శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీగోస్వామి తులసీదాసు రామాయణము

(హిందీ రామాయణమునకు సరియైన తెనుఁగు.)

శ్రీ పసుమర్తి శ్రీనివాసరావు, బి. ఏ., గారిచే

గారిచే సంపూర్ణముగ పరివర్తితము.




చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము

1927.

# పీఠిక

శ్రీరామాయణము పాలసముద్రము వంటిది ఆసముద్రముననే భగవంతుఁడు నివసించును. ఆచోటు భగవంతునకు మహాప్రీతిజనకము. కాననే చిరకాల మందు నివసించును. అట్లు శ్రీరామపరబ్రహ్మమున కీరామాయణక్షీరాబ్ధియం దెక్కువప్రీతి. సకలావతారములను దెలుపు పురాణములు భగవత్ప్రీతిపాత్రములే. ఐనను శ్రీరామపరమాత్మ కీచరిత్రమునందే మిక్కిలి ప్రీతి. భగవంతుని యనేకకోటినామములలో శ్రీరామనామము భక్తామరతరువువంటిది. ఎవ్వరెవ్వ రేయేవాంఛలఁ గోరి స్మరింతురో వారివారి కామ్యాభీష్టములు సిద్ధించుచుండుట నన్నామమహిమముననే యని తెలియఁదగు. కాన శ్రీరామనామము కల్పతరువువంటిది.

శ్రీరామాయణము సుధాసముద్రము గనుకనే వాల్మీకి దాని భాగములకుఁ గాండములని పేరుంచెను. కాండమనఁగా జలము ప్రతి సుధాబిందువు ప్రాణప్రదమగునట్లు ప్రతియక్షరము చతుర్విధపురుషార్థప్రదము. కాఁబట్టియే శ్రీరామాయణ మాబాలగోపాలవిదితము. సకలాపత్పరిహార మగుటంబట్టియే భక్తులు కష్టకాలములయందుఁ దద్భాగములలో నొకదానిని బఠింతురు. ఇతర పురాణముల నింతగా పఠించుట గనుచున్నవారమా? అప్రమేయమహిమము రామాయణమునఁ గలదనుట సర్వజనవిదితము.

ఆమహాకావ్యము నెందఱో పుణ్యపురుషులు పఠించి మహానందపరవశులై భాషాంతరీకరణ మొనరించి పామరులకు మహోపకార మొనరించిరి, ఒనరించుచున్నవారు, ఒనరింపఁగలరు. భరతఖండమున దేశభాషారూపముగనున్న రామాయణ మహాకావ్యమునందు అసమాన ప్రఖ్యాతిం గాంచినది తులసీదాసురామాయణము ఆమహాభక్తుఁడు "మక్కికి మక్కి" యన్నట్లుగాక తన్మహిమమును స్వానుభవమున నెఱింగినవాఁడు కాన నితరులు తత్పఠనమున నేయేవిషయములు నేర్పు

కోనవలయునో వానినన్నింటిని దెలిపెను. ఇదియే యాగ్రంథమునకున్న యద్భుతమహిమము. ఈరీతి నెవరును భాషాంతరీకరణమును జేయలేదని గట్టిగాఁ జెప్పఁగలము. కొందఱు కథను వ్రాసిరి. మఱియుఁ గొందఱు శ్లోకార్థమును శక్త్యనురూపముగా వ్రాసిరి. ఇంకనుం గొందఱు తదర్థమునంతయు వ్రాసిరి. కాని తన్మహిమమును దెలుపుటయే ప్రధానకృత్యముగా నీమహాభక్తుఁడు తులసీదాసు రచించెను. ఇదియే యీరామాయణమందున్న మహామహిమము. శ్రీగోవిందరాజమహేశ్వరతీర్థప్రభృతులు వ్రాసిన విశేషార్థములకన్న సీతులసీదాసు వివరించినవి తక్కువకావు. ఈయనభావమంతయు నిట వివరింప వలనుపడదు. గురుధ్యానము మొదలు ప్రతివిషయమందును గ్రొత్తమార్గమునే యవలంబించి యీకవి భావకవితావాల్మీకి యయ్యెను. గురువందనము తొలుతఁజేసి మహాత్ములను బ్రార్థించి దుర్జనుల నతివినయమునఁ దలంచి తత్కృత్యములుగూడ నొకవిధమున నుతింపఁదగినవే యని తెలిపి శ్రీరామాయణమహాకావ్యప్రతిభను స్పష్టపఱచెను.

ఈకావ్యము సర్వజనసమ్మతమని తెల్పుటలో సీదాసు మిగులఁ జమత్కారమును గనఁబఱచెను. నవగ్రహములకు నమస్కరించెను. గ్రహములు గోళోపాధికజీవులని యీమహాకవి తలంచుట స్పష్టమగును. ప్రపంచమున కెవ్వరెవ్వరివలన మేలుగలుగుచున్నదో వారెల్ల వంద్యులని కవినరుమతమైనట్లు కనుపట్టు. కవులని కుకవులని వేఱుచేయ లేదుగాని భావ మట్టిదియే యని యీతనివ్రాఁతవలన మన మెఱుంగవచ్చు.

రామనామమహిమ మపారమగుటంబట్టియే తత్కావ్యము నెవరు రచించినను దానిని సజ్జనులు నామమహిమముంబట్టి శిరసావహింతురని తేటపఱచెను. సరస్వతీప్రార్థనము చేయుచు శ్రీరామభక్తి యనునది మంత్రరూపమగుటచే రామాయణమును రచియింపఁబూను మహాకవి స్మరించినంతనే బ్రహ్మలోకమును వదలి వారికిఁ బ్రత్యక్షమగునని స్వాభిప్రాయమును వెల్లడించెను. అనఁగాఁ బవిత్రతమకావ్యకరణమున కెల్ల దేవతలు తోడ్పడుట యటుండఁ గవితాస్వరూపిణియగు శ్రీశారదాంబ ముఖ్యముగాఁ దనతోడ్పాడును గనఁబఱచునని యమ్మహాకవి విశ్వా

సను. ఎవ్వఁడు శ్రీరామచరిత్రసరోవరమున స్నానము చేసి పరిశుద్ధుఁడు కానిచో బ్రహ్మలోకముననున్న శారదాంబను ఆవాహనము చేయ సమర్థుఁడు కాఁడని కవి తెల్పుటవలన నీదాసవర్యునకు శ్రీరామచరిత్రమున నెంత దృఢభక్తికలదో స్పష్టము కాకపోదు. ప్రాకృతజనులను వర్ణించినచో సరస్వతికి శిరోభారము గల్గునని తెల్పుటచే భగవంతుఁడు తప్పఁ దక్కినవారిని నుతించుట నిష్ఫలమని కవి యుద్దేశమైనట్లు తేలకపోదు. హృదయసముద్రమున బుద్ధియను ముత్తియంపుఁజిప్ప సరస్వతియను స్వాతివర్షమున కెదురుచూచుచుండు ననువిషయమును దెల్పిన సత్కవిభావ మెంతసరళమైనదో యూహింపవలయు. ఆస్వాతివర్షబిందు వొక్కటి యందుఁబడినను ముక్తామణిరూపమగు కవిత్వము పుట్టును. అను వాక్యమును దలపోసిన మేను గగుర్పాటు నొందకమానదు. అనఁగాఁ గవిత్వము సుకుమారతం గాంచి యమూల్యము కావలయునని కవి సరస హృదయభావము కనఁబడునుగదా. ఆముత్తియములకు యుక్తిచేత రంధ్రములఁ బొడిచి శ్రీరామచరిత్రరూపమగు దారమునకు వానిం గ్రుచ్చినచో నాదివ్యహారమును సజ్జనులు ధరింతురని దాసుగారి యభిప్రాయము. అనఁగాఁ గవిత్వము నిర్దుష్టము కావలయును. శ్రీరామ చరిత్రరూపమున వెలసిన నేగాని దానికి మర్యాదలేదని దాసుగారు వెల్లడించిరి. ఔరా! తులసీదాసుగారి హరిభక్తి ప్రశంసార్హమనుటకెన్న వేఱుగా బఠింప నవకాశము గలదా.

ఈకలికాలమునఁ బుట్టినవారు చూచుటకు హంసలవలె నుందురు గాని లోపల వారు కాకులవంటివారు. వేదమార్గమును విడిచి చెడు మార్గములఁ బ్రవర్తింతురు. వారు కపటముయొక్క యవతారపురుషులు. వారిశరీరములు పాపముతో నిండియుండెడు భాండములు. రాముని యందు భక్తియుండినట్లు నటించుచుండెడు వంచకులు-అను నీవాక్యముల నీదాసకవివర్యుఁడు లోకానుభవమహాత్మ్యమును గల్గినంత యితరులకు లేదని చెప్పుటకు జంకవలసిన దేమున్నది? ఎందఱో యీ కలికాలమున భక్తులుగలరు. కాని వారెల్ల రామభక్తులుగారు. కొందఱు రమాభక్తులు. కొందఱు వామాభక్తులు. చాలకొలఁది సంఖ్యగల వారు కామభక్తులు. రామనామమును విక్రయించి కార్యాంతరముల

పేరుఁ జెప్పుకొనుచు ద్రవ్యమును సంపాదించి జీవించువా రెందఱో కలరు. వారు ధనదాసులు. కావున వారికీర్తి క్షణభంగురమైపోవును.

"వేషమునకు ధర్మధ్వజమును ధరించినవంచకులలో నే నగ్రగణ్యుఁడను. నాయవగుణములఁ జెప్పఁబూనినయెడల వాని కంతము లేదు. అవి అంతవిశేషముగ నుండును. కాఁబట్టి వానిం గొంచెము చెప్పి చాలించితిని. ఒక్కమాటఁ జెప్పిన బుద్ధిమంతులు దానిని శీఘ్రముగ గ్రహింతురు. అనేకప్రకారముల నేను జెప్పినవినయముల విని నన్ను నిందింపవలదు. ఈవినయముల విని యెవరికేని శంక కలిగినయెడల వారు నాకంటె బుద్ధిహీనులు" అని తులసీదాసుగారు వ్రాసిరి. దీని భావమేమి? ధర్మధ్వజమును ధరించినవంచకు లెందఱో జగమునఁగలరని, వారు వాస్తవముగాఁ దలంప భక్తులే కారని, కేవలద్రవ్యార్జనపరులని, వారి నమ్మవలదని తెలుపుటయేగదా. నిక్కముగ నాలోచింపఁ దులసీదాసు నిష్కల్మషస్వాంతుండని యీసిద్ధాంతము చేతనే తేటపడకపోదు.

"సరస్వతియు, శేషుఁడు, మహేశుఁడు, బ్రహ్మయు, వేదములు, శాస్త్రములు, పురాణములు - వీరందఱు పరమేశ్వరుని అనంతకల్యాణగుణములను ఘోషించి ఘోషించి తుదకు "న ఇతి" "న ఇతి" ఇది కాదు" "ఇది కాదు" అని చెప్పలేక యూరకుండిరి." అని దాసుగారు తెల్పి తమసర్వతోముఖపాండిత్యమును వెల్లడించిరి. అనఁగా భగవన్మహిమమును దెల్పఁజాలుగ్రంథములుకాని, మహాపురుషులుగాని లేని తెల్పిరి. ఇదియే యుపనిషన్మతము. సత్యవాక్యమిదియే. ఏవో నాలుగుమాటలు తమకు దోఁచినవి తెల్పుశ్రుతులు భగవన్మహిమ మిట్టిదని చక్కఁగాఁ దెల్పఁజాలవనుట సత్యముగాక మఱేమగును.

రామశబ్దనిర్వచనమును దాసుగారు చక్కఁగాఁ జేసిరి. ఆవిషయమంతయు నిట వ్రాయ వలనుపడదు. రామనామ మఖిలపాపవిచ్ఛేదకమనుట దాసుగారిసిద్ధాంతము.

దేవత లొక్కసారి తమలోఁ దాము వివాదపడి బ్రహ్మకడకుం బోయి ప్రథమపూజ్యపదవికి మే మర్హులము మేమర్హులమని విన్నవించిరి. బ్రహ్మ వారలంజూచి దేవతలారా! భూప్రదక్షిణము చేసి ముందువచ్చినవారికి బ్రథమపూజ్యపదవి నిచ్చెదనని పల్కెను. వారు తమతమవాహన

ముల నెక్కి బయలు వెడలిరి. గణపతియు మూషికవాహన మెక్కి పోవుచు నందఱికన్న వెనుకఁబడెను. నారదముని యాతనికుయుక్తిని, వాహనము నడకను జూచి కరుణించి గణేశా! నీవు వగవకుము. శ్రీరామనామమును భూమిమీఁద వ్రాసి దానిని బ్రదక్షిణము చేసి బ్రహ్మయొద్దకుం బొమ్మని యుక్తి చెప్పెను. ఆరీతిగాఁజేసి గణపతి అందఱికన్న ముందుగఁ బోయి బ్రహ్మను దర్శించెను. బ్రహ్మయు నాతనికే ప్రథమపూజార్హుఁడన్న నామము నొసఁగెను. అని దాసుగారు తెల్పిరి దీనిసారమేమి? భూప్రదక్షిణము చేయుటకన్న రామనామమునకుఁ బ్రదక్షిణము చేయుట మిక్కిలి పుణ్యమనుటచే రామనామము సర్వపుణ్యప్రదమనుటయే గాక వేఱేమున్నది ?

ఇట్లన్నిరీతుల శ్రీరామమహిమమును దెల్పి తనరామాయణకృతి నలంకరించి దాసు కృతకృత్యుఁడయ్యె. ప్రతివిషయమున నాతనిసద్భావములఁ దెల్పఁబూనుట గ్రంథమునంతయు వ్రాసినట్లే యగునుగాన వదలితిమి. స్థాలీపులాకన్యాయముగ నొకటిరెండువిషయలం దెల్పి యామహాకవియనిభావ మిట్టిదని తెలుపఁజూచితిమి. ఇట్లు రామాయణమునంతటను విశేషాంశముల బోధించి తన యఖండపాండిత్యమును దిగంతవిశ్రాంతముగా నొనర్చి కవివర్యుఁడు సఫలీకృతమనోరథుఁ డయ్యెను.

ఇవ్విధముగా వ్రాసినరామాయణ మీవఱకు లేదని చెప్పవచ్చును. అర్థచమత్కృతిం దెల్పఁజాలినవారు కలరుగాని యిట్టి యసమాన భావచమత్కృతిం దెల్పినవారు మాయెఱింగినంతవట్టు కానరాలేదు. వాల్మీకి సర్గములని కాండమున విభాగములఁ దెల్పెను. తులసీదాసు సర్గములకు బదులు విశ్రామములని పేరుంచెను, చౌపాయ్, దోహా, అను మొదలగుహిందీభాషాచ్ఛందస్సు ననుసరించిన వృత్తము లిందుఁ గలవు. అవిపాడుట కనువై శ్రోత్రవారికి గేయములా యని తోఁపఁజేయుచు సరళభాషామయములై యుండును. కాఁబట్టియే తులసీదాసు రామాయణము పఠనపాఠనముల వినుతికెక్కఁజాలి యితరదేశభాషలలోనికి మార్పఁజాలినంతమహిమము గలదయ్యెను.

తొలుదొలుతఁ దెనుఁగుదేశమున హిందీభాషాప్రచారము

చేయఁబూని దానికిఁ బ్రథమసోపానముగా సీతులసీదాసు రామాయణమును దెనుఁగున వ్రాయింపించితిమి. ఈపని ప్రారంభించి సుమారు పదునైదుసంవత్సరములయ్యెను తర్వాత హిందీబాలశిక్షను బ్రకటించితిమి. ఆవల సీరామాయణమును ముద్రింపఁబూనితిమి. శ్రీగాంధీమహాత్ముఁడు హిందీప్రచారము చేయఁబూనక పూర్వము పదిసంవత్సరములకు ముందే మాయీప్రయత్నముసాగ మొదలిడెను. కొన్ని కారణములచేత నీరామాయణము పూర్తియైన పిదప ముద్రింప వీలుచిక్కినదికాదు. ఎట్లో అవకాశమును గల్పించుకొని యిమ్మహాకార్యమునకుం బూనితిమి. ఈరామాయణమును దెనుఁగున వ్రాయింప మమ్ముం బ్రోత్సహించినవారు విశాఖపురవాసులు నస్మత్పితృసఖులు నగు మున్షీ షేక్ మౌలాసాహెబుగారు. వారిప్రోత్సాహముననే యీకార్యమునకుం బూనితిమి. పరమేశ్వరానుగ్రహమున నది పూర్తియయ్యెను.

ఈరామాయణముఁ దొలుత దాసుగారిచరిత్రమును వ్రాయింపఁ దలంచుచుండఁగా విజయనగరము నివాసముగాఁగలిగి సంస్కృతాంధ్రభాషలయందుఁ జక్కనిపాండిత్యముగలిగి కవిత్వము చెప్పనేర్చిన శ్రీమతి పక్కలంక వేంకటసూర్యరామజోగమాంబగారు లలితోపాఖ్యానమును ముద్రింప మాయచ్చుకూటమునకు వచ్చియుండి యీతులసీదాసురామాయణవిషయమును మావలన విని యీమహాత్మునిచరిత్రమును వ్రాసియిత్తుమని చెప్పిరి. సంతోషముతో నంగీకరించితిమి. కొలఁదిదినములలోనే పద్యరూపమున వ్రాసిపంపిరి. దానిని మొదట ముద్రించితిమి. తులసీదాసుగారిచరిత్రమంతయు దానియందుఁగలదు. పద్యములు హృద్యములై సులువుగ నున్నందున నదియు వచనరూపముగ నున్నట్లే భావింపవచ్చును. కాఁబట్టి యీకవితల్లజుచరిత్రమును బెంచి వ్రాయఁబూనక యింతటితో విరమించుచున్నారము. గ్రంథము చాలగొప్పది కావున బాలకాండను మాత్ర మిప్పుడుఁ బ్రచురించినారము. ఆంధ్రమహాశయుల ఆదరణమున అచిరకాలమున తక్కిన కాండలఁ బ్రచురించెదము.

తండయార్పేట,
చెన్నపట్నం.
6-3-1926.

ఇట్లు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్



శ్రీః

# తులసీదాసుచరిత్రము.

---

ఉ. శ్రీ మెఱయంగ సాధుజనచిత్తసరోజములన్ వసించి యు
ద్దామమహత్వ మొప్పనటు ధాతృజనార్దనశంకరాదులన్
గామితదానవఘ్నులను గాఁగ సృజించి సమస్తవిశ్వమున్
బ్రేమను బెంచు నీశ్వరుఁ బవిత్రచరిత్రుని భక్తిఁ గొల్చెదన్. 1

తే. శ్రీత్రిపురసుందరిని మదిఁ జేర్చి సకల
దేవతల కంజలి యొనర్చి పావనకవి
తల్లజుల సంస్తుతించి నితాంతభక్తి
పరవశులఁ బెద్దలను వేఁడి పరమనియతి. 2

సీ. ఆంధ్రసద్గ్రంథాళికాధారుఁడై యొప్పి వినయాదికాఖిలవిమలసుగుణ
నిలయుఁడై పండితనిచయసహాయుఁడై కవిపికగణమహాకల్పకమయి
వావిళ్లసద్వంశవారాశిశశియగు వేంకటేశ్వరశాస్త్రి విమలచిత్తుఁ
డొకతఱిఁ జెన్నపురికి నేను జనఁగ నన్నుఁ గాంచి మీ రేదొ గ్రంథ మొకటి

తే. సేయఁ బూనినయట్టులు చెప్పె నాకు
నాదృతిన్ జనమంచి శేషాద్రిశర్మ
యద్ది హరిభక్తవిషయంబె యైన లెస్స
యనుచుఁ దోఁచెడు మదికి జోగమ్మగారు. 8

క. అచ్చొత్తించితి నేనును
ముచ్చటమీఱంగ భక్తమూర్ధన్యుని దా
సచ్చరిత మొండు పండితు
లచ్చెరువందంగఁ జేయు మద్దానిఁ గృతిన్. 4

క. తులసీదాసను భక్తుం
డలఘుగుణుఁడు రామభక్తుఁ డగు నాతని దా

సులలితచరితముఁ గృతిగా
నెలమిం జేయంగఁ గీర్తి యిలఁ బరఁగుఁ గదా. 5
చ. అనితగురీతిఁబల్కి తగునమ్మ యిదేకృతిసేయమీఁకు నం
చనునయమొప్పఁ బుస్తకము నాదృతిమై నొసఁగంగ నేను నా
త్మనుదలపోసి యీకృతిని దద్దయుఁ బూనికజేయ ధన్యుఁనై
తనరుదుగా యటంచుఁ బ్రమదంబున దానిఁబఠించి చక్కఁగన్. 6
క. కత యిద్ది కల్పితమె యీ
క్షితి నెల్లరు నమ్మువారొ కేరడమె యన
మ్మతిఁ జేయుదురో యని నా
మతినిం దలపోసి యిట్లు మఱియుఁ దలఁచితిన్. 7
ఆ. సత్యమైనసద్విషయమందు విశ్వాస
ముండకుండు జనుల కొక్కకొంద
ఱకుఁ దలంప దాన నొకకీడుగల్గునే
నమ్మువారికెల్ల నిమ్మహిఁగన. 8
క. మనమునఁ బెద్దలు పల్కిన
యనఘులచరితములు నమ్మ నగును శుభంబుల్
ఘనమార్గ మిద్ది యగుఁ గా
యని నామది నిశ్చయించి యాదృతి మీఱన్. 9
క. నను నేవేగ్రంథంబుల
నొనరుపఁ బురికొల్పుదును సహోదరసముఁడై
తనరెడు శేషాద్రిమతం
బును గొని కృతిసేయ నిపుడు పూనితిఁ బ్రీతిన్. 10
తే. ఇంతమాత్రపు గొదవయే యింకఁ జాలు
ననుచుఁ బండితవర్యుల కంజలి యిడి
తప్పులనెపట్టు కవులను దలఁచి వారె
మేలు సేసెడివా రని చాలనమ్మి. 11
తే. మొదలుపెట్టెదఁ గృతిసేయ మొదటి దిదియె
పద్యరచనకుఁ గావునఁ బండితు లిటఁ
గలుగుదోషంబులను మాని యెలమి గుణము
లున్నఁ గొనుఁ డంచుఁ బ్రార్థించి సన్నుతింతు. 12

# కథ మొదలు.

చ. కలదొకపత్తనంబు ధరఁ గౌరవపాండవవాసరమ్యమై
సులలితహర్మ్యజాలముల సొంపున దేవపురిన్ హసించుచున్
గలితచిరత్నరత్నతతిఁ గంధిని జాలఁ దృణీకరించుచున్
లలితవిలాససంపద నిలాలలనాతిలకంబునాఁ గడున్. 13

చ. అదియెగదా యశంబు నలరారఁగ హస్తిననాఁగ నొప్పున
య్యదియె క్రమక్రమంబున మహామతియై తనయంత వారు ధా
త్రిఁ దగుదురే యటంచు బహురీతుల నెన్నఁగఁజాలు విక్రమం
బొదవఁగ నొప్పు నక్బరను భూపతితల్లజరాజధాని యై
నవమలరితి ఢిల్లియను చారుతరాహ్వయ మొందెఁ జక్కఁగన్. 14

సీ. తనయపాంగమునకు మనుజుఁ డెవ్వఁడు లక్ష్య,
మగువాని ధనపతి నపుడె చేయుఁ
దనప్రతాపమునకు మనుజేంద్రుఁ డెవఁడు ల,
క్ష్యంబగు నవ్వాని నపుడె యడఁచుఁ
దనదానవారి కేమనుజుఁడు లక్ష్యమౌ,
నతనిఁ గృతార్థుఁగా నపుడె చేయుఁ
దనక్రోధవహ్నికే దస్యువు లక్ష్యమౌ,
నతని నింధనముగ నపుడె చేయు

తే. సకలనృపమౌళిమణిరుచిజాలరుచిర
పాదనఖరుండు కరుణాతిభవ్యసుగుణ
నికరమండితుఁ డక్బరు నృపలలాముఁ
డవని నిస్సముఁడై యలరారుచుండు. 15

క. ఆరాజలలామున కా
త్మారాముం డనెడు పేర మహినొప్పు కృపా
ధారుఁడు సచివుఁడు వెలసెను
బేరునకుం దగినయట్లు పెంపు వహించెన్. 16

ఆ. అన్నుమిన్న యతని కయ్యెఁ గళత్రంబు
సంగుణరాశి కీర్తి సురుచిరనిజ

చరిత లక్ష్మిబాయి సమధికభాగ్యశా
లినియు నగుచు ధరణిఁ దనరె మిగుల. 17

చ. అడిగినయట్టి యర్థులకు నన్నముఁ గల్గినయంతలోనఁ దాఁ
గుడుచుట మాని నైన నిడుఁ గూర్మివహించును బంధురాజిపైఁ
బుడమి నదే నితంబినియుఁ బోలదు సాటి తలంప నామెకుఁ
విడువదు నాథుచింతనము వేయిపనుల్ తలపైనఁ దోర్లినన్. 18

చ. కలిగినవాఁడు భర్త స్మరకల్పుఁడు రూపమునందు భోగమం
దలసురరాజతుల్యుఁడగు నారయ నామెకు నేవిధంబునన్
దలఁచినఁ జింతలేదు నిరతంబును ధర్మమె చేయుచుండు నా
ప్పొలగనియంచుఁ జెప్పఁదగుపుత్త్రుఁడు మాత్రము కల్గఁడక్కటా!

చ. మనమున నెంచు నామె యొకమాటు శరీర మనిత్య మేలొకో
తనయునివాంఛయంచుఁ, బ్రథితంబగుకీర్తిఁజెలంగి పూర్ణచం
ద్రునిఁ బురుడించునట్టిఁడుసుతుం డొకఁడుండిన నెట్టులుండునో
యని యొకమాటు సంతతిమహత్తరభాగ్యము లేదటంచునున్. 20

చ. వనితలచిత్తె మెప్పుడొకభంగిగ నుండక యప్పుడప్పు డొ
క్కనిముసమైన మాఱుట జగంబున నైజ మదెట్టినారియై
ననితరయోషయందును గనంబడుభాగ్యము నొందఁగోరు నా
వనజజుశాసనంబె యనవచ్చును దీనిఁ దలంచి చూచినన్. 21

చ. కనుకనె లక్ష్మిబాయియు నఖండతరప్రతిభావిశేషముం
గనినదియైన స్త్రీసహజకాంక్షకులోనయి పుత్త్రవాంఛ నె
మ్మనమునఁ దాల్చెఁగాని తను మైకొను చింతను భర్తకెప్డు చె
ప్పను దలపోయ కేయడఁచె భావములోనన నేర్పుమీఱఁగన్. 22

సీ. ఒకనాటి కొకనాఁడు సకలభూషణముల,
నలరారుచుండుట యంతరించె
నొకనాటి కొకనాఁడు ప్రకటరాగంబున,
నతివలతో నాడు టంతరించె
నొకనాటి కొకనాఁడు హెచ్చులు మీఱఁగఁ జంద,
నాదుల నలఁదుట యంతరించె
నొకనాటి కొకనాఁడు నికటంబునందున్న,
మోహ్మసఖిం బిల్చు టంతరించెఁ

తే. బూటపూటకుఁ బ్రీతిమై భోజనంబు
సేయుటయు నంతరించెను జిత్తసీమఁ
దనయులే లేకయున్న నా జని యిదేల
యంచుఁ దనుమంచు వెనువాంఛ నందినపుడు. 23

క. ఒకకొంతకాల మిటు పు
ద్చు కళత్రమురీతిఁ గాంచి శుభమతి పతియే
మికతం బిటుచింతల నని
యకలంకమనీష నా మె నడిగిన సతియున్. 24

చ. తనమదినున్న చింత నికఁ దప్పక చెప్పకతీర దంచు నా
త్మనుదలపోసి యాసుదతి తత్తఱ మందక వాంఛఁ దెల్పెనం
తనతఁడు బేల! వాంఛ యిది ధర్మముగాఁదగు నుండనంచుఁ జ
క్క నిభణితిన్ వచించి తనకామిని నూఱడఁ జేసె నంతటన్. 25

కవిరాజవిరాజితము.—
తరుణియు భక్తిని దైవము నమ్ముచుఁ దత్పరయై సతతంబును దా
హరిని భజించుచు నాశ్రితరక్షక యాత్మజునొక్కని నాదృతిమై
నిరుపమకీర్తి యనింద్యచరిత్రము నిస్తులభక్తియు నీస్మృతియున్
వరమతియుం దగువాని నొసంగవె వైళమనాకని స్వాంతమునన్. 26

క. పలుమాఱు వేఁడ నంతట
నలినాక్షుఁడు పుత్త్రు నొసఁగె నారీమణికిం
దులసీదాసని యతనికి
నలరారుచు నామకరణ మప్పుడు చేసెన్. 27

చ. జనకుఁడు సంతసంబలర సజ్జనలక్షణయుక్తు నాత్మజుం
గని ముద మొందెఁ దల్లియు నఖండముదంబునుగాంచె నంతటన్
దినదిన మొక్కరీతి శశిరీరున వృద్ధినిగాంచుచున్ వినూ
తనరుచులొప్పఁగాఁ బెరిగెఁ దన్గని యెల్లరు పొంగుచుండఁగన్. 28

క. తనయంతన లభియించిన
వినయజ్ఞానముల మిగుల వెలసి యతఁడు చ
క్క నివిష్ణుభక్తిచేఁ దగి
జనవినుతిం గాంచి పెరిగెఁ జక్రికరుణచేన్. 29

క. క్రమమున జనకుఁడు సంస్కా
రములం దమిఁ జేసి సుజనరంజకుఁడగు నా
విమలాత్మునకుఁ శ్రీశీ
లము లందము విద్యయును గులంబుఁ దగుసతిన్. 30

సీ. ఉద్వాహమునుజేయ నొప్పి రాదంపతుల్,
గౌరీశు లట్టు లఖండముదము
తనరఁగా వారలఁ గని సంతసంబంది,
రెల్లవారును దగు నీవివాహ
మని; యిట్టు లొకకొన్ని దినములు జరుగ నా,
త్మారాముఁడొండె నమర్త్యపురిని
దల్లియుఁ దనయుఁ డాతనిభార్యయును ఢిల్లి,
నగరంబునందె పూర్వగతినుండి

తే. రాకుమారుని సాధ్వి యత్యంతభక్తి
యుక్తయగుచు మాతాదేవి యొప్పె మిగుల;
భార్యపయిఁ దులసీదాసుపరమమైన
ప్రీతి యలరారనుండె విఖ్యాతిమించ. 31

క. సతియుం బతియును మోదం
బతిశయమై యొప్పవెలసి రన్యోన్య మదే
తతిఁజూడఁగ లేదీ యా
ధృతి గలదంపతుల నంచు నెల్లరు పలుకన్. 32

ఆ. ఒక్కనిముసమైన నొండొరులను బాయఁ
జాలకుండి రిట్లు సతియుఁ బ్రియుఁడు
మిగుల వేడ్కనుండ మెల్లమెల్లన దాసు
భక్తి నడఁచి ప్రేమ పరిఢవిల్లె. 33

క. అగ్గలమగు మోహంబున
నగ్గజగామినిని గనుచు నాతఁడు సతముఁ
దగ్గని కుతుకంబుననే
మ్రొగ్గను గ్రీడైకనిరతి ముక్తిద మనుచున్. 34

చ. నిరతము తన్మయుండగుచు నెమ్మిని గాంతనుగూడియుండు టే
పరమని యెంచి భాగవతభక్తిని బాయక వాసినట్లుగా

స్మరపదభక్తి నుంటఁగని సాధ్వియు నొక్కపుడాత్మనాయకున్
నిరుపమభక్తిఁ జేరి యతినిర్మలవాక్కులఁబల్కు నివ్విధిన్. 35

చ. మునుపటిరీతిగాక రఘుముఖ్యుని దౌభజనంబువీడి న
న్గనుచు సమస్తకార్యములు క్రన్ననమాని యిటుంట చిత్రమై
కనఁబడుచున్న దీతనుసుఖంబె సతంబని నమ్మినారొ నా
మనముపరీక్షసేయుటకు మానని దీక్షను దీనిఁగొంటిరో. 36

చ. తనువిది నీటిబుగ్గ సతతంబిటులుండదు దీనినమ్మి యి
ట్లనిశము క్రీడలో మునుఁగు టర్హముగా దనితోఁచుచున్నదో
మనుజలలామ, నాదయినమాటను లోనఁదలంచి రామభ
క్తిని మదినూలుకొల్పు మిలధీరులు మోహరతిం త్యజింత్రుగా. 37

తరళము. పరమునెన్నక దేహభద్రమె పాడిగాఁ దలపోయుచున్
నిరతమీగతి మీరలుండిన నేను నేనని యామ్యది
గ్వరునిదూతలు క్రమ్మినప్పుడు కల్గునే యొకకార్య మే
పరుసఁ జేయఁగఁ బ్రాణనాయక వాక్కు దీనిఁ దలంపుమా. 38

చ. మునివరు లెందఱో స్వతపమున్ విడనాడి యహర్నిశంబు స్వ
ర్ధునితలయందు మక్కువముఁ బాయకయుండి యనంతరంబ యా
త్మను దలపోసి వేగిరమ తత్వమెఱింగి త్యజించి దానిఁ జ
క్కనిపథమొంది మోక్షమును గాంచి రనన్ వినమే మనోహరా. 39

క. ధీరత్వము మానుచు నా
శ్రీరామునిభక్తి మాని స్త్రీకృతసుఖమే
ధారుణి సనాతనం బని
కోరికఁ గనుచున్న ముక్తిగూడునె చెపుమా. 40

చ. అనిమది కెక్కునట్లు తనయంగన చెప్పినపల్కు లన్నియున్
వినుచును దాసు తాఁ బెడచెవింజొరునట్లుగఁ జేసి పూర్వరీ
తినిజరియించుచుండెను సతీమణియుం దనకున్న వేళలోఁ
దనపతి కెంతొ భక్తిమెయి దాశరథిప్రియవార్తఁ జెప్పుచున్. 41

క. సమయానుకూలమౌ చం
దమునం బ్రియుచిత్తమెట్లొ తాఁ ద్రిప్పఁ బ్రయ
త్నము చేయుచుండె నిటువ
ర్షము లొకకొన్నియు గతించెఁ జయ్యన నంతన్. 42

**అక్బరు వేఁటకరుగుచుఁ దులసీదాసునిఁ బిలుచుకొని పోవుట.**

సీ. జారచోరసమూహ సంతోషదాయకం,
బధ్వగప్రాణానిలార్తికరము
గృహమేధిజనమనోగేహభీతికరంబు,
శ్వాపదవ్రజమనశ్శాంతికరము
దంపతిసుఖకంధి దారుణబడబాగ్ని,
సకలదుర్జనమనోజన్మభూమి
కాంతలతావితానాంతకృత్ప్రతిమంబు,
సర్వరోగాంభోధి శశధరకళ
తే. సంతతానంత భయకరాశాంతవితత
మగుచుఁ జీఁకటిపక్షంబు తగినరీతి
నరుగుదెంచెను నిశితసాంద్రాభిపూర్ణ
నీలరోచులు దివిభువిఁ జాలఁ గ్రాల. 43

సీ. పుండరీకంబు లుద్దండగతింబాఱి యాలమందలమీఁద నోలిఁ బడఁగ
నుగ్రద్వీపేంద్రంబు లుద్ధతిమీఱంగఁ బాంథజనావళి బాధసేయఁ
బంచాస్యజాలంబు ప్రకటదర్పంబున హస్తిబృందంబులనట్టె చీల్ప
భల్లూకసంతతుల్ ప్రబలికోపంబుల వల్మీకములఁ జెండిబడలుపఱుప
తే. నింత యంతని యనరానిసంతసమున
నితరఘోరమృగంబు లెన్నేనిరీతు
లను మహాభీతిఁబుట్టింప వనములెల్లఁ
బ్రజలకుం దోఁచె యమపురప్రతిమములుగ. 44

చ. వనచరులైన చెంచులొకవంక మృగంబులు బాధసేయఁ గా
జనపతివర్యు నక్బరును సాంద్రపరాక్రముఁ జూచుకోర్కెచే
తను దగ వంశధాన్యమును దారుణమౌ పులిగోళ్లతోరణం
బును బులితోళ్లు పండ్లు తగుమూలములుం గొనివచ్చి రొక్కటన్.
తే. కానుకలుముందుపెట్టి నిక్కంపుభక్తిఁ
దేనెకుండల నర్పించి దీనవచను
లగుచు నోసామి మొక్కము సొగసుకాఁడ
యడవిమెకములు తిరుగాడఁదొడఁగె స్వేచ్ఛ. 45

తే. ఆవులను గొఱ్ఱెలను మేకలాదియైన
జంతువుల నెల్ల మ్రింగుచు సామి, యేమి
భయములేకయె పల్లెలంబడఁ దొడంగె
జనులబాధలఁ జెప్పనశక్య మిపుడు. 47

క. చెలరేఁగి పల్లెలంబడి
కలకలమని జనులు భయముఁగని యేడ్చుచు గూఁ
ఫులుగాఁ గూడఁగఁ జంపెడుఁ
దులువతనం బేమి చెప్పఁ దోఁపదు తండ్రీ. 48

క. జనులెల్లరు మొఱ్ఱో యని
మనుజేంద్రా! రమ్మురమ్ము ప్రోందించె మముఁ
ఘనమృగములంచుఁ జెప్పిన
విని యక్బరుచక్రవర్తి వికృతాస్యుండై. 49

వ. సత్వరంబ మృగయులనెల్ల రావించి యాయితంబుకండని యాజ్ఞాపించి మృగయాసంరంభంబునఁ దదుచితవేషంబుఁ దాల్చి యశ్వారోహణంబుచేసి సింహంబులఁ బిక్కబలంబు చూపియెదిగి నిలుపంజాలు భషకజాలంబుతో, సీఁటెలు, బల్లెంబులు, ఖడ్గంబులు, పిడిబాకులు లోనగు సాధనంబులతో నలుప్రక్కల మృగయు లరుదేర, ఖడ్గపాణియై శరచాపంబులంగొని చెంచులు త్రోవసూప, సత్వరంబ యరిగి మహాటవింజొచ్చి యచ్చట నలుప్రక్కల వలలొడ్డి మృగయులు నిలిచి డక్కారవంబుల దెసలనింపఁ గలఁగి మలఁగి దూరంబుగ నేగుమార్గంబు లరికట్టిన తెఱంగెఱింగి బెండుపడియు నద్భుతక్రోధంబున నరుణాక్షంబులై రూక్షదశనంబులు పటపటలాడించుచుఁ బైకినిగుడుసింగంబుల సీఁటెనెత్తి మేటిబాహుబలపాటవంబునఁ గోటమీటినరీతి నెగురవైచి వలచేతివాడిఖడ్గంబునఁ దుండెంబులు సేయు దండిబోయలును, మదించి యావులించుచు, మచ్చరంబున నెవ్వారిని లెక్కసేయక నిక్కుచు నొకప్రక్కం దాఁటి యచటివారిని గుటుక్కన మ్రింగి యవ్వలం బోవందలంచు పుండరీకంబులఁ జండదోఃప్రతాపంబున నుద్దండక్రోధంబున బెండువడని దండిసాహసంబునఁ బిడిబాకునం బొడిచి మెడఁబట్టి యెత్తి విసరివైచి విహరించు నెలుకలును, దుండంబులు వైకెత్తి యెత్తినమచ్చరంబున నున్మత్తంబులై

ఘీంకరించుచు నెటుపోవనుదోఁపక తోఁచినట్లుపోవఁ బిండుగట్టి తాలురుప్వాదు నరుదెంచు నంతావళంబుల మారుకొని యారసంబున నోరఁజేసికొనక యెదిరించి యదలించి పెద్దభల్లంబులం గ్రుచ్చి యవి పెనంగంబూన హుంకరించి వేటొక్కటావున నీఁటెనాటి చిపుక్కన నెగమీఁటి యొక్కచోటంబడవైచి తుండంబుల ఖండించి కొండలపిండునా నవిపడియుండ దండపౌరుషంబునఁ బరులగుండియ లవియ హుంకరించు చెంచులును, బరిసరంబుల వడివడిందిరుగు కాసరంబుల నీసడించి వెనుకటికాళ్ళంబట్టి యట్టెమీఁదికెత్తి గిరగిరం ద్రిప్పివైవ నవి రక్తధారాసారసిక్తముఖంబులై యొప్పఁ బక్కనపు య్యయవనులునునై, సకలమృగవిలయప్రాయంబగు వేఁటసాగుచుండఁ జక్రవర్తి శరచాపంబులూని విలయసమయవిషకంఠు చందంబున దుర్నిరప్రతాపుండై, దావదహనుపోలిక దుస్తరుండై, ప్రళయకాలభాస్కరుభంగి దుర్నిరీక్ష్యుండై, చలింపక, యోసరిలక, భీతినొందక, వెనుకంజవేయక, ప్రమాదంపడక, గూటిదప్పక, కాలంబుపుచ్చక, శరకరలాఘవంబులు మెఱయ రావణవధాభిలాషంబున నుద్దీపించిశరంబులువైచు రామునివలె బాణంబులం బరగించి కరచరణాదిభేదంబు లెఱుంగఁబడకుండ గుదిగ్రుచ్చినట్లు భయంకరమృగంబులం బొలియించి తనివినొంది మృగయులంగూడి తులసీదాసువెంటరా సలిలాశయంబుఁ జేరి యథార్హస్థలంబుల నెల్లర విశ్రమింపంబంచి తానును రమణీయపటగృహంబున విశ్రమింపంబోయె నంత నగరంబునందు. 50

చ. వెలవెలఁ బాఱుమోము నతిభీతిగనంబడఁజేయు నేత్రముల్
తొలఁగనిచింతఁ గన్పఱచు తొందఱమాటలు గల్గు మర్త్యుఁడు
జ్వలతను వొక్కరీతిగను వాడినయట్లు కనంబడంగఁ దో
య్యలి వసియించు గేహమునకాతురతం జనుదెంచెఁ బ్రొద్దునన్. 51

క. తనపుట్టినింటి సేవకుఁ
గని మాతాదేవి యచటఁగలయెల్లరకుం
దనరారునె కుశలంబన
విని యాశందూరకుండి వేగమె లేఖన్. 52

ఆ. ఆమెచేతి కొసఁగ నద్దానిఁ బఠియించి
యత్తగారితోడ ననియె నిట్లు
నాదుతల్లి కేమొ నానాఁట రోగంబు
ముదురుచున్నదంట మోసమంట. 53

క. నాలుగు దినములుగా రుజ
యోలిఁ బ్రవృద్ధంబు నగుచునున్నది గానన్
జాలము సేయక రాఁదగు
మేలగునో కీడయగునో మీఁదట ననుచున్. 54

ఉ. వ్రాసినవారు లేఖ నిటువంటిమహారుజ నాదుతల్లికి
ట్లీసరికిం గనంబడుట యేనెఱుఁగం దలవ్రాఁత యెట్టులో
చేసెడిదేమి లేదయినఁ జింత మదాత్మను గ్రమ్ముచున్న దెం
తేసిమహౌషధాళి యిటనేమియు సత్ఫలమీయకుండుటన్. 55

క. జననియు బ్రదుకుట దుర్లభ
మనితోఁచెడు నంచు మిగులనశ్రువితతిచేఁ
గనులెఱ్ఱబాఱఁ జింతిలు
తనకోడలిఁ జూచి యత్త తానిట్లనియెన్. 56

చ. అడలకుమమ్మ నామదికి నట్లొకనంబడెడుం దలంపఁగాఁ
గడుజరగ్రమ్మి యున్నయదిగాదె మహాగద యిద్ది యెవ్విధిన్
సుడివడకుండఁ జేయునొకొ చొక్కపుమందులు పోసినారొ యె
క్కడిదిఁక లాభమంచు వగఁగ్రమ్మఁగ మానము దాల్చినారలో. 57

క. పయనంబు సేయు మిఁక నే
మియు దుఃఖింపంగవలదు మేలెగలుగు ని
ట్టియవస్థ యామెకొదవుట
యెయ్యాత్మకుం బట్టె చింతయేమగు మనచేన్. 58

క. పెనిమిటి యింటన్ లేఁడని
మనమున నూహింపఁ బోకుమాతల్లీ! నే
నును జెప్పెదఁ దులసీదా
సును జూచినయడ్డా బాలసుహృదయుఁ డతఁడౌ. 59

క. జననీవాక్యంబుల నా
తనయుఁడు మీఱంగలేఁడు త్వరపడి పొమ్మా

యనిపలికి యామె దగుచిం
తనుగొంచెను శాంతిపఱచి తాయత్నమునన్. 60

క. పినతల్లి తనయుఁ డావ
చ్చినవాఁడని యెఱిఁగి యతనిఁ జేరఁబిలిచి యా
వనితామణి రోగవిధం
బును జక్కఁగ నడిగి భయము పాసఁగ దటంచున్. 61

తే. వారిచింతను గాసంతవదలఁజేసి
యన్నముంబెట్టి పోవఁబయనము చేసె
నత్తయాజ్ఞను బతియాజ్ఞయంచుఁ దలఁచి
తరలిపోయెను ద్వరపడి తల్లిఁ గనఁగ. 62

క. పంచక్రోశంబులు ద
వ్వెంచఁగ నాయూరుగాన నెట్లో చనె హృ
చ్చంచలతమించ మగువయా
నించుకప్రొద్దుండఁ దల్లియిల్లుం జేరెన్. 63

చ. తనయనుగాంచినంతనె మహాగద యప్పుడె పోయినట్లుగాఁ
గనఁబడఁ దల్లి యాత్మజను గౌఁగిటఁ జేరిచి యమ్మకాన! నీ
జననికిరోగమంచు విని సత్వరమీగతి నీవనాంతరం
బునఁ బడివచ్చినావె యనిపొక్కుచుఁ బల్కుచుఁ బ్రేమమీఱఁగన్.

తే. ప్రక్కను బరుండుమా యని పలికి నాకు
భయములే దింక వగవకు పట్టి యనుచు
నామెచింతను బాపెఁ; నాయన్నమిన్న
తల్లిమాటల కలరె నంత నిటనడవి. 65

క. మృగయాకేళులు చక్కఁగ
ముగిసిన నక్బరునుగూడి మోదంబున నె
ప్డగనుంగొనుదునో భార్యను
సగమీమే నాపెదిగద సంతత మనుచున్. 66

చ. కనుయుగ మామెరూపమును గాంచుకుతూహలమొప్ప వెల్ల నా
క్కనిముస మింకనేర్చుకొనఁగాదు తరంబని వేగవచ్చెఁ; ని
ట్టనుపుగ నిల్లుసేరి తనయంగనఁ బిల్వఁగఁ దల్లి యేమిరా
తనయ యటంచుఁ బల్కి తనదాపున నిల్వఁగఁ జేసి యిట్లనున్. 67

తే. నాయనా! నీదుభార్య జననిరుగార్త
యనుచుఁ దమ్ముఁడు రాఁగఁ జింతాకులాత్మ
యగుచు నీవింట లేమికి నార్తినొంద
నేను వగఁ బాపి పంపితి నీవు వోలె. 68
క. త్వరగా వచ్చును దండ్రీ!
యరణ్యమున నేమిబాధ యంగంబున కె
వ్వరుసం గల్గదుగద యిఁకఁ
ద్వరపడి స్నానంబొనర్చి వార్చి నియతిచేన్. 69
ఆ. భోజనం బొనర్పు పూజ్యతరాన్నము
సిద్ధపఱచి నీదు సేమమునకు
సురల వేఁడుచుంటి శుభ మొంది వచ్చితి
వంతె చాలు లక్షలమరె నాకు. 70
చ. అనిపలుమాఱు సంతసమునందుచటుల్ పలుకంగఁ దల్లిచ
క్కనిగతి యెంత చెప్పినను గాంతగృహంబున లేమి కార్తుఁడై
వనటఁ గలంగుచిత్తమునఁ బల్కక యే బలవంత పెట్టినన్
జని కుడువంగనొల్లక విశాలగృహంబున సంచరించుచున్. 71
తే. ఎవ్వ రెన్నివిధంబుల నెంత యొత్తి
చెప్పినను దాను జక్క భుజింప నొల్ల
కున్నఁ దల్లియెఱింగి యాకొన్న తనయు
నట్లె బలవంత పెట్టి భార్యపయిఁ దమిని. 72
క. మనమున నెఱింగి మఱియి
ట్లనుఁ దనయా! చింతనొందు నంతటిపని యే
మినిమిత్తంబునఁ గల్గెనొ
వినిపింపు మటన్న నతఁడు విహ్వలమతియై. 73
చ. తరుణినిజూడనందులకుఁ దాప మిదిట్టులు కల్గెనంచు నె
వ్వరుసను జెప్ప నొసనుచుఁ బల్కను వేఁటశ్రమంబె కాని ని
ర్భరమగు వేఱుచింత యిటఁబర్వదు నాకని స్నానమాడి యా
తురుఁడయి భార్యఁజూచుమదితో భుజియింపఁగఁ బోయె మెల్లఁగన్.
తే. విష్టరంబునఁ గూర్చుండి విపులచింత
మదిని బర్వుట భుజియింప మనసురామి

నెట్లొ భుజియించి నటుచూపియేగె శయ్యఁ
బవ్వళింపంగఁ దమివెలిఁబొలుచుండ. 75

చ. శయనము చేరి దిక్కులను జక్కఁగఁజూచుచు లేచిలేచి యే
మియుఁ దనకష్టతోఁపమికి మిక్కిలి కుందుచుఁ గొంతకాల మీ
నియతినిబుచ్చి యంతనిటనిల్చుట తప్పని సత్వరంబుగా
దయితనుజూచుకోర్కి మెయి ధైర్యముపొంగఁగ లేచెఁ జివ్వనన్. 76

సీ. అంతట పవళించి యత్యంతసుఖనిద్ర,
సేయున త్తెఱఁ గడుఁజీఁకటు లిలఁ
గానరాకుండంగఁ గప్పియుండఁగ సద్దు,
గాకుండఁ బయనమై కాలినడక
నైదుక్రోశమ్ములయంతదవ్వున మహా,
కాననాంతరమునఁ గ్రాలు గ్రామ
మున కిప్పుడిటుపోవఁ జనదనితలఁపక,
తమివెల్లిదంబునఁ జనియె నొకఁడె

గీ. పయనమైనది మొదలుగాఁ బల్కియలరు
గ్రామమును జేరునందాఁకఁ గాననాంత
రమున శబ్దించు శ్వాపదరాజినుడులు
చెవులఁ బడకుండఁజనియె విచిత్రరీతి. 77

క. ధరఁ గామాతురుల కదే
సరణివి భయసుఖములందు స్వాంతము పోదం
చురుమతులు పల్కుట కుదా
హరణం బీతనిచరిత్రమగుఁగా తలఁపన్. 78

క. తరువనక కంటకంబన
కురుమృగములటంచుననక యొక్కఁడె చని యా
తరుణీమణి వసియించెడు
సురుచిరహర్మ్యంబుచెంతఁ జొక్కుచుఁ జేరెన్. 79

ఉ. చీమచిటుక్కుమన్న మదిఁజేరును దద్ధ్వని స్పష్టరీతిగా
నేమియుఁగాని పల్కువిననెవ్వఁడు నేరఁడు ప్రాణియొద్దియుఁ గ
దా మసలంగఁ బూనదు నితాంతము నిద్దురఁ బొందియున్న యా
భీమనిశార్ధకాలమున భీతియొ లేక యతండు చక్కఁగన్. 80

చ. తనప్రియయున్న గేహమును దాపునఁ గాంచి యటన్ మనుష్యులె
వ్వనిఁగనలేక యెందుఁజనువారలు లేమిఁ దలంచి యర్ధరా
త్రనియమమెల్లఁ గన్పడెడుఁ దాఁ జనుదెంచినరీతిఁ దెల్ప నె
ట్లనువుపడున్ గళత్రమునకంచు నొకించుక సేపు నెమ్మదిన్. 81

క. తలపోసి యందు నిందును
గలయంజూచుచును సౌధకాంతము చెంతన్
దులసీదాసు చరింపఁగ
నిలదనుకన్ మేడనుండి యెంతో దృఢంబై. 82

ఆ. విడువఁ బడినయట్లు విషధరం బొక్కండు
త్రాడు వోలె నుండె వ్రేలుచు నట
దాని సర్పమనుచుఁ దానెఱుంగక పోయె
దాసు మోహపరతఁ దను వెఱుఁగమి. 83

క. దానినె యాధారంబుగఁ
దానెక్కెను బైకినందుఁ దనసాధ్వియు నిం
పైన తనరూపసంపదఁ
గానంబడె దానమనసుకలఁతయుఁ బాసెన్. 84

క. కనులకుఁ బండువుగాఁ దన
వనితామణితోఁప విరహభారము పాయం
గనియెను; మాతాదేవియుఁ
దనముగనిం దలఁచుకొనుచుఁ దదవసరమునన్. 85

ఆ. ఒంటినుండె నంత నువిదయుఁ బ్రాణేశు
రాకఁ గాంచి యర్ధరాత్రసమయ
మందు నిట్లురాక యరుదయ్యె ననిపల్కి
యతనికుపచరించి యనియె మరల. 86

చ. కనుఁగొనఁ జిత్రమయ్యెఁ గద కాలుఁగదల్పఁగ రాని రాత్రి యి
ద్దని తలపోయ కిచ్చటికి నల్లన వచ్చితివో విభూ! ననుం
గనుఁగొననో మఱేపనికొ కారణమున్న వచింపు మద్ది యే
వినఁదలఁతున్ మనంబునకు వింతగఁ దోఁచెడుఁజూ! యిదేలొకో. 87

చ. అనవిని హర్షమొక్కమొగి నాత్మను నిల్వక పొంగిరాఁగ నా
వనితనుగాంచి దాసనియెవచ్చితి నింటికి వేఁటకేగి ని

స్గనవికతంబునన్ గృహము గాదది పాడుగఁదోఁచె నాకు నే
మనివచియింతు నన్నమునునైనఁగొనన్ మదిఁదోఁపదయ్యెఁజూ. 88

క. ననుఁబాసి నీవువచ్చినఁ
దను విది వ్యర్థంబె యనుచుఁ దలఁచి నినుఁగనం
జనుదెంచి యెవ్వరిచ్చటఁ
గనఁబడఁమిం దిరుగుచుండఁగా భాగ్యమునన్. 89

సీ. వ్రేలాడుచుండెఁ ద్రాడేలొకో దానినే,
యూఁతఁగాఁ గొని మహోదాద్యోగమొప్పఁ
బైకివచ్చితి నిన్నుఁ బ్రాణేశ్వరినిగను,
భాగ్యంబుగల్గెను బ్రదికితి నిఁక
ననవిని యాపె యిట్లనియెఁ ద్రా డెవ్విధి,
వ్రేలాడుచుండె నీరీతినెవరు
దానినుంచిరి విచిత్రంబిది నాయకా!,
కనఁబఱచెదవె దానిని ననంగ

తే. భార్యకరమును దనకయిఁబట్టి యచటి
కల్లనం గొనిపోయె త్రాడనఁగ నిదియె
యచ్చెరువు పొందనేల నా నతివ దాని
విధముఁ గన్గొని సంతాపవివశయగుచు. 90

మ. కనుమా నాయక త్రాడుకాదిది మహాకాలాహి యీలాగు మ
త్తును దాఁబొందుచు వ్రేలుచున్నయది నాతోరంపుభాగ్యంబునే
వినుతింపంజను మృత్యుతుల్య మిది శ్రీవిశ్వేశ్వరానుజ్ఞచే
నినుఁ జంపం దలపోయదయ్యె సుమతీ నీరాక శ్రేయంబెటో. 91

ఆ. అనుచు హెచ్చరించి యాతని దోడ్కొని
శయ్యఁజేరి పొలఁతి చారువాక్కు
లలరఁ బల్కె నిట్టు లార్యా! మహాధైర్య
మూని యిట్లురాఁగ నేనె నీకు. 92

చ. ఘనకరులున్ మృగాదనముఖంబులు శ్వాపదముల్ చెలంగు నీ
వనమునుదాఁటి యిట్టితఱివచ్చుట న్యాయముగాదటంచు నీ
మనమునఁ దోఁపఁజేయనిది మన్మథు తాపమెగాదె తుచ్ఛమౌ
యనఘ! యిదేల చొచ్చెనొకొ యాత్మను సుంతఁ దలంపుమా తగన్.

తే. తుచ్ఛవిషయాభిలాషంబుతో నిదేల
వచ్చినాఁడవో మనమున భయములేక
యద్భుతంబిది మృగతృష్ణయట్లు తోఁచు
నేమి యున్నట్లు నిజమున కేమిలేదు. 94

చ. తనకు వశంబుగాక బలితంబుగ నింద్రియరాజి స్వేచ్ఛఁగాఁ
జనునపు డూరకుండిన నెసంగునెజ్ఞానము నెమ్మనంబునన్
వినుము మహాత్మ, యల్ల రఘువీరుని ధ్యానముమాని సంతతం
బును మదనున్ స్మరించినటుబుద్ధిని నాకిటుఁ దోఁచె నోవిభూ! 95

క. జలబుద్బుద మీప్రాయము
దలఁచిన మృత్యువు నదెట్లు దాఁటఁగరాదు
జ్జ్వలరూపము క్షణభంగుర
మిలశాశ్వతమైన దొక్కటే జ్ఞానము సూ. 96

ఆ. దాని వీటఁబుచ్చి తగని మార్గంబునఁ
బోవ మొదలుపెట్టినావె చనునె
బాల్యమందు నున్న భక్తి యెట్లగనో
ప్రాయమిద్ది తగ నపాయకరము. 97

క. నేఁడని రేపని మాపని
పోడిమిగా వయసుచెల్లఁబూను ముదిమి తూ
గాడుశరీరము దానన్
గూడదు తొలఁగింప దానిఁ గోరిననైనన్. 98

క. కనుచున్నారము గాదే
తనుసౌందర్యంబు మించుతరుణుల నరులన్
గనుఁగొన వారలు మార్పును
గనుటంజూచెదము ముందుకాలమునందున్. 99

క. ఈమహి "వయసిగతే కః
కామవికారో" యటంచుఁ గడుపండితసు
త్రాములు పల్కిరి వినమే
యామాటలఁ బెద్దలహరహంబును దెలుపన్. 100

క. మనములఁ దోఁప వాకో యల
వినుతోక్తులు చపలవిషయవికృతింగను నీ

మనమున? నేమని యందును
మనుజలలామా, తలంపు నూమకభణితుల్. 101

చ. అనియిటు లాసతీతిలక మాత్మహితంబుగ బోధసేసెఁ నం
తనతనిచిత్తమందు బలితంపుమనోభవతాపమెల్ల నో
క్కనిముసమంతలో వెడలఁగా విమలంబగు జ్ఞానమల్లెరం
మునిపదభక్తియుం గుదిరె మోమునఁ దెల్వియుఁ దోఁచె నప్పుడే.

చ. తరుణి హితంబు సెప్పుటయుఁ దాను జ్ఞానముఁ బాసి మోహమే
పరమతమార్థమంచు నిరపాయపథం బదెయంచు నెంచి య
యుత్తరుణమునందు వచ్చుటయు దార్ఢ్యముగాఁ దలపోసి యక్కటా
స్వగురువాగురాళిఁ బడి జాల్ముఁడనైతి నటంచుఁ జింతిలెన్. 103

చ త్వరపడి యాతఁ డప్పుడె నితంబిని గాంచి త్వదీయవాక్కులే
గురువులు నాకునయ్యె నిఁకఁగుందను పూర్వపుభక్తితోఁచె నే
నరిగెదఁ జూచెద న్ని నుమహాధృతిఁ గొండొకకాలమేగ ని
త్తరుణమునందె పోవఁగ ముఖంబున నాకు ననుజ్ఞ యిమ్మనన్. 104

చ. వెనిమిటిఁ గాంచి మీకు రఘువీరుని పాదసరోజభక్తి క
ల్గునుగద చాలునన్నియు విలీనముగా మదినుండెఁ గాని శ్రీ
శునికృప నిప్డువెల్వడియెఁ జోద్యముగాదె తలంప నిద్దియే
ననిశము మీపదాంబుజము నాత్మఁదలంచుచు నుందు నెప్పుడున్.

చ. సెలవొసఁగి యా సతిని జేరవ మీరు ఇకటం బటన్న నా
వెలఁదిని ప్రీతిఁ గాంచి రఘువీరుని సేవయె సేయుచుందు ని
న్నిలువఁగఁ బంపెదన్ మరలఁ బ్రీతిని వీడను జిత్తమందు నీ
పలుకులె వేదవాక్యములభంగిని జ్ఞానము గల్గఁ జేసెఁ జూ. 106

చ. అనిసతిఁ గౌఁగిలించుకొని హర్షము మీఱఁగ నామె పోయిర
మ్మని వలుకంగ నప్పుడె ప్రయాణము సేసి నిశాంతమాటచే
జనులరుగంగ వారిదగుసంగతిఁ దాఁజని దాసు జాహ్నవీ
ధునితటమందు నిల్చి మదిఁదోఁచెడు వేడుక సంగడింపఁగన్. 107

తే. ఆశ్రమంబొండు కల్పించి యందు నిల్చి
రామరామా యటంచు శ్రీరామ యనుచు
జానకీనాథ యంచు దాశరథి యనుచు
భజనసేయుచునుండె నిబ్బరము గల్గి. 108

క. జనశూన్యమైన యాశ్రమ
మున నాతఁడు నిష్ఠయును బ్రమోదము తగ రా
మునిఁ గొల్చుచుండె ననిశం
బును నిందుక తఱుఁగనట్టి పూనికమీఱన్. 109

క. అనుదినముదయము మేల్కని
మనమున శ్రీరాముఁ దలఁచి మఱిశౌచవిధిన్
బొనరింపఁ జనును దర్వా
త నతఁడు దంతములఁ గడుగు దైవపదరతిన్. 110

సీ. శౌచాదికృత్యముల్ జరపి శిష్టజలంబు,
నొకచెట్టుమూలమం దోపిక మెయిఁ
బోయుచుండును మూర్పుఁ బొందక యారీతిఁ,
బండ్రెండువర్షముల్ పరమనియతి
నొక్కచెట్టునకె పోయుచునుండ నయ్యది,
ప్రతిదినంబును జక్కఁబెరిగి పెద్ద
దయ్యె; నీరీతి నయ్యావనీరుహం బట్టె,
యభివృద్ధినొందంగ నతఁడు దాని
గీ. చెంతనున్నట్టి యాశ్రమసీమ నిల్చి
భజనమొగిఁ జేయుచుండె; నీపగిదినుండ
నొక్కనాఁడొక్క యద్భుతంబొదవె నేమి
యనిన నుదయకాలంబున నతఁడు లేచి. 111

చ. మనమున రామచంద్రుఁ బలుమాఱులుగా స్మరియించి కృత్యసం
క్తినియతిఁ దీర్చి వచ్చుతఱిఁ దీవ్రతరాకృతితోడఁ దోఁచె ముం
దనుపమతేజమొప్ప నొకయద్భుతభూతము బ్రహ్మరక్షసో
యని వెఱగందె నాతఁ డదియట్టులెయయ్యెను నిట్టుత్రోవలోన్.

చ. కనఁబడి దానుచిత్తమున గాఢభయంబును బొందెనంచు నా
త్మనుదలపోసి యిట్లనియె ధన్యుఁడవీవు మహాత్మ! భీతినొం
దనుదగ దేను నీదుదయఁ దద్దయుఁ దృప్తినిగాంచినాఁడ నా
మనము ప్రమోదమందె నొకమాటవచించెద నాలకింపుమా. 113

క. ప్రతిదినము నీవు చల్లిన, మితజలమున నేను దృప్తిమిగులంగని యే
వితమునఁ జింతనుగానక, తిని నిటజీవించితిని విచిత్రముగాఁగన్. 114

## బ్రహ్మరక్షస్సు వృత్తాంతము.

చ. అనవిని దాసు నిల్వఁబడి యాదృతి నిట్లను నీవనంగ నా
కును దెలియంగ రాదె మదిఁగోరెద నీవిధ మేనెఱుంగ నో
యనుపమతేజ! యన్న విని యాపెనుభూతము దాసుతోడ ని
ట్లనియెఁ గృపాత్మ! నాదుజననాదిక మక్కఱలేదెఱుంగఁగన్. 115

సీ. బ్రహ్మరక్షస్సను బరమనిర్భాగ్యుండ,
నాకొక్క విప్రర్షి నాయకుండు
కోపంబుమీఱంగ గొబ్బున శపియించె,
ననుభీతినొందఁ జేసిసకతమున
నివ్వనంబుననుండియే యుదకంబులఁ,
దాఁకఁజాలక నితాంతముశ్రమించు
చుండుమా యన నేను నోమహాత్మా! శాప,
ముక్తి యెప్పుడో తెల్పుము దయననినఁ

గీ. గాంచి కాలముజరుగ నొక్కండు భక్తి
పరవశుఁడు వచ్చి సలిలంబుఁ బట్టువిడక
పోయుచుండును దాననెపోవు నీకుఁ
దాప మంతట శాపంబు తలఁగుఁ జుమ్ము. 116

చ. అనియెను గాన నట్టులె మహాత్మక! నే చిరకాలమిందు ని
ల్చి నినుఁగనంగఁ గోరుచు విజృంభితతాపముతోడ నుంటి ని
ట్లనినది యాదిగా మదినిగల్గెను మోదము నీజలంబుచే
తనె యభివృద్ధినొందితిని దాపముదీఱెను శాపమేగుఁజా. 117

క. నీవంటిపుణ్యపురుషుల, నేవిధమున వెదకినను మహీస్థలిఁ గననౌ
నే వాసుదేవభక్తా, నీవంటి బ్రదికినాఁడ నేనిఁకఁ జనెదన్. 118

క. ఉపకారమేదియే ని
ష్కపటాత్మక! నాదువంకఁ గాంక్షించెదవో
యిపుడె యొనర్చెద నావిని
యపరిమితామోదమంది యతఁ డిట్లనియెన్. 119

సీ. జననమాదిగను దాశరథిపదంబులఁ గనవేడుకయె మనంబున నెసంగు
చుండు నీయడవిలోనుండి భజించితిఁ గాని దర్శనము నాకినియుగుదు

వఱకుఁ గాలేదేమిభక్తిలోపమొదానినగునట్లుసేయవే; యనినభూత
మతనికిట్లను నేను నతిశయపాపుండ నాకబ్బినంగాదె నీకుఁ జేయ
తే. నేర్తుఁ దత్ఫలముం బొంద నేను బ్రహ్మ
రక్షసుఁడఁగద నైన నోరామభక్త
యొకయుపాయంబుఁ జెప్పవె సకలవిధము
లను బ్రయత్నింపు కార్యసిద్ధిని గనుదువు. 120
క. అనుదిన మీవును భజనం
బును జేయుచునుండ నొక్కపూజ్యుఁడు వృద్ధుం
డును బ్రహ్మచారియును నగు
ఘనవిప్రుఁడువచ్చి వినునుగాదె సుభక్తిన్. 121
క. హనుమంతుం డాతండని
మనమునఁ దలపోయు మీవు మారుతి యతఁడౌఁ
గనుకనె నీముందటఁ జ
క్కనిభక్తిని నాలకించుఁ గమ్రభజనమున్. 122
క. హనుమంతుఁడు కరుణానిధి,గనుక మహాత్మా భజింపఁగాఁదగు నతనిన్
గొనసాగు నీదుకాంక్షిత,మని యాభూతంబు స్వేచ్ఛనరిగెం బిదపన్.
చ. వరమతి దాసు రాఘవునిభద్రదునిన్ భజియించుచున్ మనో
హరమగు రామనామము నహర్నిశమున్ నుతియించుచుండఁగా
మరుదధిపాత్మజుండు బహుమానము మీఱఁగఁ బూర్వరీతిఁగా
నరుదుగ వృద్ధవిప్రవటువై చనుదెంచెను భక్తి మీఱఁగన్. 124
తే బ్రహ్మరక్షస్సు తెల్పినభంగిఁ దులసి
దాసు మారుతిగానె యాతని నెఱింగి
వందనముసల్పి యిట్లని పలికె నోమ
హాత్మ! నాపాలిభాగ్యంబ యనిలతనయ. 125
చ. మనుజుఁడ దుష్టబుద్ధినయి క్ష్మాస్థలిఁ గొండొకకాల మిచ్చవ
చ్చిన యాటు పుచ్చినాఁడ, ననుఁజేరి సతీమణి నాదుభార్య చ
క్కనియుపదేశ మిచ్చె రఘుకాంతునినిన్ భజియింపు మంచు నే
ననయము నట్టులే కలిగినంతటిభక్తిని శ్రీరఘూత్తమున్. 126
చ. అనుదినముం దలంచుచు మహామతి రామునిఁ జూచుభాగ్యముం
గనుదు నటంచునమ్మి యిటుఁ గాలముఁ బుచ్చుచునున్నవాఁడ రా

మునిఁ గనఁ జేయుమా కరుణ ముందుగ నిన్నె భజించువాఁడ నీ
యనుమతి రామదర్శనమునందుదు నేనని నమ్మినాఁడఁ జా. 127
చ. అనిలతనూజ నీవెఱుఁగనట్టి ప్రపంచపువార్త లున్నవే
యన హనుమంతుఁ డాత్మము ... ంది ప్రయాణము సేయువేళ నీ
వనుకొనినట్టులే యగు మహాత్ముఁడనంచని పోయె; దాసు రా
మునిఁ గను భాగ్య మబ్బెనను మోదమునన్ వసియించె నచ్చటన్.
క. మరుదాత్మజుండు శ్రీరఘు,వరునిన్ ధ్యానించి సాధుభక్తునకున్ స
త్వరముగ దర్శన మిమ్మని,పరిపరిఁ బ్రార్థించె వినయభక్తులు వెలయన్.
చ. తనప్రియభక్తుప్రార్థనముఁ దా సఫలీయింపఁగఁ జేయఁ గోరి యా
తనిమదిఁ జూడఁగోరి రఘుతల్లజుఁ డమ్మఱునాఁడు వేఁకువన్
దనదగు వేషమున్ వదలి తత్క్షణమే యవనావనీశుఁడై.
తనపరివార మవ్వీధిని దన్గొలువంగ మహావిభూతిచేన్. 130
తే. పయనమయి సైకరాతులై భటులు తన్నుఁ
గొలువ దాసున్న యాశ్రమస్థలముఁ జొచ్చి
యరిగె శ్రీరాముఁడని తెనయాత్మ నెఱుఁగఁ
డట్టితఱి దాసు తనపనియందె యుండె. 131
చ. జనపతి యిట్టులేగుటయు సైన్యము, తోడ నపోవుచుంటయుం
గని యెవరో యటంచుఁ దమకింబున రాముని నేస్మరించి ద
ర్శనమొసఁగుం గృపామతిని సత్వరమే యని వేచియుండె నా
వనజసఖుండు క్రుంకుటయు వచ్చెను మారుతి పూర్వరీతిగన్. 132
క. అరుదెంచి దాసుఁ గని భూ,వరుఁ డిట నేతెంచినాఁడె వనలనిభక్తిం
బరమాత్ముఁ గొల్చినాఁడవె,నిరుపమభాగ్యంబు నీకు నేఁ డబ్బినదే.
చ. అనవిని దాసు శ్రీదశరథాత్మజుఁ డిచ్చటికేల రాఁడో నా
తనువిది పాపపూరితమె దర్శన మీయఁగ లేదటన్న నా
యనిలతనూజుఁ డోయి యెవరైనను బోయిరె యీపథంబుగా
నన నొకమ్లేచ్ఛరాజరిగె నాత్మభటావళి గొల్వ నంచనన్. 134
క. మరుదాత్మజుండు దాసును, బరికించి వచించె మ్లేచ్ఛపార్థివతనువున్
ధరియించి పోయినది దా,శరథియె;నాహృదయమం దశనిపడినగతిన్.
తే. వగచి యిట్లని యతనితోఁ బలికె, నార్య
నాకు రామునిఁ గాంచుపుణ్యంబు లేదు

పూర్వజని దుష్కృతంబె మొ పూజ్యచరిత
యన్న నాతని చింతల నాత్మ నెంచి. 136

చ. హనుమ వచించె నాపయి మహాముదముంగల రామచంద్రుఁ జ
య్యనఁ దమి దర్శనంబొసఁగునట్లుగ వేఁడెద నన్న రాముఁ డా
జనకజతోడ లక్ష్మణునిసంగతిఁ బాయక నీసమక్షమం
దనుపమదర్శనం బొసఁగునట్లుగఁ జేయవె యోకృపానిధీ! 137

చ. అనవిని యల్లె వేఁడెగ మహాత్మునినం చతఁడేగె నంత నా
దినమెటులో శ్రమంపడుచు దీనతఁ బుచ్చి యతండు వేఁగినన్
మనమున రామమూర్తిని నమానుషశక్తిని వేఁడుచుండె నా
హనుమయు దాసువాంఛ యిదియంచు రఘూత్తముఁ జేరి తెల్పినన్.

తే. మఱుదినంబునఁ ద్రైలోక్యమందునుండు
రామచంద్రుండు సహజుతో రమణితోడ
భజనమును జేయువేళను శ్వసనతనయుఁ
డుండ నప్పుడు దర్శన మొసఁగెఁ గరుణ. 139

సీ. నీలమేఘశ్యాముఁ బాలితసుత్రాము,
వందితామరజాలు భర్మచేలుఁ
గాంచనాంగదబాహుఁ గమనీయతరదేహు,
మణిహారవక్షు నిర్మలతరాక్షు
దూణీరమహితాంసు దుష్టవైరిజిఘాంసు,
దూరితమునితాపు ధూతపాపుఁ
గరుణాభిభూషణుఁ గమ్రసంభాషణు,
సురనుతశ్రీనాము సుగుణధాము
గీ. జనకజాన్వితు లక్ష్మణసహితు రాముఁ
గాంచి యాదాసు లేచి సమంచితముగ
భక్తి వలగొని మ్రొక్కి నిల్వబడి కరయు
గంబు జోడించి యీరీతిఁ గా నుతించె. 140

చ. నినుఁ గనునంత భాగ్యమును నేఁటికిఁ గాంచితి దేవదేవ నా
జని ఫలియించె వాంఛలును జక్కఁ ఫలించెను నీపదాంబుజం
బును స్పృశియించినాఁడ ననుఁబోలు కృతార్థుఁడు లేఁడటంచు నా
మనమున నమ్మినాఁడ సురమానినుతార్చిత, రాఘవేశ్వరా. 141

చ. నిరతము నీపదాంబుజము నేను భజింపఁగ నీదునామముల్
స్మరణముసేయ నిన్పొగడ సంతతముల్ మది నిన్ను నిల్ప నా
కురుకృప నీయవే వరము నొందువరంబును గోర దేవ తే
శ్వరనుతనామ మౌనివరసన్నుత, దేవగణార్చితా, విభూ. 142

చ. మనమున నేను గోరుతతి మానకవచ్చి భవత్స్వరూపమున్
గని సకలాఘముల్ దొలఁగఁగాఁ గృతకృత్యుఁడనై చెలంగ నా
కనుమతి నిమ్ము చాలు నిదె యార్తశరణ్య! యిఁకేమి నేను జే
యను గలకార్యమున్నదొ మహాత్మ! విభూ! దయ నానతీయవే. 143

క. అనిపొగడినఁ దులసీదా
సును బ్రీతింగాంచి యింక క్షోణిఁ గలుగుభ
క్తనికరమునకుం దెల్పుము
ఘనతరమగు మోక్షపథముఁ గన్గొనురీతుల్. 144

క. కోరినయప్పుడు నన్నను
దారసి ధరలోనఁ గల్గునార్యజనులకుం
గోరినపర్య లొనర్పుము
చేయుదు వంతము నాదు శ్రీయుతపదమున్. 145

క. అనిపల్కి తిరోహితుఁడై
చనియెన్ రాముండు దాసు సమధికభక్తిన్
జనకాత్మని స్తుతియించుచు
వనమున నేయుండ హనుమవచ్చెన్ మొలన్. 146

వ. దాసులేచి మహాత్మా! భవబంధవిమోచనసాధనంబగు రామచంద్రు
పాదారవిందసందర్శనంబు గలుగంజేసిన మహోపకారివి, దీనికిం
బ్రతికృతి నేమిసేయనేర్తు నని బాష్పసంకలితాంగుండై వేఁడిన నాతు
లసీదాసుం గాంచి హనుమ యిట్లనియె. 147

క. పరమేశ్వరుసేవ యనన్, నిరతము ప్రజలం జెలంగునియతిఁ గొలుచుట
పరమమ్ము ప్రజాసేవయె, పరమేశ్వరసేవ యనెదుపల్కులు వినవే.

క అనిపలికి హనుమ స్వేచ్ఛఁగఁ
జనియెన్; మఱునాఁడు దాసు సరభసగతిఁ గా
శినిజూడఁబోయె నవ్వన
మునఁగల సన్మార్గములు వగఁ బూనె నతనికై. 149

సీ. ఒకచోట నాకాశి నురుముదంబున మఠ,
మొక్కండు కల్పించి యున్నతమతి
శ్రీరామచంద్రుని సేవించుచుండంగ,
నిరతము భక్తులు నెమ్మినచ్చి
యాతనిసేవల నచ్చటఁ గాంచుచుఁ,
దాము భజించుచు ధనము రాశి
గాఁ బోసి పోవుచుఁ గడురామభక్తులై,
కాలముపుచ్చుచుఁ గాశియందుఁ
గీ. దులసిదాసును బోలుధన్యులు వెదకినఁ
గలరె యంచు వచించిరి గాల మిట్లు
జరగుచుండంగ సద్విత్తసంచయంబు
పెరిగె నామఠమునయందు గిరిని బోలి. 150
చ. ధనమిటు రాశిగాఁ బెరుగ దానిని వృత్తికఁబోలెఁ గాంచుచుఁ
జనులెవరేనిఁ జేకొనిన స్వాంతమునం దలపోయకుండె నా
ధనమును దాసుగారిదని తా మెవరైన గ్రహింపఁ బూన కిం
కను గొనివచ్చి యందెయిడి క్రమ్మఱి పోవుచునుండి రందఱున్. 151
మ. ఒకనాఁ డాధనరాశిఁ గైకొనఁగఁ దా మూహించి చోరాగ్రణుల్
ప్రకటస్ఫారపరాక్రమంబున నిశార్థంబందులోఁ జొచ్చుకాం
క్షఁ గడుం గ్రాలఁగ వచ్చి చూడ నచటం గాపుండి చాపంబు భీ
తికరాస్త్రంబులు పూని యిర్వురు మహాదీప్తాంగు లుద్యద్గతిన్. 152
క. అదలించినఁ జోరుల్ వెనఁ
గఁ దలఁచి బాహాబలంబు గలిగినకతనన్
గుదియలతో మార్కొన వా
రదలించి మహాశుగముల నల్లన నొంపన్. 153
క. ఐకాగారికు లంతట, వీఁకం బోరాడి వారిబీరము లడఁపన్
బాహులఁ ద్రిప్పుచు నచ్చట, నేఁరణిం బోరఁగ రాను నెంచి నిరాశన్
ఆ. తెల్లవాఱవచ్చెఁ దెంపున సాధింప
రాదటంచు మరలి రయమునఁ దమ
యిండ్లకేగుచుండి యింతలో దాసుస్నా
నార్థ మరుగుచుండ నంతఁ గాంచి. 155

చ. ఇతఁడు మహానుభావుఁడగు సీతనిసొమ్ము గ్రహింపఁ బూనఁగా
జతనము సేయుటర్హమె విచారమిఁకేటికి దాసుగారిసం
స్తుతపదముల్ దగంగొలిచి చోరులమై యిఁక నొండ్లసొమ్ము లె
వ్విధముననైనఁ గైకొనెడువృత్తిని మాని చరింత మూర్విలోన్. 156
చ. అనితలపోసి స్నానమున కాతురతం జనుదాసుగారినిం
గని యతిభక్తిమ్రొక్కి మముఁగావవె చోరులమై చరించుచున్
ధనముఁ ద్వదీయముం గొనఁగఁ దత్పరతం జనుదెంచి మీగృహం
బును జొరఁబోయి వాకిటను గావలియున్న భటద్వయంబుచేన్.
తే. తఱుమఁబడి శక్తినింబాసి దైన్య మొదవఁ
బోవుచున్నార మిఁకమీఁదఁ బోము పరుల
సొమ్ములకుఁ గాన క్షమియించి శుద్ధమతులఁ
జేసి నీశిష్యులనుగాఁగఁ జేకొనఁ దగు. 158
క. అనితనువేఁడిన దొంగలఁ
గని పూరుషవర్యులార! కమలదళాక్షుల్
ఘనులునగు రామలక్ష్మణు
లను గంటిరి మీరు ధన్యులరు లోకమునన్. 159
క. జననము కృతార్థమయ్యెను
జనుఁ డింక మహాత్ము రామచంద్రుఁ గొలుచుచుం
డిన మీకు మోక్షమబ్బును
గనినాఁడను మిమ్ము రాముఁ గాంచినవారిన్. 160
ఆ. ఇదియె చాలు నాకు నింకేమికోదువలే
దనుచుఁ బోయె స్నానమాచరింప
నతనిహితవుఁ గొనుచు నాదొంగ లత్యంత
సాధుచిత్తు లగుచుఁ జనిరి పిదప. 161

## తులసీదాసు పతితునిఁ బరిశుద్ధుని జేయుట.

ఆ. కొంతకాలమునకుఁ గోరిక భక్తులు
విప్రతతిని బిల్చి విమలపక్వ
వస్తువులను బెట్టి వారిఁ దృప్తులఁ జేయ
వలయుననుచుఁ దలఁచి భక్తి యలర. 162

క. ధరణీసురులం బిల్వఁగ
నరుదెంచిరి భోజనార్థ మందఱు నన్నా
తురులై వారలనడుమన్
ధరణీసురుఁ డొకఁడువచ్చెఁ దా భుజియింపన్. 163

క. కని వాని నందఱుం జయ్యన నీతనిసాగనంపు మర్త్యుఁడు కాఁడీ
మనుజాధముండు పతితుం, డనఘా! యని దాసుగారి నభ్యర్థింపన్.

క. కనుఁగొని తులసీదాసా
తనిఁ బతితుఁడవాఁడువా నితాంతము శ్రీరా
మునిఁ దలఁపు పాయుఁ బాపము
లనవిని రామా యటంచు నతఁడు స్మరించెన్. 165

క. అంతట దాసా బ్రాహ్మణ
సంతతినిం గాంచి రామసంస్మరణముచే
నింతటినుండి యితం డఘ
సంతతినిం బాసి మిగుల సాధువె యయ్యెన్. 166

సీ. అంటునే శ్రీరాము నతిభక్తిఁ గొల్చెడు,
వానికిఁ బాపముల్ భక్తచిత్తు
లార! యొకటివినుం డారసి తెల్పెద,
హరిదాసులకు నఘ మంటదెపుడు
వారు శుద్ధాత్ములు వారి నాక్షేపింపఁ,
బాపముల్ మెడఁబడుఁ బాములట్టు
లీబ్రాహ్మణునిదోష మింక నెన్నటికైన,
దలఁపంగఁ బూనకుఁ డలరి మీరు
తే. కుడిచి కూర్చుండుఁ డనవిని క్షోణిసురులు
వానిపల్కుల కోర్వక వల్కి రిట్లు
లార! వింటిమె యీపల్కు లనవినమున్ను
హరిపదారాధకుల కింటదంట యఘము. 167

క. హరిమహాత్మ్యమ్ము లసా
ధారణములె యయినవంట తెలఁపఁగఁ జోద్యం
బౌరా! యిదియె నిజమే
గాంచఁ దగు నంది యిచట నగపడు శిలచే. 168

ఆ. అన్నరాశి దీని నందుకొంచు గ్రసించు
నేని నమ్మవచ్చు నిచట దీని
ననిన దాసుగారు హరిభక్తి మీఱంగ
ననియె నంది( జూచి యాదరమున. 169

చ. ధరణిసురోత్తములు విను నితాంతముపట్టుదలల్ చెలంగ నీ
వరసభ నున్నవారలు నెబాసన నన్నము మ్రింగ( జూడ నా
తురపడుచున్నవారు తమితో(గొని మ్రింగుము యన్నమంత ని
త్తరుణమునందె శ్రీహరిపదంబులభక్తిని నన్న నంతలోన్. 170

తే. నంది యంబారవంబు మిన్నంది మ్రోయ(
జేయుచును లేచి యన్నరాశిని గ్రసించె
క్షణములోపల నంద ఆశ్చర్యపడుచు
నతని వలగొని మ్రొక్కి యిట్లనిరి భక్తి. 171

క. క్షమియింపుము క్షమియింపుము
తమోగుణంబూని యిట్లు తమశక్తి నిగ
ర్వము పేర్మి నెఱుంగక మే
ము మాటలాడితిమి జ్ఞానము మరలవచ్చెన్. 172

క. హరిదాసులశక్తిని మే
మరయ(గ( దగినంతవారమగుదుమె యని భూ
సురులెల్ల భోజనంబున(
బరితృప్తిం గాంచి చనిరి స్వస్థలములకున్. 173

తులసీదాసు మృతుని బ్రదికించుట.

చ. జరిగెను గొంతకాలమిటు చక్కని శ్రీహరిభక్తిచేత న
ప్పురమున నిట్టులుండ నొకబోటి యొకానొకనా(డు ప్రొద్దున
హరిపదభక్తు( డాకృతిని నభ్రధునీమణిc గ్రుంక(బోవ(గా(
బరమశుభంబటంచు భయభక్తులతో( బ్రణమిల్లెc ద్రోవలోన్. 174

క. తనకుం బ్రణమిల్లిన యా
వనితం గని భర్తృతనయ భాగ్యంబులతో
డను సుఖమందుము భక్తిని
గని యని యాశీర్వదించె( గడుముదమలరన్. 175

చ. వనితయు భర్తచావునకు వందురుచుం బతితోడఁ దానునుం
దనువుఁ ద్యజింపఁ బోవుచుఁ బథంబున దాసునుగాంచి మ్రొక్కఁగా
వున హరిదాసునాశిషము బుద్ధికిఁ జిత్రముగాఁగఁ దోఁప ని
ట్లనియె మహాత్మ నాకిడినయాశిషమెట్లు ఫలించునో గదా. 176

సీ. పెనిమిటి మృతినొందఁ దనువు నేనును బతి,
తనువునఁ జేర్చి యాదహనుజ్వాల
లను బడిపోవంగఁ జనుచున్నదాన నా,
విని తులసీదాసు మనమునందు
శ్రీరాఘువుని నిల్పి చెచ్చెఱ నీభర్త,
శవ మెందునున్నదో చక్కఁ జూపు
మని యామెచూపంగ నాదేహమును దాఁకి,
శ్రీరామ యీతనుస్థితము లైన

తే. యసువులను వేగ రప్పింపుమనుచు వేఁడ
నట్టి కోమటి మేల్కొన్నయట్లు లేచి
నలుఁగడలఁ గాంచి దుష్టచిహ్నములఁ జూచి
విసుగుకొని పల్కె భార్యతో విషమరీతి. 177

క. ననునేల కట్టితెచ్చితి
వనితా! యీయశుభమేల వారక చెపుమా
యనఁ దెలిపె నామె సర్వము
విని యాతఁడు దాసుగారి వినుతించెఁ గడున్. 178

క. జరగె నిటుకొంత కాలము
హరికథలను గాశియందు నక్బరుగారా
హరిదాసుకథల విని య
చ్చెరువందుచుఁ దనదుమంత్రిఁ జీరి యిటులనెన్. 179

చ. విను మలకాశియందు వినవేడుకఁ బుట్టఁగఁ జేయు వార్తలే
వినఁబడుచున్న వానుడుల వే యరయుణ్ మదిఁ గోరుచున్న దా
య్యాన హరిదాసునిం బిలువ నంపుము చూచెద వానిశక్తి నం
చనవిని మంత్రి చారులను హర్షముమీఱఁగఁ బంపెఁ గాశికిన్ 180

ఉ. వారును దాసుగారిఁ గని పల్కిరి స్వామి, మహాత్మ! మిమ్మునుణ్
ధారణినాథమౌళి గనఁ దద్దయు వేడుకఁబూని రమ్మనెణ్

గారణమేమొ? మేమెఱుఁగఁగాఁగలమే ? చనుదెమ్ము నాఁగ నా
శ్రీరమణాంఘ్రిభక్తుఁడటు చేయుదునంచని బోయె వారితోన్. 181

చ. చనిచని ఢిల్లిఁగాంచి యటఁ జారుతరంబయి చక్రవర్తియుం
డ నలరు సౌధముం జొరఁబడంగని శ్రీహరిదాసుగాఁ వం
బున మొగలాయితేఁడని యెఁ బొందుగ గాశిని మర్త్యకోటి నె
వ్వనికిని జేయరానివఁయి వర్ణ్యములౌ పనులీ వొనర్చితే. 182

చ. కనుఁగొన వేడుకయ్యెడిని గాశిని జేసిన యవ్విచిత్రముల్
కనఁబఱపంగ నోపుదువె క్రమ్మఱ మానికటంబునందు నా
విని రఘువీరుఁడే తగును వింతలొనర్పఁగ నేనుజాల నె
వ్వనికినినైన నన్ను తులసీకులపాలక మౌళియఁ దాసుతో ననెన్. 183

చ సరిసరి యట్టులేయయిన జానకిభర్తను జూపు మాతనిం
గర మనురాగమొప్పనటు గాంచినదాఁక నినుం బురంబులోఁ
దిరుగఁగనీక యుంచెదము తెప్పున నప్పనిఁ జేయు మంత నీ
వరుగ ననుజ్ఞయీయఁబడునంచతనిం జెఱసాల నుంచినన్. 184

చ. మనమున రాముభక్తిమెయి మన్ననతోఁదప స్మరింప నాతనిం
గన నరుదెంచి రామజనకాంతుఁడు వల్కె భయంబు వీడెల యీ
జనపతిగర్వ మేనణఁచి శాంతమనస్కునిఁ జేయ వీఁడటఁ
జనుదుపుగాక యంచు నృపసత్తముఁ డప్పుడదృశ్యుఁ డౌటయున్.

క. తులసీదా సాదరమునఁ
బలికెఁ రఘురాముఁడేటిభయమిఁక నాకుం
గలుగఁ గలదంచు రాముని
దలఁచుచుఁ గారాగృహమునఁ దా వసియించెన్. 186

ఆ కొలఁది దినము లిట్లు కోటలో దా నుండఁ
జక్రవర్తి యతనిఁ జాలఁ బ్రేమ
నరయుచుండె నంత నాకస్మికంబుగా
నొక్కనాఁడు కోఁతు లుక్కుమీఱ. 187

చ పరువడి నేగుదెంచి యటఁ బాలకులెల్లను భీతిఁ బాఱఁగా
నురుతరహుంక్రియల్ చెలఁగ నొక్కటఁజేరి మహాబలంబునం
బరుగిడి కోటచుట్టు నిలువంబడి లాలనువై చుచుం నరూ
పక్షపకమునఁ గొట్టుచుం బలుకొరంగులు బొడ గరించె నుద్ధతిన్.

కవిరాజవిరాజితము.—

కిలకిలకూయుచుఁ గేరడమాడుచుఁ గేలఁ దరుల్గొని కీడ్పడుపం
దలఁగుచు శూలను దారుణరీతిని దత్పరతన్ బలదర్పములన్
జెలఁగుచు నుర్వ్వుచుఁ జేరఁగనీయక సేనలఁ ద్రుంచఁగఁ జేయుచునన్
గలయఁ జరించుచుఁ గావలివారలఁ గాఁజియ పెట్టుచు గర్వమునన్.

ఆ. తిరిగితిరిగి తమ్ముఁ దేఱిచూడఁగ నేరి
కైన నలవిగానియట్లు కోఁతు
లయుతసంఖ్య లొప్ప నాకోటగోడల
నావరించి చెండి యవలనైచె. 190

వ. జనపతి విన్న నేవనునో శత్రుభయంకరమూర్తి యాతఁడే
మని తము శిక్షసేయునో మహాపదగల్గు నటంచు సేన లా
య్యనఁ దమలోనఁ దాము గలయంగను బూనికఁ జెప్పకొంచుఁ గీ
శనికరముం గలంచి యమసద్మముఁ జేరఁగఁ బంప నెంచుచున్. 191

చ. తలపడి రిట్టు లాప్లవగతల్లజరాజభటోత్తముల్ మహా
బలములుమీఱఁ దార్కొనుచుఁ బ్రాణహరంబగు ప్రస్తరాయుధం
బులు పరగించుచున్ దుదిని బొంగు జయేచ్ఛలసంగరంబు ని
ష్ఠుల భయదాట్టహాసముల మొక్కలమొప్పఁగఁ బోరుచుండఁగన్.

చ. నరపతిసేనలెల్లఁ గపినాథులపైఁబడి యీసుపొంగ భీ
కరనిశితాశుగప్రతతిఁ గాఁజియపెట్టినఁ గోఁతు లేచి య
త్తరుణమునందుఁ గన్పడినధాత్రిరుహంబులఁ బెల్లగించి వై
చిరి యవితాఁక వారలును జేరిరి ధర్మనికేతనం బొగిన్. 193

సీ. ఇరువురు దర్పంబు నీసును బొంగంగఁ,
బోరాడుచుండఁగా భూరిశక్తిఁ
బ్లవగముల్ హెచ్చినపౌరుషంబున మ్లేచ్ఛ,
రాజేంద్రసైన్యవాహమును జంపి
నిశ్శేషముగఁ జేయు నేర్పునఁ బోరాడ,
రాజేంద్రసేనలు రణము సేయఁ
జాలక పరుగెత్తి క్ష్మాపతిచెంతకు,
నరిగి మ్రొక్కి పరాకు నిరుపమాన

తే. బలముగల్గిన కోఁతులు పదిసహస్ర
ములు వెసం గోట ముట్టడి సలుప మేము
శక్తి దాఁపక యుద్ధంబు సలిపినార
మవ్వి మనసైన్యములనెల్ల నడరి చంపె. 194

చ. మనమునఁజూడఁ జిత్ర మిది మాయయొకో యనితోఁచుచున్నదో
జనవరమౌళి! యల్లదె వెసం జనుదెంచుచునున్న వింక నా
కృనిముసమేని జాగయినఁ గార్యముతప్పఁ బురంబుపాడగుఁ
గనుఁగొనుఁ డేమికారణము గల్గినదో విధికేమి కోపమో. 195

చ. అని బలముల్ తదీశులు మహాభయకంపితదేహముల్ తగన్
మనవియొనర్ప నక్బరు నమానుషబుద్ధిబలుండుగాన మం
త్రినిబిలిపించి వార్తలను దెల్పి యిఁకేమియొనర్పనౌనొ నా
కును దెలుపంగనౌఁ బురముఁ గూల్పకమున్నె సమంచితంబుగన్.

క. అనియడిగిన సచివోత్తముఁ, డను నిట్లని తులసిదాసు నత్యుత్తమబు
ద్ధిని విష్ణుభక్తుఁ జెఱలో, నునిచిన దానికి ఫలంబు నోరాజేంద్రా.

తే. అనుభవింపక తీర దయ్యాజునియంత
వానికైనను బుద్ధిపూర్వముగఁ జేసి
కొన్న కృతికి ఫలంబు సంపన్ను నతని
వదలి ప్రార్థింపుమా మది భక్తి తనర. 198

తే. మంత్రి యీరీతిఁ జెప్పినమాట మదికి
సరిపడన్ వేగపోయి దాశరథిభక్తుఁ
గాంచి మ్రొక్కుచుఁ గావుమా! కావరమునఁ
జేసినట్టి యపజ్ఞను జేర్పక మది. 199

చ. నరపతినంచు మీపయిని న్యాయమువీడి యహంకృతిన్ భయం
కరముగఁ బొంది చేసితిని గానిపనిం గరుణించి కావవే
పురమును బాడుసేయుటకుఁ బూర్వమె వేఁడెద నిన్ను నన్న యా
ధరణిపుఁగాంచి యిట్లనియె దాసు రఘూత్తములోఁ దలంచుచున్.

క. చనుదెంచె రాము సేనలు
మునుముందుగఁ గొన్ని దర్పమునఁ బొల్చెడువా
రనఘా! హరివీరవరుల్
చనుదెంతురు వరుసగా నిచటికి క్షణమునన్. 201

ఉ. వారలవెంట రాఘవుఁడు వచ్చును జూచెడుకౌతుకంబు భూ
మీరమణా యొసంగుఁగద మీకు నిఁకన్ భయమేల? కోఁతులన్
వారలఁ గాచుకీశపతివారములన్ రఘురాములక్ష్మణుల్
భూరమణీతనూజననబుద్ధిభయంబున ముస్గుచుండఁగన్. 202

క. తడఁబడుమాటల నిట్లనుఁ
బుడమివిభుం డింకఁ జాలుఁబో రాఘవునిం
గడిఁదిబలంబులఁ గనఁగాఁ
దడవేటికి మఱలుపంగఁదగు నవ్వారిన్. 203

క. నీవే రఘురాముఁడవును, నీవే సౌమిత్రి వార్య నీవే జనక
క్ష్మావిభుపుత్రికవును నిఁకఁ, గావుము నాతప్పు లెన్నగానేల మదిన్.

క. హరిదాసుల కపకృతి నె
త్తరుణంబునసైన సల్పఁదగదని నాకున్
బరమముగఁ దోఁచెఁ గావునఁ
గరుణింపుము తప్పు మఱువఁగాఁదగుఁ జుమ్మీ. 205

చ. అనిపలుమాఱు వేఁడుటయు నట్లయగుం బ్లవగాళి వేగమే
చనునిఁక భీతిలేదనుచు స్వాంతమునన్ రఘురాముఁ గొల్చినం
తనె చనెఁ గోఁతులెల్లఁ దమదారినిబట్టి మహీశపుంగవుం
డనఘుని దాసునిం గొలిచె నాత్మమహాభయభక్తు లొప్పఁగన్. 206

తే. అక్బరును దాసు దీవించి యనిపి యందె
యొక్కసంవత్సరము మాత్రముండి యధిపు
నాకృతింగాంచి సెలవంది యరిగెఁ బుణ్య
తీర్థముల క్షేత్రముల సమ్మతిని గనంగ. 207

క. ఆదిన్ మధురను గోకుల
మాదట బృందావనంబు నవ్వల సతతా
మోదం బొసఁగెడు తక్కిన
శ్రీదయితుని క్షేత్రములకుఁ జెలఁగుచుఁ బోయెన్. 208

చ. చని ఘనపాపభంజనము సల్పెడు తీర్థములందుఁ గ్రుంకి పా
వనమతులైన సాధుజనవర్యులనుం గని మ్రొక్కి వారిదీ
వనలనుగాంచి చిత్తమున వర్ధిలుజ్ఞానముతోడ శ్రీపతిన్
వనజదళాక్షు నెన్నుచును భక్తులపొందికఁ గోరుచున్ దమిన్. 209

5

ఆ. కొంతకాల మిట్లు కూర్మిమై విహరించి
తనకుఁ దెలిసియున్న తత్త్వములను
బరుల కెఱుకపఱచి వారి భక్తులఁ జేసి
యమునయొద్దఁ జేరె నాతఁ డొకట. 210

సీ. అచ్చటఁ బ్రియదాసుఁడను నొకవిప్రుండు,
శ్రీరామభక్తుండు చేరియుండె
నాతఁడు భక్తులైనట్టివారిచరిత్ర,
ముల దేవభాషను సులలితముగ
వ్రాసి యవ్వానిని వరుసఁ బఠించుచుఁ,
గాలంబు గడుపుచుఁ జాలభక్తి
రఘువర్యుఁ దలఁచుచు రాజిలుచుండెను,
గాన నాతనిఁ బ్రీతిఁగాంచి తులసి
తే. దాసు తత్పుస్తకము నాకు దయనొసంగు
మొక్కసారి పఠించి యిందుండి మరల
నిచ్చువాఁడ మహాత్మ నే నెంతొ వేడ్క
గనుదు నద్దాన నని వేఁడుకొనఁగ నతఁడు. 211

క. కొనుమా భక్తాగ్రేసర
కనుమా మోదంబు దానిఁ గాంచి యనుచుఁ బ్రీ
తిని దానినిచ్చె భక్తిని
గొని తులసీదాసు పొంగుకోరికతోడన్. 212

చ. మనమున నేటికేను రఘునందను గొల్చినసత్ఫలంబునుం
గనితిని ముక్తి నింకఁగనఁగాఁ దగియుందు నటంచు నెంచుచున్
వినుతమహాచరిత్రములఁ బ్రీతిఁ బఠించుచు నుండునంతటం
గనఁబడె స్వీయమహాచరిత కన్నులపండువుగా నెసంగుచున్. 213

చ. కనుఁగొని దానివిస్మయముఁగాంచి యిదేమొకొ నాచరిత్ర మిం
దును గననయ్యె నెవ్వఁడి తొరఘువేడుక వ్రాసియుండురో
యనుకొనుచున్ రఘూత్తముఁడెయీకృతివ్రాసెనటంచుఁ జూపెనా
తనికి నతండు వానిఁ గని తద్దయు విస్మయమంది యిట్లనున్. 214

తే. నేను బలుమాఱు చదివితిఁగాని మున్ను
దీనిఁ జూడంగలేదు నీయాన యిద్ది

క్రొత్తఁగా వ్రాయఁబడినట్లు కొమరుమిగిలి
యున్న దిదియేమిపుణ్యమో యన్న చెపుమ. 215

క. అనిపలుకుచుండఁగా దా,నిని జదివినవారలెల్ల నేను గనఁగలే
దనుమానమేల యనిప,ల్కినఁ దులసీదాసు మదిని గేవలభక్తిన్.

క. పలికెను వినుఁడీ రాముఁడె
యలరుచు సేవకునిచరితమంతయు వ్రాసెన్
గలఁడే యింకొకఁడిట్టులు
సులలితగతి వ్రాయునరుఁడు క్షోణీస్థలిలోన్. 217

చ. అనవిని యందఱొక్క మొగి నాతనిపుణ్యమునెన్ని యాదృతిం
గని రఘురాముప్రీతిఁగనఁగాఁ దగినంతటిపుణ్యరాశి వీ
వని వినుతించి యీస్థలమునందె వసింపుము మమ్ముఁగూడి మా
జననము సార్థకంబగును సాధుసమాగమ మబ్బినందునన్. 218

క. మాకోరిక నెఱవేర్పుము
శ్రీకాంతుని బాడుచుంటఁ జేర్పుము మమ్మున్
బ్రాకటముక్తిగృహంబున
నీకారుణ్యంబె మాకు నిధి మహాత్మా. 219

క. అని వారలు ప్రార్థించిన, విని తులసీదాసు భక్తివిధులన్నియుఁ జ
క్కనిరీతి వారికిం దెలు,పను నిల్చెను నాస్థలమున భద్రుఁడగుచున్.

సీ. కొంతకాలమునిల్చి యింతి మాతాదేవిఁ,
బిలిపించుకొని మహాలలితవాక్య
ములనామెదీవించి చెలఁగి యామెయుఁ దాను,
శ్రీరామచంద్రునిఁ జిత్తసీమ
నిలిపి సేవించిరి; నెమ్మి నీలాగునఁ,
గాలంబుపుచ్చుచుఁ గమ్రభణితి
రామాంకితంబుగ రామాయణంబును,
రచియించి సద్భక్తరాజి కొసఁగ

తే. కాతముంజెప్పుచును బహువత్సరములు
కాలముంబుచ్చి భార్యతోఁ గలిసి రామ
చంద్రునానతి శ్రీశునిస్థానమొందె
భక్తులందఱు నాతనిభవ్యమహిమ. 221

వ. కృతార్థులై రారామాయణంబు తులసీదాసురామాయణం బన నిప్పటికి ను_త్తరాపథంబున విఖ్యాతింబడసి పఠనపాఠనంబులం బ్రకాశించుచున్నయది. 222

చ. మనమున దాసునెన్ని మహిమంబులు జక్కఁగనమ్మి యాతనిం గనినటు తత్కృతీంద్రమును గాదిలిప్రేమఁ బఠించి రామచంద్రుని మదినిల్పి భక్తి లటఁ దొందరలేమియులేక కాలముం జనునటు సేసి ము_క్తిపదసంగతిఁ గాంచిరి కోర్కి మీఱఁగన్. 223

క. ఈకథ వినినం జదివినఁ, బ్రాకటధనధాన్యములును బరమపదంబుల్ శ్రీకాంతునికరుణనుగని, యేకాలము పుచ్చుఁగల రహీనఖ్యాతిన్.

క. నిరుపమమహిమా దాసో,త్కరవాంఛాదాననిరతకమ్రగుణాఢ్యా హరిహయముఖదేవార్చిత, పరమపదబ్జా మహేశపత్నీ లలితా. 225

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణావా_ప్తకవితాశ_క్తియు_క్తయు మౌద్గల్యగోత్రసంజనితయు నగు వక్కలంక వేంకటసూర్యరామ జోగమాంబచే విరచితమగు తులసీదాసుచరిత్రము సర్వ మేకాశ్వాసము సంపూర్ణము.

---

హరిః ఓమ్ శ న్నో మిత్ర శ్శంవరుణః శన్నో భవత్వర్యమా॥ శన్న ఇంద్రో బృహస్పతిః। శన్నో విష్ణురురుక్రమః, నమో బ్రహ్మణే॥ నమస్తేవాయో, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి త్వామేవప్రత్యక్షం బ్రహ్మవదిష్యామి, ఋతం వదిష్యామి, సత్యంవదిష్యామి, తన్మామవతు తద్వక్తారమవతు, అవతుమాం, అవతువక్తారం. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్లో. వర్ణానా మర్థసంఘానాం రసానాం ఛందసా మపి,
మంగళానాం చ కర్తారౌ వందే వాణీవినాయకౌ. ౧

భవానీశంకరౌ వందే శ్రద్ధావిశ్వాసరూపిణౌ,
యాభ్యాం వినా న పశ్యంతి సిద్ధాః స్వాంతస్థ మీశ్వరం. ౨

వందే బోధమయం నిత్యం గురుం శంకరరూపిణం,
యమాశ్రితో హి వక్రోఽపి చంద్ర స్సర్వత్ర వంద్యతే 3

సీతారామగుణగ్రామపుణ్యారణ్యవిహారిణౌ,
వందే విశుద్ధవిజ్ఞానౌ కవీశ్వరకపీశ్వరౌ. ౪

ఉద్భవస్థితిసంహారకారిణీం క్లేశహారిణీం,
సర్వశ్రేయస్కరీం సీతాం నతోఽహం రామవల్లభాం. ౫

యన్మాయావశవర్తి విశ్వ మఖిలం బ్రహ్మాదిదేవాసురా
యత్సత్త్వా దమృషైవ భాతి సకలం రజ్జౌ యథాహేర్భ్రమః,
యత్పాదః ప్లవ మేక మేవ హి భవాంభోధే స్తితీర్షావతాం
వందేఽహం త మశేషకారణపరం రామాఖ్య మీశం హరిం. ౬

నానాపురాణనిగమాగమసమ్మతం య
ద్రామాయణే నిగదితం క్వచి దన్యతోఽపి,
స్వాంతస్సుఖాయ తులసీరఘునాథగాథా
భాషానిబంధ మతిమంజుల మాతనోతి. ౭

శ్రీమద్గోస్వామి

# తులసీదాసకృతరామాయణము

## బాలకాండము.



### కథాప్రారంభము.

సోరథా (1)

ఓగణనాథా! ఓకరివరవదనా! నీవు బుద్ధిరాశివి; నీవు సర్వశుభగుణసంపన్నుఁడవు; సర్వసిద్ధిప్రదాతవు; నన్నుఁ గటాక్షింపుము. నీకటాక్షమువలన, ఓగణాధ్యక్షా! వచనమూకులును, అజ్ఞానమూకులును, ధర్మమూకులును, జ్ఞానమూకులును వాచాటులగుదురు; నీకృపవలన సుమతిపంగువులును, పదపంగువులును, కర్మపంగువులును, మహాపర్వతముల నెక్కుటకు శక్తిఁగలవారగుదురు; కలికృతమహాపాపములను, అగ్నిహోత్రమువలె, దహింపఁజేయ సమర్థుఁడవు; నన్నుఁ గటాక్షింపుము. క్షీరసాగరములో నాదిశేషువుపై శయనించు ఓనల్లనయ్యా! నీలసరోరుహములఁ బోలినశరీరకాంతి కలవాఁడా! కరుణించి నన్నేలు కమలలోచనుఁడా! నాహృదయములో నివసింపుము. ఓఉమారమణా! ఓకరుణాలయా! ఓకందర్పదర్పహరణా! ఓభక్తపాలనతత్పరా! ఓకుందేందుసమదేహా! కరుణించి నన్నుఁ గాపాడుము.

ఏపురుషుఁడు నరరూపమును ధరించినవిష్ణుమూర్తియో, ఏమహాత్ముఁడు దయాసింధువో, ఎవనిమాటలు, సూర్యునికిరణములవలె, మాయతోఁగూడిన అజ్ఞానాంధకారముఁ బోఁగొట్టునో, అట్టినాగురువుయొక్క పాదపద్మములకు నమస్కారము.

చౌపాయ్ (1)

సుందరమైనదియు సువాసనగలదియు సరసమయినదియు అనురాగముఁ బుట్టించునదియు నాగురువుయొక్క పాదపద్మపరాగమునకు నమస్కారము; ఆసుందరమగు పాదపద్మములపరాగము అమృతప్రవాహముతో సమానము; ఆపరాగము జననమరణాది సంసారదుఃఖమును పోఁ

గొట్టును; పుణ్యస్వరూపుఁడై నశివునిశరీరమునందలి విభూతివలె, నాప రాగము నిర్మలమయినది; మంగళప్రద మగును; ఆనందముఁ బుట్టించును; ఆపరాగమును తిలకమునవలె ధరించిన యెడల, మనుజులమనస్సుల నెడు అద్దముపై నుండినమాలిన్యముఁ బోవును; అందువలన సకలసద్గుణసంపత్తికలుగును; మాణిక్యకాంతివలెఁ బ్రకాశించు శ్రీగురునఖములను స్మరించుటవలన హృదయములో దివ్యజ్ఞానము ప్రకాశించును; అజ్ఞానోదయమువలన, నజ్ఞానాంధకారము పిడిపోవును; ఆపరాగమును హృదయమున ధరించినవాఁ డెంతభాగ్యవంతుఁడు! జ్ఞానదృష్టి నిర్మలమై వికసించి నలువైపులఁ బరిణమించు చున్నది; జననమరణాదిదుఃఖములతోఁగూడిన సంసార మనురాత్రి పాఱిపోవుచున్నది. ఖనిలో నేవైపునఁ జూచినను, మణులు మాణిక్యములు స్ఫుటమయినవియు గుప్తమయినవియు స్పష్టముగఁ గనబడువిధమున, శ్రీరామలీలలు తెలిసినవియు, తెలియనివియు నాకు స్ఫుటమయ్యెను.

దో హా (1)

గురువుయొక్క పాదపద్మపరాగ మనెడి అంజనమును నేత్రములకుఁ దగిలించిన యెడల, శిష్యుఁడు పరమపవిత్రుఁడగును; మహాజ్ఞానియగును; పర్వతములపైఁగాని, అడవులలోఁగాని, భూలోకములో భగవంతుఁడు చేసినలీలావతారచర్యలును, భగవంతుని యపారకటాక్షమును వానికిఁ దెలియును.

చౌ పా య్ (2)

గురువుయొక్క పాదధూళి మృదువును మంజులమునయిన అంజనమువంటిది; నేత్రముల కమృతబిందువు; జ్ఞానదృష్టిలోపములఁ బోఁగొట్టును. ఈప్రకారము నాజ్ఞానదృష్టిని నిర్మలముఁ జేసికొని, ప్రపంచోద్ధారకుఁ డగుశ్రీరాముని చర్యలను వర్ణింప నారంభించెదను. మోహజనితమగు సంశయములను భేదింప గలిగిన మహీసురులచరణములకుఁ బ్రథమమున నమస్కరించెదను. సకలసద్గుణసంపన్ను లగుసజ్జనులను మనోవాక్కులచేత నభినుతించెదను. ప్రత్తిచెట్టు రసహీనమయినను దానిఫలమునుండి వస్త్రములఁ జేయుదురు; అటులనే, సాధుజనులు సంసారరసహీనులుఅయినను, నిర్మలమయిన జ్ఞానవైరాగ్యనియమములతోఁ

గూడిన విజ్ఞానముఁ దెలియఁ జేయుదురు. ఎండలో నెండి వర్షములోఁ దడిసి, శీతము నోర్చి, ప్రత్తిచెట్టు వనములోఁ బెరుగును; దానిఫలమునుండి చేయఁబడినవస్త్రము శీతోష్ణములఁ బోఁగొట్టును; అటులనే, పరులుచేసిన యపకారములను గణింపక మన్నించి వారిని సాధుజనులు తమజ్ఞానోపదేశముచే నుద్ధరింతురు. ఆయాదేశములలో నాయాకాలములలోఁబుట్టి కీర్తిప్రతిష్ఠలను స్థాపించిన మహాపురుషులకు నమస్కరించెదను. చలనముతోఁ గూడిన తీర్థరాజమగు ప్రయాగవలె సాధుసమాజము మంగళకరమై ముదము నాపాదించును. రామునియందు భక్తి గంగానదీప్రవాహమువంటిది. బ్రహ్మయందు ధ్యానము సరస్వతీప్రవాహము వంటిది. ఈపాపభూయిష్ఠమైన కలియుగమును బవిత్రము జేయుటకు నియమింపఁబడిన నిత్యకర్మలు సూర్యతనయ యగు యమున వంటివి. ఏవిధమున గంగాయమునాసరస్వతులు మూఁడును ప్రయాగవద్ద గలియునో, ఆవిధమున రామభక్తులును, బ్రహ్మధ్యానైకపరులును, నిత్యకర్మానుష్ఠానపరులును ప్రయాగలో నివసించియుందురు. శుభానందకరమై, త్రివేణీవలె, హరిహరులకథలుశోభించును. వీనియందు నిశ్చలమయిన విశ్వాసము అక్షయవటవృక్షము; శ్రేష్ఠకర్మలనాచరించు మహాపురుషులసమాజము ప్రయాగ. ప్రయాగ ఒకస్థలములోనే యుండును. అచ్చటికిఁ బోవుటకుఁ బ్రతిమనుజునకుఁ బ్రతిదినము సాధ్యము కాదు. జన్మాంతరమున నది ఫలము నిచ్చును. సాధుసమాజమనునట్టి ప్రయాగ ప్రతిదినమున బ్రతిస్థలమునఁ గలదు. ప్రతిమనుజుఁడు దానిం జూచినవానికి ఫలము తక్షణము కలుగును.

దో హా (2)

సాధుసమాజమను ప్రయాగకుఁ బోయి, ఎవరు సాధువులవచనములను విని, వానిని గ్రహించి, భక్తితో నాత్మస్నానముఁ జేయుదురో, వారు ధర్మార్థకామమోక్షములం బొందఁగలరు.

చౌపాయ్ (3)

ఒకనిమిషము చాలును. త్రివేణీస్నానము యొక్క ఫలములఁ జూడుము. కాకి చిలుకయగును. కొంగ హంసయగును. అటులనే సత్సాంగత్యమువలన మూర్ఖులు పండితులును, ధూర్తులు మహాత్ములును కా

గలరు. ఈమాటను విని యెవరు నాశ్చర్యపడకూడదు. సత్సాంగత్య ము యొక్క మహిమ అందఱికిఁ దెలియునది కాని రహస్యమయినది కాదు వాల్మీకియు, నారదుఁడును, కుంభసంభవుఁ డైనయగస్త్యుఁడును, వారికి దానివలనఁ గలిగినలాభమును పలుమాఱు చెప్పియుండిరి. భూచ రములును, జలచరములును, నభశ్చరములును, ప్రపంచములో నాయా కాలములో నాయాస్థలములలో సమస్తచేతనాచేతనములకు, సత్సాం గత్యమువలన జ్ఞానముగాని, కీర్తిగాని, మోక్షముగాని, శక్తిగాని, ధర్మ ముగాని కలిగెను; ఈమార్గముతప్ప నీనింబొందుటకు మఱియొకమార్గ ము వేదములోఁ జెప్పఁబడలేదు; లోకమునకుఁ దెలియదు. సత్సాంగ త్యము వినాగా జ్ఞానము కలుగదు; రామకృప యుండినఁగాని సత్సాం గత్యము గలుగదు, ఆనందమునకును, శుభములకు నది మూలము; ఆనందవృక్షమున కది మూలము; శమము, దమము, సాధనము మొద లగునవి దాని పుష్పములు; మహాత్ములసిద్ధాంతమే దానిఫలము. చింతా మణి యొక్క స్పర్శచేత నేవిధమున క్షుద్రలోహములు బంగార మగు నో, దుర్మార్గు లావిధమున సత్సాంగత్యమువలన సన్మార్గులు కాఁగలరు; ప్రారబ్ధవశమున సజ్జనుఁడు దుర్జనులసహవాసములోఁ బడినను, సర్పము తలమీఁదిమాణిక్యమువలె, స్వాభావికగుణములను వాఁడు కలిగి యుండును. బ్రహ్మ విష్ణు మహేశ్వరులును, పండితులు, వాణియు, (సరస్వతియు) మహాత్ములమహిమను వర్ణింపలేకపోయిరి. కాయగూరలను విక్రయించువానికి మాణిక్యములమహిమ యేమితెలియును? అటులనె వారిమహిమ నా కేమి తెలియును?

దోహా 3-4

మహాత్ములచిత్త మంజలియందు సమానముగ నుండును; వారికి హితులని అహితులని భేదములేదు; పుష్పమునుకుడిచేతితోఁగోసి, ఎడ మచేతితోఁ బట్టుకొనినను, రెండుచేతులును దానికి సమానము; ఏ చే తితో దానిని బట్టుకొనినను, దానివాసన యొకటియే; అటులనే మహా త్ములు. ఓమహాత్ములారా! మీచిత్తము సరళ మనియు, మీరు జగత్తునకు సదా మంగళముఁగోరువా రనియు, మీరు స్వభావముచేత నందఱికిని స్నేహితులనియు నేనెఱుంగుదు; బాలునివలెనే ప్రార్థించెద; నామనవిఁ

జేకొనుఁడు; నాయందు దయ కలిగి, రామునిచరణారవిందములయందు నాకు భక్తి కలుగునట్లు చేయుఁడు.

### చౌపాయ్ 4

తదుపరి, దుర్మార్గులకు సహితము వందనముఁ జేయుదును; కారణము లేక సన్మార్గులను వారు బాధించెదరు: పరులకు వచ్చిననష్టమును తమలాభమని తలంచెదరు; పరులసంపదఁ జూచి దుఃఖింతురు; పరుల ఆపదలఁ జూచి సంతసింతురు; హరిహరులయశస్సు అనెడి రాకాచంద్రబింబమును కబళించు రాహువువంటివారు; సహస్రబాహువులు గల రాక్షసునివలె, వారు పరులకుఁ గీడుఁ జేయుదురు; వేయికన్నులుఁ గలవారివలె, వారు పరులతప్పుల నెంతురు; నేతిమీఁద వాలిన ఈఁగలవలె, సన్మార్గునిసద్గుణములను వారు చెఱతురు. అగ్నితో సమానమగు తేజస్సు ఖలులకుఁ గలదు; క్రోధమున మహిషాసురునితో వారుసమానులు; కుబేరుఁడు సిరి సంపదలు గలవాఁడు; పాపములును అవగుణములును వారిసిరిసంపదలు; తోఁకచుక్క పుట్టినందున నేవిధమునఁ బ్రజలకు భయములు కలుగునో, దుర్మార్గుల ఆగమనమువలన సజ్జనులకు భయములు కలుగును; సత్కథలఁ జెప్పినపుడు వారు కుంభకర్ణునివలె నిద్రించెదరు; వడగండ్లు పంటలను నశింపఁజేసి, అనంతర మవి నశించును; అటులనే, దుర్మార్గులు పరులకార్యములను ధ్వంసముఁజేసి, అనంతరము వారు నశింతురు. ఖలులు రోషంబున నాది శేషునితో సమానులు; పరుల దోషములను సహస్రముఖములతో వారు చెప్పుచుందురు; అట్టిదుర్మార్గులకు నమస్కరించెదను. వేయిచెవులు గలపృథురాజువలె, వారు పరులదోషములనువిని ప్రకటింతురు. సురానీకము (సుర+అనీకము)నకధిపతి గనుక దేవేంద్రునకు రాజ్యమదము మెండు; సురానీకమును(సురా నీకమద్యము+గ్రహించు) సంగ్రహించినందున, దుర్మార్గులకు మదము మెండు. ఇంద్రునకు వజ్రాయుధము ప్రియము; కఠోరవాక్యములు వారికిఁ బ్రియము. వేయికన్నులతో దేవేంద్రుఁడు పరుల శుభముఁ జూచును; రెండుకన్నులతో వారు పరులదోషములఁ జూతురు.

దోహా 5

మిత్రులను శత్రువులను సమానముగఁ జూచునట్టి మహాత్ముల పేరుఁజెప్పిన, దుర్మార్గులశరీరము మండును నని నేనెఱుంగుదు; కనుక చేతులనుజోడించి వినయముతో వారిని నేను ప్రార్థించెదను.

చౌపాయ్ 5

చేయవలసినవిధిప్రకారము నేను వందనముల నాచరించితిని; వారు నన్ను క్షమించి క్షేమమైన గతిని పొందించవలయును; నా ప్రార్థనను విని నన్ను మన్నింపవలయును. ఎంత అనురాగముతో నీవు కాకిని పెంచినను, కాకి కాకియే; మాంసమును చూపినతోడనే, అది దానిని దొంగిలించును కదా! సజ్జనుల దుర్జనులచరణములకు వందనముల నాచరించెదను; ఉభయులును దుఃఖమునకుఁగారకులు; అందులోఁ గొంచెము వ్యత్యాసము కలదు; మహాత్ములవియోగమువలన దుఃఖము కలుగును; దుర్మార్గులసంయోగమువలన శ్రమ కలుగును. పద్మమును జలగయు నీటిలోఁ బుట్టినను, వానిహానిగుణములు వేఱుకదా! అందఱికిని తండ్రి యొకఁడైనను, అమృతమువంటివారు సాధువులు; మద్యమువంటివారుఅసాధువులు; అమృతమును మద్యమును సముద్రములోనే పుట్టెను. ఉభయులును తమతమకార్యములవలనఁ బ్రసిద్ధి నొందెదరు; ఒకరు సత్కీర్తిని, మఱియొకరు దుష్కీర్తిని పొందగలరు. చంద్రునితోను, గంగతోను, అమృతముతోను సాధుజనులు సమానులు; గరళముతోను, అగ్నితోను, కర్మనాశమను నదితో దుర్మార్గులు సమానులు. ధర్మము, అధర్మము-ఈ రెండునందఱికి విశదములు. అయినను, ఆయామనుజులస్వభావమునుబట్టి యొకరు ధర్మము నాచరింతురు; మఱియొకరు అధర్మమార్గమును బట్టి నడుతురు.

దోహా 6

సజ్జనులు సత్కార్యములఁ జేయఁ జూతురు; దుర్జనులు దుష్కార్యములఁ దలపెట్టుదురు; అమృతము అమరత్వము నిచ్చును; గరళము మరణము నిచ్చును.

చౌపాయ్ 6.

సజ్జనులసుగుణములను దుర్జనులదుర్గుణములను ఎంచ నేల? రెండునుసముద్రమువలె గంభీరములు; అపారములు; ఈకారణముచేత నొకసమయమున విచక్షణ లేకపోవుటచేత, మంచిగుణము చెడుగుణమగును. ఈరెండుగుణములును భగవంతుఁడు సృష్టించెను; ఆరెండింటిని వేదము విభజించును. ఇతిహాసములును, పురాణములును వేదములు సహితము ప్రపంచములోని గుణములను అవగుణములను భగవంతుఁడు సృష్టించినటులఁ జెప్పుచున్నవి. సుఖదుఃఖములను; పాపపుణ్యములను; దివారాత్రములను; సుజనదుర్జనులను; సుజాత కుజాతులను; దేవదానవులను; ఉచ్ఛనీచములను; అమృతమును, జీవమును; విషమును, మృత్యువును; మాయను, బ్రహ్మను; జీవమును,లోకపాలురను; లక్ష్మిని, దారిద్ర్యమును; రాజును, బంటును; కాశిని, మగధను; గంగానదిని, కర్మనాశమును; 'మార్వారు' ఎడారులను, 'మాల్వా' సుక్షేత్రములను; బ్రాహ్మణులను, కసాయివాండ్రను; స్వర్గమును, నరకమును; విరాగమును, అనురాగమును; వేదమును, తంత్రమును; సకలగుణదోషములను పరమేశ్వరుఁడు సృష్టించెను.

దోహా 7

ఈలోకములో భగవంతుఁడు చేతనాచేతనములను సృజించెను; గుణములును దోషములును కలవు; అన్నియు ద్వంద్వములు; క్షీరమునుండి నీరును విభజించి, క్షీరమును గ్రహించుహంసవలె, మహాత్ములు సుగుణములను గ్రహించి దుర్గుణములను త్యజింతురు.

చౌపాయ్ 7

భగవంతుఁడు మనుజులకు గుణదోషవిచక్షణశక్తి నిచ్చెను; అందుచేత దుర్గుణములను విడిచిపెట్టి సుగుణములను గ్రహింపవలయును. కాలవశమున నైనను, స్వభావముచేతనైనను, ప్రారబ్ధకర్మవశమున నైనను, సజ్జనులు, మనుజస్వభావము కలుగ, తప్పుమార్గమును త్రొక్కినను, భక్తులరూపమును ధరించినశ్రీహరి వారితప్పులదిద్ది, వారి దుఃఖమును దోషములను పోఁగొట్టి, వారికి నిర్మలమగు కీర్తినిచ్చును. సత్సాంగత్యమువలన దుర్జనులు సత్కార్యములఁ జేసినను, వారిదుష్ట

స్వభావముమాత్రము వారిని విడువదు. లోకవంచకులు కొందఱు సాధువేషములను ధరించి, తాత్కాలికముగ గౌరవము నొందుచుండినను, తుదకు, కాలనేమియు, రావణుఁడును, రాహువువలె, వారికపటస్వభావము బయటఁబడును; ఏ కార్యములోను వారు నెగ్గలేరు జాంబవంతుఁడును హనుమంతుఁడువలె, మహాత్ములు, ఏ వేషమునుధరించినను, గౌరవము నొందఁగలరు. దుష్టులసాంగత్యము నష్టము; శిష్టులతో మైత్రి లాభము. ఈసంగతి వేదములోఁ జెప్పఁబడుటయే కాదు; సంసారులకు సహితము తెలియును. వాయువుతోఁగూడి పరాగము ఆకాశమువైపుఁ బోవును; ఏటితోఁ గలిసి బురదయై నిలిచియుండును. సజ్జనుల గృహములోనుండినచిలుక "రామ, రామ"అని పలుకును; దుర్జనులగృహములలో నుండినచిలుక చెడుమాటలను పలుకును; "ఏగూడుచిలుక ఆగూడుపలుకులు పలుకును." అజ్ఞానులకు ధూమము ధూమమే; దాని ప్రయోజనము వారికిఁ దెలియదు; ఆధూమముతో మంచి "సిరా" చేయఁబడును; ఆ"సిరా"తో పురాణమును వ్రాయవచ్చును. వాయువును, అగ్నియు, నీరును- ఈమూఁడుకలిసి, ప్రపంచమునకు జీవనాధారమగు మేఘ మగును.

దోహా 8—11

సూర్యాదినవగ్రహములును, ఔషధములును, జలమును, వాయువును, వస్త్రమును, వానివానియోగమువలన నొకప్పుడు మంచియగును; మఱియొకప్పుడు చెడునగును; సూర్యాదిగ్రహము లొకప్పుడు శుభమును మఱియొకప్పు డశుభము నిచ్చును; ఔషధములు గుణము నిచ్చును, వికటించును; ఏటిలోనినీరు శుభ్రము; కాలువలోనినీరుఅశుభ్రము; వాయువును గంధమును దుర్గంధమును తీసికొనివచ్చును; భగవంతునివిగ్రహమును వస్త్రముతో నలంకరింతురు; దానితో శవము నలంకరింతురు; ఈభేద మందఱికిఁ దెలియును. శుక్లపక్షమును, కృష్ణపక్షమును రెండును వెన్నెలకును చీఁకటికిని సమానము; అయినను, వానిలో నొకభేదముకలదు; చంద్రుఁడు వృద్ధినొందును గనుక శుక్లపక్ష మందఱికిని సహ్యము; చంద్రుఁడు క్షీణించును గనుక కృష్ణపక్ష మసహ్యము. చేతనాచేతనములతోఁ గూడిన యావత్ప్రపంచము శ్రీరామ

మయమని తెలిసికొనినవాఁడనై, ఎల్లప్పుడు వందతిచరణకమలములకుఁ బ్రణమిల్లి, చేతులజోడించి నమస్కరించెదను. భూతప్రేతపిశాచ యక్ష రాక్షసశాకినీ డాకినీ నాగకిన్నరదేవగరుడగంధర్వమానవులు—ఈమొదలగువారికి వందనముఁ జేసెద; ప్రసన్నులయి, మీరు నన్ను కృపతోఁ జూడుఁడు.

చౌపాయ్ 8

భూమిమీఁదను, జలములోను, వాయువులోను నివసించు ఎనుబదినాలుగులక్షల జీవరాసులును నాలుగువిధములుగ—పిండజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు పుట్టుచుండును; సర్వజగత్తును శ్రీసీతారామమయ మని తెలిసికొని, చేతులను జోడించి, ప్రీతిపూర్వకమగు సూచనములతో మిమ్ములఁ బ్రార్థించెద. నాయందు దయ కలిగి, నన్ను మీదాసునిగ భావింపుఁడు; కపటమును విడిచి, విలంబముఁ జేయక, మీకృపఁ బ్రసరింపుఁడు; నాకు బుద్ధిబలము గలదని నాకు నమ్మకము లేదు; అందుచేత మిమ్ములను వేఁడుచుంటిని. రఘుపతియొక్క పుణ్యచరిత్రలను కీర్తనఁ జేయఁదలఁచితిని; ఆచర్య లగాధము; నాది జడబుద్ధి; కవిత్వముఁ జెప్ప శక్తి లేదు; మందబుద్ధి గలవాఁడను; నాకోరికమాత్రము కొండ నెక్కుచున్నది. రామచరిత్రమును రచించుట కమృతమును కోరుచున్నాను; ఎటు చూచినను జగత్తులోఁ గొంచెము మజ్జిగయైనను కానరాదు. ఓసుజనులారా! దయ గలిగి మీరు నాప్రగల్భములను క్షమింపుఁడు; పసికూనలజల్పనములను విని ఆనందించువిధమున, నాపలుకులను విని ఆనందింపుఁడు. బాలులసంజల్పములు తలిదండ్రులకు శ్రవణానందములుకావా? క్రూరులును, కుటిలస్వభావులును, విచారహీనులును పరిహాసింతురు; ఎంతవఱకును వారు పరుఁదోషములను వెదకి తీసి, వానిని భూషణములుగ ధరింతురు. సరసమయినను విరసమయినను ఎవనికవిత్వము వానికి ఆనందము నిచ్చును; ఇతరులు చెప్పినకవనమును విని శ్లాఘించుసత్పురుషులు ప్రపంచములోఁ బగుమాత్రము కలరు. ఏపాటివర్షము పడినను, ప్రపంచములోనినదులు పొంగి పొర్లిపాఱును; దుర్మార్గులనదులవంటివారు; రాకాచంద్రబిం

బమును జూచి సముద్రుఁడే పొంగును; సజ్జను లాసముద్రమువంటి వారు; అట్టివారు తగుమాత్రమే కలరు.

దోహా 12

విశేషము భాగ్యము నాకు లేదు; రామచంద్రుని చరిత్రమును వ్రాయుట కభిలాషమాత్రము మెండుగఁ గలదు; ఖలులు పరిహసించినను, మహాత్ములు నామాటను విని సంతసింతురని నానమ్మకము.

చౌపాయ్ 9

దుష్టపురుషుల మందహాసము నాకు హితము; రామనామమును వా రుచ్చరింపరు; కోకిలస్వరము కాకికి కర్ణకఠోరముగ నుండును; హంసను చూచి కొంగయు, చాతకమును చూచి మండూకమును పరిహసించును; అటులనే, బుద్ధిరహితులగు దుర్జనులు నిర్మలమగు కవిత్వముఁ జూచి నిరసింతురు. అట్టివారు కావ్యరసమును గ్రహింపలేరు; శ్రీరాముని చరణారవిందములయం దనురాగమూ వారికి లేదు; కనుక వారు పరిహాసముఁ జేసిన నాకు సంతోషము. ఈ నే వ్రాసిన కావ్యములో సరసము లేదు; యుక్తి లేదు. దానిం జనులు పరిహసించిన పరిహసింపనిమ్ము; అది నాతప్పు కాదు. ఈజనులకు ఈశ్వరుని చరణములయం దనురాగము లేదు; అందుచేత వారికి కీకథ రుచింపదు; నిష్కలుషమయిన బుద్ధిగల హరిహరులదాసులకు రామకథ మధురముగ నుండును. సర్వసామ్రాజ్యాధిపతియగు శ్రీరామునియందు కవీశ్వరునకుఁ గల సద్భక్తియే ఆకావ్యమునకుఁ దగినయలంకారము; అందుచేత సత్పురుషులు దానిని విని దానిమాధుర్యమును గ్రహింతురు; నేను కవిత్వముఁ జెప్పఁజాలను; చతురత నాకు లేదు; సకలకళాపూర్ణుఁడను కాను; శబ్దాలంకారములును, అర్థాలంకారములును, ఛందశ్శాస్త్రమును, ప్రబంధరచనయు, స్థాయిసంచారాదిత్రివిధములగు భావభేదములును, శృంగారాదినవరసములును, అనేకప్రకారములగు కావ్యగుణదోషములును- ఈ మొదలగునవి నే నెఱుఁగను; ఈనాకావ్యములో నవి కనఁబడవు; కవిచాతుర్య మేమియు లేదు; సత్యమగు రామకథను తెల్లని కాగితముపై వ్రాసిచెప్పెదను.

దోహా 13

ఈనాకవనమునం దేగుణము కనఁబడదు; కాని దానియం దొక్క గుణము కలదు; సంసారమును గుర్తెఱింగినమహాత్ములు దీనిని విని ఉజ్జ్వల మగుజ్ఞానమును పొందఁగలరు.

చౌపాయి 10

శ్రీరామనామము అతిపవిత్ర మయినది; సర్వపురాణసమ్మతమయి నది; ఆనామము వేదసారము; మంగళకరము; అమంగళములను హరిం చును; ఉమామహేశ్వరు లానామమును సదాజపింతురు; ఎంత సుంద రమగు గ్రంథము నెంత దిట్టయగుకవి చెప్పినను, దానిలో రామనా మము లేనియెడల, దానికి శోభయుండదు; సుందరమగు స్త్రీ భూషణ ములను ధరించి యుండినను, వస్త్రమును విసర్జించినయెడల నామెకు శోభ లేదు కదా ! కావ్యగుణములు లేనికావ్యము నెంత విరసముగ నెంత నీరసకవి చెప్పినను అది రామనామాంకితమయి యుండినఁ బండి తులు సాదరముగ దానిని విని, తుమ్మెదలు పుష్పరసమును గ్రహిం చినవిధమున, దానిలోని భక్తిరసమును వారు గ్రహింతురు; ఒకానొ కప్పుడీగ్రంథములో నొక కావ్యగుణ మయిన లేకపోయినను, శ్రీరామ నామప్రతాపము నది ప్రకటనఁ జేయును. ఇదియే నా మనస్సులోఁ గల నమ్మకము; సత్సంగత్వమువలన నుద్ధరింపఁబడనిపదార్థ మొకటి కలదా? దానికి సహజముగు కటువువాసనను విడిచి పెట్టి, అగరు మొదలగు సుగంధద్రవ్యములతోఁ గలిసి, ధూమము సువాసన నిచ్చును కదా! నావచనము లెంతనీరసములయినను, కటువుగ నుండినను, వానివిషయ మువూత్రము సర్వోత్కృష్టమగు రఘువీరునిచరిత్రము; దానివలన జగత్తునకు శుభములు కలుగును.

ఛాంద్ 1

శ్రీరామచంద్రునికథ సకలమంగళముల నిచ్చును; సకలపాప ములఁ బోఁగొట్టును; రామకథయనునట్టినది గంగానదివలె వంకరటింకర గ బ్రవహించు చున్నది; గంగానదిజలములవలె, శ్రీరామునిచరిత్రము నిర్మలముగ నుండును; దానిజలములఁ ద్రాగినయెడల, మనస్సున కానం

దము కలుగును; రాముని చరిత్రను వినిన యెడల, బ్రహ్మానందము కలుగును; శ్మశానపుబూడిదను శివుఁడు శరీరమున ధరించుటవలన నది పవిత్రమగుచున్నది; అటులనే నాకవిత్వము రాముని చరిత్రను వర్ణించుటవలన సర్వజనశ్లాఘనీయ మగుచున్నది.

దోహా 14-15

సుప్రసిద్ధ మగు శ్రీరామనామముతోఁ గూడినందున, నాకావ్యము సర్వజనసమ్మత మగును. మలయపర్వతమువద్దనుండిన చందనవనమునుండి తీసికొనిరాఁబడిన యేదారువైన కయినను మూల్యము కలదు. అది యేదారువు అని యెవరు ప్రశ్నఁ జేయుదురు! గోవు నల్లనిది అయినను దానిపాలు శుభ్రమును నిరోగమయినవి కనుక, వానిని మనుజులు సేవింతురు. అటులనే నావాక్కులు విరసముగ నుండినను, శ్రీసీతారాములకీర్తిని చాటించును కనుక, సుజనులు వానిని విని సంతోషముతో నుచ్చరింతురు.

చౌపాయ్ 11

మణి సర్పము శిరస్సుమీఁద నుండినను, మాణిక్యము పర్వతముమీఁద నుండినను, ముత్యము ఏనుఁగుకుంభస్థలముమీఁద నుండినను, వానికి శోభ లేదు; అవి నృపాలునికిరీటములో నుండినను, ఒక లలితాంగి వానిని ధరించినను వానికి శోభ కలదు; అటులనే, నిరుపమానమగు కవితాధార, యొకశక్తివలనఁ బ్రవహించును; మఱియొకశక్తి దానిని అలంకరించును; అని పండితులు చెప్పుచున్నారు భక్తులయొక్క భక్తికి మెచ్చువారు ఆవాహనముఁ జేసినంతనే, బ్రహ్మలోకమునువిడిచి, సరస్వతి వారికిఁ బ్రత్యక్ష మగును. శ్రీరామచరిత్ర మనునట్టిసరోవరమునందు స్నానముఁ జేసి శుచిమంతుఁడు కాని యెడల, బ్రహ్మలోకమునుండి సరస్వతిని తీసికొని వచ్చుటకుఁ గవిపడినశ్రమయంతయు వ్యర్థమగును; పండితుఁ డగుకవి యీసంగతిని తెలిసికొని, కలిమలహారుఁడగు హరిగుణములను వర్ణించును. ప్రాకృతజనులగుణములను వర్ణింపఁబూనిన, సరస్వతికి శిరోభారముగ నుండును; అందువలన, నామెకు దానియందు రోఁత పుట్టును. హృదయమనెడు సముద్రమునందు బుద్ధియనెడి ముత్యపుఁజిప్ప సరస్వతి యనుస్వాతివానల కెదురుచూచు

చుండును; ఆస్వాతివాన వర్షించి, యొకబిందువు పడినను, ముక్తామణిరూప మగుకవిత్వము పుట్టును.

దోహా 16

కవిత్వరూపమగు ముత్యములకు యుక్తిచేత రంధ్రములను పొడిచి, శ్రీరామచరిత్రరూపమయినత్రాడున వానిని గ్రుచ్చి, ఆరామచరిత్రమాలను నిర్మలహృదయు లగుసజ్జనులు ధరించిన, శోభాకరముగ నుండును.

చౌపాయ్ 12

ఈమహాకలికాలములోఁ బుట్టినమనుజులు చూచుటకు హంసలవలెఁ గనఁబడినను, లోలోపల వారు కాకులఁ బోలియుందురు; వేదమార్గమును విడిచి, చెడుమార్గమున సంచరింతురు; వారు కపటముయొక్క అవతారపురుషులు; వారిశరీరములు పాపముతో నిండినభాండములు. రామునియందు భక్తి యుండినటుల నటించువంచకులు; కామక్రోధలోభమోహములకు వారు దాసులు; వారిలో వేషమునకు ధర్మధ్వజమును ధరించినవంచకులలో నే నగ్రగణ్యుఁడను; నాఅవగుణములఁ జెప్పఁబూనినయెడల, వాని కంతము లేదు; అవి యంత విశేషముగ నుండును. కాఁబట్టి వానిం గొంచెము చెప్పి చాలించితిని. ఒకమాటఁ జెప్పిన, బుద్ధిమంతులు దానిని శీఘ్రముగ గ్రహింతురు. అనేకప్రకారముల నేను చెప్పినవిషయములను విని, నన్ను నిందింపవలదు; ఈవిషయములను విని, యెవరికేని శంక కలిగినయెడల, వారు నాకంటె బుద్ధిహీనులు. కవనముఁ జెప్పుటకు తెలియదు; చాతుర్యమయినను లేదు; అయినను, నాబుద్ధికొలఁది రామకథను గానముఁ జేయుదును. సంసారసాగరములోఁ బడి మునుఁగుచుండినవాఁడను; రామునిచరిత్రఁ జూచిన అపారముగ నుండును. మేరుపర్వతశిఖరముఁ బడఁద్రోయు మహావాయువునకు, దూదివంటినే నెంతవాఁడను? నిరుపమాన మగు శ్రీరామచంద్రుని సర్వసామ్రాజ్యాధిపత్యముఁ దలంచి, గజగజ వణఁకుచు, వారిచరిత్రమును వ్రాయుచున్నాను.

దోహా 17

సరస్వతియు, శేషుఁడును, మహేశుఁడును, బ్రహ్మయు, వేదములును, శాస్త్రములును, పురాణములును—వీరందఱు పరమేశ్వరుని

అనంతకళ్యాణగుణములను ఘోషించి ఘోషించి, తుదకు, 'న,ఇతి' 'న,ఇతి', 'ఇది కాదు' 'ఇది కాదు' అని చెప్పలేక యూరకుండిరి.

చౌపాయ్ 13

సర్వోత్కృష్టుఁ డైనపరమేశ్వరుఁ డవాఙ్మానసగోచరుఁ డని సర్వజనులకుఁ దెలియును; అయినను, ఆపరమేశ్వరుని వర్ణింప నెల్లవారును బ్రయత్నించియుండిరి; అందుచేత, భజనప్రకారమును బహువిధముల వేదము చెప్పియున్నది. భగవంతుఁ డేకఁడు; ఇచ్ఛారహితుఁడు; నామరూపరహితుఁడు; ఒకఁడు; అద్వితీయుఁడు; మాయారహితుఁడు; సత్తు, చిత్తు, ఆనందస్వరూపుఁడు; మనోబుద్ధిచిత్తాహంకారములకుఁ బైఁగా నుండువాఁడు కనుక పరంధాముఁడు; జన్మము లేనివాఁడు; మనోవాక్కులచే నిట్టివాఁ డని చెప్పుట కష్టము కనుక మనోవాచామగోచరుఁడు; సర్వవ్యాపకుఁడు; విశ్వరూపుఁడు; షడ్గుణైశ్వర్యసంపన్నుఁడు కనుక భగవంతుఁడు; స్వేచ్ఛానుసార మనేకలీలావతారముల నెత్తి, అనేకనాటకముల నాడెను. ఆఈశ్వరుఁడు భక్తులకుఁ బరమదయాళువు; దీనులయందుఁ బరమకృపాళుఁడు; పరమకరుణానిధి కనుక భక్తులను ప్రేమించును; వారిమీఁదఁ గోపము లేదు; రఘురాజు త్రికాలజ్ఞానసంపన్నుఁడు; దీనరక్షకుఁడు; త్రిశక్తియుతుఁడు; సకలగుణసంపన్నుఁడు; ఈసంగతిని పండితులు గ్రహించి నారాయణునికథలను వర్ణింతురు; నావాక్కులు సహితము సఫల మయ్యెను. శ్రీరాముని చరణారవిందములకు సాష్టాంగదండప్రణామ మాచరించి, వారికీర్తనలను గానముఁ జేయుటకు నాకు సాహసము కలిగెను. పూర్వము వాల్మీకాదిమహర్షులు రామచరిత్రమును గానముఁ జేసిరి; వారు త్రొక్కినత్రోవ సులభము కనుక, నే నామార్గము ననుసరించి గమనించెదను.

దోహా 18

అపార మగునదిమీఁద నొకరాజు వంతెనఁ గట్టించెను; నలుసు వంటిచీమ దానిమీఁదఁ బోయి నదిని దాఁటును; ఆదికవులు పరిశ్రమఁ జేసి వ్రాసినకథ ననుసరించి, సునాయాసముగ నే నాకథను వ్రాయఁ దలఁచితిని.

చౌపాయ్ 14

ఈప్రకారము మనస్సును దృఢముఁ జేసికొని, సర్వశోభాకర మగు శ్రీరామచరిత్రమును చెప్పుచున్నాను. వ్యాసవాల్మీకాదిమహర్షులు భగవంతునిచరిత్రను వర్ణించిరి; మహాజనులచరణకమలములకు నమస్కరించి వారిని నామనోరథము నీడేర్పుఁడని ప్రార్థించెదను. కలియుగములో రామునిగుణములను వర్ణించినకవిపుంగవులకుసహితముప్రణమిల్లెద; ప్రాకృతభాషలోను, సాధారణభాషలోను పరమచతురతతో రామచరిత్రమును వ్రాసిన కవిశ్రేష్ఠులకు నమస్కరించెద.ప్రాచీనకవులకును,ఆధునికకవులకును, భవిష్యత్కవులకును నిశ్చలబుద్ధితో నమస్కరించెద.నాయందుఁ బ్రసన్నత కలిగి, నా కోరమును దయచేయుఁడు; సజ్జనులసమాజములో నాకావ్యము గౌరవము నొందునట్లు చూడుఁడు. బాలకవి వ్రాసినగ్రంథ మని నాకావ్యమును నిరాదరణతో సజ్జనులు చూచినయెడల నాశ్రమ వ్యర్థమగును. కీర్తిగాని, కవిత్వముగాని, ఐశ్వర్యముగాని, గంగానదీజలముగలె, సర్వజనసమ్మతమయినపుడు, వానికి విలువ గలదు. రామునికీర్తి సర్వోత్కృష్టము; నావాక్కులు వెలిసు; ఈరెండింటికిని వ్యత్యాసముకలదు; చెప్పవచ్చునా, చెప్పకూడదా అనుసంకోచము నన్ను బాధించుచున్నది. అయినను తమకృపవలన సర్వము సులభ మగును; వస్త్రమెంత ముదుగయినను, పట్టుతో దానిని తాకించిన, దానికి శోభ వచ్చును; నాభాష ముదుగు అయినను,రామునికీర్తిని వర్ణించినందున, దానికి శోభకలుగును. అనుగ్రహించి, యీసంగతిని జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు; అప్పుడు, రామచంద్రునిగుణములను గానముజేయుటకు నావచనములకు యోగ్యత పట్టును.

దోహా 19-20-21

సరళమగుకవితాశైలియు ఉజ్జ్వలమగుకీర్తియుఆదరణీయములు; ఈరెండును కలిసినయెడల, స్వాభావికశత్రుత్వమును విడిచి, శత్రువుసహితము వాని నుచ్చరించును. జ్ఞానము లేనియెడల నారెండింటికి సమ్మేళనము కలుగదు; నాకు జ్ఞానము శూన్యము; మాటిమాటికి మిమ్ముల ను ప్రార్థించెద; నాయందు దయ గలవారయి, నేను గానముఁ జేయఁబోవు నారాయణునికథను వినుఁడు. రామచంద్రునిచరిత్రమనెడుమానస

సరోవరమునందు పండితులగు కవులు హంసలవంటివారు. నే నొకహం సపిల్లను; నాబాలవచనములను ప్రీతితో విని, కృపతో వానిని మన్నింతురుగాక.

సోరఠా. 2

ఈరామాయణమును రచించినమునీశ్వరునిచరణారవిందములకు నమస్కరించెద; ఖరదూషణాదులచరిత్రమును కోమలముగను, దోషరహితముగను చెప్పెను; కఠినమగు విషయములను మృదువుగను, దూష్యమగువిషయములను నిర్దోషముగను గానముఁ జేసెను. సంసారసాగరమును తరించుటకు పడవ యైననాలుగువేదములకు నమస్కరించెద; రఘుపతియొక్క సుప్రసిద్ధమగుకీర్తిని వర్ణించి, స్వప్నమునందయినను ఖేదము నొందను. ఈసంసారసాగరమును సృష్టించినబ్రహ్మయొక్కచరణకమలములధూళికి నమస్కరించెదను; ఈసంసారములో సుజనులును దుర్జనులును గలరు; పూర్వము క్షీరసాగరమును మథించినపుడు అమృతమును, చంద్రుఁడును, కామధేనువును బుట్టెరి; ఆవెంటనే హాలాహలమును, మద్యమును బయలువెడలెనుకదా!

దోహా 22

దేవబ్రాహ్మణపండితగురుచరణములకు భూమిపై శిరస్సునుంచి నమస్కరించెదను; వారు ప్రసన్నులయి, నామనోరథమును పూర్తి చేయుమని ప్రార్థించెద.

చౌపాయ్ 15

మఱియు సరస్వతికిని గంగానదికిని నమస్కారము; ఈరెండును పవిత్రమయినవి; మనోహరమయిన ప్రవాహములు; గంగానదిలో నొకపర్యాయము స్నానముఁ జేసినను, నొకమాఱు దాని జలమును త్రాగినను మనుజులపాపములు నశించును. అటులనే, సరస్వతియొక్క నామోచ్చారణవలన సజ్ఞానము తొలఁగును. గురువువలె దీనబంధువును, తల్లివలె నిత్యము పోషించువాఁడును, తండ్రియు నైన ఉమామహే

శ్వరులకుఁ బ్రణామముఁ జేసెదను; *ఈశ్వరుఁడు రామచంద్రునకు సేవకుఁడును, ప్రభువును, సఖుఁడును కనుక, తులసీదాసునకు సర్వవిధముల హితముఁ జేయును.

కలియుగములోని దురాచారప్రవర్తనలఁ జూచి, వానినివృత్తికొఱకు, శాబరమంత్రములను పార్వతీపరమేశ్వరులు చెప్పిరి; ఆమంత్రములోనియక్షరములకు పొందిక లేదు; వానికి అర్థము లేదు; ఆమంత్రమును జపించుటవలన, శివునిప్రభావము ప్రకటమగును. శివప్రసాదమువలన రామకథను నే నింపుగఁ జెప్పఁగలను; ఉమామహేశులను ధ్యానించి, వారిప్రసాదముఁ బొంది, చిత్తమున కానందము కలుగువిధమున రామచరితమును గానముఁ జేసెద. చంద్రునితోఁ గూడినరాత్రి యెంత శోభగలదై యుండునో, అట్లుశివునిప్రసాదముతోఁగూడిన నా కావ్యము సహితము ఆనందమును కలిగించును. ఈ రామకథ నెవరైనను ధ్యానించి, ప్రీతిపూర్వకముగ వినినను, చెప్పినను, స్మరించినను వారికి రామునిచరణములయందు ప్రేమ కలుగును; వారిపాపములు నశించును; సకలశుభమంగళములఁ బొంది వా రానందింతురు.

---

* చరాచరప్రపంచమునకు శివుఁడు ప్రభువు; రఘువరుఁడు సర్వాంతర్యామి. అందుచేత, రామున కొకసమయమున శివుఁడు ప్రభువును, మఱియొకసమయమున సేవకుఁడు నగును; రాముఁడు పార్థివముఁ జేసి పూజించును కనుక, రామునకు శివుఁడు స్నేహితుఁడు. ఇందు కొకకథకలదు. సేతువుఁ గట్టినపుడు, శ్రీరామమూర్తి శివలింగము నచ్చట ప్రతిష్ఠించెను; ఆస్థానమునకు రామేశ్వరమని అచ్చటికి వచ్చినమునులు పేరుఁ బెట్టిరి.

"ఏమి దానియర్థము" అని రాముఁడు అడిగెను. "ఇచ్చట రాముఁడును, ఈశ్వరుఁడును నివసించి యుండిరి గనుక రామేశ్వరము" అని మునులు చెప్పిరి. "దానిభావ మేమి" అని రాముఁడు తర్కించెను. "రామునియొక్క ఈశ్వరుఁడు కనుక రామేశ్వరుఁడు" అని అర్థముఁ జేయుఁడని చెప్పెను. "రాముఁడే ఈశ్వరుఁడు" అని ఆలింగములోనుండి శబ్దము వచ్చెను. అందుచేత, రామునకు శివుఁడు స్నేహితుఁడును, ప్రభువును, సేవకుఁడు నగుచున్నాఁడు.

దోహా 23

నాస్వప్నమందయినను ఉమామహేశ్వరులకు నాయందుఁ గటాక్షము వచ్చినయెడల, నాకవిత్వము సరళము కాకపోయినను దాని ప్రభావము సత్యమగును.

చౌపాయ్ 16

అతిపవిత్ర మగు అయోధ్యానగరమునకును, సర్వపాపవిమోచని యగు సరయూనదికిని నమస్కారము. ఆపురవాసు లగునరనారీమణులమీఁద రామున కతిప్రేమ కనుక, వారికి నమస్కారము. *వారు సీతను నిందించినను, దానిని పాటింపక, వారిపాపములను నశింపఁజేసి, ప్రభువు వారికి వైకుంఠము నిచ్చెను.

తూర్పుదిక్కుతో సమాన మగుకౌసల్యకు నమస్కారము; అచ్చటను కీర్తి పుట్టి, అచ్చటినుండి నలువైపులకు వ్యాపించెను; ఆతూర్పుదిక్కున, శ్రీరామచంద్రుఁడు చంద్రునివలె నుదయించి, సమస్తలోకముల కానందముఁ గలుగఁజేసి, పాపాత్ములనునట్టి తామరపువ్వులను మంచువలె నాశనముఁ జేసెను. సకలమంగళస్వరూపులు, పుణ్యాత్ములు నగుదశరథమహారాజునకును, అతనిరాణులకును, మనోవాక్కాయకర్మములఁ బ్రణమిల్లి "ఓమహాత్ములారా! మీకుమారుని దాసునిగ భావించి, నన్నుఁ గటాక్షింపుఁడు; మిమ్ములను సృష్టించుటవలన, బ్రహ్మకు ఘనత వచ్చెను; సకలలోకారాధ్యుఁడు మీగర్భమునందుఁ బుట్టినందున, మీరు లోకపూజ్యులయితిరి" అని ప్రార్థించెదను.

* ఆనగరములో నొకచాకలివాని పెండ్లము వానిమాట లేక, పుట్టింటికిఁబోయెను; వానిభార్య తిరిగి ఇంటికి వచ్చినపుడు, భార్యను చూచి "ఓసీ! ఇంతకాలము నీవు పుట్టింట నివసించివచ్చితివి; పదునొకండుమాసములు లంకలోనుండినను, శంకింపక, సీతను తీసికొని వచ్చి, రాముఁడు వెఱ్ఱిబాగులవాఁడు కనుక, సీతను తననగరులో నుంచెను. నేను వెఱ్ఱిరాముఁడ ననుకొంటివా? పో పొమ్ము" అని వాఁడు కూఁకలువేసి భార్యను తఱిమి వేసెను. ఆచాకలిహీనినిసహితము క్షమించి, రాముఁడు వానికి మోక్షము నిచ్చెను.

సోరఠా 9

అయోధ్యాధిపతి యగుదశరథునకు నమస్కరించెద; ఎందుచేత నన, నతనికి రామచంద్రునిచరణములయందు సత్యమగుప్రేమ కలదు; రాముని వియోగదుఃఖము కలిగినతోడనె, శరీరమును గడ్డిపోచకంటె నీచమని భావించి ప్రాణముల నతఁడు విడిచెను.

చౌపాయ్ 17

రామునిచరణముల నేకాంతభక్తితో జనకచక్రవర్తి కొలుచుచుండెను; సకుటుంబసపరివారముగ నామహారాజునకు నమస్కరించెద. యోగభోగములక్రింద నతనిభక్తి చాటుపడి యుండి, రామునిఁ జూచి నతోడనే నది ప్రకట మయ్యెను. అన్నదమ్ములు మువ్వురలోను ప్రథమమున భరతునిచరణములకు వందన మాచరించెద; అతని నియమమును వ్రతమును వర్ణించుటకు శక్తి లేదు; లోభముచేతఁ బూఁదేనెను విడువలేనితుమ్మెదలవలె, నతనిమనస్సు రామునిచరణారవిందములవద్దఁ బీఁటవెట్టుకొని యుండును. లక్ష్మణునిచరణకమలములకు నమస్కరించెద; అతనిచరణములు శీతలములును మనోహరములును భక్తులకు సుఖప్రదము లగును; రామచంద్రుని కీర్తిరూపమగుపతాకమునకు స్వచ్ఛమగు లక్ష్మణునియశస్సు దండమై నిలువఁబడినందున నది యెగురుచున్నది; అతఁడు సాహస్రఫణములు గలయాదిశేషువు; భూభారమును నివారించుట కవతరించెను; ఆసుమిత్రానందనుఁడు కృపాసముద్రుఁడు; సకలసుగుణములకు ఖని; సదా నాపై ప్రసన్నుఁ డగుఁగాక. రిపుసూదనుఁ డగుశత్రుఘ్నునిచరణకమలములకు నమస్కరించెద; అతఁ డుదారశూరుఁడు; భరతునిసంగడీఁడు; అనంతరము, మహాబలవంతుఁ డగుహనుమంతునకు నమస్కరించెద; అతనిప్రభావమును శ్రీరాముఁడు శ్రీముఖమునఁ జెప్పియుండెను.

సోరఠా 10

మహావీరుఁ డగుపవనకుమారునకు నమస్కారము; అగ్ని వనమును వలె, నతఁడు దుష్టులను సంహరించును; విజ్ఞానఘనసంపన్నుఁడు; అతనిహృదయమందు రామచంద్రుఁడు ధనుర్బాణములను ధరించి సదా నివసించును.

చౌపాయ్ 18

సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు, అంగదుడు—మొదలగువానరులసమాజము కలదు; వారిదివ్యచరణములకు నమస్కారము; వారు నీచశరీరములను ధరించినను, రామచంద్రుని దర్శించిరి. కనుక, వందనీయులు; వారు పూజ్యులు. పక్షులు, మృగములు, దేవతలు, మనుష్యులు, అసురులు—రామచంద్రునిచరణకమలముల నుపాసించు సమస్తప్రాణులకును నమస్కారము; నిష్కామ్యముగ వారు రాముని సేవించిరి. శ్రీశుకులు, సనక సనందన సనత్కుమార సనత్సుజాతులు, వేదవ్యాసులు, నారదుడు—ఈమొదలగు విజ్ఞానులును విశారదులు నగుమునివరులకు భూమిపై శిరము నుంచి నమస్కరించి, "ఓమునివరులారా! మీదాసుడను, అనుగ్రహింపుడు" అని ప్రార్థించెద. సీత, జనకమహారాజుకూతురు; లోకమాత; కరుణానిధి యగు రామచంద్రుని రాజ్యలక్ష్మి; ఆమెచరణకమలములకు నమస్కరించెద; ఆమెకటాక్షమువలన నిర్మల మగుజ్ఞానోదయ మగును; ఆమె రామచంద్రునిశక్తి; ఆమెకును రామునకును భేదము లేదు. మఱియు మనోవాక్కాయకర్మముల చేత శ్రీరామునిచరణారవిందములకు నమస్కరించెద; సర్వము సిద్ధించును; ధనువు నుండి విడువఁబడినబాణమువలె, నతని కమలలోచనముల దృష్టి భక్తులదుఃఖమును నివారించి, వారికి సుఖము నిచ్చును.

దోహా 24

పదమును దానియర్థమును, జలమును దానిలోఁ బుట్టినకెరటమును, చూచుటకు రెండువస్తువులుగ కనఁబడినను అవి యొకటి; వానికి భేదము లేదు. అటులనే, దీనరక్షకు లగుసీతారాము లొకటిగాని రెండు కాదు; వారికి నమస్కారము.

చౌపాయ్ 19

రామచంద్రునినామములో గల "రామ" అను రెండక్షరములకు వందన మాచరించెద. కృశాను (అగ్ని) 'ర' అక్షరము అగ్నిబీజాక్షరము. భాను (సూర్యుడు). 'అ' అక్షరము సూర్యబీజాక్షరము. హిమకర (చంద్రుడు) "మ" అక్షరము చంద్రబీజాక్షరము. ఈమూడుబీజాక్షర

ములు కలిసి "రామ" శబ్ద మయ్యెను. అగ్ని గుణము దహించుట; అగ్ని బీజాక్షరమగు "ర" అక్షరము శుభాశుభకర్మలను దహించి మోక్షము నిచ్చును. సూర్యునివలన నంధకారము నశించును; అటులనే, సూర్యుని బీజాక్షరము "అ" మోహాంధకారముఁబోఁగొట్టును చంద్రుఁడు తాపమును హరించును; అటులనే, చంద్రునిబీజాక్షరము "మ" తాపత్రయమును హరించును. "రామ" అను నామము యొక్క ప్రభావ మిట్టిది. ఈబీజాక్షరములే రాముఁడు; ఈ "రామ" శక్తివలననే సూర్యునకును, అగ్నికిని, చంద్రునకును ప్రభావముకలిగెను; ఆశక్తి లేని యెడల, వీని ప్రభావము పోవును.

శ్లో. "రకారో నలబీజం స్యా ద్యే సర్వే బాడబాదయః,
కృత్వా మనోఽమలం సర్వం భస్మ కర్మ శుభాశుభం." ౧
శ్లో. "అకారో భానుబీజం స్యా ద్వేదశాస్త్రప్రకాశకః,
నాశయ త్యేవ సా దీప్త్యా యా విద్యా హృదయే తమః." ౨
శ్లో. "మకార శ్చంద్రబీజం స్యా ద్య దపాం పరిపూరణం,
త్రైతాపం హరతే నిత్యం శీతలత్వం కరోతి చేత్." ౩

అగ్నివంశమునందు పరశురాముఁడు, సూర్యవంశమునందు శ్రీరాముఁడు, చంద్రవంశమునందు బలరాముఁడు పుట్టిరి. అగ్నికి మూఁడు కళలును, సూర్యునకు పండ్రెండు కళలును, చంద్రునకు ఒకకళయును కలవు; ఇవికలిపినయెడల పదియాఱగును. ఈషోడశకళలు కల శ్రీరామునకు నమస్కారము. ఉత్పత్తికర్త యగు బ్రహ్మవంటివాఁడు చంద్రుఁడు; పోషణకర్త యగువిష్ణువంటివాఁడు సూర్యుఁడు; సంహారకర్త యగుశివునివంటివాఁడు అగ్ని దేవుఁడు; ఈత్రిమూర్తిస్వరూపుఁడు శ్రీరాముఁడు; నిర్గుణుఁడు; నిరుపమానుఁడు; గుణములకు నిధి; ఈరామతారకమంత్రమును శివుఁడు సదా జపించును; జీవులు ముక్తినొందవలెనని తలంచి, కాశీలోనిజీవులకు మరణకాలమున ఈశ్వరుఁ డీతారకమంత్రము నుపదేశించును. శ్రీరామనామమహిమను తెలిసికొని, దానిప్రభావమువలన *గణపతి ప్రథమపూజ్యుఁ డయ్యెను.

---

* బ్రహ్మయొద్దకుఁబోయి, ప్రథమపూజ్యపదవి కెవరికి వారు అర్హులమని దేవతలు తమలోఁదాము వివాదపడిరి. అప్పుడు వారింజూచి "ఓ దేవతలారా! మీలో నెవరు భూ

'రామ' అనుశబ్దమును 'మరా' అని జపించి, వాల్మీకిమహాముని నిర్మలుఁ డయ్యెను. * సహస్రనామములతో సమాన మని శివునివచన మును విని, పార్వతి రామనామమును పఠించి, శివునిసాంగత్యమునొందెను.

తనవచనములయం దామెకుఁగలవిశ్వాసముఁ జూచి, సంతసించి, ప్రసన్నుఁడయి, పార్వతికి శివుఁడు తనశరీరములో నెడమభాగము నిచ్చెను. ఆమె పతివ్రతాశిరోమణి అయ్యెను; శివుఁడు గౌరీశంకరుఁ డయ్యెను; శ్రీరామనామప్రభావ మిట్టిది అని తెలిసికొనుఁడు. శ్రీరామనామము యొక్క ప్రభావమువలన, హాలాహలమును మ్రింగినను, అది శివున కమృతమయ్యెను.

దోహా 25

ఓతులసీ! వర్షచేనుకు వర్ష మెటులనో, రాముని యందు భక్తి సీకటులు; 'రామ' అను రెండుఅక్షరములు, శ్రావణభాద్రపదమాసములు వలె, లోకుల కానందము నిచ్చును.

---

ప్రదక్షిణముఁజేసి ముందు నావద్దకు వచ్చెదరో, వారికి ప్రథమపూజ్యపదవి నిచ్చెదను" అని బ్రహ్మ వారితోఁ జెప్పెను. అప్పుడు దేవతలందఱు తమతమవాహనముల నెక్కి గమనించిరి. మూషకవాహనము నెక్కి గణపతి వెనుకఁ బడి విచారించు చుండెను. అతనిం జూచి, "ఓగణేశా! నీవు విచారింపకుము. శ్రీరామనామమును భూమిమీఁదను వ్రాసి, దానికి ప్రదక్షిణములఁ జేసి బ్రహ్మయొద్దకుఁ బొమ్ము" అని నారదుఁడు బోధించెను. అతఁడు చెప్పిన ప్రకారము చేసి, గణపతి బ్రహ్మవద్ద కందఱికంటె ముందు వెళ్లెను అందుచేత గణపతికి బ్రహ్మ ప్రథమపూజ్యపదవి నిచ్చెను. 'ఆదౌపూజ్యో గణాధిపః' అని కలదు.

* ('ఓపార్వతీ! భోజనమునకురమ్ము' అని శివుఁడుపిలిచెను. 'ఓస్వామీ! విష్ణుసహస్రనామమును పఠించు చున్నాను; అది ముగించి వచ్చెదను' అని పార్వతి ప్రత్యుత్తర మిచ్చెను. 'ఓ పార్వతీ! రామనామము సహస్రనామములతో తుల్యము–

శ్లో. శ్రీరామరామరామేతి రమే రామే మనోరమే,
సహస్రనామత స్తుల్యం రామనామవరాననే.'

అని పార్వతికి శివుఁ డీమంత్రరాజము నుపదేశించెను.)

చౌపాయ్ 20

'రామ' అనురెండక్షరములును మనోహరమయినవి; మధురమయినవి; భక్తులకు నేత్రములు; వారికిజీవనము నిచ్చును; స్మరించుటకు సులభమయినవి; ఈలోకములో సుఖమును లాభము నిచ్చును; వానిని స్మరించువారు విష్ణుసాయుజ్యముఁ బొందఁగలరు. వానిని పలికినను, చెప్పినను, స్మరించినను ఆనందముకలుగును రామలక్ష్మణుల కొకరియం దొకరి కెంతప్రీతికలదో తులసీదాసున కాయక్షరములయం దంతప్రీతి కలదు. ఆరెండక్షరముల నుచ్చరించినపుడు, వానియందు నాకుఁ గల గలప్రీతి ప్రజ్వరిల్లును; జీవాత్మకును పరమాత్మకును, నరనారాయణుల కెట్టిసంబంధమో, ఆరెండక్షరముల కట్టిసంబంధము కలదు; ఆరెండుఅక్షరములు జగత్పాలకములు; భక్తులసంరక్షకములు; భక్తియనులతాంగి యొక్క కర్ణభూషణములు; సూర్యచంద్రులవలె, లోకములఁ బాలించును; అమృతముతో నీరెండక్షరములును సమానము (అమృతము మధురముగ నుండును; సంతోషము నిచ్చును; ఈఅక్షరములు ముక్తి యనుఅమృతము నిచ్చును; 'ర' అక్షరము నుచ్చరించుటవలన, పాపములు పోయినందున, ముఖము మధురముగ నుండును; "మ" అక్షరము నుచ్చరించుటవలన, నోరు మూఁతపడును; అందువలన సంతోషము కలుగును); ఆదికూర్మముతోను ఆదిశేషువుతోను సమానము ('ర' అక్షరము నిరాధారుఁడును బ్రహ్మస్వరూపుఁడు నగు ఆదికూర్మముతో సమానము; 'మ' అక్షరము జీవస్వరూపుఁడగు ఆదిశేషువుతో సమానము); భక్తులమనస్సు అనుపద్మము నాశ్రయించిన తుమ్మెదతో సమానము; భక్తులమనస్సు అనుపద్మమునకు సూర్యకిరణమువంటివి; యశోదకు బలరామకృష్ణులయం దెంత యనురాగమో, జిహ్వ కారెండక్షరములయం దంతయనురాగము కలదు.

దోహా 26

రామనామములో 'ర' అక్షరము ఛత్రమువలెను, "మ" అక్షరము కిరీటమువలెను, సర్వవర్ణములకంటె నధికముగఁ బ్రకాశించును.

చౌపాయ్ 21

ప్రభువునకును సేవకునకు నెట్టిసంబంధము కలదో, నామమునకును ఆనామము గలవస్తువునకు నట్టిసంబంధము కలదు; నామమును

రూపమును, ఈశ్వరునిమాయ అని పండితులు చెప్పుచున్నారు; ఈశ్వరుఁడు అనాది; అనిర్వాచ్యుఁడు; అట్టి ఈశ్వరునకు నామరూపములు రెండును ఉపాధి యని తెలిసికొనుము; నామరూపములు రెండింటిలో నొకటిగొప్పది, మఱియొకటి తక్కువది అని చెప్పఁగలరు; కాని, ఆభేదమును గుఱించి నేఁ జెప్పినసమాధానమును బుద్ధిమంతులు గ్రహింతురు. విచారించి చూడ, రూపము నామమున కధీనము; నామము లేక, రూపముయొక్క జ్ఞానము కలుగదు. రూపము గలపదార్థము చేతిలో నుండినను, దానినామమును తెలిసికొననియెడల, నాపదార్థమును గుర్తెఱుంగము. రూపమును విడిచి, నామమునే ధ్యానింపుము; అప్పుడు రూపము స్వయముగ హృదయములో వ్యక్తమగును; మనస్సున కానందము కలుగును. నామరూపములయొక్క కథ అనిర్వాచ్యము; చెప్పుటకు శక్తి చాలదు; దానిప్రభావముఁ దెలిసినవారికి మాత్రము సుఖము కల్గును. సగుణబ్రహ్మమునకును నిర్గుణబ్రహ్మమునకును నామమే సాక్షి; ఆరెండింటిని తెలిసికొనుటకు నామము ప్రధానము; వానిం జేరుటకు నామము మార్గముఁ జూపును.

దోహా 27

ఓతులసీ! లోపలను వెలుపలను వెల్తురు ప్రకాశింపవలె నని నీకుఁ గోరిక యుండిన, రామనామ మనుమణిదీపమును, నీజిహ్వ యనుద్వారమువద్ద నిడికొనుము; మణిదీపమునకు వాయుబాధ లేదు.

చౌపాయ్ 22

ఈరామనామమును జపించినయోగి సిద్ధినొందును; ప్రపంచమునందు వానికి వైరాగ్యముకలుగును; నామరూపములులేనివాఁడును, అనిర్వాచ్యుఁడును, కళంకము లేనివాఁడు నగుబ్రహ్మమును పొంది సుఖము ననుభవించును; నిగూఢమార్గములను తెలిసికొనఁగోరినవారు ఈనామమును జపించి వానిం దెలిసికొనఁగలరు; ఈనామమును జపించి సాధకులు అణిమాదిసిద్ధులనుపొందఁగలరు. దుఃఖపడుచుండినమనుజులీ నామమును జపించిన, వారిదుఃఖములు నశించును; వారికి సుఖము కలుగును; ఆర్తులును, జిజ్ఞాసులును, అర్థార్థులును, జ్ఞానులును- ఈనలువురు నాలుగువిధములుగ లోకములో రాముని సేవింతురు; ఈనలువురును

పుణ్యాత్ములు; పాపరహితులు; వారికి నామమే ఆధారము; వారిలో జ్ఞానిమీఁద భగవంతునకు దయ మెండు. నాలుగు వేదములలోను నాలుగుయుగములలో నామము యొక్క ప్రభావము ప్రకాశించెను; ముఖ్యముగ కలియుగములో నామముకంటె వేఱొకయుపాయము కానరాదు.

దోహా 28

సకలకామములను విసర్జించి, రామభక్తిలో లీనమై యుండి నపుడు, రామునియందుఁ గలప్రేమ అనునట్టిసరస్సులో నామనస్సు చేప వలె విహరించుచున్నది.

చౌపాయ్ 23

బ్రహ్మము సగుణ మనియు నిర్గుణ మనియు చెప్పవచ్చును; ఏవిధమునఁ జూచిన, బ్రహ్మము అనాది, అనిర్వాచ్యము, అగాధము, నిరుపమానము; సగుణనిర్గుణములకంటె, నామము శ్రేష్ఠ మని నాఅభిప్రాయము; ఎందుచేత ననఁ: నామము యొక్క ప్రభావమువలన సగుణనిర్గుణములు రెండును స్వాధీన మగును. నాకు నామముపై ప్రీతి కనుక, దాని ప్రభావమును నేనీవిధమునఁ జెప్పితిని అని, చతురతగలవారు కనుక మీరట్లు తలంచుట భావ్యము కాదు; నిశ్చలభక్తితోను, నమ్మకముతో నే నిట్లు చెప్పుచున్నాను. అగ్ని దారువులోఁ గలదు; ఆ అగ్నియే ప్రకటమై ప్రజ్వరిల్లును; మొదటిది అవ్యక్తము; రెండవది వ్యక్తము; అటులనే, బ్రహ్మజ్ఞానము; సగుణబ్రహ్మము వ్యక్తము; నిర్గుణబ్రహ్మము అవ్యక్తము; రెండును అగమ్యములు; నామము మాత్రము గమ్యము; అందుచేత, బ్రహ్మముకంటెను, రామునికంటెను, నామము శ్రేష్ఠమని చెప్పుచున్నాను పరబ్రహ్మము సచ్చిదానందస్వరూపము ఒకటి; నాశరహితము; సర్వవ్యాపకము; ఇట్టిగుణములుగల ఈశ్వరుఁడు జీవులహృదయములలోఁ బ్రకాశించుచుండినను, లోకములో సమస్తజీవులు దీనులయి, అగచాట్లు పడుచున్నారు. ఆబ్రహ్మము రూపమును ధరించి, పేరుఁబెట్టుకొని, లోకమునకు వ్యక్త మగునంతవఱకు, ఈఅగచాట్లు నిలిచి యుండును; రత్నమున కొకపేరు పెట్టినఁ గాని, దానికి విలువ లేదు.

దోహా 29

ఈప్రకారము, నిర్గుణబ్రహ్మముకంటె, నామముయొక్క ప్రభావము శ్రేష్ఠము; అది అపారము; రామునికంటె రామనామము శ్రేష్ఠమని నాఅభిప్రాయము.

చౌపాయ్ 24

భక్తులయందుఁ గలప్రేమచేత, రాముఁడు నరరూపమును ధరించి, తాను సకలదుఃఖముల ననుభవించి, వారికి సుఖము నిచ్చెను; భక్తులానామమును సదా జపించి, ఆనందమంగళరూపము నొందుచున్నారు. రాముఁడు గౌతమునిభార్యయగు అహల్యయొక్క శాపముఁ బోఁగొట్టెను; అతనినామము కోట్లకొలఁది పాపాత్ములను పాపములనుండి విడుదలఁ జేయుచున్నది. విశ్వామిత్రునిప్రేరణవలన, తాటకి అను రాక్షసిని మారీచసుబాహులను, వారిఅనుచరులను, రాముఁడు సంహరించెను; సూర్యుఁడు చీఁకటిని పోఁగొట్టువిధమున, దాసులదుఃఖమును దోషమును, దురాశను, రామనామము హరించుచున్నది. రాముఁడు స్వయముగ శివునివిల్లును విఱిచెను; అతనినామము సంసారబంధనమును విఱుచుచున్నది. రాముఁ డొకదండకారణ్యమును బవిత్రముఁ జేసెను.

అతనినామము వేలకొలఁది మనుజులహృదయములను పవిత్రముఁ జేయుచున్నది; రాముఁడు రాక్షసులను సంహరించెను; అతనినామము పాపములను హరించును.

దోహా 30

రాముఁడు శబరికిని జటాయువునకును, వారిఅనుచరులకు నక్షయలోకముల నిచ్చెను; అతనినామ మనేకపాపాత్ముల నుద్ధరించుచున్నది; ఈసంగతి వేదములలోఁ జెప్పఁబడియున్నది

చౌపాయ్ 25

రాముఁడు సుగ్రీవవిభీషణుల కభయము నిచ్చెను; ఈసంగతి అందఱికిఁ దెలియును; అతనినామ మనేకదీనుల నుద్ధరించెనని వేదశాస్త్రములు ఘోషించుచున్నవి. రామచంద్రుఁడు ఎలుఁగులను వానరులను సంఘముఁజేసి, కష్టపడి వారిచేత వార్ధిఁ గట్టించెను; అతనినామోచ్చారణ

వలన సంసారసాగరము శోషించును; ఓమహాత్ములారా! రామనామ మును స్మరింపుఁడు సకుటుంబసపరివారముగ రావణునిఁజంపి, రాముఁడు సీతతో నయోధ్యకు వచ్చెను; రామరాజు యొక్క రాజధాని అయోధ్యానగరము; దేవతలును మునులు నతనికీర్తిని గానముఁ జేసిరి. అతని దాసులు ప్రేమతో నతనినామమును స్మరించినయెడల, శ్రమ లేకయే వారిమోహాంధకారమువిడి పోవును; భక్తిరసములో మునిఁగి, వారు సంపూర్ణసుఖము ననుభవింతురు; నామము యొక్క ప్రభావమువలన, వారికి స్వప్నములో నయిన దుఃఖము కలుగదు.

దోహా 31

రామబ్రహ్మముకంటె రామనామము శ్రేష్ఠము. గొప్పదాత దానముఁ జేయవలసిన గొప్పదాన మీనామమే; ఈనామము యొక్క సారమును గ్రహించి, రామాయణము లోని నూఱుకోట్లశ్లోకములలోనుండి శివుఁ డీనామమును సంగ్రహించెను.

చౌపాయి 26

శివుఁడు అమంగళ మయినవస్తువులను ధరించినను, అమంగళస్థలములలో నివసించినను, ఈరామనామప్రభావము చేత నతఁడు నాశరహితుఁ డయ్యెను; శ్రీశుకులును సనకాదిసిద్ధమునులును రామనామప్రభావమువలన బ్రహ్మానందము ననుభవించుచు చున్నారు. జగత్తునకు హరియందుఁ బరమప్రీతి కలదు; హరిహరులకు నారదునియందు వాత్సల్యము; అట్టినారదుఁడుసయితము రామనామము యొక్క ప్రభావము నొప్పుకొనెను; ఈనామమును సదా స్మరించి, భగవంతునికటాక్షము వలన, ప్రహ్లాదుఁడు భక్తాగ్రేసరుఁ డయ్యెను. సవతితల్లి వలన పరాభవము నొంది దుఃఖించు చుండినధ్రువుఁడు, ఈనామమును పఠించి, సర్వోత్కృష్టమగు నిశ్చలపదవిని బొందెను. ఈపవిత్ర మయిననామమును స్మరించి, మహావీరుఁ డగుహనుమంతుఁడు రామునిదయను సంపాదించి, దానిని నిలువఁబెట్టుకొనెను; హరినామము యొక్క ప్రభావమువలన గజేంద్రుఁడును, అజామిళుఁడును, గణికయు ముక్తిని బొందిరి. ఈ నామము యొక్క ప్రభావమును విస్తరించి చెప్పుట యేల? అవతారము నెత్తిన రాముఁడే తననామము యొక్క ప్రభావమును సాంతముగఁ జెప్పుట కశక్తుఁ డయ్యెను.

దోహా 32

రామనామము కల్పవృక్షమువంటిది; కలియుగమునందు సమస్త శుభములకు నాటపట్టు; దానిని స్మరించుటవలన, 'తులసి' అనువాఁడు 'తులసీదాసు' అయ్యెను; 'భంగి' చెట్టువంటి 'తులసి' అనువాఁడు 'తులసి' చెట్టుతో సమానుఁడగు 'తులసీదాసు' అయ్యెను.

చౌపాయ్ 27

నాలుగుయుగములలోను, త్రికాలములలోను, త్రిలోకములలో నేజీవుఁడయిన రామనామమును జపించిన, శోకరహితుఁడగును; సకలపుణ్యములఫలమే రామనామమందు భక్తియని, వేదములును పురాణములును మునీశ్వరులును చెప్పుచున్నారు. కృతయుగములో ధ్యానమువలనను, త్రేతాయుగములో యజ్ఞమువలనను, ద్వాపరయుగములో నారాధనవలనను భగవంతుఁడు ప్రసన్నుఁడయ్యెను. కలియుగము కేవలము పాపభూయిష్ఠ మయినది; పాపములకు మూలమయినది; పాపసముద్రములో మనుజుల మనము లనునట్టిమీనములు మునిఁగి తేలుచున్నవి. ఈతీక్ష్ణ మగుకలియుగములో, నామముకల్పవృక్షమయ్యెను; నామస్మరణమాత్రమున,పాపములన్నియు శాంతించును; ఈ పాపయుగములో రామనామమువలన,మనోవాంఛలుసిద్ధించును;పరలోకమున హితకారియగును; ఈలోకములో, మాతాపితరులవలె,హితముఁజేయును. శుభకర్మలవలనఁ గాని, భక్తివలనఁగాని, జ్ఞానమువలనఁగాని ఈయుగమునందు ప్రయోజనము లేదు; కేవలము రామనామమువలననే ప్రయోజనములు సిద్ధించును; కపటవేషమును ధరించిన కాలనేమి యనురాక్షసుని హనుమంతుఁడు సంహరించినవిధమున, నీకలియుగపాపములను రామనామము హరించును.

దోహా 33

రామనామము నృసింహమూర్తి; కలియుగముహిరణ్యకశిపుఁడు; నామమును జపించువారు ప్రహ్లాదునివంటివారు; నృసింహమూర్తి హిరణ్యకశిపునివధించి ప్రహ్లాదుని రక్షించినవిధమున, రామనామము కలియుగపాపములను హరించి, నామపారాయణులను రక్షించును.

చౌపాయ్ 28

ప్రీతి నయినను వైరమున నయినను, నిలిచినపుడును నడుచునపుడును—ఏసమయమున నయిన రామనామమును స్మరించుటవలన, దశదిశలయందు శుభములు వ్యాపించును; ఆనామమును స్మరించి, శిరస్సును వంచి నమస్కరించి, రాముని గుణములను వర్ణించెదను. అతనిదయ అపారము; అతనికృపవలన, నాతప్పుల నతఁడే సవరించును; రాముఁడు గొప్పప్రభువు; అతనికి నేనొకబీదదాసుఁడను; ఈసంగతి జ్ఞాపకముంచుకొని, నాయందు దయ నుంచి, నన్ను రక్షించును. భృత్యులప్రార్థనలను వినుటయు, వారియం దనురాగము కలిగి యుండుటయు సత్ప్రభువుల లక్షణములని వేదశాస్త్రములు ఘోషించుచున్నవి; అటులనే, లోకములో వాడుక కలదు; ధనికులును బీదలును, నాగరికులును పామరులును, పండితులును శుంఠలును, సుకవులును కుకవులును, పరిశుద్ధులును అపరిశుద్ధులును—వీరందఱు తమతమబుద్ధ్యనుసారముగ తమ ప్రభువునుస్తుతింతురు; తమరాజు మహాత్ముఁ డనియు, చతురుఁడనియు, సుశీలుఁడనియు వారతనిని నుతింతురు; వారిస్తోత్రములను విని, వారు చేసినసన్మానముల నతఁడు గైకొనును; వారిమాటలలోనే,వారివారిబలాబలములను, శ్రద్ధాభక్తుల నతఁడు గ్రహించును. ఇవియన్నియు సాధారణరాజుల స్వభావగుణములని గ్రహింపుము; కోసలపతి యగురాముఁడు సకలభూపాలశిరోమణి యని తెలిసికొనుము; నావంటి మందబుద్ధి గలవాఁడైనను,రామునియందు వానికి ప్రేమ యుండినయెడల, కపటము లేనివానిప్రేమఁ జూచి రాముఁడు సంతసించును.

దోహా 34-35

రాముఁడు పరమకృపాళుఁడు కనుక, దాసుఁడ నయిన నావంటి మూర్ఖుని భక్తిశ్రద్ధల నతఁడు గ్రహించును; అందుచేత నతఁడు నీళ్లలో రాళ్లను తేలించెను; బుద్ధిమంతు లగువానరభల్లూకములను మంత్రులుగఁ జేసెను. 'తులసీకవిత్వమా' అని నన్ను వెక్కిరించుచున్నారు; 'రాముసంత గొప్పప్రభువునకు, తులసి దాసుఁడా?' అని రాముని పరిహసించెదరు.

చౌపాయ్ 29

నామూర్ఖత్వమును దోషములఁ జూచి, నరకముసహిత మసహ్యపడును. ఈసంగతి నే నెఱుంగుదు; ఇది నాతలంపునకు వచ్చినప్పుడు, నాశరీరము వడఁకును; స్వప్నమందయిన రాముఁ డీసంగతిని లక్ష్యముఁ జేయఁడు. ప్రభువు నాప్రార్థనను విని, కన్నులార నాభక్తిఁజూచి, ఏకదీక్షతో నుండిననాకోరికను శ్లాఘించెను. నేను చెప్పినకథ బాగుగ లేకపోయినను, నేను నిర్మలమయినభక్తుఁడ నని గ్రహించి. నాకథకు రాముఁడు తృప్తి నొందెను. అతఁడు దానిని శ్లాఘించెను. ప్రమాదమువలనఁ గలిగినతప్పుల నతఁడు మన్నించును; మనుజునిహృదయము కలుషమా, నిష్కలుషమా అని ప్రతిసమయమున నతఁడు పరిశీలించును. ఒకతప్పు వాలి చేసెను; అందుకు, వేఁటకానివలె రాముఁడు వాలిఁ జంపెను.

ఆతప్పు సుగ్రీవుఁడును, విభీషణుఁడును చేసిరి; అయినను, స్వప్నములో సయితము రాముఁడు వారిని శిక్షింపవలెనని తలంపలేదు; భరతునితోఁ గలిసినపుడు రాముఁడు వారిని గౌరవించెను; సభలో నతఁడు వారిని సన్మానించెను.

దోహా 36-37-38

రాముఁడు చెట్టుక్రిందఁ గూర్చుండినను, నిర్భయముగ వానరులా చెట్టు నెక్కి దానిమీఁదఁ గూర్చుండిరి; అయినను, వారియందుఁ గోపము లేక, వారిని తనప్రాణములతో సమానముగ నతఁడు చూచెను. ఓతులసీ! రామునివంటి సుశీలుఁ డగు ప్రభువు మఱియొకఁడు లేఁడు సుమీ! అందఱకు రాముఁడు మంచివాఁడు; బ్రహ్మ, శివుఁడు, శ్రీశుకులు- మొదలగు గొప్పవారికిని, జటాయువు, శబరి మొదలగు నీచులకు నతఁడు మంచివాఁడు; సకలజనులకు నతఁడు సమరసికుఁడు; ఇది సత్యమయినయెడల, నన్ను రక్షించునని నానమ్మకము. నాకవిత్వము నకు గొప్పవచ్చును. ఈప్రకారము నాగుణదోషములను చెప్పి, సర్వప్రాణులకు నమస్కరించి, ఉమామహేశులను స్మరించి, శోభావంత మగు రామకథను వర్ణింప నారంభించెద.

చౌపాయ్ 30

ఈశోభావంత మగు రామకథను యాజ్ఞవల్క్యుఁడు మునిశ్రేష్ఠుఁడగుభరద్వాజునకుఁ జెప్పెను; నేను వినినప్రకార మాకథను నేను

చెప్పుచున్నాను; ఓసజ్జనులారా! స్వస్థచిత్తముతో మీరు దానిని వినుఁడు. ప్రథమమున శివుఁడీమనోహరమగుకథను రచించి, ప్రసాదించి, పార్వతికిఁ జెప్పెను; కాకభుశుండి రామభక్తుఁ డని తెలిసికొని, శివుఁ డతనికి రామకథఁ జెప్పెను; కాకభుశుండి యాజ్ఞవల్క్యునకును, అతఁడు భరద్వాజునకును సాంతముగ వచించెను; వీరందఱును సమానగుణసంపన్నులు; భగవంతునిలీలావతారములను వారు సమముగ దర్శించి తెలిసికొనిరి. త్రికాలజ్ఞానము వారికి కరతలామలకము; నారాయణుని తదితరభక్తులు భగవంతునికడ ననేకప్రకారముల విని, గ్రహించి చెప్పిరి.

దోహా 39-40

సూకరగ్రామములో (Sukara-gram = Suargawn = Soron, modern town, a place of pilgrimage), రామకథను నాగురువువలన విని యుంటిని; కేవలము బాలుఁడనుకనుక, నేను దానిని గ్రహింపలేదు. రామకథ మహాగంభీరమయినది; ఆకథను వినినవారును చెప్పినవారును గొప్పజ్ఞానులు; నేనుచూడ మూర్ఖుఁడను; సంసారములో మునిఁగి తేలుచుంటిని; దానిని నే నెటుల గ్రహింపఁగలను ?

చౌపాయ్ 31

అనంతరము నాగురువు మఱిమఱి నాకాకథను చెప్పెను; నాబుద్ధికొలఁది దానిని నేను గ్రహించితిని; నాజ్ఞానముకొలఁది దానిని నేను వర్ణింపఁబూనితిని; భగవంతునిప్రేరణవలన, నాకుఁ గలబుద్ధిని జ్ఞానము నుపయోగించి, ఆకథను చెప్పుచున్నాను. నాసందేహములనే కాక, తదితరమోహములను భ్రమలను సయితము నాకథహరించును; సంసారరూపక మగునదిని దాఁటుటకు రామకథ పడవవంటిది; పండితులు విరమించుస్థలము; సర్వజనుల కానందము నిచ్చును; కలియుగపాపములను హరించును; కలియుగమను మహాసర్పమును కట్టుటకు మహామంత్రము; జ్ఞానరూపమగుఅగ్నిని రగిలించుటకు అరణివంటిది. కలియుగమున కామధేనువు; మహాత్ములకు సంజీవిని; భూమిమీఁదఁ బ్రవహించు అమృతనది; సంసారభయమును పాఱఁదోలును; మాయ యనుకప్పను మ్రింగుసర్పము; రాక్షసులను శిక్షించి, దేవతలను పార్వతి యెటుల రక్షించెనో, అటులనె రామకథ నరకదుఃఖములను హరించి, సాధువు

లను రక్షించును; పాలసముద్రములో లక్ష్మి పుట్టినట్లు, మహాత్ముల సమాజములో రామకథ పుట్టును; జగత్సృష్టిని భూమి భరించునట్లు, సంసారభారము నాకథ భరించును; యమదూతలముఖమున మసి బూయుటకు యమునానదివంటిది; జీవులకు ముక్తి నిచ్చుటకు కాశీనగరముం బోలును; తులసియందువలె రామునకు దానియందుఁ బ్రీతి; ఆచరిత్రము పవిత్రమయినది; వానికోరికయం దెంత ప్రీతి కలదో, దానియందు తులశీదాసున కంతప్రీతి కలదు; నర్మదానదియం దెంతప్రీతియో, దీనియందు శివున కంతప్రీతి; సకలసంపత్తులకు రాశి; సకలసిద్ధుల నిచ్చును; సర్వదేవతలకు అదితియెట్టులతల్లియో, సకలసద్గుణములకు రామకథ తల్లివంటిది; రామునియందుఁ గలభక్తికిని అనురాగమునకు నాకథ ఆటపట్టు.

దోహా 41

రామకథ మందాకినీనది; నిర్మల మగుచిత్తము చిత్రకూటపర్వతము; నిశ్చలభక్తి ఉద్యానవనము; ఈవనములో సీతారాములు విహరింతురు.

చౌపాయ్ 32

సుందరమగు రామచంద్రునికథ చింతామణిఁబోలును; విజ్ఞానమనుస్త్రీ ధరించునట్టి భూషణము; శ్రీరామునిగుణములు జగత్తులకు మంగళకరములు; ముక్తిని, ధనమును, ధర్మము నిచ్చును; జ్ఞానమును, వైరాగ్యమును, యోగమును బోధించును; భయంకరమగు సంసారమను రోగమున కశ్వని-కుమారులను పోలును; శ్రీసీతారాములయం దనురాగముపుట్టుటకుఁ దలిదండ్రులఁబోలును; ధర్మమునకును నియమములకును బీజము; దుఃఖమును శోకమును హరించును; ఇహపరలోకములను బాలించుకర్త; విచారమను రాజునకు బుద్ధిమంతుఁడగు మంత్రినిఁబోలును; లోభమను నపారసముద్రమును పానముఁజేయుటలో నగస్త్యునిఁబోలును; భక్తులమనస్సను వనమునందు, సంచరించు కామక్రోధములనునట్టి ఏనుఁగులను సంహరించుటకు, సింహముపిల్లను బోలును; పూజ్యుఁడగు అతిథియందువలె, శివునకు దానియందుఁ బ్రీతికలదు; దారిద్ర్యమను అగ్నిని శాంతింపఁజేయు మేఘము; విషయము లనునట్టి

సర్పమునకు మహామంత్రము; నొసటను బ్రహ్మవ్రాసినవ్రాతను దుడిచి వేయును; మోహాంధకారముఁ బోఁగొట్టుటలో సూర్యకిరణములఁ బోలును; భక్తులనునట్టి వరిపాలములను రక్షించుటకుఁ గాలమేఘ మును బోలును; కల్పవృక్షమువలెఁ గోరినకోరికల నిచ్చును; హరిహరుల వలె దాసులకు సుఖమునిచ్చును; కవులయొక్క మనస్సునునట్టి నిర్మల మయిన ఆకాశమునందుఁ బ్రకాశించు నక్షత్రసమూహము; రామభక్తు లనుభవించు జీవనధనము; యజ్ఞాదిక్రతువులవలన లభించిన సంపూర్ణ పుణ్యమువంటిది; జగత్తునకు శుభకరులును హితకరులును అయినసాధు జనుల సమూహము వంటిది; భక్తులమానససరోవరమునందు విహరించు హంస; పరమపావనియగు గంగానదీజలప్రవాహతరంగముల మాలిక వంటిది.

దోహా 42-43

దుష్ప్రవర్తనము, కుతర్కము, కపటము, దంభము, పాషండ మతము—మొదలగు కలియుగపాపములను, కట్టెలను అగ్నివలె, రాముని గుణములు దహించును. చంద్రునికిరణములువలె, రామునిచరిత్ర సర్వ జనులకు సమానముగ సుఖమునిచ్చును; చంద్రకిరణములు ముఖ్యముగ చకోరములకును కుముదములకు నానందము నిచ్చును; అటులనే, రామచరిత్రము సాధుజనులచిత్తమునకు విశేషముగ లాభము నిచ్చును.

చౌపాయ్ 33

భవానివేసినప్రశ్నలును, శివుని ప్రత్యుత్తరములును, చిత్రచిత్ర ముగవర్ణించి నేను చెప్పఁగలఁచితిని; ఇదివరలో విననట్టి విచిత్రవిషయ ములను వినినను, మీరు ఆశ్చర్యపడకూడదు; జ్ఞానముకలవాఁడు వైదికకథలను ప్రథమమున వినినను, వానికి వింతయుండదు; ఎందుచేత? 'ప్రపంచములో రామునిలీలలకు పరిమితిలేదు; అతని అవతారములు అనంతము; కోట్లుకోలది రామాయణములో శ్లోక ములు కలవు; ఆయాకల్పములలో రామునిచరిత్ర వివిధప్రకారములఁ జెప్పఁబడెను. ఆచరిత్రమును ఋషు లనేకవిధములఁ జెప్పిరి.' అనిజ్ఞానము కలవాఁడు విచారించి ఆశ్చర్యపడఁడు. అందుచేత, విచారించి మీరు

సందేహములను విడిచి భక్తిశ్రద్ధలతో సీరామకథను వినిన యోగ్య మగును.

దోహా 44

రాముఁడు అనంతుఁడు; అతనిగుణము లపారము; అతనిచర్య లమితము; అందుచేత, నిర్మలమయిన జ్ఞానముకలవారు రామునియేలీల లను వినినను, ఆశ్చర్యముపడరు.

చౌపాయ్ 34

ఈప్రకారము నాసందేహములను విడిచి, నాగురుచరణారవింద ములపరాగమును శిరస్సునధరించి, ఏవిధమగు దోషములును రాకుండ, మహాజనులకు నమస్కరించెద. శిరస్సువంచి శివునకు భక్తితో నమస్క రించి, ఉజ్జ్వలమయిన రామచరిత్రను వర్ణించెదను; హరిచరణారవింద ములకు శిరస్సువంచి నమస్కరించి, (సంవత్) 1631 సంవత్సరము చైత్ర శుద్ధ నవమి మంగళవారము, అయోధ్యానగరములో సీరామ కథను వ్రాయుట కారంభించితిని; వేదముచెప్పినప్రకార మాదినమున శ్రీరాముఁడు భూలోకములో జన్మించెను; సర్వతీర్థములును మూర్తీ భవించి, ఆదినమున ఆనగరములో సమావేశమగును; అసురులును, నాగులును, పక్షులును, మనుజులును, మునులును, దేవతలును, ఆదిన మున సమావేశమయి రాముని సేవింతురు; ఆరోజున జ్ఞానులు రామ జన్మమహోత్సవముఁ జేసి, రామచరితమును గానముఁజేయుదురు.

దోహా 45

మహాత్ములును సజ్జనులును పవిత్రమయిన సరయూనది జలము లలో స్నానముఁజేసి, పవిత్రులయి, రామునిదివ్యమంగళవిగ్రహమును ధ్యానించి, తారకమంత్రమును జపింతురు.

చౌపాయ్ 35

ఈపరమపావనియగు సరయూనదిని దర్శించినను, దానిజలమును స్పర్శించినను, దానిలో స్నానముఁజేసినను, దానిజలమును పానముఁజేసి నను సకలపాపములు పోవునని వేదములును పురాణములును ఘోషిం చుచున్నవి; ఈనదియొక్క ప్రభావమును ఉజ్జ్వలమతిగల సరస్వతి

సహితము చెప్పలేదు. అండజములు, పిండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములను నాలుగుతరగతులజంతువులు అయోధ్యలో దేహమునువిడిచి, పునరావృత్తిలేని లోకములకుఁ బోవును. అన్నివిధములను అయోధ్యానగరము మనోహరమయినది; సర్వసిద్ధులనిచ్చును; సమస్త మంగళముల కాలవాలము; అచ్చటనే యీసుప్రసిద్ధమగు రామకథను వ్రాయుట కారంభించితిని; దానిని వినుటవలన, కామక్రోధాదులు నశించును:—ఆనగరములో రామచరిత్రమను మానససరోవముకలదు; దాని పేరువినిన మనస్సు హాయిగనుండును; మందుచుండిన విషయములను నట్టివనమునుండి మనస్సుఅను ఏనుఁగు పరుగెత్తివచ్చి, యీసరోవరములో మునిఁగి సుఖించును; దానింజూచి మునీశ్వరులు సంతసింతురు; దానిని సదాశివుఁడు రచించెను; మనోవాక్కర్మలవలనఁ గలిగిన దోషములను, దైహిక, దైవిక భౌతికకర్మలను హరించును; దరిద్రమును తొలఁగించును; కలియుగపాపములను భస్మముఁజేయును; మహాదేవుఁడు దానిని రచించి తనమనస్సులో దాఁచియుంచెను; మంచిసమయముఁ జూచి, అప్పుడు పార్వతికి దానినివర్ణించి శివుఁడు చెప్పెను; శివుఁడు తనహృదయములో విచారించి ప్రసన్నుఁడై, దానికి 'రామచరితమానసము' అని పేరుఁ బెట్టెను. ఈరామకథ సర్వశోభావహము; సర్వసుఖదాయకము; నేను దానింజెప్పెద; ఓమహాత్ములారా! నిశ్చలమనముతో దానిని వినుఁడు.

దోహా 46

ఉమామహేశులను ధ్యానించి, జగత్తులో నీమానససరోవర మేవిధమున నయినదో, ఏప్రకారము దానికిఁ బ్రచారముకలిగెనో, ఈవిషయములం జెప్పెద.

చౌపాయ్ 36

మహాదేవుని ప్రసాదమువలన, నామనస్సులో నీరామచరిత మానసమునుగుఱించి యొకమంచి ఆలోచనపుట్టెను; నాబుద్ధ్యాను సారము సొగసుగ దానిని వర్ణించెదను. దానిని మహాత్ములు విని దానిలోని లోపాలోపములను సవరింతురుగాక. మంచిబుద్ధి యొక భూమి

వంటిది; హృదయము ఒక అగాధస్థలము; వేదములు పురాణములు సముద్రమువంటివి; సాధుజనులు మేఘములవంటివారు; ఆమేఘములు రామచరిత్రమనునట్టి జలమును వర్షించును; ఆజలము మధురముగను మనోహరముగ నుండును; దానివలన మంగళములు కలుగును. చరిత్రలోఁ జెప్పఁబడిన రాముని సగుణలీలలు ఆవర్షజలముయొక్క నిర్మలమును స్వచ్ఛమును బోలును; చెప్పుటకు శక్యముకాని ప్రేమయు భక్తియు ఆజలముయొక్క మాధుర్యమును శీతలమును బోలును. పుణ్యాత్ములయిన భక్తులనునట్టి వరిచేలమీఁద నావర్షముపడి హితముఁజేసి, వారికి నూతనజీవనము నిచ్చును; ఆజలము బుద్ధియనునట్టి భూమిమీఁదఁ బడి, ఒకసరస్సులోఁ జేరి, అందులోనుండి ఆయాకాలువల మార్గమునఁ బ్రవహించుచుండును; రామలీలలను జలముతో మానస-సరోవరము పూర్తిగనిండెను; ఆజల మందులో స్థిరముగనుండెను; దానియందు రుచియనునట్టి శరత్కాలము వచ్చునప్పటికి, ఆనీరు పాదు నిలిచినందున సుఖమునిచ్చును.

దోహా 47

(ఉమామహేశులకును, కాకభుశుండి—గరుడులకును, యాజ్ఞవల్క్య—భరద్వాజులకును, తులసీదాసు—భక్తులకును) బుద్ధిపూర్వకముగ జరిగిన నీనాలుగు సంవాదములును, ఆసరోవరమునకు నాలుగు తీరస్థలములు (ఘాట్లు).

చౌపాయ్ 37

ఏడుకాండలు ఆసరోవరమునకు ఏడుసోపానములు; జ్ఞానదృష్టిచే దానింజూచిన, మనస్సున కాహ్లాదముకలుగును; రామచంద్రుని గుణములును మహిమయు అగాధజలముఁ బోలును; సీతారాముల కీర్తి అమృతోపమానమగు జలము; ఈచరిత్రములోని యుపమానములు మనోహరమగుతరంగములు; ఆచరిత్రలోని 'చౌపాయ్'లు పద్మవాటికలు; కవీశ్వరునియుక్తివచనములు ముత్యపుచిప్పలు; 'చాంద్' 'సోరతా'-అనునవి అనేకరంగులుగల కమలములు; సుందరమయిన ఉపమానములును, భావములును, భాషయును, ఆకమలముల పరాగమును, మకరందమును, సుగంధమును బోలును; మహాత్ములసమూ

హము తుమ్మెదలు; జ్ఞానమును వైరాగ్యమును హంసలు; నాలుగువిధములగు కవిత్వము నాలుగువిధములయినచేపలు; ధర్మార్థకామమోక్షములును, జ్ఞానవిజ్ఞానములును, నవరసములును, యోగవైరాగ్యములును, జపతపములును- ఇవియన్నియు జలచరములు; పుణ్యాత్ములును సుకృతులునగు సాధువులును, వారినామగుణములను జ్ఞానమును కథనఁజేయువారును, రంగురంగుల జలపక్షులతో సమానము; సాధుసమాజము మామిడితోఁట; శ్రద్ధ వసంతఋతువు; నవవిధభక్తిమార్గములును, విచారము, నిశ్చయము, క్షమ, దయ - ఇవి వృక్షములపై నల్లుకొనిన లతలు; సంయమ, నియమములు పుష్పములు; స్వస్వరూపజ్ఞానము ఫలము; రాముని చరణములయందుఁ బ్రీతి ఫలరసము;కథలును ఉపకథలును శుకపికాదివిహంగములు.

దోహా 48

భక్తిపరవశమై శరీరము పులకరించుటయే యొకపుష్పవాటిక; భక్తిశ్రవణము తోఁట; శ్రవణమునం దాసక్తి యొకవనము; భక్తిశ్రవణమువలనఁ గలిగిన ఆనందము వానిలో విహరించు పక్షి; నిర్మలమగుమనస్సు తోఁటమాలి; నేత్రములను కుండలలోని స్నేహము అనునీటితో నాతోఁటమాలి తోఁటను తడుపును.

చౌపాయ్ 38

ఈచరిత్రమును సంబరముతో గానముఁజేయువారు ఆసరోవరమును నలువైపులఁ గాపాడు తలవరులు; ఏదేవతాశ్రేష్ఠులగు నరనారీమణు లీరామచరితము విని సంతసింతురో, వారాసరోవరమున కధికారులు. నానావిషయాపేక్షులు కాకులు కొంగలతో సమానులు; అట్టివారు సరోవరమువద్దకు రాఁజాలరు; వారికి దానితోఁ బ్రసక్తిలేదు; ఎండ్రికలు, కప్పలు, నురుగు వీనితోసమానమగు నానారసములతోఁ గూడినవిషయకథ లీచరితములోఁ గానరావు; అందుచేతఁ గ్రామ్యాతురులగుకాకులును కొంగలు నీసరోవరమువద్దకు వచ్చినను, వానికిఁ దృష్టి కలుగదు; ఈసరోవరమువద్దకు వచ్చుట కష్టము. రామునికృపవలన నీసరోవరము భక్తులకు గమ్యము. దుస్సహావాసమునునట్టి ముండ్ల చేత నామార్గము కఠినమగును; దుర్భాష లామార్గములో నివసించు వ్యాఘ్రసింహ సర్పములవంటివి; సంసారవ్యాపకము దుర్గమపర్వతముఁ బో

లును; మదము మోహము అభిమానము మొదలగువిషయము లీమా ర్గములోనుండిన బ్రహ్మారణ్యములు; కాష్టవాదము భయంకరమగున దితో సమానము.

దోహా 49

భక్తి అను దారిబత్తెమును, సత్పురుషులనునట్టి మార్గస్థుల సహవాసమును, రఘునాథునియందుఁ బ్రేమయు లేనివారికి, ఆమానస-సరోవరము అగమ్యము.

చౌపాయ్ 39

ఒకవేళ నెవఁడైన శ్రమపడి, సరోవరముఁ జేరినను, వానిని నిద్రయు, కంపము నావహించును; జడత్వము మాంద్యమును వాని హృదయముఁ బట్టును; ఆమందభాగ్యుఁడు సరోవరములో స్నానముఁ జేయఁడు. ఆసరస్సులో స్నానపానములఁ జేయక, అభిమానముఁ గల వాఁడై, వాఁ డచ్చటనుండి తిరిగివచ్చును; అటుల వచ్చినవానిని యెవ రయిన సరోవరమునుగుఱించి ముచ్చటింపుమని కోరినయెడల, వాఁడు దానిని దూషించును; అచ్చట విశేషము లెవ్వియు లేవని చెప్పును. మార్గ ములో నేవిధమగు కష్టములను రామునికృపగలవారు అనుభవింపరు; అభిలాషతో వారాసరోవరములో స్నానముఁజేసి, దైహిక, దైవిక, భౌతిక (జ్వరము - వజ్రపాతము - సర్పము) బాధలనుండి విముక్తులగు దురు; రామునిచరణములయందు వారికి నిరంతరభక్తికలదు; కనుక వారాసరోవరమును విడిచిపెట్టరు; ఓస్నేహితుఁడా ! నీవాసరోవర ములో స్నానముఁజేయఁ గోరినయెడల, మనమును దృఢముచేసికొని, సత్సాంగత్యముఁ జేయుము. నేనుమాత్రము నాజ్ఞానదృష్టిని ప్రసరించి ఆసరోవరమును దివ్యదృష్టిచేఁ జూచితిని; అందులో నాకవితాబుద్ధి స్నానముఁ జేసి నిర్మలమయ్యెను; పరమానందముతో నాహృదయము పొంగి, ప్రేమాతిశయముతో పొర్లుచున్నది. ఈసరోవరమునుండి నాకవి త్వమనునట్టినది ప్రవహించుచున్నది; రామునికీర్తి ఆనదిలోనినీరు; దాని పేరు సరయూనది; శాస్త్రమును, వేదమతమును ఆనదికి రెండుగట్లు; ఈమానసనది పవిత్రమయినది; రెండుగట్లపైనుండిన పాపములనునట్టి వృక్షముల నానది వ్రేళ్లతోఁ బడఁద్రోయును.

దోహా 50

ఈ రామకథను వినువారు మూడురకములు; ముక్తిఁ గోరువారు, ముముక్షువులు, విషయాసక్తులు; నది కిరుతటముల పురములును, గ్రామములును, నగరములు నుండును; విషయాసక్తులు నగరములవంటి వారు; ముముక్షువులు పురములవంటివారు; ముక్తింగోరువారు గ్రామములవంటివారు; కవితారూపమగునది కిరుతటముల నీనగరములును, పురములును, గ్రామములును గలవు; నిరుపమానమగు మహాత్ములసభ సకలశుభమంగళముల కాటపట్టగు రఘునాథునిజన్మభూమి (అయోధ్య) తో సమానము.

చౌపాయ్ 40

రామభక్తి గంగానదితో సమానము; రామునికీర్తి సరయూనది వంటిది; సరయూనది గంగానదితోఁ గలియుచున్నది; రాముఁడు లక్ష్మణునితోఁగూడి చేసిన యుద్ధమును వర్ణింపఁబోవుచున్నాను. ఆవర్ణన శోణభద్రనదిఁ బోలును; ఆనదికూడ వీనిలోఁగలియుచున్నది. ప్రీతిరూపమగు సరయూనదికిని, విచారరూపమగు శోణభద్రనదికిని మధ్యను భక్తిరూపమగుగంగానది శోభించుచున్నది; ఈమూడునదులసమిష్టిప్రవాహము మనుజులతాపత్రయమును హరించి, రామునిస్వస్వరూపమను సాగరములో సంగమించును. మానససరస్సులోఁ బుట్టిన సరయూనదియొక్కయు గంగానదియొక్కయు సమిష్టిప్రవాహము రామకథను వినువారినిఁ బవిత్రముఁ జేయును; రామచరిత్రలోని విచిత్రకథలు, ఆనదుల యిరుతటములనుండిన వనములతోను తోటలతో సమానము. ఉమామహేశుల వివాహమును వారు ఊరేగుటయును ఆనదిలోని మతములేని జలచరములఁ బోలును; రామజననమువలనఁగలిగిన ఆనందమును సంబరమును, నీటితరంగములతోను సుడిగుండముతోను సమానము.

దోహా 51

అన్నదమ్ములు నలువురు చేసిన బాలచర్యలు బహురంగులు గల కమలములవంటివి; దశరథమహారాజును, అతనిరాణులును, రాజబంధువులును- ఈపుణ్యాత్ములందఱు తుమ్మెదలు జలపక్షులువలె నుండువారు

చౌపాయ్ 41

సీతాదేవిస్వయంవరచరిత్ర ఆనదీజలముల తళుకువంటిది; ఆచరిత్ర లోని చమత్కారమగు ప్రశ్నలు, ఆనదీజలములపైని తేలుచుండిన పడవలవంటివి; ఆప్రశ్నలకు వివేకముతోఁ గూడినప్రత్యుత్తరములు, పడవవాండ్రను బోలును; కథకు సంబంధములేని ఇటుకుమాటలు ఆనదీతీరమున గుంపుగూడిన ప్రయాణికులతో సమానము; పరశురాముని క్రోధము ప్రవాహవేగమువంటిది; శ్రీరాముని శాంతవచనము లానదికి తీరములవంటివి; అన్నదమ్ములవివాహమహోత్సవములు ఆనదిలోని సుందరమగు తరంగములఁ బోలును; రామకథనువిని ఆనందించి పులకరించిన శరీరములుగలవారు ఆనదిలో స్నానముఁజేసిన పుణ్యాత్ములవంటివారు; రామచంద్రుని తిలకధారణసమయమునఁ జేయఁబడిన శుభకార్యములు, ప్రతిపర్వమున సమావేశమగు జనులఁ బోలును; కైకచెప్పినదురాలోచన ఆనదిలోనిబురదతో సమానము; అనేకవిపత్తులకదియే కారణము.

దోహా 52

భరతునిచర్యలు, సకలఉత్పాతముల శాంతినిమిత్తము చేయఁబడు జపములు యజ్ఞములతో సమానము; కలియుగపాపములును, దుర్మార్గులును, దుర్భాషలను పచించువారును-ఆనదిలోని నురుగుతోను, అచ్చుటికొంగలతోను కాకులతోను సమానులు.

చౌపాయ్ 42

రామకీర్తి యనునది షడృతువులలోను నిండి ప్రవహించుచుండును; ఎల్లప్పుడు మనోహరమయినది; అన్నికాలములలోను పవిత్రమయినది; ఉమామహేశులవివాహము హిమంతఋతువునుబోలును; రామజననము శిశిరఋతువు; సమస్తప్రాణులకు ఆనందమును కలుగఁజేయు శ్రీసీతారాముల వివాహమంగళములు వసంతఋతువువంటివి; రామచంద్రుఁడు వనమునకుఁబోవుట గ్రీష్మఋతువువంటిది; రామునివనవాసకథయందుచుండినసూర్యునితోను వేఁడివాయువులతోను సమానము. రాక్షసులతోఁ జేసినగొప్పయుద్ధములు వర్షఋతువుఁ బోలును; దేవతలను నట్టి వరిచేలను జీవసమునిచ్చును; రామునిరాజ్యమును, రాజ్యవైభవమును, రాజనీతియు-అత్యంతసుఖమునిచ్చు శరదృతువుతో సమానము.

సకలసతీమణులకు శిరోభూషణి జానకియొక్క నిరుపమానమయిన సద్గుణములవర్ణన, ఆనదియొక్క నిర్మలజలములఁ బోలును; భరతునిస్వభావగుణములు ఆనదీజలముల శీతలమును బోలును-దానినివర్ణింప శక్యము కాదు.

దోహా 53

చూచినపుడును, ప్రసంగించినపుడును, కలియునపుడును, అన్నదమ్ముల పరస్పరవాత్సల్యము - ఆనదీజలముల మాధుర్యముతోను సుగంధముతోను సమానము.

చౌపాయ్ 43

నా వినయమును, దీనత్వమును ఆనదీజలముల లఘుత్వముతో సమానము; నీరు ఎంత తేలిక అయిన, అంతమంచిది; ఆగుణము దోషముకాదు. ఈజలము అద్భుతమయినది; ఎందుచేత? దాని పేరును వినినమాత్రమున గుణమునిచ్చును; ఆశయనునట్టి దాహమును పోఁగొట్టును; మనస్సునకుఁబట్టిన మలినమును హరించును. ఆజలము రామునియందుఁ గలభక్తిని పుష్టిచేయును; కలియుగపాపములు దానివలన నశించును; సంసారవాసనతగిలి, సంకటములఁబడి, జననమరణములతో బాధపడుచుండిన మనుజుని బాధను శ్రమను ఆ జలము హరించును; వానిబడలికను బోఁగొట్టును; దుఃఖమును, దోషములను, దరిద్రమునుసహిత మాజలము హరించును; భవరోగికి సంసారవ్యాపారమునందు సంతోషము నిచ్చును; అందఱిని తగినవిధమున నూరడించును; కామక్రోధలోభ మోహామదమాత్సర్యములను నశింపఁజేయును; ఉజ్జ్వలమగు జ్ఞానవైరాగ్యములను వృద్ధిఁజేయును; ఎవరు ఆదరణతోను ప్రేమతోను స్నానపానములంజేసిన, దుఃఖములు వారి హృదయమును విడిచిపెట్టును. ఈనదిలో స్నానముఁజేసి హృదయములను నిర్మలముఁజేసికొనని మనుజులు నష్టజీవులు; వారు జీవన్మృతులు; ఎండమావులఁ జూచి నీరు అని భ్రమించినమృగమువలె, వారు దిగ్భ్రమఁజెంది దుఃఖింతురు.

దోహా 54-55-56

నాబుద్ధ్యానుసారము పరమపావనియగు ఆనదీజలముల గుణములను వర్ణించి, అందులో నామనస్సుస్నానముఁ జేసినతరువాత, భవా

సీశంకరులను స్మరించి, రామకథను బ్రారంభించెద. రామచంద్రుని చరణ కమలములను హృదయములో నిడికొని, మునిశ్రేష్ఠులగు యాజ్ఞవల్క్య భరద్వాజులసమావేశమును, వారికి జరిగిన సరససంభాషణమును వివరించెదను. ఏప్రకారము యాజ్ఞవల్క్యుని భరద్వాజుఁడు ప్రశ్నించెనో, ఏప్రకార మతఁడు ప్రత్యుత్తరమిచ్చెనో - కారణసహితముగ వారిసంవాదమును చెప్పుచున్నాను.

ఇతి శ్రీగోస్వామితులసీకృత శ్రీరామచరిత్రమానసే,
సకలకలికలుషవిధ్వంసనే, బాలాకాండాంతర్గత
పండితజ్వాలాప్రసాదకృతవ్యాఖ్యానానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
ప్రథమో విశ్రామః.



# బాలకాండ ద్వితీయవిశ్రామః.

---

చౌపాయ్ 44

ప్రయాగలో భరద్వాజుఁడు నివసించి యుండెను; అతనికి రామ చరణములయం దధికభక్తికలదు; అతఁడు తపస్వి, శాంతస్వభావుఁడు; జితేంద్రియుఁడు; దయానిధి; పారలౌకికమార్గములలోఁ బరమచతురుఁడు. మాఘమాసములో మకరసంక్రమణమునకుఁ ద్రివేణిలో స్నానముఁ జేయుటకుఁ బ్రయాగరాజము (ప్రయాగ) లో ననేకులు సమావేశమయిరి; దేవతలు, పూర్వదేవతలు, కిన్నరులు, మనుష్యులు - భక్తితోఁ ద్రివేణిలో స్నానముఁ జేయుదురు; త్రివేణీమాధవస్వామిచరణకమలములను బూజించి, అక్షయవటమును స్పర్శించి, వారు స్వస్థచిత్తులగుదురు; అచ్చటఁ బరమపవిత్రమగుభరద్వాజుని ఆశ్రమముకలదు; ఆయాశ్రమము మునులమనస్సులను సయితము రమింపఁజేయునంత మనోహరముగ నుండును; ప్రయాగలో స్నానముఁజేయుటకు ఆయాశ్రమమువద్ద ఋషులును మునులును సమావేశమగుదురు, ప్రాతఃకాలమున స్నానముఁజేసి, నిర్మలహృదయములుగలవారై, వారు పరస్పరము భగవంతుని గుణములను గానముఁజేయుచుందురు.

దోహా 57

వేదాంతము, కర్మకాండ, మీమాంస, భక్తి, ఉపాసన, జ్ఞానము, వైరాగ్యము—ఈమొదలగువానిని గుఱించి వారు ప్రశంసించుదురు.

చౌపాయ్ 45

ఈప్రకారము మకరమాసదినములలోఁ బ్రాతఃకాలమున స్నానముఁజేసి, భగవన్నామసంకీర్తనముఁ జేయుచు ఆమాసముగడిపి, అనంతరము వారు తమతమ ఆశ్రమములకుఁ బోవుదురు; ఈమహోత్సవము ప్రతిసంవత్సరము కలదు; ప్రతిసంవత్సరము మునులు సమావేశమై, స్నానముఁజేసి, తిరిగి తమతమనివాసములకుఁ బోవుదురు. ఒకసమయమున మకరస్నానముఁజేసి మునులందఱు తమతమ ఆశ్రమములకుఁ

బోయిరి; యాజ్ఞవల్క్యుఁడను నొకమునీశ్వరుఁడు కలఁడు; అతఁడు జ్ఞాన విజ్ఞానసంపన్నుఁడు; రెండుచేతులతో నతనిపాదములను బట్టుకొని, అతనిని భరద్వాజుఁడు పోనీయక నిలిపివేసెను; భక్తితో నతనిచరణకమలములను గడిగి, ఉన్నతాసనముపై నతనిని భరద్వాజుఁడు కూర్చుండఁ బెట్టెను; అతనినిపూజించి, అతనిజ్ఞానసంపదను గొనియాడి, మృదుమధురవాక్యములతో భరద్వాజుఁ డతనితో నిప్రకారము సంభాషించెను:—

"ఓస్వామీ! నాకొక గొప్పసందేహము కలదు; వేదములకును తత్త్వజ్ఞానమునకును తమరు నిధులు; నాసందేహముఁ జెప్పుటకు నాకు భయమును, లజ్జయుఁ గలుగుచున్నవి; నే నీసందేహమును జెప్పక యూరకుంటినా, ఈమంచిసమయముపోవును.

దోహా 58

"ఓప్రభువా! శిష్యుఁడు తనకుఁగలసందేహములను గురువుతోఁ జెప్పక దాఁచియుంచినయెడల, వానికి జ్ఞానము కలుగదని వేదములును, పురాణములును ఘోషించుచున్నవి; మహాత్ములుసయిత మాప్రకారము చెప్పుచున్నారు.

చౌపాయి 46

"ఇట్లు విచారించి, నాయజ్ఞానమును మీతోఁ జెప్పుచున్నాను; నేను మీదాసుఁడను; నాయందు దయకలిగి, నాయజ్ఞానమును బోఁగొట్టుఁడు; రామనామప్రభావము అపరిమితము అని మునులును వేదములును ఉపనిషత్తులును జాటుచున్నవి. శాశ్వతుఁడును, షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును, జ్ఞానియు నయిన సదాశివుఁడు తారకమంత్రము నెల్లప్పుడు జపించుచుండును; కాశీలో మృతినొందిన నాలుగువిధముల జంతువులు, ఈనామప్రభావమువలనఁ బుణ్యలోకములకుఁ బోవును. ఓమునిరాజా! అదియంతయు రామనామముయొక్కమహిమ; దయచేత శివుఁ డాతారకమంత్రము నుపదేశించును; ఓస్వామీ! ఎవఁడీరాముఁడు? ఓదయానిధీ! నాసందేహమును నివర్తింపుము; అయోధ్యానగరములో నొకరాజునకు రాముఁ డనుపేరుగల యొకపుత్త్రుఁడు కలఁడు; ఆపుత్త్రునిచరిత్ర లోకవిదితము; భార్యావియోగమువలన నతఁ

డపారదుఃఖముఁ బొందెను; ఆదుఃఖముచేత నతఁడు క్రోధించి, రావణుని సంహరించెను.

దోహా 59

"ఓప్రభువా! ఈరాముఁడే పరమాత్ముఁడా, లేక మఱియొక రాముఁడు కలఁడా? వీరిలో నెవరినామమును సాంబశివుఁడు జపించు చుండును? తమరు సర్వజ్ఞులు; సత్యసంధులు; బాగుగ నిదానించి నాసందేహమును నివారింపుఁడు.

చౌపాయీ 47

"నాసందేహము, నాయజ్ఞానము విడునట్లు రామకథను విస్తరించి చెప్పుఁడు." అని భరద్వాజుఁడడిగెను. ఈమాటలనువిని, యాజ్ఞవల్క్యుఁడు మందహాసముఁ జేసి ప్రసంగించుట కారంభించెను.

"ఓభరద్వాజా! రామచంద్రునిమహత్త్వ నీకు విశదమేకదా! మనోవాక్కర్మములచే నీవు రామభక్తుఁడవు; నీచమత్కారము నాకు బోధపడెను; రామునిగంభీరగుణములను వినఁదలఁచి, జ్ఞానములేని మూర్ఖునివలె నీవు నన్నుఁ బ్రశ్నించితివి. ఓమిత్రుఁడా! రామునిచక్కనికథను వర్ణించిచెప్పుచున్నాను; కనుక, మనస్సును నిశ్చలముఁ జేసికొని వినుము; అజ్ఞానాంధకారము భయంకరుఁడగు మహిషాసురునివంటిది; వానిఁ జంపుటకు రామకథ దుర్గాదేవివంటిది. రామకథ యనునట్టి చంద్రకిరణములను భక్తులనునట్టి చకోరములు పానముఁ జేయును; ఇట్టిసందేహమే పార్వతికిఁ గలిగి, ఆమె ప్రశ్నింప, శివుఁడీప్రకార మామెసందేహమును తొలఁగించెను.

దోహా 60

"నాబుద్ధ్యనుసారము భవానీశంకరులసంవాదమును వర్ణించి చెప్పుచున్నాను; ఏకారణముచేత నేసమయమున వారి కీసంవాదము జరిగెనో చెప్పుచున్నాను. ఓమిత్రుఁడా! నీవు దానిని వినుము; దానివలన దుఃఖములుపోవును.

చౌపాయీ 48

"త్రేతాయుగములో నొకసమయమున అగస్త్యమహామునిం జూచుటకు శివుఁడు వెళ్లెను; జగన్మాతయగు దక్షప్రజాపతికూఁతురు భవాని, అతనితోఁ జేరియుండెను; అఖిలలోకముల కీశ్వరుఁడని గ్రహిం

చి, అతనిని ఋషి పూజించెను. రామకథ నాఋషి గానముఁ జేసెను; దానినివిని శివుఁడు సంతసించెను; రామభక్తినిగుఱించి ప్రసంగింపుమని శివుని అగస్త్యుఁడు ప్రార్థించెను; ఆసంగతిఁ దెలిసికొనుటకు ఋషి తగిన వాఁడనిగ్రహించి, శివుఁడు దానినివర్ణించి చెప్పెను. రామకథాప్రశంస జరిగినంత కాలము గిరినాథుఁ డచ్చట నివసించియుండెను; అనంతరము, ఋషివద్ద సెలవుగైకొని, త్రిపురాంతకుఁడు దక్షకుమారితోఁ గూడ కైలాసమునకు వెడలెను. ఆసమయమున, భూభారమును నివారించుటకు భగవంతుఁడు, హరి, రఘువంశములో నవతరించెను; పితృవచనమును మన్నించి, రాజ్యమును విడిచిపెట్టి, నాశరహితుఁడగు భగవంతుఁడు విచారగ్రస్తుఁడై దండకారణ్యములో సంచరించెను.

దోహా 61

"శివుఁడు విచారించుచు వెళ్లి, 'ఎటుల భగవంతునిదర్శింతును? ఎవరికిఁ దెలియకుండ భగవంతుఁడవతరించెను; నేనతనిఁ జూడఁబోయిన, నతఁడు పరబ్రహ్మమని అందఱకుఁ దెలియఁగలదు.' అని తనలోఁ దర్కించెను.

సోరఠా 11

"శివునిమనస్సు అతిక్షోభపడెను; భగవంతుని దర్శించుట కతని యంతఃకరణ మతనిని లాగుచుండెను; రాముఁడు పరబ్రహ్మ మను సంగతి అందఱకు విశదమగునేమో యనుభయ మతనిని వెనుకకు లాగుచుండెను; అతనినేత్రములు రామునిదర్శించుటకుఁ గుతూహలముతో నిండియుండెను; అతనిమనస్సులోనికలఁత భవానికిఁ దెలియదు.

చౌపాయ్ 49

"మనుజునివలన రావణుఁడు మృతినొందునని బ్రహ్మ విధించెను; ఆకారణముచేత, బ్రహ్మవ్రాసినవ్రాఁతను సత్యముఁజేయుటకు, భగవంతుఁడు మనుజుఁడై పుట్టెను; 'నేనతనిని దర్శింపకయుంటినా, తరువాత నేను పశ్చాత్తాప మొందవలెను;' అని విచారించెనుగాని, అందుకుఁ దగినమార్గము శివునకు స్ఫురింపలేదు. ఈప్రకారము శివుఁడు విచారించుచుండినసమయమున, రావణుఁడు నీచుఁడైనమారీచునిచే మాయలేఁడివేషమును ధరింపఁజేసి, సీతను దొంగతనముగ నపహరించెను; రావణుఁడు మూర్ఖుఁడు; వానికి రామునిప్రభావము తెలియదు; మారీ

చుని వధించి, రామలక్ష్మణులిరువురు ఆశ్రమమునకువచ్చి, సీతంగానక, దుఃఖించి, కన్నీరుఁగార్చిరి. రామునకు సీతతో సంయోగములేదు, వియోగములేదు; ప్రకటనకొఱకు విరహదుఃఖమును రాముఁడు చూపెను; అది లీలామాత్రము, నిజముకాదు.

దోహా 62

శ్రీరామునిచరిత్ర మతివిచిత్రమయినది; ఈసంగతిని పరమచాతుర్యముకలవారు గ్రహింపఁగలరు; (అతివిచిత్రమనఁగా అనేకరంగులు కలది-ఎట్లనిన, రామునితపోవేషము శాంతరసముఁ దెలియఁజేయును, కనుక తెలుపు; రాముఁడు ధనుర్బాణములను ధరించినపుడు వీరరసము—ఎఱుపురంగు; ప్రియురాలిసాంగత్యము శృంగారరసము—శ్యామలవర్ణము; మారీచునివధించినపుడు రౌద్రరసము—నలుపురంగు; జానకివియోగము కరుణారసము—పేలరంగు; విరహముచే మనోవికలము భీభత్సరసము—'ఖాకీ'రంగు. రామునిచిత్రకథను పరమచతురుఁడగు శివుఁడు గ్రహించెను; బుద్ధిహీనులు అజ్ఞానముచే నీసంగతి గ్రహింపఁజాలరు.

చౌపాయ్ 50

ఈసమయమున రామునిఁజూచి, శివుఁడు విశేషవిచారమునొందెను; అతనినేత్రముల యెదుట దేదీప్యమానమగు తేజస్సు వెలుగుచుండెను; రామునిఁ జూచుటకు మంచిసమయముకాదని యాతఁడు తలఁచెను (ఎందుచేతననిన, ఖరదూషణాదిరాక్షసులంజంపుటకు రాముఁడవతరించెను; అతనికి శివుఁడు నమస్కరించినయెడల, నారాక్షసులు రాముఁడు పరబ్రహ్మమని తెలిసికొని, అతనితో విరోధించి యుద్ధముఁ జేయరు; రామునిఅవతారమునకు భంగమువచ్చును). ఆమార్గమునఁ బోయి,

తాళము-రూపకము. రాగము-శంకరాభరణము.

పల్లవి. "జయ-జయ-స్వామిన్-జయ-జయ"॥
జయ-జయ జగదీశ, సచ్చిదానందా,
జయ-జయ సనకాదిమునిబృందవంద్యా॥ జయ॥ ౧

జయ-జయ బ్రహ్మాదీ, దేవనిధానా
జయ-జయ త్రిపురారి-హృదయనివాసా॥ జయ॥ ౨
అని గానముఁ జేయుచు శివుఁడు ధ్యానించెను.
ఉమామహేశు లిరువురును గలిసి వెళ్లిరి;
"జయజయ, అఖిలాండ-బ్రహ్మాండభర్తా
జయజయ, మాయాది-భవరోగహర్తా॥ జయ॥ 3
"జయజయ, నరలీల - నటనాట్యశక్తా,
జయజయ, పితృవాక్య - పరిపాలనసక్తా॥ జయ॥ ౪
"జయజయ, రఘువంశ-కీర్తిప్రచండా,
జయజయ, దృఢభక్తి-పరవశ్యదేహా॥ జయ॥ ౫
"జయజయ, భక్తాది-జన దీనరక్షా,
జయజయ, మదనాంతక-కర నిత్యస్తుత్యా॥ జయ"॥౬

అని యనేకపర్యాయములు శివుఁడు ఆనందపరవశుఁడై గానముం జేసెను. శివునిమనోవ్యాపారమును గ్రహించి, సతి(=ఉమ) తనహృదయము లో నిట్లువితర్కించెను: "శంకరుఁడు జగద్వంద్యుఁడు, జగదీశుఁడు; దేవ, దానవ, గరుడ, గంధర్వ, యక్ష, నర, కిన్నరులు నమస్కరింతురు; అట్టిశివుఁడు, ఈరాజకుమారుని సచ్చిదానందమయుఁడనియు, పరంధాముఁడని వచించి, వానికి నమస్కరించెను; ఆకుమారుని దివ్యసుందర విగ్రహముఁ జూచి, అతఁడు పరవశుఁడయ్యెను;అతనిశరీరము ముందు నడచివచ్చినను, అతనిప్రేమ అతనిహృదయమును వెనుకకు ఆకుమారుని వద్దకు లాగుచున్నది.

దోహా 63

"పరబ్రహ్మము సర్వవ్యాపకుఁడు; జననమరణములులేనివాఁడు; కామములు లేనివాఁడు; భేదములు లేనివాఁడు; కాలాతీతుఁడు;అబ్రహ్మ స్వరూప మిట్టిది అని వేదములు సయితము చెప్పలేకపోయెనుకదా! అట్టి వాఁడు దేహమునుధరించి మనుజుఁడై పుట్టునా?

చౌపాయ్ 51

భగవంతుఁడు విష్ణువు దేవకార్యమును సాధించుటకు మనుజుం డయిపుట్టినను సర్వజ్ఞుఁడుగనుండునని త్రిపురారి చెప్పెను; అయిననిప్పుడు,

ఈదానవాంతకుఁడు, ఈలక్ష్మీపతి, ఈజ్ఞానస్వరూపుఁడు, అజ్ఞానివలెనతఁడు తనభార్యను వెదకుచున్నాఁడు. శివునివచనములు అసత్యములుగా నేరవు; శివుఁడు సర్వజ్ఞుఁడని అందఱికి విశదముకదా; ఈగొప్పసందేహము నామనమును వ్యాకులపెట్టుచున్నది; ఆసందేహమును నివర్తింపుటకు మార్గములు కానరావు.'' అని సతి తనమనస్సులోఁ జింతించెను. ఆమె తనసందేహముఁ జెప్పకపోయినను, సర్వాంతర్యామి గనుక శివుఁడు గ్రహించి, ఆమెతో నిట్లుపలికెను: "ఓసతీ! నీది స్త్రీస్వభావము; ఆప్రకారము నీమనస్సులో సందేహింపకుము; అతనిచరిత్రమును అగస్త్యుఁడు గానముఁ జేసెను; అతనిని భక్తితో సేవింపుమని మునితోఁ జెప్పియుంటిని; అతనిని నిత్యము యోగధారణఁ జేసి మహామునులు కొలుతురు; అతఁడు నాయిష్టదేవుఁడు; నాకుఁబూజ్యుఁడగు రామచంద్రమహారాజు.

ఛాంద్ 2

ముని ధీర యోగీ సిద్ధ సంతత విమలమన జేహి ధ్యావహీం॥
కహిం నేతి నిగమ పురాణ ఆగమ జాసు కీరతి గావహీం॥
సోఇ రామ వ్యాపక బ్రహ్మ భువన నికాయపతి మాయాధనీ॥
అవతరేఉ అపనే భక్తహిత నిజతంత్రనిత రఘుకులమణీ॥

ద్విపద:—"సకలమునిధీర సిద్ధయోగీశా,
సంతతధ్యాన నిర్మలానందా,
నేతి నేతీతినిగమాదిస్తుత్యా,
శ్రీరామరఘురామ సత్యసంధామా,
సకలగుణసంపన్న నిర్గుణాతీతా,
క్షీరసాగరశయన సర్వాంతరాత్మా,
నిజభక్తహితతంత్ర రాజాధిరాజా,
నరలీలకృతకార్య శాశ్వతానంతా,
జయమస్తు దిగ్విజయ తుభ్యంనమోస్తు."

అని, శివుఁ డనేకప్రకారముల భగవంతునినుతించి, పార్వతికి బోధించెను.

సోరఠా 12

ఈప్రకారము శివుఁడు మాటిమాటికిఁ జెప్పినను, ఆమెహృదయ

మున నతనిమాటలు నాటలేదు; ఇదియంతయు భగవంతుని మాయ యని గ్రహించి, శివుఁడు నవ్వి, యీప్రకారము సతితోఁజెప్పెను:—

చౌపాయ్ 52

"ఓసతీ! ఈసందేహము నిన్ను విశేషము బాధించుచున్నది; పరీక్షించి దానిసత్యముఁ జూచినగాని అది నిన్ను విడువదు: నీవుపొమ్ము; నీవువచ్చువఱకు, నేనీవటవృక్షముక్రిందఁ గూర్చుండి యుందును; నీయజ్ఞానమును భ్రమయు విడిపోవుటకుఁ దగినమార్గము నాలోచించి,ఆప్రకారముసంచరింపుము" అని శివుఁడు పలికెను; అతనిఆజ్ఞప్రకారము సతి వెడలి, "ఏయుపాయమును బన్నుదును" అనిచింతించెను. ఆమె వెళ్లిన తరువాత, శివుఁడు విచారించి "ఇందుమూలమున సతికి మంగళముకలుగదు; నేనుబోధించి చెప్పినను, ఆమెసందేహము విడలేదు; ఇది విధివిపరీతము; శ్రేయస్సుకలుగదు" అని శివుఁడుతలఁచి, "రాముఁడు విధించియుండిన ప్రకారము సంభవించును; అందులకు నెక్కువగఁ దర్కించుటయేల?" అని నిశ్చయించి, రామనామస్మరణఁ జేయుచుండెను. అంతట సతి సుఖాశ్రయుఁడగు రామునిసమీపించెను.

దోహా 64

మనస్సులో సతి కొంత చింతించి, తుదకు జానకిరూపమును ధరించి, రాముఁడువచ్చుచుండిన మార్గములో నొకచెట్టుక్రింద నిలువఁబడియుండెను.

చౌపాయ్ 53

సతిధరించినవేషముఁ జూచి, లక్ష్మణుఁడు ఆశ్చర్యపడి భ్రమించెను. (ఒకయవతారములో రావణవధానంతరము సీతవచ్చెనుకదా! రావణవధకాకుండ ఇప్పుడేల సీతవచ్చెను- అని భ్రమించెను.) లక్ష్మణుఁ డతిగంభీరుఁడు; బుద్ధిమంతుఁడు; రామునిప్రతాపమును గుర్తెఱింగినవాఁడు; భగవంతుఁడు చూచి దీనియథార్థమును దెలిసికొని తనతోఁజెప్పునని లక్ష్మణుఁడు తలఁచి యూరకుండెను. దేవాదిదేవుఁడు, సర్వాంతర్యామి, సమదర్శి—అట్టిరాముఁడు పార్వతియొక్క కపటవేషమును గ్రహించెను; అట్టిరాముని స్మరించినమాత్రమున అజ్ఞానము విడిపోవును. అట్టిరామునిని సయితము పార్వతి మోసముఁజేయవలెనని తలంచెను; ఆహా! స్త్రీస్వభావమహిమ నేమనిచెప్పవచ్చును! స్వకీయమాయాబలమును

గ్రహించి, రాముఁడు చిఱునవ్వునవ్వి, చేతుల జోడించి నమస్కరించి, "ఓసతీ! ఓఉమా! ఓతల్లీ! నీతండ్రి దక్షుఁడు క్షేమమా? ఎచ్చట శివుఁడు నిలిచెను? ఏడీ వృషభధ్వజుఁడు? ఏకాకిగ నీవేల వనములో సంచరించుచుంటివి?" అని రాముఁడు మృదువచనములతో నడిగెను.

దోహా 65

కోమలమయినను, గూఢమగునట్టి రామునివాక్యములనువిని, సతి తగినంతసిగ్గుపడెను; శరీరములో నామెకుఁ గంపముపుట్టెను; విచారించుచు, ఆమె శివునిసన్నిధానమునకుఁ బోయెను.

చౌపాయ్ 54

"శివునివచనములను నేను మన్నింపలేదు; తదుపరి, నామూర్ఖత్వముకొలఁది, రామునివిషయమై గొప్పఅపచారముఁ జేసితిని; శివుఁడడిగినయెడల, నేనేమిప్రత్యుత్తరమిచ్చెద!"అనిసతీదేవివ్యాకులపడి చింతించెను ఆమెపొందుచుండినవ్యాకులమును రాముఁడువివ్యదృష్టింజూచి, తనప్రభావము నామెకుఁ బ్రత్యక్షముగఁ జూపెను; సతీదేవి బయలువెడలి భర్తసన్నిధానమునకుఁ బోవుచుండ, నామెకు మార్గములో నొకవింత యగుపడెను; సీతారామలక్ష్మణు లామెకుముందుఁ బోవుచుండినట్లు కనఁబడిరి; ఆమె వెనుకకుఁ దిరిగిచూచినపుడు, సీతారాముల సుందరవిగ్రహములు కనఁబడెను; ఏప్రక్కకుఁ దిరిగి చూచినను, సకలమునీంద్రాదిసేవితుఁ డగురాముని దివ్యమంగళవిగ్రహ మామెకుఁ బ్రత్యక్షమయ్యెను. బ్రహ్మవిష్ణుమహేశు లనేకు లామెకుఁ గనఁబడిరి; వారమితతేజోరూపములను ధరించి భగవంతుని చరణారవిందములను సేవించుచుండిరి; త్రింశత్కోటిదేవతలు సయితము పరమేశ్వరుని నారాధించుచుండిరి.

దోహా 66

లక్ష్మియు, సరస్వతియు, సతీదేవియు, వారివారిభర్తల కనుగుణ్యమగు విచిత్రరూపము లనేకములను వారు ధరించి సేవించుచుండినట్లు సతీదేవికిఁ గోచరమయ్యెను.

చౌపాయ్ 55

సమస్తదేవతలును వారివారిస్త్రీలతోఁ గూడి రామునిసేవించుచుండిరి; సకలచరాచరజంతువులు సహితము రామునిపాదములకు

మ్రొక్కుచుండిరి; సతీదేవికి దేవత లనేకరూపములను ధరించి కనఁబడి నను, ఏసంబంధములోఁ జూచినను, రాముని రూపములో భేదము కనఁబడదు; అదియొకటియే; అనేకరాములను అనేకసీతల నామెచూచి నను, రాముని వేషములో మాత్రము భేదము లేదు; ఒకరాముఁడును, ఒకసీతయు, ఒకలక్ష్మణుఁడును - ఒకరూపముతో నొకవేషముతో నామెకుఁ బ్రత్యక్షమయిరి. వారింజూచి, సతీదేవి భయపడెను; రాముని, సీతారాముని, సీతాలక్ష్మణులతోఁగూడిన రాముని సతిచూచెను; (ఈప్రకారము తులసీదాసు చెప్పుటకుఁ గారణమేమి? అద్వైత, ద్వైత, విశిష్టాద్వైతులకుఁ దనరామాయణ మనుకూలముగనుండుటకుఁ జెప్పెను; రాముఁడు (పరబ్రహ్మము) నిత్యము; సీతా (మాయ) రాములు నిత్యము; సీతా (మాయ) లక్ష్మణ (జీవుఁడు) రాములు (పరబ్రహ్మము) నిత్యము; ఆయామతములవారికి అనుకూలముగ నుండుటకు.) సతీదేవి హృదయము కంపించెను; ఆమెకు శరీరముపై స్మారకము తప్పెను; నేత్రములను మూసికొని ఆమె నేలకు వ్రాలెను. ఆమె మరల నేత్రములను విప్పిచూచినప్పటికి, అదియంతయు అంతర్ధానమయ్యెను; ఆమె రామలక్ష్మణుల నిరుపురనుమాత్రము చూచెను; మాటిమాటికి రామునిచరణములకు నమస్కరించుచు, ఆమె శివునిసన్నిధానముఁ జేరెను.

దోహా 67

తనవద్దకు వచ్చినసతిం జూచి, శివుఁడు మందహాసముఁ జేసి, "ఓసతీ! కుశలమా! ఏప్రకారము శ్రీరాముని నీవు పరీక్షించితివో, సత్యముఁ జెప్పుము?" అని ఆమె నడిగెను.

చౌపాయ్ 56

ఆమె రామచంద్రునిప్రభావమును తెలిసికొని, భయపడి, శివునితో నాసంగతిఁ జెప్పక, "ఓస్వామీ! రాముని నేను పరీక్షింపలేదు; మీరేప్రకారము నమస్కరించితిరో, అటులనే నేను నమస్కరించితిని; మీవచనము లసత్యములు కావని నానమ్మకము" అనియామె అసత్యముఁ బలికెను. అంతట శివుఁడు సర్వము జ్ఞానదృష్టింజూచి, సతీదేవి చేసినచర్యను గ్రహించెను. రామునిమాయవలన సతీదేవి అసత్యముఁ బలికెనని గ్రహించి, రామునిమాయకు శివుఁడు నమస్కరించెను. "భగవం

తుని ఇచ్ఛయు, పురాకృతమును బలవంతములు." అని సర్వాంతర్యామి యగు శివుఁడు తనహృదయములోఁ జింతించి, సతీదేవి సీతవేషమును వేసికొనినది; ఆహా! ఎంతవిచారమగుపని! ప్రథమమున నాయుపదేశము నకు భంగమువచ్చును కదా! ఇప్పుడు నే నామెను నాప్రియురాలివలె భావించినయెడల, రామునియందు నాకుఁగల భక్తియంతయు నశించును; నేను నీతిమార్గమును తప్పితినని లోకప్రఖ్యాతియగును.

దోహా 68

"ఆమెయందుఁ గలప్రేమాతిశేషము; నే నాప్రేమను విడువఁజాలను; అయినను, ప్రేమించుట మహాపాతకము." అని లోలోన శివుఁడు విచారించెను; కాని, యొకమాటనైనను చెప్పలేదు.

చౌపాయ్ 57

అనంతరము, రామునిచరణారవిందములకు శివుఁడునమస్కరించి, రామునిధ్యానించి, తనమనస్సులో నీప్రకారము ప్రతిజ్ఞఁ జేసికొనెను:- "ఈశరీరముతో సతీదేవి జీవించియుండినంతకాల మామెసాంగత్యమును విడిచిపెట్టుచున్నాను" అని శివుఁడు సంకల్పించుకొని, విచారించి, ధైర్యమునవలంబించి స్వగృహమునకు బయలువెడలెను. అటు లతఁడు పోవుచుండ, "ఓమహాదేవా! నీదృఢభక్తి శ్లాఘనీయము; నీకు రామునియందు నిశ్చలమగు భక్తికలదు; నీవుతప్ప మఱియొకరు నీప్రకారము శపథముఁ జేయఁగలరా!" అని ఆకాశవాణి పలికెను. "జయ, జయ" అని శబ్దములు వినఁబడెను. ఈపలుకులను విని, సతీదేవిమనస్సు వ్యాకులమొందెను; ఆమె లజ్జనొంది, "ఓదయాసాగరా! ఓసత్యసంధుఁడా! ఓ దీనదయాళుఁడా! మీరేమి ప్రతిజ్ఞఁ జేసితిరి? తెలియఁ జేయుఁడు" అని సతి యడిగెను. ఆమెయడిగినను, త్రిపురారి ప్రత్యుత్తరముఁజెప్పక యూరకుండెను.

దోహా 69-70

"శివుఁడు సర్వజ్ఞుఁడు; నేను స్త్రీని; స్వభావముచే మూర్ఖురాలను; నే నసత్యముఁ బలికినను, శివుఁడు తెలిసికొనెను." అని సతి తలఁచెను. పాలును నీరును సరిసమానముగఁ గలిపినను, అవి పాలుక్రింద విక్రయింపఁ బడును; చూచితివా! స్త్రీపురుషుల అనురాగ మీవిధముగ

సుండును; ఏపాటి కపటమునునట్టి 'కళాయి' ని దానిలోఁగలిపినను, వారికి వియోగము కలుగును.

చౌపాయ్ 58

తాను చేసిన చేష్టను స్మరించి, చెప్పుటకు శక్యముకానిదుఃఖముచే, సతీదేవి చింతించెను: "శివుఁడు పరమదయాళువు; మహాగంభీరుఁడు; నేనుచేసిన అపరాధమును ప్రకటింపఁడు; నన్ను స్వామి పరిత్యజించెను;" అని సతీదేవి చింతించెను. శంకరునిస్వభావమగు పట్టుదలయును, తాను చేసిన అపచారమును, తన్నుతఁడు విసర్జించుటయు నామెతలఁచి తలఁచి, అలజడిపడి, సతీదేవి ఆవములోవలె పశ్చాత్తాపముచే గుప్పుగుప్పు మనుచుండెను. ఆమెవ్యాకులచిత్తమును శివుఁడు గ్రహించి, ఆమె నుత్సహించుటకుఁ జక్కనికథలఁ జెప్పనారంభించెను; మార్గమునం దనేకకథలం జెప్పుచు సతితోఁ గూడి పరమేశ్వరుఁడు కైలాసముఁ జేరెను. తన శపథమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని, వటవృక్షముక్రింద పద్మాసనమువేసికొని కూర్చుండి, స్వస్వరూపానందము ననుభవించుచు, అఖండసమాధిలోఁ బ్రవేశించెను.

దోహా 71

అపారమగు దుఃఖమును పొందుచు సతీదేవి కైలాసములో నివసించియుండెను; ఒకదిన మొకయుగమువలె నామెగడపెను.

చౌపాయ్ 59

నిత్యము నపారమగు దుఃఖముచేఁ గృశించి, "ఈదుఃఖసాగరముయొక్క పారము నెప్పుడుచూడఁగలను? రాముని నే నవమానించితిని; శివునివచనము లసత్యమని తలఁచితిని; నాకర్మఫలమును నే ననుభవింపవలయును; భగవంతుఁడు తగినవిధమున నన్ను శిక్షించెను; ఓస్వామీ! శంకరునిపొత్తు విడిచి నేనుజీవింపఁగలనని మాత్రము నీవు తలంపకుము. నామనోవ్యాకులమును వాక్కులచేఁ జెప్పుటకు శక్యముకాదు; ఆపదోద్ధారకుఁడును దీనదయాళుఁడు నగు రామచంద్రుని స్మరింతును; అంతట నామనస్సు దిట్టమగును. వినయముతో నాచేతులను జోడించి, 'ఓస్వామీ! ఈనాపాపశరీరము శీఘ్రము పంచత్వముఁ బొందుగాక' అని ప్రార్థించెదను. మనోవాక్కర్మముల, శివునిచరణములయం దధికప్రేమ కలదానను; శివుఁడు సత్యప్రతిజ్ఞఁ జేసెను." అని సతీదేవి తలఁచి,

దోహా 72

"ఓపరమేశ్వరా! ఓసమదర్శీ! నాప్రార్థనవినుము; శ్రమముతప్ప నాకు మరణము సంభవించు నుపాయమును శీఘ్రమే నిరూపింపుము; ఇంతకఠినదుఃఖమును భరింపఁజాలను." అని సతీదేవి ప్రార్థించెను.

చౌపాయ్ 60

ఇట్టుల దుఃఖముచే దక్షునికూఁతురు క్రుంగెను; ఆదుఃఖ మతి కఠినమయినది; వర్ణించుటకు శక్యముకాదు. ఈప్రకారము ఇరువదియేడు వేల సంవత్సరములు సతీదేవి గడపెను; అంతట శివుఁడు సమాధినుండి లేచి, రామనామమును స్మరించుచుండెను. ఆసంగతిఁ దెలిసికొని, సతి శివునిసన్నిధానమునకుఁ బోయి, అతనిచరణములకు నమస్కరించి, చేతులనుజోడించి నిలువఁబడెను; ప్రసన్నవదనుఁడై, ఆసనముపై నామెను గూర్చుండ శివుఁడు నియోగించెను; ఆమెకు నారాయణుని అనంతగుణ కథలను శివుఁడు చెప్పుచుండెను. అప్పుడు దక్షుఁడు, (సతీదేవితండ్రి) ప్రజాపతియయ్యెను; అతనిగుణసంపత్తిని విచారించి, అతనికి బ్రహ్మ ప్రజాపతిపదవి నిచ్చెను. ఆపదవిఁ బొంది, దక్షుఁడు దురభిమానుఁ డయ్యెను; మహోన్నతపదవి లభించినతరువాత, నభిమానము లేనివాఁ డీజగత్తులో లేఁడు.

దోహా 73

దక్షుఁడు మునులం బిలిచి, ఒకగొప్పయజ్ఞముఁజేయ నారంభించెను; యజ్ఞములో హవిర్భాగములుగలసర్వదేవతల నాహ్వానముఁ జేసెను.

చౌపాయ్ 61

కిన్నరులు, సిద్ధులు, నాగులు, గంధర్వులు - సమస్తదేవతలును ప్రయాణము సాగించిరి; బ్రహ్మవిష్ణుమహేశ్వరులు తప్ప, మిగిలినవా రందఱును విమానారూఢులయి వెడలిరి. సుందర సుందరములగు విమానము లాకాశమార్గమునఁ బోవుచుండ, సతీదేవి వానింజూచెను. దేవకన్యలు 'హాయి'గ గానముఁ జేయుచుండిరి; ఆగానమునువినిన మునులు తమధ్యానమును చాలింతురు. ఆయుత్సవమునకుఁ గారణము శివుని వలనఁ దెలిసికొని, తనతండ్రి దక్షుఁడు, యజ్ఞముఁజేయుననిసతీదేవి సంతసించి, "నానాథుఁడు నాకు సెలవిచ్చిన యెడల, కొన్నిదినములు

నాతండ్రి గృహములో నివసింతును" అని ఆమెతలంచెను. పతిని విడిచి పెట్టుటవలన దుఃఖముకలుగును; పూర్వము చేసిన అపచార మామెకు జ్ఞప్తికివచ్చెను; అందుచేత నామె తనకోరికను భర్తతోఁజెప్పుటకు శంకించి యూరకుండెను; అయినను సగముసిగ్గుతోను సగము అనురాగముతోను కలఁతఁజెంది, తుదకు భర్తను సమీపించి మృదుమధురవాక్యములతోఁ నీప్రకారము సతీదేవి యడిగెను.

దోహా 74

"ఓదయాసాగరా! ఓస్వామీ! నాతండ్రిగృహములో గొప్ప యుత్సవము జరుగుచున్నది; తమరాదరించి సెలవిచ్చినయెడల, నేనువెళ్లి చూచెదను" అని సతి ప్రార్థించెను.

చౌపాయ్ 62

ఆమెప్రార్థనవిని, శివుఁడు "ఓసతీ! చక్కఁగ నీవుచెప్పితివి; నాకుఁ గూడ సంతోషము; అయిన, నీవిషయములో నొకసంగతి విచారింపుము;నీవు యజ్ఞమునకురమ్ము అని వర్తమానము నీకుఁబంపలేదు; పిలువనిపేరంటమునకుఁ బోవుట యుచితముకాదు; నిన్నుతప్ప, మిగిలిన కుమార్తెలందఱనుమీతండ్రివర్తమానముఁబంపి పిలిపించెను; న మీఁది వైరముచేతనీతండ్రి నిన్ను నిరాదరించి యుపేక్షించెను. బ్రహ్మసభలో నతనినవమానించినందుల కతఁ డిప్పుడు మనలను నిర్లక్ష్యముఁ జేసెను; కనుక, ఆహ్వానము లేక నీవచ్చుటకిఁ బోయినయెడల, నీ సుశీలమునకును, నీఅనురాగమునకును, నీమర్యాదకును లోపమువచ్చును. మిత్రుఁడు, ప్రభువు, తండ్రి, గురువు - వీరిగృహములకు, ఆహ్వానము లేక పోయినను, పోవచ్చును; అందువలన నష్టములేదు; కాని, మనతో వైరముఁగట్టినవానిగృహమునకుఁ బోయినందున, శుభములు కలుగవు" అనిచెప్పెను. ఈప్రకార మామెకు శివుఁడు అనేకపర్యాయములుబోధించెను; విధిని తప్పించుటదుష్కరము; కనుక నామెహృదయమున శివుని మాటలు నాటలేదు. "పిలువనిపేరంటమునకుఁ బోరాదు; ఇది నాయభిప్రాయము" అని శివుఁడు నొక్కిచెప్పెను.

దోహా 75

ఎప్పుడు తాను చెప్పినమాటలవలనఁ బ్రయోజనము లేదని శివుఁ

డనుగ్రహించెనో, అప్పు డతఁడు తనముఖ్యగణములను సహాయమిచ్చి, సతీదేవిని పితృగృహమునకుఁ బంపెను.

చౌపాయ్ 63

సతి పితృగృహమునకు వచ్చెను; దక్షునిభయముచేత నెవరును ఆమెను ఆదరింపలేదు; తల్లియు చెల్లెండ్రుమాత్ర మామెనాదరించిరి. ఆమెనుచూచి దక్షుఁడు మండిపడెను కాని కుశలప్రశ్న చేయలేదు; సతి యజ్ఞముఁ జూడఁబోయెను; అచ్చట, శివునిహావిర్భాగ మామెకుఁ గానరాలేదు; అప్పుడు, శివుఁడు తనతోఁ జెప్పినమాటల నామెగ్రహించెను; తననాథునకుఁ దనతండ్రి చేసిన అవమానమువలన, నామెకు విశేష దుఃఖము కలిగెను; ప్రాతదుఃఖమును మ్రింగి, యీక్రొత్తదుఃఖమున కామెమనస్సు పొక్కెను. ప్రపంచములో ననేకదుఃఖములు కలుగును; జాతివారి నిరాదరణవలనఁ గలిగినదుఃఖముతో సమానమగు దుఃఖము మఱియొకటిలేదు; అన్నిటికంటె నది గొప్పది; తల్లి యెంతబోధించినను, సతికి శాంతము కలుగలేదు; తననాథునకుఁ గలిగిన అవమానము నామె చింతించినకొలఁది, ఆమెమనస్సు దుఃఖముచే నుబుకుచుండెను.

దోహా 76

శివునికిఁగలిగిన అవమానము సహింపశక్యముకాదు; ఆమెకు శాంతము కలుగలేదు; సభలో నిలువఁబడి, సభికులను ధిక్కరించి, క్రోధముతో వారింజూచి, సతి యీప్రకారము చెప్పుట కారంభించెను.

చౌపాయ్ 64

"ఓమునీశ్వరులారా! వినుఁడు; శివునకు నాతండ్రి చేసిన యవమానమును మీరు సహించి యూరకుంటిరి; త్వరలో దానిఫలమును మీ రనుభవింతురుగాక; అందుకు మాతండ్రి సహితము పరితపించును గాక. మహాత్ములనుగాని శివునిగాని భగవంతునిగాని ఎవరునిందించిన, వారినాలుకను కోయవలెను; లేక, వారిమాటలను వినక, చెవులను మూసికొని అచ్చటనుండి పోవలెను. సాంబశివుఁడు జగత్తునకుఁ జైతన్యమునిచ్చును; మహేశ్వరుఁడు; త్రిపురాంతకుఁడు; జగత్తునకుఁ దండ్రి; లోకములకు హితకారి; అట్టిపరమేశ్వరుని మాతండ్రి మందమతి గనుక నిందించెను; ఈనాశరీర మట్టితండ్రివీర్యమునకుఁ బుట్టెను కనుక నేఁడీశరీరమును విడిచిపెట్టుచున్నాను. ఆచంద్రమౌళీశ్వరుఁడు, ఆవృషభ

ధ్వజుఁడు, ఆలోకశంకరుఁడు, నామనస్సున నిలుచుగాక'' అని ఆమె తన కోపమును వెడలఁగ్రక్కెను. ఆవెంటనే, యోగాగ్ని పుట్టి, ఆమెశరీర మును దహించెను; ఆమెపంచత్వముఁ బొందెను; యజ్ఞశాలలో హాహా కారములు పుట్టెను.

దోహా 77

సతివెంటవచ్చిన శివగణములు సతిమరణమునువిని, దుఃఖించి, యజ్ఞమును ధ్వంసముఁ జేయుచుండిరి; భృగుమహర్షి యంతయుఁ జూచి, తనమంత్రప్రభావముచే నొకరాక్షసునిఁ బుట్టించెను; వాఁడు శివగణ ముల నోడించెను; ఆఋషి యీవిధమున యజ్ఞమును రక్షించెను.

చౌపాయ్ 65

ఈసమాచారమును నారదునివలన శివుఁడు విని, కోపించి, వీర భద్రునిఁ బంపెను; అతఁడు వెళ్లి యజ్ఞమును ధ్వంసముఁజేసి, దేవతలను దగినవిధమున శిక్షించెను. శివునకుఁ బ్రతికూలముగ దక్షుఁడు ప్రవర్తించి నందున, నతనికి సంభవించిన దుర్గతి లోకవిదితము; అందుచేత, నే నా కథను సంక్షేపముగఁజెప్పితిని. ''జన్మజన్మాంతరములలోను శివునిపాదా రవిందములయందు నిశ్చలభక్తి నాకు గలుగునట్లు ప్రసాదింపుము'' అని సతి మరణకాలమున హరినిఁ బ్రార్థించెను. అందుచేత నామె యిప్పు డు హిమవంతునికూఁతురు అయిపుట్టెను; ఆమెపేరు పార్వతి; (పూర్వ జన్మమున యోగాగ్నిచే మృతినొందెను కనుక, నామెయీజన్మములో హిమవంతుని - చల్లనివాని - గర్భమున పుట్టెను.) పార్వతి హిమవం తునిగృహములోఁ బుట్టినదిమొదలు, అతనిసంపద లధికమయ్యెను; నలు వైపుల మునీశ్వరుల ఆశ్రమములు అధికముగ లేచెను; హిమవంతుఁడు మహాత్ముల కుత్తమస్థానముల నిచ్చెను.

దోహా 78

పుష్పములతోను ఫలములతోఁ గూడిన క్రొత్తక్రొత్త వృక్షములు పెరిగెను; మణిఖను లనేకములు వానియంతట నవి ప్రకాశించెను.

చౌపాయ్ 66

నదులన్నియు నిర్మలజలములతో నిండియుండెను; మృగములును, పక్షులును, తుమ్మెదలును సుఖముగ జీవించెను; అన్ని జంతువులును తమ

తమస్వాభావికవిరోధమును విడిచి, పరమానందముతోను స్నేహముతో నివసించెను; రామునియందు భక్తికలిగిన మనుజుఁ డెటుల శోభించునో, అటులనే పార్వతిపుట్టినందున హిమవంతుఁడు శోభించెను. పచ్చనితోరణములతోను నిత్యకల్యాణములతో నతనిగృహము ప్రకాశించెను; బ్రహ్మాదిదేవత లతనికీర్తిని గానముఁజేసిరి. ఈసమాచారమును విని, నారదు డొకనాఁడు కుతూహలముచే హిమవంతునిఁ జూడవచ్చెను; నారదుని హిమవంతుఁడు అర్ఘ్యపాద్యాదులతోఁ బూజించి, ఆసనముపై నతనిఁ గూర్చుండ నియోగించెను. హిమవంతుఁడును, అతనిభార్య మేనకయు నారదునిచరణములకు సాష్టాంగనమస్కారములు జేసిరి; అతనిపాదతీర్థమును గృహమంతటఁ జల్లి, సంప్రోక్షణఁ జేసిరి; అనంతరము హిమవంతుఁడు తనభోగభాగ్యములను నారదునికి వినుపించెను; అతఁడు తనకూఁతురును నారదునిసన్నిధానమునకుఁ బిలిపించెను; ఆమె వచ్చి మునిచరణములకుఁ బ్రణమిల్లెను.

దోహా 79

"ఓబ్రహ్మమానసపుత్రా! ఓనారదా! మీరు సర్వజ్ఞులు; త్రికాలజ్ఞానసంపన్నులు; మీరు త్రిలోకములను సంచరించితిరి; కావున, మీరాలోచించి, ఈనాకూఁతురుయొక్క శుభాశుభగుణములను చెప్పుదురుగాక" అని హిమవంతుఁడు ప్రార్థించెను.

చౌపాయ్ 67

ఆమాటలనువిని నారదుఁడు మందహాసముఁ జేసి, మృదువచనములతో నిట్లు ప్రసంగించెను. "ఓహిమవంతుఁడా! నీకూఁతురు సర్వశుభగుణములరాశి; ఆమె సత్త్వరజస్తమోగుణముల సమిష్టిరూపము; త్రిలోకసుందరి; ఆమె జ్ఞానస్వరూపి; సుశీలవతి; ఉమా, అంబికా, భవాని-వీనిలో నేనామమయిన నొకటియే. భర్తకు ఆమెయం దనురాగముఁ బుట్టించుటకుఁ దగినసుగుణములు కలవు; ఈచిన్నది సర్వలక్షణసంపన్నురాలు; ఆచంద్రార్కము సౌభాగ్యము ననుభవించును; ఆమె మూలమున నామె తలిదండ్రులకుఁ గీర్తిప్రతిష్ఠలు వచ్చును. ఆమెను లోకులు పూజించినందున, వారికి సర్వకామ్యార్థములును సిద్ధించును; ఆమెను సేవించినవారికి దుర్లభ మనునది యొకటి యుండదు; ఆమె

నామమును స్మరించి, అసిధారావ్రతముఁబోలిన పతివ్రతాధర్మమును స్త్రీలునడిపింతురు. ఓశైలరాజా! ఇవి నీకూఁతురి సులక్షణములు; ఇంక రెండుమూడు అవగుణములు కలవు; వానిం జెప్పెద, వినుము. ఏగుణములును లేనివాఁడును, తలిదండ్రులు లేనివాఁడును, ఉదాసీనుఁడును, ఇతరులప్రసక్తిలేనివాఁడును,

దోహా 80

బ్రహ్మచారియు, కామములేనివాఁడును, జోగియు, జటలను ధరించినవాఁడును, దిగంబరుఁడును, అమంగళవేషముగలవాఁడును. ఇట్టివాఁడు నీకూఁతురునకు భర్తయగునని ఆమె యఱచేతిరేఖలవలనఁ దెలియుచున్నది.'' అని నారదుఁడు చెప్పెను.

చౌపాయ్ 68

నారదునివచనములు సత్యమనినమ్మి, మేనకహిమవంతులు విచారగ్రస్తులైరి; ఆమాటలనువిని పార్వతి సంతసించెను; ఆముగ్గురిలో భేదము నారదునకుఁ దెలియలేదు; వారిముగ్గురి అవస్థ యొకటియై యుండెను; దుఃఖముచేఁ దలిదండ్రులనేత్రములు జలముతో నిండెను; సంతోషముచేఁ బార్వతినేత్రములు నీరుఁ గార్చెను.

పార్వతియొక్క సఖీజనులును, పార్వతియు, మేనకయు, హిమవంతుఁడును-అందఱును బులకించిన శరీరములు గలవారై, దుఃఖముచేఁ గన్నీరుఁగార్చిరి; పార్వతి ఆనందముచేఁ గన్నీరువిడిచెను. "నారదునివచనము లసత్యములు కానేరవు'' అని పార్వతి మనస్సులోఁ దలంచెను. ఆమెకు శివునియం దధికప్రేమ బలసెను; శివుఁడు లభించుట దుర్లభమని యామె సందేహించెను. అది మంచిసమయము కాదనితలఁచి, తనయనురాగమును మఱుఁగుఁజేసి, చెలికత్తెతొడమీఁదఁగూర్చుండి, పార్వతి యాడుచుండెను. నారదునివచనము లబద్ధములు కానేరవనితలఁచి తలిదండ్రులును జెలికత్తెలును వ్యాకులపడిరి; తుదకు ధైర్యమునవలంబించి, హిమవంతుఁడు, "ఓస్వామీ! ఓనారదా! ఇందు కేయుపాయము కలదు? తమరు సెలవియ్యవలెను'' అని ప్రార్థించెను.

దోహా 81

"ఓహిమవంతుఁడా! చెప్పుచున్నాను వినుము; దేవదానవులు గాని, నాగులు నరులుగాని, మునులుగాని-ఎవరయినను బ్రహ్మవ్రాసిన వ్రాఁత ననుభవింపవలెను; అందుకు విరుద్ధముకలుగదు." అని ముని చెప్పెను.

చౌపాయ్ 69

"అయిన నొకయుపాయముఁ జెప్పుచున్నాను; ఈశ్వరానుగ్రహ ముండినయెడల, నది నెఱవేఱును; నేనేగుణములను వర్ణించితినో, ఆగు ణములుగలవరుఁడు పార్వతికి లభించును; అందుకు సందేహము లేదు. నేను మీతోఁ జెప్పినదోషములన్నియు శివునకు వర్తించునని నాయను మానము; ఆమె శివుని వివాహమాడినయెడల, నాదోషములన్నియు సుగుణములని భావింతురు. భగవంతుఁడు శేషునిపై శయనించినను, పం డితు లది యొకదోషమని తలంపరు; సూర్యుఁడును, అగ్నియు సమస్త పదార్థములను దహించినను, అది యొకతప్పుక్రింద భావింపరు. శుభ్ర మగునీరును, అశుభ్రమగునీరును గంగలోఁగలవు; అయినను, గంగానది అపవిత్రమయ్యెనా ? సూర్యుఁడు, అగ్ని, గంగ - వీరిఁబోలినసమర్థులకు దోషములు లేవు.

దోహా 82

కర్మబంధములుకలిగి పంచతత్త్వములతోఁగూడినజీవుఁడు ఈశ్వ రునితో సమానుఁడ నని తలఁచి, ఆప్రకారము ప్రవర్తించినయెడల, నరకకూపములలోఁబడి, అనేకకల్పాంతములు దుఃఖము ననుభవిం చును.

చౌపాయ్ 70

మద్యములో గంగాజలమునుఁగలిపి మద్యమును జేసినను, దాని నెవరును గ్రహింపరు; అటులనే, జీవుఁడు ఈశ్వరునియంశమయినను, దేహముతోఁగూడినందున నాజీవునకుఁ గలుషమువచ్చెను; ఆమద్య మును కొంచెము గంగానదీప్రవాహములోఁ గలిపినను, ఆగంగ శుద్ధ గంగగాని, మఱియొకటి కాదు; అటులనే, ఈజీవుఁడు ఈశ్వరునిలోఁ గలిసి ఐక్యము నొందు. అంతవఱకును జీవేశ్వరుల కంతరముకలదు. ఈశ్వ

రుఁడు స్వయంప్రభువు; సర్వసమర్థుఁడు; షడ్గుణైశ్వర్యసంపన్నుఁడు; అతనితో సంబంధముఁజేయుటవలన శుభములుకలుగును; అయిన, నతఁడు దురారాధ్యుఁడు; కాని, తపముఁజేసి, దేహముఁ గృశింపఁజేసినయెడల, నతఁడు ప్రసన్నుఁడగును. అందుచేత, నీకూఁతురు శివునిదలఁచి తపముఁ జేసినయెడల, నామెకర్మము క్షీణించును; శివుఁడామె ననుగ్రహించి, లలాటరేఖను తప్పించును; లోకములో ననేకవరులుకలరు కాని, ఆమెకు శివుఁడుతప్ప మఱియొకరులేరు.

జయజయ వరదాయక ప్రణతార్తిహారా,
జయజయ సేవకమనరంజనశంభుకృపాసింధో,

యజ్ఞాదిజపములఁ జేసినను, శివారాధనఁజేయని యెడల, మనుజులమనోరథములు సిద్ధింపవు."

దోహా 83

అని నారదుఁడు చెప్పి, భగవంతునిస్మరించి, పార్వతిని ఆశీర్వదించి, "ఓగిరిరాజా! నీవు సందేహింపకుము; సన్మంగళానిభవంతు." అని హిమవంతుని హెచ్చరించెను.

చౌపాయ్ 71

ఈమాటలఁ జెప్పి, నారదుఁడు బ్రహ్మలోకమునకుఁ బోయెను; ఓమునీశ్వరా! అనంతరకథఁ జెప్పుచున్నాను; వినుము; ఏకాంతమున భర్తంజూచి, "ఓనాథా! మునివచనములు నాకు బోధపడలేదు" అని మేనక హిమవంతునిఁజూచి పలికి, "ఓరాజా! వరునికులగోత్రములు శ్రేష్ఠమయినపుడును, వరుఁడు మనకూఁతురున కనుకూలుఁడయినపుడు, తప్పక వివాహముఁజేయుము; లేనియెడల, నాకూఁతురు వివాహము లేకయుండును; అనుకూలమ్ముగానివివాహముఁ జేయవలదు; ఓనాథా! నాకూఁతురు నాప్రాణములతో సమానముసుమీ! ఆమెకుఁ దగినభర్త లభింపనియెడల, లోకులు నిన్ను జడుఁడవని నిందింతురు. కనుక, ఓస్వామీ! లెస్సగపరిశీలించి, వివాహముఁజేయుము; లేనియెడల, ననంతరము మనము పరితపింపవలసివచ్చును." అని మేనక భర్తకు బోధించి, యతనిపాదములకు శిరస్సునువంచి నమస్కరించెను; హిమవంతుఁడు

సంతసించి, "ఓప్రియురాలా! చంద్రునిలోనుండి అగ్నిపుట్టవచ్చును, నారదునివచనములకు భంగముకలుగదు.

దోహా 84

"ఓమేనకా! భగవంతుని స్మరించి, సందేహములను విడువుము; పుట్టించిన పరమేశ్వరుఁడు, పార్వతిని తప్పకరక్షించును." అనిపలికి,

చౌపాయ్ 72

"నీకూఁతురునందు నీకు దయయుండినయెడల, నీవీప్రకారము మెకు బోధింపుము:—'తపమువలన శివుఁడు లభించును; మఱియొక విధమున దుఃఖమువిడువదు. సహేతుకముగ నారదుఁడు చెప్పినవచనములు గంభీరమయినవి; శివుఁడు సకలసద్గుణసంపన్నుఁడు;' ఈసంగతిని గ్రహించి, సందేహమును విడువుము; అన్నివిధముల శివుఁడు కళంకరహితుఁడు." అని మేనకకు బోధించెను. పతివచనములనువిని మేనక సంతసించి, పార్వతివద్దకుఁబోయెను. పార్వతిఁ జూచినవెంటనే, మేనకకు కండ్లువెంబడినీళ్లువచ్చెను; మేనక కూఁతురునిఁజేరఁదీసి, తొడపైనిడికొని, ముద్దుఁబెట్టుకొని కౌఁగలించుకొనెను. అతిప్రేమచేత నామె కంఠము డగ్గుత్తికపట్టెను; అందుచే మేనక మాటలాడలేకపోయెను. అప్పుడు జగన్మాత, త్రికాలజ్ఞానసంపన్నురాలు, భవాని, పార్వతి, తల్లికి ఆనందముకలుగఁజేయుటకు మృదువుగ నిట్లుచెప్పెను:—

దోహా 85

"ఓఅమ్మా! నాకొకస్వప్నమువచ్చెను; దానిఁజెప్పుచున్నాను వినుము; మంచిచక్కనివాఁడు; గౌరవర్ణముగలశరీరముకలవాఁడు నగు బ్రాహ్మణశ్రేష్ఠుఁ డొకఁడు నాస్వప్నములోఁ గనఁబడి, యీప్రకారము నాకు బోధించెను:—

చౌపాయ్ 73

'ఓపార్వతీ! ఓశైలకుమారీ! లేలెమ్ము; తపముఁజేయుము; నారదునివచనములు సత్యములని తెలిసికొనుము; నీవు తపముఁజేయుటయే

సీతలిదండ్రులమతము; తపము సుఖమునిచ్చును; దుఃఖమును హరించును; దోషములను దొలఁగించును. తపోబలముచేత బ్రహ్మ సృష్టికర్తయయ్యెను; తపోబలముచే, విష్ణువు లోకములను రక్షించును; అందుచేత, శివుఁడు లోకములను సంహరించును; శేషుఁడు తనభుజములపై భూభారమును వహించును; ఓపార్వతీ! వేయేల, సృష్టియంతయుఁ దపోబలముచే నిలిచియుండును; ఈసంగతిని విచారించి, తపము నాచరింపుము;' అని బ్రాహ్మణుఁడు నాకు బోధించెను.'' అని తల్లితో నామె చెప్పెను. కూఁతురుచెప్పినవచనములనువిని, మేనక పరమాశ్చర్యము నొంది, హిమవంతునిఁ బిలిపించి, స్వప్నవృత్తాంతమంతయు నతనితోఁ జెప్పెను. జననీజనకుల నెట్టకేలకొప్పించి, పార్వతి తపముఁజేయుటకు ప్రారంభించెను. ఆమెతలిదండ్రులును చెలికత్తెలును అలజడివడిరి; వారికి ముఖమునుండి మాటయయినను రాలేదు.

దోహా 86

అప్పుడు వేదశిరుఁ డనుముని వచ్చి, వారిని బోధించెను; పార్వతి జగన్మాతయనియుఁ నామె మహాత్మురాలనియు విని, వారందఱు సంతసించిరి.

చౌపాయ్ 74

అప్పుడు, పార్వతివనమునకుఁబోయి, శివునిచరణములను హృదయమున నిలిపి తపముఁజేయ నారంభించెను. ఆమె సుకుమారి; ఆమెశరీరము కోమలము; అట్టిశరీరము తపమున కెట్లోర్చును? ఐనను శివుని చరణారవిందములను ధ్యానించి, సమస్తభోగముల నామె విసర్జించెను. ఆమె కంతకంతకు శివునియం దనురాగము దట్టమగుచుండెను; శరీరసౌఖ్యము నామె విడిచెను; ఆమెమనస్సు శివునియందు లగ్నమయ్యెను; ఒకవేయిసంవత్సరములు కందమూలఫలములను భుజించెను; ఒకనూరువత్సరములు శాకములనుమాత్రము భుజించెను; మఱికొంతకాలము కేవలము జలమును వాయువును భక్షించెను; కొన్ని దినములు శుష్కోపవాసములఁ జేయుచుండెను; నేలఁబడి యెండిన (మారేడు) ఆకులను భక్షించి మూఁడువేలసంవత్సరములు తపముఁజేసెను; చిట్టచివఱకు,

ఆయెండినపత్రములను సయితము నామె విడిచిపెట్టెను; అందుచేత నామెకు 'అపర్ణ' అని పేరువచ్చెను. ఘోరమగుతపముచేత నామె శరీరము శుష్కించెను; అంతట నామెను బ్రహ్మచూచి, యంతరిక్షము నుండి యీవిధమునఁ బలికెను.

దోహా 87

"ఓగిరిరాజకుమారీ! నామాటనువినుము; నీకోరిక సిద్ధించును; ఘోరతపమునుండి విరమింపుము; శీఘ్రములో శివుఁడు నీవాఁడగును" అని అశరీరవాణి చెప్పి,

చౌపాయ్ 75

"ఓయుమా! ఋషులును జ్ఞానులు నగుమును లనేకులు తపముఁజేసిరి; నీవలెఁ దపముఁజేసినవారు లేరు; నామాటలను విశ్వసింపుము; వానిని మన్నింపుము; నామాటలు సత్యము; వానివలన నీకు శుభముకలుగును. నీతండ్రి నిన్నుపిలువవచ్చును; అప్పుడు నీవు తపముఁ జాలించి, గృహమునకుఁ బొమ్ము; ఎప్పుడు నీవద్దకు సప్తఋషులు వచ్చెదరో, అప్పుడు నామాటలు సత్యమగును; వారిసందర్శనమే నామాటలకు ప్రమాణము" అని బోధించెను. ఆమాటలను వినినందునఁ బార్వతిశరీరము పులకరించెను; ఆమెహృదయము ప్రసన్నమయ్యెను. ఇంతవఱకు పార్వతికథను వినిపించితిని; యాజ్ఞవల్క్యుఁ డంతటశివునివృత్తాంతముఁ జెప్పనారంభించెను. ఏదినమున సతీదేవి మృతినొందెనో, ఆదినముమొదలు శివుఁడు విరక్తిఁబొందెను; ఎల్లప్పుడు రామనామమును జపించుచు, రామసంకీర్తనములను వినుచుండెను.

దోహా 88

సచ్చిదానందస్వరూపుఁడు, సుఖధాముఁడు, కామమోహమదములు లేనివాఁడు నగుశివుఁడు హరిని హృదయమున నిలిపికొని, సతీదేవి వియోగమువలన భూసంచారముఁ జేయుచుండెను. (శివునిసంచారమునకుఁ గారణమేమి? కైలాసముపై సతి నివసించియుండెను; అచ్చట తానునివసించినసతి శివునికిజ్ఞాపకమువచ్చుచుండును. అందుచేత నతఁడు కైలాసమును విడిచి సంచరించెను-)

చౌపాయ్ 76

ఒకచోట నతఁడు మునులకు జ్ఞానోపదేశముఁ జేయుచుండెను; మఱియొకచోట రాముని గుణములను వివరించి చెప్పుచుండెను; కామములేనివాఁ డయినను, భక్తుల విరహదుఃఖముఁ జూచి, శివుఁడు దుఃఖించును; సతీదేవి యొకభక్తురాలు; ఆమె విరహదుఃఖముచేత నతఁడు దుఃఖించెను. ఈప్రకార మనేకయుగములుగతించెను; అతనికి రాముని యందు భక్తి దినదినము వృద్ధినొందెను. శివుని స్థిరత్వమును ప్రేమను చూచి, రాముఁడు సంతసించెను; అతని నిశ్చలభక్తికిని రాముఁడు మెచ్చెను; రాముఁడు కృతజ్ఞుఁడు, కృపాళుఁడు గనుక, శివునకుఁ బ్రత్యక్షమయ్యెను; రాముఁడు రూపశీలలావణ్యములకు నిధి; తేజోవంతుఁడు; అనేకప్రకారముల నతఁడు శివునిఁ గొనియాడెను; "ఓసాంబశివా! అఖండవ్రతమును నీవుచేసినప్రకారము చేసినవా రెవరుకలరు?" అని శివుని రాముఁడు స్తుతించి, కృపానిధికనుక, పార్వతియొక్క జన్మవృత్తాంతమును, ఆమెయొక్క పవిత్రచరిత్రమును సవిస్తరముగ శివునితోఁ జెప్పి, అతనికి రాముఁడు బోధించెను.

దోహా 89

"ఓసాంబశివా! నీకు నాయందుఁ బ్రేమముండినయెడల, నామనవి మన్నింపుము; ఆగిరిరాజుకన్యను శీఘ్రముగ నీవు వివాహమాడుము; నేఁజెప్పినప్రకారము నీవుచేయుము." అని బోధించెను.

చౌపాయ్ 77

రామునివచనములను విని, "ఓస్వామీ! మీవచనములు సహ్యములుకాకపోయినను, మీరు ప్రభువులు, నేను దాసుఁడను కనుక, మీ మాటలను మన్నింపవలయును; ఓనాథా! తమయాజ్ఞను శిరసావహించి, దానిప్రకారము ప్రవర్తించుటయే నాకుఁ బరమ ధర్మము. జననీజనకులును, గురువును, ప్రభువును—వీరుచెప్పినమాటను మన్నించి, వెనుకముం దాలోచింపక, దానిప్రకారము సంచరింపవలెను; ఓప్రభువా! అన్నివిధముల మీరు నాశ్రేయస్సుఁ గోరినవారు; కనుక,

మీయాజ్ఞను శిరసావహించుటయే నాకు యోగ్యము.'' జ్ఞానము,ధర్మము, భక్తి-వీనితోఁగూడిన శివునివచనములను విని, రాముఁడు సంతోషించెను. ''ఓహరా! నీప్రతిజ్ఞను నిలుపుకొంటివి; ఇఁక నామాట మన్నింపుము'' అని రాముఁడుచెప్పి అంతర్ధానమయ్యెను; కాని, రాముని రూపముమాత్రము శివునిమనోదృష్టిలో నిలిచియుండెను. అనంతరము, సప్తమహర్షులు శివుని దర్శించుటకువచ్చిరి; వారింజూచి,

దోహా 90

''ఓఋషులారా! మీరు పార్వతివద్దకుఁ బోయి ఆమెకు నాయందుగలప్రేమను పరీక్షింపుఁడు; అనంతరము మీరు హిమవంతుని సన్నిధానమునకువెళ్లి, అతనిసందేహములను నివారించి, అతఁడు వచ్చిపార్వతిని గృహమునకుఁ దోడ్కొనిపోవునట్లుఁజేయుఁడు'' అని శివుఁడు వారితోఁ జెప్పెను.

చౌపాయ్ 78

పార్వతి తపోవనమునకు ఋషులువచ్చి, ఆమెంజూచిరి; శుద్ధతపస్సు మూర్తీభవించినవిధమున, నామె వారికిఁ గనఁబడెను. ఆమెంజూచి, ''ఓశైలరాజకుమారీ! మామాటను వినుము; నీవింతయుగ్రమయినతపము నాచరించుటకుఁ గారణమేమి? ఎవరి నుద్దేశించి తపముఁ జేయుచుంటివి? ఏమి నీకోరిక? ఏసంగతి మఱుఁగుఁజేయక, మాతో సత్యముఁ జెప్పుము'' అని యామెను ఋషులడిగిరి. ఆమె వారిపలుకులను విని, మృదుమధురగంభీరవాక్యములతో నిట్లుచెప్పఁదొడంగె. ''ఓఘనులార! మునులార! కరుణాత్ములారా! నామర్మముఁ జెప్పుటకు నాకు సిగ్గు; ఒకవేళ నేను చెప్పినను, మీరు దానిని విని పరిహసింతురు; నా మూర్ఖత్వము బయటపడును; నేపట్టినపట్టును నామనస్సు విడువఁజాలదు; ఇతరులవచనములను నామనస్సు గ్రహింపదు; నీటిపై నిల్లుఁగట్టువానివలెనో, లేక రెక్కలులేకుండ నెగురుటకుఁ బ్రయత్నించినవానివలెనో నేను కనఁబడినను, నారదుఁడు చెప్పినమాటలయొక్కబలముచేత, నేనీ పనిఁ జేయుచుంటిని; ఓతపోవర్యులారా! నాయజ్ఞాన మెంతపఱకుఁ బరి

ణమించెనో చూడుఁడు; అవికారుఁ డగుశివుని వివాహమాడుటకుఁ బ్రయత్నించుదానను."

దోహా 91

ఆమెపలుకులను విని, ఋషులు హర్షించి, "ఓగిరిజా! నీవు గిరి రాజు గర్భమునఁ బుట్టితివి, నీవు నీతండ్రివంటిదానవు. నారదునివచనము లను విని, యెవరు తండ్రిగృహములో నివసించియుండిరి?" అని వారుపలి కిరి.

చౌపాయ్ 79

"ఓఅపర్ణా! నారదునియుపదేశములను విని, దక్షప్రజాపతి కుమారులు గృహమునువిడిచి వనమునకుఁ బోయిరికదా! చిత్రకేతుని వంశము నారదునివచనములవలన నశించెను కదా! హిరణ్యకశిపుని కుమారుఁడు నారదునివచనములను విని, రక్కసికులమునకు ముప్పుఁ దెచ్చెను కాదా! స్త్రీపురుషులెవ్వరు నారదునివచనములనువిని, గృహ ములను విడిచి, భిక్షులు కాలేదు? చూచుటకు సజ్జనునివేషముగాని, నిజ ముగ నారదుఁడు కపటి; అందఱిని తనవలె భిక్షులంజేయఁజూచును. అతనిమాటలను విశ్వసించి, సిగ్గులజ్జలులేనివానిని వివాహ మాడఁదలఁ చితివి? ఎంతవెఱ్ఱిదానవు; ఆశివునకుఁ గులగోత్రములులేవు; గుణరహి తుఁడు; దిగంబరుఁడు; అతనికి గృహములేదు; అతనియాభరణములు పాములు; అతఁడు పునుకలను ధరించును. ఓచిన్నదానా! అట్టివానిని వివాహమాడి యేమిసుఖము ననుభవింతువు? చెప్పుము. ఆనారదుఁడు మోసముఁజేసి నీకుఁజెప్పినమాటలను విశ్వసింపకుము. ఇతరులుచెప్పిన మాటలను విని, శివుఁడు సతినివివాహమాడి, ఆమెను విడనాడెను; ఆ వియోగదుఃఖమును భరింపలేక, సతి మృతినొందెను.

దోహా 92

"ఆమెచనిపోయిన దనువిచార మతనికి లేదు; ఒకసమయమున నయిన నామెను తలంపఁడు; సంసారులగృహములకుఁబోయి భిక్షమెత్తి జీవించును; ఆయొంటరికానిపొత్తు నేకులస్త్రీ యభిలషించును?

చౌపాయ్ 80

"ఓవత్సా! మామాటలను నీవు మన్నించిన,నీవువివాహమాడు టకు నీకొక చక్కనిపెండ్లికుమారునిఁ జూపింతుము; ఆకుమారుఁడు

సుఖమునిచ్చువాఁడు; సకలగుణసంపన్నుఁడు; పరమపావనుఁడు; అతని చర్యలను వేదములు గానముఁజేయును; అతఁడు దోషరహితుఁడు; సర్వ గుణములకు రాశి; శ్రీపతి; ఆభగవంతుఁడు, వైకుంఠములో నివసించి యుండునని వినుచున్నాము; అతఁడు నీకుఁ దగినవరుఁడు" అని ఋషులు చెప్పిరి. వారిమాటలను పార్వతి విని, చిఱునవ్వునవ్వి, "ఓమునులారా! మీవాక్యములు సత్యము; ఈనాశరీరము పర్వతరాజునకుఁ బుట్టెను; నా దేహమును విడిచిపెట్టెదనుగాని నాపట్టునుమాత్రము విడువను; నిప్పులోఁ బెట్టి కాల్చినను, రాతిలోఁబుట్టిన బంగారమునసుఖితము స్వాభావికగుణమును విడిచిపెట్టునా? నారదునివచనములయందు గలనమ్మకమును నేను విడిచిపెట్టను; నాగృహము నిండుటిల్లుగాని, శ్మశానము గాని నాకులక్ష్యములేదు; గురువువచనములను విశ్వసింపనివారికి స్వప్నమందయినను సుఖములేదు; వారు సిద్ధిఁబొందరు.

దోహా 93

"శివుఁడు అవగుణముల పుట్టయగుఁ గాక; విష్ణువు సకలగుణ ధాముఁడగుఁ గాక; వీనితో నాకేమిప్రసక్తి? ఏపురుషునియందు నామనస్సు రమించునో, వానితో నాకుఁ బ్రసక్తికలదు గాని, యితరులతో నేమిపని?

చౌపాయ్ 81

"ఓమునులారా! ఇంతకుపూర్వము, మీరీవిషయమునుగుఱించి నాతోఁ జెప్పియుండినయెడల, నేను మీమాటలను మన్నించియుండును; ఇప్పుడు నాప్రాణములన్నియు శివునకు ధారవోసితిని; అతని గుణదోషముల నెంచుట పాడిగాదు. మీరు నిశ్చయముగ వివాహముఁ జేయఁదలఁచినయెడల, మీరు కాలయాపనఁ జేయుట మంచిది కాదు; లోకములో ననేకకన్యలునువరులును కలరు; ఆయావారికి సంఘటనఁజేసి, మీరు వివాహముఁజేయుఁడు; నేనుమాత్రము జన్మజన్మములకయినను శివునిఁదప్ప మఱియొకరినివివాహముఁ జేసికొనను; లేనియెడల, వివాహములేక కన్యకఁగానుందును; శివుఁడు వచ్చి నాతోఁ జెప్పినను, నారదునియుపదేశమునుమాత్రము నేను విడువను. నేను జగన్మాతనయినను, మీచరణములకు నమస్కరించెద; కాలాతీతమయ్యెను.కనుకమీ

మీగృహములకు దయచేయుఁడు" అని పార్వతి వారితోఁ జెప్పెను. ఆమె నిశ్చలభక్తికి మెచ్చి, ఋషు లీప్రకారము నుతించిరి:—

"జయజయ జగదంబా సర్వభక్తప్రదాంబా,

దోహా 94

"సకలగుణనితంబా, శంభురాట్ప్రావృతాంబా,

నిగమనిగదితాంబా, నిశ్చలానందమూర్తీ,

జయజయ శివగౌరీ, సత్యకల్యాణమూర్తీ"

"ఓతల్లీ! నీవు శివునిమాయవు; మీరుభయులు జగత్తులకు జననీ జనకులు" అని స్తుతించి, ఆమెచరణములకు వారు నమస్కరించిరి; వారి శరీరములు పులకరించెను.

చౌపాయ్ 82

ఋషులు హిమవంతునివద్దకు వచ్చి, అతనిని పార్వతినిఁ దీసికొని వచ్చుటకుఁ బంపిరి; అచ్చటనుండి ఋషులు శివునిసన్నిధానమునకుఁ బోయి, పార్వతియొక్క నిశ్చలప్రేమ నతనితోఁజెప్పిరి; ఆమెయొక్క పూర్వోత్తరములన్నియు వారు శివునకు వినిపించిరి. పార్వతికిఁ గల యనురాగమును విని, శివుఁడు సంతుష్టాంతరంగుఁడయ్యెను; ఋషులు వారిగృహములకువెళ్లిరి. అనంతరము, రాముని యందు మనము లగ్నముఁజేసి, శివుఁడు ధ్యాననిష్ఠలోనుండెను. ఆసమయమున తారకుఁ డను రాక్షసుఁ డొకఁడు కలఁడు; వాఁడు మహాతేజశ్శాలి; బలపరాక్రమములు కలవు; వాఁడు త్రిలోకములను దేవతలను జయించెను; వాఁడు దేవతలసంపదల నపహరించెను; వానికి వార్ధక్యములేదు; మరణము లేదు; అపజయములేదు; వాఁ డనేకయుద్ధములఁజేసి, దేవతల నోడించెను. వారందఱుబ్రహ్మనుసమీపించి మొఱఁబెట్టుకొనిరి; వారిదీనాలాపములనువిని,

దోహా 95

"ఓదేవతలారా! శివునికుమారుఁడువానితోయుద్ధముఁజేసివానిని జంపును" అని బ్రహ్మ వారికి బోధించి, ధైర్యముఁజెప్పెను.

చౌపాయ్ 83

"ఓదేవతలారా! నామాటవిని, మీకుసహాయముఁజేయుకొఱకు శివునకుఁ గుమారుఁడు కలుగుటకుఁదగినయుపాయము నాలోచింపుఁడు;

దక్షునియజ్ఞములో సతీదేవి దేహమునువిడిచి, ప్రస్తుతము హిమవంతుని గర్భమునఁ బుట్టెను. ఆపార్వతి శివుని వరించుటకు ఘోరమగుతపము నాచరించుచున్నది; సర్వమును విడిచి, శివుఁడు సమాధిలోఁ గూర్చుండెను; నేనొకయుపాయముఁ జెప్పెద; అది యసమంజసమయినను, దాని ప్రకారము నడువవలయును. అతనిసమాధిఁ జెఱిపి, శివునకు మోహము నుద్రేకింపఁజేయవలయును; అందునిమిత్తము, కామదేవుని శివునివద్దకుఁ బంపవలయును; శివునిమనస్సు కామముచేఁ గలఁతనొందినతరువాత, నే నతనిని సమీపించి నమస్కరించి, బలవంతముఁజేసి అతనిని వివాహమున కొప్పింతును." అని బ్రహ్మ వారితోఁజెప్పెను. బ్రహ్మవచనములను విని, దేవతలు సంతోషించిరి; అతఁడు చెప్పినయుపాయమును వా రామోదించిరి. అంతఁ బంచబాణుఁడు, తనచెఱకువిల్లును మీటించుకొని, దేవతలవద్దకువచ్చెను.

దోహా 96

కాముపడుచుండిన బాధలను దేవత లతనితోఁ జెప్పిరి. వారి మాటలనువిని, కామదేవుఁడు విచారించి, చిఱునవ్వునవ్వి, "ఓదేవత లారా! శివునితో విరోధించుటవలన నాకు శ్రేయస్సుకలుగదు.

చౌపాయ్ 84

"అయినను, నేను మీకార్యముఁ బూని చేయువాఁడను. 'పరోపకారార్థమిదంశరీరం' అని శ్రుతులు చెప్పుచున్నవి. పరులక్షేమమునిమిత్తము స్వశరీరమును విడిచినవానిని మహాత్ములు ప్రశంసింతురు" అని చెప్పెను. అనంతరము, చెఱకువిలుకాఁడు వారికి నమస్కరించి, పుష్పబాణములను ధరించి వెడలెను. "శివునితో విరోధించినందున, నాకు మరణమువచ్చును" అని మదనుఁడు మార్గములోఁ జింతించుచు నడచెను. అతఁడు తనప్రభావమును ప్రకటించినవెంటనే, సంసారు లతనికి వశ్యులయిరి; ఎప్పుడు మన్మథుఁడు విజృంభించెనో, అప్పుడు వేదశాస్త్రములమర్యాద లంతరించెను. బ్రహ్మచర్యము, వ్రతములు, నియమములు, ధర్మము, జ్ఞానము, విజ్ఞానము, సదాచారములు, యోగము, వైరాగ్యము, వివేకము—ఇవియన్నియు, మన్మథుని ప్రయోజకత్వముచేత మొదలంట నాశనమయ్యెను.

ఛాంద్ 3

కామునితోఁ బోరాడలేక జ్ఞానము దానియనుచరులతోఁగూడఁ బాఱిపోయెను; సద్గ్రంథము లనునట్టి పర్వతగుహాలలో వారు డాగి యుండిరి; ముందికేమిసంభవించునో యెవరికిఁ దెలియును; రక్షించువాఁ డీశ్వరుఁడు; లోకములన్నియు కలవరపడెను; ఒకతలకలవారందఱును కామునకు వశ్యులయిరి; ఒకటికంటె నధికముగ తలలుకలవారిపైని వాఁడుకోపించి, ధనుస్సు నెక్కుపెట్టెను.

దోహా 97

లోకములోని సకలజీవరాసులును, చరములుగాని అచరములు గాని, స్త్రీపురుషులును-వారివారి స్వాభావికమర్యాదలను విడిచి, మన్మథునికి వశ్యులయిరి.

చౌపాయ్ 85

కామునిసమ్మోహనాస్త్రమునకు లోకులు వశ్యులయిరి; లతలను ముద్దుబెట్టుకొనుటకు వృక్షములశాఖలు క్రిందికివంగెను; నదులుపొంగి సముద్రములోఁ గలియుచున్నవి; సరస్సులును తటాకములును యేకమగుచున్నవి; అచరములే యీవిధమునఁ బ్రవర్తించినపుడు, మనుజుల వ్యాపారముఁ జెప్పశక్యముకాదు. ఆకాశముమీఁదఁగాని, జలములోఁ గాని, భూమిమీఁదఁగాని సంచరించెడుపక్షులును జీవరాసులును సమయాసమయములను గుర్తెఱుఁగక, మన్మథునికి వశ్యులయిరి. అతనిమహిమవలన, నందఱకు మోహాంధకారమువచ్చెను; చక్రవాకమిథునమునకు దివారాత్రములు వ్యక్తముకాలేదు; దేవదానవులు, మనుజులు, కిన్నరులు, నాగులు, భూతములు, ప్రేతములు, పిశాచములును మదనునికి సేవకులయిరి; సిద్ధపురుషులు, బైరాగులు (వైరాగులు)-వీరు సహితము మన్మథునకు లోఁబడిరి;

ఛాంద్ 4

యోగీశ్వరులును, తపశ్శాలులే మన్మథావస్థఁబొందినపుడు, నీచులమాట చెప్పనేల? 'సర్వంఖల్విదం బ్రహ్మేతి' అను శ్రుతిప్రమాణము ప్రకారము సర్వము బ్రహ్మమయమని చెప్పుచుండెడి బ్రహ్మవేత్తలు సయితము జగత్తు సర్వము స్త్రీమయమని చెప్పుచుండిరి; స్త్రీలు పురుషులం

జూచియు, పురుషులు స్త్రీలంజూచియు - ఒకరితోనొకరికి ననుబంధము కలిగెను. ఈప్రకారము రెండుఘడియలకాలము మన్మథుఁడు విజృంభించునప్పటికి లోక మల్లకల్లోలమయ్యెను.

సోరఠా 14

మన్మథునిధాటికి యెదురునడచి ధైర్యముతో నిలువఁబడినమనుజుఁ డేడీ? జ్ఞానులు, కర్మిష్ఠులుసయితము వానిదాడికి భయపడి వానికి శరణాగతులయిరి. కేవలము భగవద్భక్తులు, రామదాసులు, రామోపాసకులు మాత్రము రామునికృపవలన వానికి జోపోరువనలేదు.

చౌపాయ్ 86

రెండుఘడియలకాలము కాముఁడు విజృంభించిశివుని నివాసస్థానమును సమీపించెను;మహాదేవునిఁజూచి కాముఁడు వణఁకెను;అప్పుడు, లోకమంతయు స్వాస్థ్యమునొందెను. మత్తువిడిచినతరువాత నేప్రకారము మనుజునకుఁ దెలివివచ్చునో, అటులనే మత్తుఁగినవెంటనే లోకము చల్లబడెను. షడ్గుణైశ్వర్యసంపన్నుఁడు, దురాధర్షుఁడు, దుర్గముఁడు, బ్రహ్మాదులకెల్ల మొదటివాఁడయినవాఁడు- అట్టిశివునిఁ జూచి మారుఁడు భయపడెను; అతఁడు చెప్పుటకు శక్యముకాని సిగ్గుపడెను; చాపుకు సిద్ధపడి, శివునిపై దుముకుటకు వాఁడు నిశ్చయించెను; అంతలో వసంతుఁడువచ్చి ప్రత్యక్షమయ్యెను; చెట్లుచేమలును చిగిరించి పూవుగట్టెను; అంతయు శోభస్కరముగనుండెను; వనములు,తోఁటలు, వాపీకూపతటాకములు—ఇవియన్నియు కందర్పునిదర్పమును చాటెను. మన్మథునిప్రభావమువలనఁ జేవ చల్లారిన వృద్ధులమనస్సులు చులుక్కుమనెను.

ఛాంద్ 5

ఆవనము యొక్కశోభను వర్ణింపఁజాలను; వృద్ధులమనస్సులు సయితము చలించెను; మందసుగంధశీతలవాయువులు వీచుటవలన మదనాగ్ని ప్రజ్వరిల్లెను;తటాకములలో ననేకకమలములు వికసించెను;చక్కనితుమ్మెదలు ఝంకారముఁజేయుచుండెను; శుకపికపారావతముల మంజులధ్వనులు వినఁబడెను; అప్సరసలు హాయిగ పాటలనుపాడి, అతివినోదముగ నృత్యముఁజేసిరి; కందర్పునిగర్వము వనవర్ణనమునందుఁ గనఁబడెను.

దోహా 98

అతనిపన్నాగములు పాఱలేదు; అతనిదండు దాపులేనియుద్ధముఁ జేసినను, ముక్కలుముక్కలుగ విఱిగిపడెను; వారివిఱుగఁబాటు అణఁగెను; సాంబశివుఁడు చలింపక దీర్ఘసమాధిలోనుండెను; అప్పుడు మన్మథునకు తామస మధికమయ్యెను.

చౌపాయ్ 87

శివునిదాపున నొక తియ్యమామిడిచెట్టుఁ జూచి, దానికొమ్మ మీఁదికిఁ దామసముచేత నతఁడొక గంతువేసెను. ఆలీఢపాదము వేసి, పువ్వులధనుస్సు నారికి బాణమునుతగిలించి, ఆకర్ణాంతము నారినిలాగి, మనసుఁనుసు దానిని విడిచిపెట్టెను; వెంటవెంటనే యయిదుబాణములను శివునిపైఁ బ్రయోగించెను. ఆబాణములు శివునిహృదయమునకుఁ దగిలెను; అతనిమనస్సు చలించెను; అతఁడు సమాధిఁ జాలించి మేల్కొనెను. అతఁడు నేత్రములనువిప్పి, నలువైపులఁజూడ, నామామిడిచెట్టుమీఁద నుండినకాముఁ డతనికంటఁబడెను. శివునకు రౌద్రావేశము వచ్చెను; లోకములు కంపించెను. అతఁడు మూడవనేత్రమును విప్పి, కామునిఁ జూచఁజూచెను; పిపీలికాదిబ్రహ్మపర్యంతము జగత్తులో హాహాకారముపుట్టెను; దేవతలు భయపడిరి; రాక్షసులు సంతసించిరి; కాముని లీలలనుస్మరించి, వానిమరణమునకు భోగులు దుఃఖించిరి; యోగులును తపస్సంపన్నులును, తమతమతపములు సిద్ధిఁబొందునని సంతసించిరి.

ఛాంద్ 6

యోగీశ్వరులందఱు నిర్భయులయిరి; భర్తయొక్కమరణమును విని, రతీదేవి మూర్ఛిల్లెను; అనేకప్రకారముల భర్తయొక్కప్రతాపమును స్మరించి, యామె విలపించెను; చిట్టచివఱ కామె శివునివద్దకు వచ్చి, యతనికి దండప్రణామముఁజేసి, చేతులజోడించి, నిలువఁబడి యతనిని బ్రార్థించెను. ఆమెనుజూచి శివునకు మనస్సుకరఁగెను; అతఁడు జాలిఁబడి, యామెతో నిట్లు ప్రసంగించెను:—

దోహా 99

''ఓరతీ! ఇంతటనుండి నీభర్త కనంగుఁడని పేరువచ్చును; శరీరములేకయే, వాఁడు సర్వమువ్యాపించును. ఇకమీఁద నాతనిపొత్తు నీకెటులకలుగునో వినుము;

చౌపాయ్ 88

"భూభారమును హరించుటకు యదువంశములో భగవంతుఁడు కృష్ణుఁడై పుట్టును; అతనికుమారుఁడు ప్రద్యుమ్నుఁడు; అతఁడు నీకు భర్తయగును' నామాటసత్యము. దీనికి విరుద్ధము జరుగదు నమ్ముము." అని శివుఁడు రతీదేవితోఁ జెప్పెను. ఆమాటలనువిని, రతి నిష్క్రమించెను; ముందుకథ జెప్పుచున్నాను వినుము. ఈసమాచారమును దేవతలు మొదలగువారు విని, బ్రహ్మవద్దకువెళ్లిరి. వారిని వెంటఁదీసికొని, బ్రహ్మ వైకుంఠమునకుఁ బోయెను; త్రింశత్కోటిదేవతలను వెంటఁబెట్టుకొని, బ్రహ్మయు, విష్ణువును శివునిసన్నిధానమునకు వచ్చిరి; ప్రత్యేకము ప్రత్యేకము వారు శివుని స్తుతించిరి; వారిస్తోత్రములను విని చంద్రమౌళీశ్వరుఁడు ప్రసన్నవదనుఁడై, "ఓదేవతలారా! ఏమిప్రయోజనమునకై నావద్దకువచ్చితిరి? చెప్పుఁడు" అని కరుణాసముద్రుఁ డగుశివుఁడు వారినిఁ బ్రశ్నించెను. "ఓస్వామీ! సర్వాంతర్యామివి; మీకుఁదెలియనివిషయములులేవు; అయినను మనవిఁజేసికొనుచున్నాను" అని బ్రహ్మ నమ్రుఁడై చెప్పనారంభించెను.

దోహా 100

"ఓస్వామీ! ఓసాంబశివా! దేవతలమనస్సులో నొకఆశయము కలదు; మీవివాహమును వారు కన్నులారఁ జూచుట కభిలషించుచున్నారు.

చౌపాయ్ 89

"ఓమదనాంతకా! ఓకందర్పదర్పహరా! ఈమీవివాహమహోత్సవమును కన్నులారఁ జూచి మే మానందింపఁగోరుచున్నాము; ఓదయాసాగరా! కామునిఁ జావఁజూచి, రతీదేవికి వరమునొసంగితివి; మీరు చేసినపని శ్లాఘనీయము; దయాదాక్షిణ్యముతో సేవకులనుశాసించుటయే మహాప్రభువుల స్వాభావికము; పార్వతి ఘోరమగుతపము నాచరించెను; అంగీకరించి, మీ రామెహస్తమును స్వీకరింపుఁడు." అని బ్రహ్మదేవుఁడు శివునిఁబ్రార్థించెను. బ్రహ్మవాక్యములనువిని, శ్రీరాముని వచనములను స్మరించి, "తథాస్తు" అని శివుఁడు వారితోఁ జెప్పెను. దేవతలు సంతసించి, దుందుభులను ధణధణమనిమ్రోగించిరి; పుష్పములను వర్షించిరి. "ఓదేవాదిదేవ! జయ, జయ" అని వారు ఘోషిం

చిరి. ఇది మంచిసమయమని తలంచి సప్తఋషు లచ్చటికివచ్చిరి; అతిశీఘ్రముగ బ్రహ్మ వారిని హిమవంతునివద్దకుఁ బంపెను; ప్రథమమున వారు పార్వతిని సందర్శించి, ఆమెతో నిట్లు మధురముగ సంభాషించిరి:—

దోహా 101

"ఓపార్వతీ! నీవు మామాటలను వినవు; వానిని గ్రహింపవు; నారదునియుపదేశమును నమ్మింతువు; దానియందు నీకులక్ష్యము; నీప్రతిజ్ఞ వ్యర్థమయ్యెను; కాముని శివుఁడు దహించెను" అని ఋషులుపలికిరి.

చౌపాయ్ 90

వారివాక్కులనువిని, పార్వతి చిఱునవ్వునవ్వి, "ఓమునులారా! ఓవిజ్ఞానులారా! మీరు బాగుగపలికితిరి; 'శివుఁడు కామునిదహించెను' అని మీరుచెప్పిన మాటలవలన, నింతకుముందు శివుఁడు వికారముఁ బొందెనని తెలియుచున్నది. శివుఁడు సదాయోగియనియు, జన్మములేనివాఁడు, భోగరహితుఁడు, మాయారహితుఁడు, దూషణరహితుఁడు అని నేనెఱుంగుదును. శివుఁ డట్టివాఁడని తెలిసికొని, అతిభక్తిశ్రద్ధలతో నతనిని నేను మనోవాక్కర్మములచేత సేవించియుండినయెడల నోఋషులారా! ఆకృపాసముద్రుఁ డగు శివుఁడు, నాప్రతిజ్ఞను సంపూర్ణముఁ జేయునని గ్రహింపుఁడు; మీమాట మీయజ్ఞానమును వెల్లడి జేయుచున్నది; అగ్నియొక్కస్వభావ మెట్టిది? దానియెదుట మంచు నిలువ లేదుకదా! ఒకవేళ అగ్నిని మంచు సమీపించినను, మంచు నశించును. అటులనే, మన్మథుఁడు శివునిసమీపించి నశించెను."

దోహా 102

అని పార్వతిచెప్పిన మాటలను విని, ఋషులు సంప్రీతమానసులైరి; ఆమెవిశ్వాసమును ప్రేమను వారు కాంచి చూడి, యామెకు నమస్కరించి, హిమవంతుని సన్నిధానమునకుఁ బోయిరి.

చౌపాయ్ 91

ఈ వృత్తాంతమునంతయు వారు హిమవంతునితోఁ జెప్పిరి. మన్మథునివినాశమును విని, హిమవంతుఁడు విశేషము దుఃఖించెను; అనంతరము రతీదేవి పొందినవరమును విని, అతఁడు సంతసించెను. శివునిమాహాత్మ్యమును స్మరించి, హిమవంతుఁడు పండితులఁ బిలిపించి, వేదోక్తప్రకారము, (శుభనక్షత్ర, శుభదిన, శుభలగ్నముల) వివాహామును

హూర్తమును నిశ్చయించెను. వారిపాదములకు మ్రొక్కి, హిమవంతుఁడు వారిచేతికి లగ్నపత్రిక నిచ్చెను. వారాపత్రికనందుకొని, బ్రహ్మ వద్దకువెళ్లిరి; ఆపత్రికను బ్రహ్మ చూచి, పరమానందముఁబొంది, దానిఁ జదివి సభికులకు వినిపించెను. ఋషులును, మునులును, దేవతలును హర్షించిరి; పుష్పవర్షము కురిసెను; దేవదుందుభులు అంతరిక్షమున మ్రోఁగెను; అంతటఁ బెండ్లిప్రయత్నము చేయఁబడెను.

దోహా 103

దేవతలంత అలంకరించుకొని, వారివారివాహనముల నెక్కిరి; శుభశకునములు ప్రవర్తించెను; అప్సరసలు పూర్ణకుంభములనెత్తి, గానముఁజేసిరి.

చౌపాయ్ 92

శివగణములు శివుని జటాజూటమును సర్పకిరీటమును వారు సవరించియు; నాగకుండలములను, నాగాభరణముల దగిలించియు, శరీరమునకు భస్మముఁబూసియు, నడుమునకుఁ బులితోలు ధరింపఁజేసిరి. అతనిశిరమునఁ జంద్రుఁడును, జటలలో గంగయు, కన్నులు మూఁడును, నాగయజ్ఞోపవీతమును, నీలకంఠమును, మెడనుండి వ్రేలుచుండినపుర్రెల హారమును ప్రకాశింపఁగ నీవిధమున సింగారించుకొని,ఆకృపాలుఁడు, శుభదాయకుఁడు, శివుఁడు భయమును పుట్టించుచుండెను. ఒకచేతిలోఁ ద్రిశూలమును, మఱియొకచేతిలో డమరును ధరించి, వృషభవాహనారూఢుఁడై,శివుఁడు పెండ్లికిఁదర్లి వెళ్లెను; మంగళధ్వనులు మ్రోఁగెను;దేవకన్యలు శివునిఁజూచి ముసిముసినవ్వులునవ్విరి; 'ఈవరునకుఁ దగినవధువు లోకములో లేదు' అని వారిలోవారు గుసగుసలువోయిరి. బ్రహ్మయు, విష్ణువును, సమస్తదేవతలును, వారివారివాహనముల నెక్కి వెళ్లిరి; పెండ్లివారి యుత్సవము సాగినపుడు, అందులో దేవతల సమూహము మాత్రము చూచుట కింపుగనుండెను; కాని, ఆపెండ్లిసంబరము పెండ్లికుమారునకు సాటికాదు.

దోహా 104

దేవతలను విష్ణువుచూచి, చిఱునవ్వునవ్వి, "ఓదేవతలారా! మీ మీవర్గముతో మీరు వేర్వేఱ నడవుడు.

చౌపాయ్ 93

"అటుల మీరు వెడలనియెడల, మిమ్ములను పరస్థలనివాసులు చూచి, వరునకుఁ దగినసంబరము కాదని పరిహాసింతురు" అని విష్ణువు వారితోఁ జెప్పెను. విష్ణుభగవానుని వచనములను దేవతలు విని నవ్వి, అతఁడు చెప్పినప్రకారము వారివారి యనుచరులతోఁ గలసి సాఁగి నడచిరి. శివుఁడు సయిత మామాటలను విని చిఱునవ్వునవ్వెను; కాని, నారాయణుని హాస్యవచనముల నతఁడు గ్రహింపలేదు. భగవంతుని వచనములు ప్రియములని తెలిసికొని, శివుఁడు భృంగిని పిలిచి, స్వగణములను సమావేశముఁ జేయుమని యాజ్ఞాపించెను. శివుని ఆజ్ఞప్రకారమాగణములు సమావేశమయ్యెను. వారు శివుని చరణకమలములకు నమస్కరించిరి; నానావిధములగు వారివాహనములను వారివేషములను శివుఁడు చూచి ప్రసన్నుఁడయ్యెను. వారిలోఁ గొందఱకు ముఖములులేవు; కొందఱికి అనేకముఖములు కలవు; ఆముఖములు చూచుటకు భయంకరములు; కొందఱికి హస్తములును, పాదములును లేవు; మఱికొందఱికి అనేకహస్తములును పాదములును కలవు; ఒకనేత్రమయినను కొందఱికి లేదు; అనేకనేత్రములు మఱికొందఱికిఁ గలవు! కొందఱి శరీరములు సన్నముగను, కొందఱి శరీరములు స్థూలముగనుండెను.

ఛాంద్ 7

కొందఱు బలవంతులు; కొందఱు బలహీనులు; కొందఱు పవిత్రులు; కొంద ఱపవిత్రులు:—ఇట్టి శరీరములను వారుధరించి, చూచుటకు భయంకరముగ నుండిరి; వికారమగు భూషణములను వారు సింగారించుకొనిరి; సద్యోరుధిరముతో నిండినపునుకలను జేతులతోఁ బట్టుకొని, వారు దానిని ద్రావుచుండిరి; పంది, కుక్క, గాడిద, గృధ్రముఖములుగలగణము లగణితముగఁ గలరు; భూత, ప్రేత, పిశాచ, శాకినీ, ఢాకినీ, యోగినీగణము లపరిమితముగ గలరు; వారిఁ జెప్పుటకు శక్యము కాదు.

సోరఠా 15

ఈశివగణములన్నియు చిత్రముగ నభినయించి నాట్యముఁజేయు చుండిరి; అపూర్వమగు పాటలను పాడుచుండిరి; వారిచేష్ట లసాధారణములు.

చౌపాయ్ 94

పెండ్లికుమారునకుఁ దగిన పెండ్లివారిసంచు—దారిలో వారిసంబరముఁజూచి, ప్రతివారును వినోదించిరి; హిమవంతుఁడు పెండ్లినిమిత్తము వేయించినపందిలిని వర్ణించుటకు శక్యముకాదు; అంతచక్కని పందిలినిఁ జూడవలయుఁగాని మాటలవలనఁ గార్యములేదు; చిన్నదియని పెద్దదియని విచక్షణలేక, జగత్తులోఁ గల పర్వతములను, నదులను, వనములను, సరస్సులను, వివాహమహోత్సవమున కాహ్వానముఁజేసి పిలిపించెను; సకుటుంబసపరివారముగ వారందఱు ముద్దులు మూటఁగట్టినట్లు సింగారించుకొని హిమవంతునిగృహమునకు వచ్చిరి; వారు పెండ్లిపాటల నతిమనోజ్ఞముగఁబాడిరి. అనేక విడిది గృహములను హిమవంతుఁడు కట్టించెను; ఎవరికిదగిన వసతులను వారికి హిమవంతుఁడు నిర్మించెను; వానిలో నొకదానిఁబోలి యొకటిలేదు; వాని సింగారముఁ జెప్పుటకు మాటలురావు; వేయేల, వానిచక్కఁదనము బ్రహ్మసృష్టిని మించియుండెను.

ఛాంద్ 8

ఆకోటలేమి? ఆపేటలేమి? ఆవాటికలేమి! ఆయిండ్లేమి? ఏమివాని వైభవము? వానియందముఁజూచి ఈబ్రహ్మసృష్టి సిగ్గుపడును. వనములు, ఉపవనములు,తోఁటలు, లతాగృహములు,నదులు, సరస్సులు, తటాకములు, కాలువలు—వానిచక్కఁదనముఁజెప్పనేల! వానికి జోడు లేదు; ఎటువైపుఁజూచినను పచ్చనితోరణములును, బతాకములును గనఁబడును. పురుషులసీటు, వారిమురిపములను వర్ణింప శక్యముకాదు. స్త్రీలు ముద్దులు మూటఁగట్టుచుండిరి; వారింజూచి మునీశ్వరులమనస్సులు సయితము భ్రమించును.

దోహా 105

ఆహిమవంతునినగరములో జగదంబపుట్టెను; ఆపురము యొక్క శోభను వర్ణించుట కెవరికిసాధ్యమగును? దినదినప్రవర్ధమానముగ సిరి

సంపదలతోఁ దులఁదూగుచుండెను; ప్రతిదినమును నిత్యకల్యాణములతోను బచ్చుతోరణములతోను బ్రకాశించుచుండెను.

చౌపాయ్ 95

పెండ్లివారిమేళకము నగరమును సమీపించెను. ఆసంగతి తెలిసికొని, నగరములో సందడి మెండయ్యెను; అంతటను గలకలధ్వనులు వినఁబడెను; వారియొయ్యారము మఱింతబలసెను; ఉచితమగు వాహనములనెక్కి, పడుచువారిమేళనము ఎదుర్కోలుసన్నాహమునకు వెడలెను. పడుచుపెండ్లివారు దేవతలసంఘముఁజూచి సంతసించిరి; శ్రీమన్నారాయణమూర్తిఁ జూచి, పరమానందముచే వారు కొండనెక్కిరి; శివునిపరివారమును వారు చూచి దిగులుపడిరి; వారు స్వారిచేయుచుండినజంతువులు భయపడెను; వారిలోఁ బెద్దవారు భయమును విడిచి ధైర్యమునవలంబించి నిలువఁబడిరి; చిన్నపిల్లలుమాత్రము ప్రాణములను రక్షించుకొనుటకు వారివారిగృహములకుఁ బరుగెత్తివెళ్లిరి; వారితలిదండ్రు లడిగినపుడు, ఆపిల్లలు గజగజవడఁకుచు, "ఏమిచెప్పగలుగుదుము! మేముచెప్పలేము; అది పెండ్లిసంబరముకాదు; అది యమునివాలకమువలెఁ గనఁబడును; వారు యమభటులు; ఆపెండ్లికొడుకొక వెఱ్ఱిబాగులవాఁడు; గుఱ్ఱమా, ఏనుఁగా? అతఁ డొకయెద్దునెక్కి వచ్చుచున్నాఁడు; శరీరమునిండ బూడిదఁబూసికొనెను; పాములను బునుకలను ధరించెను.

ఛాంద్ 9

గేయము. పాములును బునుకలే యతనిసొమ్ములు,
ఆయొడలునిండంగ నా తెల్లబూది,
ఆబోల్లిమేనేమి యెూయందమేను,
భూతప్రేతపిశాచయోగినీసిద్ధ
డాకినీశాకినీగణములాశంభుదేవరకు,
దగినసేస్తముంవార లాపెండ్లివారు, .
ఆజోడుకేజో డిఁకేనాఁడులేదు,
వారిజాడనుజూచి భయములేకుండ,
నిలువంగశక్యమె ప్రాణంబుతోడ,

పుణ్యాత్ములకుఁ జెల్లు పెద్దలకుఁ జెల్లు,
మావంటికూనలకు దీనులకుఁ దగదు,
అబ్బబ్బ! యిచ్చోట నిలువగాలేము"
అనుచు చేఁజాచి యాబాలురందఱును,
పఱుగిడఁజొచ్చి రానగరమంతటను,
వారిరాకడఁజూచి యింటింటివారు,
గుజగుజలనాడిరా రాత్రియంతయును.

దోహా 106

శివునిగణములను దెలిసికొని, ఆబాలకులతల్లిదండ్రులు నవ్వి, యనేకప్రకారముల వారిని బోధించి, "మీకేమియు భయములేదు; భయముపడుటకుఁ గారణములేదు" అని వారిని బుజ్జగించిరి.

చౌపాయ్ 96

ఎదురుకోలుసన్నాహముతోఁ గలిసి పెండ్లివారు నగరములోఁ బ్రవేశించిరి; ఎవరికిఁదగిన విడిదిగృహములలో వారు దిగిరి; మేనక మంగళహారతి పెండ్లికొడుకున కిచ్చెను; బంగారుకలశములలో వసంతముఁబోసి, పెండ్లికొడుకున కామె దిగఁదుడిచెను; పేరంటాండ్రు పెండ్లిపాటలను చక్కఁగఁ బాడిరి.

రాగము ఆనందభైరవి - తాళము చాపు.

పల్లవి:—జయమంగళం నిత్యశుభమంగళం:—

మంగళము శంభునకు,
మంగళము ఖర్వునకు,
మంగళం బీలోకసుందరాంగునకు॥ జయ॥ ౧
మంగళము మదనారి,
మంగళము త్రిపురారి,
మంగళము మాసర్వమంగళీశునకు॥ జయ॥ ౨
మంగళము పుంగవతురంగునకును,
మంగళము గంగోత్తమాంగునకును,
మంగళము శర్వునకు,
మంగళము భర్గునకు,
మంగళము మాచిన్నియీశ్వరునకు॥ జయ॥ ౩

శివుని వాలకముఁజూచి ముత్తైదువులు భయపడి గృహములోనికిఁ బాఱిపోయి, విచారించుచుండిరి. శివుఁడు విడిదిలోనికివెళ్లెను; మేనక మనస్సులో దుఃఖించి, కూఁతురినిఁ బిలిచి యామెను ముద్దిడి, తొడలపైఁ గూర్చుండఁబెట్టుకొని, దుఃఖము భరింపలేక యేడ్వసాగెను. "నాయమ్మా! నాచిన్నితల్లీ! అయ్యో! ఆబ్రహ్మ నిన్నెందులకుఁ బుట్టించెను! పుట్టించినవాఁడు నీకెందు కింతచక్కఁదనమునిచ్చెను? ఇచ్చిన వాఁడు నీకుఁ దగినపెనిమిటినిచ్చిన వానికి నష్టమేమి? ఈవెఱ్ఱిబాగుల వాఁడు నీకు మగఁడా?

ఛాంద్ 10

పదములు. నీచక్కఁదనమేమి నీయందమేమి,
నీరూపమేమందు నేలోకమందు,
నిన్నుఁబోలినవార లెచ్చటను లేరు,
నీముద్దులేమందు నీమాట లేమి,
కన్నులపండువౌ యపరంజిబొమ్మా,
చిలుకలకొల్కిరో, శ్రీశుభరూప,
చెఱకువిల్తునిబొమ్మ కందర్పుబంతి,
ఎంతచక్కనివాని నిచ్చెనాబ్రహ్మ.

"ఓతల్లీ! ఈవెఱ్ఱిబాగులవానినిమిత్తమా,నిన్నుబ్రహ్మపుట్టించెను? ఇంతచక్కఁదన మెందుకిచ్చెను? కల్పవృక్షము ఫలించుసమయమునకు, దానికిబ్రహ్మ బబూలమును ... ... తగిలించెను. ఓకన్నతల్లీ! నీతోఁగూడి, కొండమీఁదనుండి పడినను బడుదును; సముద్రములో దిగఁబడుదును; అగ్నిలోఁబడి కాలిపోవుదును. ఇల్లునిల్చినను, పోయినను సరే; లోకములో నపకీర్తివచ్చినను సరే; నాప్రాణము లుండినంత వఱకు, నీవివాహమును జరగనియ్యను." అని మేనక పలువిధముల దుఃఖించెను.

దోహా 107

కూఁతురియందుగల ప్రేమచేత మేనక దుఃఖించెను; ఆమెను జూచి, స్త్రీలందఱును విలపించిరి.

చౌపాయ్ 97

"నారదునకు నేనేమియపరాధమును చేసియుంటిని? హిమవంతుని కాపురము నతఁడు తెగఁద్రెంపుట చేసెను? ఈవిధమున నెందులకు పార్వతికి నుపదేశించెను? ఈ వెఱ్ఱిబాగులవానికొఱకా మా పార్వతి తపస్సుఁ జేసెను? అతనికి మాయామర్మములు లేవు; సన్యాసి; ఇల్లుగాని వాకిలిగాని లేదు; అతనికి సిగ్గులేదు; ధనముతో నతనికిఁ బ్రసక్తిలేదు; ఇతరులకొంపలను పాడుజేయును; అందువలననతనికి లాభములేదు; విచారము కలుగదు; ప్రసవవేదన గొడ్రాలికేమి తెలియును?" అని మేనక వ్యాకులపడి విచారించెను. ఆమె విలాపముఁ జూచి, పార్వతి మృదుమధురవాక్యములతో నిట్లుతల్లికి జ్ఞానముఁ జెప్పెను. "ఓ అమ్మా! ఓ తల్లీ! ఈ ప్రకారము విచారించి శోకింపకుము; బ్రహ్మవ్రాసిన వ్రాఁత తప్పదు ఈజడుఁడు నాకు మగఁడని నానొసట వ్రాసియుండినప్పుడు, పరులను నిందించుటవలనఁ బ్రయోజనమేమి? ఓ అమ్మా! బ్రహ్మవ్రాసినవ్రాఁతను నీవు తుడిచివేయఁగలవా? అందుచేత, నీవృథాజల్పములేల?

ఛంద్ 11

"ఓ తల్లీ! నీయాలాపములు వ్యర్థములు; వానివలనఁ బ్రయోజనము లేదు; వానిం జాలింపుము; ఇది సమయము కాదు; ఇంతకుపూర్వమే నాసుఖదుఃఖములు వ్రాయఁబడెను; వానిని నేనెచ్చట ననుభవింపవలెనో, నే నచ్చటకుఁ బోవలయును" అని పార్వతి తల్లికి బోధించెను. ఆమె చక్కని మాటలను విని, స్త్రీలందఱును దుఃఖమును విడిచిరి; అనేకవిధముల వారు ధాతను దూషించి, కన్నీరుఁ గార్చిరి.

దోహా 108

పెండ్లివారియగచాట్లను విని, నారదుఁడును సప్తమహర్షులును హిమవంతుని గృహమునకు వచ్చిరి.

చౌపాయ్ 98

అప్పుడు నారదుఁడు వారిని బోధించి, పార్వతియొక్క పూర్వవృత్తాంతమును వారితోఁ బ్రసంగించెను "ఓ మేనకా! నామాటలు సత్యమని తెలిసికొనుము; నీకూఁతురు భవాని, జగదంబ; ఆమె శివుని రాజ్యలక్ష్మి; అతనియర్ధాంగరాణి; అనాదిశక్తి; ఆమెకు జననమరణములు లేవు; ఆమె జగత్తుయొక్క సృష్టిస్థితిసంహారములఁ జేయును; ఇచ్ఛా

నుసారము ఆమె విలాసార్థము శరీరమును ధరించును. ఆమె ప్రథమ మున దక్షునిగృహములోఁ బుట్టెను; అప్పుడామెకు సతి యని నామ ముండెను; సతి మంచిచక్కనిది; శంకరుని సతి పెండ్లియాడెను; ఆమె చరిత్రము లోకములో వెల్లడియయ్యెను. ఒకసమయమునవామె శివుని తోఁగూడివచ్చి, శ్రీరామచంద్రునిఁ జూచి, భ్రమచే శివునిమాటలను బాటింపక, సీతవేషమును ధరించెను.

ఛాంద్ 12

"ఆమె జానకిరూపముఁదాల్చెను; ఈయపరాధమున కామెపొ త్తును శివుఁడు విడిచెను. పతివియోగమునకు దుఃఖించి, ఆమె తండ్రి యజ్ఞముఁ జూడఁబోయెను; అచ్చట నామె యోగాగ్నిలో దహింపఁ బడెను; ఇప్పు డామె నీగృహములోఁబుట్టి, శివుని వరింపఁగోరి, కఠినత పము నాచరించెను; ఈసంగతిఁ దెలిసికొని, ఓమేనకా! సందేహము విడువుము; పార్వతి సదాశివునకుఁ బ్రియురాలు" అని నారదుఁడు పా ర్వతివృత్తాంతమును వారికిఁ జెప్పెను.

దోహ 109

నారదునివచనములనువిని వారు దుఃఖమును విడిచిరి; ఒకనిమిష ములో నతనిమాట లింటింటను వ్యాపించెను.

చౌపాయ్ 99

భార్యాభర్తలు, (మేనకయు, హిమవంతుఁడును) పరమానందభ రితులయిరి; వారనేకపర్యాయములు పార్వతిపాదములకు నమస్కరించి రి; నగరములోని యాబాలవృద్ధులు, స్త్రీపురుషులు సంతోషించిరి. నగ రమంతటను మంగళధ్వనులు వ్యాపించెను; బంగారుపాత్ర లెచ్చటఁజూ చినను గనఁబడెను; షడ్రసోపేతముగఁ బంచభక్ష్య(పక్వ) పరమాన్నము లను బెండ్లివారికి వడ్డించిరి; జగన్మాత, భవాని నివసించునంతఃపురములో వడ్డనఁజేయఁబడిన భోజనపదార్థములను వర్ణించిన నోరూరును. బ్రహ్మాది దేవతలను, శ్రీమన్నారాయణమూర్తిని, హిమవంతుఁ డాదరించి, వారికి నుచితాసనముల నిచ్చెను; పఙ్క్తులఁదీర్చి, భోజనమునకు వారు సిద్ధ ముగనుండిరి; బంగారుచేటలలో భోజనపదార్థములఁ బెట్టి తీసికొని వచ్చి, సేవకులు బంగారుపళ్లెరములలో వానిని వడ్డించిరి; దేవతలు భుజింపుచుండ; సమయముఁజూచి, స్త్రీలు హాస్యముఁజేయ నారంభించిరి.

ఛాంద్ 13

ఒకరితోనొకరు హాస్యములాడిరి; అతిసంతోషముతో వారు వినోదములాడుచుండిరి; వినోదములాడుచు వారు భోజనమువద్ద విశేషకాలముగడపిరి; అంతకంతకు హాస్యములు ముదిరెను; అవి ముదిరిన కొలది, వారికి సంతోషము మెండయ్యెను; ఆసంతోషముచేత వారు కొంతసేపు భోజనములవద్దఁ గూర్చుండిరి; అనంతరము వారు లేచి హస్తములను పాదములను ప్రక్షాళనఁజేసికొని, తాంబూలాదులను గైకొనిరి; చందనముల్ది, పన్నీటఁదేలి, వారు తమతమబసలకు నిష్క్రమించిరి.

దోహా 110

తదుపరి సప్తమహర్షులు వచ్చి లగ్నసమయము సమీపించెనని హిమవంతునితోఁ జెప్పిరి; సుముహూర్తమునకు దయచేయుమని దేవతల కతఁడు వర్తమానముఁ బంపెను.

చౌపాయ్ 100

లగ్నముఁ జూచుటకు వచ్చిన దేవతల నతఁడాదరించి, వారికి నుచితాసనములనిచ్చెను; వివాహమండపముపై విధ్యుక్తప్రకారము హోమకుండముఁ ద్రవ్విరి; సువాసినులు పాటలఁ బాడుచుండిరి; ఒక మనోహరమగు సింహాసనమును బ్రహ్మ స్వయముగరచించెను; దానిశోభను వర్ణించుటకు శక్యముకాదు; బ్రాహ్మణులకు నమస్కరించి, శివుఁడాసింహాసనము నధిష్ఠించి, శ్రీరాముని ధ్యానించెను. అనంతరము ఋషులు పార్వతికి వర్తమానముఁ బంపిరి; ఆమెను సర్వాభరణములతో సింగారించి, స్త్రీలు తీసికొనివచ్చిరి; ఆమెచక్కదనముఁజూచి, దేవతలు సయితము భ్రమించిరి; ముద్దులుమూటఁగట్టుచుండిన యామె నేకవి వర్ణింపఁజాలును? ఆమె జగన్మాతయనియు శివునిరాజ్యలక్ష్మియనియు దేవతలు తెలిసికొని, తమతమమనస్సులలో నామెకు వారు నమస్కరించిరి; ఆమె సౌందర్యరాశి; ఆమె ప్రభావమును వర్ణించుటకు కోటిముఖములుండినను, నాకు సామర్థ్యములేదు.

ఛాంద్ 14

ఆమెయొక్క నిరుపమానమగుసౌందర్యాతిశయములను వర్ణించుటకు వేలకొలదిముఖములు సరిపడవు; సహస్రఫణములుగలశేషుఁడు,

వేదములును, సరస్వతియు, ఆజగన్మాత యొక్క లావణ్యమును సాంతముగాఁ జెప్పలేవు; నేను (తులసీదాసు) మందమంతిని; ఆమెనుగుఱించి నేనేమి చెప్పఁగలను? ఆచక్కదనాలకుప్ప, భవాని, వివాహమండపము నెక్కివచ్చి, కన్నుఁదెఱచి సభికులఁ జూడక, శిరస్సునువంచుకొని, శివుని సమీపించెను; తుమ్మెద పద్మముమీఁద వ్రాలువిధమున, నామె శివుని చరణకమలములమీఁదఁ బడి సాష్టాంగనమస్కారముఁ జేసెను.

దోహా 111

మునీశ్వరులు చెప్పినప్రకారము పార్వతీ పరమేశ్వరులు గణపతిఁ బూజించిరి; అటుల వారిరువురు గణపతిఁ బూజించిరని విని, మీరు శంకింపవలదు; (1. గణపతి శివునికుమారుఁడు; దేవత లాదిరహితులు; రాముఁ డనాది; అందుచేత, గణపతియు ననాది కనుక, వా రతనిని బూజించిరి; 2. లేదా గణములకు పతియైనవాఁడు గణపతి; ఆగణపతి శివుఁడు; అతఁడు తననే పూజించెను )

చౌపాయ్ 101

వేదోక్తప్రకారము మునులు వివాహమంత్రములఁ జదివిరి; కుశయును పార్వతిని హిమవంతుఁడు శివుని చేతిలోఁ బెట్టి కన్యాధారవోసెను: భవాని శివుని యొక్క సనాతనశక్తి యని గ్రహించి, ఆమెను హిమవంతుఁడు శివునకు సమర్పించెను. శివుఁ డామెను ప్రతిగ్రహించి నపుడు దేవతలు పరమానందము నొందిరి; మునిగణములు వేదమంత్రముల నుచ్చరించిరి; దేవతలు జయ, జయజయశబ్దములను ఘోషించిరి. దేవదుందుభులు మ్రోఁగెను; అంతరిక్షమునుండి పుష్పవర్షము గురిసెను; పార్వతిమెడకు మంగళసూత్రమును శివుఁడు కట్టెను; పార్వతీపరమేశ్వరుల వివాహముఁ జూచి మూఁడులోకములవారు నుత్సహించిరి దాస దాసీలను, గుఱ్ఱములను, రథములను, ఏనుఁగులను, ధేనువులను, వస్త్రములను, చీనిచీనాంబరములను, వెండిబంగారములను, మరకతమాణిక్య వజ్రవైడూర్యములను, బండ్లకొలది భోజనపదార్థములను, వెండిబంగారు పాత్రలను అనేకవస్తువులను హిమవంతుఁడు పెండ్లిసారెఁ బెట్టెను; వానిం జెప్పుటకు శక్యము కాదు.

ఛాంద్ 15

అపరిమితముగ నానాప్రకారము లనేకవస్తువులను సారెనిచ్చి, హిమవంతుఁడు చేతులజోడించి, నమస్కరించి, "ఓమహాప్రభూ! ఓసకల సంపూర్ణుఁడా! ఈపదార్థములన్నియు మీకుఁ దృణప్రాయము; నాతప్పులను క్షమింపుము" అని పలికి శివునిచరణకమలములఁ బట్టుకొనెను. కృపాసముద్రుఁడు, శివుఁడు మామను సుత్సహించి ఆదరించెను. అనంతరము, మేనకవచ్చి, ప్రీతిపూర్వకముగ నతని చరణకమలములం బట్టుకొని నమస్కరించి,

దోహా 112

"ఓనాథా! ఈపార్వతి నాకు ప్రాణములతో సమానము; ఆమెను మీగృహములలో నొకదాసి యని భావింపుము; ఆమె యపరాధములను క్షమింపుము; ఈవరమును నాకుఁ బ్రసాదింపుము" అని ప్రార్థించెను.

చౌపాయ్ 102

అనేకప్రకారముల శివుఁ డత్త నూరడించి బోధించెను; ఆమె శివునకు నమస్కరించి గృహములోనికి వెళ్లెను. మేనక పార్వతింబిలిచి, ఆమెను తనతొడపైఁ గూర్చుండఁబెట్టుకొని, "నాచిట్టితల్లీ! నాయమ్మా! శివుని చరణకమలములను సదా పూజింపుము; 'స్త్రీలకు భర్తయేదైవ'మని ధర్మశాస్త్రములు చాటుచుండును; దానికంటె స్త్రీలకుమఱి యొకధర్మము లేదు" అని బుద్ధి చెప్పి, మేనక కన్నీరుఁ గార్చెను; మాటిమాటికిఁ గూఁతురినామె కౌఁగిలించుకొని, "అయ్యో! బ్రహ్మ జగత్తులో స్త్రీల నెందుకుఁ బుట్టించెను? వారిబ్రతుకు పరాధీనము; స్వప్నములో నయితము వారికి సుఖముకలదా!" అని విలపించెను. కూఁతురిమీఁదఁగల దయచేత నామెకు దుఃఖము పొంగి వచ్చుచుండినను, అది మంచిసమయముకాదని మేనక తలఁచి, దుఃఖమును మ్రింగెను. ప్రేమచేత మాటిమాటికి పార్వతి తల్లివద్దకు పరుగిడుచు, ఆమెపాదములకు నమస్కరించుచుండెను; కూఁతురు జగన్మాత యని తెలిసికొని, ఆమెపాదములకు మేనక నమస్కరించెను; కులపుఁగోలుతనముచే నామె చెలికత్తెలతో

మాటలాడి, వారివద్ద సెలవుఁబుచ్చుకొనెను; అనంతర మామె తల్లివద్దకుఁబోయి, ఆమెను కౌఁగిలించుకొనెను.

ఛాంద్ 16

పలుమాఱు భవాని తల్లినిఁ గౌఁగిలించుకొనుచుండెను; ఉచిత ప్రకారముల నామె వారినందఱిని యూరడించెను; అచ్చటిపెద్దలు, స్త్రీపురుషులు, పార్వతిని ఆశీర్వదించిరి; మాటిమాటికి పార్వతి వెనుకకుఁదిరిగి తల్లిం జూచుచుండెను; చెలికత్తెలతోఁగూడి ఆమె శివునివద్దకు వచ్చెను; అచ్చటిజనులందఱుమంగళాశీర్వాదములం బలుకుచుండ, పార్వతీపరమేశ్వరులు గృహప్రవేశమునకు బయలువెడలిరి; దేవతలు సంతసించిరి; దేవదుందుభులు మ్రోఁగెను; పుష్పవర్షము గురిసెను; వధూవరులు ప్రయాణమును సాగించిరి.

దోహా 113

వారిని సాగనంపుటకు హిమవంతుఁడు వారివెంట వెళ్లెను; శివుఁడతనినిబోధించి, గృహమునకుమరలుమని చెప్పినపిదప, నతఁడు పార్వతీపరమేశ్వరులవద్ద సెలవుగైకొని గృహమునకు వచ్చెను.

చౌపాయ్ 103

హిమవంతుఁడు శీఘ్రముగ నింటికివచ్చెను; పర్వతములు, శైలములు, నదులు - మొదలగు పెండ్లికివచ్చిన బంధువుల నాదరించి, వారివారికిఁ దగినకట్నములను కానుకల నిచ్చి, వారిని సత్కరించెను; వారతని సెలవుగైకొని, స్వగృహములకు వెడలిరి; ఉమామహేశులిరువురు కైలాసపట్టణముఁ జేరిరి; దేవతలు వారివారి నివాసములకుఁ బోయిరి; భవానీశంకరులు జగత్తునకు జననీజనకులు కదా! వారిశృంగారచేష్టల నెటులవర్ణింపఁగలను? సకలగణములతోఁగూడి, వారు కైలాసములో సుఖముగ నివసించియుండిరి; అనేకప్రకారముల వారు శృంగారాదిభోగముల ననుభవించిరి; ప్రతిదినము వారు నూతనవిలాసములలోఁ దేలిరి; ఈప్రకార మనేకయుగములు గడచెను. అంతట, నాఱుముఖముల కార్తవీర్యుఁడు పుట్టెను; అతఁడు తారకాసురుని వధించెను; కుమారస్వామి చరిత్రము వేదశాస్త్రపురాణములు చాటుచుండును; అతనిచర్యలు జగత్ప్రసిద్ధము.

ఛాంద్ 17

కుమారస్వామి జననమును, అతని పౌరుషచర్యలను లోకములో నందఱకుఁ దెలియును; అతని బలపరాక్రమము లందఱికి విశదము; అందుచేత, నతని చరిత్రమును సంక్షేపముగ నేను చెప్పి చాలించితిని; స్త్రీపురుషు లెవరు పార్వతీపరమేశ్వరుల వివాహకథను చదివినను, విని నను, గానముఁ జేసినను, వారు చిరజీవులయి సకలసంపదల ననుభవింతురు; వారి కార్యములన్నియు విజయమగును.

దోహా 114

శివుని చరిత్రము మహాసముద్రము; దానికి పారములేదు; దాని లోఁతును వేదములు నయితము కనిపెట్టలేదు; నేను (తులసీదాసు) మందమతిని; జడుఁడను; నేనేమిదానిని వర్ణింపఁగలను?

ఇతి శ్రీగోస్వామితులసీకృత శ్రీరామచరిత్రమానసే,
సకలకలికలుషవిధ్వంసినే, బాలాకాండాంతర్గత
పండితజ్వాలాప్రసాదకృత వ్యాఖ్యానానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
ద్వితీయో విశ్రామః.

---

# బాలకాండ తృతీయ విశ్రామః.



× ఈతృతీయవిశ్రామములో రామచంద్రుని జననమునకుఁ గారణముఁ జెప్పుచున్నాను; భక్తిపూర్వకముగ దానిని వర్ణించెదను; దాని మూలమున సంసారసాగరమును మనుజులు దాటఁగలరు.

చౌపాయి 104

సరసమగు శివుని చరిత్రము శోభస్కరము; దానిని భరద్వాజుఁడు విని, పరమానందభరితుఁడయ్యెను; అతనికి దానిని వినుటయం దభిలాష మెండయ్యెను; దానివలన నతనిశరీరము పులకరించి, నేత్రము లానందబాష్పపూరితము లయ్యెను భక్తిచే నతఁడు పరవశుఁడయినందున, నతనిముఖమునుండి వాక్కులు వెలువడలేదు; భరద్వాజునియవస్థఁ జూచి, యాజ్ఞవల్క్యుఁడు సంతసించి, "ఓమునీశా! ఓభరద్వాజా! నీజన్మము సఫలమయ్యెను; నీవు గౌరీపతి ప్రాణముతో సమానుఁడు. శివుని చరణకమలములయందు భక్తిలేనిమనుజుఁడు స్వప్నమందయినను రాముని సంతోషింపఁజేయ లేఁడు; శివుని చరణకమలములయందు నిష్కలుషమగుభక్తిఁ గలిగియుండుటయే రామభక్తికి లక్షణము. రాముని యందు నిశ్చలభక్తిఁ గలవారు శివునికంటె నితరు లెవరుకలరు? అపరాధములేకయే, సతీదేవివంటి భార్యను, శివునివలె నెవరు విడిచిపెట్టఁగలరు? రామునియందుఁగల ప్రేమచేత శివుఁడు ప్రతిజ్ఞఁజేసి, ఆప్రతిజ్ఞను శివుఁడుతప్ప, మఱియొకరు నిలువఁబెట్టుకొనఁగలరా? శివునికంటెఁ బ్రియమగువారు రామునకు మఱియొకరు లేరుకదా!

దోహా 115

"ఓభరద్వాజా! నీవు శివుని నిత్యము సేవించువాఁడవనియు, రామునకును శివునకును భేదములేదని తెలిసికొనినవాఁడవనియు, నీమర్మమును గ్రహించి, శివునిచర్యలను బ్రథమమునఁ జెప్పనారంభించితిని.

చౌపాయి 105

"నీగుణశీలములు నాకు బోధపడెను; రామునిలీలామానుష చర్యలఁ జెప్పుచున్నాను; వినుము. ఓమునీశా! ఈరోజున నీతోఁగలిసి

సంభాషించుటవలన నాకుఁ గలిగినసంతోషమును చెప్పలేను. శ్రీ రామచంద్రునిచరిత్ర మపారము; సహస్రఫణములుగల నూరుకోట్ల శేషులు సయితము దానిని సాంతముగఁ జెప్పలేరు; వాణీపతియు, ధనుర్ధరుఁడు నగు రామవిభుని స్మరించి, నేనాకథను వినినప్రకారము నీకు వినిపించెదను; వినుము. సరస్వతి యొకకఱ్ఱబొమ్మతోసమానము; రామచంద్రుఁడు సూత్రధారుఁడు. సూత్రధారుఁ డేప్రకారము సూత్రములనులాగిన, నాప్రకారము బొమ్మనటించును కదా! రామచంద్రుఁడు సర్వాంతర్యామి; అతఁడు ప్రసాదించిన కవీశ్వరుని యొక్క హృదయాంగణమునందు సరస్వతి నృత్యముఁజేయును. రఘునాథునిలీలాకథాచరిత్రమును వర్ణించుటకుఁ బూర్వము, నేనాదయామూర్తియగు రామభద్రునకు సాష్టాంగనమస్కారముఁ జేయుచున్నాను. పరమశోభాయమానమగు కైలాసపర్వతముమీఁదఁ బార్వతీపరమేశ్వరులు నివసించియుండిరి.

దోహా 116

సిద్ధులును, తపశ్శాలులును, యోగులును, దేవతలును, కిన్నరులును, మునులు మొదలగుమహాత్ములు పురాణదంపతులను నిత్యము సేవించి, వారిని పరివేష్టించియుండిరి; వారినిత్యసేవకులకు వారు శాశ్వతసుఖము నిచ్చెదరు.

చౌపాయ్ 106

శివునియందు భక్తిలేనివారును, ధర్మమునందాసక్తిలేనివారును, హరిని సేవింపనివారును, స్వప్నమందయినను వారిని దర్శింపలేరు; ఆపర్వతముమీఁద నొక వటవృక్షముకలదు; అన్నికాలములయందావృక్షము పచ్చగనుండును; మిటమిటమండు వేసవిలో నాచెట్టునీడలోఁ గూర్చుండినపుడు, చల్లనివాసనగల పిల్లగాలులు వీచును; ఆచెట్టుక్రింద నెల్లప్పుడు శివుఁడు విరమించునని వేదములు చెప్పుచుండును. ఒకసమయమున నాచెట్టుక్రింగఁ బరమేశ్వరుఁడు విశ్రమించి, ఆవృక్షముఁ జూచి, పరమానందమునొందెను. ఆనీడలో వ్యాఘ్రాసనముఁ బఱచికొని, పరమదయాళుఁడు దానిమీఁదఁగూర్చుండెను. గౌరవర్ణముగలయతని శరీరకాంతి చంద్రునితోను, శంఖముతోను మల్లెపువ్వుముతోను సమానముగనుండెను; అతని వక్షస్థలము విశాలమయినది;

అతఁడు నారచీరలను ధరించెను; అతనిపాదములు అరుణోదయమున వికసించినపద్మములఁ బోలును; ఆపాదముల నఖములకాంతి భక్తుల యజ్ఞానాంధకారముఁ బోఁగొట్టును; అతనిముఖము శరత్కాలపూర్ణచంద్రుని తిరస్కరించును; అతఁడు శరీరమునిండ విభూతిఁ బూసికొనెను; నాగాభరణముల నతఁడు ధరించెను.

దోహా 117

ఆజటాజూటము, అందులో నొకప్రక్క గంగయు, మఱియొక ప్రక్క నర్ధచంద్రుఁడును, పద్మములవంటి నేత్రములు, నీలకంఠము-వీనితో నతఁడు శోభించెను.

చౌపాయ్ 107

శాంతరసము మూర్తిభవించినట్లు ఆకామునిశత్రువు, ఆదయాళుఁడు, సాంబశివుఁడు భక్తులకుఁ గన్నులపండువు నిచ్చుచుండెను. అది మంచిసమయమని తెలిసికొని, జగన్మాత, పార్వతి, పరమేశ్వరుని సమీపమునకువచ్చెను. తనప్రియురాలుగనుక నతఁడామెను దనవామపార్శ్వమునఁ గూర్చుండ నియోగించెను. ఆమె సంతోషించి, అతనిప్రక్కను గూర్చుండి, పూర్వజన్మవృత్తాంతమును స్మరణకుఁ దెచ్చుకొనెను. శివునకుఁ దనయందు సంపూర్ణదయ కలదని తెలిసికొని, చిఱునవ్వునవ్వి, లోకోపకారార్థము, శివునితో నామెమృదుమధురవాక్యములతో నిట్లు ప్రసంగించెను. "ఓనాప్రాణవల్లభా! ఓవిశ్వనాథా! నీమహిమ త్రిలోకవిదితము; చరాచరజంతుజాలములు, దేవ గరుడ గంధర్వ యక్ష కిన్నర నాగ మనుజులు, త్రిలోకవాసులు-నిత్యము నీచరణకమలములను సేవింతురు.

దోహా 118

"ఓమహాప్రభూ! నీవు సర్వసమర్థుఁడవు; సర్వజ్ఞుఁడవు; సర్వమంగళుఁడవు; సకలగుణసంపన్నుఁడవు; చతుష్షష్టికళామయుఁడవు; యోగీశ్వరుఁడవు; జ్ఞానవైరాగ్యములకు నిధివి; నీనామస్మరణఁ జేయువారికిని, నీశరణుఁ జొచ్చినవారికిని, నీవు కల్పవృక్షమువంటివాఁడవు.

చౌపాయ్ 108

"ఓసుఖరాశీ! నీకు నాయందు దయయుండినయెడల, నేను నీ సేవకురాలనని తెలిసికొనుము; శ్రీరఘురాముని మాయామానుషచర్య

లను నాకు వినిపించి, నాయజ్ఞానముఁ బోఁగొట్టుము; కల్పవృక్షము నాశ్రయించినవారికి దారిద్ర్యబాధ లెట్లుకలుగును? ఓస్వామీ! ఓచంద్రమౌళీశా! ఈసంగతిని విచారించి నాభ్రమను నివారింపుము. ఓమహాప్రభూ! తత్త్వజ్ఞానమును బోధించుమహాత్ములు శ్రీరామచంద్రుఁడు పరబ్రహ్మస్వరూపమని వక్కాణింతురు. శేషుఁడు, సరస్వతి, వేదము, పురాణము- వీరందఱును శ్రీరామునిగుణములను గానముఁజేయుచున్నారు. ఓకందర్పదర్పహరా! అహోరాత్రములు నీవు సయితము రామనామమును జపించుచున్నావు. వేదపురాణములలో స్తోత్రముఁ జేయఁబడిన రాముఁడు అయోధ్యాధిపతియొక్క కుమారుఁడా, లేక నిర్గుణుఁడును, నిర్వికారుఁడును, నిరంజనుఁడునగు మఱియొకఁడా?

దోహా 119

"ఆశ్రీరాముఁడు రాజకుమారుఁడయి, భార్యావియోగమునకు దుఃఖించినయెడల, నతఁ డెటుల పరబ్రహ్మమగును? కన్నులార నతని చర్యలఁ జూచియుంటిని; చెవులార నతనిమహిమను వినియుంటిని; అతని చర్యలకును మహిమకును గలవ్యత్యాసమును నేను గ్రహింపలేదు; అది నామనస్సును కలఁతఁబెట్టుచున్నది.

చౌపాయ్ 109

"ఓస్వామీ! సర్వాంతర్యామియు, సర్వశక్తుఁడును, సర్వజ్ఞానియు, నిరంజనుఁడు నగు బ్రహ్మమునుగుఱించి నాకు బోధింపుము; అజ్ఞానముచేత నే నడిగినందులకుఁ గోపింపక, నాయజ్ఞానము విడిపోవునట్లు తత్త్వజ్ఞానమును బోధింపుము. వనములో రామునిమహిమను కన్నులార నే చూచియుంటిని; నామనోవ్యాకులముచే భయపడి, నే నప్పుడు నీతోఁ జెప్పుటకు శంకించితిని; నామనస్సు మలినముగనుక, నేను రామునిమహిమను గ్రహింపలేదు; దానిఫలము ననుభవించితిని. నేఁటి వఱకు సందేహము నన్ను విడువలేదు; చేతులనుజోడించి ప్రార్థించెదను; నన్నుఁ గటాక్షింపుము; నామీఁద నాగ్రహింపకుము; పూర్వము నాకీసంగతి బోధించితి నని తలంపక, మఱల నాకుబోధింపుము; గతించినవిషయమును గుఱించి వగచుటయేల? ఇప్పుడు నాకు మోహము లేదు; రాముని చరిత్రనువినుటయం దాసక్తికలదు; అతనిలీలామానుషచర్యలను వినిపిం

పుము; ఓభుజగరాజభూషణా! ఓసురనాయకా! నీవాక్సుధారసమును త్రాగి సంతసించెద.

దోహా 120

"నీపాదపద్మములకు శిరస్సును వంచి, చేతులను జోడించి నమస్కరించి ప్రార్థించెదను; ఓకల్యాణాత్మకా! శ్రుతిస్మృతులసారమగు శ్రీరామునితత్త్వజ్ఞానమును బోధింపుము.

చౌపాయీ 110

"నేనుస్త్రీని; ఉపదేశమునొందుట కర్హతలేదు; అయినను, మనోవాక్కాయకర్మముల నేను నీసేవకురాలను; జ్ఞానాపేక్షచే దురవస్థలో నుండినస్త్రీలు జ్ఞానోపదేశముఁబొందుట కర్హులని మహాత్ములు చెప్పుచున్నారు; ఓయోగీశా! నామనోవ్యాకులముఁ జెప్పశక్యముకాదు; నన్నుఁగటాక్షించి, నాకు రామకథఁ జెప్పుము; లెస్సగ విచారించి బోధింపుము; నిర్గుణబ్రహ్మ మెందునిమిత్తము సగుణుఁడై యవతరించెను? ప్రథమమున నీవిషయముఁ దెలియపఱుచుము; అనంతరము, రామావతారమును, రాముని బాలక్రీడలును వివరింపుము; సీతారాములవివాహమును, వారివనవాసమునకుఁ గారణముఁ జెప్పుము. అరణ్యములో వారు చేసినమహాత్కార్యములను, రావణవధయు, ఓసుశీలుఁడా! వారి పట్టాభిషేకమహోత్సవము మొదలగుకథలను వర్ణింపుము.

దోహా 121

"ఓకృపాసాగరా! రాముని రాజకీయవ్యాపారములను గుఱించియు, పురజనులతోఁగూడి రాముఁడు వైకుంఠమున కేఁగెంచినవిధమును, సాంతముగఁ జెప్పుము.

చౌపాయీ 111

"ఓదేవదేవా! అనంతరము, రామచరిత్రయొక్క తత్త్వమును బోధింపుము; మునులును జ్ఞానులు ననుభవించెడి స్వస్వరూపజ్ఞానమును; భక్తిజ్ఞానవైరాగ్యములను, విజ్ఞానమును-నీనినిగుఱించి విస్తరించి చెప్పుము. ఓస్వామీ! రామునికిసంబంధించిన తదితరగూఢచరిత్రాంశములను, ఓనిర్మలజ్ఞానస్వరూపా! ఓమహాప్రభూ! అజ్ఞానముచే నే విడిచిపెట్టిన విషయములను వివరింపుము. నీవు త్రిలోకగురుఁడవని వేదము చెప్పును;

పామరులు నీమహిమ నెటులుగ్రహింతురు?" అని పార్వతి ప్రశ్నించెను. నిష్కలుషముగ లోకోపకారార్థము పార్వతి యడిగినప్రశ్నను విని శివుఁడు సంతసించెను. శ్రీరామునిచరిత్ర మాద్యంతము నతనిమనోదృష్టికి గోచరమయ్యెను; అతనిశరీరము పులకరించెను; అతనినేత్రములానందబాష్పములతో నిండెను; శ్రీరాముని దివ్యమంగళవిగ్రహ మతనిమనోదృష్టిలోఁ గనఁబడెను; అపరిమితానందములో నతఁడు మునిఁగెను.

దోహా 122

రెండుఘడియ లతఁడు రాముని ధ్యానించెను; అనంతర మతఁడు నేత్రములను విప్పి, సంతోషముతో రామునిచరిత్రమును వర్ణింప నారంభించెను.

చౌపాయ్ 112

"త్రాడనుసంగతి తెలిసినతరువాత, నది పామనుభయము పోవును; జాగ్రదవస్థలోనికి వచ్చినతరువాత స్వప్నావస్థలో ననుభవించినవిషయము లబద్ధములని తోఁచును; అటులనే ఆత్మజ్ఞానము కలిగినతరువాత, నీజగత్తు మిథ్యయనితోఁచును. బాలరామునకు నమస్కరించెదను; అతని నామస్మరణవలన సర్వకార్యములు నెరవేఱును; సమస్తజనులకును బాలరాముఁడు సాధ్యుఁడు; ఓమంగళధామా! ఓఅమంగళహారా! దశరథుని యంగణములోఁ దప్పటడుగులు వేయుచుండిన యోబాలరామా! నన్ను కృపతోఁజూడుము." అని శివుఁడు శ్రీబాలరాముని ధ్యానించి, తేనె లుట్టిపడుచుండినవాక్యములతో నిట్లు ప్రసంగించెను. "ఓపార్వతీ! నీవు ధన్యురాలవు; నీవంటిలోకోపకారులు మఱియొకరు లేరు; నీ వెంతధన్యురాలవు- గంగానదివలెఁ ద్రిలోకములను పావనముఁజేయు శ్రీరామచరితమును వినఁదలఁచియుంటివి; నీకు రామునిచరణకమలము లయం దనురాగము కలదు; అయినను, పరోపకారార్థము నీవు నన్నడిగితివి.

దోహా 123

"ఓపార్వతీ! శ్రీరామునికృపవలన స్వప్నమందయినను, నీకు మోహమును, శోకమును, సందేహమును, భ్రమయుఁ గలుగవు; ఇది నానిశ్చితాభిప్రాయము.

## చౌపాయ్ 113

"ఓయుమా! తెలిసికొనవలసిన విషయములను చక్కగ నీ వడిగితివి; వానికి సమాధానములను వినినను చెప్పినను శుభములు కలుగును. శ్రీరాముని చరిత్రమును వినని చెవులు పాముపుట్టలతో సమానము; శ్రీరాముని దర్శింపని నేత్రములు నెమలికన్నులంబోలును; భగవంతుని చరణారవిందములకు నమస్కరింపని శిరస్సు చేదుసొఱకాయవంటిది; శ్రీరామునియందుఁ గలభక్తిచేతఁ బరవశము కాని మనుజులు జీవచ్ఛవములు; రాముని గుణములను సంకీర్తనముఁ జేయని మనుజులు చెకచెకలాడు కప్పలవంటివారు; భగవంతుని చర్యలను విని, సంతసింపని మనుజుల హృదయములు వజ్రమువలె నభేద్యములనియు కఠినములనియు గ్రహింపుము. ఓగిరిరాజకన్యా! శ్రీరాముని చర్యలఁ జెప్పుచున్నాను; వినుము; ఆచర్యలు దేవతలకు సుఖమును, దైత్యులకు దుఃఖము నిచ్చును.

## దోహా 124

"శ్రీరామకథ కామధేనువుతో సమానము; అతనిని సేవించుట వలన సర్వసుఖములు కలుగును; మహాత్ములసభ వైకుంఠముతో సమానము; ఈసంగతిఁ దెలిసికొని, ఎవఁడు రామకథను వినకయుండును ?

## చౌపాయ్ 114

"రామనామమనే సుందరకరతాళములు మ్రోఁగించిన యెడల సంశయములనే పక్షు లెగిరిపోవును; పార్వతీ! కలియుగపాపము లను నట్టివృక్షమును వ్రేళ్లతోఁ బడఁద్రోయుటకు రామకథ గొడ్డలివంటిది; కనుక, దానిని శ్రద్ధతో వినుము. శ్రీరాముని గుణములును, చరిత్రయును, ఆజన్మాంతచర్యలును, అనంతములని వేదములు ఘోషించుచున్నవి; ఎటుల రాముఁ డనంతుఁడో, అతని చరిత్రయుఁ, గీర్తియు, గుణములు ననంతములు. నీకు రామకథ వినుటయందభిలాష కలదు, కనుక నాబుద్ధికిఁ దోఁచినప్రకారము వేదములోఁ జెప్పినవిధమున నేనాకథఁ జెప్పుచున్నాను; వినుము. ఓప్రియురాలా ! నీప్రశ్న శ్రేయోదాయకము; శ్లాఘనీయము; సర్వసుజనసమ్మతము; దానిని నేను సహితము మోదించెదను. అయినను, ఓఅపర్ణా! అజ్ఞానముచే నీవొకమాటఁ జెప్పియుంటివి; ఆమాటమాత్రము నాకు విన నింపుగ లేదు; 'వేదములోఁ

జెప్పఁబడిన రాముఁడును, మునులు ధ్యానించునట్టి రాముఁడును-ఇతఁడా-లేక మఱియొకఁడా?' అని నీవు శంకించి నన్నడిగితివి.

దోహ 125

"అజ్ఞాన మను నట్టిపిశాచము పట్టిన నీచు లావిధమునఁ జెప్పుచుందురు; సత్యాసత్యముల విచక్షణ లేని నీచులు పాషండులు- హరిపరాఙ్ముఖులు ఆటుల వక్కాణింతురు.

చౌపాయ్ 115

"అజ్ఞానులు, మందభాగ్యులు, శాస్త్రజ్ఞానము లేని యంధులు—వీరిమన స్సనునట్టి దర్పణమును విషయములనునట్టి మలినము కప్పియుండును; సంసారలంపటముగలవారును, కపటస్వభావులును, కుటిలవర్తనులును, మూర్ఖులును, స్వప్నమందయినను మహాత్ములను సందర్శింపనివారును, వేదమునకు విరుద్ధముగఁ బ్రసంగించు పాషండులును, లాభాలాభముల గుర్తెఱుంగనివారును, మలినహృదయములతోఁగూడి శాస్త్రజ్ఞానము లేనివారును—వీరు రాముని నిజరూపము నెట్లు గ్రహింపఁగలరు? వారికి సగుణనిర్గుణజ్ఞానము లేదు; వా రనేకపిచ్చిమాటలఁ జెప్పుచుందురు; వారు భగవంతునిమాయకు లోఁబడి సంసారములో మునిఁగియుందురు; వారిమాయాప్రపంచము ననుసరింతురు; ఏవిధమున నట్టి వారిని బోధింపఁగలము? వాతరోగముచే బాధపడువాఁడును, పిశాచముపట్టినవాఁడును, మద్యపానముఁ జేసినవాఁడును—వీరు బుద్ధిహీనులు; వీరిమాట లనుచితములు; మహామోహముచే మదించియుండినవారు కనుక, వారిప్రసంగములఁ జెవిపెట్టరాదు; వారిమాటలలో రసము లేదు.

సోరఠా 16

"ఈసంగతులను లెస్సగ విచారించి, ఓపార్వతీ! నీసందేహమును విడిచి, రామునిచరణారవిందములయందు నిశ్చలభక్తిని నిలుపుము; ఓగిరిరాజకుమారీ! వినుము; నామాట లనునట్టి సూర్యకిరణములు నీ యజ్ఞానాంధకారమును విడఁగొట్టును.

చౌపాయ్ 116

"సగుణమునకును నిర్గుణమునకును భేదము లేదని మునులును బండితులును, వేదపురాణములును చాటుచున్నవి. సంసారగుణరహి

తుఁడును, రూపరహితుఁడును, జన్మరహితుఁడు నగుపరబ్రహ్మము భక్తుల యందుఁగల ప్రేమచేత సగుణుఁడై జన్మించును. నామరూపములులేని వానికి నామరూపము లెట్లుఁ గలుగును? నీరు చలిచేత ఘనీభవించి మంచు గడ్డయయినవిధమున, నీశ్వరుఁడు సగుణరూపమును ధరించును. ఆబ్ర హ్మము శుద్ధజ్ఞానస్వరూపుఁడు కనుక నతనిని మోహాంధకారము స్పృశిం పదు. శ్రీరాముఁడు సచ్చిదానందమూర్తి, జ్ఞానస్వరూపుఁడు; అందుచేత నతనికి అజ్ఞానమను రాత్రిలేదు; కనుక, నతనికి జ్ఞానోదయము లేదు; సూర్యునకు దివారాత్రము లనునట్టిభేదము లేదుకదా! మోహములోఁ బడినవారికి దివారాత్రములుకలవు; అటులనే, భగవంతునకు- సచ్చిదా నందమూర్తికి- మోహము లేదు. అతనికి ద్వంద్వములు లేవు; హర్ష విషాదములును, జ్ఞానము అజ్ఞానమును, అహంకారమును, అభిమాన మును- ఈగుణములు శరీరధారులగు జీవులకుఁ గలవు; పరమాత్మకు లేవు; శ్రీరామబ్రహ్మము సర్వవ్యాపకుఁడు, సచ్చిదానందమూర్తి, పురా ణపురుషుఁడు, మాయాతీతుఁడు,

దోహా 126

"జ్యోతిస్వరూపుఁడు, మాయకు లోఁబడనివాఁడు, జీవనా థుఁడు, రఘుకులమణి-నాకు నాథుఁడు, గురుఁడు, దైవము" అని శివుఁ డు స్తుతించి, శిరస్సువంచి నమస్కరించెను.

చౌపాయ్ 117

"జ్ఞానహీనులు మోహముచేత నతనిని గ్రహింపలేరు; పరమా త్మను దెలిసికొనలేక, వారు తమయజ్ఞానము నతనియందు నిరూపిం తురు; మేఘము లావరించియుండినపుడు, జీవులకు సూర్యుఁడు కనఁబ డఁడు; కాని వానివలన సూర్యునకు నష్టములేదుకదా! వ్రేళ్లమధ్యనుండి చంద్రమండలముఁ జూచినపుడు, రెండుమూడుచంద్రబింబములు కనఁ బడును; నిజముగ చంద్రబింబ మొకటియేకదా! ఓయుమా! మేఘము గాని, ధూమముగాని, ధూళిగాని, ఆకాశముయొక్క నిర్మలత్వముఁ బోఁగొట్టఁజాలవు; అటులనే, జీవులమోహము- అజ్ఞానము- రామబ్ర హ్మముయొక్క నిర్మలత్వముఁ జెడగొట్టఁజాలవు; పరబ్రహ్మము వాస్తవ ముగ స్వచ్ఛము; నిష్కళంకము. కర్మేంద్రియములును, జ్ఞానేంద్రియము

లును, వాని యధిదేవతలును, జీవాత్మయు- వీనికి స్వప్రకాశము లేదు; ఆపరమాత్మ యొక్క ప్రభావముచే వీనికిఁ జైతన్యమును, ప్రకాశమును కలుగుచున్నవి. అతనిప్రభావము-కళ-లేనిచో, నివియన్నియు జడముల గును; సమస్తపదార్థములు, చేతనాచేతనములకు బ్రహ్మము జీవనాధారము; అతనిప్రభావమువలన నాపదార్థములకు జీవకళవచ్చును; ఆజీవ కళయే బ్రహ్మము అని తెలిసికొనుము. ఆబ్రహ్మము, ఆపరంధాముఁడు, ఆపరాత్పరుఁడు, ఆపరమజ్యోతియే శ్రీరామమూర్తియని గ్రహింపుము. జీవకళతోఁ బ్రకాశించుపదార్థములన్నియు శ్రీరామస్వరూపము; ఈమాయయంతయు నతనికి వశమైయుండును; అతఁడు సకలగుణధాముఁడు; జ్ఞానమూర్తి; అతనిసత్ప్రభావముచే, నీ జడమగు లోకము, మాయ యొక్కమహిమచేత, సత్యమని తోఁచుచున్నది.

దోహా 127

"అసత్యమగులోకముఁ జూచి జీవులు దానిని సత్యముగ భావింతురు ; భూతభవిష్యద్వర్తమానకాలములలో భగవంతునిమాయకు లోఁబడనిజీవులులేరు; చంద్రకిరణములు ముత్యపుచిప్పలోఁ బ్రకాశించునపుడు, జనులు దానింజూచి వెండియనియు, సూర్యకిరణములకాంతిం జూచి జలమనియు భ్రమింతురు; అటులనే జీవులీజగత్తుఁ జూచి మోహింతురు.

చౌపాయ్ 118

"భగవంతునకును జగత్తునకును గలసంబంధమిట్టిది యని గ్రహింపుము; జగత్తసత్యమయినను, దుఃఖముఁ గలిగించును; శిరస్సు ఛేదింపఁబడినట్లు కలగనినమనుజుఁడు జాగ్రదవస్థలోనికివచ్చువఱకు దుఃఖపడును; మేల్కొనినతరువాత వానికి దుఃఖముపోవును; ఈమాయ సంసారములో నుండినమనుజుఁడు- జీవుఁడు- సుఖదుఃఖములఁ దాను స్వయముగా ననుభవించుచుంటినని తలఁచి భ్రమించును; ఎప్పు డాజీవున కాత్మజ్ఞానము కలుగునో, అప్పుడు వానికి సుఖదుఃఖము లుండవు; ఆజీవుఁడు వానిని యనుభవింపఁడు; కేవలము చిదానందములోనుండును; ఆత్మజ్ఞానము కలుగుటయే సంసారములోనుండి మేల్కొనుట. ఆపర మాత్ముని కృపవలన మాయ వీడిపోవును; ఓపార్వతీ! శ్రీరామమూర్తి

దయాసముద్రుఁడు; ఆద్యంతములులేనివాఁడు; పొగఁజూచి, నిప్పుకలదని చెప్పఁగలవుకదా! చేయఁబడినకార్యముఁ జూచి, దానికారణము నూహింపఁగలవు; ఈజగత్తు సృష్టింపఁబడెను; కారణములేక కార్యము జరగనేరదుకదా! అందుచేత, ఈజగత్తునకుఁ గారణమేది? ఆకారణమే మూలకారణము; అదియే పరబ్రహ్మము- సత్తామాత్రమనియు, చైతన్యమనియు, ఆనందమనియు, వేదములు ఘోషించుచున్నవి. ఆసత్పదార్థము పాదములులేకనడచును; చెవులులేకవినును; చేతులులేకయే సర్వకార్యములం జేయును; ముఖములేకయే సమస్తరుచుల ననుభవించును; వాక్కులులేకయే ధారాళముగఁ బలుకును; శరీరములేకపదార్థములను స్పృశించును; నేత్రములులేకయే సర్వముఁ జూచును; నాసికలేకయే గంధముల నాఘ్రాణించును ('అపాణిపాదో జవనోగ్రహీతా పశ్యత్యచక్షుః సశృణోత్యకర్ణః। సవేత్తివేద్యం నతస్యాస్తివేత్తా తమాహురగ్ర్యం పురుషం పురాణం' అని శ్రుతిప్రమాణము). ఆసత్తుయొక్క వ్యాపారము లలౌకికములు; దానిమహిమఁ జెప్పుటకు శక్తిలేదు.

దోహా 128

"ఆపరమాత్మనుగుఱించియే వేదములు చెప్పుచున్నవి; ఆపరమాత్మనే జ్ఞానులు ధ్యానింతురు; ఆసత్పదార్థమునే పండితులు గానముఁ జేయుదురు; ఆపరమాత్మయే దశరథరాజకుమారుఁడై జన్మించెను; అతఁడే కోసలదేశాధిపతి; అతఁడే లోకోపకారియగు శ్రీరామచంద్రపరబ్రహ్మము అని తెలిసికొనుము.

చౌపాయ్. 119

"ఆరామనామమహిమచేతఁ గాశీనగరములో మృతినొందినజీవులకు ముక్తి నిచ్చుచుంటిని; ఆరామప్రభువు సర్వాంతర్యామి; సకలచరాచరములకు నాథుఁడు; అతఁడే నాస్వామి; రామనామమును స్మరించిన మనుజునియొక్క జన్మార్జితపాపసంచయములన్నియు క్షణములో నశించును; భక్తిశ్రద్ధలతో నతనినామమును జపించినమనుజుఁడు, గోష్పదమువలె, సంసారసాగరమును దాఁటును. ఓపార్వతీ! శ్రీరాముఁడు పరమాత్మయని తెలిసికొనుము; అతనివిషయమై భ్రమపడి నీవుపలికిన పలుకులయోగ్యములు; అట్టిసందేహమునొందినయెడల నీజ్ఞానమును, వై

రాగ్యమును, సుగుణములును నశించును.” అని శివుఁ డామెకు బోధించెను. అతనిబోధనవలన, నామె భ్రమయు, మోహమును విడిపోయెను. ఆమెకు రామునిచరణకమలములం దత్యంతభక్తివిశ్వాసములు కలిగెను; దారుణమగు నామెయొక్కయపనమ్మకము పోయెను.

దోహా 129

మఱలమఱల శివుని చరణకమలములఁ బట్టుకొని, చేతులజోడించి, పార్వతి మృదుమధురవచనములతో నిట్లు ప్రసంగించెను:—

చౌపాయీ 120

“ఓస్వామీ! శరత్కాలసూర్యుని వేడిమితో సమానమగు నా మోహము, చంద్రకిరణములవంటి నీవాక్సుధారసమువలన, శాంతించెను; ఓదీనదయాపరా ! నీకటాక్షమువలన, నాసందేహములు నశించెను; రామునిస్వరూపజ్ఞానము నాకు బోధపడెను; మీ కటాక్షమువలన నాదుఃఖము పోయెను. మీప్రసాదమువలన నాకు స్వాస్థ్యముకలిగెను; నేను మీ సేవకురాలను; నేను స్త్రీని; స్వభావముచే మూర్ఖురాలను; మీకు నాయందు దయయుండినయెడల, నా మొదటిప్రశ్నలకు జవాబుదయచేయుఁడు; రాముఁడు పరబ్రహ్మమనియు, సచ్చిదానందస్వరూపుఁ డనియు, అవినాశియనియు, నిరంజనుఁ డనియు, సర్వహృదయాంతరాళములలో నివసించువాఁ డనియు చెప్పియుంటిరి; ఓస్వామీ! రాముఁ డట్టివాఁ డయినపుడు, మనుజునివలె నెందుకు జన్మించెను? ఈసంగతి నాకు బోధించిచెప్పుఁడు” అని పార్వతి యడిగెను. పార్వతియొక్క పరమపవిత్రమగు వచనములను విని, ఆమెకు రామకథనువినుటయం దాసక్తికలదని తెలిసికొని,

దోహా 130

కామునిఁజంపిన సాంబశివుఁడు, సర్వజ్ఞుఁడు, ప్రసన్నుఁడై అనేకప్రకారముల పార్వతిఁ గొనియాడి, రామకథఁ జెప్పనారంభించెను:-

సోరఠా 17-18-19

“ఓపార్వతీ! ఉజ్జ్వలమగు రామచరిత్రము మానససరోవరమువంటిది; ప్రథమమునఁ గాకభుశుండి, యీవిషయమును పక్షిరాజగు గరుత్మంతునితోఁ జెప్పెను; వారిసంవాదముఁ జెప్పి, తదనంతరము పరమ

పవిత్రమగు రామచరిత్రము వర్ణించెదను; వినుము; పరమేశ్వరునిగుణము లును నామము నపారములు; అతనిచర్యలును యవతారములు ననంత ములు; నాబుద్ధికిఁ దోఁచినవిధమునవానిని వివరించెదను; భక్తిశ్రద్ధలతో నాకర్ణింపుము.

చౌపాయి 121

"ఓగిరిజా! వేదశాస్త్రములలోఁ జెప్పినప్రకారము, భగవంతుని లీలావతారములను వివరించెదను; వినుము; సర్వేశ్వరునియవతారము నకుఁ గారణ మిదియని నిరూపించిచెప్పుటకు శక్యముకాదు. ఓపార్వతీ! మనోవాక్కులచేతనుగాని బుద్ధిచేతనుగాని, రాముఁ డిట్టివాఁడని పలు కుటకు వీలుపడదు; నాబుద్ధిచేత నే నతనిని గ్రహింపలేదు; వేదపురాణ శాస్త్రములును, మునులును, యోగులును- వారివారిబుద్ధికొలది పరమే శ్వరునిగుఱించి కొంచెముకొంచెము చెప్పియుండిరి; కాని, పూర్తిగఁ జెప్పలేదు; ఓపద్మముఖీ! నేను గ్రహించినవిధమున నే నాకారణమును నీకు వివరించెదను. దుర్మార్గులు ప్రభవించి, బ్రాహ్మణులకును, దేవతలకును, గోవులకును, భూమికిని, అలజడిఁదెచ్చి, ధర్మమునకు హానిఁదెచ్చినపుడు, భగవంతుఁ డవతరించును; దుష్టులను శిక్షించి, సాధువులను రక్షించి, ధర్మమును స్థాపించును; ఏయుగములలో నధర్మము ప్రబలమగునో, ఆ యుగములలో భగవంతుఁ డవతరించును.

దోహా 131

"పరమేశ్వరుఁ డవతరించి, రాక్షసులను సంహరించి, దేవతలను స్థాపించి, వేదమర్యాదలను నిలువఁబెట్టును; జగత్తులో నతనిప్రఖ్యా తను వ్యాపించును; రామావతారములకుఁ గారణ మిదియని తెలిసి కొనుము.

చౌపాయి 122

"భగవంతుని లీలావతారములను గానముఁజేసి, మహాత్ములు సం సారసాగరమును దాఁటుదురు; భక్తులనుద్ధరించుటకతఁ డవతరించును; పరమదయాళుఁడగు శ్రీరాముని జననమున కనేకకారణములు కలవు; ఒకదానికంటె నొకటి విచిత్రముగనుండును. ఒకటి రెండుజన్మముల గుఱించి చెప్పుచున్నాను; ఓబుద్ధిమంతురాలా, పార్వతీ! భక్తిశ్రద్ధలతో

వినుము. జయవిజయు లనుపేర్లుగల యిరువురుద్వారపాలకులు వైకుంఠముసో( గలరు; ఆసేవకులమీఁద భగవంతునకుఁ బ్రీతికలదు. ఒకసమయమున నారాయణమూర్తిని దర్శించుటకు సనకసనందనసనత్కుమారసనత్సుజాతులు వైకుంఠమునకుఁబోయిరి; అభిమానము చేత నాయిరువురు ద్వారపాలకులు, భగవంతునిసెలవులేక లోనికిఁ బోఁగూడదని చెప్పి, ఋషులను ద్వారమువద్ద నిలువఁబెట్టిరి; అందు చేత వారికిఁగోపమువచ్చి, 'మూఁడుజన్మములు మీరిరువురురాక్షసులై పుట్టి, తదుపరి ముక్తిఁబొందుదురుగాక' అని ఋషులు శాపము బెట్టిరి; ఆవిప్రులశాపము చేత, నొక జన్మములో వా రిరువురును హిరణ్యాక్ష హిరణ్యకశిపులై పుట్టి, త్రిలోకములను బాధించిరి; దేవేంద్రునిగర్వమును వారు పడఁగొట్టిరి; అప్పుడు భగవంతుఁడు వరాహావతారము నెత్తి హిరణ్యాక్షుని యుద్ధములో వధించెను; నరసింహరూపమును ధరించి హిరణ్యకశిపుని సంహరించెను; భక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదునిచరిత్రము సుప్రసిద్ధము.

దోహా 132

"రెండవజన్మలో వారిరువురును రావణకుంభకర్ణులై జన్మించి, లోకములఁ బీడించి, దేవతలను సయితము స్వాధీనముఁజేసికొనిరి; వారి చర్యలు లోకములో వెల్లడియయ్యెను.

చౌపాయ్ 123

"మూఁడుజన్మములవఱకును ముక్తిలేదని వారికి మునులు శాపమిడిరి; అందు చేత, భగవంతునిచేతిలో వారు చనిపోయినను, వారికి ముక్తిలేకపోయెను. భక్తుల ననుగ్రహించుటకు భగవంతుఁ డవతరించెను; అదితియే కౌసల్యాదేవియై పుట్టెను; కశ్యపుఁడు దశరథుఁ డను పేరుతో జన్మించెను. ఒకసమయమున వారిగర్భమున భగవంతుఁ డవతరించెను. మూఁడవజన్మములో వారిరువురు శిశుపాలదంతవక్త్రులై పుట్టిరి; ఆకల్పములో భగవంతుఁడు కృష్ణావతారుఁడై, వారిని సంహరించి, లోకములో ధర్మమును స్థాపించెను. ఒకకల్పములో జలంధరుఁ డనురాక్షసుఁడు దేవతలరాజ్యము నపహరించెను; వారిదుఃఖముఁ జూచి, శివుఁడు వానితోననేకపర్యాయములుయుద్ధముఁజేసినను, వానింజంపలేకపోయెను. ఆరాక్షసునిభార్య మహాపతివ్రత; కనుక వానిని శివుఁడు సంహరింపలేకపోయెను.

దోహా 133

"అప్పుడు దేవకార్యమును సాధించుటకు భగవంతుఁ డొక యుపాయము బన్ని, యామె వ్రతమును భంగపఱచెను; భగవంతుఁడు చేసినమర్మము నామె తెలిసికొని, అతనిని శపించెను.

(జలంధరుని భార్య మహాపతివ్రత; ఆమె ప్రభావముచే వానికి మరణము లేదని తెలిసికొని, ఒకసమయమున విష్ణువు సాధురూపమును ధరించి, వాని ద్వారమువద్ద కూర్చుండెను; అప్పుడు జలంధరుఁడు శివునితో యుద్ధముఁ జేయుచుండెను; సింహద్వారమువద్దకు సాధువువచ్చిన సంగతిని విని, భర్తయొక్క క్షేమసమాచారముఁ దెలిసికొనుట కామె బయటకువచ్చెను; అంతట, జలంధరుని శిరస్సును, మొండెమును, పాదములును, హస్తములును, విష్ణుమాయవలన నామెయెదుటఁ గన్పడెను; వానిఁ జూచి యామె దుఃఖించుచుండెను; ఆమెవిలాపముఁ జూచి, "ఓతల్లీ! ఎందుకుదుఃఖించెదవు; ఈముక్కలను నీవు సంధిఁ జేయుము; నీవ్రతమాహాత్మ్యముచేత, నీభర్త సజీవుఁడగును" అని విష్ణువు చెప్పెను. ఆసాధువువచనములను విని, ఆప్రకారముఁ జేయఁదలఁచి, ఆముక్కల నామె స్పృశించెను; అంతట నవి మాయమయ్యెను; సాధు వంతర్ధానమయ్యెను. ఆమెపాతివ్రత్యమునకు భంగముకలిగినందున, శివుఁడు జలంధరుని సంహరించెను. విష్ణుమూర్తి చేసినమాయఁ గనుఁగొని, "ఓస్వామీ! పతివియోగమునకు నేను దుఃఖించువిధమున, నీవునీభార్యా వియోగమునకు శోకింపుము; నాభర్తయే నీభార్య నపహరించునుగాక" అని యామె శపించెను.)

చౌపాయ్ 124

"పరమకృపాసింధుయగు సర్వేశ్వరుఁడు మాయామానుషరూపమును ధరించి, ఆశాపము ననుభవించెను; ఆజలంధరుఁడు రావణుఁడై పుట్టెను; వానిని శ్రీరాముఁడు సంహరించెను; అప్పుడు వాఁడు ముక్తినొందెను ఒకయవతారమునకుఁ గారణ మిది; అందుచేత, భగవంతుఁడు మనుజుఁడై పుట్టెను; ఒక్కొక్కయవతారమున కొక్కొక్కకథకలదు; ప్రతికథను మునులును కవీశ్వరులును వర్ణించిరి. ఒకసమయమున నారదుఁడు శపించినందున, నొకకల్పములో భగవంతుఁడవతరించెను." అని

శివుఁడు చెప్పిన యామాటలను విని, పార్వతి యాశ్చర్యపడి, "ఓస్వామీ! నారదుఁడు విష్ణుభక్తుఁడు; మహాజ్ఞాని; భగవంతుఁడు, లక్ష్మీపతి, యేమియపరాధముఁ జేసెను; ఎందుచేత నారదునకుఁ గోపమువచ్చెను? అతఁడు మునీశ్వరుఁడుకదా! ఎందు కతనిమనస్సు భ్రమించెను? దానికిఁ గారణము నాకు బోధపడలేదు" అని శివుని నామె ప్రార్థించెను.

దోహా 134

అప్పుడు శివుఁ డామెపలుకులనువిని, నవ్వి, "ఓపార్వతీ! జ్ఞానియయిననేమి, మూర్ఖుఁడయిననేమి? భగవంతుఁడు,- రామచంద్రుని యిచ్ఛానుసారము ప్రతిమనుజుఁడును సమయమువచ్చినపుడు మార్పునొందును.

సోరఠా 20

"ఓభరద్వాజా! శ్రీరామునిగుణములను వర్ణించుచున్నాను; వినుము" అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను; ఓతులసీ, మానావమానములను విడిచి, భగవంతుని భజింపుము; సంసారభయము నతఁ డపహరించును.

చౌపాయ్ 125

"హిమవత్పర్వతమువద్ద నొకపవిత్రమగు గుహాకలదు; దానికి సమీపమున గంగానది ప్రవహించును; ఈపవిత్రమయిన ఋష్యాశ్రమ మత్యంతరమణీయముగ నుండినందున, నారదుఁడు దానింజూచి సంతసించెను. పర్వతములను, నదులను, వనములను, నారదుఁడు చూచి, వాని శోభకు సంతసించెను; అంతట నతనికి భగవంతునియందు ప్రేమ యతిశయించెను; అతఁడు హరినిధ్యానించుట కారంభించెను; దక్షప్రజాపతి యొక్క శాపము నిష్ఫలమయ్యెను; నారదుఁడు సమాధిలోఁ బ్రవేశించెను; యోగముచే వాయువులను బిగించి, వానిని క్రమముగ సహస్రారమునందు నిలువఁబెట్టి, అతఁడు భగవంతుని ధ్యానించుచుండెను. నారదునివైఖరిఁ జూచి, ఇంద్రుఁడు భయపడి, మన్మథునిఁబిలిచి, ఆదరించి, "ఓయిమదనా; నీయనుచరులతోఁగూడి నీవు నారదునివద్దకుఁ బోయి, యతనితపస్సును విఘ్నముఁ జేయుము" అని బోధించి, వానినిఁ బంపెను. ఆతక్షణము కాముఁడు బయలువెడలెను; "ఈనారదుఁడు నా

త్రిలోకాధిపత్యము నపహరించు న''నితలఁచి, దేవేంద్రుఁడు భయపడెను. దొంగతనముఁజేసిన కాకివలె, లోభివాండ్రును గామార్తులును లోకములో నందఱికిని భయపడుచుందురు.

దోహా 135

ఎండిన యెముకను నోటఁగఱచికొని, కుక్క సింహముంజూచి, "ఈమృగరాజు నానోటనుండు యెముక నపహరించును" అని తలఁచి పరుగెత్తును; అటులనే, సిగ్గునువిడిచి, దేవేంద్రుఁడు నారదునిఁజూచి భయపడెను. ఇంద్రునిపిచ్చితనమును నేనేమి చెప్పఁగలను?

చౌపాయ్ 126

నారదునియాశ్రమమునకుఁ గందర్పుఁడు వచ్చి, దర్పించి, వసంత ఋతువును బ్రకటించెను; అన్ని వృక్షములును నానాప్రకారములఁ జిగిరించి పుష్పించెను; కోకిలాలాపములు వినఁబడెను; తుమ్మెదలు ఝుంకారముఁ జేయుచుండెను. శీతల మందసుగంధవాయువులచే మదనాగ్ని ప్రజ్వరిల్లెను; కామశాస్త్రప్రవీణులగు రంభాద్యప్సరస్త్రీలు వినోదముగ గానముఁజేసిరి; తమసర్వాంగములు దృగ్గోచరమగునట్లభినయించి, వారు నృత్యముఁజేసిరి; వారు చేసినసహాయమునకు సంతసించి, మదనుఁడు మఱింత విజృంభించెను. వానిమాయలకు నారదుఁడు లోఁబడలేదు; పాపాత్ముఁ డగు మనోభవుఁడు భయపడెను; రమాపతి యొక్క సంరక్షణలోనుండిన మనుజుల నెవరు పడఁద్రోయఁగలరు ?

దోహా 136

అప్పుడు కామదేవుఁడును నతని యనుచరులును తమపరాభవము నొప్పుకొనిరి; వారు నారదునివద్దకువెళ్లి, యతనిచరణములఁ బట్టుకొని, వ్యాకులచిత్తముతో వారు తమయపరాధమును క్షమింపుఁడని యతనిం బ్రార్థించిరి.

చౌపాయ్ 127

వారియెడల నారదునకు మనస్సులోఁ గ్రోధములేదు; అతఁడు తియ్యనిమాటలఁ జెప్పి, వారికి సంతోషమునిచ్చెను; అతనిచరణములకు నమస్కరించి, యతనివద్ద సెలవుగైకొని, యనుచరులతోఁగూడ మన్మథుఁడు స్వర్గమునకుఁబోయెను. తాను చేసినపనులను నారదుని సుశీల

మును మన్మథుఁడు దేవసభలో ముచ్చటించెను; కాముని ముచ్చటను విని, సభవారు సంతసించి, నారదునిఁ గొనియాడి, శ్రీమన్నారాయణునిఁ బలువిధముల నుతించిరి. అనంతరము నారదుఁడు శివునిఁ జూచుటకు వెళ్లెను; కాముని జయించినందున, నతనికి నభిమానము బలిసెను. అతఁడు కాముని చర్యలను శివునకు వ్యక్తపఱచెను; అతనియందుఁ గల ప్రేమచేత నతనికి శివుఁడు హితము నుపదేశించెను: "ఓనారదా! నీవు నాతోఁ జెప్పిన ప్రసంగమును మాత్రము హరితోఁ జెప్పకుము; నిన్ను వేఁడుకొనియెదను; ఒకసమయమున నీప్రసంగము వచ్చినను, సాధ్యమగునంతవఱకు దానిని గోప్యముఁ జేయుము" అని శివుఁడు నారదునకు బోధించెను.

దోహా 137

శివుని హితోపదేశము నారదునిమనస్సున నాఁటలేదు; అతఁడు దానిని మన్నింపలేదు; ఓభరద్వాజా! తదనంతరము జరిగినముచ్చటను వినుము; భగవదేచ్ఛ బలీయముకదా!

చౌపాయ్ 128

భగవంతుని యిచ్ఛానుసారము కార్యములు నెరవేఱును; అందుకు వ్యతిరేకము జరగదు; శివుఁడు చెప్పినమాటలను నారదుఁడు పాటింపలేదు; అంతట నారదుఁడు బ్రహ్మలోకమునకు వెళ్లెను. అచ్చట నతఁడు వీణెను మీటుచుఁ, భగవంతుని గుణానుకీర్తనములఁ బాడెను. అనంతర మతఁడు శ్రీనివాసుని దర్శించుటకు క్షీరసముద్రమునకు వెళ్లెను; అప్పుడు లక్ష్మీపతి యాసనముపైనుండి లేచి నారదున కెదురుగ వెళ్లి, యాతనిం దీసికొనివచ్చెను: వారిరువురు నొకయాసనముపై సుఖోపవిష్టులై యుండిరి; "ఓమునిరాజా! అనేకదినములకు మిమ్ములను దర్శించు భాగ్యము నాకుఁ గలిగెను" అని జగదీశుఁడు నారదునితోఁ బలికెను శివుఁడు నిషేధించియుండినను, మన్మథుని వృత్తాంతమంతయు భగవంతునితో నతఁడు పూసగ్రుచ్చినట్లుఁ జెప్పెను; పరమేశ్వరుని మాయ ప్రబలమయినది; లోకములోఁ బుట్టినమనుజు లెవరు దానికి లోఁబడరు?

దోహా 138

ముసిముసినవ్వులు నవ్వి, "నీనామమును స్మరించినమాత్రమున,

మోహమును, అభిమానమును, అజ్ఞానమును బోవునుగదా!" అని భగవంతుఁడతనిని స్తుతించెను.

చౌపాయ్ 129

"ఓమునిరాజా! జ్ఞానవైరాగ్యములులేనివారు మోహమునకు వశ్యులగుదురు; నీవు అఖండబ్రహ్మచారివి; బుద్ధిమంతుఁడవు; జితేంద్రియుఁడవు; నీవంటివానిని మోహము బాధింపగలదా!" అని విష్ణుమూర్తి యతనిని హెచ్చరించెను. "ఓనాథా! ఇది యంతయు నీకృపవలనఁ గలిగెను" అని దురభిమానముతో నారదుఁడు పలికెను. "ఓ హరా! ఇతనిమనస్సులో గర్వము దృఢముగ నంకురించెను; నా సేవకులను రక్షించుటయే నావ్రతము కనుక, నే నతనికి గర్వప్రాయశ్చిత్తము శీఘ్రముగా చేయవలెను; నేనొకయుపాయముఁ దలఁచితిని; దానినిఁ బ్రయోగించి, కౌతుకముఁ జూచెదను. ఇతనికి శుభముకలుగుఁగాక" అని కరుణానిధియగుసూత్రధారుఁడు సూత్రముల నల్లెను. స్వామిచరణకమలములకు నమస్కరించి, సెలవుఁగైకొని, దురభిమానముతో నారదుఁడు వెడలెను. ఆవెంటనే సూత్రధారుని కోరికప్రకారము నటివచ్చి సూత్రములఁ బన్నెను; ఆపన్నాగమును వినుము.

దోహా 139

సూత్రకారుఁడు నారదునిమార్గములో నూరుయోజనముల విస్తీర్ణముగల నొకపట్టణమును గల్పించెను; దానిరచన వర్ణింపఁజాలను; దానిసొగసు వైకుంఠమును మించియుండెను.

చౌపాయ్ 130

ఆనగరములోని స్త్రీపురుషులు ముద్దులుమూటఁగట్టుచుండిరి; స్త్రీలు చక్కనిచుక్కలు; అవతరించిన రతీదేవివలెనుండిరి; పురుషులు మన్మథునిఁ దిరస్కరించుచుండిరి; ఆనగరపురాజు శీలనిధి; అతనికి లెక్కలేనిచతురంగబలములుకలవు; వైభవములో నింద్రునితో నతఁడు సమముగనుండెను; అతనిరూపమును, బలమును, తేజస్సును, నీతియుఁ జూచి, లోకము సిగ్గుపడును; ఆరాజుకూఁతురు, విశ్వమోహిని, యొక్క చక్కఁదనముఁజూచిలక్ష్మీసహితము లజ్జపడును. కలాపకర్తయొక్క మాయచేతఁ బుట్టినచిన్నదానికి లోపము లేమియుండును? అప్పుడాచి

న్న దాని స్వయంవరమహోత్సవము జరగుచుండెను; అనేకరాజకుమారులు లాసంబరమునకు వచ్చియుండిరి; ఆకౌతుకముం జూడఁగోరి, నారదుఁ డానగరమునకువచ్చి, పురజనులవలన సంగతులఁ దెలిసికొనెను. అంతలో నతఁడు రాజభవనమునకువెళ్లెను; అర్ఘ్యపాద్యాదులచే నారదుని రాజు పూజించి, సుఖాసీనుంజేసెను.

దోహా 140

అప్పుడు రాజు విశ్వమోహినిఁ బిలిపించి, నారదునకుఁ జూపించి, "ఓస్వామీ! లెస్సగవిచారించి, యీచిన్నదానిగుణదోషములం జెప్పుము" అని ప్రార్థించెను.

చౌపాయ్ 131

ఆరాజకన్యయొక్క రూపురేఖావిలాసములం జూచినంతలో నతనివైరాగ్యము నీటఁగలిసెను; అతఁ డాచిన్నదాని నెగదిగఁ జూడనారంభించెను; ఆమె సులక్షణము లతనిమనస్సు నపహరించెను; ఆమెయందతనికి మోహము కలిగెను; కాని దానినిఁ బ్రకటించుట కతఁడు వెఱచి సిగ్గుపడెను; అతనిమనస్సు చలించెను. "జననమరణములు లేనివాఁడు, యుద్ధములోనజేయుఁడు, చరాచరజంతుజాలముచే సేవింపఁబడువాఁడు, సంసారులచేఁ బూజింపఁబడువాఁడు- ఈగుణములుగల వరుఁడు శీలనిధికూఁతురిని వివాహమాడును" అని నారదుఁడు విచారించితెలిసికొనెను. నిజముఁ జెప్పక దాచిపెట్టి, "ఓరాజా! నీకూఁతురు సర్వైశ్వర్యసంపన్నురా లగును" అనిచెప్పి, విచారించుచు నారదుఁడు లేచి వెళ్లెను. "ఏవిధమునఁ బ్రయత్నించిన నన్నాచిన్నది వివాహమాడును? జపతపములకు సమయముకాదు; కాలవిలంబముఁజేయరాదు; ఓజగన్నాథా! ఆచిన్నది నాకెట్లుఁ లభించును?" అని నారదుఁ డాచిన్నదానిని ధ్యానములో నుంచెను; జపతపముల నతఁడు మఱచెను.

దోహా 141

"ఈసమయమున నేను మన్మథునివలె నుండవలెను; ఆచిన్నది నన్నుఁజూచి మోహించి, పుష్పహారము నాకంఠమునఁ దగిలింపవలెను.

చౌపాయ్ 132

"నాకుఁ జక్కదనమువచ్చుటకు భగవంతునిఁ బ్రార్థించెదను; అతనివద్దకు వెళ్లి వచ్చునంతలోఁ గాల మతిక్రమించును; భగవంతుని

కంటె మఱియొకస్నేహితుఁడు నాకు లేదు; ఇది మంచిసమయము కనుక నా కతఁడు సహాయముఁజేయును" అని నారదుఁడు చింతించి, భగవంతుని ధ్యానించెను; కౌతుకమునిమిత్తము కృపానిధి యతనికిఁ గనఁబడెను; స్వామినిజూచి, నారదునినేత్రములు వికసించెను; "తప్పక నా కార్యము సిద్ధించును" అని తలఁచి నారదుఁడు సంతసించెను. అతివ్యాకులచిత్తముతో నతఁడు తనవృత్తాంతమును భగవంతునకు విన్నపముఁజేసి, "ఓమహాప్రభో! నన్ను కృపతోఁ జూచి, నామనోరథము సఫలముఁజేయుము; ఓనాథా! నీచక్కఁదనము నాకిమ్ము; మఱియొకవిధమున నే నాచిన్నదానిం బొందలేను" అని దీనత్వముతో నతఁడు వేఁడుకొనెను. "అధికము చెప్పనేల? నాకుజయముకలుగునట్లుఁ గరుణింపుము; నేను నీదాసుఁడనుకదా!" అని నారదుఁడతనిచరణములఁ బట్టుకొనెను. మాయకు నారదుఁడు లోఁబడెనని తలఁచి, భగవంతుఁడు లోలోపున నవ్వుకొని యతనితో నిట్లు చెప్పెను:—

దోహా 142

"ఓనారదా! నీకు హితముకలుగునట్లు సర్వమునిర్వహించెదను; (అతనిగర్వమును బరిహరించుటయు, నతనిమోహమును విడఁగొట్టుటయు); అందుకువ్యతిరేకము సంభవింపదు; నామాటలు సత్యము; నమ్ముము.

చౌపాయ్ 133

"ఓమునివర్యా! జబ్బుతో బాధపడుచుండినమనుజుఁ డపథ్యపువస్తువులఁ దినఁదలఁచినను, వైద్యుఁడు వానిఁ దిననిచ్చునా? ఆప్రకారము నీకు హితముఁజేయుచున్నాను" అనిచెప్పి భగవంతుఁ డంతర్ధానమయ్యెను. నారదునిబుద్ధి మాయచే మలినమయ్యెను; కనుక, నతఁడు పరమేశ్వరుని గంభీరవాక్యములను గ్రహింపలేదు; అంతట నతఁడు త్వరపడి స్వయంవరమునకు వచ్చెను; దేశదేశములనుండి వచ్చినరాజకుమారులు వారివారి యాసనములపైఁ గూర్చుండియుండిరి; నారదుఁడు తనమనస్సులో నుప్పొంగుచు, "భగవంతునికటాక్షమువలన, నాచిన్నది నన్నుదప్ప మఱియొకరిని వరింపదు," అనితలఁచి యువ్విళ్లూరుచుండెను. భగవంతుఁ డతనికి హితముఁజేయఁదలఁచి, అతనికిఁ దెలియకుండ నతనిని

కోతిగమార్చెను; ఈసంగతి పరులకుఁ దెలియదు; రాజకుమారులు మొదలగువారు నారదునకు నమస్కరించిరి; అతనికంటె కతఁడు విష్ణువు వలెఁ జక్కనివానిగఁ గనఁబడెను; రాజులదృష్టికిమాత్ర మతఁడు నారదు నివలెఁ దోఁచెను; రాజకన్యక, విశ్వమోహిని నేత్రములకుమాత్ర మతఁడు పందుకోతివలెఁ బొడచూపెను.

దోహా 143

ఆసభలో శివునిపరిచారకు లిరువురు బ్రాహ్మణవేషములను వేసి కొని కూర్చుండిరి; నారదునిగుట్టు వారికిమాత్రము తెలియును; నార దునకు సంభవింపబోవుకౌతుకముఁ జూచుచుండిరి.

చౌపాయి 134

తనవంటిచక్కనివాఁడు లేఁడని నారదుఁడు దురభిమానముఁ బడుచుండెను; పలువురతోఁ గలసి, వా రిరువురును సభలో నొక మూలఁ గూర్చుండిరి; వారింజూచి బ్రాహ్మణులని తలఁచిరి గాని, వారు శివునిగణములోనివారని యెవరికిఁ దెలియదు; నారదునకు వినివినఁబడ నట్లు వారతనిని హేళనఁజేయ నారంభించిరి; ''నారదునకు హరివంటి చక్కదనము వచ్చెను; అతని హరిరూపముఁజూచి, రాజకన్య యతని నిగ్రహించును'' అని పలికి వారిలోవారు గుసగుసలాడిరి. మోహావేశ ముచే నతఁడు వారిమాటలను గ్రహింపలేదు; అతని వికారముఁజూచి వారిరువురు నవ్వుచుండిరి; అతనిబుద్ధికి మాంద్యమువచ్చెను. రాజకన్యకుఁ దప్ప, తదితరుల కతనివికారరూపము తెలియదు; అతనిపందుకోఁతిముఖ మును ముడతలువడినశరీరముఁ జూచి, రాజకన్య విసుఁగికొనెను.

దోహా 144

పూలదండబట్టుకొని, రాజహంసవలె నామెచెలికత్తెలతోఁ గూడి, మెఱుపువలె సభలోనికివచ్చి, తళుక్కుమనెను.

చౌపాయి 135

నారదునకు గర్వముబలిసి, క్షణక్షణము గుటకలు మ్రింగుచుం డెను; కాని, రాజకన్య యతనివైపుఁ జూడలేదు; అతని స్థలమువద్దకు నయిన రాలేదు; మాటిమాటికి నారదుఁడుమాత్రము చిన్నదానిని నిక్కి నిక్కి చూచుచుండెను; అతనిమనస్సు వ్యాకులపడెను; అతనిదురవస్థ

జూచి శివుని సేవకులునవ్వుచుండిరి. అంతట విష్ణుమూర్తి రాజకుమారుని వేషము వేసికొని సభలోనికి వచ్చెను; ఆ రాజకన్య పూలదండ నతని మెడకుఁ దగిలించెను; వైకుంఠుఁడామెనుదీసికొని వెళ్లెను; రాజకుమారు లందఱు నిరాశులయిరి. నారదునిదుఃఖమున కంతములేదు; మోహావేశముచే నతనిబుద్ధి చెడిపోయెను; సంచిలోనిమాణిక్యము కన్నములో నుండి జారిన ట్లయ్యెను; "ఓనారదా! నీముఖము నద్దములోఁజూచు కొనుము" అని వారిరువు రతనితో నవ్వుచుపలికి, భయముచేఁ బరుగెత్తిపోయిరి; అంతట నారదుఁడు తన నిజరూపమును నీళ్లలోఁ జూచుకొనెను; తన వికారరూపముఁ జూచి, యతఁడు కోపించి, వారిరువురను భగవంతుని శపించెను.

దోహా 145

"ఓపాపాత్ములారా! మీరు నన్నుఁజూచి నవ్వినందుకుఁ దగినఫలము ననుభవింపుడు; మీరు రాక్షసయోనియందుఁ బుట్టుదురు గాక! ఇఁక మీరు మునులఁజూచి నవ్వఁగలిగిన నవ్వుఁడు." అని నారదుఁడు వారిని శపించెను.

చౌపాయ్ 136

మఱల నారదుఁడు జలములోఁ దనరూపముఁ జూచుకొనెను; అయిన నతనికి సంతోషములేకపోయెను; పటపట పండ్లుకొఱుకుచుఁ, గాలాగ్నిరుద్రునివలె నతఁడు విష్ణుమూర్తివద్దకువెళ్లెను. "అతనిమూలమున, నల్వురిలోనాకు నగుబాట్లయ్యెను. కనుక, నతనిని శపింతునా, లేక నేను చచ్చిపోవుదునా?" అని యతఁడు విచారించెను. మార్గములో నతఁడు దనుజవైరిని, రాజకన్యాయుగులక్ష్మిని గలిసికొనెను; అతనిఁజూచి, "ఓమునిరాజా! వ్యాకులపడుచు నెచ్చటకుఁబోయెదవు? కారణమేమి?" అని దేవదేవుఁ డడిగెను. నారదుఁడు మాయకు వశుఁడైయుండెను; అతనికి బుద్ధి పోయెను. అందుచేత నతఁడామాటలనువిని, కోపించి, "నీవు పరుల సిరిసంపదలఁ జూచి యోర్వలేవు; ఈర్ష్యనీకు మెండు; నీవు కపటివి; పాలసముద్రమును దఱచినపుడు, దేవతలు నీప్రేరణవలన, హాలాహలమును శివునిచేఁ ద్రావించిరి.

దోహా 146

సముద్రములోఁ బుట్టిన మద్యమును రాక్షసులు త్రాగిరి; విషమును శివుఁడు భక్షించెను; నీవు లక్ష్మీదేవిని కౌస్తుభమణిని గ్రహించితివి; ఎంతవఱకు నీవు స్వార్థపరుఁడవు; నీవ్యాపారమంతయు కపటము; తప్పుత్రోవలను నీవు త్రొక్కెదవు.

చౌపాయ్ 137

"నీవు స్వేచ్ఛానుసారివి; నీకు నీవే పెద్దవు; నీబుద్ధికి దోఁచినట్లు నడచెదవు; మంచిని చెడ్డగను చెడ్డను మంచిగను జేయుచుందువు; నీకు దయాదాక్షిణ్యములు లేవు; నీగుండెలు ఱాతితో సమానము; మంచి చెడ్డల నాలోచింపక, ప్రతిమనుజని నీమాయలోఁ బడఁద్రోయుదువు; ఆపని నీకిష్టము. మంచిపనియైనను జెడుగుపనియైనను నిన్ను ముట్టవు; ఇంతవఱకు నిన్ను సాధించినవాఁడు కానరాఁడు. నామర్యాదఁ బోఁగొట్టి నందుకుఁ దగినఫలము ననుభవింపుము; నిన్ను శపించెద, వినుము; నీవు నన్ను మోసబుచ్చినరూపముతో, భూలోకములో నీవు జన్మింపుము; నాకుఁ గోతిరూపమునిచ్చితివి; కనుక, నీకుఁ గోఁతులు సహాయముఁ జేయుదురు; నేనా చిన్నదానిఁ గోల్పోయి విచారించినవిధమున, నీవు నీభార్యఁ గోల్పోయి దుఃఖింతువుగాక" అని నారదుఁడు భగవంతుని శపించెను.

దోహా 147

ఈవిధమున భగవంతుఁడు శాపముఁబొంది, దేవకార్యమును సాధించెను; పరమకృపాలుఁడు కనుకనతఁడు తనమాయ నుపసంహారముఁ జేసెను.

చౌపాయ్ 138

ఆమాయ వీడినంతనే, రాజకుమారుఁడును రాజకన్యయు మాయమయిరి; ఆక్షణము నారదుఁడు తెలివిఁదెచ్చుకొని, భగవంతుని పాదములమీఁదబడి, "ఓసర్వేశ్వరా! ఓప్రణతార్తిహరా! నన్ను రక్షింపుము; ఓదయాళుఁడా! నాశాప మసత్యమగుఁగాక" అని మొఱవెట్టెను; "ఓనారదా! మాయిచ్ఛానుసారము జరిగెను" అని భగవంతుఁడు ప్రసన్నుఁడయి పలికెను. "ఓరాజాధిరాజా! నే ననేకకఠినవాక్యములఁ బలికియుంటిని; వానికిఁ బ్రాయశ్చిత్తమేది!" అని నారదుఁడు దీనాలాపములాడెను. "శంకరుని నూటయేనిమిదినామ ములను జపింపుము;

అందువలన నీమనస్సు నిర్మలమగును; శివునికంటెఁ బ్రియుఁడు నాకెవ్వఁడును లేఁడు; నామాట సత్యము; దానిని విశ్వసింపుము; శివుని దయను సంపాదింపనివానికి నాయందు భక్తి లభింపదు. ఓమునిరాజా! ఈసంగతి నీమనస్సులోఁ బెట్టుకొని, లోకసంచారముఁ జేయుము; నా మాయ నిన్ను స్పృశింపదు" అని భగవంతుఁడు,

దోహా 148

అనేకప్రకారముల నారదుని బుజ్జగించి, యంతర్ధానమయ్యెను; భగవంతునిగుణములను గానముఁజేయుచు నారదుఁడు సత్యలోకమునకు వెళ్లెను.

చౌపాయి 139

అంతటితో నారదునిదురభిమానము శాంతించెను; అతనిమనస్సు నిర్మలమయ్యెను; ఇంతకుపూర్వమతనిచే శపింపఁబడిన శివునిసేవకు లిరువు రతనిం జూచిరి; కాని, వారతనిని సమీపించుటకు భయపడిరి. మెల్లమెల్లగ నతనియొద్దకువచ్చి, వా రతనిచరణములఁ బట్టుకొని, "ఓమునిరాజా! మేము శివునిసేవకులము; బ్రాహ్మణులము కాము; మేము చేసిన యపరాధమునకుఁ దగినప్రాయశ్చిత్తముఁ జేసితిరి; ఓకృపానిధీ! మమ్ముల ననుగ్రహింపుము" అని దీనాలాపములాడి వేఁడుకొనిరి; ఆమాటలనువిని, నారదునకు వారియందు దయవచ్చి, "మీరిరువురు రాక్షసులైపుట్టి,సంపదలననుభవింతురు;బలపరాక్రమములలోను, తేజస్సులోను మిమ్ములను మించినవారు మఱియొకరుండరు; మీభుజబలముచే మీరు త్రిలోకములను జయింతురు; అంతట విష్ణుమూర్తి మనుజుఁడై పుట్టును; అతఁడు మిమ్ములఁ జంపును; అప్పుడు మీరు ముక్తులగుదురు; అటుపైని, మీకుపునర్జన్మములేదు" అని నారదుఁడు వారితోఁ బలికి గమనించెను; వా రతనిపాదములకు నమస్కరించి నిష్క్రమించిరి; కాలాంతరమున వారిరువురు రాక్షసులైపుట్టిరి.

దోహా 149

ఒకకల్పములో భగవంతుఁ డిందునిమిత్తము జన్మించి, వారిం జంపి, దేవతలను రక్షించి, మునులకు సంతోషముఁగలిగించెను; ఇటుల నతఁడు భూభారముఁ దగ్గించెను.

చౌపాయ్ 140

ఈవిధమున భగవంతుఁడు- హరి- యనేకజన్మముల నెత్తి యనేక చిత్రవిచిత్ర కార్యములఁ జేసెను; ఆకార్యము లబ్బురములు; శాశ్వతములు; సుఖదాయకములు; ఆయద్భుతకార్యములను మును లనేకవిధముల గ్రంథములలో వర్ణించి చెప్పిరి; మహాత్ములు వానిని విని, యాశ్చర్యపడరు; వానిని వినుటవలన వారికి సంతోషముకల్గును. భగవంతుఁ డనంతుఁడు; అతనిచర్యలను వర్ణించుశ్లోకము లనంతములు; వానినే వేదములు ఘోషించును; వానినే మహాత్ములు ధ్యానింతురు; రాముని చర్యలను గుణములను వర్ణించి సంపూర్ణముగఁ జెప్పుటకొకయుగముసరిపడదు. ఓభవానీ! ఇప్పుడు నేను చెప్పిన కథవలన నేమిబోధపడును' మునులును ఋషులుసయితము భగవంతునిమాయకు వశ్యులగుదురని తెలియుచున్నది. భగవంతునకు లీలయం దభిలాషయు, దీనులయందు దయయు కలదు; దాసులకతఁడుసుగముఁడు; సర్వదుఃఖముల నతఁ డపహరించును.

సోరథా 21

"దేవతలలోను, మునులలోను, మనుజులలోను, భగవంతుని మాయకు లోఁబడనివారు లేరు; ఈసంగతి విచారించి, మహామాయాపతిని, ఓభవానీ! భజింపుము.

చౌపాయ్ 141

"ఓశైలరాజకుమారీ! జన్మరహితుఁడును, గుణరహితుఁడును, ఉపమారహితుఁడు నగుబ్రహ్మము దశరథరాజకుమారుఁడై పుట్టినందున: కారణము గతి యొకటి కలదు; దానిని విస్తరించి చెప్పెదను; వినుము. అన్నదమ్మునితోఁగూడి వనములో సంచరించుచుండిన రామానుభావుని నీవు దర్శించితివో, ఏమహాత్ముని చర్యలవలన నీపూర్వజన్మములో నీకు మతిభ్రమించెనో, ఏమహాత్ముని వ్యాపారములు నేటివఱకు నీకు బోధపడలేదో, అట్టిపరమపురుషుని చరిత్రమును వినుము; నీయజ్ఞానము విడిపోవును. ఈయవతారములో నతఁడు చేసినలీలలను నాబుద్ధికిఁ దోఁచినవిధమున వర్ణించెదను; వినుము." అనిశివుఁడు చెప్పెను. ఓభరద్వాజా! సాంబునివచనములను విని, ఉమాముఖము వికసించెను;

ఆమెమనన్ను సంతోషించెను; "ఈయవతారమునకుఁ గారణ మిది" యని శివుఁడు కథఁజెప్ప నారంభించెను.

దోహా 150

"ఓభరద్వాజా! కలియుగపాపములను హరించునట్టియు, ఇహపర సాధనమగునట్టి రామకథను వర్ణించెదను; సావధానముతో దానిని వినుము." అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

చౌపాయ్ 142

స్వాయంభువుమనువును అతనిభార్య శతరూపయు మానవకులమునకు మూలపురుషులు; వారిసంతతివారే మానవులు; వారిరువురు పరమపుణ్యాత్ములు; పరమధార్మికులు; వారిగుణములను వేదము చెప్పుచున్నది. వారియనుకూలదాంపత్యము నేఁటివఱకును లోకవిశ్రుతము. వారికుమారుఁడు, ఉత్తానపాదుఁడు; ఇతనికి ధ్రువుఁడు పుట్టెను; ఈధ్రువుఁడు విష్ణుభక్తుఁడు. స్వాయంభువుమనువుయొక్క రెండవకుమారుఁడు ప్రియవ్రతుఁడు; అతని సుగుణసంపత్తి వేదములో వర్ణింపఁ బడియున్నది. ఆమనువు కొకకూఁతురుకలదు; ఆమెపేరు దేవహూతి; ఆమె కర్దమునిని వివాహమాడెను; ఆమెగర్భమున భగవంతుఁడు జన్మించెను; అతఁడే కపిలుఁడు; ఆకపిలుఁడే సాంఖ్యశాస్త్రమును రచించెను; ఆశాస్త్రమును చదివినయెడల, దానిమహాత్మ్యము బోధపడును. భగవంతుని యాజ్ఞలను శిరసావహించి, దానికి ననుగుణ్యముగ స్వాయంభువురాజ్యముఁ బరిపాలించెను. అతఁడు విశేషకాలము జీవించెను.

సోరఠా 22

"సంసారములోనుండి విషయములనుండి విరక్తిఁబొందుట దుర్లభము; వృద్ధాప్యమువచ్చెను; ఒకనిమిషమయినను భగవంతుని ధ్యానింపకయే, నాకాలమంతయు వ్యర్థమయ్యెను" అని స్వాయంభువు విచారించెను.

చౌపాయ్ 143

కుమారునకుఁ బట్టముఁగట్టి, మనువు భార్యతోఁగూడి నైమిశారణ్యమునకుఁ బోయెను. అచ్చట నొకపవిత్రమగుసిద్ధాశ్రమముఁ జేరెను; అచ్చట మునులును సిద్ధులును సమావేశమైయుండిరి; వారిం జూచి

రాజు సంతోషించెను. భార్యాభర్తలు మార్గమునఁ బోవుచుండినపుడు, భక్తిజ్ఞానములు మూర్తీభవించినట్లు కనఁబడిరి. గోమతీనదీతీరముఁ జేరి, దాని నిర్మలజలములలో వారు స్నానముఁ జేసి పవిత్రులయిరి; మనువు ధర్మాత్ముఁడని తెలిసికొని, మునులును, సిద్ధులును, ఋషులును, జ్ఞానులు నతనిం జూడవచ్చిరి. ఏయేపుణ్యతీర్థములుగలవో, ఆయాస్థానికి వారు వారిరువురఁ దోడ్కొనివెళ్లిరి; భార్యాభర్తలశరీరము కృశించెను; వారు నారచీరలను ధరించిరి; మహాత్ముల సభలకుఁ బోయి, వారు పుణ్యకథలను వినుచుఁ గాలముఁ గడిపిరి.

దోహా 151

భగవంతుఁడు వాసుదేవుని చరణకమలములయందు మనస్సును నిలిపి, వారిరువురు ద్వాదశాక్షరీమంత్రమును జపించిరి.

చౌపాయ్ 144

కందమూలములను, ఫలములను, పత్రములను భుజించుచు, వారు తదేకదీక్షతో సచ్చిదానందబ్రహ్మమును ధ్యానించిరి; తదుపరి, వానినివిడిచి, నీరుద్రాగి, వారు భగవంతునినామము జపముఁజేసిరి. "సంపూర్ణుఁడును, నిర్గుణుఁడును, అనంతుఁడును, అనాదియు, మూలబీజమును, మోక్షసాధకులచే ధ్యానింపఁబడువాఁడును, వేదములచే నిరూపింపఁబడనివాఁడును, ఆనందస్వరూపుఁడును, ఉపాధిరహితుఁడును, ఉపమానరహితుఁడును, బ్రహ్మవిష్ణుమహేశులను దనయంశచేఁ బుట్టించినవాఁడును - అట్టిభగవంతునిఁ గన్నులారాఁ జూచునట్టిభాగ్యమెన్నఁడు మాకుఁ గలుగునోకదా! అట్టిభగవంతుఁడు భక్తపరాధీనుఁడు గనుక, వారినిమిత్తమతఁడు శరీరముధరించును; అదియొకభగవంతునిలీల; భగవంతుఁడు భక్తపరాధీనుఁడని వేదములుచెప్పినమాట సత్యమయినయెడల, మాకోరిక సఫలమగును" అని వారు విచారించిరి.

దోహా 152

ఈవిధమున నాలువేలసంవత్సరములు నీరుఁద్రాగియు, యేడువేలసంవత్సరములు వాయువును భక్షించియు వారు తపముఁజేసిరి.

చౌపాయ్ 145

వాయువును భుజించుట సయితము విడిచిపెట్టి, యేకపాదముమీఁద నిలువఁబడి, పదివేలసంవత్సరములహోరాత్రములు వారు

ఘోరమగుతపము నాచరించిరి. బ్రహ్మవిష్ణుమహేశులు వారితపముఁ జూచి, వారివద్దకు వచ్చి, "మీకేమిఁ వరముకావలయునో, చెప్పుఁడు" అని వారు వారిని భ్రమింపఁజేసిరి; కాని, వారిమాటలకు వారుచలింపక, తదేకధ్యానముతోఁ దపము నాచరించిరి. వారిశరీరములు శల్యావశిష్టములయ్యెను; అయినను, వారికి విచారముగాని, శ్రమగాని లేదు వారు నిశ్చలభక్తులనియు, అన్యవిషయాసక్తులు గారనియు సర్వజ్ఞుఁడగు భగవంతుఁడు గ్రహించెను. "వరముఁ గోరుము; వరముఁ గోరుము" అని దయారసముతోఁగూడిన గంభీరవాక్యము లంతరిక్షమునుండి వారికి వినఁబడెను ఆజీవనాధారమగువాక్యములు వారి కర్ణరంధ్రములను సోఁకి, మనోగతమయ్యెను; వారిశరీరములు పదియారువన్నె బంగారమువలెఁ బ్రకాశించెను; అప్పుడే గృహమునువిడిచి వచ్చినవారి శరీరములవలె, వారిదేహములు పూరించియుండెను.

దోహా 153

అంతరిక్షమునుండి వచ్చిన యమృతోపమానవాక్యములను విని నందున, వారిశరీరములు పులకరించెను; మనువు దండప్రణామముఁజేసి, ప్రేమ యతిశయింప, గద్గదస్వరముతో నిట్లుస్తుతించెను:—

చౌపాయ్ 146

"ఓభక్తులపాలిటికల్పవృక్షమా! ఓదాసులపాలిటికామధేనువా! నాప్రార్థనను వినుము; ఓజగద్రక్షకా! బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నీచరణకమలములపరాగమును శిరస్సున ధరింతురు; నిన్నునమ్మినవారికి సుగముఁడవు; నీదాసులకు సుఖమిచ్చెదవు; ఓదీనరక్షకా! సియఖిలాండకోటిబ్రహ్మాండనాయకా! నామొఱాలింపుము. ఓయనాథనాథా! నీకు నాయందు దయయుండినయెడల,నామనవిగైకొనుము; ఏనీదివ్యమంగళవిగ్రహమును సదా హృదయములో నిలిపికొని, శివుఁడు ధ్యానించునో, ఏనీకోటిమన్మథసుందరాకారమును మునులు చూచుటకుఁ గోరుచుందురో అట్టినీరూపమును నాకుఁ జూపుము; కాకభుశుండియొక్క మానససరోవరమునందు విహరించు రాజహంసవు; నీసగుణములను నిర్గుణములను విశేషించి వేదములు చాటుచుండును. ఓప్రణతార్తిహరా! ఓకృపాసాగరా! ఈనాకోరిక నీడేర్పుము" అని మనువు ప్రార్థించెను. ఆభార్యాభ

_ర్తల మృదుమధురవాక్యములను భగవంతుఁడు విని ప్రసన్నుఁడయ్యెను; ఆదీనదయాళునికటాక్షముకంటెఁ గావలసినది మఱియొకటి లేదుకదా! ఆభక్తవత్సలుఁడు, ఆకృపానిధి, ఆసర్వాంతర్యామి, వారికిఁ బ్రత్యక్షమయ్యెను.

దోహా 154

నీలమాణిక్యములును, నీలకమలములును, నీలమేఘములతో సమానమగు శరీరచ్ఛాయ కలదు; అతనిచక్కదనము ముందట కోటి మన్మథులు లజ్జించెదరు.

చౌపాయ్ 147

అతనిముఖము శరత్కాలపూర్ణచంద్రునిఁ దిరస్కరించును; అతని కపోలమును చుబుకమును ముద్దులు మూటఁగట్టుచుండెను; అతని కంఠము శంఖమును ధిక్కరించును; దొండపండువంటి పెదవులును, మల్లెమొగ్గలఁబోలినపండ్లును, సంపెంగమొగ్గలవంటిముక్కును, చంద్రకిరణమును పరిహసించు మందహాసమును, తామరరేకులవంటినేత్రములును, మనస్సుల నపహరించుకటాక్షదృష్టియు, చెలుకువిలుకాని విల్లువంటి కనుబొమలును, ఊర్ధ్వపుండ్రములతోఁ బ్రకాశించు లలాటమును, చెవులకు మకరకుండలములును శిరమున కిరీటమును మధుపములఁబోలి ఉంగరములవంటిముంగురులును, వక్షస్థలమున శ్రీవత్స మనుపుట్టుమచ్చయు, కంఠమునుండి వ్రేలుచుండిన వనమాలయు, ముత్యాలహారములును, సింహమునడుమువంటి నడుమును, స్వర్ణయజ్ఞోపవీతములును, ఏనుఁగుతొండమువంటి భుజములును, వానిమీఁద భుజకీర్తులును, వీపుమీఁద నంబులపొదియు, ఒకచేతిలో ధనస్సును, రెండవచేతిలో బాణమును-

దోహా 155

ఈరూపురేఖావిలాసములుగల పరమేశ్వరుఁడు మెఱుపును ధిక్కరించు పట్టుపీతాంబరమును ధరించెను; అతనితేజస్సు కోటిసూర్యులను మించియుండెను; లోతుగల యతనిబొడ్డు, యమునానదిలోని సుడిచలె నుండెను.

చౌపాయ్ 148

భగవంతుని చరణకమలముల యొక్క శోభ వర్ణింపఁజాలను; మహాత్ములమనస్సు లనునట్టి తుమ్మెద లాచరణకమలముల నాశ్రయించియుం

డును; జగన్మాత, చక్కదనముముద్ద, మహాలక్ష్మి, యతని వామభాగము నలంకరించియుండెను; ఆమెయొక్కయంశచే, లక్ష్మియు, పార్వతియు, సరస్వతియు జన్మించిరి; ఒకరెప్పపాటుకాలములో నామె, మహాశక్తి, బ్రహ్మాండములను సృజించి, పాలించి, సంహరించును; ఆమహాశక్తిస్వరూపమే సీతాదేవి; ఆమె రాముని వామపార్శ్వము నలంకరించి యుండును; భగవంతుని దివ్యమంగళవిగ్రహమును వారిరువురు నిలువుగుడ్లు పెట్టుకొని చూచిచూచి, తనివితీరక, ఆనందములో మునిఁగి, కన్నీరుఁగార్చిరి; భగవంతుని సుందరవిగ్రహము నెంతచూచినను, వారికిఁ దృప్తిలేకపోయెను; సంతోషముచే నుప్పొంగుచు, సాష్టాంగ వందప్రణామముఁజేసి, వారు భగవంతుని చరణకమలములను గట్టిగఁ బట్టుకొనిరి. పరమేశ్వరుఁడు స్వహస్తములతో వారిరువురను లేవఁదీసి, వారి శిరములపై స్వహస్తముల నిడి,

దోహా 156

"ఓతపోధనులారా! మీతపోనిష్ఠలను మెచ్చితిని; మీమనస్సులోఁగల గొప్పకోరికఁ జెప్పుడు; దానిని నెఱవేర్చెద" నని భక్తపరాధీనుఁడగు సర్వేశ్వరుఁడు వారితోఁ బలికెను.

చౌపాయ్ 149

కృపాసముద్రుని మధురవాక్యములను వినినతరువాత, వారికి ధైర్యముకలిగెను; స్వాయంభువమనువు చేతులను జోడించి, "ఓజగద్రక్షకా! ఓయనంతకల్యాణగుణస్వరూపా! బ్రహ్మాదిదేవతలకు లభింపనట్టి మీదివ్యచరణారవిందములను కన్నులార దర్శించినందున, నాతపస్సు ఫలించెను; నాజన్మము సఫలమయ్యెను; నాకోరికెలు సిద్ధించెను; అయిన నాకోరిక యొకటికలదు; మహానుభావులు మీకది యొకలక్ష్యము కాదు; కాని, నాకుమాత్ర మాకోరిక కోటితుల్యము; నాకోరికఫలించుట నాకుఁ గష్టము; దానిం జెప్పుటకు నేను పొంగదగినది కాదుగనుక, నాకు నాలుకరాదు; కల్పవృక్షము దరిద్రునకుఁ బ్రాప్తించినను, వాఁడు దానిని సకలసంపత్తుల నడుగుటకు భయపడును; వానికి దానిప్రభావమేమి తెలియును? అటులనే, నామనస్సు భ్రమించుచున్నది. ఓసర్వాంతరాత్మా! సకలజీవుల మనోభావములను నీవు తెలిసికొనఁగలవు; కనుక,

నా కోరిక నీడేర్పుము." అని ప్రార్థించెను. "ఓరాజా! నీమనోభిప్రాయముఁ దెలియఁజేయుము; నీవు సంశయింపవలదు; నీవు పొందఁదగనివస్తువు లేదు; నీ వేవరమునడిగినను, తప్పక దాని నిచ్చెద" నని కృపాసముద్రుఁడగు భగవంతుఁడు పలికెను.

దోహా 157

పరమాత్ముని వచనములను విని, "ఓదయానిధీ! ఓ భక్తులపాలిటి కల్పవృక్షమా! నా కోరికఁ జెప్పెదను; అది సత్యము; వినుము; దానిని మీతోఁ జెప్పకయుండఁగలనా? దానికి రహస్యమేల? మీవంటికుమారుఁడు నాకుఁగలుగవలెను" అని మనువు చెప్పెను.

చౌపాయీ 150

మనువుయొక్క నిర్మలహృదయమును గ్రహించి, "తథాస్తు" అని భగవంతుఁడు పలికెను. "ఓమహాప్రభో! నీవంటివాఁడెవఁడు?" అని రాజు లేచెను. "ఓ రాజా! నేనే నీకుమారుఁడనై పుట్టెదను" అని పరమేశ్వరుఁడు ప్రత్యుత్తరమిచ్చి, అతనిభార్యం శతరూపం జూచి, "ఓ తల్లీ! నీ మనోభీష్టముఁ దెలియఁజేయుము" అని యడిగెను. "ఓనాథా! నాభర్త కోరినవరమునే నేనుకోరుచున్నాను. మేము కోరఁదగినవరము కాదు; అయినను, ఓదీనరక్షకా! నీవు మాంకావలసినవరము నొసంగితివి; నీకటాక్షము నెట్లు చెప్పఁగలను? చరాచరములతోఁ గూడిన బ్రహ్మాండములకు నీవు తండ్రివి; సర్వాంతర్యామివి; సాక్షాత్పరబ్రహ్మవు; జగన్నాథుఁడవు; అందుచేత నాకు బోధపడదు; ఎటుల నీవు నాగర్భమునఁ బుట్టఁగలవని నా మనస్సు శంకించుచున్నది; అయినను, నీవు చెప్పినతరువాత, నీమాటకు వ్యతిరిక్తము జరుగదు; నీమాటయే ప్రమాణము; ఓనాథా! పునరావృత్తిలేని నీలోకములో నివసించుభాగ్యము నీకృపవలన నాకు లభించుఁగాక.

దోహా 158

"ఆనిరంతరసుఖమును, నీచరణకమలములయందు నిరంతర భక్తియు, అఖండజ్ఞానమును, అఖండస్థితియు, నీదయవలన, ఓజగద్రక్షా! నాకుఁ గలుగుఁగాక" అని.

చౌపాయ్ 151

శతరూప మృదుమధుర వాక్యములఁ బలికెను; ఆమె వచనములను పరమేశ్వరుఁడు విని, "ఓ తల్లీ! నీ మనోరథములన్నియు సఫలమగును; అందుకు సందేహము లేదు. ఓ అమ్మా! నా యనుగ్రహమువలన, నఖండజ్ఞానమును నీవు కలిగియుందువు" అని ముకుందుఁడు వరము నిచ్చెను. మఱల స్వాయంభువు గోవిందుని చరణకమలములకు నమస్కరించి, "ఓ రాజాధిరాజా! నా మనవి యొకటి కలదు; క్షమించి యాలకింపుము; లోకసంబంధమైన పుత్రుని గోరి నీ చరణారవిందములను సేవించితిని; అందుచేత, నేనొక మూర్ఖుఁడనని నన్ను నెవరు నిందింపరు? మణి లేక సర్పమును, నీరు లేక చేపయును జీవించుట కష్టము; అటులనే, నీవు లేనిచో నా ప్రాణములు నిలుచుట కష్టము; నేను నీ యధీనము." అని పలికి యతని చరణములను విడువలేదు. అతని జూచి, యతని వచనములకు దీనదయాపరమూర్తి సంతసించి, "ఓ రాజా! నీ కోరిక ప్రకారము జరుగును; ప్రస్తుతము మీ రుభయులు నా యాజ్ఞ ప్రకారము దేవేంద్రలోకములో నివసింపుఁడు.

సోరఠా 18

"ఓ తాతా! కొంతకాలము మీరు స్వర్గలోకములో సుఖము ననుభవింపుఁడు; కాలాంతరమున నీవు అయోధ్యాధిపతివై పుట్టఁగలవు; అప్పుడు నీ గర్భమునందే జన్మించెద.

చౌపాయ్ 152

"నా యిచ్ఛానుసారము నేను నరరూపమును ధరించి, నీ వంశములో జన్మించెదను; నా పూర్ణాంశతో నీకు కుమారుఁడనై పుట్టి, భక్తులచే నుపాసింపఁదగిన విధమున నటించెదను; భూభారమును హరించెదను; రాక్షసులను సంహరించెదను; భక్తులగు సంసారులను రక్షించెదను; ఈ నా చరిత్రను వినువారు ధన్యులు; వారికి మోహాంధకారము విడిపోవును; వారు సంసారసాగరమును దాఁటఁగలరు. ఈ నా ఛాయ, నా మాయ, ఆదిశక్తి యొక్క ప్రభావమువలన లోకములు పుట్టును; ఆమె కూడ నవతరించును. మీ కోరిక సఫలమగును; ఈ నా ప్రతిజ్ఞ సత్యమగునని తెలిసికొనుము;" అని చెప్పి, పరమేశ్వరుఁ డంతర్ధానమయ్యెను. ఆ యాశ్రమ

ములోఁ గొంతకాలము దంపతులు నివసించి, భగవంతుని ధ్యానించు చుండిరి; కాలాంతరమున వా రనాయాసముగ దేహములఁ జాలించి, స్వర్గమునకుఁ బోయిరి.

దోహా 160

ఓభరద్వాజా! ఈప్రకారము శివుఁడు పార్వతితో రామునివృత్తాంతముఁ జెప్పెను; శ్రీరామునియవతారమునకు మఱియొకకారణముఁ జెప్పెను; స్వస్థచిత్తముతో దానిని వినుము.

దోహా 153

ఓభరద్వాజా! పుణ్యాత్మకమునునదియు పవిత్రమునగుకథను గౌరికి శంభుఁడు వినిపించెను; దానిఁజెప్పుచున్నాను; వినుము. పూర్వకాలములో సత్యకేతుఁ డనురాజు కలఁడు; అతఁడు కేకయదేశమున కధిపతి; ఆరాజు ధర్మాత్ముఁడు; సత్యసంధుఁడు; తపశ్శాలి; తేజోవంతుఁడు; ఆసత్యకేతున కిరువురుకుమారులు కలరు; వారిరువురు బుద్ధిమంతులు; బలపరాక్రమశాలులు; యుద్ధమునం దజేయులు; వారిలో జ్యేష్ఠుఁడును, యువరాజు నయినప్రతాపభానుఁడు, రాజధానిలో నివసించును; రెండవకుమారుఁడు, అరిమర్దనుఁడు; ఇతఁడుకూడ మహాబలవంతుఁడు, యుద్ధములో నితనికి యెదురులేదు. వారిరువురక కత్యంతానురాగము కలదు; నిష్కపటముగ వా రొకరినొకరు ప్రేమించియుండిరి; పెద్దకుమారుఁడగు ప్రతాపభానునకుఁ బట్టముఁగట్టి, రాజు తపముఁజేయుటకు వనములకేగెను.

దోహా 161

ప్రతాపభానుఁడు రాజ్యమునకు వచ్చెను. అతనిపేరు దేశమంతటను చాటింపఁబడెను; అతనివంటిధర్మాత్ముఁడు రాజ్యముఁ బరిపాలించు చుండ, దేశములకును మహాజనులకు నెట్టియరిష్టములు లేకపోయెను; సమస్తజీవరాసులును సుఖముగ జీవించియుండెను.

చౌపాయ్ 154

ఆరాజుమంత్రిపేరు ధర్మరుచి; అతఁడు రాజుయొక్క శ్రేయస్సుఁ గోరుచుండును; అతఁడు రెండవశుక్రునివంటివాఁడు; అతనిబుద్ధి యతిసూక్ష్మము; మంత్రి సకలగుణగరిష్ఠుఁడు; తమ్ముఁడు మహావీరుఁడు; ప్రతాపభానుఁడు స్వయముబలవంతుఁడు; రణధీరుఁడు; సత్యసంధుఁడు; ధర్మా

త్ముఁడు; ఆరాజున కేమిలోపముగలదు? అతని సిరి సంపదలకు లోటు లేదు; చతురంగబలములును, యోధులును, విశేషముగ గలరు; రాజునకును ప్రజలకన్యోన్యానురాగముకలదు; ఈవైభవముఁజూచి, రాజు మిక్కిలిసంతసించి పొంగుచుండెను; దేశమం దంతట నిత్యకల్యాణము, పచ్చతోరణములును కనఁబడును; ఎల్లప్పుడు మహావీరులవీరాలాపములును, ధనుష్టంకారములును వినబడుచుండును. సుముహూర్తమున రణభేరిని మ్రోగించి చతురంగబలములతో రాజు దిగ్విజయమునకు వెడలెను; అనేకయుద్ధములలో ననేకరాజుల నతఁ డోడించి, వారివలనఁ గప్పములఁ గైకొనెను. సప్తద్వీపములతోఁ గూడిన జగత్తంతయు నతఁడు స్వపరాక్రమముచే స్వాధీనముఁజేసికొని, ఆయారాజులవలనఁ గట్నములఁ బుచ్చుకొనెను.

దోహా 162

ఈప్రకారము సప్తద్వీపములను జయించి, ప్రతాపభానుఁడు స్వరాజధానికివచ్చెను; అనంతర మతఁడు చతుర్విధపురుషార్థముల కనుగుణ్యముగ రాజ్యముఁ బరిపాలించుచుండెను.

చౌపాయ్ 155

ప్రతాపభానుని పరిపాలనకాలములో, భూమి కామధేనువువలెఁ గోరినకోరికల నిచ్చెను; నెలకు మూఁడువర్షములు కురియుచుండెను; భూమి సర్వసస్యములతోఁ గూడియుండెను; తాపత్రయములు లేక జనులు, స్త్రీపురుషులుం బాలవృద్ధులు, సుఖముగ జీవించియుండిరి; నరనారీమణులు సకలగుణసంపన్నులయి, ధర్మమార్గమునఁ బోవుచుండిరి; వారిసుశీలముఁ జెప్పలేను. ధర్మరుచి హరిభక్తుఁడు; అతఁడు ప్రభువుయొక్కహితవుఁగోరి, రాజునకుఁ జక్కనిమంత్రాలోచనఁ జేయును. గురువులను, దేవతలను, సాధువులను, బ్రాహ్మణులను రాజు సదా సేవించును. వేదశాస్త్రములలో విధింపఁబడినరాజధర్మముల నతఁడు ప్రీతిపూర్వకముగ నవలంబించి, వానిప్రకారము నడచుచుండెను; నిత్యమతఁడు షోడశమహాదానములఁ జేయును; వేదశాస్త్రపురాణేతిహాసముల నతఁడు సదా వినుచుండును. సర్వజనోపయోగమగునట్లు వాపీకూపతటాకముల నతఁడు త్రవ్వించెను; అనేకతోటలు, ఫలవృక్షములతోను పుష్పవృక్ష

ములతోఁగూడి, యతనికీర్తిని జాటుచుండెను; అనేకమార్గములను వేయించెను; బ్రాహ్మణులకనేకగ్రామముల దానముఁజేసెను; అనేక దేవాలయములఁ బ్రతిష్ఠింపించెను; సకలపుణ్యతీర్థములనద్ద సత్రవులఁ గట్టించెను.

దోహా 163

వేదశాస్త్రములలో నొక్కొక్కయజ్ఞమును రాజు చేయవలయునని విధింపఁబడియున్నది; ఒక్కొక్కదానిని వేయిపర్యాయములు ప్రతాపభానుఁడు చేసెను.

చౌపాయ్ 156

అతఁడు మహాజ్ఞాని కనుక సకలకార్యములను నిష్కామ్యముగ నొనరించెను; మనోవాక్కాయకర్మములచే భగవత్ప్రీత్యర్థము సర్వము నర్పించెను. ఒకరోజున నతఁ డశ్వారూఢుఁడై, చతురంగబలములతోఁ గూడి, వేఁటనిమిత్తము, వింధ్యపర్వతసమీపముననుండిన వనములకేగి, యనేకమృగముల వేఁటాడెను; అంతట నతఁ డొకవరాహముఁ జూచెను; రాహువుముఖములోనుండిన చంద్రునివలె, దానినోటిలోనిదంతములు ప్రకాశించుచుండెను; చంద్రమండలముకంట రాహువుయొక్కముఖము చిన్నది; అయినను, క్రోధముచే వాఁడు దానిని విడువక పట్టియుండును; అటులనే, దానికోఱలు దానిముఖముకంట పెద్దవి; అయినను, వరాహము వానిం బోఁగొట్టుకొనలేక, గుఱగుఱలాడుచుండెను. దానికోఱలు తళతళమనుచుండెను; దానిశరీరము మిక్కిలి బలిసియుండెను; గుఱ్ఱపుడెక్కలధ్వనివిని, అది ఘుర్ఘురగలాడెను; అది గుఱ్ఱముఁజూచి బెదరిపడి చెవ్రుల నిక్కఁబెట్టెను.

దోహా 164

మహాపర్వతశిఖరమువలె నుండినవరాహముఁ జూచి, గుఱ్ఱము టపటపలాడి వెనుకకులాగుచుండెను; కళ్లెమువిగించి, కష్టముపై రాజు దానిని ముందుకు నడిపించెను.

చౌపాయ్ 157

గుఱ్ఱముయొక్క దౌడుఁ జూచి, భయపడి వరాహము వాయువేగమునఁ బరుగెత్తెను; రాజు విల్లు నెక్కుబెట్టి బాణమునువిడుచుటకు సిద్ధపడుటఁ జూచి, వరాహము నాలుగుకాళ్లనుసాచి దౌడుపె

ట్టెను; కాని, దానిని వరాహముతప్పించుకొనెను; ఇదిగో యదిగో యను నట్లు గడియకుఁ గనఁబడియు, మఱియొకగడియకుఁ గనఁబడకయు, నొక నిమిషము సమీపించియు, మఱియొకసమయమున దూరస్థమగుచు, వరాహమువంకరటొంకరగఁ బరుగిడుచుండెను; దానినూయలలోఁబడి రాజు తామసముచే దానివెన్నునంటి పోవుచుండెను. తుద కావరా హము చీమలుదూరనిచిట్టడవి, కాకులుదూరనికాఱడవిలోనికి దూఱి యదృశ్యమయ్యెను; గుఱ్ఱముగాని యేనుఁగుగాని యందులోఁ బ్రవే శింపలేదు. రాజు యేకాకియయ్యెను; బడలికచే దిగబడినను, వేఁటను మాత్ర మతఁడు విడిచిపెట్టలేదు. వేఁటయందు రాజునకుఁగల యభి లాషనుగ్రహించి, వరాహ మొకగంభీరమగు పర్వతగుహలోఁ బ్రవే శించెను. అందులోఁ బ్రవేశించుట దుర్లభమని తెలిసికొని, రాజు వేఁటఁ జాలించి, పశ్చాత్తాపముఁబడెను; అరణ్యములో నతఁడు మార్గముతప్పి పోయెను.

దోహా 165

గుఱ్ఱముతోఁగూడా రాజు వేఁటబడలికచే డస్సి, యాఁకలిఁ గొని, ముచ్చెమటలఁ గార్చెను; ఎటువైపుఁజూచినను, గోఁకుడునీరై నను కానరాదు; అతనిదాహమునకు మితములేదు.

చౌపాయ్ 158

రాజు వనములో గ్రుమ్మరుచుండ, నతనికి ఋష్యాశ్రమ మొకటి కనఁబడెను; అందులో నొకరాజు కపటమునివేషముధరించి, నివసించి యుండెను; ఆవేషమును వేసికొనియుండిన రాజుయొక్క రాజ్యమును ప్రతాపభానుఁడు స్వాధీనముఁజేసికొనెను. ప్రతాపభానునిగ్రహ ము చ్చారోహియైయుండుటయుఁ, దనగ్రహము నీచాభిముఖుయైయుండు టయుఁ గనిపెట్టి, యారాజు రణరంగములోఁ బోరుచుండినసైన్యము లను విడిచి, పలాయనమయ్యెను; ఓడిపోయి స్వరాజధానికిఁబోవుట కతఁడు సిగ్గుపడెను; దురభిమానముచే నతఁడు ప్రతాపభానునకు జోహా రువనలేదు; అతఁడు క్షత్రియుఁడైనను బికారివానివలె మునివేషమును ధరించి, కార్పణ్యముచే ఘూర్ణిల్లుచు, వనమునకువచ్చి, నివసించియుం డెను. అతనియాశ్రమమునకు ప్రతాపభానుఁడు వచ్చెను; అతఁడు

ప్రతాపభానుని గుర్తెఱిఁగెను; రాజు బడలియుండుటచేత, నతనిని ముని యనితలఁచెనుగాని కపటవేషముధరించినశత్రురాజని పోల్చలేకపోయెను; రాజు గుఱ్ఱమును దిగివచ్చి, లోనికిఁబోయి, తపస్వికిఁ బ్రణమిల్లెను; రాజు తనపేరుమాత్ర మతనికిఁ బ్రకటింపలేదు.

దోహా 166

రాజు శ్రమపడియుండుటగ్రహించి, అతనికి ముని సరోవరముఁ జూపించెను; అతఁడాజలాశయమునకుఁబోయి, స్నానముఁజేసి, నీరుఁ ద్రాగెను; అతఁడు గుఱ్ఱమునుదోమి, దానికి నీరువెట్టెను; అంతట వారిరువురిప్రాణములు తెప్పిఱిల్లెను

చౌపాయ్ 159

అతనిబడలిక తగ్గెను; అతనిప్రాణములు కుదుటఁబడెను; ఉత్సాహముచే నతనిమన స్సుప్పొంగెను; ఆశ్రమములోనికి రాజును ముని తీసికొనివెళ్లెను; అంతట సూర్యుఁ డస్తమించెను; మునిచూపించినయాసనముపై రాజు కూర్చుండెను; "ఎవరుమీరు? మీరుయౌవనపురుషులు; చక్కనివారుకదా! ప్రాణభయములేక యొంటరిగ వనములో నెందుకుఁ దిరుగుచుంటిరి? చక్రవర్తిలక్షణములు మీరూపురేఖావిలాసములలోఁ గనఁబడును; మిమ్ములఁజూచి నామనస్సు కరఁగుచున్నది" అని మృదుమధురవాక్యములతో నాకపటముని ప్రసంగించెను. "ప్రతాపభానుఁడనురాజు కలఁడు; అతనిమంత్రిని నేను; ఓమునీశ్వరా! వేఁటాడుచు వచ్చివచ్చి, తుదకు మార్గముఁ దప్పిపోతిని; నాయదృష్టమువలన మిమ్ములను సందర్శించితిని; మీదర్శనము దుర్లభము; మీవంటిమహాత్ములను దర్శించుటవలన, నాకు ముందుకు శుభముకలుగునని తోఁచును" అని రాజు వినయముతోఁ బలికెను. రాజుపలుకులనువిని, "ఓ తండ్రీ! ఇప్పుడు రాత్రియయ్యెను; ఇచటకు నీనగరము డెబ్బదియోజనములదూరములోనున్నది.

దోహా 167, 168

"ఓమంత్రివర్యా! చీఁకటి దట్టమయ్యెను; ఈగాఢారణ్యములో మార్గము కానరాదు; కనుక, నేటిరాత్రికి నాయాశ్రమములోశయనించి, వేఁకువఝామునలేచి నీనగరమునకుఁ బొమ్ము" అని ముని బోధించెను. "ప్రారబ్ధకర్మము దానియంతట నది నడచివచ్చును; లేక, మార్గములో

దానిని నీవు కలియఁగలవు; ఎటులయినను, ప్రారబ్ధము ననుభవింపక తప్పదు" అని తులసీదాసు చెప్పెను.

చౌపాయ్ 160

"ఓమునివర్యా! మీయాజ్ఞను శిరసావహించెదను" అని రాజు చెప్పి, గుఱ్ఱము నొకచెట్టుకుఁగట్టి, లోనికివచ్చి, యాసనముపైఁ గూర్చుండెను. మునిపాదములకు రాజు నమస్కరించి, "ఓమునీశ్వరా! మిమ్ములను జూచుటవలన నాకుఁ గలిగినభాగ్య మేమని చెప్పఁగలను! మీమూలమున నాపూర్వపుణ్యము ఫలించెను;" అని రాజు ముని ననేకవిధములఁ బ్రస్తుతించి, "ఓమహాప్రభువా! మిమ్ములను తండ్రిగ భావించుచున్నాను; నాసాహసమును క్షమించి, నామనవిఁ గైకొనుఁడు; ఓమునిరాజా! మీనామముఁ దెలియఁజేయుఁడు" అని రాజు వినయముతో నడిగెను. ఆ మునిని రాజు గుర్తుపట్టలేదు; కాని, రాజునుమాత్ర మతఁడు గురుతుపట్టెను; రాజుచిత్తము సరళము; మునిచిత్తము కపటము; రాజు స్నేహపాత్రుఁడు; అతనిమనస్సు కంపుగుండము; అందులో నతఁడు సహజశత్రువు; క్షత్రియుఁడు; మూర్ధాభిషిక్తుఁడు; అతనికి రాజసము మెండు; మునివేషమునుధరించినను, తామస మతనినివిడువలేదు; మంత్రముచేనైనను, తంత్రముచేనైనను, స్వకార్యము నతఁడు సాధించుటకుఁ బూనుకొనెను. వైరముఁగలవాఁడు కనుక, నతఁడు రాజుయొక్క సంపదలఁ జూచి, దుఃఖించుచుండెను; ఆవములోనినిప్పువలె నతనిమనస్సు మండుచుండెను; రాజుయొక్క సరళవచనములనువిని, యతఁడు వైరమును మట్టిపెట్టి, లోలోపలసంతసించి,

దోహా 169

"నాపేరు బికారి; ఇల్లువాకిలిలేనిదరిద్రుఁడను" అని మెత్తని దొంగమాటల నతఁడు పలికెను.

చౌపాయ్ 161

"మీవంటిజ్ఞానసంపన్నుల కభిమానములేదు; అన్నివిధముల మీరు సరసులయినను, ప్రచ్ఛన్నవేషములనుధరించి నివసింతురు; మీరుధన్యులు; మీవంటివారిని భగవంతుఁడు, హరి, ప్రేమించునని వేదశాస్త్రములును, మహాత్ములును ఘోషించుచున్నారు. ఇల్లువాకిలి

లేనట్టి మీవంటిదరిద్రులఁ బోషించుభారమును బ్రహ్మమహేశ్వరులు వహింతురు; అన్నివిధముల మీరు ధన్యులు; కనుక మీచరణములకు నమస్కరింతును; ఓస్వామీ! మీరు నన్ను కటాక్షింపుడు" అని రాజు మునిని సరళముగఁ బ్రస్తుతించెను. రాజుయొక్కనిర్మలమగుప్రేమఁ జూచి, ఆకపటముని యతనివిశ్వాసమునుగ్రహించి, ధైర్యమునవలంబించి, తియ్యనిమాటలతో రాజును వశముఁజేసికొని, స్నేహితునివలె నటించి, "ఓరాజా! యథార్థముఁ జెప్పుచున్నాను; వినుము; అనేకసంవత్సరములనుండి నేనిచ్చట నివసించియుంటిని.

దోహా 170

ఇంతవఱకుఁ బరులు నావద్దకు రాలేదు; నేను పరులవద్దకుఁ బోలేదు; నేనితరులతోఁ బ్రసంగింపలేదు; లోకవ్యాపారములు తపస్సునకు భంగముఁగలుగఁజేయును; అందుచే నేనీవనములోఁ దపముఁజేయుచు నివసించియుంటిని" అని యాకపటముని దొంగమాటలఁజెప్పి రాజునకు నమ్మకముఁ బుట్టించెను.

సోరఠా 23

"మనుజుల చక్కనిరూపముఁజూచి, మూర్ఖులు మోసపోయెదరు; కాని, జ్ఞానులు వారికపటరూపమును గ్రహింతురు; నెమలి కన్నుల కింపుగఁ గనఁబడును; దానికేక శ్రావ్యముగనుండును; అయిన, నది పాములను మ్రింగునుకదా!" అని తులసిదాసు బోధించెను.

చౌపాయ్ 162

"ఓరాజా! అందుచేత, నేనీవనములో రహస్యముగ జీవించుచుంటిని; భగవంతునిధ్యానించుటతప్ప నాకు మఱియొకప్రయోజనము లేదు; నేనీసంగతి వివరించిచెప్పఁబనిలేదు; సర్వము సర్వేశ్వరునకుఁ దెలియును; అతఁడే నాకుసాక్షి; సంసారవ్యాపకమువలన నేమిప్రయోజనము కలదు? దానివలన నేమిసిద్ధించును? ఓరాజా!నీవుధన్యుఁడవు; బుద్ధిమంతుఁడవు; నీకు నాయందుభక్తి విశ్వాసములు కుదిరెను; అందుచేత, నిన్నుఁజూచిన, నాకు దయపుట్టుచున్నది; ఓపుత్రుఁడా! నీవంటిసత్యకాలపువానిని నేనాదరింపనియెడల, నాకుఁ బాతిత్యముకదా!" అని యాకపటముని మెత్తనివాక్యములఁ బలికెను.ఎంతవఱకును మునీశ్వరుఁడు తన

సర్వసంగపరిత్యాగమును గుఱించి చెప్పుకొనుచుండెను; అంతకంతకు రాజున కతనియందు నమ్మకముపుట్టెను; త్రికరణశుద్ధిగ నతనిని రాజువిశ్వ సించెను; ఆసంగతిని మునిగ్రహించి, బకధ్యానముఁ జేయుచు, "ఓ తమ్ముఁడా! నాపేరు ఏకతనువు (ద్విజిహ్వ)" అని చెప్పెను. ఆమాటను విని, "ఓస్వామీ! నేను మీదాసుఁడను; దానియర్థమును నాకు వ్యక్త ముఁజేయుఁడు" అని రాజు నమస్కరించి యడిగెను.

దోహా 171

"సృష్ట్యాదినుండి జీవించియుంటిని; కనుక, నాపేరు ఏకతనువు; పుట్టినది మొదలు నేనీశరీరముతో నుంటినిగాని మఱియొకశరీరమును పొందలేదు.

చౌపాయ్ 163

"ఓరాజా! ఈనామాటనువిని, యాశ్చర్యపడవలదు; తపస్సు నకు దుష్కరమగునది యొకటిలేదుకదా! తపోబలముచే లోకము లను బ్రహ్మ సృజించును; తపోబలముచే వానిని విష్ణువు పాలించును; దానిమహిమచే లోకములను శివుఁడు సంహరించును; తపస్సువలన సం సారులచేఁ బొందఁదగనివిషయ మొకటిలేదు" అనిముని చెప్పిన చక్కని మాటలను విని, రాజు సంతసించెను; అతనికి మునియందు విశ్వాసము కలిగెను. అంతకంతకు మునీశ్వరుఁడు పురాణకథలఁ జెప్పుచుండెను. చతుర్విధపురుషార్థముల గుఱించియు, జ్ఞానవైరాగ్యములను గుఱించి యామునీశ్వరుఁడు ప్రసంగించెను; లోకముల యొక్క సృష్టిస్థితిసంహార ములగుఱించి ముచ్చటించెను; తదితర చిత్రవిచిత్రకథలఁ జెప్పదొడం గెను. ఈప్రసంగములను విని, రాజు ముని యొక్క వలలోఁ బడెను; ఆ మునికి వశ్యుఁడై, రాజు తననిజగుణనామధేయము నతనితోఁ జెప్పెను. "ఓరాజా! నీవెవరో నేనుగ్రహించితిని; నీవు నాతో నబద్ధముఁబలికినం దుకు, నాకుఁ గోపములేదు.

దోహా 172

"ఓరాజా! ఈనీతివాక్యమును వినుము; కొన్నిసమయములలో రాజు తనపేరును వెల్లడిఁజేయకూడదు; నీచతురతఁజూచి నేను సంత సించితిని.

చౌపాయ్ 164

"నీపేరు ప్రతాపభానుఁడు; నీతండ్రి సత్యకేతువు; ఓరాజా! నా గురువుకటాక్షమువలన నాకు సర్వము దెలియును; ఒకరివలన నేను తెలిసికొనుటకుఁ బనిలేదు. ఓనాయనా! నీస్వాభావికసాత్త్వికమును, నీకు నాయందుఁగల భక్తివిశ్వాసములను, నీచాతుర్యముఁ జూచి, నీమీఁద నాకు దయపుట్టుచున్నది; కనుక, నీవునన్ను డిగినంతమాత్రమున, నాకథను నీకు వినిపించితిని. నీమీఁద నాకుఁబరిపూర్ణకటాక్షముకలిగెను; ఇది నిశ్చయము; నీవు శంకింపకుము; నీమనోభిప్రాయముఁ దెలియఁజేయుము;" అని యాకపటి నమ్మకముకలుగునట్లు మాటలాడెను. అతని చిలుకపలుకు లనువిని రాజు సంతసించి, యతని పాదములకు నమస్కరించి, "ఓదయాసాగరా! మిమ్ములనుదర్శించుటవలన, నాకు చతుర్విధపురుషార్థములు లభించెను; మీవంటిప్రభువులకు నామీఁద దయకలిగెను; మిమ్ముల నేనొక దుస్సాధ్యమగువరమును వేఁడుకొని, శోకరహితుఁడనయ్యెద.

దోహా 173

"ఓమునీశ్వరా! వృద్ధాప్యమువచ్చువఱకు నేను జీవించుటకును, అనాయాసమరణములభించుటకును, యుద్ధములో నజేయుఁడుగ నుండుటకును, శత్రువులులేకుండ యావత్పృథివియు నా యేకచ్ఛత్రాధిపత్యము క్రింద నుండుటకును, నా రాజ్యము నూరుకల్పములవఱకు నిలిచియుండుటకును నాకు మొసంగుము" అని రాజు ప్రార్థించెను.

చౌపాయ్ 165

"ఓరాజా! నీకోరికప్రకారము తప్పక జరుగును; అయిన, నీవిషయములో నొకకష్టముకలదు; దానిఁ జెప్పెదను; వినుము. ఓరాజా! బ్రాహ్మణులుతప్ప మిగిలినవారందఱును, కాలుఁడుసహితము, నీకు వశ్యులగుదురు; తపోధనము గలవారు కనుక బ్రాహ్మణులు బలిష్ఠులు; వారి కోపమున కెదురులేదు; ఓరాజా! ఆబ్రాహ్మణులను నీవు వశ్యముఁ జేసికొనినయెడల, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నీకు స్వాధీనులుకాఁగలరు; వారితోఁ గలహించి, బలవంతముగ వారిని నీవు సాధించుట కష్టము; నాభుజములను మీఁదికియెత్తి, నుమ్మాటికి సత్యముఁ జెప్పుచున్నాను; ఓరాజా! లెస్సగ నామాటను వినుము; బ్రాహ్మణులశాపమును నీవు

తప్పించుకొనిన యెడల, నీకు మరణములేదు." అని మునీశ్వరుఁడు పలికెను. అతనిమాటలను రాజు విని సంతసించి, "ఓనాథా! మీమాట నిశ్చయముకదా! నాకు వినాశములేదు; మీకటాక్షమువలన, నెడతెగని సంపదలు నాకుఁ గలిగియుండును" అని మునితోఁ బలెను.

దోహా 174

"తథాస్తు" అని యాకపటముని దీవించి, "ఓరాజా! వనములో నీవు దారిఁదప్పుటయు, నాతోఁ బ్రసంగించుటయు మొదలగువిషయములను నీవు పరులకుఁజెప్పినయెడల నాదోషము కాదు.

చౌపాయ్ 166

"ఓరాజా! నీమనస్సులో నుంచుకొనుము; నేను విశేషించి నొక్కి చెప్పుటకుఁ బనిలేదు; ఈసంగతిని నీవు వెల్లడిచేసినయెడల, నీకార్యము చెడును; ఇదిమూఁడవవానికిఁ దెలిసినపక్షమున, నీకు వినాశకాలము మూఁడును; ఈనామాట సత్యము. ఓరాజా! ఈరహస్యమునుగాని, బ్రాహ్మణశాపమునుగాని నీవు వెల్లడిచేసినయెడల, నీముప్పుగడచుట కష్టము; హరిహరులకుఁ గోపమువచ్చినయెడల, నాదౌర్భాగ్యుని యెవరు రక్షింపగలరు?" అని కపటముని పలుకఁజొచ్చెను. "ఓస్వామీ! మీమాటసత్యము; సత్యము;" అని రాజు పలికి యతనిచరణములకు నమస్కరించి, "ఓనాథా! గురువును బ్రాహ్మణుఁడును శపించినమనుజుని రక్షించువారెవరు? బ్రహ్మ శపించినను, గురువు వానిని రక్షింపఁగలఁడు; గురువే కోపించినయెడల, వానిని రక్షించువారులేరు. మీమాటప్రకారము నేను ప్రవర్తింపనియెడల, నిస్సందేహముగ నేను నశింతును. ఓస్వామీ! నాకొకభయముకలదు; అందుచే నామనస్సు వ్యాకులమగుచున్నది. బ్రాహ్మణశాపముఁ బలఁచినయెడల, నాగుండె లదరును;

దోహా 175

"ఓస్వామీ! మీరు నన్నుఁగటాక్షింపుడు; ఏవిధమున బ్రాహ్మణులు నాకు స్వాధీనులుకాగలరు? నాహితవునుకోరినవారు మీరుతప్ప మఱియొకరులేరు." అని రాజు పలికి దీనత్వముఁ జూపెను.

చౌపాయ్ 167

"ఓరాజా! నామాటవినుము; ప్రపంచములో, ననేకయత్నములు కలవు; అవియన్నియు కష్టసాధ్యములు; అయిన, నవి నీయెడలఁ గీడౌం

చునో మేలెంచునో, తెలియదు; ఒకయుపాయముకలదు; అది సుల భమయినను, కొంచెముకష్టముకలదు; ఆయుపాయము నాకుదప్ప మఱి యొకరికిఁ దెలియదు; నేను నీనగరమునకువచ్చుటకు వీలుపడదు. పుట్టి నదిమొదలు నేటివఱకు, నేను గృహములోనికిఁగాని గ్రామములోనికిఁ గాని వెళ్లియుండలేదు. నీనిమిత్తమిప్పుడు నీనగరమునకు నేను రాకపో యినయెడల నీకుఁ గష్టమువచ్చును; నావ్రతభంగముకాఁగూడదు; నీకుఁ గష్టముకాఁగూడదు; ఇదియే నాకు సందిగ్ధముగఁ గనఁబడును," అని యామునిరాజు పలికెను. అతనిమాటలను రాజు విని, "ఓస్వామీ! ఇందులకు శాస్త్రప్రమాణ మొకటికలదు; మహాత్ము లెప్పుడును క్షుద్రు లను వాత్సల్యముతోఁ జూచుచుందురు; పర్వతములు తమశిరముపైఁ దృణములను ధరించియుండవా? అగాధమగుసముద్రము తనపై నురుగు ను వహింపలేదా! పృథివితనపై ధూళినివహింపలేదా!" అని రాజుపలికి,

దోహా 176

మునీశ్వరునిపాదములఁ బట్టుకొని, "ఓనాథా! నీవు దీనరక్షకుఁ డవు; నాదైన్యముఁబోఁగొట్టుము, ఈయాపత్సముద్రములోనుండి నన్నుఁ దరిజేర్పుము" అని రాజు ప్రార్థేయఁబడెను.

చౌపాయ్ 168

ఆకపటతపస్వి రాజును వశ్యముఁజేసికొని, "ఓరాజా! నామా టను వినుము; లోకములో నాకు దుర్లభమగునదిలేదు; నామాట సత్యము; మనోవాక్కర్మములచే నీవు నాదాసుఁడవని నేను తెలిసికొం టిని; కనుక, నీకోరిక సఫలమగునట్లు నీకార్యమును నిర్వర్తించెదను. యుక్తియు, తపమును, మంత్రముల నెంతరహస్యముగనుంచిన, నంత వానిప్రభావము వెలుఁగును. నేను నీగృహములో భోజనపదార్థము లను స్వయము వండిపెట్టుదును; ఆసంగతి రెండవకంటివానికిఁ దెలియఁ గూడదు. నేవండినపదార్థములను భుజించువారు నీయధీనులుకాఁగలరు; వారివారిగృహములలో భుజించినవారుసయితము నీకు స్వాధీనులుకాఁ గలరు; ఈసంగతిఁ దెలిసికొని, తదనుగుణ్యముగఁ బ్రవర్తింపుము; ఈవ్రతమును సంకల్పించుకొని, యొకసంవత్సరము దానిని నీవు నడిపిం పవలెను.

దోహా 177

"ఒకసంవత్సరము ప్రతిదినము క్రొత్తక్రొత్తబ్రాహ్మణులను కుటుంబములతోఁగూడ, నూరువేలమందికి, నీవు సమారాధనఁజేయవలయును; నీవ్రతము సాంతమగువఱకు నేను నీగృహములో నివసించెదను.

చౌపాయీ 169

"ఓరాజా! ఈప్రకారము నీవు చేసినయెడల, బ్రాహ్మణులందఱు నీయధీనులు కాఁగలరు; ఈవ్రతముఁజేయుటలోఁ గష్టములేదు; బ్రాహ్మణులు యజ్ఞాదిక్రతువులఁ జేయుటచే, దేవతలు సంతసింతురు; కనుక, వారుకూడ నీమాట కడుగుదీయరు. నేను నీకొకగుఱుతుఁజెప్పెద; నేనీవేషముతో నీగృహమునకు రాఁజాలను; మాయఁబన్ని, నీపురోహితుని దొంగిలించెదను; నాతపోబలముచే నతనికి నావేషమునిచ్చి, యతని నిచ్చట నిలిపి యుంచెదను; ఇఁక నే నతనివేషమును ధరించి, నీగృహములో నొకసంవత్సరము పనిపాటులఁజేయువాఁడను; రాత్రికాలము విశేషముగతించెను; కనుక, నీవు శయనింపుము; నేటికి మూఁడవదినమున, నిన్నుఁ గలియువాఁడను; నీవు నిద్రింపుచుండ, నాతపోబలముచే, గుఱ్ఱముతోఁగూడ నీవు నీనగరములోఁ బ్రవేశింపఁగలవు.

దోహా 178

"నీపురోహితునివేషమును వేసికొని, నేను నీనగరమునకువచ్చి, యేకాంతముగ నీతో నీవృత్తాంతమంతయుఁ జెప్పినతరువాత, నీవు నన్నుఁ బోల్చగలవు" అని యాకపటముని చెప్పెను.

చౌపాయీ 170

ఆమాటలనువిని రాజు శయనించెను; ఆకపటమునిసుఖాసీనుఁడై యుండెను; రాజు బడలియుండుటచేత, శీఘ్రముగా నిద్రించెను; కాని, దురాలోచనలఁ జేయుచు నాందోళనఁబడుచుండిన మునీశ్వరున కెట్లు నిదురపట్టును? అంతట 'కాలకేతువు' అనురాక్షసుఁడు మునివద్దకు వచ్చెను; ఈరాక్షసుఁడే వరాహవేషమునుధరించి, రాజును మోసపుచ్చి, యదృశ్యమయ్యెను; వాఁడు కపటమునిరాజుయొక్క స్నేహితుఁడు; కపటోపాయము లనేకములు వానికిఁ దెలియును. వానికి నూర్వురు కుమారులును, పదిమందితమ్ములునుండిరి. వారందఱును పరమదుష్టా

ర్గులు; వారు యుద్ధములో నజేయులు; కనుక, దేవతలను వారు పీడించు చుండిరి; దేవతలకును, మునులకును, బ్రాహ్మణులకును వారుచేసిన ద్రోహముంజూచి, ప్రతాపభానుఁడు వారిని యుద్ధములో సంహరించెను. వాఁడు పూర్వవైరమునుస్మరించి, కపటమునిరాజుతోఁ గలిసి, ప్రతాపభానునివినాశమునకుఁ బన్నాగముఁ బన్నెను; ప్రతాపభానున కీకుట్రయేమియుఁ దెలియదు; విధికృతము ప్రబలముకదా!

దోహా 179

బలవంతుఁడగు శత్రుప్ర మైనఁ జిన్నఁడయుండినను నిర్లక్ష్యముఁ జేయరాదు; రాహువునకు శిరస్సొకటిమాత్రముకలదు; అయినను, పర్వదినములలో వాఁడు సూర్యచంద్రులను బాధించుసుకదా.

చౌపాయ్ 171

కపటముని స్నేహితునిఁజూచి, ప్రత్యుత్థానమొనరించి, వానికి సుఖాసనమునిచ్చి, సంతోషించి, జరగినవృత్తాంతము నంతయు వానితోఁ జెప్పెను. ఆవృత్తాంతమును విని కాలకేతువు సంతసించెను. "ఓరాజా! నీవు నామాటవినుము; నీశత్రువును దుంపనాశనముఁ జేయఁగలను; దుఃఖమును విడిచిపెట్టుము; సుఖముగ నిద్రింపుము; ఔషధమును సేవింపకయే, భగవంతుఁడు నీరోగమును బాగుజేయును. నీశత్రువును మూలముతో నాశనముఁజేసి, నాలుగుదినములనాఁటికి నీవద్దకు వచ్చుచున్నాను." అని కాలకేతువు మునిరాజును హెచ్చరించి, కోపోద్రేకముతో నాసనమునుండిలేచెను. నిద్రించుచుండిన ప్రతాపభానుని, నతనిగుఱ్ఱమును రాత్రికిరాత్రియే వాఁడు రాజధానికిఁ దీసికొనిపోయెను; అంతఃపురములో రాణిప్రక్కలో రాజును వాఁడు పరుండఁబెట్టెను; అశ్వశాలలో గుఱ్ఱముఁగట్టెను.

దోహా 180

అచ్చటనుండి వాఁడు రాజపురోహితునిఁ దీసికొనిపోయి, వాని మతిఁ బోఁగొట్టి, యొకకొండగుహలో వానిని దాచిపెట్టెను.

చౌపాయ్ 172

వాఁడు పురోహితునివేషమునుధరించి, యారాజపురోహితుని శయ్యమీఁద నిద్రించెను. ఉదయమున రాజు మేల్కాంచి, తనయంతః

పుర "మహాలు"లోఁ దానుండుటఁజూచి, యాశ్చర్యపడెను. ఆకపటముని యొక్క ప్రభావము నతఁడు మెచ్చుకొని, భార్యకుఁ దెలియకుండ నంతఃపురములోనుండి బయటకువచ్చెను; అతఁడు గుఱ్ఱమునెక్కి నగరములో నెవరికిఁ దెలియకుండ, నరణ్యమునకుఁ బోయెను; మధ్యాహ్నమున కతఁడు తిరిగివచ్చి నగరములోఁ బ్రవేశించెను; అతనిరాకఁ జూచి, జనులు మంగళధ్వనులఁ జేసిరి; "డంకా, నౌపత్తు" మొదలగువాద్యములను మ్రోఁగించిరి; అతఁడు పురోహితునిఁజూచి సంతసించెను; అతనికి వ్రతముసంగతి జ్ఞప్తికివచ్చెను. మూఁడుదినములు గడచినగాని, యాకపటముని నగరములోనికి రాఁజాలఁడు; ఆమూఁడురోజులు నతనికి మూఁడుయుగములవలెఁ దోఁచెను; సమయముఁజూచి, పురోహితుఁడు రాజునుసమీపించి, యావద్వృత్తాంతము నతనితోఁ జెప్పెను.

దోహా 181

ఆపురోహితుని రాజు పోల్చి సంతోషించెను; రాజు మోహములోఁ బడియుండెను; కనుక, నతనిబుద్ధికి మాంద్యమువచ్చెను; ఒక లక్ష బ్రాహ్మణులను కుటుంబములతోఁగూడ భోజనమునకుఁ బిలిపించెను.

చౌపాయ్ 173

పురోహితునియాజ్ఞాప్రకారము షడ్రసోపేతముగ భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములు వండింపఁబడెను. అన్నిపదార్థములను శాస్త్రోక్తప్రకారము వంటవాండ్రు సిద్ధపఱచిరి; వానింజూచిన నోరూరును; వానివాసన దిగంతములు వ్యాపించెను; లేఁడి, దుప్పి, మేక, గొఱ్ఱె మొదలగుజంతువులమాంసము ననేకవిధముల వారువండిరి; బ్రాహ్మణమాంసమును వానిలోఁ జేర్చిరి. వంటలు సిద్ధమయ్యెను; బ్రాహ్మణులందఱు వచ్చిరి; రాజు వారిచరణములఁ గడిగెను; వారు సుఖాసీనులై, పఙ్క్తులఁదీర్చిభోజనమునకుఁ గూర్చుండిరి. పదార్థమును వారు ప్రోక్షించి, ప్రాణాహుతులఁ బుచ్చుకొనుటకు సిద్ధపడునప్పటికి, "ఓబ్రాహ్మణులారా! లేచిపోవుఁడు; లేచిపోవుఁడు గృహములకుఁబొండు; ఈపదార్థములను భుజింపకుఁడు; దీనివలన, నుపద్రవము సంభవించును; వీనిలో బ్రాహ్మణమాంసముకలసియున్నది" అని యాకాశవాణి పలికెను. ఆమా

టులను విశ్వసించి,భోజనమువద్దనుండి ఘొల్లుమని బ్రాహ్మణులు దిగులు పడి దిగ్గునలేచిరి; రాజు మనస్సు వ్యాకులమయ్యెను; మోహముచే నతనిబుద్ధిచెడిపోయెను; అతని యెడల విధి విపరీతమయ్యెను; ఒకమాట యయిన నతనినోటనుండి జారలేదు.

దోహా 182

పూర్వోత్తరముల నాలోచింపక, బ్రాహ్మణులు కోపముఁదెచ్చుకొని, "ఓరాజా! నీకుటుంబముతోఁగూడ నీవు రాక్షసకులములో జన్మింతువుగాక.

చౌపాయ్ 174

"ఓక్షత్రియాధమా! ఈమాబ్రాహ్మణులనందఱను భోజనము పేరుపెట్టి పిలిచి, మమ్ములఁ జంపఁదలఁచితివి; మాధర్మములను భగవంతుఁడు కాచెను; ఇందుమూలమున, నీవును నీవంశస్థులును ఒకసంవత్సరములోపల నశించిపోగలరు; నీవంశము నిర్వంశమగుగాక" అని వారు తొందరపడి రాజును ఘోరముగ శపించిరి. ఆదారుణమగుశాపమును రాజు విని దుఃఖముచే నిశ్చేష్టుఁడై, కాళ్లుచేతు లాడక నిలువఁబడెను. "ఓబ్రాహ్మణులారా! మీరు తొందరపడి రాజును శపించితిరి; అతఁడేపాపము నెఱుఁగఁడు." అని యశరీరవాణి మరలఁబలికెను. బ్రాహ్మణు లావాక్కులనువిని, యాశ్చర్యపడిరి; వంటశాలకు రాజు పరుగెత్తివెళ్లెను; అచ్చట వంటవాఁడు లేఁడు; పదార్థములు కానరావు; అంతయు నదృశ్యమయ్యెను. రాజు విచారించి వంటశాలను విడిచివచ్చి, యావద్వృత్తాంతమును బ్రాహ్మణులతోఁ జెప్పి, దుఃఖించి, వారిపాదములమీఁదఁ బడెను.

దోహా 183

"ఓరాజా! నీవు నిర్దోషివి; ప్రారబ్ధము ప్రబలము; దాని ననుభవింపకతప్పదు; గతించినదానికి విలపించుటవలనఁ బ్రయోజనము లేదు; మాపల్కులు వ్యర్థముకానేరవు; బ్రాహ్మణశాపము కఠినమయినది" అని బ్రాహ్మణులు రాజు నోదార్చిరి.

చౌపాయ్ 175

లోకములో నేమనుజుఁడు దుర్మార్గులతోఁగూడి సంచరించునో, భగవంతుఁడు వాని నథోగతికిఁ దీసికొనిపచ్చును. బ్రాహ్మణులవచనము

లను రాజు విని, దుఃఖపడి లేచి, యనేకవిధముల వారిం బ్రార్థించెను; మఱలమఱల వారిపాదములఁబట్టుకొని, "ఓదయాళువులారా ! నన్నుఁ గటాక్షింపుఁడు; ఈశాపమును ద్రిప్పి నన్నురక్షింపుఁడు" అని రాజు దీనుఁడై వారిం బ్రతిమాలుకొనెను. "ఓరాజా ! తామసము ప్రధానముగాగల రాక్షసుఁడవై నీవు పుట్టినను, నీవు బ్రహ్మవంశమునందు జన్మించెదవు; నిరుపమానుఁడుగను, జగత్ప్రభువుగను నీవు సంచరింపఁగలవు; జగత్ప్రఖ్యాతిఁగాంచిన యిరువురుసోదరులు నీకుఁ గల్గియుందురు; నీకు నాల్గుస్థలములలోమాత్రము పరాభవముకల్గును; నీవు శివపూజాధురంధరుఁడవు కాఁగలవు; శివునివరముల ప్రభావమువలన, నీవు మూఁడులోకములను జయింపఁగలవు; నీప్రతాపము దిగంతములకువ్యాపించును; నీవు సనత్కుమారునితోఁ గలసినపుడు, మాశాపము నీకు జ్ఞప్తికి వచ్చును.

దోహా 184

"నీవిమోచనముగుఱించి నీవతని నడిగినపుడు, అతఁడు నీకుపదేశించును; ఆయుపదేశమువలన, నీవును నీపరివారము నుద్ధరింపఁబడఁగలరు."

చౌపాయీ 176

ఈమాటలను బ్రాహ్మణులు రాజుతోఁ జెప్పి, వారు స్వగృహములకువెళ్లిరి; ఈసమాచారమంతయు పురజనులకు విశదమయ్యెను; వారు దుఃఖించి విధాతను దూషించిరి; బ్రహ్మ హంసఁజేయఁదలఁచి కాకిఁ జేసెను. రాక్షసుఁడు రాజపురోహితునిఁ దీసికొనివచ్చి యతనిగృహములో విడిచిపెట్టెను; అనంతరము వాఁడు వెళ్లి సర్వవృత్తాంతమును కపటమునిరాజునకు శ్రుతపఱచెను. ఆశత్రురాజు మునివేషముఁజాలించి, ప్రతాపభానునకు సంభవించినవిపత్తును వ్రాసి, నలువైపుల శత్రురాజులకుఁ బంపెను. వారందఱు సైన్యములతోఁగూడి ప్రతాపభానునిమీఁదికి దండెత్తివచ్చిరి; రణభేరినిమ్రోఁగించి, వారు నగరమును ముట్టడించిరి; ప్రతిదినము వారు హోరాహోరిగ యుద్ధముఁజేసిరి; ప్రతాపభానునియోధు లందఱును రణములో మడిసిరి; తుదకు ప్రతాపభానుఁడును, నతనితమ్ముఁడు, అరిమర్దనుఁడును, వీరస్వర్గముఁబొందిరి; వానినం

శము నిర్వంశమయ్యెను; బ్రాహ్మణశాపమునకుఁ దిరుగులేదు; శత్రు రాజులతనిని జయించి, పట్టణమును మఱలఁ బ్రతిష్ఠఁజేసి, స్వరాజ్యములకు వెళ్లిరి.

దోహా 185

"ఓభరద్వాజా! ఏమనుజుని యెడల భగవంతుఁడు ప్రతికూలము గనుండునో, వానికి సర్వము వ్యతిరేకముగనుండును; ధూళి మహామేరువగును; తలిదండ్రులు వానియెడల యమునివలె సంచరింతురు; త్రాడు సర్పమగును" అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

చౌపాయ్ 177

ఓభరద్వాజా; వినుము; కాలాంతరమునఁ, నీప్రతాపభానుఁడును, నతనిసంతతివారును రాక్షసవంశములోఁ బుట్టిరి; ప్రతాపభానుఁడు రావణుఁడై జన్మించెను; వానికిఁ బదిశిరములును, యిరువదిచేతులును గలవు; వాఁడు త్రిలోకవీరుఁడు; వానిప్రతాపము మూఁడులోకములకు వ్యాపించెను; అతనిసోదరుఁడు, అరిమర్దనుఁడు, కుంభకర్ణుఁడై జనించెను; అతని మంత్రి ధర్మరుచి, వానికి సవతితమ్ముఁడు విభీషణుఁడై పుట్టెను; ఈవిభీషణుఁడు ధర్మాత్ముఁడనియు, విష్ణుభక్తుఁడనియు, మహాజ్ఞానియనియు ప్రసిద్ధికెక్కెను; ఇకను ప్రతాపభానునికుమారులును సేవకులును ఘోరరాక్షసులై పుట్టిరి; ఈరాక్షసులు కామరూపులు; దుర్మార్గులు; కపటస్వభావులు; మూర్ఖులు; జ్ఞానహీనులు; వారికి దయాదాక్షిణ్యములు లేవు; వారు పరహింసాపరాయణులు; పాపాత్ములు; వారింజూచి చరాచరలోకమంతయు గడగడవడఁకెను; వారిదుర్మార్గప్రవర్తనల వర్ణించి చెప్పుటకు శక్యముకాదు.

దోహా 186

పవిత్రమగు పౌలస్త్యబ్రహ్మవంశములో వారుజన్మించినను, బ్రాహ్మణశాపమువలన వారు రాక్షసులై, రాక్షసకృత్యములఁ జేయుచుండిరి.

చౌపాయ్ 178

వారుమువ్వురన్నదమ్ములును వనములకేఁగి, చెప్పుటకు శక్యము కాని ఘోరమగుతపము నాచరించిరి. బ్రహ్మ వారితపములకుమెచ్చి, ప్రత్యక్షమై, వారినివరములఁ గోరుమనెను. అతనింజూచి, "ఓజగదీశా!

నరవానరుల చేఁదప్ప, తదితరజంతువులచే నాకు మరణములేకపోవుగాక నీవరము లేకయే నేనువారినిఁజంపగలను" అని రావణుఁడు ప్రార్థించెను. "తథాస్తు" అని బ్రహ్మ పలికి, కుంభకర్ణునివద్దకువచ్చి, "ఓపుత్రా! వరమునడుగుము," అని వానితోఁ బలికెను. వానితపముఁ జూచి, యతఁడు సిగ్గుపడ్డాఁడయ్యెను; "ఈదుష్టుఁడు నిత్యము భుజించిన యెడల లోకములు నిర్మూలమగును" అని బ్రహ్మతలఁచి, సరస్వతినిఁ బ్రేరేపించెను; ఆమెప్రేరణవలన వాఁడు, "నిర్దయ, నిర్దయ," అని వరమునడుగుటకు బదులు, "నిదుర, నిదుర" యని వరమునడిగెను. "తథాస్తు" అని బ్రహ్మ పలికి, విభీషణునివద్దకు వచ్చెను.

దోహా 187

బ్రహ్మ విభీషణునిఁజూచి, "ఓపుత్రా! వరమునడుగుము" అని చెప్పెను. "ఓజగదీశా! భగవంతుని చరణకమలములయందు నాకు సదా భక్తియుండునట్లు ప్రసాదింపుము" అని విభీషణుఁడు ప్రార్థించెను. "తథాస్తు" అని బ్రహ్మపలికెను.

చౌపాయ్ 179

ఈవరములనిచ్చి, బ్రహ్మ యంతర్ధానమయ్యెను; ఆముగ్గురును సంతోషించి స్వగృహములకువచ్చిరి; మయుఁడను రాక్షసుఁడు కలఁడు; వానికూఁతురు మందోదరి; ఆమె త్రిలోకసుందరి; ఆమెసకలగుణసంపన్నురాలు; ఆమెను మయుఁడు తీసికొనివచ్చి రావణునకిచ్చెను; ఆమెను వాఁడు వివాహమాడి, పట్టపుదేవిఁజేసెను; ఆమెవంటిచక్కనిభార్య దొరకినందులకు రావణుఁడు సంతసించెను. అనంతరము వాఁడు సోదరులకు వివాహముఁజేసెను.

అధికపాఠము=దోహా (1, 2)

(వైరోచనునికూఁతురు వజ్రజ్వాల యనుదానిని కుంభకర్ణుఁడు వివాహమాడెను; శైలూషుఁడను గంధర్వునికూఁతురు సరమ యను దానిని విభీషణుఁడు వివాహమాడెను.)

చౌపాయ్ 179

బ్రహ్మచే నిర్మింపఁబడి, సముద్రమధ్యమున త్రికూట మనుపర్వతమొకటి కలదు; అది మనుజులకు దుర్గమము. ఈపర్వతముమీఁద రత్నస్థగితమగు సువర్ణనగరము నొకదానిని మయుఁడు నిర్మించెను; నాగుల

నగరముగు భోగవతికంటెను, ఇంద్రునిపట్టణముగు, నమరావతికంటె మయుఁడు నిర్మించిన నగరము మనోహరముగనుండెను; అదియే లంకా నగరమని మూఁడులోకములలోఁ బ్రసిద్ధికెక్కెను.

దోహా 188, 189

ఆనగరమున కగాధమగుసముద్రమే కందకము; ఆనగరము నలువైపులను సముద్రము తట్టుచుండు; దానిప్రాకారము బంగారము; దానిమీఁద నవరత్నములు చెక్కఁబడెను; దానిసొగసు వర్ణించుటకు శక్యముకాదు; విధికృతమువలన నాయాకల్పములలో బలవంతులగు రాక్షసాధిపతు లందఱును సైన్యములతోఁగూడి, లంకానగరములో నివసించుచుండిరి;

చౌపాయ్ 180

ఆనగరములో ననేక రాక్షసయోధులు నివసించియుండిరి; కాని, వారినందఱను దేవతలు సంహరించిరి; ఇంద్రునియాజ్ఞవలన, ధనదుని భటులు, నూరులక్షలయక్షు లానగరము నాక్రమించి, విడిదియుండిరి. ఈసమాచారమును రావణుఁడు విని, సైన్యములను నడిపించి, లంకాపట్టణమును ముట్టడించెను; రాక్షసయోధులను రాక్షససైన్యములఁ జూచి, యక్షులు తమప్రాణములఁ గాపాడుకొని, నగరమునువిడిచి పారిపోయిరి. శత్రుశూన్యమయిన నగరమును రావణుఁడు కలయఁజూచి, యానందించెను; పూర్వదుఃఖమునంతయు వాఁడు మఱచెను; ఆనగరము స్వాభావికముగఁ జూచుట కింపుగనుండెను; అది శత్రువులకు దుర్గమము; కనుక, రావణుఁడు దానిని రాజధానిగఁ జేసికొనెను. వారి వారియోగ్యతానుసారముగ రాక్షసుల కందఱికిని రావణుఁడు స్థలము లనిచ్చెను; ఆయాస్థలములలో వారు నివేశనములఁ గల్పించుకొని, పట్టణములో సుఖముగ నివసించియుండిరి. ఒకసమయమున రావణుఁడు కుబేరునిపై దండువెడలి వాని 'అలకానగరము'ను ముట్టడించి, యుద్ధములో వానినోడించి, వానిపుష్పకవిమానము నపహరించెను.

దోహా 190

ఒకసమయమున రావణుఁడు వినోదార్థము కైలాసపర్వతమును భుజములతోఁ గదల్చెను; (అంతట పార్వతి వ్యాకులపడి శివునివద్దకు

వచ్చి నిలిచెను; ఆమెవ్వాకులముఁ జూచి శివుఁడు పర్వతమును బొటన వ్రేలితో నొక్కి పెట్టెను; రావణునిచేతులు పర్వతముక్రిందఁబడి నొక్కుడువడినందున వాఁడు బొబ్బలిడెను; వానిరోదనమునకు మూఁడులోకములు వడఁకెను; కనుక, వాఁడు రావణుఁడయ్యెను. వానిరోదనమును విని, శివుఁడు కటాక్షించి, వానినిపిడిచిపెట్టెను.) కైలాసపర్వతమును గదలించుటకుఁదగిన భుజబలముగలవాఁడ నని వాఁడు తలఁచి సంతోషించి, లంకకుఁబోయెను; వానికి పదిశిరస్సులు గలవు; కనుక, వానికి దశకంధరుఁడని పేరుకలదు.

చౌపాయీ 181

రావణునిసుఖమును, సంపదలును, పుత్ర మిత్రకళత్రములును, సైన్యములును, దిగ్విజయములును, బలపరాక్రమములును, బుద్ధియు, వైభవమును, లాభము కలిగినకొలఁది, దురాశ మెండగువిధమున నివి యన్నియు దినదినప్రవర్ధమానముగ వృద్ధిఁబొందెను. వాని సోదరుఁడు, కుంభకర్ణుఁడు, మహాబలవంతుఁడు; వానితో జోడగు వీరుఁడు కాన రాఁడు; ఒకపర్యాయము వాఁడెక్కువగభుజించి, యాఱునెలలు నిద్రించును; వాఁడు నిదుఱలేచినంతట, మూఁడులోకములు కంపించును. వాఁడే ప్రతిదినము బహుళముగ భుజించుచుండినయెడల, లోకమంతయు శీఘ్రములో శూన్యమయియుండును; యుద్ధముఁ జేయుటలో వానిధైర్యస్థైర్యములను వర్ణింప శక్యముకాదు; వానితో సమానుఁడగు బలవంతుఁడు లేఁడు. ఆరావణుని పెద్దకుమారుఁడు మేఘనాథుఁడు; లోకములోని మహావీరులలో వాఁడుపాలీరేఖ; వానిని యుద్ధములో నెదిరించువారు లేరు? వాడు సదా దేవలోకమును ముట్టడించుచుండును.

దోహా 191

కుముఖుఁడు, అకంపనుఁడు, కులిశుఁడు రదుఁడు, ధూమ్రకేతువు, అతికాయుఁడు, ఇత్యాదిరాక్షసయోధు లొక్కొక్కరె మూఁడు లోకములను సాధించుటకు సమర్థులు;

చౌపాయీ 182

ఈరాక్షసులందఱును కామరూపులు; అనేకమాయాసంపన్నులు ప్వాప్నమందఱునను వారికి దయాదాక్షిణ్యములు లేవు; ఒకతోజాన తావ

ఋఁడు హాజారములో సింహాసనము నధిష్ఠించి, పుత్రమిత్రబంధువర్గంబులం జూచి, సంతుష్టాంతరంగుఁడయ్యెను. కోటానఁగోట్లు రాక్షసులఁ జూచి, వాఁడు దురభిమానము చేనుప్పొంగి, క్రోధముచే దంతములఁ బటపటఁగొఱుకుచు, దురహంకారము నణఁచుకొనలేక, "ఓవీరులారా! వినుఁడు; దేవతలు నాశత్రువులు; వారు నాయెదుటనిలిచి యుద్ధముఁ జేయరు; వారు మిమ్ముఁజూచి భయపడి పాఱిపోవుచున్నారు; ఒకవిధమున వారిని సంహరింపవచ్చును; దానిం జెప్పుచున్నాను; వినుఁడు; బ్రాహ్మణులు చేయునట్టి యజ్ఞాదిక్రతువులును శ్రాద్ధకర్మలను మీరువెళ్లి నిలిపివేయుఁడు.

దోహా 192

"అంతట దేవతలు క్షుద్బాధచే డస్సి, కృశించి, నీరసించి,నాతోఁ బోరాడుటకు రాఁగలరు; అప్పుడు వారిని స్వాధీనము చేసికొనుటకుఁ గాని సంహరించుటకు గాని సాధ్యమగును" అని యనెను.

చౌపాయ్ 193

మఱల వాఁడు మేఘనాదునిఁజూచి, వానికి రోషమును, పౌరుషమునుగల్గునట్లు పురికొల్పి, "ఓపుత్రా! దేవతలు మహాబలపరాక్రమవంతులు; దురభిమానులు; వారిని యుద్ధములో నోడించి, వారికి సంకెళ్లనుదగిలించి, తీసికొనిరమ్ము," అని చెప్పి వానిని హెచ్చరించెను. పితృవాక్యములను మేఘనాథుఁడు విని, యాసనమునుండి దిగ్గున లేచి, యుద్ధమునకు సిద్ధపడెను. వాఁడు గదఁబట్టుకొని ముందునడచెను; వాని వెనునంటి రాక్షసయోధులు పుంఖానుపుంఖములుగ పోరాటమునకు నడచిరి; ఇటుల రాక్షససైన్యములు వెడలినపుడు, భూమి కంపించెను; అంతరిక్షమునుండి పిడుగులుపడెను; దేవతాస్త్రీలు గర్భములు దిగఁబడెను; రావణి కోపముతో దాఁడివచ్చుటఁ జూచి, దేవత లొక్కుమ్మడిని స్వర్గమునువిడిచి, మేరుపర్వతగుహలఁ జొచ్చిరి. ఈవిధమున నష్టదిక్పాలుఁలోకములకు వాఁడు దాఁడినడచెను; కాని, వానిగాఁకఁ జూచి, యీయాలోకపాలురు తమతమ లోకములనువిడిచి పాఱిపోయిరి; మఱలమఱల భళీయనుచు భుజములఁ నప్పళించుకొని, వాఁడు దేవ

తలను యుద్ధమున జికొనునుగాని, వానిదాడికి వారు నిలువలేక పరాజితులయిరి.

దోహా 193

సప్తద్వీపములును, నవఖండములును, సప్తపాతాళలోకములును, పృథ్వ్యాపస్తేజోవాయు గగనములును, వానిపేరు జెప్పిన గడగడ వడంకెను; వానిపేరు విని, వరుణదేవుడు సయితము తుల్లిపడెను.

చౌపాయ్ 183 (అధికపాఠము)

రావణుని యెదిరించు ప్రతిపీరుడు లేకపోవుటచేత, వానికి యుద్ధమునం దభిలాష హెచ్చెను; ఈపొగరుబోతుతనముచే, వాడు మూడులోకములను జాడించి శోధించెను; కాని, వానికి దగినప్రతివీరుడు లేకపోయెను. అంతట నొకనాడు మార్గములో నకస్మాత్తుగ వాడు నారదునింజూచి, "ఓమునిరాజా! దేవతలెచ్చటికిబోయిరి? వారినివాసమునాకుం జూపుము" అని యతనిని ప్రార్థించెను. వానిమాటలు నారదునకు మనస్కరింపలేదు; అందుచే నతడు వానిని శ్వేతద్వీపమునకుం బొమ్మని చెప్పెను తనసంతరము వాడుసముద్రమును దాటి శ్వేతద్వీపమునకువచ్చెను; అచ్చటిస్త్రీలు వాని కండ్లంబడిరి; వారిం జూచి, "ఓ స్త్రీరత్నములారా! మీరు మీభర్తలవద్దకుంబోయి, రాక్షసరాజు వచ్చెనని చెప్పి, నాతో యుద్ధము జేయుటకు వారినిం బంపుడు; వారినిరణములో నోడించి, మిమ్ములను నా దేశమునకుం గొనిపోయెదను" అని వాడు చెప్పెను. ఒకముసలవమ్మ వానిప్రగల్భములను విని, కోపించి, వానినిసమీపించి, వానికాళ్లుం బట్టుకొని, మీందికియెత్తి, గిఱగిఱంద్రిప్పి, వానిని మీందకునెగురవేసెను; నూఱుయోజనము లంతరిక్షముమీందకు వానిందీసికొనిపోయి, యాముసలియమ్మ వానిని బాగుగజాడించి, యచ్చటనుండి వానిని సముద్రములోనికి దిగంద్రోసెను.

దోహా 194

బ్రాహ్మణుల దీవనలవలన వానికిం జావుతప్పెను; కాని, మతింబోయి, వాడు పాతాళమునం బడెను; వాడు కొంత సేదందీర్చుకొని లేచి, లజ్జలేక, పెద్దబొబ్బపెట్టెను.

## చౌపాయ్ 184

అంతట రావణుఁడు నాగులపట్టణమును జయించి, బలిచక్రవర్తి లోకమునకు గమనించెను; వానిని బలిచక్రవర్తి యాదరించి కుశలప్రశ్న జేసెను; "ఓరాజా! లేలెమ్ము; శత్రువులను జయించి, భూచక్రముఁ బరిపాలింపుము" అని రావణుఁడతనితోఁ బలికెను. వానిపలుకులను విని, "ఓరావణా! వెనుకనుండి శత్రువులను జయింపవచ్చును; ఈపని మాత్రము ముందుగఁ జేయుము; ఇవిగో నా ప్రపితామహుని యలంకారములు; వీనిని నీవు ధరించినయెడల, నీకు సకలసుఖములుకల్గును." అని బలిచక్రవర్తి పలికి, వానికి భూషణములఁ జూపించెను. అతనిమాటలను విని, వాఁడాభూషణములనుధరించుటకుఁ బ్రయత్నించెను; గాని, వానిని వాఁడు కదలింపలేకపోయెను "ఓరీమూర్ఖుఁడా! ఈనగలను నీవు కదలింపలేకపోతివికదా! ఏమినీబలము! ఆనగలనుధరించిన వారిని సంహరించినమహానుభావునితో నెట్లు నీవు యుద్ధముఁ జేయఁగలవు? నీకుసిగ్గులేదా? ఎందుకు నీకింతపొగరుఁబోతుతనము? ఈదినమున నీవు లేచినవేళ మంచిది; నీప్రాణములుదక్కెను; (నీగృహమునకుఁ బోపొమ్ము" అని బలిచక్రవర్తి చీవాట్లుపెట్టెను; రావణుఁడు సిగ్గుపడి, యచ్చటనుండి లేచి వెళ్లెను. వీనిరాకఁజూచి, వామనమూర్తికోపించి, ఒరే? వీఁడు నారదునివచనములను స్వీకరించి వచ్చెను; వీనికి దురభిమానము బలిసెను; కనుక, వీనికి గర్వప్రాయశ్చిత్తముజేయవలె" నని తలఁచి, నగరములో నాడుకొనుచుండిన బాలకులలోఁ దనదివ్యబలమును ప్రవేశపెట్టెను. ఆబాలకులు పరుగెత్తివెళ్లి, వానినిబట్టుకొని నగరములోనికిఁ దీసికొనివచ్చిరి; ఈచిత్రముఁజూచుటకు స్త్రీపురుషులు గుమిఁగూడిరి; "ఆహా! ఏమిబ్రహ్మసృష్టి! ఇరువదిచేతులును, పదితలలును, రెండుకాళ్లును గల యీపురుగును బుట్టించెను" అని వారిలోవారు గుసగుసలాడి యాశ్చర్యపడిరి. అచ్చటిరాజభటులు వాని నెంతబాధించి పేరుఁజెప్పుమనినను, వాఁడు బాధలనుసహించెనుగాని పేరుమాత్రము చెప్పలేదు; వాఁడువామనమూర్తినిఁ జూచి సిగ్గుపడెను; భగవంతుఁడు వానిఁగటాక్షించి విడిచిపెట్టెను. వాఁడులజ్జను విడిచిపెట్టెను; శీఘ్రముగ నచ్చటనుండి వాఁడు పరుగెత్తిపోయెను.

దోహా 195, 196

రావణునకు దయాదాక్షిణ్యములు లేవు; వాఁడు లజ్జనువిడిచెను; వానికి జీవులనుహింసించుటయం దభిలాష మెండు; వాఁడు మూర్ఖుఁడు కనుక రామునిసంగతిఁ దెలియక, భగవంతునితోఁ బోరాడుటకు సమ కట్టెను. ఓ భరద్వాజా! ఎవనియెడల జగన్నాథుఁడు విపరీతముగనుం డునో, వానికి మంచులుసయితము గాజుపెంకులగును; చిల్లిగవ్వపాటి విలువయైనను వానికి నుండదు.

చౌపాయ్ 185

దేవతలుగాని బ్రాహ్మణులుగాని యొంటరిగ నొక్కొక్కరు వాని కంటఁబడినయెడల, నతఁడు వారిని దండించెను; లేకవారిని దుఃఖ పెట్టెను; ఈప్రకారమాపాపాత్ముఁడు దివారాత్రములు లోకులఁ బీడించెను. అంతట నొకనాడు వాఁడు త్వరితముగ పంపాసరోవరతీరమునకు వచ్చెను; అచ్చట వానరరాజగు వాలి నివసించియుండెను; ఆసరోవర తీరమున నుండినందున, నాపట్టణమునకు 'పంపాపురము' అని పేరువ చ్చెను; ఈసరోవరము యొక్క శోభయుఁ బ్రకృతిసంపదయుఁ గన్నుల పండువుగ, మునీశ్వరులమనస్సులను సయితమపహరించును; ఆతీరమున వాలి ధ్యాననిష్ఠలోనుండెను; అతఁడు వానిఁజూచి మునివృత్తినవ్వెను; ఆనవ్వునకు వాఁడు కినిసి నీరావేశుఁడై భుజములనప్పళించి, సింహనాద ముఁజేసి, "ఓరేమూర్ఖుఁడా! నామాటవినుము; నీబకధ్యానముఁ జాలింపుము; నీపేరు వినివచ్చినాను; ఓరిపందా; భయపడక, నాతో యుద్ధమునకు రమ్ము.

దోహా 197

"ఓరివాలీ! నన్ను యుద్ధములో జయింపలేకపోయినయెడల,నీ ధ్యానమువలనఁ బ్రయోజనములేదు" అని 320 పండ్లను పటపటఁగొఱికి వాఁడు గర్జించెను

చౌపాయ్ 186

వానిమాటలను వాలి విని నవ్వి, "నీవు గొప్పబలవంతుఁడవని వినియుంటిని; నేనుసూర్యునకు భక్తితో నర్ఘ్యప్రధానము నిచ్చుచున్నాను. నేను నిన్ను జయింపగలనుఁ కొంచెము సేపునిలువుము" అని వాలి రావణునితోఁ బలికి, "వీనికి శివుఁడు వరముల నిచ్చియుండెను; కనుక, నేను

వానిం జపఁదలఁచినను వానికిఁ జావులేదు" అని లోలోపలఁ దలంచెను. మఱల వాలి రావణునిఁ జూచి, "రావణా! నీవు గృహమునకుఁబొమ్ము నాల్గుస్థలములలో నీవుపడిన పరాభవమునుగుఱించి వినియుంటిని," అని యనేకప్రకారముల వానిని బోధించెను; కాని, యతనిమాటలు వానికి బోధపడలేదు; ఇంకనువాఁడు కాలుద్రవ్వుచు బిలుచుచుండెను. అంతట వాలి క్రోధించి, వానిమీఁదకు నగిరి, బలవంతముగ వానినిఁ దనచంకలో నొక్కిపట్టుకొనెను. ఇటు వానిబట్టుకొనివాలి సూర్యున కర్ఘ్యప్రదానమునిచ్చి, వానితోఁగూడ సప్తసముద్రములలో స్నానసంధ్యాద్యనుష్ఠానముఁ జేసి, యయిదుఘడియలలోఁ దిరిగివచ్చెను. ఆప్రకారము వానిని దనచంకలో నిడికొని, వాలి మనోవాక్కర్మములచే శివపంచాక్షరీమంత్రమును జపించి, సంధ్యావందనముఁ జేసెను.

దోహా 198

అనంతరము వాలి పంపాపురమునకు వచ్చెను; రావణుఁ డతని చంకలో నలిగియుండెను; ఆరుమాసములు వాఁ డట్లు చంకలోనుండి, విశేషము శ్రమపడెను; ఒకరోజున నతఁడు వానినిఁ దిగఁద్రోబ్చి యొకపాషాణమునకు వానిని బంధించెను.

చౌపాయీ 187

అనేకప్రకారముల వాఁడీచెఱనుండి తప్పించుకొనుటకుఁ బ్రయత్నించెను; కాని వానిప్రయత్నములు నిష్ఫలములయ్యెను. వాఁ డతని చంకలో నలిగిపోయి, యాదుర్గంధమును సహింపలేకపోయెను. ఒకరోజున వాలి పండ్లుగొఱుకుచు, బాలురబొమ్మలాటకు వాఁడు తగియుండునని తలఁచెను; అతఁడు సూర్యనమస్కారములఁ జేయుచుండెను; చెఱసాలలో రావణుఁడు మొఱలిడుచుండెను; వాలి వానిబంధములనువిడదీసి, అంగదునివద్దకు వానినిఁ దీసికొనివచ్చెను; ఇరువది చేతులును, పది తలలును గల రావణునిఁ జూచి, యంగదుఁడు వానినిఁ గాలితోఁ దన్నెను; అనంతరము వాలి వానిని గుండ్రముగఁ గట్టి శయనగృహమునకుఁ బోయి, తల్పముపైఁ బవ్వళించెను, అంగదుఁడు వినోదార్థము కాలుతో వానినెత్తిమీఁదఁ గొట్టుచుండెను; వానిఁజూచి నవ్వుచుండెను.

దోహా 199

వాలిశయనించియుండిన సమయముఁజూచి, తార రావణునివద్దకువచ్చి, వానిబంధనములను విడఁదీసి, "ఓయిరావణా! శీఘ్రముగా గృహమునకుఁ బొమ్ము; లేనిచో, వాలి నిన్నుఁ గట్టిపెట్టును" అనిచెప్పెను.

చౌపాయ్ 188

తదనంతరము, రావణుఁడు బయలువెడలి; కార్తవీర్యార్జునుఁడు స్త్రీలతోఁ గూడి క్రీడించుచుండినస్థలమునకు వచ్చెను; అప్పుడు కార్తవీర్యుఁడు స్త్రీలతో జలక్రీడలలోఁ దేలుచుండెను; రేవానదీజలములలో రాసమండలి గల్పించి, కార్తవీర్యుఁడు క్రీడించుచుండెను; దేవతలును మనుజులును నాగులును నతనిని సేవించుచుండిరి; రావణుఁడు వానిసంపదఁ జూచి, దుఃఖించెను. ఆనదీతీరమున నొకశివాలయము కలదు; దానింజూచుట కన్నులపండువు; దానింజూచి మునులుసయితము భ్రమించెదరు; తులసీదళములును, కమలములును, బిల్వదళములు మొదలగుపుష్పము లనేకము లామందిరములోఁ గలవు; ఆనదిలో రావణుఁడు స్నానముఁజేసి, శివునిఁబూజించెను. అనంతరము, వాఁడు లజ్జనువిడిచి, కార్తవీర్యుఁడు క్రీడించుచుండినస్థలమునకు వచ్చెను.

దోహా 200

రావణుఁడు నదిలోనికిదిగి,యిరువదిచేతులతోనదీప్రవాహము నరికట్టెను; అందుచేత, నదీజలములు పూరించి, యెగఁదట్టెను; రాసమండలి వారందఱునునీటిలో మునుగుచుండిరి; కార్తవీర్యుఁడు వారి యల్లకల్లోలముఁ జూచి కోపించి, "నాతోసమానుఁ డెవఁడు? ఎవరింతపనిఁజేయఁగలరు?" అని చింతించెను.

చౌపాయ్ 189

తదుపరి, కార్తవీర్యుఁడు జలములలోనుండి లేచి నలువైపులఁ జూచెను; రావణుఁడు చేయుచుండినదౌర్జన్యమును కార్తవీర్యుఁడు కనిపెట్టెను. అతఁడు మహాబలవంతుఁడు; కనుక, నొక పఱుఁగిడి, వానిననాయాసముగఁ బట్టుకొనెను. స్త్రీలు వానింజూచి యాశ్చర్యపడిరి; కొంతకాలము వానిని గుఱ్ఱపుశాలలోఁ గట్టిపెట్టెను. ఆదుష్టుఁడు లజ్జపడి, కోపముచే లోలోపల దుఃఖించుచుండెను; కాని, వాఁడేపనిఁజేయ

లేకపోయెను; స్త్రీపురుషులు వానిం జూచుటకు వచ్చి, కాళ్లతో వానిం గొట్టుచు, పకపకనవ్వుచుండిరి; కార్తవీర్యుఁడు వాని నెన్ని విధముల నడిగినను, వాఁడు సిగ్గుపడి, తనపేరుఁ జెప్పలేదు. సేవకులు వానిని సభామండపమునకుఁ దీసికొనివచ్చి వానిపదితలలమీఁదఁ బదిదీపములఁ బెట్టి, వానిని నిలువఁబెట్టిరి; రంభాద్యప్సరసలు నృత్యముఁ జేయుచుండిరి; అప్పుడు పులస్త్యబ్రహ్మ కార్తవీర్యునివద్దకువచ్చి, రావణుని విడిపించెను; తర్వాత నలకూబరుఁడు వానిని శపించెను.

దోహా 201

గంధపుష్పాక్షతలఁ బట్టుకొని, యొక స్త్రీరత్న మొకదినమున శివాలయమునకుఁ బోవుచుండెను; ఆ స్త్రీ రావణుని కంటఁబడెను.

చౌపాయ్ 190

ఆ స్త్రీరత్నము 'ఊర్వశి'; ఆమె రావణునిఁజూచి సిగ్గుపడెను; రావణుఁ డామెఁజూచి, "ఓ స్త్రీరత్నమా! ఎవరునీవు? ఎవరిచిన్నదానవు? ఎచ్చటికిఁబోవుచుంటివి?" అని మృదువాక్యములతో నడిగెను. వానికిఁ బ్రత్యుత్తరమిచ్చుట కామె సిగ్గుపడి యూరకుండెను; వాఁడు మదించియుండినందున వానికి మతిపోయెను. మోహావేశముచే నామెహస్తము వాఁడు పట్టుకొనెను; ఆమె అప్సరసయయినను నాదినమున నలకూబరునిసాంగత్యమున కొప్పుకొనియుండెను; వాఁ డామెఁ జూచి పోల్చి, శంకించి, పశ్చాత్తాపమొందెను; వాఁ డామెను విడిచి, దుఃఖించుచు లంకలోఁ బ్రవేశించెను; ఊర్వశి, తదుపరి, అలకానగరమునకు వచ్చి, యావద్వృత్తాంతమును నలకూబరునకు విన్నవించెను; అతఁడు కోపించి, రావణు నుద్దేశించి, "ఓరీ! నీవంశక్షయమగుగాక!" అని శపించెను. ఆశాపము మూర్తీభవించి, లంకానగరమునకు వచ్చి, రావణుని యెదుట నిలిచెను; దానింజూచి, వాఁడు భయముచేఁ గంపించెను.

దోహా 202

వాఁ డాశాపము నందుకొని, పిమ్మట "అయ్యో! ఇంతవఱకు మనము ఋషులవద్దనుండి పన్నుఁగైకొనలేదు" అని విచారించెను.

చౌపాయ్ 191

ఒకఋష్యాశ్రమమునకు వాఁడు నల్వురుదూతలఁ బంపెను; ఆఋషి వారింజూచి, భయపడి, భగవద్ధ్యానమునువిడిచి, "ఓయీ! మీరాజు

రావణుఁడు కుశలముగ జీవించి, మాయందు దయఁగలిగియుండునా?" అని యడిగెను. "ఓమునీశ్వరా! రాజుగారు క్షేమముగనున్నారు; మీ వద్దనుండి పన్నుఁబుచ్చుకొనుటకు మమ్ములఁబంపిరి" అని వారుచెప్పిరి; ఆఋషి వారిమాటలనువిని భయపడి, ధ్యానమునువిడిచి, "అయ్యో! రాజు నీతిఁదప్పియుండెను; రాజువద్ద దుర్మార్గులు చేరియుండిరి; ఉత్తరేతులతో వీరినిఁ బంపివేయుట యుచితముకాదు" అని చింతించి, తనశరీరమునుండి రక్తముఁదీసి, దానితో నొకకుండనింపి, దానిని వారిచేతికిచ్చి, "ఓయీ! దూతలారా! మీరీకుండను రావణునకిచ్చి, యీమాట నతనితోఁజెప్పుడు:—

దోహా 203

"నీవీకుండయొక్క మూఁతఁ దీసినయెడల, నీవుపుత్రమిత్రబంధువర్గముతో నశించెదవని చెప్పుడు" అని వానితోఁ బలికెను. వారాఘటముఁ దీసికొనిశీఘ్రముగ రావణునిసభామండపమునకు వచ్చిరి.

చౌపాయ్ 192

రావణుఁడు దానింజూచి సంతోషించెను; కాని, దూతలాఋషివచనములను వానితోఁ జెప్పిరి; ఆమునిశాపమును వాఁడు విని దుఃఖించి "ఓయీదూతలారా! మీరీఘటము నుత్తరదిశకుఁ దీసికొనిపోయి, జనకమహారాజురాజ్యములో, నెవరికిఁదెలియకుండ, పదిలముగ భూమిలోఁ బాతిపెట్టిరండు" అని వారి కాజ్ఞాపించెను. శివునిసభలో జనకునివలన రావణుఁడు పరాభవముఁబొందెను; అందుచేత నతనిమీఁదఁ గోపించి, యతఁడు నశించుటకు వాఁడీపనిఁజేయించెను. ఆదూతలు రావణుని యాజ్ఞాప్రకారము ఘటముఁ దీసికొని, జనకునినగరమువద్ద నొకస్థలములో దానిని పాతిపెట్టిరి. అంతట భగవంతునికృపవలన నొకసమయమున నీటికియెద్దడియయ్యెను; అప్పుడు సకలజంతువులకు క్షోభకలిగెను; సువృష్టికలుగుటకు జనకుఁడు యజ్ఞముఁజేయదలంచి, బంగారునాగలితో భూమిని దున్నుచుండెను.

దోహా 204, 205

అంతట భూమి బ్రద్దలై, బ్రద్దలుకొకమునుపే; దేదీప్యమానముగ వెలుఁగుచుండిన నొకసుందరమగు దివ్యసింహాసనమతనికిఁ గనబ

డెను; దానికి నలువైపులనల్వురు చెలికత్తెలు చామరములనుధరించి నిలువఁబడియుండిరి. మధ్యమునఁ ద్రిలోకసుందరి యగు భూపుత్త్రిసింహాసనము నధిష్ఠించియుండెను.

చౌపాయ్ 193

ఆమెకు జనకచక్రవర్తి నమస్కరించెను; ఆమెవెంటనే స్త్రీశిశువయ్యెను; చెలికత్తెలతోఁగూడ నాసింహాసన మంతర్ధానమయ్యెను; జనులందఱాశ్చర్యపడిరి? ఆచిన్నదానిని జనకుఁడు రాణివద్దకుఁ దీసికొనివెళ్లెను; ఆపిల్ల రోదనమునువిని, రాణి సంతోషించి యామెనెత్తి చంకఁ బెట్టుకొనెను ఆమె జనకునికూఁతురుగనుక నామెకు జానకియని పేరువచ్చెను; అంతట నారదుఁడు రాజువద్దకువచ్చి, "ఓరాజా! ఈచిన్నది నాగేటిచాలులోఁ బుట్టెను కనుక నీమెపేరు సీత; ఈమె యదృష్టవంతురాలు; సకలలోకానాథుఁడును, సకలైశ్వర్యసంపన్నుఁడును, సకలగుణసంపన్నుఁడు నగువరుఁడు నీకుమారైను వివాహమాడును" అని చెప్పి బ్రహ్మలోకమునకు వెళ్లిపోయెను. ఆచిన్నది శుక్లపక్షచంద్రునివలె, దినదినప్రవర్ధమానముగ నభివృద్ధినొందెను. ఆబాలవృద్ధులుగ స్త్రీపురుషులకాచిన్నది ప్రియురాలయ్యెను; కలుపుఁగోలుతనముగ నందఱితో నామె మెలఁగుచుండెను. ఆమెకు రాజు చదువులఁ జెప్పించెను; అతిశీఘ్రములో నామె చదువులఁ జదివెను; అన్నిచదువులసారము మూర్తీభవించినజానకి చదువులగ్రహించెను.

దోహా 206, 207, 208.

ఒకసమయమున జనకుఁడు శివుని నుద్దేశించి తపముఁ జేసెను; అతనికి శివుఁడు ప్రత్యక్షమై వరముఁ గోరుమనెను; అప్పుడు రాజు చేతుల జోడించి, శివునకు నమస్కరించి, యనేకప్రకారముల నతనిని స్తుతించెను. "ఓస్వామీ! వేదములు 'న. ఇతి' అని చెప్పుచుండినపరబ్రహ్మమును నీవు నిత్యము దివారాత్రములు ధ్యానించెదవు; అట్టిబ్రహ్మము నాకుఁబ్రత్యక్షమగునట్లు వరమునొసంగుము; ఇంతకుఁ దప్పనాకు మఱియొకకోరికలేదు" అని రాజు శివునిఁబ్రార్థించెను. అతనిప్రార్థనవిని సంతసించి, "ఓరాజా! ఈధనుస్సుఁ బుచ్చుకొనుము; భక్తిశ్రద్ధలతో దీని

నీఁబూజింపుము; నీకోరికనెఱవేఱును" అని ధనస్సునిచ్చి, శివుఁడంతర్ధాన మయ్యెను.

చౌపాయ్ 194

ఆధనస్సును జనకుఁడు పుచ్చుకొని, గృహామునకువచ్చి, దానిని బూజించుచుండెను; ఒకరోజున సేవకులు చూచుచుండ, సీతాదేవి వినోదార్థ మాధనస్సుఁ జేతితోఁదీసి పట్టుకొనెను; ఆచిత్రము జనకుఁడు చూచి యాశ్చర్యపడెను; వెంటనే రాజామెకుఁ బ్రణమిల్లెను; "ఎవ రీధనుస్సును యెక్కుబెట్టఁగలరో, వారికి నాచిన్నదానినిచ్చి వివాహముఁజేయువాఁడను" అని యతఁడు ప్రతిజ్ఞఁజేసెను.

అనంతరము రావణునిదూతలు లంకానగరమునకుఁబోయి, జరిగి నవృత్తాంతమంతయు వానికివిన్నవించిరి, ఓభరద్వాజా! నాల్గుస్థలము లలో రావణుఁడు పరాభవముఁబొందినను, సిగ్గునువిడిచి, దేవతలను బాధించుచుండెను.

అధికపాఠము సమాప్తము.

అష్టదిక్పాలురును రావణునియాజ్ఞను శిరసావహించియుండిరి; గరుడ, గంధర్వ, కిన్నర, యక్ష నర నాగులు వారిస్వధర్మములను విడిచి, వానికి జోహారువనుచుండిరి. బ్రహ్మసృష్టించిన సకలజీవరాసు లును వానికి వశులైయుండిరి; వానియాజ్ఞలను వారు శిరసావహించి, వానిప్రకారము మెలగుచుండిరి. నిత్యమువానిపాదములకు వారు నమ స్కరించుచుండిరి.

దోహా 209, 210

రావణుఁడు స్వభుజబలముచే మూఁడులోకములను సాధించెను; ఒకపురుగునకైనను స్వాతంత్రములేదు; సకలదిక్పతులను స్వాధీనముఁ జేసికొని, వాఁడుస్వతంత్రముగ రాజ్యముఁబరిపాలించుచుండెను. దేవ యక్ష, నర, గంధర్వ, కిన్నర రాజాదులను జయించి, వారివారికన్యలను వాడు వివాహమాడెను.

చౌపాయ్ 195

తండ్రి చెప్పినపనులు నవలీలఁగా నింద్రజిత్తు చేయుచుండెను; రావణుని దౌర్జన్యములకు మితములేదు; వానిదుర్మార్గములను గుహ

రుఁడు చూచి విచారించి "ఓతమ్ముఁడా! దుర్మార్గములను విడిచిపెట్టుము; ఇట్టిపనులు నీకుఁ దగదు" అనిచెప్పి దూతచే వర్తమానముఁ బంపెను. ఆవర్తమానమును రావణుఁడు విని కినిసి కుబేరునిపై దండువెడలి, యత నినిజయించెను; అనంతరము వాఁడు యమునిపైకి దాఁడివెడలెను; వానికి మరణకాలము సమీపింపలేదని గ్రహించి, యముఁ డంతర్ధానమ య్యెను; తదుపరి, వాఁడు దేవేంద్రునిపైకి దండువెడలెను; ఇంద్రుఁడు వానితోఁ బోరాడి వానినిఁ బట్టుకొని చెఱలోనుంచెను. తండ్రికి జరగి నదురవస్థను మేఘనాదుఁడు విని కోపించి, స్వర్గమునకు దండువెడలి, దేవేంద్రునితో ఘోరయుద్ధముఁజేసి, యింద్రునిఁబట్టుకొని, తండ్రిని చెఱసాలనుండి విడిపించి, లంకకు వచ్చెను; కుమారుని ప్రజ్ఞకు రావణుఁడు సంతసించి, యింద్రునిఁ జెఱసాలలోఁ బెట్టెను; అప్పుడు బ్రహ్మ మేఘనాదునివద్దకు వచ్చి, వాఁడు కోరినవరములను నమోఘమగుశక్తి నొకదానిని వానికిచ్చి, ఇంద్రునిఁదీసికొని, స్వర్గమునకుఁబోయెను. ఓభరద్వాజా! ఇతరరాక్షసయోధులు వానియాజ్ఞల నెటులశిరసావహించిరో, చెప్పుచున్నాను; వినుము. ఆరాక్షసులరూపములు భయంకరములు; వారు మహాపాపాత్ములు; వారినివర్ణించుటకు సామర్థ్యము లేదు; వా రనేకఘోరకృత్యములఁ జేయుచుండిరి; వారు వివిధమాయావేషములను ధరించి మనుజులను బెదరించిరి; వారివలన ధర్మము నిర్మూలమయ్యెను; అన్నివిధముల వారు వేదములకుఁ బ్రతికూలముగ సంచరించుచుండిరి; ఎచ్చటెచ్చట గోబ్రాహ్మణులు వారికింటఁబడియె దరో, నాస్థలములను వారు తగులఁబెట్టుచుండిరి; సదాచారములు మాఁటుమణఁగెను; వేదాధ్యయనములు మాఁటుఁబడెను; గురుబ్రాహ్మణులు దిక్కులుపట్టిరి; భగవంతునియందు భక్తిపోయెను; తపములన్నియు నశించెను; స్వప్నమందైనను వేదపురాణముల ప్రశంస లేకపోయెను.

ఛాందః 18

జపములు, తపములును, యోగమును, వైరాగ్యమును, యజ్ఞములును, భాగములు నెచ్చటకనఁబడిన, నచ్చటికి వాఁడు దాడివెడలి వానిని ధ్వంసముజేయుచుండెను; వానిశబ్దము వినఁబడకుండఁజేసెను;

మూఁడులోకము లధర్మములో మునిఁగియుండెను; ధర్మము వెళ్లిపోయి యడవులలోనుండెను; ధర్మమనెడిమాట వినఁబడదు; వేదపురాణములఁ జదివినవారిని దేశమునుండి వెడలఁగొట్టి వాఁడు వారిని బాధపెట్టు చుండెను.

సోరథా 26

రాక్షసులు చేయుచుండిన ఘోరకృత్యములను వర్ణించుటకు శక్యముకాదు; వారు పరహింసాపరాయణులై, విచ్చలవిడిగ సంచరించిరి.

చౌపాయ్ 196

ఎచ్చటఁజూచిన దుర్మార్గులును, చోరులును, జూదగాండ్రును, పరధనాపేక్షులును, జారులును, జననీజనకులను దిరస్కరించువారును, సాధువులను సేవింపక వారిని దూషించువారును, విజృంభించిరి; సాధువులచే సేవఁజేయించుకొని వారిని తూలనాడు వాగునతిశయిల్లిరి; ఓపార్వతీ! ఈప్రకారముసంచరించువారు రాక్షసులని తెలిసికొనుము. ధర్మమునశించుటఁజూచి, భూదేవి భయపడి వ్యాకులపడెను; "సప్తకుల పర్వతములును, సప్తసముద్రములును, నదులును, సరస్సులును, వనములును, జీవులును, ఈమొదలగువానికంటె నీలోకకంటకునిభార మధికమయ్యెను" అని యామె చింతించెను. ఆమెధర్మహానింజూచి, చింతించెను; కాని, రావణునిభయమువలన, నామె యేమియుఁ జెప్పలేకపోయెను. ఆమెమనస్సులోఁ గొంతవిచారించి, గోరూపముధరించి, దేవతలును మునులును జేరియుండినసభలోనికి వెళ్లెను; వారియెదుట నామె నిలువఁబడి, వెక్కివెక్కి యేడ్చుచు, తనదుఃఖమును వెళ్లఁగ్రక్కెను; కాని, వారిలో నొకరైన నామెదుఃఖమును నివారించుటకు సమర్థులుకారైరి.

ఛాండ్ 19

ఒక్కమ్మడిని త్రింశత్కోటిదేవతలందఱు బ్రహ్మలోకమునకు వెళ్లిరి; వారితోఁగూడి భూదేవి గోరూపముధరించి వెడలెను; శోకముచేతను భయముచేత నామెమనస్సు విహ్వలమగుచుండెను; బ్రహ్మ సర్వమును గ్రహించి, కొంతవడిమఁ జింతించి, "ఓదేవతలారా! నేనేమి చేయగలను? నావశముకాదు; ఆజగన్నాథుఁడు, ఆలోకారాధ్యుఁడే

మిమ్ములను నన్నును సహా రక్షింపగలఁడు; కాని మఱియొకఁడు లేడు." అని వారికి బోధించెను.

సోరఠా 27

"ఓభూదేవీ! ధైర్యము నవలంబింపుము; భగవంతుని ధ్యానింపుము; ఆర్తశరణ్యుఁడగు పరమేశ్వరుఁడు భక్తుల దీనాలాపములను విని, వారిదుఃఖములఁ బోఁగొట్టును" అని బ్రహ్మ భూదేవి నూఱడించి, యామెకు ధైర్యముఁజెప్పెను.

చౌపాయ్ 197

దేవతలందఱు సభజేసి, "ఎచ్చట భగవంతుని మనము చూడగలము? ఎచ్చట మొఱబెట్టుకొందుము?" అని వారిలోవారు పాలుపోవక దిగులుపడిరి; "వైకుంఠపురిలోఁగలఁడు" అని యొకఁడు చెప్పెను. "క్షీరసముద్రములో శేషునిపైఁ బవ్వళించియుండును" అని మఱియొకఁడు పలికెను; "ఎవఁడు భగవంతుని భక్తితోఁ గొల్చునో, యాతనికిఁ బ్రత్యక్షమగును; వానిహృదయములో నతఁడు నివసించును" అని మూఁడవవాఁడు తెలియపరచెను. ఓపార్వతీ! ఆసభలో నేనును వారితోఁ గూడి యుంటిని. మంచిసమయముఁజూచి వారికి నేనిట్లుబోధించితిని; "ఓదేవతలారా! హరి సర్వవ్యాపకుఁడు; సర్వసముఁడు; భక్తిగల వారికి హరి ప్రత్యక్షముగునని నే నెఱుంగుదు; సమస్తపదార్థములలోను, దిశలువిదిశలు కాలము దేశము అంతటను హరి కలఁడు; అతఁడు లేనట్టిపదార్థము లేదు. "ఇందుఁగలఁడందు లేఁడని సందేహమువలదు; చక్రి సర్వోపగతుం డెందెందు వెదకిచూచిన నందందేకలఁడు"- రెండుకఱ్ఱలను రాపిడిచేయుటవలన నగ్ని పుట్టును, అటులనే, యతఁడు భక్తివలనఁ బ్రత్యక్షమగును" అని నేను బల్కితిని; నావచనములను బ్రహ్మ విని "సత్యము, సత్యము" అని ప్రశంసించెను.

దోహా 211

హరి సర్వవ్యాపకుఁడని శివుఁడు చెప్పినవచనములను బ్రహ్మ విని, పరమానందభరితుఁడై, ఆనందబాష్పములఁ గార్చెను; అతనిశరీరము పులకరించెను; కొంతకాల మతఁడు నిమీలితనేత్రుఁడై, పరమేశ్వరుని ధ్యానించెను; అమీఁదట, బ్రహ్మ మనస్సును సావధానముఁజేసికొని,

ధైర్యమునవలంబించి, రెండు చేతులను, జోడించి, భగవంతు నీప్రకా
రము మనోవాక్కర్మములచే స్తోత్రముఁజేయ నారంభించెను.

ఛాంద్ 20, 21 22, 23.

జయ జయ సురనాయక జన సుఖదాయక ప్రణతపాల భగవంతా,
గో ద్విజ హితకారీ జయ అసురారీ సింధుసుతా ప్రియకాంతా,
పాలన సుర ధరణీ అద్భుత కరణీ మర్మ న జానే కోఈ,
జో సహజ కృపాలా దీనదయాలా కరహు అనుగ్రహ సోఈ.

"హేసురనాయక! జయజయ! దేవతలకురక్షకుఁడవు; మనుజు
లకు సుఖదాయకుఁడవు; దీనపాలకుఁడవు; గోబ్రాహ్మణులకు హితుఁడవు;
రాక్షసాంతకుఁడవు; లక్ష్మీకాంతుఁడవు; నీవు భగవంతుఁడవు; మాకు సహా
యముఁజేయుము; జయజయ! దేవతలను భూమిని రక్షించుటలో, నీ
చర్య లద్భుతములు; నీమర్మ మెవరికిఁదెలియదు; నీవు సహజకృపాళుఁ
డవు; మమ్ముల ననుగ్రహింపుము.

"జయ జయ అవినాశీ సబ ఘట వాసీవ్యాపక పరమానందా,
అవిగతి గోతీతా చరితపునీతా మాయారహిత ముకుందా,
జేహిలాగి విరాగీ అతిఅనురాగీ విగతమోహ ముని బృందా,
నిశి వాసర ధ్యావహి హరిగుణ గావహి జయతి సచ్చిదానందా"

"హేఅవినాశీ! జయజయ! రాక్షసులవలన నాశముకలుగునని
మాకు భయము కలదు; కాని; నీకాభయములేదు; సకలజీవుల ఘటము
లలోఁ బ్రకాశించుచుందువు; సర్వవ్యాపకుఁడవు; పరమానందమూర్తివి
కనుక, భూదేవికి ఆనందమును కలుగఁజేయుము; నీగతి అద్వైతము;
నీవు మనోవాచామగోచరుఁడవు; నీయందు లేశమైన విషయములు కాన
రావు; భూలోకములో నీవుచేయఁబోవు పుణ్యచరిత్రలవలన రాక్షససం
హారము జరగినతరువాత భూదేవి పవిత్రురాలగును. నీవుమాయా
రహితుఁడవు; (మాయ నీకు లోఁబడియుండును); నీవు ముకుం
దుఁడవు (మోక్షదాయకుఁడవు); విపత్తి సముద్రములోనుండి మమ్ముల
నుద్ధరింపుము; ఆవిపత్తిసముద్రమును దాటునిమిత్తము, వైరాగ్యసంప
న్నులగు మహామునులు మోహమును విడిచి పరమ భక్తితో నిన్ను

దివారాత్రములు ధ్యానించుచుందురు, వారు నీగుణములను గానముఁజేయుచుందురు; ఓనాథా! నీవు సచ్చిదానందస్వరూపుఁడవు; జయజయ.

"జేహి సృష్టి ఉపాఈ త్రివిధ బనాఈ సంగసహాయ న దూజా
సో కరహు అఘారీ చింత హమారీ జానియ భక్తి న పూజా
జో భవ భయ భంజన జన మన రంజనభంజన విపతి వరూథా
మన క్రమ వచ వానీ ఛాడి సయానీ శరణ సకల సురయూథా."

"ఓనాథా! సత్త్వగుణముచే బ్రహ్మ లోకములను సృజించును; రజోగుణముచే విష్ణువు దానిని పరిపాలించును, తమోగుణముచే శివుఁడు దానిని సంహరించును; ఈప్రపంచము త్రిగుణాత్మకము; నీకొకసహాయుఁడులేఁడు; హేపాపనాశనా హేరాక్షసాంతకా మమ్ములను స్మరింపుము; నేను భక్తినెఱుంగను. పూజావిధానములనెఱుంగను. నీవు సృజించిన లోకములకు భయము కలిగినపుడు దానిని నీవే పోఁగొట్టఁగలవు; మనుజులకు నీవే సుఖము నిచ్చువాఁడవు; విపత్తిసమూహమును నీవే హరింపఁగలవు. అందుచేత సకలదేవతలు త్రికరణశుద్ధిగ వారివారి చాతుర్యమును విడిచి నీవేశరణని నిన్నుఁ బొందవచ్చిరి. ఓనాథా! నీవే శరణు.

"శారద శ్రుతి శేషా ఋషయ అశేషా జాకహ కోఉ న జానా
జేహి దీనపియారే వేదపుకారే ద్రవౌ శ్రీభగవానా
భవవారిధి మందర సబవిధి సుందరగుణమందిర సుఖపుంజా
మునిసిద్ధ సకల సుర పరమభయాతుర నమత నాథ పద కంజా"

"ఓనాథా! సరస్వతికిని వేదమునకును శేషునకును, సకలమహర్షులకును నీసంగతి తెలియదు; నీవు దీనబంధుఁడవు. ఆర్తత్రాణపరాయణుఁడవు; అని వేదము చెప్పుచున్నది. ఓస్వామీ! మమ్ములను గటాక్షించి, కృపతోఁ జూడుము. సంసారసముద్రమునకు నీవు మందరపర్వతమువంటివాఁడవు; సకలగుణధాముఁడవు; సకలసుఖరాశివి; దేవతలును, మునులును, సిద్ధులును వ్యాకులులై, నీచరణకమలములకు నమస్కరించుచున్నారు.

దోహా 212

దేవతలు బ్రాహ్మణులు, మునులు, భూమియు - వీరిదుఃఖముం జూచి, దీనాలాపములను విని, భగవంతుఁడు వారికి నగోచరుఁడై, వారి భయ, శోకములఁ బోఁగొట్టుట కంతరిక్షమునుండి, మృదుమధుర గంభీరవాక్యములఁ బలికెను.

చౌపాయీ 198

"ఓ బ్రహ్మ మహేశులారా! ఓ దేవమునిసిద్ధులారా! భయమును విడిచిపెట్టుఁడు; మీనిమిత్తము నేనుమనుజుఁడనై భూలోకములో నవతరించెదను; నాదివ్యాంశతో నేను సూర్యవంశములోఁ బుట్టుచున్నాను. పూర్వము కశ్యపుఁడును, అతనిభార్యఅదితియుఁ దపముఁ జేసిరి, వారికి నేను వరమునిచ్చియుంటిని; వారిరువురు నేఁడు భూలోకములోఁ బుట్టి, అయోధ్యాధిపతులై యుండిరి; కశ్యపుఁడే దశరథుఁడు, అదితియే కౌసల్య; నాల్గురూపములనుధరించి నేను వారిగర్భమున బుట్టుచున్నాను; రఘువంశమునకుఁ గీర్తిప్రతిష్ఠలు నామూలమున వచ్చును. నారదుని వచనములు సత్యము లగును; నాపరమశక్తితోఁగూడ నవతరించి, భూభారమును హరించెదను; కనుక ఓ దేవతలారా! నిర్భయముగ మీరు మీమీగృహములకుఁ బొండు" అని యాకాశవాణి పలికెను. ఆపలుకులను విని దేవతలు సంతసించి, స్వగృహములకు వెడలిరి. బ్రహ్మ భూదేవి నూఱడించెను; ఆమె నిర్భయురాలై, సంతోషించి పయనమయ్యెను.

దోహా 213

"ఓ దేవతలారా! మీరందఱును మీమీయంశములతో వానరులై పుట్టి భగవంతుని సేవింపుఁడు" అని బ్రహ్మ వారికి యాజ్ఞఁజేసి, సత్యలోకమునకుఁ బోయెను.

చౌపాయీ 199

దేవతలు వారివారిగృహములకుఁ బోయి నివసించిరి; భూమియు స్వాస్థ్యముఁ బొందెను; భగవంతుని వచనములవలన వారియలఁజడి కొంతవఱకుఁ దగ్గెను. బ్రహ్మదేవుని యాజ్ఞాప్రకారము దేవతలు విలంబనము చేయక పనిఁజేయుటకు సమకట్టిరి; వారందఱును వానరులై భూ

లోకములోఁ బుట్టిరి; ఆవానరులు మహాబలవంతులు; తేజోవంతులు; పరాక్రమశాలులు; మహావీరులు; శూరులు; పర్వతములును, వృక్షములును, నఖములును, వారికి నాయుధములు, వారు భగవంతునిరాకకు నిరీక్షించుచుండిరి; వారు రణధీరులు, వనములలోను, పర్వతములమీఁద నంతటను వారు వ్యాపించి, విహరించుచుండిరి; వారందఱు రణశిక్షఁబొందినవారివలె జాగరూకతతో మెలఁగుచుండిరి: ఎచ్చటఁజూచినను వానరబృందములే కన్పడును; ఈసమాచారమును రావణుఁడు విని విచారించి, పుట్టినశిశువులనందఱిని సంహరింపుమని దూతల కాజ్ఞాపించెను. "సూర్యవంశపురాజులందఱును నాస్వాధీనులు, వారు నన్నేమిచేయఁగలరు? జగత్తులో నెవరివలనను నాకు భయములేదు, రాక్షససైన్యముల నచ్చటచ్చట నిల్పియుంచెదను.

దోహా 214

సృష్టిస్థితిలయములు నాయాజ్ఞ ననుసరించి జరగుచుండును కదా! అని వానిలో వాఁడుతలంచెను.

చౌపాయీ 200

సూర్యవంశపురాజు, దిలీపుఁ డనునొకఁడు కలఁడు; అతఁడు రాక్షసుల నందఱిను తఱిమివేసెను' ఆతనిబలముఁ జూచుటకు వాఁడు బ్రాహ్మణవేషమును ధరించి, రాజనగరునకు వచ్చెను; ఆసమయమున రాజు నగరులోలేఁడు; బ్రాహ్మణులకు సిరాటంకముగనుక వాఁడు వారితోఁ గూడి రాణివాసములోనికిఁ బోయెను. బ్రాహ్మణులను దిలీపునిభార్య పూజించుచుండెను; అప్పుడు రావణుఁడ వారికిఁదన నిజరూపము జూపించెను; వానివికృతరూపము నామె చూచి భయపడి లోపలికిఁ బాఱిపోయెను; మిగిలినవారు నలువైపులఁ జెదఱిపోయిరి; అనంతరము, వాఁడు సరయూనదీతీరమునకు వచ్చెను. అచ్చట దిలీపుఁడు బ్రాహ్మణుల నారాధించి, తండులములను వారి కిచ్చుచుండెను. అటుల నతఁడు తండులములను దానముఁజేయుచు, కొన్ని తండులములఁదీసిచల్లెను. అటులఁ జల్లుటకుఁ గారణమేమని బ్రాహ్మణు లతనిని యడిగిరి; "వనములోనొక గోవునొకసింహము పట్టుకొనెను, ఈతండులములను మం

త్రించి, ఆసింహమును సంహరించుట కుద్దేశించి, దానిపైఁ బ్రయోగించితిని" అని రాజు వారికి సమాధానముఁ జెప్పెను. అచ్చట నిలువఁబడి యుండిన రావణుఁ డతని మాటలను విని యాశ్చర్యపడి, వనమునకు బోయి, చచ్చిపడియుండిన సింహకళేబరముఁ జూచెను; దిలీపుని ప్రతాపమును వాఁడు గ్రహించి, లంకకుఁ బోయెను. ఆమీఁదట రాజు దిలీపుఁడు నగరులోఁ బ్రవేశించెను; జరగినవృత్తాంత మంతయు నతనితో రాణి విన్నవించెను.

దోహా 215,—216

ఆమెవచనములను దిలీపుఁడు విని, కోపించి, దోసిలినిండ నీరుఁ బోసి, పవనమంత్రమును జపించి, ఆజలమును దక్షిణదిశవైపు విడిచిపెట్టెను; ఆమంత్రజలము దశలక్షబాణములయ్యెను; "ఓబాణములారా! మీరు త్రికూటపర్వతమునకుఁ బోయి దానినాథునితోఁగూడ దానిని సముద్రములోనికిఁ బడఁద్రోయుఁడు" అనివానికి నాజ్ఞాపించెను.

చౌపాయ్ 201

ఆబాణములు వాయువేగమునఁ బోయి లంకపైఁ బడి దానిఁ గదలించెను; అంతట మందోదరి చేతుల జోడించి, "ఓబాణములారా! మేము దిలీపునిభృత్యులము; మాకతఁడే రాజు గాని మఱియొకఁడు లేడు," అని చెప్పి ప్రార్థించెను. ఆబాణములు తిరిగిదిలీపునివద్దకువచ్చెను, వానినియతఁ డుపసంహారముఁ జేసెను. తదనంతరము మఱికొంతకాలము గడచెను; అయోధ్యానగరమును రఘుమహారాజు పరిపాలించుచుండెను; రావణుఁ డతనిని యెదిరించెను; అంతట నయోధ్యనుండి రఘుమహారాజు బాణములఁ బ్రయోగించి లంకానగరద్వారములను బంధించెను; మఱలమందోదరి ప్రార్థించినందున నాబాణములు రాజువద్దకు వచ్చెను; కొంతకాలమునకు 'అజమహారాజు' అయోధ్యానగరము నేలుచుండెను; అతనికిని రావణునకు ననేకఘోరయుద్ధములుజరిగెను; అతఁడు వాయవ్యాస్త్రముఁ బ్రయోగించినందున, వాఁడు సేనలతోఁగూడ నెగిరి లంకలోఁబడెను. అతనిబలమునకు వాఁడు మెచ్చుకొనెను. మఱికొంతకాలమునకు దశరథుఁ డానగరమునకు రాజయ్యెను.

దోహా 217 218.

సూర్యుని కిరణము లెటుల నలువైపుల వ్యాపించునో, దశరథునిరథము దశదిశల నటుల గమనించును దానికి నెదురులేదు. దశరథికులబలము కలవాఁడుకనుక నతఁడు దశరథుఁడు; ఎవనికుమారుఁడు దశకంధరునకు శత్రువు కాఁగలఁడో, వాఁడు దశరథుఁడు. రావణుఁ డతని సమాచారమును విని, యతనివద్దనుండి శుల్కముఁ గైకొనుమని చెప్పి, దూతలఁ బంపెను. శుల్కముఁ బుచ్చుకొనుటకు వారు దశరథుని వద్దకు వచ్చిరి; అతఁ డయోధ్యనుండి బాణములఁ బ్రయోగించి, లంకానగర ద్వారములను బంధించెను.

చౌపాయి 202

"ఓయీ! దూతలారా! నేను మీనగరద్వారములను బంధించితిని! ఆబంధములను మీరావణుఁడు విడఁదీసిన యెడల; నేను యుద్ధముఁ జేయకయే, మీరాజునకు శుల్కమునిచ్చెదను" అని దశరథుఁడు చెప్పి, వారినిఁబంపించెను. నగరగృహకవాటములన్నియు మూతలు పడెను; రావణుఁడు వానిని విడఁదీయలేఁపోయెను; రావణుఁడు పరాభవమునొందెనని గ్రహించి, బాణములు తిరిగి దశరథునివద్దకువచ్చెను. ఆకాశవాణిపలుకులను బ్రహ్మవరములను వాఁడుజ్ఞప్తికిఁ దెచ్చుకొని, వనమునకుఁ బోయి ఘోరమగుతపముఁ జేసెను. బ్రహ్మ వానికిఁ బ్రత్యక్షమై, వానిని వరము వేడుకొను మని చెప్పెను; వాఁడు సంతసించి "ఓదేవా! దశరథునివీర్యమునకుఁ గుమారులుకలుగకుండునట్లు వరముఁ బ్రసాదింపుము" అనిప్రార్థించెను. బ్రహ్మ దుఃఖపడి వరమునిచ్చి సత్యలోకమునకుఁ బోయెను; అనంతరము వాఁడు కోసలపురమునకు వచ్చి, యాదేశపురాజుకూఁతురుని దొంగిలించి తీసికొనిపోయెను; పెట్టెతోఁ గూడ నా రాజకన్యను తీసికొనివచ్చి, సముద్రములో రాఘువమత్స్యము వద్ద దాచిపెట్టెను.

దోహా 219

బ్రహ్మ రావణరూపమునుధరించి, యామత్స్యమువద్దకువచ్చి, ఆపెట్టెను తీసికొని పోయి,

చౌపాయ్ 203

యొకవనములో దానిని విడిచిపెట్టి, తనలోకమునకుఁ బోయెను. తదుపరి, సుమంత్రుఁడు వనములో సంచరించుచు, ఆపెట్టె నకస్మాత్తుగఁ జూచి, దానిమూతను విడగొట్టెను; దానిలోపలనుండిన రాజకన్యం జూచి, "ఓచిట్టితల్లీ! నీవెవరికూఁతుర వమ్మా!" అని చల్లనిమాటలతోఁ నడిగెను. "అయ్యా! నేను కోసలరాజుకూఁతురను; నాపేరు కౌసల్య; ఎవరు నన్నీ వనములోనికిఁ దీసికొనివచ్చి విడిచిపెట్టిరో నేనెఱుంగను" అని యాచిన్నది పలికెను, ఆమెంజూచి సుమంత్రుఁడు సంతసించి, ఆమెను వెంటఁదీసికొని కోసలపురమ్మునకు వచ్చెను; కోసలరాజు కుమార్తెనుఁ గానక, పలువిధముల విచారించుచుండెను; అంతట సుమంత్రుఁడు కౌసల్యందీసికొని రాజునెదుటకు వచ్చి, జరిగినవృత్తాంతమంతయు నతనితో విన్నవించెను. అతనిని రాజుచూచి, "అయ్యా! మీరెవరు!" అని యడిగెను. "ఓరాజా! అయోధ్యానగర మొకటికలదు; దానిని దశరథమహారాజు పరిపాలించును; అతఁడు ధర్మాత్ముఁడు; సకలగుణసంపన్నుఁడు;

దోహా 220

"నే నతనిమంత్రిని; నాపేరు సుమంత్రుఁడు" అని మంత్రివర్యుఁడు చెప్పెను. "ఓసుమంత్రుఁడా! నాకుమార్తెను మీరాజునకిచ్చి వివాహముఁ జేయనుద్దేశించితిని" అని రాజు పలికెను.

చౌపాయ్ 204

ఆవెంటనే, కోసలరాజు పసుపుకుంకుమములను బ్రాహ్మణులకిచ్చి, వారిని దశరథునివద్దకుఁ బంపెను. ఆబ్రాహ్మణులను దశరథుఁడు గౌరవించి, వారుతీసికొనివచ్చిన పదార్థములను కట్నముఁ గైకొని వివాహమున కంగీకరించెను. చతురంగబలములతోఁగూడ నతఁడు సకలపరివారముతో వివాహమునకు బయలుదేఱెను, శుభదినము శుభముహూర్తము, శుభలగ్నమున దశరథుఁడు కౌసల్యను వివాహమాడెను. గర్గకులసంభూతుఁడగు వీరదాసునికూఁతురిని సుమంత్రుఁడు పెండ్లిఁ జేసికొనెను; వారు వివాహములఁ జేసికొని, సుఖముగ నయోధ్యానగరములోఁ బ్రవేశించిరి; స్త్రీపురుషులందఱు నృత్యగాన వినోదములలోఁ

చేలి సంతసించిరి. తదుపరి, దశరథుఁడు కాశ్మీరదేశపురాజుకూఁతురు కైకను, సుమిత్రను క్రమముగ వివాహమాడెను (అధికపాఠముసమాప్తము) ఇంతచక్కనికథ నింతవఱకుఁ జెప్పినాను; ఇకనుముందుకథఁ జెప్పుచున్నాను, వినుము. అయోధ్యాధిపతియగు దశరథమహారాజు సకలధర్మశాస్త్రములఁ జదివెను, సకలసుగుణసంపన్నుఁడు, జ్ఞాని, శార్ఙ్గ కోదండ) పాణియందు నిత్యము భక్తిఁగలిగి యుండెను.

దోహా 221

కౌసల్యయు సుమిత్రయు, కైకయు- ఈముగ్గురుభార్యల నతఁడు సమానమగు దయతోఁ జూచుకొనెను; ఆముగ్గురును మహాపతివ్రతలు; భర్తయం దనురాగముఁగలవారు; భయభక్తులతో వారు పతిని దైవముగ భావించి సేవించిరి; వారు సదా హరిచరణకమలములను ధ్యానించుచుండిరి.

ఇతి శ్రీగోస్వామితులసీకృత శ్రీరామచరిత్రమానసే,
సకలకలికలుషవిధ్వంసినే, బాలకాండాంతర్గత
పండితజ్వాలాప్రసాదకృత వ్యాఖ్యానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
తృతీయో విశ్రామః.

---

# బాలకాండ చతుర్థవిశ్రామః.



చౌపాయ్ 265

ఈప్రకారము దశరథమహారాజు రాజ్యముఁ జేయుచుండ, ననేక వేలసంవత్సరములు గతించెను. సకలసంపదలఁ గలిగియుండినను, కుమారులు లేనందుల నతఁడు కడుదుఃఖించెను. అంతట నతఁడు కులాచార్యుఁడగు వసిష్ఠునిగృహమునకు వెళ్లి, వారిపాదములకు మ్రొక్కి, యనేకవిధముల బ్రార్థించెను. అతఁడు తనసుఖదుఃఖములను వారితో మనవిజేసికొనెను; అతనిని గురువు వోదార్చి, యనేక ప్రకారముల బోధించి, "ఓరాజా! నీవు విచారింపకుము; ధైర్యమునవలంబింపుము; నీకు నల్వురు కుమారులు పుట్టఁగలరు, వారు మూఁడులోకములలోఁ బ్రసిద్ధికెక్కఁగలరు; వారు భక్తులభయములఁ బోఁగొట్టఁగలరు," అని చెప్పి రాజును గృహమునకు బంపెను. తదనంతరము, వసిష్ఠుఁడు ఋష్యశృంగునకు వర్తమానముఁ బంపెను; వారిసహాయమునలన, రాజు పుత్రకామేష్టియజ్ఞము నొనరించెను; అగ్నిహోత్రములో నాహుతుల ఋష్యశృంగుఁడు వ్రేల్చెను; పాయసముఁ బట్టుకొని, అగ్నిదేవుఁడు ప్రత్యక్షమయ్యెను.

(దశరథునకు 'శాంత' యను నొకకూఁతురుకలదు; అంగదేశపు రాజు, రోమపాదుఁడును దశరథుఁడును స్నేహితులు; రోమపాదుఁడు శాంతను బెంచుకొని, కూఁతురువలె నామెను బోషించెను. అంగదేశములో నొకసమయమున క్షామము గలిగెను; అప్పుడు మహాత్ములందఱు రోమపాదుని వద్దకువచ్చి "ఓరాజా! విభాండఋషికి నొకకుమారుఁడు కలఁడు; అతనిపేరు ఋష్యశృంగుఁడు, అతనిని మనదేశమునకుఁ దీసికొనివచ్చిన యెడల, మనకు వర్షముకలుగును; అతనితండ్రి చూచుచుండ, నతనిని తీసికొనివచ్చుటకష్టము;" అని వారు చెప్పిరి. అప్పుడు రోమపాదుఁడు ఋష్యశృంగునిఁ దీసికొనివచ్చుటకు వేశ్యాంగనలఁ

బంపెను; విభాండఋషి గృహమువద్ద లేనిసమయముఁ జూచి, వారు ఋష్యశృంగుని సమీపించిరి; అతఁడు వారింజూచి, తపశ్శాలులని తలఁచి వారివిడిదిలోనికి వచ్చెను; అప్పుడు వా రతనిని నావలోఁ బ్రవేశపెట్టి, యంగదేశమునకుఁ దీసికొనివచ్చిరి; అతఁడు దేశమునకు వచ్చినందున, వర్షముపర్షించెను; రోమపాదుఁడతనికి శాంతనిచ్చి వివాహముఁజేసెను; ఇదియంతయు విభాండఋషి జ్ఞానదృష్టిచేఁ దెలిసికొనెను. అంగదేశములోనుండిన ఋష్యశృంగుని దశరథమహారాజు యజ్ఞమునిమిత్తము పిలిపించెను.)

"ఓరాజా! వసిష్ఠుఁడు లెస్సగ మనస్సులో నాలోచించి, నీతోఁ జెప్పిన సంగతులన్నియు సమకూడును; నీమనోరథము లీడేరును; నీవీ పాయసము నందుకొని; యథోచితముగ దానిని విభజింపుము", అని అగ్నిదేవుఁడు రాజుతోఁబలికి,

దోహా 222

చేయవలసిన విధానమంతయు సభికులతోఁ జెప్పి, యంతర్ధానమయ్యెను; దశరథుఁడు పరమానందభరితుఁడయ్యెను; సంతోషము నతఁడు పట్టలేకపోయెను.

చౌపాయ్ 206

కౌసల్య, సుమిత్ర కైకేయి ఈముగ్గురుప్రియభార్యల కతఁడు వర్తమానమంపెను; ఆపాయసములో సగము కౌసల్యకిచ్చెను; మిగిలిన సగము రెండుభాగములు చేసి, వానిలోనొకభాగమును కైకకిచ్చెను; మిగిలిన భాగము రెండువంతులుచేసి, యొకవంతునుకౌసల్యకును, మఱియొకవంతు కైకకునిచ్చెను; వారాభాగములను సుమిత్ర కిచ్చిరి; ఆముగ్గురును పాయసముఁ బుచ్చుకొని గర్భముధరించిరి; అందఱు స్వస్థచిత్తులయిరి; ఏరోజున కౌసల్య పాయసముఁ బుచ్చుకొనెనో, భగవంతుఁడాదినమున నామెగర్భములోఁ బ్రవేశించెను; ఆదినముమొదలు లోకములన్నియు తెలివిఁగాంచెను; వానియలజడులు తగ్గెను; వాని సంపద లధికమయ్యెను; రాక్షసుల పొగరుఁబోతుతనము మట్టుపడెను;

ఆనాఁటి కానాఁడు, రాణులగర్భములు పెఱిగెను; వారు నీరుపట్టి యం తఃపురములలోఁ దిరుగుచుండిరి; ఆముగ్గురును సకలగుణసంపన్నలు; సుశీలులు; తేజోవంతులు; ముద్దులు మూటఁగట్టుచుండిరి; ఇట్లు సుఖ ముగ వారు పదిమాసములు గడపిరి; అంతటఁ బ్రసవదినములు సమీపిం చెను; భగవంతుఁడు పుట్టుటకు సమయమువచ్చెను; లోకమంతయు కలకలమనుచుండెను.

దోహా 223

యోగము, లగ్నము, వారము, నక్షత్రము, నవగ్రహములు- వీనిసంపుటి శుభముగనుండెను; చరాచరజంతుజాల మంతయు సంతో షించుచుండెను;

చౌపాయ్ 207

చైత్రశుద్ధనవమి, పునర్వసునక్షత్రము, సింహలగ్నము, అభిజి త్కాలము; లోకమంతయు విశ్రమించువేళ; ఆసమయము సమశీతోష్ణ ముగనుండును; మందసుగంధశీతలవాయువులు వీఁచెను; దేవదేవుఁడు తల్లిగర్భములోనుండి బయటకువచ్చెను; దేవతలు హర్షించిరి; మును లును మహాత్ములును సంతసించిరి; వనములు పుష్పించెను; పర్వతములపై నవరత్నఖనులు ప్రకటమయ్యెను; అమృతోపమానమగు నిర్మలజలము లతో నిండి నదులుప్రవహించెను; భగవంతునిజన్మసమయముఁ దెలిసి కొని, బ్రహ్మేశానాది దేవతలందఱు విమానములనెక్కి, యంతరిక్ష మున నిలిచియుండిరి; అంతరిక్షమంతయు దేవతలతో నిండియుండెను; దేవదేవుఁడు పుట్టినపుడు, గంధర్వులు గానముఁజేసిరి; అప్సరసలు నృత్య ముఁజేసిరి; నారదతుంబురులు కీర్తనలఁ బాడిరి; దేవతలు పుష్పవర్షముఁ గురిపించిరి. దేవదుందుభులు మ్రోఁగెను; దేవ, గరుడ, గంధర్వ, కిన్నర యక్ష, ముని, నాగులు-వీరందఱు వేర్వేఱ దేవదేవుని నుతించి, వారి వారినివాసములకుఁ బోయిరి.

దోహా 224

ఆలోకారాధ్యుఁడు, ఆజగన్నాథుఁడు, ఆసచ్చిదానందమూర్తి, తల్లికిఁ బ్రత్యక్షమయ్యెను.

అధికపాఠము:—

శ్రీరామచంద్రుని జాతకచక్రము.

| | | |
|---|---|---|
| బు-రా | ర | శు |
| గు-చ | | కు |
| ల | శ | కే |

స్వస్తి - శ్రీమహాగణాధిపతయే నమః - శుభమస్తు.

అస్మిన్వర్తమాన వ్యావహారిక బార్హస్పత్యమానేన సంవత్సరే ఉత్తరాయణే వసంతఋతౌ చైత్రమాసే శుక్లపక్షే నవమ్యాం ఇందు వాసరే పునర్వసునక్షత్రే శూలనామయోగే కౌలవాకరణే, మేషసంక్రమణే సింహాలగ్నే శ్రీదేవదేవః.

శ్రీలక్ష్మణమూర్తి జాతకచక్రము.

| | | |
|---|---|---|
| బు-రా | ర | శు |
| గు-చ | | కు |
| | శ | కే |

శ్రీశత్రుఘ్నుని జాతకచక్రము.

| | | |
|---|---|---|
| బు-రా | ర | శు |
| గు-చ | | కు |
| | శ | కే |

వీరిరువురును చైత్రశుద్ధఏకాదశీ బుధవారము ఆశ్లేషానక్షత్రము, వృద్ధియోగము, గరకరణమున, పుట్టిరి:—

## శ్రీభరతుని జాతకచక్రము.

| | | |
|---|---|---|
| | ర | శు |
| బు-రా | | |
| గు-చ | | కు |
| | | కే |
| | శ | |

చైత్రశుద్ధదశమి మంగళవారము పుష్యమినక్షత్రము, గండయోగము, తైతులాకరణము.

ఛాంద 24, 25, 26, 27

"భయే ప్రకట కృపాలా దీనదయాలా కౌసల్యా హితకారీ
హర్షిత మహతారీ ముని మనహారీ అద్భుతరూప నిహారి
లోచన అభిరామా తను ఘనశ్యామా నిజ ఆయుధ భుజచారీ
భూషణ వనమాలా నయన విశాలా శోభాసింధు ఖరారీ. 24

కహ దుహు కరజోరీ స్తుతితోరీ కేహివిధి కరౌ అనంతా
మాయా గుణ జ్ఞానాతీత అమానా వేదపురాణ భనంతా
కరుణా గుణసాగర సబ గుణఆగర జేహిగావహి శ్రుతి సంతా
సో మమ హిత లాగీ జన అనురాగీ ప్రకటభయే శ్రీకాంతా. 25

బ్రహ్మాండ నికాయా నిర్మితమాయా రోమరోమ ప్రతి వేద కహై
మమ ఉర సో వాసీ యహ ఉపహాసీ సునతధీర మతి థిర న రహై
ఉపజా జబ జ్ఞానా ప్రభు ముసకానా చరిత బహుత విధికీన్హ చహై
కహికథాసునాఈ మాతబుఝాఈ జేహిప్రకార సుత ప్రేమలహై.

మాతా పుని బోలీ సో మతిడోలీ తజహు తాత యహ రూపా
కీజై శిశులీలా అతిప్రియశీలా యహ సుఖ పరమ అనూపా

సుని వచన సుజానా రోదన ఠానా హెూయి బాలక సురభూపా
యహ చరిత జో గావహిం హరిపదపావహిం తే నపరహిం భవకూపా.

ఛాంద్ 24, 25, 26, 27

ఆదీనదయాపరమూర్తి, ఆకృపాళుఁడు, ఆభక్తవత్సలుఁడు కౌసల్యకు హితముఁజేయఁదలచి, యామెకుఁ బ్రత్యక్షమయ్యెను; భూభారమును హరించుట కతఁడుపుట్టెను; అతనిదివ్యసుందరవిగ్రహముఁజూచి, మునులు సయితము భ్రమజెందిరి; అతనిశరీరము శ్యామలవర్ణము; కమలములవంటిలోచనములు; నాల్గుభుజములు; వానిలోశంఖచక్రగదాపద్మములు; ధనుర్బాణములు; మూపురమున నంబులపొది; విశాలనేత్రములు; పాదములవఱకుఁ గంఠమునుండి వ్రేలుచుండినవనమాల; అనేకభూషణములు; ఇట్టిపరమేశ్వరుఁడు, రాక్షసాంతకుఁడు, సకలశుభరాశి, యామెకుఁ బ్రత్యక్షమయ్యెను! ఆమహాపురుషునిఁగౌసల్య చూచి, తిలకించి, పులకించి, చోద్యమంది, ఆనందబాష్పములఁ జాఱవిడిచెను.

ఆమె రెండుచేతులను జోడించి నమస్కరించి, భగవంతు నిట్లు స్తుతించెను:—

"ఓఅనంతా! ఓఆద్యంతములు లేనివాఁడా! ఓఅనంతరూపా! నేను నిన్నెట్టుల స్తుతింపఁగలను? మాయాగుణ జ్ఞానాతీతుఁడవు; నీకు మానములేదు; అని వేదపురాణములు ఘోషించుచున్నవి; ఓసకలగుణసంపన్నుఁడా! ఓకరుణానిధీ! వేదములు నీగుణములను వర్ణించును; ఓలక్ష్మీపతీ! భక్తుల నుద్ధరించుటకును నన్నుఁ దరింపఁజేయుటకును నీవు నాగర్భమునఁ బుట్టితివి.

"ఓజగన్నాథా! మాయచే సృజింపఁబడిన బ్రహ్మాండభాండములన్నియు నీప్రతిరోమకూపమునందుఁ దగిలియుండును; అని వేదములు చాటుచున్నవి; బ్రహ్మాండనాయకుఁడైన నీవు నాగర్భమునఁబుట్టుట లోకవిడంబనార్థముకాని మఱియొకటికాదు; సామాన్యమనుజునివలె నీవు నాగర్భమునఁ బుట్టుట విని,జ్ఞానులుసయితము మాయకులోఁబడి, నిన్ను విశ్వసింపరు; వారిబుద్ధిచలించిపోవును" అని యనేకప్రకారముల నామె జ్ఞానయుక్తమగువచనములతో నుతించెను. ఆమెజ్ఞానమును మందము, యఁదలఁచి, భగవంతుఁడు ముసిముసినవ్వునవ్వెను; అంతలో నతఁడు

మాయఁగప్పి, జననీజనకుల పూర్వవృత్తాంతమును, తనపూర్వచరిత్రము నామెకుఁ దెలిపెను; ఆమాటలమూలమున నతనియం దామెకు ప్రేమ విశేషమయ్యెను. "ఓస్వామీ! నీజ్ఞానోపదేశములవలన, నామతి తల్లడిల్లుచున్నది; ఓతండ్రీ! ఈనీరూపమును విడిచిపెట్టుము; ఇది అలౌకికము; నీవు బాలభావముఁ బొందుము; ఆరూపము నాకిష్టము; దాని సుఖము గొప్పది; అమ్మాయని నన్ను నీవు పిలుచుటవలన, నాకానందము కల్గును" అని యామె ప్రార్థించెను. ఆమెవచనములను పరమేశ్వరుఁడు విని, వెంటనే బాలుఁడై రోదనముఁజేయ నారంభించెను.

ఈరామజననకథను గానముఁజేయువారు వైకుంఠమునకుఁబోఁగలరు; వారికిఁ బునర్జన్మముకలుగదు; సత్యము, సత్యము, సత్యము.

దోహా 225

అవాఙ్మానసగోచరుఁడగు పరమేశ్వరుఁడు, స్వేచ్ఛానుసారము మాయామానుషశరీరమునుధరించి, గోబ్రాహ్మణ, దేవసాధుజనహితవు నిమిత్త మవతరించెను.

చౌపాయీ 208

ఆబాలుని రోదనమును విని, రాణులందఱు సంతసించి, పుఱిటి గృహమునకుఁ బఱుఁగెత్తివచ్చిరి; సంతోషముచే దాసీజనంబులు నలువైపులఁ బఱుఁగిడిరి; పురజను లానందమగ్నులయిరి. దశరథుఁడు కుమారుఁడు పుట్టెనని విని, బ్రహ్మానందముఁబొందెను; సంతోషముచే నతని మనస్సు నిండెను; అతనిశరీరము పులకరించెను; లేచుట కతఁడు ప్రయత్నించినను లేవలేకపోయెను; కొన్నిగడియలకతఁడు బుద్ధిని స్థిరముఁజేసికొని, "ఏప్రభువునామముచ్చరించుటవలన శుభములుకల్గునో, అట్టి ప్రభువు నాగృహములోఁ బుట్టెను" అని పలికెను. ఈప్రకార మతఁడు బ్రహ్మానందమగ్నుఁడై, వసిష్ఠునకువర్తమానముఁబంపి, సేవకులను బిలిచి మంగళధ్వనులఁ జేయుమని యాజ్ఞాపించెను. వసిష్ఠుఁడు రాజవర్తమానము నందుకొని, బ్రాహ్మణులతోఁగూడి రాజమందిరమునకు వచ్చెను. ఆబాలుని నిరుపమానమగు దివ్యసుందరవిగ్రహముఁ జూచి, వసిష్ఠుడు సంతసించెను; ఆబాలుని రూపరేఖావిలాసముల వర్ణింపఁజాలను; విద్యుద్దీపమువలె, నాబాలుఁడు పుఱిటిగృహములో దేదీప్యమానముగ నుండెను.

దోహా 226

పుత్రోత్పత్తిసమయమునఁ జేయవలసిన నాందీముఖము, పితృదేవతారాధనయుఁ జేయఁబడెను; జాతకర్మములు జరిగెను; రాజు బ్రాహ్మణులకు షోడశమహాదానముల నిచ్చెను.

చౌపాయ్ 209

పతాకములతోను, తోరణములతోను, పట్టణమంతయు నలంకరింపఁబడెను; ఆపట్టణమంతయు కలకలమనుచుండెను; దానిశోభను వర్ణింపఁజాలను; అంతరిక్షమునుండి పుష్పవర్షముగురిసెను; పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల జీవరాసులన్నియు బ్రహ్మానందముఁబొందిరి. సహజసుందరులగు స్త్రీలు బాగుగా శృంగారించుకొని, గుంపులుగుంపులుకూడి పురుటిగృహమునకు పసుపు, కుంకుమ, పాలు, పెఱుగు-ఈమొదలగు మంగళద్రవ్యములఁ బట్టుకొని, వచ్చి అనేకపాటలను పాడిరి; వారు బాలునకు మంగళహారతులనిచ్చి, పాటలనుబాడిరి; మఱలమఱల వారతనిపాదములకు మ్రొక్కిరి; వందిమాగధపౌరాణికజనంబు లతనికీర్తిని గానముఁజేసిరి; ఒకరుగ్రహించినదానములను మఱియొకరుగ్రహించి, వారు వానిని తరితరుల కిచ్చివేయుచుండిరి; కాని, వారు వానిని దాఁచి పెట్టుకొనలేదు; కస్తూరి, కుంకుమ, పన్నీరు, పసుపు-వీనితో రాజవీథులన్నియు బురదయయియుండెను.

దోహా 227

ప్రతిగృహములో సంతోషముచే మంగళధ్వనులుచేయఁబడెను; ఎందుచేత? "సచ్చిదానందబ్రహ్మము భూలోకములో నవతరించెను; నగరమంతటను స్త్రీపురుషు లాబాలవృద్ధులు పరమానందభరితులయిరి; సంతోషముచే వారు నలువైపులఁ దిరుగుచుండిరి.

చౌపాయ్ 210

కైకకును సుమిత్రకును చక్కనికుమారులు కలిగిరి; ఆపుత్రుల జననమువలనఁ గలిగిన సుఖసంపదలను శారదయు శేషుఁడును వర్ణింపఁజాలరు; స్త్రీపురుషులసమాజము నయినను వారు చెప్పఁజాలరు. ప్రభువును సందర్శించుటకు రాత్రియుఁడ వచ్చినదేమో యనునట్లు, అగరుధూపము మొదలగువాని ధూమముతో నగరమంతయు వ్యాపించి, శోభించెను; 'బుక్క—భర్గుండ' మొదలగువాని యెఱ్ఱనిరేణువు లంత

రిక్షమున వ్యాపించి, సంధ్యారాగమువలెఁ గనఁబడెను. మందిరముల లోని మణులసమూహములే, తారాగణములు; రాజమందిరములపై నుండిన సువర్ణకలశములు, చంద్రునివలెఁ బ్రకాశించెను; రాజనగరులో వినఁబడుచుండిన వేదధ్వనులు, సంధ్యాసమయమున వినఁబడుపక్షులధ్వనులవలె నుండెను. "నాయెదుట రాత్రి యెట్ుల నిలువఁబడియుండఁ గలదు?" అని సూర్యుఁడు చింతించి, యాశ్చర్యపడి, మైమఱచి, యాకౌతుకముఁజూచుచు, నొకమాసముపఱ కంతరిక్షమున నిలిచియుండినట్లు కనఁబడెను. (శ్రీరామజనన మహోత్సవములో వారు సూర్యోదయ సూర్యాస్తమయముల నెఱుంగక, యొకమాసమును గడిపిరి.)

దోహా 228

శ్రీరామచంద్రుఁడు పుట్టినదిన మొకమాసముపొడవయ్యెను; కాని, ఆసంగతి యెవరికిఁ దెలియదు; సూర్యునిరథము నిలిచిపోయెను; ఎట్లుచీకటిపడును? (శంక:—ఎవరికిఁ దెలియనిసంగతి, తులసీదాసున కెట్లు విదితమయ్యెను? ప్రత్యుత్తరము:—గురుపుకృపవలన రహస్యముగుసంగతులుసయితము విదితమయ్యెను.)

చౌపాయ్ 211

ఈరహస్య మెవరికిఁ దెలియదు; తనవంశములో శ్రీపతి జన్మించినందులకు సూర్యుఁడు సంతసించి, వారిగుణములను గానముఁజేయుచుఁ బ్రయాణమును సాఁగించెను. తమపూర్వపుణ్యమువలన శ్రీవారి జనన మహోత్సవముఁ జూడఁగలిగినందులకు దేవ, గరుడ, గంధర్వ, కిన్నర, యక్ష నాగ, ముని, సిద్ధులు పరమానందభరితులై, స్వస్థానములకు వెడలిరి; ఓపార్వతీ! నేనొకరహస్యముఁ జెప్పుచున్నాను; వినుము; అది యెవరికిఁ దెలియదు; నీభక్తి దృఢమయినది; కనుక నీకు వినిపించెదను; నీవు పర్వతరాజుకూఁతురివి. కనుక, నీమనస్సు పర్వతమువలె నిశ్చలమయినది; నేనారహస్యము నింతవఱకు నెవరికిఁ జెప్పియుండలేదు; రెండ వకంటివానికిఁ దెలియకుండ, నేనును కాకభుశుండియు, మనుజరూపమునుధరించి, అమానుషపుత్రోత్సవముఁ జూడఁబోయియుంటిమి. ఆనందమును, ప్రేమయు, భక్తియు మేము పట్టలేక, పిచ్చివారివలె, బ్రహ్మానందభరితులమై, నగరమంతయుఁ దిరిగితిరిగి వచ్చితిమి; నగరములో

నెచ్చటఁజూచినను మంగళధ్వనులు వినఁబడెను; ఎవరియందు రాము నకుఁ బరిపూర్ణకటాక్షము కలదో, వారే మాచర్యలను గ్రహింపఁగ లరు; ఆసమయమున నెవరువచ్చి, ఏమేమియడిగినను వారివారికోరికల ప్రకార మాపదార్థములను దశరథమహారాజు వారి కిచ్చెను; ఏనుఁగు లను, గుఱ్ఱములను, రథములను, బంగారు వెండినాణెములను, గోవు లను, రత్నహారములను, చీనిచీనాంబరములను, రాజు దోసిలిఁగొలఁది పంచిపెట్టెను.

దోహా 229

సర్వజనులమనస్సులు పరమానందభరితము లయ్యెను; ఈనల్వు రుబాలురు తులసీదాసుప్రభువులు; "శతమానంభవతి, శతమనంతం భవతి, శతమైశ్వర్యంభవతి, శతమితి శతం దీర్ఘమాయుః" అని మహా రాజునకును అందఱుబాలురకును మహదాశీర్వచనముఁ జేసిరి.

చౌపాయ్ 212

ఈప్రకారము కొన్ని దినములుగడచెను; రాత్రి, పగలు, తెలియ కుండ, వారు దినములను గడపిరి; అంతట నామకరణములఁ జేయవలసి యుండునని రాజు గ్రహించి, వసిష్ఠునకు వర్తమానముఁ బంపెను. వారు వెంటనే రాజమందిరమునకువచ్చిరి; అర్ఘ్యపాద్యములనిచ్చి, గురువును పూజించి, "ఓమునిరాజా! మీరు లెస్సగవిచారించి, ఈనల్వురుబా లురకుఁ దగిన నామకరణముఁ జేయుఁడు" అని చెప్పి నమస్కరించెను. "ఓరాజా! నీబాలురు నిరుపమానులు; పెక్కునామములు వారికిఁ గలవు. నాబుద్ధికిఁ దోఁచినవిధమున వారికి నామములఁ బెట్టుచున్నాను. ఆనందసముద్రుఁడు; సకలసుఖములకురాశి; ఏయానందసముద్రము లోని నీటితుంపరలు మీఁదనునెగిరినందున, మూఁడులోకములు సంత సించునో, అట్టియానందమూర్తి; ఏఁడేఁడు పదునాలుగులోకములకును విశ్రాంతినిచ్చువాఁడును, సుఖధాముఁడును కనుక, నీపెద్దకుమారుఁడు శ్రీరామమూర్తి; సంసారులను పాలించి, పోషించువాఁడు కనుక, కైక కుమారుఁడు భరతుఁడు; ఎవనినామమును స్మరించినంతమాత్రమున, శత్రువులు నశించెదరో, వాఁడు శత్రుఘ్నుఁడు.

దోహా 230

సర్వలక్షణసంపన్నుఁడును, సకలజగదాధారుఁడును, ఉదారుఁడును, రామునకుఁ బ్రియుఁడును, కనుక, సుమిత్రకొమారునకు లక్ష్మణుఁడని, గురువులు వసిష్ఠులవారు పేరుఁబెట్టిరి. (శ్రీరాముఁడు విశ్వమునకు విశ్రామమునిచ్చును. దానిని భరతుఁడు పోషించును; దానిని శత్రుఘ్నుఁడు రక్షించును; ఈమూఁడుగుణములను కలిగియుండుటయే గాక, జగత్తుల కాధారభూతుఁడు కనుక, నతనియందు నాల్గులక్షణములు పుట్టెను; అందుచేత నతఁడు లక్ష్మణుఁడు).

చౌపాయ్ 213

ఈప్రకార మాబాలురు నల్వురకు వసిష్ఠుఁడు నామకరణముఁ జేసి, కొంతవిచారించి, "ఓ రాజా! నీనల్వురుపుత్రులు నాల్గువేదములవంటివారు; వారు నాల్గువేదములకుఁ బ్రాణములు; వారు మునీశ్వరుల ధనము; వారే శివునకు సర్వస్వము; వారిబాలక్రీడలఁ జూచి, యెల్లప్పుడు శివుఁడు పరమానందభరితుఁ డగుచుండును; కాకభుశుండియొక్కప్రాణములు వారే" అని తెలియఁబఱచెను; వారిమాటలను రాజు విని సంతుష్టాంతరంగుఁ డయ్యెను; చిన్నతనమునుండి లక్ష్మణుఁడు, రాముఁడు తనప్రభువని, తెలిసికొని, యతనిచరణములను సేవించెను; భరతశత్రుఘ్నులు పరస్పరానురాగముకలవారై, ప్రభుసేవకులవలె, సంచరించిరి; వారివారియంశలఁ బురస్కరించుకొని, వారొకరినొకరను సరించియుండిరి; ఆఁకవలలో నొకరిశరీరము శ్యామలము, మఱియొకరిదేహము గౌరవర్ణము; ముప్వురుతల్లులు వారిచక్కదనముఁజూచి, దృష్టిదోషము తగులకుండ, నొకగడ్డిపూచఁద్రెంచి, పారవేయుచుండిరి; నల్వురుసోదరులును రూపశీలలావణ్యములలో నొకరినొకరు పోలియుండిరి; కాని, వారిలో రాముఁడు మణిపూస; జనులకుముద్దువచ్చువాఁడు; చంద్రుఁ డుదయించినపుడు కిరణములువలె, నతనిమనస్సులో ననుగ్రహముపుట్టినపు డతనిముఖమున మందహాస మంకురించును. ఒకసమయమున నుయ్యేలలో నతనినిఁ బరుండఁబెట్టి, తల్లి లాలిపాటలఁ బాడును; మఱియొకప్పుడు, బాలుని తల్లి చంకనిడుకొని ముద్దులాడును; మఱియొకసమయమున, నతని "నాకన్నతండ్రీ! నాచిట్టిబాబూ! నాకులదీపమా" అనిపిలిచి, తల్లి సంతోషించును.

దోహా 231

అపరబ్రహ్మము, అనిరంజనుఁడు, అనిర్వికారుఁడు, ఆద్యంతములు లేనివాఁడు, సకలగుణమాయాతీతుఁడు, ఆనందస్వరూపుఁడు, అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుఁడు, భక్తివశుఁడై, భక్తులయందు గలదయ చేత నతఁడు కౌసల్యచేతిలో నొక చిన్నిపాపఁడై, యాటలు లేనివాఁడై నను, నాడుచుండెను. భగవంతుని వాత్సల్యమున కంతముకలదా!

చౌపాయ్ 214

కోటిమన్మథులవంటి శరీరసౌష్ఠవము; కాలమేఘమునుగాని నల్ల కలువలనుగాని పోలినశరీరము; కమలపత్రములమీఁద నుండిన ముత్యములువలె, నతనిచరణకమలములమీఁదఁ బ్రకాశించుగోళ్లును; వజ్రకులిశాంకుశధ్వజరేఖలతో నొప్పుచుండిన పాదములును; మునిమనస్సుల నపహరించు నూపురధ్వనులును; ఒడ్డాణముతోఁగూడిన కటిప్రదేశమును; మూఁడుమడతలు పడుచుండిన బొజ్జయు; గంభీరమగునాభియు; (దానిలోతు నెవరు కను గొనలేదు, నాభికమలమందుఁ బుట్టిన బ్రహ్మ సయితము దానిపారముఁ జూడలేదు; అనేకవేల దివ్యసంవత్సరములతఁడు దానిలోతుఁ జూచుటకుఁ బ్రయత్నించెను గాని, యతనిప్రయాసయు వ్యర్థమయ్యెను.) అనేకభూషణములతో నలంకరింపఁబడిన భుజదండములును; (విశ్వవిజయముఁ దెలియఁజేయు భుజదండములును); వ్యాఘ్రనఖమునంటి వ్రేలుచుండిన సింహనఖపతకమును; కంఠమునుండి వ్రేలాడుచుండిన ముత్యాలహారమును, రక్షరేకులును; ఉపాసకుల మనస్సుల నపహరించు దివ్యమంగళవిగ్రహమును; శంఖమువంటి త్రిరేఖాయుతకంఠమును; చక్కనిగడ్డము; కోటిమన్మథులఁ బోలినముఖారవిందమును; రెండురెండుపండ్లును; ఎఱ్ఱనిపెదవులును; తీఱగుముక్కును; వర్ణింపశక్యముగాని నుదుటనుండిన చేఁబుడుక్కయు; శ్రీకారములవంటి చెవులును; నీలమాణిక్యములవంటి కపోలయుగమును; మధురమగు బాలసంజల్పములును; నీలకమలములఁబోలి, కాటుకతోఁగూడిన నేత్రములును; వంచినధనస్సువంటి కనుబొమలును; నుదుటిపైఁబడుచుండిన ముంగురులును; ఉదరమువఱకుఁ బడుచుండిన నుంగరములవంటి చిక్కనిజుట్టును; జక్కగఁ దల్లి సవరించినకొప్పును; 'లుంగీ' తోఁ

గప్పఁబడినదేహమును; ముడుకులతోను చేతులతోను భూమిమీఁదఁ బ్రాకుచుండినబాలుని రూపరేఖావిలాసములను శేషుఁడును సరస్వతియు వర్ణింపఁజాలరు; అట్టివానిని నేనెటులవర్ణింపగలను? ఎవ రతనిని స్వప్నములోఁజూచియుందురో, వారే యతనిని దెలిసికొనఁగలరు.

దోహా 232

ఆసకలసుఖధాముఁడు, ఆమాయాతీతుఁడు, ఆమనోవాచామగోచరుఁడు, జననీజనకులభక్తికి వశుఁడై, వారికిఁ గుమారుఁడై పుట్టి, బాలక్రీడలను వారివినోదార్థము చేయుచుండెను.

చౌపాయ్ 215

ఈప్రకారము, జగత్తులకుఁ దండ్రియగువాఁడు బాలుఁడై పుట్టి, కోసలపురజనుల కానందమునిచ్చెను; ఓపార్వతీ! ఎవరు రామచంద్రునిచరణములయందు భక్తిఁగలిగియుందురో, వారికి యానందము లభించును. రామునియందు విముఖతగలవారు కోటిప్రయత్నములఁ జేయుచుండినను, సంసారబంధనములను విడఁగొట్టుకొనఁజాలరు; ఏమాయకుఁ జగాచరములు లోఁబడి తిరుగుచుండునో, అట్టిమాయ పరమేశ్వరునియెదుట భయముచే గడగడవడఁకుచు నిలిచి, మాటలాడును; భగవంతుని భ్రూవిలాసముచే, నది నాట్యముఁజేయును; అట్టిప్రభువును విడిచిపెట్టి, ఓభవానీ! మఱియెవరిని మనము సేవింపగలము? త్రికరణశుద్ధిగ నెవరు నిష్కలుషముగ భగవంతుని భజించెదరో, వారిని భగవంతుఁడు తప్పక రక్షించును. ఈప్రకారము రాముఁడు బాలక్రీడలఁ జేయుచు, పురజనులను సంతోషపెట్టెను. అట్టిపరమేశ్వరుఁడు తల్లిచంకలోనుండి యామెచేఁ బోషింపబడుచుండెను.

దోహా 233

కౌసల్యకుఁ గుమారునియం దధికమగుప్రేమయుండుటచేత, నామెకు దివారాత్రముల గమనము తెలియలేదు; బాలునియందుఁగల దయచేత,నామెవాసి నెత్తుకొని, యొకసమయమున ముద్దుబెట్టుకొనును. మఱియొకసమయమున పాటలఁబాడును.

చౌపాయ్ 216

ఒకదినము నామె బాలునకు నీళ్లుబోసి, వానిని శృంగారించి నొకయుయ్యాలలోఁ బరుండపెట్టి, నిద్రబుచ్చెను; అనంతర మామె

లోనికిఁబోయి, పాయసమును వండి కులదేవత నారాధించెను; పరమాన్నము నామె దేవతకు నివేదించి, వంటశాలకుఁబోయెను; ఆవంటశాలలో నామె పరమాన్నముఁభుజించుచుండిన బాలరాముని జూచెను; ఆమె యాశ్చర్యపడి, ఉయ్యేలలో బాలుని జూచుటకుఁ బరుగెత్తి వెళ్లెను. ఉయ్యాలలో రాముఁడుయ్యేలలో నిదురించుచుండెను; అచ్చటనుండి యామె వంటశాలకుఁ దిరిగివచ్చెను; ఆశాలలో నామె యథాప్రకారముభుజించుచుండినబాలునిఁ జూచెను; ఆమె ధైర్యమునువిడనాడి కంపమునొందెను; "ఈశాలలో బాలరాముఁడు పరమాన్నము దినుచుండెను; ఉయ్యేలలో నొకరాముఁడు నిద్రించుచుండెను; ఏమీయాశ్చర్యము. నామతి స్థిమితముఁదప్పెనా? లేక, ఇది యంతయు మాయయొక్క ప్రభావమా? ఏదినిశ్చయమో, నాకుఁ దెలియదుకదా!" అని కౌసల్య తనలోఁ దాను జింతించెను. అంతట, రాముఁడు తల్లియొక్క వ్యాకులముఁ జూచి, చక్కనినవ్వు నవ్వెను;

దోహా 234

శ్రీరాముఁడు తల్లికి విశ్వరూపముఁ జూపించెను. అతనిప్రతిరోమమునకుఁ గోటానుఁగోట్లు బ్రహ్మాండములుకలవు.

చౌపాయి 217

అనేకకోట్లసూర్యులును, చంద్రులును శివులును, బ్రహ్మలును, పర్వతములును, సముద్రములును, నదులును, వనములును, భూములును, కాలమును, కర్మమును, గుణదోషములును, ప్రకృతిభావములును, ఇదివఱకు వినియుండనివియుఁ, జూచియుండనివియు, నామెకు విశదమయ్యెను; ఈప్రబలమగు మాయాప్రభావము నామె చూచి, చేతులజోడించి భయపడి కదలమెదలలేక నిలువఁబడియుండెను; జీవులను వశముఁజేసికొనుచుండినమాయను, ఆమాయయొక్క పాశములను విడగొట్టుచుండినభక్తియు—ఈరెండుమూర్తులుకూడ నామెకు విశ్వరూపములోఁ గనఁబడెను; 1 నిద్రించుచుండిన రాముఁడు శాంతరూపుఁడు, మాయారహితుఁడు, త్రిగుణాతీతుఁడు, జ్ఞానాతీతుఁడు; 2 పరమాన్నముఁదినుచుండినరాముఁడు కరుణాసముద్రుఁడు, సర్వసుఖశాలి, సకలగుణసంపన్నుఁడు; 3 జన్మకాలమున నతఁడు విరాట్స్వరూప

మును తల్లికిఁ జూపించెను; ఈప్రకారమ తఁడు తన మూఁడురూపముల నామెకుఁ గనపర్చెను, ఆమెశరీరము పులకరించెను; ఆమె ముఖమునుండి మాటరాలేదు; ఆమె నేత్రములను మూసికొని, మనస్సులో భగవంతుని చరణకమలములను నమస్కరించెను; ఆమెమనస్సు చంచలమగుచుండుట భగవంతుఁడు చూచి, యథాప్రకారము బాలునివలె నామెకుఁ గన్పడెను- ఆమెకు భయముమాత్రము పోలేదు; అందుచేత నామె స్తోత్రముఁజేయలేకపోయెను; "జగత్తులకుఁ దండ్రియగువాఁడా నాకు సుతుఁడు" అని యామె తెలిసికొని భయపడెను. "ఓఅమ్మా! ఈవిషయము నెవరితోఁజెప్పకుము" అని యతఁడు తల్లికి బోధించెను.

దోహా 235

అనేకపర్యాయములు కౌసల్య చేతుల జోడించి నమస్కరించి, "ఓస్వామీ! కటాక్షించి, నీమాయను మాత్రమునామీఁదకుఁ బంపకుము', అనిప్రార్థించెను.

చౌపాయ్ 218

అనేకబాలచర్యల నతఁడు చూపించెను; ఆచర్యలఁజూచి, హరిదాసులు పరమానందభరితులగుచుండిరి; అంతకంతకు వారికి బాల్యదశ పోవచ్చెను; వారికుటుంబమువారు వారిం జూచి సంతసించిరి; బాలురకు చూడాకరణముఁ జేయుటకు, రాజు గురువునకు వర్తమానముఁ బంపెను; (సామాన్య చక్రవర్తికుమారులకుఁ బోలె. వారికి చూడాకరణముఁ జేయలేదు; వారు పాయసాంశసంభూతులు); గురువువచ్చిన తరువాత, వారికి చూడాకరణమహోత్సవముజరిగెను; బ్రాహ్మణులధికముగ దానములఁ బుచ్చుకొనిరి; అనంతరం మానలువురుసోదరులు నలువైపులఁ బఱుఁగిడుచు, ననేకబాలచర్యలఁ జేయుచుండిరి; ఆహా! ఏమిచిత్రము! మనోవాచామగోచరుఁడగు పరమేశ్వరుఁడు దశరథుని యంగణములో బాలుఁడై విహరించెను; అతనిని భోజనమునకుఁ దండ్రి పిలిచినను, క్రీడాసక్తిచే నతఁడు జతగాండ్రనువిడిచి భోజనమునకు వెళ్లకుండును; కౌసల్యవచ్చి పిలిచినపు డతఁడు గంతులువైచుచుఁ బాఱిపోవును; ఏమహాత్మునిగుట్టును వేదములు తెలిసికొనలేకపోయెనో, ఎవ్వనిసత్తువ తుదముట్ట శివుఁడుసయితము కనుఁగొనలేకపోయెనో, అట్టి

లోకారాధ్యుఁడు తల్లిచేతికి దొరకెను. అతని ధూళిదూసరశరీరమును రాజు చూచి నవ్వి, యతని నెత్తుకొని తనమెడకుఁ దగిలించుకొనెను.

దోహా 236

చలచిత్తముతో నతఁడు కూర్చుండి యొకముద్దను, వంగియుండి యొకముద్దను, నిలువఁబడియుండి యొకముద్దను, పరుగిడుచు నొక ముద్దను, దిక్కులఁ జూచుచు నొకముద్దను, సగముసగముతిని, పాఱి పోయెను; అతనిపెదవులనిండ దధ్యోదనమంటుకొనియుండెను.

చౌపాయ్ 219

బాలరామునిచరిత్రము సరళముగను శోభస్కరముగ నుండును; దానిని వేదములును, సరస్వతియు, శేషుఁడును గానముఁ జేయును. (అధికపాఠము.)—ఒకరోజున నొకఁ డొకకోతిం దీసికొనివచ్చి; దానిని రాజద్వారమువద్ద నాడించెను. రాముఁడు దానిఁజూచి, పట్టుపట్టి దాని వంటికోతిఁ గావలయుననికోరెను; ఆకోతిఁ దీసికొనివచ్చి తండ్రి యతని కిచ్చినను, రాముఁడు దానినిఁగైకొనక, వెక్కివెక్కి యేడ్వసాగెను; అప్పుడు వసిష్ఠుఁ డారాజుం జూచి "ఓరాజా! నామాట సావధానము తో వినుము; కిష్కింధలో సుగ్రీవునివద్ద నొకకోతికలదు; అతనివద్దకు నీవు దూతనుబంపి, నీవాకోతినిమర్యాదగ రప్పించుము" అని బోధించెను; అప్పుడు రాజు సంభ్రమముతో దూతలఁబిలిచి, సుగ్రీవునివద్దకు వారిని బంపెను; వారు కిష్కింధకుఁవచ్చి, సుగ్రీవునిసమీపించి, దశరథునివర్తమానము నతనితోఁ జెప్పిరి; అతఁడు సంతోషించి, వారివెంటను మహావీరునిఁ బంపెను; ఆమహావీరుఁడు సంతోషించుచు రాజ మందిరములోఁ బ్రవేశించెను; ఆకోతిని రాముఁడు తనగుండెలమీఁదఁ బెట్టుకొని ముద్దులాడి, దానినిఁ గౌగిలించుకొనెను. హనుమంతుఁడు చిన్న పిల్లకోతి రూపముఁదాల్చి రాముని వెంటనంటియుండెను; రాముఁడాడుకొనుచుండిన స్థలములలోఁగూడ నతఁడు రామునివద్దనుండెను; ఒకరోజున రాముఁడు గాలిపడగ నెగిఱించెను; అది యెగిరి యెగిరి మీఁదికిఁబోయి, తుదకు స్వర్గలోకమునంటెను. ఇంద్రునికోడలు, జయంతునిభార్య, దానిం జూచి యాశ్చర్యపడెను.

దోహా 237

"ఇంతచక్కనిపడగ నెవరెగిరించిరోకదా?" అని యామె విచారించి, యాగాలిపడగను బట్టుకొని దాఁచియుంచెను.

చౌపాయ్ 220

"ఓహనుమంతుఁడా! చూచితివా! మనగాలిపడగ నెవరో దాఁచియుంచిరి?" అని రాముఁడు పలికెను. అప్పుడు వేగముగా హనుమంతుఁడు పరుగెత్తివెళ్లి, జయంతునిభార్యంజూచి, "ఓతల్లీ! ఈగాలిపడగను విడిచిపెట్టుము" అని యడిగెను. "ఓయీ! ఈగాలిపడగ నెగుర వేసినవానిం జూడవలెననియున్నది; కనుక, దానిం గట్టిపెట్టియుంచితిని" అని యామె చెప్పెను. అతఁడు రామునితో నామెకోరినకోరికఁ జెప్పెను. "ఆమెవచ్చి, నన్ను చిత్రకూటపర్వతమునందుఁ జూడవచ్చును" అని రాముఁడు పలికెను. హనుమంతుఁ డామాటను జయంతునిభార్యతోఁ జెప్పెను; ఆమె రాముని సందర్శించుభాగ్యము కలుగునని సంతసించి, గాలిపడగను విడిచిపెట్టెను. అనంతరము రాముఁడును సోదరులును హనుమంతునితోఁగూడి సాయంసమయమున గృహమునకు వచ్చి, నాఁటిరాత్రికి విరమించిరి.

దోహా 238

రామచంద్రునిచరిత్ర మపారము; దానినిఁ దుదముట్ట నెవరు చూడఁగలరు? సిద్ధులును మునీశ్వరులును వారిబుద్ధికిఁ దోఁచినవిధమున దానిని వర్ణించిరి.

చౌపాయ్ 221

ఒకరోజున నొకరత్నవర్తకుఁడు రాజువద్దకువచ్చి, రాజున కొక నగఁ జూపించెను; రాముఁడు దానిందీసికొనిపోయి నూతిలోఁ జాఱ విడిచెను. రాజు రామునిఁజూచి, "ఓయీ బాబూ! నగఁదీసికొనిరమ్ము?" అని యడిగెను. ఆవెంటనే నూతిలోనుండి యొకవృక్షముపుట్టెను; దానినుండి ముత్యములు జలజలమని కుప్పతిప్పలుగ రాలుచుండెను; వానిని స్త్రీపురుషులు తీసికొనిపోవుచుండిరి; ఏడుదినము లావృక్షము నిలిచియుండి, తదుపరి యంతర్ధానమయ్యెను; ఒకరోజున నొకవేఁటకాఁడు రాజువద్దకువచ్చి, రాజున కొకచిత్రమగుపక్షినిఁ జూపించెను; రాముఁడు దానిం జూచుటకుఁ దీసికొని, దానిని విడిచిపెట్టెను; "నాపక్షిని నాకుఁ

దీసికొనిరమ్ము" అని వేటకాఁడు మూర్ఛముతో నడిగెను; అప్పుడు, రాముఁడు భూమిలో నొకపక్షి రెక్కను బాతిపెట్టెను; ఆవెంటనే నొక వృక్షముపుట్టెను.

దోహా

ఆవృక్షమునుండి ఫలములు నేలకుఁ బడుచుండెను; ఆఫలముల నుండి చిత్రచిత్రమగుపక్షులు వెడలి యెగురుచుండెను; వానిలోఁ గొన్ని రాజమందిరముపైఁ గూర్చుండెను; మఱికొన్నిపక్షులను బాలురు పట్టుకొని పరుగెత్తిపోయిరి; కొన్నిపక్షుల నయోధ్యాపురవాసులు పెంచిరి; ఈయద్భుతమును దేశదేశముల రాజులువిని, వానింగొనిపోయి పెంచిరి.

చౌపాయ్ 222

ఒకదినమున నొకపంది ఘురఘురమనుచు రామునివద్దకుఁ బరుగిడి వచ్చెను; రాముఁడు వెంటనే దానికాళ్లఁబట్టుకొని, గిరగిరఁద్రిప్పి, దానిని నేలఁగొట్టెను; అది వెంటనే దివ్యశరీరమును ధరించి, యనేకప్రకారముల రామునిస్తుతించి, "ఓస్వామీ! నేనొకరాజును; హరిదాసులకు నమస్కరింపకపోవుటవలన, నాకీపందిజన్మమువచ్చెను. ఓరక్షకా! నీదర్శనమువలన, నాశాపవిమోచనమయ్యెను" అని చెప్పి యాసూకరరాజు దివ్యలోకములకుఁ బోయెను. ఒకదినమున నొకసింహము బ్రాహ్మణునిగోవును బట్టుకొనెను; రాముఁడు పంచబాణములఁ బ్రయోగించి, దానిని సంహరించెను; దానిశరీరములోనుండి యొకగంధర్వుఁడు వెడలి వచ్చి, రామునకు నమస్కరించి, యనేకవిధముల రాముని నుతించి, "ఓస్వామీ! నేనొకగంధర్వుఁడను; ఒకరోజున నేను నారదునిఁజూచి పరిహసించితిని; అతఁడు నన్నుశపించెను; మీదర్శనమువలన, నాశాపవిమోచనమయ్యెను;" అనిచెప్పి, యతఁడు స్వలోకమునకు నిష్క్రమించెను. ఒకరోజున సోదరులతోను సఖులతోఁగూడి, రాముఁడు సరయూనదిలో స్నానముఁజేయుచుండెను; రావణుని ప్రేరణవలన, నొకరాక్షసుఁ డాసమయమున మొసలివలె నదిలోనికివచ్చి, రామునిఁబట్టుకొని మ్రింగెను. అప్పుడు పురజనులందఱు విచారించి, దుఃఖించుచుండిరి; ఆవెంటనే, రాముఁడు వానిని సంహరించి, బయటకువెడలివచ్చెను; స్వామిం

జూచి, పురజనులు సంతసించిరి. ఒకదినమున సఖులతోను సోదరుల తోఁగూడి, రాముఁడు సరయూనదీతీరమునఁ గ్రీడించుచుండెను; ఆసమయముఁజూచి, రావణుఁడు పక్షిరూపముతో రామునివద్దకు వచ్చి, రామునిఁ దీసికొనిపోవుటకుఁ దలఁచెను; ఆసంగతి రాముఁడు గ్రహించి, బాణమును వానిమీఁదఁ బ్రయోగించెను; ఆబాణముతగిలినందున, వాఁడు గిరగిరఁదిరిగి వచ్చి లంకలోఁబడెను; ఏడురోజులవఱకును, వాఁడు మూర్ఛిల్లిపడియుండెను; అనంతరము వాఁడు లేచి, రాముని ప్రతాపమును దలఁచి, సిగ్గుపడెను. ఈబాల రాముని చరిత్రములను విని, వానిని మనస్సునకుఁ బట్టించుకొనవలయును; అటులఁ జేయనివారిని వంచించుటకు బ్రహ్మపుట్టించెనని తెలిసికొనుము. అంతటఁ గొన్ని దినములకు సోదరులునల్వురకు ద్వాదశవర్షములువచ్చెను; ఉపనయనసంస్కారమును వారికి రాజు చేయించెను; గురుపుగృహమునకుఁబోయి, రాముఁడు విద్య నభ్యసించెను; అతిశీఘ్రములో నతఁడన్ని విద్యలను నేర్చెను; నాలుగువేదములే నాల్గుశ్వాసలుగఁ గలమహాత్ముఁడు, లోకారాధ్యుఁడు, సకలవిద్యల నభ్యసించెనట! ఇదియంతయు లోకవిడంబనముగాని మఱియొకటి కాదు; సోదరులు నల్వురును చతురగుణశీలసంపన్నులును, సకలవిద్యావినయనిపుణు లయిరి; రాజులకుఁ దగిన సాముపిద్యలను నేర్చిరి; చేతులలో వారు ధనుర్బాణములను ధరించియుండిరి; వారిరూపరేఖావిలాసములఁ జూచి చరాచరలోకము లన్నియు మోహించెను; వారు రాజవీథులలోను సందులలోను సంచరించినపు డాయావీథులలోనివారు నిలువుగ్రుడ్లుఁ బెట్టుకొని, వారిం జూచి, తనివితీరక, భ్రమించుచుండిరి;

దోహా 239

అయోధ్యాపురవాసులు, స్త్రీపురుషు లాబాలవృద్ధులు, రామునిఁ దమప్రాణములకంటె నధికముగ భావించి ప్రేమించిరి.

చౌపాయీ 223

సఖులను సోదరులను రాముఁడు వెంటఁదీసికొని, యరణ్యమునకుఁ బోయి, వేఁటాడును; ఘనమగుజంతువుల నతఁడు వేటాడి, నిత్యము వానిని రాజువద్దకుఁ దీసికొనివచ్చి, రాజునకుఁ జూపించును; శ్రీ

మునిబాణములచేఁ జచ్చినమృగములన్నియు స్వర్గమునకుఁబోయెను; అవియన్నియు పుణ్యజీవులు. అవియన్నియు శరీరములనువిడిచి వైకుంఠమునకేఁగెంచెను. అతఁడు తల్లిదండ్రులయాజ్ఞలను మన్నించుచుండెను; సోదరులతోను సఖులతోఁగూడి, యతఁడు భోజనముఁజేయుచుండును. ఏప్రకారముప్రవర్తించినయెడల నగరజనులు సంతసించెదరో, రాముఁడాప్రకారము సంచరించెను. దిక్కులఁజూడక తదేకధ్యానముతో నతఁడు వేదపురాణములను వినుచుండెను; తదుపరి, వానిసారాంశమును తమ్ములకు బోధించును; అరుణోదయమునకుఁ బూర్వమతఁడు నిదురలేచి, తల్లిదండ్రులకును గురువునకును, శిరస్సువంచి నమస్కరించును. వారియాజ్ఞఁగైకొని, యతఁడు దినచర్యలఁ జేయుచుండును. దశరథుఁడు కుమారుని ప్రవర్తనఁజూచి, లోలోపల సంతసించెను.

దోహా 240

సర్వవ్యాపకుఁడు, కళారహితుఁడు, ఇచ్ఛారహితుఁడు, ఆద్యంతములులేనివాఁడు, నిర్గుణుఁడు, నామరూపభేదములులేనివాఁడు-అట్టి భగవంతుఁడు భక్తులకు హితవుఁజేయుటకు నరరూపమును ధరించి, యనేక చిత్రవిచిత్రచర్యలను నడిపించెను.

("బాలచరిత పుని కహహు ఉదారా" అనిపార్వతియడిగిన మూఁడవప్రశ్నకుఁ బ్రత్యుత్తర మింతటితో సమాప్తమయ్యెను.)

ఇతి శ్రీగోస్వామితులసీకృత శ్రీరామచరిత్రమానసే
సకలకలికలుషవిధ్వంసనే, బాలకాండాంతర్గత
పండితజ్వాలాప్రసాదకృత వ్యాఖ్యానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
చతుర్థో విశ్రామః.

---

# బాలకాండ పంచమవిశ్రామః

---

చౌపాయ్ 224

ఓభరద్వాజా! ఇఁక ముందుకథఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము; మహాజ్ఞానియగు విశ్వామిత్రఋషి వనములో నొక సిద్ధాశ్రమములో నివసించియుండెను; అతఁడు జపమును, తపమును, యోగమును, యజ్ఞమును జేయునపుడు, మారీచసుబాహులు లనెడి రాక్షసులు వచ్చి, యతనిని భయపెట్టుచుండిరి; అతఁడు యజ్ఞముఁజేయుటఁ జూచి, వారు పరుగిడివచ్చి, యనేకవిఘ్నములఁ జేయుచుండిరి; అందువలన, విశ్వామిత్రునకు విచారముకలిగెను. శ్రీమన్నారాయణమూర్తివలనఁగాని, యీరాక్షసులకు మరణములేదని యతఁడు విచారించెను; ఈ రాక్షసులను సంహరించి, భూభారమును హరించుటకు భగవంతుఁడు భూలోకములో నవతరించెనని యతఁడు తెలిసికొనెను; "ఈవిధమున భగవంతుని దర్శించి, యతనిచరణములకు నమస్కరించెదను; అనేకవిధముల నతనిని బ్రార్థించి, తమ్మునితోఁగూడ నతనిని నాయజ్ఞసంరక్షణార్థముఁ దీసికొనివచ్చెదను; ఆసకలగుణధాముని, అజ్ఞానమూర్తిని, ఆసచ్చిదానందస్వరూపుని, నేను నాయజ్ఞముమూలమునఁ గన్నులారఁ జూచునట్టిభాగ్యము కలుగును" అని యతఁడు చింతించి నిశ్చయించెను. (విశ్వామిత్రుఁడు తనతపోబలముచే నారాక్షసులను సంహరించుటకుసమర్థుఁడు; అయిన, నప్పు డతఁడు ద్వాదశవర్షయజ్ఞదీక్షలోనుండెను; కనుక నతఁడు దీక్షకు భంగముకలుగునని యెంచి, వారిని సంహరింపక, విడిచిపెట్టెను)

దోహా 241

అతఁడు విలంబముఁజేయక, శీఘ్రముగా బయలువెడలి, నగరమునకువచ్చి, సరయూనదిలో స్నానముఁజేసి, రాజసభామండపమునకు వచ్చెను.

చౌపాయ్ 225

ఆసమయమున రాజు రాణివాసములో నుండెను; విశ్వామిత్రుని యాగమనము విని, రాజు బ్రాహ్మణులతో నెదురుగవచ్చి, మునీశ్వరు నకు ప్రణామముఁ జేసి నమస్కరించెను; అతనిని రాజు సత్కరించి, భక్తి శ్రద్ధలతో నర్ఘ్య పాద్యములనిచ్చి పూజించి,సుఖాసనముపైఁ గూర్చుండఁ బెట్టెను. "ఓమునిరాజా! ఈదినమున మీదర్శనమువలన ధన్యుఁడనయి తిని; నావంటి యదృష్టవంతుఁడు లేఁడు." అని రాజు విన్నపముఁ జేసికొని, యనేకపదార్థముల నతనియెదుట నుంచెను; అతఁడు వానిని భుజించి, ప్రసన్నుఁడయ్యెను అనంతరము, తండ్రిగారియాజ్ఞఁ బురస్కరించుకొని, నల్వురుసోదరులువచ్చి, మునిచరణములకు నమస్కరించిరి; రాముని జూచినంతనే, విశ్వామిత్రునివైరాగ్యము వికలమయ్యెను; చకోరములు చంద్రునిఁజూచి భ్రమించువిధమున, విశ్వామిత్రుఁడు రాముని పూర్ణ చంద్రముఖముఁ జూచి, పరవశుఁడయ్యెను; "ఓమునిరాజా! ఎన్నఁడును రానట్టితమరు నేఁడువచ్చితిరి; తమరాకకుఁ గారణముఁజెప్పుడు; విలం బముఁజేయక మీకోరిక నీడేర్చెదను." అని రాజు చేతులజోడించి పలి కెను. "ఓరాజా!నీవలన నొకసహాయముఁగావలెను; రామలక్ష్మణుల నిరు వురను నావెంటఁబంపుము; వారు రాక్షసులను సంహరించెదరు; అందు వలన నాకోరిక సిద్ధించును.

దోహా 242

"ఓరాజా! ఏమియు నీవు విచారింపకుము; సంతోషముతో నీకుమారులఁ బంపుము; మోహమును నజ్ఞానమును విడిచిపెట్టుము; నీకుమారులు తప్పక రాక్షసులను సంహరింపఁగలరు; అందువలన నీకుఁ గీర్తివచ్చును; నీధర్మము నిలువఁబడును; నీకుమారులకుఁ గల్యాణమగు ను." అని మునిపలికెను.

చౌపాయ్ 226

మునిచెప్పినమాటలు రాజునకు హితవుగలేవు; ఆమాటలవలన నతనిగుండెలు విడిపోయెను; ఆరాజుముఖము వాడిపోయెను. "ఓముని రాజా! నాకు వృద్ధాప్యములో నల్వురుకుమారులుకలిగిరి; ఈసంగతి విచారింపక, మీరు నన్నడిగితిరి. భూములు, గోవులు, ధనము, కోశ

భాండాగారములు, చతురంగబలములను మీరు కోరినయెడల నిచ్చె దను; దేహమును ప్రాణములకంటె నధికము లేదు; వానినిసయితము తృణ ములో నిచ్చెదను. ఓస్వామీ! నాకుమారులు నాప్రాణమువంటివారు; అందులో, రాముని లేశమైనను విడిచిపెట్టియుండలేను; గనుక యిచ్చు టకు వల్లకాదు. ఆఘోరరాక్షసు లెక్కడ? ఈనాగారాబుపసిబిడ్డ లెక్క డ! వారికిని నాబిడ్డలకు నెంతవ్యత్యాసముకలదు!" అని రాజు దీనుఁడై పలికెను ఆమాటలధోరణిఁబట్టి, కుమారులయం దతని కంతదయకల దని విశ్వామిత్రుఁడు గ్రహించి, సంతోషించెను అనేకప్రకారముల వసిష్ఠుఁడు రాజునకు బోధించెను. "ఓరాజా! నీకుమారుఁడు మనుజ మాత్రుఁ డని భ్రమపడకుము; భూభారమును హరించుటకు సాక్షా ద్భగవంతుఁడు నీగర్భమునఁ బుట్టెను; విశ్వామిత్రుఁడు మహాతపస్సంప న్నుఁడు; కోరినవరము నిచ్చెదనని ప్రతిజ్ఞఁ జేసియుంటివి; నీవంశములో నీతాతముత్తాత లాకరయిన, నాడినమాటను తప్పలేదు; కనుక, నీకు మారుల నతనివెంటఁ బంపుము; ఏమియు భయములేదు'' అని వసి ష్ఠుఁడు రాజునకుయథార్థముఁ జెప్పెను; అన్నిసంగతులనురాజువిని, కుల ధర్మమును తెలిసికొని, స్వాస్థ్యముఁబొందెను. అప్పుడు రాజు రామ లక్ష్మణులనురప్పించి, వారినిఁ దనహృదయమున కప్పళించుకొనెను. "ఓ మునిరాజా! ఈరామలక్ష్మణు లిరువురు నాప్రాణములఁబోలినవారు; వారికి మీరే తల్లిదండ్రులు; మీరుతప్ప, వారికి వేఱొకరు దిక్కు లేదు." అని రాజు పలికి,

దోహా 243

కుమారుల నిరువురను విశ్వామిత్రున కప్పగించెను; అంతట వారిని రాజు ఆశీర్వదించెను. అంతఃపురములోనికి వారు వెళ్లి, తల్లులకు నమస్కరించి వెడలిరి.

సోరఠా 28

ఆకృపాసాగరులు, ఆమతిధీరులు, ఆజగన్నాటకసూత్రధారులు, ఆపురుషసింహము లిరువురు, యజ్ఞసంరక్షణార్థము, మునివెంట నడచిరి.

చౌపాయీ 227

(అధికపాఠము:-అప్పుడు రాముఁడు హనుమంతునిఁజూచి "వనము నకుఁ బొమ్ము! నేనరణ్యమునకు వచ్చినపుడు, నిన్నుఁ గలియువాఁడను.)

రాముని నేత్రములు జలజారుణములు; వక్షస్థలము విశాలము; బాహుదండములు దీర్ఘములు; నీలకమలములును తమాలమును పోలిన శరీరము; ఇంత చక్కనివాఁడు పీతాంబరముఁగట్టుకొని, ధనుర్బాణములనుధరించి, మునివెంట నడచెను; అంబులపొదిని వీపున కతఁడు కట్టుకొనెను. రామునిశరీరము శ్యామలము; లక్ష్మణునిశరీరము గౌరవర్ణము; ఈమహానిధులు విశ్వామిత్రునకు లభించెను. "ఇతఁడు సాక్షాత్పరమేశ్వరుఁడు; ఇదినిశ్చయము; నానిమిత్త మితఁడు తండ్రిని విడిచి నాతోడ వచ్చెను" అని ముని తనలోఁ జింతించెను. మార్గములో నతఁడు తాటక యను రాక్షసిని రామునకుఁ జూపించెను; మునిమాటలను వినినవెంటనే, తాటక పరుగిడివచ్చెను. ఒక్కబాణముతో రాముఁడు దానిని సంహరించెను; దానిదీనత్వమును రాముఁడు చూచి, దానిని కటాక్షించి, దానికి స్వర్గమునిచ్చెను. "రాముఁడు నిశ్చయముగ నానాథుఁడు; నా ప్రభువు" అని విశ్వామిత్రుఁడు నిశ్చయించుకొని, రామునకు విద్యనుపదేశించెను; 'బల, అతిబల' అను రెండువిద్యల నతఁడు రామునకిచ్చెను; ఆవిద్యలవలన క్షుత్పిపాసలుండవు; శరీరము బలముగనుండును; శరీరకాంతి యధికమగును.

దోహా 244

సాంగోపాంగముగ నస్త్రశస్త్రములను రామున కతఁ డుపదేశించెను; ఆశ్రమమున కతఁడు వారినిఁదీసికొనిపోయి, కందమూలఫలములను భుజించుటకు వారికిచ్చెను.

చౌపాయి 228

ప్రాతఃకాలమున రాముఁడు లేచి, మునీశ్వరునకు నమస్కరించి, "ఓమునిరాజా! నిర్భయముగ మీరు యజ్ఞముఁజేయ నారంభింపుఁడు" అనిచెప్పెను. మునులతోఁగూడి విశ్వామిత్రుఁడు యజ్ఞదీక్షలోఁ బ్రవేశించెను; రాముఁడు ధనుర్బాణములను ధరించి, యజ్ఞవేదికను సంరక్షించుచుండెను. ఆసంగతి నతనిశత్రువులగు మారీచుఁడు మొదలగు రాక్షసులు విని, యజ్ఞముఁ బాడుచేయుటకుఁ బరుగిడివచ్చిరి; రాముఁడొకబాణమును మారీచునిపైఁ గుఱిజూడక ప్రయోగించెను; ఆబాణముతోఁగూడ వాఁడు (400)నాలుగువందల యోజనములు దాఁటిసముద్ర

మవతలఁ బడెను; అగ్నిబాణముఁ బ్రయోగించి, సుబాహువుని సంహారించెను. లక్ష్మణుఁడు రాక్షససైన్యములను సంహారించెను. రాక్షససైన్యములు పిశాపికలై నలువైపులఁ జెదరిపోయెను. ఆసోదరుల నిరువురను, దేవతలు, మునులు నుతించిరి. కొన్ని దినములు వారు ఋషులతోఁ గూడియుండిరి; వారిమీఁద నతనికి దయవచ్చెను; అతనియందు వారికి భక్తి కలిగెను; అతఁడు సర్వజ్ఞుఁడైనను, వారు చదువుచుండిన పురాణములను సావధానముగ వినుచుండెను. రాముని విశ్వామిత్రుఁ డాదరించి, "ఓరామా! నీవు స్వయముగా చూడఁదగినచిత్ర మొకటికలదు; జనకచక్రవర్తిచేయుచుండిన ధనుర్యజ్ఞముఁ జూచుటకుఁబోయెదము" అని చెప్పెను. ఆప్రకారము రామలక్ష్మణులు విశ్వామిత్రునితోఁ గలసి, జనకునిపట్టణమునకు బయలువెడలిరి మార్గములో వారొక ఋష్యాశ్రమముఁ జూచిరి; జీవజంతువు లెవ్వియు నచ్చటఁ గన బడవు; అచ్చటఁ బడియుండిన నొకశిలను రాముఁడుచూచి, దానిసంగతిఁ జెప్పుమని విశ్వామిత్రుని నడిగెను; ఆశిలయొక్క పూర్వవృత్తాంత మంతయు నతఁడు రామునకు విశదపఱచెను; (అహల్యయను నొకత్రిలోకసుందరిని బ్రహ్మ సృజించి, యామెను గౌతమమహర్షి కిచ్చి వివాహముఁ జేసెను; ఆమె యం దనురాగముకలవాఁడై, గౌతముఁడు గృహములో లేనిసమయముఁజూచి, దేవేంద్రుఁ డామెతో రమించెను. గౌతముఁ డంతసంగతియు జ్ఞానదృష్టిచేఁ జూచి, వారిరువురను శపించెను; అందుచేత నామె శిలయై యాశ్రమములోఁ బడియుండెను.)

దోహా 245

"ఓరఘువీరుఁడా! అహల్య శాపవశముచే శిలయై పడియున్నది; ఆమె నీచరణకమలపరాగము నభిలషించుచున్నది; ఆమెను కటాక్షింపుము; ఆమెమీఁద నీపాదధూళిఁ బ్రసరింపఁజేయుము" అని విశ్వామిత్రుఁడు చెప్పెను.

ఛాంద్ 28, 29, 30, 31

పరమపవిత్రములగు రాముని చరణారవిందములు సకలదుఃఖములఁ బోఁగొట్టును; ఆపావనము లాశిలను సోకినమాత్రమున నామె, నిదురలోనుండివలె, లేచి నిలువఁబడెను; భక్తసుఖదాయకుఁడగు రామ

చంద్రుని( జూచి, యామె చేతులనుజోడించికొని నిశ్చేష్టురాల య్యెను; ఆమెశరీరము మైమఱచెను; ఆమెశరీరము పులకరించెను; ఆమె ముఖమునుండి మాటలు వెడలలేదు; అహల్య యదృష్టవంతురాలు; ఆమెనేత్రములవెంబడి యానందబాష్పములు వరదలై కారుచుండెను. ఆమె మఱలమఱల రామునిపాదములపైఁబడిఁ నమస్కరించెను. కొన్ని గడియల కామె గుండెలను దిట్టముఁజేసికొని, రామునియెదుట నిలువఁ బడి, భక్తిశ్రద్ధ లుప్పతిల్ల, మృదుమధురవచనములతో నిట్లు స్తుతించెను:—

"ఓరామా! నిన్ను జ్ఞానముచేఁ దెలిసికొనఁగలరు; జయజయ! ఓరఘురామా! నేను స్త్రీని; పాపాత్మురాలను; నీవు జగత్పావనుఁడవు; నీవు రావణుని సంహరించుట కవతరించితివి; ఓభక్తసుఖదాతా! ఓకమలనేత్రుఁడా! ఓభవభయమోచనుఁడా! ఓస్వామీ! రక్షింపుము; రక్షింపుము; నేను నీశరణుఁజొచ్చెద. నేచేసినపాపమునకుఁ దగినట్లు గౌతముఁడు నన్ను శపించెను; ఆశాపము నామేలునకేవచ్చెను; నాభర్తకు నిందుగ నాయం దనుగ్రహముకలదు. భవసాగరమును దాఁటించుటకు సమర్థుఁడవగునిన్ను కన్నులారఁ జూచునట్టిభాగ్యము కలిగెను. నీసందర్శనమువలనఁ గలుగుభాగ్యము శివుఁడు పూర్ణముగఁబొందెను;ఓనాథా! నాది యొకవిన్నపముకలదు; నేను మూర్ఖురాలను; నేనేమివరములఁ గోరను; తుమ్మెదవలె, నామనస్సు సదా నీచరణకమలపరాగము నంటుకొనియుండునట్లు ప్రసాదింపుము; నీపాదారవిందములనుండి వెడలిన గంగను శివుఁడు శిరస్సుపై ధరించెను; ఆనీపాదములను సదా బ్రహ్మ నమస్కరించును; ఓదయాసాగరుఁడా! నీపాదములను నాశిరముపై నుంచితివి." అని యీప్రకారము గౌతమధర్మపత్ని రామునిస్తుతించి, అనేకపర్యాయము లతనిచరణములమీఁదఁబడి నమస్కరించెను. ఆమె మనోభీష్టమును రాముఁడు నెఱవేర్చెను; ఆమె సంతసించి భర్తవద్దకుఁ బోయెను.

దోహా 246

హరి దీనబంధువు; అతని నిర్హేతుకజాయమానకటాక్షము భక్తుల యందుఁ బ్రసరించును; "ఓమనస్సా! కపటకుచోద్యములను విడిచి, భగ

వస్మా మస్మరణంజేయుము; పరమేశ్వరుని ధ్యానింపుము; పరంధాముని భజింపుము" అని తులసిచెప్పెను.

చౌపాయ్ 229

విశ్వామిత్రునితోఁగూడి, రామలక్ష్మణులు బయలువెడలిరి; త్రిలోకపావనియగుగంగను వారు మార్గములోఁ జూచిరి; ఇరువురు సోదరులు గంగకు నమస్కరించిరి; ఆత్రిపథగామినిఁ జూచినందున, వారిమనస్సులు సంతోషముచే నుప్పొంగెను; అధికపాఠము:—(విశ్వామిత్రునకు నమస్కరించి, రాముఁడు గంగోత్పత్తినిగుఱించి చెప్పుమని ప్రార్థించెను. ఏవిధమున భూలోకమునకు గంగ తీసికొనిరాఁబడెనో, విశ్వామిత్రుఁడాకథనుఁ జెప్పనారంభించెను:—"ఓరామా! మీవంశములో సగరుఁడని యొకరాజుండెను; అతఁడు త్రిలోకప్రఖ్యాతిఁగాంచెను. చక్కనిభార్య లిరువు రతనికిఁ గలరు; కేశిని పెద్దభార్య; సుమతి రెండవభార్య; సంపదలు వారికి లోపములేదు; కాని, కుమారులులేని లోపమువలన, రాజు విచారించుచుండెను; ఓరామా! ఆవిచారముచే నతఁడు భార్యలతోఁ గూడి వనమునకుఁబోయెను; ఆవనములో ననేక ఫలవృక్షములుకలవు; అచ్చట భృగుమహర్షి నివసించియుండెను; అతని యాశ్రమము చక్కగనుండెను; అతఁడు తేజశ్శాలి; తపోధనుఁడు.

దోహా 247

"ఆవనములో సగరుఁడు నూఱుసంవత్సరములు ఘోరమగు తపము నాచరించెను; అతఁడు భృగుమహర్షి ననేకవిధముల నుతించెను; ఆముని సంతసించి, రాజుం జూచి "ఓరాజా! వరము నడుగుము" అని చెప్పెను.

చౌపాయ్ 230

"సగరుఁడతనికి నమస్కరించి, తనకుఁ గుమారులు లేనిలోపము నతనితోఁ జెప్పెను; మునీశ్వరుఁడు రాజును దీవించి, యతనికి వరము నిచ్చెను; భృగుఋషి రాణులఁజూచి, "ఓతల్లులారా! మీమీకోరికలఁ జెప్పుఁడు" అనిపలికెను. అతనిపలుకులను వారు విని, "ఓమహారాజా! మీ కేదిశ్రేష్ఠమనితోఁచునో, దానినే ప్రసాదింపుము;" అని వారు పలికిరి; కేశిని యొక్కకుమారు నేయడిగెను; సుమతి, 60,000 లమంది కుమారులఁగోరెను. "తథాస్తు" అని ముని ఆశీర్వదించెను.

ఈవరములఁబడసి, సగరుఁడు రాణులతోఁగూడి, భృగువునకు నమస్కారముఁజేసి, యనేకప్రకారముల నతనినిస్తుతించెను; తదనంతరము యతఁడు భార్యలతో అయోధ్యానగరమునకువచ్చెను; వారు సుఖముగ జీవించియుండిరి; ఇట్లు కొన్నిదినములుగడచెను; శుభలగ్నమున, శుభ దినమున, కేశినికి యొకకుమారుఁడు కలిగెను; వాఁడే అసమంజసుఁడు; సుమతికి యొక తుంబి పుట్టెను; అందులో, 60,000 లమంది చిన్నబాలురు మిలమిలలాడుచుండిరి; పుత్రోత్పత్తికి రాజు సంతోషించి, పుణ్యాహవచనముఁ జేయించెను; రాజు ప్రసన్నుఁడై, బ్రాహ్మణులకు షోడశమహాదానములనిచ్చెను; గురువులను, గణపతిని, పార్వతీపరమేశ్వరుల నతఁడు పూజించెను; ఆయరువది వేలమందిపిల్లలను వేర్వేఱు నేతికుండలలోఁ బెట్టించెను.

దోహా 248

"ఓఘనశ్యామరామా! ఈప్రకార మతనికిఁ గుమారులుకలిగిరి; అతనిమనోరథము సిద్ధించెను; దివారాత్రము లానందములో నతఁడు మునిఁగియుండెను.

చౌపాయ్ 231

"పురజనులందఱును సుఖముగ నుండిరి; సగరునకు దుఃఖముపోయెను; అంతకంతకు వారికి బాల్యదశవచ్చెను; వారు బాలక్రీడలలో విహరించుచుండిరి; ఈశుభకార్యములచే, వారిమనోభిలాషములు సిద్ధిఁ బొందెను; ఆనందమున వా రనేకదినములు గడపిరి; అయోధ్యానగరమున కుత్తరమున సరయూనది నిర్మలజలముతోఁ బ్రవహించుచుండును; సగరునికుమారు లానదిలో నిత్యము స్నానముఁజేయుచుండిరి. పురజనులకుమారుల నసమంజసుఁడు నావలోఁ గూర్చుండ బెట్టుకొని, వారిని సరయూనదిలోఁ ద్రోసివేసెను; ఓరామచంద్రా! కుమారులమరణమునకు నగరజనులు దుఃఖించిరి; రాజు సింహాసనము నధిష్ఠించియుండ, నతనివద్దకుఁ బురజనులు వచ్చి, నమస్కరించి, "ఓరాజా! నీవు జనరంజకముగ రాజ్యముఁ బరిపాలించుచుంటివి; కాని, నీకుమారుఁడు, అసమంజసుఁడు, మాకందఱకును గాలునివలెఁ గన్పడును; ఓప్రభువా! మేము నీదేశమును విడిచిపెట్టినగాని, మాక్లేశము పోదు.

దోహా 249

"నీకుమారుఁడు ఘోరమగు పాపకార్యములఁ జేయుచుండును; మాకుమారుల నతఁడు సరయూనదిలోఁ ద్రోసి చంపెను; నీకు వాఁడు నీప్రాణములవంటివాఁడు; కాని, మాకుమాత్రము శత్రువు" అని మొఱఁ బెట్టుకొనిరి.

చౌపాయి 232

జనులదీనాలాపములను రాజు విని, ధైర్యమునవలంబించి, అసమంజసుని దేశోచ్చాటనముఁ జేయించెను; అసమంజసుఁడు గొప్పయోగి; అతఁడు నగరమునువిడిచి, దానిపొలిమేరలకు వచ్చి, యోగబలముచే నా మాబాలకులను వారివారితండ్రులవద్దకుఁ బంపెను. అసమంజసుని కుమారుఁడు అంశుమంతుఁడు; అంశుమంతుఁడుకూడ సకలగుణశాలి; అతనికీర్తి మూఁడులోకములలో వ్యాపించెను; ఎటుల మత్స్యము జలములకొఱకు ధ్యానించునో, సగరుఁ డటుల అసమంజసునికొఱకభిలషించెను; పురజనులు సంతోషించుచు వారివారిస్వగృహములకు విశ్రమించిరి; రాజుయొక్క యుదారగుణమును వారుప్రసంగించుచు, నడచి వెళ్ళిరి; వారిమనస్సులు స్థిరపడెను. తదుపరి, "అయ్యో! నాకు వేగముగా వృద్ధాప్యమువచ్చెను," అని రాజు చింతించి, మంత్రులను గురువులను పుత్రులను రప్పించి, "అయ్యా! మీరందఱును హిమాచల వింధ్యాచలమధ్యస్థప్రదేశమునకు వచ్చి, నన్ను కలయుఁడు" అని వారికిఁ జెప్పి, యచ్చటికి రాజు వెళ్లెను. అచ్చట నొకచక్కని వేదిక నతఁడు కట్టించెను; దానిగొప్పఁదనమును వర్ణింప శక్యముకాదు. అతఁడు యజ్ఞముఁ జేయ నారంభించి, యొకగుఱ్ఱమును విడిచిపెట్టెను; ఆయశ్వము సర్పమువలె నతివేగమున నడచెను.

దోహా 250

"దేవేంద్రుఁ డాసంగతి విని, భయపడి, యాయశ్వమును దొంగిలించెను; అతఁడుచేసినతంత్ర మెవరికిఁ దెలియదు.

చౌపాయి 233

"ఇంద్రుఁ డాగుఱ్ఱముఁ దీసికొనిపోయి, కపిలమహామునిసమీపమున విడిచిపెట్టెను; ఆసంగతి యెవరికిఁ దెలియదు; అతఁడు దానిం దీసికొనిపోవుచుండ నెవరును చూడలేదు. ఆగుఱ్ఱము వెంబడి మహాయో

ధులు నడచుచుండినను, వారికిసయితము తెలియలేదు; వారికి గుఱ్ఱము కనఁబడలేదు. వారందఱు రాజువద్దకువచ్చి, 'ఓరాజా! మీతోఁజెప్పుటకు మాకు భయముకలుగుచున్నది; గుఱ్ఱము నెవరుతీసికొనిపోయిరో, మాలో నొకరికయినఁ దెలియదు; మీయాజ్ఞప్రకారము నడచుకొనువారము' అనిచెప్పిరి. వారివచనములను విని, రాజు విస్మితుఁడయ్యెను; అతఁడు వెంటనే కుమారులకు వర్తమానముఁబంపెను; 'ఓయీ! మీరు నలువైపులకు బోయి, గుఱ్ఱమును వెదకి, శీఘ్రముగాతీసికొనిరండు' అని రాజు వారి కాజ్ఞాపించెను. వారు తండ్రికి నమస్కరించి, బయలు వెడలిరి. ఆయఱువదివేలమందికుమారులును దేవేంద్రునితోసమానమగు బలవంతులు; గొప్పధనుర్ధరులు; రణధీరులు; రణశూరులు; వారిదండయాత్రఁ జూచి, భూదేవి గడగడవడఁకెను; జీవజంతువులన్నియు జీవములపై నిరాశఁజేసికొనెను. వాపీకూపతటాకములను, పర్వతములను, వనములను, నదులను, నగరములను, గుహలను, మునియాశ్రమములను సర్వమును వారు వెదకిరి.

దోహా 251

"ఈప్రకారము వారన్నిప్రదేశములలోను గుఱ్ఱమునువెదకి, దానిం గానక, విచారగ్రస్థులై, రాజువద్దకు వచ్చి, 'ఓమహారాజా! అన్నిప్రదేశములను మేము కలయఁజూచితిమి; కాని మాకు గుఱ్ఱము దొరకలేదు' అని విన్నవించిరి.

చౌపాయ్ 234

"అప్పుడు రాజు వారిమాటలను విని, 'ఓయీ! మీరు భూమిని త్రవ్విచూడుఁడు' అనిచెప్పెను; ఆమాటప్రకారము వారు తూర్పుదిక్కునకు వచ్చిరి; వారిచేతులు వజ్రముతోసమానములు; ఒకయోజనముపొడుగున వారు భూమినిఁద్రవ్వి పెకలించిరి, వారిబలపరాక్రమములఁ జూచి దేవతలు భయపడిరి; 'ఓయీ దేవతలారా! మీరు భయపడవలదు; ఈసగరునికుమారు లందఱు నశించిపోఁగలరు' అని బ్రహ్మ వారికి బోధించెను. సగరునిపుత్రులు భూమిని శోధించి, పాతాళమునకు వచ్చి, వారొకదిగ్గజముఁ జూచి, దానికి నమస్కరించి వృత్తాంతమంతయు విన్నవించిరి; అచ్చటనుండి, దక్షిణదిశకువచ్చిరి; అచ్చట నొకదిగ్గజమును చూచిరి; మొదటిదానికంటె నిది మిక్కిలి యుజ్జ్వల

ముగనుండెను; దానికినమస్కరించి, పశ్చిమదిశకువచ్చిరి; అచ్చట మూఁడవదిగ్గజమునకు ప్రదక్షిణముచేసి నమస్కరించి, యుత్తరదిశకువచ్చిరి; అచ్చట నొకశ్వేతదిగ్గజముఁజూచి, సంతోషించిరి; తదుపరి, వారు కపిల మహామునిం జూచిరి; గాని తుదముట్ట వారు భూమిం జూడలేదు; అంతలో నాల్గువైపులనుండి సముద్రపునీరు వచ్చి క్రమ్మివేసెను.

దోహా 252

"కపిలమహామునిసమీపమునఁ గట్టఁబడియుండిన గుఱ్ఱమును వారు చూచి, కోపించిరి; వారికి వినాశకాలము సంప్రాప్తమయ్యెను.

చౌపాయ్ 235

"'ఓరీ! దుష్టుఁడా! నీకొఱకుఁ బృథివియంతయు నాల్గుదిక్కులలోఁ జూచితిమి; ఇచ్చటకువచ్చి నీవు దాఁగియుంటివా' అని యొకఁడు పలికెను; 'మే మనేకదొంగలఁ జూచియుంటిమి; కాని, వీనివంటిగడుసు దొంగ లేడు' అని యొకఁడు చెప్పెను. 'పరులధనము నపహరించి, పాతాళమునకువచ్చి వీఁడు మునివేషమునుధరించెను' అని మూఁడవ వాఁడు పరిహాసమునుజేయుచుండెను; 'ఓరీ! వీనిముఖలక్షణములఁ బట్టి చూచిన, వీఁడు మునివలెఁ గనఁబడఁడు; అదిమాత్రము తెలిసికొనుఁడు' 'ఓరీ! వీఁడు గుఱ్ఱము నపహరించి, బకధ్యానముఁ జేయుచుండెను'— అని మఱియొకఁడు పోటుకుమాట నాడెను; ఆమాటను కపిలుఁడు విని, నేత్రములవిప్పి, వారిం దేఱిచూచెను ఆక్షణము, (60,000) అఱువదివేలమందియు భస్మమయిరి. ఓపార్వతీ! ఆలోచింపక మాటఁజెప్పిన వానికి, యమృతము విషమగును; చేదు కారమగును; తెలిసితెలిసి పాగరుఁబోతుతనముచే నిప్పును చేతిలోఁ బెట్టుకొనినవాఁడు తగులఁబడక యుండునా? ఓరామా! తెలిసితెలిసి విషముఁ ద్రాగినవాఁడు చనిపోవక యుండునా? ముందువెనుకల నాలోచింపక, మునిపైఁ గోపించిరి; అందు చేత, వారుకాలిపోయి భస్మమయిరి. అప్పుడుసగరుఁడు అంశుమంతునకు వర్తమానముఁబంపి, యతనినిరప్పించి, 'ఓకుమారా! నీతమ్ము లెవరును రాలేదు; నీవువారినివెదకి, వారిం దీసికొనిరమ్ము" అని యతనితోఁజెప్పెను.

దోహా 253

"మాటిమాటికి రాజు అంశుమంతునిదీవించి, 'ఓనాయనా! నీవే

నాప్రాణముల కాధారము సుమా! వారిని వెదకి తీసికొనిరమ్ము. గుఱ్ఱ మునుకూడఁ దీసికొనిరమ్ము' అని చెప్పి, రాజతనిం బంపెను.

చౌపాయ్ 236

''కుమారుఁడు తండ్రిచరణములకు నమస్కరించి బయలువెడలెను; అంశుమంతుఁడు పిఙ్ణభక్తుఁడు; కులదీపకుఁడు సుమా! ఓరామా! అచ్చటచ్చట మునులయాశ్రమములఁ జూచి, అతఁడు వారికి నమస్కరించి, సోదరులసమాచారము నడుగుచుండెను. అతఁడు పన్నగనాథుని దీవనలఁ బొందెను; దిగ్గజముల కతఁడు నమస్కరించెను; ఈప్రకారమతఁడు వెదకుచు బయలువెడలెను; ఈసమయమున సుమతియొక్క సోదరుఁడు గరుడుఁడు, అంశుమంతునిఁ గలిసెను; అతనికి గరుడుఁడు మేనమామ. మేనమామచరణముల కతఁడు నమస్కరించెను; మేనల్లుని యతఁడు దీవించి, సోదరుల మరణవృత్తాంతమునంతయుఁ జెప్పెను; వారిమరణమున కంశుమంతుఁడు శోకించి, విచారించెను; ఒకజలాశయమును మేనమామ చూపించెను; అందులో నంశుమంతుఁడు స్నానముఁ జేసి, క్రమముగ సోదరులకు జలతర్పణములనిచ్చెను; అప్పు డతనిని మేనమామ చూచి, 'ఓనాయనా! నేనొకసంగతిఁ జెప్పెద; దానిప్రకారము చేయుము'అని పలికెను.

సోరఠా 29

''ఓతండ్రీ! ఏవిధముననైన గంగను భూలోకమునకుఁ దీసికొని వచ్చుటకుఁ బ్రయత్నముఁ జేయుము; దానిని దర్శించుటవలన, సకల పాపములు పోవును; దానిలో స్నానముఁజేయుటవలన సకలసుఖములఁ బొందవచ్చును.

చౌపాయ్ 237

'' 'ఆప్రకారము గంగను తీసికొనివచ్చినయెడల, నీసోదరు లఱువదివేలమందియుఁ దరించెదరు.' అని మేనమామ చెప్పెను. మేనమామమాటల నతఁడు విని సంతోషించెను; వారిరువురుకలసి, కపిల మహామునివద్దకు వచ్చిరి. అప్పుడు గరుడుఁడు మునిచరణములకు నమస్కరించెను; పూర్వవృత్తాంతమంతయు నతఁడు వారిరువురతోఁజెప్పెను; అతఁడు వారికి గుఱ్ఱము నప్పగించెను; అంశుమంతుఁడు దానిని గుఱుతు పట్టి పోల్చెను. ఓరామా! అతనితోఁ గూడి మేనమామ కొంత

దూరమువచ్చి, స్వగృహమునకువెళ్లెను. గుఱ్ఱముం దీసికొని, అంశు మంతుఁడు రాజువద్దకువచ్చి, తండ్రికి నమస్కరించి, సోదరుల మరణవృత్తాంత మంతయు వారికి విన్నవించెను; తదుపరి, కపిల మహాముని యేవిధమున గుఱ్ఱమునిచ్చెనో, నాసంగతికూడ చెప్పెను. అశ్వము దొరికినందుకు సగరుఁడు సంతోషించి, కుమారులమరణము నకు దుఃఖించెను; అతఁడు యాగమును సమాప్తముఁజేసి, బ్రాహ్మణుల కనేకదానముల నిచ్చెను. అతఁడు న్యాయముగ రాజ్యముఁబరిపాలించి నందున, నతనిప్రజలు సకలసుఖములఁ బొందిరి.

దోహా 254

"అనంతరము అంశుమంతునకుఁ బట్టముఁగట్టి, సగరుఁడు, భగ వంతుని చరణకమలములను సేవించుట కుద్దేశించి, తపముఁజేయుటకు వనమున కేఁగెను; అతనిమనస్సు ప్రేమపూరితమయ్యెను.

చౌపాయ్ 238

"కుమారుఁడగు దిలీపునకుఁ బట్టముఁగట్టి, అంశుమంతుఁడు, త పోవనముల కేగెను; అంశుమంతుఁడు కొంతకాలము ఘోరమగు తపము నాచరించి, స్వర్గస్థుఁడయ్యెను. దిలీపునిప్రభావ మెటుల వర్ణింపఁగలను? దేశదేశములరాజులువచ్చి, యతనిని సేవించుచుండిరి; అతనిప్రభావ మును దేవేంద్రుఁడు చూచి యాశ్చర్యపడెను; అతనిమహిమ నేకవీశ్వ రుఁడు వర్ణింపఁగలఁడు? దిలీపునికుమారుఁడు భగీరథుఁడు; భగీరథుఁడు తండ్రికి ననుకూలముగఁ బ్రవర్తించెను; అతనికిఁ బట్టముఁగట్టి, దిలీపుఁడు తపోవనముల కేఁగెను; 'అయ్యో! గంగను భూలోకమునకుఁ దీసికొని రాలేకపోతినికదా!' యని దిలీపుఁడు విచారించుచు, వనముల కేగి, శరీర మును విడిచెను. 'అయ్యో! నాతండ్రి, అంశుమంతుఁడు, మనమును తనువును గంగనిమిత్తము సమర్పించెను; అటుల నేనుకూడ, గంగఁ దీసి కొనివచ్చుటకుఁ దపముఁజేయువాఁడ; గంగఁ దీసికొనిరాలేకపోయిన యెడల, నేనీపట్టణమునకుఁ దిరిగివచ్చువాఁడనుగాను; అంతవఱకు నేనీ నగరమునే స్మరింపను' అని దిలీపుఁడు చింతించుచు వనమున కేఁగెను.

సోరఠా 30

"ఈప్రకారము దిలీపుఁడు చింతించి, వనములకేఁగి తపముఁ జేయుచుండెను; అతఁడు తపముఁజేయుచుండ, విశేషకాలము గతిం

చెను; అతఁడు దేహమునువిడిచి స్వర్గస్థుఁడయ్యెను; కాని, గంగమాత్రము భూలోకమునకు రాలేదు.

చౌపాయ్ 239

"ఈప్రకారము గంగనిమిత్తము మూర్ధాభిషిక్తులుసయితము శరీరములను విడిచిపెట్టిరికదా! అట్టిగంగను విడిచి, మూర్ఖులు కూపములలోనిజలములను త్రాగుచుందురు. 'అయ్యో! అనేకదినములు గడచెను; నాతండ్రి తపోవనమునుండి రాలేదు' అని భగీరథుఁడు పలువిధముల విలపించెను; అతనికుమారుఁడు కకుత్థ్సుఁడు; కుమారునకు రాజనీతులనుబోధించి, గంగనిమిత్తము తాముపూర్వముపడినశ్రమవృత్తాంతమంతయు నతనికిఁజెప్పి, పట్టముఁగట్టి, దీవించి, భగీరథుఁడు వనములకు బయలువెడలెను; నగరమునకువెలుపల నతఁడు శుభశకునములఁ జూచెను; అతఁడు మహారణ్యమునకు వచ్చెను, అతఁడు వనముఁజూచి, సంతోషించి, గంగనిమిత్తము తపముఁజేయనారంభించెను; ఏకపాదముమీఁద నిలుచఁబడి, ఊర్ధ్వబాహుఁడై, రాత్రింబవళ్లు తెలియకుండ, నతఁడు తదేకధ్యానముతో సూర్యునియందు దృష్టినిలిపి, జపముఁజేయుచుండ, నొకసహస్రవర్షములు గతించెను; అతని యుగ్రతపమునకు బ్రహ్మమెచ్చుకొని, యతని మనోభావమును గ్రహించి, యతనికిఁ బ్రత్యక్షమయ్యెను; 'ఓరాజా! నీమనోభీష్టముఁ దెలియఁజేయుము; ప్రసాదించెదను' అని బ్రహ్మ పలికెను; భగీరథుఁడు బ్రహ్మకు నమస్కరించి, 'ఓస్వామీ! అనేకనమస్కారములు; నీవు సర్వజ్ఞుఁడవు; నామనోభీష్టము నీకుఁ దెలియునుకదా! నే నేలచెప్పవలయును?' అని భగీరథుఁడు పలికి,

దోహా 255

" 'ఓస్వామీ! మీరు ప్రభువులు; మీరు నన్ను వరముఁగోరుమని సెలవిచ్చితిరి; మీకృపవలన మావంశము వృద్ధియగుఁగాక;' యని చేతులజోడించి రెండవవరముఁ గోరెద; 'ఓదేవా! భూలోకమునకు గంగ దిగునట్లు ప్రసాదింపుము.' అని రాజు ప్రార్థించెను.

చౌపాయ్ 240

" 'అట్లగుఁగాక; స్వర్గమునుండి గంగ భూలోకమునకు దిగునపుడు, దానిని ధరించువా రెవరు? అది పడినంతలోనే, పాతాళమును

ముట్టునుకదా! ఓరాజా! పాతాళమును ముట్టినతరువాత, నది తిరిగి భూలోకమునకు రాదు. ఇంతియకాదు; మఱియొకవిశేషముకలదు; దాని వేగమును భూమి భరింపలేదు; కనుక, నేనొకమాటఁ జెప్పుచున్నాను; వినుము; సాంబశివుఁడు పరమదయాళువు; అతఁడు గంగనుధరించుటకు సమర్థుఁడు; అతని నుద్దేశించి నీవు తపమునాచరించినయెడల, నీకోరిక సఫలమగును' అని బ్రహ్మ రాజునకుబోధించి, యంతర్ధానమయ్యెను; తదుపరి, భగీరథుఁడు. శివుని నుపాసించెను; అంగుష్ఠముమీఁద నతఁడు నిలువఁబడి, శివనామమును జపించుచు, దేవమానమునుచొప్పున నొకసంవత్సరము, తపము నాచరించెను; అంతట నతనికి శివుఁడు ప్రత్యక్షమయ్యెను; అనేకవిధముల నతఁడు సాష్టాంగదండప్రణామముఁజేసి, చేతుల జోడించి, శివునిస్తుతించెను 'ఓరాజా! నేను గంగను ధరించెదను' అని శివుఁడు చెప్పి, భగవంతుని ధ్యానించెను.

దోహా 256

"బ్రహ్మలోకములో నుండిన గంగ, తనను శివుఁడు ధరించునని విని, 'అయ్యో! శివునితోఁ గూడి నేను పాతాళమునకుఁ బోయెదను; అచ్చటనుండి తిరిగి నేనెటులరాఁగలను' అని తనలో విచారించెను.

చౌపాయ్ 241

"సర్వాంతర్యామి యగుశివుఁ డొకయుపాయముఁబన్నెను; అతఁడు శిరముపై ననేకజటలను పెంచెను. భగీరథునిప్రార్థనను విని, బ్రహ్మ గంగను విడిచిపెట్టెను; బ్రహ్మలోకమునుండి గంగ వెడలినపుడు, లోకమంతట హాహారుమనుశబ్దము పుట్టెను; దేవతలు, దిగ్గజములు, శేషుఁడు మొదలగువారందఱు నిశ్చేష్టులయిరి; ఇంతటిగంగను శివుఁడు తనజటలలో నొకసంవత్సరము దాచియుంచెను; అందుచేతనే, గంగకు భవాని యనిపేరు వచ్చెను; భవాని యనిన భవునిభార్య; ఈచిత్రముఁ జూచి దేవతలు పరమానందభరితులయిరి; అంతట జయజయశబ్దములు వినఁబడెను; అంతరిక్షమునుండి పుష్పవర్షము గురిసెను; మఱల భగీరథుఁడు శివునిఁ బ్రార్థింప, నతఁడు తనజటలలోనుండి యొకబిందువును విడిచిపెట్టెను. ఆబిందువే, మూఁడుప్రవాహములుగ బ్రవహించును; అంతరిక్షమున నొకటియు, పాతాళమున నొకటియు, భూలోకమున నొకటియు - ఇట్లు మూఁడువిధములుగఁ బాఱుచుండును; సకలపాపనాశిని

యగు నొకప్రవాహము స్వర్గమునకుఁబోయెను; అదియే మందాకిని; అదియే దేవతలనది; మందాకినియని దేవతలు దానికిఁ బేరుపెట్టిరి.

దోహా 257, 258

"పాతాళమునఁ బ్రవహించునది ప్రభావతి; అది సకలదుఃఖములఁ బోఁగొట్టును; మూఁడవది, భూలోకములోఁ బ్రవహించును; అదియే యీగంగ; ఇది మహాత్ములకు సంతోషము నిచ్చును. ఆగంగా ప్రవాహముఁ జూచి, చంద్రునిఁజూచినచకోరములువలె, భగీరథుఁడు సంతోషముచే నుప్పొంగెను; పూర్ణచంద్రునిఁ జూచి, సముద్రుఁడుప్పొంగినవిధమున, నతనిమన స్సుప్పొంగెను

చౌపాయి 242

"భగీరథుఁడు గంగకు నమస్కరించెను; అప్పుడు గంగ రాజుం జూచి, 'ఓరాజా! సూర్యునిగుఱ్ఱమువలె నతిత్వరితముగఁ బోవునట్టిగుఱ్ఱములఁ గట్టినరథముం దీసికొనిరమ్ము; ఓరాజా! ఆరథమును నడపించుకొని, ముందు నీవు కదలుము; నీరథము వెంబడి, వెనుకను నేను వచ్చెదను' అని గంగ పలికెను ఆమెచెప్పినప్రకార మతఁడు మంచిరథము నెక్కి, భగవంతునిధ్యానించి, ముందునడచెను. అతని ననుసరించి, గంగాదేవి వెనుకనుండి నడచెను; దేవతలు సంతోషించి, పుష్పవర్షమును గురిపించిరి; ఆప్రవాహముయొక్క తేజస్సును వర్ణించుటకు శక్యము కాదు; పర్వతములు, వృక్షములు, చిన్నచిన్న తాళ్లు-సర్వము ప్రవాహవేగమునకు ముక్కలయ్యెను; అనేకప్రకారముల కోలాహలముపుట్టెను; ఆప్రవాహములో మత్స్యములు, తాఁబేళ్లు, సర్పములు మొదలగునవి కలవు; దేవతలుసయితముదానిలోస్నానముఁజేయుదురు; దానిమాహాత్మ్యమును గుర్తెఱిఁగి, సత్పురుషులు దానితటములపై నాశ్రమములఁ గల్పించుకొని, వానిలో నివసించియుండెదరు.

సోరఠా 31, 32

" 'మనస్సును స్తిమితముఁజేసికొని,దానిజలములతోఁ దర్పణముఁజేసినయెడల, మనస్సునకు విశేషానందముకలుగును; దానిం జూచినమాత్రమున పాపములునశించును;' అని మునీశ్వరులు చెప్పుచున్నారు. దేవతలును, సనకాదులును, బ్రహ్మయు మొదలగువారు పరమానంద

ముతో దానిలో స్నానముఁజేయుదురు; దానిజలములను త్రాగినయెడల, సకలపాపములు నశించును; ఇది సర్వజనమతము.

చౌపాయ్ 243

"ఎవరు నిష్ఠతో దానిలో స్నానముఁజేసి, తపమునాచరించెదరో, వారిమహిమను వర్ణింప శక్యముకాదు; రథముపైఁ గూర్చుండి ముందు నడచుచుండినరాజు, పట్టపగలింటి సూర్యునివలె, వెలుఁగుచుండెను. పర్వతములను, సుందరసీమలను దాఁటి గంగ గంతులిడుచు వచ్చుచుండెను; ముందు రాజును, అతనివెనుక గంగయు- ఈప్రకారము వారు వచ్చిరి; హరిద్వారము గొప్పతీర్థము; అచ్చటకువచ్చినతోడనే, గంగ సంతోషముచే నుప్పొంగెను; ఆపుణ్యక్షేత్రముఁ జూచి, గంగ ప్రసన్నురాలయ్యెను. అచ్చటనుండి గంగ ప్రయాగకువచ్చెను; ఆసకలపాపనాశిని యొక్క వేగ మెటులఁ జెప్పఁగలము? అప్రయాగవద్ద దానిలో స్నానముఁజేసినయెడల, సకలదుఃఖములు పోవును; తదనంతరము గంగ కాశి వద్దకు వచ్చెను.

ప్రమాణము:—శ్రుతిః:—

"సితాసితే సరితే యత్రసంగథే తత్రాప్లుతాసో దివ ముత్పతంతి,
యేవైతన్వాం వ్రివిసృజంతిధీరా స్తేజనాసోఽ అమృతత్వంభజంతే."

"ఆకాశీనగరము సర్వశోభస్కరములతో నిండియుండును; సుఖములకు ధామము; శివుని యునికిపట్టు; దానిచక్కదనము మనస్సును హరించును; దానిని వర్ణింపశక్యముకాదు. ఏయేతీర్థములు గలవో, వానివానిగుండ గంగ ప్రవహించెను; వానిని వర్ణింప వశముకాదు. ఓరఘునాథా! ఓరామచంద్రా ! మార్గములో నుండిన మనుజులను పుణ్యాత్ములుగఁజేసి, గంగ ప్రవహించెను.

దోహా 259

"ఓరామా! ఈప్రకారము గంగవచ్చి సముద్రములోఁ గలిసెను; అందుకు సముద్రుఁడు పరమానందభరితుఁడయ్యెను. అనేకవిధముల నతఁడు రాజును నుతించెను. 'ఓరాజా! నీవంటివాఁ డెవఁడు లేడు.

చౌపాయ్ 244

" 'ఇంతవఱకు నెవరు చేయనట్టిపనిని నీవు సాధించితివి; తపోమహిమతో సమానముగు బలముకలది మఱియొకటి లేదు.' అని సము

త్రుఁడు పలికెను. ఆసమయమున సగరునికుమారు లఱువదివేలమందియు తరించిరి; భగీరథునిమనస్సు స్వాస్థ్యముఁబొందెను; రఘుకులమునందు శేషములేకుండ నందఱు తరించిరి; మూఁడుతరములవారును తరించిరి; 'ఓరాజా! నీవంటివారు భూలోకములో లేరు; శాశ్వతముగ నీకీర్తి భూలోకములోనుండును; ఆచంద్రార్కము నీపేరు నిలిచియుండును' అని జనులు పొగడిరి. అప్పుడు దేవతలతోఁగూడి బ్రహ్మ భగీరథునిఁ జూడవచ్చెను; 'ఓరాజా! ముమ్మాటికిని నీవు ధన్యుఁడవు; నీపేరు లోకవిదితమయ్యెను; నీవంటిరాజు పుట్టనేలేదు; నీప్రతిజ్ఞను సాధించితివి; నీమూలమున వేదమును సన్మానించుసజ్జనులు సుఖముఁబొందిరి; గంగాసాగరసంగమమునుగుఱించి యేమని చెప్పుచున్నారు ? ఆసంగమ మనునట్టిసూర్యునిఁ జూచి, పాపము లనునట్టి గుడ్లగూబ కండ్లు మూసికొనును; గంగకు నీమూలమున భాగీరథియని మఱియొకపేరు వచ్చెను; దానిపేరు విన్నంతమాత్రమున, దేవతలకును సిద్ధులకును కీర్తివచ్చును.' అని బ్రహ్మ పలికి దేవతలతోఁగూడి స్వలోకమునకుఁ బోయెను. భగీరథుఁడు కృతకృత్యుఁడయ్యెను. గంగవచ్చినపుడు మార్గములో నుండిన జహ్నుమహర్షి యొక్క యజ్ఞసామగ్రినిఁ బడఁద్రోసెను. అతఁడు కోపించి గంగను పానముఁజేసెను; అప్పుడు రాజు వచ్చి మహర్షిని స్తుతించెను; అంతట జహ్నువు తనతొడలోనుండి గంగను విడిచిపెట్టెను. అప్పటినుండి యామెకు జాహ్నవి యని పేరువచ్చెను.

ఛాంద్ 32

"భగీరథుని మనోభీష్టము సిద్ధించెను; అతఁడు మనస్ఫూర్తిగా గంగను బూజించెను; గంగ ప్రసన్నురాలై, యతనిని దీవించెను; అంతట రాజు సంతోషించుచు స్వగృహమునకువచ్చెను" అని విశ్వామిత్రుఁడు గంగావతరణమునుగుఱించి రామునితోఁ జెప్పెను. అంతట రాముఁడు మునీశ్వరునకు నమస్కరించెను; లక్ష్మణుఁ డతనికి సాష్టాంగదండప్రణామ మొనరించెను; సోదరుల నతఁడు దీవించెను.

దోహా 260, 261

అమృతోపమానమగు విశ్వామిత్రునియాశీర్వాదముఁ గైకొని, రాముఁడు కృతార్థుఁడయ్యెను; డేఁగఁజూచి చిన్నపిట్ట లెగిరిపోయిన విధమున, నతనిసంశయములన్నియు విడిపోయెను. అమృతోపమాన

మగు దీవనలఁబొంది రాముఁడు సంతసించి, "ఓమునినాథా ! శీఘ్రముగా జనకపట్టణమునకుఁబోవుదము" అని రాముఁడు పలికెను.

చౌపాయీ 245

రామనామమువలన సకలసంశయములు విడిపోవును; ఇదియే దేహధారులకుఁ గలిగెడిఫలము.) ఈప్రకారము విశ్వామిత్రుఁడు గంగావతరణమునుగుఱించిన యావత్కథను రామునకు వినిపించెను. ఆనదిలో రామలక్ష్మణులును విశ్వామిత్రుఁడును స్నానముఁజేసి, బ్రాహ్మణులకు దానములనిచ్చిరి; అందఱు సంతోషించి, యచ్చటనుండి వెడలి జనక చక్రవర్తిపట్టణమునకు వచ్చిరి; ఆపట్టణముయొక్క శోభను రామలక్ష్మణులు చూచి పరమానందభరితులయిరి; అనేక వాపీకూపతటాకములు నదులునుఁ గలవు; ఆనదులు అమృతోపమానమగు జలములతో నిండి యుండెను; వానికి రత్నసోపానములతోఁ గట్టఁబడిన రేవులుకలవు; మకరందము నాస్వాదించి తుమ్మెదలు ఝుంకారముఁజేయుచుండెను; అనేకవిధముల చక్కనినానారంగుల పక్షులు శ్రావ్యముగ ధ్వనులఁ జేయుచుండెను; వానిలో రంగురంగులకమలము లుండెను; మంద సుగంధ శీతలవాయువులు వీచెను.

దోహా 262

పురమునకు నలువైపుల నాల్గు పుష్పవాటికలుకలవు; అవి పుష్పములతో నిండియుండెను; వానివెనుకను ఫలవృక్షముల తోటలుకలవు; అవి ఫలములతోనిండి భారముచే, నేలకువ్రాలుచుండెను; వీనికి వెనుకను వనములుకలవు; అవి సుపల్లవములతో శోభించెను.

చౌపాయీ 246

ఆపట్టణముయొక్క శోభను వర్ణింప శక్యముకాదు; దేనినైనను వర్ణించుటకు మనస్సుప్రధానము; ఏస్థలముల నది చూచుటకువెళ్లినను, వానిచక్కదనముఁజూచి, లోభించి, మన స్సచ్చట నిలిచిపోవును కాని మరలివచ్చుటలేదు; ఆనగరములో సమస్తమును విశేషించి మంచివిగఁ గనఁబడును. సొగసైన బజారులును, రంగురంగులమేడలును, రత్నస్థగితమగు గృహములును, బ్రహ్మ స్వయముగా నిర్మించినట్లు కనఁబడును. ధనికులును వణిజులును కుబేరునితోసమానులు; ఎరివస్తువులు వారి వద్దనే నిలిచియుండెను; ధనికులకు వస్తువులులేవు; వణిజులకు ధనమ్ము

లేదు; తమతమవస్తువులను ముందటనిడుకొని, వారు కూర్చుండియుం డిరి. వీథులును నలుచదరపు మట్టములును, సదా శోభాయమానముగ నుండును; పరిమళద్రవ్యము లంతటం జల్లంబడును; మణిమయమంది రము లన్నియు మూర్తీభవించిన మంగళమువలెం గనంబడును; కామ దేవుండు వానిని నిర్మించినట్లు కనంబడును. ఆపురజనులు, స్త్రీపురుషులు, సర్వైశ్వర్యసంపన్నులు; పుణ్యచారిత్రులు; సకలగుణసంపన్నులు; శాం తులు; దాంతులు; ధర్మాత్ములు; జ్ఞానులు; ఆనగరములో నన్నిగృహము లకంటె, జనకచక్రవర్తినగరు మిక్కిలిచక్కగనుండును; దానితో సమా నమగునది లేదు; జనకుని సంపదలం జూచి దేవతలుసయితము నిశ్చేష్టు లయిరి. ఆనగరులోని కోటలను బురుజులను చూచి, చిత్తము భ్రమిం చును; సకలగృహముల చక్కదనముం దీసికొనివచ్చి, దానితో వానిం గట్టినట్లు కనంబడును.

దోహా 263

ఉజ్జ్వలమగు గృహములును, వానిచుట్టు రత్నఖచితమగు సువ ర్ణప్రాకారము, మణిమయ సువర్ణకవాటములతోను సీతాదేవిమంది రము ప్రకాశించెను; ఆమందిరముయొక్క శోభను వర్ణించుట కెవరి వశము ?

చౌపాయ్ 247

వజ్రమయమయిన సింహద్వారములు మహావిశాలముగనుండెను; కవాటములు విపులములు; రాజమందిరద్వారమువద్దను నటులు, మా గధులు, బట్టులు మొదలగువారు గుంపులుగుంపులుగ నిలిచియుండిరి; గజాశ్వశాలలు కలవు; రథగజతురంగము లన్నికాలములలోను సిద్ధ ముగనుండును; మంత్రులు, ప్రధానులు, యోధులు, సేనాపతులు మొదలగు రాజసన్మానులగృహములు రాజమందిరముతో సమానముగ నుండెను పట్టణమునకు వెలుపల, 'తాల' నదీతీరమున, నచ్చటచ్చట, విడుదులలో ననేకరాజులు దిగియుండిరి; విశ్రామదాయకమును శోభా యమానము నగు నొకసుందరమయినతోటను విశ్వామిత్రుండు చూచి, "ఓరామా ! ఈస్థలము నామనస్సున కింపుగనున్నది; కనుక, నిచ్చట మనము విడిదిం జేసియుండెదము" అని పలికెను. రాముండును ముని

లందఱును సమ్మతించిరి; వారందఱు నచ్చట స్థిరముగ నుండిరి; విశ్వామిత్రుని యాగమనమును జనకచక్రవర్తి వినెను.

దోహా 264

ప్రధానమంత్రులను, మహాయోధులను, బ్రాహ్మణప్రముఖులను, జనకుఁడు వెంటఁదీసికొని, విశ్వామిత్రుని సందర్శించుటకు వెడలెను.

చౌపాయ్ 248

జనకుఁడు విశ్వామిత్రుని పాదములపైఁబడి, సాష్టాంగముగ నమస్కరించెను; విశ్వామిత్రుఁడు సంతోషించి, రాజును మనస్ఫూర్తిగ దీవించెను. తదితరమునులకును బ్రాహ్మణులకును రాజు నమస్కరించెను; రాజు తనభాగ్యమును గొనియాడుకొని, ధన్యుఁడనైతి నని సంతసించెను; విశ్వామిత్రుఁడు రాజుయొక్క క్షేమసమాచారముఁ దెలిసికొని, యతనిఁ గూర్చుండనియోగించెను అంతకుఁబూర్వము రామలక్ష్మణులు పువ్వులతోటలఁ జూడఁబోయియుండిరి; ఇంతలో వారిరువురును వచ్చిరి; రాముఁడు ఘనశ్యాముఁడు; లక్ష్మణుఁడు గౌరవర్ణముకలవాఁడు; కేవలము వారికి పిన్నవయసు; మిక్కిలి గారాబుబిడ్డలు; వారిదేహములు కోమలములు; వారినేత్రములఁ జూచిన, సుఖముకలుగును; వారిరూపములు సంసారుల మనస్సులను భ్రమింపఁజేయును; రామలక్ష్మణులు వచ్చినతోడనే, వారందఱు దిగ్గునలేచిరి; రాముని చేరఁదీసి, విశ్వామిత్రుఁడు తనప్రక్కనఁ గూర్చుండఁబెట్టుకొనెను. ఆ అన్నదమ్ములను వారు చూచి పరమానందభరితులయిరి; వారినేత్రములనుండి ఆనందబాష్పములు వఱదలైకాఱెను; వారిశరీరములు పులకరించెను; శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁజూచి జనకుఁడు పరవశుఁడయ్యెను; అతనికి విదేహుఁ డని పేరుకలదు; ఆతఁడుసార్థకనాముఁడయ్యెను; అతఁ డెంతవైరాగ్యముగలవాఁడైనను, రామునిఁజూచి, ప్రేమలో మునిఁగిపోయెను.

దోహా 265

జనకునిమనస్సు ప్రేమలో మునిఁగిపోయెను; అంతట నతఁడు తెలివిఁదెచ్చుకొని స్థైర్యము నవలంబించి, మునీశ్వరునిపాదములకు మ్రొక్కి, మృదుమధురవచనములతో నిట్లు ప్రసంగించెను.

చౌపాయ్ 249

"ఓమునినాథా! ఈబాలకు లెవరు? మునికులతిలకములా? లేక, రాజవంశస్థులా వేదములో 'నా-ఇతి, నా-ఇతి' అని బ్రహ్మ చెప్పియుండెను; ఆ 'నా-ఇతి =నేతి' యనునట్టిపురుషుఁడే యీరెండురూపములను ధరించివచ్చెనా? స్వాభావికముగ నామనస్సు చలింపదు; అట్టినామనస్సు వీరింజూచి చలించెను! చంద్రునిఁజూచిన చకోరములువలె, నామనస్సు భ్రమించెను; ఓస్వామీ! నన్నుఁ గటాక్షించి, రహస్యముఁజేయక, వారిరువు రెవరో నాతోఁ జెప్పుఁడు- వారిం జూచినమాత్రమున, వారియందు నా కనురాగము పుట్టుచున్నది; బ్రహ్మాధ్యానమునువిడిచి, నామనస్సు వారిపైఁ దిరుగుచున్నది" అని జనకుఁడు ప్రశంసించెను; జనకునివచనములను విశ్వామిత్రుఁడు విని మందహాసముఁజేసి, "ఓరాజా! నీవుచెప్పినమాట సత్యము; జనసమ్మతమగు పలుకులను పలికియుంటివి; నీమాటకు విరుద్ధములేదు; సమస్తప్రాణులకును రాముఁడు ప్రియుఁడు" అని పలికినపలుకులను రామమూర్తి విని, మందహాసముఁ జేసెను; (ఎందుకు రాముఁడు నవ్వెను? జనకునిప్రశ్నకును, విశ్వామిత్రుని ప్రత్యుత్తరమునకు నతఁడు నవ్వెను). "ఓరాజా! వీరు రఘుకులమణులు; దశరథునికుమారులు; నానిమిత్తము వారిని నావెంటను రాజు పంపించెను.

దోహా 266

"వీరు రామలక్ష్మణులు; అన్నదమ్ములు. వారిరువురును రూపబలశీలలావణ్యములకుఁ బెన్నిధానములు; వారనేకరాక్షసులను సంహరించి, నాయజ్ఞమును సంరక్షించిరి; ఈవృత్తాంతమంతయు నందఱకుఁ దెలియును;" అని ముని చెప్పెను.

చౌపాయ్ 250

"ఓమునిరాజా! నాపూర్వపుణ్యముఁ జెప్పలేను. దానిమూలమున మిమ్ములను దర్శించితిని; ఈరాజకుమారులు, ఈపీతకౌశేయవాసులు, ఈఘనశ్యాములు, ఈయన్నదమ్ములు, ఆనందమున కానందము నిచ్చుచుండిరి; వారి యన్యోన్యానురాగము నిర్మలము; దానిని మాటలతోఁ జెప్పుటకు శక్యముకాదు; వారు మనోరంజకులు ఓమునిరాజా; నా

మాటవినుఁడు;" అని జనకుఁడు పరమానందభరితుఁడై, "ఓస్వామీ! జీవాత్మ పరమాత్మలువలెఁ బ్రకాశించుచుండిరి" అని జనకుఁడు చెప్పెను; మాటికిమాటికి నతఁడు రాముని జూచుచుండెను; అతనిశరీరము పులకరించెను; అతని మనస్సు పరమోత్సాహముతో నిండెను; అనేక విధముల నతఁడు మునీశ్వరుని సత్కరించి, యతనికి నమస్కరించెను; రామలక్ష్మణులను, మునీశ్వరులను, విశ్వామిత్రుని వెంటఁదీసికొని, రాజు నగరములోఁ బ్రవేశించెను అన్నికాలములలోను,అన్నిసమయములలోను, చల్లగనుండునట్టి మందిరముల నతఁడు వారి కిచ్చి వారిని వానిలోఁ బ్రవేశపెట్టెను; రాజు వారిని సత్కరించి, కొంతవఱకు సేవించి, తదుపరి వారిసెలవుఁ గైకొని, రజమందిరమునకు వచ్చెను.

దోహా 267

రాముఁడును మునులును భోజనముఁజేసి కొంత విశ్రమించిరి; తదుపరి, రాముఁడు లక్ష్మణునివద్దకు వచ్చి కూర్చుండెను; అప్పటికి సూర్యాస్తమానమున కొకయామము వ్యవధియుండెను.

ఇతి శ్రీగోస్వామితులసీకృత శ్రీరామచరిత్రమానసే,
సకలకలికలుష విధ్వంసనే, బాలకాండాంతర్గత
పండితజ్వాలాప్రసాదకృత వ్యాఖ్యానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
పంచమో విశ్రామః.

---

# బాలకాండ షష్ఠమ విశ్రామః



చౌపాయ్ 251

జనకపట్టణముఁ గలయఁజూచి వచ్చుటకు లక్ష్మణునకుఁ గోరిక పుట్టెను. (రఘునాథునకు సయితము కోరికపుట్టెను; కాని, లక్ష్మణునకు విశేషముగనుండెను. జనకపట్టణముఁ జూడవలెనని రామునకు సాధారణముగను, లక్ష్మణునకు విశేషముగను జూడవలెననియుండెను; లేదా, లక్ష్మణున కవశ్యము చూడవలెననియుండెను). కాని, రామునకు భయపడియు, మునీశ్వరునియందుఁ గల గౌరవముచేత, నతఁడు మాటలాడక, తనలోఁ దాను నవ్వుచుండెను. శ్రీరాముఁడు లక్ష్మణుని మనోభీష్టమును తెలిసికొనెను; భక్తులఁ గటాక్షించి, వారికోరికలను సఫలముఁ జేయుటకు శ్రీరాముఁడు సిద్ధపడెను. భక్తులవెంబడించి, వెళ్లుట కతఁడు మనస్సులో నుబ్బుచుండెను—లేక, మిథిలాపురజను లనునట్టి లేఁగదూడలు త్రాళ్లచేఁ గట్టఁబడియుండిరి; రఘునాథుని దర్శనామృతమును వారు కోరుచుండిరి; కనుక, వారికిఁ దృప్తిఁ గలుగఁజేయుటకు రాముఁడు కోరుచుండెను). శ్రీరామమూర్తి చిఱునవ్వునవ్వి, వినయవిధేయతలతో నిట్లు గురువుతోఁ బలికెను. "ఓస్వామీ! జనకునిపట్టణముఁ జూడవలెనని లక్ష్మణున కభిలాషకలదు. మీరు పెద్దలుగనుక, నతఁడు శంకించి, మిమ్ములను ముఖస్థముగ నడుగుటకు భయపడుచుండెను. మీ రాజ్ఞ దయచేసినయెడల, నగరముఁజూచి, శీఘ్రముగామఱలివచ్చెదము" అని రాముఁడు ప్రార్థించెను. "ఓరామా! నీవు నీతిమార్గమునఁ దప్ప, మఱియొకమార్గమున నేల సంచరించెదవు? నీవు ధర్మమార్గములఁ బరిపాలించువాఁడవు; భక్తులప్రేమకు వశ్యుఁడవై, వారికి సుఖములనిచ్చెదవు; నీవు ధర్మమునకు సేతువువంటివాఁడవు.

దోహా 268

"ఓ సకలసుఖధాములారా! ఓసోదరులారా! నగరమంతయుఁ గలయఁజూచి రండు; మీ దివ్యమంగళవిగ్రహముల నందఱకుఁజూపి, వారినేత్రములను సఫలముఁజేయుఁడు." అని యతఁడు చెప్పెను.

(జాయ-దేఖి-అవహా-నగర, సుఖనిధాన దోఉ-భాఇ,
కరహు-సఫల-సబకే-నయన, సుందర, వదన దిఖాఇ.

'జాయ' శబ్దమువలన వియోగము ప్రాప్తించును; 'నగర' శబ్దము వలన వియోగదుఃఖము పోవును; 'అవహు' శబ్దమువలన సంయోగము కలుగును; 'నగర' శబ్దమువలన సంతోషము కలుగును; 'సుఖనిధాన' అని చెప్పుటవలన నాశయమేమి?

"మీరు నన్ను విడిచి వెళ్లినయెడల నాకు దుఃఖము కలుగును. కనుక శీఘ్రముగరండు; రెండవయర్థ మేమనిన, మీసుఖములకు సిధానములగు జానకియు, ఊర్మిళయు నగరములోఁ గలరు; మూఁడవయర్థ మేమనిన, శివునివిల్లును ముందుకు విఱిచి, మీరుభయు లానగరమునకు సుఖనిధానములు కాగలరు; 'దోఉ' అని చెప్పుటకుఁ గారణమేమి? 'నేను నగరముఁ జూచియుంటిని కనుక, మీ రుభయులే వెళ్లి, చూచి రండు. మీమీసుందరముఖములను నగరవాసులకుఁ జూపి, వారినేత్రములను సఫలముఁజేయుఁడు; అనేకరాజులముఖములను వారు చూచిరి; కాని, వారినేత్రములు సఫలము కాలేదు; కనుక, మీరు శివునివిల్లును విఱిచి, మీముఖములను వారికిఁజూపి, వారినేత్రములను సఫలముఁజేయుఁడు).

చౌపాయ్ 252

మునీశ్వరుని చరణకమలములకు నమస్కరించి, జనకపురజనుల నేత్రములకు సుఖము నిచ్చుటకు రామలక్ష్మణులు బయలువెడలిరి; కలకల లాడుచుండిన శ్రీరాముని ముఖారవిందమును జనకపురబాలకులు చూచి, గుంపులుగుంపులు కూడి, యతనిని వెంబడించిరి; ఆరాముని నేత్రముల చక్కదనముఁ జూచి, వారు లోభించిరి; అతని ముద్దు పలుకులను విని, వారిమనస్సు భ్రమించెను. పీతాంబరములను వారు ధరించిరి; వారి కటిప్రదేశము బిగువుగఁ గట్టఁబడియుండెను; వారిచేతిలో ధనుర్బాణములు శోభించెను. (శృంగారరసమునువర్ణించినపుడు శిరస్సునుండియు, శాంతకరుణారసములను పాదములనుండియు, యారంభించెదరు; ఇచ్చట, వీరరసము ప్రధానము; కనుక, నా రెండు విడిచిపెట్టి, కటిప్రదేశము మొదలుకొని శిరముపఱకును వర్ణింపఁబడెను.) ఒకరికొకరు జో

డుగనుండిరి; రామునిశరీరము శ్యామలము; లక్ష్మణునిశరీరము గౌరవర్ణము; వారిలలాటమున చందనతిలకము శోభించెను; వారిశరీరములం జక్కదన మెంతచూచినను, తనివితీరదు; వారినడుములు, సింహము నడుమువలె, నతిసూక్ష్మములు; వారి బాహువులు దీర్ఘములు; నాగమణిమాలలు వారికంఠములనుండి వ్రేలుచుండెను; వారిచెవులు శ్రీకారములు; వారినేత్రములు వికసించినకమలములు! వారిముఖము రాకాచంద్రబింబము; వారిరూపములు తాపత్రయములం బోఁగొట్టును; వారిచెవులకు సువర్ణపుష్పకుండలములు కలవు; వారు చూపఱులచిత్తముల నపహరించిరి; వారిలలాటమునం దుండినతిలకరేఖ, శోభరాశికిం బుట్టినిల్లువలె నుండెను. వారిరూపములు మనోహరములు; వారికనుబొమలు వంపఁబడినవిల్లువలె నుండెను. వారిలలాటమున నుండినతిలకమే శృంగారము యొక్కముద్ర.

దోహా 269

వారు చక్కని 'టోపీ'ని శిరస్సున ధరించిరి. వారిచక్కని నల్లని శిరోజములు, యుంగరములవలె నుండెను నఖశిఖపర్యంతము వారు ముద్దులు మూటగట్టుచుండిరి! లోకములోని సౌందర్యమంతయు మూర్తీభవించినట్లు కనఁబడును; వారియంగముల సౌష్ఠవము దిద్దినట్లుండెను; సకలావయవసౌష్ఠవముండినపుడు, శోభ పూర్ణముగనుండునుకదా?

చౌపాయ్ 253

రాజకుమారు లిరువురు నగరముఁజూచుటకు వచ్చుచుండిరని పురజనులు తెలిసికొని, గృహములను, చేతిలోనిపనులను విడిచిపెట్టి, బయటకువచ్చి నిలిచియుండిరి; నవనిధులఁ జూచి దరిద్రుఁడు పఱుఁగెత్తి వచ్చినవిధమున, వారు రామలక్ష్మణులవెనుక పఱుగెత్తిరి; (జనకరాజు యోగి; అతనిజనులు దరిద్రులు; రఘువంశపురాజు భోగి; అతనిజనులు ధనికులు; ఒకఁడుయోగి; మఱియొకఁడు భక్తుఁడు; యోగివద్ద మాయ కలదు;భక్తునివద్ద భగవంతుఁడు కలఁడు). స్వతస్సిద్ధముగ రామలక్ష్మణులు చక్కనివారు; వారిని నగరజనులు నేత్రోత్సవముగఁ జూచి పరమానందభరితులయిరి; రఘునాథునిచక్కదనిమును యువతులు విని, యతనిఁ జూడఁగోరుచుండిరి; వారికి రామునియం దనురాగముపుట్టెను; అత

డు సమీపమునకు వచ్చెనని వినినందున, వారియనురాగ మధికమయ్యె ను; వారు మేడల నెక్కి, గవాక్షములగుండ రాముని జూచినను, వారికిఁ దనివితీరలేదు. ఆయువతులు గుంపులుగుంపులుకూడి, నిలువుగ్రుడ్లు పెట్టుకొని రాముని వీక్షించిరి. వారియనురాగ మధికమగుకొలఁది వారిలోవారు గుసగుసలాడుచుండిరి; "ఓసఖీ; రాముఁ డెంత చక్కనివాఁ డమ్మా! కోటిమన్మథులయిన నతనితో సమానముకారు: (వారిలోవారు అని చెప్పుటకుఁ గారణ మేమనిన:—పలుకుచుండినవారును, వినుచుండినవారు నందఱు భ్రమించిరి; వారికి రామునియం దనురాగము సమానముగఁ గలిగెను; వారిలో నెవరికిని జ్ఞానములేదు; అతని రూపురేఖా విలాసములఁ జూచి, వారందఱు భ్రమించిరి; వారిలో నెవరికిని జ్ఞానములేదు. ... ... ... ... ...

ఓసఖీ! దేవతలుగాని, మనుజులుగాని, రాక్షసులుగాని, నాగులుగాని, మునులుగాని; అతనిచక్కదనమువంటి చక్కదనమును చూచియుండరు; వినియుండరు; ఓసఖీ! విష్ణువునకు నాలుగుభుజములు, బ్రహ్మకు నాలుగుముఖములు, జోగివేషముగల శివునకుఁ బంచముఖములు, ఇట్టిదోషములు వీరికిఁ గలవు; ఇఁకను దేవతలలోమాత్ర మెవరు చక్కదనములో నితనితో సమానులు?

దోహా 270

"పిన్నవయస్సు; సౌందర్యమునకు రాసులు: ఒకరు శ్యామలము; మఱియొకరు గౌరవర్ణము, వారింజూచిన, సుఖముకలుగును; వారి ప్రతియవయవమునందు నూరుకోట్ల మన్మథులను తిరస్కారముఁ జేయవలెను.

చౌపాయ్ 254

"ఓసఖీ! చెప్పుము; ఈదివ్యమంగళవిగ్రహముఁజూచి, రెండు కన్నులుగల శరీరధారి యెవఁడు మోహింపఁడు? (దీనిమూలమునఁ బలుకుచుండిన స్త్రీ మోహించెనని తెలియును)" "ఓసఖీ! నేను వినిన మాటలను జెప్పుచున్నాను; వినుము; వారిరువురు దశరథమహారాజుని కుమారులు; వీరు జోడుకలహంసలు! వీరు విశ్వామిత్రునియజ్ఞమును సంరక్షించిరి; అజేయులగు రాక్షసులను సంహరించిరి. ఆశ్యామలశ

రము వాఁడు, ఆచక్కని కమలనేత్రుఁడే, మారీచ సుబాహువులను మర్దిం చెను? ఆసుఖధాముఁడే, కౌసల్యాపుత్రుఁడు; అతనిపేరు శ్రీరాముఁడు; అతఁడే ధనుర్బాణములను ధరించియుండెను: ఇకను ఆగౌరవర్ణము వాఁడు, ఆపిన్నవయస్సువాఁడు, ఆచక్కనిరూపమువాఁడు, ధనుర్బాణ ములను ధరించి రాముని వెనుక నడచుచుండినవాఁడే, లక్ష్మణుఁడు; వాఁడు రాముని చిన్నతమ్ముఁడు; సుమిత్రకుమారుఁడు.

దోహా 271

"విశ్వామిత్రుని యజ్ఞమును, రక్షించి, మార్గములో మునిపత్ని, అహల్య నుద్ధరించి, వారు ధనుర్యజ్ఞముఁ జూచుట కిచ్చటకు వచ్చిరి." అని మఱియొకయువతి పలికినపలుకులను తదితరయువతులు విని, పర మానందభరితులయిరి! (స్త్రీలు సంతోషించుటవలనఁ బ్రయోజనమేమి? స్త్రీలకు శ్రీరాముఁ డుపకారముఁజేయును; విశ్వామిత్రుని బ్రహ్మర్షి యనుయజ్ఞమును రక్షించి, మునిపత్నిని రాముఁ డుద్ధరించెను; ఇఁకను, ముందు ధనుర్యజ్ఞముయొక్క ప్రతిజ్ఞను పరిపాలించి, ఆప్రతిజ్ఞకు నిమి త్తమగు జానకిని సంగ్రహించుట కతఁడు వచ్చెను. జనకుని నగరము లోఁ బుట్టి, అయోధ్యానగరములోఁ గాపురముఁజేయుచుండిన స్త్రీ, యీమాటలఁ జెప్పెను.)

చౌపాయ్ 255

ఒకయువతి రాముని చక్కదనముఁ జూచి, "ఓసఖీ! ఇతఁడు మన జానకికిఁ దగినవరుఁడుసుమీ! ఇతనిని మనరాజు చూచినయెడలఁ దన ప్రతిజ్ఞనైన విడిచి, జానకిని రామున కిచ్చి వివాహముఁజేయును" (ధర్మ హానికి సయిత మొప్పుకొని, రాజు వివాహముఁజేయును.) అని చెప్పె ను. అమాటలను మఱియొకపడుచు విని, "ఓనేస్తమా! వారెవరో రాజుకుఁ దెలియును; మునీశ్వరునితోఁగూడ వారిని రాజు గారవించి యాదరించెను; కాని, రాజుమాత్రము తనప్రతిజ్ఞను విడిచిపెట్టలేదు; అతఁడు విధికి వశ్యుఁడై, యజ్ఞానములోఁ గొట్టుకొనుచుండెను." అని చెప్పి విచారించెను. మూఁడవయువతి, యామాటలను విని, "ఓసఖీ! విధాతయేమంచివాఁడై, యెవరికిఁ దగినఫలమును వారి కిచ్చినయెడల, నితఁడే మనజానకికిఁ దగినవరుఁడు; ఓనేస్తమా! ఇందుకు సందేహము

లేదు. విధివశమున జానకీరాములకే వివాహమయిన యెడల, మనమంద అము ధన్యులము; మనము కృతకృత్యులము; ఓనేస్తమా! జానకీరాములకు వివాహ మయినయెడల, మననగరమున కతఁడు వచ్చుచుఁ బోవుచుండును; అందుమూలమున నతనిని మనము చూడవచ్చును; ఈయాశ చేత, జానకీరాములకు వివాహము కావలెనని, యెక్కువ కోరికయున్నది.

దోహా 272

"ఓసఖీ! అట్లు వారిరువురకు వివాహము కానియెడల, సత్యముఁ జెప్పుచున్నాను, నతనిదర్శనము నాకు లభింపదు; ఎంతో పూర్వపుణ్యముండినగాని, వా రిరువురసంఘటనము సంభవింపదు; మనకు వారిదర్శనము కలుగదు." అని విచారించి పలికెను.

చౌపాయ్ 256

మఱియొకయువతి లేచి నిలువఁబడి, "ఓనేస్తమా! ఈవివాహము సర్వజనసమ్మతము; అందఱు హర్షించెదరు; ఇది నిజము" అని చెప్పెను. "ఓసఖీ! శివునివిల్లుఁ జూచిన కఠినము? వీరిం జూచిన, గారాబుబిడ్డలు! ఇది కొంచెమయినను యుక్తముగ లేదు" ఇది యేలాగుజరుగును అని యొకయువతి సందేహించెను. "ఓసఖీ! ఇచ్చట ద్వైతము వచ్చెను; శ్రీరాముని మెడలో, జయమాలను వేయుటకు సీత కోరినను, జనకునిప్రతిజ్ఞవలన, నామె యట్లుచేయుటకు శంకించెను; రామునకు సీతనిచ్చి, వివాహముఁజేయుటకు జనకుఁడు కోరినను, యతనిప్రతిజ్ఞ కతఁడు లోఁబడుచుండెను. రాముఁడు కోమలుఁడు; కనుక, ధనుస్సును విఱువలేడని చెప్పుట భావ్యముకాదు; అతఁడు దానిని విఱిచినను సరే; లేకపోయినను సరేగాని, యొకమాట సత్యము.

"ఓసఖీ! చూచుటకు వీరు బాలులయినను, వీరు మహాబల పరాక్రమసంపన్నులని, పరు లనేక పర్యాయములు చెప్పుకొనుచుండ, వినియుంటిని. ఈరాముని పాదధూళి సోకినమాత్రమున; నెంతోపాపాత్మురాలగు మునిపత్ని తరించెను; ఈరాముఁడు శివునివిల్లు విరిచినగాని విరమించఁడు; మీ రెన్నిసమాధానములఁ జెప్పినను, నాకుమాత్ర మీనమ్మకము పోదు. జానకిని బ్రహ్మ పుట్టించినపుడు, లెస్సగ విచారించి యామెకుఁ దగినవరునిఁ బుట్టించెను; ఈశ్యామలవర్ణముగల

రాముఁడే మనజానకికిఁ దగినవరునిగ నియమించెను” అని యొకయువతి సమాధానముఁ జెప్పెను. ఆమెమాటలను వారందఱు విని సంతోషించి, మృదుమధురవాక్యములతో “నీమాటప్రకారమే జరుగును గాక” అని వారు పలికిరి.

దోహా 273

ఆయువతులు సంతోషముచే సుప్పొంగుచు, రామలక్ష్మణులపైఁ బుష్పములను వర్షించిరి; (కారణమేమి? కోమలమగు రాముని చరణకమలములు కఠిననేలను సహింపవు; లేక పుష్పవర్షము శుభమునుకలిగించును; సఫలమగును; లేక, పుష్పములను వర్షించినయెడల, నతఁడు తలయెత్తి మీఁదికిఁజూచును; ఈమూలమున, నతఁడు వారిం గటాక్షించి చూచునని యువతులయభిప్రాయము; లేక, 'నామనస్సు రఘునాథునిమీఁదఁ బ్రసరించెను; కనుక, నేను పుష్పములను వర్షించెదను; అతని కోమలముఖమునకు నాపుష్పములు కఠినముగనుండునేమో? పుష్పములను వర్షించుట నాయిష్టము; అతని కీపుష్పములు కఠినముగ నుండిన, నుండనిమ్ము పుష్పములను వర్షించి, మార్గమును మెత్తగజేయుదానను; ఆమెత్తనిమార్గమున, నతఁడు సంచరింపవచ్చును' అని సుముఖియనునట్టియువిద తనలోఁ దాను చింతించెను. తదుపరి, సులోచనయనుపడుచుఁ దనలో నిట్లు విచారించెను! ఆస్త్రీలు శ్రీరాముని నఖశిఖపర్యంతముఁ దేఱి చూచిరి.) ఎచ్చటెచ్చటకు రామలక్ష్మణులు నడచివచ్చిరో, మనుజు లచ్చటచ్చటివారు పరమానందభరితులయిరి; (ఆరామలక్ష్మణులే పరమానందస్వరూపులని వారు తెలిసికొనిరి; జానకీదేవి ప్రభావమువలన, వా రిరువురు సంచరించినమార్గములలో నుండినవారు పరమానందభరితులయిరి; లేక, పరమహంసయగు పరమానందయోగి యొకఁడు జనకుని పట్టణములోఁ గలఁడు; అతఁడు రామునిచే జయింపఁబడెను. జనులు రామలక్ష్మణులఁ జూచి, భ్రమించి, వా రిరువురవెనుకఁ బోవుచుండిరి; వేయేల; స్త్రీలయవస్థ యిట్లుండెను.

దోహా

అనవ్యాహీ సంశయ కరై వ్యాహీ లేత ఉసాంస,
గౌ నేలే మానే రహీం దేఖరామ మృదుహాస.

చౌపాయ్ 257

నగరము యొక్క తూర్పుదిశకు రామలక్ష్మణులు వచ్చిరి; ధనుర్యజ్ఞరంగస్థల మచ్చటఁ గట్టఁబడియుండెను; అది విశాలముగ నిర్మింపఁబడెను; ఆస్థలము రత్నస్థగితమయి శోభించెను; రజతమయమగు వేదికామండపము విశాలముగనుండెను. ఆవేదికకు నలువైపుల నున్నతాసనములు నిర్మింపఁబడెను; వానిపై రాజులు కూర్చుండి వినోదములఁ జూచెదరు; వానికివెనుకను, సమీపమున మండలాకారమున, మఱికొన్ని యున్నతాసనములు నిర్మింపఁబడెను; వీనిని రంగురంగులుగఁ గట్టిరి; మొదటివానికంటె నివి కొంచె మున్నతముగనుండును; ఈయాసనములు పురజనులనిమిత్తము రచింపబడెను. ఈరెండవవాని వెనుక, రంగురంగులతోఁ గొన్నియాసనములు నిర్మింపఁబడెను; పురస్త్రీలు, వారివారి కులాచారముల ననుసరించి, వానిపైఁ గూర్చుండి, చిత్రములఁ జూచెదరు; నగరములోని బాలులు రామలక్ష్మణులతోఁ గూడి నడచి, వారికి రంగస్థలము యొక్క చిత్రములఁ జూపించుచుండిరి; అత్యాదరణతో వారు వారిరువురను వివిధప్రదేశములకుఁ దీసికొనివెళ్లిరి.

దోహ 274

రామలక్ష్మణులు శరీరములఁదట్టుచు, వారికి నగరములోని చోద్యములను వారు చూపించిరి; వారిశరీరములను దట్టినందున, బాలుర శరీరములు పులకరించెను. వా రిరువురంజూచి, వారు పరమానందభరితులయిరి.

చౌపాయ్ 258

బాలురయాదరణఁ జూచి, రాముఁడు సంతోషించి, వారి ననేకసంగతుల నడిగెను; ఆబాలురు వారివారిగృహములఁ జూపించి, వారిగృహములకు వారిరువురను తీసికొనివెళ్లిరి; ఆవిచిత్రమగు నిర్మాణమును శ్రీరాముఁడు లక్ష్మణునకుఁ జూపించి, మృదుమధురవచనములతో ననేకవిధములఁ బ్రసంగించెను. ఓపార్వతీ! ఒకనిమిషములో నర్ధభాగము పూర్తికాకమునుపే, ఆపరమేశ్వరుని యాజ్ఞాప్రకారము మాయ బ్రహ్మాండములను చిత్రవిచిత్రముగ సృజించునుకదా! భక్తులయందుఁ గలదయచేత, నాపరమేశ్వరుఁడగు రాముఁడు, మనుజునివలె, రంగస్థలము

యొక్క చిత్రముల నబ్బురముతోఁ జూచెను. ఈచిత్రములఁ జూచుటలోఁ గాల మతిక్రమించెనని రాముఁడు తెలిసికొని, భయపడి, గురువు వద్దకు వెళ్లెను; ఎవనిభయమునకు భయముసయితము భయపడునో, అతఁడు భక్తులం జూచిభయపడును. (భక్తుల భక్తిప్రభావ మిట్టిదికదా!) తియ్యనిమాటలను మృదువుగ బాలురకుఁ జెప్పి, రామలక్ష్మణులు వారి సెలవుఁ గైకొనిరి; కాని, బాలురకుమాత్రము వారిని విడిచిపెట్టివెళ్లుట కిష్టములేదు: వారు మూల్గుచు వారివారిగృహములకు వెళ్లిరి.

దోహా 275

నగరములో విలంబముఁ జేసినందులకు భయము; బాలురకనుక ప్రేమ; పిన్నవయస్సువారుగనుక, గురువుయెడల నమ్రత; గురువును విడిచి నగరముఁ జూచుటకు వెళ్లినందున, సంకోచము; ఇవియన్నియు ముప్పిరిఁగొన, వారిరువురు వచ్చి, గురువుచరణములకు నమస్కరించి, యతనియాజ్ఞాప్రకార మతనివద్దఁ గూర్చుండిరి.

చౌపాయ్ 259

అంతట సాయంసమయ మయ్యెను; చీకటిపడుచుండెను; ముని యాజ్ఞాప్రకారము వారు సాయంసంధ్యను వార్చిరి; పురాణశ్రవణములో రెండుయామములరాత్రి గడచెను. (మునీశ్వరుఁడు చెప్పిన పురాణకథలలో శాంతరసము ప్రధానము; జనకునిపట్టణము యొక్క శృంగారరసముతో రామునిమనస్సు నిండియుండెను; అందుచేత, మునీశ్వరుఁడు చెప్పినకథలు ప్రాచీనములని రామునకుఁ దోచెను శేషించిన రాత్రి నెట్లు రాముఁడుగడపెను? మిథిలాపురమును తలంచుచు, రాముఁడు శేషించినరాత్రి కాలమును గడపెను; ప్రాతఃకాలమున గౌరీ పూజనిమిత్తము రాజకుమారి, జానకి, వచ్చునని, బాలురవలన రాముఁడు నగరములో వినియుండెను; శేషించిన రెండుయామములరాత్రి రామునకుఁ గష్టమనితోచెను; కనుకనే, మొదటి రెండుయామముల నతఁడు పురాణకథలను వినుచు, సుఖముగ గడపెను.) అంతట, విశ్వామిత్రుఁడు శయనించెను. రామలక్ష్మణు లతనిపాదములఁ బట్టుచుండిరి. (అతనిపాదములం బట్టుటకుఁ గారణమేమి? 1 గురువుసన్నిధానమును విడిచి, నగరములో విలంబముఁజేసినందుకు క్షమాపణ; (2) పురాణ

కథల నతఁడు చెప్పినపుడు, సావధానముగ వినియుండనందుకు (క్షమాపణ) ఏపరమేశ్వరుని చరణకమలములను సేవించుటకు యోగులును వైరాగులును జపములును తపముల నాచరించెదరో, అట్టిపరమేశ్వరుఁడే, గురుచరణములఁ బట్టుచుండెను. భక్తిశ్రద్ధలతో వారు గురువును సేవించుచుండిరి; మాటిమాటికిని మునీశ్వరుఁడు సేవను జాలింపుమని చెప్పెను. అప్పుడు శ్రీరామమూర్తి వెళ్లి శయనించెను. (మూఁడువిషయములలో నొకపర్యాయము చెప్పినమాత్రమున, గురువాజ్ఞను మన్నింపరాదు (1) సేవ (2) దాన(3)భోజనము.) తదుపరి, లక్ష్మణస్వామి రామచంద్రునిపాదములఁ బట్టుచుండెను; లక్ష్మణస్వామి పాదములఁ బట్టుచుండ, రామునకు భయమును ప్రేమయుఁ గలిగెను; లక్ష్మణునిచేతులు కఠినములు; రామునిపాదములు కోమలములు; అకఠినమగుచేతులతో నతఁడు కోమలమగుపాదముల బట్టుచుండ, నిదురకు భంగము కలుగునని రాముఁడు భయపడెను; పాదములఁ బట్టువాఁడు లక్ష్మణుఁడు కదా యని తెలిసికొని, రామునకు దయకలిగెను; "ఓతమ్ముఁడా! ఓనాయనా! ఇఁక నీవు శయనింపుము" అని మఱలమఱల రాముఁడు చెప్పెను. శ్రీరాముని చరణకమలములను హృదయములో నిడుకొని, లక్ష్మణుఁడు విశ్రమించెను.

దోహా 276

(ప్రభుపును సేవకుఁడును శయనించువిధముఁ జెప్పఁబడెను.) చిట్టచివఱకు లక్ష్మణుఁడు శయ్యమీఁద విశ్రమించెను; కాని, నిద్రించలేదు; ఏపాటిశబ్దమయినను, లక్ష్మణుఁడు తెలిసికొనుచుండెను; తొలికుక్కుటధ్వని వినఁబడినవెంటనే, లక్ష్మణుఁడు లేచెను; గురువునకుముందు, రాముఁడు మేల్కాంచెను.

చౌపాయీ 260

శ్రీరామలక్ష్మణులు స్నానసంధ్యాద్యనుష్ఠానముల నిర్వర్తించి, గురుచరణములకు నమస్కరించిరి; గురువాజ్ఞఁబొంది, వారిపూజనిమిత్తము పువ్వులఁ దీసికొనివచ్చుటకు, వారిరువురు బయలువెడలిరి.

భూప బాగ వర దేఖేఉ జాఈ జహఁ వసంత ఋతు రహీ లుభాఈ,
లాగే విటప మనోహర నానా వరణ వరణ వర వేలి వితానా.

జనకచక్రవర్తియొక్క శ్రేష్ఠముగుపుష్పవాటికకు వారిరువురు వెళ్లి, దానిం జూచిరి; (లేక, దేవతలపుష్పవాటికల కిది రాజువంటిది; లేక, భూపతులలో శ్రేష్ఠుఁడగు జనకుని పుష్పవాటిక; ఎందుచేతజన కుఁడు భూపతులలో శ్రేష్ఠుఁడు ? నిజముగ నతఁడు భూదేవికిఁ బతి కనుక, నామెగర్భమునఁ బుట్టిన జానకిని, యామె జనకున కిచ్చెను) వసంతఋతువు మానముఁ గప్పికొనక, నావాటికలోఁ బడియుండెను. ఆవాటికలోని యొక్కొక్కవృక్షమే మనోహరముగ నుండెను; అందులో నానావిధవృక్షము లనేక రంగురంగులతోఁ బ్రకాశించుచుండెను; ఆయారంగులకుఁ దగినరంగులుగల తీఁగె లావృక్షముల కల్లుకొని యుండెను; అందుచేత, నెందులకు వసంతఋతువు మానమునువిడిచి యుండెనని చెప్పఁగూడదు? ఒక్కొక్కరంగున కొక్కొక్కజోడు కలదు; అటులనే శృంగారాదిరసములకును—శ్వేతమునకు శ్యామము; పీతమునకు హారిద్రము జోడు. విడిజోడునకు సరసము తక్కువ—లత లనే నాయికలకును వృక్షములను నాయకులకును సంపటము కలిగెను; శృంగారరసమునకు శాంతరసము జోడు.

నవ పల్లవ ఫల సుమన సుహాయే నిజ సంపతి సుర రూఖ లజాయే,
చాతక కోకిల కీర చకోరా కూజిత విహంగ నచత కల మోరా.

నూతనమగు పత్రములును, పుష్పములతోను, ఫలములతోను వృక్షములు శోభించుచున్నవి; నూతనపత్రములును, పుష్పఫలముల భారముచేత, వృక్షములు నేలకువంగి శోభించుచున్నవి; స్వకీయమగు పుష్పఫలములసంపదచేత, దేవతరువును (సురరూఖ) సిగ్గుపడుచుచుండెను; సకలజీవములకును ముఖ్యమగు సంపద నిచ్చునట్టి జానకీరాము లీవనములో విహారించెదరు; కనుక, నది శోభాయమానముగనుండెను; అందుచేత, సురతరువులు సిగ్గుపడి, నేలఁబడెను. తదనంతర మావనములో ననేకవిధములగుపక్షులు కలవు; వానిలో నయిదువిధముల పక్షులే శృంగారమున కనుకూలముగనుండెను; చాతకములు, చకోరములు; చిలుకలు, కోకిలలు, మాయూరములు; ఈ యయిదువిధముల పక్షులు మూఁడుఋతువులలోఁ గొన్నికొన్ని యాయాఋతువులలోఁ గనఁబడును; వసంత, వర్ష, శరదృతువు లీవనములోఁ బ్రకటమైయుం

డెను; ఆయాఋతువుల కనుకూలముగ నీపక్షు లావనములో నివసించి యుండెను; దీనికి ఆశయమేమి? ప్రథమమున, వనములో వసంతఋతువు మానమును విడిచియుండెను; అందుచేత, నాఋతువునకుఁ దగినట్లు, కోకిలలును, చిలుకలు నివసించియుండెను. తదుపరి, యావనములో వర్షఋతువు ప్రకటమయ్యెను, ఏప్రకారము? వృక్షములకుఁ దగిలియుండిన పురాతనపత్రములే కాలీఘటములతో సమానము; శ్వేతపుష్పములపంక్తియే బకములసమూహము; పీలపుష్పములపంక్తియే తరంగములు; శ్వేత, పుష్పముల సమ్మేళనమే ఇంద్రధనస్సు; లతాగృహములలోఁ బ్రవేశించునపుడు వాయువుచేయుచుండిన శబ్దమే, మేఘగర్జనము, చెట్లనుండి 'టుప్,టుప్' మని క్రిందఁబడుచుండిన పుష్పముల రసమే వానచినుకులు; అందుచేత, సదా మయూరము లావనములో నాట్యము జేయుచుండెను. తదుపరి శరదృతు వావనములో నీప్రకారము ప్రకటనమయ్యెను; చాతకములును, చకోరము లావనములో నివసించియుండెను; దట్టముగనుండిన శ్యామలదళములే, నిర్మలమగు ఆకాశము; అనేక రంగులపుష్పముల కాంతియే, సీతాదేవి ముఖమనునట్లు శరత్కాల రాకాబింబము యొక్క కాంతితో సమానముగ నుండెను.

ఆపుష్పవాటికకు శోభఁగలిగించునట్టి సరస్సొకటి దానిమధ్యను ప్రకాశించుచుండెను; అనేక రంగురంగులతోఁ జెక్కఁబడిన మణిసోపానము లాచెఱువునకుఁ గలవు; ఆసరస్సులో ననేకరంగురంగుల కమలము లుండెను; అనేకజలపక్షులు ధ్వనులఁజేయుచుండెను; భృంగములు ఝుంకారముఁ జేయుచుండెను; ఏరంగుగల కమలములమీఁద నాభృంగములు వ్రాలుచుండెనో, వానిరంగు వానికిఁ దగులుకొనినందున, నాభృంగములుకూడ ననేకరంగులుగఁ గనఁబడెను.

దోహా 277

ఆవనమును, ఆసరస్సును రామలక్ష్మణులు చూచినందున, వారికి సంతోషముకలిగెను; ఆ యారామము రామునకు సుఖమునిచ్చెను; లేదా? లోకములను రమింపఁజేయు రాముఁడావనములో విహరించుటచేత, నది ఆరామమే పరమరమ్యముగనుండెను.

చౌపాయి 261

రాముఁడు పుష్పవాటికను నలువైపులఁ గలయఁజూచి, తోటమాలి నడిగి, పుష్పములఁ గోయుచుండెను; తోటమాలి వచనముల వలన, నతనిమనస్సు ముదమందెను; ఎందుచేత? వానిని యడుగుటకుఁ బూర్వము, రాముఁడు నలువైపులఁ జూచి, వనములో సీతం గానక పోవుటచేత, నతనిమనస్సు కొంచెము వ్యాకులముఁజెందెను; సీతాదేవి వనములోనికి వచ్చుటకు సమయ మయ్యెనని వాఁడు చెప్పినందున, నతనిమనస్సు ముదమందెను. అంతలో, సీతాదేవి మాతృవచనముల ప్రకారము గౌరీపూజనిమిత్తము సఖులతోఁ గూడి వనములోఁ బ్రవేశించెను.

ఆమెతోఁ గలసివచ్చిన సుందరయువతులు; చతురులునగు సఖులు అతిశ్రావ్యముగ కంఠములనెత్తి గీతములఁ బాడుచుండిరి; ఎందుచేత? వారు సుందరులు? రూపముచేతను, అలంకారములచేతను, మందగమనముచేతను, తదుపరి శ్రావ్యముగుకంఠములఁ గలిగియుండుటచేతను వారు మనోహరులు; సుందరులు—వారి మంజువాణి వాణియొక్కమనస్సును హరించుచున్నది; అథవా, సాక్షాత్ వాణివారి ముఖమునుండి వెడలినందున, మంజువాణి యయ్యెను:—ఆవనములో రెండవసరస్సు మఱియొకటి కలదు; ఈసరస్సు స్త్రీలనిమిత్తము; దీనిని రాముఁడు చూచియుండలేదు; ఈ రెండవసరోవరతీరమున, దుర్గాదేవి యాలయ మొకటి కలదు, ఈగౌరిదేవిమందిర మతిశోభస్కరముగ నుండెను; దానిశోభను వర్ణించుటకు శక్యముకాదు గౌరీదేవి మందిరమని చెప్పుటకుఁ గారణమేమి? ప్రథమమున, గౌరీదేవి యెట్లు భర్తనిమిత్తము తపము నాచరించెనో, సితాదేవి యటుల నిప్పుడు తపముఁ జేయును; ఇరువురును కన్యలుకనుక, గౌరీమందిరమని చెప్పఁబడెను. (వివాహములలో వధువు నేడుకూడ, గౌరీతపముఁ జేయును; 'గౌరీతపస్సు' అని ప్రఖ్యాతికలదు; కాని, పార్వతితపస్సు' అని చెప్పుట లోకవిరుద్ధము).

సఖులతోఁగూడి, శీతాదేవి సరోవరములో స్నానముఁజేసి, దుర్గాదేవిమందిరములోనికి వెళ్లెను; ఆమె దేవినిఁ బూజించి, తన కనుకూలమగు వరమును దయచేయుమని దేవినిఁ బ్రార్థించెను. (భర్తను

దయచేయుమని వరము నడుగుట మర్యాదకు లోపము. గౌరీదేవిని బూజించుటకుఁ గారణమేమి? ధనుర్యజ్ఞమున కొకసంవత్సరము దీక్షఁ జేయఁబడెను; ఒకరోజుతక్కువగ, సంవత్సర మంతయు గడచెను; కాని, సీతాదేవికిఁ దగినవరుఁడు సంఘటనము కాలేదు. కనుక, సీతాదేవిమనస్సు వ్యాకుల పడెను.)

సీతాదేవి యాజ్ఞాప్రకారము ప్రధానసఖి, పరపురుషులు వనములోఁ గలరో లేరో చూచుటకు బయలువెడలెను. ఆచెలికత్తె రాజకుమారు లిరువురఁ జూచి, ప్రేమవివశురాలై సీతవద్దకు వచ్చెను; ఆమె నోరు మూతఁబడెను; ఎందుచేత? వా రిరువురశృంగారము నామె చూచినందున, నామెనోరు మూతఁబడెను.

దోహా 278

ఆమెశరీరము పులకరించెను; ఆమెనేత్రములు జలముతో నిండియుండెను; తదితరసఖు లామెయవస్థఁ జూచి, "ఓసఖీ! నీయానందమునకుఁ గారణమేమి?" అని, మెల్లగ, నామె నడగిరి. మందిరములో సీతాదేవి, ధ్యానములో నుండినందున, వారు బిగ్గఱగ మాటలాడిన యెడల, నామె ధ్యానమునకు భంగముకలుగు నని యెంచి, వారు మెల్లగఁ బ్రసంగించిరి.

చౌపాయ్ 262

"ఓసఖులారా! ఆయిరువురు రాజకుమారులు వనములోనికి వచ్చిరిసుమీ! ఓఅక్కలారా! ఎంతచక్కనివారే? కేవలము నూతనవయస్సుసుమా! వారిం జూచుట, కన్నులకు విందు; వారు పువ్వులఁ గోయుచుండిరి" అని చెప్పెను; (వారిమర్యాదకు లోపమువచ్చునని తలఁచి, వారు పువ్వులఁ గోయుచుండినసంగతిమాత్ర మామె సీతాదేవితోఁ జెప్పలేదు); తదుపరి, సాముద్రికశాస్త్రప్రకారము, వారికిఁగల మహారాజలక్షణముల నామె వర్ణించి, వారికిఁ జెప్పెను; వారిలో నొకరు శ్యామలమనియు, రెండవవారు గౌరవర్ణమనియుఁ జెప్పెను. "ఓసఖులారా! వారిం జూచిన నేత్రములకు వాక్కులులేవు; వారిని వర్ణింపఁ గలిగిన నోరునకు దృష్టిలేదు; చూచినవి చెప్పలేవు; చెప్పుటకు శక్తిఁ గలది చూడలేదు. వేయేల! ఓఅక్కలారా! వారిం జూచితీరవలెను"

అని వారిం జూచివచ్చిన చెలికత్తె పలికెను. ఆపలుకులను తదితర చెలికత్తెలు విని, ఆశ్చర్యభరితులై, సంతోషించిరి; వారిం జూచుటకు సీతాదేవికి యభిలాషకలదని తెలిసికొని, వారిం జూచివచ్చినసఖి చెలికత్తెలం జూచి, "ఓసఖులారా! వారు, బహుశః, మునీశ్వరునితోం గలసి, వచ్చియుండంగలరు. వారిరూపములలో మోహినీయంత్రము కలదు; వారిమోహినీ- గారిడీవిద్యం జూచి, నగరములోని స్త్రీపురుషులాబాలవృద్ధులు, చతురులుసయితము భ్రమించిరి; వారిమనస్సులను వారిరువురు నపహరించిరికదా! ఎడముగనుండినపుడే వారింతప్రభావులుకదా! ఇంకను వారియంగములను స్పర్శించినందున, నేమిసంభవించునో తెలియదు" అని ప్రశంసించెను. ఇది యుచితము, ఇది యనుచితమని శంకింపక, స్త్రీలందఱు వారివారిమర్యాదలను విడిచి, వారిరువురను వర్ణించి, చెప్పుకొనుచుండిరి. వేయేల? వారిం గన్నులారం జూచుటయే, కన్నులపండుగ. ఈసఖి చెప్పినమాటలు సీతాదేవిమనస్సునకింపుగనుండెను; రాజమర్యాదప్రకారము ప్రథమసఖి, సీతాదేవికి మార్గముం జూపించెను; రామదర్శనకౌతూహలముచే, నామెనేత్రములు నలువైపులం బరుగెత్తెను; ఆచెలికత్తె ముందు నడచెను; (సీతాదేవి మనస్సులో నొకసంకోచము కలదు; ఆమెమనస్సులోని యనురాగము తదితరులకుం దెలియకూడదనియు, అట్లు తెలిసినయెడల, నామెమర్యాదకు లోపము కలుగునని తలంచి, యామె ఆప్రథమసఖినే వెంటందీసికొని వెళ్లెను; సఖులలో, నాప్రథమసఖినే, సీతాదేవి తన యంతరంగస్నేహితురాలుగ భావించెను. వారిరువురిలో నఱమఱ లభ్యంతరములు లేవు.)

దోహా 279

సీతాదేవి నారదునివచనములను స్మరించుకొనెను; పవిత్రమగు ననురాగమే, ఆమెమనస్సులో నంకురించెను; ("ఓజానకీ! ప్రథమమున, నొకపుష్పవాటికలో నీవు రామునిం జూడంగలవు; తదుపరి, మీరిరువురకు వివాహమగును" అని నారదుండు చెప్పినవచనములే, యామెయనురాగమునకు బీజము.) అందుచేత, రాముండు పతియగునని తలంచి, యామె సంతోషించెను. ఆసంతోషము చెలికత్తెకుం దెలియకుండు

టకు, నామె, భయపడిన లేడిపిల్లవలె, నలువైపులఁ జూచెను; లేక, రాజకుమారులు వనములోనికి వచ్చిరని చెలికత్తె చెప్పుటచేత, నామె వారిం జూడవలెనని యాతురముతో, నలువైపులఁ జూచెను;

చౌపాయి 263

ఆమె శింజాన మంజుమంజీరనినదంబులు హృదయానందముగ రాముఁడు విని, లక్ష్మణునితో నిట్లు పలికెను. "ఓతమ్ముఁడా! వినుము; విశ్వవిజయముఁ దెలుపుచుండిన కామదేవుని జయభేరీశబ్దములను వినుము"; అని చెప్పి, యేవైపుననుండి శబ్దమువచ్చెనో, ఆవైపు రాముఁడు దృష్టి నిగుడించెను; చకోరములు చంద్రునిఁజూచి, యానందించువిధమున నతఁడు సీతాదేవి ముఖచంద్రబింబముఁ జూచి, యానందించెను. సీతం జూచునంతవఱకు రామునినేత్రములు చంచలముగ నుండెను; తరువాత, నతనినేత్రములకు రెప్పపాటు లేకపోయెను; ఆరెప్పలమీఁద నివసించు, 'నిమి' మహారాజు, ఆందోళనచే, తనస్థానమును విడిచెను. సీతచక్కదనముఁ జూచి, రాముఁడు సంతుష్టాంతరంగుఁడై, యనేకవిధముల నామెను తనలోఁ దాను పొగడెను; అతనిముఖమునుండి మాటవెడల లేదు. రామునినేత్రములు సీతంజూచెను; అందువలనఁ గలిగినసుఖమును మన స్సనుభవించెను; చూచినవియును, అనుభవించినదియును, పలుకలేవు; వానికి నోరులేదుకదా ! అందుచేత, నతనినోరు మూతఁబడెను. ఇంతవఱకు సీతవంటి చిన్నదానిని బ్రహ్మ సృష్టించియుండలేదు; ఆమె విశ్వమోహిని; బ్రహ్మ సృష్టిచమత్కారము నామె ప్రకటించుచున్నది; అథవా, ఆమె స్వయంవ్యక్తురాలు; ఆమెనిపుణతయే బ్రహ్మలను సృష్టించెను; ఆమెస్వయముగ విశ్వమునకుఁ బ్రకటనమయ్యెను; బ్రహ్మ సృజించిన శృంగారమున కామె సింగారము నిచ్చెను. ఇల్లుచక్కదనము దీపముమూలమున విశేషముగ రాణించును; బ్రహ్మసృజించిన సౌందర్యమునకుఁ జీకటిపట్టెను; సీతాదేవిచక్కదనము, దీపమువలె, నాచీకటిఁ బోఁగొట్టెను. కవీశ్వరులు చెప్పిన యుపమానములు 'దేహీ' యని యడుగుచుండును; ఆమె 'విదేహి' కనుక, నిరుపమానము; కవీశ్వరుల యుపమానము లామెవద్దకు వచ్చి, 'దేహీ' యని యాచించును.

దోహా 280

సీతాదేవిచక్కదనమును రాముఁడు లెస్సగ బరీక్షించి, తనయ దృష్టమునకు సంతసించి, నిర్మలమగు హృదయముతో సముచిత ముగ లక్ష్మణునితో నిట్లు ప్రసంగించెను. (నిర్మలహృదయ మని చెప్పుటకుఁ గారణమేమి? ఈవిషయమునుగుఱించి లక్ష్మణునితోఁ బ్రసంగించుట కూడదు; అయిన, నుచితముగ రాముఁ డతనితోఁ బలికెను.)

చౌపాయ్ 264

"ఓతమ్ముఁడా! అదిగో చూడుము; ఆమెయే జానకి; జనకచక్రవర్తిప్రతిజ్ఞ కామెయే కారణము; ఆమెనిమిత్తమే, ధనుర్యజ్ఞము; గౌరీపూజనిమిత్త మామెను సఖులు తీసికొనివచ్చిరి; చూచితివా, ఆమెశరీరకాంతి, యీపుష్పవాటికకు శోభను కలిగించుచున్నది. ఆమె యలౌకికసౌందర్యముఁ జూచినందున, స్వాభావికముగ నిర్మలమగు నామనస్సు చలించుచున్నది. అందులకుఁ గారణము బ్రహ్మదేవునికేఁ దెలియును; నాదక్షిణాంగములు అదురుచుండుటవలన, నేదో శుభము కలుగునని తోఁచును; మనరఘువంశస్థులకిది సహజస్వభావము; వారిమనస్సు లేశమయినను దప్పుమార్గమునఁ బాదముఁబెట్టదు; స్వప్నమందయినను పరస్త్రీముఖమ్ముఁ జూచియుండలేదని నానమ్మకము. నామనోవ్యాకులము వలనను, నాయంగముల స్ఫారమువలనను, నామనోరథము సిద్ధించునని తోఁచును. రఘువంశస్థులు యుద్ధములో శత్రువులకు వీపుఁజూపరు; స్వప్నమందైనను పరస్త్రీలపై వారుదృష్టి నిగుడింపరు; 'దేహి' యని వారివద్దకు వచ్చిన యాచకులకు లేదని వారు చెప్పరు. ఈమూఁడుగుణములు గల మనుజులు లోకములోఁ దగుమాత్రమే కలరు. (ఈమూఁడుగుణములును లక్ష్మణునియందుఁ గలవు; (1) జానకితోఁ గలసివచ్చిన చెలికత్తెల నతఁడు చూచియైన యుండలేదు. (2) విశ్వామిత్రుని యజ్ఞసంరక్షణార్థము వెళ్లినపుడు, శత్రువులఁ జూచి భయంపడలేదు. (3) విశ్వామిత్ర రామచంద్రుల సేవించినపుడు, తనవలనఁ గాదనక, వారికి సంతుష్టికలుగునట్లు మనఃస్ఫూర్తిగ వారిని సేవించెను.

దోహా 281

జానకిముఖపంకజమును శ్రీరాముఁడు చూచెను; అందుచేత నతని మనస్సు భ్రమించెను; ఒకపర్యాయము లక్ష్మణునితో నతఁడు ప్రసంగిం

చును; మఱియొకపర్యాయ మతఁడు సీతముఖముఁ జూచును. ఇందు లకు దృష్టాంత మొకటి కలదు. సీతముఖమే యొక కమలము; ఆముఖకాంతియే ఆకమలములోని మకరందము; (1) తుమ్మెద కమలముపై వ్రాలి, నిశ్శబ్దముగ దానిమకరందముఁ బానముఁజేయును; అంతలో నది దానిపైనుండి యెగిరి, ఝంకారముఁజేయుచు దానిచుట్టు దిరుగును; (2) మఱలఁ దుమ్మెద దానిపై వ్రాలి కొంచెము మకరందముఁ బానముఁజేయును. మఱల నెగిరిపోవును; (3) స్థిరముగ నుండినయెడల, దానిభారమును పుష్పము సహింపలేదు; క్షణక్షణము తుమ్మెద దానిపై వ్రాలి, కొంచెముకొంచెము మకరందముఁ బానముఁజేసి, యెగురుచుండును. (1) శ్రీరామునిమనస్సే యొకతుమ్మెద; తుమ్మెదవలె, నతఁడొకపర్యాయము సీతముఖముఁ జూచి, లక్ష్మణునితోఁ బ్రసంగించును; (2) పిదప నతఁడు సీతముఖారవిందమకరందముఁ బానముఁజేసి, తమ్మునితో మాటలాడును; (3) తదేకదృష్టితో నామెముఖము నతఁడు చూచినయెడల, నామెముఖ మతనిదృష్టిని సహింపలేదు.

చౌపాయ్ 265

చితవతి చకిత చహూదిశి సీతా,
కహఁ గయే నృప కిశోర మనచీతా॥
జహఁ విలోకి మృగ శావక నయనీ,
తహఁ జను వరష కమల సిత శ్రేనీ॥

I. సీత చకితురాలై నలుదిశలఁ జూడ నారంభించెను; రాజపుత్రులెటువైపువెళ్లిరో యని ఆమెమనస్సు చింతించెను. 'నృపకిశోర' అని చెప్పుట చేత వారిరువురు నొకరిస్వాధీనములో నుండిరని తెలియుచున్నది. లేకున్న, వారిలో నొకరు స్వతంత్రనృపుఁడనియు, రెండవవాఁడు కిశోరావస్థలో నుండెననియుఁ జెప్పవచ్చును. 'చీతా' శబ్దము 'చింతా' శబ్దమున కనుప్రాసము. ఆమె చింత మూఁడువిధములు:— (1) వారు వెళ్లిపోయిరేమో! (2) తనమనోచింతను సఖులు తెలిసికొనిరేమో? (3) తండ్రిగారిప్రతిజ్ఞ-II. ఆమె చకితురాలై నలువైపులఁ జూచెను; అందుచేత నామెకు లేడిపిల్లయొక్క నేత్రములవంటి నేత్రములు కలవు. ఎందుచేత? దానినేత్రములు నూతనములును జలభరితములు; దాని

దృష్టి చంచలము; అటులనే, రాముని జూడవలెనని సీత కాతురత విశేషముగ నుండెను; అందుచేత, నామెదృష్టి చంచలముగ, నలువైపులఁ బ్రసరించెను. ఆమె యెటువైపుఁ జూచిన నటువైపు నేత్రముల నుండి శ్వేతకమలములను వర్షించెను; శ్వేతకమలములని చెప్పుటవలన, మిత్రదృష్టియే ప్రసరించెనని భావము. శ్వేతలోచనములు మిత్రభావమును, శ్యామలోచనములు శత్రుభావమును, శోణలోచనములు మధ్యభావమును సూచించును.

లతాగృహమునకు బయటనుండిన రామలక్ష్మణులను చెలికత్తెలు సీతకుఁ జూపించిరి; వారిం జూచినతరువాత, నామెనేత్రములు శోణత్వముఁ బొందెను; వారిచక్కఁదన మెంతఁజూచిన, నామెకుఁ జూడవలెననియే యుండెను. కోలుపోయినపదార్థము లభించిన తరువాత నెంత సంతోషముకలుగునో? ఆమె కంతసంతోషము కలిగెను. శ్రీరాముని శరీరలావణ్యముఁ జూచిచూచి, ఆమె నేత్రములు బడలి, రెప్పపాట్లను వేయుట మఱచెను; శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ జూచినందున, నామెశరీరము సంతోషముచే సంపూర్ణముగ నిండెను. శరత్కాలపూర్ణచంద్రునిఁ జూచినతరువాత నెట్లు చకోరములతాపము శాంతించునో, సీతాదేవిశరీరతాప మట్లె రామునిఁ జూచినతరువాత శాంతించెను. నేత్రములద్వారమున శ్రీరాముని రూపమును సీతగ్రహించి, ఆరూపమును దన హృదయములో నిడుకొని, నేత్రము లనునట్టిద్వారములను బంధించెను. ఆమె ప్రేమాపరవశురాలయ్యెనని చెలికత్తెలు దెలిసికొని, పరమానందమునొంది, యొకమాటనయిన పలుకలేదు.

దోహా 282

మేఘమండలముఁ జీల్చుకొని, బయటకువచ్చు రెండు చంద్రబింబములువలె, నారామలక్ష్మణు లిరువురును లతాగృహముఁ జీల్చుకొని బయటకువచ్చిరి. లతాగృహములోనికి వెళ్లుటకును వచ్చుటకును మార్గముండినను, వారిరువు రామార్గమును విడిచిపెట్టి, సీతం జూచుటకు గల యాతురముచేత, నట్లు లతాగృహముఁ జీల్చుకొని ప్రత్యక్షమయిరి. (శ్యామశరీరమును చంద్రునితో నుపమానముఁ దెచ్చుట యుచితమా? లక్ష్మణుఁడు చంద్రుఁడు; శ్యామలశరీరము గల రాముఁడు మేఘము).

చౌపాయ్ 266

ఆవీరు లిరువురు చక్కదనాలకుప్పలు; రామునిశరీరము నీలకమలములవలె నుండెను; లక్ష్మణునిశరీరము ఎఱ్ఱనికమలములవలెఁ బ్రకాశించుచుండెను. వారు కాకపక్షములను ధరించి యుండిరి; శిరస్సులపై వారు పుష్పముల గుత్తులను ముడుచుకొనిరి. వారిముఖములు చెమట బిందువులతో నిండెను; వారిలలాటమునఁ దిలకము శోభించెను; వారి చెవులకు భూషణములుండెను; వంచినవిల్లువంటి కనుబొమలును, ఉంగరములవలెఁ దిరిగియుండిన శిరోజములును, నూతనముగ వికసించిన కమలములవంటి నేత్రములును, జక్కనిచుబుకమును, దీరుగనుండినముక్కును, ముద్దుఁబెట్టుకొనఁదగిన బుగ్గలును, జాపజుల చిత్తమును హరించుచుండిన మందహాసమును- ఈ ముద్దుల మూటఁగట్టుచుండిన బాలుర ముఖసౌందర్యమును నేను చెప్పఁజాలను; వారింజూచి, వేలకొలఁది మన్మథులు సిగ్గుపడవలెను; వారలకంఠములు శంఖములవలెనుండెను; నాభివఱకును వారిమెడనుండి ముత్యాలహారము వ్రేలుచుండెను. అవతరించిన కామదేవునివంటి కలభము యొక్క తొండమువలె, వారిబాహుదండములు సొగసుగనుండెను. పుష్పములను పత్రములను వామహస్తములోఁ బట్టుకొనియుండిన, శ్యామలశరీరముఁగలవాఁడే, ఓసఖి! చక్కనివాఁడు.

దోహా 283

సింహమునడుమువలె, వారినడుములు సూక్ష్మములు; వారు పీతాంబరములను ధరించిరి; వారు సకలసుఖధాములు; సర్వగుణసంపన్నులు; వారు సూర్యకులమునకు భూషణములు; చెలికత్తెలు వారింజూచి, పరవశులై, చేష్టలఁ దప్పిరి.

చౌపాయ్ 267

పరమచతురయగు చెలికత్తె యొకర్తు తెలివిఁదెచ్చుకొని, సీత హస్తముఁ బట్టుకొని, "ఓసీతా! నేత్రములను మూసికొని, గౌరీదేవిని ధ్యానించుచుంటివా? నేత్రములనువిప్పి, రాజపుత్రుల నేల జూడవు?" అని పలికెను. (రామలక్ష్మణులు సమీపమున నుండినందున, నామె సీతతో బిగ్గరగ మాటలాడుట యుక్తముకాదు; నేత్రములతో సంజ్ఞఁ జేయుదమనిన, సీత నేత్రములను మూసికొనియుండెను; అందుచేత,

నామెహాస్తమును చెలికత్తె పట్టుకొనెను.) ప్రసంగించిన చెలికత్తె సయితము పరవశురాలయ్యెను; ఆమె ధైర్యము నవలంబించి, తెలివిదెచ్చుకొని సీతతోఁ బలికెను. రాజపుత్రులం జూచుటవలనఁ గలిగిన మనోవికలత్వమును చెలికత్తెలకుం దెలియకుండునట్లు సీత నేత్రములను మూసికొనెను; ఆమె గౌరీధ్యానముఁ జేయుచుండెనని వారు తలంచిరి. "ఓ సీతా! నీవు గౌరిని ధ్యానించుచుండిన యెడల గౌరీదేవిమందిరములోనికిఁ బొమ్ము; లేదా, నీవు గౌరిని ధ్యానించినందువలన, నీకు ఫలము కలిగెను; నీ నేత్రముల కాఫలము ప్రత్యక్షమయ్యెను; కనుక, నేత్రములనువిప్పి, ఆఫలముఁ జూడుము" అని సఖిపలికెను.) సఖిపలికిన వ్యంగ్యవచనములను సీత విని, తన మనోవికారమును జెలికత్తెలు గ్రహించిరని సంకోచించి, నేత్రములను సగముసగమువిప్పెను; ఆపురుషసింహములను, ఆరఘువంశతిలకముల నామె క్రీఁగంటితోఁ జూచెను. ప్రేమాతిశయముచే సీత పరవశురాలయ్యెనని చెలికత్తెలు తెలిసికొని, "ఓయమ్మా! కాలవిలంబమయ్యెను గనుక మనము శీఘ్రముగ గృహమునకు వెడలుటమంచిది" అని వారు భయపడి చెప్పిరి. అంతలో నామె తెలివిఁదెచ్చుకొని, తల్లిమాటఁదలఁచి భయపడి, "సత్యము; ఓచెలులారా!" అని మందముగఁ బలికెను. "ఓసఖులారా! ఈవేళకే రేపు మన మిచ్చటికి రావలసియుండును సుమీ!" అని యొక చెలికత్తె ముసిముసినవ్వు నవ్వుచుఁ బలికెను. సఖులుపలికిన వ్యంగ్యవచనములను సీత విని, కొంచెము సిగ్గుపడెను; ఆమె, తల్లిమాటను జ్ఞప్తికిఁదెచ్చుకొని, తల్లికి భయపడి, నిష్క్రమించుటకు సిద్ధమయ్యెను. ఆమె ధైర్యము నవలంబించి, శ్రీరాముని దివ్యరూపమును హృదయములో ధరించెను; మాటిమాటికి జనకునిప్రతిజ్ఞఁ దలంచి యామె విచారించెను; ఆమెమనస్సు పలువిధములఁ బ్రసరించెను. "ఆహా! నాశరీరము నాజనకునియధీనముకదా! నన్ను వా రెవరికిచ్చి వివాహముఁ జేయఁదలఁచిరోకదా!" అని సీత విచారింపఁదొడఁగెను.

దోహా 284

మృగములను బక్షులను వృక్షములఁ జూచుమిషచే యామె మాటిమాటికి వెనుకకుఁదిరిగి, శ్రీరాముని రూపలావణ్యములఁ జూచి

చూచి, లోలోపల మురియుచుండెను; ఆమెకు రామునియం దనురాగము బలిసెను; విశ్వామిత్రుని యజ్ఞరక్షణమప్పుడు, వీరరామునిప్రతాపము నామె వినియుండెను; నేడు సుకుమారుఁడగు శ్రీరామునిఁ గన్నులారఁ జూచెను. తొంగితొంగి, వీరరామునిశరీరమునే సీత చూచుచుండెను. ఈసమయమున వీరరామునిప్రయోజనము కలదు; కాని, శృంగారరామునివలన లాభములేదు; వీరరాముఁ డయినయెడల, ధనస్సును విఱుచుటకు సమర్థుఁడని యామె యభిప్రాయము; అందుచేత, నామె వీరరామునిఁ జూచిచూచి మురియుచుండెను.

చౌపాయీ 268

శివునివిల్లు కఠినమని తెలిసికొని, సీత వ్యాకులపడెను; ఆమెమనస్సునకు స్వాస్థ్యము లేకపోయెను; అయినను, శ్రీరాముని శ్యామలరూపము నామె హృదయములో ధరించెను. (శంక:—శివునివిల్లు కఠినమని తెలిసికొని, శ్రీరామునిరూపమును ధరించుట ధర్మమునకు విరుద్ధము కాదా; అతనిని బెండ్లియాడుట నిశ్చయము లేనిసమయమున, నతనిరూపమును హృదయములో ధరించుట యుచితము కాదు:—ఉత్తరము:—శివునిధనస్సు కఠినము; బాణాసురుఁడు, రావణుఁడు మొదలగువారు దానిని విఱువలేక భంగపడిరి; వారు భంగపడినను, రాముఁడు వారికంటె వీరుఁడగుటచేత, నాశివునిధనస్సును విఱువఁగలఁడని ఆమెకు నమ్మకము కలిగెను; అందుచేత, నతనిరూపమును సీత తనహృదయములో ధరించి, నిష్కర్షించెను.) పూర్వము సీతనుగుఱించి రాముఁడు వినియుండెను; ఇప్పు డామె నాతఁడు ప్రత్యక్షముగఁ జూచెను; వినినదానికంటె నధికముగ నతఁ డామెం జూచి, కొన్నివిశేషగుణములఁ గనిపెట్టెను; ఆమె చక్కఁదనాలకుప్ప యనియు, సకలగుణసంపన్నురాలనియు, తనయం దనురాగముఁ గలదనియు నతఁడు తెలిసికొని, ప్రేమయనుమసితో నామెరూపమను నొకచిత్రపటమును రాముఁడు తన యంతఃకరణములో వ్రాసికొనెను. (రామునకు ధనుస్సును విఱువఁగలనని నిశ్చయము కలదు అందుచేత నామెరూపము నతఁడు హృదయములో ధరించెను) సీత భవానాన్యాలయములోనికి వెళ్లి, దేవిచరణములకు నమస్కరించి, యిట్లు దేవినిఁ బ్రార్థించెను. "ఓతల్లీ! ఓజగజ్జననీ! జయ,జయ జయ; నీవు గిరిరాజకన్యవు; శివునిముఖచంద్రకిరణములఁ బానముఁజేయు

టలో నీవు చకోరమువంటిదానవు; నీవంటిపరోపకారులు లేరు; (సంత విటపసరితాగిరిధరనీ! పరహితహేతుసబనకీకరనీ॥ మహాత్ములును, విటపములును, నదులును, పర్వతములును, భూదేవియు—వీరు పరోపకారులు); నీలో నీతంత్రిగుణములు కనఁబడును; నీవు మహేశ్వరుని పత్నివి; సర్వకార్యములను నిస్సందేహముగ నిర్వర్తింపఁగలవు; గణపతికిని, కుమారస్వామికిని నీవు తల్లివి; నీవలన సకలకార్యములు తప్పక సిద్ధించును; (తారకాసురుని సంహరించి, కుమారస్వామి దేవతల కెటుల స్వస్థానము నిచ్చెనో, అటులనే నీమూలమున ధనస్సు విఱిగినయెడల, నాకు స్వాస్థ్యముకలుగును). నీవు జగత్తులకు మాతవు; కోటిమెఱుపు తీగలవలె నీశరీరము ప్రకాశించుచుండును; ఆదిమధ్యాంతములు నీకు లేవు; నీప్రభావ మమితము; నీమహాత్మ్యను వేదములు సయితము గుర్తెఱుఁగవు; నీవలననే సృష్టిస్థితి సంహారములు జరుగును; నీమట్టుకు నీవు స్వతంత్రురాలవు; లోకాలోకములను నీవే భ్రమింపఁ జేయుచుంటివి.

దోహా 285

"ఓతల్లీ! నీవేపతివ్రతలలో నగ్రగణ్యురాలవు; నీయపారమహిమను సహస్రశేషువులుగాని శారదలుగాని చెప్పుదమన్నఁ జెప్పలేరు; ఏమార్గమున నీవు సంచరించి సిద్ధిఁబొందితివో, నే నామార్గమునఁ బోయి సిద్ధిఁబొందునట్లుఁ బ్రసాదింపుము.

చౌపాయి 269

"ఓశ్రేష్ఠవరదాయినీ! నీవు త్రిపురాంతకుని ధర్మపత్నివి; నీదాసులఁ గటాక్షించి, వారికోరికల నీడేర్చెదవు; చతుర్విధపురుషార్థములు నిన్ను సేవించువారికి సులభముగ లభించును; రామునివియోగము, జనకునిప్రతిజ్ఞ, ధనస్సుయొక్క కాఠిన్యము. ఈమూఁడుదుఃఖములు నన్ను బాధించుచుండును; వానిం దొలఁగింప నీవే సమర్థురాలవు; ఓదేవీ! దేవతలును, నరులును, మునులును నీచరణకమలములను సేవించి, ముక్తిఁబొందుచున్నారు. నామనోభీష్టము నీకు బెస్సగదెలియును; నీవు సర్వాంతర్యామినివి; నిన్నుఁ ద్రికరణశుద్ధిగ సేవించితిని; నామనోవాంఛితమును నీడేర్పుము." అని పార్వతి ప్రార్థించెను ఓభరద్వాజా! సీతయొక్కవిన్నపములను భవాని విని ప్రేమవశురాలై, చిఱునవ్వునవ్వి, చేతిలోనుండిన పుష్పమాలికను జాఱవిడిచెను. పరమానందముతో నాదేవి

ప్రసాదమును సీత తీసికొని, హృదయమున ధరించెను; ఆమె మఱల భవాని చరణములకు నమస్కరించెను. అంతలో నిట్లు భవాని సీతతోఁ బ్రసంగించెను. "ఓ సీతా! నాయాశీర్వాదము సత్యము; వినుము; నీమనోభీష్టము నెఱవేరును; నారదుఁడు నీతోఁజెప్పిన ధర్మ వాక్యములు సత్యము; ఏ పురుషునియందు నీమనస్సు లీనమై, వానిరూప మును నీవు ధరించితివో, వాఁడే నీవాఁ డగును.

ఛాంద్ 33

"ఆచక్కని శ్యామలశరీరముగల పురుషునియందు నీమనస్సు లగ్నమయ్యెను; వాఁడే నిన్ను వివాహమాడును; ఆకరుణాసముద్రుఁ డును, పరమచతురుఁడు నగు రాముఁడు నీరూప శీలలావణ్యములను గ్రహించెను; నీవు విచారింపకుము" అని పార్వతి చెప్పిన వచనము లను సీత విని, సఖులతోఁగూడ నత్యానందముఁ బొందెను; అట్లు సీతను దీవించి, భవాని యూరకుండెను. మఱల సీత భవానిం బూజించెను; ఆమెమనస్సు ప్రసన్నమయ్యెను; అని తులసీదాసు చెప్పెను.

సోరఠా 33

అనుకూలముగ పార్వతి చెప్పినవచనములను సీత విని, పరమ సంతోషముఁ బొందెను; ఆమెసంతోషముఁ జెప్పుటకు శక్యముగాదు; శుభముఁ దెలియఁజేయుచు నామె వామాంగము లదరెను.

చౌపాయ్ 270

సీతయొక్క చక్కనిరూపమును శ్రీరాముఁడు మనస్సులో స్మరిం చుచు, లక్ష్మణునితోఁ గూడి, గురువువద్దకు వెళ్లెను. (సీతకును పార్వతి కిని జరిగిన సంభాషణను విశ్వామిత్రుఁడు జ్ఞానదృష్టిచే గ్రహించెను.) స్వభావసిద్ధముగ శ్రీరామునిమనస్సు నిర్మలము; అతనికి గపటము లేదు; అతనిబుద్ధి సరళమైనయినది; కనుక, వనములో జరిగినవృత్తాంత మంతయు రాముఁడు పూసగ్రుచ్చినట్లు గురువునకు విన్నవించెను; ఆప్రకారము గురువుతోఁ జెప్పుట యుచితమో అనుచితమో రామునకుఁ దెలియదు. విశ్వామిత్రుఁడు వారు తీసికొని వచ్చినపుష్పములఁ గైకొని వానితో భగవంతునిఁ బూజించెను; అనంతర మతఁడు వారిని దీవించెను. "మీ మనోరథములు నెఱవేఱును" అని యతఁడు పలికెను. ఆమాటను రామ లక్ష్మణులు విని ప్రసన్నులయిరి; వారిమనస్సు స్వాస్థ్యముఁ బొందెను.

భోజనానంతరమున నా త్రికాలజ్ఞానసంపన్నుఁ డగువిశ్వామిత్రుఁడు పురాణకథలఁ జెప్ప నారంభించెను; ఈవిధమున నాదినమంతయుఁ గడచెను; అంత సాయంసమయమున, గురుని యాజ్ఞప్రకారము వారిరువురు సాయంసంధ్యా ద్యనుష్ఠానములను నెఱవేర్చిరి. అప్పుడు పూర్వదిక్కునందు పూర్ణచంద్రుఁ డుదయించెను; ఆచంద్రబింబము వలె, జానకీముఖము కళకళలాడుచుండునని రాముఁడు గ్రహించి సంతోషించెను. "ఈ చంద్రబింబము సీతముఖముతో సమానము కాదు" అని రాముఁడు మఱల మనస్సులో విచారించెను. (చంద్రుఁడు లోకమునకుఁ బ్రకటమయ్యెను; సీత యంతఃపురములో నుండెను కాని లోకమునకుఁ బ్రకటము కాలేదు; (2) సీత సఖులతోఁ గూడియుండెను; చంద్రునకు సఖులు లేరు; (3) సీత, శరీరమునకుఁ జల్లఁదనమునిచ్చును; చంద్రుఁడు తాపము నిచ్చును.)

దోహా 286

ఔన్నత్యము మూఁడువిధములఁ గలుగును:—(1)జన్మస్థానము, (2) సాంగత్యము, (3) అంగసౌష్ఠవము- "అహా! ఈచంద్రుఁడు నాసీతతో సమానుఁడు కాఁడు; చంద్రుఁడు సముద్రములోఁ బుట్టెను; చంద్రుఁడు విషముతోఁ గూడియుండును; అతనివెంట హాలాహలము పుట్టెను; పగలంతయు నతనికిఁ గాంతియుండదు; మసకమసకలాడుచుండును.

చౌపాయి 271

"చంద్రునకు వృద్ధిక్షయములు కలవు; అతఁడు విరహులను బాధించును; పర్వసంధులలో నతనిని రాహువు కబళించును- సీతముఖచంద్రమునకు వృద్ధి క్షయములు లేవు; ఆముఖ మెల్లప్పుడును నొకరీతిగ నుండును; ఆమెముఖము పరులను బాధింపదు; ఆమెకు శత్రువులు లేరు- స్త్రీపురుషచక్రవాకముల కతఁడు వియోగదుఃఖముఁ గలిగించును; పద్మములకు శత్రువు; అవగుణము లనేకము లతనియందుఁ గలవు. ఓ చంద్రమా! నీవంటివానిని సీతతో సరిపోల్చుట దోషము; అనుచితము. ఓచంద్రమా! ప్రతిదినము నిన్నుఁ జూచుచుంటిని; ఇంతవఱకు నీదోషములు నాకుఁ గానరాలేదు; ఇప్పుడు నిన్ను సీతతో సరిపోల్చుటవలన, నీయవగుణములు స్పష్టమయ్యెను" అని యీప్రకారము రాముఁడు చంద్రుని యుపాలంభించెను. చంద్రునిమిష పెట్టుకొని, రాముఁడు

నాయికాముఖసౌందర్యమును వర్ణించుచుండెను; ఇంతలోఁ, గొంతరాత్రి గతించెను; అప్పుడతఁడు తెలివిఁదెచ్చుకొని, తమ్మునితోఁగూడి, గురువువద్దకు వచ్చెను. వారు మునీశ్వరుని చరణకమలములకు నమస్కరించి, వారియాజ్ఞఁ గైకొని, శయనించిరి. అంత నారాత్రి గడచెను; శ్రీరాముఁడు మేల్కాంచెను; అంతకుపూర్వమే లక్ష్మణుఁడు లేచియుండెను. అప్పుడు రాముఁడు తమ్మునిఁ జూచి, "ఓతమ్ముఁడా! చూచితివా, అరుణోదయమయ్యెను; ఆపద్మబాంధవుఁడు, ఆస్త్రీపురుషచక్రవాకములకు సంయోగము నిచ్చువాఁడు, ఆత్రిమూర్తిస్వరూపుఁడు, ఆలోకములకు సుఖమునిచ్చువాఁడు ప్రత్యక్షమయ్యెను." అని పలికెను. లక్ష్మణుఁడు చేతుల జోడించుకొని, శ్రీరాముని ప్రతాపమును వర్ణించుచు నిట్లు పలికెను.

దోహా 287

"ఓనాథా! అరుణోదయమయ్యెను; కుముదములు ముకుళించుకొనిపోయెను; తారాగణముల కాంతి వెలవెలఁబోయెను. మీయాగమనమును విని, రాజులు, తారాగణములవలె, వెలవెలఁ బోవుచుండిరి.

చౌపాయి 272

"ఓస్వామీ! కోట్లకొలఁది నక్షత్రములు ప్రకాశించుచుండినను, చీకటులఁ బోఁగొట్టఁజాలవు; అటులనే, రాజులెందఱుండినను, శివుని విల్లును విఱుచుటకు సమర్థులుకారు. కమలములును, స్త్రీపురుషచక్రవాకములును, పక్షులును, తుమ్మెదలును, చీకట్లు విడినందుకు సంతోషించును. ఓనాథా! అటులనే, మీరు ధనస్సును విఱిచినతరువాత, మీభక్తులందఱు సంతోషించెదరు. ప్రశ్రమలేకయే, సూర్యుఁడుదయించిన ("ఆర్తో, జిజ్ఞాసు, రర్థార్థీ, జ్ఞానీ, చ భరతర్షభ!" అని నాలుగువిధముల భక్తులు కలరు.) తరువాత, సంధకారము నశించును. ఆసూర్యుని కాంతియెదుట, నక్షత్రములకాంతి మఱుగుపడును. అటులే, శ్రమలేకయే, మీరు ధనస్సును విఱువఁగలరు. ఓరామచంద్రా! ఉదయించిన సూర్యునిప్రకాశము, లోకములో నెట్లు విజృంభించునో, మీప్రతాపము రాజమండలిలో నట్లు, పరిణమించెను. ఉదయపర్వత సానువులపై సూర్యుఁడు ప్రకాశించినవెంటనే, చీకట్లు విడిపోవును; అటులనే, మీ

భుజబలపరాక్రమము విజృంభించినవెంటనె, శివునిధనస్సు అనునట్టిచీకట్లు విడిపోవును." అని లక్ష్మణుఁడు రాముని నుతించెను. తమ్మునిమాటలను రాముఁడు విని చిఱునవ్వునవ్వెను; పిమ్మట వారు స్నానముఁజేసి, శుచిర్భూతులై, ప్రాతస్సంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించి, గురువువద్దకువచ్చి, వారిచరణములకు నమస్కరించిరి. అంతట, జనకుఁడు పురోహితుఁడగు శతానందునిఁ బిలిచి, విశ్వామిత్రునిఁ దీసికొనిరమ్మని, యతనివద్దకుఁ బంపెను. ఆదినముతో ధనుర్యజ్ఞదీక్షాసమాప్తమగును; కనుక, విశ్వామిత్రుని శీఘ్రముగఁ దీసికొనిరండని శతానందునిఁ బంపెను. జనకునివర్తమానమును శతానందునివలన విశ్వామిత్రుఁడు విని, సంతోషించి, రామలక్ష్మణులఁ బిలిచెను.

దోహా 288

ఆయన్నదమ్ము లిరువురు శతానందుని చరణములకు నమస్కరించి, విశ్వామిత్రునిప్రక్కను గూర్చుండిరి "ఓకుమారులారా! జనకుఁడు వర్తమానముఁ బంపెను; యజ్ఞవాటికకుఁ బోయెదము; లేలెండు" అని విశ్వామిత్రుఁడు వారితోఁ జెప్పెను.

ఇతి శ్రీగోస్వామితులసీకృత శ్రీరామచరిత్రమానసే,
సకలకలికలుషవిధ్వంసనే, బాలకాండాంతర్గత
పండితజ్వాలాప్రసాదకృత వ్యాఖ్యానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
షష్ఠ విశ్రామః.

# బాలకాండ సప్తమ విశ్రామః.



చౌపాయ్ 273

శ్రీరామలక్ష్మణులును విశ్వామిత్రుఁడును తదితరఋషులును సీతాస్వయంవరముఁ జూచుటకు రంగస్థలమునకు వెళ్లిరి; ఈశ్వరుఁడు కటాక్షించినవానికిఁ గదా జయము కలుగును; "ఓమహారాజా! ఎవని యందు మీకటాక్షము ప్రసరించునో, వానికి జయములభించును." అని లక్ష్మణుఁడు విశ్వామిత్రునితోఁ బలికెను. ఉచితముగ లక్ష్మణుఁడు పలికినపలుకులను మునులు విని, సంతోషించి, మనఃస్ఫూర్తిగ, రామలక్ష్మణులను దీవించిరి మునిశ్వరులతోఁ గూడి, అన్నదమ్ము లిరువురు ధనుర్యజ్ఞశాలకు వచ్చిరి; వారిరువురు రంగభూమికి వచ్చినందున, నాఁగరికులందఱు పరమానందభరితులయిరి; వారివారి గృహకృత్యములను విడిచి, స్త్రీపురుష బాలబాలవృద్ధులు, గుంపులుగుంపులుగ రంగభూమికి వచ్చిరి; ఇట్లు రంగభూమికివచ్చిన వేలకొలఁది జనులను జనకచక్రవర్తి చూచి, తన యాంతరంగికుఁడగు నొకవృద్ధసేవకునిఁ బిలిచి, "ఓయీ! ఆజనులవద్దకు వెళ్లి, యథాయోగ్యముగ వారికి నాసనములఁ జూపుము" అని నియోగించెను.

దోహా 289

"ఓఅయ్యలారా! యథోచితముగ మీరీయాసనములపైఁ గూర్చుండుఁడు" అని సేవకుఁడు మృదుమధురవచనములతో వారికిఁ జెప్పెను ఉత్తములు, మధ్యములు, నీచులు, లఘువులు—ఈమొదలగు పురుషులు, యథాయోగ్యమగు నాసనముల నధిష్ఠించిరి.

చౌపాయ్ 274

అంతలో రామలక్ష్మణులు రంగస్థలమునకు వచ్చిరి; వారి రూపరేఖావిలాసముల కాంతి పదిదిశల వ్యాపించెను; ఆమేఘశ్యాములు, ఆపీతకౌశేయవాసులు, ఆరమమన్మథాకారులు, ఆసకలగుణధాములు, ఆత్రిలోకవీరులు, ఆచతురులు, ఆరామలక్ష్మణులు రాజసభలోనికివచ్చిరి; నక్షత్రములమధ్యను చంద్రబింబములు రెండు ప్రకాశించునట్లు, వారిరువురు దేదీప్యమానముగ వెలుంగుచుండిరి. ఏభావముతో నెవరు రా

మునిఁ జూచిన మొదల, నాభావముతో నతఁడు వారికిఁ గనంబడుచుం డెను. మహారణధీరులును, అతిరథశ్రేష్ఠులు నగు రాజవీరు లతనింజూచి, వీరరసము మూర్తీభవించి వచ్చినట్లు రాముని దలంచిరి; కుటిలస్వభావులగు రాజు లతనిం జూచి, భయపడిరి; వారినేత్రముల కతఁడు భయోత్పాతముం గలిగించునట్లు కనఁబడెను; (భయానకరసము.) రాజవేషమునుధరించి, సభలోనికి వచ్చిన రాక్షసుల కతఁడు రౌద్రాకారుఁడుగఁ జూపట్టెను; (రౌద్రరసము) ఆ సకలజనశిరోమణులును, ఆనేత్రోత్సవదాయకులు నగు రామలక్ష్మణులను పురజనులు చూచి, శృంగారరసము యొక్క మొగ్గలని తలంచిరి.

దోహా 290

నారీరత్నములు వారిం జూచి, పరమసంతోషభావయుక్తముగ శృంగారరసము వారిరూపములను ధరించి, సభలోనికి వచ్చెనని తలంచిరి. (శృంగారరసము.)

చౌపాయి 257

"సహస్రశీర్షా పురుషః, సహస్రాక్షస్సహస్రపాత్" అని విరాట్పురుషుని వర్ణించెదరు; పండితజను లావిరాట్స్వరూపమును రాముని యందుఁ గనిపెట్టిరి; (భీభత్సరసము.) జనకుని బంధుమిత్రవర్గంబున కతఁడు మిత్రుఁడును బంధువునలెఁ గనఁబడెను. తల్లిదండ్రులు పుత్రుని యెత్తుకొని యానందించెదరు; అంతకంటె నధికముగ జనకచక్రవర్తియు అతని భార్యయు రాముని జూచి యానందించిరి; (కరుణారసము.) పరమసచ్చిదానందస్వరూపుఁ డనియు, శాంతమూర్తియనియు, తత్త్వార్థమనియు, యోగీశ్వరులు రాముని జూచి, భావించిరి. హరిభక్తులు శ్రీరాముని జూచి, యుపాసనకుఁ దగిన రూపముకలవాఁ డని తలంచిరి; (అద్భుతరసము.) అతనింజూచి, జానకి సంతోషించెను; ఆమెకుఁ గలిగిన ప్రేమయు ననురాగములను చెప్పుటకు శక్యముకాదు; (హాస్యరసము) ఆమెమనోభావముల నామెయే నిరూపింపలేకపోయెనుకదా ! మనుజమాత్రుఁ డగు కవీశ్వరుఁ డెట్లు వానిని వర్ణింపఁగలఁడు ? ఈప్రకారము స్త్రీపురుషులు వారివారి భావముల ననుసరించి, రామునిఁ జూచి సంతోషించిరి.

### దోహా 291

అయోధ్యాధిపతికుమారులు రాజసభలో దేదీప్యమానముగ వెలుఁగుచుండిరి; వారు కేవలము బాలులు; వారిలో నొకరిశరీరము శ్యామలము; మఱియొకరిశరీరము పసుపువర్ణము; వారిరువురు సంసారుల నేత్రముల నపహరించుచుండిరి. చోరులు సంసారులనేత్రములకు గాటుకఁ దగిలించి, వారికి మత్తుగలిగించి, వారివస్తువుల దొంగిలించెదరు; ఈరామలక్ష్మణు లనునట్టిదొంగలు, సంసారులనేత్రములకు ప్రేమ యనునట్టి కాటుకఁ దగిలించి వారిమనస్సుల నపహరించిరి; ఇంత చిన్నతనములో నీరింత దొంగతనములోఁ బ్రవీణులయి యుండినపుడు, వారు పెద్దవారయిన తరువాత నెంతఁబ్రవీణులుగ నుండెదరో కదా! సాధారణముగ దొంగలు రాత్రివేళ, రాజభటులకు భయపడుచు, మైమఱచియుండిన మూర్ఖులసొమ్ముల నపహరించెదరు; ఈయన్నదమ్ము లిరువురు దొంగతనములో నేర్పరులు; పట్టపగలు, రాజసభలో, నందఱు చూచుచుండ, వారిమనస్సులను నిర్భయముగ దొంగిలించిరి; కండ్లతోఁ జూచి దొంగలను బెదరింపవచ్చును; వారిని పట్టుకొనవచ్చును; ఈదొంగల నిరువురఁ జూచువారెవరు? పట్టుకొనఁగలవారెవరు? సరిసమానముగ నందఱు వారివారిమనస్సులఁ గోల్పోయిరి.

### చౌపాయ్ 276

సహజసిద్ధముగ వారి రూపములు చక్కనివి; అందుచేత, నవి జనులమనస్సులను హరించెను; కోటిమన్మథులతో వారి శరీరములను సరిపోల్చినను, యుపమానము సరిపడదు. కలకలమనుచుండిన వారి చక్కనిముఖములు కార్తికమాసములోని చంద్రబింబమువలెఁ బ్రకాశించెను; వారినేత్రములు వికసించిన కమలములవలె నుండెను; వారిచక్కఁదనము నూహింపవలయును గాని వర్ణింప శక్యముకాదు. వారిసౌందర్యము మన్మథునిగర్వముఁ బోఁగొట్టెను; నోటికి నేత్రములు లేవు; నేత్రములకు నోరులేదు; వారిని మనస్సులో నూహించి సంతోషింపుము; నిగనిగలాడుచుండిన బుగ్గలు; చెవులకుఁ దగిలియుండిన కుండలములు; చక్కనిగడ్డము; దొండపండువంటి పెదవులు; చంద్రునికిరణముల నపహసించు మందహాసము; వంగియుండిన విల్లంబువంటి కనుబొమలు; సం

పెంగమొగ్గవంటి ముక్కు; విశాలముగు లలాటముపైఁ దిలకము; వారి తియ్యనిపలుకులు; తుమ్మెదలుసమితము సిగ్గుపడుచుండినంత నల్లని తల వెంట్రుకలు; శిరముపైని, చతుష్కోణముగనుండిన పచ్చని 'టోపీ' యును; దానిలో నచ్చటచ్చట దూర్చియుంచిన పువ్వులమొగ్గలును; మూఁడు రేఖలుగల కంఠమును; ఆకంఠము శంఖమువంటిది-ఇంత చక్కని రామ లక్ష్మణులు మూఁడులోకములలోని చక్కఁదనమును మూటఁగట్టుచుండిరి.

దోహా 292

వారికంఠమునుండి నాగమణిహారములు వ్రేలుచుండెను; తులసి గళమాలనుసమితము వారు ధరించియుండిరి; (మణిహారముఁ బట్టి వారు రాజపుత్రులనియు, తులసిమాలఁబట్టి వారు మునివెంట నచ్చిరని యు తెలియును) వృషభముతో సమానముగు మహోన్నతముగు భుజ ములును, సింహమువంటి నడుమును, లెస్సగ బలిసియుండిన ఆజాను బాహువులును వారికిఁ గలవు.

చౌపాయ్ 277

కటిప్రదేశమునకు వా ంబులపొదిఁ గట్టుకొనిరి; వారు పీతాం బరములను ధరించిరి; ధనుర్బాణములను హస్తములతోఁ బట్టుకొని యుండిరి; పచ్చని యజ్ఞోపవీతములు వారి శరీరములపై, మెఱుపువలె జిగజిగలాడుచుండెను; వేయేల, నఖశిఖపర్యంతము, శృంగారము మూ ర్తీభవించినట్లు వారు కనఁబడిరి. వారిం జూచినవా రందఱు సంతుష్టాంత రంగులయిరి; ఒకనిమిష మయినను, వారు రెప్పపాట్లు వేయక, తదేక దృష్టితో వారిరువురఁ జూచుచుండిరి. ఆయన్నదమ్ముల నిరువురను జనక చక్రవర్తి చూచి, యానందభరితుఁడయ్యెను. జనకుఁడు విశ్వామిత్రుని పాదములఁ బట్టుకొని, యతనికి నమస్కరించెను; వినయవిధేయతలతో నతఁడు మునీశ్వరునకు యజ్ఞవాటికఁ జూపి, స్వగృహచరిత్రముఁ జెప్పె ను; రంగస్థలములో నాయాస్థలములఁ జూచుటకు రామలక్ష్మణులు వెళ్లినపుడు, ఆయాస్థలములలో నుండినజనులు, స్త్రీపురుషులు వారిం జూచి, నిశ్చేష్టులయిరి ఎవరికివా రతియాదరణతో రామునిఁ జూచిరి; కాని, యటుల నెందు కతనిని జూచిరో, వారు దానిమర్మముఁ గనుఁ గొనలేకపోయిరి. విశ్వామిత్రుఁడు యజ్ఞవాటికఁ జూచి, సంతోషించి,

దానిరచన మనోహరముగనుండెనని రాజుతోఁ జెప్పెను; అందుకు రాజు సంతోషించెను.

(జనకుఁడు చెప్పిన స్వగృహచరిత్రము:— (1) ఒకసమయమున జనకచక్రవర్తి శివునివిల్లుఁ బూజించుటకు సీతతోఁగూడి, గృహములో నుండి బయటకు వచ్చెను. ఇందుమూలమున, నతనికి శ్రమకలుగుచుండెనని సీత తలఁచి, ఆధనస్సును చేతితోఁ బట్టుకొని, తీసికొనివెళ్ళి గృహములోఁ బెట్టెను. (2) ఆధనస్సుఁ బూజించుటకుముందు, జనకుని భార్య వచ్చి దానిచుట్టు నలుకుచుండెను; ఆధనస్సు గృహములో నొక మూల నుండుటచేత, నామె మూఁడుప్రక్కలనుమాత్ర మలుకుచుండెను. ఒకరోజున నాపనిఁ జేయుట కామె సీతను బంపెను; ఆధనస్సును సీత బయటకుఁ దీసి, నలువైపుల నలికి, ముగ్గులఁబెట్టి, యథాప్రకారము దానిని నిలుపఁబెట్టెను; ఆసంగతి జనకుఁడు భార్యవలన విని, యాశ్చర్య పడెను. (3) మఱియొకసమయమున, సీత చెలికత్తెలతోఁ 'చెమ్మచెక్క' ఆట నాడుచుండెను; అంతట, నాటలో నామెచెయ్యి ధనస్సునకుఁ దగిలెను; అందుచేత నాధనస్సులో నొకముక్క యూడిపోయెను- ఈ కారణములచేత, నామె జనకుఁడు ప్రతిజ్ఞఁబూనెను.)

దోహా 293

అచ్చటనుండిన సింహాసనములలో నొక విశాలమగు చక్కని యున్న తాసనముపై విశ్వామిత్రుని, రాజకుమారుల నిరువురను, జనకుఁడు స్వయముగఁ గూర్చుండఁబెట్టెను.

చౌపాయ్ 278

చంద్రునిఁజూచి, నక్షత్రములు వెలవెలఁబోవుచందమున, రామలక్ష్మణులఁ జూచి, పృథ్వీపతులందఱు తెల్లబోయిరి; రాముఁడు తప్పక ధనుస్సును విఱువగలఁడు; అందులకు సందేహములేదని రాజులు వారిలోవారు నిశ్చయించుకొనిరి; ఒకవేళ, రాముఁడు ధనుస్సును విఱువలేకపోయినను, నిశ్చయముగ జయమాలను రాముని మెడలో సీత వేయును. ఓసోదరులారా! ఈప్రకారము రాజులు చింతించి, జయముఁ బోఁగొట్టుకొని, శౌర్యమును విడనాడి, బలహీనులై స్వగృహములకు నిష్క్రమింపుఁడు. ఈమాటల నొకదురభిమానియగు రాజు విని,

"రాముఁడు ధనస్సును విఱచినను, సీతను వివాహమాడుట కష్టముకదా! అట్టిస్థితిలో, నతఁడు శివుని విల్లును విఱువక, సీత నెట్లు వివాహమాడఁ గలఁడు? ఒకవేళ కాలుఁడు మనమీఁదికి యుద్ధమునకు వచ్చినను, సీత కొఱకు మన మతనితోఁ బోరాడఁగలము" అని యజ్ఞానముచేఁ బలికి, నవ్వెను. ఈరాజు ప్రగల్భములను దదితరరాజులు విని, పక్కున నవ్విరి; వారు చతురులు; హరిదాసులు; ధర్మాత్ములు! అతనిపిచ్చిమాటలను వారు లక్ష్యముఁ జేయలేదు.

సోరఠా 34

"ఓక్షత్రియులారా! మీ రెంత నిర్ఘాతము పడినను, రాముఁడు తప్పక సీతను వివాహమాడును; ఈదశరథమహారాజు పుత్త్రులు రణధీరులు; మహాశూరులు; వీరితో నెవరు యుద్ధముఁజేసి నిలువఁగలరు?

చౌపాయ్ 279

"విశేషము మాటలనుపయోగించుటవలనఁ బ్రయోజనము లేదు; లడ్డువములను భుజించితిమని యూహించినయెడల, నాకలితీరునా? నా యుపదేశమును లెస్సగ గ్రహింపుఁడు; శ్రీసీతారాములు జగత్తులకు జననీజనకులని తెలిసికొనుఁడు. కన్నులార వారిచక్కదనముఁ జూచి సంతసింపుఁడు; ఈసకలగుణసంపన్నులు, ఈసకలసుఖధాములు, ఈదివ్యమంగళవిగ్రహులు, ఈరామలక్ష్మణులు సదా శ్రీసాంబశివుని హృదయములో నివసించియుందురు; చేతిలోనుండిన యమృతమును విడిచిపెట్టి, మృగతృష్ణలోని జలమున కాసపడి, యెవరైనను జనిపోవుటకుఁ బ్రయత్నించెదరా? మీబుద్ధికిఁ దోఁచినవిధమున సంచరింపుఁడు; ఈరోజున మనజన్మములు సఫలమయ్యెనని నాతాత్పర్యము" అని వారిలో నొక ధర్మాత్ముఁడగు రాజు పలికెను. తదుపరి, పుణ్యాత్ములగు రాజులు శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ జూచి యానందించిరి. దేవతలు విమానారూఢులై, యంతరిక్షమున నిలిచియుండిరి; పుష్పములను వర్షించిరి; పాటలఁ బాడిరి; నృత్యములఁ జేసిరి.

దోహా 294

అనవ సమయముఁ జూచి జనకచక్రవర్తి జానకికి వర్తమానముఁ బంపెను; చక్కని సరసలగు చెలికత్తెలామెను వెంటఁ దీసికొని వచ్చిరి.

చౌపాయ్ 280

ఆశ్రీమాత, ఆపద్మునైశ్వర్యసంపన్నురాలు, ఆజగజ్జనని, ఆజానకి యొక్కరూపురేఖావిలాసమును వర్ణించుట కెవరు సమర్థులు? ప్రాకృతస్త్రీలను వర్ణించునపుడు చెప్పుచుండిన యుపమానములను సీత విషయములోఁ జెప్పుట యుచితముకాదు; ఆయుపమానములు సరిపడవు; ఆయుపమానములఁ జప్పి, యేకవీశ్వరుఁడు సీచకవియని పేరుఁబొంది, ఆయపకీర్తిని భరించును! ఒకవేళ నామెను ప్రాకృతస్త్రీలతో సరిపోల్చినను, సీతవంటి చక్కనిస్త్రీలు లోకములోఁ గనఁబడరే! ఒకవేళ నామెను దేవతాస్త్రీలతో సరిపోల్చినను, వారిలోఁగూడ లోపములు కనఁబడును; సరస్వతి, మాటలమారి; భవానీ భర్తశరీరములో సగము నాక్రమించెను; రతీదేవి, కాముకురాలు; ప్రద్యుమ్నయోగముచే పిలపించును; ఆమెభర్త యనంగుఁడు; మదిరమును, విషమును- ఈరెండు లక్ష్మికిఁ దోఁబుట్టువులు; అట్టిలక్ష్మితో సీత సమానురాలనని యెట్లు చెప్పఁగలను! లావణ్యమే, క్షీరసముద్రము; శృంగారమే, దానిలో నొకకచ్ఛపము (కూర్మము); శోభయే, త్రాడు; సింగారరసమునట్టి మంథరపర్వతమును, కాముఁడు తనత్రాళ్లతో, కవ్వమువలె, క్షీరసాగరమును మథించెను. కమలములవంటి హస్తములతో నతఁడాసముద్రమును మథించును.

దోహా 295

ఇట్లు లావణ్యమను క్షీరసముద్రమును మథింపినందున, సకలసుఖములకు మూలమగు లక్ష్మి పుట్టును, ఈవిధమునఁ బుట్టిన లక్ష్మిని సయితము జానకితో సరిబోల్చినను, కవీశ్వరుఁడు సిగ్గుపడును.

చౌపాయ్ 281

సభలలో నెట్లు చమత్కారముగ సంచరింపవలయునో, ఆవిధానముఁ దెలిసినచెలికత్తెలు సీతను వెంటఁబెట్టుకొని సభలోనికి వచ్చిరి; వారు శ్రావ్యముగ గానముఁజేయుచుండిరి. నవనమము లులుకుచుండిన శరీరముపై నామె సరిగంచుకోకను వల్లెవాటు వైచుకొనెను; ఆజగన్మాత, ఆజాళువాబొమ్మ, కోటిమెఱుపులవలె, నాసభలోనికి వచ్చెను; జనులమనస్సులు కదులుఁదప్పెను; వారిదృష్టులు విఱుచుకొట్లుగ్రమ్మెను.

(ఇచ్చట శృంగారరసము వర్ణింపఁబడెను; శృంగారమునకును శాంత మునకును రసాభాసమగును—అయిన, నా రెండురసముల నొకవిధ మున సమర్థింపవచ్చును: శృంగారమువలన స్థానముఁ దప్పిన మనస్సులు శాంతరసమువలన స్థానముఁ బొందెను.) రంభాది దేవతాస్త్రీలశరీర ములు దుర్భిక్షముచే సీరసించి, కృశించెను; కాని జానకి శరీరసౌష్ఠ వము సుభిక్షముఁ దెలియజేయును. ఆయూయవయవముల కనుగుణ్య ముగ చెలికత్తెలామెను భూషణములతో నలంకరించిరి. సభామండప ములో నామె పాదముఁబెట్టినంతలో, స్త్రీపురుషు లామెంజూచి, నిశ్చేష్టులయిరి. దేవదుందుభులు మ్రోఁగెను; గంధర్వులు పాడిరి; అప్స రసలు నాట్యముఁజేసిరి; దేవతలు పుష్పములను వర్షించిరి. హస్తకమల ముతో నామె జయమాలికను పట్టుకొనియుండెను. క్రేగంటిచూపు లతో నామె పరిపంథిరాజచక్రంబును వీక్షించెను. ఆమెచిత్తము తత్త రపడి, రఘునాథునివైపు పరుగెత్తుచుండెను; ఆమెం జూచి, రాజులమ నస్సులు జాతెను. విశ్వామిత్రుసప్రక్కఁ గూర్చుండి యుండిన, రాజకు మారుల సిరుపుర నామె చూచెను; వస్తువు దొరికినను, లేక నవనిధు లలో నొకటి యకస్మాత్తుగ లభించినను, సంతోషించువిధమున, నామె వారిం జూచి, పరమానందముఁ బొందెను. ఆమెయానంద మపరిమిత మయ్యెను.

దోహా 296

ఆమహాజనసభను సీతఁ జూచి, ముగ్ధరాలు కనుక భయపడి, సిగ్గుపడెను; శ్రీరాముని దివ్యరూపమును హృదయములో నామె గ్ర హించి, చెలికత్తెలవైపుఁ దిరిగిచూచెను.

చౌపాయ్ 282

శ్రీరాముని లావణ్యమును, సీత నవకమును, స్త్రీపురుషులు చూ చిచూచి నిశ్చేష్టులయిరి; వారు రెప్పపాటువేయక, వారిం జూచుచుం డిరి. "ఓభగవంతుఁడా! జనకునిమూర్ఖ్యముఁ బోఁగొట్టుము; మావంటి బుద్ధినే, రాజునకు దయచేయుము; ఈదినముతో యజ్ఞదీక్ష సమాప్త మగును. వ్యవధిలేదు; కనుక, శీఘ్రముగ రాజునకు మంచిబుద్ధిఁ గలుగఁ జేయుము; సంకోచములేక, ప్రతిజ్ఞనువిడిచి, జనకుఁడు రామునకు సీత

నిచ్చి, వివాహముఁ జేయుఁగాక! అటులఁ జేయుట సర్వజనసమ్మతము; అందువలన మేము సంతోషించెదము; అటుగాదు మూర్ఖముఁగొని యాఱీతిగఁ జేయని యెడల, మాహృదయములు పరితపించును." అని సభికులు వారిలో వారు నిశ్చయించుకొని, భగవంతునిఁ బ్రార్థించుచుండిరి. ఈమనోవాంఛితములో వారు మునిఁగియుండిరి; ఆ మేఘశ్యాముఁడే, జానకికిఁ దగిన వరుఁ డని వారు నిశ్చయించిరి.

(అధికపాఠము. అంతలో నాసభకు బాణాసురుఁడును రావణాసురుఁడును వచ్చిరి; వారిరువురం జూచి, సభికులు భయపడిరి; భగవంతుఁ డేమిఁ జేయునో యని వారు విచారించుచుండిరి.

సభికులు వారిలోవా రిట్లు గుసగుసలాడిరి:—"ఈయిరువురలో నొకనికిఁ బదిశిరస్సులును, ఇరువదిభుజములును కలవు; వానిశరీరము పర్వతమువలె, డోలాయమానముగు నున్నది. ఇంకను రెండవవానికి యొకశిరస్సును, సహస్రబాహువులు కలవు; వారిలలాటమున నెఱ్ఱని చందనత్రిపుండ్రములు శోభిల్లుచున్నవి; వారికంఠమున రుద్రాక్షమాలలు ప్రకాశించుచున్నవి; వారు శరీరమునను భస్మమును ధరించినవారు; వారు మహాబలవంతులు; జగత్తులను జయింపఁగలిగిన పరాక్రమవంతులు; భయమును కలిగించు భయంకరరూపములను వారు ధరించియుండిరి. ఆహా! దైవమా! ఈయిరువురు ధనుస్సును విఱువఁగలరేమో కదా! ఏమియుపాయముకలదు; ఓస్వామీ! ఈయుపద్రవమును నీవే తప్పింపవలయును." అని వారిలో వారు చింతించుచుండిరి. అంతలో రావణుఁడు వచ్చి, "జానకిం దీసికొని రండు- ఆనె యెచ్చటనుండును? ఈధనస్సును విఱిచి, నే నామెం దీసికొనిపోయెదను." అని పలికెను. వానిమాటలను బాణాసురుఁడు విని, "ఓరీ రావణా! ఇది పరమగురువుధనస్సు, ఆలోచించి, ప్రగల్భములు పలుకుము. ఓరి! నీకు దురభిమానము బలసెను" అని వానిని గర్జించెను. "ఓరీ బాణుఁడా! నాభుజదండములు జగత్తును ముక్కలుముక్కలుగ ఖండించెను; కాలుఁడు నన్నుఁ జూచి, భయపడి, లోకమును విడిచి పారిపోయెను నాప్రతాపము నవద్వీపములలో వ్యాపించెను; నాప్రతాపముఁ జూచి, సిగ్గుపడి, సూర్యుఁడు మానమును ధరించి, యంతరిక్షమున సంచరించును. కుబేరుఁడు నాకుఁ

బన్నుఁజెల్లించి, దరిద్రుఁడయ్యెను. నాధనుష్టంకారమును దేవేంద్రుఁడు విని, భయపడును. ఛత్రమునువలె, మేరుపర్వతమును మీఁదికి యెత్తియుంటిని. ఈప్రాంతగిల్లిన శివునివిల్లును విఱుచుటకు నాకు దురభిమానమేల?" "ఓరీరావణా! నీవు పాపాత్ముఁడవు; నీకు న్యాయములేదు. ఓరీ! వినుము; ఆభగవంతుఁడు, ఆత్రిలోకాధిపతి, సకలవరములనిచ్చు పరమేశ్వరుఁడు, మూఁడడుగులభూమిని యాచించుటకు వామనరూపమును ధరించి, మాతండ్రివద్దకు వచ్చెను. అతనివేషమును బలిచక్రవర్తి గ్రహించి, ఆశాభంగముం జేయక, వరము నొసని కిచ్చెను. 'ఓవామనుఁడా! నాతో హాస్యముంజేయుచుంటివా?' అని నాతండ్రి రోషముతోఁ బలికెను; 'నాగౌరవము నాలోచింపక, వరము నడుగుము' అని యతఁడు చెప్పెను. నాతండ్రి నిష్ఠురవాక్యములఁ బలుకుచుండినను, నేను జలమును ధారపోసియుంటిని. అతనికీర్తి మూఁడులోకములలో వ్యాపించెను. అందువలన నాకేమియు గర్వములేదు."-"ఓరీబాణుఁడా! ఒకశిరస్సుగలవానిమాట జెప్పనేల? వెయ్యిశిరస్సులపై శేషుఁడు భూమిని ధరించును; ఆవగింజలవలె, ననేకకోట్ల బ్రహ్మాండములను శిరస్సుపై శివుఁడు ధరించును. ఆశివుఁడా శేషువు నొకకంఠమాలికగ ధరించెను కదా! ఆశివుఁడు కైలాసపర్వతముపై నివసించియుండును; ఆపర్వతమును నే నొకహస్తముతో మీఁదికి యెత్తియుంటిని. అందుచేత, నాకెందుకు గర్వముండదు? శ్రీసాంబశివుఁడు నన్ను గుఱించి, సదా ప్రశంసించుచుండును."—"ఓరీరావణా! ఇది శివుని పురాణధనస్సు కాదు; ఇది దృఢమగుధనస్సు; వజ్రములోని సారముందీసి, బ్రహ్మ దానిని రచించెను ఓరీ! నీవు దానిగురుత్వమును గ్రహింపలేదు; నామంచిమాటను మన్నింపవు. దీనిమూలమున నీకు శృంగభంగమగును; అందుచేత, నీవు దానిని విఱుచుటకు సిద్ధపడు చుంటివి; నీబలముకంటె రెండింతలు ప్రగల్భములు బలుకుచుంటివి."—"ఓరీ బాణుఁడా! ఈధనస్సును విఱచి, నీమానము నణంచెదను. నీపట్టణముఁ దీసికొనిపోయి, సముద్రములో ముంచెదను." ఈప్రకారము రావణుఁడు పలికి, శివునివిల్లువద్దకు వెళ్లి, దానిని యెత్తుట కారంభించెను; కాని, వాఁడు దానిని లేశమైనఁ గదలింపలేకపోయెను. అప్పుడు బాణాసురుఁడు వానిని హాస్యముఁ

జేయ నారంభించెను. "ఓరీ దౌర్భాగ్యుఁడా! ఓసభికులారా! వానియ వస్థఁ జూడుఁడు. అలసిపోయి, యెట్లు వాఁడు నిట్టూర్పులను విడుచు చుండెనో, చూడుఁడు; తాళవృక్షములవంటి వానిభుజములు గడగడ వడఁకుచుండెను. క్రిందుమీఁదుబడి, వాఁడు దానినిఁ గదలించుట కెట్లు ప్రయత్నించుచుండెనో, చూడుఁడు. వానిప్రయత్నము లన్నియు వ్యర్థమయ్యెను. ఆవగింజంతయినను ధనస్సు కదలలేదు భూమిమాత్రము కదలుచుండెను. ఓహో! కోపముచేత నెట్లు దంతములను వాఁడు పటపటమని కొఱుకుచుండెనో వినుఁడు. శివునికృపవలన, వీనిగర్వమునకుఁ దగినప్రాయశ్చిత్తమయ్యెనని, తలంచెదను." ఈప్రకారము బాణాసురుఁడు పలికి, శివునివిల్లునకుఁ బ్రదక్షిణనమస్కారములఁ జేసి, స్వగృహమునకు నిష్క్రమించెను. "ఈధనస్సునకుఁ జిల్లింగిపెట్టినట్లు కనఁబడును. నేను జానకినిమాత్రము తీసికొనిపోయెదను." అని రావణుఁడు పలికెను. అంతలో నాకాశవాణి, ఓరావణా! నీకన్య కుంభీనసను మధుదైత్యుఁడు దొంగిలించికొనిపోయెను. మేఘనాదుఁడు యజ్ఞముఁ జేయుచుండెను; విభీషణుఁడు తపములోనుండెను; కుంభకర్ణుఁడు గాఢనిద్రలోనుండెను." అని చెప్పెను. ఆమాటలను రావణుఁడు విని, దుఃఖించి, "ఇప్పటికి నేను విరమించెదను; ఆదైత్యుని సంహారించెదను" అనిపలికి, శీఘ్రముగ వెడలిపోయెను. బిరుదు నామావళులను బఠించెడు భట్రాజులను జనకచక్రవర్తి పిలిపించెను; వారు శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ జూచి, మైమఱచియుండిరి. "ఓయీ! మీరు నాప్రతిజ్ఞను వెల్లడిచేయుఁడు" అని చక్రవర్తి యాజ్ఞాపించెను. అతి యుత్సాహముతో వారు రాజాజ్ఞను శిరసావహించిరి.

దోహా 297

"ఓరాజులారా! భుజములను మీఁదికి నెత్తి చెప్పుచున్నాము. సావధానముగ వినుఁడు. విదేహరాజు ప్రతిజ్ఞను వినుఁడు. ('విదేహుఁడు' అని చెప్పుటకుఁ గారణమేమి? రాజుప్రతిజ్ఞమాత్రము భట్రాజుల కిష్టము లేదు. దేహధారు లిట్టిప్రతిజ్ఞఁ జేయరని వారి యభిప్రాయము.)

చౌపాయ్

"ఓమహారాజులారా! మీబాహుబలమును చంద్రబింబమును ధనస్సనేరాహువు మ్రింగును దానిభారమును కాఠిన్యమును మీకు విశదము. బాణాసురుఁడును, రావణాసురుఁడును మహాబలవంతులు; వారికినయితము శృంగభంగమయ్యెను. వారు సిగ్గుపడి, నిష్క్రమించిరి. ఈశివుని కోదండము కఠోరము. ఈరోజుతో యజ్ఞదీక్ష సమాప్తమగును; వ్యవధిలేదు. కనుక, మీరు దానిని విఱిచినందున, మీకీర్తి మూఁడులోకములలో వ్యాపించును; విఱిచినవారు జానకిని వివాహమాడఁగలరు; లేనియెడల, నపకీర్తివచ్చును; జానకి లభింపదు. ఈసంగతిని విచారింపుఁడు." ఈమాటలను వినినందున, వారికి యభిలాష పుట్టెను. బలవంతులమని విఱ్ఱవీగుచుండిన రాజులకుఁ గ్రోధమును పౌరుషము నధికమయ్యెను. ఇష్టదేవతలఁ బ్రార్థించి, వారు నడుములను బిగించుకొని, దిగ్గున లేచిరి. (ప్రశ్న :—ఇష్టదేవతలను వారు ప్రార్థించిరికదా! వారిమనోరథ మేల సఫలముకాలేదు ? 'శిరనా-ఈ'='శిర న నవాయా' వారు శిరస్సులను వంచి, నమస్కరింపలేదు;) అతి తమకముతో వారు ధనస్సును తాకి, దానిని మీఁదికెత్తుటకుఁ బ్రయత్నించిరి; కాని, వారి ప్రయత్నము లన్నియు వ్యర్థము లయ్యెను; ఏపాటియో జ్ఞానముఁగలరాజులు మాత్రము దానివద్దకు వెళ్లలేదు.

దోహా 298

అనేకవిధముల వారు ప్రయత్నించిరి; కాని, వారి ప్రయత్నములు నిష్ఫలమయ్యెను. వారు సిగ్గుపడి నిష్క్రమించిరి. ఒక్కొక్క రాజు దానిని స్పృశించిన మాత్రమున, నంతకంతకు దానిబల మధికమయ్యెను.

చౌపాయ్

ఒకముహూర్తమున పదివేలమంది రాజులు దానిని మీఁదికియెత్తుటకుఁ బ్రయత్నించిరి ; కాని, వారిసాంఘికబలము వ్యర్థమయ్యెను; కాముకుని వచనములకు మహాపతివ్రత చలింపనివిధమున, నాధనస్సు కొంచెమయినను చలింపలేదు. వైరాగ్యములేని సన్యాసివలె, నారాజులందఱు హాస్యమునకుఁ బాత్రులయిరి. కీర్తిని, విజయమును, వీరత్వము మొదలగువానిని విడిచిపెట్టి రాజులు నిష్క్రమించిరి. ఆయారాజులు

కళాహీనులై, సభలోఁ గూర్చుండిరి. వారివచనములను జనకచక్రవర్తి విని, వ్యాకులపడి, రోషముతో నిట్లు పలికెను. "ఓ రాజులారా! నా ప్రతిజ్ఞను విని, ఆయాద్వీపములనుండి రాజు లనేకులు వచ్చిరి. స్వర్గవాసులును, పాతాళవాసులును - మనుజరూపములను ధరించి, దేవాసురులును - పృథ్వీవాసులును, వీరులును, రణధీరులును, యజ్ఞమునకు వచ్చిరి.

దోహా 299

"నాకుమారి, జానకి చక్కఁదనముఁ జెప్పుటకు శక్యముకాదు. నాకన్యకు మూర్తీభవించిన శృంగారము. ఆహా! భగవంతుఁడా! ఈధనస్సును విఱిచి, మూఁడులోకములలోఁ గీర్తిఁ బొంది, నాకుమారితను వివాహమాడుటకుఁ దగిన వానిని బ్రహ్మదేవుఁడు పుట్టించలేదని తోఁచును.

చౌపాయ్

"ఓసోదరులారా! ఈధనస్సు మీకు స్వాధీనము కాలేదు; నా కన్యయు మీకు లభించదు. దానిని లేశమైనను గదలించలేదు; ఇఁక దానిని విఱుచుట యెట్లు? ఆవగింజం తయినను మీరు దానిని గదలింపలేదు. మీవీరాలాపములఁ గట్టిపెట్టుఁడు; లోకములో వీరుఁడను వాఁడు లేఁడు. మీయాశలను విడిచి, మీమీగృహములకుఁ బొండు. మాజానకికి వివాహకాలము సమీపింపలేదు; ఆమెకు బ్రహ్మ మూఁడు ముళ్లను వేయలేదు. నాప్రతిజ్ఞను విడిచిపెట్టిన, నాపుణ్యము నశించును. నేనేమి చేయఁగలను? అవివాహితయై జానకి యుండును. లోకములో వీరులులేరా? నాప్రతిజ్ఞ వ్యర్థమగునా?" ఈప్రకారము జనకచక్రవర్తి పలికిన పలుకులను స్త్రీపురుషులు విని, జానకింజూచి, దుఃఖించిరి. ఆమాటలకు లక్ష్మణునకుఁ గోపమువచ్చెను; అతని నేత్రములవెంబడి నిప్పులురాలెను; అతని కనుబొమలు ముడివడెను.

దోహా 300

అతఁడు రామునకు భయపడి యూరకుండెను; కాని, జనకుని వచనములతని హృదయమునకు బాణములవలెఁ దగిలెను. తుదకతఁడు శ్రీరామునకు నమస్కరించి, యిట్లు ప్రతిజ్ఞఁ జేసెను.

చౌపాయి

"ఓసభికులారా! ఏసభలోనయిన రఘువంశస్థు లుండినప్పు డా సభలో నిట్టి యసందర్భపుఁబలుకులం బలుకుట యనుచితము. మా రఘు కులమణి యగు శ్రీరాముఁ డీసభలోఁ గూర్చుండియుండెను; అతనిని లక్ష్యముఁజేయక, జనకచక్రవర్తి యనుచితవాక్యములఁ బలికెను. ఓ సూర్యకుల కమలబాంధవుఁడా! శ్రీరామా! నామాటను మన్నింపుఁడు; నేను నాస్వభావముచేతఁ జెప్పుచుంటిని; కాని, దురభిమానముచేతఁ గాదు. మీరు సెలవు దయచేసినయెడల, బంతివలె, నేనీభూమిని మీఁదికి యెత్తఁగలను; పచ్చికుండనువలె, దానిని రెండువ్రక్కలఁ జేయఁగలను. ముల్లంగి దుంపనువలె, మేరుపర్వతమును విఱిచెదను. ఓ స్వామీ! మీప్రతాపమహాత్మ్యముల యెదుట, నీపురాణధనస్సనిన నేపాటివస్తువు? ఓనాథా! మీరు నామాటలను గ్రహించి, సెలవు నిచ్చిన యెడల, నే చేయఁబోయెడి కార్యముం జూచి, సంతోషింపుఁడు. కమల నాళమునువలె, నే నాధనస్సును నెక్కుఁబెట్టి నూరుయోజనములవఱకుఁ దీసికొని వెళ్లఁగలను.

దోహా 301

"ఓనాథా! మీప్రతాపముచేలన, నేనీధనస్సును గొడుగుదండ మువలె, మీఁదికి యెత్తలేకపోయినయెడల, నేను, మఱల ధనస్సును ముట్టను. ఇది నాప్రతిజ్ఞ."

చౌపాయి

ఈప్రకారము క్రోధతామ్రాక్షుఁడై, లక్ష్మణుఁడు పలికినందున, భూమియంతయుఁ గంపించెను. దిగ్గజములు భయపడెను. రాజులు మొదలగువారు వడఁకిరి; జానకి లోలోపున సంతసించెను; జనకచక్రవర్తి యాశ్చర్యపడెను. విశ్వామిత్రాదిమునులును, రామచంద్రుఁడును ప్రసన్నులయిరి; వారిశరీరములు పులకరించెను. శ్రీరాముఁడు సంజ్ఞఁజేసి, లక్ష్మణుని నివారించెను; తమ్ముని నాదరించి, తనసమీపమునఁ గూర్చుండఁబెట్టు కొనెను. మంచిసమయముఁ జూచి, విశ్వామిత్రుఁ డిట్లు మృదుమధురముగఁ బలికెను:—"ఓరామచంద్రా! లేలెమ్ము; శివునివిల్లును విఱిచి, జనకునిదుఃఖమును నివారింపుము." శ్రీరాముఁడు గురువుచరణములకు

నమస్కరించెను; హర్షవిషాదము లతనిమనస్సునకుఁ గలుగలేదు. మంచి కొలములో నుండిన మృగరాజువలె, నతఁడు దిగ్గునలేచి, నిశ్శంకగ నిలువఁబడెను.

దోహా 302

ధనుర్యజ్ఞమంటప మొక యుదయాచల పర్వతము; దానిపై, శ్రీరాముఁడు, ప్రాతఃకాల సూర్యునివలె నుదయించెను. కమలములవలె, సత్పురుషుల హృదయకమలములు వికసించెను; తుమ్మెదలకును వలె, సభికుల నేత్రముల కానందమయ్యెను.

చౌపాయ్

సూర్యోదయమువలన రాత్రి నశించువిధమున, జానకినిఁ బొందఁగల మనునట్టి రాజులయాశ భంగపడెను. ప్రాతఃకాలమున క్షణక్షణము నక్షత్రములు క్షీణించువిధమున, రాజుల ప్రలాపములు క్షీణించెను. కుముదములునువలె, దురభిమానము గల రాజులముఖములు ముకుళించుకొనెను. ఉలూకములవలెఁ, గపటము గల రాజులు నేత్రములను మూసికొనిరి. వియోగముచే దుఃఖించుచుండిన చక్రవాకమిథునమునకు సంయోగముకలిగి సంతసించువిధమున, మునులధర్మములకును, దేవతల సంపదలకును ప్రయోజనము కలిగెను; వారు పుష్పములను వర్షించి, వారివారి స్వకార్యములను నిర్వహించుచుండిరి. గురు చరణముల కతఁడు నమస్కరించి, వారిసెలవుఁ గైకొనెను. మదపుటేనుఁగువలె, నాజగత్స్వామి యజ్ఞమండపమునకు నడచెను; జనకనగరములోని స్త్రీపురుషులు రామునిఁ జూచి, సంతసించిరి; వారిశరీరములు పులకరించెను. వారు వారివారి పితృదేవతలకు నమస్కరించి, పుణ్యాత్ములను స్మరించి, "ఓగణాధిపా! ఓగురువులారా! మాపూర్వపుణ్య మేపాటియుండినను, దానిమూలమున, నీశివునివిల్లును, కమలనాళమునువలె, మారాముఁడు విఱుచునట్లు ప్రసాదింపుఁడు" అని ప్రార్థించిరి.

దోహా 303

జానకితల్లి శ్రీరామునిఁ జూచి, సంతసించి, చెలికత్తెలను దగ్గఱకుఁ బిలిచి, విశేషవ్యాకులముతో వారితో నిట్లు ప్రసంగించెను.

చౌపాయ్

"ఓసఖులారా ! స్త్రీపురుషు లీచోద్యముఁ జూడవచ్చిరి గాని, సత్యము రాజుతోఁ జెప్పఁగలవారు లేరు; మాహితవుఁ గోరినవారు లేరు 'ఓరాజా ! ఈపని యసందర్భము; ఇది నీకుఁ దగదు; వీరు కేవలము బాలురు. ఈధనస్సును రావణుఁడును బాణుఁడును మొగ లగు మహావీరులు విఱువలేకపోయిరి; రాజులుసయితము భంగపడిరి. అట్టికఠినధనస్సు నీరాజకుమారులచేతిలోఁ బెట్టుట న్యాయమా? మం దరాచలము నెత్తుటకు బాలమరాళమునకు సామర్థ్య ముండునా? ఓసఖు లారా! రాజులబుద్ధి చెడెను; విధికృతములు గూఢములు. ఈప్రకారము చక్రవర్తితోఁ జెప్పిన బాగుగనుండును-" ఈప్రకారము జానకితల్లి పలికిన పలుకులను విని, యొకచెలికత్తె రాణితో నిట్లు ప్రసంగించెను. "ఓతల్లీ! తేజోవంతులకు వయస్సుతోఁ బ్రసక్తిలేదు. అగస్త్యుఁ డనిన నేపాటి వాఁడు ? మహాసముద్రము నతఁడు పానముఁజేసెనుకదా ! ఆతనికీర్తి మూఁడులోకములలో వ్యాపించెను; సూర్యమండల మెంతపెద్దది ? ఆమండల ముదయించినవెంటనె, మూఁడులోకములలోఁ జీకటి నశిం చును.

దోహా 304

"ఓతల్లీ! మంత్ర మెంతచిన్నది; త్రిమూర్తు లామంత్రమునకు స్వాధీనులుకదా! మదపుటేనుఁగు, అంకుశమునకు వశ్యముకదా !

చౌపాయ్

"ఓతల్లీ! మన్మథుఁ డేపాటివాఁడు? పువ్వులబాణములఁ బ్రయో గించికదా యతఁడు లోకులను వశ్యముఁ జేసికొనుచుండును, ఓదేవీ! ఈసంగతులను గ్రహించి, సందేహమును విడిచిపెట్టుము; రామచం ద్రుఁడు తప్పక ధనస్సును విఱుచును." ఈప్రకారము సఖిచెప్పినమా టలను వినినందున, నామెకు విశ్వాసముపుట్టెను; ఆమెకు ధైర్యము కలిగెను; ఆమెవిషాదము పోయెను. జానకి శ్రీరామునిఁ జూచినందున, నామెమనస్సులో భయభీత్యావహమయ్యెను. (విదేహరాజకూఁతురు వైదేహి; దేహములేనియాఁడది వైదేహి. ఆమెకు స్మారకముతప్పెను; కనుక, నామె పరవశురాలయ్యెను.) ఆమె లోలోపల విచారించెను. "ఓపార్వతీ పరమేశ్వరులారా! నన్ను రక్షింపుఁడు; మీరు పురాణదం

పతులు; మిమ్ములనే నమ్మి, సేవించియుంటిని; నాయందు మీకుఁ బూర్ణముగుదయ యుండినయెడల, నీధనస్సు బరువును మీరు తగ్గింపుఁడు. ఓగణాధిపా! ఓవిఘ్నరాజా! ఈరోజుకార్యము నిర్విఘ్నముగ నెరవేఱుటకు నిన్ను నే నారాధించియుంటిని. మాటిమాటికి మిమ్ములఁ బ్రార్థించెదను; ఆధనస్సుబరువును దగ్గింపుఁడు." ఈప్రకారము సీత మనస్సులోఁ బ్రార్థించెను.

దోహా 305

జానకి శ్రీరాముని జూచి సంతసించి, దేవతలను బ్రార్థించి, ధైర్యము నవలంబించెను. ఆమెనేత్రములవెంబడి, ఆనందబాష్పములు కాఱెను; ఆమెశరీరము పులకరించెను.

చౌపాయ్

ఆమె కన్నులారా నతనిశోభఁ జూచి, లోలోపల సంతసించెను; జనకునిప్రతిజ్ఞను స్మరించి, శోభపడెను. "ఆహా! ఏమి మాతండ్రి యింతకఠినప్రతిజ్ఞఁ జేసెను! ఇది కేవలము మూర్ఖత్వము; దాని లాభాలాభములు నతఁడు గ్రహింపలేదు మంత్రులతనికి భయపడి, తగినవిధమున బుద్ధిఁజెప్పరు. ఆమంత్రులు మహాపండితులు; బుద్ధిమంతులు; ఇట్లు వారు యథేచ్ఛముగ నుండుట, వారికిఁ దగినపనికాదు. పిడుగువంటి ధనుస్సుయెక్కడ? అతికోమలుఁడు, శ్యామలగాత్రుఁడు, కేవలము కిశోరావస్థలోనుండిన రాముఁ డెక్కడ! ఓభగవంతుఁడా! నేనెట్లు ధైర్యముగ నుండఁగలను! శిరీషపుష్పములు వజ్రమును ఛేదింపఁగలుగునా? ఈసభికులమతి చెడిపోయెను. ఓశివునిధనుస్సా! నేను నీశరణుఁ జొచ్చెదను. నిజసత్వమును లోకులకిచ్చి, రామునకు నీవు లఘువగుము" ఈప్రకారము జానకి పలువిధములఁ దుఃఖించెను; ఒకత్రుటికాల మొకయుగమువలె నుండెను.

దోహా 306

ఒకసమయమున నామె రామునిఁ జూచును; మఱియొకసమయమున భూమిం జూచును. ఆమెనేత్రము లతిచంచలముగనుండెను. ఆమె ముఖచంద్రలక్ష్మీపరీవాహమునందు నామెలోచనములు రెండు మీనములువలెఁ జలించుచుండెను.

చౌపాయ్

ఆమెముఖ మొక కమలము; ఆమెవాక్కులు తుమ్మెదలు; ఆమె సిగ్గు రాత్రి; రాత్రి కమలము ముకుళించుకొనియుండును; అందుచేత, దానిలోనుండిన తుమ్మెదలు బయటకు రాజాలవు; అటుల, నామె ముఖకమలమునుండి, తుమ్మెదలువలె, మాటలు వెడలలేదు. ఆమె మాటఁ జెప్పఁదలఁచినను, చెప్పలేకపోయెను. లోభివానివద్దఁగల ధనమువలె, నామె నేత్రాంతమునఁ గన్నీరుబిందువు నిలిచియుండెను. అతివ్యాకులముచే నామెమనస్సునకు స్థిమితము లేకపోయెను. ఆమె తుదకు ధైర్యము నవలంబించెను; ఆమెకు విశ్వాసము కలిగెను. "త్రికరణశుద్ధిగ నాలో నేపాటిసత్య ముండినను, నాకు శ్రీరాముని చరణకమలములయం దనురాగ ముండినను, సర్వజంతువులహృదయములలో సాక్షీభూతుఁడుగ నుండినభగవంతుఁడు నన్ను శ్రీరాముని సేవకురాలుగఁ జేయును ఎప్పుడు స్త్రీపురుషులు శుద్ధాంతఃకరణము లన్యోన్యానురాగముచేఁ గలియుదురో, అప్పుడే వారికి సంఘటన మగును. అందులకు సందేహము లేదు." ఈప్రకార మామె రామునిఁ జూచి, ప్రతిజ్ఞఁ జేసెను. శ్రీరామునిపొత్తు సమకూడని యెడల, దేహమును విడిచెదనని యామె చేసినప్రతిజ్ఞ నాకృపాసిధానుఁడగు రాముఁడు గ్రహించెను. అతఁడు జానకిం జూచి, గరుత్మంతుఁడు సర్పమునువలె, ధనస్సును వీక్షించెను.

దోహా 307

శ్రీరాముఁడు శివునిధనస్సును స్పర్శించుటకు సిద్ధముగ నుండుట లక్ష్మణుఁడు చూచెను; అతనిశరీరము పులకరించెను; అతఁడు పాదముతో భూమినిఁ ద్రొక్కిపెట్టియుంచెను.

చౌపాయ్

"ఓదిగ్గజములారా! శేష కచ్ఛప వరాహములారా! ధైర్యముగ భూమిని ధరింపుఁడు; శ్రీరాముఁడు శివునివిల్లును విఱుచుటకు సిద్ధముగ నుండెను; కనుక, భూమి చలింపకుండ, నామెను మీరు కాపాడుఁడు. ఈనాయాజ్ఞను మన్నింపుఁడు." ఈప్రకారము రామానుజుఁడు పలికెను; అంతలో శ్రీరామమూర్తి ధనస్సునద్దకు వచ్చెను. "ఓదేవతలారా! మాపూర్వపుణ్యమువలన, మీరు రాముని రక్షింపుఁడు" అని స్త్రీపురుషులు ప్రార్థించిరి. సకలజనుల సంశయములును, మందమతులగు రా

రాజుల దురభిమానమును, పరశురాముని గర్వమును గురుత్వమును, దేవమునిబృందముల భయమును, జానకి శోకమును, జనకుని పశ్చాత్తాపమును, రాజ్ఞి దారుణదుఃఖమును—ఈమొదలగు సామగ్రుల నొకతెప్పమీఁదఁ బెట్టి, అపారమగు శ్రీరాముని బాహుబల మనునట్టి మహాసముద్రముమీఁద, దానిని విడిచిపెట్టిరి; దానినిఁ గడుపుటకుఁ దగిన చుక్కానివాఁడు లేడు. ఆమహాసముద్రమును దాఁటుటయెట్లు?

దోహా 308

చిత్తరువు బొమ్మలవలె జూచుచుండిన సభికులను శ్రీరాముఁడు చూచెను; ఆకృపాసముద్రుఁడు, తదుపరి, జానకిని వీక్షించెను; ఆమె వ్యాకులముతోనుండిన ట్లతఁడు గ్రహించెను.

చౌపాయ్

ఒకనిమిష మొకకల్పమువలె, నామె గడపుచుండెను; ఆమె మనోవ్యాకులమున కంతములేదు. అత్యంతదాహము చేతఁ బ్రాణములను విడిచినతరువాత, నమృతతటాకము నాదేహమునకుఁ జూపించుట వలన, నేమిప్రయోజనముకలదు? వరిపొలము లెండినతరువాత, వర్షించిన నేమిలాభము? హస్తము కాలినతరువాత, నాకులఁ బట్టుకొనిన నేమిలాభము! శ్రీరాముఁడు జానకిం జూచి, యీప్రకారము చింతించెను; ఆమెప్రేమాతిశయముల నతఁడు గ్రహించెను; అతనిశరీరము పులకరించెను. మనస్సులో నతఁడు గురుచరణములకు నమస్కరించి, సునాయాసముగ ధనస్సును మీఁదికియెత్తి పట్టుకొనెను. అతఁడు దానిని ధరించినపుడు, మెఱుపువలె, నది ప్రకాశించెను; అతఁడు దానిని వంచినపుడు, ఆకాశమువలె నది కనఁబడెను. దాని నెత్తుటయు, ధరించుటయు, సంధించుటయు- మొదలగుకార్యములు క్షణములో జరగెను; సభికులు చూచుచుండిరి; కాని, యీపనులుమాత్రము వారికిఁ గనఁబడలేదు. ఒకత్రుటిమాత్రకాలములో నతఁడు ధనస్సును విఱిచెను; దానిశబ్దము భూనభోంతరాళములు నిండెను.

ఛాంద్ 34

దాని కర్ణకఠోరమగుశబ్దము దిగంతములు నిండెను. ఆశబ్దమును విని, సూర్యునిగుఱ్ఱములు మార్గమునువిడిచి, తప్పుమార్గమునఁ బడెను.

దిగ్గజములు ఘూర్ణిల్లెను; భూమి వడఁకెను; శేష వరాహ కచ్ఛపములు భయపడి మూర్ఛిల్లెను. ఆశబ్దమును సురాసురమునిబృందములు, వారి వారిచెవులను మూసికొని, విచారించిరి; శ్రీరాముఁడు ధనస్సును విఱిచెనని తెలిసికొని, వారు సంతసించి, జయజయశబ్దములఁ బలికిరి.

సోరఠా 35

శివునిధన స్సొకతెప్ప; శ్రీరామునిబాహుబల మపారమగు మహాసముద్రము; ఆతెప్పమీఁదఁ బ్రయాణమగుచుండినవారు ఆసముద్రములోఁబడి మునిఁగిపోయిరి.

చౌపాయ్

ఆధనస్సును రెండు ముక్కలుజేసి, శ్రీరాముఁడు వానిని భూమిపైఁ బడవైచెను; వానినిఁ జూచి లోకులు సంతోషించిరి. విశ్వామిత్రుని పవిత్రమగురూపమే, యొకసముద్రము; శ్రీరామునియం దతనికి గలప్రేమయే, దానిజలములు; చంద్రోదయకాలమున సముద్ర ముప్పొంగువిధమున, శ్రీరామచంద్రుని విజృంభణమువలన, విశ్వామిత్రునిశరీరము పులకరించెను. అంతరిక్షమున దేవదుందుభులు మ్రోఁగెను; అప్సరసలు గానముఁజేసి, నాట్యమాడిరి. బ్రహ్మాదిదేవతలును, సనకాదిమునులును పలువిధముల శ్రీరాముని స్తుతించి, దీవించిరి. కిన్నరులు శ్రావ్యముగ బాడిరి; రంగురంగులపుష్పములతో నొకమాలికను దేవతలు సిద్ధముజేసిరి. లోకులు జయజయశబ్దములఁ బలికిరి. ఆధనుశ్శబ్దమును వర్ణించుటకు శక్యముకాదు. రాముఁడు శివునివిల్లును విఱిచెనని స్త్రీపురుషులు చెప్పకొనుచుండిరి.

దోహా 309

వందిమాగధసూతజనంబులును, భట్రాజులును, పూర్వపురుషుల కీర్తిప్రతిష్ఠలను వర్ణించిరి. ఏనుఁగులును, గుఱ్ఱములును, ధనమును, మణులును, చీనీచీనాంబరములును—ఈమొదలగు పదార్థములను రామునకు వారు దిగఁదుడిచిరి.

చౌపాయ్

భేరీమృదంగములు, 'ఢంకానౌపత్తు' శంఖములు—ఈమొదలగు పంచవాద్యములు మ్రోఁగెను. స్త్రీపురుషులు కోకిలస్వరములతోఁ బాటలఁ బాడిరి. ఎండిపోవుచుండినపుడు వర్షముపడిన నెట్లు వరిపొ

లము లుండునో, జనకునిభార్యయు, నామెచెలికత్తెలును పరమానందము బొందిరి. లోతగుజలములలో నీఁదుచుండినవాఁడు మెరకస్థలమునకు వచ్చి, సంతసించువిధమున, నాజనకచక్రవర్తి శోకార్ణవములో మునుంగుచుండి, ప్రస్తుతము దరిజేరి, ముదమందెను. సూర్యునియెదుట దీపములకాంతి క్షీణించువిధమున, నితరరాజులశోభ రాముని యెదుట నశించెను. చాతకములు స్వాతివర్షమునకు సంతసించువిధమున, జానకి పరమానందముబొందెను; ఆమెసంతోషమున కంతము లేదు. చకోరములు చంద్రునిఁ జూచువిధమున, లక్ష్మణుడు రామునిఁ జూచి యానందించెను. అంత, శతానందునియాజ్ఞాప్రకారము, సీతను రామునివద్దకుఁ దీసికొనివచ్చుటకు సన్నాహముఁ జేసిరి.

దోహా 310

ఆమెవెంటఁ జతురులగు చక్కని చెలికత్తెలు నడచిరి; ఆసఖులు మంగళాష్టకములఁ బాడుచుండిరి. బాలమరాళమువలె, నామెమందగమనంబున, నాచక్కదనాలకుప్ప, వెడలెను.

చౌపాయి

మూర్తిభవించిన ఛవులమధ్యను మహాఛవివలె, నామె సఖులమధ్యఁ బ్రకాశించెను. సకలదేశాధీశులకీర్తిని యొకపుష్పమాలికగఁ జేసినట్లు, యొకజయమాలిక నామెహస్తకమలములో ధరించెను. శరీరమంతటను సంకోచము వ్యాపించెను. ఆమెకు మనస్సులో నత్యంత ప్రసన్నతకలదు; ఆమె గూఢమగుప్రేమ పరులకుఁ గనఁబడదు ఆమె రాముని సమీపించి, యతని దివ్యమంగళవిగ్రహముఁ జూచి, కుడ్యములమీఁది చిత్తరువుబొమ్మవలె, నిలువఁబడెను. ఆమెయవస్థను సఖులు కనిపెట్టి, "ఓజానకీ! శ్రీవారిమెడకు జయమాలను దగిలింపుము" అని యామెతోఁ జెప్పిరి. ఆమె వారిమాటలను విని, పుష్పమాలికను రెండుచేతులతో మీఁదకునెత్తెను; కాని, యామె ప్రేమాతిశయములో మునిఁగి, పుష్పమాలికను రాముని మెడలోఁ దగిలింపలేకపోయెను. చంద్రునిముఖముఁ జూచి, పద్మమును, దానినాళమును ముకుళించుకొని పోవువిధమున, నామె రామచంద్రునిముఖముఁ జూచినందున, నామెహస్తములును, జయమాలికయు జాఱిపడెను. చెలికత్తెలు శ్రీరా

మునిం జూచి, పాటలం బాడిరి; అతనికంఠమునకు జానకి జయమాలి కను దగిలించెను.

సోరఠా 36

శ్రీరామునికంఠములో జయమాలికం జూచి, దేవతలు పుష్ప ములను వర్షించిరి. సూర్యోదయకాలమున, కుముదములు నిద్రించువి ధమున, రాజులముఖములు ముకుళించుకొనిపోయెను. ("ప్రముదితవర పత్నీమేకతస్తత్ క్షితిపతిమండల మన్యతోవితానమ్, ఉషసిసరఇవప్రఫుల్ల పద్మం కుముదవనప్రతిపన్న నిద్రమాసీత్" అని రఘువంశము-కాళి దాసు.)

చౌపాయ్

అంతరిక్షమున దేవదుందుభులును, నగరములో జయభేరులును మ్రోఁగెను. బ్రహ్మాదిదేవతలును, గరుడ, గంధర్వ, కిన్నర, యక్ష, నాగు లును, మనుజులును జయజయశబ్దములఁ బలికిరి; వారు శ్రీసీతారాము లను దీవించిరి. దుష్టులచిత్తములు మలినమయ్యెను; శిష్టులహృదయ ములు వికసించెను. గంధర్వస్త్రీలు పంచమస్వరముమీఁదఁ బాటలఁ బాడి, నాట్యమాడిరి; అంతరిక్షమునుండి, సంతతధారావృష్టిగ పుష్ప ములు గురిసెను. నలువైపుల వేదాధ్యయనసంపన్నులు సామవేదపన్న ములను గానముఁజేసిరి; వందిమాగధులు బిరుదావళుల నుచ్చరించిరి. శ్రీరాముఁడు శివునివిల్లును విఱిచెను; సీతను వివాహమాడునని, స్వర్గ మర్త్య పాతాళములలో వ్యాపించెను. పురజనులు, స్త్రీపురుషులు రామునకు నివాళులనిచ్చిరి; ధనమును లక్ష్యముఁజేయక, వారతనికి దిగఁదుడిచిరి. మూర్తీభవించిన శృంగారమోహములువలె, శ్రీసీతా రాములజోడు ప్రకాశించెను. "ఓజానకీ! నీనాథునిచరణకమలములకు నమస్కరింపుము" అని సఖులామెతో రహస్యముగఁ జెప్పిరి; కాని, యామె క్రొత్తపెండ్లికూఁతురు కనుక, సిగ్గుపడి, నమస్కారముఁ జేయ లేదు.

దోహా 311

శ్రీరామునిపాదములు సోకినంతమాత్రమున, గౌతమునిభా ర్యకు సంభవించినగతిని నామె స్మరించి, శ్రీరాముని చరణములను

స్పృశింపలేదు. ఆమె యలౌకికయనురాగమును రాముఁడు గ్రహించి, మనస్సులో సంతోషించెను. (ఆమెహస్తమునకు రత్నభూషణములు కలవు; శ్రీవారిపాదముల నవి స్పృశించినయెడల, నవి స్త్రీలుకాగలవు; ఆస్త్రీలం జూచి, రాముఁడు మోహించి తనను విడిచిపెట్టునని యామెకు భయముకలిగెను; అందుచేత, నతనిచరణములకు నమస్కారముఁ జేయలేదు.)

ఇతి శ్రీగోస్వామితులసీకృత శ్రీరామచరిత్రమానసే,
సకలకలికలుషవిధ్వంసనే, బాలకాండాంతర్గత
పండితజ్వాలాప్రసాదకృత వ్యాఖ్యానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
సప్తమవిశ్రామః.

---

# బాలకాండ అష్టమవిశ్రామః.

చౌపాయ్

ఆదుర్మార్గులు, ఆపాపాత్ములు, ఆసభికులలోని కొందఱురాజులు రోషాయత్తచిత్తులయిరి; వారు కామాతురులై, సీతం జూడ నారంభించిరి. ఆదౌర్భాగ్యులు, కవచములఁ దొడిగి, ధనుర్బాణములను ధరించి, ధీమని దిగ్గునలేచిరి. "అయ్యా! లేలెండు; మన మీజానకిని బలవంతముగఁ దీసికొనిపోయెదము. ఆరామలక్ష్మణుల నిరువురను బంధించెదము శివునిధనస్సు విఱిచినంతమాత్రమున లాభములేదు. మేము జీవించియుండ, నెవరు తెగువఁజేసి, జానకిని వివాహమాడఁగలరు? ఒకప్పుడు జనకుఁడు వారికి సహాయముఁ జేసినయెడల, నాముప్వురను యుద్ధములో నోడించెదము." ఈప్రకార మొకరాజు పలికిన ప్రగల్భములను మహాత్ములు విని, రాజమండలికి సిగ్గువచ్చునట్లు, ప్రత్యుత్తరము నిచ్చిరి.

"ఓరాజా! నీప్రతాపమును, నీవీరత్వమును, నీమర్యాదయును, ప్రస్తుతము ధనస్సును విఱుచుటకు నీవు ప్రయత్నించినపుడు, ప్రకటమయ్యెను. ఆప్రతాపమును గుఱించియేనా, నీవు ప్రగల్భములఁ బలుకుచుంటివి? లేక, ఇప్పటి కిప్పుడు క్రొత్తశూరత్వము నీలోఁ బుట్టెనా? ఈబుద్ధి కలదుకనుకనే, దేవునికృపవలన, నీకు శృంగభంగమయ్యెను.

దోహా 312

"శ్రీరామచంద్రునిఁ గన్నులారఁ జూడుము; ఈర్ష్యయు మదమోహములను విడిచిపెట్టుము. లక్ష్మణునిక్రోధము రగులుచున్నది; చూడుము. అతనిక్రోధాగ్ని నిన్ను దహించును. నీవు దానిలోఁ బడు మిడుతవు గాకుము.

చౌపాయ్

"గరుడునిభోగమును కాకి కోరినయెడల, లభించునా! సింహము భుజించుపదార్థము చెవులపిల్లికిఁ బ్రాప్తించునా? కారణములేక కోపముఁ దెచ్చుకొనినవానికి మనశ్శాంతి యెట్లుండును? శివద్రోహికి, శిరిసంపద

లును సౌఖ్యము కలుగునా? పరమలుబ్ధుఁడగు లోలుపునకుఁ గీర్తి యె ట్లువచ్చును? కామార్తులకుఁ గళంకము రాకయుండునా? భగవంతుని ధ్యానముఁజేయనివానికి ముక్తి లభించునా? అటులనే, జానకి మీపదార్థముకాదు. ఓరాజులారా! మీరు జానకి నభిలషించుట వ్యర్థము.'' ఈప్రకార మొక్కమహాత్ముఁడు రాజులకు బుద్ధిఁజెప్పెను. ఈకోలాహలమును జానకి విని, భయపడెను. ఆమెచెలికత్తెలామెను తల్లివద్దకుఁ దీసికొనివెళ్లిరి. జానకి సుగుణములను ప్రేమాతిశయములను రాముఁడు తనలోఁదాను జింతించుచు, విశ్వామిత్రునివద్దకు వచ్చెను. జానకియు, ఆమెతల్లియు, విలపించుచుండిరి. "అహా! భగవంతుఁ డేమిచేయదలఁచెనో కదా!'' అని వారుభయులు చింతించిరి. ఆరాజుల కోలాహలముచేత, వారిరువురిదృష్టి నలువైపులఁ జెదరుచుండెను. రామునకు భయపడి, లక్ష్మణుఁడు మౌనముధరించెను.

దోహా 313

లక్ష్మణుని నేత్రములు క్రోధముచే నెఱ్ఱబాఱెను; కనుబొమలను ముడుచుకొని, యతఁడు రౌద్రాకారుఁడై, రాజమండలిఁ జూచెను. మదపుటేనుఁగుల బృందముమీఁద సింహపుపిల్ల దాఁటుటకుఁ గోరిన విధమున, నతఁడు వారిమీఁదికి దుముకుట కభిలషించెను.

చౌపాయ్

ఈరాజులకోలాహలముఁ జూచి, స్త్రీపురుషులు వ్యాకులమొందిరి; వారు రాజులను పలువిధముల దూషించిరి. శివునివిల్లు భంగపడెనని విని, భృగుకులనూర్యాంశుఁడగు పరశురాముఁ డాసమయమున రాజసభకు వచ్చెను. ఆపరశురామునిఁ జూచి, సకలదేశాధిపతులు వెలవెలఁబోయిరి. డేగంజూచి, పిట్టలు భయపడినట్లు, రాజు లతనింజూచి, దిగులుపడిరి. అతనిశరీరము గౌరవర్ణము; అతఁడు నఖశిఖపర్యంతము విభూతిఁ బూసికొనెను. అతనివిశాలలలాటముపై, నూర్ధ్వపుండ్రములు ప్రకాశించెను. అతఁడు జటలను ముకుటముగ బంధించెను. చంద్రబింబమువంటి యతనిముఖము కోపాగ్నిచే మండుచుండెను. కోపముచే నతఁడు కనుబొమలను ముడిచి, నేత్రములనుండి నిప్పుఁగురియుచుండెను. అతఁడు రౌద్రాకారుఁడై, రాజమండలిని వీక్షించెను. వృషభము

వంటి బాహుస్కంధములు; విశాలమగు వక్షస్థలము; దీర్ఘములగు బాహువులు; దివ్యమగు యజ్ఞోపవీతము; చక్కని రుద్రాక్షమాల; వీపునకుఁ గట్టఁబడియుండిన కృష్ణాజినము; నడుమునకుఁ గాషాయవస్త్రము; రెండక్షయతూణీరములు; భుజమునకుఁ బరశువును; హస్తమున ధనుర్బాణములు-ఈ ప్రకారము పరశురాముఁడు యజ్ఞవాటికలోఁ బ్రవేశించెను.

దోహా 314

అతఁడు మునివేషమును ధరించినను, రూపముమాత్రము భయంకరముగనుండెను. మూర్తీభవించిన వీరరసము, మునివేషమును ధరించి, రాజులమధ్యకు వచ్చినట్లు తోఁచెను.

చౌపాయ్

ఆపరశురాముని తీక్ష్ణరూపముఁ జూచి, రాజులు వ్యాకులపడి, దిగ్గునలేచి నిలువఁబడిరి. వారివారి తాతతండ్రులపేర్లు జెప్పుకొని, వారొక్కొక్కరు పరశురామునకు సాష్టాంగనమస్కారములఁ జేసిరి. అతఁడు కటాక్షదృష్టితోఁ జూచినను, రాజులు వారివారిపుట్టిమునిఁగెనని భయపడిరి. పరశురామునకు జనకచక్రవర్తి నమస్కరించెను; తండ్రియాజ్ఞాప్రకారము జానకి వచ్చి, యతనికి నమస్కరించెను. "సౌభాగ్యవతీ భవ" అని యామె నతఁడు దీవించెను. ఆమె సంతోషించి, చెలికత్తెలతోఁ గూడి, నిష్క్రమించెను. అంతలో, నతనివద్దకు విశ్వామిత్రుఁడు వచ్చి, కుశలప్రశ్నఁ జేసెను; అతని యాజ్ఞాప్రకారము, శ్రీరామలక్ష్మణులు పరశురామునకు నమస్కరించిరి. "ఓభృగువంశోత్తమ రామా! వీరు రామలక్ష్మణులు; దశరథుని కుమారులు" అని విశ్వామిత్రుఁడు చెప్పెను. అన్నదమ్ములఁజూచి, పరశురాముఁడు సంతసించి, వారిని దీవించెను. కోటిమన్మథుల లావణ్యమును మించియుండిన శ్రీరాముని దివ్యమంగళవిగ్రహము నతఁడు చూచి, చూచి, నిశ్చేష్టుఁడయ్యెను.

దోహా 315

పరశురామునకు సర్వముఁ దెలిసినను, తెలియనివానివలె నతఁడు జనకచక్రవర్తిం జూచి, "ఓరాజా! ఈకౌతుకమునకుఁ గారణమేమి?" అని యడిగెను, నఖశిఖపర్యంత మతఁడు కోపముచేత నుబుకుచుండెను.

చౌపాయ్

రాజమండలి సమావేశ మగుటకుఁ గారణమును, ధనుర్భంగవృత్తాంతమును జనకుఁడు చెప్పెను. ఆ సరసపుమాటలను భృగునందనుఁడు విని, నలువైపుల బరికించి, విఱిగిపడియుండిన ధనస్సుఁ జూచెను. అతఁడు రౌద్రాకారుఁడై జనకునిజూచి, "ఓయీ మూర్ఖుఁడా! ఎవరీధనస్సు విఱిచిరి? శీఘ్రముగ వారిం జూపెంపుము; లేనియెడల, నిన్నును నీరాజ్యమును నేలఁగలుపుదును. నీరాజ్యములోఁగల భూమిని నలక్రిందుఁజేయుదును" అని గర్జించెను. ఆరాజు భయపడి, మాటఁ జెప్పలేకపోయెను. ఆరాజున కరిష్టము సంభవించునని తలఁచి, దుర్మార్గులగు రాజులందఱు లోలోపల సంతసించిరి. దేవతలు, మునులు, నాగులు, నగరములోని స్త్రీపురుషులు మొదలగువారు భయపడి, చింతాక్రాంతులై, దుఃఖించుచుండిరి. "అహా! ఇంతవఱకు నుత్సవము చక్కఁగ జరిగెను; ఇప్పటికిప్పుడింతయనర్థము పుట్టెకదా!" అని జానకితల్లి విచారించుచుండెను. పరశురామునిస్వభావమును జానకి విని, యొకనిమిష మొకకల్పమువలెఁ గడపెను.

దోహా 316

లోకులు భయభీతాహములఁ బొందిరి; జానకి హృదయములో సందేహములుపుట్టెను. శ్రీరామునకు మాత్రము హర్షవిషాదములు లేవు; వారిదురవస్థఁ జూచి, యతఁడు భృగురామునితో నిట్లు పలికెను.

చౌపాయ్

"ఓనాథా! ఈశివునివిల్లును విఱిచినవాఁడు మీసేవకులలో నొకఁడు. మీయాజ్ఞను శిరసావహింతును." ప్రథమమున నే పరశురాముఁడు రౌద్రాకారుఁడై యుండెను; తర్వాత, శ్రీరాముని మాటలవలన నతనికోప ముద్రేకించెను. "ఓయీ! సేవించువాఁడు సేవకుఁడు; శత్రువువలె సంచరించువానిని దండింపవలయును. ఓరామా! నామాటను వినుము. ఈశివునివిల్లును విఱిచినవాఁడు నాకు సహస్రబాహునువంటి శత్రువని తెలిసికొనుము. ఈరాజమండలినుండి వాఁడు వేఱుపడిన శ్రేష్ఠము. లేనియెడల, నీరాజులనందఱను సంహరించెదను." అతని మాటలను విని, లక్ష్మణుఁడు నవ్వి, పరశురామునిచేతిలోని గొడ్డలిని

లక్ష్యము జేయనట్లు ప్రసంగించెను. "ఓమునిరాజా! చిన్నతనములో ననేకధనస్సులను నేను విఱచియుంటిని; అప్పుడయినను మీరు నా మీఁద నాగ్రహముఁ రాలేదు. ఈధనస్సుపై మీకింతయభిమానమేల?" (పూర్వము పరశురాముఁడు రాజులను సంహరించి, ఆయాసమయము లలో నుపయోగించినధనుస్సుల నొకస్థలములోఁ బోగుచేసిపెట్టెను. ఆధనస్సులు దేవనిర్మితములు; ఒకస్థలమున నవి పోగుపడియుండినందున, భూమికి భార మధికమయ్యెను; వానినుండి, శేషుఁడు సయితము వ్యాకులమొందెను. ఈధనస్సులను రాక్షసులు సంగ్రహించినయెడల, ననర్థముపుట్టును. ఆదిశేషువు నొకబాలునిగఁ జేసికొని, వెంటఁదీసికొని, భూదేవి యొకస్త్రీరూపమునుధరించి, పరశురామునివద్దకు వచ్చెను. "ఓనాథా! ఈబాలుఁడు నాకుమారుఁడు-అనేకదినములనుండి నాకు భోజనము లేదు; నాదుఃఖముఁ జెప్పుటకు శక్యముకాదు. మీపరిచర్యజేసి, మీయాశ్రమములో నివసించెదను నాకుమారుఁడు కొంటె; చంచలుఁడు; ఇతరమునీశ్వరులు వానిచేష్టలఁ జూచి, నాపరిచర్యకు వారంగీకరింపలేదు. మీరు వానిని సహించినయెడల, నేను మిమ్ములను గని పెట్టుకొనియుండెదను." అని భూదేవి విన్నవించెను. "ఓతల్లీ! ఇచ్చట నీవు నిలిచియుండుము; నీబాలకుని క్షమించెదను" అని పరశురాముఁడు పలికెను. అట్లు వారు నివసించియుండిరి. ఒకరోజున పరశురాముఁడు సంచారమునకుఁ బోయెను. బాలకునివేషమును ధరించిన శేషుఁడు ధనస్సులను విఱచెను. ఆధనస్సుల శబ్దమును పరశురాముఁడు విని, యాశ్చర్యపడి, యాశ్రమమునకు వచ్చెను; కాని, ధనుస్సులభంగముఁ జూచి, యతఁడు కోపింపలేదు. అతఁడు వారిని దీవించి, పొమ్మనెను. అప్పుడు శేషుఁడు తననిజరూపము నతనికిఁ జూపించెను. "ఓముని రాజా! ఒక్క-శివునివిల్లుమాత్రము మిగిలిపోయెను; దానిని శ్రీరామచంద్రుఁడు విఱుచును." అని చెప్పి యతఁడు భూదేవితోఁగూడి యంతర్ధానమయ్యెను)

దోహా 317

"ఓరాజకుమారా! ముందువెనుకల నాలోచింపక, పలుకుచుంటివి. ఈశివునివిల్లు, లోకమునందలి విల్లులవంటిదని తలంచితివా?"

చౌపాయ్

"ఓమునిరాజా! నాబుద్ధికి ధనుస్సులన్నియు సమానము లే. ఈవు రాతెనధనస్సును విఱిచినందున, లాభనష్టములు లేవు కదా! శ్రీరాముఁడు దానిని క్రొత్తధనస్సని తలఁచి, దానిని ముట్టుకొనెను; అంతమాత్రమున, నది విఱిగిపడెను. అందుచేత, శ్రీరామునియం దేమిదోషముకలదు! ఓనాథా! వ్యర్థముగ మీ రేల కోపగించెదరు?" ఈప్రకారము లక్ష్మణుఁడు పలికినపలుకులను విని, పరశురాముఁడు పరశువువైపుఁ జూచి, క్రోధతామ్రాక్షుఁడై, "ఓరీ మూర్ఖుఁడా! నాస్వభావము నీకుఁ దెలియదు. నీవు బాలుఁడవని కనికరించి, నిన్ను జంపలేదు. నేను కేవలము మునీశ్వరుఁడనని తలంపకుము. నే నాబాలబ్రహ్మచారిని; కోపస్వభావుఁడను; క్షత్రియకులాంతకుఁడ నని లోకులకుఁ దెలియును ఇరువదియొకపర్యాయము భూమండలములోని రాజులను సంహరించి, భూమిని బ్రాహ్మణులకు దానముఁ జేసియుంటిని. ఈనాపరశువుఁ జూడుము; కార్తవీర్యునిసహస్రబాహువుల నిది ఛేదించెను.

దోహా 318

"ఓరాజకుమారా! నీతల్లిదండ్రులకు దుఃఖము గలుగఁజేయకుము. ఈనాపరశువు గర్భములోని పిండములనుసయితము ఛేదించును; దానిశబ్దమును విని, గర్భములోనిపిల్లలు చనిపోవుదురు" అని హుంకరించెను.

చౌపాయ్

"ఓమునిరాజా! మీరు మునీశ్వరులు కదా! మీ కింత శూరత్వ మేల? వీరుఁ డనిన యభిమాన మేల! మాటిమాటికి మీపరశువును నా కేల చూపించెదరు? 'పూపూ' త్కారమువలన, బర్వతము లెగిరిపోవునా? 'తర్జనీ' వ్రేలుచూపించినమాత్రమున, వాడిపోవుటకు నేను కుమ్మడబత్తిని కాను. మీకుఠారమును ధనుర్బాణములను చూచినతరువాత, నాకుఁ గొంతదురభిమానము పుట్టెను. మీరు భృగువంశస్థులనియు, బ్రాహ్మణులనియు తెలియుచున్నది. అందుచేత, మీమాటలవలనఁ గోపము వచ్చుచుండినను, నేను దానిని సహించి, యూరకుంటిని. మీయజ్ఞోపవీతమును, మీబ్రహ్మముడివలన, మీరు గౌరవనీ

యులు; గో, దేవ, బ్రాహ్మణ, హరిభక్తుల నెదిరించి మామూర్యవంశ పురాజులు పోరాడరు. ఎందుచేత? వారిం జంపిన, పాపమువచ్చును; వారివలన జయింపఁబడినయెడల, నపకీర్తివచ్చును. మీవాక్కులు కోటి పిడుగులకంటె నధికము; మీధనుర్బాణములును మీపరశువును వ్యర్థములు; మీశాపము పిడుగువంటిది; అది యమోఘము.

దోహా 319

"ఓమునిరాజా! మీశస్త్రాస్త్రములఁ జూచి, నేను కొంచె మనుచితవాక్కులఁ బలికియుంటిని; కాని, మీరు క్షమింపుఁడు." ఈమాటలవలన నధికముగ బరశురాముఁడు మండిపడెను.

చౌపాయి

"ఓవిశ్వామిత్రుఁడా! ఈబాలుఁడు పరమమూర్ఖుఁడు; మందబుద్ధి బలుఁడు; విధికృతమువలన, నతఁడు స్వకులమును నశింపఁజేయుటకుఁ బూనుకొనెను. మీది సూర్యవంశము; అయినను, చంద్రునివలె మీ వంశమునకు మచ్చవచ్చెను. ఇతనిని శిక్షించువారు లేరా? ఇతనిచర్యలు నిరంకుశమని తోఁచును. ఇతఁడు మూర్ఖుఁడు; పెద్దవారని భయము లేదు. ఇంతలో నితఁడు కాలునకు గ్రాసముకాఁగలఁడు. ఎలుఁగెత్తి చెప్పుచున్నాను; నావలనఁ దప్పులేదు. ఇతనిక్షేమముఁ గోరినయెడల, బోధింపుము; నాప్రతాపము నితనికిఁ దెలియఁజేయుము." "ఓముని రాజా! మీప్రతాపమును మీరుతప్ప వఱియెవరు చెప్పఁగలరు? అనేకవిధముల నిదివఱకు మీరు స్వయముగా మీప్రతాపముఁ జెప్పుకొని యుంటిరి. అంతటితో మీకు సంతుష్టిలేనియెడల, మీరు మఱల చెప్ప వచ్చును. మీకోపమును శాంతిచేసికొని, దుఃఖమును విడిచిపెట్టుఁడు. మీరు వీరులు; శూరులు; తేజశ్శాలులు; ధీరులు. ఇతరులను నిందించుటవలన, మీకుఁ బ్రయోజనము లేదు.

దోహా 320

"యుద్ధములో శత్రువు నెదుటనిలిచి పోరాడుట, వీరునిలక్షణము; కాని, యుద్ధముజేయక, ప్రగల్భములఁ బలుకుట, పిఱికిపంద లక్షణము.

చౌపాయ్

"ఓమునిరాజా! మఱలమఱల కాలుఁడు కాలుఁడని మీరు నన్ను భయపెట్టినను, నాకు భయములేదు." ఇంతకర్ణకఠోరముగ లక్ష్మణమూర్తి పలికినపలుకులను పరశురాముఁడు విని, మండిపడి, పరశువును ధరించి, ఘూర్ణిల్లెను. "ఓ రాజులారా! నాపలన దోషములేదు. ఈబాలుఁడు వధార్హుఁడు; వీఁడు కఠోరుఁడు. బాలుఁడుకదా యని, వాని మాటలను సహించితిని; కాని, యిప్పుడు సత్యముగ వానిని సంహరించెదను. నా చేతిలో గొడ్డలికలదు; కారణములేకయే, నేను కోపిని; తదుపరి, వీఁడు గురుద్రోహి; నాయెదుట నిలిచి, ప్రతిభాషలాడుచుండును; వీనిని వధింపక, విడిచిపెట్టను; ఇంతవఱకు, విశ్వామిత్రునిముఖముఁ జూచి, వీనిని విడిచిపెట్టినాను. లేనియెడల, నింతకుముందే వీని కంఠముఁ ద్రెంచి, నాగురుఋణముఁ దీర్చియుందును."

దోహా 321

ఆమాటలకు గాధితనయుఁడు (విశ్వామిత్రుఁడు) లోలోపల నవ్వి, "ఆహా! ఈపరశురాముఁడు (హరి) విష్ణుమూర్తిని (అరి) శత్రువని తలంచెను; ఈ వజ్రసాయకము ధనస్సును చెఱకుముక్కవలె విఱచెను; ఆసంగతి నితఁడు తెలిసికొనలేదు" అని తలంచెను.

చౌపాయ్

"ఓమునిరాజా! మీకీర్తిప్రతిష్ఠలు లోకములో నెవరికిఁ దెలియవు? మీతల్లిదండ్రుల నుద్ధరించితిరి. మీగురుఋణముమాత్రము మిగిలెను. ఆఋణము నేడు నామీఁదఁ బడెను; కాలాతీతమగుటవలన, దానికి వృద్ధివచ్చెను. మీవ్యవహారజ్ఞునిఁ బిలిపించినయెడల, వృద్ధులతో ఋణముఁ దీర్చుచున్నాను" ఈమాటలను పరశురాముఁడు విని, క్రోధతామ్రాక్షుఁడై, పరశును జికిలిఁజేసెను; సభికులందఱును హాహాకారముఁజేసిరి. "ఓస్వామీ! మాటిమాటికి మీపరశును నాకేల జూపించెదరు? ఓక్షత్రియాంతకరామా! మీరు బ్రాహ్మణులని తెలిసికొని, మీమాటలను సహించితిని ఇంతవఱకు మీరు వీరులతోఁ బోరాడియుండలేదు. బ్రాహ్మణులు దేవతలు; మీగృహములో మీరు వీరులు కదా!" లక్ష్మణునిమాట లనుచితములని జనులందఱు తలఁచిరి; శ్రీరాముఁడు సంజ్ఞజేసి, యతనిని నివారించెను.

దోహా 322

లక్ష్మణుని ప్రత్యుత్తరము లాహుతితో సమానమై, పరశురాముని కోపము అగ్నివలె రగులుచుండెను. ఆహుతివలన, నతనికోపాగ్ని మండుటఁ జూచి, శ్రీరాముఁడు చల్లనిమాటలతో నాకోపాగ్నిని శాంతింపఁజేసెను.

చౌపాయ్

"ఓనాథా! లక్ష్మణుఁడు బాలుఁడు; వానిమాటలను క్షమింపుఁడు; వాఁడు పసిబిడ్డఁడు; ఒకచెంపఁగొట్టిన పాలును, రెండవచెంపఁ గొట్టిన నీరును కారును. వానిమాటలను లక్ష్యముఁ జేయకుఁడు. మీప్రభావమునే వాఁడు నిజముగఁ దెలిసికొనినయెడల, నిట్లు మీతో సరిసమానముగ వాఁడేల ప్రసంగించును? అనుచితవాక్కులను బాలకులు పలికినను, తల్లిదండ్రులు వానిని సహించెదరుకదా! వీఁడు మీసేవకుఁడని తెలిసికొని, వీనిమాటలను క్షమింపుఁడు. మీరు మునీశ్వరులు; జ్ఞానులు; శాంతస్వభావులు. వానిని క్షమించుట మీకు యుక్తము." శ్రీరామునిమాటలవలన నతఁడు కొంచెము శాంతించెను. లక్ష్మణుఁడు నవ్వుచు నొకమాటఁ బలికెను; ఆమాటను విని, పరశురాముఁడు నఖశిఖపర్యంతము మండిపడెను. "ఓరామా! నీతమ్ముఁడు మహాపాపాత్ముఁడు. చూపునకు మాత్రము పచ్చనివాఁడు; కాని, మనస్సు కాలకూటవిషము; తల్లివద్ద నితఁడు పాలుద్రాగియుండలేదు; ఇతఁడు విషముఁ ద్రాగెను. ఇతనిస్వభావము కృత్రిమముకాని, సరళముకాదు; నీకుఁ దగినవాఁడు కాఁడు. నీచుఁడు. మృత్యువువంటి నన్నే లక్ష్యముఁ జేయఁడుకదా!"

దోహా 323

"ఓమునిరాజా! కోపము పాపములకు మూలము; దానికి వశులై, మనుజు లనుచితకార్యములఁ జేయుచుందురు; విశ్వమునకుఁ బ్రతికూలముగ సంచరించెదరు.

చౌపాయ్

"ఓమునిరాజా! నేను మీదాసుఁడను; కోపమునువిడచి, నన్ను క్షమించి, దయతోఁ జూడుఁడు. కోపముఁ జెందినమాత్రమున, విఱిగిపడినధనస్సు లేచిరాఁజాలదు. ఇంతవఱకు మీరు నిలిచియుండినందున,

మీపాదములకు శ్రమకలిగెను; కనుక, మీరు కటాక్షించి కూర్చుం డిన మేలు. ఒకవేళ మీకాధనుస్సునందుఁ బట్టుదలయుండినయెడల, నం దుకుఁ దగినప్రయత్నముఁ జేయుట మేలు. తెలివిగల విశ్వకర్మవచ్చి, దానిని సంధానముఁజేయును." ఇట్లు లక్ష్మణుఁడు పలికినపలుకులను జనక చక్రవర్తి విని, భయపడి, "ఈయధికప్రసంగమునుండి లక్ష్మణుఁడు విర మించిన మేలు" అని తలంచెను. నగరములోని స్త్రీపురుషులు 'థర, థర' మని భయపడిరి. పిట్ట కొంచెము, కూత ఘనము పరశురాముని శరీరము నఖశిఖపర్యంతము కోపముచే మండుచుండెను. అతని బలమం తయు నీరయ్యెను. "ఓరామా! నీతమ్ముఁడు కనుక, వానిని క్షమించి తిని. అతని శరీరము చక్కనిది; కాని, యతనిమనస్సు నలుపు. బంగారు కుండ, నిండుగ విషము. ఏమిచేయవలయును!"

దోహా 324

ఆమాటలకు లక్ష్మణుఁడు పక్కున నవ్వెను; శ్రీరాముఁడు కను సంజ్ఞజేసి, యతనిని నివారించెను. అతఁడు గొణఁగుచు, విశ్వామిత్రుని ప్రక్కను గూర్చుండెను.

చౌపాయ్

మృదుమధురముగ శ్రీరాముఁడు చేతులుజోడించుకొని న్యాయ ముగ నిట్లు ప్రసంగించెను. "ఓనాథా! స్వాభావికముగ మీరు సర సులు; చతురులు; బాలకునిమాటలను మీరు చెవుల నుంచరాదు. బాలులకును వృద్ధులకు నొకటియేస్వభావము. వారిమాటలను సత్పురు షులు లక్ష్యముచేయరు. వానివలన దోషములేదు; చేసినపని దోషమ యినయెడల, నేనపరాధిని; కాని, వాఁడు కాఁడు. ఓస్వామీ! మీరు గురువులు; జితేంద్రియులు. కరుణించినను, గోపించినను, వధించినను, బంధించినను, నేను మీదాసుఁడను; మీచిత్తానుసారము, నాకుఁ దగిన శాస్తిఁజేయుఁడు. ఓస్వామీ! మీరు సర్వజ్ఞులు; మనుజులమనోభావ ములఁ దెలిసికొనఁగలరు. ఏవిధమున మీకోపము శాంతించునో మీరు చెప్పినయెడల, మీయాజ్ఞను శిరసావహించి, సంచరించెదను." "ఓ రామా! నాకోప మెట్లు శాంతించును? నీతమ్ముఁడు క్రూరదృష్టితో

నెట్లు నన్నుఁ జూచుచున్నాఁడో, చూడుము; చూడుము. నేను కోపించిన ఫలమేమి! నేను సీతమ్మను బొందింపతినా ?

దోహా 325

"ఓ రామా! ఈ నాఘోర కుఠారశబ్దమును వినినమాత్రమున, స్త్రీలగర్భములు జారిపోవును. నా కుఠారము నావద్దనుండినను, నీ రాజకుమారుని సజీవునిగఁ జూడవలసివచ్చెను.

చౌపాయి

"ఓ రామా! నేనేమి చేయఁగలను? నా చేతులు స్వాధీనము తప్పెను; నాగుండెలు కోపముచే మండుచుండును. రాజులఁ జంపి చంపి నాకుఠారము వాడితప్పెను. విధాత నాకు ప్రతికూలుఁడుగనుండెను. నాస్వభావము కూడ మారిపోయెను. ఈనాఁటికి నాకు దయదాక్షిణ్యము లెచ్చటనుండివచ్చెనో తెలియదు. అందుచేత, భగవంతునికృపవలన, నేనీదుఃఖమును మ్రింగవలెను." ఈమాటలను లక్ష్మణుఁడు విని, నవ్వి, శిరము నుంకించెను "ఓనాథా! మీరు సుందరమే మాయువు; మీరూపమునకు శాంతరస మనుకూలము; మీరుపలికిన శాంతవచనములవలన, వృక్షముల పుష్పములు నేలఁబడును. ఓనాథా! దయచేతనే, మీశరీర మింత మండుచుండినప్పుడు, కోపముచే నెట్లు మండునోకదా ! అప్పుడు భగవంతుఁడు మిమ్ములను రక్షించుఁగాక !" "ఓ జనకరాజా ! ఈబాలుని మూర్ఖత్వముఁ జూడుము. ఈబాలుఁడు యమపురములో నిల్లుగట్టుకొనుటకుఁ గోరుచుండినట్లు కనఁబడును. నాకండ్ల యెదుటనుండి వీనినిఁ దీసికొనిపొమ్ము. ఈ రాజకుమారుడు రూపమునకుఁ జిన్నవాఁడు; కాని, వానితలకుఁ గ్రిందిమాటలను బ్రయోగించును" లక్ష్మణుఁడు పక్కున నవ్వి, "ఓనాథా! మీరు నేత్రములను మూసికొనినయెడల, మీ కన్నుల కెవరును గనఁబడరు" అని పలికెను.

దోహా 326

తదనంతరము పరశురాముఁడు శ్రీరాముని జూచి కోపించి, యిట్లు ధిక్కరించెను:—"ఓయీ ! శివునివిల్లును విఱచి, నాకు సమాధానము జెప్పుచుంటివా ?

చౌపాయి

"ఓ హెూ! నీసమ్మతిప్రకారమే, నీతమ్ముఁడు కటువులగు వచన

ముల నాడెను. తెలిసియుఁ దెలియనట్లు నీవు విన్నపములఁ జెప్పుచుంటివి. ఆహా! ఏమి నీచమత్కారము! నీమాటలు, నీయెత్తులు నాకు సరిపడవు. రారమ్ము; నాతో యుద్ధముఁ జేయుము; లేక, 'రామ' అను పేరు విడిచి పెట్టుము. ఓయీ! నీవు శివద్రోహివి; నీచమత్కారమును వినయ ములఁ గట్టిపెట్టి, నాతో యుద్ధముఁ జేయుము. లేనియెడల, మీయిరు వురను సంహారించెదను." ఈప్రకారము పరశురాముఁడు రాముని ధిక్కరించి, కుఠారమునెత్తి ఝళిపించెను; శ్రీరాముఁడుమాత్రము శిరస్సు వంచుకొని, లోలోపల నవ్వుకొనెను. "ఓస్వామీ! కఠోరవచ నములఁ బలికినందుకు, లక్ష్మణుఁడు తప్పుఁజేసెను. మీకోపమును నా మీఁదఁ బ్రసరింపఁజేసిరి. వక్రిమముఁజూచి, జనులు శంకించెదరు. వక్రి మచంద్రుని మ్రింగుటకు రాహువుసయితము భయపడును. ఓమునిరాజా! మీరు కొంచెము శాంతింపుఁడు; మీకుఠారము మీచేతిలోఁ గలదు; నాశిరస్సు మీయెదుటనుండును. నేను మీసేవకుఁడను కనుక, నేవిధ మున మీకోపము శాంతించునో, మీరావిధమున నాకుఁ దగినశాస్తిఁ జేయుఁడు. ఓనాథా! జోహార్.

దోహా 327

"ఓనాథా! సేవకుఁడు యజమానునితో నెట్లు యుద్ధముఁ జేయఁ గలఁడు? మీరు శాంతింపుఁడు; మీవేషముఁజూచి, వాఁడుబాలుఁడు కనుక, తెలివితక్కువమాటల నాడెను; ఆమాటలను మీరు లక్ష్యముఁ జేయకుఁడు.

చౌపాయ్

"ఓమునిరాజా! మీరు బ్రాహ్మణులు; కుఠారమును, ధనుర్బాణ ములును మీవద్దగలవు; వీనిఁజూచి, మీరు వీరులని వాఁడు తెలిసి కొని భ్రమపడి, మీకుఁ గోపముఁబుట్టించెను. ప్రథమమున మీనామ మును వాఁడు వినియుండెను; కాని, మీదర్శనమును వాఁడు చేసి యుండలేదు; అందుచేత, వానిసంశాచారముప్రకారము, వాఁడు మీ తోఁబ్రతిభాషలాడెను. ఓమునీశ్వరా! మీరు శుద్ధమునీశ్వరులవలెవచ్చి యుండినయెడల, వాఁడు మీచరణకమలములకు నమస్కరించియుం డును. మిమ్ములను వాఁడు తెలిసికొనక జేసినయపరాధమును క్షమిం పుఁడు. మీరు బ్రాహ్మణులు కనుక, వానిని మీరు కరుణించుట మీకు

యోగ్యము. మీతో నెట్లు నేను పోరాడగలను? మీకును నాకు నెంతయంతరువు? శిరస్సునకును పాదమునకు నెంతయంతరువుకలదో, మనయుభయులకు నంతవ్యత్యాసము కలదు. మీపాదములను నేను నాశిరస్సున ధరింపవలెను; నాశిరస్సు మీపాదములమీఁదఁ బడియుండును నాకు రెండక్షరముల పేరు కలదు; కాని, మీ కయిదక్షరముల పేరుకలదు; నేను శుద్ధబుద్ధరాముఁడను; కాని, మీరు పరశురాములు; నాకు విశేషణములు లేవు. ఓదేవా! నాకొకధనస్సుకలదు; అది అపవిత్రము; దానిమూలమున జీవహింసకలుగును; ఈయొక్క గుణమే నాధనస్సునకుఁ గలదు. మీధనస్సు పరమపవిత్రము; తొమ్మిదిగుణములు దానికిఁ గలవు; కోమలత్వము, సంతోషము, తపస్సు, క్షమ, అతృష్ణ, జితేంద్రియత్వము, దానము, సర్వదాతృత్వము, దయ—ఈతొమ్మిది గుణములు (గుణము=(1) గుణము; (2) వింటినారి) మీ యజ్ఞోపవీతమునకు (బ్రాహ్మణునిధనస్సు) గలవు. అన్నివిధముల నేను మీకు జోహారు. మీరు బ్రాహ్మణులు కనుక, నన్ను క్షమింపుఁడు.

దోహా 328

"ఓమునీశ్వరా! ఓవిప్రవరా! క్షమాకరో, క్షమాకరో!" అని పలువిధముల శ్రీరాముఁడు ప్రార్థించెను. అంతకంతను పరశురామునకుఁ గోప మధికమయ్యెను. "ఓయీ! నీతమ్మునివలె నీవును గుటిలుఁడవు.

చౌపాయ్

"ఓయీ! నేనేమో వెఱ్ఱిబ్రాహ్మణుఁడనని నీయభిప్రాయము; నేనెట్టిబ్రాహ్మణుఁడనో చెప్పుచున్నాను వినుము. నాధనస్సు స్రువము; నాకోపము అగ్ని; నాబాణములు ఆహుతి; చతురంగబలములు యజ్ఞసమిధలు; గొప్పగొప్పరాజులు యజ్ఞపశువులు; ఈపరశుతో నేను వారిని ఖండించి, ఆహుతిజేసియుంటిని. అనేకపర్యాయములు నేనీసమరయజ్ఞము నొనరించితిని నాప్రతాపము నీకుఁ దెలియదు. నేనేమో పిచ్చిబ్రాహ్మణుఁడనని తలంచి, నీవు నన్ను తృణీకరించి, నిరాదరించితివి. ఈధనస్సును విఱిచినందులకు, నీకు గర్వము బలిసెను; లోకములను జయించితినని, నీకు దురభిమానముపుట్టెను." "ఓమునిరాజా! మీకోపమునకు హద్దులేదు; కొంచెము ముందువెనుకల నాలోచించి, మీరు సంభాషించినయెడల మేలు; నేచేసినతప్పు స్వల్పము. ఈపురాతనధన

స్సును నేను ముట్టినంతమాత్రమున, నది విఱిగిపడెను. అందులకు నాకు దురభిమానమేల?

దోహా 329

"ఓభృగునాథా! మీరు బ్రాహ్మణులని తెలిసికొని, మిమ్ములను గౌరవించుచున్నాను కాని, మిమ్ములను నేను నిరాదరించితినని మీరు చెప్పుచుంటిరి. ప్రపంచములో నేనెవరునకు భయపడి, వానికి నేనుజో హారు ననుచున్నానో, చెప్పుఁడీ?

చౌపాయ్

"దేవతలును, దానవులును, మనుజులు - ననాతోసమానులు, నాకంటె బలవంతులు ఎవరైనను, కాలుఁడైనను, నాయెదుట నిలువఁబడి నపుడు, నేను వానితో యుద్ధముఁజేయగలను. నాకు భయములేదు. క్షత్రియుఁడు యుద్ధమునుండి వెనుకఁదీసినయెడల, వాఁడు వానివంశ మున కపకీర్తిఁ దీసికొనివచ్చును; వానికంటె నీచుఁడు లేఁడు. మారఘు వంశములో నొకఁడైనను వెనుకదీయక, కాలుఁడు వచ్చి యెదుట నిలి చినను, వానితోఁ బోరాడఁగలరు. ఇతరస్థలములలో నిర్భయముగ సం చరించు నేను, మీయెదుట నిలుచుటకు వెఱచుచున్నాను; అది మీ బ్రహ్మవంశముయొక్క ప్రభావము." ఈప్రకారము మృదుమధుర ముగ శ్రీరాముఁడు పలికిన గూఢవచనములను పరశురాముఁడు వినినం దున, నతని హృదయకవాటములు విడిపోయెను. "ఓరామా ! నీవచన ములవలన, నీవు అవతారపురుషుఁడవని తెలిసికొంటిని; కాని, ప్రస్తు తము నీచర్యలవలన, నాయభిప్రాయము నిశ్చయముకావలెను. ఈనా వైష్ణవధనస్సును నీవు విఱిచినయెడల, నాసందేహము నివృత్తియగును" ఇట్లు పరశురాముఁడు పలికి, తనదగు వైష్ణవధనస్సును రామున కంది చ్చెను. రామునిచేతిలోనికి వచ్చినమాత్రమున, దానియంతట నది యె క్కుపెట్టఁబడెను; ఆచిత్రముఁ జూచి, పరశురాముఁ డాశ్చర్యపడెను.

దోహా 330

అతఁడు కన్నులార రామునిప్రతాపముఁ జూచెను; అతనిశరీ రము పులకరించెను. అతఁడు పరమానందముచే నుప్పొంగెను; చేతు లను జోడించుకొని, యిట్లు ప్రార్థించెను:—

చౌపాయ్

"ఓరామా! జయ, జయ! రఘువంశకమలములను వికసింపఁజేయుటకు నీవు సూర్యుఁడవు; వనమును దవానలమువలె, రాక్షసవంశమును నీవు దహింపఁగలవు; గో, దేవ, బ్రాహ్మణులకు నీవు హితుఁడవు. జయ, జయ! కామక్రోధాదులను నశింపఁజేయఁగలవు. వినయము, సుశీలము, కరుణ—ఈసకలగుణములకు సాగరుఁడవు; జయజయ! నీవచనరచన శ్లాఘనీయము; నీసేవకులను రక్షించెదవు. నీశరీర మతికోమలము; నీశరీరలావణ్యము కోటిమన్మథులను మించియుండును. ఒకముఖముతో నెట్లు వర్ణింపఁగలను? శ్రీశంకరుని మానససరోవరమునందు నివసించు రాజహంసవు. జయజయ! అజ్ఞానముచే, ననుచితవాక్యములఁ బలికియుంటిని. మీ రుభయులు క్షమాసముద్రులు; నన్ను క్షమింపుఁడు. హేరఘుకులశిరోమణీ! జయజయ! జయజయ!" ఈప్రకారము పరశురాముఁడు స్తుతించి, తపోవనములకు నిష్క్రమించెను. పిఱికిపందలు భయపడి, పాఱిపోయిరి.

దోహా 331

దేవదుందుభులు మ్రోఁగెను; దేవతలు పుష్పములను వర్షించిరి; నగరములోని స్త్రీపురుషులు సంతోషించిరి ఇంతవఱకు వారు భయముచే బాధపడుచుండిరి; వారి బాధలన్నియు నివారణమయ్యెను.

ఇతి శ్రీగోస్వామితులసీకృత శ్రీరామచరిత్రమానసే,
సకలకలికలుషవిధ్వంసనే, బాలకాండాంతర్గత
పండితజ్వాలాప్రసాదకృత వ్యాఖ్యానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
అష్టమవిశ్రామః.

---

# బాలకాండ నవమ విశ్రామః.



చౌపాయ్

"శ్లో. లజ్జాకీర్తి ర్జనకతనయా శైవకోదండభంగే
తిస్రక్కన్యా నిరుపమతయా భేజిరే రామచంద్రమ్,
అంత్యాపాణిగ్రహణసమయే జ్యాయసీజాతరోషా
భూపైస్సార్థం ఖలుగతవతీ మధ్యమాగాద్దిగంతాన్."

మంగళధ్వనులు మ్రోఁగెను. సువాసినులు గుంపులుగుంపులుగాఁ గూడి శ్రావ్యముగ గానముఁజేసిరి. అష్టైశ్వర్యములఁ బొంది పుట్టువరిద్రుఁడు సంతసించువిధమున, జనకచక్రవర్తి పరమానందభరితుఁడయ్యెను. చంద్రోదయముఁ జూచి, పిల్లచకోర మానందించునట్లు, జానకి సంతోషించెను. జనకుఁడు విశ్వామిత్రునిచరణములకు నమస్కరించి, "ఓమునిరాజా! ఇదియంతయు మీకృపాఫలము; మీకటాక్షమువలన, శ్రీరాముఁడు ధనస్సును విఱిచెను. శ్రీరామలక్ష్మణులమూలమున, నేను కృతార్థుఁడనై, గట్టునకు వచ్చితిని. యథోచితముగ, శుభకార్యమును నిర్వహింపుఁడు" అని విన్నవించెను. "ఓరాజా! నీకుఁ దెలియనిసంగతి లేదు; నీప్రతిజ్ఞాప్రకారము, ధనస్సును విఱిచినవాఁడు జానకిని వివాహమాడుట కర్హుఁడు. ధనస్సు విఱిగిపడెను; అప్పుడే వివాహమయ్యెను; ఆసంగతి, దేవతలు, నాగులు, నరులు, మునులు మొదలగువారికిఁ దెలియును.

దోహా 332

"ఓరాజా! నీవంశాచారము ననుసరించి, వివాహమంగళోత్సవముఁ జేయుటకుఁ బ్రయత్నింపుము. బ్రాహ్మణులను, గురువులను, కులవృద్ధులను రప్పించి, వేదోక్తప్రకారము వివాహముఁ జేయుము.

చౌపాయ్

"ఓరాజా! అయోధ్యానగరమున కొకదూతను బంపి, దశరథమహారాజును రప్పింపుము." ఈప్రకారము విశ్వామిత్రుఁడు చెప్పిన

యాజ్ఞను జనకుఁడు విని, సంతోషించి, యాతక్షణ మొకదూత నయోధ్యానగరమునకు శుభలేఖతోఁ బంపెను. తదుపరి చక్రవర్తి యాజ్ఞాప్రకారము, నగరములోని మహాజనులు వచ్చి, చక్రవర్తికి నమస్కరించి, జోహారువనుచు నిలిచిరి. "ఓమహాజనులారా! రాజమార్గములను, శృంగాటకములను, సందులను గొందులను, విపణిమార్గములను, దేవస్థానములను, మందిరములను, గృహములను— మొదలగువానిని శీఘ్రి మలంకరింపుఁడు." చక్రవర్తియాజ్ఞను వారు శిరసావహించి, స్వగృహములకు వచ్చి, చిత్రకారులను బిలిపించిరి. "ఓయీ! వివాహ మండపమును రచింపుఁడు-" "చిత్తము" అని పలికి వారు నిష్క్రమించిరి. చిత్రక్రియ, లోహక్రియ, మృత్క్రియ, ఆసవకర్మము—ఈ మొదలగు కలాప్రవీణులు వచ్చి, దేవునకు నమస్కరించి, పనుల నారంభించిరి. సువర్ణకదళీస్తంభములను వారు నిర్మించిరి.

దోహా 333

ఆబంగారువృక్షములకు హరితమణుల పత్రములును ఫలములును కలవు; వానిపువ్వులు పద్మరాగమణులు; వానిరచనఁ జూచి, బ్రహ్మాసయితము సిగ్గుపడెను.

చౌపాయ్

వేణులు హరితమణులతోఁ జెక్కఁబడెను; వానిసరళమును పత్రములఁ జూచిన, నవి నిజముగ వేణువులని భ్రమపుట్టును. శ్వేత బంగారు తమలపాకుతీగెలును పత్రములును ప్రకృతి వానికంటె నధికముగ శోభించెను. వానియాకులను ముత్యాలహారమునకుఁ గుచ్చిరి. బంగారము, మాణిక్యములు, మరకతములు, శ్యామమణులు, హరితమణులు-ఈ మొదలగువానితోఁ గమలములను నిర్మించిరి. వానితో ననేకరంగు రంగుపక్షులను, తుమ్మెదలను సిద్ధముఁజేసిరి. వాయువువచ్చినపుడు, తుమ్మెదలు రోదనముఁజేయుచుండెను; పక్షులు ధ్వనులఁజేయునట్లు, వాయువు వీచినపుడు వానిశబ్దములు వినఁబడెను. మంగళద్రవ్యములఁ దీసికొని వచ్చుచుండినట్లు, దేవతల ప్రతిమలు స్తంభములపైఁ జెక్కఁబడెను. సింధూరమణులతో నలువైపుల ముగ్గులఁబెట్టిరి.

దోహా 334

నీలమాణిక్యములతోఁ జెక్కఁబడిన మామిడికొమ్మలును; బంగా

రము, ముత్యములు, శ్యామమణులును- వీనిని మామిడిపిందెలుగ జెక్కి, వానిని పట్టుదారమునకుఁ గ్రుచ్చి వ్రేలఁగట్టిరి.

చౌపాయ్

కామదేవుని సంకెలలవలె, ననేకబంగారు గొలుసులను, ననేక విధములుగ రచించిరి. అనేక ప్రకారముల గృహములు శోభస్కరముగ నుండుటకు, మంగళకలశములను, ధ్వజములను పతాకములను నిలువఁ బెట్టిరి. విచిత్రవితానములను మణిదీపములను వర్ణించి చెప్పుటకు శక్యముకాదు. జానకి కూర్చుండుటకు నిర్మింపఁబడిన మండపమును వర్ణించుటకు, నేకవీశ్వరునకు గుండెలుకలవు? సకలగుణధాముఁడగు శ్రీరాముని నిమిత్తము నిర్మింపఁబడిన మండపము ముద్దులు మూటఁగట్టుచుండెను; దానిని మించినది మూఁడులోకములలో లేదు. జనకచక్రవర్తి భవనమువలె, నగరములోని ప్రతిగృహమును శోభస్కరముగ నుండెను. ఆ సమయమున మిథిలానగరముయొక్క శోభం జూచినయెడలఁ బదునాల్గుభువనములు తలలను వంచుకొనును. ఆనగరములోని నీచుని సంపదంజూచి, దేవేంద్రుఁడుసయితము భ్రమించెను.

దోహా 335

ఆనగరములో మహాలక్ష్మి కపటనారీవేషమునుధరించి నివసించియుండెను కదా! ఇఁక నాపురముయొక్క కాంతులకు లోపముండునా? వానిని సాంతముగ వర్ణించుటకు శేషశారదలు సంకోచించిరి.

చౌపాయ్

ఇఁక నిచ్చటికథను వినుము; జనకునిదూత అయోధ్యానగరమునకు వచ్చి, దాని కాంతులఁ జూచి, యబ్బురముపడెను. వాఁడు రాజభవనమునకు వచ్చి, వర్తమానముఁ బంపెను. దశరథుఁడు వర్తమానమును విని, శీఘ్రముగా దూతను రప్పించెను. వాఁడు రాజునకు నమస్కరించి, శుభలేఖను రాజుచేతిలోఁ బెట్టెను. రాజు ప్రసన్నుఁడై లేచి, లేఖ నందుకొనెను. ఆలేఖ నతఁడు చదివి, యానందబాష్పములఁ గార్చెను; అతనిశరీరము పులకరించెను. ఆనందముతో నతనిహృదయము నిండెను. అతనిమనస్సులో రామలక్ష్మణులును, నతనిహస్తములో శుభలేఖయు నుండుటచేత, నతనిముఖమునుండి మాట వెలువడలేదు. ఏమాటయు నతఁడు చెప్పలేకపోయెను. ఆనందములో నతఁడు

మునిఁగెను. అంత నతఁడు ధైర్యముఁదెచ్చుకొని, సావధానముగ శుభలేఖఁ జదివి, సభికులకు వినిపించెను. వారు శుభవర్తమానమును విని సంతోషించిరి. శ్రీరామలక్ష్మణులు మిథిలానగరములో నుండినట్లు, శుభలేఖవలన వారికి విశదమయ్యెను. ఎచ్చటనో బహిఃప్రదేశములో నాడుకొనుచుండిన భరతశత్రుఘ్నులు శుభలేఖసంగతి విని, సభలోనికిఁ బరుగెత్తుకొనివచ్చి, తండ్రియెదుట నిలువఁబడి, "నాన్నగారూ! ఎచ్చట నుండి శుభలేఖవచ్చెను?" అని యడిగిరి.

దోహా 336

"మాప్రాణమువంటివారు, మాయన్న లేదేశములోఁ గలరు? వారు క్షేమమా? కటాక్షించి చెప్పుఁడు." ఇట్లు భరతశత్రుఘ్నులు పలికినపలుకులను రాజు విని సంతోషించి, మఱల శుభలేఖఁ జదివి, వారికి వినిపించెను.

శుభమస్తు:—అవిఘ్నమస్తు:—స్వస్తి. శ్రీగురుచరణారవిందాభ్యాంనమః. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ:—

అనంత। శ్రీమహారాజ।అపరాజితాధిరాజ। సకలమహారాజాని। శిరతాజ।జగ। లాజకో। జహాజ। గరీబనేవాజ। మహీమండల। మహేంద్ర। సురేంద్రకే। ఉపేంద్ర। సమ। కరన। కాజ,। యశ। జాగత। జహాన,। కేతే। భాన। సమాన। ప్రతాపవాన। దాన। మాన। సన్మాన। సుజాన। జ్ఞాన। ప్రేమనిధాన। దశరథ। భూప। భూపేతే। శీలకేతు। భూపకీ। జోహార్ - ఆప। అనూప। కుశల। స్వరూపహై॥ యహా। ఆపకీ। కృపాహీ। కుశలహై॥ భువనహితకారీ। ముని। సంగ। అంగ। అంగ। ఆభా।ఉమంగ।అనంగ।ఆభా।భంగ। కరనహార। ఆపకే। యుగల। కుమార। ఆయే॥ హమనే। లోచన। లాహు। పాయు। రామచంద్రనే। మహీపన। మదమోరి। మహేశధను। తోరి। మహీ। కీర్తి। ఛాఈ॥ మహిజా। పాఈ॥ సజి। బరాత। ఆఇయే। వ్యాహీ। లై। జాఇయే॥—ఆపకా—జనకరాజ—

చౌపాయ్

ఆశుభలేఖ నన్నదమ్ములు విని, పరమానందభరితులై, గడగడ వడఁకిరి. భరతుని భ్రాతృవాత్సల్యమునకు సభికులు మెచ్చుకొనిరి. ఆ దూతల నిరువురను రాజు దగ్గరకుఁబిలిచి, వారిని గూర్చుండమని చెప్పి,

వారితో నిట్లు మృదుమధురముగఁ బ్రసంగించెను. "ఓయీ! నాకుమారులు క్షేమమా ? మీరు వారిని కన్నులారఁ జూచియుంటిరా ? వారిలో నొకఁడు నల్లనివాఁడు; మఱియొకఁడు పచ్చనివాఁడు. వారిరువురు ధనుర్బాణములను ధరించియుందురు; వారు కేవలము బాలురు; మునీశ్వరునివెంట నుందురు. వారిని మీరు పోల్చియుండినయెడల, వారిక్షేమముఁ జెప్పుఁడు." ఇట్లు పితృవాత్సల్యముచే రాజు వారిని తర్కించి తర్కించి, యడిగెను. "ఆహా ! నాఁడు మావారిని మునీశ్వరుఁడు తీసికొని వెళ్లినదిమొదలు, నేఁటివఱకు మావారి శుభవర్తమానము నాకుఁ దెలియదు. ఎట్లు వారిని జనకచక్రవర్తి గుఱుతుపట్టెను? చెప్పుఁడు." అని మహారాజు సంతోషముచే నడిగినమాటలను దూతలు విని, మందహాసముఁజేసిరి.

దోహా 337

"హేభూపాలమౌళీ! మహారాజ్! జోహార్. మిమ్ములఁ బోలిన ధన్యులు లేరు. ఆరామలక్ష్మణులు విశ్వభూషణులు; వారు మీకుమారులు; ఏమి మీభాగ్యము !

చౌపాయ్

"మీకుమారులసంగతి యడుగనేల? వారివిషయమై చెప్పుటకు మేనుర్వ్యాలముకాము. వారు పురుషసింహములు; వారికీర్తి మూఁడు లోకములలో వ్యాపించెను. వారికీర్తియెదుట, సూర్యుఁడు చల్లఁబడెను; చంద్రునకు మచ్చవచ్చెను. వారిని మేమెట్లు గురుతుపట్టితిమని మీరు శంకించితిరి? సూర్యునకు దీపముఁ జూపించెదరా? వారు స్వయంప్రకాశకులు. అనేకరాజులు సీతాస్వయంవరమునకు వచ్చి, వారు వారిని జూచి, నిశ్చేష్టులయిరి ఆరాజు లతిరథ మహారథశ్రేష్ఠులు; వారిలో నొకఁడైనను శివునివిల్లును విఱువలేక పోయెను. త్రిలోకములను జయింపఁగలిగిన రాజులబలము కుంఠితమయ్యెను. సుమేరుపర్వతమును మీఁదికియెత్తుటకు బలముగల బాణాసురుఁడు సయితము శివునివిల్లును విఱువలేక, భంగపడి వెళ్లిపోయెను; వినోదార్థము కైలాసపర్వతమును మీఁదికి యెత్తిన రావణాసురుఁడు సయితము భంగపడెను.

దోహా 338

"ఓనాథా! ఆరాజమండలిలో రఘువంశమణి, శ్రీరామచంద్రు లోకరు మాత్ర మాఘనస్సును సునాయాసముగ విఱిచిరి. కమలనాళ మును గజము త్రుంచునట్లు, దానిని వారు త్రుంచిరి.

చౌపాయ్

"అప్పుడు పరశురాములు వచ్చిరి; వారు రౌద్రాకారులై శ్రీ రామచంద్రులపైకి వచ్చిరి. శ్రీవారిబలమును శోధించుటకు, వారుస్వవైష్ణ వధనస్సు నిచ్చిరి. పరశురాములకు శృంగభంగమయ్యెను; వారు తపో వనములకు నిష్క్రమించిరి. ఓనాథా! శ్రీవారిబలమపారము. వారివలె లక్ష్మణస్వామి, బలవంతులు; తేజశ్శాలులు. సింహపుపిల్లను జూచి మద గజములు వణఁకువిధమున, రాజు లందఱును శ్రీరామలక్ష్మణులం జూచి, భయపడిరి. ఓదేవా! మీకుమారులఁ జూచినతరువాత, లోక ములో నితరపదార్థములఁ జూచుటకు నేత్రము లిష్టపడవు." ఆరాజ దూతల వచనరచనకు మహారాజును సభికులును సంతోషించిరి; వారివ చనములు ప్రేమపూరితములు; సరసభూయిష్ఠములు; వీరరసయుక్త ములు రాజును సభికులును దూతలపైఁ గట్నములఁ గురిపించిరి. వా రాకట్నములఁ జూచి, చెవులను మూసికొని, "మాయపరాధమును క్షమింపుఁడు" అనిచెప్పి, కట్నములఁ బుచ్చుకొనలేదు. వారిధర్మమును సభికులు కొనియాడిరి.

దోహా 339

అనంతరము దశరథుఁడు శుభలేఖను వసిష్ఠున కిచ్చెను; దూత లను రప్పించి, వారియెదుట, యావద్వృత్తాంతమును గురువునకు విన్న వించెను.

చౌపాయ్

ఆశుభవర్తమానమును వసిష్ఠుఁడువిని, సంతోషించెను. "ఓరా జా! పుణ్యాత్ములగు పురుషులకు లోకము సుఖములతో నిండియుం డును. సముద్రున కిచ్ఛలేకపోయినను, నదులు వానియంతట నవి సముద్రములోఁ గలియునుకదా! అటులనే, పిలువకపోయినను, సంప దలు వానియంతట నవి వచ్చి, ధర్మాత్మునిఁ జేరును. నీవు గో, గురు, దేవ, బ్రాహ్మణుల నారాధించెదవు. పరమపవిత్రురాలగు కౌసల్య సీత

ర్మపత్ని. నీవంటిపుణ్యాత్ముఁడు త్రిలోకములలోఁ ద్రికాలములలోఁ బుట్టలేదు. ఓరాజా! నీకంటె నదృష్టవంతుఁ డెవఁడు కలఁడు? నీకుమారుఁడు రాముఁడు; నీవు ధన్యుఁడవు. ఓరాజా! నీనల్వురుకుమారులు మహావీరులు; ధర్మాత్ములు; సకలగుణసంపన్నులు- సన్మంగళానిభవంతు- ఇఁక బిరుదునిశానీలతోఁ బెండ్లికి నీవు వెడలుము."

దోహా 340

ఇట్లు వసిష్ఠునియాజ్ఞఁ గైకొని, దూతలను గూర్చుండమని నియోగించి, రాజు శీఘ్రముగా రాణివాసములోనికి వెళ్లెను.

చౌపాయ్

రాణివాసపుస్త్రీలను రాజు రప్పించి, జనకునిశుభలేఖను వారికిఁ జదివి వినిపించెను; తదుపరి, మిథిలానగరములో జరగినవృత్తాంతము నంతయు వారికిఁ జెప్పెను. వారు విని సంతోషించిరి; వారిశరీరములు పులకరించెను; వారినేత్రములవెంబడి యానందబాష్పములు ప్రవహించెను. మేఘధ్వనిని వినిన నెమలివలె, వారు ముదమందిరి. వృద్ధముత్తైదువలు రామలక్ష్మణులను దీవించిరి; కౌసల్య పరమానందమగ్నురాలయ్యెను. వారాశుభలేఖను గైకొని, దానిని హృదయమున కప్పళించుకొనిరి; అందుచేత, వారిహృదయములు చల్లబడెను. రామలక్ష్మణులు చేసినపనులను వారికీర్తిని, దశరథుఁడు మాటిమాటికిఁ బ్రశంసించెను. ఈశుభమంతయు విశ్వామిత్రునికృపవలనఁ గలిగెనని రాజు పలికి, ద్వారమువద్దకు వచ్చెను. ఆముప్పూరు మహారాణులు బ్రాహ్మణులఁ బిలిపించి, వారికి షోడశమహాదానముల నిచ్చిరి; వారు వారిని దీవించి, నిష్క్రమించిరి.

సోరఠా 37

తదుపరి, వారు యాచకులను రప్పించి, వారికిఁ గట్నముల నిచ్చిరి. "మాతండ్రి, మానల్వురుబాబులు చిరకాలము జీవింతురుగాక."

చౌపాయ్

ఈప్రకారము వారు దీవించి, వెళ్లిరి. అనేకవస్త్రములను వారు పుచ్చుకొనిరి. బజంత్రీవాండ్రు మంగళవాద్యములను మ్రోఁగించిరి. ఈశుభవర్తమానము క్రమముగ నగరమంతయు వ్యాపించెను. ప్రతిగృహ

మందును మంగళధ్వనులు వినఁబడెను; నగరములోని స్త్రీపురుషు లా బాలవృద్ధులు సంతోషించిరి. శ్రీజానకీరాముల వివాహమహోత్సవ మునంగతి పదునాలుగులోకములలో వ్యాపించెను. జనులందఱు వారివారిగృహములను, రాజమార్గములను, విపణీప్రదేశములను, సం దులగొందులను, శృంగాటకముల నలంకరించిరి. పరమపవిత్రుఁడును, మంగళాకరుఁడు నగు శ్రీరామునినగరము సదా శోభాయమానముగ నుండెను; తదుపరి, దానిని సింగారించినపుడు, నగరము ముద్దుల మూ టఁగట్టుచుండెను. ధ్వజములు, పతాకములు, చామరములు, తోరణ ములు, వితానములు—వీనితో రాజమార్గములు నిండెను. పంచా మృతములను బంగారుకలశములలోఁ బెట్టి, గృహములయెదుట నిలు వఁబెట్టిరి; ముత్యాలతోరణములఁ గట్టిరి. ఆణిముత్యముల జాలరులు వ్రేలుచుండెను.

దోహా 341

ప్రతిగృహము సింగారింపఁబడెను; మంగళద్రవ్యములను సమ కూర్చిరి; రాజమార్గములన్నియు సుగంధద్రవ్యములతోఁ బరిమళిం చెను; వీథులలో ముత్యాలముగ్గులఁ బెట్టిరి.

చౌపాయ్

"శ్లో. గేహేగేహే జంగమా హేమవల్లీ
వల్యాంవల్యాం పార్వణ శ్చంద్రబింబః,
బింబేబింబే కోకిలానాం విరావో
రావేరావే మన్మథః పంచబాణః."

షోడశశృంగారములను సింగారించుకొనిన సువాసినులు, మెఱు పుతీగెలవలె, తళుకుతళుకుమనుచుండిరి. ఆ చంద్రముఖులు ఆమృగనే త్రలఁ జూచి, రతీదేవి సిగ్గుపడి గర్వమును విడిచెను. వారు పంచమస్వ రముమీఁద మంగళాష్టకములఁ బాడుచుండిరి; వారిస్వరములను కోకి లలువిని, సిగ్గుపడెను. రాజనగరు శోభను వర్ణించుట కెవరిశక్యము? రాజాజ్ఞాప్రకార మత్యంతశోభస్కరముగ వివాహమండపము నిర్మిం పఁబడెను; దానిసింగారము లోకులను భ్రమింపఁజేయుచుండెను. అనేక మంగళద్రవ్యములను సమకూర్చిరి. పంచవాద్యములు మ్రోఁగెను. బట్రా

జులు వంశావళిని వర్ణించుచుండిరి. బ్రాహ్మణులు వేదపన్నములఁ బఠించిరి. శ్రీసీతారాములమీఁదఁ బాటలఁగూర్చి, ఆపాటలను స్త్రీలు గానముఁజేసిరి. వారియుత్సాహము గృహములు నిండి, పొర్లి పాఱెను. ఆయుత్సాహము నలువైపులఁ బ్రవహించెను

దో॰ 342

ఆరాజనగరువైభవమును వర్ణించుట కేకవికి శక్తికలదు? ఆనగరులో దేవతాశిరోమణియగు శ్రీరాముఁడు జన్మించెను కదా!

చౌపాయ్

రాజు భరతునిబిలిచి, "ఓబాబూ! చతురంగబలములను సన్నాహముఁ జేయుము; శ్రీరాముని వివాహమునకు మనము వెళ్లవలెను." అని యాజ్ఞాపించెను. భరతశత్రుఘ్ను లతియుత్సాహముతో వివాహప్రయత్నములఁ జేయ నారంభించిరి వారియాజ్ఞను శిరసావహించి, సేవకులు పనులఁ జేసిరి. రంగురంగుల గుఱ్ఱములకుఁదగిన రంగురంగుల జీనులఁ దొడిగిరి. మండుచుండినలోహముపైఁ బాదములను మోపకుండ నడచునట్లు, గుఱ్ఱములపాదములు భూమిమీఁద నిలుచుటలేదు; అంత చంచలముగ నవి కదముద్రొక్కుచుండెను. అయిదుధారలప్రకార మా గుఱ్ఱములు నడచుచుండెను; వానినడక వాయువేగమును మించియుండెను. భరతునిసవయస్కులగు రాజకుమారులు వానిపై స్వారీచేయుచుండిరి. వారు సర్వాలంకారములను సింగారించుకొని, నడుమునకు తరకసమును, హస్తమున ధనుర్బాణములను ధరించిరి.

దో॰ 343

బంగారుసలాకవంటి బాలకుల శరీరలావణ్యమును, సౌష్ఠవమును, పటుత్వమును, బిగియు, చూచితీరవలెను; ఆరాజకుమారస్వారు లొక్కొక్కరి కిరుప్రక్కల నిరుపురుపదాతులు విచ్చుకత్తులఁ బట్టుకొనియుండిరి; అశ్వకౌశలములోను, కత్తిసాములోను వీరు ప్రవీణులు.

చౌపాయ్

అతిరథ, మహారథ, అర్ధరథశ్రేష్ఠులు ముస్తీబులై, వారివారి వాహనములపై వెడలి, నగరబహిఃప్రదేశమున నిలువఁబడిరి. అశ్వకౌశలులు గుఱ్ఱముల నయిదువిధముల నడిపించుచుండిరి. భేరీభాంకృతు

లును, దుందుభిస్వనములవలన, వీరులమనస్సు లుత్సాహముతో నుప్పొంగెను. ధ్వజములును, పతాకములును, ముత్యాలతోరణములును, ఘంటలును—వీనితో రథములను సారథులు సింగారించి, సిద్ధముం జేసిరి. ఈరథములు సూర్యునిరథమును దిరస్కరించుచుండెను. శ్యామకర్ణములుగల గుఱ్ఱముల ననేకములను రథములకుఁ గట్టిరి. వీరివైభవముఁ జూచి, మునులుసయితము భ్రమించిరి. భూమిమీఁదనువలె, నాగుఱ్ఱములు నీటిపై నడచును; రథశిఖరములు కదలకుండ, నాగుఱ్ఱములు వాయువేగమున నడచెను.

దోహా 344

అందఱును వాహనారూఢులై, నగరబహిరంగమున నిలిచిరి. వారిశుభకార్యమునకుఁ దగినవిధమున, శుభశకునములు కనఁబడెను.

చౌపాయీ

ఏనుఁగులపై బంగారు హౌదాలను నిలువఁబెట్టి కట్టిరి; వానిసొగసుఁ జెప్పుటకు వీలుకాదు. ఆమదగజములు నడచినపుడు, వానిఘంటారవములు, శ్రావణమాసములో మేఘధ్వనులవలె, వినఁబడెను. ఇతరవాహనము లనేకములు నడచెను; 'పల్లకీలును', 'టాన్‌జన్లును'-వెడలెను. మూర్తీభవించిన వేదములో యనునట్లు, శుద్ధశ్రోత్రియులు వాహనములపై వెడలిరి. సూత, మాగధ, వందిజనంబులును, వైతాళికులును, వారివారివాహనములపై నడచిరి. ఖరములు, లొట్టియలు, వృషభములు-మొదలగునవి పదార్థములను వహించి, వెడలెను. అనేకవస్తువులఁ బట్టుకొని, కావళ్లవాండ్రు బయలుదేరిరి. రాజసేవకులు యథావిధిగ సింగారించుకొని ప్రయాణముసాగించిరి.

దోహా 345

అతియుత్సాహముతో వారు వెడలిరి; సంతోషముచే వారి శరీరములు పులకరించెను. "ఎప్పుడు రామలక్ష్మణులను మనము కన్నులారఁ జూడఁగలము?" అని వారిలో వారు గుసగుసలాడుచుండిరి.

చౌపాయీ

గజబృంహితములు, అశ్వహేషింకారములు, ఘంటారవములు, రథఘర్ఘరారావములు - వీనితో నలుదిక్కులు నిండెను. నగారాశబ్దములు

మేఘధ్వనులను మించియుండెను. ఒకరిమాట యొకరికి వినఁబడుట లేదు. రాజసింహద్వారమువద్ద నుండిన జనసమ్మర్దముచేత, నచ్చటి రాతి యంగణమంతయు ధూళిఅయ్యెను. సువాసినులు మేడలపై నెక్కి, మంగళహారతుల నిచ్చి, సేసలఁ జల్లిరి. అతిశ్రావ్యముగ వారు పాటలఁ బాడిరి. వారియానందము నెవరు చెప్పలేరు. సూర్యుని గుఱ్ఱములను దిరస్కరించుగుఱ్ఱములఁ గట్టి, రెండురథములను సుమంతుఁడు తీసికొని వచ్చి, రాజులయదుట నిలువఁబెట్టెను దానివైభవమును వర్ణించుటకు శేషశారదలు శంకించెదరు. వానిలో నొకటి రాజునకుఁ దగినట్లును, రెండవది గురువసిష్ఠునకుఁ దగినట్లు, సిద్ధముఁ జేయఁబడెను.

దోహా 346

ఒకరథముపై గురువు కూర్చుండి వెడలెను; రెండవరథముపై రాజు కూర్చుండి, గురువునకును, పార్వతీపరమేశ్వరులకును, గణపతికిని నమస్కరించి, ప్రయాణ మయ్యెను.

చౌపాయ్

బృహస్పతితోఁ గూడిన దేవేంద్రునివలె, గురువువెంటనుండిన రాజు శోభించెను. కులాచారము ననుసరించి, వేదోక్తప్రకారము, చేయఁదగిన శుభకర్మలను రాజు చేసెను. పంచవాద్యములు మ్రోగెను; గురువుసెలవుఁగైకొని, రాజు రామునిస్మరించి, వెడలెను. భూనభోంతరాళమును మంగళధ్వనులతోను, చతురంగబలముల కోలాహలముతో నిండెను. దేవతాస్త్రీలు మంగళాష్టకములఁ బాడుచుండిరి. "రసిలీ రాగముమీఁద సహానాయిని" పాడుచుండిరి. ఘంటారవములవలనఁ జెవులు దిమ్మువట్టెను. పోటమునకువలెఁ బదాతులు గమనించె. విదూషకులకౌతుకము నవ్వుఁబుట్టించెను.

దోహా 347

మృదంగములు,నిశానములు, నగారాలు-వీనిశబ్దములకు సమతాళముగ, రౌతులు నడిపించినప్రకారము గుఱ్ఱములు పదములువేయుచుండుటఁ జూచి, నటులు ఆశ్చర్యపడిరి.

చౌపాయ్

ఆపెండ్లిసంబరమును వర్ణించుట వ్యర్థము. శుభశకునము లగుపడెను. మంగళమును సూచించునట్లు, పిచ్చుకలు ధాన్యపుగింజల నేరు

కొనుచుండెను; ఇవి యెడమప్రక్కనుండెను. కుడిప్రక్కను మంచివరి పొలములో, ముంగిసలును కాకులును నిలిచెను; వానిని పెండ్లివారు చూచిరి; మంద,సుగంధ,శీతలవాయువు ప్రసరించెను. ఒకబాలుని నెత్తుకొని, యొకసువాసిని పూర్ణఘటమును నెత్తిమీఁదఁ బెట్టుకొని యెదురుగ వచ్చెను. మాటిమాటికిని నక్కలు ప్రదక్షిణముఁ జేసెను. పాలను లేదూడలకుఁగుడుపుచు, గోవు లెదురువచ్చెను. సకలశుభములను సూచించునట్లు, లేఁడిబృందము లెదురుగవచ్చెను. గరుడపక్షి సవ్యముగఁ బ్రదక్షిణముఁజేసెను. ఎడమప్రక్కన నొకచెట్టుపై శ్యామపక్షి కూర్చుండెను. మీనములను పెరుగును పట్టుకొని యొకమనుజుఁడు వచ్చెను. ఇరువురు బ్రాహ్మణులు పుస్తకములఁ బట్టుకొనివచ్చిరి.

దోహా 348

సన్మంగళములును, సకలకల్యాణములును, సర్వశుభశకునములును,అభిమతార్థముల నిచ్చుదాతలును-ఏకముహూర్తమున శుభమును సూచించుటకుఁ బ్రత్యక్షమయిరి.

చౌపాయ్

సగుణబ్రహ్మమును కుమారుఁడుగఁ గలవానికి సన్మంగళములును, శుభశకునములును వానియంతట నవి వచ్చెను. శ్రీరామునివంటి వరుఁడును, జానకివంటి వధువును జనకదశరథులవంటి వియ్యంకులునుకదా! వారికి శుభశకునముల లోప మేమియుండును. "ఈనాఁటికి మమ్ములను బ్రహ్మ సృజించినందులకు, మాజన్మము కృతార్థమయ్యెను" అని శకునములు తలంచెను. ఈప్రకారము పెండ్లివారు తరలి వెడలిరి; పంచవాద్యములు మ్రోఁగెను; చతురంగబలముల శబ్దములు భూనభోంతరాళములు నిండెను. దశరథమహారాజు వెడలెనని తెలిసికొని, జనకుఁడు మార్గములోనుండిన నదులపై వంతెనలఁ గట్టించెను; మార్గములో మధ్యమధ్యను, దేవేంద్రవైభవముతోఁ గూడిన శిబిరములను నిర్మించెను; ఆయాజనుల మనోభీష్టముప్రకారము షడ్రసోపేతమగు పదార్థములతోను, వస్త్రాద్యలంకారములతోను బిడిరములు నిండియుండెను. జనకుఁడు చేయించిన ప్రయత్నములవలనఁ బెండ్లివారిలో నొకఁడైనను కటికనేలపైఁ బవ్వళింపలేదు; వేళతప్పి భోజనముఁజేయలేదు.

ప్రతిదినము పెండ్లి వారికి మార్గములో నూతనోత్సాహము కలిగెను; ఈసుఖముచే వారు స్వగృహములను మఱచిరి.

దోహా 349

పెండ్లి వారి పంచవాద్యములు వినఁబడెను; అంతలో మిథిలాపుర జనులు చతురంగబలములతోఁ గూడి, యెదురుకోలుసన్నాహమునకు వెడలిరి.

చౌపాయ్

అమృతోపమానమగు పక్వాన్నముతోఁగూడిన సువర్ణపాత్రలను, మధుపదార్థములును పిండివంటలును సుపక్వఫలములతో నిండిన పళ్లెరములను వారికి రాజు కట్నముగ బంపెను. ఈపదార్థములఁ బట్టుకొని, సేవకు లనేకులు నడచిరి. చతురంగబలములు వారికి నెదురుగ వెళ్లెను. సువర్ణాలంకారములను, నవరత్నములను, చీనిచీనాంబరములను రాజు పంపెను; జనకుని యాజ్ఞప్రకారము నవధాన్యములను, పంచామృతములను, పుష్పములను, గూరగాయలను దీసికొని, కావళ్ల వాండ్రు వెళ్ళిరి. ముత్తైదువలు సుగంధద్రవ్యములఁ బట్టుకొని, నడచిరి. ఎదురుకోలుసన్నాహమునకు వెళ్ళినవారు పెండ్లివారిం జూచి, సంతోషించిరి; వారిశరీరములు పులకరించెను. ఇట్లుభయపక్షములవారును గలసికొని, పరమానందముఁ బొందిరి. ఉభయపక్షములవారి పంచవాద్యములు మ్రోఁగెను.

దోహా 350

రెండు ఆనందసముద్రములు కలసి యుప్పొంగినవిధమున, నుభయపక్షములవారును గలిసి, యుప్పొంగి, వారివారి చతురంగబలములతోను, వాహనములతో నడచిరి.

చౌపాయ్

అంతరిక్షమున దేవదుందుభులు మ్రోఁగెను; దేవతలు పుష్పములను వర్షించిరి; దేవకన్యకలు గానముఁజేసిరి. జనకుఁడు తీసికొనివచ్చిన కట్నములను దశరథుని యెదుట వినయపూర్వకముగ సేవకులు నిలువఁ బెట్టిరి. ప్రీతితో దశరథుఁడు వానిని గైకొని, సంతోషించి, వానిని యాచకుల కిచ్చెను. యథావిధిగ దశరథుఁడు మొదలగు పెండ్లివారిని జనకుఁడు సత్కరించి, యాదరించి, విడిదిగృహములో వారిని దింపెను,

రాజమార్గములోఁ జీనీచీనాంబరములఁ బఱచి, వానిపై నడుగులకు మడుగులనొత్తింపించి, దశరథమహారాజును జనకుఁడు తీసికొనివెళ్లెను. ఆజనకచక్రవర్తి సంపదలఁ జూచి, కుబేరుఁడు గర్వమునువిడిచి, సిగ్గు పడెను. ఏభోగమునకు లోపములేకుండ, విడిదిగృహములను నిర్మించి, పెండ్లివారిని వానిలో నతఁడు దింపెను. ఆగృహములలో వారు సకల సుఖములఁ బొందిరి. పెండ్లివారు నగరములోఁ బ్రవేశించినసంగతిని జానకివిని, తనమాహాత్త్యము శ్రీరామునకు విశదమగుటకు, అష్టసిద్ధులను స్మరించి, వానిని బిలిచి, "ఓయీ! మీరు రాజునకుఁ దగినయుప చారములఁ జేయుఁడు" అని యాజ్ఞాపించెను.

దోహా 351

శ్రీజానకియాజ్ఞాప్రకారము, బుద్ధి, సిద్ధులు విడిదిగృహములోఁ బ్రవేశించి, మాయను విస్తరించి, ఇంద్రలోకభోగములను సుఖముల నచ్చటఁ బ్రచురించెను.

చౌపాయ్

పెండ్లివారు యథోచితముగు విడిదిగృహములలోఁ బ్రవేశించి, యథానుకూలముగ సుఖముగ నుండిరి; దేవలోకభోగముల ననుభ వించిరి. ఈబుద్ధిసిద్ధుల ప్రభావమును వారు గ్రహింపక, సర్వము జన కుని ప్రయత్నములని తలంచిరి. జానకి మాహాత్త్యమును శ్రీరాముఁడు గ్రహించి, సంతోషించెను. తండ్రిగారిరాకను రామలక్ష్మణులు విని, సం తోషించిరి; తండ్రినిఁ జూడవలెనని వారికి హృదయములో నభిలాష కలిగెను; కాని, వారు బాహాటముగ గురువు నడుగుటకు శంకించిరి. వారి వినయవిధేయతలను విశ్వామిత్రుఁడు సంతసించి, వారిని కౌఁగిలించుకొనెను. సంతోషముచే నతనిశరీరము పులకరించెను; అతని నేత్ర ములవెంబడి నానందబాష్పములు కాఱెను. దాహముతో డస్సిన వారి వద్దకు సరోవరము వెళ్లినట్లు, రామలక్ష్మణులఁ దీసికొని విశ్వామిత్రుఁడు దశరథుని విడిదిగృహమునకు వెళ్లెను.

దోహా 352

ఋషివెంట వచ్చినకుమారులను రాజు చూచి, దిగ్గున లేచి, సం తోషించి, వారికి నెదురుగవెళ్లెను. పరమానందసముద్రములో నతఁడు మునిఁగి తేలుచుండెను; అతఁడు సంతోషముచేఁ బరవశుఁడయ్యెను.

చౌపాయ్

విశ్వామిత్రునిచరణములకు రాజు సాష్టాంగనమస్కారముఁ జేసి, వారిపాదధూళిని శిరస్సున ధరించెను. రాజు నతఁడు కౌఁగిలించుకొని, కుశలప్రశ్నఁ జేసెను. తదుపరి, కుమారులు తండ్రిపాదములకు నమస్కరించిరి. వారిం జూచినయానందము నతఁడు భరింపలేక, వారిని గౌఁగిలించుకొనెను; మృతకళేబరములోనికిఁ బ్రాణములు చేరినట్లయ్యెను. అనంతర మాకుమారులు వశిష్ఠుచరణములకు నమస్కరించిరి; అతఁడు సంతోషించి, శ్రీరాముని యాలింగనముఁ జేసికొనెను. తర్వాత, వారు బ్రాహ్మణులకు నమస్కరించిరి; వారు యథావిధిగ వారిని దీవించిరి. భరతశత్రుఘ్నులు శ్రీరామునకు నమస్కరించిరి; అతఁడు వారిని లేవఁదీసి, యాలింగనముఁ జేసికొనెను. అత్యుత్సాహముతో లక్ష్మణుఁడు వారితోఁ గలసి తిరిగెను.

దోహా 353

అంతఃపురజనులతోను, రాజకుటుంబీకులతోను, జాతిజనులతోను, యాచకులతోను, మంత్రులతోను, మిత్రులతోను యథాయోగ్యముగ శ్రీరాముఁడు కలసి, సంభాషించెను. శ్రీరామునిచిత్త మతికోమలము; అతఁడు కృపాసముద్రుఁడు; వినయవిధేయతలకు నిధి.

చౌపాయ్

శ్రీరాముని జూచినందున బెండ్లివారికిఁ గలిగినసంతోషముఁ జెప్పుటకు శక్యముకాదు. ధర్మార్థకామమోక్షములు మూర్తీభవించినట్లు నల్వురుకుమారులు రాజునెదుట నిలువఁబడిరి. ఆతండ్రి కుమారులఁ జూచి, స్త్రీపురుషులందఱు పరమానందభరితులయిరి. అంతరిక్షమున దేవదుందుభులు మ్రోఁగెను; దేవతలు పుష్పములను వర్షించిరి; గంధర్వులు గానముఁజేసిరి; అప్సరసలు నాట్యమాడిరి. శతానందుఁడును, మంత్రులును, బ్రాహ్మణులును, వందిమాగధసూతజనంబులును, యాచకులును దశరథుని సెలవుఁగైకొని, తిరిగివచ్చిరి. పెండ్లివారు శుభలగ్నమునకుఁ బూర్వము నగరములోఁ బ్రవేశించినందున, నగరజనులు బ్రహ్మానందభరితులయిరి; శుభలగ్నదినమును బొడుగింపుమని వారు భగవంతునిఁ బ్రార్థించిరి.

దోహా 354

"ఓస్వామీ! శ్రీసీతారాములు శోభాసముద్రులు; ఇరువురు వియ్యంకులు పుణ్యస్వరూపులు." ఈప్రకారము స్త్రీపురుషులు కలిసి పలుకుచుండిరి.

చౌపాయ్

"జనకుని పుణ్యమంతయు జానకిరూపమై పుట్టెను; దశరథుని పుణ్యమంతయు శ్రీరాముఁడై యవతరించెను. వీరివలె శివుని నారాధించినవారు లేరు; వీరివలె, ఫలమును బొందినవారు లేరు. వేయేల? వారివంటివారు త్రికాలములలో లేరు. మన మెంతో పుణ్యముఁజేయఁబట్టి, జనకపట్టణములో జన్మించితిమి. శ్రీసీతారాముల దివ్యమంగళ విగ్రహములఁ జూచుటకు మన మెంతటిపుణ్యముఁ జేసియుంటిమో కదా? మనవంటిధన్యులు లేరు. మఱియు వారి వివాహముఁ గన్నులారఁ జూచుభాగ్యము మనకు గలిగెను" ఈప్రకారము జనులు సంతోషించిరి తదుపరి, కోకిలవంటి స్వరముగల స్త్రీలు వారిలో నిట్లు సంభాషించిరి. "ఓసఖి! ఈవివాహము సకలాంభముసకు వచ్చెను. ఎంతో పూర్వపుణ్యమువలన, సీవివాహమును భగవంతుఁడు సమకూర్చెను. మనయదృష్టమువలన, రామలక్ష్మణులఁ జూచినందున, మనకు నేత్రోత్సవము కలిగెను.

దోహా 355

"ఓసఖి! మాటిమాటికి జానకిని జనకుఁడు స్వగృహమునకు రప్పించును; మఱల నామెను దీసికొనివెళ్లుటకుఁ గోటిమన్మథాకారులగు రామలక్ష్మణులు మననగరమునకు వచ్చెదరు; అప్పుడు వారిని మనము చూడవచ్చును.

చౌపాయ్

"ఓసఖి! అనేకవిందులు జరగును. ఇట్టి మామగారిని యెవరు ప్రేమింపరు? నగరములో నివసించు స్త్రీపురుష లాబాలవృద్ధులు రామలక్ష్మణులం జూచి సంతసించెదరు; ఓసఖి! రామలక్ష్మణులవంటి శోడు బాలకులు మఱియిరువురు దశరథునివద్దఁ గలరు. వారిలో నొకఁడు శ్యామలవర్ణము; రెండవవాఁడు గౌరవర్ణము; ఈబాలకులుకూడ చక్కనివారని, చూచివచ్చినవారు చెప్పుచున్నారు." ఆస్త్రీలలో నొక రిట్లు

ప్రత్యుత్తరము నిచ్చిరి. "ఓసఖీ! ఇప్పుడే నేను వారినిఁ జూచివచ్చితిని. భగవంతుఁడు స్వహస్తములతో వారిని సృజించెనని నాకుఁ దోఁచెను. రామభరతులు రూపురేఖలలో నొకరీతిగ నుందురు; స్త్రీపురుషులు వారిని నిదానించి చూచినగాని, వారిని బోల్చుట కష్టము. అటులనే, లక్ష్మణశత్రుఘ్నులు నఖశిఖపర్యంతము ముద్దులు మూటఁగట్టుచు, సరి సమానముగ నుందురు. వారిం జూచినతరువాత, నాకుఁ గలిగినసంతోషముఁ జెప్పుటకు నాకు శక్యముకాదు చెప్పుటకుఁ దగినమాటలు లేవు. వారితో సరిపోల్చుటకుఁ దగినయుపమానము మూఁడులోకములలో లేదు.

ఛాంద్ 35

తులసీదాసుగారిట్లు చెప్పుచున్నారు:—వారికిఁ దగినయుపమానము లేదుసుమీ! వారివంటివారు వారేకాని మఱియొకరు లేరు. ఏకవీశ్వరుఁడు, విద్వాంసుఁడు, పండితుఁడు, వారిని వర్ణింపఁగలఁడు? విద్యకును, బలమునకును, సుశీలమునకును, సౌందర్యమునకును, వినయమునకును వారు నిధులు. ఏయుపమానము వారికిఁ దగియుండును? అందుచేత, వారితోసమానులు లేరు. "ఓజగన్నాథా! ఈనల్వురన్నతమ్ములకు మానగరములో వివాహమగునట్లు ప్రసాదింపుము! ఇప్పుడు మేము వివాహమంగళాష్టకములఁ బాడఁగలము" అని స్త్రీపురుషులు చేలాంచలములఁ బట్టుకొని, ప్రార్థించిరి.

సోరథా 37

ఆనందబాష్పములఁగార్చి, "ఓసఖీ! జనకదశరథులు పుణ్యాత్ములు; శివునికటాక్షమువలన, మనయభిమతము లీడేరును." అని మఱియొకసువాసిని పలికెను.

ఇతి శ్రీగోపాలస్వామితులసీకృత శ్రీరామచరిత్రమానసే
సకలకలికలుషవిధ్వంసనే, బాలకాండాంతర్గత
పండితజ్వాలాప్రసాదకృత వ్యాఖ్యానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
నవమోవిశ్రామః.

---

*

# బాలకాండ దశమవిశ్రామః.



చౌపాయ్

ఈప్రకారమే పురజనులందఱుఁ గోరుచుండిరి; పరమానందసము ద్రములో వారు మునిఁగియుండిరి; జానకీస్వయంవరమునకు వచ్చిన రాజు లాయన్నదమ్ములఁజూచి, సంతోషించిరి. వారు శ్రీరాముని నిర్మల మగు సత్కీర్తినిఁ గొనియాడుచు స్వగృహములకు నిష్క్రమించిరి. ఇట్లు కొన్నిదినములు గడచెను; అతిథులును పురజనులును ముదమం దిరి. వివాహోత్సవ శుభలగ్నదినము వచ్చెను; హేమంతఋతువు, మార్గశీర్షమాసము, శుభలగ్నము, శుభదినము, శుభనక్షత్రము, తారాబలచంద్రబలము-ఈమొదలగువానిని బ్రహ్మ స్వయముగఁజూచి, వివాహశుభముహూర్తముఁగట్టి, లగ్నచక్రమునువ్రాసి, నారదుని చేతి కిచ్చి, జనకచక్రవర్తివద్దకుఁ బంపెను జనకుని యాస్థానములో నుండిన జ్యోతిశ్శాస్త్రపండితులు కూడ యిదేము, బ్రహ్మనిర్ణయించిన ముహూర్త మునే, స్వతంత్రముగ నిర్ణయించిరి. ఆసంగతి జనులు విని, తమపండి తులు బ్రహ్మదేవునివంటివారని స్తోత్రముఁ జేసిరి.

దోహా 356

నిర్విఘ్నముగ గోధూళిసమయము (వేళ) సుమంగళములకు మూలము; ఆవేళఁ జూచి, బ్రాహ్మణు లందఱు జనకునివద్దకు వచ్చి, “ఓ మహారాజా! ఈవేళ వివాహమునకు మంచిది”అని చెప్పిరి.

చౌపాయ్

అపుడు జనకుఁడు పురోహితునిఁ బిలిచి, “ఓస్వామీ ! ఏల విలంబము !” అని యడిగెను. ఆవెంటనే శతానందుఁడు మంత్రు లకు వర్తమానముఁ బంపెను ; వారు మంగళకలశములను బట్టుకొని వచ్చిరి; శంఖములు, భేరీమృదంగములు, ‘ ఢంకానోపత్ ’— ఈ మొదలగునవి ధ్వనులఁజేయ నారంభించెను; శుభశకునమును సూచిం చెడు మంగళకలశముల నలంకరించి, తీరుగనుంచిరి; చక్కని సువా

సినులు సీతారాములమీఁదఁ బాటలఁ గూర్చి, గానముఁ జేయుచుండిరి; వేదాధ్యయనసంపన్నులు వేదపారాయణము జేయుచుండిరి; ఈప్రకార మాడపెండ్లివారు సర్వసన్నాహములతో మగపెండ్లి వారివిడిదికి బయలు వెడలిరి. శ్రీదశరథమహారాజుల పరిజనమును వారివైభవమును విలాసమును జనకునిపరివారముఁ జూచి, దేవేంద్రునివైభవమును మించియుండెనని తలంచెను. పరిజనముతోఁ గూడి జనకుఁడు పెండ్లివారివిడిదికి వచ్చి, దశరథునిఁ జూచి, నమస్కరించి, "ఓమహారాజా ! సమయము వచ్చెను; కనుక, శీఘ్రముగ వెడలుఁడు" అని చెప్పెను. అంతలో, దశరథుని బిరుదునిశానీలను బయటనుంచిరి; భేరిమృదంగములను మ్రోగించిరి; మంగళధ్వనులు మిన్నుముట్టెను; దశరథుఁడు వసిష్ఠుతోఁ బ్రసంగించి, కులాచారప్రకారము చేయవలసిన శుభక్రియలను నిర్వర్తించి, పరివారముతోఁ గూడి, బయలువెడలెను. ఇట్లుభయపక్షముల వారు కలసి వెడలిరి.

దోహా 357

దశరథమహారాజు సంపదలను వైభవమును బ్రహ్మాదిదేవతలు చూచి, సిగ్గుపడి, వారివారిజీవనములు వ్యర్థమయ్యెనని తలంచిరి; "దశరథునివైభవమును సంపదలను సీఘ్ర వర్ణింపఁగలవా?" అని వారు శేషు నడిగిరి.

చౌపాయ్

శుభముహూర్తము సమీపించెనని దేవతలు తెలిసికొని, పుష్పములను వర్షించిరి; దుందుభులను మ్రోగించిరి. బ్రహ్మమహేశాదిదేవతలు విమానారూఢులై, యంతరిక్షమున నిలిచియుండిరి; వారిశరీరములు పులకరించెను; శ్రీసీతారాముల వివాహోత్సవముఁ జూడవలెనని వా రువ్విళ్లూరుచుండిరి జనకపట్టణముయొక్క శోభను వారు చూచినందున, వారిలోకములు వారికంటికిఁ గనీసముగఁ గనఁబడెను. ఆ వివాహమండపమును, దానిరచనాచిత్రమును వారు తనివిదీరఁ జూచిచూచి, యాశ్చర్యమగ్నులయిరి. ఆమండపముయొక్కరచన కేవల మలౌకికముగనుండెను. ఇఁక, మిథిలానగరములోనిజనులు, స్త్రీపురుషులసంగతి వినుము. వారు రూపురేఖావిలాసములలో దిద్దినట్లుండిరి.

వారిచక్కదనమేమి? వారి యౌవనమేమి? వారిసొగసులేమి! వారి శీలియేమి? వారు ధర్మాత్ములు; చతురులు; సరసులు; చంద్రుని యెదుట నక్షత్రములవలె, వారియెదుట దేవతాస్త్రీలు వెలవెలఁబోవుచుండిరి. బ్రహ్మకునయిత మాశ్చర్యముకలిగెను; ఆపట్టణమును సీతాదేవి స్వయముగ రచించెను; దానియెదుట బ్రహ్మసృష్టివైభవము 'దేహి' యనినట్లుండెను.

దోహా 358

ఈవిధమున నాశ్చర్యమగ్నులయిన బ్రహ్మాదిదేవతలను పరమేశ్వరుఁడు చూచి, వారితో నిట్లు ప్రసంగించెను:— "ఓ దేవతలారా! మీ యాశ్చర్యమును విడిచిపెట్టుడు; స్థైర్యము నవలంబించి లెస్సగవిచారింపుడు. ప్రస్తుతము, శ్రీసీతారాముల వివాహోత్సవము; దాని యెదుట, మిగిలినవి నీరసములే.

చౌపాయీ

"వారి నామోచ్చారణవలన, నమంగళములు నిర్మూలమగును; చతుర్విధపురుషార్థములు వారిచేతిలో నుండును; అట్టివారు శ్రీసీతారాములు" అని పరమేశ్వరుఁడు వారికి బోధించెను. ఈప్రకారము సాంబశివుఁడు వారికి బోధించి, నందికేశ్వరు నెక్కెను. దశరథుఁడు పరివారముతో వెడలుట దేవతలు చూచి యానందభరితులయిరి; వారిశరీరములు పులకరించెను. ఆపరివారములో నుండిన సాధువులును బ్రాహ్మణులును, శరీరములను ధరించిన దేవతలువలె నుండిరి. ఆపరివారము మధ్యను, నలువురుసోదరులు, మూర్తీభవించిన అపవర్గచతుష్టయమువలె ప్రకాశించుచుండిరి; రామభరతులశరీరములకాంతి, మరకతమాణిక్యముల కాంతివలెఁ ప్రకాశించుచుండెను; లక్ష్మణశత్రుఘ్నుల శరీరములు సువర్ణచ్ఛాయవలె నుండెను. ఈజతలను దేవతలు చూచి ప్రసన్నులయిరి; మఱలవారు శ్రీరామచంద్రునిఁ జూచి, ఆనందభరితులయిరి; వారు దశరథుని స్తోత్రముఁజేసిరి; అంతలో, విద్యాధరులు వచ్చి, పెండ్లివారిపైఁ బుష్పములను వర్షించిరి.

దోహా 359

శ్రీరామచంద్రుల దివ్యమంగళవిగ్రహమును నఖశిఖపర్యంతముఁ

జూచిచూచి, పార్వతీపరమేశ్వరులు పరమానందభరితులయిరి; వారిశరీరములు పులకరించెను; వారినేత్రములు కడవలకొలఁది, యానందబాష్పములఁ బ్రవహించెను.

చౌపాయి

నెమలికంఠముతో సమానమగు కాంతిగల నతని శ్యామలశరీరముపై నుండిన యుత్తరీయము మెఱుపును ధిక్కరించుచుండెను; వివాహసమయమున నుచితమగుభూషణాలంకారము లతనిశరీరచక్కదనము నతనివద్ద నెరవుఁదీసికొని వచ్చెను. అతనిముఖము శరత్కాలరాకాచంద్రబింబమువలె వెలుఁగుచుండెను; అతనినేత్రములు నూతనముగ వికసించిన కమలములనుసయితము హేళనముఁజేయుచుండెను. అతనిసౌందర్య మలౌకికము; అతనిం జూచినతరువాత నెట్లు మనస్సు భ్రమించునో, యెవరుచెప్పలేరు. అతనితమ్ము లతనిపార్శ్వము నలంకరించియుండిరి; గుఱ్ఱములు చంచలించి, 'కదముఁ' ద్రొక్కుచుండెను; ఇతరరాజకుమారుల గుఱ్ఱములుసయితము కదముఁద్రొక్కుచుండెను. భట్రాజులు రఘువంశపురాజులకీర్తినిఁ బ్రశంసించిరి. రాముఁడు స్వారీచేయుచుండిన గుఱ్ఱముయొక్క పదగతులఁజూచి, గరుత్మంతుఁడు సిగ్గుపడెను; ఆగుఱ్ఱముయొక్కసొగసును వర్ణించుటకు శక్యముకాదు; మన్మథుఁ డాగుఱ్ఱమురూపమును ధరించి వచ్చినట్లు తెలిసికొనుము.

ఛాంద్ 36

మన్మథుఁడు రామునియందు గలప్రేమచేత, నాయశ్వరూపమును ధరించివచ్చినట్లుఁ దోఁచును. దానిచక్కదన మంతచోద్యముగ నుండెను; వయస్సు, రూపము, బలము, గుణము, పదగతులు - ఈ మొదలగువానిచే నది లోకులను భ్రమింపఁజేసెను. దానివీఁపుమీఁద నుండిన మృదువగు జీనికి ముత్యములను మాణిక్యములను గ్రుచ్చిరి; దానిపగ్గములను గొలుసులను చూచి దేవతలును మునులు నాశ్చర్యపడిరి.

దోహా 360

ఆగుఱ్ఱము ప్రభుచిత్తముఁ గనిపెట్టి, తదనుగుణ్యముగ కదముఁ ద్రొక్కుచుండెను; నక్షత్రములకాంతిచేతను మెఱుపులకాంతిచేతను

తళుకుమనుచుండిన నీలమేఘముఁజూచి, నెమలి నృత్యముఁజేయువిధ మున, నాగుఱ్ఱము పాదములను సమగతిగ వేయుచుండెను.

చౌపాయ్

అంత చక్కనిగుఱ్ఱముపై శ్రీరామమూర్తి స్వారీచేయుచుం డెను; దానియొయ్యారమును వర్ణించుటకు శారదకయినను సామర్థ్య ములేదు; శ్రీశంకరులు పదిసౌమ్యనేత్రములతో మొదట రాముని౯ జూచి, తనవిఁదీరక, మిగిలిన అయిదువిషమలోచనములను సౌమ్యముఁ జేసికొని, మొత్తము పదియయిదునేత్రములతోఁ జూచుచుండెను లక్ష్మీనారాయణు లిరువురును శ్రీరాముని౯ జూచి, పరవశులయిరి; రఘు రాముని బ్రహ్మదేవుఁడు యెనిమిదినేత్రములతోఁ జూచి, తనవిఁదీరనం దున, నింతకొంచెమునేత్రము లుండెనని విచారించెను. బ్రహ్మదేవుని కంటె నధికముగ మఱినాలుగునేత్రము లుండుటచేత సుబ్రహ్మణ్యస్వామి, కుమారస్వామి సంతసించెను; ఇంద్రుఁడు శ్రీరాముని౯ జూచి, గౌతమ మునిశాపము తనకు మేలయ్యెనని తలఁచెను. ఇంద్రునకు సహస్రనేత్ర ములు కలవు; అదియే, మునిశాపము, "ఈరోజున నింద్రునితో సమా నుఁడులేడు" అని దేవత లతనిని స్తుతించిరి. బ్రహ్మాదిదేవతలు రాము ని౯జూచి, పరమానందముఁబొందిరి; ఆరాజులసమావేశముఁ జూచియు వారు ప్రసన్నులయిరి; ఉభయదేశాధిపతుల పరిజనములును, వారి యెదురుకోలుసన్నాహమువలన, నానందించుచుండిరి.

ఛాంద్ 37

పెండ్లివా రుభయపక్షములవా రానందభరితులయిరి; ఉభయుల మంగళవాద్యములు మ్రోఁగుచుండెను; దేవతలు పుష్పవర్షమును వర్షించి, జయజయశబ్దములఁ జేసిరి; ఈప్రకారము పెండ్లివారు వెడ లిరి; మంగళధ్వనులను విని, పెండ్లివారు వచ్చుచుండిరని తెలిసికొని, రాణులు సువాసినులఁ బిలిచి, మంగళహారతులను సిద్ధముఁజేయుమని చెప్పిరి.

దోహా 361

అనేకప్రకారముల మంగళహారతులను, సువర్ణకుంభములను సిద్ధపరచి, వారు ప్రసన్నులై నిలిచియుండిరి; మత్తగజగామినులు హార తులఁ బట్టుకొని, పాటలఁ బాడుచుఁ, బెండ్లివారికి నెదురుగ వచ్చిరి.

చౌపాయ్

ఆచంద్రముఖుల, ఆమృగనేత్రల చక్కదనముఁజూచి, కంద ర్పుఁడు దర్పమునువిడిచెను; వారు రంగురంగులవస్త్రములను ధరించిరి; వారు చిత్రవిచిత్రభూషణములను సింగారించుకొనిరి. వారు సువాసి నులని తెలిసికొనుటకుఁ దగినసులక్షణములన్నియు వారియందుఁ గనఁ బడును. మధురముగ వారు పాడుచుండినపాటలను విని, కోకిల సిగ్గు పడెను; వారి శింజాన మణిమంజీరనినదంబులును, కంకణకేయూర నూపుర ధ్వనులను విని, మన్మథునివాహనము తలను వంచుకొనెను. చిత్రచిత్ర మంగళవాద్యములు మ్రోఁగుచుండెను; భూమ్యాకాశము లంతయు మంగళాచరణములతో నిండెను. శచీదేవియు, శారదయు, లక్ష్మియు, భవానియు—ఈమొదలగు చతురులగు దేవతాస్త్రీలు, మానవస్త్రీరూ పములను ధరించి, తదితర రాణివాసపుస్త్రీలతోఁ గూడి, జనకునియంతః పురములో మెలఁగుచుండిరి; వారును చక్కని పెండ్లిపాటలఁ బాడుచుం డిరి; పెండ్లివారందఱు పెండ్లిసంబరములో నుండుటచేత, వారు దేవ తాస్త్రీలఁ గనుఁగొనలేకపోయిరి.

ఛాంద్ 38

ఆమహాసంబరములో నొకరినొకరు పోల్చుకొనుట యెట్లు? పర మానందభరితులై, పెండ్లివారు, పాటలఁబాడుచు, నృత్యములఁజే యుచు, శ్రీరామునకు మంగళహారతుల నిచ్చుటకు వెడలివచ్చిరి; మం గళవాద్యములు మ్రోగుచుండెను. దేవతలు పుష్పములను వర్షించిరి; పెండ్లిసంబరము శోభస్కరముగనుండెను; సచ్చిదానందస్వరూపుఁడగు శ్రీరాముని సువాసినులు చూచి ప్రసన్నులయిరి; వారిశరీరములు పుల కరించెను; కమలములవంటి వారినేత్రములవెంబడి, కడవలకొలఁదిగ నానందబాష్పములు జారెను.

దోహా 362

శ్రీరామచంద్రుని దివ్యమంగళవిగ్రహమును జానకితల్లి చూచి సంతోషించెను; ఆసంతోషమును నూరుకల్పములవఱకు సహస్రశేషు వులుగాని శారదలుగాని తుదముట్టఁ జెప్పలేరు.

చౌపాయ్

అప్పుడు శుభసమయమని మహారాణి తెలిసికొని, నేత్రముల

వెంబడి స్రవించుచుండిన నీరుఁ దుడుచుకొని, సంతోషముతో వారికి యెదురుగ నడచెను. వేదోక్తప్రకారమును కులాచారప్రకారము వివాహశుభకర్మలను వారు పూర్తిగఁజేసిరి; పంచవాయిద్యములు మ్రోఁగుచుండెను. [(1) శంఖము, ఘంటము, నగారా, దుందుభి, పిల్లనఁగ్రోవి; (2) అథవా, వేదధ్వని, వందీధ్వని, జయధ్వని, శంఖధ్వని, వాయిద్యములధ్వని.] పెండ్లికుమారుఁడు నడచుమార్గమున వస్త్రమును బఱచిరి; పెండ్లికుమారునకు మంగళహారతినిచ్చి, మహారాణి యతని పాదములను వసంతముతోఁ గడిగెను; తదుపరి, పెండ్లికొడుకు వివాహమండపముపైఁ గూర్చుండెను. దశరథమహారాజును నతనిపరివారము దేదీప్యమానముగ వెలుఁగుచుండిరి; అతనివైభవముఁ జూచి, లోకపతులు సిగ్గుపడిరి; సమయోచితముగ దేవతలు పుష్పములను వర్షించుచుండిరి; బ్రాహ్మణులు దశశాంతులఁ జెప్పుచుండిరి; అంతరిక్షమునను, నగరమంతటను కోలాహలముపుట్టెను; ఎవనిమాటలు వానికే వినఁబడ లేదుకదా! ఒకరిమాట లొకరికి వినఁబడుట యెట్లు? ఈప్రకారము శ్రీరామమూర్తి వివాహమండపమునకు వచ్చెను; వసంతముతో నతని పాదములఁ గడిగిరి; తదుపరి, యతఁడాసనముపైఁ గూర్చుండెను.

ఛాంద్ 39

పెండ్లిపీటపైఁ గూర్చుండిన రామునిఁ జూచి వారు సంతోషించిరి; సువాసినులు వచ్చి మంగళహారతుల నిచ్చిరి; మణులను, వస్త్రములను, నాణెములను వరుసను దిగఁదుడిచి పారవేసిరి; సుభగులు మనోహరముగఁ బెండ్లిపాటలఁ బాడుచుండిరి; బ్రహ్మాదిదేవతలు బ్రాహ్మణులవేషమును ధరించి, వివాహమహోత్సవముఁ జూడవచ్చిరి; రఘుకులకమలములను వికసింపఁజేయుటకు సూర్యునివంటివాఁడగు శ్రీరాముని రూపరేఖావిలాసములను వారు చూచి, వారివారిజన్మములు సఫలమయ్యెనని తలంచిరి.

దోహా 363

గాయకులును, నాటకులును, మంగళులును, దివటీవాండ్రును రామునకు దిగఁదుడిచి విసర్జించినపదార్థములను సంగ్రహించి, రామునకు నమస్కరించి, యతనిని దీవించిరి; పట్టలేనిసంతోషమును వారు పొందిరి.

చౌపాయ్

జనకచక్రవర్తియు దశరథమహారాజును పరమానందముతోఁ గూడి, లౌకిక వైదిక శుభకర్మలఁ గలసి యొనరించిరి; ఆ రాజుల కలుపుఁగోలుతనముఁ జూచిన, సంతోషముకలుగును; దానికిఁ దగినయుపమానము లేనందునఁ గవీశ్వరుఁడు సిగ్గుపడుచుండెను; తుద కాకవీశ్వరుఁడు చింతించి, వారికివారే సమానులని చెప్పి యూరకుండెను. ఆవియ్యంకుల యన్యోన్యానురాగమును దేవతలు చూచి సంతోషించి, పుష్పములను వారిపై వర్షించి, వారిరువురను స్తోత్రముఁజేసిరి. "బ్రహ్మసృష్టి మొదలు నేఁటివఱకు లోకములో ననేకవివాహములను గుఱించి విని యుంటిమి; అనేకములఁ జూచియుంటిమి; కాని, దీనితోసమానమగు వివాహమును, వీరితోసమానులగు వియ్యంకులను, మేము చూచి యుండలేదు" అని దేవత లంతరిక్షమునుండి పలికిరి. వియ్యంకు లిరువురు వారిమాటలను విని ప్రసన్నులయిరి; జనకుఁడు దశరథున కర్ఘ్యమునిచ్చి, యొకరత్నకంబళమును బఱచి, దానిపై వియ్యంకునిఁ గూర్చుండఁబెట్టెను.

ఛాంద్ 40

వివాహమండప విచిత్రరచనయును దానిశోభఁ జూచి, మునీశ్వరులుసయితము భ్రమించిరి; జనకచక్రవర్తి స్వయముగా సింహాసనముల నమర్చి, వానిపై మహాత్ములఁ గూర్చుండఁబెట్టెను; ఇష్టవేల్పునకువలె, జనకుఁడు వినయవిధేయతలతో వసిష్ఠునిఁ బూజించి గౌరవించెను; అతఁడు రాజును దీవించెను; అతిభక్తిశ్రద్ధలతో నధికముగ నతఁడు విశ్వామిత్రునిఁ బూజించి, మన్నించెను; ఆవిధానముఁ జెప్పుటకు శక్యముకాదు.

దోహా 364

వామదేవుఁడు, జాబాలి మొదలగుమహర్షుల నతఁడు యథావిధిగ బూజించి, వారికిఁ దగినయాసనముల నిచ్చెను. వారందఱు మహాదాశీర్వచనముఁ జేసిరి.

చౌపాయ్

తదుపరి, జనకుఁడు దశరథుని సాక్షాదీశ్వరుఁడనిభావించి, పూజించెను; అనేకవిధముల నతఁడు చేతుల జోడించుకొని, దశరథునిఁ

గొనియాడి, అట్టిమహానుభావునితో వియ్యమందు భాగ్యము లభించెనని సంతోషించెను. పెండ్లివారితోఁ గలసివచ్చిన రాజబంధువులను, తదితరులను దశరథునితో సమానముగ నాదరించి, వారి నతఁడు సత్కరించెను; వారివారికిఁ దగినయాసనములను సమర్పించెను; ఓభరద్వాజా! ఆపెండ్లివైభవము నొకముఖముతో నేనెట్లు వర్ణించిచెప్పఁగలను? పెండ్లివారికి జనకుఁడు కానుకలును కట్నముల నిచ్చి, వారిని యథాన్యాయముగ సన్మానించెను బ్రహ్మావిష్ణుమహేశ్వరులును, అష్టదిక్పతులును, సూర్యుఁడును, శ్రీరాముని ప్రభావముఁ దెలిసికొని, వారివారి నిజరూపములను మఱుఁగుపఱచి, బ్రాహ్మణవేషములను ధరించి, సభలోఁ గూర్చుండి, పెండ్లిసంబరముఁ జూచుచుండిరి. వారు నిజముగ దేవతలని తెలియకపోయినను, బ్రాహ్మణులు భూదేవతలని జనకుఁడు గ్రహించి, వారిని యథావిధిగ సత్కరించి, సన్మానించెను

ఛాంద్ 41

ఎవరిసంగతివారికేఁ దెలియనిసమయమున నొకరిసంగతిఁ జెప్పువా రెవరు? దానిని గ్రహించువా రెవరు? ఆచిదానందస్వరూపుఁడగు శ్రీరామునిఁ జూచి, రెండుపక్షములవారును బ్రహ్మానందభరితులయిరి; శ్రీరాముఁడు దేవతలఁ జూచి, వారివారికిఁ దగినయాసనములను మానసికముగ సమర్పించెను; శ్రీరాముని సరళచిత్తమును దేవతలు గ్రహించి, ప్రసన్నులయిరి.

దోహా 365

చకోరములు చంద్రకిరణములఁ బానముఁజేయువిధమున, వారు శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ గన్నులారఁ జూచి, ఆనందపరవశులయిరి.

చౌపాయ్

శుభముహూర్తముఁ గనిపెట్టి, వసిష్ఠుఁడు శతానందునిఁ బిలిచెను; ఆవెంటనే, శతానందుఁడు వచ్చెను. "శీఘ్రము సీతఁ దీసికొని రండు అని వసిష్ఠునియాజ్ఞ నతఁడు శిరసావహించి,నిష్క్రమించెను.శతానందునివచనములను రాణియు చెలికత్తెలును విని సంతోషించిరి. అప్పుడు బ్రాహ్మణులను గులవృద్ధులఁ బిలిచి, వారు కులాచారప్రకారము చేయవలసిన శుభకర్మల నాచరించిరి; సువాసినులు మధురముగ గానముఁ

జేసిరి. దేవతాస్త్రీలు, మానవస్త్రీవేషములను ధరించి, పెండ్లికి వచ్చియుండిరి; వారిశరీరముల నవకముఁ జూచి, తదితరస్త్రీలు సంతోషముచేసుచుండిరి. వారిపూర్వోత్తరములు తెలియకపోయినను, మానవస్త్రీలు తమప్రాణములకంటె నధికముగ వారినిఁ బ్రేమించిరి మహాదేవి, మహాలక్ష్మి, మహాసరస్వతులతో సమానులని రాణి తలంచి, వారిని నాదరించి, సత్కరించెను. సీతను సర్వాలంకారములతో సింగారించి, చెలికత్తెలామెను వెంటఁదీసికొని, పాటలఁ బాడుచు, వివాహమండపమునకుఁ దీసికొనివచ్చిరి.

ఛాంద్ 42

ఆసువాసినులు, ఆషోడశకళాశృంగారవతులు, ఆసుభగులు, ఆసఖులు, ఆమత్తగజగామినులు, పాదసంచారులై, పంచమస్వరములోఁ బాటలఁ బాడుచు, సీతను వెంటఁదీసికొని, వివాహమండపమునకు వచ్చిరి; మునీశ్వరులు ధ్యానమునువిడిచి, గానరసమునకు లోఁబడిరి; వారిసింగారముఁ జూచి మన్మథుఁడును, శ్రావ్యముగ నుండినవారికంఠమును విని కోకిలయును సిగ్గుపడెను. శింజాన మణిమంజీరనినదంబులు చెవులకుఁ బండువు సేయుచుండెను.

దోహా 366

పరమరమణీయులగు వనదేవతలమధ్య నత్యంతకమనీయమగు శోభాదేవి ప్రకాశించువిధమున, నాచక్కని చెలికత్తెలమధ్యను సహజసౌందర్యయగు సీత దేదీప్యమానముగ నుండెను.

చౌపాయ్

జానకిసౌందర్యమును వర్ణించుటకు శక్యముకాదు; నాబుద్ధి స్వల్పము; ఆమెచక్కదన మధికము; ఆరూపరాశిని, ఆపరమపవిత్రురాలిని, ఆసీతమ్మను, పెండ్లివారు చూచి, మానసికముగ నామెకు నమస్కరించిరి; ఆమెం జూచినందున, శ్రీరాముని మనస్సున కాప్యాయము కలిగెను. దశరథుఁడును, అతనికుమారులును, చెప్పుటకు శక్యముకాని సంతోషముఁ బొందిరి. ఆమెకు దేవతలు నమస్కరించి, పుష్పములను వర్షించిరి; పరమానందమగ్నులై, మునీశ్వరులు, శాంతిపాఠములను వర్ణించిరి; సకలశుభములను సూచించు మహదాశీర్వచనములఁ జెప్ప

చుండిరి. మంగళధ్వనులు మ్రోఁగెను; నృత్యగీతవాద్యములు మిన్ను ముట్టెను; ఎటువైపుఁజూచినను కోలాహలమే! నగరములోని స్త్రీపురుషు లత్యంతప్రేమానందభరితు లయిరి. జానకి వివాహమండపమునకు వచ్చెను. ఆసమయమున, నుభయుల కులగురువులును శిష్టాచారము ననుసరించి, విధ్యుక్తప్రకారము, శుభకర్మలను నడిపించిరి.

ఛాంద్ 43, 44

తదుపరి, గురువుగారి యాజ్ఞప్రకారము, బ్రాహ్మణులు వచ్చి, గౌరీదేవిని, గణపతినిఁ బూజించిరి. ఆయాదేవతలు ప్రత్యక్షమై వారి పూజలఁ గైకొని, సంతోషించి, వధూవరులను దీవించిరి; వారందఱు ప్రసన్నులయిరి; వివాహసమయమునకుఁ గావలసిన మధుపర్కములను, పంచామృతములను, తదితర మంగళద్రవ్యములను, మునులుకోరిన ప్రకారము, సువర్ణపాత్రలలో నుంచి, సేవకులు వానిం దీసికొనివచ్చి యిచ్చిరి. సూర్యనిసిద్ధాంతము ననుసరించి, కులాచార ప్రకారము చేయవలసిన శుభకర్మలను వారు మనస్ఫూర్తిగ నిర్వర్తించిరి; ఇష్టదేవతల నారాధించిరి; జానకిని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టిరి; శ్రీసీతారాము లొకరినొకరు క్రేగంటిచూపులతోఁ జూచుకొనిరి; వారియన్యోన్యానురాగము పరులకు స్పష్టముకాదు; వారియనురాగమును బుద్ధిచే నాలోచించుటకుఁగాని, మనస్సుచే నూహించుటకుఁగాని, వాక్కులచే వర్ణించుటకుఁగాని, శక్యముకాదు. ఏకవీశ్వరుఁడు దానినిఁ బ్రకటింప సమర్థుఁడు?

దోహా 367

హోమసమయమున,నగ్ని హోత్రుఁడు శరీరమునుధరించివచ్చి, ఆహుతులను స్వయముగ గ్రహించెను. బ్రాహ్మణరూపములను ధరించి చతుర్వేదములును వివాహమంత్రములఁ జెప్పెను.

చౌపాయ్

ఆరాణి, సునయన, ఆజనకునిపట్టపురాణి, ఆతనిధర్మపత్ని, ఆజగజ్జననికి మాత; ఆమె మూఁడులోకములలోఁ బ్రసిద్ధికెక్కెను; ఆమెను వర్ణించిచెప్పుటకు సామర్థ్యములేదు; సత్కీర్తి, పుణ్యము, సుఖము, సౌందర్యము - వీనిని బ్రహ్మదేవుఁడు సమ్మేళనము జేసి, సునయనరూపమున బుట్టించెను. శుభముహూర్తముఁ జూచి, మును లామెను బిలి

చిరి; ఆమె సువాసినులతోఁ గూడి వచ్చెను. పార్వతివివాహసమయమున హిమవంతునివామపార్శ్వమున మేనక శోభించినవిధమున, నేడు సీతావివాహసమయమున జనకుని వామపార్శ్వమున సునయన, ప్రకాశించెను. రత్నస్థగితమగు సువర్ణపాత్రలలో సుగంధద్రవ్యములతోఁ గూడిన పుణ్యజలము లుండెను; ఆపాత్రలను భార్యాభర్త లిరువురు స్వయముగఁ దీసికొనివచ్చి, రాముని యెదుట నుంచిరి. మునీశ్వరులు స్వస్తిపుణ్యాహవచనముఁ బఠించుచుండిరి; అంతరిక్షమునుండి దేవతలు పుష్పములను వర్షించిరి; ఆభార్యాభర్త లిరువురు వరునిఁ జూచి ప్రసన్నులై, యతని చరణకమలములను జలములతోఁ గడిగిరి.

ఛాంద్ 45, 46, 47, 48.

వారిరువురిశరీరములు పులకరించెను; వారు వరునిపాదములఁ గడిగిరి; ఆసమయమున, భూలోకములోను స్వర్గలోకములోను, మంగళధ్వనులను నృత్యగీతవాద్యములును చెలరేఁగె. దిగంతములకు వ్యాపించెను. ఆచరణకమలములు సదాశివుని మానససరోవరములోఁ బ్రకాశించును; ఆపరమపవిత్రములగు చరణములను ధ్యానించుటవలన, సకలపాపములు నశించును; మనస్సు నిర్మలమగును. ఆచరణకమలములపరాగము సోకినమాత్రమున, మహాపాతకురాలు, మునిపత్ని పవిత్రురాలయ్యెను; ఆచరణారవిందముల మకరందమును పరమపవిత్రమనితలఁచి, శివుఁడు శిరస్సుపై ధరించును; ఆచరణములయందే గంగాదేవి పుట్టెను; మునీశ్వరులును, యోగీశ్వరులును, వారివారిమనస్సులనునట్టి తుమ్మెదలు శ్రీవారిపాదకమలముల నాశ్రయించి, సేవించి, సద్గతిఁ బొందుచుండిరి. ఆచరణకమలములను జనకచక్రవర్తి జలములతోఁ గడిగెను. ఏమి జనకునిభాగ్యము? జనులందఱు జయజయశబ్దములఁ జేసిరి. వధూవరుల చేతులను జోడించి, వసిష్ఠుఁడును శతానందుఁడును వారివారి రాజులవంశానుక్రమణికఁ జెప్పనారంభించిరి. ఈప్రకారము వారిపాణిగ్రహణ మయ్యెను; దేవతలును మునులును పరమానందభరితులయిరి; ఆసకలగుణధాముఁడగు జామాతం జూచినందున, దంపతుల కత్యంతానాప్యాయనము కలిగెను. ఇట్లు లోకాచారము ననుసరించి, వేదోక్తప్రకారము, దంపతులు సాలంకృతకన్యాదానముఁ జేసిరి. పార్వ

తిని హిమవంతుఁడు శివున కిచ్చినవిధమునను, మహాలక్ష్మిని క్షీరసముద్రుఁడు భగవంతున కిచ్చినట్లును, జానకిని జనకచక్రవర్తి శ్రీరామచంద్రునకు సమర్పించెను. ఆచక్రవర్తికీర్తి దిగంతములకు వ్యాపించెను.

సూర్యవంశానుక్రమణిక.

పరమేశ్వరునకు బ్రహ్మ; బ్రహ్మకు మరీచుఁడు; మరీచునకు కశ్యపుఁడు; అతనికి సూర్యుఁడు; అతనికి వైవస్వతమనువు; ఆమనువునకు ఇక్ష్వాకు; ఇక్ష్వాకుమహారాజు అయోధ్యానగరముఁ గట్టెను. ఇక్ష్వాకునకు కుక్షి; అతనికి వికుక్షి; అతనికి బాణుఁడు; అతనికి అనరణ్యుఁడు; అతనికి పృథుచక్రవర్తి; అతనికి త్రిశంకు; అతనికి ధుంధుమారుఁడు; అతనికి యువనాశ్వుఁడు; అతనికి మాంధాతచక్రవర్తి; అతనికి సుసంధి; అతనికి ధ్రువసంధియు, ప్రసేనజిత్తు అని యిరువురు కుమారులు; ధ్రువసంధికి భరతుఁడు; అతనికి అసితుఁడు; అసితుఁడు రాణితోఁగూడి తపోవనమునకుఁ బోయెను. అసితుని రెండవరాణి కాళింది యనునామె గర్భము ధరించియుండెను; ఆమెగర్భముఁ జెడఁగొట్టుట కామెకు మూఁడవరాణి విషముఁ బెట్టించెను. అప్పుడు కాళింది చ్యవనుని శరణుఁజొచ్చెను; అంతట నా కాళిందికి గరళముతోఁగూడిన పుత్రుఁడు పుట్టెను; అతఁడే సగరుఁడు; అతఁడు రాజ్యముఁ బరిపాలించెను; అతనికి అసమంజసుఁడు; అతనికి అంశుమంతుఁడు; అతనికి దిలీపుఁడు; అతనికి భగీరథుఁడు; అతనికి కకుత్స్థు; అతనికి రఘువు; అతనికి ప్రవృద్ధు; ఇతనినే గురువు శపించెను; శాపానంతరమున నతనికి కల్మాషపాదుఁ డని పేరు వచ్చెను; ఆకల్మాషపాదునకు శంఖణుఁడు; అతనికి సుదర్శనుఁడు; అతనికి అగ్నివర్ణుఁడు; అతనికి శీఘ్రగుఁడు; అతనికి మరుఁడు; అతనికి పశుశ్రుకుఁడు; అతనికి అంబరీషుఁడు; అతనికి నహుషుఁడు; అతనికి యయాతి; అతనికి నాభాగుఁడు; అతనికి అజుఁడు; అజునకు మహారాజాధిరాజ దశరథమహారాజు; వారిగర్భమున శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు జన్మించిరి.

జనకచక్రవర్తి వంశానుక్రమణిక.

త్రిలోకప్రసిద్ధుఁ డగు నిమిచక్రవర్తికి తిథియనుకుమారుఁడు; అతనికి జనకుఁడు; (ఈ రాజు పేరు నతనివంశస్థులు ధరించిరి;) అతనికి ఉదావసు; అతనికి నందివర్ధనుఁడు; అతనికి సుకేతు; అతనికి దేవరా

తుఁడు; అతనికి బృహద్రథుఁడు; అతనికి మహావీరుఁడు; అతనికి సుధృతిమంతుఁడు; అతనికి ధృష్టికేతు; అతనికి హర్యశ్వుఁడు; అతనికి మరుఁడు; అతనికి ప్రతీంధకుఁడు; అతనికి కీర్తిరథుఁడు; అతనికి దేవమీఢుఁడు; అతనికి విబుధుఁడు; అతనికి మహీధ్రకుఁడు; అతనికి కీర్తిరాతుఁడు; అతనికి మహారోముఁడు; అతనికి స్వర్ణరోముఁడు; అతనికి హ్రస్వరోముఁడు; అతని కిరువురు కుమారులు, సీరధ్వజుఁడు, కుశధ్వజుఁడు; సీరధ్వజుని కూఁతురు జానకి; కుశధ్వజుఁడు సాంకాశ్యనగరమునకు రాజు.

## మహాసంకల్పము.

ఓంవిష్ణుః ఓంవిష్ణుః ఓంవిష్ణుః ఓంనమః పరమాత్మనే । శ్రీపురాణపురుషోత్తమాయ । ఓంతత్సత్ । శ్రీహంసస్య । సచ్చిదానందరూపిణో । బ్రహ్మణోనిర్వాచ్యమాయాశక్తివిజృంభితావిద్యాయోగాత్ । కాలకర్మస్వభావావిర్భూతమహత్తత్త్వోదితాహంకారతత్త్వోద్భూతవియదాదిపంచకేంద్రియదేవనిర్మితాండకటాహే । చతుర్దశలోకాత్మకే । లోకే । లీలయా । తన్మధ్యవర్తిభగవతః । శ్రీనారాయణస్యాంగనాభికమలోద్భూతేన । సకలలోకపితామహేన । బ్రహ్మణా । సృష్టిం । కుర్వతా । తదుద్ధరణాయ । ప్రజాపతిప్రార్థితేన । మహాపురుషరూపిణా । సితవారాహావతారేణ । ధ్రియమాణాయామస్యాం । భూర్లోకసంజ్ఞితాయాం । ధరిత్ర్యాం । సప్తద్వీపమండితాయాం । క్షీరాద్యబ్ధిద్విగుణద్వీపవలయీకృతలక్షయోజనవిస్తీర్ణే । జంబూద్వీపే । భరతఖండే । స్వర్గస్థితాద్యాశాసితావతారే । గంగాదిసరిద్భిః । పావితే । నిఖిలజనపావనే । శౌనకాదిమునికృతనివసతి నైమిశారణ్యే । ఆర్యావర్తే । పుణ్యక్షేత్రే । అయోధ్యాఖ్యే । మధ్యదేశే । శ్రీభగవన్మార్తాండకృపాపాత్రకాలత్రితయజ్ఞగర్గపరాశరాచార్యాది గణితాయాం । పరార్ధాదిసంఖ్యాయాం । శ్రీబ్రహ్మణో । ద్వితీయపరార్ధస్య । ప్రథమయామే । తృతీయముహూర్తే । శ్రీశ్వేతవారాహనామ్ని । ప్రథమకల్పే । స్వాయంభువస్వారోచిషోత్తమతామసరైవతచాక్షుషేతి షణ్మనూనామతిక్రమ్యమాణే । సంప్రతి । సప్తమే । మన్వంతరే । చతుర్ణాం । యుగానాం । మధ్యే । త్రేతాయుగే । షష్ట్యబ్దానాం । మధ్యే । అముకసంవత్సరే । మార్గశీర్ష మాసే । శుక్లపక్షే । పంచమ్యాం తిథౌ । అముకనక్షత్రే । అత్రిగోత్రోత్పన్న । వృ

శ్చికరాశిః। జనకవర్మా। సమహంషికోఽహం। కాశ్యపగోత్రస్య। కాశ్యపావత్సారనైధ్రువేతి। త్రిప్రవరస్య। మాధ్యందినీశాఖినో। యజుర్వేదాధ్యాయినః। శ్రీమద్రాజరాజేశ్వరస్య। నాభాగవర్మణః। ప్రపౌత్రాయ। రాజ్ఞోఽజవర్మణః। పౌత్రాయ। రాజ్ఞో। దశరథవర్మణః। పుత్రాయ। ఆయుష్మతే। విష్ణుస్వరూపిణే। కన్యార్థినే। శ్రీరామచంద్రనామ్నే। వరాయ। ఆత్రేయగోత్రస్య। ఆత్రేయశాతాతపసాంఖ్యేతి త్రిప్రవరస్య। మాధ్యందినీశాఖినో। యజుర్వేదాధ్యాయినః। శ్రీమద్రాజానిమివర్మణః। ప్రపౌత్రీం। మిథవర్మణః। పౌత్రీం। జనకవర్మణః। పుత్రీం। ఆయుష్మతీం। శ్రీరూపిణీం। వరార్థినీం। సీతానామ్నీం। కన్యాం। శక్త్యాలంకృతాం। బహుకౌతుకాన్వితాం। సమస్తఫలప్రాప్తికామః। పితౄన్। పవిత్రీ। కర్తుమ్। ఆత్మనశ్చ। శ్రీలక్ష్మీనారాయణప్రీతయే। దేవాగ్నిగురుబ్రాహ్మణసన్నిధౌ। అగ్నిసాక్షికతయా। సహధర్మాచరణాయ। తుభ్యమహం। సంప్రదదే। ప్రతిగృహ్ణాతు। భవాన్ ॥

సీతాకన్యామిమాం రాజన్ యథాశక్త్యుపలంకృతామ్। తుభ్యం కాశ్యపగోత్రాయ దత్తాం రామ సమాశ్రయ ।

దోహా 368

వందిమాగధజనంబులు జయజయశబ్దములఁ జేయుచుండిరి; బ్రాహ్మణులు వేదమంత్రములఁ జదువుచుండిరి; నారీజనంబులు పాటలఁ బాడిరి; మంగళధ్వనులు మ్రోగెను; దేవతలు పుష్పములను వర్షించిరి; జనులందఱు ఆమోదించిరి.

చౌపాయ్

శ్రీసీతారాములు ప్రదక్షిణముఁ జేసి, సప్తపాదములఁ ద్రొక్కిరి; ఆవధూవరులఁ జూచి, సభికులు సంతసించిరి. ఆవధూవరులతో సమానమగు యుగ్మము మఱియొకటి లేదు; ఆయిరువురయనురాగము వర్ణింప శక్యముకాదు; వారికి వారే సమానులు. శ్రీసీతారాముల రూపములు మణిస్తంభములలోఁ బ్రతిఫలించెను. రతిమన్మథులనేక రూపములనుధరించి, వివాహముఁ జూడవచ్చినట్లు కనఁబడెను. ఆవధూవరుల ప్రతిబింబములు మణిస్తంభములలో నొకమారు కనఁబడును; మఱియొకమారు తిరోధానమగును; రతీమారులు దాఁగిలిమూఁత లాడి

నట్లు తోఁచెను. జనకునివలె, వారందఱు మైమఱచిరి. మునీశ్వరులు ప్రసన్నులై, వారిచేత సప్తపాదములఁ ద్రొక్కించిరి. శ్రీజానకిశిరస్సుమీఁద శ్రీరాముఁడు జీలకఱ్ఱ బెల్లముఁ బెట్టెను. ఆశోభను వర్ణింప శక్యముకాదు. అమృతముఁ బానముఁజేయఁగోరిన సర్పమువలె, నతని కరకమలహస్తము విగిడె, సింధూరముతో నామె ముఖచంద్రము నలంకరించెను. వసిష్ఠుని యాజ్ఞాప్రకారము వధూవరు లొకపీఠముపైఁ గూర్చుండిరి.

ఛాంద 49, 50, 51, 52.

శ్రీజానకీరాము లేకాసనముపైఁ గూర్చుండియుండ, దశరథుఁడు చూచి, ప్రసన్నుఁ డయ్యెను; అతనిశరీరము పులకరించెను. కల్పవృక్షమువలె, నతనితపస్సు ఫలించి, యతనికి సంతోషమునిచ్చెను. శ్రీసీతారాముల వివాహామయ్యెను; పదునాలుగులోకములవారును సంతసించిరి. ఆయానందమును నేనెట్లు చెప్పఁగలను? అది యపరిమితము; ఒక నాలుక నాకుఁ గలదు.

తదుపరి, వసిష్ఠుని యాజ్ఞాప్రకారము, జనకచక్రవర్తి వివాహప్రయత్నములఁ జేసి, ముగ్గురుకన్యలను—(మాండవి, శ్రుతకీర్తి, ఊర్మిళలను) రప్పించెను. మాండవి కుశకేతునికూఁతురు; (కుశకేతువు మఱియొకదేశమునకు రాజు-అతనిరాజధాని సాంకాశ్యనగరము.) ఆమె వయోరూపశీలలావణ్యములకు నిధి-ఆమెను యథావిధిగ భరతునకిచ్చి, వివాహముఁజేసెను.

సునయనగర్భమున ఊర్మిళాదేవి పుట్టెను; ఆమె జానకి చెల్లెలు; ఆమె చక్కదనాలకుప్ప; అపరంజిబొమ్మ; ఆమెను సకలలక్షణసంపన్నుఁడగు లక్ష్మణున కిచ్చి, వివాహముఁజేసెను. తదుపరి, శ్రుతకీర్తికలదు; ఆమె ముద్దులను మూటఁగట్టుచుండును; ఆమెనేత్రములఁ జూచిన, కడుపునిండును; ఆమెను శత్రుఘ్నునకిచ్చి, వివాహముఁ జేసెను. ఆమె కుశకేతునికుమార్తె; ఆకుశకేతువు జనకునితమ్ముఁడు.

తమకుఁ దగినవరులు దొరికినందుకు వధువులు తమలోఁ దాము ముదమంది, తమభాగ్యముఁ గొనియాడిరి. దేవతలు పుష్పములను వర్షించిరి. ఈనాల్గుయుగళముల వధూవరులను నేకమండపముమీఁదఁ

గూర్చుండఁబెట్టిరి. జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయావస్థలు నాలుగును వానివానిపతులతో (విశ్వ, తైజస, విరాగ, అంతర్యామి) మూర్తీభవించినట్లు, వారు నల్వురు దంపతులును గనఁబడిరి. [(1) లక్ష్మణుఁడు—ఊర్మిళ, లక్ష్మణుఁడు—విశ్వము; ఊర్మిళ—జాగ్రదవస్థ. (2) శత్రుఘ్నుఁడు—శ్రుతకీర్తి, శత్రుఘ్నుఁడు—తైజసము; శ్రుతకీర్తి—స్వప్నావస్థ. (3) భరతుఁడు—మాండవి, భరతుఁడు—విరాగము; మాండవి-సుషుప్తిఅవస్థ. (4) శ్రీరాముఁడు—జానకి, శ్రీరాముఁడు—అంతర్యామి; జానకి—తురీయఅవస్థ. (1) రజోగుణము=ఫలము కామము. (2) సత్త్వగుణము=ఫలము అర్థము. (3) తమోగుణము = ఫలము ధర్మము (4) త్రిగుణాతీతము=ఫలము మోక్షము.]

దోహా 369

ధర్మార్థకామమోక్షములను, సేవా శ్రద్ధా తపోభక్తులను పొందినవానివలె, రాజు నల్వురుకొడుకులను గోడండ్రనుఁ జూచి, సంతసించెను.

చౌపాయి

శ్రీసీతారాముల వివాహామువలె, లక్ష్మణభరతశత్రుఘ్నులవివాహాము జరగెను. వధూవరుల కిచ్చినకట్నములఁ జెప్పుటకు శక్యము కాదు; సువర్ణముతోను మణులతోను మండపము నిండెను. చీనిచీనాంబరములు, పట్టుపీతాంబరములు, కాశ్మీరశాలువలు, అమూల్యవస్త్రాద్యలంకారములు, రథగజతురంగములు, దాసదాసీజనంబులు, సువర్ణశృంగములతోఁ గూడిన కామధేనువువంటి గోవులును— ఈ మొదలగుపదార్థము లనేకములను కట్నముక్రింద జనకుఁ డొసంగెను; వానింజూచినవారుతప్ప, తదితరులు విని నమ్మరు. వానింజూచి, దిక్పాలురు దశరథుని స్తోత్రముఁజేసిరి; అతఁడు వారిని సత్కరించి, పూజించెను. యాచకులు కోరినవస్తువుల నతఁడు వారి కిచ్చెను; వినియోగింపఁబడిన తరువాత మిగిలినపదార్థములను విడిదిగృహామునకు సేవకులు తీసికొనివెళ్లిరి. తదుపరి, జనకచక్రవర్తి చేతులను జోడించుకొని, పెండ్లివారికి నమస్కరించి, యిట్లు విన్నవించెను.

ఛాంద్ 53, 54, 55, 56.

జనకచక్రవర్తి పెండ్లివారిని యాదరించి, మన్నించి, సత్కరించి, పూజించి, వారికి విన్నపములఁ జెప్పుకొనెను. అనంతర మతఁడు మునీశ్వరులచరణములకు నమస్కరించి, వారినిఁ బూజించెను. తదుపరి, యతఁడు చేతులను జోడించుకొని, దేవతలకు నమస్కరించి, యిట్లు విన్నవించెను. "ఓదేవతలారా! ఓఋషులారా! మనుజుల శుద్ధాంతఃకరణముఁ జూచియే, దేవతలును సాధువులును సంతసించెదరు. దోసెడునీరువలన సముద్రునకు సంతోషముకలుగునా? మీరు మహానుభావులు; ఎట్లు మిమ్ములను సంతోషపెట్టఁగలను? మీరు నన్ను దయతోఁ జూచి, రక్షింపుఁడు. నేను మీదయకుఁ దగినవాఁడ నయినయెడల, నన్నుఁ గటాక్షింపుఁడు." తదుపరి జనకుఁడును గుశకేతువును జేతులను జోడించుకొని, వినయవిధేయతలతో దశరథునితో నిట్లు విన్నవించిరి: "ఓనాథా! మీతో సంబంధముఁ జేసుకొనుటవలన, మాకు గౌరవము వచ్చెను, మారాజ్యమును మాసమాజమును, మాసర్వమును, మీసేవకులమని భావింపుఁడు. ఈమానలువ్వురుకన్యలను మీపరిచారికలని భావించి, వారిని రక్షించి, కాపాడుఁడు. ఓధర్మాత్ముఁడా! వర్తమానముఁబంపి, మిమ్ముల నిచ్చటకు రప్పించుట, నాతలకుఁ దగనిపని; కనుక, నాయపరాధమును క్షమించి, కాపాడుఁడు." అనంతరము దశరథమహారాజు జనకచక్రవర్తిని పలువిధముల నాదరించి, సత్కరించి, కొనియాడెను. వారి యన్యోన్యానురాగమును, బరస్పరవినయములను చెప్పుటకు శక్యముకాదు. వారి యన్యోన్యానుబంధములు బలసి, బిగిసెను. దేవతలు పుష్పములను వర్షించిరి; దేవదుందుభులు మ్రోఁగెను; వేదధ్వనులు పిక్కటిల్లెను; జయజయశబ్దములతో భూనభోంతరాళములు నిండెను; పంచవాద్యములు మ్రోఁగెను. దశరథమహారాజు విడిదిగృహమునకు వెడలెను. సువాసినులు మంగళాష్టకములఁ బాడుచుండిరి; మంగళధ్వనులు చెలఁగెను. వసిష్ఠునియాజ్ఞాప్రకారము, వధూవరులఁ దీసికొని, యంతఃపురములోఁ బ్రవేశించిరి.

దోహా 370

మాటిమాటికి జానకి శ్రీరాముని జూచి, లోలోపున సంతసించెను; రాముని చేరిచూచుటకు సిగ్గును, చూడవలెనని యభిలాష

యు—ఈవిధమున నామె యాందోళనమునొందెను. ఆమీనాక్షి, ఆచకోరాక్షి నేత్రములు ప్రేమపూరితములై, క్రేగంటిదృష్టులతో వరునిం జూచెను.

"శ్లో. ఉత్తుంగ స్తనమండలోపరిలసత్ప్రాలంబముక్తామణే
రంతర్బింబిత మింద్రనీలనికరచ్ఛాయానుకారిద్యుతిః,
లజ్జావ్యాజ ముపేత్య నమ్రవదనా స్పష్టం మురారే ర్వపుః
పశ్యంతీ ముదితాముదేస్తువదనా లక్ష్మీర్వివాహోత్సవే."

కర్ణామృతము.

చౌపాయ్

ఆశ్రీరాముని శ్యామశరీర లావణ్యము, కోటిమన్మథులను మించియుండెను. పారాణితోఁ గూడిన సతనిచరణారవిందములను, తుమ్మెదలువలె, మునీశ్వరు లాశ్రయించియుందురు. అతనిపీతాంబరము, మెఱుపుకంటెను, ప్రాతఃకాలసూర్యునికంటె, నధిక దేదీప్యమానముగ నుండెను. అతని కటిసూత్రము మువ్వ కింకిణీరవములు శ్రావ్యముగనుండెను; అతనివిశాలబాహువులకుఁ గల భుజబందులును, పీతాంబరముఁ జూచి, సంతోషింపవలెను; అతనికరముద్రిక (ముద్దుటుంగరము) మనస్సులను భ్రమింపఁజేయును. అతని వివాహాలంకారము లతిశోభస్కరముగ నుండెను; అతనిహృదయమున వ్రేలుచుండిన పతకములును హారములును ధగద్ధగాయమానముగ వెలిఁగెను. అతని పట్టుయుత్తరీయము నను మణులను ముత్యములు నద్దిరి. ఆకపోలలోచనములు, ఆకర్ణకుండలములు, ఆచక్కనిముఖము, కనుబొమలు, తీరుగలముక్కు, లలాటమునఁ దిలకము, నవరత్నఖచితమగు కిరీటమును ధరించినశిరస్సు-ఇంత చక్కనివిగ్రహము కదా!

ఛాంద్ 58, 59, 60.

ఆముత్యాలహారములు,ఆరత్నకిరీటము,ఆదివ్యమంగళవిగ్రహము, మనుజులచిత్తముల నపహరించెను. నగర స్త్రీలత్యంతసుందరులు; వారు సుమితము రామునిఁ జూచి, యాశ్చర్యపడి, దృష్టిపరిహారార్థము తృణముఁద్రుంచి, విసర్జించిరి పెండ్లికుమారునకు వస్త్రాద్యలంకారములను దిగదుడిచి, స్త్రీలు మంగళహారతుల నిచ్చిరి; హారతులనిచ్చి, పెండ్లిపాటలఁ బాడిరి. దేవతలు పుష్పములను వర్షించిరి; వందిమాగధసూతజనంబులు

బరాబరులఁ దీర్చి, స్తోత్రపాఠములఁ జదివిరి. శ్రీజానకీరాములు రాణి వాసములోఁ బ్రవేశించిరి. వారితోఁ గూడి సువాసినులు లోనికివెళ్లి, లోకాచారప్రకారము, వధూవరులచేతఁ బువ్వులబంతుల నాడించి, సరసముగ పాటలఁబాడిరి. "ఓరామా! ఈపరమాన్నమును నీవు జానకినోటిలోఁ బెట్టుము" అని పార్వతి రామునకు బోధించెను. "ఓ జానకీ! ఈపరమాన్నమును నీవు రామునినోటిలోఁ బెట్టుము" అని సరస్వతి జానకికి బోధించెను. ఈప్రకారము సరసవినోదములలో రాణివాసపుస్త్రీలు కాలమును గడపిరి. స్వహస్తకంకణమణులలో శ్రీరాముని ప్రతిబింబమును జానకి చూచి, రామునిప్రతిబింబ మదృశ్యమయినయెడల విరహదుఃఖము ననుభవింపవలెగదా యని తలఁచి, హస్తము నామె కదల్చకయుంచి, యాప్రతిబింబముఁ జూచుచు బ్రహ్మానందముఁ బొందెను. ఆవధూవరుల చర్యలఁ జూచి, స్త్రీలు సంతోషించుచుండిరి; ఆవధూవరులఁ దీసికొని, వారు విడిదిగృహమునకు వచ్చిరి. వారిసంతోషముఁ జెప్పుటకు శక్యముకాదు; ఆజానకీరాములవద్ద నుండినసువాసినులాసంతోషము ననుభవించిరి; కాని, తదితరులకు దానిసంగతి తెలియదు. భూనభోంతరాళములు మంగళధ్వనులతో నిండెను; ఎటువైపుజూచినను మంగళాశీర్వచనములు వినఁబడెను. "ఈవధూవరులాచంద్రార్కము జీవించెదరుగాక" అని జనులు దీవించిరి. యోగీశ్వరులు, దేవతలు, మునులు, సిద్ధులు, సాధ్యులు, శ్రీవారి వివాహమహోత్సవముఁ జూచి, పరమానందభరితులయి, భేరీమృదంగములను, దుందుభులను మ్రోఁగించిరి. బ్రహ్మాదిదేవతలు పుష్పములను వర్షించిరి. 'జయజయ' అని పలికి వారు స్వలోకములకు విశ్రమించిరి.

దోహా 371

ఆనల్వురుకుమారులును తమతమభాగ్యలతోఁ గూడి, తండ్రివద్దకు వచ్చిరి. ఆయుత్సవము, ఆసంతోషము, రాజనూజారమునిండి, పొర్లిపాఱెను.

చౌపాయీ

గొప్పవిందు సిద్ధముఁజేయించి, జనకుఁడు పెండ్లివారికి వర్తమానముఁ బంపెను. చీనిచీనాంబరములను మార్గములోఁ బఱచి, వానిపై నడిపించుకొని, దశరథమహారాజును నల్వురుకుమారులను జనకుఁడు

విందునకుఁ దీసికొనివచ్చెను; అతఁడు వారిని సాదరించి, సత్కరించి, వారిపాదములఁ గడిగెను; తదుపరి, వారిని యుచితాసనములపైఁ గూర్చుండఁబెట్టెను. జనకుఁడు దశరథుని చరణములను స్వయముగా జలములతోఁ గడిగెను. ఆజనకుని యాదరణమునుఁ జెప్పుటకు శక్యము కాదు. శ్రీసాంబశివుని హృదయారవిందమున నెల్లపుడు నిలిచియుండు శ్రీరాముని చరణకమలముల నతఁడు ప్రక్షాళనముఁ జేసెను; లక్ష్మణ భరతశత్రుఘ్నులు శ్రీరామునివంటివారని జనకుఁడు తలఁచి, స్వయముగా వారిపాదములఁ గడిగెను; యథాయోగ్యముగ నతఁడు వారిని యుచితాసనములపైఁ గూర్చుండఁబెట్టెను. జనకునియాజ్ఞాప్రకారము, బంగారుపుడకలతోఁ గ్రుచ్చఁబడిన మణిపళ్లెరములను వంటవాండ్రు తీసికొనివచ్చి, వారియెదుటఁ బెట్టిరి.

దోహా 372

ఆచతురులగు వంటవాండ్రు వినయపూర్వకముగఁ బళ్లెరములఁ బట్టుకొని వచ్చి, షడ్రసోపేతమగు పక్వాన్నమును, పిండివంటలను, కూరగాయలను, సూపమును, ఘృతమును, భక్ష్యములను నిమిషములో వడ్డించిరి.

చౌపాయ్

పంచభూతములకు బలిహరణము నిచ్చి, వారు భోజనముఁజేయుట కారంభించిరి; ఆసమయమున, స్త్రీలు వచ్చి, విందుపాటలను, వియ్యాలవారిపాటలను, సరసముగఁ బాడిరి. ఆపప్పుకూరలును, పక్వాన్నము నమృతోపమానముగ నుండెను; వానిని భుజింపవలెను కాని, వర్ణించినందున లాభము లేదు. షడ్రసోపేతముగ భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములను వడ్డించిరి; అనేకవిధముల నొక్కొక్కటి చేయఁబడెను. మాధుర్యములో నొకదానికంటె నొకటి మించియుండెను. ఒకరసముకంటె నొకటి రుచ్యముగనుండెను. వానివడ్డనలఁబెట్టి, స్త్రీపురుషులపేరున పాటలఁగూర్చి, సువాసినులు పాడిరి. సమయోచితముగ వారు హాస్యముఁజేయ నారంభించిరి; వారి సరసవచనములకు దశరథుఁడు మొదలగువారు సంతోషించి, నవ్వుచుండిరి. ఈప్రకారము వారు భోజనముఁజేసి, యుత్తరాపోశనముఁబట్టి, లేచిరి

దోహా 393

పెండ్లివారికి జనకుఁడు తాంబూలాదుల నిచ్చి వారిని సన్మానించెను; అతని సెలవుఁగైకొని, దశరథుఁడు విడిదిగృహమునకు వచ్చెను.

(అధికపాఠము.)

శ్రీరాముని చల్దియాఱగింపులు.

దోహా 1-126

అంతఁ బ్రాతఃకాలమయ్యెను; జనకచక్రవర్తి తనకుమారునకు వర్తమానముఁ బంపెను; లక్ష్మీనిధి స్నేహితులతోఁగూడి తండ్రివద్దకు వచ్చి, తండ్రిచరణములకు నమస్కరించెను. అతఁడు కుమారుని నాదరించి, "ఓయీ! విడిదిగృహమునకుఁ బోయి, దశరథమహారాజును దర్శింపుము. నావిజ్ఞాపనమును వారికి విన్నవించి, వారిసెలవుప్రకారము, నీబావమఱఁదులను నల్వురను విందుభోజనమునకుఁ దీసికొని రమ్ము" అని చెప్పెను. లక్ష్మీనిధి పరమానందభరితుఁడై, తండ్రికి నమస్కరించి, సఖులతోఁ గూడి, చంచలమగు గుఱ్ఱములపై నెక్కి వెడలెను. అనేకవిధముల వారు వానిని నడిపించి, వారిలోవారు గుఱ్ఱములనడకకు నవ్వుచు, వానిని వీఁపుమీఁదఁ దట్టుచు, విడిదిగృహమువద్దకు వచ్చిరి. ఆలక్ష్మీనిధి సఖులతో గుఱ్ఱములపైనుండి దిగి, లోనికివెళ్లి, దశరథునకును నల్వురుబావమఱఁదులకు నమస్కరించెను. ఆరఘుకులదీపకుఁడు దశరథుఁడు లక్ష్మీనిధిని నాదరించి, సత్కరించి, తనవద్దఁ గూర్చుండఁబెట్టుకొనెను. అప్పుడు లక్ష్మీనిధియు, స్నేహితులును శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నుల దివ్యమంగళవిగ్రహములఁ జూచి, సంతోషించిరి; బావమఱఁదిని జూచినందున, శ్రీరామునినేత్రములు చల్లఁబడెను. అప్పుడు లక్ష్మీనిధి చేతులను జోడించుకొని, "ఓమహారాజా! మాతండ్రిగారియాజ్ఞప్రకారము, నల్వురుబావమఱదులను విందుభోజనమునకుఁ బిలువవచ్చితిని" అని విన్నవించెను. వినయవిధేయతలతో నతఁడు చెప్పినమాటలను దశరథుఁడు విని, మందహాసముఁజేసి, నల్వురుకుమారులఁ బిలిచి, వారిని విందుభోజనమునకుఁ బంపెను. ఆనల్వురుకుమారులు జనకుని నగరునకు వెళ్లుటకు సిద్ధముగనుండుటఁ జూచి, వారివారి స్వకీయసేవకులు వచ్చి వారిని సింగారించుట కారంభించిరి. మూఁడుపట్టీలుగ దిద్దబడిన జలతారుపాగాను శ్రీరాముఁడు ధరించెను; ఆపాగాకు ముం

దు ముత్యాలతురాయి గ్రుచ్చఁబడెను. ఇట్లు పెండ్లికుమారుఁడు సింగారించుకొని వెడలెను. ఆజగన్మోహనాకారుని, ఆశ్రీరాముని చక్కఁదనముఁ జూచి, బ్రహ్మ మహేశాది దేవతలుసయితము భ్రమించిరి. ఈప్రకారము నల్వురు సింగారించుకొని, అత్యుత్సాహముతో నుప్పొంగుచు, గుఱ్ఱములపై నెక్కి, వారి యుత్తరీయములు వ్రేలుచుండ, వారు పెండ్లివారిగృహమునకు వెడలిరి. ఆరఘురామునితో సమానముగువారు, రామునకుఁ బ్రాణమువంటి స్నేహితులు భావమఱఁదియు, మంచిగుఱ్ఱములపై నెక్కి వెడలిరి. వారుకూడ మదించినగుఱ్ఱముల నెక్కి, రామునివెంట నడచిరి. లక్ష్మీనిధి సఖులతోఁ గూడి, నవ్వుచు, నవ్వుఁబుట్టించుచు, గుఱ్ఱమును కదముఁ ద్రొక్కించుచు, దానిపగ్గములఁ బట్టుకొని, హాస్యములాడుచుండెను. జగద్విఖ్యాతమగు 'జగవందన' మనుగుఱ్ఱముపై శ్రీరాముఁడు స్వారిచేయుచుండెను; ఆగుఱ్ఱము యొక్కసొగసు నెవరు చెప్పఁగలరు? దానిజూచినందున, మనస్సు భ్రమించును. శ్రీరామునియిచ్ఛను గ్రహించి, యాగుఱ్ఱము నడచును. అతఁడు వెళ్లఁదలఁచినస్థలమునకు దానియంతట నది వెళ్లును. దానిరాకపోకలు క్షణములో జరగును; అనేకవిధముల కదముఁద్రొక్కుచు, భూమిమీఁదఁ బాదములను మోపకయే, యాగుఱ్ఱమునడచును. సంతోషముచేఁ గుప్పించి యెగయుచు, చంచలముగ దుముకుచు, మార్గములో నుండిన చాపలఁ జూచి, వానిమీఁదనుండి చతురముగ దాఁటుచు, భరతుని రంగురంగులగుఱ్ఱము, చిత్రవిచిత్రముగ నడచెను; దానిశోభను వర్ణించుటకు శక్యముకాదు. 'చంపా' యనుపేరుగల గుఱ్ఱముపై శత్రుఘ్నుఁడు స్వారిచేయుచు వెడలెను; ఆగుఱ్ఱము సమాజమువారిముందు నృత్యముఁజేయుచు, నడచెను; దానినడకలఁ జూచి, నెమళ్లును మృగములును సిగ్గుపడెను. ఏమాత్రము దానిని గొట్టుటకు హస్తముఁ జూచినను దానినిఁ గొట్టకపూర్వమే, యా గుఱ్ఱము గ్రహించి, యెంతబుజ్జగించినను లక్ష్యముఁజేయక, పరుగెత్తును. లక్ష్మణుఁడు స్వారీచేయుచుండినగుఱ్ఱ మతిచులుకు; అమూల్యమగుజంతువు; ఆగుఱ్ఱ మతిసొగసుగ వంకరటింకరగనడచును; అది భూమిమీఁదఁ బాదమును మోపదు; ఎంత పఱుకు నది వాయుమండలములో నడచును; ఒకప్పుడు ప్రక్కకుదిరిగి,

కుప్పించి, లక్ష్మీనిధి గుఱ్ఱమువద్దకు వచ్చి పడుచుండును. సమయోచిత ముగ, లక్ష్మణుఁడు నవ్వుచుండును; శ్రీరామమూర్తి మందహాసముఁ జేయును. ఆగుఱ్ఱము యొక్క చపలత్వమును లక్ష్మణుఁడు స్వారి చేయుటయు, ఉభయులు (నిమివంశస్థులును, రఘువంశస్థులును) చూచి యాశ్చర్యము పడిరి. శ్రీరామమూర్తి మొదలగు బాలురు లక్ష్మణుని స్వారిఁ జూచి, సంతోషించి, యతనిని కొనియాడిరి. ఈప్రకారము వారు మార్గములో ననేకవినోదములఁ జూపుచు వెడలిరి. వారిముందు పంచవాద్యములు మ్రోఁగుచు నడచెను. భట్రాజులు బిరుదావళీలను వర్ణించుచు ముందు నడచిరి. వారిసంబరముఁ జూచుటకు, నారీమణులు గృహములలోపలనుండి వచ్చి, గుమ్మమువద్ద నిలువఁబడిరి. ఒకనారీమణి శ్రీరాముని ముఖారవిందముఁ జూచి, యానందభరితురాలయ్యెను; రామునిచక్కనిరూపముఁ జూచినందున, నామె యనురాగముచే పరవశురాలయ్యెను. మఱియొకకన్య పెండ్లికుమారుని రూపురేఖలఁజూచి, స్మారకముతప్పెను. ఆమె నేత్రములను మూసికొనెను; ఆమె హృదయములోఁ గామముపుట్టెను; ప్రేమ ముడిపడెను. మఱియొకచంద్రముఖి, ముసుఁగుఁదీసి, చేతిలోనుండిన దర్పణములో రామునిప్రతిబింబముఁ జూచి, యానందసముద్రములో మునిఁగెను. ఆమె పతివ్రత; కనుక, రామునిఁ బ్రకటముగఁ జూచుటకు వెఱచెను.

దోహా 30-50

మఱియొకపడుచు శ్రీరాముని శ్యామలశరీరముఁ జూచి, యతనికి దృష్టిదోషముతగులకుండ, గడ్డిపోచను ద్రుంచి, యతనిరూపములో లీనమై, మైమఱచెను. "ఓసఖీ! ఈపెండ్లికుమారులు విందుభోజనమునకు జనకునిగృహమునకు వెళ్లుచున్నారు. వారిని లక్ష్మీనిధి పిలుచుకొని, వెంటఁదీసికొని వెళ్లుచున్నాఁడు. వారు రఘువంశబాలకులు. ఈనల్వురు దశరథమహారాజు కుమారులు. ఆహా! సఖీ! ఏమి నాభాగ్యము! నాజన్మము సఫలమయ్యెను; నేను ధన్యురాలను. ఈ పెండ్లికుమారులను, ఈసూర్యకుల తిలకముల నీవిధమునఁ జూడని మొదల, వారిదర్శనము కలుగుట దుర్లభము. జనకుని ముద్దుకూఁతురు జానకి, యదృష్టవంతురాలు; ఆమెసౌభాగ్యము చల్లగనుండుఁగాక; ఇంత

చక్కనికుమారునిపొందు జానకికిఁ గలిగెను.” అని యొకస్త్రీ ముచ్చ టించెను. “ఓసఖి! సమయమువచ్చెను; లేలెమ్ము; ముసుఁగువేసి కొనుము; శీఘ్రము జనకునినగరునకువెళ్లి, చిత్రములఁ జూచెదము. మనము వినోదించి, వారికి వినోదముఁ గలిగించెదము.” ఈప్రకారము స్త్రీలు పరస్పరము వారిలోవారు కూడఁబిలుచుకొని, నగరునకు వెడ లిరి. శ్రీరాముఁడు తమ్ములతోఁ గూడి, ప్రసంగించుచు, వారి సంభాష ణను వినుచు, ముసిముసినవ్వులు నవ్వుచు, వెళ్ళుచుండెను. తుదను వారు రాజసింహద్వారమువద్ద గుఱ్ఱములను నిలువఁబెట్టిరి; ముత్యాల ముగ్గులు పెట్టఁబడియుండెను. రాణి 'సునయన,' యాజ్ఞప్రకారము సువాసినులు సువర్ణకలశములఁబట్టుకొని, ద్వారమువద్ద నిలువఁబడిరి; మఱికొందఱు కర్పూరహారతులఁ బట్టుకొనియుండిరి. బంగారుపళ్లెరము లలో హారతులఁ దీసికొనివచ్చి, వారు పాటలఁబాడిరి; వారు పెండ్లి కుమారులకు హారతులనిచ్చిరి. వారు శ్రీరామునిదగ్గరకువచ్చి, యతని రూపురేఖలఁ జూచి, పరవశులయిరి; వారినేత్రము లానందబాష్పము లతో నిండెను. వారు పరవశులై, యచ్చటివా రచ్చట నిలిచి, నిశ్చే ష్టులయిరి ఆజగన్మోహనుని దివ్యమంగళ విగ్రహముఁ జూచి, వారు భ్రమించిరి. వారిలో నొకరికయినను శరీరముపై స్మృతిలేదు. ఇఁక మంగళాచరణములఁ జేయువా రెవరు? ఈప్రకారము సువాసినులు పరమానందభరితులై, మఱల ధైర్యమునవలంబించి, కన్నీటిఁదుడుచు కొని, శ్రీరామునకు మంగళహారతి నిచ్చిరి. పిమ్మట లక్ష్మీనిధి ముందు గుఱ్ఱముమీఁదనుండిదిగి, నలువురుకుమారులను గుఱ్ఱములమీఁదనుండి దింపెను; అతఁడు శ్రీరాముని హస్తముఁబట్టుకొని, వారినలువురను నగరులోనికిఁ దీసికొనివెళ్లెను. అంతఃపురములో రాణి సునయన యుండిన స్థలమునకు వారు వెళ్లిరి. ఆమె చక్కదనము జూచి, ఇంద్రాణియు రతీదేవిసహితము సిగ్గుపడుచుండిరి. ఆమెకు నలువై పుల నలువురుచంద్రముఖులు నిలిచియుండి, చామరములను వీచుచుం డిరి; ఒకస్త్రీ రామునకు మంగళహారతినిచ్చి, పాటఁబాడెను. మన్మథుని సయితము మోహింపఁజేయు చక్కనిరూపముతో శ్రీరాముఁడు వెళ్లె ను; అతనిం జూచి, యంతఃపురస్త్రీలు దిగ్గునలేచి, నిలువఁబడి, నిశ్చేష్టు

లయిరి; వారిలో నొకరికిని శరీరముపై స్మృతిలేదు. వారు రామునకు దివ్యాభరణములను దిగఁదుడిచి, హారతినిచ్చిరి తదుపరి, వారానల్వురు కుమారుల పాదములను జలముతోఁ గడిగి, వారిని నాలుగుసింహాసనములపైఁ గూర్చుండబెట్టిరి. రాణి సునయన, రెప్పపాటు వేయకుండ, నల్వురుకుమారులఁ జూచుచుండెను; ఆమెచైతన్యము తప్పెను; ఆమె ముఖమునుండి మాట వెలువడలేదు. ఏపనిజేయుట కామెకుఁ గరచరణములు కదలలేదు. పరమానందములో నామె మునిఁగియుండెను; శ్రీరాముని జగన్మోహనరూపముఁ జూచినందున, నామె నేత్రములవెంబడి ఆనందబాష్పములు వరదలై కారెను. ఆమెయవస్థను శ్రీరాముఁడుచూచి విచారించెను; ఆమెతోఁ బ్రసంగించుట కతఁడు సిగ్గుపడి, యూరకుండెను.

శ్లో॥ 51-80

శ్రీరాముని చిత్తవృత్తిని యొకస్త్రీ కనిపెట్టి, యతనితో నిట్లు పలికెను. "ఓరామా! ఇదియంతయు నీప్రభావమే కాని, మఱి యొకటి కాదు." ఆమెమాటలను సునయన విని, తెలివిఁదెచ్చుకొని, ధైర్యము నవలంబించి, దూరముగనుండి రాముని ముఖమును ముద్దాడి, తనచేతులను ద్రిప్పి, తన శిరముపై వ్రేళ్లను విఱుచుకొనెను. వారికి దృష్టిదోషము తగులకుండ, సునయన తృణమును ద్రుంచి, పారవేసెను. అమూల్యమగు వారిరూపములను గ్రహించినందులకు రాణి సంతోషించి, చేతులను జోడించుకొని, వారితో నిట్లుపలికెను. "ఓబాలకులారా! లేలెండు; మీయిష్టప్రకారము పదార్థములను భుజింపుఁడు" అనెను. ఆమెమాటప్రకారము వారు సఖులతోఁగూడి, విందుభోజనమునకు లేచిరి. అప్పుడు సునయన స్వయముగ నల్వురుకుమారులచరణములను జలముతోఁ గడిగెను. రత్నస్థగితమగు నాలుగుసింహాసనములపై, నామె వారినిఁ గూర్చుండఁబెట్టెను; బంగారుపళ్లెరములలో మధురపదార్థములఁ దీసికొని, వారియెదుట బెట్టెను. వారివారిరుచుల కనుగుణ్యముగ, వారు వానిని భుజించిరి; ఆసమయమున, వారికి రాణి చామరమును వీచుచుండెను. సమయస్ఫూర్తిగ అత్తవారు హాస్యముఁ జేయుచుండిరి; వారిసంతోషముఁ జెప్పుటకు శక్యముకాదు. ఆమధురపదార్థములపాకమును పెండ్లికుమారులు కొనియాడుచు, వానిని

భుజించిరి. వారు పానీయములం ద్రాగి, యుత్తరాపోశనముం బట్టి, కరచరణములం బ్రక్షాళనముం జేసికొనిరి. తదుపరి, వారు దుస్తులను ధరించి, సఖులతోఁగూడి, కూర్చుండిరి. సుగంధద్రవ్యములను వారు శరీరముల కద్దుకొనిరి ఈప్రకారము నలువురుకుమారులు జనకుని గృహములోఁ గేళీవినోదముల జరగించిరి; వారి రూపురేఖావిలాసములం జూచి, కోటిమన్మథులు సయితము సిగ్గుపడుచుండిరి. ఆసమయమున, లక్ష్మీనిధిభార్య, సకలసుగుణసంపన్నురాలు, అపరంజిబొమ్మ 'సిద్ధి' యనుపేరు గలస్త్రీ యొకచెలికత్తెవలన రాముని వృత్తాంతమును విని, సంతోషించెను. ఆమె యదృష్టవంతురాలు; సౌభాగ్యవతి; నవయౌవనముచే మదించిన రసికురాలు; శృంగారాదిభావములలో నామె నిపుణురాలు. ఆనిమివంశపుమహారాణి, ఆచతురజాణ, ఆయపరంజిబొమ్మ, ఆ చక్కదనాలకుప్ప, రామునియందుఁ గలయనురాగముచే నుప్పొంగుచు, రామునిరూపమును ధ్యానించుచు, ఆచంచలాక్షి, చెలికత్తెలతోఁ గూడి, సంభ్రమముతో రామునిఁజూచుటకు వచ్చెను. ఆచంద్రముఖి, కమలముంబట్టుకొని, మందగమనంబున వచ్చి, శ్రీరాముని హస్తముం బట్టుకొని, మందహాసముం జేసెను; ఆమె చెలికత్తెలం జూచి, కనుగీటి, రామునితో నిట్లు ప్రసంగించెను. "ఓ రాజకుమారా! ఓరామా! మనుజులచిత్తముల నపహరించుటలో నీవు మంచిచతురుఁడవు. నామీఁద నీకు దయలేదు; కనుక, నన్ను మఱచి, యత్తవద్ద నీవు కూర్చుంటివి." "ఓబాలా! నీమాట నీకే వర్తించును; నన్ను వ్యర్థముగ దూషింపకుము. నేనువచ్చినసంగతి నీకుఁ దెలియును; అయినను నీవు దాఁగియుంటివి ఇప్పుడు నేను నీయంతఃపురముప్రక్కనుండి వచ్చియుంటిని. అప్పుడు నీవు మైమఱచియుంటివి. ఓబాలా! మీగృహాచారములు శ్లాఘనీయములు. లోపాలోపములు మీగృహములో సవరింపఁబడును." ఇట్లు రాముఁడు ప్రత్యుత్తరమునిచ్చెను. "రామా! నీ గృహమర్యాదలు మాగృహములో వర్తింపవు." అని సిద్ధి పలికినపలుకులకు, సునయనయెదుట, ప్రత్యుత్తరముం జెప్పుటకు రాముఁడు సిగ్గుపడెను ఆసమయముం జూచి, సిద్ధి రామునిహస్తముం బట్టుకొని, తదితరరాజకుమారులం బిలుచుకొని, స్వాంతఃపురమునకు వెళ్లెను; ఆ

నల్వురురాజకుమారులనునాలుగుసింహాసనములపైఁగూర్చుండఁబెట్టెను. ఆమెమాటిమాటికి శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ జూచి, ఆనందించి, అతనికి మంగళహారతినిచ్చెను. మాలతీపుష్పములదండ నతనిమెడలో వేసి, ఆమె తనపయ్యెదకొంగుతో రామునిముఖముఁ దుడిచెను; పరిమళద్రవ్యముల నతనివస్త్రములకు రాచెను; చల్లనిపానీయముఁ దీసికొనివచ్చి, త్రాగుటకిచ్చెను. పూగీఫలములును, గర్పూరమును, నాగవల్లీదళములును, ముత్యాలచూర్ణముతోఁ గూడిన తాంబూలము నొకచెలియ తీసికొనివచ్చి, రామున కందిచ్చెను. మఱియొకతె 'పీకదాను'ను బట్టుకొని, నిలిచియుండెను; మఱియొకరిత చామరమును వీచుచుండెను. వివాహమున కాహ్వానము చేయఁబడిన నిమివంశపు రాజకుమారికలు రామునిఁ జూచుట కువ్విళ్లూరుచుండిరి; కాని, వారు సిగ్గుపడి, యూరకుండిరి. ఆచిదానందపురుషులు, ఆనల్వురుకుమారులు సిద్ధియంతఃపురములో నుండిరని వారికి విశదమయ్యెను. రామునిఁ జూడవలెనను కుతూహలముచే రాజకుమారికలు వచ్చిరని సిద్ధి గ్రహించి, తగినవిధమున వారిని నాదరించి, సత్కరించెను. ఆసమయమున నామె గృహము కేళీవినోదములతోఁ గూడియుండెను. ఆణిముత్యములతోఁ జెక్కఁబడిన నెమలిపింఛము, తురాయి రామునిలలాటమునకుఁ గట్టఁబడియుండెను; దానిసొగసుఁ జూచి, మునులచిత్తములే భ్రమించినపుడు, రాజకుమారికలమనస్సులు చంచలమయ్యెనని చెప్పుటయేల? ఆహా! శ్రీరామునిరూపము ముద్దులను మూటఁగట్టుచుండెను; అతనిం జూచి, స్త్రీలు మోహముచేఁ బరవశులై, చేష్టలఁదప్పి, మాటలులేక, చెక్కినబొమ్మలువలె, నిలువఁబడి, రెప్పవేయక, చూచుచుండిరి. తమవంటి చక్కనివారు లేరని గర్వించిన స్త్రీలు సయితము గర్వమును విడిచిపెట్టిరి; రామునియెదుట, వారి చక్కదనము భిక్షమునకు వచ్చినట్లుండెను. సిద్ధి మొదలగు రాజకుమారికలందఱు పరమానందభరితులయిరి. ఆసమయమున వా రన్యోన్యము హాస్యముఁజేసికొనుట కారంభించిరి.

దోహా 80-100

"ఓ రామా! ఇంతచక్కనిరూపము నీకెట్లువచ్చెను? మన్మథుఁడు చక్కనివాఁడని వినియుంటిని? ఒకవేళ, నీ వతనికిఁగాని పుట్టియుంటి

వా?" అని యొకకుమారిక పలికెను. "ఓరామా! నాకన్నులయెదుట నిలిచియుంటివి కనుక, నొకవిషయము నడుగుచున్నాను; దాఁచక నిజముఁ జెప్పుము. మనయాచార ప్రకారము క్షత్త్రియులు క్షత్త్రియులనే వివాహమాడవలెనుకదా! నీచెల్లెలు, శాంత, ఋష్యశృంగుని యెట్లు వివాహమాడెను? ఆమె నతఁడువరించెనా? లేక, అతనిపొత్తు నామె కోరెనా? మీరఘువంశము నిష్కళంకము. ఈసంగతి యథార్థముఁ జెప్పుము." అని సిద్ధి యడిగెను. "ఓబాలా! నామాటను వినుము. ఎవ రెవరికి బ్రహ్మ వ్రాసియుండెనో, వారివారికి వివాహమగును. అప్పుడే, వారివారికి సంయోగమగును. వారివివాహము, కర్మానుసారము జరగును. ఈసంగతిఁ జూడుము; రఘువంశస్థులము మేమెచ్చట? విదేహులు, వైరాగులగు మీరెచ్చట? మనయుభయులకు సంబంధము కలిగెనుకదా! బ్రహ్మవ్రాసినవ్రాఁత నెవరు చెప్పఁగలరు? నామాట యొకటికలదు; ఆమాటను వినిన, మీకు నవ్వు వచ్చును. దానిని వినిన నెంతో యాశ్చర్యముగ నుండును. ఓసిద్ధీ! నీభర్త లక్ష్మీనిధి; మీయిరువుర నామములు స్త్రీవాచకములుకదా? మీయిర్వుర కెట్లు వివాహమయ్యెను." అని లక్ష్మణుఁడు హాస్యముఁ జేసెను. "హాహా! ఓబాలుఁడా! నీమాట కెదురు లేదని తలంచి, పొంగుచుంటివి! మీయింటిచిత్రములు, మీయింటినడకలు, లోకమునకుఁ దెలియును. మీఅయోధ్యాపురనారీమణులు ఉదారులు; చతురులు; వారు పాయసముఁదిని, పిల్లలను గనుచుందురు; పురుషులప్రసక్తి వారికి లేదుకదా!" అని యొకకుమారిక యెత్తిపొడిచెను. ఆమె మాటలను రాముఁడు విని, ముసిముసినవ్వునవ్వి, "ఓబాలామణీ! నీ గుట్టును నీవు దాచియుంచుకొని, నీవేలపరులను యెత్తిపొడుచుచుంటివి? తల్లిదండ్రులు లేనున్న సంతానము కలుగదు. ఈసంగతి నిశ్చయము; దీనికి వేదమేప్రమాణము మానారీమణులకుఁ దండ్రిప్రసక్తి లేదు; అయినను, మామాటకేమి! మీమాటఁజెప్పుము; మీవారి మాటను దించిపెట్టి, యొకరి నెత్తిపొడుచుట యుచితమా? మీకు స్త్రీపురుషులప్రసక్తిలేదు; మీపిల్లలు భూమిలోనుండి పుట్టుచుందురు. ఈ చమత్కారము మాస్త్రీలకుఁ దెలియదు." అని పలికెను. ఆసమయ

మున సిద్ధిచెల్లెలు, సుకుమారి, పరమజాణ, లక్ష్మీనిధిమరదలు, చంద్రకళ యనుబాలిక, రాముని యెదుట నిలిచి, "ఓరామా! ఇంత చిన్నతనములో మీకు మునీశ్వరునిసాంగత్య మెట్లులభించెనో, నిజముఁజెప్పుము. ఈచమత్కారము నీకెట్లువచ్చెను? మునిపత్నులవలన నేర్చుకొనియుంటివా? లేక, మునిపత్నియగు నీచెల్లెలువద్ద నేర్చుకొనియుంటివా? పదార్థములను దినినగాని, వానిరుచి తెలియదుకదా" అని చెప్పెను. "ఓబాలామణీ! నీవింతచిన్నదానవు. పురుషులసాంగత్యమును గురించి ప్రసంగించుచుంటివి కదా! ఈసంగతుల నీవెట్లు నేర్చుకొనియుంటివి; నిజముఁజెప్పుము. జ్ఞానాపేక్షులమై, మేము మునీశ్వరుని నాశ్రయించితిమి. మాసంగతి లోకవిదితము. ఓచిన్నదానా! కళాశాస్త్రమును నేర్చుకొనుటకు మేము మిమ్ముల నాశ్రయింపవలసి వచ్చెను." అని భరతుఁడు పలికెను. "ఓభరతుఁడా! నీవిట్లుపలుకకుము. మిమ్ములను సాధువులపద్దులో వేసియుంటిమి; సంసారులతీరు మీకేమి తెలియును?" అని సిద్ధి తర్కించెను. "ఓబాలామణీ! సత్యము; సత్యము. మేము సాధువులము; పరోపకారులము మామనస్సులు కరఁగునట్లు మమ్ములను సేవింపుము. మీగృహమున కపూర్వమగు యోగీశ్వరులు వచ్చిరి; వారికి నీయధరామృతముఁబెట్టి, వారిని సత్కరింపుము." అని భరతుఁడు చెప్పెను. "ఓబాలామణులారా! నామాటవినుఁడు. వీరి కొకగర్వము కలదు. వీరు మునీశ్వరుని యజ్ఞసంరక్షణార్థము వెళ్లినపుడు, వీరుచేసినపనిని నేను వినియుంటిని. తాటక యనుస్త్రీ వీరిరూపముఁజూచి, మోహించి, వీరివద్దకు వచ్చెను. ఆమె వీరిని లాలించి, కొన్ని మోహంపుజేష్టలఁ జేసెను; వీరు వానిని సహింపక, కోపించి, దానిని వధించిరి." అని యొకకుమారిక పలికెను.

దోహా 101-126

"ఓభామామణీ! వ్యర్థముగ దూషింపకుము. దానిచమత్కారమును గ్రహింపనిలోపములను నేను పూర్తిచేయుచున్నాను. నీయుంటివద్ద చమత్కారమును నేర్చుకొనకముందుఁ గొందఱు వివాహమాడిరి; అందులకు నీవు విచారించుచుంటివి. ఇఁక ముస్ముందు నీవు మనుజులకుఁ జమత్కారమును నేర్పి, వారికి వివాహముఁజేయుము. ఇప్పుడు మాచమత్కారముఁ జూడుము. ప్రస్తుతముఁ

నీమనోద్రేకము శాంతించునట్లు ప్రయత్నింపుము. నిన్ను సేవించుటకు మేము నల్వురన్నదమ్ములము వచ్చియుంటిమి." ఈప్రకారము శత్రుఘ్నుఁడు పలికినపలుకులను విని, మఱియొకరాజకుమారిక యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "ఓరాజకుమారా! ఈచమత్కారమును నీవెచ్చట నేర్చుకొనియుంటివో చెప్పుము. గుణవంతులగు చతురభాషిణులవద్దనా, లేక వేశ్యాంగనలవద్దనా, నీవీచమత్కారమును నేర్చుకొనియుంటివి? మీనల్వురలో, నీవద్ద క్రొత్తక్రొత్తచాతుర్యము కనఁబడుచున్నది." "ఓచతురభాషిణీ! నీమాట సత్యము. ఈభేదాభేదములు నీకు బాగుగ తెలియును. చతురులలో కెల్ల నీవు నూఱింతలు చతురజాణవలెఁ గనఁబడుచుంటివి! ఓప్రియరత్నమా! మనయుభయుల చాతుర్య మొకరీతిగ నుండును. నేను నీవానినిగఁ దెలిసికొనుము." "ఓరసికశిఖామణీ! ఓఆనందకందరఘునందనా! నామాటవినుము. నీదివ్యమంగళవిగ్రహము కామునినయితము మోహింపఁజేయును. నీరూపముఁ జూచినతరువాత నీనగరపుస్త్రీలకు నీయం దనురాగమెందులకుఁ బుట్టదు?" అని సిద్ధిపలికి యూరకుండెను ఆచిదానందమూర్తి సిద్ధిహస్తముఁ బట్టుకొని, యామెతో నిట్లు మృదువుగ సంభాషించెను. "ఓబాలా! భగవంతుఁడు లోకములోఁ గొన్ని మర్యాదల నేర్పఱచెను. రాజులును, బీదవాండ్రును, సతీమణులును, వానికి ననుగుణ్యముగ వ్యవహరించెదరు. ఉచితానుచితములనువిచారించి, లోకులు వారివారిభావములప్రకారము వానిని తెలిసికొనుచుందురు. నీవంటిభావము పరులకుఁ గలదని నీవు తలంచెదవు. మన భావమున కనుగుణ్యముగ నేతదితరులు సంచరించెదరు." శ్రీరాముని మాటలను విని, మువ్వురన్నదమ్ములు పకపకనవ్వి, చప్పట్లఁ గొట్టిరి సిద్ధిమొదలగు రాజకుమారికలు పరమానందభరితులయిరి. "ఓభామినీ! నీతోడునుమీ! అనురాగము మూర్తీభవించినట్లు నీరూపము కనఁబడును. నీవును, నీరాజకుమారికలును, నాప్రాణములకంటెఁ బ్రియులు. ఓసఖి! అన్నివిధముల నీమనోభిలాష పూర్తియగును. లోకమునకు వెఱచుచున్నాను; కాని, నేను నీవాఁడను; నీవు నాదానవు. నామాట సత్యమునుమీ!" శ్రీరాముని వాక్కులవలన రాజకుమారికల హృదయకవాటములు వీడ్వడెను. వారిహృదయములలోఁ బుట్టినయనురా

గమును వారు పట్టఁజాలకపోయిరి. వారందఱు ధైర్యము నవలంబించి, రామునిహస్తముఁ బట్టుకొని, యేకగ్రీవమున నిట్లు పలికిరి. "ఓరామా! మాభాగ్యమేభాగ్యము; మావంటిధన్యులు లోకములో లేరు. మేము సంసారసాగరములో మునుఁగుచుంటిమి- నీహస్తములు మమ్ములను రక్షించెను. మాప్రాణములు నిలువఁబడినవి. ఓరామా! నీవు చేసినమేలునకు, మేమేమి ప్రత్యుపకారముఁ జేయఁగలము· కోట్లకొలఁది నక్షత్రము లుదయించినను, చంద్రునితో సమానమగునా? మామాకర్మానుసారము బ్రహ్మ మమ్ముల నాయాయోనులయందుఁ బుట్టించినను, నీయందు మా కనురాగ ముండునట్లు ప్రసాదింపుము. విధికృతమువలన మాకు నానాదుఃఖములు- కష్టములు- వచ్చుఁగాక! క్షణక్షణము మా కొకజన్మము వచ్చుఁగాక! ఏజన్మమైనను, నీమీఁద భక్తియుండునట్లు ప్రసాదింపుము. అనన్యభక్తి మాకుఁ గలుగుఁగాక." ఈప్రకారము వారు కరుణారసముతోఁ బలికిన వాక్యముల నాసర్వాంతర్యామి, శ్రీరామమూర్తి విని, 'తథాస్తు' అని చెప్పి, వారిని సన్మానించెను; వారివద్ద సెలవుఁబుచ్చుకొని, నల్వురన్నదమ్ములు దిగ్గునలేచిరి. సంపూర్ణకళాప్రభావుం డగు శ్రీరాముఁడు, తమ్ములతోఁగూడి, చంద్రునివలె, నామెగృహమునుండి వెడలి, సునయనవద్దకు వచ్చి, ఆమెయనుజ్ఞఁ గైకొని, విడిదిగృహమునకు వచ్చెను. ఈప్రకారము జనకునినగరములో నిత్యోత్సవములు క్రొత్తక్రొత్తవి జరగుచుండెను.

(అధికపాఠము సమాప్తము.)

ఇతి శ్రీగోస్వామితులసీకృత శ్రీరామచరిత్రమానసే,
సకలకలికలుషవిధ్వంసనే, బాలకాండాంతర్గత
పండితజ్వాలాప్రసాదకృత వ్యాఖ్యానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
దశమోవిశ్రాముః.

# బాలకాండ ఏకాదశ విశ్రామః.



### చౌపాయ్

ప్రతిదినము జనకునిపట్టణములోఁ గ్రొత్తక్రొత్తవినోదములు జరగుచుండెను; దివారాత్రములు నిమిషమువలెఁ గడచెను. వేకువ జామున నాభూపతితిలకము (దశరథమహారాజు) మేల్కాంచెను; వంది మాగధులు వచ్చి భూపాళరాగముమీఁద మేలుకొలుపులఁ బాడి, యనేకవిధముల నతనిని స్తుతించిరి. దేశదేశములనుండి వచ్చినరాజకుమారులను, వననల్వురుకుమారుల నతఁడు చూచి, పరమానందభరితుఁడై, మాటలాడలేకపోయెను. స్నానసంధ్యాద్యనుష్ఠానాది ప్రాతఃకాలక్రియల నతఁడు నిశ్చింతగ నొనరించి, సంతోషముచే నుప్పొంగుచు, గురువువద్దకువచ్చి, వారికి దండప్రణామము లొనరించి, చేతులను జోడించుకొని నిలువఁబడి, అమృతోపమాన మగువాక్యకులముతో నిట్లు మందముగఁ బ్రసంగించెను. "ఓమునిరాజా! మీకృపవలన నేడు కదా నాకోరిక సిద్ధించెను; ఓస్వామీ! బ్రాహ్మణులకు వర్తమానముఁబంపి, భూషణాలంకారములతోఁగూడిన గోవులను వారికిదానముఁజేయుఁడు" అని దశరథుఁడు ప్రార్థించెను. అనేకవిధముల రాజుం గొనియాడి, యతఁడు కోరినప్రకారము, బ్రాహ్మణులకు గురువు వర్తమానముఁ బంపెను.

### దోహా 376

అప్పుడు వామదేవుఁడు, నారదుఁడు, వాల్మీకి, జాబాలి, విశ్వామిత్రుఁడు మొదలగుమహామునులును, ఋషులును, తపశ్శాలులును, మహాత్ములును వచ్చిరి.

### చౌపాయ్

దశరథమహారాజు వారికి దండప్రణామంబు లొనరించి, వారినిఁ బ్రేమపూర్వకముగ నాదరించి, వారికి సుఖాసనముల నిచ్చెను; సర్వాలంకారములతోఁ గూడియుండిన నాలుగులక్షల కామధేనువువంటిగోవులను రప్పించి, దశరథుఁడు వారికి సమర్పించెను. "ఓమునులారా!

నేఁడు నాజన్మము సఫలమయ్యెను; మిమ్ములను దర్శించుటవలన, నాకో రికలు సిద్ధించెను" అని యనేకప్రకారముల వినయవిధేయత లొలుకు చుండఁ బలికి, రాజు వారిని నుతించెను. ఆమును లతనిని దీవించిరి; రాజు ప్రసన్నుఁడయ్యెను; తదనంతరము, యాచకులకు వర్తమానముఁ బంపెను. సువర్ణమును, మణులను, వస్త్రములను, ఏనుఁగులను, గుఱ్ఱములను, రథములను- సూర్యకులాచారప్రకారము భూపతి, యెవరు కోరినప్రకారము వారికి వాని నిచ్చెను; ఆయాచకులందఱు రాజుం గొనియాడుచు, "హేసూర్యకులనాథా! హేదశరథా! జయ, జయ, జయ! హేరాజన్! జయ, జయ, జయ!" అని వేనోళ్లఁ బ్రస్తుతించి, నిష్క్రమించిరి. ఈప్రకారము శ్రీరాముల వివాహమంగళోత్సవములు జరగెను; 'శ్రీశివజీమహాప్రభువు' సయితము వానిని వర్ణింపలేఁడు; వెయ్యిముఖములుండినను, శేషుఁడే సమర్థుఁడు కాఁడుకదా! నేనుమాత్రము చెప్పఁగలనా?

దోహా 377

మాటిమాటికి విశ్వామిత్రునిచరణములకు దశరథుఁడు నమస్కరించి, "ఓమునిరాజా! మీకృపాప్రభావమువలన, నిట్టి సుఖములు సంప్రాప్తమయ్యెను" అని పలికెను.

చౌపాయి

జనకచక్రవర్తియొక్క సుశీలమును, ప్రేమయుఁ, గర్తవ్యములను దశరథమహారాజు నాఁటిరాత్రి వేనోళ్లఁ గొనియాడి, యతనిసంపదలఁ బ్రస్తుతించెను; ప్రతిదిన ముదయమున, దశరథుఁడు లేచి, స్వరాజధానికిఁ బోవుట కుద్యుక్తుఁడై, జనకచక్రవర్తిని వేడుకొనుచుండెను; కాని, జనకుఁ డతని నిరోధించి, యుంచివేయుచుండెను. జనకుఁడు చేసిన యాదరణమువలన నతఁ డతనిమాట కెదురునడచుటకు సమర్థుఁడు కాకపోయెను. రోజు కొకచిత్రముగ జనకమహారాజు వియ్యంకుని నాదరించెను; ఏదినమున కాదినముననే, క్రొత్తక్రొత్తవిందులఁ జేయుచుండెను; ప్రతిదిన మేదేనొక క్రొత్తవినోదము నగరములో జరగుచుండెను; దశరథమహారాజు స్వరాజధానికివెళ్లుటకు, జను లెవరును సమాధానపడలేదు. ఈప్రకార మనేకదినములు గతించెను; పెండ్లివారు, మోహపాశములచే నొకరితో నొకరు కట్టఁబడిరి; విశ్వామిత్రుఁ

డును శతానందుఁడును గలసి, జనకునితో నిట్లు చెప్పిరి:—"ఓరాజా! ధశరథమహారాజు స్వగృహమునకు వెళ్లుటకు సెలవుఁ బ్రసాదింపుము; నీకు వారియం దనురాగముకలదు; వారిని విడిచిపెట్టుటకు నీకిష్టము లేదు; అయినను, వారిని విడిచిపెట్టుము." "వారిచిత్తము" అని జనక చక్రవర్తి చెప్పి, మంత్రులకు వర్తమానముఁ బంపెను. వారు వచ్చి "హే రాజన్! జయ, జయ, జయ!" అని చెప్పి, రాజునకు నమస్కరించిరి.

దోహా 378

"అయోధ్యాపురినాథులు స్వగృహమునకు గమనించెదరు; అంతఃపురములో నీసంగతిఁ దెలుపుడు" అని రాజు మంత్రుల కాజ్ఞాపించెను. ఈసంగతిని వా రంతఃపురవాసినులకుఁ దెలిపిరి; సచివులును, మంత్రులును, బ్రాహ్మణులును మొదలగువా రాసంగతిని విని, జాలిఁ బడిరి.

చౌపాయ్

పురజను లాసమాచారమును విని, యిరుదెసల గృహములుగల వారితోఁగూడి, యాసమాచారము యథార్థమగునో, కాదో యని, ఆందోళనముతో, నొకరితోనొకరు గుసగుసలాడిరి; ఆవర్తమానము సత్యమని తెలిసికొని, వారు దీనులయిరి; సాయంసమయమున కమలములు ముకుళించుకొనిపోవువిధమున, వారిముఖములు వాడిపోయెను. పెండ్లి వారి విడిదిగృహములలో నెచ్చటఁజూచినను కట్నములు కనఁబడెను; ఎచ్చటఁజూచినను, ఫలములును, పిండివంటలును లడ్డూనములును, ఫేడాలును మొదలగునవి తిప్పలుతిప్పలుగఁ బడియుండెను; ఏవిడిదిలోఁ జూచినను, విందులే జరగుచుండెను; వానిం జెప్పుటకు శక్యముకాదు; ఇఁకను జనకచక్రవర్తి కూఁతురునకిచ్చిన సారెను వినవలెను; చీని చీనాంబరములును, పీతాంబరములును, శాలువలును, దోవతులును, రంగురంగుల జల్తారుబుటాచీరలును, అనేకములనిచ్చెను; వానిని శుభ్రముగఁ గాపాడుటకు సేవకులును; వేలకొలఁది వంటలవారును; వేలకొలఁది దాసదాసీజనంబులును; ఒకలక్షగుఱ్ఱములును; నిరువదియైదు వేలరథములును; నారథములు నఖశిఖపర్యంతము చక్కఁగఁ గట్టఁబడియుండెను; పదివేలుమదించిన యేనుఁగులును, నాగజములఁజూచి, దిగ్గజములుసయితము లజ్జపడుచుండెను; బండ్లకొలఁది వెండిబంగారము

లును, నవరత్నములును, వస్త్రములును, మహిషములును, ధేనువు లును, తదితర వివిధపదార్థములును-జనకమహారాజు సారెఁబెట్టెను.

దోహా 379

జనకమహారాజు కూఁతురికిఁ బెట్టినసారెచీరలఁ జెప్పుటకును లెక్కించుటకును శక్యముకాదు; ఈసంపదను దేవేంద్రుఁడు చూచిన యెడల, ధనదునిసంపదయు దానితో సమానముకాదని తలంచును.

చౌపాయ్

ఈప్రకారము జనకచక్రవర్తి సారెసామగ్రులను బండ్లపై నెక్కించి, అయోధ్యాపట్టణమునకుఁ బంపెను. నీరు తగ్గుచుండుటఁజూచి, మత్స్యములు విచారించువిధమున, నావర్తమానమును రాణులు విని, విచారించిరి. సీతను వారు తొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని, ముద్దులాడి, దీవించి, యీవిధమున నామెకు బుద్ధులఁ జెప్పిరి; "ఓఅమ్మా! ఓతల్లీ! నీయమ్మకడుపు చల్లఁగను, నీయత్తకడుపు చల్లఁగను, శతవత్సరము లయిదువతనముఁ జేయుము. ఓచిట్టితల్లీ! ఇదియే మాదీవన. లక్ష్మీనారాయణులవలె, మీదాంపత్య మనుకూలముగ నుండుగాక! ఓకన్నతల్లీ! మీమామగారును, అత్తగారును, మీకులాచార్యులును జెప్పిన ప్రకారము సంచరింపుము; నీభర్తకుఁ గోపము రాకుండ, నతనియాజ్ఞలను మన్నింపుము" అని తల్లులు బోధించిరి. ఆమెచెలికత్తెలు స్నేహముప్పొంగ, నామెతో ననేకవిధములఁ బ్రసంగించి, స్త్రీధర్మములఁ జెప్పిరి. నల్వురకుమారికల ననేకవిధముల బోధించి, రాణులు వారిం గౌఁగిలించుకొనిరి; మాటిమాటికి వారిని గాఢాలింగనముఁజేసికొని, "ఆహా! ఆడపిల్లలను బ్రహ్మ యెందులకుఁ బుట్టించెనోకదా! ఏదేనొకదినమున వారు పరార్థమే గాని మఱియొకటి కాదు కదా!" అని పలికి, నొచ్చుకొనిరి.

దోహా 380

ఆసమయమున, రామచంద్రుఁడు సోదరులతోఁగూడి, సెలవుఁ బుచ్చుకొనుటకు, జనకునినగరులోనికి వచ్చెను.

చౌపాయ్

ముద్దులు మూటఁగట్టుచుండిన యానల్వురరాజకుమారుల జూచుటకు, నగరములోని స్త్రీపురుషు లాబాలవృద్ధులు పరుగెత్తి

వారివెంట వెళ్లిరి. వారిలో నొకఁడు తదితరులతో నిట్లు ప్రసంగిం చెను. "ఓజనులారా! ఈరోజున దశరథమహారాజు కుమారులతోను గోడండ్రతోఁ గలసి, స్వరాజధానికి నిష్క్రమింతురు; అందులకు జన కుఁడు తగినసన్నాహముఁ జేసెను; ఆనల్వురురాజపుత్రులను మీరు కన్నులారఁ జూడుఁడు; వారు మనచే నాదరింపఁదగినవారు; ఓస్నేహి తుఁడా! ఎవరుచెప్పఁగలరు? మనపురాకృతభాగ్య మెట్టిదోకాని, బ్రహ్మ మనము కన్నులారఁజూచుట కిట్టియతిథులఁ బంపెను. మరణము సమీ పించినవానికి నమృతము నిచ్చినట్లును, నాజన్మాంతము క్షుద్బాధచేఁ బీడింపఁబడినవానికిఁ గల్పవృక్షము లభించినట్లును, నరకములోఁ బడు చుండినవానికి వైకుంఠము ప్రాప్తించినట్లును, వారిదర్శనము మన కయ్యె ను. రామునిదివ్యమంగళవిగ్రహముఁ గన్నులారఁ జూచి, దానిని హృద యములో ధరింపుఁడు; సర్పము మణినిధరించినవిధమున, నతనిరూప మును మనమనస్సులు ధరింపవలెను." అని యీప్రకార మొకపురజ నుఁడు పలికెను. ఈప్రకారము నగరజనులకు నేత్రోత్సవముఁ గలుగఁ జేయుచు, వారు నల్వురును జనకచక్రవర్తినగరునకు విజయముఁజేసిరి.

దోహా 381

ఆలోకమోహనాకారులగు నల్వురన్నదమ్ములఁ జూచి, రాణి వాసపుస్త్రీలు దిగ్గునలేచిరి; అంతట నత్తలు వచ్చి, వారినల్వురకును హారతులనిచ్చి, వారిమీఁద సేసలంజల్లిరి.

చౌపాయి

ఆనల్వురన్నదమ్ములలోను శ్రీరామునిమోహనాకారముఁ జూచి, వారు సంతసించి, మాటిమాటికి యతనిపాదములమీఁదఁ బడుచుండిరి; వారు సిగ్గునువిడిచి, తమస్వాభావికానురాగమును స్నేహమును రాము నియెడలఁ జూపించిరి; దానిని వర్ణింప శక్యముకాదు. వా రానల్వుర కును కుంకుమాదులతో నలుఁగులఁబెట్టి, స్నానముఁజేయించిరి; షడ్ర సోపేతముగఁ బక్వాన్నమును బెట్టిరి; శ్రీరాముఁడు మంచిసమయముఁ జూచి, మృదుమధురవచనములతో నిట్లు మందముగ వారితోఁ బ్రసం గించెను; "శ్రీమాజనకులు, దశరథమహారాజుగా రయోధ్యానగరము నకు గమనించుట కుద్యుక్తులగుచుండిరి; మీ సెలవుఁబుచ్చుకొనుటకు మమ్ములఁబంపిరి; ఓతల్లులారా! నన్నుఁ గటాక్షించి, ఎల్లపుడు నన్ను

మీబాలుఁడనని భావింపుఁడు; అనవరతము నన్ను మీరు దయతో స్మరింపుఁడు" అని రాముఁడు పలికెను. శ్రీరామునివచనములను రాణివాసపుస్త్రీలందఱు విని, అత్తలు మొదలగువారుసయితము వ్యాకులపడిరి; అతిప్రేమావశులై నందున, రాణులకు నోటివెంబడి మాట వెడలలేదు; తదనంతరము రాణులు తమకుమారికలఁ గౌఁగిలించుకొని, వారివారి భర్తలకు నప్పగించిరి.

ఛాంద్ 31

అత్తగారు సీతం దీసికొనివచ్చి, రాముని చేతిలోఁ బెట్టి, "ఓరామా! నానాయనా! నాబాబూ! నామీఁదనొట్టుసుమీ! ఇవి నాయప్పగింతలుసుమీ! నీకుఁ దెలియనిసంగతి లేదు; నీవు చతురుఁడవు; నాకుటుంబములోనివారేమి, నానగరములోని జనులేమి, మేమందఱము మా సీతను మాప్రాణములవలెఁ గాపాడి, చూచుచుంటిమి. ఆమె యోగ్యతను, బుద్ధిని, ప్రవర్తనను విచారించి, యామెను నీదాసిగ భావింపుము.

సోరథా 40

"ఓరామా! నీవు పరిపూర్ణకాముఁడవు; బుద్ధిమంతులకు శిరోమణివి; ఓనాథా! ఓకరుణాసముద్రుఁడా! నీభక్తులగుణముల నవలీలలో గ్రహించెదవు; ఓసంకటహరణా! రక్షింపుము" అని చేతుల జోడించి, ప్రార్థించి, యప్పగించెను.

చౌపాయ్

ఈప్రకారము రాణులందఱుఁ బలికి, రాముని పాదములను గట్టిగఁ బట్టుకొనిరి; సైకతరేణువులలో నీరు మాయమగువిధమున, వారిప్రేమలో వారిమాటలు మాయమయ్యెను. ప్రేమపూరితమగు వారివచనములను రాముఁడు విని, చేతులను జోడించి, నమస్కరించి, వారి ననేకవిధముల సత్కరించి, సన్మానించెను; మాటిమాటికి వారికిఁ బ్రణమిల్లి, నిష్క్రమించుటకు రాముఁడు సెలవుఁగోరెను. వారియాశీర్వాదములఁ బొంది, మఱల రాముఁడు వారిపాదములకు నమస్కరించి, సోదరులతోఁగూడి, నిష్క్రమించెను. రాముని దివ్యమంగళవిగ్రహమును వారు హృదయములో నిడుకొని, ప్రేమపూరితులై, చకితులఁబడిరి. అనంతరము, వారు ధైర్యము నవలంబించి, కుమారికలఁ

బిలిచి, స్నేహముప్పొంగ, వారినిఁ దమగుండెల కద్దుకొనుచుండిరి; వారు కుమారికలతోఁ గొంతదూరము నడచివచ్చి, యంతలో మాతృ వాత్సల్యముప్పొంగ, మఱియొకపర్యాయము వారినిఁ దమగుండెల కద్దుకొనుచు, మఱియొకపర్యాయము కుమారికలే తల్లులకంఠములఁ బట్టుకొని, వెక్కివెక్కి యేడ్చుచు, నొకరినొకరు విడిచిపెట్టలేక, కలిసివ చ్చిరి. ఈప్రకారము వారిపరస్పరానురాగము వెల్లివిరిసెను. ఉన్నటు లుండి చెలికత్తెలామెవద్దకు వచ్చి, యొకపర్యాయము మాటలాడి, వెడలుచుండిరి; లేదూడ తల్లి(గోవు)వద్దకుఁ బరుగెత్తుకొని వచ్చువిధ మున, నామెవద్దకు వారు వచ్చుచుండిరి.

దోహా 383

జనకునినగరులోని దాసదాసీజనంబులును, చెలికత్తెలును, రాణు లును, బంధువులును, ప్రేమకు వశ్యులయిరి; వారిం జూచినయెడల, జనకపట్టణమంతయుఁ గరుణకును విరహమునకును నివాసమయినట్లు కనఁబడెను

చౌపాయి

శుకశారికములను బంగారుపంజరములోఁ బెట్టి, సీత పెంచెను; అవి నేడు సీతం గానక "ఓసీతా! ఓసీతా! మాసీతమ్మయేదీ!" అని పలుకుచుండెను. ఆమాటలను వినినతర్వాత, నెవనికి గుండెలు దిట్ట ముగనుండును? వానిపలుకులను వినినందున, సకలజనులగుండెలు జాఱిపోయెను ఈప్రకారము పక్షులును, మృగములే సీతావియోగ మువలన, వ్యాకులపడినపుడు, మనుజులదశఁ జెప్పనేల? పిమ్మట జన కుఁడు, తమ్ముఁడు కుశకేతునితోఁ గూడి, వచ్చెను. కూఁతురియందుఁ గలయనురాగముచే నతనిమనస్సు పూరించియుండెను; అతనినేత్ర ములు నీటితో నిండెను. అతఁడు పరమవైరాగియని సుప్రసిద్ధముకదా! అట్టివాఁడుసయితము జానకిం జూచి, ధైర్యమును దిగవిడిచెను. అతఁడు సీతను తనగుండెల కద్దుకొనినందున, నతని జ్ఞానవైరాగ్యములు దిక్కు లఁబట్టెను; ఆసమయమున, నెవరికి ధైర్యము నిలువఁబడియుండును? కూఁతురి నత్తవారింటికిఁ బంపునపుడు, జనకునివంటివాఁడే వియోగ దుఃఖమును భరింపలేకపోయినపుడు, సాధారణగృహస్థుల దుఃఖ మెంత యుండవచ్చునోకదా? (జ్ఞానవైరాగ్యములు భక్తికి సాధనములు; రామ

భక్తిస్వరూపమే సీత; సిద్ధిఁబొందినతరువాత, సాధనములు జాఱిపోవును; రామభక్తిస్వరూపమగు సీతను జనకుఁడు పొందినందున, నతని జ్ఞానవైరాగ్యములు వీడిపోయెను.) అంతట మంత్రులు రాజువద్దకు వచ్చి, యతని నోదార్చిరి; ఆసమయము విచారించుట కనుకూలము కాదని జనకుఁడు గ్రహించి, ధైర్యము నవలంబించెను. మఱలమఱల జనకుఁడు సీతను హృదయమున కప్పళించుకొని, ఆమెచుబుకమును దువ్వి, శిరము నాఘ్రాణించెను. అతనియాజ్ఞప్రకారము, బంగారు పల్లకి సిద్ధముగనుండెను.

దోహా 384

అంతటఁ బ్రేమచే స్త్రీపురుషులగుండెలు ఝల్లుమనెను; రాజబంధువులు పల్లకిఁ జుట్టియుండిరి; జనకచక్రవర్తి; ప్రయాణమునకు సుముహూర్తమువచ్చె నని తెలిసికొని, సీతను బంగారుపల్లకిలోఁ గూర్చుండఁ బెట్టెను. అతఁడు సిద్ధగణేశునిఁ బ్రార్థించెను.

చౌపాయి

అనేక ప్రకారముల స్త్రీధర్మములను, కులాచారములను, నల్వురుకుమారికలకు జనకుఁడు బోధించెను; ఆమె తనదాసదాసీజనంబుల నామెవెంట నతఁడు పంపెను. జానకి ప్రయాణసమయమున, నగరములోని స్త్రీపురుషులందఱు వ్యాకులమొందిరి; శుభశకునములు కనఁబడెను; మంత్రులును, ప్రధానులును, బ్రాహ్మణులును, తదితరజనులును, పెండ్లివారిని సాగనంపుటకు రాజుతోఁ గలసి నడిచిరి. పెండ్లివారి చతురంగబలములు నడచుటకు సిద్ధముగనుండెను; భేరీభాంకారములు, "బాజాబజంత్రీలు" మొదలగు మంగళధ్వనులు వినఁబడఁ జొచ్చెను; దశరథుఁడు బ్రాహ్మణులఁ బిలిచి, వారువారు కోరినప్రకారము వారివారికి దానముల నిచ్చెను; వారిచరణకమలముల కతఁడు నమస్కరించెను; మనస్ఫూర్తిగ వా రతనిని దీవించిరి; దశరథునిమనస్సు సంతోషముచే నుప్పొంగెను. అతఁడు గణేశునిఁ బ్రార్థించి, ప్రయాణమునకు సిద్ధపడెను. అంతట, మంగళధ్వనులు వినఁబడెను; నలువైపుల శుభశకునములు కనఁబడెను

దోహా 385

దేవతలు పుష్పములను వర్షించిరి; అప్సరసలు సంతోషముతోఁ

బాటలఁ బాడిరి; ప్రయాణభేరి మ్రోఁగుచుండెను; అయోధ్యానగరము నకు దశరథుఁడు అభిముఖుఁడై, ప్రయాణమును సాగించెను.

చౌపాయ్

వినయవిధేయతలతో దశరథుఁడు బ్రాహ్మణులకు నమస్కరించి, వారిని విరమింపుఁడని ప్రార్థించెను. అతఁడు యాచకులఁ బిలిచి, వారికి ధనమును, వెండి బంగారములను, రథగజతురంగములను, సమృద్ధిగనిచ్చి, వారిని సంతోషపెట్టెను. వారు దశరథునియెదుట నొకవరుసగా నిలువఁబడియుండిరి. వా రతనిని బిరుదనామావళీలతో ననేకవిధములఁ గొనియాడి, రామునిరూపమును హృదయములలో నిడుకొని, స్వగృహములకు వెడలిరి; మాటిమాటికి దశరథుఁ డెంతచెప్పినను వినక, జనకుఁడు ప్రేమానుబంధములచేఁ గట్టుపడి, వెనుకకుఁ దిరుగక, పెండ్లివారితోఁ గలసి వెళ్లుచుండెను. "ఓరాజా! మీరు విశేషదూరము వచ్చితిరి; ఇంతటితో మీరు విరమించుట యుక్తము." అని పలువిధములఁ గోసలాధిపతి మాటిమాటికి జనకునితో నొక్కిచెప్పెను. అంతట జనకచక్రవర్తి వాహనమునుండి దిగి, చేతుల జోడించుకొని, నిలువఁబడి యుండెను; అతనినేత్రములనుండి ప్రేమానందబాష్పములు కడవల కొలఁది జాలుచుండెను. "ఓమహారాజాధిరాజా! నావంటి యథమాధముని మీరు స్వయముగ నాదరించి గారవించినందులకు, నేను కృతజ్ఞుఁడనై యుండెద; ఏమాటఁజెప్పుటకు నాకు శక్తిలేదు" అని జనకచక్రవర్తి వినయముతోఁ బలికెను.

దోహా 386

దశరథమహారాజు జనకచక్రవర్తి ననేకవిధముల సన్మానించి, బహూకరించెను; వారు పరస్పరానురాగముఁ గలవారై, రాజమర్యాదల కనుగుణ్యముగ, నొకరితోనొకరు కలిసి, కొంతవఱకు ముచ్చటించిరి. వారిసమాగమమును, వారిమర్యాదలను, వర్ణించిచెప్పుటకు సామర్థ్యములేదు.

చౌపాయ్

జనకచక్రవర్తి బ్రాహ్మణులకును మునీశ్వరులకును శిరస్సువంచుకొని నమస్కరించెను; వా రతనిని దీవించిరి. పిమ్మట నతఁడు నల్వురు జామాతలవద్దకు వెళ్లెను; ఆనల్వురును సకలగుణధాములు; రూపశీల

లావణ్యములకు నిధులు; కమలములనంటి రాముని హస్తములను జన కుఁడు పట్టుకొని, మనస్సులోనుండి ప్రేమ యుబుకుచుండ, "ఓరామా! ఎట్లు నేను నీతోఁ బ్రశంసింపఁగలను? మునుల యొక్కయు శివుని యొక్కయు మానససరోవరములోపలను విహరించుహంసవు; యోగులు సదా నిన్నే ధ్యానించెదరు; కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు నీకు లేవు; సర్వవ్యాపకుఁడవు; ఈశ్వరుఁడవు; నిరాకారుఁడవు; నాశరహితుఁడవు; ఆనందస్వరూపుఁడవు; నిర్గుణుఁడవు; సకల గుణధాముఁడవు; మనోవాచామగోచరుఁడవు; అనుమానముచే న్యూహింపఁదగినవాఁడవు కాని, తర్కముచే నీ విట్టివాఁడవని చెప్పుటకు వీలు పడదు. ఏన్యాయముచేఁ జూచినను, నీవు అనుమానాస్పదుఁడవు; నీమహిమను వేదములు 'న-ఇతి, న-ఇతి' అని ఘోషించుచున్నవి; నీవు త్రికాలాతీతుఁడవు; నీకుఁ గాలవికల్పములు లేవు.

దోహా 387

"సమస్తసుఖములకును మూలకందము నీవే; నీవు నాదృక్కులకు గోచరుఁడ వగుటవలన, నాపూర్వపుణ్యము ఫలించెను; ఓఈశ్వరా! ఏ సుఖము లోకములోనిజీవుల కనుకూలముగనుండునో, నా కట్టిసుఖమును దయచేయుము. (లేకున్న జీవులు నీసాయుజ్యసుఖముఁ బొందుటకు, శివుఁ డనాతరము వారికి ననుకూలుఁడుగనుండును.)

చౌపాయ్

"అన్నివిధముల, ఓస్వామీ! నీవు నన్నాదరించి, గారవించితివి; నీభక్తుఁడనని తెలిసికొని, నన్ను నీవానిం జేసికొంటివి; పదివేలశేషువులును సరస్వతులును గూర్చుండి, కోట్లకొలఁది కల్పాంతములవఱకు లెక్కించినను, నీమహిమను గాని నాభాగ్యమునుగాని లెక్కించి చెప్పుటకు సమర్థులు కారు. నేనొకటిమాత్రము చెప్పఁగలను; అది నానమ్మకము; అదియే నాబలము; ఏపాటినిర్మలభక్తిం జూపినను, నీవు ప్రసన్నుఁడవు కాఁగలవు; మాటిమాటికిని చేతుల జోడించుకొని ప్రార్థించెద. ఓనాథా! ఎన్నటికిని, నీచరణారవిందములను విడువకుండునట్లు ప్రసాదింపుము" అని జనకచక్రవర్తి ప్రార్థించి, విన్నవించుకొనెను. ప్రేమచేఁ బుష్టిఁగలిగియుండిన జనకునివచనములను, సంపూర్ణకాముఁ

డగు రాముఁడు విని సంతోషించి, వినయముతో మామగారిని సన్మానించి, తండ్రితోను, విశ్వామిత్రునితోను, వసిష్ఠునితో జనకచక్రవర్తిసమానుఁడని భావించెను. (1. జానకీరాముల కొకటియే శరీరము కనుక, జనకచక్రవర్తి దశరథునితో సమానుఁడు; 2. విశ్వామిత్రుని మూలమున రామునకు విజయముకలిగెను; పిమ్మట నతనిమూలమున, విజయరూపిణియగు జానకి లభించెను; కనుక, జనకుఁడు విశ్వామిత్రునితో సమానుఁడు, 3. ప్రథమమున వసిష్ఠుఁడు రామునకు విద్యాభ్యాసముఁజేసెను; పిమ్మట బ్రహ్మ విద్యాస్వరూపిణియగు జానకిని జనకుఁడిచ్చెను; కనుక, నతఁడు వసిష్ఠునితోసమానుఁడు) అనంతరము, జనకుఁడు భరతునకు విన్నపములఁజెప్పి, యతనిని గాఢాలింగనముఁజేసికొని, దీవించెను.

దోహా 388

అనంతరము, రాజు లక్ష్మణునితోను శత్రుఘ్నునితోఁ గలిసి, వారికి విన్నపములఁజెప్పి, వారిని దీవించెను. ఒకరియం దొకరికిఁ గల ప్రేమానుబంధముచే, నొకరొకరు నమస్కారములఁ జేసికొనిరి.

చౌపాయ్

తుద కొకరితోనొకరు విన్నపములఁ జెప్పుకొనిరి; ఒకరినొకరు స్తోత్రముఁజేసికొనిరి; అన్నదమ్ములతోఁ గూడి రాముఁడు ప్రయాణమును సాగించెను; జనకుఁడు విశ్వామిత్రునివద్దకు వచ్చి, యతనిచరణములకు నమస్కరించి, యతనిపాదధూళిని తనశిరముపైని, నేత్రములపైని ధరించెను. "ఓమునిరాజా! మీదర్శనమువలన, సమస్తము నాకు సుగమమని నావిశ్వాసము; ఓస్వామీ! ఇంద్రాది లోకపతులుసయితము కోరఁదగినసుఖములును మనోరథములును, మీదర్శనమువలన, నా కనాయాసముగ సంప్రాప్తమయ్యెను." అని యీప్రకార మనేకవిధముల విశ్వామిత్రుని స్తుతించి, జనకుఁడు మునీశ్వరుని చరణములకు వినయముతో నమస్కరించెను; ఆతనిని మునీశ్వరుఁడు దీవించెను; అనంతరము, రాజు వెనుకకుమరలెను. మంగళధ్వనులు మ్రోఁగుచుండెను; పెండ్లివారిసంబరము ప్రయాణమై నడచెను; ఆబాలవృద్ధులందఱుఁ బ్రసన్నులయిరి. పురజనులు, స్త్రీపురుషులు రెప్పపాట్లువేయక, రామునిఁ గన్నులారఁజూచిచూచి, పరమానందభరితులయిరి.

దోహా 389

మార్గములో నచ్చటచ్చట పెండ్లివారు విడిదిఁజేయుచు, నచ్చటి జనులకు సంతోషమునిచ్చిరి; తుదకు, వారు శుభదినమున, నయోధ్యా నగరసమీపమునకు వచ్చిరి.

చౌపాయ్

"డంకా, నౌపత్, సహనాయి, నగారా," డమడమలు, బాజాలు, దుందుభులు, శంఖములు, మృదంగములు, తాళములు-ఈ మొదలగు వాని వివిధధ్వను లంతరిక్షము ముట్టెను. చతురంగబలముల కోలాహలముఁ జెప్పుటకు శక్యము కాదు; అవధ (అయోధ్యా) పురవాసులు పెండ్లివారు గృహప్రవేశమునకు వచ్చుచుండిరని విని, సంతోషించిరి; వారిశరీరములు పులకరించెను; వారు స్వగృహముల నలంకరించి, సింగారించిరి; అంగడివీథులును, గల్లీలును, చతుష్పథప్రదేశములును, నగర బహిర్ద్వారములును, సింహద్వారములును - సర్వము నలంకరించిరి. రాజమార్గములను పన్నీరుతోఁ దడిపిరి; పరిమళద్రవ్యములంతటఁ జల్లిరి; రాజమార్గములలో నానావికారములుగఁ బెండ్లిముగ్గులఁ బెట్టిరి; అంగడివీథులసొగసుఁ జెప్పుటకు శక్యము కాదు. ఎచ్చటఁజూచినను, ధ్వజములు, పతాకములు, మంగళతోరణములు, పందిళ్లు-ఈ మొదలగునవి కట్టఁబడెను. పోఁక చెట్లు, తియ్యమామిడి చెట్లు, అరఁటి చెట్లు, వకుళ, కదంబ, తమాలవృక్షములు-ఈ మొదలగువానిం దీసికొనివచ్చి, మార్గములలోఁ బాతిరి; ఈ చెట్లన్నియు ఫలములతోఁ గూడి నేలకు వంగియుండెను; వానికి ముత్యాలపాదులఁ గట్టిరి; ఆవృక్షములను భూమిలోఁ బాతినంతలో, నవి వేఱుఁదన్ని పెరిఁగెను.

దోహా 390

శుభసూచకముగ, పూర్ణకుంభములను గృహముల యెదుట నుంచిరి; బ్రహ్మాది దేవతలు రామునినగరముఁ జూచి, దానినిఁ గొనియాడిరి.

చౌపాయ్

రాజమందిరము దేదీప్యమానముగఁ బ్రకాశించుచుండెను; దానిరచనఁ జూచి, కామదేవుఁడుసయితము మోహించెను; సకల

శుభశకునములను, సంపదలును, సర్వసుఖములును, వృద్ధిసిద్ధులును, మూర్తీభవించి, దశరథుని నాహ్వాయము జేయుటకు వచ్చినట్లు, రాజనగరు కనుపించెను. శ్రీసీతారాములఁ జూడవలయునని యెవరు కోరరు? స్త్రీలు గుంపులుగుంపులుగఁ గూడి, బయలువెడలిరి; వారి శరీరకాంతులఁ జూచి, రతీదేవి సైతము లజ్జించెను; సుందరమగు కలశములను మంగళహారతులఁ బట్టుకొని, వారు వెడలిరి; సరస్వతియే వారిరూపములను ధరించి వచ్చి, పాడుచుండినట్లు కనఁబడెను. రాజమందిరములోఁ గోలాహలముపుట్టెను; గృహప్రవేశమువలనఁ గలిగిన సుఖమును వర్ణింపఁజాలను; కౌసల్యాది రామునితల్లులు పరమానందముచేఁ బరవశులయిరి.

దోహా 391

రాజు బ్రాహ్మణుల కనేకదానముల నిచ్చెను; గణపతిని, పార్వతిని రాజు పూజించెను. చతుర్విధపురుషార్థములు లభించినతరువాత దరిద్రుఁడు సంతసించువిధమున, రాజును రాణులును నల్వురుకుమారులఁ జూచి పరమానందభరితులయిరి.

చౌపాయ్

ముప్వురుతల్లు లధికప్రేమచే విహ్వలమానసులై, పాదములఁ గదల్పలేకపోయిరి; వారిశరీరములు పరవశములయ్యెను. రామునిఁ జూచుట కువ్విళ్లూరుచు, వారు మంగళహారతులను సిద్ధపఱచిరి. అనేక మంగళధ్వనులు మ్రోఁగెను; పసుపు, కుంకుమము, పంచామృతములు, దూర్వాదళములు, పత్రములు, పుష్పములు, ఫలములు, నవధాన్యములు, తమలపాకులు, చెక్కలు, చందనము, కర్పూరము, అక్షతలు, కస్తూరి, అగరు, అగరువత్తులు, తులసీదళములు, బంగారుకలశములు- ఈ మొదలగు శుభప్రదమగువస్తువులను సుమిత్ర సిద్ధపఱచెను. మన్మథుఁడాబంగారుకలశములలోనుండి తొంగితొంగి చూచుచుండెను. మంగళద్రవ్యములును సుగంధద్రవ్యములును, ముప్వురుతల్లులును సిద్ధపఱచిరి; వారాసమయమునకు సంగ్రహింపనివస్తువులు లేవు; అనేకవిధముల మంగళహారతుల నిచ్చి, సువాసినులు పాటలఁ బాడిరి. మంగళమును సూచించెడి పదార్థము లన్నియు నచ్చట నిలిచియుండెను.

దోహా 392

బంగారుపళ్లెములలో సుమంగళద్రవ్యముల నుంచుకొని, ముప్వ్వరుతల్లులు వానినిఁ దమకమలములవంటి హస్తములతోఁ బట్టుకొని, పెండ్లికొడుకులకు హారతుల నిచ్చుటకు వెడలిరి; ఆతల్లులశరీరములు పులకరించెను; వారానందసముద్రములో నోలలాడుచుండిరి వారు పరవశులై యుండిరి.

చౌపాయ్

ధూపములధూమముతో నంతరిక్షము నల్లఁబడెను; శ్రావణమాసములో నంతరిక్షమున మేఘములు నిలిచియుండినట్లుతోఁచెను. దేవతలు కల్పవృక్షములపుష్పములను వర్షించిరి; అంతరిక్షమున నెగురుచుండిన కొంగలబారువలె నాపుష్పవర్షము పరులకుఁ గనఁబడెను. నవరత్నతోరణములే, దేవేంద్రునిధనస్సువలెఁ దోఁచెను; మేడలమీఁదనుండి తొంగి తొంగిచూచుచుండిన స్త్రీలు మెఱుపుతీఁగెలవలె నుండిరి; 'నగారా, ఘంటా, నౌపత్'-ఈమొదలగువానిశబ్దములే మేఘగర్జనములు; కప్పలును నెమిళ్లనువలె, యాచకులు బొబ్బలిడుచుండిరి; చాతకములు సదా జలధారకొఱకు మేఘములను యాచించువిధమున, యాచకులు సదా మేఘశ్యాముని యాచించెదరు; కప్పలు వర్షముకురియునంతవఱకు బెకబెకలాడి, వర్షించినతరువాత, నిశ్శబ్దముగనుండును; అటులనే, యాచకులు ధనము దొరకనంతవఱకు గుజగుజలాడి, ధనము దొరికినతరువాత, వారినోరు మూతఁబడును; మేఘములఁజూచి; నెమిళ్లు నృత్యముఁ జేయును; అటులనే, యాచకులు దాతంజూచి గంతులువేయుచుండెదరు. అంతలో శుభముహూర్తమువచ్చెను; గురునాజ్ఞ ననుసరించి శ్రీరాముడు నగరులోఁ బ్రవేశించెను. గణపతిని, పార్వతీ పరమేశ్వరులను ధ్యానించి, పూజించి, రాజు, పరివారముతోఁగూడి, నగరులోఁ బ్రవేశించెను.

దోహా 393

శుభశకునము లగపడెను; దేవతలు పుష్పములను వర్షించిరి; వారు దుందుభులను మ్రోఁగించిరి; అప్సరసలు నాట్యముఁజేసి, పాటలఁ బాడిరి.

చౌపాయ్

సూత, మాగధ, వందిజనంబులును, నాటకులును వచ్చి, త్రిలోక ప్రసిద్ధమగు శ్రీరాముని కీర్తిని గానముఁ జేసిరి; జయజయధ్వనులును, వేదపారాయణములును దశదిశల నిండెను; ఎచ్చటఁ జూచినను మంగళధ్వనులు వినఁబడెను; అంతరిక్షమున దేవదుందుభులు మ్రోఁగుచుండెను. భూలోకములోని జనులును, దేవలోకములోని దేవతలును పరమానంద భరితులయిరి; పెండ్లివారి గృహప్రవేశమహోత్సవమును వర్ణించిచెప్పుటకు శక్యము కాదు; ఆసంతోషమును మనస్సు పట్టలేకయుండెను. పురజనులు "జోహారు" అనుచు వచ్చి, మహారాజు యెదుట నిలిచిరి; వారు శ్రీరాముని దర్శించి, ప్రసన్నులయిరి; వస్త్రములును, రత్నములును మొదలగు కట్నములం దీసికొని వచ్చి, వానిని రాజునెదుట నుంచిరి; వారిశరీరములు పులకరించెను; వారినేత్రములవెంబడి నానందబాష్పములు కడవలకొలఁది జారుచుండెను. నగరములోని సువాసినులు నల్వురు పెండ్లికుమారులకు మంగళహారతుల నిచ్చిరి; వారు వారినల్వురఁ జూచి, పరమానందభరితులయిరి; అంతలో బంగారుపల్లకీలు వచ్చెను; వానిపైఁ గప్పఁబడియుండిన 'పరదాల'ను మీఁదికియెత్తి, వానితలుపుల నెడముఁ జేసిరి; ఆస్త్రీలు ముద్దులుమూటఁగట్టుచుండిన నల్వురుకోడండ్రఁ జూచి, నిశ్చేష్టులయిరి.

దోహా 394

ఈప్రకారము నల్వురువధూవరులు రాజద్వారమువద్దకు వచ్చిరి; జనులకు సంతోషముకలిగెను; రాణులును తల్లులును ప్రసన్నులై, వధూవరులకు మంగళహారతుల నిచ్చిరి; వా రానందపరవశులయిరి.

చౌపాయ్

మాటిమాటికి వధూవరులకు వారు మంగళహారతుల నిచ్చిరి; వారియానందమున కంతము నెవరుచూడఁగలరు? అనేకవస్త్రములను, రత్నములను, మణులను దృష్టిదోషముపోవుటకు వధూవరులకు వారు దిగఁదుడిచి, వానిని విసర్జించిరి. ఆకుమారులనల్వురను తల్లులు కన్నులారఁ జూచి చూచి, బ్రహ్మానందముఁ బొందిరి; దేదీప్యమానముగ వెలుంగుచుండిన శ్రీసీతారాములఁ జూచి, వారు వారిజన్మము సఫల

మయ్యెనని తలంచిరి; చెలికత్తెలు సీతంజూచి, యానందభరితులై, వారి వారిభాగ్యమును గొనియాడుకొనుచుండిరి. ఉండియుండి, దేవతలు పుష్పములను వర్షించిరి; గంధర్వులు పాటలఁబాడిరి; అప్సరసలు నృత్యముఁజేసిరి; ముప్పదికోట్లదేవతలు శ్రీసీతారాములకు జోహారువనుచు నమస్కరించిరి. ఆనల్వురువధూవరులఁ జూచి, సరస్వతి వారికిఁ దగిన యుపమానముఁ జెప్పలేకపోయెను; ఏయుపమానమును 'దేహి' యను నట్లు కనఁబడెను; నిరుపమానమగు వారిరూపరేఖావిలాసములయం దనురాగముచే, నామె వారిం గన్నులారఁ జూచిచూచి, నిశ్చేష్టురా లయ్యెను.

దోహా 395

కులాచారము ననుసరించి, వేదోక్తప్రకారము వధూవరుల పాదములఁ గడిగి, తల్లులు వారిని నగరులోఁ బ్రవేశపెట్టిరి; వారికి హారతుల నిచ్చిరి.

చౌపాయి

కామదేవుఁడు స్వయముగా రచించినట్లు కనఁబడుచుండిన, దేదీప్యమానమగు నాలుగురత్నస్థగితమగు సువర్ణసింహాసనములను తీసికొని వచ్చిరి ఆనల్వురు వధూవరులు వానిపైఁ గూర్చుండిరి; సువర్ణకలశములలోని జలముతో వారిపాదములను గడిగిరి; ఆవధూవరులను షోడశోపచారములతోఁ బూజించిరి; మాటిమాటికి వారికి మంగళహారతుల నిచ్చిరి; చామరములతో వీచిరి; దృష్టిదోషము పోవుటకు నేకపర్యాయములు వస్తువులను వారికి దిగఁదుడిచి వారు పాఱవైచిరి; ఆతల్లులుమువ్వురును పరమానందభరితులయిరి. పరమతత్త్వముఁ బొంది యానందించు యోగీశ్వరునివలెను; ఆజన్మాంతము సంకటములతోఁ బీడింపఁబడినవానికి నమృతము లభించినప్పటివలెను; చింతామణిని సంగ్రహించిన జన్మదరిద్రునివలెను; నేత్రములు వచ్చినపుట్టంధునివలెను; మాటలువచ్చిన మూగవానివలెను; యుద్ధములో జయముఁబొందివచ్చిన శూరునివలె, నాతల్లులు సంతోషించిరి.

దోహా 396, 397

వీరికంటెఁ గోటిమడుంగుల సుఖము నాసమయమునఁ దల్లులు పొందిరి; రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు వివాహమాడి, మాఘ

బహుళవిదియనాఁడు స్వగృహములోఁ బ్రవేశించిరి. లోకాచారప్రకారము ముప్వురుతల్లులును వధూవరులఁ జూచి ప్రవర్తించిరి; వారియుపచారములఁ జూచి, వధూవరులు కొంచెము శంకించిరి; వారియానందమును రాముఁడు కనిపెట్టి, చిఱునవ్వులు నవ్వుచుండెను.

చౌపాయ్

కులాచారప్రకారము వారు కులదేవతలఁ బూజించి, పితృదేవతల నారాధించిరి; వారిమనోరథములు సిద్ధించెను. "ఓదేవతలారా! మానలువ్రురువధూవరులకు సదా మంగళములఁ గలుగఁజేయుఁడు" అని వారు ప్రార్థించిరి; అంతర్ధానులై, దేవతలు తల్లుల ప్రార్థనలను విని "తథాస్తు" అని దీవించిరి. ముప్వురుతల్లులును సుఖముగనుండిరి; వారు కుమారులను గుండెలకద్దుకొనిరి. పెండ్లికివచ్చినవారికి రాజు వర్తమాన మంపెను; వారు వచ్చినతరువాత, వారికి యథాన్యాయముగ, వస్త్రములను, భూషణములను, వాహనములను, యానములను- ఈమొదలగు కట్నముల నిచ్చెను. వారు మహారాజువద్ద సెలవుఁగైకొని, రాముని ధ్యానించుచు, వారివారిగృహములకు సంతోషించుచు వెళ్లిరి. తదనంతరము, పట్టణములోనిజనులు, స్త్రీపురుషులు, పెండ్లిశృంగారములను సింగారించుకొని, వారివారిగృహములలో నుత్సవములఁ జేసికొనిరి. యాచకులకుఁ దృప్తిగ రాజు సంతోషముతో ధనధాన్యముల నిచ్చెను. యథాన్యాయముగ సేవకులకును, 'బాజాభజంత్రీమేళముల' వారికినిఁ దృప్తిగ రాజు కట్నముల నిచ్చెను; వారిప్రకారము రాజసన్మానములఁ బొంది, సంతసించిరి.

దోహా 398

అనేకప్రకారముల వారు రాజుం గొనియాడి, యతనిగుణములను బ్రసంగించిరి; వా రతనిని దీవించి, స్వగృహములకు వెళ్లిరి. గురువును బ్రాహ్మణులును వెంబడించియుండ, నంతఃపురములోనికి రాజు వెళ్లెను.

చౌపాయ్

వసిష్ఠునియాజ్ఞాప్రకారము, లోకాచారప్రకారమును వేదోక్తప్రకారమును జేయవలసిన శుభకర్మలను రాజు సంతోషముతో నాచ

రించెను. రాణులందఱు, తమభాగ్యమువలన బ్రాహ్మణసందర్శనము లభించెనని తలఁచి, దిగ్గునలేచి నిలువఁబడిరి. విధ్యుక్తప్రకారము బ్రాహ్మణులకు భూపతి యర్ఘ్యపాద్యముల నిచ్చి షోడశోపచారములతో వారిం బూజించెను; షడ్రసోపేతముగ వారికి విందుఁజేయించి, భోజనముఁబెట్టించెను; వారికి గంధములనలఁది తాంబూలాదులనిచ్చి సంభావించెను; మాటలచేతను మన్ననలచేతను వారిని రాజు సంతోష పెట్టెను;

"ఓం శతమానంభవతి, శతమైశ్వర్యంభవతి, శతమనంతంభవతి, శతందీర్ఘమాయుః" అని వారు రాజును దీవించి, నిష్క్రమించిరి. అనంతరము, రాజు విశ్వామిత్రుని సత్కరించెను. "ఓమునిరాజా! నావంటిధన్యుఁడు మఱియొకఁడు లేడు;" అని యనేకప్రకారముల నతని రాజు స్తుతించెను; రాజును రాణులును విశ్వామిత్రునిపాదములకు నమస్కరించిరి; వా రతనిపాదధూళిఁ దీసి, తమశిరములపై ధరించిరి. అతఁడు నగరులో నివసించుట కొకవిడిదిగృహము నేర్పఱచిరి; రాజును రాణులు నతని నెల్లపుడు సేవించుచుండిరి. మఱల విధేయతతో వారు గురుచరణములకు నమస్కరించిరి.

దోహా 399

రాజును, మువ్వురుభార్యలును, నల్వురువధూవరులును, గురుచరణారవిందములకు నమస్కరించిరి; అతఁడు వారిని దీవించెను.

చౌపాయ్

హృదయము సంతోషముచే నుప్పొంగుచుండ, రాజు బహుప్రసన్నుఁడై, కుమారులను, యావద్రాజ్యమును వసిష్ఠునధీనముఁ జేసెను. యథావిధిగ వసిష్ఠుని రాజు సత్కరించెను; ఉచితముగువానిని గురువు గ్రహించి, రాజును దీవించెను; శ్రీసీతారాములను ధ్యానించుచు, నతఁడు పరమానందభరితుఁడై, స్వాశ్రమమున కభిముఖుఁ డయ్యెను. రాజు బ్రాహ్మణులఁ బిలిపించి, వారికిఁ దృప్తిగ ధనధాన్యాదుల నిచ్చెను. రాజాజ్ఞప్రకారము సువాసినులు వచ్చిరి; వారిని యథోచితముగ రాజు సత్కరించెను; పట్టణములోని సామంతులను గృహస్థులను యథావిధిగ సన్మానించి, వారికిఁ దగినకట్నముల నిచ్చెను;

ఎంతతక్కువయోగ్యతఁ గలవారైనను రాజువలన సన్మానింపఁబడిరి. అనంతరము, రాజసన్మానులును, రాజసన్ముఖస్థులును, రాజువలన విశేషముగఁ గట్నముల నందుకొనిరి. శ్రీరాముని వివాహమంగళోత్సవమును దేవతలు చూచి, ముదముపొంది, పుష్పములను వర్షించిరి; ఆయుత్సవమును వా రనేకవిధములఁ గొనియాడిరి.

దోహా 400

వారు దేవదుందుభులను మ్రోఁగించిరి; శ్రీరామచంద్రునిప్రభావమును ముచ్చటించుచు, వారు వారివారిలోకములకు నిష్క్రమించిరి; వారియానందము పొంగిపడుచుండెను.

చౌపాయి

అన్నివిధముల రాజు జనులను సన్మానించెను; రాజు మొదలు రెడ్డినఱుకుఁ గలవారందఱు లోపములేకుండ సత్కరింపఁబడిరి; రాజుమనస్సునకు సంతోషముకలిగెను రాజు రాణివాసములోనికి వెళ్లి, నల్వురుకొడుకులను కోడండ్రఁ జూచి, వారినిఁ దనతొడమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని, వారిని గుండెలకప్పళించుకొనెను. ఆసమయమున నతఁడు పొందినయానందముఁ జెప్పుట కెవరుసమర్థులు ? అతఁడు కోడండ్రను తొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని, ముద్దులాడెను. ఈవిధమున నానాలుగుజంటలను రాజు ముద్దులాడుటఁ జూచి, రాణివాసపుస్త్రీలు గుంపులుగుంపులుగ వచ్చి సంతోషించిరి; వారందఱుఁ బ్రసన్నులయిరి; పూసఁగ్రుచ్చినట్లు వివాహకథనంతయు రాజు చెప్పుచుండెను; ఆకథను వారు వినివిని, ప్రసన్నులయిరి. జనకచక్రవర్తియొక్కగుణములను, యోగ్యతను, విధేయతను, నాదరణమును, సంపదలను, మర్యాదలను - ఈమొదలగువానిని రాజు స్మరించి, జనకుని స్తుతించెను; ఈవృత్తాంతమంతయు రాణులు విని సంతోషించిరి.

దోహా 401

అంతట, రాజు కుమారులతోఁగూడి మజ్జనమాడెను; రాజబంధువులఁ బిలిచి, షడ్రసోపేతముగ, రాజు వారికి విందుభోజనముఁ బెట్టెను. అంతలో నయిదుఘడియలరాత్రి గతించెను.

చౌపాయ్

భోజనానంతరము, రాజబంధువులతో రాజు సభామండపములోఁ గూర్చుండెను; సువాసినులు వచ్చి, పాటలఁ బాడిరి; ఆరాత్రి వారు సుఖముగఁ గడపిరి; రాజబంధువులకు సుగంధపానీయముల నిచ్చెను; వారిశరీరములకుఁ బరిమళగంధముల నలఁది, వారికి నాగవల్లీదళముల తోను, పూగీఫలములతోను, ముక్తాచూర్ణముతోఁ గూడినతాంబూలములను సమర్పించెను. వారు శ్రీరామునిదర్శించి, మహారాజుగారి యాజ్ఞఁగైకొని, స్వగృహములకు వెళ్లిరి; అంతలో, నయిదుఘడియల రాత్రిగడచెను. వారు రాజునకు నమస్కరించి, నిష్క్రమించిరి. ఆరాజమండలియొక్క మర్యాదలు, ఘనతయు, వినయవిధేయతలు, సంతోషాతిశయములు, సొగసు-ఈమొదలగువానిని వేదములును, సరస్వతియు, శేషుఁడునయితము యథార్థముగ వర్ణింప సమర్థులుకారు. వేదమును, బ్రహ్మయు, గణపతియు, వానిని న్యాయముగ వ్రాయుటకు నిపుణులుకారు. వర్ణించుటకుఁగాని వ్రాయుటకుఁగాని, నేనెంతవాఁడను? భూమిమీఁద నివసించి, తలలెత్తుచుండిన పాములన్నియు భూభారమును వహింపఁగలవా? యథాన్యాయముగ వారలను రాజు సన్మానించెను; పిమ్మట రాణులఁ బిలిచి, రాజు వారితో నిట్లు మృదువుగ సంభాషించెను. "ఓప్రియలారా! మీకోడండ్రు చిన్నపిల్లలు; పరులగృహమునుండి వచ్చిరి; పరులబిడ్డలు; కన్నులను రెప్పలవలె, వారిని మీరు కాపాడవలెను.

దోహా 402

"వారు ప్రయాణముయొక్కబడలికచే నలసిరి; వారికి నిదుర వచ్చుచున్నది; కనుక, వారిని మీరు శయనగృహములకుఁ బంపి నిదురఁ బుచ్చుఁడు"; అని యీప్రకారము రాజు వారితోఁ జెప్పి, శ్రీరాముని చరణములను ధ్యానించుచు, శయనగృహమునకు వెళ్లి, శయనించెను.

చౌపాయ్

మహారాజుగారి యాజ్ఞాప్రకారము వారు (రాణులు) శయనగృహము నలంకరించిరి. రత్నఖచితమగు సువర్ణమంచము; హంసతూలికాతల్పములు; పాలనురుగుతో సమానమగు తెల్లని మృదువగు దుప్పటములును; మృదువగు తలదిండ్లును; ముత్యాలతోరణములు; నిలువు

టద్దములు; కుంకుమాగరు కస్తూరి ధూపములు; రత్నదీపములు; బంగారుజల్తారుబుటాలతో నల్లికచేయఁబడిన 'ఛాందిని'యు; దానినుండి వ్రేలుచుండిన నాగమణులును, మణిదీపములును;—ఇంతచక్కని శయనగృహమును వర్ణించుట కష్టము; దానిం జూచియుండనివారు, దానిచక్కఁదనము-నూహింపలేరు; ఈశయనగృహములో హంసతూలికాతల్పముపై, రాముని వారు పరుండఁబెట్టిరి; "ఓయీతమ్ములారా! మీరు మీమీశయనగృహములకుఁ బోయి శయనింపుఁడు" అని రాముఁడు తమ్ముల కాజ్ఞాపించెను. కోమలమగు మేఘశ్యామునిశరీరమును తల్లులు చూచి, యతనిని ముద్దులాడి, సంతోషముతో నిట్లు ప్రసంగించిరి. "ఓనాయనా! కన్నతండ్రీ! ఇంతగారాబుబిడ్డఁడవుకదా మార్గములో నెట్లు తాటకను వధించితివి?

దోహా 402

"ఓచిట్టితండ్రీ! ఆరాక్షసులు కఠినులుకదా! మనుజులనిన, వారికి లక్ష్యములేదే? ఆదుర్మార్గులు, మారీచసుబాహువుఁను, వారిసైన్యములతో, నెట్లు సంహరించితివి?

చౌపాయ్

"ఓతండ్రీ! ఆవిశ్వామిత్రుని కటాక్షమువలన మిమ్ములను భగవంతుఁడు కష్టములనుండి తప్పించెనని నానమ్మకము; అందుచేతనే, మీరిరువురు యజ్ఞమును సంరక్షింపఁగలిగిరి; మిమ్ముల నతఁడు కటాక్షించి, మీకు విద్యల నుపదేశించెను. నీపాదరజము సోకినమాత్రమున, మునిపత్ని తరించెను. లోకమంతయు నీప్రభావముతో నిండెను; ఓనాయనా! కమఠపీఠమువలెను, వజ్రమువలెను, కఠోరముగనుండిన శివుని విల్లును, రాచమండలిలో నీవు విఱిచితివికదా! నీకీర్తి మూఁడులోకములకు వ్యాపించెను; నీవిజయము దిక్కులునిండెను; నీవు సీతను వివాహమాడి, తమ్ములతోవచ్చి, స్వగృహములోఁ బ్రవేశించితివి. అమానుషచర్యలను నీవు చేసియుంటివి; నీవు బాగుపడుటకు విశ్వామిత్రుని కృపయే కారణము; ఓనాయనా! ఓతండ్రీ! చంద్రబింబమువంటి నీముఖముఁ జూచినందున, నాజన్మము నేఁడు సఫలమయ్యెను; ఓనారాజా! ఇదివరలో నెన్నిదినములో, నీముఖముఁ జూడకయే, మేము గడపియుంటిమి; ఆదినములను మాఆయుస్సులో భగవంతుఁడు చేర్పనియె

డల, మఱికొన్ని దినములు నిన్నుఁ జూచుచు, మేము జీవించియుండఁ గలముకదా!" అని తల్లులు పలికి, తమవాత్సల్యమును జూపించిరి.

దోహా 403

వినయవిధేయతలతో నతఁడు ముప్పురుతల్లులతోఁ బ్రసంగించి, వారిని సంతోషపెట్టెను. అనంతరము వారు శయనగృహములలోఁ బ్రవేశించిరి; రాముఁడు, సాంబశివుని, గురువును, బ్రాహ్మణులను స్మరించి, మానసికముగ వారిచరణములకు నమస్కరించి, శయనించెను.

చౌపాయీ

సాయంసమయమున ముకుళించుకొనుచుండిన యెఱ్ఱతామరపువ్వువలె, నిద్రలోనుండిన రామునిముఖము శోభించెను. ఆరాత్రి, వివాహమహోత్సవము పేరుబెట్టి నగరములోని స్త్రీపురుషులు జాగరముఁజేసిరి; ఒకరితోనొకరు సరససల్లాపముల నాడుచుండిరి. ఆసమయమున నానగరముయొక్క శోభ; లేక, ఆనగరములో నాఁటిరాత్రిశోభ ధగద్ధగాయమానముగ నుండెను. "ఓసఖులారా! నగరముయొక్క శోభఁ జూడుఁడు!" అని రాణులు సఖులతోఁ బలికిరి. సర్పము తన శిరోభూషణమును గుండెలకద్దుకొని నిద్రించువిధమున, నాముప్పురత్తలుఁ దమకొడుండ్రను హృదయముల కప్పళించుకొని, శయనించిరి. తామ్రచూడుఁడు తారస్వనముతో నరుణోదయకాలమును సూచించెను; ఆవెంటనే, శ్రీరాముఁడు మేల్కాంచెను. వందిమాగధులు వచ్చి రాముని గుణములను గానముఁజేసిరి; అతనిదర్శనార్థము పురజనులు వచ్చి, సింహద్వారమునద్దఁ గాచుకొనియుండిరి. బ్రాహ్మణులకును, దేవతలకును, గురువునకును, జననీజనకులకును, నల్వురన్నదమ్ములు నమస్కరించిరి; వారిని వారు దీవించిరి. ఆముప్పురుతల్లులు కుమారులముఖములఁ జూచి సంతసించిరి; తర్వాత, వారు తండ్రితోఁగూడి ద్వారమువద్దకు వచ్చి, తండ్రివెనుక నిలువఁబడిరి.

దోహా 404

ఆనల్వురన్నదమ్ములు సరయూనదిలోఁ గ్రుంకులిడి, ప్రాతఃకాలసంధ్యావందనాదికర్మల ననుష్ఠించి, శుచిర్భూతులై, నిర్మలహృదయములతో, జనకునివద్దకు వచ్చిరి.

చౌపాయ్

రాజు వారిం జూచి, సంతోషించి, వారిని గుండెల కప్పలించుకొనెను. రాజుగారి యాజ్ఞప్రకారము, వారు యథోచితాసనముల నధిష్ఠించిరి; శ్రీరామచంద్రుని సభికులు చూచి సంతోషించిరి; శ్రీరాముని సందర్శించుటవలనఁ గలిగిన నేత్రోత్సవమున కంతముకలుగునేమో యని యనుమానించిరి. పిమ్మట, విశ్వామిత్రుఁడును వసిష్ఠుఁడును సభలోనికి వచ్చిరి. రాజు వారిని సుఖాసీనులఁజేసెను. నల్వురుకుమారులతోఁ గలసి రాజు వారిని బూజించి, వారిచరణములకు నమస్కరించెను. ఆమునీశ్వరు లిరువురు రామునిఁ జూచి ప్రసన్నులయిరి. వసిష్ఠుఁడు ధర్మశాస్త్రకథలను జెప్పనారంభించెను; ఆకథలను రాజును రాణులును సావధానముగ నాలకించిరి. మునీశ్వరులకుసయిత మగమ్యము విశ్వామిత్రునిచరిత్రమును, అతఁడు బ్రహ్మత్వముఁ బొందినవిధమును, సాంతముగ వసిష్ఠుఁడు వారికిఁ జెప్పెను. "ఓరాజా! ఇదియంతయు సత్యము; విశ్వామిత్రునికీర్తి త్రిలోకప్రసిద్ధము" అని వామదేవుఁడనుఋషి పలికెను. విశ్వామిత్రునిచరిత్రమును సభికులు విని సంతోషించిరి; రామలక్ష్మణులు మాత్రము గురువుగారిప్రభావమును విని, పరమానందభరితులయిరి.

దోహా 405

ఈప్రకారము, నిత్యకల్యాణము, పచ్చతోరణములతో దినములు గతించెను. అయోధ్యాపట్టణము ప్రతిదినము నూతనోత్సవములచే నుక్కిరిబిక్కిరియగుచుండెను.

చౌపాయ్

అంతట నొకశుభదినమున శుభముహూర్తమున వారు పెండ్లికంకణములను విప్పిరి; ఆదినమున గొప్పయుత్సవము జరగెను. అయోధ్యానగరములో నిత్యము నూతనోత్సవములు జరగుచుండుట దేవతలు చూచి పరమానందభరితులయిరి; అవధపురిలో జననముకలుగునట్లు ప్రసాదింపుమని వారు బ్రహ్మదేవునిఁ బ్రార్థించిరి. విశ్వామిత్రుఁడు ప్రతిదినము ప్రయాణమగుచుండెను; కాని, శ్రీరాము లతనిని వినయతతోఁ బ్రార్థించినందున నతఁడు శిష్యునిమాటను ద్రోసివేయలేక, నిలిచియుండెను; అనేకవిధముల నతనిని రాజు నిత్యము సన్మానించుచుం

డెను; రాజసన్మానముల నంగీకరించి, రాజు నతఁడు స్తుతించెను. ప్రయాణమున కతఁడు సిద్ధమగుట రాజు చూచి, కుమారులతో నతనియెదుట నిలువఁబడి, చేతుల జోడించుకొని, "ఓమునిరాజా! ఈసంపదయంతయు మీయధీనము; నేను, నాకుమారులు, నా భార్యలు, నాకోడండ్రు-మేమందఱము నీ సేవకులము; ఈబాలురను మీరెల్లపుడు జ్ఞాపకముంచుకొనుఁడు; మీదర్శనము లభించునట్లు ప్రసాదింపుఁడు," అని ప్రార్థించెను. రాజును, రాజకుమారులును, రాజుభార్యలును, విశ్వామిత్రుని పాదములపైఁబడి నమస్కరించిరి; వారిముఖమునుండి, యొకమాట వెడలలేదు. విశ్వామిత్రుఁడు వారి వినయమునకు సంతసించి, వారిని దీవించెను. అతఁడు ప్రయాణమును సాగించెను; ఆసమయమున, వారి యన్యోన్యానురాగముఁ జూచి తీరవలెనుగాని, దానిం జెప్పుటకు శక్యముకాదు. తమ్ములతోఁ గూడి శ్రీరాముఁడు విశ్వామిత్రుని సాగనంపుటకు వెళ్లెను; అతనియాజ్ఞఁబొంది, వారు స్వగృహమునకు మరలి వచ్చిరి.

దోహా 406

శ్రీరాముని రూపమును, దశరథుని భక్తియు, వివాహోత్సవ సంబరమును, మునీశ్వరుఁడు తనలోఁదాను స్మరించి, స్తోత్రముఁజేయుచు, మార్గమున నడచివెళ్లెను.

చౌపాయ్

వామదేవుఁడును వసిష్ఠుఁడును మఱల గాధేయుని చరిత్రమును వర్ణించి చెప్పిరి; విశ్వామిత్రుని తపఃప్రభావమును రాజు విని, "ఆహా! నేనెంతపుణ్యాత్ముఁడను! ఏమినాభాగ్యము! ఆమహాత్ముఁడు నాగృహమునకు వచ్చి, దానిని పవిత్రముఁజేసెను; నేను ధన్యుఁడను; నాజన్మము సఫలమయ్యెను" అని తనలోఁ దాను చింతించెను. ఎవరిగృహములకు వారు వెళ్లుటకు, రాజు వారికి సెలవునిచ్చెను; వారు విసర్జించిన తరువాత, నతఁడు కుమారులతోఁగూడి, యంతఃపురములోనికి వెళ్లెను; అంతటను శ్రీరాముని వివాహోత్సవమును గుఱించియే జనులు ముచ్చటించుచుండిరి; శ్రీరాముని నిర్మలప్రభావము మూఁడులోకములలో వ్యాపించెను. ఇంతకుముందు మిథిలానగరములలో నివసించుచుండినయానందమంతయు, నేఁడు శ్రీసీతారాముల వివాహానంతరమున,

నవధ(అయోధ్యా)పురములో నివసింపఁజొచ్చెను. శ్రీసీతారాముల వివాహమహోత్సవసంబరమును పూర్తిగ వర్ణించిచెప్పుటకు శేషునకు గాని సరస్వతికిగాని సామర్థ్యము లేదు. శ్రీసీతారాముల పవిత్రచరిత్రము కవికులమున కాధారమనియు, వారిసత్కీర్తి సకలమంగళములకు ఖనియనియు, కవీశ్వరులకు జీవనాధారమనియు, నేను తెలిసికొని, నావాక్కులను పవిత్రముఁ జేయఁగోరి, నాబుద్ధికిఁ దోఁచినవిధమున గొంచెముకొంచెము, వారిచరిత్రమును వర్ణించితిని. (పార్వతి నాల్గవప్రశ్నకుఁ బ్రత్యుత్తరము.)

ఛాంద్ 62

తులసీదాసు, తనవాక్కులను పవిత్రముఁ జేసికొనుటకు శ్రీసీతారాములచరిత్రమును వర్ణించెను; శ్రీరామునిచరిత్ర మపారము; ఏ కవీశ్వరుఁడు దానినిఁ దుదముట్టఁ జెప్పఁగలఁడు? శ్రీసీతారాముల వివాహోత్సవఘట్టము నేపురుషుఁ డెల్లపుడు పఠించునో, గానముఁ జేయునో, ఆలకించునో, వాఁడు శ్రీసీతారాముల కటాక్షమునకుఁ బాత్రులై శాశ్వతసుఖముల ననుభవింపఁగలరు.

సోరఠా 39

శ్రీసీతారాముల వివాహఘట్టము నేపురుషుఁడు సదా పఠించునో, గానముఁ జేయునో, ఆలకించునో, చెప్పునో, వాఁడు నిత్యోత్సవముల ననుభవించును; శ్రీరామునిచరిత్రముఁ సకలమంగళములకు స్థానముకదా!

ఇతి శ్రీగోస్వామి తులసీకృత శ్రీరామచరిత్రమానసే,
సకలకలికలుషవిధ్వంసనే, బాలకాండే
పండితజ్వాలాప్రసాదకృత వ్యాఖ్యానుసారే
శ్రీశ్రీనివాసశర్మకృత ఆంధ్రభాషాయాం
ఏకాదశోవిశ్రామః.

బాలకాండము సమాప్తము.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1926.

శ్రీ మద్గోస్వామి

# తులసీదాసకృతరామాయణము

# అయోధ్యాకాండము.



## ప్రథమవిశ్రామః.

శ్లో. యస్యాం కేచవిభాతి భూధరసుతా దేవాపగా మస్తకే
ఫాలే బాలవిధుర్గళే చ గరళం యస్యోరసి వ్యాళరాట్,
సోయం భూతివిభూషణః సురవరః సర్వాధిపః సర్వదా
శర్వః సర్వగతః శివః శశినిభః శ్రీశంకరః పాతు మామ్. 1

శ్లో. ప్రసన్నతాం యానగతాభిషేకతః
తథా న మమ్లౌ వనవాసదుఃఖతః,
ముఖాంబుజశ్రీరఘునందనస్య మే
సదాస్తు సా మంజులమంగళప్రదా. 2

శ్లో. నీలాంబుజశ్యామలకోమలాంగం
సీతాసమారోపితవామభాగం,
పాణౌ మహాసాయకచారుచాపం
నమామి రామం రఘువంశనాథమ్. 3

### దోహా 1

శ్రీ సద్గురుచరణారవిందములకు నమస్కరించి, వారిపాదరజమును ధరించుటవలన నామనస్సు నిర్మలమై అద్దమువలెఁ బ్రకాశించుచున్నది; చతుర్విధపురుషార్థములఁ గలిగించు శ్రీరామచరిత్రమును జెప్పుటకు నాకు సామర్థ్యము కలిగెను; ఆకథను నే నిప్పుడు వర్ణించుచున్నాను.—

చౌపాయ్ 1

శ్రీరామచంద్రుడు సీతను వివాహమాడి స్వగృహములోఁ ప్రవేశించిన దినము మొదలు, నిత్యము క్రొత్తక్రొత్తయుత్సవములు జరగుచుండెను; నిత్యకల్యాణములు, పచ్చతోరణములతో దినములు గడచుచుండెను. పదునాలుగుభువనములే గొప్పపర్వతములు; త్రిభువనములలో నివసించు మహాత్ములు మేఘములు; ఆమేఘములే సుఖమను నట్టిజలమును వర్షించును. శ్రీరాముడు నివసించియుండునగరమే క్షీరసాగరము; పర్వతములపైఁబడినజలము నదులలోనికిఁ బ్రవహించును; అప్పుడు నదు లుప్పొంగును; వృద్ధి, సిద్ధి, సంపత్తు ఈమొదలగునదు లుప్పొంగి, అయోధ్యానగర మనునట్టిసముద్రములోఁ గలయుచుండును. సముద్రములో మణులుండును; ఆనగరములో స్త్రీపురుషులు మణిపూసలు; సముద్రములోనిమణులకు దోషము లుండవచ్చును; కాని, ఆపట్టణములోని స్త్రీపురుషులు దోషములులేని మణులవంటివారు. వారు సత్కులశ్రేష్ఠులు; నిర్మలులు; సుందరులు. ఆనగరముయొక్క సిరిసంపదలను లేశమైనను వర్ణించుటకు శక్యముకాదు. ఈనగరమే బ్రహ్మసృష్టిలో మణిపూసవంటిది; శ్రీరామచంద్రునిఁ జూచి, నాగరికులు పరమానందముఁ బొందిరి; వారిమనోరథము లనునట్టి లత ఫలించెనని తలఁచి, ముప్వురు తల్లులును, సఖులును సంతసించిరి. రాముని రూపరేఖావిలాసములను, సుశీలమును, సుగుణములను, స్వభావమును దశరథుఁడు చూచి సంతోషించెను.

దోహా 2

సకలజనులహృదయములలో నొకయభిలాష పుట్టెను; దశరథమహారాజు స్వయము శ్రీరాముని యువరాజుగ నియమించుట యుచితముగ నుండునని, వారు తలఁచి శ్రీశివునిఁ బ్రార్థించిరి.

అధికపాఠము:— దోహా 3, 4, 5, 6, 7, 8.

(ఒకరోజున విశ్వావసుఁడను గంధర్వుఁడు రాజనగరునకువచ్చి గానముఁజేసెను; అప్పుడు రాజు మొదలగువారు ప్రసన్నులై, ఆగంధర్వుని నగరులో నివసింపుమని ప్రార్థించిరి. "ఓరాజా! ఇంద్రుని యనుజ్ఞలేక, నే నిచట నివసించుట యుచితముకాదు" అని విశ్వావసుఁడు

పలికెను. "ఓహో! ఇంద్రుడు మాబలముఁ బురస్కరించుకొనియే స్వర్గములో నుండఁగలిగెను" అని కైకేయి ప్రగల్భములు పలుకుచు, "ఏమి! ఇంద్రుడు మామాటకుఁ గోపించునా!" అని దురభిమానముతో నామె పలికి, యొకయుత్తరమును వ్రాసి, ఇంద్రున కందజేయు మనిచెప్పి గంధర్వునిచేతి కిచ్చెను. ఆమె పలికినపలుకుల నతఁడు దేవేంద్రునితోఁ జెప్పెను; ఆమాటలను వినినందున, నింద్రుడు కోపించెను. "ఈకైకేయి నన్నింతఁ దృణీకరించునా! ఇంతకర్ణకఠోరముగ నాపేర నుత్తరమును వ్రాయునా! బాపురే! సమయము రాకపోవునా! ఆమెకు జీడిమచ్చనుఁ దగిలింపక యుందునా!" అని ఇంద్రుడు తనలోఁ దాను చింతించి, "ఓయీ విశ్వావసుఁడా! ఈయుత్తరము నామె కందజేయుము; వారియాజ్ఞప్రకార మచ్చట నీవు నిలచియుండుము; వారి సెలవుఁ బుచ్చుకొని రమ్ము" అనియతనితోఁ జెప్పపంపెను. వివాహానంతరము శ్రీసీతారాములు పండ్రెండుసంవత్సరములు నగరములోసుఖముగ జీవించియుండిరి; సీతమ్మకు పదునెనిమిదిసంవత్సరములవయస్సు; శ్రీరామున కిరువదియేడు సంవత్సరముల ప్రాయము; అప్పుడు వారు దేవకార్యమును సాధించుటకుఁ దలంచిరి.

## చాపాయ్ 2

అయోధ్యాపురవాసు లానల్వురన్నదమ్ములం జూచి, సంతోషించుచుండిరి; ఒకరోజున శ్రీరామమూర్తి సింహాసనము నధిష్ఠించియుండెను. అతనిప్రక్కను సీతకూర్చుండెను. శ్రీరామునిభుజములు దీర్ఘములు; వక్షస్థలము విశాలము; నేత్రములు వికసించిన పద్మములు; శరీరము శ్యామలము; అతఁడు పీతాంబరమును ధరించియుండెను; అతని దివ్యమంగళవిగ్రహముఁ జూచి, కోటిమన్మథులు సహితము మోహించుచుండిరి; చామరమును సీత వీచుచుండెను. దేవకార్యార్థము బ్రహ్మదేవుఁడు పంపినందున, నాసమయమున నారదుఁడు వచ్చెను. ఆ దేవముని మహాతేజశ్శాలి; భక్తిరసపూర్ణుఁడై, వీణెను మీటించుకొనుచు, హరికీర్తనలఁ బాడుచు, నారదుఁడు ప్రత్యక్షమయ్యెను. శ్రీరాముఁడు సింహాసనమునుండి దిగ్గున లేచి, నారదునకు సాష్టాంగదండప్రణామముఁ జేసి, నమస్కరించి, మునీశ్వరునిఁ

గౌఁగిలించుకొనెను. శ్రీరాముఁడు స్వయముసింహాసనముఁ దీసికొనివచ్చి, నారదునిఁ గూర్చుండఁబెట్టెను. అంతట, సీత సువర్ణకలశముతో జలముఁదీసికొనివచ్చి, యతనిపాదములఁ గడిగెను. ఆమునీశ్వరుని పాదజలముతో గృహమును సంప్రోక్షించిరి; జగత్పావనుఁడగు శ్రీరాముఁడాజలమును శిరముపై ధరించెను. "ఓమునిరాజా! ఈనాజీవుఁడు విషయములకుఁ వగులుకొనెను; ఈనాజీవునకు దేహాద్యభిమానములు బలమయ్యెను. కేవలము భగవంతుని కృపవలననే మీవంటిసత్పురుషుల దర్శనము లభించెను. ఓమునివర్యా! ఎవరిమీఁద సత్పురుషులకు నిర్హేతుకముగ కటాక్షమువచ్చునో, వారు తప్పక సంసారసాగరములోఁ బడియుండరు. ఓనారదమహర్షి! అందుచేత నేనదృష్టవంతుఁడను; నేనెంత తాపత్రయములఁ బడుచుండినను, మీదర్శనము లభించెను; నేను కృతార్థుఁడనయితిని; నాజన్మము సఫలమయ్యెను." అని రాముఁడు నుతించెను.

దోహా 9

శ్రీరాముని మృదుమధురవచనములను నారదుఁడు విని, విచారించి, ధైర్యము నవలంబించి "ఓరాజాధిరాజ! నీవు పరమదయాళుఁడవు; లోకములకు హితకారివి; అందుచేత నెందుకు నీవిట్లు పలుకకయుండఁగలవు?" అని సావధానముగఁ జెప్పి, పునః యిట్లు ప్రసంగించెను.

చౌపాయ్ 3

"ఓరామా! నీకృపవలననే నీమహిమను గొంచెముకొంచెము తెలిసికొంటిని; సాధారణమనుజునివలె నీవు ప్రసంగించినంతమాత్రమున నీకు లోపములేదు; నీ సేవకులను నీవు గౌరవించినందున, నీకు లోపము కలుగదు; అందువలన నీకు గొప్పతనమువచ్చును. స్వభావముచే నీవు దీనరక్షకుఁడవు; నీభక్తుల నుద్ధరించుటకు నీవు నరరూపమును ధరించి, యవతరించితివి. మాయ నీకు వశ్యమై యుండును; వాక్కులకును, మనస్సునకును, బుద్ధికిని నీవు పరుఁడవు; అజేయుఁడనుపేరు నీకు గలదు; కాని, నిన్ను నీభక్తులే జయించుచున్నారు. నీవు సర్వసముఁడవు; సర్వవ్యాపకుఁడవు; శాశ్వతుఁడవు; అనంతుఁడవు; నీవంటిప్రతాపముగల ప్రభువు మఱియొకఁడు లేఁడు. చరాచరజంతుజాలముతోఁ గూడిన

బ్రహ్మాండములను కుదురుగ నీబొజ్జలో దాచుకొని, వటపత్రముపై శయనించెదవు; అట్టి మహనీయుఁడవగు నీవు నేడు పాలకొఱకు బాలునివలె రోదనముఁ జేయుట నీచిద్విలాసము గాని మఱియొకటి కాదు. ఓనాథా! నామము, రూపము, భేదము, దేహము, వర్ణము-ఈమొదలగునవి నీకు లేవు; నీకు గతిలేదు; కాలరహితుఁడవు; 'న ఇతి, న ఇతి' అని వర్ణించి, వేదములు నిన్ను గుఱించి చెప్పెను. నీకు మమకారము లేదు; ముక్తస్వరూపుఁడవు; సకలకల్యాణభాజనుఁడవు; అట్టి నీవు నేఁడు దశరథునకుఁ గుమారుఁడవై జన్మించితివి. జపములు, తపములు, వ్రతములు, దానములు, యజ్ఞాదిక్రతువులు, యోగములు, జ్ఞానవిజ్ఞానవైరాగ్యములు-ఈమొదలగుసాధనములచే ననేకయత్నములఁ జేసి యే నీరూపమును మునులు దర్శించెదరో, ఆ నీరూపమును భక్తులకుఁ బరవశుఁడవై, వారికి నీవు చూపించెదవు; ఆ నీరూపముఁ గన్నులారఁ జూడు భాగ్యము నేఁడు నాకుఁ గలిగెను. భక్తినివిడిచిపెట్టి, తదితరప్రయత్నములనేకములఁ జేసినను, జీవులు సంసారసాగరమును దాఁటుట దుర్లభము.

దోహా 10

"ఓనాథా! నీకటాక్షమువలన నీసగుణనిర్గుణరూపములఁ దెలిసికొనుటకు సామర్థ్యము కలిగెను; నాహృదయకమలములో నీ సగుణరూపము తుమ్మెదవలె, సదా నివసించునట్లు ప్రసాదింపుము.

చౌపాయి 4

"ఓకృపాసముద్రుఁడా! ఇంతకాలము నీగుణములను గానముఁ జేయుచు, బ్రహ్మలోకములో నివసించియుంటిని. నీ చరణకమలములఁ జూచి శేషదినములు గడింపెనని విచారించి, నిన్ను దర్శించుటకు బయలువెడలితిని; ఈశ్వరుఁడవు; నీవు సర్వవ్యాపకుఁడవు; అయినను, నీ సగుణరూపముఁ జూచుటకు నా కభిలాషకలిగెను. అయోధ్యానగరమునకు నేను ప్రయాణమగుట బ్రహ్మదేవుఁడు చూచి, నీతో నొకసంగతిని విన్నపముఁ జేయుమని నాతో రహస్యముగఁ జెప్పెను. నీవు సర్వాంతర్యామివి; సర్వజ్ఞుఁడవు; భక్తవత్సలుఁడవు; కనుక, నావిన్నపముఁ గైకొనుము; భక్తులయందుగల తాత్పర్యముచేత, నీవు నరరూపమును ధరించి యవతరించితివి. ఓనాథా! అందుకుఁ దగినప్రయత్న

ముఁ జేయుము.” అని నారదుఁడు పలువిధముల రాముని నుతించి, అవతారకారణమును విన్నవించెను. శ్రీరాముఁడు మునిమాటలను విని చిఱునవ్వునవ్వి, “ఓస్వామీ! ఇప్పుడుకూడ బ్రహ్మకు భయమే? వారి వచనములను గ్రహించితిని; ఇంతలోనే వారిదర్శనముఁ జేయువాఁడనని చెప్పుఁడు” అని పలికెను. అనేకపర్యాయములు నారదుఁడు శ్రీరామునకు నమస్కరించుచు, బ్రహ్మానందభరితుఁడై రామునిరూపమును ధ్యానించుచు, రాముని గుణములను గానముఁ జేయుచు, బ్రహ్మలోకమునకు నిష్క్రమించెను. అనంతరము, శ్రీరాముఁడు, తమయవతారమునకుఁ గారణమును, రావణుని వృత్తాంతమును సీతతోఁ జెప్పెను. “ఓజానకీ! దేవకార్యమును సాధించుటకుఁ దగినయుపాయముఁజూడవలెను. రాజ్యమునువిడిచి, మనము వనములకుఁ బోవలెను” అని రాముఁడు సీతకు బోధించెను.

దోహా 11

ఏ పరమేశ్వరుని భ్రుకుటీవిలాసముచే జగముల సృష్టిస్థితిసంహారములు జరుగుచుండునో, ఆరామచంద్రుఁడు రాక్షసుల నెట్లు సంహరింపఁ గలనని విచారించెను. అధికపాఠము సమాప్తము.)

చౌపాయ్ 5

ఒకసమయమున హజారములో రాజాధిరాజగుదశరథమహారాజు సింహాసనము నధిష్ఠించియుండెను; ఆ మహారాజు సకలపుణ్యస్వరూపుఁడు. అతనిసుకృతములు ఫలించి రాముఁడై పుట్టెను. అతనికీర్తి మూఁడు లోకములలో వ్యాపించెను. అతని సచ్చరిత్రములను వినినయెడల, మనస్సున కధికసంతోషము కలుగును. రాజులు జోహారనుచు, నతనికటాక్షమునకు నిరీక్షించుచుండిరి. ఇంద్రాది దిక్పతులుసహితము పొంచుండి దశరథునిచిత్తముఁ గనిపెట్టి యతనిచిద్విలాసము ననుసరించి మెలంగుచుండిరి. త్రిలోకములలో దశరథునివంటిమహారాజు గతములోఁ బుట్టియుండలేదు; ప్రస్తుతము పుట్టియుండలేదు; ఇకముందైనను బుట్టబోఁడు. సర్వమంగళములకు నిధానమగు రాముఁడే యతనికిఁ గుమారుఁడు కదా! అతనివిషయమై యేమిచెప్పినను, స్వల్పముగఁ గనఁబడును. అప్పుడు దశరథుఁడు దర్పణముఁ బట్టుకొని, దానిలోఁ దనముఖముఁ జూచు

కొని శిరముపై నుండిన కిరీటమును సవరించుకొనెను. "ఓ రాజా! రాముని కుఁ బట్టముఁగట్టి, నీజన్మము నేల సఫలముఁ జేసికొనవు" అని వృద్ధాప్యమువచ్చి యుపదేశించువిధమున నతనిచెవిమీఁద నొకతెల్లనివెంట్రుక లేచెను.

దోహా 12

ఈప్రకారము రాజు మనస్సులో నిశ్చయించి, పులకితశరీరుఁడై, ఆనందబాష్పములు కారుచుండ, నొకశుభదినమున, శుభముహూర్తమున గురువును సమీపించి, మనోభిప్రాయమును వారితో విన్నవించెను.

చౌపాయి 6

"ఓమునిరాజా! సావధానులై చిత్తగింపుఁడు; అన్నివిధముల శ్రీరామమూర్తి సకలకళాపూర్ణుఁ డయ్యెను. సేవకులును, మంత్రులును పురజనులును, నాశత్రువులును, స్నేహితులును, ఉదాసీనులును- ఈ మొదలగువారు రాముని నాకంటె నధికముగఁ బ్రేమించి, మీయాశీర్వచనములే, రాముఁడై పుట్టెనని చెప్పుచుండిరి. ఓస్వామీ! మీరు ప్రేమించిన విధమున నతనిని బ్రాహ్మణులందఱు ప్రేమించుచుండిరి. శ్రీగురుచరణారవిందరజమును శిరముపై ధరించినవారు సకలైశ్వర్యసంపన్నులు కాఁగలరు. ఓనాథా! నావంటి యదృష్టవంతుఁడు లేఁడు; పరమపవిత్రములగు మీచరణకమలముల రజమును ధరించినంతమాత్రమున నాకిట్టిసుఖములు లభించెను. నామనస్సులో నొకయభిలాష కలదు; మీయనుగ్రహమువలన నది సిద్ధించును" అని రాజు విన్నవించెను. అతని విన్నపములను వసిష్ఠుఁడువిని, సంతోషించి, "ఓరాజా! నీయభిలాషను వ్యక్తముఁ జేయుము" అనిపలికెను.

దోహా 13

"ఓరాజా! నీనామమువలనను, నీకీర్తివలననే నీకోరికలు సిద్ధించును; నీమనోభిలాషయే యొకరాజు; సేవకులు రాజునువలె, ఫలములు నీమనోభిలాష ననుసరించియుండును" అని వసిష్ఠుఁడు రాజును హెచ్చరించెను.

చౌపాయి 7

గురువుగారి రూపరేఖావిలాసములఁ బట్టియు, వాక్కులవలన

రణేఁబట్టి యతఁ డనుకూలముగనుండుట దశరథుఁడు గ్రహించి చిఱు నవ్వునవ్వుచు మృదుమధురవచనములతో "ఓనాథా! తమరుకటాక్షించి నయెడల, శ్రీరామమూర్తిని యువరాజుఁ జేయుటకుఁ దగినసన్నాహముఁ జేయువాఁడను. నాజీవితకాలములో నీయుత్సవము జరగినయెడల, సకల జనులకు నేత్రోత్సవముకలిగి వారు హర్షించెదరు. మీకటాక్షమువలన, నీశ్వరుఁడు నాకోరికలనీడేర్చెను; ఈయొక్కకోరికయే యవశిష్టము;ఇది సిద్ధించినయెడల, నాకు విచారముండదు; నేను జీవించినను, మృతినొంది నను నామనస్సు నిర్విచారముగ నుండును; ఈమనోతాపము నన్ను బాధింపదు" అని విన్నవించెను. అతనివచనములను వసిష్ఠుఁడు విని పర మానందభరితుఁడయ్యెను; "ఓరాజా! ఏపరమేశ్వరునియందు విముఖు లై జీవులుపరితపించెదరో, ఏలోకారాధ్యుని భజించినగాని, మనోతాప ములు శాంతింపవో, ఆ పరమపవిత్రుఁడగు ప్రభువే రాముఁడై నీగర్భ మునఁ బుట్టెనుగదా! నీవు సంతోషించుము; నీకుఁ బశ్చాత్తాప మేల! అందుకు సమయము కాదు.

దోహా 14

"ఓరాజా! విలంబనముఁ జేయకుము; ఉత్సవమునకుఁ దగినసన్నాహ ముఁజేయుము; శ్రీరాముని యువరాజుగ పట్టముఁ గట్టినదినమే సుది నము; ఆ యుత్సవమే యుత్సవము" అని గురువు పలికెను. (ఆశుభకా ర్యము శ్రీరామునియధీనముగాని, నీయధీనము కాదని వ్యంగ్యార్థము.)

చౌపాయ్ 8

సంతుష్టాంతరంగుఁడై రాజు నగరునకు వచ్చెను; అతఁడు మం త్రులకును సేవకులకును వర్తమానముఁ బంపెను; అతక్షణమే సుమం త్రుఁడు మొదలగువారు రాజువద్దకువచ్చి, జయజయశబ్దములఁ బలికి, నమస్కరించి, చేతులజోడించుకొని నిలువఁబడియుండిరి; ఆశుభవర్త మానమును రాజు సుమంత్రునితోఁ జెప్పెను. "ఓసుమంత్రుఁడా! శ్రీరా ముని యువరాజుగ పట్టముఁగట్టుమని గురువుగారీరోజున నామనస్సున కింపగుమాటఁ జెప్పిరి. ఈ శుభమునంగతి సభవారికి విన్నవించి, వారు సమ్మతించినయెడల నందుకుఁ దగినసన్నాహముఁ జేయుము" అని దశర థుఁడు శుభవర్తమానముఁ జెప్పెను. లేతవరిచేనుమీఁద వర్షము పడిన

యెడల నెట్లుండునో, దశరథుఁడు చెప్పిన శుభవర్తమాన మటులనే సుమంతుని మనోరథమును బుష్టి జేసెను. చేతుల మూర్ధమునకు నెత్తి సుమంతుఁడు వినయవిధేయతలతో "ఓనాథా! ఓలోకనాథా! ప్రభువులు చిరంజీవులగుదురుగాక; తమరు తలంచిన శుభకార్యము శుభప్రదము; సర్వజనసమ్మతము; కనుక విలంబముఁ జేయక, దానిని శీఘ్రము కొనసాగింపవలయును." అని విన్నవించెను. ఒక గొప్పవృక్షము నాశ్రయించిన లత యెంత వేగముగ నభివృద్ధినొందునో, సుమంతునియుత్సాహము రాజు నభిలాష నాశ్రయించి వర్ధిల్లెను.

దోహా 15

"ఓమంత్రివర్యా! గురువుగారియాజ్ఞఁ బురస్కరించుకొని, దాని ప్రకారము శ్రీరాముని యువరాజపట్టాభిషేకమహోత్సవమునకుఁ దగిన ప్రయత్నములఁ జేయుము; విలంబముఁ జేయకుము" అని రాజాజ్ఞాపించెను.

చౌపాయ్ 9

అంతట మునివర్యుఁడీప్రకార మాజ్ఞాపించెను. "సకలపుణ్యతీర్థజలములను, ఓషధులను ఫలములను, పుష్పములను, తమలపాకులను, తదితర సుగంధద్రవ్యములను, చామరములను, వ్యాఘ్రమృగములచర్మములను, చీని పీనాంబరములను, శాలువులను, పట్టువస్త్రములను, నవరత్నములను, నవధాన్యములను, సువర్ణభూషణములను—ఈ మొదలగునవి రామపట్టాభిషేకమునకుఁ దగినమంగళపదార్థముల నాయత్తముఁ జేయుఁడు" అని వసిష్ఠుఁడు మంత్రితోఁ జెప్పెను. "ఓసుమంతుఁడా! పటకుటీరములను నిలుపుము; ఫలభరితములగు రసాల, కదళీ; పూగవృక్షములను రాజమార్గములలో స్థాపింపుము; నగరము నలువైపులును తోరణములతోను పతాకములతోను ధ్వజములతో నలంకరింపుము; రాజవీధులను గజముక్తాఫలముల ముగ్గులతో సింగారింపుము; అంగడివీధులనలంకరింపుము; గణపతిపూజ, గురుబ్రాహ్మణసమారాధనయు, కులదేవతార్చనయు—ఈ మొదలగునవి జరుగవలయును" అని చేయవలసినపనులను గురువుసూచించెను; వేదములలో శతపథబ్రాహ్మణములోఁ జెప్పనవిధానము నతఁడు చెప్పెను.

దోహా 16

"చతురంగబలములను, సువర్ణపాత్రలను, తోరణములను, ధ్వజములను, పతాకములను సిద్ధముచేయుము" అని గురువాజ్ఞాపించెను. మునివచనముల ప్రకార మెవరిపనులను వారు శీఘ్రముగఁ జేయుట కారంభించిరి.

చౌపాయ్ 10

మునీశ్వరుని యాజ్ఞలను శిరసావహించి, యెవరిపనులను వార వలీలలో నెరవేర్చిరి; రాజు బ్రాహ్మణులను సత్కరించెను; సాధువులకు భిక్షఁ జేసెను; కులదేవతల నర్చించెను; రామునకు శుభముకలుగుటకుఁ దగినశుభకార్యముల నతఁడు నిర్వర్తించెను. శ్రీరాముని యువరాజపట్టాభిషేకమహోత్సవముసంగతి నగరమంతట వ్యాపించెను; స్త్రీపురుషులా బాలవృద్ధు లపరిమితానందభరితులయిరి; ఎటువైపు జూచినను మంగళధ్వనులువినఁబడెను. జానకికి వామాంగములును, రామునకు దక్షిణాంగములును గదలెను. (దీనిఫల మేమి? రావణుని వాలిని వధించినగాని, శ్రీరాముఁడు భూమండలమునకు రాజగుట దుర్లభము; అతఁడు వనవాసముఁ జేయుట మంగళము.) "నాదక్షిణాంగములు వణఁకుటకుఁ గారణ మేమి? ఏమిలాభము కలుగును? మేనమామలగృహమునకు భరతుఁడు వెళ్లియుండెను; అతఁడువెళ్లి విశేషదినములయ్యెను" మఱల నాతమ్మునిఁ జూచుటయేలాభము" అని శ్రీరాముఁడు తనలోఁదాను చింతించెను. భరతునికంటె నధికమగు ప్రియుఁడు మఱియొకఁడు లేడు; అతనిని జూచుటకంటె నాశకునమునకు మఱియొకఫల మేమియుండును? రాత్రింబగళ్లు భరతునిమీఁదనే శ్రీరాముని ధ్యానముండెను. కమఠము గ్రుడ్ల నిసుకలోనుంచి తానునీటిపైఁదేలియుండి, నదేకధ్యానముతో వానినిఁజూచు చుండును. అటులజూచుటవలన నవి పిల్లలగును.

దోహా 17

అంతలో మంగళధ్వనులు మ్రోఁగెను. పూర్ణచంద్రునిఁజూచి సముద్రుఁడుపొంగినవిధమున, నంతఃపురస్త్రీలు సంతోషముచేనుప్పొంగిరి.

చౌపాయ్

ప్రథమమున, నీశుభవర్తమానముఁ దీసికొని వచ్చినవారికి తల్లులుముప్వురు వస్త్రాద్యలంకారములను బహుమతి నిచ్చిరి. ఆముప్వురి

శరీరములు పులకరించెను. ఆమహోత్సవమునకుఁ దగనప్రయత్నముల నుత్సాహముతో వారు చేయుట కారంభించిరి. సుమిత్ర చిత్రవిచిత్ర మగుముగ్గులను మణులతోఁ బెట్టెను; కౌసల్యపరమానందభరితురాలై బ్రాహ్మణులఁ బిలిచి, వారికిదానముల నిచ్చెను; స్త్రీపురుషులు గ్రామదేవతలకును నాగులకుఁ బండుగ సేసిరి; బలులను ఉపహారములనిచ్చెదమని మ్రొక్కులను మ్రొక్కిరి. "ఓ దేవతలారా! శ్రీరామమూర్తికి శుభము కలుగునట్లు ప్రసాదింపుడు" అని కౌసల్య మ్రొక్కెను. చంద్రముఖులును, హరిణాక్షులును, కోకిలస్వరములతోఁ బాటలఁ బాడిరి.

దోహా 18

శ్రీరాముని యువరాజపట్టాభిషేకమహోత్సవమును గురించి స్త్రీపురుషులెల్లరు విని, పరమేశ్వరుని కటాక్షము వారియందుఁగలదని సంతోషించి, దానికిఁదగిన సన్నాహముఁ జేయ నారంభించిరి.

చౌపాయ్

అంతట దశరథుఁడు వసిష్ఠుఁబిలిచి, వారిచేశుభవర్తమానమును రామునకుఁ బంపెను. గురువుగారి యాగమనమును శ్రీరాముఁడు విని, వారికి నెదురుగ ద్వారమువద్దకు వచ్చి, వారిచరణములకు నమస్కరించెను; వారిని లోనికిఁ దీసికొనివెళ్లి షోడశోపచారములతోఁ బూజించెను; శ్రీజానకీరాములు గురుచరణారవిందములకు నమస్కరించిరి. "ఓస్వామీ! సేవకుని గృహమునకు శ్రీస్వాములవారు విజయముఁ జేయుటవలన, శుభమంగళములు సూచింపఁబడును; అమంగళములు నశించును. మీ యాజ్ఞకు బద్ధుఁడనుకదా! మీచిత్తముఁ దెలిపియుండినయెడల, మీకు శ్రమలేకయే నేను మీదర్శనమునకు వచ్చియుందును—శ్రీవారికటాక్షము ఇటుల నన్నుగౌరవించుట నాభాగ్యము; నాగృహము పవిత్రమయ్యెను. ఓనాథా! మీ యాజ్ఞలను శిరసావహించి నిర్వర్తించువాఁడను. స్వాములవారియాజ్ఞలను, చేతుల జోడించుకొని, పూనుకొనుట సేవకుల కుచితముకదా!" ఈప్రకారము శ్రీరామమూర్తి వినయవిధేయధర్మములతోఁ బలికెను.

దోహా 19

స్నేహవాత్సల్యములతోఁగూడిన శ్రీరాముని మృదుమధురమగు వచనములను గురువువిని, సంతోషించి, "ఓరామా! నీవు సూర్యవంశ

మునకు శిరోమణివి; ఎందుకు నీపలుకు లుచితముగ నుండవు!" అని పలికెను.

చౌపాయ్

అనేకవిధముల శ్రీరాముని సుగుణములను, సుశీలమును వసిష్ఠుఁడు కొనియాడెను; అతనిశరీరము పులకరించెను; అతనినేత్రము లానందబాష్పములతో నిండెను. "ఓరామా! నీతండ్రిగారు నిన్ను యువరాజుగఁ జేయఁదలంచిరి; అందుకుఁ దగినప్రయత్నములు చేయఁబడెను. బ్రహ్మచర్యాది కర్తవ్యాంశములను నేఁడే నీవు జరగింపవలయును; ఈ శుభకార్యము భగవంతుని కృపవలన సానుకూలమగుగాక" అనివసిష్ఠుఁడుపలికి, రాజువద్దకు వెళ్లెను. ఈవర్తమానమును రాముఁడు విని యాశ్చర్యపడెను; అతనిమనస్సు పలువిధముల శంకించెను. "అహా దైవమా! అన్నదమ్ములము మేమొకముహూర్తమున జన్మించితిమి; ఏకముహూర్తమున మాతల్లులు పాయసముఁ దినియుండిరి; మా యన్నదమ్ముల, యాటపాటలు, భోజనము, శయనము—ఒకరినివిడిచి యొకరు చేయుటలేదు; మేముకలసి చేయుచుంటిమి; చౌలము, కర్ణవేధము, ఉపనయనము, వివాహము—ఈ శుభములన్నియు నేకముహూర్తముననే మాకు జరగెను కదా! మావంశమున నిదియే యొకకళంకము. తమ్ములనువిడిచి, జ్యేష్ఠునకు యువరాజ్యము నిచ్చుటకంటె ననుచితమగుపని మఱియొకటిలేదు." ఈప్రకారము శ్రీరాముఁడు భ్రాతృవాత్సల్యమును తలంచి, విచారించెను. ఓభక్తులారా! శ్రీవారి హృదయమును గ్రహించి, మీరు మీకుటిలత్వమును విడిచిపెట్టుడు.

దోహా 20

శ్రీరాముని యువరాజ్యాభిషేకమహోత్సవమును గుఱించి లక్ష్మణమూర్తివిని,సంతోషముతో నుప్పొంగుచు, రాముని జూడవచ్చెను. రఘుకులకైరవచంద్రుఁడు తమ్ముని జూచి, యాదరించి, మధురముగ నతనితోఁ బ్రసంగించెను. "ఓయీతమ్ముఁడా! నామమాత్రార్థమే నేను; కర్తవు, భోక్తవు, నీవేసుమీ!" అనిపలికెను. కైరవచంద్రుఁడని చెప్పుటకుఁ గారణమేమి? కుముదములకును,చకోరములకును జంద్రుఁడు సంతోషము నిచ్చును.

చౌపాయీ

నగరమంతట మంగళధ్వనులు మ్రోఁగుచుండెను; ఆయుత్సవముఁ జెప్పనలవికాదు. "భరతుఁడు శీఘ్రముగ వచ్చియుండిన నీయుత్సవముఁ జూచియుండునుకదా!" అని స్త్రీపురుషులు గుసగుసలాడి, భరతునిరాక కెదురుచూచిరి.

రాజమార్గములలోను, అంగడివీధులలోను,సందులలోను,గృహములలోను, స్త్రీపురుషులు గుంపులుగుంపులుగ గూడి, వారిలోవారు పలువిధముల ముచ్చటించుకొనుచుండిరి. "ఎంతవేగము రేపువచ్చును? ఎప్పుడు నాయభిలాష నెఱవేఱును? శ్రీసీతారాములు సువర్ణసింహాసనము నధిష్ఠించియుండుటఁ జూచి, నానేత్రముల కానంద మెప్పుడు కలుగును! నామనస్సున కాహ్లాద మెన్నఁడు కలుఁగును!" ఎప్పుడు తెల్లవారునా యని వారు విచారించుచుండిరి ఈయుత్సవమునకు విఘ్నము కలుగవలెనని స్వార్థపరులగు దేవతలు ప్రార్థించుచుండిరి. వెన్నెల రాత్రి జనులకు సంతోషము నిచ్చును; కాని, దొంగలకుమాత్రము దుఃఖముఁ గలిగించును. అటుల, నాయుత్సవము స్త్రీపురుషులుమొదలా బాలవృద్ధులకు సంతోషము నిచ్చును; కాని, దానివలన దేవతలకు దుఃఖము కలిగెను. దేవతలు సరస్వతిని తమవద్దకుఁ బిలిచి, యామెచరణములపైఁ బడి, యనేకవిధముల నామెను వారు ప్రార్థించిరి.

దోహా 21

"ఓతల్లీ! ఈవిపత్తునుండి మమ్ములఁ గాపాడుము; కన్నెత్తి మాపాట్లఁ జూడుము; ఆయుత్సవమునను నేఁడే విఘ్నముఁ జేయుము; వ్యవధిలేదు; అన్నిపనులును రేపటికి సమాప్తమగును; రాముఁడు వనములకుఁ బోవునట్లు ప్రసాదింపుము."

చౌపాయీ

ఈప్రకారము దేవతలు సరస్వతినిఁ బ్రార్థించిరి; వారి దీనాలాపములను విని,యామెజాలిఁబడెను.ఆమెని శ్చేష్టురాలైనిలువఁబడి,పలువిధముల విచారించెను."ఓదేవతలారా! హేమంతఋతువులోఁబద్మములశోభనశించువిధమున, నయోధ్యాపురజనుల యుత్సాహము నామూలమున నశించునుకదా!"అనియామె పశ్చాత్తాపముఁబడెను.ఆమెపశ్చాత్తాపమును దేవతలుచూచి,భయపడి,కార్యము చెడునని విచారించి, మఱలమఱల నామె

ను బ్రార్థించిరి—“ఓతల్లీ! ఇందువలన నీకేమిదోషముకలుగును! హర్షవి షాదములు శ్రీరామునకు లేవు; శ్రీరాముఁడు విచారింపఁడు; వారిప్ర భావము నీకుఁ దెలియునుకదా! ఒకవేళ,నయోధ్యాపురజనులు దుఃఖిం చెదరని నీవుశంకించెదవు;అంతమాత్రముననష్టములేదు.కర్మానుసారము, తదితరజీవులవలె,వారుకూడ సుఖదుఃఖములననుభవించెదరు.(అవశ్యమే వభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమ్ అనిప్రమాణము.) మానిమిత్తము నీవు తప్పక నగరమునకుఁ బొమ్ము; నీవుకూడ దేవతలలోనిదానవు; కనుక, దేవతల కుపకారము జేయుట నీకుచితము.” ఈప్రకారము దేవ తలు నొక్కినొక్కి చెప్పుటవలన, శారదమనస్సు కొంతవఱకు దార్ఢ్య మునుబొందెను; ఆమెపాదములను దృఢముగ వారు పట్టుకొని, వేఁడు కొనిరి.“ఉచ్చపదవిలో నుండినను, ఈదేవతలు నీచపుపనులఁ జేయుచుం దురు; ఇతరుల యైశ్వర్యముఁ జూచి వారోర్వలేరు. అయినను శ్రీరా ముఁడు వనములలో నివసించి, ముస్ముందు రావణాదిరాక్షసులను సంహరించును; అందువలన, గోబ్రాహ్మణులును దేవతలును సంతసించె దరు. శ్రీరాముని చరిత్రమును వర్ణించు సత్కవులు నాకీర్తిని నిలుపఁబె ట్టఁగలరు.” ఈప్రకారముశారదతనలోఁదానుచింతించుచు,నయోధ్యా నగరమునకుఁ బ్రయాణమయ్యెను. ఆదికిఁ బూర్వము శనిమహాదశ ప్రవేశించువిధమున, నామె దశరథునినగరములోఁ బ్రవేశించెను.

దోహా 22

కైకేయివద్ద నొకచెలికత్తె కలదు; దానిపేరు మంథర. మొట్టమొ దట శారదవచ్చి,అపకీర్తిని దాచియుంచుటకు దానిని యొకపెట్టెగఁ జేసి, దానిబుద్ధిఁ గలుషముఁజేసెను; అంతలో దానిబుద్ధి పాపపుఁజింతలతో నిండెను. తదుపరి, శారద నగరమును విడిచి వెళ్లెను. (ఎందుచేత సరస్వతి నగరమును విడిచిపెట్టెను! ఆనగరవాసులవిపత్తిం జూడలేక యామె నిష్క్రమించెను. లేక, అయోధ్యాపురజనులబుద్ధిని శారద కలుషముఁ జేయలేకపోయెను; కాని, మంథరమాత్రము కైకేయి పితృగృహము నుండి వచ్చెను; దానినివాసస్థానము అయోధ్యాపురముకాదు; అందు చేత, సునాయాసముగ దానిబుద్ధిని శారద కలుషముఁ జేయఁగలిగెను. లేక, ఒకసమయమున, కైకేయితండ్రి వనములో వేఁటాడుచు, నొక

పురుషమృగమును వధించెను; ఆమృగముయొక్క భార్య, తనతల్లివద్దకుఁ బోయి, భర్తకువచ్చిన కష్టమును దానితోఁ జెప్పి దుఃఖించెను. అప్పుడు తల్లిమృగము రాజువద్దకు వచ్చి, "ఓరాజా! నీవుతీసికొనివచ్చిన పురుషమృగము నాయల్లుఁడు; వానిని విడిచిపెట్టుము; యక్షిణీవిద్యను నేర్చియుంటిని; కనుక, వానినిఁ బ్రతికించెదను. నాదాపురముఁ జూచి, వాఁడు నిర్భయముగ సంచరించెను" అని మొఱబెట్టెను; ఆవెంటనే, రాజు తల్లిమృగముఁ జంపెను. "ఓరాజా! నాయల్లుని ప్రాణములఁ గైకొంటివి; అటులనే, ముందుజన్మమున నీయల్లుని ప్రాణములఁ గైకొందును" అని పలికి తల్లిమృగము ప్రాణములను విడిచిపెట్టెను. ఆతల్లిమృగమే మంథరయై పుట్టెను.)

అయోధ్యాకాండము ప్రథమవిశ్రామము సమాప్తము.



# అయోధ్యాకాండ ద్వితీయవిశ్రామము.

—●(:)●—

### చౌపాయ్

ఆమంథర, నగరముయొక్క సింగారముం జూచెను. మంగళధ్వనులను విని, "ఈయుత్సవమునకుం గారణమేమి!" అని జనులనడిగెను. నృత్యగీతవాద్యములు మిన్నుముట్టుచుండెను శ్రీరాముని రాజ్యాభిషేకమహోత్సవమని వారివలన విని, మంథర దుఃఖించెను. "ఈయుత్సవమునకు నేఁటిరాత్రియే విఘ్నముఁజేయవలెను" అని యాదౌర్భాగ్యురాలు నీచురాలునునగు మంథర తలఁచెను. ఒకచెట్టునుండి వ్రేలుచుండిన తేనెపట్టుంజూచి, దానిని సంగ్రహింపవలెనని కిరాతస్త్రీ ప్రయత్నించిన విధమున, నామంథర, విఘ్నముఁ జేయుటకు సిద్ధపడెను. ఆమంథర,దుఃఖించుచు, భరతునితల్లివద్దకు వచ్చెను. "ఓమంథరా! ఎందులకు దుఃఖించుచుంటివి?" అని కైకేయి యడిగెను. అడిగిన ప్రశ్నకుఁ గారణముఁ జెప్పక, మంథర వేఁడినిట్టూర్పులనువిడిచెను. ఒకస్త్రీవలె, నది వెక్కివెక్కి యేడ్వసాగెను. దానిరోదనముఁజూచి, కైకేయి నవ్వి, "ఓసీ మంథరా! ఎల్లప్పుడు నీవు వెఱ్ఱిమొఱ్ఱిచేష్టలఁ జేయుచుందువు; నేను గ్రహించితిని; నిన్ను లక్ష్మణుఁడు శిక్షించెనా!" అని తర్కించెను. అప్పుడయిన నది పలుకక యూరకుండెను; కాలసర్పమువలె నది నిట్టూర్పులను విడిచెను.

దోహా 23

కైకేయి నవ్వుచు, "ఓసీ మంథరా! రాజు, నలువురు కుమారులు—కుశలముగ నుండిరా!" అని మఱలఁ బలికెను. ఆమాటల నామనుబ్జ విని మండిపడెను; దానిహృదయము దహించుకొనిపోయెను.

### చౌపాయ్

"ఓతల్లీ! ఎందునిమిత్తము నాకొకరు బుద్ధి జెప్పవలెను? ఏలనన్నొకరు శిక్షింపవలెను! నామూర్ఖత్వము నుత్సహించువారెవరు! ఈరోజున రామునకుఁ గుశలముగాక యేమగును? అతఁడు యువరాజ్యాభిషేకమునకు, రాజుగారి యాజ్ఞాప్రకారము సిద్ధమయ్యెను. ఇంతవఱకు భగవంతుని కృపవలనఁ గౌసల్య యదృష్టవంతురాలు; ఆమెంజూచిన

తరువాత,నెవరు గర్వపడగలరు!అహంకారముతో నెవరుండగలరు! ఆమె వైభవమును శోభను నీవు వెళ్లిచూడవేమి? నేనుచూచినందున, నామనస్సు చంచలమయ్యెను—నీ వైభవముకుముందు నే నితరుల వైభవమును సహింపఁజాలను. నీకుమాయఁడు విదేశములో నుండెను; నీకులక్ష్యము లేదు; రాజు నీకువశుఁడని నీకొక పిచ్చినమ్మకము కలదు; రాజు కపట చాతుర్యము నీకుబోధపడలేదు; ఎంతవఱకు నీపఱుపును, నీనిద్రను, నీవు చూచుకొనుచుంటివి; చాలుఁజాలు! నీబుద్ధి బంగారముగాను! ఇంత యుపేక్ష తగదు." ఈప్రకారము మంథర కైకేయితోఁ బలికెను. ఆమంథర నీచురాలనియు, దానిపలుకులు విషమనియు, కైకేయి గ్రహించి "ఓ మంథరా! చాలుఁజాలు; ఇక నీమాటలఁగట్టిపెట్టుము.ఈప్రకారము నీవు, మఱలఁ బ్రసంగించినయెడల, నీనాలుకఁ గోసి, నిన్ను గృహము నుండి వెడలఁగొట్టెదను" అనికోపించి, విసుఁగుకొనెను.

దోహా 24

సాధారణముగ, నేకాక్షులు, కుబ్జులు, కుంటివాండ్రు—వీరి స్వభావము కపటము. వీరిచిత్తము కలుషము. వారు దాసీలు నయినయెడల, నీయవగుణములు రెండును విశేషముగఁ గనఁబడును. ఈసంగతి కైకకుఁ దెలియును. అందుచేత, నామెనవ్వి, దానితో నిట్లుప్రసంగించెను.

చౌపాయి

"ఓప్రియవాదినీ! ఓ మంథరా! నీకు బుద్ధిఁజెప్పియుంటిని కాని, నీమీఁదనాకు స్వప్నమందయినను గోపము లేదు. ఈరోజున శ్రీరాముని యువరాజ్యాభిషేకమహోత్సవము జరగును.అది సత్యము.ఈదినమే సుదినము.ఈయుత్సవమే యుత్సవము ('ప్రియవాదిని' అని మంథరను పిలుచుటకుఁ గారణమేమి? దేవమాయ కైకేయిమీఁదఁ గొంచెము ప్రసరించెను. మొదట నామెకోపించి, మఱలఁ దియ్యని మాటలతో దాని నూఱడించినపుడు సహితము, దేవమాయకు, కైకలోఁ బ్రవేశించుటకు సమయము చిక్కలేదు.) సూర్యకులాచారము ప్రకారము జ్యేష్ఠునకు సింహాసనమువచ్చును; కనిష్ఠు లతనిని సేవించెదరు. నిజముగ రేపు రామునకుఁ బట్టముఁ గట్టినయెడల, నీ వేమికోరిన నిచ్చుదానను; అడుగుము. కౌసల్యాది మాముగ్వురు తల్లులను శ్రీరాముఁడు సమానముగఁ

ప్రేమించును; అతనిస్వభావను మంచిది. నాయం దతనికి విశేషముప్రేమ; అనేకసమయములలో నేనతని ప్రేమను పరీక్షించియుంటిని. నేనెన్ని జన్మముల జన్మించినను, నాకు రామునివంటి కొడుకును, సీతవంటి కోడలును గలుగవలెనని, భగవంతునిఁ బ్రార్థించుచున్నాను. నా ప్రాణములకంటె రాముఁడు నాకుఁ బ్రియుఁడుకదా! అట్టి రాముని యుత్సవమువలన, నాకేల శోభకలుగును? రాముఁడు నా ప్రియకుమారుఁడు కదా! నావలె, నీవేల సంతోషింపవు! ఎన్ని జన్మముల నెత్తినను, నాకును రామునకు నెడబాపు భగవంతుఁడు చేయకపోవుగాక! ఎన్ని జన్మములనెత్తినను, నాకిట్టి సుఖము కలుగుగాక! నీవు నా చెలికత్తెవుకదా! నీవు సంతోషింపక, యెందుకు దుఃఖించుచుంటివి?

దోహా 25

"ఓ మంథరా! కపటమును విడిచి, భరతుఁడే ప్రమాణముగ, సత్యముఁ జెప్పుము; రహస్యమయినను పలుకుము; ఇంతగొప్పయుత్సవము జరుగుచుండిన సమయమున, నీవేలదుఃఖించెదవు! అందుకుఁ గారణముఁ జెప్పుము—" అని కైకేయి యడిగెను.

చౌపాయ్

ఈ ప్రకార మాఱెను మంథర చెప్ప నారంభించెను—"ఓతల్లీ! నేనొక్కమాఱు చెప్పుటవలన నా యాశ పూర్ణించెనుగదా! ఇప్పుడు మఱల నేను చెప్పుటకు రెండవనాలుకను దెచ్చుకొని చెప్పవలెను; మంచిమాట జెప్పిన, నీకుదుఃఖము కలుగును; అందుకు నాశిరస్సును బ్రద్దలు గొట్టెదనని చెప్పియుంటివి. అసత్యమును సత్యమని పలుకు మనుజులు నీకుఁ బ్రియులు; నేను సత్యముఁ జెప్పినందుకు నాకు మరణదండనను విధించితివి. అబద్ధముఁ జెప్పినవారికి లడ్డుకములనిచ్చెదవు. ఇంతటనుండి నేనును జమత్కారముగ సంచరించెదను. లేనియెడల, దివారాత్రములు మౌనమును ధరించియుందును. ఈవిధముగనన్ను బ్రహ్మసృష్టించెను; కురూపిని; పరాధీనురాలను ఏజాతివిత్తనమును నాటిన, నది ఫలించును. చేసినకర్మఫలము ననుభవింపక తప్పదు. ఎవరు రాజయిన నాకేమికలదు? నాపని నాకుఁదప్పదు; నేనేమి రాణినికాఁగలనా? ఇది నా స్వభావము; నాకు సిగ్గులేదు; నీ పరాభవముఁ జూచి నేను సహింపలేను. అందుచే

త, నే నొకటి రెండుమాటలఁ జెప్పియుంటిని. ఓతల్లీ! నేను గొప్పతప్పు జేసియుంటిని; కనుక, క్షమింపుము." ఈప్రకారము మంథర విన్న వించెను.

దోహా 26

ఆమంథర వచనములు మధురము; కాని గాఢము—దాని మనస్సు కపటము;విషము—దాని నిజమని కైకేయి నమ్మెను; ఆరాణి, దేవమాయకు వశమై, దానితోఁ బ్రసంగించెను.

చౌపాయ్

అత్యాదరణముతో నామెకు మాటమాటికి దానితోఁ బలికెను. చెంచుది పాటఁబాడిన వెంటనే, మృగము దానివద్దకుఁ బరుగెత్తివచ్చును; ఆస్త్రీ తనను సంహరించునని మృగమునకుఁ దెలియదుకదా! విధికృతము ననుసరించి, యామె బుద్ధి ప్రసరించెను; దానిస్వంత పన్నాగము సాఁగినందుకు మంథర లోలోపల సంతసించెను. "ఓతల్లీ! నేను కొంపలను మాపుదాన నని చెప్పియుంటివి; నీవు తరచితరచి, నన్నడుగుచుంటివి. అందుచేత నీమాటకుఁ బ్రత్యుత్తరము నిచ్చుటకు భయముకలుగుచున్నది." ఈప్రకారము, అయోధ్యాపురమునకు శనిగ్రహమువంటి మంథర, విశ్వాసము కలుగునట్లుఁ దియ్యనిమాటలతో నామెకు విషము నెక్కించెను. "ఓతల్లీ! సీతారాములు నీకుఁ బ్రియులని చెప్పియుంటివి; నాకుఁగూడ వారు ప్రియులే; వారికి నేను బ్రియురాలను. ఈమాటలు పూర్వముజరగెను; ఆదినములు గతించెను కదా! ఆయాసమయములఁ బట్టి మిత్రులు శత్రువులును, శత్రువులు మిత్రులును కాఁగలరు. సూర్యునివలనఁ గమలములు వికసించును; ఆకమలములకు నీరులేనియెడల, మిత్రుఁడగు సూర్యుడు వానిని దహించునుగదా! నీకు జడ్డుదనము బలిసెను; నీసవతి చమత్కారి; నీవు మెలకువతో సంచరింపనియెడల, నీపని, కమలములవలెఁ జెడిపోవును. దీప ముండినపుడే, గృహముఁ జక్కబెట్టుకొనుము. మంచియుపాయమనునట్టి మంచినీరు బెట్టి నీకమలమును గాపాడుము.

దోహా 27

"ఓతల్లీ! నీ అయిదువతనము బలముఁజూచుకొని, నీకేమి విచారము లేదు. రాజు నీకు వశ్యుఁడని తలంచి, నీవు నిర్లక్ష్యముగనుంటివి;

రాజు మనస్సు నిర్మలముకాదు; అతఁడు కపటి; అతఁడు తియ్యని మాటల నాడును; నీచిత్తము సరళము కనుక, సతనిచిత్తము సరళమని తలంచితివికాని, నిజముగ నతఁడు నిట్టనిలువుగ నాపాదము విషము.

**చౌపాయ్**

"ఓతల్లీ! శ్రీరామునితల్లి చమత్కారి; ఆమెమనస్సుతిగాఢము. సమయముఁజూచి, కట్టుదిట్టములతో నామె యెత్తులను వేయును; ఆయెత్తులు నీకు దెలియవు.ఆమె యాలోచనప్రకారము, మేనమామగృహమునకు భరతుని రాజు పంపించెను. సవతులందఱు నామెమాట నడుగుదీయ రనియు, రాజు నీకువశుఁడని గర్వించి, నీవుమాత్ర మామెమాటను లక్ష్యముఁ జేయవనియు, నామెకు నీఁమీఁదఁ గోపము. ఆమె నీప్రక్కలో బల్లెమువంటిదియని నమ్ముము. ఆమె మహాకపటి;నీకుఁ దెలియదు. ఆమె నీసవతికనుక, రాజు నిన్నుఁబ్రేమించుట సహింపలేదు. చమత్కారముగ నామె యెత్తులఁబన్ని, శ్రీరామునకుఁ బట్టముఁగట్టునట్లు, రాజుచే నియమించి యుత్సహింపఁజెను. మీసూర్యకులాచారముప్రకారము, శ్రీరామునకుఁ బట్టముఁగట్టుట యుచితము; సర్వజనసమ్మతము;నాకుఁగూడ సమ్మతము. అయిన, నిందులోనొకవిశేషముకలదు; నీయధికార మడుగుపట్టును;నీమాట నెవరు శిరసావహింపరు.అందుచేత, నాకు భయము కలుగుచున్నది. ఓదైవమా! నీచిత్తము సరళము గనుక నాతల్లియాశను భంగముఁ జేయఁదలఁచినవారియాశను భగవంతుఁడు పడఁగొట్టునుగాక!"

దోహా 28

ఆ మంథర వాక్చాతుర్యముఁ జూపించి, నానావిధముల శ్రమపడి, కైకేయిబుద్ధిని గలుషముఁ జేసెను. సవతుల కయ్యము మొదురుటకుఁ దగిన విధమున, ననేకకథలఁ జెప్పెను. (చిత్రకేతోపాఖ్యానము, ధ్రువోపాఖ్యానమును.)

**చౌపాయ్ 9**

అహా! విధికృతమువలన నామె మనస్సు దానికి వశమయ్యెను. పిట్టఁబెట్టుకొని, అనేకవిధముల నామె దానిని వేఁడుకొనెను; దానిజడి

జముల నామె గ్రహింపలేదు; ఆ మంథర యెంతజెలరి! ఆ మంథర వెఱ్ఱి బాగులది యని యామెనమ్మకము; దానివంటి విశ్వాసముకలపరిచారిక లేదనియుఁగైకకునమ్మకము. "ఓతల్లీ! నామాట నీకుబోధపడలేదా? పశువు వంటిది మంచిచెడ్డలను గ్రహించునే! పదునైదుదినములనుండి యుత్స వమునకుఁ దగినసంభారముఁ జేయుచుండిరికదా! నేనుచెప్పువఱకు నీకుఁ దెలియదా! రాజునకు నీయెడలఁ గపటములేదా? కపటము లేనియెడల నీయుత్సవముసంగతి రాజు నీతోఁజెప్పక, రహస్యముగ దాఁపుట యేల! ఒకరికి హానికలుగునపుడు, సత్యముబలుకుట తప్పు; కాని నేనేలినవారి యన్నముఁదిని, బట్టఁ గట్టుకొనుచుంటిని; నేను సత్యముఁజెప్పుచున్నాను; అందువలన నాకు దోషములేదు. ఈవిషయములో నేనుకల్పించి యసత్యముఁ జెప్పినయెడల, భగవంతుఁడు నాకు దగినశాస్తిఁ జేయును. రేపు గాని రామునకుఁ బట్టముఁ గట్టఁబడినయెడల, నీపుట్టి మునుఁగునని నమ్ముము. ఇదిగో చూడుము; ఈగీతగీచి చెప్పుచున్నాను. నా మాటను విశ్వసింపుమీ! పెడచెవిఁ బెట్టకుము. కడు నిబ్బరముగఁ బలుకుచున్నాను. నిశ్చయము సుమీ! పాలలోఁ బడినయీఁగవలె, నీ పస చల్లారును. అయీఁగను దీసినవిధమున, నిన్నుఁ దృణీకరించెదరు. నీవును నీకుమారుఁడును సేవకులకంటెఁ గనీసము కాగలరు. మీరు వారిని సేవించినయెడల గృహములో నుండవచ్చును; లేనియెడల లేదు.

దోహా 29

"ఓతల్లీ! వేయేల! వినతను గద్రువ దుఃఖపెట్టినవిధమున, నిన్ను గౌసల్య దుఃఖపెట్టును. లక్ష్మణుఁడు రామునకు మంత్రియగును. భరతుఁడు కారాగృహవాసివలెఁ జూడఁబడును."

చౌపాయ్

ఈప్రకారము మంథర చెప్పిన మాటలను కైకేయి విని, పలువిధముల శంకించెను; ఏమాట నామె చెప్పలేక పోయెను. ఆమెశరీరము, జ్వరము వచ్చినట్లు మండుచుండెను; ఆమె సర్వావయవములు కంపించెను; నఖశిఖపర్యంత మామెశరీరము చెమటతో నిండెను; అరఁటిచెట్టు వలె, నామె వడఁకెను. ఆ మంథర నాలుకఁ గఱచుకొని, పలువిధముల మహాచాతుర్యముతో నామెకు బోధించెను. క్రమక్రమముగ దానివిష

మాయామె శరీరమంతట వ్యాపించెను; చేవఁదేరినవృక్షమును వంచుట కష్టముకదా! దాని మాటలచే, నామె శరీరము చేవఁదేలెను. ఒడుపుఁ జూచి, మంథర పురుల నెక్కించెను. "ఓఅమ్మా! ధైర్యము నవలంబింపుము. నీకార్యములు సమకూడును." విధికృతమువలన, నీవెఱ్ఱిబాగుల మంథర కైకకుఁ బ్రియురాలయ్యెను. హంసవచ్చి కాకిని సేవించినట్లు కనఁబడును. "ఓమంథరా! వినుము. నీ మాట సత్యముసుమీ! నాకుడి కన్ను పదిదినములనుండి బెదరుచుండెను. ప్రతిరాత్రి పీడకలలువచ్చుచుండెను. నామూర్ఖత్వముచే వానిని లక్ష్యముచేయలేదు. (ఈయపశకునములు వైధవ్యమును సూచించును.) నేనేమి చెప్పఁగలను! నా స్వభావము పరళము సుమీ! ఎవరు శత్రువులో, ఎవరుమిత్రులో నాకుఁ దెలియదు.

దోహా 30

"ఓ మంథరా! ఇంతవఱకు నేనొకరికిఁ గీడుఁ జేసి యుండలేదు. ఆహా! ఏమిభగవంతుని కటాక్షము! ఇంతదుఃఖము నొక్కపర్యాయము నాకుఁ దెచ్చిపెట్టెను.

చౌపాయ్

"నేను మాత్రము వారిని సేవించియుండను. అంతకష్టమే వచ్చినయెడల, నాపుట్టినింటికిఁబోయి జవించెదను. ఈబొందెలో నాప్రాణము లుండినంతవఱకు, నాసవతిని మాత్రము నేను సేవింపను. విపరీతము పుట్టినను, భగవంతుఁడు శత్రువునకు లోఁబడి జీవింపఁజేసినపుడు, బ్రతుకుటకంటెఁ బ్రాణములను విడుచుట శ్రేష్ఠము." ఈప్రకారము పలువిధముల నామె దీనాలాపము లాడెను. మఱల మంథర, కపటోపాయములఁ బన్నెను. "ఓతల్లీ! ఈ నీ దైన్యమువలన లాభమేమి! ఈప్రకారము పాదములఁ జాచి, కూర్చుండుటవలనఁ బ్రయోజనము లేదు. నీసౌభాగ్యము దినదినప్రవర్ధమాన మగుఁగాక! ఎవరు నిన్ను వంచింపఁ దలఁచిరో, వారే వంచింపఁ బడఁగలరు. ఓ అమ్మా! వారికుట్రను నేను వినినదినము మొదలు, నే తినినతిండి నాశరీరమును బట్టలేదు; నాకింటికి నిదురలేదు. నేను జ్యోతిష్కుల నడిగియుంటిని. వారు సమయములఁ గనిపెట్టి, భరతునికే రాజ్యము వచ్చునని చెప్పియుండిరి. నేను చెప్పినప్రకారము

నీవు సంచరింపుము. అది కష్టమగునని; అయినను, రాజు నీవాఁడు కనుక, నీవు దానిని సాధింపఁగలవు."

దోహా 31

"ఓ మంథరా! నూతిలోఁగాని, గోతిలోఁగానిపడుమని చెప్పినను, నేను సిద్ధముగ నుంటిని; తుదకు, నాభర్తను కొడుకును విడిచిపెట్టుమనిచెప్పినను, ఆప్రకారముఁ జేయఁ దలఁచితిని నమ్ముము. నీవు నాదుఃఖము జూచుచుంటివికదా! నాహితవుఁ జెప్పినపుడు, నే నాప్రకార మేలచేయకూడదు!"

చౌపాయ్

కైకేయి యొక యజ్ఞపశువు; మంథరయొక్క కపటవాక్యములే యొకకత్తి; దాని పాషాణహృదయమే యొకసానరాయి;మంథర తనయిష్టదేవతకు బలినిచ్చుటకు మ్రొక్కుకొనెను; కైకేయి తనకు ముందుకువచ్చెడి దుఃఖమును విచారింపక, మంథరమాటలకుఁ జెవియొగ్గెను. ఆమె ప్రస్తుతపుసుఖమునే భావించెను గాని, ముందుకురాఁబోవుకష్టమును భావింపలేదు.మృత్యువు సమీపించినసంగతిఁ దెలిసికొనక, యజ్ఞపశువుపచ్చగడ్డిని మేయుచుండునుకదా! ఆమంథరమాటలు వినుటకింపుగనుండినను, వాని ఫలముమాత్రము కఠోరము. విషముతోఁగూడిన మధువువలె, దానిమాటలు కనఁబడును. "ఓతల్లీ! ఇతఃపూర్వము నీవు నాతో నొకమాటఁ జెప్పియుంటివి; నీకు జ్ఞాపకము కలదా,లేదా? రాజు నీకు రెండువరముల నిచ్చియుండెను; సమయము వచ్చినపుడు వానిని బుచ్చుకొనియెదనని చెప్పి,నీవువానిని రాజువద్దదాఁచియుంచితివి. ప్రస్తుతము నీవు రాజు నా రెండువరముల నడుగుము; వానివలన నీమనస్సు చల్లఁబడును. భరతునకుఁ బట్టముఁగట్టుటకును, రాముని బదునాలుగుసంవత్సరము లరణ్యమునకుఁ బంపుటకును—ఈ రెండువరముల నడుగుము. నీకోరిక నెరవేఱును; నీ సవతులకు శృంగభంగ మగును. రాజు రామునిమీఁద నొట్టుఁబెట్టుకొనినఁగాని, నీ వావరముల నడుగకూడదు. ఒట్టుఁబెట్టుకొనినతరువాత నతఁడు మాటఁ దిరుగలేఁడు; అప్పుడు వరముల నడుగుము. వ్యవధిలేదు కనుక, నీ కార్యమును నేటిరాత్రియే నీవుసాధింపుము; సూర్యోదయమయినయెడల, నీకార్యము చెడును. నామాటలను బాగుగ గ్రహింపుము."

(1.పూర్వకాలమున దండకారణ్యములో వైజయంతమనుపట్టణమును రాజు అతిధ్వజుఁడు పరిపాలించుచుండెను. ఆ రాజునకు శంబరాసురునితో యుద్ధము సంభవించెను. ఆ రాజునకు దేవేంద్రుఁడు సహాయము నిచ్చెను వారిరువురు కలసి శంబరాసురునితో పోరాడిరి; కాని, వారు వాని దాడికి నిలువలేక పోయిరి. అప్పుడు వారు దశరథమహారాజు మొదలగు మహారాజుల సహాయముఁ గోరిరి. అప్పుడు దశరథుఁడు కైకేయితోఁ గూడి యుద్ధమునకుఁ బోయెను. వారందఱు హోరాహోరిగ శంబరాసురునితోఁ బోరాడిరి; కాని, వాని బల మంతకంతకు హెచ్చెను అనేకవీరులను వాఁడు చంపెను. దశరథునిసారథి చనిపోయెను అతని శరీరమంతయు బాణములచేఁ జిల్లులుపడెను. అతఁడు రథముపై మూర్ఛిల్లెను. అప్పుడు కైకేయి రథమును మఱలించి రాజుప్రాణములఁ గాపాడెను.2.ఆయుద్ధములో నతనిరథచక్రపుచీలజాఱిపోయెను.అప్పుడు కైకేయి తనచిటికెనవ్రేలు నాయిరుసులోఁ బెట్టి, రథముగాఁపాడెను. ఆమె ధైర్యస్థైర్యములకు రాజు సంతసించి, రెండువరముల నిచ్చెను. ఈ వృత్తాంతమును కైకేయి మంథరకుఁ జెప్పియుండెను; వానినిగుఱించి, యామె మఱచిపోయెను; కాని, దానికిమాత్రము జ్ఞాపకముండెను.

ఒకసమయమున నొకఋషి నిద్రించుచుండెను; అతని ముఖము నిండ కైకేయి మషిబూయుటచేత, నతనికిఁ గోపమువచ్చి, "నాకు నీవు కళంకముఁ బెట్టినందున, నీకుఁగూడ కళంకము వచ్చుగాక" అని యామెను శపించి, కండముఁ దీసికొని రమ్మనుని యాజ్ఞాపించెను. ఆమెవామహస్తముతో కండముదీసికొనివెళ్లి యతనికిచ్చెను. "ఓ కైకేయి,నాదండమును వామహస్తముతోఁ దీసికొనివచ్చినందున, నీవామహస్తము లోహముతో సమానముగు గాక!" అని మఱలశపించెను.అందుచేత,నామె చిటికెనవ్రేలు లోహమునువలె నుపయోగించెను.)

## దోహా 32

ఈ ప్రకారము దాసీభాగ్యపు మంథర పన్నాగముఁబన్ని "ఓ తల్లి! లేలెమ్ము; అలుకగదిలోనికి శీఘ్రముగఁబొమ్ము; సావధానముగ

నాలోచించి, నీ యెత్తులను నడిపింపుము; మాటకుమాటఁజెప్పి నీపతిని క్రమముగ స్వాధీనముఁ జేసికొనుము" అని బోధించెను.

చౌపాయ్

ఆ మంథరను కైకేయి తనప్రాణములతో సమానముగ భావించి, దానివంటి హితోపకారి లేదని తలంచి, దానిని పలువిధముల నుతించెను. "ఓ మంథరా! ఈ లోకములో నీవంటి హితోపకారి లేదు. ఆపత్సముద్రములోఁ గొట్టుకొనిపోవుచుండిన నన్ను నీవు తెప్పవలె రక్షించితివి. భగవంతుని కృపవలన రేపు నాకార్యము సిద్ధించినయెడల,నిన్ను నాకంటిపాపవలెఁ జూచుకొనియెదను." ఈప్రకారము దానిని బలువిధముల నాదరించి, యామె యలుకగదిలోఁ బ్రవేశించెను. నీచుల నాదరించుటవలన, దానిఫలము విపరీతమగును. ఈ వృక్షమునకు విపత్తియే బీజము (విత్తనము); ఆమంథరవచనము లను నట్టివర్షమువలన, నాబీజము నాటుకొనెను విత్తనమునకు భూమియాధారము; అటులనే, విపత్తిబీజము కైకేయిహృదయములో నాటుకొనెను. కపటజలములచే నాబీజము తడపఁబడి, యంకురించెను. ఆబీజము బ్రద్దలై, రెండాకులను వేయును; ఈ విపత్తిబీజమునకు రెండువరము లే, రెండాకులు. ఆవృక్షము పరిణమించి, దుఃఖఫలము నిచ్చును. అలుకకుఁ దగినవేషమును ధరించి, యామె శయనించెను. ఆమె దురాలోచనలవలన, రాజ్యమునశించెనని కవీశ్వరులు చెప్పుచున్నారు. సంబరము కనుక, నగరములోను రాజనగరులో నతికోలాహలము పుట్టెను. కైకేయిగృహములో జరుగుచుండిన నిప్పుసంగతి వారికి లేశమైనను దెలియదు.

దోహా 33

నగరములోని స్త్రీపురుషు లతియుత్సాహముతో మంగళద్రవ్యములను సిద్ధపఱచిరి. వచ్చుచుండినవారికిని, వెళ్లుచుండినవారికిని లెక్కలేదు. రాజదర్బారు పూర్ణించి, కిలకిలలాడుచుండెను.

చౌపాయ్

ఈశుభవర్తమానమును రాముని బాల్యస్నేహితులు విని,సంతోషించి, పదునైదుగురు జతగవెడలి, రామునిఁ జూడవచ్చిరి. ఆస్నేహితుల యంతఃకరణములు శుద్ధమని రాముఁడు తెలిసికొని, వారినియాదరించి,

సత్కరించి, వారి యోగక్షేమమును మృదుమధురముగ నడిగెను. వారు రాముని సెలవుగైకొని, రాజగృహములోఁ బ్రవేశించిరి; మందిరములోఁదిరుగుచున నేకవిధములవారు రాముని కలుపుగోలుఁదనము గుఱించి ప్రశంసించిరి. "రాముని వంటి సుశీలుఁడును, స్నేహపాత్రుఁడును, లోకములో మఱి యొకఁడు కలఁడా? రాజ్యము లభించెనని లేశమపు గర్వము లేక, మనలను పూర్వమువలె నాదరించెనుకదా! ఎన్ని జన్మములు మనము కర్మవశముచే జన్మించినను, మనవంటి సేవకులకు శ్రీరాముఁడే ప్రభువగునట్లు భగవంతుఁడు ప్రసాదించుగాక! అంతకంటె మఱియొక కోరిక మనకు లేదు." ఈ ప్రకార మాస్నేహితులు రాజమందిరములో సంచరించుచు, వారిలో వారు తలంచిరి. ఈ యభిలాషయే నగరములోని స్త్రీపురుషులకుఁ గలదు. కైకేయిహృదయముమాత్రము దహించుకొని పోవుచుండెను. దుర్జనసాంగత్యమువలన నెవరు నశింపరు? నీచుల యభిప్రాయములను గ్రహించుటవలనఁ బ్రయోజనము లేదు.

దోహా 34

అంతలో సాయంసమయ మయ్యెను; అత్యుత్సాహముతో నప్పుడు రాజు కైకేయిమందిరమునకు నడచెను. స్నేహము శరీరమును ధరించి, నిష్ఠురమువద్దకు వెడలినట్లుండెను.

ఇది ద్వితీయవిశ్రామము.

# తృతీయవిశ్రామము.



**చౌపాయ్**

కోపగృహములో నామె ప్రవేశించెనని రాజువిని నిశ్చేష్టుఁడయ్యె ను; భయముచేత నతనిపాదము ముందుకుఁ బడలేదు. అతనిబాహుబల మును దాపుఁజేసికొని, దేవేంద్రాదులు సుఖముగనుండిరి; సకలదేశాధి శులు నతనికటాక్షవీక్షణమునకు నిరీక్షించెదరు. అట్టిమహారాజు స్త్రీకో పమునకు నిర్ఘాతపడెను. ఇది యంతయు కామదేవుని ప్రతాపముకదా! సాంబశివుని త్రిశూలమును, దేవేంద్రుని వజ్రాయుధమును, దుర్గాదేవి చంద్రాయుధము నతఁడు ధరించుటకుఁ దగినవాఁడు కాని, తలిరువిలు కానివాఁడితూపుల కతఁడు నిలువలేక పోయెను. భయంపడుచు నతఁడు కైకను సమీపించెను; ఆమె దురవస్థఁజూచి, రాజు దుఃఖించి, జాలిఁ బడెను; అలంకారములను విసర్జించి, ప్రాఁతగిల్లిన యొకముదుకవస్త్రము నామె ధరించి, కటికనేలపై శయనించి యుండెను. ఆమెబుద్ధి చెడిపో యెను; రాఁబోవు వైధవ్యమును సూచించునట్లు, యామె నీచవేషమును ధరించెను. రాజు మెల్లమెల్లగ నామెను సమీపించి యామెతో నిట్లు ప్రసంగించెను. "ఓ నాప్రాణనాయకీ! నా అల్లారిబెల్లమా! నీ కోపము నకుఁ గారణమేమి?

**ఛాంద్**

"ఓ ప్రాణసఖి! ఎందుచేత నీకుఁ గోపమువచ్చెను"— ఈప్ర కార మతఁడు పలికి, యామెచేతులఁ బట్టుకొనెను. అప్పుడామె రాజు చేతులను విదలించి, తనచేతులను విడిపించుకొని, కొఱకొఱలాడుచు, నాగుబామువలెఁ జూచెను. ఆమెవరములు రెండును రెండునాలుకలు; అవియే రెండుకోఱలు; పామునకువలె, నామెముఖమున విషముండెను. ఆయువుపట్టుఁ జూచి, పాముకఱచును; 'రాముని మీఁదనొట్టు' అని రాజుపలుకుటయే, యతని ఆయువుపట్టు; ఆసమయమున కామె నిరీ క్షించుచుండెను. ఆహా! విధికృతము నెవరు తప్పించుకొనఁగలరు? కాముని కౌతుకము నతఁడు చూచిచూచి, నిశ్చేష్టుఁడయ్యెనని తులసి దాసుగారు చెప్పుచున్నారు.

సోరఠా 1

మఱలమఱల, రాజావెను వేఁడుకొనెను. "ఓ సుముఖీ! ఓ సులోచనీ! ఓ పికవాణీ ! ఓ గజగామినీ! నీ కోపమునకుఁ గారణముఁ జెప్పుము.

చౌపాయ్

"ఓ తలిరుఁబోఁడి! రెండుతలలవాఁ డెవఁడు నీకపరాధముఁ జేసియుండెను? వానికి మృత్యువు సమీపించినందున, వాఁడు నీకుఁ గోపముఁ దెప్పించెను. నీకోరికఁ జెప్పుము; ఘటుని రాజుగఁ జేయుమనినను, రాజును దేశమునుండి వెడలఁగొట్టిభిక్షుకునిగఁ జేయుమనినీవు చెప్పినయెడల నాప్రకారముఁ జేయువాఁడను. ఓ వరోరూ! నా స్వభావము నీకుఁ దెలియునుగదా! చంద్రునిఁ జూచి చకోరము లానందించువిధమున, నీముఖచంద్రముఁ జూచి, నామనస్సు సంతసించును. ఓ కలకంఠి! రాముని తోడుసుమీ! నీయెడల నాకు లేశమైనఁ గపటములేదు. ఓ ప్రియసఖీ! నాప్రాణములును, నా రాజ్యమును, నా పుత్రులును, నా ప్రజలును, దేశవాసులును—— వీరందఱు నీభృత్యులని భావింపుము. ఓ భామినీ! రాముఁడుతోడుగ, నీవు చిఱునవ్వునవ్వి, నీమనోభీష్టముఁ దెలియఁజేయుము; నీ దేహమును సర్వాలంకారములతో సింగారించుకొనుము. నీవు నీవేషమును విడిచిపెట్టినఁ గాని, నా మనస్సునకు నెమ్మది కలుగదు; నిన్నుఁ జూచినను, నీగృహముఁ జూచినను, నాకు బాధకలుగుచున్నది. నీశత్రు వమరుఁడైనను, వానిని సంహరించెదను; పురుషులవంటి, స్త్రీపురుషులమాటఁ జెప్పనేల?"

దోహా 35

ఈ ప్రకారము రాజుచెప్పిన మాటలను కైకేయి విని, గొప్పశపథమును మనస్సులో నుంచుకొని, నవ్వుచు దిగ్గునలేచి, భూషణములను సింగారించుకొనెను. మృగముఁ జూచి, కిరాతస్త్రీ వలఁ బన్నినట్లు, ఆమెనగలను శృంగారించుకొనెను.

చౌపాయ్

ఆమెమనస్సు స్థిరపడెనని రాజు తెలిసికొనినందున, సతని శరీరము పులకరించెను; మృదుమధురవచనములతో నతఁ డిట్లు ప్రసంగించెను. "ఓ భామినీ! నీ మనోభీష్టము సిద్ధించెను; నగరములోఁ బ్రతి

గృహములో నుత్సవములు జరుగుచున్నవి; మంగళధ్వనులు మ్రోగుచున్నవి; ఓ ప్రాణసఖీ! రేపు శ్రీరామునకు యువరాజపట్టాభిషేకమహోత్సవము జరగును; నీ వాయుత్సవమునకుఁ దగినమంగళసామగ్రులను సిద్ధముఁజేయుము" ఈమాటలను వినినందున నామె హృదయపాషాణము, ఆరపండిన దోసపండువలె, విచ్చిపోయెను. ఆమె మనస్సులోలోపున దహించుకొని పోవుచుండినను, దానిని మరుగుపఱచి, చోరునిభార్య భర్తకువచ్చినపాట్లను జూచి, లోలోపున దుఃఖించినను బ్రకటముగ నవ్వువిధమున, నామె పక్కున నవ్వెను. ఆమె కపటచాతుర్యమును రాజు గ్రహింపలేకపోయెను. కోటికుటిలులకు శిరోమణియగు మంథరవలన, నామె బలవంతపెట్టఁబడెను. రాజుమాత్రము సామాన్యుఁడుకాఁడు; మంచిచతురుఁడు; రాజనీతి నెఱుంగును; నారీమణుల చర్య లగాధములు; వానిలోతుఁ గనిపెట్టుట కష్టము. ఆ కపటపు కైకేయి, నేత్రవక్త్రవికారములచేఁ బ్రేమాతిశయములఁ జూపించి, ముసిముసినవ్వుల నవ్వుచుండెను.

దోహా 36

"ఓ ప్రాణనాథా! వరము నడుగుమడుగుమని చెప్పుటయేకాని, యొకవరమునయినను మీరిచ్చియుండలేదు. ఇదివఱలో రెండువరముల నిచ్చియుండిరి కాని, యిప్పుడు వానినిబొందగలనో లేదో యని సందేహము కలుగుచున్నది."

చౌపాయి

"ఓ సఖీ! నీ యభిప్రాయముఁ దెలిసికొంటిని; ప్రణయకలహమునందు నీ కభిలాష మెండు. నేను నీకువరములనిచ్చినమాట సత్యము; పరాకుపడుట నాస్వభావము; ఆసంగతి నీకుఁ దెలిసినను, నేనిచ్చినవరములను నీకియ్యలేదని అబద్ధపుదోషమును నామీఁద నిరూపింపకుము. నీవావరముల నడిగియుండినయెడల, నే నిచ్చియుందును; అడుగక నీవేల యూరకుంటివి? మా రఘుకులవంశస్థుల ప్రతిష్ఠ యెట్టిదో నీకుఁ దెలియునుకదా! ప్రాణమునయినను విడిచిపెట్టెదముకాని, అసత్యముఁ బలుకుటకు వెఱతుము. అన్నిపాపము లసత్యముతో సమానము కావు; నూరుగిట్ట లొకపర్వతముతో సమానమగునా! సకలసుగుణ

ములకును సత్యము మూలము. ఈవిషయమునే వేదపురాణేతిహాసములు ఘోషించును; ఈమాటను మనువు చెప్పియుండెను. దీనినే మహాత్ములు నొక్కి చెప్పుచుండిరి. సకల సుకృతములకును వాత్సల్యమునకును శ్రీరాముఁడు పుట్టినిల్లుకదా! అట్టిశ్రీరాముఁడు నాతోడు. నీవరముల నడుగుము; నే నిచ్చెదను. మూఁటికి ముమ్మాటికి రాముఁడు తోడు" — ఈప్రకార మొట్టుఁబెట్టుకొని రాజు పలికినతరువాత నతని మాటను దృఢముఁజేయించుకొని, ఆమె నవ్వుచుఁ బలికెను. వేఁటకాండ్రు వేఁటనిమిత్తము డేగఁదీసికొనివెళ్లి, మొదట దానిముఖమును 'టోపీ' తోఁ గప్పియుందురు; వేఁటకుఁ బక్షులు కనఁబడినవెంటనే, దాని ముఖముపైనుండి 'టోపీని' దీసివేయుచుందురు. అటులనే, కైకేయి తనవరములనునట్టి డేగను రాజుపైకి విడిచిపెట్టెను.

దోహా 37

రాజు మనోరథములే యొకసుందరవనము; ఆ మనోరథముల సుఖమే పక్షులు; కైకేయి యొక వేఁటకత్తె; ఆమె వరములు డేఁగ; ఆభయంకరమగు డేఁగ నామె విడిచిపెట్టఁదలఁచెను.

చౌపాయి

"ఓ ప్రాణప్రియుఁడా! నామనస్సునకు నచ్చిన రెండు వరములను వినుము — భరతుని యువరాజుగ నియోగింపుము" ('ప్రాణప్రియుఁడా!' అనిసంబోధనఁజేయుటకుఁ గారణమేమి! ఆమె రాజుప్రాణములను భక్షింపఁదలఁచెను — ఇది మొదటివరము. రెండవవరము నామె హస్తములజోడించి, ప్రార్థించెను. మొదటివరమును గోరినపుడామె చేతులను జోడింపలేదు; రెండవవరము నడిగినపుడు చేతులను జోడించెను. ఈ రెండవవర మతికఠినము కనుక, నామె చేతులను జోడించెను. మొదటివరమువలన ధనమును, రెండవవరమువలన నతనిప్రాణముల నామెయపహరించెను. అందుచేత నామె యధికనమ్రతతో వేఁడుకొనెను. అథవా, ఆచేతులతో నామెయుద్ధములో నతనిప్రాణములఁ గాపాడెనని చూపించుచున్నదో యనునట్లు తోఁచెను.) "ఓనాథా! నాచేతులఁజూచి, నా రెండవవరమును దయచేయుము. ఉదాసీనుఁడై, మునివేషమును ధరించి, శ్రీరాముఁడు పదునాలుగు సంవత్సర

ములు వనములలో నివసించుఁగాక—(మొదటివరమువలన భరతునకు రాజ్యమువచ్చునుకదా! ఇఁక రెండవవరమువలనఁ బ్రయోజనమేమి? అయోధ్యానగరములో శ్రీరాముఁడు నివసించినయెడల, నుపాధిఁ జేసికొనునని యామెతలంచెను. మునివేషమును వేసికొనవలెనని కోరుటకుఁ గారణమేమి! వనములోనివసించి, సాత్త్వికవృత్తి నభ్యసించుటచేత రజోగుణము శాంతించును; రాజ్యాభిలాషనశించును.ఉదాసీనుఁడై యుండవలెనని కోరుటకుఁ గారణమేమి! విశ్వామిత్రాదిమును లుదాసీనులు; వారివద్ద బండ్లు, యెడ్లు మొదలగునవి యుండును. ఏకాకియై శ్రీరాముఁడు వనవాసముఁ జేయవలయును; కాని, వాహనములు మొదలగువానిని సంగ్రహింపఁ గూడదు. విశేషోదాసీనుఁడుగ నుండవలెను; అందువలన వైరాగ్యము కలుగును;రాజ్యాభిలాష నిశ్శేషముగ నశించును. పదునాలుగుసంవత్సరములని కోరుటకుఁ గారణమేమి? ఈలోపల భరతుఁడు రాజ్యమును స్వాధీనముఁ జేసికొనును; ప్రజలకు భరతునియం దనురాగముండునుకాని, రామునియందుఁ బ్రవర్తింపదు; అప్పుడు రాముఁ డేమిచేయఁగలఁడు!ఇంతదూరమాలోచించి, రెండవవరము నామెకోరెను. ఇది బాహ్యార్థము. ఇఁకపరమార్థమునువినుఁడు; మహాత్ములావరము నిట్లువ్యాఖ్యానముఁ జేసిరి:—రెండవవరము నామెకోరినపుడామెజిహ్వయందు సరస్వతి నాట్యమాడెను.(1)రావణునకప్పటికిఁ బదునాలుగుసంవత్సరములు ఆయుర్దాయము శేషించియుండెను. (2)పదునాలుగు ఘడియలకాల మతఁడు నగరములో నివసించుటకు వ్యవధియుండెను;కనుక, నొక్కొక్కఘడియ కొక్కొక్కసంవత్సరముచొప్పున నామెకోరెను(3) రాక్షసులను శ్రీరాముఁడు సంహరించి, యేడేడుపదునాలుగు భువనములకు సుఖమునిచ్చును.) 'ప్రాణప్రియ, నాథ' ఈ మొదలగు విశేషణములతోఁ గూడిన కోమలవచనముల నతఁడువిని,దుఃఖించెను.చంద్రకిరణములు సోఁకినమాత్రమునఁజక్రవాకములువలె, నతఁడు వికలత్వముఁ బొందెను;చంద్రకిరణములు మృదువయినను, జక్రవాకములకు దుఃఖదాయకములు; కైకేయివచనములు కోమలములయినను, రాజునకు దుఃఖదాయకములు. డేఁగ యెగిరివచ్చినపుడు చిన్నపిట్టలువలె, నామె మాటలవలన నతనిగుండెలు ఝల్లుమనెను. పిడుగుపడిన తాళవృ

క్షీణునకువలె, నతని కళాకాంతులు నశించెను. నేత్రములను మూసికొని, రెండు చేతులతో శిరముఁబట్టుకొని, రాజు విలపించుచుండెను. ఆహా! మూర్తీభవించిన శోకరసము దుఃఖించుచుండినట్లు కనఁబడెను. "ఆహా! దైవమా! నామనోరథమనే కల్పవృక్షము పుష్పించుట కారంభించెను; ఏనుఁగువలె, నావృక్షమును కైకేయి నిర్మూలముగ ఛేదించెను. ఆమె మూలమున, నగరమంతయు ధ్వంసమగును; అనేకదుఃఖముల కామె విత్తనమును నాటెను.

దోహా 38

"ఆహా! సుఖము ననుభవించుకాలమున కెంతవిపత్తు వచ్చెను? ఆఁడుదానిని విశ్వసించినందువలనఁగదా! నాపుట్టి మునిఁగెను. యోగము సిద్ధించుసమయమున, నవిద్యవచ్చి యతీశ్వరునిఁ జెఱచినవిధమయ్యెను."

చౌపాయ్

ఈప్రకారము మహారాజు లోలోపల దుఃఖించెను. చింతాక్రాంతుఁడయిన రాజుంజూచి, కైకేయి కోపముతో నిట్లు ప్రసంగించెను. ఆమెకు మంథరావచనములు స్మరణకువచ్చెను; దానిమాటలుసత్యమని నమ్మెను; రాజునకుఁ దనమీఁద నిజమగు ప్రేమ లేదని యామె గ్రహించెను; "ఓరాజా! భరతుఁడు నీకుమారుఁడు కాఁడా? రాముఁడే నీకుమారుఁడా? అంగడివీథిలో నన్ను వెలకుఁగొని, బానిసతనమునకుఁ దీసికొనివచ్చితివా? భరతుఁడు దాసీపుత్రుఁడా! నామాటలు బాణములువలె నీకుఁ దగులుచుండిన, మొదట నాతోఁ జెప్పినప్పుడీసంగతి నీకుఁ దెలియదా? నీతాతముత్తాతలును నీవును సత్యసంధులుకదా! నావరములకు 'అవును, కాదు' అని యొకమాటఁ జెప్పుము. నీ కీర్తిప్రతిష్ఠలను నిలుపుకొనఁ దలఁచినయెడల, నావరముల నిచ్చివేయుము; లేనియెడల, లేదు. ఆడినమాటఁ దప్పుము. సత్యమును విడిచిపెట్టుము; లోకములో నపఖ్యాతిఁ బొందుము. నేనేమోపిచ్చివరముల నడిగెదనని తలఁచి, నీవు మొదట సత్యమును గుఱించి విశేషముగ స్తోత్రముఁ జేసియుంటివి. శిబి, దధీచి, బలి—ఈమొదలగుచక్రవర్తులు, ప్రాణములను విడిచిపెట్టిరిగాని, యాడినమాటను తప్పలేదు. ఆడినమాటను నిలువఁబెట్టుకొనుటకు వారు ధనమునుసహితము గోల్పోయిరి." గాయమునకు లవణము తగిలినవిధమున, నామెనిష్ఠురవాక్యము లతనిమనస్సును బాధించెను.

దోహా 39

ఆ ధర్మధురంధరుఁడు ధైర్యము నవలంబించి, నేత్రములను విప్పి, నెత్తిఁగొట్టుగొని, యీప్రకారము పలికెను—"ఆహా! నాభార్య కత్తితో నాయువృష్టుమీఁద గొట్టెనుకదా!"అని, యతఁడు నిట్టూర్పును విడిచెను.

చౌపాయ్

అతనియెదుట నత్యంతక్రోధముతో మండుచుండిన కైకేయినిలువఁబడి యుండెను.ఆమె కైకేయి కాదు;మూర్తీభవించిన క్రోధము; ఆమెయొక పాఁడిగల కత్తివంటిది; ఆమెకొంకుబుద్ధియే దానిపిడి; నిష్ఠురవాక్యములే దానిధార; మంథరాహృదయమే సానఱాయి. ఆ కైకేయియొక్క చంద్రాయుధము వలె నతనినేత్రములకుఁ గనఁబడెను. "ఆహా! ఈమె నా ప్రాణములఁ గొనును; అథవా, నా సత్యమును దొంగిలించును." ఈప్రకారము రాజు చింతించి, గుండెలు దిట్టముఁజేసికొని, వినయపూర్వకముగ నామెతో నిట్లు ప్రసంగించెను—"ఓప్రాణసఖీ, ఏ కారణముచేత నీవిధమున నీవు పలికియుంటివి? పుత్రవాత్సల్యమును, భార్యాభర్తల యనురాగమును, నీపలుకులువలన నశించును; జనుల కనుమానము పుట్టును. ఓ ప్రియురాలా! భరతుఁడును రాముఁడును నాకు రెండునేత్రముల వంటివారు. శ్రీశివుఁడు ప్రమాణముగ సత్యము జెప్పుచున్నాను. రేపు ప్రాతఃకాలమున నొకదూతను బంపి, భరతశత్రుఘ్నులను శీఘ్రము రప్పించెదను. శుభదినమున శుభముహూర్తమున, భరతునకు బట్టముఁగట్టెదను-నామాట నిశ్చయము.

దోహా 40

"శ్రీరామునకు లేశమైనను రాజ్యకాంక్ష లేదు; అతనికి భరతునియం దధికప్రేమ కలదు. భరతుఁడు చిన్నవాఁడని యాలోచించి, రాజధర్మము ననుసరించి, రామునకుఁ బట్టముఁగట్టుటకు నిశ్చయించితిని; కాని, మఱియొకటి కాదు.

చౌపాయ్

"రాముఁడు ప్రమాణముగ జెప్పుచున్నాను వినుము; రాముని తల్లి నాతో నేసంగతియు జెప్పియుండలేదు; ఈవిషయమును గుఱించి నీతో ముచ్చటింపక, స్వతంత్రించి వ్యవహరించితిని; అందుచేత, నా

ప్రయత్నము నిరర్థక మయ్యెను. కోపమునువిడిచి, యుత్సవమునకుఁ దగినవిధమున మంగళకార్యములఁ జేయుము; కొన్ని దినములలో భరతునకుఁ బట్టముఁ గట్టెదను. నీవడిగిన రెండవవరమే నాకు దుఃఖముఁ గలిగించెను; ఆ వర మసందర్భము; ఆవరమును లోకులువిని, మనయిరువురగుఱించి యేమని చెప్పుకొనియెదరు! ఇప్పటికిని నీహృదయము మండుచున్నది. కోపముచేతనో, లేక సత్యముగనో, నీవెందులకావరము నడిగి యుంటివో నాకు తెలియదు. కోపమువిడిచి, రాముఁడు చేసిన యపరాధముఁ జెప్పుము. రామచంద్రుఁడు మహాత్ముఁడని లోకులు చెప్పుచుండిరి. ఒక సమయమున, నీవు సహితము రాముని గొనియాడుచుంటివి కదా! నీమాటలవలన నాకు సందేహము కలుగుచున్నది; రాముఁడు నీకేమియపరాధముఁ జేసియుండెనా? లేక నీబుద్ధి భ్రమించెనా? స్వభావసిద్ధముగ నతఁడు శత్రువులనుసహితము మిత్రులుగఁ జేసికొనును కదా! అట్టిరాముఁడు తల్లియెడలఁ బ్రతికూలముగ నడచియుండఁడే! రాముఁడు నిశ్చయముగ నపరాధముఁ జేసి యుండఁడు.

దోహా 41

"ఓ ప్రాణసఖి! హాస్యమునకుఁగాని, నీ వావరము నడిగియుండిన యెడల, దానిని విడిచిపెట్టుము; విచారించి మఱియొకవరము నడుగుము. నాకన్నులార భరతుని రాజ్యాభిషేకముఁజూచి, సంతోషించెదను.

చౌపాయ్

"ఓసఖి! జలములను విడిచి మత్స్యము జీవింపవచ్చును; మణిలేక సర్పము జీవింపవచ్చును. చమత్కారమునకుఁ జెప్పుటకాదు; సత్యముఁ జెప్పుచున్నానుసుమీ! రాముఁడు లేనియెడల, నా ప్రాణములు నిలిచి యుండవు. ఓ ప్రియురాలా! చెప్పగ విచారింపుము; నీవయినను బుద్ధిమంతురాలవు; కాని, తెలివితక్కువదానవు కావు. నిత్యము రాముని సందర్శించుటవలన, నా ప్రాణములు నిలిచియుండునని నమ్ముము." ఈప్రకారము రాజు చెప్పిన మాటలను కైకేయివిని, మండిపడెను; ఆహుతిపడిన హుతాశనునివలె, నామె 'ఘుప్పు' మని మండెను. "ఓ రాజా! నీవు కోటిప్రయత్నములఁ జేసినను, ప్రయోజనము లేదు; నీమాయో

పాయములును, నీ చమత్కారపు యెత్తులును, నాయెదుట నిలువఁబడవు. నా వరముల నిచ్చి వేయుము; లేక, లోకములో నపకీర్తిఁబొందుము—'అవును, లేదు' అని యొకమాటఁ జెప్పుము—నా కీవాదము వలనఁ బ్రయోజనము లేదు. రాముఁడు మంచివాఁడు, నీవు మంచివాఁడవు; మీ తండ్రికుమారు లిరువురును సమానులు; మీరు సాధువులు; రామునితల్లియు ముద్దురాలు—ఈ సంగతి లోకులకుఁ దెలియును. ఆమె నాకు మేలుఁజేయఁ దలఁచెనుకాని, నే నామెకు ద్విగుణముగ మేలుఁ జేయుచున్నాను.

దోహా 42

"ఓ రాజా! పెక్కుమాటలవలనఁ బ్రయోజనము లేదు; ఈనామాట నిశ్చయమని తెలిసికొనుము. రేపు ప్రాతఃకాలమున రాముఁడు మునివేషమును ధరించి, వనమునకుఁ బోవలెను; లేనియెడల నా మరణము నిశ్చయము;లోకములో నీ కపకీర్తి వచ్చును.నామాటనమ్ముము—"

చౌపాయి

ఈప్రకారము కైకేయి బెణఁకులేకుండపలికి, దేరాకొయ్యవలె, రాజయెదుట నిలువఁబడియుండెను. ఆమెక్రోధమే, యొకనది; నదివలె, నామెవర్తనము కుటిలము; ఆ నది పాపమనేపర్వతములోఁ బుట్టెను; క్రోధమే దానిజలములు; ఆనది భయభీషాహములఁ బుట్టించును; ఆ రెండువరములే, దాని రెండుతటములు; మూర్ఖత్వమే, దాని నిర్ఝర ప్రవాహము; ఆమంథరదుర్వచనములే, దాని సుడిగుండములు; దశరథమహారాజే, దాని తటముపైనుండిన మహావృక్షము; ఆనదీ ప్రవాహమువలెనే, ఈక్రోధనదీప్రవాహము మహారాజును బడఁద్రోసెను. మూలముతో నూడఁబెటికెను; ఆనది దుఃఖసముద్రములో గలయుచున్నది. "ఆహా! నిశ్చయముగ నామెమాటలు సత్యము; హాస్యము నకుఁ గాదు. ఈ స్త్రీవచనముల మూలమున, నా మృత్యువు సన్నిహితమయ్యెను." ఆమెచరణములఁ బట్టుకొని, కూర్చుండఁబెట్టి, "ఓ జగజ్జననీ!నా మాటలను వినుము;నా ప్రార్థనఁ గైకొనుము; నీ వచనకుఠారముతో, సూర్యవంశమును ఛేదింపకుము; ఆ రెండవవరమునకు బదులు, నా శిరస్సుఁగోరుము;నే నిచ్చివేయఁగలను. ఆ ముని వియోగమువలన, నా

ప్రాణముల భక్షింపకుము; నాశిరస్సుఁ గోరిన, నాయొక్క ప్రాణములే పోవును; కాని, రాముని వియోగమువలన, వంశమునకు గీడువచ్చును. ఏవిధముననయిన రాముఁడు నిలిచియుండుమార్గముఁజూడుము; లేనియెడల, నా జన్మాంతము గుండెలుమండును సుమీ"—అని దశరథుఁడు ప్రార్థించెను.

దోహా 43

ఈప్రకార మతఁడు విన్నవించి, "ఈరోగ మసాధ్యము; తిరుగదు" అని చింతించి, నెత్తిఁగొట్టుకొని, "రామా, రామా" అని పిలచి దుఃఖాక్రాంతుఁడై, నేలమీఁదఁ బడెను.

చౌపాయ్

ఈ వ్యాకులముచేత, నతనిశరీరము శిథిలమయ్యెను. మనోవ్యాధికి మందులేదుకదా! ఏనుఁగు కల్పవృక్షమును మూలముతో బడద్రోసిన ట్లయ్యెను అభిమతార్థములనిచ్చు మహారాజు నేలఁగూలెను. అతనికంఠ మార్చుకొని పోయెను; ముఖమునుండి మాట వెలువడలేదు జలములోనుండి బయటఁబడిన మత్స్యముపాట్లు వచ్చెను. గాయమునకు విషముఁదగిలించినట్లు, రాణి మఱలఁ గఠోరవాక్యములఁ బలికెను. "ఓ రాజా! ఏబలముచేత, నీవు నన్ను మొదటవరము నడుగుమడుగుమని పలికియుంటివి? తుద కీప్రకారముప్రవర్తించుట న్యాయమా? ఎప్పుడయినను రెండుమాట లుండునా? ఎప్పుడయిన నేక ముహూర్తమున, నవ్వుటయు బుగ్గలబూరించుటయు జరుగునా? కృపణత్వమును దాతృత్వమును జోడుగనుండునా? కోపమునకును శాంతమునకును పొత్తుండునా? సత్యమును రక్షించుకొనుము; లేక, నీమాటఁదీసికొనుము; ఆఁడుదానివలె, నేడ్చుట యుచితముకాదు. శరీరము, ధనము, పుత్రులు, భార్య, గృహము, రాజ్యము—ఈ మొదలగునవి సత్యసంధులకుఁ దృణప్రాయములు."

దోహా 44

ఆమె పలికిన దుస్సహావచనములను మహారాజు విని, చింతాక్రాంతుఁడై, "నీకుఁ దోఁచినవిధమునఁ బలుకుచుంటివి. నీవలన దోషము లేదు; విధినాథుఁడు నిన్నావహించెను; అతఁడే నీముఖమునుండి, పలికించుచుండెను." అనిపలికి, నిట్టూర్పులను విడిచెను.

చౌపాయ్

"ఓ భామినీ! మఱపునకయినను, భరతుఁడు రాజ్యపదవిఁ గోరఁడు. ఏపాటి తెలివిగలవారట్లు చెప్పరు. విధివశమువలన, నీకు దుర్బుద్ధిపుట్టెను; ఇదియంతయు నా పాపఫలము. విధినాథుఁడు నాకు వ్యతిరిక్తముగనుండెను. భరతుఁ డేమి చేయఁగలఁడు? సకలగుణధాముఁడగు శ్రీరాముని ప్రభుత్వములో, నయోధ్యానగరము, సురలముందునకుఁగలకలలాడుచుండును. అన్నదమ్ములు శ్రీరాముని సేవించెదరు. త్రిలోకములలో రామునికీర్తి వ్యాపించును. మనము చనిపోయినను, నాపశ్చాత్తాపమును, నీ దుర్బుద్ధియు నశింపవు; ఆచంద్రార్కము భూమిమీఁద నీ రెండును నిలిచియుండును. ఇక నీయిష్టము ప్రకారము ప్రవర్తింపుము. నాకన్నులయెదుట నిలిచియుండకుము; ఎచ్చటనయిన, నీముఖమును దాఁచియుంచుకొనుము. నీ ముఖముఁ జూచిన, నాకుఁ గోపమువచ్చును. చేతులఁజోడించుకొని, ప్రార్థించెదను; నేను జీవించియుండునంతవఱకు, నీవు నాతోఁ బలుకవద్దు. ఓ దౌర్భాగ్యురాలా! తుదకు నీవు పశ్చాత్తాపముఁ బడఁగలవు. ఎవరయినను, సింహముకొఱకు గంగగోవును సంహరించెదరా?"

దోహా 45

ఈప్రకారము రాజు పలువిధముల విలపించి, నేలఁగూలెను. "ఏలనాపుట్టి ముంచితివి! నావంశమును నశింపఁజేయుటకుఁ గారణమేమి?" ఈప్రకార మతఁడు చింతించెను. కాలుచుండిన కాష్ఠము వలె, నామె నిలిచియుండెనుకాని, ప్రత్యుత్తరము నిచ్చియుండలేదు.

చౌపాయ్

రెక్కలువిఱిగిన పక్షివలె, నా మహారాజు, "రామరామ," అని యేడ్వసాగెను. "రేపుసూర్యుఁ డుదయింపకపోవుఁగాక! ఈవృత్తాంతము రామునకుఁ దెలియకపోవుఁగాక! ఓ రఘుకులగురువా! దివాకరుఁడా! నీవు రేఖమాత్ర ముదయింపకుము. నీవుదయించినయెడల శ్రీరాముఁడు వనములకుఁబోవును; అయోధ్యానగరము వ్యాకులమగును; అతనివియోగమువలన, నాకు బాధకలుగును—" ఈప్రకార మతఁడుచింతించి, నేలఁబడెను. ఆ రాజుహృదయ మతికోమలము; కైకేయి హృదయ మతికఠినము. ఈ రెండింటిని బ్రహ్మ సంఘటనముఁ

జేసెను. ఈప్రకారము రాజు విలపించుచుండ, నరుణోదయమయ్యెను. రాజమందిరమువద్దకువచ్చి, వైతాళికులు మేల్కొలుపులఁబాడిరి— మంగళధ్వనులు మ్రోఁగెను; పంచవాద్యములు మ్రోఁగెను; ఆమంగళ ధ్వనులతనిహృదయమునకు బాణములవలెఁ దగిలెను; సహగమనముఁ జేయదలఁచినస్త్రీకి భూషణములయందసహ్యముకల్గునుకదా! అట్టుల నతనికి వానియందసహ్యము పుట్టెను. శ్రీరాముని పట్టాభిషేకమహోత్సవ సంబరముచే, నాఁటిరాత్రి నగరములో స్త్రీపురుషులు నిద్రించి యుండలేదు. శ్రీరామదర్శన కుతూహలాయత్తచిత్తులై వారు మేల్కొని యుండిరి.

**దోహా 46**

సింహద్వారమువద్ద మంత్రులును, జనులును గుంపులుగూడి యుండిరి. "సూర్యోదయ మయ్యెను; ఇంతవఱకు రాజదర్శనము కాలేదు—ఏమికారణమ"ని వారు గుసగుసలాడిరి.

తృతీయవిశ్రామము సమాప్తము.

—

# చతుర్థ విశ్రామము.



### చౌపాయ్

"అరుణోదయమునకుఁ బూర్వమే రాజుగారు లేచుట యాచారమనుకదా! నేఁడింతవఱకు లేవకయుండు టాశ్చర్యము. ఓ సుమంత్రా! నీవు శీఘ్రమువెళ్లి, రాజును మేల్కొలిపి, వారి యాజ్ఞప్రకారము వ్యవహరింపవచ్చును"—అని జనులుపలికిరి. అతఁడు రాజుశయనించిన గృహమునకు వెళ్లెను; ఆశయనగృహముఁజూచినంతలో, నతనికి భయభీతులు కలిగెను. ఆగృహములోనుండి యేదోదుముకి మ్రింగుటకు వచ్చినట్లు కనఁబడెను; కాని అది మ్రింగుటకు వీలులేక విడిచిపెట్టెను. ఆగృహములో విషాదమును విపత్తును నివసించియుండినట్లు కనఁబడెను. అతఁడు దౌవారికుల నడిగెను; కాని, వారు తగినప్రత్యుత్తరమునిచ్చియుండలేదు. రాజును కైకేయియు నివసించియుండిన గదివద్దకువచ్చెను. "ఓ నాథా! జయజయ! శతందీర్ఘమాయుః" అని దీవించి, జోహారువని కూర్చుండెను. అతఁడు రాజుదుర్దశఁజూచి, వెలవెలఁబోయెను. వ్యాకులమునచే రాజు చింతాక్రాంతుఁడై, నాళమునుండి త్రుంచివేయఁబడిన కమలమువలె, నేలఁబడి యుండెను. సుమంత్రుఁడు భయపడి, యేమాట నడుగుటకు వెఱచెను. అమంగళములకును, అశుభములకును పుట్టినిల్లు కైకేయి, యొక పన్నాగముఁబన్ని, సుమంత్రునితో నిట్లుపలికెను.

### దోహా 47

"ఓ సుమంత్రా! ఈ గడచినరాత్రి రాజుగారు నిద్రించియుండలేదు; దానికారణము పరమేశ్వరునకుఁ దెలియును. వారు రామరామయనుచుండిరి; అంతలో రాత్రిగడచి, ప్రాతఃకాలమయ్యెను. కారణమును మాత్రము వారు నాకుఁ జెప్పియుండలేదు.

### చౌపాయ్

"ఈ వర్తమానము రామచంద్రునకుఁ జెప్పి యతనిని శీఘ్రము తీసికొనిరమ్ము— అతఁడు వచ్చినతరువాత సమాచారమును నీవు తెలిసి

కొనవచ్చును—" ఆమె మాటలను దశరథుఁడు విని, యూరకుండినందున నామాటలు వారిసమ్మతమని సుమంత్రుఁడు తెలిసికొని వెడలెను. ("రాముని కోమలత్వమును, నా వ్యాకులతను జూచి, యొకప్పుడు కైకేయిమూర్ఖత్వమును విడిచిపెట్టును" అని రాజుతలఁచి, ఆమెమాటలకు వ్యతిరిక్తముఁజెప్పక యూరకుండెను.) "కైకేయి యొకచమత్కారముఁ జేయఁదలఁచెను" అని మంత్రి నిశ్చయించెను. చింతాక్రాంతుఁడై యుండినందున, నతఁడు పాదములను ముందుకు వేయలేకపోయెను— "రాజు రామునితో నేమి చెప్పును?" అని యతఁడు తనలోఁదాను విచారించెను. అతఁడు ధైర్యమునవలంబించి, ద్వారమువద్దకు వచ్చెను. అతని ముఖము వెలవెలఁబోయెను; అతనిని రాజసమాచారమును గురించి జనులడిగిరి. వారికిఁ దగినట్లు సమాధానముఁ జెప్పి యతఁడు రాముని వద్దకు వెళ్లెను. శ్రీరామమూర్తి సుమంత్రునిఁజూచి, తండ్రినివలె, నాదరించి, సత్కరించెను. ఆ రఘుకులదీపకుని, ఆ రాముని ముఖారవిందమును సుమంత్రుఁడు చూచి, సంతోషించి, రాజాజ్ఞను విన్నవించి, అతనిని వెంటఁదీసికొని, వెళ్లెను. ఉత్తరీయమును వేసికొని, శ్రీరాముఁడు పాదచారియై సుమంత్రునివెంట వెళ్లెను. అతఁడు పాదచారియై వెళ్లుటఁ జూచి, లోకులు చింతాక్రాంతులై, యేదో యుపద్రవముపుట్టె ననితలంచి భయపడుచుండిరి.

**దోహా 48**

ఆఁడుసింహమును జూచిన వృద్ధగజమువలె, విగుఱుపడి, సొమ్మసిల్లి యుండిన వృద్ధరాజును శ్రీరాముఁడు చూచి, యాశ్చర్యపడెను.

**చౌపాయి**

దశరథుని పెదవు లెండిపోయెను; ముఖము వాడెను; శరీరము మండుచుండెను. మణిని బోఁగొట్టుకొనిన సర్పమువలె దీనుఁడై యుండెను. నిమిషములను లెక్కపెట్టుచుండిన మృత్యువువలె, నతనియెదుటఁ గూర్చునియుండిన కైకేయిని, శ్రీరాముఁడు చూచెను. శ్రీరాముని స్వభావము కోమలము; అతఁడు కరుణాసముద్రుఁడు; ఇంతవఱకు దుఃఖము నతఁడు చూచిగాని వినిగాని యుండలేదు. అయినను నతఁడు ధైర్యమునవలంబించి, దుఃఖించుసమయము కాదని తెలిసికొని, మృదు

మధురముగ నతఁడు తల్లితో నిట్లు ప్రసంగించెను—"ఓతల్లీ! తండ్రి గారిదుఃఖమునకుఁ గారణమేమి! ఆకారణము నాతోఁ జెప్పుము; వారిదుఃఖము శాంతించుటకుఁ దగినట్లు వ్యవహరించెదను." "ఓ రామా! వారిదుఃఖమునకు నీవే కారణము; నీమీఁద వారికి మోహ మధికము. వారు నాకు రెండువరముల నిచ్చియుండిరి. నే నావరములను యాచించితిని; నే కోరినవరములను వారు వినినందున, వారికి దుఃఖముకలిగెను. నీప్రతిబంధకమే వారిని బాధించుచుండును.

దోహా 49

"ఓ రామా! ఒకవైపునఁ బుత్రవాత్సల్యము; రెండవవైపున సత్యవాక్యపరిపాలనము. ఈ రెండింటిమూలమున, వారిమనస్సు డోలాయమానముగ నుండును. నీవు సమాధానమయినయెడల వారియాజ్ఞను శిరసావహించి, వారిదుఃఖమును శాంతింపఁజేయుము."

చౌపాయ్

ఆమె కూర్చుండి, యీప్రకారము శల్యములను భేదించు వాక్యములఁబలికెను; మూర్తీభవించినకాఠిన్యమునహిత మూ మెమాటలనువిని సిగ్గుపడును. ఆమెనాలుక—ధనస్సు; ఆమెవాక్కులు—బాణములు; ఆబాణములకు లక్ష్యము—రాజు. మూర్తీభవించినకాఠిన్యమువచ్చి, ధనుర్విద్యలోఁ బాండిత్యముఁబొంది, బాణములఁ బ్రయోగించునట్లు, కైకేయి రాజునుద్దేశించి, వాక్కుల నుపయోగించెను. "దేహమేకు" వలె, నామె కూర్చుండి, పూర్వోత్తరమంతయు రామునకు బోధించెను. ఆరఘుకులమార్తాండుఁడు, ఆసచ్చిదానందమూర్తి, ఆ శ్రీరామచంద్రమూర్తి లోలోపున నవ్వుకొనెను. ఆసరస్వతీదేవియొక్క ముఖమునుండి యూడిపడిన నవరత్నములో యనునట్లు, శ్రీరామమూర్తి మృదుమధురముగ తల్లితో నిట్లు ప్రసంగించెను:— "ఓ అమ్మా! తల్లీ! నామాట వినుము; తల్లిదండ్రులమాటప్రకారము ప్రవర్తించుకుమారుఁడు ధన్యుఁడు; తల్లిదండ్రులను బోషించి, వారిని స్మరించుకుమారుఁడులోకములోదొరుకుటదుర్లభము.

దోహా 50

"ఓ జననీ! వనములోనుండిన మునులతో గలసి, కాలక్షేపముఁ జేయుటయందు నా కభిలాష కలదు; తదుపరి, తండ్రిగారి యాజ్ఞ

కలదు; అందుకు నీవు సమ్మతించితివి; ఇఁక నిశ్చయముగ నాకోరిక సఫల మగును.

చౌపాయ్

"ఓ తల్లీ! భరతుఁడు నా ప్రాణమువంటివాఁడు; అతఁడు రాజ్యముఁ బరిపాలించిన, నా కపరిమితసంతోషము కలుగును. అన్ని విధముల నాకు భగవంతుఁ డనుకూలముగ నుండెను. అనేకలాభములు నాకుఁ గలుగును. మునీశ్వరుల సంసర్గము, పుణ్యతీర్థ దర్శనము, జననీ జనకుల యాజ్ఞ పరిపాలన, భరతుని రాజ్యాభిషేకము—వీనికంటె నాకు లాభ మేమికలదు? ఓ తల్లీ! ఇంతమంచితరుణము వచ్చినపుడు, నేనుగాని వనములకుఁబోనియెడల, నేను పరమమూర్ఖాగ్రేసరుఁడ నని తెలిసికొనుము. కల్పవృక్షమునువిడిచి,ఆముదపుచెట్టు నాశ్రయించువాఁడును,అమృతమునువిడిచి విషమును సేవించువాఁడును, మంచితరుణము వచ్చినపుడు, దానినిబోఁగొట్టుకొని విలపించును; అప్పుడు వాఁడుపడిన విచారముఁ జూడుము. అయినను, ఓతల్లీ! నాకొకవిచారము కలదు. తండ్రిగారు వ్యాకులపడియుండిరి. ఇంతస్వల్పాంశము తండ్రిగారిని విశేషవ్యాకులముఁ జేసెనుకదా యని నాకు విచారము కలుగుచున్నది; ఇంతస్వల్పమునకు నాజనకులు దుఃఖించెదరని నాకు నమ్మకము లేదు. నా తండ్రిగారు ధైర్యవంతులు; సకలగుణసంపన్నులు; నే నేదైన గొప్పయపరాధముఁ జేసియుండవలెను. అందుచేత, నాతండ్రిగారు నాతో మాట్లాడుట లేదు. ఓతల్లీ! నామీఁద నొట్టుబెట్టుకొని, నిజముఁ జెప్పుము."

దోహా 51

స్వభావసిద్ధముగ శ్రీరామమూర్తి పలికిన పలుకులు నిష్కపటముగ నుండినను, ఆకపటి, ఆ మందమతి, ఆ కైకేయి యతనిమాటలకు నపార్థము నిచ్చెను. జలప్రవాహము సమానముగ నుండినను, జలగ దానిస్వభావముచేత, వంకరటింకరగఁ బోవునుగదా!

చౌపాయ్

శ్రీరాముఁడు వనమునకుఁ బోవుటకు సిద్ధముగ నుండుటఁజూచి, కైకేయి సంతోషించెను. అతనిమీఁద నెంతోదయయుండినట్లు అభినయించి, ఆమె కుమారునితో నిట్లుపలికెను: "ఓరామా! నీతోడు; భర

తునితోడు; ఇంతకంటె మఱియొక కారణము నాకుఁ దెలియదు. నీవు చేసిన యపరాధమేమి? ఆ దోషము నీకు లేదు. నీ జననీజనకులును, నీబంధువులును, నిన్నుఁజూచి, నీ కలుపుఁగోలుదనముఁజూచి, సంతోషించుచుందురు. ఓరామా! నీవు చెప్పనమాటలు సత్యము. నీ తల్లిదండ్రులచిత్తము ననుసరించి, నీవు ప్రవర్తించెదవు. ఓరఘునాథా! ఈవార్ధక్యములో నీతండ్రిగారి కపకీర్తి రాకుండునట్లు బోధింపుము; వారు పుణ్యాత్ములు; సత్యవాక్యధురంధరులు; కనుక, నీవంటికుమారుఁడు వారికి లభించెను; వారి తపఃఫలమే నీవు; కనుక, వారు సత్యమును విడుచుట యుచితముకాదని బోధింపుము." మగధదేశములో (అనిన, పాపపుదేశము) నుండిన 'గయ' మొదలగు పుణ్యతీర్థములువలె, నింతతియ్యనిమాటల నామెపలికెను. మఱికినీరువచ్చి గంగానదిలోఁగలసి,శుభ్రమగువిధమున, నామెమాటలను శ్రీరాముఁడు నిర్మలముగ గ్రహించెను.

దోహా 52

శ్రీరామమూర్తివచ్చినసంగతిని, దశరథుఁడు తెలివిఁ దెచ్చుకొని, ప్రక్కకుఁ గదలెను. "మహారాజాధిరాజా! రాజమార్తాండా! చింతింపుఁడు; ధైర్యము నవలంబింపుఁడు. శ్రీరామచంద్రులు వచ్చిరి" అని సుమంత్రుఁడు సమయోచితముగ విన్నవించెను.

చౌపాయ్

శ్రీరామమూర్తివచ్చిన సంగతిని రాజు విని, ధైర్యముఁ దెచ్చుకొని, నేత్రములను విప్పి చూచెను. అప్పుడు సుమంతుఁడు రాజును లేవఁదీసి, యొక యున్నతాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. అప్పుడు కుమారుఁడు తండ్రిపాదములకు నమస్కరించెను పుత్రవాత్సల్యముచేత నతఁడు వ్యాకులపడి, కుమారునిఁ గౌఁగిలించుకొనెను. పోఁగొట్టుకొనిన మణి, పునః దొరకినందున సంతోషించు సర్పమువలె, నతఁడు సంతోషించెను అతఁడు కన్నులార రాముని జూచిచూచి, కన్నీరుగార్చెను. అతనికి దుఃఖము మనస్సులో నుప్పొంగి వచ్చుచుండెను; అందుచేత, నతఁడు మాటలాడక, రాముని పునఃపునః కౌఁగిలించుకొనుచుండెను. ఏవిధముననయిన శ్రీరాముఁడు వనమునకుఁ బోకుండునట్లు ప్రసాదింపుమని యతఁడు మనస్సులో భగవంతుని బ్రార్థించుచుండెను. అతఁడు సాంబశి

వుని స్మరించి, యిట్లువిన్నవించెను:—"ఓస్వామీ! నామొరాలకింపుము. నీవు శీఘ్రము ప్రసన్నుఁడవు కాఁగలవు; ఎంత నీచుఁడయినను, వాఁడు నీభక్తుఁడయినపుడు, వానిని నీవు రక్షించెదవు; నీచిత్తము కోమలము. నేను నీదాసుఁడను; దీనుఁడను. నీకుఁ దెలియనిసంగతి లేదు. నాదుఃఖముఁ బోఁగొట్టుము.

దోహా 53

"ఓ నాథా! సకలజీవుల హృదయములను నీవు ప్రేరేపించెదవు. నామాటను నిర్లక్ష్యముఁ జేసి, రాముఁడు వనమునకుఁ బోకుండునట్లతనిమనస్సుఁ ద్రిప్పుము. అతనికి నాయందుఁగల భక్తివిశ్వాసముల నతఁడు మఱచిపోవునట్లు చేయుము.

చౌపాయ్

"అపకీర్తి వచ్చుఁగాక; నా పేరు ప్రతిష్ఠలు నశించుఁగాక; స్వర్గముకంటె నాకు నరకమె వచ్చుఁగాక; లోకములో భగవంతుని కృపవలనఁ బడరానిపాట్లు ననుభవించెదఁగాక. ఏమివచ్చినను, వానిని యనుభవించెదను; కాని, రాముఁడుమాత్రము నాకన్నులయెదుటనుండి వెళ్ళకుండునట్లు ప్రసాదింపుము." ఈప్రకారము రాజు విచారించుచు యేడ్చుచుండెను; కాని, యొకమాటనయినను, నతఁడు పలుకలేదు. అతని మనస్సు చలించెను; రావియాకువలె, నతని చిత్తము డోలాయమానముగ నుండెను. తండ్రిగారు ప్రేమవశులై యుండిరని రాముఁడు గ్రహించెను; అతఁడు నమ్రుఁడై, తల్లిచెప్పినమాటల నిజమును తెలిసికొనఁగోరి, దేశకాలానుగుణ్యముగఁ దండ్రిగారితో నిట్లుపలికెను: "హే పితాజీ! మీతోఁ గొంచెము ప్రసంగింపఁ దలఁచితిని. అపశబ్దములు పొరపాటున వచ్చినయెడల, నేను బాలుఁడనుకనుక, నన్ను క్షమింపుఁడు. ఇంతస్వల్పమును గుఱించి మీరిట్లు విచారించుట యేల! ప్రథమమున మీరీసంగతిని నాతోనెందుచేతఁ జెప్పియుండలేదు? మీవిచారముఁ జూచి, నేను తల్లిగారివలన దీనిపూర్వోత్తరములఁ దెలిసికొనినతరువాత, నాహృదయము చల్లఁబడెను.

దోహా 54

"హే పితాజీ! ప్రస్తుతము మంగళమునకు సమయము; పుత్రవాత్సల్యముచేత మీరిట్లువిచారించుట తగదు. మీ మాటప్రకారము

మీరునడచి, ఋణవిముక్తులగుట యుచితము. శోకమును విడిచిపెట్టుడు. నేను వనములకుఁ బోవుటకు సెలవుదయచేయుఁడు" అని విన్నవించి, రాముఁ డతియుత్సాహముతో నరణ్యమునకుఁ బోవుటకు సిద్ధపడెను.

చౌపాయ్

"హే పితాజీ! ఏకుమారుని ప్రవర్తనవలన, జననీజనకులు సంతోషించెదరో, వానిజన్మమే జన్మము; వాఁడేధన్యుఁడు; చతుర్విధఫల పురుషార్థములు వానికి సులభముగ లభించును; ఎవఁడు తల్లిదండ్రులను తనప్రాణములకంటె నధికముగఁ బ్రేమించునో, వాఁడేకుమారుఁడు. మీయాజ్ఞను పాలించుటవలన, నా జన్మమును సఫలముఁజేసికొని, శీఘ్రమువచ్చెద. తల్లిగారివద్ద సెలవుఁ బుచ్చుకొని వచ్చి, మీచరణారవిందములకు నమస్కరించి వెళ్లఁగలను." ఈప్రకారము శ్రీరామమూర్తి విన్నవించి వెడలెను. శోకార్ణవములో మునిఁగియుండినందున, రాజు రామునకుఁ బ్రతివచనముఁ బలుకలేదు. ఈసమాచారము రాజసేవకులవలన వెల్లడియై, నగరమంత వ్యాపించెను. తేలుకుట్టినపుడు శరీరము వ్యాకులముపడినట్లు, స్త్రీపురుషు లాబాలవృద్ధులు యేడ్వసాగిరి. కార్చిచ్చు నలువైపుల వ్యాపించినపుడు లతలును, వృక్షములును వాడినట్లు, వారిముఖములు వాడెను. వారు ధైర్యమునువిడనాడి, శిరములను బంకించి విలపించిరి.

దోహా 55

వారిముఖము లెండిపోయెను; వారినేత్రములనుండి, నీరు వఱదలై కారెను. వారిదుఃఖము హృదయములోనుండి పొంగివచ్చుచుండెను. కరుణారసము రణభేరిని మ్రోగించుకొని, నగరముమీఁదికి దండు వెడలివచ్చినట్లు కనఁబడెను.

చౌపాయ్

"ఆహా! పీటలమీఁది శుభకార్యమును భగవంతుఁడు చెడఁగొట్టెను." ఈప్రకారము పురజనులు గుసగుసలాడుచు, రాణి కైకేయినిఁ బలువిధముల దూషించుచుండిరి. "ఈ పాపాత్మురాలు చక్కని కొంపకు నిప్పుపెట్టెనుగదా ఆమె కేమి లాభముకలుగును! ఆమె స్వహస్తములతో నేత్రములు నూడఁదీసి వానినిచూడఁదలఁపనే! అమృత

మువంటి రాముని విడిచి, ఆమె విషమునుగోరుచుండెనే! వెదురుపొదకు నువలె, నా మెరఘువంశమునకుఁ జిచ్చుపెట్టెను. కొమ్మమీఁదఁగూర్చుండి, చెట్టుఁగొట్టిన ట్లయ్యెను; ఆమె శుభము నశుభముఁజేసెను. ఆమెను రాముఁడు ప్రాణములనువలెఁ బ్రేమించుచుండునుకదా! అట్టి రామునియెడల నింత దుర్మార్గముగఁ బ్రవర్తించుట కామె కెట్లు మనస్కరించెనో కదా! స్త్రీలవిషయమై కవీశ్వరులు చెప్పినమాట నిజము. ఆ స్త్రీలమనస్సు అగాధము; కపటము; వారిమనస్సును గ్రహించుటకు శక్యము కాదు. అద్దములోఁ గనఁబడు ప్రతిబింబముఁ బట్టుకొనవచ్చును కాని, స్త్రీలమనస్సును గనిపెట్టుట కష్టము.

దోహా 56

"అగ్నిచే దహింపఁబడనివస్తువు కలదా? ఏపదార్థమును సముద్రము భరింపలేదు! ప్రతిపదార్థమును కాలుఁడు మ్రింగునుకదా! ఆప్రకారము, స్త్రీలు ప్రబలులై, యేపనిఁ జేయలేరు?

చౌపాయి

"ఒకదానిం జేయఁదలఁచి, భగవంతుఁడు మఱియొకదానిం జేసెను; ఒకదానిం జూపించుటకుదలఁచి, మఱియొకదానిం జూపించెను." ఈప్రకారము పలువిధముల నామెను వారు దూషించిరి. "రాజు చేసినపని బాగులేదు. అతఁడు పూర్వోత్తరముల నాలోచింపక, యీ పాపాత్మురాలకు వరములనిచ్చెను. ఆలోచింపక పనిఁజేసినందున, నతఁడు దుఃఖముఁ గొనితెచ్చుకొనెను. అతఁడు స్త్రీలోలుఁడు; అతనికి బుద్ధిలేదు; యుక్తాయుక్తవిచక్షణ లేదు." అని యొకఁడు రాజును దూషించెను. రాజు సత్యసంధుఁడనియు, ధర్మాత్ముఁడనియు మఱియొకఁడు రాజును భూషించెను. శిబి, దధీచి, హరిశ్చంద్రుఁడు—ఈ మొదలగు చక్రవర్తులచరిత్రములను వారిలోవారు చెప్పుకొని, రాజును శ్లాఘించిరి. ఈవిషయములో భరతుఁడు తంత్రముఁజేసెనని యొకఁడు చెప్పెను; ఆమాటనువిని, మఱియొకఁడు సిగ్గుపడి యూరకుండెను. మూఁడవవాఁడు చెవులను మూసికొని, పండ్లఁగొఱుకుచు, పెదవులను బిగించి, కోపించి, "ఓయీ! ఇట్టి పాపపుమాటలఁ బలుకుట తప్పు. రామునకు

భరతుఁడు ప్రాణమువంటివాఁడు. ఇట్టిమాటలఁ బలుకుటవలన నీకుఁ బాపమువచ్చును." అని హుంకరించెను.

దోహా 57

"ఓరీ! చంద్రబింబములోనుండి నిప్పులవర్షము పడవచ్చును; అమృతము విషముకావచ్చును; కాని, యెన్నఁడునూత్రము రామునకు భరతుఁడు కీడుఁజేయఁ దలంపఁడుసుమీ" అని వాఁడు సమాధానముఁ జెప్పెను.

చౌపాయ్

అమృతము నాశఁ జూపించి, భగవంతుఁడు విషము నిచ్చెనని యొకఁడు భగవంతుని దూషించెను. నగరమంతయు కోలాహలముతో నిండెను; ఇతఃపూర్వమువా రనుభవించిన సంతోషమంతయు నిమిషములో మాయమయ్యెను; జనులందఱు శోకార్ణవమగ్నులై యుండిరి. కైకేయిచే సన్మానముఁబొందుచుండిన బ్రాహ్మణులస్త్రీలు పలువిధముల నామెనుబోధించి, హితము నుపదేశించిరి. "ఓతల్లీ! భరతునికంటె రాముఁడే నీకుఁ బ్రియుఁడని నీవు మాతోఁ జెప్పియుంటివి; ఈసంగతి లోకవిదితము స్వభావసిద్ధముగ నీకు రామునిమీఁద దయకలదు. అతఁడు నేఁ డేమియపరాధముఁ జేసెనని తలఁచి నీ వతనిని వనములకుఁ బంపెంచుచుంటివి! నీ సవతులతో నీకు సఖ్యముకలదు కాని, వైరము లేదుకదా! మీసవతుల కలుపుగోలుతనమును, అన్యోన్యానురాగమును సుప్రసిద్ధము. ఓతల్లీ! కౌసల్య నీకేమి యపరాధముఁ జేసెను? ఆమె కింతపిడుగువంటి కష్టమును నీవు తీసికొనివచ్చుట నీకుఁ దగునా? ఆమె యొకరికేకాదు; నగరమునకును దేశమునకును నీవింతకష్టముఁ దెచ్చిపెట్టుట యుచితముకాదు.

దోహా 58

"ఓ తల్లీ! నీవు లెస్సఁగవిచారింపుము. ఇప్పుడు జానకి రాముని విడిచిపెట్టునా? లక్ష్మణుఁడు గృహములోనుండునా? భరతుఁడు రాజ్యముఁజేయునా? రామునిజూడక మహారాజు జీవించియుండునా?

చౌపాయ్

"ఓ తల్లీ! ఈసంగతులను విచారించి, కోపమును విడిచిపెట్టుము. చేతులు కాలినతరువాత విచారించిన లాభములేదు నిష్కార

ణము నీ కపకీర్తి వచ్చును; ఉత్తరోత్తరము నీవు విచారింపఁగలవు. నీ కోరికప్రకారము, భరతునకే యువరాజ్యపట్టముఁ గట్టుము; కాని, రాముఁడు వనమునకుఁ బోవుటవలన నేమిప్రయోజనము కలదు? రామునకు లేశమైనను రాజ్యముఁజేయుట కభిలాషలేదు. అతఁడు ధర్మధురంధరుఁడు; విషయభోగముల ననుభవించుట కతనికిఁ గోరికలేదు. అతఁడిచ్చట నివసించుటవలన నుపద్రవము వచ్చునని నీవు తలంచిన యెడల నతఁడు నగరువిడిచి గురువుగృహములో నివసించును. ఈప్రకారము నీవు రాజును వరమడుగుము. నామాటలను నీవు మన్నింపని యెడల నీచేతులతోఁ జేసినపనులన్నియు నశించును; తప్పక భ్రష్టగుదు ఒకవేళ, నీవు హాస్యమునకు బలికియుండినయెడల, నిజముఁజెప్పుము. ఓతల్లీ! రామునివంటి కుమారుఁడు వనమునకుఁబోవుటకుఁ దగఁడు. ఈసంగతిని లోకులువిని, నీవిషయమై యేమని చెప్పుకొనుచుందురు? లేలెమ్ము. చేయఁదగినపనిని శీఘ్రముచేయుము. నీ పుణ్యముండును; నీమూలమున మాప్రాణములు నిలువఁబడును; నీయపకీర్తి పోవును.

ఛాంద్ 2

"ఓ తల్లీ! నీ యిష్టమువచ్చినయుపాయముఁ జేసి, నీయపకీర్తిఁ బోఁగొట్టుకొనుము; మా ప్రాణముల నిలువఁబెట్టుము నీ వంశమును రక్షించుకొనుము. ఏవిధముననయిన శ్రీరాముఁడు వనమునకుఁ బోకుండునట్లు ప్రయత్నింపుము. చేతులు కాలినతరువాత, విచారించినందునఁ బ్రయోజనములేదు. మఱియొకవిషయమై నీవు శ్రమపడినను, లాభము లేదు. 'సూర్యుఁడులేని దినమువలె, ప్రాణములులేని శరీరమువలె, చంద్రుఁడులేని రాత్రివలె, రాముఁడులేని నగరము కళాహీనమగును.' అని తులసీదాసుగారు చెప్పుచున్నారు. ఓతల్లీ! ఈ సంగతి లెస్సగ విచారింపుము."

సోరఠా 2

ఈప్రకారము పూర్వోత్తరముల నాలోచించి, స్త్రీలు హితోపదేశముఁ జేసిరి; వారిమాటలు మృదుమధురముగ నుండెను; ఉత్తరోత్తరము వానివలన లాభముకలుగును. వారిమాటలు కైకేయిచెవులఁ

# పంచమవిశ్రామము

చౌపాయి

శ్రీరాముఁడు తల్లిపాదములకు మ్రొక్కి, చేతులను జోడించుకొని నిలువఁబడెను; ఆమె కుమారునిదీవించి, కౌఁగిలించుకొని వస్త్రాద్యలంకారములను దిగఁదుడిచి పారవేసెను. మాటిమాటికామె రాముని ముఖమును ముద్దుఁబెట్టుకొనెను; ఆనందబాష్పములామె నేత్రముల వెంబడి వఱదలై కాఱెను; ఆమె శరీరము పులకరించెను. ఆమె తొడలపై రాముని గూర్చుండఁబెట్టుకొని కౌఁగిలించుకొనెను; ఆమెచనుదోయి నిండ పాలుచేపు వచ్చెను. ప్రేమపరవశురాలై యామె మాటఁ బలుకలేకపోయెను. పుట్టుదరిద్రునకు నిధులు లభించినట్లయ్యెను అత్యంత వాత్సల్యముతో నామె కుమారుని ముఖము నుపలక్షించి యిట్లు మృదుమధురముగ సంభాషించెను. "నాతండ్రీ! నీకు నేనుబలిహారిని; నీ యభిషేకోత్సవ శుభముహూర్త మెప్పుడు? నీవు సకలగుణసంపన్నుఁడవు; బుద్ధిమంతుఁడవు; ధర్మాత్ముఁడవు; మా నోములపంటవు; అయోధ్యాపుర జనులభాగ్యమువలన నీవు లభించితివి.

దోహా 60

"స్వాతివానలకు చాతకములువలె, నీయభిషేకమునకు జూచునవలెనని, స్త్రీపురుషులందఱు కుతూహలముతో నుండిరి

చౌపాయి

"ఓ తండ్రీ! లెమ్ము; శీఘ్రముగ స్నానముఁ జేసి, నీ యిష్టమువచ్చినది కొంచెము మధురపదార్థములను భుజించి, నీతండ్రివద్దకు వెళ్లుము. ఇప్పటికే, విలంబమయ్యెను. జాగుఁజేయక, లేలెమ్ము"—అని తల్లి ప్రేమపూర్వకముగఁ బలికెను. పుత్రవాత్సల్యముచే నామె యిట్లుచెప్పెను. ఆమె వాత్సల్యమే యొక కల్పవృక్షము; ఆమె వాక్కులే దానిపుష్పములు; ఆమె దయయే దాని మకరందము; దానికి మూలము సంపత్తి ఆపుష్పములఁ జూచి తుమ్మెదలు భ్రమించును; కాని, రాముని మనస్సు మాత్రము చలింపలేదు అతఁడు ధర్మధురంధరుఁడు; ధర్మమార్గమును గుర్తెఱింగినవాఁడు మృదుమధురముగ నతఁడు తల్లితో నిట్లుపలికెను.

"ఓతల్లీ! నాతండ్రిగారు నాకు వనవాసరాజ్యము నిచ్చిరి. అన్నివిధముల నాకార్యములు నెఱవేఱును. నీవు కటాక్షించి నీయనుజ్ఞ దయచేయుము; నేను వనమునకుఁ బోవుటకు నీవు సంతోషించి ప్రసాదింపుము; మంగళములు సమకూడును. నావియోగమునకు నీవు దుఃఖింపకుము. నీదయవలన నాకు శుభము కలుగును.

దోహా 61

"ఓతల్లీ! తండ్రిగారి యాజ్ఞను మన్నించి, పదునాలుగు సంవత్సరములు వనవాసముఁ జేసి, పునః నీచరణకమలములను దర్శించెద. నీవు మనస్సులో విచారింపకుము."

చౌపాయి

ఈప్రకారము మృదుమధురముగ రాముఁడు పలికిన పలుకులు ములుకులువలె, నామె హృదయమునకుఁ దగిలెను. వర్షము పడినపుడు 'జవాస' పుష్పము వాడి యెండిపోవునట్లు, శ్రీరాముని చల్లనిమాటలను విని తల్లి సొమ్మసిల్లి నేల వ్రాలఁబోయెను. ఆమెవిషాదముఁ జెప్పుటకు శక్యముకాదు. సింహనాదమును వినిన హరిణివలె నామె దిగులుపడెను. ఆమె నేత్రములనుండి నీరు వఱదలై కారెను; ఆమెశరీరము గడగడవడఁకెను. జలములోనుండిన యెఱను మ్రింగిన మీనమువలె, నామె వ్యాకులముపడెను. ఆమె ధైర్యముఁ దెచ్చుకొని రామునిఁ జూచుచు గద్గదస్వరముతో నిట్లుపలికెను. "ఓతండ్రీ! నీజనకులు నిన్ను వారిప్రాణములకంటె స[illegible]కముగఁ జూచుకొనుచుండిరి; నీబాలచర్యలు సదా వారికన్నులకుఁ బండుగ. నీకుఁ బట్టముఁ గట్టుటకు వారు శుభముహూర్తమును నిర్ణయించిరి. ఏమియపరాధమువచ్చెను? నిన్ను వనములకుఁ బంపుటకుఁ గారణమేమి? నాకుఁ జెప్పుము. ఎవరు మనసూర్యవంశమునకు నిప్పుఁబెట్టిరి!"

దోహా 62

రాముని ముఖముఁ జూచి, తదుపరి సుమంత్రునికుమారుఁడు అభినందనుఁడు, సర్వవృత్తాంతము నామెకుఁ జెప్పెను; ఈసంగతుల నామె విని, నిశ్చేష్టురాలయ్యెను; ఆమె దురవస్థ చెప్పుటకు శక్యము కాదు.

చౌపాయ్

అవును కాదని యేమాటం జెప్పుటకు నామెకు నోరు రాలేదు. ఈదుఃఖము నామె మ్రింగలేదు; కక్కలేదు; ఈ విషమసంధిలోం బడెను. చంద్రుండని వ్రాయుటకుబదులు రాహువని వ్రాసినట్లయ్యెను. అహా! కాల మొకరీతిం గడవంబోదు. విధికృతిములు విపరీత మగును ఆమెకు ద్వంద్వము వచ్చెను. ఆమె ధర్మమార్గమును విడిచిపెట్టలేదు; పుత్రవాత్సల్య మధికముగ నుండెను. చుంచుయెలుకను నోటం బట్టుకొనిన పాముపలె, నామె దుఃఖించెను. (ఆయెలుకను పాముమ్రింగిన చనిపోవును; దానిని కక్కినయెడల సర్పము గ్రుడ్డిపోవును.) "నేను మూర్ఛించి, కుమారుని నావద్ద నుంచుకొనినయెడల ననుకూలముగ నుండునుకాని, నాసుకృతము నశించును; నాబంధువులతో నాకు విరోధము వచ్చును. నాకుమారుండు వనములకుం బోవుటకు నేను సమ్మతించినయెడల గొప్ప యుపద్రవము పుట్టును." ఈప్రకారము మహారాణి కౌసల్య విషమ సంధిలోం బడి చింతించెను. తరువాత, ఆమె పతివ్రతధర్మమును జ్ఞప్తికిం దెచ్చుకొని, రామభరతు లిరువురును సమానులని తెలిసికొనెను. ఆమె చిత్తము స్వభావసిద్ధముగ సరళము. ఆమె ధైర్యము నవలంబించి, శ్రీరామునితో నిట్లుపలికెను. "ఓతండ్రి! నీకు నేను బలిహారిని; నీవుచేసినది మంచిపని—తండ్రిగారియాజ్ఞను మన్నించుటయే సర్వోత్కృష్టమగు ధర్మము.

దోహా 63

"ఓ తండ్రీ! మొదట నీకు రాజ్యమువచ్చునని సంతోషములేదు; ఇప్పుడు వనవాసమువచ్చినందులకు విచారములేదు; కాని, యొకమాట నిశ్చయము. నీ ముఖారవిందము కనంబడనపుడు, భరతుండును, నగరములోని స్త్రీపురుషులును, వీరికంటె నధికముగ నీ తండ్రిగారును విచారించెదరు.

చౌపాయ్

"ఓ నాముద్దుపట్టీ! కేవలము మీతండ్రిగారి యాజ్ఞయే అయినపుడు, నీవు వనమునకుం బోవలదు. నీతల్లిదండ్రులిరువురు యాజ్ఞ నిచ్చినయెడల, నీవు వనమునకుం బొమ్ము; అయోధ్యకంటె మారింతలు వనమే

శ్రేష్ఠము. ఎట్లయినను, మాతృవాక్యమును పరిపాలించుట యుచితము. 'పితుర్దశగుణాం మాతా గౌరవేణాతి రిచ్యతే' తండ్రికంటెఁ బదియంతలు తల్లి పూజ్యురాలు. తల్లికంటె సామాతయాజ్ఞ ప్రబలము. 'మాతుర్దశగుణామాన్యా విమాతా ధర్మభీరుణా' ఓ రామా! వనదేవతలే నీతల్లిదండ్రులు. ఖగమృగములు నీచరణకమలములను సేవించును. కాలమంతయుఁ గడచినతరువాత, వనవాసమే రాజున కుచితము; కాని, నీవు కేవలము సుకుమారుఁడవు నీవెట్లు వనవాసమును సహింపఁగలవోయని విచారము కలుగుచున్నది. అహా! అరణ్య మెట్టిభాగ్యము నోచుకొనెనోకదా! అయోధ్యానగర మెంతనిర్భాగ్యురాలు' ఓ రఘుకులమణీ! నీవు విడిచిపెట్టిన నగరము కళాహీనమగును. ఓతండ్రీ! నీతో నన్నుఁ దీసికొని వెళ్ళుమని నేను చెప్పినయెడల, నీకు సందేహముపుట్టును. భర్తను సేవించుట స్త్రీకి నుచితముకదా! ఈమె పుత్రునివెంట నెట్లు వెళ్లెనని లోకులునిందించెదరు లోకులంటేకే నీవు ప్రియుఁడవు; ప్రాణములకంటె నధికుఁడవు. నీవె నాప్రాణము. 'అమ్మా! నేను వనమునకు వెళ్లుచున్నాను' అని నీవడిగినపుడు, నేను పరితపించుచున్నానుకాని, నా శరీరమును విడిచిపెట్టలేకపోతిని.

దోహా 64

"నా నయనకొలఁది, నీవు వనమునకుఁ బోకుండఁజేయుటవలనఁ బ్రయోజనము లేదు. ఈ సంగతులను విచారించి, నే నూరకుంటిని. తల్లికిని, బిడ్డకును రక్తసంబంధము కలదని తెలిసికొని, బహుదినములు విదేశములలో నుండినను, నన్ను మఱవకుము.

చౌపాయి

(అ-పా) సీతారామా! శుక్రుఁడు, చంద్రుఁడు, సూర్యుఁడు, యముఁడు, కుబేరుఁడు-వీరందఱు నిన్ను రక్షించుఁగాక! నీవు దండకారణ్యములో నుండినను వీరిమూలమున నీ కానందము కలుగుఁగాక. ఓతండ్రీ! నీకు నేను బలిహారిని; అగ్ని, వాయువు, పవిత్రమగు యజ్ఞధూమము, ఋషులుచ్చరించుమంత్రములు, వారి యాచనలు-నిన్ను రక్షించుఁగాక! ఆజగన్నాథుఁడు, ఆజగత్కర్త, ఆగోబ్రాహ్మణరక్షకుఁడు, ఆరాక్షసాంతకుఁడు, ఆభగవంతుఁడు-నీవు వనవాసము చేయునపుడు, నిన్ను రక్షించుఁగాక! నిన్నుఁ గరుణించుఁగాక! షట్ఛాస్త్రములును, షడృతువులును,

చతుర్వేదములును, సప్తసముద్రములును, సప్తద్వీపములును, త్రిలోకములును, దశదిశలును నీకు సకలసుఖములనిచ్చుగాక! ఇవి నీకు మంగళముల నిచ్చుగాక! నీ అమంగళములను హరించుగాక!" ఈవిధమున కౌసల్య కుమారుని దీవించి, యతని శిరముపై నక్షతలనుంచి, యతని ముఖమున తిలకమునుబెట్టెను. ఇట్లు తల్లి కుమారుని సింగారించి, యతని దేహమునకు పరిమళద్రవ్యములను బూసెను.

దోహా 65

శరీరమునకు గాయములును, బడలికయు, మూర్ఛయు ఈ మొదలగుబాధలు కలుగకుండుటకు ఓషధుల నామె యతనిభుజమునకు గట్టి, ప్రయాణమునకు సెలవునిచ్చెను. ఆసమయమున నామె దురవస్థను వర్ణించుటకు శక్యముకాదు. (అధికసారిము సమాప్తము.)

చౌపాయి

"నాముద్దుపట్టీ! కంటిని ఱెప్పవలె, నిన్ను దేవతులును, పితృదేవతులును రక్షింతురుగాక! నీవు ధర్మధురంధరుడవు; కరుణాసముద్రుడవు. పదునాలుగుసంవత్సరములవనవాసమే జలము; నీకు బ్రియులగు పరివారజనము మీనములు; ఈసంగతివిచారించి, వారుజీవించి నీవుతిరిగి వచ్చునప్పటికి, వారు నీతోగలియునట్లు, నీవు చూడుము. (జలము లెండినపుడు మత్స్యములు చనిపోవును; జనులకు నీవే జీవనము; పదునాలుగు సంవత్సరములవఱకు వారికి జీవనముండునట్లు ప్రసాదింపుము.) ఓతండ్రీ! శుభమగుగాక! నీవు వనమునకు బొమ్ము. నీ బంధువులను, నీ పరిజనమును దుఃఖసముద్రములో విడచి, వారిని యనాథులజేసి, వనమునకు బొమ్ము. మాపుణ్యము క్షీణించెను; కాలమువిపరీతమయ్యెను" ఇట్లు పలువిధముల కౌసల్యవిలపించి, రామునిచరణములమీద బడెను. తనవంటి నిర్భాగ్యురాలు లేదని యామె తలంచెను. ఆమె హృదయము శోకముచే దహించుకొనిపోయెను; దానిం జెప్పుటకు శక్యముకాదు. రాముడు తల్లిని లేవదీసి, కౌగిలించుకొని, మృదుమధురవచనములతో నోదార్చెను.

దోహా 66

ఈ సమయమున, జానకి సకలవృత్తాంతమును విని, వ్యాకులముపడి, దిగ్గునలేచి, అత్తవద్దకు వెళ్లెను; ఆమెపాదములకు నమస్క-

రించి కూర్చుండెను. (విపత్కాలము కనుక, నామె భర్తసమ్ముఖమున కూర్చుండెను. ఇది మర్యాదాలోపము కాదు).

చౌపాయీ

కౌసల్య కోడలిని దీవించి, యామె సుకుమారత్వముఁ జూచి, విశేషము దుఃఖించెను. ముఖమును వంచుకొని, జానకి పిలపించుచుండెను. ఆ చక్కదనాలకుప్ప, ఆ పతివ్రతాశిరోమణి, యిట్లు చింతించెను:— "అహా! నా జీవనమున కాధారభూతుఁడు, నా నాథుఁడు, వనమునకుఁ బోవుటకు సిద్ధముగ నుండెను. వారిని ననుసరించి వెళ్లుట కెవరు పుణ్యముఁ జేసిరో కదా! ఈ నా శరీరముతో నేను వారివెంట వెళ్లవలెను. లేక, నన్ను వారు తీసికొని వెళ్లనియెడల, నా శరీరమును విడిచి, నా ప్రాణములైనను వారివెంట వెళ్లును ఈ రెండింటిలో నేదియైనను నాకు మేలు విధికృతము తెలియదు" ఇట్లు జానకి చింతించి, మనోహరమగు పాదాంగుష్ఠముతో భూమిపై వ్రాసెను; అట్లు వ్రాయుటవలన, నూపురములశబ్దములు మధురముగ నుండెను సుకవీశ్వరుఁడు వానిని వర్ణింపఁగలఁడు! (గోరుతో భూమిమీఁద వ్రాయుట శోకముఁ దెలుపును. దానిభావ మేమనిన, "ఓనాథా! నన్ను మీతోఁ దీసికొని వెళ్లుఁడు. లేనియెడల, నేను భూమిలోఁ బ్రవేశించెద" అని యామె చెప్పుచుండి నట్లు కనఁబడును.) "మేము మీచరణములను విడిచిపెట్టఁ జాలము" అని చెప్పుచుండినట్లు, జానకి చరణనూపురములు ధ్వనులఁ జేసెను. ఆమె కమలలోచనముల నుండి, నీరు నిండినవై కారెను. అప్పుడు కౌసల్య రామునితో నిట్లు పలికెను. "ఓ రామా! జానకి మహాసుకుమారి. అత్త మామలకును, బంధువులకును గారాపుబిడ్డ.

దోహా 67

"భూపాలశిరోమణియగు జనకచక్రవర్తి కూఁతురు; సూర్యవంశమునకు సూర్యునివంటి దశరథుని కోడలు; సూర్యకుల కుముదములను వికసింపఁజేయు రామచంద్రుని భార్య; సకలగుణసంపన్నుఁడు చక్కదనాలకుప్పయగు రాముని ధర్మపత్ని.

చౌపాయీ

"నా ముద్దుకోడలు; ఈమె సకలగుణసంపన్నురాలు; ఈ యప

రంజిబొమ్మముద్దులనుమూటఁగట్టుము; రూపురేఖవిలాసములలో నీమెను మించినవారు లేరు. నాప్రాణము వలె, నామెను కాచుకొనుచుంటిని; నాకంటిపాపవలె, నామెను గాపాడుచున్నాను. నాపాలి కల్పవృక్షమని భావించి, నే నామెను ప్రేమించి, పెంచుకొనుచుంటిని; నావాత్సల్యమనే నీరుచే నావృక్షము వృద్ధిపొంది, పుష్పించి, ఫలించు సమయమునకు, విధి విపరీత మయ్యెను; విధికృతములఁ దెలిసికొనుట యెవరితరము' ఇది యెట్లుపరిణమించి, తుదకెట్టగునో తెలియదు. చిన్నతనములో నామెను సేవకు లెత్తుకొని యుండిరి; తరువాత నామె పల్లకిలోనుండి దిగ తివాసిమీఁద నడచి, సింహాసనముపైఁ గూర్చుండును; కాని, ఆమె యెప్పుడును నడచియుండలేదు. సంజీవని మూలికవలె నామెను గాపాడుచుంటిని. ఒకానొక సమయమునందైన, దీపము నార్పుమని నేనామెను చెప్పియుండలేదు. అట్టి యామె నీవెంట వనములకు బోవఁదలఁచియున్నది నామాట నేనుచెప్పియుంటిని; ఇఁక, రఘునాథా! నీమాటఁ జెప్పుము; ఆమె తనకు సహజముగ బ్రవర్తించుచు చంద్రకిరణములఁ బానముఁ జేయు చకోరములు నేత్రములను విప్పి, సూర్యునకెదురుగ నిలువఁబడి చూడఁగలుగునా'

దోహా 68

"వనములో నిశాచరులును, సింహవ్యాఘ్రాలాది దుష్టజంతువులును సంచరించుచుందురు. రఘునాథా! విషవృక్షములవాటికలో, సంజీవనమూలిక యెట్లు వర్ధిల్లును'

చౌపాయీ

"విషయసుఖముల ననుభవించి, వనములను దగిలియుండుటను బ్రహ్మ కిరాతస్త్రీలను కన్యలను సృజించెను. పాషాణములును, క్రిమికీటకములును, సర్పములును, వృశ్చికములు వలె, వారిస్వభావము కఠినము. వనములో నివసించుటవలన, వారికి లేశమైనను దుఃఖములేదు సకల భోగములను విడిచి, తపస్సుజేయుమునికన్యలకును, మునిపత్నులకును వనము యోగ్య మగుచుండును. [illegible] సీతకు [illegible] సముచు కదా! ఈమె వనములో నెట్లు నివసింపగలదు? మానస సరోవరములోని కమలములలో విహరించుచుండు హంసను తుమ్మచెట్లమధ్య

నెట్లు విహరింపఁగలదు? ఈసంగతులను విచారించి, నే నామెను బోధించితిని; నీవుకూడ బోధింపుము. జానకి గృహములో నుండినయెడల, నా ప్రాణములు కొంచెము నిలువఁబడును; నాకుధైర్యముండును." కౌసల్య చల్లగవాత్సల్యముచేఁ జెప్పినమాట లమృతోపమానములు. ఆమెమాటలను రాముఁడు వినెను.

దోహా 69

యుక్తాయుక్తముగ జెప్పఁదగిన మాటలను రాముఁడు తల్లికిఁ జెప్పి, తదుపరి, జానకిని జూచి, వనవాసములోని గుణదోషములను గుఱించి చెప్పనారంభించెను.

చౌపాయీ

జానకిని వెంటఁదీసికొని వెళ్లుటకు రామున కిష్టము; కాని, ఆసంగతిని తల్లియెదుట స్పష్టముగఁ జెప్పుట కతఁడు సంశయించెను. విపత్తి కాలము కనుక నతఁడు ముందువెనుకలనాలోచించి, యిట్లు ప్రసంగించెను. "ఓ రాజకుమారీ! నాబోధను వినుము. రాజులు ధైర్యశాలులు; నీవు రాచబిడ్డవు; ధైర్యముగనుండుట యుక్తము. నీవు మనస్సులో మఱియొకవిధమునఁ దలంపకుము. మనయుభయుల శ్రేయస్సును నీవుకోరినయెడల, నామాటలను మన్నించి, నీవు గృహములో నుండుము. నాయాజ్ఞప్రకారము, నీవత్తగారిని సేవించు చుండుము. ఓ ప్రియురాలా! అన్నివిధముల నీవు గృహమువద్ద నుండుట మంచిది. అతియాదరముతో నత్తమామలను సేవించుటకంటె, నధికమగు ధర్మము లేదు. ఒకప్పుడు నాతల్లి నన్నుజ్ఞప్తికిఁ దెచ్చుకొని, పుత్రవాత్సల్యముచే వ్యాకులము పడి, విచారించునపుడు, ఓసుందరీ! మృదుమధురముగ, నీవు పురాణ కథలఁ జెప్పి, యామె నోదార్పుము. నామీఁద నొట్టుబెట్టుకొని చెప్పుచున్నాను. నాతల్లికి నీవు హితముఁజేయుటకే, నిన్నుగృహమువద్ద విడిచిపెట్టుచున్నాను. ఓ సుముఖీ! నా స్వభావమును లెస్సగ గ్రహింపుము.

దోహా 70

"గురువులకును, శ్రుతులకును,సమ్మతమగు ధర్మము కష్టములేకయే అత్తమామలను సేవించుటవలన లభించును. మూర్ఖించినయెడల గాలవమునికిని నహుషునకునువలె సంకటము వచ్చును. (గాలవముని విశ్వా

మిత్రునివద్ద విద్య నభ్యసించి గురుదక్షిణ నిచ్చుటకు మూర్ఖించెను. అతని మూర్ఖత్వమునకు గురువు కోపించి శ్యామకర్ణములుగల గుఱ్ఱములు 800 దక్షిణ క్రింద దీసికొనిరమ్మని చెప్పెను. అంత గాలవుడు విచారించి గరుత్మంతునితోఁ గూడి యయాతిమహారాజువద్దకు వచ్చెను. అప్పుడు యయాతి తనకుమార్తెను 200 గుఱ్ఱముల నతని కిచ్చెను. "ఓగాలవా! ఈ నాచిన్నదాని కన్యత్వము నిశ్చలము; ఆమె సంతానవంతురాలయినను కన్యత్వమునకు భంగములేదు" అని రాజు చెప్పెను. ఆకన్య నతఁడు క్రమముగ ముగ్గురు రాజుల కప్పగించి, వారిలో నొక్కొక్కనివద్ద 200 గుఱ్ఱములఁ బుచ్చుకొని మొత్తము 800 గుఱ్ఱములను గురువునకు సమర్పించెను. ఆకావలన నొక్కొక్కరాజున కొకకుమారుఁడు పుట్టెను. మూర్ఖించినందున నతఁ డింత శ్రమఁ బడవలసి వచ్చెను.

నహుషుఁడు చంద్రవంశపు రాజు; అతఁడు పుణ్యాత్ముఁడు; అందుచేత నతనికి దేవేంద్రపదవి వచ్చెను; అప్పుడు దేవేంద్రుఁడు బ్రహ్మహత్యఁ జేసినందున భయపడి దాఁగియుండెను. నహుషుఁడు శచీదేవి పొత్తుఁగోరి యామెకు వర్తమానము బంపెను. "నీవు పల్లకిలోఁ గూర్చుండి మహర్షులచే దానిని మోయించుకొని రమ్ము" అని యామె వర్తమానముఁ బంపెను. ఆప్రకారము నహుషుఁడు మహర్షులచే సవారి మోయించుకొని బయలువెడలెను. అగస్త్యుఁడు వారిలోఁబొట్టివాఁడు. వారింజూచి 'సర్పసర్ప శీఘ్రము నడువుము" అని నహుషుఁడు మందలించెను. అగస్త్యుఁడు కోపించి 'సర్పోభవ'అని శపంచెను. ఆశాపముచే నహుషుఁడు అజగరమై పుట్టి ధర్మరాజువలన శాపవిముక్తుఁడై పునః స్వర్గమునకు వెళ్లెను.)

**చౌపాయ్**

"ఓ సుముఖీ! తండ్రిగారియాజ్ఞను పరిపాలించి నేను శీఘ్రము వచ్చుచున్నాను. అవలీలలో దినములు గతించును. ఓ సుందరీ! నామాట వినుము. నాయందుఁగలప్రేమచేత నీ విప్పుడు మూర్ఖించినయెడల నీవు తుదకు దుఃఖము ననుభవించెదవు వనవాసము కష్టము; వనము దుర్గమము; కఠినము; భయంకరముగ నుండును; ఎండల కెండి వానలకుఁ దడిసి చలిదెబ్బలఁ దిని నీవు బాధపడవలెను. కంకర, ముండ్లు, కుశ,

వీనితో మార్గము నిండియుండును. వానిమీఁద నడచుట కష్టము. పాద రక్షలు లేకయే నీవు నడవవలెను. కమలములువంటి నీచరణములు కోమలములు; మార్గములు దుర్గమములు; అనేకమహోన్నతపర్వతములు కలవు. దారులు సరిసమానముగ నుండవు; ఎగుడుదిగుడుగ నుండును. కొండలోయలు, కొండగుహలు, సెలయేళ్లు, నదులు, అగాధమగుప్రవాహములు వీనినిజూచిన ధైర్యవంతులు సహితము భయపడుచుందురు. సింహవ్యాఘ్రభల్లూకములధ్వనులను వినిన గుండెలు పగులును.

దోహా 71

"కటకనేలను బవ్వళింపి నారవస్త్రములఁగట్టి కందమూలఫలములను భుజింపవలెను. అవియైనను ప్రతిదినము దొరకుట దుర్లభము; ఋతుధర్మము ననుసరించి యవి దొరకుచుండును.

చౌపాయ్

"కోటికపటవేషములను ధరించి రాక్షసులువచ్చి మనుజులను భక్షింతురు. ఓప్రియురాలా! పర్వతములపై విశేషముగ మేఘములు వర్షించును. వేయేల, వనవాసకష్టములఁ జెప్పుటకు శక్యము కాదు. అనేక భయంకరమగుసర్పములును, పక్షులును మృగములును గలవు. స్త్రీపురుషులను దొంగిలించు రాక్షసులు స్వేచ్ఛగ విహరించుచుందురు. వనవాస మనుపేరుచెప్పిన ధీరులుసహితము భయపడుచుందురు. ఓమృగలోచనా! స్వతస్సిద్ధముగ నీవు భయశీలురాలవు. ఓహంసగమనా! నీవు వనవాసమునకుఁ దగవు; నీవు నాతో వనమునకు వచ్చినయెడల లోకులు నన్ను దూషించెదరు. మానససరోవరములోని యమృతోపమానమగు నిర్మలజలములను ద్రాగిజీవించు మందమరాళము, లవణసముద్రములోని నీరును ద్రాఁగి యెట్లు జీవింపఁగల్గును! నూతనముగ జిగిరించిన తియ్యమామిడితోటలో విహరించుకోకిల తుమ్మతోటలో నెట్లు విహరింపఁగలదు! ఈసంగతులను విచారించి నీవుగృహములో నుండుము. ఓచంద్రవదనా! వనములో ననేకకష్టములు కలవు సుమీ!

దోహా 72

"గురువును స్నేహితుఁడును భర్తయు, వారిస్వభావముకొలఁది స్త్రీని శిక్షించి మంచియుపదేశముఁ జేసినపుడు, స్త్రీ వారిని మన్నింపవల

యును; లేనియెడల నామె తుదకు పశ్చాత్తాపముపడి విచారింపవలసి వచ్చును."

చౌపాయ్

ఈ ప్రకారము మృదుమధురముగ శ్రీరాముఁడు పలికిన ప్రియవచనములను జానకి విని కన్నీరుఁగార్చెను; ఆమె కమలములవంటి నేత్రములవెంబడి నీరు వఱదలై కారెను. స్త్రీపురుషచక్రవాకములను శరత్కాలచంద్రునివలె శ్రీరాముని ప్రియవచనము లామెను క్షోభపెట్టెను. 'ఆహా! నానాథునకు నాయందు దయకలదు; నన్ను విడిచిపెట్టి వెళ్ళుటకు సిద్ధముగనుండెను' అని యామె తలఁచి వ్యాకులముపడెను; ప్రత్యుత్తరము లిచ్చుట కామెకు శక్తిలేకపోయెను. అభూపుత్రిక ధైర్యముఁ దెచ్చుకొని దుఃఖము జాలించి అత్తగారిచరణములకునమస్కరించి నిలువఁబడెను; ఆమె చేతులను జోడించుకొని యిట్లు విన్నవించెను "ఓదేవీ! నావిన్నపమును విని, లోపాలోపములను క్షమింపుము. నాక్షేమమును గోరి నాప్రాణమువంటి నానాథుఁడు నాకు బోధించెను. వారివచనములను నేను గ్రహించితిని; ప్రాణేశ్వరుని వియోగముకంటె నధికమగు దుఃఖము మఱియొకటి లేదని నాయభిప్రాయము.

దోహా 73

"ఓ ప్రాణనాథా! మీరు కరుణాసముద్రులు; సకలసుఖములకు నిధులు; రఘుకులకుముదములను వికసింపఁజేయుటకు చంద్రునివంటివారు. మిమ్ముల నే నెడబాసియుండినపుడు స్వర్గమయినను నాకు నరకముతో సమానము.

చౌపాయ్

"తల్లిదండ్రులును సోదరిసోదరులును స్నేహితులును, బంధువులును, అత్తమామలును, సుతులును, గురువులును, సహాయకారులును వీరందఱు సకలగుణసంపన్నులయినను, సుఖము నిచ్చువారయినను వీఱొకరొత్తు; భర్తయొకరొత్తు; ఓనాథా! ఎట్టిసంబంధబాంధవ్యములు గలవారయినను భర్త తప్ప స్త్రీలకు వారివలన సూర్యునికంటె నధికతాపము కలుగును. తనువును, ధనమును, గృహమును, భూమియు, పురమును, రాజ్యమును— ఇవి పతిలేక స్త్రీకి దుఃఖము నిచ్చును. పతిలేనిభోగము

రోగముఁ బోలును; ఆభరణములు భారములు; సంసారము యమయాతనము; ఇవి స్త్రీధర్మములు. ఓప్రాణనాథా! మీరుకాక లోకములో నాకు సుఖమునిచ్చునది యొకటియులేదు. ఓనాథా! జీవములేనిశరీరమును, జలములేని నదియువలె, భర్తలేని స్త్రీ శోభింపదు. అన్నిసుఖములు నాకు మీవద్దఁగలవు; శరత్కాలచంద్రబింబమువంటి మీముఖారవిందముఁ జూచుచుండుటయే, నాకు సుఖము.

దోహా 74

"నేను మీతో నుండినపుడు ఖగమృగములే నాబంధువులు; వనమే పట్టణము; వల్కలములే పట్టుబట్టలు; పర్ణశాలయే సురసదనము.

చౌపాయీ

"నాయత్తమామలువలె వనదేవతలు, స్త్రీపురుషులు, నన్ను రక్షించెదరు; వారుదారులు అనేకఫలపుష్పముల నిచ్చెదరు; మీతో నుండినపుడు కుశపల్లవములు మన్మథునిసెజ్జవలె మెత్తగనుండి సుఖము నిచ్చును. కందమూలఫలము లమృతోపమానముగ నుండును. పర్వతములు అయోధ్యలోని మేడలతో సమానమగును. ప్రాతఃకాలమున చక్రవాకమిథునమువలె నిత్యము నేను మీపాదారవిందములను దర్శించి సంతోషించుచుందును. వనవాసకష్టములను, దుఃఖములను, తాపములను, విషాదములను, మీరు విస్తరించి చెప్పియుంటిరి. అవియన్నియు మీవియోగదుఃఖముతో లేశమైన సమానముకావు. ఓకృపానిధానా! ఓసుజ్ఞానశిరోమణీ! ఈసంగతులను విచారించి నన్ను విడిచిపెట్టక, తీసికొనివెళ్లుడు. నేను విస్తరించి విన్నవించుటయేల! మీరు దయామయులు; సర్వాంతర్యాములు; నామనస్సు మీకుఁ దెలియును.

దోహా 75

"హేదీనబంధూ! నేను దీనురాలను; నన్ను విడిచిపెట్టినందున మీనామమునకు లోపమువచ్చును. మీరు సకలసుఖదాయకులు; నాసుఖమును మీరేల పడఁగొట్టెదరు? మీరు సకలగుణసంపన్నులు; నామీఁద దయతప్పుట యుచితమా? పదునాలుగుసంవత్సరములు మిమ్ముల నెడబాసి నేను జీవింపఁగలనా? నన్ను విడనాడక మీతోఁ దీసికొని వెళ్లుఁడు.

**చౌపాయ్**

"ఓనాథా! క్షణక్షణము మార్గములో మీచరణకమలములను దర్శించుటవలన నాకు శ్రమకలుగదు. ఓప్రాణనాథా! అన్నివిధముల మీసేవఁజేయుచుందును. మీమార్గ యాసమును హరించెదను. మీరు శ్రమపడి చక్కని చెట్టునీడలోఁ గూర్చుండినపుడు మీచరణకమలములను చల్లనినీరుతోఁగడిగి, మీకువిసరి, మీసేదఁదీర్చెద స్వేదబిందువులతోఁగూడిన మీముఖారవిందమును, మీశ్యామల శరీరముఁ జూచుచుండినందున,నాకేమి శ్రమయుండును! భూమిమీఁద వృక్షముల పల్లవములను తృణములఁబఱచి మీసేవకురాలను మీపాదములఁ బట్టుచుండెదను. మీదివ్యమంగళవిగ్రహమును సదా చూచుటవలన నాకు శీతోష్ణములబాధయుండదు. నేను మీవద్దనుండినపుడు నన్నెవరు తేఱి చూడఁగలరు! నక్కగాని కుందేలుగాని కన్నుతెఱచి ఆఁడుసింహముంజూడఁగలదా? నేనేసుకుమారినా? మీరు సుకుమారులుకారా! మీరే వనవాసమున కర్హులా! నేనుగానా! మీరే తపముఁజేయుటకుఁ దగినవారా? నేను కానా! మీవంతు శ్రమపడుటయు, నావంతు భోగముల ననుభవించుటయు నగునా! మీరు సంచరించినప్రకారము నేను గూడ సంచరించెద; మీరుచేసినపనిని నేను జేయుదు.

దోహా 76

"కర్ణకఠోరమగు మీవచనములను వినినందున నాహృదయము బ్రద్దలగును. మీవియోగదుఃఖమును భరించి నేనుజీవించియుండలేను; తప్పక ప్రాణములను విడిచిపెట్టెద."

**చౌపాయ్**

ఈప్రకారము జానకి వ్యాకులమునుచే దీనాలాపములాడి దుఃఖించెను; 'వియోగ' మనుమాటనే యామె సహింపనపుడు నిజమగువియోగము నెట్లు జానకి సహింపఁగలదు! ఆమె పట్టినపట్టును రాముఁడు చూచి "ఇక నే నామెను నిరోధించినయెడల, నామె ప్రాణములను విడిచిపెట్టును" అని తలఁచి, ఆకృపాళుఁడు, ఆ రఘుకులనాథుఁడు జానకితో నిట్లు చెప్పెను. "ఓప్రియురాలా! విచారింపకుము. నీయిష్టము

ప్రకారము నావెంటరమ్ము ఇప్పుడు విషాదమునకు సమయముకాదు. ప్రయాణసమయమున విచారించుట యుచితముకాదు. వనమునకుఁ బోవుటకుఁ దగిన ప్రయత్నము శీఘ్రముగఁ జేయుము." ఈప్రకారము శ్రీరామమూర్తి ప్రియవచనములఁ బలికి, జానకి నోదార్చెను; తదుపరి యతఁడు తల్లిచరణములకు నమస్కరించి యామెదీవనలఁ బొందెను. "ఓరామా! నీవు శీఘ్రము వనములనుండివచ్చి ప్రజల దుఃఖమును బోఁగొట్టుము. నావంటి కఠినాత్మురాలగుతల్లిని మాత్రము మఱువకుము. ఓభగవంతుఁడా! ఈదుర్దశపోయి మంచిదశ యెప్పుడు వచ్చునోకదా! నాకన్నులారా మీయిరువురఁ జూడఁగలుగు భాగ్య మెప్పుడు వచ్చునోకదా! ఓతండ్రీ! నేను జీవించి నీముఖారవిందమును జూచుటకు మంచిసమయ మెప్పుడోకదా!

దోహా 77

'వత్సా! రఘుపతీ! రఘువరా! తండ్రీ' అనిమాటిమాటికి నిన్నుఁ బిలిచి యెప్పుడు నిన్నుఁగౌఁగిలించుకొనఁగలను! ఆదిన మెప్పుడువచ్చును!" ఈప్రకారము తల్లి పలువిధములఁ బిలపించి వ్యాకులముపడెను.

చౌపాయ్

ఆమె పుత్రవాత్సల్యముచేఁ బరవశురాలై విచారించుచుండెను; ఆమెదుఃఖముఁ జెప్పుటకు శక్యముకాదు; ఆమె ముఖమునుండి మాట వెడలలేదు. అనేకవిధముల నామెను రాముఁడు బోధించి యోదార్చెను. ఆకష్టసమయము నెవరు వర్ణింపఁగలరు? అత్తపాదములకు జానకి నమస్కరించి చెప్పెను. "ఓతల్లీ! నేను నిర్భాగ్యురాలను. మమ్ములను సేవించుచుండిన సమయములో బ్రహ్మ ప్రతికూలించి నాకు దుఃఖము నిచ్చెను; నామనోరథము సఫలముకాలేదు మీరు విచారింపకుఁడు; నామీఁద దయతప్పకుఁడు. కర్మము ననుభవింపకతీరదు. అదికష్టము. నేనేమి చేయఁగలను? నాతప్పుకాదు; నేను నిర్దోషిని." జానకి వచనములను కౌసల్యవిని చెప్పుటకు శక్యముగాని వ్యాకులముపడి దుఃఖించెను. మాటిమాటి కామె జానకిని కౌఁగిలించుకొనెను; ఆమె ధైర్యముఁ దెచ్చుకొని కోడలిని దీవించెను. "ఓసీతమ్మా! గంగాయమునానదులప్ర

వాహములవలె నీసౌభాగ్యము నిశ్చలముగ నుండుఁగాక" అని అత్త దీవించెను.

దోహా 78

అనేకవిధముల కౌసల్య జానకికి బుద్ధులఁజెప్పి ఆమెను దీవించెను. పునఃపునః జానకి యామెచరణములకు నమస్కరించి, ఆమెయందుగల యనురాగముచే నామెను విడిచిపెట్టలేక, కష్టముపైఁ బ్రయాణమయ్యెను.

---

# షష్ఠమ విశ్రామము

---

చౌపాయి

శ్రీరాముఁడు వనమునకుఁబోవుటకు సిద్ధముగ నుండెనని లక్ష్మణుఁడు విని ఖిన్నుఁడై, రామునివద్దకు వచ్చెను. అతనిశరీరము పులకరించి గడగడవణఁకుచుండెను; అతని నేత్రములవెంబడి నీరు వరదలై కారెను. రామునియందుగల యనురాగముచే నతఁడు పరవశుఁడై అన్న పాదములమీఁదఁబడెను. ఏమాటయు నతఁడు పలుకలేక నిలువఁబడి రాముని జూచుచుండెను. జలములోనుండి బయటకుఁ దీసికొని రాఁబడిన మత్స్యమువలె నతఁడు దీనుఁడై యుండెను. " ఓభగవంతుఁడా ! ఏమితలంచితివి ! ఏమిసంభవించునోకదా ! నాపుణ్యమంతయు పోయెను శ్రీరామునిసేవించునట్టిపుణ్యము నాచేతిలోనుండి జారిపోవుచున్నది. నాయన్నగారిచిత్త మెట్లుండునో తెలియదు; వారివెంట నన్నుఁ దీసికొనివెళ్ళఁదలఁచిరో లేదో స్పష్టముగా లేదు. జానకి వారియర్ధాంగరాణి కనుక వారివెంట వెళ్లుటకు యోగ్యురాలు; నేనుదాసుఁడను; వారియాజ్ఞను మన్నింపవలయును." సర్వసంగపరిత్యాగము జేసి చేతులను జోడించుకొని నిలువఁబడియుండిన తమ్ముని రాముఁడు చూచెను. ఆసమయమున లక్ష్మణునకు దేహమును గేహమును తృణమువలె నుండెను. సుఖసాగరుఁడు సకలగుణసంపన్నుఁడు అపరమచతురుఁడు శ్రీరాముఁడు తమ్మునితో నిట్లు పలికెను. "ఓలక్ష్మణా! నాయందుగల యనురాగముచే నీవు పరవశుఁడవై విచారింపకుము. పదునాలుగుసంవత్సరముల తరువాత సకలశుభములు కలుగును; యథాప్రకార ముత్సవములు జరుగును.

దోహా 79

"ఎవరు జననీజనకులును, గురువును, యాజమానుఁడును వీరి శిక్షలకులోఁబడి వ్యవహరింతురో వారిజన్మము సాఫల్యము. అట్లు లోఁబడనపుడు వారిజన్మము నిరర్థకము.

చౌపాయ్

"ఓతమ్ముఁడా! ఈసంగతులను విచారించి నామాటను మన్నించి తల్లిదండ్రులను సేవింపుము. ప్రస్తుతము భరతుఁడును శత్రుఘ్నుఁడును గృహమువద్ద లేరు. తండ్రిగారు వృద్ధులు; నానిమిత్తము విచారించుచున్నారు. నిన్ను నాతో నేను తీసికొనివెళ్లినయెడల నన్నివిధముల మన అయోధ్యానగర మనాథయగును. మనతల్లిదండ్రులును, గురువులును, జనులును, పరివారమును దీనులై విచారించెదరు. నీవు గృహములో నుండి వీరిని బోధించి యోదార్పుము. ఓతమ్ముఁడా! లేనియెడల ననర్థమువచ్చును. ప్రజలను వాత్సల్యముతోఁ జూడవలెను; ఏరాజు రాజ్యములో జనులు దుఃఖించెదరో ఆ రాజు తప్పక నరకముఁబొందును. నీవు గృహములో నిలిచియుండినయెడల నన్నియనర్థములు నివృత్తియగును. ("క్షత్రియస్య పరోధర్మః ప్రజానా మేవ పాలనమ్" మను.) ఓతమ్ముఁడా! ఈక్షత్రియధర్మమును గ్రహించి నిలువుము." ఈమాటలను విని, లక్ష్మణుఁడు వ్యాకులముపడి చల్లనిమంచుతగిలిన కమలమువలె వాఁడెను.

దోహా 80

ప్రేమాతిశయముచే నతఁడు పరవశుఁడై, ప్రత్యుత్తరముఁ జెప్పలేక యూరకుండెను. "ఓనాథా! నేను మీదాసుఁడను. మీరు యజమానులు; మీరు నన్ను విడనాడినయెడల నే నేమిచేయఁగలను?

చౌపాయ్

"ఓరాజాధిరాజా! తగినట్లు మీరు నాకుపదేశించితిరి; కాని, మీయుపదేశముప్రకారము నడుచుట కష్టమని నాభయము. ఉత్కృష్టధర్మముల నాచరించువారును, రాజనీతిపారంగతులును, వేదమార్గములను గుర్తెఱింగినవారును మీయుపదేశములప్రకారము ప్రవర్తింపఁగలరు; కాని, వానిప్రకారము నావంటిసేవకుఁడు నడచుట కష్టము. సేవకునకు సేవకన్న త్రియే ధర్మము నేను బాలుఁడను; మీచాటుననిలిచి బ్రతుకుచుంటిని; మీకటాక్షమే నాజీవనము. మేరుపర్వతమును హంసయెత్తఁగలదా? తల్లిదండ్రులను గురువులను నే నెఱుంగను. ఓనాథా! నామనోభిప్రాయము చెప్పుచున్నాను నామాటను విశ్వసింపుఁడు; హేదీనబంధూ!

మీరు సర్వాంతర్యాములు; మీకుఁ దెలియనిసంగతి లేదు; శాస్త్రములోఁ జెప్పఁబడినప్రకారము స్నేహము, బాంధవ్యము, జ్ఞానము, చాతుర్యము సర్వమునాకు మీరే. కీర్తిప్రతిష్ఠలను ఐశ్వర్యమును, సద్గతియుఁ గోరిన వానికి ధర్మశాస్త్రమును నీతులను మీ రుపదేశింపుడు. ఓకృపాసింధూ! త్రికరణశుద్ధిగ నాకు మీచరణములయందే యనురాగము కలదు నన్ను విడిచిపెట్టుట మీకు న్యాయమా?"

దోహా 81

ఆకరుణాసముద్రుఁడు శ్రీరాముఁడు వినయ విధేయతలతో దమ్ముఁడు చెప్పిన మృదుమధురవాక్యములను విని సంతోషించి యతనిని తనహృదయమునకుఁ గౌఁగిలించుకొని తమ్మునితో నిట్లు పలికెను.

చౌపాయి

"ఓతమ్ముఁడా! లక్ష్మణా! తల్లివద్ద సెలవుపుచ్చుకొని శీఘ్రమురమ్ము; మనము వనములకుఁబోవుదము." నష్టమువచ్చునని తలంచినపుడు లాభము వచ్చినట్లు లక్ష్మణుఁడు శ్రీరాముని వచనములను విని సంతోషించెను. అత్యానందముతో నతఁడు తల్లివద్దకువచ్చి తల్లిపాదములకు నమస్కరించెను. అతని మనస్సుమాత్రము శ్రీసీతారాములవద్దనుండెను. దృష్టివచ్చినందున గ్రుడ్డివాఁడువలె నతఁడు సంతోషించెను. అతనిమనస్సు వ్యాకులము పడియుండుటఁ జూచి ఆమె దానికారణము నడిగెను. యావద్వృత్తాంతము నతఁ డామెకుఁ జెప్పెను. నలువైపుల మండుచుండిన కార్చిచ్చుఁ జూచిన యాఁడు లేఁడివలె, నామె యతనికర్ణకఠోరమగు వాక్యములను విని, భయపడి గడగడవడఁకెను. "ఆహా! ఈమె వాత్సల్యము మూలమున ననర్థము పుట్టునేమోకదా! నాప్రయాణమున కాటంకమువచ్చునా!" అని యతఁడు తల్లిముఖలక్షణములఁబట్టి చింతించి, భయపడుచు "అమ్మా! మీసెలవు దయచేయుఁడు" అని యడిగి "ఆహా! భగవంతుఁడా! ఈమె నాకనుజ్ఞనిచ్చునో లేదో కదా!" అని విచారించెను.

దోహా 82

శ్రీసీతారాములరూపశీలలావణ్యముల నాలోచించి, దశరథునకుగల పుత్రవాత్సల్యమును గ్రహించి సుమిత్రశిరమును పంకించి యిట్లు చెప్ప నారంభించెను:— "ఆహా! ఈపాపకర్మమున కాక్కైకమ్మ తల్లియే కారకురాలు."

**చౌపాయ్**

ఆసమయము మంచిదికాదని యామె తెలిసికొని ధైర్యము నవలంబించి మృదుమధురముగ నిట్లు ప్రసంగించెను. "ఓతండ్రీ! నీతల్లి జానకి; నీతండ్రి రాముఁడు; నీతండ్రివలె, నతఁడు నిన్ను ప్రేమించును. రాముఁడు నివసించియుండినస్థలమే అయోధ్యానగరము ఎచ్చటచ్చట సూర్యుఁడు ప్రకాశించునో అచ్చటచ్చట దినమగును. (శ్లో. రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజాం, అయోధ్యా మటవీం విద్ధిగచ్ఛతాత యథా సుఖమ్)" శ్రీసీతారాములు వనములకుఁ బోవుచుండ, నీవు నగరములోనుండిన ప్రయోజనమేమి? గురువును, జననీజనకులను, సోదరులను, దేవతలను, యజమానుని మన ప్రాణమువలె భావించి, సేవింపవలయును. రాముఁడు ప్రాణముకంటె నధికప్రియుఁడు; జీవునకు జీవుఁడు; సకలజనులకును స్వార్థములేని సఖుఁడు; అతనితో సమానమగుపాలకుఁడు మఱియొకఁడు లేఁడు; ('ద్వాసుపర్ణాసయుజాసఖాయా—' అని శ్రుతి ప్రసిద్ధము. జీవుఁడును ఈశ్వరుఁడును పరస్పరసఖులు.) మనకుఁ బ్రియులును బూజనీయులు నగువారు రామబంధువులని తెలిసికొనుము. ఓతండ్రీ ఈసంగతిని విచారించి, వారివెంట వనమునకుఁబొమ్ము; అందువలన నీజన్మము సఫలమగును.

దోహా 83

"ఓతండ్రీ! నీమీఁద నేను బలిహారిని సుమీ! నీవు గాని కపటము నుపేక్షించి నిశ్చయముగ రాముని చరణకమలములను నమ్మియుండినయెడల నీవంటిధన్యుఁడును నావంటి యదృష్టవంతురాలును లేరు.

**చౌపాయ్**

"రఘురామునియందు భక్తిగలకుమారునిఁగనినతల్లియే లోకములో ధన్యురాలు; అట్టికుమారుఁడు కలుగనియెడలనా గొడ్రాలుగనుండినమేలు; రామునియందు విముఖతగలకుమారుఁడు పుట్టినను ప్రయోజనములేదు; వాఁడు పశువుతో సమానుఁడు ఓపుత్రా! నీయదృష్టమువలననే రామమూర్తి వనమునకుఁ బ్రయాణమయ్యెను; ఇందులకు మఱియొకకారణము లేదు. (పాపాత్ములభారమును భూమియు భూభారమును శేషుఁడును, ధరించియుండును. ఆభారముఁదగ్గించుటకు రాముఁడు వనమునకుఁ బ్రయాణమయ్యెను; నీభాగ్యము పండెను. ఇప్పుడు నీవు

మనస్స్ఫూర్తిగ రాముని సేవించి, సంతోషింపవచ్చును శ్రీసీతారాముల చరణారవిందములయందు సహజమగు నిర్మలభక్తియుండుటయే సకలపుణ్యములఫలము. ఓతండ్రీ! రాగ, రోష, ఈర్ష్య, మదమోహములకు స్వప్నమందైనను నీవు వశ్యుఁడవు కాక మనోవికారములను విడిచి, త్రికరణశుద్ధిగ శ్రీరాముని సేవింపుము. నీతల్లిదండ్రులవంటి శ్రీసీతారాముల వద్ద నుండుటచేత నీకు సకలవిధముల వనములో శుభములు కలుగును. శ్రీరామునకు క్లేశము రాకుండునట్లు నీవు సేవింపుము. ఇదియే నా యుపదేశము.

ఛాంద్ 3

"ఓతండ్రీ! శ్రీసీతారాములకు కష్టములేకుండ నీవు వారిని సేవింపుము; ఇదియే నాయుపదేశము. నీతల్లిదండ్రులను, సఖులను పరివారమును బంధువులను మఱచి సర్వము వారే యని భావింపుము. పట్టణవాససుఖములను మఱచిపొమ్ము." ఈప్రకారము సుమిత్ర కుమారునికి బోధించి దీవించెను. "ఓతండ్రీ! ఎట్టియవాంతరములు లేకుండ, శ్రీసీతారాములచరణకమలములయందు నీకు నిశ్చలభక్తి యుండుఁగాక!" అని యామె దీవించెను.

సోరఠా 3

తదుపరి లక్ష్మణుఁడు తల్లిపాదములకు నమస్కరించి హృదయము ఉత్తేజిల్ల శీఘ్రముగ వెడలెను. వలలోఁబడక తప్పించుకొనిన మృగము తత్తఱపడుచు బరుగెత్తినవిధమున నతఁడు పరుగెత్తెను.

చౌపాయీ

శ్రీజానకీనాథుఁడు నిలిచియుండిన స్థలమునకు లక్ష్మణుఁడు వెళ్లెను; ప్రియసోదరుఁడు వచ్చినందుల కతఁడు సంతోషించెను. శ్రీసీతారాములచరణములకు సోదరుఁడు నమస్కరించి వారివెంట నడచి రాజమందిరమునకు వెళ్లెను. "ఆహా! భగవంతుఁడు శుభమును సంధానముఁ జేసి, దానిని విఘ్నముఁ జేసెను" అని నగరములోని స్త్రీపురుషులు విచారించుచుండిరి. వారిశరీరములు వాఁడెను; వారిమనస్సు దుఃఖముచే వ్యాకులమయ్యెను; తేనెను బోఁగొట్టుకొనిన తుమ్మెదలవలె వారు దీనులయిరి. వారు చేతులను నులుపుకొనుచు, శిరస్సులను మోఁదికొనుచు, రెక్కలులేనిపక్షులవలె విలపించిరి. వేలకొలదిజనులు రాజ

హజారములో నిలిచియుండిరి; వారివిషాదమును వర్ణింపశక్యముకాదు. మంత్రివచ్చి రాజును లేవదీసి కూర్చుండఁబెట్టెను. అంతలో శ్రీరామమూర్తి ప్రియవచనములఁ బలుకుచుఁ దండ్రిని సమీపించెను. జానకిని రామలక్ష్మణుల నతఁడు చూచి యపరిమితముగ దుఃఖించెను.

దోహా 84

అతఁడు మాటిమాటికి వారినిజూచి దుఃఖించి వాత్సల్యముచేఁ బరవశుఁడై వారిని కౌఁగిలించుకొనెను.

చౌపాయి

అతనిమనస్సు దుఃఖముతో నిండెను; వ్యాకులముచే నతఁడు మాటఁజెప్పలేక యూరకుండెను. అంతలోనతనిచరణములకు రాముఁడు నమస్కరించి ప్రయాణమునకు సెలవు దయచేయుమని ప్రార్థించెను. "హేపితాజీ! మమ్ములను దీవించి మాకు సెలవు దయచేయుఁడు. ఇది సంతోషమునకు సమయము; తమరు విస్మయముఁ బొందవచ్చునా! ✓అతిమోహముచే నేపదార్థములనుగాని లోకములో విశేషముగఁ బ్రేమించినయెడల నపకీర్తివచ్చును. మర్యాదకు లోపముకలుగును" పుత్ర వాత్సల్యముచేఁ బరవశుఁడై యుండినరాజు రామునిమాటలను విని లేచికూర్చుండి రామునిహస్తముఁబట్టుకొని కూర్చుండఁబెట్టెను. "ఓరామా! నామాట వినుము. చరాచరములకు రాముఁడు స్వామి యని మునీశ్వరులు చెప్పుచున్నారు. నీవు నియతాత్ముఁడవు; ఉచితకార్యములఁ జేయుట నీకుఁ దగును. శుభాశుభకర్మములను భగవంతుఁడు విచారించి వానికిఁ దగినశుభాశుభఫలముల నిచ్చును. ఎవఁడు చేసిన కర్మకుఁదగినట్లు వాఁడు ఫలము ననుభవించునని శాస్త్రములు చెప్పుచున్నవి.

దోహా 85

"అపరాధముఁ జేసినవాఁ డొకఁడై దానిఫలము ననుభవించువాఁడు మఱియొకఁడని చెప్పుట యుచితముకాదు. విధికృతములు విచిత్రములు; వానినిఁ దెలిసికొనువా రెవరు!"

చౌపాయి

రామునిప్రయాణమును దప్పించుటకు రాజు నిష్కపటముగ ననేకయుపాయములఁ బన్నెను. ధర్మధురంధరుఁడును, చతురుఁడును,

ధీరుఁడు నగు శ్రీరాముని ముఖలక్షణములఁబట్టి యతఁడు ప్రయాణమునకు సిద్ధముగనుండుట రాజుచూచి గ్రహించి జానకిని కౌఁగిలించుకొని ఆమెకు హితోపదేశముఁజేసెను. వనవాసకష్టముల నామెతోఁజెప్పి అత్తమామలవద్దగాని ఆమె తండ్రివద్దఁగాని ఆమెయుండుట మంచి పనియని రాజుబోధించెను. ఆమె మనస్సుమాత్రము రామునిచరణముల యందు లగ్నమైయుండెను; అత్తయిల్లుగాని, పుట్టిల్లుగాని ఆమెకు మన స్కరింపలేదు. రామునితో నుండగలనని యామె తలఁచి వనవాసకష్టములను లక్ష్యముజేయలేదు. వనవాసకష్టములను గుఱించి పలువురు పలువిధములు నామెతోఁ జెప్పిరి. మంత్రిభార్యయు గురుపత్నియు పలుతెఱంగుల జానకిని బోధించిరి. "ఓజానకీ! నిన్ను వనములకుఁ బొమ్మని చెప్పలేదే; ఈవిషయములో నీవు నీఅత్తమామలును గురువును చెప్పినట్లు వినుట యుచితము.——"

దోహా 86

శరత్కాలములో చంద్రకిరణములు చక్రవాకమునువలె మృదుమధురమగువారిచల్లనిహితోపదేశములు జానకిని వ్యాకులముపెట్టెను.

చౌపాయ్

ఆమె సంకోచించి ప్రతివచనముఁజెప్పక యూరకుండెను. అంతలో వారిమాటలను విని, కైకేయి దిగ్గునలేచి మునివేషమునకుఁదగిన నారచీరలను, తులసిపూసలమాలికలను, దానబతుంబయుపట్టుకొనివచ్చి వానిని రాముని యెదుటఁబెట్టి యిట్లు పలికెను. "ఓరామా! రాజునకు నీవు ప్రాణమువంటివాఁడవు; నీయందుగల వాత్సల్యముచే వారు నిన్ను విడిచిపెట్టలేరు. సుకృతముపోయినను, అపకీర్తివచ్చినను, పరలోకముపోయినను వారు నిన్ను విడిచిపెట్టరు; వనమునకుఁ బొమ్మని యెప్పటికిని చెప్పరు. ఈసంగతులను విచారించి, నీకుఁ దోఁచినట్లు సంచరింపుము" (ఒకవైపున రాజ్యము; రెండవవైపున వనవాసము——ఈప్రక్క సింహాసనము; ఆప్రక్క నారచీరెలు—— వీనిలో నొకదానిని నతఁడు కోరవలెను). ఈప్రకారము తల్లిచెప్పినమాటల నతఁడు విని సంతోషించెను; కాని, యామెపలుకులు రాజు హృదయమునకు ములుకులువలె నాటెను. "ఆహా! ఎంత నిర్భాగ్యుఁడను! నాప్రాణములు నన్ను విడిచి

పెట్టవుకదా!" అని రాజు చింతించెను. (అధిక పాఠము. అంతలో శ్రీరాముఁడు నారచీరలను ధరించెను; అతని మునివేషముఁజూచి, జనులు దుఃఖించిరి. లక్ష్మణుఁడు సహితము నారచీరలఁగట్టెను; వానింజూచి జానకి వెఱచి వానినిఁబట్టుకొనిధరించుటకుఁ బ్రయత్నించెను; ఆమె సిగ్గు చేనిలువఁబడెను. వానినిధరించువిధమామెకుఁదెలియదు. ఆమె వ్యాకులముపడి రామునితోనిట్లుగ్నృదువుగబలికెను; "ఓనాథా ఈనారచీరలనుమునీశ్వరులెట్లుధరించెదరోనాకుఁ దెలియదు." ఈప్రకారముజానకిపలికి కన్నీరుఁగార్చెను; అప్పుడు శ్రీరాముఁడు ధైర్యముఁదెచ్చుకొని దిగ్గునలేచి, స్వయము వానిని జానకికిఁ గట్టించ నారంభించెను. ఈదుర్దశఁజూచి స్త్రీపురుషులు చింతాక్రాంతులయిరి. అప్పుడు వసిష్ఠుఁడు వారిని నోదార్చిఆనారచీరలను జానకికట్టుకొనుట కూడదని నివారించెను. వస్త్రాద్యలంకారములతో నామె రామునివెంటవెళ్లునని యతఁడు చెప్పినందున, నామెకు నారచీరలను రాముఁడు కట్టించలేదు.

దోహా 87

"ఓ రామా! సహజముగు వస్త్రాద్యలంకారములను ధరించి, జానకి నీవెంట నుండవచ్చును" అని వసిష్ఠుఁడుపలికెను. ఆమాటనువిని, నారచీరను జానకికిఁగట్టుట రాముఁడు విడిచిపెట్టెను.)

చౌపాయ్

జనులందరు దుఃఖించుచుండిరి; రాజు మూర్ఛఁబడెను. ఎవరేమి చేయఁగలరు? ఏమియుపాయము కలదు? రాముఁడు మునివేషమును ధరించి జననీజనకులపాదములకు నమస్కరించి ప్రయాణమయ్యెను.

దోహా 88

ఇట్లు వనవాసమునకుఁ దగినసన్నాహముఁ జేసి, సీతాలక్ష్మణులతోఁగూడి రాముఁడు గురుబ్రాహ్మణచరణములకు నమస్కరించి ప్రయాణమయ్యెను; వారందఱు నిశ్చేష్టులై నిలువఁబడియుండిరి.

చౌపాయ్

శ్రీరాముఁడు ద్వారమువద్దకువచ్చి వసిష్ఠుఁజూచి నిలువఁబడెను; శ్రీరామునిఁజూచి జనులందరు విరహాగ్నిచే వ్యాకులముపడిరి. శ్రీరాముఁడు ప్రియవచనములఁబలికి వారినిబోధించి బ్రాహ్మణులఁ బిలిపించెను;

చెను; వారికి వర్షాశనముల నిప్పించుమని యతఁడు గురువును బ్రార్థించెను; అందుకుఁ దగినట్లు వారికి ద్రవ్యము నిప్పించెను; క్షత్రియులను సహిత మతఁడు మన్నించి యాదరించి వశ్యము జేసికొనెను; యాచకులకు దానములనిచ్చి సంతోషపెట్టెను; మిత్రులనుబిలిచి యతఁడు వారిని ప్రేమపూర్వకముగ నాదరించెను. తదుపరి, దాసదాసీజనంబుల నతఁడు గురువున కప్పగించి, చేతులనుజోడించుకొని, "ఓస్వామీ! వీరికి మీరే తల్లిదండ్రులు; అటులనే వారిని మీరుపోషింపుఁడు "అని విన్నవించెను. శ్రీరామమూర్తి చేతులను మాటిమాటికి జోడించుకొని, వారితో మృదుమధురముగ బ్రసంగించెను. "ఓజనులారా! మాతండ్రి రాజుగారికి సౌఖ్యముకలుగునట్లు ప్రవర్తించువారే నాకుఁ బ్రియులు; వారే నాహితవును గోరినవారు.

దోహా 89

"ఓజనులారా! నావియోగముచే నాతల్లి దుఃఖించుచుండును; మీరు చతురులు కనుక, నామె దుఃఖముపోవునట్లు, మీరు తగినప్రయత్నములఁ జేయుఁడు."

చౌపాయ్

ఈప్రకారము శ్రీరాముఁడు వారిని బోధించి, మరల గురువుచరణములకు నమస్కరించెను పార్వతీపరమేశ్వరులను, గణపతిని స్మరించి, వారి దీవనలఁబొంది, శ్రీరాముఁడు వెడలెను. అతని ప్రయాణసమయమున జనులందఱు విచారించిరి; వారిదుఃఖముఁజెప్పుటకు శక్యము కాదు. అప్పుడు మృత్యువును సూచించు దుశ్శకునములు లంకలోఁ గనఁబడెను; అయోధ్యానగరమంతయు శోకార్ణవములో మునిఁగియుండెను. దేవతలకు హర్షవిషాదములు కలిగెను. లంకలోఁబుట్టిన దుశ్శకునములఁజూచి, వారు సంతోషించిరి; అయోధ్యానగరము దుఃఖించుటవలన వారు దుఃఖించిరి. అంతలో దశరథుఁడు మూర్ఛనుండిలేచి తెలివిఁదెచ్చుకొని, సుమంత్రునిఁ బిలిచి, యతనితో నిట్లుచెప్పెను: "ఓసుమంత్రా! రాముఁడు వనమునకు వెళ్లెను; కాని, నాప్రాణములుమాత్రము నాశరీరమును విడిచిపెట్టలేదు. నాశరీరము నాశ్రయించియుండినందున, నాప్రాణముల కేమిసుఖము కలుగును? వీనిని నాబొందినుండి వెడలఁగొట్టుట కింతకంటె నధికదుఃఖ మేమికలదు?" అని రాజుపలికి, ధైర్యముఁ

దెచ్చుకొని, "ఓయీ! నీవు రథముం దీసికొని, రాముని వెంట వెళ్లుము" అని చెప్పెను.

దోహా 90

"ఓయీ సుమంతా! నాయిరువురుకుమారులు సుకుమారులు; గారాబుబిడ్డలు; జానకి సుకుమారి; వారిని రథముపైఁ దీసికొనివెళ్లి, వారికి వనముఁజూపించి, నాలుగవదినమునఁ దిరిగిరమ్ము.

చౌపాయ్

"ఓయీ! నాకుమారులు ధీరులు; వారు వెనుకకుఁ దిరుగరు. వారిలో రాముఁడు సత్యసంధుఁడు; కట్టుదలగలవాఁడు. నీవు చేతులను జోడించుకొని, 'ఓనాథా! మిథిలేశకిశోరియగు జానకిని గృహమునకుఁ బంపుఁడు' అని వేడుకొనుము. ఒకవేళ జానకి వనముఁజూచి భయపడినపుడు, నామాటల నామెకు జ్ఞప్తిఁ జేసికొనిరమ్ము. 'పుత్రీ! గృహమునకు దిరిగి రమ్ము; వనవాసము కష్టము. నీయిచ్ఛానుసారము నీజనకునివద్దగాని, నీయత్తమామలవద్దగాని నీవు నిలిచియుండవచ్చును.' అని నామాటలుగఁ జెప్పి, తగినయుపాయములఁ జేసి యామెను మరలింపుము. ఆమె గాని మరలివచ్చినయెడల నా ప్రాణములు కొంతవఱకు నిలువఁబడును. అట్లు కానియెడల నామరణము నిశ్చయము. ఇంక నేనేమి చెప్పఁగలను! విధికృతము నాయెడల విపరీతముగనుండెను." ఈప్రకారము పలువిధముల రాజు పలవించి, మూర్ఛిల్లి నేలఁబడెను "ఓయీ! శ్రీసీతారామలక్ష్మణులఁ దీసికొనివచ్చి చూపింపఁగలవా?" అనిపలికి, రాజుమూర్ఛిల్లి నేలఁబడెను.

దోహా 91

దశరథుని యాజ్ఞఁ గైకొని, సుమంతుఁడు రాజునకు నమస్కరించి, రథమును శీఘ్రము నడిపించుకొని, నగరబహిఃప్రదేశమున శ్రీసీతారామలక్ష్మణులు కలసియుండినస్థలమునకు వచ్చెను.

చౌపాయ్

రాజుగారివచనముల నతఁడు రామునకు విన్నవించి, వారిని రథముపైఁ గూర్చుండఁబెట్టుకొని రథమును నడిపించెను. వారు నల్వురు రథమునధిష్ఠించి, మనస్సులో నయోధ్యాపురమునకు నమస్కరించి, ప్రయాణమును సాగించిరి. రాముఁడు వనమునకుఁ బోవుటవలన నయోధ్యానగర మనాథయయ్యెను. జనులందఱు వ్యాకులముపడి, రాముని వెంట

నడచిరి. ఆకృపాసముద్రుఁడు పలువిధముల వారిని బోధించి మరలించెను; కాని, వారు వెనుకకు వెళ్లి మరల పరుగెత్తివచ్చిరి. ఆనగరము భయంకరముగనుండెను; గాఢాంధకారమగు కాలరాత్రివలెఁ గనఁబడెను. ఆనగరములో నివసించుస్త్రీపురుషులు దుష్టజంతువులువలెఁ గనఁబడిరి; ఒకరినిజూచి యొకరు భయపడుచుండిరి. గృహములు శ్మశానములు; గృహస్థులు భూతములు; పుత్రమిత్రబంధుజనంబులు యములు; తోఁటలలో వృక్షములు వాడెను; సరితసరోవరములు భయంకరముగనుండెను.

దోహా 92

కోట్లకొలదిగుఱ్ఱములును, ఏనుఁగులును, కేళీమృగములును, పశువులును, నెమిళ్లును, చాతకములును, పికములును, చక్రవాకములును, చకోరములును, సారసములును, శారికలును, హంసలును,

చౌపాయి

ఈ మొదలగునవి రామునివియోగమున వ్యాకులములపడ, చేష్టలఁదప్పి, చిత్తరువుబొమ్మలువలె నిలువఁబడియుండెను. నగరమంతయు వనమును బోలియుండెను. నగరములోని స్త్రీపురుషులు ఖగమృగములవలె నుండిరి. ఆవనములో భగవంతుఁడు కైకేయియనుకిరాతస్త్రీని పుట్టించెను; ఆవనమునకు దశదిశలలో నామె నిప్పును ముట్టించెను. రామునివియోగాగ్నిని వారు సహింపలేక పరుగెత్తిరి. "శ్రీసీతారామలక్ష్మణులు లేక మనకు సుఖములేదు; ఎచ్చట రాముఁడు నివసించునో అచ్చటనే సమాజముకూడును. రాముఁడు లేనినగరములో మనకేమి ప్రయోజనముకలదు!" ఇట్లు వారు చింతించిరి; దేవతలకు సహితము దుర్లభములగు సౌఖ్యములను వారు గృహములలో ననుభవించుచుండిరి; అట్టి గృహములను వారు విడిచిపెట్టి రామునివెంటఁబడిరి. శ్రీరాముని చరణకమలములయందుఁ బ్రీతిగలవారికి విషయభోగములయం దాసక్తి యుండదుకదా!

దోహా 93

వృద్ధులను, బాలురను గృహములలో విడిచిపెట్టి వారందఱు రామునివెంటఁబడిరి. మొదటిదినమున శ్రీరాముఁడు తమసానదీతీరమున విశ్రమించెను.

# సప్తమవిశ్రామము

**చౌపాయి**

ప్రేమకువశ్యులై తనవెంటఁబడివచ్చుచుండినప్రజలను రాముఁడు చూచి దయాసముద్రుఁడుకనుక విశేషము దుఃఖించెను. రఘునాథుఁడు కరుణామయుఁడు; పరులదుఃఖముఁజూచి జాలిఁబడును. శ్రీరామునకుఁ గూడ వారిమీఁద దయకలదు కనుక, నతఁడు మృదుమధురముగ వారితో సంభాషించి, వారిని బోధించెను; అనేకధర్మముల నుపదేశించెను. వారు ప్రేమకు వశులై, మరలిపోఁదలఁచినను ప్రేమపాశములను ద్రుంచి వెళ్లలేక రాముని వెంట నంటియుండిరి. శ్రీరాముఁడు వారిని యెంతవిశేషముగఁ బ్రేమించెనో, వారంతకు రెండంతలు శ్రీరాముని ప్రేమించి యతనిని విడిచిపెట్టలేకయుండిరి. ఆప్రజలసుగుణసంపత్తియు, వారిప్రేమయు రాముఁడుచూచి యేమాటయుఁ జెప్పలేకపోయెను; వారిని తనవెంటఁ దీసికొనివెళ్లుట కష్టము; వారిని మరలిపొమ్మనుట మఱింతకష్టము; ఇట్టివిషమసంధి రామునకు వచ్చెను. విచారముచేతను, శ్రమచేతను వారు బడలికఁజెంది నిద్రించిరి. అతఁడు దేవమాయఁబ్రసరింపఁజేసి వారిబుద్ధిని భ్రమింపఁజేసెను. అంతలో రెండుయామములరాత్రి గతించెను; అప్పుడు రాముఁడు సుమంత్రునితో నిట్లు పలికెను "అయ్యా! సుమంత్రా! రథజాడలు కనఁబడకుండ రథమును నడిపింపుము; ఇందుకు మఱియొకయుపాయము కానరాదు."

**దోహా 94**

శ్రీసీతారామలక్ష్మణులు శివునిచరణములకు నమస్కరించి, రథము నధిష్ఠించిరి. రథమార్గము కనఁబడకుండ వెనుకకును, ప్రక్కకును, ముందుకును సుమంత్రుఁడు రథమును నడిపించెను.

**చౌపాయి**

అంత ప్రాతఃకాలమయ్యెను; జనులు నిద్రనుండి మేల్కొని లేచిరి. "రాముఁడు మమ్ములను విడిచిపెట్టిపోయెను." అని వారిలోవారు చెప్పుకొనుచు దుఃఖించిరి. మార్గము లేనియు వారికి గోచరము కాలేదు. "హా రామా హా రామా" అని వారు గొంతెత్తి నలువైపులఁ బరుగె

త్తిరి. సముద్రములో మునుఁగుచుండిన పడవంజూచి వణిజులు విచారించునట్లు వారు విలపించిరి. ఒకరికొక రుపదేశముఁ జేసికొనిరి. "మన ము పడుచుండిన కాయక్లేశముఁ జూచి, రాముఁడు మనలను విడిచిపెట్టెను." అని యొకఁడు సమాధానముఁజెప్పెను. ఒకరినొకరు దూషించుకొని, జలములోనిమీనములను స్తోత్రముఁజేసిరి. "ఆహా! ఈమీనములు జలములేక జీవింపవు; రాముఁడు నావద్దలేకపోయినను నేను బ్రదికియుంటిని; ఛీ! ఎందుకు వచ్చిన బ్రదుకు! మనకుఁ బ్రియుఁడగు రాముని వియోగమును భగవంతుఁడు తెచ్చిపెట్టెనుకదా! ఎందుచేత మనకు మరణముఁ దెచ్చిపెట్టఁడు! ఈప్రకారము వారు పలువిధముల విలపించి యేడ్వసాగిరి; వారు శోకార్ణవములో మునిఁగి, నగరములోఁ బ్రవేశించిరి. వారివియోగదుఃఖమును వర్ణింప శక్యముకాదు; శ్రీరాముఁడు తిరిగివచ్చునని యాశఁబెట్టుకొని వారు ప్రాణములను నిలుపుకొనిరి.

దోహా 95

శ్రీరామపునర్దర్శనాపేక్షులై స్త్రీపురుషులు వ్రతోపవాసములఁ జేయుచుండిరి; సూర్యుఁడు లేనిసమయమున, చక్రవాకమిథునమును కమలములునువలె, వారు దీనులై విచారించిరి.

చౌపాయ్

అంతలో మంత్రితోఁగూడి వారు ముప్వురును శృంగిబేరపురమునకు వచ్చిరి. అప్పుడు శ్రీరాముఁడు గంగానదినిజూచి, రథముపైనుండిదిగి సంతోషించి, గంగానదికి దండప్రణామముఁజేసెను. శ్రీసీతాలక్ష్మణులును, సుమంతుఁడును గంగకు నమస్కరించిరి. అన్నివిధముల శ్రీరాముఁడు సంతోషించెను. సకలసన్మంగళములకును, ఆనందమునకును గంగానది మూలము; ఆదేవనది సకలసుఖముల నిచ్చును; సకలదుఃఖములను హరించును. అనేకచిత్రవిచిత్రకథలం జెప్పుచు, శ్రీరాముఁడు గంగానదీతరంగములఁ జూచుచుండెను. వారిముప్వురకు నతఁడు గంగానదిమాహాత్మ్యముఁ జెప్పెను. వారు దానిలో స్నానముఁ జేసి, మార్గాయాసముఁ దీర్చుకొనిరి; ఆపవిత్రజలములఁ బానముఁజేసి, వారు ప్రసన్నచిత్తులయిరి. ఆహా! శ్రీరామునినామమును స్మరించినందున,

జననమరణముల శ్రమ నివారణమగునుకదా! అట్టి మహాప్రభువు శ్రమ పడెనని చెప్పుట, లోకవిడంబనార్థముకాని మఱియొకటకాదు.

దోహా 96

ఆసచ్చిదానందమూర్తి అగు శ్రీరాముఁడు సూర్యవంశమునకు ధ్వజమువంటివాఁడు; అతఁడు లీలామానుషచరిత్రములఁజేసినను సంసారసాగరమును దాఁటుటకు సేతువువంటివాఁడు.

చౌపాయి

శ్రీరాముని యాగమనము నిషధాధిపతియగు గుహునకుఁ దెలిసెను. ఉత్కృష్టపదార్థము నొక్కఁడు సేవించుట యుచితముకాదు. కనుక,నతఁడు సంతోషముతో బంధువులను, సఖులను, సోదరులను బిలిచి పుష్పములను ఫలములను బట్టుకొని, నమ్రుఁడై రాముని జూచుటకు వెడలెను ఈపదార్థముల నతఁడు రామునియెదుటఁ బెట్టి, సాష్టాంగదండప్రణామముఁజేసి, చేతులనుజోడించుకొని, రాముని జూచుచు నిలువఁబడెను. శ్రీరాముఁడు సఖునింజూచి, సంతోషించి, యతనిని తనవద్దఁ గూర్చుండఁబెట్టుకొని, కుశలప్రశ్నఁజేసెను. "ఓనాథా! మీచరణకమలములను దర్శించినందున మేమందఱము క్షేమముగ నుంటిమి; సకలభోగములు మాకు లభించును. మీభక్తులను బ్రసాదించుటకు మీరు వచ్చితిరి. ఓదేవా! నా రాజ్యము, ధనము, గృహము,నాసర్వము మీయధీనము నేనును, నాపరివారమును నీచులము; మీసేవకులము. మీరు కటాక్షించి, మానగరమునకు విజయముఁజేయుఁడు. నన్ను మీదాసునిగ భావింపుఁడు; అప్పుడు నేను జనులందఱిలో ధన్యుఁడను కాఁగలను" అని గుహుఁడు విన్నవించెను "ఓగుహుఁడా! నీవు బుద్ధిశాలివి. నీవు చెప్పినమాటలు సత్యము; కాని, నాతండ్రిగారియాజ్ఞ మాత్రము వేఱొకటి.

దోహా 97

"ఓసఖుఁడా! నే నేమిచేయఁగలను! పదునాలుగుసంవత్సరముల వఱకు నేను వనవాసముఁజేసి, మునివేషమును ధరించి, మునులయాహారమును భుజించి సంచరింపవలెను. ఇదినాతండ్రిగారియాజ్ఞ. ఇందుచేత, నేను నగరములోనికివచ్చుట యుచితముకాదు." ఇట్లు శ్రీరాముఁడు చెప్పినమాటలను గుహుఁడు విని దుఃఖించెను.

చౌపాయ్

శ్రీసీతారామలక్ష్మణుల దివ్యమంగళవిగ్రహములంజూచి, శృంగిబేరపురములో నివసించు స్త్రీపురుషు లాశ్చర్యపడి, వారిలో వారు గుసగుసలాడుచుండిరి. "ఓసఖీ! వీరితల్లిదండ్రు లెవరు! ఇంత చక్కని వారిని వనమునకుఁ బొమ్మని చెప్పుటకు వారికి నోరెట్లువచ్చెను!" అని యొకస్త్రీ పలికెను. "ఓసఖీ! రాజు మంచిపనిఁజేసెను; వీరువచ్చుటవలన, మానేత్రముల కుత్సవముకలిగెను." అని మఱియొకర్తె చెప్పెను అప్పుడు నిషాదపతి మనస్సులోఁ జింతించి, మనోహరమగు నొకశింశుపావృక్షమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని, రామునిఁగొనిపోయివెళ్లి యాప్రదేశమును రామునకుఁ జూపించెను. స్థలమును రాముఁడుచూచి సంతోషించెను. పురజనులు రామునకు జోహారనుచు నమస్కరించి, సెలవుగైకొని గృహములకు నిష్క్రమించిరి. శ్రీరాముఁడు సాయంసంధ్యావందనానుష్ఠానముల నిర్వర్తించెను. అప్పుడు గుహుఁడువచ్చి దర్భలతోను, కిసలయములతోను మృదువగుశయ్యను సిద్ధపఱచెను. మధురమగుకందమూలఫలముల నతఁడు దొన్నెలనింపఁబెట్టుకొని తీసికొనివచ్చి వానిని రాముని యెదుటఁబెట్టెను.

దోహా 98

శ్రీసీతారామలక్ష్మణులును, సుమంత్రుఁడును కందమూలఫలములను భుజించి విశ్రమించిరి; శ్రీరాముఁడు శయనించెను. అతనిపాదములను లక్ష్మణుఁడు పట్టుట కారంభించెను.

చౌపాయ్

అంతలో శ్రీరాముఁడు నిద్రించెను; ఆసంగతి గ్రహించి లక్ష్మణుఁడు మెల్లగలేచి వచ్చి సుమంత్రుని విశ్రమింపుమని చెప్పెను లక్ష్మణుఁడు శరచాపతూణీరములను ధరించి కొంచెము దూరములో వీరాసనమును వేసికొని కూర్చుండి, జాగరూకుఁడై నలువైపుల చూచుచుండెను. నిషాదపతి విశ్వాసపాత్రులగు సేవకులను కాపుపెట్టి, స్వయముగ ధనుర్బాణములను ధరించి, తూణీరముఁగట్టుకొని లక్ష్మణునియొద్దకువచ్చి కూర్చుండెను. శ్రీరాముఁడు నిద్రించుటఁజూచి నిషాదపతి విశేషముగ రామునియందుగల ప్రేమచేత విచారించెను; అతనిశరీరము పులకరించెను; అతనినేత్రములవెంబడి నీరుపఱదలై కారెను. అతియనురాగముతో నతఁడు లక్ష్మణుని

తో నిట్లు ప్రసంగించెను "దశరథమహారాజుగృహము స్వతస్సిద్ధముగ దేవేంద్రభవనముకంటె నధికశోభాయమానముగనుండును. మన్మథుఁడు స్వయము రచించెనో యనునట్లు, మణిమయమగు చక్కని మందిరములు దేదీప్యమానముగ నుండును.

దోహా 99

"ఆమందిరములలోఁ జిత్రవిచిత్రమగుభోగముల ననుభవింపవచ్చును. సుగంధద్రవ్యములు, పుష్పములు, హంసతూలికాతల్పములును, మణిదీపములు నానందమును కలుగఁజేయును.

చౌపాయ్

"పాలనురుగుతో సమానమైన మృదువగు తెల్లనిదుప్పటములును, తలదిండ్లును కలవు. ఇంత చక్కనిమందిరములలో శ్రీజానకీరాములు శయనించుచుండిరి వారిసొగసులు మన్మథునిగర్వము నపహరించును. అట్టి శ్రీసీతారాములు నేఁడు మార్గాయాసముచే బడలి, దుప్పటములు లేకయే కుశపల్లవములపర్యంకముమీఁద శయనించిరి; వారి దుర్దశఁజూచిన దుఃఖమువచ్చును. జననీజనకులును, బంధువులును, పురజనులును, స్నేహితులును, దాసదాసీజనంబులును తమప్రాణములను వలె శ్రీరాముని రక్షించుచుండిరి; అట్టి శ్రీరాముఁడు నేఁడు కటికనేల మీఁద నిద్రించెను మహాజ్ఞానియని లోకప్రఖ్యాతిఁబొందిన జనకచక్రవర్తి తండ్రి; దేవేంద్రునిస్నేహితుఁడగు దశరథమహారాజు మామగారు; రామచంద్రుఁడు భర్త; అట్టి జానకి నేఁడు కటికనేలపై శయనించెను. ఎవనియెడల విధాత విపరీతముగ లేఁడు? శ్రీసీతారాములు వనవాసమునకు యోగ్యులా! కర్మప్రధానమని లోకులు చెప్పినమాట సత్యము.

దోహా 100

"కేకయరాజుకూఁతురు, కైకేయి యింతచెడుపనిని జేసెను; శ్రీసీతారాములు సుఖమనుభవించుసమయమున వారికి దుఃఖమాఁ దెచ్చిపెట్టెను.

చౌపాయ్

"కైకేయి సూర్యవంశవృక్షమును గొడ్డలివలె ఛేదించెను. "మొత్తిబుద్ధివలన లోకమంతయు దుఃఖింపవలసివచ్చెను" శ్రీసీతారాములు కటికనేలపై నిద్రించుట గుహుఁడుచూచి కడు దుఃఖించెను.

అప్పుడు లక్ష్మణుఁడు గుహునిఁజూచి, భక్తిజ్ఞానవైరాగ్యములతోఁగూడిన మృదుమధురవచనములఁ జెప్పెను. "ఓనిసాదపతీ! ఒకనివలన నొకనికి సుఖదుఃఖములు కలుగవు; హేభ్రాతా! ఎవనికర్మఫలమును వాఁడనుభవించును. కర్మఫలములు మాయాకృతములు. సంయోగవియోగములును, సుఖదుఃఖములును, హితాహితమధ్యమములును-మాయయొక్కవలలు. జననమరణములును, లోకవ్యవహారములును. సంపదలును, విపత్తులును, కర్మమును, కాలమును, భూమియు, గృహమును, ధనమును, పురములును, బరివారమును, స్వర్గమును, నరకమును, లోకవ్యాపారములును వేయేల నీవు చూచునట్టియు, వినునట్టియు, మనస్సులో విచారించునట్టి సంగతులన్నియును—మాయారచితములు; వాస్తవములు కావు.

దోహా 101

"స్వప్నములో భిక్షుఁడు రాజగును; రాజు భిక్షుఁడగును" మేల్కాంచిన తరువాత నెవనికి లాభనష్టములు లేవు. అట్లులనే, లోకమంతయు మిథ్యయని తెలిసికొనుము.

చౌపాయీ

"ఈసంగతులను విచారించి, రోషమును విడిచిపెట్టుము; వ్యర్థముగ నొకరిని దూషింపకుము. మోహరాత్రిలో జనులందరు నిద్రించుచుండిరి; అనేకవిధములగుస్వప్నములు వారికివచ్చును. ఈసంసారరూపమగురాత్రివేళ, యోగులుమాత్రము మేల్కొనియుందురు; వారికే పరమార్థచింతకలదు; వారికి ప్రపంచముతో బ్రయోజనములేదు. సకలవిషయభోగములనుండి విముఖుఁడు కానంతవఱకు జీవుఁడు మేల్కొనెనని చెప్పుటకువీలుపడదు. జ్ఞానముకలిగినందున మోహపాశములువీడును; శ్రీరాముని చరణములయందను రాగముపుట్టును. 'ఓసఖుఁడా! త్రికరణశుద్ధిగ శ్రీరాముని చరణములను ప్రేమించుటయే, పరమపరమార్థమని తెలిసికొనుము. రఘురాముఁడు బ్రహ్మము; పరమార్థస్వరూపుఁడు, ప్రమాణముచేతఁగాని, అనుభవము చేతగాని అలక్షితుఁడు; అవిరహితుఁడు; ఉపమారహితుఁడు; సంపూర్ణప్రభావుఁడు; సకలవికారరహితుఁడు; సమదర్శి! 'నఇతి,నఇతి'అని వేదములచే నిరూపింపఁబడిన

కాఁడు; అట్టి నేత్రములకు గోచరముసెకుగాని పరమాత్మస్వరూపుఁడగు శ్రీరామునకు సుఖదుఃఖములని చెప్పుట యుచితముకాదు.

దోహా 102

"గోబ్రాహ్మణులకును, దేవతులకును, దాసులకును, సేవకులకు హితవుఁజేయుటకును, భూభారమును హరించుటకును, పరమేశ్వరుఁడు రాముఁడై యవతరించి లీలామానుషచర్యలఁ జూపుఁచున్నాఁడు. ఆచర్యలను వినినయెడల సంసారబంధములు వీడిపోవును.

చౌపాయ్

"ఓసఖుఁడా! ఈప్రకారము విచారించి మోహమును విడిచి పెట్టి శ్రీసీతారాములచరణములను సేవింపుము" ఈప్రకారము వారు శ్రీరామునిగుణములను వర్ణించి చెప్పుకొనుచుండిరి; అంతలోఁ బ్రాతఃకాలమయ్యెను; ఆజగన్మంగళదాయకుఁడు శ్రీరాముఁడు మేల్కాంచెను. ప్రాతఃకాలస్నానసంధ్యావద్యనుష్ఠానముల నతఁడు నిర్వర్తించెను. అతఁడు నిత్యశుద్ధబుద్ధస్వరూపుఁడు; పవిత్రుఁడు. మఱ్ఱిపాలను దెప్పించి దానితో వారు రామలక్ష్మణులు జడలనుబంధించిరి. వారిచర్యంజూచి సుమంతుఁడు కన్నీరుఁగార్చెను. శ్రీరాముని రాజ్యతిలకముఁ జూచుటకుబదులు జటాముకుటమును జూడవలసివచ్చెనని మంత్రి విచారించెను. అతని హృదయము దహించుకొనిపోయెను అతనిముఖము వాడెను. అతఁడు చేతులనుజోడించుకొని రామునితో నిట్లు విన్నవించెను. "ఓనాథా! మహారాజువచనములను వినుఁడు. 'నీవు రథముఁదీసికొని రాముని వెంట వెళ్లుము. వారిముప్పురకు వనముఁజూపించి వారిచే గంగానదిలో స్నానముఁజేయించి శీఘ్రము వారినిఁదీసికొనిరమ్ము. వారిసంశయములను సంకోచములను బోఁగొట్టి వారినిఁదీసికొనిరమ్ము' అని మీతో విన్నవింపుమని వారు చెప్పిరి.

దోహా 103

"ఇదిమహారాజులయాజ్ఞ, ఓనాథా! మీచిత్తముప్రకారము ప్రవర్తించెదను" అని సుమంతుఁడు విన్నవించి బాలునివలె నేడ్చుచు రామునిపాదములమీఁద బడెను.

చౌపాయ్

"ఓతండ్రీ! అయోధ్యానగరము అనాథకాకుండునట్లు వ్యవహ

రింపుడు. మీరులేనప్పుడు, మహారాజులు జీవించుట కష్టము, భరతులు రాజ్యముఁ జేయుట దుస్తరము." శ్రీరాముఁడు మంత్రిని లేవఁదీసి పలు విధముల బోధించెను. 'ఓతండ్రీ! మీకు ధర్మమార్గములు విశదములు శిబి, దధీచి, హరిశ్చంద్రుఁడు మొదలగుమహారాజులు ధర్మమునిమిత్త మనేకకష్టములఁ బడియుండిరి. రంతిదేవుఁడును జ్ఞానియగు బలిచక్రవర్తి యుకష్టములకోర్చి తమధర్మములను నిలువఁబెట్టుకొనిరి. సత్యము కంటె నుత్కృష్టమగుధర్మము గాఁజియొకటి లేదు. ఈసంగతి వేదపురాణే తిహాసములలో సుప్రసిద్ధము. అట్టి సర్వోత్కృష్టమగుధర్మము నాకు సులభముగ లభించుట మార్గము కనబడెను దానిని నేను విడిచిపెట్టిన యెడల నాకు మూడులోకములలో నపకీర్తివచ్చును కోటిమరణముల కంటె, నపకీర్తి సంభావితులను దహించును ఓతండ్రీ! నేను మీతో నేమిచెప్పఁగలను? మీతోఁ బ్రతివచనముల భాషించుటవలన, నాకుఁ బాపమువచ్చును. మీరుపెద్దలు, మీకుఁ దెలియనిసంగతు లేవు.

దోహా 104

"మీరు నాతండ్రిగారి పాదములమీఁదఁ బడి నమస్కరించి చేతులనుజోడించుకొని నాసన్నాహములను విశదముఁ జేయుఁడు, నన్నుగు ఱించి వారు చింతింపకుండునట్లు మీరు ప్రయత్నముఁ జేయుఁడు."

చౌపాయ్

"మీరు నాతండ్రివంటివారు, నాకు హితకారులు; కనుక నేను చేతులనుజోడించుకొని, మీకు విన్నవించుచున్నాను. నావిషయమై నాతండ్రిగారు దుఃఖింపకుండునట్లు చేయఁదగినపనులను మీరు చేయ వలయునని నాప్రార్థన." శ్రీరామసుమంతులసంవాదమును గుహుఁడును అతనిపరిజనులును విని, వ్యాకులమువడిరి. అంతలో లక్ష్మణుఁడు కొన్ని కటువువచనములఁబలికెను; కాని, యతనివచనములను నుచితములని రాముఁడు తెలిసికొనియతనిని నివారించెను. తదుపరి, రాముఁడు సిగ్గు పడి మంత్రినిజూచి, "అయ్యా! లక్ష్మణుఁడు బాలుఁడు; అతనివచనముల నుమీరుపాటించక, మాతండ్రిగారితో విన్నవింపకుఁడు; నాతోడు" అనిచెప్పి బోధించెను. తదుపరి సుమంతుఁడు. మహారాజుసందేశము చెప్పనారంభించెను. "జానకి సుకుమారి, వనవాసకష్టముల నోర్వలేదు.

ఏవిధమున జానకి నగరమునకుఁ దిరిగివచ్చునో ఆవిధమున నామెను బోధించుట యుచితము. ఆమె నాప్రాణమున కాధారము: ఒకవేళ నామె రాకపోయినయెడల జలములేని మీనములువలె. నేను జీవించుట కష్టము.

దోహా 105

"ఆమె స్వేచ్ఛానుసారము తల్లివద్దనుగాని అత్తవద్దనుగాని సుఖముగ నివసించి యుండవచ్చును. ఈలోపల రాముఁడు, పదునాలుగు సంవత్సరములు వనవాసముఁ జేసి తిరిగివచ్చును.

చౌపాయ్

"ఓనాథా! మహారాజుగారిదైన్యమును దుఃఖమును నేనెట్లు వర్ణింపఁగలను? తండ్రిగారిసందేశమును రాముఁడువిని పలువిధముల జానకిని బోధించెను. "ఓజానకీ నీవు తిరిగి గృహమునకు వెళ్లినయెడల నీయత్తమామలకును గురువులకును సఖులకును పరివారమునకును దుఃఖము శాంతించును." శ్రీరామునివచనములను జానకి విని, యిట్లు ప్రత్యుత్తరము నిచ్చెను. "ఓప్రాణనాథా! మీరుసర్వజ్ఞులు. కృపాసముద్రులు. నావిన్నపము నాలకింపుడు. ఛాయపదార్థము ననుసరించియుండునుకాని దానిని విడిచియుండునా? సూర్యునివిడిచి, సూర్యకాంతియుండునా? చంద్రునివిడిచి చంద్రకాంతి యెచ్చటనుండును?" ఈప్రకారము జానకి రామునకు సమాధానము జెప్పి, మంత్రితో నిట్లు పలికెను. "మీరు నాతండ్రిమామలతో సమానులు; నాహితకారులు; మీకుఁ బ్రత్యుత్తరము నిచ్చుట యుచితముకాదు.

దోహా 106

"ఓతండ్రీ! దుఃఖముచేఁ బీడితురాలనై మీయెదుట నిలువఁబడియుంటిని; అదియొకతప్పుగ భావింపకుఁడు; ఆర్యపుత్రులగు నాభర్తపదకమలములు తప్ప తదితర సంబంధములతో నాకుఁ బ్రయోజనము లేదు.

చౌపాయ్

"నాజనకునిభోగైశ్వర్యములను సిరిసంపదలను జూచియుంటిని; భూపతుల ముకుటమణులు నాజనకునిపాదపీఠము నలంకరించియుండును. నాజనకునిగృహము సకలసుఖములలోఁ గూడియుండును; కాని,

నాభర్తవినాగా అవియన్నియు నాకుఁ దృణప్రాయములు. నామామ గారు చక్రవర్తులు. అయోధ్యాపురీశ్వరులు, వారిప్రభావము పదునా లుగులోకములలో వ్యాపించెను. దేవేంద్రుఁడు వారికి నెదురుగవచ్చి, వారిని సన్మానించి, అర్ధసింహాసనమును వారికిచ్చెను. నామామగా రిట్టి ప్రభావసంపన్నులు; వారినివాసము అయోధ్యాపురి; బంధువులు ప్రియులు; తల్లివలె నాయత్తగారు నన్నుఁ బ్రేమించును. అయినను, నానాథుని చ రణకమలపరాగముతప్ప నాకు స్వప్నమందయినను సుఖముకలుగదు, దుర్గమమార్గములును, వనభూములును, పర్వతములును, మహానదులును, వ్యాఘ్రములును, సింహములును, సరస్సులును, కాలకిరాతులును. భిల్లులును, హరిణములును, పశుపతీమృగంబులును—నాప్రాణేశ్వరు నివద్ద నేనుండినయెడల నివియన్నియు నాకు సుఖము నిచ్చును

దోహా 107

"నాయత్తమామలచరణములకు సమస్కరించి నావిన్నపములను వారికిఁజెప్పి, ననుగుఱించి విచారింపవలదని బోధింపుఁడు; సుఖముగ వనవాసముఁ జేయుగలనని విన్నవింపుఁడు.

చౌపాయ్

"నాప్రాణేశ్వరులతోను వారిప్రియసోదరులు వీరాగ్రగణ్యులు. ధనుర్బాణములను ధరించియుండ, వారివెంట నేను వెళ్లుచున్నాను. మార్గాయాసముగాని, దుఃఖముగాని, భ్రమగాని, నాకుఁ గలుగవు. నానిమిత్తము మీరు విచారింపకుఁడు.'' ఇట్లు జానకి చెప్పినమాటలను సుమంతుఁడువిని, మాణిక్యమును బోగొట్టుకొనిన సర్పమువలె విచా రించెను. అతఁడు నేత్రములతోఁ జూడలేకపోయెను; చెవులతో వినలే కపోయెను. అతఁడు మాటఁజెప్పలేక యూరకుండెను. అతనిదుఃఖము పొంగిపొర్లెను. అనేకవిధముల నతనిని రాముఁడు బోధించెనుకాని యతనిమనస్సు చల్లఁబడలేదు. వారిని మరలించుటకు సుమంతుఁ డనేక ప్రయత్నములఁ జేసెనుకాని, యతనికిఁదగినవిధమున రాముఁడు ప్రత్యు త్తరము నిచ్చెను. "మీరు మహారాజులను విడిచిపెట్టుట యుచితము కాదు." అని రాముఁడుచెప్పెను. "శ్రీరామునియాజ్ఞ అలంఘనీయము; విధికృతములు కఠినములు; నేనేమిచేయఁగలను." అని సుమంతుఁడు

చింతించి, వారిముగ్వురిపాదములకు నమస్కరించి, మోసపోయినకళాసువలె, బ్రయాణోన్ముఖుఁడయ్యెను

దోహా 108

సుమంతుఁడు రథమును నడిపించుకొని వెళ్ళెను. అతనిగుఱ్ఱములు సకిలించుచు, రామునివైపుఁ దిరిగితిరిగిచూచుచు నడచెను. ఈచరిత్రము నిషాదుఁడు చూచి శిరస్సును మోఁదుకొని దుఃఖించెను.

చౌపాయ్

"నోరులేనిజంతువులే రామునివియోగమును సహింపలేక యేడ్చుచుండెనుగదా! ఇఁక నతనితల్లిదండ్రులును బ్రజలు నెట్లు సహింపఁగలరు!" అని గుహుఁడు చింతించెను. ఈప్రకారము బలవంతముగ శ్రీరాముఁడు సుమంతునిఁ బంపించి, భార్యయు తమ్మునితోఁగూడి గంగానదీతీరమునకు వచ్చెను. అతఁడు నావికునిఁ బిలిచి నావను దీసికొని రమ్మనుమని చెప్పెనుగాని, వాఁడు నావను దీసికొని రాలేదు. వానిమనస్సులోఁ గలసందేహమును వాఁడు రామునితో విన్నవించెను. "ఓనాథా! మీమర్మమును గ్రహించితిని, మీచరణకమలపరాగము మనుజులఁ జేయఁగలదని లోకవాడుక కలదు. మీచరణపరాగము సోకినమాత్రమున, శిల నారియయ్యెను శిలకంటె దారువు బలముకాదు. ఒకవేళ నానావయు నారియగునేమో! ఎవరికిఁ దెలియును. అది నిజముగ నారియయినయెడల నానావమార్గము కట్టబడును. ఈనావవలన నేను నాపరివారమును, కుటుంబమును పోషించుచుంటిని. ఇదితప్ప నాకేయొక జీవనాధారమును నేనెఱుంగను. ఓనాథా! ఒకవేళ మీరుగంగానదిని దాఁటవలెనని కోరినయెడల, మీపాదముల కడుగుటకుఁ బ్రసాదింపుఁడు.

ఛంద 4

"ఓనాథా! మీచరణారవిందములఁ గడిగి మీపాదోదకమును నాశిరమునైధరించి పితృములను దాఁటించెద. మీరు భవసాగరమును దాఁటించెదరు! నేను నదిం దాఁటించెదను: మనయుభయులము చేయు పనియొకటియే; కనుక మీవద్దనుండి పన్నుఁబుచ్చుకొనను. ఓనాథా! మీతోడు. నేను సత్యముఁజెప్పుచున్నాను. లక్ష్మణమూర్తి బాణములఁ బ్రయోగించి నన్ను సంహరించుఁగాక. మీపాదములను నన్ను మీరు

కనుగనిచ్చినగాని, నేను మిమ్ములను దాఁటింపను. ఓకృపానిధీ! నన్ను రక్షింపుము."

సోరఠా 4

నావికుఁడు పలికినపలుకులు కొంచెము మోటుగనుండినను, ప్రేమపూరితములని రాముఁడు గ్రహించి, జానకిని, తమ్ముని జూచి, మందహాసముఁ జేసెను (శ్రీరాముఁడు, కరుణాసముద్రుఁడుకదా! వారిరువురవైపు జూచుటకుఁ గారణమేమి? "ఓజానకీ! కన్యాదానకాలమున, మీతండ్రి కడిగినపాదములను వీఁడు కడుగుటకు సిద్ధపడెను; చూడుము" లేక, "నీవు సేవించుచుండినపాదములను వీఁడు సేవింపఁదలఁచెను; చూడుము"—లేక "నిషాదపతియే; చతురుఁడని భ్రమపడియుంటిమి; ఆతనిసే నకుఁడెంతచతురుఁడో, తెలిసికొనుము"—లేక "మీరిరువురు నాపాదములో నొక్కొక్కదానిని సేవించి యింతసద్గతికి వచ్చితిరికదా! ఇక నా రెండుచరణములను సేవించువాఁ డెట్టిసద్గతిఁ బొందఁగలఁడో తెలిసికొనుము"—అని శ్రీరాముని చూపునకు భావము.)

చౌపాయ్

శ్రీకృపాసాగరుఁడు మందహాసముఁ జేసి నావికునితో నిట్లుపలికెను. "ఓయీ! నీనావను రక్షించుటకుఁ దగినట్లు, వ్యవహరింపుము. శీఘ్రము జలముఁ దీసికొనివచ్చి, నాపాదములఁ గడుగుము. విలంబముఁ జేయక, మమ్ములను దాఁటింపుము" ఆపరమేశ్వరుని శ్రీరాముని నామము నొకమారు స్మరించినమాత్రమున, మనుజులు భవసాగరమును దాఁటుచున్నారు. అహా! ఆశ్రీరాముఁడు నావికుని బ్రతిమాలుకొనెనుకదా! వామనావతారములో నతని మూఁడుపాదములకు భూమి సరిపోలేదు. శ్రీరామునిపదనఖములఁ జూచి, తనజన్మస్థానమని తెలిసికొని, గంగాదేవి సంతోషించెను; ఆమె శ్రీరామునిమాటలనువిని, స్వస్థచిత్తురాలయ్యెను. శ్రీరామునియాజ్ఞానుసారము, నావికుఁడు పాత్రతో జలముందీసికొనిరాక, తోలుతిత్తితో జలముందెచ్చెను. (శ్రీమునిపాదములమహాత్మ్యము దెలిసికొనఁగోరి, వాఁడు తోలుతిత్తి దెచ్చెను; ఇది గాని స్త్రీ కాకుండినయెడల నావకూడ కాదని నిర్ధారణఁ జేయవచ్చును.) ఆనావికునివంటి ధన్యుఁడు లేఁడని తలంచి, దేవతులు స్తోత్రముఁ జేసి,

పుష్పములను వర్షించిరి. ధ్యాననిష్ఠాగరిష్ఠులగు మునీశ్వరులకునసహిత మగోచరమగు శ్రీరాముని చరణకమలములను వాఁడు ప్రత్యక్షముగఁ బ్రక్షాళనఁజేసెగదా! వాడెంతపుణ్యాత్ముఁడు. వాఁడు పరమానందభరితుఁడై, శ్రీరాముని చరణారవిందములను గడుగ నారంభించెను.

దోహా 109

వాఁడును వానిబంధువులును శ్రీరాముని పాదతీర్థమును పానముఁజేసి, పవిత్రులయిరి. వానిపితృదేవతులు తరించిరి. తదనంతరముఁ వాఁడు పడవఁగడపి, శ్రీసీతారామలక్ష్మణులను. గుహుఁనినది దాఁటించెను.

---

# అష్టమ విశ్రామము

---

చౌపాయ్

శ్రీసీతారామలక్ష్మణులును, నిషాదపతియు, గంగానదినిదాఁటి, దాని యిసుకదిబ్బలమీఁదఁ గూర్చుండిరి. ఆనావికుఁడువచ్చి. శ్రీరామునకు నమస్కరించెను. వానికి వేతనమునిచ్చుటకు ధనములేనందుకు రాముఁడు విచారించెను. నాథునియంతరంగమును జానకి గ్రహించి రత్నస్థగితమగు ముద్దుటుంగరమును దీసి, వారిచేతిలోఁ బెట్టెను. "ఓయీ! ఇదిగో నీవేతనముఁ బుచ్చుకొనుము" అని యాకృపాళుఁడు చెప్పెను. ఆనావికుఁడు విహ్వలమానసుఁడై, శ్రీరామునిచరణములఁ బట్టుకొనెను. ఓనాథా! ఈరోజున నేను బొందనిది యొకటికలదా? నాపాపము, రోగము, దుఃఖము, దరిద్రము మొదలగునవి నశించెను. అనేకజన్మములనుండి నేను శ్రమపడుచుండిన శ్రమకు నేడు విధాత నాకుఁదగినట్లు సంపూర్ణమగు వేతనముల నిచ్చెను. నాపితరులందఱును పారంగతులయిరి. ఓనాథా? మీరు దీనదయాపరులు. మీయనుగ్రహముతప్ప నాకు మఱియొకదానితోఁ బ్రయోజనములేదు. తమరు తిరిగివచ్చినపుడు, నన్నుఁ గటాక్షించి, యేప్రసాదమును మీరు నాకు దయచేసినను నేను దానిని శిరసావహించెదను."

దోహా 110

రామలక్ష్మణులు పలువిధముల వానిని బోధించిరి; కాని, వాఁడు మాత్రము వేతనమును స్వీకరింపలేదు. "నేను మిమ్ములనొక్కరిని దాటించితిని; కాని, మీరు నాపితురుల నందఱిని దాటించితిరి; కనుక నేను వేతనమును స్వీకరింపను" అని వాఁడు చెప్పెను, అప్పుడు వానికి శ్రీరాముఁడు నిర్మలమగుభక్తి నిచ్చి వానిని బంపించెను.

చౌపాయ్

తదుపరి, శ్రీరాముఁడు స్నానముఁజేసి శివునిబూజించి సాష్టాంగ నమస్కారముఁ జేసెను. జానకి చేతులనుజోడించుకొని గంగాదేవికి నమస్కరించి "ఓతల్లీ! నామనోరథము నీడేర్పుము. నానాథుఁడును నామఱదియు నేనును క్షేమముగ తిరిగివచ్చి పునః నిన్ను దర్శించి పూజించునట్లు ప్రసాదింపుము" అని ప్రార్థించెను ప్రేమరసపూరితములగు జానకి మాటలను గంగాదేవి విని, నిర్మలమగువాక్యములతో నామె యిట్లు ప్రత్యుత్తరమునిచ్చెను. "ఓరఘునాథునిధర్మపత్నీ! జనకచక్రవర్తి జ్ఞానులలో శిరోమణి; అతనికూఁతురవు నీవు; నామాటలను వినుము. లోకములో నీప్రభావ మెవరికిఁ దెలియదు? నీకృపాదృష్టిచే దేవేంద్రాదిలోకపాలురు సకలభోగముల ననుభవించుచుండిరి; సకలసిద్ధులును నీచేతిలో నుండును; అవి చేతులను జోడించుకొని నిన్ను సేవించును. నాకుఁ బెద్దఱికమునిచ్చి, నన్ను బ్రార్థించితివి. నీకు నాయందు దయకలదు. కనుక, నన్నింతగాఁగొనియాడితివి. అయినను, ఓదేవీ! నీమాటలు సఫలమగునట్లు దీవించెదను.

దోహా 111

"నీప్రాణనాథుఁడును వారితమ్ముఁడును, నీవును కుశలముగ నయోధ్యానగరమునకు రాఁగలరు. నీమనోరథములు సఫలమగును. లోకములో మీకీర్తి వ్యాపించును. ఇట్లు గంగాదేవి పలికెను.

చౌపాయ్

గంగాదేవి యనుకూలముగనుండి, మంగళప్రదమగువచనములఁ బలికెను; వానిని జానకి విని సంతోషించెను. అప్పుడు శ్రీరాముఁడు గుహునిఁజూచి, గృహములకుఁ బొమ్మని చెప్పెను. ఆమాట నతఁడు వినినవెంటనే, యతనిముఖము వాడిపోయెను; అతనికి దుఃఖము వచ్చెను.

గుహుఁడు దీనుఁడై, చేతులను జోడించుకొని యిట్లు విన్నవించెను. "ఓనాథా! నావిన్నపమును వినుఁడు; నేను మీవెంబడివచ్చి, మీకు మార్గమును జూపించి, నాలుగురోజులు మీచరణములను సేవించెదను. వనములో నెచ్చట మీరు నివసించెదరో, అచ్చట మీనివాసమునకుఁ దగినపర్ణశాల నొకదానిని నిర్మించెదను మీతోడు; తదుపరి, మీయాజ్ఞప్రకారము సంచరించెదను" అతనిమాటలను శ్రీరాముఁడు విని, ప్రసన్నుఁడై యతనిని వెంటఁదీసికొని వెళ్లెను. తదుపరి, నిషాదపతి బంధువులను బిలిచి, వారిని యథావిధిగ సత్కరించి, వారివారి స్వగృహములకుఁ బంపించెను.

దోహా 112

తదుపరి గణపతికిని, ఉమామహేశ్వరులకును, గంగాదేవికిని, శ్రీరాముఁడు నమస్కరించి, వారిని స్మరించి, సీతాలక్ష్మణగుహులతోఁ గూడి వనమునకుఁ బ్రయాణమయ్యెను.

చౌపాయ్

ఆరోజున వారు తరుచ్ఛాయలో నివసించిరి. లక్ష్మణుఁడును గుహుఁడును స్థలమును శుభ్రముఁజేసి, కుశపల్లవములతో నాసనమును బఱచి, కందమూలఫలములఁ దీసికొని వచ్చిరి. అంత ప్రాతఃకాలము య్యెను; అన్నదమ్ము లిరువురును స్నానసంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించి, జానకితోఁగూడి వెడలి, తీర్థరాజగు ప్రయాగను దర్శించిరి. ఆతీర్థరాజమునకు సత్యము మంత్రి; శ్రద్ధ ప్రాణసఖి; మాధవునివంటిహితకారి-సఖుఁడు; ధర్మార్థకామమోక్షములు భండారములోనిసొమ్ములు; పుణ్యతీర్థములు రాజ్యము; నలువదిక్కోసులవఱకుఁ గలక్షేత్రములు దృఢమగుసంరక్షణదుర్గములు; పాపములు శత్రువులు; స్వప్నమందైనను దుర్గములను భేదించి, లోపలఁ బ్రవేశించుటకు శత్రువులకు శక్తిలేదు. గొప్పగొప్పతీర్థములు సైన్యములు; వానిలో గొప్పవీరుఁడు పాపముల సైన్యములను సంహరించి, విజృంభించును. ఆత్రివేణీసంగమము చక్కనిసింహాసనము; అక్షయవటవృక్షము ఛత్రము; ఇది మునీశ్వరులమనస్సులను సహితము హరించును. గంగాయమునానదుల తరంగములు చామరములు; వానిని జూచినమాత్రమున సకలదుఃఖములును దరిద్రమును నశించును.

దోహా 113

పుణ్యాత్ములును, మహాత్ములును, సాధువులును, రాజసేవకులు; వారిమనోరథము లీడేరును; వేదపురాణములు, వందిజనంబులు; రాజు యొక్కసకలగుణములను వారు వర్ణించుచుందురు.

చౌపాయ్

ఆ ప్రయాగరాజుయొక్క ప్రభావము నెవరు వర్ణింపఁగలరు! పాపము లను నట్టిమదగజములను సంహరించుటకు సింహము; ఇట్లు దేదీప్యమానముగ వెలుగుచుండిన ప్రయాగరాజమును శ్రీరాముఁడు దర్శించి సంతోషించెను. శ్రీరాముఁడు స్వయము తీర్థరాజుయొక్కప్రభావమును వర్ణించి సీతాలక్ష్మణగుహులకుఁ జెప్పెను. వారు తీర్థరాజునకు నమస్కరించి యచ్చటివనోపవనములఁజూచి యానందించుచు దానిమహాత్మ్యము జెప్పుకొనుచు నడచిరి. ఈ ప్రకారము శ్రీరాముఁడు వారితోఁగూడి వచ్చి త్రివేణిని దర్శించెను. ఆ త్రివేణిని స్మరించినమాత్రమున సకల సన్మంగళములును సమకూడును. వారు త్రివేణిలో స్నానముఁజేసి శివునిఁబూజించి క్షేత్రపాలకుఁడగు మాధవుని యథావిధిగ సేవించిరి. తదుపరి, శ్రీరాముఁడు భరద్వాజుని యాశ్రమమునకువచ్చెను.ఆమునిరాజునకతఁడు సాష్టాంగనమస్కారముఁజేసెను; అతఁడు శ్రీరాముని లేవఁదీసి కౌఁగిలించుకొనెను. మూర్తీభవించిన బ్రహ్మానందముఁ జూచినట్లు భరద్వాజుఁడు సంతోషించెను.

దోహా 114

మునీశ్వరుఁడు సంతోషించి, శ్రీరాముని దీవించెను. అతఁడు పరమానందముఁబొందెను; అతనిపుణ్యఫలమును బ్రహ్మ తీసికొనివచ్చి యతని నేత్రముల యెదుట బెట్టినట్లతఁడు సంతోషించెను.

చౌపాయ్

అతఁడు కుశలప్రశ్నఁజేసి, ఆసనముపై శ్రీరామునిఁ గూర్చుండబెట్టెను. షోడశోపచారములతో నతఁడు శ్రీరామునిఁబూజించి కృతార్థుఁడయ్యెను; ఆతనిమనోభీష్ట మీడేరెను. అమృతోపమానమగు కందమూలఫలములను అంకురముల నతఁడు తీసికొనివచ్చి రామున కిచ్చెను. సీతాలక్ష్మణగుహులతోఁగూడి శ్రీరాముఁడు సంతోషించుచు వానిని నారగించెను. శ్రీరాముఁడు నేఁడేకి ప్రసన్నచిత్తుఁడయ్యెను. అప్పుడు భర

ద్వాజుఁడు రామునితో నిట్లు ప్రసంగించెను. "ఈరోజున నాతపస్సు, తీర్థవాసము, యాగము, యజ్ఞము, వైరాగ్యము, జపము సఫలమయ్యెను. ఓరఘునాథా! మీదర్శనమువలన నాశుభసాధనములన్నియు ఫలించెను. ఇదియే లాభము; ఇదియే సుఖము; ఇంతకంటె మఱియొకటి లేదు; మీదర్శనమువలన నాయాశలన్నియు సంపూర్ణమయ్యెను; మీచరణకమలములయందు సదా సహజమగు ప్రేమయుండునట్లు నన్నుఁ బ్రసాదింపుము. ఇదియే నా ప్రార్థన.

### దోహా 115

"ఓనాథా! కపటమును విడిచి త్రికరణశుద్ధిగ మిమ్ములను సేవింపని వఱకు మనుజుఁడు కోటిప్రయత్నములఁ జేసినను స్వప్నమందైనను సుఖమును బొందలేఁడు."

### చౌపాయ్

ఆమునీశ్వరునిమాటలను శ్రీరాముఁడువిని కొంచెము సంకోచించెను; కాని యతనిభక్తితాత్పర్యములం దెలిసికొని సంతోషించెను. తదుపరి శ్రీరాముఁడు పలువిధముల నతనిప్రభావమును వర్ణించి వారికి జెప్పెను. "ఓమునిరాజా! మీచే నాదరింపఁబడినవాఁడే గొప్పవాఁడు; వాఁడే సకలగుణసంపన్నుఁడు." ఈప్రకారము మునివీర రఘువీరులు పరస్పరము వందనములఁ జేసికొని అన్యోన్యసంభాషణముల చేఁ జెప్పరాక యుకాని సంతోషముఁ బొందిరి. ప్రయాగనివాసులగు బ్రహ్మచారులును, తపశ్శాలులును సిద్ధులును మొదలగువారు దశరథకుమారులయాగమనమును విని, వారిం జూచుటకుఁ బరుగెత్తుకొనివచ్చిరి. శ్రీరాముఁడు వారికి యథావిధిగ నమస్కరించెను; నేత్రోత్సవముగ వారు శ్రీరామునిసందర్శించి సంతోషించిరి; వారు రామునిదీవించి యతనిదివ్యమంగళవిగ్రహము గొనియాడి స్వగృహములకు నిష్క్రమించిరి.

### దోహా 116

ఆరాత్రి శ్రీరాముఁడు భరద్వాజునియాశ్రమములో విశ్రమించి ప్రాతఃకాలమున త్రివేణిలో స్నానసంధ్యాదిక్రియలను నిర్వర్తించెను. తదుపరి యతఁడు మునీశ్వరునివద్ద సెలవుఁగైకొని సీతాలక్ష్మణగుహులతోఁగూడి ప్రయాణమయ్యెను.

చౌపాయ్

అప్పుడు శ్రీరాముఁడు మునీశ్వరునిఁ జూచి "ఓనాథా! ఏమార్గమున మేము పోవచ్చునో చెప్పుడు" అని యడిగెను. మునిరాజు మనస్సులో నవ్వి, "ఓనాథా! అన్నిమార్గములు మీకు సుగమము" అని చెప్పి వారివెంటవెళ్లుటకు శిష్యుల బిలిచెను. ఆశిష్యులు సంతోషించి వెంటనే వచ్చిరి; శ్రీరామునియందుఁగల ప్రేమచేత వారిలోఁ బ్రతిమనుజుఁడును మార్గముఁ జూపింపఁగలనని చెప్పెను. వారిలో నల్వురు శిష్యుల నతఁడు రామునివెంటఁ బంపెను. ఆనల్వురును వారిపూర్వజన్మములలో ననేకపుణ్యకర్మలఁ జేసియుండిరి. శ్రీరాముఁడు మునీశ్వరునకు నమస్కరించి, యతిని సెలవుఁగైకొని, ప్రయాణమును సాగించెను. వారు గ్రామసమీపమునకు వచ్చునప్పటికి గ్రామములో నివసించు స్త్రీపురుషులు వారిం జూచుటకు వచ్చిరి; వారు శ్రీరామునిఁ జూచి, తమజన్మము సఫలమయ్యెనని తలంచి, నిష్క్రమించిరి; కాని, వారిమనస్సుమాత్రము రామునిమీఁద నుండెను.

దోహా 117

తదుపరి, శ్రీరాముఁడు విద్యార్థులకు సెలవిచ్చి పంపించెను. వారు తమ మనోభీష్టముఁ బొంది, నిష్క్రమించిరి. అంత శ్రీరాముఁడు యమునా నదివద్దకు వచ్చెను; రామునిశరీరమువలె, నీలమగు దానిజలములలో శ్రీరాముఁడు, సీతాలక్ష్మణగుహులతోఁ గూడ, స్నానముఁ జేసెను.

చౌపాయ్

యమునానదీతీరవాసులగు స్త్రీపురుషులు శ్రీరాముని యాగమనమును విని, చేతులలోనిపనులను విడిచిపెట్టి అతనిని జూచుటకుఁ బరుగెత్తుకొనివచ్చిరి. శ్రీసీతారామలక్ష్మణుల దివ్యమంగళవిగ్రహములను సందర్శించి, తమజన్మము సఫలమయ్యెనని సంతోషించిరి; వారిమనస్సులో నుత్సాహముపుట్టి, వారు తత్తరపడుచు సంకోచించి సంకోచించి; వారినామధేయముల నడిగిరి. వారిలో వయోవృద్ధులగుచతురులు శ్రీరామునిగురుతుపట్టి వారి ఆమువ్వురివృత్తాంతముఁ జెప్పిరి. తండ్రియాజ్ఞప్రకారము వారు వనములకువచ్చిరని జనులువిని, విచారించి, దుఃఖించిరి. "అహో! రాజును రాణియు చేసినపని శ్లాఘనీయముకాదు." అని వారిలోవారు గుసగుసలాడిరి. ఆసమయమున నొకతపశ్శాలి

వచ్చెను; అతఁడు మహాతేజస్వి;వయస్సులోఁ జిన్నవాఁడు అతనివ్యాపా రము లేకవీశ్వరునకుఁ దెలియవు; అతఁడు మునివేషమును ధరించెను; కాని, త్రికరణశుద్ధిగ నతనికి రామునియం దభిమానము.

దోహా 118

అతనినేత్రములవెంబడి కన్నీరు కారెను; అతనిశరీరము పులకరించెను; ఇష్టదేవుఁడగు శ్రీరాముని యతఁడుచూచి, సాష్టాంగదండప్రణామముఁ జేసెను. అతనియవస్థఁ జెప్పుటకు శక్యముకాదు.

చౌపాయీ

అతనిం జూచినందున శ్రీరామునిశరీరము పులకరించెను. అతనిని శ్రీరాముఁడు లేవఁదీసి, కౌఁగిలించుకొనెను. చింతామణినిఁబొందిన పరమదరిద్రునివలె, నాతపస్వి సంతోషించెను. మూర్తిభవించినప్రేమయు పరమార్థమును కలిసినట్లుండెనని జనులు చెప్పఁదొడంగిరి. ఆతపస్వి, తదుపరి, లక్ష్మణునిపాదములకు మ్రొక్కెను. అతనిని లక్ష్మణుఁడు లేవఁదీసి, కౌఁగిలించుకొనెను. అనంతర మతఁడు జానకీచరణములకు నమస్కరించి, ఆమెపాదధూళిని శిరస్సున ధరించెను. అతఁడు బాలుఁడని తెలిసికొని, ఆమె యతనిని దీవించెను. ఆమునీశ్వరునకు గుహుఁడు నమస్కరించెను; ఆనిషాదపతి శ్రీరామునిస్నేహితుఁడని యతఁడు గ్రహించి, యతనిని సంభావించెను ఆమునీశ్వరుఁడు నయనపుటములద్వారమున పీయూషముఁ బానముఁ జేసెను; ఆకలిగొనిన వాఁడు భోజపదార్థములను బొందినపుడు వలె నతఁడు సంతోషించెను. అంతలో నచ్చటిస్త్రీ లిట్లు సంభాషించుచుండిరి "ఇంత చక్కనిబాలకులను వనములకుఁ బంపిన తల్లిదండ్రు లెవరోకదా!" శ్రీసీతారామలక్ష్మణుల దివ్యమంగళవిగ్రహములను వారుచూచి, వారియందు బద్ధానురాగులై వారిదురవస్థకు విలపించిరి.

దోహా 119

అనేకవిధముల శ్రీరాముఁడు నిషాదపతిని బోధించెను; అతఁడు శ్రీరామునకు నమస్కరించి గృహాభిముఖుఁ డయ్యెను.

చౌపాయీ

తదుపరి, శ్రీసీతారాములు చేతులనుజోడించుకొని యమునానదికి నమస్కరించిరి. జానకితోఁగూడి అన్నదమ్ము లిరువురును యమునానదిమ

హాత్మ్యముఁ జెప్పుకొనుచు నడచిరి ఆయమునానది సూర్యునిపుత్రిక. మార్గస్థులనేకులు వారిని మార్గములోఁ జూచిరి. ప్రయాణికులు వారి ముఖ్వరంజూచి, బద్ధానురాగులై వారితో నిట్లు ప్రసంగించిరి. "అయ్యలారా! మీచక్కనిశరీరములంజూడ, రాజలక్షణములు కనఁబడుచున్నవి. మీకీదశపట్టి, తిరుగుచుండినందులకు, మాకు విచారము కలుగుచున్నది. మీరు పాదచారులై రక్షకులులేకయే వచ్చుచుండిరి; జ్యోతిష్కులమాటలసత్యమని తోఁచుచున్నది. మార్గములు దుర్గములు; కడుగొప్పగొప్ప పర్వతములును వనములును గలవు. ఒకసుకుమారియగుస్త్రీ మిమ్ముల నాశ్రయించియున్నది. సింహములును మదగజములును వనములోఁ గలవు. భయంకరమగు దుర్గారణ్యములం జెప్పుటకు శక్యముకాదు; మీరు మమ్ముల నాజ్ఞాపించినయెడల, మీ వెంటవచ్చెదము. మీయిష్టము వచ్చినంతవఱకు మీతోఁగలసివచ్చి, తదుపరి మీ సెలవుఁబుచ్చుకొని మీకు నమస్కరించి తిరిగివచ్చెదము."

దోహా 120

ఈప్రకారము వారుపలికి, ప్రేమాస్పదులై కన్నీరుఁగార్చిరి. మృదుమధురవచనములతో వారినిబోధించి రాముఁడు వారిని మరలించెను.

చౌపాయ్

నాగరలోకమును దేవలోకములను మించినట్టి నగరములును గ్రామములును మార్గములోఁ గనఁబడెను. ఈపుణ్యభూములు పరమశోభాయమానముగ నుండెను; ఏపుణ్యాత్ముఁ డేసుముహూర్తమున వీనిని బ్రతిష్ఠించెనో తెలియదు. శ్రీరాముని చరణారవిందములు సోఁకినప్రదేశములతో నమరావతీపట్టణమైనను సమానముకాదు.; ఆప్రదేశములలో నివసించుపుణ్యాత్ములతో సురపురవాసులు సహితము సమానులుకారు. ఆమేఘశ్యాముఁడగు శ్రీరాముని ఆసీతాలక్ష్మణులను, వారు నేత్రోత్సవముగఁజూచి యానందించిరి. శ్రీరాముఁడు స్నానముఁ జేసిన సరోవరములతోను నదులతోను మానససరోవరముగాని గంగానదిగాని సమానములుకావు. ఏచెట్లనీడలక్రింద శ్రీరాముఁడు కూర్చుండియుండెనో, వానితోఁ గల్పవృక్షము సమానముకాదు. శ్రీరాముని చరణకమలములు స్పర్శించినందున ధన్యురాలనయితినని భూదేవితలంచెను

దోహా 121

ఛత్రమువలె మేఘములు నీడనిచ్చెను; దేవతలు పుష్పములను వర్షించి రాముని స్తోత్రముఁజేసిరి. గిరి వన మృగములం జూచుచు రాముఁడు నడచెను.

చౌపాయ్

ఆయాసమయములలో శ్రీసీతారామలక్ష్మణులు గ్రామములను సమీపించుచుండిరి, వారియాగమనమును విని గ్రామములోని స్త్రీపురుషు లాబాలవృద్ధులు తమతమపనులను విడిచిపెట్టి రామునిఁ జూచుటకు వచ్చిరి. వారిదివ్యమంగళరూపములను కన్నులారఁజూచి తమ నేత్రములు సఫలమయ్యెనని తలంచి వారు సంతోషించిరి. ఆనందబాష్పములు వారినేత్రములవెంబడి కారెను; వారిశరీరములు పులకరించెను. రామలక్ష్మణులను వారు చూచి, బద్ధానురాగులై, పరవశులయిరి, చింతామణినిఁ బొందినదరిద్రునివలె, వారు పరమానందభరితులయిరి; వారియవస్థఁ జెప్పుటకు శక్యముకాదు, "ఒకక్షణమయినను నేత్రోత్సవముఁ జేసికొనుము" అని యొకరినొకరు సొచ్చరించుకొనుచుండిరి. రామునియందుఁ గలప్రేమచే నొకఁడు రామునిఁజూచుచు నతనివెంట నడచివెళ్లెను. నేత్రములద్వారా మఱియొకఁడు శ్రీరాముని దివ్యమంగళవిగ్రహమును గ్రహించి, నిశ్చేష్టుఁడయ్యెను; వాఁడు మాటఁజెప్ప లేక, కదలక నిలువఁబడెను.

దోహా 122

మఱియొకఁడు చల్లని వటవృక్షచ్ఛాయనుజూచి, కోమలములగు తృణపల్లవములతో నొకపాన్పును బఱచి, "ఓనాథా! ఒకక్షణము దీని క్రింద విశ్రమించి నేఁడేటి ప్రయాణమును సాగింపుఁడు లేక యిచ్చట రేపు ప్రాతఃకాలమువఱకు విరమింపుఁడు" అని ప్రార్థించును.

చౌపాయ్

మఱియొకఁడు పాత్రతో జలముం దీసికొనివచ్చి "ఓనాథా! ఈజలమును పానముఁజేయుఁడు" అని మృదువుగ విన్నవించును. వారి ప్రియవచనములనువిని, వారికిఁ దనమీఁదఁగల యనురాగమును గ్రహించి, ఆ పరమకృపాళుఁడు ఆసుశీలుఁడు శ్రీరాముఁడు జానకిసహితము శ్రమపడియుండినందున, నొకక్షణము వటవృక్షముక్రింద విర

మించెను. స్త్రీపురుషులు వారిశోభనుజూచి సంతోషించిరి; నిరుపమాన మగు వారిరూపములం జూచినందున, వారినేత్రములకు లోభత్వము వచ్చెను. చంద్రునిఁ జకోరములువలె, శ్రీరాముని రూపలావణ్యములను వారు తెప్పవేయక చూచుచుండిరి. శ్రీరామునిమాయవలన నతనిము ఖము నలువైపులనుండినవారికి యెదురుగనుండినట్లు కనఁబడెను. నూతన తమాలవృక్షముఁను బోలిన శ్రీరాముని శ్యామలశరీరము కోటిమన్మ థులం దిరస్కరించుచుండెను. మెఱుపువలె లక్ష్మణునిశరీరము ప్రకా శించెను. నఖశిఖపర్యంత మతనియవయవముల చక్కఁదనముఁజూచి, వారు భ్రమించిరి; అతఁడు నారబట్టలఁ గట్టుకొనెను; అతనినడుమున తరకసును, కమలములవంటి హస్తమున ధనుర్బాణములును బ్రకాశిం చెను.

దోహా 123

శిరమున జటామకుటమును, విశాలమగువక్షఃస్థలమును, ఆజా నుబాహువులును, వికసించినపద్మములవంటి నేత్రములును, శరత్కాల చంద్రబింబమువంటి ముఖమును— ఇంత చక్కనిరూపము, స్వేదబిం దువులతోఁగూడి దేదీప్యమానముగ నుండెను.

చౌపాయీ

ఆయన్నదమ్ముల చక్కఁదనమును వర్ణింప శక్యముకాదు. వారి సౌందర్య మధికము; నాబుద్ధి స్వల్పము. ఆముగ్గురచక్కదనములో వారిమనస్సులు లీనమయ్యెను. దేదీప్యమానముగ వెలుగుచుండినకాం తినిఁ జూచిన మృగమిథునమువలె, స్త్రీపురుషులు దాహముచేతనువలె నత్యంతానురాగముచే నిశ్చేష్టులయిరి గ్రామములోని స్త్రీలు జానకిని సమీపించి సంకోచించుచు నామెయందుగల దయచే, నామెను గొన్ని ప్రశ్నల నడుగుచుండిరి. ఆమెపాదములను వారు మాటిమాటికిఁ బట్టుకొని మృదుమధురముగ నిట్లు ప్రసంగించిరి: "ఓరాజకుమారీ! మే మొకవిన్నపముఁ జేయుచున్నాము. స్త్రీస్వభావము కనుక నడుగుటకు భయపడుచున్నాము. ఓతల్లీ! మా అవినయమును క్షమింపుము. మేము గ్రామస్థులము; మాకు మాటలనేర్పు తెలియదు; కనుక మమ్ములను క్షమింపుము. ఈరాజకుమారు లిరువురదేహముల కాంతులలోనుండి,

మరకతమును బంగారమును తమతమకాంతుల నెరువుఁదెచ్చుకొనినట్లు కనఁబడును.

దోహా 124

"ఒకరిశరీరము శ్యామలము; రెండవవానిశరీరము గౌరవర్ణము. ఆసుందరపురుషులు సకలసుఖధాములు; వారినేత్రములు శరత్కాలసరోరుహములు; వారిముఖములు శరత్కాలచంద్రబింబములు.

చౌపాయ్

"వారిచక్కదనముఁ జూచి, కోటిమన్మథులుసహితము సిగ్గుపడఁగలరు. ఓసుముఖీ! వారు నీకేమి కాఁగలరు?" ఇట్లు వారు మనస్ఫూర్తిగ పలికిన ప్రియవచనములను జానకి విని, లజ్జపడి, మనసులో నవ్వుకొని మొదట రామలక్ష్మణులను, తరువాత శిరస్సును వంచుకొని, భూమినిఁ జూచెను. ఆబాల, ఆమృగనయని, ఆపికవాణి, జానకి వారిం జూచి, మృదుమధురముగ నిట్లు ప్రయోక్తులఁ బలికెను. "ఓచెలియలారా! సహజస్వభావుఁడును, పచ్చనిశరీరముగలవాఁడే లక్ష్మణమూర్తి. అతఁడు నామఱఁది; చిన్నవాఁడు. ఆనీలమేఘశ్యాముఁడు, ఆకమలలోచనుఁడు, ఆనిడుదభుజములుగలవాఁడు" అని యామెచెప్పి, చేలాంచలముతోఁ దనముఖచంద్రబింబమును గప్పుకొని, రామునివైపుఁ దిరిగి, కనుబొమలతో సంజ్ఞఁజేసెను. ఖంజనపక్షివలె నామెనేత్రములతో సంజ్ఞ జేసి, యతఁడు తనప్రాణనాథుఁడని సూచించెను. దొంగిలించినధనరాశినిబొందిన దరిద్రులువలె, స్త్రీలందఱు సంతోషించిరి.

దోహా 125

అత్యంతానురాగముచే వారు జానకిపాదములమీఁదఁబడి, "ఓ తల్లీ! ఆచంద్రార్కము, భూమిని శేషుఁడు ధరించునంతవఱకు, నీవు సౌభాగ్యవతిగ నుండుము" అని దీవించిరి.

చౌపాయ్

"ఓదేవీ! పార్వతీపరమేశ్వరులవలె, మీదాంపత్య మనుకూలముగ నుండుఁగాక! మామీఁదమాత్రము దయఁ దప్పకుము. మాటిమాటికి మేము చేతులను జోడించుకొని ప్రార్థించుచున్నాము. ఈమార్గమున మీరు తిరిగివచ్చినయెడల, మేము మీసేవకులమని తెలిసికొని, మీదర్శనము మాకుఁ గలుగఁజేయుఁడు." ఆస్త్రీలు బద్ధానురాగులై

పలికిన ప్రియవచనములను జానకి విని, మృదుమధురముగ వారిని బోధించెను; చంద్రకిరణములు కుముదములనువలె, నామెవచనములు వారిని సంతోషపెట్టెను. శ్రీరాముని మనోభిప్రాయమును లక్ష్మణుఁడు తెలిసికొని, మార్గముఁ జెప్పుమని జనుల నడిగెను. అతనిమాటలను విని స్త్రీపురుషులు దుఃఖించిరి; వారిశరీరములు పులకరించెను; వారు కన్నీరుఁగార్చిరి. వారిసంతోష మంతరించెను. వారిమనస్సులు చిన్నపోయెను: వారు శ్రీరాముని వియోగమును భరింపలేక, "ఆహా! భగవంతుఁడు మనకు ధనముకుప్పనిచ్చి, వెంటనే దానిని దీసికొనెనుకదా!" అని విచారించిరి. విధికృతములు తప్పవని వారు తలంచి, ధైర్యముఁదెచ్చుకొని, మంచిమార్గమును వారికిఁ జూపించి, బోధపఱచిరి.

దోహా 126

శ్రీసీతాలక్ష్మణులతోఁగూడి శ్రీరాముఁడు వనములకు వెడలెను; అతఁడు ప్రియవచనములఁ బలికి, వారిని బోధించి, స్వగృహములకుఁ బంపించెను; వారు నిష్క్రమించిరికాని, వారి మనస్సులుమాత్రము రామునివద్ద నుండెను.

చౌపాయీ

ఆస్త్రీపురుషులు పరితపించుచు. గృహాభిముఖులయిరి; వారు మనస్సులో దైవమును దూషించిరి. చేతులకు దొరికినలాభము జాఱిపోయెనని వారు చింతించిరి. విధికృతములు తలక్రిందులని వారిలో వారు చెప్పుకొనిరి. "ఆహా! భగవంతుఁ డెంతకఠినుఁడు! అతనికి దయ దాక్షిణ్యములు లేవు; అతనిచర్యలు విపరీతములు; అతనిప్రభుత్వము నిరంకుశము; అతనికి శంకలేదు. భగవంతునిప్రభుత్వ మిట్టిది కనుకనే, చంద్రుఁడు రోగపీడితుఁడు; కళంకుఁడు. సకలకోరికల నిచ్చుకల్పము వృక్షమయ్యెను. సకలరత్నముల నిచ్చు సముద్రుఁడు లవణమయ్యెను. ఈరాజకుమారుల నతఁడేల వనములకుఁ బంపెను; భోగములను, విలాసముల నతఁడు సృష్టించినందుకు లాభమేమి? పాదరక్షలులేకయే వారు వనములో సంచరించినపుడు వాహనములను సృజించినఁ బ్రయోజనమేమి? కుశపత్రములమీఁద వారు శయనించినపుడు హంసతూలికా తల్పములవలనఁ బనియేమి కలదు? వారు చెట్లనీడలలో విహరించునపుడు, మహోన్నతభవనములను నిర్మించిన లాభమేమి!

దోహా 127

"ఇంత చక్కనివారు, సుకుమారులు, జడలనుబిగించి, నారబట్ట లను ధరించినపుడు, భూషణములును, దివ్యాంబరములు నుండినందుకుఁ బ్రయోజనమేమి? వీనిని వ్యర్థముగ విధాత సృజించెను.

చౌపాయ్

"వారు కందమూలఫలములను భుజించునపుడు, అమృతోపమాన మగు భోజనపదార్థములు వ్యర్థములు" వారిలో నొకఁ డిట్లు చెప్ప నారంభించెను. "వారు సహజముగ శోభస్కరులు; వారియంతట వారు పుట్టిరి; కాని, వారిని బ్రహ్మసృజింపలేదు. వేదములోఁ జెప్పఁబడిన ప్రకారము బ్రహ్మ సృజించినపదార్థములన్నియు శ్రవణములకును, నయనములకును, మనస్సునకును గోచరములు; పదునాలుగుభువనములను వెదకి చూచినను, నిట్టిపురుషుఁడు కాని, యిట్టిస్త్రీ కాని కనఁబడునా? ఇట్టి స్త్రీపురుషులను సృజింపవలెనని బ్రహ్మ యనేకవిధముల శ్రమపడెను; కాని, యతనిప్రయత్నములు వ్యర్థమయ్యెను; కనుక, నతఁడు కోపించి, యీర్ష్యచేత వారిని వనమునకుఁ బంపెను." మఱియొకఁడిట్లు చెప్ప నారంభించెను; "ఈసంగతులు నాకుఁ దెలియవు; మనము ధన్యులమని నాయభిప్రాయము. వారిని జూచినవారును, జూచుచుండినవారును, చూడఁగలవారును పుణ్యాత్ములని తలంచెదను. ఇదియే నామతము."

దోహా 128

ఈప్రకారము వాఁడు ప్రియవచనములఁ బలికి "ఇంతసుకుమారులు దుర్గారణ్యములలో నెట్లుసంచరింపఁగలరు?" అని విచారించి కన్నీరుఁ గార్చెను.

చౌపాయ్

సంధ్యాసమయమున, చక్రవాకమిథునమువలె, స్త్రీలు సహజముగ వ్యాకులమువడిరి. వారిమువ్వురుచరణములు కోమలములనియు, దుర్గారణ్యమార్గములు కఠినములనియు వారు తెలిసికొని గద్గదస్వరముతో నొకరితో నొకరు ప్రసంగించిరి. "కోమలములగు వారిచరణాంబుజములు సోఁకినందున, నాహృదయములోనువలె భూదేవికిసహితము సంశయముపుట్టెను. జగదీశ్వరుఁడు వారికి వనవాసము నిచ్చినపుడు, వనమార్గములను పుష్పసమానముగ నెందులకు జేయలేదు? ఓసఖి! బ్రహ్మదేవుఁడు

నేకోరినవరము నిచ్చినయెడల నే నీరాజకుమారులను నానేత్రములలో నిలుపుకొందును" ఆసమయమున శ్రీసీతారాములను దర్శింపనివారు వారియాగమనమునువిని వ్యాకులనుపడి "ఓయీ! అన్నదమ్ము లిరువురు నెంతదూరము వెళ్లియుండగలరు?" అని యడిగిరి. బలముగలవారు పరుగెత్తివెళ్లి, వారినిదర్శించి, జన్మము సఫలముఁ జేసికొనిరి. వారు సంతోషించి స్వగృహములకుఁ దిరిగివచ్చిరి.

దోహా 129

స్త్రీలును, బాలకులును, వృద్ధులును చేతులను నులుపుకొని పశ్చాత్తాపముఁబడిరి. శ్రీరాముఁడు వెళ్లుచుండిన ప్రదేశములలో నివసించు స్త్రీపురుషు లీప్రకారము ప్రేమకు వశ్యులయిరి.

చౌపాయ్

భానుకులకైరవచంద్రుఁడగు శ్రీరామునిజూచి, ఆయాగ్రామస్థులు పరమానందభరితు లగుచుండిరి. ఆతనిపూర్వోత్తరములఁ దెలిసినవారు కైకేయిని దూషించిరి. "రాజు మంచివాఁడు; ఆతనిమూలమున మనకు నేత్రోత్సవము కలిగెను." అని యొకఁడుపలికెను. ఈప్రకారము వారు బద్ధానురాగులై, పరస్పరము ప్రియవచనములఁ జెప్పుకొనుచుండిరి. "ఆహా! వారితల్లిదండ్రులు ధన్యులు; వారినగరము ధన్యము; వారు సంచరించుదేశములు, పర్వతములు, వనములు, గ్రామములును, వారు విహరించుస్థలములన్నియు ధన్యమగును. వారిని సృష్టించిన బ్రహ్మకు సహితము వారిమీఁద దయపుట్టెను. అతఁడు వారినిజూచి సంతోషించెను." ఈప్రకారము శ్రీసీతారామలక్ష్మణుల చక్కనిచర్య లంతకం తను మార్గములోను వనములకును వ్యాపించెను.

దోహా 130

ఈప్రకారము రఘుకులకమలబాంధవుఁడు మార్గస్థుల కానందము నిచ్చుచు,వనశోభలఁ జూచుచు,జానకీలక్ష్మణులతోఁ గూడి నడచి వెళ్లెను.

చౌపాయ్

మునివేషములను ధరించిన రామలక్ష్మణులు ముద్దులు మూటఁగట్టుచుండిరి. ముందు రాముఁడును, అతనివెనుక లక్ష్మణుఁడును వెళ్లుచుండెను. జీవేశ్వరులకు మధ్యనుండినమాయవలె, వారిరువుర మధ్యను

జానకి నడచుచుండెను. (బ్రహ్మవెనుక మాయ; మాయవెనుక జీవుఁడు.) వసంతునకును కామదేవునకును మధ్యనుండిన రతీదేవివలె నామె శోభించెను. మనస్సులో నాలోచించి, మఱియొకయుపమానముఁ జెప్పుచున్నాను. బుధునకును చంద్రునకును మధ్యనుండిన రోహిణివలె నామె ప్రకాశించెను. శ్రీరామునిచరణములఁ దప్పించి, యతనివెనుకనుండి, భయభీతులతోఁగూడి జానకి నడచెను. వారుభయులచరణచిహ్నముల కెడమవైపునఁ బాదము వేయుచు, వానికిఁ బ్రదక్షిణపూర్వకముగ వారి వెనుకనుండి లక్ష్మణుఁడు నడచెను. వారిముగ్వురయనురాగము వాచామగోచరము; అది యెవరికిఁ దెలియదు. వారి దేదీప్యమానమగు రూపములను ఖగమృగములు చూచి, చిత్తరువుబొమ్మలువలె నిలువఁబడెను; శ్రీరాముఁ డనునట్టిమార్గస్థుఁడు వానిచిత్తముల నపహరించెను.

దోహా 131

ఎవరెవరు జానకీసహితరామలక్ష్మణులను మార్గములోఁ జూచిరో, అనాయాసముగ వారు సంతోషించుచు దుస్తరమగు సంసారసాగరమును దాఁటుచున్నారు.

చౌపాయ్

స్వప్నమందయినను, యెవనిహృదయములో మార్గస్థులగు శ్రీసీతారామలక్ష్మణులు నివసించెదరో, అంతమున వాఁడు రామధామమునకుఁ బోవును; వాఁడు వెళ్లినమార్గమున నొకానొకప్పుడయినను మఱియొకఁడు పోఁజాలఁడు. అంతలో జానకి మార్గాయాసముచే బడలియుండుట రాముఁడుచూచి యొకచల్లని వటవృక్షముక్రింద విశ్రమించెను; ఆవృక్షమునకు సమీపమున జల్లనిప్రవాహము కలదు. తదుపరి, శ్రీసీతారాములు కందమూలఫలములను భుజించి, రాత్రి చెట్టుక్రింద విశ్రమించిరి. ప్రాతఃకాలమున లేచి, వారు స్నానసంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించి, ప్రయాణమును సాగించిరి. వనములను, పర్వతములను, సరోవరములను వారు చూచుచు, వాల్మీకిమహామునియాశ్రమమునకు వచ్చిరి ఆమహాముని యాశ్రమమును శ్రీరాముఁడు చూచెను. వెనుకకు పర్వతము, ముందునకు నదీప్రవాహము, ఆరెండింటిమధ్య ఋష్యాశ్రమము శోభాయమానముగ నుండెను.సరోవరములు కమలములతో నిండెను; వనవృక్షములు పుష్పించెను. తుమ్మెదలు

ఝంకారముఁ జేయుచుఁ, బుష్పరసము నాస్వాదించి, మైమఱచియుండెను. వనమంతయు ఖగమృగముల కోలాహలము వ్యాపించెను అవి స్వాభావికవైరమును విడిచి, నెమ్మదిగ సంచరించుచుండెను.

దోహా 132

ఆమనోహరమగు ఋష్యాశ్రమమును శ్రీరాముఁడు చూచి సంతోషించెను. శ్రీరాముని యాగమనమును వాల్మీకిమహాముని విని, యతనికి నెదురుగవచ్చెను.

# నవమవిశ్రామము.

చౌపాయ్

శ్రీరాముఁడు మునీశ్వరునిచరణములకు సాష్టాంగనమస్కారముఁ జేసెను; అతఁడు శ్రీరాముని దీవించెను. శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ జూచినందున, నతని మనస్సున కాప్యాయము కలిగెను; అతని నేత్రములు చల్లఁబడెను. అతఁడు శ్రీరాముని సన్మానించి, స్వాశ్రమమునకుఁ దీసికొనివచ్చెను; ప్రాణప్రియుఁడగు శ్రీరాముని దోడ్కొనివచ్చి, యతనిని సుఖాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. తదుపరి, యతఁడు కందమూలఫలములఁ దెప్పించి, వారిముగ్గురి యెదుటఁబెట్టెను. వారు వానిని భుజించి సంతోషించిరి. శ్రీరాముని దివ్యమంగళస్వరూపము నతఁడు కన్నులారఁ జూచి, పరమానందభరితుఁడయ్యెను. అంత శ్రీరాముఁడు చేతులను జోడించుకొని, మునీశ్వరునితో నిట్లు విన్నవించెను; “ఓనాథా! మీరు త్రికాలజ్ఞానసంపన్నులు; సంసారము మీకు కరతలామలకము” అని రాముఁడు చెప్పి, రాణి కైకేయి తనను వనమునకుఁబంపిన వృత్తాంతమంతయు సకృచ్ఛ్రిముగ శ్రుతపఱచెను.

దోహా 133

తండ్రిగారివచనములును, దల్లిగారి కోరికప్రకారము భరతునకు రాజ్యమువచ్చుటయు మొదలగుసంగతులను విన్నవించి, “ఓముని రాజా! మీదర్శనము లభించెను. నేఁడు నాపుణ్యము ఫలించెను” అని శ్రీరాముఁడు విన్నవించెను.

చౌపాయ్

"ఓమునిరాజా! మీచరణారవిందములను దర్శించుటవలన నాసు కృతము సఫలమయ్యెను. ఏస్థలములో నన్ను మీరు నివసించుమని యాజ్ఞ జేసినయెడల నే నాస్థలములో నివసించెదను; అచ్చట నేనుండి నందువలన మునులకు బాధకలుగఁ గూడదు. నామూలమున వారికి నష్ట ముకలుగఁ గూడదు. ఏరాజుమూలమున మునులకును తపశ్శాలులకును దుఃఖముకలుగునో, ఆరాజు నిప్పులేకయే భస్మమగును. బ్రాహ్మణులను సంతోషింపఁజేయుటయే పరమమంగళము; బ్రాహ్మణులరోషము నూరు తరములను నశింపఁజేయును. ఈసంగతులను విచారించి, నాకు మంచిస్థ లమును జూపుఁడు. అచ్చట నేను సీతాలక్ష్మణులతోఁగూడి కొంచెము కాలము నివసించెద. అచ్చట నొకపర్ణశాలను నిర్మించుకొని దానిలో గాలముఁగడుపుదు." ఈప్రకారమునిర్మలాంతఃకరణముతో శ్రీరాముఁడు పలికిన ప్రియవచనములను మునిరాజువిని, రామునితో నిట్లు చెప్పఁదొ డంగెను. "ఓ రామా! నేను ధన్యుఁడను. నీవు రఘుకులమునకు కేతువు వంటివాఁడవు. ఇట్లు నీవెందులకుఁ బలుకకయుందువు? వేదమార్గములను నీవు పాలించెదవు.

ఛాంద్ 5

"శ్రుతి సేతు పాలక రామ తుమ జగదీశ మాయా జానకీ
జో సృజతి జగ పాలతి హరతి రుఖపాఇ కృపానిధానకీ,
జో సహసశీశ అహీశ మహీధర లషణ సచరాచర ధనీ
సురకాజ ధరి నరరాజ తను చలే దలన ఖల నిశిచర అనీ.

"హేరఘునాథా! హేజగదీశ్వరా! నీవు వేదమార్గములను రక్షించువాఁడవు; జానకి నీమాయ; ఓకృపానిధానా! నీయిచ్ఛాను సార మామె జగత్తుల సృష్టిస్థితిసంహారములఁ జేయుచుండును. చరాచ రముల కాధారభూతుఁడు, భూభారమును వహించువాఁడు, సహస్రశి రస్సులుగల ఆదిశేషుఁడే లక్ష్మణుఁడు. దేవతలకార్యమును సాధించుటకు మీరు నరరూపమును ధరించితిరి; రాక్షసులను మీరు శీఘ్రము సంహ రింపుఁడు.

సోరఠా 5

"ఓరఘునాథా! నీస్వరూపము మనోవాచామగోచరము. నీ చర్య లపారము; చెప్పుటకు శక్యముకాదు. 'న-ఇతి, న-ఇతి=నేతి, నేతి' అని వేదములు నినుగుఱించి చెప్పును.

చౌపాయ్

"ఓనాథా! ఈలోకవ్యాపారములకు నీవు సాక్షీభూతుఁడవు. జగత్తు దృశ్యము; నీవు సాక్షివి; బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నాడించుచుంటివి. దేవతలు సహితము నీమహిమ నెఱుంగరు. ఇఁక నిన్నెవరు తెలిసికొనఁగలరు? ఎవరికి నీవు జ్ఞానము నిచ్చెదవో, వారే నిన్నుఁ దెలిసికొనఁగలరు. నిన్నుఁ దెలిసికొనినవారు నీసారూప్యమును బొందుచున్నారు. ఓరఘునాథా! నీకృపచేత నీభక్తులు నిన్నుఁ దెలిసికొనుచున్నారు. ఆభక్తులహృదయమునందు చల్లనిగంధమువంటి భక్తి నిలిచియుండును. నీవు సచ్చిదానందస్వరూపుఁడవు. నీకు వికారములు లేవు నిన్నుఁ దెలిసికొనుట కధికారముకలవారే నిన్నుఁ దెలిసికొనఁగలరు. దేవసజ్జనహితార్థము నీవు మనుజరూపమును ధరించి, సాధారణరాజువలె మాటలఁ జెప్పి, చర్యలఁ జేయుచున్నావు నీచర్యలఁ జూచి, మూర్ఖులు మోహములోఁ బడుచున్నారు; పండితు లానందించుచున్నారు. నీవు చెప్పినప్రకారము సంచరించెదవు; నీమాటలకును క్రియలకును భేదములేదు. నీ వాడించిన ప్రకారము నే మాడుచుంటిని. నీవు కపటనాటక సూత్రధారుఁడవు.

దోహా 134

"నివాసయోగ్యమగుస్థలముఁ జూపింపుమని నన్ను నీవు కోరియుంటివి. అందులకుఁ బ్రత్యుత్తరము నిచ్చుటకు నాకు సంశయము కలుగుచున్నది ఏస్థలముఁ జూపింపఁగలను? నీవు లేనిస్థల మొకటికలదా? అట్టిస్థల ముండినయెడలఁ జూపించెద."

చౌపాయ్

మునీశ్వరుని ప్రియవచనములను రాముఁడువిని సిగ్గుపడి, లోలోన నవ్వుకొనెను. పునః వాల్మీకిమహాముని మందహాసముఁ జేసి, అమృతోపమానమగు మృదుమధురవాక్యములఁ జెప్ప నారంభించెను. "ఓరామా! ఉత్తమమగు నివాసస్థానముఁ జెప్పుచున్నాను; వినుము. అచ్చట నీవు

సీతాలక్ష్మణులతోఁగూడి నివసింపవచ్చును. నీదివ్యచరిత్రము లనునట్టి మహానదులు ప్రవేశించుట కెవనిచెవులు సముద్రమువంటివో, ఎవనిచెవులు నిరంతరము నీకథలతో నిండియుండునో, ఎన్నటికిని వానిచెవులకు నిండుటలేదో, వానిహృదయమే నీకుఁ దగిననివాసస్థానము. ఎవనినేత్రములు చాతకములుపలె,నీలమేఘమువంటినీస్వరూపముఁ జూచుటకభిలషించుచుండునో, సముద్ర, నదీ, సరోవరజలములఁ దిరస్కరించి, వర్ష జలము నాశించు చాతకమువలె నేభక్తులు సాధకములనువిడిచి, నీస్వరూపమును సదా సేవించుచుందురో,వారిహృదయములో మీరు ముగ్గురు సదా నివసింపవచ్చును.

దోహా 135

"విమలమగు నీకీర్తిని మానసికముగ వర్ణించుట కెవనిజిహ్వ హంసవంటిదో, నీగుణగణము లనునట్టి ముత్యాలమాల నెవఁడు సదా త్రిప్పుచుండునో, వానిహృదయములో నివసింపుము.

చౌపాయ్

"ఓ రామా! ఎవరు ప్రతిదినము సుగంధద్రవ్యములను ముందు నీకు సమర్పించి, తదుపరి వాని నాఘ్రాణించెదరో, ఎవరు నీకు నివేదనఁజేసినపదార్థములను భుజించెదరో, ఎవరు వస్త్రాద్యలంకారములను నీకు సమర్పించి ధరించెదరో, ఎవరు గురుదేవబ్రాహ్మణులఁజూచి నమ్రులై శుద్ధాంతఃకరణముతో నమస్కరించెదరో, ఎవనిహస్తములు సదా శ్రీరామునిపాదములను బూజించునో, ఎవఁడు రామునితప్ప మఱియొకనిని రక్షకునిగ భావింపఁడో, ఎవఁడు రామునితీర్థములకుఁ బ్రయాణమగునో, వానిహృదయములో నివసింపుము.

"మంత్రరాజ నిత జపహి తుమ్హారా
పూజహి తుమహి సహిత పరివారా.

"ఎవఁడు నీనామమంత్రరాజమును సదా జపించునో, ఎవఁడు సకుటుంబసపరివారముగ నిన్ను సదా పూజించునో,

(శ్లో. సప్తకోటిమహామంత్రా శ్చిత్తవిభ్రమకారకాః,
ఏకఏవ పరోమంత్రో రామ ఇత్యక్షరద్వయం.)

"ఎవఁడు నిత్య మనేకతర్పణములఁజేసి, బ్రాహ్మణులకు భోజన

ముఁబెట్టి దానముల నిచ్చుచుండునో, ఎవఁడు తనగురువును నీకంటె నధికుఁడని భావించి, సన్మానించి సేవించునో,

దోహా 136

"ఎవఁడు నీచరణములయందు భక్తితప్ప మఱియొకదానిని కోరఁడో, వానిహృదయములో నివసింపుము. వానిహృదయమే మీాము వ్వురకుఁ దగిననివాసస్థానము.

చౌపాయ్

"ఎవనికి కామక్రోధలోభమోహమదమాత్సర్యములు లేవో, ఎవనికి ద్రోహచింతగాని, కపటము, దాంభికము, మాయ మొదలగునవి లేవో, వానిహృదయము మీాకుఁ దగిననివాసస్థానము. ఎవఁడు పరోప కారియో, ఎవఁడు లోకబంధువో, ఎవనికి దూషణభూషణములు సమానమో, ఎవఁడు విచారించి సత్యముఁ జెప్పునో, అన్నియవస్థలలో నెవఁడు నీశరణుఁ జొచ్చియుండునో, ఎవనికి నీవుతప్ప మఱియొకఁడుగతి లేదో, ఓరామా! వానిహృదయములో మీారు నివసింపుఁడు. ఎవఁడు పరస్త్రీని తల్లివలెఁ జూచునో, పరధనమును విషమని భావించునో, పరు లసంపదఁజూచి సంతోషించునో, పరులవిపత్తులఁజూచి దుఃఖించునో, నిన్ను ప్రాణముతో సమానముగ ప్రేమించునో, వానిహృదయము మీాకుఁదగిన నివాసస్థానము.

దోహా 137

"ఓరామా! ఎవనికి నీవే తల్లివి, తండ్రివి, గురుఁడవు, సఖుఁడ వో వానిహృదయమందిరములో మీారు ముగ్గురు నివసింపుఁడు.

చౌపాయ్

"ఎవఁడు అవగుణములనువిడిచి సుగుణములను గ్రహించునో, ఎవఁడు గోబ్రాహ్మణహితవుకొఱకు బాధలనుబడునో, ఎవఁడు నీతిమా ర్గమున సంచరించునో, ఎవఁడు లోకమర్యాదఁ బొందునో, వానిహృద యమే మీాకుఁ దగిన నివాసస్థానము. ఎవఁడు స్వదోషములఁ జెప్పు కొని, నీగుణములను వర్ణించునో, ఎవఁడు సహజముగ నీశరణే చొచ్చి యుండునో, ఎవఁడు నీభక్తినిఁ బ్రేమించునో, వానిహృదయములో నివసింపుము. ఎవఁడు సుతుల హితులనువిడిచి, చుట్టాలవిడిచి, యిల్లాలి విడిచి, బహుధనాళివిడిచి, జాతిని, గృహమునువిడిచి, వేయేల, సర్వసంగ

పరిత్యాగముఁజేసి, నీస్వరూపధ్యానములో లీనమైయుండునో, వాని హృదయములో నివసింపుము. ఎవఁడు స్వర్గాపవర్గములను, నరకమును సమానముగఁ జూచునో, ఎవఁడు ధనుర్ధరుఁడవగు నిన్ను దర్శించునో, ఎవఁడు త్రికరణశుద్ధిగ నీశిష్యుఁడో, వానిహృదయములో నివసింపుము.

దోహా 138

"ఎవఁడు తదితరవిషయములను గోరక, త్రికరణశుద్ధిగ నిన్నుఁ బ్రేమించునో, వానిహృదయములో సదా నివసింపుము. వానిహృదయమే నీకుఁ దగిన నివాసస్థానము."

చౌపాయీ

ఈప్రకారము రామునకుఁదగిన నివాసస్థానమును శ్రీవాల్మీకిమహాముని చూపించెను అతనిప్రియవచనములను శ్రీరాముఁడు విని సంతోషించెను. "ఓరామా! సమయానుసారముగ నీకుఁ దగిననివాసస్థానముఁ జెప్పుచున్నాను; వినుము. చిత్రకూటపర్వతముమీఁద నివసింపుము. అన్నివిధముల నచ్చట విశ్రమించి యుండవచ్చును. అది పుణ్యస్థలము; మనోహరముగ నుండును. అచ్చట గజములును సింహములును నిర్వైరముగ విహరించును. వేదములోఁ జెప్పఁబడిన పవిత్రమగు మందాకినీనది యచ్చట ప్రవహించుచుండును. అత్రిమహాముని భార్య అనసూయాదేవి తపముఁజేసి, యానదినిఁ దీసికొనివచ్చెను. పరమపావని యగు మందాకిని గంగానదియొక్క యుపనది; పిల్లలను ఢాకినివలె, మహాపాపముల నానది భక్షించును. అత్రిమొదలగు మహామును లచ్చట నివసించియుందురు. వారు జపతపయోగములఁజేసి, స్వశరీరములఁ గష్టపెట్టుచుందురు. నీవు వెళ్లి వారింజూచి, వారిశ్రమలను సఫలముఁ జేయుము. ఓరామా! యాపర్వతమునకు గొప్పదనముఁ దీసికొనిరమ్ము."

దోహా 139

ఆపర్వతముయొక్క మహిమను మునివలన శ్రీరాముఁడువిని, సీతాలక్ష్మణులతోఁగూడి వెడలివచ్చి, మందాకినిలో స్నానముఁ జేసెను.

చౌపాయీ

"ఓలక్ష్మణా! ఈస్థలము మనోహరముగ నున్నది; ఇచ్చట మనము నివసించుటకుఁ దగినయేర్పాటుఁ జేయుము." అని రాముఁడు చెప్పెను. ఆనది యుత్తరతీరమును రామానుజుఁడుచూచి, అది ధనుఃకారముగ

నలువైపులఁ దిరిగియుండెనని తెలిసికొనెను. "ఆనదియే, ధనువుయొక్క నారి; శమము, దమము, దానము మొదలగునవియే బాణములు; కలియుగపాపములే వానికి లక్ష్యము; చిత్రకూటపర్వతమే నిశ్చలముగ నిలువఁబడియుండిన మహావీరుఁడు; ఒక్కవ్రేటున నతఁడు పాపములను సంహరించును. అతఁడు వెనుకఁదీయఁడు." ఇట్లు లక్ష్మణుఁడుచెప్పి, స్థానము జూపించెను; ఆస్థానమును రాముఁడుచూచి సంతోషించి, సమాధానమునఁబడెను. శ్రీరాముఁడాస్థలమున కిష్టపడెనని దేవతలు గ్రహించి ఇంద్రునితోఁగూడి వచ్చిరి. ఆదేవతలు కోలకిరాతభిల్లుల వేషములతోవచ్చి, రెండు చక్కనిపర్ణశాలలఁగట్టిరి; ఆపర్ణశాలలచక్కఁదనమును వర్ణించుటకు శక్యముకాదు; వానిలో నొకటి పెద్దది; రెండవది చిన్నది.

### దోహా 140

రతిమన్మథవసంతులవలె, శ్రీసీతారామలక్ష్మణులు పర్ణశాలలో దేదీప్యమానముగ వెలుఁగుచుండిరి.

### చౌపాయీ

ఆసమయమున దేవ, గరుడ, గంధర్వ, కిన్నర, యక్ష, నాగులు చిత్రకూటపర్వతమునకు వచ్చిరి. అష్టదిక్పాలురును వచ్చిరి. శ్రీరాముఁడు దేవతలకు నమస్కరించెను. శ్రీరాముని దర్శించినందున, నేత్రోత్సవమయ్యెనని వారు తలంచి సంతోషించిరి. వారు పుష్పములను వర్షించి, రామునితో నిట్లు విన్నవించిరి. "ఓనాథా! ఈనాఁటికి మీయాగమనము వలన మాకు దిక్కుకలిగెను. మీరే మాకుదిక్కు." ఈప్రకారము వారు విన్నవించి, దుస్సహమగు స్వాంతదుఃఖమును వెల్లఁబుచ్చిరి. వారు స్వస్థచిత్తులై స్వలోకములకు నిష్క్రమించిరి. శ్రీరాముఁడువచ్చి చిత్రకూటపర్వతమున నివసించియున్నాడని మునీశ్వరులు విని, రాముని జూడవచ్చిరి; అట్లు చూడవచ్చినమునులకు శ్రీరాముఁడు దండప్రణామముఁ జేసెను. వారు శ్రీరాముని నాలింగనము జేసికొని, వాక్కులు సఫలమగునట్లు రాముని దీవించిరి. శ్రీసీతారామలక్ష్మణుల దివ్యమంగళ విగ్రహములఁజూచి, తమసాధనములు సఫలమయ్యెనని వారు తలంచిరి.

### దోహా 141

యథావిధిగ శ్రీరాముఁడు మునుల నాదరించి సత్కరించెను;

తదుపరి వారికి సెలవిచ్చి పంపించెను. ఆమునులు స్వాశ్రమములకుఁ దిరిగివచ్చి, జపతపయోగయజ్ఞములను యథాప్రకారము చేయుచుండిరి.

చౌపాయ్

శ్రీరాముని సమాచారమును కోలకిరాతులువిని, నవనిధులు దొరికినట్లు సంతోషించిరి. వారు కందమూలఫలములను దొన్నెలునిండ బెట్టుకొని, బంగారమును దొంగిలించుటకు దొంగలువలెఁ బరుగెత్తుకొని వచ్చిరి. రామలక్ష్మణులంజూచి వచ్చినవారిని తదితరులు మార్గముఁ జూపింపుమనియు, వారిరువురగుఱించి చెప్పుమని యడుగుచుండిరి. శ్రీరామునిగుఱించి చెప్పుకొనుచు, చెప్పినమాటలను వినుచు, వారు సకలపదార్థములఁ బట్టుకొనివచ్చి రామునిఁజూచిరి. ఆపదార్థములను వారు రామునియెదుటఁ బెట్టి నమస్కరించి, నమ్రులై నిలువఁబడి జోహారు వనిరి; వారిప్రేమాతిశయము లుప్పతిల్ల వారు కన్నులార రాముని జూచుచుండిరి. చిత్తరువుబొమ్మలువలె, వారు నిశ్చేష్టులయి యుండిరి. వారిశరీరములు పులకరించెను. వారినేత్రములవెంబడి ఆనందబాష్పములు కారెను. వారు బద్ధానురాగులై యుండుట రాముఁడు గ్రహించి, ప్రియవచనములఁ బలికి వారిని సన్మానించెను. శ్రీరామునకు వారు మాటిమాటికి జోహారు వనుచు, హస్తములను జోడించి వినయవిధేయతలతో నిట్లు విన్నవించిరి.

దోహా 142

"ఓనాథా! ఈనాటికి మీపాదములం జూచినందున మాకు దిక్కు కలిగెను. హేకోసలపతీ! మాయదృష్టమువలన మీరువిచ్చేసితిరి.

చౌపాయ్

"ఓ నాథా! మీపాదారవిందములు సోకిన భూములును, వనములును పర్వతములును ధన్యమయ్యెను. మిమ్ములను దర్శించి జన్మము సఫలముఁజేసికొనిన ఖగమృగములును, వనములో సంచరించుజంతువులును, ధన్యమయ్యెను. మాకన్నులార మిమ్ములను దర్శించితిమి కనుక, మేమును మాబంధువులును ధన్యులము. మీరు తగిననివాసస్థానము నేర్పఱచుకొంటిరి. ఇచ్చట నెల్లప్పుడు షడృతువుల ధర్మము పాలించును. అన్నివిధముల మేము మిమ్ములను సేవించెదము; వ్యాఘ్రములను,

సింహములను, పాములను, గజములను మేము పాఱఁదోలి, మీసేవఁ జేయుచుందుము. మేము పాదచారులమై గొప్పవనములను, పర్వతములను గుహలను వెదకి చూచియుంటిమి. మీరు వేటనిమిత్తము వెళ్లినపుడు కొండవాఁగులను, సరోవరములను, గుహలను జూపించెదము. మేమును మా పరివారములును, మీసేవకులమని తెలిసికొనుఁడు. మీరు సంశయింపక మమ్ముల నాజ్ఞాపింపుఁడు."

దోహా 143

ఆమహాపురుషుని వేదములు 'నేతి, నేతి' అని చెప్పుచుండును; ఆమహాపురుషుని మునీశ్వరులు సహితము గ్రహింపలేరు. ఆకరుణాసముద్రుఁడు కిరాతులవచనములను విని, బాలునిసంజల్పములను వినినతండ్రివలె సంతోషించెను.

చౌపాయ్

శ్రీరాముని ప్రేమయే ప్రధానము; బుద్ధిగలవారీసంగతిని తెలిసికొనుఁడు. శ్రీరాముఁడు వనవాసుల నందఱిని సంతోషపెట్టెను; మృదుమధురముగ వారితోఁ బ్రసంగించి, వారిమనస్సున కాప్యాయముఁ గలుగఁజేసెను. అతఁడు కిరాతులకు సెలవిచ్చి పంపించెను; వారు రామునకు నమస్కరించి సెలవుఁగైకొని వెడలిరి; మార్గములో వారు రామునిగుణములం జెప్పుకొనుచు, వానిని యోచించుచు, స్వగృహములకు వచ్చిరి. ఈప్రకారము జానకితోఁగూడి, రామలక్ష్మణులు దేవతలకును మనుజులకు నానందముఁ గలుగఁజేసి వనములో నివసించిరి. రఘురాముఁడువచ్చి, వనములో నివసించినదిమొదలు వనము సకలమంగళదాయకమయ్యెను. నానావిధములగువృక్షములు పుష్పించి ఫలించెను; వితానములువలె, ననేకలతలు మనోహరముగ నుండెను. నందనవనమునువిడిచి, కల్పవృక్షము భూలోకమునకువచ్చెనోయనునట్లు, వృక్షములు సహజముగ శోభించెను. ఆచెట్లపై, తుమ్మెదలు ఝంకారముఁ జేయుచుండెను; మందసుగంధశీతలవాయువులు ప్రసరించెను.

దోహా 144

నీలకంఠములును, కోకిలలును, చాతకములును, చక్రవాకమిథునములును, శుకపారావతంబులును మొదలగుపక్షు లనేకములు శ్రవణానందముగఁ గూయుచు, మనస్సుల నపహరించెను,

**చౌపాయ్**

గజములును, సింహములును, వానరములును, వరాహములును, హరిణములును వానివానిసహజవైరమును విడిచి, యొకస్థలమున విహరించుచుండెను. వనములో సంచరించుచుండినమృగములు శ్రీరాముని జూచి, సంతోషముఁబొందెను దేవలోకభూలోకవనములు రాముఁడు నివసించియుండినవనముతో సమానము కానేరవు. గంగానది, యమునా, గోదావరియు, సరస్వతియు, నర్మదయు, సరోవరములును, సముద్రములు, నదులును మందాకినితో సమానము కావు. ఉదయాస్తపర్వతములును, మందరకైలాసపర్వతములును, దేవతలు నివసించు సుమేరు పర్వతమును, హిమాచలము మొదలగుపర్వతములును చిత్రకూటపర్వతముయొక్క యదృష్టమును శ్లాఘించుచుండెను. అనాయాసముగ చిత్రకూటపర్వతమున కింత యదృష్టముపట్టినందుకు, వింధ్యపర్వతము విచారించెను.

**దోహా 145**

చిత్రకూటపర్వతముపై నుండిన ఖగమృగములును, వృక్షము లును, లతలును ఈమొదలగునవి యెంతపుణ్యముఁ జేసికొనెనని రాత్రింబవళ్లు దేవతలు వానిని స్తోత్రముఁ జేయుచుండిరి.

**చౌపాయ్**

నేత్రములుగలవారందఱు రామునిఁజూచి, వారినేత్రములు సఫలమయ్యెనని సంతోషించిరి. శ్రీరామునిపాదరజము సోఁకినమాత్రమున స్థావరములకు పరమపదముఁ బొందుటకు యోగ్యతకలిగెను. ఆవనభూములును పర్వతములును స్వతస్సిద్ధముగ పవిత్రములయినవి; చక్కనివి; సుఖసాగరుఁడు, ఆభగవంతుఁడు నివసించియుండుటచేత, వానిమహిమ నెట్లు వర్ణింపఁగలను? ఆస్థలముల కెందుకు గొప్పదనము రాదు? సీతారాములు క్షీరసాగరమును అయోధ్యానగరమును విడిచిపెట్టి, ఆస్థలములలో నివసించిరి కదా! ఆవనభూములసౌఖ్యమును నూరువేలశేషువులయినను వర్ణించి చెప్పలేరు నేనెట్లు వర్ణించి చెప్పఁగలను? సాధారణపిల్లికూర్మము మంథరాచలపర్వతమును మీఁదికి నెత్తఁగలదా? త్రికరణశుద్ధిగ శ్రీసీతారాములను లక్ష్మణుఁడు సేవించుచుండెను. అతనిసుశీలమును భక్తిశ్రద్ధలను జెప్పఁజాలను.

దోహా 146

క్షణక్షణము శ్రీసీతారాములచరణారవిందములఁజూచుచు,వారికిఁ దనమీఁదఁగల వాత్సల్యముచేతను, లక్ష్మణుఁడు స్వప్నమందైనను దల్లిదండ్రులనుగాని బంధుజనంబులనుగాని స్మరింపలేదు.

చౌపాయి

శ్రీరాముని పొత్తుఁగూడి, జానకి సుఖముగ నుండెను; పట్టణమును, బంధువులను, గృహము నామె మఱచెను. చంద్రుని జూచిన చకోరకుమారివలె, నామె క్షణక్షణము రామచంద్రునిముఖముఁజూచి, సంతోషించుచుండెను. శ్రీరామునకు జానకిమీఁద దయ దినదినప్రవర్ధమానమగుచుండెను; పగలు సంతోషించు చక్రవాకమిథునమువలె, నామెమనస్సు దినదిన ముప్పొంగెను. ఇట్లు జానకి ప్రాణేశ్వరునియందు బద్ధానురాగియై, అయోధ్యనగరసుఖకంటె వనమే నూరింతలు సౌఖ్యముగ నుండెనని తలంచెను. ప్రియుఁడగు ప్రాణేశ్వరునివద్ద నుండుటవలన, నాపర్ణశాలయే దేవేంద్రభువనమును మించియుండెను; ఖగమృగములు బంధువులుకంటె నూరురెట్లు ప్రియులయిరి. అత్తమామలువలె, మునులును మునిపత్నులు నామెను ప్రేమించిరి. కందమూలఫలములు అమృతోపమానముగ నుండెను. ఆమె భర్తవద్దనుండినందున, నూర్వురు మన్మథులహంసతూలికాతల్పములకంటె దర్భాసనమే సుఖముగ నుండెను. ఎవని కృపాదృష్టిమాత్రమున నింద్రాదిదేవతాధిపత్యమువచ్చునో, అట్టివాని కీవిషయభోగము లొకలక్ష్యమా?

దోహా 147

శ్రీరామనామమును స్మరించు భక్తజనులు విషయభోగములను తృణప్రాయములని తలంచి, వానిని విసర్జించెదరు. అట్టిస్థితిలో ప్రియురాలు జానకి, వానినివిడిచిపెట్టనని చెప్పుటవలన నాశ్చర్యమేమి?

చౌపాయి

శ్రీసీతాలక్ష్మణులు సంతోషించునట్లు శ్రీరాముఁడు వారితోఁ బ్రసంగించి, తదనుగుణ్యముగ వ్యవహరించుచుండెను. శ్రీరాముఁడు చెప్పుచుండినపురాణకథలను వారిరువు రతియుత్సాహముతో వినుచుండిరి. అయాసమయములలో నతఁడు అయోధ్యనగరమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని కన్నీరుఁగార్చును. జననీ జనకులను, బంధువులను, భరతుని,

పరివారమును, భరతునిసుశీలమును, అనురాగమును, ఆకృపాసాగరుఁడు, శ్రీరామప్రభువు స్మరించి, విచారించును; కాని, అంతలో నతఁడు పునఃసమయముకాదని తలంచి, ధైర్యము నవలంబించును. పురుషుని నాశ్రయించియుండిననీడవలె, నతని దుఃఖముఁజూచి, సీతాలక్ష్మణులు విచారించుచుండిరి. ఆపరమకృపాళుఁడు, భక్తులహృదయమునకు గంధమువలె, సంతోషము నిచ్చువాఁడు. శ్రీరాముఁడు సీతాలక్ష్మణులమనోభ్రమణము నెఱింగి, వారివిచారమును దొలగించుటకుఁ బుణ్యకథలఁ జెప్పుచుండును: ఆకథలను వారు విని, సంతోషించుచుండిరి.

దోహా 148

భార్యాపుత్రులతోఁగూడిన దేవేంద్రునివలె, శ్రీరాముఁడు, సీతాలక్ష్మణులతోఁగూడి పర్ణశాలలో దేదీప్యమానముగ వెలుఁగుచుండెను.

## దశమవిశ్రామము.

చౌపాయ్

కంటిరెప్పలు పాపనువలె, రామలక్ష్మణులు జానకిని రక్షించుచుండిరి; జ్ఞానములేనిపురుషుఁడు శరీరమునువలె, శ్రీసీతారాములను లక్ష్మణుఁడు సేవించెను. ఈప్రకారము శ్రీరాముఁడు సుఖముగ వనములో నివసించెను. ఖగమృగములకును, దపశ్శాలులకు నతఁడు సంతోషము కలుగఁజేసెను. ఇంతవఱకు శ్రీరామునివనవాసకథను వర్ణించి చెప్పినాను; ఇఁక సుమంత్రుఁడు నగరములోఁ బ్రవేశించినవృత్తాంతమును వినుము. నిషాదపతి శ్రీరాముని సాగనంపి, వారియాజ్ఞఁ గైకొని తిఱిగివచ్చి, గంగాతీరమున సుమంత్రునిరథమునుజూచెను. అతఁడు సుమంత్రుని దుఃఖముఁజూచి, చెప్పలేనంతవిచారముఁబొందెను. శ్రీసీతారామలక్ష్మణులనామముల నుచ్చరించుచు, మంత్రివర్యుఁడుదుఃఖముఁ బట్టలేక, నేలఁబడెను. రెక్కలులేనిపక్షులువలె, గుఱ్ఱములు దక్షిణదిశకుఁ దిరిగి చూచుచు సకిలించెను.

దోహా 149

ఆగుఱ్ఱములు గడ్డిఁ దినుటలేదు; జలమును ద్రాగవు; వాని

నేత్రములనుండి నీరుకారుచుండెను. శ్రీరాముని గుఱ్ఱముల దురవస్థఁ జూచి, నిషాదులు వ్యాకులము పడిరి.

చౌపాయీ

అప్పుడు నిషాదపతి ధైర్యముఁ దెచ్చుకొని, సుమంత్రునిఁ జూచి "ఓసుమంత్రా! దుఃఖముఁ జాలింపుము. నీవు బుద్ధిమంతుఁడవు; పరమార్థమును గుర్తెఱింగినవాఁడవు. విధికృతములు విపరీతములయినపుడు, వానిని సహింపవలెను." అని బోధించెను. ఈప్రకార మనేకవిధముల నతఁడు బోధించి, మంత్రి కిష్టము లేకపోయినను, బలవంతముగ మంత్రిని రథముపైఁ గూర్చుండఁబెట్టెను. శ్రీరాముని వియోగదుఃఖముచే నామంత్రి పరితపించుకొని పోవుచుండినందున, నతనిశరీరమునకుఁ బటుత్వము తప్పెను; అతఁడు రథమును నడిపింపలేకపోయెను. అశ్వములు సకిలించును గాని, ముందుకుఁ బాదమును వేయుట లేదు. విచ్చలవిడిగ వనములో సంచరించు మృగములఁ దీసికొనివచ్చి రథమునకుఁ గట్టినట్లు, గుఱ్ఱములు నేలకు క్రుంగి వెనుకకుఁ దిరిగిచూచును; రాముని వియోగమున నాగుఱ్ఱములు సహితము దుఃఖించుచుండెను. శ్రీసీతారామలక్ష్మణులనామముల నెవఁడైన నుచ్చరించిన యెడల, నవి సకిలించి వానివైపుఁ దిరిగిచూచును. మణినిఁబోగొట్టుకొనిన సర్పమువలె, నవి వ్యాకులము నొందెను; దానిని వర్ణింప శక్యము కాదు.

దోహా 150

ఆమంత్రిని, ఆగుఱ్ఱములను నిషాదపతిచూచి కడుదుఃఖించెను. అతఁడు నల్వురు సేవకులఁబిలిచి, రథమును దోలుటకు సారథిని నియమించెను.

చౌపాయీ

ఆనిషాదపతి సారథికి రథము నప్పగించి, చెప్పుటకు శక్యము కాని దుఃఖముఁ బొంది స్వగృహమునకు వెడలెను. ఆసారథి రథముఁ దోలుకొని నగరమునకు వచ్చెను. క్షణక్షణము వాఁడు విషాదముఁ బొందుచుండెను. సుమంత్రుఁడు శోకసంతప్తహృదయుఁడై, విలపించెను. "ఛీ! ఛీ! రాముఁడు లేని బ్రతుకు కాల్చనా! తుద కీతుచ్ఛశరీరము నశించును; శ్రీరాముని వియోగసమయమున నీప్రాణములు శరీరమును విడిచి కీర్తి బొందలేదు. ఈ నాపాపపుప్రాణములు అపకీర్తిపాలయ్యెను; ఏ కారణ

ముచేత శరీరమును విడిచిపెట్టవో తెలియదు. ఆహా! నేనెంతమందమ
మతిని. సమయము దాఁటెను. నాహృదయ మీరోజున రెండుచెక్కలు
కాలేదు.'' ఇట్టు మంత్రి విలపించి, చేతులను నులుపుకొని నెత్తిఁగొట్టు
కొని యేడ్చెను. సొమ్మంతయు దొంగిలింపఁబడిన వణిజునివలె, యుద్ధము
జేయలేక రణరంగమును విడిచి పరుగెత్తిన మహావీరునివలె, నాసుమం
త్రుఁడు పరితపించెను.

దోహా 151

అథవా, జ్ఞానియు, వేదాధ్యయనసంపన్నుఁడును, సాధువును, సజ్జ
నుఁడునగు బ్రాహ్మణుఁడు పొరబాటున మద్యపానముఁజేసి, విలపించువి
ధమున సుమంత్రుఁడు దుఃఖించెను.

చౌపాయ్

సత్కులమునఁబుట్టి, యుక్తాయుక్తవిచక్షణగలిగియుండి, త్రికర
ణశుద్ధిగ భర్తను సేవించుచుండినపతివ్రత, కర్మవశమున తనప్రాణనాథు
నివిడిచి, పరపురుషునిఁబొంది, శోకించువిధమున, నతఁడు పరితపించెను.
నేత్రములు నీరుతో నిండియుండుటచేత, నతనిదృష్టి చెడిపోయెను;
అతనిమతి వికలమయ్యెను; అతనిచెవులకు మాట వినఁబడదు; అతనిపె
దవు లార్చుకొనిపోయెను; మసిబూసినట్లు ముఖము నల్లఁబడెను; పదు
నాల్గుసంవత్సరముల తరువాత రాముఁడు తిరిగివచ్చునని యొకయాశ
కలదు; ఆయాశయే అతనిప్రాణములను కవాటమువలె, రక్షించెను.
అతఁడు దుర్బలుఁడయ్యెను; అతనిశరీరము వాడెను; అతనిముఖము
వెలవెలఁబోయెను. జననీజనకులను చంపినవానివలె నతఁడు కనఁబడెను.
ఒకపాపాత్ముఁడు పాపముఁజేసి యమలోకయాతననుస్మరించి పరితపించు
విధమున, నతఁడు దుఃఖించుచుండెను. అతనిమనస్సు మలినమయ్యెను;
శోకముచే వికలమయ్యెను. అతనిముఖమునుండి మాట రాలేదు; మనస్సు
పరితపించుచుండెను. "నగరమును నేనెట్లు చూడఁగలను! రాముఁడు
లేనిరథమును జనులుచూచి వ్యాకులపడి సంకోచముతో నన్ను వీక్షిం
చెదరు.''

దోహా 152

"నగరములోని స్త్రీపురుషులు పరుగెత్తివచ్చి 'రాముఁడేఁడి' అని

యడిగినపుడు నాగుండెలను ఱాయిజేసికొని, వారికిఁ బ్రత్యుత్తరముఁ జెప్పవలెను.”

చౌపాయ్

“దుఃఖపడుచుండిన తల్లి వచ్చి, నన్నడిగినపుడు, ఓ దైవమా! నేనేమి చెప్పగలను? లక్ష్మణునితల్లి సుమిత్రవచ్చి, యడిగినపుడు, నేనేమి శుభవర్తమానముఁ జెప్పఁగలను? లేఁగదూడ జ్ఞాపకమువచ్చినపుడు పరుగెత్తుకొనివచ్చు గోవువలె, రామునితల్లి పరుగెత్తుకొనివచ్చి యడిగినపుడు ‘శ్రీసీతారామలక్ష్మణులు వనమునకు వెళ్ళిరి. ఓతల్లీ!’ అని నేను జెప్పవలెను. నన్నడిగినవారికి నేనీయుత్తరముజెప్పవలయు. నగరమునకు వెళ్లి నే నీసంతర్పణ జేయవలెను. ఆరాజునకు రాముఁడే జీవనాధారముకదా! అతఁడు దీనుఁడై దుఃఖించుచుండును. అతఁడు రామునివృత్తాంతము నడిగినపుడు నేనెట్లు మాటలాడఁగలను. ‘ఓనాథా! రాజకుమారులఁ జూచి వచ్చితిని; వారు కుశలము; వారు ముప్వురు శ్రీసీతారామలక్ష్మణులు సుఖముగ వనములకు వెళ్లిరి’ అని నేను జెప్పవలెను. ఈనామాటలను రాజువిని, ప్రాణములు తృణప్రాయములని తలంచి, తక్షణము విడిచిపెట్టును.”

దోహా 153

“నీరును మన్ను కలసినపుడు బురదయగును. ఆ నీరెండినతరువాత బురద గట్టిపడినను శీఘ్రము వాలిపోవును. శ్రీరాముఁడు వనమునకు వెళ్లెనుకదా! ఎందుచేత నామనస్సు వ్రక్కలుకాదు? దానికారణము నాకుఁ దెలియును. నాశరీరము యమయాతనను సహితము సహించును.”

చౌపాయ్

ఈప్రకార మతఁడు శోకించుచుండ, రథము తమసానదీతీరమునకు వచ్చెను. అతఁడు సారథిని పిలిచి స్వగృహమునకుఁ బొమ్మనిచెప్పెను. వాఁడు మంత్రి పాదములకు నమస్కరించి, దుఃఖించుచునిష్క్రమించెను. గోగురుబ్రాహ్మణులను సంహరించినవానివలె, నతఁడు నగరములోఁ బ్రవేశించుటకు సంకోచించెను. ఒకచెట్టుక్రింద నతఁడు కూర్చుండి, ప్రొద్దుఁబుచ్చెను; అంతసాయంసమయ్యెను. అప్పు డతఁడు నగరములో బ్రవేశించెను. సింహద్వారమువద్ద రథమును నిలువఁబెట్టి, యతఁడు గృహములోఁ బ్రవేశించెను. ఈసమాచారముఁ గొంచెముగొంచెము

తెలిసినవారు రాజద్వారమువద్దకువచ్చి రథముంజూచి పోల్చిరి. సూర్య కాంతికి వడగండ్లు నీరగునట్లు వారిహృదయములు గుఱ్ఱముల వ్యాకులముంజూచి నీరయ్యెను. జలము లెండినందున వ్యాకులపడు మీనములవలె, స్త్రీపురుషులు వ్యాకులపడిరి.

దోహా 154

మంత్రియాగమనమును రాణివాసపుస్త్రీలు విని, దుఃఖాక్రాంతులయిరి; భూతప్రేతములు నివసించుగృహమువలె, రాజమందిరము భయంకరముగ నుండెను.

చౌపాయ్

దుఃఖాక్రాంతులై రాణులందఱు నడుగజొచ్చిరి; మంత్రి మాట జెప్పలేకపోయెను; అతనిమాటలు తొట్రుపాటుపడెను. అతనిచెవులకు మాటలు వినఁబడలేదు. అతనినేత్రములకు వస్తువులు కనఁబడలేదు. "మహారాజెగా రెచ్చటకలరు?" అని యతఁడు ప్రతివారిని నడుగుచుండెను. మంత్రి తత్తరబాటును దాసీజనంబులు చూచి యతనిని కౌసల్యా మందిరమునకుఁ దీసికొనివెళ్లిరి. కళాహీనుండగు చంద్రునివలె, నామందిరములోఁ బడియుండిన రాజు నతఁడు చూచెను. నిద్రాహారములు లేక భూషణాద్యలంకారమును ధరింపక, మహారాజు వేఁడినిట్టూర్పులను విడుచుచు స్వర్గమునుండి క్రిందఁద్రోయఁబడిన యయాతి మహారాజువలె, నేలఁబడియుండెను. (యయాతిమహారాజు యజ్ఞాదిక్రతువులనేకములఁజేసి సదేహముతోఁ స్వర్గమునకువెళ్లి, ఇంద్రాసనముపైఁ గూర్చుండెను. "అయ్యా! మీరేమి కర్మలఁజేసితిరి? సశరీరముగలవారై స్వర్గమున కెట్లు రాగల్గితిరి?" అని ఇంద్రుఁ డతనిని యడిగెను. ఆయయాతి దురభిమానముచే, స్వయంకృతపుణ్యకర్మలను స్వయముఁ జెప్పుకొనెను. అందుచేత నతనిపుణ్యము క్షీణించెను. అతక్షణమతనిని దేవతలు తలక్రిందుగఁ బడఁద్రోసిరి.) "రామా! రామా! రామా! నాప్రాణప్రియుడా!" అని రాజుపలికి, పునః, "రామా! లక్ష్మణా! జానకీ!" అని పలవరించెను. రెక్కలు తెగులఁబడినసంపాతివలె, నతఁడు శోకసంతప్తమానసుఁడై, నిలపించుచుండెను.

దోహా 155

మంత్రివర్యుఁడు రాజునుజూచి, "జయ, జయ" అనిపలికి, నమస్క-

రించెను. ఆమాటలను విని,దుఃఖముతో నుండిన రాజు దిగ్గున లేచికూర్చుండెను; "ఓయీ సుమంత్రా, రాముఁడేఁడీ? చెప్పుము?" అనియడిగెను.

చౌపాయ్

సుమంత్రుని రాజు కౌగిలించుకొనెను; నీటిలో మునుఁగుచుండిన వాఁడు తృణమును బట్టుకొనినట్లు, రాజు మంత్రినిఁ బట్టుకొనెను. మంత్రిని యాదరించి, తన ప్రక్కను రాజు కూర్చుండఁ బెట్టుకొనెను. కన్నీరువఱదలై కారుచుండ, రాజు మంత్రితో నిట్లుసంభాషించెను. "ఓ సుమంత్రా! నా రాముని క్షేమముఁ జెప్పుము; శ్రీసీతా రామలక్ష్మణు లెచ్చటఁగలరు? వారిని మరలించి తీసికొనివచ్చితివా? లేక వారు వనములకుఁ బోయిరా!" ఈమాటలను సుమంత్రుఁడువిని, కన్నీరుఁగార్చెను. శోకముచే రాజుమనస్సు కొట్టుకొనుచుండెను. మరల రాజు మంత్రిని జూచి, "ఓయీ! శ్రీసీతా రామలక్ష్మణులసందేశముఁ జెప్పుము" అని యడిగెను. శ్రీరామునిరూపరేఖావిలాసములను, సుశీలమును, సుగుణములను స్మరించి, రాజు విలపించెను. "అయ్యో; రామా! నీకు రాజ్యాభిషేకముఁ జేయఁదలచిఁ నిన్ను వనములకుఁ బంపితిని. నామాటలను వినినను, నీమనస్సునకు హర్షవిషాదములుకలుగలేదు. నాయాజ్ఞగైకొని, నీవు వనములను గమనించితివి: నీవంటికుమారుని విడిచిపెట్టినను, నాప్రాణములు శరీరమును విడిచిపెట్టలేదు. లోకములో నావంటిపాపాత్ముఁడెవఁడు కలఁడు!"

దోహా 156

"ఓసఖుఁడా; శ్రీసీతా రామలక్ష్మణులు నివసించియుండినస్థలమునకు నన్ను దీసికొనిపొమ్ము. నన్ను నీవు తీసికొనివెళ్లనియెడల, నేను సత్యముఁ జెప్పుచున్నాను. నాప్రాణములు పోఁవును"

చౌపాయ్

మాటిమాటికి రాజు మంత్రిని నొక్కినొక్కియడుగుచుండెను. "ఓయీ! నాముద్దుకుమారుని సందేశముఁ జెప్పుము. ఈక్షణము నేను సీతా రామ లక్ష్మణులను జూడవలెను; అందుకుఁ దగినప్రయత్నముఁ జేయుము." అప్పుడు మంత్రి ధైర్యము దెచ్చుకొని, మృదువుగ నిట్లు చెప్ప నారంభించెను. "రాజాధిరాజా! మీరు పండితులు; జ్ఞానులు; మీరు వీరులు; సుధీరులు; ధురంధరులు; దేవతాంశసంభూతులు; సాధు

సమాజములను మీరు సదా సేవించితిరి. జననమరణములు, కలిమిలేములు, సుఖదుఃఖములు, లాభనష్టములు, సంయోగవియోగములు ఈమొదలగునవి దివారాత్రములువలె, నొకదానితరువాత నొకటి, కర్మానుసారము కాలక్రమమున వచ్చుచుండును. సుఖములు వచ్చినపుడు సంతోషించి, దుఃఖములు వచ్చినపుడు విచారించుట మూర్ఖులప్రకృతి; కాని, పండితులు మాత్రము వానిని సమముగఁజూచి, నిశ్చింతగ నుందురు. మీరు జ్ఞానులు; అన్నిసంగతులను విచారించి, ధైర్యముగ నుండుఁడు. హేలోకోపకారీ! నామాటనువిని, దుఃఖమును విడచి పెట్టుఁడు.

దోహా 157

"మొదటిరోజున వారు తమసానదీతీరమున నిలిచిరి; రెండవదినమున, వారు గంగానదీతీరమునకువెళ్లి స్నానపానాదులఁ జేసిరి. తమసానదీతీరమున వారు కేవలము జలముఁ ద్రాగియుండిరి."

చౌపాయ్

"పడవవాండ్రువచ్చి, వారిని సేవించిరి; ఆరాత్రి వారు శృంగిబేరపురములో నుండిరి. ప్రాతఃకాలమున శ్రీరాముఁడు మఱ్ఱిపాలను దెప్పించి, స్వయము జటాముకుటమును బంధించెను. అంతలో, శ్రీరాముని స్నేహితుఁడు, నిషాదపతి, నావను దీసికొనివచ్చెను. అపడవలో జానకిని మొదటఁగూర్చుంపఁబెట్టి; తదుపరి రాముఁడు కూర్చుండెను. ఆతరువాత, శ్రీరాముని యాజ్ఞాప్రకారము ధనుర్బాణములను ధరించి, లక్ష్మణుఁడు పడవలోనికి వెళ్లి కూర్చుండెను. (ఒకవేళ రాముఁడు మరలి నగరమునకు వెళ్లునేమోయని లక్ష్మణున కొకసందేహము కలదు; అందుచేత నింతవఱకు నతఁడు ధనుర్బాణములను ధరింపలేదు; రామునికృతసంకల్పము నతఁడు తెలిసికొని, ధనుర్బాణములను ధరించెను.) నాదుఃఖమును రాముఁడు చూచి, ధైర్యము నవలంబించి, నాతో నిట్లు పలికెను. 'ఓతండ్రీ! నాతండ్రిగారికి నానమస్కారమని చెప్పి, వారిచరణములఁ బట్టుకొని విన్నవింపుఁడు. వారిచరణములమీఁదఁబడి, నావిన్నపములఁ జెప్పుఁడు—ఓతండ్రీ! నానిమిత్తము మీరు విచారింపకుఁడు. మీయనుగ్రహమువలనను గృపచేతను, బుణ్యమువలనను మే మిచ్చట వనమార్గములో క్షేమము.

ఛాంద్ 6

" 'హేపితాజీ! మీయనుగ్రహమువలన, నాకు వనములో సకల సుఖములు కలుగును. మీయాజ్ఞప్రకారము వనవాసముఁజేసి పునః మీచరణకమలములను దర్శింపఁగలను? తదుపరి, నాతల్లులు ముప్వురపాదములకు నమస్కరించి నావిన్నపములఁజెప్పి వారిని యోదార్పుఁడు. మహారాజు కుశలముగనుండునట్లు తగినప్రయత్నములఁ జేయుమని వారితోఁ జెప్పుఁడు.

సోరఠా 6

" 'పునఃపునః నాగురువుపాదములకు నమస్కరించి, నానిమిత్తము నాతండ్రిగారు విచారింపకుండునట్లు వారికి నుపదేశింపుఁడని, గురువుగారితోఁ జెప్పుఁడు.

చౌపాయ్.

" 'తదుపరి, ఓతండ్రీ! పురజనులను, రాజబంధువులను బిలిచి, వారితో నావిన్నపముఁ జెప్పుఁడు. 'నాతండ్రిగారు సుఖముగ జీవించునట్లు ప్రయత్నించువాఁడే నాహితకారి' అని వారికి విన్నవింపుఁడు. భరతుఁడు వచ్చినతరువాత, నతనితో నిట్లుచెప్పుఁడు. 'ఓతమ్ముఁడా! మహారాజ్యాధిపత్యము వచ్చినందుకు, నీవు నీతిమార్గమును విడిచిపెట్టకుము. త్రికరణశుద్ధిగ ప్రజలను బరిపాలింపుము. పక్షపాతములేకుండ, ముప్వురుతల్లులను సమానముగ సేవింపుము. ఓతమ్ముఁడా! నీవు తమ్ముఁడవు; తమ్ముఁడు చేయవలసినపనులఁ జేయుము. జననీజనకులచరణములను సేవింపుము. నేను లేనిలోపములేకుండ, నీవు తండ్రిగారినిసేవించి, వారు దుఃఖమును మఱచునట్లు సంచరింపుము.' ఓరాజాధిరాజా! లక్ష్మణుఁడు కోపించి, కొన్ని కఠోరవచనములఁ బలికెను; కాని, యతనిని రాముఁడు నివారించి, తనమీఁద నొట్టుఁబెట్టుకొని, యతనిమాటలను మీతోఁ జెప్పవద్దని, నన్నాజ్ఞాపించెను. చిన్నతనముకొలది లక్ష్మణుఁ డట్లుపలికెను; అతనిమాటలను మన్నింపఁగూడదని బోధించెను.

దోహా 158

"ఓనాథా! అనేకనమస్కారములఁజెప్పి, జానకి కొన్ని వచనములఁ బలుకనారంభించెను కాని, యనురాగముచే నామె పరవశురాల

య్యెను. ఆమె స్వరము గద్గదమాయెను; శరీరము పులకరించెను; ఆమె కన్నీరుఁగార్చెను. అందుచేత నామె మాటఁ జెప్పలేకపోయెను.

చౌపాయ్

"అంతలో, నావికుఁడు శ్రీరాముని మనోభిప్రాయమును గ్రహించి, పడవను గడుపుట కారంభించెను. ఈప్రకారము శ్రీరాముఁడు ప్రయాణమయ్యెను. నాగుండెలను ఱాయిఁజేసికొని, వారిప్రయాణమును జూచుచుంటిని. ఓనాథా! నాదుఃఖము నెట్లు చెప్పఁగలను? నేనుబ్రతికి తిరిగివచ్చి, రామునిసందేశమును మీతోఁ జెప్పఁగలిగితిని"—ఈప్రకారము సుమంత్రుఁడు చెప్పి, యూరకుండెను. దుఃఖము శోకము, విచారముచేత నతఁడు పరవశుఁడయ్యెను. మంత్రివచనములను మహారాజువిని, మూర్ఛిల్లి, నేలఁబడెను. దారుణమగుదుఃఖ మతనిహృదయమును భేదించెను. బురదనీటిలోనుండి, యూపిరిదీయలేక కొట్టుకొనుమీనములువలె, నతనిప్రాణములు కుమారులవియోగదుఃఖముచేఁ గొట్టుకొనెను. మహారాణులెలుగెత్తి యేడ్వసాగిరి; ఆమహావిపత్తును వర్ణించి చెప్పుటకు శక్యముకాదు. వారివిలాపములంజూచి, దుఃఖముసహితము దుఃఖించును; ధీరులధైర్యము క్రుంగును.

దోహా 159

రాజమహాలులో మహారాణులు ఘొల్లుమని యేడ్వసాగిరి; వారి రోదనముఁజూచి, నగరములోని స్త్రీపురుషులు విలపించిరి.నగరమంతయు కోలాహలము వ్యాపించెను. నిశిరాత్రివేళ వనములోఁ బిడుగుపడినపుడు పక్షులువలె, వారు వ్యాకులచిత్తులయిరి.

చౌపాయ్

మహారాజుప్రాణములు కంఠగతమయ్యెను; మణినిఁ బోఁగొట్టుకొనినసర్పమువలె, నతఁడు దిగులుపడియుండెను. జలము లెండినతరువాత సరోవరములోని కమలములువలె, నతని సర్వేంద్రియములును వికలత్వముఁబొందెను మహారాజుయొక్క దురవస్థను కౌసల్యచూచి, సూర్యకులసూర్యుఁ డస్తమించునని తెలిసికొనెను. ఆరామునితల్లి ధైర్యముఁదెచ్చుకొని, సమయోచితముగఁ జల్లనిమాటలఁ జెప్ప నారంభించెను. "ఓనాథా! మనస్సును సావధానముఁజేసికొని, విచారింపుఁడు. శ్రీరామునివియోగదుఃఖ మపారమగుసముద్రము. అయోధ్యానగ

రము దానిమీఁదఁబోవు పడవవంటిది; మీరు కర్ణధారులు (పడవను గడుపువారు) మనబంధువులు మొదలగువారు వానిలోఁ బ్రయాణముఁజేయువణిగ్జనులు. మీరు ధైర్యముగనుండి, పడవను గడపినయెడల మనము క్షేమముగఁ దీరము జేరఁగలము. మీరు ధైర్యమును విడనాడినయెడల, మేముశోకార్ణవములో మునిఁగిపోఁగలము. ఓనాథా! నావిన్నపమును మీరు గ్రహింపుఁడు. సీతారామలక్ష్మణులు తిరిగివచ్చి, మీదర్శనముఁ జేయఁగలరు"

**దోహా 160**

ఈప్రకారము ప్రియురాలుపలికిన కోమలవచనములను మహారాజువిని, నేత్రములనువిప్పి చూచెను; అతిదీనుఁడై యుండినందున నతనిముఖమున కళాకాంతులులేవు. చల్లనినీరు మీఁదఁబడిన మీనను వలె, నతఁడు కొట్టుకొనుచుండెను.

**చౌపాయ్**

మహారాజు ధైర్యముఁదెచ్చుకొని లేచి కూర్చుండెను. "ఓయీ సుమంత్రా! అకృపాళుఁడు రాముఁడేఁడీ? చూపుము.లక్ష్మణుఁడేఁడీ! నాము ద్దుకోడలేదీ!" ఈప్రకారము రాజు పలువిధముల పలపించెను. ఆరాత్రి యొకయుగమువలె నుండెను; దానికి యంతములేనట్లు కనఁబడెను. అంతలో జాత్యంధుఁడు, తపశ్శాలియగు సరవనునితండ్రి పెట్టినశాపము రాజు జ్ఞప్తికివచ్చెను. ఆవృత్తాంతమంతయు రాజు కౌసల్యకుఁ జెప్పనారంభించెను. (అధికపాఠము). "ఓప్రియురాలా! ఒకసమయమున వేఁటనిమిత్తము నేను వనమునకు వెళ్లియుంటిని. వేఁటసన్నాహముఁజేసి సైన్యములతోఁ గూడి రాత్రిసమయమున నేను వేత్రవనమునకువెళ్లి యొకసరోవరతీరమున కూర్చుంటిని. ఆసమయమున సరవసుఁడు ఘటమును బట్టుకొని జలమునిమిత్తము సరోవరమునకు వచ్చెను. అతఁడు ఘటమును జలములోముంచినందున, గుడగుడశబ్దము పుట్టెను. ఆశబ్దమును నేను విని, యొకజంతువని తలంచితిని; నేను శబ్దవేదిని · యొఱింగినవాఁడను కనుక నేను బాణమునుసంధించి ప్రయోగించితిని; నాబాణ మతనిహృదయమునకుఁ దగిలెను. 'హా' అని యతఁడు నేలఁగూలెను; ఆమాటను నేనువిని, మనుజుఁడని తెలిసికొంటిని. ఆతక్షణము నే నతనివద్దకువెళ్లి

విచారించితిని. ఆసరవనుఁడు నాతో నిట్లుచెప్పెను. 'ఓరాజా! శోకింపకుము. నేను చెప్పినట్లుచేయుము. నేను సరవనుఁడను. నాతల్లిదండ్రులను సేవించుచుంటిని. వారివలన నాకు సకలసుఖములు కలిగెను. వారిరువురకు దృష్టిలేదు వారు దాహముచే బాధపడుచుండిరి; వారికి జలముఁ దీసికొనివచ్చుటకు నే నిచ్చటకు వచ్చితిని.

దోహా 161

" 'ఓరాజా! అజ్ఞానముచే నీవు నామీఁద బాణమును ప్రయోగించితివి ఈబాణమును పైకిఁదీసివేయుము; నాప్రాణములు కొట్టుకొనుచున్నవి; అవి కంఠగతమయ్యెను.

చౌపాయ్

" 'నీవు మనస్సులో సందేహింపకుము. నామాటలు సత్యమని నమ్ముము. నాముఖముఁజూచి, నేను జెప్పినప్రకారము చేయుము. నాతల్లిదండ్రులవద్దకు వెళ్లుము. అతియాతురతతో వారు జలముఁద్రాగిన తరువాత, సకలవృత్తాంతమును వారికిఁజెప్పి బోధింపుము. వారు నానిమిత్తము విచారింపకయుండునట్లు వారికి యుపదేశముఁజేయుము. ఓరఘువంశోత్తమా! ఓరాజా! నీవు సత్యసంధుఁడవు. ఈబాణమును నాశరీరమునుండితీసివేయుము' అతనిమాటలనువిని, నేను విచారించితిని. అతనిహృదయమునుండి బాణమును నేను దీసివేసినంతలో నతఁడు 'ఓం'కారము నుచ్చరించి ప్రాణములను విడిచిపెట్టెను." అప్పుడు దశరథమహారాజు ఘటముతో నీరుఁదీసికొని సరవనుని తల్లిదండ్రులవద్దకువెళ్లెను. అతఁడు వారితో మాటలాడక, వారికి జలమునిచ్చెను. ఆదంపతులు దుఃఖించుచు నిట్లు విలపించిరి.

దోహా 162

"ఓకుమారుఁడా! నీవు మాతో నెందుకు సంభాషింపవు? కారణముఁ జెప్పుము? ఆకారణముఁ దెలిసికొనవలెనని మాకుఁ గోరిక కలదు.

చౌపాయ్

"నీవు కారణముఁ జెప్పినఁగాని మేము జలముఁ బుచ్చుకొనము." ఓపార్వతీ! ఈమాటలను దశరథుఁడువిని, ధైర్యమును విడనాడెను. "ఈవృత్తాంతమంతయు నీకు వినిపించియుంటిని. ఆవృద్ధదంపతు లిరువురు

నేలమీఁదఁబడిరి. వారిరువురు 'కుమారా! కుమారా!' అని యేడ్వ సాగిరి. వారు నన్నుఁ జూచి 'ఓరీ! నిర్భాగ్యుఁడా! మా కుమారుఁడు పడియుండినస్థలముఁ జూపింపుము.' ఆస్థలమునకు వారిని నేను దీసికొనివెళ్ళియుంటిని. ఆకుమారునితల్లి, కళేబరమును దీసి యెత్తుకొని తొడమీఁదఁ బెట్టుకొని యేడ్వసాగెను. 'ఓరాజా! కాష్ఠముసిద్ధముఁ జేయుము.' అని వారుచెప్పిరి. వారిమాటప్రకారము నేను కాష్ఠమును సిద్ధముఁజేసినతోడనే వారు కుమారునికళేబరముతో దానిమీఁదఁగూర్చుండిరి. వారు యోగాగ్నిచే శరీరములను దహింపఁజేసిరి. మరణసమయమున వారు నాతో నొకమాటఁ జెప్పిరి.

దోహా 163

" 'ఓరాజా! ఇప్పుడు మేము కుమారుని వియోగముచే నెట్లు మాప్రాణములను, విడిచిపెట్టుచున్నామో, నీవుకూడ బుత్రవియోగముచే, నట్లే ప్రాణములను విడువఁగలవు.'

చౌపాయీ

"ఈమాటను వారు నాతోఁజెప్పి శరీరమునువిడిచి దేవలోకమునకుఁబోయిరి. అప్పుడు నేను పొందినదుఃఖముఁ జెప్పలేను. పూర్వోత్తరములదెలిసికొనకయే మునీశ్వరుఁడు నన్ను శపించినందులకు నాకు దుఃఖమువచ్చెను. అప్పటికి నాకుఁ గుమారులులేరు; ఏప్రకారము ఋషివచనముసత్యమగునని నేనువిచారించితిని అతనివచనములు సత్యముకావలసియుండినయెడల, నాకుఁబుత్రులు కలుగవలెను. అప్పు డతనిమాటలు ఆశీర్వచనములగునని తలంచి నేను గృహమునకు వచ్చితిని. ఇంతవఱకు నే నీమర్మమును నీకుఁజెప్పఁనుండలేదు. ఇప్పు డతనిమాటలు సత్యమగును. సీతారామలక్ష్మణులు వనములకు వెళ్ళిరి. నాముద్దుల రాముఁడు వనమునకు వెళ్ళెను. ఇంతవఱకు నాప్రాణములు పోలేదు. ఇంక నేను లోకములో జీవించి దేనిసుఖముల ననుభవింపవలెను! ఎందులకు నాప్రాణములు శరీరమును విడిచి పెట్టవు! సీతాలక్ష్మణులు వనములకు వెళ్ళిరికదా! ఇంతవఱకు నాప్రాణములు శరీరములో నిలిచియుండెను.

దోహా 164

"ఓప్రాణసఖీ! ఆసరవనునికథ జ్ఞప్తికివచ్చెను; ఇంక నాకు ధైర్య

ము లేదు. కుమారులను విడిచిపెట్టినతరువాత, జీవింపని మహాపురుషులే ధన్యులుసుమీ!" (అధికపాఠము సమాప్తము.)

చౌపాయ్

ఈప్రకారము రాజు పూర్వముజరగిన వృత్తాంతమును స్మరించి విచారించెను. "రాముఁడు లేనిజీవనము వ్యర్థము. ఏమిజీవనాశ నాకుఁ గలదు? నామనోభీష్టము నెరవేరలేదు; ఇఁక నాశరీరము నిలిచియుండి నందునఁ బ్రయోజనమేమి? నాముద్దులరామా! నిన్ను విడిచిపెట్టి యెన్ని దినములు బ్రదికియుంటిని. తండ్రీ! ఓనాముద్దులజానకీ! ఓనాకన్నతండ్రీ! లక్ష్మణా! ఓరామా! మేఘములు చాతకములనువలె, నీ తియ్యనిమాటలతో నీవు నాచిత్తమును సంతోషపెట్టుచుంటివి."

దోహా 165

రామ। రామ। కహా। రామకహా
రామ। రామ। కహా। రామ
తను। పరిహారి। రఘువర। విరహా
రాఉ। గయే। సురధామ.

'రామ, రామ, రామరామ, రామరామ'అని వియోగదుఃఖముచే రామనామము నుచ్చరించి, దశరథమహారాజు ప్రాణములనువిడిచి, సురలోకమునకు వెళ్లెను. (అతనిమనస్సులో నొకకోరికయుండుటచేత నతఁడు వైకుంఠముఁ బొందలేదు. రామునిపట్టాభిషేకముఁ జూడలేదని యతనికి సందేహముండెను. శ్రీరామునిపట్టాభిషేకానంతర మతఁడు సాకేతలోకమునకు వెళ్లెను.)

---

# ఏకాదశవిశ్రామము.

---

చౌపాయ్

దశరథమహారాజు జీవితకాలములోను మరణానంతరమునను పొందఁదగినఫలముఁ బొందెను; అతనికీర్తి బ్రహ్మాండమంతయు వ్యాపించెను. అతఁడు జీవించియుండినపుడు, శ్రీరామునిముఖారవిందముఁ జూచుచు జీవించెను; శ్రీరామునివియోగమును భరింపలేక ప్రాణము

లనువిడిచి కీర్తిఁబొందెను. శోకసంతప్తమానసులై మహారాణులు మహా రాజు రూపశీలలావణ్యములను బలపరాక్రమములను స్మరించి, పలువిధముల విలపించి, నేలఁబడి యేడ్వసాగిరి దాసదాసీజనంబులు విలపించిరి. నగరములోఁ బ్రతిగృహములో రోదనము వినఁబడెను. ఆధర్మాత్ముఁడు, ఆసకలగుణసంపన్నుఁడు, ఆమహారాజు, ఆసూర్యకుల సూర్యుఁ డస్తమించెను. జనులందఱు కైకేయిని దూషించిరి. ఆనాఁమూలమున లోకమునకు నేత్రములుపోయెను. ఈప్రకారము వారు విలపించుచుండ, రాత్రి గతించి ప్రాతఃకాలమయ్యెను. జ్ఞానస్వరూపుఁడగు వసిష్ఠ మహాముని వారిం జూడవచ్చెను.

## దోహా 166

సమయోచితముగ నతఁ డనేకయితిహాసములఁజెప్పి, తనజ్ఞానమును వారికి నుపదేశించి మహారాణుల శోకము బోఁగొట్టెను. లోకములో జననమరణములు సాధారణము; పుట్టుటయు, గిట్టుటయు సహజమని యతఁడు చెప్పెను.

ఈప్రకారము వసిష్ఠుఁడు కౌసల్య నోదార్చెను. "ఓకౌసల్యా! నీ వెవరు? నేనెవరు? సుఖదుఃఖము లవశ్యము భోక్తవ్యములు; అంతమున జనులకు మరణము నిశ్చయముకదా; నీవెందులకు విచారించెదవు? ప్రాచీనరాజులచరిత్రముఁ జెప్పుచున్నాను వినుము. ఆచరిత్రములు నీదుఃఖమును హరించును. ఈరాజులచరిత్రములను వినినయెడల, నాయువు వృద్ధియగును; నవగ్రహములు శుభఫలముల నిచ్చును.

"అవక్షితికుమారుఁడు మరుత్తు; ఈమరుత్తు బలపరాక్రమశాలి; ధైర్యవంతుఁడు; వీరుఁడు; శూరుఁడు; ధర్మాత్ముఁడు; ఇంద్రాదిదేవతలు యజ్ఞమునకు వచ్చిరి. కీర్తిప్రతిష్ఠలలో నతఁడు దేవేంద్రుని మించెను. ఇంద్రుని ప్రీత్యర్థము, బృహస్పతి రాజువద్దకువచ్చి యనేకయజ్ఞముల నతనిచేత సంపూర్తిగఁ జేయించెను. సాగులేకయే, భూమి పండుచుండెను ఆతనియజ్ఞములో విశ్వేదేవతులు సభికులు; సాధ్యులును మరుత్తులు నతనియజ్ఞమును నలువైపుల సంరక్షించిరి; దేవతలు స్వయము వచ్చి, సోమపానముఁజేసి, తృప్తులయిరి. ఎత్తిమోయుటకు శక్యముగాని ధనము నతఁడు బ్రాహ్మణులకును, దేవతలకును, గంధర్వులకును దక్షిణ

క్రింద నిచ్చెను. ఆ రాజు మహాజ్ఞాని; వైరాగి. ఆమహారాజుసహితము కాలునకు వశ్యుఁడయ్యెనుకదా! నీవేల నీమహారాజునిమిత్తము విచారించెదవు?

(2) "ఓకౌసల్యా! ఉతథికుమారుఁడు సుహోత్రునకుసహితము మృత్యువువచ్చెను.అతని కాలములో నొకసంవత్సరమువఱకు దేవేంద్రుఁడు సువర్ణమును వర్షించెను. అప్పుడే భూమికిఁగల 'హిరణ్యగర్భ' యను పేరు సార్థకమయ్యెను. అన్నినదులలోను సువర్ణమే ప్రవహించెను. ఆనదులలోని జలచరములు పాకశాసనునిప్రభావమువలన, సువర్ణమయములయ్యెను. ఈచిత్రమును రాజుచూచి, యాశ్చర్యపడెను. ఆనదులలోని సువర్ణజలచరముల నతఁడు తెప్పించి కురుజాంగలదేశములో వానిని నిలువఁజేసి యజ్ఞాంతమున వానిని బ్రాహ్మణుల కిచ్చెను. అతఁడు కూడఁ జనిపోయెను.

(3)"అంగదేశమునుబృహద్రథుఁడనురాజుపరిపాలించుచుండెను. విష్ణుపదమనునట్టిపర్వకాలమున నతఁడొకయజ్ఞము నొనరించెను; బ్రాహ్మణులును, దేవతలును సోమపానముఁజేసి, ఉన్మత్తులయిరి; పదిలక్షలతెల్లగుఱ్ఱములను, పదిలక్షలసాలంకృతకన్యలను, దిగ్గజములఁబోలిన పదిలక్షలయేనుఁగులను, సువర్ణమాలలతో నలంకరింపఁబడినయొకకోటివృషభములను, ఒకవేయిగోవుల నతఁడు దక్షిణక్రింద నిచ్చెను. ఈప్రకారమతఁడు నూరుయజ్ఞములఁజేసెను; ఇష్టి యతఁడు దక్షిణలనిచ్చెను. ఆరాజువలె దానముఁజేసినవాఁడు నేటివఱకు గనఁబడలేదు. అతఁడుసహితము కాలునకు వశ్యుఁడయ్యెను; నీవేల నీమహారాజునిమిత్తము వ్యర్థముగ విచారించెదవు!

(4)"ఓకౌసల్యా!శిబిచక్రవర్తియొక్కఁడు రథముపైఁగూర్చుండి, భూమండలమును జయించెను. అతఁడు యజ్ఞానంతరమున సర్వము దానముఁజేసెను. అట్టి మహారాజుసహితము మృత్యువున కాధీనమయ్యెను కదా! నీవేల నీమహారాజునిమిత్తము విచారించెదవు?

(5)"ఓకౌసల్యా!శకుంతలకుమారుఁడుభరతుఁడుమహాబలపరాక్రమశాలి;యమునానదీతీరమున మూఁడువందలయజ్ఞములను, సరస్వతీతీరమున నిరువదియజ్ఞములను, గంగాతీరమున పదునాలుగుయజ్ఞములను,

ఈప్రకారము వేయి అశ్వమేధయజ్ఞములను, నూఱురాజసూయముల నతఁడొనరించెను. అతనికాలములో నతనితో సమానుఁడు మఱియొకఁడు లేడు. వేయిపద్మములధనమును, కోట్లకొలదిగుఱ్ఱములను, యజ్ఞవేదికయు నతఁడు కణ్వమహామునికి దానముఁజేసెను. ఆరాజను సహితము కాలుఁడు కబళించెనుకదా! నీవేల నీమహారాజునిమిత్తము వ్యర్థముగ విచారించెదవు?

(6)"ఓకౌసల్యా! ఒకసమయమున, నేకాంతస్థలములో భగీరథుఁడు కూర్చుండి యుండెను. అప్పుడు గంగాదేవివచ్చి, యతనితొడపైఁ గూర్చుండెను. ఆమె యతనినితండ్రివలె భావించెను; అందుచేత నామెకు భాగీరథియని పేరువచ్చెను. అతఁడొకయజ్ఞముఁ జేసెను. అప్పుడు, పదిలక్షలసాలంకృతకన్యలను, రాజు దానముఁజేసెను. ఒక్కొకకన్య యొక్కొక్కరథముపైఁ గూర్చుండెను; ఒక్కొక్కరథమునకు నాలుగు గుఱ్ఱములు కట్టఁబడెను. ఒక్కొక్కరథమువెనుకనూఱునూఱుగజములు, సువర్ణమాలలతో నలంకరింపఁబడి వెళ్లెను. ఒక్కొక్కయేనుఁగువెనుక నూఱునూఱుగోవులను, ఒక్కొక్కగోవువెనుక వెయ్యివెయ్యి మేషములును, గొఱ్ఱెపోతులును నడచెను. ఆరాజుకూడ కాలునిముఖములోఁ బ్రవేశించెనుకదా! నీవేల నీరాజునిమిత్తము విచారించెదవు?

(7)"ఓకౌసల్యా! దిలీపమహారాజు యజ్ఞముఁజేసి, ధనధాన్యములతోను నవరత్నములతో నిండిన భూమిని దానముజేసెను ఒక్కొక్కయజ్ఞము నతఁడుచేసి, వెయ్యివెయ్యియేనుఁగులను పురోహితునకు బ్రతిసమయమున దక్షిణ క్రిందనిచ్చెను. అతఁడు సువర్ణయూపస్తంభమును స్థాపించెను; ఆయజ్ఞవాటిక బంగారముతోఁ గట్టఁబడెను. అతనియజ్ఞమునకు దేవతలు స్వయము వచ్చిరి. గంధర్వులు నృత్యముఁ జేసిరి; గంధర్వులరాజు విశ్వావసు గానముఁజేసెను. వారు రాజును కన్నులారఁజూచిరి; అతఁడుకూడ కాలునకు వశ్యుఁడయ్యెనుకదా! నీవేల దశరథుని నిమిత్తము విచారించెదవు?

(8)"ఓకౌసల్యా! యువనాశ్వునికుమారుఁడు మాంధాత యొక్క రోజున భూమండలమును జయించెను; అంగారుఁడు, మరుత్తు, అసితుఁడు, యయుఁడు, అంగుఁడు మొదలగువారిని బృహద్రథునికూడజయించెను.

అంగారునితో నతఁడు యుద్ధముఁజేసినపు డతని ధనుష్టంకారమువలన, నంతరిక్షము బ్రద్దలగునంత శబ్దము పుట్టెను. ఉదయాచలము మొదలు అస్తాచలమువఱకుఁగల భూమండలము నతఁడు జయించెను. అతఁడు నూఱశ్వమేధములను, నూఱు రాజసూయములను జేసెను. పదియోజనములు పొడుగును, ఒకయోజనము వెడల్పునుగల బంగారుమత్స్యము నతఁడు బ్రాహ్మణులకు దానముఁజేసెను. అతఁడుకూడ కాలునకు వశ్యుఁడయ్యెనుకదా! నీవేల వ్యర్థముగ విచారించెదవు!

(9) "ఓకౌసల్యా! యయాతి నహుషునికుమారుఁడు; అతఁడు స్వస్థానమున గూర్చుండి, యాపచ్ఛక్తితో నొకరథచక్రమును విసరెను. అది కొంతదూరమువెళ్లి పడెను. స్వస్థానము మొదలు చక్రముబడినస్థలమువఱకుఁగల ప్రదేశముపై నొకయజ్ఞవేదిక నతఁడు కట్టించెను. అతఁడు నూఱు ప్రధానయజ్ఞములను, నూఱు వాజపేయములను జేసి, మూఁడుసు వర్ణపర్వతములను బ్రాహ్మణులకు దానమునిచ్చి, వారిని సంతోషపెట్టెను. రాక్షససమూహముల నతఁడు యుద్ధములో జయించి, యదువు మొదలగు కుమారులకు భూమినిచ్చి, పురువునకు రాజ్యపట్టముఁగట్టి, భార్యతోఁగూడివనమునకేఁగెను; అతఁడుకూడ స్వర్గస్థుఁడయ్యెనుకదా! నీవేల దశరథమహారాజునిమిత్తము వ్యర్థముగ విచారించెదవు?

(10) "ఓకౌసల్యా! అంబరీషుఁడు నాభాగునికుమారుఁడు; అనేకవిధముల నతఁడు జనులను సంతోషపెట్టెను. అతఁడు యజ్ఞదీక్షలోనుండి, బ్రాహ్మణసేవనిమిత్తము పదిలక్షలరాజులను నియోగించెను; ఆరాజుల నతఁడు బ్రాహ్మణులకు దానముజేసెను. అతఁడుకూడ మృత్యువునకు వశ్యుఁడయ్యెనుగదా! నీభర్తనుగుఱించి నీవేల విచారించెదవు?

(11) "ఓకౌసల్యా! శశిబిందుమహారాజునకుఁబదిలక్షలకుమారులుండిరి. ఒక్కొక్కకుమారునకు నూర్వురుకన్యలనువివాహముఁజేసెను; ఒక్కొక్కకన్యవెనుక నూఱుగజములును, ఒక్కొక్కగజమువెనుక నేడురథములును, ఒక్కొక్కరథమువెనుక సువర్ణాలంకారములతోఁగూడిన నూఱు గుఱ్ఱములును, ఒక్కొక్కగుఱ్ఱమువెనుక నూఱుగోవులును ఒక్కొక్కగోవువెనుక నూఱుమేఁకలును, గొఱ్ఱెలును వచ్చెను; ఈప్రకార మూ

కన్యలు సారెఁదీసికొనివచ్చిరి. అతఁడుయజ్ఞముఁజేసియీసర్వముదానముఁజేసెను. అతఁడుకూడ కాలునికంఠముఁలోఁబడెను; నీశోకము వ్యర్థము.

(12) "ఓకౌసల్యా! అమూర్తరయునికుమారుఁడుగయుఁడు, నూఱు సంవత్సరములవఱకు హోమముచేఁ బక్వముజేయఁబడినవస్తువులను భోజనముపెట్టెను. ఆహుతివలన నగ్నిహోత్రుఁడు ప్రసన్నుఁడై వరమునిచ్చుటకు సిద్ధపడెను. 'ఓహుతాశనుఁడా! ధర్మమునందు శ్రద్ధయు, సత్యమునందుఁ బ్రీతియు కలుగునట్లును, నిరంతరము దానముజేయుటవలన ధనము నశింపకయుండునట్లును ప్రసాదింపుము' అని గయుఁడు వరముల నడిగెను. 'తథాస్తు' అనిచెప్పి, అగ్నిహోత్రుఁ డంతర్ధానమయ్యెను. అనంతర మారాజు వేయిసంవత్సరములవఱకు, దర్శపౌర్ణమాస చాతుర్మాస అశ్వమేధములను జేసెను. 'స్వాహా' అనిచెప్పి దేవతలను 'స్వధా' అని చెప్పి పితృదేవతలను యథావిధిగ స్త్రీగణంబుల నతఁడు తృప్తిఁజేసెను. ఇరువదివ్యామములువెడల్పును పదివ్యామములు పొడవుగల సువర్ణమయమగుభూమిని యతఁడు బ్రాహ్మణులకు దానముజేసెను; ఎన్నియిసుకరేణువులు గంగానదిలో గలవో అన్నిగోదానములం జేసెను. అటువంటి మహారాజుకూడఁ గాలునకు వశ్యుఁడయ్యెనుకదా! నీవు విచారించుట వ్యర్థము.

(13) "ఓకౌసల్యా! ఇక్ష్వాకువంశములోఁబుట్టిన సగరునికీర్తి ఆకాశమువఱకు వ్యాపించెను. ఆతఁడుకూడఁ బంచత్వమునొందెనుకదా! నీవేల విచారించెదవు!

(14) "ఓకౌసల్యా! వేనుకుమారుఁడు పృథుచక్రవర్తి. మహర్షులంబఱు దండకారణ్యములో సమావేశమై యతనికి రాజ్యతిలకము బెట్టిరి; ఆతఁడు శత్రువులను (క్షత) నశింపఁజేసి వారిని రక్షించెను; కనుక క్షత్రియుఁడనువే రతనియెడల సార్థకమయ్యెను. అతఁడు ప్రజలను రంజింపఁజేసెను; కనుక, నతనికి 'రాజు' శబ్దము వర్తిల్లును. అతనికాలములో సాగుజేయఁబడకయే, భూమి నవధాన్యములను పండించుచుండెను; అనేక పుష్పములును ఫలములును పుట్టుచుండెను. నిరోగులై, జనులు సుఖముగ నుండిరి. అతనిరథము నీటిపై వెళ్లినపుడు జలములు స్తంభించియుండెను; అశ్వమేధయాగము నతఁడుచేసి యిఱువదియొకసువర్ణపర్వ

తములను దానముఁజేసెను. అతఁడుకూడ కాలునకు వశ్యుఁడయ్యెను; నీశోకము వ్యర్థము."

చౌపాయి

వసిష్ఠుని యాజ్ఞప్రకారము, మహారాజు తైలద్రోణిలోనుంచఁబడెను; ఒకదూత నతఁడుపిలిచి, "ఓయీ! నీవు శీఘ్రము భరతునివద్దకు వెళ్లుము; రాజు స్వర్గస్థుఁడయ్యెననిమాత్ర మతనితోఁ జెప్పకుము. గురువుగారు మీయన్నదమ్ముల నిరువురను. శీఘ్రము నగరమునకువిజయము జేయుఁడని రని చెప్పుము." అని యాజ్ఞాపించెను. మునియాజ్ఞఁగైకొని యతివేగమున వాఁడువెళ్లెను; వానివేగమునుజూచిగుఱ్ఱములుసహితము సిగ్గుపడెను. అయోధ్యానగరములో ననర్థములుప్రారంభించినదిమొదలు భరతునకు దుస్స్వప్నములు వచ్చుచుండెను. రాత్రి నిద్రలో నతఁడనేక దుస్స్వప్నములఁజూచి మేల్కాంచి, అరిష్టములుకలుగుననిభయపడి విచారించెను. దుస్స్వప్నపరిహారార్థ మతఁడు ప్రతిదినము బ్రాహ్మణులకు దానములనిచ్చి వారికి భోజనముఁబెట్టుచుండెను; అనేకరుద్రాభిషేకములఁ జేయించెను. జననీజనకులును అన్నదమ్ములును పరిజనమును రక్షింపుమని యతఁడు శివునిఁ బ్రార్థించెను.

దోహా 167

ఈప్రకారము భరతుఁడు శోకించుచుండెను; పదునాలుగుదినములకు దూత కేకయరాజ్యమునకువెళ్లి నగరములోఁ బ్రవేశించి, భరతునకు నమస్కరించి గురువుగారియాజ్ఞను విన్నవించెను. అతఁడు శివునకు నమస్కరించి మేనమామవద్ద సెలవుపుచ్చుకొని తమ్మునితోఁగూడి వెడలెను.

చౌపాయి

భరతశత్రుఘ్నులు రథముపైఁగూర్చుండి, ప్రయాణమును సాగించిరి; గుఱ్ఱములు వాయువేగమున నడచెను. నదులను, పర్వతములను, మహారణ్యములను వారు దాఁటివచ్చిరి. శోకముచే నతనిహృదయము పీడింపఁబడెను; ఏపదార్థముఁజూచిన నతనికి సంతోషము లేకపోయెను. "అహా! నాకు రెక్కలుండిన, శీఘ్రము యెగిరివెళ్లియుందునుకదా! అని భరతుఁడు తలంచెను. ఒకనిమిషమొకయుగమువలె నతఁడు గడపెను. ఈప్రకారమతఁడు వచ్చివచ్చి, నగరమును సమీపించెను. నగరములో

నతఁడు ప్రవేశించునప్పుడు, దుశ్శకునములు కనఁబడెను. అశుభస్థానములలోఁ గూర్చుండి, కాకులు మొదలగునవి భయంకరముగఁ గూయుచుండెను. ఖరములును, సృగాలములును ప్రతికూలముగ నఱచుచుండెను. వానిశబ్దములు భరతునిహృదయమునకును జెవులకును బాణములవలెఁ దగిలెను. నదులును, వనములును, ఉపవనములును శోభారహితమయ్యెను; నగరమంతయుఁ బీఁకఁగొట్టినట్లు భయంకరముగనుండెను. ఖగమృగములను, గజాశ్వములను జూచిన దుఃఖముఁవచ్చును. శ్రీరాముని వియోగమనునట్టి రోగముచే జనులందఱు బాధపడుచుండిరి నగరములో స్త్రీపురుషులందఱు శోకార్ణవములో మునిఁగియుండిరి. సకలసంపదలను బోఁగొట్టుకొనినవారివలె వారు చింతాక్రాంతులయిరి.

దోహా 168

పురజనులు భరతునిఁజూచి నమస్కరించి మాటఁజెప్పక, యూరకుండిరి. భయవిషాదములచేఁ బీడితుఁడై, యతఁడు వారిని యోగక్షేమము నడుగలేదు. వారిమార్గమున వారు వెళ్లిరి.

చౌపాయీ

నగరమునకు నలువైపుల నిప్పుముట్టి, దహించుకొని పోవుచుండినట్లు, రాజమార్గములును, అంగడివీధులును భయంకరముగ నుండెను; వానింజూచిన, మనస్సునకు సంతోషము లేకపోయెను. కైకేయి, తన కుమారుని యాగమనముగువిని సంతోషించెను. అసూర్యకులకమలములకుఁ జంద్రునివంటి కైకేయి మంగళహారతిఁబట్టుకొని, కుమారున కెదురుగ వెళ్లి; మంగళహారతినిచ్చి, కుమారుని లోనికి, దీసికొని వెళ్లెను. మంచుపడి, వాడియుండినకమలములువలె దుఃఖముచేఁ బీడితులైయుండిన దాసదాసీజనంబుల నతఁడు చూచెను. కిరాతస్త్రీ వనమునకు నలువైపుల నిప్పుముట్టించి సంతోషించువిధమున, న్యాకైకేయిసంతోషించుచుండెను కుమారునిమనస్సు విచారగ్రస్తమయినందులకు, యామె విచారించి, "ఓతండ్రీ! నీమేనమామలు క్షేమమా?" అని యడిగెను. అతఁడు వారియోగక్షేమముఁజెప్పి, తనవారికుశలము నడిగెను. "ఓఅమ్మా! నాతండ్రిగారెక్కడ? నాతల్లులెక్కడ? సీతయెక్కడ? నాప్రాణమువంటి యన్నదమ్ములు రామలక్ష్మణు లెక్కడ?"

దోహా 169

కుమారుని ప్రియవచనముల నామె విని కపట దుఃఖమును నటించి, కన్నీరుఁదెచ్చుకొని, భరతునిచెవులకును మనస్సునకును బాణములవంటి పాపపువార్తఁ జెప్పెను.

చౌపాయ్

"ఓతండ్రీ! మంథరసహాయమువలన, నేను కార్యమంతయు సిద్ధపఱచితిని; కాని, ప్రారంభమున నే, నాకార్యమును భగవంతుఁడు పాడుగొట్టెను. మహారాజు సీతండ్రిగారు స్వర్గస్థులయిరి." సింహనాదమునువిన్న ఆఁడయేనుఁగువలె, నతఁడు తల్లిమాటలనువిని, చింతాక్రాంతుఁడై, "హాతండ్రీ! తండ్రీ!" అనియేడ్చి నేలఁబడెను. "అయ్యోతండ్రీ! మీప్రాణప్రయాణసమయమున, మీవద్ద నుండలేకపోతిని; ఎంతపాపాత్ముఁడను? నన్ను మీరు శ్రీరామున కప్పగించి యుందురుకదా!" అతఁడు ధైర్యముఁదెచ్చికొని, లేచికూర్చుండి, "అమ్మా! ఏకారణముచేత నాతండ్రిగారు స్వర్గస్థులయిరి? చెప్పుము" అని యడిగెను. గాయమునకు విషముఁ దగిలించినట్లు, ఆపాపాత్మురాలు, తాను జేసినదుష్కార్యమున కుప్పతిల్లుచు, యావద్వృత్తాంతమును సక్రమముగ కుమారునితోఁ జెప్పెను.

దోహా 170

శ్రీరాముని వనగమనమును భరతుఁడువిని, తండ్రిగారిమరణమును మఱచెను అన్నియనర్థములకు నామె కారకురాలని యతఁడు గ్రహించి, యూరకుండెను. అతఁడు మాటఁజెప్పలేక చతికిలఁబడెను.

చౌపాయ్

ప్రథమమున భరతునిశరీరము దుఃఖముచే మండుచుండెను; మండుచుండినశరీరమునకు లవణముఁ దగిలించినట్లు, కైకేయి కుమారునితో నిట్లుపలికెను. "ఓతండ్రీ! మీతండ్రినిమిత్తము విచారింపఁబనిలేదు. వారనేకసత్కర్మలఁజేసి, కీర్తిప్రతిష్ఠలఁబొంది, సుఖముగ జీవించిరి. వారు జీవించియుండినందుకు దగినఫలముఁ బొందిరి. అంతమున వారు స్వర్గమునకు వెళ్ళిరి ఈసంగతులను గ్రహించి, నీవు విచారింపకుము. నీమంత్రులతోఁగూడి, నీవు రాజ్యముఁజేయుము" గాయమున కంగారముఁ దగిలించినట్లు, తల్లిమాటలు భరతునిహృదయ

మునకుఁ దగిలి, బాధపెట్టెను. అతఁడు ధైర్యముఁదెచ్చుకొని, నిట్టూర్పులను విడిచిపెట్టెను "ఓపాపాత్మురాలా! నీవు కులమును నాశనముఁ జేసితివి. నీమూలమున రాజు చనిపోయెను; శ్రీరాముఁడు వనములకు వెళ్లెను; వంశాచారమునకు విరుద్ధముగ, చిన్నవాఁడు పెద్దవారినివిడిచి, రాజ్యముఁ జేయవలసివచ్చెను. ఈపాపబుద్ధి నీమనస్సులో నిదివఱకే పుట్టియుండవలెను; అట్లయినయెడల నేను నీగర్భమున పుట్టినపుడే నన్నేల నీవు చంపితివి కావు? నీవు చెట్టునునఱికి, కొమ్మలకు నీరుఁబోయుచుంటివి. మీనములు జీవింపవలెనని తలఁచి, సరస్సులోని నీరును తోడివేయుచుంటివి.

## దోహా 171

"మాసూర్యవంశము హంసవంటిది; మాతండ్రి దశరథమహారాజు; రామలక్ష్మణులు నాయన్నదమ్ములు; ఓతల్లీ! నీవు నాతల్లివి; ఆహా! విధికృతముఁ దప్పించుకొనుట కెవరితరము? నీవునాకుఁ దగినతల్లివి కావు. (నీవు నీతల్లి వంటిదానవు. నీతల్లి నీతండ్రినివలె నీవు నీభర్తను జంపితివి. కథ:— ఒకఋషి కైకేయితండ్రినిజూచి, "ఓరాజా! సకలజంతువుల భాషలు నీకుఁ దెలియును; ఆయాజంతువులసంభాషణ నీవు పరులకుఁ దెల్పియఁజేసినయెడల నీకు మరణమువచ్చును." అని వరము నిచ్చెను. ఒకదినమున రాజును రాణియుకూర్చుండియుండిరి;ఒకచీమమాట నతఁడు విని నవ్వెను. అతనినవ్వునకుఁ గారణము చెప్పుమని రాణి నిరోధించెను; ఆకారణముఁజెప్పిన, తనకు మరణము సంభవించునని రాజు బోధించెను; కాని యామె రాజునుజూచి "ఓనాథా! మీప్రాణములుండినను, పోయినను గారణముఁ జెప్పుఁడు" అని యామె మూర్ఖించెను. ఆమాటను రాజు విని యామెను గృహమునుండి వెడలఁగొట్టెను.)

## చౌపాయీ

"ఓపాపాత్మురాలా! ఈదుర్బుద్ధి నీమనస్సులోఁ బుట్టినపుడే నీహృదయ మేల రెండుముక్కలు కాలేదు? ఈవరము నడిగినపుడు, నీమనస్సులో విచారము పుట్టలేదా? నీనాలుక మండలేదా? నీముఖమునకు సిగ్గులేకపోయెనా? రాజునకు నీయందు విశ్వాస మెట్లు కలిగెను? వారికి మరణకాలము సమీపించినందున, భగవంతుఁడు వారిబుద్ధిని భ్రమింపఁ

జేసెను. స్త్రీలమనోవ్యాపారములు బ్రహ్మకే తెలియవుకదా! నీవు కపటివి; పాపాత్మురాలవు; అవగుణములకు నిధివి. నీమనోవ్యాపారముల నెట్లు నాతండ్రి తెలిసికొనఁగల్గును? నాతండ్రిచిత్తము సరళము; నిర్మలము; వారికి లేశమపి కపటములేదు వారు సుశీలురు; ధర్మాత్ములు— స్త్రీలస్వభావ మెట్లు వారు తెలిసికొనఁగలరు? లోకములో నే జీవజంతువు శ్రీరాముని తనప్రాణమువలెఁ బ్రేమింపదు? మనుజులమాటఁ జెప్ప నేల? అట్టి శ్రీరామునకు నీ వహితముఁ జేసి సంతోషించుచుంటివి. ఎవరు నీవు? సత్యముఁ జెప్పుము. నీవెవరయిన నాకేమి? పాపముఁ జేసినందున నీముఖము నల్లఁబడెను. నీవు నాయెదుటనుండి లేచిపొమ్ము.

దోహా 172

"శ్రీరామునితో విరోధించిన నీవంటిపాపాత్మురాలిగర్భమున బ్రహ్మ నన్నుఁ బుట్టించెను; అందుచేత, నావంటిపాపాత్ముఁడేడీ! నీతోఁ బ్రసంగించుట వ్యర్థము."

చౌపాయ్

కైకేయిమాటలవలన శత్రుఘ్నునిశరీరము మండుచుండెను; కాని యతఁడు తల్లితో నెదిరించి మాటలాడలేదు. అతనికోపముఁ జెప్పుటకు శక్యముకాదు. ఆసమయమున, దివ్యవస్త్రాద్యలంకారములను ధరించి మంథర ప్రవేశించెను. ఆజ్యాహుతివలన బ్రజ్వరిల్లు హుతాశనునివలె, లక్ష్మణుని తమ్ముఁడు, శత్రుఘ్నుఁడు దానింజూచి, మండిపడెను. కోపము చేత నతఁడు దానిమూపురముమీఁద నొకదెబ్బఁగొట్టెను; ఆదెబ్బతో నది గిరగిరతిరిగి యేడ్చుచు నేలఁబడెను. దానిమూపురము విఱిగెను; దానిబుర్ర బ్రద్దలయ్యెను; దానికండ్లు ముఖమునుండి రాలెను. దాని ముఖమునుండి నెత్తురుకారెను. అది బోరగిలఁబడెను. "హా! దైవమా! నేనేమి యపరాధముఁ జేసితిని? ఇదియా, నేనుచేసినపనులకుఁ బ్రత్యుపకారము?" ఆమంథర నఖశిఖపర్యంతము విషమని తెలిసికొని శత్రుఘ్నుఁడు దానిశిఖఁబట్టుకొని బరబరమని యీడ్చెను. ఆకృపానిధి భరతుఁడువచ్చి, దానిని విడిపించెను. తరువాత భరతశత్రుఘ్నులుకలసి కౌసల్యవద్దకు వెళ్లిరి.

దోహా 173

ఆ కౌసల్యాదేవి, యేకవస్త్రమును ధరించి ధూళిపట్టినశరీరము

కలదిగ్రై, "నాథా! నాథా!" యని యేడ్చుచుండెను. ఆమెమనస్సు శోకముచే దహించుకొనిపోయెను; ఆమెశరీరము నీరసించెను; వనములో నుండిన సువర్ణఛాయవంటి నాగవల్లిలత మంచుచే వాడినట్లు యామె ముఖము వాడిపోయెను.

చౌపాయ్

భరతునిఁజూచి, కౌసల్యాదితల్లులు దిగ్గునలేచి యతని కెదురుగ వెళ్లిరి; కాని, వారుశోకముచే మూర్ఛిల్లి నేలఁగూలిరి. వారిదురవస్థఁ జూచి భరతుఁడు విలపించెను. తనయవస్థను మఱచి యతఁడు వారిపాదములమీఁదఁబడెను. "ఓతల్లీ! నాతండ్రినిఁ జూపింపుము. సీతమ్మయెక్కడ? నాయన్నదమ్ములు రామలక్ష్మణు లెక్కడ? లోకములో నాతల్లి కైకమ్మ యెందుకుఁబుట్టెను? ఆమె పుట్టినను గొడ్రాలైయుండిన బాగుండునే! ఆమె కడుపున నేనేలజన్మించితిని? నామూలమున వంశమున కపకీర్తివచ్చెను. నాకుఁ గళంకము వచ్చెను. నాప్రియులకు నేను ద్రోహిని. మూఁడులోకములలో నావంటిమందభాగ్యుఁడు కలఁడా? నామూలము నకదా మీకిట్టి దురవస్థ సంప్రాప్తమయ్యెను. తండ్రిగారు స్వర్గమునకును, రఘుపతివనములకును వెళ్లెను ఈయనర్థములకు నేనేకారణము. వెదురు పొదకు నిప్పుపెట్టిన నావంటివాని జన్మమేల? ఈదుస్సహమగుశోకాగ్నిని అపరాధమును నేనెట్లు భరింపఁగలను?

దోహా 174

భరతుని చక్కని ప్రియవచనములను తల్లివిని, ధైర్యముఁదెచ్చుకొని లేచి కూర్చుండెను. భరతుని లేవఁదీసి, అతనిని నామె కౌఁగిలించుకొనెను; అతని కన్నీటి దుడిచెను.

చౌపాయ్

ఆకౌసల్యస్వభావము సరళము; ఆమె నిష్కపటి; ఆ భరతుఁడు తిరిగివచ్చిన రాముఁడేమో యనునట్లు, ఆమె యతనిని కౌఁగిలించుకొనెను. తదుపరి, ఆమె శత్రుఘ్నుని యాదరించి,దగ్గఱకుఁదీసికొని యాలింగనముఁజేసికొనెను ఆమె ప్రేమాతిశయములును, దుఃఖము నుప్పొంగివచ్చెను. ఆమె సరళచిత్తమును గ్రహించి "అమె రామునితల్లి. ఆమె చిత్తమెందుకు కోమలముగ నుండదు?" అని జనులు చెప్పుకొనిరి. తన తొడలమీఁదఁ గుమారునిఁ గూర్చుండఁబెట్టుకొన్ని ఆమె కన్నీటిం దుడు

చుకొని, కుమారునితో నిట్లు చెప్ప నారభించెను:—"ఓభరతా! ధైర్యము దెచ్చుకొనుము. ఇది అసమయము;నీవు శోకింపకుము.గతించినదానికి వగవనేల? నీవు ఖిన్నుఁడవైయుండుట తప్పు. కాలకర్మములగతు లఘటితములు. ఓతండ్రీ! ఒకరిని దూషింపకుము. అన్నివిధముల భగవంతుఁడు నాకుఁ బ్రతికూలముగ నుండెను. ఇంతదుఃఖము ననుభవించి జీవింపుమని నాకుఁ బ్రహ్మ వ్రాసెను. ఇఁక ముందుకు నాకు బ్రహ్మ యేగతిబెట్టునో యెవరికిఁ దెలియును?

## దోహా 175

"ఓకుమారా! తండ్రియాజ్ఞాప్రకారము, శ్రీరాముఁడు వస్త్రాద్యలంకారములను విసర్జించి హర్షవిషాదములులేక, వల్కలాంబరములను ధరించెను.

## చౌపాయి

"అతనిముఖము సంతోషముగనుండెను; మనస్సులో రాగరోషములు లేశమైనలేవు. యథోచితముగ నతఁ డందఱను నోదార్చెను. అతనివెంట జానకిసహితము వనమునకువెళ్లెను. ఆమె మహాపతివ్రత; ఆమెకు భర్తయందు దనురాగము మెండు.అనేకవిధముల నామెను మేము బోధించి, వలదనిచెప్పినను, యామె భర్తవెంట వెళ్లెను. వనవాసగమనమును లక్ష్మణుఁడు విని దిగ్గునలేచి వారివెంట వెళ్లెను.అతనిని రాముఁడు బోధించినను, యతఁడు గృహమునువద్దనిలువక రామునితోఁగూడి వెళ్లెను. ఈప్రకారము సీతారామలక్ష్మలు వనమునకు వెళ్లిరి. నేనైనను వారితో వెళ్లలేదు; నాప్రాణములైనను వారితోఁ బోలేదు. ఇదియంతయు నాకన్నులయెదుట జరగెను; నేను నిర్భాగ్యురాలను; కనుక నా దేహమును ప్రాణములు విడిచిపెట్టలేదు. నాహృదయము పాషాణము; నాకడుపున బుట్టినరామునిహృదయము కోమలము; నాకు రామునిమీాద నెంతదయయుండిన ప్రయోజనమేమి? సిగ్గునువిడిచి నేను జీవించియుంటిని.మీాతండ్రి మహారాజు, ఎంతవఱకు జీవింపవలెనో, ఎప్పుడు చనిపోవలెనోవారికిఁ దెలియును. శ్రీరాముఁడు వారికన్నులయెదుటనుండినంతవఱకు వారు జీవించియుండిరి. వారికన్నులకు రాముఁడు చాటుపడినతోడనే వారు ప్రాణములను విడిచిపెట్టిరి. నాహృదయము నూరువజ్రములతో సమానము."

దోహా 176

ఆ కౌసల్యమాటలను భరతుఁడువిని, యేడ్వసాగెను. రాణివాస పుస్త్రీలును దాసదాసీజనంబులును చింతాక్రాంతులై యేడ్వసాగిరి. రాజ మందిరము శోకార్ణవమయ్యెను.

చౌపాయ్

భరతశత్రుఘ్ను లిరువురును శోకసంతప్తమానసులై విలపించిరి. వారిని తల్లి కౌఁగిలించుకొని యోదార్చెను. అనేకవిధముల నతనిని తల్లి బోధించి, యతనికి జ్ఞానము నుపదేశించెను. పురాణేతిహాసములలోని వాక్యములఁ జెప్పి, భరతుఁడు తల్లుల నోదార్చెను. భరతుఁడు చేతులను జోడించుకొని, నిర్మలాంతఃకరణముతో విన్నవించెను. "ఓతల్లీ! నాకన్నతల్లి చేసినకుట్ర నేనెఱుంగను; శ్రీరాముని వనమునకుఁబంపినసంగతి, యింతవఱకు నాకు లేశమైనను దెలియదు; ఒకవేళ నే నీసంగతి నెఱుంగుదునని నీకుగాని యపనమ్మకముండినయెడల, జననీ జనకులను, గురువును చంపినపాపము నాకు వచ్చుఁగాక; గోశాలలను; దేవబ్రాహ్మణమందిరములను దహించిన పాపము వచ్చుఁగాక; స్త్రీహత్య శిశుహత్య పాపము వచ్చుఁగాక; స్నేహితుని, రాజును విషముబెట్టి చంపినపాపము వచ్చుఁగాక. బ్రహ్మహత్య, సురాపానము మొదలగుపంచమహాపాతకములు వచ్చుఁగాక; అసత్యము, కపటప్రవర్తనము మొదలగుపాపములు, మనోవాక్కాయకర్మలచే బుట్టునట్టిపాపములు, కవీశ్వరులు వర్ణించిచెప్పునట్టి పాపములు వచ్చుఁగాక. ఇతఃపూర్వమీవిషయము నాకు లేశమపి తెలిసియుండినయెడల, ఓదైవమా! ఈపాపములన్నియు నాకుఁ దగులును గాక

దోహా 177

"ఓతల్లీ! ఈవిషయము నే నెఱింగియుండినయెడల, హరిహరుల చరణసేవను విడిచి ఘోరమగుభూతగణముల నుపాసించువానికి వచ్చునట్టిదుర్గతి నాకు వచ్చుఁగాక.

చౌపాయ్

"ఓతల్లీ! వేదమును విక్రయించువారును, గన్యాశుల్కమును బుచ్చుకొనువారును, పరోక్షమున నిందించువారును, పరులపాపములను చెప్పువారును, పాపముఁజేసి చెప్పుకొనువారును, కపటులు,

కుటిలులు, కలహప్రియులు, క్రోధులు, వేదవిదూషకులు, విశ్వవిరోధులు. లోభులు, లంపటులు, లోలుపులు, చంచలులు, పరధనపరదారాపేక్షులు, వీరిదుర్గతి నాకు వచ్చుఁగాక! సాధుసాంగత్యమును విసర్జించువారును, పరమార్థమునందు విముఖులగునిర్భాగ్యులును, మనుజశరీరమును ధరించియు భగవంతునిసేవింపనివారును, హరిహరులకీర్తిని గానముఁజేయనివారును, వేదమార్గములను విడిచి వామమార్గమున సంచరించువారును, ఆత్మవంచకులును, లోకవంచకులును వీరికి వచ్చుదుర్గతి నాకువచ్చుఁగాక.

ఛాంద్ 7

"ఓతల్లీ! మనోవాక్కర్మలచే నేను శ్రీరాముని దాసుఁడను; శ్రీరాములు సర్వజ్ఞులు; సకలజీవులహృదయములలో నివసించును. అందుచేత, జీవుల నిర్మలాంతఃకరణమును, కపటమును, చాతుర్యమును వారికిఁ దెలియును;" ఈప్రకారము భరతుఁడు చెప్పి, చెప్పి, కన్నీరుఁగార్చెను; అతనిశరీరము పులకరించెను; అతఁడు పాదాంగుష్ఠములతో భూమిమీఁద వ్రాయ నారంభించెను; అతఁడు రామునిభక్తుఁడని తెలిసికొని, తల్లి యతనిని కౌఁగిలించుకొనెను.

దోహా 178

భరతుని సరళమగుప్రియవచనముల నామెవిని, యతనితో నిట్లు పలికెను. "ఓతండ్రీ మనోవాక్కులచే సదా నీవు రామునకుఁ బ్రియుఁడవు.

చౌపాయ్

"రామునిప్రాణములకు నీవు ప్రాణము. అతనిప్రాణములకంటె నీవతనికిఁ బ్రియుఁడవు. చంద్రబింబములోనుండి విషము వెడలవచ్చును; హిమవంతములో నగ్ని పుట్టవచ్చును; జలములనువిడిచి, జలచరములు జీవింపచ్చును, జ్ఞానికి మోహ ముండవచ్చును; కాని, నీవుమాత్రము రఘురామునకుఁ బ్రతికూలముగ నుండవు. రాముఁడు వనములకు వెళ్లుట నీసమ్మతమని లోకములో నెవఁడైన చెప్పినయెడల, వానికి స్వప్నమందైన సుఖముగాని, సద్గతిగాని, లభింపదు." ఈప్రకారము తల్లి పలికి, కుమారుని కౌఁగిలించుకొనెను. ఆమెకు పాలు చేపువచ్చెను. ఆమె కన్నీరుఁగార్చెను. ఈప్రకారము వారు కూర్చుండి, విలపించుచుండ, రాత్రి గతిం

చెను. ప్రాతఃకాలమున, వామదేవుఁడును, వసిష్ఠులునువచ్చి, మంత్రులను మహాజనులను బిలిపించిరి. అనేకవిధముల వసిష్ఠు భరతుని నోదార్చి, బోధించెను; పరమార్థతత్త్వము నుపదేశించెను.

దోహా 179

"ఓతండ్రి! ధైర్యము నవలంబింపుము; చేయవలసినకార్యముల నిరోజునచేయుము". గురువుపచనములప్రకారము భరతుఁడు లేచి, పితృకార్యముఁ జేయుటకు సిద్ధపడెను.

చౌపాయ్

వేదోక్తప్రకారము మహారాజుకళేబరమునకు స్నానముఁజేయించిరి: ఆశరీరమును శ్మశానమునకుఁ దీసికొనివెళ్లుటకుఁ జక్కనివిమానముఁ గట్టిరి. భరతుఁడు తల్లులచరణములఁబట్టుకొని, "ఓతల్లులారా! మీరు సహగమనముఁజేయకుఁడు. రాముని జూడఁగలరు; అని ప్రార్థించి, వారిని నోదార్చెను రాముని జూడఁ గోరి, వారు నిలిచిరి. చందన దారువులను, అగరు మొదలగుసుగంధద్రవ్యములను వారు తీసికొని వెళ్లిరి. సాక్షాత్తు స్వర్గలోకమునకు మెట్లుగట్టినట్లు, సరయూనదీతీరమునఁ గాష్ఠముఁ బేర్చిరి. ఇట్లు దహనక్రియలుజరిగెను. యథావిధిగ భరతుఁడు స్నానముఁజేసి, తిలోదకముల నిచ్చెను. వేదపురాణములను విచారించి చూచి, శుక్లపక్షయేకాదశినాటికి దశరాత్రములును, ప్రేతకర్మయు ముగించెను. వసిష్ఠులు యాజ్ఞచేసినదానికంటె నధికము సహస్రాంతము భరతుఁడు పితృకార్యమును నిర్వర్తించెను. అతఁడు తండ్రిపేరుఁజెప్పి, షోడశమహాదానముల నిచ్చెను. ధేనువులను, గజాశ్వములను దానముఁ జేసెను

దోహా 180

సింహాసనములు, అలంకారములు, వస్త్రములు, అన్నము, భూములు, గృహములు, ధనము మొదలగువానిని సంతృప్తిగ భరతుఁడుబ్రాహ్మణుల కిచ్చెను; అంతకంటె నధికము బుచ్చుకొనుటకు వారికి వీలులేకపోయెను.

చౌపాయ్.

భరతుఁడుచేసిన పితృకార్యములను వేనోళ్లతోనైనఁ జెప్పుటకు శక్యము కాదు. తదుపరి, మంచిసమయముఁజూచి, వసిష్ఠుడువచ్చి, మంత్రు

లను, మహాజనులను, సామంతప్రభువులను బిలిపించెను. అందఱు రాజసభలోఁ గూర్చుండిరి; భరతశత్రుఘ్నులను సభకురప్పించిరి. వసిష్ఠుఁడు భరతునియెదుటఁగూర్చుండెను; అతఁడు ధర్మానుసారము రాజనీతినిఁ బురస్కరించుకొని, భరతున కుపదేశించెను. ప్రథమమున, రాణి కైకేయి చేసిన పన్నాగముమొదలు రామునివనగమనమువఱకుఁ గలకథ నతఁడు చెప్పెను; తదుపరి, మహారాజు సత్యమును, ధర్మమును కొనియాడెను. ఆమహారాజు రామునివియోగమును భరింపలేక, శరీరమును విడిచిపెట్టెను? ఇందుమూలమున నతనికి రామునియందుఁగలప్రేమాతిశయములువ్యక్తమయ్యెను. తదుపరి, గురువు శ్రీసీతారామలక్ష్మణులగుణమును గొనియాడుచుండ, నతని నేత్రములవెంబడి నీరు వఱదలై కారెను; అతనిశరీరము పులకరించెను; వారియందుఁ గలప్రేమాతిశయములచే, నాగురువు మహాజ్ఞానియైనను విలపించి, పరవశుఁడయ్యెను.

దోహా 181

ఈప్రకార మామునివర్యుఁడు శోకార్ణవమగ్నుఁడై చెప్పనారంభించెను. "ఓభరతా! విధికృతము ప్రబలము. లాభనష్టములు, జననమరణములు, కీర్తిఅపకీర్తులును, భగవదధీనములు. ('నావంటివాఁడును సహితము విధికృతమును దప్పించుకొనలేఁడు సుమీ' అని యతఁడు సూచించెను. అయోధ్యానగరమునకు నష్టము; దేవతలకులాభము; వనవాసులకు లాభము; సుగ్రీవవిభీషణులకు జీవనము; రావణాది రాక్షసులకు మరణము. భరతలక్ష్మణులకు కీర్తి; కైకేయికి అపకీర్తి.)

చౌపాయ్

"ఓభరతా! ఈసంగతులను విచారించియొకరిని దూషించుటయు, నొకరిని కోపించుటయు వ్యర్థము. నీవు విచారించి చూడుము; దశరథమహారాజు మరణము శోచనీయము కాదు. వేదబాహ్యుఁడును స్వధర్మమార్గమునువిడిచి విషయములలోఁ దగులుకొనిన బ్రాహ్మణుఁడు శోచనీయుఁడు. రాజనీతినివిడిచి ప్రజలను ప్రాణములవలె రక్షింపనిరాజు శోచనీయుఁడు. ధనవంతుఁడైనను కృపణుఁడును, అతిథులను సత్కరింపనివాఁడును, శివుని సేవింపని వైశ్యుఁడు శోచనీయుఁడు. బ్రాహ్మణుల నవమానించువాఁడును, దురభిమానముగలవాఁడును, వదరుఁబోతును, జ్ఞానినని విఱ్ఱవీగుశూద్రుఁడు శోచనీయుఁడు. భర్తకుఁ బ్రతికూలముగ

సంచరించు స్త్రీనిమిత్తము విచారింపవలెను. కుటిలస్వభావురాలును కల హప్రియురాలును స్వేచ్ఛానుసారియగు స్త్రీ నిమిత్తము విచారింపవలెను. బ్రహ్మచర్యమునువిడిచి గురువాజ్ఞను ధిక్కరించిన బ్రహ్మచారి శోచనీయుఁడు.

దోహా 182

"మోహముచేత ధర్మమార్గమును విడిచిపెట్టిన గృహస్థుఁడు శోచనీయుఁడు; వివేకమును వైరాగ్యమునుఁ బోగొట్టుకొని, ప్రపంచరీతిని యనుసరించుసన్యాసి శోచనీయుఁడు.

చౌపాయీ

"జపతపములను విడిచి, విషయభోగములయందు మనస్సును బ్రసరింపఁజేయువానప్రస్థుఁ శోచనీయుఁడు. పరోక్షమున దూషించువారును, అకారణముగఁ గోపించువారును, జననీజనకులతోను, గురువుల తోను, సోదరులతో విరోధించువారును, ఆత్మపోషకులును, పరుల కప కారముఁజేయువారును, నిర్దయులును, లోభులును, రతికాములును, బరధనాపేక్షులును, వేదవిదూషకులును, దేవవంచకులును శోచనీయులు. కపటమునువిడిచి, భగవంతుని సేవింపనివాఁడును, శోచనీయుఁడు. దశరథమహారాజు శోచనీయుఁడుకాడు; ఆతనికీర్తి యేడేడుపదునాలుగు లోకములలో వ్యాపించెను. త్రికాలములలో నతనివంటివాఁడు లేఁడు. ఓభరతా! ఇట్టివాఁడు నీతండ్రి. బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, దేవేంద్రాది దిక్పతులును మీతండ్రిగుణములను జెప్పుకొనుచుందురు.

దోహా 183

"రామలక్ష్మణభరతశత్రుఘ్నులవంటి కుమారులఁగల తండ్రియొక్క పుణ్యము నెవరు విస్తరించి, చెప్పఁగలరు? నీవాలోచించి, చూడుము.

చౌపాయీ

"అన్నివిధముల మీతండ్రి యదృష్టవంతుఁడు; అతనినిమిత్తము విచారించుట వ్యర్థము. నామాటలనువిని, వానిని గ్రహించి, దుఃఖమును విడిచిపెట్టుము; మీతండ్రియాజ్ఞను శిరసావహింపుము. మహారాజు నీకు రాజ్యాధిపత్యము నిచ్చెను. తండ్రివచనములను మన్నించుట యుచితము. ఆడినమాటను దప్పలేక, నీతండ్రి రామునివియోగమున నొప్పుకొని, యతనియందుఁగల్గు యనురాగముచే, నిజశరీరమును విడిచి

పెట్టెను. మీతండ్రికి మాట ప్రధానముకాని, ప్రాణము ప్రియముకాదు. అందుచేత, నీవతనిమాటను మన్నింపుము. అతనియాజ్ఞను నీవు శిరసా వహించినయెడల, నీకు మంగళమగును; అన్నివిధముల నీకు శుభములు చేకూడును. పరశురాముఁడు తండ్రియాజ్ఞాప్రకారముతక్షణము తల్లిని సంహరించెను. యయాతిచక్రవర్తికోరినప్రకార మతనికుమారుఁడు, పురువు, తనయౌవనమును తండ్రికిచ్చి, తండ్రివార్ధక్యమును దానను భవించెను.

దోహా 184

"యుచితానుచితముల నాలోచింపక, తండ్రియాజ్ఞను మన్నింప వలెను; ఆప్రకారము మన్నించువారే, సకలసుఖములను గీర్తినిబొంది, స్వర్గమునకు వెళ్లగలరు.

చౌపాయ్

"అన్నివిధముల నీవు రాజువచనములను శిరసావహించి, రాజ్యముఁజేసి, ప్రజలను రక్షింపుము. ఇంతటితో దుఃఖమును విడిచిపెట్టుము. నీకార్యమువలన, స్వర్గములోనుండిన మీతండ్రిమనస్సు స్థిమిత పడి, యతఁడు సంతోషించును 'వేదశాస్త్రసమ్మతముగు వాక్యముఁ జెప్పు చున్నాను వినుము. ఏకుమారునకుఁ దండ్రి రాజ్యమునిచ్చునో, వాఁడే రాజ్యమున కర్హుఁడు. ఆతనిమాటప్రకారము నీవు ప్రవర్తించినయెడలఁ గీర్తిప్రతిష్ఠలు నీకువచ్చును. నీవు శోకమునువిడిచి, రాజ్యముఁజేయుము; నీక్షేమమునిమిత్తము నేను చెప్పుచున్నాను. నామాటలను విచారించి చూడుము. నీవు రాజ్యముచేయుచుండిన సంగతినివిని సీతారాములు సంతోషించెదరు, బుద్ధిగలవాఁడునామాట లనుచితములని చెప్పఁడు. జనులసౌఖ్యముఁజూచి, కౌసల్యాదితల్లులు సుఖముగ జీవించెదరు. నీనిర్మ లాంతఃకరణము రామునకుఁ దెలియును;నీవు చేసినపని నతఁడు మెచ్చుకొని సంతోషించును. రాముఁడు తిరిగివచ్చిన తరుత నతనికి నీవు రాజ్యమును సమర్పించి, అతనిని నీయిష్టానుసారము సేవింపుము."

దోహా 185

మంత్రులు చేతులనుజోడించుకొని, భరతునితో నిట్లు విన్నవించిరి "ఓనాథా! గురువాజ్ఞనుమన్నింపుఁడు; శ్రీరాములవారు తిరిగివచ్చినతరువాత, సమయోచితముగఁ దమరు ప్రవర్తింపవచ్చును."

చౌపాయ్

కౌసల్య ధైర్యముఁ దెచ్చుకొని, భరతునితో నిట్లు చెప్ప నారంభించెను; "ఓ భరతా! గుర్వాజ్ఞను నీవు మన్నించుట యుచితము. అది నీకు హితవని తెలిసికొని, మనస్ఫూర్తిగ దాని ప్రకారము నడుచుట యుచితము. కాలగతులను గ్రహించి, విషాదమును విడిచిపెట్టుము. నీవు ప్రస్తుత మస్థిమితముగ నుండుటకు సమయము కాదు. శ్రీరాముఁడు వనములోనుండెను; మీతండ్రి సర్వర్గస్థులయిరి. ఇట్లు నీవు విచారించుచుంటివి. నీకుటుంబమునకును, నీతల్లులకును, నీమంత్రులకును నీజనులకును నీవే యాధారుఁడవు. నాతోడుసుమీ; కాలకర్మములు ప్రతికూలముగనుండెనని తెలిసికొని నీవు ధైర్యముఁ దెచ్చుకొనుము. తండ్రియాజ్ఞను శిరసావహించి మన్నింపుము. ప్రజాపాలనము జేయుము. పురజనుల దుఃఖముఁ బోగొట్టుము." నీగురువును మంత్రులును జెప్పిన ప్రియవచనములు, చల్లనిగంధమువలెనతనిహృదయమున కాప్యాయముగనుండెను. నిర్మలాంతఃకరణముతో నానితల్లి చెప్పినప్రియవచనములు మృదుమధురముగనుండెను.

ఛాంద్ 8

ఆమెమాటలవలన,నతనిమనస్సు వ్యాకులముపడెను. తనతల్లి చేసిన కృత్రిమవ్యాపారమువలనఁగదా, రాముఁడువనమునకువెళ్లెనని యతఁడు జ్ఞాపకముఁ దెచ్చుకొని, యిరువురుతల్లులకుఁ గలతారతమ్యమున కతఁడు విచారించెను. అతనికములములవంటినేత్రములవెంబడి నీరుకారెను. అతనిహృదయములోనూతనముగఁ బుట్టినవిరహాంకురముల నతనికన్నీరు తడిపి మొలిపించెను. ఆసమయమున, నతనిదురవస్థఁ జూచినవారందఱు దుఃఖముచే మైమఱచియుండిరి. అతనిసుశీలమును, భ్రాతృవాత్సల్యమును సభికులుకొనియాడిరి. అని తులసీదాసుగారు చెప్పుచున్నారు.

సోరఠా 7

భరతుఁడు ధైర్యముఁదెచ్చుకొని, కములములవంటిహస్తములను జోడించి, అమృతోపమానముగ వారితో నిట్లు ప్రసంగించెను.

చౌపాయ్

"గురువులు నాకు మంచియుపదేశముఁజేసిరి; వారివచనములు మంత్రులకును జనులకును సమ్మతములు. నాతల్లిగారుకూడ నాకుఁదగినట్లు

నన్నాజ్ఞాపించిరి. వారిమాటలను నేను శిరసావహించి మన్నింపవలెను. గురువులును, జననీజనకులును, ప్రభువులును చెప్పినమాటప్రకారము నడచినయెడల మేలుకలుగును; కనుక, వారు చెప్పినవెంటనే విలంబముజేయక నడచుట యుచితము. వారిమాటలు యుచితమా, అనుచితమా యని విచారించుటవలన, ధర్మమునకు హానివచ్చును. అందువలన మహాపాతకము చుట్టుకొనును. మీరు సరళముగఁ జెప్పిన హితోపదేశములప్రకారము నేనునడచినయెడల, నాకు మేలుకలుగును. అయినను; నేను మీమాటలను బాగుగగ్రహించినను, నామనస్సునకుమాత్రము సంతోషము కలుగలేదు. నావిన్నపమును మీరు వినుఁడు. నాముఖముఁజూచి, నన్ను తగినప్రకారము శిక్షింపుఁడు. నేను మీకుఁ బ్రత్యుత్తరము నిచ్చినందుకు నన్ను క్షమింపుడు. దుఃఖములో నుండినవారు చెప్పినమాటలలో గుణదోషములుండినను, సాధువులు వానిని లక్ష్యముఁజేయరు.

దోహా 186

"ఏరాజ్యమునిమిత్తము నాతండ్రిగారు స్వర్గస్థులైరో, ఏదానిమూలమున,నాసీతారామలక్ష్మణులు వనములకేగిరో,నన్నారాజ్యమును పరిపాలింపుమనికదా, మీయభిప్రాయము. నేను రాజ్యముఁజేయుటవలన, నాకేమిప్రయోజనము? మీకేమిలాభము? కలుగునో, మీరు చెప్పుఁడు.

చౌపాయ్.

"శ్రీసీతాపతిని సేవించుటయే, నాకు శ్రేయస్కరము. నాతల్లి చేసినకృత్రిమమువలన, నాయభిలాషకు భంగముకలుగవచ్చెను. నేను పూర్వోత్తరముల నాలోచించిచూడ, నాకింతకంటె శ్రేయోదాయకమగునని మఱియొకటి కనఁబడదు. శ్రీసీతారాముల పాదములఁ జూచినపుడు, నాకీరాజ్యము గీజ్యమేల? దానివలన నాకు దుఃఖముకలుగును.భూషణములను ధరించి, వస్త్రమును విసర్జించినట్లు, మాతండ్రి లేనిరాజ్యమునకు శోభలేదు. బ్రహ్మతత్త్వమును విచారించి నిజమును తెలిసికొనని వైరాగ్యమేల? రోగముచేఁ బీడింపబడుచుండిన శరీరమునకు భోగములేల? హరిభక్తిలేని జపతపములేల? జీవములేని శరీరచక్కదనమేల? రాముఁడులేని రాజ్యము నాకేల? ఈభోగములు నాకేల? నేను

శ్రీరామునివద్దకు వెళ్లుటకు మీరు నాకు సెలవునిచ్చుటయే నాముఖ్యాభిప్రాయము; అదియే నాకు శ్రేయోదాయకము. నేను రాజ్యముఁ జేయుటవలన, మీమీకోరికలు నెరవేరునని మీరు తలంచినట్లు కనబడును; నాయందుఁగలవెట్టిదయచే; మీ రట్లుతలంచితిరి కాని, మఱియొకటికాదు.

దోహా 187

"నేను కైకేయికుమారుఁడను; కుటిలస్వభావుఁడను! సిగ్గులజ్జలు లేనివాఁడను. రామునిశత్రువుఁడను; నావంటియధముడు రాజ్యముఁ జేయుటవలన, మీరు సుఖములుకలుగునని తలంచుచుండితిరి.

చౌపాయ్

"నేను సత్యముఁ జెప్పుచున్నాను; నామాటలనువిని, విశ్వసింపుఁడు; ధర్మశీలుఁడే రాజ్యముఁజేయుటకుఁ దగినవాఁడు. మీరు మూర్ఖించి, రాజ్యమును నాకుఁగట్టినయెడల, భూమిపాతాళమునకుఁ గ్రుంకును. నానిమిత్తముకదా శ్రీసీతారాములు వనవాసముఁజేయుచుండిరి; నాకంటెఁ బాపాత్ముఁ డెవఁడుకలఁడు? మహారాజు శ్రీరాములను వనములకుఁబంపి, వియోగదుఃఖమును భరింపలేక, స్వర్గస్థులయిరి. నేను మూర్ఖుఁడను; ఈయనర్థములకు నేనే కారణము. ఏవిధమగువిచారము లేనివానివలె, నేనుమీమాటలను సావధానముగ వినుచుంటని. రాముఁడు లేని రాజమందిరముఁజూచినను, నాప్రాణములు నిలిచియున్నవి. నాబ్రతుకు లోకపరిహాసమునకువచ్చెను. పరమపవిత్రుఁడగు శ్రీరాముఁడు విషయభోగములు తుచ్ఛములని విడిచిపెట్టెను. నేను విషయాసక్తుఁడనై, లోభివానివలె, రాజ్యసుఖముల ననుభవింపఁగోరుచుంటిని. నాహృదయకాఠిన్యము నెంతవఱకుఁ జెప్పఁగలను? నాహృదయము వజ్రముకంటె నధికకఠినమని ప్రసిద్ధికెక్కెను. శ్రీరామునివియోగమువలన, నాహృదయము రెండుముక్కలు కాలేదు.

దోహా 188

"కారణముకంటెఁ గార్యమే కఠినము; ఇందుకు రెండుదృష్టాంతములు కలవు. ఎముకలవలన జేయఁబడినవజ్రము మహాకఠినము; పాషాణములోఁబుట్టినలోహము పాషాణముకంటెఁ గఠినముకదా! అటుల, కైకేయిగర్భములోఁబుట్టిన నే నామెకంటె మహాకఠినుఁడను.

చౌపాయీ

"కైకేయిగర్భమునఁబుట్టిన నేను పాపాత్ముఁడను; మందభాగ్యుఁడను; శరీరమునం దభిమానముకల వాఁడను. శ్రీరాముని వియోగముచే నాప్రాణములు నాశరీరమును విడిచిపెట్టనపుడు, ముందుకు నేనేమి చూడవలసివచ్చునో, వినవలసివచ్చునో తెలియదు. ఈపాపాత్మురాలు, కైకమ్మ, శ్రీసీతారాములను వనములకుఁబంపి, భర్తను స్వర్గమునకుఁ బ్రయాణముఁ జేసెను. ఇదియంతయు నాతల్లికి హితవయ్యెను. ఆమెమూలమున జనులకు శోకసంతాపములుకలిగెను; ఆమెకు వైధవ్యమును, అపకీర్తివచ్చెను. నాకు రాజ్యమును సత్కీర్తినిచ్చెను; అన్నికార్యముల నామె చక్కఁబెట్టెను ఈపనులవలన, నాకేమిప్రయోజనము? మీరు కూడ నన్ను రాజ్యముఁజేయుమని నొక్కిచెప్పుచుంటిరి. నేను కైకేయి గర్భవాసమునఁ బుట్టియుంటిని; ఇదియే, నాకువచ్చినమచ్చ; ఇది నా కను చితముకాదు. ఒకపర్యాయమే, వ్రాయవలసినదానిని బ్రహ్మ నాలలాటమున వ్రాసెను. మీరు "పంచాయతి"నిజేసి, దానికిసహాయముఁ చేయుచుంటిరి; నేనేమి చేయఁగలను?

దోహా 159

"ఒకనికి నవగ్రహములు వక్రించియుండెను; అందులకుఁదోడు సన్నిపాతము; దానిపైఁదేలుకుట్టెను. అప్పుడు వానియారోగ్యమునిమిత్తము వానికి మద్యమునిచ్చినయెడల, వాని ప్రాణములు నిలువఁబడునా? అటులనే నాయవస్థయున్నది.

చౌపాయీ

"నేను కైకేయికుమారుఁడను; బ్రహ్మచతురుఁడు; నాకుఁదగినట్లు, నాలలాటమున నతఁడు వ్రాయవలసినదానిని వ్రాసెను. దశరథమహారాజుకుమారుఁడనని, శ్రీరామచంద్రులతమ్ముఁడని నేను గొప్పలుచెప్పుకొనుట వ్యర్థము. నేను రాజ్యముఁజేయుట మంచిపని యని మీరుచెప్పుచుంటిరి; సర్వసామాన్యముగ, రాజ్యము జేయవలెనని యందరు కోరుచుందురు. నేనుమాత్రము రాజ్యముఁగోరను. ఏప్రకారము నేను మీలో నెవరికిఁ బ్రత్యుత్తరము నియ్యఁగలను? నేను నాతల్లితప్ప మీలో నేచేసినపనిని హర్షించెదరో చెప్పుఁడు? లోకములో నేనుతప్ప, యేచరాచరజంతువు శ్రీసీతారాములంజూచి, ప్రేమింపదు! నేను రాజ్యముఁ

జేయుటవలన, మీకు లాభమువలెఁ గనఁబడును; కాని, దానివలన మీకు హానికలుగును, అట్లుకలుగుట, నాదినముల సామాన్యముగాని, మీదోషముకాదు.

దోహా 190

"శ్రీరాములతల్లికి నామీద విశేషదయకలదు; ఆమెహృదయము స్వతస్సిద్ధముగ కోమలము. ఆమె నాదీనత్వముఁజూచి, నన్ను రాజ్యముఁ జేయుమని కోరుచున్నది.

చౌపాయ్

"నాగురువులు జ్ఞానసముద్రులు; త్రికాలజ్ఞానసంపన్నులు; ప్రపంచమంతయు వారికిఁ గరతలామలకము. వారుకూడ నాకు రాజ్యతిలకముఁ బెట్టవలెనని కోరుచున్నారు. భగవంతుడే నాయెడల విపరీతముగ నుండినపుడు, మీరందరు విపరీతముగనుండుటలో నాశ్చర్యములేదు. ఇదియంతయు నేనుజేసినఁగృత్రిమమని, శ్రీసీతారాములుతప్ప, లోకములో నెవరు చెప్పకయుందురు! ఈలోకాపవాదమును నేనువిని, సహింపవలయునుకదా! జలములుండినదగ్గఱ, బురదకూడ నుండునుకదా, ఈలోకాపవాదమునకు నాకు భయములేదు. పరలోకముకలుగునో లేదో యని విచారములేదు. ఒకదానిచే నాహృదయము మండుచున్నది; నానిమిత్తమునకదా, శ్రీసీతారాములు వనవాసముఁజేసి, కష్టములఁబడుచుండిరికదా యని నామనస్సు దహించుకొనిపోవుచున్నది. జీవించియుండినందులకుఁ దగినఫలము లక్ష్మణునకు లభించెను. అతఁడు సర్వమును విడిచిపెట్టి, శ్రీరాముని చరణములనే యాశ్రయించెను నేను పుట్టినందునకదా, శ్రీసీతారాములు వనములకేగిరి. నేను నిర్భాగ్యుఁడను; నావిలాపములు వ్యర్థములు; అరణ్యరోదనములు.

దోహా 191

"ఈదారుణమగు నాదుఃఖమును మీకు విన్నవించుచున్నాను. నేను శ్రీరాములచరణములఁజూచినగాని, నాకడుపులోనిమంట చల్లారదు.

చౌపాయ్

"ఈమంట చల్లారుటకుఁ దగినయుపాయము మఱియొకటి కనఁబడదు. శ్రీరాముడు వినాగా, నాజీవనముతో నాకేమిప్రయోజనము?

ఇదియే నామనస్సులోనుండుకోరిక. రేపు ప్రాతఃకాలమున లేచి, నేను శ్రీరామునివద్దకుఁ బోవుచున్నాను. నిజముగ నే నపరాధిని; నాశ్రేయస్సుఁగోరని వాఁడను.నామూలమునఁగదా,జనులయుపాధులు నశించెను. నేను శ్రీరామునిసమ్ముఖమున నిలువఁబడియుండిన, వారికృపాదృష్టులు నామీఁదఁబడును. వారునన్ను రక్షించెదరు. శ్రీరాములు సుశీలురు; కృపానిధానులు; వారిస్వభావము సరళము; వారిచిత్తము కోమలము; వారిహృదయము నిర్మలము. వారు శత్రువునైనను బాధపెట్టరు; నేనపరాధిని; బాలుఁడను; వారిసేవకుఁడను; అందుచేత వారు నన్నురక్షించెదరు. ఓమహాజనులారా; మీరందరు నాశ్రేయస్సుగోరి, నన్నుదీవింపుడు; నేను శ్రీరాముల వద్దకు వెళ్లుటకు, మీయాజ్ఞ దయచేయుడు. నేను వారిదాసుఁడనని వారుతెలిసికొని, నావిన్నపములను మన్నించి, రాజధానికిఁ దిరిగివచ్చెదరు.

దోహా 192

“వారికి శరణాగతులయందు విశ్వాసము. కైకేయివంటిదుర్మార్గరాలికడుపున జన్మించితిని. నేను మూర్ఖదాసుఁడను; దోషిని, నేను వారివాఁడనని తెలిసికొని, వారు నన్ను విడిచిపెట్టరని నానమ్మకము”.

చౌపాయి

వారు భరతునివచనముల నామోదించిరి. అమృతోపమానమగు నతని వాక్యములవలన, నతనికి రామునియందుఁగలభక్తి వ్యక్తమయ్యెను. శ్రీరాముని వియోగదుఃఖ మనునట్టివిషము జనులశరీరమున వ్యాపించెను; సజీవనమంత్రమువలన విషమువిఱిగిపోవునట్లు,శ్రీరామునిదర్శనోత్సాహముచే వారిదుఃఖముపోయెను. ముప్వురు తల్లులు, మంత్రులు, గురువు, నగరములో నివసించు స్త్రీపురుషులందఱును బహువ్యాకులులయిరి. వారికిఁ గలప్రేమ యతిశయించెను. పలువిధములవారు భరతుని యుపన్యాసము నామోదించిరి. “నిశ్చలభక్తి భరతునిశరీరమును ధరించి పుట్టెను ఓభరతా! ఈప్రకారము నీవెందులకుఁ జెప్పకయుండుదువు? శ్రీరాముఁడు నీప్రాణములకంటె నీకుఁ బ్రియుఁడు. ఏమూర్ఖులు నీతల్లికపటము నీకువచ్చెనని చెప్పుచుందురో, వారును వారివంశస్థు లేడేడుపురుషాంతరములవఱకు ననేకయుగములు నరకములోఁబడియుందురు. మణిసర్పము నెత్తిమీఁదనుండినను దానివిషము మణికియుండునా!అటులనే,ఓభరతజీ!

నీవు కైకగర్భమునఁబుట్టినను, ఆమెవిషము నీలో లేదు. ఆమణివిషమును బీల్చి, బాధలను దొలగించి,దరిద్రమునుబోఁగొట్టును. అటులనే, నీమూలమున, జనులవిరహవిషముహరింపఁబడెను; రామదర్శనమనునట్టి ధనము లభించును; అందుచేత వారిదరిద్రము తొలఁగిపోవును.

దోహా 193

"తప్పక, వనములోనుండినశ్రీరామునివద్దకు మనముపోవలెను; భరతుఁడుచెప్పినమాటలు జనసమ్మతములు; శోకార్ణవములో మునుఁగుచుంటిమి; అట్టిమమ్ములను నీవువచ్చి రక్షించితివి".

చౌపాయ్

ఈప్రకారము జనులు వారిలోవారు ముచ్చటించుకొనిరి. అంభోదనాదమునువిని, చాతకములును మయూరములును సంతసించునట్లు, స్త్రీపురుషులు భరతునివాక్యములనువిని సంతోషించిరి. ప్రాతఃకాలమున లేచి, వెడలుటకు వారునిశ్చయించిరి; తనప్రాణములనువలె,నతఁడు వారిని ప్రేమించెను. వారు మునీశ్వరునకు నమస్కరించి, భరతునిచే శెలవు గైకొని, వారు స్వగృహములకుఁబోయిరి. లోకములో భరతుఁడు పుట్టినందులకు, జన్మము సార్థకమయ్యెను. అతనిసుశీలమును సుగుణసంపదలను వారు స్తోత్రముఁజేయుచు వెళ్లిరి. "మంచిపనికాఁబోవును; ఇదియొక మేలు; ప్రయాణమునకు సన్నాహముఁజేయుచుండిరి. కొందఱుజనులు నగరసంరక్షణార్థము నగరులోనుండక తప్పదు; వారు". వారుచావుదెబ్బను దినినట్లు విచారించెదరు.అని వారిలో వారు ప్రసంగిచుచుండిరి. "ఆమాట చెప్పకుము; ఎవరుమాత్ర నగరులోనుండరు. జీవించియుండినందులకు, లోకములో నెవరు, శ్రీసీతారాములక్ష్మణులజూచి, జన్మము సార్థకముఁ జేసికొనరు! ఎవరికి వారు ముప్పురుప్రియులు కారు! రాముని మనసూర్తిగ ప్రేమించువారికే రామునిఁజూడవలెనని యభిలాషయుండును". అని యొకఁడు చెప్పెను.

దోహా 194

"సంపదలు, గృహములు, సుఖములు, స్నేహితులు, జననీజనకులు, సోదరులు, ఈమొదలగువారు రామునివద్దకు వెళ్లుటకు సహాయముఁ జేయనియెడల, వారిజీవనము వ్యర్థము"; ఒకరికొకరు సహాయముఁ జేసికొని, రామునిఁజూచుటకు వెడలుచుండిరి.

చౌపాయ్

ప్రతిగృహమువద్దను వాహనము నిలిచియుండెను. ప్రాతఃకాలమున ప్రయాణమగుటచేత, జనులు సంతోషించుచుండిరి. భరతుఁడు నగరులోఁ బ్రవేశించి, ఝట్లు చింతించెను. "ఈరథగజతురగములును, ఈసంపదలును, ఈనగరమంతయు, శ్రీరాములసొత్తుతగినవిధమునవీనినిసంరక్షింపక, విడిచిపెట్టి, నేను వెళ్లినయెడల, వనర్థములు తుదకు నాకువాటిల్లును. అట్లు విడిచిపెట్టివెళ్లినయెడల, భూపాలశిరోమణియగు ప్రభువునకు ద్రోహముఁజేసినవాఁడనుగాఁగలను. ఇతరు లెంతదూషించినను, భూషించినను, లక్ష్యముఁజేయక, స్వామిహితవునుకోరి, పనులను నిర్వర్తించువాఁడే మంచిసేవకుఁడు". ఈప్రకారము భరతుఁడు తలంచి, స్వప్నమందైనను ధర్మమార్గమును విడిచిపెట్టని యాంతరంగిక సేవకులఁ బిలిపించెను. అతఁడు వారికి సేవకధర్మము నుపదేశించి, వారు చేయనలసినపనులను వారికిబోధించి, యథోచితముగ వారిని యాస్థానములను రక్షింపుఁడని నియమించెను. ఈప్రకార మతఁడు తగినయత్నముఁ జేసి, సంరక్షకులను నియోగించి రామునితల్లివద్దకు వెళ్లెను.

దోహా 195

కుమారునివియోగముచేత దుఃఖించుచుండిన తల్లుల యాతురత నతఁడు గ్రహించి, వారు సుఖముగఁ గూర్చుండి, ప్రయాణముఁ జేయుటకుఁ దగినవిమానములను సిద్ధపఱచెను.

చౌపాయ్

చక్రవాకమిథునమువలె, నగరములోని స్త్రీపురుషులు ప్రాతఃకాలమునకెదురుచూచుచుండిరి. అంతలో రాత్రిగడచి, తెల్లవారెను; రాత్రియంతయు వారు జాగరణలోఁగడపిరి. అప్పుడు భరతుఁడు మంత్రులను బిలిపించి, వారితో నిట్లుచెప్పెను. "రాజ్యతిలకమునకుఁ దగినపదార్థములను బట్టుకొనుఁడు. వనములో శ్రీరామునకుమునిరాజుపట్టముఁగట్టును. శీఘ్రముపెడలుఁడు". అతనియాజ్ఞప్రకారము వారు చతురంగబలములను సన్నాహముఁజేసిరి. అగ్నిహోత్రములఁజేయుటకుఁ దగినపదార్థములఁబట్టుకొని, వసిష్ఠుఁలును, వారిభార్య అరుంధతియు రథమునెక్కి, ముందునడచిరి. మహాతపస్సంపన్నులును, తేజోవంతులు నగుబ్రాహ్మణులనేకులు, వివిధవాహనములనెక్కి ప్రయాణమును సాగించిరి. పురజనులు

వారివారివాహనముల నధిష్ఠించి, చిత్రకూటమునకు వెడలిరి. మంచి చక్కని సవారీలలోఁగూర్చుండి మహారాణులు బయలుదేఱిరి.

దోహా 196

అంతరంగికసేవకులకు నగరము నప్పగించి, సాదరముగ జనులందఱు ముందునడచినతరువాత, భరతుఁడు శత్రుఘ్నునితోఁగూడి శ్రీసీతారాములచరణములను స్మరించి ప్రయాణమయ్యెను.

---

# ద్వాదశవిశ్రామము.

---

చౌపాయ్

గ్రీష్మకాలములో స్త్రీపురుషగజములు జలాశయముఁజూచి సంతసించి వెడలిన విధమున నగరములో నివసించియుండిన స్త్రీపురుషులు శ్రీరామసందర్శనార్థము వెడలిరి శ్రీసీతారాములనుమనస్సులో ధ్యానించి, భరతశత్రుఘ్నులు పాదచారులై ప్రయాణమును సాగించిరి. వారిరువురకు రామునియందుఁగల యనురాగమును భాతృవాత్సల్యమును జనులు వేనోళ్ల గొనియాడి, యేనుఁగులు, గుఱ్ఱములు, రథములు, పల్లకీలు మొదలగువాహనములను విడిచిపెట్టి పాదచారులై నడచిరి; ఈచిత్రము జూచి శ్రీరామునితల్లి కౌసల్యవిచారించి, తనపల్లకిని భరతునిసమీపమునకుఁ దీసికొనివెళ్లుమని వాహకుల కాజ్ఞాపించెను; ఆమె భరతునివద్దకువెళ్లి, యతనితో నిట్లుచెప్పెను. "ఓతండ్రీ! నీకు నేను బలిహారము సుమీ! నీవు రథముపైఁగూర్చుండుము. నీవు పాదచారివై వెళ్లుచుండుటవలన నీప్రియపరివారకులందఱు పాదచారులై నడచుచుండిరి; అందుచేత వారికి శ్రమకలుగుచున్నది నీవు రథముపైఁగూర్చుండినయెడల వారివారివాహనములపై వారుకూర్చుండి, సుఖముగఁ బ్రయాణమును సాగింపఁగలరు; వారుకూడ శ్రీరామునివియోగమువలన దుఃఖించుచుండిరి.

వారు వాహనములనువిడిచి, పాదములతో నడచివెళ్లుటకు యోగ్యులుకారు." భరతశత్రుఘ్నులిరువురు తల్లిచరణములకు నమస్కరించి ఆమెయాజ్ఞను శిరసావహించి రథముపైఁ గూర్చుండిరి. ప్రథమ

దినమున వారు తమసానదీతీరమునను, రెండవరోజున గోమతీతీరమునను విడిదిఁజేసిరి. ('తమసా'నది 'ఘోఘ్రా'నదియొక్క యుపనది; 'గోమతీ' నది 'గంగా'నది యుపనది.)

దోహా 197

చీఁకటిపడినతరువాత వారు ఫలహారముఁజేసికాని, లేక పాలు ద్రాగికాని, ప్రాణములను నిలువఁబెట్టుకొనిరి. సకలభూషణములను భోగములను విడిచిపెట్టి, వారు నియమములను వ్రతములఁజేయుచు రామునిఁజూచుటకు వెడలిరి.

చౌపాయ్

ఆరాత్రి వారు 'సయీా' నదీతీరమున విశ్రమించి ప్రాతఃకాలమున లేచి, ప్రయాణమును సాగించి, శృంగిబేరపురమువద్దకు వచ్చిరి. భరతునియాగమనమును నిషాదపతి విని, విషాదముఁబొంది, తనమనస్సులో నిట్లు వితర్కించెను. "ఈభరతుఁడు వనమునకుఁబోవుటకుఁ గారణమేమి? నిశ్చయించిచూడ నతనిమనస్సు కపటమని బోధపడుచున్నది. అతనిస్వభావము కుటిలముకానియెడల నతఁడు తనవెంట చతురంగబలముల నెందులకుఁ దీసికొనివెళ్లును? ఆహా! ఇప్పుడు నాకు బోధపడెను? రామలక్ష్మణుల సంహరించి నిష్కంటకముగ రాజ్యముఁజేయవలెనని యతని యభిప్రాయమని తోఁచుచున్నది. రాజధర్మముల నతఁడు లెస్సగ గ్రహించియుండలేదు; పదునాలుగుసంవత్సరములవఱకు నతఁడు రాజ్యముఁజేయుననియే యతనికిప్పుడు మచ్చవచ్చెను; ఇందులకుఁదోడు, ప్రజానాశనము కల్గును. సురాసురులుకలసి యొక్కుమ్మడిని రామునితోఁ బోరాడుటకువచ్చినను, వారెన్నటికి రామునిమాత్రము జయింపలేరు. ఇట్లు భరతుఁడు ప్రవర్తించుటలో నాశ్చర్యమేమికలదు? చెట్టు విషమయినపుడు, దానిఫలము తియ్యగనుండునా?"

దోహా 198

ఈప్రకారము గుహుఁడు చింతించి, తనజాతివారినిబిలిచివారితో నిట్లుచెప్పెను. "ఓయీా! మీారు సావధానముగ నామాటను వినుఁడు; పడవలను నీటిలోముంచి, పడవమార్గమును గట్టివేయుఁడు; విలంబముఁ జేయక లేలెండు.

చౌపాయి

"ఓయీ! సావధానముగ వినుఁడు; రేవులను కట్టివేయుఁడు. చావునకుఁ దెగించి, యుద్ధముఁ జేయుఁడు. ఆయుధములను ధరించి భరతునితోఁ బోరాడుఁడు. వారినిమాత్రము గంగానదిని దాఁటనియ్యవలదు. ఈశరీరము క్షణభంగురము; నశ్వరము; ఏదోయొకరోజున నది గాలిపోవును. నిశ్చయము. గంగానదితీరమునఁ జనిపోవుట శ్రేష్ఠము; ఆమరణము యుద్ధములోనయినయెడల శ్రేష్ఠతరము; ఆయుద్ధము రామకార్యార్థము కనుక, శ్రేష్ఠతమము; శ్రీరామునితమ్ముఁడు భరతునితో యుద్ధముఁజేయుట సంభవించెను; అభరతుఁడు రాజు; గొప్పరాజు; నేనొక నీచుఁడను. ఇంతకంటె నాకు భాగ్యమేమికలదు? స్వామికార్యార్థమై గొప్పసంగ్రామముఁ జేయుదు. ఏడేడుపదునాలుగులోకములలో నాకు గొప్పకీర్తివచ్చును. శ్రీరామునిమిత్తము నాప్రాణములను విడిచి పెట్టెదను. ఏవిధమునఁ జూచినను, నారెండుహస్తము లామోదమోదకములతో నిండును. జీవించియుండినయెడల, రామునికటాక్షము వచ్చును; కీర్తివచ్చును. చనిపోయినయెడలఁ బరమపదము లభించును. ఎవఁడు సాధుసమాజములో లెక్కపడఁడో, ఎవడు రామభక్తులలో లెక్కపడఁడో వానిజన్మము వ్యర్థము; వాఁడు జీవన్మృతుఁడు. వాఁడు భూమికి భారము. వృక్షమును పడఁద్రోయుటకు గొడ్డలివలె, వాఁడు తల్లియౌవనమును చెఱుపఁబుట్టెను."

దోహా 199

ఆనిషాదపతి విషాదమునువిడిచి, ధైర్యము నవలంబించి, తనజాతివారికి యుత్సాహముఁ బుట్టించెను. అతఁడు శ్రీరాముని ధ్యానించి, ధనుర్బాణములను గవచమును దీసికొనిరండని యాజ్ఞాపించెను.

చౌపాయి

"ఓ ప్రియసోదరులారా! మీరు శీఘ్రము యుద్ధమునకు సిద్ధపడుఁడు. నాయాజ్ఞను వినినతోడనే, మీరు వెనుకకుఁదీయక, యుద్ధమునకు రండు." "మహారాజ్, మీచిత్తము" అని వారుచెప్పి, సంతోషించి, యొకరినొక రుత్సహించిరి. వారునిషాదపతికిజోహారువని.నిష్క్రమించిరి; ఆశూరులందఱు యుద్ధముఁజేయుట కభిరుచిగలిగియుండిరి. వారుశ్రీరామునిచరణారవిందముల పాదుకలను స్మరించి, తూణీరములఁ గట్టుకొని

ధనుర్బాణములను ధరించిరి. వారు కవచములఁ దొడగి, శిరస్త్రాణములను ధరించిరి. ఈఁటెలను, బల్లెములను, పరశువులను, వారు సానఁబెట్టిరి; ఒకఁడు డాలుకత్తులఁబట్టుకొని, కుప్పించి యెగసినపుడు, భూమిని విడిచి పెట్టెనేమో యనితోఁచెను. ఆయాయోధులు వారివారిసమాజమును వెంటఁదీసికొనివచ్చి, నిషాదపతికి జోహారువనుచు నిలువఁబడిరి. ఆయో ధుల నతఁడుచూచి సంతోషించి, పేరుపేరువరుసను వారినిఁబిలిచి, యొక్కొక్కరిని యాదరించి సన్మానించెను.

దోహా 200

"ఓసోదరులారా!-ఈదినమున గొప్పకార్యము వచ్చిపడెను; మీరు నన్ను నమ్మించి, స్వామిద్రోహముఁ జేయకుఁడు," అని యతఁడు పలి కెను. "ఓనాథా! వీరుల కధైర్యము లేశమపి యుండదు" అని రోషావే శముతో వారు చెప్పిరి.

చౌపాయ్

ఆయోధులు నిషాదపతితో నిట్లు చెప్ప నారంభించిరి; "ఓనాథా! శ్రీరాముని ప్రతాపమువలనను, మీబలమువలనను మేము భరతుని సైన్యమును రథములతోను గుఱ్ఱములతోను సైనికులతోను ధ్వంసముఁ జేయఁగలము. ఈమాశరీరములలో మాప్రాణములుండినంతవఱకు వెనుకకుమాత్రము మేము పాదమునువేయము; భూమియంతయు శిర స్సులులేనిమొండెములతో నిండును" తనజాతివారు చెప్పినమాటలను నిషాదపతి విని హర్షించి, రణభేరిని మ్రోగింపుమని యాజ్ఞాపించెను. ఇట్లు సంభాషించుచుండ, నతనియెడమవైపున నొకరుతుమ్మిరి; అప్పు డతఁడు శకునముఁ జెప్పువారినిఁ బిలిపించి యడిగెను; తుమ్ము శుభమ నియు, జయప్రదమనియు వారు చెప్పిరి. ఒకవయోవృద్ధుఁడువచ్చి, శకు నము జెప్పెను. "ఓనాథా! నీవు భరతునితోఁ గలిసికొనుట జరగును? కాని, యతనితో యద్ధముఁజేయుట జరగదు. శ్రీరాముని సత్కరించు టకు భరతుఁడు వెళ్లుచుండెను కాని, యుద్ధమునకుఁ గాదు. ఈశకునఫల మిదియని నాకుఁ దెలియుచున్నది." ఆవృద్ధునివాక్యములను నిషాదపతి విని, "వృద్ధుఁడు చెప్పినమాటలు సత్యము; ముందు వెనుకల నాలో చింపక, పనిఁజేసి మూర్ఖులు తుదను విచారించెదరు; కనుక, మనము పూర్వోత్తరముల నాలోచించి, పనిఁజేయుట యుత్తమము. భరతుని

స్వభావమును శీలమును బరీక్షింపక, యుద్ధమునకు దిగుటవలన,లాభము కలుగదు." అని చింతించెను.

దోహా 201

"ఓ వీరులారా! మీరందఱు సమావేశమై నదీతీరమున రేవుస్థలములలో గుమిగూడియుండుఁడు. నేను ముందు భరతునివద్దకువెళ్లి అతఁడు మిత్రుఁడో, శత్రువో, మధ్యముఁడో కనుఁగొనివచ్చినతరువాత జేయఁదగినపనినిఁ జేయవచ్చును.

చౌపాయ్

"ప్రప్రథమమున స్వభావమువలన నతనిస్నేహము విదితమగును; వైరమును స్నేహమును దాచియుంచినను దాఁగఁబడవు" అని నిషాదపతిచెప్పి, రాజునుదర్శించుటకు వెళ్లునపుడు తీసుకొనివెళ్లఁదగిన పదార్థములను, గందమూలఫలములను, ఖగమృగములను దెప్పించెను. మత్స్యములను, పీనములగు ప్రాచీనపాఠీనములను గంపలనిండఁబెట్టుకొని, మాలవాండ్రు తీసికొనివచ్చిరి. (మిత్రశత్రుమధ్యములఁ దెలిసికొనుటకుఁ దగినపదార్థముల నతఁడు సమకూర్చెను. (1) కందమూలఫలములు సత్త్వగుణము; వానివలన మిత్రుఁడని తెలియును. (2) ఖగమృగములు రజోగుణము; వానివలన మధ్యముఁడని తెలియును. (3) మీనములువలన శత్రువని తెలియును; అవి తమోగుణము.) నిషాదపతి యీసామగ్రులను వెంటఁదీసికొని భరతునిఁజూచుటకు వెడలెను; అప్పుడు మంచిశకునమయ్యెను. దూరమునుండి యతఁడు వసిష్ఠుంజూచి తనపేరుఁ జెప్పుకొని, గురువునకు దండప్రణామముఁజేసెను. అతఁడు శ్రీరాముని సఖుఁడని గురువు గ్రహించి యతనిని దీవించి, "ఓభరతుఁడా! ఇతఁడు శ్రీరామునిసఖుఁడుసుమీ!" అని చెప్పెను. ఆమాటను వినినవెంటనే భరతుఁడు రథముడిగ్గి పాదచారియై గుహునివద్దకువచ్చి యతనినాదరించి సత్కరించెను. ఆనిషాదపతి, తనకులగోత్రములను గ్రామమును జెప్పుకొని, భరతునకు సాష్టాంగనమస్కారముఁజేసి, జోహారువనుచు నిలువఁబడెను.

దోహా 202

ఆప్రకారము సాష్టాంగనమస్కారముఁజేసి నిలువఁబడినగుహుని భరతుఁడు కౌఁగిలించుకొని, తమ్ముఁడగులక్ష్మణునితోఁ గలసినట్లు పరమా

నందభరితుఁడయ్యెను; అప్పు డతనిసంతోషము మనస్సులో నుప్పొంగు చుండెను.

చౌపాయ్

ప్రేమాతిశయము లుప్పతిల్ల భరతుఁడు గుహునితోఁ గలిసి కొనెను; వారివారియనురాగమును, భరతుని కలుపుఁగోలుఁదనమును లోకులుచూచి హర్షించి వారిని కొనియాడిరి. 'ధన్యులు, ధన్యులు' అని యంతరిక్షమునుండి దేవతలుఃలికి పుష్పములను వర్షించిరి. అప్పుడు దేవ తలు వారిలోవా రిట్లు ప్రసంగించిరి; "ఈనిషాదపతి లోకాచారముప్ర కారము నీచుఁడు; వేదబాహ్యుఁడు. వానినీడసోఁకినయెడల, స్నానముఁ జేసినగాని శుద్ధిలేదు. అట్టివానిని రామునితమ్ముఁడు గాఢాలింగనముఁ జేసికొనెను. అప్పు డతని (భరతుని) శరీరము పులకరించెను. ఆపులించిన పుడైనను 'రామ,రామ' యని పలికినయెడల, లేశమైనను పాపములు వానిని ముట్టవు. ఈనిషాదపతిని శ్రీభరతుఁడు స్వయము కౌఁగిలించుకొ నెను; అందుచేత వానిని వానివంశమును పవిత్రముఁజేసెను; కర్మనాశ మను నదీజలములువచ్చి గంగానదిలోఁ గలియునపుడు వానిని నెవఁడు శిరముపై ధరింపఁడు? రామనామమును వ్యత్యస్తముగ జపించి వాల్మీకి మహాముని సిద్ధిఁబొందెనని లోకప్రసిద్ధము.

దోహా 203

"శ్వపచులును సవరులును జడులగుయవనులును, పామరులగు కోలుకిరాతులును ఈమొదలగువారు రామనామమును జపించి పరమ పావనులై పదునాలుగులోకములలో ఖ్యాతిఁదెచ్చుకొనిరి.

చౌపాయ్

"ఇందులో నాశ్చర్యమేమియు లేదు ఈప్రకారము ప్రతియుగ ములో జరగుచుండును. శ్రీరాముఁడు తనభక్తులకుఁ గీర్తిప్రతిష్ఠల నిచ్చును." ఈప్రకారము దేవతలు శ్రీరామనామమహిమను వర్ణించి చెప్పుకొనుచుండినమాటల నయోధ్యాపురనివాసులు విని పరమానంద భరితులయిరి. భరతుఁడు గుహునితోఁగలసి, యతనియోగక్షేమములఁ గనుఁగొనెను. భరతునిసుశీలమును కలుపుఁగోలుదనము నతఁడు చూచి, సంతోషించి పరవశుఁడయ్యెను. నిషాదపతి ప్రథమమునఁ జేయఁదలఁచి

నపనికి దనలోఁదాను సిగ్గుపడి ప్రస్తుతము తనకుఁ జూపఁబడినయాదరణ కబ్బురపడి, నిశ్చేష్టుఁడై భరతునిజూచుచుండెను. అతఁడు ధైర్యముఁదెచ్చుకొని భరతునిచరణములకు నమస్కరించి యిట్లు విన్నవించెను. "ఓనాథా! మీపాదపంకజములను దర్శించినందున, నాకు మూఁడుకాలములలో క్షేమముండునని తలంచెదను. మీపరమానుగ్రహమువలన గోటితరములవఱకు మాకు మంగళములు కలుగుచుండును.

దోహా 204

"నావంశమును, నాపూర్వజన్మకర్మలను దెలిసికొని ప్రభువుల మహిమను స్మరించి లోకములో నెవఁడైన శ్రీరాములచరణములను సేవింపనియెడల వాఁడు లోకవంచకుఁడని నాయభిప్రాయము.

చౌపాయీ

"నేను కపటిని; కుమతిని; పిఱికిపందను; తక్కువజాతివాఁడను. లోకాచారము ప్రకారమేమి, వేదముచెప్పినప్రకారమేమి నేను బాహ్యుఁడను. శ్రీవారు నన్ను తమవానిగ గ్రహించినదిమొదలు లోకములో నాకుఁ గీర్తివచ్చెను. నేను లోకభూషణుఁడనయితిని" అతని యనురాగమునుజూచి వినయవిధేయతలతోఁ గూడిన నతని ప్రియవచనములను భరతుఁడు విని సంతోషించి యాదరించెను. తదుపరి, యతఁడు తనపేరుఁజెప్పుకొని మహారాణులకు నమస్కరించి, జోహారువనెను. అతఁడు లక్ష్మణునివంటివాఁడని భావించి వారతనిని దీవించి "ఓగుహా! నూఱులక్షలసంవత్సరములవఱకు సుఖముగ జీవింపుము" అని వారు దీవించిరి. అయోధ్యానగర స్త్రీపురుషు లతనినిజూచి, లక్ష్మణునిజూచినట్లు సంతోషించిరి. "ఆహా! ఇతఁడు జీవించి యుండినందులకు కృతార్థుఁడయ్యెను. ఏమి యతనిభాగ్యము; శ్రీరామునితమ్ముఁ డతనిని చేతులతోఁ గౌఁగిలించుకొనెను "అని వారిలో వారు చెప్పుకొనిరి. తన భాగ్యమును వారు కొనియాడుట నిషాదపతి విని, సంతోషించి, తన నగరమునకు వారికి మార్గము జూపించెను.

దోహా 205

ఆనిషాదపతి తనసేవకులకు సంజ్ఞ జేసెను. వారతనిమనోభిప్రాయమును గ్రహించి నదీతీరమునను చెట్లక్రిందను, తోటలలోను సరోవరములవద్దను, బటకుటీరములను నిర్మించిరి.

చౌపాయ్

భరతుఁడు శృంగిబేరపురమును జూచినంతలో నతనిశరీరము శిథిలమయ్యెను; నిషాదపతి మోఁదమీఁద నతఁడు చెయివేసి నడచెను వినయమును అనురాగమును మూర్తీభవించివచ్చెనేమో యనునట్లు. వారిరువురు కనఁబడిరి. ఈప్రకారము భరతుఁడు పరివారముతోను సైనికులతోఁగూడి వెళ్లివెళ్లి, జగత్పావనియగు గంగానదినిఁజూచెను. అతఁడు 'రామఘాటునకు' నమస్కరించెను. ఆఘాటు నతఁడుచూచి, రామునిఁ జూచినట్లుసంతోషించెను అయోధ్యానగరస్త్రీపురుషులుగంగకునమస్కరించుచుండిరి; వారు దేవనదినిదర్శించిపరమోత్సాహభరితులయిరి. వారు దానిలో స్నానముఁజేసి, చేతులను జోడించుకొని, "హే త్రిలోకపావనీ! శ్రీరామునిచరణకమలములయందు మాకు నిరంతరము భక్తియుండు నట్లు ప్రసాదింపుము." అని ప్రార్థించిరి. "ఓగంగాదేవీ! నీరేణువులు సకల జనులకు సుఖము నిచ్చును. కామధేనువువలె, సేవకులకోరికల నీడేర్చు చుందువు. చేతులను జోడించి, నేనొకవరమును బ్రార్థించెద. నాకు శ్రీసీతారాములచరణములయందు స్వాభావికస్నేహ ముండుఁగాక."

దోహా 206

ఈప్రకారము గంగాదేవిని నతఁడు ప్రార్థించి, స్నానముఁజేసి' గుర్వాజ్ఞనుగైకొని, తల్లులచేత స్నానముఁజేయించి, వారిని బసలోనికిఁ దీసికొనివెళ్లెను.

చౌపాయ్

అచ్చటచ్చట నిర్మింపఁబడిన పటకుటీరముల నతఁడుచూచి, సంతసించి, వానిని జాగ్రత్తగఁ జూడుమని యాజ్ఞాపించెను. కొంతవడకుభరతశత్రుఘ్నులు గురువునిసేవించి, యతనియాజ్ఞఁ గైకొని, రామునితల్లి వద్దకు వచ్చిరి. వారామెచరణములనొత్తి. కొంతవడకు మృదుమధురముగ సంతోషించి, యామెను గారవించిరి. తల్లికి సేవఁజేయుటకు శత్రుఘ్నుని నియోగించి, యతఁడు నిషాదపతినిఁ బిలిపించెను.అతఁడు గుహుని జేతులఁబట్టుకొని నడచెను; అతనిస్నేహ మతిశయించెను; అందుచేత, నతనిశరీరము శిథిలమయ్యెను. "ఓసఖుఁడా! ఏస్థానమునైన జూపింపుము; ఒకవేళ దానింజూచినయెడల, నాహృనోతాపము శాంతించునేమో! ఆ రాత్రి శ్రీసీతారామలక్ష్మణు లెచ్చట శయనించిరో చూపుము!" అని

భరతుఁడు పలికి, కన్నీరుగార్చెను. అతనిమాటలవలన,నిషాదపతికి విషాదముకలిగెను. ఆతక్షణ మతఁడు భరతునిఁ దీసికొనివెళ్లి,

దోహా 207

శింశుపావృక్షమును జూపించెను; దానిక్రింద శ్రీసీతారాములు విశ్రమించిరి. ఆస్థలమున కత్యంతానురాగముతో నతఁడు దండప్రణామముఁ జేసెను.

చౌపాయ్

ఆచెట్టుక్రిందనుండిన కుశాజినమును భరతుఁడుచూచి, దానికిఁ బ్రదక్షిణనమస్కారములఁ జేసెను; అచ్చట పడియుండిన శ్రీపాదరేణువుల నతఁడు తీసి, కన్నులకద్దుకొనెను. జానకి పయ్యెదకొంగునుండి జారి పడిన జల్తారుముక్కల నతఁడుచూచి, వానిని జానకితో సమానమని భావించి, వానిని శిరస్సున ధరించెను; అతనినేత్రములనుండి నీరు వరదవలె కారుచుండెను. దుఃఖముచే నతనిమనస్సు పరితపించుకొనిపోవుచుండెను. మృదుమధురముగ నతఁడు గుహునితో నిట్లు ప్రసంగించెను. "ఓసఖుఁడా! శ్రీరాముని వియోగదుఃఖముచే నయోధ్యానగరస్త్రీపురుషులు వాడియుండినట్లు,జానకిని నెడఁబాసి యీజల్తారుముక్కలు కళాహీనమై యుండెను. జనకచక్రవర్తికి యోగభోగములు రెండును గరతలామలకములుకదా! అతని నెవరితో సరిపోల్చవచ్చును? సూర్యవంశమునందుఁ బుట్టిన దశరథమహారాజు మామగారు. ఆమహారాజును దేవేంద్రుఁడుసహితము గౌరవించెను. ఆమె ప్రాణనాథుఁడు మహారాజు శ్రీరామచంద్రమూర్తి; వారే ఈశ్వరులు; వారిప్రభావమువలననే, పరులకు గొప్పఁదనమువచ్చును.

దోహా 208

"ఆజానకి పతివ్రతాశిరోమణి; ఆమె కుశాజినముపైఁ బవ్వళించెనని తెలిసికొనియు, నాహృదయము బ్రద్దలుకాలేదు. వజ్రముకంటె నాహృదయ మతికఠినము.

చౌపాయ్

"నాతమ్ముఁడు లక్ష్మణుఁడు లాలింపఁదగినవాఁడు; చిన్నవాఁడు; అన్నివిధములఁ నతఁడు సుఖముల ననుభవింపఁదగినవాఁడు; నాతమ్మునివంటివాఁ డిదివఱలోఁ బుట్టియుండలేదు;ఇప్పుడు పుట్టినవారిలో మఱియొకఁ

డు లేఁడు; ముందు కట్టివాఁడు పుట్టఁడు. అతఁడు పురజనులకుఁ బ్రియుఁడు;తల్లిదండ్రుల గారాపుబిడ్డఁడు. శ్రీసీతారాములతనిని దమప్రాణములవలెఁ జూచుకొనుచుందురు అతనిశరీర మతికోమలము; అతఁడు సుకుమారి. వేఁడివాయువుల నతనిశరీరము సహింపదు. ఈవనవాసకష్టముల నతఁడెట్లు సహింపఁగల్గును? ఈనాహృదయము కోటివజ్రములసహితము తిరస్కరించుచున్నది. ఆశ్రీరాముఁడు వయోరూపశీలలావణ్యములకు నిధి; సకలగుణసంపన్నుఁడు; అతనిజననమువలన, లోకములకు వెల్తురు వచ్చెను; పురజనులకును, బంధువులకును, గురువులకును, జననీజనకులకు నతఁడు సుఖమునిచ్చును. అతనిశత్రువులుసహిత మతనిని కొనియాడుచుందురు అతనివాక్కులును వినయమును విధేయతయుఁ బరుల మనస్సుల నపహరించును. కోటిశారదలును నూరుకోట్లశేషువులుసహితము ప్రభువుగుణగణములను లెక్కపెట్టి వ్రాయలేరు.

దోహా 209

"ఆసుఖస్వరూపుఁడు, ఆసకలసుంగళదాయకుఁడు, ఆచిదానందమూర్తి, ఆశ్రీరామమూర్తి కటికనేలఁ బవ్వళించెనుకదా! అహో! బ్రహ్మవ్రాసినవ్రాత యెంతబలవంతము.

చౌపాయ్

"అహో! శ్రీరాముఁడు దుఃఖమనుమాట చెవులార వినియైనయుండలేదు తనపాలింటి జీవనవృక్షమువలె నతనిని రాజు కాపాడుచుండెను. కంటిపాపను తెప్పలువలె, మణిని సర్పమువలె నతనిని రాజు రక్షించుచుండెను. ఈప్రకారము దివారాత్రములు మహారాణులు మొదలగువా రతనిని బోషించుచుండిరి. ఆహా! అట్టి శ్రీరాముఁడు నేఁడు కందమూలఫలములను భుజించి,పాదచారియై వనములలో సంచరించుచుండెనుగదా! అమంగళములకు మూలము కైకేయికదా! ఆమె బ్రతుకొందులకువచ్చినబ్రతుకు? ఛీ! ఆమెబ్రతుకు కాల్చనా? ప్రాణములవంటి శ్రీరామునియెడల, నామె ప్రతికూలముగఁ బ్రవర్తించెనే! నావంటిపాపస్వరూపుని, నావంటినిర్భాగ్యుని బ్రతుకు కాల్చనా? నానిమిత్తముకదా, యీయుత్పాతములు పుట్టెను. మావంశమునకు మచ్చఁదీసికొనువచ్చుటకు కాఁబోలు, బ్రహ్మ నన్ను పుట్టించెను;నాతల్లి మూలమునఁ

గదా, నేను స్వామికి ద్రోహినయితిని" ఈప్రకారము విలపించుచుండిన భరతునిఁజూచి, నిషాదపతి మృదుమధురముగ నిట్లు బోధించెను; "ఓనాథా! వ్యర్థముగ మీరేల విచారించెదరు? శ్రీరాములు మీకును మీరు వారికిని ప్రియులు. మీతల్లి కూడ నిర్దోషురాలు; విధాత మనకుఁ బ్రతికూలముగ నుండెను. మనమేమి చేయఁగలము?

ఛాంద్ 8

"ఆబ్రహ్మ వ్రాసినవ్రాత కఠినమయ్యెను. ఆవ్రాతమూలమున, మీతల్లిబుద్ధి చలించెను;ఆరాత్రి మిమ్ములను శ్రీరాములు మాటిమాటికిఁ గొనియాడుచుండెను." 'ఓనాథా! మీతో సమానమగుప్రియులుశ్రీరాములకు మఱియొకరు లేరు. నేను ప్రమాణముఁజేసి చెప్పుచున్నాను. తుదకు సర్వము మంగళప్రదమగునని విశ్వసింపుఁడు. ఈమాటనునమ్మి, ధైర్యముగనుండుఁడు' అని తులసిదాసుగారు చెప్పుచున్నారు.

సోరఠా 8

"శ్రీరామచంద్రుఁడు సర్వాంతర్యామి; కృపాసాగరుఁడు; పరమదయాళువు; సుశీలుఁడు; ఈసంగతి మీరు నిశ్చయముగ నమ్ముఁడు; దయచేసి విశ్రమింపుఁడు." అని గుహుఁడు చెప్పెను.

చౌపాయ్

సఖుఁడు చెప్పినమాటలను భరతుఁడువిని,ధైర్యముఁదెచ్చుకొని, శ్రీరామమూర్తిని స్మరించి,పటకుటీరములోఁ బ్రవేశించెను.ఆనగరములో నివసించుస్త్రీపురుషులు భరతునియాగమనమునువిని, యాతురతతో వెడలి, చూచుటకు వచ్చిరి. స్త్రీలు ప్రదక్షిణనమస్కారములఁజేసి, కైకేయిని వ్యర్థముగ దూషించిరి; వారు కన్నీరుఁగార్చి, విధికృతమునకు బ్రహ్మను దూషించిరి. ఆస్త్రీపురుషులలోఁ గొందఱు భరతునిఁ గొనియాడిరి; మఱికొందఱు రాజునకుఁ గలప్రేమనుగుఱించి ముచ్చటించిరి;వారిని వారు నిందించుకొని, నిషాదపతిని స్తోత్రముఁజేసిరి. వారివిమోహమును విషాదము నెవరు వర్ణించి చెప్పఁగలరు? ఈప్రకారము వారు రాత్రియంతయుఁ గడపిరి; అంత ప్రాతఃకాలమయ్యెను; వారు నదిని దాఁటుట కారంభించిరి.గురువు మంచినావలోఁ గూర్చుండి వెడలిరి; క్రొత్త పడవలలోఁ గూర్చుండి, ముప్వురుతల్లులు బయలుదేరిరి. నాలుగుగడియ

లలో వారందఱు నదిని దాఁటిరి. ఇట్లునదినిదాఁటి వచ్చినవారిని భరతుఁడు చూచి, యెవరును వెనుకఁబడియుండలేదని తెలిసికొని సంతోషించెను.

దోహా 210

తదుపరి, భరతుఁడు ప్రాతఃకాలస్నానసంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించి, తల్లులకును గురువునకును నమస్కరించెను; నిషాదులు ముందునడచి, మార్గముఁ జూపించుచుండ, నతఁడు పరివారముతోఁ గూడి, ప్రయాణమును సాగించెను.

# త్రయోదశవిశ్రామము.

చౌపాయ్

నిషాదపతి ముందునడచెను; తరువాత, ముువ్వురుతల్లులపల్లకీలు వెళ్లెను. వారివెంట శత్రుఘ్నుఁడు వెళ్లెను; బ్రాహ్మణులతోఁగూడి గురువు వసిష్ఠులు ప్రయాణమును సాగించెను. భరతుఁడు గంగాదేవికి నమస్కరించి, రామలక్ష్మణులను ధ్యానించి, పాదచారియై, ప్రయాణమును సాగించెను. అతనివెనుక, గుఱ్ఱము కళ్లెముఁబట్టుకొని, దానిని నడిపించుకొని, సేవకుఁడు నడిచెను. "మహారాజా! గుఱ్ఱముపై స్వారీచేయుఁడు" అని రాజసన్మానియగు సేవకుఁడు విన్నవించెను. "ఓయీ! రఘురాములు పాదచారియై నడచి వెళ్లిరి. ఏనుఁగులును గుఱ్ఱములును వాహనములును నాకేల? క్రిందికి బుఱ్ఱ, మీఁదికి కాళ్లు పెట్టుకొని వెళ్లిన బాగుగనుండును. అన్నివిధముల సేవకవృత్తి కఠినమయినది." అని భరతుఁడు చెప్పిన మృదుమధురవాక్యములనువిని, యతనిప్రవృత్తిఁజూచి సేవకులు ఖిన్నులై విచారించిరి.

దోహా 211

మూఁడవయామముసకు భరతుఁడు ప్రయాగకువచ్చి చేరెను. అతనియనురాగ ముప్పొంగి వచ్చుచుండెను. "సీతారామ్, సీతారామ్" అని యతఁడు పలుమారు లుచ్చరించెను.

చౌపాయ్

భరతుఁడు పాదచారియై వచ్చినందున, నతనిపాదములపై

పొక్కులుపొక్కెను. పద్మముమొగ్గపైఁబడిన మంచుబిందువులువలె నాపొక్కులు ప్రకాశించెను. అతఁడు పాదచారియైవచ్చిన సంగతిని విని, సమాజమువారందఱు విచారించిరి. అతఁడు వచ్చిన సమాజమువారిని పరిశోధించి, త్రివేణివద్దకువచ్చి విధిప్రకారము గంగాయమునానదీజలములలో స్నానముఁజేసి, బ్రాహ్మణులకు దానముల నిచ్చెను. శ్యామ—ధవళజలముల నతఁడు చూచి, చేతులను జోడించుకొని యిట్లు ప్రార్థించెను: "ఓతీర్థరాజమా! సకలకోరికల నీడేర్చెదవు. నీప్రభావ మిట్టిది యని వేదములు చెప్పుచున్నవి; లోకప్రసిద్ధము. క్షత్రియులు యాచించుట యుచితము కాదు; అయినను, నాధర్మమును విడిచి నిన్ను యాచించెద దుఃఖములోనుండినవాఁడు ఏ అనుచితమగు పనినిచేయఁడు? ఓతీర్థరాజమా! నీవు చతురితవు; కోరినకోరికల నియ్యఁగలవు. యాచకుని ప్రార్థనను సఫలముఁజేయుము.

దోహా 212

"చతుర్విధపురుషార్థములను నేను యాచింపను. నేను ముక్తినిఁ గోరను. జన్మజన్మాంతరములను నాకు సీతారాములచరణారవిందముల యందు భక్తియుండునట్లు ప్రసాదింపుము.

చౌపాయ్

"నేను కుటిలుఁడనని శ్రీరామునకుఁ దెలియును. నేను గురుద్రోహిననియు, స్వామికి ద్రోహిననియు లోకులు తెలిసికొనిరి; అయినను, నీయనుగ్రహమువలన, నాకు సీతారాములచరణకమలములయందనురాగము దినదినము వృద్ధియగుగాక. చాతక మెంతప్రార్థించినను, మేఘుఁడు దానిప్రార్థనను నిర్లక్ష్యముఁజేసి, దానికి జీవనమునిచ్చుటకు బదులు రాళ్లనువర్షించి, పిడుగులను ఋువ్వినను, చాతకము మాత్రము మేఘుని ప్రార్థింపక యుండినయెడల,దానినిలోకులు తృణీకరించెదరుకదా! ఆచాతకము సదా మేఘుని ప్రార్థించి, దానికోరికను నెఱవేర్చుకొనును; దానిపట్టుదలను జూచి, లోకులు దానిని హర్షించెదరు.అటులనే, నిప్పుచే దహింపఁ బడినందున, బంగారమునకు వన్నె వచ్చునుకదా! ఎన్నికష్టములు నాకువచ్చినను,శ్రీసీతారాములయందు నాకుఁగల యనురాగమున కంత కంతకు వన్నెవచ్చుఁగాక!" ఇట్లు భరతుఁడు ప్రార్థించెను. అప్పుడు త్రివే

ణిలోనుండి యొక మృదువగుమాట వినఁబడెను. "ఓభరతుఁడా! అన్నివి ధముల నీవు సాధువు. రామునిమీఁద నీకుఁగలప్రేమ అగాధము. వ్యర్థముగ నీవు విచారింపకుము. నీతో సమానుఁడగు ప్రియుఁడు రామునకు మఱియొకఁడు లేఁడు".

దోహా 213

ఇట్లు త్రివేణి చెప్పినమాటల నతఁడు విని సంతోషించెను; అతని శరీరము పులకరించెను. ఆమాటలను దేవతలు విని "ఓభరతుఁడా! నీజన్మము ధన్యము, ధన్యము" అని ఘోషించి పుష్పములను వర్షించిరి.

చౌపాయ్

ప్రయాగనివాసులు, వైఖానసులు, బ్రహ్మచారులు, గృహస్థులు, ఉదాసీనులు మొదలగువారు గుంపులుగుంపులుగవచ్చి, భరతునిజూచి, "ఆహా! ఏమియితనివాత్సల్యము, యనురాగము, ఇతనిఅంతఃకరణనిర్మలము సత్యముగ నితఁడుపవిత్రుఁడు" అనివారిలోవారు చెప్పుకొనిరి. శ్రీరాముని దివ్యమంగళచరిత్రముల నతఁడువిని, సంతోషించి, భరద్వాజునియాశ్రమమునకు వచ్చెను. అతఁడు మునిరాజునకు దండప్రణామముఁజేసెను; తనభాగ్యదేవత మూర్తీభవించి వచ్చెనేమో యని, మునీశ్వరుఁ డతనిఁ జూచి, పరమానందభరితుఁడై పరుగెత్తివచ్చి, యతనిని లేవదీసి కౌఁగిలించుకొని దీవించెను; అతని నాశ్రమములోనికిఁ దీసికొనివెళ్లి కూర్చుండఁబెట్టెను. అతఁడే దానిని గుఱించి యడుగునోయని భరతుఁడు శంకించి భయపడి, సిగ్గుచే శిరస్సు వంచుకొనియుండెను. అతనిసిగ్గును మునిరాజుచూచి యతనితో నిట్లు ప్రసంగించెను. "ఓభరతుఁడా! సర్వము నాకు విశదమయ్యెను. విధికృతములు మనయధీనములుకావు.

దోహా 214

"ఓతండ్రీ! నీతల్లి చేసినపనికి నీవు విచారించి దుఃఖింపకుము. ఇందులో నామెదోషము లేశమైనను లేదు. ఆమెబుద్ధిని సరస్వతివచ్చి కలుషముఁజేసెను.

చౌపాయ్

"నీవు చేసినతప్పును లోకులు క్షమింపరని యొకవేళ నీవు భయపడి శంకించెదవు. లోకాచారమును వేదవాక్యములును పండితసమ్మతమని నేను చెప్పుచున్నాను. లోకవాదుకప్రకారము కైకేయి దోషి; వేదాచా

రము ప్రకారము సరస్వతి దోషి; నీరికు ప్రభువునకు సమ్మతమే; ప్రభు స్వేచ్ఛానుసారము సర్వము జరగెను. కనుక నెవరును దోషులు కారు. ఓశంత్రి! నీనిర్మలగుకీర్తిని గానముచేయుటవలన, లోకులకును వేదములకును గొప్పవచ్చును ఏకుమారునకు తండ్రి రాజ్యమునిచ్చిన యెడల, వాడే రాజ్యముఁ జేయుట కర్హుఁడని లోకసిద్ధాంతము; అదియే వేదవాక్యము. ఆసత్యసంధుఁడు, మహాత్ముఁడు, దశరథమహారాజు నిన్నుఁబిలిచి, నీకు రాజ్యమిచ్చి రాజధర్మముల ననుసరించి ప్రవర్తించు మని చెప్పెను. శ్రీరాముని వనగమనము సకలఅనర్థములకు మూలము య్యెను అందులకు లోకమంతయు విచారించెను. ఆసమయమునకు సీత ల్లిబుద్ధి విధికృతమువలన చెడిపోయెను; ఇప్పుడు సీతల్లి పూర్వము తాను చేసినపనికి విచారించుచును. ఈవిషయములో నీవు యేమాత్రము అపరా ధివి అని చెప్పినవాఁడు నీచుఁడు, మూర్ఖుఁడు. అసాధువని నాయభిప్రా యము. నీవు రాజ్యముజేసినను దోషములేదు; నీవు రాజ్యముఁ జేయు చుండుటవిని శ్రీరాముఁడు సంతసించును.

దోహా 215

"ఓభరతుఁడా! ఇప్పుడు నీవుచేసినపనిమాత్ర శ్లాఘనీయము; నీయుద్యమము సర్వోత్కృష్టము. శ్రీరామునిచరణములయం దను రాగము కలిగియుండుటయే సకలసన్మంగళములకు మూలము.

చౌపాయీ

"ఈయనురాగమే నీధనము; నీజీవనము; నీప్రాణము. నీవంటియ దృష్టవంతుఁడు మఱియొకఁడేఁడీ? ఈయనురాగమును నీవు కలిగియుం డుటలో నాశ్చర్యమేమియులేదు. నీవు దశరథునికుమారుఁడవుకదా! నీవు శ్రీరాముని ప్రియతమ్ముఁడవుకదా! నీవు మఱియొకవిధమున నుండఁ గలవా? ఓభరతుఁడా! నామాటను వినుము. నీవంటిప్రేమపాత్రుఁడు మఱి యొకఁడు శ్రీరామునిమనస్సులో లేఁడు. ఆనాఁడుసగముదారిలో త్రివేణికనుశ్రీ సీతారామలక్ష్మణులు నిన్ను గుఱించి చెప్పుకొనుచు నీగుణములను కొని యాడుచుండిరి. వారు ప్రయాగకు స్నానముఁజేయుటకు వచ్చినపుడు, వారికి నీమీఁదఁ గలప్రేమ నాకు బోధపడెను. వారు నిన్ను తలంచి, నీ మీఁదఁగల మోహముచేఁ బరవశులయిరి. మూర్ఛనను సుఖజీవనము

మీఁదవలె, శ్రీరాముకు నీమీఁద దయకలదు శ్రీరామునకు నీమీఁద దయయుండుట గొప్పకాదు. అతఁడు ప్రణతార్తిహరుఁడు; అతనికి లోకమే కుటుంబము. మూర్తీభవించిన శ్రీరాముని వాత్సల్యమే నీవని నాయభిప్రాయము.

దోహా 216

"ఓభరతుఁడా! ఏవిషయమును నీవు కళంకమని తలంచుచుంటివో, ఆవిషయము నావంటివారికి యుపదేశమని నాయభిప్రాయము. ఈసమయమున నీవు గణేశునివలె రామభక్తిరసమును సిద్ధిఁబొందించితివి.

చౌపాయ్

భ"ఓరతుఁడా! నూతనముగఁబుట్టి, నిర్మలముగనుండిన నీకీర్తి యొకచంద్రుఁడు; శ్రీరామునిదాసులే, కుముదములు చకోరములు. ఈకీర్తిచంద్రునకు నిత్యోదయము; ఈచంద్రునకు అస్తంగతములేదు; క్షయములేదు. లోకమనునట్టి యంతరిక్షమున, నీకీర్తిచంద్రుఁడు దినదినప్రవర్ధమానుఁడై ప్రకాశించును. లోకములోనుండిన విముక్తులును, ముముక్షువులును, విషయాసక్తులును నీకీర్తిచంద్రునిఁజూచి చకోరములవలె సంతోషించెదరు. శ్రీరాముని ప్రతాపభానుఁడు నీకీర్తిచంద్రునికళలను హరింపఁడు. నీకీర్తిచంద్రుఁడు దివారాత్రములు లోకులను సుఖదాయకుఁడు. కైకేయి దుర్వ్యాపారము, రాహువువలె, నీకీర్తిచంద్రుని కబళింపలేదు. నీకీర్తిచంద్రుఁడు రామభక్తియనునట్టి పీయూషముచే సంపూర్ణముగ నిండియుండెను. నీకీర్తిచంద్రునకు గురువు నవమానించినదోషము లేదు. నీవు రామభక్తుఁడవు; రామభక్తి యనునట్టి అమృతముతో నీవు పూర్ణించియుంటివి. నీకీర్తిచంద్రుఁడు రామభక్తి అమృతకిరణములను లోకములోఁ బ్రసరింపఁజేయును. భగీరథుఁడు గంగను దీసికొని వచ్చెను; ఆగంగను స్మరించినమాత్రమున, సన్మంగళములు కలుగును. ఇది మీకులాచారమై యున్నది. మీతండ్రి దశరథునిగుణములను వర్ణించుటకు శక్యముకాదు. అధికముఁజెప్పనేల! అతనితో సమానుఁడు లోకములో లేఁడు.

దోహా 217

"ఆమహారాజు వాత్సల్యమునకును, సుశీలమునకును వశ్యుఁడై, శ్రీరాముఁడు ప్రత్యక్షమై, యతనిగర్భవాసమున జన్మించెను. ఆశ్రీరాముని యెంతజూచినను, శివునినేత్రములకుఁ దృప్తియుండదు.

చౌపాయ్

"ఓభరతుఁడా! నిరుపమానమగు నీకీర్తిచంద్రునిలో, శ్రీరామభక్తి మృగమువలె నివసించియుండును. నీవు విచారింపకుము. చింతామణిని స్వీకరించి, దరిద్రమని వెఱచుటయేల? ఓభరతుఁడా! నామాటను వినుము. నే నసత్యముఁజెప్పను. నాకు మిత్రులుగాని శత్రువులుగాని లేరు. నేను తపశ్శాలిని. నేను వనములో నివసించియుందును. నాకొకరి భయము లేదు. శ్రీసీతారామలక్ష్మణులను దర్శించుటయే సకలసాధనములకు ఫలము. ఆఫలము నాకు లభించెను. కన్నులార నిన్నుఁ జూచుటయే వారిదర్శనమునకుఁ దగినఫలము. ఈదినమున ప్రయాగవాసులును నేనును ధన్యులము; మే మదృష్టవంతులము. మాజన్మములు సఫలమయ్యెను. ఓభరతుఁడా! నీవు ధన్యుఁడవు; నీకీర్తి లోకములో వ్యాపించెను". అని మునిరాజుపలికి, ప్రేమాతిశయముచేఁ బరవశుఁడయ్యెను. మునివచనములను సభికులువిని, సంతసించిరి; వారు భరతుని వేనోళ్లఁ గొనియాడిరి; దేవతలు పుష్పములను వర్షించిరి. భూనభోంతరాళములు 'ధన్య' ధన్య' అనుశబ్దములతో నిండెను. ఆశబ్దములను భరతుఁడువిని, సంతుష్టాంతరంగుఁడయ్యెను.

దోహా 218

అతనిశరీరము పులకరించెను; అతనికమలనేత్రములవెంబడి, ఆనందబాష్పములు వఱదలై కారెను. అతఁడు మునిమండలమునకు నమస్కరించి గద్గదస్వరముతో నిట్లు ప్రసంగించెను.

చౌపాయ్

"ఓమునులారా! ఇది మునీశ్వరులసమాజము; ఈస్థలము తీర్థరాజము. ఇచ్చట సత్యమునే చెప్పవలెను; ప్రమాణముఁ జేయుట యనుచితము; వ్యర్థము. ఇచ్చట నేనేమిరైన కల్పించి చెప్పినయెడల, దానితో సమానమగుపాపము మఱియొకటిలేదు. మీరు సర్వజ్ఞులు; నేను సత్యముఁ జెప్పుచున్నాను. జనులమనోభిప్రాయములు శ్రీరామునకుఁ దెలి

యును. మాతల్లి చేసిన దురాచారమునకు నాకు దుఃఖములేదు. లోకులు నన్ను దూషించెదరని నాకు భయములేదు. పరలోకము నాకు దూరమగునని భయములేదు. తండ్రిగారు స్వర్గస్థులయినందుకు నాకు విచారములేదు. మాతండ్రిగారు కీర్తివంతులు; మృతజీవులు; వారికీర్తి లోకమంతయువ్యాపించెను. రామలక్ష్మణులు వారిగర్భమునఁబుట్టిరి. రాముని వియోగదుఃఖమును సహింపలేక, క్షణభంగురమగు శరీరమును వారు క్షణములో విడిచిపెట్టిరి. అందుచేత, వారినిగుఱించి విచారింపవలసిన పని లేదు. శ్రీసీతారామలక్ష్మణులు మునివేషములను ధరించి, వనములలో పాదచారులై, క్రుమ్మరుచుండిరి.

దోహా 219

"వారు మృగచర్మములను ధరించిరి. వారు కందమూలఫలములను భుజించుచుండిరి. కుశపత్రములే వారియాసనములు. తరుచ్ఛాయలే వారి నివాసస్థానము. ఎండలకెండి, వానలకుఁదడిసి, చలిబాధలనోర్చి, వనములలో వారు తిరుగుచుండిరికదా! వారికష్టములకు నేనుగదా కారణము.

చౌపాయ్

"ఈదుఃఖము దివారాత్రములు నామనస్సును దహించుచున్నది. ఏపూటనయిన నోటిలోనికి తిండివెళ్లదు; కంటినిండ నిదురరాదు. నేను లోకమంతయు వెదకిచూచితిని; కాని, నామనోవ్యాధిని బాగుజేయుటకుఁ దగినమందు కనఁబడలేదు. మాతల్లియొక్క ఈకుబుద్ధియే నాప్రాణములపాలిటికి వడ్రంగివంటిదైనది. ఆమె నాకు హితము అనుకొనిచేసిన ఈపనియే నాకు మేకైనది. దీని నాధారముచేసికొని ఆవడ్రంగి నన్ను గట్టిగా బంధించి అయోధ్యలో పాతిపెట్టెను. (అనఁగా శత్రువులపైని ప్రయోగము మొదలగువానిని చేయునట్టివారు తమశత్రువుల యాకారముగా నొకకొయ్యబొమ్మనుచేసి మంత్రములను పఠించి, ఒకచోట నాబొమ్మను పాతిపెట్టి తమ శత్రువులను స్తంభింపఁజేయువిధముగా ఇచ్చట కైకేయి హితముచేయుట యనుగుంటను త్రవ్వి, వరములడుగుట యనెడిమంత్రములను పఠించి, భరతుని కదలకుండునట్లు రామవనవాస మనెడిమిషతో అయోధ్యలో కట్టివైచినదని తాత్పర్యము.) మఱియు నామె యాబుద్ధియే నాకొఱకీపన్నాగముపన్ని సర్వనాశనము

గావించినది. (* ఇందులకు మూలములో బారాబాట్ అని యున్నది.) ఈదురదృష్టయోగము శ్రీరామచంద్రమూర్తి అయోధ్యకు తిరిగివచ్చిననాడుగాని యుపశమిల్లిపోఁజాలదు. ఇంతకంటెను మఱియొకయుపాయమేదియును నాకు అయోధ్యలో నుండుటకు కన్పట్టకున్నది.'' భరతుఁడు చెప్పిన యీమాటలకు మునులందఱును హర్షించిరి. అనేకవిధములవారతని నుగ్గడించిరి. "నాయనా! భరతా! ఇటుపైని అట్టి విచారము నొందకుము. శ్రీరామచంద్రుని చరణకమలములను సందర్శించినంతనే నీవిచారములన్నియును పటాపంచలై పోఁగలవు".

దోహా 220

ఈప్రకారము మునివరుఁడు భరతునిబోధించి, యోదార్చెను. "నీవు నాప్రాణమువంటివాఁడవు; అతిథిసత్కారముఁ జేయుచున్నాను. కందమూలఫలముల నిచ్చుచున్నాను. ప్రేమపూర్వకముగ దానిని స్వీకరింపుము".

చౌపాయ్

ఆ మునివరునిమాటలవలన, భరతునిమనస్సునకు దుఃఖము వచ్చెను. ఆతీర్థరాజములో భుజించుట యుచితముకాదని యతఁడు చింతించి సంశయించి మునివచనములను నిరాదరించుటకు భయపడెను. అతనివచనములను మన్నించుటయే పరమధర్మమని గ్రహించి, భరతుఁడు

* మూలములోని 'బారాబాట్' అనుమాటకు రెండర్థములు కలవు. ఒకటి సర్వనాశనమగుట. రెండవది పండ్రెండుత్రోవలఁబట్టుట (అనఁగా కార్యము అనుకూలముగా ఏకముఖమున నడవక భిన్నభిన్నములై, ఒకదానికొకటి సంబంధములేనివిధమున పండ్రెండుచీలికలుగా చీలి చెడుట) పండ్రెండుత్రోవలేవనఁగా "శ్లో. మోహో దైన్యం భయం హాసో హాని ర్గ్లానిః క్షుధా తృషా, మృత్యుః క్షోభో వృథా కీర్తిః బాటా ఏతే హి ద్వాదశ" అని చెప్పెదరు. ఇందులో మోహ మనఁగా గాబరాపడుట, దైన్య మనఁగా దీనత్వము, భయము, హాస మనఁగా పరిహాసము, హాని యనఁగా కీడు, గ్లాని యనఁగా కృశించి చిక్కిపోవుట, క్షుధ యనఁగా ఆఁకలి, తృష యనఁగా దప్పి, మృత్యువు, క్షోభ మనఁగా ఆయాసపడుట, వ్యర్థత్వము, అపయశస్సు, ఇవి 'బారాబాట్' అని హిందీపండితులు అందురు.

మునిచరణములకు దండప్రణామముఁజేసి, యిట్లువిన్నవించెను. "ఓనాథా! మీయాజ్ఞను శిరసావహించుటయే నాకు బరమధర్మము". భరతునిమాటల కతఁడు సంతసించి, శుచిర్భూతులై నిలువఁబడియుండిన సేవకులఁ బిలిచి, "ఓయీ! భరతుఁడు మనఅతిథి; అతనికి విందుఁజేయవలయును. కందమూలఫలములను శీఘ్రము తీసికొనిరండు" అని యాజ్ఞాపించెను. "ఓనాథా! మీచిత్తము" అని వారుపలికి, నమస్కరించి, తమతమపనులను నిర్వర్తించుటకు వెడలిరి. "ఆహా! భరతునివంటిగొప్ప అతిథివచ్చెను. ఇతనిని దేవునివలెఁ బూజింపవలెను". అని మునివర్యుఁడు విచారించి, అణిమాదిసిద్ధులను, బుద్ధియుసిద్ధియును బిలిచెను. "ఓనాథా! మీయాజ్ఞను శిరసావహించి, ప్రవర్తించెదము" అని వారు విన్నవించిరి.

దోహా 221

"ఓయీ సిద్ధులారా! శ్రీరామునివియోగదుఃఖమును సహింపలేక, భరతుఁడు సమాజముతోఁగూడి వచ్చెను; అతిథిసత్కారము తగినట్లుచేసి, వారిశ్రమను బోఁగొట్టుఁడు". అని మునీశ్వరుఁడు చెప్పెను.

చౌపాయ్

అణిమాదిసిద్ధులు మునీశ్వరునియాజ్ఞను శిరసావహించి తాము గొప్పయదృష్టవంతులమని సంతోషించుచు, భరతుఁడు గొప్పఅతిథియని వారిలోవారు చెప్పుకొనిరి. "ఈదినమున భరతునిసమాజమువారు సంతోషించునట్లు సకలకార్యములను నిర్వహించెదము"అని వారుకూడఁబలుకుకొని, మునివర్యునకు నమస్కరించి, చక్కనిగృహములను నిర్మించిరి. ఆగృహములఁజూచి,విమానములుసహితము కలవరపడి సిగ్గుపడెను; అనేకభోగభాగ్యములనాగృహములు కలిగియుండెను; వానినిఁజూచినందున దేవతలకు సహితమభిలాషపుట్టెను. దాసదాసీజనంబులు వివిధగృహోపకరణములఁబట్టుకొని, పనులఁజేయుటకు సిద్ధముగనుండిరి. రెప్పపాటుకాలములో సిద్ధులు సకలకార్యములను నెరవేర్చిరి. స్వప్నమందైనను దేవలోకములో నట్టిసౌఖ్యము లుండవు. ప్రథమమున సమాజమువారికిఁ దగిననివాసస్థానములను వారికిఁ జూపించిరి. సకలభోగములతోఁగూడిన చక్కనినివేశనములను వారివారిమనస్సుల కింపగునట్లు యెంచుకొని వానిలో వారు దిగిరి.

దోహా 222

తదుపరి, భరతునకును, అతనికుటుంబమువారికిని, మునియాజ్ఞ ప్రకారము, తగిననివేశనములఁ జూపించిరి; వానిలో వారుప్రవేశించిరి. ఆమునీశ్వరుఁడు తనతపోబలముచే నిరుపమానమగుభోగభాగ్యములను కల్పించినందులకు బ్రహ్మదేవుఁడు సహిత మాశ్చర్యపడెను.

చౌపాయ్

ఆమునివర్యుని తపోమహిమకు భరతుఁడు పరమానందభరితుఁడ య్యెను; అతనికంటికి లోకపతులభోగభాగ్యములు తృణప్రాయములు వలెఁ గనఁబడెను; ఆగృహములలోని సుఖసంపదలను వర్ణించిచెప్పుటకు శక్యముకాదు; వానిని జూచినతరువాత, జ్ఞానులజ్ఞానము పోవును; వారి వైరాగ్యము పోవును. ఆసనములు, శయనములు, పట్టుపీతాంబరములు, వితానములు, వనములు, వాటికలు, విహంగములు, రంగురంగులమృగ ములు, సుగంధద్రవ్యములు, పుష్పములు, ఫలములు, అమృతమువంటి ఫలములు, నిర్మలమగుజలములతోఁగూడిన జలాశయములు, అమృతము వంటి నిర్మలమగుపానీయములును, భోజనపదార్థములును; శ్రీరాముని యందుఁ గలప్రేమచేత, నయోధ్యానగరవాసు లీవిషయభోగముల ననుభవించుటకు సంశయించి, కేవలము ఫలములనుమాత్రమే స్వీకరిం చిరి ప్రతిగృహమునెదుట నొకకామధేనువు, కల్పవృక్షము నుండెను. ఇంద్రుఁడును శచీపతియు వానిభోగముల నభిలషించిరి. అచ్చట వసంతఋతువు ప్రకటమయ్యెను; మందసుగంధశీతలవాయువులు ప్రసరిం చెను; చతుర్విధపురుషార్థములు ప్రత్యక్షమయ్యెను. స్రక్చందనవనితాది భోగములను పురజనులుచూచి సంతోషించి, ఆశ్చర్యపడిరి.

దోహా 223

ఈభోగభాగ్యములు స్త్రీచక్రవాకము; భరతుఁడు పురుషచ క్రవాకము. పక్షులను వేఁటకాఁడు పంజరములో నుంచినవిధమున, ముని రాజు తనతపోబలముచే నీచక్రవాకమిథునమును తనయాశ్రమమనునట్టి పంజరములో బలవంతముగ నుంచెను; కాని, అది రాత్రిసమయము కనుక, వానికి సంయోగములేదు. ఆరెండు నొకస్థలములోనుండినను, వానికి సంయోగము రాత్రివేళలేదు. (శ్రీరామునివియోగమే రాత్రి;

ఆవియోగదుఃఖముచే, భరతుఁడీభోగములను లక్ష్యముఁజేయలేదు; వానిని యనుభవింపలేదు.)

చౌపాయ్

భరతుఁడు మొదలగువారు తీర్థరాజములో స్నానముఁజేసిరి. వారు మునీశ్వరునకు దండప్రణామముఁజేసి, యతనిదీవనలఁబొంది, యతనియాజ్ఞఁగైకొని వెడలిరి. మార్గముఁజూపించుసేవకులు వెంటనడుచుచుండ, వారు చిత్రకూటపర్వతమునకు వెడలిరి. మూర్తీభవించినయనురాగమో యనునట్లు, భరతుఁడు నిషాదపతిమెడమీఁద హస్తమువేసి నడచెను. అతనిపాదములకు రక్షలులేవు. అతనిశిరస్సునకు ఛత్రములేదు. రామునియందుఁగల యనురాగమే యతనివ్రతము. ఆభరతుఁడు నిష్కపటి. మాయారహితుఁడు. శ్రీసీతారామలక్ష్మణుల వనసంచారమును గుఱించి, స్నేహితునియడుగుచు, భరతుఁడు నడచెను. శ్రీరాముఁడు విశ్రమించినస్థలముగాని వృక్షమునుగాని యతఁడు చూచినపుడు, అతనియనురాగము కట్టుపడక, పొంగివచ్చుచుండెను. అతనియవస్థను జూచి, దేవతలు పుష్పములనువర్షించిరి. ఆసమయమున భూమియంతయు మృదువయ్యెను. మంగళప్రదమయ్యెను.

దోహా 224

మేఘములు నీడనిచ్చెను; చల్లనిపిల్లవాయువులు వీచెను. వనమార్గములు భరతునకు మృదువుగనుండినట్లు, శ్రీరామునకు మృదువుగనుండలేదు. (శంక:—మార్గము కఠినముగనుండుటవలన, భరతునిపాదములమీఁద పొక్కులుపొక్కెను. అని మొదట చెప్పఁబడెను. ఇప్పుడు, మార్గములు మృదువయ్యెనని చెప్పుటకుఁ గారణమేమి? సమాధానము:-శ్రీరాముఁడు వనమునుండి తిరిగివచ్చునట్లు యాశీర్వదింపుఁడని భరతుఁడు వసిష్ఠునిప్రార్థించెను. స్వకార్యమునకు హానికలుగునని దేవతలు భయపడి, భరతునకు మార్గములో ననేకకష్టములం దెచ్చిపెట్టిరి; భరతుఁడు త్రివేణిలో స్నానముఁజేసి, ధర్మార్థకామమోక్షములను విడిచి, కేవలము శ్రీరామునియందు భక్తికలుగవలెనని కోరెను. అతనియంతఃకరణశుద్ధమని దేవతలు తెలిసికొని, యతనిమార్గమును సులభముఁజేసిరి.)

చౌపాయ్

శ్రీరామునిసందర్శించిన చరాచరజంతుజాలమునకు పరమపదము

నకు వెళ్లుట కర్తవ్యతకలిగెను; రాజ్యవిషయమైకదా, రాముఁడు వనములకు వెళ్లెనని యవి తలంచినందున, వానికి భవరోగములు వదలలేదు. ఇప్పుడు చరాచరజంతువులు భరతునిఁజూచినందున, వానికి భవరోగములు వదలెను. రాజ్యమును సహితము భరతుఁడు విడిచిపెట్టి శ్రీరామునిజూచుటకు వెళ్లుచుండెనని, యవి తలంచి, రాజ్యభోగములు తుచ్ఛమని తెలిసికొనెను. అందుచేత వానిని భవరోగములు విడిచిపెట్టెను. భరతుఁడు కేవలము రామతత్పరుఁడై, రామునియందే మనస్సును లగ్నముఁజేసియుండుటచేత, నతనికంటికి నేపదార్థముకూడ లక్ష్యముగ నుండలేదు. ఒకపర్యాయము రామనామము నుచ్చరించినమాత్రమున, మనుజుఁడు తనమట్టుకు తాను దరించుటయేగాక,పరులనుసహితము తరింపఁజేయును. భరతుఁడు రామునిప్రియుఁడు; రామునిప్రియతముఁడు. మార్గములో నతఁడెందుకు మంగళప్రదుఁడుకాఁడు? ఈప్రకారము మునులును, సిద్ధులును, సాధువులును తలంచి, భరతునిజూచి, పరమానందభరితులయిరి. అతనిప్రభావమును దేవేంద్రుఁడుచూచి, "ఈభరతుఁడు రాముని మఱలించి, తీసికొనివచ్చినయెడల, నాకార్యముచెడును. ఈలోకము మంచివారికి మంచిగనుండును. చెడుగువారికి చెడుగుగనుండును" అని సంశయించి, భయపడి, బృహస్పతినిజూచి, "ఓనాథా! శ్రీరామునకును భరతునకును సంయోగము కాకుండునట్లు ప్రయత్నముఁజేయవలయును" అనిచెప్పెను.

దోహా 225

"ఓనాథా! శ్రీరాముఁడు ప్రేమకు వశ్యుఁడు.దయాళువు.భరతుఁడు ప్రేమకు సముద్రుఁడు.న నకార్యము చెడిపోవునేమో యని భయము కలుగుచున్నది. తల్లిదండ్రులనువిడిచి, యెట్లో రాముఁడు వనమునకు వచ్చెను ఇప్పుడు రాముఁడు వనములో నుండునట్లు, తగినచమత్కారముఁజేసి, పనిజేయవలెను." అని ఇంద్రుఁడు మొఱవెట్టెను.

చౌపాయ్

ఇంద్రునివచనములను బృహస్పతివిని, నవ్వెను; అతనిసహస్రనేత్రములు వ్యర్థమని తెలిసికొనెను "ఓ ఇంద్రా! నీచమత్కారమును, మున్నేను విడిచిపెట్టుము వానికి సమయముకాదు; వానివలనఁ బ్రయో

జనము లేదు. శ్రీరాముఁడు మాయాపతి; అతని సేవకులమీఁద మాయను బ్రయోగించినయెడలఁ, బ్రయోగించినవానికే యనర్థమువచ్చును. ఒక సమయమున, రామునిమనస్సును నేను గ్రహించి, మాయనుబ్రయోగించితిని; కాని, ప్రస్తుతము మాయ నుపయోగించుటవలన ముప్పు వచ్చును. ఓ ఇంద్రా! రామునిస్వభావముఁ జెప్పుచున్నాను; వినుము. కేవల మతనికి యపరాధముఁ జేసినయెడల, నతఁడు కోపింపఁడు; అతనిభక్తులకు మాత్ర మపరాధముఁ జేసినయెడల, నతఁడు కోపముచే మండిపడును; అపరాధముఁ జేసినవారిని యతఁడు దహించును. ఈయితిహాసము లోకవిదితము. దానిని వేదముకూడ చెప్పుచున్నది. శ్రీరామునిస్వభావము దుర్వాసమహామునికి బాగుగఁ దెలియును. భరతునివంటి ప్రియుఁడు రామునకు మఱియొకఁడేఁడీ? లోకమంతయు రాముని జపించును; రాముఁడు భరతుని జపించును.

దోహా 226

"ఓ అమరనాథా! శ్రీరామునిభక్తుల నవమానించుటకుఁ బ్రయత్నింపకుము. అట్లు చేసినయెడల, లోకములో నీ కపకీర్తివచ్చును; పరలోకములో దుఃఖము సంప్రాప్తమగును; జీవించియుండినంతవఱకు నీవు దుఃఖింపవలసివచ్చును.

చౌపాయీ

"ఓ ఇంద్రా! నామాటను వినుము. తనసేవకులయందు రామున కభిమానము మెండు. సేవకులకు సేవఁజేసినయెడల, నతఁడు సంతోషించును; సేవకులతో విరోధించినవారితో నతఁడు విరోధించును. అయినను, శ్రీరాముఁడు సముఁడు; అతనికి రాగరోషములు లేవు. ఇతరులపాపపుణ్యములుగాని, గుణదోషములుగాని యతనిని స్పృశింపవు. అతఁడు ప్రారబ్ధకర్మమును లోకములో ముఖ్యముగఁ జేసి యుంచెను. ఎవనికర్మఫలమును వాఁడు తప్పక యనుభవించును. అయినను, భక్తులును, భక్తిహీనుల హృదయముల ననుసరించి, యతఁడు సమముగను, విషమముగను ప్రవర్తించును. ఆశ్రీరాముఁడు గుణరహితుఁడు; మానరహితుఁడు; రూపరహితుఁడు; ఏకరసికుఁడు; భక్తులయందుఁగలప్రేమచేత, నతఁడు సగుణుఁడై యవతరించెను. శ్రీరాముఁడు సదా సేవకులను సఖులను మన్నించును. ఇందుకు వేదపురాణేతిహాసములే సాక్ష్యము; ఈసంగతిని

తెలిసికొని, కపటమునువిడిచి, భరతునిచరణములను ప్రీతితో సేవింపుము.

దోహా 227

"రామభక్తులు పరోపకారులు; పరులదుఃఖములను జూచి విచారించెదరు; వారు పరమదయాళువులు. ఓ ఇంద్రా! భరతుఁడు భక్తశిరోమణి; భయపడకుము.

చౌపాయ్

"శ్రీరామప్రభువు సత్యసంధుఁడు; దేవతలకు హితకారి. భరతుఁడు శ్రీరామునియాజ్ఞను శిరసావహించును. నీవు స్వార్థపరాయణుఁడవై, విచారించుచుంటివి. ఈవిషయములో భరతుఁడు నిర్దోషి. ఇది నీయజ్ఞానమే కాని,మఱియొకటి కాదు". ఇట్లు బృహస్పతి చెప్పినమాటలవలన, దేవేంద్రునకు జ్ఞానము కలిగెను; అతనివిషాదము పోయెను. ఇంద్రుఁడు సంతోషించి, పుష్పములనువర్షించి, భరతునిస్వాభావికగుణములను కొనియాడెను. ఈప్రకారము భరతుఁడు ప్రయాణమును సాగించి వెళ్లుచుండెను. అతనిని మునులును సిద్ధులు మొదలగువారుచూచి సంతోషించుచుండిరి. అతఁడు 'రామరామ' యని నిట్టూర్పులను విడిచినపుడెల్ల, అతనియనురాగ ముప్పొంగివచ్చిన ట్లుండెను. అతనిమాటలవలన, వజ్రములును రాళ్లుసహితము నీరయ్యెను. ఇక పురజనుల యనురాగమును జెప్పుటకు శక్యముకాదు. కొంతవఱకు సగముమార్గములో విశ్రమించి, యతఁడు యమునానదీతీరమునకువచ్చి, దానిజలములఁజూచి, కన్నీరుఁ గార్చెను.

దోహా 228

ఆనదీజలములరంగును, శ్రీరాముని శరీరచ్ఛాయయు సమానములని భరతుఁడు మొదలగువారు తలఁచి, విరహసాగరములో మునింగిరి; పునః వారు తెలివిఁ దెచ్చుకొని, ధైర్యము నవలంబించిరి.

చౌపాయ్

ఆరోజున వారు యమునాతీరమున విశ్రమించిరి; సమయానుసారముగ వారు యథోచితముగ సుఖముగ నుండిరి. రాత్రికిరాత్రికి రేవులలోనికి ననేకపడవలు వచ్చెను; వానిని లెక్కించుటకు శక్యము కాదు. ప్రాతఃకాలమున వారందఱేకకాలమున నదిని దాఁటిరి. నిషాద

పతి వారిని సేవించి, వారిని సంతుష్టులఁజేసెను. వారు నదిలో స్నానముఁజేసి, నదికి నమస్కరించి, ప్రయాణమును సాగించిరి. నిషాదపతియు శత్రుఘ్నుఁడును వెంటనుండ, భరతుఁడు నడచెను అందఱకు ముందు, గురువు మంచివిమానముపైఁ గూర్చుండి, వెడలెను. అతనివెనుక రాజసమాజమువారు నడచిరి; వారివెనుక పాదచారులై భరతశత్రుఘ్నులు నడచిరి. వారిరువురు సాధువులవేషమును ధరించియుండిరి. వారిరువుర వెంటను మంత్రులును మిత్రులును సేవకులును, శ్రీసీతారామలక్ష్మణులను స్మరించుచు నడచిరి. ఏయేస్థలములలో రాముఁడు నివసించెనో, లేక విశ్రమించెనో, ఆయాస్థలములను వారిరువురు చూచి ప్రేమపూర్వకముగ నమస్కరించుచుండిరి.

దోహా 229

మార్గములోనుండిన గ్రామనివాసులు స్త్రీపురుషులు, వారివారి గృహములను పనులను విడిచిపెట్టి పరుగెత్తివచ్చి వారిదివ్యమంగళరూపములను జూచి, పరమానందభరితులై, జన్మము సఫలమయ్యెనని తలంచిరి.

చౌపాయ్

వారిలో వా రిట్లు చెప్పుకొనుచుండిరి. "ఓసఖీ! వారిరువురు రామలక్ష్మణులా, లేక మఱియొకరా? రూపవయోశీలలావణ్యములలో వారొకరినొకరు పోలియుండిరి; ఓసఖీ! వీరివేషములుమాత్రము వేఱుగనున్నవి. వీరివెంట జానకిలేదు. వీరిముందుఁ జతురంగబలములు నడుచుచున్నవి. వీరిముఖములు ఖేదముతోఁ గూడియున్నవి; అందుచేత, వీరు రామలక్ష్మణులు కారేమోయని సందేహము కలుగుచున్నది." ఈప్రకారమొకస్త్రీ తర్కించి చెప్పినమాటలను పదితరస్త్రీలువిని సంతసించి, "ఓసఖీ! నీవంటిచతురభాషిణి లోకములోలేదు" అనికొనియాడిరి. ఆమెను గొనియాడి ఆమెవచనములను బ్రస్తుతించి మఱియొకమధురభాషిణి మృదుమధురముగ యావద్వృత్తాంతముఁ జెప్ప నారంభించెను. ఏప్రకారము రామునిపట్టాభిషేకమునకు భంగముకలిగెనో, ఆవృత్తాంతము నామె ముచ్చటించి, భరతుని సుశీలమును సుగుణములను గొనియాడెను

దోహా 230

"ఓసఖీ! ఈభరతుఁడు తండ్రియిచ్చిన రాజ్యమును విడిచి, పాదచారియై వెడలి మార్గములో ఫలములను భక్షించుచు శ్రీరాముని మరలించి తీసికొనివెళ్లుటకు వచ్చుచుండెను. ఈదినములలో భరతుని వంటి యదృష్టవంతుఁడేఁడీ!

చౌపాయ్

"భరతుని భ్రాతృవాత్సల్యమును ఆచరణవిధానమును గుఱించి ప్రసంగించినను, వినినను, దుఃఖములును దోషములును నశించును. ఓసఖీ! నేనెంతవఱకుఁ జెప్పినను స్వల్పముగనుండును. అతఁడు శ్రీరాముని తమ్ముఁడు; అతఁడు మఱియొకవిధమున నెందులకుఁ బ్రవర్తించును? ఓసఖులారా! భరతశత్రుఘ్నులను మనము చూచినందుకు మనజన్మములు సఫలమయ్యెను." అని యామె చెప్పెను. భరతుని సుగుణములను వారు చెప్పుకొనుచు, వినుచు యతనిదురవస్థఁజూచి పరితపించిరి. "ఈభరతుఁడు కైకేయిగర్భమునఁ బుట్టుటకు తగినవాఁడు కాఁడు." "ఏదోషమును రాణికి లేదు. ఇదియంతయు విధికృతము. ఇందువలన నాకు మేలుకలిగెను." అని యొకస్త్రీ పలికెను. "నేను స్త్రీని; లోకములోను విధికృతమువలనను వేదముప్రకారము నేను హీనురాలను: నాకులము నీచము; నాపనులు నీచము; నాదేశము నీచము; నాగ్రామము నీచము. నా పుణ్యము ఫలించినందున నాకు వారిదర్శనములభించెను." ఈప్రకారము ప్రతిగ్రామస్థులును వారినిఁజూచి సంతోషించి, ప్రేమాతిశయములచే నుప్పొంగిరి. ఎడారులలోఁ గల్పవృక్షము పుట్టినట్లయ్యెను.

దోహా 231

భరతునిసందర్శనమువలన మార్గములో నివసించుపురుషుల భాగ్యము సఫలమయ్యెను. ప్రారబ్ధవశముచే సింహళద్వీపవాసులకుఁ బ్రయాగదర్శనము లభించినట్లయ్యెను.

చౌపాయ్

ఈప్రకారము తనగుణములను రామునిగుణములను భరతుఁడు వినుచు, రామునిస్మరించుచు, నడచి వెళ్లెను. మార్గములోనుండిన తీర్థములలో స్నానముఁజేయుచు మునియాశ్రమములఁజూచి మునులకు యథాయోగ్యముగ నమస్కరించుచు, భరతుఁడు ప్రయాణమును

సాగించి, పోవుచుండెను. "నాకు సదా సీతారాములచరణములమీఁద భక్తియుండుఁగాక" అని యతఁడు తనలోఁదాను కోరుచుండెను. కిరాతులు, కోలులు, వనవాసులు, వైఖానసులు, బ్రహ్మచారులు, యతీశ్వరులు, ఉదాసీనులు మొదలగువారు భరతునికలసినపుడు, వారికి నతఁడు నమస్కరించి శ్రీసీతారామలక్ష్మణులు నివసించియుండు వనమును జూపుమని వారిని నడుగుచుండెను. వారు శ్రీరామునిసమాచారము నతనికిఁజెప్పి, భరతునిఁ జూచినందుకు జన్మము సఫలమయ్యెనని తలంచి సంతోషించిరి. "రామలక్ష్మణులఁ జూచివచ్చితిమి; వారు క్షేమముగనుండిరి" అని చెప్పినవారిని, రామలక్ష్మణులని తలంచి, వారిని భరతుఁడు ప్రేమించి యాదరించెను. ఈప్రకారము మార్గస్థుల నడుగుచు, రాముని గుణములను జెప్పుకొనుచు, భరతుఁడు నడచివెళ్లెను.

దోహా 232

ఆరోజున భరతుఁడు సమాజముతోఁగూడి విశ్రమించి ప్రాతఃకాలమునలేచి శ్రీరాముని స్మరించి ప్రయాణమును సాగించెను. భరతుఁడును సమాజమువారును సమానముగ రామదర్శనోత్సాహులై వెడలిరి.

చౌపాయ్

వారికి శుభశకునములు కనఁబడెను. పురుషులకు దక్షిణాంగములును స్త్రీలకు వామాంగములును గదలెను. భరతునకును సమాజమువారికిని నుత్సాహముపుట్టెను. శ్రీరామునిదర్శనమువలన మనోతాపమును, దుఃఖమును శాంతించునని వారు నమ్మియుండిరి. ఎవరిమనోరథముప్రకారము వారు కోరుచుండిరి. వారు స్నేహసుధారసములో మునిఁగియుండిరి. వారిపాదములు తొట్రుపాటు పడుచుండెను. వారు ప్రేమవశులై వెఱ్ఱివెఱ్ఱిమాటలఁ బలుకుచుండిరి. ఆసమయమున నిషాదపతి, స్నేహవాత్సల్యము లుప్పతిల్ల చిత్రకూటమును వారికిఁ జూపించెను. దానిప్రక్కను మందాకినీనది ప్రవహించుచుండును; దానితీరమున శ్రీసీతారామలక్ష్మణులు నివసించియుండిరి. దానిం జూచి వారు దండప్రణామముఁజేసిరి. "జానకీజీవనాథా! హేరామా! జయజయ" అని వారు ఘోషించిరి. రాజసమాజమంతయుఁ బ్రేమకు వశ్యులై రాముఁడు తిరిగి నగరమునకు వచ్చినట్లు సంతోషించిరి.

దోహా 233

ఆసమయమున భరతుని ప్రేమాతిశయములను శేషుఁడు సహితము వర్ణించి చెప్పలేఁడు. "నేను, నాది" అని మమకారముగలమనుజులును, మలినమగుబుద్ధిగలవారును బ్రహ్మానందమును తెలిసికొనలేనివిధమున, నాభరతుని ప్రేమాతిశయములను గవీశ్వరులుగ్రహించి వర్ణించి చెప్పలేరు.

---

# చతుర్దశవిశ్రామము.

---

చౌపాయ్

శ్రీరామునియందు గలప్రేమచేత వారు దుర్బలులై, నడవలేక, సూర్యాస్తమయమునకు రెండుక్రోసులదూరము వెళ్లిరి. అచ్చట జలాశయమునుజూచి, వారారాత్రి విశ్రమించి, ప్రాతఃకాలమునలేచి, శ్రీరాముని స్మరించి, ప్రయాణమును సాగించిరి. శ్రీరామునిప్రియుఁడు భరతుఁడు, పాదచారియై వెడలెను. ఇఁక శ్రీరామునివృత్తాంతమును వినుఁడు. తెల్లవాఱకమునుపు శ్రీరాముఁడు మేల్కాంచెను; జానకిలేచి, తాను స్వప్నములోఁజూచిన వృత్తాంతము నతనితోఁ జెప్పెను. "ఓనాథా! మీవియోగదుఃఖముచేత భరతుఁడు కృశించి, సీరసించి, పరితపించుచు, మనవద్దకు వచ్చినట్లును, నతని సమాజమువారు దీనులై, దుఃఖించుచుండినట్లును, మహారాణులు ముప్వురును వైధవ్యమునుబొంది వచ్చినట్లును కలవచ్చెను." ఆమె స్వప్నవృత్తాంతమును రాముఁడువిని, కన్నీరుఁగార్చెను. ఆశోకవిమోచనుఁడు శోకసంతప్తమానసుఁడయ్యెను. "ఓ లక్ష్మణా! ఈస్వప్నము శుభసూచకము కాదు. ఏదో యొకదుర్వార్త వినఁగలమని తోఁచుచున్నది." ఈమాటఁజెప్పి, శ్రీరాముఁడు తమ్మునితోఁగూడి స్నానముఁజేసి, శివుని బూజించి, సాధువులను సన్మానించెను.

ఛాంద్ 10

అతఁడు మునులను సత్కరించి, సురలకును మునులకును నమస్కరించి కూర్చుండెను. ఉత్తరదిక్కు నతఁడు చూచుచుండెను. ఆకాశ

మంతయు ధూళిచేఁ గప్పఁబడెను. అనేకఖగమృగములు రామునియాశ్రమమువైపు వచ్చుచుండెను. కారణముఁ గనుఁగొనుట కతఁడు దిగ్గున లేచెను అతనిమనస్సు పలువిధములఁ బరిణమించెను. ఆసమయమున భిల్లులును, కోలులును, కిరాతులును, వనవాసులునువచ్చి, భరతునియాగమనమును రామునితోఁ జెప్పిరి.

సోరఠా 10

ఆసుమంగళవర్ధమానము నతఁడువిని, సంతోషించెను; అతనిశరీరము పులకరించెను. శరత్కాలసరోరుహములువలె, నతనికమలలోచనములు జలపూరితము లయ్యెను.

చౌపాయ్

మరలభగవంతుఁడు శోకించెను. "భరతునిరాకకు కారణమేమి!" అని యతఁడు విచారించెను. "అతనివెంటఁజతురంగబలము లనేకములు వచ్చెను" అని యొకఁడుచెప్పెను ఆమాట నతఁడువిని, విశేషము దుఃఖించెను. తండ్రివచనములను గుర్తెఱింగియు, శ్రీరాముఁడు పరిపరివిధములఁ దలంచి, యేమియుదోఁచక, ఆందోళనపడుచుండెను. భరతునిస్వభావము నతఁడెఱింగినవాఁడు కనుక, నతఁడు 'ఇద మిత్థ మ్మని' నిర్ధారణచేయలేక, తత్తరపడుచుండెను. "భరతుఁడు సాధువు; బుద్ధిమంతుఁడు" అని యతఁడు తనలోఁదాను సమాధానముఁ జెప్పుకొని, మనస్సును గుదురుఁజేసికొనెను. శ్రీరామునిమనోవ్యాపారమును లక్ష్మణుఁడు తెలిసికొని, సమయోచితముగ నీతివాక్యములను మృదుమధురముగఁ జెప్ప నారంభించెను. "ఓనాథా! మీరు నన్నడుగకపోయినను జెప్పుచున్నాను. నాయపరాధమును మన్నింపుఁడు. సమయముఁజూచి, సేవకుఁడు చెప్పినమాటల నపరాధముగ భావింపఁగూడదు. ఆమాటలపరాధములు కావు. మీరు సర్వజ్ఞశిరోమణులు; నేను సేవకుఁడను. నాకుఁ దోఁచినమాటఁ జెప్పుచున్నాను.

దోహా 234

"ఓనాథా! మీరు సుహృదులు; మీచిత్తము సరళము; మీరు సుశీలురు; వాత్సల్యనిధులు. మీరు జనులనుప్రేమించి, వారిని నమ్ముచుందురు; మీచిత్తమువలె, వారిచిత్తముకూడ సరళమని మీయభిప్రాయము.

### చౌపాయీ

• "ఓనాథా! విషయాసక్తులగు మూర్ఖులు ప్రభుత్వమును బొంది, మోహమునకు వశ్యులై, దురభిమానములను బొందఁగలరు. తమతో సమానులు లేరని వారు విఱ్ఱవీగుచుందురు. భరతుఁడు ధర్మాత్ముఁడు; సాధువు; బుద్ధిమంతుఁడు. అతనికి మీచరణములయం దనురాగముకల దని లోకవిదితము. అభరతుఁడు నేఁడు రాజ్యపదవినిబొంది, ధర్మమార్గమును విడనాడి, వచ్చుచుండెను. అతఁడు కుటిలుఁడు; కుత్సితబంధువు. మీరు వనములో నొంటరిగనుండుటయే మంచిసమయమని తలంచి, యతఁడు మనస్సులో దుర్మార్గము నాలోచించి, చతురంగబలములను దీసికొని, నిష్కంటక రాజ్యముఁ బరిపాలించుటకు వచ్చుచుండెను. కోటి కుటిలప్రయత్నముల నాలోచించి, భరతశత్రుఘ్నులిరువురును బలములను దీసికొనివచ్చుచుండిరి; యుద్ధముఁజేసి, మిమ్ములను సంహరింపవలెనని వారియభిప్రాయము. అతనిమనస్సులో దుర్మార్గమును గపటమును లేనియెడల, నతఁడీసైన్యము నెందుకు వెంటఁదీసికొని వచ్చును? అతనిని వ్యర్థముగ దూషించుటయేల? రాజ్యపదవి వచ్చినతరువాత, లోకులందఱు విఱ్ఱవీగుచుందురు.

### దోహా 235

"గురుపత్నిని చంద్రుఁడు చెఱచెను. నహుషుఁడు దేవేంద్రపదవికివచ్చి, పల్లకిలోఁగూర్చుండి, బ్రాహ్మణులచేత సేవఁజేయించుకొనెను. వేనునికంటె లోకములో నధముఁడు లేఁడు. అతఁడు లోకవిరోధి; వేదవంచకుఁడు.

### చౌపాయీ

"సహస్రబాహువు, ఇంద్రుఁడు, త్రిశంకుఁడు రాజ్యమదముచేత నిందసహితము లోకములో నపకీర్తిఁబొందిరి. లోకములో శత్రుశేషము లేకుండుటకు భరతుఁడీయుపాయమును బన్నెను. ఒకపొరపాటు మాత్ర మతఁడుచేసెను. అతఁడు మీకు సహాయులులేరని తలంచి, మిమ్ములను దృణీకరించెను. ఈరోజున వీరరసమునిరౌద్రాకారము నతఁడు రణరంగమునఁ జూచినతరువాత, నతనికి సర్వము విశదమగును." ఈప్రకారము లక్ష్మణుఁడు నీతిమార్గమునుదప్పి, విజృంభించి పలికెను; వీరరసముతో నతనిశరీరము పులకరించి, అతనిపాదరేణువులను శిరస్సు

పై ధరించి,మృదుమధురముగ నతఁడుస్వాభావికధైర్యస్థైర్యములను ప్రకటించి సంభాషించెను. "ఓనాథా! నామాట లనుచితములని తలంపకుఁడు. భరతుఁడు నన్ను కోించెను తృణీకరించి యుండలేదు. ఓనాథా! అతఁడు చేసినయవమానమును నేనెంతవఱకు సహించి యుండఁగలను? మీరు నానాథులు; నావద్దనుండితిరి; నాధనుర్బాణములు నావద్దనుండెను.

దోహా 236

"నేను క్షత్రియవంశస్థుఁడను; అందులో రఘువంశస్థుఁడను; నేను శ్రీరాముని తమ్ముఁడను. ఈసంగతులు లోకవిదితములు. ధూళి కంటె నీచమగుపదార్థము లేదు. కాలితో దానిని కలయఁబెట్టినయెడల, నది శిరస్సుపై వచ్చి పడును."

చౌపాయ్

ఈప్రకారము లక్ష్మణుఁడుపలికి దిగ్గునలేచి, నిలువఁబడి చేతులను జోడించుకొని, నిద్రలోనుండి మేల్కాంచిన వీరరసమేమో యనునట్లు శ్రీరామునియాజ్ఞ కెదురు చూచుచుండెను. అతఁడు శిరస్సుపైనుండిన జటలనుబంధించి, నడుమునకుఁ దూణీరమునుగట్టుకొని ధనుర్బాణములను దుల్పుచు, రామునితో నిట్లుసంభాషించెను. "ఓనాథా! ఈదినమున మీ సేవకుఁడనని కీర్తిఁబొందఁగలను. భరతునకుఁ దగినట్లు యుద్ధములో నతనిని శిక్షించెదను శ్రీరఘురాముని నిరాదరించినందుకుఁ దగినఫలమును, వారిరువురుపొంది పరుపుమీఁదవలె, రణస్థలమున వారు నేఁడు శయనింపఁగలరు. అతఁడు చతురంగబలములతోఁగూడి వచ్చుట మంచి పని; ఈరోజున నావీరరసమును బ్రకటించి వారికిఁ దగినశాస్తిఁ జేయఁగలను, అనేకమృగగజముల నొకసింహము చంపును;అనేకపక్షిసమూహముల నొక డేఁగ వేటాడును. అట్లల నేను భరతశత్రుఘ్నులను సమాజమునతోఁ గూడ యుద్ధములోఁ బడద్రోయఁగలను. ఇందులకు రాముఁడే సాక్షి. శివుఁడు వచ్చి సహాయము చేసినను నేనతనిని సంహరించెదను."

దోహా 237

ఈప్రకారము లక్ష్మణుఁడు క్రోధాగ్నిపూర్ణుఁడై పలికినపలుకులకు లోకములు ఘూర్ణిల్లెను; లోకపతులు తల్లడిల్లిరి; వారు భయపడి పరుగెత్తిపోవుటకు సిద్ధపడిరి.

చౌపాయ్

జగత్తులన్నియు భయముచే గడగడవడంకెను. లక్ష్మణునిబాహుబలమును బ్రశంసించుచు, నంతరిక్షమునుండి యొకమాట వినఁబడెను. "ఓలక్ష్మణా! నీప్రతాపమును బ్రభావము నెవరు చెప్పఁగలరు? వానిసంగతి యెవరికిఁ దెలియును? ఉచితానుచితముల నాలోచించి పనులఁజేసిన యెడల మేలుకలుగును; ఇది జనసమ్మతము. పూర్వోత్తరముల నాలోచింపక తొందఱపడి పనులఁ జేసినయెడలఁ, దుదకు పశ్చాత్తాపముపడవలసి వచ్చును. అటులఁ జేయనివారు బుద్ధిమంతులు కారని వేదములు చెప్పుచున్నవి; పండితులు చెప్పుచున్నారు." దేవతలవాక్యములను లక్ష్మణుఁడు విని వెనుకకుఁదగ్గెను. శ్రీజానకీరాము లతనిని సన్మానించిరి. "ఓతమ్ముఁడా! నీవు చెప్పినమాటలు నీతియుక్తములు; అన్నివిధముల రాజ్యమదము కఠినము. సాధుసమాజములను సేవించియుండని రాజు, ప్రభుత్వము నేపాటిరుచిజూచినను రాజ్యమదమును బొందకయుండఁడు. ఓలక్ష్మణా! నామాటను వినుము; బ్రహ్మసృష్టిలో, భరతునివంటి మంచివానినిఁ జూచికాని, వినికాని యుండలేదు.

దోహా 238

"భరతునకు బ్రహ్మవిష్ణుమహేశ్వరులపదవివచ్చినను, గర్వముండదు; అతనికి రాజ్యమద మెందులకుండును? గంజిచుక్కలవలన క్షీరసముద్రము తోడుకొనునా?

చౌపాయ్

"ఓతమ్ముఁడా! మధ్యాహ్నమున సూర్యుఁడు చీఁకట్లఁ గ్రమ్మవచ్చును; అవకాశములో నాకాశము మునిఁగిపోవచ్చును సముద్రోదకమును పానముఁజేసిన కుంభసంభవుఁడు గోష్పాదములో మునిఁగిపోవచ్చును. పృథ్వికి క్షమ పోవచ్చును. మశకములఫూత్కారములవలన, సుమేరుపర్వత మెగిరిపోవచ్చును. కాని, భరతునకుమాత్రము రాజ్యమద మెన్నటికిని గలుగదు. ఓతమ్ముఁడా! నీతోడు; మనతండ్రితోడు. భరతునివంటి నిర్మలమగుబంధువు మఱియొకఁడు లేఁడు. ఓయన్నా! సగుణములను క్షీరమును, అవగుణములను జలమును సమ్మేళనఁజేసి, బ్రహ్మలోకమును సృజించెను. సూర్యవంశ మనునట్టి సరోవరములో, భరతుఁడు హంసవంటివాఁడు. ఆవంశములో నతఁడుపుట్టి, గుణదోషము

లను విభజించును. అతఁడు గుణములను క్షీరమును సంగ్రహించి, అవగుణములను జలమును విసర్జించి, తనకీర్తిచే లోకమును బ్రకాశింపఁ జేసెను." ఇట్లు శ్రీరాముఁడు భరతుని సుగుణములను వర్ణించి, చెప్పి చెప్పి, ప్రేమపయోధిలో మగ్నుఁడయ్యెను.

దోహా 239

శ్రీరామునిమాటలను దేవతలు విని, అతనికి భరతునియందుఁ గల ప్రేమనుజూచి, పలువిధముల రామునిఁ గొనియాడిరి. "శ్రీరాముని వంటికృపాళుఁడు కలఁడా!

చౌపాయ్

"భరతుఁడే, లోకములో జన్మించియుండనియెడల, భూభారమును వహించువారెవరు? ధర్మమును సంస్థాపించువారెవరు? ధర్మధురీణు లెవరు? భరతునిగుణములు కవీశ్వరుల కగమ్యము. ఓరామా! అతనిగుణములు మీకుఁదప్ప, మఱియెవరికి దెలియును!" దేవతల వాక్యములను శ్రీసీతారామలక్ష్మణులువిని, చెప్పుటకు శక్యముగాని సంతోషమునుబొందిరి. ఇచ్చట భరతుఁడు సమాజమువారితోఁగూడి, మందాకినిలో స్నానముఁజేసి, సంతోషించెను. అతఁడు నదీతీరమున చతురంగబలమును నిలువఁబెట్టి తల్లులవద్దను, గురుమంత్రులవద్దను సెలవుఁగైకొని, తమ్ముని వెంటఁదీసికొని, భరతుఁడు నిషాదపతితోఁగూడి, పాదచారియై, రామునియాశ్రమమునకు వెడలెను. అతఁడు కైకేయి చేసిన కృత్రిమమునకు సంశయించుచుండెను. అతఁడు మనస్సులో ననేకవిధములఁ దర్కించుకొనుచుండెను. "నాపేరువిని, శ్రీసీతారామలక్ష్మణు లీస్థలమునువిడిచి, మఱియొకస్థలమునకు వెళ్లియుందురేమోకదా!

దోహా 240

"నాతల్లి చేసినపనికి నేను సహాయుఁడనని తలంచి, శ్రీరాముఁడు నావిషయమై యేమిఁజేసినను స్వల్పము. ఒకవేళ నతఁడు నాపాపమును దలంపక, నాయవగుణములను సహించి, నాముఖముఁజూచి,నన్నాదరించినను నాదరింపవచ్చును.

చౌపాయ్

"నామనస్సు మలినమని తలంచి నన్ను నిరాకరించినను, నేను సేవకుఁడనని భావించి నన్ను సన్మానించినను, నాకు శ్రీరామునిపాదములే

గతి; నాకు శ్రీరాముఁడే శరణు.నియమములోను ప్రేమలోనునిపుణము లని,చాతకము,మీనమును లోకములోఁ గీర్తిఁబొందెను.'' ఈప్రకారము మనస్సులో భరతుఁడు చింతించుచు నడచెను. సంశయముచేతను,ప్రేమాతిశయముచేత, నతనిశరీరము దుర్బలమయ్యెను. తల్లి చేసినయపరాధము నతఁడు తలంచినపుడు, అతనిపాదములు వెనుకకుఁ బడుచుండెను; రాముని యందుఁగలభక్తిచేత, నతఁడు ధైర్యముఁ దెచ్చుకొనినపుడు, అతనిపాదములు ముందుకుఁ బడుచుండెను. నీటిసుళ్లు జలప్రవాహము ననుసరించి వెళ్లువిధమున, నతనిమనస్సు పరిపరివిధముల బరిణమించెను. అతని వాత్సల్యమును విచారమును నిషాదపతిచూచి, మైమఱచెను. శ్రీరాముఁడు భక్తవత్సలుఁడని భరతుఁడు తలంచి, యుత్సాహముతో ముందునకు నడచును.

దోహా 241

అప్పుడు శుభశకునములు కనఁబడెను; పక్షులధ్వనులను నిషాదపతివిని, వానిఁబట్టి శకునముఁ జెప్పెను; "దుఃఖముపోవును; సంతోషము కలుగును; కాని, తుదకు విషాదమువచ్చును."

చౌపాయ్

ఆనిషాదపతిమాటలు సత్యమని భరతుఁడు తెలిసికొని, రాముని యాశ్రమమును సమీపించెను.అచ్చటనుండిన తరుశైలపాషాణములను భరతుఁడుచూచి, సప్రమోదేతముగుపకాశ్వస్నముఁజూచినటుఖార్తునివలె సంతోషించెను. ఈతిభీతిబాధలు,త్రివిధతాపములు,గ్రహబాధలు మొదలగువానిచేత దుఃఖించుచుండినవారు సుభిక్షముగనుండిన సురాజ్యమునకు వెళ్లి సంతసించువిధమున, నతఁడు సంతసించెను. సురాజ్యములో నివసించుప్రజలు సంపూర్ణకళాప్రవీణులై యుండువిధమున, రాముఁడు నివసించియుండినవనము కళకళలాడుచుండెను. పరమపవిత్రమగు వనమే-యొకదేశము, జ్ఞానము-రాజు; వైరాగ్యము - మంత్రి; సంయమనియమములు-యోధులు; ఆచిత్రకూటశైలము - రాజధాని; శాంతి, సుమతి, పవిత్రత-మువ్వురు మహారాణులు; అన్నియంగములలోను రాజు సంపూర్ణుఁడు; ఆరాజు శ్రీరామునిచరణముల నాశ్రయించియుండినందున, నతనితో సమానమగుబలవంతులు లేరు.

దోహా 242

శ్రీరాముని కృపచేత నాజ్ఞానరాజు, మోహమనురాజును జయించెను. ఆజ్ఞానరాజు నిష్కంటక రాజ్యము బరిపాలించుచుండెను. అతని రాజ్యములో సకలసంపదలును, సుఖములును కలవు; కాల మొక్కరీతిని బోవుచుండును.

చౌపాయ్

అచ్చటచ్చట వనములలోనుండిన మునీశ్వరులయాశ్రమములు-నగరములు, గ్రామములు, పల్లెలు; చెప్పుటకు శక్యము కాని చిత్రవిచిత్రమగుపక్షులును, మృగములును- దేశీయులు; సింహములు, వ్యాఘ్రములు, ఏనుగులు, గుఱ్ఱములు, మహిషములు, సృగాలములు, వరాహములు, వృకములు మొదలగుజంతువులు స్వాభావికవైరమును విడిచి, కలసిమెలసి తిరుగుచుండెను ఈజంతువులే-చతురంగబలములు; కొండపైనుండి జాలిపడుచుండిన ధారలధ్వనులును, మదగజములబృంహితములును-రణభేరులును, బిరుదునిశానీలు; చక్రచకోరచాతకశుకపికగానంబులును, సంతోషముతో నాట్యముజేయుచుండిన మరాళములమంజులధ్వనులును, తుమ్మెదలఝంకారమును, మయూరముల నాట్యములును - నగరములో త్రికాలములయందుమ్రోగుచుండిన మంగళవాద్యములు; లతలును, వృక్షములును, పుష్పములును, ఫలములును-సకలమంగళముల కును, ఆనందమునకును మూలములు; లతలు-స్త్రీలు; వృక్షములు-పురుషులు; తృణములు-శిశువులు.

దోహా 243

తపస్సిద్ధిబొంది, నియమములనువిడిచి, సంతోషించుతపశ్శాలివలె, భరతుఁడు శ్రీరాముఁడు నివసించియుండినపర్వతముయొక్క శోభను జూచి, పరమానందభరితుఁడయ్యెను.

చౌపాయ్

ఒకనిషాదుఁడు వృక్షము నెక్కిచూచి, చేతులను మీఁదికియెత్తి, భరతునితో నిట్లు చెప్పెను; "ఓనాథా! ఆవిశాలమగుపాకర, జంబు, రసాల, తమాలవృక్షములఁ జూడుము; వానిమధ్య నొకవిశాలమగు చక్కని వటవృక్షము కన్నులకింపుగఁ గలదు. దానిపల్లవములు నీలములు; దాని ఫలములు యెరుపు; అన్ని కాలములలోను దానినీడ చల్లగనుండును;

ఎఱుపును నలుపునుకలిపి, మూఁడులోకములలోని చక్కదనమునుదీసి, బ్రహ్మ దీనిని నిర్మించెనేమో యని కనఁబడును. నదీతీరమున, దీనినీడను శ్రీరామునిపర్ణశాల కలదు. జానకియు, లక్ష్మణుఁడును స్వయముగఁ దీసికొనివచ్చి, వేసినతులసీబృందావనము శోభస్కరముగ నున్నది. ఆచెట్టు క్రింద, జానకి స్వయము తనకమలహస్తములతో నొకవేదికను నిర్మించెను.

దోహా 241

"ఆవేదికమీఁద నిత్యము శ్రీసీతారాములు, మునిగణంబులతోఁగూడ, కూర్చుండి, వేదపురాణేతిహాసములను వినుచుందురు."

చౌపాయ్

సఖునివచనములను భరతుఁడువిని, అవృక్షమునుజూచి, పరమానందభరితుఁడై, కన్నీటఁగార్చెను. అన్నదమ్ములిరువురు దానికి దండప్రణామముఁజేసి వెడలిరి. వారియనురాగమును జెప్పుటకు సరస్వతిసహితము సంశయించును. పారదమణిని స్వీకరించినదరిద్రునివలె, భరతుఁడు శ్రీరాముని చరణచిహ్నములను జూచి, సంతోషించెను. శ్రీరామునిపాదరేణువుల నతఁడు తీసి, శిరస్సుపై ధరించి, హృదయమునకును నేత్రములకద్దుకొనెను. ఆశ్రీపాదరేణువుల నతఁడుచూచి, శ్రీరామునిజూచినట్లు సంతసించెను. చెప్పుటకు శక్యముగాని భరతుని యవస్థనుజూచి, చరాచరజంతుజాలములు ప్రేమమగ్నులయిరి. అన్నదమ్ములప్రేమాతిశయములను నిషాదపతిచూచి, మార్గమును మఱచెను; దేవతలు పుష్పములను వర్షించి, మార్గమును జూపించిరి. పరమానందభరితులై, మునులును సిద్ధులును సాధువులును వారినిఁజూచి, భరతుని కొనియాడిరి. "లోకములో భరతునివంటి వాఁడు కలఁడా? అతనిమహిమ యేమని చెప్పఁగలము! (అతనిభావము లోకములో నెవరికిని లేదు; దేవతలు స్వార్థపరులై జడులయిరి; ఎవరు వారికి చైతన్యమును తీసికొనిరాఁగలరు? చైతన్యముగల నిషాదపతిని యెవఁడు జడునిగఁజేసెను? భరతుని ప్రేమాతిశయముల నతఁడుచూచి గ్రహించి, మార్గమును మఱచెను.) పర్వత,తృణములు మొదలగునచరములు, చరములై నీరయ్యెను; చరములగుమునులు మొదలగువారతనివాత్సల్యమునుచూచి పరవశులయిరి; వారిశరీరములు శిథిలమయ్యెను."

దోహా 245

విరహము - మందరపర్వతము; భరతుఁడు - గంభీరమగు సముద్రము; ఆకృపాసాగరుఁడు శ్రీరాముఁడు దానిని మథించి, సురులను, సాధువులనిమిత్తము భరతునిప్రేమ యనునట్టి అమృతమును బుట్టించెను.

చౌపాయ్

వృక్షములు దట్టముగ నుండుటచేత, భరతశత్రుఘ్నులనుగాని, వారిసఖునిగాని లక్ష్మణుఁడు చూచుటకు వీలులేకపోయెను. పరమపవిత్రమును సన్మంగళాకరమునగు శ్రీరామునియాశ్రమమును భరతుఁడు చూచి సంతసించెను. ఆశ్రమములో నతఁడు ప్రవేశించినతరువాత, నతనిమనోతాపము శాంతించెను. పరమార్థమును సంగ్రహించినయోగీశ్వరునివలె నతఁడు ముదమందెను. శ్రీరామునితో సంభాషించుచుండిన లక్ష్మణుని నతఁడు ముందునకుఁ జూచెను. అత్యాప్యాయముతో లక్ష్మణుఁడు రామునితో ముచ్చటించుచుండెను. లక్ష్మణునిశిరముపై జటాముకుటము, నడుమునకు మునివస్త్రమును దూణీరమును,హస్తములో బాణమును, భుజమునకు ధనుస్సును గలవు. శ్రీరాముఁడు జానకితోఁగూడి, సాధువులును మునులును బరివేష్టించియుండ, వేదికపైఁగూర్చుండి, దేదీప్యమానముగ వెలుఁగుచుండెను.

వల్కల । వసన । జటిలతను । శ్యామా,
జను । ముని । వేష । కీన్హ । రతి కామా॥
కర । కమలన్హ । ధను । శాయక । ఫేరత,
జీకీ । జరని । హరత । హసి । హేరత॥

శ్రీరాముఁడు వల్కలాంబరములను ధరించియుండెను; అతఁడు శిరస్సుపై జటాముకుటమును బంధించెను; అతనిశరీరము శ్యామలము. ('ల'కార, 'ర'కారములకు సావర్ణ్యసంజ్ఞ. వల్కల=వర+కల; వర=శ్రేష్ఠమగు; కల=సుందరమగు; వసన=వస్త్రములను; శ్యామా 16-సంవత్సరములబాల (సీత); జటిలతను=శరీరముపై వ్రేలుచుండిన గొప్పశిరోజములు.) మునివేషములను ధరించిన రతీకాములువలె, వారిరువురు ప్రకాశించుచుండిరి;

దోహా 246

లసత । మంజు । ముని । మండలీ,
మధ్య । సీయ । రఘుచంద॥
జ్ఞాన । సభా । జను । తనుధరె,
భక్తి । సచ్చిదానంద॥

జ్ఞానసభలో మూర్తిభవించినభక్తియు సచ్చిదానందమునువలె, మునీశ్వరులసభలో శ్రీజానకీసహితశ్రీరామచంద్రుఁడు దేదీప్యమానముగఁ బ్రకాశించుచుండెను.

చౌపాయ్

భరతశత్రుఘ్నులును, నిషాదపతియు వారినిజూచి, హర్షవిషాదములను, సుఖదుఃఖములను మఱచి, నిశ్చేష్టులయిరి. "రక్షాకరో నాథ! రక్షాకరో" అని పలికి దండమువలె భరతుఁడు భూమిమీఁదఁబడెను. అతని ప్రియవచనములఁబట్టియు, అతని ప్రణామముఁబట్టి, యతఁడు భరతుఁని లక్ష్మణుఁడు తెలిసికొనెను.

దోహా 247

బలాత్కారముగ భరతుని శ్రీరాముఁడు లేవదీసి, గాఢాలింగనముఁ జేసికొనెను. శ్రీరామభరతులసంయోగమును జూచినవారు సంతోషముచేఁ బరవశులయిరి.

చౌపాయ్

ఆసమయమున వారియనురాగమును జెప్పుటకు శక్యముకాదు. మనోవాక్కర్మలచే దానిని కవీశ్వరులు వర్ణించి చెప్పలేరు. ఆయనురాగము వారికి నగమ్యము. అత్యంతానురాగములో వారు కలసికొనిరి; వారు మనోబుద్ధిచిత్తాహంకారములను మఱచిరి. కవీశ్వరులబుద్ధిఛాయనైనను గ్రహింపఁగలదు; కాని, వారిరువురప్రేమాతిశయములను మాత్రము వర్ణింపలేదు. కవీశ్వరులకు వాక్యార్థములు ప్రమాణము; వానిని యనుసరించి, వారు వర్ణింపఁగలరు; నటులకు తాళము ప్రమాణము. వారిరువురప్రేమాతిశయమును వర్ణించుటకుఁ బ్రమాణములేదు. వారిస్నేహము పరుల కగమ్యము. బ్రహ్మవిష్ణుమహేశ్వరులుసహితము దానిని గ్రహింపలేరు. వారిస్నేహమును నేనెట్లు వర్ణింపఁగలను? గడ్డిపోఁచతో వీణెను మీటించినయెడల, మధురమగురాగము వెలువ

డునా? శ్రీరామభరతులసమాగమముఁజూచి దేవతలు భయపడి, గడ గడవణఁకిరి మరల బృహస్పతి చెప్పినమాటలవలన, వారు తెలివిఁదెచ్చుకొని, పుష్పములను వర్షించి, వారినిఁ గొనియాడిరి.

దోహా 248

శ్రీరాముఁడు శత్రుఘ్నుని నాదరించి, నిషాదపతిని సత్కరించి సన్మానించెను. అటులనే, లక్ష్మణుఁడు భరతునకు నమస్కరించి యాదరించెను.

చౌపాయ్

తదుపరి, లక్ష్మణుఁడు శత్రుఘ్నుని కౌఁగిలించుకొని, నిషాదపతిని యాలింగనముఁజేసికొనెను. భరతశత్రుఘ్నులు మునీశ్వరులను నమస్కరించిరి; వారిదీవనలఁబొంది, వారు సంతసించిరి వారిరువురు సంతోషములో జానకిచరణకమలములకు నమస్కరించి, ఆమెపాదధూళిని శిరముపై ధరించిరి. ఆమెపాదములకు వారు మాటిమాటికిఁ బ్రణమిల్లిరి; ఆమె భరతుని లేవఁదీసి, తనకమలహస్తముల నతనిశిరముపైనుంచి, అతనిని గూర్చుండఁబెట్టెను. ఆమె, మనస్సులో వారిని దీవించెను. వారియందుఁగల ప్రేమాతిశయముచే నామె పరవశురాలై, మాటఁజెప్ప లేకయూరకుండెను. ఆమె ప్రసన్నురాలై నందులకు భరతుఁడు సంతసించెను; అతనిమనోతాపము శాంతించెను. అతనిమనస్సులోని సంకోచములు విడిపోయెను ఆసమయమునఁ బ్రసంగించువాఁ డొకఁడయినను లేకపోయెను; అడిగినవాఁడు లేఁడు; చెప్పినవాఁడు లేఁడు. వారిమనస్సులు ప్రేమపూరితములై యుండెను; అందుచేత, వారిహృదయములు కొట్టుకొనుటలేదు. అప్పుడు నిషాదపతి ధైర్యముఁదెచ్చుకొని నమస్కరించి, చేతులను జోడించుకొని విన్నవించెను.

దోహా 249

"ఓనాథా! మీవియోగదుఃఖమును సహింపలేక గురువులును, ముువ్వురుతల్లులును, మంత్రులును, సేనాధిపతులును, పురజనులును మీదర్శనమునకువచ్చి నిరీక్షించుచుండిరి" అని యతఁడు చెప్పెను.

చౌపాయ్

ఆశీలనిధి, ఆధర్మధురంధరుఁడు, ఆదీనదయాపరమూర్తి, గురువు ఆగమనమునువిని, ప్రేమాతిశయముచే దిగ్గునలేచి, శత్రుఘ్ననకు జాన

కిని నప్పగించి, పరుగెత్తివెళ్లెను. రామలక్ష్మణులు గురువునుజూచి, సంతోషముతో నతనిచరణములకు దండప్రణామముఁ జేసిరి. వసిష్ఠులు శ్రీరాముని లేవఁదీసి, కౌఁగిలించుకొని, అన్నదమ్ముల నిరువుర నాదరించెను. ప్రేమచే నిషాదపతిశరీరము పులకరించెను. అతఁడు పేరుఁజెప్పుకొని, దూరముననుండి, గురువునకు బ్రణమిల్లెను. నేలమీఁదఁబడినస్నేహమును నెత్తుటకు యత్నించినవిధమున, నతఁడు శ్రీరామునిసఖుని లేవఁదీసి యాదరించెను. "శ్రీరామభక్తి సుమంగళములకు మూలము" అని దేవతలు వ్యోమమార్గమున నిలువఁబడి, కొనియాడి, పుష్పములను వర్షించిరి. "ఆహా! వసిష్ఠునివంటిమహాత్ముఁడును, నిషాదపతివంటినీచుఁడును లోకములో లేరు.

దోహా 250

"లక్ష్మణునియెదుట మహాముని రాజు నిషాదపతినిఁజూచి, సంతోషించి, యతనినిఁ గౌఁగిలించుకొనెనుగదా! ఇందుమూలమున సీతాపతిని భజించుటవలనఁ గలిగినమహాత్మ్యము ప్రకటమయ్యెను."

చౌపాయ్

ఆకరుణాకరుఁడు, ఆచతురుఁడు పురజనుల దైన్యముఁజూచి, జాలిపడి, యెవరిని యేవిధమున నాదరింపవలయునో, వారిని ఆవిధమున నాదరించి, వారియోగక్షేమమును కనుఁగొనెను. ఒకక్షణములో రామలక్ష్మణులు వారితోఁ గలసిమెలసి తిరిగి, వారిదుఃఖమునుబోఁగొట్టి, వారి మనోతాపమును శాంతింపఁజేసిరి. శ్రీరామున కిది యొకగొప్పపనికాదు; ఏకకాలములో ననేకఘటములలో సూర్యుని ప్రతిబింబము కనఁబడును కదా! శ్రీరాముఁడు పురజనులతోఁగలసి, మరల నిషాదపతితోఁగూడి ముచ్చటించెను. ఆగుహునియదృష్టమును జనులు కొనియాడిరి. హిమముచేఁ గొట్టఁబడినలతలవలె నుండినతల్లుల నతఁడుచూచెను. ప్రథమమున నతఁడు కైకేయినిఁజూచి, నమస్కరించి, సరళమగు భక్తిమాటలనుజెప్పి, యామె బుద్ధిమాంద్యమును బోఁగొట్టెను. ఆమెపాదములమీఁద నతఁడు పడి, అనేకవిధముల నామెను బోధించి, యిదియంతయుఁ గాలకర్మమనియు, విధికృతమనియు చెప్పి, ఆమె నిర్దోషియని బోధపఱచెను.

దోహా 251

అనంతర మతఁడు తల్లులను నమస్కరించి, "ఓతల్లులారా! మీరు

విచారింపకుఁడు; ఒకరిని దూషించుటవలన లాభములేదు. లోకము పరమేశ్వరునియధీనము" అని బోధించెను.

చౌపాయ్

రామలక్ష్మణులు గురుభార్యచరణములకు నమస్కరించిరి; ఆమె వెంటనుండిన బ్రాహ్మణస్త్రీలకు వారు ప్రణమిల్లిరి. వారు గంగాభవానీసమానులని వారు తలంచి వారిని సన్మానించిరి; అన్నదమ్ముల నిరువురను వారు కోమలవాక్యములతో దీవించిరి. అనంతరము, రామలక్ష్మణులు సుమిత్రకు నమస్కరించి, యామెతోడఁ బైఁ గూర్చుండిరి; దరిద్రునకు సంపదవచ్చినట్లు ఆమె వారినిఁ జేరఁదీసి సంతోషించి, వారిని నాలింగనముఁ జేసికొనెను. తదుపరి, వారు వ్యాకులచిత్తులై, తల్లి కౌసల్యపాదములమీఁదఁబడిరి. ఆమె వారిని అత్యంతానురాగముతో నాలింగనముఁ జేసికొనెను; ఆమె కన్నీరుఁగార్చి, వారిని తడిపెను. ఆసమయమునఁ గలిగినహర్షవిషాదముల నేకవీశ్వరుఁడును వర్ణించిచెప్పలేఁడు. మూఁగవాఁడు రుచిచూచిన మాధుర్యమును చెప్పఁగలఁడా? రామలక్ష్మణులు తల్లులతోఁగూడి యాశ్రమమునవిజయంచేయుఁడని గురువును వేఁడిరి. మునియాజ్ఞప్రకారము పురజనులు జలమును స్థలమును జూచుచు వెడలిరి.

దోహా 252

బ్రాహ్మణులను, మంత్రులను, దల్లులను, గురువును, పురజనులను వెంటదీసికొని, శ్రీరామలక్ష్మణభరతులాశ్రమమునకు వెడలిరి.

చౌపాయ్

జానకివచ్చి, గురువుచరణములకు నమస్కరించెను; ఆమె మనోభిప్రాయముప్రకార మామె నతఁడు దీవించెను. గురుభార్యను బ్రాహ్మణస్త్రీల నామె యాదరించి, సత్కరించి, పొందినసంతోషమును వర్ణించిచెప్పుటకు శక్యముకాదు. ఆమె మాటిమాటికి వారిచరణములకు నమస్కరించి, వారిదీవనలను గైకొని సంతసించెను. ముప్పురత్తలు జానకినిఁ జూచి, ఆమె సుకుమారియని తెలిసికొని, యామెదుర్దశను జూడలేక, నేత్రములను మూసికొనిరి. వేఁటకానిచేతిలోఁజిక్కిన హంసినివలెనుండిన జానకిని వారు చూచి విచారించిరి. ఆహా! దైవమా! ఎంతకఠినముగఁ బ్రవర్తించితివి! అప్పుడు జానకి ధైర్యముఁదెచ్చుకొని, కపుల

ములవంటి నేత్రముల వెంబడి నీరు గారుచుండ, ముగ్గుర త్తలవద్దకు వెళ్లి, వారికి నమస్కరించి, యాదరించి, కలసిమెలసి సంభాషించెను. ఆసమయమున లోకమంతయుఁ గరుణామయమయ్యెను.

దోహా 253

పునఃపునః వారిచరణముల కామె నమస్కరించి, వారితో నాదరణపూర్వకముగ సంభాషించెను. "సౌభాగ్యవతీభవ" అని వారు మనస్ఫూర్తిగ దీవించిరి.

చౌపాయ్

జానకియు ముగ్గురుతల్లులును ప్రేమాతిశయముచే వ్యాకులలయిరి. అప్పుడు వారిని కూర్చుండుమని గురువు బోధించెను. ఆమునినాథుఁడు లోకవ్యాపారమును గుఱించిముచ్చటించి,లోకములోనిసంబంధములు మాయాకల్పితములని బోధించి, పరమార్థకథలనుజెప్పి, దశరథమహారాజు స్వర్గస్థుఁడయినసంగతిని వెల్లడిచేసెను. తండ్రిమరణమును రాముఁడువిని, దుఃఖించెను "ఆహా! నామీఁదఁగల దయచేతఁగదా, నావియోగదుఃఖమును సహింపలేక, నాతండ్రి ప్రాణములను విడిచిపెట్టెను." అని ఆధైర్యధురంధరుఁడగు శ్రీరాముఁడు విచారించి దుఃఖించెను. వజ్రమువలె, హృదయములను ఛేదించునట్టి దుర్వార్తను శ్రీసీతాలక్ష్మణులు విని, రాణులతోఁగూడి యేడ్వసాగిరి. ఆసమాజమువారు విచారగ్రస్తులయిరి. ఆదినమున మహారాజు చనిపోయినట్లు, వారు విలపించిరి. అప్పుడు వసిష్ఠుఁడు శ్రీరాముని, సమాజమువారిని బోధించి, మందాకినిలో స్నానముఁజేయుమని చెప్పెను. ఆదినమున శ్రీరాముఁడును, పురజనులును నిర్జలోపవాసముఁజేసిరి; మునీశ్వరుఁ డెంతచెప్పినను, వారు జలమునయినను పానముఁ జేయలేదు.

దోహా 254

అంత ప్రాతఃకాలమయ్యెను. అప్పుడు మునీశ్వరునియాజ్ఞాప్రకారము, శ్రీరాముఁడు భక్తిశ్రద్ధలతోఁ బితృకార్యములను సాంతముగఁ జేసెను.

శ్లో. జీవత్సు తాతపాదేషు నూతనేదారసంగ్రహే,
మాతృభిః పాల్యమానానాం తేహినోదివసాగతాః.

# పంచపంచాశద్విశ్రామము.

చౌపాయీ

మహాపాపాంధకారములను బోఁగొట్టుటకుసూర్యునివంటి శ్రీరాముమూర్తి వేదోక్తప్రకారము పితృకార్యములను నిర్వర్తించి, పరిశుద్ధుఁడయ్యెను. పాపములను దహించుట కతనినామ మగ్నివంటిది; సకల సుమంగళముల కతనినామము మూలము. సాధుసమ్మతమగునట్లు శ్రీరాముఁడు పరిశుద్ధుఁడయ్యెను. 'గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి, నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధిం కురు' అని చెప్పుటవలన, తీర్థము పరిశుద్ధమగునట్లు, శ్రీరాముఁడు స్వయముగఁ జేయుటవలన, పితృకార్యములకుఁ బవిత్రతవచ్చెను. అతఁడు శుద్ధియయినతరువాత, రెండుదినములు గడచెను; అప్పుడు శ్రీరాముఁడు గురువుతో నిట్లు సంభాషించెను:—"ఓనాథా! ఈజనులందఱుఁ గందమూలఫలములను భుజించి, జలముఁ ద్రాగుచు, కడుకష్టములఁ బడుచుండిరి. భరతశత్రుఘ్నులను నాతల్లులను జూచినతరువాత, నొకనిమిషమొకయుగమువలె నాకుఁ గనఁబడుచున్నది. మీరు నగరమునకు వెళ్లుట యుచితము. మీ రిచ్చటనుంటిరి; రాజు స్వర్గస్థుఁడయ్యెను; నేను విస్తరించి చెప్పుట భావ్యముకాదు. ఓనాథా! ఉచితమగునట్లు వ్యవహరింపుడు."

దోహా 255

"హేధర్మసేతు! హేకరుణాసాగర! హేరఘునాథ! ఎందులకు నీవిట్లు పలుకవు! జనులు దుఃఖించుచుండిరి; కాని, రెండుదినములనుండి వారు నీముఖారవిందముఁజూచి సంతోషించుచుండిరి." అని గురువు చెప్పెను.

చౌపాయీ

ప్రచండవాయువు వీచినపుడు సముద్రముపై బోవుచుండినపడవ తల్లడిల్లువిధమున, శ్రీరామునివచనములను జనులువిని, వ్యాకులులయిరి. అనుకూలముగ వాయువు వీచినపుడాపడవ నిరుపద్రవముగఁ బోవునట్లు, మునీశ్వరునిమంగళవచనములను వారువిని, స్వస్థచిత్తులయిరి. మందాకినీ

నదిలో వారు త్రికాలములలో స్నానముఁజేసి సుఖముగ నుండిరి; ఆనదిని జూచుటవలన సకలపాపములు నశించును. ఆశ్రీరాముని దివ్యమంగళ విగ్రహమును వారు కన్నులారఁజూచి, చూచి, అతనికి దండప్రణామముఁజేసి, పరమానందభరితు లగుచుండిరి. వారు రామశైలమును వనమును జూచుటకు వెళ్లుచుండిరి; ఆప్రదేశములు సుఖాస్పదములు; సకల దుఃఖరహితములు; అమృతోపమానమగుజలములతోఁగూడినసెలయేళ్లు ప్రవహించుచుండును; తాపత్రయమును హరించు మందసుగంధశీతల వాయువులు ప్రసరించుచుండును. వృక్షములును, పత్రములును, లతలును,తృణములును,నానాజాతులఫలపుష్పములును గలవు; సుందరమగు శిలలు కలవు; తరుచ్ఛాయలు సుఖదాయకములు;ఆవనస్థలి ప్రకృతిసంపద నిరుపమానముగ నుండెను; దానిని వర్ణించుట శక్యముకాదు.

దోహా 256

కమలములు నదులలో వికసించియుండెను; వానిపై జలపక్షులు విహరించుచుండెను; తుమ్మెదలు ఝంకారముఁ జేయుచుండెను. మృగవిహంగములు వైరమునువిడిచి, సంచరించుచుండెను.

చౌపాయీ

అమృతోపమానమగు తేనెను దిత్తులలోఁబోసికొని కోలుకిరాతులును, భిల్లులును, వనవాసులును వచ్చిరి. పుల్లలతోఁగుట్టినయాకుల దొన్నెలనిండ కందమూలఫలములను బెట్టుకొని వారు వచ్చిరి. అయోధ్యాపురజనులకు వారు నమస్కరించి, ఆవస్తువులను వారికిచ్చిరి. వాని మాధుర్యమును వారు కొనియాడుచు, వానిని భక్షించిరి; పురజనులు వానిమూల్యమును వారికిచ్చినను, వారు గైకొనలేదు; వారు శ్రీరాముని తోడు అనిచెప్పి, వానిని వారికిచ్చుచుండిరి. వారు పురజనులతో నిట్లు మృదుమధురముగ సంభాషించుచుండిరి:—“మేమిచ్చినపదార్థములను మీరు గైకొనరా? అనురాగపూర్వకముగ నిచ్చినపదార్థములను మహాత్ములు స్వీకరించి, ప్రసన్నులగుచుందురు. మీరు పుణ్యాత్ములు; మేము నీచులమగు నిషాదులము. శ్రీరామునికటాక్షమువలన, మీదర్శనము మాకు లభించెను. మారవాడదేశములో నివసించువారికి గంగానదివలె, మీదర్శనము మాకు దుర్లభము. శ్రీరామమూర్తి మాప్రభువు;

మాపోషకుఁడు; ఆగ్రామకృపాలుఁడు మారక్షకుఁడు. 'యథారాజా తథాప్రజాః' అని లోకోక్తి కలదు.

దోహా 257

"ఓజనులారా! ఈసంగతులను మీరు మీమనస్సులో విచారించి, మాస్నేహమును గ్రహించి సంశయింపక, మామీఁద దయఁజూపి, మేమిచ్చినఫలములను దృణములను నంసుగములను స్వీకరించి, మమ్ములను గృతార్థులఁజేయుఁడు.

చౌపాయ్

"మీరు మాప్రియాతిథులు; మీరు మావనమునకు వచ్చితిరి. మాభాగ్యము మిమ్ములను సేవించుటకుఁ దగినది కాదు. ఓఅయ్యలారా! ఏమి మీకియ్యఁగలము? ఇంధనములను బత్త్రములను నేస్తముఁ గట్టుటకు మేమియ్యఁగలము; మీగిన్నెలను బట్టలను దొంగిలించకయుండుటయే మాసేవ; మేము జడజీవులము; జీవహింసకులము; అల్పులము; కుటిలస్వభావులము; కుమతులము; కుజాతులము; పాపకార్యములఁ జేయుటలో మాదివారాత్రములు గతించును; కట్టుకొనుటకు మాకు బట్టలా లేవు; కడుపునిండ తినుటకు మాకు తిండిఅయిన లేదు. స్వప్నమందయినను మాకు ధర్మచింతయుండదు. శ్రీరామసందర్శనప్రభావమువలననే, మీకు శుశ్రూషఁజేయుటకు మాకు బుద్ధిపుట్టెను శ్రీప్రభువుల చరణకమలములను దర్శించుటవలన, మాదుఃఖములును పాపములును నశించెను." ఈప్రకారము కోలుకిరాతులు పలికినపలుకులను బురజనులు విని సంతసించి, వారియదృష్టమును గొనియాడిరి.

ఛాంద్ 11

ఈప్రకారము పురజనులు వారిని గొనియాడిరి. ఆవనవాసుల ప్రియవచనములను వారు వినుచుండిరి; వారిమాటలను, వారికలుపుఁగోలుతనమును, శ్రీరామునిచరణములయందు వారికిఁగల యనురాగమును పురజనులుచూచి సంతసించిరి; "ఆహా! ఈవనవాసులకుఁగల యనురాగము మనకు లేదుకదా!" అని స్త్రీపురుషులు చింతించి, తమకు శ్రీరామునియందట్టివాత్సల్యము లేదుకదా యని నిందించుకొనిరి. ఆకృపాసముద్రుఁడగు శ్రీరామచంద్రుని ఆరఘువంశశిరోమణియొక్క కటాక్షమే

యొకనావ; ఆకోలుకిరాతులు లోహామువంటివారు; నీ రానావమీఁదఁ గూర్చుండి సంసారసాగరముయొక్కదరిఁ జూచిరి.

సోరఠా 12

శ్రీరాముని వియోగముచేత దుర్బలులయియుండిన పురజనులు శ్రీరాముని సంయోగముచేఁ గలిగినసంతోషముచే బలిష్ఠులై వనములో విహరించుచుండిరి; వర్ష కాలప్రారంభమున వర్షజలమునుబొంది, బలిసి సంతోషముచే విహరించుమండూకములును, మయూరములునువలె వారు విహరించిరి.

చౌపాయ్

పురజనులు స్త్రీపురుషులు పరమానందమగ్నులై, దివారాత్రములు నిమిషమువలె (రెప్పపాటువలె) గడపిరి. అనేకరూపములను జానకి ధరించి, ముప్పుర త్తలను సమానముగ సేవించుచుండెను. ఆమె చేసినమాయ మఱియొకరికి లేశమైనఁ దెలియదు.ఒక్కశ్రీరామచంద్రునకే తెలియును; ఆమహామాయాస్వరూపిణియగు జానకికి మాయలన్నియు లోఁబడియుండును; ఆశ్రీరామప్రభువు మాయాపతి. ఆమె ముప్పుర త్తలను సేవించి, వారిని వశ్యముఁజేసికొనెను. వారు సంతసించి, జానకికి బుద్ధులఁజెప్పి ఆమెను దీవించిరి. శ్రీసీతారామలక్ష్మణుల సరళచిత్తమును కుటిలస్వభావురాలగు కైకేయిచూచి, మనస్సులోఁ బలువిధములు పశ్చాత్తాపము పడెను "ఆహా! ఈభూమి రెండు వ్రక్కలయిన యెడల, నేను దానిలో దూఱి యుందునుకదా! నేను గోరినను ఓ దైవమా! నాకు మృత్యువు రాదు. శ్రీరామవిముఖునకు నరకము సహితము స్థలము నిచ్చుటకు వెఱచును. అయోధ్యానగరమునకు శ్రీరాముఁడు వచ్చునో రాఁడో యని పురజనులు సందేహించుచుండిరి."

దోహా 258

భరతునకు రాత్రి నిదురలేదు; పగలు ఆఁకలిలేదు; దుఃఖముచే నతఁడు వ్యాకులుఁడై యుండెను. కొంచెమబురదలోనుండిన మీనమువలె, నతఁడు చింతించుచుండెను. ఆబురదలోఁ గొంచెమునీరుండినను, మీనము మునిఁగియుండుటకుఁ దగినంతనీరు లేదు. ఆమీనమువలె నతఁడు సంశయించుచుండెను. (ఆబురదలో మీనమువలె భరతుఁడు శ్రీరామునివద్దఁ గొంచెముకాలమే యుండును. మీనమునకు కొంగల

భయము కలదు; భరతునకు శ్రీరామునియాజ్ఞ భయముకలదు; జలము లేక మీనము జీవించియుండలేదు; అటులనే శ్రీరాముఁడు లేక భరతుఁడు జీవించియుండలేఁడు.)

చౌపాయ్

"కైకేయి యనుమిష చేత, కాలుఁడీకృత్రిమకార్యముఁజేసెను; శ్రీరాముఁడు కిరీటమును ధరించుటకుబదులు జటాముకుటమును బంధించెను; పంటముఖమునకువచ్చిన పంట, ఈతిబాధవలన నశించినట్లయ్యెను. ఏవిధమున శ్రీరాముని యభిషేకము జరగునో, నాకు బోధపడదు. గురువాజ్ఞాపించినయెడల, శ్రీరాముఁడు తిరిగివచ్చును; కాని, శ్రీరామునిచిత్తము ననుసరించి, గురువు ప్రవర్తించును. తల్లిమాటప్రకారము శ్రీరాముఁడు సంచరించును; కాని, ఆమెకూడ ధర్మమునకుఁ గట్టువడి, రాజ్యమును విడిచిపెట్టుమని కుమారునకుఁ జెప్పెను; ఈవిషయములో నామె మూర్ఖించి, రాముని మరలింపదు. నేను శ్రీరామునితోఁ జెప్పవచ్చుననిన, నేను సేవకుఁడను; నామాట నెవరు పాటించెదరు! ఈసమయమూ మంచిదికాదు; నాయెడల, విధాత ప్రతికూలముగ నుండెను. నేను మూర్ఖించినను నామాట అసత్యమగును. సేవకధర్మము కైలాసపర్వతముకంటె నధికభారముగ నుండును." శ్రీరామునకు భయపడియే శివుఁడు సతీదేవిని విడిచిపెట్టెను. సేవకధర్మము కైలాసముకంటె నధికనిర్మలముగనుండును; దానికి కళంకముదెచ్చుట మంచి పనికాదు. గురువాజ్ఞను మన్నించికదా, వింధ్యాచలము వంగియుండెను. ఏయుక్తియు భరతునిమనస్సునకు సరిపడలేదు. ఈప్రకార మతఁడు చింతించుచుండ, రాత్రి గతించెను; అతఁడు ప్రాతఃకాలమున లేచి స్నానసంధ్యాద్యనుష్ఠానములఁజేసి, కూర్చుండ, యంతలో మునిరాజతనికి వర్తమానముఁ బంపెను.

దోహా 259

భరతుఁడు గురువుచరణములకు నమస్కరించి, యతనిసెలవుఁగైకొని కూర్చుండెను. ఆసమయమున బ్రాహ్మణులును, మహాజనులును, మంత్రులును సభజేసి కూర్చుండిరి.

చౌపాయ్

అప్పుడు మునిరాజు సమయోచితముగ నిట్లుప్రసంగించెను.

"ఓసభికులారా! ఓభరతుఁడా! చతురుఁడవగుభరతా! నామాటలను వినుఁడు. శ్రీరాముఁడు ధర్మధురీణుఁడు; సూర్యకులమునకు సూర్యుఁడు; తల్లిదండ్రులయాజ్ఞ నతఁ డెట్లు నిరాకరించును? సూర్యునివలె నతఁడు సకలప్రదేశములను ప్రకాశింపఁజేయవలయును కదా! అతఁడు రాజు; సకలజనులను రక్షింపఁజేయవలయును; అతఁడు షడ్గుణైశ్వర్యసంపన్నుఁడు; స్వవశమతనికి వశ్యమైయుండును. అతఁడు సత్యసంకల్పుఁడు; ప్రపంచభారమును దగ్గించుటకును, వేదమర్యాదలను సంస్థాపించుటకును, లోకములకు మంగళములను కలుగఁజేయుటకు నతఁడు భూలోకములో నవతరించెను. గురు మాతా పితృలయాజ్ఞ నతఁడు మన్నించును; వారియాజ్ఞప్రకారము సంచరించునుకదా! ధర్మమునకు విరుద్ధముగ సంచరింపుమని నే నతనితో నెట్లు చెప్పఁగలను? దుష్కర్ములగు రాక్షసులను సంహరించుటకును, దేవతలను సంరక్షించుటకును, ధర్మమును స్థాపించుటకు నతఁ డవతరించెను. నీతియుఁ, బ్రీతియుఁ, బరమార్థమును, స్వార్థములయథార్థము నెఱింగినవాఁడు శ్రీరాముఁడుతప్ప మఱియొకఁడు లేఁడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులును, సూర్యచంద్రులును, అష్టదిక్పాలురును, మాయయు, జీవులును, సంపూర్ణ కాలకర్మములును, శేషుఁడును, మహీపాలురును - ఈ మొదలగు ప్రభుత్వము గలవారందఱును, వేదశాస్త్రములును, యోగములును, అణిమాదిసిద్ధులును- మీరు లెస్సగ విచారించి చూడుఁడు; శ్రీరామునియాజ్ఞను శిరసావహింతురు; అతనియాజ్ఞ వారిపై శిరమువలెనుండును; అతని నాజ్ఞాపించువారు లేరు.

దోహా 260

"శ్రీరామునిచిత్తమును గనిపెట్టి, అతనియాజ్ఞలను మన్నించుటయే మనకు శ్రేయస్సు; ఓసభికులారా! మీరు చతురులు; సకలకళాప్రవీణులు కనుక నాలోచించి, మీమీచిత్తానుసారము జనసమ్మతమగుకర్తవ్యమును నిరూపింపుఁడు.

చౌపాయ్

"శ్రీరామునిపట్టాభిషేకము, సకలజనులకు సుఖదాయకము; సకలసన్మంగళములకు నది యొకటియే మార్గము. ఏవిధమున శ్రీరాముఁడు

నగరమునకు తిరిగివచ్చును? మీరాలోచించి చెప్పుడు; ఆప్రకారము సంచరించెదము.'' ఆమునిరాజు చెప్పినమాటలు నీతియుక్తములు; స్వార్థ పరమార్థములలో మునిఁగియుండెను; అందుచేత వారు మాటఁజెప్ప లేక యూరకుండిరి. వారినోళ్లు కట్టువడెను; అప్పుడు భరతుఁడు లేచి వారికి నమస్కరించి, చేతులను జోడించుకొని, వారితో నిట్లు ప్రసంగించెను "ఓసభికులారా! సూర్యవంశములో ననేకరాజులు పుట్టిరి; వారిలో నొకరికంటెనొకరు ఘనతకెక్కిరి; తల్లిదండ్రులే వారిజన్మములకుఁ గారణము. పిల్లలను పోషించి పెద్దవారిని జేయుటయే తల్లిదండ్రులపని గాని, పిల్లలభాగ్యభోగ్యములకు వారు కర్తలు కారుకదా! భగవంతుఁడు కేవలము వారికర్మమునకుఁ దగినఫలమును వారికిచ్చును. మీ యాశీర్వచనము సకలదుఃఖములను బోఁగొట్టి, కల్యాణములనిచ్చునని లోకవిదితము. ఓనాథా! బ్రహ్మవాక్యమును సహితము మీరు తుడిచివేసి, శుభఫలము నిచ్చితిరి; మీరు చేసినపనిని బాడుచేయుట దుర్లభము. (విశ్వామిత్రునికథ జ్ఞప్తికిఁదెచ్చుకొనుఁడు.)

దోహా 261

"ఓనాథా! మీరింతసమర్థులై యుండియు, నన్ను యుక్తిఁజెప్పుమని యడుగుచున్నారు. ఇట్లు మీరు నన్నడుగుట నానిర్భాగ్యముకాని, మఱియొకటికాదు.'' ఇట్లు భరతుఁడు పలికినప్రియవచనములను గురువు విని, ప్రసన్నుఁడయ్యెను; అతనిమనస్సులో ననురాగము పుట్టెను.

చౌపాయ్

"ఓతండ్రీ! భరతా! నీమాట సత్యము; ఇదియంతయు శ్రీరామునికటాక్షము. శ్రీరామవిముఖునకు స్వప్నమందైనను సిద్ధికలుగదు. దీనికొకమార్గము కలదుకాని, దానిని చెప్పుటకు సంశయించుచున్నాను. ఒకవేళ సర్వమునకు భంగమువచ్చునని భయముకలిగినపుడు, దానిలో సగము విడిచిపెట్టుట పండితధర్మము. మీయిరువు రన్నదమ్ములు వనమునకు వెళ్లినయెడల, శ్రీసీతారామలక్ష్మణులు నగరమునకు రాఁగలరు'' అతఁడు చెప్పిన చక్కనిమాటలను భరతశత్రుఘ్నులు విని, సంతోషించిరి; వారిశరీరములు సంతోషముచే నుప్పొంగెను; వారిముఖములు కలకలలాడెను. శ్రీరామునకుఁ బట్టాభి

షేకమయినట్లు వారు సంతసించిరి; దశరథమహారాజు బ్రతికివచ్చినట్లు వారు సంతోషించిరి. దీనివలన జనులకు లాభ మధికము; నష్టము స్వల్పము. రాణులకు మాత్రము సుఖదుఃఖములు సమముగ నుండుట చేత, వారు దుఃఖించిరి. "నాగురువులు మాటఁజెప్పినవెంటనే, దానిప్రకారము జరగునని నాయభిప్రాయము; దానిఫలము నాకు లభించెనని తలంచెద. లోకములో నేఁగోరినఫలము నాకువచ్చెనని సంతసించుచున్నాను. నాయావజ్జన్మము వనములో నివసించియుండెద. అంతకంటె నధికమును నేకోరను.

దోహా 262

"ఓనాథా! శ్రీసీతారాములు సకలాంతర్యాములు; మీరు చతురులు; సర్వజ్ఞులు; మీవచనములను మీరు ప్రమాణముఁజేసినయెడల, నేను వానిప్రకారము నడుచుటకు సందేహములేదు." అని భరతుఁడు చెప్పెను.

చౌపాయ్

భరతునివచనములను విని, అతనియనురాగముఁజూచి, మునిరాజును సభికులును బరవశులయిరి. భరతునిమహామహిమ సముద్రమువంటిది. సముద్రతీరమున నిలిచియుండిన స్త్రీవలె, నామునీశ్వరునిమతి భరతునిమహిమసముద్రతీరమున నిలిచియుండెను. ఆమహాసముద్రమును దాఁటుటకు నావగాని, పడవగాని, తెప్పగాని, మునిరాజునకు గోచరముకాలేదు. భరతునిమహిమ నెవరు చెప్పఁగలరు? నాబుద్ధి సరస్సులోఁబుట్టిన నత్తగుల్లవంటిది; మహాసముద్రమువంటి భరతునిమహిమ నాగుల్ల గ్రహింపఁగలదా! (సముద్రములోఁబడిన వస్తువును కెరటములు తీరమునకుఁ గొట్టివేయును; భరతునిమహిమలోఁ బ్రవేశింపఁగోరిన మునీశ్వరునిమతి యొడ్డునకుఁ గొట్టివేయఁబడెను. (ఇంతవఱకును భరతుఁడు మొదలగువారు పైనుండి ప్రసంగించుచుండిరి.) భరతునివచనములను మునిరాజువిని, లోలోన హర్షించెను. తదుపరి, వారందఱు కలసి, రాముని వద్దకు వచ్చిరి. శ్రీరాముఁడు గురువునకు నమస్కరించి, ఆసనముపై నతనినిఁ గూర్చుండఁబెట్టెను. గురువాజ్ఞప్రకారము వారందఱు కూర్చుండిరి. అప్పుడు, గురువు దేశకాలానుగుణ్యముగ నిట్లు

ప్రసంగించెను. "ఓరఘునాథా! నామాటను వినుము. నీవు సర్వజ్ఞుఁడవు; చతురుఁడవు; సకలధర్మములకును,నీతులకును,గుణములకును, జ్ఞానమునకును నీవు నిధివి.

దోహా 263

"సకల జీవుల హృదయాంతరాళములలో నివసించియుందువు. సుభావములను కుభావములును నీకుఁ దెలియును. నీపురజనులకును, నీతల్లులకును, నీతమ్ముఁడు భరతునకును హితవగునట్టియుపాయముఁ జూడుము.

చౌపాయ్

"ఆర్తుఁడు పూర్వోత్తరములను విచారింపక సంభాషించును; ఎంతవఱకు నాటలో జూదగాఁడు స్వప్రయోజనముఁ జూచుకొనును." ఇట్లు మునివర్యుఁడు పలికినపలుకులను రాముఁడువిని, యిట్లు ప్రత్యుత్తరము నిచ్చెను. "ఓనాథా! ఏయుపాయమైనను మీచేతిలోఁ గలదు. మీచిత్తానుసారము ప్రవర్తించుటవలన, సకలజనులకును శ్రేయస్సు కలుగును. మీయాజ్ఞను దయచేయుఁడు; దానిని సంతోషపూర్వకముగ నేను శిరసావహించెదను. మీయాజ్ఞాప్రకారము తదితరులు సంచరింపఁగలరు". "ఓరామా! నీమాట సత్యము. భరతునియందు నాకు గలవాత్సల్యముచే నాచిత్తము స్థిరముగ లేదు; నాబుద్ధిసహితము స్తంభించెను. మాటిమాటికి నేనొకమాటఁ జెప్పుచున్నాను; వినుము. భరతుని మీఁద నాకుఁగలప్రేమచే నామతి చలించెను. శివుఁడుసాక్షిగఁ జెప్పుచున్నాను. భరతునకు హితవగునట్లు పనిఁజేయుట యుచితమని నాయభిప్రాయము.

దోహా 264

"ప్రశమతిః, ఓరామా! భరతునివిన్నపము నాలకింపుము; ఆవిన్నపమును విచారించి, సాధుసమ్మతమును, లోకసమ్మతమును, రాజనీతికనుగుణ్యముగను, వేదసమ్మతమగునట్లు సంచరింపుము.''అని వసిష్ఠుఁడు చెప్పెను.

చౌపాయ్

గురువునకు భరతునిమీఁదఁగల వాత్సల్యమును రాముఁడు తెలిసికొని, పరమానందభరితుఁడయ్యెను. భరతుఁడు ధర్మధురంధరుఁడ

నియు, మనోవాక్కాయకర్మములచే నతఁడు తనసేవకుఁడనియు, తనక నుకూలముగఁ బ్రవర్తించుననియు రామునకుఁ దెలియును. గురువాజ్ఞ ననుసరించి, మృదుమధురమగు మంగళవాక్యములను శ్రీరాముఁడు పలికెను. "ఓనాథా! మీరే సాక్షి; నాజనకునిచరణములే సాక్షి; లోక ములో నాకు భరతునివంటితమ్ముఁడు మఱియొకఁడు లేఁడు. గురువుచ రణములయం దనురాగముకలవా రదృష్టవంతులని వేదములు ఘోషిం చుచున్నవి; అటులనే లోకులు చెప్పుచున్నారు. మీకతనిమీఁద నింతదయకలదు కనుక, నతనియదృష్టము నెవరు చెప్పఁగలరు? నాకంటె భరతుఁడు చిన్నవాఁడు; అతనిముఖము నెదుట నతనిని స్తుతించుటకు సంశయించుచున్నాను. భరతుఁడు చెప్పినప్రకారము మనము నడుచు కొనుట యుచితమని నాయభిప్రాయము". అని శ్రీరాముఁడుపలికి యూరకుండెను.

దోహా 265

అప్పుడు మునిరాజు భరతునితో నిట్లు పలికెను— "ఓభరతా! అన్నిసంశయములను విడిచిపెట్టుము. అదయాసాగరుఁడు, శ్రీరాముఁడు నీజ్యేష్ఠభ్రాత; నీమనోభిప్రాయము నతనితోఁ జెప్పుము."

చౌపాయ్

భరతుఁడు మునివచనములనువిని రామునిచిత్తమును గనిపెట్టి, వారువురు తనయం దనుకూలముగ నుండిరని తెలిసికొని సంతసిం చెను. అంతభారము నతనిశిరస్సుపై నుండుటచేత నతఁడు మాటఁజెప్ప లేక యూరకుండి విచారించుచుండెను; అతనిశరీరము పులకరించెను; సభ లో నతఁడు నిశ్చేష్టుఁడై నిలువఁబడియుండెను. కమలముపంటి యతని నేత్రములవెంబడి నీరు కారుచుండెను. "ఓనాథా! నేను జెప్పఁదలఁచి నవిషయములను మునిరాజు చెప్పియుండెను; అంతకంటె నధికము నేనే మి చెప్పఁగలను? నానాథునిస్వభావము నాకుఁ దెలియును. అపరాధముఁ జేసినవానినిసహితము వారు కోపింపరు. వారికి నామీఁద నధికముగ వాత్సల్యమును కటాక్షమును కలదు. ఆటలోనైనను వారు నన్ను కోపముతోఁ జూచియుండలేదు. నాచిన్నతనములోనైనను వారిని నేను విడిచియుండలేదు. ఎన్నడుకూడ, వారు నామనస్సును నొప్పించియుండ

లేదు. నానాథునికృపావిలాసములఁ జూచియుంటిని. ఆటలలో నేను వీఁగుచుండినపుడు, నానాథుఁడు నాకు గెలుపు నిచ్చుచుండెను.

దోహా 266

"అనురాగముచేతను, సిగ్గుచేతను, నేనింతవఱకు వారియెదుట నిలిచి, వారితో నొకమాటఁ జెప్పియుండలేదు. అనురాగముచే వారినిఁ జూడఁ గోరుచుండిన నానేత్రము లింతవఱకు వారిని జూచినను తృప్తిఁ బొందలేదు.

చౌపాయి

"నాయనురాగమునుజూచి బ్రహ్మ సహింపలేక, నాతల్లిద్వారా నాకీకష్టమును దెచ్చిపెట్టెను. ఈమాటఁ జెప్పుటచేత నాకు ఘనతలేదు; నాతల్లిపై నేరమును మోపుటవలన నాకేమి గొప్పకలదు? ఎవనికివాఁడు నిర్దోషిని అని చెప్పుకొనుటవలన, వాఁడు నిర్దోషియగునా? నాతల్లి మందమతి యనియు, నేను సాధువును, బుద్ధిమంతుఁడనని చెప్పుకొనుటకు నాహృదయములో ననేకసందేహములు పుట్టుచున్నవి. కోద్రవముల వెన్నులనుండి వరిగెంజలు వెడలునా? సరోవరములలోనుండిన నత్తగుల్లలో ముత్యములు పుట్టునా? కుమాతగర్భమున సుపుత్త్రుఁడు పుట్టునా? నాదుఃఖమున కితరులను దూషించుటయుచితము కాదు సముద్రమువలె, నానిర్భాగ్య మపారము; ఇదియంతయు నాపాపఫలమని తెలిసికొనక, నాతల్లిని వ్యర్థముగ నేను దూషించుటవలన నాకనర్థమే కాని మఱియొకటి కాదు; నానిర్భాగ్యమును దరింపఁజేయుటకు నేను నలువైపుల మార్గముఁ జూచుచుంటిని, ఒకమార్గముతప్ప మఱియొకటి కానరాదు. నాగురువులు వసిష్ఠులు; నాప్రభువులు శ్రీసీతారాములు; కావునఁ బరిణామమున శుభము కలుగునని నానిశ్చయము; అందుచేత నాకుఁ గొంచెము సంతోషము కలుగుచున్నది.

దోహా 267

"ఈస్థలము పుణ్యతీర్థము; ఈసభికులు మహాత్ములు; వీరు నాగురువులు; వీరు నాప్రభువులు;వీరియెదుట నాసత్యభావముఁ జెప్పుచున్నాను. నేను ప్రేమచేఁ జెప్పుచుంటినో, లేక లోకరీతిని అసత్యముఁ జెప్పుచుంటినో, నాప్రభువును నాగురువును, సర్వాంతర్యాములు కనుక తెలిసికొనఁగలరు.

చౌపాయీ

"దశరథమహారాజు ప్రేమకు వశ్యుఁడై, ప్రాణమును గోల్పోయెనుకాని, ప్రతిజ్ఞను నిలువఁబెట్టుకొనెను; నాతల్లి చేసిన కృత్రిమవ్యాపారము లోకప్రసిద్ధము; నాతల్లులవ్యాకులమును నేను చూడఁజాలను; దుఃఖముచే నగరవాసులు స్త్రీపురుషులు పరితపించుచుండిరి. ఈయనర్థములకు నేనే మూలకారకుఁడను; వీనిని నేను వినినను, దెలిసికొనినను, వానిని సహించుచుంటిని. మునివేషమును ధరించి, శ్రీరాముఁడు శ్రీసీతాలక్ష్మణులతోఁగూడి వనములకు వెళ్ళెనని వినినను, పాదములకు రక్షలు లేకయే వారు పాదచారులై వనమున కేతెంచిరని వినినను, శూలమువలెఁ దగులుచుండిన నీసమాచారమును వినినను, నాప్రాణములు నిలిచియుండెను. వీనికి నేను కారకుఁడను కానియెడల నే నితఃపూర్వమే నాశరీరమును విడిచిపెట్టియుందును. నేను రఘురామునకు శత్రువని తలఁచి, స్నేహముచే నిషాదపతి నాతో యుద్ధముఁజేయుటకు సిద్ధపడినపుడుకూడ నాప్రాణములుపోలేదు; వజ్రముకంటె నాహృదయము కఠినము కనుక, వ్రక్కలుకాలేదు. నేను వినియుండినసంగతుల నిప్పుడు కన్నులారఁ జూచుచుంటిని; అయినను, నాజీవము కష్టజీవము కనుక, నింతదుఃఖమును సహింపఁగలిగెను. ఏనాతల్లిని మార్గములోఁజూచి, సర్పములును వృశ్చికములును వానివానివిషములను విడిచిపెట్టెనో;

దోహా 268

"ఏనాతల్లి శ్రీసీతారామలక్ష్మణులను శత్రువులని భావించెనో; అట్టితల్లికుమారుఁడనగు నన్ను భగవంతుఁడు విడిచిపెట్టి, మఱియెవనిని సహింపరానిదుఃఖములపాలు వెట్టును?"

చౌపాయీ

ఈప్రకారము భరతుఁడు చెప్పినమాటలువ్యాకులమును, దుఃఖమును, వినయమును, నయమును, ననురాగమును, చాతుర్యమును సూచించెను; ఆమాటలను సభికులువిని, తుషారముపైఁ బడినకమలమువలె శోకసంతప్తమానసులయిరి. అనేకపురాణకథలను మునిరాజుచెప్పి భరతునిబోధించి యోదార్చెను. దినకరకులకైరవవనమునకుఁ జంద్రునివంటి రఘురాఘవనుఁడు సమయోచితముగ నిట్లు పలికెను. "ఓతమ్ముఁడా! వ్యర్థముగ నీవు విచారింపనేల? కర్మగతు లీశ్వరాధీనములు; త్రికాలముల

లోను, త్రిలోకములలోనుండిన పుణ్యశ్లోకులందఱు నీయధీనులని నాయభిప్రాయము. నీవు కుటిలుఁడవని దూషించువారు, ఇహపరలోకములకు దూరస్థులు కాఁగలరు. సాధుసమాజములోఁగాని, గురువులవద్దగాని శిక్షఁబొందనిమూర్ఖుఁడే మనతల్లిని దూషించును.

దోహా 269

"ఓతమ్ముఁడా! నీనామమును స్మరించినమాత్రమున సకలపాపములును, అమంగళములును నశించును; వారి కీలోకములోఁ గీర్తియుఁ బరలోకములో సుఖముఁ గలుగును.

చౌపాయి

"ఓతమ్ముఁడా! నామనస్సులో మాటఁజెప్పుచున్నాను; శివుఁడే సాక్షి; ఈభూమి నీవలననే నిలువఁబడియున్నది. ఓయీ! నీమనస్సులో వ్యర్థమగు కుతర్కముఁ జేయకుము. వైరమును ప్రేమయు దాఁచియుంచినను, దాఁగియుండవు; మునీశ్వరులసమీపమున మృగవిహంగములు నిర్భయముగ విహరించును; అవి వేఁటకానినిజూచి భయపడి పాఱిపోవును పశుపక్షిమృగాదులకుసహితము హితాహితములు తెలియునుకదా! శరీరధారియగు మనుజుఁడు గుణధాముఁడు;జ్ఞానవంతుఁడు. ఓతమ్ముఁడా! నీసంగతి నాకు బాగుగ దెలియును; నీకసమంజసమగుపనులను నేనెట్లు చేయఁగలను? సత్యవాక్యమును నిలువఁబెట్టుటకు రాజు నన్ను విడిచిపెట్టెను. నాయందుగలప్రేమచేత, వారు ప్రాణములఁగోల్పోయిరి. తండ్రివచనముల నుల్లంఘించుటవలన నాకు దుఃఖముకలుగును. అంతకంటె నధికముగ నీవిషయమై సంశయించుచుంటిని; తదుపరి, గురువు నన్నాజ్ఞాపించియుండెను. వేయేల? నీవు చెప్పినప్రకారము నేను సంచరించెదను.

దోహా 270

· "నీవు సంశయమునువిడిచి, సంతోషపూర్వకముగ చెప్పవలసిన మాటఁ జెప్పుము." ఈప్రకారము సత్యసంధుఁడగు శ్రీరాముఁడు చెప్పిన **మాటలను** సభికులు విని సంతసించిరి.

చౌపాయి

ఈమాటలను దేవేంద్రాదిదేవతలువిని, "ఆహా! మనకార్యము చెడిపోనున్నది" అని తలఁచి భయపడిరి. వారు పలువిధములఁ జింతించిరి;

కాని, వారికి యేమార్గము పాలుపోలేదు. తుదకు, వారు రాముఁడే శరణని మనస్సులో నిశ్చయించిరి. రాముఁడు భక్తులభక్తికి వశ్యుఁడగు నని వారు పరస్పరము చెప్పుకొని విచారించిరి. అంబరీష-దుర్వాసుల చరిత్రమును దేవేంద్రాదిదేవతలుజ్ఞప్తికిఁ దెచ్చుకొని,నిరాశఁజేసికొనిరి. విశేషకాలమువఱకు దేవతలువిషాదమును సహించిరి; తరువాత, భక్తుఁడగుప్రహ్లాదునివలన,నృసింహమూర్తి ప్రత్యక్షమయ్యెను. వారు శిరములను వంకించి సురకార్యము భరతునిచేతిలోఁ గలదని యొకరిచెవిలో నొకరు చెప్పుకొనిరి. ఏయుపాయము వారికిఁ దోఁచలేదు. "సుసేవకుల సేవను శ్రీరాముఁడు మన్నించును. లేక, భక్తులను సేవించువారిని అతఁడు మన్నించును. ప్రేమపూర్వకముగ మీహృదయములలో భరతుని స్మరింపుఁడు. ఎందుచేతనన, నతఁడు స్వగుణశీలములచే శ్రీరాముని వశ్యముఁ జేసికొనఁగలఁడు."

దోహా 271

దేవతలసమాధానమును బృహస్పతి విని, "ఓదేవతలారా! మీరదృష్టవంతులు; లోకములో భరతునిచరణములయందనురాగము కలిగియుండుట, సుమంగళములకు మూలము" అని చెప్పెను.

చౌపాయ్

"ఓదేవతలారా! శ్రీసీతానాథునిసేవకులను సేవించినయెడల, శ్రీసీతాపతి నూరుకామధేనువులతో సమానుఁడై, ఫలము నిచ్చును. మీమనస్సులో భరతునిమీఁద భక్తిపుట్టెను; మీరు విచారమును విడిచిపెట్టుఁడు; కాఁగలకార్యమును బ్రహ్మ యిదివఱకే వ్రాసిపెట్టెను. ఓ ఇంద్రుఁడా! భరతుని ప్రభావముఁ జూడుము; స్వభావసిద్ధమగు స్నేహముచే నతఁడు శ్రీరాముని వశ్యముఁ జేసికొనెను. ఓదేవతలారా! మీరు స్వస్థచిత్తముతో నుండుఁడు; భయపడుటకుఁ గారణములేదు. భరతుఁడు శ్రీరాముని ఛాయ యని తెలిసికొనుఁడు. ఆసర్వాంతర్యామియగు శ్రీరాముఁడు, దేవతలభయమును, వారిసమాధానములను, బృహస్పతిచెప్పిన బోధనలను విని సంశయించెను. అంతభారము తన శిరస్సుపైనుండుట భరతుఁడు తెలిసికొని, పలువిధముల హృదయములో శంకించి, పూర్వోత్తరముల నాలోచించి, శ్రీరామునియాజ్ఞను మన్నిం

చుటయే, శ్రేయోదాయకమని నిశ్చయించెను. "నామాటను నిలువఁ బెట్టుటకుఁగదా శ్రీరాముఁడు తనప్రతిజ్ఞను విడిచిపెట్టుటకు సిద్ధపడెను. నామీఁద వారికి నెంతదయయు వాత్సల్యము కలదు.

దోహా 272

"ఆసీతానాథుఁ డన్నివిధముల విశేషముగ నన్ననుగ్రహించెను" అని భరతుఁడు చింతించి, ప్రణమిల్లి చేతులను జోడించి, యిట్లు విన్న వించెను.

చౌపాయ్

"ఓకృపాసాగరా! మీరు సర్వాంతర్యాములు; నేనేమిచెప్పఁ గలను? ఒకరిచేత నేమిచెప్పించఁగలను? నాయెడల నాగురువులు ప్రస న్నులయిరి; నాస్వామి యనుకూలుఁడై యుండెను మలినమగునామ నస్సు కల్పించుకొనిన దుఃఖములన్నియు నశించెను. నేను మీకు భయ పడియుంటిని; కాని, నాభయమునకుఁ గారణములేదు. దిక్కులవిచక్ష ణ తెలియనపుడు, సూర్యునిదోషమా? భ్రమజెందినవాఁడు దోషికాని, సూర్యుఁడు దోషికాఁడు. నానిర్భాగ్యత్వము, నాతల్లి కుటిలతయు, విధికృతమును, కాలవిపరీతమును, ఇవియన్నియుకలిసి, దృఢముగ పాద ముఁబెట్టి, నన్నుఁ బడద్రోయుటకుఁ గోరెను; అయినను, మీరు ప్రణ తపాలకులు కనుక, మీమాటకు భంగమురాకుండ, నన్నుద్ధరించితిరి. మీవిషయములో నిది యొకక్రొత్తసంగతికాదు; ఇది ప్రాచీనమగువిష యము; ఇది వేదపురాణములలో విశదమైయున్నది; ఇది రహస్యము కాదు. ఓనాథా! ఈలోక మసత్యము; మీరొక్కరే సత్యము. ఓదేవా! మీస్వభావము కల్పవృక్షముతో సమానము. ఎల్లజనులకు సమ్ముఖమై యుండును; ఎవరికిని విముఖముగ నుండదు. ఎవరిని విము ఖముఁ జేయదు.

దోహా 273

"ఆకల్పవృక్షమును గుఱుతుపట్టి, దానిఛాయలోనికి వెళ్లినవా రికి, సకలదుఃఖములు శాంతించును; గొప్పవాఁడుకాని, నీచుఁడుకాని, భాగ్యవంతుఁడుకాని, దరిద్రుఁడుకాని, ఎవఁడేమికోరిన దాని నిచ్చును.

చౌపాయ్

"నాగురువులును, నాప్రభువులును నాయెడల స్నేహవాత్సల్య

ములను గలిగియుండిరి. కనుక, నాసందేహములు విడిపోయెను ఓకరుణాసాగరా! మీరు నాప్రభువులు; కనుక, మీచిత్తమునకు క్షోభలేకుండ, నన్నుఁ గటాక్షించి, పనిజేయుఁడు. ఏసేవకుఁడు, నిజహితతంత్రుఁడై యజమానునిమనస్సును క్షోభపెట్టునో, వాఁడు దౌర్భాగ్యుఁడు; వానిబుద్ధి మంచిది కాదు. స్వార్థమును స్వసుఖమును విడిచిపెట్టి, స్వామికార్యమును జేయుటయే సేవకున కుచితమగునని. ఓనాథా! అయోధ్యానగరమునకు మీరు మరలివచ్చినయెడల, లోకుల స్వార్థము ఫలించును; ఆజ్ఞను బరిపాలించుట, అంతకంటెఁ గోటింతలు శ్రేయోదాయకము; మీయాజ్ఞయే స్వార్థపరమార్థముల సారము; సంపూర్ణసుకృతములఫలము; సద్గతికి శృంగారము. ఓదేవా! నావిన్నపము నొకదానిని వినుఁడు తదుపరి, యథాయోగ్యముగ జేయుఁడు. రాజ్యతిలకమునకుఁ దగిన సంభారములను దీసికొనివచ్చితిని. ఓనాథా! మీమనస్సునకు సమాధానమయినయెడల వానిని వినియోగింపుఁడు.

దోహా 274

"శత్రుఘ్నునితోఁగూడ నన్ను వనములకుఁ బంపుఁడు; మీరు తిరిగివెళ్లి ప్రజలను సనాథులుగఁ జేయుఁడు; లేక, లక్ష్మణశత్రుఘ్నులను నగరమునకుఁబంపుఁడు; నేను మీతో వచ్చెదను.

చౌపాయ్

"లేక, మీరును శ్రీజానకియు నగరమునకు విజయముఁజేయుఁడు; మేము, ముగ్వురన్నదమ్ములము వనములకుఁ బోయెదము. ఓకరుణాసాగరా! ఏప్రకారము మీచిత్తమునకు సమాధానమగునో, ఆప్రకారము వ్యవహరింపుఁడు ఓదేవా! అంతభారమును నాశిరస్సుపై మోపియుంటిరి; రాజధర్మములనుగాని, న్యాయశాస్త్రమునుగాని నేనెఱుంగను. స్వార్థము నాలోచించి, నేను పలుకుచుంటిని; దుఃఖములోనుండినవానికి, నేమిజ్ఞానముండును? స్వామియాజ్ఞను గైకొని, ప్రత్యుత్తరము నిచ్చుసేవకునిఁజూచి, సిగ్గుసహితము సిగ్గుపడును. అగాధమంటి సముద్రమువలె, నవగుణములు నాలోఁగలవు. నాయందుఁగలవాత్సల్యముచే నాప్రభువు నేను సాధువునని స్తోత్రముజేయును. ఓకృపాలుఁడా! ఏమార్గము మీమనస్సును నొప్పింపకయుండునో, ఆమార్గమే నామన

స్సునకు సంతోషమును గలుగఁ జేయును. మీచరణములే తోడు; నేను సత్యముఁ జెప్పుచున్నాను. లోకములకు మంగళముకలుగుటకు మార్గ మొకటి కలదు.

దోహా 275

"మీరు సందేహమునువిడిచి, ప్రసన్నులై, యెవరిని యేవిధమున నాజ్ఞాపించినయెడల నావిధమున వారు మీయాజ్ఞను శిరసావహించి ప్రవర్తింపఁగలరు. ఈఅలజడియుఁ బురజనులదుఃఖమును శాంతించును."

చౌపాయ్

ఈప్రకారము భరతుఁడు చెప్పినమాటలను సభికులువిని సంతోషించిరి; అతఁడు మంచిమాటలఁజెప్పెనని దేవతలు హర్షించి, పుష్పములను వర్షించిరి. రామాజ్ఞాప్రకారము భరతుఁడు సంచరించునని దేవతలకు నమ్మకముపుట్టెను. 'అవధ'పురవాసులకుమాత్రము ద్వంద్వమువచ్చెను. తపశ్శాలులును, వనవాసులును సంతసించిరి. శ్రీరాముఁడు సంశయించి యూరకుండెను; అతనియంతర్భావమును గ్రహించి, సభికులు చింతాక్రాంతులయిరి. ఆసమయమున జనకచక్రవర్తి పంపించిన దూతలువచ్చిరి. ఆదూతలను గురువు రప్పించెను; వారు గురువునకు నమస్కరించి, శ్రీరామమూర్తి ధరించిన మునివేషమును జూచి దుఃఖించిరి. "విదేహరాజునకు క్షేమమా?" అని మునివర్యుఁడు వారిని యడిగెను. ఆమాటలను వారు విని, సంశయించి, శిరస్సులనువంచి, చేతులనుజోడించి, యిట్లు విన్నవించిరి. "ఓనాథా! మీరు మమ్ముల నాదరించి, కుశలప్రశ్నఁజేసినమాత్రమున, మాప్రభువులు క్షేమముగ నుండిరి.

దోహా 276

"ఓనాథా! ప్రాచీనమగుకుశలమంతయు దశరథమహారాజుగారి మరణముతోనే గతించెను. అందుచేత, లోక మనాథయయ్యెను; అయోధ్యానగరమునకును మిథిలానగరమునకు విశేషముగ దిక్కులేదు.

చౌపాయ్

"ఓనాథా! దశరథమహారాజులమరణమును విని, జనకచక్రవర్తియు సకలజనులును శోకసంతప్తమానసులయిరి. ఆసమయమున విదేహు

లనుజూచి, 'ఈవిదేహులు సార్థకనామధేయులు' అని జనులు చెప్పు కొనిరి. మహారాణిచేసిన కృత్రిమమును చక్రవర్తివిని, మణినిఁబోగొట్టు కొనిన సర్పమువలె వ్యాకులుఁడై, యేమియుతోఁచక, విచారించెను. భరతునకు రాజ్యముపచ్చెననియు, శ్రీరామచంద్రులు వనములకేఁగెంచి రనియు విని, జనకుఁడు చింతాక్రాంతుఁడయ్యెను. అప్పుడు జనకచక్ర వర్తి సచివులను బుధులను సమావేశముఁజేసి, 'ఓసభ్యులారా! మీ రాలోచించి, చేయవలసినపనిని జెప్పుఁడు' అని వారి నడిగెను. అయో ధ్యానగరస్థితిగతులు వారికిఁదెలియును; తెలియవు. ఈసందిగ్ధముచే నేమాటనువారు చెప్పలేక యూరకుండిరి. జనకచక్రవర్తి ప్రయాణముఁ జేయుటయో, లేక ప్రయాణమును నిలిపివేయుటయో, యేమాటయు వారు చెప్పలేదు. అప్పుడు జనకచక్రవర్తి ధైర్యమునవలంబించి, తనలోఁ దాను విచారించి, చతురులగు నల్వురుదూతల నయోధ్యానగరము నకుఁబంపి, భరతునిస్వభావము సరళమో, విరసమో రహస్యముగ కను గొని శీఘ్రము రమ్మని చెప్పెను.

దోహా 277

"ఆనగరమున కాదూతలువెళ్లి, భరతునివ్యవహారములను కను గొని చూచి అతఁడు చిత్రకూటమునకు వెళ్లినసంగతిని విని, మిథిలా నగరమునకుఁ దిరిగివచ్చిరి.

చౌపాయ్

"ఆదూతలు జనకునిసభకువచ్చి భరతునిచర్యలను యథామతిగ వర్ణించి చెప్పిరి. వారిమాటలనువిని, గురువును, రాజును, మంత్రు లును, పురజనులును దుఃఖముచే వ్యాకులులయిరి. అప్పుడు చక్రవర్తి ధైర్యముఁదెచ్చుకొని, సేనాధిపతులను, యోధులను బిలిపించి, గృహ ములను నగరమును రాజ్యమును కాపాడుటకు రక్షకుల నియో గించి,చతురంగబలములను సన్నద్ధముఁజేసెను. రెండుఘుడియలలో సర్వస న్నాహముఁజేయించి, జనకచక్రవర్తి వెడలెను; మార్గములో నతఁ డెచ్చటను విశ్రమింపక, ప్రయాణముఁజేసి, యీప్రాతఃకాలమున ప్రయాగలో స్నానముఁజేసి, వెడలివచ్చుచుండెను. వారు యమునాన దిని దాఁటుచుండిరి. ఓనాథా! ఈసమాచారమును మీకుఁదెలుపు

టకు చక్రవర్తి మమ్ములను ముందుగఁ బంపెను." ఈప్రకారము వారు చెప్పి, భూమిపై శిరస్సునువంచి, నమస్కరించిరి. ఆరు, యేడువ్వురు కిరాతులను వారికి సహాయమిచ్చి, వసిష్ఠుఁడు వారికి వేగముగ సెలవునిచ్చి, వారినిఁ బంపించెను.

దోహా 278

జనకచక్రవర్తి యాగమనమునువిని, అవధపురజనులు సంతోషించిరి; (రాముఁడు నిశ్చయముగ నగరమునకుఁ దిరిగివచ్చునని తలఁచి వారు సంతసించిరి.) (భరతుఁడు వచ్చినందులకే, శ్రీరాముఁడు సంశయించుచుండెను.) చక్రవర్తియాగమనమును రాముఁడువిని, విశేషముగ సంశయించెను అందుచేత, సురరాజుకూడ విచారించెను.

చౌపాయ్

'నేనేమని చెప్పఁగలను? ఎవరిపైదోషమును నిరూపింపఁగలను?' అని కుటిలురాలగు కైకేయి లోలోపున విచారించి, సిగ్గుపడి, కుందుచుండెను. రెండుమూడుదినములవఱకు నిలిచియుండవచ్చునుకదా యని, నగరవాసులు, స్త్రీపురుషులు, సంతోషించుచుండిరి. ఈప్రకారమాదినము గతించెను. అంత ప్రాతఃకాలమున వారు స్నానసంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించి, గణపతిని, పార్వతీపరమేశ్వరులను, సూర్యనారాయణమూర్తినిఁ బూజించిరి.

రమారమణ । పదవంది । బహోరీ,
వినవహిం । అంజలె । అంచల జోరీ॥
రాజా । రామ । జానకీ । రానీ,
ఆనద । అవధి । అవధ । రజధానీ॥

తదుపరి, వారు రమారమణునిచరణములకు దండప్రణామంబులజేసి విన్నవించిరి. "భగవంతునికృపవలన, రాముఁడు రాజును, జానకి మహారాణియుఁ గావలెను; అయోధ్యారాజధాని ఆనందసీమయగుఁగాక" అని చేలాంచలములఁబట్టుకొని స్త్రీలును, దోసిలిపట్టి పురుషులును ప్రార్థించిరి. "ఓరమారమణా! అయోధ్యానగరము యథాప్రకారము జనులచే నిండియుండుఁగాక! శ్రీరాముఁడు భరతుని యువరాజుగఁ జేయుఁగాక! పూర్వమువలె, నగరములో సభ్యులును మంత్రు

లును నివసించియుందురుగాక! ఓదేవా! ఈసుఖామృతముచే మమ్ములను దడిపి, లోకములో మా కీజీవనలాభమును కలుగ జేయుము.

దోహా 279

"గురువును, సమాజము వారును, తమ్ములును సహకారులై యుండ, నగరమునకు రాముఁడు రాజగుఁగాక! రాముఁడు రాజ్యముఁ జేయుచుండ, మాకు మరణమువచ్చుగాక!" అనివారు ప్రార్థించిరి.

చౌపాయ్

ఈప్రకారము పురజనులు స్నేహవాత్సల్యములచేఁ బలికినపలుకులను జ్ఞానులును మునులును విని, తమయోగవైరాగ్యములను నిందించిరి. ఈవిధమున పురజనులు నిత్యకర్మల ననుష్ఠించి, సంతుష్టాంతరంగులై, శ్రీరామునకుఁ బ్రణామంబులఁ జేయుచుండిరి. ఉత్తమ, మధ్యమ, నీచులు, స్త్రీపురుషులు, యథాయోగ్యముగ శ్రీరాముని దర్శించుచుండిరి. సావధానముగ శ్రీరాముఁడువారిని సన్మానించుచుండెను. ఆకృపానిధానునిపలువిధముల వారుకొనియాడిరి. "చిన్నతనమునుండియు శ్రీరామునిలో నొకగుణము కలదు మనుజులరీతినిజూచి, అతఁడు వారిని బ్రేమించును. సుశీలమునకును మర్యాదకును శ్రీరాముఁడు సాగరమువంటివాఁడు. అతనిసుముఖమును, సులోచనములను, సరళచిత్తమును జూడవలెను" (కృపాదృష్టితో నందఱను జూచును గనుక, సులోచనుఁడు. ఒకనికి సమ్ముఖుఁడు, మఱియొకనికి విముఖుఁడు కాఁడు కనుక, సుముఖుఁడు.) ఈవిధమున శ్రీరామునిగుణగణములను వారు చెప్పుకొని, తమయదృష్టమును కొనియాడుకొనిరి. "లోకములో మనమే, అల్పపుణ్యాత్ములము; అట్టి మమ్ములనే, శ్రీరాముఁడు తనవారిగ భావించెను." అని వారు తలంచిరి.

దోహా 280

ఓపార్వతీ! ఆసమయమున జనకుఁడువచ్చెనని వారువిని, ప్రేమమగ్నులయిరి రవికులకమలములకు సూర్యునివంటి శ్రీరాముఁడు సభ్యులతోఁగూడి, ససంభ్రమముతో దిగ్గునలేచెను.

చౌపాయ్

ముస్ముందు శ్రీరాముఁడు నడచెను; అతనివెంట తమ్ములును, మంత్రులును, గురువును, బురజనులును నడచిరి. గిరివరముగుచిత్రకూ

టమును జనకచక్రవర్తిచూచి, దానికి నమస్కరించి, రథముపైనుండి క్రిందికిదిగెను. శ్రీసీతారామదర్శనలాలసాయత్తచిత్తులై, యుత్సాహముతో వారు వచ్చినందున, మార్గాయాసముగాని, బడలికగాని వారికి లేకపోయెను. శ్రీజానకీరాములపై వారిమనస్సులు లగ్నమైయుండెను. మనస్సు యొకవైపునుండినపుడు, శరీరమునకు గలిగినసుఖదుఃఖములపై నెవనికి స్పృహయుండును? ఈప్రకారము ప్రేమాతిశయములో మునిఁగి జనకచక్రవర్తియు, సమాజమువారును వెడలివచ్చిరి. అంత వారు సమీపించి, యొకరినొకరు కలిసికొని, వందనములఁజేసి, సంతోషముతోఁ గూడియుండిరి. జనకుఁడు మునులకుఁ బ్రణమిల్లెను; రఘునందనుఁడు ఋషులకుఁ బ్రణామంబుజేసెను. తమ్ములతోఁగూడి శ్రీరాముఁడు జనకునిఁ గలిసికొని, సమాజముతోఁగూడి వెడలెను.

దోహా 281

శ్రీరామునియాశ్రమము శాంతరసముతో సంపూర్ణముగనిండిన మహాసముద్రమువలె నుండెను; ఆసముద్రములోఁ గలియుటకు, కరుణానదివలె, జనకచక్రవర్తి సేనలతోఁగూడి, శ్రీరామునివెంట నడచెను.

చౌపాయీ

ఆకరుణానదికి,జ్ఞానవైరాగ్యములు రెండుతటములు;అవధపురజనులును, మిథిలానగరవాసులును పలుకుచుండిన దీనాలాపములు దానిలోఁ గలియుచుండిన యుపనదులు; దుఃఖముచే వారు విడిచిపెట్టిన నిట్టూర్పులు నదీతరంగములును, వాయువులును; ఈతరంగములు నదీతీరమునసుండిన ధైర్యమనునట్టి మహావృక్షములను బడఁద్రోయుచుండెను. రాజుమరణము, రామునివనగమనము, భరతుఁడు రాజ్యము నంగీకరించకయుండుట - ఈవీనివలన గలిగినవిషాదము తీవ్రమగునదీప్రవాహము. నగరమునకు రాముఁడు తిరిగివచ్చునో రాఁడో యనుభయమును, భ్రమయు అపారమగునదిలోని సుడిగుండములు. వసిష్ఠాదిబుధులు నావికులు; జ్ఞానము (విద్య) నావ; ఈనావను గడుపుట కష్టము; ఒకఁడు గడపలేఁడు; ఆనదియొడ్డుఁజేరుట నిశ్చయములేదు విచారగ్రస్థులగువనచరులును, కోలుకిరాతులును బాటసారులు; వారు బడలి

కచే, నిశ్చేష్టులై నిలియుచుండిరి. నదీజలములువచ్చి పూర్ణముగనుండిన సముద్రములోఁ గలిసినట్లు, ఆకరుణానదివచ్చి, శ్రీరామాశ్రమములోఁ గలిసెను. ఉభయపక్షములవారును శోకసంతప్తమానసులై యుండినందున, జ్ఞానమును, ధైర్యమును సిగ్గును వారు విడిచిపెట్టిరి. దశరథమహారాజుయొక్క రూపగుణశీలములను వారు కొనియాడి, శోకార్ణవములో మునిఁగినవారివలె, విలపించిరి.

ఛాంద్ 12

స్త్రీపురుషులు వ్యాకులులై, శోకార్ణవములో స్నానముఁజేసి దుఃఖించుచుండిరి. "ప్రతికూలుఁడై, విధాత యింతపనిఁజేసెను?" అని వారు కోపించి, విధాతను దూషించిరి. దేవతలును, మునులును, సిద్ధులును, తపశ్శాలులును, యోగులును, విదేహరాజుయొక్క ప్రేమాతిశయమును జూచిరికాని, అమహానదియొక్కదరిని వారు చూడలేకపోయిరి. అని తులసీదాసుగారు చెప్పుచున్నారు.

సోరఠా 12

మునివర్యులును, తదితరజనులును యథోచితముగ విదేహరాజు నోదార్చిరి. అప్పుడు వసిష్ఠుఁడు చక్రవర్తి కీవిధమున నుపదేశించెను. "ఓరాజా! ఈసమయమున ధైర్యము నవలంబించి యుండుము.

## షోడశ విశ్రామము.

చౌపాయ్

వసిష్ఠమహాముని జనకునితో నిట్లు ప్రసంగించెను. "ఓరాజా! సంసారమను చీఁకటిని (రాత్రిని) బోఁగొట్టుటకు నీవు సూర్యుని వంటి వాఁడవు; కిరణములు కమలములనువలె, నీవచనములు మునీశ్వరులను వికసింపఁ జేయును. మోహము తనమహిమను నీయెదుట నెట్లు చూపింపఁగలుగును? శ్రీసీతారాములయందుఁగల ప్రేమచేతనే,నీకీవ్యాకులము కలిగెను. విషయాసక్తులనియు, సాధకములఁజేయు ముముక్షువులనియు, సిద్ధులనియు-మూఁడువిధములగుజీవులు కలరని వేదములు చెప్పుచున్నవి. ఏమనుజునిమనస్సు శ్రీరామునిమీఁదఁగల యనురాగ

ముచేఁ దడిసియుండునో, వాఁడే సాధుసమాజములో వన్నెకెక్కును; వాఁడే ఆదరింపఁబడును. కర్ణధారుఁడులేని నావవలె, రామభక్తిలేని జ్ఞానము శోభింపదు." ఈప్రకార మనేక విధముల జనకుని వసిష్ఠుఁడు బోధించెను. తరువాత, వారందఱు రామఘాటులో స్నానముఁ జేసిరి. స్త్రీపురుషులందఱు బహువ్యాకులులై, తీర్థమునయినను పుచ్చుకొనక, దినమంతయు గడపిరి. పశుపక్షిమృగాదులే భోజనములేక యుండిన పుడు, ప్రియులగు పరిజనులమాటఁ జెప్పనేల?

దోహా 282

దశరథమహారాజు పరివారమును, జనకునిపరిజనులును స్నానముఁ జేసి, వటవృక్షముక్రిందఁ గూర్చుండిరి దుఃఖముచే, వారిమనస్సులు కలుషమైయుండెను; వారిశరీరములు కృశించెను.

చౌపాయి

దశరథపురవాసులగు బ్రాహ్మణులును, జనకనగరవాసులగు బ్రాహ్మణులును, సూర్యవంశపురాజులకు గురువగువసిష్ఠుఁడును, జనకుని పురోహితుఁడగు శతానందుఁడును లోకములోఁగల పరమార్థమును దెలిసికొనుటకుఁ దగినమార్గములను శోధించి యుండిరి. వారు న్యాయధర్మశాస్త్రముల ననుసరించి, జ్ఞానవైరాగ్యయుక్తములగు కథలఁ జెప్పనారంభించిరి. పురాణకథలను జక్కఁగ విశ్వామిత్రుఁడు సభికులకుఁ జెప్పి బోధించెను. అప్పుడు శ్రీరాముఁడు "ఓనాథా! గడచినదినమంతయు జనులు తీర్థమునైనను బుచ్చుకొనకయుండిరి. భోజనముఁ జేయుఁడని వారితో జెప్పుఁడు" అని విశ్వామిత్రునితోఁ బలికెను. "ఓరామా! నీమాట యుచితముగ నున్నది. ఈదినమున అపరాహ్ణము తిరిగెను." అని యతఁడు చెప్పెను. అప్పుడు జనకుఁడు మునీశ్వరుని చిత్తముఁ గనిపెట్టి, "ఓనాథా! ప్రస్తుతము అన్నమును భుజించుట యుచితము కాదు" అని పలికెను. ఆచక్రవర్తి చెప్పినమాటను జనులు హర్షించి, సెలవుఁగైకొని, స్నానముఁ జేయుటకు వెడలిరి.

దోహా 283

నానాజాతుల ఫలములను, బుష్పములను, పత్రములను, దళములను, మూలములను కావడియం దెత్తుకొని అనేకవనచరులును, గిరాతులును వచ్చిరి.

చౌపాయ్

శ్రీరాముని కటాక్షమువలనఁ, బర్వతప్రదేశములు సకలఫలదాయకములయ్యెను; వానిని జూచినమాత్రమున, సకల దుఃఖములు పోవును. సరోవరములును, నదులును, వనభూములును, ప్రకృతిసంపదలతోనిండి, చూచుట కాహ్లాదమును బుట్టించుచుండెను. లతలును వృక్షములును బుష్పములతోను ఫలములతోను నిండియుండెను; అనుకూలముగ ఖగమృగములు సంచరించెను. ఆసమయమున వనములో నుత్సాహము ప్రబలమయ్యెను; మంద, సుగంధ, శీతలవాయువులు ప్రసరించెను. ఆవనములయొక్క ప్రకృతిసంపదను వర్ణించుటకు శక్యము కాదు. జనకచక్రవర్తి భూదేవి ఆతిథ్యముఁ జేయుచున్నదో యనునట్లు కనఁబడెను; ఆభూదేవి కూఁతురే జానకి; ఆజానకితండ్రియే జనకచక్రవర్తి. అంత జనులందఱు స్నానముఁ జేసి, శ్రీరామ, జనక, మునీశ్వరులవద్ద సెలవుఁగైకొని, అతి యనురాగముతో వృక్షములఁజూచి, చూచి, ఆయాంతరుఛాయలలో స్వేచ్ఛానుసారము విరమించిరి. శుభ్రముగనుండిన అమృతోపమానమగు నానాజాతుల చక్కని కందమూలఫలములను, దళములను-

దోహా 284

అత్యాదరముతో శ్రీరామునిగురువు వారికిఁ బంపించెను. దేవతలను, పితృదేవతలను అతిథులను వారు పూజించి ఫలహారముఁ జేసిరి.

చౌపాయ్

ఈప్రకారము నాలుగుదినములు గతించెను. స్త్రీపురుషులు శ్రీరాముని సందర్శించుచు, సుఖముగ నుండిరి. "మనము శ్రీసీతారాములను నగరమునకుఁ దీసికొని వెళ్లినఁగాని, యుచితముగ నుండదు. శ్రీసీతారాములతోఁగూడి, వనవాసముఁ జేయుటయే కోటిస్వర్గములకంటె సుఖదాయకము. ఏమనుజుఁడు శ్రీసీతారామలక్ష్మణులను విడిచి, గృహాభిలాషియగునో, వానియెడల విధాత ప్రతికూలుఁడుగ నుండెనని తలంచవలెను. మనము శ్రీరామునిసమీపమున వనములో నివసించియుండుటచేత, భగవంతునకు మనమీఁదఁ బరిపూర్ణకటాక్షము కలదని తోఁచుచున్నది. త్రికాలములలో మందాకినీనదిలో స్నానము, నిత్యము సకలానందమంగళములకు మూలమగు శ్రీరామునిసందర్శనము; రామ

గిరి, వనప్రాంతములలోను, ఋష్యాశ్రమములలో విహారము, అమృతోపమానమగు కంద, మూల, ఫలముల భక్షణయు - ఈప్రకారము సుఖముగ పదునాలుగుసంవత్సరములు రెప్పపాటువలె, తెలియనివిధమునఁ గడిపిన బాగుగ నుండును.

దోహా 285

"ఇంతసుఖము ననుభవించుటకు మనకు యోగ్యత లేదు. ఇంత భాగ్యము మన కెచ్చటఁ గలదు!" అని స్త్రీపురుషులు వారిలో వారు చెప్పుకొనుచుండిరి. వారికి శ్రీరామునిచరణములయం దిట్టిసహజమగు యనురాగము కలదు.

చౌపాయ్

ఈప్రకారము ప్రేమపూర్వకమగువచనములతో వారు వారి వారిమనోరథములఁ జెప్పుకొని, మనస్సులో సంతోషించుచుండిరి. అప్పుడు, సీతాదేవితల్లి, సునయన, యొకచెలికత్తెను బిలిచి, కౌసల్యాది మహారాణులసమయముఁ జూచి రమ్మని, పంపెను; ఆచెలికత్తె వెళ్లి, వారిం జూచి, తిరిగివచ్చెను. అంతట, సునయన వెడలి, కౌసల్యాదిమహారాణులఁ జూచుటకు వారివద్దకు వెళ్లెను; జ్యేష్ఠశుద్ధయేకాదశినాఁడు, మహారాణులు కలిసికొనిరి. కౌసల్య సునయనను సన్మానించి, యాదరించి, సమయోచితముగ నాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. ఆమహారాణుల సుశీలమును, స్నేహమును, వారిసరసోక్తులనుజూచి, కఠినమగువజ్రము సహితము నీరగును. వారిశరీరములు పులకరించి, శిథిలమయ్యెను; వారు కన్నీరుఁ గార్చుచుండిరి; గోళ్లతో భూమిమీఁద వ్రాయుచు, వారు విచారించుచుండిరి. శ్రీసీతారాములయందుఁ గలప్రేమ మూర్తీభవించి, కూర్చుండెనేమో యనునట్లును, లేక మూర్తీభవించిన కరుణారసమేమో యనునట్లును, వారు ప్రత్యేకముగఁ గనఁబడిరి. అప్పుడు సునయన యిట్లు సంభాషించెను. "విధాతబుద్ధి వక్రముగ వెళ్లెను. పాలనురుగును ఛేదించుటకు వజ్రమునువలె నుపయోగించెను.

దోహా 286

"అమృతమును వినుచున్నాముకాని, చూచియుండలేదు; గరళమును జూచుచున్నాము; కాకులును, కొంగలును, గుడ్లగూబలును

పెక్కుసహస్రములు కలవు; కాని, అగమ్యమగు మానససరోవరములో రాజహంసలుకలవని, వినుచున్నాము."

చౌపాయ్

"ఓదేవీ! విధికృతములు విపరీతములు; విచిత్రములు; ఆభగవంతుఁడే లోకములను సృజించి, పరిపాలించి, సంహరించును. విధికృతములు బాలునిచర్యలవలె కనఁబడును." అని సుమిత్ర విచారించుచు బలికెను. "ఓదేవీ! ఇది యొకరిదోషము కాదు. సుఖదుఃఖములును, లాభనష్టములును కర్మాధీనములు ("అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం") కఠినమగుకర్మగతులు భగవంతునకు దెలియును; శుభాశుభకర్మలకుఁ దగినఫలము నతఁడిచ్చును. కర్మగతులు నాకుఁ దెలియవు; భగవంతునకే తెలియును. ఈశ్వరాజ్ఞ శిరస్సు నధిష్ఠించియుండును. సృష్టిస్థితిసంహారములకును, అమృతమునకును, విషమునకును, ఈశ్వరాజ్ఞయే ప్రధానము. ఓదేవీ! మోహమునకు వశ్యులై, వ్యర్థముగ విచారింపనేల! బ్రహ్మసృష్టిలో, నీప్రకార మనాదికాలము నుండి జరుగుచున్నది. దీనిప్రకారము మహారాజు జీవించియుండుట శ్రేష్ఠమో, లేక పంచత్వమునొందుట శ్రేష్ఠమో, ఆలోచించి, చూడుఁడు." అని కౌసల్య బోధించెను. అప్పుడు సునయన యిట్లు పలికెను. "ఓదేవీ! నీవు సుకృతురాలవు; దశరథునివంటి పుణ్యాత్ములులేరు; అట్టి మహాపుణ్యాత్ముని భార్యవు; నీమాటలు సత్యము.

దోహా 287

"శ్రీసీతారామలక్ష్మణులు వనవాసముఁజేసినయెడల నంతమున శుభములు కలుగును." "కాని, ఓదేవీ! శ్రీరాముని వియోగదుఃఖమును భరతుఁడు సహింపలేడు. కనుక, నతనిని జూచిన, నాకు భయము కలుగుచున్నది" అని కౌసల్య గద్గదస్వరముతోఁ బలికెను.

చౌపాయ్

"ఓదేవీ! ఈశ్వరునియనుగ్రహమువలనను మీయాశీర్వచనము వలనను, నాకొడుకును, కోడలును, గంగవలె నిర్మలులు. ఇదివఱకు రాముఁడుతోడని చెప్పియుండలేదు; ఇప్పుడు రాముఁడుతోడని సత్యభావముతోఁ జెప్పుచున్నాను వినుము. భరతుని గుణశీలములను, వినయమును, ఉదారబుద్ధియు, భ్రాతృవాత్సల్యమును, భక్తిశ్రద్ధలను, ధైర్యస్థైర్యము

లను సంపూర్ణముగవర్ణించి చెప్పుటకు సరస్వతిసహితము సంశయించును: నత్తగుల్లతో సముద్రమును తెలిచనగునా? సదా, భరతుఁడు కులదీపకుఁడని తెలిసికొనుము. అని పలుమారులు మహారాజు నాతోఁ జెప్పియుండెను. పరీక్షవలన రత్నములును, పారసమణివలన బంగారమును వలె,సమయమువచ్చినపుడు మనుజుని పరీక్షింపవలయును. ఈసమయమున నేనిట్లు పలుకుట యుచితము కాదు; శోకము చేతను, పుత్రవాత్సల్యము చేతను నాబుద్ధి తక్కువయ్యెను.'' ఈప్రకారము గంగవంటిపవిత్రమగు వాక్యముల నామెపలికెను; ఆకౌసల్యమాటలను మహారాణులు విని, స్నేహపరవశలయిరి.

దోహా 288

మరల, కౌసల్య ధైర్యముఁదెచ్చుకొని యిట్లు చెప్పుట కారంభించెను. "ఓమిథిలదేశమహారాణీ! నామాటను వినుము. జ్ఞానసముద్రులగు జనకచక్రవర్తిభార్యవు. ఎవరు నీకుపదేశముఁ జేయఁగలరు?

చౌపాయి

"ఓమహారాణీ! సమయముఁజూచి, చక్రవర్తితో, నామాటయని యొకమాటఁ జెప్పుము. లక్ష్మణుఁడు గృహమువద్ద నిలిచియుండునట్లు, రామునితో వనమునకు భరతుఁడు వెళ్లునట్లును, చక్రవర్తిని జెప్పుమని వేడుకొనుము. ఈప్రయత్నమునకు వారు సమ్మతించినయెడల, మిగిలిన ప్రయత్నములను నేను శుభ్రముఁ జేయఁగలను. భరతునివిషయములో నాకుగొప్పభయమును దుఃఖమును గలుగుచున్నది. భరతునకు శ్రీరామునియందు గంభీరమగుస్నేహము కలదు. శ్రీరాముఁడు వినాగా, భరతుఁడు నిలిచియుండఁగలఁడని నాకు నమ్మకము లేదు.'' రామునితల్లి స్వభావమును జూచి, ఆమె సరళవచనములను వారు విని, కరుణారసమగ్నలయిరి. ఆకాశమునుండి పుష్పవర్షముపడెను; ధన్య, ధన్య, శబ్దములంతరిక్షమున వినఁబడెను సిద్ధులును, యోగులును, మునులును స్నేహరసమగ్నులయిరి. కౌసల్య మనోభావమును దేవతలు గ్రహించి, పరమానందభరితులయిరి. ఈచిత్రమును రాణివాసపుస్త్రీలుచూచి, నిశ్చేష్టలయిరి. అప్పుడు సుమిత్ర ధైర్యముఁదెచ్చుకొని, యిట్లుచెప్పెను: "ఓ

దేవీ! రెండుఘడియలరాత్రి గతించెను." ఆతక్షణము కౌసల్య దిగ్గున లేచెను.

దోహా 289

"ఓ దేవీ! నీస్థానమునకు నీవు శీఘ్రము నిష్క్రమింపుము. శంకరుఁడును మిథిలాధిపతియే, మనకుగతి" అని కౌసల్య స్వభావసిద్ధముగ సత్యముఁ జెప్పెను.

చౌపాయ్

ఆకౌసల్యయొక్క స్నేహధర్మమునకును, వినయవచనములకును జనకుని ప్రియురాలు సంతసించి, ఆమెచరణములనుబట్టుకొని యిట్లు చెప్పెను. "ఓదేవీ! ఈవినయములు నీ కుచితములు; నీవు దశరథుని భార్యవు; రామునతల్లివి కనుక, నీలో నిట్టి వినయసంపత్తి కలదు. ప్రభువులు నీచులనుసహితమాదరించెదరు. అగ్ని, ధూమమును ధరింపదా? పర్వతములు, తమశిరముపై, తృణములను ధరింపవా? మనోవాక్కర్మములచే, చక్రవర్తి మీసేవకుఁడు. పార్వతీపరమేశ్వరులే, మీకు సదాసహాయకారులు; లోకములో నీపాదములగోరునకు సమానముగు యోగ్యులెవరు కలరు? దీపము సహాయమువలన సూర్యునకు శోభ కలుగునా? దేవకార్యమును సాధించుటకు శ్రీరాముఁడు వనమునకుఁ బోవుచుండెను; అతఁడు తిరిగివచ్చి, అయోధ్యారాజ్యమును నిశ్చలముగఁ జేయును. శ్రీరామునిబాహుబలముచే దేవ, నర, నాగులు సుఖించి, వారివారి నిజస్థానములఁ బొందఁగలరు ఓదేవీ! ఇదియంతయు యాజ్ఞవల్క్యఋషి చెప్పియుండెను. ఋషివాక్యము లసత్యములుకావు."

దోహా 290

ఈప్రకారమామె విన్నవించి, కౌసల్యపాదములమీఁదఁబడి, జానకిని బంపుమని ప్రార్థించెను. ఆమె సెలవుఁగైకొని, సునయన సీతం దోడ్కొని, నిజస్థానమునకు వచ్చెను.

చౌపాయ్

తనకుఁ బ్రియులగు స్వకుటుంబస్థులను యథాయోగ్యముగ జానకి కలిసికొనెను. ఆమెధరించిన తపస్వినివేషమును వారుచూచి దుఃఖించి, వ్యాకులులయిరి. శ్రీరాము, వసిష్ఠులయాజ్ఞ గైకొని, జనక చక్రవర్తి స్వస్థానమునకువచ్చి, జానకిని జూచెను. పవిత్రమగుప్రేమకును

ప్రాణములకు జానకి యతిథి కనుక, నామె నతఁడు కౌఁగిలించుకొనెను. అతనిహృదయములోనుండి, యనురాగము సముద్రమువలె నుప్పొంగి వచ్చెను. ఆసమయమున, రాజు మనస్సు ప్రయాగవలె నుండెను. అతనికి జానకియందుఁగలప్రేమ అక్షయవటవృక్షమువలె, దృఢముగ వేరు దన్నుకొనియుండెను; వటపత్రశాయియగు బాలముకుందునివలె నావటపత్రముపై, నతనిరామభక్తి శోభించుచుండెను. (శ్లో. "కరారవిందేన పదారవిందం, ముఖారవిందే వినివేశయంతం, వటస్యపత్రస్య పుటేశయానం, బాలం ముకుందం మనసా స్మరామి" పాండ.గీ.) ప్రళయకాలమున జలార్ణవములో మునిఁగి తేలుచుండినమార్కండేయుఁడు వటపత్రశాయియగు బాలముకుందుని శరణుఁజొచ్చి, రక్షింపఁబడినట్లు, శోకార్ణవములో మునిఁగితేలుచుండిన జనకునిజ్ఞానము రామభక్తి శరణుఁజొచ్చి రక్షింపఁబడెను. జనకచక్రవర్తి మోహాపరవశుఁడైనందున, నతని బుద్ధి చలించెను. ఇదియంతయు శ్రీసీతారాములయం దతనికిఁగల ప్రేమ మహిమకాని, మఱియొకటి కాదు.

దోహా 291

ప్రేమకు వశ్యులై, జననీజనకులు విచారించుట జానకి చూచినందున, నామెమనస్సుకూడ వికలముబొందెను. అప్పుడు జానకి (ధరణీసుత) సమయముఁజూచి, ధర్మమును విచారించి, ధైర్యము నవలంబించెను.

చౌపాయ్

జానకిధరించిన తపస్వినివేషములను చక్రవర్తిచూచి సంతోషించి ప్రేమాతిశయముచే నిట్లుచెప్ప నారంభించెను; "ఓతల్లీ! నీమూలమున, నీతండ్రివంశమును, నీమామవంశమును పవిత్రమయ్యెను. ఉజ్జ్వలముగ నీకీర్తి లోకములోఁ బ్రకాశించును; నీకీర్తిని లోకులు చెప్పుకొనుచుందురు. నీకీర్తినదికి, మనరెండువంశములును, రెండుగట్లు; నీకీర్తినది, గంగానదిని జయించి, కోట్లకొలఁది బ్రహ్మసృజించిన బ్రహ్మాండములలోఁ బ్రవహించుచున్నది. భూలోకములో గంగానదికి మూఁడుపుణ్యతీర్థములు కలవు. (హరిద్వారము, ప్రయాగ, సాగరసంగమము.) పుణ్యతీర్థములవలె, నీకీర్తినదీతీరమున ననేకసాధుసమాజములు వెలసెను."

ఈవిధమున, స్నేహవాత్సల్యములచే నతఁడు పలికినసత్యవాక్యముల నామెవిని, లోలోపున సిగ్గుపడి, యూరకుండెను. తదుపరి, ఆమెను జననీజనకులు కౌఁగిలించుకొని, హితోపదేశముఁజేసి, యామెను దీవించిరి. ఆమె సిగ్గుపడి, యేమాటయుఁ జెప్పక యుండెను. "ఈ రాత్రి నే నిచ్చట నివసించియుండుట యుచితముకాదు" అని యామె లోలోపున విచారించెను. ఆమెచిత్తమును తల్లి కనిపెట్టి, కూఁతురిమనోభిప్రాయమును రాజునకు విన్నవించెను; ఆమె సుశీలమును, సత్స్వభావమును దంపతులు కొనియాడిరి.

దోహా 292

పలుమాఱు లామెను వారు కౌఁగిలించుకొని, సన్మానించి, వెళ్లుమని సెలవునిచ్చిరి. అనంతరము, సునయన మంచిసమయముఁజూచి, మహారాణి కౌసల్య చెప్పుమనిన వాక్యములను మంచిచమత్కారముగ రాజునకు విన్నవించెను.

చౌపాయ్

బంగారముతోను, సుగంధములతోను, అమృతముతోను, చంద్రునిసారముతోను, సమానమగునట్టి భరతునివ్యవహారమును జనకుఁడు విని, నిమీలితనేత్రుఁడై సంతసించెను; అతనిశరీరము పులకరించెను; భరతునిసత్కీర్తిని మనస్సులో నతఁడు కొనియాడి, యిట్లు ప్రసంగించెను. "ఓసుముఖిసులోచనా! సావధానముగ వినుము; భరతునిచరిత్రము సంసారబంధములను విడఁగొట్టును. ధర్మశాస్త్రమును, నీతిశాస్త్రమును, బ్రహ్మమును గుఱించి,యథామతి నేను చెప్పఁగలను; కాని, భరతునివిషయమై ప్రసంగించుటకు, నాబుద్ధి లేశమపి అతనినీడను జేరలేదు. నేనేమిచెప్పఁగలను? బ్రహ్మయు, గణపతియు, శేషుఁడును, శివుఁడును, సరస్వతియు, కవులును, బండితులును, విద్వాంసులును, బుద్ధిమంతులును-ఈమొదలగువారు భరతునిచరిత్రమును, గుణశీలములను, ధర్మశీలములను, కీర్తియు, విమలమగువిభూతియు-వీనిని వినినను, బోధించినను, వారికి సుఖము కలుగును ఈభరతునిచరిత్రము, శుచిత్వములో గంగానదిని, రుచిలో నమృతమును మించియుండును.

దోహా 293

"ఓసులోచనా! భరతుఁడు భరతుఁడే యని తెలిసికొనుము

అతనిగుణములు కవధిలేదు. అతఁడు నిరుపమానమగు పురుషుఁడు. కవీశ్వరులు సంశయించి, మేరుపర్వతమునకు మేరుపర్వతమే సమానమని చెప్పిరి.

చౌపాయీ

"ఓమనోహారిణీ! జలహీనమగుభూమిపై నావలు నడుచుట యెంతకష్టమో, భరతునికీర్తిని గుణములను వర్ణించి చెప్పుటకు శారద గణపతి మొదలగువారి కంతకష్టమని తెలిసికొనుము. ఓరాణీ! భరతుని మహిమ మపారము; దానిపారము రామునకుఁ దెలియును; కాని, అతఁడుకూడ దానిని వర్ణించి, చెప్పలేఁడు" ఈప్రకారము జనకుఁడు స్వభావసిద్ధముగఁ దనకు భరతునియందుఁగల ప్రేమచేత, నతని సత్స్వభావము నామెకు వర్ణించి చెప్పి, ఆమెచిత్తమును గనిపెట్టి, మఱల నిట్లు ప్రసంగించెను. "నగరమునకు లక్ష్మణుఁడు తిరిగివెళ్లుటయు, రాముని వెంట భరతుఁడు వెళ్లుటయు, సర్వజనసమ్మతము; అదియే, సకలజనులు కోరుచుండిరి. ఓదేవీ! రామునిప్రీతియు, భరతునిప్రతీతియుఁ జెప్పుటకు శక్యముకాదు భక్తివాత్సల్యములకు భరతుఁడు యునికిపట్టు. శ్రీరాముఁడు సమభావమున కాటపట్టు. స్వార్థ-పరమార్థసుఖములసారమును స్వప్నమందైనను భరతుఁడు మనస్సులో గ్రహించి యుండలేదు. అతఁడు కేవలము రామాజ్ఞ కనుకూలముగ నడుచును. సకలసాధనములు సిద్ధించినందువలన, శ్రీరామునిచరణములయందు భక్తియనురాగములు కలుగునని భరతునియభిప్రాయమని తెలియుచున్నది.

దోహా 294

"స్వప్నమందైనను, భరతుఁడు ప్రమాదవశమున రామాజ్ఞ నుల్లంఘింపఁడు. ప్రేమకు వశ్యురాలవై, నీవు విచారింపకుము." అని జనకుఁడు ప్రీతిచే వ్యాకులుఁడై పలికెను.

చౌపాయీ

ఈప్రకార మాదంపతు లిరువురు ప్రేమాతిశయముచే శ్రీరామభరతుల గుణములను జెప్పుకొనుచు, రెప్పపాటువలె, రాత్రి గడిపిరి. ప్రాతఃకాలమున రాజసమాజమువారు లేచి, స్నానముఁజేసి, దేవపూజలఁ జేయుచుండిరి. శ్రీరాముఁడు స్నానముఁజేసి, నిత్యకర్మలను నిర్వ

ర్థించి, గురువును సమీపించి, వారిచరణములకు నమస్కరించి, వారి ముఖసంజ్ఞఁజూచి, కూర్చుండెను. "ఓస్వామీ! నానిమిత్తము భరతుఁడును, పురజనులును, తల్లులును, విచారగ్రస్తులై, దుఃఖించుచుండిరి. అటులనే, మిథిలాధిపతియు, వారిసమాజమును గాయక్లేశములఁ బడుచుండ, ననేకదినములు గతించెను. ఓనాథా! ఉచితమగు దానినిఁ జేయుఁడు; సకలజనులహితవును క్షేమమును మీచేతిలో గలవు." ఈప్రకారము సంశయించుచు శ్రీరాముఁడు పలికెను. అంత, మునీశ్వరుఁడు శ్రీరాముని సుశీలమును సత్స్వభావమును గనిపెట్టి, యిట్లు చెప్పెను; "ఓరామా! నీవులేక సకలసౌఖ్యములును రెండుసమాజములవారికిని నరకముతో సమానముకదా! ఎట్లు వారు గృహములకుఁ బోఁగలరు?

దోహా 295

"ఓరామా! వారి ప్రాణమునకు నీవు ప్రాణము; వారి జీవమునకు జీవము; వారిసుఖమునకు సుఖము. ఎవరైనను, నిన్ను విడిచిపెట్టి, గృహసౌఖ్యముల నపేక్షించినయెడల, వారికి బ్రహ్మ ప్రతికూలుఁడుగ నుండెనని తలంచెద.

చౌపాయ్

"శ్రీరామునిపదకమలములయందుఁ బ్రేమలేనియెడల, సకలసుఖములును, కర్మలును, ధర్మములును, తగులఁబడుఁగాక! శ్రీరామునియందనురాగము ప్రధానముగ లేనియోగము, కుయోగము; జ్ఞానము, అజ్ఞానము. నీవియోగమే దుఃఖము; నీసంయోగమే సుఖము; సకలజనులమనోభిప్రాయములు నీకుఁ దెలియునుకదా. నీయాజ్ఞ శిరసావహించుటకు యోగ్యము. నీవు కృపాసాగరుఁడవు; సర్వాంతర్యామివి; సకలజనులగతులు నీకు విశదము. ఓరామా! ఆశ్రమమునకు నీవు వెళ్లుము." అని వసిష్ఠుఁడుపలికి, స్నేహముచే శిథిలుఁడయ్యెను. శ్రీరాముఁడు గురువునకు నమస్కరించి, ఆశ్రమమునకు వెళ్లెను వసిష్ఠుఁడు ధైర్యము నవలంబించి, జనకునివద్దకు వచ్చెను. శ్రీరామునిశీలమును, సుస్వభావమును, స్నేహవాత్సల్యములను జనకునకు గురువు తెలియఁజేసి యిట్లుచెప్ప నారంభించెను "ఓరాజా! ధర్మము ననుసరించి, సకలజనులకు హితవగు వాక్యమును జెప్పుము.

దోహా 296

"నీవు జ్ఞానమునకు నిధివి; చతురుఁడవు; సుశీలుఁడవు; పవిత్రుఁడవు; ధర్మాత్ముఁడవు; ధీరుఁడవు; ప్రజాపాలకుఁడవు. శ్రీరాముఁడు నగరమునకు వచ్చుటయో, లేక వనవాసముఁ జేయుటయో ఈసందిగ్ధమును బోఁగొట్టుటకు మీరుతప్ప మఱియొకరు సమర్థులు కారు"

చౌపాయ్

ఇట్లు, జనకచక్రవర్తి గురువుపలికిన వాక్యములను విని, పరమానురాగబద్ధుఁడయ్యెను. అతనియవస్థఁజూచి, జ్ఞానవైరాగ్యములు సహితము వైరాగ్యమును బొందెను. అతఁడు స్నేహమునకు వశ్యుఁడయ్యెను. అందుచేత, నతనిశరీరము శిథిలమయ్యెను. ఈవిధమున నతఁడు మనస్సులోఁ జింతించెను:—"నే నిచ్చటకు వచ్చుట తప్పుపని. రామునివనములకు వెళ్లుమని రాజు చెప్పెను; రామునియందుఁ గలప్రేమచేత, నతఁడు వియోగదుఃఖమును సహింపలేక, ప్రాణములను విడిచిపెట్టెను. నేను చేయవలసినపనియేమి? శ్రీరాముని వనమునకుఁబంపి, నేను నాజ్ఞానమును దృఢముఁజేసికొని, గృహమునకు మరలిపోవలెను. నేను రాముని త్రిప్పలేక, మరలితినని లోకులు చెప్పుకొనుచుందురు. నేను జ్ఞానిననియు, రాముని మరలింపలేకపోవుటయేగాక, నాశరీరము నయినను విడిచిపెట్టలేకపోతినని పలుకుచుందురు. అందుచేత నేను వచ్చుట మంచిపని కాదు." తపశ్శాలులును, మునులును, బ్రాహ్మణులును రాజు మనోభిప్రాయమును తెలిసికొని, వ్యాకులులయిరి. సమయముఁ జూచి, జనకుఁడు ధైర్యము నవలంబించి, సమాజముతోఁగూడి, భరతునివద్దకు వచ్చెను. భరతుఁడు జనకున కెదురుగవెళ్లి, ఆదరించి, సన్మానించి, సమయానుసారముగ నొకయాసనము నిచ్చెను. అప్పుడు జనకుఁడు భరతునితో నిట్లు చెప్ప నారంభించెను:—"ఓభరతుఁడా! శ్రీరాముని స్వభావము నీకుఁ దెలియును.

దోహా 297

"శ్రీరాముఁడు సత్యవ్రతుఁడు; ధర్మరతుఁడు. మనయందుఁ గల స్నేహవాత్సల్యములచే నతఁడు సంశయముచే బాధపడుచున్నవాఁడు. నీవు చెప్పినప్రకార మతఁడు చేయును."

చౌపాయ్

ఇట్లు జనకుఁడు చెప్పినవచనముల నతఁడు వినినందున, నతనిశరీరము పులకరించెను. అతఁడు ధైర్యముఁ దెచ్చుకొని, యిట్లు సంభాషించెను; "ఓనాథా! శ్రీరాముఁడు నాప్రభువు; నాకుఁ బ్రియుఁడు; నాకుఁ బూజ్యుఁడు మీరు నాతండ్రితో సమానులు; నాకులగురువులు వసిష్ఠులును నాతండ్రితో సమానులు. నాతల్లిదండ్రులైనను, వారివంటిహితకారులు కారు. ఈదినములలో మీరును విశ్వామిత్రాదిమహామునులును, జ్ఞానసముద్రులు; నేను బాలుఁడను; మీసేవకుఁడను; మీచేఁ బ్రేమింపఁదగినవాఁడను; కనుక, మీరు నన్నుఁ దగినవిధమున శిక్షింపుఁడు. ఈసమాజము గొప్పది; మహాత్ములు, మీరు నన్నడుగుచున్నారు; ప్రత్యుత్తరము నిచ్చుటకు నే నెంతటివాఁడను! నామనసు మలినము; నామాట లసందర్భములు. నేనేమి చెప్పఁగలను! నాచిన్నముఖమునుండి గొప్పమాటలను నేనెట్లు చెప్పఁగలను? విధి నాయెడలఁ బ్రతికూలముగ నుండెనని తెలిసికొని నన్ను క్షమింపుఁడు. సేవకునిధర్మము మహాకఠినమని వేదశాస్త్రములు ప్రకటించుచున్నవి; ఆసంగతి లోకవిశదము స్వామిధర్మమునకును స్వార్థమునకును విరోధము కలదు. గ్రుడ్డివాఁడును చెవిటివాఁడును నృత్యము జూడఁబోయిరి; వారిలో నొకనికిఁ దెలిసినసంగతి రెండవవానికిఁ దెలియదు. ఒకఁడు గానమును మెచ్చుకొనును; రెండవవాఁడు నృత్యమును మెచ్చుకొనును.

దోహా 298

"రాముఁడు ధర్మవ్రతపరుఁడనియు, నేను పరాధీనుఁడననియు తెలిసికొని, రామునిధర్మము సర్వసమ్మతమును రామునివ్రతము సకలజనహితమును కనుక, రామునియందు గలప్రేమను తెలిసికొని, తత్ప్రకారము ప్రవర్తింపుఁడు."

చౌపాయ్

ఇట్లు భరతుఁడు చెప్పినమాటలను విని, అతని సుస్వభావమును గనిపెట్టి, జనకుఁడును అతనిసమాజమును, భరతుని గొనియాడ నారంభించిరి. అతనివచనములు సుగమములు, అగమ్యములు; మృదువును మంజులమును గాని కఠినములు; మాటలు కొంచెముకాని, వాని యర్థ మమితము. (రామునిచిత్తమును గనిపెట్టుమనియు, తాను పరాధీ

నుఁడనని చెప్పుట-సుగమము.) (తండ్రిమాటప్రకారము రాముఁడు నడుచుకొనుట ధర్మము. ఆతనివియోగమును సహింపలేక, అతని శరణుఁ జొచ్చియుండిన తల్లులను, మంత్రులను, తనను, పురజనులను రక్షించుట రామునివ్రతము. ఈరెండింటికిని విరోధము; అయినను వానికి భంగము రాకూడదు. అందుచేత భరతునివాక్యములు మంజువులును, అగమ్యములును, గభీరములుగ నుండెను.) అద్దము చేతిలోఁగలదు; అద్దములో ముఖముయొక్క ప్రతిబింబము కనఁబడును; కాని, ఆప్రతిబింబమును పట్టుకొనుట కష్టము. అటులనే, భరతునివాక్యము లద్భుతముగ నుండెను. కుముదములను చంద్రుఁడువలె, దేవతలను వికసింపఁజేయు శ్రీరామచంద్రునివద్దకు జనకుఁడును, భరతుఁడును, మునులును, సాధుసమాజమువారును వెడలిరి. ఏసంగతియు ఆదినమున నిర్ధారణము గునని పురజనులు తెలిసికొని, శోకాక్రాంతులైరి. క్రొత్తనీటిలో నివసింపవలసివచ్చినపుడు మీనములువలె, వారు వ్యాకులులయిరి. ప్రథమమున, కులగురువగు వసిష్ఠుని మనోగతుల నెఱింగి తదుపరి, విశేషముగ జనకునకుఁ గలప్రేమాతిశయములను తెలిసికొని, రామభక్తిమయమగు భరతునిజూచి, స్వార్థపరులగు దేవతలు లోలోన విషాదగ్రస్తులయిరి. జనులకు శ్రీరామునియందుఁ గలప్రేమాతిశయములను లేఖులు (దేవతలు) చూచి, నగరమునకు రాముఁడు తిరిగివెళ్లునేమోయని భయపడి, అలేఖులయిరి (విచారగ్రస్తులయిరి).

దో॥ 299

"శ్రీరాముఁడు స్నేహవాత్సల్యములకు వశ్యుఁడయ్యెను." అని ఇంద్రుఁడు విచారగ్రస్తుఁడై పలికి, ఓదేవతలారా! మనము కలిసి, యొకయుపాయముఁ జూడవలెను; లేనియెడల, మనకార్యము చెడిపోవును" అని చెప్పెను.

చౌపాయ్

అప్పుడు దేవతలు శారదనుస్మరించి, ఆమెను స్తుతించిరి. "ఓదేవీ! శరణాగతులమగు మమ్ములను రక్షింపుము నీమాయచే భరతుని బుద్ధిని త్రిప్పుము. ఏచమత్కారమైనఁజేసి, దేవబృందములను బరిపాలింపుము" ఆచతురభాషిణి, ఆశారద దేవతల విన్నపముల నాలకించి, వారిజడత్వమును స్వార్థపరత్వమును గ్రహించి, వారితో నిట్లు సంభా

షించెను, "ఓదేవతలారా ! భరతునిబుద్ధిని త్రిప్పుమని నాతోఁ జెప్పు చుంటిరి. ఓఇంద్రా! నీకు సహస్రనేత్రములు కలవు. అయినను, నీవు సుమేరుపర్వతముఁ జూడలేవు. భరతునిమహిమ నీకు వ్యక్తముకాలేదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులమాయ మహాగొప్పది; ఆమాయసహితము భరతునిమతిని జూడలేదు అట్టి భరతునిమతిని త్రిప్పుమని నాతోఁ జెప్పుచుంటిరి. ఆహా! చంద్రకిరణములు చంద్రుని దొంగిలింపఁగలవా? భరతునిహృదయములో శ్రీసీతారాములు నివసించియుందురు. సూర్యుని సమీపమునఁ జీకటియుండఁగలదా? భరతునివద్ద మాయ నిలువగలదా?" ఈమాటలను సరస్వతిచెప్పి, బ్రహ్మలోకమునకు వెళ్లెను. రాత్రికాలమున చక్రవాకమిథునమువలె, దేవతలు వ్యాకులులయిరి.

దోహా 300

మనస్సులు కలఁతపడినందున, స్వార్థపరులగు దేవతలు కుమంత్రములను గుత్సితపన్నాగముల నాలోచించి, మాయాప్రభావముచే నుచ్చాటనమంత్రముల సిద్ధపఱచి, వానిమూలమున, భయమును, దుఃఖమును, భ్రమను వ్యాపింపఁజేసిరి.

చౌపాయ్

"కార్యము జరగుటకాని, చెడిపోవుటకాని, భరతునిచేతిలోఁ గలదు" అని ఇంద్రుఁడు చమత్కారముఁబన్ని, విచారించుచుండెను. అంత, జనకచక్రవర్తి మొదలగువారు రామునివద్దకు వెళ్లిరి; అతఁడు వారిని యథావిధిగ సన్మానించెను. అప్పుడు, సమయానుసారముగ, ధర్మమునకు విరుద్ధముకాని వచనములను రఘువంశపురోహితుఁడు, వసిష్ఠుఁడు చెప్పి, భరతజనకులసంవాదమును రామునకు వినిపించి, భరతుని ప్రసంగమును ముచ్చటించి, మరల నిట్లు చెప్పెను: "ఓరామా! నీయాజ్ఞా ప్రకారము మేము ప్రవర్తించెదము; ఇదియే నాయభిప్రాయము." అప్పుడు శ్రీరాముఁడు చేతులను జోడించి, సరళమయిన మృదుమధురమగు సత్యవాక్యముల నిట్లుచెప్పెను:—"ఓనాథా! పూజ్యులగు మీరును, జనకులును నిలిచియుండ, నేను పలుకుట అసందర్భము. ఓనాథా! మీతోడు; ఏప్రకారము మీ రుభయు లాజ్ఞాపించెదరో, నే నాప్రకారము మీయాజ్ఞను సత్యముగ శిరసావహించెదను."

దోహా 301

రామునివచనములను విని, వసిష్ఠుఁడును, జనకుఁడును, సభ్యులును ఆశ్చర్యపడి, మాటఁజెప్పలేక భరతునిముఖముఁ జూచుచుండిరి.

చౌపాయ్

ఆశ్చర్యపరవశులైయుండిన సభ్యులను భరతుఁడుచూచి, రాముని తమ్ముఁడు కనుక, గాంభీర్యమును వహించి, ధైర్యముఁ దెచ్చుకొనెను. ఆసమయము మంచిది కాదని తెలిసికొని, యతఁడు తనప్రేమాతిశయమును, అగస్త్యుఁడు వింధ్యపర్వతమునువలె, మట్టుపెట్టెను. హిరణ్యాక్షుఁడు భూమిని నెత్తుకొనిపోయినవిధమున, భరతుని విమలగుణగణములను శోకము హరించెను; కాని, ఆసమయమున బ్రహ్మస్వరూపుఁడగు వరాహమూర్తి ప్రత్యక్షమై, హిరణ్యాక్షుని సంహరించి, భూమిని నుద్ధరించినట్లు, భరతునివివేక మతనిశోకమును బోఁగొట్టి, యతనిబుద్ధిని నిలువఁబెట్టెను అతఁడు చేతులనుజోడించి, శ్రీరామునకును, జనకునకును, గురువునకును, సాధువులకును నమస్కరించి, యిట్లు ప్రసంగించెను. "ఈరోజున నాకోమలముఖముతో నేను కఠోరవచనములఁ బలుకుటకు సిద్ధపడితిని కనుక, నాయనుచితవాక్యములను క్షమింపుఁడు" అని భరతుఁడు, సరస్వతిని ధ్యానించెను. ఆశారద, అతని మానససరోవరమునుండి వెడలి అతనిముఖకమలముగుండ, వచ్చెను; ఆభరతుని భారతి హంసవలె, జ్ఞానవైరాగ్యధర్మరూపమగు ముత్యాల క్షేత్రములలో, విహరించుచుండును.

దోహా 302

సమాజమువారు ప్రేమచేఁ బరవశులై యుండిరని, భరతుఁడు జ్ఞానదృష్టిచేఁ దెలిసికొని, వారికిఁ బ్రణామముఁజేసి, శ్రీసీతారాములను ధ్యానించి, యిట్లు చెప్పఁదొడంగెను.

చౌపాయ్

"ప్రభు । పితు । మాతు । సుహృద । గురు । స్వామీ,
పూజ్య । పరమహిత । అంతర్యామీ. ౧
సకల । సుసాహిబ । శీల । నిధానూ,
ప్రణతపాల । సర్వజ్ఞ । సుజానూ. ౨

"ఓనాథా! మీరు సర్వాంతర్యాములు, మీరే నాజననీజనకులు, మీరే నాస్నేహితులు, మీరే నాగురువులు, నాప్రభువులు, నాపూజ్యులు; మీచిత్తము సరళము, చక్కని ప్రభువులు, సుశీలనిధులు, ప్రణతపాలకులు, సర్వజ్ఞులు, సుజ్ఞానులు (నేను చెప్పఁదలఁచినసంగతులు మీకు విశదము.)

"సమరథ । శరణాగత । హితకారీ,
గుణగ్రాహక । అవగుణ । అఘహారీ. ౩
స్వామి । గుసాఈ । సరిస । గుసాఈ,
మోహి । సమాన । మైఁ । స్వామి । దుహాఈ. ౪

"ఓనాథా! మీరు సమర్థులు, శరణాగతహితకారులు, గుణగ్రాహులు, అవగుణములను పాపములను హరించెదరు — ఓస్వామీ! మీకు మీరే సమానులు, మీతోడుగ నేను చెప్పుచున్నాను. స్వామిద్రోహులలో నాకు నేనే సమానుఁడను.

"ప్రభు । పితువచన । మోహావశ । పేలీ,
ఆయఉఁ । యహాఁ । సమాజ । సకేలీ. ౫
జగభల । పోచ । ఊఁచ । అరు । నీచూ,
అమీ । అమరపద । మాహురు । మీచూ. ౬

"ఓనాథా! నేను మోహమునకు వశ్యుఁడనై, మీమాటను తండ్రిమాట నుల్లంఘించి, సమాజసహితముగ నిచ్చటకు వచ్చితిని. మంచిచెడ్డలను, ఉచ్చనీచములను, అమృతమును, విషమును, అమరత్వమును, మృత్యువును, లోకములోఁ జూచియుంటిని.

"రామరాజ్య । ఖేటి । మనమాహీఁ,
దేఖా । సునా । కతహు । కోఅ । నాహీఁ॥ ౭
సో । మైఁ । సబవిధి । కీన్హి । ఢిఠాఈ,
ప్రభుమానీ । సనేహ । సేవకాఈ॥ ౮

"కాని, మనస్సులోనైనను శ్రీరామునియాజ్ఞ నుల్లంఘించినవానిని చూచిగాని, వినిగాని యుండలేదు. నే నన్నివిధముల నుల్లంఘించియుంటిని; అయినను, నాయందుఁగల వాత్సల్యముచే, నేను జేసిన పనిని సేవకున కుచితమయినది అని నాప్రభువు సమ్మతించెను.

దోహా 303

"ఓనాథా! మీకృపాప్రభావముచే నన్నివిధముల మీరు నన్ను గారవించితిరి; అందుచేత నాదోషములన్నియు నాకు భూషణము లయ్యెను. నాచక్కనికీర్తి నలువైపుల వ్యాపించెను.



చౌపాయ్

"ఓనాథా! మీచర్యలును మీసువాక్యములును లోకవిదితము; వానినే, వేదములు గానముఁజేయుచున్నవి. క్రూరులును, కుమతులును, ఖలులును, కళంకులును, నీచులును, దుశ్శీలులును, నిర్భయులును, నిరీశ్వరులును - ఈమొదలగువారు మీగుణగణములను విని, మీవద్దకు వచ్చి, మీశరణుఁజొచ్చి యొకపర్యాయము మీకుఁ బ్రణామముఁ జేసినయెడల, వారిని మీవారిగ భావించెదరు. వారిలో దోషములుండినను వానిని మీరు లక్ష్యముఁజేయరు; వారిసుగుణములను మీరు విన్నయెడల, వానిని సాధుసమాజములలో మీరు ప్రకటించెదరు. తనసేవకులను దయతోఁ జూచునట్టియు, తనతో సమానముగ తనసేవకులను సన్మానించునట్టియుఁ,దాను దనసేవకులకుఁ జేసినయుపకారములను స్వప్నమందైనను తలఁచనట్టియు, తనసేవకుల సంకోచములనిమిత్తము సదా విచారించునట్టి, మీవంటిప్రభువు మఱియొకఁడు కలఁడా? అందుచేత మీవంటివారు మీరేకాని, మఱియొకరులేరు ఊర్ధ్వబాహుండనై నే నీప్రతిజ్ఞఁ జేయుచున్నాను. ఆడించినప్రకారము పశువులాడును; చెప్పినప్రకారము చిలుకలుపలుకును; వానియాటలును, వీనిపలుకులును, చెప్పినవానియధీనములు. అటులనే, నామంచిగుణములును,చెడుగుణములును మీయధీనములు నేను కేవలము పాఠకుఁడను.

దోహా 304

"ఓనాథా! నేచేసినయవజ్ఞతను మీరు సవరించి, నన్ను గారవించి, నన్ను భక్తశిరోమణినిఁ జేసితిరి. మీరు కృపాసముద్రులు కనుక తప్పుల నొప్పులుగఁ జేయఁగలరనునట్టి బిరుదు మీకే చెల్లును.

చౌపాయ్

"ఓనాథా! శోకముచేతనో, లేక ప్రేమచేతనో, లేక బాలస్వభావముచేతనో, నేను మీయాజ్ఞ నుల్లంఘించితిని. మీరు కృపాళురు

కనుక, నాముఖముఁజూచి, నాతప్పును క్షమించి, నాకు గొప్పతనము నిచ్చితిరి. సకలమంగళములకు మూలమగు మీచరణములను దర్శించితిని; నాప్రభువులగు మీరు నాకనుకూలముగ నుంటిరని తెలిసికొంటిని. నాయదృష్టవశమున నే నీసమాజమును జూడఁగంటి; నేను గొప్పయప రాధముఁజేసినను, నన్ను మీరు ప్రేమించితిరి మీకృపానుగ్రహామృత ములచే, నేను దృప్తినొందితిని; మీరు కృపానిధానులు; సర్వమునకును మీరు గొప్పతనముఁదెచ్చితిరి. ఓస్వామీ! మీసుశీల, సుస్వభావముల ప్రభావముచే, నామీఁద దయనుంచితిరి. ఓనాథా! నాప్రభువులగు మీయెదుటను, ఈసమాజమువారియెదుటను సిగ్గునువిడిచి, నేను దప్పుఁజేసియుంటిని. వినయముగనో, అవినయముగనో, నాబుద్ధికిఁ దోఁచి నట్లు నేను బలికియుంటిని; ఓదేవా! నే నార్తజనుఁడనని గ్రహించి, నాతప్పులను క్షమింపుఁడు.

దోహా 305

"స్నేహితునితోను, చతురునితోను, యజమానునితో నధికము ప్రసంగించుట దోషము; ఓదేవా! మీయాజ్ఞఁజెప్పి,నన్ను సవరింపుఁడు.

చౌపాయ్.

"ఓనాథా! మీచరణకమలపరాగమే, తోడు. సత్యమునకును, సుఖమునకును, సుకృతమునకును, మీచరణములే, యునికిపట్టు. మీచర ణములయాన — జాగ్రత్స్వప్నసుషుప్త్యాద్యవస్థలలోఁగూడ, నామనోభీ ష్టముఁ జెప్పుచున్నాను. స్వార్థమును, కపటమును, చతుర్విధపురుషార్థ ములను విడిచి, స్వభావసిద్ధమగు యనురాగముతో మిమ్ములను సేవిం చుటయే, నాకోరిక. ఓరఘునాథా! ఆజ్ఞాపూర్వకముగ సేవను జేయు టయే, భక్తులకుఁ గలుగుప్రసాదము! ఆప్రసాదము నాకుఁ గలుగుగాక! సుస్వామియాజ్ఞను బరిపాలించుదానితో సమానమగుసేవ మఱియొకటి లేదు." ఈప్రకారము భరతుఁడు చెప్పి, ప్రేమకువశ్యుఁడై, కన్నీరుఁ గార్చెను; అతనిశరీరము పులకరించెను. అతనిమనస్సు తత్తఱపడుచుండఁ, బతఁడు శ్రీరామునిచరణకమలములఁ బట్టుకొనెను. ఆసమయమునఁ గనఁ బడినప్రేమాతిశయములఁజెప్పుటకు శక్యముకాదు. ఆకృపాసముద్రుఁడు, ఆశ్రీరాముఁడు చక్కనిమాటలతో భరతుని సన్మానించి, స్వహస్తము

లతో లేవఁదీసి, తనవద్దఁ గూర్చుండఁబెట్టుకొనెను. భరతునివినయవచనములను వినియు, అతనిసుస్వభావమును జూచియు, సభికులును, శ్రీరాముఁడును ప్రేమచేఁ బరవశులయిరి.

ఛాంద్ 13

రఘురాముఁడును, సాధుసమాజమువారును, మునిజనులును, జనకుఁడును, ప్రేమాతిశయముచేఁ బరవశులయిరి; భరతుని భ్రాతృవాత్సల్యమును, భక్తిని, మహిమను వారు వారిమనస్సులలోఁ గొనియాడిరి. దేవతలమనస్సులు కలఁతఁజెందినను, వారు పుష్పములను వర్షించిరి. రాత్రికాలమున కమలముల శోభ క్షీణించువిధమున, రెండునగరముల జనులు వ్యాకులు లయిరి.

సోరథా 13

ఉభయపక్షముల స్త్రీపురుషులు దీనులై, దుఃఖించుచుండ, వారిం జూచి, మహాకులీనుఁడగు దేవేంద్రుఁడు, దయాదాక్షిణ్యములులేక, సగము చచ్చియుండినవారినిఁ జంపి, మంగళములను గోరుచుండెను.

చౌపాయ్

ఇంద్రుఁడు కపటమునకును, చమత్కారమున కునికిపట్టు; స్వార్థలాభమును పరార్థనష్టమును గోరును. కాకివలె, నాపాకశాసనుఁడు కపటి; చమత్కారి; అతనికి నెవరియందును విశ్వాసము లేశమైన లేదు ప్రథమమున, నతఁడు దురాలోచనజేసి, కపటసన్నాహములఁబన్ని, వారి నెత్తిమీఁద ననేకకష్టములఁ దెచ్చిపెట్టెను. వారందఱు దేవమాయకు వశ్యులై, మోహపడియుండిరి; కాని, రామునియందుఁ గలపరమానురాగముచే, వారు రాముని విడిచిపెట్టియుండుట కియ్యకొనలేదు. భయశోకాహములచే, వారిమనస్సులు వైకల్యముఁబొందెను; వారిమనస్సులకు స్థిమితములేకపోయెను; ఒకక్షణమున వారికి వనమునందు రుచియుండెను; మఱియొకక్షణమున గృహములకుఁ బోవలెనని యభిలాష పుట్టెను. ఈప్రకారము వారిమనస్సులు సందిగ్ధమగుటచేత,వారు చింతాక్రాంతులయిరి. నదివచ్చి కలియునపుడు సముద్రజలములు కలఁతఁజెందినట్లు, వారు కలఁతపడియుండిరి. వారిమనస్సులు చలించినందున, నెచ్చటకూడ వారికి సంతోషములేకపోయెను. ఎవనియాలోచనలనువాఁడు మఱియొకనికిఁ జెప్పుకొనలేదు. ఆకృపానిధానుఁడు వారిదుర్దశను

గ్రహించి, "ఇంద్రునివ్యాపారములు కుక్కనుబోలియున్నవి" తలంచి, నవ్వుకొనెను.

దోహా 306

భరతుని, జనకుని, మునిగణములను, మహాత్ములను, మంత్రులను, సాధువులను విడిచిపెట్టి, దేవమాయ సకలజనులపై వ్యాపించెను.

చౌపాయ్

ఆకృపాసముద్రుఁడు జనులదుఃఖమును జూచి, తనలో నిట్లు చింతించెను. "ఆహా! నామీఁదఁగల యనురాగముచే, దేవేంద్రుఁ డీ కపటపన్నాగముఁ జేసెను. రాజును, సభికులును, గురువును, బ్రాహ్మణులును మంత్రులుసుభరతునిభక్తియంత్రములోఁబడియుండిరి."చిత్తరువు బొమ్మలవలె, వారు నిలువఁబడి, శ్రీరాముని జూచుచుండిరి; కంఠాపాఠముఁ జేసినట్లు, వారు సంకోచముతో మాటలఁ బలుకుచుండిరి. భరతుని వినయమును, నీతియుఁ బ్రీతియు, గొప్పతనమును విననందున, సుఖముకలుగును; వానిని వర్ణించుట కష్టము ఆభరతుని భక్తిలో లవలేశమునుజూచి, మునులును జనకుఁడును ప్రేమలో మగ్నులయిరి. ఆభరతుని మహిమను తులసీదాసు ఎట్లు వర్ణింపఁగలఁడు! భక్తిప్రభావముచే, సుప్పాంగుచుండిన నామనోల్లాసము ననుసరించి, చెప్పుచున్నాను. నాబుద్ధి చిన్నది; భరతునిమహిమ గొప్పది; ఈసంగతిఁ దెలిసికొని, నాబుద్ధి కవిజనులయెదుట నిలువఁబడుటకు సిగ్గుపడి, సంకోచముతో వెనుకఁదీయుచున్నది. ప్రేమాతిశయముచే భరతునిగుణాధిక్యతను జెప్పలేక, నాబుద్ధివ్యాపారములు, బాలునిసంజల్పములవలెఁ గనఁబడును.

దోహా 307

భరతుని నిర్మలమగుకీర్తిచంద్రుఁడు భక్తులనిర్మలాంతఃకరణములో నుదయించును. బాలచకోరములువలె, పండితులబుద్ధి తదేకదృష్టితో నాచంద్రునిఁ జూచుచుండును (భక్తులహృదయము—ఆకాశము.)

చౌపాయ్

భరతునిస్వభావము వేదమునకుసహితము సుగమముకాదు. ఓ కవిజనులారా! నన్ను క్షమింపుఁడు; నాబుద్ధి చంచలము; మహాస్వల్పము; నే నతనిస్వభావము నెట్లు చెప్పఁగలను? భరతునిసుస్వభావమును చెప్పి

నను, వినినను, ఎవనికి శ్రీసీతారాములచరణములయం దనురాగము పుట్టదు! శ్రీరామభరతులను ప్రేమతో స్మరించినను, నెవనికి వారిచరణములయం దనురాగముకలుగదో, వానియెడల విధాత ప్రతికూలముగ నుండెనని తలంపుఁడు. ఆసుజ్ఞాని, ఆదయాళువు, శ్రీరాముఁడు వారి దుర్దశఁజూచి,వారిమనోభిప్రాయములను గ్రహించెను. ఆధర్మధురీణుఁడు, ఆధీరుఁడు, ఆనీతికోవిదుఁడు, ఆరాజనీతిపారంగతుఁడు, ఆసుశీలసుఖసాగరుఁడు, ఆసత్యసంధుఁడు, ఆస్నేహపాత్రుఁడు, న్యాయపరిపాలకుఁడు, పరమప్రీతికలవాఁడు, రఘురాముఁడు, సమాజమునుజూచి, దేశకాలసమయముల నాలోచించి, వినుటకుఁ జంద్రునివలె నింపుగనుండునట్టియు, పరిణామమున హితవును కలిగించునట్టియు, సరస్వతితో సమానమగువాక్యములఁ జెప్పట కారంభించెను. "ఓతమ్ముఁడా! భరతుఁడా! నీవు ధర్మాత్ములలో ధురీణుఁడవు. వేదమార్గములలోను,లోకాచారములలోను నీవు చతురుఁడవు.

సోరఠా 308

"ఓతమ్ముఁడా! నిర్మలమగు మనోవాక్కర్మలలో, నీసమానుఁడు నీవు. ఈసమాజములో గురుజనులు కలరు; ఈసమయ మసమయము; ఈస్థలములో నాతమ్మునిగుణములనెట్లు వర్ణింపఁగలను?

చౌపాయ్

"ఓతమ్ముఁడా! సూర్యవంశాచారము నీకుఁ దెలియును. మనజనకులు సత్యప్రతిజ్ఞులు; వారికీర్తియు, అనురాగము నీకు విశదము. ఈసమయమును, గురుజన-సమాజమువారి మనోభిప్రాయములును, హితాహితకారులమనస్సులును, ఉదాసీనులమనస్సులును, లజ్జగలవారిమనస్సులును నీకు విశదము. సకలజనులమర్మము నీకుఁ దెలియును. మనయుభయులపరమార్థము నీకు వ్యక్తము ఓభరతుఁడా! అన్నివిధముల నీయందు నాకు నమ్మకము కలదు; అయినను, సమయము నాలోచించి చెప్పుచున్నాను. ఓతమ్ముఁడా! మనజనకులు లేనిసమయమున, మనగురువులకృపవలననే, నామాటలు నూటిగనున్నవి; లేనియెడల, నాపురజనులును, ప్రజలును పరివారమును, నేను గూడ దుఃఖములో మునిఁగియుందుము. అసమయమున, సూర్యుఁడు కనఁబడినయెడల, లోకములు

కష్టముఁజెందునుకదా! ఓతమ్ముఁడా! ఇట్టికష్టము విధికృతమువలనఁ గలిగెను; కాని, దానిని గురువులును మిథిలాధిపతులును నివారించిరి.

దోహా 309

"మనరాజ్యమును, పేరుప్రతిష్ఠలను, ధర్మమును, ధనమును, ధామమును, భూమిని మనగురువులు, తమప్రభావముచే, నిలువఁబెట్టిరి; పరిణామమున శుభము కలుగును.

చౌపాయ్

"మనయుభయులసమాజమును, వనమును, గృహమును, మన గురువులు మనలను ప్రసాదించి, రక్షించుచుండిరి. జననీజనకులయాజ్ఞయు, గురునాజ్ఞయు, యజమానునియాజ్ఞయు, శేషుఁడు భూమిని వలె, సకలధర్మములను భరించును. ఓతమ్ముఁడా! ఆయాజ్ఞను మనయుభయులము శిరసావహింప వలయును. ఓతండ్రీ! సూర్యకులమును పరిపాలించినవాఁడవగుము. ఈయొక్కసాధనమువలన, సకలసిద్ధులు కలుగును. కనుక, జనకునియాజ్ఞను మన్నించుటయే, యుచితము; దానిమూలమున, సుగతియుఁ, గీర్తియు, విభూతుల త్రివేణిసంగమము కలుగును. ఈప్రకారము నీవు విచారించి, సకలకష్టములను భరించి, నీప్రజలకును పరివారమునకును సౌఖ్యముఁగలుగఁజేయుము. ఓతమ్ముఁడా! ఈవిపత్తి సకలజనులకు సరిసమానముగ వచ్చెను; పదునాలుగుసంవత్సరములవఱకు విశేషముగ నీవు దానిని సహింపవలెను. ఓతమ్ముఁడా! నీమనస్సు మృదువని నాకుఁ దెలియును; అయినను, నేనింతకఠోరముగఁ బలుకవలసి వచ్చెను ఈసమయ మసమయము; నేనిట్లు పలుకుట, అనుచితముకాదు. సమయమువచ్చినపుడు, కత్తిపోటును దప్పించుకొనుటకు హస్తము నుపయోగించునట్లు, ప్రియసోదరుని,డాలువలెనుపయోగింపవచ్చును హస్తమునకును,శరీరమునకు భేదము లేదు.అటులనే,నీవు సహాయముఁజేయుము."

దోహా 310

సేవకుఁడు హస్తమును, నేత్రమును, పాదమును బోలును; యజమానుఁడు ముఖమువంటివాఁడు.ఈప్రకారము సేవకునిధర్మమును, భక్తినిఁ, దులసీదాసు వర్ణించెను; ఈవర్ణనను సుకవులు విని హర్షించిరి.

చౌపాయ్

ప్రేమసముద్రములోఁ బుట్టిన యమృతముతో సమానముగు

శ్రీరాముని వాక్యములను సభికులు విని, స్నేహపరవశులయిరి; అందుచేత, వారిశరీరములు పులకరించెను; వారిశరీరము శిథిలమయ్యెను. వారిదశఁ జూచి, సరస్వతిసహితము మౌనమును ధరించెను. భరతుఁడు పరమానందభరితుఁడయ్యెను. అతఁడు స్వామిసమ్ముఖమున నుండుటచేత, నతనిదోషములును దుఃఖములును నశించెను; అతనిముఖము వికసించెను. సరస్వతి ప్రసన్నమయినందున సంతసించుమయూరగవానివలె, నతఁడు సంతోషించెను. అతఁడు ప్రేమచే స్వామికి నమస్కరించి, కమలముల వంటిహస్తములను జోడించి, యిట్లు విన్నవించెను:—"ఓనాథా! మీతోఁగూడి వచ్చినంత సుఖము నాకుఁగలిగెను. లోకములో నాజన్మము సఫలమయ్యెను. ఓకృపాసముద్రుఁడా! మీయాజ్ఞ అయినయెడల, నాదరముతో దానిని శిరసావహించెదను. ఓనాథా! నాయవలంబనకు దేనినైన ప్రసాదింపుము; నేను దానిని నాశ్రయించి, పదునాల్గు సంవత్సరములు గడపఁగలను.

దోహా 311

"ఓనాథా! మీయభిషేకార్థము సకలతీర్థముల జలములను దీసికొనివచ్చితిమి; గురునాజ్ఞాప్రకారము వానిని దెచ్చితిమి; ఏవిధమున వీనిని నుపయోగించుటయో, మీరు చెప్పవలెను.

చౌపాయ్

"ఓనాథా! నామనస్సులో నొకగొప్పకోరిక కలదు. భయముచేతను, సంకోచముచేతను, దానిని జెప్పుటకు వెఱచుచున్నాను." "ఓతమ్ముఁడా! నీవు దానినిఁ జెప్పుము" అని శ్రీరాముఁడు పలికెను. "ఓనాథా! మీశెలవుప్రకారము, చిత్రకూటపర్వతమును ఋష్యాశ్రమములను, తీర్థములను, వనములను, నదులను, ఖగమృగములను, సరోవరములను, ఆకాశధారలను, విశేషముగ శ్రీవారిపాదచిహ్నములను, జూచివచ్చెదను." అని భరతుఁడు చేతులనుజోడించి, ప్రేమాతిశయముచేఁ బలికెను "ఓతమ్ముఁడా! నీవు తప్పకవెళ్లుము; కాని, అత్రిమహాముని యాజ్ఞ గైకొని, నిర్భయముగ, వనములో సంచరింపుము. ఓతమ్ముఁడా! ఆమునీశ్వరునిప్రసాదమువలన వనమంతయు పవిత్రమై,మంగళదాయకమై, మనోహరముగ నున్నది. ఏస్థలములో, నేతీర్థములను

మునిరాజు నిలుపుమని యాజ్ఞాపించునో, ఆస్థలములో వానిని నిలుపుము." అని శ్రీరాముఁడు చెప్పెను. శ్రీరామునివచనములను భరతుఁడు విని, సంతసించి, మునిచరణకమలములకు శిరస్సునువంచినమస్కరించెను.

దోహా 312

సకలమంగళములకు మూలమగుశ్రీరామభరతులసంవాదమును, స్వార్థపరులగుదేవతలువిని, సూర్యవంశమును గొనియాడి, పుష్పములను వర్షించిరి.

# సప్తదశవిశ్రామము.

చౌపాయీ

"భరతుఁడు ధన్యుఁడు, ధన్యుఁడు; జయరామ్, జయరామ్" అని పలుమాఱు దేవతలు పలికి, సంతుష్టాంతరంగులైరి. మునులును, మిథిలాధిపతియు, సభ్యులును, ప్రతిమనుజుఁడును భరతునిప్రసంగమును విని హర్షించిరి. శ్రీరామభరతుల సుగుణసంపదను, వారిభ్రాతృవాత్సల్యమును పలువిధముల మిథిలాధిపతి స్తోత్రముఁజేసెను; సేవకుని యభిమానము యజమానునివాత్సల్యము శ్లాఘనీయములు; వారియన్యోన్యస్నేహమును నియమములును పరమపవిత్రములు. అచ్చటనుండినమంత్రులును, సభాసదులును, వారివారిబుద్ధికిఁ దోఁచినట్లు, వారిరువురను స్తుతించి, ఆమోదించిరి. ఉభయపక్షములవారును శ్రీరామభరతులసంవాదమునువిని, హర్షవిషాదములఁ బొందిరి. శ్రీరామునితల్లి, కౌసల్యకు సుఖదుఃఖములు సమానముగనుండెను; ఆమెగుణదోషములను బోధించి తదితరరాజపత్నులనుబోధించి యోదార్చెను. ఆసభికులలోఁ గొందఱు శ్రీరాముని గొప్పదనమును గొనియాడిరి; మఱికొందఱు భరతుని సుగుణములను బ్రశంసించిరి.

దోహా 313

"ఓభరతుఁడా! పర్వతసమీపమున నొకకూపముకలదు; సకలపుణ్యతీర్థముల పవిత్రజలములు దానిలోఁ గలవు. ఆజలములు నిర్మలములు" అని అత్రిమహాముని చెప్పెను.

చౌపాయీ

అత్రిమహాముని యాజ్ఞాప్రకారము, భరతుఁడు, జలపాత్రలను బంపించి, తమ్ముఁడును, అత్రిమహామునియు, సాధుజనులును వెంటనుండ వెడలి, యగాధమగు కూపమువద్దకు వచ్చెను. ఆపుణ్యతీర్థస్థలమున నతఁడు పవిత్రజలముల నుంచెను. అప్పు డత్రిమహాముని సంతోషించి, యిట్లు ప్రసంగించెను:— "ఓభరతుఁడా! ఈతీర్థస్థల మనాదికాలము నుండి వచ్చుచున్నది. కాలాంతరమున నిది లోపించెను; దీనిసంగతి యెవరికిఁ దెలియదు; కొంతకాలమునకు నాసేవకులు దీనింజూచి, యిది రమ్యమగుస్థలమని యాలోచించి, యీకూపములోనిమన్నును బురదను దీసివేసి, దీనిజలములను నిర్మలముఁ జేసిరి; దానిజలము పానీయమునకు యోగ్యమయినవి. దైవయోగమువలన, నిది లోకుల కుపయోగమయ్యెను. అగమ్యమగు సకలతీర్థముల జలములు దీనిలోనుండుటవలన, నిది లోకులకు సుగమ్యమయ్యెను. ఇప్పటినుండి దీనిని 'భరతకూపము'ని లోకులు పిలుచుచుందురు. సకలతీర్థముల పుణ్యజలముల ప్రభావముచే, దీనికి పవిత్రతవచ్చెను. దీనిజలములలో నెవరు ప్రేమపూర్వకముగ స్నానముఁ జేయుదురో, వారు మనోవాక్కర్మలచే నిర్మలులు కాఁగలరు"

దోహా 314

ఆకూపముయొక్క మహాత్మ్యమును జెప్పుకొనుచు, వారు శ్రీరాముని వద్దకు వచ్చిరి. అత్రిమహాముని దానిపుణ్యప్రభావమును వర్ణించి, శ్రీరామునకుఁ జెప్పెను.

చౌపాయీ

ధర్మశాస్త్రప్రసంగములలోను, నితిహాసశ్రవణములోను, వారారాత్రి సుఖముగ గడపిరి; అంత ప్రాతఃకాలమయ్యెను. ఆరాత్రి సంతోషముగఁ గడచెను. భరతశత్రుఘ్ను లిరువురు ప్రాతఃకాలస్నానసంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించి, శ్రీరామునివద్దను, అత్రివసిష్ఠులవద్దను సెలవుగైకొని, సాధుసమాజమును వెంటదీసికొని రామవనమును జూచుటకు పాదచారులై వెడలిరి. వారిరువురచరణములు కోమలములు; వానికి రక్షలులేవు; వారు పాదచారులై వచ్చినందులకు భూదేవి సిగ్గుపడి, మృదువయ్యెను; మార్గములో మెఱకపల్లములను సమముగఁజేసికొని, రాళ్లు, కంకర, ముండ్లు మొదలగువానిని లేకుండ

జేసి భూదేవి మృదువుగనుండెను. మందసుగంధశీతలవాయువులు మనోహరముగ వీచెను. దేవతలు పుష్పములను వర్షించిరి; మేఘములు నీడనిచ్చెను. వృక్షములు ఫలపుష్పములు నందిచ్చెను. మార్గము కోమలముగనుండుటకు పత్రములు వాని యంతట నవి నేలఁబడియుండెను. ఖగమృగములు వారిని జూచి, మనోహరముగ నఱచెను. శ్రీరాముని ప్రియుఁడని తెలిసికొని యతనికి వారు సకలోపచారములఁ జేసిరి.

దోహా 315

ఆవులించునపుడయినను రామనామమును స్మరించినమాత్రమున సాధారణమనుజునకు సకలసిద్ధులు కలుగునుకదా! అట్టిస్థితిలో నారాముని ప్రియసోదరునకు మార్గములు సుగమ్యములయ్యెనని చెప్పుటవలన, నాశ్చర్యమేమియు లేదు.

చౌపాయీ

ఈప్రకారము భరతుఁడు శ్రీరామవనములో సంచరించెను. అతనినియమమును, ప్రేమను మునులుచూచి ఆశ్చర్యపడిరి. పుణ్యసరోవరములను, పుణ్యస్థలములను, ఖగమృగములను, వృక్షములను, తృణములను, పర్వతములను, వనములను, ఉద్యానవనములను—ఈ మొదలగుచిత్రవిచిత్రములగు చక్కని సకలదివ్యతీర్థముల నతఁడు చూచి, సంతోషించి "ఓమునిరాజా! ఈపుణ్యతీర్థములప్రభావముఁ జెప్పుఁడు" అని యడుగుచుండెను. ఆయాదివ్యతీర్థముల పుణ్యప్రభావమును, వానినామములను, సకారణముగ నతనితో అత్రిమహాముని చెప్పుచుండెను. ఒకస్థలములో నతఁడు స్నానముఁజేయును; ఒకస్థలములో దండప్రణామముఁజేయును. మఱియొకస్థలమును దర్శించినమాత్రమున నతని మనస్సు సంతసించును. మునియాజ్ఞాప్రకార మొకస్థలములో నతఁడు కూర్చుండి, శ్రీసీతారామలక్ష్మణుల ధ్యానించును. భరతునిస్వభావమును, స్నేహమును, యాచరణయు దేవతలుచూచి, సంతసించి, యతనిని దీవించిరి; అంత దినములో మూఁడుయామములు గడచెను. అప్పుడు వారు తిరిగివచ్చి, శ్రీరామునిచరణకమలములను దర్శించిరి.

దోహా 316

అయిదుదినములలో నతఁడు సకలపుణ్యతీర్థములను జూచి

వచ్చెను. శ్రీశివకేశవుల ప్రభావములను గానముఁజేయుచు, వారు దిన మును గడపిరి. అంత సాయంకాలమయ్యెను.

చౌపాయ్

ప్రాతఃకాలమున వారు స్నానసంధ్యాదినిత్యకర్మల ననుష్ఠించి, సమావేశమయిరి. భరతుఁడును, జనకచక్రవర్తియు, బ్రాహ్మణులును వచ్చి కూర్చుండిరి. ఆదినము సుదినమని రామునకుఁ దెలియునుకాని, ఆమాటఁజెప్పుట కతఁడు వెఱచెను; ఆరాముఁడు పరమకృపాలుఁడు కనుక, నతఁడు సంశయించెను. అతఁడు గురువసిష్ఠాదిసభ్యులను, భర తజనకులను జూచి, సిగ్గుపడి, తలవంచుకొని, కూర్చుండెను. యుక్తా యుక్తవిచక్షణలో శ్రీరామునితో సమానుఁడగు ప్రభువు లేఁడని సభా సదులు తలంచి, అతనిసుశీలమును కొనియాడిరి. అప్పుడు శ్రీరాముని ముఖలక్షణములను భరతుఁడు గ్రహించి, దిగ్గునలేచి నిలువఁబడి, ధై ర్యము నవలంబించి, దండప్రణామముఁజేసి, చేతులను జోడించుకొని, యిట్లు విన్నవించెను. "ఓరాజాధిరాజా! అన్నివిధముల మీరు నాకో రికల నీడేర్చితిరి. నానిమిత్తము మీరు సకలదుఃఖములఁ బడుచుంటిరి. నానిమిత్తము మీరు సకలకష్టముల ననుభవించుచుంటిరి. ఓనాథా! మీ యాజ్ఞను దయచేయుఁడు. పదునాలుగుసంవత్సరములవఱకు మీయా గమనమును నిరీక్షించుచు నేను నగరములో మీసేవఁజేయువాఁడ.

దోహా 317

"హేదీనదయాళూ! హేకోసలాధీశా! హేకృపాలా! నేను మీదాసుఁడను; అవధిదాటినతరువాత మీచరణారవిందములను దర్శిం చుటకు మార్గముఁజూపుఁడు. ఈపదునాల్గుసంవత్సరములవఱకు నా కేవి ధమున ధైర్యము నిలిచియుండునో బోధింపుఁడు.

చౌపాయ్

"ఓనాథా! మీపురజనులు, మీకుటుంబస్థులు, మీప్రజలు— అత్యంతసరసులు, పరమపవిత్రులు, మీయందు బద్ధానురాగులై యుందురు. ఈసంసారదుఃఖములను, తాపములను మీనిమిత్తము భరించి, సహించువాఁడ; మీపరోక్షమున, పరమపదమైనను నాకు వ్యర్థము. ఓస్వామీ! మీరుసర్వజ్ఞులు; మీసేవకుల మనోభిప్రాయము

టులును, వారిభావములును, వారికోరికలును మీకు విశదము. మీరు దీనరక్షకులు; మీరే నారక్షకులు; ఉభయలోకములలోను మీరే నన్ను నిర్వహింపఁగలరు. ఇదియే నాకుఁగల మనోధైర్యము. అందుచేత, నా కీదుఃఖమంతయు తృణప్రాయమువలెఁ గనఁబడును. మీరు కరుణించి, యంగీకరించితిరి కనుక, నాదుఃఖమును పట్టలేక, నేనింతవఱకు నాతలకుఁ దగనట్లు ప్రసంగించితిని. ఓనాథా! నాలోపాలోపములను క్షమించి, వెనుకదీయక, తగినట్లు నన్ను శిక్షింపుఁడు." ఇట్లు భరతుఁడు చెప్పిన విన్నపమును సభికులువిని, హర్షించి, ఆమోదించి, అతనిని గొనియాడిరి. నీరములనుండి క్షీరములను విభజించు హంసవలె, నతఁడు సత్యము నస త్యమునుండి విభజించి, చెప్పెను.

దోహా 318

నిర్మలాంతఃకరణముతో భరతుఁడు చెప్పినమాటల నాదీనబంధువు, శ్రీరాముఁడు విని, దేశకాలసమయానుసారముగ నతనితో నిట్లు పలికెను.

చౌపాయ్

"ఓతమ్ముఁడా! గృహములోనుండిన నీయొక్కయు, వనములోనుండిన మాయొక్కయు, సకలజనులయోగక్షేమములను మనగురువులును, జనకచక్రవర్తులును గనుఁగొనుచుందురు. మనతలమీఁద గురువులును, జనకచక్రవర్తు లుండినంతవఱకు,నీకేమి, నాకేమి స్వప్నమందైనను కష్టములుండవు. నీకేమి, నాకేమి, మాయిరువురన్నదమ్ములకేమి, మన తండ్రిగారియాజ్ఞను బరిపాలించుటయే పరమపురుషార్థము; పరమార్థము; సర్వశ్రేయోదాయకము; శాశ్వతకీర్తిప్రదాయకము. సకలవిధముల రాజునకుఁ గీర్తివచ్చుటయే వేదసమ్మతము; లోకసమ్మతము. ఎవరు గురువులయాజ్ఞను, జననీజనకులయాజ్ఞను మన్నించి, సన్మార్గమున సంచరించెదరో, వారిపాదములు తప్పుమార్గమునఁ బడవు; వారికి సకలసిద్ధులు కలుగును. ఈసంగతులను విచారించి శోకమునువిడిచి, పదునాల్గుసంవత్సరములు నగరమును రక్షింపుము. నీదేశమును నీరాజ్యమును, నీకోశమును, నీబంధువులును, నీసర్వస్వమును, గురువులపాదరేణువులకంటె నధికులుకారని తెలిసియుండుము. నీతల్లులును, నీగురువులును, నీమంత్రు

లును చెప్పినమాటప్రకారము, దేశమును, రాజ్యమును, రాజధానియుఁ బ్రజలను నీవు పరిపాలింపుము."

దోహా 319

"రాజు ముఖమువలె నుండవలెను; భోజనపానములను ముఖము చేయును; సకలాంగముల నది యథావిధిగఁ బుష్టిచేయును. అటులనే, రాజుద్వారా, రాజ్యాంగములకుఁ బుష్టివచ్చును—" అని తులసీదాసుగారు చెప్పుచున్నారు

చౌపాయి

సకలమనోరథములు మనములో నిమిడియుండినవిధమున, సకల రాజధర్మములును, రాజనీతులును, రాజులో దాఁగియుండును ఈ ప్రకార మనేకవిధముల నతఁడు తమ్ముని బోధించెను; కాని, మనస్సునిలుచుట కాధారము లేకపోవుటచేత, భరతునిమనస్సునకు శాంతిలేక పోయెను. శ్రీరాముని యందుఁ గలప్రేమకు వశ్యులై, మంత్రులును గురువును, భరతునివలె, నేకాభిప్రాయులై, సంశయించి, యూరకుండిరి. అప్పుడు శ్రీరామప్రభువు కటాక్షించి, తనపాదుకలను భరతున కిచ్చెను; సాదరముగ నతఁడు వానిని స్వీకరించి, శిరస్సుపై ధరించెను. ఆపాదుకలు కేవలము కరుణాసముద్రుఁడు ధరించుపాదుకలుకావు—సకల జనులప్రాణములను రక్షించురక్షకులు; భరతునిస్నేహరత్నమును గాపాడునట్టిసంపుటము; సకలజీవుల నుద్ధరించు 'ర' కార, 'మ' కారములు; రఘుకులమును రక్షించు రెండుకవాటములు; సుకర్మలఁ జేయుటకు రెండుహస్తములు; ధర్మమునకును సేవకును రెండునేత్రములు, నిర్మలమగు నేత్రములు; ఆపాదుకల నతఁడు గ్రహించి, శ్రీసీతారాములు వచ్చినట్లు, సంతసించెను

దోహా 320

అంత భరతుఁడు శ్రీరామునకు నమస్కరించి, ప్రయాణమునకు సెలవు నడిగెను. అప్పు డతనిని శ్రీరాముఁడు కౌఁగిలించుకొనెను. కుటిలస్వభావుఁడగు దేవేంద్రుఁ డాదుస్సమయముఁజూచి, భరతుఁడు మొదలగువారికిఁ దగనికష్టములను మార్గములోఁ బెట్టెను.

చౌపాయి

ఆకష్టములన్నియు వారిమేలునకు వచ్చెను. పదునాల్గుసంవత్సర

ముల తరువాత, శ్రీరామునిదర్శనము కలుగునని వారు పెట్టుకొనిన యాశయే, వారికి జీవనాధారమయ్యెను; ఆయాశయే వారికి లేనియెడల, వారాక్షణమే, సీతారామలక్ష్మణుల వియోగదుఃఖమును భరింపలేక, ప్రాణములను విడిచిపెట్టియుందురు. శ్రీరామునికృపవలన, వారి కష్టము వీడెను; దేవతలు పెట్టిన కష్టములన్నియు వారికి సుఖదాయకములయ్యెను. చేతులనిండ శ్రీరాముఁడు తమ్ముని గౌఁగిలించుకొనెను; అతని ప్రేమాతిశయమును వర్ణించి చెప్పుటకు శక్యముకాదు. ఆసమయమున నతనిమనోవాక్కర్మలు సంపూర్ణానురాగముతో నిండియుండెను. అధర్మధురంధరుఁడు, శ్రీరామునకు సహితము ధైర్యము జాఱిపోయెను. అతనికమలనేత్రములనుండి నీరు వఱదలై కారెను. అతనిదశను దేవతలు చూచి, దుఃఖించిరి; గురువసిష్ఠాదిమునిగణంబులును, జనకచక్రవర్తియు ధీరోదారులు; జ్ఞానాగ్నిచే దహింపఁబడినవారిమనస్సులు, బంగారమువలె వన్నెకెక్కియుండెను. తామరాకుపైఁదేలియుండిన నీటిబిందువువలె, బ్రహ్మసృజించినప్రపంచమునుండి వారు భిన్నులై యుందురు.

దోహా 321

అట్టివారుసహితము శ్రీరామభరతుల నిరుపమానమగు యన్యోన్యానురాగమును వారివిచారమును జూచి, విరాగమునువిడిచి, మనోవాక్కర్మలచే విచారించి, దుఃఖాక్రాంతులయిరి.

చౌపాయ్

గురువసిష్ఠజనకాదిమహాత్ముల మనోవ్యాపారములే వికలమయినపుడు, ప్రాకృతమానుజులమనస్సులు భ్రమించెనని చెప్పుట వ్యర్థము. శ్రీరామభరతుల వియోగదుఃఖమును వర్ణించిచెప్పిన కవీశ్వరుఁడు కఠినుఁడనిలోకులు నిందించెదరు. ఇట్టిది యని నిరూపించి, చెప్పుటకు శక్యముకాని వారియనురాగమును, భాతృవాత్సల్యమును, సంపూర్ణముగ వర్ణించుటకు నావాణి, సిగ్గుపడి, శంకించుచున్నది. శ్రీరాముఁడు భరతుని యాదరించి బోధించెను; తరువాత నతఁడు శత్రుఘ్నుని యాలింగనముఁ జేసికొనెను. భరతునిమనోభిప్రాయమును దెలిసికొని సేవకులును మంత్రులును వారివారిపనులమీఁద వెడలిరి. ప్రయాణ

సన్నాహముఁ జేయుటచూచి, ఉభయపక్షములవారును విచారగ్రస్తుల యిరి. ప్రభువుచరణములకు భరతశత్రుఘ్నులు దండప్రణామముఁ జేసి, సెలవుఁగైకొని వెడలిరి. మునులకును, తపశ్శాలురకును, వనదేవతలకును వారు నమస్కరించి, సన్మానించి వారిరువురు వెడలిరి.

దోహా 322

వారు లక్ష్మణునిఁ గౌఁగిలించుకొని, సన్మానమునుబొంది, జానకీ పాదరేణువులను శిరముపై ధరించిరి. సకలమంగళములకు మూలమగు నామె దీవనలఁబొంది, వారు సంతసించిరి.

చౌపాయ్

తదుపరి, శ్రీరామలక్ష్మణులు జనకచక్రవర్తికి నమస్కరించి, అనేక విన్నపములఁ జెప్పుకొనిరి; "ఓనాథా! మామీఁదఁగల దయచేత, మీరింతకష్టమును సహించి, మీరును మాసమాజమువారును, మమ్ములను జూచుటకు వనమునకువచ్చితిరి. మీరు మమ్ములను దీవించి, స్వనగరమునకు విజయముచేయుఁడు." ఆమాటలను జనకచక్రవర్తివిని, ధైర్యముఁదెచ్చుకొని, స్వనగరమునకు వెడలెను. అనంతరము, రామలక్ష్మణులు బ్రాహ్మణులను, మునులను, మంత్రులను, సాధువులను సన్మానించి, వారు శివకేశవులతో సమానులని భావించి, వారికి నమస్కరించి, వారిసెలవుఁ గైకొనిరి. అచ్చటనుండి వారు జనకునిభార్యవద్దకువెళ్లి, యామెచరణములకు నమస్కరించి, యామెదీవనలఁబొంది, తిరిగివచ్చిరి. విశ్వామిత్ర, వామదేవ, జాబాలి మొదలగుమహామునులను, సదాచారపరాయణులగు సచివులను, పురజనులను, బంధువులను, స్త్రీపురుషులను, ఉత్తమ, మధ్యమ, నీచులను, యథావిధిగ శ్రీరాముఁడు వినయప్రణామ సన్మానములచే నాదరించి, వారిసెలవుఁగైకొని వారిని బంపించెను.

దోహా 323

భరతుని తల్లిపాదములకు శ్రీరాముఁడు నమస్కరించి, యామెనోదార్చి, యామెను బల్లకిలోఁ గూర్చుండఁబెట్టి, యామెదుఃఖమును బోఁగొట్టెను. ఆమెసెలవుఁ బుచ్చుకొని, తిరిగివచ్చెను.

చౌపాయ్

ఆశ్రీరామునిప్రాణసఖి, పరమపతివ్రత, ఆజానకి, బంధువులతోను, అత్తలతోను, తల్లితోను గలసిమెలసి తిరిగి, వారిసెలవుఁగైకొని, భర్తయందుఁగల యనురాగముచే నతనివద్దకుఁ దిరిగివచ్చెను. ఆమె ముప్వురత్తలకు నమస్కరించి, వారినిఁ గౌఁగిలించుకొని తిరిగి వచ్చెను. ఆమె కలుపుగోలుదనమును వర్ణించి చెప్పుటకు శక్యము కాదు. వారుచెప్పినబుద్ధుల నామెగ్రహించి, తనమనోభీష్టముప్రకారము వారు దీవించినదీవనల గైకొని యత్తలవద్దను, దల్లివద్దను, దండ్రివద్దను సెలవుఁబుచ్చుకొని వచ్చెను. అప్పుడు శ్రీరాముఁడు చక్కని పల్లకీలను రప్పించి, ముప్వురుతల్లులను వానిలోఁ గూర్చుండపెట్టెను. ప్రేమపూర్వకముగ రామలక్ష్మణులు ముప్వురుతల్లులను గలసికొని, స్నేహవాత్సల్యములఁ జూపించి, వారిని సాగనంపిరి. చతురంగబలములు ముందు నడుచుచుండెను. జనకచక్రవర్తియు, భరతుఁడును ప్రయాణమును సాగించిరి. శ్రీసీతారామలక్ష్మణులను వారు తలఁచి, వ్యాకులులయిరి. పశువులును, వృషభములును, అశ్వములును, గజములును, బరులకు వశ్యులయి, విచారించుచు, బలవంతముగ ముందుకు నడచెను.

దోహా 324

గురువునకు, గురుపత్నికిని, శ్రీసీతారామలక్ష్మణులు నమస్కరించి, హర్షవిషాదములతోఁ గూడుకొనినవారై, పర్ణశాలకు తిరిగి వచ్చిరి.

చౌపాయ్

తదుపరి, శ్రీరాముఁడు నిషాదపతిని సన్మానించి, పంపించెను అతఁడు వియోగదుఃఖముచే ఖిన్నుఁడై వెడలెను. అనంతరము శ్రీరాముఁడు, కోలకిరాతవనచరులకు సెలవునిచ్చి పంపించెను; వారు జోహారువనుచు వెళ్లిరి. శ్రీసీతాలక్ష్మణులతోఁగూడి రాముఁడు వటఛాయలోఁ గూర్చుండి, బంధువులవియోగమునకు దుఃఖించెను. భరతుని స్నేహవాత్సల్యములను, అనురాగము నతఁడు సీతాలక్ష్మణులతోఁ జెప్పికొనియాడెను; అతఁడు ప్రేమకు వశ్యుఁడై త్రికరణశుద్ధిగ భరతునకు

గల భక్తిశ్రద్ధలను, ప్రేమానురాగములను గుఱించి, ముచ్చటించెను. ఆసమయమున, ఖగమృగములును, మీనములును, చిత్రకూటపర్వత సమీపముననుండిన స్థావరజంగమములన్నియు విచారగ్రస్తములయ్యెను. శ్రీరాముని దురవస్థను దేవతలుచూచి, పుష్పములను వర్షించి, వారి వారియింటికష్టసుఖములఁ జెప్పుకొని, ప్రభువునకు నమస్కరించి, అతని వలన నుత్సహింపఁబడి, భయమునువిడిచి, సంతోషముతో స్వగృహములకు వెడలిరి.

దోహా 325

మూర్తీభవించిన భక్తిజ్ఞానవైరాగ్యములవలె, శ్రీజానకీలక్ష్మణసహిత శ్రీరామమూర్తి పర్ణశాలలో దేదీప్యమానముగ వెలుఁగుచుండెను.

చౌపాయ్

మునులును, బ్రాహ్మణులును, వసిష్ఠుఁడును, భరతుఁడును, జనక చక్రవర్తియు, సమాజమువారు శ్రీరామునివియోగమును సహింపలేక, చింతాక్రాంతులయి, మనస్సులో శ్రీరామునిగుణములను స్మరించుచు, మౌనమును ధరించి నడచిరి. వారు యమునానదివద్దకువచ్చి, దానినిదాఁటి, ఆదినమున భోజనములేకయే యుండిరి; రెండవదినమున వారు గంగానదిని దాఁటివచ్చిరి; ఆదినమున వారిని నిషాదపతి గారవించి సన్మానించెను. మూఁడవదినమున వారు 'సరయూ'నదిని 'గోమతీ'నదిని దాఁటి నాల్గవదినమున అయోధ్యానగరమువచ్చి చేరిరి. నాలుగుదినములు జనకచక్రవర్తి నగరములోనుండి, రాజకార్యములను సవరణజేసి, గురువునకును, మంత్రులకును, భరతునకును, రాజ్యసూత్రముల నప్పగించి; తనసమాజముతోఁగూడి, తనరాజధాని, తిరుహుతునకు వచ్చిచేరెను. నగరములోని స్త్రీపురుషులు గురువాజ్ఞను శిరసావహించి, శ్రీరాముని రాజధానిలో సుఖముగ నుండిరి.

దోహా 326

శ్రీరాముని దర్శనమునిమిత్తము, పురజనులు వ్రతములను, నియమోపవాసములఁ జేయుచుండిరి. వారు భూషణములను విసర్జించి,

సకలభోగభాగ్యముల ననుభవింపక, రాముఁడు తిరిగివచ్చునని యాశచే, తమప్రాణములను నిలువఁబెట్టుకొనిరి.

చౌపాయ్

మంత్రులను ఆంతరంగికసేవకులను భరతుఁడు పిలిచి, తగినవిధమున వారిని బోధించి పంపించెను; వా రతనిసెలవుఁగైకొని, తమతమ పనులఁ జేయుచుండిరి. అతఁడు తమ్ముఁడగుశత్రుఘ్నునిఁ బిలిచి బోధించి, తల్లులసంరక్షణార్థ మతనిని నియోగించెను. తదనంతర మతఁడు బ్రాహ్మణులను రప్పించి, చేతులనుజోడించి వారికి నమస్కరించి, "ఓభూదేవతలారా! మీయాజ్ఞప్రకారము ప్రవర్తించెద; గొప్పవయినను, తక్కువయినను, మీరు సంశయింపక, మీకోరికలను దెలియఁజేసినయెడల, వానిని నెరవేర్చెదను" అని విన్నవించి పంపించెను. అనంతర మతఁడు పురజనులను, బంధువులను బిలిచి, దేశీయులను సమావేశముఁజేసి, తగినట్లు వారినిబోధించి, వారికి దగిననివాసస్థానములను నిర్ణయించి, వారిని సుఖముగ జీవింపుమని చెప్పెను. అతఁడు తమ్మునితోఁగూడి, గురువుగృహమునకువెళ్లి, గురువునకు నమస్కరించి, యిట్లు విన్నవించెను. "ఓనాథా! మీయనుజ్ఞగైకొని, నియమముగ జీవించెదను" ఆమాటను గురువువిని సంతసించెను; ఆతనిశరీరము పులకరించెను. "ఓభరతుఁడా! నీయాలోచనయు, నీమాటలును, నీప్రవర్తనయు, ధర్మానుసారముగ నుండును కనుక శ్లాఘనీయములు"

దోహా 327

అతనిని గురువు దీవించెను; అతఁడు గురువుసెలవుఁగైకొని నగరునకువచ్చి, జ్యోతిష్కులనుబిలిచి, సుముహూర్తమున శ్రీరాముని పాదుకలను సింహాసనముపైఁ బెట్టెను.

చౌపాయ్

అతఁడు కౌసల్యకును గురుచరణములకును నమస్కరించి, శ్రీరాముని పాదుకలవద్ద సెలవుఁబుచ్చుకొని, నందిగ్రామమునకు వచ్చెను; ఆధర్మధురంధరుఁడు, ఆధైర్యశాలి, ఆగ్రామములో నొకపర్ణశాలఁ గట్టించి, దానిలో నివసించెను. అతఁడు జటలనుబంధించి, మునుల

వల్కలములను ధరించి, భూమిలో నొకచీకటిబిలమును త్రవ్వికొని, భోజనములోను, వస్త్రములను గట్టుకొనుటలోను, వ్రతనియమముల లోను మహాకఠినముగ మునులవలె, ధర్మము ననుసరించి, ప్రేమపూర్వకముగ సంచరించెను. త్రికరణశుద్ధిగ నతఁడు భోగరాగములను, వస్త్రాద్యలంకారములను, తృణప్రాయములని తలంచి విసర్జించెను. అయోధ్యానగరభోగములను దేవేంద్రుఁడు ప్రస్తుతించును. దశరథమహారాజు భాగ్యమును కుబేరుఁడు కొనియాడును. అటువంటినగరములో భరతుఁడు వైరాగ్యముతో నివసించియుండెను చంపకవనములో నివసించుతుమ్మెదవలె, నతఁడు జీవించియుండెను. ఓపార్వతీ! రమావిలాసునియం దనురాగముకలవాఁడే, గొప్పయదృష్టవంతుఁడు; అట్టివానికి రమావిలాసములగు ధనాదులయందు, వమనముమీఁదనువలె, నసహ్యముపుట్టి, వానిని విసర్జించును.

దోహా 328

శ్రీరామునిదయకు భరతుఁడు పాత్రుఁడు; ఈప్రకార మతఁడు చేయుట గొప్పవింతకాదు; చాతకమును, హంసయు, వానివానిపట్టుదలను విడిచిపెట్టవు; వానినైజము శ్లాఘనీయము.

చౌపాయ్

అతనిదేహ మనుదినము దుర్బలమయ్యెను; అతనితేజస్సును బలము నధికమయ్యెను;అతనిముఖవర్చస్సు యథాప్రకారముగనుండెను. నూతనోత్సాహముతో నతనికిగల రామభక్తి దినదినప్రవర్ధమానమయ్యెను; అతనిధర్మములు బలమయ్యెను; అతనిమనస్సు నిర్మలముగనుండెను. శరదృతువులో జలములు నిర్మలమగును; అంతరిక్షము నిర్మలమగును; కమలములు వికసించును. భరతునిశమదమసంయమనియమోపవాసములు, తారాగణములువలె, నతనిహృదయాంతరాళమునఁ బ్రకాశించెను. రఘునాథుఁడు తిరిగివచ్చునని యతనికిగలవిశ్వాసము, ధ్రువనక్షత్రము. పదునాలుగుసంవత్సరములమితి, పూర్ణమాసి; శ్రీరామునిస్మరణ, దేవవీధి;శ్రీరామునియందుఁగలప్రేమ,క్షయములేక నిశ్చలముగనుండుచంద్రుఁడు. సమాజసహితముగ నిత్యమాచంద్రుఁడు ప్రకాశించుచుండును. భరతునిసహనమును, బుద్ధిని, కర్తవ్యమును, భక్తివైరా

గ్యములను, సుగుణములను, ఐశ్వర్యమును—గొప్పకవీశ్వరులు వర్ణించిచెప్పుటకు సంశయించెదరు; ఆదిశేషువు, గణేశుఁడు, సరస్వతియు వానిని సంపూర్ణముగ చెప్పలేరు.

దోహా 329

ప్రతినిత్య మతఁడు శ్రీరాముని పాదుకలను పూజించుచుండెను. హృదయములో నిమిడియుండుటకు శక్యముకాని యనురాగముతో నతఁడు వానిని నారాధించి, రాచకార్యములను వానికి విన్నవించి, వానియాజ్ఞఁగైకొని, చేయుచుండును.

చౌపాయ్

అతనిశరీరము పులకరించియుండును. అతనిహృదయములో శ్రీసీతారాములు సదా నివసించియుందురు. అతనిజిహ్వ సదా రామనామమును జపించుచుండును; అతనినేత్రములవెంబడి సదా నీరు వఱదలై కారుచుండును. శ్రీసీతారామలక్ష్మణులు వనములోనుండిరి; భరతుఁడు గృహములోనుండి, తపముఁజేసి, శరీరమును తపింపఁజేసెను. పూర్వోత్తరముల నాలోచించి భరతునివ్యాపారము శ్లాఘనీయమని జనులు కొనియాడిరి. అతని వ్రతనియమములకు సాధువులు సిగ్గుపడిరి; అతనిదశనుజూచి, మునిరాజు సిగ్గుపడెను. భరతునియాచరణ పరమపవిత్రము; నిర్మలము; ఉజ్జ్వలము; మంగళానందదాయకము. కలియుగపాపములను నాశనము జేయును; సూర్యునివలె మహామోహాంధకారమును బోఁగొట్టును; సింహమువలె, మహాపాపము లనుమదగజములను సంహరించును; సకలసంతాపములను శాంతింపఁజేయును; భక్తుల కానందమునిచ్చును; సంసారులభయమును బోఁగొట్టును; శ్రీరామభక్తి యనే సుధాకరునిసారమే, అతని యాచరణవిధానము.

ఛాంద్

సియ । రామ । ప్రేమ । పీయూష । పూరణ ।
హోత । జన్మ । న । భరతకో ॥
ముని । మన । అగమ । యమ । నియమ । శమ
దమ । విషమ । వ్రత । ఆచరతకో ॥
దుఖ । దాహ । దారిద । దంభ । దూషణ । సుయ
ిసు । అపహరతకో ॥

**కలికాల । తులసీసే । శఠహి । హఠి ।**
రామ । సన్ముఖ । కరతకో ॥

శ్రీసీతారాములయందుఁ గల, ప్రేమామృతమును సంపూర్ణముఁ జేయుటకే భరతుఁడు జన్మించి యుండనియెడల, మునీశ్వరులమనస్సులకు సహితమగమ్యమగు కఠిన యమ, నియమ, శమదమాదుల నాచరించి లోకమున కతనివలె నెవరు దర్శనీయులుగ నుండఁగలరు! ఆభరతుఁడే జన్మించియుండనియెడల, దుఃఖదంభాదిదారిద్ర్యదోషములను బాపి, లోకములో నతనివలె సత్కీర్తిని సంపాదించువా రెవరుందురు! అతఁడే జన్మించియుండనియెడల, నీకలికాలములో నావంటిమూర్ఖుఁడు శ్రీరామునిమాహాత్మ్యమును జెప్పఁగలుగునా? శ్రీరామునిసందర్శనము జేయింపఁగలుగునా?

సోరఠా 14

ప్రేమపూర్వకముగ నెవఁడు, భరతునిచరిత్రమును నియమముగ వినునో వానికి శ్రీసీతారాములచరణకమలములయందు నిర్మలభక్తి కలుగును; వానికి సంసారభోగములయందు విరక్తిపుట్టును.

అయోధ్యాకాండము సమాప్తము.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము —1926.

శ్రీ మద్గోస్వామి

# తులసీదాసకృతరామాయణము

## ఆరణ్యకాండము.



ప్రథమవిశ్రామము.

శ్లో. మూలం ధర్మతరో ర్వివేకజలధేః పూర్ణేందుమానందదం
వైరాగ్యాంబుజభాస్కరం హ్యఘఘనధ్వాంతాపహం తాపహమ్,
మోహాంభోధరపుంజపాటనవిధౌ ఖేసంభవం శంకరం
వందే బ్రహ్మకులం కలంకశమనం శ్రీరామభూపప్రియమ్.

శ్లో. సాంద్రానందపయోదసౌభగతనుం పీతాంబరం సుందరం
పాణౌ బాణశరాసనం కటిలసత్తూణీరభారం వరమ్,
రాజీవాయతలోచనం ధృతజటాజూటేన సంశోభితం
సీతాలక్ష్మణసంయుతం పథిగతం రామాభిరామం భజే.

సోరఠా 1

ఓ పార్వతీ! శ్రీరామునిగుణములు మహాగంభీరములు; ఆ గుణములను ధ్యానించి, పండితులును మునులును వైరాగ్యముఁ బొందుచుండిరి; రామునియందు విముఖులును, ధర్మమునం దాసక్తి లేనివారును, మాయకు వశ్యులై, సంసారములోఁ జిక్కగలరు.

చౌపాయీ 1

భరతునకు రామునియందు నిరుపమానమగు దయ కలదు; రామునకును భరతునకును గల యన్యోన్యానురాగములో వెలితిలేదు; ఈవిషయమునుగుఱించి నాబుద్ధికిఁ దోఁచినవిధమున నిదివఱలోఁ జెప్పియుంటిని; ఏవిషయమును గుఱించి మునులును దేవతలును సదా శ్రీరాముని ధ్యానించుచుండిరో, ఆవిషయమును సాధించుటకు శ్రీ

రాముఁడు చేసినచర్యలఁ జెప్పుచున్నాను; వినుము. (అయోధ్యాకాండలో విశేషము భరతునిచరిత్రము వెళ్లెను; ఇఁకను, ఆరణ్యకాండలో, శ్రీరామునిచర్యలే విశేషముగ వర్ణింపఁబడును.) ఒక సమయమున శ్రీరాముఁడు స్వయముగఁ బుష్పములఁ ద్రెంపి, వానిలో నొకదండను గ్రుచ్చి, దానిని సీతమెడకుఁ దగిలించెను. ఆపుష్పములదండ సీతమెడలో శోభాకరముగ నుండెను; ఆమె యొక స్ఫటికశిలపై గూర్చుండియుండెను. (రావణుఁడు రెండువిధముల బలవంతుఁడు:—1 వాఁడు శక్తిఁ బూజించును; 2 వాఁడు శివపూజా ధురంధరుఁడు; సీత మహాశక్తిస్వరూపము కనుక నామెను రాముఁడు పూజించి, యామెప్రసాదముఁ బొందెను; మున్ముందు రాముఁడు శివునిఁ బూజించును.) (అధికపాఠము:—ఆ పర్వతముపై ననేకమణులు ప్రకాశించుచుండెను; 'ఖాందిని'గట్టినట్లు, చంద్రుఁ డంతరిక్షమునఁ బ్రకాశించెను; ఆ రాత్రిసమయమున, దేవేంద్రునికోడలు, జయంతుని భార్య, సఖులతోఁగూడి, రాముని దర్శించుటకు వచ్చెను. ఆమె శ్రీరాముని సందర్శించి, అనేకవిధముల నతనిని స్తుతించి, సంతోషించెను. తదనంతరమామె స్వప్రయోజనములను శ్రీరామునివలనఁ గైకొని, స్వర్గలోకమునకు వెళ్లెను. ఈసమాచారము నామె జయంతునితోఁ జెప్పెను. అందుచేత, నతనికిఁ గోపము వచ్చెను. అధికపాఠము సమాప్తము.) ఆజయంతుఁడు కాకిరూపమును ధరించి, శ్రీరాముని సత్తువఁజూచుటకు వచ్చెను; వానికంటె మూర్ఖుఁడు కలఁడా? ఒక చిన్న చీమ సముద్రునిలోఁతుఁ గనిపెట్టవలెనని ప్రయత్నించినట్లు కదా! ఆజయంతుఁడు మూర్ఖుఁడు; జడుఁడు; వానిబుద్ధి మందము; అంతట వాఁడు కాకియై వచ్చి, సీతపాదములను తనచంచువులతోఁ బొడిచి, గాయముఁ జేసెను; అప్పుడు, సీతతొడలపై శిరము నుంచుకొని, రాముఁడు నిద్రించుచుండెను; శ్రీరాముని నిద్రకు భంగము కలుగునని తలఁచి, సీత, బాధనోర్చి చలింపకయుండెను. అంతట, నామెపాదమునుండి రక్తము ప్రవహించి, శ్రీరాముని వీఁపునకుఁ జల్లఁగ పోఁకెను. అతఁడు దిగ్గున లేచి, రక్తముఁజూచి, క్రోధించి, యొక గడ్డిపోఁచను మంత్రించి, దానిని ధనుస్సునకుఁ దగిలించి, విడిచెను.

దోహా 1

స్వభావముచేత శ్రీరాముఁడు కృపాళుఁడు; దీనులయందు దయ గలవాఁడు; ఈజయంతుఁడు మూర్ఖుఁడు; బుద్ధిహీనతచేత, నిట్లు రాముని యెడల వాఁడు కపటముగఁ బ్రవర్తించెను.

చౌపాయ్ 2

(అధికపాఠము:—అపరాధము లేక, శ్రీరాముఁ డొకరికి హింసఁ జేయఁడు; సమయము వచ్చినపుడు, రాహువు చంద్రునిఁ గబళించును గదా! ఆగడ్డిపోచను మంత్రించి, రాముఁడు విడిచిపెట్టెను; అగ్నిహోత్రముతో సమానమై, ఆబాణము జయంతునిపైఁ బడెను. అధికపాఠము సమాప్తము.) ఆబాణము బ్రహ్మాస్త్రమై, వానిని వెంటఁదరిమెను; వాఁడు ప్రాణములకు భయపడి, నిజరూపమును స్వీకరించి, పరుగెత్తి, తండ్రి శరణుఁ జొచ్చెను; వాఁడు రామద్రోహియని తెలిసికొని, ఇంద్రుఁడు కుమారుని వెడలఁగొట్టెను; వాఁడంతట, ప్రాణములపై నిరాశఁ జేసికొనెను; పూర్వము, అంబరీషుని మూలమున దుర్వాసుఁడు చక్రమునకు భయపడినవిధమున, వాఁడు నేఁ డాబాణముఁజూచి కంపించెను. అతివ్యాకులతచే వాఁడు దుఃఖించుచు, బ్రహ్మమహేశాదిలోకములకు వెళ్లి, వారి శరణుఁజొచ్చెను గాని, వారు వానిని రక్షింపలేక విడిచిపెట్టిరి. ఒకరైనను వానినిఁ గూర్చుండుమని పలుకలేదు; ఎవరు రామునిశత్రువును రక్షింపఁగలరు! ఓ గరుత్మంతుఁడా! ఎవఁడు రామునకు విరోధియగునో, వానికి వానితల్లి మృత్యువగును; వానితండ్రి యముఁ డగును; వానికమృతము విషమగును; ఒకస్నేహితుఁడు వానిని నూర్వురు శత్రువులవలె బాధించును; వాని ప్రాణమునకు గంగానది వైతరణీనదివలె నుండును; ఓ భరద్వాజా! అగ్నివలె, లోకమంతయు వానిని దహించుకొని పోవుచుండును. శ్రీరామునకు విముఖుఁ డగువాని పాట్లీవిధమున నుండునని తెలిసికొనుము.

దోహా 2 (అధికపాఠము.)

ఇంద్రునికుమారుని వ్యాకులత్వమును, దుఃఖమును, దైన్యమును జెప్పుటకు శక్యముకాదు; అతఁ డెటువైపు పరుగిడిన, నటువైపు రామబాణము వానిని వదిలియుండెను.

### చౌపాయ్ 3

ఒకవేళ, గరుడునకుఁ జిక్కినపామునకు విడుదల యుండును; కాని, రామబాణమునకుఁ దిరుగులేదు; జయంతుని వ్యాకులతను నారదుఁడు చూచెను; నారదుఁడు మహాపురుషుఁడు; కనుక, సతనిచిత్తము కోమలము; అతఁడు వానింజూచి, జాలిఁ బడెను. అతఁడు దూరమునుండియే, రాముని ప్రభావమును జయంతునకుఁ జెప్పి, శీఘ్రముగా రాముని యొద్దకుఁ బోయి, "ఓ దీనరక్షకుఁడా! రక్షింపుము, రక్షింపుము" అని మొఱపెట్టుకొనుమని బోధించెను. ఆమాటలను వాఁడు విని, ఆతురతతో రామునివద్దకు పచ్చి, రాముని చరణములకు నమస్కరించి, "ఓ దీనరక్షకా! రక్షింపుము; రక్షింపుము. ఓ నాథా! మీప్రతాపము ప్రతిహతము; నేను మూర్ఖుఁడను కనుక దానిని దెలిసికొననందులకు క్షమింపుఁడు. నాపాపకర్మమునకుఁ దగినఫలముఁ బొందితిని. రక్షింపుము; ఓ స్వామీ! నీశరణుఁజొచ్చితి" అని దీనాలాపము లాడి, వాఁడు శ్రీరామునిఁ బ్రార్థించెను. ఓ పార్వతీ! ఆ కృపాసాగరుఁడు వానిదైన్యముఁ జూచి, జాలిఁబడి, వానిని నేకాక్షునిగఁ జేసి విడిచిపెట్టెను.

### సోరఠా 2

వాఁడు మోహమునకు వశ్యుఁడై, రామునకు ద్రోహముఁ జేసెను; ఆ ద్రోహమునకు మరణదండన తప్ప మఱియొకటి లేదు; అయినను, పరమేశ్వరుఁడు కృపాళుఁడు కనుక, స్వల్పదండన విధించి, వానిని విడిచిపెట్టెను; భగవంతుఁడగు శ్రీరాముని కంటె జాలిగుండె కలవాఁడు కలఁడా!

### చౌపాయ్ 1

చాలదినములు శ్రీ సీతారాములు లక్ష్మణునితోఁ గూడి, చిత్రకూటపర్వతముపై నివసించియుండిరి; వినుట కమృతోపమానములగు చర్యలఁ జేసిరి; "మే మిచ్చట విశేషకాలము నివసించియుంటిమి; అయోధ్యావాసులు ప్రతిదినము మాదర్శనార్థము వచ్చుచుండిరి; వారికి మా ప్రభావము తెలియును" అని రాముఁడు తనలోఁదాను విచారించి, మునీశ్వరులకు నమస్కరించి వారి సెలవుఁగైకొని, భార్యతోడను లక్ష్మణునితోడను గూడి, మార్గశీర్ష శుద్ధదశమినాఁడు, దక్షిణదిశకుఁ

ప్రయాణ మయ్యెను. అత్రిమహాముని యాశ్రమమునకు వారు ముగ్వురు వచ్చిరి; అతఁడు వారింజూచి పరమానందభరితుఁ డయ్యెను; అతని శరీరము పులకరించెను; అతఁడు ప్రత్యుత్థానముజేసి, వారికెదురుగ వెళ్లెను; వా రతనిపాదములకు నమస్కరించిరి. ఆ యన్నదమ్ముల నతఁడు కౌఁగిలించుకొని, కన్నులవెంబడి కాఱుచుండిన యానందబాష్పములచే వారిశరీరములఁ దడిపెను. అతఁడు వారినాదరించి, సత్కరించి, పూజించెను; కందమూలఫలముల నతఁడు వారి కిచ్చెను. అతఁడు శ్రీరాముని శరీరకాంతిని జూచినందున, నతనినేత్రములు చల్లబడెను; అతఁడు వారిని బూజించి, యాదరించి, స్వాశ్రమమునకుఁ దీసికొనివచ్చెను.

సోరఠా 3

శ్రీరాముఁడు సుఖాసీనుఁడై యుండెను; అతని దివ్యమంగళ విగ్రహమును, అత్రిమహాముని కన్నులారఁ జూచిచూచి, పరమానంద భరితుఁడై, చేతులను జోడించి యీవిధమున స్తుతించెను.

ఛాంద్ 1, 2, 3, 4, 5.

నమామి భక్తవత్సలం, కృపాళు శీల కోమలం
భజామి తేపదాంబుజం, అకామినాం స్వధామదమ్,
నికామ శ్యామసుందరం, భవాంబునాథ మంథరం
ప్రఫుల్ల కంజలోచనం, మదాది దోష మోచనమ్.

"ఓ భక్తవత్సలుఁడా! నీకు నమస్కారము; నీవు కృపానిధివి; నీ కోమల చరణకమలములను సదా భజించుచున్నాను. నిష్కామ్యముగ నిన్ను సేవించువారికి, నీధామము నిచ్చెదవు. ఓ మేఘశ్యామ రామా! సంసారసాగరమును మథించుటకు నీవు మందరపర్వతము వంటివాఁడవు; సముద్రమును మథించుటవలన, రత్నములు వెడలిన విధమున, సంసారసాగరమును మథించుటవలన, నీపాదముల నాశ్రయించిన భక్తులు వెడలుచున్నారు. నీవు రక్షించుటవలన, నరిషడ్వర్గము నశించును. నీనేత్రములు వికసించిన కమలములఁ బోలును; మదాది దోషములను నీవు పోఁగొట్టఁగలవు.

ప్రలంబ బాహు విక్రమం, ప్రభో అమేయ వైభవం
నిషంగ చాప సాయకం, ధరేత్రిలోక నాయకమ్,

దినేశ వంశ మండనం, మహేశ చాప ఖండనం
మునీంద్ర సతత రంజనం, సురారి బృంద భంజనమ్. 2

ఓ స్వామీ! నీ బాహుదండములు బలపరాక్రమము వైభవ మప్రమేయము; ఆ బాహుదండములే, ధనుర్బాణములను ధరించి యుండెను. ఓ నాథా! నీనడుమున కంబులపొది కట్టఁబడెను. నీవు త్రిలోకాలంకారుఁడవు; సూర్యవంశమునకు నీవు నాయకమణి; ఆ వంశమున కలంకారము నీవే; శివునివిల్లును విఱచి యుంటివి; మునీశ్వరులకును మహాత్ములకు నీరూప మానందముఁ గలుగఁజేయును; నీవు రాక్షసాంతకుఁడవు.

మనోజవైరి వందితం, అజాదిదేవ సేవితం
విశుద్ధబోధ విగ్రహం, సమస్తదుఃఖాపహమ్,
నమామి ఇందిరాపతిం, సుఖాకరం సతాంగతిం
భజే సశక్తి సానుజం, శచీపతిం ప్రియానుజమ్. 3

ఆ భుజములనే, మన్మథారి యగుశివుఁడు సేవించును; వానినే బ్రహ్మాదిదేవతలు సదా పూజించుచున్నారు; నీనిర్మల మగుదివ్యాంగక విగ్రహము, జ్ఞానస్వరూపము; దానిని దర్శించుటవలన, జీవుల తాపత్రయములు నశించును; ఓ లక్ష్మీపతీ! నీవే, సర్వసుఖములకు నునికిపట్టువు; నీవే, సజ్జనులకు గతివి. ఓ నాథా! మీ ముగ్గురకు నా నమస్కారము. (అదితిగర్భమున జన్మించి), దేవేంద్రున కనుజుఁడవై పుట్టి, (బలిచక్రవర్తి గర్వమును బోఁగొట్టియుంటివి.)

త్వదంఘ్రిమూల యేనరాః, భజంతి హీనమత్సరాః
పతంతినో భవార్ణవే, వితర్కవీచి సంకులే,
వివిక్త వాసినః సదా, భజంతి ముక్తయే ముదా
నిరస్య ఇంద్రియాదికం, ప్రయాంతితే గతిం స్వకమ్. 4

ఓ నాథా! సంసారమే యొకసాగరము; కాష్ఠవాదమే దాని కెరటములు; దురభిమానమును విడిచి, జనులు నీ చరణకమలములను భజించినయెడల, నా కెరటములబాధ వారికియుండదు; వారికి పునర్జన్మము లేదు; ముక్తినే సదాలక్ష్యములో నిడుకొని, ఏకాంతభక్తుఁడు

నీచరణములనే సేవించుచుండును; ఇంద్రియభోగములను విడిచిపెట్టి, భక్తుఁడు సదా నిన్నే ధ్యానించుచుండును; నిన్నే వాఁడు నమ్మియుండును.

త్వమేక మద్భుతం ప్రభుం, నిరీహ మీశ్వరం విభుం
జగద్గురుం చ శాశ్వతం, తురీయ మేక కేవలమ్,
భజామి భావ వల్లభం, కుయోగినాం సుదుర్లభం
స్వభక్తకల్ప పాదపం, సమస్తసేవ్య మన్వహమ్. 5

ఓ స్వామీ! నీ వొక్కఁడవు; నీ చరిత్రము లబ్బురములు; అఖిలాండములకు నీవే పతివి; నీవే ఈశ్వరుఁడవు; ప్రయత్నములు లేనివాఁడవు; సర్వసమర్థుఁడవు; సర్వవ్యాపకుఁడవు; జగత్తులకు నీవే గురుఁడవు; శాశ్వతుఁడవు; తురీయఅవస్థలో నుండెడవు; అభిన్నుఁడవు; కేవలము, భావమువలనఁ దెలిసికొనఁ దగినవాఁడవు; కపటయోగీశ్వరులకు దుర్లభుఁడవు; భక్తులకుఁ గల్పవృక్షము నీవే; సకల జీవులచేత సేవింపఁదగినవాఁడవు; ఓ నాథా! నీకనేకనమస్కారములు.

అనూప రూప భూపతిం, నతోఽహ ముర్విజాపతిం
ప్రసీద మే నమామి తే, పదాబ్జభక్తి దేహి మే,
పఠంతి యే ఇదం స్తవం, నరాదరేణ తే పదం
వ్రజంతి నాత్ర సంశయం, త్వదీయభక్తి సంయుతమ్. 6

ఓ సీతాపతీ! భూపతులలో నీరూపము నిరుపమానము; నన్ను గటాక్షింపుము; నీకే నమస్కరించుచున్నాను; నీ చరణారవిందములయందు భక్తి కలుగునట్లు ప్రసాదింపుము". ఈప్రకారము అత్రిమహాముని శ్రీరాముని స్తుతించెను. ఈస్తోత్రమును భక్తిశ్రద్ధలతోఁ జదివినను, పఠించినను, పునరావృత్తి లేనిలోకము భక్తితోఁ గూడ వారికి లభించును; అందుకు సందేహములేదు.

దోహా 3

ఈప్రకారము శ్రీరాముని, అత్రిమహాముని స్తుతించి, చేతులను జోడించుకొని నమస్కరించి, రామునితో నిట్లు పలికెను. "ఓ నాథా! నీ చరణకమలములయందు భక్తి నాకు సదా కలిగియుండుఁ గాక.

### చౌపాయ్ 5

"ఓ నాథా! ఎన్ని జన్మముల జన్మించినను, నీ చరణారవిందముల యందు నిశ్చలభక్తిఁ బ్రసాదింపుము; చకోరములు చంద్రకిరణముల నపేక్షించువిధమున, నీ పాదభక్తిని నేను గోరుచున్నాను." ఈ ప్రకారము మునీశ్వరుఁడు చెప్పిన విన్నపములను శ్రీరాముఁడు విని, జాలిఁబడి, మునీశ్వరునికి స్వాస్థ్యము నిచ్చెను. (అధికపాఠము:—అత్రిమహాముని భార్య అనసూయ; ఆమెను సీతచూచి, వినయవిధేయతలతో నామెకు నమస్కరించి, కలువుఁగోలుఁ దనముగ నామెయొద్ద సంచరించెను. ఆ జగజ్జనని, ఆ సకలసుఖదాయిని, ఆ జానకిని, అనసూయ చూచి, కలువలు చంద్రునిఁజూచి సంతోషించువిధమున సంతసించి, ప్రసన్నురా లయ్యెను. ఆమె సీతమ్మను దీవించెను; ఆమె తన సమీపమున సీతను గూర్చుండఁ బెట్టుకొనెను; ఆమె సీతకు మలినము కాని మడుపులును, మార్పులేని సింగారము నిచ్చెను. ఆ రెండును కలిగియుండినమాత్రమున, గరుడుని సమీపమునకు సర్పములు రాఁజాలని విధమున, దుఃఖము కలుగదు.

### దోహా 4

ఆవస్త్రములను మలినము సోఁకదు; ఆసింగారమునకుఁ జెలుపు లేదు; ఈ రెండు నామె సీతకిచ్చి, సంతోషించి, సీతను పలువిధముల సన్మానించెను; ఆమె యనురాగము జెప్పుటకు శక్యముకాదు.

### చౌపాయ్ 6

తదుపరి, అనసూయ స్త్రీధర్మములను గురించి సీతతో నీవిధమున ముచ్చటించెను. "ఓ రాజకుమారీ! సావధానముగ వినుము. జననీజనకులు, సోదరులు, స్నేహితులు, బంధువులు—ఈ మొదలగు వారు వారివారి ధర్మానుసారముగ స్త్రీలకు సుఖము నిచ్చెదరు; కాని, భర్తయే స్త్రీకి అనంతసుఖము నిచ్చును; భర్తను సేవింపని స్త్రీ అధము రాలు; శూరులను, ధర్మాత్ములను మిత్రులను, ఆపత్కాలము వచ్చినపుడు పరీక్షింపవలెను. వృద్ధు, రోగి, దరిద్రుఁడు, కోపిష్ఠి, మూర్ఖుఁడు, మూఁగవాఁడు, గ్రుడ్డివాఁడు,—భర్త వీరిలో నెట్టివాఁడయినను, భార్య వానిని దైవముగభావించి సేవింపవలయును; అటులఁ జేయని

యొడల, నామె యమలోకముం బొందును; ఆమె యనేకదుఃఖముల ననుభవించును - మనోవాక్కర్మములచే భర్తను దేవునిగ భావించి, సేవించుటయే స్త్రీలకుఁ బరమధర్మము; పరమవ్రతము; పరమనియమము; అంతకంటె నుత్కృష్టమగునది మఱియొకటి లేదు. నాలుగువిధముల పతివ్రతలు లోకములోఁ గలరని, వేదపురాణములు ఘోషించుచున్నవి; సత్పురుషులు చెప్పుచున్నారు.

దోహా 5

"ఉత్తమ, మధ్యమ, అధమ, అధమాధములని నాలుగువిధముల స్త్రీలుకలరు; వారివారి యంతరములఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము; దానిని వినినందున, సంసారసాగరమును దాఁటవచ్చును. (అధికపాఠము సమాప్తము).

చౌపాయ్ 6

"లోకములోనివారందఱు స్త్రీలనియు, తనభర్తయే పురుషుఁడనియు, తలంచునట్టిస్త్రీ, ఉత్తమురాలు; పరపురుషులు సోదరులనియు లేక కుమారులని భావించి, భర్తను సేవించు స్త్రీ, మధ్యమురాలు; స్వకులాచారమునకు భయపడి, ధర్మమార్గమున సంచరించుస్త్రీ, నికృష్టస్త్రీయని వేదములు చెప్పుచుండును. లోకమునకు భయపడియు, అవసరము నిమిత్తమును, ధర్మమార్గమునఁ బ్రవర్తించుస్త్రీ అధమురాలని తెలిసికొనుము; అగ్నిసాక్షిగ వివాహమాడిన భర్తను విడిచి, పరపురుషునితో విహరించుస్త్రీ, నూరుకల్పములు నరకములోఁబడి, దుఃఖించును. ఒకక్షణము సుఖము ననుభవించి, దానిపాపఫలమును నూరుకోట్ల కల్పములవఱకు ననుభవింపఁగోరిన స్త్రీకంటె మూర్ఖురాలు మఱియొకరు కలరా? నిష్కపటముగ పతివ్రతాధర్మముల నవలంబించినస్త్రీ, అనాయాసముగఁ బరమగతిఁ బొందును. భర్తకుఁ బ్రతికూలముగ నడచినస్త్రీ, రెండవజన్మములోఁ జిన్నతనములోనే, వైధవ్యము నొందును.

సోరఠా 4, 5.

"స్వాభావికముగ నపవిత్రమగు నారి పతిశుశ్రూషనొనరించినయెడల, నామెకు సద్గతి లభించును; ఈ సంగతిని వేదములు చెప్పుచుండును, (ఆవిషయమును నేఁడు హరిభక్తుఁడు, తులసీదాసు, చెప్పుచుంటిను.)

ఓ సీతమ్మా! సావధానముగ వినుము; నీనామమును స్మరించినస్త్రీ నిశ్చయముగ పతివ్రతాధర్మముల నాచరించును. శ్రీరాముని నీప్రాణములతో సమానమని తలఁచి, నీ పతినిని సేవించుచుంటివి; ఈ వృత్తాంతమంతయు లోకోపకారార్థము నీకు విన్నవించితిని". అని, యీప్రకారము అనసూయాదేవి ప్రసంగించెను.

చౌపాయ్

ఆమెప్రసంగమును సీత విని, సంతోషించి, యామెచరణములకు నమస్కరించెను. అంతట శ్రీరాముఁడు మునీశ్వరుని చరణములకు మ్రొక్కి "ఓ నాథా! నామనవి చిత్తగింపుఁడు. నన్ను మీదాసునిగ భావించి, కటాక్షింపుఁడు; ఓ స్వామీ! మీయాజ్ఞప్రకారము, వనములలో సంచరించుటకుఁ బోయెదను" అని,ధర్మధురంధరుఁడగు రాముఁడు వినయవిధేయతలతోఁ బలికెను. ఆవచనములను మహాజ్ఞానియగు అత్రిమహాముని విని, "ఓ నాథా! బ్రహ్మ మహేశాదిదేవతలును, సనకాదిఋషులును, పరమతత్త్వజ్ఞానులును, సదా నీకటాక్షము నభిలషించెదరు; నీవు నిష్కాముఁడవు; నీవు దీనదయాపరమూర్తివి; కరుణాసముద్రుఁడవు అట్టి నీవు నాతో నింతవినయవిధేయతలతోఁ బ్రసంగించుట నా భాగ్యము. లక్ష్మీదేవిసరసతఁ దెలిసికొంటిని. ఇంత మంచివాఁడవు కనుక, నాకు తదితరదేవతలను విడిచి, నిన్నే సేవించును. నిశ్చయముగ, నీవంటివాఁడు మఱియొకఁడు లేడు; నీసుశీలము మఱియొకవిధమున నెట్లు ప్రసరించును"? అని రామునిస్తుతించెను. "ఓ నాథా! నే నేమి చెప్పఁగలను? నీవు సర్వాంతర్యామివి, వనములకుఁ బొమ్ము" అని ముని పలికెను. అతనిశరీరము పులకరించెను అతని నేత్రములవెంబడి ఆనందబాష్పములు వఱదలై కాఱెను. అతఁడు ధైర్యము నవలంబించెను.

ఛాంద్ 7

అత్రిమహామునిశరీరము పులకరించెను; అతఁడు పరమానందభరితుఁడయ్యెను. శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ జూచుటలో, నతనినేత్రములు రెప్పపాట్లను మఱచెను. "ఓ నాథా! మనస్సునకును, జ్ఞానమునకును, గుణములకును, ఇంద్రియములకును నీవు పరుఁడవు.

నిన్నుఁ గన్నులారఁ జూచుటయే, నా జపతపములకుఁ దగినఫలము" అని అత్రిమహాముని పలికెను. జపములు, తపములు, ధర్మములు—ఈ మొదలగువానివలన, భక్తికలుగును. ఆసంగతిఁ దెలిసికొని, తులసీదాసు దివారాత్రములు రామునే సేవించుచుండును; అతనిచరిత్రములను గానముఁ జేయుచుండును.

దోహా 6

శ్రీరాముని సచ్చరిత్రములు కలియుగపాపములను హరించును; మనస్సును నిగ్రహించును; బ్రహ్మానందముఁ గలుగఁజేయును; అతని చరిత్రములను సదా గానముఁ జేయుచుండినవారిని, శ్రీరాముఁడు కటాక్షించును.

సోరఠా 6

కలికాలపాపము లపారములు. అతిఘోరములు. ధర్మములు, జపములు, తపములు, వ్రతములు—ఈ మొదలగువానివలనఁ బ్రయోజనము లేదు. సర్వధర్మములను పరిత్యజించి, శ్రీరాముని భజించు పురుషులే, సరసులు; వారే చతురులు.

---

# ద్వితీయ విశ్రామము.

చౌపాయీ

చరాచరజగన్నాథుఁడును, దేవదేవుఁడు మునిచరణకమలములకు నమస్కరించి, వనములకుఁ బ్రయాణ మయ్యెను. మునివేషములను వారిరువురు ధరియించియుండిరి. ముందు రాముఁడును, వెనుక లక్ష్మణుఁడును,—ఈ ప్రకారము వారు నడచిరి. జీవాత్మకును బరమాత్మకును మధ్యను మాయ యుండినవిధమున, వారిరువురిమధ్యను సీత నడచెను. నదులును, వనములును, పర్వతములను, మహాపర్వతములను,— శ్రీరామునిఁ జరాచరజగన్నాథునిఁ బ్రార్థించి, అత

నికి మార్గమునిచ్చెను; ప్రభువున కెండ తగులునని, అంతరిక్షమున మేఘములు ఛత్రముఁ బట్టెను. (అధికపాఠము) మార్గములో ననేక ఋష్యాశ్రమములను వారు చూచిరి; దేవస్థానములు సహితము వానితో సమానము గావు; ఆ యాశ్రమములకు నలువైపులను రసాల సాల పున్నాగపూగవృక్షములు ఫలభరితములై యుండెను; తదితరఫల వృక్షము లనేకములు ప్రకాశించుచుండెను; వానిచక్కదనముఁ జూచి దేవతులమనస్సులు సహితము భ్రమించును; ప్రతిదినము మునులు వచ్చి, శ్రీరామునితోఁ గలసి, ప్రసంగించి విందు జేయుచుండిరి.

దోహా 7, 8

ప్రతిఋష్యాశ్రమములో నొక వేదికయుండెను; దానిపైఁ దులసిచెట్లు పచ్చగ నుండెను; ఆయాశ్రమముఁ జూచి, శ్రీసీతాలక్ష్మణ రాములు సంతోషించిరి; వారిమనస్సుల కాహ్లాదము కలిగెను; వారివారి యాశ్రమములకు వారిముగ్గురను మునులు తీసికొని వెళ్లి, వారిని యథావిధిగ సత్కరించి, పూజించిరి; తదనంతరము, కంద, మూల, ఫలములను భుజంచుటకు వారికిచ్చిరి; అమృతోపమానముగు ఫలములనువారు భుజించిరి.

చౌపాయ్

ఆ ముగ్గురు కందమూలఫలములను భుజించి, నిద్రించిరి; పమ్మట, రాముఁడు వారికిఁ దగినవరముల నిచ్చెను; ప్రాతఃకాలమున లేచి, వారు మునీశ్వరులకు నమస్కరించి, వారిదీవనలఁ బొందిరి; అంతట, వారు పార్వతీపరమేశ్వరులను గణపతిని ధ్యానించి, ఓ పార్వతీ! ప్రయాణమును సాగించిరి. అనేక పర్వతములను, వనములను, నదులను, దాటి, వారు ముగ్గురు నడచివెళ్లిరి; మార్గములో వారు విరాధుఁ డను రాక్షసునిఁ జూచిరి; కర్ణకఠోరముగ వాఁడు గర్జించెను. (అధికపాఠము సమాప్తము). కాలునివలె, వానిరూపము భయంకరముగ నుండెను; సర్పమువలె, వాఁడు వారిమీఁదకు బరుగెత్తి వచ్చెను. వాని దౌర్జన్యముఁ జూచి, అంతరిక్షమున నుండినదేవతులు హాహాకారముఁ జేసి, భయపడిరి; శ్రీరాముఁడు చూచుచుండ, నవలీలగా వాఁడు సీతనెత్తుకొని పోయెను; వాని చాకచక్యమునకు రాముఁ

డాశ్చర్యపడెను; అంతట, లక్ష్మణుఁడు కైకేయివచనములను స్మరించి, ఆమె మనోరథము సిద్ధించెనని తలఁచి, పలువిధముల రాముని బోధించెను; లక్ష్మణుఁడు కోపించి, పంచబాణములును వానిపైఁ బ్రయోగించెను.

ఛాంద్ 8

క్రోధతామ్రాక్షుఁడై, ఆకర్ణాంతములాగి లక్ష్మణమూర్తి విడిచి పెట్టిన బాణములు వానిహృదయమును ఛేదించెను; వాఁడు వ్యాకులపడి, సీతను గ్రిందనిలువఁబెట్టి, త్రిశూలముఁ బట్టుకొని, కాలునివలె, వారిపైకి దాఁడివచ్చెను. చరాచరజంతుజాలము గడగడ వడంకెను. అక్షణమే శ్రీరాముఁడు బాణముఁ బ్రయోగించి, వాని త్రిశూలముఁ జూర్ణముఁ జేసెను.

దోహా 9

మరల శ్రీరాముఁడు, అర్ధచంద్రాకారబాణముఁ బ్రయోగించి, వానిశిరస్సుఁ ద్రుంచివేయఁ దలఁచెను; కాని, ఆబాణము తగిలినందున వాఁడు నేలమీఁదఁ బడెను; వాఁడు లేచి, గర్జించి, శ్రీరాముని నెదిరింపవచ్చెను.

చౌపాయ్

ఈకోలాహలముఁ జూచి, రాక్షసుఁడు పరుగెత్తివచ్చి, "ఓయీ! ఆదినమున నిన్ను విడిచిపెట్టను; తప్పక నిన్ను భంజించెదను" అని గర్జించెను. వాఁడు మహాపర్వతమువలెఁ బరుగిడి వచ్చెను. ఏమి సంభవించునో యని, దేవతలు గుసగుస లాడిరి. వానివేగము సూర్యోరువాయుదేవులతో సమానముగ నుండెను; వానివేగమునకు వృక్షములును, పర్వతములును, పాషాణములును గంపించి యెగిరిపోయెను. జీవజంతువులన్నియు వానివాని ప్రాణములకు భయపడి, ఆప్రదేశమును విడచి, పారిపోయెను. సర్పములతో సమాన మగు నేడుబాణములఁ బ్రయోగించి, రాముఁడు వానిశిరస్సుఁ ద్రుంచివేసెను. వాని కళేబరములో నుండి, యొకదివ్యరూపము వెడలివచ్చెను. వాఁ డొకగంధర్వుఁడు; కుబేరుని శాపమువలన, వాని కీరాక్షసజన్మము వచ్చెను; వాఁడు రామునిచే సంహరింపబడి, శాపముక్తుఁ డయ్యెను. వాఁడు శ్రీరాముని

స్తుతించి, వారి సెలవుగైకొని, స్వధామమునకు నిష్క్రమించెను. వానిఅస్థులను శ్రీరాముడు భూమిలో సమాధిజేసెను; అతనిచర్యకు దేవతలు సంతసించిరి. అంతట సీత శ్రీరామునివద్దకు వచ్చి, భర్తచరణములకు నమస్కరించెను. ఓపార్వతీ! అనంతరము వారుముగ్గురు ప్రయాణమును సాగించిరి; శరభంగమహాముని యాశ్రమమునకు దేవతలతోఁ గూడి దేవేంద్రుఁడు వచ్చియుండెను; రావణునిగుఱించి యావద్వృత్తాంతమును శ్రీరామునకు విన్నవించుటకు దేవేంద్రుఁడు వచ్చెను.

దోహా 10

ఇంద్రుని సంశయములే, అంధకారము! దానిని శ్రీరాముని ప్రతాపభానుఁడు విడగొట్టును; రావణుఁడే, యొకరాత్రి; వానిం జయించినయెడల, నా రాత్రిపోవును; అందువలన, నింద్రాదుల దుఃఖములు నశించును.

చౌపాయీ

శ్రీరామునిం జూచుటకు దేవేంద్రుఁడు మహావైభవముతో వచ్చెను; అతని లావణ్యమును వేషమును జూచుటకు రెండుకన్నులు చాలవు; అతనిరథమునకు నాలుగుగుఱ్ఱములు కట్టఁబడెను; ఆరథము వాయువేగమున నడుచును; సూర్యుని రథమువలె, నతనిరథము దేదీప్యమానముగ వెలుఁగుచుండెను. దానిని వర్ణించుటకు నా యలవికాదు. ఆరథము భూమిని స్పృశింపదు; అంతర్హితమై రథము నిలిచియుండెను; ఇంద్రునిశిరస్సుపై శ్వేతచ్ఛత్రము రాజిల్లెను; సేవకులు చామరములును వీచుచుండిరి. శ్రీసీతాలక్ష్మణులకు శ్రీరామమూర్తి దేవేంద్రుని వైభవమును ప్రతాపమును బోధించి చెప్పెను. ఇంద్రునియాగమనమునకుఁ గారణమునుమాత్ర మతఁడు వారితోఁ జెప్పలేదు. శ్రీవారి యాగమనమును దేవేంద్రుఁడు విని, రథము దిగ్గి, రథమును సారథినిఁ బంపివేసెను; అతఁడు శరభంగునివద్దకు వెళ్లి, రావణునిసమాచారమంతయు నతనికి విన్నవించెను. పిమ్మట నతఁడు శ్రీవారికి మానసికముగ నమస్కరించి, స్వర్గలోకమునకు వెళ్లెను. శ్రీసీతాలక్ష్మణులతోఁ గూడి, శ్రీరాముఁడు శరభంగునియాశ్రమమునకు వచ్చెను.

దోహా 11

శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ జూచి, శరభంగుఁడు భ్రమించెను; అతనినేత్రములు మిఱుమిట్లు గ్రమ్మెను. అతఁడు వారిని సత్కరించి, యాదరించి, తనజన్మము సఫలమయ్యెనని తలంచెను.

చౌపాయ్

"ఓ నాథా! నీవు సాంబశివుని మానససరోవరములో విహరించు రాజహంసవు; నేను బ్రహ్మలోకమునకుఁ బోఁదలఁచి, సిద్ధముగ నుంటిని; అంతలో, నీవు వనమునకు వచ్చుచుంటివి అని నేను విని, నీదర్శనమునకు దివారాత్రములు నిరీక్షించుచుంటిని. నేడు, నిన్నుఁ జూచినతరువాత, నాహృదయము చల్లఁబడెను. ఓ స్వామీ! నేను దీనుఁడను; ఏసాధనముల నెఱుంగను; నన్నుఁ గటాక్షింపుము. ఓ కరుణాసముద్రుఁడా! నా కవశిష్టములులేవు; విన్నపములు లేవు; నిన్నుఁ జూచిన, జనులమనస్సులు భ్రమించును; నీప్రతిజ్ఞను నీవు నిలుపుకొనుము. నీవు దీనులను రక్షించువాఁడవు కనుక, నాశరీరమును విడిచిపెట్టునంతవఱకు, నీవు నాయెదుట నిలిచియుండుము. యోగములు, జపములు, తపములు, వ్రతములు, యజ్ఞములు — ఈ మొదలగు వానినిఁ జేయుటవలన, నాకు నీయందు భక్తి కలిగెను" ఈప్రకారము శ్రీరాముని శరభంగుఁడు స్తుతించి, సర్వసంగములఁ బరిత్యజించి, చితిఁ జేర్చి దానిపైఁ గూర్చుండెను.

దోహా 12

"ఓ నాథా! ఈ నీ సగుణరూపము, శ్రీసీతాలక్ష్మణులతోఁ గూడియుండిన నీ నీలమేఘరూపము సదా నాహృదయములో నివసించునట్లు ప్రసాదింపుము.

చౌపాయ్

ఈప్రకారము శరభంగుఁడు ప్రార్థించి. యోగాగ్నిచే శరీరమును దహించెను. శ్రీరాముని కటాక్షమువలన, నతఁడు వైకుంఠమునకేగెను. ఆమునీశ్వరుఁడు భక్తిఁ గోరియుండినందున, నతఁడు పరమేశ్వరునిలో నైక్యమగుటకు వీలులేక పోయెను. ఇతరఋషులు శరభంగుఁడు సిద్ధిఁబొందుటఁ జూచి, చూచి, సంతోషించిరి; వా రనేకవిధ

ముల నతనినిఁ గొనియాడిరి. "ఓ దీనదయాపరుఁడా! ఓ కరుణామయుఁడా! జయ—జయ!" అని ఋషులు శ్రీరామునిఁ బొగడిరి. తదుపరి, శ్రీవారు ముందు వనమునకుఁ బ్రయాణ మయ్యెను. అతని వెంట ఋషులు వెళ్లిరి. ఎముకల ప్రోఁగుఁ జూచి, శ్రీరాముఁడు దానిని గుర్తించి, ఋషులతోఁ బ్రస్తావించెను. "ఓ నాథా! మీరు సర్వజ్ఞులు; సర్వాంతర్యాములు; సర్వము తెలిసియుండినను, మమ్ముల నడుగుట యేల! మా మనోభావములను సహితము మీరు గ్రహింపఁగలరు." అనేకమునీశ్వరులను రాక్షసులు భక్షించిరి;"—ఈప్రకారము ఋషులుచెప్పినమాటలను శ్రీరాముఁడు విని, జాలిఁబడి, కన్నీరు గార్చెను.

దోహా 13

"ఓ ఋషులారా! భూచక్రములో రాక్షసులను నిర్మూలముఁ జేయుదు" అని యూర్ధ్వబాహుఁడై శ్రీరాముఁడు ప్రతిజ్ఞ జేసెను. స్వస్థానములకు నిష్క్రమించి, సుఖముగ నుండిరి.

చౌపాయీ

సుతీక్ష్ణుఁ డనుమునియొకఁడు కలఁడు; అతఁడు చతురుఁడు; అగస్త్యమహాముని శిష్యుఁడు; అతఁడు శ్రీరామునిఁ బ్రేమించును. త్రికరణశుద్ధిగ నతఁడు శ్రీవారి చరణకమలములను సేవించుదాసుఁడు; అన్యదేవతల నతఁడు స్వప్నమందయినను భజించియుండలేదు. శ్రీరాముని యాగమనము నతఁడు విని, దిగ్గున లేచి, వారిదర్శనమున కువ్విళ్లూరుచుఁ, దనలోఁ దా నిట్లు తలంచెను. "ఓ స్వామీ! ఓ దీనబంధూ! నావంటిమూర్ఖుని రక్షించెదవా? నిస్సందేహముగ నీవు నన్ను రక్షించెదవు; ఈదినమున శ్రీసీతాలక్ష్మణయుత శ్రీరాముఁడు నన్నుఁ దనసేవకునిగ భావించి, యాదరించును. నాకుమాత్రము నమ్మకము దృఢముగ లేదు; ఎందుచేత? భక్తి, జ్ఞానము, వైరాగ్యము—నే నెఱుంగను; సత్సాంగత్యము, యోగము, జపము, తపము, యజ్ఞము—ఈ మొదలగువానిని నేను జేసియుండలేదు; అతని చరణారవిందములయందు నాకు దృఢముగు భక్తిఅయినను లేదు. తథాపి, శ్రీవారు చేసినప్రతిజ్ఞ యొకటికలదు. 'ఇతరగతులను విడిచి, నన్ను నమ్మినవారిని నేను ప్రేమించెదను' అని శ్రీవారు పలికియుండిరి.

**అధికపాఠము. ఛాంద్ 9**

("ఎంతమహాపాతకుఁడైనను, రామనామమును స్మరించినయెడల వాఁడు రామునకుఁ బ్రియుఁడగును ఈదినమున, శ్రీవారిని గన్నులారఁ జూచుభాగ్యము నాకుఁ గలుగును." ఈప్రకారము సుతీక్ష్ణుఁడు తలంచెను; అతనిశరీరము పులకరించెను. అనేకవిధముల మునీశ్వరులు ధ్యానించినను, శ్రీవారిపాదకమలములు వారికి లభింపవు; ఆపాదములు కేవలము భక్తులకు లభించును. అధికపాఠము సమాప్తము.)

**దోహా 14**

ఓ గరుడుఁడా! శ్రీవారిని ప్రేమతో సేవించుటకంటె నధికమగు భజన యొకటి లేదుకదా! అందుచేత, మునీశ్వరులు సదా శ్రీవారిగుణములను గానముఁ జేయుచుందురు.

**చౌపాయ్**

"ఓ భవమోచనుఁడా! ఓ కమలలోచనుఁడా! ఓ మేఘశ్యాముఁడా! ఈరోజున మిమ్ములను దర్శించినందున, నానేత్రములు సఫలమగును." ఈప్రకారము సుతీక్ష్ణుఁడు పరమానందములో మునిఁగి, పరవశుఁడయ్యెను; ఆ మునీశ్వరునకు దశదిక్కులు కనఁబడలేదు; స్వస్వరూపము నతఁడు మఱచెను; ఏదిక్కునకు నడచుచుండెనో, తెలియలేదు; ఒకసమయమున ముందుకును, ఒకసమయమున వెనుకకు నతఁడు నడచెను; ఒకపర్యాయ మతఁడు రామునిగుణములఁ బాడుచు, నృత్యముఁ జేయును. అంతకంత కతనిప్రేమ యధికమయ్యెను; అతని వైకృతమును శ్రీరాముఁడు చెట్టుచాటుననుండి చూచుచుండెను. అతని నిశ్చలభక్తిని శ్రీరాముఁడు గ్రహించి, యతని హృదయములోఁ బ్రత్యక్ష మయ్యెను. అంతలో నాసుతీక్ష్ణుఁడు శ్రీవారిరూపమును హృదయములోఁ జూచి, పరవశుఁడై చతికిలఁబడెను; ఆసంతోషముచే, నతనిచైతన్యము తప్పెను; కనుక, నతఁడు నేలమీఁదఁ బడెను; అతనిశరీరము, పనసపండువలె పులకరించెను. అతని ప్రేమాతిశయములకు శ్రీరాముఁడు సంతోషించి, మునీశ్వరునియెదుటఁ బ్రత్యక్షమయ్యెను.

**అధికపాఠము సోరఠా 7**

(ఆ ప్రణతార్తిహరుఁడు, ఆ దీనరక్షకుఁడు, ఆ దారిద్ర్యభంజనుఁడు, శ్రీరాముఁడు మునీశ్వరునకుఁ బ్రత్యక్షమై, "ఓ స్వామీ! లే లెమ్ము; నావెంబడి రమ్ము; నా ప్రాణములతో సమానుఁడవు" అని పలికెను. అధికపాఠము సమాప్తము.)

**చౌపాయ్**

అనేకవిధముల నతఁడు మునీశ్వరుని మేల్కొలిపెను; కాని, యతఁడు ధ్యానసుఖములో మునిఁగియుండినందున, మేల్కొనలేదు. అంతట, శ్రీరాముఁడు మనుజరూపమును విడిచి, చతుర్భుజములుగల స్వస్వరూపముతో నతనిహృదయములోఁ బ్రత్యక్ష మయ్యెను. మణిని నష్టపడినసర్పమువలె, నా మునీశ్వరుఁడు (సుతీక్ష్ణుఁడు) తత్తరపాటుతో దిగ్గున లేచెను. ఆ మేఘశ్యాముఁడు, ఆ పీతకౌశేయవాసుఁడు, ఆ శ్రీవత్సాంకుఁడు, శ్రీసీతాలక్ష్మణులతోఁగూడిన శ్రీరామపరబ్రహ్మము మునియెదుట నిలువఁబడి యుండెను. ఆ ముగ్వురఁ జూచినంతలో, నతఁడు పరమానందమగ్నుఁడై, దండమువలె, వారిపాదములమీఁదఁ బడెను. అతనిని శ్రీవారు స్వయము చేతులతో లేవదీసి, గాఢాలింగనముఁ జేసికొనెను. జంటలుగ నల్లుకొనియుండిన సువర్ణ - తమాలవృక్షములవలెఁ గౌఁగిలించుకొనియుండిన మునీశ్వరయోగీశ్వరులు శోభించిరి. మునీశ్వరుఁడు మౌనమును ధరించి, శ్రీరాముని ముఖపద్మముఁ జూచుచుండెను. ఒక చిత్తరువుబొమ్మవలె, నతఁడు నిలువఁబడి, శ్రీవారిని వీక్షించెను.

**దోహా 15**

అంతట నతఁడు ధైర్యమునవలంబించి, శ్రీవారిపాదములకు నమస్కరించి, వారిని నిజాశ్రమమునకుఁ దీసికొనివెళ్లి, పలువిధముల వారిని బూజించి, యాదరించి, సత్కరించెను.

**చౌపాయ్**

"ఓ నాథా! నామనవిఁ గైకొనుము. నేను మిమ్ముల నెట్లు స్తుతింపఁగలను? మీప్రభావ మపారము; నాబుద్ధి స్వల్పము; సూర్యునియెదుట ఖద్యోతము ప్రకాశించునా?

శ్యామ తామరస దామ శరీరం
జటా ముకుట పరిధన ముని చీరం,
పాణి చాప శర కటి తూణీరం
నౌమి నిరంతర శ్రీరఘువీరం.

"ఓ నాథా! నీశరీరము శ్యామకమలములతో సమానము; చీర వస్త్రములను ధరించియుంటివి; నీశిరముపై జటలు, ముకుటమువలె ప్రకాశించును; నీచేతిలో ధనుర్బాణములును, నీనడుమునకుఁ దూణీరమును-ఇటువంటి రఘువీరునకు నమస్కరించెదను.

మోహా విపిన ఘన దహన కృశానూ
సంత సరోరుహ కానన భానూ,
నిశిచర కర వరూథ మృగరాజం
త్రాతు సదా నో భవ ఖగ బాజం.

"ఓ స్వామీ! మోహమనునట్టి దట్టమగు నరణ్యమును దహించుటకు నీవు పావకుఁడవు; సజ్జను లనునట్టిపద్మములను వికసింపఁ జేయుటకు నీవు సూర్యుఁడవు; రాక్షసకుంజరములను సంహరించుటకు నీవు మృగరాజువు; సంసారమనునట్టిపక్షిని యెగురఁగొట్టుటకు నీవు డేఁగవంటివాఁడవు; ఓ నాథా! నన్ను రక్షింపుము.

అరుణ నయన రాజీవ నేవేశం
సీతా నయన చకోర నిశేశం,
హర హ్రద మానస రాజమరాళం
నౌమి రామ ఉర బాహు విశాలం.

"ఓ నాథా! నీనేత్రములు రాజీవములు; నీ దివ్యమంగళవిగ్రహముఁ జూడ రెండుకన్నులు చాలవు; జానకినయన చకోరములకు నీవు చంద్రుఁడవు; శ్రీశివుని మానససరోవరములో విహరించు రాజహంసవు; నీ వక్షస్థలము విశాలము; నీ బాహువులు దీర్ఘములు. అనేక వందనములఁ జేయుచున్నాను.

సంశయ సర్ప గ్రసన ఉరగాదం
శమన సుతర్క సుకర్కనిషాదం,

భయ భంజన రంజన సుర యూథం
త్రాతు సదా నో కృపా వరూథం.

"ఓ దేవదేవా! సంశయ మనుసర్పమును భక్షించుటకు నీవు గరుత్మంతుఁడవు; కాష్ఠవాదము, విషాదము, కర్కశము-నీ కటాక్షము వలన నశించును; దేవతలకు సంతోషము నిచ్చెదవు; భక్తులభయమును బోఁగొట్టఁగలవు; కృపాసాగరుఁడవు; నన్ను రక్షింపుము.

నిర్గుణ సగుణ విషమ సమ రూపం
జ్ఞాన గిరా గోతీతమనూపం,
అమల మఖిల మనవద్య మపారం
నౌమి రామ భంజన మహీభారం.

"ఓ భక్తరక్షకా! సమానముగ సగుణనిర్గుణవిషమరూపములు నీకుఁ గలవు; మనోవాచామగోచరుఁడవు; జ్ఞానాతీతుఁడవు; ఉపమారహితుఁడవు; (నీ నిర్గుణబ్రహ్మరూపమును యోగులు ధ్యానించెదరు; నీ సగుణరూపమును భక్తులుపాసించెదరు; దుష్టులనిమిత్తము విషమరూపమును, శిష్టులనిమిత్తము సమరూపమును ధరించెదవు) ఇంద్రియములకుఁ బరుఁడవు; నిర్మలుఁడవు; అఖండుఁడవు; దోషరహితుఁడవు; అనంతుఁడవు; భూభారమును హరించుట కవతరించిన ఓ స్వామీ! మీకు దండప్రణామముఁ జేయుచున్నాను.

భక్త కల్ప పాదప ఆరామం
తర్జన క్రోధ లోభ మద కామం,
అతి నాగర భవసాగర సేతుం
త్రాతు సదా దినకర కుల కేతుం.

జగన్నాథా! భక్తులమనోరథములను సఫలముఁ జేయుటకు నీవు కల్పవృక్షముల వనమువంటివాఁడవు; కామక్రోధాదులు నీ కటాక్షమువలన నశించును; భవసాగరమును దాఁటించుటకు నీవే సేతువు వంటివాఁడవు; ఓ రఘుకులపతాకమా! రక్షింపుము.

అతులిత భుజ ప్రతాప బల ధామం
కలిమల విపుల విభంజన నామం,

ధర్మ వర్మ నర్మదా గుణ గ్రామం
సంతత శంతనోతు మమ రామం.

"ఓ రఘుకులతిలకమా! నీ భుజబలపరాక్రమ మతులితము; నీవు మహాబలవంతుఁడవు; నీ నామమువలన సకలపాపములు నశించును; ధర్మములను కర్మములను రక్షించుటకు నీ గుణములే డాలువంటివి; నీ గుణములు సకలకల్యాణముల నిచ్చును; నీ కటాక్షమువలన, ఓ నాథా! మాకు నిత్యకల్యాణములు సమకూడును గాక.

యదపి విరజ వ్యాపక అవినాశీ
సబకే హృదయ నిరంతర వాసీ,
తదపి అనుజ సియ సహిత ఖరారీ
బసహు మనసి మమ కాననచారీ.

"ఓ ఖరదూషణాంతకా! గుణాతీతుఁడవు; జన్మము లేనివాఁడవు; సర్వవ్యాపకుఁడవు; నాశనరహితుఁడవు; సకల జనహృదయములలో నివసించెదవు; ఓరామా! శ్రీసీతాలక్ష్మణులతోఁ గూడి, నా మానసవనములో సదా నివసించియుండుము; ఆవనములో విహరింపుము.

జే జానహి తే జానహు స్వామీ
సగుణ అగుణ ఉర అంతర్యామీ,
జో కోశలపతి రాజివ నయనా
కరౌ సో రామ హృదయ మమ అయనా.

"ఓ నాథా! నీ సగుణనిర్గుణరూపములఁ దెలిసికొనినవారే జ్ఞానులు; నీవే సర్వాంతర్యామివి; ఓ కోసలాధిశా! ఓ రాజీవనేత్రుఁడా! ఈరూపముతో సదా నాహృదయములో నివసింపుము.

సోరథా 8

"ఓ నాథా! సకలజీవులును నీమాయకు వశ్యులు; ఓ కృపాసాగరుఁడా! నన్ను నీప్రియునిగ భావింపుము.

చౌపాయ్

"ఓ దేవదేవా! నేను నీ సేవకుఁడను; నీవు నా స్వామివి; అనుదురభిమానముపుట్టకుండఁ బ్రసాదింపుము. శ్రీవారి భక్తినివిడిచి, శుభములఁ గోరువాఁడు మూర్ఖుఁడు; వాఁడు మృగాలముతో సమా

నుఁడు." ఈప్రకారము మునీశ్వరుఁడు స్తుతించినస్తోత్రము శ్రీరాముని హృదయమునకు దట్టెను; అతఁడు సంతసించి, మునీశ్వరుని గుండెల కప్పలించుకొనెను. "ఓ మునీశ్వరుఁడా! నీ కిష్టమగువరము నడుగుము; నే నిచ్చెదను." "ఓ నాథా! వరమునడుగుట నాకుఁ దెలియదు; ఏది సత్యమో, ఏది యసత్యమో నే నెఱుంగను. నీవు నాశ్రేయస్సుఁ గోరినవాఁడవు; కనుక, నీవే వరముఁ బ్రసాదింపుము." "ఓ సుతీక్షుణుఁడా! అఖండభక్తియు, జ్ఞానవిజ్ఞానములును నీకుఁ గలుగును; నీవు సకలగుణసంపన్నుఁడ వగుము." "ఓ నాథా! నీమాటప్రకారము నాకన్నియు లభించెను. నా కొకకోరిక కలదు. ప్రసాదింపుము.

దోహా 16

"ఓ స్వామీ! శ్రీసీతాలక్ష్మణులతోఁ గూడి, ధనుర్ధరుఁడవై, నా హృదయాంతరాళమున సదా నివసించియుండుము." అని మునీశ్వరుఁడు ప్రార్థించెను.

చౌపాయ్

"తథాస్తు" అని శ్రీరాముఁడు చెప్పి, యతనిసెలవుఁ గైకొని, శ్రీసీతాలక్ష్మణులతోఁ గూడి, అగస్త్యుని యాశ్రమమునకుఁ బ్రయాణమయ్యెను. అప్పుడు సుతీక్షుణుఁడు చేతులను జోడించుకొని, "ఓ నాథా! నాది యొకవిన్నపము; నాగురువుల దర్శనముఁ జేసి, విశేష కాలము గతించెను; వారిని విడిచివచ్చినదిమొదలు, నే నీయాశ్రమములో నివసించియుంటిని; నేను మీతోఁగూడి, నాగురువులను దర్శించుటకు వచ్చెదను; నావలన మీకు నిరోధకము లేనియెడల, మిమ్ముల ననుసరించెదను." అని వేడుకొనెను. శ్రీరాముఁడు సమ్మతించినందున, నతఁడు వారిని యనుసరించి, వారి చరణకమలములఁ జూచుచు సంతోషించెను. "ఆహా! ఈ నాథుఁడెకదా పరాధునిమదమును బోఁగొట్టెను." అని యతఁడు తనలోఁ దాను చింతించెను. ఆమునీశ్వరుని చమత్కారముఁ జూచి, రామలక్ష్మణులు వారిలోవారు నవ్విరి. మార్గములో ననేకభక్తికథలఁ జెప్పుకొనుచు, వారు నడచివచ్చిరి; అంతట, నా దేవదేవుఁడు మునియాశ్రమముఁ బొడగనెను. ఎదురుగ నొక నదికలదు; ఆ నదికిమీఁదుగ నొక పర్వతముకలదు; ఆ రెండింటికిని

మధ్యను బుష్పవాటికలును, వనములును, తోఁటలును గలవు; ఆ వన ములమధ్యను, అగస్త్యుని యాశ్రమము కలదు. ఆయాశ్రమ మెంత మనోహరముగ నున్నది. జలచరములు, భూచరములు సహజవైరమును విడిచి, అత్యంతమైత్రితో నివసించెను. సిద్ధులును, మునీశ్వరులును నచట తపముఁ జేయుచుండిరి. ఆ యాశ్రమము వారిమనస్సుల కాహ్లా దముగ నుండెను.

దోహా 17

ఆవనములో ననేకపక్షులును మృగములును, సహజవైరమును విడిచి, కలుపుఁగోలుఁదనముతో మెలఁగుచుండెను. ఇదియంతయు అగ స్త్యుని ప్రభావమే!

చౌపాయ్

శీఘ్రముగ నాశ్రమములోనికి సుతీక్ష్ణుఁడు వెళ్లి, గురువుపాద ములకు నమస్కరించి, "ఓ నాథా! ఆ అయోధ్యాధిపతికుమారుఁడు ఆ జగదాధారుఁడు మీదర్శనముఁ గోరి నిలిచియుండిరి; శ్రీసీతారామ లక్ష్మణులు ముగ్గురు వచ్చిరి. వారినే మీరు సదా దివారాత్రములు ధ్యానించుచుంటిరి." అని వర్తమానముఁ జెప్పెను. ఆ మాటలను విని, అగస్త్యుఁడు దిగ్గున లేచి, బయటకు వచ్చి, ఆ ముగ్గురఁ జూచి, పరమానందభరితుఁడై, కన్నీరుఁ గార్చెను. రామలక్ష్మణు లతనిచరణ మునకు నమస్కరించిరి; వా రిరువుర నతఁ డప్పుడు కౌఁగిలించుకొనెను. అతఁడు మహాజ్ఞాని; వారికుశలము నడిగెను; వారిని లోనికిఁ దీసికొని వచ్చి, వారి నాసనములపైఁ గూర్చుండఁబెట్టెను; అనేకవిధముల నతఁడు వారి నాదరించి, సత్కరించి, వారితో నిట్లు ప్రసంగించెను. "ఓ నాథా! నావంటి యదృష్టవంతుఁడు లేఁడు." అని అగస్త్యుఁడు పలికెను.

దోహా 18

మునీశ్వరులసమూహములో శ్రీవారు కూర్చుండిరి. వారిముఖ మును నలువైపులనుండినవారు చూచుచుండిరి. శరత్కాలచంద్రునిఁ జూచిన చకోరములవలె, వారు సంతోషించిరి. (నలువైపులనుండిన వారు శ్రీవారి సన్ముఖముననుండినట్లు తలంచుటయే యొక రహస్యము.) సజ్జలములఁబొందిన మత్స్యమును, జింతామణిని సంగ్రహించిన దరి ద్రుఁడునువలె, వారు శ్రీరామునిఁ జూచి, పరమానందభరితు లయిరి.

స్వాతివానలజలముఁ ద్రాగి సుఖించు చాతకములవలె, వారు సుఖముఁ బొందిరి. అంతట శ్రీవారు అగస్త్యునితో నిట్లు ప్రస్తావించిరి:—"ఓ మునిరాజా! మీవద్ద నాకు రహస్యములేదు; నేను వనములకు వచ్చుటకుఁ గారణము మీకు విశదము. అందుచేత నాసంగతి నేను ప్రకటించుకొనలేదు. ఏప్రకారము నేను రాక్షసులను సంహరింపఁగలనో, స్వాములవారు సెలవు దయసేయవలెను. హిమంతఋతువులోఁ గమలములు నశించువిధమున, నేఁడు గోబ్రాహ్మణ మునిద్వేషులు నశించెదరు." శ్రీవారివచనముల నగస్త్యుఁడు విని, చిఱునవ్వు నవ్వెను. "ఓ నాథా! మీకు సర్వము విదితముకదా! ఇట్లేల నన్నుఁ బ్రశంసించెదరు? ఓ పాపనాశనుఁడా! మిమ్ములను భజించుటవలనఁ, గొంచెము మీప్రభావముఁ దెలిసికొంటిని.

సోరఠా 9

"ఓ నాథా! మీ మాయ మీ పాదాక్రాంతురాలై, మీ భ్రుకుటీవిలాసమును నిరీక్షించుచుండును. ఆమాయయే, మీప్రభావము చేత, బ్రహ్మమహేశాదిదేవతలను, సిద్ధమునిగణంబులను సృజించును.

చౌపాయ్

"ఓ నాథా! మీమాయ అజేయురాలు; ఎవ్వుల నతికష్టపెట్టును. ఈసంగతి లోకప్రసిద్ధము. కటాక్షించి, నా స్వల్పవిన్నపము నాలకింపుము. మీమాయ బొడ్డచెట్టువంటిది; దాని పండ్లవంటివి మాయాకల్పితములగు బ్రహ్మాండకటాహములు. ఈ బ్రహ్మాండములలోని చరాచరజంతుజాలము లా పండ్లలోని పురుగులువంటివారు. వానియందము పైపైఁ జూడ చిత్రముగ నుండును; కాని, వానిపొట్టవిప్పిచూడఁ బురుగులుండును. ఈ బ్రహ్మాండఫలములయం దాసక్తికలవారు, కాలస్వరూపులగు మిమ్ముఁజూచి భయపడుచుందురు. ఓ నాథా! మీరు లోకారాధ్యులు; మనుజమాత్రునివలె, మీరు నన్నుఁ బ్రశంసించెదరు; మీరు కరుణాసముద్రులు నా కీవరమును ప్రసాదింపుఁడు. శ్రీసీతాలక్ష్మణులతోఁ గూడి, మీరు నాహృదయములో నివసింపుఁడు. మీ కటాక్షమువలన, నిశ్చలభక్తియు, సత్సాంగత్యమును, జ్ఞానవిజ్ఞానములు నాకుఁ గలుగుఁగాక. మీరు బ్రహ్మణ్యులు; అఖండులు; అనం

తులు; సర్వజ్ఞులు; అనుభవగమ్యులు; మిమ్ములను సదా సత్పురుషులు భజించెదరు. మీ నిర్గుణ స్వరూపముఁ గొంచెము తెలిసికొంటిని; కాని, మీసగుణరూపమును ధ్యానించి, పూజించుటలో నా కభిమానము మెండు.

దోహ 19

"మీ కటాక్షముకలవారే, సదా సంతోషముతో సుఖించెదరు; మీ యనన్యదాసులే, మీ మహిమను గుర్తెఱుంగుదురు. తదితరులు మీ మహిమను గ్రహింపఁగలరా?

చౌపాయ్

"ఓ నాథా! మీరు మీ దాసులకు గొప్పతనము నిచ్చెదరు; అందుచేత, మీరు నన్నుఁ బ్రశంసించితిరి. ఓ స్వామీ! మీ నివాసము నకుఁ దగినస్థలము పవిత్రమగు పంచవటీతీరము; అచ్చట, గోదావరీనది ప్రవహించును. ఆ మహానది నాలుగుయుగములనుండి ప్రసిద్ధికెక్కెను. దానిసమీపముననే దండకారణ్యము కలదు; ఆ దండకారణ్యమును మీరు పవిత్రముఁ జేయవలసియుండును. ఆవనమును మునిరాజు శపిం చియుండెను; ఆశాపమును మీరు పోఁగొట్టవలెను. (కథ:—(1) ఒకస మయమున, పంచవటీతీరమున దుర్భిక్షము వచ్చెను. అప్పుడు మునులం దరు గౌతమఋషిని నాశ్రయించిరి. అతఁడు తపోమహిమచే, విశేష కాలము వారినిఁ బోషించెను. కొంతకాలమున కా ఋషులు స్వస్థాన ములకుఁ బోఁదలఁచిరి కాని, వారు గౌతమునకు భయపడి యూరకుం డిరి. వారు కుట్రఁబన్ని యొక మాయాగోవునుఁ గల్పించి, గౌతముని ధాన్యాగారమువద్ద దానిని విడిచిపెట్టిరి. ఆగోవును గౌతముఁడు స్పృ శించినమాత్రమున నది చనిపోయెను. గౌతమునకు గోహత్యాపాపము వచ్చెనని, యతనిని దూషించి, వారు జనస్థానములకు నిష్క్రమించిరి. ఆ ఋషులుచేసిన చమత్కారమును గౌతముఁడు గ్రహించి శపించెను. "ఓ బ్రాహ్మణులారా! మీరు కపటముగఁ బ్రవర్తించినందున, నీవనము భ్రష్టగుగాక; ఈవనములో రాక్షసులు నివసించెదరుగాక" అని శపిం చెను. (2) దండకుఁడను రాజు గురుపుత్రికను బలాత్కారముగఁ జెఱఁ బట్టెను. ఆమె భృగుమహాముని కూఁతురు; రాజుచేసిన దురాచారము

నా మెజనకునకు విన్నవించెను. ఆమునీశ్వరుని శాపమువలన, నా రాజ్యము నశించెను; ధూళివర్షము కురిసెను. మునీశ్వరుల నివాసము, జనస్థానము. శ్రీరాముఁడు దండకారణ్యములోఁ బ్రవేశించిన తరువాత, నచ్చటివృక్షములు పుష్పవతులై ఫలించెను). ఓ స్వామీ! ఓ రఘుకులతిలకమా! ఆవనములోఁ గొంతకాలము నివసించి, మీరా ఋషులను గటాక్షింపుఁడు." ఆమునులకు నమస్కరించి, వారి సెలవుఁగైకొని, శ్రీసీతారామలక్ష్మణులు ప్రయాణము సాగించిరి; క్రమముగ వారు దండకారణ్యముఁ జూచి, పంచవటీతీరమునకు వచ్చిరి. వారి దృష్టిపడిన మాత్రమున, నా యరణ్యములోని, లతలును వృక్షములును జిగిరించి, పుష్పించి, ఫలించెను. వారిపాదధూళి తగిలినమాత్రమున, మునిశాపము విమోచన మయ్యెను; ఆ యరణ్యము సకల జనానందదాయక మయ్యెను.

దోహా 20

శ్రీరాముఁడు గృధ్రరాజు. జటాయువుఁను జూచెను! జటాయువునకును దశరథునకు నత్యంతమైత్రి; అందుచేత నతనికిని రామునకును పరమ స్నేహముకలిగెను. గోదావరీతీరమున నొకపర్ణశాలను నిర్మించుకొని, శ్రీ సీతారామలక్ష్మణులు సుఖముగ నివసించిరి.

---

# తృతీయవిశ్రామము.



చౌపాయ్

ఆ గోదావరీతీరమున శ్రీరాముఁడు నివసించియుండిన కాలము మొదలుకొని మునీశ్వరులు మొదలగువారు సంతోషముతో నుండిరి; వారి దుఃఖములు నశించెను. పర్వతములును, నదులును, వృక్షములును, వాపీకూపతటాకములును, సర్వము కళకళ లాడుచుండెను; దిన దిన ప్రవర్ధమానముగ శోభిల్లెను. పశుపక్షిమృగములు, స్వాభావికవైర

మును విడిచి, సఖ్యతగ మెలంగెను. మధుపములు ఝంకారముఁ జేయు చుండెను. ఆ వనస్పతులశోభను శేషుడు సహితము వర్ణింపలేడు. శ్రీ రాముఁడు నివసించుటవలన, నావనము ప్రకృతిసంపదలతోఁ దులఁ దూగెను. ఈ వనములో నొకసంవత్సరము వారు నివసించిరి. అంత నొకనాఁడు లక్ష్మణుఁడు శ్రీరామునిఁ జూచి, జ్ఞానాపేక్షతోఁ గొన్ని ప్రశ్నల నడిగెను.

[ప్రశ్నలనడుగుటకుఁ గారణములు నాలుగు. (1) వివాదార్థము ఒకరి నోడించుటకుఁ బ్రశ్న వేయుట తుచ్ఛము. (2) వాక్చాతుర్యముఁ జూపించుటకుఁ బ్రశ్న వేయుట కనిష్ఠము. (3) బుద్ధిచాతుర్యముఁ జూపించుటకుఁ బ్రశ్న వేయుట మధ్యమము. (4) సందేహములను నివృత్తిఁ జేసికొనుటకుఁ బ్రశ్న వేయుట యుత్తమము. లక్ష్మణుని ప్రశ్న నాలుగవతరగతిలోఁ జేరును]. "ఓ దేవా! ఓ చరాచరజగన్నాథా! ఓ సర్వజ్ఞుఁడా! ఓత్రికాలజ్ఞానసంపన్నుఁడా! మీరే నా ప్రభువులు; నా విన్నపమును వినుడు. నేను సర్వమును విడిచి, మీ చరణములనే నమ్మి సేవించుచుంటిని. జ్ఞానము, వైరాగ్యము, మాయ-వీనినిగుఱించి నాకు బోధింపుఁడు; నేను మూర్ఖుఁడను; నా కేమి తెలియదు. మీకు భక్తియం దభిమానము; ఆ భక్తిగలవారిం జూచిన, మీరు ప్రాణముల నిచ్చెదరు; ఆ భక్తిస్వరూపమును బోధింపుఁడు."

దోహా 21

"ఓ నాథా! జీవునకును, ఈశ్వరునకును గల భేదమేమి! మీ చరణములను నమ్మియుండిన, శోకమోహాదులు నశించును; నా సందేహములను నివృత్తిఁ జేయుఁడు."

చౌపాయ్

ఈప్రకారము లోకోపకారార్థము లక్ష్మణుఁడు శ్రీరాముని నడిగెను. (లక్ష్మణునిప్రశ్నలు వ్యతిక్రమముగ నుండెను. శ్రీరామునియుత్తరము లనుక్రమముగ నుండును.) "ఓ తమ్ముఁడా! సావధానముగ వినుము. దేహమునం దభిమానము, పదార్థములయం దాసక్తి, 'నీవు, నేను' యను మమకారమును, ఈషణత్రయమును—ఈ మొదలగునవి మాయాకల్పితములు; మాయయొక్క స్వరూపములని తెలిసికొనుము;

ఈ మాయయే చరాచరజంతుజాలమును తనవశము఼ జేసికొని యుం డును. ఇంద్రియములు పదియు, వానివాని యధిష్ఠానదేవతల నను సరించి, భోగముల ననుభవించును. ఆయా విషయభోగములన్ని యు మాయాకృతములని తెలిసికొనుము. ఈమాయకే రెండు నామ ములు; ఆ మాయనే ప్రకృతియనియు, పరాపర అనియు నామములు కలవు. విద్యయనియు, అవిద్యయనియు దానిలో రెండుభేదములు కలవు. అవిద్య మహాదుష్టురాలు; ఆమెమూలమున నధికదుఃఖములు కలుగును; దానికి వశులై, జీవులు సంసారకూపములో఼ బడియుందురు. విద్యారూపి యగుమాయ ప్రభువుప్రేరణవలన, ననేక బ్రహ్మాండము లను రచించును. ఆమాయకు స్వతంత్రశక్తి లేదు; పరమేశ్వరుని సన్ని ధానమున నుండినమాత్రమున నా విద్యారూపి యగుమాయ, త్రిగు ణాత్మకమగు ప్రపంచమును సృష్టించును. వర్ణాశ్రమధర్మములను విడిచి పెట్టి, సర్వము బ్రహ్మస్వరూపమని తలంచి, భేదబుద్ధిని విడిచినవా఼డే జ్ఞాని యని తెలిసికొనుము. ('సర్వం ఖల్విదం బ్రహ్మ నేహనానాస్తి కించన'అని ప్రమాణము)— ఈ జగత్తు బ్రహ్మస్వరూపమనియు, నానావిధ పదార్థము లొకటియని తెలిసికొనువా఼డె జ్ఞాని. ఓ లక్ష్మణు఼డా! రజో గుణము బ్రహ్మయందును, సత్త్వగుణము విష్ణువుయందును, తమోగు ణము రుద్రునియందును సిద్ధించెను. ఈ మూ఼డుగుణములే ప్రపంచ మునకు఼ గారణములు? ఈ మూ఼డును తృణప్రాయములని తెలిసికొని, వానిని విడిచిపెట్టినవా఼డే, వైరాగియని తెలిసికొనుము."

దోహా 22

"ఓ తమ్ము఼డా! ఎంతవఱకు జీవు఼డు తనకును మాయకును పర మాత్మకును గల సంబంధమును తెలిసికొనలే఼డో, అంతవఱకు జీవు఼డు జీవు఼డుగ నుండును; ఆ జీవు఼డు మాయకు లో఼బడి యుండును ఎప్పు డు జీవు఼డు తనకును పరమాత్మకు భేదము లేదనియు, పరమాత్మ యొక్క ప్రతిబింబమే తా నని గ్రహించునో, అప్పుడు జీవునకు మాయ విడిపోవును; ఆ జీవు఼డు మాయకు లో఼బడి యుండ఼డు. అదియే ఆత్మజ్ఞానము. జీవాత్మకును, మాయకును, బరమాత్మకును గల సంబంధము఼ దెలిసికొనుము."

చౌపాయ్

"స్వధర్మములవలన, విరక్తిపుట్టును; యోగమువలన, జ్ఞానము పుట్టును; జ్ఞానమువలన, మోక్షము లభించునని వేదములు ఘోషించును. ఈశ్వరునియం దత్యంతప్రేమఁ గలిగియుండుటయే భక్తి - భక్తివలన, నేను ప్రసన్నుఁడను కాఁగలను; నాభక్తులకు భక్తి సుఖము నిచ్చును. భక్తి స్వతంత్రము; ఆ భక్తి పరాధీనము కాదు; జ్ఞానవిజ్ఞానములు దాని యధీనములో నుండును. నిరుపమానమగు సుఖమునకు భక్తి మూలము; సత్పురుషుల కటాక్ష ముండినఁగాని, భక్తి కలుగదు. భక్తిమార్గము సులభము; అమార్గమున జీవులు నన్ను శీఘ్రముగఁ జేరఁగలరు; భక్తిమార్గములఁ జెప్పుచున్నాను, వినుము; ప్రథమమున, బ్రాహ్మణుల నత్యంతభక్తితో సేవించుట; తదుపరి, వేదోక్తప్రకారము స్వకులధర్మముల ననుష్ఠించుట. వీని మూలమున, విషయభోగముల నుండి, మనస్సునకు విరక్తిపుట్టును; తదనంతర, మాచరణములమీఁద నత్యంత ప్రీతికలుగును. 'తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్, వందనార్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనంబను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరి న్నమ్మి' సేవింపుము. నా లీలావతారములను సదా వినుచుండుము; ఈ ప్రకారము నడచినయెడల, భక్తి క్రమముగ దృఢమగును. సత్పురుషుల చరణకమలములను సేవింపుము; త్రికరణశుద్ధిగ ననుభజింపుము. గురువులను, జననీజనకులను, బంధువులను, బతులను, దేవతలను, నన్నుగాభావించి, వారిని సేవింపుము. శరీరము పులకరించువఱకు నాగుణములను గానముఁజేయుము; ఆనందబాష్పములు నేత్రములనుండి వరదలై, కారవలెను; కంఠములో గద్గదస్వరము పుట్టవలెను. కామాదిదోషములు లేనివాఁడగును. అహంకారము లేశమైన లేనివాఁడును, నాకుఁ బ్రియుఁడు; వానికిసదా నేను వశ్యుఁడను.

దోహా 23

"త్రికరణశుద్ధిగ నన్నే నమ్మియుండి, నిష్కామ్యముగ, దాంభికమునువిడిచి, నన్నే యెవఁడుభజించునో, వాని హృదయకమలములో నేను నివసించెదను."

చౌపాయ్

ఈ ప్రకారము శ్రీరామమూర్తి చెప్పిన భక్తిమార్గమును లక్ష్మణుఁడు విని, శ్రీవారిచరణములకు నమస్కరించెను. "ఓ నాథా! శ్రవణమాత్రమున, నాసందేహములు విడిపోయెను. మీ కృపవలన, జ్ఞానోదయ మయ్యెను; అందువలన, నూతనముగ భక్తి పూర్వముకంటె నధికముగ వికసించెను." లక్ష్మణునివచనములకు శ్రీరాముఁడు సంతసించి, యతనిని హృదయమునకుఁ గౌఁగిలించుకొనెను. ఈప్రకారము సత్సంభాషణలో వారికాలము గడచెను. అంతట నొకనాడు, రావణుని విధవచెల్లెలు, మహాదుర్మార్గురాలు, నాఁగుబాముఁవంటి శూర్పణఖ వారిముగ్వురఁ జూచి, పరుగెత్తి వచ్చెను. ఆరాక్షసి పంచవటీతీరమునకు వచ్చి శ్రీరామలక్ష్మణులఁ జూచినందున, దానిమనస్సు వికలమయ్యెను; వారి చక్కఁదనముఁజూచి, శూర్పణఖ వారిని మోహించెను. ఓ గరుడజీ! సోదరులతోను, తండ్రులతోను, పుత్రులతో సమానవయస్సుగల పురుషుల చక్కఁదనముఁ జూచి, మనస్సుబట్టలేక స్త్రీలు మోహించెదరు; సూర్యునిఁజూచి సూర్యకాంతిమణివలె, వారి హృదయములు నీరగును. ఆశూర్పణఖ వయోవృద్ధు; అయినను, దానిమనస్సు చలించెను.

దోహా 24

ఓ గరుడజీ! ప్రథమతః, ఆ శూర్పణఖబుద్ధి నీచము; అది రాక్షసి; శ్రీవారితో హాస్యమాడెను. అందుచేత, దానిని వారు దండించిరి. (ఇంతవఱకు నది శ్రీవారినిఁ జూడలేదు - వనవాసమంతము కావచ్చెను. వినాశకాలము సమీపించెను. కనుక, దానికి విపరీతబుద్ధి పుట్టెను. రాక్షసుల కంత్యకాలము వచ్చెను.)

చౌపాయ్ అధికపాఠము.

ఆశూర్పణఖ సుందరరూపమును ధరించి, చిఱునవ్వునవ్వుచు, శ్రీరామునివద్దకు వచ్చెను. "నీవంటిపురుషుఁడును, నావంటిస్త్రీయు లోకములో లేరు; మన యుభయులదాంపత్య మనుకూలముగ నుండునని తలంచి, బ్రహ్మ మనలను సృష్టించెను. నేను మూఁడులోకములలో సంచరించితిని కాని, నీవంటి చక్కనివాఁడు నాకుఁ గనఁబడలేదు.

ఇంతవఱకు నేను వివాహముఁ జేసికొనలేదు. ఇప్పుడు నిన్నుఁ జూచిన తరువాత, నాకు మనోవికారము పుట్టెను." ఈప్రకారము శూర్పణఖ పలికినపలుకులను శ్రీరామమూర్తివిని, జానకిం జూచి, "ఓ కుమారీ! నా తమ్ముడు బ్రహ్మచారి; అతనివద్దకుఁ బొమ్ము"అని దానితోఁజెప్పెను. ఆ రాక్షసి లక్ష్మణుని సమీపించెను. అతఁడు శ్రీవారిముఖముఁ జూచి, దానితో నిట్లు పలికెను. "ఓ సుందరీ! నామాటను వినుము; నేను వారి దాసుఁడను పరాధీనుఁడను; నీకుఁ దగిన వాఁడను కాను. నాప్రభువు కోసలాధిపతి; సర్వసమర్థుఁడు. వారు చేయఁదలఁచిన కార్యములను నలువ్వరు శ్లాఘించెదరు.

దోహా 25

"ఏనుఁగు సింహముతోను, జిన్నపిట్ట డేఁగతోను సమానమగునా? నేను సేవకుఁడను. నాకును నాప్రభువునకు నంతయంతరము కలదు. నేను నిన్ను వివాహముఁజేసికొనుటకుఁ దగుదు".

చౌపాయ్

"సుఖముగోరిన సేవకుఁడును, అభిమానముగల యాచకుఁడును, దుర్వ్యసనములుగల ధనికుఁడును, వ్యభిచారగుణములు కలవారికి సద్గతియు, లోభికి కీర్తియు,—ఈ నలువురి కోరికలు సిద్ధించునా? ఆకాశమునుండి పాలఁ బితుకఁదలఁచినవానికి క్షీరములు లభించునా?" ఈప్రకారము లక్ష్మణుఁడు చెప్పినమాటలను శూర్పణఖ విని, పునః రామునివద్దకు వచ్చెను. అతఁడు మరల దానిని లక్ష్మణునివద్దకు బంపెను. "ఓకుమారీ! గడ్డిపోఁచకంటెఁ గనిష్ఠుఁడు సిగ్గునువిడిచి, నిన్ను వివాహముఁ జేసికొనవలెను" అని లక్ష్మణుఁడు దానితోఁ జెప్పెను. ఆ శూర్పణఖ, కొఱకొఱలాడి, భయంకరరూపముతో రామునివద్దకు వచ్చెను. దాని శిరోజములు వీడియుండెను; దానిదంతములు క్రూరములు; దానిచెవులు వ్రేలుచుండెను; దానిగళము భయంకరము. దాని వికృతరూపముఁ జూచి, సీత భయపడెను. అంతట శ్రీరాముఁడు సంజ్ఞఁజేసి, లక్ష్మణునకు బోధించెను. (శ్రీరాముఁడు హస్తమును మీఁదికిఁ జూచి, బొటనవ్రేలితో మిగిలినవ్రేళ్లను లెక్కించెను. ఈ సంజ్ఞ కర్థమేమి? నాలుగు=వేదమునకు సంజ్ఞ; వేదమునకు శ్రుతులని

పేరుకలదు; శ్రుతి=చెవి; హస్తమును మీఁదికిఁ జాచి, శ్రీరాముఁడాకాశముఁ జూపించెను. ఆకాశముపైఁ స్వర్గముండునని భావము; స్వర్గము=నాకము, నాకమునకు ముక్కు అని యర్థము.] శ్రీరాముఁడు చేసినసంజ్ఞను లక్ష్మణమూర్తి గ్రహించెను. ఆతక్షణ మతఁడు రౌద్రాకారుఁడై, దానిపైకి గమకించెను.

దోహా 26

దాని ముక్కుచెవుల నతఁడు కోసెను; దానిహస్తములను ఖండించి, కయ్యమునకుఁ గాలుఁ ద్రవ్వుచు, దానిని రావణునివద్దకు బంపెను.

చౌపాయ్

ముక్కును జెవులును దప్ప దానిముఖము భయంకరముగ నుండెను. పర్వతమునుండి జేగురురంగు ప్రవహించినవిధమున, రక్తము దానిముఖమునుండి ప్రవహించెను. ఈ ప్రకార మారాక్షసి ఖరదూషణులవద్దకు వెళ్లి, "ఓరీ తమ్ముఁడా! ఎందునిమిత్తము మీ బలము? కాల్చనా! మీరు పురుషులు కారు." అని వారిని ధిక్కరించెను. "ఓ అమ్మా! ఏమి విపరీతము జరగెను!" అని వా రామెనడిగిరి. వనములో జరగిన యావద్వృత్తాంతము నది వారికి జెప్పెను. దానిమాటలను విని వారు సమరమునకు సిద్ధపడిరి; పదునాలుగువేల రాక్షసవీరులతో వారు దాఁడివెడలిరి; స్వప్నమందయినను, వారు యుద్ధములో వెనుకఁ దీయరు. తెక్కలుగల పర్వతములువలె, వారు పరుగెత్తి వచ్చిరి. వారి ముఖము లనేక వికారములుగ నుండెను; వా రనేకవాహనములపై నెక్కివచ్చిరి; నానావిధ శస్త్రాస్త్రములను ధరించిరి. ఆ రాక్షసులమూలమున, నంతరిక్షమంతయు నల్లఁబడెను. వారు ధరించిన వివిధాయుధములు, దేవేంద్రుని ధనుస్సువలెఁ, బ్రకాశించెను. వారిముందు శూర్పణఖ నడచెను. ముక్కుచెవులు లేని విధవ ముందు నడచుట, యపశకునము.

దోహా (27)

రాక్షసులు, వారిలోవారు బలాబలములఁ జెప్పుకొనుచుండిరి; ఎవనిబలమును వాఁడు పొగడుకొనెను; తదితరులు వాని ప్రగల్భము

లను వినుచుండిరి, వారు రణభేరిని మ్రోగించిరి; వారినుసన్న లుత్సాహముచే నుప్పొంగెను.

చౌపాయి

ఆ సమయమున ననేక యుత్పాతములు పుట్టెను. ఆ రాక్షసునకు మృత్యువు సన్నిహిత మయ్యెను; కనుక, వారు వానిని లక్ష్యము జేయ లేదు. కొందఱు గర్జించిరి; కొందఱు తర్జించిరి; కొంద అంతరిక్షమున కెగసిరి; వారి కటకమును జూచి, వారు సంతోషించిరి.

"ఆ యన్నదమ్ముల నిరువురను జయించి, పట్టుకొనుము"—"అట్లు కాదు; వారిం జంపి, వారిస్త్రీ నపహరింపుము"—"ఓయీ! అట్లు కాదు, నామాట సత్యము; వినుము. వారు మహావీరులు కనుక, నీవవ మున నిర్భయముగ సంచరించుచుండిరి"—"ఓరి దౌర్భాగ్యుఁడా! ఈ మాటఁజెప్పుటకు నీకు సిగ్గులేదా! ఇట్టిమాటలను ఖరునియొదుటఁ జెప్పుము"—ఆ మహావీరు లీప్రకారము వారిలోవారు గుసగుసలాడుచు రామునిపైకి దుమికి వచ్చిరి. ఆకాశమండలమంతయు ధూళితో నిండెను. "ఓ తమ్ముఁడా! ఈ యుత్పాతముఁ జూచిన, రాక్షససైన్యము దాఁడివెడలినట్లు కనఁబడును; కనుక, నీవు సీతను వెంటఁబెట్టుకొని, పర్వతగుహాలో దాఁగియుండుము - నాకు లేశమైన భయములేదు. మీ రిరువురు స్వాస్థ్యముగ నుండుడు" అని శ్రీరాముఁడు చెప్పినమాటలను లక్ష్మణుఁడు విని, ధనుర్బాణములను గ్రహించి, సీతఁ దీసికొని, గుహాలోఁ బ్రవేశించెను. అంతలో నతఁడు రాక్షససైన్యముఁ జూచి, చిఱునవ్వు నవ్వి, ధనువు నెక్కుపెట్టెను.

ఛాంద్ 10

శ్రీరాముఁడు కఠినమగు కోదండము నెక్కుపెట్టెను. అతఁడు రెండుచేతులతో జడలను సవరించుకొనెను. కోటానకోట్లు మెఱుపులు మెఱయుచుండినపుడు నీలమహాశిక్యపర్వతము ప్రకాశించువిధమున, నతని జటామకుటము శోభించెను. జటలను సవరించుచుండిన రెండు హస్తములును, రెండు సర్పములువలెఁ గనఁబడెను. అతఁడు నడుమున కక్షయతూణీరములఁ గట్టుకొనెను. మదగజబృంహములఁ జూచి,

సింహము కోఱలం గీటుచుండినవిధమున, నతఁడు రాక్షసులం జూచి, ధనుర్బాణములను దువ్వుచుండెను.

సోరఠా 10

నలువైపులనుండి రాక్షసులు వచ్చిరి; "పట్టుకొనుఁడు, పట్టుకొనుఁడు" అని వారు బొబ్బలిడుచుఁ బరుగెత్తిరి. ఉభయసంధ్యలలో 'మందేహ' నామదైత్యులు సూర్యుని ముట్టడించువిధమున, వారు శ్రీరాముని ముట్టడించిరి.

చౌపాయీ

ఈప్రకారము వారు శ్రీరామునకు నలువైపుల గుడిఁగట్టిరి; దండకారణ్యములో నివసించు మృగములును బక్షులును పారిపోయెను. వారు శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముం జూచి, నిశ్చేష్టులయిరి; వారతనిపై బాణములఁ బ్రయోగించుట కిష్టపడలేదు. అప్పుడు ఖరుఁడు మంత్రిని బిలిచి, "ఓయీ! ఈ రాజకుమారులు పురుషసింహములు; సురాసుర, నరనాగ, మునులను నేనుజూచి జయించితిని; వారిలోఁ గొందఱిని సంహరించితిని; కాని, తమ్ముఁడా! నా జీవితకాలములో నింత చక్కనివారిని జూచియుండలేదు. వీరు నా చెల్లెలికి వికృతరూపముఁ గలుగఁజేసినను, వారు నిరుపమానులు కనుక, వారిని వధించుట యుచితము కాదు. ఆగుహలో దాఁగియుండిన స్త్రీని వారు నా కప్పగించినయెడల, వారు జీవించెదరు; సుఖముగ వారు స్వగృహమునకుఁ బోఁగలరు. నే చెప్పినమాటలను వారితోఁ జెప్పి, వారియుత్తరముఁ దీసికొని రమ్ము" అని యాజ్ఞాపించెను.

దోహా 2[illegible]

ఆ ఖరదూషణాదిమూర్ఖులు కాలునకు వశ్యులై, శ్రీరాముని ప్రభావమును గ్రహింపలేక పోయిరి. ఓ గరుడా! దోమలు 'ఫూ' అని యూదినమాత్రమున సుమేరుపర్వతము యెగిరిపోవునా? (అధికపాఠము సమాప్తము.

చౌపాయీ

ఆ దూతవచ్చి, ఖరుఁడు చెప్పినవృత్తాంతమును శ్రీరామునకు విన్నవించెను. అతఁడామాటలకు నవ్వి, "ఓరీ! ఈదినమున, నే నద్భ

ష్టవంతుఁడను. ఇంతన్యాయముగ నీప్రభువు పలికినందులకు నేను సంతో
షించితిని. అయినను, నేను క్షత్రియుఁడను; మీవంటి మృగములను
సంహరించుటకు వనములకు వచ్చితిని. శత్రువులంజూచిన, నాకు భయ
ములేదు. కాలుఁడు నా సముఖమున నిలువబడినను, నేను వానితోఁ
బోరాడఁగలను. నేను మనుజుఁడను; దుష్టులగు రాక్షసులను సంహ
రించెదను; శిష్టులగు మునులను రక్షించెదను. మీకు బలములేనియెడ
ల, మీమీ గృహములకుఁ బొండు. యుద్ధమునుండి విముఖులయిన
వారిని నేను సంహరింపను - ఓరి నీచుఁడా! మీరు యుద్ధమునకు
వచ్చి, నాతో నిట్లు ప్రసంగించుటవలన, మీమీరు నాకేమి భయపు
ట్టునా! శత్రువునకు భయఁజూపించుట, నీరసమగు పని-" ఈప్రకారము
రాముఁడు చెప్పినమాటలను దూతలువెళ్లి, ఖరదూషణులతో విన్న
వించిరి; ఆమాటలచే వారి హృదయములు మండిపడెను.

ఛాంద్ 11

ఆ రాక్షసులు క్రోధసమన్వితులై, దగ్గరలేచి, 'ఓ రాక్షసు
లారా! మీరతనిని శీఘ్రము ముట్టడించి, పట్టుకొనుఁడు.' అని యా
జ్ఞాపించిరి. శరశరాసనములను, దోమరములను, శక్తులను, పరశువులను,
శూలములను, త్రిశూలములను, కృపాణములను, శస్త్రాస్త్రములను
ధరించి, వారు పరుగెత్తిరి. శ్రీరాము ధనుష్టంకారమును జేసిరి; దాని
శబ్దము భూనభోంతరాళములు నిండెను; ఆధ్వనిని వినినంతలో నా
రాక్షసులమతులు చలించెను; వారిజ్ఞానము శూన్యమయ్యెను.

దోహా 29, 30.

శ్రీరాముఁ డసాధారణశత్రువని వారు తెలిసికొని, సావధా
నులై, నిలిచిరి; వారిపై నతఁడు శస్త్రాస్త్రములను వర్షించెను; అతనిపై
వారు బాణపరంపరలఁ గురిపించిరి. వారి యాయుధముల నతఁడు
తిలప్రమాణముగ ఖండించెను. ఆకర్ణాంత మతఁడు ధనస్సును లాఁగి,
బాణములఁ బ్రయోగించెను.

ఛాంద్ 12, 13

సర్పములువలె, నతనిబాణములు వెడలుచుండెను. మూర్తీభ
వించిన వీరరసమువలె, నతఁడు రణభూమిమీఁద నిలువఁబడి, వాఁడ

గలబాణములఁ బ్రయోగించెను. అతని తీక్ష్ణబాణములకు రాక్షసులు నిలువలేక, పికాపికలయిరి. ఒకరినొకరు లక్ష్యముఁజేయక, "అమ్మా! బాబూ!" అని మొరలిడుచు వారు పరుగెత్తిరి. "ఖరుఁడు కనఁబడఁడేమి! వాఁడేమి దాఁగియుండెనా! ఈ ముని తీక్ష్ణబాణములకు వాఁడు భయపడెనా!" అని వారిలోవారు గుసగుస లాడుచుండిరి. ఖరుఁడు, దూషణుఁడు, త్రిశిరుఁడను మువ్వు రన్నదమ్ములు—"ఓయీ రాక్షసులారా! యుద్ధమునుండి పాఱిపోవువారిని నా హస్తముతో సంహరించెదను." ఈప్రకారము ఖరుఁడు చెప్పినమాటలను రాక్షసులు విని, నిలువఁబడి, యుద్ధము చేయుచుండిరి.

దోహా 31

ఓ పార్వతి! ఆ రాక్షసు లెంత భాగ్యవంతులు; ఏకకాలమున, జపతపోయోగములు చేయకయే, శ్రీహరిబాణములు తగిలినందున, వారు ప్రాణములను విడిచి, శ్రీహరి పదముఁ బొందిరి.

ఛంద్ 14, 15, 16, 17, 18, 19

అనేకవిధముల నా రాక్షసులు బాణములఁ బ్రయోగించిరి. శత్రువులు మోహరించి, యుద్ధముఁజేయుటఁ జూచి, శ్రీరాముఁడు కోపించి, శరపరంపరలను వర్షించెను; ఆ బాణములు, వారిహృదయములను, బాహువులను, పాదములను, శిరస్సులను, ఖండించెను, పటపటాంతారావముతో బాణములు వారిం దాఁకెను; మహాపర్వతములవలె, వారు నేలఁ గూలుచుండిరి. వారిశరీరములు వెయ్యితునకలుగ ఖండింపఁబడెను; అయినను, వారు మాయఁబన్ని, పునః యుద్ధసన్నద్ధులై, నిలిచియుండిరి. వారిలో నొకరివలన నొకరికి మృత్యువు కలదు; కాని, పలువలన వారికి మృత్యువు లేదు. శ్రీరామునిబాణములకుఁ దగిలి, యనేక బాహువులును, శిరస్సులును, పాదములు నంతరిక్షమున నెగురుచుండెను. శిరస్సులు లేనిమొండెములు పరుగిడుచుండెను. పక్షులును, కాకులును, గృధ్రములును, సృగాలములును మాంసమును భక్షించుచుండెను. గృధ్రములు కటకటశబ్దములఁ జేసెను; భూతప్రేతపిశాచములు పునుకలలో రక్తముఁ ద్రాఁగెను. తాళములనువలె, వీరులపునుకలను భేతాళములు మ్రోఁగించెను. యోగినులు నాట్య

చూచిరి. శ్రీరాముని తీక్ష్ణబాణములు రాక్షసులఁ జిత్రవధఁ జేయుచుండెను. వారి బాహువులు మొదలగునవి, నలువైపుల నేలమీఁదఁ బడి, పునః లేచి నిలువఁబడి, 'కొట్టు, కొట్టు' మని కేకలు వేయుచుండెను. గృధ్రములు శవములప్రేగులను బయటకు లాగి, వానితో నెగురుచుండెను. పిశాచములు వారి చేతులఁ బట్టుకొని, పరుగెత్తెను. 'సంగ్రామపట్టణము' లోనిబాలురు గాలిపటముల నెగురవేయుచుండినట్లు తోచెను. మహాయోధులు ప్రాణములను విడిచి, నేలఁ బడియుండిరి. రాక్షససైన్యము చిందఱవందఱ యైనందులకు, ఖరదూషణత్రిశిరులు నిర్ఘాతపడిరి. బాణ, శక్తి, తోమర, త్రిశూలాద్యాయుధములను ధరించి, కోటానకోట్లు రాక్షసులు రాముని నెదుర్కొనిరి. ఒకక్షణములో శ్రీరాముఁడు వారిఘాతిని నివారించి, వారిపై శస్త్రాస్త్రములను వర్షించెను. పదిపదిబాణములు లొక్కొక్క రాక్షసుని హృదయమునకుఁ దగిలెను; కొందఱు రాక్షసులు నేలమీఁదఁ బడుచుండిరి; పడిన వారిలోఁ గొందఱు లేచి, నిలువఁబడి, మరల యుద్ధముఁ జేయుచుండిరి. వారు మాయఁబన్ని, యుద్ధముఁ జేసిరి. వారిఘోరరూపముఁ జూచి, దేవతలు భయపడిరి. 'రాక్షసులు పదునాల్గువేలు; రాముఁ డొక్కఁడు' అని దేవతలును మునులు మొదలగువారు భయపడుచుండిరి; ఆ మాయాపతియగు రాముఁ డొకమాయఁ బన్నెను. ఆ రాక్షసులలో నొకరికొకరు రామునివలెఁ గనఁబడిరి; అందుచేత, నొకరినొకరు సంహరించుకొనిరి, శ్రీరాముఁడు కౌతుకముగ నిలిచియుండెను. ఇంతలో నా రాక్షసులందఱు నిశ్శేషు లయిరి.

దోహా 32, 33

ఆ రాక్షసులు 'రామ, రామ' అని పలుకుచు, శరీరములను విడిచి, ముక్తిఁ బొందిరి. ఈ ప్రకారము క్షణమాత్రములో నా కృపాసముద్రుఁడు మాయఁబన్ని శత్రువులను సంహరించెను. దేవతలు ప్రసన్నులై, పుష్పములను వర్షించిరి; దేవదుందుభులు మ్రోఁగెను. దేవతలు విమానారూఢులై, యంతరిక్షమున నిలిచి, శ్రీరాముని స్తుతించిరి. తదనంతరము వారు స్వలోకములకు నిష్క్రమించిరి.

సోరఠా 11

'ఓరీ రావణా! అగ్ని, రోగము, శత్రువు, పాపము, పాము పిల్ల — ఇవి చిన్నవని నిరసించకుము. ప్రబలినయెడల, దుస్సాధ్యము లగును' ఈప్రకారము శూర్పణఖ పలికి, యేడ్వసాగెను.

దోహా 34

ఇట్లు దుఃఖించి, సభలో నది క్రిందబడి, పలువిధముల విలపించెను, 'ఓరీ పదికంఠుడా! నీవు జీవించియుండగ, నా కీపాట్లు సంభవించెను.'

చౌపాయ్.

ఆమెదుఃఖమును జూచి, సభాసదులు వ్యాకులము పడి, దానిని చేతులతో నెత్తి, కూర్చుండబెట్టిరి. 'ఓసీ! ఏమాటయు నీవు చెప్పవేల! నీ ముక్కు చెవుల నెవరు త్రుంచిరి?' అని రావణుడు దానిని నడిగెను. శూర్పణఖ వానితో నిట్లు పలికెను. 'ఓరీ! అయోధ్యానగరమునకు దశరథుడు మహారాజు, అతనికుమారులు ఇరువురు పురుషసింహములు. వేటనిమిత్తము వనమునకు వచ్చిరి. ఈ భూలోకములో రాక్షసులను నిశ్శేషముగ సంహరించుటకు వారు కంకణముగట్టి వనములను వచ్చినట్లు నాకు దోచును. వారి భుజబలము ప్రాపకము జూచుకొని మునులు నిర్భయముగ వనములో సంచరించుచుండెరి. వారు చూచుటకుమాత్రము బాలురు; కాని, వారు ధనుర్ధరులలో శ్రేష్ఠులు; మహాధీరులు; సకలగుణసంపన్నులు; కాలాంతకులు; అతులితబలవంతులు; అతి ప్రతాపశాలులు! దుష్టజనసంహారకులు. సుర, నర, మునిబృందములకు సుఖము నిచ్చువారు. వా రిరువురిలో నొకడు రాముడు; అతడు సకల శుభసంపన్నుడు. అతనికొకశ్యామ కలదు.

సోరఠా 12

'ఆమె సుకుమారి; చక్కదనాల చుక్క; ఆమెపొత్తు గలవాని జీవనమే ధన్యము' నా యభిప్రాయము.

చౌపాయ్

'ఓరీ రావణా! ఆమెచక్కదనము ముందు నూరుకోట్లరతీదేవులు ఏమి దుమియబడినట్లు కనబడును. ఆమెను నీవు చూచినయెడల, నామెను విడిచి పెట్టవు. అయ్యు రాజబొమ్మను వశము జేసికొనినవాడు,

జీవన్ముక్తుఁడు; మూఁడులోకములు వానికి స్వాధీనములు. నేను నీ చెల్లెలనని తెలిసికొని, రాముని తమ్ముఁడు నా ముక్కుచెవులను ఛేదించెను. ఓ సుకారి! నిరపరాధినియగు నాకే యీపాట్లు వచ్చెనుకదా! అపరాధము చేసినవాని కెట్టి దుర్గతి వచ్చునో తెలియదు. తత్క్షణమున నేను జనస్థానములో నివసించియుండిన ఖరదూషణులవద్దకు వెళ్ళియుంటిని; వారు నా దురవస్థఁ జూచి, పదునాలుగువేల వీరులతోఁ బోరాటమునకు వెడలిరి; శ్రీరాముఁడు వారినొకక్షణములో సంహరించెను' ఖరదూషణాదుల మరణమును రావణుఁడు విని, క్రోధాగ్నిచే మండిపడెను; వాఁడు కడు దుఃఖించి, భయపడి, యొకనిమిషము నొకయుగముగ ముపలె గడపెను.

దోహా

రావణుఁడు స్వబల పరాక్రమములను శూర్పణఖకు బోధించి, దాని నోదార్చి, అంతఃపురములోఁ బ్రవేశించెను; కాని, ఆ రాత్రి వానికిఁ గంటినిండ నిద్ర లేదు; వాని దుఃఖమునకు మితము లేదు.

చౌపాయి

'దేవ, దానవ, యక్షనాగ, గంధర్వులు మొదలగువారు నా యనుచరులయెదుట నిలువఁబడి పోరాడలేరు. ఖరదూషణులు నాతో సమానబలవంతులు; భగవంతుఁడు తప్ప వారిని మఱియొకరు చంపలేరు. దేవతల కానందము నిచ్చుటకును, భూభారమును హరించుటకును, సాక్షాత్ పరమేశ్వరుఁడు నరావతారము గ్రహించి, యవతరించెను. హఠపూర్వకముగ వారితో విరోధించి, వారి బాణములచేఁ గొట్టఁబడి, భవసాగరమును దాటెదను. ఈ తామసశరీరముతో వారిని భజించుట దుష్కరము; త్రికరణశుద్ధిగ నిదియే నా నిశ్చయము. వారు సాధారణ రాజపుత్రులయినయెడల, వారిని సంహరించి, వారి స్త్రీని నపహరించెదను.' ఈ ప్రకారము రావణుఁడు మనస్సులో నిశ్చయించి, పల్లకిలోఁ గూర్చుండి, యొంటరిగ, సముద్రతీరమున మారీచుఁడు నివసించుస్థలమునకు వచ్చెను. గరుడునితో సమానమగు బలముగల ఖచ్చరములు వాని రథమునకుఁ గట్టఁబడెను. కొంతవఱకు వాఁడు రథముపైఁ గూర్చుండి వచ్చెను. (అధికపాఠము.)

ఛాంద్ 20

గరుడునివంటి వేగముగల ఖచరములు రథమునకుఁ గట్టఁబడెను; దానిని వర్ణించుటకు శక్యము కాదు; దానిపై వాఁడు కూర్చుండెను; వానిశిరముపై శ్వేతచ్ఛత్రము శోభించెను. సేవకులు శ్వేతచామరములను వీచుచుండిరి. ఈ ప్రకారము వాఁడు రథముపైఁ గూర్చుండి, మునులమనస్సులను మోహింపఁజేయు కీకారణ్య బ్రహ్మారణ్యములను, నదులను, పర్వతములను, వనములను, ఉపవనములను, ఋష్యాశ్రమములను, నగరములను, గ్రామములను, దాఁటుకొని వచ్చెను.

దోహా 36

కమలాకరములతో నిండిన యనేకసరోవరములలో ననేకజలపక్షులు ధ్వనులఁ జేయుచుండెను; వానిని వాఁడుచూచి, సంతసించి, సముద్రతీరముఁ జేరెను.

చౌపాయ్

ఆ నూరుయోజనముల విస్తీర్ణము గల ప్రదేశమున నతిచక్కని జలజంతువులు దివారాత్రములు కోలాహలముఁ జేయుచుండును. అవి యంతరిక్షమున కెగిరి, మేఘములువలె, గర్జనముఁ జేయును. వాని బలమును వర్ణించుటకు శక్యము కాదు. ఆతీరమున బంగారుయిసుకపై నాజంతువులు కూర్చుండును; ఆప్రదేశమున లతలతోఁగూడిన వృక్షములు కలవు. ఆ ప్రకృతిశోభఁ జూచి, మునీశ్వరులు సహితము మోహించెదరు. ఆ లతాగృహముల శోభను వర్ణించుటకు శారద సిగ్గుపడును. ఆప్రదేశము ఋషులు నివసించుటకు యోగ్యము; అయినను ఋషులు నివసించియుండిరి. రావణుని జూచి, వాఁడు పరమమూర్ఖుఁడని, క్రూరుఁడని తెలిసికొని, మునీశ్వరులు సంకోచించి, భయపడిరి. ఓ పార్వతీ! ఇచ్చట రఘునాథుఁడు చేసిన చిత్రకథను వినుము.

దోహా 37

ఆసమయమున లక్ష్మణమూర్తి కందమూలఫలములఁ దీసికొనివచ్చుటకు వనమునకుఁ బోయెను. అప్పుడా కృపాసముద్రుఁడు మందహాసముఁ జేసి, జానకితో నిట్లు పలికెను.

చౌపాయ్

"ఓ ప్రియసఖి! నీవు మహాపతివ్రతవు; నీ వయోరూపశీలలావణ్యము లలౌకికములు - ఇప్పుడు నేను వినోదార్థము విరహశోకాదులఁ జూపి, సాధారణ మనుజునివలెఁ బ్రవర్తించెదను. నేను రాక్షసులను సంహరించుపఱకు, నీవు అగ్నిలో దాఁగియుండుము". (అగ్నిలోనుంచుటకుఁ గారణ మేమి? అగ్నిదేవుఁడిచ్చినపాయసమువలన, రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు పుట్టిరి; కనుక నతఁడు వారికిఁ దండ్రి. పతివద్దను, లేక భర్తతండ్రివద్దను స్త్రీ యుండవలెను. (2) అగ్నిహోత్రుఁడు సాక్షిగ, తనను రాముఁ డామెను స్వీకరించును. అగ్ని మొదలగు దిక్పాలురను రావణుఁడు శిక్షించెను; అగ్నిలో జానకి దాఁగియుండినగాని, లంకానగరము నగ్ని దహించుట యెట్లు? లంకాపట్టణమును జానకి దహించెను గాని, అగ్నిహోత్రుఁడు కాఁడు.) శ్రీరాముని యాజ్ఞప్రకారము జానకి యతనిచరణములను నమస్కరించి, అగ్నిలో దాఁగియుండెను; రూపలావణ్యములలో నామెతో సమానముగు ప్రతిబింబముమాత్రము రామునివద్ద నిలిచియుండెను. ఈ చమత్కారము లక్ష్మణునకుసహితము తెలియదు. శ్రీవారి కృపవలనను, శ్రీగురువుల కటాక్షమువలనను, తులసీదాసున కీసంగతి వ్యక్తమయ్యెను. పిమ్మట, రావణుఁడు మారీచుని యాశ్రమమునకు వచ్చెను. వాఁడు నీచుఁడైనను, రావణుఁడు స్వార్థపరుఁడుకనుక, వానికి నమస్కరించెను. నీచులు నమ్రులైయుండియు దుఃఖము నిచ్చెదరు. అంకుశము, ధనస్సు, సర్పము, బల్లి—ఈ మొదలగునవి నమ్రులైయుండి, దుఃఖము నిచ్చును. ఓ పార్వతీ! అకాలపుష్పములవలన భయము కలుగునట్లు, దుర్జనులప్రియవాక్యములు భయముఁ బుట్టించును.

దోహా 35

యథావిధిగ మారీచుఁడు రావణుని నాదరించి, సత్కరించెను. "ఓ నాథా! ఏకారణముచేత మీమనస్సు చిన్నబోయి యుండెను? ఒంటరిగ మీరు వచ్చుటకుఁ గారణ మేమి?" అని మారీచుఁ డడిగెను.

చౌపాయ్

దౌర్భాగ్యుఁడగు రావణుఁడు దుఃఖితమానసుఁడై ఖరదూషణాదుల మరణవృత్తాంతము నతనితోఁ జెప్పెను. "ఓయీ మారీచా!

అనేక మాయోపాయములు నీకుఁ దెలియును; నీవొక కపటమృగవేషమును ధరింపుము; నే నారాజకుమారిని నపహరించెదను."

"ఓ నాథా! ఏమి విపరీతము; నామాటను మన్నింపుఁడు; ఆరాజు మనుజమాత్రుఁడా? అతఁడు సాక్షాత్ జగదీశ్వరుఁడు. అతనితో వైరమును విడిచిపెట్టుఁడు. ఇచ్ఛానుసార మతఁడు చంపఁదలంచినఁ జంపఁగలఁడు; బ్రతికింపఁదలచిన బ్రతికింపఁగలఁడు. కేవలము బాల్యావస్థలో నతఁడు విశ్వామిత్రుని యజ్ఞసంరక్షణార్థము వచ్చియుండెను. గురిచూడకయే, యతఁడు నాపై బాణముఁ బ్రయోగించెను. ఒకనిమిషములో నూరుయోజనములదూరమున నేనుపడి, మూర్ఛబడిలేచినను, నాకు శక్తిలేకపోయెను. అతనితో విరోధించుటవలన లాభము లేదు. ఆనాడుమొదలు, భ్రమరకీటన్యాయమువలె, నెటువైపు నేను జూచినను, నాకంటికి రామలక్ష్మణులే కనఁబడుచుందురు. ఓ తండ్రీ! అతఁడు మనుజుఁడయినను, మహాబలవంతుఁడు; శూరుఁడు; అతనితోఁ గలహించుటవలన, నీకు క్షేమము కాదు.

దోహా 39

"అతఁడు తాటకిని, సుబాహువును సంహరించెను; శివునిధనస్సును విఱిచెను. ఖరదూషణాదులను వధించెను. ఇంత బలవంతుఁడు మనుజమాత్రుఁడా?

చౌపాయీ

"రామనామోచ్చారణమువలన నా కింతభయము కలిగెను; 'రా' యక్షరము నుచ్చరించినమాత్రమున నాప్రాణము వెడలిపోవును. నీవంశమును రక్షించుకొనుము; శీఘ్రము గృహమునకుఁ బొమ్ము"— మారీచుని హితోపదేశమును వాఁడువిని, మండిపడి, తిట్టెను. 'ఓరీ మూర్ఖుఁడా! గురువువలె, నాకు బోధించెదవా? లోకములో నాతో సమానుఁడగు వీరుఁడొకఁడు కలఁడేమో చెప్పుము?' వానిమాటలకు మారీచున కనుమానము పుట్టెను. బలవంతులతో విరోధించుటవలనఁ బ్రయోజనము లేదని వాఁడు తలంచెను. 'శస్త్రధారుఁడు, మర్మముఁ దెలిసినవాఁడు, యజమానుఁడు, మూర్ఖుఁడు, ధనికుఁడు, వైద్యుఁడు, భట్రాజు, కవీశ్వరుఁడు, పండితుఁడు—ఈవీరితో వైరము కూడదు.

ఏవిధమునఁ జూచినను, నాకు మరణము నిశ్చయము. నేను శ్రీరాముని శరణుజొచ్చెద. ప్రత్యుత్తరమునిచ్చిన, వీఁడు నన్ను వధించును. అంత కంటె రామబాణమువలనఁ జచ్చుట యుచితము.' ఇట్లు మారీచుఁడు లోపల గుణించుకొని, రావణునితో వెడలెను. రావణుని యాశాభంగమును, శ్రీరామునిపాదముల కభంగముఁ గోరుచు వాఁడు నడచెను. వాఁడు లోలోపుననే సంతోషించుచుండెను కాని, దానిని వ్యక్తముఁ జేయలేదు. 'ఆహా! ఈదినమున శ్రీరాముని దర్శించెదను.

ఛాంద్ 21

'ఈదినము సుదినము; నాకన్నులార శ్రీవారి దివ్యమంగళవిగ్రహముఁ జూచి, సంతోషించెదను. శ్రీ సీతారామలక్ష్మణుల చరణారవిందములఁ జూచి, వానికి నమస్కరించెదను. శ్రీవారితో విరోధించుట ముక్తికి మార్గము. శ్రీవారినిఁ ద్వేషించినవారికి భక్తి కలుగును. ఆ సుఖసాగరుఁడు బాణముఁ బ్రయోగించి, నన్ను నేఁడు సంహరించును; నా జన్మము సఫలమగును; ఇంతకంటె భాగ్యమేదికలదు!

దోహా 40

'ఆహా! ఈదినమున శ్రీవారు ధనుర్బాణములను ధరించి, నావెనుకఁ బరుగెత్తివచ్చెదరు; మాటిమాటికి వెనుకకుఁ దిరిగి వారినిఁ జూచెదను. నావంటి ధన్యుఁడుకలఁడా!'— ఈప్రకారము మారీచుఁడు లోలోపున సంతసించెను.

చౌపాయ్

ఆ మునిపాలకుఁడు, గోపాలుఁడు, శ్రీరాముఁడు, సీతాలక్ష్మణులతోఁ గూడి నివసించువనములో రావణమారీచులు ప్రవేశించిరి. మారీచుఁడు కపటమృగవేషమును ధరించెను. ఆహా! ఏమి చిత్రవిచిత్రమగు రంగులమృగము! దానిచర్మము బంగారము; దానిశరీరమునిండ నవరత్నములు కలవు. దానిచక్కదనముఁ జూడవలెను. వేర్వేరు దాని యవయవములసింగారమును జానకి చూచి భ్రమించెను. 'ఓ నాథా! ఓ కరుణాసముద్రుఁడా! ఇంత చక్కనిమృగముఁ జూడుఁడు? ఏమి దానియొయ్యారము! హే సత్యసాగర! దానినివధించి, దానిచర్మముఁ

దీసికొని రండు' అని సీత ప్రార్థించెను. ఆజంతువు కపటమృగమని రాముఁడు గ్రహించినను, వినోదార్థము దేవకార్యమును సాధించుటకు నత్యుత్సాహముతో దిగ్గునలేచి, నడుముఁగట్టుకొని, ధనువు నెక్కుఁబెట్టి బాణమును సంధించెను. 'ఓ తమ్ముఁడా! ఈవనములో రాక్షసులు సంచరించుచుందురు. సమయోచితముగ నీబుద్ధిబలమును దేహబలమును నుపయోగించి, నీవు జాగరూకుఁడవై జానకిని గాపాడుము'.

దోహా 41

ఈప్రకారము శ్రీరాముఁడు తమ్మునకు బోధించి, యా కపట మృగమువద్దకు వెళ్లెను. దేవతలకు హర్షవిషాదములు కలిగెను. స్వాతి కార్తెలో వర్షించునో లేదోయని చాతకములు భయపడినట్లు వారు భయపడిరి.

చౌపాయీ

ఆమృగము శ్రీరాముని జూచి, పరుగెత్తెను; శ్రీరాముఁడు ధనుర్బాణములను ధరించి, దాని వెనుకఁబడెను. వేదములు 'నేతి, నేతి' (న+ఇతి-న+ఇతి)యని చెప్పుచుండిన మహాపురుషుఁడు, ఏ పరమేశ్వరుని లోఁతును తుదముట్ట శివుఁడుసహితము కనుఁగొన లేకపోయెనో, అట్టి జగద్రక్షుఁడా మాయామృగము వెంటఁ బడెను. ఒకసమయమున నా మృగము సమీపించును; మఱియొకసమయమున దూరముగఁ బోవును; ఒకప్పుడు దృశ్యమగును. ఒకప్పు డదృశ్యమగును. ఈప్రకార మా మృగము చమత్కారముఁ జేసి, శ్రీరాముని దూరముగఁ దీసికొని పోయెను. అమోఘాస్త్రము నతఁడు ప్రయోగించి, దానిని సంహరించెను. 'హా లక్ష్మణా' యనుచు మృగము నేలఁబడి ప్రాణములను విడిచి పెట్టెను. ప్రాణప్రయాణసమయమున వాఁడు నిజరూపమును దాల్చి, శ్రీరాముని స్మరించినందున, నతఁడు వానినిఁ గటాక్షించి, మునీశ్వరులకు దుర్లభమగు సద్గతిని వానికిచ్చెను.

దోహా 42

దేవతలు పుష్పములను వర్షించి, శ్రీరాముని స్తుతించిరి. ఆ దీనబంధువు ఘోరరాక్షసునకు సహితము సాకేతలోకము నిచ్చెను. (ఆ మృగముయొక్క నూపురము పడినస్థలము 'నూపుర' గ్రామ మయ్యెను;

అది చపలత్వముగ సంచరించిన ప్రదేశము 'చాపల్య' గ్రామ మయ్యెను. ఈ రెండు గ్రామములు గోదావరీతీరమునఁ గలవు.)

చౌపాయ్

ఆ రాక్షసుని శ్రీరాముఁడు వధించి, తిరుగుముఖ మయ్యెను. అతని నడుమునఁ దూణీరములును, చేతిలో ధనుర్బాణములును శోభించెను. ప్రాణావసానకాలమున 'హా లక్ష్మణా' యని మారీచుఁడు పలికినమాటను జానకి విని, భయపడి, దుఃఖించి, లక్ష్మణునితో నిట్లనియె:- 'ఓయీ! మీ యన్నగారికి విపత్తువచ్చినట్లు కనఁబడును. వారి రక్షణార్థము నీవు శీఘ్రము వెడలుము.' ఆమెమాటలకు లక్ష్మణుఁడు నవ్వి, 'ఓ తల్లీ! నానాథుని భ్రూవిలాసమువలన, లోకములు నశించును. అతనికి స్వప్నమందయినను సంకటము వచ్చునా? మిమ్ముల నొక మహానిధివలె, వారు నా కప్పగించిరి. మిమ్ములను విడిచిపెట్టుటవలన, నాకు సంతోషము కలుగదు. ఓ మాతా! ఈసంగతి విచారించి, నామాటలను మన్నింపుడు. మిమ్ములను విడిచి యేల వచ్చితిని అని వారు నన్నడిగిన యెడల, నే నేమిచెప్పఁగలను?' అని విన్నవించెను. ఆమె కర్ణకఠోరమగువచనములఁ బలికెను. 'ఓయీ! నీవు శ్రీవారి క్షేమముఁ గోరినవాఁడవు కావు.' ఆమెమాటల నతఁడు లక్ష్యము జేయకపోవును; కాని, హరిప్రేరణవలన, నతనిమనస్సు తొందఱపడెను. అతఁడామెను నలువైపుల నాల్గు గీట్లువ్రాసి, యభిమంత్రించి, ఆమెను వనదేవతలకును, దిగ్దేవతలకు నప్పగించి వెడలెను. చంద్రుని రాహువువలె, రావణుని శ్రీరాముఁడు కబళించును; అట్టి శ్రీరామునిసన్నిధానమునకు లక్ష్మణుఁడు వెడలెను. అతఁడు జానకికి నమస్కరించి, గోవు పిల్లనువలె, వెనుకకుఁ దిరిగితిరిగిచూచుచు వెళ్లెను.

దోహా 43

రెండువిధముల నతనికి భయముకలిగెను; రాముని కోపమునకును, జానకి యేకాకిత్వమునకు నతఁడు భయపడెను. ఎండవేఁడిమికి లత వాడిపోవువిధమున, నతఁడు భయముచేత వాడిపోయెను.

చౌపాయ్

సీత యొంటరిగనుండుటఁ జూచి, రావణుఁడు మాయసన్యాసి రూపమును ధరించి, వచ్చెను. ఎవనిపేరు చెప్పనమాత్రమున సురాసు

రులు భయపడి, రాత్రి నిద్రింపరో, పగలు సుఖముగ నన్నముభుజింపరో, అట్టి రావణుఁడు, పదార్థములను దొంగిలించుటకువచ్చిన కుక్కవలె, నలువైపులఁ జూచి, యాశ్రమమునకు వచ్చెను. ఓ గరుడజీ! దుర్మార్గమున సంచరించుపురుషులకు బుద్ధిబలమును, దేహబలమును నశించును. అనేక చమత్కారములఁ బన్ని, వాఁ డాశ్రమమునకు వచ్చి, సీతంజూచి, భిక్ష నడిగెను. అతిథివచ్చెనని జానకి తెలిసికొని, కందమూలఫలములఁ దీసికొని వచ్చెను. వాఁడు మఱియొకచమత్కారముఁ జూపించెను. 'ఓ త్రిలోకసుందరి! ఈ రేఖలమధ్యనుండి నీవు భిక్షనిచ్చిన, నేను పుచ్చుకొనను.' అని వాఁడు చెప్పెను. విధికృతము విపరీతముగ నుండెను; కాలధర్మములు వ్యత్యాసములు పడెను. జానకి హద్దుదాఁటి వచ్చెను. హద్దు దాఁటినయెడల, నేమి సంభవించునో కదా!

దోహా 44

"విశ్వభరని అఘదల పాలని
కరని సకల సురరాజ,
జానా నహి తేహి సమయ తహ
దశశిర కపట కుసాజ"

ఆ జగజ్జనని, ఆ విశ్వంభరణి, పాపారణ్యములను ఛేదించుటకు, గుఠారమువంటి జానకి, దేవకార్యములను సాధించుటకు, రావణునిచమత్కారముఁ దెలిసితెలియనట్లు నటించెను.

చౌపాయ్

నయమునను భయమునను వాఁ డనేకవిధముల నామెను బోధించెను. 'ఓయీ! మీరు సన్యాసులు; ఈ దుర్వచనములఁ బలుకుట యుచితమా?' అని యామె మందలించెను. అంత వాఁడు నిజరూపముఁ జూపించెను; తనపేరుఁ జెప్పుకొనెను. అంతలో నామెను భయముపుట్టెను; కాని, ఆమె ధైర్యము నవలంబించి, 'ఓరీ దుష్టుఁడా! నిలువుము; నిలువుము. అదిగో శ్రీవారు వచ్చుచున్నారు. కాలవశమున స్త్రీసింహమును జెవులపిల్లి కోరినవిధముగ, నీవు నన్నాశించుచుంటివి. నీవు రాక్షసులకు రాజువు; దుర్మార్గుఁడవు; కాకికిని గరుత్మంతునకును, నదికిని సముద్రునకు నెంతయంతరువు కలదు? గార్దభము కామధేను

వుతో సమానమగునా! ఓరీ జ్ఞానహీనుఁడా! క్షేమముగ నీ గృహమునకుఁ బొమ్ము' ఈప్రకారము జానకి చెప్పినమాటలను రావణుఁడు విని, 'ఆహా! ఈమె జగజ్జనని. అందుచేత నింతనిశ్చయముగ ప్రసంగించెను. నారూపముఁ జూపించినను, దేవేరి భయపడలేదు' అని చింతించి, లోలోపల నామె చరణారవిందములను నమస్కరించి, సంతోషించెను.

దోహా 45

అంత రావణుఁడు కోపించి, జానకిని రథముపైఁ గూర్చుండఁబెట్టుకొని, అతియాతురతతో నాకాశమార్గమున వెడలెను. వాఁడు భయముచేఁ గంపించుచుండెను; అందుచేత, వానికి రథముఁదోలుటకు శక్తిలేక పోయెను. జానకి యెలుఁగెత్తి విలపించెను.

చౌపాయ్

"హా! జగదేకవీర రఘురాయా
కేహి అపరాధ విసారేహు దాయా,
ఆరత హరణ శరణ సుఖదాయక
హా రఘుకుల సరోజ దిననాయక.

'హా! నాథా! దుఃఖములోఁ బడియుంటిని; హే జగదేకవీరా! నే నేమియపరాధముఁ జేసియుంటిని? నన్ను విడనాడుట న్యాయమా! నామీఁద దయతప్పుట యుచితమా? ఓ ఆర్తత్రాణపరాయణా! ఓ శరణాగతవత్సలా! హే రఘుకుల కమలబాంధవా! రక్ష-రక్ష. ఓ లక్ష్మణా! నీవు నిరపరాధివి; నిష్కారణము కోపముతో నిన్ను దూషించినందులకుఁ దగిన ఫలము లభించెను. కైకేయిమనస్సులోనుండిన దుఃఖమంతయు నేఁడు తీరెను; విధికృతమువలన, నామెదుఃఖము నాకు వచ్చెను." ఈప్రకారము జానకి విలపించెను. పంచవటీతీరముననుండిన వనచరములు దుఃఖించెను. అనేకవిధముల నామె రోదనముఁ జేయుచుండెను. 'నానాథుఁడు కృపాసముద్రుఁడు; నానాథునకు నామీఁద దయకలదు. ఈ దుష్టుని సంహరింపఁగలరు. ఆమృగము వెనుకఁబడి, వా రెంతదూరము వెళ్ళియుండిరో తెలియదుకదా! నే నేమిచేయఁగలను! నావిపత్తి నానాథునకుఁ జెప్పువా రెవరు? దేవతలు పుచ్చుకొనఁదగిన పురోడాశమును శునకము దొంగిలించెను కదా!' ఆమె దీనాలాప

ములను విని, చరాచరజంతుజాలములు విలపించెను. "నా వినాశము నను నేనామెను దీసికొని పోవుచుంటిని" అని వాఁడు తలంచి, యామె రోదనమును లక్ష్యముఁ జేయలేదు.

దోహా 46

ఆకాశమార్గమున వారు రథముపై వెళ్ళుచుండిరి; జానకి యెలుఁగెత్తి యేడ్చుచుండెను. బ్రహ్మామహేశ్వరుల వరప్రభావమువలన, వాఁడు నిర్భయముగ విహరించెను.

చౌపాయ్

గృధ్రరాజు జానకివిలాపమును విని, యామెను గుర్తుపట్టెను. నతఁడు పూర్వము చూచియుండెను; కనుక, నామె శ్రీరామునిభార్య యని తెలిసికొని, యామెరోదనమునకుఁ గారణమేమని చింతించెను. కపిలగోవును మ్లేచ్ఛుఁడువలె, నామెను వాఁడు తీసికొనిపోవుచుండెను. "ఆహా! ఏమి యామెదుఃఖము? పూర్వమువలె, నాకు బలము లేదు; అయినను, వానిని నేనుచూచి వానితోఁబోరాడి, జానకిని విడిపించెదను" అని జటాయువు నిశ్చయించి, "ఓ సీతమ్మా! భయపడకుము; నేను వీనిని సంహరించెదను" అని యామెకు ధైర్యముఁ జెప్పెను. పర్వతముపైఁ బిడుగువలె, నా జటాయువు రావణునిపైఁ బడెను. "ఓరీ దుష్టుఁడా! తాళుతాళుము; ఇంతనిర్భయముగ నెట్లు పోఁదలఁచితివి? నేను లక్ష్యములేదా?" అని జటాయువు వానిని ధిక్కరించి, కాలునివలె నెదుర్కొనెను. అతనిని వాఁడు తిరిగిచూచి యనుమానించెను.

"ఈ వచ్చెడివా రెవరు! మైనాకుఁడా? గరుత్మంతుఁడా? లేక గరుడవాహనుఁడా? వీరికిమాత్రము నా భుజప్రతాపము తెలియును." అని రావణుఁడు చింతించుచుండినంతలో, గృధ్రరాజు సమీపమునకు వచ్చెను. "ఓహో వీఁడు జటాయువు; వయోవృద్ధు; వీఁడు తప్పక నా భుజబలములోఁ బ్రాణములను విడిచిపెట్టును." అని వాఁడు నిశ్చయించెను.

దోహా 47

"వీనికి నా బలపరాక్రమములు తెలియవు; ఆ తపస్వాలులసహాయము నిమిత్తము నామీఁదికి వచ్చుచుండెను. వాఁడు యుద్ధముఁ

జేసినయెడల, నిశ్చయముగ వానిని సంహరించెదను. ఒకవేళ వాఁడు జయించినను, నాగృహమునకు రాఁజాలఁడు." ఈ ప్రకారము వాఁడు గుణించుకొనెను.

చౌపాయ్

ఇంతలో జటాయువు రౌద్రాకారుఁడై, వానిని సమీపించెను. "ఓరీ రావణా! నామాటను వినుము; జానకినివిడిచి, క్షేమముగ నీ గృహమునకుఁ బొమ్ము. లేనియెడల నీ కీపాట్లు వచ్చును. అగ్నిలోఁబడి శలభములువలె, నీవును నీ వంశమువారును శ్రీరాముని క్రోధాగ్నిలోఁ బడి నశించెదరు." అని జటాయువు బోధించెను. రావణుని పొగరుఁ బోతుదనమునకు హద్దులేదు; అతనిమాటలకు వాఁడు జవాబుచెప్పక, వానిమార్గమునఁ బోవుచుండెను. జటాయువు కోపించి, వానిని యెదుర్కొనెను. అతఁడు వానికిరీటములఁ దన్ని, వానిశిరోజముల నూడఁ బెఱికి, వానినిఁ బడఁద్రోసెను ; రథమునుండి సీతం దీసికొనివచ్చి, యొకచెట్టునీడను కూర్చుండఁబెట్టెను. పునః అతఁడు వానింజంపుటకు వానిమీఁదికి వెళ్లెను. దశకంఠుఁడు లేచి, ధనుస్సు నెక్కుపెట్టి, బాణమును సంధించెను. ఆ ధనుర్బాణములను జటాయువు ఖండించి, ముక్కుతో వానిశరీరముఁ బొడిచెను. వానిశరీరమునుండి రక్తము ప్రవహించెను; వాఁడు ఘడియవఱకు మూర్ఛపడెను.

దోహా 48

సురాసురులను, మునులను, సిద్ధులను జయించి, రావణుఁడు స్వాధీనముఁ జేసికొనెను. అట్టివానిని యెదిరించిన జటాయు వెంత వాఁడు? అతఁడు బలవంతుఁడు; శూరుఁడు.

చౌపాయ్

వాఁడు సావధానుఁడై తెలివిఁదెచ్చుకొని లేచెను. పునః వానిని జటాయువు తన్నెను; అతనియెదుట వాఁడు నిలువలేకపోయెను. కొంతవఱకు వా రుభయులు పోరాడిరి; కాని, జటాయువు వృద్ధు; అందుచేత, నిలిచిపోరాడుటకు శక్తిలేక పోయెను. అప్పుడు రావణుఁడు కోపించి, చంద్రాయుధముఁ దీసి, యతనిరెక్కలను ఖండించెను. అప్పుడు జటాయువు 'రామ, రామ' అనుచు నేలఁ బడెను. అనేకవిధముల

నతఁడు శక్తికొలఁది పోరాడెను; కాని, యతనిప్రయత్నములు వ్యర్థమయ్యెను; "స్వామికార్యములో నా ప్రాణములను విడుచుచున్నాను. నాజన్మము సఫలమయ్యెను" అని జటాయువు సంతోషించెను. పిమ్మట, రావణుఁడు సీతను రథముపైఁ గూర్చుండఁబెట్టుకొని, శీఘ్రముగ వెడలెను. ఒకానొకప్పుడు వెనుకనుండి యెవరైనను వచ్చి, జానకిని విడిపించుకొని పోఁగలరేమో యని, వాఁడు జిజ్ఞాసపడి, వేగమువేగముగ, మనోవేగముగ బోవుచుండెను. వేఁటకానిచేతిలోఁ జిక్కినమృగమువలె, నామె యంతరిక్షమునఁ బోవుచు విలపించుచుండెను. ఋష్యమూకపర్వతముపైఁ గూర్చుండియుండిన సుగ్రీవాదుల నామెచూచి, 'హరి, హరి' యని పలికి, బట్టమూటను జాఱవిడిచెను.

ఈప్రకారము వాఁడు సీత నపహరించి, లంకలోఁ బ్రవేశించి, అశోకవనములో నశోకవృక్షముక్రింద నామెను గూర్చుండఁబెట్టెను. (హరినామము నామె యుచ్చరించుటకుఁ గారణమేమి? హరి- కోఁతి, వారిని సహాయార్థము జానకి పిలిచెను. అథవా, హరి = విష్ణువు; నేను శ్రీరామునిభార్యను. మీ రీగుఱుతును శ్రీరామునకుఁ జూపించి, నాదురవస్థఁ జెప్పుడు. ఆమెను రావణుఁడు స్వగృహములోనికి యెందుచేతఁ దీసికొనివెళ్లలేదు? "కామోద్రేకముచేత నామె రామునిచక్కఁదనముఁ దలంచి విచారించును; ఈ యశోకవనసంపదఁ జూచినందున, నామెకు మోహము బలమగును; అప్పుడామె నన్ను మోహించును" అని వాఁడు నిశ్చయించెను. కాదేని, "ఓరీ రావణా! బలవంతముగ, నీవు పరస్త్రీసంభోగముఁ జేసినయెడల, నాక్షణము నీశిరస్సు బ్రద్దలగును" అని కుబేరునికుమారుఁడు వానిని శపించెను. ఇంత చక్కనిస్త్రీని గృహములో నుంచుకొనినయెడల, నామె ప్రతిక్షణము వానికంటఁబడుచుండు; వానిచిత్తము భ్రమించినయెడల, వానికి మృత్యువు సమీపించును. ఈభయముచేత, నామెను గృహములోఁ బ్రవేశపెట్టలేదు.)

దోహా 49

అనేకప్రకారముల, నయమునను భయమునను, వాఁడు జానకిని బోధించెను; కాని, వానిమాటల నామె నిరాకరించెను. అశోకవనములో నామెను వాఁడు బలవంతముగ విడిచిపెట్టెను.

చౌపాయ్

ఈసమాచారమును బ్రహ్మ తెలిసికొని, దేవేంద్రునిఁ బిలిచి, యతనితో నిట్లు పలికెను. "ఓ ఇంద్రుఁడా! రావణునకుఁ దెలియకుండ, నీవు రహస్యముగ జానకివద్దకుఁ బొమ్ము. ఈ క్షీరాన్నము నామె కందఁ జేయుము. దీనిని భక్షించినయెడల, క్షుత్పిపాసలు పదివేలసంవత్సరములవఱకుఁ గల్గవని యామెతోఁ జెప్పుము." ఇట్లు బ్రహ్మదేవుని యాజ్ఞాప్రకారము దేవేంద్రుఁడు క్షీరాన్నముఁ బట్టుకొని, శ్రీనాథుని స్మరించుచు, రాత్రిసమయమున లంకలోఁ బ్రవేశించెను; అతఁడు దేవమాయను బ్రసరింపఁజేసినందున, నచ్చటి రక్షకులందఱు నిద్రించిరి. అతఁడు భయపడుచు, జానకిని సమీపించెను. ఆమె కతఁడు నమస్కరించి, తనపేరుఁ జెప్పుకొనెను. అతఁడు నిశ్చయముగ దేవేంద్రుఁడని జానకి తెలిసికొని, యతనిని తండ్రితోను మామతోను సమానముగ భావించి, యాదరించి సత్కరించెను. ఇంద్రుఁడు జానకిని బోధించి, యామెచేతిలో క్షీరాన్నముఁ బెట్టెను. ఆమె భక్షించినతరువాత, నతఁడు స్వర్గలోకమునకు వెళ్లెను.

దోహా 50

ఎంత చక్కనిరూపముతో శ్రీరాముఁడు కపటమృగమువెనుక వెళ్లెనో, అంత చక్కనిరూపమును జానకి మనస్సులోనుంచుకొని, శ్రీరాముని ధ్యానించుచు నశోకవృక్షముక్రిందఁ గూర్చుండెను.

---

# పంచమవిశ్రామము.

చౌపాయ్

ఎదురుగవచ్చుచుండిన లక్ష్మణుని శ్రీరాముఁడు చూచి, చింతాక్రాంతుఁడయ్యెను. "ఓయీ తమ్ముఁడా! నామాటను నిరాకరించి, యొంటరిగ జానకినివిడిచి, యేల వచ్చితివి? వనములో ననేకరాక్షసులు

సంచరించుచుందురు కదా! ఆశ్రమములో జానకియుండదని నా కను మానము కలుగుచున్నది. ఓ తమ్ముడా! నీవు చేసినపని బాగుగలేదు. జానకిలేక, నాప్రాణములు నిలిచియుండవు; వనమునకు వచ్చి, జానకిం బోగొట్టుకొనుటకంటె, నిక తిరిగియొకటలేదు." లక్ష్మణమూర్తి చేతులను జోడించుకొని, జానకిపలికిన దుర్వచనములను విన్నవించి, "ఓ నాథా! నేను నిరపరాధిని. క్షమింపుడు." అని ప్రార్థించెను. గోదావరీతీరమున నుండినస్వాశ్రమమునకు వారిద్దరు కలసివచ్చిరి. జానకిశూన్యముగ నుండిన యాశ్రమమును శ్రీరాముడు చూచి, సాధారణమనుజుని వలె వ్యాకులపడెను.

దోహా 51

ఆ దండకారణ్యమొక సరోవరము; శ్రీసీతారాములు స్త్రీపురుష చక్రవాకములు; రాత్రిసమయమున వానికి వియోగము; అటుల రావణునివలన వారికి వియోగము కలిగెను.

చౌపాయి

ఆ పరులదుఃఖము నపహరించుమహాత్ముడు, లేశమైన దుఃఖము నెఱుంగని మహనీయుడు, భార్యావియోగమునకు సాధారణ మనుజునివలె, దుఃఖపడి విలపించెను. "ఓ జానకీ! ఓ సీతా! రూపశీలలావణ్యములలో నీతో సమానులు లేరు. సకలగుణరాశివి; ఎంత కలుపుగోలుతనము గలదానవు; పతివ్రతాశిరోమణివి. ఎచ్చట నీవు దాగియుంటివి?"

(హనుమన్నాటకము:—

శ్లో. రేవృక్షాః పర్వతస్థాగిరిగహనలతా వాయునా వీజ్యమానాః
రామోహం వ్యాకులాత్మా దశరథతనయః శోకశుక్రేణదగ్ధః,
బింబోష్ఠీ చారునేత్రీ సువిపులజఘనా బద్ధనాగేంద్రకాంచీ
హా సీతా! కేననీతా మమహృదయగతా కోభవాన్ కేనదృష్టా.

శ్లో. కే యూయం వదనాథనాథకిమిదం దాసోస్మి తే లక్ష్మణః
కోఽహంవత్స స ఆర్యఏవ భగవా నార్యః సకో రాఘవః,
కింకుర్మో విజనేవనే తత ఇతో దేవీం సముద్వీక్ష్యతే
కా దేవీ జనకాధిరాజతనయా హా! హా! ప్రియే జానకీ.)

ఇట్లు విలపించుచుండిన రాముని యనేకవిధముల లక్ష్మణుడు బోధించెను; విరహదుఃఖముచే నతఁడు లతలను వృక్షముల నడుగుచు వెడలెను. జానకియంగముల నతఁడు స్మరించి, వానిని ఖగమృగములతో సరిపోల్చి, వానిని యడుగుచుండెను. "ఓ ఖగమృగభ్రమరములారా! ఆమృగనయని, జానకిని మీరు చూచియుంటిరా?

"ఖంజన శుక కపోత మృగ మీనా
మధుప నికర కోకిలా ప్రవీనా,
కుందకలీ దాడిమ దామినీ
శరద కమల శశి అహి భామినీ.

"ఖంజనము, లేడి, మీనము—ఈ మూఁడు నేత్రముల కుపమానము; శుకము(చిలుక)—ముక్కు; కపోతము—కంఠము; మధుపము—శిరోజములు; కోకిల—స్వరము; మల్లి, చమ్మెలిమొగ్గలు, దాడిమగింజలు—దంతములు; మెఱుపు—వాని కాంతి; శరత్కాలకమలము—ముఖము; శరత్కాలచంద్రబింబము—ముఖమండలము; శరత్కాల నాఁగుఁబాము—జడ.

"వరుణ పాస మనోజ ధను హంసా
గజ కేహరి నిజ సునత ప్రశంసా,
శ్రీఫల కనక కదలి హర్షాహీం
నేకు న శంకు సకుచ మన మాహీం.

"వరుణపాశములు—కంఠరేఖలు; మన్మథునిధనస్సు—కనుబొమలు; హంసగతి (నీరును పాలును విభజించు శక్తి)—సత్యాసత్యవివేకము; ఏనుఁగు—గమనము; సింహము—నడుము; శ్రీఫలము—ఉరోజములు; కనకకదలీ—జంఘములు—ఇవియన్నియు నేటివఱకు జానకియంగముల శోభఁజూచి, సిగ్గుపడియుండెను; కాని, నేఁడు జానకి గుప్తమగుటవలన నవి సంతోషించెను; నేఁడు వానిమనస్సులలో సంకోచముకాని శంకగాని లేదు. (ఇంతవఱకు తులసీదాసు శ్రీమహారాణీవారి శృంగారమును వర్ణించియుండలేదు; ఇప్పుడు శ్రీవారి శ్రీముఖముచే వానిని వర్ణించెను; ఇప్పుడయిన నుపమానములఁ జెప్పెను; కాని, యుపమేయములఁ జెప్పలేదు.) ఓ జానకి! నా మాట

వినుము. నీవు మఱుఁగుపడి యుండినందున, నీ ఖగమృగములన్నియు మహారాజ్యాధిపత్యము వచ్చినట్లు సంతోషించుచున్నవి. ఓ ప్రియసఖీ! నీ శత్రువులవిజృంభణ నీవెట్లు సహింపఁగలవు? కనుక, శీఘ్రముగ నీవు ప్రత్యక్షము కావలెను; ఎందుకు విలంబము!" ఈప్రకారము శ్రీరాముఁడు విలపించి, జానకిని వెదకుచుండెను. కాముకుని వలె, రాముఁడు విరహశోకమును జూపించెను.

దోహా 52

మాణిక్యమును బోఁగొట్టుకొనిన సర్పమువలె, జలములను విడిచిపెట్టిన మత్స్యమువలె, శ్రీరాముఁడు దుఃఖించెను; అతని దుఃఖము జూచి, లక్ష్మణుఁడు దీర్ఘశ్వాసము విడిచెను.

చౌపాయీ

లక్ష్మణుఁడు ధైర్యము నవలంబించి, శ్రీరాముని నోదార్చెను; కాని, యతనిదుఃఖము పొర్లిపొర్లి వచ్చుచుండెను. ఆహా! ఆ సకలసుఖరాశి, ఆ యవినాశి, ఆ సంపూర్ణకాముఁడు, ఆ శ్రీరాముఁడు, సాధారణ మనుజునివలె నటించెను. సరోవరములు, నదులు, పర్వతగుహలు- ఈ మొదలగుస్థలములలో వారు జానకిని వెదకిరి; కాని, యచ్చట జానకి లేదు; వారి దుఃఖమున కంతము లేదు; ఇట్లు వారు ముందునకు నడచివచ్చిరి; అంతలో, విఱిగిపడియుండిన ధనుర్బాణములు వారికి గోచరమయ్యెను. "ఓ లక్ష్మణా! ఇచ్చట నెవరో యుద్ధముఁజేసి యుండిరి" అని శ్రీరాముఁడు పలికెను. శ్రీరాముని చరణకమలములను ధ్యానించుచు, నేలఁబడియుండిన గృధ్రరాజును వారు చూచిరి.

దోహా 53

శ్రీరాముఁడు తన కమలహస్తమును జటాయువు శిరస్సుపై నుంచెను; అంతలో, నతని శ్రమయంతయు నివారణమయ్యెను. జటాయువున కెట్టిపశి వచ్చెను!

స్వైయా 1, 2.

గృధ్రరాజు, దీనమలీనుఁడై పడియుండెను; అతనియంగములను వికలత్వము వచ్చెను; అతనిదుఃఖమునకు మితము లేదు; అతని దురవస్థఁ జూచి, శ్రీరాముఁడు జాలిఁబడెను. అతనిని శ్రీరాముఁడు

లేవనెత్తి, తొడలపైఁ గూర్చుండఁబెట్టుకొని, ఱెక్కలను దువ్వి, వానిపై నుండినధూళిని తనజడలతో దులిపి, కన్నీరుఁ గార్చెను. ఆహా! ఆ కరుణాసముద్రుని కన్నీరు జటాయువుశరీరముఁ దడిపెను. ఆ పక్షిరాజువాత్సల్యము నతఁడు మెచ్చుకొని విచారించెను; ఆ సమయమున నతఁడు జానకీవియోగమును మఱచెను. "ఓ పక్షిరాజా! నన్ను విడచి, యెచ్చటికిఁ బోయియుంటివి!" అని శ్రీరాముఁడు పలికి, కన్నీరుఁ గార్చెను.

చౌపాయ్

అప్పుడు జటాయువు ధైర్యము నవలంబించి, యతనితో నిట్లు చెప్పెను:—"ఓ నాథా! నీవు సంసారులదుఃఖములఁ బోఁగొట్టఁ గలవు. ఆ దుర్మార్గుఁడగు రావణునివలన, నాకీ దుర్దశ వచ్చెను; వాఁడే, జానకిని నపహరించెను. వాఁడు జానకిని వెంటఁదీసికొని, దక్షిణదిశను బోయెను; కురరిపక్షివలె, జానకి యెలుఁగెత్తి యేడ్చుచుండెను; నిన్ను దర్శించుట కింతవఱకు నాప్రాణముల నిలువఁబెట్టుకొని యుంటిని; ఇఁక నాప్రాణములను విడిచిపెట్టుచున్నాను." "ఓ పక్షిరాజా! నీవు బ్రతికియుండుము." అని శ్రీరాముఁడు పలికినపలుకులను జటాయువు విని,చిఱునవ్వు నవ్వి, "ఓ నాథా! అంత్యకాలమున, నీనామము నుచ్చరించినందున, నధమాధముఁడు సహితము ముక్తిఁబొందునని వేదములు ఘోషించుచుండును. అట్టి పరబ్రహ్మస్వరూపుఁడవగు నీవు నాయెదుట నిలిచియుంటివి; 'మిమ్ముఁ జూడఁగంటి మీకృపఁ గనుగొంటి, యఖిలసౌఖ్యపదవు లందఁగంటి.' ఇఁక నేల నేను దేహమును ధరించియుండవలెను!" అని విన్నవించెను. "ఓ పక్షిరాజా! నీ సత్కర్మలవలన నీకు సద్గతివచ్చెను; నా సహాయ మేమియు లేదు. ఓ పక్షిరాజా! పరోపకారబుద్ధికల మనుజునకు లోకములో దుర్లభములు లేవు.(పరోపకారాయ సతాం విభూతయః.) ఓ తండ్రీ! నీవు శరీరమును విడిచి, నాలోకమునకుఁ బొమ్ము. అవశిష్టములు నీకు లేవు; నీవు సంపూర్ణకాముఁడవు; కనుక, నీకు నేనేమి యొసంగఁగలను!

దోహా 54

"ఓ తండ్రీ! ఆలోకములో నాజనకుని నీవు చూడఁగలవు; వారితో మాత్రము జానకీవియోగను సంగతి విన్నవింపవలదు. వారీ

వర్తమానమును వినినయెడల, దుఃఖించెదరు; అందుచేత మీరు చెప్ప వలదు; రావణుని మరణమునువిని, వారు సంతోషింపఁగలరు. ("ఓరీ రావణా! నీవును నీకులమును శ్రీవారికోపాగ్నిచే దహింపఁబడఁగ లరు." అని జటాయువు కోపించి, శపించెను. ఆశాపమును బరిపాలిం చుటకు శ్రీరాముఁడు, "నేనే రాముఁడనయినయెడల, రావణుని పుత్ర మిత్రవర్గముతోఁగూడ సంహరించెదను" అని ప్రతిజ్ఞఁ జేసియుండెను.)

చౌపాయ్

జటాయువు ప్రాణములను విడిచి, హరిసారూప్యముఁ బొంది, చతుర్భుజుఁడై, పీతాంబరధారియై, దివ్యాలంకారములను ధరించి, శ్రీరామునకుఁ బ్రత్యక్ష మయ్యెను. సారూప్యముఁబొందిన జటాయువు నేత్రములవెంబడి, ఆనందబాష్పములు వఱదవలె ప్రవహించెను. ఈప్ర కారముగ మతఁడు శ్రీరాముని స్తుతించెను:—

ఛాంద్ 22, 23, 24, 25.

"జయ రామ రూప అనూప నిర్గుణ సగుణ గుణ ప్రేరక సహీ
దశశీశ బాహు ప్రచండ ఖండన చండ శరమండన మహీ
పాథోద గాత సరోజ ముఖ రాజీవ ఆయత లోచనమ్
నిత నౌమి రామ కృపాలు బాహు విశాల భవ భయ మోచనమ్.

ఓ రామ! నిరుపమానమగు నీరూపమునకు జయమగుఁ గాక! నీ రూపమెట్టిది? నిర్గుణబ్రహ్మము, సర్వవ్యాపకము; నీసగుణరూపము త్రిగుణాత్మకమైన బ్రహ్మ విష్ణు మహేశ్వరరూపములను ధరించి, సృష్టి స్థితిసంహారములఁ జేయుచు, మత్స్యాదిరూపములతో నవతరించును. నీవు ప్రేరేపించువాఁడవు (చైతన్యస్వరూపుఁడవు (That is you are the vivifying force) సకల భూమండలమునకు భూషణము నీవు; దుష్టదుర్గమగు రావణుని సంహరించుటకు ధనుర్బాణములను ధరించితివి; నీశరీరము నీలమేఘముతో సమానము; నీనేత్రములు వికసించిన కమల ములు. ఓరామ! నీవు కృపాళుఁడవు; సంసారసంకటములు నీమూ లమున నశించును; ఓ నాథా! నీ విశాలమగు బాహువులకు నమ స్కారము.

"బల మప్రమేయ మనాది మజమవ్యక్తమేకమగోచరమ్,
గోవింద గోపద ద్వంద్వ హార విజ్ఞాన ఘనధరణీ ధరమ్,
జే రామ మంత్ర జపంత సంత అనంత జనమనరంజనమ్,
నిత నౌమి రామ అకామప్రియ కామాది ఖలదల గంజనమ్.

"ఓ నాథా! నీబల మప్రమేయము; అనాదిబ్రహ్మవు; అజన్ముఁడవు; అప్రకటితశక్తివి; అద్వైతుఁడవు; ఇంద్రియ వ్యాపారములకుఁ బరుఁడవు; ఇంద్రియవిషయములకు భోక్తవు; శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగుద్వంద్వములు నీకటాక్షమువలన నశించును; నీవలన విజ్ఞానము కలుగును; నీవే, భూమిని యుద్ధరింపఁగలవు; అనంతము సత్పురుషులు నీ మంత్రరాజమును జపించెదరు; వారికి నీవు ప్రసన్నుఁడవై, వరముల నిచ్చెదవు; నీ నిర్హేతుకజాయమానకటాక్షమువలనఁ గామాదిదుష్టులు నశించెదరు. ఓ రామా! నిత్యము నీకు నమస్కారము.

"జేహి శ్రుతి నిరంతర బ్రహ్మ వ్యాపక విరజ అజ కహి గావహీ,
కరి జ్ఞాన ధ్యాన విరాగ యోగ అనేక ముని జేహి ధ్యావహీ,
సో ప్రగట కరుణాకంద శోభావృంద అగ జగ మోహఈ,
మమ హృదయ పంకజ భృంగ అంగ అనంగ బహు ఛబి సోహఈ.

"జన్మరహితుఁడును, రోగరహితుఁడు నగు పరబ్రహ్మము నీవని వేదములు నిరంతరము ఘోషించును. జ్ఞాన, ధ్యాన, యోగ, విరాగ మార్గముల నవలంబించి యనేకమునులు నిన్ను సదా ధ్యానించెదరు; నీ నిర్హేతుకజాయమానకటాక్షమును నీదాసులపై వర్షించెదవు. నీ దివ్య మంగళవిగ్రహముచే, నీవు చరాచరజంతుజాలమును భ్రమింపఁ జేయుచుంటివి. అనేక కోటిమన్మథుల సొగసుగల నీవు, తుమ్మెదవలె, నా హృదయకమలము నాశ్రయించి యుండుము.

"జో అగమ సుగమ స్వభావ నిర్మల అసమసమ శీతల సదా,
పశ్యంతియం యోగీ యతన కరి కర్మ మనగో వస ముదా,
సో రామ రమా నివాస సంతత దాస వశ త్రిభువన ధనీ,
మమ ఉర వసహు సో శమన సంసృతి జాసు కీరతి పావనీ.

"ఓ నాథా! నీవు అగమ్యుఁడవు; సుగమ్యుఁడవు; నిర్మలుఁడవు; విషముఁడవు; సముఁడవు; శీతలుఁడవు; వశేంద్రియములను, మనోచి

త్తహంకారముల నిరోధించి, యోగీశ్వరులు నిన్ను దర్శించి, ధ్యానందించెదరు; వారికి నీవు అగముఁడవు (సులభముగఁ బొందఁదగని వాఁడవు.) భక్తులయందు నీకు దయకలదు కనుక, వారికి నీవు సుగముఁడవు. కర్మఫలముల నిచ్చునపుడు, నీవు విషముఁడవు. భక్తులఁ గటాక్షించునపుడు నీవు సముఁడవు; శీతలుఁడవు. ఓ రామా! నీవు శ్రీనివాసుఁడవు; త్రిభువనములకు ధనరాశివి; సజ్జనులకును, నీదాసులకు నీవు వశ్యుఁడవు; నీకీర్తి జననమరణములను నశింపఁజేయును; ఓ నాథా! నాహృదయములో నివసింపుము.

దోహా 55

ఇట్లు జటాయువు శ్రీరాముని స్తుతించి అవిచలభక్తిఁ బొంది, వైకుంఠమునకు వెళ్లెను. యథాయోగ్యముగ నతనికి శ్రీరాముఁడు స్వయముగ దాహాద్యుత్తరక్రియల నొనరించెను.

చౌపాయీ

శ్రీవారిచిత్తము కోమలము; వారు దీనదయాపరులు; వారికటాక్షము నిర్హేతుకము. గృధ్ర మొకనీచమగు పక్షి; మాంసాదులను భక్షించును; అట్లైనను, శ్రీవారి కటాక్షమువలన, యోగీశ్వరు లభిలషించుసద్గతి, దానికి లభించెను. ఓపార్వతీ! వినుము. ఆహా! అట్టి భగవంతుని చరణములను విడిచి, విషయములయం దనురాగముకల వాఁడు మందభాగ్యుఁడు సుమీ! తదుపరి, రామలక్ష్మణులు జానకిని వెదుకుచు నరణ్యములో సంచరించిరి. అంతట నొక అజాముఖి యను భయంకర మగురాక్షసిని వారు జూచిరి; "ఓయీ! రా రమ్ము; మనము విహరించెదము" అని యారాక్షసి పలికి, లక్ష్మణుని హస్తముఁ బట్టుకొనెను. ఆతక్షణము దాని ముక్కుచెవుల నతఁడు ఖండించెను; అది భయపడి, పాఱిపోయెను. ఆ బ్రహ్మారణ్య మతిభయంకరముగ నుండెను; అనేక సింహములును, గజములును విచ్చలవిడిగ దానిలో విహరించుచుండెను. మార్గములో శ్రీరాముఁడు కబంధుని సంహరించెను. (ఆ కబంధుఁడు పూర్వజన్మములో నొక గంధర్వుఁడు; ఒకసమయమున వాఁడు గానముఁ జేయుచుండెను; వానిగానమును దూర్వాసమహాముని విని, మెచ్చుకొనలేదు; అందుచేత, నతనిని వాఁడు చూచినవ్వెను;

అతఁడు కోపించి, వానిని శపించెను. వాఁడు రాక్షసుఁడై పుట్టి, లోకముల కుపద్రవముఁ గలిగించెను. ఇంద్రుఁడు వానిని వజ్రాయుధముతోఁ గొట్టెను; కాని, వానికి మృత్యువు రాలేదు; వాని శిరస్సు మాత్రము వానిగర్భములోనికిఁ బోయెను; అందుచేత, వానికి కబంధుఁడని పేరువచ్చెను. అప్పుడు వాఁడు భోజనమునిమిత్తము దేవేంద్రునిఁ బ్రార్థించెను. దేవేంద్రుని ప్రసాదమువలన, వాని రెండుచేతులు వొక యోజనము పొడవయ్యెను; ఆ చేతులమధ్యఁజిక్కిన జంతువులను వాఁడు భక్షించుచుండెను. శ్రీరాముఁడు వాని చేతులమధ్యఁ జిక్కెను; అతఁడు వానిని సంహరించెను. వాఁడు శాపవిముక్తుఁ డయ్యెను.) "ఓ నాథా! మునీశ్వరుఁడు నన్ను శపించెను; మీదర్శనమువలన, నా శాపవిమోచన మయ్యెను." "ఓ గంధర్వుఁడా! నామాట వినుము. నీకు బోధించి చెప్పుచున్నాను. బ్రాహ్మణద్వేషులనుమాత్రము నేను సహింపను.

దోహా 56

"ఓయీ! నిష్కపటముగ బ్రాహ్మణులను త్రికరణశుద్ధిగ సేవించువాఁడు నన్నును బ్రహ్మాదిదేవతులను వశముఁ జేసికొనును.

చౌపాయ్

"శపించినను, చంపినను, దుర్వచనములఁ బలికినను, బ్రాహ్మణుఁడు పూజ్యుఁడు; ఇదియే సత్పురుషుల యభిప్రాయము. (నారదుని శాపము, భృగుమహర్షి తాడనము, పరశురాముని కఠోరవచనములును, విష్ణువు సహించెను.) గుణశీలములు లేకపోయినను, బ్రాహ్మణుఁడు పూజ్యుఁడు; గుణశీలములఁ గలిగియుండినను, శూద్రుఁడు పూజ్యుఁడు కాఁడు." ఈప్రకారము శ్రీరాముఁడు నిజధర్మము నతనికి బోధించెను. అతఁడు సంతోషించి, శ్రీరామునిచరణములకు నమస్కరించి, నిష్క్రమించెను. ఉదారచిత్తుఁ డగుశ్రీరాముఁడు పాదచారియై సద్గతినిచ్చుటకు శబరియాశ్రమమునకు వచ్చెను. పాదచారియై వచ్చుచుండిన శ్రీరాముని శబరిచూచి, మునీశ్వరునివచనములను స్మరించి, యుప్పొంగెను. (ఈశబరి కొంతకాలము మతంగమహామునిని సేవించుచుండెను. అతఁడు పరమధామమునకుఁ బోవునపుడు, శబరి యతనితోఁబోవుటకు

సిద్ధపడెను. "ఓ శబరీ! ఇచ్చట నీవు నివసించియుండుము; నీకు శ్రీరామునిదర్శనము కాఁగలదు." అని యామె నతఁడు నివారించెను. అప్పటినుండి యామె శ్రీరామునిరాక కెదురు చూచుచుండెను. పదివేల సంవత్సరములతరువాత, శ్రీరాముఁ డామెవద్దకు వచ్చెను.)

సరసిజ లోచన బాహు విశాలా
జటా ముకుట శిర ఉర బనమాలా,
శ్యామ గౌర సుందర దోఉ భాఈ
శబరీ పరీ చరణ లపటాయీ.

కమలములవంటి లోచనములు, విశాల మగుబాహువులు, శిరముపై జటాముకుటము, హృదయమునందు వనమాల, శ్యామగౌర శరీరములు—ఇట్టి రామలక్ష్మణులఁ జూచి, శబరి వారిచరణములపైఁబడి, నమస్కరించెను. ఆమె పరమానందమగ్నురా లయ్యెను; ఆమె ముఖమునుండి మాట వెలువడలేదు. శబరి శ్రీవారిచరణములకు నమస్కరించెను. అత్యంత భక్తిశ్రద్ధలతో నామె వారి చరణములను జలములతోఁ గడిగి, వారిని సున్నాసనములపైఁ గూర్చుండబెట్టెను.

దోహా 57

మంచి తియ్యని కందమూలఫలములఁ దీసికొనివచ్చి, యామె వారికిచ్చెను. "ఈ పదార్థములు తియ్యనివి" అని శ్రీరాముఁడు సంతోషించుచు వానిని భుజించెను. ఏచెట్టున ప్రతిదినము తియ్యనిపండ్లు కనఁబడినపుడు, వాని రుచిఁజూచి, వానినిఁ దీసికొనివచ్చి, యామె వాని శ్రీవారినిమిత్తము దాఁచియుంచెను. ఆమె చేతులనుజోడించుకొని, శ్రీవారియెదుట నిలువఁబడి యుండెను; ఆమెకన్నులార వారిని జూచిచూచి, సంతోషించెను. "ఓ నాథా! నేను నీచజాతిస్త్రీని; మందమతిని; మూర్ఖురాలను; ఎట్లు మిమ్ములను కొనియాడఁగలను? అధమాధములలో నధమురాలను. మాటలపొందిక నెఱుంగను; చదువులను నేర్చియుండలేదు. ఓ స్వామీ! ఏమి తెలివితేటలు నాకుఁగలవు?" అని శబరి విన్నవించెను. "హే శుభే! నామాటను వినుము. కేవలము నాకు భక్తి ప్రధానము. జన్మము, వంశావళి, సత్కులము, ధర్మము, మానము, కుటుంబము, బలము, గుణము, చాతుర్యము—ఈ మొద

లగువానికంటె నధికము భక్తి; జలములేని మేఘమువలె, భక్తిలేని మనుజుఁడు నిరర్థకము. ఓ శబరీ! తొమ్మిది భక్తిమార్గములఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము; సత్సాంగత్యముఁ జేయుట; నా కథలను వినుటయందుఁ బ్రీతి.

దోహా 58

"దురభిమానమును విడిచి, గురుచరణములను సేవించుట మూఁడవమార్గము; కపటమునువిడిచి, నాగుణములను గానముఁజేయుట నాల్గవమార్గము.

చౌపాయ్

"విశ్వాసముతో నామంత్రమును జపించుట; ఇంద్రియనిగ్రహము, వైరాగ్యము, సత్కర్మల నాచరించుట, ఆఱవమార్గము; ఈ జగమంతయు రామమయమని తెలిసికొనుటయు, సత్పురుషులు నాకంటె నధికులని గ్రహించుటయు, యేడవమార్గము; యథాలాభముతో సంతోషము, స్వప్నమందయినను బరులను నిందింపకయుండుట, యెనిమిదవమార్గము; కపటమును, కుత్సితమును విడిచి, నిర్మలాంతఃకరణముతో భూతములను ప్రేమించుటయు, హర్షశోకములను విడిచి నేనే రక్షకుఁడనని నమ్మియుండుట తొమ్మిదవమార్గము. ఓ భామినీ! చరాచరజంతువులు, స్త్రీపురుషు లీ తొమ్మిదిమార్గములలో నొకదాని ననుసరించి ప్రవర్తించినను, వారు నాకుఁ బ్రియులు; ఈ తొమ్మిదిమార్గములు నీయందు దృఢముగఁ గనఁబడును. యోగీశ్వరులకు దుర్లభ మగుసద్గతి నీకు సులభమయ్యెను.

దోహా 59

"ఓ శబరీ! అన్నివిధముల నీవు ధన్యురాలవు; నీకు నా చరణములయం దనురాగము కలదు. నిన్నును నీమహిమను స్మరించువారు సహితము ధన్యులు."

చౌపాయ్ (అధికపాఠము)

ఈప్రకారము శ్రీరాముఁడు పలికినపలుకుల నామె విని, సంతోషించెను. "ఓ శబరీ! జానకిసమాచారమును నీవు వినియుంటివా?" అని యామె నడిగెను. "ఓ చరాచరజగన్నాథా! మీరు సావధాన

ముగ నాలకింపుడు; రావణుఁడు మహా బలవంతుఁడు; అతి కామార్తుఁడు; ఒకసమయమున వాఁడు విమానమునెక్కి లోకములను జయించుటకు వెడలెను. వనములో నొకకన్యను వాఁడు చూచి, 'ఓ కన్యారత్నమా! వనములో నొంటరిగ నీవేల సంచరించుచుంటివి?' అని యడిగెను. "ఓ రావణా! నామాట వినుము. నాతండ్రి కుశధ్వజుఁడు; అతఁడు బ్రహ్మర్షి; వేదాధ్యయనసంపన్నుఁడు. నన్ను విష్ణుమూర్తి కిచ్చి వివాహముఁ జేయుదునని నాతండ్రి ప్రతిజ్ఞ జేసెను. నాతండ్రి మహాతపశ్శాలి; అతఁడు వేదము నుచ్చరించునప్పుడతనిముఖమునుండి నేను బుట్టినందున, నాకు వేదవతి యని పేరువచ్చెను. నా తండ్రి చేసిన ప్రతిజ్ఞను శంభుఁడను రాక్షసుఁడు విని, కోపించి, సకలధర్మములను బుద్ధిపూర్వకముగ వాఁడు నాశనముఁ జేసెను; అర్ధరాత్రివేళ నాతండ్రి నిద్రించునప్పుడతనిని వాఁడు చంపెను; నాతల్లి నాతండ్రితో సహగమనముఁ జేసెను. నా తండ్రి ప్రతిజ్ఞను బురస్కరించుకొని, దానిని సత్యముఁజేయుటకు నిత్యము నేను విష్ణువునారాధించి, తపముఁ జేయుచున్నాను" అని యామె రావణునితోఁ జెప్పెను. ఓ చిన్నదానా! వ్యర్థముగ నీవింత తపముఁజేసి, దుఃఖించుట యేల? 'నన్ను వివాహమాడుము. నేను మూఁడులోకముల కధిపతిని' అని రావణుఁడు పలికి, యామెహస్తముఁ బట్టుకొనెను. ఓ నాథా! ఆ సమయమున వేదవతి హస్తము కత్తితో సమానముగ నుండెను. 'ఓరీ రావణా! నిన్ను శపించి, ధ్వంసముఁ జేయఁగలను; కాని, నా తపమునకు భంగమువచ్చునని భయపడుచున్నాను. ఓరీ! తప్పక ముందుజన్మములో నేను నిన్ను నాశనముఁ జేయుచున్నాను.' అని యామె కోపించి, వానిని శపించి, నిప్పులోఁబడి, చనిపోయెను. ఆమె యంశమువలన జానకి పుట్టెను. ఆమెను రావణుఁడు వనములోఁ జూచి, స్వానర్థములనిమిత్తమామెను దొంగవలె, నపహరించెను. ఓ నాథా! మీరు శోకమును విడిచి, ధైర్యము నవలంబించి, జానకిని వెదకుఁడు. జానకిసమాచారమును మతంగమహాముని నాతోఁ జెప్పినప్రకారము, యావత్తు మీకు విన్నవించితిని. (అధికపాఠము సమాప్తము.) ఓ రఘువీరుఁడా! మీరు పంపాసరోవరమునకు విజయముఁ జేయుఁడు; అచ్చట గొప్పగొప్ప

మునీశ్వరులు కలరు. ఆ సరోవరతీరమున నివసించువారు నిత్యము సుఖముగ నుండఁగలరని మతంగమహాముని, యోజనులను దీవించెను. పరస్పరము స్వాభావికముగ విరోధముగల జంతువులుసహితము వాని విరోధములను విడిచి, అత్యంతానురాగముతోఁ గలిసిమెలసి తిరుగుచుండును. పర్వతములును వనములును ప్రకృతిసంపదలతో నిండియుండును. ఖగములును మృగములు మొదలగు జీవజంతువులు, సింహము తప్ప, విశేషముగ వనములోఁ గలవు. ఓ నాథా! ఋషులకు మీరు ప్రత్యక్షమై, వారి మనోరథములను సఫలముఁ జేయుడు; సుగ్రీవునితో సఖ్యముఁ జేయుఁడు." ఈప్రకారము శబరి సుగ్రీవునిసఖ్యమును, రావణుని మరణమును, బట్టాభిషేకమును మొదలగువృత్తాంతములఁ బలికి, మతంగమహాముని చెప్పిన యోగవృత్తాంతమును విన్నవించి, శ్రీరాముని చరణములకు నమస్కరించెను.

ఛాంద్ 26

శ్రీవారి చరణారవిందముల నామె తన హృదయకమలమున ధరించి, వారి ముఖముఁజూచుచు యోగాగ్నిచే శరీరమును దహింపఁజేసి, పునరావృత్తిలేని విష్ణులోకమునకుఁ బోయెను. (యద్గత్వాననివర్తంతే తద్ధామ పరమం మమ.) ఓ మనుజులారా! నానావిధకర్మలు నానావిధశోకములనుఁ గారణములు గనుక, వానిని విడిచి, నమ్మకముతో శ్రీవారి చరణకమలములను సేవింపుఁడని, తులసీదాసు చెప్పుచుండును.

దోహా 60

శబరి, జాతిహీనురాలు; అధమాధమురాలు; ఆమె భక్తికిమెచ్చి, యామెకును శ్రీరాము ముక్తి నిచ్చిరి; ఆహా! మనుజు లెంత బుద్ధిహీనులు! అట్టి దయామయులగు శ్రీవారిని మనుజులు విడిచి, సుఖమనుభవింప దలంచెదరు కదా!

# షష్ఠమవిశ్రామము.

చౌపాయ్.

అచ్చటనుండి, శ్రీరామలక్ష్మణులు ముందునకు నడచిరి. అడవులలోనుండి తప్పివచ్చిన సింహములజతవలె, వారిరువురును ప్రయాణమును సాగించిరి. విరహపురుషునివలె, శ్రీరాముఁడు విషాదముఁ బొంది, యనేకకథలుఁ జెప్పుచు, మార్గముఁబట్టి వెళ్లిరి. "ఓ లక్ష్మణా! ఈ వనముయొక్క శోభఁ జూడుము; ఆ శోభం జూచినతరువాత, నెవరిమనస్సు క్షోభపడదు! ఖగమృగములన్నియు వానివాని స్త్రీలతో విహరించుచుండును. నా స్త్రీతో నేనెందుకు విహరించుట లేదని నన్నువి నిందించునట్లు కనఁబడును. నన్నుఁజూచి, పురుషమృగము పారిపోఁ దలఁచినపుడు, స్త్రీమృగము వానినిఁ జూచి, "ఓ నాథా! నీవు భయపడకుము; అతనివలన నీకు భయములేదు. అతఁడు బంగారు మృగమును వెదుక్కుచు వచ్చెను; నీవు సంతోషింపుము." అని చెప్పుచున్నది. 'ఈప్రకారము నీవేల నీస్త్రీని వెంటఁదీసికొని రాలేదు' అని నా కుపదేశించునట్లు, స్త్రీగజముతోఁగూడి పురుషగజము విహరించుచున్నది. శాస్త్రమును బఠించి, విచారించి, మననము జేయుచుండవలెను; లేనియెడల, శాస్త్రము స్మరణతప్పును. రాజుల చిత్తముఁగనిపెట్టి, వారిని సేవింపవలయును; లేనియెడల, వారికటాక్షము తప్పును. అటులనే, స్త్రీలను సదా హృదయమునందు ధరించి యుండవలెను. లేనియెడల స్త్రీలును శాస్త్రములును, రాజులు వశ్యులు కారు. ఓ తమ్ముఁడా! వసంతఋతువు ప్రకట మయ్యెను; దానిశోభం జూడుము. నా ప్రియురాలు నావద్ద లేనందున, నాకు భయము కలుగుచున్నది.

దోహా 61, 62

"నేను విరహముచే వ్యాకులపడి, బలహీనుఁడననియు, యేకాకిననియుఁ దెలిసికొని, వనదేవతలను, దుమ్మెదలను, బక్షులను సహాయముఁ దీసికొని, మన్మథుఁడు నన్నుఁ జయించుటకు సిద్ధపడుచుండెను. కాని, నీవు నా వెంటనుండి నాకు సహాయముఁ జేయుటఁజూచి, యతని దూతవెళ్లి యతనితోఁ జెప్పినందున, నతఁడు భయపడి నామీఁదికి దండువెడలుటకు వెనుదీయుచుండెను.

## చౌపాయ్

"ఓ తమ్ముఁడా! ఆ మన్మథుని యోధులను వర్ణించి చెప్పుటకు శక్యము కాదు. వృక్షములపై విశాలముగ వ్యాపించియుండిన లతలు - వివిధవితానములు (జండాలు) కదళీవృక్షములు—ధ్వజములు; తాల వృక్షములు—పతాకములు; మనోధైర్యముగలవారే, వీనింజూచి, భయపడరు. అనేకరంగు రంగులపుష్పములతోఁ బుష్పించినవృక్షములు— మన్మథుని యోధులు; అచ్చటచ్చట వనములోనుండిన మహావృక్షములు—ఆ యోధుల శిబిరములు; కోకిలారావములు—మదగజ ఘీంకారములు; డేఁగలు, కాకులు—లొట్టియలు, ఖచ్చరములు; నెమళ్లు, చకోరములు; చిలుకలు—ఉత్తమగుఱ్ఱములు; పావురములు, హంసలు—అరబ్బీగుఱ్ఱములు. డేఁగలు మొదలగుపక్షులు— పదాతులు; కామదేవుని చతురంగబలములను వర్ణించుటకు శక్యము కాదు. పర్వతములు, శిలలు—రథములు; కొండవాఁగులు— నగారాశబ్దములు; చాతకములు—భట్రాజులు; తుమ్మెదల ఝుంకారములు—భేరి, సహనాయి (సొన్నాయి) ధ్వనులు; మంద, సుగంధ, శీతలవాయువు—కాముని దూతలు ("నీవు శత్రువునితో యుద్ధముఁ జేయకుము; అతనికి జోహారు వసుము." అని దూతలు చెప్పును). ఈ ప్రకారము మన్మథుఁడు చతురంగబలములతో దాఁడి వెడలి, చరాచరములను గలఁతఁ జేయును; అతనిబలములు విచ్చలవిడిగ సంచరించుచున్నవి. ఓ తమ్ముఁడా! కాముని సైన్యములఁ జూడుము; వానినిఁ జూచి, భయపడని వానికి మర్యాద కలదు. కాముని బలమంతయు స్త్రీయందుఁ గలదు; దానిని జయించిన వాఁడే, మహావీరుఁడు.

## దోహా 63, 64

"ఓ తండ్రీ! ముగ్గురు క్రూరశత్రువులు కలరు; వీరు సేనాపతులు; గొప్పగొప్ప విజ్ఞానులు, మునీశ్వరుల మనస్సులను సహితము, వారు క్షణములో క్షోభ పెట్టఁగలరు. కామ్యమును గర్వమును, లోభముయొక్క సైన్యము; వీనికి లోఁబడినవారిని లోభము జయించును. కేవలము స్త్రీయే, కామమునకు బలము; కఠోరవచనములు—క్రోధమునకు బలము.

చౌపాయ్

ఓ పార్వతీ! శ్రీరాముఁడు పరాత్పరుఁడు; చరాచరజగన్నాథుఁడు; త్రిగుణాతీతుఁడు; సర్వాంతర్యామి; అయిన, నతఁడు కామార్తునివలె, దుఃఖముఁ జూపించెను. అతనికృపవలన, ధీరులమనస్సు ధైర్యముగ నుండును; అరిషడ్వర్గము నశించును; మాయాగుణములు భక్తుల యందు వ్యాపింపవు; అతని ఇంద్రజాలమును గుర్తెఱింగినవారే ధన్యులు. ఎవరియం దతని కటాక్షముకలదో, వారే యతని ఇంద్రజాలమును దెలిసికొనఁ గలరు. ఓ పార్వతీ! నా యనుభవముఁ జెప్పుచున్నాను; వినుము. కేవలము మిథ్యాస్వరూప మగులోకములో, నారాయణునిభక్తియే సత్యము. తదుపరి, శ్రీరామలక్ష్మణులు పంపాసరోవర తీరమునకు వచ్చిరి; ఆ సరోవర మతిమనోహరముగ నుండును; దానిజలము లగాధములు. సత్పురుషునిహృదయమువలె, దాని జలములు నిర్మలములు; దానికి నలువైపుల నాలుగురేవులు కలవు. దాత గృహము వద్ద, ననేకయాచకులు నిలిచియుండినవిధమున, నా సరోవరమువద్ద ననేక పక్షులువచ్చి, నిలిచి, దాని జలములను పానము జేయుచుండును.

దోహా 65, 66

"ఓ తమ్ముఁడా! దట్టముగ బలిసియుండిన తామరచేత, సరోవరములోని జలములను దెలిసికొనుటకుఁ గష్టముగ నుండును; అటులనే, మాయచేత నావరింపఁబడియుండిన నిర్గుణబ్రహ్మముఁ దెలిసికొనుట కష్టము. అగాధ మగుజలములలో నొకేరీతిగ మత్స్యములు సంతోషముగ నివసించువిధమున, నొకేరీతిగ ధర్మాత్మునిదినములు సంతోషముగ గతించును.

చౌపాయ్

"అనేకరంగు రంగులకమలములు కలవు; తుమ్మెదల ఝంకారమును వినుము; జలకుక్కుటములును, కలహంసలును, మనరాకనుఁ జూచి, ప్రశంసించును." చక్రవాకములును, బకములును, ఖగములును— ఈ మొదలగువానినిఁ జూచి, సంతోషింపవలెను; కాని, వానిని వర్ణించినందునఁ బ్రయోజనము లేదు. దూర్గస్థుల నాహ్వానముఁ జేయుచుండినట్లు, పక్షులు ధ్వనులఁ జేయుచున్నవి. సరోవరమునకు సమీపమున, మునీశ్వరులయాశ్రమములు కలవు; వాని

చుట్టును, జక్కని వనవృక్షములు కలవు; చంపకము, వకుళము, కదంబము, తమాలము, పాటలము, పనస, పలాశము, రసాలము—ఈ మొదలగువృక్షములు నూతన పల్లవముతోను బుష్పములతోను శోభించుచున్నవి; తుమ్మెదలు వానిపై నిలిచి, ఝంకారముఁ జేయుచున్నవి. మంద, సుగంధ శీతలవాయువులు సదా వీచుచుండును. కోకిలారావములు వినబడును; అవ్యక్తమధురమగు వానిధ్వనులు మునీశ్వరులచిత్తములను భ్రమింపఁజేయును.

దోహా 67

ఫలములబరువుచేత, వృక్షములు నేలకు వంగియుండెను; అటులనే, పరోపకారులు సంపదలఁ గలిగియుండి, నమ్రులై యుందురు.

చౌపాయ్

ఆ సరోవరముఁ జూచినతరువాత, శ్రీరాముని మనస్సున కాప్యాయనము కలిగెను; అతఁడు దానిలో స్నానముఁజేసి, సేద దేరెను. ఒక చక్కనిచెట్టునీఁడలో నతఁడు తమ్మునితోఁగూడి కూర్చుండెను. ఆ స్థలమునకు ముప్పదిమూఁడుకోట్లు దేవతలువచ్చి, శ్రీవారినిఁ జూచి, కొనియాడి, స్వగృహములకు నిష్క్రమించిరి. శ్రీరాముఁడు కూర్చుండి, సంతోషించుచు, నొక వినోదమగుకథను లక్ష్మణునకుఁ జెప్పుచుండెను. విరహముతోఁ గూడియుండిన శ్రీరామునిఁ జూచి, నారదుఁడు విచారించెను. "ఆహా! నా శాపము నంగీకరించినందునగదా, శ్రీరాముఁ డిట్లు దుఃఖించుచుండెను. ఇట్టిసమయము నాకు లభింపదు; కనుక, వారినిఁజూచెదను." ఇట్లు నారదుఁడు చింతించి, వీణఁబట్టుకొని, రాముఁడు కూర్చుండియుండిన స్థలమునకు వచ్చెను. అతఁడు వీణను మీటించి, మృదుమధురముగ శ్రీరామచరిత్రమును గానముఁ జేయుచుండెను. అతఁడు శ్రీవారిపాదములకు దండప్రణామముఁ జేసెను. శ్రీవారు దిగ్గునలేచి, యతనిని గౌఁగిలించుకొనిరి; ఉభయకుశలానంతరము, వారు కూర్చుండిరి. మునీశ్వరునిపాదములను లక్ష్మణుఁడు జలముతో గడిగెను.

దోహా 68

అనేకవిధముల నారదుఁడు విజ్ఞాపనముఁ జేసి, శ్రీవారి సగళచిత్తముఁ గనిపెట్టి, చేతులను జోడించుకొని, యిట్లు విన్నవించెను.

చౌపాయ్

"పరమోదారుఁడవగు రఘునాథా! నామాటను వినుము, నీయంత చక్కనివాఁడు లేఁడు; అతికష్టముపై గాని, నీ దర్శనము లభింపదు; భక్తి యుండినయెడల, నీ దర్శనము లభించును; నీవు వరదాతవు. ఓ నాథా! నా కొకవరముఁ బ్రసాదింపుము. నీవు సర్వాంతర్యామివి; నీకు రహస్యము లేదు." "ఓ మునిరాజా! మీకు నాస్వభావము తెలియును; నా భక్తులయెడల, నాకు మర్మము లేదు; నాకుఁ బ్రియమగు వస్తువునయినను, నీవు కోరినపుడు నీ కిచ్చెదను. నా భక్తుల కియ్యఁదగనివస్తువు లేదు. ఈ నమ్మకముమాత్రము నీవు కలిగియుండుము; దానిని విడిచిపెట్టకుము." ఈ ప్రకారము శ్రీరాముఁడు పలికిన పలుకులను నారదుఁడు విని సంతసించి, యిట్లు విన్నవించెను. "ఓ నాథా! నావరమును బ్రసాదింపుము. నిష్కపటముగ నేను ప్రార్థించుచున్నాను. అనంతకోటినామములు నీకుఁ గలవు; ఒకదానికంటె నొకటి యధికమని వేదములు చెప్పుచున్నవి; అయినను, వానికంటె రామనామ మధికమగుగాక; పక్షులు వేఁటకానివలలోఁ జిక్కినవిధమున, నీ నామోచ్చారణచే, సకలపాపములు నశించుఁ గాక.

దోహా 69, 70

"ఓ నాథా! పున్నమినాఁడు పూర్ణచంద్రునివలె, నీ భక్తి సదా నాహృదయమున బ్రకాశించు గాక! అనంతకోటి నీ నామములు—నక్షత్రములు; భక్తులహృదయము—ఆకాశము; రామనామను—పూర్ణచంద్రబింబము." అతనిప్రార్థనను శ్రీరాముఁడు మన్నించి, "తథాస్తు" అని పలికెను. నారదుఁడు సంతోషించి, శ్రీరాముని పాదములకు నమస్కరించెను.

చౌపాయ్

శ్రీరాముని చిత్తముఁ గనిపెట్టి, మరల నారదుఁడు మృదుమధురముగ నిట్లు విన్నవించెను:—"ఓ నాథా! నీమాయను ప్రేరేపించి, నీవు నన్ను మోహింపఁ జేసియుంటివి. నేను విశ్వమోహినిని వివాహముఁ జేసికొనదలఁచినపుడు (బాలకాండ), నీవేల నన్ను భంగపఱచితివి!" నారదునిప్రశ్నకు శ్రీరాముఁ డిట్లు సమాధానముఁ జెప్పెను. "ఓ మునిరాజా! నీవు కోపింపక, దురభిమానమును విడిచి, నామా

టను వినుము. నీవు సదా నన్ను భజన జేయుచుందువు. తల్లి బాలకులను రక్షించువిధమున, నేను నా భక్తులను సదా రక్షించెదను. నిప్పునుగాని, సర్పమునుగాని పట్టుకొనుటకు బాలుఁడు పరుగెత్తినపుడు, తల్లి వానిని నివారించును గదా! అన్ని చింతలను విడిచిపెట్టి కేవలము నన్నే భజన జేసినయెడల వారి యోగక్షేమమును నేను వహించెదను. (శ్లో. అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం. భ. గీ. ప్రమాణం.) ఆ బాలకులకు వయస్సు వచ్చి, కొంచెము బుద్ధికలిగినతరువాత, వారినిఁ దల్లి విడిచిపెట్టును; చిన్నతనములోవలె, వారినిఁ గాచుకొని తిరుగుట యుండదుకదా! అటులనే, జ్ఞానులు నాపెద్దకుమారులు; మానరహితులగు దాసులు నా చిన్నకుమారులు. నా పెద్దకుమారులు బుద్ధిమంతులు కనుక, వారు స్వతంత్రముగ జీవింపఁగలరు; నా చిన్నపిల్లలు బలహీనులు కనుక, వారికి నేనే ప్రాపకము; నా ప్రాపకము లేక, వారు జీవించుట కష్టము. కామక్రోధాదిశత్రువులు వా రిరువురను సమానముగ బాధించును.

దోహా 71

"వానిలో మోహము ప్రధానము; కామక్రోధలోభాదులు వానివర్గములోఁ జేరి, దుఃఖము నిచ్చుచుండును. మాయారూపి యగు స్త్రీ మహాకఠినము; దీనికంటె నామెవలన నధికదుఃఖము కలుగును.

చౌపాయ్

"ఓ మునిరాజా! వేదపురాణేతిహాసములును, సత్పురుషులును, మునీశ్వరులును ఘోషించుచుండిన మాటఁ జెప్పుచున్నాను; వినుము. మోహవనమునకు, స్త్రీ వసంతఋతువు; ఆమెయే, మనోహరముగ నుండును. జలములను గ్రీష్మఋతువు శోషింపఁజేయునట్లు, జప, తప, వ్రతములను స్త్రీ నాశనముఁ జేయును. కప్పలు వర్షకాలములో సంతోషించునట్లు, కామక్రోధాదులు స్త్రీనిఁ జూచి, విజృంభించును. కుముదములు శరత్కాలములో వికసించునట్లు, దుర్వాసనలు స్త్రీని జూచి ప్రకటమగును. కమలములు హిమవంతఋతువులో నశించునట్లు, స్త్రీమూలమున వర్ణాశ్రమధర్మములు నశించును. జలవాసము శిశిరఋతువులో శోభించునట్లు, స్త్రీవలన మమకారము ప్రకాశించును. అంధ

కారము గ్రుడ్డగూబలకు సంతోషదాయక మగునట్లు, పాపాత్ములకు నారి సంతోషము నిచ్చును. మీనములు గాలమునకుఁ దగిలి, చనిపోవునట్లు, స్త్రీలంపటముచే బుద్ధిబలము, దేహబలము, సుశీలము, సత్యము మొదలగునవి నశించును.

దోహా 72

"ఓ మునీశ్వరా! అవగుణములకును, సకల దుఃఖములకును స్త్రీ మూలము; సకలదుఃఖముల స్వరూపమే, స్త్రీయంత్రము. ఈ దోషములు కలవు కనుక, నీ వివాహమును నివారించియుంటిని."

చౌపాయ్

ఈ ప్రకారము శ్రీరాముఁడు చెప్పినమాటలను నారదుఁడు విని నందున, నతనిశరీరము పులకరించెను.; అతని నేత్రములవెంబడి యానందబాష్పములు వఱదలై ప్రవహించెను. సేవకునిమీఁద నింతప్రేమ గల యజమానుని మఱియొకనిఁ జెప్పుము! భ్రమను విడిచిపెట్టి, అట్టి యజమానుని సేవింపనివాఁడు, జ్ఞానదరిద్రుఁడు; మందమతి; నిర్భాగ్యుఁడని తెలిసికొనుము. పునః నారదుఁడు శ్రీరామునితో నిట్లు విన్నవించెను; "ఓ నాథా! నీవు విజ్ఞానవిశారదుఁడవు; నామాటను మన్నింపుము. నీ కటాక్షమువలన, జననమరణములతోఁగూడిన సంసారదుఃఖములు నశించును; సత్పురుషుల లక్షణములఁ జెప్పుము." "ఓ నారదా! సత్పురుషుల లక్షణములను వినుము; వారికి నేను వశ్యుఁడను. కామ క్రోధాదులను విడిచి, నిర్మలాంతఃకరణము కలవాఁడును, పరమార్థచింత గలవాఁడును, సత్యముఁ జెప్పువాఁడును, సత్యాసత్యములఁ దెలిసినవాఁడును, పండితుఁడును, యోగీశ్వరుఁడును, జితేంద్రియుఁడును, పరమ ధార్మికుఁడును, మమకారమును మదమును లేనివాఁడును, భక్తిమార్గమునఁ బ్రవర్తించువాఁడును, ధైర్యవంతుఁడును,

దోహా 73

"సకలగుణధాముఁడును, కుమ్మరిపురుగువలె సంసారములో సంచరించువాఁడును, దారాపుత్త్రాదులకంటె నధికముగ నా చరణములఁ బ్రేమించువాఁడును,

చౌపాయ్

"ఆత్మస్తవముఁ జేసికొననివాఁడును, పరులసుగుణములను విని సంతోషించువాఁడును, సమశీతలుఁడును, నీతిమార్గమును తప్పనివాఁ

డును, సరళస్వభావుఁడును, సకలభూతములఁ బ్రేమించువాఁడును, జప తపవ్రతముల నొనరించువాఁడును, గురుగోవింద బ్రాహ్మణచరణములను సేవించువాఁడును, దమము (ఇంద్రియనిగ్రహము) సంయమము (విషయములను విడుచుట), శ్రద్ధ, క్షమ, మిత్రత్వము, దయ, సంతోషము, నా చరణములయందు నిష్కలమగు భక్తి, విరక్తి, త్యాగము, వివేకము, సత్యాసత్యవిచక్షణము, వినయము, నమ్రత, విజ్ఞానము, అంతఃకరణశోధన, వేదపురాణముల యథార్థజ్ఞానము — ఈ మొదలగువానిని కలిగి యుండినవాఁడును, గర్వమును దురభిమానమును విడిచిపెట్టినవాఁడును, మఱపులోనయిన దుర్మార్గమున సంచరింపనివాఁడును, నా లీలావతారములను సదా గానముఁ జేయువాఁడును, స్వప్రయోజనమును విడిచి, పరార్థప్రాపకుఁడును — వీరు సత్పురుషులని తెలిసికొనుము. శేషుఁడును సరస్వతియు వారి గుణములను సాంతముగ వర్ణింపఁజాలరు.

ఛాంద్ 27

"వారికింగూడ సాధ్యము కాదు —" ఈప్రకారము శ్రీరాముఁడు చెప్పినమాటలను నారదుఁడు విని, సంతోషించి, వారి చరణములకు నమస్కరించి, వారితో నిట్లు పలికెను. "ఓ నాథా! నీవు దీనబంధుఁడవు నీ భక్తులగుణములను నీవు స్వయము వర్ణించి, చెప్పినందులకు నమస్కారము" ఇట్లు శ్రీరాముని స్తుతించి, మాటిమాటికి వారి చరణములకు నమస్కరించి, నారదుఁడు బ్రహ్మలోకమునకు నిష్క్రమించెను. ఏమనుజులు దురాశలను విడిచిపెట్టి, హరిరంగముఁ బహరించెదరో, వారు ధన్యులని తులసీదాసు చెప్పెను.

దోహా 74, 75.

ఆ రావణాంతకుని, ఆ శ్రీరాముని చరిత్రమును గానముఁ జేసినను, వినినను, జపతపములఁ జేయకపోయినను, రామభక్తి, నిశ్చలమగు భక్తి లభించును. ఓ మనసా! పతంగమువలె, దీపపువత్తితో సమానమగు స్త్రీకి లోబడి, నశించిపోకుము; కామక్రోధములను విడిచి, సదా శ్రీవారిని సేవింపుము; సత్సాంగత్యముఁ జేయుము.

ఆరణ్యకాండము సమాప్తము.

శ్రీ మద్గోస్వామి

# తులసీదాసకృతరామాయణము

## కిష్కింధాకాండము.



### ప్రథమవిశ్రామము.

శ్లో. కుందేందీవర సుందరావతిబలౌ విజ్ఞానధామావుభౌ
శోభాఢ్యౌ వరధన్వినౌ శ్రుతినుతౌ గోవిప్రబృందప్రియౌ,
మాయామానుషరూపిణౌ రఘువరౌ సద్ధర్మవర్మౌ హితౌ
సీతాన్వేషణతత్పరౌ పథిగతౌ భక్తిప్రదౌ తౌ హి నః.

శ్లో. బ్రహ్మాంభోధిసముద్భవం కలిమలప్రధ్వంసనం చావ్యయం
శ్రీమచ్ఛంభుముఖేందుసుందరవరం సంశోభితం సర్వదా,
సంసారామయభేషజం సుమధురం శ్రీజానకీజీవనం
ధన్యాస్తే కృతినః పిబంతి సతతం శ్రీరామనామామృతం

సోరఠా 1, 2.

ముక్తి జన్మ మహి జాని
జ్ఞాన ఖాని అఘ హాని కర,
జహఁ బస శంభు భవాని
సో కాశీ సేఇయ కస న.

శ్రీ తులసీదాసుగారు పార్వతీపరమేశ్వరులను నమస్కరించుచున్నారు:—కాశీనగరములో సుపురాణ మహేశ్వరులు నివసించియుందురు; ఆ నగరము ముక్తికి జన్మస్థానము; జ్ఞానమునకు ఖని; ఆ నగరములోనా పురాణదంపతులిరువురు నివసించి, జీవులపాపములను నశింపజేయుచుందురు; ఆ నగరమును, ఆ అర్ధనారీశ్వరులను నేనెందులకు సేవింపను? ఈ శ్లోకమునకు రెండవయర్థము:—శ్రీమద్రామాయణ మెట్టిది?

ము క్తికి జన్మస్థానము; జ్ఞానమునకు ఖని; పాపములను హరించును; ఈ రామాయణములో సదా పార్వతీపరమేశ్వరు లంతఃకరణపూర్వకముగ నివసించియుందురు; శోకములను హరించుటకు ఖడ్గమువంటిది; అట్టి రామాయణమును నే నేల సేవింపను? అవశ్యము దానినే సేవించెదను.

శ్రీమద్రామాయణము గురువుతో సమానమని తెలిసికొని, శ్రీ తులసీదాసుగారు మహేశ్వరునకు నమస్కరించుచున్నారు:—శ్రీశంకరు లెట్టివారు? జాజ్జ్వల్యమానముగ నెగిరివచ్చుచుండిన హాలాహల విషముఁ జూచి, సురాసురులు సహితము తొట్రుపాటుఁ బడిరి; ఆ కాలకూటవిషమును శివుఁడు పానముఁ జేసెను; శివునివంటి కృపాలుఁడు మఱియొకఁడు కలఁడా! ఓ మందబుద్ధీ! ఆ శివుని నీవేల భజింపవు! శ్రీరామనామ మహిమవలన, నా కాలకూటవిషమును శివుఁడు పానముఁజేసెను; ఆ రామనామమును నీవేల ధ్యానింపవు? శివునివంటి కృపాళుఁ డొకఁడుకలఁడా! కాశీపట్టణములో మృతినొందిన జీవులకు శివుఁడు తారకమంత్రము నుపదేశించును కదా!

చౌపాయ్ 1

పూర్వమువలె, రాముఁడు ముందును, అతనివెనుకను లక్ష్మణుఁడును కలసి వచ్చిరి; రాజ్యమును, భోగములను, తల్లిదండ్రులను, దేశమును వారు విడచి, అరణ్యమునకు వచ్చిరి; వీనికంటె నధికము, వారు సీతం గోల్పోయిరి; ఇట్టి సహింపరాని విపత్తులను సహితము వారు సహించి, ముందుకు నడచి వెళ్లిరి; కాని, అధైర్యపడి, వారు వెనుకకుఁ దిరుగలేదు. ఇందులో, వారి వీరత్వము వెల్లడియగును; అంతకంతకు వారు ముందుకు నడచివచ్చి, సకలమునిసేవితంబగు ఋష్యమూకపర్వతమును సమీపించిరి. మంత్రులతోఁ గూడి సుగ్రీవుఁడాపర్వతముపై నివసించియుండెను; ఈ మహావీరులను, ఈ మహాబలసంపన్నులను, ఈ సద్వంశస్థులను, ఈ యన్నదమ్ములను, సుగ్రీవుఁడు చూచెను. వాలిభయముచే సుగ్రీవుఁడు సదా యులికిపడుచుండును; అతఁడు వారిం జూచి, భయపడి, హనుమంతునిఁ బిలిచి, "ఓ మహావీరుఁడా! ఆ మహాపురుషుల నిరువురఁ జూచితివా? వా రనేకకష్టములఁ బడివచ్చినట్లు కనఁబడుచున్నారు; ఎంత నిశ్శంకగ వారు వచ్చుచుం

డిరో చూడుము. నీవు బ్రహ్మచారిరూపమును ధరించి వారిం జూచి రమ్ము. (బ్రహ్మచారి అవధ్యుఁడు; మంగళస్వరూపుఁడు; చంచలుఁడు; విద్యార్థి; ప్రయోజనములేకయే, కుశంకలఁజేయును.) నీవు వారిం జూచి, వారివృత్తాంతమంతయు, వారికిఁ దెలియకుండ, వానరసంజ్ఞలచే నాకుఁ దెలియఁజేయుము. ఒకవేళ వారు వాలివలనఁ బంపఁబడినవా రయినయెడల, నీవు నీముఖమును వంచుకొనియుండుము; నేను గ్రహించి, యీ పర్వతమునువిడిచి, పరుగెత్తి పోయెదను." అని పలికి యతనిం బంపెను. హనుమంతుఁడు బ్రాహ్మణరూపమును ధరించి, రామలక్ష్మణులవద్దకు వచ్చి, శిరస్సును వంచుకొని వారియెదుట నిలువఁబడెను. స్వస్వరూపమును వారికిఁ దెలియకుండునటుల, నతఁడు శిరస్సు వంచుకొనియుండెను; (ఆ రామలక్ష్మణులు బ్రహ్మఋషికుమారులని తలంచి, యతఁడు వారికి నమస్కరించెను; అథవా, వారి యపూర్వరూపములఁ జూచి, వారు దేవతలని తలంచి, యతఁడు వారికి నమస్కరించెను; అథవా, వారు త్రిమూర్తులలోనివారో, లేక నరనారాయణులో యని తలఁచి, నమస్కరించెను; అథవా, మహాపురుషులయెదుట శిరస్సును వంచుకొని నిలిచియుండుట యుచితము కనుక, నతఁడు శిరస్సువంచుకొని, వారికి నమస్కరించెను; అథవా, శ్రీరామునిదివ్యరూపము నతఁడు తేరిఁ జూడలేక, శిరస్సువంచుకొని, వారికి నమస్కరించెను.) "ఓ కుమారులారా! శ్యామలశరీరమును, పచ్చనిశరీరమును గల మీ రెవరు! క్షత్రియరూపములతో మీరు వీరవృత్తినవలంబించి, వనములోఁ దిరుగుచుండినట్లు కనఁబడును; మీ పాదములు కోమలములు కదా! ఈ వనభూములు కఠినములు; వీనినెటుల నవి సహింపఁగలవు? మీ రెందుకు వనములోఁ గ్రుమ్మరుచుంటిరి! (రెండు ప్రశ్నలు.) ముద్దులు మూటఁగట్టుచుండిన మీశరీరము లతికోమలములు కదా! ఎండల కెండి, వానలకుఁ దడిసి, చలిబాధలఁ బడి, మీ రెందుకీ వనములకు వచ్చితిరి! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో మీ రెవరు! మీలో మూఁడవవాఁ డెచ్చటికి వెళ్లెను? మీరు జగత్తులను రక్షించు నిమిత్తము భూసంచారముఁ జేయుచుండిన నరనారాయణులా!

దోహా 1

"భూభారమును హరించుటకు వినోదార్థము మనుజశరీరమును ధరించిన బ్రహ్మాండనాయకులా!" అని హనుమంతుఁ డడిగెను.

చౌపాయ్ 2

ఆ నవవ్యాకరణవేత్తమాటలను శ్రీరాముఁడు విని, చిఱునవ్వు నవ్వి, "ఎవరు బ్రహ్మలిపిని తప్పించుకొనఁ గలరు? అయోధ్యాధిపతి యగు దశరథమహారాజునకు మేము కుమారులము; పితృవాక్యము ప్రకారము మేము వనములకు వచ్చితిమి; మే మిరువుర మన్నదమ్ములము; ఇతఁడు నా తమ్ముఁడు లక్ష్మణుఁడు; శ్రీరామమూర్తి యని నాకు నామకరణముఁ జేసిరి; మాతోఁగూడ నొక్కచక్కనిస్త్రీ వచ్చియుండెను; ఆ నాస్త్రీని రాక్షసులు దొంగిలించిరి; ఓ విప్రుఁడా! మేమామెను వనములలో వెదుకుచు వచ్చుచున్నాము; ఇంతవఱకు మే మామెజాడఁ జూడలేదు; మా పూర్వోత్తరములఁ జెప్పినాము; ఓ విప్రుఁడా! నీ పూర్వోత్తరములఁ జెప్పుము" అని హనుమంతునితోఁ బలికెను. శ్రీరామచంద్రుని వచనములను విని, హనుమంతుఁడు ప్రభువునుఁ దెలిసికొని, వారిపాదములమీఁదఁ బడెను; ఓ పార్వతీ! ఆసమయమున హనుమంతుఁ డనుభవించినసంతోషముఁ జెప్పుటకు శక్యము కాదు. అతని శరీరము పులకరించెను; అతని నేత్రములవెంబడి ఆనందబాష్పములు వరదలై కారెను; అతని ముఖమునుండి మాట వెడల లేదు. అతఁడు నిలువుగ్రుడ్లు బెట్టుకొని, శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ జూచుచుండెను; అతఁడు తుదకు ధైర్యము నవలంబించి, భగవంతు నిట్లు స్తుతించెను; ప్రభువును కనుగొనినందుల కతఁడు పరమానందభరితుఁ డయ్యెను. "ఓ నాథా! నేను బుద్ధిహీనుఁడను; నాకు జ్ఞానము లేదు; అందుచేత, నే నటుల మిమ్ముల నడిగియుంటిని; నేను స్వల్పుఁడను; కనుక, నుచితము—ఓ నాథా! ఓ రాజాధిరాజా! సాధారణ మనుజులువలె, నా పూర్వోత్తరములను మీ రడుగుట ధర్మమా? నేను మీ మాయకు లోఁబడియుంటిని; కనుక, మిమ్ములను గుర్తుపట్టలేదు.

దోహా 2

"ఓ నాథా! ప్రథమతః, నేను మందమతిని; అటుపిమ్మట మీ మాయకు వశ్యుఁడను; నా హృదయము కఠినము; బుద్ధి తక్కువ వాఁడను. ఓ దీనరక్షకా! నావంటి నిర్భాగ్యుఁడు లేఁడు; నా యపరాధమును క్షమింపుఁడు.

చౌపాయీ 3

"ఓ నాథా! నాతప్పులకు లెక్కలేదు; అయినను, నాప్రభువులు సర్వసమర్థులు; ఎన్నఁడయిన సేవకుఁడు స్వామికంటె నధికుఁడగునా! ఓ రక్షకుఁడా! సకలజీవులును మీ మాయచే మోహితులగుచుండిరి; మీ కృపవలననే, వారు మోహమునుండి విముక్తులు కాఁగలరు. నే నొకమాటఁ జెప్పుచున్నాను; నామాటకు నానాథుఁడే ప్రమాణము; నేను నానాథుని భజించుట తప్ప, మఱియొకమార్గము నెఱుంగను; సేవకునకు స్వామియందును, పుత్రునకు జననీజనకులయందును నమ్మక ముండునుకదా! వారిబలముఁ జూచుకొని సేవకుఁడు గాని పుత్రుఁడుగాని ప్రవర్తించును; పోషించుటకును రక్షించుటకును ప్రభువు నిలిచియుండ, సేవకులు నిర్భయముగ నుండవచ్చును కదా!" అని హనుమంతుఁడు పలికి, వ్యాకులచిత్తుఁడై, శ్రీరాముని చరణముల మీఁదఁ బడెను; అతఁడు బ్రాహ్మణరూపమును విడిచి, వానరరూపముతోఁ బ్రత్యక్ష మయ్యెను; స్వామియందుఁ గలవాత్సల్య మతని శరీరమంతయు వ్యాపించెను. అతఁడు కపటరూపమును ధరించియుండినంతవఱకు, రాముఁ డతనిని ముట్టుకొనలేదు; అతఁడు స్వస్వరూపముతోఁ బ్రత్యక్షమయినతరువాత, నతనిని రాముఁడు మీఁదికియెత్తి నిలువఁబెట్టి, కౌఁగిలించుకొనెను; శ్రీరాముని నేత్రములవెంబడి వచ్చిన యానందబాష్పములు హనుమంతునిశరీరమును తడిపెను; అందుమూలమున నతనిదేహము చల్లఁబడెను. "ఓ హనుమంతుఁడా! సంకోచింపకుము; లక్ష్మణునికంటె రెండింతలు నీవు నాకుఁ బ్రియుఁడవు; (లక్ష్మణుఁడు నా సేవకుఁడు; నీవు మా యిరువుర సేవకుఁడవు; అథవా, శ్రీరాముని విపత్కాలములో నతనివద్దకు హనుమంతుఁడు వచ్చెను; లక్ష్మణుఁడు శ్రీరామునివద్దనుండనను, సీతాపహరణము జరిగెను; పునః

హనుమంతునివలన, సీత యోగక్షేమము రామునకు శ్రుతమయ్యెను; కనుక, హనుమంతుఁడు ద్విగుణముగ రామునకుఁ బ్రియుఁడు.) నేను సమర్థుఁడనని చెప్పుచున్నారు; అనన్యగతి నెఱుంగక, నన్ను సేవించు సేవకులు నా కధికముగఁ బ్రియులు.

దోహా 3

"ఓ హనుమంతుఁడా! అనన్యగతియనిన నేమి! ఈ చరాచర ప్రపంచములో నంతటవ్యాపించి, దానిరూపమునఁ బ్రత్యక్ష మగుచుండిన భగవంతుఁడే నా స్వామియనియు, నే నతని సేవకుఁడననియు తలంచి, నిశ్చలభక్తితోఁ గొలుచుటయే అనన్యగతి; దానికి రెండవ మార్గము లేదు." అని శ్రీరామమూర్తి పలికెను.

చౌపాయ్ 4

శ్రీరాముని ప్రసన్నాననముఁ జూచి, హనుమంతుఁడు సంతోషించెను; సుగ్రీవుని దుఃఖమువలన నతఁడు క్రుంగుచుండెను; ఆ దుఃఖముకూడ నతనిని విడిచిపెట్టెను. "ఓ నాథా! సుగ్రీవుఁడు వానరులకు రాజు; ఆ పర్వతముపై నతఁడు నివసించియుండును; అతఁడు సహితము మీ సేవకుఁడు; అతఁడు మీ స్నేహమునకుఁ దగినవాఁడు; మీరు వానరరాజున కభయము నిచ్చి, యతనిదైన్యమును బోఁగొట్టుడు. అతఁడు సీతాన్వేషణమునిమిత్తము కోట్లకొలదివానరులను నలుదిశకుఁ బంపఁగలఁడు." అని యీప్రకారము హనుమంతుఁడు రాజధర్మములను గుఱించి రామునితోఁ బ్రసంగించి, వారి నిరువురను భుజములపై నెక్కించుకొని, ఒక్కయుఋకున పర్వతముపైకి చెంగున దాఁటెను; ఆ రామలక్ష్మణుల దర్శించినమాత్రమునఁ గృతార్థుఁడ నయితినని సుగ్రీవుఁడు తలంచెను; జన్మము సఫలమయ్యెనని భావించెను; అతఁడు రామలక్ష్మణుల చరణములకు నమస్కరించి, సుగ్రీవుఁడు వారి నాదరించి సత్కరించెను. "ఏది మనకుఁ బ్రీతియుక్తముగ నుండునో, దానినే మనకు భగవంతుఁడు కలుగఁజేయును." అని సుగ్రీవుఁడు తన లోఁ దాను తలంచెను.

దోహా 4

అప్పుడు హనుమంతుఁడు, రామునకును, సుగ్రీవునకు, నన్యోన్య వృత్తాంతములఁ జెప్పి, వారికి సఖ్యముఁగలిపెను. (శ్రీరాముఁడు సుగ్రీ

పున కథయను నిచ్చెను; సుగ్రీవుఁడు శ్రీరామునకు సహాయముఁ జేయుటకు నిశ్చయించెను.) ఈప్రకారము వా రిరువురు రామసుగ్రీవులు, అగ్నిసాక్షిగ స్నేహముఁ గట్టుకొనిరి; (అగ్ని సకలజీవుల హృదయములలో నుండును; మనోవికారములు పుట్టినయెడల, వానిని దహించును; రామాయణమున కగ్ని ప్రధానము; అగ్నిహోత్రుని ప్రసాదమువలన రాముఁడు పుట్టెను; అగ్నిసాక్షిగ సీత వివాహ మయ్యెను; అగ్ని లంకను దహించెను; అగ్నిలో సీత దాఁచఁబడెను; అగ్నిసాక్షిగ వారు సఖ్యముఁ గట్టుకొనిరి.)

చౌపాయ్

ఈ స్నేహమువలన వారిలోవారికి యభ్యంతరములు లేకపోయెను; శ్రీరాముని వృత్తాంతమంతయు లక్ష్మణుఁడు సుగ్రీవునకుఁ జెప్పెను; అతఁడు దానినివిని, కన్నీరుఁ గార్చి, "ఓ నాథా! జానకి సకలాధిపతికూఁతురు; పుథంపఁబడిన వంశముకసుక మిథిలవంశము; అందుచేత, నామె విశేషము మథనము జరగినగాని లభింపదు. నేత్రములవెంబడి నీరుఁ గార్చినఁగాని, యామె లభింపదు." అని పలికి, పునః సుగ్రీవుఁడు రామునితో నిట్లు ప్రసంగించెను. "ఓ నాథా! ఒక సమయమున నే నిచ్చట మంత్రులతోఁ గూర్చుండి, ఆలోచనఁ జేయుచుంటిని; ఆకాశమార్గమున జానకి వెళ్లుచుండెను; నే నామెఁ జూచియుంటిని; ఆమె పరవశురాలై విలపించుచుండెను; 'హా రామా! హా రామా!' అని యామె రోదనముఁ జేయుచు, నా వైపుఁ జూచి, వస్త్రమునకు భూషణములఁ గట్టి, ఆమూటను దిగవిడిచెను." "ఆ మూటఁ దీసికొనిరమ్ము" అని శ్రీరాముఁ డాజ్ఞాపించెను; ఆమూటను సుగ్రీవుఁడు తీసికొనివచ్చెను. ఆమూటను శ్రీరాముఁడు విప్పి, ఆ భూషణములను గుండెలకద్దుకొని విలపించెను. (అధికపాఠము):—"ఓ తమ్ముఁడా! లక్ష్మణుఁడా! ఈవస్త్రమును, అలంకారములఁ జూడుము." అని శ్రీరాముఁడు పలికెను; ఆమాటలను లక్ష్మణుఁడు విని, యంజలి యొగ్గి, "ఓ నాథా! జానకి పాదభూషణములమాత్రము గుర్తు పట్టఁగలను; ఈ మిగిలినయలంకారములను నేను చూచియుండలేదు" అని నిష్కల్మషముగఁ బలికెను. "ఓ నాథా! మీరు ధైర్యము నవలంబిం

ప్రుఁడు; శోకమును విడిచిపెట్టుఁడు. సీతాన్వేషణమునకుఁ దగినసన్నా
హముఁ జేయువాఁడను." అని సుగ్రీవుఁడు రామునకు ధైర్యముఁ
జెప్పెను. అధికపాఠము సమాప్తము.)

దోహా 5

స్నేహితునివచనములను శ్రీరామమూర్తి విని, సంతోషించి, స్వా
స్థ్యముఁ బొందెను. "ఓ సఖుఁడా! నీవేల వనములో నివసించియుంటివి!
నాకుఁ జెప్పుము." అని శ్రీరాముఁడా వానరవీరులవృత్తాంతముఁ

చౌపాయ్

తెలిసినను, తెలియనివానివలెఁ బ్రసంగించి, "ఓ సఖుఁడా! ప్రథమ
మున, నీ నివాస మెచ్చట? నీ జననీజనకు లెవరు!" అని యడిగిరి.
ఆమాటల కిట్లు సుగ్రీవుఁడు చెప్ప నారంభించెను. "ఓ నాథా! నా
వంశముయొక్క పూర్వోత్తరములఁ జెప్పుచున్నాను; వినుము. ఒక
సమయమున, బ్రహ్మ తనకంటిపుసిదీసి, గోళ్లతో భూమిమీఁదికిఁ జల్లెను.
ఆ పుసిలోనుండి యొకవానరుఁడు పుట్టెను; వాఁడు మహాచంచలుఁడు;
బ్రహ్మతో సమానమగు బలవంతుఁడు: బ్రహ్మ కొంతవిచారించి, వానికి
'ఋక్షరాజు' అను పేరుఁబెట్టెను. ఆ వానరుఁడు బ్రహ్మదేవునకు నమ
స్కరించి, 'ఓ నాథా! మీయాజ్ఞఁ జేయువాఁడ' నని పలికెను. 'ఓ
వానరుఁడా! నీవు వనములో స్వేచ్ఛగ సంచరింపుము; అచ్చటిఫలము
లను భుజింపుము; నీ చేతికిఁజిక్కిన రాక్షసులను సంహరింపుము.' అని
బ్రహ్మ యాజ్ఞాపించెను. ఓ స్వామీ! ఆ యాజ్ఞప్రకారము ఋక్ష
రాజు వెడలి, [illegible]గిరికి వచ్చెను.

దోహా 6

"ఓ స్వామీ! అప్పుడా మహావానరుఁడు వనములలోఁ గ్రుమ్మ
రుచు, రాక్షసులను సంహరించుచుండెను.

చౌపాయ్

"అట్లు క్రుమ్మరుచుండఁగ, నా వానరుఁ డొకనాఁడు నొకగుండముఁ
జూచెను; దానిజలములలో నతనిప్రతిబింబ మతనికిఁ గనఁబడెను. ఆ
ప్రతిబింబము నతఁడు చూచి, శత్రువనిభావించి, విచారింపఁ దొడం
గెను; ఆ క్రోధమును ధరింపలేక, యతఁడా గుండముచుట్టుఁ దిరుగు
చుండెను. అతఁడు చేసినచేష్టలన్నియు జలములోఁ బ్రతిఫలించెను;

అతఁడు గర్జించిన, దాని ప్రతిధ్వని గుండములోనుండి వినఁబడెను. ఆ వెంటనే, ఋక్షరాజు గుండములోనికిఁ గుప్పించెను ; ఆతక్షణ మతని కొకచక్కని స్త్రీరూపము వచ్చె. ఆ గుండములోనుండి బయటకువచ్చి, ఆస్త్రీ నిలువఁబడెను; దాని చక్కదనముఁ జూచి, ఇంద్రుఁడు మోహ వశ్యుఁడై వీర్యమును జాఱవిడిచెను; ఆవీర్య మాస్త్రీయొక్క వెంట్రు కలపైఁ బడెను ; ఆవెంటనే, సూర్యుఁడు సహితము భ్రమ పడెను ; ఆమెకంఠముపై నతనివీర్యము పడెను.

దోహా 7

"ఓ నాథా ! ఇంద్రుని అంశవలన వాలియు, సూర్యుని అంశ వలన సుగ్రీవుఁడును బుట్టిరి ; వాలములయందుఁ బుట్టినందున వాలి యనియు, గ్రీవమునందుఁ బుట్టినందున సుగ్రీవుఁడనియు వారికి నామ ములు వచ్చెను.

చౌపాయ్

"ఓ రామా! ఆక్షణమే మమ్ములఁ గన్ననారి స్త్రీరూపమును విడిచి, ఋక్షరాజయ్యెను. అతఁడు మా యిరువురను వెంటఁదీసికొని బ్రహ్మలోకమునకు వెళ్లెను. అతఁడు బ్రహ్మకు నమస్కరించి, యావచ్చ రిత్రము నతనికి శ్రుతపఱచెను. భగవంతుని యిచ్ఛ బలీయమని బ్రహ్మ పలికి, "ఓయీ వాలిసుగ్రీవులారా ! మీ యన్నదమ్ము లిరువురును దక్షిణదిశకుఁ బొండు. మీరు కిష్కింధానగరములో నివసించి, రాజ్య సుఖముల ననుభవింపుఁడు ; ఆ చరాచరజగన్నాథుఁడు, అనేకనామ ములు గలప్రభువు, రఘువంశములో దశరథమహారాజు గర్భమునఁ బుట్టి, తండ్రియాజ్ఞ ననుసరించి, వనములకు వచ్చి యనేక లీలామాను షచర్యలఁ జేయును ; అతనిని దర్శించుటవలన, మీకు సకలకల్యాణ ములు సమకూడును." అని మాతోఁ జెప్పెను.

దోహా 8

"అన్నదమ్ములము మేము బ్రహ్మదేవుని వచనములను విని, సంతోషించితిమి ; జపములను దపములను, యజ్ఞాదిక్రతువులను— ఈ మొదలగునవి మేము చేయలేదు; అయినను, మేము బ్రహ్మదేవునిఁ గన్నులారఁ జూచియుంటిమి ; అందుచేత, మాకు సంతోషము కలిగెను.

చౌపాయ్

"మేము బ్రహ్మదేవుని చరణారవిందములకు నమస్కరించి, కిష్కింధానగరమునకు వచ్చితిమి; ఓ సురరక్షకా! వనములలోనుండిన రాక్షసులను సంహరించితిమి; కిష్కింధారాజ్యమును వాలి పరిపాలింప నారంభించెను. ఓస్వామీ! మయుఁడను దానవునకు మాయావియు, దుందుభి యని కుమారు లిరువురు కలరు; వారిరువురు మహారణధీరులు. బ్రహ్మదేవునివ్యాపారము లలక్షితములు; వానిం దెలిసికొనుట కష్టము" అని సుగ్రీవుఁడు చెప్పినవృత్తాంతమును రఘురాముఁడు వినెను. (అధికపాఠము సమాప్తము.) "వాలికి నాయందుగల వాత్సల్యమును వర్ణించి చెప్పలేను. ఓ నాథా! మాతో యుద్ధముఁ జేయుటకు మయునికుమారుఁడు మాయావి మా నగరమునకు వచ్చెను. నిశిరాత్రి సమయమున వాఁడు నగరబహిర్ద్వారము వద్దకువచ్చి, బొబ్బ పెట్టెను; శత్రువుని పొగరుబోతుతనమునుమాత్రము వాలి సహింపఁడు. ఆ తక్షణమే వాలి వానివద్దకు వచ్చెను; వాఁడు వాలిం గాంచి, పాఱిపోయెను; వానివెంట వాలి పరుగెత్తెను; సైన్యముతో నేను వాలివెనుకను వెళ్లియుంటిని; ఒక మహాపర్వతగుహలో నామాయావి ప్రవేశించెను; అప్పుడు వాలి నన్నుఁ జూచి, 'ఓ తమ్ముఁడా! పదునయిదుదినములవఱకు నీవీ గుహాముఖద్వారమువద్ద నిలచియుండుము; ఆదినములు గతించినతరువాత, నేను రానియెడల, నన్ను వాఁడు సంహరించెనని గ్రహింపుము' అని చెప్పి, వాలి గుహలోఁ బ్రవేశించెను. ఓ స్వామీ! అప్పుడు నేను ముప్పదినములు నిలచియుంటిని; అంతట నా గుహలోనుండి రక్తప్రవాహము వెడలివచ్చెను; నా యన్న చనిపోయెనని విచారించితిని; ఆ రాక్షసుఁడు వాలిని సంహరించి, నాతోఁ బోరుటకు వచ్చునేమో యని భయపడి, నే నాగుహాముఖద్వారమును గొప్ప మహాశిలతోఁ గప్పివేసి, పరుగెత్తి నగరములోఁ బ్రవేశించితిని.

దోహా 9

"ఓ నాథా! వాలి మహాబలవంతుఁడు; వానిని యుద్ధములో జయించుట కష్టము; వాలినే వాఁడు సంహరించినయెడల, సునాయాసముగ వాఁడు నన్ను జయించును.

చౌపాయ్

"ఈప్రకారము నేను చింతించి, నగరములోఁ బ్రవేశించి, వాలి సమాచారమును మరణమును జనులకుఁ జెప్పియుంటిని. అతని మరణమును విని, పంపాపురనివాసులు వ్యాకులముపడి శోకించిరి. రాజు లేని రాజ్యమును నగరముఁ జూచుటకు నా కిష్టములేకపోయినను, మంత్రులు బలవంతముగ రాజ్యమును నాకుఁ గట్టిపెట్టిరి; అంతలో, మాయావిని సంహరించి, వాలి నగరమునకు వచ్చెను; ఆ సమయమున నేను సింహాసనము నధిష్ఠించియుంటిని; వాలి నన్నుఁ జూచి, కోపముచే మండిపడెను. అది మొదలు నాతో నతఁడు వైరముఁ బూనెను. నన్ను శత్రువునిగభావించి, అనేకవిధముల నన్నుబాధించి, నా సర్వస్వముఁ దీసికొని, నాభార్య నపహరించెను. ఓ నాథా! వాలికిభయపడి, నేను దేశసంచారముఁ జేయుచుంటిని. మునిశాపమునకు వెఱచి, నాతోఁ బోరాడుట కీ పర్వతముపైకి, వాలి రాఁజాలఁడు; అయినను, వానిభయము నాగుండెలఁ బట్టెను."అని సుగ్రీవుఁడు యావద్వృత్తాంతమును శ్రీరామునకు విన్నవించెను. రాజేసుని దీనాలాపములను శ్రద్ధతో విని, దుఃఖించెను. శ్రీరాముఁడు వ్యాకులముచే రెండుచేతులఁ జాచి, ఆందోళనముఁ బడెను.

దోహా **10, 11** అధికపాఠము.

(అతనివచనములను శ్రీరాముఁడు విని, "ఓ సఖుఁడా! శాపమునకుఁ గారణమేమి? దుందుభి యనురాక్షసుని వాలి యెట్లు సంహరించెను! మతంగమహాముని సుశీలుఁడు; మహర్షి; మహాశాంతుఁడు కదా! ఏ కారణముచేత, నతఁడు వాలిని శపించెను? సాంతముగ నాకుఁ జెప్పుము." అని సుగ్రీవుని నడిగెను.

చౌపాయి

ఈప్రకారము వాలిశాపమునకుఁ గారణమును రాముఁ డడిగెను. ఈప్రకారము సుగ్రీవుఁడు చెప్పఁదొడంగెను. "ఓ నాథా! దుందుభి యనురాక్షసుఁ డొకఁడు కలఁడు. వాఁడు మహాశూరుఁడు; రణధీరుఁడు; మహాబలవంతుఁడు; వానితో సమానుఁడగు బలవంతుఁడు లోకములో లేఁడు. ఒకదినమున వాఁడు తీరమునకు వచ్చి, సముద్రమును క్షోభ పెట్టెను. అతి దుష్ప్రవర్తనముచే, వాఁడు సముద్రములోఁ

జొచ్చి, రెండుచేతులతో దానిని మథించెను; సముద్రమంతయు వాని నడుమువద్దకు వచ్చెను; వాఁడు మథించుటవలన, సముద్రుఁడు వ్యాకులముఁ జెందెను; జలజంతువులు కోట్లకొలది నశించెను; అతివ్యాకులచిత్తముతో సముద్రుఁడు ప్రత్యక్షమై, "నీతో సమానుఁడగు బలవంతుఁడు లేఁడు. నామాటను విశ్వసింపుము. హిమవంతునివంటి బలవంతుఁడు లేఁడని వినియుంటిమి; అతనినిసాధించుటకు నీవు ప్రయత్నింపుము." అని దుందుభితోఁ బలికెను. వాఁడాప్రకారము వెడలివచ్చి, హిమవంతునిఁ జూచి సంతసించెను. భుజముల నప్పళించుకొని, వాఁడు హిమవంతుని రెండుచేతులతో మీఁదికిరియెత్తెను. హిమవంతుఁడు భయపడి, "ఓయీ! నేను నీతో సమానబలవంతుఁడను కాను. అందుచేత, నా విన్నపము వినుము; ఈతక్షణము నీవు పంపాపురమునకుఁ బొమ్ము; అచ్చట మహాబలవంతుఁడగు వాలియుండును; వానితోఁ బట్టుపట్టి చూడుము" అని చెప్పెను. ఆవెంటనే, వాఁడు పంపా నగరమునకు వచ్చి, "ఓ వాలీ! వాలీ! రా! రా!" మని బొబ్బలిడెను.

### దోహా 12

వాఁడు మహిషరూపమును ధరించి, గర్జించుచు, డెక్కలతో భూమినిదువ్వుచు, తోఁకను బెణుకులు లేక, రమని వచ్చెను.

### చౌపాయ్

వాఁడు భూమిని మర్దించుటవలన, వృక్షములువిఱిగి నేలఁగూలెను; వానిసింహనాదము హృదయములను భేదించెను. వానిభుజాస్ఫాలనము పిడుగుపడినట్లుండెను; వాని వ్యాపారమువలన, అందఱు భయపడిరి. చంద్రునిఁబట్టుటకు రాహువువచ్చినట్లయ్యెను; పంపాపురజనులు చింతాక్రాంతులైరి; తత్క్షణము, వాలి వానిపైకివెడలి, వాని వికృతరూపముఁ జూచెను; రెండు మదపుటేనుఁగులవలె, వారు తారొకనిరి; వారు మల్లయుద్ధము నొనరించిరి; దానిని వర్ణించుటకు నా శక్యముకాదు. ఈ విధమున, నాలుగుయామములు వారు పోరాడిరి; తుదకు వానిని వాలి పొడిచిచంపెను. ఆపోటుతో వాఁడు గిరగిరతిరిగి, పర్వతమువలె భూమిపైఁ బడెను; వానికళేబరముక్రింద ననేక జంతువులుపడి చనిపోయెను; అనేకవృక్షములు వ్రేళ్లతోఁ డెగి

పడెను. ఆకళేబరమును వాలి రెండువ్రక్కలుచేసి, దక్షిణోత్తరముల కొక్కొక్కదానిని పాఱవైచెను. అట్లు వానిం జిమ్ముటవలన మునీశ్వరుని యాశ్రమమువద్ద రక్తముపడెను. ఈ పర్వతమంతయు రక్తమయమయ్యెను; అప్పుడు మతంగమహాముని స్నానమునకు వెళ్లియుండెను. అతఁడు స్నానమాడి వచ్చి, యాశ్రమువద్దఁ బడియుండిన రక్తముఁ జూచి, రౌద్రాకారుఁ డయ్యెను. అచ్చటికి రక్త మెటులవచ్చెనోయని యతఁడు చింతించెను. అంతట నొకయతుఁడు వచ్చి, యావద్వృత్తాంతమును మతంగునకు విన్నవించెను; మునీశ్వరునకు విశేషము క్రోధము వచ్చెను.

### దోహా 13

"ముందువెనుకల నాలోచింపక, నతఁడీవిధమున శపించెను. 'ఈ పర్వతముపైకి వాలి వచ్చినను, దానివైపుఁ జూచినను, వాలి భస్మమగును' అని యతఁడు శపించెను.

### చౌపాయ్

"మునిశాపమునకు వాలి భయపడి, యీపర్వతముపైకి రాఁజాలఁడు; ఆధైర్యముచే, నే నీపర్వతముపై నిశ్చింతగ నివసించియుంటిని; వానికి భయపడి, మఱియొకస్థలమునకుఁ బోఁజాలను. ఓ నాథా! ఈచింతయే, రాత్రింబవళ్లు నామనస్సును దహించుచుండును. అందుచేత, హనుమంతునితోఁ గూడి, నేనిచ్చట నివసించియుంటిని. మునీశ్వరుని శాపమును వాలి విని, యిచ్చటకు రాఁజాలఁడు" ఈప్రకారము వారి స్వాంతవృత్తాంతమును సుగ్రీవుఁడు విన్నవించెను. అప్పుడు శ్రీరామమూర్తి ధనుష్ప్రగ్రైకొని, యిట్లు పలికెను. (అధికపాఠము సమాప్తము.)

### దోహా 14

"ఓ సుగ్రీవుఁడా! బ్రహ్మరుద్రుల శరణుఁజొచ్చినను, వాలి నొక్కబాణముతో సంహరించెదను. ప్రాణములతో వానిని విడిచిపెట్టను.

# ద్వితీయవిశ్రామము.

—○(·)○—

చౌపాయ్

‘‘ఓ సఖుఁడా! మిత్రునిదుఃఖముఁ జూచి, విచారింపని మనుజునిముఖముఁ జూడఁగూడదు. ఎవరిదుఃఖములు వారికి నిజముగఁ గొండంతలయినను, వానిని స్వల్పములని నిర్లక్ష్యముఁ జేసి, మిత్రులదుఃఖములు నిజముగ స్వల్పమయినను, వానిని గొండంతలని భావించి, మిత్రులకు సహాయముఁ జేయవలెను అట్లు సహాయముఁజేయక, తటస్థముగ నుండినవాఁడు పరమదుర్మార్గుఁడు; వానిని స్నేహితుఁడని తలఁపఁగూడదు. దుర్మార్గమునుండి నివారించుటయు, సన్మార్గమున సంచరించుటయు, సుగుణములఁ బ్రకాశించుటయు, అవగుణములను దాచుటయు, నిశ్శంకగ ఋణమునకు ధనము నిచ్చిపుచ్చుకొనుటయు, యథాశక్తి యుపకారముఁ జేయుటకు సిద్ధముగనుండుటయు, నూరురెట్లాపదకాలములలో నాదరించుటయు—మిత్రునిగుణములని వేదములు చెప్పెను; సత్పురుషులు పలుకుచుండిరి. ఓ సఖుఁడా! నీ సముఖమునఁ దియ్యనిమాటలఁ బలికి, నీ పరోక్షమున నినుగుఱించి చెడ్డమాటలఁ బలుకువాఁడు కుటిలుఁడని గ్రహింపుము; సర్పగతివలె, వానిచిత్తము వక్రము; అట్టి కుమిత్రుని స్నేహమును విడిచిపెట్టుము.

దోహా 15

‘‘మిత్రులతో [illegible] స్నేహముగ నుండును. హృదయములోఁ గాని, మాటలలోఁగాని, [illegible]లో గాని, [illegible]లో గాని, స్నేహము లేనివాఁడు కుమిత్రుఁడని గ్రహింపుము. వానిహృదయము కపటము.

చౌపాయ్

‘‘మూర్ఖసేవకుఁడు; లోభియగు రాజు; అపవిత్రురాలగు భార్య; కపటమిత్రుఁడు—ఈ నల్వురు శూలములవంటివారు. ఓ సఖుఁడా! నీవు విచారింపకుము; నా యథాశక్తి నీకు సహాయముఁ జేయువాఁడను’’—ఈప్రకారము శ్రీరామమూర్తి సుగ్రీవునకు సహ

ముఁ జెప్పెను. "ఓ స్వామీ! వాలి మహాబలవంతుఁడు. రణధీరుఁడు. (అధిక పాఠము.) ఓ కృపానిధీ! ఈ సప్తతాళముల నొకబాణముతోఁ బడఁద్రోయుము; చంద్రమండలాకారముగ నుండిన యీ తాళములను మీ రొకబాణములతోఁ బడఁద్రోసినయెడల, మీరు వాలిం జంపఁ గలరు; లేనియెడల, ఓ నాథా! మీ శ్రమ వ్యర్థమగును." ఈప్రకారము సుగ్రీవుఁడు పలికినపలుకులను శ్రీరామమూర్తి విని, నవ్వి, "ఓ సఖుఁడా! నీ చమత్కారముఁ దెలిసికొంటిని; ఈప్రకారము నా బలమును నీవు పరీక్షింపఁదలఁచితివి; మంచిది; ఈ తాళవృక్షములవృత్తాంతముఁ జెప్పుము" అని యడిగెను. అందులకు సుగ్రీవుఁడు సంతసించి, తాళవృక్షములచరిత్రముఁ జెప్ప నారంభించెను "ఓ నాథా! ఒకదినమున వాలి వనమునకు వెళ్లి, వృక్షముల పుష్పములను ఫలములఁ జూచుచుండెను. అధిక పాఠము:—వాలి పరమానందభరితుఁడై, తాళఫలములు నేడింటిని సంగ్రహించి, వానిని నీటిలోఁ గడిగి శుభ్రముఁ జేసెను.

దోహా 16

"ఓ జగదీశా! వానింబట్టుకొని, వాలి పంపాపురమునకు వచ్చెను; స్నానసంధ్యాద్యనుష్ఠానములఁ జేసి, భగవంతునిఁ బ్రార్థించెను.

చౌపాయి

"ఓ నాథా! ఆఫలముల నెంతో ఆప్యాయముగ వాలి తీసికొనివచ్చెను. అంతలో నొకసర్పము వచ్చి, వానిపైఁ గూర్చుండెను; ఆసర్పము చంద్రమండలాకారముగ, ఫణమును విప్పి యాడుచుండెను. దాని వేషముఁ జూచి, వాలి కోపించి, 'ఓ సర్పమా! నాఫలముల నేల స్పృశించితివి? నీకుఁ బ్రాణములమీఁద నాశ లేదా? నీశరీరము భగ్నమై, దానిలోనుండి యేడు తాళవృక్షములు వెడలుఁగాక! ఇచ్చట నేప్రకారము కూర్చొనియుంటివో, ఆప్రకారమే నీవు తాళరూపమున నుండుము' అని శపించెను. దానిశరీరము భగ్నమై, దానిలోనుండి సప్తతాళము లావెంటనే వెడలెను. తదుపరి, వాలి స్వగృహమునకు వచ్చెను. ఈ శాపవృత్తాంతమంతయుఁ దక్షునకు విశదమయ్యెను.

దోహా 17

"కుమారునకుఁ గలిగినశాపమును తక్షకుఁడు విని, దుఃఖించెను. 'ఈ సప్తతాళముల నొకబాణముతోఁ బడఁద్రోయువానిచే వాలి చచ్చుగాక' అని తక్షకుఁడు వాలిని శపించెను.

చౌపాయీ

"ఓ నాథా! 'ఈ దుందుభికాయము నొకబాణముతోఁ జిమ్ము వాఁడు వాలికి మృత్యువగును; వానిచే వాఁడు చనిపోవును' అని మతంగముని శపించెను. మీరు కోరినప్రకారము యావద్వృత్తాంత మును మీకుఁ జెప్పినాను. మీ యాజ్ఞాప్రకారము సంచరించెద" అధి కపాఠము సమాప్తము.) శ్రీరాముఁడు సప్తతాళముల నొకబాణము తోఁ బడద్రోసెను; దుందుభికాయమును కాలిబొటనవ్రేలితోఁ జిమ్మె ను; ఆ శరీరము నూరుయోజనములదూరమునఁ బడెను. ఆ సప్తతాళ ములలోనుండి, సర్పము వచ్చి, రాముని యాజ్ఞాప్రకారము, నిద్రించు చుండిన వాలిని సమీపించెను; వాలికి దేవేంద్రుఁ డిచ్చియుండిన జయమాల నాపాము దొంగిలించి, దానిం దీసికొనివచ్చి, శ్రీరాము నకు సమర్పించెను. ఆ జయమాలను ధరించినవారు నిర్భయముగఁ బోరాడఁగలరు. ఆ సర్పము శ్రీరామునిస్తుతించి, నాగలోకమునకుఁ బోయెను. సుగ్రీవునికిమనస్సునకు నిబ్బరము కలిగెను; శ్రీరాముని బల పరాక్రమముల నతఁడుచూచి, సంతోషించెను; శ్రీరాముఁడు వాలిని సంహరింపఁగలఁడని విశ్వాసము కలిగెను. అతఁడు పెక్కుమారులు శ్రీ రామునిచరణములకు నమస్కరించెను; శ్రీవారిప్రభావముఁ దెలిసి కొనెను; సుగ్రీవునిమనస్సు నిర్మలమయ్యెను. శ్రీవారు పరబ్రహ్మస్వరూ పులని తెలిసినంతలో, నతనికి బ్రహ్మజ్ఞానము కలిగెను. "ఓ నాథా! మీ కృపవలన నా మనస్సు నిశ్చలమయ్యెను. ఓ స్వామీ! సంసారసుఖము లును, సంసారవైభవమును మిథ్యయని తోఁచును; వానినివిడిచి, సదా మిమ్ములను సేవించెదను. మీభక్తికి వానివలన బాధకలుగును. అటు లనే, సజ్జనులును మహాత్ములును జెప్పుచున్నారు; వారు సదా నీ చరణ ముల నారాధింతురు; శోకహర్షములు, శత్రుమిత్రులు మొదలగుద్వం ద్వములు మాయవలనఁ గనఁబడును. పరమార్థమునందుఁ గనఁబడవు;

వాలి నాకుఁ బరమహితుఁడు; అతని మూలమున, మీదర్శనము నాకుఁ బ్రాప్తించెను. ఓ ఆర్తరక్షకా! స్వప్నములో నొకనితోఁబోరాడి తెలివి వచ్చినతరువాత, నది మిథ్యయని తోఁచునుకదా! అటుల నీ సంసారములో మమకారము మొదలగువానిని మిథ్యయని తెలిసికొంటిని; జ్ఞానము కలిగినతరువాత, నవి మిథ్యయని తోఁచును. ఓ నాథా! మీరు కటాక్షించినయెడల, సర్వసంగములను విడిచి, దివారాత్రములు మీ చరణములను సేవించెదను; నాకీరాజ్యముగిజ్యముతోఁ బ్రయోజనము లేదు." ఈప్రకారము సుగ్రీవుఁడు చెప్పినమాటలను శ్రీరామమూర్తి విని సంతోషించెను. ధనుర్బాణములను ధరించి, శ్రీరాముఁడతనితో నిట్లు ప్రసంగించెను. "ఓ సఖుఁడా! నా వచనములు సత్యములు; నాప్రతిజ్ఞ నిష్ప్రయోజనము కాదు; నీకు రాజ్యము లభించును; రాజభోగముల ననుభవించి, తుదను నాలోకముఁ బొందఁగలవు. నీకుఁ బునర్జన్మ ముండదు." ఓ గరుడా! నటునిచేతిలోని వానరము లాడిన విధమున, శ్రీరాముని ప్రభావముచే జీవులు నృత్యముఁ జేయుదురు. అంతలో నతఁడు సుగ్రీవునిజ్ఞానము నాకర్షించెను. ("ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" అని గీతాప్రమాణము.) ధనుర్బాణములను ధరించి, శ్రీరాముఁడు సుగ్రీవునివెంట నడచెను. శ్రీరాముని యాజ్ఞాప్రకారము, సుగ్రీవుఁడు, వాని సింహద్వారమును సమీపించి, పెద్ద బొబ్బపెట్టెను. ఆబొబ్బను వాలి విని, కోపించెను; అతఁడు తమ్మునిపైకి వెడలుటకు సిద్ధపడెను. అంతలో నతనిభార్య, తార, యతనిచరణములఁ బట్టుకొని, ఇతఃపూర్వ మంగదుఁడు చెప్పినమాటల నతనితోఁ జెప్పెను. "ఓ నాథా! నామాట వినుఁడు; ఒకరిసహాయముఁ దీసికొని, సుగ్రీవుఁడు నీతోఁబోరాడుటకు వచ్చెను. అన్నదమ్ములు వారిరువురు మహాబలవంతులు; ఇంతకుఁబూర్వము సుగ్రీవుఁడు కొంచె దిగిఁయుండ లేదు; ఇప్పుడు వారిసహాయముఁ గోరి, యతఁడు నీమీఁదికి వచ్చెను. ఆ యన్నదమ్ములు దశరథమహారాజు కుమారులు; వారు శ్రీరామలక్ష్మణులు; యుద్ధములో వారు కాలునిసహితము జయింపఁగలరు. ఆ రఘు

రాముని హృదయములో ధ్యానింపుము; మోహమును విడిచిపెట్టుము; నామాటలను విశ్వసింపుము."

దోహా 18

ఆమె దీనాలాపములను వాలి విని, పక్కున నవ్వి, "ఓ భయస్థురాలా! శ్రీరాముడు సమదర్శియని చెప్పియుంటివి; అటులయిన యెడల, నతడు మా యిరువురను సమానముగ భావించును. నేనేమి యపరాధముం జేసియుండలేదు. ఒకవేళ నతడు నన్ను సంహరించిన యెడల, నాజన్మము సఫలమగును; నేను స్వర్గమునకుం బోగలను" అని యామెకు బోధించెను.

చౌపాయి

శ్రీరాముడు పరమేశ్వరుడనియు, అతడు సుగ్రీవునకు సహాయముం జేయుననియు, రాజకీయబుద్ధి స్త్రీనిషేధించుట యపశకునమని వాలికిం దెలిసియుండినను, దురభిమానముచేత నతడు సుగ్రీవునిం దృణప్రాయముగ భావించి, యుద్ధమునకు వెడలెను. సుగ్రీవుడు, యుద్ధమునకు సిద్ధముగ నుండెను. రామునిం జూచి యతడు మండిపడెను. వారిరువురు ముష్టియుద్ధము నొనరించిరి; వాలిప్రహారణమునకు సుగ్రీవుడు నిలువలేక పారిపోయెను. పిడుగులవంటి గుద్దుల నాతడు గుద్దెను; అందుచేత, సుగ్రీవుడు సొమ్మసిల్లి, రామునివద్దకు వచ్చెను. "ఓ నాథా! నాయన్న యన్న కాడు; నాపాలి మృత్యుదేవత" అని రామునితో నతడు విలపించెను. "ఓ సఖుడా! మీ రిరువురిరూపములు సమానము; కనుక, నే నతనిని జంపలేదు." అని రాముడు సమాధానముం జెప్పెను. (దీని తాత్పర్యమేమి? ప్రథమమున, "ఓ రామా! వాలి నా హితుడు" అని, సుగ్రీవుడు చెప్పెను. "ఓ సఖుడా! మీరూపములు సమానము—మీరిరువురు నాకు సమానులు అని భావము—అందుచేత, వానిని జంపలేదు." అని రాముడు చెప్పెను. తరువాత, "ఓ నాథా! వాలి నాపమృత్యుదేవత" అని సుగ్రీవుడు రెండవపర్యాయము చెప్పినతరువాత, "ఓ సఖుడా! నిశ్చయముగ నీయన్నను సంహరించెదను" అని రాముడు సుగ్రీవునకు బోధించెను.) శ్రీరాముడు సుగ్రీవునిశరీరమును నిమిరినందున,

నతనినొప్పులన్నియు నివారణ మయ్యెను. సుగ్రీవునిమెడలో నొక పుష్పమాలిక నతఁడు తగిలించెను; అనేకవిధముల నతనిని యుత్సాహించి, యుద్ధమునకుఁ బంపెను. (పుష్పమాలికను దగిలించుటకుఁ గారణమేమి ? శ్రీరాముఁడు సమదర్శియని వాలి పలికెను. అందుచేత, వాలికంటె సుగ్రీవుఁడే తనకుఁ బ్రియుఁడని తారకుఁ దెలియుటకొఱకు శ్రీరాముఁడు పుష్పమాలికను సుగ్రీవుని మెడకుఁ దగిలించెను.) రెండవమాఱు వాలిసుగ్రీవులకు గొప్ప ముష్టియుద్ధముఁజరగెను; చెట్టుచాటుననుండి వారియుద్ధము నతఁడు చూచుచుండెను. (చెట్టుమఱుగుననుండుటకుఁ గారణమేమి ! వాలికి యెదురుగనిలువఁబడియుండిన వీరుని బలములో సగముబలము వాలికిఁ బోవునని చెప్పినమాట, పరమేశ్వరునియెడల సరిపడదు. మఱి యేకారణముచేత శ్రీరాముఁడు చెట్టుచాటున నుండెను ? ఒకవేళ, శ్రీరాముని వాలిగాని చూచియుండినయెడల, నతఁడు తమ్మునితో యుద్ధముఁజేయక, శ్రీరామునకు జోహారువనను; అందువలన, శ్రీరామునిప్రతిజ్ఞకు భంగముకలుగును.)

దోహా 19

శరీరములో బలముండినంతవఱకు సుగ్రీవుఁడు వాలితోఁ బోరాడెను; ఎప్పుడు బలముక్షీణించెనో, వాఁ డప్పుడు శ్రీరామునిశరణుఁజొచ్చెను. ఆ తక్షణము, శ్రీరాముఁడు, వాలిహృదయమును లక్ష్యముఁ గలిగించి, బాణమును బ్రయోగించెను. (ఆ వాలి దురభిమాని కనుక, వానిహృదయమును ఛేదించెను.)

చౌపాయ్

ఆ దెబ్బతో వాలి గిరగిరమని నేలఁబడెను; ఆ బాణము వాని హృదయమును ఛేదించి, రామునితూణీరములోఁ బ్రవేశించెను. వాలి దిగ్గున లేచికూర్చుండెను; ఆ వెంటనే, శ్రీరాముఁడు వానియెదుట నిలువఁబడెను; ఆ శ్యామలశరీరుఁడు, ఆ రాజీవలోచనుఁడు, ఆ జటామకుటధారి, వాలినేత్రములకుఁ గనఁబడెను; ఆ ధనుర్ధరుని వాలి నఖశిఖాపర్యంతము జూచిచూచి, వెలవెలఁబోయెను; "ఈ దివ్యమంగళవిగ్రహుఁడు సాక్షాత్పరమేశ్వరుఁడు కదా ! ఇంత విపరీతకార్యము నేలఁజేసెను. అట్లుకాదేని, నాతోఁజెప్పు, నన్ను వధించియుండిన, బా

గుగనుండును ; ఇతఁడు సుగ్రీవునివలనఁ బొందిన లాభమేమి? ఇదియం తయు భగవంతునికృప." అని వాలి చింతించి, హృదయము నిర్మలముగ నుండినను, గర్ణకఠోరముగ రామునితోఁ బ్రసంగించెను. "ఓ నాథా! ధర్మసంస్థాపనార్థము నీవు భూలోకములో నవతరించితివి కదా! వేఁట కానివలె దాఁగియుండి, నన్నేల వధించితివి! నేను నీ శత్రువునా! సుగ్రీవుఁడు నీకుఁ బ్రియుఁడా? నన్నేలవధించితివి!" వాలిమాట లను శ్రీరాముఁడు విని, వానితో నిట్లుపలికి, వానితప్పులను జూపిం చెను. "ఓ వాలీ! తమ్మునిభార్యయు, చెల్లెలును, కోడలును, కూఁతు రును సమానులు ; పాపదృష్టితో వారిం జూచినవాఁడు పాపాత్ముఁడు; ఆపాపాత్ముని సంహరించినను, పాపములేదు. నీవు నీ తమ్మునిభార్యను సంగ్రహించితివి ; అంతకంటెఁ బాప మేదికలదు? ఓ మూర్ఖుఁడా! నీవు దురభిమానివి ; నీ భార్యచెప్పినమాటను నీవు మన్నింపక, యుద్ధము నకు వచ్చితివి; నీకు సర్వజ్ఞత్వము హెచ్చయ్యెను ; నాసంగతిఁ దెలిసి, నేను సుగ్రీవుని రక్షించితినని తెలిసియు, నీవు వానిం జంపవచ్చితివి."

దోహా 20

ఈప్రకారము, శ్రీరాముఁడు పలికినపలుకులను వాలి విని, "ఓ నాథా! మీయెడల నా చమత్కారము వ్యర్థమయ్యెను. నా విన్నప మును వినుము ; ఓ నాథా! నా అంత్యకాలమున మిమ్ములఁ జూచెడి భాగ్యము కలిగెను. నేనేల పాపాత్ముఁడను? నాపాపములు నశించెను." అని స్తుతించెను.

చౌపాయ్

వాలి స్తవమును శ్రీరాముఁడు విని సంతసించి, యతనిశిరముపై స్వహస్తము నుంచెను. "ఓ వాలీ! నీప్రాణములనిచ్చెద ; నీకు జరామర ణములు లేకుండ జేయువాఁడను; నీ శరీరమును నిలువఁ బెట్టుకొనుము." "ఓ కృపాసముద్రుఁడా! నావిన్నపము నాలకింపుఁడు ; ఆ జన్మాంత ము నేకయత్నములఁ జేసినను, ప్రాణప్రయాణసమయమున మునీశ్వరుల ముఖమునుండి నీనామము వెడలదు. నీ నామప్రభావమువలన, శ్రీ సాంబశివుఁడు కాశీనగరములో జీవులకు ముక్తి నిచ్చుచుండును. ఆ సాక్షాత్ భగవంతుఁడవు ; నీవు నాయెదుటకు స్వయము వచ్చి నిలిచి

యుంటివి. ఓ నాథా! ఈ యదృష్టము మరల నాకుఁ గల్గునా? పునః మీదర్శనము నాకు లభించునా?

ఛాంద్ 1, 2

"ఓ నాథా! వేదములుసహితము 'న-ఇతి, న-ఇతి' అని పలుకు చుండిన నీవు నా యదృష్టమువలన, నాయెదుట నిలిచియుంటివి. ఇంద్రియములను నిగ్రహించి, ప్రాణవాయువులను బిగించి, వానిని క్షణముగ షట్చక్రములపై నడిపించి, సహస్రారములో మునీశ్వరులు దర్శించు మహానుభావుఁడవు; నీవు నా దురభిమానముఁ జూచి, నాకుఁ బ్రాణములనిచ్చెదనని పలుకుచుంటివి. కల్పవృక్షమును బడద్రోసి, తానుఁగు చెట్టును గోరునట్టిమూర్ఖుఁడు కలఁడా! ఓ నాథా! కటాక్షించి నా వైపుఁ జూడుము. నేఁ గోరినవరమును బ్రసాదింపుము. నా కర్మానుసార మేయోనులయందుఁబుట్టినను, నీ చరణములయందు నాకు భక్తి కలుగునట్లు ప్రసాదింపుము. (ఇప్పుడు వాలిచిత్తము చలించెను. అతనికి భేదదృష్టి కలిగెను. అనన్యభక్తి కలదివునకుఁ గర్మములునశించునని తెలిసికొనక, నతఁడావరముఁగోరెను. అనన్యభక్తియుండినవానికిఁ గర్మములు నశించును; త్రివిధకర్మలు నశించినపుడు, వానికి జన్మము లుండవు. అతఁడు కోరినవరముప్రకారము ద్వాపరయుగములో శ్రీ కృష్ణ నిర్యాణమువఱకును ముక్తి లేకపోయెను.) ఓ నాథా! వీఁడు నా పుత్రుఁడు; నావంటిబలవంతుఁడు; వినయవివేకసంపన్నుఁడు. ఓ దేవాదిదేవా! అభయము నిచ్చి, వీనిం గాపాడుము. వీనిని రక్షించెదనని వీనిహస్తముఁ బట్టుకొని, నాకు ధైర్యముఁ జెప్పుము. వీనిని నీ దాసునిగ భావింపుము. ఇదియే నాప్రార్థన."

దోహా 21

ఈ ప్రకారము భగవంతునిఁ బ్రార్థించి, కుమారుని నప్పగించి, సునాయాసముగ వాలి ప్రాణములను విడిచిపెట్టెను. కంఠమునుండి పుష్పమాలిక జాఱిపడినను, యేనుఁగునకు లక్ష్య ముండదుకదా! అంత నిర్లక్ష్యముగ నతఁడు ప్రాణములను విడిచెను.

చౌపాయ్

శ్రీరాముని కటాక్షమువలన, నతఁడు స్వర్గమునకుఁ బోయెను; పంపాపురవాసులు వాలిమరణమునకు దుఃఖించిరి. అనేకవిధముల నతని

భార్య తార, విలపించెను. ఆమె శిరోజములు వీడిపోయెను; ఆమె స్మారకరముదప్పి నేలఁబడెను. మరల లేచి యామె వాలిశిరస్సును తన గుండెలమీఁదఁ బెట్టుకొని, వానిముఖముఁ జూచి, యేడ్వసాగెను. "ఓ నాథా! నామొర నాలకింపవేమి? అనేకవిధముల నిన్ను బోధించితిని; విధికృతమువలన, నా బోధనలు నీ మనస్సునకుఁ బట్టలేదు. నీకు మారునిఁ జూడవేమి! నాతో ముచ్చటింపవేమి! మాకు బ్రదుకుఁ ద్రోవం జూపవేమి! మమ్ములను విడనాడి, పరలోకమునకుఁ బోవుట న్యాయమా? ఇది నీకుఁదగునా! ఓ నాథా! ఇంత నిర్దయుఁడవేమి?" ఈప్రకారము విలపించుచుండిన దారం జూచి, శ్రీరామమూర్తి జాలిఁబడి, మాయనుబోఁగొట్టి, ఆమెకు జ్ఞానము నుపదేశించెను. "ఓ తారా! ఎందులకు విలపించెదవు! ఈశరీరము లనిత్యములు. ఈశరీరము పంచభూతాత్మకము. ఇది నికృష్టము. ఆతుచ్ఛశరీరము నీయెదుటఁ బడియున్నది; నీ యిష్టముప్రకారము దానిం జేయుము; కాదేని · నాత్మనిమిత్తము నీవు దుఃఖించినయెడల, నాత్మ నిత్యమని తెలిసికొనుము. అట్టి యాంత్మనిమిత్తము విలపించుట యేల!" శ్రీవారి వచనములవలన, నామెకు జ్ఞానము కలిగెను. శ్రీవారిచరణముల కామె నమస్కరించి, పరమభక్తినిఁ బ్రసాదింపుమని ప్రార్థించెను. ఓ పార్వతీ! కర్రబొమ్మలను వలె, శ్రీవారు జీవుల నాడించెదరు. శ్రీవారి యాజ్ఞాప్రకారము, సుగ్రీవుఁడు వాలికి నుత్తరక్రియలఁ జేసెను. శ్రీవారియాజ్ఞ ననుసరించి, లక్ష్మణుఁడు నగరములోనికి వెళ్లి, సుగ్రీవునకుఁ బట్టముఁ గట్టెను. శ్రీవారిచరణములకు నమస్కరించి, వారియనుమతిఁ గైకొని, హనుమదాదులు నిష్క్రమించిరి.

దోహా 22

బ్రాహ్మణులను పురజనులఁ బిలిచి, వారియెదుట లక్ష్మణుఁడు సుగ్రీవునకుఁ బట్టముఁ గట్టెను; అంగదునకు యువరాజ్యపట్టాభిషేకముఁ జేసెను.

# తృతీయ విశ్రామము.



చౌపాయి

ఓ పార్వతీ! శ్రీరామునివంటి గురువును, దండ్రియుఁ దల్లియు, సఖుఁడును, హితకారియు, బంధువును లేఁడు. అతఁడే సర్వముసుమీ! దేవతలును, నరులును, మునులును స్వార్థపరులు; కాని, శ్రీరాముఁడు పరోపకారుఁడు. వాలిభయముచేత, సుగ్రీవుఁడు భయపడుచుండెను; అతనిశరీరము కాంతిహీన మయ్యెను; ఆవిచార మతనిగుండెలను దివారాత్రములు దహించెను. ఆ శ్రీవారికృపవలన, నతనికి వానరప్రభుత్వము వచ్చెను కదా! శ్రీవారిస్వభావ మతికోమలము. శ్రీవారిస్వభావమును దెలిసియుండియు, వారిని విడిచిపెట్టినవారు విపత్తిజాలములో నేల పడరు? అంతట శ్రీవారు సుగ్రీవునిఁ బిలిచి, యతనికి రాజధర్మముల నుపదేశించిరి. శ్రీవారిని నగరములోనికి విజయముఁ జేయుమని సుగ్రీవుఁడు ప్రార్థించెను. "ఓ సఖుఁడా! పదునాలుగుసంవత్సరములవఱకు నేను నగరములోఁ బ్రవేశింపఁగూడదు" అని వారు పలికిరి. అంత గ్రీష్మఋతువు గడచెను; వర్షఋతువు ప్రవేశించెను; ఆ వర్షకాలములో శ్రీరామలక్ష్మణులు ఋష్యమూకపర్వతముపై నివసించియుండిరి. "ఓ సఖుఁడా! అంగదుని సమ్మతిప్రకారము నీవు రాజ్యముఁ జేయుము. సహాయము వచ్చువఱకు, నా కార్యమును జ్ఞప్తిలో నుంచుకొనుము." ఈప్రకారము శ్రీవారు చెప్పినమాటలను విని, సుగ్రీవుఁడు పంపాపురమునకు నిష్క్రమించెను; శ్రీరామలక్ష్మణులు ప్రవర్షణపర్వతముపై నివసించిరి.

దోహా 23

శ్రీరాముఁడు వర్షకాలములో నా పర్వతముపై నివసించునని తెలిసికొని, దేవతలు గుహను కల్పించియుండిరి. ఆ వర్షకాలములో వా రిరువురు నా గుహలో నుండిరి.

చౌపాయ్

ఆ వర్ష కాలములో వృక్షములు పుష్పములతో శోభించెను; మధుపములు తేనెనిమిత్తమాశపడి, ఝుంకారముఁ జేయుచుఁ దిరిగెను. కంద, మూల, ఫల, పత్రములు మొదలగునవి, శ్రీవారినిమిత్తము, ప్రకట మయ్యెను. ఆ మనోహరమగు పర్వతముపై నా దేవదేవుఁడు విహరించెను; నివసించియుండినమాత్రమున, నా పర్వతము శోభస్కరముగ నుండెను; ప్రకృతిసంపదలతో నిండెను. దేవతలు, మృగపక్షీరూపములను ధరించి, చిత్రచిత్రముగ సంచరించి, రూపురేఖావిలాసములచేతను, మధురగాత్రములచేతను శ్రీవారికి వినోదముఁ గలిగించిరి. మునులును సిద్ధులును వారి దర్శనముఁ జేయుచుండిరి. ఒక శిలాతలముపై, శ్రీరామలక్ష్మణులు సుఖముగఁ గూర్చుండిరి. భక్తివైరాగ్యములను, రాజధర్మములను, శ్రీవారు లక్ష్మణున కుపదేశించిరి. అంతరిక్షమున మేఘములు వ్యాపించి, ఉరుములుమెఱుపులతోఁ గూడి, సంతధారగ వర్షించెను.

దోహా 24

"ఓ తమ్ముఁడా! లక్ష్మణుఁడా! విష్ణుభక్తులగు వైరాగులఁ జూచి, గృహస్థు సంతోషించువిధమున, మేఘములఁ జూచి, మయూరములు నృత్యముఁ జేయుచున్నవి; చూడుము.

చౌపాయ్

"ఓ తమ్ముఁడా! ఆ మేఘముల ధ్వని విని, ప్రియురాలివియోగమువలన దుఃఖించుటచేత, నా మనస్సు భయపడుచున్నది. దుష్టుల చిత్త మెంత చంచలమో, ఆమెఱుపులప్రకాశ మంత చంచలము. విద్యావంతులు వంగియుండినవిధమున, నా మేఘములు భూమిమీఁదకు వంగి వర్షించును. దుష్టులవచనములను సత్పురుషులు సహించువిధమున, నా వర్ష ధారలను పర్వతములు సహించును. పశుపతులు వర్ష ధారలను సహింపనివిధమున, నా దుర్జనులవచనములను దుర్జనులు సహింపరు. స్వల్పభాగ్యముచే దుష్టులు విఱ్ఱవీఁగువిధమున, నా నదులు పొంగి ప్రవహించును. మాయలోఁబడినజీవుఁడు కలంకముఁ బొందినవిధమున, నా వర్షజలము భూమిమీఁదఁ బడి, కలంక మగును. సజ్జనులు సద్గుణ

ములను సంగ్రహించువిధమున, నా సరోవరములు వర్షజలమును గ్రహించును. ఈశ్వరునిఁ బొందినజీవులు నిశ్చలమగువిధమున, నా నదీజలములు సముద్రముఁ బొంది, నిశ్చలమగును.

దోహా 25

"ఓ తమ్ముఁడా! పాషండుల వివాదములచే వేదమార్గములు కప్పఁబడి కనఁబడనివిధమున, వనములోని పదమార్గములు (కాలిత్రోవలు) పచ్చగడ్డి మొలచుటచేత, మఱుగుపడెను.

చౌపాయ్

"బ్రహ్మచారులు వేదమును వర్ణించువిధమున, మండూకములు బెకబెకలాడును. సాధువులచిత్తము జ్ఞానముచే వికసించువిధమున, వృక్షములన్నియు నూతనపత్రములతో వికసించెను. ధర్మాత్ముఁడగు రాజు రాజ్యములో దుర్మార్గులు నశించువిధమున, జిల్లేడు, జవాసములు నశించెను. క్రోధముచే ధర్మమార్గము మఱుగుపడినట్లు, బురదచేఁ గాలిత్రోవలు మఱుగువడెను; వెదకినను గానరావు. పరోపకారుని సంపదవలె, భూమియంతయు పరిచేనుతో నిండెను. మూర్ఖుల కాష్ఠవాదములువలె, నంధకారము ఖద్యోతములతో నిండెను. స్వాతంత్ర్యము వచ్చినస్త్రీవలె, భూముల గట్లు తెగిపోయెను. మహాత్ములు కామక్రోధాదుల నూడఁదీసి, చిత్తమును శుభ్రముఁ జేసికొనువిధమున, హాలికులు పొలములలోని గాబు నూడఁదీసి వానిని శుభ్రముఁ జేసిరి. కలియుగములో వర్ణాశ్రమధర్మము లదృశ్యమగువిధమున, వర్షకాలములో స్త్రీపురుషచక్రవాకము లదృశ్య మయ్యెను. సత్పురుషుల హృదయములో లేశమపి కామ మంకురింపనివిధమున, నూషరక్షేత్రములలో లేశమైనఁ దృణ మంకురింపదు. ధర్మరాజురాజ్యములోఁ బ్రజాభివృద్ధి యగువిధమున, వర్షకాలములో సకలజంతువు లభివృద్ధినొందెను. జ్ఞానము లభించినతరువాత, నింద్రియములు విశ్రమించువిధమున, వర్షముచే మార్గములు మఱుగుపడినందున, పాంథులు విశ్రమించిరి.

దోహా 26, 27

"కుపుత్త్రుఁడు పుట్టినందునఁ గులధర్మములు నశించువిధమునఁ, బ్రచండవాయువులు వీఁచినందున, మేఘములు చెదరెను; దుర్జనసాంగత్యమువలన, జ్ఞానము నశించును; సజ్జనసాంగత్యమువలన, జ్ఞానము విక

సించును. అటులనే మేఘములచే నొకప్పుడు సూర్యుఁడు కప్పఁబడును; మఱియొకప్పుడు, మేఘములు వీడినందున, సూర్యుఁడు ప్రకాశించును.

చౌపాయ్

"ఓ తమ్ముఁడా! వర్షకాలము గతించెను; శరదృతువు వచ్చెను. పృథ్వియంతయుఁ బచ్చనిగడ్డితో శోభించుచున్నది. వర్షకాలమునకు వృద్ధాప్యము వచ్చినట్లు, గడ్డిపువ్వులు పుట్టెను. సంతోషముచే లోభము క్షీణించువిధమున, నగస్త్యోదయమువలన జలములు శోషించెను. కామమోహాదులు క్షీణించినందున, మనస్సు నిర్మల మగువిధమున, నదీసరోవరజలములు నిర్మల మయ్యెను. కొంచెముకొంచెము జ్ఞానికి మమకారము తగ్గినవిధమున,నదీసరోవరజలములు కొంచెముకొంచెము తగ్గెను. శరత్కాలములోఁ గాటుకపిట్ట వచ్చినవిధమున, మంచిదినములు వచ్చినపుడు శుభకర్మలు ఫలించును. (కాటుకపిట్టకు వర్షకాలములోఁ గంటిపై నొకరెక్క పుట్టును; అందుచేత, దానిదృష్టి చెడును. శరత్కాలములో నా రెక్క యూడిపోవును; దానికి దృష్టివచ్చును.)— భూమిమీఁద బురదగాని ధూళిగాని కనఁబడనివిధమున, రాజధర్మములను గుర్తెఱింగిన రాజు దేశముఁ బరిపాలించుచుండ, (నీ) ఈతిబాధలు నశించెను. ధనములేనందున, గొప్ప కుటుంబీకుఁడు వ్యాకులపడిన విధమున, జలములు క్షీణించినందున, మత్స్యములు వ్యాకులము పడెను. నిష్కాముఁడగు హరిభక్తునిహృదయము ప్రకాశించువిధమున, నంతరిక్షము మేఘములు లేనందున, నిర్మల మయ్యెను. కోట్లలో నొకఁడు నా భక్తుఁడు నివసించువిధమున, శరత్కాలములో నచ్చటచ్చట వర్షము పడును.

దోహా 28

"ఓ తమ్ముఁడా! రాజులును, తపశ్శాలులును, వర్తకులును, భిక్షుకులును, శరత్కాలము వచ్చినందున, స్వగృహములను విడిచి, వారివారికార్యములపై విదేశములకు వెడలుచుందురు. చతురాశ్రమములవారును హరిభక్తులం జూచినతరువాత, వారివారి యాశ్రమములకష్టములు చల్లారును. రాజులు దండయాత్రకును, వర్తకులు వ్యాపారమునకును, వానప్రస్థులు తపోవనములకును, భిక్షుకులు యాచనార్థమును, ప్రయాణము సాగించెదరు. ఈ నాలుగాశ్రమములవారును

నాభక్తిఁ బొంది, యటుమీఁద వారివారి యాశ్రమధర్మముల ననుష్ఠించెదరు.

చౌపాయ్

"ఎచ్చట జలములు లోఁతుగనుండిన, నచ్చట మత్స్యములు నివసించును; అటులనే, నారాయణునిభక్తిని దాపుఁ జేసికొనినవారు సుఖముగ జీవించెదరు. వికసించిన కమలములతో నిండిన సరోవరము వలె, సగుణరూపమును ధరించిన నిర్గుణబ్రహ్మము లోకములోఁ బ్రకాశించును. అనేకభృంగములు ఝంకారముఁ జేయుచుండెను; అనేకపక్షులు పలువిధముల మనోహరముగఁ గూయుచుండెను. స్త్రీపురుష చక్రవాకములు రాత్రిసమయమున దుఃఖించువిధమున, నితరులసంపదఁజూచి దుర్జనుఁడు దుఃఖించును. స్వాతివానలు పడనంతవఱకుఁ జాతకము దాహముచే బాధపడువిధమున, శివద్రోహి సుఖములేక శ్రమపడును. శరత్కాలాతపతాపమును జంద్రుఁడు నివారించువిధమున, పాపాత్ములపాపములను మహాత్ములు నివారించెదరు. చంద్రునిఁ జూచి, చకోరములు సంతసించువిధమున, భగవద్భక్తిఁ బొందినతరువాత సజ్జనులు సంతోషించెదరు. హిమంతమునకు భయపడి, దోమలును నల్లులును నశించువిధమున, బ్రాహ్మణులను ద్వేషించిన వానివంశము నశించును; వానికులము క్షయమగును.

దోహా 29

"ఓ తమ్ముఁడా! వర్షకాలములో సకల జీవజంతువులు వృద్ధిఁ బొంది, శరత్కాలములో నశించువిధమున, సద్గురువు నాశ్రయించుట వలన, సకలమోహాదులు నశించును.

చౌపాయ్

"ఓ లక్ష్మణా! వర్షకాలము గతించెను; శరత్కాలము ప్రవేశించెను. ఇంతవఱకు సీతసమాచారము తెలియలేదు. ఒకనిమిషములోఁ గాలుని జయించి, ఆమెసమాచారముఁ దీసికొని రాఁగలను. ఆమె యెచ్చటనైన జీవించియుండినయెడల, నామెను తీసికొని రాఁగలను. సుగ్రీవుఁడు సకలరాజ్యమును భార్యతోఁగూడ సంగ్రహించి నన్ను మఱచెను. అతనిపై నాకుఁ గోపములేదు. ఈరోజున నతఁడు నావద్దకు వచ్చి, నాతోఁ బ్రసంగింపనియెడల, వాలిని సంహరించినబాణముతో

నతనిని సంహరించెదను.” ఓ పార్వతీ! ఆ మహాత్మునికృపవలన, సకల కామాదులు నశించును కదా! అతనికి స్వప్నమందయినను, కోపమను మాట లేదు. తప్పుమార్గమున సంచరించుదాసులను మంచిమార్గమునకుఁ దీసికొనివచ్చుటకు భగవంతుఁడు దాసులను భయపెట్టును కాని, యతనికి నిజముగఁ గోపము లేదు. ఓ పార్వతీ! భగవంతుని లీలావతారచర్యలను విని, మునులును జ్ఞానులును సంతోషించెదరు. శ్రీరాముని వచనములను విని, లక్ష్మణుఁడావెంటనే, ధనుస్సునకు బాణమును సంధించెను. “ఓయీ! తమ్ముఁడా! సుగ్రీవుని సంహరింపకుమీ!

దోహా 30

“అతనిని సంహరించుట నామతముకాదు. అతఁడు నాభక్తుఁడు; అతనిని మాటలచే బెదరింపుము.” అని యా కరుణాసముద్రుఁడు తమ్మునకు బోధించెను.

చౌపాయీ

“ఆహా! సుగ్రీవుఁడు కృతకృత్యుఁ డయ్యెను; అందుచేత, నతఁడు శ్రీరామకార్యమును మఱచిపోయెను.” అని హనుమంతుఁడు విచారించి, సుగ్రీవునిసమీపించి, యతనికి నమస్కరించెను. “ఓనాథా! సామ,దాన,భేద, దండములని చతురోపాయములను రాజులు గ్రహింపవలెను. సామదానములచే నీకార్యమును శ్రీవారు నిర్వహించిరి; వారికార్యము నుపేక్షించితివి; భేద, దండములను వారు నీమీఁద నుపయోగించెదరు; కనుక, సీతాన్వేషణమునిమిత్తము శీఘ్రము దూతలఁ బంపుము.” ఈప్రకార మతఁడు సుగ్రీవునకు బోధించెను. ఆ మాటలకు వానరపతి భయపడి, త్రుళ్లిపడెను. “ఓ పవనతనయుఁడా! విషయభోగములలోఁ బడి, నాబుద్ధి మందమయ్యెను. నలువైపులకు దూతలఁ బంపి, వానరులను, వానరయోధలను శీఘ్రముగ రప్పింపుము. రెండువారములు వ్యవధి నిచ్చుచున్నాను; నా యాజ్ఞప్రకారము వారిలో నెవరు రాకపోయినయెడల, వారికిఁదగిన శాస్త్రియగును.” ఈప్రకారము సుగ్రీవుఁ డాజ్ఞాపించెను. ఆతక్షణము హనుమంతుఁడు వానరదూతలఁ బిలిచి, వారిని నాదరించి, రాజాజ్ఞను వారితోఁజెప్పెను. “ఓ దూతలారా! మిమ్ము రాజు సత్కరించును; మీరు శీఘ్రము పోయిరండు.” అని హనుమంతుఁడు పలికి, వారినిం బంపెను. సుగ్రీవునివచనముల

నంగదుఁడు విని, "ఓ నాథా! హనుమంతుఁడు లేనియెడల, నీకార్య మును సాధించుట దుర్లభము." అని విన్నవించెను. (అధికపాఠము.) "ఓ నాథా! వాయుపుత్రుఁడు, సప్తకులపర్వతములను, సప్తసాగరము లను, సప్తద్వీపముల నెఱుంగును; అతఁడు సరసుఁడు; బుద్ధిమంతుఁడు; బలవంతుఁడు; అతఁడు కేసరిపుత్రుఁడు; వాయుమూర్తియంశము వలనఁ బుట్టెను. అతనిని మీరు ప్రయాణముఁ జేయింపుఁడు." అని అంగదుఁడు విజ్ఞాపనముఁ జేసికొనెను. అంతట నాంజనేయుని సుగ్రీ వుఁడు పిలిచి, "ఓ వాయుకుమారుఁడా! శ్రీవారికార్యమును నీవు సాధింపవలెను; సకలవానరులను నీవే సమావేశముఁ జేయవలయును" అని యాజ్ఞాపించెను. సుగ్రీవునియాజ్ఞాప్రకార మతఁడు కుప్పించి, యె గసి, తూర్పుదిక్కునకు వచ్చెను. అచ్చట నివసించియుండిన వానరు లందఱు హనుమంతునిఁ జూడవచ్చిరి. వా రతనికి నమస్కరించిరి. "ఓ నాథా! ఏల మీ రింతశ్రమపడి వచ్చితిరి! మీరు కిష్కింధాధి పతుల సన్నానులుకదా! మీ యాజ్ఞాప్రకారము మేము చేయఁదగిన కార్యమును శిరసా వహించెదము." అని పూర్వదిశవానరులు విన్న వించిరి. "సుగ్రీవుని యాజ్ఞాప్రకారము, మీరు విలంబముఁజేయక, శీఘ్రము పంపాపురమునకు విజయముఁ జేయుఁడు. గొప్పకార్యమును సాధింపవలయును." ఈప్రకార మతఁడు చెప్పినమాటలను వారు విని, "సుగ్రీవకీ జయ్" అని కేకలువేసి, ఆకాశమార్గమున వెడలిరి.

దోహా 31

సేనాధిపతులగు గయగవాక్షులవెంట అనేకలక్షలవందలవా నరు లంతరిక్షమున కెగసి, నడచిరి.

చౌపాయీ

[illegible] బంపి, ఆంజనేయుఁడు కుప్పించి, రోహితపర్వతమువద్దకు వచ్చెను. ఆ పర్వతమువద్ద నివసించియుండిన దుర్ధర్షునితో నతఁడు రాజాజ్ఞఁ జెప్పి, యచ్చటనుండి కదళీవనమునకు వచ్చెను. అచ్చట నివసించియుండిన గజుఁడను వానరునిఁ జూచి, "ఓ గజుఁడా! గొప్పకార్యమును సాధింపవలెను; కనుక, సుగ్రీవుని యాజ్ఞా ప్రకారము శీఘ్రము నీవు నీసైన్యములతో రాజనగరమునకుఁ బొమ్ము. నిన్నుఁ జూచి, రాజు ధైర్యము నవలంబించును" అని కపీశ్వరుఁడు పలికెను.

'తథాస్తు' అని వానరు లేకగ్రీవముగఁ బలికి, ప్రయాణమునకు దిగ్గున లేచిరి. వారిదాఁడికి భూమి కంపించెను; శేషుఁడు కలవరపడెను. అనేకపద్మముల కోట్లవానరులతో ద్వివిదుఁడును గజుఁడును వెడలిరి; భూమియంతయు చీఁకటి వ్యాపించెను. తదుపరి, హనుమంతుఁడు 'వ్యాహార' పర్వతమువద్దకు వచ్చి, బలవీరునికుమారునిఁ బిలిచెను; అతఁడు అనేకలక్షల వేలవానరులతో వచ్చి, వాయుపుత్రునకు జోహారునెను. "ఓ నాథా! ఏల మీ రింతశ్రమపడి వచ్చితిరి! మీయాజ్ఞను శిరసావహించెదను." అని యతఁడు పలికినపలుకులను హనుమంతుఁడు విని, శ్రీరామ సుగ్రీవవృత్తాంతము నతనికిఁ జెప్పి, పంపాపురమున కతనినిఁ బంపెను. అచ్చటనుండి యతఁడు వెడలి 'ధుంధుమార' పర్వతమునకు వచ్చెను. అచ్చట నివసించియుండిన శ్రీఖండవానరులను వారి సేనాధిపతులతో నతఁడు రాజాజ్ఞఁజెప్పెను; వారు అనేకకోట్లవానరులతో నతనికి నమస్కరించి, ప్రయాణమును సాగించిరి. అచ్చటనుండి యతఁ 'డంజన'పర్వతమునకు వచ్చెను; ఆ ప్రదేశములో నుండిన వానరులకు 'కుముదుఁడు' సేనాధిపతి. సుగ్రీవునియాజ్ఞాప్రకార మా సేనాధిపతి అనేకపద్మముల వానరవీరులతో వెడలెను. 'శ్రీరామజీకీ జయ్' అని కేకలువేయుచు హనుమంతుఁడు కుప్పించి యెగసి, 'నీలగిరి' పర్వతము మీఁద వ్రాలెను. అచ్చట నీలుఁ డనువానరుఁడు నివసించును; అతఁ డగ్నివంటివాఁడు; మహాబలవంతుఁడు; బుద్ధిమంతుఁడు. అతఁడు హనుమంతుని వచనములను విని, మేఘమువలె గర్జించెను. అనేకార్బుదముల బారువుల వానరయోధులతో నతఁడు వెడలెను. 'శ్రీరామజీకీ జయ్' అని వానరయోధులు ధ్వనులఁజేయుచు, వృక్షములను బర్వతముల నాయుధములుగ ధరించి, వెడలిరి. అచ్చటనుండి, హనుమంతుఁడు వెడలి, యుత్తరదిక్కునుండిన 'బదరికాశ్రమ'మునకు వచ్చెను; అచ్చట నతఁడు 'గంధమాదనపర్వత' మునకు వచ్చెను; అచ్చటి సరోవరములఁ జూచినందున, నతనిమనస్సున కాహ్లాదము కలిగెను.

దోహా 32

ఆవల నతఁడు గజగవాక్షులఁజూచి, వారితో సుగ్రీవునివర్తమానముఁ జెప్పెను. వా రతనికి నమస్కరించి, యుత్సాహముతో వెడలిరి.

చౌపాయ్

అచ్చటనుండి మహావీరుఁడు 'అర్జునపర్వత'మునకు వచ్చెను. అచ్చట, తారతంద్రి నివసించియుండును; అతఁడు మహాబలవంతుఁడు; అతఁడే సుషేణుఁడు; బుద్ధిమంతుఁడు; ధైర్యశాలి; తేజస్సంపన్నుఁడు. యావద్వృత్తాంతము నతనికి విన్నవించి, హనుమంతుఁడు 'సుమేరు పర్వత'మునకు వచ్చెను. అతనిశరీరము సువర్ణచ్ఛాయను బోలియుండును; అతని విశాలమగునేత్రము లరుణములు. అతఁడు గర్జించుచు, నంతరిక్షమార్గమున వచ్చుచుండెను; కాలాంతకుఁడువలె, నతఁడు రాక్షసులకుఁ గనఁబడెను. అతఁడు తోఁకను మీఁదికియెత్తి శిరస్సుపై నుంచుకొనెను; ఇంద్రధనుస్సువలె నది ప్రకాశించెను. మహావీరుని వృత్తాంతమును వినినవా గతనిచగణములకు నమస్కరించిరి. "ఏల మీా రింత శ్రమవడి వచ్చితిరి? కిష్కింధాధిపతులకు క్షేమమా?" యావ ద్వృత్తాంతము నతఁడు వారికిఁ జెప్పెను; అత్యుత్సాహముతో వారు వెడలిరి.

దోహా 33

పదికోట్ల తోఁమిదిలక్షల ఇరువదివేల నూర్వురు వానరులు మర్కటచేష్టలఁ జేయుచు, 'కేసరి' యను వానరసేనాధిపతివెంట నడచిరి.

చౌపాయ్

అతఁడు వారినిఁ బంపించి, 'రుద్రగిరికిని, కైలాసపర్వత'మునకు వచ్చెను. అలకాపురిపట్టణమును రక్షించుచుండిన, 'బలపురదుఁడు' అనువానరుఁ డచ్చట నివసించియుండును. అతఁడు మహాతేజస్వి; బలవంతుఁడు; అతనిశరీర మభేద్యము; అతఁ డనేక మాయోపాయముల నెఱుంగును. అతఁడు మహావీరుని యాగమనమును విని, దిగ్గున లేచి, పరివారముతో నెదురువచ్చి, యతని చరణములకు నమస్కరించెను. "ఓ మహావీరుఁడా! తమ యాగమనమునకు నిమిత్తమేమి? మిమ్ము లను దర్శించినందున, నా జన్మము సఫల మయ్యెను. సుగ్రీవునకు మీారు ప్రధానమంత్రులు; మీా యాజ్ఞలను శిరసావహించెదను" అని యతఁడు విన్నవించెను. "అయ్యా! విలంబముఁ జేయక మీారు పంపాపుర మునకు సైన్యములతోఁ బొండు." అని మహావీరుఁ డాజ్ఞాపించెను. "జయత్యతి బలో రామో, లక్ష్మణశ్చ మహాబలః, రాజా జయతి సుగ్రీ

వో రాఘవే ణానుపాలితః" అని వారు పలికి, ప్రయాణమును సాగించిరి. ఆ వానరసైన్యములు నడచినపుడు, భూమి క్రుంగెను. వారు తోఁకలను మీఁదికియెత్తి, మహోత్సాహముతో సింహనాదములఁ జేయుచు, వెడలిరి. శేషము లేకుండ, సకలవానరులును నడచిరి. తదుపరి, హనుమంతుఁడు 'మైనాకపర్వత'మునకును 'హిమవత్పర్వత'మునకును వచ్చెను. అచ్చట నివసించియుండిన వానరుల నాదరించి, ఆశ్వాసించి పంపాపురమునకు వారినిఁ బంపెను. 'అంగద' అను పేరుగల వానరసేనాధిపతి, శ్రీరాముని స్మరించి, బయలువెడలెను. తదుపరి అంగసేయుఁడు 'వింధ్యపర్వత'మునకు వచ్చెను. ఆ ప్రదేశములో నివసించియుండిన 'వసంతుఁడు' అను కపిరాజు సైన్యముతో నతని కెదురుగవచ్చి, నమస్కరించెను. 'ఇంద్రకేలి' వనములో నివసించువానరులు మహావీరుని చరణములకు నమస్కరించిరి. 8 పద్మముల సహస్రవానరులు శ్రీరామునివద్దకు వెడలిరి. శ్రీరాముని ధ్యానించుచు, మహావీరుఁడు 'కశ్యపపర్వత'మునకు వచ్చెను; అచ్చట 'మైందవుఁడు' అను మహాబలవంతుఁ డగువానరుఁడు కాపుర ముండెను. 21 కోట్లవానరులతో నతఁడు వచ్చి, యతనికి నమస్కరించెను. "ఓయీ మైందవుఁడా! నిన్నునే నెఱుంగుదు; నీ దర్శనమువలన, నాజన్మము సఫలమయ్యెను. ఓయీ వీరుఁడా! విలంబముఁ జేయక నీవు శీఘ్రము సుగ్రీవునిఁ జూడఁ బొమ్ము" అని మహావీరుఁడు చెప్పెను.

దోహా 34

మైందుఁడును గైందుఁడును సైన్యములతో నంతరిక్షమున కెగసి, అట్టహాసముఁ జేయుచు వెడలిరి.

చౌపాయ్

మిడుతలదండువలె, నా వానరసైన్యము వెడలెను; వారిం జూచి, దిక్పాలురు భయపడిరి. ఆకాశమార్గమున వారు మహావేగమునఁ బోవుచుండిరి; అంతరిక్ష మంతటఁ జీఁకటి వ్యాపించెను; వారు తోఁకలను మీఁదికియెత్తినందున, సూర్యుఁ డంతర్ధాన మయ్యెను. నీలుఁ డనువానరుఁడు మహాబలవంతుఁడు; 3 కోట్లవానరులతో వెడలెను; వా రొకరితో నొకరు పోటాడుచుండిరి; బలదర్పితులై, సింహనాదములఁ జేయుచు, జయజయశబ్దములఁ బలుకుచు, వెడలిరి. వారింజూచి,

దేవతలు కడుపులుపట్టుకొని, నిర్ఘాతపడిరి. శ్రీరాముని రూపమును ధ్యానించుచు, వారినిఁ బంపి, మహావీరుఁడు వెడలెను. అతనిజిహ్వ శ్రీరామునిగుణములను గానముఁ జేయుచుండెను ; అతఁడు 'ధవళగిరి' పర్వతమునకుఁ బ్రయాణ మయ్యెను. అచ్చట దుర్గంధుఁ డనువానరుఁడు మహాబలవంతుఁడు నివసించియుండును ; మహావీరుఁ డతనిని బిలిచి, సుగ్రీవుని వృత్తాంతము నతనితోఁ జెప్పెను. 8 కోట్లవానరులతో నతఁడు పంపాపురమునకు వెడలెను. అచ్చటనుండి, మహావీరుఁ 'ఉదయపర్వత' మునకు వచ్చెను. ఆప్రదేశమున కుందుఁడును కుముదుఁడను వానరులు కలరు. అతఁడు వారికి నమస్కరించి, వారిని బ్రయాణముఁ జేసి పంపెను ; కిలకిలశబ్దములఁ జేయుచు, నంతరిక్షమున కెగసి, వారు వెడలిరి. వనములలోను, సరోవరతీరములను, పర్వతములలోను నివసించువానరులు కదలి వెళ్లిరి.

దోహా 35

ఈప్రకారము శ్రీరామకార్యమును సాధించి, హనుమంతుఁడు సుగ్రీవునివద్దకు వచ్చెను. వానరరాజతనినాదరించి, సన్మానించెను. అనేకవిధముల నతనిని స్తుతించెను. "ఓ వాయుపుత్రుఁడా! నీవు ధన్యుఁడవు" అని యతఁడు ప్రశంసించెను. (అధికపాఠము సమాప్తము.)

చౌపాయి

ఆ సమయమున, నతి రౌద్రాకారుఁడై, లక్ష్మణుఁడు పంపానగరములోఁ బ్రవేశించెను. అతని భయంకరరూపముఁ జూచి, వానరులు చెదరిపోయిరి ; వారు భయముచే వ్యాకులము పడిరి.

దోహా 36

లక్ష్మణుఁడు ధనువును సంధించి, "అవలీలతో నే నీపట్టణమును దహించెదను" అని నిశ్చయించెను. నగరములోని స్త్రీపురుషుల కోలాహలముఁ జూచి, అంగదుఁడు పరుగెత్తివచ్చెను. (తండ్రి లేనివాఁడు కనుక, నతనిఁ జూచి, లక్ష్మణుఁడు శాంతించునని తలఁచి, అంగదుఁడు వచ్చెను. అట్లుకాక అంగదుని వాలి శ్రీరామున కొప్పగించెను ; కనుక, నతనిని లక్ష్మణుఁడు రక్షించునని తలఁచి, యతఁడు వచ్చెను.)

చౌపాయ్

అతఁడు వచ్చి, లక్ష్మణునిపాదములకు మ్రొక్కెను; అతనికి సౌమిత్రి యభయము నిచ్చెను. సుమిత్రానందనుఁడు రౌద్రాకారుఁడై నగరములోఁ బ్రవేశించెనని విని, సుగ్రీవుఁడు భయపడెను. "ఓ మహా వీరుఁడా! నీవు తారను వెంటఁబెట్టుకొని, లక్ష్మణునివద్దకు వెళ్లి, యతనిని శాంతింపఁజేయుము" (తారనుబంపుటకుఁ గారణ మేమి? స్త్రీని జూచినందునఁ గోపము శాంతించును. కాదేని, స్త్రీవిన్నపమువలన, శీఘ్రము దయపుట్టును; కనుక, నామెభర్తను శ్రీవారు సంహరించిరి; కనుక, నామెఁజూచి, లక్ష్మణుఁడు జాలిఁబడును.) తారాసమేతముగ హనుమంతుఁడు వెళ్లి, లక్ష్మణమూర్తికి నమస్కరించెను. "ఓనాథా! మీరు దీనరక్షకులు. మమ్ములను రక్షింపుఁడు"—ఈప్రకారము మహావీరుఁడు స్తుతించి, లక్ష్మణుని నగరులోనికిఁ దీసికొనివచ్చెను. అతనికర్ఘ్యపాద్యముల నిచ్చి, సుగ్రీవుఁడు పూజించెను; అతనిని హంసతూలికాతల్పముపైఁ గూర్చుండఁబెట్టెను. అతనిపాదములకు సుగ్రీవుఁడు నమస్కరించి, భుజదండములతో నతనికంఠమును గౌఁగిలించుకొనెను. "ఓ నాథా! విషయములతో సమానముగుమదము మఱియొకటి లేదు. దానివలన మునీశ్వరుల మనస్సులుసహితము చలించును. అందులో రాజమదము మిక్కిలి కఠినము." ఈప్రకారము సుగ్రీవుఁడు పలికినపలుకులను లక్ష్మణుఁడు విని, సంతసించి, మిత్రునకు హితోపదేశముఁ జేసెను. అంతలో మహావీరుఁడు దేశదేశములనుండి వచ్చినవానరయోధుల వృత్తాంతమంతయు లక్ష్మణునితోఁ జెప్పెను.

దోహా 37

ఆ వృత్తాంతమును లక్ష్మణుఁడు విని, సంతసించెను. లక్ష్మణుని ముందునిడుకొని, సుగ్రీవాదివానరులు రామునివద్దకు వచ్చిరి.

చౌపాయ్

సుగ్రీవుఁడు శ్రీరామునిచరణములకు నమస్కరించి, చేతులను జోడించుకొని, యిట్లు విన్నవించెను. "ఓ నాథా! నావలన దోషము లేదు; మీమాయ ప్రబలము. మీ మాయను దాఁటుటకు, మీ కటాక్షమే ప్రధానము. ఓ నాథా! మునులును, నరులును, దేవతలును విషయభోగములకు వశ్యులయి యుందురుకదా! నేను పామరుఁ

డను; పశువును; నామాటఁ జెప్పనేల? ఎవఁడు స్త్రీలకటాక్షదృష్టి బాణముల కభేద్యముగ నుండునో, ఘోరాంధకారమగు క్రోధమను రాత్రివేళ నెవఁడు మెలఁకువతో నుండునో, లోభమను ఉరుల నెవఁడు మెడకుఁ దగిలించుకొనఁడో, హే నాథా! వాఁడు నీతో సమానుఁడు. ఈగుణములు సాధనమువలన, లభింపవు; కేవలము మీకటాక్షమువలన లభించును. అచ్చటచ్చట నూటికొకరికి ప్రాప్తించును." ఈప్రకారము జ్ఞానవైరాగ్య యనురాగములతోఁ గూడిన సుగ్రీవుని వచనములను శ్రీరాముఁడు విని, మందహాసముఁ జేసెను. "ఓ మిత్రుఁడా! నీవు నా తమ్ముఁడగు భరతునివంటివాఁడవు. ఓ సఖుఁడా! ఏప్రకారము జానకివర్తమానము తెలియఁ గలదో, అందులకుఁ దగినప్రకారము వ్యవహరింపుము. విలంబముకూడదు."

దోహా 38

ఈప్రకారము వారు సంభాషించుచుండ, వానరయోధులు, కోటానకోట్లు ప్రవేశించిరి; ఆవానరులు నానారంగులవారు వచ్చిరి; వారు వీరులు; శూరులు; విక్రమార్కులు; నానాదేశములనుండి వారువచ్చి, రాముఁడు చూచుచుండ నటించిరి.

---

## చతుర్థవిశ్రామము.



చౌపాయ్

ఈప్రకారము శివుఁడు చెప్పుట కారంభించెను. ఓ పార్వతీ! నేనా వానరసైన్యముఁ జూచియుంటిని; ఆ వానరసైన్యమును లెక్కింపఁ దలచినవాఁడు మూర్ఖుఁడు సుమీ! ఆవానరు లొక్కొక్కరువచ్చి, శ్రీవారిచరణములకు నమస్కరించిరి. ఇంతవఱకు వానరు లనాథులువలె నుండిరి; కాని, ప్రస్తుతము వారు శ్రీపతివారి ముఖముఁజూచి, సనాథులమని తెలిసికొని, సంతోషించిరి. శ్రీవారు స్వయము పలుక

రించి, కుశలప్రశ్నఁజేసి, యాదరింపనివానరుఁ డాబలములో నొక్కఁ డైనను లేఁడుసుమీ! ప్రతివానరుని పేరుపేరున శ్రీవారు సత్కరించిరి; వానరులు దేవతాంశసంభూతులు; శ్రీవారు విరాట్పురుషులు; చరాచరములు వారిరూపము; ప్రతినువ్వుగింజలోఁ దైల ముండినవిధమున, వారు సర్వవ్యాపకులు; సర్వాంతర్యాములు; కనుక, వారు ప్రతివానరుని యోగక్షేమమును పేరుపేరున కనుగొనిరని చెప్పుటలో నాశ్చర్యము లేదు. శ్రీవారి యాజ్ఞనిమిత్తము వానరులు చేతులను జోడించుకొని, నిలువఁబడిరి. అప్పుడు సుగ్రీవుఁడు వారికిబోధించి, వారితో నిట్లు ప్రసంగించెను. "ఓ వానరులారా! శ్రీరామచంద్ర మహారాజులకార్యమును మీరు సాధింపవలయును. ఇదియే మీరు నాకుఁ జేయవలసినయుపకారము. మీమీసైన్యములతో మీరు నలువైపులకుఁ బోవలయును. మీరు జానకినివెదకి, నెలరోజులకుఁ దిరిగి రావలయును." (అధికపాఠము:—అనంతర మతఁడు గజగవాక్షులతో నిట్లు చెప్పెను. "ఓయీ! మీరు బుద్ధిమంతులు; సకలశాస్త్రధర్మములు మీకుఁ దెలియును. మీరు తూర్పుదిక్కునకు వెళ్లి, శ్రీజానకిని వెదకి రండు. ఇది శ్రీవారికార్యము; విలంబముఁ జేయకూడదు. సముద్రములను, నదులను, నదీతీరములను, పర్వతములను, పర్వతగుహలను, రహస్యస్థలములను, బ్రహ్మపురిమొదలు కామావతీపట్టణమువఱకుఁ గల ప్రదేశమును, వాపీకూపతటాకములను, సరోవరములను, దేవస్థానములను, నగరములను, జనస్థానములను, గ్రామములను—సర్వము మీరు కలయఁజూడవలయును. మార్గములోఁ గనఁబడిన వారినిసహితము మీరు జానకీవృత్తాంతము నడుగవలయును."

దోహా 39

ఈప్రకారము సుగ్రీవునియాజ్ఞను శిరసావహించి, వారు సీతాపతిచరణములకు నమస్కరించి, రామలక్ష్మణులరూపములను ధ్యానించుచు, నేడుకోట్ల వానరయోధులు తూర్పుదిక్కునకు వెడలిరి.

చౌపాయ్

తదుపరి, సుగ్రీవుఁడు సుషేణునిఁబిలిచి, యాదరించి, యతనితో నిట్లు పలికెను. "ఓ సఖుఁడా! నీవును మైందవుఁడు నుత్తరదిశకు వెళ్లి, శ్రీజానకినిఁ జూచిరండు. ఆమెయోగక్షేమముఁ దెలిసికొనిరండు.

గంధమాదనము, సుమేరుపర్వతము, అర్జునపర్వతము, నీలగిరిపర్వతము లను, వానిగుహలను, కైలాసపర్వతమును, నలకాపట్టణమును—ఈ ప్రదేశములలో జానకిని వెదకిరండు. గంధర్వులను యక్షులను జానకి వృత్తాంతమును మృదువుగ నడిగిరండు. అచ్చటనుండి మానససరోవర మునకు వచ్చి, పుష్పములతోను ఫలములతో నిండి, వానిభారము చేత నేలకు వంగియుండినవృక్షములఁ జూతురు. మీ శ్రమనివార ణార్థముమాత్రము మీరు తగుమాత్రము భుజించి, సేదఁదేరి, శ్రీ వారికార్యమును, విలంబముఁ జేయక సాధింపుఁడు. మీరు సావధా నులై, ప్రతిస్థలములో జానకిని వెదకవలయును.

దోహా 40

"అచ్చట నివసించియుండు మహర్షులతో సంభాషించి, శ్రీజానకి వృత్తాంతము నడిగి, శీఘ్రము ముందుకునడచి, మ్లేచ్ఛదేశముఁ గలయఁ జూచి, యుత్తరసముద్రతీరముఁ జేరుఁడు. అచ్చట సూర్యుఁడు ప్రకాశిం పఁడు ; మంచుచేత, జలములు పేరుకొనును. దానిమీఁదికి శ్వేతభూమి కలదు. అంతటితో భూమి యంతమగును. సుమేరుపర్వతశిఖరమునకుఁ దగిలి కైలాసపర్వతము కలదు; ఆ శిఖరముమీఁద (గా) కాకభుశుండి నివసించియుండును. అచ్చట 'మోతీచూరము' అను పేరుగల యొకగుం డము కలదు; దానిజల మమృతము; దానిబురద కర్పూరము. జంబూ వృక్షమునకుసమీపమున నా స్థలముకలదు. ఆ జంబూవృక్షముచేత, దానికి జంబూద్వీపమని పేరువచ్చెను. ఆ వృక్షమునకు "హత్తిముండ" వంటి పండ్లుకలవు; ఆ పండ్లు మధురములు. ఆపండ్లు పక్వమై, వానియం తట నవి నేలమీఁదఁ బడును; వానిరసముచేత నాగుండము నిండును. దివ్యవిమానారూఢులై, దేవత లాగుండములో స్నానముఁ జేయు చుందురు. ఆ గుండములోనుండి యొకనది ప్రవహించును ; ఆనదియే, సరయూనది ; అయోధ్యానగరమువద్ద నానది ప్రవహించును. ఓయీ వానరులారా ! మీ రానదిలో స్నానముఁ జేసిన, మీపాపములు నశిం చును ; మీ దుఃఖములుపోవును. అచ్చట మీరు స్నానపానాదులఁ జేసి, ఫలములనుభుజించి, శ్రీవారిని ధ్యానించుచు, వారికార్యమును సాధించుటకు వెడలి, శూరసేనమండపమునకు రండు. అచ్చటనివసించు

లోమశమహర్షిని దర్శనముఁజేయుఁడు.ఒక్కొక్క ప్రళయమున ఒక్కొక్కరోమ మతనిశరీరమునుండి రాలిపడును. తదుపరి శాండిల్యమహర్షికి వందనముఁ జేయుఁడు.

దోహా 41

"ఓయీ వానరులారా! ఆ కీకారణ్యబ్రహ్మారణ్యములలో జానకిని వెదకి, యొకనెలలోఁ దిరిగివచ్చి, విశ్రమింపుఁడు.

(అధికపాఠము)

"ఆవర్తన (Britain); అశ్వక్రాంత (Europe); రోమ (Rome); పటచ్చర (Italy); ఇంద్రద్వీపము(England); పశుశీలము (Portugal); క్రాంచము (Germany); సైనిక, కుక్కుటములు (Holland and Belgium); అశ్వీయము (Austria); ప్రలియము (France); తామసము (Spain); మారకము, మాటకము (Norway and Sweeden); ఆరణ్యకతురుష్కము (Europe Turkey); కానివలము (Cannibal Country); బర్బరము (Barbary); రథక్రాంతము (Africa); దానియుపద్వీపము; విష్ణుక్రాంతము (Asia); హైూఖ (Siberia); రుష (Russia); శంకతురుష్కము (Asia Turkey); చీన, మహాచీనము (Chinese Empire); తాలతోషకము (Tibet); పార్శ్వతము (Tartary); ఆవర్తము (Arabia); పారస్యము (Persia); తుఖారము (Bokhara); శూద్రయవన (Mecca); కహానవ (Kabul); కారస్కారము (Medina); గాంధారము (Kandahar); అపక్రాంతము (Muscat); బ్రహ్మదేశము (Burma); ఉపమల్యకము (Malay Peninsula); సింహళము (Ceylon); కన్యాకుబ్జము (Cape Comiorin); స్వర్ణభూమి (America); దక్షిణోత్తరకుమారములు (North and South America); రమణకము (Australasia); తలహాము(Brazil);స్వర్ణప్రస్థము (polynesia);దుర్గద్వీపము (Bhutan); పంచనదము (Punjab); దరదలింగము (Dorjeeling); కాశ్మీరము

(Cashmir); ఉత్తరకోసలము (Oudh); కురుజంగాలము (Kurukshetra); ఇంద్రప్రస్థము (Delhi); అవంతి (Ujjain); గుర్జరాటము (Guzerat); కాంచి (Carnatic); కాశి; వారణాసి (Benares); కేకయ (Herat); మాహిషకము (Mysore); పాండ్య (Malabar); ఉత్కళ (Orissa); మిథిల (Tirhut); సింధుసౌవీర (Sindh Province); సౌరాష్ట్రము (Maharashtra); మహోదయ,కాన్యకుబ్జము (Kanuj); మగధ (Gaya); అంగ (Rajmahal etc); పాటలీపుత్ర (Patna); పుండ్ర (Midnapur); చంపా (Bhagalpur); మత్స్యదేశము (Dinajpur Rajashai etc); వంగగౌడ (Bakargunj etc); ఉపవంగ (Mymensing); కిలకిలా (Culcutta); ప్రాగ్జ్యోతిషము (Kamrupa); శౌరసేన (Muttra); ఈ మొదలగు ప్రదేశములలో జానకిని వెదకిరండు. ఉదయాద్రి మొదలు అస్తాద్రివఱకుఁ గల ప్రదేశమును వెదకి శీఘ్రము రండు.'' అతని యాజ్ఞప్రకారము వానరులు వెడలిరి; అప్పుడు శ్రీరాముఁడు సుగ్రీవునితో నిట్లు పలికెను.

దోహా 42, 43, 44

"ఓ సఖుఁడా! ఈ దేశసమాచారములను నీవెప్పుడు తెలిసికొంటివి?"—"ఓ నాథా! వాలికి భయపడి, నే నీదేశములఁ దిరిగియుంటిని. ఈనాటికి దేశసంచారఫలము లభించెను." ఈ ప్రకారము సుగ్రీవుఁడు పలికె.

చౌపాయ్

శ్రీరాముని చరణములకు నమస్కరించెను. వాయువుకంటె నధికవేగముగల మహావానరులు దిగ్గున లేచి, పదునొకండు పద్మముల వారు వెడలిరి. పిమ్మట సుగ్రీవుఁడు శతబలునిఁ జూచి, వానితో నిట్లు పలికెను. "ఓ వీరుఁడా! ఓ ప్రాణసఖుఁడా! నా మాటను మన్నించి శ్రీవారికార్యమును సాధింపుము. నీవును వసంతుఁడును బశ్చిమదిశకుఁ బోయి, జానకిని వెదకి రండు. ఆమెనుగుఱించి ప్రతివానిని మార్గములో నడుగుము. పశ్చిమదేశములోఁగల వాపీకూపతటాకములును, కీకారణ్యబ్రహ్మారణ్యములను, పర్వతములను, నదీసరోవరములను కల

యఁజూచి, అగ్ని దేవునకు నమస్కరింపుము అంతవఱకుఁగల భూమిని వెదకిచూడుము. శ్రీరామకార్యర్థమై, ప్రయాణము సాగింపుము. ఓ తమ్ముఁడా! రంగభూమికిఁ (Rangoon) బోయి, జానకివృత్తాంతముఁ దెలిసికొనుము. నదులు పర్వతములు వనములు గలప్రదేశములలో జానకిని వెదకుము; మహామునులను జ్ఞానులఁ జూచి వారికి నమస్కరించి, వినయముగ వారిని సీతసమాచారము నడుగుము. ఓ తమ్ములారా! మీ బలముఁజూచి, నేను గర్వించి, గర్జించుచుంటిని. శీఘ్రము జానకిఁ జూచిరండు.

దోహా 45

"పశ్చిమదేశములలోఁ దిరిగి, తుదవఱకుఁ జూచి మాసములో రండు."

చౌపాయ్

పదియాఱులక్షలవానరులు సుగ్రీవుని చరణములకు నమస్కరించి, 'హరిహర' అని ధ్వనులఁ జేయుచుఁ బశ్చిమదిశకు వెడలిరి. అధికపాఠము సమాప్తము.) "ఓయీ! వానరులారా! జానకివృత్తాంతముఁ దెలిసికొనక, వ్యవధిదాఁటి మీరు వచ్చినయెడల, నా చేతులతో మిమ్ములను వధించెదను. ఇది నిశ్చయము."

దోహా 46

వారు సుగ్రీవుని యాజ్ఞాప్రకారము వెడలిరి. అనంతరమతఁడు, అంగద, హనుమదాదులఁబిలిచి, వారితో నిట్లు పలికెను.

చౌపాయ్

"ఓ నలనీలులారా! ఓ మతిధీరా! హనుమంతా! ఓ అంగద, జాంబవంతులారా! నా మాటను వినుఁడు. మీ మొదలగుయోధులు దక్షిణదిశఁ జూచిరండు. అన్నివిధముల జానకిని వెదకి రండు. త్రికరణశుద్ధిగ విచారించి, రామకార్యమును సాధింపుఁడు. సూర్యాగ్నులకు ముందువెనుకల కపటము కలదు; ముందువెనుకల మీరు కపటమును విడిచి, స్వామికార్యమును సాధింపుఁడు. మాయప్రపంచభోగములను విడిచి, పరలోకసుఖములఁ గోరుట యుచితము; అందువలన, సంసార సంకటములు నశించును. ఓ తమ్ములారా! దేహములను ధరించినందుకు,

సకలకామములను విడిచి, శ్రీరాముని భజించుట కర్తవ్యము; అదియే, దానికిఁ దగినఫలము.

" తజ మాయా సేఇయ పరలోకా
మిటహి సకల భవ సంభవ శోకా,
దేహ ధరే కర యహ ఫల భాఈ
భజియ రామ సబకామ విహాఈ.

" సోఇ గుణజ్ఞ సోఈ బడభాగీ
జో రఘువీర చరణ అనురాగీ,
ఆయసు మాంగి చరణ శిరనాఈ
చలే హృదయ సుమిరత రఘురాఈ.

"శ్రీరాముని చరణకమలములయం దనురాగము కలవాఁడే, గొప్పభాగ్యవంతుఁడు—" ఈప్రకారము సుగ్రీవుఁడు పలికినపలుకులను వానరులు విని, శ్రీవారిచరణములకు నమస్కరించి, యతియుత్సాహముతో వెడలిరి. తుదను హనుమంతుఁడు శ్రీరాముని చరణములకు నమస్కరించెను. అతఁడు కార్యమును సాధింపఁగలఁడని శ్రీరాముఁడు గ్రహించి, యేకాంతమున నతనితో నిట్లు పలికెను. అతనిశిరముపై శ్రీవారు స్వహస్తకమలము నుంచి, యతఁడు తమభక్తుఁడని తెలిసికొని, యతని చేతికి ముద్రిక నిచ్చిరి. (నలుగురిలో నొక్కరినియాదరించుట తప్పు; కనుక, నేకాంతమున నతనితో శ్రీవారు పలికిరి.) "ఓ హనుమంతుఁడా! అన్నివిధముల సీతనుబోధించి, యూరడింపుము. నా విరహదుఃఖముఁ జెప్పుము. నా బలముసంగతి విన్నవింపుము. శీఘ్రము రమ్ము"— జన్మము సఫలమయ్యెనని హనుమంతుఁడు సంతోషించి, శ్రీవారిని ధ్యానించుచు వెడలెను. శ్రీవారు సర్వజ్ఞులయినను, రాజనీతిని యనుసరించి, ప్రవర్తించిరి; దేవతలను రక్షించుటకు, ధర్మమార్గమున నడచిరి. (సకలకార్యములును దేవతలను రక్షించుటనిమిత్తమే కాని, వారికి స్వప్రయోజనము లేదు. జానకి లంకలోగలదని వారికిఁ దెలియును. అయినను, దూతద్వారా కార్యమును సాధింపవలయును; రావణునకు వానిద్వారా తనుబలము తెలియవలెను. సముద్రమును

గట్టవలెను. శ్రీవారిసేవకుఁ డింత బలవంతుఁడయినపుడు, శ్రీవారు
యెంత బలవంతులోయని రాక్షసులకు భయముకలుగవలెను. వాని
వలన రాక్షసులబలాబలములు తేటపడును. ఈ సర్వకార్యములును
హనుమంతునివలన వ్యక్తమగును.)

దోహా 47

ఆ వానరులమనస్సులు రామకార్యమునందు లవలీనమయ్యెను ; నదులను, పర్వతములను, వనములను వెదకి వెళ్లుచుండిరి. వారు దేహాభిమానమును విడిచి, కార్యముఁబూనిరి.

చౌపాయ్

రాక్షసకీటకము మార్గములోఁ గనఁబడిన, వానిని వారు పట్టుకొని వధించుచుండిరి. అంతలో, నొక వజ్రదంష్ట్రుఁ డను రాక్షసుఁడు వచ్చెను; వానినిఁజూచి, వానరులు భయపడిరి. "ఇంత భయంకరరూపముగల రాక్షసుఁ డెవఁడు!" అని వానరులు చింతించిరి; అంగదుఁడు కోపించి, వానిమీఁదికి దుమికెను. వానినిఁ జూచినంతలో వానికి వాని మీఁదఁ గోపమువచ్చి, వానియెదుట నిలువఁబడెను. వారు గొప్ప మల్లయుద్ధముఁ జేసిరి. "లంగముఁ గట్టినవెంటనే, పిడుగుపడిన ట్లయ్యెను. ఆహా! విధికృతము బలవంతము; ప్రథమరంగములోనే, కాలుఁడు మనకెదురుగ వచ్చెను. ఏమిచేయఁగలము" అని వానరులు విచారించుచుండిరి. వారిమనోవికారము నంగదుఁడు గ్రహించి, ఓ పార్వతీ! శ్రీవారిరూపమును స్మరించి, ధ్యానించి, వానిశిరస్సుపై నొక గుద్దు గుద్ది, వానిని పాదములతోఁ జల్చెను. వానరులు జయజయశబ్దములఁ జేసిరి; మహావీరుఁడు ప్రసన్నుఁడయ్యెను. ఇరువదికోట్లు వానరు లేక ముహూర్తమున "శ్రీరామునకీ జయ్" అని శబ్దముఁజేసిరి. ఈప్రకారము వారు జయశబ్దములఁ జేయుచు, సీతాన్వేషణమునిమిత్తము వెడలిరి. నదులను, వనోపవనములను, బర్వతప్రాంతములను, సకలప్రదేశములను వారు కలయఁ జూచుచుండిరి; మార్గములోఁ గనఁబడిన ఋషులను మునుల నడుగుచుండిరి. ఒకనాఁడు వారు వనములోఁ దిరుగుచు మార్గముఁ దప్పిరి; వారు పిపాసాయత్తులై, శ్రమపడుచుండిరి; ఎచ్చటను జలము లేదు, జలము దొరకనియెడల, వానరులు నశిం

చెదరని హనుమంతుఁడు తలంచి, యొకపర్వతముపైకి దుమికెను; అతఁడు నలువైపులఁ గలయఁజూడ, నొకబిలము కనఁబడెను. దానిలో నుండి యనేకపక్షులు వెలువడుచుండెను; అతఁ డాపక్షులఁజూచి, యా బిలముక్రింద సరోవరముకలదని నిశ్చయించి, బిలములోనికి దిగి, నలువైపులఁ జూచి, సరోవరముఁ గాంచెను. తదుపరి, యతఁడు వెలు పడివచ్చి, వానరులఁదీసికొని, బిలములోఁ బ్రవేశించెను. ఆప్రదేశము నాలుగుయోజనముల విస్తీర్ణము; దానిని మయుఁ డనుదానవుఁడు మాయాబలముచే రమణీయముగఁ జేసెను.

దోహా 48

అనేకసరస్సులను, ఉపవనములను వారు చూచిరి; ఆ సరోవరములు వికసించినకమలములతో నిండియుండెను. అచ్చట నొకస్త్రీ తపముఁ జేయుచుండెను.

చౌపాయీ

వా రామెకు దూరమునుండి నమస్కరించి, వారి యాగమన వృత్తాంతము నామెకు విన్నవించిరి. "ఓ వానరులారా! మీరు బడలి యుంటిరి; స్నానపానములఁ జేసి, ఫలములను భక్షించి, విశ్రమింపుడు." అని యామె చెప్పెను. ఆప్రకారము వారు స్నానపానాదులఁ జేసి, విశ్రమించి, యామెసమీపమునఁ గూర్చుండిరి. ఆమె స్వవృత్తాంతమును వారితోఁ జెప్ప నారంభించెను. "ఓయీ వానరులారా! శ్రీరాముఁడు నిలిచియుండినతావునకు నేను పోవుచున్నాను; నాపేరు 'స్వయంప్రభ' నేనొక గంధర్వునికుమార్తెను. హేమయను అప్సరస నా సఖి; ఆమెను మయుఁడు దాచియుంచెను; కాని, దేవేంద్రుఁ డామె నపహరించెను. నే నిచ్చట నిలిచియుంటిని; నేను దేవకన్యను. ఒకసమయమున, నేను దపము నాచరించితిని; అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమై, నన్ను వరమును వేడుకొనుమనెను. భగవంతునిదర్శనముఁ జేయింపుమని నేను వేఁడుకొంటిని. 'ఓ కన్యారత్నమా! ఈస్థలములో నీవు నివసించియుండుము; కొంతకాలమునకు మహాబలవంతులగు వానరు లిచ్చటికి రాఁగలరు. వారివలన శ్రీరామునివృత్తాంతముఁ దెలిసికొని, వారిని దర్శింపుము' అని నాతో బ్రహ్మచెప్పెను. అతనిమాట యింతకాలమునకు సత్యమయ్యెను. నేను శ్రీరాముని సందర్శనార్థము

పోవుచున్నాను. మీ రొకక్షణము నేత్రములను మూసికొనుఁడు; మీరు సముద్రతీరమున నిలచెదరు. జానకిని మీరు చూడఁగలరు; మీ రేమి విచారింపవద్దు." ఆమె చెప్పినప్రకారము వారు నేత్రములను మూసికొనిరి; నేత్రములను వారు మరలఁ దెఱచిచూచిరి; వారు సముద్రతీరమునఁ బడియుండిరి. ఆమె శ్రీరామునివద్దకు వెళ్లి, వారి చరణములకు నమస్కరించెను. అనేకవిధముల నామె శ్రీరాముని స్తుతించెను. ఆమెను శ్రీరాముఁడు కటాక్షించి, యామెకు నిత్యానపాయినియగు భక్తి నిచ్చెను.

దోహా 49

ఆమె శ్రీవారిచరణకమలములను ధ్యానించుచు, వారియాజ్ఞను శిరసావహించి, బదరీనారాయణమునకు నిష్క్రమించెను. ఆమెకు దేవతలుసహితము నమస్కరించెదరు.

---

## పంచమవిశ్రామము.



చౌపాయ్

"అహో! ఈరోజుతో వ్యవధిగతించును. మనకార్యమింకను దేఱలేదు; ఏమి చేయఁగలము!" అని అంగదాదివానరులు విచారించిరి. "ఓయీ! సీతసమాచారము తెలియలేదు. ఏమి చేయువారము!" అని వానరులు చింతించిరి. అంగదుఁడు కన్నీరుఁగార్చుచు, "ఎట్లుచూచినను నాకు మృత్యువు నిశ్చయము; ఇచ్చటనుండిన, సీతసమాచారము తెలియలేదు; అచ్చటకువెళ్లిన, సుగ్రీవుఁడు చంపును. నా తండ్రినివలె, నన్ను చంపించును. శ్రీవారు నా కభయము నిచ్చియుండిరి కనుక, నన్ను నాపినతండ్రి చంపలేకపోయెను. లేనియెడల నన్నిదివఱకే చంపియుండును" అని పలువిధముల విలపించి, "నాకు మృత్యువు సన్నిహితమయ్యెను; నిశ్చయము" అని విచారించెను. అంగదునివిచారముఁ జూచి, తదితరవానరులు మాటఁ జెప్పలేక యూరకుండిరి; వారుకూడ

కన్నీరుగార్చిరి. ఒకక్షణమాత్రము వానరులు శోకమగ్ను లయిరి. "ఓ వానరయువరాజా! నీవు చతురుఁడవు; మేము చనిపోయెదము; కాని, జానకిని జూచినఁ గాని, మే మిచ్చటనుండి మరలివెడలము" అని వానరులు నిశ్చయించి, సముద్రతీరమున దర్భాసనములఁ బఱచి, ప్రాయోపవేశులయిరి. అంగదునిదుఃఖముఁ జూచి, జాంబవంతుఁడు విచారించి, పలువిధముల నుపదేశించెను. "ఓ తండ్రీ! శ్రీరాముఁడు సామాన్యమనుజుఁడని విచారింపకుము. అతఁడు నిర్గుణబ్రహ్మము; అజేయుఁడు; అనంతుఁడు; అజుఁడు, సగుణబ్రహ్మమునారాధించు నేనును, నావంటిసేవకులును ధన్యులు.

దోహా 50

"గోబ్రాహ్మణదేవతలను రక్షించుటకును, భూమిని నుద్ధరించుటకు నతఁడు స్వేచ్ఛానుసారము నరరూపమును ధరించి, యవతరించెను. చతుర్విధపురుషార్థములను విడిచి, సగుణబ్రహ్మము నారాధించువారు ధన్యులు; కనుక, నీవు శోకమును విడిచిపెట్టుము. శ్రీరాముని కృపవలన, మనకార్యములు నెఱవేరును."

చౌపాయ్

ఈప్రకార మనేకకథలను జాంబవంతుఁడు చెప్పి, వారిధైర్యమును నిలువఁబెట్టెను. ఆ తీరముననుండిన నొకగుహలో సంపాతి నివసించెను. అతఁడు వారి దీనాలాపములను వినెను; అతఁడు గుహలోనుండి బయటకు వచ్చి, ప్రాయోపవిష్టులగు వానరులఁ జూచెను. "ఆహా! ఈదినమున బ్రహ్మ నాకు భోజనముఁ బెట్టెను; నేడు వీరినందఱను భక్షించెదను అనేకదినములనుండి యాఁకలిచే బాధపడుచుంటిని; ఇదివఱకు నాకుఁ గడుపునిండ భోజనము లేదు. ఈదినమున నొక్కపర్యాయము భగవంతుఁడు నాకు భోజనముఁ బెట్టెను." ఈప్రకారము సంపాతి పలికినపలుకులను వానరులు విని భయపడి "నేఁడు మనకు మృత్యువు నిశ్చయము" అని గుసగుసలాడిరి. పండుకొనినవారు లేచి కూర్చుండిరి. జాంబవంతుఁడు విచారించి, "ఓయీ వానరులారా! వీనినిఁజూచి మీరు భయపడితిరి కదా! రావణునితో నెట్లు పోరాడఁగలరు?" అని వారికి ధైర్యముఁజెప్పెను. ఆ సంపాతి జటాయువు భ్రాతయని అంగదునకుఁ దెలియును. ఆసంపాతి వినునట్లు అంగదుఁడు

వానరులతో నిట్లు పలికెను. "ఓయి వానరులారా! జటాయువువంటి భాగ్యవంతుఁడు లేఁడు. శ్రీరాముని కార్యమును సాధించుటలో నతఁడు శరీరమునువిడిచి వైకుంఠముఁ బొందెను" "శ్రీరాముని చరణముల యందుఁ జిత్తమును సంధించువారు ధన్యులు; వారితో సమానులు లేరు." ఈప్రకార మంగదుఁడును వానరులు పలికినపలుకులను సంపాతి విని, బయటికి వచ్చెను. వానింజూచి, వానరులు భయపడిరి. జానకివృత్తాంతముఁ దెలియనందుకును సుగ్రీవునిభయముచేత నిదివఱకే వారు సగము చచ్చియుండిరి; ఇప్పుడు సంపాతినిఁ జూచి, వారు మరణమునకు సిద్ధపడిరి; వారు ప్రాణములను రక్షించుకొనుటకుఁ బరుగెత్తిరి; అతఁ డనేకవిధముల వారినిబోధించి, యొట్టుపెట్టుకొని వారిని నిలువఁ బెట్టెను. "ఓయీ వానరులారా! మీరు భయపడకుఁడు. అభయము నిచ్చుచున్నాను. నేనుసహితము శ్రీరాముని సేవకుఁడను. మా వృత్తాంతముఁ జెప్పుడు?" అని సంపాతి వారితోఁబలికెను. సీతాపహరణము, జటాయుమరణము, సుగ్రీవసంభాషణము, వాలివధయు, సీతాన్వేషణము—ఈ మొదలగువృత్తాంతములు వారు సాంతముగ నతనితోఁ జెప్పిరి. సోదరునిమరణమును విని, సంపాతి దుఃఖించి, శ్రీరాముని మహిమను గొనియాడెను.

దోహా 51

"ఓ తమ్ములు వానరులారా! నన్ను సముద్రతీరమునకుఁ దీసికొనిపొండు. నాసహోదరునకుఁ దిలోదకముల నిచ్చి, తర్పణములఁ జేయువాఁడను. పిమ్మట మీకు నా మాటసహాయముఁ జేయఁగలను; మీరు జానకినివెదకి చూడఁగలరు." అని సంపాతి చెప్పెను.

చౌపాయ్

అతనిని వారు సముద్రతీరమునకుఁ దీసికొనిపోయిరి; అతఁడు తర్పణములను విడిచి, స్వవృత్తాంతమును వారితో నిట్లుచెప్పట కారంభించెను. "ఓయీ వానరులారా! నాసమాచారమును వినుఁడు. నేను జటాయువును సోదరులము—చిన్నతనములో మేము పందెము వేసికొని, సూర్యునిసమీపించుటకు మీఁదికెగిరియుంటిమి. సూర్య వేఁడిమిని సహింపలేక, నా తమ్ముఁడు తిరిగివచ్చెను. నేనుమాత్రము దురభిమానముచేతఁ బట్టినపట్టును విడువక, మీఁదికి యెగురుచుంటిని. సూర్య

కాంతివలన, నా ఱెక్కలు కాలిపోయెను. అంతరిక్షమునుండి దబ్బున నేలమీఁదికిఁ బడియుంటిని. ఒకచంద్రముఁ డనుముని కలఁడు; అతఁడు నా దురవస్థఁ జూచి జాలిఁబడెను; అనేకవిధముల నతఁడు నాకు జ్ఞానము నుపదేశించెను; అతని జ్ఞానోపదేశములవలన, నా యభిమానము నశించెను. 'ఓ పక్షిరాజా! నామాట వినుము. త్రేతాయుగములో, బ్రహ్మము నరరూపమును ధరించి, యవతరించును; అతనిభార్యను రావణుఁ డపహరించును. అతఁడు భార్యను వెదకుటకు దూతలఁబంపును. ఆ దూతలఁజూచి, నీవు పవిత్రుఁడవు కాఁగలవు. అప్పుడు నీ ఱెక్కలువచ్చును. కనుక విచారింపకుము. నీవు వారికి సీతవృత్తాంతముఁ జెప్పుము' అని యామునీశ్వరుఁడు నాకు బోధించి, స్వాశ్రమమునకు నిష్క్రమించెను. అతనిమాటలవలన నాకుఁ గొంచెము జ్ఞానముకలిగెను." అని సంపాతిపలికి, నిట్టూర్పులనువిడిచి, మరల నిట్లుచెప్పుట కారంభించెను. "ఓయీ తమ్ములారా! మీరు నా హితకారులు; నామాటవినుఁడు. నాకు సుపార్శ్వుఁడను కుమారుఁడొకఁడుకలఁడు; ఇచ్చటనే, వాఁడు నన్ను సేవించుచుండెను.

దోహా 52

"ఒకనాఁడు నేను ఆఁకలిచే బాధపడుచుంటిని. 'ఓయీ! బాబూ! నా కాఁకలి విశేషము బాధించుచున్నది; కనుక, శీఘ్రము నాకు భోజనముఁ దీసికొనిరమ్ము' అని వానితోఁ జెప్పియుంటిని.

చౌపాయి

"భోజనములేక, నాప్రాణములు నశించునని తెలిసికొని, వాఁడు నామాటప్రకారము వెళ్లెను. వానిమాటలను గ్రహించి, నేను ధైర్యముతో నాప్రాణములను నిలువఁబెట్టుకొని, నిరీక్షించుచుంటిని. ఆకాశమార్గమున వాఁడు మహారణ్యమునకుఁ బోయి, మదగజములను సింహములను మృగములఁ జంపి, వానిని నోటఁగఱచుకొని, సూర్యాస్తమానమునకు గృహమునకు వచ్చెను. వానిం జూచి, నేను కోపించితిని. నేను జ్ఞానహీనుఁడను; నీచుఁడను; నాకుమారుని శపించుటకుఁ దలంచితిని. వాఁడు నా పాదములఁ బట్టుకొని, నాకు బోధించెను. 'ఓ తండ్రీ! నామాటలను మన్నింపుఁడు. సావధానముగ వినుఁడు. నేను మహారణ్యమునకు వెళ్లినతరువాత, నొకయుత్పాతము పుట్టెను. ఇరువది

భుజములును పదిశిరస్సులు గలపురుషుఁ డొకఁడు మార్గమునఁ బోవుచుండెను. వానివద్ద నొకచక్కని స్త్రీకలదు; ఆమె మూటగట్టినముద్దులను వర్ణింపఁజాలను. ఆమె నఖకాంతియెదుట, ననేకకోట్లచంద్రులు దిగదుడుపఁబడినట్టు కనఁబడఁగలరు. ఆమె రతీదేవియో, లేక రంభయో, లేక ఇంద్రాణియో, నేను చెప్పఁజాలను. వాఁ డొకజంతువని తలఁచి, నేను వానినిఁ బట్టుకొంటిని; కాని, వానివెంట నొకస్త్రీయుండుటఁ జూచి, వానిని విడిచిపెట్టియుంటిని. పలువిధముల వాఁడు నన్ను వేఁడుకొని, దక్షిణదిశకుఁ బోయెను. ఈ యుపద్రవముచేత, విలంబమయ్యెను. ఓ తండ్రీ! నన్ను 'క్షమింపుము' అని నాకుమారుఁడు విన్నవించెను. వానిమాటలకు నాగుండెలు మండెను; నాకు గోపమువచ్చెను. నా కీదుర్గతి వచ్చెను; క్షమించినందులకు ప్రయోజనము లేకపోయెను. నాకు ఱెక్కలులేవు. నే నేమిచేయ గలను! లేనియెడల వానిని నేను నిరాయాసముగ బట్టుకొనియుందును.

దోహా 53

"అయ్యో! నాకు ఱెక్కలులేవు. ఱెక్కలుఁ గలిగియుండినను, నాకుమారుఁడు సమయమువచ్చినప్పుడు నుపేక్షించెను. నేను నాకుమారుని ధిక్కరించి, 'ఓరీ! వానినిఁబట్టుకొని, యెందులకు నావద్దకుఁ దీసికొనిరా లేదు! ఆమె శ్రీరామునిభార్య; వాఁడు రావణుఁడు. వాఁడామెను అపహరించుకొని పోయెనుగదా' అని వానితోఁ బలికియుంటిని.

చౌపాయి

"ఓ తమ్ములారా! అంతలో, మునీశ్వరునివచనములు నాకు జ్ఞప్తికివచ్చెను. అందువలన, గొంచెము ధైర్యముకలిగెను. 'ఆమెను వెదకుటకు రాముఁడు దూతలఁబంపును. వారు వనములకు రాఁగలరు; వారింజూచి, నేను ధన్యుఁడను కాఁగలను.' ఈప్రకారము చింతించి, మీమార్గముఁ జూచుచుంటిని. దివారాత్రములు శ్రీరాముని స్మరించుచు, మీరాకను నిరీక్షించుచుంటిని. ఈనాఁటికి మునీశ్వరునివచనములు సత్యమయ్యెను. నామాటప్రకారము రామకార్యమును సాధింపుఁడు. సముద్రములోఁ ద్రికూటపర్వతముమీఁద లంకానగరము కలదు. అచ్చట రావణుఁడు నిర్భయముగ నివసించియుండును. ఆనగరములో నశోకవనము కలదు. ఆవనములో జానకియుండును. అశోకవృక్షము

క్రిందఁ గూర్చుండి, జానకి దుఃఖించుచు, దివారాత్రములఁ గడుపు చుండును." ఈప్రకారము సంపాతి చెప్పినమాటలను వానరులు విని, దక్షిణదిశకు దృష్టుల నిగిడించిరి; కాని, వారికి జానకి దృగ్గోచరము కాలేదు. "ఓయీ! మాకు జానకిఁ జూపుము" అని వానరులు ప్రార్థించిరి. సంపాతి వారితో నిట్లు పలికెను.

దోహా 54

"ఓయి వానరులారా! మీరు జానకినిఁ జూడలేరు. 400 యోజనముల దూరమువఱకు మా గృధ్రములదృష్టి ప్రసరించును. నాకు వృద్ధాప్యము వచ్చెను. లేనియెడల, మీకు నాశక్తికొలది సహాయముఁ జేసియుందును.

చౌపాయీ

"నూరుయోజనములు దాఁటఁగలబలవంతుఁడు, బుద్ధిమంతుఁడు, రామ కార్యమును సాధింపఁగలఁడు. మీ కటకములో నట్టివాఁ డుండిన యెడల, మీకార్యమును వాఁడు సాధించును. వాఁడే ధన్యుఁడు. నా దుర్గతిఁ జూచియుంటిరి; ఇప్పుడు నాసద్గతిఁ జూడుఁడు; శ్రీవారికృప వలన, నా రెక్కలు వచ్చుచుండెను. చూడుఁడు; కనుక, మీరు ధైర్యము నవలంబింపుఁడు. ఈ సముద్రమునకుఁ బారముకలదు; మీరు శ్రీవారిభక్తులు. శ్రీవారినామమును స్మరించినమాత్రమున, మహాపాపాత్ములు పారములేని సంసారసాగరమును దాఁటుచున్నారు; మీరు వారిభక్తులు; ఈసముద్రము నవలీలలో మీరు దాఁటఁగలరు. మీరు వారిదూతలు; ధైర్యము నవలంబించి, కార్యమును సాధించుటకుఁ దగినప్రయత్నములఁ జేయుఁడు." ఓ పార్వతీ! ఈప్రకారము సంపాతి వారికి బోధించి, మీఁదికి నెగిరిపోయెను. వా రతనిఁజూచి, యాశ్చర్య పడిరి. శ్రీవారిమహిమఁ జూడుము; రెక్కలులేనిపక్షికి రెక్కలు వచ్చెను. అనంతర మా వానరులు, వారివారిబలాబలములఁ బరిశీలించిరి; ఆ సముద్రమునుదాఁటుటకు వారు సందేహించిరి. అప్పుడు జాంబవంతుఁడు వారితో నిట్లు పలికెను, "ఓయీ! వానరులారా!

నాకు వృద్ధాప్యమువచ్చెను. నాపూర్వపుబలము సర్వము క్షీణించెను. శ్రీపరమేశ్వరుని త్రివిక్రమావతారసమయమున, నేను బూర్ణవయస్సులో నుంటిని."

దోహా 55

అప్పుడు వానరులందఱు యువరాజుచుట్టుఁగూడి, యిట్లు పలికిరి. "ఓ నాథా! ఉపాయము నాలోచింపుఁడు. మనలో సముద్రమును దాఁటఁగల బలవంతుఁ డెవఁడుకలఁడు?"

చౌపాయ్

"ఓ నాథా! నేను ముప్పదియోజనములను దాఁటఁగలను"అని వికటుఁడు చెప్పెను. "ఓ రాజా! నేను నలువదియోజనములను దాఁటఁగలను; తదుపరి, నాపాదము ముందుకుఁబడదు." అని నీలుఁడు పలికెను. "ఏఁబదియోజనములు దాఁటఁగలను"అని దుర్ధరుఁడును, "అఱువదియోజనములు నేను" అని నలుఁడు చేతులఁజాచి, విజృంభించెను. "డెబ్బదియోజనములను దాఁటఁగలను, కాని ఓ వీరులారా! అంతకు నాబలము క్షీణించును" అని దధిముఖుఁడు పలికెను. ఈపాటిబలము గలవారు కార్యమునుసాధింప సమర్థులు కారని యంగదుఁడు తెలిసికొని, విచారించి, దుఃఖించుచుండెను. అప్పు డతనిఁజూచి, జాంబవంతుఁ డిట్లు బోధించెను. "ఓ వానరులారా! పూర్వపుదేహబలము ప్రస్తుతము నాకులేదు. ఇంతవృద్ధాప్యములో సహితము నేను సముద్రమును దాఁటియుందును." అతనిమాటలు సత్యమని వానరులు పూర్ణముగ విశ్వసించిరి. "ఓ వానరులారా! నామాటను వినుఁడు; పూర్వ మొకసమయమున నేను బదరికాశ్రమమునకు వెళ్లియుంటిని; ఆ వనముఁజూచి, నాకు సంతోషము కలిగెను. నేను ఫలములను భక్షించి, పానీయములఁ ద్రాగి, యొక శిలాతటముపై విశ్రమించియుంటిని. అచ్చట నొకబ్రాహ్మణుఁడు, మహాతపస్సంపన్నుఁడు, నిశ్చలముగ భగవంతుని నారాధించుచుండెను. ఆ బ్రాహ్మణునిఁ జంపుట కొక రాక్షసుఁడు వచ్చెను. వానింజూచి, నాకుఁ గోపమువచ్చెను. ఆబ్రాహ్మ

ణుని భయకంపములఁ జూచి, నే నతనిని సమీపించితిని. ఆరాక్షసుఁడు నన్నుఁజూచి, మూఁడుయోజనములపర్వతముఁ దీసికొనివచ్చి, నా ముణుకుమీఁదఁ గొట్టెను. నేను కోపించి, వానినిఁబట్టుకొని, నేలఁ గొట్టి, వానిపాదములఁ జీల్చి, వానిని వధించితిని. ఆబ్రాహ్మణుఁడు సంతోషించి, నన్ను దీవించెను. అప్పుడు నాకుఁగలబలము ప్రస్తుతము నాకుండినయెడల, మీరు నన్నుఁజూచి, యాశ్చర్యపడియుందురు. నా ముణుకునకు దెబ్బఁ దగిలియుండినయెడల, నేను తొంబదిఅయిదుయోజనములు దాఁటఁగలను.

దోహా 56

"త్రివిక్రముఁడు బలిచక్రవర్తిని బంధించి, రెండుపాదములతో లోకముల నాక్రమించినపుడు, రెండుఘడియలలో వారికి నేడుప్రదక్షిణములఁ జేసియుంటిని." అని జాంబవంతుఁడు ముచ్చటించెను.

చౌపాయ్

అటుతరువాత, నంగదుఁ డిట్లు పలికెను. "ఓ వానరులారా! నేను సముద్రమును దాఁటఁగలను; కాని, తిరిగిరాఁగలనో లేనో సందేహము. అచ్చట రాక్షసులతోఁ బోరాడినతరువాత, నాబలము క్షీణించును. రాకపోకలకుఁ దగినంతబలము లేదు." "ఓ అంగదుఁడా! నీవు యువరాజువు; మాకు నాయకుఁడవు; నీకు సామర్థ్యముండినను లేకపోయినను విచారాంశము కాదు. నీవు స్వయముగ వెళ్లుట యుచితము కాదు; రాజధర్మమునకు విరుద్ధము. ఆపనిని నీసేవకులు చేయఁగలరు." అని జాంబవంతుఁడు యువరాజునకు బోధించి, వాయుపుత్రునితో నిట్లు ప్రస్తావించెను. "ఓయీ! వాయుపుత్రుఁడా! నీవేల యిట్లు మౌనమును ధరించియుంటివి; ఓయీ! నీవు వాయువుకుమారుఁడవు; వాయువువంటి బలవంతుఁడవు; బుద్ధిమంతుఁడవు; వివేకుఁడవు; విజ్ఞానసంపన్నుఁడవు కదా! నీవు సాధింపలేనిదుష్కార్యము లోకములోఁ గలదా? ఈ హనుమంతునిచరిత్రముఁ జెప్పుచున్నాను; ఓ వానరులారా! చెవియొసఁగి విని యర్చుండి, సావధానముగ మీరు దానిని

వినుఁడు. హిమాచలసమీపమున కశ్యపఋషి యొకఁడు కలఁడు. అతఁడు మహాతపస్సంపన్నుఁడు; తేజశ్శాలి; ఒకసమయమున, నైరావతమువంటి మదగజమొకటి, కాలునివలె నతనికియెదురుగఁ బరుగెత్తెను. దానింజూచి, సకలఋషులును భయపడిరి; వారి కరచరణము లాడ లేదు. ఓ హనుమంతుఁడా! అచ్చట నీతండ్రి కేసరి, నివసించియుండెను; అతఁడు మహాబలవంతుఁడు; తేజశ్శాలి; ఆవనమున కతఁడు రాజు. ఆ మదగజమును ఋషులుచూచి, నీ తండ్రివద్దకువెళ్లి, 'ఓ కపిరాజా! శరణు, శరణు; మమ్ములను రక్షింపుము' అని వారు వేఁడుకొనిరి. వారి దీనాలాపములఁ జూచి, యతఁడు జాలిఁబడి, దానిమీఁదికిఁ బరుగెత్తెను. మీతండ్రి దానినిఁబొడిచి, దాని రెండుదంతములఁ బెఱికి, నేలఁ గొట్టి చంపెను. ఆమునులు సంతోషించి, ప్రసన్నులయిరి.

దోహా 57

వారు నీ తండ్రిబలముఁజూచి, సంతసించి, 'ఓ బ్రాహ్మణపాలక కపిరాజా! నీ యిష్టమువచ్చినవరము నడుగుము.' అని పలికిరి.

చౌపాయ్

ఆ తపస్సంపన్నులు ప్రసన్నులగుటకు నీతండ్రి సంతోషించి, చేతులజోడించి, వారికినమస్కరించి, యిట్లు విన్నవించెను. 'ఓ భగవంతులారా! నామీఁద మీకుఁ గటాక్షమువచ్చెను; కనుక, మహాబలునితో సమానుఁడగుపుత్రుఁడు నాకుఁ గలుగునట్లు ప్రసాదింపుఁడు.' 'తథాస్తు' అని ఋషులుపలికి, నిష్క్రమించిరి. అనంతరము వృత్తాంతముఁ జెప్పుచున్నాను; వినుము. నీతల్లి అంజనాదేవి; ఆమె రూపలావణ్యములలో రతీదేవివలె నుండును. ఆమె యొకనాఁడు సి[illegible]చుకొని, షోడశకళలతోఁ బ్రకాశించుచు,నొకశిలాతటముపైఁ గూర్చుండెను. అప్పుడు మందసుగంధశీతలవాయువు ప్రసరించెను; ఆవనములోని ప్రకృతిసంపదఁ జూచినందున,నామెమనస్సున కాప్యాయనము కలిగెను. ఆమెనుఁజూచి, పవనుఁడు మోహించెను. ఆమె నతఁడు కౌఁగి

లించుకొనెను. అతనిమోహముఁ జూచి, యామె కోపించి, యతనిని శపించుటకు సిద్ధపడెను. అప్పుడు వాయుమూర్తి మృదుమధురవచనములతో నిట్లు చెప్పెను. 'ఓ అంజనీ! నీవు కోపించి, నన్ను శపింపకుము. పూర్వము జరగినవృత్తాంతమును వినుము. నావంటి బలవంతుఁడగుకుమారుఁడు నీకుఁగలుగుటకు బ్రాహ్మణులు నీభర్తకు వరము నిచ్చియుండిరి. అందుచేత, నీశరీరమును స్పృశించితిని. ఈ వరముచేతగాని, లేనియెడల నీ శరీరమును ముట్టుటకు నా కేమిప్రయోజనము? అందుచేత, నన్ను శపింపకుము.' అని వాయుమూర్తి చెప్పి, యంతర్ధానమయ్యెను. అనంతరము, నీతల్లి, యీవృత్తాంతమును నీతండ్రితోఁ జెప్పెను. ఓ వానరకులదీపకా! ఇఁక నీజన్మవృత్తాంతముఁ జెప్పుచున్నాను; వినుము. శుభలగ్నము, శుభనక్షత్రమున నీవు మహాబలునిప్రతాపమువలన జన్మించితివి. ("కార్తికబహుళచతుర్దశి భౌమవారము, స్వాతీనక్షత్రము, మేషలగ్నము—మహావీరునిజననము." ఉత్సవసింధు.) ఈప్రకారము నీవు మహాబలునివీర్యమువలన జన్మించితివి; నీ జననమువలన, నీ తల్లిదండ్రులు పరమానందమగ్నులై, వనములలో విహరించుచుండిరి. ఒకసమయమున నీతల్లి నిన్ను తొడలోఁ గూర్చుండఁబెట్టుకొని, నీకుఁ బాలుఁబెట్టుచుండెను. అప్పుడు ప్రాతఃకాలము; బాలసూర్యునిఁ జూచి, యతనినిఁ బట్టుకొనుటకు నీ వాకాశముమీఁదికి యెగిరియుంటివి; ఆ సూర్యునిబింబ మొకఫలమని నీవు తలంచితివి. అప్పుడు దేవేంద్రుఁడు నిన్ను వజ్రముతోఁ గొట్టెను.

దోహా 58

"ఆ వజ్రప్రహారముచే, నీవు మూర్ఛఁబడియుంటివి; అప్పుడు నీతండ్రి కోపించి, వాయువులను బంధించెను.

చౌపాయ్

"ఈప్రకారము నీతండ్రి, మహాబలుఁడు వాయువులను బంధించినందున, మూఁడులోకములు వ్యాకులమాయెను. అప్పుడు దేవతలు

నిర్ఘాతపడి, మహాదేవుని స్తుతించిరి; శివుఁడు వారితో నిట్లు చెప్పెను. 'ఓ దేవతలారా! ధైర్యము నవలంబింపుఁడు; ' ఉదాసీనమును విడిచి, వాయుమూర్తివద్దకు వెడలుఁడు' అని చెప్పి, బ్రహ్మమహేశాదిదేవతలు నీతండ్రి వాయుమూర్తివద్దకు వచ్చిరి. 'ఓ వాయుమూర్తీ! నీకుమారుఁడు సూర్యునిఁ బట్టుకొనుటకుఁ బ్రయత్నించెను; అతఁ డీయపరాధముఁ జేసియుండెను; నీవు వాయువులను బంధించితివి. నీవు వాయువులను విడిచిపెట్టినఁగాని, జీవులు జీవింపలేరు. నీవు ప్రసరించుటవలన, నీకును లోకమునకును మేలుకలుగును. కనుక, వాయువులను విడిచి, నీ యిష్టమువచ్చినవరముల నడుగుము.' జీవుల ప్రాణములను నిలువఁబెట్టుము.' ఈప్రకారము దేవతలు వాయువునిఁ బ్రార్థించిరి. 'ఓ దేవతలారా! అమరత్వమును, అజేయత్వమును, సంపూర్ణబలమును నాకుమారునకు దయచేయుఁడు; నాకుమారుఁడు శ్రీరామభక్తుఁడై, సదా శ్రీరామునిసన్నిధానమున నివసించునట్లు ప్రసాదింపుఁడు.' 'తథాస్తు' అని దేవతలందఱు పలికిరి. బ్రహ్మమహేశ్వరులును, అష్టదిక్పాలురును, వారివారి ఆయుధములవలన నీకు భయముకలుగనట్లు వరముల నిచ్చిరి. అప్పుడు నీతండ్రి వాయువులను విసర్జించెను. ఈప్రకారము నీకు వరములనిచ్చి, బ్రహ్మాదిదేవతలు స్వస్థానములకు నిష్క్రమించిరి. నీవును, నీ తల్లిదండ్రులును వనములలో సంతోషముతోఁ దిరుగుచుంటిరి. నీవు మునీశ్వరుల యాశ్రమములకు వెళ్లి, వారి దయను సంపాదించి, వారికమండలోదకమును ద్రాగుచుంటివి. వృక్షములఁ బడద్రోసియు, పర్వతశిఖరములపైకి నెగసియు, నీశరీరమును నీవు దృఢముఁ జేసికొంటివి. ఋషులు నిన్ను శపించిరి; కనుక, నొకరు నీకు జ్ఞాపకముఁ జేసికొనివచ్చినఁగాని, నీబలమును నీవు గుర్తెఱుంగవు. ఓ వీరుఁడా! నిన్ను నీతల్లిదండ్రులు వారిప్రాణముతో సమానముగఁ జూచుకొనుచుండిరి. దేవేంద్రుఁడు వజ్రముతో నిన్ను హనువులమీఁదఁ గొట్టెనుకనుక, నీకు హనుమంతుఁడని పేరువచ్చెను."

ఈప్రకారము జాంబవంతుఁడు చెప్పినమాటలను హనుమంతుఁడు విని, యిట్లు పలికెను. "ఓ వానరులారా! మీరు శోకమునువిడిచి, ధైర్యము

నవలంబింపుఁడు. నేను శ్రీవారిదాసుఁడను; వారికార్యమును సాధించెదను." అతనిమాటలను వారు విని, జయజయశబ్దములఁ జేసిరి. శ్రీరాముని కార్యము సఫలమగునని తలఁచి, అంగదుఁడు ప్రసన్నుఁడయ్యెను; వానరులముఖములు వికసించెను. నల, నీల, జాంబవంతాది మహావానరయోధులు హనుమంతుని సమీపించి, "ఓ వీరుఁడా! శ్రీవారికార్యమును సాధింపుము" అని ప్రార్థించిరి. అతఁడు సముద్రమువైపుఁ జూచి, "ఓ వానరులారా! శ్రీవారికార్యమును సాధించెదను" అని వారికి ధైర్యముఁజెప్పెను. తదుపరి, హనుమంతునితో నిట్లు జాంబవంతుఁడు పలికెను. "ఓ వాయుపుత్రా! సావధానముగ వినుము. నీవు శ్రీవారికార్యమును సాధించుటకే జన్మించితివి సుమీ!" ఆ మాటలకతఁడు కొండంతవాఁడయ్యెను; అతనిశరీరము కాంచనాద్రివలె నుండెను; రెండవకొండలరాయఁడేమో యని వానరులు భ్రమించిరి. అతఁడు పెక్కుమారులు సింహనాదముఁ జేసి, "ఓ వానరులారా! ఈ లవణసముద్రము నవలీలలోఁ దాఁటఁగలను. చతురంగబలముతోఁ గూడిన రావణుని సంహరించి, త్రికూటశిఖరముతో లంకానగరముఁ దీసికొనివచ్చెదను" అని చెప్పి, "ఓ జాంబవంతుఁడా! నే నేమిచేయవలయునో చెప్పుము. నేను జేయఁదగినవిధానమును బోధింపుము" అని విన్నవించెను. "ఓ వీరుఁడా! నీవు లంకానగరమునకు వెళ్లి చేయవలసినపని విశేషము లేదు. జానకిఁజూచి, యామెక్షేమమును గనుఁగొనుము. ఆమెను నీవు చూచినమ్ము.

## కాండ్ 6

"పిమ్మట శ్రీరాముఁడు వినోదార్థము వానరసైన్యములఁ దీసికొని, లంకను ముట్టడించి, రావణుని సంహరించి, సీతను గైకొనును. శ్రీవారిపవిత్రచరిత్రమును నారదముని మూఁడులోకములలో గానముఁజేయును. శ్రీవారిచరిత్రమును బ్రహ్మాదిదేవతలు విని సంతోషించెదరు." ఈప్రకారము జాంబవంతుఁడు బోధించెను.

ఈ శ్రీరామచరిత్రమును వినినవారును, జదివినవారును, చెప్పినవారును, శ్రీరామసాయుజ్యముఁ బొందఁగలరు. కమలమునాశ్రయిం

చిన తుమ్మెదవలె, శ్రీరాముని చరణకమలముల నాశ్రయించి, తులసీదాసు రామచరిత్రమును గానముఁ జేసెను.

దోహా 59

సంసారరోగములను హరించుటకుఁ బరమౌషధమగు రామచరిత్రమును వినినవారును, చెప్పినవారును, చదివినవారును, శివుని కటాక్షమువలన, సకలమనోరథములఁ బొందఁగలరు.

సోరఠా 3

నీలోత్పల తనుశ్యామ
కామకోటి శోభా అధిక,
సునియ తాసు గుణగ్రామ
జాసు నామ అఘ ఖగ వరక.

కిష్కింధాకాండము సమాప్తము.

---

శ్రీ మ ద్గో స్వా మి

# తులసీదాసకృతరామాయణము

# సుందరకాండము.



## ప్రథమవిశ్రామము.

శ్లో. శాంతం శాశ్వత మప్రమేయ మనఘం నిర్వాణశాంతిప్రదం
బ్రహ్మాశంభు ఫణీంద్ర సేవ్య మనిశం వేదాంతవేద్యం విభుమ్,
రామాఖ్యం జగదీశ్వరం సురగురుం మాయామనుష్యం హరిం
వందేహం కరుణాకరం రఘువరం భూపాల చూడామణిమ్. 1

నాన్యాస్పృహా రఘుపతే హృదయేఽస్మదీయే
సత్యంవదామి చ భవా నఖిలాంతరాత్మా,
భక్తిం ప్రయచ్ఛ రఘుపుంగవ నిర్భరాం మే
కామాదిదోషరహితం కురు మానసంచ. 2

అతులితబలధామం స్వర్ణశైలాభదేహం
దనుజవనకృశానుం జ్ఞానినా మగ్రగణ్యం,
సకలగుణనిధానం వానరాణామధీశం
రఘుపతివరదూతం వాతజాతం నమామి. 3

### చౌపాయ్ 1

జాంబవంతునివచనములను హనుమంతుఁడు విని సంతోషించెను; అతఁడు వానరులఁ జూచి, "ఓ వానరులారా! మీరు నారాకకెదురుచూచుచు, నిచ్చట నిలిచియుండుఁడు; కందమూలాదుల భుజించి, మీప్రాణములను నిలుపుకొనుఁడు; ఒకవేళ, నవి దొరకనియెడల, నా దుఃఖమును సహించియుండుఁడు; నేను జానకిఁ జూచివచ్చునంత

పలుకు నిలిచియుండుడు; ఈ రామకార్యముఁ జేయుటకు నా కుత్సాహము కలుగుచున్నది" అని చెప్పి వారికి నమస్కరించి, యోగమార్గమున పవనముబంధించి, శ్రీరామమూర్తిని ధ్యానించి, ప్రయాణమునకు సిద్ధమయ్యెను. సముద్రతీరమున 'సుందర' మను పర్వతమొకటి కలదు; అతి సునాయాసముగ మహావీరుఁడు దానిమీఁదికి లంఘించెను; (ఈపర్వతముమూలమున, నీకాండకు సుందరకాండ యని పేరు వచ్చెను.) అతఁ డాపర్వతముపైకి లంఘించి, శరీరమునుఁ బెంచి, సింహనాదముఁ జేసెను; అతఁడు పాదములఁ ద్రొక్కి, బాహువులఁ జాచి, శిరస్సునెత్తి, అంతరిక్షమునకుఁ గుప్పించి లంఘించెను; ఆవేగమున కోర్వలేక, పర్వతముపై నుండిన చెట్లు మొదలగునవి, యతనితోఁ గూడ నంతరిక్షమున కెగిరి, యతనితోఁగలసి సముద్రమువైపు వెళ్లెను; అతఁడు రామకార్యార్థము దూరదేశమునకు గమనించుచుండెనని తెలిసికొని, ఆవృక్షములు మొదలగునవి, యతనిని సాగనంపుటకు వెళ్లినట్లు కనఁబడెను. అతఁడు పాదములతోఁ ద్రొక్కినందున, నా సుందరపర్వతము పాతాళమును ముట్టెను. అప్రతిహతమగు శ్రీరామునిబాణమువలె, నతఁ డాకాశమార్గమునఁ బోవుచుండెను. (శ్రీరామునిబాణమునకు మూఁడుగుణములు కలవు:—1. రామబాణమునకు జయమే గాని అపజయము లేదు. 2. ఆబాణము వాయువేగమునఁ బోవును. 3. ఆబాణము నద్దగించినను, దానికి నద్దము లేదు.) అంతట సముద్రుఁడు తనలోఁ దా నిట్లు విచారించి, "ఈ హనుమంతుఁడు రాముని దూత; రామకార్యార్థమె బయలువెడలెను" అని తెలిసికొని, తనగర్భములో దాఁగియుండిన మైనాకపర్వతముఁ జూచి, "ఓ మైనాకపర్వతమా! నీవు నీటిలోనుండి పైకిలేచి, ఈ హనుమంతునకుఁ గొంచెము విశ్రాంతిఁ గలుగఁజేయుము; ఇంద్రుఁడు పర్వతములరెక్కలను గొట్టినపుడు వాయుమూర్తి నీకు సహాయముఁజేసెను; కనుక, నతనికుమారునకు నీవు సహాయముఁజేయుట యుచితము:—(అధికపాఠము. అని-"

సోరఠా 1

సముద్రుఁడు చెప్పినపలుకులను మైనాకుఁడు విని, నీటిలోనుండి పైకి లేచెను; అతఁడు చేతుల జోడించుకొని, "ఓ మహావీరుఁడా!

నాపైఁ గొంచెము విశ్రమింపుఁడు, అని ప్రార్థించెను." అధికపాఠము సమాప్తము.)

దోహా 1

ఆ పర్వతశిఖరమును హనుమంతుఁడు తనచేతులతో స్పృశించి, అతనికి నమస్కరించి, "ఓ మైనాకమా! రామకార్యార్థమై నేను బోవుచుంటిని; ఆకార్యము పూర్తమగువఱకు, నేను విశ్రమించుట యుచితముకాదు. ఈప్రకారమే నేఁడుమొదలు నీవు నిలిచియుండుము; ఇంద్రునిభయము నీకు గలుగదు." అని చెప్పి, అభయము నిచ్చి, ప్రయాణము సాగించెను.

చౌపాయ్ 2

అంతట నతని దేహబలమును, బుద్ధిబలమును రామునియందుఁ గల విశ్వాసమును దేవతలు తెలిసికొనుటకు నిశ్చయించి, సురస యనుపేరుగల నాగమాతను వారు పంపించిరి. ఆమె హనుమంతునివద్దకు వచ్చి, "ఓయీ! ఈదినమున నాయాహారమునిమిత్తము దేవతలు నిన్ను నిర్ణయించిరి; కనుక, నిన్ను నేను భుజించెదను." అని పలికెను. ఆమెవచనముల నతఁడు విని, నవ్వి, "ఓ అమ్మా! ఓ తల్లీ! నేను రామకార్యార్థమై వెళ్లుచున్నాను; సీత క్షేమసమాచారమును ప్రభువునకు విన్నవించి, తిరిగివచ్చి నీముఖములోఁ బ్రవేశించెదను; ఓ తల్లీ! సత్యముఁ జెప్పుచున్నాను; నన్ను విడిచిపెట్టుము." అని ప్రార్థించెను. (అతఁడు బ్రహ్మచారి కనుక, నామెను తల్లీయని పిలిచెను.) అతఁ డనేకవిధములఁ బ్రయత్నించెను; కాని, అతనిని యామె విడిచిపెట్టలేదు. "నీవు నన్ను మ్రింగుట కష్టము; అయినను, నీప్రయత్నము నీవు చేయుము" అని యతఁడు చెప్పెను. (అతఁడు ప్రయత్నించినప్రయత్నము లేమనిన:—1 "రామునిదూతను; రామకార్యార్థము నేను పోవుచుంటిని" అని యతఁడు చెప్పినమాట యొకటి. 2 అతనిప్రయాణము స్త్రీనిమిత్తమని చెప్పుటవలన, నామె మనస్సు కఱగునని యతఁడు తలఁచెను. 3 ఆమెకు దనయందు దయవచ్చుట కతఁ డామెను తల్లీ యని

పిలిచెను. 4 సీతనిమిత్తమే, రామలక్ష్మణులును, సుగ్రీవుఁడును, దేవతలు మొదలగువారు తపించుచుండిరి; ఆమెఁ జూచివచ్చుటవలన, వారికి శాంతముకలుగునని తలఁచి, సీతయని యతఁడు చెప్పెను—వీనిమూలమున నతనిబుద్ధిబలము ప్రకటమగుచున్నది.) సురస తనముఖము నొకయోజనము విస్తరించెను; హనుమంతుఁడు స్వశరీరమును రెండుయోజనములు పెంచెను; ఆమె పదియాఱుయోజనములు విస్తరించెను; అతఁడు నుప్పదిరెండుయోజనములు పెంచెను. ఆమె ముఖము నెంతవఱకు విస్తరించెనో, మహావీరుఁ డంతకు ద్విగుణముగ శరీరముఁ బెంచుచుండెను; ఆమె తుదకు నూఱుయోజనములు పెంచెను; అంతలో నతఁడు మహాసూక్ష్మరూపమును ధరించి, ఆమె గర్భములోనికి వెళ్లి, మరల వెలుపలకు వచ్చెను; ఆమె కతఁడు నమస్కరించి, "ఓ తల్లీ! ఇఁక నన్ను విడిచిపెట్టుము" అని ప్రార్థించెను. అంతట నామె యతనిబుద్ధిబలమును, దేహబలమును, రామునియందుఁ గల విశ్వాసమును గ్రహించి, సంతోషించి, "ఓయీ వీరుఁడా! నిన్నుఁ బరీక్షించుటకు దేవతలు నన్నుఁ బంపిరి; నీసత్త్వవ నేను గ్రహించితిని.

దోహా 2

"నీవు బుద్ధిమంతుఁడవు; బలవంతుఁడవు; విశ్వసింపఁదగిన రామునిదూతవు; రామకార్యమును సాధింపఁగలవు" అని పలికి, దీవించెను. ఆమె స్వర్గమునకు నిష్క్రమించెను. అతియుత్సాహముతో నతఁడు ప్రయాణమును సాగించెను.

చౌపాయ్ 3

సముద్రములో సింహిక యనురాక్షసి కలదు; అది రాహువు తల్లి; ఛాయనుఁబట్టి, అంతరిక్షమున నెగురుచుండినపక్షుల నది సంగ్రహించును. ఈపథమున నారాక్షసి జంతువులను గ్రహించి, వానిని భుజించును; అప్రకారమ మప్పు డారాక్షసి, హనుమంతుని ఛాయనుఁబట్టి, యతనిని దిగువకులాగెను; ఆరాక్షసి వృత్తాంతమంతయు సుగ్రీవుఁడు హనుమంతునితోఁ జెప్పియుండెను; కనుక, నతఁడు శీఘ్రముగ గ్రహించి, దానిని సంహరించెను; తదుపరి, యతఁడు సముద్రమును దాఁటి, యొడ్డుఁ జేరెను. ఆ సముద్రతీరముననుండిన యుద్యానవన

ముల శోభయు, మధుపముల ఝంకారమును హనుమంతుఁడు చూచి, పరమానందభరితుఁ డయ్యెను. అనేకవృక్షములు పుష్పములతోను ఫలములతో నిండియుండెను. ఆవనములో నివసించియుండిన మృగములను పక్షులఁ జూచి, మనస్సు భ్రమించును. అచ్చటనుండిన నొక పర్వతముపైకి హనుమంతుఁడు నిర్భయముగ నెగిరి వెళ్లెను. ఓ పార్వతీ! ఇందులో హనుమంతునిమహిమ లేశమైన లేదుసుమీ! ఇదియంతయు శ్రీవారికృపయేయని తెలిసికొనుము; శ్రీవారు కొలునిసహితము భక్షింపఁగలరు. ఆ పర్వతముపై నెక్కి, హనుమంతుఁడు లంకాపట్టణమును వీక్షించెను. ఆపట్టణముయొక్క దుర్గములను వర్ణించుటకు శక్యముకాదు. ఆ నగరములో మహోన్నతమగు కోటలుకలవు; సముద్రము నలువైపుల దానినిఁ జుట్టియుండెను. ఎటువైపుఁ జూచినను, బంగారుకోటలు దేదీప్యమానముగ వెలుగుచుండెను.

## శ్లోక్ 1, 2, 3.

ఆ సువర్ణకోటలకు రంగురంగులమణులు స్థాపింపఁబడియుండెను; ఆ పట్టణములోనిగృహములు లతిరమ్యములు; పొడుగువెడల్పులలోను, దిట్టతనములోను వానిని మించినగృహములు లేవు; చౌహట్టములు, అంగడివీధులు, రాజమార్గములు—ఈ మొదలగునవి తీరుగనుండెను. ఆ లోకరావణుని చతురంగబలములను లెక్కించుట కెవనికిశక్యము? మహాబలవంతులును, కామరూపులు నగు రాక్షససైన్యముల నెటుల వర్ణింపఁగలను? వాపీకూపతటాకములును, వనములును, ఉపవనములును, ఉద్యానవనములు నతిరమ్యముగ నుండెను; దేవ, గంధర్వ, నాగ, మనుజకన్యలు వేలకొలఁది నగరములో నుండిరి; వారిచక్కదనముఁ జూచి, మునులుసహితము భ్రమించెదరు. ఆ రాక్షసులు పర్వతాకారులు; మహాబలవంతులు; వారు సింహనాదములఁ జేసి, భుజముల నప్పళించుకొని, ఢీమని యొకరితో నొకరు పోరాడుచుండిరి; గరిడీలలో వా రనేకవిధముల మల్లబంధములలోఁ దేలుచుండిరి. ఆనగరము నలువైపులును గోట్లకొలఁదియోధులు రక్షించుచుండిరి; మనుజులను, మహిషములను, ధేనువులను, గార్దభములను, ఛాగములను, వారు తినుచుండిరి. పుణ్యతీర్థములలో స్నానముఁ జేయుటవలన సద్గతి

వచ్చును; ఈరాక్షసులు రామునిబాణములనునట్టితీర్థములో స్నానముఁ జేసి, శరీరములను విడిచిపెట్టి, సద్గతికిఁ బోఁగలరు; కనుక, వారిచరిత్రము తులసీదాసుగారు సంక్షేపముగఁ జెప్పిరి.

దోహా 3

నగరరక్షకులను మహావీరుఁడు చూచి, విచారించెను; అతిసూక్ష్మరూపమును ధరించి నగరములోఁ బ్రవేశించుటకు నిశ్చయించెను.

చౌపాయీ 4

మశకమువంటి సూక్ష్మరూపమును హనుమంతుఁడు ధరించి, శ్రీరామమూర్తిని ధ్యానించి, నగరములోఁ బ్రవేశించెను. లంకానగరముఁ గాపాడుచుండిన రాక్షసి, లంకిని యను పేరుగలది, వానరునిఁ జూచి, "ఓరీ! ఎవరు నీవు? నన్ను ధిక్కరించి, యెటువైపుఁ బోయెదవు?" అని తర్జించెను. "ఓరీ మూర్ఖుఁడా! నాపేరు లంకిని; నాసంగతి నీకుఁ దెలియదుకదా! ఏమి? దొంగవలె, లంకలోఁ బ్రవేశించుచుంటివి? అట్లు ప్రవేశించువారిని భక్షించెదను" అని లంకిని మహావీరుని బెదరించెను. హనుమంతుఁడు దానితో మారుమాట నాడక, దానిని యొకగ్రుద్దు గ్రుద్దెను; ఆగుద్దుతో నది నేలమీఁదఁబడెను; దానిముఖమునుండి రక్తము కడవలకొలఁది జారిపడెను. పిమ్మట ఆలంకిని సవరించుకొని, కూర్చుండి, చేతులజోడించి, వానరునితో నిట్లు ప్రసంగించెను. "ఓయీ! బ్రహ్మదేవుఁడు రావణునకు వరములనిచ్చి, నిష్క్రమించునపుడు నన్నుఁ జూచి, నాతో నిట్లు చెప్పెను. 'ఓ లంకినీ! ఎప్పుడు నీవు వానరుని గ్రుద్దువలన, వ్యాకులముఁ బడియెదవో, అప్పుడు రావణునకు మరణకాలము సమీపించెనని తెలిసికొనుము. ఆ వానరుఁడు సీతంజూచుటకు వచ్చును. రాక్షసులవినాశము కలుగును' అని బ్రహ్మ నాతోఁ బలికెను. కనుక, ఓ తండ్రీ! నేను పుణ్యాత్మురాలను; ఈ నానేత్రములతో రఘునాథుని దూతం జూచుభాగ్యము కలిగెను.

దోహా 4

"ఓ తండ్రీ! స్వర్గాదిసప్తలోకములను, అపవర్గచతుష్టయమును- వీనివలనఁ గలుగుసుఖము నొక తక్కెడలోనుంచి, సత్సాంగత్యమును రెండవతక్కెడలో నుంచి తూచినయెడల, సత్సాంగత్యముతోఁ గూడిన

తక్కెడ బరువుచేతఁ గ్రిందికిఁదిగును; స్వర్గాదిలోకములతోఁ గూడిన తక్కెడ చులకన యగుటచేత, మీఁదికి లేచును. *

చౌపాయీ

"ఓ తండ్రీ! శ్రీరాముని ధ్యానించి, నగరములోఁ బ్రవేశింపుము; నీకార్యములు సిద్ధించును. (1. సుగ్రీవుని ప్రతిజ్ఞ, 2. రామకార్యము, 3. వానరులు పడినశ్రమకుఁ దగినఫలము, 4. సీత విరహ దుఃఖమున కుపశాంతియు, 5. విభీషణుని మనోరథసిద్ధియు, 6. లంకా దహనము, 7. సీతాద్వారా, త్రిలోకవాసుల యానందము.) శ్రీవారి కృపవలన, విష మమృతమగును; శత్రువులు మిత్రులు కాఁగలరు; సముద్రము గోష్పాదమగును; సుమేరుపర్వతము ధూళియగును; జగన్నాథుఁ డనుకూలముగ నుండినయెడల, సర్వ మనుకూలముగ నుండును." అని యీప్రకారము లంకిని బోధించెను. అతి సూక్ష్మరూపమును హనుమంతుఁడు ధరించి, భగవంతుని స్మరించి, నగరములోఁ బ్రవేశించెను. ప్రతిమందిరమున కతఁడు వెళ్లెను; ఆయామందిరములలో మహా వీరుల నతఁడు చూచెను. అనంతర మతఁడు రావణునిమందిరములోఁ బ్రవేశించెను; వాని యంతఃపురములోని చిత్రవిచిత్రములఁ జెప్పుటకు శక్యముకాదు; ఆ మందిరములో ననేకస్త్రీలు శయనించియుండిరి; కాని, జానకినిమాత్ర మతఁడు చూడలేదు. (శత్రువులు శయనించియుండఁజూచిన శుభశకునము. (అధికపాఠము:—"నే నెచ్చటికిఁ బోఁగలను; జానకివృత్తాంతముఁ జెప్పువా రెవరు! ఆమెదర్శన మెట్లు లభించును! జానకిని సందర్శింపక, శ్రీవారిముఖము నెటులఁ జూడఁగలను! జాంబవంతుఁడు మొదలగువారు జానకి క్షేమసమాచారము నడిగినయెడల, నే నేమి ప్రత్యుత్తర మిచ్చెదను!" అని యీప్రకా

---

* ఒకసమయమున, విశ్వామిత్రుఁడు తపోబలము బలమనియు, వసిష్ఠు సత్సాంగత్యబలమే బలమనియు వాదించి, వా రిరువురుకలసి, ఆదిశేషువువద్దకు వెళ్లి, వివాదాంశము నతనితోఁ జెప్పిరి. "ఓ మునులారా! ఈభూమిని మీ రొకనిమిషము ధరించిన, మీ వివాదమును పరిష్కరించెదను." అని శేషువు చెప్పెను. విశ్వామిత్రుని తపోబలమువలన, భూమి నిలువఁబడలేదు; వసిష్ఠుగారి సత్సాంగత్యబలమువలన, భూమి నిలువఁబడెను.

రము హనుమంతుఁడు తనలోఁదాను చింతించెను. అనేక ఘోరరాక్షసుల నతఁడు చూచెను; కాని, జానకిక్షేమసమాచారము వారివలనఁ దెలియదు. (ఎవరు జానకివృత్తాంతముఁ జెప్పఁగలరు? అధికపాఠము సమాప్తము.) అచ్చట నొక హరిమందిరము నతఁడు చూచెను; అది విభీషణుని గృహమున కెదురుగ నుండెను.

దోహా 5

ఆగృహ ముఖద్వారముమీఁద శ్రీరఘునాథాక్షరములు వ్రాయఁబడియుండెను; ఆ గృహముయొక్క శోభనువర్ణింప శక్యము కాదు; ఆగృహము నలువైపులను, తులసిబృందావనము కలదు; దానిం జూచి మహావీరుఁడు సంతోషించెను.

చౌపాయ్

"ఈ లంకానగరములో ననేక రాక్షసులు కలరు కదా! ఇచ్చట సజ్జనులనుఁ జూచుటకష్టము; ఇచ్చట వారు నివసించియుండుట యెట్లు?" అని హనుమంతుఁడు తనలోఁదాను విచారించెను. ఇది సత్యమా, అసత్యమా, అని వానరుఁడు చింతించుచుండ,విభీషణుఁడు మేల్కాంచి, రామనామమును స్మరించుచుండెను; అతఁడు సత్పురుషుఁడని హనుమంతుఁడు గ్రహించి, సంతోషించెను; "నాసందేహము నితనితోఁ జెప్పిన, బాగుగనుండునా? ఏకార్యమైయినను, మహాపురుషులు భంగముఁజేయరు." అని నిశ్చయించి, హనుమంతుఁడు బ్రాహ్మణరూపమును ధరించి, విభీషణునితోఁ బ్రసంగించుటకు సిద్ధముగ నుండెను. అతని మాటలను విభీషణుఁడు విని, అతనికి నెదురుగ వెళ్లి, నమస్కరించి, యోగక్షేమముల నడిగి, "ఓ బ్రాహ్మణవర్య! మీ వృత్తాంతముఁ దెలియఁజేయుఁడు; ఒకవేళ మీరు హరిదాసులేమోయని తోఁచుచున్నది; నా మనస్సునకు, మిమ్ములఁ జూచినందున, నాప్యాయము కలుగుచున్నది; అథవా, మీరు రాముని దాసులయినయెడల, మీ దర్శనము నాభాగ్యము." అని పలికెను.

దోహా 6

అంతట, హనుమంతుఁడు స్వనామమును, స్వసందేశము నతనితోఁ జెప్పి, రాముని సమాచారము నతనికి విన్నవించెను; శ్రీరాముని

గుణములను వారు స్మరించి, పరమానంద మగ్నులయిరి; వారిరువుర శరీరములు పులకరించెను.

చౌపాయ్

"ఓ పవనపుత్త్రుఁడా! రెండు దంతపంక్తులమధ్య నాలుకవిధమున, నేనీ నగరములో నివసించియుంటిని; ఓ తండ్రీ! నేను దీనుఁడను, దిక్కులేనివాఁడనని తెలిసికొని, శ్రీరామమూర్తి నన్నుఁ గటాక్షించునా? నేను తామసవంశములోఁ బుట్టియుంటిని; అందుచేత, నాకు రాముని చరణారవిందములయందు భక్తికలుగుట యెట్లు? అయినను, ఓ మహావీరుఁడా! ప్రస్తుతము నాకుఁ గొంచెము ధైర్యము కలిగెను; భగవంతునికృప యుండినగాని, సజ్జనులదర్శనమును, సత్సాంగత్యమును లభింపదు. పరమేశ్వరునికృపవలననే, నీ దర్శనమయ్యెను; అందుచేతనే, నీయంతట నీవు నీ వృత్తాంతముఁ జెప్పియుంటివి." అని విభీషణుఁడు ప్రసంగించెను. "ఓ విభీషణుఁడా! నిష్కపటముగ నతనిని సేవించుదాసులపై నతనికి దయకలదు; అది శ్రీవారిస్వభావము; నీవేమో తామసుఁడవని చెప్పియుంటివి; నే నెవరు! నేనేమి కులీనుఁడనా! నే నొకవానరమును; నాస్వభావము చంచలము; అన్నివిధముల నేను హీనుఁడను; ప్రాతఃకాలమున లేచి, నానామము స్మరించిన యెడల, నాదినమున భోజనము లభింపదు.

దోహా 7

"ఓ సఖుఁడా! నే నింతనీచుఁడను; అయినను శ్రీరామమూర్తికి నామీఁదఁ బరిపూర్ణకటాక్షము కలదు." అని హనుమంతుఁడు పలికెను. అతనిశరీరము పులకరించెను; అతని నేత్రములవెంబడి నానందబాష్పములు కారెను.

చౌపాయ్

"ఇట్టి సుగుణసంపదలుగల ప్రభువునుమఱచి, అన్యచింతలతోఁ నుండిన వా రేల దుఃఖింపరు?" అని హనుమంతుఁడు తన నిశ్చితాభిప్రాయముఁ జెప్పెను. ఈప్రకారము వానరమూర్తి పలికినపలుకులను వినినందున, విభీషణునిమనస్సునకు శాంతము కలిగెను; అపరిమితానందము నతఁడు పొందెను. అనంతర మతఁడు సీతవృత్తాంతమునం

తయు వానరునితోఁ జెప్పెను. "ఓ సఖుఁడా! నీ వనుజ్ఞ నిచ్చిన యెడల, నేను జానకింజూచుటకు గమనించెదను. ఆమెం జూచువ ఱకు నామనస్సు స్తిమితముగ నుండదు" అని వానరుఁడు చెప్పి, విభీషణునియాజ్ఞఁ గైకొని, ప్రయాణ మయ్యెను. మరల హనుమంతుఁడు సూక్ష్మరూపమును ధరించి, సీత నివసించియుండిన అశోక వాటికకు వెళ్లెను. మానసికముగ నామె కతఁడు నమస్కరించెను. నిద్రాహారములు లేకయే, జానకి కూర్చుండి, దివారాత్రములు గడుపు చుండెను. ఆమె నీరసించి, కృశించియుండెను; ఆమెశిరోజము లొకజ టవలె నల్లుకొనెను; ఆమె సదా 'రామ, రామ' అని జపించుచుండెను.

"ఏకవేణీధరా దీనా భర్తృచింతాపరాయణా, భూమిశయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే"—అని వాల్మీకము.

దోహా 8

ఆమెనేత్రము లామెపాదములఁ జూచుచుండెను; ఆమెమనస్సు రాముని చరణారవిందములయందుఁ దగులుకొని యుండెను; ఆమె దైన్యముఁజూచి, హనుమంతుఁడు జాలిఁబడి, దుఃఖించెను. వియోగమునకును, సంయోగమునకును చరణములే ప్రధానములు; ఆమెచరణములు రామునివద్దకు వెళ్లవలెను; లేక, ఆమెవద్దకు రామునిచరణములు రావలెను.

---

# ద్వితీయవిశ్రామము.



చౌపాయ్

ఆకులమధ్యను హనుమంతుఁడు సూక్ష్మరూపముతో నిలిచియుండెను. "ఓ నాథా! ఇఁక నే నేమిచేయఁగలను?" అని యతఁడు తన లోఁదాను చింతించెను. ఆసమయమున రావణుఁడు మేల్కాంచి, సీతవద్దకు వచ్చెను; అనేకప్రకారములు సింగారించుకొనిన స్త్రీజనంబు లతని

వెంట నుండిరి. చతురోపాయముల నుపయోగించి, రావణుడు సీతకు బోధించెను; నయమునను, భయమునను వాడు సీతతోఁ బలికెను. "ఓ సుముఖి! నామాటను వినుము; మందోదరాదిస్త్రీలు నీకుఁ బరిచర్యలఁ జేయఁగలరు. ఒక్కపర్యాయము కన్నెత్తి, నన్నుఁ జూడుము" అని వాఁడు వేఁడుకొనెను. ఒకతృణముఁ బట్టుకొని, సీత శ్రీవారిని స్మరించి, ముఖమునువంచుకొని, వానితో నిట్లు ప్రసంగించెను. "ఓరీ రావణా! ఖద్యోతముఁ జూచి, పద్మములు వికసించునా? (నీవు ఖద్యోతమువంటివాఁడవు; శ్రీరామునిముఖముఁ జూచిన, నా ముఖపద్మము వికసించును.) ఓరీ మూర్ఖుఁడా! నామాటలను లెస్సగ విచారింపుము; రామునిబాణములఁ జూచి, నీకు భయములేదా? ఓరీ సిగ్గుమాలినశిఖండీ! నీవు పిఱికిపందవు; కుక్కవలె, నీవు నన్ను దొంగిలించి, తీసికొనివచ్చితివి; అప్పుడు నా సమీపమున రాముఁడు లేకపోయినను, ప్రస్తుతము నావద్దకు వచ్చి, నన్ను రక్షించును. ఇందులకు సందేహము లేదు.

దోహా 9

"ఓరీ పాపాత్ముఁడా! నీవు ఖద్యోతమువంటివాఁడవు; శ్రీరాముఁడు సూర్యునితో సమానము;" అని యీప్రకారము సీత కర్ణకఠోరముగఁ బలికినపలుకులను రావణుఁడు విని, రౌద్రాకారుఁడై, చేతిలోని వజ్రాయుధమును ఝళిపించి, సీతపై హుంకరించి, గర్జించెను.

చౌపాయి

"ఓ సీతా! నన్నింత తృణీకరించి, నీవు సంభాషించితివి; ఈ యాయుధముతో నీ శిరస్సును ఖండించెదను. ఓ సుముఖి! శీఘ్రముగ నీవు నామాటలను మన్నింపనియెడల, నీప్రాణములఁ బుచ్చుకొందును" అని వాఁడు భయపెట్టెను. "ఓరీ రావణా! నీలకమలములవంటి నా మేఘశ్యాముని హస్తము లేనుఁగుతొండముఁ బోలియుండును. ఓరీ నీచుఁడా! నా నాథునిహస్తములు నా మెడమీఁదఁ బడును; లేక, నీ యాయుధమయినను పడును. ఓరీ! నాప్రతిజ్ఞను వినుము; ఓ చంద్రహాసమా! శ్రీరాముని వియోగదుఃఖమును నేను భరింపఁజాలను; నీధారతో, శీఘ్రము నా ప్రాణములఁ గొనిపొమ్ము; ఓ చంద్రహాసమా! ఈ వియోగదుఃఖముచేఁ బరితపించుచుంటిని; నీధారలతో నా తాప

మును శాంతింపఁజేయుము." అని యీప్రకారము సీత పలికినపలుకులను, రావణుఁడు విని, ఆమెను సంహరించుటకు దుమికెను. పలువిధముల నతనిని మండోదరిబోధించి, మందలించెను. అప్పుడు వాఁడు రాక్షసస్త్రీలను బిలిచి, సీతను దండింపుఁడని, వారికి నాజ్ఞాపించెను. "ఒకనెలదినముల వ్యవధినిచ్చెదను; ఈలోపున, నామాటను సీత మన్నింపనియెడల, దానిప్రాణములను మీప్రాణములఁ బుచ్చుకొందును" అని వాఁడు వారితోఁ జెప్పెను.

దోహా 10

ఈ ప్రకారము రావణుఁడు రాక్షసస్త్రీలతోఁ బలికి, స్వగృహమునకు నిష్క్రమించెను. అనంతరము, రాక్షసస్త్రీలు, నానా భయంకర రూపములను ధరించి, జానకిని ననేకవిధముల భయపెట్టిరి. (అథవా, ఏరూపమువలన నామెకు వారిమీఁద వయకలుగునో, వారారూపములను ధరించిరి.)

చౌపాయ్

త్రిజటయను రాక్షసస్త్రీ యొకర్తుకలదు; ఆమెకు శ్రీరాముని చరణారవిందములయందు భక్తికలదు; ఆమె కొంచెము జ్ఞానవంతురాలు; ఆమె రాక్షసస్త్రీలను పిలిచి, వారితో నిట్లు ప్రసంగించెను. "ఓ సఖులారా! నాకొక స్వప్నమువచ్చెను. జానకినిసేవించి, ఆమెకటాక్షమును సంపాదింపుఁడు. ఈప్రకారము నాకొక కలవచ్చెను. సావధానముగ వినుఁడు. ఒకవానరుఁడు మన లంకాపట్టణమునకు వచ్చి, రాక్షసులను సంహరించి, పట్టణమును దహించెను; రావణుఁడు దిగంబరుఁడై గార్దభమునెక్కి దక్షిణదిశకుఁ బోవుచుండెను; వానిశిరస్సు ముండనముఁ జేయఁబడెను; వానిచేతులు నరకఁబడెను; లంకారాజ్యమును విభీషణునకుఁ బట్టముఁగట్టిరి; శ్రీరామనామమును నగరమంతటఁ జాటించిరి; తదుపరి, శ్రీరాముఁడు జానకికి వర్తమానముఁ బంపెను. ఓ సఖులారా! నామాటలను విశ్వసింపుఁడు; నాలుగుదినములలో నాస్వప్నము సత్యమగును" అని త్రిజట స్వప్నవృత్తాంతమును వారితోఁ జెప్పెను. ఆమాటలను రాక్షసస్త్రీలు విని, భయపడి, జానకిచరణములకు నమస్కరించిరి.

దోహా 11

అనంతర మా రాక్షసస్త్రీలు నలువైపులకుఁ జెదరిపోయిరి; యథాప్రకారము జానకి విలపించుచుండెను. "ఆహా! నాథా! నాథుఁ డుండియు నేననాథను; ఒకనెల వ్యవధికలదు; తదుపరి, రావణుఁడు నన్ను సంహరించును" అని యామె తనలోఁదాను విచారించెను.

చౌపాయ్

జానకి త్రిజటంజూచి, చేతులజోడించుకొని, "ఓ తల్లీ! నా యాపదకాలములో నీవే నాసిబ్బంది; నా దేహత్యాగమునకుఁ దగిన యుపాయమును శీఘ్రము చెప్పుము; ఈ వియోగదుఃఖమును భరింపఁజాలను. కట్టెలఁదీసికొనివచ్చి, చితిఁ బేర్చుము. నేను దానిపైఁ గూర్చుండిన తరువాత, దానికి నిప్పుఁబెట్టుము. రాముని యందు నాకుఁగల యనురాగము నీమూలమున సత్యమగును. కర్ణకఠోరములగు రావణుని వచనములను నే వినఁజాలను. ఎవరుమాత్రము వినగలరు!" అని పలువిధముల విలపించి ప్రార్థించెను. అంతట త్రిజట జానకిచరణములకు నమస్కరించి శ్రీరాముని ప్రభావమును, ప్రతాపమును, పలువిధముల జానకికి బోధించెను. "ఓ జానకీ! నామాటవినుము. ఈ రాత్రివేళ నిప్పు దొరకుట కష్టము." అని త్రిజటచెప్పి, స్వగృహమునకు వెళ్లెను. "ఓ భగవంతుఁడా! నీవే ప్రతికూలముగనుండినపుడు, నాపని యేమగును? నిప్పు దొరకదు; నాదుఃఖము శాంతింపదు. అంతరిక్షమున, నంగారము లనేకములు వెలుగుచుండును; కాని, వానిలో నొకటి భూమిమీఁదకు రాదు. చంద్రుఁడు నిప్పులకుప్ప; నావంటి దౌర్భాగ్యురాలు లేదని గ్రహించి, లేశమైనఁ జంద్రుఁడు నాకు నిప్పును విడిచిపెట్టఁడు. ఓ అశోకవృక్షమా! నీవయినను నావిన్నపమును వినుము; నీనామము సార్థకమైనయెడల నాశోకమును హరింపుము. నీచిగురుటాకు లగ్నితో సమానములు. నీవు కొంచెమునిప్పునిచ్చినయెడల నాశరీరము విడిచిపెట్టఁగలను." ఈప్రకారము జానకి పలువిధముల విలపించెను. ఒకక్షణమొక యుగమువలె, హనుమంతునకుఁ దోఁచెను. ఆమె దుఃఖముఁజూచి, యతఁడు జాలిఁబడెను.

సోరఠా 2

కొంతవడికి మహావీరుఁడు విచారించి, అశోకవృక్షము నిప్పుకణమును జారవిడిచినట్లు, రాముని ముద్దుటుంగరమును విడిచెను. ఆ యుంగరమును పరమానందముతో నామె సంగ్రహించెను.

చౌపాయ్

శ్రీరామనామాంకితమగు ముద్దుటుంగరమును జానకి చూచి, ఆశ్చర్యపడి, మనస్సులో నుప్పొంగెను; ఆశ్చర్యముతో నామె దానిం జూచుచుండెను; అంగుళీయకముఁ జూచి, ఆమె సంతసించెను; ఎవరు దానిందీసికొనివచ్చిరోయని చింతించెను. "ఈ యంగుళీయకమెట్టులవచ్చెను! నానాథుఁ డజేయుఁడుగదా! ఇది రాక్షసులమాయయా! ఇది మాయచమత్కారము కానేరదు." ఈప్రకారమామె హర్షవిషాదములచే, డోలాయమానమగుచు, బలువిధములఁ జింతించెను. అంతట వానరవీరుఁడు మృదుమధురవచనములతో నిట్లు ప్రస్తావించెను; శ్రీరాముని పుట్టు పూర్వోత్తరములను పూసగ్రుచ్చినట్లు చెప్పెను. శ్రీరాముని చరిత్రను నామె వినినందున, నామెమనస్సున కానందముకలిగెను; ఆమెదుఃఖము శాంతించెను; సావధానముగ నామె శ్రీరాముని చరిత్రమును మొదటనుండి సాంతముగ వినెను. శ్రీరామచరిత్ర మామె చెవుల కింపుగనుండెను; అమృతోపమానమగు వాక్యముల నామెవిని, పరమానందముఁబొందెను; "ఓయీ తమ్ముఁడా! ఎందుచేత నాకుఁ బ్రత్యక్షముకావు!" అని జానకియడిగెను. అతక్షణము వానరప్రముఖుఁడు చెట్టుదిగివచ్చి, జానకియెదుట నిలువఁబడెను. ఆమె వానరునిఁ జూచి, తలవంచుకొని, ముఖమును వెనుకకుఁ ద్రిప్పెను; ఇదియంతయు రావణునిమాయయని తలఁచి, ఆమె విస్మయముఁబొందెను. ఆసంగతిఁ దెలిసికొని, వీరుఁడు జానకితో నిట్లు ప్రసంగించెను. "ఓ తల్లీ! జానకీ! నేను రామునిదూతను; శ్రీరాములే నాప్రమాణము; నేను సత్యముఁ జెప్పుచున్నాను. ఓ తల్లీ! ఈయంగుళీయకమును నేను దీసికొనివచ్చియుంటిని; నిదర్శనార్థము మీకుఁ జూపుటకు శ్రీవారు నాచేతికి దాని నిచ్చిరి." "ఓయీ! నరవానరులకు మైత్రి యెట్లుకలుగును?" అని సీత శంకించెను. అప్పుడు, సుగ్రీవునివృత్తాంతమును, శ్రీరామసుగ్రీవులసఖ్యము మొదలగువృత్తాంతము నతఁడు జానకికి బోధించి, చెప్పెను.

దోహా 12

భవిష్యద్బ్రహ్మవచనములవలన, నామెకుఁ గొంచెము నమ్మకము పుట్టెను; త్రికరణశుద్ధిగ నతఁడు శ్రీరాముని దాసుఁడని యామె గ్రహించెను.

చౌపాయీ

ఆ కపీశ్వరుఁడు రామభక్తుఁడని సీత గ్రహించెను; అతనిం జూచినందున, నామె మనస్సునకు సంతసము కలిగెను; ఆమె శరీరము పులకరించెను; నేత్రము లానందబాష్పములతో నిండెను. "ఓ వాయుపుత్త్రుఁడా! విరహసముద్రములో మునుంగుచుండిన నన్ను నీవు, పడవవలె రక్షించితివి. ఓ వీరుఁడా! నామీఁద నొట్టుపెట్టుకొని నిజముఁ జెప్పుము; శ్రీరామలక్ష్మణులకుఁ గుశలమా? వారు ప్రసన్నులై యుందురా? నానాథుఁడు కృపాళుఁడు; వారిచిత్త మతికోమలముకదా! ఎందుచేత వారిచిత్తము నాయెడలఁ గఠినమయ్యెను? సేవకులకు సుఖము నిచ్చెదమని వారు కంకణముఁగట్టిరి; ఎప్పుడైనను వారు నా ప్రశంసఁ జేయుచుందురా? వారి శ్యామల కోమలదేహముఁ గన్నులారఁ జూడు భాగ్యము నాకెన్నడు కలుగును?" ఆమెమనస్సు దుఃఖముతో నిండెను; ఆమెనేత్రములు జలములతో నిండెను; ఆమెస్వరము గద్గదు వోయెను. "ఆహా! నాథా! నన్ను మఱచితిరి—" ఈ ప్రకారము సీత విలపించెను. ఆమె విరహదుఃఖమును కపీశ్వరుఁడుచూచి, మృదు మధుర వచనములతో నామె నోదార్చెను. "ఓ తల్లీ! శ్రీరామలక్ష్మణులు కుశలము. నీదుఃఖముచే వారు దుఃఖించుచుండిరి; నీమనస్సులో విచారింపకుము; నీమనస్సుఁ జెడఁగొట్టుకొనక, ధైర్యముగనుండుము; నీకంటె రెండింతలదయ రామునకు నీయందుఁ గలదు.

దోహా 13

"ఓ తల్లీ! నీనాథుని సందేశమును సావధానముగ వినుము" అంతలో నతనికంఠము గద్గదువోయెను. అతనినేత్రములు జలములతో నిండెను. అతఁడు ధైర్యము నవలంబించి, సీతతో నిట్లు ప్రసంగించెను.

చౌపాయీ

"ఓ తల్లీ! నీనాథుని వచనములను వినుము:—ఓ చల్లని సీతా! నీ వియోగమువలన సర్వము విపరీతమయ్యెను. శీతలపదార్థ

ములు మండుచుండినట్లు కనఁబడును; నూతన కిసలయములు నిప్పువలె నుండును; రాత్రి కాలరాత్రితో సమానము; చంద్రునకు జ్యేష్ఠమాస సూర్యునిగుణము లబ్బెను; పద్మములు ముండ్లపొదలు; మేఘములు వేఁడితైలమును వర్షించును; వృక్షముల ఛాయలు సహితము దుఃఖముఁ గలిగించును; మందసుగంధ శీతలవాయువులు, సర్పము యొక్క వేఁడినిట్టూర్పులువలెఁ దోఁచును. నాదుఃఖమును నివారించువారెవరు? ఎవరితోఁ జెప్పఁగలను? నాదుఃఖముఁ దెలిసినవారెవరు? మన యిరువుర యనురాగము మన మనస్సులకుఁ దెలియును; నామనస్సు సదా నీయందు లీనమైయుండును. నాయనురాగ మిట్టిదియని తెలిసికొనుము." ఈప్రకారము నాథుని సందేశము నామె విని, పరవశురాలై, మూర్ఛిల్లెను. "ఓ తల్లీ! శాంతింపుము. ధైర్యము నవలంబింపుము; ఆ శరణాగతవత్సలుని ధ్యానింపుము; శ్రీవారి ప్రభావమును స్మరింపుము; నామాటలను విని, దుఃఖమును విడిచిపెట్టుము.

దోహా 14

"రాక్షససైన్యములు శలభములవంటివి; శ్రీరాముని బాణము లగ్నితో సమానములు. ఓ తల్లీ! నీ మనస్సును ధైర్యముగ నుంచుకొనుము; రాక్షసులు భస్మము కాఁగలరని తెలిసికొనుము.

చౌపాయ్

"ఓ తల్లీ! నీవృత్తాంతము శ్రీవారికిఁ దెలిసినవెంటనే, విలంబముఁ జేయక, వారు వెడలివచ్చెదరు. ఓ జానకీ! శ్రీరాముని బాణములు, సూర్యుని కిరణములతో సమానములు. ఆకిరణములవలన, రాక్షసాంధకారము విడిపోవును. ఓ జననీ! నేను నిన్నుఁ దీసికొని వెళ్లుటకు సమర్థుఁడను; కాని, శ్రీవారియాజ్ఞ లేదు. ఓ మాతా! కొలఁది దినములు ధైర్యముగ నుండుము; ఇంతలో, వానరసైన్యములతో నీనాథుఁడు వచ్చును. రాక్షసులను సంహరించి, నిన్నుఁ గొనిపోవును. మీకీర్తిని నారదుఁడు మూఁడు లోకములలో గానముఁ జేయును." ఈ ప్రకారము వానరప్రముఖుఁడు పలికిన వచనములను జానకి విని, ధైర్యము నవలంబించి, యతనితో నిట్లు పలికెను. "ఓ నాయనా! నీవింత చిన్నవాఁడవుకదా! నీవంటి వానరు లేమిచేయఁ

గలరు? రాక్షసులు మహాయోధులు; మహాబలవంతులుకదా! నాకు సందేహము కలుగుచున్నది." అని యామె శంకించెను. అంతట, నతఁడు స్వస్వరూపముఁ బ్రకటించెను. సువర్ణ పర్వతముతో సమానమగు శరీరము నతఁడు చూపించెను; ఆ శరీరముఁజూచిన భయము కలుగును. అతఁడు మహాబలవంతుఁడని, రణధీరుఁడని, జానకికి నమ్మకము కలిగెను. అంతలో నతఁడు శరీరమును ముడుఁచుకొనెను.

దోహా 15

"ఓ తల్లీ! నేనొక శాఖామృగమును. చెట్లమీఁదను దాఁటుచుందును. నావంటి మృగములకు బుద్ధిగాని బలముగాని యుండునా? లేఁత కొమ్మలు సహితము మా భారమును వహింపఁగలవు. శ్రీవారి ప్రభావము వలన, సర్పము గరుత్మంతుని సహితము చంపఁగలదు. శ్రీవారు కటాక్షించినయెడల, రావణుని సంహరింపఁగలను. *

చౌపాయ్

మహావీరుని వచనములవలన, నతని భక్తియు ప్రతాపమును, తేజమును వ్యక్తమగును; ఈ మూఁడు గుణములను జానకి గ్రహించి సంతోషించెను. (భక్తి:—"సుమిరి, రామ, సేవక, సుఖదాతా"—ప్రతాపము:—"ప్రభు, ప్రతాపసే, గరుడహి, ఖాయ, పరమలఘు, వ్యాళ". తేజము:—"రామ, బాణ, రవి, ఉదయ, జానకీ"—బలము:—"ఉర, ఆనహు, రఘుపతి, ప్రభుతా ఈ") అతఁడు శ్రీరాముని భక్తుఁడని జానకి గ్రహించి యతనిని దీవించెను. "ఓ నాయనా! బుద్ధిబలమునకును దేహబలమునకును నిధివి; నీకు జరామరణములు లేక పోవుఁగాక. నీవు సకలగుణ సంపన్నుఁడవగుము. సదా నిన్ను నాథుఁడు ప్రేమించుఁగాక!" అని యామె జాయమాన కటాక్షముతో దీవించెను. ఆమాటల నతఁడు

* ఒక సమయమున నొకపాము గరుడునకు భయపడి, విష్ణుమూర్తి సింహాసనము క్రింద దూరియుండెను. శ్రీవారు లేచినతరువాత, దానిని మ్రింగుటకుఁ బక్షిరాజు వేచియుండెను. శరణుఁజొచ్చిన దానిని యతఁడు మ్రింగుటకు సిద్ధపడెనని, విష్ణుమూర్తి కోపించి, ఆసర్పమునకు బలమునిచ్చి, "ఓసర్పమా! ఈగరుడునితోఁ బోరాడుము" అని చెప్పెను. ఆప్రకారమాసర్పము గరుత్మంతునిఁ బట్టుకొనెను. అతఁడు పాహి పాహి యనెను.

విని, యానందముచేఁ బరవశుఁడయ్యెను; ఆమె చరణములకతఁడు పునః పునః నమస్కరించి, చేతుల జోడించుకొని, "ఓ తల్లీ! నాజన్మము సఫలమయ్యెను. నేను కృతార్థుఁడను. మీయాశీర్వాదమమోఘము; మీమాట నిష్ఫలముకాదు. ఓ తల్లీ! ఈచక్కని ఫలములఁ జూచి, నాకాఁకలియగుచున్నది."అని ప్రార్థించెను. "ఓ తండ్రీ! ఈవనమును మహా బలవంతులగు రాక్షసులు రక్షించుచుందురు. నేనేమి చేయఁగలను?" "ఓ తల్లీ! వారిభయము నాకులేదు. మీరు మాత్రము ధైర్యముగ నుండుఁడు."

దోహా 16

అతని త్రిశక్తుల నామె తెలిసికొనెను; కనుక, "ఓ తండ్రీ! తథాస్తు; శ్రీవారి చరణములను స్మరించి, ఆ ఫలములను సుఖముగ భుజింపుము." అని యామె సమ్మతించెను.

---

# తృతీయ విశ్రామము.



చౌపాయ్

ఆమెకు నమస్కరించి హనుమంతుఁడు ప్రయాణమయ్యెను; అశోకవనములో నతఁడు ప్రవేశించి, స్వేష్టకృత్యుగ ఫలములను భుజించి, వృక్షములను బడఁద్రోసెను; అచ్చటఁ గాపుండిన రాక్షసులను సంహరించెను. హతశేషులు రావణునివద్దకుఁ బరుగెత్తిరి. "ఓ రాక్షస రాజా! ఒక గొప్ప వానరుఁడు వచ్చి, అశోకవనమును ధ్వంసముఁ జేసెను." ఈ ప్రకారము రాక్షసులు పలికిన పలుకులు, రావణున కశుభముగఁ దోఁచెను. అశోకవనము శోకవనమయ్యెను. "ఓ రాజా! వాఁడు ఫలములను భుజించి, వృక్షములను బడఁద్రోసి, రక్షకులను సంహరించెను." ఆ తత్క్షణము రావణుఁడు (80) వేలమంది యోధులను వానరునిపైకిఁ బంపెను.

"నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై,
నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోస్తు చంద్రార్కమరుద్గణేభ్యః.
జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః,
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః.
దాసోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః,
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః.
న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్,
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః.
అర్దయిత్వా పురీం లంకాం అభివాద్యచ మైథిలీం,
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరాక్షసాం."

ఈ ప్రకారమతఁడు గర్జించి, తోరణ స్తంభమును బట్టుకొని, రాక్షస యోధులపైఁ బడెను; వారిని చేతులతోఁ బొడిచియు, పాదములతోఁ దన్నియు, హుంకరించియు, వారిని సంహరించెను. హతశేషులు రావణుని వద్దకుఁ బరుగెత్తివెళ్లిరి. "ఓ నాథా! ఆ వానరుఁడు (80) వేల మంది రాక్షస యోధుల నవలీలలో సంహరించెను." అని వారు మొఱబెట్టిరి. అంతట రావణుఁడు అక్షయకుమారుని బంపెను; ఆ కుమారుని వెంట ననేక యోధులువచ్చిరి. ఆ యోధులను, అక్షయకుమారుని యతఁడు క్షణములో వధించెను. కపీశ్వరుఁడొక పెద్ద బొబ్బ పెట్టెను.

### దోహా 17

ఆ యోధులలోఁ గొందఱను వధించెను; కొందఱను జూర్ణముఁ జేసెను; కొందఱను నులిపి చంపెను. హతశేషులు రావణునివద్దకుఁ బోయి, "ఓ రాజా! ఆ వానరుఁడు మహాబలవంతుఁడు; అక్షయకుమారునిసహితము సంహరించెను." అని చెప్పిరి.

### చౌపాయ్

అక్షయకుమారుని మరణమునకు రావణుఁడు చింతించి, మేఘనాదునిఁ బిలిచి, "ఓ నాయనా! ఆ వానరుని సంహరింపుఁడు; అథవా,

వానిని గట్టి తీసికొనిరమ్ము; వాని పూర్వోత్తరముఁ దెలిసికొనుము” అని చెప్పి పంపెను. అనేక యోధులతోఁ గూడి, మేఘనాదుఁడు కనకరథమునెక్కి వీరాలాపము లాడుచు, నాంజనేయుని పైకి దాడివచ్చెను. వారిం జూచి, కపీశ్వరుఁడు కటకట పండ్లుఁగొఱికి, సింహనాదముఁ జేసెను; ఆతక్షణము వారిపైఁ బడెను. ఒక మహావృక్షము నతఁడు పట్టుకొని, యోధులను సంహరించి, మేఘనాదుని రథమును జూర్ణముఁ జేసెను; ఆ రథముపైనుండి వాఁడు దిగెను. ఆ యోధులను, హనుమంతుఁడు చిత్ర చిత్రముగ వధించెను; వారిం జంపి, ఇంద్రజిత్తుపైకి దుమికెను; రెండు కుంజరములువలె వారు పోరాడిరి; మేఘనాదుని యొక గ్రుద్దు గ్రుద్దెను; ఆ దెబ్బతో నొకక్షణము వాఁడు మూర్ఛిల్లెను. వాఁడు తెలివిఁ దెచ్చుకొని, యనేక మాయలఁ బన్నెను; కాని, వాఁడు హనుమంతుని జయింపలేక పోయెను.

దోహా 18

అంతట మేఘనాదుఁడు బ్రహ్మాస్త్రమును సంధించెను. “ఆహా దైవమా! నేసీ యస్త్రము నెఱుంగను; నర వానరులు రావణునకు మృత్యువులని బ్రహ్మ విధించెను. ఈ యస్త్రము నన్ను సంహరించిన యెడల బ్రహ్మ మహిమకు భంగమువచ్చును” అని కపీశ్వరుఁడు చింతించెను.

చౌపాయ్

ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముఁ బ్రయోగించెను. హనుమంతుఁడు రాక్షసులను సంహరించి నేలఁ గూలెను; అతఁడు మూర్ఛిల్లెను. నాగపాశములతో నతనిని వాఁడు బంధించెను. ఓ పార్వతీ! శ్రీరామ నామమును స్మరించిన మాత్రమున, జ్ఞానులును, మునులును, మనుజులును తమ సంసార బంధములు విడగొట్టుకొనగలరు కదా! ఆ నాగపాశముల కతఁడెందుకు బద్ధుఁడయ్యెను? శ్రీవారి కార్యమును సాధించుట కతఁడు నాగపాశములకు బద్ధుఁడయ్యెను. వానరుఁడు కట్టుఁబడెనని రాక్షసులు విని, అతనిని జూచుటకుఁ బరుగెత్తి వచ్చిరి; ఆ చిత్రముఁ జూడవలెనని వారు సభామంటపముఁ గిక్కిరువెట్టిరి. ఆ రాక్షసరాజుని హజారమును వానరపుంగవుఁడు చూచి, దానికివి కచ్చెరువడి, నిర్ఘాతపడెను. అష్ట

దిక్పతులు సభకు వచ్చి, చెల్లచెదరులేక జోహారువనుచు నిలిచి యుండిరి. వారు రావణుని చిత్తముఁ గనిపెట్టి, వాని భ్రూవిలాసము ననుసరించి, ప్రవర్తించుచుండిరి. రావణుని ప్రతాపమును హనుమంతుఁడు చూచి నను, వానరునకు భయము కలుగలేదు. గరుత్మంతుని నెదిరించిన సర్ప మువలె నతఁడు నిర్భయముగ నుండెను.

దోహా 19

రావణుఁడు మహావీరునిఁ జూచి పక్కున నవ్వి, అంతలోఁ గుమారుని మరణమును స్మరించి, దుఃఖించి, యతనితో నిట్లు క్రోధ తామ్రాక్షుఁడై పలికెను.

చౌపాయ్

"ఓ వానరుఁడా! నీవెవఁడవు? ఎవరిబలము నీకుఁ గలదు? ఎందుచేత వనమును ధ్వంసముఁ జేసియుంటివి? ఇంత చెడుకార్యముఁ జేసినను, సిగ్గునువిడిచి, నిశ్శంకగ ముఖము నెత్తుకొని చూచుచుంటివి? ఏమి నీపొగరు? నాపేరు నీవు వినియుండలేదా? నిరపరాధులగు రాక్షసుల నేల సంహరించితివి? ఓరీ మూర్ఖుఁడా! నీ ప్రాణములమీఁద నాశలేదా?"—ఈ ప్రకారము రావణుఁడు పలికిన పలుకులను హను మంతుఁడు విని చిఱునవ్వు నవ్వెను. (రావణుని ప్రశ్నలకతఁడు విలో మముగ నుత్తరమిచ్చెను. రాక్షసుని ప్రశ్నలు సంక్షేపముగ నుండెను; వాఁడు వ్యహాపండితుఁడు. అందులకుఁ దగినవిధమున, నతఁడు విలో మముగఁ బ్రత్యుత్తరముల నిచ్చెను. అతఁడు కూడ నవవ్యాకరణపం డితుఁడు. ఆ ప్రత్యుత్తరములవలన రావణుఁడు దుర్బలుఁడని వ్యక్త మగును; వానరుఁడు బలీయుఁడని తెలియును. లంకాపట్టణము నతి చిత్రముగ నిర్మించితినని వానికి గర్వము కలదు; మహా బలవంతుఁడ ననియు వానికి దురభిమానము కలదు.) "ఓ రావణా! ఏ మహాత్ముని బలముచే ననేక కోటి బ్రహ్మాండముల నవలీలలోఁ జిత్ర విచిత్రముగ మాయ సృజించునో; ఏ మహాపురుషుని దాపురమువలన, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, సృష్టి స్థితిలయములఁ జేయుచుందురో; (రాక్షసులను పుట్టించి వారిని బరిపాలించితిననియు, శత్రువులను సంహరించితిననియు వానికి గర్వముకలదు;) ఏ లోకారాధ్యుని బలముచే నీ చరాచర

బ్రహ్మాండము నాదిశేషువు తన సహస్రఫణములమీఁద భరించుచుండునో; (కైలాసపర్వతమును మీఁదికి నెత్తగలిగితినని వానికి గర్వము.) ఏ త్రిజగద్వంద్యుఁడు నీవంటి మూర్ఖులను శిక్షించుటకును, దేవతలను రక్షించుటకు నవతరించెనో; (పరమేశ్వరుఁడు నరరూపమును ధరించి పుట్టఁడని వానినమ్మకము.) ఏ మహావీరుఁడు, నీవంటి రాజబృందములకు శృంగభంగముఁజేసి, శివుని విల్లును విఱచెనో; ఏ రణధీరుఁడు, ఖర, దూషణ, విరాధులను, వాలి మొదలగు అసాధారణ శత్రువులను యుద్ధములో సంహరించెనో;

దోహా 20

"ఏ మహాపురుషుని బలములో లవలేశము శంకరునకుఁ గలదో; ఆశంకరుని ప్రసాదమువలనఁ గొంచెము బలమును నీవు పొంది, చరాచర జంతుజాలమును జయించితివి. ఆ మహాపురుషుని దూతను. ఆ పురుషుని భార్యను నీవు హరించితివి; ఆ కారణముచేత నేను నీవద్దకు వచ్చితిని.

చౌపాయ్

"నీసంగతి నేనెఱుంగుదును. నీప్రభుత్వము గుఱించి నాకుఁ దెలియును. నీవు సహస్ర బాహువునితోఁ బోరాడుట విని యుంటిని; నీవు వాలితోఁ బోరాడిన సంగతియు నాకు విశదము. (వానిమర్మములను వానరుఁడు చెప్పినందులకు వాఁడు సిగ్గునువిడిచి నవ్వెను.) ఆఁకలియగుటచేత, నేను ఫలములఁ దినియుంటిని; నా వానరస్వభావముచే, వృక్షములఁ బడద్రోసియుంటిని. ఓ స్వామీ! నాస్థలములో నేను యుంటిని; ఎవని శరీరమునందు వానికి యభిమానముండును. నీభటులు దుర్మార్గులు; నన్ను వారు కొట్టిరి; అందుచేత వారిని నేను సంహరించితిని. ఆత్మరక్షణనిమిత్తము నేను వారితోఁ గలహించితిని. నీ కుమారుఁడును నేనును పోరాడియుంటిమి; నీకుమారుని యస్త్రము నన్ను బంధించెను; అంతమాత్రమున నాకు వంచనలేదు; నాస్వామి కార్యమును నేను సాధింపవలెను. ఓ రావణా! చేతులను జోడించి, విన్నవించెదను. నావిన్నపమును సావధానముగ వినుము; నీ యభిమానమును విడిచిపెట్టుము. ఎంత గొప్పవంశములో జన్మించితివో విచా

రింపుము. బ్రహ్మకు నీవు ప్రపౌత్రుఁడవు; పులస్త్యునకుఁ బౌత్రుఁడవు; విశ్రవసునకుఁ బుత్రుఁడవు. భ్రమను విడిచి, ఆ భక్తభయహారుని, ఆ శ్రీరాముని భజింపుము. ఆ మహాపురుషునిఁ జూచి, సురాసురులతోఁ గూడిన చరాచర బ్రహ్మాండము భయపడును; కాలుఁడు సహితము వెఱగుపడును. అతనితో వైరము తగదు. నామాటను విని, జానకిని సమర్పింపుము. నీగురువు, శివుఁడు సహితము నామాట నామోదించును.

దోహా 21

"ఓ రావణా! ఆ ప్రణతార్తిహరుఁడు, ఆ రఘువంశమణి, ఆ కరుణాసముద్రుఁడు, ఆ ఖరదూషణ విరాధ వధ పండితుఁడు, నిన్ను రక్షించును; నీయపరాధమును క్షమించును; శరణాగతుల కభయము నిచ్చును.

చౌపాయ్

"శ్రీరాముని చరణారవిందములను ధ్యానముఁ జేయుచు, లంకారాజ్యమును శాశ్వతముగఁ బరిపాలింపుము. పులస్త్యుని కీర్తి ప్రతిష్ఠలు చంద్రునివలె, నిష్కళంకము. అతని కీర్తికి నీవు మచ్చఁ దీసికొనివచ్చుట కూడదు. రామనామము నుచ్చరింపనివాక్కు వాక్కు కాదు; ఈసంగతి గ్రహించి, మద మోహాదులను విడిచి పెట్టుము. ఓ దేవ కంటకుఁడా! అనేక భూషణములతో స్త్రీ సింగారించుకొనినను, వస్త్రము లేనియెడల నామె రాణింపదు అటులనే, రామనామము లేని వాక్కు శోభింపదు. ఎంత సంపదగాని, ప్రభుత్వముగాని పూర్వముండినను, ప్రస్తుతముండినను, రానుండినను, రామునియందుఁ బ్రేమ లేనియెడల, వానివలనఁ బ్రయోజనము లేదు. ప్రథమమున నంకె లేని సున్నలకు విలువలేదు కదా! (000000 ఈ ప్రకారము సున్నలకు విలువలేదు; వానిముందు, 1, 2, 3,—యే సంఖ్యనుంచినను, వానికి విలువ వచ్చును. అందుచేత, '0' శూన్యసంఖ్యయని పేరు.) పర్వతములోఁ బుట్టియుండని నదులు, వర్షకాలములో నుప్పొంగి, పొర్లి పాఱును; అంతలో నవి యెండిపోవును; అటులనే, నీ సిరిసంపదలు శీఘ్రము నశించును. పర్వతములలోఁ బుట్టి ప్రవహించు నదులు వర్షకాలములో

నుప్పొంగినను, తదుపరి యథాప్రకారముగ నుండును కదా! అటు లనే, శ్రీవారిని యాధారముగఁ జేసికొని యుండిన వాని సిరిసంపద లకు వృద్ధి వచ్చినను, వానికి నష్టము కలుగదు; అవి శాశ్వతముగ నిలిచి యుండును. ఓ రావణా! ప్రమాణముఁజేసి, చెప్పుచున్నాను. శ్రీరామునితో విరోధించిన వానిని రక్షించువారు లేరు. సహస్ర బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సహితము నిన్ను రక్షింపలేరు. నామాట నిజము; నమ్ముము.

దోహా 22

"ఓ రాజా! అభిమానము నీహృదయములో నంకురించెను; దానికి మూలము మోహము; దానిఫలము బాధలు; ఆ యభిమాన మును విడచి, శ్రీరాముని చరణములను సేవింపుము; శ్రీవారు నిన్ను రక్షించెదరు."

చౌపాయ్

ఈప్రకారము హనుమంతుఁడు భక్తి జ్ఞాన వైరాగ్యములను, నీతులను రావణునకు బోధించెను. "ఓహో! మాకు గొప్ప గురువు లభించెను;" అని రావణుఁడు నవ్వుచుఁ బలికి, "ఓరీ మూర్ఖుఁడా! నీకు మృత్యు వాసన్నమయ్యెను. నీవీప్రకారము పలుకుచుంటివి." అని ధిక్క రించెను. "ఓ రావణా! నీవచనములే నీకు వ్యత్యస్తముగ వర్తించును; నీమతి భ్రమించెను; క్రమముగ నీకు బోధపడును;" ఈ ప్రకారము వానరుఁడు పలికిన పలుకులను రావణుఁడు విని, కోపించి, "ఓయీ! రాక్షసులారా! శీఘ్రము మీరు వీనిని వధింపుఁడు." అని యాజ్ఞాపిం చెను. రాక్షసుని యాజ్ఞప్రకారము, వానరుని సంహరించుటకు వారు సిద్ధపడిరి. ఆసమయమున మంత్రులతో గూడి, విభీషణుఁడు సభకు వచ్చెను. అతఁడు రావణునకు నమస్కరించి, పలువిధముల వినయ విధే యతలతో నతనికి రాజనీతిని బోధించెను. "ఓనాథా! దూతను వధిం చుట రాజధర్మమునకు విరుద్ధము. మఱియొక విధమున వానికిఁ దగిన శాస్తిఁ జేయుఁడు" అని విభీషణుఁడు పలికిన పలుకులను దదితర రాక్ష సులు విని, యామోదించిరి. వారిమాటలకు రావణుఁడు నవ్వి "వానిని నంగవికారముఁ జేసి పంపుఁడు" అని చెప్పెను.

దోహా 23

వానరములకు వాలములం దభిమానము మెండు; కనుక, వాని వాలమునకు నూనెగుడ్డలఁ గట్టి, నిప్పుఁ దగిలించిన భాగుగనుండునని రాక్షసులు తలంచిరి.

చౌపాయ్

"ఈ వానరుఁడు వాలముఁ బోఁగొట్టుకొని, వానిస్వామినిఁ దీసికొనివచ్చును. అప్పుడు వీని పౌరుషమును, వీని ప్రభువు శూరత్వముఁ జూడవచ్చును." అని వారిలోవారు గుసగుస లాడిరి. వారి మాటల వలన హనుమంతునకు నవ్వు వచ్చెను. "ఇదియంతయు శ్రీ సరస్వతి ప్రభావము" అని యతఁడు తలఁచెను. ఆ మూర్ఖులగురాక్షసులు, రావణుని యాజ్ఞప్రకారము, వానరుని తోఁకకు నూనెగుడ్డలఁ గట్ట నారంభించిరి. ఆ సమయమున, నిలువయుండిన తైలమును ఘృతమును నిండుకొనెను. అంతకంతకు వానరుని వాలము పెఱిగెను. ఆచిత్రముఁ జూచుటకు స్త్రీపురుషులు గుంపులుగుంపులుగ వచ్చిరి. వారు వానరునిఁ గొట్టి, నవ్వుచుండిరి. "తోలు" వాద్యమును మ్రోగించిరి; చప్పట్లఁ గొట్టిరి; నగరమంతయు వానినిఁ ద్రిప్పి, వాలమునకు వారు నిప్పును ముట్టించిరి. నిప్పుఁ దగిలించినతరువాత, నతఁడు సూక్ష్మరూపుఁ డయ్యెను; అతని బంధనములన్నియు విడిపోయెను. ఆవెంటనే హనుమంతుఁడు సువర్ణప్రాకారములపైకిఁ గుప్పించెను. రాక్షసస్త్రీలు భయపడిరి.

దోహా 24

ఆసమయమున, హరికృపవలన, వాయువు ప్రచండముగ వీఁచెను. అట్టహాసముతో నతఁడు గర్జించి, కుప్పించి, యంతరిక్షమున కెగిరెను.

ఛాంద్ 4, 13 (అధికపాఠము.)

అతఁడు తలక్రిందుగఁ గుప్పించి యెగసెను. నిప్పుమంటలతో వెలుగుచుండిన నతనితోఁక పొడవయ్యెను. ఆకాశమునుండి నిప్పునది ప్రవహించెనా? కాలుఁడు తన నాలుకను లంకానగరముపైఁ జాచియుండెనా? త్రిలోకవీరుఁ డొకఁడు తన చంద్రాయుధమును ఝుళిపించెనా? అని తోఁచెను. ఒక గృహముపైనుండి మఱియొక గృహముపైకి దాఁటుచు, నతఁడు వానికి నిప్పు ముట్టించెను. గృహములు కాలి, భస్మ

మయ్యెను. "గుఱ్ఱములను, ఏనుగులను, కంచరగాడిదెలను, వానివాని శాలలనుండి విడిచిపెట్టుఁడు" అని వారు కేకలను వేయుచుండిరి. "ఓ అమ్మా! ఓ తల్లీ! ఓ నాయనా! నన్ను రక్షింపుఁడు. నన్నుఁ గాపాడరా!" అని బాలికా బాలురు మొఱపెట్టుచుండిరి. కొందఱు రాక్షసస్త్రీలు వారి వారి గృహములలోని సామగ్రులను బయటకుఁ దీసివేయుచుండిరి. కొందఱు నీరుఁదెచ్చుటకుఁ బరుగెత్తిరి. "అయ్యో! జలము మాటకేమి? మన పిల్లలను గాపాడుఁడు" అని రాక్షసస్త్రీలు వారివారి భర్తలతోఁ బలుకుచుండిరి. ఆ అనాథస్త్రీల దీనాలాపములను మందోదరి విని, దుఃఖించి, "ఓయీ రాక్షసులారా! మీకుఁ జెవులులేవా? వారి మాటలను విని, మీకు సిగ్గులేదా? ఓరీ అకంపనుఁడా! ఓరీ మహోదరుఁడా! మీరు శీఘ్రము వెళ్లి, వారిని రక్షింపుఁడు." అని వారిని దూషించెను. "పలువిధముల విభీషణుఁడును నేనును రావణునకు బోధించియుంటిమి; వంశక్షయముఁ జేయకుమని చెప్పియుంటిమి; కాని, యతఁడు మా మాటలను లక్ష్యముఁజేయలేదు. రాక్షసవంశముఁ బడఁద్రోయుటకు సిద్ధపడెను;" అని మందోదరి విలపించెను. ఎచ్చట చూచినను, గృహములపైని, ద్వారములవద్దను, రాజమార్గములలోను, హనుమంతుఁడే వారికిఁ గనఁబడెను; సందులలోను గొందులలో నతఁడే ప్రత్యక్షమయ్యెను. "ఓ వానరుఁడా! శ్రీరాముఁడు తోఁడు; నాపతి నిద్రించుచుండెను; కనుక నాగృహమునకు నిప్పుఁబెట్టకుము" అని కుంభకర్ణుని భార్య ప్రార్థించెను. ఈ కోలాహలమును రావణుఁడు చూచి, మేఘనాదునకు వర్తమానముఁ బంపెను. రావణుని యాజ్ఞాప్రకారము రాక్షసులు శస్త్రాస్త్రములతో వానరునిపైకి వెడలిరి. ఒకపర్యాయ మతఁడు మండుచుండిన తోఁకతో వారిం గొట్టెను; వారు భయపడి పరుగెత్తిరి. "ఓ మేఘుఁడా! నీవు వర్షించి, లంకాపురముఁ జల్లార్పుము" అని రావణుఁ డాజ్ఞాపించెను. అంతలో మేఘము లంతరిక్షమున నిలిచి వర్షించెను. ఆ వర్షధారలు పడినంతలో, నిప్పుమంటలు, ఘృతము పడిన పుడువలె, ద్విగుణముగ, ఘనాభ్రోంతరాళములు నిండ మండుచుండెను. అగ్నికణములు రాక్షసుల శరీరమును దహించెను. వారు ప్రాణావళి

ష్టులై పరుగెత్తిరి. వారి దుర్దశఁజూచి, మాల్యవంతుఁడు విచారించెను. "ఆహా! ఇది నిప్పు కాదు; ఈశ్వరుని క్రోధాగ్ని ; అథవా, జానకి నిట్టూర్పులు ; అథవా, శ్రీరాముని కోపము." అని యతఁడు తలఁచెను. అప్పుడు రావణుఁడు యమునిఁ బిలిచి, "ఓయీ! నీవు నీ కాలదండమును ధరించి, నీ భూతప్రేతపిశాచగణములతో నెదిరించి, వానరుని సంహరింపుము" అని యాజ్ఞాపించెను. ఆ జమునిసైన్యమును వానరుఁడు సంహరించి, చెండాడి, ఆతనిని బుగ్గలోఁ బెట్టుకొనెను. అప్పుడు దేవేంద్రుఁడును, బ్రహ్మాది హాకాశాది దేవతలును మహావీరునివద్దకు వచ్చిరి. యమునికి సంభవించిన దుర్దశఁ జూచి, వారు భయపడిరి.

దోహా 25

"ఓ మహావీరుఁడా! యముని విడిచిపెట్టుము. ఈ నావిన్నపమును మన్నింపుము. అతఁడు పరాధీనుఁడు కనుక, ని న్నెదిరించెను." అని బ్రహ్మ విన్నవించెను. అప్పు డతఁడు ముఖములోనుండి, యముని విడిచిపెట్టెను. (అధికపాఠము సమాప్తము).

చౌపాయ్

ఆ కపీశ్వరునిశరీరము మహోన్నతమయినను, లేశమపి శ్రమ లేకయే యతఁడు గృహముమీఁదనుండి గృహమునకుఁ గుప్పించి యెగయుచుండెను. నగరమంతటను నిప్పు ముట్టుకొనెను. స్త్రీ పురుషులా బాలవృద్ధులు, రాక్షసులు, దిగులుపడిరి. నిప్పుమంటలు 'లపట—ఝపట' మని మిన్ను ముట్టుచుండెను. "ఎవరు నన్ను రక్షించెదరు?" అని బాలురు మొఱఁబెట్టుచుండిరి. "అయ్యో! ఇదివఱలో నేను చెప్పియుంటినికదా! ఇతఁడు వానరుఁడు కాఁడు; ఒకదేవత వానరరూపమును ధరించి వచ్చెను." అని యొకరాక్షసుఁడు చెప్పెను. "ఓ అగ్నిదేవుఁడా! నేనే సత్యవంతురాలనయినయెడల, నీవు హనుమంతుని బాధింపకుము" అని సీత ప్రార్థించెను; అందుచేత, నగ్నిహోత్రుఁడతనికి శీతలుఁడయ్యెను. మహాత్ములవచనములను రావణుఁడు నిరాదరించినందున, దాని ఫలము ననుభవించెను; దిక్కులేనివానిగృహామువలె, నా నగరము తగులఁబడెను; ఒక రెప్పపాటుకాలములో నగర

మంతయు భస్మమయ్యెను. పరమభక్తుఁడగు విభీషణుని గృహమును, నిద్రించుచుండిన కుంభకర్ణుని గృహమును దప్ప, తదితరగృహము లన్నియు నేలఁ గూలెను. ఓ పార్వతీ! విభీషణుఁడు భక్తుఁడని తెలిసికొని, యతనిగృహము నగ్నిహోత్రుఁడు విడిచిపెట్టెను. ఈ ప్రకారము హనుమంతుఁడు లంకాపురమును దహించి, సముద్రములో మునిఁగి, వాలముఁ జల్లార్చి శాంతించెను.

దోహా 26

ఈ ప్రకార మతఁడు శాంతిఁబొంది పిల్లకోఁతిరూపమును ధరించి, సీతవద్దకు వచ్చి, యామెకు నమస్కరించి, నిలువఁబడెను.

చౌపాయ్

"ఓ తల్లీ! మీ తలవుప్రకారము శ్రీవారికి మీ క్షేమసమాచారమును విన్నవించెదను. మిమ్ములఁ జూచినట్లు, నిదర్శనమొకటి దయచేయుఁడు." అని యతఁడు ప్రార్థించెను. చూడామణిఁదీసి, యామె యతనిచేతిలోఁ బెట్టెను; అతఁడు దానిని సంగ్రహించి, నేత్రముల కద్దుకొని, ప్రసన్నుఁ డయ్యెను. "ఓ తండ్రీ! శ్రీవారికి నా నమస్కారములఁ జెప్పి, వారికి నావిన్నపముఁ జెప్పుము. 'ఓ నాథా! మీరు సంపూర్ణకాములు; మీరు దీనదయాపరులు; మీబిరుదును నిలుపుకొని, నా సంకటమును నివారింపుఁడు!' ఓ తండ్రీ! కాకాసురుఁడు నన్ను బాధించెను; తృణమును మంత్రించి, వానిపైని వారు ప్రయోగించిరి. ఈవృత్తాంతమును వారిలోఁ జెప్పుము. ఒకనెలలో శ్రీవారు నావద్దకు రానియెడల, నాప్రాణములతో నేను వారిం జూచెడిభాగ్యము నాకుఁ గలుగదు. ఓ మహావీరుఁడా! ఏప్రకారము నాప్రాణములు నిలిచియుండునో, నీవాప్రకారము వారితో విన్నవింపుము. నిన్నుఁ జూచిన తరువాత నా గుండెలు చల్లఁబడెను. ఓ నాయనా! నీవు వెళ్లినతరువాత, నిఁక నే నెట్లు దివారాత్రములఁ గడపఁగలను.

(అధిక పాఠము) దోహా (1—13)

"ఓ తండ్రీ! మణిఁ బోఁగొట్టుకొనిన సర్పమువలెను, జలములేని మత్స్యమువలెను, శ్రీవారి దర్శనములేనందున, నేను దుఃఖించెదను.

ఓ మహావీరుఁడా! ఆ బ్రహ్మకు నాపై నెప్పుడు కటాక్షము వచ్చును? ఎప్పుడు నేనయోధ్యానగరములోఁ బ్రవేశించి, నా ముప్పురత్తలను భరతశత్రుఘ్నులఁ జూడఁగలను? బ్రతికియుండ, నేను సుఖముల ననుభవించెదనా? ఏనాఁడు శుభములు కలుగును? ఏనాఁడు యాచకులకు దానముల నిచ్చెదను! ఏనాఁడు శ్రీవారిని నఖశిఖపర్యంతముఁ జూచి యానందింపఁగలను! జటాముకుటముపై రత్నఖచితమగు కిరీటమును గాని నిరుపమానమగు 'టోపీని' గాని ధరించిన ప్రభువును, డోలాయమానమగు కుండలములుగల ముఖారవిందము నెన్నఁడు చూచు భాగ్యము కలుగును? ఆ నీలాలకములతోఁగూడిన ముఖారవిందమును, ఆ నీలమాణిక్యములవంటి కపోలమును, ఆ చక్కనిచుబుకమును కన్నులారఁ జూచి, యానందించుభాగ్య మేనాఁడు కలుగును! చక్కని తిలకముతోఁ బ్రకాశించు లలాటమును, ధనురాకారముగల కనుబొమలను, నే నేనాఁడు రెప్పపాటువేయక, చూడఁగలను? ఓ మహావీరుఁడా! అతి చంచలమగు శ్రీవారి నేత్రారవిందముల నేనాఁడు చూడఁగలను! ఆహా! ఆ చక్కనిచిలుకముక్కును, ఆ చంద్రబింబము వంటి ముఖమును, దృష్టిదోషములేకుండ తృణముఁ ద్రుంచి, యేనాఁడు చూడఁగలను? ఆ అరుణాధరమును, దాడిమగింజలవంటి దంతములను, మందహాసముతోఁగూడిన ముఖారవిందమును, చంద్రికలవంటి చిఱునవ్వు నేనాఁడు చూడఁగలను? భక్తులమనస్సుల నపహరించు శ్రీవారి కోమలవాక్కుల నేనాఁడు వినఁగలను? ఆ చక్కని, యమృతోపమానమగు చుబుకము నేనాఁడు చూడఁగలను? ఆ కంబుగ్రీవమును, ఆ తులసిమాలను, ఆ ముత్యాలహారమును, ఆ త్రివళీయుతకంఠమును, ఆ విశాలవక్షస్థలము నే నేనాఁడు చూడఁగలను? ఏనుఁగుతొండమువలె నతిదీర్ఘములగు బాహువులను, వికసించిన కమలములవంటి కరతలములలోనుండిన ధనుర్బాణములను, దివ్యాలంకారభూషితులగు శ్రీవారిని యేనాఁడు చూడఁగలను? ఆ పీతాంబరధారిని, ఆ సువర్ణయజ్ఞోపవీతములను ధరించినస్వామిని, నా నేత్రోత్సవముగ నేనాఁడు చూడఁగలను?"

(అధికపాఠము సమాప్తము.)

దోహా 27

ఈప్రకారము పలువిధముల విలపించుచుండిన జానకిని నోదార్చి, యామె కతఁడు ధైర్యముఁ జెప్పెను; అతఁడు, మరల జానకి చరణములకు నమస్కరించి, శ్రీవారివద్దకుఁ బ్రయాణమయ్యెను.

---

# చతుర్థవిశ్రామము.

చౌపాయ్

మహావీరుఁడు లంకాపురమునుండి వెడలునపుడు సింహనాదముఁ జేసెను; ఆబొబ్బచేత రాక్షసస్త్రీలగర్భములు విచ్ఛిన్నమయ్యెను. అతఁడు సముద్రమును దాఁటి, యీవలియొడ్డునకు వచ్చెను. వానరులతనిం జూచి, కిలకిలమనిరి. (కార్తికశుద్ధ పౌర్ణమినాఁడు లంకనుండి యతఁడు తిరిగి వచ్చెను.) వానరులందఱు ప్రసన్నులయిరి; మరల తల్లి గర్భమున జన్మించితిమి అని వారు తలంచిరి. వారిముఖములు వికసించెను; వారిశరీరములు కాంతులతో నిండెను. శ్రీరాముని కార్యమును సాధించితిమి అని వారు సంతసించిరి. నీరులేక, 'తటపట' మని కొట్టు కొనుచుండిన మత్స్యమునకు జీవముఁ దొరికినవిధమున, బ్రతుకు నిరాశఁ జేసికొనిన వానరులకతఁడు జీవనము నిచ్చెను. లంకానగర వృత్తాంతము నంతయుఁ జెప్పుకొనుచు, వారు పంపాపురమునకు వెడలిరి. అంతలో వారు సుగ్రీవుని మధువనమునకు వచ్చి, దానిలోఁ బ్రవేశించి, ఫలములను భక్షించిరి; జానకినిఁ జూచివచ్చినతరువాత, వారా వనములోని ఫలములను భక్షింపవచ్చునని సుగ్రీవుఁడు వారితోఁ జెప్పియుండెను; ఆ వనరక్షకులు వానరులను నిరోధించిరి; వారు వారిని దండించిరి; అప్పుడా రక్షకులు పరుగెత్తి, యీ సమాచారమును సుగ్రీవునకు విన్నవించిరి. (కార్తిక బ ౫ = మార్గశీర్ష బ ౫ మి సౌరమానము ప్రకారము శుక్రవారమునాఁడు వారు మధువనమునకు వచ్చిరి.)

దోహా 28

"ఓ రాజా! యువరాజు మొదలగు వానరులు మధువనమును ధ్వంసముఁ జేసిరి." అని వారు విన్నవించిరి. శ్రీరాముని కార్యమును వారు సాధించిరి అని సుగ్రీవుఁడు తెలిసికొని సంతసించెను.

చౌపాయ్

"జానకి క్షేమసమాచారముఁ దెలిసికొని రాకుండ, నెవరు మధువనమును ధ్వంసముఁజేయుటకు సమర్థులు." ఈప్రకారము సుగ్రీవుఁడు చింతించెను; అంతలో వానరులు ప్రవేశించిరి. వారు రాజుచరణములకు మ్రొక్కిరి. రాజు వారిని యాదరించెను; "ఓయీ వానరులారా! మీరు కుశలమా?" అని సుగ్రీవుఁ డడిగెను. "ఓ నాథా! మీ కటాక్షమువలన, మేము కుశలము. శ్రీవారికృపవలన వారి కార్యమును సాధించితిమి. ఓ నాథా! కార్యమంతయును మహావీరుఁడే నిర్వహించెను. మా ప్రాణముల నతఁడే నిలువఁబెట్టెను." అని వారు విన్నవించిరి. తదుపరి, సుగ్రీవుఁడు మొదలగువారు దిగ్గునలేచి, శ్రీరామునివద్దకు వెడలిరి. కార్యమునుసాధించి వానరులు వచ్చుచుండిరని శ్రీరాముఁడు తెలిసికొనెను. ఒక శుద్ధస్ఫటికశిలపై, రామలక్ష్మణులు కూర్చుండియుండిరి; వానరులు వచ్చి, వారి చరణములపైఁ బడి నమస్కరించిరి.

దోహా 29

ఆ కృపాసముద్రుఁడు వారిని నాదరించి, సత్కరించెను; పిమ్మట వారి క్షేమము నడిగెను. "ఓ నాథా! మీ చరణారవిందములఁ జూచినందున, మాకు స్వాస్థ్యము కలిగెను." అని వానరులు విన్నవించిరి.

చౌపాయ్

అంతట జాంబవంతుఁడు శ్రీరామునితో నిట్లు విజ్ఞాపనముఁ జేసికొనెను. "ఓ నాథా! ఎవనిని మీరు కటాక్షింతురో, వానికే సదా క్షేమము. సురలును, నరులును, మునులుసహితము వానిని గటాక్షించెదరు. మీకృపఁ గలిగియుండినవాఁడే విజయుఁడు; సకలగుణసంపన్నుఁడు; వానికీర్తి మూఁడులోకములలో వ్యాపించును. ఏలినవారి కటాక్షమువలన, మా కార్యములు సిద్ధించెను; నేఁడు మా జన్మములు సఫలమయ్యెను. ఓనాథా! మహావీరుఁడు నిర్వహించిన కార్యమును

లక్షముఖములతో నయినను వర్ణించి చెప్పలేను.” ఈప్రకారము జాంబవంతుఁడు శ్రీవారిని స్తుతించి, హనుమంతుని కార్యమునుగుఱించి వారితోఁ జెప్పెను. యావద్వృత్తాంతమును శ్రీరాముఁడు విని, పరమానందభరితుఁడై, హనుమంతునిఁ గౌఁగిలించుకొనెను. “ఓ వాయుపుత్రుఁడా! ఏప్రకారము జానకి ప్రాణములతో నుండెనో, సకృచ్ఛ్రీముగఁ జెప్పుము.” (అధికపాఠము) “ఓ మహావీరుఁడా! లంకాపురమును సవిస్తరముగ వర్ణించిచెప్పుము.” అని శ్రీవారు పలికిరి. “ఓ దీనబంధూ! ఓ సుఖనిధానా! నామాటలను మన్నింపుఁడు. త్రికూటపర్వతముపై లంకానగరము కలదు. ఆ నగరముయొక్క శోభను వర్ణింప శక్యము కాదు. ఆ పట్టణములో నయిదులక్షల శిలాగృహములును, తొమ్మిది లక్షల కర్రగృహములు కలవు.

దోహా 30

“ఏడుకోట్ల తామ్రగృహములును, నాలుగుకోట్ల రజతగృహములును, నాలుగుకోట్ల సువర్ణగృహములును, ఒకకోటి మాణిక్యగృహములును గలవు.

చౌపాయ్

“ఆరుకోట్ల పూరిండ్లును, నూరుకోట్లు వెదురుకొంపలును, తొమ్మిదికోట్లు స్ఫటికగృహములును, వేయికోట్ల నీలమాణిక్యగృహములును కలవు. ఓ నాథా! ఆపట్టణము నూరుయోజనముల విస్తీర్ణము. ఆ నగరమును రావణుఁడు పరిపాలించును. మీరు సర్వజ్ఞులు. మీకు సర్వము వ్యక్తము. వానికి దశశిరస్సులును, వింశతిభుజములు గలవు. దేవదానవులు వానికి భయపడి, వానిని సేవించెదరు. వాని ప్రభుత్వమున కెదురులేదు; నిశ్శంకముగ, వాఁడు మూఁడులోకములఁ బరిపాలించును. ఓ నాథా! శీఘ్రము మీరు వెడలుఁడు. మీరే జానకికి ధైర్యముఁ జెప్పవలయును. మీ వియోగమువలన, నామె చింతాక్రాంతయై, దివారాత్రములు విలపించుచుండును. ఆమెమనస్సునకు లేశమైన స్వాస్థ్యము లేదు. (అధికపాఠము సమాప్తము.)

దోహా 31

“ద్వారికునివలె, మీనామమే జానకిని దివారాత్రములు కాపాడుచుండును. ఆమెనేత్రములే, కవాటములు; వానిని, పాదము

లను నట్టియంత్రములకు బంధించెను; అందుచేత నామె ప్రాణములు వెడలుటకు మార్గము లేదు.

చౌపాయ్

"నేను బ్రయాణమగుచుండినపు డీ చూడామణిని నా కిచ్చెను." ఈ ప్రకార మతఁడు పలికి, చూడామణిని శ్రీరాముని చేతిలోఁ బెట్టెను. శ్రీరాముఁడు దానిని హృదయమున కద్దుకొనెను. మరల హనుమంతుఁ డిట్లు చెప్పుట కారంభించెను. "ఓ నాథా! జానకి నేత్రముల నిండ నీరుఁ బెట్టుకొని, మీతోఁ గొన్ని వచనములఁ జెప్పుమనెను. 'ఓ వాయుపుత్రా! లక్ష్మణునితోఁగూడ శ్రీవారిచరణములకు నా నమస్కారములని చెప్పుము. ఓ నాథా! మీరు దీనులకు బంధువులు. మనోవాక్కర్మలచే, నేను మిమ్ములనే సేవించుచుంటిని; ఏమియపరాధముఁ జేసియుంటిని? మీరు నన్ను విడనాడుట న్యాయమా? నాలో నొక యవగుణము కలదు; మీ యెడఁబాపు కలిగినవెంటనే, నేను బ్రాణములను విడిచిపెట్టలేదు. ఓ నాథా! అది నా నేత్రముల తప్పు; నాప్రాణముల నవి వెడలకుండ, నిరోధించుచుండెను. ఈ మీవియోగదుఃఖముచే, నా శరీరము దహించుకొని పోవుచుండెను; ఆ వియోగాగ్ని, నా నిట్టూర్పులవలనఁ బ్రజ్వరిల్లుచున్నది. నాశరీరము, దూదివలెఁ దగులఁబడి యుండును; కాని, నా నేత్రములనుండి సంతతధారావృష్టి కారుచుండుటచేత, నా శరీరము చల్లఁబడుచుండెను. అందుచేత, నాదేహము దహింపఁబడలేదు; నా నేత్రములు మీసందర్శన కుతూహలముచే నుండును;' ఓ దీనదయాపరమూర్తీ! సీత వియోగదుఃఖముఁ జెప్పశక్యముకాదు; దానిం జెప్పకుండుటయే మంచిది; మీ మనస్సు జాలిఁబడును.

దోహా 31

"ఓ కరుణాసముద్రుఁడా! ఒకనిమిష మొకకల్పమువలె నామె గడుపుచుండును. మీరు శీఘ్రము దండుతో వెడలి, శత్రువులను సంహరించి, జానకిని రక్షింపుఁడు."

చౌపాయ్

ఈ ప్రకారము మహావీరుఁడు పలికినపలుకుల నా రాజీవలోచనుఁడు విని, కన్నీరుఁ గార్చెను. "ఓ నాథా! మనోవాక్కర్మములచే మీరే గతియని నమ్మినవారికి స్వప్నమందయినను విపత్తులు సంభవింపవని నా నమ్మకము. అట్టి మహనీయులకు విపత్తు లనిచెప్పుట యసంబద్ధము. ఓ జగదాధారా! మిమ్ములను స్మరింపనివారికిని ధ్యానింపనివారికిని విపత్తులు సంప్రాప్త మగును. జానకికిమాత్ర మాపదలు కలుగలేదు; ఆమెకుఁ గలుగవు. ఆ రాక్షసులమాటఁ జెప్పనేల? మీరు వారినిజయించి, సీతను నిరాయాసముగ బొందవచ్చును." "ఓ వాయుపుత్రా! శరీరములను ధరించిన దేవమానవులలో నీవంటియుపకారి లేఁడు. నీకేమి ప్రత్యుపకారముఁ జేయఁగలను? నీకుఁదగిన ప్రత్యుపకారముఁ జేయలేకపోవుటచేత, నీముఖముఁ జూడలేను. నామాట వినుము. ఇది సత్యము; నేను నీఋణమున నుంటినికదా యని నాకు విచారము కలుగుచున్నది." ఈ ప్రకార మా రాక్షసాంతకుఁడు పలికి, మహావీరునిఁ జూచి, కన్నీరు గార్చెను; అతనిశరీరము పులకరించెను.

దోహా 32

శ్రీవారివచనములను మహావీరుఁడు విని, వారిముఖముఁ జూచి, పరమానందభరితుఁడై, వారి చరణములమీఁదఁ బడి, "ఓ నాథా! రక్షింపుము." అని ప్రార్థించెను.

చౌపాయ్

అతఁడు భక్తిపరవశుఁడై, పాదములమీఁదఁ బడియుండెను; అతనిని లేవనెత్తుటకు శ్రీవారు ప్రయత్నించిరి; కాని, వారిప్రయత్నములు వ్యర్థమయ్యెను. ఓ భరద్వాజా! శ్రీరామ చరణారవిందములమీఁదఁ గపీశ్వరునిశిరస్సును, అతనిశిరస్సుపై శ్రీవారి హస్తము నుండెను. ఆహా! కపీశ్వరుఁ డెంత యదృష్టవంతుఁడు? అతని భాగ్యముఁ జూచి స్మరించి, పార్వతీపరమేశ్వరులు పరమానందమగ్నులయిరి. పరమేశ్వరుఁడు వెండియు సావధానముతో నిట్లు ముందుకథఁ జెప్ప నారంభించెను. అంతట శ్రీవారు కపీశ్వరుని లేవనెత్తి, హృదయమునకుఁ గౌఁగిలించుకొనెను; అతని చేతులఁబట్టుకొని, తనవద్దఁ గూర్చుండఁ బెట్టుకొనెను. "ఓ వానరా! రావణుని ప్రభుత్వ మెట్లువెలుఁగును?

ఎట్లు నీవు లంకాపురమును దహించితివి ?" ఇట్లు శ్రీరాముఁడు పలికిన పలుకులను మహావీరుఁడు విని, వారి యనుగ్రహమునకు సంతసించి, దురభిమానమును విడిచి, యిట్లు విన్నవించెను. "ఓ నాథా ! మీరు సర్వజ్ఞులు ; మా వానరులకు బల మేపాటికలదు ? మేము కేవలము శాఖామృగములము ; చెట్లకొమ్మలపై దాఁటుచుండెదము. సముద్రమును లంఘించుటయు, రాక్షసులను సంహరించుటయు, నగరమును దహించుటయు—ఈ మొదలగు కార్యములు మీ ప్రతాపమువలన జరిగెను. వీనిలో నా ప్రయోజకత్వము శూన్యము. ఓ నాథా ! మీ ముద్రికబలముచేత, సముద్రమును, గోష్పాదమువలె, లంఘించితిని. ఆ ముద్రికఁజూచి, జానకి శాంతించెను. ఆమె శోకాగ్ని లంకాపట్టణమును దహించెను. ఆమె చూడామణిబలముచేత, నేను పునః సముద్రమును లంఘించి, మిమ్ములఁ జూచితిని. ఇదియంతయు మీ ప్రతాపమువలన జరిగెను.

దోహా 33

"ఓ నాథా ! మీకటాక్షము గలవారికి, దుస్సాధ్యము లుండవు. అగ్ని దూదినివలె, మీ ప్రచండప్రతాపము రాక్షసులను దహించును.

చౌపాయి

"ఓ జగదీశ్వరా ! నన్ను రక్షింపుఁడు, ఓ నాథా! మీ నిత్యానపాయినియు, సుఖదాయిని యగుభక్తిని బ్రసాదింపుఁడు." ఈ ప్రకారమాంజనేయుఁడు, నిగర్వముతోఁ బలికినపలుకులను రామభద్రుఁడు విని "తథాస్తు" అని దీవించిరి. ఓ పార్వతీ! శ్రీవారిస్వభావమును గుర్తెఱింగినవారు, వారి భజననువిడిచి, మఱియొకపనిలోఁ బ్రవేశింపరు. ఈ సంవాదమును స్మరించినవారికి, శ్రీరాముని చరణకమలములయందత్యంతభక్తి కలుగును. ప్రభువు వచనములను వానరులు విని, కిలకిలమని "ఓ కృపాలుఁడా ! జయ, జయ" అని యేకగ్రీవముగఁ బలికిరి. "ఓ సఖుఁడా ! విలంబముఁ జేయక, సమరసన్నాహముఁ జేయుము. వానరులఁ బ్రయాణముఁ జేయుము." అని శ్రీవా రాజ్ఞాపించిరి. ఈ వానరుల సన్నాహముఁ జూచి, దేవతలు సంతసించి, పుష్పములను వర్షించి, స్వగృహములకు నిష్క్రమించిరి.

దోహా 34

ఆకపిరాజు శ్రీవారి యాజ్ఞప్రకారము, వానరయోధులఁ బిలిచెను; అనేకరంగురంగులవీరులు వానరులును, జాంబవంతులును రాజు వద్దకు వచ్చిరి.

చౌపాయ్

ఆ వానరయోధులు శ్రీవారి చరణకమలములకు నమస్కరించి, సింహానాదములఁ జేసిరి. శ్రీపతి వారిని కటాక్షదృష్టితోఁ జూచి, యాదరించిరి. పర్వతములకు రెక్కలువచ్చినట్లు వారి కటాక్షవీక్షణముచే, వానరులు బలవంతులై, విజృంభించిరి. శ్రీయశఃపతి ప్రసన్నుఁడై, ప్రయాణమును సాగించెను; అప్పుడు శుభశకునములు కనఁబడెను; వానివలన, వారి కార్యము దిగ్విజయమగునని తోఁచెను. "శ్రీవారు దండుతో వెడలిరి" అని చెప్పుటకో యనునట్లు, జానకివామాంగములు చెదరెను. ఆమెకు శుభముసూచించినట్లు, రావణున కశుభము సూచించెను; వానికి వామాంగములు చెదరెను; ఆ వానరకటకమును లెక్కించి చెప్పుట కెవరికి శక్తికలదు? కోటానఁగోట్లు వానరులును జాంబవంతులును గర్జించి, వెడలిరి. వారినఖములే వారికి యాయుధములు; పర్వతములను, వృక్షములను వారుధరించి, స్వేచ్ఛానుసారముగ నంతరిక్షమునఁ గొందఱును, భూమిమీఁదఁ గొందఱును వెడలిరి. ఆవానరులును భల్లూకములును సింహానాదములఁ జేసిరి; వారి సింహానాదములను విని దిగ్గజములు బెదరి, ఘీంకారముఁ జేసెను.

ఛాంద్ 14, 15

దిగ్గజములు సొమ్మసిల్లెను; భూమి కంపించెను; పర్వతములు చలించెను; సముద్రము క్షోభించెను; సూర్యచంద్రులు సంతోషించిరి. దేవ, గరుడ, గంధర్వ, కిన్నర, యక్ష, నాగ, మనుజులదుఃఖములు శాంతించెను. అనేకవానరులు పటపటమని పండ్లఁగొఱుకుచు, ననేకవిధములఁ బరుగెత్తఁజొచ్చిరి. "శ్రీరఘురామజీకీ జయ్"అని శ్రీవారిఁ గొనియాడి, వానరులు వెడలిరి. ఆ భారమును సహింపలేక, శేషుఁడు మాటిమాటికి మూర్ఛిల్లుచుండెను. అతఁ డనేకపర్యాయము లాదికూర్మము వీఁపును పండ్లతోఁగొఱికి, పట్టుకొనుచుండెను. దానివీఁపు కఠినమ్ము కనుక, నతని కోరలు, దానివీఁపునకుఁ దగులలేదు. దాని పండ్లగీటులుమాత్రము దాని

వీఁపుమీఁదఁ గనఁబడును. శ్రీరాముని ప్రయాణమార్గములో యనునట్లు, ఆ గీటులు కనఁబడును. ఈ భూభారము తగ్గునని, శేషుఁడు సంత సించెను.

దోహా 35

ఈ ప్రకార మా కృపాసముద్రుఁడగు శ్రీరాముఁడు వానరులతో వెడలి, సముద్రతీరమునకు వచ్చెను. ఆవానరు లచ్చటచ్చట నిలిచి, ఫలముల భక్షించుచుండిరి.

---

# పంచమవిశ్రామము.

చౌపాయ్

అచ్చట లంకలో రాక్షసులు దిగులుపడి యుండిరి; మహావీరుఁడు లంకానగరమును దహించి వెళ్లినతరువాత, వారందఱు భయపడుచుండిరి. "రాక్షసుల వంశమునకు వినాశకాలము వచ్చెను" అని, రావణునకు భయపడి, రాక్షసులు వారిలోవారు గుసగుస లాడిరి. "నగరమునకు దూతవచ్చి, యింతటిపనిఁ జేసెనుకదా? ఇఁక, యజమానుఁడు వచ్చిన, నెంతయనర్థము పుట్టునోకదా? ఇంతవాఁడు దూత అయినపుడు, రా జెంతవాఁడో కదా?" ఈ ప్రకారము రాక్షసుల గుసగుసలను చెలికత్తెలు విని, వారిమాటలను మందోదరితోఁ జెప్పిరి; ఆ మెమనస్సు వ్యాకుల పడెను. ఏకాంతమున నామె భర్తనుఁగలసి, చేతుల జోడించుకొని, పాదములకు నమస్కరించి, యిట్లు విన్నవించెను. "ఓ నాథా! భగవంతునితో విరోధము తగదు. నా హితవచనములను మన్నించి, విచారింపుము. రామదూత చేసిన కార్యములను వినినందున, రాక్షసస్త్రీలగర్భములు విచ్ఛిన్న మయ్యెను. నీ మంత్రిసహాయము నిచ్చి, రామునిభార్యను పంపివేయుము. ఓ ప్రాణనాథా! అందువలన నీకు శుభము కలుగును.*

---

* పూర్వము పద్మాక్షుఁ డనురాజు కలఁడు. అతనికి సంతానములేదు. లక్ష్మీదేవియే కూఁతురుగఁ బుట్టవలెనని యతఁడు కోరి, ఆ దేవినుద్దేశించి, తపముఁ జేసెను.

"ఓ నాథా! కమలములను శీతకాలరాత్రివలె, నీవంశమును జానకి ధ్వంసముఁ జేయును. నీవు సీతను రామునకు సమర్పింపనియెడల బ్రహ్మమహేశ్వరులు నీకడ్డుపడినను, వారు నిన్ను రక్షింపలేరు. నీకు శుభము కలుగదు.

---

ఆమె ప్రత్యక్షమై "ఓ రాజా! నేను పరతంత్రురాలను. నీవు విష్ణుమూర్తినిగుఱించి తపముఁ జేయుము" అని చెప్పి, యంతర్ధాన మయ్యెను. అప్పుడు రాజు విష్ణువును గుఱించి తపస్సుజేసెను. విష్ణువు ప్రత్యక్షమై, పద్మాక్షరాజున కొక మాతులుంగఫలము నిచ్చి, "ఓ రాజా! ఈ ఫలమువలన నీ కొకకూఁతురు పుట్టును" అనిచెప్పి, యంతర్ధాన మయ్యెను. ఆఫలము నతఁడు విప్పెను; దానిలోనుండి యొకకన్య వెడలెను; ఆ ఫలము ఫలమువలె నుండెను. ఆ కన్యకు రాజు పద్మావతియని నామకరణముఁ జేసెను. బాలచంద్రునివలె, నామె దినదినప్రవర్ధమానముగ సంపూర్ణకళలతో నిండెను. ఆమె త్రిశక్తిస్వరూపిణి; ఆమెకు లోపము లేమియుండును? అంతకంత కామెకు వయస్సు వచ్చెను. నీలమేఘమును వస్త్రముగధరించినవాని కామెనిచ్చి వివాహముఁ జేసెదనని యతఁడు చాటించెను; అతని ప్రతిజ్ఞను రాక్షసులును రాజులును విని కోపించి, యతనితోఁ బోరాడి యతనిని జంపి, నగరమును ధ్వంసముఁ జేసిరి. పద్మావతి అగ్నిగుండములోఁ బ్రవేశించెను. ఇట్లు కొంతకాలము గడచెను. ఒకనాఁడు పద్మావతి గుండములోనుండి బయటకువచ్చి విహరించుచుండెను. అప్పుడు రావణుఁడు విమానము నెక్కి, నభోమార్గమునఁ బోవుచు, నామెనుఁ జూచి "ఓ పద్మావతీ! నీ యునికిపట్టుఁ దెలిసికొంటిని. రా రమ్ము" అని చేఁ జాచెను. అతక్షణ మామె గుండములోఁ బ్రవేశించెను; వాఁడు విమానమునుండి దిగివచ్చి, గుండముఁ గలయఁజూచెను; అందులో వానికిఁ బంచ రత్నములు దొరికెను. ఆరత్నములను వాఁడు పెట్టెలోఁబెట్టి, లంకకు వెళ్లెను. ఏకాంతమున వాఁడు భార్యనుఁబిలిచి, "ఓ ప్రాణసఖి! నీనిమిత్తము మంచిరత్నములఁ దెచ్చియుంటిని; ఆ పెట్టెమూత విప్పి, వానినిఁ దీసికొనుము" అని చెప్పెను. ఆ పెట్టె నామె విప్పుటకుఁ బ్రయత్నించెను; కాని, యామెయత్నములు వ్యర్థమయ్యెను. తదుపరి, రావణుఁడు ప్రయత్నించెను; కాని, వాని ప్రయత్నములు విఫలమయ్యెను. అప్పుడు వాని యాజ్ఞాప్రకారము రాక్షసులు దానిని గొడ్డండ్లతోఁ బగులఁగొట్టిరి. ఆపెట్టెలో నొకబాలిక యగుపడెను. "ఓ రాక్షసరాజా! ఈ బాలికవలన నీవంశము నశించును. నీలంకకుఁ గీడు వాటిల్లును." అని రాక్షసులు చెప్పి, ఆకన్యను పెట్టెలోఁబెట్టి, జనకపట్టణసమీపమున భూమిలో దానినిఁ బ్రాతిపెట్టిరి. ఆకన్యయే సీత."

దోహా 36

"ఓ స్వామీ! సర్పములు మండూకములనువలె, రామబాణములు మీ రాక్షసులను మ్రింగును. గర్వమును విడిచి, సీతను రామునకు సమర్పింపుము. అతనితో శీఘ్రము సంధిఁజేసికొనుము"

చౌపాయ్

ఈ ప్రకారము మందోదరి పలికినపలుకుల నామూర్ఖుఁడు విని, పక్కున నవ్వి, "ఓ సఖీ! స్త్రీలు భయస్వభావలు; అది వారిస్వభావము. వారిమాటలవలన, శుభము లశుభములగును. వానరులు మనగుమ్మము వద్దకు వచ్చినపుడు రాక్షసులు వారిని భక్షింతురు. ఆహా! నావంటివానింజూచి లోకపాలురు సహితము బెదరుచుండెదరు; నాభార్య కింత భయమేల! ఆమోఘయము నగుబాట్లకు వచ్చెను." అని పలికి నవ్వి, యామెను కౌఁగిలించుకొని, యామె చుబుకమును ముద్దుఁబెట్టుకొని, మూర్తీభవించిన దురభిమానమువలె, సభలోఁ బ్రవేశించెను. "ఆహా! విధికృతము విపరీతముగ నుండెను; నా నాథున కేమి దుర్గతి వచ్చునోకదా! నే నేమి చేయఁగలను? గతాయువులకు దీపనిర్వాణ గంధమును, మిత్రులవచనములును, అరుంధతియు విపరీతము లగును." అని మందోదరి చింతించెను. అంతలో రావణుఁడు సభలోఁబ్రవేశించి, మంత్రులఁ బిలిచి, "ఓయీ! మీమీ యభిమతములఁ జెప్పుఁడు; ఈ విషయములో మీ సమ్మతిఁ దెలుపుఁడు" అని యడిగెను; వారు ముఖముఖములఁ జూచుకొని, నవ్వి యూరకుండిరి. (అధికపాఠము.) ఆదినమున కుంభకర్ణుఁడు మేల్కాంచెను. వాఁడు సభకువచ్చి, యావులించుచు, "అరే! మూఁడులోకములలో నావంటివీరుఁడు లేఁడే. నాయెదుట నిలువఁబడియుండఁ దగినవాఁడు కలఁడా!" అని పలికి, శయన గృహములోఁ బ్రవేశించెను. "ఓ రావణా! మీ యాజ్ఞను శిరసావహించెదను. మీ కటాక్షముండినఁ జాలును. లోకములో మనుజులను వానరులను నిశ్శేషముగ సంహరించెదను. పెక్కుమాటలు మీతోఁ జెప్పనేల?" అని, క్రోధాకారుఁడై, అతికాయుఁడు హుంకరించెను. "ఓ నాథా! నాప్రతాపము లోకవిఖ్యాతము. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు సహితము నాకు స్వాధీనులు; వారికంటె బలవంతులు లేరుకదా! ఇఁక

నరవానరులమాటఁ జెప్పనేల?" అని కామరూపుఁడగు మేఘనాదుఁడు ప్రగల్భములఁ బలికెను. "ఓనాథా! మా ప్రతాపము మీకు విశదము. త్రిశంతోఁటిదేవతులును మా కటాక్షవీక్షణమునకుఁ గాచుకొనియుం డెదరు. వారు మా కున్నతాసనముల నిచ్చెదరు. ఒకరు స్పృశించినపదార్థములను మేము భుజింపము. మా ధాటికిభయపడి, మాతో నెవరును ప్రసంగింపరు. నరవానరులను లెక్కపెట్టము" అని, కుంభకర్ణునిపుత్రులు, పాషండులు, పొగరుబోతులు, కుంభినికుంభులు పలికి విజృంభించిరి. "ఓ స్వామీ! నేను జీవించియుండ, రెండుకన్నులవాఁ డెవఁడు జానకినిఁ దీసికొనిపోఁగలఁడు? నరవానరుల వినాశమునకుఁ దగిన యుపాయముఁ జెప్పుఁడు; దానిప్రకారము వారిని సంహరించెదను." అని, దురభిమాని యగు నకంపనుఁడు గర్జించెను. "కోట్లకొలఁది వానరులువచ్చినను, వారిం జంపి, నా కడుపు నింపుకొనియెదను. నన్నుఁ జూచి పామువం టిది, కన్నములో దూరుసుకదా! లక్షలు, కోట్లు నరవానరులనిన నేపా టివారు?" అని మహోదరుఁడు పలికి హుంకరించి, కడుపును సవరించు కొనెను. "ఓ నాథా! మీయాజ్ఞకు నిరీక్షించుచుంటిని; ఒకక్షణములో నేనాముని వేషధారులనుఁ బట్టుకొని తీసికొనివచ్చెదను." అని పాషం డమూర్తి యగుదుర్ముఖుఁడు గర్జించెను. "ఓ నాథా! నేను బ్రాహ్మణ వేషమును ధరించి, తదితరబ్రాహ్మణులను వలె, రామలక్ష్మణులను విందు నకుఁ బిలిచెదను.

దోహ

"ఓ రాజా! వారు నిశ్శంకగ భోజనమునకు వచ్చినతరువాత, వారిని గట్టిగ పట్టుకొనవచ్చును. ఈ యుపాయము మీ సమ్మతమే?" అని కపటియగు మకరాక్షుఁడు పలికెను. (అధికపాఠము సమాప్తము.) "సురాసురులను సునాయాసముగ జయించిన నాకు నరవానరు లేపాటి వారు?" అని వాఁడు తలంచెను.

దోహ 37

ప్రియవచనములఁ జెప్పిన మంత్రివలన రాజ్యమును, లోభము చేతఁ బ్రియవచనములఁ బలికినవైద్యునివలన శరీరమును, గురుకట్టు మునకు భంగమువచ్చునని భయపడి, ప్రియవచనములఁ బలికిన గురువు వలన శిష్యుఁడును నశింతురు.

చౌపాయ్

ఈప్రకారము మంత్రులు చెప్పినవాక్యములు రావణునకు హితవుగ నుండెను; వానికి భయపడి వా రట్లు చెప్పిరి. అంతలో విభీషణుఁడు సభలోనికి వచ్చి, రావణునకు నమస్కరించి, యాసనముపైఁ గూర్చుండెను. "ఓ తమ్ముఁడా! ఈ నరవానరులవిషయములో నీ యభిప్రాయముఁ జెప్పుము." అని రావణుఁ డతని నడిగెను. "ఓ కృపాళుఁడా! నాబుద్ధికిఁ దోఁచినవిధమునఁ జెప్పుచున్నాను; నామాటలను మన్నింపుఁడు. ఓ నాథా! మీరు సద్గతిని, సత్కీర్తిని, శుభములను, సుఖములను గోరినయెడల, భాద్రపద శుద్ధచవితిచంద్రునివలెఁ, బరస్త్రీ ముఖముఁ జూడకూడదు. పదునాలుగు భువనములకు నధిపతియగు వాని నొకజీవుఁ డెదిరించి జీవింపఁగలఁడా? వానికేమి శుభములు కలుగును? ఎన్నిసుగుణము లుండినను, లోభగుణమువలన మనుజుఁడు రాణింపఁడు.

దోహా 38

"ఓ రాజా! కామక్రోధాదులు నరకమునకు మార్గములు. వానిని విడిచి, శ్రీవారిని భజించుట శ్రేయోదాయకములని సద్గ్రంథములు చాటుచుండును.

చౌపాయ్

"ఓ తండ్రీ! శ్రీరాముఁడు సామాన్యమనుజునివంటి రాజు కాఁడు; కాలున కతఁడు కాలుఁడు; త్రిలోకారాధ్యుఁడు; బ్రహ్మ; అనామయుఁడు; అజుఁడు; భగవంతుఁడు; సర్వవ్యాపకుఁడు; అజేయుఁడు; ఆద్యంతములు లేనివాఁడు; అనంతుఁడు. గోబ్రాహ్మణదేవతల నుద్ధరించుట కా మహాత్ముఁడు నరరూపమును ధరించి, యవతరించెను. భక్తులఁ బాలించుటకును, దుష్టులను శిక్షించుటకును, దేవతలను వేదధర్మములను రక్షించుటకు నతఁ డవతరించెను. శ్రీరాముఁడు ప్రణతార్తిహరుఁడు; వారితో వైరమును విడిచి, వారిని సేవింపుము. వారికి జానకిని సమర్పింపుము. వారి నిర్హేతుకజాయమానకటాక్షమును సంపాదింపుము. వారిని భజింపుము. ఎంతపాపాత్ముఁ డయినను వారిని

సమీపించి, వారిశరణుఁ జొచ్చినయెడల, వారు వానిని రక్షించెదరు. 'ఓనాథా! నేను పాపాత్ముఁడను; నన్ను రక్షించి కాపాడుము' అని మీరు శరణుఁజొచ్చినయెడల, మిమ్ములను రక్షించును. ఓనాథా! వారినామము తాపత్రయములను హరించును. ఆ మహాప్రభువు సగుణరూపమును ధరించి వచ్చెను. మీరు విచారించి, ప్రవర్తింపుఁడు.

దోహా 39, 40

"ఓ రాజా! మీ చరణములకు నమస్కరించి, మాటిమాటికి విన్నవించెదను. మానమదమోహాదులను విడిచి, శ్రీరామచంద్రుని సదా భజింపుము. మీకు భయపడి, మీయెదుట మీమంత్రులు సత్యముఁ జెప్పరు. పులస్త్యఋషి, శిష్యునిద్వారా నాకీవర్తమానముఁ బంపెను; సమయముఁ జూచి, నేనావర్తమానమును మీకు విన్నవించితిని; జానకిని సమర్పింపుఁడు."

చౌపాయ్

ఈప్రకారము విభీషణుఁడు చెప్పినవచనములను మాల్యవంతుఁడనువృద్ధమంత్రియొకఁడు సమ్మతించెను. "ఓ మహారాజా! మీతమ్ముఁడు చెప్పినమాటలు నీతియుక్తములు. వానిని మీరు మన్నించుట శ్రేయస్సు." అని మాల్యవంతుఁడు బుద్ధిఁజెప్పెను. వారిరువురమాటలకు రావణుఁడు కోపగించి, "ఓరీ! మీరిరువురు మూర్ఖులు; మీరెంతవఱకు శత్రువులను శ్లాఘించెదరు. వీరిని మీరు బయటకు వెడలఁగొట్టుఁడు" అని యాజ్ఞాపించెను. ఆవెంటనే మాల్యవంతుఁడు సభను విడిచి, గృహమునకు నిష్క్రమించెను. పిమ్మట విభీషణుఁడు రావణునకు నమస్కరించి, చేతులను జోడించుకొని, "ఓ నాథా! ప్రతిమనుజుని హృదయములో సుమతియు కుమతియు నివసించునని వేదశాస్త్రములు చెప్పును. సుమతి యుండినపుడు, సకలసంపద లుండును. కుమతి యుండినపుడు సకలవిపత్తులు కలుగును. ఓ రాజా! మీ హృదయములోఁ గుమతియుండును; అందుచేత, మీకు హితవుఁగోరినవారిని మీకు శత్రువులని మీరు భావించెదరు. రాక్షసకులమునకుఁ గాళరాత్రివంటి సీతమీఁద మీకు దయకలదు; అదియే మీ కుబుద్ధి.

దోహా 41

"ఓ నాథా! నే నొకవరము నడుగుచున్నాను. నా మాటను మన్నించి, శ్రీరామునకు జానకిని సమర్పింపుఁడు. మీకు సకలకల్యాణములు సమకూడును."

చౌపాయ్

పండితులు విని హర్షించుటకుఁ దగినట్లు, న్యాయధర్మశాస్త్ర సమ్మతమగు వచనములను విభీషణుఁ డుపదేశించెను. అతనిమాటలను రావణుఁడు విని, కోపించి, దిగ్గున లేచి, "ఓరీ! మూర్ఖుఁడా! నీకు మృత్యువు సమీపించెను. నావలన, నింతకాలము నీవు జీవించియుంటివి. ఇప్పుడు నీకు శత్రువు లుపకారులా! వారిమీఁద నీకింత యభిమాన మేల? నా భుజబలముచేత సాధింపఁబడని మనుజుఁడొకఁడు లోకములోఁ గలఁడా? నా గృహములోనుండి, నా యన్నముఁ దిని, నా శత్రువులను భూషించెదవా! కానలను బెంచిన, కూటికుండలకుఁ జేటువచ్చిన ట్లయ్యెను. నీవా తపశ్శాలులవద్దకుఁ బోయి, నీ నీతులను వారికిఁ జెప్పుము" అని పలికి, తమ్ముని దన్నెను. మాటమాటకి యతఁడు రావణునిచరణములఁ బట్టుకొనెను. ఓ పార్వతీ! ఈప్రకారమే సత్పురుషులు సంచరించెదరు. ఇదియే వారిప్రభావము. దుర్జనులు దూషించినను, సత్పురుషులు వారిని భూషింతురు. "ఓ నాథా! నాబుద్ధి కనుగుణ్యముగ మీరు ప్రవర్తించితిరి. మీకు సర్వమంగళము లగుగాక." అనిచెప్పి, యంతరిక్షమునకు మంత్రులతోఁ గూడి, యతఁడు కుప్పించి, మరల నిట్లు చెప్పెను.

దోహా 42

"ఓ నాథా! శ్రీరాముఁడు సత్యసంకల్పుఁడు; నీకువలె, నీ యనుచరులకుఁగూడ కాలము సమీపించెను. నేను శ్రీరాముని శరణుఁజొచ్చెదను. నా దోషములేదు."

చౌపాయ్

ఈప్రకారము చెప్పి, విభీషణుఁడు వెడలెను. ఓ పార్వతీ! సాధువులను తిరస్కరించుటవలనఁ, దక్షణము సకలకల్యాణములు నశిం

చును. ఎప్పుడు రావణుఁడు విభీషణుని విడిచిపెట్టెనో, అప్పుడే వానిని నిర్భాగ్యము పొందెను. శ్రీరామదర్శన కుతూహలముతో విభీషణుఁడు వెడలెను.

"దేఖహా జాయ చరణ జలజాతా,
అరుణ మృదుల సేవక సుఖదాతా.
జే పద పరసి తరీ ఋషినారీ,
దండక కానన పావన కారీ."

"ఆహా! నేఁడు సకలసేవకులకు సుఖమునిచ్చు శ్రీవారి చరణకమలములఁ జూచెదను. ఆ చరణకమలముల రజము సోకినమాత్రమున, మునిపత్ని తరించెను; దండకారణ్యము పవిత్రమయ్యెను.

"జే పద సునకసుతా ఉర లాయే,
కపట కురంగ సంగ ధరి ధాయే.
హర ఉర సర సరోజ పద జోఈ,
అహోభాగ్య మై దేఖబ సోఈ."

"ఆ చరణకమలములను శ్రీజానకి వక్షస్థలమున ధరించును; ఆ చరణకమలములే కపటకురంగము వెనుక వెళ్లెను. ఆ చరణములే శివుని మానససరోవరములో నిలిచియుండును. ఆహా! ఏమి నాభాగ్యము! ఆ చరణారవిందములను నేఁడు నా కన్నులారఁ జూడఁగలను.

దోహా 43

"జిన పాయనకీ పాదుకా, భరత రహే మనలాయ
తే పద ఆజ విలోకిహా, ఇన నైనన అబ జాయ."

"ఆ చరణారవిందముల పాదుకలను భరతుఁడు నిత్యము సేవించును. ఐశ్వర్యమదము నతఁడు పొందక, వానిని బూజించును. ఈ నాకన్నులతో వానిని నేఁడు చూడఁగలను. అందువలన, నైశ్వర్యమద మోహాదులబాధ నన్ను విడిచిపెట్టును."

చౌపాయ్

ఈప్రకార మతఁ డువ్విళ్లూరుచు సముద్రమును దాఁటి, యివతలియొడ్డునకు వచ్చెను. అతని యాగమనముఁ జూచి, అతఁడు రావ

ఋనిదూతయని తలఁచి, వానరులు సుగ్రీవునితోఁ జెప్పిరి. అతనిని వారు కటకములోఁ బ్రవేశింపకుండ నిరోధించి, యతనివృత్తాంతమును గపిరాజునకు వారు విన్నవించిరి. అతఁడు శ్రీవారితో నిట్లు విన్నవించెను:- "ఓ నాథా! రావణునితమ్ముఁడు మిమ్ములను దర్శించుటకు వచ్చెను." "ఓ సఖుఁడా! ఈవిషయములో నీ యభిప్రాయ మేమి?" అని శ్రీరాముఁడు ప్రశంసించెను. "ఓమహారాజా! నా మాటలను మన్నింపుఁడు. రాక్షసులమాయలఁ దెలిసికొనుట కష్టము. వారు కామరూపులు. ఎందులకు వాఁడు మీావద్దకువచ్చెనో నాకుఁ దెలియదు? నాకును అంగదునకును మిత్రభేదముఁ జేయుటకు వచ్చినట్లు తోఁచుచున్నది. మీాచిత్తము; వానిని బంధించుట యుచితము." అనిసుగ్రీవుఁడు పలికెను. "ఓ సఖుఁడా! నీమాట సత్యము; శాస్త్రానుసారము వచించితివి. అయినను, నాప్రతిజ్ఞను వినుము. నీమాటకుఁ బ్రతికూలముగ నుండును. శరణాగతులను రక్షించెదనని నాప్రతిజ్ఞ" శ్రీరాముఁడు శరణాగతవత్సలుఁడని మాటలవలనఁ దెలిసికొని, మహావీరుఁడు ప్రసన్నుఁ డయ్యెను. లేఁగదూడల శరీరముపైనుండిన మాలిన్యమును గోవు నాలుకతో నాకివేయునట్లు, శ్రీవారు భక్తులపాపములను హరించి, వారిని నిర్మలులఁ జేయఁగలరు.

### దోహా 44

"ఓ సఖుఁడా! శరణాగతులు మనకు శత్రువులయినను, వారిని విడిచిపెట్టుట యనుచితము; అట్లు విడనాడినవాఁడు పాపాత్ముఁడు; వానిముఖముఁ జూచిన పాపములు వచ్చును.

### చౌపాయ్

"కోటి బ్రహ్మహత్యాదిపాపములఁ జేసినవాఁడు నా శరణుఁ జొచ్చినయెడల, నేను వానిని విడిచిపెట్టను. నా సన్నిధానమునకు వచ్చినజీవుని, కోటి జన్మములపాపములను హరించెదను. పాపాత్ములకు లేశమైన నాభజనయందు మనస్సుచొరదు. కలుషచిత్తములఁ గలవారు నా సముఖమునకు రాఁజాలరు. స్వభావసిద్ధముగ నిర్మలచిత్తములఁ గలవారే నన్ను సమీపించెదరు. కపటము, చమత్కారము- ఈ మొదలగునవి నాయెదుటఁ జెల్లవు. ఒకవేళ మనకు మిత్రభేదముఁ

జేయుట కతనిని మనవద్దకు రావణుఁడు పంపినను, అంతమాత్రమున మనకు వచ్చినభయమేమి? ఓ సఖుఁడా! లోకములో నుండినరాక్షసుల నొకముహూర్తములో లక్ష్మణుఁడు సంహరింపఁ గలఁడు. వాఁడు నాకు భయపడి, నా శరణుఁజొచ్చినయెడల, నా ప్రాణములతోసమానముగ వానిని రక్షించెదను.

దోహా 45

"వాఁడు భయపడివచ్చినను, మిత్రభేదముఁ జేయుటకువచ్చినను, భయము లేదు; వానిని శీఘ్రముగఁదీసికొనిరండు" ఈప్రకారము శ్రీ రాముఁడు నవ్వుచుఁ బలికెను. "శ్రీ రామజీకీ జయ్" అనుచు హనుమదాదులు వెడలిరి.

చౌపాయ్

శ్రీ రాముని యాజ్ఞాప్రకారము, వారు విభీషణుని ముందుబెట్టి, యతనివెంట శ్రీ రామునివద్దకు వచ్చిరి. నయనానందదాయకులగు రామ లక్ష్మణులను, శ్రీ రాముని దివ్యమంగళవిగ్రహము నతఁడు దూరమునుండి చూచి, పరవశుఁ డయ్యెను; అతనికి నిలువుగ్రుడ్లుపడెను. ఎంత చక్కని విగ్రహము? ఆజానుబాహువులు, కమలలోచనములు, విశాలవక్షః స్థలము, సింహస్కంధము, కామమోహితమగు ముఖము, నీలమేఘ శ్యామలశరీరము, ఆ చక్కదనాలకుప్ప నతఁడు చూచి, ఆనందబాష్ప ములఁ గార్చెను; అతనిశరీరము పులకరించెను. అతఁడు ధైర్యము నవలంబించి, మృదుమధురముగ నిట్లు ప్రార్థించెను. "ఓ దేవరక్షకా! రాక్షసవంశములోఁ బుట్టి, రాక్షసులఁ బరిపాలించు రావణుని తమ్ముఁ డను. నాపేరు విభీషణుఁడు. నేను పాపసంభవుఁడను; పాపాత్ముఁడను; మహాపాపిని; తమోగుణప్రధానుఁడను. గుడ్లగూబ చీకటిని సహించు విధమున, నేను తామసమునే సహించెదను.

దోహా 46

"ఓ నాథా! మీరు శరణాగతరక్షకులని విని, మీ పొత్తుఁగో రివచ్చితిని. ఓ సంసారసాగరోత్తారకా! మీరు తప్ప నాకు మఱియొకరు రక్షకులు లేరు. ఓ శరణాగతవత్సలా! ఓ ప్రణతార్తిహరా! రక్ష రక్ష"

### చౌపాయ్

ఈప్రకారము స్తుతించి, విభీషణుఁడు శ్రీరాముని చరణముల మీఁద, దండమువలెఁ బడెను. శ్రీరాముఁడు ప్రసన్నుఁడై, యతనిని లేవనెత్తెను. అతని దీనాలాపములను శ్రీరాముఁడు విని, జాలిఁబడి, యతనిని కౌఁగిలించికొనెను. శ్రీవారిని దర్శించుటవలన నతని నిశాచరత్వము నశించెను. శ్రీరామలక్ష్మణులును, సుగ్రీవుఁడును, విభీషణుఁడును కలసి కూర్చుండిరి. శ్రీరాముని యభయమువలన, నతఁడు నిర్భయుఁ డయ్యెను. "ఓ లంకేశా! నీకును నీపరివారమునకుఁ గుశలమా? దివారాత్రములు రాక్షసులమండలిలో నివసించియుంటివి; వారు దుర్మార్గులు; ఎట్లు ధర్మమును నిలువఁబెట్టుకొంటివి? నీవు ధర్మాత్ముఁడవని గ్రహించితిని; నీలో నధర్మము లేశమపి కనఁబడదు. ఓసఖుఁడా! నరకములో నివసించియుండుట శ్రేష్ఠము; కాని, దుష్టుల సాంగత్యముమాత్రము కలుగకుండునట్లు భగవంతునిఁ బ్రార్థించెదము." ఈ ప్రకారము శ్రీరాముఁడు చెప్పినమాటలను విభీషణుఁడు విని, యతనితో నిట్లు పలికెను. "ఓ నాథా! మీచరణారవిందములను దర్శించుటవలన, నఖిలసౌఖ్యపదవు లందగొంటిని. మిమ్ముఁ జూడఁగంటి. మీకృపఁ గనుగొంటిని.

### దోహా 47

"ఎంతవఱకు సకలదుఃఖములకు మూలమగు కామాదులను విడిచి, జీవులు రఘునాథుని భజింపరో; అంతవఱకు వారికి క్షేమములు కలుగవు; స్వప్నమందయినను వారికి మనశ్శాంతి యుండదు.

### చౌపాయ్

"ఓ నాథా! శ్రీవారు ధనుర్బాణములను ధరించి, హృదయములో నివసించువఱకు, జీవులకుఁ గామాదులబాధ తగిలియుండును. ఎంతవఱకు శ్రీవారి స్వరూపజ్ఞానోదయము కలుగదో, అంతవఱకే, రాగద్వేషాదు లనునట్టి గుడ్లగూబలకుఁ దగిన యజ్ఞానాంధకారము జీవులహృదయముల నావరించి యుండును. ఓ నాథా! మీ చరణారవిందములను దర్శించుటవలన, నాజన్మము సఫల మయ్యెను; నాకు క్షేమములు కలిగెను; నా భయశోకములు నశించెను. మీకటాక్షము

కలవానికిఁ దాపత్రయములు నశించును. నేను రాక్షసుఁడను; నాస్వభావము నీచము; శుభకర్మల నాచరించి యుండలేదు. మునులు ధ్యానించి, మీరూపమును గ్రహింపఁలేరు; అట్టి మీరు నన్నుఁ గౌఁగిలించుకొంటిరి; ఏమి నా భాగ్యము?

దోహా 48

"ఓ నాథా! ఓ ఆర్తరక్షకా! ఏమి నా యదృష్టము? కృపాసముద్రులు, మిమ్ముఁ జూడఁగంటిని. బ్రహ్మమహేశ్వరులు మీ చరణారవిందములను సదా సేవించెదరు."

చౌపాయ్

"ఓ సఖుఁడా! నాస్వభావముఁ జెప్పుచున్నాను, వినుము; పార్వతీపరమేశ్వరులకును, కాకభుశుండికిని, నా స్వభావము తెలియును. చరాచరజంతుజాలమునకు ద్రోహముఁ దలఁచినవాఁడు, భయపడి, కామాదులను విడిచి, నా శరణుఁ జొచ్చినయెడల, నేను వానిని సాధువుఁ జేయుచున్నాను. పుత్రులను, మిత్రులను, దారాదులను, బంధువులను, ధనమును, గృహములను, పశువులను—ఈ మొదలగుపాశములను దారపుబంతివలెఁ గట్టిపెట్టి, నా చరణములకు మనస్సునుఁ గట్టి, శోకమోహాదులను విడిచి, సమదర్శియై, నిష్కాముఁ డగువాఁడే సజ్జనుఁడు; లోభివానిహృదయములో ధనము నివసించువిధమున, వాఁడే నా హృదయములో సదా నివసించును. నీవంటిమహాత్ములు నాకుఁ బ్రియులు. మీవంటివారినిమిత్తమే నేను దేహమును ధరించి, యవతరించెదను. తదితరులు చెప్పినను, వారిమాటలను లక్ష్యముఁ జేయను.

దోహా 49

"ఓ సఖుఁడా! సగుణోపాసనఁజేయు సత్పురుషులును, న్యాయమార్గమున సంచరించువారును, బ్రాహ్మణచరణములను సేవించువారును, నాకుఁ బ్రాణప్రియులు.

చౌపాయ్

"ఓ లంకేశా! నీవు సకలగుణసంపన్నుఁడవు; కనుక, నాకుఁ బ్రియుఁడవు." ఈ ప్రకారము శ్రీరాముఁడు చెప్పినవచనములను వాన

రులు విని, జయజయశబ్దములఁ జేసిరి. శ్రీవారి యమృతోపమానమగు వచనములను విభీషణుఁడు విని, యపారమగు సంతోషముఁ బొందెను. ఆ సంతోష మగాధము. పునఃపునః, అతఁడు శ్రీవారిచరణములకు నమస్కరించి, యిట్లు ప్రార్థించెను. "ఓ దేవా! మీరు చరాచరజంతుజాలమున కధిపతులు; దీనదయాపరులు; సర్వాంతర్యాములు. మీ చరణారవిందములను దర్శించుటవలన, నా మనస్సులోనుండిన వాసనలు నశించెను; ఏకోరికలును నాకు లేవు. ఓ కృపాసాగరా! శివునకు మీయందుఁగల భక్తివంటి భక్తిని నాకుఁ బ్రసాదింపుము." అని విభీషణుఁడు ప్రార్థించెను. "తథాస్తు" అని శ్రీరాముఁడు పలికి, "సముద్రజలముఁ దీసికొని రండు" అని వానరుల కాజ్ఞాపించెను. "ఓ సఖుఁడా! నీవు నిష్కాముఁడవు; నాదర్శన మమోఘము; నిష్ఫలము గాఁగూడదు." అని శ్రీరాముఁడు పలికి, విభీషణుని లంకారాజ్యమున కభిషేకముఁ జేసెను. దేవతలు పుష్పములను వర్షించిరి; దేవదుందుభులు మ్రోఁగెను.

దోహా 50, 51

రావణుని క్రోధాగ్ని, శ్రీరాముని నిట్టూర్పులవలనఁ బ్రజ్వరిల్లెను. శ్రీరాముఁడు విభీషణున కఖండరాజ్యము నిచ్చెను. దశశిరములను ఛేదించుకొనుటవలన రావణునకు శివుఁడు సంపదలనిచ్చెను; కేవలము భక్తివలన విభీషణునకు శ్రీరాముఁడు శాశ్వతమగు సంపదల నిచ్చెను.

---

# షష్ఠవిశ్రామము.



చౌపాయ్

ఆహా! ఇంత భక్తవత్సలుఁడగు శ్రీరాముని భజనవిడిచి, భూతప్రేతపిశాచములను భజించువాఁడు తోఁకలేని పశువువంటివాఁడు. శ్రీవారు భక్తులను తనవారిగ భావించెదరు; శ్రీవారిస్వభావమును

వానరులు గ్రహించిరి. ఆ సర్వజ్ఞుఁడు, ఆ సర్వాంతర్యామి, ఆ ధర్మరక్షకుఁడు, ఆ రాక్షసాంతకుఁడు, ఆ మాయామానుజరూపధారి, శ్రీరాముఁడు సేనాధిపతులఁ జూచి, "ఓ కపీశా! ఓ లంకేశా! ఈ మహాగంభీరమగు సముద్రమునుదాఁటుట యెట్లు? అనేకసర్పములును, మత్స్యములును, కచ్ఛపములును, మకరములును దానిలోఁ గలవు; ఆసముద్రమపారము; గంభీరము కదా! దానిని దాఁటుట యెట్లు?" అని యడిగిరి. "ఓ నాథా! మీబాణము సముద్రములను శోషింపఁ జేయును. అయిన నొకమాటకలదు. సముద్రుని మీరు ప్రార్థింపుఁడు.

దోహా 52

"ఓ నాథా! సముద్రుఁడు మీ కులగురువు; సగరపుత్రులవలన నది పుట్టెను. మీ రతనిని బ్రార్థించుట యుత్తమము. ప్రయాసము లేకుండ వానరులు దాఁటుటకు మార్గము నతఁడే చెప్పును." అని విభీషణుఁడు చెప్పెను.

చౌపాయ్

"ఓ సఖుఁడా! నీవచనములు సత్యము. భగవంతుని కటాక్షము వలన, నది సమకూడిన లాభముగ నుండును." ఈ ప్రకారము శ్రీరాముఁడు చెప్పినమాటలు లక్ష్మణునకుమాత్రము సహ్యముగ నుండలేదు; అతనికి దుఃఖము కలిగెను. "ఓ నాథా! భగవంతుఁ డేమిచేయును? కోపించి, మీరు సముద్రమును శోషింపఁజేయుఁడు. పిఱికిపందలవలె నూరకుండుట మంచిపనికాదు. అలసులు 'దేవుఁడు, దేవుఁడ'ని చెప్పి, నిద్రించెదరు; ప్రయత్నమువలన సకలకార్యములు సిద్ధించును." ఈ ప్రకారము లక్ష్మణుఁడు చెప్పినవచనములను శ్రీరాముఁడు విని, నవ్వి, "ఓ తమ్ముఁడా! నీవు చెప్పినప్రకారమే జరగును. నీవు ధైర్యము నవలంబింపుము." అని తమ్ముని బోధించి, సముద్రతీరమునకు వెళ్లెను. ఆ తక్షణము శ్రీరాముఁడు దర్భాసనముపైఁ గూర్చుండి, సముద్రుని ధ్యానించుచుండెను. అంతలో రావణుఁడుపంపిన దూతను దీసికొని, విభీషణుఁడు శ్రీరామునివద్దకు వచ్చెను.

దోహా 53

ఆ శరణాగతవత్సలునియం దత్యంతానురాగము గలదు కనుక, నొకఁడు వానరరూపమును ధరించి, శ్రీవారిరూపమును ధ్యానించుచు వారి వృత్తాంతముఁ దెలిసికొనుటకు, వానరకటకమునకు వచ్చెను.

చౌపాయ్

బాహాటముగ వాఁడు శ్రీవారిగుణములను వర్ణించుచుండెను. ప్రేమచేత, మైమఱచి యుండెను; కనుక, సహజమగు వానిరాక్షసరూపము ప్రకటమయ్యెను. వాఁడు రావణునిదూతయని వానరులు తెలిసికొని, వానిని బంధించి, సుగ్రీవునివద్దకుఁ దీసికొనివచ్చి, "ఓ నాథా! వీఁడు రావణుని దూత; మీచిత్తము" అని విన్నవించిరి. "ఓ వానరులారా! వీని యంగములను ఛేదించి, పంపుఁడు" అని కపిరా జాజ్ఞాపించెను. ఆప్రకారము వానరులు వానిని బంధించి, వానరకటకము నలువైపులఁ ద్రిప్పిరి. అనేకప్రకారముల వానిని వారు బాధపెట్టిరి; వాఁడు మొఱ్ఱఁబెట్టుకొనినను, వారు వానిని విడిచిపెట్టక, హింసించిరి. "ఓయీ వానరులారా! రామునితోడు; మీరు నా ముక్కుచెవులను మాత్రము ఛేదింపకుఁడు" అని వాఁడు పలికెను. వానిమొఱ్ఱను లక్ష్మణుఁడు విని, వానిని రప్పించి, వానరులతోఁ జెప్పి, వానిని విడిచిపెట్టెను. లక్ష్మణుఁ డొకపత్రమును వ్రాసి వాని చేతికిచ్చి, వానితో నిట్లు పలికెను. "ఓరీ! ఈ యుత్తరమును రావణున కిచ్చివేయుము. ఈ నోటిమాటలను వానితోఁ జెప్పుము. 'ఓరీ కులఘాతకుఁడా! లక్ష్మణునిమాటలను విని, నీహృదయమును శాంతముఁ జేసికొనుము.

దోహా 54

"'నాసందేశమును బాగుగ విచారించి, ప్రవర్తింపుము. జానకిని శ్రీవారికి సమర్పింపుము. లేనియెడల, నీకాలము సమీపించెనని తెలిసికొనుము.'"

చౌపాయ్

వాఁడు లక్ష్మణునకు నమస్కరించి, శ్రీరామగుణములను గానముఁ జేయుచు వెడలెను. వాఁడు మరల లంకకు వచ్చి, రావణునకు నమస్క-

రించెను. "ఓరీ శుకసారణా! నీకు క్షేమమా! విభీషణునకు క్షేమమా! వానికి మృత్యువు సమీపించెను. యవధాన్యమునకుఁ బురుగుపట్టినట్లు, ఆ నిర్భాగ్యుఁడు లంకారాజ్యమును విడిచి, శత్రువు శరణుఁజొచ్చెను. ఆ వానరకటకవృత్తాంతముఁ జెప్పుము; విధికృతనువలన, వారికిసహితము మృత్యువు సన్నిహిత మయ్యెను. వారి జీవములను రక్షించుటకు సాగరుని చిత్తముసహితము కోమలమయ్యెను. ఆ తపశ్శాలులు, ఆ సోదరులవృత్తాంతముఁ జెప్పుము. నాభయము వారిగుండెలకుఁ బట్టినందున, వా రెల్లపుడు దుఃఖించుచుండిరి.

దోహా 55

"ఓరీ శుకా! ఎట్లు నీకు వారిదర్శన మయ్యెను? నా తేజోబలములను వారికి విన్నవించితివా? ఏమి నీచిత్తము వ్యాకులపడుచున్నది; శత్రువుల తేజోబలములను వర్ణించి పలుకవేమి?"

చౌపాయ్

ఈ ప్రకారము రావణుఁడు వాని నడిగెను; వాఁడు చేతులను జోడించుకొని, యిట్లు విన్నవించెను. "ఓ నాథా! మీరు కటాక్షించి, నాతో నెంతమృదువుగ సంభాషించితిరో, అటులనే, మీరు కోపమును విడిచి, నామాటలను మన్నింపుఁడు. ఎప్పుడు నీతమ్ముఁడు శ్రీరామునితో సఖ్యముఁ జేసికొనెనో, అప్పుడే నీతమ్మునకు శ్రీరాముఁడు లంకాపట్టణముఁ గట్టెను. నేను నీదూతనని తెలిసికొని, వానరు లనేకవిధముల నన్ను బాధించిరి. నేను రామునిమీఁద నొట్టుఁబెట్టినందున, నా ముక్కు-చెవులను ఛేదింపక, వారు నన్ను విడిచిపెట్టిరి. వేయిముఖములతో నయినను, నేనా వానరబలమును దళమునువర్ణించి, చెప్పఁజాలను. రంగురంగులవానరులును జాంబవంతులును కలరు; వారిం జూచినను, వారిరూపములఁ దలఁచినను, భయము కలుగును. నీకుమారునివధించి, నీపట్టణమునుదహించిన వానరుఁ డర్భకుఁడు; ఏపాటిబలము వానికిఁ గలదు? శ్రీరామప్రతాపమువలన నత్యల్పుఁడగు వానరుఁడుసహితము మహాబలవంతుఁ డయ్యెను; వాఁడు గొప్పకార్యములను సాధింపఁగలఁడు. అనేకనామములుగల వానరయోధులు కలరు. అనేకవేల యేనుగులబల మొక్కొక్కనికిఁ గలదు.

దోహా 56

"ద్వివిద - మైంద - నీల - నల - అంగద - వికట - దధిముఖ - కేహరి - కుముద - గజ - గవాక్ష - జాంబవంత— ఈ మహాబలులు సేనాధిపతులు.

చౌపాయ్

"వారు సుగ్రీవునితో సరిసమానబలవంతులు. ఇంకను వారితో సమానులగు వీరులు కోట్లుకోలందికలరు; ఎవరు వారిని లెక్కపెట్టఁ గలరు? శ్రీరామునికృపవలన, వారతులిత పరాక్రమవంతులు; తృణమువలె, మూఁడులోకములను జయింపఁగలమని వారు పలుకుచుండిరి. ఓ రావణా! వారు పదునెనిమిదిపద్మముల వానరులని వినియుంటిని; వారికి వేర్వేఱుసేనాపతులు కలరు; వారిని వర్ణించిచెప్పుటకు శక్యము కాదు. ఓ నాథా! యుద్ధములో నిన్ను జయింపలేనని యధైర్యపడిన వానరుఁడొకఁడు వారిలోఁ గనబడఁడు. నీపట్టణముపై దుముకుటకు, వారు సిద్ధపడి, చేతులను నులుపుకొనుచుండిరి; ఇంతవఱకు శ్రీవారి యుత్తరువు లేదు. మీనమకరములతోఁ గూడినసముద్రుఁడు మార్గము నిచ్చినను లేకపోయినను, వారు సముద్రమును పాషాణములతోఁ గట్టి, వారికార్యమును సాధించుటకు సిద్ధముగ నుండిరి. రావణునిమర్దించి, చూర్ణముఁ జేయఁగలమని వానరులు పలుకుచుండిరి. వారి గర్జనలను, వారి వీరాలాపములను వినిన భయముకలుగును. వారు నిర్భయులు; వారు లంకానగరమును భక్షించుటకుఁ గోరుచుండిరి.

దోహా 57

"ఓ నాథా! స్వాభావికముగ, వానరభల్లూకములు ఒక్కొక్కరె మహాశూరులు; అందులకుఁదోడు, వారికి రాముఁడు యజమానుఁడు. కోటికాలాంతకులను వారు మ్రింగగలరు; నీమాటఁ జెప్పనేల?

చౌపాయ్

"ఓ రావణా! శ్రీరాముని తేజోబలములను బుద్ధిని, శతసహస్ర శేషులుసహితము వర్ణించి చెప్పలేరు. ఒకబాణముతో నతఁడు సముద్రమును శోషింపఁజేయుటకు సిద్ధపడెను; అయినను, నీతమ్ముఁడు చెప్పి

నప్రకార మతఁడు సముద్రునిఁ బ్రార్థించెను. సీతమ్మునిమాట ననుసరించి, యతఁడు కృపాలుఁడు కనుక, మార్గముఁజేయుమని సముద్రుని వేడుకొనెను." ఈప్రకారము శుకసారణుఁడు చెప్పిన వచనములను రావణుఁడు విని, పక్కున నవ్వెను. "ఓరీ! అతఁ డింతబుద్ధిమంతుఁడా! అతనిసైనికులు వానరులా! మా విభీషణుఁడు పిఱికిపంద; వానిమాటలను విని, యతఁడు సముద్రునిఁ బ్రార్థించునా! ఓరీ మూర్ఖుఁడా! నీ బకవాదముఁ జాలింపుము; చాలు, చాలు; ఇంతబలవంతుఁడా రాముఁడు; ఇదివఱకు నేను వాని బలమునుగుఱించి వినియుంటిని. మా విభీషణునివంటి పిఱికిపంద మంత్రియైయుండినపుడు శ్రీవిజయ విభూతులు శ్రీరామునకు లభింపవు" ఈప్రకారము రావణుఁడు పలికినపలుకులను సారణుఁడు విని, కోపమువచ్చినను, శాంతముఁ జేసికొని, లక్ష్మణుఁడు వ్రాసియిచ్చినయుత్తరము జూపించెను. "ఓ నాథా! ఈ యుత్తరమును లక్ష్మణుఁడు మీపేర వ్రాసియుండెను. మీరు కొంచెము శాంతింపుఁడు." అని చెప్పి, సారణుఁ డుత్తరమును రావణునిచేతిలోఁ బెట్టెను. రావణుఁడు నవ్వుచు, దానినిఁగైకొని, మంత్రిచేతిలోఁ బెట్టి, చదువమనెను. మంత్రి యుత్తరముఁ జదువుచుండినపుడు, నిర్లక్ష్యముగ వాఁడు దానిని వినెను.

దోహా 58, 59

"ఓరీ మూర్ఖుఁడా! పెక్కుమాటలవలనఁ బ్రయోజనము లేదు; నిష్కారణము నీవంశమును నాశముఁ జేయకుము. నీవు రామునితో విరోధించి, త్రిమూర్తుల శరణుఁజొచ్చినను, నిన్నుద్ధరించువారు లేరు. విభీషణునివలె, నీవు శ్రీరాముని సమీపించి, తుమ్మెదవలె, వారి చరణకమలముల నాశ్రయింపుము. ఓరీ మూర్ఖుఁడా! అగ్నిలోఁబడి, పతంగములు చనిపోవును; అట్లు, రాముని బాణాగ్నిలోఁబడి, నీవును నీ పరివారమును చచ్చుట మంచిది కాదు."

చౌపాయ్

ఈ యుత్తరమును విని, రావణుఁడు లోలోన భయపడెను; బాహాటముగ వాఁడు నవ్వి, సభికులతో నిట్లు ప్రసంగించెను. "ఓయీ!

రాక్షసులారా! చూడుఁడు; లీతువపిట్ట తనపిల్లలను రక్షించుటకుఁ బాదములను మీఁదికెత్తి యాకాశముఁ బడకుండఁ గాపాడును. ఈత పక్షులులు ఈ యర్భకులు మాటలతో నన్ను బెదరించుచుండిరి; మాటలతో నన్ను జయింపఁగలరా?" "ఓ నాథా! ఇదియంతయు సత్యము; ఆయుత్తరములో వ్రాయఁబడినసంగతులను లెస్సగవిచారించి, నీ యభిమానమును విడిచిపెట్టుము. కోపమును విడిచి, నామాటను మన్నింపుము; శ్రీరామునితో వైరముఁ జాలింపుము. అతనిస్వభావ మతికోమలము. అతఁడు త్రిలోకాధిపతి; నీవు వారిని సమీపించినయెడల, నతఁడు నిన్ను రక్షించును; నీ యపరాధముల నతఁడు మఱచిపోవును. జానకిని యతనికి సమర్పింపుము. నా విన్నపమును మన్నింపుము. అని శుకుఁడు చెప్పినమాటలను రావణుఁడు విని, పాదముతో వానినిఁ" దన్నెను. వాఁడు వాని చరణములకు నమస్కరించి, శ్రీరామునివద్దకు వెళ్లెను. వాఁడు శ్రీరామునకు నమస్కరించి, స్వవృత్తాంతము నతనికి విన్నవించి, యతనికృపవలన సద్గతిఁ బొందెను. ఓ పార్వతీ! పూర్వ మొకఋషికలఁడు; అతఁడు మహాజ్ఞాని; అగస్త్యుఁడొకనాఁడు అతని యాశ్రమమునకు వచ్చెను. అతిదురభిమానముచేత నగస్త్యుని యతఁడు నిరాదరించెను; అగస్త్యునిశాపమువలన, నతఁడు రాక్షసుఁడై పుట్టెను; ఈనాఁటికతనికి శాపవిమోచనమయ్యెను. అతఁడు శుకసారణుఁడై పుట్టెను. అతఁడు శ్రీరామునకు నమస్కరించి, శాపవిముక్తుఁడై, స్వస్థానమునకు నిష్క్రమించెను. ఆవలివృత్తాంతమును వినుము.

దోహా 60

సముద్రుఁడు జడస్వభావుఁడు; శ్రీరామునిప్రార్థనను మన్నింపలేదు. శ్రీరాముఁడు మూఁడుదినములు దివారాత్రములు దర్భాసనము పైనుండి, జడునిఁ బ్రార్థించెను. శ్రీరాముఁడు ప్రకృతిపురుషుఁడని సముద్రుఁడు భావించి, ప్రసన్నుఁడు కాలేదు. అందుచేత శ్రీరామునకుఁ గోపమువచ్చెను. భయముండినగాని, యనురాగ ముండదు. - - - -

చౌపాయ్

"ఓ తమ్ముఁడా! ధనుర్బాణములఁ దీసికొనిరమ్ము. అగ్నిబాణముచే సముద్రుని శోషింపఁజేయుదును. మూర్ఖులకు వినయమును,

కుటిలస్వభావులకుఁ బ్రీతియు, స్వాభావికకృపణులకు నీతిబోధనలును, మమకారముఁగలవారికి జ్ఞానమును, లోభులకు వైరాగ్యమును, కోప స్వభావులకు శాంతమును, కామాతురులకు హరికథలును, ఊషర క్షేత్రములో బీజములఁ జల్లినవిధమున, వ్యర్థములు." ఈప్రకారము శ్రీరాముఁడు పలికి, ధనస్సునెక్కుపెట్టి, బాణమును సంధించెను. శ్రీరాముని కోపముఁజూచి, లక్ష్మణుఁడు భయపడెను. శ్రీరాముఁడు బాణమును సంధించునప్పటికి, సముద్రునకు గుండెలలో వేడి పుట్టెను. మీన మకరములు మొదలగునవి వ్యాకులపడెను. జలము శోషించునని సముద్రుఁడు భయపడెను. అభిమానమును విడిచి సముద్రుఁడు బ్రాహ్మణరూపమును ధరించి, బంగారుపళ్లెరములో నవరత్నముల నుంచి, రాముని వద్దకు వచ్చెను.

**దోహా 61**

ఓ గరుడా! అరటిచెట్టుఁ గొట్టి, దానిగెలఁ దీసినగాని, యది పండదు; అటులనే, నీచులను దండించినగాని, వారికి బుద్ధికలుగదు.

**చౌపాయ్**

సముద్రుఁడు వచ్చి, శ్రీరామునిచరణములకు నమస్కరించి, ప్రార్థించెను. "ఓ నాథా! నా యవగుణములను క్షమింపుఁడు. పంచభూతములును స్వాభావికముగ జడములు. ఓ ఈశ్వరా! మీ మాయవలన, నవి పుట్టెను. వానిని మీమాయ సృజించెనని సద్గ్రంథములు చాటుచుండును. ఏభూతములు మీయాజ్ఞను మన్నించునో, వానికి క్షేమము కలుగును. నావంటి జడులనుశిక్షించుట, మీకుఁ దగినపని; ప్రథమమున మీరు నా మర్యాదనాలోచించి, ప్రార్థించినపుడు, నేను మీప్రార్థనను మన్నింపనందులకు, మీరు నాకుఁ దగినశాస్తిఁ జేసితిరి. ఓ రాజాధిరాజా! డోలును, మూర్ఖులును, శూద్రులును, స్త్రీలును, పశువులును దండనార్హులు. నేను ప్రభువువారి యాజ్ఞప్రకారమెండి, మార్గము నిచ్చెదను; కాని, దానివలన నాకు గౌరవము లేదు. ఓ నాథా! మీయాజ్ఞ అమోఘమని వేదములుచెప్పును; మీ చిత్తానుసారము ప్రవర్తించెద."

దోహా 62

ఈప్రకారము వినయవిధేయతలతో రత్నాకరుఁడు పలికినవచనములను శ్రీరాముఁడు విని సంతసించి, మందహాసముఁ జేసి, "ఓ సాగరుఁడా! వానరసైన్యము దాఁటుటకుఁ దగినయుపాయనుఁ జేయుము." అని యాజ్ఞాపించెను.

చౌపాయ్

"ఓ నాథా! మీ కటకములోన, నలనీలులని యిరువురు సేనాపతులు కలరు. చిన్నతనములో వారికి మునిశాపముఁ దగిలెను; ఆశాపమిప్పుడు మన కాశీర్వచన మయ్యెను. (అధికపాఠము) నదీతీరమున ఋషులయాశ్రమము కలదు. చిన్నతనములో వీరా ఋషులు తపముఁ జేయుచుండినపుడు, వారి సాలగ్రామముల నపహరించి, వానిని నీటిలో విసరివేయుచుండిరి. అప్పుడు ఋషులు కోపించి, వారిని శపించిరి. 'ఓయీ బాలకులారా! మీరు నీటిలోవేయుచుండిన వస్తువులన్నియు నీటిపైఁ దేలి, కదలకయుండుఁగాక. నీరు ప్రవహించుచుండినను, మీ వస్తువులు మాత్రము నీటిపైఁ దేలి నిలకడగనుండుఁగాక' అని శపించిరి. (అధిక పాఠము సమాప్తము.) మీ ప్రతాపమువలన వారు నీటిలోవేయుచుండిన గొప్పగొప్పపర్వతములు తేలియుండును. మీపరాక్రమమును స్మరించి, నా శక్త్యనుసారము నేను సహాయముఁ జేయువాఁడను. ఓ మహారాజా! ఈప్రకారము నన్ను బంధించినయెడల, మీకీర్తి మూఁడులోకములలో వ్యాపించును. మీబాణ మమోఘము కనుక, నా యుత్తరతీరముననుండిన కిరాతులపై దానినిఁ బ్రయోగింపుఁడు." ఈప్రకారము సముద్రుఁడు విన్నవించెను. ఆకిరాతులవలన సముద్రునకుఁ గలిగినభయమునుఁ బోఁగొట్టుటకు శ్రీరాముఁ డాబాణమును వారిపైఁ బ్రయోగించెను. ఆ బాణప్రభావమువలన, నాప్రదేశము జలశూన్యమయ్యెను. అప్పుడు శ్రీరాముని కటాక్షమువలన, నాప్రదేశము ప్రకృతిసంపదలతో నిండెను. శ్రీరాముని యతులితప్రతాపముఁ జూచి, సాగరుఁడు ప్రసన్నుఁడై, సంతోషించెను. అతఁడు రావణునిగృహచరిత్రమును శ్రీరామునకు విన్నవించి, నిష్క్రమించెను.

ఛాంద్ 16

ఆసరిత్పతి స్వగృహమునకు వెళ్లెను. అతనిమాటలను శ్రీరాముఁడు మన్నించెను.

ఈచరిత్రమును యథామతి తులసీదాసు వ్రాసెను. ఈచరిత్రముఁ జదివినందున, సకలసుఖములు కలుగును. సంశయములు నశించును; తాపత్రయములు విడిపోవును. ఈచరిత్రములో శ్రీరాముని గుణములు వర్ణింపఁబడెను. స్వగృహమునకు వెళ్లి, జడనిధి సంతసించిన విధమున, నీరామకథఁ జదివినవారును వినినవారును సుఖింపఁగలరు. ఏవిధమునఁ గిరాతులు నశించిరో, సంసారసంకటము లావిధమున నశించును. నిష్కామ్యముగ గ్రంథమును చదివినవారును వినినవారును సంసారసాగరమును దాఁటి, రామసాయుజ్యముఁ బొందఁగలరు.

దోహా 63

సకల సుమంగళ దాయక
రఘునాయక గుణ గాన,
సాదర సునహిఁ తే తరహిఁ భవ
సింధు బినా జలయాన.

సుందరకాండము సంపూర్ణము.

---

శ్రీ మద్గోస్వామి

# తులసీదాసకృతరామాయణము

## లంకాకాండము.



### ప్రథమవిశ్రామము.

శ్లో. రామం కామారిసేవ్యం భవభయహరణం కాలమత్తేభసింహం
యోగీంద్రం జ్ఞానగమ్యం గుణనిధిమజితం నిర్గుణం నిర్వికారమ్,
మాయాతీతం సురేశం ఖలవధనిరతం బ్రహ్మబృందైకవేద్యం
వందేకందావదాతం సరసిజనయనం దేవముర్వీశరూపమ్.

శ్లో. శంఖేంద్వాభమతీవసుందరతనుం శార్దూలచర్మాంబరం
కాలవ్యాళకపాలభూషణధరం గంగాశశాంకప్రియమ్,
కాశీశం కలికల్మషౌఘశమనం కల్యాణకల్పద్రుమం
నౌమీడ్యం గిరిజాపతిం గుణనిధిం శ్రీశంకరం కామదమ్.

శ్లో. యో దదాతి సతాం శంభుః కైవల్యమపి దుర్లభమ్,
ఖలానాం దండకృద్యోఽసౌ శంకరశ్శం తనోతు మే.

**దోహా 1**

ఓ మనసా ! శ్రీరాముని భజింపుము ; శ్రీరామునకు మహాయుగములే, నిమిషములు ; మహాకల్పములే, సంవత్సరములు ; ఈ మహాకాలమే, అతని కోదండము ; మహాకల్పములే, అతని బాణములు ; అట్టి మహావీరుఁడగు శ్రీరాముని సదా సేవింపుము.

**సోరఠా 1, 2**

సముద్రుఁడు చెప్పిన వచనములను శ్రీరాముఁడువిని, మంత్రులఁ బిలిచి, "విలంబనమేల ? శీఘ్రము సేతువుఁగట్టుటకుఁ బ్రయత్నింపుఁడు; అప్పుడు మనవానరసైన్యములు సముద్రమును దాఁటఁగలవు" అని వారితోఁ బలికెను. "ఓ ఇనవంశోత్తమా ! రామా ! మీ నామమే

యొక సేతువు; దానిమూలమున, జీవులు సంసారసాగరమును దాఁటు చుండిరికదా!

చౌపాయ్ 1

"ఈ యల్పసాగరమును దాఁటుట యెంతసులభము" అని యంజలిఘటియించి జాంబవంతుఁడు విన్నవించెను. "ఓనాథా! మీ ప్రతాపమనునట్టి బడబాగ్నిచే, నీసముద్రము ప్రథమమున శుష్కించెను; యుద్ధములో మీరు సంహరించిన శత్రువుల భార్యలు దుఃఖించినందున, వారికన్నీటిచే, నీసముద్రము మరల నింపఁబడెను; అందుచేత దాని జలము లుప్పగనుండును"అని చేతులను జోడించుకొని, హనుమంతుఁడు విన్నవించెను; అప్పుడు శ్రీరామమూర్తి మహావీరుని వచనములను విని, వానరులఁజూచి, చిఱునవ్వునవ్వెను. అంతట జాంబవంతుఁడు నలుని నీలునిఁ బిలిచి, సముద్రుఁడు చెప్పిన మాటలను వారికిఁ జెప్పి, "ఓ వీరులారా! శ్రీరామస్వామిని ధ్యానించి, సేతువుఁగట్టనారంభింపుఁడు; ఏపాటి శ్రమము మీకుఁ గలుగదు." అని వారిరువురను హెచ్చరించెను; పిమ్మట నతఁడు వానరులఁజూచి, "ఓ వానరులారా! నావిన్నపము నాలకింపుఁడు; శ్రీరాముని చరణకమలములను ధ్యానించినయెడల, నీపనియంతయు వినోదముగ నుండును; ఓవీరులారా! వృక్షములను బర్వతములను మీరు తీసికొనిరండు" అని వారి నుత్సహించెను. "రఘునాథజీకీ జయ్! రామప్రతాపకీ జయ్" అని వానరులును జాంబవంతులును బొబ్బలిడి, గంతులువేయుచు, నలువైపులఁ బరుగిడిరి.

దోహా 2

అతిలీలగ, గొప్పగొప్ప వృక్షములను పర్వతములను వారు నిరాయాసముగఁ దీసికొనివచ్చిరి; వానిని నలనీలులు విలాసముగఁ గైకొని, చక్కని సేతువుఁగట్టిరి.

చౌపాయ్ 2 (అధికపాఠము)

నలుఁగడలకు వానరులు పరుగెత్తి, మహాపర్వతములను, బంతులవలె దీసికొనివచ్చిరి; ప్రథమదినమున పదునాలుగు యోజనములును, రెండవదినమున నిరువది యోజనములును, మూడవదినమున నిరువది

యొక యోజనములును, నాల్గవదినమున నిరువదిరెండును, అయిదవ దినమున నిరువదిమూఁడు యోజనములు. మొత్తము నూరుయోజనములు నయిదు దినములలో నలుఁడును నీలుఁడును కట్టిరి. ఒకయొడ్డు నుండి మఱియొక యొడ్డువకు నూరు యోజనముల సేతువును వారు కట్టిరి; సేతువుఁగట్టుట సమాప్తమయ్యెనని శ్రీరామచంద్రుఁడు విని, సంతసించి, "ఓ వానరులారా! ఇఁకమీరు పర్వతములఁ దీసికొని రావలదు; విలంబనముఁ జేయకుఁడు" అని యాజ్ఞాపించెను. ఆసమయమున హిమవత్పర్వత శృంగము నొకదానిని హనుమంతుఁడు తీసికొనివచ్చుచుండెను. అతఁడు శ్రీరామాజ్ఞను విని, ఆశిఖరమును బృందావనము వద్దనుంచెను.

దోహా

శ్రీరామాజ్ఞాప్రకారము మహావీరుఁడు పర్వతశిఖరమును బడవేసెను; అదియే గోవర్ధనపర్వతము, ఆపర్వతము బ్రాహ్మణరూపమును ధరించి, "ఓమహావీరుఁడా! నన్ను రామునివద్దకుఁ దీసికొనివెళ్లెదనని చెప్పియుంటివి.

చౌపాయ్ 3

"రామునిఁ జూచుటకు నాకభిలాషకలదు; ఇట్లు నను విడుచుట నీకుచితముకాదు;" అని మొఱఁబెట్టుకొనెను. హనుమంతుఁడు దానిని బోధించి, శ్రీరాముని వద్దకువచ్చి, దాని వృత్తాంతమంతయు వారికి విన్నవించెను. "ఓ మహావీరుఁడా! ద్వాపరాంతమున మాదర్శనము దానికి లభించునని చెప్పుము" అని రాముఁడు చెప్పెను; శ్రీరామమూర్తిమాంట నతఁడు పర్వతశిఖరమునకుఁ దెలియఁజేసెను; అది సంతోషముచే నుప్పొంగెను. అందుచేత నా పర్వతము నేడుదినములవఱకు శ్రీరాముఁడు పట్టుకొని యుండెను. దాని మహిమ మూఁడులోకములలో వ్యాపించెను. (అధికపాఠము సమాప్తము.)

మహాపర్వతములను వానరులు తీసికొనివచ్చిరి; నలుఁడును నీలుఁడును, బంతులవలె, వానినిఁ గైకొనిరి. ఆసేతువును వారు చక్కఁగఁ గట్టిరి; శ్రీరాముఁడు దానింజూచి సంతోషించెను. "ఓయీ వానరులారా! ఈ ప్రదేశము మహారమణీయముగ నుండినందున, దానిని వర్ణించి చెప్పుట శక్యముకాదు. ఇచ్చట శివలింగముఁ బ్రతిష్ఠించుటకు

సంకల్పించితిని " అని శ్రీరాముఁడు పలికెను. (శివలింగముఁ బ్రతిష్ఠించుటకుఁ గారణమేమి? రావణుఁడు శివపూజాధురంధరుఁడు; వానిని సంహరించుటకు శ్రీరాముఁడు నిశ్చయించెను; శివునకుఁ గోపము రాకుండునట్లు, రాముఁడు శివలింగముఁ బ్రతిష్ఠించెను.) ఆవెంటనే, సుగ్రీవుఁడు వానరుల నిరువురఁ బిలిచి, వారని మునీశ్వరులఁ దీసికొని వచ్చుటకుఁ బంపెను. వేదోక్తప్రకారము, మునీశ్వరులు చూచుచుండ, శివలింగమును స్థాపించి, శ్రీరాముఁడు దానికిఁ బ్రాణప్రతిష్ఠఁ జేసి, షోడశోపచారములతోఁ బూజించెను. " ఓ సభ్యులారా! శివునికంటె ప్రియుఁడు నాకు మఱియొకరు లేరు; నాదాసుఁడనని ప్రగల్భములఁ బలికి, శివునకు ద్రోహముఁ జేసినవానికి, స్వప్నమందయినను, నాకటాక్షము కలుగదు. నాభక్తుఁడైనను శివునియందు విముఖుఁడయినయెడల, వాఁడు బుద్ధిహీనుఁడు. అందులకు సందేహము లేదు.

దోహా 3

" శైవుఁడై, వైష్ణవద్రోహి అయినను, వైష్ణవుఁడై శివద్రోహి అయినను. వాఁడు ఘోరనరకముఁ బొందును.

చౌపాయ్ 4

" శ్రీరామేశ్వరుని సందర్శించి, ప్రాణములను విడిచినజీవుఁడు, నాలోకముఁ బొందును. శ్రీరామలింగేశ్వరుని గంగానదీ జలములతో నభిషేకముఁ జేసినవారికి సాయుజ్యముక్తి లభించును. నిష్కామముగను నిష్కపటముగను శ్రీసాంబశివుని సేవించినయెడల, శ్రీశివునికటాక్షమువలన, వారికి నాభక్తి కలుగును. ఈ మేముకట్టించిన సేతువుఁ జూచిన వారికి మాలోకము సంప్రాప్తమగును." అని శ్రీరామమూర్తి శ్రీరామలింగేశ్వరమాహాత్మ్యమును వారితోఁ బ్రసంగించెను. మునీశ్వరులును వానరులు నామాహాత్మ్యమును విని సంతసించిరి.మునీశ్వరులు వారివారి యాశ్రమములకు నిష్క్రమించిరి. ఓ పార్వతీ! వినుము; శ్రీరామునియందొక ధర్మముకలదు; తనదాసులపై నతనికి విశేషప్రేమ కలదు. శ్రీరాముని కృపవలన, నలనీలులు సేతువుఁగట్టిరి; వారికీర్తి దిగంతములకు వ్యాపించెను. పాషాణములు నీటిలోమునిఁగి పోవును; వానితోఁగూడిన పదార్థములు కూడ మునిఁగిపోవును; అట్టిపాషాణములు

పడవలవలె, నీటిపైఁదేలియుండెను. సముద్రుని ప్రభావమువలనఁగాదు; వానరుల ప్రభావము కాదు; పాషాణముల ప్రభావము కాదు.

దోహా 4

శ్రీరాముని ప్రభావమువలన, నాపాషాణములు నీటిపైఁ దేలి యుండెను. ఇంత ప్రభావముగల శ్రీరామప్రభువును విడిచి, తదితర స్వాములను సేవించువారికంటె మూర్ఖులు కలరా?

చౌపాయ్ 5

వారు సేతువును దృఢముగఁగట్టిరి; దానింజూచుట నేత్రోత్సవము; శ్రీరాముఁడు దానింజూచి, సంతోషించెను. వానరసైన్యములును, వానరయోధులును, సింహనాదములఁ జేయుచు సేతువుపై నడచిరి. ఆవానరపటాలముల యొయ్యారముఁ జెప్పుటకు శక్యముకాదు. అప్పుడు శ్రీరామమూర్తి సేతువుపైకివచ్చి, మహాసముద్రముఁ జూచెను. ఆకరుణాసముద్రుఁడగు శ్రీరామునిఁ జూచుటకు జలచరములనేకములు జలముపైఁ దేలి యుండెను; మత్స్యములు, మీనములు, కమఠములు, తిమితిమింగిలములు, సర్పములు, నక్రములు, తదితర జలచరములు, వారివారి సహజవైరమును విడిచి, యొకరిప్రక్క నొకరు నిలిచి, రామునిఁ జూచుచుండిరి; కంబళము పఱచినట్లు, జంతువులన్నియు నీటిపై దేలియుండెను; అందుచేత, జలములు కనఁబడలేదు; అవియన్నియుఁ దదేకదృష్టితో, శ్రీరామునిఁ జూచుచుండెను. కోట్లు, అర్బుదములు, నిర్బుదముల కొలది వానరపటాలములు నడచెను; వానిని లెక్కించుటకు శక్యముకాదు.

దోహా 5

జలసాగరమును, సంసారసాగరమును దాఁటుటకు మూఁడు మార్గములుకలవు; "కర్మ, ఉపాసన, జ్ఞాన" అని మూఁడుమార్గములు; సేతువుపై నడచి వెళ్లినవానరులు, కర్మకాండ ననుసరించినవారితో సమానులు; నీటిపైఁదేలి యుండిన జలచరములపై నడచినవారు, ఉపాసకులతో సమానులు; అంతరిక్షమున కెగిరి వెళ్లినవారు, జ్ఞానులతో సమానులు. ఒకఫలమే, యీత్రిమతస్థులకు లభించును; శ్రీరాముని కటాక్షము, భక్తిస్వరూపమగు జానకిని దర్శించుటయు, మోహాదులను రావణుని నాశనము. ఇవియే దానిఫలము.

చౌపాయ్ 6

ఆయిరువురన్నదమ్ము లాచమత్కారముఁ జూచి, చిఱునవ్వు నవ్విరి; వారుకూడ బయలువెడలిరి; వానరపటాలములును, వానర యోధులును, వారియొయ్యారమును, వారి బింకమును వర్ణింపఁజాలను. ఈ మొదలగు వారితోఁ గూడి శ్రీరాముఁడు సముద్రమును దాఁటి లంకలోఁ బ్రవేశించెను. ఒకశిబిరము నేర్పఱచి, దానిలో వారిరువురు నిలిచిరి; "ఓయీ వానరులారా! కందమూలములను, ఫలములను మీ స్వేచ్ఛానుసారముగ భుజింపుఁడు" అని శ్రీరామమూర్తి యాజ్ఞాపించెను. శ్రీరామాజ్ఞఁగైకొని, వానరులు గంతులు వైచుచుఁ, బరుగెత్తిరి. శ్రీవారినిమిత్తము, వృక్షములన్నియు, కాలము అకాలము అనువిచక్షణలేక, ఫలములతో నిండియుండెను. ఆఫలములనే వానరులు భుజించిరి; ఆవృక్షములను వారు కదలించిరి. వృక్షములను పాషాణములను వారు లంకలోనికి రువ్విరి; ఒంటరిగఁ దిరుగుచుండిన రాక్షసుఁడు వారిచేతికి దొరికినయెడల, వారు వానిని యాడించుచుండిరి. వారు వాని ముక్కుచెవులఁ గోఱుకుచుండిరి; రామునితో సమానుఁడగు ప్రభువులేఁడని వాఁడు చెప్పినయెడల, వారు వానిని విడిచిపెట్టుచుండిరి. ఈవిధమున వానరులచేఁ బరిభవమునొందిన రాక్షసులు రావణునివద్దకువచ్చి, సేతుబంధనమును, వానరుల దాడియు, శ్రీరాముని యాగమనము నీ మొదలగువృత్తాంతమును రావణునకు విన్నవించిరి. ఆవృత్తాంతమును రావణుఁడు విని దిగులుపడి, దిగ్గునలేచెను. (వానికి దశముఖములుండినను వాఁ డొక్కముఖముతో మాటలాడును; ఇప్పుడు వాఁడు రాక్షసులమాటలను విని, కోపించి, పలుకుట కారంభింప, దశముఖములనుండి మాటలు వెడలెను. ఇది యశుభము.)

దోహా 6

"జలనిధి, నీరనిధి, జలధి, సింధు, వారీశ, తోయనిధి, కంనిధి, ఉదధి, నదీశ-సముద్రుఁడు బంధింపఁబడెనా! ఇదిసత్యమే?" అని రావణుఁడు చారులనడిగెను. వాఁడు పదిముఖములతో నుచ్చరించునపుడు వానికి మృత్యువు సమీపించునని వానికి శాపముకలదు. వాఁడా శాపమును స్మరించి, కొంచెము దిగులుపడి, "ఛీ! శాపము నన్నేమిచేయును;

ఇది నామనోభ్రాంతియేకాని, మఱియొకటికాదు” అని తనలోఁ దాను బోధించుకొనెను.

చౌపాయ్ 7

ఈవ్యాకులముచే వానిమనోస్వాస్థ్యము చెడిపోయెను; అందుచేత నంతఃపురములోనికి వాఁడు వెళ్లెను. (అథవా, వానిమనోవ్యాకులమును రాక్షసమంత్రులు మొదలగువారు చూచి, దిగులు పడఁగలరని తలఁచి, వాఁడు గృహములోనికి వెళ్లెను. అథవా, వానరులు వచ్చి ముక్కు-చెవులఁ గోయుదురని భయపడి, వాఁడు గృహములోనికి వెళ్లెను.) అవలీలగా శ్రీరాముఁడు సముద్రముపై సేతువుఁగట్టించి, వానరసైన్యములతో నతఁడు లంకలోఁ బ్రవేశించెనని, మందోదరి వినెను. అంతలో నామె అంతఃపురములో రావణునిఁ జూచెను; వాని రూపరేఖావిలాసములఁ బట్టి, వాని మనోవ్యాకులము నామె గ్రహించెను వానికి హితోపదేశముఁ జేయుటకు మంచిసమయము దొరకినందులకు మందోదరి సంతోషించి, వానిహస్తములఁ బట్టుకొని, లోనికిఁ దీసికొనివెళ్లి, మృదుమధురవచనములతో నిట్లు వానితోఁ బ్రసంగించెను: “ఓ నాథా! కోపమును విడిచి, నామాటలను సావధానముగ విని, వానిని మన్నింపుము. ఎవరిని బుద్ధిచేతను, బలముచేతను జయింపఁగలమో, వారితో విరోధించిన శ్రేష్ఠము; కాని, మీకును రామునకు నెంత యంతరము కలదు? సూర్యునకును ఖద్యోతమునకు నెట్టియంతరమో చూచితిరా? ఆమహాబలుఁడు, ఆశ్రీరాముఁడు, మధుకైటభులను సంహరించెను; హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను వధించెను; అతఁడే బలిచక్రవర్తిని బంధించెను; అతఁడే సహస్రబాహువులుగల కార్తవీర్యార్జునుని గర్వము నపహరించెను; ఇరువది భుజములుగల మీ రెంతవారు? ఆపరమేశ్వరుఁడు, ఆలోకారాధ్యుఁడు, ఆకృపానిధి, ఆభక్తవత్సలుఁడు, భూభారమును హరించుటకు రాముఁడై యవతరించెను. అతనితో విరోధముఁ జాలింపుము; ఓనాథా! సర్వమును భక్షించుకాలమును, చరాచరజంతుజాలమును బంధించు కర్మమును, గుణము నతనిచేతులలో నుండును; కనుక, నట్టి ప్రభువుతో విరోధముకూడదు; అది మనకు శ్రేయస్సుకాదు.

దోహా 7

"జానకిని శ్రీరామునకు సమర్పింపుము; అతని చరణారవింద ములకు నమస్కరించి, నీ కుమారునకుఁ బట్టముఁగట్టుము. వనములకుఁ బోయి మనము రఘునాథుని ధ్యానించెదము.

చౌపాయ్ 8

"ఓనాథా! దీనులంజూచిన యెడల, శ్రీరాముని మనస్సు జాలిఁ బడును; అతఁడు శరణాగతులను రక్షించును; వ్యాఘ్రమున కెదురుగ నిలువఁబడియుండిన, నదిమనుజుని సంహరించి, భక్షింపదా? చేయఁ దగిన సమస్తకార్యములను నీవు సానుకూలముగ నొనరించితివి; అవశిష్టములు లేవు; చరాచరములతోఁ గూడిన మూఁడు లోకములను జయించితివి; ఇంద్రాది దిక్పతులు సహితము నీకు జోహారు వనుచుండిరి. ఈ పని తగును; ఈపని తగదు అనువిచక్షణలేక, నీ వన్నిపనులఁ జేసియుంటివి; ఓ స్వామీ! వార్ధకదశలో, రాజ్యమును గుమారున కప్పగించి, రాజు వనమునకుఁ బోయి తపముఁ జేయుట యుచితమని వేదములు చెప్పుచుండును. ఆప్రణతార్తిహరుని, ఆసృష్టిస్థితిసంహారకర్తను, సదా ధ్యానముఁ జేయుము; మమకారమును, అభిమానమును విడిచి, నిష్కపటముగ, భక్తిశ్రద్ధలతో నతనిని సేవింపుము; అతనినిమిత్తమే మునిశ్రేష్ఠులు కోటియత్నములఁ జేయఁగలరు; అతని నిమిత్తమే, రాజులు రాజ్యములను విడిచి, విరాగులై సంచరించెదరు. ఆపరబ్రహ్మమే, ఆపరమేశ్వరుఁడే కోసలాధిపతి; అతఁడే శ్రీరాముని రూపమున స్వయముగ నిన్నుఁ గటాక్షించుటకు నీనగరమునకు వచ్చెను; నీపుణ్యమువలన, నతని దర్శనము నీకు లభించెను; ఓ నాథా! నామాటలను మన్నింపుము; నీకీర్తి మూఁడులోకములలో వ్యాపించును" అని పలువిధముల బోధించి, మందోదరి రావణునకు బ్రతుకుఁదెరువుఁ జూపెను.

దోహా 8

ఈ ప్రకారము మందోదరి పలికి, కన్నీరుఁగార్చి, యతనిచరణముల మీఁదఁబడెను. ఆమెశరీరము గడగడ వడంకెను. "ఓ నాథా! శ్రీరఘునాథుని చరణారవిందములను సేవింపుము; నామాటను విశ్వసింపుము; ఓ స్వామీ! పట్టినపట్టును విడిచిపెట్టుము; నాముఖముఁ జూడుము నాసౌభాగ్యమును నిలువఁబెట్టుము; నీవంశముఁ గాపాడు

కొనుము ; ఓ నాథా ! నీకుభయపడి, నీమంత్రులు నీకు మంచిబుద్ధులఁ జెప్పరు. నామాట వినుము ; రామునితో వైరముఁ జాలింపుము ; శాశ్వతముగ నపకీర్తి వచ్చును సుమీ ! నామంగళసూత్రములఁ ద్రెంపకుము," అని మందోదరి పలువిధముల విలపించెను.

చౌపాయ్ 9

పాదములమీఁదఁబడి దుఃఖించుచుండిన భార్యను రావణుఁడు నిలువఁబెట్టి, యోదార్చి, ఆమెకు ధైర్యముఁ జెప్పెను ; ఆత్మస్తవముఁ జేసికొనెను. (ఆత్మస్తవముఁ జేసికొనినవాఁడు ఖలుఁడు) "ఓ ప్రియురాలా ! ఇంతభయము నీకేల ? నీభయమునకుఁ గారణము లేదు ; లోకములో నావంటి వీరుఁడు కలఁడా ! అష్టదిక్పతులను నాభుజబలముచే జయించితిని ; నేను రాజ్యముఁ జేయుచుండ, ననేక యుగములు గతించెను ; కాలుఁడు సహితము నాసమీపమునకు రాఁజాలఁడు" (అథవా, రామునితోఁ బోరాడి, కాలుని పోష్యవర్గములోనుండిన ప్రకృతిమండలములోనికి రాఁజాలను. రావణుఁడు మహాతత్త్వవేత్త ; వేదమునకు భాష్యముఁ జెప్పెను. కాలుని జయించుటకు శాంతరసమే ప్రధానము.) అని యనేక విధముల భార్యనోదార్చి, రావణుఁడు హజారమునకు వచ్చి సింహాసనము నధిష్ఠించెను. కాలునకు వశ్యుఁడై, రావణుఁడు దురభిమానము విడిచిపెట్టఁడని మందోదరి తలంచి, విచారించెను. అంతట, రావణుఁడు మంత్రులఁ బిలిచి, సమరసన్నాహమునకుఁ దగిన యాలోచనలను వారితోఁ జేయ నారంభించెను. "ఓ రాక్షసరాజా ! సావధానముగ మావిన్నపమును చిత్తగింపుఁడు. మాటిమాటికేల మమ్ముల నిట్లు తర్కించెదరు ? ఏదానింజూచి మేము భయపడవలయునో, మీరు విచారించి, మాకు బోధింపుఁడు ; వానరులును. జాంబవంతులును, మనుజులును, మేము భుజించుకబళమునకు సరిపడరు" అని మంత్రులు చెప్పిరి.

దోహా 9

ఆమంత్రులు చెప్పిన మాటలను ప్రహస్తుఁడు విని, చేతుల జోడించుకొని, "ఓ రాక్షసరాజా ! నీతిమార్గముఁ దప్పకుము ; ఈ మంత్రుల బుద్ధి మహాస్వల్పము." అనిపలికి,

చౌపాయ్

"ఓ నాథా! ఈ నీ మంత్రులు నీచిత్తమున కనుకూలముగ వచించిరి; అంతమాత్రమున, శుభము కలుగదు; ఒక వానరుఁడు సముద్రమును దాఁటి, లంకకువచ్చి, యెన్ని చిత్రములఁ జేసియుండెనో, నిశాచరుల గుండెలకుఁ బట్టెను కదా! ఈ రాత్రించరుల కప్పుడు క్షుద్బాధ లేకపోయెనా? ఆ వానరుఁడు లంకానగరమును దహించినపుడు, వీరు వానిని భుజింపక, యేల విడిచిపెట్టిరి? ఓ రాజా! ప్రస్తుతము నీ మంత్రులు చెప్పినమాటలు నీకు హితముగఁ దోఁచినను, వానివలన నుత్తరోత్తరము నీకుఁ గీడు మూడును. వారియాలోచనల ప్రస్తుతము ఓ నాథా! లెస్సగ విచారింపుము. నిరాయాసముగ సముద్రమును బంధించి, వానరసైన్యములతో దాడివెడలివచ్చి, సువేలాచలముమీఁద విడిదిఁజేసియుండిన శ్రీరాముఁడు మనుజమాత్రుఁ డనియా నీయభిప్రాయము? ఈ నిశాచరు లతనిని భుజించుటకు సమర్థులా? నోటికివచ్చినట్లు వారు ప్రగల్భములఁ బలుకుచుండిరి; కాని, వా రతని సముఖమున నిలువఁబడియుండలేరు. ఓ రాజా! నామాటలను సాదరముగ విని, మన్నింపుము; నేను పిఱికిపందనని మాత్రము తలఁపకుము. చిత్తమునకుఁ బ్రియమగువచనములఁ బలుకువారును, వినువారు ననేకులు లోకములోఁ గలరు; కాని, ఓ నాథా! చెవులకుఁ గర్ణకఠోరముగ నుండినను, యుత్తరోత్తరము లాభముఁ గలిగించువచనములను బోధించువారును, వాని నాలకించువారును, లోకములోఁ గొందఱు కలరు. ఓ స్వామీ! నామాటను మన్నింపుము; రాజనీతిప్రకారము, రాముని వద్దకు రాయబారముఁ బంపుము; తదుపరి, యతనికి సీతను సమర్పింపుము; అనంతరము, రామునితో సఖ్యముఁజేయుము.

దోహా 10

"సీతనుగైకొని, శ్రీరాముఁడు విరమించినయెడల, నంతటితో మనవివాదము శాంతించును; అట్లు కానియెడల, నతనితోఁ బోరాడుటకు సమరసన్నాహముఁ జేయుము.

చౌపాయ్

"ఓ నాథా! నామాటను మన్నించి, యేవిధమున నీవు సంచరించినను, లోకములో నీకీర్తి వ్యాపించును." అని ప్రహస్తుఁడు పలువిధ

ముల బోధించెను. ఆమాటలను రావణుఁడు విని, క్రోధతామ్రాక్షుఁడై గర్జించి, హుంకరించి, "అరే మూర్ఖుఁడా! ఈబుద్ధి నీకెవరు చెప్పియుండిరి? ప్రస్తుతము నీవ్యాపారము బోధపడెను; ఆహా! వెదురుపొదలో నగ్నిపుట్టినట్లు, నావంశములో నీవు పుట్టియుంటివి" అని వానిని ధిక్కరించెను. ఇంత కర్ణకఠోరముగ తండ్రి పలికినపలుకులను ప్రహస్తుఁడు విని, దుఃఖించి, గృహములోనికిఁ బోయెను. "మరణకాలము సమీపించినవానికి ఔషధములు గుణము నిచ్చునా? అటుల, నే జెప్పిన హితవాక్యములు నాతండ్రి కపథ్యమయ్యెను" అని ప్రహస్తుఁడు తనలోఁ దాను జింతించెను. అంతట సాయంసమయ మయ్యెను; పదిశిరస్సులను, ఇరువది భుజములఁ జూచి, వానిలో వాఁడు సంతసించి, హజారమును విడిచి,అతియొయ్యారముతో నంతఃపురములోనికి వాఁడు వెళ్లెను. లంకానగరములో నొకశిఖరముపై నొకచిత్రవిచిత్రమగు సభామండపము కలదు; ఆమండపములో రావణుఁడు సింహాసనము నధిష్ఠించియుండెను; వానియెదుట నిలువఁబడి, కిన్నరులును గంధర్వులును గానముఁ జేయుచుండిరి. తాళములు, మృదంగములు మ్రోఁగుచుండెను; వారు వీణెలను మీటుచుండిరి; అప్సరసలు నృత్యముఁ జేయుచుండిరి.

దోహా 11

శతదేవేంద్రులకంటె నధికముగ రావణుఁడు భోగభాగ్యముల ననుభవించెను; ఇంద్రుఁడు మహావైభవముల ననుభవించుచుండినను, మేఘనాదుని భయముచేత నతనిమనస్సునకు స్వాస్థ్యము లేకపోయెను; శ్రీరామునివంటి శత్రువు వచ్చి, నగరములో నివసించి, యుద్ధమునకు సిద్ధముగనుండినను, రావణుఁడు శత్రువును లక్ష్యముఁజేయక, నిశ్చింతగ నాటపాటలలోఁ దేలుచుండెను. వాని చిద్విలాస మాశ్చర్యముఁ బుట్టించును. ఎవరైనను త్రిలోకాధిపత్యము నపహరించెదరని, దేవేంద్రునకు భయము కలదు; కాని, రావణున కెవరిభయము లేదు.

# ద్వితీయ విశ్రామము.

—o(·)o—

**చౌపాయ్**

ఇచ్చట సువేలాచలముమీఁద వానరసైన్యములతోఁ గూడి, శ్రీరామలక్ష్మణులు శిబిరములను వేసికొనియుండిరి ; ఆపర్వతమున నొక మహోన్నతమగు చక్కని శృంగము కలదు. ఆశృంగముపైని, పచ్చని పత్రములతోను పుష్పములతో నొకమృదువగు నాసనమును లక్ష్మణుఁడు పఱచెను ; వానిపైఁ గృష్ణాజినముఁ బఱచెను ; దానిపై శ్రీరామమూర్తి కూర్చుండెను. సుగ్రీవుని తొడపై శిరస్సునుంచుకొని, శ్రీరాముఁడు విశ్రమించెను ; ఇరువైపుల నతఁడు ధనుర్బాణములనుంచెను ; రెండుచేతులతో నొకబాణము నతఁడు మెఱుఁగుఁ బెట్టుచుండెను ; చెవులవద్ద విభీషణుఁడు కూర్చుండి, మంత్రాలోచనముఁ జేయుచుండెను; అదృష్టవంతులగు హనుమంతుఁడును అంగదుఁడు నతని పాదముల నొత్తుచుండిరి ; నడుమున కంబులపొదిఁ గట్టుకొని, ధనుర్బాణములను ధరించి, అతనివెనుక లక్ష్మణమూర్తి వీరాసనము వేసికొనియుండెను.

**దోహా 12, 13**

ఈప్రకారము శ్రీరామచంద్రుఁడు దేదీప్యమానముగ వెలుగుచుండెను; ఈరూపమును మనస్సున సంధానముఁ జేసి, సదా ధ్యానించు పురుషులు ధన్యులు. ఆకరుణాసముద్రుఁడు, ఆసకలగుణధాముఁడు చూడఁ జోద్యముగ నుండెను. (ఇచ్చట మూఁడువిశేషణములు కలవు. (1) సుగ్రీవునితొడపై శిరస్సునుంచుట. (2) బాణమును మెఱుఁగుఁబెట్టుట. (3) విభీషణుని మంత్రములను వినుట. (4) అంగదహనుమంతులు పాదములఁ బట్టుట ; ఇదియంతయు కరుణారసము. (1) స్నేహితునివద్ద శిరస్సు నతఁడు దాచుకొనెను. (2) చిన్నతనమునుండి బాణములను నమ్మియుండినందుకు, దాని సమయము వచ్చెనని, దానిని దువ్వుచుండెను. (3) అంగద-హనుమంతులకుఁ బాదముల నిచ్చెను; వా రెచ్చటికిఁ దీసికొనివెళ్లిన, నచ్చటకు వారితోఁ బోవుటకు సిద్ధముగనుండెనని తెలి

యును. (4) శ్రీరాముని యాజ్ఞలను మన్నింపనివారిని దండించుటకు లక్ష్మణుఁడు వీరాసనము వేసికొనియుండెను.) అప్పుడు శ్రీరామమూర్తి తూర్పుదిక్కుఁ జూచెను; ఆసమయమున, చంద్రుఁ డుదయించుచుండెను. శ్రీరాముఁడు వారిం జూచి, "ఓ సఖులారా! చూడుఁడు. ఈచంద్రుఁడు నిస్సందేహముగ సింహముతో సమానుఁడు." అని చెప్పెను. (చంద్రుని మిషఁబెట్టుకొని, శ్రీరాముఁడు తనశూరత్వముఁ జెప్పుకొనెను. మూఁడువిధముల నతఁడు చంద్రుని వర్ణించెను.)

చౌపాయ్

"మొదటిది పూర్వదిక్కున నివసించు సింహము; రెండవది గిరినివాసియగు సింహము; మూఁడవది గుహానివాసియగు సింహము; అంధకార మనునట్టి యేనుఁగును చంద్రుఁడనునట్టి సింహము సంహరించును; రావణుఁ డనునట్టి కుంజరమును సంహరించుటకు సువేలాచలగిరిపై నివసించియుండిన నేనే యొక సింహమును; ప్రాకృత గజమును ప్రాకృతసింహము చంపును. (మూడు సింహములకు కేసరములు కలవు. (1) చంద్రసింహమునకుఁ గిరణములు; (2) రామసింహమునకు కేశములు; (3) ప్రాకృతసింహమునకు జటలు.) ఆకాశముపై, ముత్యములువలె, నక్షత్రములు ప్రకాశించెను. (ఆముత్యములే, రాత్రి యనునట్టిస్త్రీకి నలంకారము; లేక, అంధకారమనునట్టి యేనుఁగు తలలో, నక్షత్రము లనునట్టి ముత్యములు కలవు; ఆముత్యముల హారము రాత్రియనునట్టి స్త్రీ ధరించెను. ప్రాకృత నాగమణిహారమును ప్రాకృతస్త్రీలు ధరించెదరు. రావణగజముత్యములను రావణుని స్త్రీలు హారముగఁజేసి, ధరించెదరు.) ఓ సఖులారా! చంద్రునిలో నొకమచ్చ కలదు. మీ మీ బుద్ధికిఁ దోఁచినప్రకారము, దానిగుఱించి మీయభిప్రాయముఁ దెలుపుఁడు" అని శ్రీరామమూర్తి పలికెను. (ఇందువలన వారి మనోభిప్రాయములు వెల్లడియగును). "ఓ నాథా! భూచ్ఛాయయే చంద్రునిలో వ్యక్తమగును" అని సుగ్రీవుఁడు చెప్పెను. ఇందువలన, సుగ్రీవునకు రాజ్యమునం దభిలాషకలదని తెలియుచున్నది; ఎంతవఱకు నతఁడు భూమినే ధ్యానించుచుండెను. "ఓ స్వామీ! చంద్రుని రాహువు కొట్టెను; ఆదెబ్బ తట్టుతేఱెను; అదియే ఆమచ్చ" అని

మఱియొకఁడు పలికెను. ఇందుమూలమున, నతనిశూరత్వమును, యుద్ధమునందుఁగల మనోరథమును వ్యక్తమగును. "ఓ రాజా! చంద్రునిలోఁ గొంతభాగముఁ దీసి, దానితో బ్రహ్మ రతీదేవిని సృష్టించెను; ఆ వెలితియే ఆమచ్చ" అని మఱియొకఁడు సమర్థించెను. ఇందువలన, నతఁడు కామాతురుఁడనియు, యుద్ధమునకు విముఖుఁడనియు తెలియును. "ఓ సఖులారా! గరళము చంద్రునిబంధువు; వారిరువురు సముద్రములోఁ బుట్టిరి; ఈ సంబంధముచేత, నాగరళమును చంద్రుఁడు హృదయములో దాఁచుకొనెను; ఆగరళమే ఆమచ్చ. అందుచేత, నతనికిరణములు విషమువలె, విరహులను బాధించును." అని శ్రీరామమూర్తి పలికెను; ఇందువలన, నతఁడు విరహదుఃఖముచే బాధపడుచుండెనని తెలియును.

దోహా 14, 15

వారివారి మాటలను హనుమంతుఁడు విని, తన మనోభిప్రాయమును సమయోచితముగ నిట్లు పలికెను. "ఓ రాజేంద్రా! చంద్రుఁడు మీ ప్రియుఁడగు దాసుఁడు; మీ శ్యామలవిగ్రహము నతఁడు హృదయములో ధరించెను. మీ శ్యామలతనువే ఆమచ్చ" అని వానరపుంగవుఁడు పలికిన పలుకులను శ్రీరామమూర్తి విని, చిఱునవ్వు నవ్వెను. అతఁడు దక్షిణదిక్కుం జూచి, విభీషణుని భావముఁ బరీక్షించుటకు నిట్లు పలికెను.

చౌపాయ్

"ఓ విభీషణా! దక్షిణదిక్కుం జూడుము; ఆ మేఘము లేమి? ఆ మెఱుపు లేమి? ఆదట్టమగు మేఘబృందముల మధ్యనుండి, పిడుగులధ్వని మనోహరముగ వినఁబడుచున్నది; ఇప్పుడు వర్షించునా, లేక వడగండ్లవాన పడునా? ఏమి నీయభిప్రాయము?" ఈ ప్రకారము రాముఁ డడిగినప్రశ్నకు విభీషణుఁ డిట్లు చెప్పెను. "ఓ నాథా! అవి మేఘములు కావు; మెఱుపులుగావు; లంకాపట్టణములో నొకశిఖరముపై నొకమండపము కలదు; అచ్చట, దశకంధరుఁడు వాని మేళముతోఁ గూడి వినోదించును; వారు నృత్యగీతవాద్యముల జరిగించుచుండిరి? రావణుని శిరముపై మేఘమువలెఁ బ్రకాశించునవి ఛత్రములు; ఆమేఘముల మధ్యను మెఱుపులువలెఁ బ్రకాశించునవి

మందోదరి కర్ణతాటంకములు ; తాళమృదంగశబ్దములే మేఘధ్వని ;" ఈ ప్రకారము విభీషణుఁడు పలికినపలుకులను శ్రీరాముఁడు విని, రావణుని దురభిమానమునకుఁ గోపించి, ధనువున నొక బాణమును సంధించెను. దోహా 16, 17

ఆ ప్రకారము శ్రీరామమూర్తి సంధించి ప్రయోగించినబాణము, రావణుని ఛత్రమును ముకుటములను బడఁద్రోసి, మందోదరి కర్ణపుష్పముల నపహరించెను ; అవి గిరగిరతిరిగి నేలఁ బడెను ; అందుకుఁ గారణమును వారు గ్రహింపలేదు. ఈచిత్రముఁ జేసి, రామబాణము తిరిగివచ్చి నిషంగములో దూరెను. రావణుని మేళమంతయు పికాపికలయ్యెను ; రసభంగమయ్యెను.

చౌపాయ్

భూకంపముగాని, ప్రచండవాయువుగాని లేదు ; అస్త్రశస్త్రములయినను వారినేత్రములకుఁ గనఁబడలేదు. రావణున కశుభము కలిగెనని, వారిలోవారు విచారించిరి. సభికులు భయభీతులగుట రావణుఁడు తెలిసికొని, ముసిముసి నవ్వునవ్వి, "ఓ సభికులారా ! నాశిరస్సులను హోమమునకుఁ జేసియుంటిని ; అమంగళము లప్పుడు నాకుఁ గలుగలేదు ; ఇప్పుడు కిరీటములు పడినందున, నమంగళములు జరగునా ? మీ పిచ్చిభయమును విడిచిపెట్టుఁడు. మీమీ గృహములకుఁ బోయి, సుఖముగ నిద్రింపుఁడు." అని యుక్తముగఁ బలికి, వారిని బంపించెను. వారు రావణునకు నమస్కరించి, స్వగృహములకు నిష్క్రమించిరి. కర్ణపుష్పములు నిష్కారణము నేలఁబడినందుకు, మందోదరి విశేషము భిన్నురాలయ్యెను ; ఆమెనేత్రముల వెంబడి నీరుకారెను ; ఆమె చేతుల జోడించుకొని, రావణునితో నిట్లు ప్రసంగించెను. "ఓ ప్రాణనాథా ! నావిన్నపము వినుము. ఓ స్వామీ ! శ్రీరాముఁడు మనుజమాత్రుఁడని తలంచి, గర్వపడకుము ; అతనితో విరోధముఁ జాలింపుము. నీమూర్ఖమును విడిచిపెట్టుము.

దోహా 18

"ఓనాథా! శ్రీరాముఁడు సాక్షాత్ విరాట్పురుషుఁడు; నామాటను విశ్వసింపుము; ఆపురుషుని రోమరోమముల కనేకబ్రహ్మాండములు కలవని వేదములు ఘోషించును.

చౌపాయ్

"ఆమహాపురుషుని పాదములు, పాతాళము; శిరస్సు, బ్రహ్మలోకము; భ్రూవిలాసము, కాలము; నేత్రములు, సూర్యుఁడు; కేశములు, మేఘములు; నాసిక, అశ్విని కుమారులు; రెప్పపాట్లు, దివారాత్రములు; చెవులు, దశదిశలు; ఉచ్ఛ్వాసనిశ్వాసములు, వాయువు; వాక్కులు, వేదములు; అధరము, లోభము; దంతములు, యముఁడు; ఆదంతములు మహాతీక్ష్ణములు; మందహాసము, మాయ; బాహువులు, దిక్పతులు; ముఖము, అగ్ని; జిహ్వ, వరుణుఁడు; ఉద్యమములు, ఉత్పత్తిస్థితిలయములు; రోమములు, అష్టాదశవనస్పతులు; ఎముకలు, పర్వతములు; నాడులు, నదులు; ఉదరము, సముద్రము; అధఃకాయము, నరకము; సంకల్పములు, జగుత్తున కుత్పత్తి.

దోహా 19

"అహంకారము, శివుఁడు; బుద్ధి, బ్రహ్మ; మనస్సు, చంద్రుఁడు; చైతన్యము, మహత్తత్త్వము; చరాచరజంతుజాలములలో నతఁడు నివసించును; అతని రూపమే, చరాచరప్రపంచము.

దోహా 20

"ఓ ప్రాణనాథా! ఈసంగతి లెస్సగ విచారించి, శ్రీరామునితో వైరమును విడిచిపెట్టుము; శ్రీరాముని చరణారవిందములను సేవింపుము; నా యయిదువతనమును నిలుపుము."

చౌపాయ్

ఈప్రకారము మందోదరి విలాపమును రావణుఁడు విని, పక్కున నవ్వి, భార్యతో నిట్లు పలికెను "ఆహా! స్త్రీలమోహ మెంత చిత్రము; కవీశ్వరులు నిజముఁ జెప్పిరి; స్త్రీలకు స్వభావసిద్ధముగ నెనిమిది యవగుణములుండును; సాహసము; అనృతము; చంచలత్వము; మోహము; భయము; అజ్ఞానము; అపవిత్రత; నిర్దయ. నాకు భయము కలుగునట్లు, శత్రువుగుణములను నీవు వర్ణించియుంటివి. ఓ సఖీ! సర్వము నేను గ్రహించితిని; నీకు నాయం దభిమానము మెండు; నీచమతాకారము బోధపడెను; ఈప్రకారము శత్రువుని ప్రభావము వర్ణించుట వలన, నా ప్రతాపమును నీవు వెల్లడిఁ జేయుటకుఁ దలంచితివి. ఓ మృగ

లోచనీ! నీ వచనములు గూఢములు. చెవులకుఁ గఠోరముగ నుండి
నను, మనస్సునకు భయముఁ గలిగించినను, వానిని గ్రహించినయెడల,
మనస్సునకు సంతోషము కల్గును; అందువలన భయము పోవును."
"ఆహా! దైవమా! నాభర్త కాలమునకు వశ్యుఁ డయ్యెను; కనుక,
నతనిబుద్ధి కలుషమయ్యెను." అని మందోదరి చింతించెను. (మందోదరి
వచనములు గూఢమని రావణుఁడు చెప్పుటకుఁ గారణమేమి? పరమ
విరాట్పురుషుని బాణముతగిలిన, ముక్తి లభించును; అందుచేత, నామె
వచనములవలన, భయము పోవును; అతనిని భజించుటవలన, భక్తి
లభించును; భక్తి సుఖదాయకము; అయినను, దానిమార్గములో
ననేకవిఘ్నములు కలవు; కాని, వైరమునకు విఘ్నములు లేవు; తప్పక
వైకుంఠము కలుగును.)

దోహా 21

ఈప్రకారము బకవాదములో నారాత్రియంతయు వాఁడు
గడపెను; అంతట ప్రాతఃకాల మయ్యెను. వానిబుద్ధి కలుషమయ్యెను;
నిర్భయుఁడై, వాఁడు సభామండపమునకు వచ్చెను.

సోరఠా 3

మేఘము లమృతమును వర్షించినను, వెదురు పుష్పించునా?
ఫలించునా? ఆకాశము పుష్పించునా, ఫలించునా? అటులనే, మూర్ఖు
నిహృదయము శూన్యము; కనుక, వానికి బ్రహ్మదేవునివంటి గురువు
వచ్చి యుపదేశించినను, వ్యర్థమగును; ఆ యుపదేశమువలన, వాని
బుద్ధి వికసింపదు.

(అధికపాఠము.) దోహా 22

అంతట రావణుఁడు, లంకాశిఖరముపై నుండిన సభామండపము
నకు వెళ్లి, సింహాసనము నధిష్ఠించెను; మంత్రులును, ప్రధానులును,
సేనాధిపతులును, సామంతులును, కొలువుకూటములో బరాబరులు
దీర్చియుండిరి. అంతట, రావణునిఁ జూచి, సారణుఁడు విన్నవించెను.
"ఓ రాక్షసరాజా! కపిసైన్యములఁ జూడుము.

చౌపాయ్

"ఆ సింహనాదముఁ జేయువాఁడు సప్తతాళవృక్షముల ప్రమా
ణము గలవాఁడును, ఒకకోటి మహాబలవంతులతోఁ గూడియుండిన

వాఁడును, రణమునం దజేయుఁడును, స్వాభావికముగ నిర్భయుఁడును; ఏ వానరుని గర్జనవలన లంకానగరము గడగడవడంకునో, వర్షఋతువులో నింద్రధనస్సులు రెండు వెడలినట్లు, ఆకాశము పొడవున వాలముఁ గలవాఁడును, ఆ యభిమానముకలవాఁడు విశ్వకర్మ కుమారుఁడు; అతనివెంట నతని తమ్ముఁడు; వా రిరువురు మహాబలవంతులు; వారు స్పర్శించినమాత్రమున, పాషాణములు నీటిపైఁ దేలియుండును; వారి నివాసస్థానము తామ్రగిరికందరము; అఖండగోదావరీజలములను వారు సదా త్రాగుచుందురు; ఆ వీరులఁ జూడుము; వారు ముందు నడచుచుండిరి; వారు శ్రీరామునకుఁ బ్రియులు; యుద్ధములో వారు యమునిసహితము లక్ష్యముఁజేయరు; ఆ నల్లనిరూపములు కలవారు, నలనీలులని తెలిసికొనుము.

దోహా 23

"(18) పద్మముల వానరసైన్య మా వానరునినీడను నడచుచున్నది. ఆ వానరుఁడు సౌగంధికపుష్పముతో శ్రీరామునిఁ బూజించును.

చౌపాయ్

"వాఁడు పర్వతమువలె నడచును; (14) తాళవృక్షముల ప్రమాణము; వాఁడు పులిందానదీతీరమున నివసించును; వాఁడు మేఘబృందముల నందుకొనును. వానిదేహము రక్తకమలములఁ బోలును. సంధ్యారాగముతోఁ గూడిన మేఘమువలెఁ గనఁబడును. వాఁడు తోఁకతో భూమినిఁగొట్టిన, భూమి కంపించును; లంకవైపుఁ జూచిన, వాఁడు లంకను కబళించునని తెలిసికొనుము. వాఁడే వాలిపుత్రుఁడు; అంగదుఁడు; వానితల్లి తార; వాఁడు మహావీరుఁడు; బలవంతుఁడు; శూరుఁడు; వాఁడు శ్రీరామునకుఁ బ్రియుఁడు. వాని హృదయాంతరాళమున శ్రీరామభానుఁడు సదా ప్రకాశించుచుండును. అంగదునివెంట (5) పద్మములవానరులు నడచెదరు; ఇంద్రుని వజ్రాయుధమును సహితము వాఁడు లక్ష్యముఁజేయఁడు; ఉదయపర్వతమును వాఁడు చంకబెట్టుకొనఁగలఁడు; వాఁడే సేనాధిపతి; వానియందు శ్రీరాముని కటాక్షముకలదు; వానివంటి యదృష్టవంతుఁడు లేఁడు.

దోహా 24

"ఆదిశేషునకు వ్యాకులముఁ గలుగునట్లు, భూమినిఁబట్టుకొని వాఁడు పోఁగలఁడు; చూడుము; సకలసేనలకు ముందుగ నుండును. వాఁడే యువరాజు.

చౌపాయ్

"ఆ శ్వేతవర్ణముగల వానరునిం జూడుము; రజతగిరిశృంగము వలె నుండును; ఆ వానరుని కేశములు దీర్ఘములు; వాని భుజదండములు బలీయములు; వానిబుద్ధి కుశాగ్రము; వాని బలము తీవ్రము; వాఁడు చపలుఁడు; వాఁడు మహాచతురుఁడు; వాఁడు సముద్రతీరమున నివసించియుండును; గోమతీజలములఁ బానముఁ జేయును; వాఁడే వానరరాజు; సుగ్రీవుఁడు వ్యూహములఁ బన్ని, సైన్యములఁ జతురతతో నతఁడు నడిపించును. అతఁడు పుట్టినపుడే, చంద్రుని మ్రింగఁబోయెను; అతని పౌరుషము లోకవిదితము; ఆకాశమునఁ బూర్ణచంద్రబింబముఁ జూచినందున, నతనిమనస్సు భ్రమించెను. ఆసమయమున నతఁడు బాలకుఁడైనను, ఆజానుబాహువు. ఆవస్తువుఁ బట్టుకొనుటకతఁడు పరుగెత్తినపుడు, భూమి కంపించును. (70) యోజనముల దూరము.

దోహా 25

"ఈ వానరునిఁ జూడుము; ఏనూరు. (500) కోట్లవానరుల కధిపతి; వాఁడు కాలునితో సహితము పోరాడును. వానిపేరు కుముదుఁడు.

చౌపాయ్

"ఆ వానింజూడుము; వాఁడు నలువైపులఁ గుప్పించుచుండును; లంకానగరముపై నీలమేఘములు కప్పినట్లు కనఁబడును. ముందుకును వెనుకకును దశదిశలకును వాఁడు పరుగెత్తును; పర్వతములను, శిలలను, వృక్షములను వాఁడు రువ్వును; ఒకవెయ్యి యేనుఁగుల బలము కలదు; వారిలో నొక్కొక్కరి కంతబలము కలదు; వారందఱు (7) పద్మముల వానరులు. వీరు కాశీపురనివాసులు; వీరు యుద్ధములో లేశమైన వెనుకఁదీయరు. వారి దంతములును నఖములు నతితీక్ష్ణములు; వానితోఁ బోరాడఁగలరు; వారు ద్వంద్వయుద్ధ విశార

దులు. వారియధిపతి ధూమకేతువు; వాఁడే లంకకెదురుగ శిబిరమును వేసికొనెను. వానియన్న జాంబవంతుఁడు; ఆ జాంబవంతునిబలముఁ జూచినవారు లేరు. సురాసురులలో నొకఁడైనను వానితోఁ బోరాడ లేఁడు; ఒకపద్మమును వలె, భూమిని యెత్తఁగలఁడు; వాఁడు నిర్భయుఁడు; నర్మదానదీతీరమున నివసించును. వాని శరీరము, వజ్రము వలె నభేద్యము.

దోహా 26

"ఆ జాంబవంతుఁడు సుగ్రీవునకు మంత్రి; శ్రీరాముని ప్రియ సేవకుఁడు; యుద్ధములో జాంబవంతుని జయింపఁదలంచినవానికంటె మూర్ఖుఁడు లేఁడు.

చౌపాయ్

"ఓ రాజా! ఈ యపారమగు వానరయూథముఁ జూడుము; ఈ పర్వతమంతయు వారి శరీరకాంతిచేఁ బచ్చఁబడెను; ఆరాక్షసాంధకారమును విడఁగొట్టిన ప్రాతఃకాల సూర్యకిరణములవలె, నా వానరులు కనఁబడుచుండిరి. ఆ వానరులు (24) అర్బుదములు; సహస్రకోట్లును మించియుండిరి; వారిముందుగఁ గనఁబడిన బర్వతములను పాషాణములను వారు పిండిజేయుచుండిరి. వారు సుమేరుపర్వత కందరములలో నివసించియుందురు. వారియూథపతికి వినాశము లేదు; వాఁడు మహాబలవంతుఁడు; ఇంద్రునకుఁ బ్రియుఁడు; సుగ్రీవునకు మిత్రుఁడు; వాఁడు గంగాజలముఁ బానముఁ జేయును; వానిశరీరము మహాపర్వత శిఖరముఁ బోలును.; క్షణక్షణము వాఁడు చేయుచుండిన సింహనాదమును వినుము. ఆ వానరులగర్జన, హృదయమును భేదించును.

దోహా 27

"ఈ వానరునికీర్తి త్రిలోకప్రసిద్ధము; అనేక కుంజరయూథముల నతఁడు సంహరింపఁగలఁడు. వానిబలమున కాద్యంతములు లేవు. అతఁడు వానరరాజు, కేసరి; కుమారుఁడు; అతఁడే హనుమంతుఁడు.

చౌపాయ్

"ఓ రాజా! నీనగరమున కుత్తరదిక్కుఁ జూడుము. తొమ్మకాలములో, మిడుతలదండువలె, వానరులు వచ్చిపడిరి. వారు మహాబల

వంతులు; వా రెట్లు పరుగెత్తుచుండిరో చూడుము. చెలియలిగట్టు దాఁటి, సముద్రము వచ్చినట్లు, వారు వచ్చుచుండిరి. ఈ వానరయూథముల కధిపతి మహాబలవంతుఁడు; రణధీరుఁడు; వాఁడు సదా రాజు ననుసరించి యుండును. కపిరూపమును ధరించిన సాక్షా దగ్ని దేవుఁడని తోఁచును. ఆ వారిరువురు పారియాత్ర పర్వత నివాసులు; వారు సుందరులు; మహాబలవంతులు; మహాయుద్ధప్రవీణులు; వా రిరువురు, గవయగవాక్షులు; వారు రణధీరులు; వారిసింహనాదమును వినుము. వారు తుంగభద్రానదీజలములఁ బానముఁ జేయుచుందురు. వా రొక్కొక్కరికి (70) డెబ్బదివేలయేనుఁగుల బలముకలదని వినియుంటిని. ఆవానరుఁడు గంధమాదనుఁడు; వాఁ డజేయుఁడు; సకల గుణధాముఁడు.

దోహా 28

“ఆవానరునిఁ జూడుము; వైభవములో దేవేంద్రునితోను, తేజస్సులో సూర్యునితో నతఁడు సమానుఁడు; వాఁడే పనసుఁడు. మహాబలవంతుఁడు; నీతికోవిదుఁడు.

చౌపాయ్

“ఓ రాజా! ఆ వానరునిఁ జూడుము; కుముదపత్రములతో సమానమగు వానిదేహముఁ జూడుము; కైలాసపర్వతముపై శరత్కాలములో వ్యాపించినమేఘమువలె వాఁడు కనఁబడును. వాఁడు చక్కని వాఁడు పింగళాక్షుఁడు ; కామరూపి ; వాఁడు నలువైపుల నెట్లు చూచుచుండెనో, చూడుము. ప్రళయకాలమేఘమువలె, వాఁడు గర్జించును; వానివాలము లంకానగరమువైపు ద్రిప్పియుండెను; రాక్షసులతోఁ బోరాడుటకు వాఁడు దేవేంద్రునితో యుద్ధమునకు వెళ్లెను; ఆ దినము మొదలు వానికిఁ గామరూపము వచ్చెను. వానితో నింద్రుఁడు సఖ్యముఁ జేసెను; వాఁడు దేవతులకు సహాయపడెను. ఒక వేయికోట్ల వానరులకు వాఁడు నాయకుఁడు. పీతవర్ణము, శ్వేతవర్ణము, నీలవర్ణము-ఈ వర్ణముగలవానరుల కధిపతి. ఓ నాథా! నామాట లసత్యము కాదు. వాఁడు రెంభవవాలియని తెలిసికొనుము. వాని నివాసస్థానము దర్దురపర్వతము. త్రికరణశుద్ధిగలవాఁడు రాముని సేవకుఁడు.

దోహా 29

"వాఁడు పర్వతములను దాఁటును; వాఁడు నడచినపుడు ధూళి రేఁగుచున్నది; చూడుము; ఆ ధూళివలన, సూర్యుఁడు తిరోహితుఁడయ్యెను. తార వానికి ముద్దుపేరు పెట్టెను. వాఁడే సుషేణుఁడు.

చౌపాయ్

"ఓ రాజా! ఆ వానరునిం జూడుము; జేగురువలె, వానిశరీరము శోభించుచున్నది. వాఁడు నిలిచియుండిన ప్రదేశము, సుమేరు పర్వతమువలెఁ బ్రకాశించును. ఆ వానరుఁడే ప్రథమమున నీ లంకానగరమును దహించెను. ఆవానరుఁ డెటువైపువచ్చునో దెలియదు. అంజనీదేవిగర్భమున నతఁడు పుట్టెను. "అమ్మా, అమ్మా! ఆఁకలివేయుచున్నది" అని యతఁడు తల్లి నడిగెను; "ఓ నాయనా! చక్కగఁబండిన యెఱ్ఱని పండ్లఁ దినుము" అని యామె చెప్పెను. అతఁడు తల్లిమాటలను విని, నలువైపులఁ బరుగెత్తెను. ప్రాతఃకాలమున నుదయించుచుండిన సూర్యుని ఫలమని తలంచి యతఁడు సూర్యునిఁ దినుటకు మీఁదకు నెగిరెను. ఆ సమాచారము నింద్రుఁడు తెలిసికొని, వజ్రముతో నతని చుబుకముఁ గొట్టెను; అందుచేత, నతని ముఖమునకుఁ గొంచెము వంకరకలదు. కుమారునిఁ గొట్టినందులకు వాయువు కోపించి, వాయువులను నిరోధించెను. అప్పుడు దేవతలు వాయుమూర్తిని స్తుతించిరి. "ఓ వాయుమూర్తీ! నీ కుమారునిదేహము వజ్రదేహమగును" అని దేవతలు వరము నిచ్చిరి. అంతట వాయువు సంతసించి, ప్రసరించెను; దేవతలు సంతసించి, జయజయశబ్దములఁ జేయుచు, స్వర్గలోకమునకు వెడలిరి. క్రిందికి శిరస్సుఁబెట్టుకొని, పైకెగిరి, హనుమంతుఁడు సూర్యుని వద్ద విద్య నభ్యసించెను. ఆ వానరుఁడే సముద్రమును, గోష్పాదమును వలె దాఁటెను. ఆవానరునితో నెవరు పోరాడఁగలరు?

దోహా 30

"ప్రాతఃకాలసూర్యునివలె, నతనిముఖము వెలుగుచుండును. అతఁడు పింగళాక్షుఁడు; అతఁడు వాయువువంటి మహాబలవంతుఁడు; వాయువుకంటె నతివేగముగఁ బోవును. తేజస్సులో నగ్నిహోత్రునితో సమానుఁడు; అతనితో నెవరు పోరాడఁగలరు?

చౌపాయ్

"ఓ నాథా! ఆ మహాపురుషునిఁ జూడుము; అతసీపుష్పము వలె, నతనిశరీరము ప్రకాశించును. మనుజరూపమును ధరించిన పురాణపురుషుఁడు. అతని బాహుదండములు గజేంద్రునితుండముఁ బోలును. అతని హస్తములోనుండిన ధనుర్బాణములఁ జూడుము; ఆ చంద్రాయుధమును, నాయక్షయతూణీరములఁ జూడుము. అతనిహృదయము విశాలము; అతనిస్కంధము మహోన్నతము; అతని కంబుకంఠము త్రివళీయుతము; సదా ప్రసన్నవదనుఁడు; అతని ముఖమును చంద్రునితోను పద్మములతోను సరిపోల్చుటకు కవీశ్వరులు లజ్జించెదరు. ఆదంతములకాంతిని నెవరు వర్ణింపఁగలరు? వానికిఁదగిన యుపమానము లేదు. అతనియధరముల యెఱుపుఁ జూచి, బింబాఫలమును బంధూకము సిగ్గుపడిరి. అతనిముక్కుఁ జూచి, చిలుక సిగ్గుపడెను; దానికిఁ దగిన యుపమానము లేక, కవీశ్వరులు నిశ్చేష్టు లయిరి. ఆ జటామకుటధారి ముఖమున తిలకము శోభించుచున్నది; చూడుము. అతఁడే శ్రీరామచంద్రుఁడు; అతనికిఁ గుడివైపున వీరలక్ష్మణుఁడు వీరాసనమును వేసికొని యుండెను. అతఁడు మహావీరుఁడు; రామునకుఁ గుడిభుజము వంటివాఁడు.

దోహా 31

"ఓ నాథా! శ్రీరామునకు వామభాగమున నుండినవాఁడు నీ తమ్ముఁడు, విభీషణుఁడు; వానిముఖమున రాజ్యతిలకము ప్రకాశించుచున్నది; చూడుము. నీలంకగుట్టు సర్వము వానికిఁ దెలియును; వానివలన నీపుట్టి మునుఁగును; శ్రీరాముని కార్యము నెఱవేఱును.

చౌపాయ్

"ఓ రాజా! భాద్రపదమాసములో మేఘములవలె, నా వానరసైన్యమెటుల నలువైపుల వ్యాపించెనో చూడుము. పూర్వము బ్రహ్మదేవుఁ డొకచక్కనిస్త్రీని పుట్టించెను. దాని విలాసములఁ జెప్పుటకు శక్యముకాదు. ఇంద్రుని వీర్యము దాని వెంట్రుకలపైని, సూర్యుని వీర్యము దాని కంఠముపైఁ బడెను; అందువలన, నిరువురు వీరులు పుట్టిరి. వెంట్రుకలమీఁదఁ బుట్టినవీరుఁడు వాలి; గ్రీవమునందుఁ

బుట్టినవాఁడు సుగ్రీవుఁడు. వా రిరువురు దేవతాంశసంభూతులు. వారు కిష్కింధలో నివసించియుండిరి; ఆ కిష్కింధావనము నందనవనముతో సమానము. ఈ సుగ్రీవుఁడు ఋష్యమూకపర్వతముపై నివసించి యుండెను; ఆపర్వతముపై, చాతుర్మాస్యదినములను శ్రీరామమూర్తి గడపెను. వాలి సుగ్రీవులు పోరాడిరి; వాలిని శ్రీరాముఁడు సంహరించెను; సుగ్రీవునకుఁ బట్టముఁ గట్టెను; అతని పట్టపుదేవి తార; తార కుమారుఁడు అంగదుఁడు, యువరాజు; వాఁడు మహాజ్ఞాని. ఓ నాథా! పదిలక్షలకోట్లొక అర్బుదము; ఒక వేయి అర్బుదము లొకబిందువు; ఒక వేయిబిందువు లొక మహాపద్మము. ఈ ప్రకారము జ్యోతిష్కులు గణించెదరు. నీతో యుద్ధముఁ జేయుటకుఁ బదునెనిమిది మహాపద్మముల వానరులు రామునితో వచ్చిరి. ఆవీరవేషమును ధరించినవాని విశాల నేత్రములఁ జూడుము; వాని కంబుకంఠముఁ జూడుము; వాని కంఠమున వ్రేలుచుండిన ముత్యాలహారముఁ జూడుము.

దోహా 32, 33

"ఓ రాజా! వానికి డెబ్బదివేలయేనుఁగుల బలముకలదు. వాఁడు ధర్మముగ రాజ్యముఁ బరిపాలించును. అతనిశిరస్సుపై శ్వేతచ్ఛత్రము శోభించుచున్నది. వాఁడే వానరరాజు, సుగ్రీవుఁడు." ఈ ప్రకారము వానరసేనాధిపతులను వేఱ్వేఱ సారణుఁడు వర్ణించి, రావణునితోఁ జెప్పెను. విధికృతమువలన రావణునిబుద్ధి చెడిపోయెను; వానికి దురభిమానము బలిసెను; అందుచేత, వాఁడు వారిని లక్ష్యముఁ జేయలేదు.

---

# తృతీయ విశ్రామము.



చౌపాయ్

అంతటఁ బ్రాతఃకాలమున, శ్రీరాముఁడు మంత్రులను బిలిచెను. (జాంబవంతుఁడు, సుగ్రీవుఁడు, విభీషణుఁడు—ఈ ముగ్గురును మంత్రులు) "ఏమియుపాయముఁ జేయవలయునో చెప్పుఁడు?" అని

శ్రీరాముఁడు వారిని యడిగెను. అప్పుడు జాంబవంతుఁడు శ్రీరాముని నమస్కరించి, "ఓ నాథా! ఓ సర్వజ్ఞా! మీరు సర్వాంతర్యాములు; మీరు సర్వరూపధారులు; మీరు ఉదాసీనులు; మీచిత్తము. నాబుద్ధికిఁ దోఁచినవిధమునఁ జెప్పుచున్నాను. అంగదుని రాయబారిగ రావణునివద్దకుఁ బంపుఁడు." అని చెప్పెను. జాంబవంతునివచనములను వారు మన్నించిరి. అప్పుడు వాలిపుత్రునిఁ బిలిచి, "ఓ అంగదుఁడా! నీవు బుద్ధిమంతుఁడవు; బలవంతుఁడవు; నాకార్యమునిమిత్తము నీవు రావణునివద్దకుఁ బొమ్ము. నేను నీకేమి బోధింపఁగలను? నీవు మంచి సరసుఁడవు; సర్వము నీకుఁ దెలియును. నాకార్యమును సాధింపుము; రావణునకు హితము కలుగవలెను." అని శ్రీరాముఁడు పలికెను.

సోరఠా 4, 5

శ్రీవారిచరణములకంగదుఁడు దిగ్గునలేచి నమస్కరించి, చేతులను ముకుళించి, "ఓ నాథా! మీరు నన్నుఁ గటాక్షింపుఁడు. మీకార్యమంతయు ఫలముఖమయ్యెను. అయినను, మీరు నన్ను గౌరవింపఁ దలంచితిరి" అని విన్నవించి, ప్రయాణమయ్యెను. అతనిశరీరము పులకరించెను.

చౌపాయ్

శ్రీవారిచరణములకతఁడు నమస్కరించి, అత్యుత్సాహముతో బయలువెడలెను. శ్రీరామచరణములనతఁడు స్మరించుచు, లంకలోఁ బ్రవేశించెను. శ్రీవారిప్రతాపమువలన నతఁడు నిర్భయుఁడై వెళ్లెను. ఆరణధీరుని నిరోధించువారెవరు? అంత నతఁడు రాజనగరులోఁ బ్రవేశించెను; అచ్చట నాడుకొనుచుండిన రావణునికుమారుని నతఁడు చూచెను. "ఓ వానరుఁడా! నీ వెవఁడవు?" అని రావణునికుమారుఁ డడిగెను. "నేను శ్రీరాముని దూతను" అని అంగదుఁడు చెప్పెను. "ఆ శ్రీరామునిభార్యను మాతండ్రి తీసికొనివచ్చెను కదా!" "అవును. నే నతనిదూతను. అతఁడే, నీ మేనత్త శూర్పణఖ ముక్కుచెవులఁ గోసెను." ఈ ప్రకారము వా రిరువురు, మహాబలవంతులు సంభాషించిరి. అంగదుని వాఁడు కాలితోఁ దన్నఁబోయెను. వాని కాలిఁబట్టుకొని, యంగదుఁడు గిరగిరఁ ద్రిప్పి, నేలమీఁదఁ గొట్టెను. ఈ చిత్రముఁ

జూచి, రాక్షసు లతఁడు మహాబలవంతుఁడని తలఁచి, మారుమాటాడక, నలువైపులకుఁ బోయిరి. అతఁ డేమిచేయునో యని వారు తలఁచి, యొకరితోనొకరు పలుకక, నిశ్చేష్టులయిరి. ఇతఃపూర్వము లంకను దహించినవానరుఁడు మరల లంకకువచ్చెనని తెలిసికొని, రాక్షసులు దిగులుపడిరి ; నగరమంతటఁ గోలాహలముఁ బుట్టెను. అంగదుఁ డెటువైపుఁ జూచిన, నటువైపు నిలిచియుండిన రాక్షసులందఱు భయాక్రాంతులయిరి ; వారు నిశ్చేష్టులయిరి ; అతఁడు ప్రశ్నఁ జేయకఁబూర్వమే, వా రతనికి మార్గముఁ జూపిరి. ఎవనిపై నంగదునిదృష్టిపడిన, వాఁడు భయముచే వెలవెలఁ బోయెను.

దోహా 34

శ్రీరామచరణములను స్మరించి, అంగదుఁడు రావణునిసభలోఁ బ్రవేశించెను. ఆ మహాబలవంతుఁడు, ఆరణధీరుఁడు, సింహమువలె నవలోకించుచు, సభలోఁ బ్రవేశించెను.

చౌపాయ్

అతిత్వరితముగ నొకదూత వెళ్ళి, అంగదుని యాగమనమును రావణునకు విన్నవించెను. "ఆవానరుని శీఘ్రము మాసముఖమునకుఁ దీసికొని రమ్ము" అని రావణుఁ డాజ్ఞాపించెను. ఆ దూతవచ్చి, కపికుంజరుని రావణునివద్దకుఁ దీసికొని వెళ్లెను. అతనిం జూచి, చైతన్యముగల కాటుకపర్వతమో యని అంగదుఁడు తలఁచెను. ఇరువదిభుజములు వృక్షశాఖలను; దశశిరస్సులు, పర్వతశిఖరములను; శరీరముపైనుండినరోమావళి, లతలను; ముఖమును, నేత్రములును, ముక్కును, కొండగుహలను బోలియుండెను. అంగదుఁడు మహారణధీరుఁడు కనుక, నిర్భయముగ రాజసభలోఁ బ్రవేశించెను. ఆవానరునిఁ జూచి, సభికులు దిగ్గునలేచి కూర్చుండిరి. "మేముసహితము ప్రత్యుత్థానముఁ జేయవలయునా ?" అని రావణునకు శంకపుట్టెను. వానిమనస్సు క్షోభించెను.

దోహా 35

మదగజములమధ్య నిర్భయముగ విహరించు పంచాననమువలె, నతఁడు, శ్రీరాముని ప్రతాపమువలన సభలోఁ బ్రవేశించి, వారికి నమస్కరించి, కూర్చుండెను.

చౌపాయ్

"ఓ వానరుఁడా! ఎవఁడవు నీవు?" అని రావణుఁ డడిగెను. "ఓ రాజా! నేను శ్రీరాముని దూతను." "నీ యాగమనమునకుఁ గారణ మేమి?" "ఓ రావణా! నాతండ్రికిని నీకును స్నేహముండెను. అందుచేతఁ, గొన్ని మంచిబుద్ధులఁ జెప్పుటకు నీవద్దకు వచ్చితిని. సావధానముగ నామాటలను వినుము. ఓ రావణా! నీవు సత్కులములో జన్మించితివి. నీతాత పులస్త్యబ్రహ్మ; బ్రహ్మమహేశ్వరుల నారాధించితివి; అనేకవరములఁ బొంది, సర్వకార్యములను నిర్వహించితివి; ఇంద్రాదిదిక్పతులను జయించితివి. ఓ రాక్షసరాజా! అభిమానము చేతనో, మోహముచేతనో, రాజమదాంధముచేతనో, ఏకారణము చేతనో, నీవు, ఆజగదంబను, ఆజానకిని, దీసికొని వచ్చితివి; అది మంచి పనికాదు. నేఁజెప్పినప్రకారము నీవు సంచరించినయెడల, నీయపరాధమును శ్రీరాముఁడు క్షమించును. నోటిలో గడ్డిఁగఱచుకొని, నీమెడకుఁ గత్తినిఁ దగిలించుకొని, మందోదరి మొదలగు రాక్షసస్త్రీలకు ముందు జానకినిఁ బెట్టుకొని, వారితోఁ గూడి నీవు నిశ్శంకముగ రామునివద్దకుఁ బొమ్ము.

దోహా 36

"'ఓ దీనదయాపరుఁడా! త్రాహి, త్రాహి' అని నీవు మొఱవెట్టుకొనుము. శ్రీవారు నిన్ను రక్షించెదరు." ఈప్రకార మంగదుఁడు చెప్పినమాటలను రావణుఁడు విని, యిట్లు తర్కించెను.

చౌపాయ్

"ఓరీ వానరాధమా! లెస్సగవిచారింపక, నీవు పలుకుచుంటివి; ఓరీ మూర్ఖుఁడా! నేను దేవశత్రువునని నీకుఁ దెలియదా? ఓరీ! నీపేరేమి! నీ తండ్రి పేరేమి? నీకును నాకుఁగలసంబంధముఁ జెప్పుము?" "ఓ రావణా! నాపేరు అంగదుఁడు; నేను వాలికుమారుఁడను. మీ యిరువురకు సఖ్యముండెను." అంగదునివచనములను రావణుఁడు విని నిశ్చేష్టుఁడయ్యెను. "వాలియని యొకవానరుఁడా? సత్యము, సత్యము. వాలియని యొకవానరుఁడు పూర్వకాలములో నుండెను. ఓరీ అంగదుఁడా! ఆ వాలికుమారుఁడవా, నీవు? ఆహా! నీవంశమును ధ్వంస

ముఁజేయుటకు నీవు నిప్పువంటివాఁడవే? నిన్ను ధరించినగర్భము వ్యర్థమయ్యెను; నీజన్మము తగులఁబడెను. అంతటి వీరునికుమారుఁడవై యుండి, నీవాతపస్వికి దూత్యముఁ జేయుచుంటివి? ఏమి నీకు సిగ్గు లేదా? నీతండ్రి క్షేమమా!" ఈప్రకారము రావణుఁడు పలికిన పలుకుల నంగదుఁడు విని, పక్కున నవ్వెను. "ఓ రావణా! ఇఁకఁ బది దినములు గడచిన నీవు స్వయము వాలివద్దకుఁ బోయి, యాతనిఁ గౌఁగిలించుకొని, వాని క్షేమము నడుగుము. శ్రీరామునితో విరోధించుట వలన లభించు క్షేమమునుగుఱించి, వాలి నీతోఁ జెప్పును. ఓరీ మూర్ఖుఁడా! ఎవఁడు తనహృదయమునందు శ్రీరాముని గ్రహింప లేఁడో, వానికి వాఁడే శత్రువు సుమీ!

దోహా 37

"ఓరీ రావణా! రఘురాముని సేవించుటవలన, నేను కులపాతకుఁడను; శ్రీవారితో విరోధించుటవలన, నీవు నీకులమును రక్షించుకొనుము; ఇరువది నేత్రములును, ఇరువదిచెవులును నీకుఁ గలవుకదా! చెవులును గన్నులును లేనివాఁడు, నీవు బుద్ధిహీనుఁడవని చెప్పును. ఏకులమును నీవు రక్షింపఁదలఁచితివో, నేనాకులమును నశింపఁజేయఁ దలఁచితిని.

చౌపాయీ

"ఏమహాత్ముని చరణారవిందములను సేవించుటకు బ్రహ్మమహేశాదిదేవతలు ఎల్లపు డభిలషించెదరో, నేనా మహాత్మునికార్యమును సాధించుటకు దూత్యమును స్వీకరించినందున, నాకులమునకు మచ్చ వచ్చెను. ఈమాట నీవు పలికినందుకు, నీహృదయము బ్రద్దలు కావలెను." ఈప్రకార మంగదుఁడు కర్ణకఠోరముగఁ బలికినపలుకులను రావణుఁడు విని, ఘూర్ణిల్లి, "ఓరీ! కులపాతకుఁడా! నీవచనము లతి పరుషములు; రాజనీతిధర్మములను గుర్తెఱింగినవాఁడను కనుక, నీమాటలను సహించితిని." అని పలికెను. "ఓరీ రావణా! నీధర్మమును, సుశీలతను విని యుంటిని. నీవంటి ధర్మాత్ముఁడు లేఁడు; కనుక, నీవు పరస్త్రీని దొంగతనముగ నపహరించితివి. నీయన్న కుబేరుఁడు పంపించినదూతను, నా కన్నులయెదుట భక్షించితివి; ఏప్రకారము నీవు రాయభా

రులను రక్షించి సన్మానించెదవో, నాకు బోధపడెను. నీవు సముద్రములో మునిఁగి చనిపోయినయెడల క్షేమము. నీకు సిగ్గులేదా! ఇది వఱలో నొక వానరునితోఁకకు నీవు నిప్పంటించి యుండలేదా? ఏమి నీధర్మము? నీచెల్లెలి ముక్కుచెవులు ఛేదింపఁబడినపుడు, నీవు ధర్మమును విచారించి క్షమించితివి; సత్యము, సత్యము; నీధర్మము లోకమంతట వ్యాపించెను. ఏమి నాభాగ్యము? నీవంటి ధర్మాత్మునిదర్శనమయ్యెను?"

దోహా 38, 39

"ఓరీ వానరాధమా! అసందర్భపుమాటలఁ జాలింపుము; రాహువు చంద్రునికాంతిని యపహరించువిధమున, నేను దిక్పాలుర గర్వము నపహరించితిని.

"యద్బాహురాహు రసనాయతశస్త్రధారా, దిక్పాలకీర్తిమయచంద్రమసం గ్రసంతే." (అని భోజచంపు). చూచితివా! ఓరీ వానరా! ఆకాశమనునట్టి సరోవరములో, నా హస్తకమలముపైని, శివునితోఁగూడిన శ్వేతకైలాసపర్వతము హంసవలె శోభించెను.

చౌపాయ్

"ఓరీ అంగదుఁడా! నాతో యుద్ధముఁజేయుటకు, దగినవీరుఁడొకఁడు మీకటకములోఁ గలఁడా? నీప్రభువు భార్యావియోగదుఃఖమువలన, నీరసించెను; అతనికి బలములేదు. అన్నగారిదుఃఖముచే దుఃఖించుచుండిన నతనితమ్ముఁడు కృశించెను; అతఁడు నాతోఁ బోరాడలేఁడు; ఇఁక, నీవును సుగ్రీవుఁడును బరస్పరవిరోధులు; వైరమనునట్టి నదియొడ్డున నిలిచియుండిన రెండు వృక్షములవలె, మీ రిరువురు వైరముతోఁ గూలుచుంటిరి. మీ రిరువురకు రాజ్యకాంక్ష కలదు; మీ రేమి నాతోఁ బోరాడఁగలరు? నాతమ్ముఁడు విభీషణుఁడు పిఱికిపంద; జాంబవంతుఁడు వయోవృద్ధుఁ; అతఁ డేమియుద్ధముఁ జేయఁగలఁడు? నలుఁడును నీలుఁడును శిల్పికర్మప్రవీణులు, వారికి యుద్ధముఁజేయుట తెలియదు. ఒకవానరుఁడు మా లంకానగరమునకు వచ్చియుండెను; వాఁడు మానగరమును దగులఁబెట్టెను; వాఁడుమాత్రము మహాబలవంతుఁడు." ఈమాటల నంగదుఁడు విని పక్కున నవ్వెను. "ఓరీ

రావణుఁడా! ఒకవానరుఁడు నీనగరముఁ దగులఁబెట్టుట సత్యమే? ఒకపిల్లక్రోఁతి నీనగరమునకు నిప్పుఁబెట్టెనని చెప్పినను, నేమూర్ఖుఁడామాటను విని నమ్మును? ఆపిల్లక్రోఁతి మహావీరుఁడని నీవు పొగడుచుంటివి? వాఁడు సుగ్రీవునిదూతలలో నొకఁడు; వాఁడువీరుఁడు కాఁడు; వాఁడు కేవలము శీఘ్రగామి; అందుచేత, వానిని మేము లంకాపట్టణమునకు బంపియుంటిమి.

దోహా 40, 41, 42, 43, 44

"వానిసమాచారము ప్రస్తుతము నీవలన నేను దెలిసికొంటిని. వాఁడు శ్రీవారియాజ్ఞలేకుండ, నీనగరమును దహించినందులకు, సిగ్గుపడి, దాఁగియుండెను; నేటివఱకు వాఁడు మాకుఁ గనఁబడఁడు. నీతో యుద్ధముఁ జేయఁదగినవీరుఁడు మాకటకములో లేఁడని నీవు చెప్పినందులకు, నాకుఁ గోపములేదు; నీమాట సత్యము. స్నేహముగాని వైరముగాని సరిసమానులతోఁ జేయవలయునని ధర్మశాస్త్రము కలదు. సింహము కప్పఁ జంపినయెడల, నెవరు శ్లాఘించెదరు? శ్రీరాముఁడు నిన్ను సంహరించుటకుఁ బ్రయత్నించుట, వారిమర్యాదకు లోపము; నీవంటిక్షుద్రుని సంహరించుట వారిపరువునకుఁ దక్కువ. ఓ రావణా! క్షత్రియధర్మము మహాకఠినము; నీవు బ్రాహ్మణుఁడవు; నిన్నుఁ జంపుట దోషము; అయినను, నీవు పరస్త్రీని యపహరించితివి; నీవు మహాపాతకుఁడవు; నిన్ను సంహరించుటవలనఁ బాపములేదు. క్షత్రియులకు మహారోషముకనుక, శ్రీవారు నిన్ను సంహరించెదరు." ఈమాటలకు రావణుఁడు పక్కున నవ్వెను. ఓరీ అంగదా! వానరులకొక గొప్పగుణము కలదు. వారియజమానుల గొప్పదనముఁ బ్రకటించుచుందురు.

చౌపాయ్

"ఓరీ అంగదుఁడా! వానరులు ధన్యులు; వారి యజమానుని చిత్తముఁ గనిపెట్టి, సిగ్గునువిడిచి, నాట్యముఁ జేయుచుందురు. ఏయాటనాడుమని యజమానుఁడు చెప్పిన, వారా యాటనాడి, ప్రజలకు వినోదముఁ గలిగించెదరు. యజమానుని సంతోషపెట్టుటకు వారనేక చమత్కారచేష్టలఁ జూపించెదరు. ఓరీ అంగదుఁడా! స్వామి చిత్తముఁ గనిపెట్టి సంచరించుట మీ జాతిలక్షణము; అందుచేత, నీప్రభువును

నీవేల స్తోత్రముఁ జేయకయుండెదవు? ఆయా జంతువులగుణములను నేను గ్రహింపఁగలను; అందుచేత, నీ కర్ణకఠోరమగువాక్యములను విని సహించితిని; నీమాటలు నాకు లక్ష్యములేదు." "హాహా! రావణా! ఎంత బుద్ధిమంతుఁడవు? జంతువుల గుణములను గ్రహించుటలో నీతరువాత నితరులఁ జెప్పవలెను. నీసమాచారమంతయు వాయుకుమారుఁడు మాతోఁ జెప్పెను. అతఁడు నీకుమారునిఁ జంపెను; నీనగరముఁ దగులఁబెట్టెను; నీవనమును ధ్వంసముఁ జేసెను. అతఁడు మూఁడుతప్పులఁ జేసినను, నీ వతనికిఁదగిన శాస్తిఁజేయక విడిచిపెట్టితివి కదా! నీచిత్త మింతసరళమని తెలిసికొనియే, నే నిట్లు నీతోఁ గఠోరముగఁ బ్రసంగించితిని; కనుక, నేను నిన్నుఁజూచుటకు శ్రమపడి వచ్చితిని. ఆవానరుఁడు చెప్పినమాటలును, నీప్రవర్తనము సమానముగ నుండెను నీకు సిగ్గులేదు; క్రోధములేదు; అభిమానము లేదు."

దోహా 45

అంగదునివక్రోక్తులు, బాణములువలె, రావణుని హృదయమున నాటెను; ఆమాటలకు వానిగుండెలు బ్రద్దలయ్యెను. వాని కరచరణములాడలేదు; వాఁడు దిగులుపడి చూచెను; వాఁడు పలుకఁదలఁచినను, పలుకలేక పోయెను. చిత్తరువుబొమ్మవలె, వాఁడు కూర్చుండెను.

చౌపాయ్

అంతట వాఁడు ధైర్యము నవలంబించి, "ఓరీ అంగదా! ఇంత బుద్ధిమంతుఁడవు కనుకనే, నీతండ్రిని భక్షించితివి." అని పలికెను; "ఓరీ రావణా! నాతండ్రిని నేనుభక్షించుట మాటకేమి? ప్రస్తుతము నిన్నే భక్షించియుందును; కాని, నా కొకసంగతి స్మరణకు వచ్చెను. ఓరీ దురభిమానీ! నీమూలమున నాతండ్రికీర్తి నిలువఁబడి యుండును; లోకులు నిన్నుఁజూచి, 'వాలి బాహుమూలలో నిమిడియుండిన రావణుఁడు వీఁడ'ని ప్రసంగించెదరు. అందుచేత నిన్ను భక్షింపలేదు. లోకములో ననేకరావణులసంగతి వినియుంటిని; వారిలో నెవఁడవు నీవు? ఒకరావణుఁడు బలిచక్రవర్తిని జయింపఁదలఁచి, పాతాళమునకు వెళ్లెను; అచ్చట నివసించియుండిన బాలురు వానినిఁబట్టుకొని, గుఱ్ఱపుశాలలోఁ గట్టిపెట్టి, కఱ్ఱలతోఁ గొట్టుచుండిరి; అప్పుడు బలిచక్రవర్తి జాలినొంది,

వానిని విడిపించెను. మఱియొకరావణుని, జలజంతువునువలె, సహస్ర బాహువు బంధించెను. ఆకార్తవీర్యుఁడు వినోదార్థము జలక్రీడ నాడి, తదుపరి, వానిని కారాగృహములోఁ బెట్టెను. అప్పుడు పులస్త్యుఁడు వచ్చి, వానిని విడిపించెను.

దోహా 46

"మఱియొకరావణునిసంగతిఁ జెప్పుటకు నాకు శంకకలుగు చున్నది. వాఁడు మాతండ్రిబాహుమూలలో నిమిడియుండెను. ఈ రావణులలో నీవెవఁడవు? సిగ్గునువిడిచి, సత్యముఁ జెప్పుము."

"రేరే రావణ రావణాః కతి బహూ నేతాన్వయం శుశ్రుమః, ప్రాగేకం కిల కార్తవీర్యనృపతే ర్దోర్దండపిండీకృతం, ఏకం నర్తనదాపి తాన్నకబలం దైత్యేంద్ర దాసీగణై, రన్యం వక్తుమపి త్రపామహ ఇతి త్వం తేషు కోన్యోఽథవా" అని హనుమన్నాటకము.

చౌపాయ్

"ఓరీ అంగదుఁడా! మూర్ఖుఁడా! ఎవఁడు స్వభుజపరాక్రమ ముచేఁ గైలాసపర్వతమును మీఁదికెత్తెనో; ఎవఁడు పుష్పములకు మాఱుగ శిరస్సులతో శివునిఁ బూజించెనో; ఎవనిశూరత్వము శివు నకుఁ దెలియునో; ఎవఁడు స్వహస్తములతో స్వంతశిరస్సులను, కమల ములువలెఁ ద్రుంచి, శివుని యారాధించెనో; ఎవనిభుజబలము దిక్పా లురకుఁ దెలియునో; ఎవనినామమును దలంచినమాత్రమున, గుండెల కదరుపుట్టునో; ఓరీ మూర్ఖుఁడా! ఎవని వక్షస్థలకాఠిన్యము దిగ్గజము లకుఁ దెలియునో; ఎవఁడు సంబరముతో వానితోఁ బోరాడెనో; వజ్ర మునుభేదించిన వానిదంతము లెవనిహృదయమునకుఁ దగిలి, ముల్లంగి దుంపలవలె, మూలములతోఁ గ్రిందఁబడెనో; ఎవఁడు నడచినపుడు, ఓరీ! భూమి కంపించునో; మదగజము పాదముఁబెట్టినపుడు పడవవలె, నెవని పాదము సోకినమాత్రమున భూమి డోలాయమానమగునో; ఆ మహావీరుఁడే, ఆశూరుఁడే, ఆరణధీరుఁడే, ఓరీ! ఈ రావణుఁడు సుమీ! నాప్రతాపమును గ్రహించితివా! ఓరీ! నీయసందర్భపు ప్రగల్భములఁ గట్టిపెట్టుము. ఇదివఱకు నాప్రతాపమును వినియుండలేదా?

దోహా 47

"ఓరీ! నీవు పిల్లక్రోఁతివి; నీకు బుద్ధిలేదు; నీ వెంతవాఁడవు? నీప్రభువు, మనుజుఁ డెంతవాఁడు? నీసంగతి గ్రహించితిని." అని రావణుఁడు ధిక్కరించెను.

చౌపాయ్

వానిమాటల కంగదునకుఁ గోపముపుట్టెను. "ఓరీ నీచుఁడా! నీదురభిమానమే నిన్నుఁ బాడుచేయును. కార్తవీర్యుని సహస్రబాహువులను, నగ్నివలె, పరశురాముని గండ్రగొడ్డలి దహించెను. ఆపరశురాముని తీక్ష్ణకుఠారధారలలో ననేకకోట్లరాజులు నశించిరి. ఆ పరశురాముఁడు సహితము శ్రీరామునిఁ జూచి, యభిమానమును విడిచి, శ్రీవారికి జోహారువనెను కదా! ఓరీ దౌర్భాగ్యుఁడా! అట్టి శ్రీరాముఁడు మనుజమాత్రుఁడా! అరే మూర్ఖుఁడా! పాపాత్ముఁడా! పూవిలుకాఁడు సాధారణ ధనుర్ధరుఁడా; భాగీరథి సాధారణ నదియేనా; కామధేనువు సామాన్యపశువేనా; కల్పవృక్షము సామాన్యవృక్షమేనా; అన్నదానము సామాన్యదానమేనా; అమృతరసము సాధారణరసమేనా; గరుత్మంతుఁడు సాధారణపక్షియేనా; ఆదిశేషువు సాధారణసర్పమేనా; చింతామణి సామాన్యశిలయేనా; ఓరీ నీచుఁడా! వైకుంఠము సామాన్యలోకమేనా? శ్రీరాముని చరణకమలములయందు నిశ్చలభక్తియుండుట సాధారణలాభమేనా?

దోహా 48

"ఓరీ! నీసైన్యమును మథించి, నీవనమును ధ్వంసముఁ జేసి, నీకుమారునిఁ జంపిన హనుమంతుఁడు సాధారణ వానరుఁడేనా?

చౌపాయ్

"ఓరీ దుష్టుఁడా! నీ దురభిమానమును విడిచి, నామాటను వినుము; శ్రీరాముని భజింపుము. శ్రీరామునితో విరోధించినవారిని, బ్రహ్మామహేశ్వరులయినను రక్షింపలేరు సుమీ! ఓరీ! నీప్రగల్భములఁ గట్టిపెట్టుము. శ్రీవారితో విరోధించినయెడల, నీకుఁ దగినశాస్తియగును; శ్రీవారిబాణములచేఁ దెగి, నీశిరస్సులు భూమిమీఁదఁ బడును; బంతులతోవలె, వానరులు నీ శిరస్సులతోఁ గ్రీడించెదరు. ఎంతపటుకు

శ్రీవారు యుద్ధములోఁ గోపింపరో; ఎంతవఱకు వారు తీక్ష్ణబాణములను కోదండమునకు సంధింపరో; అంతవఱకు నీకంఠములోఁ బ్రాణము లుండును; ఈసంగతి విచారించి, నీవు శ్రీవారిని సేవింపుము." ఈప్రకార మంగదుఁడు పలికినపలుకులను రావణుఁడు విని, ఆహుతిచేఁ బ్రజ్వరిల్లు హుతాశనునివలెఁ, గ్రోధముచే మండిపడెను.

దోహా 49

"ఓరీ అంగదుఁడా! నా ప్రతాపమును వినుము; ప్రసిద్ధికెక్కిన కుంభకర్ణుఁడు నా తమ్ముఁడు; ఇంద్రుని జయించినవాఁడు నా కుమారుఁడు; ఇఁక నాసంగతిని వినుము; ఈచరాచరజంతుజాలముతోఁగూడిన బ్రహ్మాండములు, నాపేరు చెప్పినమాత్రమున గడగడ వడంకును.

చౌపాయ్

"ఓరీ మూర్ఖుఁడా! వానరులసహాయముచే సేతువుఁ గట్టినమాత్రమున, నతఁడు వీరుఁడగునా! అనేకపక్షులు సముద్రమును దాఁటుచుండును; అంతమాత్రమున, వానికి శూరత్వము కలదా? నా వింశతిభుజములు బలముచేఁ బూర్ణించియుండును. నాభుజబలజలములలో ననేకదేవతలును మనుజులును మునిఁగిపోయిరి. నావింశతి భుజము లగాధములగు మహాసముద్రములు; ఏవీరుఁడు వానిని క్షేమముగఁ దాఁటఁగలఁడు? అరే వానరాధమా! దిక్పాలురు కావడికుండలతో జలమును నాగృహమునకుఁ దీసికొనివచ్చెదరు కదా! ఓరీ! నీప్రభువు ప్రభువని యొక మనుజమాత్రునిగుఱించి యేల ప్రసంగించెదవు? నీప్రభువు మహావీరుఁడని, యతనిగుణములను మాటిమాటికిఁ బ్రశంసించెదవు. నీవు చెప్పినప్రకార మతఁడే వీరుఁ డయినయెడల, నతఁడు నిన్నేల నావద్దకుఁ బంపెను? నాతో సఖ్యముఁ జేయుట కతనికి సిగ్గులేదా? ఓరీ! శివుని కైలాసపర్వతమును మథించిన నా బాహుదండములఁ జూచి, మరల నీవేల నీప్రభువును నుతించెదవు?

దోహా 50

"ఓరీ! రావణునితో సమానుఁ డగుశూరుఁ డొకఁడు కలఁడా! ఆరావణుఁడు స్వహస్తములతో స్వంతశిరస్సులఁ ద్రుంచి, శివునిఁ బూజించెను.

చౌపాయ్

"ఓరీ! అప్పుడు నాకపాలములు మంటలో మండుచుండెను; వానిని నాకన్నులారఁ జూచియుంటిని; వానిపై బ్రహ్మ వ్రాసినవ్రాతను వీక్షించితిని. నాకు మనుజునిచే మృత్యువని బ్రహ్మ వ్రాసెను; అందులకు నాకు నవ్వువచ్చెను. బ్రహ్మ వ్రాసినవ్రాత యబద్ధమని తలంచితిని. అంత మాత్రమున నాకు భయములేదు; అట్లు బ్రహ్మ వ్రాసినందులకు నేను దుఃఖింపను; ఎందుచేతననిన, బ్రహ్మకు వృద్ధాప్యమువచ్చెను; అతని బుద్ధికి స్థిమితము లేదు. ఓరీ! నాయెదుట నిలిచియుండుటకుఁదగిన వీరుఁడెవఁడు? సిగ్గునువిడిచి, నీవేల ప్రగల్భములను వచించెదవు?"—"ఓరీ రావణా! నీవలె సిగ్గుగలవారు మఱియొకరు లోకములో లేరు. స్వగుణములను స్వముఖముతోఁ జెప్పుకొనుటయే సిగ్గుగలవారికి లక్షణము కదా! (సిగ్గుగలవా రటులఁ జెప్పుకొనరు. వారిగుణములను దాచియుంచెదరు.) నీవు సిగ్గులేనివాఁడవు కనుక, నీగుణములను నీవుస్వయము కొనియాడుకొనుచుంటివి. ఓరీ! ఎంతవఱకును నీవు కైలాసపర్వతమును గుఱించియు, శిరస్సులను గుఱించియుఁ బలుకుచుంటివి; వాని మూలమున నీకు గర్వము బలిసెను. ఓరీ! కార్తవీర్యుఁడును, బలిచక్రవర్తియు, వాలియు—ఈముప్వురితో నీవు పోరాడినపుడు నీభుజబల మెచ్చట దాఁగియుండెను? ఓరీ బుద్ధిహీనుఁడా! నెత్తురుకోఁతవాండ్రు శూరులా? వారు స్వహస్తములతో స్వశరీరములనుండి రక్తముఁ దీయుచుందురు; వారు వీరులా? నీవొక నెత్తురుకోఁతవాఁడవు.

దోహా 51

"ఓరీ! పతంగము మోహమునకు వశమై, దీపముపైఁ బడును; గాడిద బరువులను మోయును. ఓరి మందమతీ! వానిని శూరులని యెవరు చెప్పఁగలరు? నీవు గ్రహించుకొనుము.

చౌపాయ్

"ఓరీ మూర్ఖుఁడా! నీప్రగల్భములఁ జాలింపుము; నీ దురభిమానమును విడిచిపెట్టుము; నామాటను మన్నింపుము. ఓరీ రావణా! నీతో సఖ్యముఁజేయుటకు రాలేదు; అందునిమిత్తము శ్రీవారు నన్ను నీవద్దకుఁ బంపలేదు. మాటిమాటికి శ్రీరాముఁడీప్రకారము చెప్పెను.

'సృగాలముఁ జంపినందున, సింహమునకుఁ గీర్తివచ్చునా?' శ్రీరామ వచనములను స్మరించి, నీకర్ణకఠోరవాక్యములను సహించితిని; అట్లు కానియెడల, నిదివఱకే నిన్ను సంహరించి, జానకినిఁ దీసికొని వెళ్లియుం దును. ఓరీ నీచుఁడా! నీవు బలవంతుఁడవని గ్రహించితిని; నీవు బల వంతుఁడవు కనుకనే, రక్షకులులేక నిరాధారముగ నుండినస్త్రీని దొంగి లించి, తీసికొని వచ్చితివి. ఓరీ రావణా! అధికారముకలదని, నీకు గర్వము బలిసెను. నేను శ్రీవారిసేవకుఁడను; సుగ్రీవునిదూతను. శ్రీ వారిప్రతిష్ఠకు భంగమువచ్చునని భయపడుచుంటిని; లేనియెడల, నవ లీలలో నిన్ను సంహరించియుందును.

దోహా 52

"ఓరీ తుచ్ఛుఁడా! నిన్ను, నీసైన్యమును సంహరించి, మందో దరి, జానకి మొదలగుస్త్రీలతో నీ లంకాపట్టణముఁ దోఁకకుఁ జుట్టి, తీసికొని పోఁగలవాఁడను. నాసంగతి గ్రహించితివా?

చౌపాయ్

"ఓరీ! ఇంతపనిఁ జేసినను, నాకు గొప్పలేదు. ఎందుచేత! జీవ న్మృతులఁ జంపినందున, నేమి కీర్తిప్రతిష్ఠలు వచ్చును? (1) జాతిభ్ర ష్టుఁడు, (2) కామాతురుఁడు, (3) కృపణుఁడు, (4) విమూఢుఁడు, (5) దరిద్రుఁడు, (6) అపకీర్తికలవాఁడు, (7) వయోవృద్ధు, (8) రోగపీడి తుఁడు, (9) క్రోధి, (10) శ్రీరామవిముఖుఁడు, (11) శ్రుతిసజ్జనవిరోధి, (12) ఉదరపోషకుఁడు, (13) పరులను నిందించువాఁడు, (14) పాపా త్ముఁడు. ఈ పదునాల్గురు జీవన్మృతులు; వీరు జీవించియుండినను, మృతి నొందినవారితో సమానులు; కనుక, ఓరీ! నేను నిన్నుఁ జంపను. నాకు మాత్రము కోపముఁ బుట్టింపకుము." ఈమాటలకు రావణుఁడు కోప గించి, పెదవులఁ గఱచుకొని, చేతుల నలుపుకొని, ఘూర్ణిల్లెను. "ఓరీ! 'పిట్టకొంచెము, కూతఘనము' అనినట్లు, చూచుటకు నీవు పిల్లకోఁ తివి; కాని, నీవు పెద్దమాటలను వదరుచుంటివి. ఏమనుజుని ప్రాపకముఁ జూచి నీవిట్లు కర్ణకఠోరముగ వదరుచుంటివో, వాఁడేపాటిబలవం తుఁడు? ఏపాటి బుద్ధిమంతుఁడు? ఏపాటి తేజశ్శాలి? ఏపాటి పరా క్రమముకలవాఁడు? వానికేమియు లేవు.

దోహా 53, 54

"నీ ప్రభువు అవగుణముల పుంజము; అతనికి మానములేదు; అందుచేత నతనితండ్రి యతనిని గృహమునుండి వెడలఁగొట్టెను. ఒకటి దుఃఖము; రెండు స్త్రీవియోగము; మూఁడు నాభయము; ఈ మూడింటితో నతఁడు దివారాత్రములు కాలము గడుపుచుండెను. అతఁడు బలవంతుఁడని తలఁచి, నీవు గర్వించితివి. అనేకమనుజులను రాక్షసులు నిత్యము భక్షించెదరు. ఓరీ! నీగర్వమును విడిచిపెట్టుము; రాముఁ డసమర్థుఁడు; ఏమియుఁ జేయలేఁడు. నిశ్చయము."

చౌపాయ్

ఈ ప్రకారము రావణుఁడు రాముని నిందించుటవలన నంగదు నకుఁ గోపము వచ్చెను. విష్ణుమహేశ్వరుల నిందించువారిని సహించిన యెడల, వారికి గోహత్యాపాపము సంభవించునని యతఁడు తలఁచెను. అతఁడు రౌద్రాకారుఁడై, సింహనాదముఁ జేసి, రెండుచేతులను భూమి మీఁదఁ గొట్టెను; ఆ హస్తప్రహారణమునకు, భూమి కంపించెను. సభి కులముఖములు తిరిగెను; భయముచేత, వారి కరచరణము లాడ లేదు; రావణుఁడు గిరగిరతిరిగిపడి, సవరించుకొని లేచెను. వాని పది కిరీటములును నేలఁ బడెను. ఆరుకిరీటములను వాఁడు శిరస్సులపై ధరిం చెను; నాలుగుకిరీటముల నంగదుఁడు తీసికొని, శ్రీవారివద్దకుఁ బంపెను. ఆ కిరీటములను వానరులు చూచి, భయపడి, "అయ్యయ్యో! ఉల్కాపాతములు పగలు పడుచుండెనే" అని విచారించి, పరుగెత్తిరి. రావణుఁడు కోపించి, వారిపైఁబంపిన నాలుగు వజ్రపుతునకలని వారు భావించిరి. వానరులకోలాహలమును శ్రీరాముఁడు చూచి, నవ్వి, "ఓ వానరులారా! భయపడకుఁడు. ఉల్కాపాతములు కావు; వజ్రములు కావు; కేతువు కాదు; రాహువు కాదు; అవి రావణుని కిరీటములు; అంగదుఁడు వానినిఁ బంపినందున, నవి యెగిరి వచ్చుచుండెను." అని పలికెను.

దోహా 55

మహావీరుఁ డెగిరి, వానినిఁ బట్టుకొని, శ్రీరామునివద్దకుఁ దీసికొని వచ్చెను. వానికాంతులు సూర్యునివలెఁ బ్రకాశించుచుండెను; వానిఁజూచి, కపు లాశ్చర్యపడిరి.

చౌపాయ్

"ఓ రాక్షసులారా! ఈవానరునిఁ బట్టుకొని సంహరింపుఁడు; వాఁడు పారిపోకుండ, జూడుఁడు. మీరా వానరసైన్యముపైఁ బడి, వానరులను జాంబవంతులను భక్షింపుఁడు. నాయాజ్ఞఁ జాటించి, నిశ్శేషముగ వానరుల సంహరించి, ఆ రామలక్ష్మణుల భక్షింపుఁడు." ఈప్రకారము రాక్షసాధిపతి యాజ్ఞఁ జేసెను. వానిమాటల కంగదునకుఁ గోపమువచ్చెను. "ఓరీ మూర్ఖుఁడా! నీముఖమునకు సిగ్గులేదా? ఎందులకు నీవిట్లు వదరుచుంటివి? ఓరీ కులఘాతకుఁడా! ఉరిఁబోసికొని, నీవు చనిపోయిన మేలు; నా బలపరాక్రమములఁ జూచి, నీహృదయ మేల బ్రద్దలుకాలేదు? ఓరీ స్త్రీచోరుఁడా! దుష్టుఁడా! మందమతీ! పాపాత్ముఁడా! ఓరీ కామార్తుఁడా! ఓరీ దుర్మార్గుఁడా! ఓరీ! కాలము నీకు సన్నిహితమయ్యెను; అందుచేత, నీవిట్లు వదరుచుంటివి. నీవు నరభక్షకుఁడవు; అయినను, నీకు మృత్యువు సమీపించెను. ఓరీ! రణరంగముమీఁద నీశిరస్సులను వానరులు తన్నినపుడు, నీవు దీనిఫలము ననుభవించెదవు. ఓరీ! శ్రీరాముఁడు మనుజమాత్రుఁడా? ఆమాటఁ బలికినందులకు, నీనాలుక తెగిపడిన మేలు. నిశ్చయముగ నీశిరస్సులును నాలుకలునుఁ దెగి భూమిమీఁదఁబడును; సందేహము లేదు.

సోరఠా 4, 5

"ఓరీ రావణా! ఓరీ నీచుఁడా! నీజన్మము కాల్చనా? నీ యిరువదికండ్లు కాలిపోయెనా? ఒక్కబాణముతో వాలిని సంహరించిన ప్రభువు మనుజమాత్రుఁడా? శ్రీవారిబాణములు నీరక్తముఁ ద్రాగుటకుఁ గోరుచుండును. ఓరీ నిశాచరాధమా! అందుచేత నిన్ను విడిచితిని.

చౌపాయ్

"ఓరీ! నీదాడపండ్లు రాలఁగొట్టవలెనని యున్నది; కాని, నేనేమిచేయఁగలను? శ్రీవారి శలవులేదు. నా కింతకోపము వచ్చుచున్నది;

నీపదిబుఱ్ఱలఁ జితుకఁబొడిచి, నీలంకాపురమును సముద్రములోఁ బాఱ వేయవలెనని యున్నది. నీపట్టణము మేడిపండువంటిది; రాక్షసులు దానిలోనివసించు పురుగులువంటివారు. నేను వానరుఁడను కనుక, నేనాఫలముఁ దినుటకు వెనుకఁదీయను; కాని, శ్రీరామాజ్ఞ లేదు; నేనేమి చేయఁగలను?" ఈప్రకార మంగదుఁడు పలికినయుక్తులను రావణుఁడు విని పకపక నవ్వెను. "ఓరి వానరా! ఈప్రగల్భములఁ బలుకుట యెచ్చట నేర్చుకొంటివి? ఎన్నడు నీతండ్రి యిట్లు పలికి యుండలేదు; ఈబకవాదమును నీవా తపోవేషధారులవద్ద నేర్చుకొనినట్లు కనఁబడును." "ఓరీ రావణా! యుద్ధములో నేను నీనాలుకల నూడఁబెఱుకనియెడల, నామాటలు ప్రగల్భములని తలంచుము." ఈప్రకార మంగదుఁడు పలికి, శ్రీరామునిస్మరించి, క్రోధతామ్రాక్షుఁడై, ప్రతిజ్ఞఁ జేసి, తనపాదమును భూమిమీఁద మోపెను. ("తృణతే కులిశ కులిశ తృణ కరఈ". "శ్రీరఘువీర ప్రతాపతే, సింధుతరే పాషాణ." "గరుఅ సుమేరు, రేణు సమతా-ఈ"—ఇత్యాదివచనముల యం దతనికి విశ్వాసము కలదు కనుక, నతఁ డిట్టిప్రతిజ్ఞఁ జేసెను.) "ఓరీ మూర్ఖాగ్రేసరుఁడా! ఈనాపాదమును మీరు కదలించినయెడల, శ్రీరాముఁ డోడినట్లు తలంచెదను; నేను సీతను విడిచిపెట్టెదను. ఇది నిశ్చయము." (అంగదుఁడు శ్రీరాముని ప్రతినిధి; ప్రతినిధికి సర్వాధికారములు కలవు; ఈమాటలలో దోషము లేదు.) ఈప్రకార మంగదుఁడు పలికినపలుకులను రావణుఁడు విని, "ఓయీ యోధులారా! మీరు వానిపాదముఁ బట్టుకొని, భూమిపైఁ బడఁద్రోయుఁడు." అని యాజ్ఞాపించెను. మేఘనాదుఁడు మొదలగుమహావీరులు దిగ్గునలేచి, నిలువఁబడిరి. అనేకవిధముల నతనిపాదమును వారు కదలింపఁజూచిరి; కాని, వారిప్రయత్నములు వ్యర్థములయ్యెను. శిరఃకంపములఁ జేసి, వారు సిగ్గుపడి కూర్చుండిరి. కుత్సితపురుషుఁడు మోహావృక్షముఁ బడఁద్రోయుటకు సమర్థుఁ డగునా? అటులనే, దేవకంటకుఁ డనేకవిధముల నతనిపాదముఁ గదలింప యత్నించెను; కాని, వానియత్నములు విఫలమయ్యెను.

దోహా 56

ఓ గరుడా! కోటివిఘ్నములఁ జేసినను, సత్పురుషుని నీతిమార్గమునుండి తప్పించలేము కదా! అటులనే, యతనిపాదమును వారు కదిలింపలేక పోయిరి; ఆనిశాచరుల పొగరుఁబోతుఁదనమునకు భంగము వచ్చెను.

చౌపాయ్

ఆ వానరవీరుని బలముఁజూచి, రాక్షసులు నిశ్చేష్టులయిరి; అప్పుడు రావణుఁడు స్వయము వానిపాదముఁ బట్టుకొని, వానిని మీఁదికినెత్తుటకు సిద్ధపడెను. అంగదునకు రావణుఁడు యజమానుఁడు; తండ్రితో సమానుఁడు. తదనంతరము, వానిని రాముఁడు స్వయముగఁ జంపును. అందుచేత, నతఁడు పాదములఁ బట్టుకొనుటకు వచ్చినను నంగదుఁ డతనిని నిషేధించెను. "ఓరీ రావణా! నీవు శ్రీరామచరణముల నాశ్రయించి, సేవించినయెడల, నీకు ముక్తికలుగును." ఈమాటను రావణుఁడు విని, సిగ్గుపడి మూర్ఛిల్లెను. అతనితేజస్సు విడిపోయెను; అతని కళాకాంతులన్నియు నశించెను. పగలు చంద్రునికాంతివలె, నతఁడు మలమల మాడిపోయెను. ఆ జగదాధారునకు, ఆ ప్రణతార్తిహారునకు విముఖుఁ డయినవానికి మనోస్వాస్థ్య మెట్లు కలుగును? ఆ రావణుఁడు శిరస్సుఁగొట్టుకొని, సింహాసనముపైఁ గూర్చుండెను. ఓ పార్వతీ! శ్రీరాముని భ్రూవిలాసమువలన, లోకముల సృష్టిస్థితిసంహారములు జరగును; తృణము మహామ్మేరువుతోను, మహామ్మేరువు తృణముతోను సమానమగును. ఆమహాత్ముని దూతపాదమును వారు కదలింపఁగలరా? ఇదియే దానికి దృష్టాంతము. పిమ్మట ననేకవిధముల నతఁడు రావణునకు నీతిమార్గములను బోధించెను కాని, వానికి మృత్యువు సమీపించెను; కనుక నతనిమాటలను వాఁడు లక్ష్యముఁ జేయలేదు. వానికి గర్వప్రాయశ్చిత్తమగునట్లు శ్రీరామునిగుణముల నతఁడు చెప్పి, వెడలెను. "ఓరీ రావణా! నీతో నధికప్రసంగముఁ జేయుటవలనఁ బ్రయోజనము లేదు; యుద్ధములో నిన్నుఁ జంపఁగలము." అంగదుని బలపరాక్రమములఁ జూచి, రావణుఁడు దుఃఖించెను. ప్రథమమున

నంగదుఁడు రావణునికుమారునిఁ జంపెను; ఆ వర్తమానమును వాఁడు విని, విలపించెను.

దోహా 57, 58

ఈప్రకార మంగదుఁడు శత్రువులను మథించి, యుత్సాహముతో వెడలెను. అతని నేత్రములవెంబడి, నానందబాష్పములు కురిసెను. అతనిశరీరము పులకరించెను. అతఁడు శ్రీరామునిచరణములకు నమస్కరించెను. అంతట సాయంసమయమయ్యెను. అత్యంతవ్యాకులముతో నంతఃపురములోనికి రావణుఁడు వెళ్లెను. అనేకవిధముల వానికి మందోదరి బోధించెను.

చౌపాయ్

"ఓ నాథా! నామాటలను లెస్సగ విచారింపుము; నీ మూర్ఖత్వమును విడిచిపెట్టుము; రామునితో విరోధించుటవలన, నీకు శ్రేయస్సుకలుగదు. లక్ష్మణుఁడు ధనస్సుతో గీచినగీటును నీవు దాఁటలేకపోతివి; నీపౌరుషము విశదమయ్యెను. ఓ ప్రాణనాథా! నీవా లోకారాధ్యునితోఁ బోరాడఁ దలఁచితివి? అతనిసేవకుఁడు నీపట్టణమునకు వచ్చి, యెంతపనిఁ జేసియుండెనో నీవు చూచియుంటివి కదా! ఆసేవకుఁడు సముద్రమును, గోష్పాదమునువలె దాఁటి, నీనగరమునకు వచ్చి, సీతం జూచి, నీకుమారులఁ జంపి, అశోకవనమును ధ్వంసముఁ జేసి, రాక్షససైన్యములఁ దునుమాడి, నీపట్టణమును దహించెను కదా! అప్పుడు నీగర్వమును బలమును నిద్రించుచుండెనా? ఓ స్వామీ! నీప్రగల్భములఁ జాలింపుము. నావచనములను మన్నింపుము. శ్రీరాముఁడు మనుజమాత్రుఁడని నమ్మకుము. అతఁడు మహాబలవంతుఁడు. చరాచర జగత్తులకు నాథుఁడు. ఈసంగతిఁ దెలిసికొనుము. శ్రీరాముని బాణముల ప్రతాపము మారీచునకుఁ దెలియును; వాఁడు నీతోఁ జెప్పినను, నీవు మూర్ఖత్వముచే వానిమాటలఁ బాటింపలేదు. నీవు చూచియుంటివికదా! జనకునిసభలో ననేకరాజులు కూర్చుండిరి. నీ బలగర్వముచే, నీవుసహిత మాసభకు వెళ్లియుంటివి; ఆసభలో నీకేమిప్రయోజనము లేదు; శ్రీరాముఁడు మీరందఱు చూచుచుండ, శివుని విల్లునువిఱచి, జానకిని వివాహమాడెను. ఆరాముని నీవు యుద్ధములో జయింపఁ

గలవా? అప్పుడుమాత్రము మీ గతనితోఁ బోరాడఁగలిగితిరా? శ్రీరాముఁడు కాకాసురుని ప్రాణములతో విడిచి, వానినేత్రమును బుచ్చుకొనెను; అందుచేత, వాఁడు రామునిబలమును గొంచెము గ్రహించెను. నీచెల్లెలు, శూర్పణఖకు సంభవించినదుర్గతి నీవు కన్నులారఁ జూచియుంటివి; కాని, నీకు సిగ్గులేదు; నీమనస్సునకు భీతాహములు లేవు.

దోహా 59

"అతఁడు విరాధుని వధించెను; ఖరదూషణాదులను సంహరించెను; కబంధుని యొకబాణముతోఁ జంపెను; ఒకబాణముతో వాలి ప్రాణములఁ బుచ్చుకొనెను; ఓ రావణా! ఈసంగతులను విచారింపుము.

చౌపాయ్

"వినోదార్థముగ, నతఁడు సముద్రమును బంధించెను; వానర సైన్యములతో వచ్చి, యతఁడు సువేలాచలముపై విడిది దిగెను. ఆ సూర్యవంశతిలకము కరుణామయుఁడు; నీక్షేమముకొఱకు, నీవద్దకు మంత్రినిఁ బంపెను. మదగజములను సింహమువలె, నా రామదూత మీసభలోఁ గూర్చుండి, మీబలగర్వములను మర్దించెను. అంగదుఁడును మహావీరుఁడును శ్రీరామునకు సాధారణపుదూతలు; వారే మహావీరులని నీ యభిప్రాయము; కాని, వారికంటె మహాబలులు వారి సైన్యములోఁ గలరు. ఓ నాథా! నీకు దురభిమానము బలసెను; రాజ్యమదము నీకన్నులఁ గప్పెను. నీవు రామునితో విరోధించుట వలన, కాలుఁడు నిన్నావహించెను; అందుచేత, నీజ్ఞానము శూన్యమయ్యెను; ఒకరుచెప్పిన మంచిమాటలు నీచెవులఁ బట్టవు. కాలుఁడు స్వయమువచ్చి, యెవరిని కఱ్ఱతోఁ గొట్టఁడు. అయా మనుజులబుద్ధిని, బలమును, ధర్మము నతఁ డపహరించును. ఓ నాథా! కాలుఁడు సన్నిహితమగునపుడు, నీకువలె, మనుజులకు భ్రమపుట్టును.

దోహా 60

"ఓ నాథా! చూడుము; అతఁడు నీ కుమారులనిరువురను సంహరించెను; నీపట్టణమును దహించెను. ఇప్పు డతనికి నీవేమి ప్రత్యుత్తరము నిచ్చెదవు? ఇప్పటికిని వ్యవధికలదు. ఆ కరుణాసముద్రుఁడగు

శ్రీరాముని భజించి, కీర్తిఁబొందుము. నిష్కారణముగఁ గులమును నశింపఁజేయకుము."

**చౌపాయ్**

ఈప్రకారము మందోదరి పలికినపలుకులు బాణములువలె, వాని హృదయమునకుఁ దగిలెను. అంత ప్రాతఃకాలమయ్యెను; వాఁడు సభలోఁ బ్రవేశించెను. ఉప్పొంగినశరీరముతో వాఁడు సింహాసనము నధిష్ఠించెను. మూర్తీభవించిన దురభిమానమువలె, వాఁడు కనఁబడెను. అంగదుఁడు చెప్పినమాటలను, మందోదరి యుపదేశములను, వాఁడు శుభ్రముగ మఱచెను. (అధికపాఠము) అప్పుడు వాఁడు విచారించి, విద్యుజ్జిహ్వుఁ డనురాక్షసునిఁ బిలిచి, "ఓరీ! రాముని శిరస్సును, ధనుర్బాణములను మాయచేఁ బన్ని, వానినిఁ దీసికొని రమ్ము; వానింజూచి జానకి నిజమని తలఁచి, దుఃఖింపవలెను" అని యాజ్ఞాపించెను. ఆమాటలను విని, విద్యుజ్జిహ్వుఁడు దిగ్గున లేచి, వెళ్లెను. వాఁడు మాయధనుర్బాణములను రాముని శిరస్సునురచించి, రావణున కిచ్చెను. అవి నిజముగ రామునిశిరస్సుతోను ధనుర్బాణములతోను సమానముగ నుండుటఁ గ్రహించి, రావణుఁడు సంతోషించి, దిగ్గున లేచి, యశోకవనమునకు వెళ్లి, వానిని జానకియెదుట నుంచి, యిట్లు పలికెను. "ఓ సీతా! ఎవనిగుణములను దివారాత్రములు గానముఁ జేయుచుంటివో, వానిశిరస్సును ధనుర్బాణములఁ జూడుము. వానరసైన్యములను నిశ్శేషముగ సంహరించితిని. లక్ష్మణుఁడు ప్రాణములఁ దక్కించుకొని, పాఱిపోయెను.

**దోహా 1**

"ఓ జానకీ! నీకు నమ్మకముకలుగుటకు, రామునిశిరస్సును ధనుర్బాణములఁ దీసికొని వచ్చితిని." వానింజూచి, జానకి విలపించెను.

**చౌపాయ్**

ఆసమయమున నామె పొందినదుఃఖము నెవరు చెప్పఁగలరు? అనేకప్రకారముల నామె రామునిగుణములను స్మరించి, నేలఁబడి పొర్లి, యేడ్చెను; తుదకామెకు శరీరస్మారకము తప్పెను. ఆమెదుఃఖముఁ జూచి, రాక్షసాధములు ముసిముసినవ్వుల నవ్వుచుండిరి; అంతలో నలువైపుల జయజయశబ్దములు వినఁబడెను; "కౌసలపతి, రామకీ

జయ్'' అని వానరులు కేకలువేయుచు, లంకాపురమును ముట్టడించిరి. ఆశబ్దమును రావణుఁడు విని, సీతనువిడిచి, సభకు వచ్చెను. అంతలో విభీషణునిభార్య, సరమ సీతవద్దకు వచ్చి, యామెకు బోధించెను. ''ఓ తల్లీ! సీతమ్మా! ఇదియంతయు రాక్షసులమాయయని విశ్వసింపుము. చూడుము; వానరులు లంకాపట్టణమును ముట్టడించిరి. నిజముగ రావణుఁడు రాముని వధించినయెడల, నీవానరు లేల 'రామకీ, జయ్' అని కేకలువేయుచు, నగరమును ముట్టడించెదరు? ఇది యబద్ధము కనుక, రావణుఁడు నిన్నువిడిచి, పాఱిపోయెను.

దోహా 2, 3

''ఓ తల్లీ! ఈ రాక్షసమాయోపాయములు నాకుఁ దెలియును. నీతో సత్యముఁ జెప్పుచున్నాను; తల్లీ! నమ్ముము. ఈదినము ప్రాతఃకాలమున, రామలక్ష్మణులను వానరసైన్యములను జూచియుంటిని; వారు క్షేమముగ జీవించియున్నారు.'' ఈప్రకారము సరమాదేవి చెప్పినమాటలను జానకి విని, సంతోషించి, ధైర్యము నవలంబించి, 'రామ, రామ' అని జపముఁ జేయ నారంభించెను. ఆమెదుఃఖము నశించెను. (అధికపాఠము సమాప్తము.)

చౌపాయి

అప్పుడు శ్రీరాముఁడు వాలికుమారునిఁ బిలిచెను. అతఁడు వచ్చి, శ్రీవారిచరణములకు నమస్కరించెను. ఆరాక్షసాంతకుఁడు, ఆకరుణాసముద్రుఁ డతని నాదరించి, చిఱునవ్వు నవ్వి, యతనిని దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొనెను. ''ఓ వాలిపుత్రా! నామనస్సులో నొకకోరిక కలదు; నాప్రశ్నలకు సత్యముఁ జెప్పుము. రాక్షసకులమునకు రావణుఁడు శిరోమణి; వాని బాహుబల మపారము; వాని ప్రతాపము లోకవిదితము; వాని నాలుగుకిరీటములను నావద్దకు నీవెట్లు పంపించితివి? ఆసంగతిఁ జెప్పుము.'' అని శ్రీరాముఁ డతనిని యడిగెను. ''ఓ నాథా! మీరు సర్వజ్ఞులు; దీనదయాపరమూర్తులు. ఆనాలుగును వానికిరీటములు కావు; నాలుగు రాజధర్మములు; సామ, దాన, భేద, దండములు. ఈ చతురోపాయములు రాజధర్మములని వేదములు

ఘోషించుచున్నవి. ఈనాలుగును నాలుగుధర్మములు; నాలుగునీతిమార్గములు; కనుక, వానియంతట నవి మీావద్దకు వచ్చెను.

దోహా 61, 62

"ఓ నాథా! రావణుఁడు ధర్మహీనుఁడు; మీాపదములయందు విముఖుఁడు; వాఁడు కాలమునకు వశీభూతుఁ డయ్యెను. అందుచేత, నీ నాలుగుగుణములును వానినివిడిచి, మిమ్ముల నాశ్రయించెను." ఇంత చమత్కారముగ నంగదుఁడు పలికినపలుకులను శ్రీరాముఁడు విని, మందహాసముఁ జేసెను. తదుపరి, లంకానగరవృత్తాంతము నతఁడు శ్రీవారికి విన్నవించెను.

---

# చతుర్థ విశ్రామము.



చౌపాయ్

శత్రువుల సమాచారమును శ్రీరాముఁడు విని యాలోచించుటకు మంత్రులఁ బిలిచెను. "లంకానగరమునకు నాలుగుద్వారములు కలవు; ఏవిధమున వానిని మనము ముట్టడింపవలయునో యాలోచింపుఁడు." శ్రీరాముని యాజ్ఞ ననుసరించి, కపిరాజును, భల్లూకరాజును, రాక్షసరాజునుఁ గలసి, శ్రీరాముని చరణారవిందములకు నమస్కరించి, చేయఁదగిన సమరసన్నాహము నాలోచించి, వానరసైన్యములను నాలుగుభాగములుగ విభజించిరి. యథాయోగ్యముగ సేనాపతులను వారు నియమించి, యూథపతులఁ బిలిచిరి; ప్రభువువారియాజ్ఞను వారికిఁ దెలియఁజేసిరి; వారు విని, సింహనాదములఁ జేసి, యుద్ధమునకు నడచిరి. ఆవానరులు శ్రీరాముని చరణకమలములకు నమస్కరించి, పర్వతములను శిలలను వృక్షములఁ బట్టుకొని వెడలిరి; వారు సింహనాదములఁ జేసి, రాక్షసులఁ దర్జించి, 'జయత్యతి బలో రామో లక్ష్మణశ్చ మహాబలః, రాజా జయతి సుగ్రీవో రాఘవేణానుపాలితః.' అని పలుకుచు, రాక్షసుల నెదిరించిరి. లంకానగరము దుర్గమము; అభే

ద్యము ; అయినను శ్రీరాముని ప్రతాపమువలన, వారు నిర్భయముగ నగరముపై దుమికిరి. లంకానగర పూర్వద్వారమువద్ద నిలిచియుండిన అతికాయునిపైకి నీలుఁడు నడచెను; దక్షిణద్వారమును రక్షించుచుండిన మహోదరుని అంగదుఁ డెదిరించెను. పశ్చిమద్వారముఁ గాపాడుచుండిన మేఘనాదునితో మహావీరుఁడు పోరాడెను. ఉత్తరద్వారమును సంరక్షించుచుండిన దశకంఠుని శ్రీరాముఁడు స్వయముగఁ దార్కొనెను. ఈప్రకారము లంకానగరమును నలువైపుల వానరులు ముట్టడించి, లగ్గలకెక్కిరి. వానరులకు రణభేరులు మొదలగునవి లేవు; వారు, ముఖములతో భేరీమృదంగవాద్యములను వాయించి, పోరునకు నడచిరి.

**దోహా 63**

'జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః, రాజా జయతి సుగ్రీవో రాఘవేణానుపాలితః.' అని వానరులు సింహనాదములఁ జేసి గర్జించిరి.

**చౌపాయ్**

లంకానగరములో నత్యంతకోలాహలము పుట్టెను. ఆహాహాకారమును రావణుఁడు విని, దురభిమానమును విడిచిపెట్టక, రాక్షసులఁ బిలిచి, "ఓయీ! ఈవానరుల దార్జన్యముఁ జూడుఁడు. వారి పొగరుఁబోతుదనమునకు మితము లేదు" అని పలికి నవ్వి, "ఓయీ! ఈవానరులు కాలునిచేఁ బ్రేరేపింపఁబడి, వచ్చిరి. మా రాక్షసులకు గొప్పవిందు జరుగును." అని తలఁచి, "ఆహా! భగవంతునికటాక్షము; మేము మాగృహములలో నుండినను, భోజనము దానియంత నది మాకాళ్ల వద్దకు వచ్చెను." అని సంతోషించెను. "ఓ యోధులారా! మీరు నలువైపులకు వెళ్లి, మీచేతులకు దొరికిన వానరభల్లూకములను దినుఁడు" అని వాఁ డాజ్ఞాపించెను. ఓ పార్వతీ! ఒకానొకసమయమున నంతరిక్షము పడునేమోయని భయపడి, తీతువపిట్ట తనకాళ్లను మీఁదికినెత్తి, తనయండములను రక్షించుకొనును; ఆ పిట్టకువలె, రావణునకు దురభిమానము కలదు. రావణుని యాజ్ఞప్రకారము, రాక్షసులు తోమరములను, ముద్గరములను, గత్తులను, గుఠారము

లను, బర్వతములను, శిలలను, భిండివాలములను బట్టుకొని, వాన రుల నెదుర్కొనిరి. ఎట్టిని రాళ్లఁజూచి, మాంసమని భ్రమించి, పక్షు లెగిరివెళ్లి, వానిముక్కులఁ బోఁగొట్టుకొనినవిధమున, నా రాక్షసులు వానరులపైఁ దుమికిరి. ముక్కులు విఱిగినతరువాత, నాపక్షులకుఁ దెలివివచ్చును; అటులనే, మూర్ఖత్వముచేత, రాక్షసులు వానరుల నెదుర్కొనిరి.

దోహా 64

ధనుర్బాణములను, అస్త్రశస్త్రములను ధరించి, కోట్లకొలఁది రాక్షసవీరులు కోటబురుజులపై నెక్కి, సింహనాదములఁ జేయుచుండిరి.

చౌపాయ్

మేరుపర్వతశిఖరముల నావరించిన మేఘములవలె, రాక్షసులు కోటబురుజుల నావరించియుండిరి. రణభేరులు మ్రోఁగుచుండెను; ఆధ్వ నులను విని, సుయోధు లత్యుత్సాహముతో యుద్ధమునకు నడచిరి. 'ఢంకా, నౌపత్తు' మొదలగు వానిశబ్దములను విని, పిఱికిపందలు గుండెలను బ్రద్దలుచేసికొని, భయపడిరి. వానరుల వికారచేష్టలఁ జూడ శక్యముకాదు; భల్లూకములశరీరములు పర్వతాకారములు. ఈమార్గ మామార్గమని యొంచక, వానరులు పరుగెత్తిరి; పర్వతములు వారిమార్గములో నుండినను, వారు వానిని యూఁకఁ బెఱికి, మార్గముఁ జేసికొని నడచిరి. కోట్లకొలఁదివానరులు కటకటమని గర్జించిరి; మఱి కొందఱు పండ్లనుబిగించి, తర్జించిరి; ఆవైపున 'రావణకీ జయ్' అని రాక్షసులును, ఈవైపున 'రామకీ జయ్' అని వానరులును బొబ్బలిడి యెదుర్కొనిరి. నగరప్రాకారములమీఁదనుండి రాక్షసులు పర్వతము లను శిలలను, వృక్షములను విసరుచుండిరి; అవి నేలమీఁదఁ బడకము నుపే, వానరులు మీఁదికినెగిరి, వానినిఁబట్టుకొని, వెండియు వానినే నగరములోనికి విసరుచుండిరి.

ఛాంద్ 4

వానరభల్లూకవీరులు పర్వతములను శిలలను వృక్షములను రాక్షసులపైకి ఉవ్విరి; ఆరాక్షసులపాదములఁ బట్టుకొని, వారిని గిర గిరఁద్రిప్పి, నేలఁగొట్టి చంపుచుండిరి. ఆ మహాబలులు, ఆ ప్రతాపశా

లులు, ఆ రణధీరులు, ఆ వీరులు, శూరులు, వానరులు, కోటప్రాకారములపైకి నెగిరి, దుర్గములఁ బట్టుకొని, రాక్షసులను సంహరించి, "జయత్యతి బలోరామః" అని జయధ్వనులఁ జేయ నారంభించిరి.

దోహా 65

ఒక్కొక్క రాక్షసుని వారు పట్టుకొని, వానిదుమ్ములను విఱిచి, ప్రాకారములపైనుండి నేలకుఁ బడఁద్రోసిరి; ఇట్లు ప్రాణావశిష్టముగ నేలఁబడినరాక్షసులను వానరులు సంహరించిరి.

చౌపాయ్

శ్రీరాముని ప్రతాపమువలన, వానరులబల మధికమయ్యెను; అంతకంతకు వారు ప్రబలులై, రాక్షసులను మట్టివేసిరి. లంకానగరము నలువైపులను 'జయత్యతి బలోరామః' అను శబ్దము ఖంగుమనెను. సూర్యునికంటె, శ్రీరాముని ప్రతాపము మించెను. ప్రచండవాయువు వీచినపుడు మేఘబృందములు నలువైపులఁ జెదరిపోవునట్లు, వానరుల ప్రతాపమువలన రాక్షససైన్యములు విఱుగఁబడి, దిక్కులుపట్టెను. లంకానగరములో హాహాకారము పుట్టెను; స్త్రీపురుష లాబాలవృద్ధులు రోదనముఁ జేయుచుండిరి; వారుకలసి, రావణుని దూషించిరి; వాని యంతట వాఁడు మృత్యువు నాహ్వానముఁజేసెనని వారు విలపించిరి. వారివిలాపములను రావణుఁడు విని, వారిదైన్యముఁ జూచి, సిగ్గుపడి, కోపించి, రాక్షసయోధులఁ బిలిచి, "ఓయీ! పిఱికితనముచే యుద్ధముఁజేయక, వెనుకకుఁ దిరిగినవారిని, నా చంద్రాయుధముతో సంహరించెదనని చెప్పుఁడు; భోగములచే వారిశరీరములు సుఖపడెను; ప్రాణములమీఁద వారికిఁ దీపుపుట్టెను." అని తర్జించెను. రావణుని మాటలకు రాక్షసులు కినిసి, శౌర్యముఁ జాటించి, వానరుల నెదుర్కొనిరి. ఆరాక్షసులు జీవితాశనువిడిచి, శత్రువు నెదిరించి, యుద్ధములోఁ జనిపోవుట వీరధర్మమని తలంచిరి.

దోహా 66

అస్త్రశస్త్రములను ధరించి, రాక్షసులు వానరులఁ దాఁకొని, యనేకవిధముల వారిని బాధపెట్టిరి; వారు వ్యాకులములచే ఖిన్నులయిరి.

చౌపాయి

వారు రాక్షసులయెదుట నిలువలేక, పరుగెత్తిరి. ఓ పార్వతీ! ప్రథమమున వారికే జయముకలిగెను. "ఓయీ! అంగదహనుమంతు లెచ్చట? నీలద్వివిదజాంబవంతు లెచ్చట?" అని వానరులు మొఱఁ బెట్టి, పికాపికలయిరి. వానరులవ్యాకులమును పశ్చిమద్వారమువద్ద నుండినహనుమంతుఁడు చూచి, విచారించెను; అతఁడు మేఘనాదుని తోఁ బోరాడుచుండెను; ఆద్వార మతికఠినముగ నుండుటచేత, నింత వఱకును మహావీరునకు స్వాధీనము కాలేదు. అతనికి మనస్సులో నిండుకోపము వచ్చెను; ప్రళయకాలమేఘమువలె, నతఁడు రోదోంత రాళములు నిండ, గర్జించెను. ఆగర్జనతోఁగూడ హనుమంతుఁడు నగ రప్రాకారముమీఁద నెగిరిపడి, యొకపర్వతశిఖరముఁ బట్టుకొని, మేఘ నాదుని నెదిరించి, వానిరథమును సారథిని అశ్వములను జూర్ణముఁ జేసెను; పాదముతో వానిహృదయముఁ దన్నెను. మఱియొకసారథి వాఁడు చైతన్యములేక పడియుండుటఁ జూచి, వానిని రథముపై నిడు కొని, గృహమునకుఁ దీసికొనివెళ్లెను.

దోహా 67

మహావీరుఁ డొక్కఁడు దుర్గములోఁ బ్రవేశించెనని యంగ దుఁడు విని, రణకౌతుకముఁ జూపించుచు, నడచెను.

చౌపాయి

ఆవానరు లిరువురు వీరావేశముతో రాక్షససైన్యములోఁ బ్రవే శించి, శ్రీరామునిచరణములను స్మరించి, రావణునిదుర్గములోఁ బ్రవే శించి, "శ్రీరాముఁడు తోడు" అని పలికి, ఆదుర్గమును బడఁద్రోసిరి. ఆయుత్పాతమును నిశాచరపతి చూచి, విస్మయముఁ బొందెను. ఆ దుర్గముయొక్క శిఖరములన్నియు నేలఁగూలెను; స్త్రీలు గుండెలఁ గొట్టుకొని, యేడ్వసాగిరి. "ఒకవానరుఁడు పూర్వము వచ్చి, నగర మును ధ్వంసముఁ జేసెనుగదా! ఇప్పు డిరువురువానరులు వచ్చిరి; ఏమియుత్పాతములు కలుగునో కదా" అని వారు విచారించి, భయ పడిరి. ఆవానరు లిరువురు వినోదార్థము రాక్షసులను బెదరించి, శ్రీరా మునిప్రతాపమును వారికిఁ జెప్పుచుండిరి. ఒకబంగారుతోరణస్తంభము నూడఁబెఱికి, వారు మారణహోమముఁ జేయ నారంభించిరి. ...హార్ధ

సింహనాదముఁ జేసి, శత్రుసైన్యముపైఁ బడి, భుజపరాక్రమముఁ జూపించి, విజృంభించిరి. ప్రచండవాయువువలన సముద్రమువలె, వారి వలన శత్రుసైన్యములు క్షోభపడెను. "రఘురాముని సేవింపనందు లకుఁ దగినఫలమును మీరు పొందవలెను" అని హుంకరించి, యొక రాక్షసుని వారుతన్నియు, మఱియొకనిని చెంపమీఁదఁ గొట్టియు, సంహరించిరి.

దోహా 68

ఒక్కొక్క రాక్షసుని వారీప్రకారము మర్దించి, వానిశిరముఁ ద్రుంచి, పారవేసిరి; ఆశిరములు రావణుని యెదుటవచ్చి పడుచుండెను. మట్టికుండలవలె, వారిశిరములు బ్రద్దలై, పడెను.

చౌపాయి

గొప్పగొప్ప రాక్షసయోధులను పాదములతో వారుపట్టుకొని, వారిని గిరగిరఁద్రిప్పి, నేలఁగొట్టి చంపి, వారికళేబరములను శ్రీరాముని వద్దకు విసరివేయుచుండిరి; అట్లు చచ్చిపడిన వారినామములను విభీషణునివలన శ్రీవారు తెలిసికొని, కటాక్షించి, వారిని వైకుంఠధామమునకుఁ బంపెను. ఆ దుష్టరాక్షసులు, ఆ మాంసభక్షకులు, శ్రీరామ కృపవలన, యోగీశ్వరులకు దుర్లభమగుసద్గతినిఁ బొందిరి. ఓ పార్వతీ! ఆ దయాసముద్రుఁడు ఆ శ్రీరామునిచిత్త మతికోమలము. వైరభావముతో వారు శ్రీవారిని స్మరించుటవలన, వారికి సద్గతివచ్చెను. ఓ పార్వతీ! శ్రీవారివంటి దయాసముద్రులు మఱియొకరు లేరు కదా! కపటమునువిడిచి, శ్రీవారిని భజింపనివాఁడు మందమతి; అభాగ్యుఁడు సుమీ! ఈప్రకార మంగదహనుమంతులు లంకానగరములోఁ బ్రవేశించి, "జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః, రాజా జయతి సుగ్రీవో రాఘవే ణానుపాలితః." అని సింహనాదముఁజేసిరి. మహాసముద్రమును రెండు మేరుపర్వతములువలె, వారిరువురు రాక్షససైన్యములను మథించిరి.

దోహా 69

ఈప్రకారము వారు భుజబలముఁ జూపించి, శత్రువులను సంహరించి, దినాంతమున, సునాయాసముగ శత్రుసైన్యమును దాఁటి, శ్రీరాముని వద్దకు వచ్చిరి.

### చౌపాయ్

వారు శ్రీరామునిచరణములకు నమస్కరించి, చేతులను జోడించుకొని, నిలువఁబడిరి; ఆయిరువురు మహాయోధులను శ్రీరాముఁడు చూచి, ప్రసన్నుఁ డయ్యెను; అతనికృపాదృష్టి పడినంతమాత్రమున, వారిశ్రమయంతయు క్షణములో శాంతించెను; వారు బడలికమఱచి, సుఖముఁ బొందిరి. అంగదహనుమంతులు కటకమునకు వచ్చినసంగతిఁ దెలిసికొని, వానరభల్లూకములు యుద్ధమునుండి మఱలెను. అంతలో రాత్రివచ్చెను; రాక్షసులబల మధికమయ్యెను. "రావణకీ జయ్" అని సింహనాదములఁ జేయుచు రాక్షససైన్యములు యుద్ధమునకుఁ దిరిగెను. ఆశత్రుదళములఁ జూచి, వానరవీరులు నిలిచి, దంతములఁ గొఱుకుచు, వారిని యెదుర్కొనిరి. ఇట్లుభయసైన్యంబుల వీరులు దార్కొని, ముష్టిప్రహారంబులఁ జేసికొనుచు, వెనుకఁదీయక హుమ్మని పోరాడిరి. రాక్షసవీరులు నలుపు; రంగురంగులవారు వానరులు. ఉభయసైన్యంబులు మహావీరులు; శూరులు; రణధీరులు వారు సరిసమానులు; వీరావేశముతో వారు పోరాడిరి. ఒకదానికొకటి యెదురుగవచ్చుచుండిన రెండు శరత్కాలమేఘములు, వాయుప్రేరితములై, గుభిల్లున తాఁకినట్లు, వానరరాక్షససైన్యంబులు తాఁకెను. అంతలో రాక్షససైన్యములు విఱుగఁబడెను; అకంపనుఁడును, అతికాయుఁడును, రాక్షసమాయఁ బన్నిరి. వారిమాయవలన, నొకనిమిషములో గాఢాంధకారము నలువైపుల వ్యాపించెను. రక్తము, శిలలు, ధూళి—వీని వర్షము పడెను.

### దోహా 70

ఇట్లు గాఢాంధకారము నలువైపుల నల్లుకొనినందున, వానరులు మనోక్షీతులైరి; వారిలో హాహాకారము పుట్టెను; ఒకరికొకరు కనఁబడలేదు.

### చౌపాయ్

ఈమర్మమును శ్రీరాముఁడు గ్రహించెను; అతఁ డంగదహనుమంతులఁ బిలిచి, రాక్షసులు చేసినయుపద్రవమును వారికిఁజెప్పి, బోధించెను. ఆకపికుంజరు లిరువురు కోపించి, రాక్షసులపై దుమికిరి.

అప్పుడు శ్రీరాముఁడు మందహాసముఁ జేసి, ఆగ్నేయాస్త్రమును సంధించి, ప్రయోగించెను. జ్ఞానోదయమువలన నజ్ఞానము విడునట్లు, రాక్షసమాయ క్షణములో విడిపోయెను; రణరంగమంతయు తెలివిఁ దాల్చెను. మాయచీఁకట్లు మాయమయ్యెను. దశదిశలు ప్రకాశించుట వలన, వానరభల్లూకములు పూర్వపుశ్రమను మఱచి, యుత్సాహముతో యుద్ధము నారంభించిరి. అంగదహనుమంతులు గర్జించి, యుద్ధముఁ జేయుచుండినస్థలమును రాక్షసులు విడిచి, పారిపోయిరి. అట్లు పారిపోవుచుండిన రాక్షసులను వానరులు పట్టుకొని, వారిని నేలఁ గొట్టి, చంపిరి; ఆమృతకళేబరముల నీడ్చుకొనిపోయి, వానరులు వానిని సముద్రములోఁ బారవేసిరి. ఆశవములను జలజంతువులు పట్టుకొని, తినుచుండెను.

దోహా 71

కొందఱు రాక్షసులకు గాయములు తగిలెను. కొందఱు ప్రాణములను విడిచిపెట్టిరి. కొందఱు లంకలోఁ బ్రవేశించిరి. ఈప్రకారము శత్రుసైన్యములను వానరులు విఱుగఁగొట్టి, సింహనాదముఁ జేసిరి.

చౌపాయీ

చీఁకట్లు నలువైపుల వ్యాపించెను; రాక్షసులు లంకలోఁ బ్రవేశించిరి; వానరసైన్యములు తిరిగి, శ్రీరామునివద్దకు వచ్చెను. శ్రీరాముని కటాక్షదృష్టి ప్రసరించినమాత్రమున, వానరుల శ్రమమంతయు శాంతించెను. అప్పుడు రావణుఁడు మంత్రులఁ బిలిచి, వారితో నిట్లు ప్రసంగించెను. "ఓయీ! ఈదినమున ననేకరాక్షసులు హతులయిరి. సగముసైన్యమును వానరులు సంహరించిరి; మనము చేయఁదగినయుపాయముఁ జెప్పుఁడు." మాల్యవంతుఁ డనురాక్షసవృద్ధు డొకఁడు కలఁడు. అతఁడు రావణుని మాతామహుఁడు; రావణుని మంత్రి; అతఁడు రావణునితండ్రికి సహితము మంత్రి. అతఁడు రావణునకు నీతిమార్గము నుపదేశించెను. "ఓ తండ్రీ! ఓ రావణా! సావధానముగ నామాటలను వినుము. జానకిని నీవు తీసికొని వచ్చినదిమొదలు, దుశ్శకునములు కనఁబడుచున్నవి; వేర్వేఱ వానిం జెప్పుటకు శక్యముకాదు. ఆ మహాపురుషుని ప్రతాపమును వేదపురాణములు గానముఁ జేయును; ఆ విరా

ట్పురుషుని యెదిరించుటవలన, శ్రేయస్సు కలుగదు. ఈసంగతిఁ దెలిసికొనుము.

దోహా 72, 73

"ఆ మహాపురుషుఁడే, హిరణ్యాక్ష హిరణ్యకశిపులను, మధుకైటభులను, సంహరించెను. ఆ కృపాసముద్రుఁడు, భగవంతుఁడు భూభారమును హరించుట కవతరించెను. అతఁడు కాలస్వరూపుఁడై, దుష్టులను సంహరించును. అతఁడు సకలగుణధాముఁడు; విజ్ఞానస్వరూపుఁడు. అతనిని బ్రహ్మమహేశ్వరులు సదా సేవించుచుందురు. అతనితో నీకు వైరమేల?

చౌపాయ్

"ఓ రావణా! నీవు వైరమును విడిచి, జానకిని శ్రీరామునకు సమర్పింపుము. ఆ కరుణామయుఁడగు శ్రీరాముని సేవింపుము." ఇట్లు మాల్యవంతుఁడు పలికినపలుకులు బాణములవలె రావణునిహృదయమునకుఁ దగిలెను. "ఓరీ! నీవు కాలునిముఖములోఁ బ్రవేశింపఁదలఁచినట్లు తోఁచును. నీవు వృద్ధుఁవు; కనుక, నిన్ను క్షమించితిని. నా యెదుటనుండి లేచిపొమ్ము." అని రావణుఁడు హుంకరించెను. "ఈ దుర్మార్గుని భగవంతుఁడు చంపఁదలఁచెను" అని మాల్యవంతుఁడు తలఁచి, సభలోనుండి దిగ్గున లేచివెళ్లెను. రావణునకు బుద్ధి విపరీతమయ్యెను. అంత్యకాలము వానికి సమీపించెను. అప్పుడు మేఘనాదుఁడు లేచి, "ఓ తండ్రీ! మీరు విచారింపకుఁడు; రేపు ప్రాతఃకాలమున నారణకౌతుకముఁ జూడఁగలరు. నేను జెప్పుచుండినదానికంటె నధికముగ పనిఁజేసి, చూపించెదను." అని పలికి, హెచ్చరించెను. పుత్రునివచనములవలన రావణునకు ధైర్యోత్సాహములు పుట్టెను; అతియాదరముతో వాఁడు కుమారుని తనదగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొనెను. ఇట్లు వారు మంత్రాలోచనములఁ జేయుచుండ, నరుణోదయమయ్యెను; వానరభల్లూకసైన్యములు నగరమును నలువైపుల ముట్టడించెను. లంకాపురములోఁ గోలాహలము పుట్టెను. శస్త్రాస్త్రములను ధరించి, రాక్షసవీరులు వెడలిరి. నగరప్రాకారములనుండి, వారు పర్వతములను విసరుచుండిరి.

ఛాంద్ 5

అనేక శస్త్రాస్త్రములను, పర్వతములను, కోట్లకొలఁది రాక్షసులు ప్రయోగించిరి; ప్రళయకాలమేఘములవలె, వారు గర్జించుచుండిరి. గొప్పగొప్ప వానరవీరులు వారిని యెదిరించిరి. రాక్షసులశరీరములు జర్జరీభూతమయ్యెను; కాని, వారు లేశమైన చలింపక, నిలిచి, పోరుచుండిరి. పర్వతశిఖరములను రాక్షసులపై వానరులు విసరుచుండిరి. ఆ పర్వతములక్రిందఁబడి, రాక్షసులు నేలఁబడి చనిపోయిరి.

దోహా 74

వానరులు నగరమును నలువైపుల ముట్టడించిరని, మేఘనాదుఁడు విని, రౌద్రాకారుఁడై, శస్త్రాస్త్రములను ధరించి, వారికి నెదురుగ వెళ్లెను. రాక్షసులు రణభేరులను మ్రోఁగించిరి. ఇంద్రజిత్తు అతిరథశ్రేష్ఠుఁడు. వానింజూచి, వానరులు పరుగెత్తిరి.

---

# పంచమవిశ్రామము.

చౌపాయ్

"కోసలపురాధీశులగు రామలక్ష్మణు లెచ్చటఁగలరు? వారు గొప్పధనుర్ధరులని లోకప్రఖ్యాతి కలదు. నలుఁడు, నీలుఁడు, ద్వివిదుఁడు, సుగ్రీవుఁడు, హనుమంతుఁడు, అంగదుఁడు—ఈ బలవంతులగు వానరు లెచ్చటఁగలరు? అన్నతో విరోధించిన విభీషణుఁ డెచ్చట? ఆమూర్ఖుని నేఁడు సంహరించెదను." ఈప్రకారము మేఘనాదుఁడు, రౌద్రాకారుఁడై, వీరాలాపము లాడి, ధనుష్టంకారముఁ జేసి, బాణములను సంధించి, ఆకర్ణాంతము నారిని లాగి, బాణములఁ బ్రయోగించెను. తెక్కలుగల సర్పములవలె, నాబాణములు నలువైపులఁ బరుగెత్తెను. ఆబాణములు వచ్చి తగిలినందున, వానరులు వ్యాకులపడి, గడగడ వణఁకిరి; వానియెదుటఁబడుటకు వారు భయపడిరి; వారు కాందిశీకులయిరి; నిరుత్సాహులై, వారు యుద్ధముఁజాలించి, మరలిరి. ఓ

పార్వతీ! వానరులశరీరములు జర్ఝరీభూత మయ్యెను; వారు ప్రాణావశిష్టులై యుండిరి.

దోహా 75

ఆబాణములు దశదిశలను వ్యాపించి, వానరవీరులను బాధించెను; వారు నేలఁబడి, సొమ్మసిల్లిరి. ఆమహావీరుఁడును, రణధీరుఁడు నగు మేఘనాదుఁడు సింహనాదముఁ జేసి, గర్జించెను.

చౌపాయ్

ఆ వానరసైన్యముల వ్యాకులముఁ జూచి, హనుమంతుఁడు కోపించి, వానిమీఁదికి కాలునివలెఁ బరుగెత్తెను. అతఁడు క్రోధతామ్రాక్షుఁడై యొకమహాపర్వతమును వానిమీఁదికి విసరెను. కాలాంతకునివలె వచ్చుచుండిన పర్వతమును వాఁడు చూచి, యంతరిక్షమునకు దాఁటెను. ఆపర్వతము క్రిందఁబడి, వానిరథాశ్వములును, సారథియు చూర్ణమయ్యెను. "ఛీ! రా రమ్ము! నాయెదుట నిలువుము; నాప్రతాపముఁ జూపించెదను" అని మహావీరుఁడు గర్జించెను; కాని, యతని బలము వానికిఁ దెలియును కనుక, నతనియెదుట నిలుచుటకు వాఁడు భయపడెను. వాఁడు రామచంద్రుని యెదుటనిలిచి, యనేకదుర్వచనములఁ బలికెను. అనేకశస్త్రాస్త్రములను వాఁడు ప్రయోగించెను; శ్రీరాముఁడు వాని నవలీలలోఁ ఖండించెను. వాఁడు రఘురాముని ప్రభావమును ప్రతాపముఁ జూచి, వెఱగుపడి, యనేకమాయలఁ బన్నెను. ఒకచిన్న పాము వచ్చి, గరుత్మంతుని బెదరించినవిధమున, వాఁడు శ్రీరాముని బెదరించెను.

దోహా 76

ఆహా! బ్రహ్మమహేశాదిదేవతలు లామహాపురుషుని మాయలోఁ బడి, గిజగిజలాడుచుందురు; ఆ మేఘనాదుఁడు మూర్ఖుఁడు; వాని బుద్ధి స్వల్పము; కనుక, నతనియెదుట వాఁడు రాక్షసమాయలఁ బన్నెను; ఇంతకంటె వెఱ్ఱితనము కలదా?

చౌపాయ్

అంతరిక్షమునుండి వాఁడు నిప్పులను వర్షించెను; రణరంగమంతయు జలార్ణవ మయ్యెను. అనేక భూతప్రేతపిశాచగణములు వచ్చి,

"పట్టు, కొట్టు, తిట్టు" అని పలుకుచుండిరి. ఏనుఁగుతొండమువంటిధారలతో, రక్తవర్షము గురిసెను. రాళ్లు, ధూళి, ఆకులు - ఈ మొదలగు వానిని వాఁడు వర్షించెను. పట్టపగలు గాఢాంధకారము వ్యాపించెను. ఎవనిహస్తము వానికిఁ గనఁబడలేదు. ఆ మాయచేత, వానరులు వ్యాకులపడిరి. సంఘుమరణము కలుగునని వానరులు భయపడిరి. ఈ రాక్షసమాయను శ్రీరాముఁడు చూచి, లోలోన నవ్వి, వానరులు భయపడిరని తెలిసికొని, యొకబాణముఁ బ్రయోగించి, మాయను విడఁగొట్టెను. సూర్యోదయమువలన నంధకారము విడునట్లు, రాక్షసునిమాయ విడిపోయెను. వానరుల నతఁడు కటాక్షదృష్టితోఁ జూచెను; వారిశ్రమ శాంతించెను; వారు ప్రబలులై, యుద్ధమునకు వెడలిరి. వారిని నిరోధించుటకు శక్యముకాదు.

దోహా 77

శ్రీరాముని యాజ్ఞాప్రకారము హనుమదాదివానరవీరులతోఁ గూడి, లక్ష్మణుఁడు ధనుర్బాణములను ధరించి, మేఘనాదునితో యుద్ధముఁ జేయుటకు వెళ్లెను.

చౌపాయ్

క్రోధముచే నెఱ్ఱనినేత్రములు, విశాలవక్షస్థలము, నిడుదబాహువులు, హిమవంతునివంటి తెల్లనిశరీరము—ఇట్టి లక్ష్మణుఁడు మేఘనాదు నెదుర్కొనెనని రావణుఁడు విని, రాక్షసయోధులను గుమారుని సహాయమునిమిత్తము పంపెను. వారు శస్త్రాస్త్రములను ధరించి, వెడలిరి. వానరులకు వృక్షములు, శిలలు, నఖములే ఆయుధములు. "జయత్యతిబలో రామః" అని గర్జించి, వానరులు పరుగెత్తిరి. ఇట్లుభయసైన్యంబుల వీరు లుద్దండపరాక్రమంబున విజృంభించి, ద్వంద్వయుద్ధముఁ జేయుచుండిరి. ఒకరినొకరు జయింపఁగోరి, వారు పోరాడిరి. పిడికిలితోఁ బొడిచియు, పండ్లతోఁ గొఱికియు, వానరులు రాక్షసులను సంహరించిరి. 'పట్టు, కొట్టు, ఖండించు, శిరములఁ ద్రుంచు, భుజములఁ ద్రెంచు' అని యీప్రకారము వానరులు బొబ్బలిడి, రాక్షసులను వధించిరి. వారిధ్వనులు, నవద్వీపములలో నిండెను. శిరములులేని రాక్షసులమొండెములు పరుగెత్తుచుండెను. అంతరిక్షమునుండి దేవతలు రణకౌతుకముఁ జూచు

చుండిరి. సమయానుసారము వారు హర్షవిషాదములఁ బొందిరి; వానరులకు సంకటమువచ్చినపుడు వారు దుఃఖించిరి; వారికి జయమువచ్చినపుడు దేవతలు సంతోషించిరి.

దోహా 78

రణభూమిమీఁదగల గుంటలలో రక్తము నిండెను; వానిపై ధూళి గప్పియుండెను; నివురుగప్పిననిప్పువలె నవి ప్రకాశించెను.

చౌపాయ్

పుష్పించిన కింశుకవృక్షమువలె, గాయములు తగిలినవీరులు శోభించిరి. క్రోధతామ్రాక్షులై, యొకరినొకరు జయింపఁగోరి, లక్ష్మణమేఘనాదులు పోరాడిరి. బలములో నొకరితోనొకరు సమానముగ నుండిరి. ఇంద్రజిత్తు మాయోపాయములఁ బన్ని, లక్ష్మణుని జయింపఁ దలఁచెను; కాని, వానిప్రయత్నములు వ్యర్థము లయ్యెను. లక్ష్మణుఁడు కోపించి, వానిసారథిఁ జంపి, వానిరథముఁ గూల్చెను. ప్రాణములఁ గదలింపఁజేయుబాణముల నతఁడు వానిపైఁ బ్రయోగించెను; "ఈ బాణములవలన, నాప్రాణములు పోవును; ఇతఁడు నాప్రాణములఁ దీయుటకు సిద్ధపడెను" అని వాఁడు చింతించి, దేదీప్యమానముగ వెలుగుచుండిన బ్రహ్మదత్తమగు మహాశక్తిని వాఁడుతీసి, లక్ష్మణునిహృదయమునకుఁ దగులునట్లు గుఱిచూచి, దానినిఁ బ్రయోగించెను. అదివచ్చి హృదయమునకుఁ దగిలినవెంటనే, లక్ష్మణుఁడు మూర్ఛిల్లి, నేలఁబడెను. వాఁడు నిర్భయుఁడై, పడియుండిన లక్ష్మణునివద్దకు వచ్చెను.

దోహా 79

మేఘనాదునితో సమానముగు బలవంతులు వచ్చి, లక్ష్మణుని శరీరమునెత్తుటకుఁ బ్రయత్నించిరి కాని, వారియత్నములు నిష్ఫలము లయ్యెను. ఆ జగదాధారుని, ఆదిశేషు నెత్తుటకుఁదగిన బలవంతులు కలరా? కోట్లకొలఁది రాక్షసవీరులు వచ్చి, ప్రయత్నించిరి; కాని, వారాశరీరమును గదలింపలేక పోయిరి.

చౌపాయ్

ఓ పార్వతీ! ఆ లోకారాధ్యునికోపాగ్ని చేఁ బదునాలుగులోకములు భస్మమగును గదా! ఆజగన్నాథుని చరాచరభూతములును దేవ

తలును సదా సేవించెదరు కదా! అతనిని యుద్ధములో నెవరు జయింపఁగలరు? లక్ష్మణస్వామి మూర్ఛిల్లి, పడియుండెను; శ్రీరామునికటాక్షము కలవారే, వారి చిత్రవిచిత్రచర్యలను గ్రహింపఁగలరు. అంతలో సాయంసమయ మయ్యెను; ఉభయసైన్యంబులు వానివాని కటకములకు నిష్క్రమించెను. ఆ భువనేశ్వరుఁడు, ఆ సర్వాంతర్యామి, ఆ సర్వవ్యాపకుఁడు, ఆ యజేయుఁడు, సంధ్యాసమయమున వానర వీరులం జూచి, "ఓయీ! నాతమ్ముఁ డేడీ!" అని యడిగెను. అంతలో నాంజనేయమూర్తి లక్ష్మణునిశరీరము నెత్తుకొనివచ్చెను. తమ్మునికివచ్చిన దురవస్థఁ జూచి, శ్రీరాముఁడు దుఃఖించెను. "ఓ నాథా! మీరు విచారింపకుఁడు; సుషేణుఁ డనువైద్యుఁడు లంకానగరములోఁ గలఁడు. అతనిని రప్పింపుఁడు." అని జాంబవంతుఁడు చెప్పెను. ఆవెంటనే, హనుమంతుఁడు, సూక్ష్మరూపమును ధరించి, లంకలోఁ బ్రవేశించి, "అయ్యో! ఆసుషేణుని నేనుఁబిలిచిన, వాఁడు వచ్చునో రాఁడో" యని విచారించి, గృహముతోఁగూడ, వానినిఁ దీసికొనివచ్చెను.

దోహా ६०

సుషేణుఁడు వచ్చి, శ్రీరామునిచరణములకు నమస్కరించి, పర్వతము పేరును, ఔషధమునుఁ జెప్పెను. "ఓ మహావీరుఁడా! శీఘ్రము నీవువెళ్లి, మందుఁ దీసికొనిరమ్ము" అని యతఁడు హనుమంతునితోఁ జెప్పెను.

చౌపాయ్

శ్రీరాముని చరణారవిందములకు మహావీరుఁడు నమస్కరించి, వారిని ధ్యానముఁజేయుచు వెడలెను. ఈవృత్తాంతము నొకచారుఁడు తీసికొనివచ్చి, రావణునితోఁ జెప్పెను; ఆవెంటనే వాఁడు కాలనేమి యనురాక్షసునివద్దకు వెళ్లెను. యావద్వృత్తాంతమును వాఁడు కాలనేమితోఁ జెప్పెను; వానిమాటలను వాఁడు విని, తలపంకించెను. "ఓయీ రావణా! నీ కన్నులయెదుటనే, వాఁడు నీనగరమును గాల్చి తగులఁబెట్టెను కదా! వానిని నిరోధించుటకు నాకేమి శక్తి కలదు? నీవు శ్రీరాముని జయింపఁగలనను భ్రమను విడిచి, వారిచరణముల నాశ్రయించి, వారిని సేవింపుము; అందువలన, నీకు మేలుకలుగును.

ఆ నీలమేఘశ్యాముని, ఆ కమలలోచనుని, దివ్యమంగళవిగ్రహమును సదా ధ్యానింపుము. నీ యహంకారమును, మదమును విడిచిపెట్టుము; మహామోహాంధకారములోఁ బడి, నిద్రించుచుంటివి; కనుక, శీఘ్రముగ నీవు మేల్కాంచి, శ్రీరాముని సేవింపుము. ఆ శ్రీరాముఁడు కాలసర్పమును సహితము భక్షింపఁగలఁడు; అతనిని నీవు జయించుట కష్టము; స్వప్నమందైనను, నీవట్టి భ్రమపడకుము." ఈ ప్రకారము కాలనేమి వానికి హితోపదేశముఁ జేసెను.

దోహా ౬౧

ఆమాటలను రావణుఁడు విని, కోపించి, వానిని ధిక్కరించెను. "అయ్యో! నేను శ్రీరాముని దూతచేతిలోఁ జనిపోయినయెడల, నాకులాభము. వీనిచేతిలోఁ జచ్చుటకంటె దుర్మరణము లేదు."

చౌపాయీ

ఈ ప్రకారము కాలనేమి మనస్సులోఁ జింతించి, ప్రయాణమయ్యెను. మాయఁబన్ని, మార్గములో నొకసరోవరమును, యుద్యానవనమును వాఁడు కల్పించి, ఋషివేషమును ధరించి, ఆశ్రమములోఁ దపము నాచరించుచు గూర్చుండెను. "ఆహా! నేనీ యాశ్రమము లోనికి వెళ్ళి, మునీశ్వరుని యాచించి, కొంచెము జలముఁద్రాగి, విరమించెదను" అని హనుమంతుఁడు విచారించెను. ఆ మాయావితియొక్కదూతను భ్రమింపఁజేయుటకు వాఁడు కపటమునివేషమును ధరించి కూర్చుండెను. వాయుకుమారుఁడు వానియాశ్రమములోఁ బ్రవేశించి, వానిచరణములకు నమస్కరించెను. అంతలో, నాకపటవేషధారి శ్రీరామునిగుణములను గానముఁజేయ నారంభించెను. "ఓయీ! రామరావణులకు యుద్ధము జరగును; శ్రీరామమూర్తి వానిని జయించును. ఇందులకు సందేహములేదు. నేనిచ్చట నిలిచియుండియే, సర్వముఁ జూచుచున్నాను. నాకు జ్ఞానదృష్టి కలదు; కనుక, సర్వము కరతలామలకము." అని కాలనేమి ప్రసంగించెను. అప్పుడు హనుమంతుఁడు పానముఁజేయుటకు జలము నడిగెను; వాఁడు స్వకమండలములోని జలమును ద్రాగుమనిచెప్పెను. "ఓ నాథా! ఇంత కొంచెమునీటితో నాదాహము శాంతింపదు." అని హనుమంతుఁడు విన్నవించెను.

"ఓయీ! మహావీరుఁడా! నీవా సరోవరములోనికిఁ బోయి, స్నానముఁ జేసి, దాహముఁ దీర్చుకొని, శీఘ్రము రమ్ము; పిమ్మట, నీకు జ్ఞానోపదేశముఁ జేయఁగలను." అని వాఁడు చెప్పెను. ఆమాటల కతఁడు సమ్మతించి, సరోవరమువద్దకు వెళ్లెను.

దోహా ౬౨

అతఁడు సరోవరములో దిగినంతలో, నొక స్త్రీమకరము వచ్చి, యతనిచరణములనుఁ బట్టుకొనెను. ఆతక్షణ మతఁడు మకరిని ధ్వంసింపించి, చంపెను. ఆశరీరమును విడిచి, యొకదివ్యపురుషుఁడు విమానము నెక్కి యూర్ధ్వలోకములకుఁ బోవుచు, నతనితో నిట్లు చెప్పెను.

చౌపాయీ

"ఓ మహావీరుఁడా! మీ దర్శనమువలన, నాపాపము నశించెను; నాకు వచ్చినశాపము మరలెను. నేనును కాలనేమియు పూర్వజన్మములో గంధర్వులము; మే మిరువురము దేవేంద్రునిసభలో గానముఁ జేయుచుంటిమి. ఆసమయమున దుర్వాసమహాముని సభలోనికి వచ్చెను. అతనిరూపరేఖలను మేము చూచి, నవ్వియుంటిమి; అందుచేత నతఁడు కోపించి, రాక్షసులై పుట్టుమని మమ్ములను శపించెను. మేము విచారించి, యతనిని వేఁడుకొంటిమి. 'ఓయీ! మీరిరువురు రాక్షసులై, లంకానగరములో జన్మించెదరు. త్రేతాయుగచతుర్థపాదములో, శ్రీరాముఁ డవతరించును; అప్పుడు మీపట్టణములో గొప్ప యుద్ధము జరగును; ఆయుద్ధములో శక్తితగిలి, లక్ష్మణుఁడు మూర్ఛిల్లును. సంజీవిపర్వతముఁ దీసికొనివచ్చుటకు హనుమంతుఁ డామార్గమున వెళ్లును; అతనివలన మీశాపవిమోచన మగును' అని యతఁడు కరుణించి, మాతోఁ జెప్పెను. ఓ వీరుఁడా! ఆవేషమును ధరించినవాఁడు మునీశ్వరుఁడు కాఁడు; నామాటలను విశ్వసింపుము; వాఁ డొకరాక్షసుఁడు." అని గంధర్వుఁడు బోధించి, యాకాశమార్గమునఁ బోయెను. తదుపరి, హనుమంతుఁ డా కపటమునివద్దకు వచ్చెను. "ఓ గురుస్వామీ! ప్రథమమున మీరు నాగురుదక్షిణను స్వీకరింపుఁడు; అనంతరము మీరు నాకు జ్ఞానోపదేశముఁ జేయవచ్చును." అని హనుమంతుఁడు పలికెను. (అధికపాఠము) అతఁడు విలంబముఁ జేసి,

రానందున నీహనుమంతునకు నాగుట్టు తెలిసినట్లు కనఁబడును; ఆసరో వరములోని మకరము నతఁడు చంపియుండవచ్చును; దానివలన నాస మాచార మతనికిఁ దెలిసెఁగాఁబోలు. నేను లంకకుఁ బోయెదను" అని వాఁడు తనలో విచారించి, హనుమంతునిఁ జూచి చూడన ట్లూరకుం డెను. వాఁడు భయపడి లంకాపట్టణమునకుఁ బోవుటకు సిద్ధపడెను. అం తలో వానికి ధైర్యముకలిగెను. "ఆహా! ఈవానరుని నెంతలోఁ జం పఁగలను! వీనినిఁ జంపినవెంటనే, రావణుఁడు నాకు సగము రాజ్యము నిచ్చును. అది వానిప్రతిజ్ఞ. రాజ్యమును దక్షిణోత్తరములుగ విభజిం చెదము. ఉత్తరభాగమంతయు సముద్రతీరము; ఇసుకనేల వరదవచ్చు నని భయముకలదు. ఆభాగమును రావణున కిచ్చి, నేను దక్షిణభాగ ముఁ గోరెదను. చతురంగబలములలో సగముఁ బుచ్చుకొనియెదను. ఏవిధముననైన, వానివద్దనుండి, పుష్పకవిమానముఁ గైకొనియెద." ఈప్రకారము వాఁడు కన్నులనుమూసికొని, లోలోన విచారించెను. అంతలో మహావీరుఁడు వచ్చి, వానితోఁ బలికెను. (అధికపాఠము సమాప్తము.) ఈప్రకారము హనుమంతుఁడు పలికి, తనతోఁకను వాని మెడకు జుట్టి, వానిని గిరగిరత్రిప్పి, నేలఁగొట్టి, వానిని క్షణములో సంహరించెను. మరణకాలమున, వాఁడు రామనామమును స్మరించుచు, ప్రాణములను విడిచిపెట్టెను. ఆంజనేయుఁడు సంతోషించి, ద్రోణపర్వత మునకు వెడలెను. అతఁడు సంజీవిపర్వతముఁ జూచెను; కాని, ఓషధుల నతఁడు గుఱుతుపట్టలేక పోయెను; అవి దాగియుండెను. అతఁ డెంత ప్రార్థించిన, నవి ప్రత్యక్షముకాలేదు. అతఁడు కోపించి, పర్వతమును బెకలించి, దానినిఁ బట్టుకొని, అయోధ్యానగరమార్గమున వచ్చెను. ఆ నిశీసమయమున భరతుఁడు జపముఁ జేయుచుండెను. "భరతుని గుణ సంపదలను, వాత్సల్యమును గుఱించి, శ్రీరాముఁడు నిత్యము ప్రసం గించును కదా! అది మనము కన్నులారఁ జూచి, సంతోషించెదము." అని వీరుఁడు తలంచి, యామార్గమున వెడలివచ్చుచుండెను. అతనినీడ భరతునిమీఁదఁ బడెను; అతఁడు కోపించి, ధనుస్సునకు బాణమును సంధించెను.

దోహా 83

"ఓహో! ఈ నిశాసమయమున నెవఁడో యొకరాక్షసుఁడు పర్వతముఁ బట్టుకొని వచ్చుచుండెను. ఏయుపద్రవమును వాఁడు చేయ కపూర్వమే, వానిని సంహరించుట యుచితము." అని భరతుఁడు చింతించి, యొకబాణముఁ బ్రయోగించెను. ఆకర్ణాంతము ధనస్సునులాగి, యతఁడు బాణమును విడిచిపెట్టెను.

చౌపాయ్

ఆబాణము వచ్చి తగిలినందున, హనుమంతుడు "హా రామా! హా రామా" అని బొబ్బలిడుచు నేలఁబడెను. ఆ రామశబ్దము నతఁడు విని భరతుఁడు దిగ్గునలేచెను. ఆవెంటనే భరతుఁడు వానరునివద్దకు వెళ్లెను. అతఁడు వానరునిఁ జూచి, దుఃఖించి, యతనిని కౌఁగిలించుకొనెను. అనేకవిధముల నతఁడు వానరుని మేల్కొలిపెను; కాని హనుమంతునకుఁ దెలివిరాలేదు. అతఁడు విలపించి, కన్నీరుఁ గార్చెను; అతనిముఖము వెలవెలఁ బోయెను. "అయ్యో! నే నెంతపాపాత్ముఁడను; భగవంతుఁడు విపరీతముగ నుండుటవలన, నాకును రామునకును వియోగము కలిగెను. ఆ దుఃఖమునకుఁదోడు, ప్రస్తుత మీయార్తదుఃఖము వచ్చెను. నే నేమిచేయఁగలను? మనోవాక్కర్మములచే, నేను నిర్మలాంతఃకరణకో శ్రీరాముని సేవించుచుండినయెడల, నామీఁద శ్రీరామునకు దయయుండినయెడల, శీఘ్రము హనుమంతునిబాధ నివారణ మగుగాక!" అని భరతుఁడు విలపించి, శపథముఁ జేసెను. ఆవెంటనే, హనుమంతుఁడు దిగ్గునలేచి, "జయ జయ! శ్రీరామజీకీ జయ్" అని పలికి, కూర్చుండెను. (భరతునిహృదయముఁ బరీక్షించుటకు హనుమంతుఁ డిట్లు నటించెను.

సోరఠా 6

అతనిని భరతుఁడు కౌఁగిలించుకొనెను; అతనిశరీరము పులకరించెను; అతనినేత్రములవెంబడి నానందబాష్పములు కారెను. అతని యనురాగ ముప్పొంగివెడలెను. అతఁడు మాటిమాటికిని శ్రీరాముని స్మరించుచుండెను.

"ఓ కపీశ్వరా! మా సీతారామలక్ష్మణులకుఁ గుశలమా? మాతల్లి జానకి క్షేమమా?" అని భరతుఁ డడిగెను. సంక్షేపముగ యావద్వృత్తాంతమును వానరుఁడు భరతునితోఁ జెప్పెను; ఆవృత్తాంతము నతఁడు విని, విచారించెను. "ఓ భగవంతుఁడా! ఈలోకములో నన్నేల బుట్టించితివి? నేను జీవించియుండియు, శ్రీవారికి కొంచెమయిన సహాయముఁ జేయకయుంటిని." అని భరతుఁడు విచారించి, దుఃఖించుటకు సమయముకాదని తలఁచి, ధైర్యము నవలంబించి, "ఓ వాయుపుత్రా! ఈవృత్తాంతమును స్వయముగ నీవు మాతల్లులకు వినిపింపుము; లేనియెడల, నీవు వెళ్లినతరువాత, వారి కీసంగతిఁ దెలిసిన, వారు విచారించెదరు. నీవు వారివద్దకువెళ్లి, వారికి బోధింపుము." అని పలికి, వానరునిఁ దీసికొని, తల్లులవద్దకు వెళ్లెను. ఈ సమాచారమునంతయు వానరుఁడు తల్లులకు విన్నవించెను. (అధికపాఠము.) లక్ష్మణునకుఁ దగిలిన గాయముసంగతిని విని సుమిత్ర కొంతదుఃఖించి, సంతోషించెను. "ఆహా! ఈ దినమున నాకుమారుఁడు ధన్యుఁడు; వానిజన్మము సఫలమయ్యెను. స్వామికార్యార్థము నాకుమారుఁడు రణస్థలములోఁ బడి మూర్ఛిల్లెను. అయినను, నాకొకదుఃఖము కలదు. ఇట్టి దుస్సమయములో శ్రీరామునకుఁ దమ్మునివియోగము కలిగెను." అని యామె విచారించి, శుద్ధాంతఃకరణముతో శత్రుఘ్నునిఁ జూచి, "ఓయీ! నీవు శ్రీరామునిసహాయమునకుఁ బొమ్ము." అని పలికెను. ఆమాటలను శత్రుఘ్నుఁడు విని, సంతోషించి, దిగ్గునలేచెను. ప్రారబ్ధకర్మబంధనములు విడిన ట్లతఁడు తలఁచెను.

దోహా 84, 85, 86

శత్రుఘ్నుఁడు సిద్ధపడుటఁ జూచి, ముప్వురుతల్లులు సంతోషించిరి. అప్పుడు కౌసల్య ధైర్యమునవలంబించి, మహావీరునితో నిట్లు ప్రసంగించెను. "ఓ మహావీరుఁడా! నాచేతులార లక్ష్మణుని శ్రీరామున కప్పగించియుంటిని; ఇట్టిదుర్దశ వానికివచ్చెను; ఎప్పుడు వానిముఖపద్మమును నేను జూడఁగలను?" "ఓ తల్లులారా! మీరు విచారింపకుఁడు; ధైర్యము నవలంబించియుండుఁడు. ఇంతలో శ్రీసీతారాము

లక్ష్మణులు సుఖముగ మీదర్శనముఁ జేయఁగలరు" అని హనుమం తుఁడు వారి నోదార్చెను. (అధికపాఠము సమాప్తము.)

అప్పుడు భరతుఁడు ధైర్యమునవలంబించి, హనుమంతునితో నిట్లు పలికెను. "ఓయీ వీరుఁడా! నీవు జేరవలసినస్థలము చాల దూరము గనుక నీ కాలస్యమవును. నీవు విలంబముచేయక, శీఘ్రము వెడలుము; ప్రాతఃకాల మయినయెడలఁ గార్యమంతయు విఫలమ గును. ఈపర్వతముతో నీవు నాబాణముమీఁదఁ గూర్చుండిన, నిన్ను శీఘ్రము లంకాపట్టణమునకుఁ బంపఁగలను." ఈమాటలవలన, హను మంతునిమనస్సులో నభిమానము పుట్టెను. "ఇంతబరువుతో నితనిబాణ మెట్లు పోఁగలదు?" అని వానరుఁడు చింతించి, శ్రీరాముని ప్రతాప మును స్మరించి, యతనిచరణములకు నమస్కరించి, "ఓ నాథా! మీ యనుగ్రహముండిన, చాలును; మీప్రతాపమును స్మరించి, బాణము వలెఁ బోఁగలను." అని విన్నవించి, భరతుని సెలవుఁగైకొని, యతనిచర ణములకు నమస్కరించి, ప్రయాణమయ్యెను.

దోహ 87, 88

"ఓ నాథా! మీ చరణారవిందములను స్మరించి, నేను వేగ ముగా వెళ్లఁగలను." అని వానరమూర్తి పలికి, వారికి నమస్కరించి, వెడలెను. భరతునిభక్తియు, అతనియనురాగమును, మనస్సులోఁ గొని యాడుచు, హనుమంతుఁడు వెళ్లెను.

చౌపాయ్

ఇచ్చట లంకాపట్టణములో, శ్రీరాముఁడు లక్ష్మణునిఁ గాపాడు చుండెను; అంతలో నర్ధరాత్రము గతించెను; వానరులందఱు శ్రీరా మునిఁ బరివేష్టించియుండిరి. సాధారణ మనుజునివలె, నతఁడు విలపించి, వారితో నిట్లు సంభాషించెను. "ఓ వానరులారా! అర్ధరాత్రము గతిం చెను; ఇంతవఱకు వానరమూర్తిజాడ కనఁబడదు. ఒకవేళ నతఁడు ద్రోణగిరిమార్గముఁ దప్పియుండెనా?" అని శ్రీరాముఁడు పలికి, లక్ష్మ ణునియొత్తి హృదయమున కప్పలించుకొని, యేడ్వసాగెను. "ఓ తమ్ముఁ డా! నానిమిత్తము నీవు తల్లిదండ్రులను విడిచి, నాతో వనములకు వచ్చి, పడరానిపాట్లను పడియుంటివి. నేను గష్టపడుట నీవు లేశమపి

చూడలేకపోవుచుంటివి; నీస్వభావము కోమలము. ఎండలకు రెండి, వర్షములోఁ దడిసి, చలిబాధల నోర్చి, నాతో శ్రమపడియుంటివి. ఓ తండ్రీ! ఈ నీప్రేమ యెచ్చటకుఁబోయెను? నాతోఁ బలుకవేమి! నే నేమియపరాధముఁ జేసియుంటిని? నావైపుఁ జూడవేమి? ఓ తండ్రీ! కన్నెత్తి నన్నుఁజూడుము. నీ ముద్దుమాటలను నాకు వినిపింపుము. నా వ్యాకులముఁ జూడవా? ఎవరువచ్చి, న న్నోదార్చఁగలరు? దిగ్గునలేచి, నాతోఁ బలుకవేమి? ఈవనవాసములో నాకుఁ దమ్మునివియోగము కలుగునని ముందు తెలిసియుండినయెడల, నేను దండ్రిగారియాజ్ఞను మన్నింపకయుందును. పుత్రులును, ధనమును, గృహమును, గళత్రమును, బంధువులును— మనుజునకు లోకములో వచ్చిపోవుచుందురు కాని, సోదరులుమాత్రము లభింపరు; ఓ తమ్ముఁడా! ఈసంగతిఁ దెలిసికొని, తెలివిఁ దెచ్చుకొనుము. ఓ తండ్రీ! ఱెక్కలులేనిపక్షివలె, మణిలేని సర్పమువలెఁ, దొండములేని యేనుఁగువలె, నీవులేని నేను దీనుఁడనై యుంటిని. ఓ తమ్ముఁడా! భగవంతుఁడు ప్రతికూలముగ నడచినయెడల, నేనుగూడ నీతోడ వచ్చెదను. నిన్నువిడిచి, నేను జీవించియుండలేను. ఓ తండ్రీ! నిన్నువిడిచి, నే నేముఖముతో, నగరమునకుఁ బోఁగలను? ఆహా! స్త్రీనిమిత్తము నాప్రాణమువంటి నాతమ్మునిఁ బోఁగొట్టుకొంటిని. (శ్లో. "దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః, తంతుదేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః." వా. రా.) లోకములో నపకీర్తినయి నను సహింపఁగలను; స్త్రీవియోగ మంతవిశేషకష్టము కాదు. ఈరెండు కష్టములను నామనస్సు సహించెను; నామన స్సెంతకఠినము? ఓ తమ్ముఁడా! నీతల్లికి నీవు ప్రాణమువంటివాఁడవు. ని న్నాశ్రయించి, యామె సంసారసాగరమును దాఁటఁగోరును. ఆమె నాచేతులఁ బట్టుకొని, ని న్నప్పగించెను. నేను నీక్షేమముఁ గోరినవాఁడననియు, నీసౌఖ్యములఁ జూడఁగలననియు నీతల్లి తలంచి, నిన్ను నా కప్పగించెను. కౌసల్యగాని, నీతల్లిగాని న న్నడిగినయెడల, వారికి నేనేమి సమాధానముఁ జెప్పఁగలను? ఓ తండ్రీ! ఏల నీవులేచి, నాకు బోధింపవు?" ఆర్తత్రాణపరాయణుఁడగు శ్రీరాముఁ డీప్రకారము, పలువిధముల విచారించి, యేడ్వసాగెను. అతని నేత్రములనుండి నీరు వఱదలై

కారెను. ఇదియంతయు లీలామానుషచరిత్రము. ఓ పార్వతీ! శ్రీరాముని రూప మఖండము. ఆ పరమేశ్వరుఁ డద్వితీయుఁడు. ఈప్రకార మతఁడు లీలామానుషచర్యలఁ జూపించి, భక్తులయం దతనికిఁగల యనురాగమును వ్యక్తపఱచెను. భక్తుల నతఁడు తనప్రాణమువలెఁ జూచును.

సోరఠా 7

ఓ పార్వతీ! ఈప్రకారము శ్రీరామమూర్తి విలపించుటఁ జూచి, వానరులు వ్యాకులపడి దుఃఖించుచుండిరి. ఆసమయమున సంజీవిపర్వతముఁ బట్టుకొని, హనుమంతుఁడు ప్రత్యక్షమయ్యెను. కరుణారసముతో వీరరసము వచ్చి కలసినట్లు, హనుమంతుఁడు వచ్చి, వానరులతోఁ గలిసెను. (సకలవానరులును, శ్రీరామునిదుఃఖముఁ జూచి, కరుణారసముతో నిండియుండిరి. వారిప్రాణములను మహావీరుఁడు రక్షించెను. అతఁడు తెల్లవారకమునుపు రానియెడల, వారు ప్రాణములను విడిచిపెట్టియుందురు. అతఁడు ప్రాతఃకాలమునకుఁ బూర్వమే వచ్చెను; కనుక, నతఁడు వారికిఁ బ్రాణముల నిచ్చెను. మహావీరుఁడు వీరరసము-వీరరసమును గరుణారసమును గలియుటవలన, దోషము లేదు.)

---

# షష్ఠవిశ్రామము.



చౌపాయీ

ఓ పార్వతీ! శ్రీరాముఁడు కృతజ్ఞుఁడు; వివేకచూడామణి; ఇట్లు సంజీవిపర్వతముఁ దీసికొనివచ్చిన హనుమంతునిఁ జూచి, యతఁడు పరమానందభరితుఁ డయ్యెను. అప్పుడు సుషేణుఁడు నాలుగువిధముల మూలికలఁ దీసికొనివచ్చెను. (విశల్యకరణి, సంధానకరణి, సావర్ణ్యకరణి, సంజీవకరణి.) ఈ నాలుగుమూలికల నతఁడు లక్ష్మణునకుఁ దగిలించెను. ఆక్షణ మతఁడు దిగ్గున లేచి కూర్చుండెను. ఆ పర్వతవాయువు తగిలినం

దున, జచ్చిపడియుండిన వానరులందఱు లేచి కూర్చుండిరి. శ్రీరాముఁడు తమ్మునిఁ గౌఁగిలించుకొని, సంతోషించెను. వానరులందఱుఁ బరమానందముఁ బొందిరి. హనుమంతుఁడు యథాప్రకారము సంజీవిపర్వతమును, సుషేణునిగృహమును వానివానిస్థలములోఁ బెట్టెను. (అధికపాఠము) ఏకాదశీదినమున బలవంతుఁడగు ధూమ్రాక్షుఁడు యుద్ధముఁ జేసెను; వానిని ద్వాదశినాఁడు మహావీరుఁడు వధించెను; పిమ్మట నకంపనుఁడు యుద్ధమునకు వచ్చెను; వాఁడు గొప్పయుద్ధముఁ జేసెను; వానిని త్రయోదశినాఁడు అంగదుఁడు చంపెను. క్రోధతామ్రాక్షుఁడై, ప్రహస్తు పోరాటమునకు వచ్చెను; వానిని పర్వదినమున నీలుఁడు సంహరించెను. పిమ్మట మహోదరుఁడు వచ్చెను; ఆతక్షణమే వానిని హనుమంతుఁడు పరలోకమునకుఁ బంపెను. అతికాయుఁ డెనిమిదిదినములు హోరాహోరిని బోరాడి, స్వర్గస్థుఁ డయ్యెను. కుంభకర్ణునికుమారులు కుంభనికుంభులు, అయిదుదినములు యుద్ధముఁ జేసి, వీరస్వర్గముఁ బొందిరి. మహాయోధుఁడగు మకరాక్షుఁడు వచ్చి, లక్ష్మణునితోఁ బోరాడెను.

దోహా 89

వానిని లక్ష్మణుఁడు సంహరించెను. వానరులు సంతోషించి, జయజయశబ్దములఁ జేసిరి. (అధికపాఠము సమాప్తము.)

చౌపాయీ

ఇట్లు రాక్షసవీరులు యుద్ధములోఁ జనిపోవుటవిని, రావణుఁడు నెత్తిఁగొట్టుకొని, విలపించెను; వాఁడు వ్యాకులపడి, కుంభకర్ణునివద్దకు వెళ్లెను; అనేకప్రయత్నములఁ జేసి, వానిని మేల్కొలిపెను. (అధికపాఠము.) రావణుని యాజ్ఞాప్రకారము పదివేలరాక్షసయోధులు వెళ్లి, కుంభకర్ణుని చెవులవద్ద భేరీమృదంగములను మ్రోఁగించిరి; మఱికొందఱు గదలతోను, తోమరములతోను, గునపములతోను వానినిఁ గొట్టిరి; కాని వాఁడు నిద్రనుండి మేల్కొనలేదు; దుడ్డుకఱ్ఱలతో వానినిఁగొట్టిరి; కాళ్లతోఁదన్నిరి; కాని, వానికిఁ దెలివిరాలేదు. వాని శరీరము పర్వతమువలెఁ బడియుండెను. అందుచేత, రాక్షసులు చేసిన పనులవలన, వానికి లేశమైనఁ దెలివిరాలేదు. తుపానుగాలివలె, వాని

ముక్కులోనుండి యూపిరి వచ్చుచుండెను; అందుచేత, వారు వానియెదుట నిలువలేకపోయిరి. అనేకవిధముల వారు బొబ్బలిడి, వానినిఁగొట్టిరి. వారి ప్రయత్నములన్నియు వ్యర్థములయ్యెను; అప్పుడు వారు విచారించి, వానిముక్కులో నొకమేకను ప్రవేశపెట్టిరి. వానిమీఁదను మహాగజములను నడిపించిరి; కాఁగుచుండినతైలమును వానిచెవులలోఁ బోసిరి. అప్పుడు వానికిఁ దుమ్మువచ్చెను.

దోహా 90

అప్పుడు వాఁడు నీల్గి, కాళ్లుచేతులఁ జాచి, కండ్లను విప్పి చూచెను; రాక్షసులు భయపడి, పరుగెత్తిరి. రావణుఁడు సంతోషించెను. (అధికపాఠము సమాప్తము.) మూర్తీభవించిన కాలునివలె, వాఁడు మేల్కొని కూర్చుండెను. "ఓ రావణా! నీముఖము వాడియుండుటకుఁ గారణమేమి?" అని వాఁడు ప్రశ్నవేసెను. అప్పుడు దురభిమానియగు రావణుఁడు సీతాపహరణము మొదలగువృత్తాంతమునంతయుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పెను. "ఓయీ తమ్ముఁడా! అనేకరాక్షసవీరులను వానరులు సంహరించిరి; సేనాపతులు మడిసిరి. దుర్ముఖుఁడు, దేవశత్రువు, నరాంతకుఁడు, అతికాయుఁడు, అకంపనుఁడు, మహోదరుఁ డాదిగాఁగల రాక్షసవీరులు సమరములో వారివారిప్రాణములను విడిచిపెట్టిరి."

దోహా 91

అన్నగారు పలికినపలుకులను తమ్ముఁడు విని, వ్యాకులపడెను. "ఓయీ మూర్ఖుఁడా! జానకి జగజ్జనని. ఆమెను దొంగిలించి, తీసికొనివచ్చినందున, నీకు శుభములు కలుగునా? ఓ రాజా! నీవు చేసినపని యుచితముగ లేదు. నన్ను మేల్కొలుపుట వ్యర్థము. అభిమానమును విడిచి, నీవు శ్రీరాముని సేవించినయెడల, నీకు శుభములుకలుగును. (అధికపాఠము.) నీవు బాగుగ విచారింపక, యీపనిఁ జేసియుంటివి; అందువలన, నీకు మంగళములు కలుగవు. ఓ రావణా! ఎందుచేత నీవు సముద్రతీరమున నొకసంరక్షణదుర్గమును స్థాపించియుండలేదు? అది నీలోపము. అట్లు నీవు దానిని స్థాపించియుండినయెడల, రాముఁడు సేతువు నెట్లు కట్టియుండును? రామలక్ష్మణు లొంటరిగనుండినపుడు,

వారిని సంహారింపక, యేల యూరకుంటివి? వాలి నీ స్నేహితుఁడుకదా! వానిసహాయమును నీవు కోరియుండినయెడల, వానరులు నీపక్షమునకు వచ్చియుందురు కదా? శత్రువులను సంహరింపఁదగినప్రయత్నములను నీవు చేసియుండలేదు. పరస్త్రీని దొంగిలించితివి; శూర్పణఖ వచ్చి, నీతోఁ జెప్పినపుడే, నీవు వారితో యుద్ధముఁజేసియుండిన, నీకు జయము కలిగియుండును.

దోహా 92

"పరువుమర్యాదలను విడిచి, ధర్మముఁ దూలనాడి, పరస్త్రీని యపహరించితివి; రాజధర్మమును, పరమార్థమును విడిచినందుకు, నీకుఁ దగినఫలమువచ్చెను. శ్రీరాముఁ డెవఁడని నీయభిప్రాయము? ఈసంగతి నీవు మఱచినట్లు కనఁబడును.

చౌపాయ్

"ఓ రావణా! శ్రీరాముఁడు సాధారణమనుజుఁడు కాఁడు. అతఁడు పరబ్రహ్మమని తెలిసికొనుము. అతఁడు భూభారమును హరించుట కవతరించెను. అనేకపర్యాయములు నారదుఁ డీవిషయమును నాతోఁజెప్పియుండెను. ఆహా! రాముఁడు మనుజుఁడా? అతనికి హనుమంతుఁడు సేవకుఁడా? ఈదౌర్జన్యముఁ జేయకపూర్వము, నన్ను మేల్కొలిపి, యీసంగతి నెందులకు నాతో జెప్పియుండలేదు? నీవు దేవతలతో విరోధించి, వారిని జయించితివి; అప్పుడు నీవు బలవంతుఁడవు. కాని, బ్రహ్మమహేశాదిదేవతలు పూజించుబ్రహ్మతోఁ గలహించుటకు నీకేమి శక్తి కలదు? ఓయీ! నారదుఁడు నాకు జ్ఞానము నుపదేశించియుండెను. ఆజ్ఞానమును నీ కుపదేశించుటకు నాకుఁ గోరికకలదు; కాని, యిప్పుడు మంచిసమయము కాదు. (ఒకసమయమున నారదుఁడు కుంభకర్ణునివద్దకు వచ్చెను. "ఓ నాథా! ఎచ్చటనుండి మీరు వచ్చుచుండిరి?" "ఓ కుంభకర్ణా! రాక్షసుల బాధపడలేక, భూదేవి క్షీరసాగరమువద్దకు వెళ్లి, మొఱపెట్టెను. భగవంతుఁడు భూలోకములో నవతరించెదనని చెప్పి, యామె నోదార్చెను. అతఁడు శ్రీరాముఁడై పుట్టి, రావణుని సంహరించును" అని నారదుఁడు చెప్పెను. ఈసంగతి రావణునితోఁ జెప్పుటకు కుంభకర్ణునకు సమయము జిక్కలేదు.) ఓ రావణా!

నన్ను చేతులారఁ గౌఁగిలించుకొనుము. నేను జయించినను, అపజయముఁ బొందినను ఒకటి—నేను శ్రీరాముని గన్నులారఁజూచి, కృతార్థుఁడను కాఁగలను."

దోహా 93

ఒకక్షణము కుంభకర్ణుఁడు శ్రీరామునిగుణములను స్మరించి, యతనిరూపమును ధ్యానించెను. రావణునకు సంతోషముకలుగుటకు వాఁడు యుద్ధమునకు వెడలుటకుముందు, కుండలకొలఁది మద్యమును గంపలకొలఁది గొడ్డుమాంసముఁ దీసికొనిరమ్మని, సేవకుల కాజ్ఞాపించెను.

చౌపాయి

వాఁ డామాంసమునుభక్షించి, మద్యముఁ ద్రాగి, పిడుగువలె గర్జించెను. ఆ గర్వపోతు, ఆ కుంభకర్ణుఁడు, రణరంగమునకు వచ్చి, నాట్యముఁజేయ నారంభించెను. వాఁడొక్కఁడే యుద్ధమునకు వచ్చెను; కాని రాక్షససైన్యముమాత్రము వానివెంట రాలేదు. వాఁడు వచ్చుటఁజూచి, విభీషణుఁడు వానియెదుటకు వెళ్లి, వానిపాదములకు నమస్కరించి, తన పేరుఁ జెప్పుకొనెను. తమ్ముని లేవదీసి, కుంభకర్ణుఁడు వానినిఁ గౌఁగిలించుకొనెను; అతఁడు శ్రీరామునిసేవకుఁడని తెలిసికొని, వాఁడు సంతోషించెను. అప్పుడు విభీషణుఁడు వానితో నిట్లు పలికెను. "ఓ స్వామీ! రావణుఁడు నన్ను గాళ్లతోఁదన్ని, యవమానముఁ జేసెను. నేను పూర్వోత్తరముల నాలోచించి, యతనికి హితోపదేశముఁ జేసియుంటిని. అందుచేత, నతఁడు నన్నుఁ దన్నెను. కనుక, నవమానమును భరింపలేక, నేను శ్రీరాముని శరణుఁజొచ్చియుంటిని. నేను దీనుఁడనని తెలిసికొని, వారు నన్ను స్వీకరించిరి." "ఓయీ తమ్ముఁడా! రావణునకు మృత్యువు సన్నిహితమయ్యెను. అందుచేత, నెట్లు వాఁడు హితోపదేశమును మన్నించును! నిశ్చయముగ నీవు ధన్యుఁడవు. రాక్షసకులమునకు నీవు విభూషణమువంటివాఁడవు. ఆ సుఖసాగరుని, ఆ రఘురాముని నీవు సేవించుటవలన, రాక్షసకులమంతయు పవిత్రమయ్యెను.

దోహా 94

"ఓ తమ్ముఁడా! కపటమునువిడిచి, త్రికరణశుద్ధిగ నీవు శ్రీరాముని సేవింపుము. ఇక నీవు వెళ్లుము. నాపక్షము, శత్రుపక్షమని విచా

రింపక, నేను యుద్ధముఁజేయవలెను. నాకుసహితము కాలము సమీపించెను. నామతము రావణునకుఁ దెలియును. నీవుమాత్రము స్వపక్షపరపక్షమనుభేదమును విడిచి, శ్రీరాముని భజింపుము."

చౌపాయ్

కుంభకర్ణుని యనుజ్ఞఁదీసికొని, విభీషణుఁడు, ఆ త్రిలోకవిభూషణుని, ఆ రావణాంతకుని, ఆ శ్రీరామునివద్దకు వచ్చెను. "ఓ నాథా! ఆ పర్వతాకారుఁడు, ఆ రణధీరుఁడు, కుంభకర్ణుఁడు; మీతోఁ బోరాడుటకు వచ్చెను." అని యతఁడు చెప్పెను. అతనిమాటలను వానరులందఱు వినిరి. ఆ క్షణమే మహావీరుఁడు వానిమీఁదికిఁ బరుగెత్తెను. వృక్షములను, పర్వతశిలలను వానరులు వానిమీఁదఁ బ్రయోగించిరి. కోట్లకొలఁది పర్వతశిఖరములను వానరభల్లూకములు వానిమీఁద వర్షించిరి; కాని, వాని మనస్సుమాత్రము చలింపలేదు. వానిస్థలమును వాఁడు విడిచిపెట్టక, ధైర్యముగ నిలిచియుండెను. మదగజమును పూగింజలతోఁగాని, కంటిరెప్పతోఁగాని కొట్టినయెడల, దానికేమి బాధకలుగును? మహావీరుఁడు హుంకరించి, వాని నొక్కగుద్దు గుద్దెను; ఆ గుద్దుతో వ్యాకులపడి, వాఁడు సొమ్మసిల్లెను. మరల వాఁడు తెలివిఁదెచ్చుకొని, మహావీరుని గుద్దెను; ఆ గుద్దుతో నతఁడు నేలఁబడి, మూర్ఛిల్లెను. తదుపరి, వాఁడు నలనీలులతోఁ బోరాడి, వారి నోడించెను; అనేకవానరవీరులను వాఁడు సంహరించెను; వానరసైన్యము భయపడి, పరుగెత్తెను; ఆసైన్యము చీకాకుపడి, వానియెదుట నిలువలేకపోయెను.

దోహా 95

వాని విజృంభణమువలన, సుగ్రీవ, అంగదాదివానరవీరులు సొమ్మసిల్లి, నేలఁబడిరి; అప్పుడు వాఁడు సుగ్రీవుని తనచంకలో నిమిడ్చికొని, తీసికొనిపోయెను. కపిరాజును వాఁడు పట్టుకొనినందున, వానరసైన్యమును జయించినట్లు వాఁడు తలంచెను.

చౌపాయ్

ఓ పార్వతీ! గరుత్మంతుఁడు సర్పములతోఁ గ్రీడించువిధమున, రఘురాముఁడు రాక్షసులతో వినోదము జరపెను. ఆ త్రిలోకారా

ఘ్నుఁడు కనుబొమలను ముడిచినమాత్రమునఁ, గాలుఁడుసహితము దహించుకొని పోవునుకదా! అట్టిజగదేకవీరుఁ డీయుద్ధమున కెట్లు సమ్మతించెనోకదా! జగములను పావనముఁ జేయుటకును, తనకీర్తిని లోకములలో వ్యాపింపఁజేయుటకును, తనచరిత్రమును గానముఁ జేసిన మనుజులు సంసారసాగరమును దాఁటుటకును, శ్రీరాముఁ డిట్లు సాధారణమనుజునివలె, సంచరించెను. వాయుపుత్త్రుఁడు తెలివిఁదెచ్చుకొని, సుగ్రీవునివెదకుట కారంభించెను. అంతలో సుగ్రీవుఁడు మూర్ఛనుండి లేచి, కుంభకర్ణుని చంకలోనుండి తప్పించుకొనెను; అతఁడు చచ్చి నేలఁబడెనని తలఁచి, వాఁ డతనిని విడిచిపెట్టెను. అతఁడు వానిముక్కు చెవులఁ గొఱికి, సింహనాదముఁ జేసి, యంతరిక్షమునకుఁ గుప్పించి, యెగసెను. అప్పుడు వాఁడు నిజముఁ దెలిసికొని, యతనిఁబాదములతోఁ బట్టుకొని, గిరగిరద్రిప్పి, నేలఁగొట్టెను. అతఁడు దిగ్గునలేచి, మరల వానినిదన్నెను. "జయత్యతిబలోరామః లక్ష్మణశ్చ మహాబలః" అని యతఁడు సింహనాదముఁ జేసి, రామునివద్దకు వచ్చెను. ముక్కుచెవులు కోలుకఁబడినందున, వాఁడు మండిపడుచు, యుద్ధమునకు మరలెను. స్వతస్సిద్ధముగ వాఁడు రౌద్రాకారుఁడు; తదుపరి, వాని ముక్కు చెవులు పోయెను; వాని వికృతరూపము విశేషముగ భయముఁబుట్టించెను; వానింజూచి, వానరభల్లూకములు భయపడి, విచారించిరి.

దోహా 96

"జయత్యతిబలో రామః లక్ష్మణశ్చ మహాబలః" అని సింహనాదములఁ జేయుచు, హాహాంహామనుచు వానరులు కోటానకోట్లు పర్వతములను వృక్షముల నొక్కపెట్టున వానిపై వర్షించిరి.

చౌపాయ్

కాలునివలె, వాఁడు క్రోధతామ్రాక్షుఁడై, వారిని నెదుర్కొనెను. కోట్లకొలఁదివానరులను వాఁడు పట్టుకొని భక్షించెను. మిడుతలదండు కొండగుహలోనువలె, వానరులు వానిముఖములోఁ బ్రవేశించిరి. కోట్లకొలఁదివానరులను వాఁడుపట్టుకొని, తనశరీరముపై మర్దించి, చంపెను; కోట్లకొలఁదివానరులను తనచేతులతోఁ జూర్ణముఁ జేసెను. వానిముక్కు, చెవులు, నోరు—వీనిగుండ, వానరు లనేకులు వెలుప

లకు వెళ్లివచ్చిరి. వాఁడు మద్యముఁ బానముఁజేసి, రణరంగములో విచ్చలవిడిగ విజృంభించెను. వాఁడు లోకమునంతయు మ్రింగివేయు నట్లు తోఁచెను. వానరులు యుద్ధమునుండి విముఖులై, పరుగెత్తిరి; వారు కన్నులారఁ జూచుటలేదు; చెవులార వినుటలేదు; మరలించి నను, వారు పోరాటమునకు రారు. ఈప్రకారము వానరసైన్యములను వాఁడు చీకాకుపఱచెను; అప్పుడు, దాఁగియుండిన రాక్షసవీరులు యుద్ధమునకు మరలివచ్చిరి. వానరులదైన్యమును రాక్షసులయుత్సాహమును శ్రీరాముఁడు చూచి, తమ్ముఁడు మొదలగువారితో నిట్లు పలికెను.

దోహా 97

"ఓ లక్ష్మణా! ఓ విభీషణా! మనసైన్యమును సన్నిహితముఁ జేయుఁడు. ఈదుర్మార్గుల పొగరుమాపి, నాబలముఁ జూపించెద."

చౌపాయీ

అక్షయతూణీరములను, శార్ఙ్గధనస్సును శ్రీరాముఁడు పట్టుకొని, సింహామువలె, యుద్ధమునకు నడచెను. ప్రథమమున శ్రీరాముని కోదండటంకారమును విని, రాక్షసులు దిగులుపడిరి; వారిచెవులు ఘుమ్మనెను. రెక్కలుగల కాలసర్పములవంటి బాణములను లక్షలకొలఁది శ్రీరాముఁడు ప్రయోగించెను. ఆబాణములు వాయువేగమున నలువైపులఁ బ్రసరించి, కోట్లకొలఁది రాక్షసవీరులను యోధులను సంహరించెను; ఆబాణములు రాక్షసులశిరస్సులను, పాదములను, భుజములను, హృదయములను ఖండించెను; వారిశరీరములు నూరుముక్కలుగ ఛేదింపఁబడెను. రాక్షసయోధులు గిరగిరదిరిగి, నేలఁబడి, చచ్చుచుండిరి; మఱికొందఱు మరల లేచి, నిలువఁబడి, యుద్ధముఁజేసిరి. బాణములు వచ్చితగిలినందున, రాక్షసులు మేఘములువలె, బొబ్బలిడుచుండిరి. శ్రీరాముని తీక్ష్ణనారాచములకు వారు భయపడి, పాఱిపోయిరి. శిరములులేనిమొండెములు పరుగెత్తుచుండెను. 'పట్టుపట్టు, కొట్టుకొట్టు' అను శబ్దములు వినఁబడెను.

దోహా 98

ఒకక్షణములో శ్రీరాముని వాఁడిగలబాణములు రాక్షసులను సంహరించెను. ఆబాణములు మరల తిరిగివచ్చి, రామునితరకసములోఁ బ్రవేశించెను.

చౌపాయ్

ఒకక్షణములో శ్రీరాముఁడు రాక్షసులను సంహరించెనని వాఁడు తెలిసికొని, కోపోద్దీపితుఁడై, సింహనాదముఁ జేసి, యుద్ధమునకు వెడలెను. వాఁ డొకపర్వతశిఖరము వానరులపై రువ్వెను. అట్లు మహావేగమున వచ్చుచుండిన పర్వతశిఖరమును శ్రీరాముఁడు చూచి, బాణములను బ్రయోగించి, దానినిఁ జూర్ణముచేసెను. శ్రీరామమూర్తి ధనస్సునుసంధించి, తీక్ష్ణమగు బాణములను వానిపై విడిచిపెట్టెను; ఆ బాణములు, మేఘములలో మెఱుపువలె, వానిశరీరములోఁ బ్రవేశించి, వెడలివచ్చెను. కాటుకపర్వతమునుండి జేగురువఱద ప్రవహించినట్లు, వానిశరీరమునుండి రక్తము వఱదలై కారెను. వాని వ్యాకులముఁ జూచి, వానరభల్లూకములు వాని నెదుర్కొనిరి; వారినిఁజూచి, వాఁడు పకపకనవ్వెను.

దోహా 99

'రావణకీ జయ్' అని వాఁడు సింహనాదముఁ జేసి, కోట్లకొలఁది వానరులఁ బట్టుకొని, గిరగిరఁద్రిప్పి, నేలఁగొట్టి చంపెను.

చౌపాయ్

వృకమునుజూచిన మేకలువలె, వానింజూచి, వానరులు భయపడి, పరుగెత్తిరి. ఓ పార్వతీ! వానరభల్లూకములు దీనాలాపములాడుచు, దిక్కులఁ బట్టిరి. "అయ్యో! ఒకదేశమును క్షామమువలె, వీఁడు మనలను నాశనముఁ జేయును. ఓ రామా! ఓ దీనరక్షకా! నీ కరుణామృతమును వర్షింపుము. హే కృపానిధీ! రక్షింపు, రక్షింపు." అని వానరులు మొఱఁబెట్టిరి. ఎంతవఱకు వానరులకు బలదర్పములుండెనో, యంతవఱకు ముందునిలువఁబడి, యుద్ధముఁ జేసిరి; ఎప్పుడు వారు బలహీనులై, చలికిలఁబడిరో, అప్పుడు వారిని వెనుకఁబెట్టి, శ్రీరాముఁడు ధనుర్బాణములను ధరించి, ముందుకువచ్చెను. ఆ జగదేకవీరుఁడు ముందుకువచ్చి, యుద్ధముఁజేయ నారంభించెను. శ్రీరా

ముఁడు ధనస్సును సంధించి, నూరుబాణములను వానిపైఁ బ్రయోగించెను; ఆబాణములు వానిశరీరములోఁ బ్రవేశించెను. ఆబాణములు తగిలినందున, వాఁడు యుద్ధమునకు మరలెను. వాఁడు నడచినపుడు, పర్వతములు చలించెను; భూమి కంపించెను. వాఁడొక పర్వతశిఖరముఁ బట్టుకొని వచ్చెను; ఒకబాణముతో వానిభుజమును శ్రీరాముఁడు ఖండించెను. వాఁడు రెండవచేతితో నొకపర్వతముఁ బట్టుకొనివచ్చెను; ఆ హస్తమునుకూడ శ్రీరాముఁడు ఛేదించెను. ఱెక్కలులేని మందర పర్వతమువలె, భుజములులేని కుంభకర్ణుఁడు ప్రకాశించెను. త్రిలోకములను భక్షించుటకు సిద్ధపడినట్లు, వాఁడు కొఱకొఱమని శ్రీరాముని జూచి, మండిపడెను.

దోహా 100

అప్పుడు వాఁడు సింహనాదముఁ జేసి, నోరువిప్పి, రాముని మీఁదికిఁ బరుగెత్తివచ్చెను. అంతరిక్షమున నిలువఁబడియుండిన బ్రహ్మాదిదేవతలు 'హాహా'కారముఁ జేసిరి.

చౌపాయ్

బ్రహ్మాదిదేవతలభయమును శ్రీరాముఁడు చూచి, ఆకర్ణాంతము ధనస్సును లాగి, వానిముఖము నిండునట్లు, బాణములఁ బ్రయోగించెను; అయినను, వాఁడు నేలఁబడక, నిలిచి యుండెను. బాణములలోనిండిన కాలునితరకసమువలె, ముఖమునిండ బాణములతోఁ గూడి, వాఁడు రామునిమీఁదికి వచ్చెను. అప్పుడు శ్రీరాముఁడు బాణముఁ బ్రయోగించి, వానిశిరస్సును ఖండించెను. ఆశిరస్సు త్రుళ్లి, రావణునియెదుటఁ బడెను.

(శ్లో. కుంభకర్ణశిరో భాతి కుండలాలంకృతం మహత్, ఆదిత్యే ఉభ్యుదయే రాత్రౌ మధ్యస్థ ఇవ చంద్రమా. వా. ౧.) మునిఁ బోఁగొట్టుకొనిన సర్పమువలె, రావణుఁడు వానిమరణమునకు దుఃఖించెను. శిరస్సులేని వానిమొండెము పరుగెత్తుచుండెను; అప్పుడు భూమి కంపించెను. అప్పుడు రాముఁడు బాణమును బ్రయోగించి, వాని మొండెమును రెండుముక్కలుగ ఖండించెను. అంతరిక్షమునుండి పడిన పర్వతమువలె, వానిశరీరము నేలఁ గూలెను; దానిక్రిందఁబడి, వానర

భల్లూకములు హతులయిరి. వానిశరీరమునుండి వెడలినతేజస్సు, శ్రీరాముని శరీరములోఁ బ్రవేశించెను. ఆచిత్రమును బ్రహ్మాదిదేవతలు చూచి, శ్రీరాముని స్తుతించిరి. జపతపములఁ జేయకయే, రాక్షసునకు ముక్తివచ్చినందులకు, దేవత లాశ్చర్యపడిరి. అంతరిక్షమున దేవదుందుభులు మ్రోఁగెను; దేవతలు పుష్పములను వర్షించిరి; వారు జయజయశబ్దములఁ జేసిరి. అనేకవిధముల వారు శ్రీరాముని స్తుతించి, వారివారి లోకములకు నిష్క్రమించిరి. ఆసమయమున నారదుఁడు వచ్చి, అంతరిక్షమున నిలిచియుండి, హరిగుణములను గానముఁ జేసి, వీరకరుణారసములతోఁగూడిన శ్రీరామునిరూపమును ధ్యానించెను. "ఓనాథా! ఈదుర్మార్గులను శీఘ్రము సంహరింపుము." అని నారదుఁడు చెప్పి, సత్యలోకమునకుఁ బోయెను.

ఛాంద్ 6

ఈప్రకార మా జగదేకవీరుఁడు రణరంగమునఁ బ్రకాశించెను. అతనిముఖారవిందమున స్వేదబిందువులు శోభించెను. ఆ కమలలోచనుని చక్కనిశరీరముపై రక్తబిందువులు పడియుండెను. అతఁడు ధనుర్బాణములఁ బట్టుకొని, గిరగిరఁ ద్రిప్పుచుండెను. అతనికి నలువైపుల వానరభల్లూకములు బరాబరులఁ దీర్చియుండిరి. "ఈవీరరాముని చక్కదనమును శేషుఁడే వర్ణింపఁజాలఁడుకదా! ఒకముఖముతో నేనెట్లు వర్ణింపఁగలను" అని తులసీదాసు చెప్పెను.

దోహా 101

ఓ పార్వతీ! దుష్టపాపాత్ములగు రాక్షసులను సహితము శ్రీరాముఁడు కటాక్షించి, వారికి స్వధామమునిచ్చెను. ఆ కరుణాసముద్రుని భజింపనివాఁడు మూర్ఖాగ్రేసరుఁడని తెలిసికొనుము.

---

# సప్తమవిశ్రామము.

—◆(·)◆—

శ్లో. ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది, యుద్ధేషుచాప్రతిద్వంద్వ శ్శరైనం జహి రావణిమ్. వా. రా. యు.

చౌపాయ్

అంత సాయంసమయ మయ్యెను; ఉభయపక్షములవారును హోరాహోరిగఁ బోరాడి, విరమించిరి. శ్రీరాముని కృపవలన, వానరుల బల మధికమయ్యెను. తృణములవలన, నగ్ని ప్రజ్వరిల్లువిధమున, వానరులు విజృంభించిరి. ఆత్మస్తుతిఁ జేసికొనుటవలనఁ బుణ్యము క్షీణించునట్లు, అహోరాత్రములు రాక్షసులు నశించిరి. అనేకవిధముల రావణుఁడు విలపించెను; మాటిమాటికి వాఁడు తమ్మునిశిరస్సును హృదయమునకుఁ దగిలించుకొని, యేడ్వసాగెను; వాని స్త్రీలు గుండెలఁ గొట్టుకొని, వాని బలపరాక్రమములను గొనియాడి, రోదనముఁ జేయుచుండిరి. ఆసమయమున, మేఘనాదుఁడు వచ్చి, యనేకవిధములఁ దండ్రిని బోధించి, యొందార్చెను. "హే పితాజీ! నేనిప్పుడు ప్రగల్భములఁ బలుకుట యేల? రేపు నాప్రతాపముఁ జూపించెద; దానిని మీరు చూడఁగలరు. నే నిదివఱలో మీకుఁ జెప్పలేదు; ఇప్పుడు చెప్పుచున్నాను; వినుఁడు. నాయిష్టదైవము నాకుఁ దగినంతబలమును, నొక రథము నిచ్చెను." ఈప్రకారము వాఁడు వ్యర్థమగుమాటలఁ బలుకుచుండఁ దెల్లవారెను. అంత వానరభల్లూకములు నగరము నలువైపులను ముట్టడించిరి. ఈపక్షమున, వానరభల్లూకములు, కాలాంతకులవలె, నిలువఁబడిరి; ఆపక్షమున, వీరులును శూరులు నగు రాక్షసులు మోహరించియుండిరి. ఓ గరుడజీ! ఎవరికి వారు జయముఁగోరి, యుద్ధము నారంభించిరి; వారి పోరాటమును వర్ణింప శక్యముకాదు.

దోహా 102

మేఘనాదుఁడు మాయారథము నారోహించి, యంతరిక్షమున కెగసెను; అంతరిక్షముననుండి, వాఁడు, ప్రళయకాలమేఘమువలె గర్జించెను; వానిగర్జనను విని, వానరులు భయపడి, దిగులుపడిరి.

(అధికపాఠము) చౌపాయ్

ఒకక్షణములో వాఁడు మాయాసీతనుగల్పించి, దానిని రథముమీఁదఁ బెట్టుకొని, రణరంగమునకు వచ్చి, వాయుపుత్రునకు జూపించి, యతనితో నిట్లు పలికెను; "ఓయీ! ఎవరినిమిత్తము మీరు యుద్ధముఁ జేయుచుంటిరో, ఆజానకినిఁ జంపుచున్నాను. ఆమెను సంహ

రించినతరువాత, యుద్ధమంతయు శాంతించును" అని వాఁడు పలికి, కత్తితో మాయసీతనుఁ జంపి క్రిందికిఁ ద్రోచెను. అప్పుడు మహావీరుఁడు కోపించి, వానరయోధులఁ బిలిచి, "ఓ వానరవీరులారా! ప్రాణములమీఁద నాశవిడిచి, యుద్ధముఁ జేసి, రాక్షసులను సంహరింపుఁడు." అని హెచ్చరించెను. ఆవానరులు రాక్షసులపైఁ బడి, ఘోరఘోర ముగయుద్ధముఁ జేసిరి; వానరుల ప్రహారములకు రాక్షసులు నిలువలేక, లంకలోఁ బ్రవేశించిరి. మహావీరుఁడు యుద్ధముఁజాలించి, శ్రీరాముని వద్దకు వచ్చి, మేఘనాదుఁడు చేసిన దుర్వ్యాపారముఁ జెప్పెను. అతనిమాటను శ్రీరాముఁడు విని, మూర్ఛిల్లెను. ఆ పాపనాశనుఁడు తెలివిఁదెచ్చుకొని, విలపించుచుండెను.

దోహా 103

"ఓ లక్ష్మణా! సీతలేనపుడు, మన కీయుద్ధమేల? నేను యుద్ధముఁజేయను. జానకివంటిపతివ్రత లోకములో వెదకినను కానరాదు.

చౌపాయ్

"నావంటి భర్తయుండినను, దిక్కులేనిదానివలె, జానకి చనిపోయెను. అయోధ్యానగరమునకు నేను తిరిగివెళ్ళినఁ బ్రయోజన మేమి కలదు? తల్లులతో నేమి చెప్పఁగలను?" అని శ్రీరాముఁడు విలపించి, మూర్ఛిల్లి, నేలఁబడెను. ఆసమయమున శ్రీరామునివద్దకు విభీషణుఁడు వచ్చెను. ఈవృత్తాంతము నతఁడు సాంతముగ విని రామునితో నిట్లు విన్నవించెను:—"ఓ నాథా! ఈసమాచార మసత్యము; మీయాజ్ఞ ప్రకారము హనుమంతుఁడు లంకలోఁ బ్రవేశించి, జానకిక్షేమముఁ జూచివచ్చును. నామాట సత్యము; వినుఁడు; అతిజాగరూకతతో జానకి కాపాడఁబడుచుండును; రావణుఁడుతప్ప, మఱియొకఁడు జానకిని తేరిచూడలేడు. మిమ్ములను మోహింపఁజేయుటకు మేఘనాదుఁడు మాయసీతను గల్పించి, దానిని సంహరించెను కాని, మఱియొకటి కాదు." అతనిమాటలవలన శ్రీరామునకు ధైర్యము కలిగెను. అప్పుడు హనుమంతుఁడు ప్రచ్ఛన్నరూపమును ధరించి, లంకలోఁ బ్రవేశించి, జానకినిఁ జూచివచ్చెను.

దోహా 104

జానకి క్షేమసమాచారమును హనుమంతునివలన వానరులు మొదలగువారు విని ధైర్యముఁ దెచ్చుకొని, యుద్ధమునకు నడచిరి.

చౌపాయ్

అంతలో మేఘనాదుఁడు తిరిగివచ్చి, యుద్ధముఁ జేయనారంభించెను. (అధికపాఠము సమాప్తము.) ఆ సమయమున, బాణములు, పరిఘలు, కృపాణములు, పరశులు, ప్రచండపాషాణములు—ఈ మొదలగువానిని బుంఖానుపుంఖములుగ వాఁడు వర్షించెను. మఘుకా రైలోఁ బడు జడివానవలె, బాణపరంపరలు నలువైపులనుండి వచ్చి, వానరుల మీఁదఁ బడుచుండెను. 'పట్టు, కొట్టు' అనుమాటలు వానరులచెవులఁ బడుచుండెను. ఎవరు వారినిఁ గొట్టుచుండిరో వారికిఁ దెలియదు. తరు శైలపాషాణములఁ బట్టుకొని, వానరు లంతరిక్షమునకుఁ గుప్పించి, యెగసిరి. అచ్చట వారికి నెవరు కనఁబడలేదు; అందుచేత వారు దుఃఖించి, భూమిమీఁదకు వచ్చుచుండిరి. కొండలోవలు, కొండగుహలు, దుర్గారణ్యములు మొదలగునవి వాని మాయాబలముచే, బాణములచేఁ గప్పఁబడి, బాణపంజరములువలె నుండెను. వానరులు భీభత్సులయిరి; ఎటువైపు వెళ్లుటకును వారికిఁ దోఁచలేదు. దేవేంద్రునకు భయపడి, మహాపర్వతములు పడియుండినట్లు, వానరులు భయపడియుండిరి. మహాబలవంతులగు నలుఁడును, నీలుఁడును, నంగదుఁడును, హనుమంతుఁడు సహితము దిగులు పడియుండిరి. ఆ మేఘనాదుఁడు లక్ష్మణ, సుగ్రీవ, విభీషణులపై బాణములను బ్రయోగించెను; వారిశరీరములు చిల్లులువడెను. పిమ్మట వాఁడు లేశమైన భయములేకుండ, శ్రీరామునితో యుద్ధముఁజేయ నారంభించెను. సర్పములవంటిబాణముల నతనిపై వాఁడు ప్రయోగించెను. ఆ వికారరహితుఁడు, స్వతంత్రుఁడు, ఖరదూషణాంతకుఁడు, అనంతుఁడు, కపటనాటకసూత్రధారుఁడు, భగవంతుఁడు, రాముఁడు, సాధారణమనుజునివలె, వాని నాగాస్త్రమునకు గట్టువడెను. యుద్ధమునకు గౌరవమువచ్చుటకు శ్రీరాముఁడు నాగాస్త్రముచే బంధింపఁబడెను. అతనిదురవస్థఁ జూచి, దేవతలు విచారించిరి.

దోహా 105

ఓ గరుడజీ! ఆ శ్రీరామునినామమును స్మరించినమాత్రమున, సంసారపాశములు విడిపోవును. ఆ సర్వవ్యాపకుఁడు, ఆ జగన్నివాసుఁడు, పాగనాశములకుఁ గట్టువడునా! అయినను, స్వేచ్ఛానుసారమతఁడు నాగపాశములకుఁ గట్టువడెను.

చౌపాయ్

ఓ పార్వతీ! ఇదియంతయు శ్రీరాముని సగుణచరిత్రము. మనోవాక్కులచేత నతనిచరిత్రమును తర్కించుటకు శక్యముకాదు. అన్ని కుతర్కములను విడిచి, పరమవైరాగులు సదా శ్రీరాముని భజించెదరు. ఈప్రకారము వానరసైన్యములను మేఘనాదుఁడు చీకాకుపఱచి, దుర్వచనములఁ బలుకుచుఁ బ్రత్యక్షమయ్యెను. ఆసమయమున జాంబవంతుఁడు వానింజూచి, "ఓరీ దుష్టుఁడా! నిలువుము, నిలువుము" అని యఱచెను. అతనిమాటలకు వాఁడు మండిపడెను. "ఓరీ నీచుఁడా! నీవు వృద్ధుఁడవని, నిన్ను విడిచిపెట్టితిని. ఛీ! నీమాటలు నాకేమిలక్ష్యము" అని వాఁడు తిట్టి, జాంబవంతునిపై నొకత్రిశూలమును బ్రయోగించెను. ఆత్రిశూలమును జాంబవంతుఁ డెగిరిపట్టుకొని, దానిని వానిమీఁదఁ బ్రయోగించెను. ఆశూలము వానిహృదయమునకుఁ దగిలెను. ఆదేవఘాతకుఁడు గిరగిరఁదిరిగ నేలఁబడి, మూర్ఛిల్లెను. జాంబవంతుఁడు వానిపాదముఁ బట్టుకొని, వానిని గిరగిరఁద్రిప్పి, నేలఁగొట్టి, తనబలముఁ జూపించెను. "ఓరీ! నేను వృద్ధుఁడనా? చెప్పుము." అని జాంబవంతుఁ డడిగెను. వాని వరప్రభావముచే, వానికి మరణము రాలేదు. జాంబవంతుఁడు వానిపాదములఁ బట్టుకొని, వానిని లంకలోనికి విసరెను. ఇఁక రామునివృత్తాంతమును వినుము. నారదుఁడు చెప్పినప్రకారము, గరుత్మంతుఁడు శీఘ్రముగ వెడలి రామునివద్దకు వచ్చెను. (అధికపాఠము.) అప్పుడు పార్వతి యొకసంగతి శివునినడిగెను. "ఓ నాథా! మేఘనాదునకు 'శక్తి' ఆయుధ మెట్లువచ్చెను? సులోచనయనుదానిని రెట్లు వివాహమాడెను? ఈసంగతులఁ జెప్పుఁడు" అని పార్వతి ప్రార్థించెను. ఆ సుఖసాగరుఁడు, సాంబశివుఁడు, ప్రసన్నుఁడై, పార్వతితో నిట్లుచెప్పుట కారంభించెను. ఓ పార్వతీ! ఇరువదిసంవత్స

రముల ప్రాయమప్పుడు, మేఘనాదుఁడు ఘోరమగు తపముఁజేసెను. అప్పుడు దేవి వానికిఁ బ్రత్యక్షమై, వరముఁ గోరుమనెను. 'ఓ దేవీ! నీకు నామీఁదఁ గటాక్షము వచ్చినయెడల, నావరమును వినుము. ఎవరినేత్రములకు గోచరముకాని రథము నాకుఁ గావలెను. నేను దానిపైఁగూర్చుండి, యుద్ధముఁ జేయునపుడు, శత్రువులను నిరాయాసముగ సంహరింపవలెను.' వాని కోరికప్రకారము దేవి వానికొక రథమునిచ్చి వానితో నొకమాటఁ జెప్పెను. 'ఓయీ! ఈరథమును నీవు దాఁచి యుంచుము. ఎప్పుడైన గొప్పయుద్ధము తటస్థించినపుడు, నీవు దీనిపైఁ గూర్చుండి, యుద్ధమునకు వెళ్లుము. ఆకాశమునకు దీనిపై వెళ్లి, రెండు ఘడియలలో నీవు శత్రువులను జయింపఁగలవు; ఇందులకు సందేహము లేదు.

దోహా 106

'ఓయీ! పండ్రెండుసంవత్సరములు నిద్రాహారములు లేక, స్త్రీ సంగమమును విడిచిపెట్టినవానితోమాత్రము నీవు యుద్ధముఁ జేయకుము. వానితో నీవు యుద్ధముఁ జేసినయెడల, నీకు మరణమువచ్చును.'

చౌపాయ్

ఓ పార్వతీ! ఈ మాటఁజెప్పి, దేవి యంతర్ధానమయ్యెను. పిమ్మట, వాఁడు శివుని నుద్దేశించి, ఘోరతపముఁ జేసెను. అప్పుడు శివుఁడు వానికిఁ బ్రత్యక్షమై, యుద్ధములో వానికి భయములేకుండునట్లు వరము నిచ్చెను. ఒకసమయమున వాఁడు చతురంగబలములఁ దీసికొని, దేవేంద్రునిపైకి వెడలెను. దేవదానవులకు ఘోరసంగ్రామము జరగెను. వాఁడు దేవేంద్రునిఁ బట్టుకొని, లంకకుఁ దీసికొని వచ్చెను. అప్పుడు రావణుఁడు కుమారుని ప్రతాపమునకు సంతోషించెను. ఈసమాచారమును బ్రహ్మవిని, లంకకు వచ్చి, మేఘనాదుని బోధించి, యింద్రుని విడిపించెను. బ్రహ్మకోరినప్రకారము వాఁడు దేవేంద్రుని విడిచిపెట్టెను. అప్పుడు బ్రహ్మ ప్రసన్నుఁడై, వాని కీయమోఘశక్తి నిచ్చి, 'ఈశక్తిచే నేలఁబడినవాని కొకరాత్రి యుపచారముఁ జేయక యుండిన, వాఁడు చనిపోవును' అని చెప్పి, సత్యలోకమునకు నిష్క్రమించెను.

దోహా 107

అనంతరము మేఘనాదుఁడు, నాగలోకమునకు వెళ్లి, వాసుకి మొదలగు నాగులతో ఘోరయుద్ధముఁ జేసెను.

చౌపాయ్

పదునాలుగుదినములు వాఁడు మహోద్దండముగఁ బోరాడి, వాసుకినిఁ బట్టుకొని, బంధించెను. వాఁడు వానిని లంకకుఁ దీసికొని వచ్చి, రావణునకుఁ జూపించెను; వానిని బంధించి, లంకలోఁ బెట్టెను. 'ఓ మేఘనాదా! నీవు నన్ను విడిచిపెట్టుము; నాకుమార్తెను నీకిచ్చి, వివాహముఁ జేయుదు. నామాటను నమ్ముము' ఓ పార్వతీ! వాసుకి మాటలను వాఁడు విని, వానిని విడిచిపెట్టెను. వాఁడు తనకుమార్తెను వానికిచ్చి, వివాహముఁ జేసెను. ఆకుమారితయే సులోచన; ఆమె మహాపతివ్రత. ఓ పార్వతీ! ఈప్రకారము వాఁడు సులోచనను వివాహమాడెను; ఇంద్రజిత్తు అని వానికిఁ బేరు వచ్చెను. ఏప్రకారము వానికి మహాశక్తియు బలపరాక్రమములువచ్చెనో నీకుఁ జెప్పియుంటిని. ఇఁక మీఁదివృత్తాంతమును వినుము. (అధికపాఠము సమాప్తము.)

దోహా 108, 109

నాగాంతకుఁడు వచ్చి, యొకక్షణములో నాగపాశములను త్రుంచెను. ఆ మాయయంతయు విడిపోయెను; వానరభల్లూకములు సంతోషించిరి. వారు తరుశైలపాషాణములఁ బట్టుకొని, రాక్షసులపైకిఁ దుమికిరి. నఖములే వానరుల కాయుధములు. రాక్షసులు భయపడి, పరుగెత్తి లంకలో దాఁగియుండిరి.

చౌపాయ్

అంతలో మేఘనాదుఁడు తెలివిఁదెచ్చుకొని, లేచి కూర్చుండి, ప్రతిజ్ఞఁ బూర్తిచేయలేదు కదా యని చింతించి, తండ్రిముఖముఁ జూచుటకు సిగ్గుపడెను. ఆస్థలమును వాఁడు విడిచి, 'అజయయజ్ఞముఁ' జేయుటకు వాఁడు నికుంభిలాస్థలమునకు వెళ్లెను. ('నికుంభిలా' యను స్థలము లంకలో నొకయుపవనము. అచ్చట రాక్షసు లనేకతపములఁ జేసి, వరములఁబొందిరి.) విభీషణుని నల్వురుమంత్రులు గుప్తవేషములతోఁ దిరుగుచుండి, యీవృత్తాంతమునుఁ దెలిసికొని వచ్చి, విభీష

ణునితోఁ జెప్పిరి. అతఁడు శ్రీరామునిఁ జూడవచ్చెను. "ఓ నాథా! ఇప్పు డొకసమాచారమును వింటిని. మేఘనాదుఁడు దుర్మార్గుఁడు; మాయావి; దేవకంటకుఁడు. ఇప్పుడు వాఁడొక పాపయజ్ఞముఁ జేయు చుండెను. ఓ నాథా! వానియజ్ఞము సంపూర్తియయినయెడల, వానిని జయించుట కష్టము." విభీషణునిమాటలను శ్రీరాముఁడు విని, సంతోషించి, అంగదహనుమంతులఁ బిలిపించెను. "ఓయీ తమ్ములారా! మీ రందఱు లక్ష్మణునితోఁగూడి వెళ్లి, యజ్ఞమును భంగముఁ జేయుఁడు. ఓ లక్ష్మణా! నీవు వానితో యుద్ధముఁజేసి, వానిని జంపవలెను. దేవత లందఱు దుఃఖించుచుండిరి; వారిదుఃఖముఁ జూచిన, నాకు దుఃఖము వచ్చుచున్నది. విభీషణుఁడు, సుగ్రీవుఁడు, జాంబవంతుఁడు—ఈ ముువ్వురును సైన్యములతోఁ గూడి, నీకు సహాయముఁ జేయఁగలరు." శ్రీరామునియాజ్ఞాప్రకారము లక్ష్మణుఁడు ధనుర్బాణములను ధరించి, యక్షయతూణీరములను గట్టుకొని, శ్రీరామునిప్రతాపమును స్మరించి, మేఘగంభీరవాక్యములతో నిట్లు విన్నవించెను. "ఓ నాథా! ఈదినమున నేను వానిని సంహరింపకవచ్చినయెడల, నేను రామదాసుఁడను కానని చెప్పవచ్చును. వానిని రక్షించుటకు మూర్గురు శివులువచ్చినను, వానినిఁ దప్పక సంహరించెదను. ఇందులకు రాములవారే సాక్షి."

దోహా 110

శ్రీరామునిచరణకమలములకు నమస్కరించి, లక్ష్మణుఁడు వెడలెను. అంగదుఁడు, నలుఁడు, నీలుఁడు, మైందుఁడు మొదలగుయోధులు హనుమంతునివెంట నడచిరి.

చౌపాయీ

నికుంభిలాస్థలమునకు వారు వెళ్లి, చూచునప్పటికి, మేఘనాదుఁడు మహిషమాంసమును రుధిరమును హోమముఁ జేయుచుండెను. వారు యజ్ఞమును ధ్వంసముఁజేయుట కారంభించిరి. అయినను, వాఁడు దీక్షను విడువకయుండెను. అప్పుడు వారు వ్యాజస్తుతిఁజేయ నారంభించిరి. అప్పటికిని, వాఁడు లేవకయుండెను. అప్పుడు వారు వానిజుట్టుఁ బట్టుకొనిరి; వానిని పాదములతోఁ దన్నిరి. అప్పుడు వాఁడు దిగ్గునలేచి త్రిశూలముఁ బట్టుకొని, వారిమీఁదికి వెళ్లెను; వారు వానింజూచి,

పరుగెత్తి, లక్ష్మణునివెనుక దాఁగిరి. వాఁడు త్రిశూలమును ధరించి, సింహనాదముఁ జేయుచు, వచ్చెను; అంగదుఁడును, హనుమంతుఁడును వానిని నెదుర్కొనిరి. వారిని వాఁడు త్రిశూలముతోఁ గొట్టెను; ఆదెబ్బలో వారు నేలఁబడిరి. ఆశూలమును వాఁడు రామునిపైఁ బ్రయోగించెను; లక్ష్మణుఁడు దానిని రెండుముక్కలుగఁ దునిమెను. ఇంతలో వాయుపుత్త్రుఁడును అంగదుఁడును తెలివిఁదెచ్చుకొని, వానినిఁ గొట్టిరి; కాని, వానికిఁ దగిలినదెబ్బలు వానికి లక్ష్యములేదు. మరల మహావీరుఁడు వానిపైఁబడెను; కాని, అతనిచేత వానికి మరణములేదు; ఆమహావీరుఁడు, సింహనాదముఁ జేయుచు, వానితోఁ బోరాడెను. వానివిజృంభణముఁ జూచి, లక్ష్మణుఁడు కోపించి, మృత్యుతుల్యమగు బాణములను వానిపైఁ బ్రయోగించెను. పిడుగువంటి లక్ష్మణునిబాణములను వాఁడు చూచి, యంతర్ధానమయ్యెను. అనేక మాయవేషములను వాఁడువేసి, దొంగయుద్ధముఁ జేయుచుండెను. ఒకసమయమున వాఁడు ప్రత్యక్షమగును; మఱియొకసమయమున వాఁడు దాఁగియుండును. లక్ష్మణునిపై వాఁడు త్రిశూలమునుఁ బ్రయోగించెను; అతఁడు దానిని నూరుముక్కలుగ ఖండించెను. ఒకపర్వతశిఖరముఁ బట్టుకొని, వాఁడు పరుగెత్తి వచ్చుచుండెను; దానినిసహిత మతఁడు ఖండించి, పడఁద్రోసెను. వాని యుద్ధపటాటోపమునకు వానరులు భయపడి, దిగులుపడుచుండిరి. అంతలో లక్ష్మణునకుఁ గోపము వచ్చెను. "ఈ దుష్టాత్మునితో నింతకాలము క్రీడించితిని. వానినిజంపక నాడించితిని." అని యతఁడు మనస్సులోఁ జింతించి, అమోఘమగుబాణమును సంధించి, శ్రీరాముని ప్రతాపమును స్మరించి, ఆకర్ణాంతము లాగి, విడిచిపెట్టెను. ఆబాణము వానిహృదయమును భేదించి, వానిప్రాణములనుఁ బుచ్చుకొనెను. మరణకాలమున వాఁడు మాయవేషములను విడిచిపెట్టెను.

దోహా 111

"రాముఁ డేఁడీ? లక్ష్మణుఁ డేఁడీ?" అని వాఁడుపలికి, ప్రాణములను విడిచిపెట్టెను. "ఓ ఇంద్రజిత్తా! నీతల్లి ధన్యురాలు" అని అంగదహనుమంతులు వానినిఁ గొనియాడిరి.

చౌపాయ్

నిరాయాసముగ వానికళేబరమును మహావీరుఁడెత్తిపట్టుకొని, లంకాద్వారమువద్దఁ బెట్టివచ్చెను. వానిమరణమును విని, సకలదేవతలు విమానారూఢులై, యంతరిక్షమున నిలువఁబడిరి. వారు పుష్పములను వర్షించిరి; దేవదుందుభులు మ్రోఁగెను. వారు శ్రీరామునిగుణములను గానముఁ జేసిరి. వారు శ్రీరాముని స్తుతించి, వారివారిలోకములకు నిష్క్రమించిరి. లక్ష్మణుఁడు శ్రీరామునివద్దకు వచ్చెను. శ్రీరాముఁడు ప్రసన్నాననుఁడై, తమ్మునిఁ జూచి, మేఘనాదుని మరణవృత్తాంతము నడిగెను. అంత విభీషణుఁడు రామునితో నిట్లు చెప్పెను. "ఓ నాథా! ఈదినమున వానికి మృత్యువువచ్చెను." ఆమాటను విని, రాముఁడు సంతోషించెను. శ్రీరామునిచరణములకు లక్ష్మణుఁడు మ్రొక్కెను; రాముఁడు పరమానందముఁ బొంది, తమ్మునిఁ గౌఁగిలించుకొనెను; అతని కరుణాకటాక్షవీక్షణముచే, లక్ష్మణునిశ్రమ శాంతించెను; అతఁడు తమ్మునిశరీరమును దువ్వెను; తమ్మునిబాధలు నివారణమయ్యెను. బాణములతో నిండిన కనకతూణీరమువలె, గాయములతోఁ గూడిన నతనిశరీరము ప్రకాశించెను. (అధికపాఠము సులోచన సహగమన కథ.) శ్రీరాముని ప్రసన్నాననమునుఁ జూచి, వానరులు సంతోషించిరి; మేఘనాదుని మరణవృత్తాంతమును విభీషణుఁడు చెప్పెను. మేఘనాదునిశిరస్సు రామునియెదుట వచ్చి పడెను. దానిని వానరభల్లూకములు చోద్యముగఁ జూచుచుండిరి. ఆశిరస్సును రాముఁడు చూచి, దానిని దాఁచి పెట్టుమని యాజ్ఞాపించెను.

దోహా 112

శ్రీరాముని యాజ్ఞాప్రకారము సుగ్రీవుఁడు దానిని దాఁచిపెట్టెను; శత్రువును సంహరించి, రామలక్ష్మణులును, వానరయోధులును దేదీప్యమానముగ వెలుఁగుచుండిరి.

చౌపాయ్

శ్రీరామునికటాక్షదృష్టి సైన్యములపైఁ బ్రసరించెను. వారిశ్రమమంతయు తక్షణము నివారణమయ్యెను. ఓ పార్వతీ! ఆదుర్మార్గుని మరణమువలన, సురనరమునిగణంబులు సంతోషించిరి. తర్వాతివృత్తాం

తమును వినుము. లక్ష్మణునిబాణముచేఁ గొట్టఁబడి, మేఘనాదునిభుజము పతితవలె, నెగిరి వెళ్లి, వానియంగణములోఁ బడెను. వానిహస్తము ధూళిచేఁగప్పఁబడి, రక్తము జిమ్ముచుండెను. రతీదేవికంటె నతిరూపవతి వాసుకికూఁతురు, సులోచన, దశకంఠుని కోడలు, దేవతాస్త్రీలకంటె నతిమనోహరముగ నుండెను. ఆమె కనకపుసింహాసనముపైఁ గూర్చుండెను; మూఁడుకాలములలో నామెను పరివేష్టించి, విద్యాధరస్త్రీలు సేవించుచుండిరి. అనేకవిధముల నామెతో వారు విన్నపములఁ జెప్పుకొనుచుండిరి. ఆమెభోగమును వైభవమును వర్ణించిచెప్పుటకు శక్యము కాదు. సౌఖ్య మనునట్టివృక్షము విఱిగిపడినట్లు, మేఘనాదుని హస్తమువచ్చి, యంగణములోఁ బడెను.

దోహా 113

రక్తముచిమ్ముచుండిన వానిహస్తమును దాసీజనంబులు చూచి, "ఏమియాశ్చర్యము? ఎంత ఘోరమగు సమరము జరగెను? అఖండను ఖండింపఁబడినట్లు కనఁబడును" అని వారిలోవారు గుసగుసలాడిరి.

చౌపాయ్

వారివచనములను సులోచన విని, సింహాసనము దిగివచ్చెను; ఈలోపున నామెమనస్సు పలువిధములఁ జింతించెను; అశుభమును సూచించునట్లు, యామె కుడిభుజము వడఁకెను. "రామరావణులకు ఘోరయుద్ధము జరగుచున్నది; రణధీరుఁడగు నాప్రాణేశ్వరుఁడు యుద్ధములో నుండెను. దేవదానవు లెవరును నానాథుని యెదుటనిలిచి, పోరాడలేరు; అయినను, విధికృతముల నెవరు తెలిసికొనఁగలరు!" ఈప్రకారము సులోచన విచారించుచు వచ్చి, ప్రాణనాథుని హస్తముఁ జూచి, విలపించెను. ఆహస్తము సువర్ణభూషణములతో నలంకరింపఁబడి యుండెను. "మహావృక్షమువంటి నాప్రాణేశ్వరునిహస్తమేగాని, మఱియొకటి కాదు. ఆహస్తమును నేను కన్నులారఁ జూచుచుండినను, నాకు లేశమైన విశ్వాసముకలుగుట లేదు. నాకు వారిప్రభావము తెలియును. ద్వాదశవర్షము లహోరాత్రములు నిద్రాహారములను, స్త్రీలసాంగత్య

మును విడిచిపెట్టిన మహాపురుషుఁడే, నాభర్తను సంహరింపఁగలఁడు; కాని, తదితరులు చంపలేరు."

దోహా 114

ఈ ప్రకార మామెమనస్సులో విచారించి, "నేనే పతివ్రతనయి నయెడల, నీభుజము వ్రాసి, నాసందేహముఁ బోఁగొట్టును" అని నిశ్చయించెను. ఆవెంటనే, హస్తముయొక్క వ్రేళ్లను జాచెను.

చౌపాయ్

ఆతక్షణ మొకచెలికత్తె పరుగెత్తివెళ్లి, యొకసుద్దముక్కఁ దీసికొని వచ్చెను. ఆచెలికత్తె దానిని హస్తములోఁ బెట్టెను. ఆహస్తము లక్ష్మణునికీర్తిని మణి యంగణములో వ్రాయ నారంభించెను. "ఓ సులోచనా! నూరుకోట్లసంవత్సరములవఱకు నిద్రాహారసంగమములను విడిచిపెట్టినవాఁడయినను, లక్ష్మణునితో సమానుఁడు కాఁడు. అతఁడు అక్షయుఁడు; అఖండుఁడు; మనోవాచామగోచరుఁడు; అప్రమేయుఁడు; సర్వాంతర్యామి; త్రిగుణాత్మకమైన త్రిమూర్తిస్వరూపముతో సృష్టిస్థితిసంహారములఁ జేయుచుండును. కాలునకు భయంకరుఁ డగు కాలుఁడు. ఆ మహాపురుషునిమహిమను శేషుఁడును, సరస్వతియు, శివుఁడును సంపూర్తిగ వర్ణింపఁజాలరు. ఆసర్వజ్ఞుఁడు, సాధుసజ్జన దేవబ్రాహ్మణులనిమిత్తము లీలామానుషరూపమును ధరించెను. అతనినామము నుచ్చరించినందున, జనులు భవసాగరమును దాఁటుచున్నారు. అతఁడు మునిమానసపద్మములో నివసించును; మనోబుద్ధిచిత్తాహంకారములకుఁ బరుఁడు.

దోహా 115

"శాస్త్రము లతనిగుణగణములను నూరుకల్పాంతములవఱకు వర్ణించినను, దుదముట్టఁ జెప్పలేవు. ఈనా జడశరీరము, జీవములేని హస్త మామహాపురునిగుణముల నెట్లు వ్రాయఁగలదు?

చౌపాయ్

"నాశిరస్సు రఘురామునివద్ద నున్నది; నీకు విశ్వాసముకలుగుటకు నాహస్తము నీవద్దకుఁ బంపఁబడెను." ఈప్రకారము హస్తము సర్వవృత్తాంతమును వ్రాసెను. ఆమె చింతాక్రాంతురాలై, నేలఁ బడెను. ఆహస్తము వ్రాసినయథార్థముఁ బట్టి, రామలక్ష్మణుల నామముల

యొక్క పరమార్థము వారికి వ్యక్తమయ్యెను. ఆసులోచన స్త్రీస్వభావము ననుసరించి సఖులు చూచుచుండ, వారిమధ్యఁ గూర్చుండి, యనేకవిధముల విలపించెను. ప్రాణేశ్వరుని రూపశీలలావణ్యములను, బలపరాక్రమములనుఁ దలంచి, ఆమె యేడ్వసాగెను. "ఓ నాథా! ఈభుజబలమునకు భయపడి, దేవేంద్రుఁడు పాఱిపోయెను. ఆహా! ఆభుజమునకిట్టిదుర్దశ వచ్చెను." అని యామె విచారించి, భూషణాద్యలంకారములను విసర్జించి, నేలఁబడి, నెత్తిఁ గొట్టుకొనుచు, గుండెలు మోఁదుకొనుచు, రోదనముఁ జేసెను. ఆమె శోకార్ణవములోమునిఁగి, మైమఱచియుండెను. ఆమెకువచ్చిన మహావిపత్తు నెవరు చెప్పఁగలరు? ఆచెలికత్తెలామెనెట్లోదార్చి,ఆమెకు బుద్ధిఁ జెప్పఁగలరు? శోకాగ్నిచే నామె మనస్సు దహించుకొనిపోయెను. ఆమె క్షణక్షణము దిగ్గునలేచి, మరల నేలమీఁదఁ బడి, ప్రాణేశ్వరునిచర్యలను స్మరించి, యేడ్చుచుండెను.

దోహా 116

"ఓ పతివ్రతా! శోకమును విడిచిపెట్టుము; నీవు బుద్ధిమంతురాలవు; ఇఁకముందుఁ జేయఁదగినకార్యముఁ జేయుము" అని చతురభాషిణి యగుచెలికత్తె బోధించెను.

చౌపాయీ

"ఓ సఖి! ఓ తల్లీ! నీవు సత్యముఁ జెప్పితివి; ప్రారబ్ధవశమున నాకీదుఃఖము సంప్రాప్తమయ్యెను. నాగృహములో సకలభోగములును పదార్థములును గలవు. రామలక్ష్మణులకు జయము కలుగును. వానరులకుఁ గీర్తివచ్చును. విభీషణునిమూలమున మావంశమునకుఁ గళంకము వచ్చెను. అతనివంటి వంశనాశనుని నే నిదివఱకు వినియుండలేదు; చూచియుండలేదు. దేవతల సంకెళ్లు వీడెను. ఇఁక దేవతలు వారివారి స్వరాజ్యమునుఁ బ్రకటించి, సుఖముగ నుండఁగలరు. పులస్త్యునివంశము నశించెను. సూర్యచంద్రులు యథాప్రకారము దేదీప్యమానముగ వెలుఁగఁగలరు. అగ్నిహోత్రుని దుఃఖము పోయెను; అతఁడుకూడ యథాప్రకారము ప్రజ్వరిల్లును వాయుమూర్తికి స్వచ్ఛందవిహారము కలిగెను. నేఁడు గంగాదేవిజలములకు నిర్మలత్వము వచ్చెను. దేవేంద్రుఁడు స్వేచ్ఛగ విహరించును.

దోహా 117

"ఈనాఁడు యముఁడును, కుబేరుఁడును, దిక్పాలురును, దేవ, నర, నాగులును, సంతోషముతో వారివారి యజ్ఞభాగముల నందుకొని, సుఖముగ భుజింపఁగలరు."

చౌపాయ్

ఈప్రకార మామె విలపించి, దేవేంద్రభవనముకంటె నధిక శోభాయమానముగనుండిన గృహములోనికి వెళ్లెను. నవరత్నములతోను, సువర్ణముతో నిండియుండెను. శరీరములను ధరించి, బుద్ధియు సిద్ధియుఁ బనులఁ జేయుచుండిరి. ఆసంపద నామెఁజూచినను, దానియందామె కనురాగము పుట్టలేదు. ఆమెమనస్సు ప్రాణేశ్వరుని చరణముల యందే లీనమై యుండెను. ఆమె షోడశమహాదానములఁ జేసెను రత్నఖచితమగు బంగారుపల్లకిలో నామె ప్రాణేశ్వరుని హస్తమునుంచి, వెడలెను. దేవభోగములకంటె నధికభోగముల ననుభవించుచుండినను, వానిని విడిచిపెట్టి, యామె పల్లకివెంట నడచెను. సకలవిషయభోగములను విడిచిపెట్టిన వైరాగివలె, నామె సర్వమును విడిచిపెట్టి, ప్రాణేశ్వరుని ధ్యానించుచుండెను. శుకసారికల నామె బంగారుపంజరములలోఁ బెట్టి, మాటలఁ జెప్పుచుండెను. ఆపక్షులు విచారించి, "సులోచనియెచ్చటకు వెళ్లుచున్నది" అని యడిగెను; వానిమాటలను విని, ధీరులుసహితము ధైర్యమును విడనాడిరి. ఈప్రకారము పశుపక్షులే విచారించినపుడు, మనుజులవిచారముఁ జెప్పనేల? రాక్షసులు వారివారి గృహములను విడిచి, యామెవెంట నడచిరి. ఆమెమీఁద వారికిఁ గల దయచేత, వారు కన్నీరుఁగార్చిరి.

దోహా 118

ఆ పల్లకిముందు బిరుదచిహ్నములు నడచెను; 'ఢంకా, నౌపత్తు' మొదలగువాద్యములు మ్రోఁగుచుండెను. లంకాపురనివాసులు, స్త్రీపురుషులు, పల్లకివెంట నడచిరి.

చౌపాయ్

వీరందఱు రావణుని సింహద్వారమువద్దకు వచ్చుచుండుటఁ జూచి, అచ్చట కావలియుండిన రాక్షసవీరులు యుద్ధమునకు సిద్ధపడిరి;

శత్రుసైన్యము లేమోయని వారు భ్రమించి, అస్త్రశస్త్రములను ధరించి యెదురుగ వెళ్లిరి. అంబులపొదులను నడుములకుఁ గట్టుకొని, డాల్కత్తులను ధనుర్బాణములఁ బట్టుకొని, వారు వెడలిరి. మఱికొందఱు తోమరములను, పరశులను, గదలను, త్రిశూలములను, శక్తులనుఁ బట్టుకొని, క్రోధతామ్రాక్షులై, నిలువఁబడిరి. 'పట్టు, కొట్టు' అని వారు వీరాలాపములాడుచుఁ బరుగెత్తిరి. 'రావణకీ జయ్' అని వారు సింహనాదములఁ జేసిరి. అనేకప్రకారముల రాక్షసవీరులు తర్జించుచు, గర్జించుచు, 'ఛీ'యని యుద్ధమునకు వెడలిరి. అంతలో వారిపల్లకి సమీపించెను; తమపరిజనులేయని వారు తెలిసికొని, సిగ్గుపడిరి. మహాపతివ్రతయగు నాగకన్య, సులోచనను వారు చూచి, జోహారువనుచు నిలువఁబడిరి. ఆమె యెంతధన్యురాలు?

దోహా 119

ఆమె యాగమనమును ద్వారపాలకులు లోనికివెళ్లి, రావణునకు విన్నవించిరి. రావణుని యాజ్ఞప్రకారము, వారు నామెను లోనికిఁ దీసికొని వెళ్లిరి. ఆమె రావణునిఁజూచి, విలపించెను.

చౌపాయ్

"మీరు జీవించియుండ, నాకీ దశవచ్చెను; సుఖముల ననుభవించుటకు బదులు, నాకు దుఃఖము సంభవించెను. ఆకాశమార్గమున వచ్చి, యీ నాప్రాణేశ్వరునిహస్తము నాయంగణములోఁ బడెను. ఆహస్తము బాణముచేఁ గొట్టఁబడి, రక్తముఁ జిమ్ముచున్నది. దానిం జూచిన తరువాత, నామనస్సు శంకించి, భయపడెను. నాసందేహమును నివృత్తిఁ జేసికొనుటకు, నేనాహస్తమునకో నొకసుద్దముక్కనుఁ బెట్టియుంటిని. ఆహస్తము శ్రీరామలక్ష్మణులమహిమను వ్రాసెను." అని యామె చెప్పి, సర్వవృత్తాంతమును సాంతముగ వినిపించెను. "ఓ స్వామీ! ఈప్రకారము వ్రాయఁబడిన శ్రీరాముని గుణగణములఁ జదివినందున, నా కాశ్చర్యము కలిగెను. నాప్రాణేశ్వరునిశిరస్సు నాకు దొరికినయెడల, నేను సహగమనముఁ జేయుచున్నాను. ఈ ఘోరసంగ్రామమునుండి నాభర్తహస్తము నావద్దకు వచ్చిపడెను; వారిశిరస్సు శ్రీరామునివద్దకు వెళ్లిపడెను. ఓ రావణా! ఓ నిశాచరపతీ! మీరు సమర్థులు; కనుక,

నా ప్రాణేశ్వరునిశిరస్సును తెప్పింపుఁడు; మీరు ప్రయత్నించినయెడల, నది దొరకును." అసులోచన పలికినపలుకులు వజ్రమువలె, వానిహృదయమును భేదించెను; వాఁడు జీవితాశను విడిచిపెట్టెను. వాఁడు లోకరావణుఁడు కనుక, ధైర్యము నవలంబించి, యామెను బోధించెను; "ఓ సులోచనీ! నాతో సరిసమానమగువీరుఁడు లోకములో నెవఁడు కలఁడు ?

దోహా 120

"రామలక్ష్మణులు, విభీషణుఁడు, నలుఁడు, నీలుఁడు, సుగ్రీవుఁడు, హనుమంతుఁడు, ద్వివిదుఁడు, తదితరవానరులు—ఈ మొదలగువారిని సంహరించి, యిప్పుడే వారిశిరస్సులఁ దీసికొనివచ్చెదను.

చౌపాయ్

"కుంభకర్ణుఁడును మేఘనాదుఁడును కార్యమును సాధింపఁగలరని, నా కింతవఱకు నమ్మకముండెను; అందుచేత, నింతవఱకు నేను యుద్ధముఁజేయక యూరకుంటిని. వారివారిపురుషార్థములను నేను కన్నులారఁ జూచితిని. వానరులచేతను మనుజులచేతను వారు సంహరింపఁబడిరని వినినందున, నాకు సిగ్గువచ్చుచున్నది. వానరులచేతఁ జంపఁబడినవారేపాటివీరులని లెక్కపెట్టవచ్చును! ఓ కులవధూ! నీవు శోకమును విడిచిపెట్టుము; నేను వారివంటి వీరుఁడననిమాత్రము తలంపకుము. ఒక నాలుగుఘడియలకాలము నీవు శాంతముతో నిలువుము. నా బలపరాక్రమములను ఘోరసంగ్రామములోఁ జూడఁగలవు. ప్రయాసములేకయే, నీశత్రువుల శిరస్సులఁ ద్రుంచి, తీసికొనివచ్చెదను. ఇందులకు సందేహము లేదు. నీ పూర్వజన్మసుకృతమున కనుగుణ్యమగుభోగముల ననుభవింపుము; లేనియెడల, నేమిప్రయోజనము కలదు ? రాక్షసులను వానరులు సంహరించెదరు.

దోహా 121

"ఆహా! ఏమి దుర్దశవచ్చెను. నా రాక్షసవీరులు మహామేరుపర్వతమును బడద్రోయగలిగినంత మహాబలవంతులు; భూమిని ధరింపఁగలిగినంత సమర్థులు; అటువంటి మహావీరులను, దోమలనువలె, వానరులు మర్దించి, చంపిరి. కాలవిపరీతము లెవరికిఁ దెలియును?"

చౌపాయ్

రావణుని ప్రగల్భముల నామె విని, కోపముచే మండిపడి, శోక సంతప్తసూనసురాలై, వానిమాటలకు నిశ్చేష్టురాలై, వానితో నిట్లు చెప్ప నారంభించెను. ఏవిధమున నామె వానికి సమాధానముఁ జెప్పినను, వానికి బోధపడలేదు; వ్యర్థమగు వాని ప్రతాపములవలన, నామెకు సంతోషము కలుగలేదు. ఓ మహారాజా! నరవానరులపురుషార్థమును మీరు కన్నులారఁ జూచియు, వారి ప్రభావమును మీరేల తృణీకరించెదరు? సాగరమును దాఁటివచ్చి, లంకను దహించినవానరుఁడు సహితము కున్నఁడనియా మీ యభిప్రాయము? కుంభకర్ణుఁడు, అతికాయుఁడు, మహోదరుఁడు, నా ప్రాణేశ్వరుఁడు, వారిసోదరులు మొదలగువారు హతులయిరి. హే దశాననా! ఇఁక శత్రువులను జయింపఁగలరని యాశకలదా? మీరు మహామోహాంధకారములోఁ బడియుండిరి." మామగారితోఁ బ్రతిభాషలాడుట పాపమని తలఁచి, వారితో వాదించుట నిరర్థకమని యామె గ్రహించి, తనలో నిట్లు చింతించెను. "ఒకవేళ రాజ్యమువచ్చినను, నాకేమిలాభము! దానితో నాకేమి ప్రసక్తికలదు? నానాథుఁడు లేఁడు కనుక, నాకీసుఖములు నరకముతో సమానము."

దోహా 122

ఈ ప్రకారము సులోచన తలంచి, దిగ్గునలేచి, మందోదరివద్దకు వెళ్లెను; అత్తచరణముల నామె పట్టుకొని, యేడ్వసాగెను; జరగిన వృత్తాంతమునంతయు నామెతోఁ జెప్పెను.

చౌపాయ్

ఆవృత్తాంతమును మందోదరి విని, విలపించెను. ప్రాణేశ్వరుని హస్తముచే వ్రాయఁబడిన రామలక్ష్మణుల మహిమనుగుఱించి, యామెతో సులోచన చెప్పెను; తదుపరి రావణుని క్రోధమునుగుఱించి విన్నవించెను. "నాప్రాణేశ్వరుఁడు చచ్చినతరువాత, వారు నాకు బోధించిరి; వారిమాటలు ప్రగల్భములు. ఈ ప్రకారము వారు నాకు బోధించిరి." కోడలు చెప్పినమాటలను మందోదరి విని, దుఃఖించి, యామెతో నిట్లు చెప్పెను. "ఓ సులోచనీ! నీవు బుద్ధిమంతురాలవు. నీవు

చెప్పినమాటలు సత్యము. ఈసంగతులనే, పూర్వము, నాకు నారదుఁడు చెప్పియుండెను. అప్పటి కామాటలు పిచ్చిమాటలువలెఁ గనఁబడినను, నేఁడు సత్యమయ్యెను; ఆ మాటలన్నియు మన యనుభవములోనికి వచ్చెను; ఒకమాటయైనను తప్పలేదు. ఓ వధూ! నారదునిమాటలసత్యములు కావు; ఆమాటలను మనస్సులో నుంచుకొనుటయే యజ్ఞానము. ఇఁక ముందుకథఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము. ఇదియంతయు నారదుఁడు చెప్పియుండెను. వైరభావముచేత, రావణునిబుద్ధి చెడిపోయెను; ప్రాణములు పోవుచుండినను, వారు నీతిమార్గమునఁ బ్రవర్తింపరు. శోకసంతప్తమానసురాలై, యుండినజానకి ముక్తురా లగును. వానరభల్లూకములు రాజమందిరమును కొల్లపెట్టఁగలరు దేవతులమణులను, అలంకారములను, వస్త్రములను, విమానములను వనచరులు సంగ్రహించి, యనుభవింపఁగలరు.

దోహా 123

"ఒకకల్పమువఱకు మరణములేక విభీషణుఁడు లంకారాజ్యముఁ బరిపాలించును. కర్మమునననుసరించి, సుఖదుఃఖములు లోకములో వచ్చుచుండును. ఒకనికి యుపదేశించుటవలనఁ బ్రయోజనము లేదు. ఎవనికర్మము ననుసరించి, వానివిషయములు ప్రవర్తించును.

చౌపాయ్

"నారదునిమాటలయందు నాకు సంపూర్ణముగ విశ్వాసము కలదు. జయాపజయము లనుభవనీయములు. ఓ పుత్రీ! శోకమును విడిచిపెట్టి, నీభర్తతోఁగూడి పరలోకమునకుఁ బోవుటకుఁ దగినప్రయత్నముఁ జేయుము. నీభర్తయొక్క శిరస్సునిమిత్తము నీవు శ్రీరాముని వద్దకు వెళ్లుము. నీవు సంశయమును విడిచిపెట్టి, శిరస్సును రామునియడిగి తెచ్చుకొనుము. ఇప్పుడు సిగ్గుపడుటకు సమయము కాదు. సమయమువచ్చెను కనుక, నీవు రాముని యడిగినందున, దోషములేదు. జేయఁదగినపనిని జేయవలెను. విభీషణుఁడు నీమామ; అతఁడు నీతోఁ బ్రతివచనము లాడఁడు. వాలికిని రావణునకుఁ గలస్నేహముచేత, నంగదుఁడు నా కుమారునివంటివాఁడు. ఏకపత్నీవ్రతుఁడు శ్రీరాముఁడు; లక్ష్మణునివృత్తాంతమంతయు నీకు విశదము. వారు పరస్త్రీలను జూడరు; అందుచేత, వారివద్దకు నీవు వెళ్లినందున, దోషములేదు. మహాబలవం

తులగు జాంబవంతుఁడు, సుగ్రీవుఁడు, ద్వివిదుఁడు, మందుఁడు మొదలగు వానరమంత్రులు రామునిముఖముఁ జూచి, వ్యవహరించెదరు; మహా వీరుఁ డగుహనుమంతుఁడు బ్రహ్మచారి; సకలదుఃఖములను హరించు శ్రీ శివునియవతారము. శ్రీరాముఁడు సదా నీతిమార్గము ననుసరించి వ్యవహరించును. అచ్చటికి వెళ్లుటవలన, నీకేమికష్టము?

దోహా 124

"నీ ప్రాణేశ్వరునిహస్తమే, రామలక్ష్మణులమహిమను వ్రాసియుం డెను కదా! అదియంతయు నీకు విశదమయ్యెను. నేను నారదునివలన వినినవృత్తాంతమునంతయు నీకుఁ జెప్పియుంటిని. ఇఁక విలంబముఁ జేయకుము."

చౌపాయ్

ఈప్రకారము మందోదరిపలికిన ప్రియవచనములను సులోచన విని, రామునివద్దకు వెళ్లుటకు నిశ్చయించెను. ఆమె యత్తగారిచరణ ములకు నమస్కరించి, రాముని సమీపించుటకు వెడలెను. వానరభ ల్లూకసైన్యములు సముద్రతీరమున సువేలాపర్వతమువఱకుఁ గలప్రదే శము నాక్రమించి యుండెను. ఎఱుపు, తెలుపు, నలుపు, గోధుమ వర్ణము గలవానరులు కోటానఁగోట్లు, రెండవ మహాసముద్రమువలె నుప్పొంగుచుండిరి. వారు లంకానగరమును నలువైపులను ముట్టడించి యుండిరి. ఆకాశముయొక్క రక్తవర్ణమే బడబానలము; వేలకొలఁదివా నరులు పర్వతములను వృక్షములను భుజములతోఁ బట్టుకొని, ప్రళయ కాలమేఘములవలె, రాక్షసులగృహములపై నిలిచియుండిరి. ఆ వానర సేనాసముద్రములో నాదిశేషుఁడగు లక్ష్మణునితొడపై శిరస్సునుంచు కొని, శ్రీరాముఁడు పవ్వళించెను. అక్షయవటమువలె, విభీషణుఁడు యథోచితముగ శ్రీరాముని సమీపమునఁ గూర్చుండియుండెను. ఈ వైభవమును బుణ్యాత్ములు చూచిగాని వినిగాని యుండలేదు.

దోహా 125

వారింజూచి, సులోచన భయపడెను; కాని, యామె ధైర్య ముఁదెచ్చుకొని, "మహారాజా! నావినయమును శ్రీరాములకు విన్న వింపుఁడు" అని ప్రార్థించెను.

చౌపాయ్

అప్పుడు వానరులు సంతోషించి, వారిలో వా రిట్లు గుసగుస లాడిరి. "ఓ తమ్ముఁడా! ఈదినమున లంకలోనుండి యొకపల్లకి వచ్చుచున్నది. దీనిఁ బట్టిచూడ, రావణునకు బుద్ధివచ్చినట్లు కనఁబడును. మేఘనాదుని మరణానంతరమున, వానికి సర్వము బోధపడెను వాఁడు మూర్ఖత్వమును విడిచి, జానకిని రామునివద్దకుఁ బంపించుచుండినట్లు తోఁచును. ఇకను దుఃఖమును విడిచిపెట్టుఁడు; ఈరోజుతో యుద్ధము శాంతించెను. ఏజానకినిమిత్తము లంకానగరము దహింపఁబడెనో, ఏజానకినిమిత్తము సముద్రము కట్టఁబడెనో, ఆజానకి నేఁడు శ్రమలేకయే, రామునివద్దకు వచ్చుచున్నది. ఆవిధాత మనకు సహాయుఁడై యుండెను. శ్రీరామునకును సుగ్రీవునకును జయమువచ్చెను; వానరులకుఁ గీర్తి వచ్చెను. రామలక్ష్మణుల విరహదుఃఖము శాంతించును. ఏకష్టములేకయే, లంకానగరము పడిపోయెను. యుగయుగములకు మనకీర్తి వ్యాపించును. రాక్షసు లెక్కడ? లఘువులగు వానరు లెక్కడ?"

దోహా 126

ఈప్రకారము వానరులు కూడఁ బలుకుకొని, రామకార్యము నెఱవేఱెనని నిశ్చయించిరి. అందులకు సందేహములేదని వారినమ్మకము.

చౌపాయ్

పరులగృహములో నొక క్రొత్తస్త్రీ ప్రవేశించునపుడువలె, సులోచన వానరకటకములో సంకోచించుచుఁ బ్రవేశించెను. ఆమె ముందునకు నడచివెళ్లి, శ్రీరాముని నీలమేఘశ్యామశరీరమును దాని లావణ్యముఁ జూచెను; ఆ చక్కఁదనాలకుప్పప్రక్కనుండిన గౌరవర్ణముగల లక్ష్మణుని వీక్షించెను. మరకతములును, సువర్ణమును వారిరువురి దేహకాంతులఁ జూచి, సిగ్గుపడును. వారిమహిమను వర్ణించువారే ధన్యులు. మదగజముయొక్క తొండముతో వారి భుజదండములు సమానము. ఆభుజదండములు ధనుర్బాణములను తీక్ష్ణమగుకత్తిని పట్టుకొని యుండెను. ఆశ్రీరాముని వక్షస్థలము విశాలము; మూపుర మున్నతము; కంఠము శంఖము; దానిపై మూఁడురేఖలు కలవు; అతని దంతములశోభ నెవరు చెప్పఁగలరు? వానికిఁదగిన యూథమా

నముఁ జెప్పుటకు మనస్సు సంశయించును. అతని యధరారుణము జూచి, బింబాఫలమును, బంధూకమును సిగ్గుపడును; అతనిముక్కుఁ జూచి, చిలుకముక్కు సిగ్గుపడును. వానికిఁదగిన యుపమానముఁ జెప్ప లేక, కవీశ్వరులు నిశ్చేష్టులయిరి.

దోహా 127

ఆశ్రీరాముఁడు తేజోరాశి; గుణసముద్రుఁడు; గుణనిధి—అతని మహిమను దేవతలుసహితము తుదముట్టఁ జెప్పలేరు. మనుజమాత్రుఁ డగుకవీశ్వరుఁ డెట్లు చెప్పఁగలఁడు?

చౌపాయ్

ఆ చక్కనికనుబొమలు; సుందరమైన కపోలయుగము; శిరస్సుపైఁ గట్టఁబడిన జటాముకుటము; విశాలమగు ఫాలము; ముఖమున శోభించుచుండిన తిలకము; ఈ దివ్యమంగళవిగ్రహమును ధ్యానించిన, మునీశ్వరుల మనస్సుసహితము భ్రమించును. అతఁడు వల్కలాంబరమును ధరించి, నడుమునకు తూణీరములనుఁ గట్టుకొని, భుజముపైనుండి ధనుస్సు వ్రేలుచుండ, హస్తముతో బాణమునుఁబట్టుకొనియుండెను. ఆ దయానిధి, ఆ దీనబంధువు వీరాసనము వేసికొని, కూర్చుండెను. నవపల్లవములతోను పుష్పములతోఁ జేయఁబడిన వనమాల యతనికంఠమునుండి వ్రేలుచుండెను. అతని చరణకమలములకాంతిని వర్ణించుటకు శక్యముకాదు. తుమ్మెదలువలె, మునీశ్వరులమనస్సులు వానినిఁ జూచి, లోభించును. ఆ చరణములయందే, గంగపుట్టెను. ఈపురాణకథను వేదపురాణములు చెప్పుచున్నవి; ఆ చరణములకే, బ్రహ్మ మహేశాదిదేవతలు నమస్కరింతురు. ఎంతోపుణ్యాత్ముల కాచరణములు దృగ్గోచరము లగును. ఆ చరణకమలములే, మనుజులదుఃఖములను బోఁగొట్టును; ఆ చరణారవిందములే, సంసారసాగరమును దాఁటించును.

దోహా 128

ఆ చరణకమలములకే, దీనరక్షకులని బిరుదావళి కలదు. ఆ చరణములే శోకమును హరించును; సంశయములను బాపును; సకలసన్మంగళముల నిచ్చును.

చౌపాయీ

అంగదహనుమంతులు చేతులను జోడించుకొని, రాముని యెదుట నిలువఁబడిరి. ద్వివిదుఁడు, మైందుఁడు, బలవంతుఁడగు కుముదుఁడు, జాంబవంతుఁడు, సుగ్రీవుఁడు, ఋషభుఁడు, సుషేణుఁడు, నలుఁడు, నీలుఁడు మొదలగువానరవీరు లతనిని పరివేష్టించి యుండిరి. రామున కిరుప్రక్కల లక్ష్మణవిభీషణులు ప్రకాశించుచుండిరి. వీరందఱు మితముగ సంభాషించుచు, రామునిచరణములను సేవించుచుండిరి; ఆదేవదేవుని ముఖారవిందముఁ జూచి, వ్యవహరించుచుండిరి. ఈ మహాసభలో శ్రీరామమూర్తి దేదీప్యమానముగ వెలుఁగుచుండెను; శ్రీరామచంద్రుని దర్శించినందున, సులోచన లోచనములు సులోచనము లయ్యెను. ఆమె శ్రీరామునకు సాష్టాంగదండప్రణామముఁ జేసెను. ఆమెవృత్తాంతమును విభీషణుఁడు రామునకుఁ జెప్పెను. "ఓ రాజాధిరాజా! ఈమె మేఘనాదుని ధర్మపత్ని; మహాపతివ్రత." అతనిమాటలను రాముఁడు విని, ఆమెవైపుఁ దిరిగి, చూచెను. "ఈ సుశీలురాలు మేఘనాదునిభార్య; వాఁడు మీతో విరోధించుటవలన, నామె కీదుర్గతి పట్టెను." ఆమె చేతులనుజోడించుకొని, ప్రేమాతిశయము లుప్పతిల్ల, శ్రీరామునిపై స్తోత్రముఁజేయ నారంభించెను.

దోహా 129

"ఓ నాథా! మీ మహిమాతిశయములను నా ప్రాణేశ్వరుని హస్తము వ్రాసినందున, నాకు విశదమయ్యెను. ఓ రాజాధిరాజా! మిమ్ముల నొకటి ప్రార్థింప మీదర్శనమునకు వచ్చితిని.

ఛాంద్ 1

"పరశేచరణ కర ప్రేమ స్ఫూరణ ప్రణతపాల ఖరారికే,
జిహి నమత శంకర శేష సుర ముని ధరణి భంజన భారకే.
ప్రభు జాన సో వినతీ సులోచన కరత కహి వినతీ ఘనీ,
జయ శోకహారణ కృపాలు జయ జయ జయతి జయ రఘుకులమణీ.

"ఓ దీనరక్షకా! ఓ ఖరదూషణాంతకా! మీరే నాకు శరణు" అని ప్రేమాతిశయముచే నామె పలికి, శ్రీరాముని చరణారవిందములను స్పృశించెను. ఆ చరణములకు బ్రహ్మామహేశాదిదేవతలును,

శేషుఁడును, మునులును దండప్రణామముఁ జేయుచుందురు. ఆ చరణములే భూభారమును హరించును. "ఓ నాథా! ఈసులోచని దీనాలాపములను విన్నపములను స్వీకరింపుఁడు. నావిన్నపమును మన్నింపుఁడు. జయ, జయ; జయజయ! ఓ రఘుకులమణీ! హే శోకహరణా! హే దీనదయాపరా! జయజయ!

ఛాంద్ 2

"ప్రభు బ్రహ్మరూప స్వభావ శీతల అతుల బల త్రిభువన ధనీ,
జయ హరణ ధరణీభార బాహు విశాల ఖండన ఖలఅనీ.
తవ దీనబంధు దయాళు అపరంపార సబగుణ ఆగరే,
కరుణానిధాన సుజాన శీల సనేహ రూప ఉజాగరే.

"ఓ ప్రభో! మీరు సాక్షాత్ బ్రహ్మరూపులు; స్వభావముచే మీరు చల్లనివారు; మీబల మపరిమితము; (ధనీ=ధాసీ=ఉనికిపట్టు) త్రిభువనములకు మీరే యునికిపట్టు; ఓ భూభారహరణా! మీ భుజబలముచే దుష్టజనులను సంహరించితిరి. జయజయ! ఓ దీనబంధూ! ఓ కరుణానిధీ! మీగుణము లపారములు; మీరు సకలగుణనిధులు; ఓ దయానిధీ! మీరు సర్వజ్ఞులు; చతురులు; సుశీలురు; మీ రూపశీల లావణ్యములు దేదీప్యమానముగ వెలుంగుచుండును.

ఛాంద్ 3

"షట అష్ట లోక జో రచత పాలత ప్రళయ సో మాయాసురీ,
కేహి భాతి వరణౌ నాథ గుణ గణ నారి జడమతి బావరీ.
జే చరణ ఈశ మహేశ శారద శ్రుతి నిరంతర ధ్యావహీ,
హౌం భూరిభాగ్య సరోజ పద సోఇ హర్ష శిరసి లగావహీ.

"ఓ నాథా! మీ యాజ్ఞాప్రకారము మాయ పదునాలుగు లోకములను సృష్టించి, పరిపాలించి, సంహరించును. మీయంతము నెవరు చూడఁగలరు! నేను స్త్రీని; నాబుద్ధి మందము; నేను మీగుణముల నెట్లు వర్ణింపఁగలను? మీ చరణారవిందములను శివుఁడును, వేదములును, సరస్వతియు, శేషుఁడును, నిరంతరము ధ్యానించుచుందురు. ఆ చరణకమలములధూళిని నేను శిరస్సుపై ధరించితిని; నేనెంత యదృష్టవంతురాలను? ఏమి నాభాగ్యము?

ఛాంద్ 4

"నిరఖత యుగచరణం అశరణ శరణం తారణ తరణం భయహరణం,
జగకారణకరణం పోషణభరణం ఖలదలహరణం దుఖటరణం.
ఘనశ్యామ స్వరూపం అతిహి అనూపం సురవరభూపం నరరూపం,
జేహి నిగమ నిరూపం అకల అరూపం కీన్హా కురూపం నఖశూపం.

"ఓ నాథా! మీ చరణారవిందములు భవసాగరమును దాఁటించును; రక్షకులులేనివారిని రక్షించును; భయమును బోఁగొట్టును; ఆ చరణములే జగత్తులకుఁ గారణములు; ఆ చరణములే లోకములను భరించి, పోషించును; దుష్టజనులను సంహరించును; భక్తజనుల దుఃఖములను హరించును. వానిని దర్శించినమాత్రమున, నాజన్మము కృతార్థమయ్యెను. ఓ నాథా! మీరు దేవదేవులు; మీ ఘనశ్యామస్వరూప మత్యంతశ్రేష్ఠ సుఖదాయకము; మీ దివ్యమంగళనరరాజరూప మత్యంత మనోహరము. మీరూప మపురూపమనియు, కాలరహితమనియు వేదములు చెప్పుచున్నవి. మీరే శూర్పణఖను గురూపం జేసితిరి.

ఛాంద్ 5

"పీతాంబర రాజత అతిఛబిఛాజత తడితసులాజత ముఖ భ్రాజత,
సబకే శిర తాజత గరిబ నివాజత సంతనకాజత తనుసాజత.
కటిసుభగసుభావని సింహాలజావని మునిమనభావని లలచావని,
నాభిః సుభగావని అతిశయ పావని ఉపమానావని ఛబిఛావని.

"ఓ నాథా! మీ పీతాంబరముయొక్క కాంతి దేదీప్యమానముగ వెలుఁగుచున్నది; దాని కాంతిఁజూచి, మెఱుపుసహితము సిగ్గుపడుచున్నది; మీ ముఖారవిందము ప్రకాశముగ నున్నది. మీరు సకలజనశిరోమణులు; దీనదయాపరమూర్తులు; సత్పురుషుల కోరికలను నిర్వహించెదరు. మీ సూక్ష్మమగు చక్కనినడుమును సింహము చూచి, సిగ్గుపడుచున్నది; ఆ నడుమునుజూచి, మునీశ్వరుల మనస్సులు భ్రమించుచున్నవి; ఎంతవఱకుఁ జూచినను, దానిని జూడవలెనని, కోరిక పుట్టుచున్నది. అతిచక్కని మీ గంభీరనాభి, పవిత్రమయినది; దానికిఁ దగినయుపమానముఁ జెప్పఁజాలను.

ఛాంద్ 6

"అతి హృదయవిశాలా గల వనమాలా తల మృగఛాలాహై కాలా,
లోచన యుగలాలా భ్రుకుటి విశాలా దీనదయాలా జనపాలా.
కుండల యుగకానా సూర్యసమానా కరతహిం ధ్యానా మనమానా,
కరధరి ధనుబానా కృపానిధానా కామలజానా లఖిబానా.

"ఓ నాథా! మీహృదయము విశాలము; మీకంఠమునుండి వనమాల వ్రేలుచున్నది; మీయాసనము నల్లని కృష్ణాజినము; మీనేత్రము లరుణారుణములు; మీకనుబొమలు విశాలములు; ఓ జనపాలకా! ఓ దీనదయాపరా! సూర్యునివలెఁ బ్రకాశించుచుండిన రెండు కుండలములు మీచెవులకుఁ గలవు; వానిని ధ్యానించుటవలన, మనస్సునకు సంతోషము కలుగును. మీహస్తములో ధనుర్బాణములు కలవు. మీరు కృపానిధానులు; మీ దివ్యమంగళవిగ్రహముఁ జూచి, కాముఁడుసహితము భ్రమించును.

ఛాంద్ 7

"మస్తక దియచందన శిరజటవందన దశరథనందన సురవందన,
ద్విజసంత అనందన దుష్టనికందన హరదుఃఖద్వంద్వన యమఫందన.
సుని కీర్తిసుహాఈ శరణహిం ఆఈ సుందరతాఈ మన భాఈ,
దీజై రఘురాఈ భక్తిసదాఈ కరియసహాఈ సుఖదాఈ.

"ఓ నాథా! మీమస్తకమున చందనము రాయఁబడి యుండెను. మీశిరమున జటాముకుటము కట్టఁబడెను; ఓ దశరథకుమారా! మీకు దేవతలు నమస్కరించుచున్నారు. బ్రాహ్మణులకును సత్పురుషులకును మీరు సంతోషముఁ గలిగించెదరు; మీరు దుష్టులను సంహరించెదరు; మీరే దుఃఖద్వంద్వము లనుయమపాశములను హరించెదరు. మీకీర్తి విని, నేను మీశరణుఁ జొచ్చితిని. మీదివ్యరూపము నాహృదయము నాక్రమించెను. ఓ రఘురామా! ఓ సుఖధామా! మీపై ప్రేమభక్తిని దయచేయుఁడు; నా కీసహాయముఁ జేయుఁడు.

ఛాంద్ 8

"గహాకరవాణీ శార్ఙ్గపాణీ సబగుణఖానీ రామబలీ,
సురసురభీరతుక రాక్షసభక్షక భక్తహిరతుక మానబలీ.

మైరిపుసుతనారీ జానఅఘారీ అధికారీ నహి దుఃఖభారీ,
హారి విరహదవారీ అతిభయకారీ సహబహువారీ దుఃఖకారీ.

"ఓ శార్ఙ్గపాణీ! ఓ సకలగుణధామా! ఓ రామా! మీరు మహాబలవంతులు; నా వినయమును గ్రహింపుఁడు. గోవులను దేవతలను మీరే రక్షించెదరు; మీరే రాక్షసాంతకులు; మీరే భక్తరక్షకులు; మీ మూలముననే, మీభక్తులకు మానమును బలమును కలుగును; ఓ పాపహారీ! నేను మీ శత్రువుల స్త్రీని; మిమ్ములను స్తుతించుటకు నా కధికారము లేదు. నాకు గొప్పదుఃఖము వచ్చెను. ఓ నాథా! ప్రాణేశ్వరుని వియోగాగ్ని భయంకరము; దుఃఖదాయకము; ఇంతవఱకు సహించితిని కాని యికముందు దుఃఖమును సహింపఁజాలను.

ఛాంద్ 9

"తవ శరణహి ఆఈ జన సుఖదాఈ రఘురాఈ కరుణాసాగర,
పతిమస్తక పాఊం జరి సంగజాఊం శిరపాఊం శోభాఆగర.
పతి మమ తను త్యాగీ అతిబడభాగీ అనురాగీ జిన ముక్తిలహీ,
మమతా కిమితాసూ వరణూం ఆసూ జాసు అచల జగపంక్తిరహీ,
యహివిధి పదపంకజ సేవ్య రమా అజ శిర నమి ద్వా కరజోరి రహీ,
సుని పంకజలోచన వచన సులోచన లోచనమే జలధార బహీ.

"ఓ సకలజనసుఖదాతా! ఓ రఘునాథా! ఓ దయాసాగరా! నాకు మీరే శరణ్యులు; ఓ శోభాకరా! నాకొక కోరికకలదు; నా నాథునిశిరస్సు దొరికినయెడల, సహగమనముఁజేయుటకు నిశ్చయించితిని; నాప్రాణేశ్వరుఁడు శరీరమును విడిచి, మీయం దనురాగముకలవాఁడయ్యెను; అతఁడు గొప్ప యదృష్టవంతుఁడు. అతఁడు మీప్రేమకుఁ బాత్రుఁడైనందున, నతనికి ముక్తివచ్చెను; అతనినిగుఱించి, విచారించుటవలనఁ బ్రయోజన మేమికలదు? నానాథుని నిశ్చలమగుకీర్తి లోకములో వ్యాపించెను; దానిని నేనేమి వర్ణించి చెప్పఁగలను? ఓ నాథా! మీ చరణకమలములను లక్ష్మియు బ్రహ్మయు సదా సేవించుచుందురు." ఈప్రకారము సులోచన శ్రీరాముని ప్రార్థించి, నమస్కరించి, చేతులను జోడించుకొని, నిలువఁబడెను. ఆ కమలలోచనుఁడు,

శ్రీరాముఁడు, సులోచనివచనములను విని, కంటినిండ నీరుఁబెట్టుకొని, కన్నీరుఁ గార్చెను.

దోహా 130

ఆ దీనబంధు, ఆ భగవంతుఁడు, ఆ శ్రీరాముఁ డెట్టివాఁడు? నిర్హేతుకజాయమానకటాక్షముఁ జూపించును కదా! "ఓ మూర్ఖుఁడా! కపటమును విడిచి, నీవెందుల కట్టిప్రభువును భజింపవు?" అని తులసీదాసుగా రడుగుచున్నారు.

చౌపాయ్

"ఓ భగవానుఁడా! మీరు సర్వాంతర్యాములు; ఆదిమధ్యావసానములు మీకు లేవు." ఈప్రకారము సులోచనిపలికిన ప్రియవచనములను రాముఁడు విని, సంతసించెను; అతనిశరీరము పులకరించెను; అతనిశరీరము పరవశమయ్యెను. "ఓ చిన్నదానా! నీభర్తను బ్రతికించెద; మీ రిరువురు నూరుకల్పములవఱకు లంకారాజ్యమును బరిపాలింపుఁడు. నీవు శోకమునువిడిచి, సంతోషించుచు, నీగృహమునకుఁ బొమ్ము" అని శ్రీరాముఁడు ప్రసన్నుఁడై పలికినసత్యవాక్యములను విని, వానరులు భయపడిరి; ప్రతివచనముఁ జెప్పుటకు వారు వెఱచి, యూరకుండి, ప్రభువుముఖమును వీక్షించుచుండిరి. ఈశ్వరునికృప యెట్లు ప్రవర్తించునో కదాయని వారు తలంచిరి. "ఒకసమయమున శ్రీరాముఁడు కటాక్షించి, వానిని బ్రతికించినయెడల, వానివలన దేవతలకు శోకము కలుగకుండునట్లు చేయును" అని వారిలో వారు చెప్పుకొనిరి.

దోహా 131

"విభీషణుఁడు లంకారాజ్యము నెట్లు పరిపాలించును? పూర్వవైరమును స్మరించి, మేఘనాదుఁడు ధనుర్బాణములను ధరించి, యతని యెదుట నిలువఁబడిన, నతఁ డేమిచేయఁగలఁడు?"

చౌపాయ్

శ్రీరాముని ముఖముఁజూచి, వానరులు భయపడి, "ఓ నాథా! సావధానులై, దీనులను రక్షింపుఁడు" అని విన్నవించిరి. శ్రీరాముని కటాక్షవీక్షణముఁ జూచి, సులోచన యిట్లు విన్నవించెను. "ఓ నాథా! మీ రుదారులు; మీరు సర్వము చేయఁగలరు; మీరు కరుణాసము

ద్రులు; మీకరుణఁ జూపించితిరి. నాప్రాణేశ్వరుఁడు జీవించుటకంటె మృతినొందుటయే, యుక్తమని నాబుద్ధికిఁ దోఁచుచున్నది. ఏ నాప్రాణేశ్వరుఁడు స్వభుజబలముచే లోకములను జయించి, పదునాలుగుభువనముల భోగముల ననుభవించి, యుద్ధరంగమున లక్ష్మణునివంటి యాచకునకు ధనమును ప్రాణములను దానముఁ జేసెనో, అట్టి నాభర్తను బహుమతిగ నేను పుచ్చుకొనుట యుచితముకాదు. అన్నిటికంటె శ్రేష్ఠము మీదర్శనము నాకు లభించెను. నేను సత్యసహగమనముఁ జేసి, ప్రాణములను విడిచిపెట్టెదను; యోగీశ్వరులు సమాధిలోనుండి, మిమ్ములను పొందువిధమున, నేను మిమ్ములనుఁ బొందుదును.

దోహా 132

"ఓ రఘునాథా! నిర్మలమగు గతినిఁబొందుటకు సమయము వచ్చెను. మిమ్ములను గలసినతరువాత, లోకములో జన్మంబు గలుగదు. సముద్రములోఁ గలసిననీరు తిరిగి, పైకివచ్చునా?

చౌపాయీ

"ఓ దేవదేవా! మనుజులమనోభావములు మీకుఁ దెలియును. నానావను భవసాగరమును దాఁటింపుఁడు." ఆమెప్రార్థనను శ్రీరాముఁడు విని, సుగ్రీవునిఁ బిలిచి, మేఘనాదుని శిరస్సును దీసికొనిరమ్మని యాజ్ఞాపించెను. భర్తశిరస్సు నామె స్వీకరించి, తనజన్మము కృతార్థమయ్యెనని సంతోషించెను; కాని, పతివియోగసంతాప మామెమనస్సును నూతనముగ దహింప నారంభించెను. "ఓ ప్రాణసజీవనమూర్తీ!" అని యామెపలికి, తనచేలాంచలముతో నతని ముఖముపైనుండిన ధూళిని దుడిచెను. ఆశిరస్సును సుగ్రీవుఁడు చూచి, సంశయపడి, యిట్లు పలికెను. "ప్రాణములు లేకయే, యితనిభుజమెట్లు వ్రాయఁగలిగెను? ప్రాణములులేకయే, యీశిరస్సు నవ్వినయెడల, మొదటిమాట నిజమని నమ్మవచ్చును; లేనియెడల, నసత్యమని భావించెదము. జ్ఞానవంతులగు మునీశ్వరులు సాధనముఁజేసినను, వారి కిట్టిశక్తి లభింపదుకదా! మృతకళేబరముయొక్క హస్తమెట్లు వ్రాయఁగలిగెను?" "ఓ సుగ్రీవా! ఏమి కుతర్కముఁ జేయుచున్నావు? ఈశిరస్సు నవ్వఁగలదు." అని రాముఁడు సమాధానముఁ జెప్పెను.

దోహా 133

అప్పుడు సులోచన ప్రాణేశ్వరుని ముఖముఁజూచి, యిట్లు పలికెను; "ఓ నాథా! మీరు శీఘ్రముగ నవ్వుఁడు; లేనియెడల, మీ హస్తము వ్రాసినవ్రాఁతకు భంగమువచ్చును."

చౌపాయ్

ఒకక్షణమాత్రము విలంబమయ్యెను; అది మృతకళేబరముఖము కనుక, మూతఁ బడియుండెను; అది నవ్వలేదు. "ఓ నాథా! మీరు యుద్ధముఁ జేసిచేసి, శ్రమపడి, భయపడియుంటిరా? లక్ష్మణునిబాణము మిమ్ములను క్షోభపెట్టుచుండెనా? ప్రభువెదుట నాకు సిగ్గుఁ దెప్పించెదరా? ఈదేహముగల మిమ్ములనే, నేను త్రికరణశుద్ధిగ భర్తయనియు దైవమనియు భావించియుండినయెడల, నేనితరుల నెప్పుడు ప్రేమించియుండనియెడల, నా భర్తశిరస్సు సభికులయెదుటఁ బలుకును; నా భర్తకీర్తి నిర్మలమై, లోకములో వ్యాపించును. ఓ నాథా! నాకీసంగతి తెలియుచున్నది; మీకీ గతివచ్చెను. కనుక, మీకు సహాయముఁ జేయుటకు, మీ జనకుని రప్పించెదను. మీ జనకుఁడువచ్చి, పరమేశ్వరుని జయింపఁగలఁడా?" అని యామె పలికినపలుకులను శిరస్సు విని, పక్కున నవ్వెను. వానరభల్లూకము లాశ్చర్యమగ్నులయిరి; వారు నిశ్చేష్టులయిరి. పిడుగుపడినట్లు, వానిశిరస్సు ముమ్మారు నవ్వెను. ఈసంగతి వినిగాని, చూచిగాని యుండలేదు. అనంతరము, వానిముఖము మూసికొనిపోయెను. కపిరా జాశ్చర్యపడి, సులోచనమహిమను గొనియాడెను. వానరు లాశ్చర్యమగ్నులయిరి. అప్పుడు సుగ్రీవుఁడు శ్రీరామునిచరణములకు నమస్కరించి, యిట్లు విన్నవించెను; "ఓ నాథా! ఏకారణముచేత వానిశిరస్సు నవ్వెను?" "ఓ సుగ్రీవా! ఓ లక్ష్మణా! ఆ శిరస్సునవ్వుటకుఁ గారణముఁ జెప్పుచున్నాను. త్రికరణశుద్ధిగఁ బతిని సేవించుటయే స్త్రీలకు పరమధర్మము; దానివలననే, వారికి సకలకల్యాణములు సంప్రాప్తమగును; అంతకంటె నధికమగునుపాయము మఱియొకటి లేదు. ఈసంగతిని విచారించి, స్త్రీలు భర్తలను సేవింపవలయును; ఆమెధర్మమునుఁ జూచి, సకలదేవతలు ప్రసన్నులు కాఁగలరు. ఈనాగకన్య సత్యవతి; మహాపతివ్రత; ఆమెసత్యముచేత వానిశిరస్సు

నవ్వెను.” ఇట్లు శ్రీరాముఁడు పలికినపలుకులను వానరులు విని సంతో షించిరి; మాటిమాటికి, హనుమంతుఁడు ప్రేమకు వశ్యుఁడై, యా మెకు నమస్కరించెను. ఓ పార్వతీ! శ్రీరామప్రభువునందు నొకగొప్ప గుణము కలదు. వారు సదా భక్తులకు గొప్పదనముఁ దీసికొనివచ్చెదరు. వారికటాక్షదృష్టి ప్రసరించినమాత్రమున, లోకముల సృష్టిస్థితిసంహార ములు జరగుచుండును; ఈశిరస్సు నవ్వుట, వారి కౌకవిచిత్రమా?

దోహా 134

ఆసులోచన ప్రాణేశ్వరునిశిరస్సును స్వీకరించి, శ్రీరామునకు దండప్రణామములఁ జేసి, యిట్లు విన్నవించెను; “ఓ కోసలాధీశా! నేఁడు నానిమిత్తము యుద్ధమునుఁ జాలింపుఁడు.”

చౌపాయ్

అనంతర మామె విభీషణునిచరణములకు నమస్కరించి, శ్రీరా మునిచరణములపై మనస్సును నిలిపెను. “ఓ విభీషణా! మీరు రావ ణుని తమ్ములు; తండ్రితోసమానులు; ఈ రాక్షసకులమునకు కీర్తిగాని, అపకీర్తిగాని మీవలన వచ్చును. మీరు పులస్త్యవంశమునకు దీపకులు; మీతపోఫలముచే, మీరు శ్రీరామునివద్దఁ జేరితిరి. మహామోహము నకు వశీభూతుఁడై, పురుషుఁడు మంచిచెడ్డలను గ్రహింపలేఁడు; జ్ఞానము కలిగినతరువాత, వానికి సుగుణములు తెలియును. అజ్ఞానముచే, నేను మొదట మీ మంచిచెడ్డలనుఁ దెలిసికొనలేక, దూషించితిని; ఇప్పుడు నాకు జ్ఞానము కలిగినందున, మీ సుగుణములు నాకు విశదమయ్యెను. యుగాంతరములవఱకు మీరు నిష్కంటకరాజ్యముఁ బరిపాలింపుఁడు. మీకీర్తియు మీపుణ్యమును లోకములో వ్యాపించును. మీనామ మును స్మరించినవారికి సహితము సద్గతివచ్చును. శ్రీరాముని చరిత్ర తోఁగూడ, మీచరిత్రమును గానముఁ జేయుచుందురు.” ఈప్రకార మామెచెప్పినమాటలను విభీషణుఁడు విని, జాలిపడెను. దుఃఖమును ప్రకటించుటకు సమయముకాదని యతఁడు తలంచి, యూరకుండెను. “ఓ సులోచనా! కాలకర్మము ననుసరించి, సర్వము ప్రవర్తించును” అని యతఁడు చెప్పి, ఆమెను బోధించెను. ఆమె వారిసెలవుఁ గైకొని, వెళ్లెను.

దోహా 135

ఆమెను వానరకటకమువఱకు సాగనంపి, విభీషణుఁడు తిరిగి వచ్చెను. ఆసమయమున, రావణునివైరము నతఁడు మఱచి, యధికసంతాపముఁ బొందెను.

చౌపాయ్

ఆమెప్రభావము శ్రీరామునికృపవలన, వ్యాపించెను; ఆమె, శిరస్సును బల్లకిలోఁ బెట్టుకొని, వెడలెను. శ్రీరాముని దివ్యమంగళవిగ్రహమును, ఆ నీలమేఘశ్యాముని, మనస్సులో నామె ధ్యానించుచు, శ్రీరామనామమును జపించుచు, సులోచన వెళ్లెను. నదీసాగరసంగమమువద్ద కామెవచ్చెను; ఆమె వచ్చినసమాచారమును రావణుఁడు విని, అచ్చోటికి వెళ్లెను. వానివెంట మందోదర్యాది రావణాంతఃపురస్త్రీలు, శోకసంతప్తమానసలై, నడచి వెళ్లిరి. వారిశోకము, సూర్యకాంతివలె, నలువైపుల వ్యాపించెను. రావణునియాజ్ఞాప్రకారము సేవకులు వెళ్లి, చందనాగరువస్తువులను సమకూర్చిరి. స్వర్గలోకమునకు సోపానములో యనునట్లు, వారు చితినిఁ బేర్చిరి. ఆ సులోచని, అత్తమామలు మొదలగువారికి నమస్కరించి, వారిని సంతోషపెట్టెను; తదితరస్త్రీల నామె బోధించి, వారికి ధైర్యముఁజెప్పెను. తదనంతర మామె మేఘనాదుని శిరస్సును భుజములను తనతొడలపైఁ బెట్టుకొని, చితిపైఁ గూర్చుండెను; అగ్నిహోత్రజ్వాలలు నలువైపులఁ బరిణమించెను.

దోహా 136

అగ్నిసంస్కార మయ్యెను; ఆమె భర్తతోఁగూడి సురపురమునకు వెళ్లెను. (అధికపాఠము సమాప్తము.)

---

# అష్టమవిశ్రామము.



చౌపాయ్

రావణుఁడు కుమారునిమరణమును విని, దుఃఖించి, మూర్ఛిల్లి, నేలఁబడెను; వాఁడు దుఃఖాక్రాంతుఁడై, కన్నీరుఁ గార్చెను; మఱినిని

బోఁగొట్టుకొనినసర్పమువలె, వాఁడు పరితపించెను. "ఆహా! నాకుమారుఁడు నాయాజ్ఞలను సదా మన్నించుచుండెను." అని వాఁడు పలువిధముల విలపించి, "ఇంద్రాదిదేవతలను వాఁడు జయించెను; దేవతలను మునులను బంధించి, వారిచేతఁ బనులఁ జేయించెను. నాపుత్రునితో సమానమగుబలవంతుఁడు లోకములో లేఁడు; వానిప్రతాపము మూఁడు లోకములలో వ్యాపించెను." అని దుఃఖించెను. ఓ గరుడజీ! ఈప్రకారము వాఁడు పరితపించి, ఖిన్నుఁడై, తేజోహతుఁ డయ్యెను. మందోదరిసహితము కుమారునిమరణమునకు దుఃఖించి, గుండెలను గొట్టుకొని, యేడ్వసాగెను. లంకానగరనివాసులు, స్త్రీపురుషులుసహితము వ్యాకులులై, యేడ్చి "ఆహా! రావణుని భాగ్యదశ తిరిగిపోయెను" అని విచారించిరి.

దోహా 137

అంతఃపురస్త్రీలను వాఁడు పలువిధముల బోధించి, యోదార్చెను. ఈలోకమంతయు నశ్వరమని వాఁడు తలంచి, వారికి ధైర్యముఁ జెప్పెను. (జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ")

చౌపాయ్

ఆ రావణుఁడు మందబుద్ధి; అయినను వాఁడు వారికి జ్ఞానము నుపదేశించెను. ఒకరికి బుద్ధిఁజెప్పుటలో నందఱు చతురులు; కాని, ఆ ప్రకార మాచరణఁ జేయవలసివచ్చినపుడుమాత్ర మందఱకు కష్టమువచ్చును; అట్లు నడుచువారు బహుస్వల్పము. ఆ మేఘనాదునకుఁ జేయవలసినక్రియలను వాఁడుచేసి, శోకాక్రాంతుఁ డయ్యెను; వాని హృదయము దుఃఖముచే పీడిపోయెను. మంత్రులు వచ్చి, వానిని బోధించి, యోదార్చిరి. "ఓ రావణా! ఎందుకు వ్యర్థముగ విచారించెదరు? ఆకాశముమీఁది ఘుటములువలె, ధనము, పుత్రులు, సుతులు మొదలగువారు నశ్వరులు; మేఘములోని మెఱుపువలె, జీవనము క్షణభంగురము. ఓ రావణా! ఈసంగతిఁ దెలిసికొని, విచారింపుము. కాలము వచ్చినతరువాత, నేవస్తువును నిలువదు. ఓ నాథా! శత్రువును నశింపఁజేయుటకుఁ దగినయుపాయముఁ జూడుఁడు"

(అధికపాఠము.) దోహా 138

ఎంతవఱకు వారు వానిని యోదార్చినను, వానికి స్థిమితము లేకపోయెను; వాఁడు పలుతెఱంగుల విచారించి, అహిరావణుని స్మరించి, శివాలయమునకు వచ్చెను.

చౌపాయ్

అంత నాలుగుఘడియల రాత్రి గతించెను; వాఁడు సంధ్యావందనముఁ జేసి, నిశ్చింతగనుండెను. సంతోషముతో వాఁ డిరువదిచేతులను జోడించి, శివుని ధ్యానించెను. ఓ గరుడా! రావణుఁడు శివపూజాధురంధరుఁడు; శివుని ప్రియసేవకుఁడు; గొప్ప యదృష్టవంతుఁడు. (సహస్రదళములు గలపద్మములను కోటిసహస్రములను దీసికొనివచ్చి, వాఁడు ప్రతిదినము కోటిలింగార్చన జేయుచుండును. రావణకృతమహాన్యాసము కలదు.) ఆకర్షణమంత్రమును వాఁడు జపించుట కారంభించెను. పాతాళములోనుండిన అహిరావణునిమనస్సు భ్రమించెను. ఎందుచేత రావణునిమనస్సు వ్యాకుల మయ్యెనోయని, వాఁడు చింతించి, మనస్సులో ననుమానించెను. "ఆహా! వాఁడు రాక్షసేశ్వరుఁడు; లోకమంతయు వానికి వశము. వానిని జయించువీరుఁడు లేఁడు." అని అహిరావణుఁడు చింతించెను. త్రికరణశుద్ధిగ వాఁడు కామదదేవినిఁదప్ప, మఱియొకరిని నుపాసించి, ఆరాధింపఁడు. ఆదేవిని వాఁడు ధ్యానించెను; రావణుఁడు కూర్చుండియుండిన శివమండపము వద్దకు వాఁడు వచ్చెను. వాఁడు తనపేరుఁ జెప్పుకొని, నిశాచరపతికి నమస్కరించెను; రావణుఁడు వానిచేతులఁ బట్టుకొని, వానిని దనవద్దఁ గూర్చుండఁబెట్టుకొనెను.

దోహా 139

అహిరావణుఁడు తండ్రినిఁజూచి, ప్రీతిపూర్వకముగ నతని యోగక్షేమము నడిగెను. వాఁడు సకలవృత్తాంతముఁ జెప్పనారంభించి, ప్రథమమునఁ దనచెల్లెలు శూర్పణఖకు జరగినపరాభవమును ముచ్చటించెను.

చౌపాయ్

ఖరదూషణాదుల మరణమును; మాయలేడివేషమును ధరించిన మారీచునివృత్తాంతమును; సీతాపహరణమును; హనుమంతుని

చర్యలను; లంకాపురీదహనమును; సేతుబంధనమును; అంగదుని రాయభారమును; సంవాదమును; అకంపనాతికాయుల మరణమును; రాక్షసుల మూలబలనాశనమును; వాఁడు చెప్పెను. "ఓ అహిరావణా! నాకేమి కుశలము? నా కుశలమంతయు నశించెను. దుర్బలులగు తపశ్శాలులు కుంభకర్ణ, మేఘనాదులను సంహరించిరి. ఇందుచేత నిన్ను నావద్దకుఁ బిలిచితిని. శత్రువులను సంహరించుటకుఁ దగినయుపాయముఁ జేయుము." ఈమాటలను అహిరావణుఁడు విని, చింతాక్రాంతుఁడై, నీతియుక్తమగు చక్కనిమాటలఁ జెప్పనారంభించెను. "ఓ రావణా! లోకములో నీతిమార్గము సర్వజనాదరణీయము; ఆమార్గమును విడిచి, యధర్మమార్గమున సంచరించుటవలన, భయముకలుగును. పూర్వోత్తరములను నీవు విచారింపక, వైరమును బ్రకటించి, యుద్ధమునకుఁ దిగితివి. అందువలన, నీవంశమును, నీసర్వస్వమును నశించెను. మనుజుల ప్రతాపమును ప్రభావమును నీకుఁ దెలియవు; అందఱికంటె గొప్ప వానిని నీవు మిక్కిలి తక్కువవాఁడని భావించితివి; నే నీమాటలఁ జెప్పుటతగదు; నీనిమిత్తము రామలక్ష్మణుల హరించెదను; పాతాళమునకు వారినిఁ దీసికొనిపోయి, నా దేవికి బలిగ సమర్పించెదను. రాక్షసవంశమునకు సంపూర్ణయశస్సును దీసికొనివచ్చెదను. సూర్యసమానమగు తేజస్సు రాత్రి ప్రకాశించునపుడు, వారిని నేను తీసికొనివెళ్లుచుంటినని తెలిసికొనుము."

దోహా 140

ఈమాటలను వాఁడు చెప్పి, రావణునకు నమస్కరించి, తనతేజోబలములను జెప్పుకొని, దేవిని స్మరించి, శ్రీరాముని కటకమునకు వచ్చెను.

చౌపాయ్

అప్పుడు పార్వతి శివునిఁజూచి, యొకప్రశ్న నడిగెను. "ఓ నాథా! అహిరావణుఁ డెవఁడు? వాని జన్మచరిత్రముఁ జెప్పుడు." ఈ విచిత్రమగుకథను శివుఁడు చెప్పనారంభించెను. ఓ పార్వతీ! సావధానముగ వినుము. అహిరావణుని జన్మవృత్తాంతముఁ జెప్పుచున్నాను. అనేక కుమారులు రావణునకుఁ బుట్టిరి. ఆకుమారులు బలవంతులు; విద్యాప్ర

వీణులు; ఒకసమయమున మందోదరిగర్భమున అహిరావణుఁడు పుట్టెను; వానిజననమునువిని, రావణుఁడు భయపడెను. ఇరువదిపాములతోఁ గూడి వాఁడు పుట్టెను; వానిని గృహములోనుంచుట యుచితముకాదని రావణుఁడు తలంచి, శ్వానాననుఁడను రాక్షసునిఁ బిలిచి, "ఓరీ! ఈశిశువును దీసికొనిపోయి, పాతిపెట్టిరమ్ము" అని యాజ్ఞాపించెను. ఆ శిశువును సేవకుఁడు తీసికొనివెళ్లి, నైఋతిమూలను పాతిపెట్టి వచ్చెను. ఆశిశువు భూమినిదొలుచుట కారంభించి, ముందు శ్రీరాముని చరిత్రమునిమిత్తము, జీవించెను. ఒకమాసమువఱకాశిశువు భూమినిఁ దొలచి తొలచి, మన్నుఁదిని తుదకు సముద్రతీరమునకు వచ్చెను. రాహువుతల్లి వానినిఁ జూచి, సంతసించి, స్వగృహమునకుఁ దీసికొని వెళ్లి, పెంచుచుండెను. ఒకదినమున శుక్రాచార్యుఁడు దానిగృహమునకు వెళ్లి, ఆశిశువు వృత్తాంతమునుగుఱించి దాని నడిగెను. ఆశిశువు సముద్రతీరమున దొరికెనని ఛాయాగ్రాహిణి, సింహిక చెప్పెను. "ఓ సింహికా! ఈశిశువు రావణునికుమారుఁడు;" అని యతఁడు వాని వృత్తాంతముఁ జెప్పి, వానికి 'అహిరావణుఁడు' (అహి=పాములు) అని నామధేయముఁ జేసెను. అనంతర మతఁడు వెళ్లినతరువాత, అహిరావణుఁడు స్వజన్మవృత్తాంతమును వినినందున, సముద్రములోఁ బడెను. ఆతక్షణము వాఁడు వితలలోకముఁ జేరెను; ఆలోకములో, నాగుల పట్టణము కలదు. అది భోగవతీపట్టణము; దానివైశాల్యము డెబ్బది యోజనములు; ఆపట్టణములో సువర్ణగృహములు కలవు; ఆపట్టణమును దర్వీకరుఁ డనురాజు పరిపాలించుచుండెను; అతఁడు వాసుకికి బావమఱఁది. ఆపట్టణచక్కదనమును వాఁడు చూచి, సంతసించి, పురాణముజరగుచుండిన స్థలమునకు వెళ్లెను. ఆ పురాణకథలోవచ్చిన తపోమాహాత్మ్యమును వాఁడు విని, సంతసించి, వనమునకు వెళ్లి, యొకనదీతీరమున పరమరమ్యముగనుండిన కామదదేవి యాశ్రమమును జూచి, తపముఁ జేయుట కారంభించెను. పదునాలుగువేలసంవత్సరములు గతించెను. వాని నిశ్చలసమాధిని దేవిచూచి, ప్రసన్నురాలై, వానిని వరముఁ గోరుమనెను. ఇష్టదేవత పలికినపలుకులను వాఁడు విని, సంతసించి, చేతులను ముకుళించి నమస్కరించి, యిట్లు ప్రార్థించెను:—"ఓ

దేవీ! దేవతలకంటె నధికమగుసుఖములు నాకుఁ గలుగుగాక! ఎవరితో నేను యుద్ధముఁ జేసినను, వానిని నేను జయింతుఁగాక!

దోహా 141

"బ్రహ్మావిష్ణు మహేశాదిదేవతలును, సూర్యుఁడును, శేషుఁడు మొదలగువారివలన నాకు మరణము లేకపోవుగాక. నేను రాక్షసుల కధిపతిగ నుందుఁగాక!

చౌపాయ్

"నాతండ్రి నన్నవమానించెను; అతఁడొకపర్యాయము నన్ను యాచించునట్లు ప్రసాదింపుము." "ఓ అహిరావణా! అనేకసుఖములను నీ వనుభవింపఁగలవు. త్రేతాయుగాంతమున రావణుఁ డంజలిఘటియించి, నిన్ను బ్రార్థింపఁగలఁడు. నిన్నెవరు చంపలేరు; ఒకవానరుఁడుమాత్రము నాకు వశ్యుఁడు కాఁడు; వాఁడు నామాటను మన్నింపఁడు. వానిప్రభువునకుమాత్రము నీచమత్కారము జూపింపకుము. అటుల నీవు చేయకయుండినయెడల, నీకు మరణము కలుగదు; అమరత్వము నీకు సిద్ధించును;" అని దేవి పలికి, యంతర్ధానమయ్యెను. అనేకఖగమృగములను వాఁడు భుజించి, జీవించుచుండెను. ఈప్రకారము (500) సంవత్సరములు గతించెను. అప్పుడు వాఁడు దుష్టచర్యలఁ జేయ నారంభించెను. అనేకవేషములను వాఁడు ధరించి, నాగులనగరమునకు వెళ్లి, గజాశ్వములను భక్షించుచుండెను. ఒకదినమున దర్వీకరరాజు సేనలఁదీసికొని, వానినిఁ బట్టుకొనుటకు, వానిమీఁదికి దాడివెడలెను. అహిరావణుఁడు ఘోరయుద్ధముఁ జేసి, నాగుల నోడించెను. ఆ నాగులరాజు దర్వీకరుఁడు, అనంతనాముఁ డనుశేషనాగునివద్దకు వెళ్లి, రణవృత్తాంతము నతనితోఁ జెప్పెను. "ఓ దర్వీకరా! అహిరావణుని తపోబల మధికము; వానిని యుద్ధములో జయించుట కష్టము. నీకుమార్తెను వానికిచ్చి, వివాహముఁ జేసి, వానితో సఖ్యముగ నుండుము." అని అనంతశేషుఁడు బుద్ధిఁజెప్పెను. అతని మాటప్రకారము దర్వీకరుఁడు అహిరావణుని బిలిపించి, తనకుమార్తెను వానికిచ్చి, వివాహముఁ జేసెను. కుందని అనునాగకన్యను వాఁడు వివాహమాడి, "ఓ దర్వీకరా! నిరాక్షేపణగ మీరు జీవింపవచ్చును; నాగృహమును నేను వనములో నిర్మించుకొనియెదను." అని మామతోఁ జెప్పి, వెళ్లెను. అనంతరము

వాఁడు కామదదేవి ఆలయమువద్దకు వచ్చి, తొమ్మిదియోజనముల వైశాల్యముగల నగరమును నిర్మించెను. రాక్షసులతోఁగూడి, వాఁడానగరములో జీవించియుండెను. చెప్పుటకు శక్యముగాని భోగరాగములను, సుఖముల ననుభవించుచుండెను. ఈప్రకారము అహిరావణుని జన్మవృత్తాంతము మొదలగుచరిత్రమును శివుఁడు పార్వతికి, బోధించి చెప్పెను. ఓ గరుడజీ! వాఁడు యమాలయమునకు వెళ్లిన సంగతిఁ జెప్పుచున్నాను; వినుము.

సోరఠా 1

త్రేతాయుగాంతమున యోగమువచ్చునని కామదదేవి చెప్పిన ప్రకారము, యోగము సిద్ధమయ్యెను; అహిరావణుఁడు స్వమాయాబలముచే, వానరసైన్యమును గాఢాంధకారముతోఁ గప్పెను.

చౌపాయీ

ఎవనిహస్తము వానికిఁగనఁబడనంత చీఁకటి జిమ్ముమని క్రమ్మియుండెను; వానరయోధులు జాగరూకులై యుండిరి; ఆకృపాళునకు, ఆశ్రీరామునకు జయ అనుచుండిరి. వారికటకములోఁ బ్రవేశించుటకు కాలుఁడుసహితము వెనుదీయును. ఆసమయమున నొకయుపాయమును మహావీరుఁడు పన్ని, తోకను పెంచి, దానితో గుండ్రముగ నొకమహోన్నత మగుకోటనుగట్టెను; కుండలముఁగట్టియుండిన సర్పరాజువలె, నతఁడు కుండలాకారముగ దానినిఁ గట్టెను. పర్వతమువలె, మహోన్నతముగ, నతఁడు దానిని నిర్మించెను; ఆకోట సింహద్వారమువద్ద, నతఁడు కూర్చుండెను. అహిరావణుఁ డాచిత్రముఁ జూచి, మనస్సులో దిగులుపడెను. అంధకారము సూర్యునియెదుట నిలువఁగలదా? ఓ పార్వతీ! ఒకయుపాయమయినను వానిబుద్ధికిఁ దోఁచలేదు! అప్పుడు వాఁడొక కపటవేషము నాలోచించి, విభీషణునివేషమును ధరించి, మహావీరునివద్దకు వెళ్లెను.

దోహా 142

మహావీరుఁడు స్వభావసిద్ధముగ మహాప్రతాపుఁడు; అతఁడు రఘునాథునిదాసుఁడు; అహిరావణుఁ డతనినిఁ దిరస్కరించి, రాముని వద్దకు వెళ్లెను. వానిమనస్సునకు జుగుప్స లేకపోయెను,

చౌపాయీ

వాఁడు చేసినమర్మము మహావీరునకుఁ దెలియదు; వాఁడు నిజమగు విభీషణునివలె, నతనివద్దకు వచ్చెను. "ఓ సఖుఁడా! నేను శ్రీరామునివద్దకు వెళ్లవలెను; నేను శ్రీరామునియాజ్ఞఁ గైకొని, సంధ్యావందనముం జేయుటకు వెళ్లియుంటిని; సంధ్యావందన మయ్యెను; నేను శ్రీరామదర్శనమునిమిత్తము వెళ్లవలెను. నేను విలంబముఁ జేయక వెళ్లవలెను; లేనియెడల, వారికిఁ గోపము వచ్చును." ఇట్లు కపటముగ వాఁడు చెప్పినమాటలు సత్యమని మహావీరుఁడు నమ్మెను. ఓ పార్వతీ! విధికృతము బలవంతము. మనుజులకపటము నెవరు తెలిసికొనఁగలరు? వారు కపటముఁ జేసి, మనుజులధనమును మనస్సు నపహరించెదరు. వాఁడు సెలవుఁ గైకొని, శ్రీరామలక్ష్మణులు శయనించియుండినస్థలమునకు వెళ్లెను. మహాబలవంతులగు నలుఁడు, నీలుఁడు, సుగ్రీవుఁడు, జాంబవంతుఁడు, అంగదుఁడు, సుషేణుఁడు,

దోహా 143

ద్వివిదమైందాది వానరగణములును, గయగవాక్షాదివీరులును, విభీషణుఁడును, దదితరయోధులును శయనించి, నిద్రించుచుండిరి.

చౌపాయీ

ఈ వానరయోధులమధ్యను రావణుఁ డనుచంద్రునిఁ గబళించుటకు రాహువువంటి శ్రీరామలక్ష్మణు లొకస్థలమున నిద్రించుచుండిరి. ఎడమప్రక్క బడుకొనియుండిన లక్ష్మణునిమీఁద హస్తమును బెట్టుకొని, శ్రీరాముఁడు నిద్రించెను. బంగారుకమలముపైనుండిన సర్పమువలె, నతనిమీఁద శ్రీరామునిహస్తము ప్రకాశించెను. వానరసమూహము, క్షీరసాగరము; ఆమహావీరు లిరువురు దానిలో శయనించిరి. లక్ష్మణుఁడు ధనుర్బాణములను ధరించి, శ్రీరామునిప్రక్కఁ బండుకొనెను. ఆనీలమేఘశ్యాముని దివ్యమంగళవిగ్రహముఁ జూచి, అహిరావణుఁడు సంతసించి, తనమనస్సులో నతనికి నమస్కరించెను. ఏ దేవదేవుని బ్రహ్మాదులు ధ్యానించి గ్రహింపలేరో, ఏ పరమేశ్వరునిపై మనస్సును సంధానముఁ జేసి, మునులును మహాశివుఁడును సేవించుచుందురో, ఏ జగన్నాథునినిమిత్తము విరాగు లనేకజపములనుఁ జేసి, యోగము నభ్యసించెదరో, ఏ లోకారాధ్యునినిమిత్తము వారు దివా

రాత్రములు జాగరూకులై, యతనినామమును జపించెదరో, ఏ కృపా సాగరుని సేవించుటవలన, సకలభయములు నశించునో, అట్టి శ్రీరామ ప్రభువును వాఁడు కన్నులారఁ జూచెను; రావణుఁడు చేసినపని యుచితముగ లేదని వాఁడు మనస్సులో విచారించెను. వాఁడు స్వరాక్షస మాయనుఁ బన్ని, యేప్రకార మన్నదమ్ములనిరువురను తీసికొని పోవచ్చునని యాలోచించెను.

దోహా 144

వాఁడు మోహనయంత్రమును జపించి, వానరయోధులు మొదలగువారిని మోహింపఁజేసి, వారినోళ్లను గట్టి, యదృశ్యుఁడై రామలక్ష్మణులఁ బట్టుకొని, యంతరిక్షమునకుఁ గుప్పించి, యెగసి, తీసికొనిపోయెను.

చౌపాయ్

ఈప్రకారము వాఁడు రామలక్ష్మణులఁ దీసికొనిపోయెను; అంతరిక్షమున నొకగొప్పజ్యోతి కనఁబడెను. ఆజ్యోతిని రావణుఁడు చూచి, తనకుమారునివచనములు సత్యమని తెలిసికొని, రామలక్ష్మణులఁ దీసికొనిపోయెనని గ్రహించి, సంతోషించెను. ఒకరెప్పపాటుకాలములో వాఁడు వారినిఁ దీసికొని, స్వలోకమునకుఁ బోయెను; ఆతక్షణమే వానరకటకములో హాహాకారము పుట్టెను; వానరులు తెలివిఁ దెచ్చుకొనిరి; జలములేని నదివలె, వారు కళాహీనులై యుండిరి; చంద్రుఁడులేని రాత్రివలె, చంద్రుఁడులేని తారాగణములువలె, వానరులు వెలవెలఁబోయిరి. సూర్యుఁడులేని దినమువలె, జీవములేని దేహమువలె, దీపములేని గృహమువలె, వారు జీవకళలు లేకయుండిరి. ఆత్రిలోకభూషణుఁ దెచ్చుటికి వెళ్లెనని వానరు లొకరినొక రడుగుచుండిరి.

దోహా 145

వారందఱుఁగలిసి, యావత్కటకమును వెదకుట కారంభించిరి; కాని, రామలక్ష్మణులు వారికిఁ గానరాలేదు; జలము లెండినతరువాత వ్యాకులపడు మీనములువలె, వానరభల్లూకములు దుఃఖాక్రాంతులయిరి.

చౌపాయ్

"ఆహా! బ్రహ్మ యెంతపనిఁ జేసెను? శ్రీరామునివియోగదుఃఖము మనప్రాణములఁ బుచ్చుకొనును." ఇట్లు వానరులు చింతించి, ధైర్యములను విడనాడి, శోకసంతప్తమానసులై, "రామలక్ష్మణు లెచ్చట గలరు!" అని యడుగుచుండిరి. "ఆహా! మంచిచక్కనిపనిని బ్రహ్మ పాడుచేసెను. రాక్షసులసైన్యమంతయు నశించెను; ఒక్కరావణుఁడు మాత్రము మిగిలియుండెను; ఆ దురభిమానియొక్కఁడే, హతశేషుఁడు. వాఁడైనను, శ్రీరామునిబాణము తగిలినయెడల, జీవింపఁడు. ఆహా! ఓ అన్నదమ్ములారా! నేనును నావారు నెంత నిర్భాగ్యులము? ఒకవేళ నేను రావణుని సంహారించినను, జానకికి నేనేమియుత్తరువుఁ జెప్పఁగలను?" ఈప్రకారము సుగ్రీవుఁడు పలువిధముల విలపించి, వ్యాకులుఁడై, పిడుగుపడినకొండవలె, విఱుచుకొని నేలఁబడి, మూర్ఛిల్లెను. ఈసమాచార మింతవఱకు విభీషణునకుఁ దెలియదు. కొద్దిదినముల క్రింద గోవీని, తనలేఁదూడ కంటికిఁగనబడనపు డెట్లు విచారించునో, వానరు లట్లు పరితపించిరి.

దోహా 146

మహావీరుఁడును జాంబవంతుఁడు సహితము పలువిధముల దుఃఖించిరి. ఓ గరుడజీ! ఆరాత్రి గాఢాంధకారము క్రమ్మియుండెను. ఏవస్తువైనను గనఁబడుట లేదు.

చౌపాయ్

"ఓ వీరులారా! ఈరెండింటిలో నొకటి యయియుండునని నామనస్సునకుఁ దోఁచుచున్నది. ఒకఁడు విభీషణుని వేషమువేసికొని వచ్చియుండెను. వాఁడు శ్రీరామునివద్దకు వెళ్లియుండెను; వాఁడు వెళ్లుచుండుట నేను జూచియుంటిని. నే నడిగినపుడు, వాఁడు తియ్యని మాటలను నాతోఁ జెప్పెను. రాక్షసుల కపటమునెఱుంగుట కష్టము." ఇట్లు మహావీరుఁడు చెప్పినమాటలను విభీషణుఁడు విని, "ఓ వానర వీరులారా! అహిరావణుఁడు శ్రీరామలక్ష్మణులఁ దీసికొనిపోయెను. వాఁడు పాతాళలోకములో నివసించియుండును. నావేషమును రూపమును వాఁడుతప్ప మఱియొకరు ధరింపలేరు. వాఁడు మాయావి; మహాబలవంతుఁడు; రావణుఁడు తొందఱపడి, వానినిఁ బంపెను;

మనలో బలవంతుఁడు వానిపట్టణమునకుఁ బోయి, వానిని జయించి, శ్రీరామలక్ష్మణులను దీసికొనిరావలెను.” అని పూర్వోత్తరములను బోధించి చెప్పెను. “ఓ హనుమంతుఁడా! నీబలపరాక్రమములు లోక విదితములు; నీవు శీఘ్రమాలోచించి ఆకృపాసాగరుల నిరువురను దీసికొనివచ్చుటకుఁ దగినయుపాయముఁ జూడుము.” అని జాంబవంతుఁడు చెప్పెను.

దోహా 147

అప్పుడు సుగ్రీవుఁడు వ్యాకులుఁడై, హనుమంతునితో నిట్లు చెప్పెను. “ఓ వీరుఁడా! నామాటను వినుము. రఘునాథుఁడు లేని జీవనము వ్యర్థము. ఒకనిమిష మొకయుగమువలె నున్నది.

చౌపాయ్

“వర్షము లేకపోవుటచేత వాగులును, సూర్యరశ్మి లేనందున కమలములును, జలములు లేనందున మీనములును, శస్త్రము లేని వీరుఁడును, యజమానుఁడు లేనిసైన్యమును, సమిధలు లేని నిప్పును, వత్తి లేని దీపమును—క్షణభంగురములు; అటులనే, ఓ వీరుఁడా! శ్రీరాముఁడు లేని నేనుఁ గూడ నశ్వరుఁడను. ఏప్రకారము జానకీయోగక్షేమమును నీవు తీసికొనివచ్చితివో, ఏప్రకారము సంజీవినిఁ దెచ్చి, లక్ష్మణుని బ్రతికించితివో ఆప్రకారము సకలసుఖధాముని, శ్రీరాముని దీసికొని రమ్ము.” అని సుగ్రీవుఁడు చెప్పెను. “మహారాజా! మీరు స్వస్థచిత్తులై, సైన్యములను గాపాడుఁడు. ఓ నాథా! మీప్రతాపముచేఁ బదునాలుగులోకములను జయించి, తీసికొని రాఁగలను. మీరు విచారింపకుఁడు. ఓ వానరవీరులారా! మీరు సావధానముగ నుండుఁడు. మీరు భయపడక, కాలుఁడువచ్చినను, వానితో సావధానముగ యుద్ధముఁ జేయుఁడు.” అని హనుమంతుఁడు పలికి, ప్రళయకాల మేఘమువలె, గర్జించి, వెడలెను. అతఁడు మార్గమువెంబడి వెళ్లి వెళ్లి, యొకచెట్టుక్రిందఁ గూర్చుండి, విచారించుచుండెను. దానిమీఁద నుండిన స్త్రీపురుషగృధ్రము లిట్లు సంభాషించుచుండెను.

దోహా 148

ఆస్త్రీగృధ్రము గర్భమును ధరించియుండెను. “ఓ నాథా! మను

జమాంసమును దీసికొనివచ్చి నాకుఁ దినిపించినయెడల, నాప్రాణమునకు సంతోషము కలుగును" అని స్త్రీపక్షి పలికెను.

చౌపాయ్

"ఓ ప్రియురాలా! అహిరావణుఁడు రామలక్ష్మణులనుఁ దీసికొనివచ్చెను. వాఁడు వారిని దేవికి బలివేయును; నీయదృష్టమువలన, వారిమాంసము నీకు లభించును. ఏవిధముననయినను ప్రయత్నముఁ జేసి, నీ కామాంసమునుఁ దీసికొనివచ్చెదను" అని పురుషపక్షి చెప్పి, భార్య నాదరించెను. ఈవృత్తాంతమును మహావీరుఁడు విని, దిగ్గున లేచి, శ్రీరాముని స్మరించి, వెడలెను. అతఁడు నిర్భయుఁడై, యొక్కయూపిరిని పాతాళమునకుఁ దిగెను. ఆతక్షణ మతఁడు అహిరావణునినగరములోఁ బ్రవేశించెను. వానిద్వారమువద్ద, మకరధ్వజుఁ డనువానరుఁడు నిలిచి యుండెను. వాఁడు మహావీరుని యెదిరించి, "ఓయీ! ఎవఁడవు నీవు? నన్నుఁ దిరస్కరించి, యెచ్చటికి బోవుచున్నావు? నీకు భయములేదా? దీపములోఁ బడఁబోవుపతంగమునకు భయముండునా? నన్నెఱుంగవా? నేను మహావీరుఁడగు వాయుపుత్రునికుమారుఁడను. బలవంతుఁడను. నేను స్వామిభక్తుఁడను; కాలునిముఖమును సహితము భంజనముఁ జేయఁగలను." అని తర్కించెను.

సోరఠా 2

ఆమాటలను హనుమంతుఁడు విని, ఆశ్చర్యపడెను. "ఓరీ మూఢా! అజ్ఞానీ! స్వప్నమందైనను, నాకుఁ గుమారుఁడు లేఁడు.

చౌపాయ్

"ఓరి మూర్ఖుఁడా! ఇంతపాపపుమాటల నెందుకు వచించితివి? ఏనాఁడును నాబుద్ధి కామునకు వశ్యము కాలేదుకదా! మూర్ఖాగ్రేసరుఁడా! నా కుమారుఁడనని యెందులకుఁ జెప్పుకొనుచుంటివి? ఈ మాటఁ జెప్పుకొనుటకు నీముఖమునకు సిగ్గులేదా? ఎట్లు నీవు నాకుమారుఁడవు? నీపుట్టుకసంగతిఁ జెప్పుము." అని మహావీరుఁడు రౌద్రాకారుఁడై యడిగెను. "ఓ నాథా! ఒకసమయమున మీరు లంకాపురమును దహించియుంటిరి; అప్పుడు మీరు సముద్రతీరమునకు వచ్చితిరి. మీ శరీరమునుండి స్వేదబిందువులు కారుచుండెను; ఆబిందువులు సముద్రములోఁ బడెను; వాని నొకమీనము మ్రింగెను; అందుమూలమున

నేను దానిగర్భమున జన్మించితిని. ఓ తండ్రీ! ఈప్రకారము నేను మీ కుమారుఁడను. నాతల్లిదండ్రులను నేను గోప్యముఁ జేయను. అహిరావణుని నేను సేవించుచుంటిని; నేనీద్వారమువద్దనుండి లేశమైనఁ గదలను." అని మకరధ్వజుఁడు ప్రత్యుత్తరము నిచ్చెను.

దోహా 149

"ఓయీ! నీమాట సత్యము" అని మహావీరుఁడు పలికి, ప్రసంగరీతిని, మఱియొకసంగతి నడిగెను. "ఓయీ! అహిరావణుఁడు శ్రీరామలక్ష్మణులఁ దీసికొనివచ్చెను; వారిని వాఁడేమి చేయఁదలఁచెను?

చౌపాయ్

"ఓయీ! వారు నివసించియుండుస్థలమును జేర్కొనుము. నేను మీ ప్రభువువద్దకు వెళ్ళఁదలఁచితిని." "ఓ తండ్రీ! నేను వినిన వృత్తాంతమును మీకుఁ జెప్పుచున్నాను; శ్రీరామలక్ష్మణులను నా ప్రభు వు తీసికొనివచ్చెను. ఆ కారణముచేత, నీదినమున హోమముఁ జేయుటకుఁ దగినపదార్థములు సమకూర్పఁబడెను. వారిని వాఁడు దేవికి బలివేయును. నాచెవులార నేను వినినవృత్తాంతమంతయు మీకుఁ జెప్పినాను. నా ప్రభువుకార్యమునిమిత్తము నేనెంతదుఃఖమునయినను సహించెదను. నేను మీతో సత్యముఁ జెప్పుచున్నాను. లోపలఁ బ్రవేశించుటకు మీరు సెలవునడిగినను, నేను మిమ్ములను బోనియ్యను. స్వామియాజ్ఞనుల్లంఘించి, నేనపకీర్తినిఁ బొందను." అని కుమారుఁడు పలికినపలుకుల నతఁడు విని, నవ్వి, వానిని ధిక్కరించి, నగరులోనికిఁ బోవుచుండెను; అందుచేత, మకరధ్వజునకు విశేషము కోపము వచ్చెను.

దోహా 150

వాఁడు మహావీరుని నొకగ్రుద్దు గ్రుద్దెను; అతఁడు వానిని గ్రుద్దెను; ఇట్లు వా రిరువురు గ్రుద్దులాడిరి; వారు సమానబలవంతులు; ఒకరికంటె నొకరు తక్కువలేదు.

చౌపాయ్

ఆతండ్రికుమారు లిరువురు మహాయోధులు; ఒకరినొకరు జయింపలేక పోయిరి. ఓ పార్వతీ! అంతమున నతఁడు కుమారునిఁ దనతోఁకకుఁగట్టి విలంబనముఁ జేయక, తత్తరపడుచు, లోపలికి వెళ్లెను. అతఁడు చిన్నరూపమును ధరించి, హోమముఁ జేయబడుస్థానమును

జూచెను. జీవముతోనుండిన జీవరాసులనేకముల నతఁ డచ్చటఁజూచెను. అచ్చట దేవీమండపము కలదు. రుధిరముతో నిండియుండినఘటములు కలవు; వానినెవరు లెక్క పెట్టఁ గలరు? నానావిధపక్వాన్నములను, ఫలములను దీసికొనివచ్చి, సేవకులచ్చట పెట్టియుండిరి. ఆసమయమున నొకమాలాకారుఁడు పుష్పమాలికలను దీసికొనివచ్చెను. అణువురూపమును ధరించి, మహావీరుఁడు వానిలోఁ బ్రవేశించెను. అతఁడు పుష్పలకంటె నతిచులకగ నుండెను; చేతితో వానినిఁబట్టుకొనినను, అతని భారము వారికిఁ దెలియదు. ఆపుష్పలను అహిరావణుఁడు దేవికిఁ బూజించెను; ఆదేవి విగ్రహముమీఁదనుండి, మహావీరుఁడు వికృత రూపమును జూపించెను.

దోహా 151

ఆ మహావీరునిచరణములు సోఁకినమాత్రమున, దేవి నేలఁబడి అడుగంటెను. అతఁడు ముఖమునుదెఱచుకొని, నిలువఁబడెను; ఆముఖమును జూచినమాత్రమున, వారికి భయముపుట్టెను.

చౌపాయ్

ఆదేవియొక్క ప్రత్యక్షరూపమును రాక్షసులు చూచి, వారిలోవారు విచారించుచుండిరి. "ఈదినమున దేవి ప్రత్యక్షమయ్యెను. మన మహారాజుభాగ్యము ఫలించెను." అహిరావణుఁడు దేవికి నమస్కరించి, పూజించుచుండెను; వాఁడు పూజచేయుచుండిన పదార్థములన్నియు వానరునిముఖములో బడుచుండెను. ఏపదార్థము శేషము లేకుండ వాని నతఁడు భక్షించెను. వినోదార్థ మతఁడు కిలకిలమనుచుండెను. బలిపశువు భుజముమీఁదికి వచ్చినట్లు, వాఁడు మనస్సులో సంతోషించుచుండెను. నేఁడు హోమము సిద్ధించెనని రాక్షసులు సంతసించి, రామలక్ష్మణులను దీసికొనివచ్చిరి. వారు శ్రీరాముని దీసికొని వచ్చి, నిలువఁబెట్టిరి; విచ్చుకత్తులనుఁబట్టుకొని, రాక్షసు లతనిని చుట్టియుండిరి. కొందఱు కత్తులను, కొందఱు గదలను, కొందఱు ధనుర్బాణములను, కొందఱు త్రిశూలములను ధరించి, నిలువఁబడిరి.

దోహా 152

తోమరములను, ముద్గరములను, పరశువులను, జంత్రాయుధములను, బాశములను, బరిఘలను, వేత్రములను, శూలములను, భుశుం

డులను, రాక్షసులు ధరించి, నిలిచియుండిరి. వారినిఁ జూచినమాత్ర మున, మనుజునిచైతన్యము పోవును; వానిబుద్ధి నశించును.

చౌపాయ్

ఆరాక్షసులు మాయాబలముచే గర్వించినచతురులు; దుర్మార్గులు; మూర్ఖులు; వారిరూపములు వికృతములు. ఈప్రకార మావీరులు నిలిచియుండిరి. వారు వానియాజ్ఞను శిరసావహించి, నిశ్చలమగు భక్తితో నిలువఁబడిరి. వాని యాజ్ఞాప్రకారము వారు ఖడ్గమునుఁ దీసి, సంహరించుటకు సిద్ధముగ నుండిరి. రాజనీతి ననుసరించి, మూఁడు ఘడియలకాలము విలంబముఁ జేయుఁడని వారిలో నొకఁడు చెప్పెను. "ఓయీ! నీహితవును కోరినవాఁ డుండినయెడల, వానిని జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. లేనియెడల, నీకాలము సమీపించెనని తెలిసికొనుము. రాత్రి స్వప్నమువలె, మీ యిరువురప్రాణములు క్షణభంగురములు." అని వారిలో నొకఁడు రామునితోఁ జెప్పెను. ఓ పార్వతీ! వారు పలికిన అసందర్భపుమాటలను జెప్పుటకు నాకు సిగ్గగుచున్నది.

దోహా 153

రాముఁడు లక్ష్మణుని, లక్ష్మణుఁడు రాముని, ఇట్లు వా రొకరినొకరు చూచుకొనిరి. ఓ గరుడజీ! ఆ శ్రీరామప్రభువు చేసినకౌతుకము నేమని చెప్పఁగలను? వారికివచ్చిన దుర్దశను వినుము.

చౌపాయ్

అప్పుడు శ్రీరాముఁడు నవ్వి, మనస్సులో నిట్లు విచారించెను. "లోకములో జనులందఱు నానామమును జపించెదరు. నే నెవరినామమును జపించెదను?" అని యతఁడు తలంచి, దేవివిగ్రహముపైనుండిన మహావీరుని జూచి, నవ్వి, యిట్లు పలికెను. "ఓ నిశాచరులారా! మీరు కాలునకు గ్రాసమై పడియుంటిరి; మీరే మీరక్షకుని స్మరింపుఁడు; మీ దేవియే, మిమ్ములను భక్షించుటకు సిద్ధపడెను." శ్రీరాముని వచనములను వారు విని, అతనిని జంపుటకు సిద్ధపడిరి; ఆసమయమున మహావీరుఁడు, కాలమేఘమువలె, గర్జించెను; అతని మేఘగర్జనను వారు విని, భయపడి, వ్యాకులులై, వారిలో వారిట్లు విచారించిరి, "అహిరావణుఁడు చేసినపని బాగుగలేదు; వాఁడు కపటవేష

మును ధరించి, దేవదేవుని దీసికొనివచ్చెను; అందుచేత, దేవికిసహి తము కోపము వచ్చెను; మనకు మరణము సమీపించెను." ఇట్లు వారు విచారించి, మోహమునకు వశ్యులయిరి. వెండియు మహా వీరుఁడు గర్జించెను.

దోహా 154

మహావీరుఁడు స్వరూపమును ప్రకటించి, గర్జించెను; రాక్షసు లందఱు భయపడి, దిగులుపడిరి; అతని యట్టహాసమును వారు చూచి, వ్యాకులు లయిరి; ఓ పార్వతీ! ధైర్యముగనుండి, సావధానముగ ముందుకథను వినుము.

చౌపాయ్

వాయువువీచినపుడు జలము లల్లకల్లోలమగునట్లు, దురభిమాను లగు రాక్షసులమనస్సులు భయముచే జలించెను; ఆతక్షణము రామ లక్ష్మణులను మహావీరుఁడు తనవీఁపుమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని, దూరి నివలె, రాక్షసులను మర్దించి, చెండాడెను. కృషీవలుఁడు ధాన్యపుఁజేనిని వలె, నతఁడు కత్తిఁదీసికొని, నిశాచరుల శిరస్సులను ద్రుంచెను; అతఁ డీప్రకారము దుష్టులను సంహరించెను; పాదములతోఁ గొందఱను పట్టుకొని, త్రిప్పి, నేలఁగొట్టి, వారిని జంపెను. ఆమహావీరుఁడు తన తోఁకతో నలువైపులను పెద్దకోటను గట్టెను; అందుచేత వారు దాఁటి పోవుట దుర్లభము. ఈప్రకార మతఁడు రాక్షసులను నిశ్శేషముఁ జేసెను. అహిరావణుఁడు వచ్చి, మహావీరునిజూచి, అతనితో నిట్లు సంభాషించెను; "ఓరీ వానరా! నిలువుము; నిలువుము; నీకు భయము లేదా? నేనెవరో నీకుఁ దెలియదా? నేను అహిరావణుఁడను. జంబు మాలిని, రావణునికుమారుఁ డగునక్షయకుమారుని నీవు చంపియుం టివి; నేనుకూడ వారివంటివాఁడననియా నీవు తలంచితివి?

దోహా 155

"నేను కాలనేమిని కాను; నామాటను విశ్వసింపుము." అని వాఁడుపలికి, మహావీరుని నొకకత్తితోఁ గొట్టెను; కాని యతనిదే హము వజ్రదేహము కనుక, నతనికి వానిదెబ్బలు లక్ష్యము లేక పోయెను.

చౌపాయ్

అప్పుడు మహావీరుఁడు వాఁడుపట్టుకొనిన కత్తిఁ దీసికొని, దానితో వానిశిరస్సును త్రుంచి, దానిని ముందుకు పారవేసెను. ఈప్రకారము మహావీరుఁడు పూర్ణాహుతినిచ్చి, రామలక్ష్మణులఁ దీసికొని, వెడలెను. ఆసమయమున మకరధ్వజుఁడు వచ్చి, తండ్రికి నమస్కరించెను. అప్పుడు మహావీరుఁడు వానిని బంధనములనుండి విడిచిపెట్టి, అహిరావణునిరాజ్యమును వానికిచ్చెను. "ఓయీ! నీవీరాజ్యము ననుభవింపుము. సదా నాప్రభువుల నీయన్నదమ్ముల నిరువురను నీవు భజింపుచుండుము." ఈమాటల నతఁడు కుమారునితోఁ జెప్పి, రామలక్ష్మణులఁ దీసికొని, వానరకటకములోఁ బ్రవేశించెను; రామలక్ష్మణులను వానరులుచూచి, సంతుష్టాంతరంగు లయిరి. వెడలిపోయిన ప్రాణములువచ్చి, మరల మృతకళేబరములోఁ బ్రవేశించినట్లును, పోఁగొట్టుకొనినమణిని మరల సంపాదించుకొని సంతోషించు సర్పమువలెను, అలభ్యవస్తువును బోఁగొట్టుకొని, దానిని స్వీకరించినట్లు, వానరులందఱు రామలక్ష్మణులఁ జూచి, సంతసించిరి; సుగ్రీవుఁడు వచ్చి, వారిచరణములకు నమస్కరించెను; పిమ్మట విభీషణుఁడు వచ్చి, వారిచరణములమీఁదఁ బడెను.

దోహా 156

అంగదజాంబవంతాది వానరభల్లూకములు వారినిఁ జూడవచ్చిరి; అట్లు చూడవచ్చినవారిని రామలక్ష్మణు లాదరించి, సన్మానించి, ప్రియవచనములను వారితోఁ బలికిరి.

చౌపాయ్

వానరయోధులు మహావీరునిఁ గలిసికొని, "ఓ వీరుఁడా! నీవు మాప్రాణములను రక్షించితివి." అని పలికి, స్తుతించిరి. దేవతలు సంతోషించి, పుష్పములను వర్షించి, దుందుభులను మ్రోఁగించిరి. "ఓ పవనపుత్రా! దేవ, ముని, సిద్ధనరులలో శరీరమును ధరించినవాఁ డొకఁడైనను, నీతో సమానుఁడు లేఁడు. నీకీర్తి మూఁడులోకములలో వ్యాపించుగాక!" అని రామలక్ష్మణులు ప్రసన్నులయి, యతనిని స్తుతించిరి. అతఁడు వారిచరణములమీఁదఁ బడి, నమస్కరించి, "ఓ నాథా! రాజాధిరాజా! నేను స్వయముగఁ జేసినపని లేదు. అగాధజలముపై, నావ దానియంతట

నదిపోవును ; అటులనే, నేను మీబలమును దాఁపుఁజేసికొని, యీ స్వల్పకార్యమును జేసియుంటిని. ఈప్రకారమే, మీ ప్రతాపము చేతనే, సకలకార్యములు నిర్వహింపఁబడును” అని విన్నవించెను ; రాముఁ డతని నాదరించెను. రామలక్ష్మణులు ప్రసన్నులై, వానరసైన్య ములతోఁ గలిసియుండిరి. ఆసమయమున వారు పొందినసౌఖ్యము నెట్లు చెప్పఁగలను ?

ఛాంద్ 7

ఓ పార్వతీ! సావధానముగ వినుము ; ఆసమయమున వారు పొందినసంతోషమును చెప్పఁజాలను. రఘునాథుని ముఖారవిందమును దేవతలు చూచి, సంతసించి, హారతినిచ్చిరి. వారు ప్రేమకు వశ్యులై, మహావీరునికీర్తిని గానముఁజేసి, “స్త్రీపురుషులు మహావీరునికీర్తిని గానముఁ జేసినయెడల, నానందమును, సకలమంగళములును వారికి లభించును” అని పలికిరి.

దోహా 157

ఈప్రకారము దేవతలు భగవంతునకు హారతినిచ్చి, సత్యవచన ములఁ బలికి, పుష్పములను వర్షించి, శ్రీరాముని చరణకమలములయం దనురాగముకలవారై యుండిరి.

చౌపాయ్

దేవతలు నిర్భయులై, ప్రభువుగుణములను గానముఁజేసి, తమ దుఃఖములను హరింపుమని విన్నపములఁ జెప్పుకొనిరి. వారివిన్నపము లను శ్రీరామప్రభువు విని, వారితో నిట్లు ప్రతిజ్ఞఁ జేసెను. “ఓ దేవ తలారా ! అమోఘములగువరములను బ్రహ్మయిచ్చెను ; అవి వ్యర్థములు కానేరవు ; అందుచేత, నింతవఱకు కీవినోదమును జేయవలసివచ్చెను ; అట్లు కానియెడల, నొకక్షణములో లక్ష్మణుఁడు రాక్షసకులమును నాశ నముఁ జేసియుండును. ఈయుద్ధములో గొప్పకౌతుకము జరగఁబోవును; మీరు విచారింపక, దానినిఁ జూడుఁడు. ఇప్పుడు హతశేషు లగురాక్ష సులను లెక్కించిచూడ, వారిలోఁ గూడఁ గొందఱు మహాయోధులు కలరు. ఏవిధమగు శ్రమలేకయే, వారిని సంహరించెదను.” అని శ్రీరా ముఁడు వారితోఁ బలికెను. శివునికృపవలన, నెట్టిసందేహములు లేని వారై, దేవతలు పరమానందభరితు లయిరి.

దోహా 158

శ్రీరాముఁడు చేసినసత్యప్రతిజ్ఞను దేవతలు విని, సంతోషించి, "జయజయ" శబ్దములఁ బలుకుచు, నిష్క్రమించిరి.

---

# నవమవిశ్రామము.

చౌపాయ్

ఓ గరుడా ! ఈ సకలశోభస్కరమగు శ్రీరామునిచరిత్రము పవిత్రమయినది ; శ్రీరామునికృపవలన నీకుఁ జెప్పినాను. ఓ పక్షిరాజా ! రాఁబోవుకథను సావధానముగ వినుము. మనస్సులో శ్రీరాముని ధ్యానించి, చెప్పుచున్నాను. యాజ్ఞవల్క్యునిచరణములకు భరద్వాజుఁడు నమస్కరించి, "ఓ స్వామీ ! మీముఖతః నే నీచరిత్రమును వినినందున, నామనస్సున కాహ్లాదము కలిగెను. అహిరావణుని వధానంతరమున భగవంతుఁడు చేసినచర్యలఁ జెప్పుఁడు." అని ప్రార్థించెను. భరద్వాజుని వినయపూర్వకమగు వచనములను యాజ్ఞవల్క్యుఁడు విని, సంతోషించి, శ్రీరాముని ధ్యానించి, యిట్లు చెప్పుటకారంభించెను. ఓ తండ్రీ ! నీప్రశ్న పవిత్రమయినది ; సరళమగుస్వభావముగల మహాత్ములు నీప్రశ్నకు సమ్మతించెదరు; శ్రీరామ మానసచరిత్రము బహుశ్రేష్ఠమయినది. ఈచరిత్రము నెంతవినినను, మనస్సునకుఁ దృప్తి లేనివారు

దోహా 159

జగద్వంచకులు ; ఈ రామచరిత్ర మానసమును విని, బాగులేదనినవారు, కల్పములకొలఁది భవసాగరములో మునిఁగియుందురు.

చౌపాయ్

శ్రీరామచరిత్ర మానస మెంతవినినను వినవలెనని యెవని మనస్సు కోరుచుండునో వానితోసమానుఁడు లేఁడు ; వానివంటి ధన్యుఁడు లేఁడు. ఓ మునిరాజా ! నీవు పరమచతురుఁడవు ; నీతో సమానుఁ డగుధన్యుఁడు కలఁడా ! ఈ శ్రేష్ఠమగుచరిత్రమును వినుము.

శ్రీరామలక్ష్మణులు వానరదళములతోఁ గూడి, దేదీప్యమానముగ నుండిరి; "జయరామ్" అని వానరులు సింహనాదములఁ జేయు చుండిరి. ఆ శ్రీరామునిసైన్యముల ఆధిక్యతను వారి యుత్సాహమును వేదశాస్త్రములును పండితులే తెలిసికొనఁగలరు. ఈవృత్తాంతము రావణునకుఁ దెలిసెను; ఒకదూత వెళ్లి, యానదవృత్తాంతమును రావణునకు విశదపఱచెను. అహిరావణునివధను వాఁడు విని, తేజోహీనుఁడై, పలువిధముల విలపించెను. ఆ పిడుగువంటిపలుకులను వాఁడు విని, సంభ్రమించి, నేలఁబడి, మూర్ఛిల్లెను. రెక్కలుకొట్టఁబడిన పక్షివలెను, శీతకాలములో రాత్రివేళ వస్త్రహీనుఁడగు దరిద్రునివలెను, వాఁడు వ్యాకులుఁ డయ్యెను; వానిముఖ మెండిపోయెను; వానినేత్రములవెంబడి నీరు వఱదలై కారెను. వానినోటినుండి మాట వెలువడలేదు; వాఁడు శిరమునుపంకించి, నెత్తిఁ గొట్టుకొనెను.

దోహా 160

అప్పుడు మందోదరి వానివద్దకు వచ్చి, పలువిధముల వానినోదార్చి, బోధించెను. అయినను, వాఁడు కాలవశ్యుఁడై, రౌద్రాకారుఁ డయ్యెను. "ఓ నాథా! మీరు బలిపశువులై, విచారింపనేల?" అని యామె పలికెను.

చౌపాయ్

ఆనారీమణి పలికినపలుకులకు వాఁడు క్రోధతామ్రాక్షుఁడై, ధైర్యముఁ దెచ్చుకొని, దిగ్గునలేచి కూర్చుండెను. ఆసమయమున నొకమంత్రి వానివద్దకు వచ్చెను; అతనిని రావణుఁ డాదరించి, కూర్చుండుమనెను. ఆమంత్రి సింధురనాదుఁడు; వయోవృద్ధుఁ; జ్ఞాని; పరమచతురుఁడు; ఎల్లప్పుడు విభీషణునివద్ద నుండెను; ఏనాఁడును రావణునిసభకు వచ్చి యుండలేదు. అతఁడు మంచిసమయముఁ జూచి, రావణునివద్దకు వచ్చి, నీతివాక్యములఁ జెప్పనారంభించెను. అతని జ్ఞానోపదేశములు వాని చెవుల కింపుగ లేకపోయెను. అతనిమాటలను వాఁడు చెవినిబెట్టక, మఱియొకసంభాషణలోనికి దిగెను. "ఆహా! వీనిహృదయ మజ్ఞానముచే నావరింపఁబడియుండెనుగదా" అని మంత్రి విచారించి, "ఈయుపాయ

మును వానికిఁ జెప్పెద; అందుమూలమున వాఁడు నిర్మూలమగును" అని యతఁడు తలంచెను.

దోహా 161

"ఓ రాక్షసాధిపా! సంశయమును విడిచి, నేను చెప్పినప్రకారము చేయుము.

చౌపాయ్

"ఓ నాథా! నీ అక్షయకుమారుఁడు మొదలగుకుమారులకంటె రెండింతలు బలవంతుఁడగుకుమారుఁ డొకఁడు కలఁడుకదా! ఎందులకు నీవిట్లు మనస్సులో విచారించెదవు?" ఇట్లు మంత్రి చెప్పినమాటలను వాఁడు విని, "ఓయీ! ఇఁక నావంశములో హతశేషుఁ డెవఁడు కలఁడు?" అని యడిగెను. "ఓ రావణా! నీవు విచారించిచూడుము; నరాంతకుఁడని నీకొకకుమారుఁడు కలఁడు; మూలానక్షత్ర అభుక్తఘడియలలో వాఁడు పుట్టినందున, వానిని నీవు విసర్జించితివి; కాని, వాఁడు చావక, బ్రతికియుండెను. వానిమీఁద శివునకుఁ గొంచెము దయకలదు. వాఁడు 'విహావాబల' పురములో రాజ్యముఁ జేయుచుండును. సరిసమానబలసంపన్నులగు డెబ్బది రెండుకోట్ల రాక్షసులకు వాఁడు ప్రభువు; ప్రజలకును రాజునకును లేశమైన భేదములేదు. నీవు దూతనుబంపి, వానిని బిలిపించినయెడల, వాఁడు వచ్చి, నీశత్రువులను నిశ్చయముగ సంహరింపఁగలఁడు. ఓ రావణా! వానివద్దకు మంచిచతురుఁడగుదూతను బంపుము. నీవు విచారింపక, ధైర్యము నవలంబించియుండుము."

దోహా 162

ఈప్రకారము మంత్రివర్యుఁడు చెప్పినమాటలను వాఁడు విని, సంతసించెను. వాఁడు ధూమకేతు వనుదూతను రప్పించి, వాని నాదరించి, వానితో నిట్లు చెప్పెను.

చౌపాయ్

"ఓయీ ధూమ్రకేతూ! నీవు మహాచతురుఁడవు; నాపత్రికను దీసికొనివెళ్లుము; నరాంతకుఁడు నివసించియుండు పట్టణమునకుఁ దప్ప, మఱియొకస్థలమునకు నీవు వెళ్లవలసిన పనిలేదు. సమయముఁ జూచి, కారణముఁ జెప్పి, వానిని శీఘ్రముఁ దీసికొనిరమ్ము." రావణుని

యాజ్ఞాప్రకార మాతక్షణము వాఁడు వెడలెను; ఈవృత్తాంతమును గరుత్మంతుఁడు విని, నవ్వి, "ఓ కాకభుశుండీ! ఈవృత్తాంతమును సాంతముగఁ జెప్పుము. ఏవిధమున, నరాంతకుఁడు పుట్టెను? ఎట్లు వానికి 'విహ్వావలపురము' లభించెను? యథావిధిగఁ జెప్పుము." అని ప్రార్థించెను. కాకభుశుండి, హృదయములో శ్రీరాముని ధ్యానించి, కథఁ జెప్ప నారంభించెను. ఓ గరుత్మంతుఁడా! ఈసంవాదము చిత్రముగ నుండును; సావధానముగ వినుము.

### దోహా 163

ఇరువదినఖములు కలవు; ఆ యిరువదిని నాలుగుచే గుణించిన, యెనుబది యగును; దానిలోనుండి, యెనిమిదిఁ గొట్టివేసిన, డెబ్బదిరెండు మిగులును; ఆసంఖ్యతరువాత, నేడుసున్నలు వరుసగ బెట్టిన, డెబ్బదిరెండు కోట్లగును; ఈ రాక్షసు లేక కాలమున రావణుని నగరములోఁ బుట్టిరి.

### చౌపాయ్

ఇందఱు రాక్షసు లేకకాలమున రాక్షసులగృహములలోఁ బుట్టిన సమాచారమును రావణుఁడు విని, సంతసించి, శుక్రాచార్యుని రప్పించి, అతనిచరణములకు నమస్కరించి, కలశముఁ బట్టుకొని, ఆబాలుర జన్మఘుడియలఁగట్టుమని ప్రార్థించెను. "ఓ రావణా! ఈబాలకులు మూలనక్షత్రమునఁ బుట్టిరి; నేను సత్యముఁ జెప్పుచున్నాను; ఈనక్షత్రమున నీనగరములోఁ బుట్టిన బాలురవలన, వారివారితండ్రులకు మృత్యువు కలుగును. ఆ బాలురముఖముఁ జూచినయెడల, వారితండ్రులకు మరణము సంభవించును. వారిని గృహములలో నుంచుకొనినయెడల, ధనముతోఁగూడ వారిగృహములు నశించును. వారిని విశేషకాలము గృహములలో నుంచుకొనుట తగదు." ఇట్లు శుక్రాచార్యుఁడు చెప్పిన మాటలను రాక్షసులు విని, భయపడి, యేమిచేయుదమని వారిలో వారు గుసగుసలాడిరి. "ఓ నిశాచరులారా! ఈదినమునఁ బుట్టినబాలురను సముద్రములోఁ ద్రోసివేయుఁడు.

### దోహా 164

"ఈపని శీఘ్రముగఁ జేయుఁడు; బాలురనందఱను దీసికొని రండు;

వారిని గృహములలో నుంచుకొనుటవలన, హానికలుగును." అని రావణుఁడు వారితోఁ జెప్పెను.

చౌపాయీ

అప్పుడు సేవకులు వచ్చి, రావణునకు నమస్కరించి, వానియాజ్ఞాప్రకారము పనిఁజేయ నారంభించిరి; రావణునియాజ్ఞను నగరమంతట వారు చాటించిరి; "ఓ నిశాచరస్త్రీపురుషులారా! రావణునియాజ్ఞను వినుఁడు; ఈదినమున అభుక్తమూలానక్షత్రమున బుట్టినబాలురను సముద్రములోఁ బడద్రోయుఁడు; ఈబాలకులు కులనాశకులు." తేనెటీగలనువలె, నొక్కపెట్టున వారు వారినిఁ బడద్రోసిరి. ఆబాలకులు వటవృక్షమువద్దకు వచ్చి, దానిని నలువైపులఁ బట్టుకొని, దానిపాలను ద్రాగుచుండిరి; ఈప్రకారము దానిపాలం ద్రాగుచు, నేఁడుసంవత్సరములు వారు బ్రతికిరి; అంత, వారిదేహములకుఁ బుష్టికలిగెను. అప్పుడు వా రొక్కమ్మడిని వెడలి, గంగానదీ-సాగరసంగమమునకు వచ్చి, కూర్చుండిరి; అచ్చటనుండిన శివాలయమును వారు చూచి, సంతసించి, శిరస్సులను వంచి, నమస్కరించిరి.

ఛాంద్ 8

పరమసుందరమగు శివమందిరమును వారు చూచి, సంతోషించి, యచ్చట కొన్నిదినములు నివసించి, యచ్చటనుండి వెడలిరి. ఓ గరుత్మంతుఁడా! రావణునినగరమునకుఁ దూర్పుగ, నారువందలకోసుల దూరము వారు వెళ్లిరి; సముద్రతీరమున నొక రమ్యమగుస్థానమును జూచుకొని, వా రచ్చటకూర్చుండి, భూతభావనుఁడగు శ్రీసాంబశివుని చరణారవిందములను ధ్యానించుచుండిరి.

దోహా 165

వారిపుట్టువు పూర్వోత్తరములు వారికిఁ దెలియనందున, వారు విచారగ్రస్తులై, యుండిరి. సూర్యునితేజస్సులో షడాంశము తేజస్సుగల శుక్రాచార్యుఁ డప్పుడు వారివద్దకు వచ్చెను.

చౌపాయీ

ఆదైత్యగురువు తన నిజశిష్యులను గుఱుతుపట్టెను; వా రతనికి నమస్కరించిరి; అతఁడు వారిని దీవించెను. అప్పు డతఁడు తననాము

మును వారికిఁ జెప్పి, బోధించెను; అతఁడు తమకులగురువని వారు తెలిసికొని, విన్నపముఁజెప్పుకొని, అతనికి నమస్కరించి, తమపూర్వోత్తరములఁ జెప్పుమని ప్రార్థించిరి; వారిపూర్వోత్తరము నతఁడు వారికిఁ జెప్పెను; ఆవృత్తాంతమును వారు విని, సిగ్గుపడిరి; వారిముఖలక్షణముల నతఁడు చూచి, వారిని సన్మానించి, సంతోషపెట్టి, వారికి మంత్రము నుపదేశించెను; వారు తగినశిక్షను బొంది, యచ్చటనుండి వెడలిరి; సర్వసందేహములను విడిచి, వారు జ్ఞానమును బొంది, బ్రహ్మదేవుని చరణకమలముల నారాధించుట కారంభించిరి. వారు నిరాహారులై, యేకాసనముపైఁ గూర్చుండిరి; ఓ గరుడా! ఈప్రకార మొకవేయి సంవత్సరములు వారు తపముఁ జేసిరి. ఊర్ధ్వముఖులై నిలిచి, ప్రాణవాయువులను నిరోధించి, నిరాహారులై, మఱియొక వెయ్యిసంవత్సరములు వారు తపముఁ జేసిరి.

దోహా 166

ఏకచరణముమీఁద వారు నిలువఁబడి, యూర్ధ్వభాగమును నేలకువంచి, పరిశ్రమలేకయే, తపముఁ జేసిరి; వారిశరీరములు పుష్టిగ నుండెను; మనస్సులు సంతోషముగ నుండెను; స్వప్నమందైనను వారికి క్షుత్పిపాసలు లేకపోయెను.

చౌపాయ్

ఇట్లు వారు చేయుచుండిన ఘోరతపమును బ్రహ్మదేవుఁడు మెచ్చుకొని, మనస్సులో సంతోషించి, కమండలమును బట్టుకొని, హంసవాహనారూఢుఁడై, వారియెదుట నిలిచెను. అతని నాలుగు శిరస్సులపై, డెల్లనికిరీటములు ప్రకాశించుచుండెను; అతనిముఖములు నాలుగు; అతనిరాజీవనేత్రము లెనిమిది; అతనిముఖమున విభూతిరేఖలు కలవు; ఆ జగన్నివాసునకుఁ దగినయుపమాన మేమిచెప్పఁగలను? ఆ దయాసముద్రుఁడు వారిం జూచి, "ఓయీ! మీమనస్సునకు వచ్చినవరమును గోరుఁడు" అని పలికినపలుకులను వారు విని, అతనిచరణములకు నమస్కరించిరి. "ఓ నాథా! మాకు సంగ్రామములో నపజయము లేకుండునట్లు ప్రసాదింపుము." అని వారు ప్రార్థించిరి. వారిప్రార్థనను బ్రహ్మ విని, విచారించి, "తథాస్తు; ఒకరివలనగాని, మీవలనగాని మీకు మృత్యువుకలుగదు. సుగ్రీవునిపుత్రుఁడు మీకు

'గురుభాయి' యగును. అతనితో నెన్నఁడు మీరు యుద్ధముఁ జేయ కూడదు.

దోహా 167

"అతనితో మీరు పోరాడినయెడల, మీకు మృత్యువువచ్చును; నామాటను విశ్వసింపుఁడు" అని పలికెను. ఆకృపానిధానుఁ డీవరమును నరాంతకున కొసంగెను.

చౌపాయ్

నరాంతకుఁ డీవరమును గైకొని, మరల ధ్యానముఁ జేయుచుం డెను. వానిని బ్రహ్మచూచి, "ఓయీ! వరము నడుగుము" అని పలికినపలుకులను వాఁడు విని, సంతసించి, "ఓ స్వామీ! మీరు సర్వాంతర్యాములు; మా కోకవరమును బ్రసాదింపుఁడు; దేవాసురయుద్ధములో మేము జయించునట్లు కటాక్షింపుము" అని ప్రార్థించి, అతనికి నమస్కరించి, నిలువఁబడి యుండిరి. అప్పుడు వారిని బ్రహ్మ బోధించి, "ఓయీ దైత్యులారా! అన్నివిధముల మీ రజేయులుగ నుండఁగలరు; కాని, మీకు వానరభల్లూకములవలనమాత్రమే భయము కలుగును" అని నిశాచరులకు వరములనిచ్చి, సత్యలోకమునకు హంసవాహనారూఢుఁడై, నిష్క్రమించెను. ఈప్రకారము వారు బ్రహ్మ వలన వరములను గైకొని, సంతుష్టాంతరంగులై, మరల ఘోరమగు తపముఁజేయ నారంభించిరి.

దోహా 168

ఏకచరణముమీఁద నిలువఁబడి కొందఱును, కొందఱు చేతులను జోడించుకొని, శ్రీపార్వతీపరమేశ్వరులను ధ్యానించుచు, దపము జేయ నారంభించిరి.

చౌపాయ్

ఈప్రకారము ప్రయాసములేకయే, వారు క్షుత్పిపాసల నెఱుంగక, తపముఁజేయుచుండ, మూఁడువేలసంవత్సరములు గతించెను; పిమ్మట వారు క్రిందికి శిరస్సులను, మీఁదికిఁ బాదములను బెట్టి, చేతులను జోడించుకొని, ప్రాణవాయువులను బిగించి, తపముఁ జేయుచుండిరి; వారిసాధనమును మునిజనంబులు చూచి, సంకోచపడి, సర్వము

నారాయణునిమహిమయని తెలిసికొని, భగవంతుని ధ్యానించి, తమ మార్గమున వెళ్లిరి. ఓ గరుత్మంతుఁడా! ఈవిధమున వారు తపముఁ జేయుచుండ, పదివేలసంవత్సరములు గతించెను; అప్పుడాసుఖదాయకుఁ డగుశివుఁడు ప్రసన్నుఁ డయ్యెను. అతఁడు పార్వతితోఁగూడి, వృషభవాహనారూఢుఁడై, వారికిఁ బ్రత్యక్షమయ్యెను.

దోహా 169

వారితో శివుఁడు ప్రసంగించి, "ఓ దైత్యులారా! వరము నడుగుఁడు" అని చెప్పెను. అప్పుడు నరాంతకుఁడు శివునకు దండప్రణామముఁ జేసి, యిట్లు విన్నవించెను:—"ఓ దేవదేవా! నామాటను వినుఁడు.

చౌపాయ్

"ఓ నాథా! మీదర్శనార్థము తపము నాచరించితిని; మీరు భక్తవత్సలులు. మిమ్ములను వరమునడుగుటకు నాకు సిగ్గువేయుచున్నది." అని వాఁడు విన్నవించి, నిలువఁబడెను. "ఓయీ! నీవు సంకోచమును విడిచి, వరము నడుగుము" అని శివుఁడు పలికినవచనములను వాఁడు విని, సంతసించి, యీవరము నడిగెను:—"ఓ సదాశివా! రాజునకును బ్రజలకును తారతమ్యము లేకుండునట్లు సకలైశ్వర్యముల నొసంగుము. పరిశ్రమలేకయే, నానగరము నిర్మింపఁబడుఁ గాక!" అని వాఁడు చేతులను జోడించుకొని, ప్రార్థించి, నిలువఁబడెను. "తథాస్తు" అని శివుఁడుపలికి, పార్వతితోఁ గూడి, కైలాసపర్వతమున కేతెంచెను. శివుని ప్రసాదమువలన, నంతరిక్షమున, నరాంతకుఁడు స్వనగరమును నిర్మించెను. దానికి 'విహ్వలబలపురమ'ని పేరుపెట్టెను. దానిశోభను వర్ణించి, నీతో నెట్లు నేను చెప్పఁగలను?

దోహా 170

పట్టణమునకు నలువైపుల, డెబ్బదిరెండుకోట్ల సువర్ణగృహము లేకకాలమున నిర్మింపఁబడెను. ఆగృహము లేకరీతిని నిర్మింపఁబడి, శోభించుచుండెను.

చౌపాయ్

దానివైశాల్యము రెండువందల యేబదియోజనములు; అరువదినాలుగుక్రోసులు దాని యౌన్నత్యము; ఆదుర్గము మహాకఠినముగ

నిర్మింపఁబడెను; దానిం జూచి, విశ్వకర్మయు నాశ్చర్యపడెను. నాలుగు సింహద్వారములకు వజ్రస్థగితమగు ద్వారములు కలవు. ఆ దుర్గము లోపలనుండిన చౌహట్టము ధనరాసులతో నిండియుండెను. కుబేరుని వంటి వైశ్యు లానగరములోఁ గలరు; ఒక్కొక్కనివద్ద నొక్కొక్క పద్మముధనము కలదు; అయినను, వారు తుచ్ఛులు. నానావిధ వనోప వనములును, నదులును, సరోవరములును కలవు. పురములో జనులు విశేషముగ నివసించియుండిరి. నరాంతకుఁడు వారికి నాయకుఁడై, దుర్గములో నుండెను. శ్రేష్ఠములగు మణిమాణిక్యస్థగితమగుకోట పది యామడక్రోసులవఱకు వ్యాపించియుండెను. రథ, గజ, తురగములును, ఖచరములును, ఖగమృగములును, గోట్లకొలఁది కలవు; వానిం జెప్పుటకు శక్యముకాదు. ఓ గరుత్మంతుఁడా! ఆ డెబ్బదిరెండుకోట్ల రాక్షసులొకనివద్ద విద్యనభ్యసించుట కారంభించిరి.

దోహా 171

ఆసమయమునకు హరిప్రేరితమువలన, దధిబలుఁ డనువానరుఁడానగరమునకు వచ్చి, దానిశోభను జూచి, యచ్చటఁ గొన్నిదినములు నివసించెను.

చౌపాయ్

ఓ భరద్వాజా! విధికృతమువలన, నావానరుఁడు రాక్షసులతోఁ గూడి, యొకసంవత్సరము విద్యనభ్యసించెను. ఒకనాఁ డతనిగురు వతనిమీఁదఁ గోపించి, "ఓరీ మూర్ఖుఁడా! నీవు నీగురుభాయినిఁ జూచి, నవ్వియుంటివి; కనుక, నీమూలమున వానికి మరణమువచ్చును" అని శపించెను; నిష్కారణ మతఁ డీశాపమును గైకొని, గురువువద్ద సెలవుఁ బుచ్చుకొని, ఆనగరమునుండి వెడలెను; ఆ దధిబలుఁడు సుగ్రీవుని కుమారుఁడు; అతఁడు మార్గములోవచ్చుచుండు నారదునిఁ జూచి, యతనిచరణములఁ బట్టుకొని, దండప్రణామముఁ జేసెను. అప్పు డతనిని నారదుఁడు దీవించి, "ఓ దధిబలుఁడా! ఏకార్యముపై నెచ్చటకువెళ్లి, యిప్పుడు వచ్చుచుంటివి?" అని యడిగెను. నరాంతకుని పట్టణమును గుఱించియు, వాని ప్రభుత్వమును గుఱించి యతఁడు నారదునితోఁ జెప్పెను. రాక్షసుల మహదైశ్వర్యమును నారదుఁడు విని, మనస్సులో విచారించెను; క్షణమాత్ర మతఁడు విచారించి, భగవంతుని స్మరించెను.

దోహా 172

అప్పుడు దధిబలునకు నారదుఁ డీవిధమున నుపదేశించెను; "ఓ దధిబలుఁడా! శరీరమునుబొంది నారాయణుని భక్తితో సేవింపని యెడల, వానిజన్మము వ్యర్థము.

చౌపాయ్

"ఓ తండ్రీ! ఈసంగతి విచారించి, శ్రీరాముని ధ్యానింపుము;" ఇట్లు నారదుఁడు చెప్పినమాటలవలన, దధిబలునకు జ్ఞానోద్భవమయ్యెను; ఆమహర్షి చరణకమలములకు నమస్కరించి, అతఁడు సంతసించెను. అతనిని నారదుఁడు దీవించెను. అచ్చటనుండి దధిబలుఁడు వెడలి, క్షీరసముద్రమధ్యముననుండిన ధవళగిరిపర్వతమువద్దకు వచ్చి, దానినిఁ జూచి, సంతసించెను. అతఁడు శ్రీపార్వతీపరమేశ్వరులను గణపతిని ధ్యానించి, అచ్చట నివసించెను. నారదుఁడు దధిబలున కుపదేశించి, బ్రహ్మలోకమునకు వెళ్లెను. ఇచ్చట నరాంతకుఁడు విద్య నభ్యసించి, పలువురతో ననేకయుద్ధములఁ జేసెను. బిందువను రాక్షసుఁడొకఁడు పాతాళలోకమున నివసించియుండెను.

సోరఠా 4

వాఁడు రణధీరుఁడు; శూరుఁడు; విక్రమార్కుఁడు; మహాబలవంతుఁడు. ఒకసమయమున, వాఁడు దేవేంద్రునితో నొకసంవత్సరము పోరాడెనని సత్పురుషులు చెప్పుచున్నారు; ఆసంగతి వేదములోఁ జెప్పఁబడియున్నది.

చౌపాయ్

ఏడుకోట్లనిశాచరులు వానివెంట నుండిరి; వారు మహాదుర్మార్గులు; మేరుపర్వతాకారులు; మహావీరులు. ఒకసమయమున దేవేంద్రుఁడు కోపగించి, వారిని యుద్ధములో సంహరించెను. 'బిందువను' రాక్షసుఁడు పాఱిపోయి, స్వగృహములో, దాఁగియుండెను. వాఁడు వానిభార్యతోఁ గూడి, సుఖముగ నుండెను; అర్ధరాత్రమున వాఁడు భార్యతోఁగూడి, కేళీవినోదములను జరపెను; అందువలన, ననేకదుఃఖదాయకు లగుకుమారులు పుట్టిరి; ఏడుకోట్లకుమారులు వానికిఁ బుట్టిరి; వారిముఖములు చక్కగనుండెను; వారు మహాబలవంతులు; అనేక

నామములు వారికిఁ గలవు. డెబ్బదిరెండుకోట్ల కుమార్తెలుకూడ వానికిఁ బుట్టిరి. వారినేత్రముల చక్కదనమును జూచి, హరిణములు సహితము సిగ్గుపడుచుండెను. వారిలో బిందుమతియనుకన్య మంచి చక్కనిది; ఆమె, చక్కదనములో దేవకన్యలను మించియుండెను. నరాంతకునితో సమానుఁ డగుబలవంతుఁడు లేఁడని బిందువు మనస్సులో విచారించెను.

దోహా 173

ఈ ప్రకారము వాఁడు చింతించి, నరాంతకుని బిలిచి, బిందుమతి మొదలగుకుమార్తెలను శృంగారించి, వానికిచ్చి, వివాహముఁ జేసెను.

చౌపాయ్

యథాయోగ్యముగ వాఁడు తనకుమార్తెలను వానికిచ్చి, వివాహముఁ జేసెను; నరాంతకుఁడు సేనాసమేతముగ వారిని వివాహమాడి, స్వపురమునకు వెళ్లెను. ఆనరాంతకుఁడు విహ్వబలపురములో రాజ్యముఁ జేయుచుండెను; వాఁడు జనులతోఁగూడి, కేళీవినోదములలోఁ దేలుచుండెను. దేవతులగృహములలో నుండదగినకన్యలు, ప్రారబ్ధవశమున, రాక్షసులగృహములలో నివసించుచుండిరి. వారు మహాపతివ్రత లగుటచేత, వారిభర్తలను జూచి, దేవతలు భయపడుచుండిరి. "ఓగరుత్మంతుఁడా! ఆ బిందుమతి సరస్వతితో సమానురాలు; సభలలో నామెగుణములను బుద్ధిమంతులు చెప్పుకొనుచుందురు. ఓ గరుత్మంతుఁడా! ఇంతవఱకు నరాంతకుని యుత్పత్తిచరిత్రమును జెప్పియుంటిని; ఇఁక రాఁబోవుచరిత్రమును సావధానముగ వినుము. నాగురువు చెప్పినప్రకారము నీకుఁ జెప్పుచున్నాను" అని కాకభుశుండి పలికి, భగవంతుని ధ్యానించి, కథఁజెప్ప నారంభించెను.

దోహా 174

ఇచ్చట, రావణునిదూత, ధూమకేతువు, మార్గమున వెడలివచ్చి విహ్వబలపురమును సమీపించెను. ఆనగరవైశాల్య మెనిమిదిక్రోసులు; దానిని వాఁడు చూచి, సంతసించి, నిలువఁబడెను.

చౌపాయ్

ఆనగరమునకు వాయవ్యదిశ నొకగొప్పవనము కలదు; ఆవనమున నొకసేవకుఁడు వచ్చి, పత్రములను గోయుచుండెను; వాఁడు

వానినిఁ జూచెను. సంకోచముతో వానివద్దకు వాఁడువచ్చి, నిలువఁబడి, ధైర్యముఁ దెచ్చుకొని, వానితో నిట్లు ప్రసంగించెను. "ఓ కుమారా! రాజకుమారులు పాదచారులై, వనమునకువచ్చి, పత్రములను గోయుట, మీనగరవాసుల యాచారమా?" వానిమాటలను వాఁడు విని, నవ్వి, "ఓరీ మూర్ఖుఁడా! నీవు గ్రామములో నివసించువాఁడవా? ఈనగరమునకు నరాంతకుఁడు రాజు; నే నతనిదూతను" అని చెప్పెను. వానిమాటలను వాఁడు విని, భయపడి, ప్రత్యుత్తరముఁ జెప్పక, మార్గమున బోయెను. ఆసమయమున నొకస్త్రీరత్నము బంగారు కలశమునుఁ బట్టుకొని, జలమునిమిత్తము వచ్చెను. వానికి గొప్పసందేహము కలిగెను. ఆమె వద్దకు వాఁడు వెళ్లి, ఆమెతో నిట్లు సంభాషించెను:—"ఓ కుమారీ! సత్యముఁ జెప్పుము.

దోహా 175

"ఓ రాణీ! మీనగరములో దాసీజనంబులు లేరా? జలమును దెచ్చుటకు నీవెందుకు వచ్చితివి? ఏకారణముచే నీవువచ్చితివో భయమును విడిచి, చెప్పుము."

చౌపాయ్

వానిమాటల నామె విని, పక్కున నవ్వి, "ఓరీ! నరాంతకుని చెలికత్తెయొక్క చెలికత్తెకు నే నాంతరంగిక చెలికత్తెను. ఈసాగరమునుండి జలమును దీసికొనివెళ్లుటకు నిత్యము నేను వచ్చుచుందును. ఇచ్చటకు మహారాణివచ్చుటకు గారణమేమి? ఈమాటను నీవెవరితోనైనఁ జెప్పినయెడల, నిన్ను వారుపొడిచి, కాలుతోఁ దన్ని, నిన్నుఁజంపి, భక్షించెదరు." అని వానికి బోధించి, జలమునిమిత్తము తనమార్గమున వెళ్లెను. ఆమెవెనుకను వాఁడు నడిచివెళ్లెను. వాఁడు నగరములోఁ బ్రవేశించి, అనేక వాపీ, కూప, తటాకములను జూచెను; అనేక రథ, గజ, తురగ, ఖచ్చరములు నగరములోఁ దిరుగుచుండెను; అనేకనగరములను, పురములను వాఁడు చూచుచుఁ దిరిగెను. ఆనగరములో రాజమందిరమునకు నాలుగుసింహద్వారములు కలవు; చారులు దానిలోఁ బ్రవేశించుట కష్టము.

ఛాంద్ 9

చారులు దానిలోఁ బ్రవేశించుట దుష్కరము; ద్వారములు వీడ్వడి, మూతఁబడును; దానిలోఁ బ్రవేశించినతరువాత, బయటకు వచ్చుట దుర్లభము. ఆలోచించుచు, వాఁడు రెండుగడియలు నిలువఁబడెను. ఆచౌహట్టములో వాఁడు నిలువఁబడి, విచారించుచుండెను. ఆహా! ఆరాక్షసులకు ప్రారబ్ధవశమున, సంఘమరణము సంభవించుటకు సమయము వచ్చెను.

సోరఠా 5

నరాంతకునియెదుట నాట్యముఁజేయుటకు నాటకులు కొందఱు నాటకసామగ్రినిఁ దీసికొని, రాజమందిరములోఁ బ్రవేశించుచుండిరి; ధూమకేతువు నాటకునివేషమును ధరించి, వారివెంట మందిరములోఁ బ్రవేశించెను.

చౌపాయ్

సభలో నరాంతకుఁడు సింహాసనము నధిష్ఠించియుండెను; ఏకకాలమున జన్మించిన డెబ్బదిరెండుకోట్ల రాక్షసులు వానినిఁ బరివేష్టించియుండిరి. పదునెనిమిదిలక్షల ముప్పదియాఱువేలరాక్షసులు సమావేశులయిరి. నిత్యమాసభలో భట్రాజులును విదూషకులును వినోదము జేయుచుందురు; పండితులును, కవీశ్వరులును వానికీర్తినిఁ గానము జేయుచుందురు. ఈ అద్భుతమగువ్యాపారమును రావణుని దూత చూచి, ఆశ్చర్యపడెను. ఈడెబ్బదిరెండుకోట్లరాక్షసు లేకరీతిగ నుండిరని వానిలో వాఁడు చింతించెను. ఆరాక్షసుల వస్త్రములను, భూషణములను, సుఖాసనములను వాఁడు కన్నులారఁ జూచి, భ్రమించెను; వానిమనస్సు చంచలమయ్యెను. దినములో నొకయామము గతించెను; అప్పుడు మంచిసమయముఁ జూచి, వాఁడు నరాంతకునకు నమస్కరించి, రావణునిపత్రికను వానికిచ్చెను; వాఁడు దానినిఁగైకొని, రావణుని యోగక్షేమమునుగుఱించి యడిగెను.

దోహా 176

నరాంతకుఁడు సంతోషించి, స్వకుశలమును జెప్పి, రావణుని క్షేమమునుగుఱించి యడిగెను. అప్పుడు ధూమకేతువు లంకానగరములో జరుగుచుండిన యావద్వృత్తాంతమును వానితోఁ జెప్పెను.

చౌపాయ్

వానిమాటలను నరాంతకుఁడు విని, క్షణమాత్రము దానికారణమును మనస్సులో విచారించెను. పిమ్మట, వాఁడాపత్రికను విప్పి, చదివెను; దూత చెప్పినమాటలు సత్యమని వాఁడు గ్రహించెను. కోపోద్దీపితుఁడై, వాఁడు సభలోనుండి దిగ్గునలేచి, శోకసంతప్తమానసుఁడై, స్వగృహములోఁ బ్రవేశించెను. వాఁడాపత్రికను బిందుమతికిఁ జదివి, వినిపించెను. "మాతండ్రికి గొప్పకష్టము వచ్చెను. నన్నురమ్మని వర్తమానముఁ జేసెను." వాఁడు చెప్పినమాటల నామె విని, "నీవు రఘురామునితో యుద్ధముఁ జేయకుము. ఓ నాథా! నీవు వెళ్లి, వారి చరణములను బట్టుకొనుము. నీవిన్నపములను వారితోఁ జెప్పి, నీజిహ్వను సఫలముఁ జేసికొనుము. శ్రీరామునియందు భక్తికలుగునట్లు వరము నడిగి, నీభక్తిని దృఢముగఁ జేసికొని, స్వగృహమునకు వచ్చి, నిర్భయముగ రాజ్యముఁ జేయుము." అని బోధించెను; ఆమెమాటలు వానికి మనస్కరింపలేదు. వాఁడు దిగ్గునలేచి, కోటసింహద్వారమువద్దకు వచ్చెను.

దోహా 177

"ఓ నిశాచరులారా! రణభేరిని మ్రోఁగించి, చతురంగబలముల నాయత్తము చేయుఁడు; మాజనకునిదూతవెంట వెళ్లి, మాజన్మభూమిని జూచివచ్చెదము." అని వాఁడాజ్ఞాపించెను.

చౌపాయ్

వానియాజ్ఞాప్రకారము నిశాచరులు సకలసామగ్రులను సన్నద్ధముఁజేయ నారంభించిరి. అనేక రథ,గజ,తురగములను, ఖచ్చరములను, లొట్టియలను, ఆకాశవిమానములను వారు సిద్ధపఱచిరి; అనేకశస్త్రాస్త్రములను ధరించి, వారు ప్రయాణమునకు సిద్ధపడిరి; ఆ రాక్షససైన్యమును జెప్పుటకు శక్యముకాదు. ఈప్రకారము వారు యుద్ధసన్నాహముఁ జేసి, రణభేరిని సంతోషముతో మ్రోఁగించిరి. నరాంతకుఁడు ప్రయాణమునకు సిద్ధమయ్యెనని బిందుమతి తెలిసికొని, విచారగ్రస్తురాలయ్యెను. "ఆహా! శ్రీరామునితో విరోధించుటవలన, నానాథునకు క్షేమముకలుగదు. నేను నానాథుని ననుసరించి యుండెదను." ఈవిధ

మున నామెచింతించి, అనేకవస్త్రాద్యలంకారముల నలంకరించుకొని, నాథునిచరణములను బట్టుకొని, యిట్లు విన్నవించెను:—"ఓ నాథా! నా అత్తమామలను దర్శించునిమిత్తము నేను మీ వెంట వచ్చుచున్నాను."

దోహా 178

ఆమెవచనములను వాఁడు విని, సంతసించి, "ఓ ప్రియురాలా! నిస్సందేహముగ, నీచెలికత్తెలతోఁ గూడి, నీవు నావెంట రమ్ము" అని చెప్పెను.

చౌపాయ్

వానిమాటల నామె విని, సంతోషించి, చెలికత్తెలతోఁ గూడి, వానివెంట వెడలెను. అపారమగు రాక్షససైన్యములతోఁగూడి వాఁడు ప్రయాణమును సాగించెను; వారివిజృంభణము నెట్లు చెప్పవచ్చును? ఓ గరుత్మంతుఁడా! నామాటను వినుము. వానిసేనలో, నైదులక్షల యేడువేలరణభేరులు మ్రోఁగింపఁబడెను. ధూమకేతువును వెంటఁబెట్టుకొని, వారు రౌద్రాకారులై, అతిశీఘ్రముగ లంకానగరమునకు వెడలిరి. వారి ప్రయాణసమయమున, దుశ్శకునము లనేకములు కనఁబడెను; కాని, వారు మృత్యువునకు వశీభూతులై, వానిని లక్ష్యముఁ జేయలేదు. వారిప్రయాణమును దేవతలు చూచి, భయపడి, సందేహించిరి. ఆదివరాహమును, కచ్ఛపమును, శేషుఁడును భయపడిరి; వీరు మాటిమాటికి శ్రీరామునిచరణములను మనస్సులో ధ్యానించుచుండిరి. శ్రీరాముని ప్రతాపమును దేవతలు తెలిసికొని, సంశయములను విడిచి, అతని చరణములను ధ్యానించుచు, ధైర్యముగ నుండిరి.

దోహా 179

సైన్యములతోఁ గూడి, నరాంతకుఁడు లంకానగరసమీపమునకు వచ్చెను. వానిసైన్యము నలుబదిక్రోసులప్రదేశము నాక్రమించియుండెను; ఓ భరద్వాజా! ముందుకథను సావధానముగ వినుము.

చౌపాయ్

ఆ లక్ష్మీపతి, ఆ కృపాసాగరుఁడు, ఆ రఘుపతి కాలమేఘములు వలెనుండిన రాక్షససైన్యములఁ జూచి, సర్వజ్ఞుఁడైనను, మనుజధర్మము ననుసరించి, మంత్రులను బిలిచి, వారితో నిట్లు ప్రసంగించెను; "ఓ

సఖులారా ! దక్షిణదిశవైపుఁ జూడుఁడు. అనేకమేఘములు గర్జించి, వచ్చుచున్నవి." ఓ పార్వతీ ! శ్రీరాముఁడు సర్వాంతర్యామి ; కౌతుక మునిమిత్తము వారిట్లు పలికిరి. శ్రీరామునివచనములను విభీషణుఁడు విని, మందహాసముఁ జేసి, శ్రీరాముని చరణకమలములను బట్టుకొని, యిట్లు విన్నవించెను:—"ఓ నాథా ! అవి మేఘబృందములు కావు ; అవి రాక్షససైన్యములు ; వానికి నరాంతకుఁడు రాజు. వీఁడు రావణుని కుమారుఁడు; విహ్వబలపురమునకు రాజు; అచ్చట వాఁడు నివసించును. రావణుఁడు ధూమకేతు వనుదూతను వారివద్దకుఁ బంపియుండెను ; ఆ వినఁబడుచుండినశబ్దము వారికోలాహలము ; వారు సింహనాదముఁ జేయుచు, వానివెంట వచ్చిరి.

దోహా 180

"ఓ నాథా ! వానివెంట ననేకగాయకులు కలరు ; వారు గానముఁజేసి, వాద్యములను మ్రోఁగించెదరు. అనేక రథ,గజ,తురగ, పదాతులతో నాదుర్మార్గుఁడు వచ్చెను ; వానిచతురంగబలములు విచ్చలవిడిగఁ దిరుగుచున్నవి."

చౌపాయ్

ఆ మహాబలవంతుఁడు, బుద్ధిమంతుఁడు, భగవంతుఁడు, శ్రీరాముఁడు నరాంతకునిప్రభావమును విని, చిఱునవ్వు నవ్వెను. శ్రీరాముని యాజ్ఞఁగైకొని, మహావీరుఁడు లోలోపున ఘూర్ణిల్లి, దిగ్గున లేచెను. శ్రీరామలక్ష్మణుల చరణముల కతఁడు నమస్కరించి, "జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః" అని సింహనాదముఁ జేసి, పరుగెత్తెను. అతిశీఘ్రములో నతఁడు రాక్షససైన్యములవద్దకు వచ్చెను. అతఁడు కటకటమని పండ్లుగొఱికి, మేఘమువలె, గర్జించెను. ఇట్లు మహావేగమునవచ్చిన హనుమంతుని నరాంతకుఁడు చూచి, "ఓయీ ! ధూమకేతూ ! ఇట్లు పరుగెత్తివచ్చినవాఁ డెవఁడు ? సువర్ణశైలమువలె, నతని శరీరము భయంకరముగఁ గనఁబడుచున్నది ; ప్రళయకాలమేఘములువలె, నతఁడు గర్జించుచుండెను. వాఁ డెవఁడు ?" అని యడిగెను. అప్పుడు ధూమకేతువు వానితో నిట్లు చెప్పెను. "ఇతఁడు హనుమంతుఁడు ; మహావీరుఁడు ; బలవంతుఁడు.

దోహా 181

"ఇతఁడే సముద్రమును దాఁటి, లంకానగరమును దహించెను. ఇతఁడే అక్షయకుమారుని సంహరించెను. మార్గములో నితఁడే కాల నేమిని దునుమాడి, ద్రోణాచలమును దీసికొనివచ్చెను.

చౌపాయ్

"ఇతఁడే పాతాళమునకుఁ బోయి, అహిరావణుని, పుత్రమిత్ర వర్గముతోఁగూడ సంహరించెను. పాతాళమునుండి, రామలక్ష్మణుల నితఁడే తీసికొనివచ్చెను. ఇతఁడే యిప్పుడు నీవద్దకు వచ్చుచుండెను. ఇతనిభుజబల మపారము." ఇట్లు ధూమకేతువు చెప్పినమాటలను నరాంతకుఁడు విని, మండిపడి, ధనువునకు బాణమును సంధించెను; అంతలో మహావీరుఁడు వానినిఁబట్టుకొని, రెండుముక్కలుగ ఖండించి, రౌద్రాకారుఁడై, నరాంతకునిగుండెలను ముష్టితోఁ బొడిచెను. మిశ్రనామ పర్వతము గిరగిరఁదిరిగి, రసాతలమునకుఁ బడినట్లు, ఆదెబ్బతో నరాంతకుఁడు గిరగిరఁదిరిగి, నేలఁగూలెను. మహావీరుఁడు స్వపుచ్ఛమును బెంచి, దానితో ననేకరథములను గొట్టి, కోట్లకొలఁది వానిపైఁ బడఁద్రోసెను. రథములును, సారథులును జూర్ణమయ్యెను. వరప్రభావముచే వారిప్రాణములు పోలేదు.

దోహా 182

ఒకగడియవఱకు వాఁడు నెత్తిఁగొట్టుకొనుచు, భూమిమీఁదఁ బడియుండెను. పునః, వాఁడు దేహమును సవరించుకొని, దిగ్గున లేచి, ధనుర్బాణములను బట్టుకొని, మహావీరుని నెదుర్కొనెను.

చౌపాయ్

వాఁడు కోపించి, కోట్లకొలఁదిబాణములను బ్రయోగించి, క్షణములో వానరసైన్యమును గప్పెను. శ్రీరాముని ప్రతాపమువలన, మహావీరుఁడు వానిబాణములను బట్టుకొని, త్రుంచివేసెను. మహావీరుని ప్రతాపమును దేవతలు చూచి, ఆనందించి, పుష్పములను వర్షించిరి. "ఓ పింగాక్షుఁడా! జయ-జయ" అని దేవతలు పలికినపలుకులను నరాంతకుఁడు విని, భగ్గున మండిపడెను. ఆతక్షణము వాఁడు హనుమంతుని వద్దకు వచ్చి, "ఓ వానరుఁడా! నీకు బల ముండినయెడల, నాతో మల్ల

యుద్ధముఁ జేయుము. నీభుజబలమును దేవతలు కొనియాడుచుండిరి. నాముష్టిప్రహారమును నీగుండెలపై నీవు సహించినయెడల, నీవు బలవంతుఁడవే; ఓ వానరుఁడా! నాముష్టిప్రహారమునకు నీవు నిలువఁబడిన యెడల, నీవు బలవంతుఁడవని తెలిసికొనుచున్నాను." అని పలికెను.

సోరఠా 6

వానిమాటలకుఁ గోపమువచ్చినను, దానిని నిరోధించి, హనుమంతుఁడు నవ్వి, క్షణములో వానియెదుట నిలువఁబడెను.

చౌపాయ్

అప్పుడు వాఁడు మహావీరుని నొకగ్రుద్దుగ్రుద్దెను; ఆగ్రుద్దు పిడుగుపడినట్లు శబ్దమయ్యెను. హనుమంతునిపాదములు లేశమైనఁ జలింపలేదు. ఆ నిశాచరునిహృదయమునకు లేశమైనఁ దణుకుబెణుకులు లేకపోయెను. ఈప్రకారము వా రిరువురు ముష్టియుద్ధముఁ జేసిరి; అంతలో మహావీరునకుఁ గోప మావేశించెను. అతఁడు కిలకిలారావముఁ జేసి, తోఁకతో వానినిఁజుట్టి, గిరగిరద్రిప్పి, నేలఁగొట్టెను; వానిని వ్యాకులపెట్టి, అతఁడు గర్జించెను. రాక్షసులు భయపడి, పరుగెత్తిరి. కోట్లకొలఁదిరాక్షసుల నతఁడు పట్టుకొని, మర్దించి, సంహారించెను. ఈప్రకారము శ్రీరామునిదూత, రణకౌతుకముఁ జేసెను. అతఁడు రాక్షసులను మర్దించి, మర్దించి, వారినిఁజంపి, సముద్రములోఁ బడద్రోసెను. అతని రణచర్యను దేవతలుచూచి, జయజయశబ్దములఁ జేసిరి. ఒక ఘడియకు నరాంతకుఁడు తెలివిదెచ్చుకొని, యనేకవిధముల యుద్ధముఁ జేయుట కారంభించెను.

ఛాంద్ 10

వాఁడు స్వసైనికులను మరలించి, యుద్ధము నారంభించెను. వారు మహావీరుని జుట్టుముట్టి, కోట్లకొలఁది తీక్ష్ణనారాచముల నతనిపైఁ బ్రయోగించిరి; రణరంగమున ననేకవిధముల మహావీరుఁడు విజృంభించి, సింహనాదముఁజేయుచుఁ బోరాడెను. అతఁడు రాక్షసులను బట్టుకొని, కొట్టి, వారిహృదయములను భేదించి, సంహారించెను.

దోహా 183

సునాయాసముగ మహాగజము దట్టమగు కమలవనమును ధ్వంసముఁ జేయునట్లు, ప్రయాసములేకయే మహావీరుఁడు రాక్షససైన్యములను నాశనముఁ జేసెను.

చౌపాయ్

ఈ ప్రకారము వారు యుద్ధముఁజేయుచు, నిత్యము యుద్ధము జరగుచుండిన రణస్థలమునకు వచ్చిరి. ఒంటరిగ మహావీరుఁడు యుద్ధముఁజేయుట అంగదుఁడు చూచి, అతనిసహాయార్థము పరుగెత్తెను. అతనివెనుక ననేకవానరులు "జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః" అని సింహనాదముఁ జేయుచు, నడచిరి. వారు తరు, శైల, పాషాణములం బట్టుకొని, వెళ్లిరి. అనేకరాక్షసులను వారుచంపి, రణరంగమును వారికళేబరములతో నలంకరించిరి. ఓ భరద్వాజా! ఆ సమయమున, నంగదుఁడు మహావీరునియొద్దకు వచ్చి, "జయ త్యతిబలో రామః" అని పలికెను. ఆయిరువురు మహాయోధులు కలిసి, హాహాకారముఁ జేయుచు, రాక్షసులను సంహరించుచుండిరి. వానరభల్లూకముల భయంకరకృత్యములను రాక్షసులు చూచి, భయపడి, పరుగెత్తిరి. స్వసైన్యములవ్యాకులమును నరాంతకుఁడు చూచి కోపించి, వారితో నిట్లు పలికెను: "ఓ రాత్రించరులారా! ఎందుకు మీరు పారిపోవుచుంటిరి?"

ఛాంద్ 11

అప్పుడు నరాంతకుఁడు మహాకాలాగ్నిరుద్రుఁడై, రాక్షసయోధులను బిలిచి, యొట్టుఁబెట్టి, వారిని మరలించెను "ఓయీ! ఎచ్చటకు మీరు పారిపోవుచున్నారు? ఈవానరులను మీ భోజనమునిమిత్తము బ్రహ్మ సృష్టించెను. మీ కడుపులునిండ, వారిని మీరేల భక్షింపరు? చూడుఁడు; వానరభల్లూకములను నిశ్శేషముఁ జేయుఁడు. ఆయిరువురు తపశ్శాలులను మీరు పట్టుకొనుఁడు" అని వాఁడు హెచ్చరించెను.

దోహా 184

ఇట్లు నరాంతకుఁడు పలికినపలుకులను రాక్షసులు విని, రాక్షసమాయను విస్తరించి, యుద్ధము నారంభించిరి.

చౌపాయ్

వారిమాయవలన నంధకారము ప్రసరించెను. ఆసమయమున ననేకశస్త్రాస్త్రములను వారు ప్రయోగించి, వానరులను గొట్టిరి. త్రిశూలములను, శక్తులను, భిండివాలములను, తీక్ష్ణనారాచములను, ధూళిని, మహావృక్షములను వారు వర్షించిరి. ఆ బాణములు వచ్చి తగిలినందున, వానరభల్లూకములు గిరగిరఁదిరిగి నేలఁబడి, దిగ్గునలేచి, "జయత్యతిబలో రామః" అని జయజయశబ్దములఁ జేయుచుండిరి. వానరబలము వ్యాకులపడుట శ్రీరాముఁడు చూచి, యొకబాణమును బ్రయోగించి, రాక్షసులబాణములను సంహరించి, వారిమాయను బోఁగొట్టి, యనేక రాక్షసులను వధించెను. ఆ రామబాణము తిరిగివచ్చి, రామునితరకసములోఁ బ్రవేశించెను. అంధకారము నశించెను; దిక్కులు తెలివిఁగాంచెను; వానరులు తరుశైలపాషాణములం బట్టుకొని, "జయత్యతిబలో రామః" అని సింహనాదములఁ జేసి, పరుగెత్తిరి. ఆ రాక్షసులపై, వారు తరుశైలపాషాణములను ధూళిని వర్షించిరి.

దోహా 185

ఆయుకోట్లరాక్షసులు సమరములో మడిసిరి; అంత సాయంసమయ మయ్యెను; అంగదహనుమదాదివానరవీరులు శ్రీరాముని వద్దకు వచ్చిరి.

చౌపాయ్

అంగదహనుమదాది వానరభల్లూకవీరు లాకృపాసముద్రుని, శ్రీరాముని సన్నిధానమునకు వచ్చిరి. వారు శ్రీరాముని సందర్శించి, అతని చరణారవిందములకు నమస్కరించి, శ్రమరహితులై, సంపూర్ణసుఖము ననుభవించిరి. శ్రీరాముఁడు వారి నాదరించి, సన్మానించెను; వారినిఁ గూర్చుండుమని యాజ్ఞాపించెను. ఆదివ్యమంగళవిగ్రహుని, చరణకమలములకు నమస్కరించి, వారియాజ్ఞఁగైకొని, వారు స్వస్థానమునకు నిష్క్రమించిరి. ఆ సకలసుఖధాముని, ఆ గుణధాముని ఆ శ్రీరాముని సన్నిధానవర్తులగుటచేత, నంగదహనుమంతు లతనిచరణకమలములఁ బట్టుకొని, పట్టుచుండిరి. ఆ పాదములను వారివలెఁ బట్టుటకు దేవత లువ్విళ్లూరుచుండిరి. "మేముకూడ వానరరూపములతో

లోకములోఁ బుట్టియుండినయెడల, శ్రీరామునిచరణములను బట్టి యుందుము కదా!" అని దేవతలు వారిలోవారు తలంచి, వానరులను కొనియాడి, పుష్పములను వర్షించి, స్వస్థానములకు నిష్క్రమించిరి.

దోహా 186

తమ్ముఁడు లక్ష్మణునితోను, సుగ్రీవాదిమంత్రులతోను, వానర సైన్యములతోఁ గూడి, శ్రీరాముఁడు దేదీప్యమానముగ వెలుఁగుచుండెను. ఇట్టి శ్రీరాముని మనస్సులో ధ్యానించుమనుజులు ధన్యులని తులసీదాసుగారు చెప్పుచున్నారు.

చౌపాయ్

అచ్చట నరాంతకుఁడు సేనలతోఁగూడి, రావణుని సమీపించెను; వానిఁజూచి, రావణుఁడు సంతసించి, వానియోగక్షేమమును గనుఁగొని, సుఖముగ వానితోఁగలిసి, కూర్చుండెను. నరాంతకుని మహదైశ్వర్యమును, అపారబలములను వాఁడుచూచి, స్వశోకమును మరచెను. సీతాపహరణముమొదలు పూర్వవృత్తాంతమునంతయు వాఁడు వానిలోఁ జెప్పెను; కుంభకర్ణ, మేఘనాద, అహిరావణుల మరణమును జెప్పి, చింతాక్రాంతుఁడయ్యెను. జనకునిముఖము దైన్యముబడియుండుట నరాంతకుఁడు చూచి, దురభిమానముతో నిట్లు పలికెను:—"ఓ దేవకంటకుఁడా! మీరు మీ సందేహములను విడిచిపెట్టుఁడు; ప్రాతఃకాలమున గొప్పయుద్ధముఁ జేయఁబోవుచున్నాను. ఓ తండ్రీ! లోకమంతయు వానరరహితముఁ జేసి, ఆ తపశ్శాలుల నిరువురను బట్టి, తీసికొనివచ్చెదను.

ఛాంద్ 12

"ఓ నాథా! ప్రాతఃకాలము కావేగమే, నే నాతపశ్శాలుల నిరువురనుబట్టుకొని, కట్టి, తీసికొని వచ్చెదను. వానరభల్లూకములను సంహరించి, దీనులగు రాక్షసులకు విందుఁజేసెద. నాభుజబలమును విస్తరించి, చెప్పను; శత్రువులయెదుట జూపించెదను. మీ తమ్మునివైరమును శాంతింపఁజేసి, మీ చరణములకు నమస్కరించెదను."

దోహా 187

ఈ ప్రకారము కుమారుఁడు చెప్పినమాటలను రావణుఁడు విని, సంతసించి, మాటిమాటికి వానిని హృదయమునకుఁ గౌఁగిలించు

కొనెను; వాఁడు నాటకులను బిలిపించెను; వారువచ్చి, నాట్యముఁ జేయుచుండిరి.

---

# దశమవిశ్రామము.

—◆(•)◆—

చౌపాయ్

బిందుమతి మొదలగు నరాంతకునిస్త్రీలు మందోదరిని సమీపించి, ఆమెచరణములకు నమస్కరించిరి; ఆమె వారి నాదరించి, కూర్చుండఁబెట్టెను. ఉభయకుశలోపరి, మందోదరి శ్రీరామునిగుణములను వర్ణించి, వారికిఁ జెప్పెను. కోడండ్రను సుఖాసీనులం జేసి, ఆమె శ్రీరామనామమును స్మరించుచుండెను. "ఓ కుమారుఁడా! నీవు వెళ్లి, శయనింపుము" అని నరాంతకునితోఁ జెప్పి, రావణుఁడు దిగ్గున లేచి, మందోదరి యంతఃపురములోనికి వెళ్లెను. ఆ కుటిలుఁడు సకలగుణసంపన్నురాలగు మందోదరిని సమీపించెను. నాథుఁడు వచ్చినతరువాత, నామె వానిహస్తములం బట్టుకొని, ప్రేమాతిశయము లుప్పొంగ, మృదుమధురవాక్యములతో సంభాషించి, కన్నీరుఁ గార్చి, యిట్లు పలికెను.

దోహా 188

"ఓ నాథా! సర్వము పోనుండినపుడు, దానిలో సగము నిలువఁబెట్టుకొనువాఁడు చతురుఁడని వేదశాస్త్రములు ఘోషించుచున్నవి; పండితులు చెప్పుచున్నారు.

చౌపాయ్

"ఓ నాథా! మూర్ఖత్వముచే సర్వమును బోఁగొట్టుకొను మూర్ఖుఁడు తుదకు బశ్చాత్తాపము పడి, నెత్తినిఁ గొట్టుకొనును. ఓ నాథా! మీకు సర్వము తెలియును. లెస్సగ విచారించి, నామాటను వినుఁడు. మీ మూర్ఖత్వమును విడిచిపెట్టి, విభీషణునివలె, శ్రీరామునితో సఖ్యముఁ జేసికొనుఁడు. ప్రథమమున జానకిని వారికి సమర్పించి,

వారివద్దకు మీ కుమారునిబంపి, తదుపరి మీరు వారిని దర్శింపుఁడు. శ్రీరాముని చరణములనుఁ బట్టుకొని, వారిచరణకమలములయందు నిర్మలమగు భక్తికలుగుటకు వరమును బ్రార్థింపుఁడు.'' ఇట్లు మందోదరి పలికినపలుకులు, విషమువలె, వానికిఁ దోఁచెను. ఆ గృహమును వాఁడు విడిచి, మఱియొకగృహములోఁ బ్రవేశించి, మందోదరిపలికిన కటువచనములను వినుటలో విశేషరాత్రి గతించినందున, శయనించెను. అంతలో రాత్రిగతించి, ప్రాతఃకాల మయ్యెను. ఆ త్రిలోకరక్షకుఁడు, శ్రీరాముఁడు మేల్కాంచెను.

దోహా 189

వానరభల్లూకములు శ్రీరామునిచరణములకు నమస్కరించి, వారియాజ్ఞఁ గైకొని, తరుశైలపాషాణములనుఁ బట్టుకొని, 'జయత్యతిబలో రామః' అని సింహనాదములం జేయుచు, లంకానగరముపై దాడి వెడలిరి.

చౌపాయ్

వానరభల్లూకములు లంకానగరమును ముట్టడించిరని, నరాంతకుఁడు విని, క్రోధతామ్రాక్షుఁడై, రణభేరులను మ్రోఁగించి, స్వసైన్యములతో లంకలోనుండి వెడలివచ్చెను; నగరబహిర్ద్వారములవద్ద నుభయసైన్యములకు ఘోరయుద్ధము జరగెను. నరాంతకుఁడు బాణములను వర్షించి, వానరసైన్యములను వ్యాకులముఁ జేసెను. పర్వతగుహాలలోనుండి శలభములు వెడలువిధమున, లంకలోనుండి రాక్షసులు వెడలి వచ్చిరి. వానరులు పరాఙ్ముఖులగుచుండుట మహావీరుఁడు చూచి, యావచ్ఛక్తితో నొకపెద్దబొబ్బఁ బెట్టెను; అతఁడు స్వపుచ్ఛమును నలువైపులఁ ద్రిప్పి, రాక్షసులను బలవంతముగ నిరోధించెను; బిల్వఫలములను వలె, నతఁడు వారిశిరస్సులను నేలఁ గొట్టుచుండెను; అతఁడు వారిశిరస్సులను దశదిశలఁ బాఱవేసెను. ఒకవైపున మహావీరుఁడును, మఱియొకవైపున అంగదుఁడును హాహాకారిగఁ బోరాడుచుండిరి.

దోహా 190

సాగరమునుమథించు మందరపర్వతమువలె, నంగదహనుమంతులు రాక్షససైన్యములను మర్దించి, జయరత్నమునుబొందుట కభిల

షించుచుండిరి. వా రిరువురపటాటోపమును శ్రీరాముఁడు చూచి, మందహాసముఁ జేయుచుండెను.

చౌపాయ్

ఈప్రకారము మహాబలవంతు లగువానరవీరుల విజృంభణమును జూచి, నరాంతకుఁడు సహింపలేక, రౌద్రాకారుఁడై, ప్రళయకాలమేఘములువలె, గర్జించెను; గొప్పగొప్ప రాక్షసవీరులు శస్త్రాస్త్రములను పర్వతములనుఁ బట్టుకొని, వానరుల నెదుర్కొనిరి. ఒక్కపెట్టున వారు శస్త్రాస్త్రములను వర్షించి, వానరులను కలవరపెట్టిరి. కొందఱు వానరులు భయపడి, సుగ్రీవుని స్మరించిరి; మఱికొందఱు స్వగృహములను జ్ఞప్తికిఁ దెచ్చుకొనిరి; కొందఱు పర్వతగుహలలోఁ బ్రవేశించుచుండిరి; కొందఱు నలువైపులఁ బరుగెత్తుచు, సముద్రములో మునుఁగుటకుఁ బ్రయత్నించుచుండిరి; కొందఱు రామలక్ష్మణులే తోడని తలంచిరి; కొందఱు బ్రహ్మ ప్రతికూలుఁ డయ్యెనని విచారించిరి. ఆ సమయమున, నరాంతకుని మంత్రి వచ్చి, అంగదునిహస్తమునుఁ బట్టుకొనెను; ఆ మంత్రిని, అతనివెంట వచ్చినరాక్షసుల నతఁడు పట్టుకొని, వ్యోమమార్గమున కెగసెను. అంగదమహావీరు లిరువురు రాక్షసులనుఁ బట్టుకొని, సూర్యమండలమును సమీపించిరి; అందుచేత, రాక్షసుల శరీరములు దహింపఁబడెను; ఇట్లు దహింపఁబడినవారు నేలఁ బడుచుండిరి; అంగదుఁడు క్రిందికిఁ దిగి, రణస్థలమునకు వచ్చెను. అతనిని రాక్షసులసేనాపతి చూచి, పిశాచసైన్యముతో విజృంభించెను. ఆ రాక్షససేనాపతి యొక త్రిశూలముతో నంగదుని హృదయముపైఁ గొట్టెను. దానిపోటుచే నతఁడు నేలఁబడి మూర్ఛిల్లెను. అతనిదురవస్థను మహావీరుఁడు చూచి, పరుగెత్తి వెళ్లి, ఆ త్రిశూలముతో సేనాపతినిఁ బొడిచెను; ఆ శూలము సేనాపతిని వేయిముక్కలుగ ఖండించి, నేలఁబడెను. ఈ సమాచారమును శ్రీరాముఁడు విని, లక్ష్మణుని శీఘ్రము వెళ్లుమని యాజ్ఞాపించెను. ఆతక్షణము సౌమిత్రి శ్రీరామునకు నమస్కరించి, శ్రీ శంకరుని స్మరించి, తూణీరములనుఁ గట్టుకొని, ధనుర్బాణములను ధరించి, వెడలెను. ఆ శేషమూర్తి స్వహస్తములతో నంగదుని లేవదీసి, హృదయములో శ్రీరాముని ధ్యానించెను; అంతలో నంగదుఁడు శ్రమరహితుఁ డయ్యెను.

దోహా 191

అంగదుఁడు మూర్ఛనుండి లేచి, యుద్ధమునకు నడచెను ; లక్ష్మణుని ధనుష్టంకారమును వానరులు విని, సంతోషించి, యుత్సాహముతోఁ బోరాటమునకుఁ దిరిగివచ్చిరి.

చౌపాయ్

ఆ ధనుష్టంకారము నెప్పుడు రాక్షసులు వినియుండనందున నిశ్చేష్టులయిరి. రాక్షసుల కరచరణములును శిరస్సులును తెగిపడునట్లు లక్ష్మణుఁడు బాణవర్షమును గురిపించెను. ఏకఁబడినదూది యంతరిక్షమున కెగసినట్లు, రాక్షసుల బాహువులును, శిరస్సులు నంతరిక్షమున నెగురుచుండెను. అకాలమున క్షుధార్తుఁడు తిరుగునట్లు, శిరస్సులు లేనిమొండెములు రణభూమిమీఁదఁ దిరుగుచుండెను. ఇటువైపు వానరభల్లూకములు జయాభిలాషులై, పోరాడుచుండిరి ; అటువైపు, రాక్షసులు జయమునుగోరి, యుద్ధముఁ జేయుచుండిరి. ఆ యుద్ధములో నంగదహనుమంతులే, రణధీరులై, నిలువఁబడిరి. ఆ సమయమున వారిరువురు చేసిన సింహనాదములను విని, పాఱిపోవుచుండిన వానరులు సహితము యుద్ధమునకుఁ దిరిగివచ్చిరి. ఇట్లుభయసైన్యంబు లుద్దండంబున విజృంభించి, నటాటోపంబున ధీరులకు ధైర్యము నాపాదించుచు, భీరువులకు దైన్యమును బురికొలుపుచు, హోరాహోరిగ వెనుదీయక, సంగ్రామమును జరపిరి.

ఛాంద్ 14

భయస్థులకు భయమును గలిగించుచు, సాహసులకు సాహసమును బుట్టించుచు, వారు పోరాడి, లేశమపి, వెనుదీయక, నొకప్పుడు నేలఁబడుచు, నొకప్పుడు లేచుచు, జయజయశబ్దములఁ జేయుచు, భుజముల నప్పళించుచు, ...మని పిలుచుచు, అన్యోన్య విజయాభిలాషులై, కలహించిరి ; ఈ రణకౌతుకమును దేవతలు చూచి, యొకప్పుడు విస్మయముఁ బొందుచు, నొకప్పుడు సంతోషించుచు, వానరులపైఁ బుష్పములను వర్షించిరి.

దోహా 192

వానరభల్లూకములు రాక్షసుల కరచరణములను ద్రుంచి, వారి ముఖములలో ధూళిని బోయుచుండిరి.

### చౌపాయ్

వారు రాక్షసులశిరస్సులను ద్రుంచి, పారవేయుచుండిరి; స్వభుజబలమును వారు రావణునకు వ్యక్తముఁ జేసిరి. ఓ పార్వతీ! దినములో రెండుయామములు గతించెను; నరాంతకుని సగముసైన్యము నశించెను. ఇట్లు సమరములో వేలకొలఁది నశించినరాక్షసులను నరాంతకుఁడు చూచి, రౌద్రాకారుఁడై, రథముపైఁ గూర్చుండి, యంతరిక్షమున కెగసి, అదృశ్యుఁడై, శస్త్రాస్త్రములను వర్షించెను. క్షణములో వాని పరాక్రమమువలన, వానరులు మూర్ఛిల్లిరి; పిమ్మట, వాఁడు శ్రీరాముని సమీపించి, మేఘమువలె గర్జించి, క్రోధతామ్రాక్షుఁడై, కర్ణకఠోరముగ నిట్లు పలికెను. "ఓ రాక్షసకులద్రోహీ! సావధానముగ నిలువుము; నీయన్నతో నీవు విరోధించినందుకు నిన్నీదినమున సంహరించెదను." ఈ ప్రకారము వాఁడు రామునియెదుట పలికిన కఠోర వాక్యములను జాంబవంతుఁడు విని, కోపించెను.

### దోహా 193

ఆ నరాంతకుఁడు జాంబవంతునిపై నొకత్రిశూలమును బ్రయోగించెను; అతఁడు తప్పించుకొని, దానినిఁ బట్టుకొని, 'జయత్యతిబలో రామః' అని సింహనాదముఁ జేసి, పరుగెత్తి వెళ్లి, దానితో వాని హృదయముపైఁ గొట్టెను.

### చౌపాయ్

ఆ శూలముపోటుతో వాఁడు నేలఁబడి మూర్ఛిల్లెను; అతఁడు వానినిఁ బట్టుకొని, గిరగిరఁద్రిప్పి, నేలఁగొట్టి, యిసుకలోఁ బాతిపెట్టెను. ఇంతలో, వానరభల్లూకములు మూర్ఛనుండి లేచెను; వారు స్వేచ్ఛానుసారముగ యుద్ధముఁజేయ నారంభించిరి. "నేనుగొట్టినను వానికి మరణము రాలేదు" అని జాంబవంతుఁడు తనలో విచారించెను; అతఁడు వానిని నిసుకలోనుండి బయటకుదీసి, నాలుగుగ్రుద్దులు గ్రుద్ది, వాని పాదములనుఁ బట్టుకొని, గిరగిరఁద్రిప్పి, లంకలోఁబడునట్లు, వానినీ విసరెను; వాఁడు వెళ్లి, రావణుఁడు కూర్చుండియుండిన స్థలమువద్దఁ బడెను. వాఁడు వానినిఁజూచి, హాహాకారముజేసి, దిగ్గునలేచి వెళ్లి వానిని హృదయమునకుఁ గౌఁగిలించుకొనెను. యుద్ధభూమిలో నరాంత

కుఁడు కనఁబడనందున, రాక్షసులు భయపడి, చెదరి, లంకలోఁ బ్రవేశించిరి.

దోహా 194

అంత ప్రదోషకాల మయ్యెను; వానరులు యుద్ధమును జాలించి, శ్రీరాముని సమీపించి, అతనిచరణములకు నమస్కరించి, నిలువఁబడిరి. శ్రీరాముఁడు కృపాదృష్టితో వారినిఁ జూచి, యాదరించెను.

చౌపాయ్

అతనికృపాదృష్టి ప్రసరించినమాత్రమున, వారు శ్రమరహితులయిరి; వారు స్వశిబిరములకు నిష్క్రమించిరి. శ్రీరాముఁడు సుఖాసనము నధిష్ఠించి, దేదీప్యమానముగ వెలుఁగుచుండెను; అతనిపార్శ్వమున వీరాసనమును వేసికొని, లక్ష్మణుఁడు కూర్చుండెను. అంగదహనుమంతులు శ్రీరాముని చరణములను బట్టుచుండిరి. ఓ అపర్ణా! పార్వతీ! ఎవరిపై భగవంతుఁడు నిత్యము ప్రసన్నుఁడై యుండునో, వారే పుణ్యాత్ములు; వారే భాగ్యమునకు నిధానులు. అచ్చట రావణుఁడు కుమారుని శయ్యపైఁ బవళింపఁజేసెను; నాథునకు సంభవించినదుర్దశఁ జూచి, బిందుమతి యేడ్వసాగెను. అంత ప్రాతఃకాల మయ్యెను; నరాంతకుఁడు మూర్ఛనుండి లేచెను; వాఁడు తండ్రిని జూచి, సిగ్గుపడెను. వాఁడు రథముపైఁగూర్చుండి, యొంటరిగ యుద్ధమునకు నడచెను. ఆకాశమార్గమున వాఁడు రథమును నడిపించి, రణస్థలమునకు వచ్చెను; వానరకటకముపై వాఁడు బాణములను సంతతధారగవర్షించి, ఆకటకము కనఁబడకుండ, గప్పెను.

దోహా 195

వానరభల్లూకము లంతరిక్షమున కెగసెనుకాని, వారు నేత్రములతోనే దానినిఁ జూడలేకపోయిరి. గాయములు తగిలినందున, వారు నేలఁబడి, దీనాలాపముల నాడుచుండిరి.

చౌపాయ్

శ్రీరాముఁడు నిలిచియుండినస్థలమువద్దఁ బడునట్లు, వాఁడు నూరుబాణములను బ్రయోగించెను. ఆ బాణములు తగిలినందునఁ గొందఱువానరులు మూర్ఛిల్లిరి; పిఱికిపందలు పారిపోయిరి. ఓ గరు

త్మంతుఁడా! కొందఱువానరులు సేతువువద్దకుఁ బాఱిపోయిరి; ఎంత పిలిచినను వెనుకకుఁ దిరుగక, మఱికొందఱును పాఱిపోయిరి. హనుమదంగద, సుగ్రీవ, కుముద, ద్వివిదమయందాదిమహావానరవీరులు ధైర్యముగనిలువఁబడి వారిని నెంతమరలించినను, వారు మరలక వెనుజూడక, పాఱిపోవుచుండిరి. అప్పుడు వానరవీరులు సమావేశమై, తరుశైలపాషాణములనుఁ బట్టుకొని, లంకపై దాడివెడలిరి. రావణుని కోటబురుజులపైనెక్కి, వానరులు తోఁకలను ముడుచుకొని, కూర్చుండిరి; అచ్చటనుండి వారు పాషాణములను రాక్షసులపై రువ్వుచుండిరి; ఆదెబ్బలతో రాక్షసులు ప్రాణములను విడుచుచుండిరి.

ఛాంద్ 18, 19, 20

రాక్షససైన్యములు చూర్ణమయ్యెను; రాక్షసస్త్రీలు భయపడి, రోదనముఁజేయుచుఁ బరుగెత్తి, రావణునిగృహముపైఁ బడిరి. ఆ స్త్రీలదుర్దశను వాఁడు చూచి, విచారించి, రాక్షసయోధులను బిలిచి, వానరులను భక్షింపుఁడని యాజ్ఞాపించెను; వానరులు పరుగెత్తునట్లు ప్రయత్నింపుఁడని వాఁడు చెప్పినమాటలను వారు విని, యుద్ధసన్నద్ధులయిరి. "ఓ యోధులారా! నాయాజ్ఞ నుల్లంఘించినవారు నాశత్రువులని తెలిసికొనుఁడు. అనేకవానరులను భక్షించినవారే నాకుఁ బ్రియులు." అని వాఁడు చెప్పెను.

దోహా 196

ఈప్రకారము వాఁడు చెప్పినమాటలను వారు విని, జయజయశబ్దములం జేసి, వానియాజ్ఞను శిరసావహించి, "రండు, రండు" అని యొకరినొకరు పిలుచుకొని, వీరావేశులై, యుద్ధమునకు నడిచిరి.

చౌపాయ్

వానరులను వారు చూచి, సంతోషించిరి; తేనెటీగలవలె, వారు వానరులచేతిలోఁ జిక్కిరి. వారు శ్రీరాముని ప్రతాపమునుస్మరించి, రాక్షసులను సంహరించుచుండిరి. పచ్చికుండలనువలె, వారు రాక్షసులను బద్దలుచేయుచుండిరి. "జయత్యతిబలో రామః లక్ష్మణశ్చ మహాబలః" అని వారు సింహనాదములం జేయుచుండిరి. ఏరాక్షసులు వారి తోఁకలను ముట్టుచుండిరో, వారిని ఆ పదియాఱువానరవీరులు తోఁకలకుఁ జుట్టి, గిరగిరఁద్రిప్పి, కోటబురుజులకుఁ గొట్టి, నేలఁ గొట్టుచుం

డిరి. శ్రమలేకయే, వారు సువర్ణస్తంభముల నూడదీయుచుండిరి; ఆపనిఁ జేయునపుడు వారికి లేశమైన శ్రమలేకపోయెను. పచ్చికుండలనువలె, వారు రాక్షసులను సంహరించిరి. ఏవిధమగుశ్రమయు వారికి లేక పోయెను. మరల వానరులు విచారించి, రాక్షసుల నెదుర్కొనిరి; అనేకరాక్షసుల ముక్కుచెవులను గొఱికిరి; అనేకుల బాహువులను, పాదములను ద్రుంచిరి.

ఛాంద్ 15

అనేకరాక్షసుల కరచరణములను వారు త్రుంచిరి. వారు భయపడి, దీనాలాపములాడుచు, లంకనువిడిచి, వనములకుఁ బారిపోవుచుండిరి. పిప్పలపత్త్రములవలె,నార్వురువానరులు లంకానగరమును గంపింపఁజేసిరి; మందిరముల కవాటముల నూడఁబెఱికిరి; రాక్షసస్త్రీల శిరోజముల నూడఁదీసిరి.

దోహా 197

లంకానగరములోఁ గోలాహలము పుట్టెను. ఈశబ్దమును నరాంతకుఁడు విని, యంతరిక్షమునుండి దిగివచ్చి, రౌద్రాకారుఁడై, వానరుల యెదుట నిలిచెను.

చౌపాయ్

రాక్షసస్త్రీలదుర్దశను వాఁడు చూచి, పరుషవాక్యములను బలుకుట కారంభించెను. "ఓ వానరమూర్ఖులారా! యుద్ధమును విడిచి, యిచ్చట కేలవచ్చితిరి? స్త్రీలతోఁ బోరాడుటకు మీకు సిగ్గులేదా! అబలలపై యోధులు పౌరుషమును జూపించరు. అందుచేత, మీరు వారిని విడిచి, నాతోఁ బోరాడుఁడు." వానిమాటలను వానరులు విని, సంతసించి, దీనాలాపముల నాడుచుండినస్త్రీలను విడిచిపెట్టిరి. ఆస్త్రీలు భయపడి, గృహములలో దాఁగియుండిరి; వానరు లొక్కొక్కపాషాణమునుఁ బట్టుకొని, నరాంతకునిపై విసరి, వాని అశ్వములను సారథిని జంపి, వానిరథమును, ఆయుధములను విఱుగగొట్టిరి. రావణుని కన్నుల యెదుట, వానరులు రాక్షసులను సంహరించి, వారిసేనలను కలవర పెట్టిరి; రాక్షసులచరణములనుఁ బట్టుకొని, గిరగిరఁద్రిప్పి, నేలఁగొట్టి, "జయత్యతిబలో రామః" అని సింహనాదములఁ జేసిరి. ఈప్రకారము వానరులు రణకౌతుకముఁ జూపించిరి.

దోహా 198

రాక్షసులను నేలఁగొట్టి, వారిశరీరములను వానరులు త్రుంచు చుండిరి; "జయత్యతిబలో రామః" అని వారు జయశబ్దములఁ జేసిరి; ఈప్రకార మార్యువీరువానరవీరులు యుద్ధముఁజేయుచుండ, దినములో రెండుయామములు గతించెను.

చౌపాయ్

అంతలో సూర్యుఁ డస్తాచలము నధిష్ఠించెను; వానరులు యుద్ధమును జాలించి, శ్రీరామునిసమీపించి, యతనిచరణములకు నమస్కరించిరి. ఆనీలోత్పలదళశ్యాముని దివ్యమంగళవిగ్రహమును వారు చూచి, సంతసించి, యతనిచరణకమలములకు నమస్కరించిరి. శ్రీరాముఁడు వారిని యాదరించి, సన్మానించెను. శ్రీరామునివంటి కృపాలుఁ డెవఁడు కలఁడు? శ్రీరాముని యాజ్ఞాప్రకారము, వారు స్వశిబిరములలోఁ బ్రవేశించిరి. వానరభల్లూకములు శ్రమరహితు లయిరి; శ్రీరామలక్ష్మణులు పరమానందభరితు లయిరి. ఓ పార్వతీ! ఆ నిశీసమయమున సకలగుణధాముని భక్తు లతనిగుణములను గానముఁ జేయుచుండిరి. మూఁడు యామములరాత్రి గతించినతరువాత, నరాంతకునకుఁ దెలివివచ్చెను. వాఁడు సిగ్గుపడి, శోకసంతప్తమానసుఁడై, స్వహస్తములను నులుపుకొనెను.

ఛాంద్ 19, 20, 21

ఆదుర్మార్గుఁ డగునరాంతకుఁడు దిగ్గునలేచి, రథమును సిద్ధముచేసి పుష్టిగలగుఱ్ఱములను దానికిఁగట్టి, శస్త్రాస్త్రములను దానిపైఁబెట్టి, రాక్షసయోధులు వెంటనుండ, నిశ్శంకగ, యుద్ధమునకు సిద్ధపడెను; రణభేరులు మ్రోఁగుచుండెను. రాక్షసవీరులును, శూరులును ముందు నడుచుచు, సింహనాదములం జేయుచుండిరి. జీవితాశను, భయమును విడిచి, మహావీరులగు గుఱ్ఱపురౌతులు నిశ్శంకగ మోహమునువిడిచి, వీరావేశులై, భయంకరముగ గర్జించిరి. గజాశ్వములఘీంకారములు భూనభోంతరాళములు నిండెను; ధూళి మీఁదికెగిరి, మేఘమువలె, నంతరిక్షమును గప్పెను; మేఘములువలె, రాక్షసులు గర్జించిరి; ఆసమయమున నొకరికిని స్వపక్ష-పరపక్ష మనుజ్ఞానము లేకపోయెను. మాఁటి

మాటికి రాక్షసు లంతరిక్షమున కెగసి, క్రిందికి దిగుచుండిరి; శస్త్రాస్త్రములను ధరించి, వారు రౌద్రాకారులై, విజృంభించిరి.

దోహా 199

ఆసమయమున రాక్షససైన్యములు ప్రళయముఁ జేయవలెనని తలంచెను; ఓ గరుడా! మహావీరులగు వానరయోధు లేవిధమున యుద్ధమునకు నడచిరో చెప్పుచున్నాను వినుము.

ఛాంద్ 22, 23, 24

వానరభల్లూకములు నిశాచరులను జూచి, సంతోషముచే నుప్పొంగి, పర్వతాకారులై, (వాద్యములు లేనందున) ముఖములతో గానముఁజేయుచు, దంతములను గొఱుకుచు, నిర్భయముగ హాహాకారముఁ జేయుచు, తరుశైలపాషాణములతో రాక్షసులను గొట్టుచుండిరి. శిరస్సులులేని రాక్షసులమొండెములు తిరుగుచుండెను; వారిశిరస్సులు చూర్ణమయ్యెను. మృగములను సింహము సంహరించువిధమున, రాక్షసులను వానరులు ధ్వంసముజేసిరి. మన్మథుఁడు స్వసైన్యములను విచిత్రముగ విస్తరించెనేమో యనునట్లు, రథ, గజ, తురగ, ఖచ్చరములు ముక్కలుముక్కలుగఁ గొట్టఁబడి, నేలఁబడియుండెను. వాని భారమును సహింపలేక, భూదేవి అసమర్థురా లయ్యెను; అందుచేత, నామె కంపించెను. "జయత్యతిబలో రామః" అని వానరులు జయశబ్దములం జేసిరి. రాక్షసులభయము వారికి లేశమపి లేకపోయెను. వానరులపుచ్ఛములు శూలములువలె నుండెను; వారు శరీరములను పెంచి, భయమును బుట్టించుచుండిరి. ప్రచండవాయువు వీచునపుడు తిరుగఁబడు మేఘములువలె, రాక్షసులసైన్యములు వానరులధాటికి నిలువలేక, తిరుగఁబడెను; కోట్లకొలఁది రాక్షసులు ప్రాణములను విడిచి, నేలఁ బడుచుండిరి.

సోరఠా 8

ఈప్రకారము వానరభల్లూకములు రాక్షసులయెదుట నిలువఁబడి, పోరాడిరి. ప్రళయకాలమేఘములు వర్షించువిధమున, రాక్షసులు బాణవర్షమును గురిపించిరి.

చౌపాయ్

రాక్షసులు సమీపమునకు వచ్చియుండినందున, వానరులు పాదములను మోపుటకు, వారికి సందులేకపోయెను. చీఁకటి వ్యాపించినట్లు నల్లనిశరీరములు గలరాక్షసులు నలువైపులను వ్యాపించి, వానరులను గొట్టుచుండిరి. చీఁకటిపడినందున, వానరులు స్వహస్తములను జూడలేకపోయిరి; వా రందుచేత నొకరినొకరు పేరుఁబెట్టుకొని, పిలుచుకొనుచుండిరి. ఆసమయమున నొక రాక్షసుఁడు వారియెదుట నిలువఁబడి, పోరాడక, మఱుగుననుండి, వారినిఁజంపి, రణస్థలమున వారిని శయనింపఁజేసెను. కొందఱు వానరులు భయపడి, సాగరతీరమునకుఁ బాఱిపోయిరి; స్వసైన్యములవ్యాకులమును శ్రీరాముఁడు చూచి, యొకబాణమునుఁ బ్రయోగించినందున, సూర్యుఁడు ప్రకాశించునపుడువలె, దశదిశలు తెలివిఁగాంచెను; చీకటి వీడినందున, వానరభల్లూకములు సంతోషముతో మరలివచ్చి, రాక్షసులను జంపుచుండిరి. ఇట్లుభయసైన్యంబులు ఘోరపటాటోపమున విజృంభించి, భయంకరముగఁ బోరాడిరి.

దోహా 200

శిరస్సులపై శిలలను, హస్తమున వృక్షములను, బాహుమూలల ధూళిని ధరించి, వానరభల్లూకములు వ్యోమమార్గమున కెగసి, సింహనాదములం జేసిరి.

చౌపాయ్

రాక్షసుల శిరస్సులపై, తరుశైలములను వారు రువ్వుచుండిరి; దధిభాండములువలె, రాక్షసులశిరస్సులు వ్రక్కలగుచుండెను. వారి శరీరములపై వానరులు దుమికి, వారినేత్రములలో ధూళిఁజల్లి, వారి చెవులను ద్రుంచుచుండిరి; అనేక రాక్షసుల ధనుర్బాణములను, త్రిశూలములను వారు త్రుంచివేసిరి; శత్రుదళములో నొకనివద్దనైనను శస్త్రాస్త్రములు లేకపోయెను. నిరాయుధులై, రాక్షససేనలు పరుగెత్తి, పాఱిపోయెను; అప్పుడు మహావీరుఁ డుచ్చస్వరముతో నవ్వెను; అతఁడు స్వపుచ్ఛమును నిలువెడల్పులుగ బెంచి, దానినిజుట్టి, భూమిమీఁదఁ గూర్చుండెను. రెక్కలులేనిపక్షు లంతరిక్షమునుండి తిరిగిపడినట్లు, రాక్ష

సులతనివాలమును ముట్టుకొని, నేలఁగూలిరి. ఇట్లు నేలఁగూలుచుండిన రాక్షసులను పాదములతోఁ వానరులు పట్టుకొని, గిరగిరఁద్రిప్పి, నవ్వి, వారిని నేలఁగొట్టిరి; ఆనబతుంబలువలె, వారిశిరస్సులు బ్రద్దలగుచుండెను; అనేకరాక్షసుల శరీరములను వారు సముద్రములోఁ బడఁద్రోయుచుండిరి.

దోహా 201

నరాంతకుఁడు చూచుచుండ, వానరులు శ్రీరాముని ప్రతాపమువలన, నలుబదిరెండుకోట్లరాక్షసులను సంహరించిరి. అంతలో రాత్రిగతించెను.

చౌపాయ్

ఉదయపర్వతమును సూర్యుఁ డలంకరించినవిధమున, దేదీప్యమానముగ వెలుంగుచుండిన శ్రీరామునిబాణము తూణీరములోఁ బ్రవేశించెను. స్వసైన్యములదుర్దశను నరాంతకుఁడు చూచి, చింతాక్రాంతుఁడై రణకర్కశులగు రాక్షసయోధులను వెంటఁదీసికొని, శపథముచేసి యుద్ధమునకు వచ్చి, వానరులపై శస్త్రాస్త్రములను సంతతధారగ వర్షించెను. అప్పుడు వాఁడు వారిపై 'స్తంభన' బాణమును బ్రయోగించినందున, వానరు లసమర్థులై, కదలమెదలక, నిలువఁబడిరి. వేఁటకాఁడు పక్షులను వలలోవేసి, పట్టుకొనువిధమున, రాక్షసులు పాశములతో వానరులను గట్టిరి; వ్యాధుఁడు పక్షులను పంజరములోఁ బెట్టునట్లు, వేలకొలఁదివానరులను వారు కారాగృహములోఁ బెట్టిరి; మూర్ఛపడియుండిన వానరయోధులనుఁ బట్టుకొని, నరాంతకుఁడు వారిని లంకలోఁబడునట్లు విసరెను. కుమారుని వ్యాపారమును రావణుఁడు చూచి, సంతసించి, భట్రాజువలె, వానిని స్తోత్రముఁ జేయుచుండెను.

దోహా 202

ఓ భరద్వాజా! ఓ బుద్ధిసాగరుఁడా! ఈ మూర్ఖుఁడగు రావణుఁడు హరియిచ్ఛ నెఱుంగక, కుమారుని గొనియాడెను. కాలవశమున, వానిమతి భ్రమించెను. ("ప్రాయస్సమాపన్నవిపత్తికాలే, ధియోఽపి పుంసాం మలినా భవంతి.")

చౌపాయ్

అంతలో నంగదహనుమంతులు తెలివిఁదెచ్చుకొని, లేచి, నరాంతకునితోఁ బోరుచుండిరి; ఒకక్షణమైనను వారు యుద్ధముఁ జేసియుండ లేదు; అంతలో వాఁడు బాణమును బ్రయోగించినందున, వారు మరల మూర్ఛిల్లిరి. వరప్రభావమువలన, వాఁడు రెండుగడియలకాలము పటాటోపముతో విజృంభించెను; అందుచేత, నింతవఱకు శ్రీరాముఁడు నిరీక్షించి, వానిని యుపేక్షించెను; ఆ రఘుకులకేతువు, ఆ శ్రుతిసేతువు, బ్రహ్మవాక్యములను బరిపాలించుట కింతవఱకు శత్రువునితో వినోదము జరిపెను. అంతలో రెండుయామములకాలము గతించెను; అప్పుడు జయమునిమిత్తము శ్రీరాముఁ డొకకౌతుకముఁ జేసెను. ఒక పర్యాయ మతఁడు హుంకరించినందున, వానరులకుఁ జైతన్యము వచ్చి, వారు మూర్ఛనుండిలేచి, యుత్సాహముతో యుద్ధమునకు సిద్ధపడిరి. అంగదహనుమంతులు లేచి, రామలక్ష్మణులచరణముల కాదరముతో నమస్కరించిరి. కొంతవఱకు వారు శ్రీరామునిచరణములమీఁద శిరస్సుల నుంచుకొని, పడియుండిరి; అప్పుడు శ్రీరాముఁడు నవ్వి, వారితో నిట్లు పలికెను.

సోరఠా 9

"ఓ సఖులారా! బ్రహ్మవరప్రభావమువలన మీరీ దినమున మూర్ఛిల్లితిరి; ఇఁక మీరు ధైర్యముగ నుండుఁడు; మీకు స్వప్నమందైనను శ్రమకలుగదు.

చౌపాయ్

"ఓ అంగద - హనుమంతులారా! మీ యిరువురను స్మరించిన మాత్రమున, మనుజులకు యుద్ధములో జయముకలుగును." శ్రీరామునివలన వారీవరమును బొంది, సంతుష్టాంతరంగు లయిరి. పిమ్మట, శ్రీరాముఁడు వారితో నిట్లు సంభాషించెను. "ఓ అంగద-హనుమంతులారా! మీరు మహారణధీరులు; మీరు శీఘ్రము లంకలోనికి వెళ్లి, కారాగృహములోఁ బడియుండినవానరులను విడిపించి, తీసికొని రండు." వా రిరువురు శ్రీరాముని యాజ్ఞఁగైకొని, అతనిని స్మరించి, విశాలమగు శైలములను బట్టుకొని, శీఘ్రము లంకలోఁ బ్రవేశించిరి;

వారు కాలు పెట్టినవెంటనే, లంకలోఁ గోలాహలము పుట్టెను. ఇచ్చట లంకలోఁబడి, మూర్ఛనొందినవానరులు తెలివిఁదెచ్చుకొని, కట్టఁబడి యుండిరి; వా రిరువురు "జయత్యతిబలో రామః" అని జయశబ్దములం జేసి, వారిని బంధనములనుండి విడిపించిరి; అంగదహనుమంతులను వారు చూచి, జయజయశబ్దములం జేసిరి.

దోహా 203

మేషబృందములను వృకములు చెండాడువిధమున, నార్వురు వానరవీరులు వీరావేశులై, విజృంభించి, యుత్సాహముతో రాక్షసులను సంహరించుచుండిరి.

చౌపాయ్

అప్పటికి దినములో నొకయామము శేషించియుండెను; అంగదుఁడు వానరులను జూచి, "ఓ వానరులారా! శ్రీరాముని సన్నిధానమును జేరి, వారి చరణారవిందములను దర్శింపుఁడు." అని చెప్పెను. అంగదునివచనములు మహావీరునకు సమాధాన మయ్యెను; వారందఱు వెడలి, శీఘ్రము శ్రీరాముని సమీపించిరి. ఒకకోటినిశాచరులు మాత్రము నరాంతకునివెంటనుండి, యుద్ధముఁ జేయుచుండిరి. మాయఁ బన్ని వాఁడు స్వశరీరమును మాయఁగు జేసి, రావణునిప్రతాపమును గానముఁ జేయుచుండెను; వానిమాయను దేవతలు చూచి, భయపడిరి. వానిమాయను శ్రీరాముఁడు తెలిసికొని, యుద్ధమునకు లక్ష్మణుని వెళ్లుమని యాజ్ఞాపించెను. అతక్షణ మతఁడు దిగ్గునలేచి, ధనుర్బాణములను ధరించి, నరాంతకుని సమీపించి, వానితో నిట్లు సంభాషించెను; "ఓరీ దుష్టుఁడా! అనేకవిధముల నీవు రణకౌతుకమును జూపించితివి; ఒకక్షణము నాయెదుట నిలినియుండుము.

ఛాంద్ 25, 26

"ఓరీ దుష్టుఁడా! అనేకవిధముల రణములో నీవు నీచమత్కారమును జూపించితివి. ఒకక్షణము నీవు రణరంగమున నిలిచియుండుము. నీకు సర్వము బోధపఱచెదను." అని లక్ష్మణుఁడు పలికి, ధనుస్సును సంధించి, బాణవర్షమును గురిపించి, రాక్షసులను సంహరించెను స్వసైన్యముల నాశమును నరాంతకుఁడు చూచి, కోపించి, శస్త్రాస్త్రములను, తరుశైలపాషాణముల నతనిపై వర్షించెను.

రాక్షసులను సంహరించుటలో రామానుజుఁడు ప్రవీణుఁడని, వేదములు గానము జేయుచున్నవి. లక్ష్మణునిబాణములవలన, రాక్షసుల తరుశైలపాషాణములు చూర్ణమయ్యెను; వారి శస్త్రాస్త్రముల నతఁడు చూర్ణముఁ జేసెను. దేవతలు పరమానంద భరితులై, జయజయశబ్దములం జేసి, పుష్పములను వర్షించిరి.

దోహా 204

ఆమాయాపతియొక్క సోదరునియెదుట మాయను బన్నినవాఁడు మూర్ఖుఁడు; అజ్ఞాని; వాని చమత్కారమును కపటమును లేశమైనఁ బ్రసరింపనందున, లక్ష్మణునియెదుట వాఁడు ప్రత్యక్షమయ్యెను.

చౌపాయ్

లక్ష్మణుని హృదయమునకుఁ దగులునట్లు, వాఁడు పిడుగువంటి బాణమును బ్రయోగించెను. ఆదెబ్బతో లక్ష్మణుఁడు నేలఁబడెను; అప్పుడు రాక్షసులు ప్రబలులై, విజృంభించి, వానరభల్లూకములను భక్షింపుచుండిరి. అంతట, వానరులు భయపడి, పాఱిపోయిరి; "దాఁగి యుండిన ప్రయోజనము లేదు; కాలము సమీపించెను" అని వారిలో వారు విచారించిరి. రాక్షసులు వానరభల్లూకముల వేషములను ధరించి, నిజమగు వానరభల్లూకములను భక్షించుచుండుట, వారు చూచిరి. మాయవానరుఁడు వానరుని, మాయభల్లూకము భల్లూకమును గలిసికొని, యుపద్రవముఁ జేయుచుండెను. ఒకనియెదుట నొకఁడు నిలుచుట లేదు. దగ్గఱఁబడినవానిని వారు భక్షించుచుండిరి. ఆనరాంతకుఁడు విభీషణునిరూపమును ధరించి, సుగ్రీవాంగదహనుమంతులవద్దకు వచ్చెను. ఈమాయ యెవనికిఁ దెలియదు. వాఁడు విభీషణునిరూపమును ధరించి, వారిని సమీపించుటకు నిశ్చయించెను.

దోహా 205

అంతలో లక్ష్మణుఁడు మూర్ఛనుండి లేచి, స్వసైన్యముల వినాశమును జూచెను; ఇచ్చట, మహావీరుఁడు అహిరావణుఁడు చేసిన మాయను జ్ఞప్తికిఁ దెచ్చుకొని, అంతరిక్షమున కెగసెను.

చౌపాయ్

అంతరిక్షమున నతఁడు నిలిచి, సింహనాదముఁ జేసినందున, రాక్షసులహృదయములు బ్రద్దలయ్యెను. మాయాహృతబాణమును

లక్ష్మణుఁడు ప్రయోగించినందున, వానిమాయ నశించెను. స్వమాయ నశించినందున, నరాంతకుఁడు యుద్ధమును జాలించి, యజ్ఞశాలలోఁ బ్రవేశించి, విజయ-యజ్ఞమును జేయుటకుఁదగిన సామగ్రులను సంభారము జేసెను. వాఁడు యజ్ఞదీక్షలోఁ బ్రవేశించి, జన్నము నారంభించెను; అనేక యజ్ఞపశువులు తీసికొని రాఁబడెను. అంత సంధ్యాసమయమయ్యెను; వానరులు యుద్ధమును జాలించి, శ్రీరాముని స్మరించి, స్వశిబిరములకు నిష్క్రమించిరి. అంతలో, సేనలతోఁ గూడి, లక్ష్మణుఁడు శ్రీరామునివద్దకు వచ్చి, అతనిచరణములకు నమస్కరించెను. శ్రమపడి, దీనులైయుండిన వానరులపై శ్రీరాముఁడు కటాక్షదృష్టులను నిగిడించినంతలో, వారు శ్రమరహితు లయిరి.

దోహా 206

"ఓ వానరులారా! మీ స్వస్థానములకు వెళ్లి, విశ్రమింపుఁడు" అని శ్రీరాముఁ డాజ్ఞాపించెను. అతనియాజ్ఞను గైకొని, వారు రామనామమును స్మరించుచు, సుఖాసీనులై యుండిరి.

చౌపాయ్

అప్పుడు శ్రీరాముఁడు లక్ష్మణునిఁ గౌఁగిలించుకొని, తనసమీపమునఁ గూర్చుండఁబెట్టుకొనెను. అంగద, హనుమంతులతో సమానమగు అదృష్టవంతులు లోకములోఁ బుట్టరు. కోమలమలములగు శ్రీరాముని చరణాంబుజములను వారిరువురు పట్టుకొని, ప్రేమతోఁ బట్టుచుండిరి. ఓ పార్వతీ! సుగ్రీవ, జాంబవంత, విభీషణాదులు శ్రీరామునిసన్నిధానమునఁ గూర్చుండిరి. లక్ష్మణ, విభీషణులు నరాంతకుని ప్రబలమగు యుద్ధమును పలువిధముల వర్ణించి, చెప్పిరి; శ్రీసాంబశివుని ప్రతాపమువలన, నింతవఱకు వాఁడు సంహరింపఁబడక, దుఃఖమును కలిగించి, విజృంభించెను. ఈమాటలను శ్రీరాముఁడు విని, మందహాసముఁ జేసి, శివునిచరిత్రమును జెప్పనారంభించెను. "ఓ మహాత్ములారా! మీరు నామాటను వినుఁడు; శివునకును నాకును లేశమపి భేదములేదు. మాయిరువురకు భేదముకలదని తలంచువాఁడు జ్ఞానహీనుఁడు. ("యథాంతరం న పశ్యామి తథామీ స్వస్తిరాయుషీ.")

దోహా 207

"శ్రీపార్వతీపరమేశ్వరులను స్మరించువాఁడు నాకుఁ బ్రియుఁడు; శ్రీశివునిభజించుటయే, నన్ను భజించుట; శివుఁడు నాకంటె గొప్ప వాఁడు.

చౌపాయ్

"ఎవఁడు పార్వతీపరమేశ్వరులను ప్రాణములతోఁ బ్రేమించునో, వానికి ధర్మార్థకామమోక్షములు కరతలామలకములు. శ్రీసాంబశివుఁడు నా ప్రతిజ్ఞను సదా నిర్వహించును; మనకు జయమునిచ్చును; అందులకు సందేహము లేదు. సకలసుఖములును, పుత్రమిత్రకళత్రములును, శిరిసంపదలును, శివుని స్మరించినమాత్రమున, సమకూడును. నాయందు భక్తి కలుగుట కూడ, శివుని యధీనము. మత్స్యములజీవము జీవనాధీనము కదా! నరాంతకుఁ డిట్టివాఁ డగుటలో నాశ్చర్యము లేదు; శివునకు నాయందును బరమస్నేహము కలదు. మీరు కపటమును విడిచి, విశ్వనాథుని స్మరింపుఁడు; అతనిచరణములకు నమస్కరింపుఁడు. జయము కలుగును; కనుక, మీరు ధైర్యముగ నుండుఁడు; ఒకయుపాయము తోఁచుచున్నది; మీరు సంతోషముగ నుండుఁడు. శివునియుపాసకులు నాకుఁ బ్రియులు. ఓ లక్ష్మణుఁడా! ఈసంగతిని దృఢముగ విశ్వసించి, నీమనస్సులో నుంచుకొనుము.

దోహా 208

"ఏమనుజుఁడు నాభక్తిని గోరునో, వాఁడు కపటమును, జమత్కారమును విడిచి, దివారాత్రములు శ్రీపార్వతీపరమేశ్వరులను భజింపవలయును.

చౌపాయ్

"ఎవరు త్రికరణశుద్ధిగ శ్రీశివుని స్మరించెదరో, వారిహృదయములో సకలగుణములు నివసించును. ఎవరు నిర్భయముగ శ్రీశివునిచరణములను బ్రేమించెదరో, వారిహృదయములో నేను లక్ష్మితోఁగూడి, సదా నివసించెదను. కర్ణధారుఁడు లేకయే, సంసారసాగరమును దాఁటవచ్చునని తెలిసికొని, చతురు లగుమనుజులు శ్రీశివుని భజించెదరు."

సంసారదుఃఖమును హరించుటకు శ్రీరాముఁడు లక్ష్మణసుగ్రీవుల కీవిధమున హితము నుపదేశించెను. శ్రీరాముఁడు పలికిన సత్యవచనములను వారు విని, సంతసించిరి; శ్రీరామానుజుఁడు రామునిచరణములకు నమస్కరించెను. నల, నీలాంగద, సుగ్రీవ, జాంబవంత, హనుమదాది మహావీరులును, విభీషణుఁడు మొదలగువారును శ్రీరామునివలన శ్రీశివునిప్రభావమును విని, శ్రీరామేశ్వరులకు భేదములేదని తెలిసికొని, భయమును విడిచి, రామేశ్వరులనామమును జపముఁ జేయుచుండిరి.

దోహః 209

ఈప్రకారము పరమపవిత్రమగుశివునిమాహాత్మ్యమును వినుటలో రెండుయామములరాత్రి గతించెను. ఓ గరుత్మంతుఁడా! ఆసమయమున నారదుఁడు శ్రీరామునివద్దకు వచ్చెను.

చౌపాయ్

శ్రీరామలక్ష్మణులు సుఖాసీనులై, దేదీప్యమానముగ వెలుఁగుచుండిరి; వారి దివ్యమంగళవిగ్రహములం జూచి, మన్మథుఁడు సిగ్గుపడెను. నారదుని జూచి, శ్రీరాముఁడు దిగ్గునలేచి, కూర్చుండెను; దిక్కుగలవాఁడ నయితినని నారదుఁడు తలంచెను. శ్రీరామమూర్తి మునీశ్వరునకు నమస్కరించి, సుఖాసనముపైఁ గూర్చుండఁబెట్టెను; అతనిదీవనలం గైకొని, సంతోషించెను. చంద్రునిఁజూచి సంతోషించు చకోరములువలె, శ్రీరాముని నారదుఁడు చూచి, పరమానందభరితుఁడయ్యెను; అతనిశరీరము పులకరించెను; అతఁడు శ్రీరామునితో నిట్లు ప్రసంగించెను:—"ఓ నాథా! నేను మీవద్దకువచ్చుటకుఁ గారణముఁ జెప్పుచున్నాను; వినుము. మీరు సర్వాంతర్యాములు; అయినను, జెప్పుచున్నాను. బ్రహ్మదేవుఁడు నన్ను మీ వద్దకుఁ బంపెను. ఓ నాథా! అనాథులకు మీరు నాథులు; బ్రహ్మదేవుఁడు చెప్పినవినయముల నాలకింపుము. ప్రాతఃకాలము కాకపూర్వము, మహావీరుఁడు వెళ్లి, సుగ్రీవునికుమారుఁ డగుదధిబలుని తీసికొని రావలెను.

దోహా 210

"ఓ స్వామీ! అతఁడు నిత్యము మీ నామమును జపించుచుండును; ఓ కృపాసముద్రుఁడా! బ్రహ్మవరదానానుసార మతనినిచ్చుటకుఁ దీసికొనివచ్చుట కర్తవ్యమని తెలిసికొనుము.

చౌపాయ్

"అతనివలన, నరాంతకుఁడు సంహరింపఁబడును; ఆదధిబలుఁడు మీ భక్తుఁడు. ఓ స్వామీ! ఈదుష్టునితో మీరు విశేషకాలము వినోదమును జరిగించితిరి. ఇఁక వానిని వధింపుఁడు. ఈసంగ్రామమును జూచి, దేవతలు భయపడుచుండిరి. ఓ రఘునాథా! ప్రాతఃకాలమునఁ బ్రయాసములేకయే శత్రువు సంహరింపఁబడుటకుఁ దగినయుపాయమును జూడుఁడు. వానితో మీరు యుద్ధముఁజేయుట తగదు; వానితో దధిబలుఁడు యుద్ధముజేయునట్లు, నియోగింపుఁడు." ఇట్లు సవినయముగ నారదుఁడు విన్నవించి, శ్రీరామునకు నమస్కరించి, అతని దివ్యమంగళ విగ్రహమును ధ్యానించుచు, సత్యలోకమునకు వెళ్లెను. అంతలో శ్రీరాముఁడు మహావీరునిపై దృష్టినిగిడించి, "ఓ వీరుఁడా! సముద్రములోనుండిన ధవళగిరివద్దకు శీఘ్రము వెళ్లుము. అచ్చట దధిబలుఁడు ధ్యానసమాధిలో నుండును. అతఁడు తపముఁజేయుచుండ, ననేకదినములు గతించెను. అతనిని శీఘ్రముగఁ దీసికొని రమ్ము.

దోహా 211

"ఓ మహావీరుఁడా! అతఁడు మహాతపస్సంపన్నుఁడు; బలవంతుఁడు; తేజశ్శాలి. అతనిని సమీపించి, అతని దయను సంపాదించి, చాతుర్యముగ నతనిని దీసికొని రమ్ము" అని యాజ్ఞాపించెను.

చౌపాయ్

శ్రీకపీశ్వరుఁడు దురభిమానమును విడిచి, శ్రీరామునియాజ్ఞ ప్రకారము దిగ్గున లేచి, అతనిచరణములకు నమస్కరించి, సంతోషముతో వెడలి, ధనుర్విముక్తబాణమువలె, నతివేగమునఁ బోయెను. ఆమహాబలవంతుఁ డగువాయుపుత్రుఁడు మూఁడుఘడియలన్నరలో ధవళగిరివద్దకు వచ్చెను. అచ్చటనుండిన మందిరమువెలుపల నతఁడు

నిలువఁబడెను; ఆమందిరము సూర్యునివలె, దేదీప్యమానముగ వెలుఁగు చుండెను. రెండుఘడియలవఱ కతఁడు నిలువఁబడి యుండెను; కాని, మందిరములో నొకమాటయైనను వినఁబడలేదు. అతఁడు రామనామ మును స్మరించుచుండెను. అచ్చట ప్రాతఃకాలమున లంకలో యుద్ధము జరగును; ఇచ్చట నతఁడు హరిచరణములను ధ్యానించుటలో మునిఁగి, దీర్ఘసమాధిలో నుండెను. ఒకక్షణము కపీశ్వరుఁడు మన స్సులో విచారించి, "ఏవిధమున నేను శ్రీరామునివద్దకు వెళ్లఁగలను? గృహముతోఁగూడ నితనిఁ దీసికొనిపోదునా? ఆ ప్రకారముచేయుటకు శ్రీరామునిశెలవు లేదు. అతఁడు భక్తవత్సలుఁడు; ఈ ప్రకారము చేయుట యుచితము కాదు." అని చింతించెను.

దోహా 212

ఆపండితశిరోమణి, ఆ మహావీరుఁడు సిగ్గుపడి, అతనిని సమా ధిలోనుండి మేల్కొలుపుట కనేకప్రయత్నములం జేసెను.

చౌపాయ్

ఆ దధిబలుఁడు నిశ్చలమగు సమాధిలోనుండుట మహావీరుఁడు గ్రహించి, చమత్కారమును విడిచి, భగవంతుని స్మరించెను. ఆ వాయు పుత్రుఁడు శ్రీరామునిచరణములయందు మనస్సును సంధించి, ధ్యానముఁ జేయుచుండ, నొకఘడియకాలము గతించెను. ఇంతలో, విధివశమున లఘుశంకకు దధిబలుఁడు దిగ్గునలేచి నిలువఁబడియుండిన మహావీరునిఁ జూచెను. "జయత్యతిబలో రామః" అని ఆంజనేయుఁడు పలికెను. ఆ మాటను దధిబలుఁడు విని, నేత్రములను విప్పి, మహావీరునిఁ జూచి, యతనిని కౌఁగిలించుకొని, కుశలప్రశ్నఁ జేసెను. ఉభయకుశలోపరి, మహావీరుఁ డతనిని జూచి, "ఓ అన్నా! ఆ త్రిలోకరక్షకుని, ఆ భగ వంతుని, ఆ శ్రీరామునిఁజూచుటకు వెడలుము; నీతమ్మునితోఁ గూడి, ఆ సకలసుఖధాముని చరణకమలములను దర్శింపుము. ఆ చరణముల పరాగము శిలనుసహితము ముద్ధరించెను. ఎవనినిమిత్త మింతకాలము వఱకు నీవు తపముఁ జేయుచుంటివో, నీమీఁద నతని కిప్పుడు ప్రస న్నత కలిగెను" అని చెప్పెను.

దోహా 213

"ఓ అన్నా! హంసవలె, నతఁడు శ్రీశివునిమానససరోవరములో సదా నివసించును. అత్యాదరముతో నతఁడు నిన్నుఁ దీసికొనిరమ్మని నన్నుఁ బంపెను."

చౌపాయ్

ఈ ప్రకారము వాయుపుత్త్రుఁడు పలికినపలుకులను సుగ్రీవుని కుమారుఁడు విని, పరమానందభరితుఁడై, శ్రీరామదర్శన కుతూహలాయత్తచిత్తుఁడై, హనుమంతునితోఁ గూడి, వెడలెను. వా రిరువురు వెడలి, యేమహాపురుషుని చరణారవిందములను శివుఁడు హృదయములో సదా ధ్యానించుచుండునో, ఆ మహాత్మునివద్దకు వచ్చిరి. ఆ కృపాసాగరుని, ఆ శ్రీరాముని వారు దర్శించి, అతనిచరణములకు దండప్రణామముఁ జేసిరి. శ్రీరాముఁడు ప్రసన్నుఁడై, తమ్మునితో నతనిఁ గలిసి, స్వహస్తముతో దధిబలునిఁ బట్టుకొనెను. అతఁ డతనిఁ దనవద్దఁ గూర్చుండఁబెట్టుకొనెను; అంతలో సుగ్రీవుఁడు శ్రీరామునివద్దకు వచ్చెను; కుమారునిఁ జూచి, యతఁడు సంతోషించెను; అతఁడు కుమారునిఁ గలిసినసమయమునఁ బొందినసుఖమును జెప్పుటకు శక్యము కాదు. పోఁగొట్టుకొనిన మాణిక్యమును మరల సంగ్రహించిన సర్పము వలె, పోయినప్రాణములు శరీరములోనికి వచ్చినవిధమున, జలములను బొంది సంతసించు మత్స్యములువలె, నతఁడు కుమారునిగలిసి, సంతోషించెను. ఆ దధిబలుఁడు శ్రీరాముని దర్శించినందున, నతని తాపత్రయములు నశించెను.

సోరఠా 10

అంగద-దధిబలులు సంతోషముతోఁ గలిసికొనిరి; అంత, ప్రాతఃకాల మయ్యెను వారు స్నానములం జేసి, శ్రీరామునిచరణములను స్పృశించిరి.

చౌపాయ్

"జయత్యతిబలో రామః లక్ష్మణశ్చ మహాబలః" అని వానరులు సింహనాదములం జేయుచు, యుద్ధమునకు నడచిరి. అప్పుడు ప్రాతః

కాలమున, నరాంతకుఁడు లేచి, భయంకరులగు రాక్షసవీరులను వెంటఁ దీసికొని, రథముపైఁ గూర్చుండి, శస్త్రాస్త్రములను ధరించి, యుద్ధభూమి మీఁద నిలువఁబడిరి. కాలమేఘమువంటి రాక్షసులు రౌద్రాకారులై, యుద్ధమునకు వచ్చిరి. స్వమాయచే, నరాంతకుఁడు తిరోహితుఁడై వెడలి, శ్రీరాముని సన్నిధానమునకు వచ్చి, ప్రత్యక్షమయ్యెను. ఇట్లు శ్రీరామునివద్దకువచ్చిన 'గురుభాయి'ని దధిబలుఁడు చూచి, దిగ్గునలేచి, వెళ్లి, చేతులను జాచి, కలిసికొనెను. అతనిని వాఁడు చూచి, సంతోషించి, కలిసికొనెను. ఇట్లు వారు పరస్పరానురాగముతోఁ గలిసి, ఉభయకుశలోపరి, స్వప్రయోజనములను జెప్పుకొనిరి.

దోహా 214

సుగ్రీవునికుమారుఁడు మహాచతురుఁడు, నరాంతకుఁ డతనిస్నేహితుఁడు కనుక, నతఁడు వానిని బోధించెను. ఓ గరుడా! ఇఁక ముందువృత్తాంతమును వినుము.

చౌపాయ్

కపీశ్వరులు వంశముయొక్క స్వభావమును సత్యముగఁ జెప్పియున్నారు; విషముతోఁగూడిన లతకు అమృతోపమానము లగుఫలములు పుట్టవుకదా? "ఓ మిత్రమా! దీని పరిణామమును విచారించి, చూడుము. అధర్మమార్గమున నడచినవానికి లోకములోఁ గల్యాణములు కలుగవు. నీతండ్రిచర్యలను లెస్సగవిచారించి, చూడుము; రామునితో విరోధించుటవలన, జయము కలుగదు. నీవుకూడఁ జతురుఁడవు; ఎందుచేత నీమతి భ్రమించెను? మార్గమునఁ బోవుచు, నూతిలోనికి దుమికి, మీఁదికి రాఁగలమా? నీతండ్రికివచ్చిన విపత్తియనునూతిలో నీవేల పడియెదవు? ఒకమేకవెంట నొకమేక వెళ్లి, బుద్ధిలేక, నూతిలోఁ బడినట్లు, నీవేల విపత్తిలోఁ బడియెదవు? నీవైనను నాలుగుదినముల నుండి, యుద్ధముఁజేసి, వానరభల్లూకముల బలపరాక్రమములను జూచియుంటివి. అందుచేత, నజ్ఞానాంధకారములో మునిఁగియుండిన కుమంత్రులను విడిచి, శ్రీరాముని శరణుఁజొచ్చి, క్షమాపణఁ గోరుకొనుము. అతనిచరణములను స్పృశించి, నీజన్మము సఫలముఁ జేసికొనుము. అతఁడు సమదర్శి; నిన్ను నిర్భయునిగ జేయును. సుఖదాయకమగు నా

హితోపదేశమును మన్నింపుము. శ్రీరాముఁడు రాక్షసాంతకుఁ డయి నను, నతఁడు దీనరక్షకుఁడు.

దోహా 215

"శ్రీరామునిబాణములు సూర్యునివంటివి ; రావణుఁడు పక్షివం టివాఁడు ; నీవు బుద్ధిమంతుఁడవు కనుక, నీచాతుర్యమును జూపి, వినాశమునుండి, రావణుని రక్షింపుము."

చౌపాయ్

ఇట్లు గురుభాయి చెప్పిన హితోపదేశములను నరాంతకుఁడు విని, మండిపడి, పూర్వోత్తరముల నాలోచింపక, నోటికివచ్చినట్లు కర్ణకఠోరవాక్యములం బలుక నారంభించెను; "ఓయీ ! స్వతస్సిద్ధముగ వానరు లహోరాత్రములు పిఱికిపందలు. ఆతపశ్శాలులు వాలిని సంహ రించిరి; వారియాజ్ఞల నంగదుఁడు శిరసావహించును. ఓ దధిబలుఁడా! ఇది మీ వానరవంశాచారము. నేనుమాత్రము శత్రువునితో సఖ్యముఁ జేయను." ఇట్లు వాఁడు పలికి, శ్రీరామున కెదురుగ నడచెను. అప్పుడు వానిని దధిబలుఁడు తోఁకతోఁ జుట్టి, నేలఁగొట్టెను. "ఓ వానరా ధమా ! నీకు మనస్సులో లేశమైన భయములేదా? ఓ మూర్ఖుఁడా! నీవు గురుభాయివి కనుక, నిన్ను విడిచిపెట్టుచున్నాను." అని వాఁడు పలికి, యతనిని ధిక్కరించి, యుద్ధమునకు నడచెను. ఆతక్షణము దధి బలుఁడు కోపించి, ముందునకు నడచి, వానినిఁ బట్టుకొనెను.

దోహా 216

అప్పుడు వా రిరువురు యుద్ధముఁజేయ నారంభించిరి ; "జయ త్యతిబలో రామః" అని వానరభల్లూకములు జయశబ్దములం జేసి, రాక్షసులతోఁ బోరాడిరి.

ఛాంద్

రాక్షసులను పాషాణములతోఁ గొట్టి, వానరులు సంహరిం చిరి; కొందఱు రాక్షసులను మర్దించి, మర్దించి, చూర్ణముఁ జేసిరి ; పర్వ తములవంటి రాక్షసులను పిండిజేసిరి. విహ్వబలపుర రాక్షసులలో నొకఁ డైనను శేషించి యుండలేదు. ఓ గరుఁడా! ఒక్కనరాంతకుఁడుమా త్రము జీవించియుండెను. వానికిని దధిబలునకును ద్వంద్వయుద్ధము జరగెను. కజ్జల - సువర్ణపర్వతములువలె, వా రిరువురు పోరాడినపుడు,

దేదీప్యమానముగ బ్రకాశించిరి. ఒకయామమున్ మీఁద రెండుఘడి యలవఱకు మహాబలవంతులగు వారిరువురు మల్లయుద్ధముఁ జేసిరి. యుద్ధముఁ జేయుచు, వాఁడు తిరోహితుఁ డయ్యెను. ఆమహావీరులకు లేశమైన శ్రమము లేకపోయెను. అంతకంతకు వారు రౌద్రాకారులై పోరాడిరి. శాస్త్రములోఁ జెప్పఁబడిన షట్ప్రకారముల వారు పోరా డుచుండిరి; వారిపోరాటమును దేవతలు చూచి, సంతసించిరి. ఒంట రిగ కుమారుఁడు యుద్ధముఁ జేయుచుండుటవలన, సుగ్రీవుఁడు విచా రించెను; అతనిశరీరము పులకరించెను; అతఁడు జాంబవంతునితో నిట్లు ప్రసంగించెను.

దోహా 217

"ఓ జాంబవంతుఁడా! ఎంతలో నాకుమారుఁడు వానిని సంహ రింపఁగలఁడు?" అని సుగ్రీవుఁడు మృదుమధురముగఁ బలికెను.

చౌపాయ్

వారు యుద్ధముఁ జేయుచుండ, కాలాతీత మయ్యెను. అప్పుడు ఋక్షపతి, జాంబవంతుఁ డిట్లు ప్రత్యుత్తరము నిచ్చెను. "ఓ సుగ్రీ వుఁడా! ఒకక్షణము నీవు ధైర్యముగ నుండుము. గురు వాశీర్వచ నము ప్రకారము, దధిబలుఁడు జయించును. ఆసమయము వచ్చియు న్నది. ఒకరెప్పపాటులో నీకుమారుఁడు వానిని సంహరించును." ఇట్లు జాంబవంతుఁడు చెప్పిన మాటలను సుగ్రీవుఁడు విని, లోలోన సంత సించెను; దేవతలు పుష్పములను వర్షించిరి. "ఓ దధిబలుఁడా! నీవు ధన్యుఁడవు. నీభుజబల మపారము." అని దేవతలు కొనియాడి, "ఓయీ! నీవు గొప్పరణకౌతుకమును జూపించితివి." అని స్తుతించిరి. వారిమాటలను వాఁడు విని, కోపించి, దధిబలునితోఁ గూడ, తిరో హితుఁ డయ్యెను. ఎనుబదియోజనము లంతరిక్షమునకు వారు యెగిరి, యుద్ధముఁ జేసిరి. అంత వానరుఁడు శ్రీరాముని ధ్యానించి, వానినిఁ బట్టుకొని, గిరగిరఁ ద్రిప్పి, నేలఁగొట్టెను; ఆదెబ్బతో వాఁడు నేలఁబడి, భయంకరారావముఁ జేయుచుఁ బ్రాణములను విడిచెను.

ఛాంద్ 27

మరణకాలమున, రావణునికుమారుఁడు రామరామయనుచు, శరీరమును విడిచెను. ఈ నీచమగు దేహమును వాఁడు విడిచి, పరమ

పదమును బొందెను. ఓ ద్విజనాథా! ఓ గరుడా! అనేక జప, తప, యజ్ఞములం జేసి, దేవ, ముని, సిద్ధు లభిలషించుము క్తినిఁ, గరుణా సముద్రుఁ డగురాముఁడు సహజముగ వానికిచ్చెను.

దోహా 218

ఓ గరుత్మంతుఁడా! వానికీగతి సంభవించెను; దేవతలు నిర్భయులై, శ్రీరాముని చరణములపై మనస్సునుసంధించి, ధ్యానముఁ జేసి, పుష్పములను వర్షించిరి.

చౌపాయ్

నరాంతకుఁడు ప్రాణములను విడిచిపెట్టెనని దధిబలుఁడు తెలిసికొని, వానిశిరస్సును ద్రుంచి, పట్టుకొని, వానికళేబరమును లంకలోనికి విసరి, శ్రీరామునివద్దకు వచ్చెను. అంత సాయంసమయ మయ్యెను; రాత్రివచ్చెను; భూతప్రేత, పిశాచములు భయంకరరూపములను ధరించి, వాహనముల నెక్కి, రణరంగమునకు వచ్చి, స్వేష్టకృత్తుగ భుజించి, స్వస్థానములకు వెళ్లెను. దధిబలుఁడు శ్రీరామునిసన్నిధానమునకు వచ్చెను. అతనిని శ్రీరాముఁడు చూచి, సంతోషముతో దిగ్గునలేచి, లక్ష్మణునితోఁ గూడి, యెదురుగ వెళ్లి, యతనిఁ గలిసికొనెను. అత్యంత ప్రేమను జూపించుటయే శ్రీరామునిస్వభావము; అపరిమితమగు ప్రసన్నత నతఁడు చూపించెను. రామలక్ష్మణులు కూర్చుండి, తమసన్నిధానమున, మిత్రునికుమారునిఁ గూర్చుండఁబెట్టుకొనిరి. హనుమదాదివానరులు శ్రీరామునిచరణములకు నమస్కరించి, సుఖముగఁ గూర్చుండిరి.

దోహా 219

శ్రీరాముని కటాక్షవీక్షణలు ప్రసరించినమాత్రమున వానరులు శ్రమరహితులై, అతనియాజ్ఞఁ గైకొని, సుఖాసీనులై, యుండిరి. అప్పుడు నరాంతకునిశిరస్సును దధిబలుఁడు రామునియెదుటఁ బెట్టెను.

చౌపాయ్

కౌతూహలాక్రాంతుఁడై, శ్రీరాముఁడు వానిశిరస్సును జూచి, సుగ్రీవునిఁ బిలిచి, "ఓ సఖుఁడా! ఈశిరస్సును పదిలముగ దాఁచియుంచుము; దానిని పాఱవేయకుము." అని యాజ్ఞాపించినప్రకార మతఁడు దానిని జాగ్రత్తగ దాఁచియుంచెను. అనేకప్రకారముల శ్రీరాముఁడు

స్వయముగ దధిబలుని గొనియాడెను. ఏమహాత్ముఁడు గొప్పదనము నిచ్చినందున, దేవేంద్రాదులకు గొప్పదనము వచ్చెనో, ఆజగదీశ్వరుఁడు స్వయము మిత్రునికుమారుని కొనియాడెను. శ్రీరాముఁడు ప్రసన్నుఁ డయ్యెనని దధిబలుఁడు తెలిసికొని, తనజన్మము సఫలమయ్యెనని తలంచి, ఆనందబాష్పముల విడిచెను. అతఁడు చేతులను జోడించుకొని, భక్తిరసముప్పతిల్ల, మృదుమధురముగ నిట్లు ప్రార్థించెను. "ఓ జగత్పతీ! ఓ నాథా! మీవాక్సుధారసము సదా మీభక్తులను సంతోషింపఁ జేసి, వారికి గొప్పదనము నిచ్చును.

దోహా 220

"వనచర పామల సహజజడ, బుద్ధి విషమ అజ్ఞాన,
విరద స్వభావ కృపాలు ప్రభు, సేవక సుయశ బఖానా."

"ఓ నాథా! మీరు బిరుదావళీపాలకులు; మీరు సహజకృపా ళురు; మీసేవకులకీర్తిని రక్షించెదరు. నేను వనచరుఁడను; పామరుఁ డను; మూర్ఖుఁడను; జ్ఞానహీనుఁడను.

చౌపాయ్

"ఓ అయోధ్యాపురీశా! మీ నిర్మలమగుకీర్తి లోకమంత వ్యాపించెను; వేదపురాణేతిహాసములును, శేషుఁడును మీకీర్తిని తుద ముట్టఁ జెప్పలేకపోయిరి. ఓ నాథా! నేనెట్లు వర్ణించిచెప్పఁగలను! పత్ర వర్తకునకు గజముత్యములగుణములు తెలియునా?" అని దధిబలుఁడు విన్నవించి, శ్రీరాముని చరణములమీఁదఁ బడెను. అతని ప్రేమాతి శయములను దేవతలు కొనియాడిరి. అతఁడు దురభిమానరహితుఁడని శ్రీరాముఁడు తెలిసికొని, దీనదయాపరుఁడు కనుక, నతనిని సన్మానిం చెను. "ఓ దధిబలుఁడా! నీమనస్సునకు వచ్చినవరముం గోరుము" అని శ్రీరాముఁడు పలికినపలుకుల నతఁడు విని చేతులను జోడించుకొని, యిట్లు విన్నవించెను. "ఓ నాథా! మీ దివ్యమంగళవిగ్రహమును, మీ సకలకల్యాణగుణములును సదా నాహృదయములో నివసించు నట్లు ప్రసాదింపుఁడు. కామార్తుఁడు స్త్రీని, లోభి ధనమునువలె, నేను

మీచరణకమలములను ప్రేమించునట్లు ప్రసాదింపుఁడు." "తథాస్తు" అని శ్రీరాముఁడు చెప్పి, "ఓయీ! నాకోరిక మఱియొకటి కలదు. నేనిచ్చినదానినిఁ బుచ్చుకొనుము.

సోరఠా 11

"ఓ దధిబలుఁడా! నీవు సంతోషముతో విహ్వాబలపురరాజ్యమును బరిపాలింపుము. కపటమునువిడిచి, సదా శ్రీపార్వతీపరమేశ్వరుల చరణకమలముల నారాధింపుము." అని బోధించెను.

చౌపాయ్

"ఓయీ! ఈశుభకర్మలను జేయుచుండినప్రాణులు సదా నామనస్సులో నివసించియుందురు." అని శ్రీరాముఁడు పలికెను. ఓ పార్వతీ! శుద్ధాంతఃకరణతో భక్తులను ప్రేమించుట శ్రీరాముని స్వభావము; విలంబముఁజేయక, వారు భక్తులను ప్రేమించెదరు. నాస్వరూపము శ్రీరామునకుఁ దెలియును. అందుచేత నతఁడు నన్నుఁ బ్రశంసించును. శ్రీరామునిస్వభావమును దెలిసికొనినవారు సర్వమును విడిచి, అతని ప్రేమ - భక్తిని గోరుచుందురు. ఏమనుజునిహృదయములో శ్రీరామభక్తిసాగరము వ్యాపించియుండునో, ఆమనుజునిమహిమను వేదములుగాని, పండితులుగాని, పూర్ణముగ వర్ణించి, చెప్పలేరు. సకలనదులును వానియంతట నవి వెడలివచ్చి, సకలసుఖదాయకమగు సముద్రములోఁబడినట్లు, సకలసుఖములును పిలువఁబడకయే, వానియంతట నవి వచ్చి, సకలసుఖదాయకు లగుభక్తులను బొందును. ఈప్రకార మతనిని శ్రీరాముఁడు బోధించి, స్వహస్తములతో నతనికి రాజ్యతిలకముఁ బెట్టెను. శ్రీరామునిముఖలక్షణము నుపలక్షించి, అంగదాదివానరవీరు లతనికి నమస్కరించిరి.

దోహా 221

ఇట్లు భక్తివరమును రాజ్యమును బొంది, దధిబలుఁడు శ్రీరామునిచరణములకు నమస్కరించి, అతని సెలవుఁగైకొని, విహ్వాబలపురమునకు వెడలెను. ఓ భరద్వాజా! సావధానముగ ముందుకథను వినుము.

చౌపాయ్

త్రికరణశుద్ధిగ నతఁడు శ్రీరామునిచరణములను సేవించుచు, భయమును విడిచి, రాజ్యముఁ జేయుచుండెను. ఇట్లు సేనలతోఁ గూడి, దేదీప్యమానముగ వెలుఁగుచుండిన శ్రీరాముని దేవతలు చూచి, పరమానందభరితులై, దుందుభులను మ్రోఁగించి, పుష్పములను వర్షించిరి; అనేకవిధముల వారు దేవదేవుని స్తుతించి, విన్నపములం జెప్పుకొని, స్వస్థానములకు నిష్క్రమించిరి. ఓ భరద్వాజా! ఇఁక లంకలోజరగిన వృత్తాంతమును వినుము. రావణుఁడు కూర్చుండియుండిన స్థలమువద్దకు, శిరస్సులేని నరాంతకునికళేబరము వచ్చిపడెను. వాఁడు దానినిఁజూచి, వ్యాకులుఁడై, దిగ్గునలేచి వెళ్లి, దానిని గుఱుతుపట్టి, దుఃఖాక్రాంతుఁడై, "హా! నరాంతకా!" అని విలపించుచు, నేలఁబడి, మూర్ఛిల్లెను. లంకానగరమంతయు శోకార్ణవములో మునిఁగియుండెను. మందోదరాది రావణాంతఃపురస్త్రీలు శోకసంతప్తమానసులై, విలపించుచుండిరి.

దోహా 222

బిందుమతి మొదలగు నరాంతకునిభార్యలు దుఃఖాక్రాంతలై, నేలఁబడి, విలపించి, విలపించి, శరీరముపై స్మారకములేక, పడియుండిరి.

చౌపాయ్

ఓ గరుత్మంతుఁడా! వారివిలాపములను వర్ణించి, చెప్పుటకు శక్యము కాదు. రాక్షసస్త్రీలతోఁ గూడియుండిన లంకానగరమనునట్టి చిన్నపడవ, శోకార్ణవములో మునుఁగుచుండెను. దానిని నిలువఁబెట్టు రక్షకులు లేరు. అప్పుడు మందోదరి బిందుమతిహస్తములం బట్టుకొని, సులోచనచేసిన సహగమనవృత్తాంతమును వినిపించి, బోధించెను. ఆమె పుణ్యచరిత్రమును బిందుమతి విని, ధైర్యము నవలంబించి, అత్తచరణములకు నమస్కరించి, స్వాభిప్రాయము నామెకుఁ జెప్పెను; ధనమును, ధామమును, మోహము నామె విడిచి, నాథుని ననుసరించివెళ్లుటకు సిద్ధపడెను. "ఓ తల్లీ! నా నాథుఁడు వెళ్లినలోకములకు నేను వెళ్లుటకుఁ దగిన యుపాయముఁ జెప్పుము." అని యామె ప్రార్థించెను. "ఓ బిందుమతీ! నీకు మఱియొకయుపాయము లేదు; శ్రీరామునితావునకు నీవు శీఘ్రము వెళ్లుము.

దోహా 223

"సులోచన వెళ్లినప్రకారము, నీవు భయమునువిడిచి, శ్రీరాముని చరణకమలములను దర్శించి, నీనాథునిశిరస్సునుఁ దెచ్చుకొనుము." అని మందోదరి బోధించెను.

చౌపాయ్

అత్తగారు చెప్పినమాటల నామె విని, సంతసించెను; అంతఁ బ్రాతఃకాలమయ్యెను. ఆమె లేచి, బంగారుపల్లకిని దెప్పించి, నాథుని కళేబరమును స్వయముగ దానిలోఁ బెట్టి, యొంటరిగ దానివెంటనడచెను. ఆమెసవతి, చిత్రరేఖ, సకలసద్గుణసంపన్నురాలు కనుక, నామె కూడ బిందుమతివెంటఁ బడెను. ఆయిరువురుసవతులు సత్త్వగుణప్రధానులై, శ్రీరామునితావునకు వెడలిరి. ఈప్రకార మొంటరిగవచ్చుచుండిన పల్లకిని వానరులు చూచి, భయపడిరి; బలవంతుఁడగు శత్రువొకఁడు వచ్చుచుండెనని మహావీరులగు నలనీలులు విచారించి, శీఘ్రముగ ముందునకు నడచివచ్చి, ఆసవతుల నిరువురను జూచిరి.

దోహా 224

ఆసవతు లిరువురవృత్తాంతము నడిగి, వారు తెలిసికొని, రఘునాథునివద్దకు వచ్చి, అతనిచరణకమలములకు నమస్కరించి, యిట్లు విన్నవించిరి.

చౌపాయ్

"ఓ నాథా! నరాంతకుని భార్యలిరువురు మీశరణుఁ జొచ్చుటకు వచ్చిరి. మీరు ప్రణతార్తిహారులు." వారిమాటలను శ్రీరాముఁడు విని, లోలోపున నవ్వి, "ఓ సఖులారా! వారిని బయటను నిలుపుఁడు"అని యాజ్ఞాపించెను. శ్రీరాముని సెలవుప్రకారము, వారిరువురు శీఘ్రము వెడలివచ్చి, వానరకటకమునకు బహిఃప్రదేశమున సవతుల నిరువురను నిలిపివేసిరి. అప్పు డాబిందుమతి, చిత్రరేఖలు వానరులతో నిట్లు విన్నవించిరి; "ఓ వానరులారా! మా స్వల్పవిన్నపము నాలకింపుఁడు. మీరు మీనాథుని సమీపించి, మా కెందుచేత దర్శనమియ్యరో కనుఁగొనుఁడు. ఓ కపీశ్వరులారా! మేము స్త్రీలము; మావిన్నపమును వినుఁడు. ఈమావిన్నపమును మీనాథునకు విన్నవించి, వారి

ప్రత్యుత్తరమును మాకుఁ జెప్పుఁడు." అనలనీలులు వారిమాటలను విని, ధర్మమును విచారించి, శ్రీరామునివద్దకు వెళ్లి, బిందుమతి-చిత్రరేఖలవిన్నపనుల నతనికి విన్నవించిరి; అతఁడు వారిమాటలను విని, నవ్వుకొనెను.

దోహా 225

శ్రీరామునిచిత్త మతికోమలమని పండితులు చెప్పుచున్నారు; వేదములు ఘోషించుచున్నవి. ఓ గరుడా! ఏకారణముచేత, నతఁడు సవతులకు దర్శనమియ్యలేదో, దానికారణముఁ జెప్పుచున్నాను వినుము.

చౌపాయ్

ఆ సవతులిరువుర ప్రేమాతిశయములను బరీక్షించునిమిత్త మా సకలసుఖదాయకుఁడగు శ్రీరాముఁ డీచిత్రకథను రణరంగమునఁ జూపించెను. శ్రీరాముఁడు నలనీలులను బోధించి, సవతులవద్దకుఁ బంపెను. "ఓ నరాంతకునిభార్యలారా! శ్రీరాముఁడు మీకు దర్శనమియ్యఁడు కనుక, నామాటలను నమ్మి, మీగృహములకు నిష్క్రమింపుఁడు." ఇట్లు నలుఁడు చెప్పినమాటలను జతురలగుస్త్రీలు విని, అతనితో నిట్లు ప్రసంగించిరి. "మేము స్త్రీలము; వారిదర్శనార్థము వచ్చియుంటిమి; వారిని సందర్శించి, మా నేత్రములను సఫలముఁ జేసికొనక, మేమెట్లు మాగృహములకుఁ బోఁగలము!" ఈప్రకారము సవతు లిరువురు పలికి, వానరులకు విన్నపములం జెప్పుకొని, వానరకటకములోఁ బ్రవేశించిరి. వా రిరువురు శత్రువునిభార్యలయినను, మహాపతివ్రతలు; కనుక, నిశ్చయముగ, వానరకటకములోఁ బ్రవేశించి, శ్రీరాముఁడు దర్శనమియ్యనని చెప్పినను, వా రతనియెదుట నిలువఁబడి, యిట్లు స్తుతించిరి:—

దోహా 226

"ప్రభు సీతాపతి జగత్పతి, సురనరపతి రఘునాథా,
దేఉ దర్శన కరుణాయతన, దీనబంధు శ్రుతిమాథ.

"ఓ నాథా! ఓ సీతాపతీ! ఓ జగదీశ్వరా! ఓ జగత్పతీ! ఓ దేవదేవా! ఓ నరపతీ! ఓ కరుణాసాగరా! ఓ దీనబంధూ! ఓ వేదరక్షకా! మమ్ములను రక్షింపుఁడు."

చౌపాయి

శ్రీరాముఁడు వారి ప్రార్థనను విని, యూరకుండెను. ఆ సవతు లిరువురు మహాజ్ఞానులు ; పతివ్రతధర్మమునందు నిశ్చలులు. "ఓ నాథా! మహాత్ములగు పురుషులు పరస్త్రీలను స్వప్నమందైనను జూడరని, వేద శాస్త్రములు ఘోషించుచున్నవి. పరస్త్రీలను కపటముగ నిత్యము హృదయములోఁ బ్రేమించుటయే, ప్రాకృతజనులస్వభావము. ఓ నాథా! మీరు సమదర్శులు; కొంచెమైనను మీలో దోషములేదు. మీరు సర్వాంతర్యాములు; ఓ ఆర్తత్రాణపరాయణా! ఓ కరుణా సాగరా! మీరు మాసంగతి విచారించి, విలంబనముఁ జేయక, మమ్ము లను గటాక్షించి, మీదర్శనమును బ్రసాదింపుఁడు." ఇట్లు వారు పలు విధములఁ బ్రార్థించినను, వారి ప్రార్థనలను శ్రీరాముఁడు విని, మిన్న కుండెను. మరల వారీవిధమున విన్నవించిరి:—"ఓ నాథా! ఈ ప్రకా రము వేదము మీకీర్తిని గానముఁ జేయుచున్నది.

"గౌతమ నారి నాథ తుమ తారీ
అధమజాతి భిలనీ నిస్తారీ,
సుని మమ హృదయ పరీ పరతీతీ
అబ ప్రభు కస దేఖియ విపరీతీ.

"ఓ నాథా! మీరు గౌతమునిభార్య నుద్ధరించితిరి; నీచ జాతిలోఁ బుట్టినశబరిని దరింపఁజేసితిరి. ఓ నాథా! ఈ మీచర్యలను వినినందున, నాకు విశ్వాసముకలిగెను. ఇంతవిపరీతముగ నాయెడల నెందులకుఁ బ్రవర్తించెదరు?

దోహా 227

"తారి తారి అధముని అమిత, బార బార శ్రమ జాన,
తాతే కరత అనాకనీ, మోరి ఓర భగవానా.

"ఓ రాజాధిరాజా! మాటిమాటికి పాపాత్ములను దరింపఁజేసి, శ్రమపడినందునా, మీదర్శనమును మాకుఁ బ్రసాదింపక యూరకుంటిరి? ఓ స్వామీ! భగవంతుఁడా! అందుచేతనా, మీరు మమ్ములను నిరాక రించితిరి."

చౌపాయ్

వారిమాటలను శ్రీరాముఁడు విని, నవ్వి, ప్రత్యుత్తరము నియ్యక, యూరకుండెను; వారిని లోతుగ బరీక్షించుటకు మిన్నకుం డెను. నరాంతకునిభార్యలు వ్యాకులచిత్తము గలవారై, మాటిమా టికి శ్రీరాముని బ్రార్థించుచుండిరి.

"ధర్మధురంధర ప్రభు అవతారా
కేవల పతివ్రత ధర్మ హమారా,
జో హమ సత్య సత్య తుమ స్వామీ
ద్రవహు వేగ ఉర అంతర్యామీ.

"ఓ నాథా! మీరు ధర్మసంస్థాపనార్థము లోకములో నవతరిం చితిరి; కేవల పతివ్రతధర్మమును నేను పరిపాలించుచుంటిని. నేనే సత్య మగు పతివ్రతనయినయెడల, ఓ నాథా! నీవే నిజముగ జగదీశ్వరుఁడ వయినయెడల, ఓ స్వామీ! విలంబముఁజేయక, మమ్ములను బ్రసాదిం పుము; ఓ సర్వాంతర్యామీ! మమ్ములను గటాక్షింపుము.

"వృథా కరత కత ప్రభు శ్రుతి భాషా
పూజత నాథ న మమ అభిలాషా,
లీన భయఉ పతి ప్రాణ రామ మహ
అర్థభాగ హమ కహహు జాఇ కహ.

"ఓ స్వామీ! ఓ ప్రణతపాలకా! మీగురించి చెప్పుచుండిన వేదవాక్యములను మీరేల వ్యర్థముఁ జేసెదరు? మాకు మీదర్శన మును బ్రసాదించి, మాయభిలాషను మీరేల సఫలముఁ జేయరు? మానాథునిప్రాణములు మీలో లీనమయ్యెను; మేము మానాథుని యర్ధాంగులము కదా! మే మెచ్చటికిఁ బోఁగలము?

"బృందా చరిత నాథ సుధి కరహూ
వినయ హమారి వేగి ఉర ధరహూ.

"ఓ నాథా! బృందచరిత్రమును జ్ఞప్తికిఁదెచ్చుకొని, మావినయ ముల నాలకింపుఁడు." ఈప్రకారము సవతులిరువురు ప్రేమాతిశయము

లుప్పతిల్ల, సద్ధర్మమును వినయముగ విన్నవించి, భక్తిపరవశులై, నేలఁ బడిరి.

దోహా 228

"పాహి పాహి రఘువంశ మణి, హాతహాం న విదర ప్రతీతి,
ప్రీతమ ప్రీతి నకరత డర, తుమ కహా నాథ అనీతి.

"ఓ నాథా! రక్షింపుఁడు; రక్షింపుఁడు; ఓ రఘువంశతిలకమా! ఓ ప్రణతపాలకా! అనేకబిరుదావళీలు మీకుఁ గలవు; మీరు వానిని రక్షించెదరు. మా నిర్మలాంతఃకరణవలన, మీకు భయము లేదా? మా నాథునిశిరస్సు మాకు దొరకనియెడల, మేమెట్లు సహగమనముఁ జేయఁగలము? మాసహగమనమున కవాంతరము వచ్చినయెడల, విశేషముగ మీకు లోకములో నపకీర్తివచ్చును."

చౌపాయీ

ఓ పార్వతీ! ఇట్లు నిరాశతో సవతులు పలికినపలుకులను దీనదయాపరమూర్తి విని, సంతసించెను; అతనిశరీరము పులకరించెను. వారిరువురను తన సన్నిధానమునకుఁ బిలిపించెను; వారువచ్చి, అతనిచరణములకు నమస్కరించిరి. వారిని శ్రీరాముఁడు లేవఁదీసి కూర్చుండఁబెట్టెను; ఆ త్రిలోకారాధ్యుఁడు వారితో నిట్లు కోమలముగ సంభాషించెను. "ఓ బిందుమతీ! నీవు మహాచతురతవు! నీ నాథునిచరణములమీఁద నీకు దృఢమగు భక్తికలదు. పతివ్రతధర్మము నీమనస్సులోఁ బూర్ణముగఁ గలదు. నీగుణములను వర్ణించి, యేమి చెప్పఁగలను? నీమనస్సునకు వచ్చినవరమును గోరుకొనుము." ఇట్లు శ్రీరాముఁడు పలికిన పలుకులను వారు విని, ఆనందబాష్పములను విడిచి, చేతులను జోడించుకొని, నిలువఁబడిరి. "ఓ రాజాధిరాజా! దానమునిచ్చుటలో మీరు కల్పవృక్షముతో సమానులు; పవిత్రముఁ జేయుటలో, మీ చరణకమలములు గంగతో సమానములు; వానినిదర్శించినమాత్రమున, మేము పరమపవిత్రుల మయితిమి. మాతోసమానులగు స్త్రీలు మఱియొకరు లేరు.

ఛాంద్ 28

"ఓ రఘునాథా! మావంటి ధన్యులగు స్త్రీలు లోకములో నెవరుకలరు? మీదర్శనమును బ్రసాదించి, మమ్ములను మీరు పవిత్రముఁ

జేసితిరి. ఓ పతితపావనా! ఓ రాక్షసాంతకా! ఓ కృపాసాగరా! మీ కీర్తి దిగంతములకు వ్యాపించెను. ఓ దేవతానందదాయకా! మా కీవరమును బ్రసాదింపుము. శ్రమలేకయే, మేము మానాథునిలోకమును బొందునట్లు కటాక్షింపుము. ఓ లక్ష్మీపతీ! మీకీర్తి వ్యాపించును."

సోరఠా 12

ఈప్రకారము బిందుమతి విన్నవించి, సవతితోఁగూడి, రాముని చరణములమీఁదఁ బడెను. అతఁడు వారిని లేవఁదీసి, వారితో నిట్లు సంభాషించెను.

చౌపాయ్

"ఓ బిందుమతీ! మీరు ధైర్యముగనుండుఁడు; భయమును విడిచిపెట్టుఁడు; మీనాథుని వెంటఁదీసికొని, స్వగృహములకు వెళ్లి, సుఖముగ జీవింపుఁడు." "ఓ నాథా! మీరు మీకటాక్షమును జూపించితిరి; ఇఁక నామనస్సులోఁ గలకోరికను వినుఁడు. ఓ నాథా! పార్వతితోఁగూడి శివుఁడు విరాగియై, సదా మీదర్శనమునం దనురాగముకలవాఁడై యుండును. సనకసనందనాదులును, నారదాదిబ్రహ్మర్షులును నిత్య మనేక జప, తపములం జేయుచుందురు; వారయినను, మావలె, మీచరణకమలములను సంపూర్ణముగఁజూచిన సుఖము ననుభవించియుండలేదు. లోకములోని సౌఖ్యములన్నియు మీదర్శనముతో లవలేశము సమానము కావు. అమృతముతోఁ గడుపును నింపుకొని, విషము నెవఁడుకోరును? ఓ దేవదేవా! ఇదియే, నావిన్నపము; మానాథునిశిరస్సును మాకు దయచేయుఁడు. ఓ దయానిధీ! ఇదియే, మాకోరిక."

దోహా 229

ఇట్లు వారు ప్రార్థించినందున, శ్రీరాముఁడు నరాంతకునిశిరస్సును దెప్పించి, వారికిచ్చెను. ఓ గరుడా! వారు స్వనాథుని శిరస్సును గైకొని, సంతసించి, యిట్లు విన్నవించిరి.

చౌపాయ్

"ఓ నాథా! మావిన్నప మొకటికలదు; దారువులు వినాగా, మాశరీరముల నెట్లు దహింపఁజేయఁగలము?" అసుఖసాగరుఁడు వారి

మాటలను విని, అంగద-హనుమదాది వానరయోధులనుఁ బిలిచి, "ఓ సఖులారా! మీరు లంకలోఁ బ్రవేశించి, చందనాగరు సుగంధద్రవ్యములను దీసికొనిరండు." అని యాజ్ఞాపించెను. అతని యాజ్ఞప్రకారము వారు పరుగెత్తి, లంకలోఁ బ్రవేశించి, చందనాగరుద్రవ్యములను బ్రతిగృహములో వెదకి, అపరిమితముగ వానినిఁ బట్టుకొని, శ్రీరాముని వద్దకు వచ్చిరి. అప్పుడు శ్రీరాముఁడు విభీషణునిఁ జూచి, "ఓ లంకేశా! ఈ హితోపదేశమును వినుము. బిందుమతి కోరినస్థలములో, నీవీ చందనాగరుద్రవ్యములను జేర్పించి, రమ్ము. ఈసమయమున, రావణునిమీఁద నీకుఁగలవైరమును విడిచి, చితినిఁ జేర్పించి, రమ్ము." అని యాజ్ఞాపించెను.

దోహా 230

శ్రీరామునియాజ్ఞాప్రకార మనేక చందనాగరుద్రవ్యముల నతఁడు వెంటఁదీసికొని, రుద్రభూమికి నడచెను.

చౌపాయ్

మేఘనాదునిభార్య సులోచన, సహగమనము జేసినస్థలములో, వారు బిందుమతినిమిత్తము చితినిఁ జేర్చిరి. బిందుమతికి యత్యంతప్రియులగు తదితరసవతులాసమయమున కచ్చుటకు వచ్చిరి. వారు స్మారకము తప్పి, మూర్ఛిల్లి, నేలఁబడిరి. బిందుమతి చేయఁదలచినవ్యాపారమును వారు విని, యచ్చటకు వచ్చిరి. నిప్పుఁజూచి, పరుగెత్తుమృగములువలె, ఒదునాల్గురుస్త్రీలు వేగముగఁ బరుగెత్తివచ్చిరి. వారు హాహాకారముఁ జేయుచు, "ఓ ప్రియసఖి! బిందుమతీ! నీ వెచ్చటనుంటివి? మమ్ములను విడనాడి, యెచ్చటికిఁ బోయియుంటివి?" అని విలపించుచు వచ్చిరి. వారు బిందుమతి - చిత్రరేఖలను జూచి, సంతసించిరి. అదృష్టవంతులగు పదియార్గురుసవతులు సహగమనముఁ జేయుటకు నిశ్చయించిరి. వారు క్రుంకులిడి, మృతకళేబరమునకు స్నానము జేయించి, శ్రీరాముని ధ్యానించిరి.

దోహా 231

ఓ గరుడా! ఇంతలో రావణుఁడు మూర్ఛనుండి లేచెను; బిందుమతివృత్తాంతమును వాఁడు విని, మందోదర్యాదిస్త్రీలతోఁ గూడి, సహగమనస్థానమునకు వచ్చెను.

చౌపాయి

భేరీమృదంగములధ్వనులను వానరులు విని, యెవఁడో వీరుఁడు యుద్ధమునకు వచ్చుచుండెననియు, అచ్చట నిలిచియుండుట యుచితము కాదనియు, విచారించిరి. పదివేలవానరులు శ్రీరామునివద్దకు వచ్చి, అతనిచరణములకు నమస్కరించి, "ఓ నాథా! ఆ సహగమనస్థానము వద్దకు రావణుఁడు వచ్చుచుండెను. ఓ జనరక్షకా! మీయాజ్ఞను శిరసావహించెదము." అని విన్నవించిరి. "ఓ కుముదుఁడా! నీవు శీఘ్రము విభీషణునిఁ దీసికొని రమ్ము" అని శ్రీరాముఁ డాజ్ఞాపించెను. అతఁడు శ్రీరాముని యాజ్ఞాప్రకారము వెడలి, శీఘ్రము విభీషణుని సమీపించి, "ఓ రాక్షసనాయకా! మిమ్ములను దీసికొనిరమ్మని శ్రీరామాజ్ఞ యయ్యెను." అని చెప్పెను. అతఁడు కోదండమ్రను యథావిధిగ బోధించి, కుముదునితోఁ గూడి, శ్రీరామునివద్దకు వచ్చెను.

దోహా 232

మోహాంధకారమును బోఁగొట్టుటకుఁ బ్రచండభానుఁడగు శ్రీరామునిచరణముల కదృష్టవంతుఁడగు రావణునితమ్ముఁడు నమస్కరించి, అతనియాజ్ఞఁ గైకొని, నిలువఁబడెను.

చౌపాయి

బిందుమతి-చిత్రరేఖలు సహగమనముఁ జేయఁదలఁచినస్థలమునకు రావణుఁడు మందోదర్యాదిస్త్రీలతోఁ గూడి, వచ్చెను. వారినిఁ జూచి, రావణుఁడు వ్యాకులుఁడై, విలపించెను. మందోదర్యాదిస్త్రీలు యేడ్వసాగిరి. శ్రీరాముని దర్శించినపిమ్మట, బిందుమతికి నూతనముగ జ్ఞానము ప్రాదుర్భావ మయ్యెను; ఇట్లు విలపించుచుండిన అత్తమామల నామెచూచి, జ్ఞానోపదేశమును జేసి, వారిని బోధించి, భర్తకళేబరమునుఁ బట్టుకొని, చితిపైఁ గూర్చుండెను. భర్త బ్రతికియుండినపుడు స్వగృహములో నేయేస్థానములో వారు పతితోఁగూడి కూర్చుండి యుండిరో, ఆప్రకారము నారిద్దఱు కళేబరమునుజుట్టి, చితిపైఁ గూర్చుండిరి. అంతలో దానికి నిప్పుఁ దగిలించిరి; అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లెను; క్షణములో వారు స్వర్గమునకు వెళ్లిరి. దేవతాస్త్రీలు వారినిఁ జూచి, కొనియాడి, స్వస్థానములకు నిష్క్రమించిరి. రావణుఁడు

మందోదరాదిస్త్రీలతోఁ గూడి, విలపించుచు, స్వగృహములోఁ బ్రవేశించెను.

ఛాంద్ 29

దుఃఖాక్రాంతుఁడై, సందేహించుచు, రావణుఁడు, మందోదరాదిస్త్రీలతోఁ గూడి, స్వమందిరములోఁ బ్రవేశించెను. ఆ స్త్రీలరోదనమును వాఁడు చూచి, మూర్ఛిల్లెను. వాని దుర్దశనుజూచి, రాక్షసులు, స్త్రీపురుషులు యేడ్వసాగిరి. దుఃఖ, భయ, సంతాప, విలాప, సందేహాదుల సేనలువచ్చి, లంకలో విడిదిఁజేసెను.

దోహా 233

శ్రీరాముని తో విరోధించినందునఁ గలుగుఫలము ననుభవించుటకుఁ దగినదినము రావణునకు సంప్రాప్తమయ్యెను. రణభేరిని మ్రోఁగించి, విపత్తి లంకలోనికి వచ్చి, దిగెను.

చౌపాయ్

ఆ దేవదేవుఁడు, ఆ త్రిజగద్వంద్యుఁడు, ఆ లోకారాధ్యుఁడు, శ్రీరాముఁడు సుఖాసీనుఁడై, దేదీప్యమానముగ వెలుఁగుచుండెను. అతనిని వానరులు పరివేష్టించి, సుఖాసీనులై యుండిరి; వారిమనస్సులు శ్రీరాముని చరణారవిందములయందు లీనమై యుండెను. గొప్ప శత్రువు సంహరింపఁబడినందుకు వారు సంతోషించుచుండిరి. మాటిమాటికి వారా నీలమేఘశ్యాముని శరీరమును విలోకించుచుండిరి. వారియనురాగమును శ్రీరాముఁడు కనిపెట్టి, శివనామసంకీర్తనముఁ జేయుమని తమ్ములతోఁ బలికెను. ఓ భరద్వాజా! శ్రీరామునియాజ్ఞప్రకారము వానరులు, కోకిలకు సిగ్గువచ్చునట్లు, మధురస్వరములతో శివనామమును గానముఁజేయ నారంభించిరి. డమరు, భృంగి, శృంగి, తాళము-ఈ మొదలగువాద్యములను వారు ముక్కుతోను ముఖముతోను, హస్తములతో నభినయించి, వానివానిధ్వనులను యథావిధిగ వినిపించుచుండిరి. గోండర, సంతు, వేణు, శంఖ, మంజీర, మృదంగాది వాద్యములధ్వనులను వారు ముఖములతోనే వినిపించిరి; అభినయించుచు, వారు నాట్యముఁజేసిరి; పార్వతీపరమేశ్వరుల నామమును వారు గానముఁజేసిరి.

ఛాంద్ 30

ఈప్రకారము వానరభల్లూకములు పరమానందభరితులై, శ్రీపురాణదంపతులకీర్తిని గానముఁ జేసిరి. వానరభల్లూకములు శ్రీరామలక్ష్మణుల చరణారవిందములయందు మనస్సులనుసంధించి, వారిరువుర దివ్యమంగళవిగ్రహములను ధ్యానించుచుండిరి. వానరులగానమును కౌతుకమును శ్రీరాముఁడు చూచి, స్వయము శ్రీ పార్వతీపరమేశ్వరులను స్తోత్రము జేయ నారంభించెను.

ఈధ్యానములో మునిఁగియుండినవారు సత్కీర్తిని, సకలసుఖములను బొందఁగలరని, తులసీదాసుగారు చెప్పుచున్నారు.

సోరఠా 13

ఈప్రకారము వారు పరమానందములో మునిఁగి తేలుచుండ, రెండుయామములరాత్రి, గతించెను. అప్పు డాకరుణాసముద్రుఁడు, శ్రీరాముఁడు, వారికోరికలను సఫలముఁ జేసి, స్వస్థానములకు వెళ్లి, విశ్రమింపుఁడని వారికి సెలవునిచ్చెను.

చౌపాయ్

ఆ మహావీరులగు వానరులు స్వస్థానములకు వెళ్లి, సుఖముగ నుండిరి. శ్రీరాముఁడు తమ్మునితోఁ గూడి, దేదీప్యమానముగ బ్రకాశించుచుండెను. ఇట్లు పరమానందములో మునిఁగితేలుచు, వానరభల్లూకసైన్యములు జయజయశబ్దములం జేయుచు, శోభించిరి. ఓ పార్వతీ! శ్రీరాముని కటాక్షమువలన, నేను నీకీ చక్కనిచరిత్రమును వినిపించినాను. ఓ గిరిరాజకుమారీ! నీమనస్సులో సంపూర్ణాభిలాష కలదు కనుక, ముందుచరిత్రమును జెప్పుచున్నాను; సావధానముగ వినుము.

అంతలో నర్ధరాత్రివేళ, రావణుఁడు మూర్ఛనుండి లేచెను; కొందఱుమంత్రులు పలువిధముల వానిని బోధించుచుండిరి. గొప్ప గొప్పమహాపండితులు వానివద్దకు వచ్చి, హితోపదేశముఁ జేసి, యలసి పోయిరి. వారు చెప్పినమాటలలో నొకమాటఅయినను వానిబుద్ధికి నచ్చలేదు. విధాత మనస్సులోఁ దలంచినవిధమున, వాఁడుకూడ తలంచెను; వానితలంపు నెవరు త్రిప్పఁగలరు? భగవంతునితో విరోధించి,

శుభములను గోరువాఁడు, మూర్ఖుఁడు; అజ్ఞాని; మోహామునకు వశ్యుఁడు.

దోహా 234

నరాంతకుఁడు సేనలతో మడిసినవిధమును దూతవలన రావణుఁడు విని, పాడ్యమిదినమున స్వసైన్యములను సమరసన్నాహముఁ జేసి, శ్రీరామునితో స్వయముగఁ బోరాడుటకు వెడలెను.

---

# ఏకాదశవిశ్రామము



చౌపాయ్

ఈప్రకారము రావణుఁడు బకవాదముఁ జేయుచుండ, తెల్లవాఱెను. నాలుగు సింహద్వారములవద్దకు వానరులు వచ్చి, యుద్ధముఁ జేయ నారంభించిరి. అప్పుడు రావణుఁడు రాక్షసయోధులఁ బిలిచి, వారితో నిట్లు ప్రసంగించెను. "ఓ యోధులారా! యుద్ధముఁజేయుటకు మీగుండెలు జాఱినయెడల, మీరిప్పుడే యుద్ధమునుండి మరలుట యుచితము. యుద్ధముఁజేయుచు, సగములో మీరు పాఱిపోవుట మంచిపని కాదు. మీభుజబలముఁ జూచుకొని, నేను వైరముఁ బాటించితిని. నన్నెదిరించి, యుద్ధమునకు వచ్చినశత్రువునకుఁ దగినశాస్తిఁ జేయఁగలను." ఈప్రకారము వాఁడు చెప్పి, వాయువేగమువంటిరథమును సన్నద్ధముఁ జేసెను; రణభేరులు మ్రోఁగుచుండెను. చీఁకట్లను వ్యాపింపఁజేయుచుండిన కాటుకకొండలో యనునట్లు, అతులితబలవంతులగు రాక్షసవీరులు వెడలిరి. అప్పుడు దుశ్శకునములు కనఁబడెను; భుజబలముచే గర్వించినరావణుఁడు వానిని లక్ష్యముఁ జేయలేదు.

ఛాంద్ 31

రావణుఁడు గర్వించి, శుభాశుభశకునములను నిర్లక్ష్యముఁ జేసెను. చేతులలోనుండిన ఆయుధములు విఱిగిపడెను. రథములపైనుండి రథికులు నేలఁబడిరి. గజాశ్వములు శీత్కారములఁ జేయుచుఁ

బరుగెత్తెను. గృధ్రములును, నక్కలును కుక్కలును భయంకరముగ మొఱవెట్టెను; వీని మొరలవలన, రావణునిమృత్యువు సమీపించె నని తెలియుచున్నది. కాలునిదూతవలె, భయంకరముగ గ్రుడ్లగూబ అఱచెను.

దోహా 235

భూతములతో వైరముఁ బూనినవానికి, స్వప్నమందైనను శుభ శకునములుగాని, సంపదలుగాని, మనస్సునకు శాంతిగాని, లేశమైనఁ గలుగదు; మోహామునకు వశీభూతుఁ డగుకాముఁడు, రామునితో విరోధించినపుడు, సుఖమును బొందఁడు.

చౌపాయ్

రాక్షసుల రథగజతురగపదాతులతో గూడిన చతురంగబల ములు సంతతధారగ యుద్ధమునకు నడచెను. అనేకవిధములగు వాహా నములును, రథములును, యానములును వెడలెను; వానినిఁజెప్పుటకు శక్యము కాదు; నానావిధ ధ్వజ, పతాకములు శోభించెను. మదగజ యూథములు వేలకొలఁది నడచెను; అనేక మాయలనెఱింగిన రాక్షస యోధులు కోట్లకొలఁది యుద్ధమునకు వెడలిరి. వీరవసంతుఁడు తనసేన లను వ్యూహముఁ బన్ని, యుద్ధమునకు నడిపించినట్లు, రాక్షసులసైన్య ములు శోభించెను; ఆ రాక్షససైన్యములు నడచినపుడు దిగ్గజములు ఘూర్ణిల్లెను; సాగరములు క్షోభించెను; పర్వతములు క్రుంగెను; అంత రిక్షమున ధూళివ్యాపించి, సూర్యునిఁ గప్పెను; వాయువు స్తంభిం చెను; భూమి కంపించెను; మహాప్రళయకాలమేఘములు గర్జించినట్లు, రణభేరులు భయంకరముగ మ్రోఁగెను; యోధులకు హెచ్చరిక పుట్టిం చుటకు 'మారూ' రాగముతో 'భేరీ, నఫేరీ, సహనాయి' మొదలగు వాద్యములు చెలరేఁగెను; వీరులు సింహనాదములఁ జేసి, వీరాలాప ముల నాడుచుండిరి.

"ఓ రాక్షసవీరులారా! మీరు వానరభల్లూకములను జయించి, చెండాడి, మర్దింపుఁడు; ఆ యిరువురుతపశ్శాలులను నేను సంహరించె దను" అని రావణుఁడు పలికి, సేనాసమ్ముఖమున నడచెను. ఈసమాచా

రమును వానరులు తెలిసికొని, 'రామదుహాయి' అని సింహనాదముఁ జేసి, పరుగెత్తిరి.

ఛాండ్ 32

బాణములతో నెగురఁగొట్టఁబడిన తెక్కలుగల పర్వతములవలె మహాక్రూరులగు వానరభల్లూకములు, కాలునివలె, యుద్ధమునకు వెడలిరి ; నఖములును, దంతములును, పర్వతములును, వృక్షముల నాయుధములుగఁ జేసికొని, వానితో వారు పోరాడి, రాక్షసులఁ గొట్టుచుండిరి ; వారు మహాబలవంతులు ; వారికి లేశమపి శంక లేదు ; 'మదగజమువంటి రావణుని సంహరించుటకు సింహమునుబోలిన రామచంద్ర మహారాజునకు జయము కలుగుఁగాక' అని వానరులు సింహనాదముఁ జేసి, రాముని సత్కీర్తినిఁ బొగడి, యుద్ధమునకు నడచిరి.

దోహా 236

వానర - రాక్షససైన్యములు జయజయశబ్దములఁ జేసి, ద్వంద్వయుద్ధము నారంభించిరి ; సరిసమాను లగు యోధులు పోరాడిరి ; 'రావణకీ - జయ్' అని రాక్షసులును, 'రామజీకీ - జయ్' అని వానరులును ఘోషించి, యుభయసైన్యము లెదుర్కొనెను.

చౌపాయ్

రావణుఁడు రథము నధిష్ఠించియుండెను ; శ్రీరామమూర్తి పాదచారియైయుండుట విభీషణుఁడు చూచి, అధైర్యపడి, సందేహించి, ప్రేమాతిశయములు హృదయములో నుప్పొంగ, రామునిచరణములకు నమస్కరించి యిట్లు విన్నవించెను ; "ఓ నాథా ! మీకు రథము లేదు ; పాదత్రాణములు లేవు ; కవచము లేదు ; ఈ బలవంతుఁడగు శత్రువునెట్లు మీరు జయింపఁగలరని నాకు సందేహము కలుగుచున్నది." ఆ కృపాసముద్రుఁడు, శ్రీరాముఁడు విభీషణునితో నిట్లు చెప్పెను. "ఓ సఖుఁడా ! జయముకలుగుటకుఁ దగినరథము వేరొకటి కలదు ; దానిం జెప్పుచున్నాను ; వినుము. ఆరథమునకు ధైర్యమును, శౌర్యమును—రెండుచక్రములు ; సత్యమును, సుశీలమును—ధ్వజపతాకములు ; బలము, వివేకము, దమము, పరహితము—నాలుగుగుఱ్ఱములు ; క్షమయు, దయయు, సమత్వమును—వానికళ్లెములు ; శంక

రథజన—సుజ్ఞానియగు సారథి; వైరాగ్యము—డాలు; సంతోషము—కత్తి; దానము—పరశు; బుద్ధి—ప్రచండశక్తి; ఉత్తమజ్ఞానము—కఠినధనస్సు; అనర్థత్యాగము, సంయమము, నియమము (వేదవిహితార్థములను పాలించుట)బాణములు; నిర్మలమగు నిశ్చలమనస్సు—అంబులపొది; బ్రాహ్మణచరణములను బూజించుట—అభేదకవచము. ఇట్టిరథికుని యేయుపాయముచేత నెవఁడు జయింపఁగలఁడు? ఓ సఖా! ధర్మరథముపైఁ గూర్చుండినరథికుని యెవఁడును జయింపలేఁడు; సకల జనులను వాఁడే జయించును.

దోహా 237, 238, 239

"ఓ సఖా! ఏవీరుఁడు మహాఘోరమగు సంసారశత్రువును జయింపఁగలఁడు? ఇట్టి దృఢరథముగలవాని నెవఁడు జయింపఁగలఁడు?" ఈప్రకారము శ్రీరాముఁడు పలికినపలుకులను విభీషణుఁడు విని, సంతసించి, రాముని చరణములనుఁ బట్టుకొనెను; "ఓ నాథా! ఓ కృపాసాగరా! ఇట్లు మీరు నా కుపదేశించితిరి. అనేకవందనములఁ జేయుచున్నాను." అని యతఁడు విన్నవించెను. ఇచ్చట రావణునియోధులు 'ఛీ' యని యుద్ధము నారంభించిరి; అచ్చట రామునివీరులు అంగద హనుమదాదులు పోరాటమునకు సిద్ధపడిరి. ఉభయసైన్యములవీరులు వారివారిప్రభువులకు జయము కలుగవలెనని, జయజయశబ్దములఁ జేసి, వారినామముల నుచ్చరించి, వారిమీఁద నొట్టుఁబెట్టుకొని, యుద్ధము నారంభించిరి.

చౌపాయ్

ఆసమయమున బ్రహ్మాదిదేవతలును, మునులును, సిద్ధులును, విమానారూఢులై యంతరిక్షమున నిలిచి, రణకౌతుకమును జూచుచుండిరి; ఓ పార్వతీ! ఆసమయమున దేవతలతోఁ గూడి, నేనును విమానమునెక్కి, శ్రీరాముని రణచరిత్రమునుజూచుట కంతరిక్షమున నిలిచి యుంటిని. అప్పుడు రణస్థలమున రెండుపక్షములయోధులును మదించి యుండిరి; వానరులను జంపవలెనని రాక్షసులు మండిపడుచుండిరి. ఒక వానరుఁ డొకరాక్షసునిఁ బొడిచి చంపుచుండెను; మఱియొకఁడు మఱియొకరాక్షసుని మర్దించి, నేలఁగొట్టి సంహరించెను; వానినిఁ గొట్టి,

చంపి, భూమిమీఁదఁ బడఁగొట్టును; వానిశిరస్సును ద్రుంచి, వాని చేతుల నూడఁబెఱుకును; వానికడుపును జించును; వానిభుజములను ఖండించును; వానిపాదములఁ బట్టుకొని, గిరగిరఁ ద్రిప్పి, నేలమీఁదఁ గొట్టును; మహావీరులగు వానరభల్లూకములు రాక్షసయోధులఁ బట్టుకొని, వారిని నేలఁగొట్టి, చంపుచుండిరి; వారిని భూమిలోఁ బాతిపెట్టి, వారిమీఁద నిసుకను గప్పుచుండిరి. ఈప్రకారము మహాశూరులగు వానరులు ఘోరయుద్ధముఁ జేసిరి; కరాళుఁడగు మహాకాలుఁడు కోపించి వచ్చినట్లు, వానరులు పోరాడిరి.

ఛాంద్ 33, 34

రాక్షసులు కాలునివలె, రౌద్రాకారులై, వానరులఁ దారొక్కనిరి; వానరులశరీరమునుండి రక్తము ప్రవహించెను; వారు రాక్షససైన్యములను మర్దించి, మేఘములువలె, గర్జించుచుండిరి; రాక్షసుల చెంపలమీఁదఁ గొట్టుచుండిరి; పండ్లతోఁగొఱికి, కాళ్లతోఁ దన్ని, వెక్కిరించుచుండిరి; రాక్షసులు నశించునట్లు, వారు చమత్కారములఁ జేసిరి.

రాక్షసులను గట్టిగఁబట్టుకొని, వారిదాడలను జీల్చి, వారిప్రేగులను వానరులు తమకంఠములకుఁ దగిలించుకొనుచుండిరి; అనేకరూపములను ధరించి, నృసింహమూర్తి సమరాంగణములోఁ గ్రీడించునట్లు, వానరులు వినోదముఁ జేసిరి. 'పట్టు, కొట్టు, పడఁద్రోయుము' అను మాటలు భూనభోంతరాళములు నిండెను. 'శ్రీరామజీకీ జయ్' అతని కటాక్షమువలన తృణము వజ్రమగును; వజ్రము తృణమగును. తృణమువంటివానరులు వజ్రమువంటివారై, వజ్రమువంటి రాక్షసులను దృణమునువలె, మర్దించి, చంపిరి.

దోహా 240

రాక్షససైన్యములు విఱుగఁబడుట రావణుఁడు చూచి, పది చేతులతోఁ బదిధనస్సులను, రెండవ పదిచేతులతో బాణములనుఁ బట్టుకొని, క్రోధతామ్రాక్షుఁడై, పరుగెత్తుచుండిన రాక్షససైన్యములను మరలించెను.

చౌపాయ్

ఇట్లు రౌద్రాకారుఁడై వచ్చిన రావణుని వానరులు చూచి హాహాకారముఁ జేసి, యెదుర్కొనిరి; వృక్షములను, రాళ్లను, పర్వతములను వానిమీఁద నొక్కపెట్టున వారు ప్రయోగించిరి; అవి, వజ్రమువంటి వానిశరీరమును దగిలి, చూర్ణమయ్యెను; మఱికొన్ని, ముక్కలై, తెగిపడెను. ఆ లోకరావణుఁడు రథమును నిలిపి, నిశ్చలముగ నిలిచెను; వాఁడు మద్యపానముఁ జేసియుండెను; దానికిఁదోడు యుద్ధమదముచే, వాఁడు ఘూర్ణిల్లుచుండెను; ఇట్లు రణదుర్మదుఁడగు రావణుఁడు కోపించి, పోరాటమునకు వచ్చెను; వాఁడు నలువైపుల గిరగిరఁదిరిగి, వానరసైన్యములను మర్దించెను; వానరులు భయపడి, నలుదిక్కులకుఁ బరుగెత్తి, "ఓ అంగదా! ఓ ఆంజనేయా! త్రాహి, త్రాహి" అని మొఱవెట్టిరి "ఓ రఘువీరా! రక్షింపుము; రక్షింపుము. ఈదుర్మార్గుఁడు కాలునివలె, వచ్చెను." అని వారు బొబ్బలిడిరి. వాఁడు పదిచేతులతోఁ బదిధనస్సులఁ బట్టుకొని, బాణములనుసంధించుట వానరులు చూచి, పరుగెత్తిరి;

ఛాంద్ 35

వాఁడు ధనస్సునకు సంధించి, ప్రయోగించినబాణములు, సర్పములవలె వచ్చి, వానరులశరీరములఁ దాఁకెను; భూనభోంతరాళములు బాణములతో నిండెను; దశదిక్కులకు వానరులు పరుగెత్తిరి; కోలాహలము నలువైపుల వ్యాపించెను; వానరులు మహావ్యాకులులై, "ఓ రామా! ఓ కరుణాసాగరా! ఓ దీనబంధూ! ఓ ఆర్తత్రాణపరాయణా! రక్షింపుము; రక్షింపుము" అని దీనాలాపములఁ బలికిరి.

దోహా 241

వానరసైన్యములవ్యాకులమును లక్ష్మణుఁడు చూచి, క్రోధతామ్రాక్షుఁడై, తరకసమును నడుమునకు బంధించి, ధనుర్బాణములను ధరించి, శ్రీరాముని చరణములకు నమస్కరించి, యుద్ధమునకు వెడలెను.

చౌపాయ్

ఆ లక్ష్మణమూర్తి రావణునిఁ జూచి, "ఓరి దుర్మార్గుఁడా! వానరభల్లూకములఁ జంపిన నీ కేమి ప్రయోజనము? కాలునివంటి నన్నుఁ

జూడుము" అని తర్జించెను. "ఓయీ! నీవు నా పుత్రఘాతకుఁడవు. అనేకదినములనుండి నిన్ను వెదకుచున్నాను. ఈదినమున నిన్నుఁ జంపిన తరువాత, నాగుండెలు చల్లఁబడును." అని రావణుఁడు హుంకరించి, తీక్ష్ణమగు బాణములను బ్రయోగించెను; లక్ష్మణుఁడు వానిని వేయి ముక్కలుగ ఖండించెను; కోట్లకొలఁది యాయుధములను రావణుఁడు ప్రయోగించెను; తిలగింజలువలె, నతఁడు వానిని దునిమి, నివారించెను. అతఁడు మరల బాణములను బ్రయోగించి, రావణునిసారథిని జంపి, వానిరథమును జూర్ణముఁజేసెను; పర్వతశృంగములలోఁ బ్రవేశించు సర్పములువలె, నతఁడు ప్రయోగించిన నూరునూరుబాణములు వాని శిరస్సులలోఁ బ్రవేశించెను; మఱియొక నూరుబాణములను వాని హృదయముపైఁ బ్రయోగించెను; ఆదెబ్బతో వాఁడు నేలఁబడి, మూర్ఛిల్లెను; అంతలో వాఁడు మూర్ఛనుండి దిగ్గునలేచి, కూర్చుండి, రౌద్రాకారుఁడై, బ్రహ్మదత్తమగు నమోఘశక్తిని లక్ష్మణునిపైఁ బ్రయోగించెను.

ఛాంద్ 36

బ్రహ్మదత్తమగు ప్రచండశక్తి వచ్చి, లక్ష్మణునిహృదయమునకుఁ దగిలెను; దానిదెబ్బచే నతఁడు వ్యాకులుఁడై, నేలఁబడి మూర్ఛిల్లెను; అతనిశరీరమును రావణుఁడు లేవఁదీయుటకుఁ బ్రయత్నించెను; కాని, వానియత్నములు వ్యర్థములయ్యెను; ఆలక్ష్మణుని యతులితబలమును రావణుఁడు మూర్ఖుఁడు కనుక, తెలిసికొనలేక పోయెను; ఆ త్రిలోక ధారణుఁడు బ్రహ్మాండములను, రజఃకణమునువలె, శిరస్సుపై ధరించి యుండును కదా! ఆ మహానుభావుని వాఁ డెట్లు లేవఁదీయఁ గలఁడు?

దోహా 242

వాఁడు చేయుచుండినపనిని మహావీరుఁడు చూచి, పరుగెత్తి వెళ్లి, దుర్వాక్యములను బలికెను; అట్లు పరుగెత్తివచ్చిన మహావీరుని హృదయముపై నొకపిడిగ్రుద్దును వాఁడు గ్రుద్దెను.

చౌపాయ్

ఆదెబ్బతో మహావీరుఁడు చతికిలఁబడెను కాని, నేలఁ బడలేదు; అంతలో నతఁడు తెప్పరిల్లి, రౌద్రాకారుఁడై, దిగ్గునలేచి, రావణుని

ముష్టితోఁ బొడిచెను; పిడుగుపడిన శృంగమువలె, నాదెబ్బతో వాఁడు నేలఁబడి, మూర్ఛిల్లెను. అంతలో వానికిఁ జైతన్యముకలిగి, తెలివి వచ్చెను; వాఁడు మహావీరునిబలమును స్తోత్రముఁజేయ నారంభించెను. "ఓరీ దేవకంటకుఁడా! నాదెబ్బచే నీవు జయింపఁబడి, బ్రతికియుంటివి; నీవు లేచి, కూర్చుండినందున, నాబలము కాల్చనా? నాపౌరుషము కాల్చనా? ఛీ! ఛీ!" అని మహావీరుఁడు పలికి, లక్ష్మణుని నెత్తుకొని వెళ్లెను; ఆచిత్రమును వాఁడుచూచి, ఆశ్చర్యపడెను. "ఓ తమ్ముఁడా! మాటిమాటికి నీవు శక్తిచే బాధింపఁబడుట యుచితము కాదు. నీవు తెలివిఁదెచ్చుకొని చూడుము. నీవు కాలుని భక్షింపఁదగినవాఁడవు. నీబలమును స్మరింపుము." అని శ్రీరాముఁడు పలికినపలుకులను లక్ష్మణుఁడు విని, దిగ్గునలేచి, కూర్చుండెను. ఆ కరాళమగుశక్తి వ్యోమమార్గమున బ్రహ్మలోకమునకుఁ బోయెను. ఆ లక్ష్మణమూర్తి వెండియు ధనుర్బాణములను ధరించి, నడచివెళ్లి, శత్రువునియెదుట నిలిచెను.

ఛాంద్ 37

అతఁడు రావణునిరథమును గూల్చి, వానిపై బాణములను బ్రయోగించి, వానికి వ్యాకులముఁ గలుగఁజేసెను; వాఁడు నేలఁబడి, మూర్ఛిల్లెను; అతనిబాణములు వానిహృదయమును భేదించెను; అంతట వానిసారథి రెండవరథముపై వానినిడుకొని, వానిని లంకలోనికిఁ దీసికొనివెళ్లెను. ఆ మహాప్రతాపశాలియగు శ్రీరామానుజుఁడు తిరిగివచ్చి, రామునిచరణములకు నమస్కరించెను.

దోహా 243

అంత దశాననుఁడు తెలివిఁదెచ్చుకొని, చైత్రబహుళదశమినాఁడు, పాతాళహోమముఁజేయ నారంభించెను. ఆహా! రావణుఁడెంత పరమమూర్ఖుఁడు! రామునితో విరోధించి, వాఁడు జయముఁ గోరుచుండెను.

చౌపాయ్

వాఁడుచేయుచుండిన పాతాళహోమమునుసంగతిని మంత్రులవలన విభీషణుఁడు విని, శీఘ్రముగ రామునివద్దకు వచ్చి, యిట్లు విన్నవించెను. "ఓ నాథా! శీఘ్రముగ వానరులను బంపుఁడు. ఒకయజ్ఞ

మును రావణుఁడుచేయ నారంభించెను; ఆయజ్ఞము సాంతమయిన యెడల, వానిని జయించుట దుష్కరము; వానరులఁ బంపి వానియజ్ఞమును ధ్వంసముఁజేయవలెను; అప్పుడు యుద్ధమునకు వాఁడు తిరిగి వచ్చును." అంతఁ బ్రాతఃకాల మయ్యెను. శ్రీరామునియాజ్ఞాప్రకార మంగదహనుమదాదిమహావీరులు యజ్ఞవాటికకు నడచిరి. కౌతుకముఁ జేయుచు, వానరులు గంతులువేయుచు, లంకలోఁ బ్రవేశించి, నిర్భయముగ రావణునిగృహముఁ జొచ్చిరి; యజ్ఞదీక్షలో నుండినవానిని వారు చూచి, క్రోధతామ్రాక్షులై, "ఓరీ లజ్జాహీనుఁడా! రణమును విడిచి, గృహమునకుఁ బాఱిపోయి, బకధ్యానముఁజేయుచుఁ గూర్చుంటివా" అని వానిని వెక్కిరించిరి. అంగదుఁడు వానిని కాలుతోఁ దన్నెను; వాఁడు స్వార్థపరుఁడై యుండినందున, వారివైపుఁ జూడలేదు. వాఁడు తదేకధ్యానముతో నుండెను.

### ఛాంద్ 38

వాఁడు యజ్ఞదీక్షలోఁ గూర్చుండి, వానరులఁ జూడలేదు; వానిని వారు కంఠ్లతోఁ గొఱికిరి; కాళ్లతోఁ దన్నిరి; జుట్టుఁబట్టుకొని, వాని స్త్రీలను బలాత్కారముగఁ దీసికొనివచ్చిరి; ఆస్త్రీలు దీనులై, రోదనముఁ జేసిరి; అప్పుడు వాఁడు కాలాగ్నిరుద్రునివలె, మండిపడి, దిగ్గున లేచి, వానరులపాదములఁ బట్టుకొని, వారిని గిరగిరఁద్రిప్పి, నేలఁ గొట్టెను; ఈప్రకారము వానరులు వానియజ్ఞమును ధ్వంసముఁ జేసిరి; తఱుకుబెఱుకులు వారికి లేశమైన లేకపోయెను.

### దోహా 244

ఇట్లు వానరులు యజ్ఞమును ధ్వంసముఁజేసి, శ్రీరామునివద్దకు వచ్చిరి; రావణుఁడు జయమును నిరాశచేసికొని, క్రోధముచే మండిపడుచు, యుద్ధమునకు నడచెను (ఇంతవఱకును వానికిఁ గొంతయాశ యుండెను; కాని, ఇప్పుడు యజ్ఞము ధ్వంసముకావేగమే, వానికి అధైర్యము కలిగెను; యజ్ఞవిధ్వంసము వానినాశమును సూచించునని యజ్ఞదేవత చెప్పియుండెను; అందుచేత, వాఁడు జయమును నిరాశ చేసికొనెను.)

## చౌపాయ్

వాఁడు యుద్ధమునకు వెడలునపుడు, భయంకరమగు దుశ్శకునములు కనఁబడెను; వానిశిరస్సులపై గృధ్రములు కూర్చుండి, యెగురుచుండెను; వాఁడు కాలునకు వశ్యుఁడై, వానిని లక్ష్యముఁ జేయలేదు. వాఁడు రణభేరులను మ్రోఁగించుమని యాజ్ఞాపించెను. రథ, గజ, తురగ, పదాతులతోఁగూడిన రాక్షసచతురంగసైన్యములు పోరాటమునకు నడచెను. స్వనాశమునిమిత్త మగ్నిలోఁ బ్రవేశించుపతంగములువలె, రాక్షసులు శ్రీరామునితో యుద్ధముఁ జేయుటకు వెడలిరి. అప్పుడు దేవతలు శ్రీరామునివద్దకు వచ్చి, "ఓ నాథా! ఈదుర్మార్గుఁడు మమ్ముఁ జెప్పుటకు శక్యముకాని కష్టములఁ బెట్టి, దుఃఖముఁ గలిగించెను. వానితో వినోదముఁ జాలింపుము. ఓ దేవా! జానకీదేవి కడు దుఃఖముల ననుభవించుచున్నది" అని విన్నవించిరి. దేవతలు వారిదుఃఖములఁ జెప్పుకొనక, జానకి దుఃఖించుచున్నదని చెప్పినమాటలను శ్రీరాముఁడు విని, మందహాసము జేసి, దిగ్గునలేచి, బాణమును దువ్వెను. పుష్పములతో నలంకరింపఁబడిన జటామకుటము నతఁడు సవరించుకొనెను. అతనినేత్రము లరుణములు; అతనిశరీరము జలభరితమగు నీలమేఘముఁ బోలియుండెను; ఆశ్రీరాముని దివ్యమంగళవిగ్రహము జనులనేత్రముల కానందదాయకము; నడుమున కతఁడు పీతాంబరమును గట్టుకొనెను; తూణీరములను దానిపై బంధించెను; హస్తములో శార్ఙ్గకోదండమును ధరించెను.

ఛాంద 39

నడుమునకుఁ దూణీరములను, హస్తమున శార్ఙ్గధనస్సును, అజానుబాహువులును, విశాలవక్షస్థలమును, ఆవక్షస్థలమున భృగుమహర్షి పాదచిహ్నయు—ఇంతశోభస్కరముగనుండిన వీరరాముఁడు ధనుష్టంకారముఁ జేసినవెంటనే బ్రహ్మాండకటాహము బ్రద్దలయ్యెను; దిగ్గజము లులికిపడెను; కచ్ఛపమును శేషుఁడును వడఁకిరి; భూమి కంపించెను; సాగరములు క్షోభించెను; కులపర్వతములు క్రుంగెను.

దోహా 245

దేదీప్యమానముగ రణరంగమున వెలుఁగుచుండిన శ్రీరాముని దివ్యమంగళవిగ్రహమును దేవతలుచూచి, పరమానందభరితులై, పుష్పములను వర్షించి, ఆ సకలగుణధాముసకు, ఆ మహాబలవంతునకు, ఆ భూభారనివారణకర్తకు జయమగుఁగాక యని పలికి, దీవించిరి.

చౌపాయీ

ఇంతలో నపారమగు రాక్షససైన్యములు సంకీర్ణమై, తత్తఱపడుచు యుద్ధమునకు వచ్చెను; ప్రళయకాలమునఁ బిడుగులనువ్వుచు వెడలు సంవర్తకమేఘములువలె, రాక్షసుల నాశమునిమిత్తము వానరసైన్యములు వారినిఁ దార్కొనెను. దశదిశలమెరయు మెఱుపులవలె, శక్తి, శూలాద్యాయుధములు ప్రకాశించెను; మేఘగర్జనమువలె, రథ, గజ తురంగములశబ్దములు వినఁబడెను. అంతరిక్షమున వ్యాపించు ఇంద్రధనస్సువలె, వానరుల నిడుపగుతోఁకలు ప్రకాశించెను; మీఁదికి నెగురుచుండినధూళి జలధారలవలె నుండెను; శరపరంపరలు వర్షబిందువులువలెఁ బడెను. ఉభయపక్షములవారు విసరుచుండిన పర్వతములు, పిడుగులవలె, ధ్వనిజేయుచుఁ బడుచుండెను. శ్రీరామమూర్తి క్రోధతామ్రాక్షుఁడై, వర్షించిన బాణములవలన, రాక్షసులకు గాయములు తగిలెను; అతనిబాణములు వచ్చి తగిలినవెంటనే, రాక్షసులు చించుకొని, గిరగిరఁదిరిగి నేలఁబడుచుండిరి. పర్వతములనుండి ప్రవహించు ఝరీప్రవాహమువలె, రాక్షసులశరీరమునుండి రక్తప్రవాహము, పిఱికిపందలకు భయమును గలిగించుచుఁ బ్రవహించెను.

ఛాంద్ 40

పిఱికిపందలకు భయమును కలిగించుచు, రక్తనది హోరునఁ బ్రవహించెను; ఉభయపక్షములవారానదికి రెండుగట్లు; విఱిగి పడిన రథములు—ఇసుక; రథచక్రములు—సుడిగుండములు; ప్రవాహవేగమునఁ బోవుచుండిన రథ, గజ, తురగ, పదాతులు—జలజంతువులు; బాణములు, ఈటెలు, శక్తులు, తోమరములు, పరశువులు—పద్మములు; ధనుస్సులు—తరంగములు; డాలు—కూర్మము.

దోహా 246

నేలఁ గూలినవీరులు—నదీతీరమున నుండినవృక్షములు; మాంసము మెదడు మొదలగునవి—జలఫేనము; ఈ ఘోరమగునదిని బిఱికిపందలు చూచి, భయపడిరి; మహాయోధులు సంతసించిరి.

చౌపాయ్

ఆనదిలో భూత, ప్రేత, పిశాచగణములు స్నానముఁ జేయుచుండెను; భయంకరులగు యోగినులు పరమానందముఁ బొందిరి. తెగిపడి యుండినభుజములను బట్టుకొని, గృధ్రకాకములు మీఁదికి నెగురుచుండెను. ఒకదానినోటనుండి మఱియొకటి యీడ్చుకొని, దానిని భక్షించెను; "ఓరీ మూర్ఖుఁడా! ఇప్పు డింతసమృద్ధిగ నుండినను, నీదరిద్రము పోలేదా!" అని యొకప్రేతము మఱియొకప్రేతముతోఁ బలికెను. ప్రాణములు పోవుచుండినపుడు, సగముశరీరము నీటిలోను, సగముశరీరము బయటనుండినమనుజులవలె, గాయములు తగిలి, అచ్చటచ్చట పడియుండినవీరులు, సగము రక్తములోను, సగము బయటనుండి, మూల్గుచుండిరి. ఆనదీతీరమున గృధ్రములు కూర్చుండి, గాలముతో మీనములను బట్టుకొను మీలవాండ్రవలె, రాక్షసకళేబరములను త్రుంచి, వానిప్రేగులను బయటకుఁ దీయుచుండెను. నావకేళిమహోత్సవము జరగించుచుండినట్లు, రక్తనదిలో బోవుచుండిన మృతకళేబరములపైఁ గూర్చుండి, పక్షులు విహరించెను. యోగినులు పునుకలను రక్తముతో నింపుచుండిరి; అనేకవిధముల భూత, పిశాచములు నాట్యముఁ జేయుచుండెను; తాళములనువలె, యోధులపునుకలను మ్రోఁగించుచుండిరి; అనేకప్రకారముల చాముండులు గానముఁ జేసిరి; గుంపులుగుంపులుగ నక్కలువచ్చి, కటకటమని భక్షించుచు, నొకదానినొకటి తొందరొక్కొని, పోరాడుచు, గిరగిరఁ దిరుగుచు, "హూ, హూ" అని శబ్దములఁ జేయుచుండెను; శిరములు లేనిమొండెములు వేలకొలఁది రణరంగమునఁ బ్రమ్మరుచుండెను; తెగి, నేలఁ బడినశిరస్సులు 'జయజయ'శబ్దములఁ జేయుచుండెను.

ఛాంద్ 41

తెగిపడినశిరస్సులు 'జయ-జయ' శబ్దములఁ జేసెను; మొండెములు నలువైపులఁ బరుగెత్తుచుండెను; శత్రువున కెదురుగ నిలువఁబడి, ప్రాణముల నిచ్చినయెడల, స్వర్గము లభించుటయే, యుద్ధముయొక్క పరిణామము; అందుచేత, మహావీరులు హాహాకారిగఁ బోరాడి, స్వర్గమునకుఁ బోవుచుండిరి; వానరభల్లూకములు, వీరావేశులై, మదించి, రాక్షససైన్యములనుఁ జెండాడిరి; అనేకయోధులు రామబాణములచే నేలఁగూలి, రణరంగమున దీర్ఘనిద్రఁ బొందిరి.

(అధికపాఠము) సోరఠా 13

భగవంతుని నారాధించునపుడు, ఘంటారావము వినఁబడునట్లు, శ్రీరామునిధనుస్సుయొక్క ఘంటారావ మేడుదినము లహోరాత్రములు వినఁబడెను; ఈప్రకారము రాక్షసయోధులసంహారము జరగెను.

దోహా 247

ఆసమయమునఁ బదివేలయేనుఁగులును, పదిలక్షలరౌతులును, లక్షయేబదివేల రథికులును స్వర్గస్థులయిరి; అందుచేత, శ్రీరాముని ఘంట మ్రోఁగెను.

చౌపాయ్

పదికోట్లపదాతులు సంహరింపఁబడిరి; అప్పుడొక కబంధుఁడు లేచి, నాట్యమాడెను; ఈప్రకార మొకకోటి కబంధులు లేచి, నాట్యమాడిరి; అప్పు డొకఖేచరుఁడు లేచెను; ఆఖేచరుఁడు శిరస్సులేకయే, అంతరిక్షమునఁ దిరిగెను; ఒకకోటిఖేచరులు లేచి, తిరిగిరి; అప్పుడు శ్రీరాముని ధనుస్సుయొక్కఘంట యొకపర్యాయము మ్రోఁగెను.

శ్లో. ఏవం సప్తదినం ఖ్యాతం స్వర్గే మర్త్యే రసాతలే, ఆసీద్భూరి బలం నాశం రామరావణసంగరే. (అధికపాఠము సమాప్తము.)

దోహా 248

"ఆహా! రాక్షసులందఱు సంహరింపఁబడిరి; నే నేకాకిని; వానరభల్లూకము లనేకములు; కనుక, నేను రాక్షసమాయను విస్తరించెదను" అని రావణుఁడు తనలోఁదాను విచారించి, నిశ్చయించెను.

చౌపాయ్

శ్రీరాముఁడు నిలువఁబడి యుద్ధముఁ జేయుట దేవతలు చూచి, విచారించిరి; అప్పుడు సురపతి, తనసారథియగు మాతలినిఁ బిలిచి, రథమును శ్రీరామునివద్దకుఁ దీసికొనివెళ్లుమని యాజ్ఞాపించెను; ఆమాతలి సంతోషముతో రథమును దీసికొని వెళ్లెను. దేదీప్యమానముగ వెలుఁగుచుండిన దేవరథము నిరుపమానము; శ్రీరాముఁడు నవ్వి, దానిపైఁ గూర్చుండెను; ఆరథమునకు నాలుగుగుఱ్ఱములు కట్టఁబడియుండెను; ఆగుఱ్ఱములకు మరణము లేదు; వృద్ధాప్యము లేదు; అవి మనోవేగముగఁ బోవును. శ్రీరాముఁడు రథమునధిష్ఠించుట వానరులు చూచి, సంతోషించి, బలముచే గర్వించి, పోరాటమునకుఁ బరుగెత్తిరి. ఆవానరుల మదోద్రేకమును రావణుఁడు సహింపక, రాక్షసమాయను విస్తరించెను. ఆమాయ, శ్రీరాముని విడిచిపెట్టి, తదితరులపైఁ బ్రసరించెను. ఆ మాయాప్రభావముచే, ననేక రామలక్ష్మణులును, అపారమగు నిశాచరసైన్యమును వానరులకు గోచరమయ్యెను.

ఛాంద్ 42

అనేక రామలక్ష్మణులను వానరులు చూచి, విచారించి, భయపడిరి; చిత్రకూటములోవలె, లక్ష్మణునితోఁ గూడి, నిలువఁబడియుండిన రాముని వారు చూచిరి. వానరభల్లూకముల వ్యాకులమును శ్రీరాముఁడు చూచి, బాణమును బ్రయోగించి, యొకనిమిషములో రాక్షసమాయను బోఁగొట్టెను; అంతలో వానరులు సంతోషించిరి.

దోహా 249

అప్పుడు శ్రీరాముఁడు వానరులఁజూచి, "ఓ వానరవీరులారా! మీరు శ్రమపడియుంటిరి; కనుక, యుద్ధముఁజాలించి నిలువఁబడుఁడు; రామరావణులయుద్ధముఁ జూడుఁడు." అని మేఘగంభీరవాక్యములతోఁ బలికెను.

చౌపాయ్

ఈప్రకారము పలికి చెప్పి, బ్రాహ్మణుల చరణకమలములకు మానసికముగ నమస్కరించి, రథమును నడిపించెను. అప్పుడు రావణుఁడు క్రోధతామ్రాక్షుఁడై, గర్జించి, రామని రాముని నెదుర్కొని, యిట్లు

పలికెను. "ఓ తపశ్శాలీ! యుద్ధములో నీవు రాక్షసవీరులను సంహరించియుంటివి; నేను వారితో సమానుఁడను కాను. నాపేరు రావణుఁడు. నాకీర్తి లోకవిదితము. దిక్పాలురు నా కారాగృహములోఁ గలరు. నీవు ఖరదూషణాదిరాక్షసులను సంహరించి యుంటివి; వేఁటకానివలె, వాలిని జంపితివి; కుంభకర్ణుఁడు, మేఘనాదుఁడు మొదలగు రాక్షసయోధులను సంహరించితివి. ఈదినమున మన వైరము తుదముట్టవలెను; నీవు రణభూమిని విడిచి, పాఱిపోవక, నిలువఁబడియుండిన యెడల, నేఁడు నిన్ను కాలునిగృహమునకుఁ బంపుచున్నాను; ఇది నిశ్చయము. నేఁడు నీవు రావణునితోఁ బోరాడవలెను." కాలవశుఁడై రావణుఁడు పలికిన దుర్వచనములను శ్రీరాముఁడు విని, నవ్వి, వానితో నిట్లు పలికెను. "ఓయీ! నీమాటలు ప్రశస్తములు; సత్యములు; నీప్రభుత్వము లోకప్రసిద్ధము. ప్రగల్భములఁ బలుకుట యేల? నీవీరత్వముఁ జూపింపుము.

ఛాంద్ 43

"ఓరీ! నీబకవాదముఁ జాలింపుము; అందువలన, నీకీర్తి నశించును; ఓరీ మూర్ఖుఁడా! క్షమించి, నేను చెప్పఁబోవు నీతిమాటలను వినుము. లోకములో మూఁడువిధముల మనుజులుకలరు. ఒకరు పాటలీవృక్షమువంటివారు; అది పుష్పించును కాని, దానికి ఫలముండదు; మాటలఁ జెప్పువారు రీవృక్షమువంటివారు; పెక్కుమాటలే గాని, కార్యము శూన్యము. రెండవతరగతివారు రసాలముతో సమానులు; అది పుష్పించి, ఫలించును; అటులనే, వారు మాటలఁ జెప్పి, కార్యములఁ జేయుచుందురు. మూఁడవతరగతివారు పనసచెట్టుతో సమానులు; దానికిఁ బుష్పము లుండవు కాని, అది ఫలించును; అటులనే, వారు మాటలఁ జెప్పక, కార్యములఁ జేయుచుందురు."

దోహా 250

ఇట్లు శ్రీరాముఁడు బోధించినమాటలను వాఁడు విని, నవ్వి, "ఓయీ! నీవు నాకు బోధించెదవా! నాతో వైరముఁగట్టుటకు నీకు భయములేదా? తుదకు నీప్రాణములమీఁద, నీ కాశ పుట్టును. అందుచేత, నీ వీనీతులను బలుకుచుంటివి." అని చెప్పెను.

చౌపాయ్

ఈప్రకారము వాఁడు దుర్వాక్యములను బలికి, పిడుగువంటి బాణములను బ్రయోగించెను; అనేకవిధముల బాణములు వచ్చి, దశదిశలను, భూనభోంతరాళములను గప్పెను. ఆగ్నేయాస్త్రమును శ్రీరాముఁడు ప్రయోగించి, క్షణములో రావణునిబాణములను నాశనముఁ జేసెను. అప్పుడు వాఁడు కోపించి, తీవ్రమగుశక్తిని విడిచిపెట్టెను; ఆశక్తిని శ్రీరాముఁడు బాణముతోఁ ద్రిప్పి, వానిమీఁదికి బంపెను. కోట్లకొలఁది చక్రములను, త్రిశూలములను వాఁడు ప్రయోగించెను; వానిని శ్రీరాముఁడు తిలప్రమాణముగ ఖండించెను. దుష్టునిమనోరథములు నిష్ఫలమగునట్లు, వానిబాణములు నిష్ఫలమయ్యెను. అప్పుడు వాఁడు మండిపడి, మాతలిపై నూరుబాణములను బ్రయోగించెను. ఆదెబ్బలకు మాతలి తాళలేక, "జయ-రామ్" అని పలుకుచు, నేలఁబడి, మూర్ఛిల్లెను. అప్పుడు శ్రీరాముఁడు జాలిఁబడి, మాతలిని లేవఁదీసి, కూర్చుండఁ బెట్టెను. శ్రీరామునకుఁ గోపమువచ్చెను.

ఛాంద్ 44

శ్రీరాముఁడు రౌద్రాకారుఁ డయ్యెను; తూణీరములో నతనిబాణములు మీఁదికి నెగిరి వచ్చుచుండెను. శ్రీరాముని ధనుష్టంకారమునువిని, రాక్షసులు వికలులై, గుండెలను జాఱవిడిచిరి. భయమనునట్టి ప్రచండవాయువు వారినిఁ గదిలించెను. మందోదరిహృదయము కొట్టుకొనెను; కచ్ఛపము కంపించెను; పర్వతములు వణఁకెను. దిగ్గజములు, దంతములతో భూమినిఁబట్టుకొని, ఘీంకారముఁ జేసెను. ఈచిత్రమును జూచి, దేవతలు నవ్విరి; రావణసంహారమగునని వారు తలంచిరి.

దోహా 251

ఆకర్ణాంతము శ్రీరాముఁడు ధనుస్సును లాగి, బాణములను బ్రయోగించెను; సర్పములువలె, నతనిబాణములు మహావేగమున వెళ్లెను.

చౌపాయ్

ఱెక్కలుగల సర్పములువలె, నతనిబాణములు వెళ్లి, రావణుని సారథిని, గుఱ్ఱములను సంహరించెను; రథమును జూర్ణముఁ జేసెను;

పతాకమును పిండిజేసెను; వాఁడు గర్జించెను; కాని, వానిగుండెలు జారిపోయెను. మఱియొకరథముపై వాఁడు కూర్చుండి వచ్చి, కోపో ద్దీపితుఁడై, అనేకశస్త్రాస్త్రములను వర్షించెను. పరద్రోహుల మనోభీష్ట ములు సిద్ధిబొందనివిధమున, వాని యుద్యమములన్నియు నిరర్థక మయ్యెను; అప్పుడు వాఁడు పదిత్రిశూలములను బ్రయోగించి, దేవా శ్వములను నేలఁ బడఁద్రోసెను; శ్రీరాముని కృపాదృష్టిచే, నాయశ్వ ములు దిగ్గునలేచెను; అంత నతఁడు కోపించి, యొక తీక్ష్ణమగుబాణ మును బ్రయోగించెను. రావణుని శిరస్సులనునట్టి కమలవనములో నతనిబాణము, తుమ్మెదవలె బ్రవేశించెను. వాని యొక్కొక్కశిరస్సు నకు పదిబాణములు తగిలెను; వాని శిరస్సులనుండి, రక్తము వఱదలై కారెను. ఇట్లు రక్తము ప్రవహించుచుండినను వాఁడు బలముచే గర్వించి, రామునిమీఁదికి వెడలెను. అప్పుడు శ్రీరాముఁడు ముప్పది బాణములను ధనుస్సునకు సంధించి, ప్రయోగించెను; ఆబాణములు వానిశిరస్సులను భుజములను ఖండించెను. ఆతక్షణము వానిశిరస్సులును భుజములును నూతనముగఁ బుట్టి, వికసించెను; పునః శ్రీరాముఁడు వానిని ఖండించెను. ఈప్రకార మనేకపర్యాయములు వానిని ఖండిం చుచు, శ్రీరాముఁడు వినోదము జరపెను. అంతరిక్షమున వానిభుజ ములును శిరస్సులును వ్యాపించియుండెను; అనేక రాహుకేతువుల వలె నవి ప్రకాశించెను.

ఛంద్ 45

అనేకరాహుకేతువులు రక్తమును జిమ్ముచు నంతరిక్షమునఁ బరు గెత్తునట్లు, వానిభుజములును శిరస్సులును పరుగెత్తుచుండెను. శ్రీరాముని ప్రచండబాణములు తగిలినందున, నవి నేలఁబడలేదు. సూర్యుఁడు కోపించి, తనకిరణమున కనేకరాహువులను దగిలించినట్లు, శ్రీరాముని బాణమున కనేకశిరస్సులు తగిలియుండెను.

దోహా 252

విషయములను సేవించినకొలఁది, నిత్యము క్రొత్తక్రొత్త కోరి కలుపుట్టి, ప్రబలమగునట్లు, వానిశిరస్సులను శ్రీరాముఁడు ఖండించిన కొలఁది, అవి నూతనముగ బుట్టుచుండెను.

**చౌపాయ్**

తనశిరస్సులు పుట్టుచుండుట రావణుఁడుచూచి, మరణమునం గతి నుఱచి, కాలాగ్నిరుద్రుఁడై, దురభిమానముచే గర్వించి, గర్జించి, దశధనుస్సులను బట్టుకొని, రాముని నెదుర్కొనెను వాఁడు శరపరంపరలను వర్షించి, రామునిరథమును గప్పెను. ఒకఘడియవఱకు శ్రీరామునిరథము కనఁబడలేదు. మంచువలన సూర్యుఁడు కనఁబడనట్లు, రథము గోచరము కాలేదు. అప్పుడు దేవతలు హాహాకారముఁ జేసిరి; అంత శ్రీరాముఁడు కోపించి, ధనుస్సును సంధించి, రావణునిబాణములను నివారించి, వాని శిరస్సులను ఖండించెను. భూనభోంతరాళములును దిశదిశలును వానిశిరస్సులతో నిండెను. ఖండింపఁబడినశిరస్సులంతరిక్షమునఁ బరుగెత్తుచు, జయజయశబ్దములఁ జేయుచు భయమును గలిగించుచుండెను. "లక్ష్మణుఁ డేడీ! అంగద, సుగ్రీవు లేరి? కోసలాధీశుఁ డగు రాముఁడేడీ? హనుమంతుఁ డేడీ?" అని వానిశిరస్సులు పలుకుచుండెను.

**ఛాంద్ 46**

"రాముఁ డః!" అని వాని శిరస్సులు పలికి, పరుగెత్తెను ఈచిత్రమును వానరులు చూచి, భయపడి, పరుగెత్తిరి. అప్పుడు శ్రీరాముఁడు బాణమును బ్రయోగించి, ఖండింపఁబడినను బలుకుచుండిన వానిశిరస్సుల ముఖములను బంధించి, వానిగుండ రంధ్రములను బోడిచెను; ఆశిరస్సులతో నప్పుడు కాళికాదేవి, యొకమాలికను సిద్ధపఱచి, యోగినులతోఁ గూడెను. రక్తనదిలో స్నానముఁజేసి, స్త్రీలు త్రిరాత్రోపవాసముఁ జేసి, సంగ్రామవటవృక్షమును బూజించుటకు వచ్చినట్లు వారు కనఁబడిరి.

**దోహా 253**

అంత రావణుఁడు కోపించి, యొకశక్తిని బ్రయోగించెను; కాలుని కోదండమువలె, నది విభీషణునిమీఁదికి వచ్చెను.

**చౌపాయ్**

ఇట్లు విభీషణునిమీఁదికి వచ్చుచుండిన కరాళమగుశక్తిని, ప్రణతార్తిహరుఁ డగుశ్రీరాముఁడు చూచి, తత్తరపడి, విభీషణుని వెను

కకుఁ ద్రోసి, తాను స్వయముగ దానికెదురుగ నిలువఁబడెను. ఆ శక్తి వచ్చి, రాముని దాఁకెను; వినోదార్థ మతఁడు కొంచెముకాలము మూర్ఛిల్లినట్లు నటించెను; అతని దురవస్థఁజూచి, దేవతలు వ్యాకులులయిరి: శ్రీరామునకు సంభవించినకష్టమును విభీషణుఁడు చూచి, కోపించి, గదఁబట్టుకొని, రావణుని యెదురొక్కెను. "ఓరీ మూర్ఖుఁడా! ఓరీ మందమతీ! ఓరీ కుబుద్ధీ! దేవ, ముని, నాగులతో నీవు విరోధించి యుంటివి; అత్యాదరముతో నీవు శివుని నీశిరస్సులతో నారాధించి యుండినందున, నీ యొక్కొక్కశిరస్సునకు గోటిశిరస్సులు పుట్టుచుండెను. అందుచేత, నీకు మరణము రాలేదు; ఓరీ దుష్టుఁడా! ఇంతవఱకు జీవించియుంటివి; ఇప్పుడు నీశిరస్సుపై మృత్యువు నాట్యముఁ జేయుచున్నది. ఓరీ మూర్ఖుఁడా! నీవు రామునితో విరోధించి, సంపదలను గోరుచుంటివి." అని విభీషణుఁడు పలికి, గదతో రావణునిఁ గొట్టెను.

చౌపాయి 47

ఆగద వానిహృదయమును దగిలినందున, వాఁడు నేలఁబడి, మూర్ఛిల్లెను; పదిముఖములనుండి, వాఁడు రక్తమును గ్రక్కెను. అంతలో వాఁడు తెలివిఁదెచ్చుకొని, లేచి, కోపించి, తమ్ముని నెదురొక్కెను. అన్నదమ్ములు మల్లయుద్ధముఁ జేసిరి; ఒకరినొకరు గ్రుద్దుకొనిరి; శ్రీరామునిబలముచే దర్పించియుండిన విభీషణుఁడు రావణుని ప్రహారములను లక్ష్యముఁ జేయలేదు. "ఆహా! వీఁడు పరమభక్తుఁడు; వీని శరీరమును స్పృశించినమాత్రమునఁ జిత్తశుద్ధి కలుగును" అని రావణుఁడు విచారించి, "ఓరీ! నీవు విరాగివి కాని, వీరుఁడవు కావు" అని తమ్మునితోఁ బలికెను. అప్పుడు విభీషణుఁడు కత్తిఁ బట్టుకొని, "ఓరీ! నా వీరత్వమునుగుఱించి నీకు సందేహముండినయెడల, నాతో మల్లయుద్ధముఁ జేసి, చూడుము." అని పలికి, ఆయుధమును విడిచి, వానితో మల్లయుద్ధముఁ జేయ నారంభించెను.

దోహా 254

ఓ పార్వతీ! రావణునియెదుట నిలువఁబడుటకు విభీషణుఁడు సమర్థుఁడు కాఁడు; శ్రీరామునిప్రతాపమువలన, నేఁడతఁడు కాలుని వలె, రావణునితోఁ బోరాడెను.

### చౌపాయీ

విభీషణుఁడు శ్రమపడియుండుట మహావీరుఁడు చూచి, యొక పర్వతమును బట్టుకొని, రావణుని నెదుర్కొనెను. ఆపర్వతముతో నతఁడు వానిరథాశ్వములను, సారథిని సంహరించి, కాలితో వానినిఁ దన్నెను. ఆతాపుతో వాఁడు గడగడవడఁకెను; కాని, వాఁడు నిలువఁ బడియుండెను; విభీషణుఁడు శ్రీరామునివద్దకు వచ్చెను. రావణుఁడు కపీశ్వరునిపైఁ బడెను; అతఁడు తోఁకనువిప్పి, అంతరిక్షమునకుఁ గుప్పించెను. అతని తోఁకనుబట్టుకొని, వాఁడుకూడ మీఁదికి నెగసెను; అంతరిక్షమున వా రిరువురు మహాప్రళయముగఁ బోరాడిరి; క్రోధోద్దీపితులై, ఘోరఘోరముగ వా రిరువురు పోట్లాడిరి; అంజనాద్రియు సుమేరుపర్వతమునువలె, నంతరిక్షమున వారు తమతమబలమును జూపించి, చమత్కారముగఁ బోరాడిరి; వాఁడు మహాబలవంతుఁడు; బుద్ధిమంతుఁడు; వానినిఁ బడఁద్రోయుట కష్టము; అప్పుడు కపీశ్వరుఁడు శ్రీరాముని ధ్యానించెను.

### ఛాంద్ 48

అతఁడు శ్రీరాముని ధ్యానించి, రావణునిఁ గొట్టెను; ఆదెబ్బతో వాఁడు నేలఁబడెను; మరల వాఁడు లేచి, పోరాడుచుండెను; అప్పుడు దేవతలు జయజయశబ్దములఁ జేసి, వా రిరువురను గొనియాడిరి; మహావీరుఁడు శ్రమపడియుండుట వానరభల్లూకములు చూచి, రావణుని నెదుర్కొనిరి; వాఁడు రణమత్తుఁడై, విజృంభించి, వానరులను మర్దించెను.

### దోహా 255

అప్పుడు శ్రీరాముఁడు వానరులను హెచ్చరించి, యుద్ధమునకుఁ బురికొల్పెను; వారు ధైర్యమునుబాటించి, రావణుని నెదుర్కొనిరి; వచ్చుచుండిన వానరదళమును వాఁడు చూచి, రాక్షసమాయను విస్తరింపఁ జేసెను.

### చౌపాయీ

వాఁడు క్షణములో నంతర్ధానమై, అనేకరూపములతోఁ బ్రకట మయ్యెను. రామచంద్రుని కటకములోనుండిన ప్రతి వానరభల్లూకము

నెదుట నొక్కొక్క రావణుఁడు ప్రత్యక్షమయ్యెను. అనేకరావణులను వారు చూచి, భయపడి, వ్యాకులురై, నలువైపులఁ బరుగెత్తిరి; వారు ధైర్యమును విడనాడి, "ఓ రామా! ఓ లక్ష్మణా! రక్షింపుము; రక్షింపుము" అని మొఱపెట్టిరి. కోట్లకొలఁది రావణులు దశదిశలఁ బరుగెత్తి వచ్చిరి; కర్ణకఠోరముగ వాఁడు గర్జించుచుండెను; సకలదేవతలు ధైర్యమును జాఱవిడిచి, పరుగెత్తిరి. "ఓ దేవతలారా! జయముఁ గలుగుట దుర్లభము; ఆయాశను విడిచిపెట్టుఁడు. ఒక్క రావణుఁడు దేవతానీకమును జయించియుండెను; ఇప్పు డనేకరావణులు వచ్చిరి; పర్వతగుహాలలోఁ బ్రవేశించి, దాఁగియుండుఁడు" అని దేవతలు వారిలో వారు చెప్పుకొని, కాందిశీకులయిరి. బ్రహ్మమహేశ్వరులకును, జ్ఞానులకును, మునులకును శ్రీరాముని మాహాత్మ్యము తెలియును కనుక, వారుమాత్రము నిలువఁబడియుండిరి.

ఛాంద్ 49

శ్రీరాముని ప్రతాపము నెఱింగినవారు నిర్భయముగ నిలువఁబడిరి; ఆమాయయంతయు సత్యమని వానరభల్లూకములు నమ్మి, భయపడి, "ఓ కరుణాకరా! ఓ కృపాళుఁడా! రక్షింపుము; రక్షింపుము" అని మొఱఁబెట్టుచుఁ బరుగెత్తిరి. నలనీలాంగద హనుమదాదివానరవీరులు కపటరావణులను కోట్లకొలఁది మర్దించి, సంహరించిరి.

దోహా 256

దేవతలును వానరులును వ్యాకులపడుట శ్రీరాముఁడు చూచి, మందహాసముఁ జేసి, ధనుస్సును [illegible]ంచి, క్షణములో వానిమాయను బోఁగొట్టి, మాయరావణులను సంహరించెను.

చౌపాయీ

అంధకారమును సూర్యోదయము విడఁగొట్టువిధమున నతఁడు క్షణములో రావణునిమాయను బోఁగొట్టెను. ఒక్క రావణుని దేవతలు చూచి, సంతసించి, శ్రీరామునిపైఁ బుష్పములను వర్షించిరి. అప్పుడు శ్రీరాముఁడు భుజమును జాచి, వానరులను మరలించెను; వారొకరినొకరు పిలుచుకొని, యుద్ధమునకు మరలిరి. శ్రీరామునిబలముఁ జూచుకొని, వానరభల్లూకములు యుద్ధమునకు వెడలిరి; రణమందోదే

కముచే వారు విజృంభించి, యుద్ధముఁజేయ నారంభించిరి. దేవతలు ముదమందుట వాఁడు చూచి, "ఓ మూర్ఖులారా! నే నొంటరివాఁడ నయితి ననికదా, మీరు సంతసించుచుంటిరి. ఎన్నిపర్యాయములు మిమ్ము లను నేను సంహరించి, భక్షించియుంటిని." అని తలంచి, కోపోద్దీపితుఁడై, ఆకాశమార్గమునఁ బరుగెత్తెను. దేవతలు హాహాకారములఁ జేసి, పాఱిపోయిరి. "ఓ మూర్ఖులారా! నా యెదుటనుండి, యెచ్చటికి పాఱిపోఁగలరు!" అని వాఁడు తర్జించెను; అంగదుఁడు వానివెంటఁ బడి, వాని పాదములఁ బట్టుకొని, గిరగిరఁద్రిప్పి, వానిని నేలఁగొట్టెను.

ఛాంద్ 50

అంగదుఁడు వానిని నేలఁగొట్టి, కాలుతోఁదన్ని, శ్రీరాముని వద్దకువచ్చెను. అంతలో వాఁడు తెప్పరిల్లి, దిగ్గునలేచి, కర్ణకఠోరముగ గర్జించెను. మహాకష్టమువలతో వాఁడు పదిధనుస్సులను బట్టుకొని, బాణ వర్షమును గురిపించెను; వానరవీరులను వాఁడు కలవరబెట్టి, స్వసైన్యమును జూచి, సంతోషించెను.

దోహా 257

అప్పుడు శ్రీరాముఁడు వానిశిరస్సులను, భుజములను ధనుస్సులను, బాణములను ఖండించెను; పాపాత్ముని పాపకర్మలు దినదినప్రవర్ధమాన మగునట్టు, వాని శిరస్సులును, భుజములును, నూతనముగఁ బుట్టుచుండెను.

చౌపాయ్

ఆ పాపాత్ముని భుజములును శిరస్సులును ప్రాదుర్భావ మగుచుండుట వానరభల్లూకములు చూచి, రౌద్రాకారులై, మండిపడి, "ఈదుర్మార్గుని శిరస్సులును, భుజములును ఖండింపఁబడుచుండినను, వీనికి మరణమురాకుండ నున్నది" అని విచారించి, యుద్ధమునకు వెడలిరి. నల నీలాంగద, మయంద, ద్వివిదహనుమదాది వానరయోధులు తరుశైల పాషాణములను వానిపై వర్షించిరి; వానిని వాఁడు పట్టుకొని, వారిపై వానిని బ్రయోగించెను; ఒకవానరుఁడు వానిశరీరమును నఖములతోఁ జీల్చెను; మఱియొకఁడు కాలుతో వానిని దన్నెను. నలనీలులు వానిశిరస్సులను నఖములతో విదీర్ణముఁ జేయుచుండిరి; ప్రవహించు

చుండిన రక్తమును వాఁడు చూచి, కోపించి, వారినిఁబట్టుకొనుటకు స్వభుజములను మీఁదికిఁ జాచెను; వానికట్టుకు వారుదొరకక, వాని శిరస్సులపై దిరుగుచుండిరి. కమలవనములో విహరించు రెండుతుమ్మెదలవలె, వారు విహరించిరి. అప్పుడు వాఁడు కోపించి, దిగ్గునయుండెకి, బాహువులతో వారిని బట్టుకొని, గిరగిరఁద్రిప్పి, వారిని నేలఁగొట్టి, వారిభుజములను నులిపెను. వాఁడు పదిధనుస్సులతో వానరులఁ గొట్టి, వారిని కలవరపఱచెను. హనుమదాదివానరవీరులు మూర్ఛిల్లి, నేలఁబడిరి; అంత సాయంసమయ మయ్యెను. వాఁడు పరమానందభరితుఁడయ్యెను. మూర్ఛబడియుండిన వానరులను రణధీరుఁడగు జాంబవంతుఁడు చూచి, కోపించి, వాని నెదుర్కొనెను. అతనివెంట ననేక భల్లూకములు తరుశైలపాషాణములఁ బట్టుకొని, 'ధీ'మని యుద్ధమునకు నడచిరి. రావణుఁడు విజృంభించి, వారిచరణములను బట్టుకొని, గిరగిరఁద్రిప్పి, వారిని నేలఁగొట్టుచుండెను. ఇట్లు సంహరింపఁబడిన భల్లూకములను జాంబవంతుఁడు చూచి, మండిపడి, కాలితో వానినిఁదన్నెను.

ఛాంద్ 51

ఆతాఁపుతో వాఁడు నేలఁబడి, మూర్ఛిలెను. నిశీసమయమునఁ గమలములలో దాగియుండు తుమ్మెదలవలె, నల్లనిభల్లూకములు వాని వింశతి భుజములపిడికిళిలోఁ జిక్కువడియుండిరి; వారినిఁ బట్టుకొని, వాఁడు మూర్ఛిల్లెను; వానిని మఱియొకతాఁపు దన్ని, జాంబవంతుఁడు శ్రీరామునివద్దకు వెళ్లెను. అంతలో రాత్రియయ్యెను; ఇట్లు మూర్ఛబడియుండిన రావణుని మఱియొకరథముపై నిడుకొని, వానిని సారథి లంకలోనికిఁ దీసికొనివెళ్లి, వానికిఁ దెలివివచ్చుటకుఁ దగినశీతలోపచారములఁ జేసెను.

దోహా 258

ఇంతలో వానరయోధులు మూర్ఛనుండి లేచి, శ్రీరాముని వద్దకు వచ్చిరి; అచ్చట లంకలో, రక్షసులందఱు రావణుని సమీపించి, వానిచుట్టుఁ గూర్చుండి, పలువిధముల విలపించుచు, ననేకయత్నములఁ జేయ నారంభించిరి.

———

# ద్వాదశవిశ్రామము.

చౌపాయ్

ఆరాత్రి త్రిజట జానకివద్దకు వచ్చి, రామరావణులయుద్ధమును, రావణునిశిరస్సులు మొలచుటయు మొదలగువృత్తాంతము నామెతోఁ జెప్పెను. వానిశిరస్సులును భుజములును మొలచుచుండెనని జానకి విని, దుఃఖించెను. ఆమెముఖము వెలవెలఁ బోయెను; ఆమె చింతాక్రాంతురాలయ్యెను. "ఓ తల్లీ! ఇందులకు బ్రతీకార మేమిచేయవలయునో చెప్పుము. ఈ లోకకంటకుని నేవిధమునఁ జంపవచ్చును? వానిశిరస్సులను శ్రీరాములు త్రుంచుచుండినను, నెందుచేత వానికి చావురాదు! దీనిఁ బట్టిచూడఁ, విధాత విపరీతముగనుండినట్లు బోధపడుచున్నది. నా నిర్భాగ్యమువలన,వాఁడు జీవించియుండెను. నానాథుని చరణకమలముల నెడబాసియుండి, నేను జీవించియుంటిని. ఏదేవునికృపవలన, వాఁడు మాయబంగారులేఁడిని కల్పించెనో, ఆదేవుఁడు నావిషయమై యిప్పటికిని బ్రతికూలముగ నుండెను. ఆదేవుఁడే నన్నింతదుఃఖమును భరింపుమని వ్రాసెను; ఆదేవుఁడే, నా చేతఁ గర్ణకఠోరవాక్యములను లక్ష్మణునుద్దేశించి, పలికింపించెను. ఆదేవుఁడే, రాముని వియోగబాణములు నామర్మములను భేదించుచుండినను, నే నాదుఃఖమును సహించి, జీవించియుండునట్లు చేసెను. ఆదేవుఁడే వాని నింతవఱకు జీవించియుండునట్లు చేసెను; ఇఁక నెవ రేమిచేయఁగలరు?" ఈప్రకారము జానకి శ్రీరాముని స్మరించి, పలువిధముల విలపించెను. "ఓ రాజకుమారీ! నీవు ధైర్యముగ నుండుము. ఒకబాణము వానిహృదయమునకుఁ దగిలినయెడల, వాఁడు చనిపోవును. వానిహృదయములో జానకిరూపము నివసించియుండినందున, వానిహృదయమును భేదించుటకు శ్రీరాముఁడు సంశయించుచుండెను.

ఛాంద్ 52

"వానిహృదయములో జానకిరూపము కలదు; నేను జానకి హృదయములో నివసించియుందును; నాహృదముయలో, చరాచర

ములు కలవు; వానిహృదయమును భేదించుటవలన, లోకములకు ముప్పు వాటిల్లును' అని శ్రీరామమూర్తి సంశయించుచుండెను." ఈప్రకారము త్రిజట చెప్పినమాటలవలన, జానకికి హర్షవిషాదములు కలిగెను. అప్పుడు త్రిజట జానకితో నిట్లు చెప్పెను. "ఓ రాజకుమారీ! నీవు సంశయమును విడిచిపెట్టుము. నామాటను వినుము; వానికీప్రకారము చావు వచ్చును.

దోహా 259

"మాటిమాటికి వానిశిరస్సులను శ్రీరామమూర్తి త్రుంచును; అప్పుడు ని న్నతఁడు ధ్యానింపఁడు; ఆసమయమున, నతనిబాణము వానిహృదయమును భేదించి, వానిని సంహరించును."

చౌపాయీ

ఈప్రకారము త్రిజట చెప్పవలసినమాటలఁ జెప్పి, పలువిధముల నామెను బోధించి, యోదార్చి, స్వగృహమునకు వెళ్లెను. శ్రీరాముని స్వభావము నామె స్మరించి, విరహదుఃఖమును భరింపలేక, రాత్రిని, చంద్రుని ననేకవిధముల దూషించెను. ఆరాత్రి యొకయుగమువలె నుండెను; ఎప్పటికిని తెల్లవాఱదు. ఆమె తనలోఁదాను రాముని వియోగదుఃఖమును దలపోసి, పెక్కుభంగుల విలపించెను. అంతకంత కామెదుఃఖము బహుళమయ్యెను. అంతలో నామెవామహస్తమును నేత్రమును చెదరెను; అది శుభసూచకము. ఆమె శుభముకలుగునని తెలిసికొని, ధైర్యముఁ దెచ్చుకొనెను. శ్రీరాముని సంయోగము కలుగునని యామె సంతోషించెను. అంత నర్ధరాత్రమున, రావణుఁడు మూర్ఛనుండి లేచి, తెలివిఁదెచ్చుకొని, సారథిని దూషించెను. "ఓరీ మూర్ఖుఁడా! న న్నెందులకు రణస్థలమునుండి తీసికొనివచ్చితివి? ఎంత మందమతివి? ఛీ! ఛీ! నీబ్రతుకు కాల్చనా!" అని వాఁడు వానిని దూషించెను. ఆసారథి వానిచరణములఁ బట్టుకొని, వానికి బోధించెను; అంతఁ బ్రాతఃకాలమయ్యెను; వాఁడు రథముపైఁ గూర్చుండి, యుద్ధమునకు వెడలెను. వాఁడు యుద్ధమునకువచ్చుట వానరులు చూచి, దిగులుపడిరి; వానరయోధులు తరుశైలపాషాణములను ధరించి, వానిని నెదుర్కొనిరి. వారు పండ్లను గటకటకొఱుకుచు, నట్టహాసముతో వానిని నెదిరించిరి.

ఛాంద్ 53

వికృతరూపములుగల వానరభల్లూకములు తరుశైలపాషాణములఁ బట్టుకొని, వాని నెదుర్కొనిరి; వారు రౌద్రాకారులై రాక్షసులను సంహరించుచుండిరి. రాక్షసులు వానరులకు భయపడి, పరుగెత్తిపోయిరి. ఈ ప్రకారము వానరయోధులు రాక్షసుల నోడించి, సంహరించిరి. తదుపరి, వారు రావణుని ముట్టడించిరి; అనేకవిధముల వారు వానిని బాధపెట్టిరి; వారిబాధల కోర్వలేక, వాఁడు వ్యాకులముపడెను.

దోహా 260

మహాప్రబలముగ బోరాడుచుండిన వానరులను వాఁడు చూచి, చింతాక్రాంతుఁడై, అంతర్ధానమై, క్షణములో రాక్షసమాయను బ్రసరింపఁజేసెను.

ఛాంద్ 54, 55, 56

ఆ రావణుని మాయాప్రభావమువలన, ననేక వికృతరూపములుగల భూతప్రేతపిశాచగణంబులు, ధరుర్బాణములను ధరించి, ప్రత్యక్షమయిరి. యోగిను లొకహస్తముతోఁ గత్తిఁబట్టుకొని, రెండవహస్తముతో మనుజుల పునుకలఁబట్టుకొని, రక్తముఁ బానముఁజేయుచు, నాట్యమాడుచు, గానముఁ జేయుచుండిరి. 'పట్టు, కొట్టు' అను శబ్దములు దిగంతములకు వ్యాపించెను. శునకములు కబళించుటకు నోరు దెఱచుకొని, పరుగెత్తుచుండెను; అప్పుడు వానరులు భయపడి, పరుగెత్తిరి. ఎటువైపు వారు పరుగెత్తిన, నటువైపు వారిముందు మండుచుండినమంటలు వారికి గోచరమయ్యెను. ఈ ప్రకారము వానరభల్లూకములు వ్యాకులముపడిరి; అప్పుడు వారిపై నిసుకవర్షము పడెను. వానరులు దిగులుపడి, కాందిశీకులయిరి. వారియలజడిని రావణుఁడు చూచి, సింహనాదముఁ జేసెను. లక్ష్మణ, సుగ్రీవాది మహావీరులు నిశ్చేష్టులయిరి. "హా రామా! హా రఘునాథా!" అని యోధులు మొఱపెట్టి, చేతులను నులుపుకొనిరి. ఇట్లు వానరభల్లూకసైన్యములను వాఁడు వికలించి, మఱియొక్కమాయను బన్నెను. ఆ మాయాప్రభావముచే, ననేకహనుమంతులు పర్వతములనుఁ బట్టుకొని, ప్రత్యక్షమై,

శ్రీరాముని నలువైపుల ముట్టడించిరి. ఆమాయహనుమంతులు, "కొట్టు, పట్టు, పాఱిపోకుము" అని కేకలువేయుచు, వాలములను మీఁదికినెత్తి, శ్రీరాముని ముట్టడించిరి; దశదిశలను వారివాలములు కనఁబడెను; వానివెనుక శ్రీరాముఁడు ప్రకాశించుచుండెను. అతని శ్యామశరీరము దేదీప్యమానముగ నుండెను. నలువైపుల నింద్రధనుస్సుచే నావరింపఁబడిన తమాలవృక్షమువలె, నతఁడు శోభించెను. శ్రీరాముని దేవతలు చూచి, హర్షవిషాదముల బొంది, జయజయశబ్దములఁ జేసిరి. ఒకబాణమును శ్రీరాముఁడు ప్రయోగించి, వానిమాయను బోఁగొట్టెను. ఆమాయవిడినందున, వానరభల్లూకయోధులు సంతోషించిరి. వారు తరుశైలపాషాణములఁ బట్టుకొని, పరుగెత్తిరి; అనేకబాణములను శ్రీరాముఁడు ప్రయోగించి, వానిబాహువులను శిరస్సులను ఖండించుచుండెను; అవి తెగి నేలమీఁదఁ బడుచుండెను. అనేకకోట్ల శేషులును, సరస్వతియు, వేదములు ననేక కల్పములకొలఁది, శ్రీరామునిగుణములను గానముఁ జేసినను, వానిని దుదముట్ట వారు చెప్ప లేరు.

దోహా 261, 262

ఆపరమేశ్వరుని గుణానుకీర్తనము నెట్లు తులసీదాసు చేయఁగలఁడు! యథాశక్తి, మశకము లంతరిక్షమున నెగురునుకదా! అనేకపర్యాయములు వానిశిరస్సులను భుజములను రాముఁడు ఖండించెను. అవి, మరల మొలచుచుండెను; ఈప్రకారము యుద్ధములో వానితో రాముఁడు కేళీవినోదములం జరపుచుండెను; కాని, వారివినోదమును దేవతలు, మునులును సిద్ధులును చూచి, రామరావణులయుద్ధమెట్లు తుదముట్టునో యని విచారించిరి.

చౌపాయ్

లాభము వచ్చినకొలఁది లోభ మధికమగువిధమున్న, వానిశిరస్సులు ఖండింపఁబడుచుండినను, వెండియు మొలచుచుండెను. (ఫాల్గుణ శు ౧౨ శి మొదలు చైత్ర బ ౧౪ శి వఱకు రామరావణులయుద్ధము జరగెను; 'రామరావణయో ర్యుద్ధం రామరావణయో రివ.' వారియుద్ధమునకు సమానమగు నుపమానము లేదు. 'గగనం గగనాకారం

సాగర స్సాగరోపమః." ఆకాశమున కాకాశమే యుపమానము. సాగరమునకు సాగరమే యుపమానము. రామరావణయుద్ధమునకు రామరావణులయుద్ధమే యుపమానము.) ఇట్లు రామరావణులు యుద్ధముఁ జేయుచుండ, పదునెనిమిదిదినములు గతించెను; రావణుఁడు చంపఁబడలేదు. శ్రీరామునకు శ్రమ మధికమయ్యెను. అతఁడు విభీషణునిఁ జూచెను. ఓ పార్వతీ! ఆప్రభువిచ్ఛామాత్రమునఁ గాలుఁడు సహితము చనిపోవును; ఈరాక్షసుఁ డేపాటివాఁడు? విభీషణునకుఁ దనయందుఁగల యనురాగమును దెలిసికొనుటకు రాముఁ డతనిని యడిగెను. "ఓ నాథా! మీరు సర్వజ్ఞులు; చరాచరములకు నాయకులు; ప్రణతపాలకులు; సురలకును మునులకును సుఖమునిచ్చెదరు. బ్రహ్మయొక్కవరప్రభావముచే, వీనినాభిస్థానమున నమృతకలశము కలదు; దానిబలముచే వీనిభుజములును శిరస్సులును మొలుచుచున్నవి; ఆకలశమును ముందు శోషింపఁజేసినయెడల, వాఁడు చనిపోవును." ఇట్లు విభీషణుఁడు చెప్పినమాటలను కృపాసాగరుఁడు విని, ప్రసన్నుఁడై, తీక్ష్ణమగుబాణమును సంధించెను. ఆసమయమున నపశకునములు పుట్టెను; నక్కలు, కుక్కలు, గాడిదలు మొదలగునవి మొఱవెట్టెను. ఖగమృగములార్తనాదముఁ జేసెను; అంతరిక్షమునుండి, ఉల్కాపాతములు పడెను; ఆసమయమున దశదిశలలో నగ్నిమంటలు ప్రజ్వరిల్లెను. పర్వములేకయే సూర్యుని రాహువు కబళించుటకు వెళ్లుచుండెను. మందోదరిహృదయము కంపించెను. విగ్రహములు కన్నీరుఁగార్చెను. ("యదా దేవతాయతనాని కంపంతే దైవతప్రతిమా హసంతి రుదంతి నృత్యంతి స్ఫుటంతి స్విద్యంత్యున్మీలంతి నిమీలంతి తదా ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్ సమూఢమస్య పాంసురే" సామ.)

ఛాంద్ 57

విగ్రహములు కన్నీటిఁ గార్చెను; ఆకాశమునుండి పిడుగులు పడెను. ప్రచండవాయువులు భయంకరముగ వీచెను; భూమి కంపించెను; మేఘములు, ధూళిని, నిసుకను, రక్తమును వర్షించెను. అనేకదుర్నిమిత్తములు పుట్టెను. వానిని యొవరు వర్ణింపఁగలరు? ఈయుత్పాతములఁ జూచి, యంతరిక్షమున నుండినదేవతలు జయజయశబ్దములఁ

జేసిరి. దేవతలు భయభీతులతో నుండిరని రాముఁడు తెలిసికొని, ధనస్సునకు బాణమును సంధించెను.

దోహా 263

ఆకర్ణాంత మతఁడు నారిని లాగి, యేక కాలమున ముప్పదియొక్క బాణములను విడిచిపెట్టెను. కాలసర్పములువలె, నతని బాణములు వెడలెను.

చౌపాయ్

ఒకబాణము వాని నాభిప్రదేశముననుండిన అమృతకలశమును శోషింపఁజేసెను. మిగిలిన ముప్పదిబాణములు వానిశిరస్సులను బాహువులను ఖండించెను ; ఇట్లు శిరస్సులును బాహువులు లేని రావణునికళేబరము నేలఁగూలెను. జీవము లేని వానిమొండెము నాట్యముఁ జేయుచుండెను. ఆ దేహముయొక్క బరువుచేత, భూమి క్రుంగుచుండెను ; అప్పు డాశరీరమును రాముఁడు బాణములతో రెండుముక్కలుగ ఖండించెను. "ఏఁడీ రాముఁడు ? అతనిని నెదుర్కొని సంహరించెద" అని వాఁడు మరణకాలమున గర్జించి, ప్రాణములను విడిచిపెట్టెను. రావణుఁడు నేలఁబడినపుడు, భూమి గిరగిరఁ దిరిగెను. సప్తసముద్రములును, సరోవరములును, సప్తకులపర్వతములును కలవరపడెను ; దిక్పాలురు క్షోభించిరి. రెండుముక్కలుగఁ దెగిపడిన వానికళేబరము క్రిందఁబడి, వానరభల్లూకము లనేకములు చనిపోయెను. (చైత్ర శు ౧౪ నాఁడు వాఁడు స్వర్గస్థుఁ డయ్యెను.) శ్రీరాముని బాణములు వానిశిరస్సులను బాహువులను మందోదరివద్దఁ బడద్రోసి, తిరిగి శ్రీరామునితూణీరములోఁ బ్రవేశించెను. అంతరిక్షమున దేవదుందుభులు మ్రోగెను ; ఆ రావణుని తేజస్సు రామునిలోఁ బ్రవేశించెను ; అచిత్రముఁ జూచి, బ్రహ్మమహేశాదిదేవతలు సంతోషించిరి. నవద్వీపములు జయజయశబ్దములతో నిండెను. "శ్రీరామచంద్రుని ప్రబలప్రతాపమునకు జయ !" దేవతలును మునులును పుష్పములను వర్షించిరి ; "హే కృపాళూ ! ముకుంద ! మీకు జయమగుఁగాక !" అని వారు పలికిరి.

ఛాంద్ 58, 59

"జయ కృపాకంద ముకుంద ద్వంద్వ హరణ శరణ సుఖద ప్రభో,
ఖల దల విదారణ పరమకారణ కారుణీక సదా విభో.
సుర సుమన, వర్షహి హర్ష సంకుల బాజ దుందుభి గహాగహీ,
సంగ్రామ అంగన రాము అంగ అనంగ బహు శోభాలహీ.

"హే కృపాసాగర! ముకుంద! హే దుఃఖహరణ! హే శరణాగతవత్సల! హే సుఖదాయక! ఓ నాథా! ఓ ఖలదళవిదారణ! మీరు సదా కరుణాసముద్రులు; సర్వజ్ఞులు;" ఇట్లు దేవతలు స్తుతించి, సంతోషించి, పుష్పములను వర్షించిరి. దేవదుందుభులు ధణధణమని మ్రోగెను. కోటిమన్మథులను దిరస్కరించుచుండిన శ్రీరామునిదివ్య మంగళవిగ్రహము రణస్థలమున నతిశోభాయమానముగ నుండెను.

శిర జటా ముకుట ప్రసూన బిచ బిచ అతిమనోహర రాజహీ,
జను నీల గిరిపర తడిత పటల సమేత ఉడుగణ భ్రాజహీ.
భుజదండ శర కోదండ ఫేరత రుధిర కన తను అతి బనే,
జను రాయ మునీ తమాల పర బైఠీ విపుల సుఖ ఆపనే.

నీలపర్వతశృంగములపై మెఱుపులతోఁ గూడిన తారాగణములువలె, శ్రీరాముని జటాముకుటము పువ్వులతో నలంకరింపఁబడి, దేదీప్యమానముగ నుండెను. ధనుర్బాణములఁ బట్టుకొని త్రిప్పుచుండిన హస్తములును, రక్తబిందువులతోఁగూడిన శరీరమును, మనోహరముగ నుండెను.

దోహా 264

శ్రీరాముఁడు కృపాదృష్టులను నిగిడించి, దేవతలభయమును బోఁగొట్టెను; వారు నిర్భయులయిరి. "ఓ సుఖధామ! ఓ ముకుంద! జయజయ!" అని వానరభల్లూకములు సంతోషించి, ఘోషించిరి.

చౌపాయ్

ప్రాణేశ్వరుని శిరస్సులను మందోదరి చూచి చింతాక్రాంతురాలై, నేలఁబడెను. దుఃఖముచే విలపించుచుండిన నామెచెలికత్తెలు పరుగెత్తి వచ్చి, యామెనుఁ బట్టుకొని, లేవఁదీసి, యామెను రావణుని కళేబరమువద్దకుఁ దీసికొని వెళ్లిరి. ప్రాణేశ్వరునకు సంభవించినదుర్గతి

నామె చూచి, యేడ్వసాగెను. ఆమెశిరోజములు విడిపోయెను. ఆమెకు శరీరములోఁ గొంచెమైన దార్ఢ్యము లేకపోయెను. అనేకవిధముల నామె గొట్టుకొనుచుండెను. ఆమె విలపించి, విలపించి, రావణుని ప్రతాపమును స్మరించి, యేడ్వసాగెను. "ఓ నాథా! మీబలమునకు భయపడి, భూమి నిత్యము వడఁకుచుండెను; సూర్యచంద్రాగ్నులు తేజోహీనులయి యుండిరి; ఆదిశేషువును కూర్మమును మీభారమును భరింపలేకపోయిరి; ఆ మీశరీరము నేఁడు ముక్కలుముక్కలుగ తెగి నేలఁబడియుండెను. ఇంద్రుఁడు, వాయువు, కుబేరుఁడు, వరుణుఁడు మొదలగు దేవతాధిపతులు ధైర్యములేక, మీయెదుట నిలువలేకపోయిరి. మీ భుజబలముచే, మీరు కాలుని, యమునిసహితము జయించితిరి; అట్టి మీరనాథునివలె, నేఁడు నేలఁబడియుంటిరి. ఈశరీర మెంతనిస్సారము? మీ ప్రతాపమును, మీ ప్రభుత్వమును లోకవిదితము. మీ పుత్రమిత్రబంధువర్గంబుల బలపరాక్రమములఁ జెప్ప శక్యముకాదు. మీరు శ్రీరాముని నెదిరించితిరి; దానికిఁ దగినఫలము ననుభవించితిరి; మీనిమిత్తము దుఃఖించుటకు పుత్రులుగాని పౌత్రులుగాని, యొకరైనను లేరు. కులమంతయు సమూలనాశన మయ్యెను. ఓ నాథా! బ్రహ్మసృష్టియంతయు మీకు వశమైయుండెను; అష్టదిక్పాలురు మీకు నమస్కరించుచుండిరి. మీశిరస్సులను భుజములను గృధ్రములు తినుచున్నవి. మీరు రామవిముఖులు కనుక, మీకీపాట్లు తగినట్లు వచ్చెను. ఓ నాథా! విధికృతమువలన, నామాటలు మీకు రుచ్యముగ నుండలేదు. ఆ చరాచరజగన్నాథుని, ఆ లోకారాధ్యుని, ఆ శ్రీరాముని, మనుజమాత్రుఁడని మీరు తలంచి, భ్రమపడితిరి.

ఛాంద్ 60

"ఓ నాథా! ఆ శ్రీరాముఁడు రాక్షసవనమును దహించుటకవతరించిన సాక్షాన్నారాయణమూర్తి. అతఁడు సాధారణమనుజుఁడని మీరు భ్రమపడితిరి. బ్రహ్మమహేశాదిదేవత లతనిని సదా సేవించుచుందురు. ఓ నాథా! మీ రాకరుణాసముద్రుని సేవించియుండలేదు. పుట్టినదిమొదలు మీరు పరులకు ద్రోహముఁజేయుటకే చింతించుచుంటిరి. మీశరీరము పాపములో మునిఁగియుండెను. అట్టిమీకు శ్రీరా

ముఁడు తనసాకేతలోకము నిచ్చెను. అని రామయుఁడగు శ్రీరామునకు నేను నమస్కరించుచున్నాను.

దోహా 265

"ఆహా! నాథా! ఏమియాశ్చర్యము! ఆకృపాసముద్రుఁడు, శ్రీరామునిలో సమానుఁడు మఱియొకఁడు కలఁడా? మునీశ్వరులకు దుర్లభమగుగతిని మీకు శ్రీరాముఁ డిచ్చెనుకదా!"

శ్లో. జాతిర్బ్రహ్మకులాగ్రజో ధనపతి ర్వ్యః కుంభకర్ణోఽనుజః
పుత్రశ్శక్రజయీ స్వయం దశశిరాః పూర్ణా భుజావింశతిః,
దైత్యాః కామచరాః రథశ్చ విజయీ పారే సముద్రం గృహం
సర్వం నిష్ఫలితం తథైవ విధినా దైవేబలే దుర్బలే.

ఇతి హనుమన్నాటకే.

శ్లో. అపి ఖలు విషమః పురాకృతానాం
భవతి హి జంతుషు కర్మణాం విపాకః,
శివశిరసి శిరాంసి యాని రేజుః
శివశివ తాని లుఠంతి గృధ్రపాదైః. ఇతి హనుమన్నాటకే.

మందోదరి విలపించుచుండినను, జ్ఞానముచే శ్రీరాముఁడు పరబ్రహ్మమని తెలిసికొనెనని, సురలును మునులును, సిద్ధసాధ్యులును సంతోషించిరి. బ్రహ్మమహేశ్వరులును, నారదుఁడును, సనకసనందనాది పరమార్థవేత్తలును, మునీశ్వరులును, కన్నులార శ్రీరామునిఁ జూచి చూచి, పరమానందభరితులై, నిలువఁబడిరి. పలువిధముల విలపించు చుండిన స్త్రీలనుజూచి, విభీషణుఁడు సహితము దుఃఖించి, వారివద్దకు వెళ్లెను. అన్నకు సంభవించిన దుర్దశ నతఁడు చూచి, విలపించెను. అప్పుడు శ్రీరాముని యాజ్ఞాప్రకారము, లక్ష్మణమూర్తి వెళ్లి, విభీషణుని నోదార్చెను. అనంతరము వా రిరువురుకలసి, రామునివద్దకు వచ్చిరి. అప్పుడు విభీషణుని శ్రీరాముఁడు కృపాదృష్టితోఁ జూచి, "ఓ సఖుఁడా! శోకమును విడిచిపెట్టుము. రావణునకుఁ దగిన పరలోక క్రియలఁ జేయుము." అని యాజ్ఞాపించెను. శ్రీరాముని యాజ్ఞాప్రకార మతఁడు దేశకాలపాత్రముల ననుసరించి, విధిపూర్వకముగ రావణునకుఁ బరలోకక్రియలఁ జేసెను.

దోహా 266

మందోదరి మొదలగుస్త్రీలు వచ్చి, వానికిఁ దిలోదకముల నిచ్చిరి. వారు శ్రీరాముని గుణములను స్మరించుచు, స్వగృహములలోఁ బ్రవేశించిరి.

చౌపాయీ

విభీషణుఁడు తిరిగివచ్చి, శ్రీరామునకు నమస్కరించెను. అప్పుడా కరుణానిధి తమ్మునిఁ బిలిచి, యతనితో నిట్లు చెప్పెను. "ఓ తమ్ముఁడా! నీవును, సుగ్రీవాంగద నలనీలజాంబవంతహనుమదాదులు కలసి, లంకలోనికి వెళ్లి, విభీషణునకుఁ బట్టముఁగట్టి, శీఘ్రము రండు. తండ్రిగారియాజ్ఞాప్రకారము నేను నగరములోనికివచ్చుటకు వీలుపడదు. నాసమానులగు వానరులను నాతమ్మునిఁ బంపుచున్నాను." శ్రీరాముని యాజ్ఞఁ గైకొని, వానరులు వెడలి, విభీషణునిపట్టాభిషేకమునకుఁ దగిన ప్రయత్నములఁ జేసిరి. అతివినయముతో వారు విభీషణుని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి, చేతులను ముకుళించికొని, స్తుతించిరి. వారతనికి నమస్కరించిరి; వారు విభీషణునకు రాజ్యతిలకముఁ బెట్టిరి; తదుపరి, వా రతనితోఁ గూడి రామునివద్దకు వచ్చిరి అప్పుడు శ్రీరామచంద్రుఁడు వానరులఁ బిలిచి, వారితోఁ గొన్ని ప్రియవచనములఁ బలికెను.

ఛాంద 61

"ఓవానరులారా! కేవలము మీ సహాయముచేతనే, నేను రావణుని సంహరించి, విభీషణునకు రాజ్యముఁ గట్టితిని. మీకీర్తి యాచంద్రార్కము భూమిమీఁద నుండుగాక! ఎవరు నన్నుఁ బురస్కరించుకొనియుండిన మిమ్ములను, మీకీర్తిని నిత్యము గానముఁజేయుచుందురో, వారు కొంచెమైన శ్రమలేకయే, సంసారసాగరమును దాఁటఁగలరు." అని శ్రీరామమూర్తిచెప్పిన అమృతోపమానమగు వాక్యములను వానరులు విని, పరమానందభరితు లయిరి.

దోహా 267

ప్రభుప్రవచనముల నెంతవఱకు వానరులు వినినను, వారికిఁ దృప్తి లేకపోయెను; ఇంకను వినవలెనని వారికిఁ గోరికయుండెను. పెక్కు

మారులు వారు శ్రీరామునకు నమస్కరించి, యతనిచరణములఁ బట్టు కొనిరి.

చౌపాయ్

అనంతరము, శ్రీరాముఁడు హనుమంతునితో నిట్లు చెప్పెను; "ఓ మహావీరుఁడా! నా కార్యమునిమిత్తము నీవు లంకలోనికి వెళ్లుము. నాసమాచారమును జానకికి విన్నవించి, యామెయోగక్షేమమును దెలిసికొని, శీఘ్రముగ రమ్ము." మహావీరుఁడు లంకలోఁ బ్రవేశించిన సంగతి విని, రాక్షసులు, స్త్రీపురుషులు శుశ్రూషఁ జేయుటకుఁ బరుగెత్తి వచ్చిరి. అనేకవిధముల మహావీరుని వారు పూజించి, సత్కరించి, జానకినిఁ జూపించిరి. దూరమునుండి, యతఁడు జానకికి నమస్కరించెను. అతఁడు శ్రీరామునిదూతయని యామె గ్రహించి, "ఓ వీరుఁడా! శ్రీరామలక్ష్మణులకును, వానరసైన్యములకును క్షేమమా? ఆ కృపాసాగరుఁడు, నానాథుఁడు కుశలమా?" అని యడిగెను. "ఓ తల్లీ! అన్నివిధముల శ్రీరామచంద్రులు క్షేమము; వారు రావణుని జయించిరి. విభీషణునకు శాశ్వతమగు రాజ్యము నిచ్చిరి." ఇట్లు మహావీరుఁడు చెప్పిన మాటలవలన, నామెకుఁ బరమానందమయ్యెను.

ఛాంద్ 62

సంతోషముచే, నామె ప్రసన్నురాలయ్యెను. ఆమెశరీరము పులకరించెను; ఆనందబాష్పము లామెనేత్రములనుండి కారెను. "ఓ కపీశ్వరా! నీ కేమి నే నియ్యఁగలను? నీవాక్కులకు సమానమగు వస్తువు లేదు." అని యామె చెప్పెను. "ఓ తల్లీ! మీరు సంతోషించి, ప్రసన్నులయినందున, నాకీదినమున మూఁడులోకములరాజ్యము లభించెను. ఇందులకుఁ గొంచెమయిన సందేహము లేదు. నేఁడు శత్రువులను జయించి, తమ్మునితోఁ గూడిన నిరామయుఁడగు శ్రీరామప్రభువును జూచుటకంటె భాగ్య మేమి కలదు? ఇంతకంటె నధిక మేమి కలదు?"

దోహా 268

"ఓ హనుమంతుఁడా! నామాటను వినుము సకలసుగుణములు నీహృదయములోఁ గలవు. లక్ష్మణసహిత శ్రీరాముఁడు సదా నిన్ను దయతోఁ జూచుఁగాక!

చౌపాయ్

"ఓ వీరుఁడా! ఆ కోమలశ్యామశరీరుని, శ్రీరామునిదర్శనము నాకు శీఘ్రము లభించునట్లు, ప్రయత్నముఁ జేయుము." అతక్షణము హనుమంతుఁడు వెడలి, రామునివద్దకు వచ్చి, జానకీ యోగక్షేమ సమాచార మతనితో విన్నవించెను. ఆ సూర్యకులభూషణుఁడు, శ్రీరాముఁడు, మహావీరుని మాటలను విని, అంగదవిభీషణులఁ బిలిచి, "ఓయీ! మీరు హనుమంతునితో వెళ్లి, జానకిని నాదరించి, తీసికొని రండు" అని చెప్పెను. అతక్షణము వారుముగ్గురు జానకివద్దకు వెళ్లిరి; రాక్షసస్త్రీలు జానకిని సేవించుచుండిరి. విభీషణుని యాజ్ఞాప్రకారము, రాక్షసస్త్రీలు జానకికి స్నానముఁ జేయించి, పీతాంబరములఁ గట్టించి దివ్యభూషణములతో నామెను సింగారించి, పల్లకిలోఁ గూర్చుండబెట్టి, తీసికొనివచ్చిరి. ఆ సకలసుఖధాముని, శ్రీరాముని నామె స్మరించి, పల్లకిలోఁ గూర్చుండి, సంతోషముతో వెడలెను. వేత్రములను ధరించి, పార్శ్వరక్షకులు సంతోషముతో బంబరులు దీర్చి, పల్లకికి నలువైపుల నడచిరి. వానరభల్లూకములు జానకినిఁ జూచుటకు వెళ్లిరి; కాని, జానకిని దర్శించుటకు సమయముకాదని చెప్పి, వారిని పార్శ్వరక్షకులు నిరోధించిరి. అప్పుడు శ్రీరాముఁడు విభీషణుఁ జూచి, "ఓ సఖుఁడా! జానకిని నడపించి, తీసికొని రమ్ము; తల్లినివలె, నామెను వానరులు చూచి, సంతోషించెదరు." అని నవ్వుచుఁ బలికెను. ప్రభువువచనములను వానరులు విని సంతోషించిరి; అంతరిక్షమునుండి దేవతలు పుష్పములను వర్షించిరి. అరణ్యములో నుండినపుడు, జానకిని శ్రీరాముఁ డగ్నిహోత్రున కప్పగించెను. లంకలో నింతవఱకు నివసించియుండిన సీత మాయసీత; నిజమగు సీతయొక్క ప్రతిబింబము; ఆ నిజమగుసీతను స్వీకరించుటకు శ్రీరాముఁడు కోరెను; ఆమెయంతఃకరణ నిర్మలమని లోకులకుఁ దెలియుట కామె నగ్నిలోఁ బ్రవేశింపుమని యతఁడు చెప్పెను.

దోహా 269

ఈ హేతువుచేత, నతఁడు జానకినిఁ జూచి, కఠోరవాక్యములఁ బలికెను; ఆమాటలను రాక్షసస్త్రీలు విని, దుఃఖించిరి. ఆ కరుణాసముద్రునకుఁ దెలియనివిషయములు లేవు కదా!

చౌపాయ్

ప్రభువువచనముల నామె విని, త్రికరణశుద్ధిగ నిట్లు విన్నవించెను: "ఓ లక్ష్మణా! వివాహకాలమున, బ్రాహ్మణులగ్నిహోత్రమును వెలిగించి, వివాహముఁ జేయించిరి. ఇప్పుడు నా కగ్నిలోనుండి పునర్జన్మము కలుగును; పిమ్మట, నేను ప్రభువును వరించెదను. నీవు ధర్మము నాలోచించి, అగ్నిహోత్రమును వెలిగింపుము." అని యామె చెప్పెను. విరహమును, వివేకమును, ధర్మమును, న్యాయమును, చాతుర్యమును సూచించు జానకివచనముల నతఁడు విని, కన్నీటినిగార్చి, చేతులను జోడించుకొని, నిలువఁబడెను; కాని, యొకమాటనయినఁ జెప్పలేక పోయెను. అతఁడు శ్రీరామునకు భయపడి, యూరకుండెను. అతఁడు శ్రీరాముని ముఖలక్షణముఁ జూచి, కాష్ఠములఁ దీసికొనివచ్చి, నిప్పు ముట్టించెను. ప్రబలముగ మండుచుండిన నిప్పుఁజూచి, జానకి సంతోషించెను; ఆమెకు లేశమైన భయములేకపోయెను. "ఓ హుతాశనుఁడా! మనవచనకర్మములచే నేను శ్రీరామచంద్రులను తప్ప, మఱియొకరిని నామనస్సులో ధ్యానించియుండలేదు. ఓ పావకుఁడా! నీవు సకలజీవులహృదయములలో నివసించియుందువు. శ్రీఖండచందనమువలె, నీవు నాకు శీతలుఁడవగుము.

ఛాంద్ 63, 64

ఆమైథిలి, జానకి, ప్రభువునుస్మరించి, యగ్నిలోఁ బ్రవేశించెను; శ్రీఖండచందనమువలె, నగ్నిహోత్రుఁడు శీతలుఁడయ్యెను. "శ్రీరామచంద్రా! జయజయ! మీచరణములపరాగము నిర్మలము; ఆచరణములనే, సాంబశివుఁడు సదా సేవించును. ఆమాయసీతయు, లోకాపవాదమును నిప్పులో దహించుకొనిపోయెను. ప్రభువుచర్య లెవరికిని బోధపడవు. సురలును, సిద్ధసాధ్యులును, మునులును నిశ్చేష్టులయిరి. అగ్నిదేవుఁడు బ్రాహ్మణరూపమును ధరించి, వేదవిదిత మగుజానకిని, నిజమగు సీతను వెంటఁదీసికొని వచ్చి, క్షీరసముద్రుఁడు మహాలక్ష్మిని విష్ణుమూర్తికి సమర్పించినవిధమున, నామెను శ్రీరామునకు సమర్పించెను. నూతనముగ వికసించిన నీలనీరజముప్రక్కను బంగారుపద్మమొగ్గవలె, నామె శ్రీరాముని యెడమప్రక్కను శోభించెను.

**దోహా 270, 271**

దేవతలు సంతోషించి, పుష్పములను వర్షించిరి; దేవదుందుభులు మ్రోఁగెను; దేవతలును కిన్నరులును గానముఁజేసిరి. దేవతా స్త్రీలు విమానములపైనుండి, నాట్యముఁ జేసిరి.

శ్రీజానకీ సమేత ప్రభు, శోభా అమిత అపార,
దేఖి భాలు కపి హార్షేఉ, జయ రఘుపతి సుఖసార.

---

# త్రయోదశవిశ్రామము.



**చౌపాయ్**

దేవేంద్రునిసారథి, మాతలి, శ్రీరామునియాజ్ఞఁ గైకొని, యతని చరణములకు నమస్కరించి, స్వర్గలోకమునకు వెళ్లెను. అంత స్వార్థపరులగు దేవతలు శ్రీరాముని సమీపించి, స్వరసూర్థమగు వాక్యములతో నిట్లు స్తుతించిరి:—

"దీనబంధు దయాళు రఘురాయా,
దేవకీన దేవనపర దాయా.
విశ్వద్రోహ రత యహ ఖల కామీ,
నిజ అఘ గయో కుమారగగామీ.

"ఓ దీనబంధూ! ఓ దయాళూ! ఓ రఘురాయ! మీకు దేవతలపై దయ కలదు. ఈ రావణుఁడు లోకద్రోహి; దుష్టుఁడు; కామి; దుర్మార్గమున సంచరించెను; వాని పాపములే వానినిఁ జంపెను.

"తుమ సర్వజ్ఞ బ్రహ్మ అవినాశీ,
సదా ఏక రస సహజ ఉదాసీ.
అకల అగుణ అనవద్య అనామయ,
అజిత అమోఘ శక్తి కరుణామయ.

"ఓ బ్రహ్మ! మీరు సర్వజ్ఞులు; నాశనరహితులు; సదా యేక రసముతో నుండువారు; స్వాభావికముగ ఉదాసీనులు; సకల కళా రహితులు; త్రిగుణాతీతులు; దోషరహితులు; అవిద్యవలనఁ గలుగు భ్రమలు మీకులేవు; అజేయులు; మీశక్తి అమోఘము; మీ బలము నిష్ఫలము కాదు; మీరు కరుణామయులు.

"మీన కమఠ శూకర నర హరీ,
వామన పరశురామ వపుధారీ.
జబ జబ నాథ సురన దుఖ పావా,
నానా తను ధర తుమహీ నశావా.

"ఓ నాథా! మీరే మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామనాదిరూపములను ధరించితిరి; ఓ స్వామీ! మీయవతారమే, పరశురాముఁడు; ఏయేసమయములలో దుఃఖముకలిగెనో, ఆసమయ ములలో మీరు శరీరమును ధరించి, దుష్టులను సంహరించి, దేవతల దుఃఖములఁ బోఁగొట్టితిరి.

" రావణ పాపమూల సురద్రోహీ,
కామ లోభ మద రతి అతి క్రోహీ.
సోకృపాలు తవ ధామ సిధావా,
యహ హమరే మన అచరజ ఆవా.

"ఓ నాథా! ఈరావణుఁడు పాపమునకు మూలము; దేవ ద్రోహి; వాఁడు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లకుఁ బుట్టిల్లు; ఓ భగవంతుఁడా! అట్టివాఁడు మీలోకములఁ బొం దెను; అందుచేత మాకాశ్చర్యము కలుగుచున్నది.

"హమ దేవతా పరమ అధికారీ,
స్వారథ రతి తవ భక్తి బిసారీ.
భవ ప్రవాహ సంతత హమ పరే,
అబ [illegible] పాహి శరణ అనుసరే.

"ఓ నాథా! దేవతలము మేము మీభజనజేయుట కధికారు లము; అయినను, మేము స్వార్థపరులమై, మీభక్తిని విడిచిపెట్టియుం జననమరణములతోఁగూడిన సంసారప్రవాహములోఁ బడియుం

టిమి; ఓ ప్రభూ! మమ్ములను రక్షింపుఁడు; మేము మీ శరణాగతులము."

దోహా 272

ఈప్రకారము సురసిద్ధసాధ్యులు దేవదేవుని స్తుతించి, చేతులను ముకుళించికొని, నిలువఁబడిరి. అప్పుడు సరోజభవుఁడు, బ్రహ్మ, ప్రేమాతిశయము లుప్పతిల్ల, శ్రీరాముని స్తోత్రముఁజేయ నారంభించెను.

ఛాంద్ 1

"జయ రామ సదా సుఖధామ హరే,
రఘునాయక సాయక చాప ధరే.
భవవారణ దారణ సింహ ప్రభో,
గుణసాగర నాగర నాథ విభో.

"ఓ రామా! ఓ హరి! ('హరతి దుఃఖానితి హరిః')=దుఃఖములను హరించువాఁడు కనుక 'హరి') ఓ రఘునాథా! ధనుర్ధరులగు మీకు జయమగుగాక! జయజయ! సంసారరూపమగు మదగజమును సంహరించుటకు మీరు మృగరాజులు; సకలగుణసముద్రులు; చతురులు; ఓ నాథా! మీరు సర్వవ్యాపకులు.

ఛాంద్ 2

"తను కామ అనేక అనూప ఛబీ,
గుణగావత సిద్ధ మునీంద్ర కవీ.
యశ పావన రావణ నాగ మహా,
ఖగనాథ యథా కరి కోప గహా.

"ఓ నాథా! నిరుపమానమగు మీ దివ్యమంగళవిగ్రహము యొక్క కాంతి కోటిమన్మథులకాంతిని మించియున్నది. మునులును, కవీశ్వరులును, సిద్ధులును మీయశస్సును గానముచేయుచుందురు; మీ కీర్తి నిర్మలము; సర్పమును గరుత్మంతుఁడువలె, మీరు రావణుని సంహరించితిరి.

ఛాంద్ 3

"జన రంజన భంజన శోకభయం,
గత క్రోధ సదా ప్రభు బోధమయం.

అవతార ఉదార అపార గుణం,
మహిభార విభంజన జ్ఞాన ఘనం.

"ఓ ప్రభూ! భక్తులకు మీ రానందదాయకులు; మీకటాక్షమువలన, భయశోకములు నశించును; మీరు క్రోధరహితులు; మీరు సదా జ్ఞానస్వరూపులు; మీయవతార ముదారము; మీ గుణము లపారము; మీరు సచ్చిదానందస్వరూపులు; భూభారమును హరించితిరి.

ఛాంద్ 4

"అజవ్యాపక మేక మనాది సదా,
కరుణాకర రామ నమామి ముదా.
రఘువంశ విభూషణ దూషణహా,
కృతభూప విభీషణ దీనరహా.

"ఓ నాథా! మీరు జన్మరహితులు; మీరొక్కరు; అనాదులు; కరుణాసముద్రులు; లోకములను రమింపఁజేయు మీకు బ్రదక్షిణనమస్కారముఁ జేయుచున్నాను ఓ రఘువంశభూషణా! మీరే సకలదోషములను హరించుకర్తలు; దీనుఁడగు విభీషణునకు మీరు బట్టముఁగట్టితిరి.

ఛాంద్ 5

"గుణ జ్ఞాన నిధాన అమాన అజం,
నిత రామ నమామి విభుం విరజం.
భుజదండ ప్రచండ ప్రతాప బలం,
ఖలబృంద నికంద మహాకుశలం.

"ఓ దేవదేవా! మీరు సకలగుణధాములు; జ్ఞానస్వరూపులు; మహాచతురులు; మానరహితులు; మీకు జననములేదు; సర్వవ్యాపకులు; త్రిగుణాతీతులగు మీరే నాకుశరణు; మీ భుజదండముల ప్రతాపమును బలమును ప్రచండములు; మీభుజములు దుష్టుల సమూహములను సంహరించుటలో మహానేర్పరులు.

ఛాంద్ 6

"వినుకారణ దీనదయాళు హితం,
ఛబిధామ నమామి రమాసహితం.

భవతారణ కారణ కాయపరం,
మన సంభవ దారుణ దోషహరం.

"ఓ నాథా! నిర్హేతుకముగ మీరు కటాక్షముఁ జూపించెదరు; మీరు తేజస్స్వరూపులు; ఓ రమారమణగోవిందా! మీ కనేక ప్రణామంబులఁ జేయుచున్నాను; మీరే సంసారసాగరమును దాఁటింపఁ గలరు; లోకములకు మీరే కారణభూతులు; కాయమునకుఁ బరులు ("సపర్యగాచ్ఛుక్రమ కాయమవ్రణమ్" ఇతి యజుర్వేద ప్రమాణము); మనోసంభవములగు దారుణమైనదోషములను మీరే హరింపఁగలరు.

ఛాందు 7

"శర చాప మనోహర తూణధరం,
జలజారుణ లోచన భూప వరం.
సుఖ మందిర సుందర శ్రీరమనం,
మదమార మహా మమతా శమనం.

"ఓ నాథా! మీరు నిర్గుణులు; అయినను, శరచాపములను దూణీరములను ధరించితిరి; మీలోచనములు జలజారుణములు; మీరు భూపతిశ్రేష్ఠులు; సకలసుఖములకు నిధులు; రమారమణులు; అహంకారమును, మమకారమును, కామమును శాంతింపఁజేయువారు.

ఛాందు 8

"అనవద్య అఖండన గోచరగో,
సబ రూప సదా సబ హోఇ నసో.
ఇతి వేద వదంతి న దంత కథా,
రవి ఆతప భిన్నమభిన్న యథా.

"హే భగవన్! మీరు దోషరహితులు; అఖండులు; సర్వత్ర పరిపూర్ణులు; ఇంద్రియములకుఁ బరులు; అన్నిరూపములును మీరే; కాని, ఆరూపములు మీరుకారు; వానికి మీరు భిన్నులు - ఈప్రకారము వేదములు చెప్పుచున్నవి; ఇది నా వాక్చాతుర్యము కాదు; సూర్యుఁడును, సూర్యునివేఁడిమియు, వేలుగనుండినను యొకటికదా! అటులనే, మీ రొకటికాని, రెండుకాదు. (ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా." అని శ్రుతి.)

ఛాంద్ 9

"కృత కృత్య విభో సబ వానరయే,
నిరఖంత తవానన సాదరయే.
ధికజీవన దేవ శరీర హరే,
తవ భక్తి వినా భవ భూలిపరే.

"ఓ విభూ! ఓ సర్వవ్యాపక! ఈవానరులు కృతార్థులు; అత్యాదరముతో వారు మీముఖమును జూచుచుండిరి. ఓ హరీ! ఈ దేవతుల శరీర మెందులకు వచ్చినశరీరము? వారిజీవన మెందుకువచ్చిన జీవనము? ఛీ! ఛీ! మీభక్తిని విడిచిపెట్టి, వారు సంసారవిషయములలోఁబడి, మైమఱచియుండిరి.

ఛాంద్ 10

"అబ దీనదయాళు దయా కరియే,
మతి మోరి విభేద కరీహరియే.
జేహి తేవిపరీత క్రియా కరియే,
దుఖసోసుఖ మానసుఖీ చరియే.

"ఓ దీనదయాపరా! ఈ ప్రకారము నన్ను రక్షింపుఁడు; నాకు భేదబుద్ధియుండనట్లు ప్రసాదింపుము. ("ద్వితీయాద్వై భయం భవతి" భేదబుద్ధికలవానికే యితరులవలన భయముకలదు. "తత్రకః మోహః కః శోకః ఏకత్వమనుపశ్యత." అంతట నేకమును జూచువానికి మోహశోకములు కలుగవు.) ఓ నాథా! ఏదానిద్వారా దుఃఖమును సుఖమని భ్రమించుచుంటినో, ఏదానిద్వారా విపరీతమగుక్రియల నాచరించుచుంటినో, ఆవిపరీతబుద్ధి నాకుఁబోవునట్లు ప్రసాదింపుము.

ఛాంద్ 65

"ఖల ఖండన మండన రమ్య క్షమా,
పదపంకజ సేవిత శంభు ఉమా.
నృపనాయక దేవరదానమిదం,
చరణాంబుజ ప్రేమ సదా శుభదం.

"ఓ నాథా! మీరు దుష్టులను సంహరించినందున, భూదేవికి కళకాంతులు వచ్చెను. మీరే భూదేవికి శృంగారము; మీరే శోభ;

ఓ నృపనాయక! ఓ లోకపతీ! పార్వతీపరమేశ్వరులు మీ చరణాంబుజములను సదా సేవించుచుందురు. సకలసుఖములకు మూలమగునట్టి మీ చరణారవిందములయందు నిరంతరమగు ప్రేమ నాకుండునట్లు రక్షించి, ప్రసాదింపుఁడు."

దోహా 273

ప్రేమాతిశయముచే బ్రహ్మదేవునిశరీరము పులకరించెను; అనేకవిధముల బ్రహ్మ దేవదేవుని స్తుతించెను; ఆ శోభాసాగరుని యెంత జూచినను, బ్రహ్మదేవునినేత్రములకుఁ దృప్తిలేకపోయెను; అంతకంతకతనిప్రేమ యతిశయించెను.

చౌపాయి

ఆసమయమున దశరథమహారాజు విమానములోఁ గూర్చుండి, స్వర్గలోకమునుండి వచ్చి, కుమారునిఁ జూచి, యానందబాష్పములఁ గార్చెను. రామలక్ష్మణు లిరువురు తండ్రికి నమస్కరించిరి; అతఁడు కుమారులను దీవించెను. "ఓ తండ్రీ! మీపుణ్యప్రభావమువలన, నజేయుఁడగు నిశాచరపతిని నేను జయించితిని;" ఈప్రకారము రాముఁడు చెప్పినమాటల నతఁడు విని, సంతోషించెను; అతనిప్రేమ అధికమయ్యెను; ఆనందబాష్పములు వఱదలై కారెను; అతనిశరీరము పులకరించెను. "ఇతఁడు నాయందుఁగల ప్రేమచేత, నావియోగమును సహింపలేక, ప్రాణములను విడిచిపెట్టెను." అని శ్రీరాముఁడు చింతించి, దశరథునకుఁ గలప్రేమను బోఁగొట్టి, యతనికి జ్ఞానముకలుగునట్లు చేసెను. ఓ పార్వతీ! ఇంతవఱకును దశరథునకు ముక్తిలేకపోవుటకుఁ గారణముఁ జెప్పుచున్నాను వినుము. పరమేశ్వరుఁడు ప్రభువు; నేను సేవకుఁడను. పరమేశ్వరుఁ డొకఁడు; నే నొకఁడను. అనితలంచి, భజించుటయే, భేదభక్తి. సర్వము పరమేశ్వరునిస్వరూపమని తెలిసికొని, భజించుట అభేదభక్తి; అభేదభక్తియే, ముక్తికి కారణము. సగుణోపాసకులు ముక్తిని కోరరు; వారికి శ్రీరాముఁడు తన భక్తినిచ్చును. దశరథునకు భేదభక్తియుండెను; తండ్రి నేనను చెట్టుగాఁగలఁడు! అందుచేత నతనికి రాముఁడు జ్ఞానమును కలుగజేసెను; అమ్మూలమున

నతనికి ముక్తివచ్చెను. మాటిమాటికి దశరథుఁడు శ్రీరామబ్రహ్మము నకు నమస్కరించి, కైవల్యముఁ బొందెను. అతనికి జ్ఞానముకలిగినందున, శ్రీరాముఁడు కుమారుఁ డనేభావ మతనికిపోయెను.

దోహా 274

ఆకోసలాధిపతి, శ్రీరాముఁడు, శ్రీసీతాలక్ష్మణులతోఁ గూడి, కుశలముగనుండెను; ఆదేవదేవుని దివ్యమంగళవిగ్రహముఁ జూచి, సంతోషించి, దేవేంద్రుఁ డిట్లు స్తోత్రముఁజేయ నారంభించెను.

ఛాంద్

"జయ రామ శోభా ధామ, దాయక ప్రణత విశ్రామ.
ధృత త్రోణ వర శర చాప, భుజదండ ప్రబల ప్రతాప.
జయ దూషణారి ఖరారి, మర్దన నిశాచర ధారి.
యహ దుష్ట మారెఉ నాథ, భయదేవ సకల సనాథ.

"ఓ రఘునాథా! మీరు తేజోరాసులు; జయజయ! మీరే భక్తులకు విశ్రామమునిచ్చెదరు; తూణీరములను ధనుర్బాణములను ధరించియుంటిరి; మీ భుజబలముల ప్రతాపము ప్రబలము; మీరు ఖర దూషణాంతకులు; రాక్షసాంతకులు; జయజయ! ఓ నాథా! మీ రీదుష్టుని సంహరించినందున, నింతవఱకు నాథుఁడులేకయుండిన మాకు మీరే నాథులయితిరి. ఇప్పుడు మేము సనాథుల మయితిమి.

ఛాంద్

"జయ హరణ ధరణీ భార, మహిమా ఉదార అపార.
జయ రావణారి కృపాల, కియే యాతుధాన విహాల.
లంకేశ అతిబల గర్వ, కియే వశ్య సుర గంధర్వ.
ముని వృంద నర ఖగ నాగ, హఠి పంథ సబకే లాగ.

"ఓ భూభారహరణా! మీయుదారమహిమ అపారము; ఓ రావణారీ! జయజయ! రాక్షసులందఱు విహ్వలులయిరి. ఈలంకేశుఁడు, రావణుఁడు బలవంతుఁడనని గర్వించియుండెను; సకలదేవతలను

గంధర్వులను వశముఁ జేసికొనెను. మునులను, నరులను, పక్షులను, మృగములను వాఁడు మూర్ఛించి, యెదిరించి, వారిని వెంటఁదఱిమెను

ఛాంద్

"పరద్రోహరత అతిదుష్ట, పాయో సో ఫల పాపిష్ట.
అబ సునహు దీనదయాల, రాజీవనయన విశాల.
మోహి రహా అతి అభిమాన, నహి కోఉ మోహి సమాన.
అబ దేఖి ప్రభుపద కంజ, గత మాన ప్రద దుఖ పుంజ.

"ఓ నాథా! ఆరావణుఁడు పాపాత్ముఁడు; పరద్రోహి; వానికిఁ దగినఫలము వానికి దొరికెను. ఓ దీనదయాపరా! ఓ కమలలోచనా! నావిన్నపమును స్వీకరింపుఁడు. నాతోసమానుఁడు లేఁడని నాకు దురభిమాన ముండెను. ప్రస్తుతము మీచరణారవిందములను దర్శించినందున, నాదురభిమానమును దుఃఖమును నశించెను.

ఛాంద్

"కోఇ బ్రహ్మ నిర్గుణ ధ్యావ, అవ్యక్త జేహి శ్రుతి గావ.
మోహి భావ కౌసలభూప, శ్రీరామ సగుణ స్వరూప.
వైదేహి అనుజ సమేత, మమ హృదయ కరహు నికేత.
మోహి జానియే నిజ దాస, దేభక్తి రమా నివాస. (8-66)

"వేదములు గానముఁజేయుచుండిన అవ్యక్తమగు నిర్గుణబ్రహ్మము నితరులు ధ్యానించెదరు గాక! నేనుమాత్రము సగుణరూపుఁడగు కోసలాధిపతి, శ్రీరాముని కోరి భజించెదను. ఓ నాథా! శ్రీసీతాలక్ష్మణులతోఁ గూడి, మీరు సదా నాహృదయములో నివసింపుఁడు; ఓ రమారమణగోవిందా! నేను మీదాసుఁడనని తెలిసికొని, మీభక్తిని ప్రసాదింపుఁడు.

ఛాంద్ 67

"దేభక్తి రమా నివాస త్రాసహరణ శరణ సుఖదాయకం.
సుఖధామ రామ నమామి కామ అనేక ఛబి రఘునాయకం.
సురబృంద రంజన ద్వంద్వ భంజన మనుజతను అతులిత బలం.
బ్రహ్మాది శంకర సేవ్య రామ నమామి కరుణా కోమలం.

"ఓ శ్రీనివాసా! ఓ త్రాసహరణా! ఓ శరణాగతవత్సలా! ఓ సుఖధామా! ఓ సుఖదాయకా! ఓ రఘునాథా! మీభక్తిని నాకుఁ బ్రసాదింపుఁడు; మీరు సుఖధాములు; లోకములను రమింపఁజేయుదురు; అనేకకోటిమన్మథాకారులు; తేజోరాసులు; రఘుకులమునకు నాయకులు; నరరూపమునుధరించిన మహాబలవంతులు; దేవతలదుఃఖములను బాపి, వారికి సుఖము నిచ్చితిరి. బ్రహ్మమహేశాదిదేవతలు సదా మిమ్ములను సేవించుచుందురు. మీరు కరుణామయులు; మీస్వభావము కోమలము; ఓ రామా! అనేకవందనములఁ జేయుచున్నాను.

దోహా 275

"ఓ కృపాసాగరా! కటాక్షింపుఁడు; నే నేమిచేయవలయునో, యాజ్ఞాపింపుఁడు." అని దేవేంద్రుఁడు పలికినవచనములను దీనదయాపరుఁడగు రామచంద్రుఁడు విని, సంతోషించి, యతనితో నిట్లు పలికెను.

చౌపాయి

"ఓ దేవేంద్రా! ఈ నావానరభల్లూకములు రాక్షసులచేఁ జంపఁబడి, నేలఁబడియుండిరి; వీరు నానిమిత్తము వారిప్రాణములను విడిచిపెట్టిరి; ఓ సురేశా! నీవు తెలిసినవాఁడవు; బుద్ధిమంతుఁడవు. ఈ వానరభల్లూకములను బ్రతికింపుము." ఓ గరుడా! ప్రభువుమాట యగాధము; మహామునులును, గొప్పజ్ఞానులే, వారిమాటలను గ్రహింపఁగలరు. ప్రభువు తలంచినయెడల, మూఁడులోకములవారిని సంహరించి, క్షణములో బ్రదికింపఁగలరు; అయినను, దేవేంద్రునకు గౌరవమువచ్చుటకు వా రిట్లు చెప్పిరి. అప్పుడు దేవేంద్రుఁ డమృతమును వర్షించి, వానరభల్లూకములను బ్రదికింపించెను; వారు దిగ్గునలేచి, రామునివద్దకు వెళ్లిరి. వానర రాక్షససైన్యములపై నతఁ డమృతమును వర్షించినందున, వానరులు బ్రదికిరి; రాక్షసులు బ్రదుకలేదు. రాక్షసులమనస్సులు రామమయ మయ్యెను; కనుక, వారు ప్రాణములను విడిచి, పరమపదమునకు వెళ్లిరి; అందుచేత, నమృతవర్షముపడినను, వారు బ్రదుకలేరు. వానరభల్లూకములు దేవాంశసంభూతులు. వారి ప్రాణములు వారివారియంశలలోఁ జేరును. కేవలము శ్రీరామునికృప

వలన వారు సజీవులయిరి. ("అనుకూలే జగన్నాథే విపరీతే విపర్యయా") శ్రీరామునివంటి దీనరక్షకుఁ డెవఁడుకలఁడు? కనుకనే, యతఁడు రాక్షసులకుసహితము మోక్షపదవి నిచ్చెను. రావణుఁడు పాపాత్ముఁడు; కామి; దుష్టుఁడు; అయినను, మునీశ్వరులకు లభించుసద్గతి, వానికి రామునికృపవలన లభించెనుగదా!

దోహా 276, 277

దేవతలు పుష్పములనువర్షించి, విమానారూఢులై, వారివారి లోకములకు నిష్క్రమించిరి. ఏకాంతసమయముఁ జూచి, దేవదేవుఁ డగు మహాదేవుఁడు శ్రీరామునివద్దకు వచ్చెను. ఆచతురుఁడు, సర్వజ్ఞుఁడు, సాంబశివుఁడు, ప్రేమాతిశయము లుప్పతిల్ల, హస్తములను జోడించి, స్తోత్రముఁజేయ నారంభించెను; అతని కమలలోచనముల నుండి యానందబాష్పములు కారుచుండెను; అతనిశరీరము పులకరించెను; గద్గదస్వరముతో నతఁ డిట్లు స్తుతించెను.

చౌపాయ్

"ధనుర్బాణములను ధరించియుండిన ఓ రఘునాయకా! నన్ను రక్షింపుఁడు. మహామోహ మనునట్టిమేఘములను విఱియగొట్టుటకు మీరు వాయువువంటివారు. సందేహము లనునట్టివనమును దహించుటకు హుతాశనునివంటివారు. భక్తుల కానందమునిచ్చెదరు. మీరు నిర్గుణులు; సగుణులు; సకలగుణధాములు; మీ దివ్యమంగళవిగ్రహ మతిమనోహరము; భ్రమయనునట్టి యంధకారమును నశింపఁజేయుటకు మీ ప్రతాపము ప్రచండసూర్యుని బోలును; కామక్రోధాదులనునట్టి మహాగజములను సంహరించుటకు మీరు మృగరాజులు; సంసారసాగరమును మథించుటకు మీరు మంథరాచలమువంటివారు; ఓ పరంధామా! ఓ పరాత్పరా! నన్ను రక్షింపుఁడు; నాశిష్యుని వలన మీకు శ్రమకలిగెను; క్షమింపుఁడు. జననమరణములు దుస్తరములు; అవాఙ్మనసములు; వీనినుండి నన్ను తరింపఁజేయుఁడు. ఓ నాథా! మీశరీరము శ్యామలము; మీనేత్రములు కమలములు; మీరు దీనబంధువులు; ప్రణతార్తిహరులు. ఓ రామనృపాలా! శ్రీ సీతాలక్ష్మణులతోఁ గూడి, నాహృదయములో మీరు సదా నివసిం

పుడు. భూమండలమునకు మీరే భూషణము; మునీశ్వరులమనస్సులను రంజింపఁ జేయఁగలరు. ఓ నాథా! తులసీదాసుదుఃఖమును హరింపుము.

దోహా 278

"ఓ నాథా! అయోధ్యానగరములో మీ రాజ్యతిలకసమయమునకు వచ్చి, మీ యుదారచరిత్రముఁ జూచుటకు వచ్చెదను."

చౌపాయ్

ఈ ప్రకారము శివుఁడు స్తుతించి, నిష్క్రమించెను. అంతలో విభీషణుఁడు రామునివద్దకు వచ్చెను. అతఁడు రామునిచరణములకు నమస్కరించి, మృదుమధురముగ నిట్లు విన్నవించెను. "ఓ నాథా! ఓ శార్ఙ్గకోదండధరా! నావిన్నపమును వినుఁడు; పుత్రమిత్రబంధువర్గముతో మీరు రావణుని సంహరించితిరి; నిర్మలమగు మీకీర్తి మూఁడులోకములలో వ్యాపించెను. నేను దీనుఁడను; మలినుఁడను; బుద్ధిలేనివాఁడను; తక్కువజాతివాఁడను; అట్టి నన్ను మీరు కటాక్షించితిరి. ఓ నాథా! దాసునిగృహములోనికి వచ్చి, పవిత్రము జేయుఁడు; యుద్ధముఁజేసి, బడలియుంటిరి; కనుక, స్నానముఁజేసి, విశ్రమింపుఁడు. ఈనా రాజ్యమును, కోశమును, మందిరమును, సంపదను ప్రసన్నులై, చిత్తగించి, వానరులకు సంతోషముఁ గలుగజేయుఁడు. ఓ నాథా! నేనును నాసర్వమును మీవానిగభావించి, నన్ను మీనగరమునకు దీసికొనివెళ్లుఁడు." ఇట్లు విభీషణుఁడు విన్నవించినమాటల నా దీనదయాపరమూర్తి విని, సంతోషించి, యానందబాష్పములఁ గార్చెను.

దోహా 279, 280, 281, 282

"ఓ విభీషణా! నీవు చెప్పినమాట సత్యము; ఈనీరాజ్యమును, కోశమును, సంపదయు నిజముగ నాకుఁజెందును. అయినను, నా తమ్ముఁడు భరతునిదుర్దశను స్మరణముఁ దెచ్చుకొనినపుడు, ఒకనిమిషము నాకొకకల్పమువలె నున్నది. నాతమ్ముఁడు మునివేషమును ధరించియుం

డెను; అతనిశరీరము కృశించెను; అతఁడు సదా నన్నే భజించుచుం డును. అతనిని శీఘ్రముచూడవలెనని నాకు గోరికకలదు. ఓ సఖుఁ డా! నామాటను మన్నింపుము; పదునాలుగుసంవత్సరములు గడచిన తరువాత, నేనువెళ్లి, నాతమ్ముని జీవించియుండఁ జూడను." ఈప్రకా రము తమ్మునివాత్సల్యము నతఁడు స్మరించినపు డతనిశరీరము పులక రించెను. "ఓ సఖుఁడా! ఒకకల్పము నీవు రాజ్యముఁజేయుము. ఎల్ల పుడు నన్నుస్మరించి, భజింపుము. అంతమున నీవు నాధామమును బొందఁగలవు. ఆధామమునకే సత్పురుషులు వచ్చుచుందురు." అని రాముఁడు చెప్పెను.

చౌపాయ్

ఆకృపాధాముని, ఆ శ్రీరామునివచనముల నతఁడు విని, యతని చరణములఁ బట్టుకొనెను. వానరభల్లూకములు పరమానందభరితులై, శ్రీరాముని నిర్మలగుణములను ప్రశంసించిరి. అనంతరము విభీషణుఁడు నగరులోనికి వెళ్లి, దివ్యవస్త్రాద్యలంకారములను, నవరత్నములను పుష్ప కవిమానముపైఁ బెట్టి, దానిని దీసికొనివచ్చి, రామునియెదుటఁ బెట్టెను. అప్పు డతనితో శ్రీరామమూర్తి యిట్లు ప్రసంగించెను. "ఓ సఖుఁడా! ఈవిమానముపైఁ బెట్టిన వస్త్రాద్యలంకారములను బట్టుకొని, యంతరిక్ష మునకుఁ గుప్పించి, నీవు వానిని వర్షింపుము." ఆప్రకార మతఁడు కుప్పించి, యెగసి, యంతరిక్షమునుండి వానిని వర్షించెను. వానరులు వారివారిమనస్సునకుఁ దోఁచినట్లు వానిని సంగ్రహించిరి. ఆమణులను వానరులుచూచి, ఫలములని భ్రమపడి, వానిని నోటిలోఁ బెట్టుకొని, రాళ్లని తెలిసికొని, వానిని విసర్జించిరి. వానరులచేష్టలను జూచి, శ్రీసీ తారామలక్ష్మణులు నవ్వుచుండిరి.

దోహా 283, 284

వేదములచే 'నేతి, నేతి' అని గానముఁ జేయఁబడువాఁడు, మునీశ్వరులధ్యానమునకు సహితము గ్రాహ్యము కానివాఁడు, శ్రీరా మమూర్తి వానరభల్లూకములతోఁ గూడి, యనేకకేళీవినోదములన్ను

జరపెను. ఓ పార్వతీ! యజ్ఞములను, జప, తప, వ్రతనియమములఁ జేసినను, భగవంతుఁ డిట్లు వినోదము జరపఁడు. కేవలము వారి యనుగ్రహమే, దీనికిఁ గారణము.

చౌపాయ్

వానరభల్లూకములు వస్త్రాద్యలంకారములను ధరించి, రాముని వద్దకు వచ్చిరి; అనేకరంగురంగుల వానరభల్లూకముల నతఁడుచూచి పరమానందభరితుఁ డయ్యెను. అతఁడు కృపాదృష్టిచే వారిని వీక్షించి, యాదరించి, మృదుమధురముగ నిట్లు సంభాషించెను. "ఓ వానరులారా! మీబలముచేతనే, నేను రావణుని సంహరించితిని; విభీషణునకు రాజ్యమునిచ్చితిని. ఇఁక మీరు మీస్వగృహములకు నిష్క్రమింపుఁడు. సదా నన్ను స్మరింపుఁడు; ఒకరికి మీరు భయపడవలదు." ఆ వానరులు శ్రీరామునివచనములను విని, ప్రేమాతిశయముచే వ్యాకులులై, చేతులను జోడించుకొని, యిట్లు విన్నవించిరి; "ఓ నాథా! మీ మాటలు మీకే ప్రవర్తించును; కాని, మీమాటలవలన, మామనస్సులు భ్రమించుచున్నవి. మేము దీనులమని మీరు తెలిసికొని, మీరే మాకు నాథులయిరి; ఓ రఘురామా! మీరు త్రిలోకాధిపతులు. మీమాటలను వినినందున, మమ్ములను సిగ్గు చంపుచున్నది. ఎన్నఁడైనను, మశకము గరుత్మంతునకు సహాయముఁ జేయఁగలదా?" ఆ వానరభల్లూకములు శ్రీరామునిముఖారవిందముఁ జూచిచూచి, సంతోషముచేఁ బరవశులై, స్వగృహములకు వెళ్లుట వారి కిష్టములేకపోయెను.

దోహా 285, 286, 287

శ్రీరామునియాజ్ఞప్రకారము వానరభల్లూకములు రాముని రూపమును మనస్సులో ధ్యానించుచు, హర్షవిషాదములతోఁ గూడినవారై, యనేకవిధముల విన్నపములఁ జేయుచు, వెడలిరి. జాంబవంతుఁడు, నలుఁడు, నీలుఁడు, సుగ్రీవుఁడు, హనుమంతుఁడు, విభీషణుఁడు మొదలగుమహాయోధులు, ప్రేమచేఁ బరవశులై, మాటఁజెప్పలేక యూరకుండిరి; వారు కన్నీరుఁ గార్చుచుండిరి; తెప్పవేయక, వారు శ్రీరామునిముఖముఁ జూచుచు, నిలువఁబడిరి.

## చౌపాయ్

వారిప్రేమాతిశయములను శ్రీరాముఁడు చూచి, వారిని విమానముపైఁ గూర్చుండఁబెట్టుకొనెను. అతఁడు మనస్సులో బ్రాహ్మణుల చరణములకు నమస్కరించి, ఉత్తరదిక్కునకు విమానమును ద్రిప్పెను. ఆవిమానము వెడలినపుడు కోలాహలము పుట్టెను. 'శ్రీరామచంద్రజీకీ జయ్' అని వానరులు ఘోషించిరి; అటులనే, దేవతలుసహితము జయజయశబ్దములఁ బలికిరి. ఆవిమానములో నొకమహోన్నతమగు చక్కని సింహాసన మొకటికలదు. దానిపై శ్రీజానకీరాములు కూర్చుండిరి; సుమేరుపర్వతశృంగములపై మేఘములును మెఱుపులునువలె, సింహాసనముపైనుండిన వారిరువురు దేదీప్యమానముగ వెలుగుచుండిరి; ఆ విమానము మహావేగమున బోవుచుండెను; దేవతలు సంతోషించి, పుష్పములను వర్షించిరి; మంద, సుగంధ, శీతలవాయువులు ప్రసరించెను; సముద్రోదకములును, గంగానదీజలములును నిర్మలమయ్యెను. నలువైపుల శుభశకునములు కనఁబడెను; దశదిశలు నిర్మలముగ నుండెను; అందరిమనస్సు లుత్సాహముతో నుండెను. అప్పుడు శ్రీరాముఁడు జానకితో నిట్లు సంభాషించెను. "ఓ జానకీ! ఇదిగో రణస్థలము; ఇచ్చటనే, లక్ష్మణుఁడు మేఘనాదుని సంహరించెను. ఇట్లు కుప్పతిప్పలుగ పడియుండినరాక్షసుల నంగదహనుమంతులు సంహరించిరి. దేవతలను మునులను బాధించుచుండిన రావణకుంభకర్ణుల నే నిచ్చట సంహరించితిని.

## దోహా 288, 289

"ఓ జానకీ! ఇదిగో సేతువుఁ జూడుము; ఇచ్చట వారధిఁగట్టితిమి; ఇచ్చటనే, శ్రీరామేశ్వరుని బ్రతిష్ఠించితిమి." అప్పుడు శ్రీసీతారామలక్ష్మణులు రామలింగేశ్వరునకు నమస్కరించిరి. ఏయేస్థలములలో నతఁడు వనవాసముఁజేసి, విశ్రమించెనో, ఆయాస్థలముల నతఁడు పేరుపేరున జానకికిఁ జూపించెను.

## చౌపాయ్

అతివేగమున విమానము దండకారణ్యమునకు వచ్చెను. ఆ వనము పరమశోభాయమానముగ నుండెను. అగస్త్యాది మహామునుల

యాశ్రమములవద్ద దిగి, శ్రీరాముఁడు వారిని దర్శించెను. వారిదీవనల నతఁడుపొంది, చిత్రకూటపర్వతమునకు వచ్చెను. అచ్చట నివసించియుం డినమహర్షుల నతఁడు సంతోషపెట్టి, యచ్చటనుండి విమానమును నడి పించెను. ఆవిమానము మహావేగమునఁ బోవుచుండెను. సకలపాపము లను బోఁగొట్టుయమునానదిని జానకికి శ్రీరాముఁడు చూపించెను. అంతలో గంగానది దృగ్గోచర మయ్యెను. "ఓ జానకీ! ఇదిగో గంగాభ వాని! సమస్కరింపుము. సుఖముగ వనవాసముఁ జేసివచ్చినయెడల, నామెను బూజించెదనని మ్రొక్కియుంటివి." ఆమె వారుచెప్పినప్రకా రము గంగాయమునలకు నమస్కరించెను. అంతలో వారు, తీర్థరాజ మగుప్రయాగను దర్శించిరి. దానిని దర్శించినమాత్రమున, కోటిజన్మ ములపాపములు నశించును; పిమ్మటఁ బరమపావనియగు త్రివేణిని వారు చూచిరి. ఆత్రివేణి శోకమును దుఃఖమును హరించును; ఆమె స్వర్గలోకమునకు సోపానమువంటిది. అంతలో వారు పరమపవిత్రమగు నయోధ్యానగరమును జూచిరి; ఆనగరము తాపత్రయములను భవ రోగములను హరించును.

దోహా 290, 291

అయోధ్యానగరమునకు శ్రీజానకీరాములు నమస్కరించిరి; దానింజూచి, వారు కన్నీటఁ గార్చిరి; వారిశరీరములు పులకరించెను. శ్రీరాముఁడు పరమానందభరితుఁ డయ్యెను. అచ్చటనుండి రాముఁడు తిరిగి, త్రివేణివద్దకు వచ్చి, స్నానముఁజేసి, సంతోషించెను. అతఁడు వానరులతోఁ గూడి, బ్రాహ్మణులకు దానముల నిచ్చెను.

చౌపాయ్

అప్పుడు శ్రీరాముఁడు హనుమంతునితో నిట్లు చెప్పెను; "ఓ మహావీరుఁడా! నీవు బ్రాహ్మణరూపమును ధరించి, అయోధ్యానగరము నకు శీఘ్రముగ వెళ్లుము. మాక్షేమమును భరతునకుఁ జెప్పి, యతని క్షేమసమాచారముఁ దీసికొని రమ్ము;" ఆమాటలను విని, మహావీరుఁడు వెంటనే వెడలెను. శ్రీరామమూర్తి భరద్వాజునియాశ్రమమువద్దకు వచ్చిరి; అతనిని మునిరాజు స్తుతించి, సత్కరించి, పూజించి, దీవించెను. ఆ మునిరాజుచరణముల కతఁడు దండప్రణామములఁ జేసి, విమాన

ముప్పైఁ గూర్చుండి వెడలెను. అంతలో, నిషాదపతి శ్రీరామునియాగమ నమును విని, నావలను సిద్ధపఱచుమని సేవకుల కుత్తరవుఁజేసెను. ఆవిమానము గంగానదిని దాఁటి, యొడ్డునకు వచ్చెను; శ్రీరాముని యాజ్ఞప్రకార మది నదీతీరమున దిగి, నిలిచెను. అప్పుడు జానకి గంగా దేవినిఁ బలువిధములఁ బూజించి, యామెపాదములకు నమస్కరించెను. "ఓ సుందరీ! సౌభాగ్యవతీభవ" అని యామెను గంగాదేవి దీవించెను. శ్రీరామునియాగమనమును నిషాదపతి విని, పరమోత్సాహభరితుఁడై, అతియనురాగముచేఁ బరవశుఁడై, పరుగెత్తి రామునివద్దకు వచ్చెను. అతఁడు శ్రీజానకీరాములఁ జూచి, భూమిమీఁదఁబడి, సంతోషముచేఁ బరవశుఁడై, మైమఱచెను. అతనినిర్మలాంతఃకరణమును రాముఁడు చూచి, ప్రసన్నుఁడై, యతనిని లేవఁదీసి, కౌఁగిలించుకొనెను.

ఛాంద్ 68, 69

ఆలక్ష్మీపతి, యాచతురుఁడా కృపాసాగరుఁడు, శ్రీరాముఁడు గుహునిఁ గౌఁగిలించుకొనెను; ఆనిషాదపతిని తనవద్దఁ గూర్చుండఁ బెట్టుకొని, అతనియోగక్షేమము నడిగెను. "ఓ రాజాధిరాజా! బ్రహ్మ మహేశాదిదేవతలు సేవించునట్టి మీచరణకమలములను దర్శించి నందున, మేమందఱము కుశలము. మీరు సుఖధాములు; సంపూర్ణకాములు. మీ కనేకదండప్రణామంబులఁ జేయువాఁడ." అని గుహుఁడు విన్నవించెను. అన్నివిధముల నిషాదపతి నీచుఁడని తెలిసికొనుము; అయిన, నతఁడు భరతునివంటివాఁడని రాముఁడు గ్రహించి, యతనిఁ గౌఁగిలించుకొనెను.

'ఓరీ మందమతీ! నీవు మోహముచే నట్టిప్రభువును మఱచితివి.' అని తులసీదాసుగారు చెప్పుచున్నారు. ఆ రావణాంతకుని, ఆశ్రీరా ముని పవిత్రమగుచరిత్రమును వినినందున, నతనిచరణములయందు నిర్మలమగు ననురాగము పుట్టును. ఆచరిత్రము కామక్రోధాదులను హరించును; విజ్ఞానముఁ బుట్టించును. ఈచరిత్రమును దేవతలును, మునులును, సిద్ధులును సంతోషముతో సదా గానముఁజేయుచుందురు.

**దోహా 292, 293**

శ్రీరాముని యుద్ధవిజయచరిత్రము నెవరు ప్రేమపూర్వకముగ విని సంతోషించెదరో, వారికి సకలైశ్వర్యములును జయములును గలుగును. మహాకలికాలము పాపభూయిష్ఠము. ఈసంగతినివిచారించి, తెలిసికొనుము. శ్రీరామనామముతప్ప మఱియొక యాధారము లేదు ఆనామము చతుర్విధపురుషార్థముల నిచ్చును.

లంకాకాండము సంపూర్ణము.

---

*

శ్రీమద్గోస్వామి

# తులసీదాసకృతరామాయణము

# ఉత్తరకాండము.



## ప్రథమవిశ్రామము.

శ్లో. కేకీకంఠాభనీలం సురవరవిలసద్విప్రపాదాబ్జచిహ్నం
శోభాఢ్యం పీతవస్త్రం సరసిజనయనం సర్వదా సుప్రసన్నమ్,
పాణౌ నారాచచాపం కపినికరయుతం బంధునా సేవ్యమానం
నౌమీడ్యం జానకీశం రఘువరమనిశం పుష్పకారూఢరామమ్.

శ్లో. కోసలేంద్రపదకంజమంజులౌ, కోమలౌ విధిమహేశవందితౌ,
జానకీకర సరోజలాలితౌ, చింతకస్య కలభృంగసంగినౌ.

### దోహా 1, 2, 3, 4

శ్రీరామమూర్తి నగరములోఁ బ్రవేశించుట కొకదిన మవశేషముండెను; రామునివియోగముచేత నాబాలవృద్ధులు, స్త్రీపురుషులు, నిద్రాహారములులేక కృశించి నీరసించియుండిరి; నగరమంతటను వారి దీనాలాపములు వినఁబడెను; ఎచ్చటనుండినవా రచ్చటనే యుండిరిగాని యొకరివద్ద కొకరువెళ్లుటకు వారికి శక్తిలేదు; నగరములో నెటువైపుఁ జూచినను, విషాదము కనఁబడెను. అంతట శుభశకునములు కనఁబడెను; ఆవెంటనే, స్త్రీపురుషులహృదయములు సంతోషముచే వికసించెను; మఱుసటిదినము శ్రీరామమూర్తి నగరములోఁ బ్రవేశించునని వర్తమానము వచ్చెను; అది నగరమంతటను వ్యాపించెను; అయోధ్యాపట్టణమంతయుఁ గళకళలాడుచుండెను. పట్టణమునకు నూతన కళలు వచ్చెను. కౌసల్యాద్యంతఃపురస్త్రీలహృదయములు సంతోషముచే వికసించెను; ఆముహూర్తమున శ్రీసీతాలక్ష్మణులతోఁగూడి

శ్రీరామమూర్తి వారియెదుట నిలువఁబడియుండినట్లు వారు తలంచి ఆనందించిరి. భరతుని దక్షిణహస్తమును నేత్రమును నదరెను; మాటి మాటికి నవి యదరెను; అందుచేత నతఁడు సంతసించి, మనస్సులో నిట్లు చింతించెను;

### చౌపాయ్ 1

"ఇంతవఱకు నాప్రాణములను ధరించియుంటిని; ఇంక నొకదిన మువూత్రము కలదు; ఆసంగతిఁ దలఁచికొనిన, నాకు దుఃఖము కలుగు చున్నది; ఎందుచేత నింతవఱకు నాప్రభువు రాలేదు? నేను కుటిలస్వ భావుఁడనని స్వామిగ్రహించి, న న్నుపేక్షించెను. అహాహా! లక్ష్మణుఁ డెంతధన్యుఁడు! ఎంతపుణ్యాత్ముఁడు! రాముని చరణకమలముల నతఁడు సదా సేవించునుగదా! నేను కపటిననియుఁ గుటిలుఁడననియు స్వామి తెలిసికొని, నన్ను నగరములో విడిచిపెట్టి వెళ్లెను. నాకార్యములనే స్వామి విచారణఁజేసినయెడల, ననేకవేలయుగములు గతించినగాని నాకు ముక్తిలభింపదు; స్వామిమనస్సు మృదువయినది; అతఁడు దీన బంధువు; కృపాలుఁడు; తనసేవకులయపచారముల నతఁడు క్షమించు చును. శ్రీరామమూర్తి తప్పకవచ్చునని నా నమ్మకము; అందునకుఁ దగినట్లు శుభశకునములు కనఁబడుచున్నవి; పదునాలుగుసంవత్సరముల కొకదినము తక్కువగ దయచేయుమని రాముని నేను బ్రార్థించియుం టిని; అవధి దాఁటినతరువాత, రామునిఁజూడక నేను ప్రాణములతో నుండినయెడల, నావంటిపాపాత్ముఁడు మఱియొకఁడు లోకములో నుం డఁడు." అని యనేకప్రకారముల భరతుఁడు విచారించుచుండెను.

### దోహా 5, 6

శ్రీరాముని వియోగమనునట్టి దుఃఖసముద్రములో భరతుని మనస్సు మునుఁగుచుండెను; మహావీరుఁడు, హనుమంతుఁడు బ్రాహ్మణ వేషమును ధరించి, పడవవలె నతనిని రక్షించుటకు వచ్చెను; భరతుఁడు కుశాసనముపైఁ గూర్చుండెను; అతనిశరీరము కృశించి నీరసించెను; అతనిశిరోజములు జట లల్లుకొనెను; అతనినేత్రములవెంబడి నీరు కారుచుండెను; అతఁడు సదా రామనామమును జపించుచుండెను; భగవంతునియందుఁగలప్రేమ భరతునియందే ప్రకాశించెను.

చౌపాయ్ 2

ఈవిధమునసుండిన భరతునిఁ జూచి, హనుమంతుఁడు పరమానందభరితుఁ డయ్యెను; అతనిశరీరము పులకరించెను; ఎందుచేతననిన, "ఓ ఆంజనేయా! భరతునకు రాజ్యముఁజేయుట కభిలాషయుండిన యెడల, నేను వానికి రాజ్యమును విడిచిపెట్టెదను" అని రాముఁడు హనుమంతునితోఁ జెప్పెను; ఆమాటవిని హనుమంతుఁడు విచారించెను; అందుచేత, నతనిమాటకు విరుద్ధముగ భరతుఁడు కనఁబడినందున, హనుమంతుఁడు సంతసించెను; అనేకప్రకారముల నతఁడు చింతించి,అమృతోపమానవాక్యములను భరతునిచెవిలో హనుమంతుఁడు చెప్పెను. "ఓ స్వామీ! ఓ భరతుఁడా! ఎవనివియోగమును సహింపలేక అహోరాత్రములు నీవు దుఃఖించుచుంటివో, ఎవనిగుణముల నహర్నిశము నీవు జపించుచుంటివో, ఎవఁడు రఘువంశమునకుఁ దిలకమువంటివాఁడో, ఎవఁడు దేవతలను మునులను రక్షించెనో, ఎవఁడు స్వధర్మపరిపాలకుఁడో, ఎవఁడు సుజనులకు సుఖమునిచ్చునో, అట్టి శ్రీరామమూర్తి సురక్షితముగ, సీతాలక్ష్మణులతోఁ గూడి, విజయముఁ జేసిరి; శ్రీరాముఁడు శత్రువులను సంహరించెను; అతనిప్రతాపమును దేవతలు కొనియాడిరి" అని హనుమంతుఁడు చెప్పెను. దాహముచే డస్సినమనుజుఁడు జలముఁజూచి సంతసించినవిధమున, నతని యమృతవాక్కులను విని, భరతుఁ డానందించి, "అయ్యా! ఈ శుభవర్తమానముఁ దెచ్చిన మీ రెవరు? మీ రెచ్చటనుండి వచ్చితిరి? అని యడిగెను. "ఓ కృపానిధానా! నేను వాయుపుత్త్రుఁడను; హనుమంతుఁ డనుపేరుగల వానరుఁడను" అని యాంజనేయుఁడు ప్రత్యుత్తరమిచ్చెను; "దీనబంధువు శ్రీరాముని దాసుఁడనని తెలిసికొనుము" అని చెప్పెను; ఆమాటలను విని, అత్యాదరముతో భరతుఁడు లేచి, వాయుపుత్త్రుని సమీపించి, ప్రేమతో వానినిఁ గౌఁగిలించుకొనెను; ఆసంతోషము నతఁడు పట్టలేకపోయెను; నేత్రములనుండి ఆనందబాష్పములు జలజలఁ గారెను; అతనిశరీరము పులకరించెను; "ఓ కపివర్యా! నీమాట విని, నాదుఃఖము పోయెను; నీదర్శనమువలన, నాకు శాంతమువచ్చెను. ఏమి నాభాగ్యము! ఈదినమున రామునిదూతను

నేను జూచితిని." అని భరతుఁడు పలికి, మాటిమాటికి శ్రీరాముల క్షేమసమాచారము నడిగెను. "ఓ తమ్ముఁడా! నీకేమి ప్రత్యుపకారముఁ జేయఁగలను? నేను లెస్సగవిచారించి చూచితిని; కాని, నీవు చెప్పిన శుభవర్తమానమునకుఁ దగినప్రత్యుపకారము లోకములో మఱియొకటి నాబుద్ధికిఁ దోఁచలేదు. ఓ నాయనా! అందుచేత, నేను నీఋణముఁ దీర్పలేను; రాముఁడు చేసిన కార్యములను నాకు వినిపింపుము," అని భరతుఁడు చెప్పెను. భరతుని చరణకమలములకు హనుమంతుఁడు వందనముఁ జేసి, శ్రీరామునిరణచర్యల నతనికి శ్రుతపఱచెను. "ఓ మహావీరుఁడా! నే నతనిదాసుఁడనని తెలిసికొని, పరమదయానిధి, శ్రీరాముఁడు, నన్నెప్పుడైనఁ దలఁచియుండెనా? నిజముఁ జెప్పుము.

చౌపాయ్ 1

ఆ రఘువంశతిలకము నావంటిదీనుని స్మరించెనా?" అని భరతుఁడుపలికిన మృదుమధురవాక్యములను హనుమంతుఁడు విని, పులకరించిన శరీరముగలవాఁడై, పరమానందముతో నతనిపాదములమీఁదఁ బడెను. "నీవంటి బుద్ధిమంతుఁడును, బుణ్యాత్ముఁడును, సకలగుణసంపన్నుఁడు నగుతమ్ముఁడు లోకములో మఱియొకఁడు లేఁడని, జగన్నాథుఁడు, శ్రీరాముఁడు శ్రీముఖములోఁ జెప్పెను; అందునకు వ్యతిరిక్తము కలుగునా

దోహా 7

"ఓ నాథా! రామునకు నీవు ప్రాణములతో సమానుఁడవు. నామాటలు సత్యము" అని మహాబలునికుమారుఁడు చెప్పి, పట్టలేనంత సంతోషముతో నతఁడు భరతుని గాఢాలింగనముఁ జేసికొనెను.

సోరఠా 1

ఈమాటలఁ జెప్పి, భరతునిపాదములకు నమస్కరించి, పవనపుత్రుఁడు రామునివద్దకు వచ్చి, భరతుని సర్వవృత్తాంతమును వినిపించెను; అందులకు శ్రీరాముఁడు సంతసించి, విమానముపై బయలువెడలెను.

చౌపాయ్ 3

అంతట పరమానందముతో భరతుఁడు నందిగ్రామమునుండి వెడలి, అయోధ్యానగరమునకు వచ్చి, శ్రీరామవృత్తాంతమును వసిష్ఠ

నకు విన్నవించెను; అనంతర మతఁ డంతఃపురములోనికిఁ బోయి, శ్రీ రాముఁడు సీతాలక్ష్మణులతోఁగూడి సురక్షితముగవచ్చి నగరములోఁ బ్రవేశించుచునని,ముప్వురుతల్లులకు వ్యక్తపఱచెను. ఆమాటను విని తల్లులు త్రుళ్లిపడి దిగ్గునలేచిరి; కాని, రాముని క్షేమసమాచారమును వారికిఁ జెప్పి, భరతుఁడు వారికి స్వాస్థ్యమునిచ్చెను. నగరవాసులు, స్త్రీపురుషు లావర్తమానమును విని, సంతోషముచే నలువైపుల పరుగెత్తిరి; స్త్రీలు చక్కఁగ సింగారించుకొని, జాతీవకుళ చంపక పాటలాబ్జ పున్నాగ జాజి కరవీర రసాలపుష్పములను, బిల్వప్రవాళ తులసీదల మల్లికాదులను బట్టుకొని, మంగళద్రవ్యములను దీసికొని, యెదురునడిచిరి; బాలురను వృద్ధులను గృహములవద్దవిడిచిపెట్టి, యెవరికివారు సంభ్రమముతో వెడలిరి; ఎవరిపనులను వారు దిగవిడిచి, పరుగెత్తిరి; "దయాసముద్రుఁడు, రాముని నీవు చూచితివా? నీవు చూచితివా?" అని యొకరితోనొకరు గుసగుసలాడిరి. ఆసమయమున నయోధ్యానగరము కళకళలాడుచుండెను; దానిశోభను వర్ణింపలేను; సరయూనదిజలము లతినిర్మలముగఁ బ్రవహించెను; శీతల మందసుగంధవాయువులు వీఁచెను.

దోహా 8, 9, 10

సుమంత్రాదిమంత్రులును, వసిష్ఠాదిగురువులును, ముప్వురుతల్లులును, బురజనులు స్త్రీపురుషులును, చతురంగబలములును వెంటనడువఁ దమ్ముఁడు శత్రుఘ్నునితోఁగూడి సంతోషముతో భరతుఁడు రాముని సందర్శించుటకు వెడలెను. అనేకస్త్రీలు రామునిదర్శించుటకు మేడల నెక్కిరి; వారు పుష్పకముఁ జూచి, సంతసించి, సేసలఁజల్లి, మంగళహారతుల నిచ్చి, పాటలఁబాడిరి. శరత్కాలరాకాచంద్రబింబముఁ జూచి, సముద్రుఁడు పొంగినరీతిమున, శ్రీరాముని దర్శించి, పురజనులు సంతోషముచేఁ బొంగిరి. వారికోలాహలము మిన్నుముట్టెను.

చౌపాయ్ 4

రఘుకులకమలములకు మిత్రుఁడగు రాముఁడు నగరముయొక్క శోభను వానరులతోఁ జెప్పుచుండెను. "ఓ సుగ్రీవా! ఓ అంగదా! ఓ విభీషణా! ఈ నాపట్టణ మయోధ్య పరమ పవిత్రమయినది; ఈనాదేశ మతిసుందరమయినది. వేదపురాణములు స్తోత్రముఁజేసిన వైకుంఠ రాజ్య

మును మనుజు లభిలషింతురు; అయోధ్యమీఁద నాకుఁ బ్రీతికలదు; ఈ నాయభిప్రాయమును తగుపాటిజనులు మాత్రము గ్రహింతురు.

శ్లో. అయోధ్యా చ పరబ్రహ్మ సరయూః సగుణః పుమాన్,
తన్నివాసీ జగన్నాథ స్సత్యం సత్యం వదామి తే.

ఇతి పద్మపురాణే.

శ్లో. మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. ఇతి భ. గీతా.

ఇదిగో చూడుఁడు; ఇది నా జన్మభూమి; ఎంత కళకళలాడు చున్నది; నగరమున కుత్తరమున సరయూనది ప్రవహించుచున్నది; ఈ నదిలో స్నానముఁజేయువారు సునాయాసముగ నాసాయుజ్యముఁ బొందఁగలరు. ఈనగరవాసులు నా కత్యంతమిత్రులు; ఈనగరము సకలసంపదలకుఁ బుట్టిల్లు. ఇది నాకు వైకుంఠముకంటె నధికము" అని శ్రీరామమూర్తి వారికిఁ జెప్పెను; శ్రీవారివాక్యములను విని వానరులు హర్షించిరి; అహహా! అయోధ్యారాజ్యలక్ష్మి యెంతధన్యురాలు! శ్రీవారు స్వయము దానిని పలువిధములఁ గొనియాడిరి కదా!

దోహా 11, 12

భరతాదులఁ జూచి శ్రీరాముఁడు పుష్పకమును భూమిమీఁదకు దిగుమని యాజ్ఞాపించెను; అప్రకార మది భూమిమీఁద వ్రాలెను; శ్రీస్వామివారు విమానములోనుండి వెలుపలికివచ్చి నిలువఁబడి, "ఓ పుష్పకమా! నీవు కుబేరునివద్దకుఁ బొమ్ము" అని దానికి సెలవునిచ్చిరి; రావణునిపోరు తప్పినందులకుఁ బుష్పకము సంతసించెను; కాని, భగవంతునివియోగమున కది దుఃఖించి, కుబేరునివద్దకుఁ బోయెను.

చౌపాయి 5

భరతుఁడును, నతనివెంట వచ్చినవారును, రామునివియోగదుఃఖముచేఁ గృశించి నీరసించియుండిరి; వసిష్ఠ, వామదేవ, వాలఖిల్య, జాబాల్యాదిమహర్షులఁ జూచి, ధనుర్బాణములను విడిచి, శ్రీరాముఁడు వారికి దండప్రణామములఁ జేసెను; రామలక్ష్మణు లిరువురు పులకితశరీరములుకలవారై, గురుపదములను నమస్కరించిరి; వసిష్ఠుఁడు వారి నిదీవించి, వారియోగక్షేమమును బ్రశంసించెను. "ఓ స్వామీ! మీ

యాశీర్వచనమువలన మేము సురక్షితముగ వచ్చితిమి" అని వారిరు వురు పలికిరి. అనంతరము శ్రీరాముఁడు బ్రాహ్మణులకు నమస్కరించెను ; వారతనిపై నేసలఁ జల్లి, "శతమానం భవతి, శతమనంతం భవతి, శతమైశ్వర్యం భవతి, శతం దీర్ఘమాయుః" అని వారు దీవించిరి. పిమ్మట బ్రహ్మాదిదేవతలచే నిత్యము సేవింపఁబడురాముని చరణారవిందములఁ బట్టుకొని భరతుఁడు సాష్టాంగముపడెను. అతనిపాదములఁ బట్టుకొని, యెంత లెమ్మనిచెప్పినను భరతుఁడు వినక సాష్టాంగము పడియుండెను. అప్పుడు రాముఁడు తమ్మునిఁ జేతులతోఁబట్టి నిలువఁబెట్టి కౌఁగిలించుకొనెను ; దూర్వాంకురములఁబోలిన రాముని దేహము పులకరించెను ; అతని నేత్రకమలములనుండి బాష్పములు స్రవించెను.

ఛాంద్ 2, 3

అతనిపద్మనేత్రములు ఆనందబాష్పపూరితము లయ్యెను. అతని సుందరమయినశరీరము పులకరించెను ; త్రిలోకాధిపతి తమ్ముని గాఢాలింగనముఁ జేసికొనెను ; అన్నదమ్ముల సమాగమముయొక్కసొంపు వర్ణింపఁజాలను; ప్రేమయు శృంగారమును మూర్తీభవించి, యొకటితో నొకటి కలసియుండినట్లు తోఁచెను. అపరమకృపానిధి భరతునిఁ జూచి కుశలప్రశ్నఁ జేసెను ; అందుకుఁ బ్రత్యుత్తరముఁ జెప్పక, భరతుఁడు యూరకుండెను. ఓ పార్వతీ ! ఆసంతోషము ననుభవింపవలెనుగాని, మాటలతోఁజెప్పుటకు శక్యముకాదు. "ఓ కోసలాధీశా ! అన్నిప్రకారముల నాను క్షేమము ; దాసునిదీనత్వముఁ జూచి, మీరు వానికి దర్శనము నిచ్చితిరి ; ఓ కృపానిధీ ! వియోగదుఃఖములో మునుఁగుచుండినవానిని మీచేతులతో నుద్ధరించి నిలువఁబెట్టితిరి."

దోహా 13

అనంతరము రాముఁడు శత్రుఘ్నునిఁ బ్రేమతో నాలింగనముఁ జేసికొనెను ; భరతుఁడు లక్ష్మణునిఁ గౌఁగిలించుకొనెను ; అన్నదమ్ముల పొత్తును వారిసొంపును జూచిపరవలెనుగాని మాటలవలనఁ జెప్పుటకు శక్తిలేదు.

చౌపాయ్ 6

పిమ్మట లక్ష్మణశత్రుఘ్నులు కలసిరి; వియోగదుఃఖమును వారు మఱచిరి; పరమానందముతో భరతశత్రుఘ్నులు సీతచరణకమలములకు నమస్కరించిరి. పురజనులు రాముని దర్శించి సంతసించిరి; వారి దుఃఖము శాంతించెను; పురజనులకుఁ దనయందుఁగల దయఁజూచి, వారికోరికలనీడేర్చుటకు రాముఁ డొకమాయఁ బన్నెను; వనములో నతఁడేవిధమున ఋషులకోరికలను నెరవేర్చెనో, అటులనే పురజనుల మనోరథముల నతఁడు తీర్చెను. అనేకరూపములను ధరించి, ఆయా స్త్రీపురుషుల యోగ్యతకనుగుణ్యముగ వారితో నతఁడుకలిసి, కలుపుగోలుతనముఁ జూపి, వారిని సంతోషపఱచెను. ఓ పార్వతీ! క్షణములో రాముఁడు మాయఁజేసి, వారికి సంతోషము నిచ్చెను; అతఁడుచేసిన మర్మమెవరికిఁ దెలియదు. సకలగుణధాముఁడు, సుశీలసంపన్నుఁడు, రాముఁ డీప్రకారము వారిని సంతోషపఱచి, రాజభవనమునకు గమనించెను. లేఁగదూడలఁ జూచి గోవులు పరుగెత్తువిధమున, నా ముప్వురుతల్లులు సంబరముతో రామునిఁ జూడవచ్చిరి.

ఛాంద్ 4

లేఁగదూడలను శాలలోవిడిచి, పగలంతయు గోవులు వనములో సంచరించును; సాయంసమయమున నవి గృహమునకు వచ్చినపుడు, వానిపొదుఁగులు పాలతో నిండియుండును; అవి తోఁకలనెత్తుకొని, 'అంభా' యని అఱచుచు పరుగెత్తివచ్చును. అటులనే, ముప్వురుతల్లులును రామునివద్దకు వచ్చిరి; రఘుపతి కలుపుగోలుతనముఁజూపి వారితోఁ గలసిమెలసి సంచరించెను; ప్రీతిపూర్వకముగ వారితో నతఁడు సంభాషించెను; రామునివియోగమువలనఁ గలిగినదుఃఖమును వారు మఱచిరి; వారందఱు సుఖంచియుండిరి. (పిహితాలంకారము).

దోహా 14, 15

రామునిచరణములనుసేవించి ధన్యుఁడయ్యెనని తెలిసికొని, లక్ష్మణుని సుమిత్ర కౌఁగిలించుకొనెను; కైకమాత్రము కొంచెము సంకోచించి రాముని నాలింగనముఁ జేసికొనెను. లక్ష్మణుఁడు ముప్వురుతల్లులను గౌరవించి ప్రశంసించెను; వా రతనిని దీవించిరి; వారిసంతో

షము జెప్పలేను; మాటిమాటికిని గైకతో రాముఁడు సంభాషించి నను, ఆమెమనస్సుమాత్రము క్షోభపడుచుండెను.

చౌపాయ్ 7

అత్తలుముప్వురకు సీత నమస్కరించి, ప్రీతితో వారిపాదము లకు మ్రొక్కెను; వారామె క్షేమము నడిగి "ఓ సీతమ్మా! నీపసుపును కుంకుమయు చల్లగనుండుఁగాక! నీయమ్మకడుపును నీయత్తకడుపును జల్లగనుండుఁగాక!" అని వారు దీవించిరి. వారు రామునిచరణకమల ములను దనివిదీరఁ జూచిరి; శుభసమయమునఁ గంట నీరుఁబెట్టుట యమంగళమని గ్రహించి, కండ్లవెంబడి నీరువచ్చినను, వారు నేత్ర ములఁ దుడిచికొనిరి. రామునకు మంగళహారతి నిచ్చి, వా రతని దివ్య మంగళవిగ్రహమును తనివిదీరఁ జూచిరి. దృష్టిదోషముపోవుటకు వారు పరమానందముతో నతనికి దిగదుడుపులు సెట్టిరి; అతనియందుఁ గలప్రేమచేత నతనిని మాటిమాటికి కౌసల్య చూచెను; ఆ కృపాసాగ రుని, ఆ రణధీరుని నెంతచూచినను తల్లికిఁ దృప్తిలేకపోయెను. "నా కుమారునిశరీర మతికోమలముకదా! ఇతఁడు లంకేశుఁడగు రావణుని నేవిధమునఁ జంపఁగలిగెను? నాకుమారులు, రామలక్ష్మణుల నిరువురను లాలించి ముద్దుగఁ బెంచియుంటినిగదా! రావణునిపరివారము రాక్ష సులు; వారు భయంకరులు; వారిశరీరములు మోటువడియుండును; వారిని నాకుమారులు, నా గారాపుబిడ్డ లెట్లు సంహరించిరోకదా!" అని కౌసల్య మనసులోఁ జింతించెను.

దోహా 16

సీతారామలక్ష్మణులను కౌసల్య, కన్నులారఁజూచి, యానంద పరవశ మయ్యెను; ఆమెశరీరము పులకరించెను.

చౌపాయ్ 8

విభీషణుఁడును, సుగ్రీవుఁడును, నలుఁడును, నీలుఁడును, నంగ దుఁడును, హనుమంతుఁ డాదిగాఁగల వానరులును సుందరమగుశరీర ములను ధరించిరి; వారింజూచి, పురజనులు సంతసించిరి; వారందఱి మనస్సు లానందముచే వికసించెను. భరతునిప్రేమయు, వ్రతమును, సుశీలతయును, బ్రీతిపూర్వకముగ వారు వేనోళ్లఁ గొనియాడిరి; పుర

జనులయాకారముఁ జూచి, వారికి రామునియందుఁగలభక్తికి వారు మెచ్చుకొనిరి. అప్పుడు రాముఁడు వానరులఁ బిలిచి, "ఓ వానరులారా! మీరు నాగురువు, వసిష్ఠునిచరణములకు నమస్కరింపుఁడు" అని వారితోఁ జెప్పెను; "ఈవసిష్ఠుఁడు నాతాతముత్తాతలకు సహితము గురువు; పూజనీయుఁడు; వారికృపవలన మనము రాక్షసులను యుద్ధములో సంహరించితిమి" అని రాముఁడు వానరులతోఁ బలికి, వసిష్ఠుం జూచి, "ఓ స్వామీ! ఓ మునిరాజా! ఈవానరులు నాస్నేహితులు; పడవలమీఁద సముద్రమును దాఁటినవిధమున, వీరిసహాయమువలన యుద్ధమునుదాఁటి, రాక్షసులను జయించితిని. వారిప్రాణములను నానిమిత్తము వారు ధారవోసిరి; భరతుఁడు నారాజ్యమును గాపాడెను కాని వారు నాప్రాణములను శరీరమును గాపాడిరి; కనుక, భరతుని కంటె నాకు వారధికముగఁ బ్రియులు" అని గురువుతోఁ జెప్పి, వానరులను రాముఁడు స్తుతించెను. శ్రీవారివచనములనువిని వానరులు సంతోషముచే నుప్పొంగిరి; క్షణక్షణము వారు క్రొత్తక్రొత్తసుఖముల ననుభవించిరి.

### దోహా 17, 18

వారందఱు కౌసల్యచరణములకు నమస్కరించిరి; ఆమెసంతసించి, "ఓ వానరులారా! మీరు నాబిడ్డలు; రామునితో సమానముగ మిమ్ములఁ జూచెదను" అని వారిని దీవించెను. అంతరిక్షమునుండి పుష్పవర్షము గురిసెను; ఆనందమునకు మూలకందమగు శ్రీరాముఁడు రాజనగరులోఁ బ్రవేశించుటకు గమనించెను; పట్టణములోనిస్త్రీపురుషులు మేడలనెక్కి, రామునిపై సేసలఁజల్లి, స్వామినిదర్శించిరి; రాజవీథిలో జనసమ్మర్దము బహుళమయ్యెను.

### చౌపాయీ 9

బంగారుపాత్రములను వసంతముతో నింపి, పురజనులు వానిని దమతమద్వారములవద్ద నిడిరి; గృహములకు మంగళతోరణములఁ గట్టిరి; జండాలను, బావుటాలను నిలువఁబెట్టిరి; రాజవీథిలో నచ్చటచ్చట విజయస్తంభములతో దోరణములఁ గట్టిరి; రాజవీథులను బన్నీరుతోఁ దడిపిరి; ఏనుఁగతలవంటి ముత్యములతో ముగ్గులఁ బెట్టిరి;

నగరమంతయు గొప్పసంబరముఁ జేసిరి; "ఢంకా, నౌబతు, భేరీ" మొదలగు వాద్యములను మ్రోఁగించిరి; రాజమార్గములో నచ్చటచ్చట నేసలను లాజలను జల్లి, స్త్రీలు పరమానందముతో రాముని దీవించిరి; చామరములతో స్త్రీలు స్వామిని వీచుచుండిరి; కర్పూరమును వెలిగించి స్వామికి హారతినిచ్చి, వారు పాటలఁ బాడిరి; ప్రణతార్తిహారునకును, రఘుకులకమలములకు సూర్యుఁడునగు రామునకు వారు హారతినిచ్చిరి; ఆ పట్టణముయొక్క శోభను శిరిసంపదలను శారదయు, శేషుఁడును వేదమును వర్ణింపవలెను; వారైనను దానిని బూర్తిగ వర్ణింపఁజాలరు; ఓ పార్వతీ! ఎటుల దానిని మనుష్యమాత్రులు చెప్పఁగలరు?

దోహా 19, 20

సూర్యవేఁడిమికి సరోవరములోనికుముదములు కమిలినవిధమున, నగరములోని స్త్రీలముఖములు రామునివియోగము చేత వాడెను; చంద్రోదయమయినతరువాత నాకుముదములు వికసించును; అటులనే, రామచంద్రుని రాకవలన, వారిముఖములు కళకళలాడెను. అనేకవిధముల శుభశకునములు కనఁబడెను; ప్రజలకుఁ దండ్రివంటిరాముఁడు వారినినాదరించి, రాజనగరులోఁ బ్రవేశించునపుడు దేవదుందుభు లంతరిక్షమున మ్రోఁగెను.

చౌపాయ్ 10

కైకయొక్కముఖము సిగ్గుచే మోటువడియుండెనని గ్రహించి, రాముఁ డామెగృహమునకు వెళ్లెను; అనేకప్రకారముల నామెను బోధించి, తనదివ్యరూపము నామెకుఁజూపించి, రాముఁ డామెకు స్వాస్థ్యము నిచ్చెను; అనంతర మతఁడు స్వగృహమునకు వచ్చెను. కృపాసముద్రుఁ డంతఃపురములోఁ బ్రవేశించెను; పురజనులు, స్త్రీపురుషులు, సంతసించిరి; అంతట వసిష్ఠుఁడు బ్రాహ్మణులఁ బిలిచి, "ఓ భూదేవతలారా! యీశుభదినమున, శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ, శుభలగ్నమున శ్రీరామచంద్రుఁడు పట్టాభిషిక్తుఁ డగునుకనుక మీ రానమయమునకు దయచేయుఁడు" అని వారితోఁజెప్పెను. రఘుకులాచార్యుని వచనములకు బ్రాహ్మణులు సంతసించి, "ఓ స్వామీ! రామునిపట్టాభి

షేకము జగన్మంగళదాయకము; ఓ మునిరాజా! విలంబనముఁజేయక, శీఘ్రముగ రామునిలలాటమునకుఁ బట్టముఁగట్టుము" అని చెప్పిరి.

దోహా 21, 22

అప్పుడు వసిష్ఠుఁడు సుమంత్రునిఁ జూచి, "ఓ మంత్రివర్యా! రాముని పట్టాభిషేకమహోత్సవము కనుక శీఘ్రము చతురంగబలముల నాయత్తముఁజేయు"మని యాజ్ఞాపించెను; అంతలో నతఁడు చతురంగ బలములను సన్నాహముఁ జేసెను; గజములును, నశ్వములును, రథములు నలంకరింపఁబడి, సింహద్వారమువద్ద నిలిచియుండెను; పదాతులును, రౌతులును సింగారించుకొని, విచ్చుకత్తులను ధరించి, పంక్తి దీర్చి, బరాబరులఁ జెప్పుచుండిరి. మంగళద్రవ్యములఁ దీసికొనివచ్చుటకు సేవకులను నలువైపులఁ బంపి, సుమంత్రుఁడు వచ్చి గురుచరణములకు మ్రొక్కెను.

చౌపాయ్ 11

అయోధ్యానగరముయొక్క మహోత్సవసింగారముఁ జూచుటకు రెండుకన్నులు చాలవు; దేవతలు పుష్పవర్షముఁ గురిపించిరి. అంతట రామచంద్రుఁడు సేవకులఁ బిలిచి, "నామిత్రులస్నానముఁ జూడుఁడు" అని యాజ్ఞాపించెను. అతనియాజ్ఞ శిరసావహించి, సేవకులు నలువైపులపరుగెత్తి, సుగ్రీవాదివానరుల స్నానముఁ జేయించిరి; అనంతరము రాముఁడు భరతునిఁ జేరఁదీసి, స్వహస్తములతో నతనిజటలను విడఁదీసెను; దగ్గరనిలువఁబడి, ముప్వురన్నదమ్ములు లక్ష్మణ భరత శత్రుఘ్నులచే, రాముఁడు మంగళస్నానములఁ జేయించెను; రాముఁడు భక్తవత్సలుఁడు; కృపాలుఁడు కదా! భరతునిభాగ్యమును, రాముని సుశీలత్వమును, కోటిశేషువులయినను గొనియాడలేరు. పిమ్మట శ్రీరామమూర్తి, గురువునాజ్ఞఁగైకొని, జటలనువిప్పుకొని, మంగళస్నానముఁ జేసెను; మజ్జనమిడి, భగవంతుఁడు స్వర్ణాలంకారములను ధరించెను; అతని శరీరలావణ్యమును, సౌష్ఠవమును, బటుత్వమును, గోటి కందర్పులదర్పము నపహరించెను.

దోహా 23, 24, 25

కౌసల్యాది తల్లులుముప్వురు సీతాదేవికి మజ్జనమాచరించిరి. ఆమెకుఁ బీతాంబరముఁగట్టి, సర్వాలంకారములతో నామె నలంకరిం

చిరి; సాక్షాత్ లక్ష్మివలె వచ్చి, సీత రాముని వామపార్శ్వము నలంక రించెను; కోడలిని గుమారునిఁ జూచి, తల్లులుముగ్వురు బ్రహ్మానం దముఁ బొంది, "మాజన్మము సఫలమయ్యెను" అని తలఁచిరి. "ఓ గరుత్మంతుఁడా! రామునిపట్టాభిషేకమహోత్సవముఁ జూచి, శ్రీవారినిఁ గన్నులార దర్శించుటకు బ్రహ్మమహేశాదిదిక్పాలురు దేవతలతోఁ గూడి, వారివారివిమానముల నెక్కి వచ్చి, అంతరిక్షమున నిలిచియుం డిరి." అని కాకభుశుండి చెప్పెను.

# ద్వితీయవిశ్రామము.

చౌపాయ్ 12

శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ జూచి, వసిష్ఠమహాముని సహితము భ్రమించెను; అతనియాజ్ఞాప్రకారము, సేవకులు రత్నస్థగి తమయిన సింహాసనముఁ దెచ్చి, హజారములో నుంచిరి; ఆసింహాసనము యొక్క సొగసు వర్ణింపశక్యముకాదు; కోటిసూర్యులవలె నది ప్రకా శించుచుండెను; వసిష్ఠాదిమహామునులకును బ్రాహ్మణులకు నమస్క రించి, శ్రీరామమూర్తి సింహాసనము నధిష్ఠించెను; శ్రీసీతారాములు గద్దియనెక్కిరి; వా రుభయులఁ జూచి, మునులును మహాజనులును సంతసించిరి; బ్రాహ్మణులు వేదమంత్రములఁ బఠించిరి; అంతరిక్షము నుండి దేవతలును మునులును 'జయ, జయ' శబ్దములఁ బలికిరి; సూర్యవంశాభరణుఁడగు శ్రీరామచంద్రుఁడు పట్టభద్రుఁ డయ్యెను; బ్రాహ్మ ణులసెలవుఁ గైకొని, వసిష్ఠుడు శ్రీరామునిలలాటమునకుఁ బట్టముఁ గట్టెను; మాటిమాటికిఁ గుమారునిఁజూచి తల్లి పరమానందమునొం దెను; ఆమె కుమారున కారతినిచ్చెను; శ్రీరాముఁడు బ్రాహ్మణులకు షోడశమహాదానముల నిచ్చెను; అయాచితముగ యాచకులను సంభా వించెను; శ్రీరాముఁడు సింహాసనము నధిష్ఠించినసమయమున, నంతరిక్ష మున దేవదుందుభులు మ్రోగెను.

ఛాంద్ 5

ఆకాశమున దేవతలు దుందుభులను మ్రోఁగించిరి; గంధర్వులు పాటలఁబాడిరి; అప్సరసలు నాట్యమాడిరి; దేవతలును మునులును బరమానందముఁ బొందిరి; లక్ష్మణభరతశత్రుఘ్నులును, విభీషణుఁడు, అంగదుఁడు, హనుమంతుఁడు, సుగ్రీవుఁడు, దధిముఖుఁడు, ద్వివిదుఁడు, మైందుఁడు, జాంబవంతుఁడు, సుషేణుఁడు, దరీముఖుఁడు, కుముదుఁడు, నీలుఁడు, నలుఁడు, గవాక్షుఁడు, పనసుఁడు, గంధమాదనుఁడు - ఈ వానరప్రముఖులందఱును ఛత్రచామరములను, ధనుర్బాణములను, డాల్కత్తులను, శక్తితోమరములను ధరించి, ఇరువైపులఁబంక్తిఁదీర్చి, బరాబరులఁ జెప్పుచుండిరి.

ఛాంద్ 6

వామపార్శ్వమున శ్రీసీతతోఁగూడి శ్రీరాముఁడు సింహాసనము నధిష్ఠించి, కోటిమన్మథులలావణ్యము నపహసించెను; కాలమేఘము యొక్క ఛాయనుబోలిన శరీరముకలవాఁడు; అతఁడు పట్టుపీతాంబర మును ధరించెను; ఆరఘుకులతిలకముఁ జూచి దేవతలును మునులు సహితము మోహించిరి; విపులాంసములును, ఆజానుబాహువులును, కంబువంటిగ్రీవమును, గొప్పహనువులును, సుశిరస్సును, సులలాట మును, బీనవక్షమును, పద్మపత్రవిశాలాక్షమును - ఈ రూపురేఖవిలాస ములుగల శ్రీరాముఁడు కనకాంగదకేయూరములను మకరకుండలము లను కిరీటమును ధరించి, త్రిజగన్మోహనాకారముతోఁ బ్రకాశించెను. ఆ శ్రీరామచంద్రపరబ్రహ్మమును దర్శించినవారు ధన్యులు కదా!

దోహా 26

ఓ వైనతేయా! ఆ మహోత్సవముయొక్క శోభయు, ఆసభికుల భాగ్యమును వర్ణింపఁజాలను; ఆదిశేషుఁడును, సరస్వతియు, వేదమును శ్రీరామమహిమఁ గొంచెముకొంచెము వర్ణింపఁగలరు; కాని, దాని రసము సంపూర్ణముగఁ బురారికిమాత్రము విశదము.

(అధికపాఠము) చౌపాయ్ 13

ఒకరత్నమాలను సముద్రుఁడు రావణునకు బహుమతి నిచ్చెను; దానిఁబట్టుకొని, సభలోనుండి విభీషణుఁడు లేచివెళ్లి, ఆమాలను సీతా

దేవి మెడకుఁ దగిలించెను ; ఆ రత్నమాలయొక్క కాంతివలన నేత్రములు మిఱుమిట్లుగొనెను; దానికాంతి దశదిశల వ్యాపించి, సభికులదృష్టి నాకర్షించెను ; అంతట సీత శ్రీరామునిముఖముఁ జూచెను ; ఆమె యంతరంగమును గ్రహించి, "ఓ ప్రియురాలా ! ఈసభ్యులలో నెవరి యందు దయగలదో, వారికి దానిని బహుమతిఁ జేయుము" అని రాముఁడు చెప్పిన వచనములను గ్రహించి, సీత తనమెడనుండి హార మునుతీసి, చేతులతోఁ బట్టుకొని, క్షణమువిచారించి, హనుమంతుని వైపుఁ జూచెను.

దోహా 27

ఆమెకృపాదృష్టిఁ జూచి, హనుమంతుఁడు జోహారువనుచు వచ్చి, సీతయెదుట నిలువఁబడెను ; ఆహారము నామె యతనికంఠము నకుఁ దగిలించెను.

చౌపాయ్ 14

"ఈరత్నమాలలో విశేషముకలదు" అని వాయుపుత్రుఁడు తలఁచి, దానిఁ జూచిచూచి, ఆనందించెను. ఆమాల నతఁడు క్రిందుగను మీఁదుగను ద్రిప్పత్రిప్పచూచి, "ప్రకాశముతప్ప దీనిలో మఱియే కటి లేదు" అని తెలిసికొని, "అయిన, నొకవేళదీనిలో నేమిసారము కలదో చూచెదను" అని నిశ్చయించి, యతఁ డామాలనుద్రెంపి, దానిలో నొకరత్నమును పండ్లతోఁ గొఱికి వ్రక్కలుచేసెను. ఈ ప్రకా రము రత్నముల నతఁ డొకదానితరువాత నొకదానిని వ్రక్కలుచేయు చుండెను ; అతనివికారముఁ జూచి, సభికులు నిశ్చేష్టితులయిరి ; అంతట నతఁడు మాలను పాఱవేసెను ; దానిలో సారములేదని యతఁడు గ్రహించెను. అతనిని మందలించువారు లేకపోవుటచేత నతఁ డీపనిఁ జేసెనని సభ్యులు గుసగుసలాడిరి ; ఆమాల నతనికిచ్చుట యనుచితమని కొందఱు తలఁచిరి ; అతనికిచ్చుటచేత నామాల కిట్టిదురవస్థ సంప్రాప్త మయ్యెనని కొందఱు విచారించిరి.

దోహా 28

ఆసభ్యులలో నొకరాజు లేచి నిలువఁబడి, "ఓ మహావీరుఁడా ! నీవు చతురుఁడవుకదా ! ఆరత్నమాల నెందుచేత నట్లు నీవు త్రుంచి తివి ?" అని యడిగెను.

చౌపాయ్ 15

అతనివచనములను హనుమంతుఁడు విని "ఓ రాజా! ఈ నీల మాణిక్యములలోఁ బవిత్రమగు రామనామముఁ జూడఁదలఁచి, వానిని వ్రక్కలుచేసితినిగాని, వానిలో రామనామము కానరాలేదు; కనుక, నే నామాలను విసర్జించితిని." అని ప్రత్యుత్తరము నిచ్చెను; "ప్రతి పదార్థములో రామనామ ముండవలెననియా నీయభిప్రాయము?" అని రాజు తర్కించెను. "రామనామము లేనిపదార్థమువలనఁ బ్రయోజనము లేదు" అని మహాబలుఁడు రాజువచనములను ఖండించెను. "తథాస్తు; ఓ రామభక్తుఁడా! నీశరీరములో రామనామముఁ జూపఁ గలవా?" అని రాజు శంకించెను. అతని శంకఁజూచి, "ఓ రాజా! నాశరీరములో రామనామముఁ జూపెద; చూడుము" అని కపివర్యుఁడు చెప్పి, తనవక్షస్థలముఁ జీల్చెను; అతనిశరీరములో రామనామము లేనిస్థలము లేదు; శరీరమంతటను, రోమరోమమునకు, రామనామము వ్రాయఁబడియుండెను; ఆ యద్భుతముఁజూచి, సభ్యులు నిశ్చేష్టితులయిరి; అంతరిక్షమున దేవదుందుభులు మ్రోఁగెను; పుష్పవర్షము గురిసెను; రామునికృపాదృష్టిచే నతనికి స్వాస్థ్యమువచ్చెను.

దోహా 29

రఘునాథుని కరుణాదృష్టివలన నతనిశరీరము వజ్రదేహమయ్యెను; అతనిశరీరము పులకరించెను; అతని నేత్రములనుండి బాష్పములు కాఱెను; శ్రీరామమూర్తి భక్తునిఁ గౌఁగిలించుకొనెను.

చౌపాయ్ 16

అందరు హనుమంతునిఁ గొనియాడి, "జయజయ" శబ్దములఁ బలికిరి; దేవత లతనినిఁ బ్రస్తుతించిరి.

దోహా 30, 31

మాటిమాటికి దేవతలు శ్రీరామునిస్తుతించి, తమతమస్థానములకు గమనించిరి; భట్రాజులవేషమును ధరించి, నాలుగువేదములును రామునిసన్నిధానమునకు వచ్చెను. శ్రీరాముఁడు సర్వజ్ఞుఁడును సర్వే

శ్వరుఁడును కనుక, సతీఁడు వారినినాదరించి గౌరవించెను; ఆమర్మము పరులకుఁ దెలియదు; అప్పు డానల్వురు పరమేశ్వరుని వేర్వేఱ స్తుతించిరి.

ఛాంద్ 7, 8, 9, 10, 11, 12

ప్రథమమున సామవేద మిటుల స్తుతించెను:—

ఛాంద్ 7

"జయ సగుణ నిర్గుణ రామ రూప అనూప భూప శిరోమణే
దశకంధరాది ప్రచండ నిశిచర ప్రబల ఖల భుజ బల హనే,
అవతార నర సంసార భార విభంజి దారుణ దుఖ దహే
జయ ప్రణతపాల దయాల ప్రభు సంయుక్త శక్తి నమామి హే.

"ఓ నాథా! మీరూప ముపమానరహితము; ఓ భూపాల శిరోమణీ! జయ, జయ; సగుణమని, నిర్గుణమని మీకు రెండురూపములు కలవు. ('ద్వావేవ ఈశ్వరస్య రూపమూర్తం చా మూర్తంచేతి' ఇతి శ్రుతేః) సత్త్వ, రజ, స్తమోగుణములతోఁ గూడిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు మీ సగుణరూపము; మీ విరాట్స్వరూపము నిర్గుణము. మీ భక్తులనిమిత్తము మీరు సగుణరూపమును ధరించెదరు. ('ఏకం రూపం బహుధా యః కరోతి') మీరు నిర్గుణులు; నిరాకారులు; నిర్విశేషులు; సర్వవ్యాపకులు; సర్వసాక్షులు; చైతన్యస్వరూపులు; మీరు కరుణాసముద్రులు కనుక, మీ భక్తులనిమిత్తము మీరు లోకములో నవతరించెదరు. రావణాది ప్రచండనిశాచరులను మీ భుజబలపరాక్రమముచే విదళించి, సంహరించితిరి; మీరు మనుజరూపమును ధరించి, మనుజులను సంసారసాగరములోనుండి దాఁటించి, ఓ నాథా! వారి దారుణదుఃఖములను దహించుచుంటిరి. ఓ ప్రణతపాలకా! ఓ దీనదయాళుఁడా! శక్తితోఁ గూడియుండిన మీకు నమస్కరించుచున్నాను. (రామతాపనీయోపనిషత్:—ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ అద్వైత పరమానందాత్మా యో బ్రహ్మాండస్థాంతర్బహిర్వ్యాప్తో యోవిరాట్ భూర్భువః స్వస్తస్మైవై నమోనమః—)"

ఛాంద్ 8

యజుర్వేద మిట్లు స్తుతించెను:—

"తవ విషమ మాయా వశే సురాసుర నాగ నర అగ జగ హారే
భవ పంథ భ్రమతామిత దివస నిశికాల కర్మన గుణ భరే,
జో నాథ కరి కరుణా విలోకహు త్రివిధ దుఖ తేహి నిర్వహే
భవ ఖేద ఛేదన దక్ష హమకహ రక్షరామ నమామి హే.

"ఓ హరీ! మీ విషమమాయకు లోఁబడి, చరాచరములును, దేవ, దానవ, నర, నాగులు సంసారమార్గముఁ ద్రొక్కి, భ్రమించి, భ్రమించి, యలసిపోవుచుండిరి; కాల, కర్మములవలనఁగలిగిన గుణముల భారమును, వారే యనుభవించుచుండిరి; ఓ స్వామీ! ఎవరిపై మీ కటాక్షదృష్టులను మీరు నిగిడించెదరో, వారితాపత్రయములు (కాల, కర్మ, గుణ) నశించును; ఓ భవఖేదఛేదనరామా! మమ్ములను రక్షింపుఁడు; మాటిమాటికి మీకు నమస్కారముఁ జేయుచున్నాము."

అథర్వవేద మిట్లు స్తుతించెను:—

ఛాంద్ 9

"జే చరణ శివ జయ పూజ్య రజ శుభ పరశి మునిపత్నీ తరీ
నఖ నిర్గతా సుర వందితా త్రైలోక్య పావని సురసరీ,
ధ్వజ కులిశ అంకుశ కంజ యుత వన ఫిరత కంటక జినల హే
పదకంజ ద్వంద్వ ముకుంద రామ రమేశ నిత్య భజామహే.

"ఓ రామా! ఏ చరణారవిందములను బ్రహ్మమహేశ్వరులు సదా పూజించుచుందురో, ఏ చరణాంబుజములపరాగము సోఁకినమాత్రమున మునిపత్ని తరించెనో, యే చరణకమలములలో సురపూజా భాజనంబగు త్రిలోకపావని, గంగానది—పుట్టెనో, యే చరణసరోజములలో ధ్వజ, కులిశ, అంకుశ, కమలచిహ్నలుకలవో, యే చరణ రాజీవములు వనములోఁ దిరుగునపుడు కోల, కిరాతులు వానివలన రక్షింపఁబడిరో, అట్టి చరణారవిందములుగల మీకు, నో లక్ష్మీపతే! యో ముకుందా! నమస్కరించుచున్నాము."

ఛాంద్ 10

"జో జ్ఞాన మాన విముక్త తవ భయ హారణిభక్తి న ఆదరీ,
తే పాయ సురదుర్లభ పదాదపి పతత హమ దేఖత హారీ.
విశ్వాస కరి సబ ఆశ పరిహరి దాస తవ జే హ్వై రహే,
జపి నామ తవ విను శ్రమ తరహి భవ నాథ సో స్మరామిహే.

"ఓ భగవంతుఁడా! మాయాసృష్టిత మగుమనస్సునకు సంపూర్ణముగ నతీతుఁడుగనుండువాఁడే, జ్ఞాని; అనాత్మ, యసత్యమనియు, నాత్మయే, సత్యమనియుఁ దెలిసికొనును; ఆత్మకు విచక్షణనిమిత్తము రెండునామములు కలవు; జీవాత్మ, పరమాత్మ; (అయమాత్మా బ్రహ్మేతి శ్రుతేః) జీవాత్మ, వాసనాదులతోఁ గూడియుండును; ఆవాసనలు నశించినతరువాత, నాజీవాత్మ, పరమాత్మలో నైక్యమగును. (ఏకమేవా ద్వితీయం బ్రహ్మనేహనా నాస్తికించన) అప్పుడు సర్వము బ్రహ్మమని తెలియును; భేదబుద్ధి (నీవు, నేను, కుక్క, పులి ఆది) నశించును; అభేదబుద్ధియే, బ్రహ్మానందమునకు మూలము; ద్వంద్వములు నశించును; (శ్లో. సమదుఃఖసుఖస్స్వస్థః సమలోష్టాశ్మకాంచనః, తుల్యప్రియాప్రియో ధీరస్తుల్య నిందాత్మసంస్తుతిః. మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారి పక్షయోః, సర్వారంభ పరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే. భగ. గీ.) ముక్తినిచ్చునట్టియు, దేవతలకు దుర్లభమగునట్టి మీభక్తిని నాదరింపనివాఁడు, జ్ఞానియైనను, బ్రహ్మలోకమును బొంది, మరల భూలోకములో జన్మించును; (శ్లో. యేన్యేఽరవిందాక్ష విముక్తమానిన స్త్వయ్యస్తభావాదవిశుద్ధబుద్ధయః, ఆరుహ్య కృచ్ఛ్రేణ పరంపదం తతః పతత్యధోనాదృత యుష్మదంఘ్రయః. యేరామభక్తిమమలాం సువిహాయ రమ్యాం జ్ఞానేరతాః ప్రతిదినం పరిక్లిష్టమార్గే ఆరాన్మహేంద్ర సురభీం పరిహృత్య మూర్ఖా అర్కంభజంతి సుభగే సుఖదుగ్ధహేతుమ్. భాగ.) ఓ నాథా! సంపూర్ణముగ సకలాశలనువిడిచి, విశ్వాసపూర్వకముగ, మీదాసులమై యుండెదము; ఎంతవఱకును, లోకము వేదమునకు సాధనము; అన్ని యుపాయములను విడిచి, ఉపాయశూన్యులగు మిమ్ములను శరణుఁ జొచ్చెదము. ఓ శరణాగతవత్సలా! మీనామ

మును జపించి, భవసాగరమును దాఁటెదము. ఓ నాథా! ఎంతవలి కును, కృపాసాగరులగు మీనామమును నిత్యము భజించెదము."

ఛాండ్ 11

అంత ఋగ్వేద మిట్లు స్తుతించెను:—

"అవ్యక్త మూల మనాది తరు త్వక చారి నిగమాగమ భనే,
షట కంధ శాఖా పంచవింశ అనేక పర్ణ సుమనఘనే.
ఫల యుగల విధి కటు మధుర వేలి అకేలి జేహి ఆశ్రితరహే,
పల్లవిత ఫూలతి నవల నిత సంసార విటప నమామి హే.

"ఓ జగద్రక్షకా! ఈ చరాచరములతో నిండిన బ్రహ్మాండమంతయు నీవిభూతిని వ్యక్తముఁ జేయును; అట్టి నీవిభూతికి దండప్రణామ మాచరించెదను; ఓ స్వామీ! నీవిభూతియే, సంసారము; ఆసంసారమే, యొక వటవృక్షము. అవ్యక్తమగు నీవే, దానిబీజము; ఆవృక్షమునకు నాలుగుపట్టలుకలవని వేదశాస్త్రములు చెప్పుచున్నవి; (మనోబుద్ధి చిత్తాహంకారములు; లేక అంతఃకరణచతుష్టయము; లేక నాలుగు అవస్థలు; నాలుగుయుగములు; చతుర్విధపురుషార్థములు; చతుర్వేదములు; చతుర్విధజంతువులు; లేక సత్త్వ, రజ, స్తమోహంకారములు - ఈవీనిలో, నేనాలుగును దానిపట్టలు); ఓనాథా! ఈ నాల్గుపట్టలుగల స్కంధమునుండి, అనేక శాఖోపశాఖలు వెడలుచుండును; వానికి ననేకపత్రములును, బుష్పములును, ఫలములును, లతలును గలవు; ఆస్కంధమున కాఱుపెద్దశాఖలు కలవు; (షట్ఛాస్త్రములు; పంచజ్ఞానేంద్రియములు మనస్సు; శీతోష్ణములు సుఖదుఃఖములు జ్ఞానాజ్ఞానములు; వీనిలో నేయారును దానిశాఖలు); (లేక, షడ్ధాతువులు; షడ్వికారములు; షడ్వర్గములు); (వీనిలో నొక్కదానికి తప్ప, మిగిలినవానిలో నొక్కొక్కదానికి అయిదుపశాఖలు కలవు; మొత్తముపై నన్నియు (25) పంచవింశతిశాఖలు;) శుభాశుభకర్మలు దానిపత్రములు; కామ్యకర్మలు వాసనగల దానిపుష్పములు; పాపపుణ్యములు దానిఫలములు; వానిలోనొకటి తియ్యగను, రెండవది చేదుగ నుండును; ఓ జగదీశా! ఈ మహావృక్షమునకు బీజము నీవు; నీవు అజ్ఞానుల కవ్యక్తుఁడవు; నిన్ను జ్ఞానులు తెలిసికొనఁగలరు; ఈ సంసారవృక్షస్వరూపుఁడవగు మీకు నమస్కారము.

ఛాంద్ 12

"జే బ్రహ్మ అజ అద్వైత అనుభవ గమ్య మన పర ధ్యావహీ,
తే కహహు జానహు నాథ హమ తవ సగుణ యశ నిత గావహీ.
కరుణాయతన ప్రభు సద్గుణాకర దేహు యహ వర మాంగహీ,
మన కర్మ వచన వికార తజి తవ చరణ హమ అనురాగహీ.

"ఓ నాథా! నీ వజుఁడవు; అద్వైతుఁడవు; మాయారహితుఁడవు; అనుభవముచేఁ దెలిసికొనఁదగినవాఁడవు. ఇట్టివాఁడవని నిన్ను మనస్సు గ్రహింపలేదు. ఈప్రకార మనేకభక్తులు నిన్ను ధ్యానించెదరు; కాని, మేముమాత్రము నిన్ను సగుణముగ ధ్యానించెదము; ఓ యనంతా! నీయవతారగుణములను కీర్తించెదము; ఓ సద్గుణాకరా! ఓ కరుణాలవాలా! ఓ దేవా! మాకీవరము నొసంగుము; మనోవాక్కర్మములచే నీ చరణకమలములయందు నిర్మలభక్తి మాకుఁ గలుగుఁగాక."

దోహా 32, 33

ఈప్రకారము నాలుగువేదములు శ్రీరాముని స్తుతించి, యంతర్ధాన మయ్యెను; వేదములు బ్రహ్మలోకమునకు వెళ్లెను; ఓ గరుత్మంతుఁడా! అనంతరము శ్రీసదాశివుఁడు శ్రీరామునియెదుట నిలిచి, చేతులను జోడించుకొని, పులకితశరీరుఁడై, గద్గదస్వరముతో నిట్లు స్తుతించెను:—

ఛాంద్ 13 - 17

"జయ రామ రమా రమణం శమనం
భవతాప భయాకుల పాహి జనం,
అవధేశ సురేశ రమేశ విభో
శరణాగత మాగత పాహి ప్రభో,
దశశీశ వినాశన వీశ భుజా
కృత దూరి మహా మహిభూరి రుజా,
రజనీచర వృంద పతంగ రహే
శరపావక తేజ ప్రచండ దహే.

మహీ మండల మండన చారు తరం
ధృత సాయక చాప నిషంగ వరం,
మద మోహ మహా మమతా రజనీ
తమ పుంజ దివా కర తేజ అనీ,
మనజాత కిరాత నిపాత కియే
మృగ లోగ కుభోగ శరేణ హియే,
హని నాథ అనాథని పాహి హరే
విషయావన పామర భూలపరే. 14

బహు రోగ వియోగన్హి లోగ హయే
భవదంఘ్రి నిరాదరకే ఫలయే,
భవసింధు అగాధ పరే నరతే
పద పంకజ ప్రేమ న జే కరతే,
అతి దీన మలీన దుఖీ నితహీ
జినకే పద పంకజ ప్రీతి నహీ,
అవలంబ భవంతకథా జినకే
ప్రియ సంత అనంత సదా తినకే. 15

నహి రాగ నరోష న మాన మదా
తినకే సమ వైభవ వా విపదా,
ఇహితే తవ సేవక హోతి ముదా
ముని త్యాగత యోగ భరోస సదా,
కరి ప్రేమ నిరంతర నేమ లియే
పద పంకజ సేవత శుద్ధ హియే,
సమ మాన నిరాదర ఆదరహీ
సోఽ సంత సుఖీ విచరంత మహీ. 16

ముని మానస పంకజ భృంగ భజై
రఘువీర మహారణధీర అజై,
తవ నామ జపామి నమామి హరీ
భవ రోగ మహా మద మాన అరీ,

గుణ శీల కృపా పరమాయతనం
ప్రణమామి నిరంతర శ్రీరమనం,
రఘునంద నికందన ద్వంద్వ ఘనం
మహిపాల విలోకయ దీన జనం. 17

"ఓ రమారమణగోవిందా! భవతాపమునకు భయపడి, వ్యాకులముపడుచుండిన నన్ను రక్షింపుము; ఓ అయోధ్యాపురీశా! ఓ సురేశా! ఓ రమేశా! ఓ దేవదేవా! నీవుతప్ప, నన్ను రక్షించువారెవరు? ఓ రావణాంతకా! ఓ భూభారహరణా! నీబాణాగ్నిచే, రాక్షసవిహంగములను దహించితివి; ఓ సకలభూపతితిలకా! నీవు భూమండలమునకు భూషణము; నీవు ధనుర్ధరులలో శ్రేష్ఠుఁడవు; నీబాణముల కెదురులేదు; నీతూణీరము లక్షయములు; దట్టమగు మోహాంధకారమును విదళించుటకుఁ బ్రచండభానుఁడవు; దురాశలనునట్టి బాణములఁ బ్రయోగించి, లోకులను మృగములను వేఁటాడుచుండిన (మన్మథుఁడను) కిరాతుని నీవు సంహరించితివి; ఓ క్షీరసాగరశయనా! విషయములనునట్టి వనములోఁబడి మార్గముఁ దప్పి, సంచరించుచుండిన నావంటిదీనులను రక్షింపుము. ఓ యాపదోద్ధారకా! నీ చరణకమలములను సేవింపక నిరాదరించుటవలన, జనులు రోగవియోగముల ననుభవింతురు; నీ పదపంకజములఁ బూజింపకపోవుటచే, నగాధమగు భవసాగరములో మునిఁగి వారు తేలుచుండిరి; నీ చరణారవిందములయం దనురాగములేని మనుజులవంటి దౌర్భాగ్యులును దుఃఖభాగులును బాపాత్ములును లేరు; నీనామము నుచ్చరించుటయం దభిలాషగలవారును, సాధుసాంగత్యముఁ జేయువారును, షడ్వర్గములబాధనుండి విముక్తులు కాఁగలరు; ద్వంద్వములవలన వారిమనస్సు చలింపదు; అందుచేత నీదాసులు నిత్యానందము ననుభవింతురు; భక్తులు యోగనియమములను విడిచి, నిర్మలహృదయముతో నీపాదారవిందములను సేవించి, నిత్యానందము ననుభవించుచు, నిర్లిప్తతగ విహరింతురు; ఓ రఘువీరుఁడా! మునిమానసపంకజములలో విహరించు తుమ్మెదవు; ఓ మహారణధీరుఁడా! ఓ హరీ! సదా నీనామమును జపించువాఁడను; ముమ్మాటికి నీనామమునకు నమస్కరించెదను; భవరోగములను నీనామము హరించును; ఓ సకల

గుణధామా! ఓ పరంధామా! ఓ పరాత్పరా! ఓ శ్రీనివాసా! మాటి మాటికి నీకు దండప్రణామంబు లొనరించెద; ఓ రఘునందనా! ఓ సకల భూపాలచూడామణీ! ద్వంద్వములను నశింపఁజేయుము; నీ నిర్హేతుక జాయమానకటాక్షము నావంటిదీనులయందుఁ బ్రసరింపుము.

దోహా 34, 35

"బార బార వర మాంగౌ, హర్షి దేహు శ్రీరంగ
పద సరోజ అనపావనీ, భక్తి సదా సతసంగ. 34

వర్ణి ఉమాపతి రామగుణ, హర్షి గయే కైలాస
తబ ప్రభు కపిన దివాయే, సబ విధి సుఖప్రద వాస. 35

"ఓ శ్రీరంగలక్ష్మీపతే! పునఃపునః నే నొకవరముఁ బ్రార్థించెద; నన్నుఁ గటాక్షించి, యొసంగుము; నీ చరణసరోజములయం దెడతెగని భక్తినాకుఁ గలుగఁజేయుము; నీప్రసాదమువలన నాకు నిత్యము సాధు సాంగత్యము కలుగుఁగాక;" ఈప్రకారము శివుఁడు శ్రీరాముని స్తుతించి, సంతోషించుచుఁ గైలాసపట్టణమున కేఁగెను. అనంతరము రామచంద్రుఁడు వానరులకుఁ దగిననివాసముల నిచ్చెను.

---

# తృతీయవిశ్రామము.

---

చౌపాయ్ 13

ఓ వైనతేయా! ఈపవిత్రమగు రామకథను వినుటవలన, మనుజుల తాపత్రయములును భవరోగములును నశించును; ఈపట్టాభిషేక మహోత్సవకథను నిష్కామ్యముగ భక్తిశ్రద్ధలతో వినినయెడల, జ్ఞాన వైరాగ్యములు లభించును; ఒకవేళఁ గామ్యార్థము దీనిని వారు పఠించినను, గానముఁ జేసినను, వినినను, వారి సకలకోరికలు ఫలించును; వారు సర్వసుఖముల ననుభవించి సంపదలతోఁ దులఁదూగుదురు;

ఇహలోకములో సమస్తభోగములను దేవతలకంటె నధికముగ భోగించి, వారు దేహములనువిడిచి శ్రీరామునిసాయుజ్యముఁ బొందఁగలరు. ఈ రామకథను విని నందువలన, విషయార్థులకు విషయభోగములును, విముక్తులకు భక్తియు, విరాగులకు సద్గతియు సంప్రాప్తమగును; ఓ పక్షిరాజా! నేను వర్ణించిచెప్పిన రామకథవలన, బుద్ధి వికసించును; జ్ఞానము కలుగును; తాపత్రయములు విడిచిపెట్టును; జ్ఞాన వైరాగ్యములు లభించును; మోహమనెడినదిని దాఁటవచ్చును; అయోధ్యానగరములో నిత్యము నూతనమంగళోత్సవములు జరుగుచుండెను; రాజు మొదలు గ్రామపాలకునివఱకును స్త్రీపురుష లాబాల వృద్ధులు సుఖముగ జీవించియుండిరి; అవధపురీజనులు రాముని చరణారవిందములను నిత్యము సేవించుచుండిరి; ఆ చరణకమలములనే బ్రహ్మ మహేశాదిదేవతలును మునులును సదా పూజించి ధ్యానించెదరు; శ్రీరాముఁడు బీదవాండ్ర కపరిమితముగ వస్త్రముల నిచ్చెను; బ్రాహ్మణుల కనేకదానములఁ జేసినందున, వారు సంతసించి, రాముని దీవించిరి.

**దోహా 36**

వానరులందఱు పరమానందమగ్నులై యుండిరి; వారు రామునిచరణముల నత్యంతభక్తితోఁ గొల్చిరి; అహోరాత్రముల గమనికఁ దెలియకుండ రాముని వారుసేవించి, యాఱుమాసములు గడపిరి; ఇదియంతయు వారికి నొకదినమువలెఁ గన్పట్టెను.

**చౌపాయ్ 14**

వారు స్వగృహములను మఱచిరి; వారికి స్వప్నమందయినను వాని సంగతి దానికి జ్ఞప్తికి రాలేదు; పరులకు ద్రోహముఁ జేయవలయుననెడి తలంపు మహాత్ముల కెన్నఁడయిన కలుగునా? తుదకొకనాఁడు రఘుపతి సఖులనందఱను హజారములో సమావేశముఁ జేసెను; వారు రామునకుఁ బ్రీతిపూర్వకముగ నమస్కరించిరి. రాముఁడు వారిని యుచితాసనములపైఁ గూర్చుండఁబెట్టి, భక్తులు సంతోషించువిధమున, మృదు మధురవచనములతో నిట్లు వారితోఁ బ్రసంగించెను. "ఓ సఖులారా! మీరు నావిషయములో విశేషము శ్రమపడితిరి; మీయెదుట మిమ్ములనుస్తుతించుట సంభావితము కాదు. మీగృహములను విడిచి, సుఖము

లేక నానిమిత్తము మీరు కష్టపడితిరి; మీకంటె నాకు స్నేహితు లెవరుకలరు ? అందుచేత మీయందు నాకు విశేషము దయకలదు. నా సోదరులును, రాజ్యమును, సంపత్తియు, జానకియుఁ, బ్రాణములును, గృహమును, బరివారమును, గుటుంబమును, వీనికంటె మీరే నాకుఁ బ్రియులు; నేనబద్ధముఁ జెప్పుటలేదు; ఇది నా నిశ్చితాభిప్రాయము; సేవకులయందు దయఁగలిగియుండుట ప్రభువులకు ధర్మము; అందులో నాదాసులయందు నాకధికముగు దయకలదు.

దోహా 37

"ఓ సఖులారా! మీరు మీమీగృహములకుఁ బొండు; నేను శాశ్వతబ్రహ్మముననియు సర్వాంతర్యామిననియు సర్వజనహితుఁడ ననియు తెలిసికొని భక్తిశ్రద్ధలతో నన్ను సేవించి, నానామమును స్మరింపుఁడు." అని రాముఁడు వారికి బోధించెను.

చౌపాయ్ 15

ప్రభువచనములను వారు విని, పరమానందమగ్నులై శరీరములను మఱచిరి; తా మెవరో, తా మెచ్చటనుండివచ్చిరో, తా మెచ్చట నిలిచియుండిరో, వారికి జ్ఞాపకము లేకపోయెను; వారు చేతులను జోడించుకొని, భక్తిపరవశులై, నిలువు గ్రుడ్లు పెట్టుకొని భగవంతునిఁ జూచుచు నిలిచియుండిరి; కాని, వా రొకమాటనయినను బలుకలేదు. రఘునాథుఁడు వారిపరమభక్తికి మెచ్చి, యనేకవిధముల వారికి జ్ఞానము నుపదేశించెను; రఘునాథునియెదుట వా రొకమాటనయినఁ జెప్పలేకపోయిరి; ఎంతవఱకును వారు రామునిచరణములఁ జూచుచుండిరి; రామునిజ్ఞానోపదేశము వారిమనస్సులకుఁ బట్టలేదు. ప్రభువు వారియాజ్ఞాప్రకారము దివ్యాభరణములను వస్త్రములను సేవకులు తీసికొనివచ్చిరి; రామునియాజ్ఞననుసరించి భరతుఁడు స్వయము సుగ్రీవునకు వస్త్రములఁ గట్టి, యతనికంశమునకు భూషణములఁ దగిలించెను; లక్ష్మణుఁడు స్వయము విభీషణున కలంకరించెను; అంగదుఁడు కూర్చునియుండెనుగాని కదలలేదు; అతనిభక్తిఁ జూచి, భగవంతుఁ డతనినిఁ బిలువలేదు.

**దోహా 38, 39**

జాంబవంతుఁడు, నలుఁడు, నీలుఁడు - ఈ మొదలగువానరులకు రాముఁడు కట్నములఁ జదివించి గౌరవించెను; రామునిస్వరూపమును వారు హృదయమునందు నిలుపుకొని, మాటిమాటికి నమస్కరించి, రామనామమును స్మరించుచు వారు నిష్క్రమించిరి; అనంతర మంగదుఁడు లేచి నిలువఁబడి, శిరస్సువంచి, చేతులజోడించి, కన్నీరుఁ గార్చుచు, దీనత్వముతో నిట్లు విన్నవించెను.

**చౌపాయ్ 16**

"ఓ సర్వజ్ఞా! ఓ కృపాసింధో! ఓ నిత్యానందస్వరూపా! ఓ దీనదయాళో! ఓ ఆర్తశరణ్యా! ఓ దీనదయాపరా! ఓ నాథా! నామనవిఁ గైకొనుము; నీగుణములవర్ణింప నే నెంతవాఁడను? నాతండ్రి వాలి చనిపోవునపుడు, నన్ను నీ కప్పగించెను; ఓ భక్తవత్సలస్వామీ! నన్ను విడనాడకుము; రక్షకులులేనివారిని రక్షించెదననుచు నీవు కంకణముఁ గట్టియుంటివి కదా! నీవే తల్లివి తండ్రివి; నీవే గురుఁడవు సఖుఁడవు; నాసర్వము నీవే; నీవుతప్ప నా కితరులు లేరు; నీ చరణములను విడిచి నే నెచ్చటికిఁ బోఁగలను? ఓ నరనాథా! ఓ నాథా! నీవే యాలోచించిచెప్పుము; నిన్నుతప్ప, నాకు గృహమెచ్చట కలదు? ఓ కరుణాసాగరా! నేను బాలుఁడను; మూర్ఖుఁడను; బుద్ధిబలములేదు; దేహబలము శూన్యము; నేను దీనుఁడను; నేను నీదాసులదాసుఁడనని గ్రహించి రక్షింపుము; నేను నీవద్దనుండి, నీనగరులో నతినీచసేవఁ జేయుచు, నీచరణారవిందమకరందముఁ బానముఁ జేసి, సంసారసాగరమునుదాఁటెదను;" అని యీప్రకార మంగదుఁడు విన్నవించి ప్రభువు పాదములమీఁదఁ బడి, "ఓ నాథా! నాగృహమునకుఁ బొమ్మని నాతోఁ జెప్పకుము." అని మొఱవెట్టెను.

**దోహా 40, 41**

రాజీవలోచనుఁడు హరి వానివిన్నపమును విని లేచి నిలువఁబడి, కన్నీరుఁగార్చి, వానిని లేవఁదీసి, వానినిఁ గౌఁగిలించుకొనెను; అప్పుడు శ్రీవారు తమస్వంతవస్త్రములను వానికి స్వయముకట్టించి, తమస్వంత భూషణములతో నలంకరించి, "ఓ కుమారా! నీకు నా సారూప్య

ముక్తి నిచ్చితిని; కొంతకాలము నీవు రాజ్యసుఖముల ననుభవింపుము." అని యనేకప్రకారముల వానినిబోధించి, పొమ్మని సెలవిచ్చిరి.

**చౌపాయ్ 17**

లక్ష్మణభరతశత్రుఘ్నులు వానిభక్తికి మెచ్చుకొని, రాముని యాజ్ఞప్రకారము, వానినంపకముఁ బెట్టుటకు వానితోఁ గలసివెళ్లిరి; వానిహృదయము ప్రేమచే నుప్పొంగుచుండినందున, నడచిపోవుచుండినను, వెనుకకుఁ దిరిగి, మాటిమాటికి వాఁడు రామునిఁ జూచుచుండెను; అనేకపర్యాయములు రామునకు వాఁడు దండప్రణామముఁ జేయుచు, "స్వామి నన్నిచట నిలిచియుండుమని చెప్పినయెడల, వారిసేవఁ జేయువాఁడను గదా!" అని విచారించెను. రామునికృపాదృష్టియు, వాక్సుధారసమును, ముఖపంకజవికాసమును, మందహాసమును, గాఢాలింగనమును- వీని నతఁడు మాటిమాటికిఁ దలఁచి తలఁచి దుఃఖించి, మఱియొకపర్యాయము స్వామినిఁ గన్నులారఁజూచి, వారి దివ్యమంగళవిగ్రహమును లక్ష్యములోనిడుకొని, యతఁడు పయనమయ్యెను. లక్ష్మణభరతశత్రుఘ్నులు వానరుల సాగనంపి, నగరునకుఁ దిరిగివచ్చిరి. అనంతరము హనుమంతుఁడు సుగ్రీవునిపాదములకు నమస్కరించి, యతనినిఁ గొనియాడి, "ఓ నాథా! ఒకపదిరోజులుమాత్రము రాముని చరణములను సేవించి, మరల యథాప్రకారము మిమ్ములను సేవించెద; మీయాజ్ఞఁ దయచేయుఁడు" అని ప్రార్థించెను. సుగ్రీవుఁ డతనివిన్నపమును విని, "ఓ మహావీరుఁడా! నీవు పుణ్యాత్ముఁడవు; ధన్యుఁడవు; నీవుపోయి, యాకృపాసాగరుని చరణములను సేవింపుము" అని యాజ్ఞనిచ్చెను. అంతట సుగ్రీవాదివానరులు ప్రయాణము సాగించిరి. అప్పు డంగదుఁడు వాయుపుత్రునిఁ జూచి, "ఓ మహావీరుఁడా! నీవదృష్టవంతుఁడవు; పుణ్యాత్ముఁడవు; ఏమి నీభాగ్యము?

**దోహా 42, 43, 44**

చేతులనుజోడించి నేను నిన్నొకటిఁ బ్రార్థించెదను; నీవు భగవంతునిసన్నిధానమున వర్తించెదవు గనుక, నావిన్నపములను స్వామికిఁ దెలియపఱచి, శ్రీవారు సదా నన్నుస్మరించునట్లు చేయుము" అని ప్రునవిచేసెను. ఈమాటలఁజెప్పి యంగదుఁడు గమనించెను; తదుపరి

హనుమంతుఁడు రాముని వద్దకు వచ్చి, అంగదుని భక్తిశ్రద్ధలను స్వామితో విన్నవించెను; శ్రీవారు వాని వచనములను విని సంతసించిరి. ఓ పక్షిరాజా! ఒకసమయమున భగవంతుని చిత్తము వజ్రమువలెఁ గఠినముగనుండును; మఱియొకసమయమున కుసుమమువలె మృదువుగనుండును; ఆహా! పరమేశ్వరుని చిత్తమును గ్రహించుటకు శక్యమగునా!

**చౌపాయ్ 18**

అనంతరము కృపాసముద్రుఁడగు శ్రీరాముఁడు నిషాదపతిఁ బిలిచి, యతనికి భూషణములను వస్త్రముల నిచ్చి, "ఓ సఖుఁడా! నీ గృహమునకుఁ బొమ్ము; నన్ను మాత్రము మఱచిపోకుము; త్రికరణశుద్ధిగ ధర్మముల నాచరింపుము; ఓ తమ్ముఁడా! నీవు నాకు భరతుని వంటి తమ్ముఁడవు; ఇదికూడ నీగృహమని తలఁచి, నీవు రాకపోకలఁ జేయుచుండుము; అందువలన నాకు సంతోషము కలుగును" అని రాముఁడు నిషాదపతితోఁ బలికెను; శ్రీవారివచనముల కతఁడు సంతోషముచేఁ బరవశుఁడై కన్నీరుఁగార్చుచు వారిపాదములమీఁదఁ బడెను; ప్రభువుల చరణారవిందముల నతఁడు హృదయములో నిల్పుకొని, గృహమునకు వెడలెను; స్వామివారి దయయు, నాదరణయు నతఁడు తనబంధువులతోఁ జెప్పి వారినిఁ గొనియాడెను; పురజనులు రాముని చర్యలఁ జూచి, "ఓ రామా! నీవు ధన్యుఁడవు, ధన్యుఁడవు!" అని మాటిమాటికిఁ జెప్పి, * చప్పటించిరి. శ్రీవారు సింహాసనము నెక్కిన తరువాత, మూఁడులోకములకు స్వాస్థ్యము కలిగెను; మూఁడులోకములవారును పరమానందభరితు లయిరి; వారిదుఃఖములు శాంతమయ్యెను; ఒకరితో నొకరికి వైరము లేదు; వారి ప్రభావమువలన, జనులకుటిలత్వము మాసిపోయెను.

**దోహా 45**

జనులు వారివారి వర్ణాశ్రమధర్మముల ననుసరించి సంచరించుచుండిరి; వారు సుఖించి జీవించిరి; భయశోకరోగములు వారిని విడిచెను.

---

* కరతాళములను వైచిరి.

### చౌపాయ్ 19

తాపత్రయములు రాముని రాజ్యకాలములో నశించెను; మనుజులు పరస్పరానురాగముకలవారై యుండిరి; వేదములోఁ జెప్పఁబడిన ప్రకారము, వారివారికులధర్మముల ననుసరించి ప్రవర్తించిరి. తపమును, దానమును, యజ్ఞమును, జ్ఞానమును—ఈ నాలుగుధర్మములును యథావిధిగ లోకములో జరగుచుండెను; స్వప్నమందయినను, మనుజులకుఁ బాపచింత లేదు; స్త్రీపురుషులు రామునియందు భక్తిఁగలిగి యుండిరి. పరమగతికి నందఱు నర్హులైయుండిరి; అందఱు ముక్తికిఁ బోవుచుండిరి; రాముని కాలములో నపసవ్యపుచావులు లేవు; ఏవిధమగుపీడలును గాన రావు; దరిద్రులును, దుఃఖభాగులును, దీనులును, మూర్ఖులును, గురూపులును—ఇట్టిమనుజులు రాముని కాలములోఁగనఁబడరు; అందఱును సర్వలక్షణసంపన్నులు; ఒకరికిని డాంబికము లేదు; అందఱును జ్ఞానులు; ధర్మరతులు; అందఱకును దయదాక్షిణ్యములు కలవు; స్త్రీపురుషులు చతురులు; సరసులు; ఒకరిసుగుణముల నొకరు మెచ్చుకొనుచుండిరి; అందఱు పండితులు; జ్ఞానులు; కృతజ్ఞులు; నిష్కపటులు; సత్యవాదులు.

### దోహా 46

ఓ పన్నగాశనా! వినుము; రాముని కాలములో లోకములోని చరాచరజంతువులకుఁ గాలకర్మస్వభావములవలనఁ గలుగుదుఃఖములు సంభవింపలేదు.

### చౌపాయ్ 20

సప్తద్వీపములతోఁ గూడిన భూమండలముయావత్తును సముద్రములవఱకును రాముని యేకచ్ఛత్రాధిపత్యముక్రింద నుండెను; ఈ సామ్రాజ్యమునకు శ్రీరాముఁడే స్వరాట్టు; ఓ పార్వతీ! భగవంతుని రోమకూపము లొక్కొక్కదానిలో ననేకబ్రహ్మాండములు దాఁగియుండును గదా! అటువంటిమహాత్మున కీసామ్రాజ్య మొకగొప్పదియా? పరమేశ్వరుని యనంతమహిమను గుర్తెఱింగినవారి కీనావర్ణన హీనముగఁ గనఁబడును; ఓ గరుత్మంతుఁడా! శ్రీరాముని ప్రభావముఁ దెలిసినవారతనిదివ్యచరిత్రములను విని నిరంతరము సంతసింతురు. పర

మాత్మునిమాహాత్మ్యముఁ దెలిసినవారి కేమిఫలము కలదు ? అతనిదివ్య చరిత్రములను నిరంతరము వినుటయం దాసక్తియుండుటయే దాని ఫలము. శ్రీరాముని రాజ్యకాలములో మనుజు లనుభవించిన సుఖసంపత్తులను వర్ణించుటకు శేషునకును సరస్వతికినైన సామర్థ్యము లేదు. స్త్రీపురుషు లుదారబుద్ధిగలవారు ; పరోపకారపరాయణులు ; బ్రాహ్మణ సేవాధురంధరులు ; పురుషు లేకపత్నీవ్రతులు ; స్త్రీలు భర్తశుశ్రూషాసక్తలు.

దోహా 47

రాముని రాజ్యములో సామదానములు పూర్ణించియుండెను ; భేదదండములు గానరావు; దండము యతీశ్వరుల చేతిలోఁ గనఁబడును; భేదము రాగములోను నృత్యములోఁ గన్పించును ; నిగ్రహము ఆత్మనిగ్రహములోఁ గన్పడును. శత్రువులే లేనిసమయమున, వారిని నిగ్రహించుట యెట్లు ?

చౌపాయ్ 21

వృక్షములు సదాపుష్పములతోను ఫలములతో నిండియుండెను; ఏనుఁగును సింహమును స్నేహభావముతో నుండెను ; పక్షులును మృగములును వానివాని స్వభావ వైరమునువిడిచి పరస్పరానురాగముతో జీవించెను ; అనేకవిధముల నవియన్నియు శబ్దములఁ జేయుచుండెను ; మందసుగంధశీతలవాయువులు వీచెను ; తుమ్మెదలు మకరందమునాస్వాదించి భ్రమించెను ; లతలును వృక్షములును కోరినపుడు ఫలములనిచ్చెను ; గోవులు వానియంతట నవి క్షీరముల జారవిడిచెను. అన్ని కాలములలోను భూమి సస్యములతో నిండియుండెను ; కృతయుగధర్మములన్నియుఁ త్రేతాయుగములోఁ బ్రవర్తించెను ; రత్నఖనులును బంగారు వెండిమొదలగు లోహములఖనులును, వానియంతట నవి పర్వతములపైఁ బ్రకటమయ్యెను ; చరాచరజంతుజాలముతోఁ గూడిన బ్రహ్మాండమంతయు జగన్నాథుని నాథునిగ భావించెను ; సమస్తనదులును నిర్మలశీతలజలములతో నిండి ప్రవహించెను ; సముద్రము చెలియలికట్టుదాఁటక నిలిచి, దానియంతట నది తీరములపై నవరత్నముల విడిచిపెట్టుచుండెను ; వానిని మనుజులు తీసికొనుచుండిరి ; సరో

వరములు కమలములలో నిండియుండెను; దశదిశలును గలకలమని తెలివిగాంచెను.

దోహా 48

శ్రీరాముని రాజ్యకాలములో నమృతకిరణములను చంద్రుఁడు ప్రసరించెను; సూర్యుని తేజస్సు ప్రయోజనము విశేషము లేకయుండెను; కోరినపుడు మేఘబృందములు వర్షించుచుండెను.

చౌపాయ్ 22

శ్రీరాముఁ డనేకఅశ్వమేధయాగముల నొనరించెను; కోట్లకొలఁది బ్రాహ్మణులకు దానముల నిచ్చి, వారిని తృప్తిఁబొందించెను; వేదమార్గప్రవర్తకుఁడును, ధర్మరక్షకుఁడును, గుణాతీతుఁడు నగు శ్రీరాముఁడు దేవేంద్రభోగముల ననుభవించెను. సకలసుగుణసంపన్నురాలగు సీతాదేవి ధర్మమార్గము నవలంబించి పతిశుశ్రూషలో మెలఁగుచుండెను; భర్తకనుకూలముగ నామె సంచరించెను; ఆమెచక్కఁదనమును, సుశీలమును, ఆమె కలుపుఁగోలుతనమును చెప్ప శక్యముకాదు; పతియేదైవమని తలఁచి, యామె రాముని చరణకమలములను సేవించెను. తెలివితేటలుగల సేవకులును దాసీలు ననేకులుండినను, గృహకృత్యముల నామెస్వయము నిర్వర్తించెను; ఏప్రకారము గృహకృత్యములఁ జేసినయెడల రామునకు దయకల్గునో, యాప్రకార మామె యన్నిపనులఁ జేయుచుండెను; ఏపనిఁ జేయుమని భర్త సెలవిచ్చునోయని యామె చేతుల జోడించుకొని, నిరీక్షించుచుండును; ఆమెకు షడ్వర్గములు లేవు; అందుచేత నామెకు శత్రువులు లేరు; ముప్పూరత్తలకు నామె పరిచర్యలఁ జేయును; ఆజగదంబను, ఆ నిఖిలపావనిని, మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వతులు సదా సేవించుచుందురు.

దోహా 49

ఆమె కటాక్షదృష్టికి బ్రహ్మాదిదేవతలు నిరీక్షింతురు. అట్టి శ్రీమాత శ్రీమహారాజ్ఞియైనను, స్వయము శ్రీరాముని చరణకమలముల నాశ్రయించి మెలంగెను.

(శ్లో. జయతి జనకజాయాః పాదపద్మం చ శుభ్రం
హరిహరవిధివంద్యం సాధకానాం సుసేవ్యం,

నఖరనికర కాంతం ముద్రికానూపురాద్యై
ర్హారిహారహృాదిమధ్యే యోగియోగీశభావ్యమ్.)

చౌపాయ్ 23

ముప్వురమఱఁదుల కనుకూలముగ నామె ప్రవర్తించెను; ఆమె పతిసేవమాత్ర మధికముగఁ జేయుచుండెను; ఏసమయమున నేయాజ్ఞను భగవంతుఁ డిచ్చునోయని తలఁచి, యామె యతనిచరణకమలములను నెల్లపు డనుసరించియుండును; రాముఁడు సోదరులతోఁ గలసి మెలసి పొత్తుగనుండెను; అనేకధర్మమార్గముల నతఁడు వారికి బోధించెను; పురజనులు సంపదలతోఁగూడి దేవేంద్రవైభవముకంటె నధికముగ సుఖముల ననుభవించిరి; రామునిచరణములయందు నిరంతర భక్తియుండుటకు వారు దివారాత్రములు భగవంతుని ధ్యానించుచుండిరి; వాల్మీకాశ్రమములో శ్రీమహారాణికి కుశలవులనుకుమారు లిరువురు కలిగిరి. అని వేదశాస్త్రములు ఘోషించుచున్నవి; ఆయిరువురు సకలగుణసంపన్నులు; రణధీరులు; శూరులు; వీరులు; నవమన్మథాకారులు; మూఁడుమూర్తులు తండ్రినిఁ బోలియుండిరి; ఇతరసోదరులు మువ్వురలో నొక్కొక్కరి కిరువురుకుమారులు కలిగిరి; కుమారులందఱును రూపరేఖావిలాసములలోను సుగుణములలోను వారివారితండ్రులఁ బోలియుండిరి. భరతునికుమారులు పుష్కలుఁడు, తక్షుఁడు; లక్ష్మణునికుమారులు అంగదుఁడు, చిత్రకేతువు; శత్రుఘ్నునికుమారులు శ్రుతిసేనుఁడు, సుబాహువు.

దోహా 50

ఆ త్రిగుణాతీతుఁడును, మాయారహితుఁడును, సచ్చిదానందస్వరూపుఁడును, మనోవాచామగోచరుఁడు నగుశ్రీరాముఁడు మాయామానుషచర్యలఁ జేయుచు, రాజ్యముఁ బరిపాలించెను.

చౌపాయ్ 24

అరుణోదయమునకు శ్రీరాముఁడు లేచి సరయూనదికిఁ బోయి స్నానసంధ్యాద్యనుష్ఠానములఁ జేసి, నగరునకువచ్చి దేవపూజ లొనరించి, హజారములో సింహాసనము నధిష్ఠించియుండును; కొలువుకూటములో బ్రాహ్మణులును, సజ్జనులును, సామంతప్రభువులు నతనిని

బరివేష్టించియుందురు. వసిష్ఠాదిమహామునులు వేదపురాణములఁ బఠించు చుందురు; శ్రీరాముఁడు వానిని విని పరవశుఁ డగుచుండును; ఈ వేదపురాణము లతనికిఁ దెలిసినను, లోకవ్యవహారార్థ మతఁడు వానినిఁ దెలియనివానివలె నటించును; సోదరులతో నతఁడుకలసి భోజనముఁ జేయును; వారిపాత్తుఁ జూచి ముప్పుర్వురతల్లులు పరమానందభరిత లగుచుండిరి; పిమ్మట భరతశత్రుఘ్నులు హనుమంతునిఁదోడ్కొని యొకయుద్యానవనమునకుఁ బోయి, సుఖాసీనులై, కుతూహలముతో నతనిని వారు రామచర్యలఁ జెప్పుమనుచుండిరి; మహావీరుఁడు రామ కథను వర్ణించిచెప్పుచుండును; భక్తిశ్రద్ధలతో వారు దానిని వినుచుం డిరి; ఆకథను విని, వా రిరువురు పరమానందభరితులై, మాటిమాటికిని హనుమంతుని రామకథఁ జెప్పుమని ప్రార్థించిరి; అయోధ్యానగరములోఁ బ్రతిగృహస్థునిగృహములో నిత్యము పురాణశ్రవణ మగుచుండెను; పురజనులందఱు రామచరిత్రమును వినుచుండిరి; స్త్రీపురుషులు రాముని గుణములఁ బాడుచుండిరి; రామనామకీర్తనముఁ జేయుచు, వారు దివారాత్రములగమనమును గుర్తెఱుఁగకయుండిరి.

దోహా 51

రామునిరాజ్యకాలములో నవధపురజనుల సిరిసంపదలను సహ స్రశేషులయినను వర్ణింపలేరు; అంతటిధర్మముగ రాముఁడు రాజ్యముఁ బరిపాలించెను.

చౌపాయ్ 25

నారదసనకాదిమహామునులు ప్రతిదిన మయోధ్యకు వచ్చి రాముని సందర్శించి జ్ఞానవైరాగ్యములఁ బొందుచుండిరి; ఆనగరము యొక్క శోభఁజూచి వారు భ్రమించిరి; రత్నఖచితమగు సువర్ణకోట బురుజులును, అనేకరంగులతో గచ్చుఁజేయఁబడిన అంగణములును, పట్టణమునకు నలువైపుల చక్కనిరంగులతోఁ బూయఁబడి దిట్టముగఁగ ట్టఁబడిన నాలుగుదుర్గములును, ఒక్కొక్కదానిలోపలఁ దొమ్మిదిగృహ ములును — ఈ చక్కదనముఁ జూచి, స్వర్గమునుండి అమరావతిపట్ట ణము భూలోకమునకు వచ్చెనాయని తోఁచును. రంగులురంగులుగల శుద్ధస్ఫటికమణులతో నేలమట్టమంతయుఁ జెక్కఁబడియుండెను; దాని

శోభ మునీశ్వరులహృదయములను హరించెను; ఆపట్టణములోని మేడల మిద్దెలపైనుండిన సువర్ణకలశముల కాంతి సూర్యచంద్రులకాంతిఁ దిరస్కరించెను. మణులతోఁ జెక్కఁబడినగవాక్షములు కలవు; ఏగృహములోఁ జూచినను మణిదీపము లుండెను.

ఛాంద్ 18

ప్రతిగృహములో మణిదీపములు వెలుగుచుండెను. ఆగృహములకు ముత్యములతోఁ జేయఁబడిన ద్వారబంధములును గుమ్మములును గలవు; సువర్ణకుడ్యములు, మణిస్తంభములు—ఇవియన్నియు రత్నస్థగితములు. వీని నీప్రకారము బ్రహ్మ సృష్టించెనేమోయని తోఁచును. అంగణములు శుద్ధస్ఫటికమణిమయములు; ప్రతిద్వారమునకు సుందరమగు కవాటములు—నవరత్నములు వానిలో నద్దఁబడియుండెను. చూచుట కానగరము చిత్రముగ నుండెను.

దోహా 52

ప్రతిగృహములో నొకచిత్రశాల కలదు; రామచరిత్రపటములు దానిలోనుండెను; ఆపటములం జూచిన, మనస్సు భ్రమించును.

చౌపాయ్ 26

ప్రతిగృహస్థున కొకపువ్వులతోఁట కలదు; అతఁడు దానిని జాగ్రత్తతోఁ గాపాడును; ఆతోఁటలో నానావిధములగు చక్కని పువ్వులచెట్లును, లతాగృహములును, లతలును కలవు; ఎల్లప్పుడు నచ్చట వసంతఋతువులోవలె నన్నికాలములలో నాచెట్లు పుష్పించి ఫలించును; సదా భ్రమరములు ఝంకారముఁ జేయుచుండును; మందసుగంధశీతలవాయువులు వీచుచుండును; అనేకవిధములయినపక్షులను బాలురు పెంచిరి; అవి చక్కనిధ్వనులను జేయుచుండెను; అవి మీఁదికి నెగురుచుండెను; మయూరములు, హంసలు, సారసములు, పారావతములు—ఇవియన్నియు గృహములపైనుండినపుడు చూచుటకు వినోదముగ నుండును; వానివానినీడలఁ జూచి, యవి మనోహరముగఁ గూయుచుండును; అనేకవిధములుగ నవి నృత్యముఁ జేయును; బాలురు చిలుకలకును, మైనలకును 'రామ,రామ' యని మాటలఁ జెప్పుచుండిరి; రాజనగరసింహద్వారములు విశాలమయినవి; రాజవీధులును, అంగళ్లును సూటిగనుండెను; అన్నియు రాతితోఁ జెక్కఁబడెను.

ఛాంద్ 19

అంగడివీధుల శోభనువర్ణింప శక్యముకాదు ; పదార్థములన్నియు మూల్యములేకయే దొరకును ; సాక్షాత్ లక్ష్మీపతి, శ్రీనివాసుఁడు పరి పాలించునగరముయొక్క సిరిసంపదల నెట్లు వర్ణింపఁగలను? బట్టలవర్త కులు, బంగారువర్తకులు మొదలగువణిజులు కుబేరునితో సమానులు; ప్రతివారును సద్గుణప్రవర్తనులు ; సదాచారసంపన్నులు ; భోగులు ; ఆబాలవృద్ధులు, స్త్రీపురుషులందఱు ముద్దులు మూటఁగట్టుచుండిరి.

దోహా 53

ఆనగరమున కుత్తరమున గంభీరమగు సరయూనదియొక్క నిర్మ లజలములు ప్రవహించును ; దానితీరమునందంతటను చక్కని రేవులు కలవు ; ఏ రేవులోను బురదలేదు. అన్నియు రాతిరేవులు.

చౌపాయ్ 27

కొంచెముదూరములో నొకవిశాలమగు రేవుకలదు; ఆ రేవులో గుఱ్ఱములను ఏనుఁగులను వానిపాలకులు స్నానముఁ జేయించెదరు ; త్రాగుట కుపయోగించుజలములఁ దీసికొనివచ్చుటకుఁ గొన్ని రేవుల నేర్పఱచిరి; వానిలో నెవరు స్నానముఁ జేయఁగూడదు, అన్ని రేవులకంటె రాజరేవు చక్కనిది ; చాతుర్వర్ణములవా రా రేవులో స్నానముఁ జేయుదురు ; ఆ రేవులపొడుగునను దేవాలయము లనేకములు కలవు ; ఆలయములకు నలువైపులఁ దోఁటలుండెను ; ఆనదీతీరమున నచ్చటచ్చట జ్ఞానులును, మునులును, సన్యాసులును పర్ణశాలలఁగట్టుకొని వానిలో నివసించియుండిరి ; వారు సదా భగవంతుని ధ్యానించుచుండిరి ; మహా త్ములనేకు లాతీరమునందంతటను దులసిమొక్కలను బాతించిరి ; వాని శోభ మునులమనస్సులను భ్రమింపఁజేయును ; అయోధ్యానగరము యొక్కసొగసు వర్ణింపఁజాలను ; ఆపట్టణము సదా కలకలలాడుచుం డును ; దానిపొలిమేరలుసహితము చూచుట కింపుగనుండును ; దానిని దర్శించుటవలన, సకలపాపములు నశించును ; వాపీకూపతటాకము లతో నది ప్రకాశించును ; సకలమునిసిద్ధసేవ్యంబగు నాపట్టణము పాప ములఁ బోఁగొట్టును.

ఛాంద్ 20

నిరుపమానమగు వాపీకూపతటాకము లనేకము లానగర ములోఁ గలవు; వానినిర్మల జలములేమి? వానిచక్కని రేవులేమి? వానిసొగసుఁ జూచి మునులును దేవతలును సిగ్గుపడిరి; నానారంగులు గలకమలములు సరోవరములో వికసించియుండెను; వానియొద్దుల ననేకపక్షులు ధ్వనులఁ జేయుచుండెను; తుమ్మెదలఝంకారము వినఁ బడును; వానితీరముననుండిన వనములలోనుండి శుకపికపారావత ములు మధురస్వరముతో గానముఁ జేయుచుండెను; బాటసారుల నానగరమున కాహ్వానముఁ జేయునట్లు, వానిధ్వనులు వినఁబడును; ఆనగరము స్వర్గముకంటె నధికముగ నుండుటచే, మునులు దానిం జూచి, భ్రమించిరి.

దోహా 54

ఆనగరమునకు రాజు సాక్షాచ్ఛ్రీనివాసుఁడు, లక్ష్మీపతి కదా! దానిని నే నెటుల వర్ణింపఁగలను? అణిమాదిసిద్ధు లానగరములోఁ గలవు; సముద్రము జలముతోఁ బూరించియుండినవిధమున, నానగ రము జనులతోను ధనముతోను బుష్కలముగ నుండెను.

చౌపాయ్ 28

ఎచ్చటఁజూచినను మనుజులు రామనామమును గానముఁ జేయు చుండిరి; ఆసనములపై వారుకూర్చుండి, బాలుర కీవిధమున బోధించిరి. "ఓ బాలకులారా! రాముని స్మరింపుఁడు; అతనినామమును గానముఁ జేయుఁడు; అతనిపాదములకు నమస్కరింపుఁడు; అతఁడు దీనదయా ళువు; సకలగుణసంపన్నుఁడు; సుశీలుఁడు; కమలలోచనుఁడు; నీలమే ఘమువంటి శరీరచ్ఛాయకలవాఁడు; కంటిని ఱెప్పవలె నతఁడు సేవ కుల రక్షించును; విల్లును, బాణములను, నంబులపొదిని ధరించియుం డును; రణధీరుఁడు; మహాత్ముల మనఃకమలములను వికసింపఁజేయు సూర్యుఁడు; కాలసర్పమును మ్రింగుటకు గరుత్మంతునిఁ బోలును; నిష్కామ్యముగ నతనిచరణములను సేవించువారిని దయతోఁ గాపా డును; అరిషడ్వర్గములను మృగములను సంహరించుటకు మేటిపోటు బంటు; సకలసుఖముల నిచ్చును; కామమనునట్టి మదపుటేనుఁగును

సంహరించుటకు సింహమువంటివాఁడు; శోకమోహాంధకారమును విడఁగొట్టుటకు సూర్యునిఁబోలును; రాక్షసులను వనమును దహించుటకు నిప్పువంటివాఁడు; సంసారతాపత్రయమును బోఁగొట్టు శ్రీసీతారాములను భజింపుఁడు; నానావిధములగు వాసనలనునట్టి మశకములను నశింపఁజేయుటకు హిమరాశిఁబోలును; అతఁ డొకఁడు; పుట్టువు లేనివాఁడు; శాశ్వతుఁడు; నిరంజనుఁడు; నిర్వికారుఁడు; మునిమనోరంజనుఁడు; భూభారహరుఁడు; తులసీదాసుని ప్రభువు" అని వారు బాలురకు బోధించిరి.

దోహా 55

ఈ ప్రకారము స్త్రీపురుషు లానగరములో రామునిగుణములను గానముఁ జేయుచుండిరి; ఆ కృపాసముద్రుఁ డగురాముఁడు ప్రజల ననురాగముతోఁ బాలించెను; వారంతట వారతనినిఁ బ్రేమించిరి.

చౌపాయి 29

ఓ గరుత్మంతుఁడా! వినుము; శ్రీరామచంద్రుని ప్రతాపమనునట్టి ప్రచండభాస్కరుఁ డుదయించినదిమొదలు, మూఁడులోకములు తెలివిగాంచి, కలకల మనుచుండెను; వానియంధకారము వీడిపోయెను; కొందఱు సుఖించిరి; మఱికొందఱు దుఃఖించిరి; ఎవరుదుఃఖించిరో వారిం జెప్పుచున్నాను; వినుము. మొట్టమొదట, నజ్ఞానాంధకారము విడిపోయెను; పాపమనునట్టి గుడ్లగూబ పాఱిపోయెను; కామక్రోధములనెడి జూదగాండ్రు సిగ్గుపడి దాఁగియుండిరి; కాలధర్మములు, గుణములు, స్వభావములు మొదలగునవియే చకోరములు; వానికి సుఖములేకపోయెను; మదము, మోహము, మాత్సర్యము, మానము—ఈ చోరులదొంగాటలు సాగలేదు. ఎవరుసుఖించిరో వారిం జెప్పుచున్నాను వినుము; ధర్మమనునట్టి సరోవరమునందు జ్ఞానవిజ్ఞానమనెడికమలములు వికసించెను; సుఖము, సంపత్తి, వైరాగ్యము, వివేకము—ఇవి చక్రవాకములు—స్త్రీపురుష చక్రవాకముల దుఃఖము శాంతమయ్యెను.

దోహా 56

శ్రీరామచంద్రుని ప్రతాపమనునట్టి ప్రచండభాస్కరుఁ డెవనిహృదయములోఁ బ్రకాశించునో, వానికి జ్ఞానవైరాగ్యములు దృఢమ

గును; వానిపాపములు నశించును; అందుచేత భగవంతుని భజింప వలయును.

చౌపాయ్ 30

ఒకదినమున శ్రీరాముఁడు సోదరులతోను బ్రియుఁడగు హనుమంతునితోఁ గలసి, యొకయుద్యానవనముఁ జూచుటకు వెడలెను; ఆవనము పుష్పములతోను ఫలములతో నిండియుండెను. ఆసమయముఁజూచి సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులు రాముని సందర్శించుటకు వచ్చిరి; ఆ నల్వురుమును లయిదుసంవత్సరముల ప్రాయమువారివలెఁ గాన్పింతురు; చూచుటకు బాలురవలెఁ గన్పడినను, వారివయస్సు లక్షలసంవత్సరములు; వా రెప్పుడు బ్రహ్మానందములో మునిఁగియుందురు; వారందఱకు నొకరూపము కలదు; మూర్తిభవించిన నాలుగువేదములని తోఁచును; వారిలో భేదమేమియు లేదు; వారు దిగంబరులు; వారల కొకవ్యసనము కలదు; వారల కోరికయొకటి; రామునిచర్యలను వినుటయందు వారల కభిలాషమెందు; ఓ పార్వతీ! అగస్త్యమహామునియాశ్రమములోఁ గొంతవఱకు వారు నిలిచియుండిరి; అగస్త్యుఁడు వారికి రామకథను వినిపించెను; అరణియందగ్ని పుట్టినవిధమున, రామకథను వినినందున జ్ఞానముక లుగును.

దోహా 57

రాముఁ డామునులఁజూచి సంతసించి, వారికి సంప్రణామముఁ జేసి నమస్కరించెను; పీతాంబరుఁడు వారిని సుఖాసీనులఁ జేసి, వారికి యర్ఘ్యపాద్యమధుపర్కముల నిచ్చి, పూజించి, స్వాగతము నడిగెను; "ఓ మునులారా! నేను మీ దాసుఁడను" అని చెప్పెను.

చౌపాయ్ 31

తదుపరి, లక్ష్మణభరతశత్రుఘ్నులును, హనుమంతుఁడును వారికి నమస్కరించిరి; అందఱు సుఖాసనముల నధిష్ఠించిరి; శ్రీరాముని దివ్యమంగళవిగ్రహమును వారు కన్నులారఁ జూచి, నిర్భరానందభరితులై స్మారకము తప్పిరి; ఆ కమలలోచనుని, ఆ కాలమేఘావభాసుని, ఆ లోకరక్షకుని, ఆ భవమోచనుని, వారు ఱెప్పవేయక నిలుఁపుగ్రుడ్లఁ బెట్టుకొని చూచిరి; చేతులజోడించి వా రతనికి నమస్కరించిరి; శ్రీరా

ముఁడు వారియవస్థఁ జూచి, ఆనందబాష్పములఁ జారవిడిచెను; అతని శరీరము పులకరించెను; రాముఁడు వారిచేతులఁబట్టుకొని, వారిని యాసనములపైఁ గూర్చుండఁబెట్టెను; "ఓ మునులారా! నేఁడు నాజన్మము సార్థకమయ్యెను; నేను గృతకృత్యుఁడ నయితిని; మీదర్శనమువలన నాపాపములు నశించెను; ఎంతోభాగ్యమువలన, సత్పురుషులసాంగత్యము ప్రాప్తించును; ఏప్రయాసము లేక, వారి సాంగత్యమువలన, మనుజులు సంసారసాగరమును దాఁటఁగలరు.

దోహా 58

"మహాత్ములసాంగత్యము మోక్షమునకు మార్గము; పాపాత్ములసహవాసము సంసారమునకు మార్గము; అని మహాత్ములును, వేదపురాణేతిహాసములును, కవులును, బండితులును ఘోషించుచుండిరి" అని రాముఁడు మృదుమధురవచనములతోఁ బ్రసంగించెను.

చౌపాయీ 32

శ్రీరామునివచనములను విని మునులు సంతసించి, భగవంతునిట్లు స్తుతించిరి; వారిశరీరములు పులకరించి కంపించెను; ఆనందబాష్పములు వారినేత్రములనుండి కారుచుండెను.

"జయజయ! ఓ షడ్గుణైశ్వర్యసంపన్నుఁడా! ఓ అనంతా! ఓ అనామయా! ఓ అద్వితీయా! ఓ పాపరహితుఁడా! ఓ కల్యాణస్వరూపుఁడా! నీవు సర్వవ్యాపకుఁడవు; సర్వాంతర్యామివి; కరుణాసముద్రుఁడవు; సకలగుణసంపన్నుఁడవు; నిర్గుణుఁడవు; జయజయ! నీవు సుఖరాశివి; సౌందర్యమూర్తివి; ఓ ఇందిరారమణా! సకలశోభాయమానుఁడవు; లోకములను బరిపాలించు రాజాధిరాజా! నీసామ్రాజ్యమున కెదురులేదు; నీకుఁ బుట్టువులేదు; ఆద్యంతములు నీకులేవు; సకలజ్ఞానమూర్తివి; త్రికాలస్వరూపుఁడవు; నీకు మానములేదు; మానవంతులకు మానము నిచ్చెదవు; నీసత్కీర్తిని వేదపురాణములు ఘోషించును; సకలతత్త్వములు నీవు; తత్త్వవేత్తలు నీవు; తజ్ఞుఁడవు, కృతజ్ఞుఁడవు నీవు; అజ్ఞానమును భంజించువాఁడవు నీవు; నామరూపభేదములు నీకుఁ గలవు, లేవు; మాయారహితుఁడవు; నిరంజనుఁడవు; కల్యాణమూర్తివి; ఓ స్వామీ! ఓ జగద్రక్షకా! మమ్ములఁ

గటాక్షించి రక్షింపుము; నీదాసులము; నీవు మాహృదయములలో నివసింపుము; మా ద్వంద్వములను విడగొట్టుము; మా షడ్వర్గములను నశింపఁజేయుము; మాకు నీపాదారవిందములయందు నిర్మలభక్తి కలుగునటులఁ బ్రసాదింపుము;

దోహా 59

"ఓ కృపానిధీ! ఓ బ్రహ్మానందస్వరూపుఁడా! ఓ సంపూర్ణకాముఁడా! ఓ శ్రీరామా! ఓ లక్ష్మీరమణా! నిన్ను స్మరించినమాత్రమున సర్వపాపములు నివృత్తియగును; నీనామమును వినినమాత్రమున సకలకోరికలు సిద్ధించును; నిన్ను దర్శించినమాత్రమున మోక్షము లభించును; నీయందు మా కెడతెగనిభక్తికలుగునట్లు దయచేయుము.

చౌపాయ్ 33

"ఓ రఘువీరుఁడా! భవరోగములను తాపత్రయములను నశింపఁజేయునట్టి నిర్మలమగుభక్తిని బ్రసాదింపుము; ఇదియే మాకోరిక; మాకోరిక నెఱవేర్పుము; కామధేనువువలె దీనుల రక్షించెదవు; కల్పవృక్షమువలెఁ గోరినకోరికల నిచ్చెదవు; అగస్త్యునివలె సంసారసాగరమును పానముఁ జేయఁగలవు; నీదాసులకు సులభుఁడవు; వారికోరికల నీడేర్చెదవు; మనోదుఃఖములను నశింపఁజేయఁగలవు; దీనులను రక్షించెదవు; అందఱికిని సముఁడవు; ఎవరియెడలను నీకుఁ బక్షపాతము లేదు; ఆశాపాశములను, ఈర్ష్యాదులను దొలఁగింప సమర్థుఁడవు; వినయవివేకములను, జ్ఞానవైరాగ్యములను వికసింపఁజేయ సమర్థుఁడవు; ఓ సకలభూపాలమౌళీ! ఓ భూమండలచూడామణీ! నీయందు నిరంతర భక్తిఁ గలిగింపుము; నీభక్తియనునట్టి తెప్పమూలమున భవసాగరమును దాఁటఁగలము; హంసవలె, మునిమానససరోవరములలో విహరించెదవు; బ్రహ్మమహేశులు నీచరణకమలముల కెల్లపుడు నమస్కరింతురు; ఓ రఘుకులపతాకమా! శ్రుతులనునట్టిసేతువును రక్షించెదవు; కాలము, కర్మము, గుణము, స్వభావము—వీనిని నశింపఁజేయుదువు; మోక్షమునకుఁ దీసికొనివెళ్లుటకు నావవంటివాఁడవు; సకలదోషములను బరిహరించెదవు; ఓ త్రిలోకరక్షామణీ! ఓ బ్రహ్మాండనాయకా! మాతప్పులను క్షమించి, మమ్ములను రక్షింపుము; నీ కనేకనమస్కారములు; జయజయ;" అని వారు నుతించిరి.

దోహా 60

ఇట్లు సనకాదులు శ్రీరామునిస్తుతించి, అతనిపాదములకు శిరస్సువంచి, నమస్కరించి, వరములఁ గైకొని, బ్రహ్మలోకమునకు వెళ్ళిరి.

చౌపాయ్ 34

సనకాదులు రామునిసన్నిధానమునుండి వెళ్ళినతరువాత సోదరులుముువ్వురు రామునిపాదములకు మ్రొక్కిరి; రాముని కొన్నిప్రశ్నల నడుగుటకు వారు సంకోచించిరి; వారు హనుమంతునిఁ జూచి, సంజ్ఞార్థముగ వారిమనోభావము నతనికిఁ దెలిపిరి; అతఁడు రామునిఁ బ్రశ్న జేసినయెడల, శ్రీవారు స్వయము ప్రత్యుత్తరము నిచ్చెదరు; అందుమూలమున వారిదుఃఖములును భ్రమయు వీడిపోవునని వారు తలంచిరి; సర్వాంతర్యామియగు రాముఁడు సర్వము గుర్తెఱిఁగెను; "ఓ హనుమంతుఁడా! ఏమి నీవు తెలిసికొనఁ గోరుచుంటివి? అడుగుము" అని రాముఁడు పలికెను. "ఓ దీనరక్షకా! ఓ స్వామీ! ఓ భగవంతుఁడా! తమ్ముఁడు భరతుఁడు మిమ్ములనొకప్రశ్న నడుగఁదలఁచెను; కాని, యతఁడు సంశయపడుచుండెను; మీయెదుట నతఁడు సిగ్గుపడుచుండెను" అని హనుమంతుఁడు చేతులజోడించి నమస్కరించి విన్నవించెను. "ఓ వాయుపుత్రా! నాస్వభావము నీకుఁ దెలియునుకదా! భరతునకును నాకు నే విధమగుభేదము లేదుకదా!" అని శ్రీవారు చెప్పిరి. శ్రీరామునివచనములను భరతుఁడు విని, వారిపాదములకు మ్రొక్కి, "ఓ ప్రణతార్తిహరుఁడా! ఆలకింపుము; నా తప్పులను క్షమించి, నన్ను రక్షించుము.

దోహా 61

"ఓ నాథా! ఏసందేహములు నాకులేవు; స్వప్నమందయినను శోకమోహములు లేవు; ఓ సర్వజ్ఞుఁడా! ఓ సచ్చిదానందస్వరూపుఁడా! ఇదియంతయు నీకటాక్షము.

చౌపాయ్ 35

"ఓ కృపాసాగరా! మీరు నన్ను క్షమించినయెడల, నేనొక విన్నపముఁ జేయువాఁడను; నేను నీదాసుఁడను; నీదాసులకు సుఖము నిచ్చెదవు; ఓ రఘునాథా! మహాత్ములప్రభావమును వేదపురాణము

లనేకవిధములుగ గానముజేయుచున్నవి; నీవు స్వయము వారిమాహాత్మ్యమునుగుఱించి చెప్పియుంటివి; నీకు వారియం దధికప్రేమకలదని కూడ సెలవిచ్చితిరి; ఓ స్వామీ! సత్పురుషులలక్షణములను వినఁ గోరుచున్నాను; ఓ నాథా! నీవు సకలగుణసంపన్నుఁడవు; జ్ఞానస్వరూపుఁడవు; ఓ రాజాధిరాజా! సత్పురుషులకును దుర్మార్గులకుఁ గల తారతమ్యమును వివరించిచెప్పుము; ఓ దీనవత్సలుఁడా! రక్షింపుము" అని ప్రార్థించెను. "ఓ తమ్ముఁడా! వేదపురాణములలోఁ జెప్పినవిధమున, సత్పురుషులగుణము లనంతములు; చందనతరువునకును గొడ్డలికిని నెట్టిసంబంధముకలదో, సత్పురుషులకును దుర్మార్గులకు నట్టిసంబంధము కలదు; చూడుము; గొడ్డలిచందనతరువును నఱికినను, తనసుగంధమును దానికి యిచ్చునుకదా! ప్రాణహానిఁ దీసికొనివచ్చిన దానికిసహితమది సుగంధము నిచ్చును.

దోహా 62

"అందుచేత, శ్రీఖండము సర్వజనసమ్మత మయ్యెను; దేవతలు దానిని శిరస్సుపై ధరించెదరు; హితవుఁజేసినవృక్షమున కపకారముఁ జేయుటవలన, గొడ్డలికివచ్చినపాట్లుఁ జూడుము; దానిని నిప్పులోఁ గాల్చి, సుత్తితోఁ గొట్టుచుందురు కదా! ఈప్రకారమే సజ్జనులును దుర్జనులు నని గ్రహింపుము; ఖలులు సత్పురుషులకు దుఃఖము నిచ్చెదరు; అయినను, సజ్జను లెప్పుడును వారికి నుపకారముఁ జేయుచుందురు. దీనిఫల మేమి! సజ్జనులు స్వర్గమునకుఁ బోదురు; దుర్జనులు నరకకూపములలోఁబడి, కాలునిదండముచే దెబ్బలఁ దినుచుందురు.

చౌపాయి 36

"సత్పురుషులగుణముల వర్ణించెదను; వినుము; వారు విషయాసక్తులు కారు; సకలసుగుణ సుశీలసంపన్నులు; ఇతరుల సుఖముఁ జూచి సంతసించి, వారిదుఃఖముఁజూచి దుఃఖింతురు; వారు సమదర్శులు; వారికి శత్రువులు లేరు; ఈషణత్రయములు లేవు; అంతశ్శత్రువులబాధ వారికి లేదు; వారు జ్ఞానవిజ్ఞానవైరాగ్యసంపన్నులు; వారిచిత్తములు కోమలములు; దీనులయందు వారికి దయ మెండు; త్రికరణశుద్ధిగ వారు నాపాదములను సేవింతురు; వా రందఱను గౌర

వింతురు; వారికి మానావమానములు లేవు; ఈసజ్జనులు నాప్రాణముతో సమానులు; వారు పరోపకారులుకాని, స్వార్థపరులు కారు; వారు నిరంతరము నానామోచ్చారణముఁ జేయుచుందురు; వారు స్నేహపాత్రులు; వారి ప్రవర్తన సరళము; వారిహృదయములు శీతలములు; వారిశాంతము, వారినమ్రత, వారిత్యాగశీలముఁ గొనియాడవలెను; ఎప్పుడును వారికిసంతోషమే; వారు గోబ్రాహ్మణులను సేవించుచుందురు; వారు సదా ధర్మరతులు; లోకులకు వారియాచరణలు ప్రత్యక్షప్రమాణములు. ఓ తమ్ముఁడా! భరతుఁడా! ఈలక్షణముల నెవఁడుకలిగియుండిన, వాఁడు సత్పురుషుఁడని తెలిసికొనుము; పరుషవాక్యముల నుచ్చరింపరు; జితేంద్రియులు; శమము, దాంతము, శాంతము, సమత్వము-ఈగుణములకు వారు పుట్టినిల్లు; వారు నీతిమార్గమును విడిచిపెట్టరు; వారిమనస్సు నిష్కలుషము.

దోహా 63

"వారికి దూషణభూషణములు సమానము; వారు సదా నాచరణములను ధ్యానించెదరు; ఈసత్పురుషులు నాప్రాణములతో సమానులు; వారు సకలగుణధాములు; సుఖరాసులు; అని తెలిసికొనుము.

చౌపాయీ 37

"ఓ తమ్ముఁడా! దుర్జనులలక్షణములఁ జెప్పుచున్నాను; వినుము; వారిసాంగత్యము నన్నివిధముల విడిచిపెట్టవలయును; వారిసహవాసమువలన దుఃఖము ప్రాప్తించును; పోట్లు గొడ్డుతోఁగూడిన కపిలగోవు సహితము దెబ్బలఁదినును; పరులసంపదఁజూచి, వారిహృదయము లెప్పుడు పరితపించును; పరదూషణ విని, వారు సంపదవచ్చినట్లు తలంచి సంతోషించెదరు; అరిషడ్వర్గములు వారిని నాశ్రయించియుండును; ఆశ్రయులుచెప్పినట్లు వారు సంచరింతురు; వారు నిర్దయులు; కపటులు; కుటిలులు; పాపాత్ములు; కారణములేకయే పరులతో వారు కలహింతురు; ఉపకారముఁ జేసినవారితోసహా వారు విరోధించెదరు; వారిమాటలు, వారికార్యములు, వారిభోజనమును, నిచ్చిపుచ్చుకొనుటయు—సర్వమసత్యము; వారిమాటలుమాత్రము తియ్యగనుండును; కాని, వారిహృదయములు కఠోరములు; నెమలి పైకిజూచుటకుఁ జక్క

గనుండును; దానికేక విన సొంపుగనుండును; అయిన, నది పాములను భక్షించునుగదా! అటులనే, దుర్జనులని తెలిసికొనుము.

దోహా 64

"పరహింసాపరాయణులు; పరధనాపేక్షులు; పరదారాసక్తులు; పరనిందారతులు; ఈ పాపకర్ములు, పాపాత్ములు, పాపసంభవులు అయిన దుర్జనులు కేవలము రాక్షసులని తెలిసికొనుము. వీరు మనుజాధములు;

చౌపాయ్ 38

పరుపులనినను, దుస్తులనినను, వారికి నాశ హెండు; శిశ్నోదర పరులు; వారికి యమునిభయము లేదు; ఇతరు లభివృద్ధినొందుట విని, పసిఁబట్టినట్లు, వారు తలనొప్పిచే బాధపడుచుందురు; ఇతరులవిపత్తులఁ జూచి, వారు సంతసింతురు; పరులకష్టముల విని, దేశమునకు రాజయినట్లు వారు సంతోషింతురు; వారు స్వార్థపరులు; కామక్రోధాదులకు వారు పుట్టిల్లు; వీరు దుర్జనులని తెలిసికొనుము; తల్లిదండ్రులని, గురువులని, బ్రాహ్మణులని, వారికి లక్ష్యములేదు; పరులనుసహితము వారు దుర్మార్గములోనికి లాగి, వారిని భ్రష్టులఁ జేయుచుందురు; అజ్ఞానములోఁబడి, వారు పరులను బాధించెదరు; సత్పురుషులను, భగవంతుఁడనినను, వారికిఁ దలనొప్పివచ్చును. వారు మందమతులు; అవగుణధాములు; కామాంధులు; వేదములను దూషించెదరు; బ్రహ్మద్వేషులు; పరహింసాపరాయణులు; పరద్రోహాసక్తులు; పాషండులు; కపటస్వభావులు; దుష్టచిత్తులు; సజ్జనవేషమునుధరించిన లోకవంచకులు.

దోహా 65

"ఈనీచులు, దుర్మార్గులు, కృతయుగమునందు లేరు; త్రేతాయుగమునందు వారిప్రసంగము లేదు; ద్వాపరయుగములో నచ్చటచ్చట వారు కనఁబడుదురు. కలియుగములో నంతట వారిం జూడవచ్చును; ఈదుర్జనులు సమావేశమై, ఉపన్యాసముల నిచ్చుచుందురు.

చౌపాయ్ 39

"ఓ తమ్ముఁడా! పరోపకారముకంటె ధర్మము వేఱియొకటి లేదు; పరహింసకంటె నధికమగుపాపము లెదు; ఇదియే వేదపురాణ

ములసారము ; ఇదియే సత్పురుషులమతము ; మనుజుఁడై పుట్టి, పుర హింసఁజేయువాఁడు సంసారసాగరములోఁ బడియుండును ; చర్విత చర్వణముగ, వాఁడు నీచయోనులయందుఁబుట్టి చచ్చుచుండును ; మనుజులజ్ఞానాంధకారములోఁ బడి, యనేకపాపకార్యములఁ జేయుచుందురు; స్వార్థపరులై, ఇహలోకసౌఖ్యములయందుఁ దగిలి, వారు పరలోకమునకుఁ దూరస్థులగుచున్నారు ; అట్టివారికి స్వర్గము లేదు ; ఓ తమ్ముఁడా! అట్టివారికి నేను ప్రారబ్ధకర్మస్వరూపుఁడనై కాలాంతరమునఁ బ్రత్యక్షమగుచుందును ; అట్టివారిని సంసారములోఁ బడఁద్రోసి, వారి శుభాశుభకర్మఫలముల ననుభవింపఁ జేయుదును ; ఈసంగతులను లెస్సగ విచారించి, సంసారమే సకలదుఃఖములకు మూలమని తెలిసికొని, మహాత్ములు నాపాదములను సేవించి, నన్ను భక్తితోఁ గొలుచుచుందురు ; ఓ భరతుఁడా ! దేవతలును, మునులును, మహాత్ములును, శుభాశుభఫలముల నిచ్చునట్టికర్మములను విడిచిపెట్టి, సదా వారు నన్ను భక్తితో భజించెదరు ; వారు నిష్కామ్యముగ, కర్మముల నాచరించెదరు ; కామ్యతపస్సులను, కామ్యకర్మలఁ జేసినయెడల, వాని శుభాశుభఫలముల ననుభవించుటకు, దేహములను ధరించి, జీవులు సంసారములోనికి రావలెను ; ఏకర్మములఁ జేసినను, వానిఫలము నపేక్షింపక, వానినొనరించినయెడల, మనుజునకు జ్ఞానముకల్గును; భక్తికలుగును; వానిమూలమున వాఁడు ముక్తికిఁ బోవును.

("శ్లో. యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ." భ. గీ. ప్రమాణము.)

"ఈప్రకారము సజ్జనదుర్జనలక్షణములను నీకు విశదపఱచితిని ; ఈలక్షణములఁ దెలిసికొనినవాఁడు సంసారసాగరములోఁ బడి మునిఁగియుండఁడు.

దోహా 66

"ఓ తమ్ముఁడా ! అనేకవిధములగు సుగుణదుర్గుణములన్నియు మాయాసంకల్పితములని తెలిసికొనుము ; ఈ రెండుగుణములను లక్ష్యముఁజేయనివాఁడు సజ్జనుఁడు ; మహాత్ముఁడు ; ఈగుణముల రెండింటికిని వశుఁడగువాఁడు మూర్ఖుఁడు ; అదియే అజ్ఞానము."

చౌపాయ్ 40

ఈప్రకారము రాముఁడు తమ్ములకుబోధించి, విరమించెను; శ్రీరామునియుపదేశమును వారు విని, స్వాస్థ్యముఁ బొందిరి; వారి హృదయములు భక్తితో నుప్పొంగెను; మాటిమాటికి వారు రాముని దండప్రణామంబులు జేసిరి; అంపటికంటె నధికముగ హనుమంతుఁడు బ్రహ్మానందముఁ బొందెను. యనంతరము తమ్ములతోఁగూడి, హనుమంతునితో సహా, శ్రీరాముఁడు రాజమందిరమునకుఁ బోయెను; ఈ ప్రకారము శ్రీరామునిదినచర్య నడచుచుండెను; మాటిమాటికి శ్రీరామునిసందర్శించుటకు నారదాదిమహామునులు వచ్చుచుండిరి; వారు సదా శ్రీవారిచరిత్రను గానముఁజేయుచుండిరి; నిత్యము వారు రామునిచర్యలలోఁ గ్రొత్తవిశేషములఁ గనిపెట్టుచుండిరి; పిమ్మట నారదాదులు బ్రహ్మలోకమునకుఁ బోయి, యచ్చట రామకథను సభికులకుఁ దెలియఁబఱచుచుండిరి; ఆకథను బ్రహ్మాదిదేవతలు విని, పరమానందభరితు లయిరి; మాటిమాటికి రామకథఁజెప్పుమని వారు నారదుని వేఁడుకొనిరి; నారదునిసరసవచనములను సనకాదులు విని, యద్భుతపడిరి; ప్రతిదినమతనికి రామునిదర్శన మెటులసంభవించెనని యాశ్చర్యపడిరి; సనకాదులును, బ్రహ్మయు, నాత్మజ్ఞానపరాయణులయినను, రామునిచరిత్రమును విని, పరవశులయిరి; సమాధిని విడిచిపెట్టి, జ్ఞానాధికారులుసహితము రామకథను నిశ్చలభక్తితో వినుచుండిరి.

దోహా 67

జీవన్ముక్తులు, బ్రహ్మజ్ఞానపరాయణులుసహితము, ధ్యానమును విడిచి, యత్యాదరముతో రామకథను విని సంతసించుచుండిరి; సంసారములో నుండినమనుజుఁడు, కామాదులను విడిచి, రామకథను వినని యెడల, వానిహృదయము పాషాణమని తెలిసికొనుము.

చౌపాయ్ 41

ఒకదినమున శ్రీరాముఁడు పురజనులకును గురుబ్రాహ్మణులకును వర్తమానముఁ బంపెను; వారందఱు కొలువుకూటములో సమావేశమయిరి; వారు సుఖాసనముల నధిష్ఠించిరి; అప్పుడు వారింజూచి, శ్రీవారీవిధమున వారితోఁ బ్రసంగించిరి:—

"ఓ పురజనులారా! ఓ గురుబ్రాహ్మణులారా! మీకు నమస్కారము; నామాటలను శాంతముతో సాంతముగ వినుఁడు; స్వార్థపరుఁడనై, నేను దురభిమానముచే మీతోఁ బ్రసంగించుట కాదు; నేను మీరాజునని చెప్పుటకాదు; మిమ్ములను జెడుమార్గముల సంచరింపుమని బోధఁజేయువాఁడను కాను. నామాటలు మంచివని మీకుఁ దోఁచినయెడల, నాప్రకారము సంచరింపుఁడు; నామాటలను విని, వానిప్రకారము నడుచుకొనువాఁడే, నాసేవకుఁడు; నాదాసుఁడు; నా మిత్రుఁడు వాఁడే; ఓ తమ్ములారా! నేనొక తప్పుమాటఁజెప్పినను, మీరు వెనుకఁదీయక నాతప్పును నాకుఁజూపుఁడు; అన్నిజన్మముల కంటె నరజన్మము దుర్లభమని వేదపురాణములును మహాత్ములును జెప్పుచుందురు; ఎంతోపుణ్యముఁ జేసియుండినగాని, నరుఁడై పుట్టఁడు; అది దేవతలకుసహితము దుర్లభము; నరజన్మము మోక్షమునకు ద్వారము; సకలసాధనములకు రాధారిమార్గము.

దోహా 68

"ప్రారబ్ధకర్మమని, కాలధర్మమని, యీశ్వరేచ్ఛయని తలంచువారు పరలోకములో దుఃఖము ననుభవింతురు; "అయ్యో! మనము మోహావశులమయి చెడిపోతిమి" అని వారు నెత్తిఁగొట్టుకొని పలువిధముల దుఃఖింతురు; వారికోరికలు సిద్ధింపకఁబోయినను, వారు తలపెట్టినకార్యములు చెడిపోయినను, ప్రారబ్ధకర్మమనియు, ఈశ్వరునిదోషమనియు, కాలప్రభావమనియు, వారు దూషించెదరు. ఓ తమ్ములారా! ఇంతకంటెఁ బిచ్చితనము మఱియొకటి కలదా! ఏ పాపపుణ్యములనెఱుఁగని భగవంతుని దూషించుటకంటెఁ బాపము మఱియొకటి కలదా!

చౌపాయ్ 42

"ఓ తమ్ములారా! ఈశరీరము విషయభోగముల ననుభవించుటకుఁ గాదు; స్వర్గభోగముల ననుభవించుటకుఁ గాదు; ఇవియన్నియు క్షణభంగురములు; వీనిమూలమున మనుజుఁడు మరల సంసారములోనికి వచ్చును; అందుచేత నీభోగములన్నియు దుఃఖములకుఁ గారణములు; ఈ విషయభోగములయం దాసక్తికలవాఁడు మూర్ఖుఁడు; విషయములు విషమువంటివి; అమృతమును విడిచి, విషమునుగోరుట

తగునా? అటుల విషయమునుగోరువాఁడు మంచివాఁడు కాఁడు; చింతామణినివిడిచి, వాఁడు గాజుపెంకున కభిలషించినట్లు కనఁబడును; ఆ విషయాసక్తుఁడు, ఆ విషయజీవుఁడు, (జీవునకు నాశము లేనందున) కర్మానుసారము నానాయోనులయందుఁ బుట్టుచుండును; (84) లక్షల జీవరాసులు కలవు; ఆజీవుఁడు మాయకులోఁబడి భ్రమించును; కాల కర్మస్వభావగుణము లాజీవుని పట్టియుండును; అనేకజన్మాంతరములు గడచినతరువాత, నాజీవునికష్టములఁజూచి, పరమేశ్వరుఁడు కటాక్షించి, వానికి నరజన్మము నిచ్చును; నరజన్మమునకుఁ గారణము పరమేశ్వరుని నిర్హేతుకజాయమానకటాక్షమేగాని మఱియొకటి కాదు; సంసార సాగరమును దాఁటుటకు నరశరీరము పడవవంటిది; పడవ నీటిమీఁదఁ బోవుటకు గాలియుండవలెను కదా! సంసారసాగరముమీఁద శరీర మనునట్టిపడవను నా యనుగ్రహమనునట్టివాయువు నడిపించును; పడవను జక్కఁగ నడిపించుటకు చుక్కానివాఁ డొకఁడుండవలెను కదా! శరీరమనుపడవను నడిపించువారు సద్గురువులు; సద్గురువులు దొరికిన తరువాత, నాపడవ కష్టములేకయే దరిఁజేరును; ఏభయమును దానికి యుండదు; సద్గురువులు దొరుకుట దుర్లభము; కాని, వారు దొరికిన తరువాత నేకష్టము లుండవు.

దోహా 69

"నరశరీరమునుధరించినను, జీవుఁడు సంసారసాగరమును దాఁట లేకపోయినయెడల, వానివంటి దౌర్భాగ్యుఁడును, మందమతియు లేఁడు; వాఁడు వృథాగా భగవంతుని దూషించును; వానివంటి ఆత్మ ఘాతకుఁడు లేఁడు; అందుచేత, మనుజుఁడై పుట్టినవాఁడు, భగవంతుని భజింపవలయును; ఇందులకువిరుద్ధముగఁ బ్రవర్తించువాఁడు నరకకూపములలోఁబడి పరితపించును;

చౌపాయ్ 43

"ఓ తమ్ములారా! ఇహపరలోకసుఖముల ననుభవింపఁగోరిన వాఁడు నామాటలను లక్ష్యములోనిడికొని, వానిని మఱవక, వాని ప్రకారము సంచరించును; అన్నిమార్గములకంటె, సంసారమునుదాఁటుటకు భక్తిమార్గమే సులభము; మనోహరమయినది; భక్తిమార్గమే

శ్రేష్ఠమని వేదపురాణములుసహితము చెప్పుచున్నవి ; సంసారమును దాటుటకు జ్ఞానమార్గము కష్టము ; ఆమార్గమున ననేకవిఘ్నములు కలుగును ; జ్ఞానసాధనములు కఠినముగ నుండును ; మనోనిగ్రహము దుర్లభము ; అనేకకష్టములఁ బడి, జ్ఞానమార్గమున నొకఁడు నడచినను, వానికి భక్తిలేనియెడల, నాకు వాఁడు ప్రియుఁడు కాఁడు. భక్తివంటిది యొకటిలేదు ; దానికి స్వతంత్రము కలదు ; దానివలన సకలసుఖములు కలుగును ; సత్సాంగత్యము లేనియెడల, భక్తికలుగదు ; అనేకజన్మాంతరపుణ్యముఁ గలిగియుండినగాని, సజ్జనులదర్శనము లభింపదు ; వారి సాంగత్యము కలిగియుండినగాని సంసారమును దాటుట దుర్లభము ; పుణ్యమంతయు నొకటిగాని రెండుకాదు ; త్రికరణశుద్ధిగ బ్రాహ్మణుల సేవించుటయే పుణ్యము ; ఎవఁడు వారిని సేవించునో, వానింజూచి, దేవతలు ప్రసన్నులయ్యెదరు ; అందుచేత, నిష్కపటముగ బ్రాహ్మణులను సేవింపవలయును ; అంతకంటె గొప్పపుణ్యము లేదు.

దోహా 70

"ఓ జనులారా ! చేతులనుజోడించి మీకు నమస్కరించి, మఱియొకరహస్యముఁ జెప్పుచున్నాను ; వినుఁడు ; శివుని నారాధింపక పోయినయెడల, నాయందు భక్తికలుగదు ; అందుచేత, దప్పక శివుని నారాధింపవలయును ; శివకేశవుల కేవిధమగు భేదములేదని తెలిసికొనుఁడు; భక్తిమార్గమును మీకు జూపించితిని; అందులో నేకష్టములు కలవో మీరు చెప్పవలయును ! ఆమార్గములో నేకష్టములు లేవు కదా ! యోగము, యజ్ఞము, జపము, తపము, వ్రతము—ఈ మొదలగునవి చేయనవసరము లేదు ; సత్స్వభావము, నిష్కలుషచిత్తము, ప్రాప్తించినదానితో సంతోషించుట—ఇవి సులభములు కదా ! నా భక్తులమని ప్రగల్భములుపలుకుచుఁ, బరులను విశ్వసించువారు నా భక్తు లెట్లు కాఁగలరు ? ఇతరచింతలనువిడిచి, ఇతరుల నపేక్షింపక, మనోవాక్కర్మములచేఁ గేవలము నన్నే భజించువారు నాసేవకులు, నాదాసులు కాని తదితరులు కారు ; ఓ తమ్ములారా ! వేయేల ? నన్నీవిధమున భజించినయెడల, నేను స్వాధీనము కాఁగలను; వైరమును విగ్రహమును విడిచిపెట్టవలయును ; ఆశగాని భయముగాని యుండరాదు;

ఎల్లప్పుడు చిత్తము సమముగనుండవలయును; కార్యములయం దాసక్తియు, గృహాదులయం దనురాగము, శరీరమునం దభిమానము - ఇవి యుండఁగూడదు; ద్వంద్వములచే మనోఖేదముఁ బొందరాదు. రోషము, క్రోధము మొదలగువానిని విడిచిపెట్టవలయును; దాక్షిణ్యము, నిపుణత, విజ్ఞానము - వీనిని కలిగియుండవలెను; సదా సత్సాంగత్యముఁ జేయవలెను; విషయభోగములను, స్వర్గమును, మోక్షమును సహితము తృణమువలెఁ జూడవలయును; దృఢమగు భక్తి యుండవలెను; దురాచారముల విడువవలయును; ఏపురుషులసహవాసము వలన దుఃఖముకల్గునో వారిసహవాసము విడిచిపెట్టవలయును; కాష్ఠవాదముఁ జేయఁగూడదు.

దోహా 71

"నాయందు భక్తికలిగి, నానామమును సదా ధ్యానింపవలయును; నాగుణములను గానముఁ జేయవలెను; మమకారము, మదము, మోహము మొదలగువానిని విసర్జింపవలెను; అట్టిమనుజుని సుఖమునకే బ్రహ్మానందమని చెప్పుచున్నారు." అని శ్రీరాముఁడు స్వయము పురజనులకు హితోపదేశముఁ జేసిరి.

చౌపాయ్ 45

శ్రీరాముని యమృతోపమానమగు వచనములను విని, పురజనులు శ్రీరామచరణములకు శిరస్సులవంచుకొని నమస్కరించిరి; "ఓ స్వామీ! నీవే తల్లివి తండ్రివి; నీవే గురుఁడవు సఖుఁడవు; సోదరుఁడవు నీవే; సర్వము నీవే; ఓ కృపానిధీ! మాప్రాణములకంటె, నీమీఁదనే మాయాశ యెండు; నీమూలమున మాశరీరములు దృఢముగనుండెను; మాకు ధనము పుష్కలముగఁ గలదు; మాగృహములలో నిత్యమంగళములు జరగుచుండెను; ఇదియంతయు నీప్రభావము; అన్నివిధముల మాదుఃఖములఁ బోఁగొట్టి, మమ్ములఁ దరిజేర్చితివి; ఓ మహారాజాధిరాజా! నీవుతప్ప, మాకు నీవలె బోధించువా రెవరు? నీవు కాఁబట్టి మాయందు గలదయచే, నీవిధమున నుపదేశించితివి; మా తల్లిదండ్రులు స్వార్థపరులుకాని మఱియొకటి కాదు; మావలన నీకుఁ బ్రయోజనము లేదు; నీకు స్వప్రయోజనము లేదు; మేము పరలోక

మునకుఁ బోఁదగినట్లు, మమ్ములను శిక్షించితివి; అదియే మాకుఁజా లును; ఓ రాక్షసాంతకా! నీవును నీసేవకులును లోకమున కుపకారులు; మీ రుభయులుతప్ప మఱియొకరు లేరు; లోకములోని స్నేహితులం దఱును స్వార్థపరులు; పారమార్థికచింతతో స్నేహముఁజేయువారు కనఁబడరు; స్వప్నమందయిన నట్టిమిత్రులఁ జూడలేము;" అని వారు విన్నవించిరి. వారివిన్నపమును విని, శ్రీరాముఁడు ప్రసన్నుఁడయ్యెను; శ్రీవారిసెలవుఁ గైకొని, వారు స్వగృహములకుఁ బోయిరి; శ్రీవారి ప్రసంగమును స్మరించుచు, వారు నిష్క్రమించిరి.

దోహా 72

ఓ పార్వతీ! అయోధ్యలోని స్త్రీపురుషులు పుణ్యాత్ములు; పుణ్యస్వరూపులు సుమీ! ఎందుచేత? సచ్చిదానందమూర్తి యగు పరబ్రహ్మము వారిం బరిపాలించుటచేత సుమీ! వారిలోనెవరు కృతార్థులు కారు?

చౌపాయ్ 46

ఒకదినమున సకలసుఖధాముఁడగు శ్రీరామునిసందర్శించుటకు వసిష్ఠుఁడు రాజమందిరమునకు వచ్చెను; అర్ఘ్యపాద్యమధుపర్కములనిచ్చి, శ్రీరాముఁ డతనిని సత్కరించెను. ఆమునిరాజు చేతులజోడించి, "హే కృపాసింధూ! నామనవియొకటి కలదు; నన్నుఁ గటాక్షింపుము; మీ లీలామానుషచర్యలఁ గన్నులారఁ జూచుచుంటిని; నామనస్సులో నొకగొప్పసందేహముఁ బుట్టెను; నీప్రభావ మపారము; వేదములకుసహితము నీసంగతి బాగుగఁ దెలియదు; ఓ స్వామీ! నేను నిన్నెటుల వర్ణింపఁగలను? పురోహితకర్మ నీచమయినది; వేదపురాణశాస్త్రములు పురోహితవృత్తిని దూషించుచున్నవి; యజమానుని శుభాశుభకర్మఫలములలో సగము పురోహితునివంతుకు వచ్చును; కనుక, నది దూష్యము. మొదట నీపురోహితకర్మను స్వీకరించుటకు నేను సమాధానపడలేదు; అప్పుడు బ్రహ్మ నన్నుఁజూచి, 'నాయనా! నీకు రాఁబోవుసంగతి తెలియదు; తప్పక నీ వాపనినిఁ జేయుము; అందువలన, ముస్ముందు నీకు లాభముకలుగును; పరబ్రహ్మము రఘు

కులమునం దవతరించును' అని నొక్కి-చెప్పి, న న్నాపనికి మొదలుపం చెను; అందుచేత, దానికి నే నొడంబడితిని.

దోహా 73

"ఏసత్పదార్థముం బొందుటకు, యోగ, యజ్ఞ, జపతపములు మొదలగువానిం జేయుచుందురో, నేనా సత్పదార్థమును, వానిం జేయకయే, సులభముగ బొందఁగలను; ఈసత్కర్మలకుఁ బరమార్థమే లక్ష్యము; ఇంతకంటె నేమంచిమార్గమును నే ననుసరింతును?

చౌపాయ్ 47

"ఓ దేవాదిదేవా! జపములు, తపములు, యజ్ఞములు, నియమములు, వ్రతములు—ఇవియన్నియు వేదవిదితకర్మములు; జ్ఞానము, భూతదయ, దమము, తీర్థస్నానము, వేదాధ్యయనము, శిష్టాచారప్రవర్తన, పురాణేతిహాసశ్రవణపఠనమననములు, వానిని లిఖించుటయు— ఓ రక్షకా! వీనివలన నొకటేఫలము కలుగును; వీనిమూలమున, నీ పాదారవిందములయందు నిరంతరభక్తి కలుగును; ఈభక్తికలుగుటయే సకలసాధనములయొక్క-ఫలము; ఓ బ్రహ్మాండనాయకా! మలినము మలినమును బోఁగొట్టఁగలదా? నీటిని దఱచుటవలన ఘృతముపుట్టదు కదా! ప్రేమయు భక్తియనునట్టి జలముచేతనుగాని, హృదయమాలిన్యము నిర్మోచనము కాదు; నీ చరణారవిందములయందు నిరంతర భక్తి గలవాఁడే సర్వజ్ఞుఁడు, ఆత్మజ్ఞాని, పండితుఁడు; వాఁడే గుణజ్ఞుఁడు; అఖండవిజ్ఞాని వాఁడే; వాఁడే చతురుఁడు; వాఁడే సకలలక్షణ సంపన్నుఁడు;

శ్లో. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని,
శునిచైవ శ్వపాకేచ బ్రాహ్మణాః సమదర్శినః. అని ప్రమాణము.

దోహా 74

"ఓ నాథా! నేనొకవరముఁ గోరెదను; తమరుకటాక్షించి దయచేయుఁడు; ఎన్నిజన్మములనెత్తినను, నీ పాదారవిందములయందు భక్తి, తక్కు-వకాకుండ నుండుఁగాక." అని వసిష్ఠుఁడు శ్రీవారినిఁ బ్రార్థించెను.

చౌపాయ్ 48

పిమ్మట శ్రీరామునియనుజ్ఞఁ గైకొని, వసిష్ఠుఁడు స్వగృహామునకుఁ బోయెను; శ్రీవారు పరిపూర్ణప్రసన్నులయి యుండిరి; సేవకులకు సుఖమునిచ్చు భగవంతుఁడు సోదరులతోను హనుమంతునితోఁగూడి వెడలి, నగరబహిఃప్రదేశమునకు వచ్చి, చతురంగబలములను వీక్షించెను; శ్రీవారు వారింజూచి ప్రసన్నులయి, వారినిఁ గొనియాడి, యెవరు కోరినపదార్థములను వారికిఁ బంచిపెట్టిరి. సకలజనులశ్రమలను నివారింపఁగలిగినప్రభువు శ్రమచే నలసి, సోదరులతోను హనుమంతునితోఁ గలసి, యొకమామిడితోటలోనికిఁ బోయి, దాని చల్లనినీడలో విరమించెను;

(ప్రథమమున, పార్వతి తొమ్మిదిప్రశ్నలను శివుని నడిగెను.

"ప్రథమ సో కారణ కహో విచారీ,
నిర్గుణ బ్రహ్మ సగుణ వపు ధారీ."

అని యామె మొదటిప్రశ్న; ఇదిమొదలు నాలుగుప్రశ్నలకుఁ బ్రత్యుత్తరములు బాలకాండలోను, అయిదవప్రశ్న కయోధ్యకాండలోను, ఆఱవప్రశ్న కారణ్య - కిష్కింధ - సుందరకాండలలోను, ఏడవప్రశ్నకు యుద్ధకాండలోను, ఎనిమిదవప్రశ్న కుత్తరకాండప్రారంభమునఁ బట్టాభిషేకమహోత్సవమునను—ఈప్రకారము శివుఁడు వానికి సమాధానముఁ జెప్పెను;

"ప్రజాసహితరఘువంశమణి
కిమి గవనే నిజధామ"

అని యామె తొమ్మిదవప్రశ్నకు సమాధాన మీ 'చౌపాయీ' లోఁ జెప్పఁబడెను; శ్రీరాములవారు పరమపదమునకు విజయముఁజేసిరని స్ఫుటముగఁ జెప్పినందున, నామాట వారియుపాసకులకుఁ బ్రతికూలముగనుండునని తులసీదాసుగారు తలంచి, యావిషయమును సందిగ్ధముగ నిటులవ్రాసిరి; ఇంతటితోఁ బార్వతిప్రశ్నలకుఁ బ్రత్యుత్తరములు సమాప్తమయ్యెను; ఆ 'చౌపాయ్' ప్రత్యక్షార్థమువిూఁద వ్రాయఁబడెను; దానిగూఢార్థ మేమనిన, "సకలజీవులశ్రమను నివారణఁజేయఁగలిగినప్రభువు శ్రమపడి, సోదరులతోను సేవకులతోను బుర

జనులతోను జతురంగబలములను వీక్షించి, స్వేచ్ఛానుసారము వారు కోరినకోరికల నీడేర్చి, చల్లనిపరంధామమునకు వెళ్లెను.

"హారణ సకల శ్రమ ప్రభు శ్రమ పాఈ
గయే జహా శీతల అమరాఈ.")

ఆ మామిడితోటలో నేలమీఁద భరతుఁడు స్వంతఅంగవస్త్రముఁ బఱచెను; దానిమీఁద శ్రీవారు సుఖాసీనులయి యుండిరి; సోదరులందఱు వారిని సేవించుచుండిరి; హనుమంతుఁడు చల్లఁగఁ జామరము వీచుచుండెను; హనుమంతునిశరీరము పులకరించెను; అతనినేత్రముల నుండి, యానందబాష్పములు కారెను; శ్రీవారిచరణారవిందములను సేవించునంతటిభాగ్యము కలిగినవారిలో, హనుమంతునివంటి యదృష్టవంతుఁడు మఱియొకఁడు లేఁడు. ఓ పార్వతీ! అతనిప్రేమను భక్తియుఁ జూచి, సంతసించి, దేవరవారు స్వయముగ వాయుపుత్రుని స్తుతించిరి.

దోహా 75

ఆసమయమున, నారదుఁడు స్వీయవీణెను మీటుచు, శ్రీరాముని దర్శించి, వారినామమును గీర్తించెను.

చౌపాయ్ 49

"ఓ పంకజలోచనుఁడా! నీ నిర్హేతుకజాయమానకటాక్షమును నాయందుఁ బ్రసరింపుము; ఓ కృపానిధీ! సంసారమోహమును నీ కటాక్షమే హరించును; ఓ రామా! ఓ మేఘశ్యాముఁడా! ఓ హరీ! భ్రమరమువలె, నీవు శివునిహృదయకమలమునందు సదా నివసించెదవు; ఓ రాక్షసాంతకుఁడా! మునులకును సజ్జనులకు నానందము నిచ్చెదవు; నీకటాక్షమే, పాపములను బోఁగొట్టును; బ్రాహ్మణులను నట్టి నూతనవరిచేనులకుఁ గాలమేఘమువంటివాఁడవు; రక్షకులులేని వారికి రక్షకుఁడవు; ఆర్తశరణ్యుఁడవు; ఓ దీనరక్షకా! నీ భుజబలముచే దుష్టులనుశిక్షించి, భూభారమును హరించితివి; ఖర, దూషణ, విరాధవధపండితుఁడవు; ఓ రావణాంతకరామా! ఓ ఆనందస్వరూపుఁడా! ఓ సకలభూపాలమౌళీ! ఓ రఘుకులకుముదచంద్రమా! నీ మాహాత్మ్యమును వేదపురాణేతిహాసములు ఘోషించుచుండును; దేవతలు,మునులు,సత్పురుషులు—వీరిసమాజములలో నీగుణములు కీర్తనఁ

జేయఁబడును; ఓ కరుణానిధీ! ఓ వాలిమదమర్దనుఁడా! ఓ కోసలదేశ చూడామణీ! నీ కన్నివిధముల కుశలమగుఁగాక! ఓ నాథా! నీ నామోచ్చారణవలన, సకలకలియుగపాపములన్నియు నశించును; తులసిదాసువంటి దీనునిరక్షింపుము" అని నారదుఁడు స్తుతించెను.

దోహా 76

అదృష్టవంతుఁ డగునారదుఁడు భక్తిశ్రద్ధలతో భగవంతుని స్తుతించి, నామకీర్తనముఁ జేసి, వారిరూపమును హృదయమునందు నిలుపుకొని, యాడుచుఁ బాడుచు, బ్రహ్మలోకమునకుఁ బోయెను.

రాగము:—— తాళము:——

పల్లవి: రామ - నామకీర్తనేన - ధన్యోహం,
తవ - నామకీర్తనేన - ధన్యోహం.

# చతుర్థవిశ్రామము.

చౌపాయ్ 50

"ఓ పార్వతీ! ఈ యుజ్జ్వలమగు రామకథను వినుము; నా బుద్ధికిఁ దోఁచినవిధమున దానిని నీకుఁ జెప్పియుంటిని; రామునిచరిత్రలు కోటానఁగోట్లు కలవు; అవి యపారములు; వేదములయినను, సరస్వతియయినను వానిని తుదముట్ట వర్ణింపఁజాలదు; ఇఁక మఱియెవరు చెప్పఁగలరు? రామునిగుణములును, నతని లీలావతారచర్యలు ననంతములు; జలబిందువులను, పృథివిరేణువులను లెక్కపెట్టవచ్చును; కాని, రామునిగుణములనుమాత్రము గణింపలేము. ఈ చక్కనిరామకథను విని నందువలన, రామునిచరణములయందు భక్తికల్గును; పునరావృత్తిలేని రామునిపరంధామము సంప్రాప్తమగును; ఓ పార్వతీ! కాకభుశుండి గరుత్మంతునకుఁ జెప్పినవిధమున, నేను రామకథను నీకు వినిపించియుంటిని; రామునిగుణములలో నొకసహస్రాంశముమాత్రమే

నీకుఁ జెప్పినాను; ఇఁక నేమిజెప్పుమని కోరెదవు?" అని శివుఁ డామె నడిగెను. రామకథను పార్వతి విని, ప్రసన్నురా లయ్యెను; పిమ్మట, నామె శివునకు నమస్కరించి, "ఓ నాథా! ఓ కృపాసాగరా! మీ దయవలన నేను గృతకృత్యురాల నయితిని; నామోహమంతయు విడి పోయెను; ఓ ప్రభువా! ముచ్చుముమ్మాటికిని నేను ధన్యురాలను; సంసారభయముఁ బోఁగొట్టు రామకథను విని, సంతోషము కలిగెను.

దోహా 77

"ఓ నాథా! మీకృపవలన సర్వముఁ దెలిసికొంటిని; రాముని ప్రభావము కనుఁగొంటిని; సచ్చిదానందస్వరూపుఁడనియుఁ దెలిసికొంటిని" అని పార్వతి చెప్పెను.

చౌపాయ్ 51

"ఓ స్వామీ! ఎవరు రామునిచరిత్రమును విని, తృప్తులు కాఁ గలరో, వారు సరసులుకారని నా యభిప్రాయము; భగవంతునిగుణము లను నిత్యము వినునట్టిసజ్జనులు జీవన్ముక్తులు; సంసారసాగరమును దాఁ టఁగోరినవారికి రామకథ దిట్టమగు పడవవంటిది; కేవలము లౌకికపురు షులకుసహితము శ్రీహరికథలు శ్రవణానందముగను మనోహ్లాదముగ నుండును; చెవులుకలవాఁ డెవ్వఁడయ్యా రామకథనువినుట కభిలాష పడఁడు? రామకథను వినుటకుగాని విని యానందించుటకుగాని నోము నోచుకొననివాఁడు నౌర్భాగ్యుఁడు; మందమతి; ఆత్మఘాతకుఁ డని నా యభిప్రాయము; ఓ స్వామీ! నీవు రామకథఁ జెప్పుచుండ, నేను దానిని విని పరమానందభరితురాల నయితిని; నీవు చెప్పిన రామ కథను గాకభుశుండి గరుడునకు వినిపించెను.

దోహా 78

"ఓ నాథా! కాకశరీరమును ధరించినవానికి జ్ఞానము, విజ్ఞా నము, వైరాగ్యమును, రాముని చరణకమలములయందు నిశ్చల భక్తియు, యెటులకలిగెనో నాకు సందేహము కల్గుచున్నది; నాసందే హమును విడఁగొట్టుము.

చౌపాయ్ 52

"ఓ స్వామీ! ఒకవేయిమందిలో నొకఁడు ధర్మముల నాచరిం చును; ఒకకోటిమందిలో నొకఁడు, విషయవిముఖుఁడై, వైరాగ్య

యుక్తుఁ డగును; ఒకకోటివిరక్తులలో నొకనికి యథార్థజ్ఞానము కలుగును; ఒకకోటిజ్ఞానులలో నొకఁడు జీవన్ముక్తుఁ డగును; అనేకసహస్ర జీవన్ముక్తులలో నొకఁడు విజ్ఞానియై బ్రహ్మలో నైక్యమగును; ధర్మశీలురును, జ్ఞానులును, విరక్తులును, జీవన్ముక్తులును, బ్రహ్మపరాయణులును - వరుసగ వీరిలో నొకరికంటెనొకరు శ్రేష్ఠులు; ఓ దేవరాజా! మదమాయారహితుఁడును రఘునాథునిపాదారవిందములఁ గొల్చువాఁడును - వీరందఱకంటె నధికుఁడని నా యభిప్రాయము; ఓ విశ్వనాథా! కాకికి హరిభక్తి యెట్లు కలిగెను? ఈవిషయము నాకు బోధించి చెప్పుము.

దోహా 79

"ఓ నాథా! హరియందు భక్తియు, జ్ఞాననిష్ఠయు, సకలగుణములును, నిశ్చలమనస్సును నెటు లామహాత్మునకు గలిగెను? ఎందుచేత నతఁడు కాకిశరీరమును ధరించియుండెను? ఈసందేహములను వీడఁ గొట్టుము.

చౌపాయ్ 53

"పరమపవిత్రమయిన శ్రీరాముని మనోహరమగుచరిత్రను గాకభుశుండి యెటులఁ దెలిసికొనెనో చెప్పుము. ఓ మదనమర్దనుఁడా! ఎవరి వలన నీప్రకార మీచరిత్రను నీవు వినియుంటివో, నేను వినఁగోరుచున్నాను; చెప్పుము. గరుత్మంతుఁడు గొప్పజ్ఞాని; సకలగుణరాశి; హరిదాసులలో నొకఁడు కదా! మహాత్ములనువిడిచి, కాకివద్దకు, రామకథను వినుట కతఁ డెందుకువెళ్లెను? కాకభుశుండియు, గరుడుఁడును హరిభక్తులు; ఆ యిరువురసంవాద మెటులజరగెనో తెలియఁజేయుము" అని పార్వతి శివుని యడిగెను; పార్వతియొక్క నిర్మలమగు వాక్సుధారసమును శివుఁడు త్రాగి పరమానందభరితుఁడై, యిట్లు చెప్ప నారంభించెను:—"ఓ సతీ! ధన్యురాలవు; ముమ్మాటికిని ధన్యురాలవు; నీబుద్ధి దృఢమయినది; రామునిచరణారవిందములయందు నీకు దృఢమగుభక్తి కలదు; ఈ పరమపవిత్రమగు రామకథను వినుము; దానిని వినినందువలన, శోకమోహములు నశించును; దానివలన, రామునిపాదారవిందములయందు భక్తికలుగును; దానిమూలమున, వినాయాసముగ సంసారసాగరమును దాఁటవచ్చును.

దోహా 80

"నీవు నన్నడిగినప్రశ్ననే, పక్షిరాజు కాకభుశుండిని యడిగెను; ఓ పార్వతీ! అత్యుత్సాహముతో, దానికిఁ బ్రత్యుత్తరము నిచ్చెదను; మనమును స్వాస్థ్యముఁజేసికొని, భక్తిశ్రద్ధలతో వినుము.

చౌపాయీ 54

"ఓ భవభయమోచనీ! ఓ సుందరముఖి! నేను రామకథను వినినప్రకారము నీకుఁ జెప్పుచున్నాను, వినుము; నీవు పూర్వజన్మమున దక్షునికూఁతురవు; అప్పుడు నీపేరు సతి; కొంచెము నీకది జ్ఞాపకముండవచ్చును; దక్షునియజ్ఞములో నా కవమానము జరగినందున, కోపముచే నీవు నీదేహమును విడిచిపెట్టితివి; నాసేవకులు వెళ్లి, యాయజ్ఞమును ధ్వంసముఁ జేసిరి; అవియంతయు నీకుఁ దెలిసియేయుండును; ఓ ప్రియురాలా! నీమరణమువలన విచారించితిని; నీవియోగమువలన నాకు విశేషదుఃఖము కలిగెను; చక్కనిపర్వతములను, నదులను, వనములను, ప్రకృతిసంపదలఁ జూచుచు, నేకాకినై, యోగివలె సంచరించుచుంటిని; సుమేరుపర్వతమున కుత్తరదిశయం దొకనీలపర్వతము కలదు; అది మంచి చక్కనిపర్వతము; దానికి నాలుగు బంగారు శృంగములు కలవు; ఆప్రదేశము నామనస్సున కింపుగఁ గనఁబడెను; ఒక్కొక్కశృంగముపై, నొక్కొక్కవృక్షము కలదు; పిప్పల (రావి), శమీ, వట, రసాలవృక్షములు వరుసగనుండెను. ఆపర్వతముపై నొక సుందరమగు సరోవరము కలదు; దానికి రత్నఖచితమగు సోపానములుండెను; దానింజూచి నామనస్సు పరమానందభరిత మయ్యెను.

దోహా 81

"ఆ సరోవరజలములు నిర్మలములు; శీతలములు; మధురము; దానిలో ననేకరంగులురంగులకమలము లుండెను; వానిపై హంసలు నిలువఁబడి, మధురముగ ధ్వనులఁ జేయుచుండెను; తుమ్మెదలఝుంకారము వినఁబడెను.

చౌపాయీ 55

"ఈపర్వతముపై నొకకాకి నివసించియున్నది; అనేక కల్పాంతములనుండి జీవించియున్నది; మాయతోసంబంధించిన గుణదోషము

లును, కామక్రోధాదులును, అవివేకమును—జగత్తులో వ్యాపించి యుండిన మాయగుణము లేవియు నాపర్వతమును స్పృశింపవు; ఓ పార్వతీ! ఆపర్వతముపై నివసించి, కాకి, తదేకధ్యానముతో నారాయణుని భజించుచుండును; దానిచరిత్రఁ జెప్పుచున్నాను, వినుము; దిక్కులఁజూడక సావధానముతో నాలకింపుము; కృతయుగములో నాకాకి రావిచెట్టుక్రిందఁ గూర్చుండి, ధర్మానుసారముగ భగవంతుని ధ్యానించెను; త్రేతాయుగములో శమీవృక్షముక్రిందను జపయజ్ఞముల నాచరించెను; ద్వాపరయుగధర్మము ననుసరించి రసాలవృక్షముక్రిందనుండి, మానసికముగ భగవంతుని ధ్యానించెను, కలియుగధర్మానుసారముగ, వటవృక్షముక్రిందనుండి, హరికథలఁ జెప్పుచుండును. నే నచ్చటికి వెళ్లినసమయమున నది వటవృక్షముక్రిందనుండి, రామకథను జెప్పుచుండెను; అప్పుడు కోటానఁగోట్లు పక్షులువచ్చి, తదేకధ్యానముతో రామకథను వినుచుండెను; శ్రీరామచంద్రుని చిత్రవిచిత్రకథలను కాకభుశుండి గానముఁ జేయుచుండెను. హంసలన్నియు సావధానముగ నా రామకథను వినుచుండెను; ఆహంస లాసరస్సులో నివసించియుండును; నే నాసమాజముఁ జూచి, యానందపరవశుఁడ నయితిని.

దోహా 82

"ఆ సమయమునకుఁ దగినట్లు, నేనొక హంసరూపమును ధరించి, యాసమాజములోనికి వెళ్లి, రామకథను. జెవులార విని, పిమ్మటఁ గైలాసమునకు వచ్చితిని.

చౌపాయ్ 56

"ఓ పార్వతీ! నేను కాకభుశుండివద్దకు వెళ్లి, రామకథను వినుటకుఁ గారణముఁ జెప్పియుంటిని; ఇఁక నతనివద్దకు గరుత్మంతుఁడు వెళ్లి, రామకథనంతయు వినినందుకుఁ గారణముఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము. శ్రీరామునిరణకౌతుకముఁ జెప్పుటకు, నేను కొంచెము సిగ్గుపడవలసి వచ్చును; అంతటి రాముఁడుసహితము మేఘనాదుఁడు ప్రయోగించిన నాగాస్త్రములకుఁ గట్టుపడియుండెను కదా యని సిగ్గువేయును! రాముని నాగపాశములనుండి విడిపించుటకు,

నారదుఁడు గరుత్మంతునిఁ బంపించెను. పక్షిరాజు వచ్చి, రాముని విడిపించెను; కాని, వైనతేయునకు మనస్సులో విషాదము పుట్టెను. అనేక ప్రకారముల నతఁడు రాముని బంధనమును గుఱించి చింతించి భ్రమఁ జెందెను. "సచ్చిదానందస్వరూపుఁడు, పరబ్రహ్మము, వాగీశ్వరుఁడు, మాయాతీతుఁడు, పరమేశ్వరుఁడు, రఘుకులములో నవతరించెనని విని యుంటిని గదా! అనేకబంధనములను విడిపించుట కతనికి శక్తి కలదు కదా! అతఁ డీనాగపాశములను విడిపించుకొనలేక పోయెనే? అతని ప్రభావ మేమయ్యెను?

### దోహా 83

"అతనినామమునుస్మరించి, మనుజులు సంసారబంధములనుండి తప్పించుకొనఁ గలరు; ఒకపక్షివంటినిశాచరుఁడు కట్టినకట్ల నతఁడు విడిపించుకొనలేకపోయెనే? ఈశ్వరుఁ డతఁ డెట్లు కాఁగలఁడు?" అని పక్షిరా జనేకప్రకారముల చింతించెను.

### చౌపాయి 57

"ఓ పార్వతీ! అతఁ డెన్నివిధముల సమాధానముఁ జేసికొనినను, మనస్సునకు శాంతము లేకపోయెను; అతనికి భ్రమపోలేదు; అతఁడు ఖేదముఁబొంది, పలువిధముల దుఃఖించెను; అతఁడు మనస్సులో నెంత తర్కించుకొనినను, అతనిమనస్సునకు స్థిమితము లేకపోయెను; నీవలె నతఁడుకూడ మోహముఁ జెందెను; అతఁడు వ్యాకులపడి, నారదునితో సందేహములన్నియుఁ జెప్పెను. అతనివిచారమును నారదుఁడు చూచి విచారించి, కనికరించి, "ఓ గరుత్మంతుఁడా! రఘునాథుని మాయ ప్రబలము; అతనిమాయ జ్ఞానులచిత్తమునుసహితము భ్రమింపఁజేయును; బలవంతముగ వారిని మాయవలలో వేసికొనును; ఆ మాయ నన్ననేకపర్యాయము లాడించెను; అదియే, ప్రస్తుతము నీచే గంతులువేయించుచున్నది. ఓ పక్షిరాజా! నీమనస్సులో గొప్పయజ్ఞానము పుట్టెను; అది నామాటలవలనఁ బోదు; కనుక, నీవు బ్రహ్మవద్దకు బొమ్ము; అతఁడుచెప్పినప్రకారము నడచుకొనుము." అని నారదుఁడు బోధించెను.

దోహా 84

"ఈప్రకారము నారదుఁడు బోధించి, 'రామనామకీర్తనేన - ధన్యోఽహం' అని గానముఁజేయుచు, నిష్క్రమించెను. నారదుఁడు పరమచతురుఁడు; కనుక, నారాయణునిమాయను వర్ణించుచు, నిష్క్రమించెను.

చౌపాయీ 58

"పిమ్మట గరుత్మంతుఁడు బ్రహ్మవద్దకు వెళ్లి, తనసందేహముల నతనితో విన్నవించెను. అతనిమనోవ్యాకులమును బ్రహ్మ గ్రహించి, రామునకు నమస్కరించెను; రాముని ప్రభావమును బ్రహ్మ స్మరించి, పరమానందభరితుఁ డయ్యెను. 'ఆహా! కవులును, బండితులును, జ్ఞానులుసహితము మాయకు వశ్యులుకదా! ఏమి దాని ప్రభావము! భగవంతుని మాయకదా! ఏమిచిత్రవిచిత్రములఁ జేయును! ఆమాయ నన్నేకపర్యాయము లాడించెను; చరాచరజంతుజాలమును సృజించిన నేనే దానివలలోఁ జిక్కితినికదా! ఇఁక నీపక్షిరాజుమాట చెప్పనేల?' అని బ్రహ్మ తనలోఁదాను తర్కించుకొని, గరుత్మంతునిఁ జూచి, 'ఓ పక్షిరాజా! పరంధాముఁడు, పరమాత్ముఁడు, పరాత్పరుఁడు నగుశ్రీరాముని ప్రభావము సంపూర్ణము మహాదేవశంభునకుఁ దెలియును; నీ వతనిసన్నిధానమునకుఁ బొమ్ము; నీవు మఱియొకరితోఁ బ్రశంసింపకుము; అతఁడు తప్పక నీసందేహములను నీడఁగొట్టును.' అని చెప్పెను; ఆవెంటనే, నాగాంతకుఁడు బయలువెడలెను.

దోహా 85

"ఓ పార్వతీ! అతియాతురతతో నతఁడు నావద్దకు వచ్చెను; అప్పుడు నిన్ను కైలాసపట్టణములో విడిచి, నే నొంటరిగఁ గుబేరునిఁ జూచుట కతనిపట్టణమునకుఁ బోవుచుంటిని.

చౌపాయీ 59

"ఓ యుమా! అతఁడు నాపాదములకు మ్రొక్కి, తనసందేహములను నాతోఁ జెప్పెను; అతఁడు మహాభక్తుఁడు; కాలవశమున నతఁడు మోహమునకు వశ్యుఁడయ్యెను; అతని చక్కనిమాటలను విని, యతనిని నే నాదరించి, 'రా వైనతేయా! నన్ను నీవు మార్గములోఁ

గలిసికొంటివి; నీసందేహములనెట్లు వీడఁగొట్టఁగలను? కొంతకాలము నీవు మహాత్ములసాంగత్యముఁ జేసినకాని, నీసందేహములు వీడవు; అనేకవిధముల వారు భగవంతునిలీలావతారములను వర్ణించెదరు; వానిని నీవు తప్పక వినవలెను; ఆకథల యాదిమధ్యావసానములన్నియు పరంధాముఁడగు శ్రీరాముని చర్యలను వర్ణించును; కనుక, ఓయీ తమ్ముఁడా! నిన్నొకస్థలమునకుఁ బంపుచున్నాను; అచ్చట నిరంతర మహోరాత్రములు రామకథ జరగుచుండును, నీ వచ్చటికిఁ బోయి, దానిని వినినయెడల, నీసందేహములు విడిపోవును; నీకు రామునిచర చారవిందములయందు భక్తి దృఢమగును.

దోహా 86

"'సత్సాంగత్యమువినా నారాయణునికథవినుట దుర్లభము; ఆకథ వినినగాని, యాయజ్ఞానమునకు నాశనము లేదు; అయజ్ఞానము నశించినగాని, రామునిచరణములయందు దృఢభక్తి కల్గదు;

చౌపాయ్ 60

"'జపములును యోగములుఁ జేసినను, జ్ఞానవైరాగ్యములఁ గలిగియుండినను, ప్రేమ (అనురాగము) లేనియెడల, రామునిదర్శనము దొరకదు; ఉత్తరదిక్కున చక్కని నీలపర్వతమొకటి కలదు; అచ్చట, కాకభుశుండి నివసించియుండును; అతఁడు సుశీలుఁడు; రాముని భక్తి మార్గముఁ దెలిసిన పరమచతురుఁడు; జ్ఞాని; సకలగుణధాముఁడు; వయోవృద్ధు; అతఁ డెల్లపుడు రామకథలఁ జెప్పుచుండును; అనేక పక్షులు వచ్చి, యాకథను వినుచుండును; అచ్చటికి నీవు వెళ్లి, నారాయణుని గుణగణములను వినుము; అందువలన, మోహముచేఁ గలిగిన దుఃఖము దూరమగును;' అని, ఓ పార్వతీ! నేను గరుత్మంతునకు బోధించితిని; అతఁడు నాచరణములకు నమస్కరించి, నిష్క్రమించెను. ఓ యుమా! అందుచేత నే నతనికి రామకథను బోధించలేదు; రాముని కటాక్షమునకు మర్మమును నేను గ్రహించితిని; ఒకసమయమున గరుడుఁ డనేకమారులు, దురభిమానముఁ బొందియుండవచ్చును; ఆ కృపానిధియగు భగవంతుఁడు వానిమనోరోగమును బాగుజేయఁదలఁచి, వాని నిట్లు పంపియుండవచ్చును; వానియంతట వాఁడు స్వరోగమును

కుదుర్చుకొనవలెను. ఇటుల, గరుడుఁడు కాకభుశుండివద్దకు వెళ్లి, యతనిమూలమునఁ దనమనోవైకల్యమును బాగుగఁ జేసికొనెను. విలంబముఁజేయక నే నతనినిఁ బంపించివేయుటకుఁ గారణము మఱియొకటి కలదు; అతఁడు పక్షిరాజు; పక్షి పక్షిభాషను సులభముగ గ్రహింపఁ గలదు; ఓ పార్వతీ! భగవంతునిమాయ బలవంతురాలు సుమీ! ఈలోకములో దానికి లోఁబడకయుండిన జ్ఞానియొకఁడు కలఁడా?

దోహా 87, 88

"ఓ గిరిరాజకుమారీ! గరుత్మంతుఁడు గొప్పజ్ఞాని; హరిభక్తులలో శిరోమణివంటివాఁడు; త్రిలోకాధిపతియగు భగవంతునివాహనము; అట్టివాఁడుకూడఁ బ్రబలమగుమాయలోఁ బడి, మోహముఁ జెందెను; ఎవఁడు జ్ఞానినియని భ్రమించునో, వానివంటిమందమతి లేఁడు; ఆమాయ, బ్రహ్మమహేశ్వరులనే భ్రమింపఁజేయును గదా! ఇఁక నితరులమాట చెప్పనేల? ఈసంగతి సత్పురుషులు లెస్సగ గ్రహించి, మాయాపతియగు భగవంతుని భక్తితో సేవించెదరు.

చౌపాయీ 61

ఎచ్చట కాకభుశుండి నివసించియుండెనో, అచ్చటికి గరుడుఁడు వెళ్లెను; ఆ కాకభుశుండియొక్కమతి తీవ్రమయినది; అతనికి నారాయణునియం దఖండభక్తి కలదు; వైనతేయుఁ డాపర్వతముఁ జూచిన తరువాత, నతనిమనస్సు సంతోషముచే నుప్పొంగెను; అతనిమనస్సును బట్టియుండినమాయయు, మోహమును, శోకమును, భ్రమయు, సర్వము నతనిని విడిచిపెట్టెను. నాగాంతకుఁడు సరోవరములో స్నానముఁజేసి, దానిజలములఁ ద్రాగి, వటవృక్షముక్రిందకుఁ బోయెను; ఆ చెట్టుక్రింద ననేకముసలిహంసలు రామకథనువినుటకు వచ్చియుండెను; కాకభుశుండి రామకథఁజెప్పుటకు సిద్ధముగనుండెను; ఆసమయమునకు గరుడుఁడు వెళ్లెను; అతనిఁ జూచి, కాకభుశుండియు సమాజము వారును బరమానందముఁ బొందిరి; ఉత్యాదరముతో గరుత్మంతుని భుశుండి సత్కరించి, కుశలప్రశ్నఁజేసి యాసనము నిచ్చెను; అనేక విధముల నతనినిఁ బూజించి, మృదుమధురవచనములతో నతనిం జూచి, భుశుం డిట్లు పలికెను.

దోహా 89, 90

"ఓ స్వామీ! ఓ పక్షిరాజా! మీ దర్శనమువలన, నేను కృతార్థుఁడ నయితిని; మీ యాగమనమునకునిమిత్తముఁ దెలియఁ జేసినయెడల, మీయాజ్ఞలకు నేను బద్ధుఁడను; తత్ప్రకారము సంచరింతెద; మీయాజ్ఞలను జేయువాఁడను;" అని యతఁడు చెప్పెను. "ఓ మహాశయా! మీరు కృతార్థులు; మీ ప్రభావమును సాంబశివుఁడు స్వయము సాదరముగఁ బ్రస్తుతించెను;

చౌపాయ్ 62

"ఓ తాతా! వినుఁడు; నే నేకార్యమునిమిత్తము మిమ్ములను జూడవచ్చితినో, అది మిమ్ముఁజూచినమాత్రమున సఫలమయ్యెను. ఈ పరమపవిత్రమగు మీయాశ్రమముఁ జూచినవెంటనే, నామోహము లును సందేహమును భ్రమయు దూరమయ్యెను. శ్రీరామచంద్రునికథ పవిత్రమయినది; సకలసుఖముల నిచ్చి, సర్వదుఃఖముల నశింపఁ జేయును; ఓ తాతా! ఆ రామకథను మీరు సాదరముగ నాకుఁ జెప్పుడు; మిమ్ములను మాటిమాటికిఁ బ్రార్థించెద." అని గరుడుఁడు వేడుకొనెను. అతనివచనములు సరళములు; నీతియుక్తములు; సుఖ దాయకములు; ప్రేమాస్పదములు; పవిత్రములు; అట్టివాక్కులను కాకభుశుండి వినినందున, నుత్సాహముచే నతనిమన స్సుప్పొంగెను; రఘునాథుని గుణములను వర్ణించుట కారంభించెను; ఆ మూలరామా యణమునే తులసీదాసుగారు రచించిరి. ఓ పార్వతీ! కాకభుశుండి, ప్రథమమున, రామచరిత్రమానసమును వర్ణించెను; పిమ్మట, నారదుని యపారమోహమును, రావణునిజన్మమునకుఁ గారణము, రఘునాథుని జననము, రామునిబాలచరిత్రయు వరుసగ వర్ణించెను.

దోహా 91

"కాకభుశుండికి బాలరామునియందుఁ బ్రేమవిశేషము; కనుక, నత్యుత్సాహముతో నతఁడు బాలచరిత్రను విరళముగ వర్ణించెను; అనంతరము విశ్వామిత్రుని యాగమనమును, సీతావివాహముఁ జెప్పెను.

**చౌపాయ్ 63**

" రామునకుఁ బట్టముఁగట్టుటకుఁ జేయఁబడినప్రయత్నము, దానివిఘ్నమును, పురజనుల విరహదుఃఖమును, రామలక్ష్మణులసంవాదము, రాముని దండకారణ్యాగమనము, నిషాదాధిపతియొక్క దర్శనము, గంగానదిని దాఁటుట, ప్రయాగలో నివసించుట, వాల్మీకి మొదలగు మహర్షుల సందర్శనము, చిత్రకూటముపై నివసించుట, రాముని వనములోవిడిచిపెట్టి సుమంత్రుఁడు నగరములోనికి వెళ్లి యావద్వృత్తాంతమును రాజునకు విన్నవించుట, రాజు స్వర్గస్థుఁడగుట, మాతామహునిగృహమునుండి భరతుఁడు వచ్చుట, భరతునివిచారము, అతఁడు రామునిఁ జిత్రకూటముపై దర్శించుట, రాముఁడు భరతుని బోధించుట, పాదుకలతో నతఁడు నగరమునకుఁ దిరిగివచ్చుట, భరతుని మునివేషము, జయంతుని దుర్వ్యాపారము, అత్రిముని దర్శనము—ఇవి వరుసగ వర్ణింపఁబడెను.

**దోహా 92**

"విరాధవధయు, శరభంగుఁడు స్వర్గస్థుఁడగుట, సుతీక్ష్ణప్రేమయు, అగస్త్యునిసందర్శనము,

**చౌపాయ్ 64**

"దండకారణ్యమును నిష్కంటకముఁ జేయుట, జటాయువుతో స్నేహము, పంచవటీతీరమున నివసించుట, మునులదుఃఖము, లక్ష్మణునకుపదేశించుట, శూర్పణఖయొక్క ముక్కుచెవులఁ గోయుట, ఖరదూషణుల వధ, రావణ శూర్పణఖసంవాదము, రావణ-మారీచసంవాదము, మాయామృగము, మాయసీతాపహరణము, శ్రీరాముని సీతావియోగదుఃఖము, జటాయువునకు మోక్షప్రాప్తి, కబంధుని వధ, శబరికి ముక్తినిచ్చుట, రాముని విరహవేదన, రాముఁడు సాగరతీరమునకు వచ్చుట—ఇయ్యవి వర్ణింపఁబడెను.

**దోహా 93, 94**

"పిమ్మట నారదుఁడు రామునివద్దకు వచ్చుట, హనుమంతుని సమాగమము, సుగ్రీవునితో మైత్రి, వాలిని వధించుట, సుగ్రీవుని రాభిషేకము, శ్రీరాముఁడు ప్రవర్షణగిరిపై నివసించుట, వర్ష-శర

దృతువులవర్ణనము, సుగ్రీవునిను పేక్షకు రాముఁడు కోపించుట, సుగ్రీవుని భయము.

చౌపాయ్ 65

"సీతాన్వేషణమునకు వానరులు వెడలుట, వారు నలువైపులఁ గలయవెదకుట, వారు వెదకుచు వచ్చి పర్వతగుహాలో సంపాతిం జూచుట, అశోకవృక్షము క్రింద సీతయుండుట విని హనుమంతుఁడు సముద్రమును దాఁటుట, సురసా, సింహిక, లంకిని—వీరిని వధించుట, లంకానగరములో వానరవీరుఁడు రాత్రి ప్రవేశించుట, అతఁడు విభీషణునిఁ జూచుట, సీతవృత్తాంతమును వానరుఁడు విని ధైర్యము నవలంబించుట, సీతను సందర్శించుట, వనమును పాడుచేయుట, రాక్షసుల సంహారించుట, రావణుని దర్శించుట, లంకను దహించుట, మరల సముద్రమును దాఁటుట, వానరులసంతోషము, రాముని దర్శించి వారు సీతయొక్క క్షేమసమాచారము నతనితోఁ జెప్పుట, వానరులతోఁ గూడి, రాముఁడు తీరమునకు వచ్చుట, రావణునిచే భంగపడి విభీషణుఁడు రామునివద్దకు వచ్చుట, సాగరమును బంధించుట, సాగరునిగర్వమును భంగపఱచుట— మొదలగునవి వర్ణింపఁబడెను.

దోహా 95, 96

"సేతుబంధనము, రామేశ్వర ప్రతిష్ఠ, సముద్రము దాఁటుట, లంకలోఁ బ్రవేశించుట, అంగద రాయభారము, రాక్షస-వానరుల యుద్ధము, కుంభకర్ణ - మేఘనాదులయుద్ధము, వారిమరణము— ఇవియు చెప్పఁబడెను.

చౌపాయ్ 66

"రాక్షసుల మరణము, రామరావణుల యుద్ధము, రావణుని మరణము, మండోదరి విలాపము, విభీషణుని రాజ్యాభిషేకము, దేవతల సంతోషము, శ్రీసీతారాముల సంయోగము, దేవతలు స్తోత్రముఁ జేయుట, పుష్పకము నెక్కి రాముఁడు నగరమునకు వచ్చుట, శ్రీరామభరతుల సంయోగము, శ్రీవారిపట్టాభిషేకము, నగరవర్ణన, రాజనీతి ;—ఈ మొదలగునవి కాకభుశుండి వర్ణించెను. ఓ పార్వతీ!

నేను నీకుఁజెప్పిన యీవత్కథను కాకభుశుండి గరుత్మంతునకు విని పించెను; రామకథను సాంతముగ గరుడుఁడు విని, సంతోషించి, యత్యుత్సాహముతో నిట్లు చెప్పెను:—

సోరఠా 2, 3

"ఓ కాకకులతిలకమా! శ్రీరామునిచరిత్రమును సాంతముగ విని నందున, నాసందేహములు విడిపోయెను; అతని చరణారవిందముల యందు భక్తికలిగెను; మీకృపవలన, నాసందేహములు నశించెను; శ్రీరాముఁడు నాగపాశములచేఁ గట్టువడి, రణభూమిమీఁదఁ బడియుం డెను. సచ్చిదానందమూర్తియగు పరబ్రహ్మ మెందుకీవిధమున వ్యాకుల పడుచుండెనని, నేను భ్రమఁజెందియుంటిని.

చౌపాయ్ 67

"లోకసామాన్యముగ నతఁడు సంచరించుటచేత, నాకు గొప్ప సందేహము కలిగెను; నేనటుల భ్రమఁజెందుట నామేలునకే వచ్చెను; ఆ కృపాసాగరుఁడు, శ్రీరఘురాముఁడు నాయందు మిక్కిలి దయగల వాఁడు. ఎండలోఁ దిరిగితిరిగి వచ్చినవానికే, చెట్టునీడయొక్క సౌఖ్యము లెస్సగఁ దెలియును; ఓ తాతా! నేనే యజ్ఞానములోఁ బడకయుండిన యెడల, మీవంటిమహాత్ముల సత్సాంగత్యము నాకు లభించుట యెట్లు? పరమశోభాయమానమగు రామకథను మీవలన నేను వినుటయెట్లు? అనేకవిధముల మీరు రామకథను నాకు వినిపించితిరి; వేదపురాణేతి హాసములేమి, సిద్ధులు మునులేమి, నిస్సందేహముగ నందఱిమత మొక టియే; ఏమనిన, నెవరు నిర్మలచిత్తముతో మహాత్ములసాంగత్యముఁ జేయఁగలరో, వారు తప్పక రామునికృపకుఁ బాత్రులు కాఁగలరు. రామునికృపవలననే, మీదర్శనము లభించెను; మీ కటాక్షమువలన, నాసందేహములు నన్ను విడిచిపెట్టెను."

దోహా 97, 98

ఈప్రకారము గరుడుఁడు వినయముతోను, ననురాగముతోఁ బలికినపలుకులను కాకభుశుండి విని, ఆనందబాష్పములఁ గార్చెను; అతనిశరీరము పులకరించెను; అతనిమనస్సు ప్రసన్నమయ్యెను; శ్రీ

పార్వతీ! బుద్ధిమంతుఁడును పవిత్రమగు శ్రోతయునగు వాఁడు హరిదాసునితోఁ గూడినయెడల, నతఁ డాసజ్జనునకు మతవిషయరహస్యములఁ జెప్పును.

# పంచమవిశ్రామము.

చౌపాయ్ 68

కాకభుశుండికి గరుడునిమీఁద నధికదయ కలిగెను; కనుక, నతఁడు వైనతేయునితో నిట్లు పలికెను:—"ఓ నాథా! అన్నివిధముల మీరు నాకుఁ బూజ్యులు; మీరు రఘునాథునికృపకుఁ బాత్రులు; మీకు సంశయములును, భ్రమయు, మాయయుఁ గలవా? ఏమియు లేవు; కేవలము మీకు నాయందు దయకలదు; కనుక, నిదియొక మిషఁ బెట్టుకొని మీరు నావద్దకు వచ్చితిరి; ఓ పక్షిరాజా! నిన్ను మోహములోఁ బడద్రోసి, నీమూలమున నాకు గొప్పతనమువచ్చుటకు రఘుపతి తలంచెను; ఓ స్వామీ! మీరు మాయకు వశ్యులమయితిమని చెప్పియుంటిరి; అందులో నాశ్చర్యము లేదు; నారదుఁడు, బ్రహ్మ మహేశ్వరులు, సనకసనందనాదులు, మొదలగు నాత్మజ్ఞానులలో నెవరు మోహములోఁ బడియుండలేదు? లోకములో నెవఁడు కామునకు వశ్యుఁడు కాలేదు? ఎవఁడు తృష్ణవలన వెఱ్ఱివాఁడు కాఁడు? ఎవని హృదయము క్రోధముచే దహింపఁబడలేదు? అందఱు వానికి వశ్యులయిరి.

దోహా 99, 100

"జ్ఞాని, తపస్వి, శూరుఁడు, కవి, పండితుఁడు, సకలగుణరాశి— వీరిలో నెవరిని లోభము బాధింపలేదు? ధనమదముచే నెవరు తప్పుమార్గములఁ ద్రొక్కలేదు? అధికారబలముచే నెవఁడు చెవిటివాఁడు కాలేదు? స్త్రీలయొక్క నేత్రాంతదృష్టిబాణములచే నెవనిహృదయము భేదింపఁబడక యుండును?

చౌపాయ్ 69

"గొప్పగుణములచే సన్నిపాతము లేకయుండినవాఁడేఁడీ? లేశమైన మదమానములను విడిచిపెట్టినవాఁడేఁడీ? యౌవనజ్వరముచే బాధపడనివాఁడేఁడీ? మమకారముచేఁ గీర్తిఁ బోఁగొట్టుకొననివాఁడేఁడీ? మత్సరమను మచ్చ లేనివాఁడేఁడీ? శోకమనునట్టివాయువుచేఁ గంపమునొందనివాఁడేఁడీ? చింతయనునట్టిసర్పముచేఁ గఱవఁబడకయుండినవాఁడేఁడీ? మోహములోఁ బడకయుండినవాఁడేఁడీ? శరీరమను నది యొకదూలము; మనోరథము లే అంపములు; ఈమనోరథము లనునట్టిఅంపముచేఁ గోయఁబడకయుండిన ధైర్యవంతుఁడేఁడీ? ఈషణత్రయములచేఁ గలుషమునొందనివాఁడేఁడీ? ఇదియంతయు మాయయొక్క కుటుంబము; దానికుటుంబమునకు లెక్కలేదు; అది మహాబలవంతురాలు; తుదముట్ట నెవరు దానిని వర్ణింప సమర్థులు? ఈమాయలో, బ్రహ్మమహేశ్వరులుసహితము పొర్లుచుందురు; అట్టివారికే గతిలేనప్పుడు, జీవులమాట లెక్కకువచ్చునా? వారిమాట చెప్పనేల?

దోహా 101, 102

"ఈలోకములో మాయయొక్క ప్రచండసైన్యములు తిరుగుచుండును; కామాదులు యోధులగు భటులు; దంభము, పాషండము మొదలగునవి సేనాపతులు; ఆమాయ రఘునాథునిదాసి; ఆమె మిథ్య; అయినను, ఓ నాథా! నా నమ్మకముకొలఁది చెప్పుచున్నాను; రఘునాథునికటాక్షము లేనియెడల, దానిబంధములు వీడవు; తజ్జాయమానకటాక్షమే దానిని వీడఁగొట్టునని నా నమ్మకము.

చౌపాయ్ 70

"ఏమాయ చరాచరజంతుజాలము నాడించుచున్నదో; ఏమాయయొక్క ప్రభావమును గుర్తెఱింగినవారు లేరో, అట్టిమాయ, యొక నటివలె, దానియనుచరులు కామాదులతోఁ గూడి, భగవంతుని భ్రూవిలాసమునననుసరించి, నాట్యముఁ జేయును. ఆ శ్రీరఘురాముఁడు సచ్చిదానందమూర్తి; ఘనశ్యాముఁడు (జీవ, ఆనంద, మాయలకు ఘనమని పేరు.), పుట్టుకలేనివాఁడు, పరాత్పరుఁడు, సకలగుణధాముఁడు, విజ్ఞానస్వరూపుఁడు, రూపవంతుఁడు, సర్వవ్యాపకుఁడు, అఖండబ్రహ్మము,

అనంతుఁడు, అఖిలసంపూర్ణరూపము కలవాఁడు, అమోఘుఁడు, ఒకఁడు భగవంతుఁడు, గుణ - దంభరహితుఁడు, మనోవాచామగోచరుఁడు, సమదర్శి, దూషణరహితుఁడు, అజేయుఁడు, మమతాకార మోహ రహితుఁడు, శాశ్వతుఁడు, నిరంజనుఁడు, సుఖరాశి, ప్రకృతికిఁ బరుఁడు, అందఱిహృదయములలో నివసించువాఁడు, పరబ్రహ్మస్వరూపము, చేష్టారహితుఁడు, రోగరహితుఁడు, అక్షీరుఁడు, అట్టిపరమాత్మయందు మాయ లేశమైన లేదు; సూర్యునియెదుట చీఁకటి యుండఁగలదా?

దోహా 103, 104

"శ్రీరామభగవానులు భక్తుల నుద్ధరించుటకు మనుజుఁడై పుట్టెను; సాధారణరాజులవలె, నతఁడు పరమపవిత్రమగుచర్యల నడపించెను; అందుచేతఁ బండితులుసహితము భ్రమఁ బొందుచుండిరి. ఒకఁడు నాటకములో ననేకవేషములను ధరించి, ఆయావేషముల కనుగుణ్యముగ నటించును; అయినను, వానిస్వభావ మొకటియే!

చౌపాయ్ 71

"ఓ నాగాంతకుఁడా! ఇదియంతయు భగవంతుని లీలావతారము; దైత్యులను శిక్షించుటకును, భక్తులను రక్షించుటకు నతఁ డవతరించెను; భక్తులతనిఁ బరమాత్మయని గ్రహించెదరు; మూర్ఖులు, కుటిలబుద్ధిగలవా రతనిని సామాన్యరాజపుత్రుఁడని భావించెదరు; ఓ స్వామీ! మతిహీనులును, విషయాసక్తులును రామునియం దజ్ఞానము నిరూపించెదరు. నేత్రదోషముకలవానికి సర్వము పచ్చగఁ గనఁబడును; వానినేత్రములకుఁ జంద్రుఁడుసహితము పచ్చగఁ గనఁబడును; పరదేశములో నుండినవానికి దిక్కులు తెలియవు; వాఁడు భ్రమించి, సూర్యుఁడు పశ్చిమమున నుదయించెనని చెప్పును; పడవమీఁదఁ బోవుచుండినవానికి, భూమియంతయుఁ దిరుగుచుండినట్లు కనఁబడును; వాని మట్టుకు వాఁడు స్థిరముగనుండినట్లు తలంచును; వాఁడు మోహముచే నిట్లు తలంచును; బాలురు గిరగిరఁ దిరుగుచుండినపుడు, గృహములు మొదలగునవి తిరుగుచుండినట్లు వారికిఁ దోఁచును; యథార్థముగ బాలురు తిరుగుచుండిరిగాని, గృహాదులు నిశ్చలముగ నుండును; ఇటులనే, మనుజులు పరస్పరము మిథ్యావాదముఁ జేయుచుండెదరు; అటు

లనే, మోహములోఁ బడియుండిన మనుజులు రామునియందు మోహమును నిరూపించెదరు; నిజముగ, నతనికి స్వప్నములోనైనను నజ్ఞానము లేదు; మోహములోఁబడియుండిన మందమతులును నిర్భాగ్యులును నీషణత్రయము లనునట్టియావరణములలోఁ జిక్కువడియుండెదరు; వారిహృదయములపై మాయయనుతెరను వేసియుండును; ఈమూర్ఖులు పట్టినపట్టును విడిచిపెట్టక, కుశ్శంకలఁ జేయుచుండెదరు; వారియజ్ఞానమును రామునకు నిరూపించెదరు.

దోహా 105, 106

అరిషడ్వర్గముచే బాధపడుచు, దారాపుత్రగృహాదులయం దాసక్తిచే నజ్ఞానాంధకారకూపములోఁ బడియుండినమూర్ఖులు శ్రీరాముని యెట్లు గ్రహింపఁగలరు? అతిసులభముగ నిర్గుణబ్రహ్మమును దెలిసికొనవచ్చును; కాని, సగుణబ్రహ్మమును గ్రహించుటయే కష్టము; నిర్గుణబ్రహ్మములో నొకరసమే యుండినందున, నది సులభముగ గ్రాహ్యము; సగుణబ్రహ్మము నానాచిత్రవిచిత్రచర్యలఁ జేయుటచే, నతనిని సులభముగ గ్రహించుటకు శక్యము కాదు.

చౌపాయ్ 72

"ఓ గరుడా! నాబుద్ధికిఁ దోఁచినవిధమున రఘునాథునిప్రభావముఁ గొంచెము చెప్పుచున్నాను; సావధానముగ వినుము; ఓ స్వామిజీ! ఏప్రకారము నే నతనిమాయకు వశుఁడనై, యతనిప్రభావమును తెలిసికొనలేక పోయియుంటినో, దానిం జెప్పుచున్నాను; వినుము; ఓ తాతా! రామునికృపకు నీవు పాత్రుఁడవు; రాముని గుణములను వినుటకు నీ కభిలాష కలదు; నీవలన నాకు సంతోషము కలిగెను. అందుచేత, నీయెడల నేను రహస్యము దాఁచిపెట్టను; ఒక పరమరహస్యమును నీకుఁ బ్రకటించి చెప్పుచున్నాను; ఆరహస్యము మనోహరమయినది; వినుట కింపుగనుండును; తనదాసులకు దురభిమానము కలిగినయెడల, రాముఁడు సహింపఁడు; అది యతనిస్వభావము; ఈదురభిమానమే జననమరణములకు మూలము; దానిమూలమున, ననేకబాధలు పుట్టును; సకలదుఃఖములు కలుగును; అందుచేత నతఁడు దాసులను గటాక్షించి, వారిదురభిమానముఁ బోఁగొట్టును;

అతనికి దాసులయందు దయకలదు; బాలునిశరీరముపై వ్రణములేచిన యెడల, దల్లి దానిని బాగుచేయుటకు దానిని శస్త్రముఁ జేయును; అప్పటి కాపని కష్టమే! కాని, దానివలన వానికి ముందు లాభముకలుగును కదా!

దోహా 107, 108

"ఆసమయమున బాలుఁడు బాధచే నేడ్చినను, తల్లి దానిని లక్ష్యముఁజేయక వానివ్యాధిని జక్కఁజేయును; ఈప్రకారమే, దాసుల యెడల రాముఁడు ప్రవర్తించును. దురభిమానముచే బాధపడుచుండెన వారిదురభిమానము నతఁడు పోఁగొట్టును."

ఓ భక్తజనులారా! భ్రమను విడిచిపెట్టి, మీ రెందుచేత నట్టిప్రభువును భజింపరు? అని తులసీదాసుగారు మిమ్ము నడుగుచున్నారు.

చౌపాయ్ 73

"ఓ గరుడజీ! నామూర్ఖత్వమును, రామునికృపయు, నీకుఁ జెప్పుచున్నాను వినుము; సావధానముగ దానిని వినుము. ఎప్పుడెప్పుడు రాముఁ డవతరించిపుట్టెనో, అప్పుడప్పు డతఁడు భక్తులకానందముఁ గలుగఁజేయుట కనేకలీలలఁ జేయును. ఆయాసమయములలో నే నయోధ్యానగరమునకుఁ బోవుచుండెదను; బాలరామునిచర్యలఁ జూచి, నేను సంతోషించుచుండెదను; బాలరాముని నామకరణమహోత్సవముఁ జూచియుంటిని; అయిదుసంవత్సరముల ప్రాయము బాలరామునకు వచ్చువఱకు నేనచ్చట నివసించియుండెదను. బాలరాముఁడే నా యిష్టదైవము; బాలరాముని శరీరచక్కదనము కోటిమన్మథులను మించియుండును; ఆ బాలరామునిఁ జూచినందున, నానేత్రములు సఫలమయ్యెను; ఒకచిన్న కాకిరూపమును ధరించి, నేను ప్రభువు సమీపముననే నిలువఁబడియుండి, యతనిబాలలీలలఁ జూచి, పరమానందభరితుఁడ నయితిని.

దోహా 109, 110

"అతఁడు గంతులువేయుచుఁ దిరుగుచుండినప్రదేశములకు నే నెగిరిపోవుచుంటిని; అతఁడు సగముసగము తిని పారవేయుచుండిన

పదార్థముల, సంగణములోనుండి ముక్కుతోఁదీసికొని, వానిని నేను దినుచుంటిని; ఒకసమయమున నతఁడు చేసినలీలలను జ్ఞప్తికిఁ దెచ్చుకొనినపుడెల్ల నాశరీరము పులకరించును.

చౌపాయ్ 74

"ఓ గరుడా! సావధానముగ వినుము; రామునిచరిత్రమును వినినందువలన సుఖముకలుగును; అన్నివిధముల రాజమందిరము చక్కనిది; అదియంతయు సువర్ణమయము; దానిపై రత్నములు చెక్కఁబడి యుండెను; ఆమందిరములోని సుందరమగు యంగణమునువర్ణింప శక్యముకాదు; అందులో నా నల్వురుభ్రాతృలు క్రీడించుచుండెదరు; రామునికోమలశరీరము మరకతమాణిక్యములతో సమానమగు శ్యామలవర్ణము; ఆశరీరములోని ప్రతియవయవమును గామదేవునితో సమానము; నూతనముగ వికసించినపద్మముయొక్క యెఱుపుతో సమానమగు మృదుచరణములును; చంద్రునికాంతిని తిరస్కరించుచుండిన శ్రేష్ఠాంగుళీనఖములశోభయును; చక్కనియవయవములును; వజ్ర, ధ్వజ, అంకుశ, యవ రేఖలతోఁ గూడియుండినచరణములును; ఘల్లుఘల్లుమనుచుండిన నూపురములును; అతనిరూప మింతచక్కనిది; రత్నస్థగితమగు బంగారుమొలనూ లతనినడుమునకుఁ దగిలించియుండెను; అతఁడు నడచినపుడు ఘల్లుఘల్లుమని శబ్దము వినఁబడెను.

దోహా 111

"అతనిబొజ్జమీఁద మూఁడుముడుతలు కనఁబడును; అతని చక్కని నాభికమలము మిక్కిలి లోఁతుగలది; అతని విశాలవక్షస్థలముపై సువర్ణాలంకారములు ప్రకాశించుచుండెను. కంఠము మొదలు పాదములవఱకు నొకచిన్న 'ఝంగీ' యాబాలునకుఁ దొడిగించియుండిరి.

చౌపాయ్ 75

"అరుణారుణహస్తములును, మనోహరమయిన నఖములును, సువర్ణకడియములుగల బాహుదండములును, సింహపుఁబిల్లనుబోలిన బాహుస్కంధములును, శంఖమువంటి మెడయుఁ, జక్కనిచుబుకమును, ముద్దులుమూటఁగట్టిన ముఖమును, బాలసంజల్పములును,

ఎఱ్ఱనియధరోష్ఠము, క్రిందనుమీఁదను రెండురెండుపండ్లును, సుందరమగు కపోలయుగమును, మనోహరమగు నాసికయుఁ, జంద్రునివలె సుఖమునిచ్చు చిఱునవ్వును, సంసారభయముఁ బోఁగొట్టఁదగిన కమలలోచనములు, నుదుట గోరోచనాతిలకమును, ధనుస్సువంటి కనుబొమలును, జక్కనిచెవులును, నుంగరమువలెఁ జుట్టుకొనుచుండిన చక్కని నల్లనిశిరోజములును, అతనిశరీరముపైఁ బచ్చని 'లుంగీ' యును; ఇన్నిముద్దులు మూటఁగట్టుచుండిన బాలరాముఁడు, తననీడఁజూచి యాడుచు, గంతులువేయుచు, అంగణములోఁ బరుగిడుచు, నాచిత్తమును హరించెను; అతఁడు నన్నుఁజూచి, చేసినకేళీవినోదములఁ జెప్పుటకు నాకు సిగ్గువేయును. అతఁడు నవ్వుచు నన్నుపట్టుకొనుటకుఁ బరుగిడినపుడు, నే నెగిరిపోవుచుంటిని, 'ఇదిగో, కాకీ! రొట్టెముక్క; కాకీ! రా;' అని నన్నుఁ బిలుచును.

దోహా 112, 113

"నేను దగ్గఱకువచ్చిన, నతఁడు నవ్వును; నే నెగిరిపోయిన, నతఁ డేడ్చును; అతనిచరణములఁ బట్టుకొనుటకు నేను సమీపించితిని; అతఁడు వెనుకకుఁ దిరిగి తిరిగి చూచుచుఁ బరుగెత్తిపోయెను. సాధారణ బాలునివలె నతఁడు క్రీడించుట చూచి, నేను మోహపరవశుఁడనై, భ్రమించియుంటిని. ఈప్రకారము ప్రభువు సంచరించునా? అతఁడు సచ్చిదానందస్వరూపుఁడు కదా? నేను సమీపమునకువచ్చిన నతఁడు సంతసించును; నేను దూరముగవెళ్లిన, నతఁ డేడ్చును; ఏమీ చిత్రము?

చౌపాయ్ 76

"ఓ గరుడా! ఈప్రకారము నామనస్సులోఁ జింతించితిని; శ్రీరామప్రేరణవలన, మాయవచ్చి నన్నుఁ దగులుకొనెను; అయిన, నామాయ నాకు దుఃఖముఁ గలిగింపలేకపోయెను; ఇతరజీవులనువలె, నామాయ నన్ను వశముఁ జేసికొనలేకపోయెను. ఓ నాథా! ఇందుల కొకకారణము కలదు; సావధానముగ వినుము; సీతాపతి యొకఁడు; అఖండజ్ఞానస్వరూపుఁడు; సర్వజ్ఞశిరోమణి; చరాచరజంతువులు మాయకువశులు. అఖండజ్ఞాన మందఱకున్నయెడల, నప్పుడు పరమాత్మ

కును జీవాత్మకు నేమిభేదముండునో చెప్పుఁడు? జీవుఁడు పరవశ్యుఁడు; భగవంతుఁడు స్వతంత్రుఁడు; జీవు లనేకములు; ఈశ్వరుఁ డొకఁడు; ("శ్లో. భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" అని భగ. గీ ప్రమాణము.) ఈభేదము లనేకములు మాయాకల్పితములయినను, భగవంతునికృప లేకపోయినయెడల, నెన్నికోట్లప్రయత్నములఁ జేసినను, భేదములు విడిపోవు.

దోహా 114, 115

"మనుజులలో నెంతజ్ఞానియైన, రాముని భజింపక, ముక్తిఁబొఁ గలనని తలంచినయెడల, నతఁడు తోఁకలేని పశువువంటివాఁడని తెలిసికొనుము; పదునాఱుకళలతోఁ జంద్రుఁ డుదయించినను, గోట్లకొలఁది తారాగణములు బయలు వెడలినను, బ్రపంచములోనుండిన సకలపర్వతములపై నిప్పుముట్టించినను, చీఁకటి పోఁగలదా? చీఁకటిని బోఁగొట్టుటకు సూర్యుఁ డుదయింపవలెను; అటులనే, రామునియందు భక్తిలేనియెడల, దుఃఖములు నశింపవు.

చౌపాయ్ 77

"ఓ గరుడా! నారాయణునిభజనతప్ప జీవులదుఃఖములు నశింపవు; ప్రభువుయొక్క ప్రేరణవలన జ్ఞానము కలుగును; అతనిసేవకుల యందు మాయ ప్రసరింపదు. అందుచేత, నతనిసేవకులకు నాశము లేదు; సేవకసేవ్యభేదము భక్తివలన వృద్ధిపొందును. నేను మాయకు లోఁబడి కొట్టుకొనుట రాముఁడుచూచి నవ్వెను; అతఁడుచేసిన చమత్కారమును వినుము; ఆచమత్కార మతని తల్లిదండ్రులకుఁగాని తమ్ములకుఁగాని తెలియదు; అతని జలజారుణచరణము లతికోమలములు; నన్నుబట్టుకొనుట కతఁడు మొణుకులతోను జేతులతోను బ్రాఁకుచు వచ్చెను; ఆ మేఘశ్యామునిశరీర మప్పుడు చూడవలెను; నే నెగిరిపోతిని; అతఁడు నన్నుబట్టుకొనుటకుఁ జేయిఁ జాచెను. ఎంత మీఁదికి నే నెగురుచుండినను, రామునిహస్తముమాత్రము నా సమీపమున నే యుండెను.

దోహా 116, 117

"ఓ తాతా! ముందువెనుకలఁ జూచుచుంటిని; బ్రహ్మలోకపర్యంతము నే నెగిరియుంటిని కాని, రామునిహస్తము రెండంగుళ

ములవ్యత్యాసములో నుండెను. నాశక్తికొలఁది, సప్తావరణల దాఁటి, మీఁదికి నెగిరియుంటిని; (సప్తావరణలు=జలము, వాయువు, అగ్ని, ఆకాశము, అహంకారము, మహత్తత్త్వము, ప్రకృతి.) కాని, నాకును రామునిహస్తమునకును రెండంగుళముల వ్యత్యాసమే యుండెను; ఆచిత్రముఁజూచి నామనస్సు వ్యాకులముఁ బొందెను.

చౌపాయ్ 78

"ఆవ్యాకులముచే నేను నేత్రములను మూసికొంటిని; మరల నేను నేత్రములను విప్పి, చూచునప్పటికి, నే నయోధ్యానగరములో నుంటిని; నన్నుఁజూచి రాముఁడు నవ్వెను; ఆనవ్వుతోఁగూడ నే నతనిముఖముగుండ గర్భములోనికిఁ బోయియుంటిని. ఓ పక్షిరాజా! వినుము; అతనియుదరములో ననేక బ్రహ్మాండకటాహములఁ జూచితిని; అనేక చిత్రవిచిత్రలోకములు కనఁబడెను; ఒకదానికంటెనొకటి యధికముగ నుండెను. కోట్లకొలఁది బ్రహ్మలు, శివులు, నక్షత్రములు, సూర్యచంద్రులు, అష్టదిక్పాలకులు, పర్వతములు, నదులు, వనములు, భూములు, సముద్రములు బ్రహ్మాండసృష్టియంతయు నాకు దృగ్గోచరమయ్యెను; దేవతలు, మునులు, యక్షులు, నాగులు, సిద్ధులు, కిన్నరులు, చతుర్విధచరములు, అచరములు - సర్వము కనఁబడెను.

దోహా 118, 119

"ఇదివఱకుఁ జూచియుండలేదు; వినియుండలేదు; మనముచే నూహించియుండలేదు; అట్టిచిత్రములను నేను జూచియుంటిని; ఏప్రకారము వానిని నేను వర్ణింపఁగలను? ఒక్కొక్కబ్రహ్మాండములో నొక నూరుసంవత్సరములచొప్పున నేను నివసించియుంటిని; ఈప్రకారమనేకబ్రహ్మాండకటాహములను నేను జూచియుంటిని.

చౌపాయ్ 79

"ఒక్కొక్కలోకములో బ్రహ్మ, విష్ణు, శివులను, మనువులను, దిక్పాలురను, గరుడ, గంధర్వ, కిన్నర, యక్ష, రాక్షసులను, దేవతలను, మనుజులను, భూత, ప్రేత, పిశాచములను-అనేకప్రకారముల నానావిధ జీవరాసులను నేను గనుఁగొంటిని; భూమియు, సముద్రమును, నదులును, బర్వతములును-యావత్ప్రపంచము నాకుఁ గనఁబడెను. ఏబ్రహ్మాం

డమున కాబ్రహ్మాండమే చిత్రముగ నుండెను; ఒకదానిలక్షణములు మఱియొకదానిలోఁ గానరావు; ప్రతిబ్రహ్మాండములో నొక అయోధ్యాపట్టణమును, సరయూనదియు, ఆనగరవాసులు, స్త్రీపురుషులును, దశరథుఁడును, కౌసల్యయు, తదితరరాణులును, భరతాదిభ్రాతలును-వారివారిరూపములతోఁ గనఁబడిరి; రాముఁడు ప్రతిబ్రహ్మాండములో నవతరించి, బాలక్రీడలఁ జేయుచుండెను; కన్నులారఁ జూచియుంటిని.

దోహా 120, 121

"ఓ గరుడా! ఈబ్రహ్మాండములలో నేను దిరిగితిరిగి వాని చిత్రవిచిత్రములఁ జూచియుంటిని; కాని, యొకరాముని నేను చూచియుంటిని; రెండవరూపము గలరాముఁడు నాకంటఁ బడలేదు. ఆ చక్కదనము, ఆ బాలలీలలు, ఆ కృపాసాగరుఁడు, ఆ రఘురాముఁడే నాకుఁ గనఁబడెను. మోహముచేఁ గొట్టఁబడి, లోకములన్నియు నేను సంచరించితిని; కాని, రాముఁ డొకఁడు.

చౌపాయ్ 80

"ఈప్రకారము నే నతనియుదరములోని బ్రహ్మాండములలోఁ దిరుగుచుండ, నొకనూరుకల్పములు గతించెను; తిరిగితిరిగి నాయాశ్రమమునకు వచ్చి, నేను గొంతకాల మచ్చట నివసించితిని; అవధపురిలో, నాప్రభువు జన్మించెనని విని, సంతోషముచే నుప్పొంగుచు నే నానగరమునకు వచ్చి, నామకరణమహోత్సవములఁ జూచి, పరమానందభరితుఁడనై యుంటిని; ఈసంగతులను మీకుఁ జెప్పియుంటిని; ఆమాయాపతియొక్కయుదరములో ననేకబ్రహ్మాండములఁ జూచియుంటిని; కాని, వానిని నేను చెప్పఁజాలను. పిమ్మట కృపాసాగరుని, నాసర్వజ్ఞుని, నాభగవంతుని నేను కన్నులారఁ జూచి సంతోషించితిని; మాటిమాటికి నాలో నేను విచారించితిని; అజ్ఞానముచే నామతి వికలమయ్యెను; ఇది యంతయు రెండుగడియలలో నేను జూచితిని; నాచిత్తము భ్రమించెను; నామనస్సు మాయలోఁబడి చిక్కువడెను.

దోహా 122, 123

"ఆ కృపాళుఁడు, రఘునాథుఁడు నావ్యాకులముఁజూచి నవ్వెను; అంతలో నేను గర్భములోనుండి బయటకు వచ్చితిని; ఓ మతిధీరుఁడా!

సామాటను వినుము; ఈచరిత్ర నంతయు నతని యుదరగోళములోఁ గనుఁగొంటిని; మరల రాముఁడు నాతో బాలకేళీవినోదములఁ జేయు చుండెను; నాశక్తికొలఁది నాలో నేను నామనస్సునకు సమాధానముఁ జేసికొంటిని; కాని, నామనస్సునకు నాసమాధానములవలన స్వాస్థ్యము మాత్రము రాలేదు.

చౌపాయ్ 81

"రాముని బాలక్రీడలను, నతనిప్రభావముఁ జూచిచూచి నేను భ్రమఁజెంది, తెలివిఁ దప్పి, నేలఁ బడియుంటిని; నాముఖమునుండి మాట రాలేదు; 'ఓ ఆర్తశరణ్యా! ఓ ప్రణతార్తిహరా! ఓ దీనరక్షకా! త్రాహి; త్రాహి; మాం త్రాహి; హే కృపానిధే' అని ధ్యానముఁజేయుచు నేను సొమ్మసిల్లి పడియుంటిని. రాముఁడు నావ్యాకులముఁ జూచి, తనమాయయొక్క ప్రభావమును కట్టిపెట్టెను. ఆ దీనబంధువు, కమలములవంటి స్వహస్తమును నాశిరముపై నుంచెను; అంతలో నాదుఃఖములు నశించెను; ఆ కృపానిధి, ఆ సేవకసుఖదాయకుఁడు నాకు మోహాము లేకుండఁ జేసెను; పిమ్మట, నే నతనిపూర్వపు మాయయొక్క ప్రభావమును స్మరించి, పరమానందముఁ బొందితిని. శ్రీరాముని భక్తవాత్సల్యముఁ దెలిసికొని, నామనస్సు పరమానందముచే నుప్పొంగెను; నా నేత్రములవెంబడి, వఱదలై నీరుకాఱెను; నాశరీరము పులకరించెను; రెండుచేతుల జోడించి, నేనిటుల శ్రీరామునిఁ బ్రార్థించితిని;

దోహా 124, 125

"నాప్రేమపూర్వకమగు ప్రార్థనను విని, దీనుఁడనైన నన్నతని నిజదాసునిగ భావించి, ఆ శ్రీనివాసుఁడు, ఆ లక్ష్మీపతి, ఆ భక్తసుఖదాయకుఁడు, మృదుమధురగంభీరవాక్యములతో నిట్లు నన్నుద్దేశించి పలికెను. 'ఓ కాకభుశుండీ! నాకు నీయందు దయవచ్చెనని తెలిసికొనుము; నీకేమివరము కావలయునో, కోరుము; అణిమాదిసిద్ధులు, నవనిధులు, పునరావృత్తి లేనిలోకము,

చౌపాయ్ 82

" 'జ్ఞానము, విజ్ఞానము, వివేకము, విరక్తి, మునులకుసహితము దుర్లభమగు గతియు— ఈసంగతులన్నియు జగద్విఖ్యాతములు—వీని

లో నేమేవానిని నీవు కోరుదువో వానివాని నిచ్చెదను; ఈదినమున నీవడిగినవన్నియు లేదనక యిచ్చెదను; సంశయింపక, వేగముగఁ దెలియఁజేయుము;' అని భగవంతుఁడు చెప్పెను. శ్రీవారివచనములను విని నాలో నే నిటుల తర్కించుకొంటిని. ఆమాటలను విని, నా కనుమానము కలిగెను. 'శ్రీరాముఁడు నాకు సర్వమునిచ్చెదనని చెప్పిరి; తనయందు భక్తినిచ్చెదనని చెప్పలేదు; భక్తిలేక సుఖములుండిన నేమిప్రయోజనములేదని నే నెఱుంగుదు; లవణములేకుండ వండినపదార్థములు వ్యర్థములు కావా! భక్తిలేక సుఖములుండినందున లాభము లేదు.' అని నాలోనేను చింతించి, ఓ గరుత్మంతుఁడా! నేనిటుల శ్రీవారిలో విన్నవించితిని; 'ఓ స్వామీ! ఓ జగద్రక్షకా! మీరుకటాక్షించి నాకు వరమునిచ్చుటకు సిద్ధపడితిరి; మీరు సర్వాంతర్యాములు; సర్వజ్ఞులు; మీరు నన్నుఁగటాక్షించి, రక్షింపఁదలఁచి, నే నడిగినవరమునిచ్చుటకుఁ దలఁచినయెడల,

### దోహా 126, 127.

" 'నిదియే నాకోరిక; మీయందు శుద్ధభక్తిఁ గలిగియుండునట్లు ప్రసాదింపుము; వేదపురాణము లాభక్తినే కొనియాడుచుండును; ఆ భక్తింగానక, యోగులును మునులును దప్పుమార్గముల సంచరించి, దానిం దెలిసికొనుటకు వారు దివారాత్రములు శ్రమపడుచుండెదరు; మీకటాక్షమువలన దానిని వానిలోఁ గొందఱే పొందఁగలరు; ఓ భక్తజనకల్పవృక్షమా! ఓ కృపాసాగరుఁడా! ఓ ప్రణతార్తిహరా! ఓ సుఖధాముఁడా! మీయందుఁ గలభక్తివలన, మీభక్తుల ప్రభావమిట్టిది; మీరు కటాక్షించి, నాకీవరము నొసంగుఁడు' అని నేను విన్నవించితిని;

### చౌపాయ్ 63

" 'తథాస్తు' అని శ్రీరాముఁడు సెలవిచ్చెను. ఆ రఘుకులనాయకుఁడు, మరల నన్నుద్దేశించి, పరమసుఖదాయకము లగువచనములతో నిట్లు ప్రసంగించిరి. 'ఓ కాకభుశుండీ! నీవు పరమచతురుఁడవు; కనుక, నపూర్వమగువరముఁ గోరియుంటివి; సకలసుఖములకును మూలమగుభక్తిని నీవు ప్రార్థించితి; కనుక, నీవంటిగొప్పభాగ్యుఁడు లేఁడు;

కోటిప్రయత్నములఁ జేసినను, మునులు భక్తినిఁ బొందలేరు; వారెన్ని జపములను, తపములఁ జేసి, శరీరములను నిప్పులోఁగాల్చినను, వారికి భక్తిసంప్రాప్తము కాదు. నీచాతుర్యముఁ జూచి, మాకు సంతోషము కలుగుచున్నది. నీవు భక్తినిఁగోరుట మామనస్సునకు సమ్మతము; ఓ పక్షిరాజా! మా యనుగ్రహామువలన, సకలసుఖములు నీలో నివసించును; భక్తియు, జ్ఞానమును, విజ్ఞానమును, వైరాగ్యమును, యోగరహస్యములును, శాస్త్రమర్మములును, వానిభేదములును నీ మొదలగు నవియన్నియు మాప్రసాదమువలన నీకు సులభముగఁ దెలియఁగలవు.

దోహా 128, 129

"'ఓ వాయసమా! నేఁడుమొదలు మాయయొక్క చేష్టలు నీయందుఁ బ్రవర్తింపవు; మే మనాదిబ్రహ్మమనియు, ఆద్యంతములు లేనివారమనియు, మారూపము సగుణనిర్గుణమనియు, శక్తిమంతులమనియు, సమస్తజగదాధారులమనియు నీకుఁ దెలియునుగదా! భక్తి నామతము; నాకుఁ బ్రియము; ఈసంగతిఁ దెలిసికొని, త్రికరణశుద్ధిగ మాయందు బద్ధానురాగముఁ గలవాఁడవై, భక్తితో మమ్ములను సేవింపుము.

చౌపాయి 84

"'ఓ కాకమా! ఈ మాపరమోజ్జ్వల మగువాక్యములను వినుము; మామాటలు సత్యము; సుగమము; సహజముగఁ బొందయోగ్యము; వేదపురాణములలో రహస్యముగ నుండును; మా స్వంతసిద్ధాంతమును దెలియఁజేయుదుము; సావధానముగ వినుము; సర్వధర్మములను విడిచిపెట్టి, మమ్ము భజింపుము; మాశరణఁ బొందుము. ("సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" భగ. గీ. ప్రమాణము.) ఈ చరాచరజంతుజాలముతోఁ గూడినప్రపంచము మామాయవలనఁ బుట్టుచున్నది; అంతయు మావలనఁ గలుగుచుండినందున, నంతయు మాకుఁ బ్రియము; అందులో మాకు మనుజు లధికముగఁ బ్రియులు; వారిలో బ్రాహ్మణులును, వారిలో వేదాధ్యయనసంపన్నులును, వారిలో వేదానుసారముగ నీతిమార్గప్రవర్తకులును, వారిలో మాదాసులు మాకధికముగఁ బ్రియులు; వారికి మేమే గతిగాని రెండవగతి లేదు; ఈప్రకారము విరక్తులు, మునులు,

జ్ఞానులు, విజ్ఞానులు-వీరిలో నొకరికంటెనొకరు మాకుఁ బ్రియులు; అయిన ననేకపర్యాయములు మే మొకమాటఁ జెప్పుచున్నాము; అది సత్యము; మా సేవకులకంటె నధికమగుఁబ్రియులు మాకు లేరు భక్తిహీనుఁడగు బ్రహ్మాయు మాకు సాధారణజనులవంటి ప్రియుఁడగును; భక్తివంతుఁడగు ప్రాణి నీచుఁడైనను మాకుఁ బరమప్రియుఁడు; ఇది మామాట సత్యము.

దోహా 130

" 'పవిత్రుఁడును, సుశీలుఁడును, బుద్ధిమంతుఁ డగు సేవకుఁ డే యజమానికిఁ బ్రియుఁడు కాకయుండునో చెప్పుము? వేదపురాణసమ్మతమగు సిద్ధాంతముఁ జెప్పుచున్నాము సావధానముగ వినుము:

చౌపాయ్ 85

" 'ఒకగృహస్థున కనేకకుమారులు కలరు; గుణములోను, శీలములోను, ఆచరణలోను, వారిలో వారికి భేదములు కలవు; వారిలో నొకఁడు పండితుఁడు; ఒకఁడు తపస్వి; ఒకఁడు జ్ఞాని; ఒకఁడు ధనికుఁడు; ఒకఁడు దాత; ఒకఁడు శూరుఁడు; ఒకఁడు సర్వజ్ఞుఁడు; ఒకఁడు ధర్మాత్ముఁడు; తండ్రికి వారియందు సమానముగ దయకలదు. స్వప్నమందైనను రెండవధర్మము నెఱుంగక, మఱియొకఁడు కేవలము పితృభక్తిఁ జేయుచుండును. అన్ని విధముల వాఁడు శుద్ధబుద్ధస్వరూపుఁడైనను, వానిని బ్రాణములవలెఁ దండ్రి రక్షించును కదా! ఆప్రకార మీలోకములోనుండిన చతుర్విధచరములును, దేవదానవులును, మావలనఁ బుట్టినందున, మాకుఁ బ్రియులు; వారియందు మాకు సమానముగ దయకలదు. వారిలో నెవరు మమకారమును కపటమును విడిచి, త్రికరణశుద్ధిగ మమ్ములను భజించెదరో,

దోహా 131

" 'చరాచరజీవులలో వారు స్త్రీపురుషనపుంసకు లయినను, నిష్కపటముగ మమ్ములను సేవించినయెడల, మాకు వారు పరమప్రియులు.

సోరఠా 4

" 'ఓ కాకమా! మేము సత్యముఁ జెప్పుచున్నాము. మమ్ములను విశ్వసించి మా సేవఁ జేయువాఁడు మాకు మా ప్రాణములతో సమానుఁడు; ఈసంగతిని గ్రహించి, మాభజనఁ జేయుము; అన్యచింతలను

విడిచి, నిష్కామ్యముగ మమ్ములనే ధ్యానించి, సేవింపుము ; నీవు పవిత్రుఁడవు కాఁగలవు.

చౌపాయ్ 86

"'ఓ కాకమా ! కాలము నీయందుఁ బ్రవర్తింపదు ; ఎంతవఱకు నీవు నిరంతరము మమ్ములనుధ్యానించి సేవించెదవో, అంతవఱకు నీవు కాలమునకు వశ్యుఁడవు కావు' అని యిట్లు భగవంతుఁడు ప్రశంసించెను ; ఓ గరుత్మంతుఁడా ! ఆ వాక్సుధారసమును నేనెంతజుర్రినను, నాకుఁ దృప్తిలేకపోయెను ; నాశరీరము పులకరించెను ; నామనస్సు పరమానందభరిత మయ్యెను ; ఏసుఖమును నామనస్సును జెవులును దెలిసికొనినవో, దానిని నానోరు చెప్పలేదు ; శ్రీరామ దివ్యమంగళ విగ్రహమును నేత్రములు చూచెను ; ఆచక్కఁదనమును నోరు చెప్పలేదు. అనేకవిధముల శ్రీరాముఁడు నన్ను శిక్షించి, బోధించిరి ; అనంతరము, వారు బాల్యక్రీడల నాడుచుండిరి ; వారినేత్రములవెంబడి జలము కారెను ; కొంచెము ముఖమును ముడుచుకొని యాఁకలిఁ గొని యుండినట్లు, వారు తల్లివైపుఁ దిరిగిచూచిరి. తల్లి రామునిఁజూచి శీఘ్రమునఁ బరుగిడి వచ్చి, బాలునిముద్దులాడి, బుజ్జగించి, గుండెల కప్పళించుకొనెను. ఆమె రామునిఁ జంకఁబెట్టుకొని, రామలీలపాటలఁ బాడుచు, నతనికి పా లిచ్చెను.

సోరఠా 5, 6

" సకలసుఖములనిచ్చునట్టి త్రిపురాంతకుఁడుసహితమే సుఖము నిమిత్తము అమంగళవేషమును ధరించెనో, యేసుఖమునిమిత్త మతఁడు నిజరూపమును విడిచి, మారువేషము ధరించి, అయోధ్యలో సంచరించుచుండెనో, నట్టిసుఖములో నానగరజనులు, స్త్రీపురుషులు, దివారాత్రములు మునిఁగియుండిరి. ఆసుఖము ననుభవించుటకే శివుఁడు యోగివేషమును ధరించి, అయోధ్యలోఁ దిరుగుచుండును. కొంచెమైన నాసుఖమును స్వప్నమందొకపర్యాయ మనుభవించినమహాత్ములు, సత్పురుషులు, బ్రహ్మలోకసుఖమునైన లెక్కజేయరు.

చౌపాయ్ 87

"ఆవల, కొంతకాలము నేనానగరములో నివసించియుండి, మనోహరమగు బాలరాముని క్రీడలఁ దనివితీరఁ జూచిచూచి యానందించి

తిని. రామునిభక్తిప్రసాదముఁ బొంది, వారిచరణారవిందములకు మ్రొక్కి, నాయాశ్రమమునకు వచ్చితిని. రామునిఅభయముఁ బొందినది మొదలు, మాయ నామీఁద వ్యాపింపలేదు; హరిమాయ నన్నాడించినప్రకారమంతయు నీకు వినిపించితిని. ఓ గరుడా! ఇఁక నాయనుభవముఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము; హరిభజనలేక, క్లేశములు నశింపవు; రామునికృపలేక, యతనిప్రభావముఁ దెలిసికొనుట దుర్లభము; దానిం దెలిసికొనినఁగాని, విశ్వాసము కలుగదు. విశ్వాసము కలిగినఁగాని, ప్రీతిలేక దయకలుగదు; ప్రీతికలిగినగాని, దృఢభక్తి కలుగదు; నీటిపైఁ దేలియుండినఘృతము జారిపోవువిధమున, ప్రీతిలేనిభక్తి జారును.

సోరఠా 7, 8

"గురువులేక జ్ఞానమెటులకలుగును? జ్ఞానములేక, వైరాగ్యము కలుగునా? వేదపురాణములు చెప్పినట్లు, హరిభక్తిలేక సుఖము లెట్లు కలుగును? ఓ తాతా! స్వాభావికసంతోషము లేక, ఆత్మకు శాంతి యెట్లు కలుగును? ఎన్నివిధముల నీవు, ప్రేవులు తెగిపోవునట్లు, ప్రయత్నములు జేసినను, నీరులేనిప్రదేశములో నావ తేలియుండదు కదా?

చౌపాయీ 88

"సంతోషములేక, కామము నశింపదు; కామమువిడిచినఁగాని స్వప్నమందైనను సుఖముకలుగదు. రాముని భజించినగాని, కామము విడిచిపెట్టదు; స్థలములేకుండ వృక్షముమొలుచునా? విజ్ఞానములేనియెడల, సమత్వమెట్లుకలుగును? ఆకాశములేకుండ నవకాశముండునా? శ్రద్ధలేక ధర్మముకలుగదు; భూమిలేక సుగంధము కలుగదుకదా! (గంధవతీ పృథ్వీ); తపములేక తేజస్సు విస్తరించునా? లోకములో జలములేక, రస మెట్లుకలుగును? పండితులను సేవించినగాని శీలము ప్రాప్తించదు; తేజస్సులేక రూపము కలుగదు; సుఖము (రఘురామునిఁ బొందుటయే సుఖము) లేకపోయినయెడల, మనస్సు స్థిమితముగ నుండదు; వాయువు లేకపోయినయెడల, స్పర్శగుణము పుట్టదు; విశ్వాసముండినగాని సిద్ధికలుగదు; ఈప్రకారము హరినిభజించినగాని, సంసారభయములు నశింపవు.

దోహా 132

"విశ్వాసముండినగాని భక్తి కలుగదు; భక్తియుండినగాని రామునిసందర్శనము కలుగదు; రామునికటాక్షముండినఁగాని స్వప్నమందైనను సుఖముకలుగదు; మనస్సునకు విశ్రాంతియుండదు.

సోరఠా 9

"ఓ బుద్ధిమంతుఁడా! ఈ సంగతులనువిచారించి, కుతర్కమును (కాష్ఠవాదము) విడిచిపెట్టి, యా రఘురాముని, నా కృపాసాగరుని, నా సుఖదాయకుని, నిరంతరము భక్తిశ్రద్ధలతో భజింపుము.

చౌపాయ్ 89

"ఓ నాథా! ఓ స్వామీ ఖగపతీ! నాబుద్ధికిఁ దోఁచినవిధమున, భగవంతుని ప్రతాపమహిమను నీకు బోధపఱచితిని; నే నీప్రస్తావనలో నేవిధమగు యుక్తిని సమకూర్చి చెప్పలేదు; నేను చెప్పినసంగతులన్నియు నేను కన్నులారఁ జూచియుంటిని; ఓ గరుడుఁడా! శ్రీరాముని గుణములును, నామమును, మహిమయు అనంతములు; మునులు వారివారిబుద్ధికిఁ దోఁచినవిధమున, హరిగుణములను గానముఁ జేసిరి; తుదముట్ట శేషుఁడును, సరస్వతియు, శివుఁడుసహితము వానిని వర్ణించి చెప్పలేరు; ఈవిశేషముఁ జూడుము; ఓ పక్షిరాజా! నీవు మొదలు మశకమువఱకు అెక్కలుగలజంతువులన్నియు నంతరిక్షమున కెగిరినను, దానియంతముఁ జూచియుండరు కదా! ఓ తాతా! అటులనే శ్రీరాముని మహిమ గూఢము; దానిలోఁతు నెవరు కనుఁగొనఁగలరు? శ్రీరాముఁడు కోటిమన్మథులతో సమానమగు చక్కని శరీరముకలవాఁడు; కోటిదుర్గలతో సమానమగు బలముకలవాఁడై, శత్రువులను సంహరించును; నూరుకోట్లు దేవేంద్రులవంటివిలాసము కలవాఁడు; కోటియాకాశములవలె విస్తారమగువాఁడు.

దోహా 133, 134

"శ్రీరామునకు నూరుకోట్లవాయువులబలము కలదు; నూరుకోట్ల సూర్యులతేజస్సు కలదు; నూరుకోట్ల చంద్రులశీతలము కలదు; అతఁడు సకలదుఃఖములను శాంతింపఁజేయును. అతఁడు నూరుకోట్ల

యములువలె దుస్తరుఁడు, దుర్గముఁడు, దురంతుఁడు; నూరుకోట్ల అగ్నులువలె దురాధర్షుఁడు.

(దుర్గముఁడు=కష్టముచేఁ బొందఁదగినవాఁడు;
దురాధర్షుఁడు=కష్టముచే ధరింపఁదగినవాఁడు;
దురంతుఁడు=తుదముట్టఁ జూడ శక్యముకానివాఁడు;
దుస్తరుఁడు=తరించుటకు శక్యముకానివాఁడు.)

చౌపాయ్ 90

"శ్రీరాముఁడు నూరుకోట్ల పాతాళములువలె, నగాధమయినవాఁడు; నూరుకోట్లయములవలె భయంకరుఁడు; నూరుకోట్లతీర్థములవంటి పవిత్రుఁడు; అతనినామోచ్చారణవలన యమునిభయము పాఱిపోవును; నూరుకోట్ల హిమవత్పర్వతములవలె నిశ్చలుఁడు; నూరుకోట్లసముద్రములువలె గంభీరుఁడు; నూరుకోట్లకామధేనువులువలెఁ గోరినకోరికల నిచ్చును; నూరుకోట్లసరస్వతులవంటి చతురుఁడు; అతఁడే నాప్రభువు; నూరుకోట్లబ్రహ్మలవలె సృష్టించును; నూరుకోట్లవిష్ణువులువలెఁ బరిపాలించును; నూరుకోట్లరుద్రులువలె సంహరించును; నూరుకోట్ల కుబేరులకంటె ధనవంతుఁడు; నూరుకోట్లమాయలవలె లోకములను నిధానమును; నూరుకోట్ల శేషువులువలె భూభారమును భరించును; అవధిలేనివాఁడు; ఉపమానరహితుఁడు; జగదీశ్వరుఁడు; అతఁడే శ్రీరాముఁడు; అతఁడే నాస్వామి.

ఛాంద్ 21

"శ్రీరాముఁ డుపమారహితుఁడు; ఉపమాన ఉపమేయములతఁడే; రామునివంటివాఁడు రాముఁడేకాని మఱియొకఁడు లేఁడు; అని వేదములు చెప్పుచుండును. నూరుకోట్లఖద్యోతములను సూర్యునితోఁ బోల్చినయెడల, నెంతసరసముగ నుండును? అట్లుపోల్చిన మనుజుని తెలివితక్కువతనము వెల్లడియగును. ఆప్రకారము వారివారిబుద్ధికిఁ దోఁచినవిధమున, హరిజనులును, మునిజనులును హరిగుణములను వర్ణించిరి; హరి, కృపాళుఁడు కనుక, వారిస్వభావమును గనిపెట్టి, హరివర్ణనల నంగీకరించెను; వారికి సుఖమునిచ్చెను.

దోహా 135

"శ్రీరాముఁ డపారగుణములకు సాగరుఁడు; తుదముట్ట వానిం జూచుట కెవఁడు సమర్థుఁడు? నేను మహాత్ములవలన వినినసంగతులను నీకుఁ జెప్పినాను.

సోరఠా 10

"సకలసుఖధాముఁడు; కరుణాసముద్రుఁడు; భక్తికిఁ బరవశుఁడు కనుక, మమకారమును, మదమానములను విడిచి, శ్రీసీతారాముని భజించుట యుచితము." అని కాకభుశుండి ప్రసంగించెను.

---

# షష్ఠ విశ్రామము.

---

చౌపాయ్ 91

ఓ పార్వతీ! కాకభుశుండియొక్కవచనములను గరుత్మంతుఁడు విని, ప్రసన్నుఁడై, సంతోషించెను; అతనిశరీరము పులకరించెను; అతని నేత్రములవెంబడి ఆనందబాష్పములు కారెను; అతఁడు శ్రీరామచంద్రునిప్రతాపమును మనస్సునకు బాగుగఁ బట్టించుకొని, పరమానందముఁ బొందెను. ఇతఃపూర్వ మతఁడుపొందిన భ్రమకు విచారించి, పశ్చాత్తాపముఁ బొందెను; అతఁడు పలుమాఱు కాకభుశుండిచరణములకు నమస్కరించెను; అతఁడు భుశుండిని రెండవరామునిగ భావించి, యతనిని విశేషముగఁ బ్రేమించెను. "ఓ తాతా! ఓ కాకభుశుండీ! బ్రహ్మమహేశ్వరులతో సమానమగువాఁడైనను, గురువు సహాయము లేక, సంసారసాగరమును దాఁటలేఁడు; సర్పము దానిచుట్లలోఁజుట్టి జంతువులఁ జంపును; అటులనే, సంశయమనుసర్పము కుతర్కమనునట్టి చుట్లలోఁబెట్టి మనుజులఁ బాడుచేయును; నన్నా సంశయము పాడుచేసెను. ఓ రఘునాథా! ఆరాముఁడే నీరూపముఁ దాల్చివచ్చెను; నీ వాక్సుధారసమునునట్టి పాముమంత్రము నాకుఁ

బ్రాణముల నిచ్చెను; ఆరాముఁడు భక్తసుఖదాయకుఁడు కదా! నీప్రసాదమువలన నామోహము నశించెను; నిరుపమానమగు రాముని చక్కనిరహస్యమును నీవలనఁ దెలిసికొంటిని."

**దోహా 136, 137**

ఈప్రకార మనేకవిధముల గరుడుఁడు ప్రశంసించి, కాకభుశుండికి నమస్కరించెను; అతనిమనస్సు ప్రేమతో నిండెను; అతఁడు చేతుల జోడించి, నీతియుక్తమగు మృదుమధురవచనములతో నిట్లు ప్రసంగించెను "ఓ స్వామీ! ఓ కాకమా! అజ్ఞానముచే నేను నిన్నొకవిషయము నడుగుచున్నాను. ఓ కృపాసాగరుఁడా! నేను నీదాసుఁడనని తెలిసికొని, సాదరముగ నాకు బోధింపుము.

**చౌపాయ్ 92**

"నీవు సర్వజ్ఞుఁడవు; తజ్జ్ఞుఁడవు (ఆత్మజ్ఞానులలో శ్రేష్ఠుఁడవు); సుమతివి; సుశీలుఁడవు; సరలాచారసంపన్నుఁడవు; అనుభవముచేఁగలిగిన జ్ఞానవైరాగ్యములకు నిధివి; రఘునాథునకుఁ బ్రియదాసుఁడవు; ఓ తాతా! ఈ కాకశరీరమును నీవు ధరించుటకుఁ గారణమేమి? నాకు బోధించిచెప్పుము; ఓ వియద్గామీ! శ్రీరామచరిత్రమనునట్టి సుందరసరోవరము నీకెటుల లభించెను? ఈసంగతియు నాకు బోధించి చెప్పుము. ఓ నాథా! మహాప్రళయకాలమున సహితము నీకు నాశములేదని, సాంబశివుఁడు నాతోఁ జెప్పెను; శివుఁడు గొప్పవాఁడు; అతఁ డసత్యముఁ జెప్పఁడు; శివునిమాటవలన, నామనస్సులో సంశయము పుట్టెను. ఓ నాథా! చరాచరజంతుజాలమంతయును, దేవతలును, నరులును, నాగులును, సర్వమును కాలుఁడు కబళించును; జీవరాసులతోఁగూడిన బ్రహ్మాండకటాహములను కాలుఁడు లయముఁ జేయును; కాలుఁడు దురంతుఁడు; దుర్జయుఁడు.

**సోరఠా 11**

"ఓ కృపాసాగరా! ఏకారణముచేత నంతకరినుఁ డగుకాలుఁడు సహితము నిన్ను వశముఁ జేసికొనలేకపోయెను? ఇది నీ జ్ఞానప్రభావమా, లేక నీ యోగబలమా? నాకు బోధించిచెప్పుము.

దోహా 138.

"ఓ నాథా! నీ యాశ్రమమునకు వచ్చినందున, నామోహాము భ్రమయు నశించెను కదా! ఇందుకుఁ గారణమేమి? ఈసంగతులను కటాక్షించి, నాకు బోధింపుము." అని గరుడుఁడు ప్రార్థించెను.

చౌపాయ్ 93

ఓ పార్వతీ! గరుడునివచనములను కాకభుశుండి విని, ప్రసన్నుఁడై, ప్రేమతో నిట్లు ప్రసంగించెను. "ఓ గరుడజీ! ధన్యుఁడవు; ఎంతచక్కని బుద్ధిమంతుఁడవు! నీబుద్ధి బంగారమగు గాక! నామనస్సున కిష్టమగు ప్రశ్న నడిగితివి. ఇంతదయతో నీవు న న్నడిగిన ప్రశ్నను వినినందున, నాజన్మము సఫలమయ్యెను; నాజీవితమంతయుఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము; జపము, తపము, యజ్ఞము, సంయమము, వ్రతము, దానము, వైరాగ్యము, వివేకము, యోగము, విజ్ఞానము—ఈ మొదలగువానివలనఁ గలిగెడిఫల మొకటియే; రఘునాథుని చరణకమలములయందు నిశ్చలభక్తి లభించుటయే వానిఫలము; ఆ భక్తిలేనియెడల, విశ్రాంతి కలుగదు; మనస్సునకు స్థిమితముండదు. ఈశరీరముతో, రామునిచరణములను భక్తితోఁ గొలుచుచుంటిని; అందుచేత, నా కీదేహమునం దభిమానము మెండు; ఒకదానివలనఁ బ్రయోజనము కలిగినయెడల, దానియందభిమానముఁ గలిగియుండుట స్వతస్సిద్ధము.

సోరఠా 12, 13

"ఓ గరుడా! నీచపదార్థమువలనఁ బరమహితము సంప్రాప్తమగునపుడు, దానియెడల నభిమానముఁగలిగియుండుట మంచిదియని వేదప్రమాణము కలదు; అదియే సజ్జనులమతము. ఓ తాతా! చూచితివా! పురుగునుండిపట్టువచ్చును; పీతాంబరముల నాపట్టులోఁ జేయుదురు; ఆ పురుగుచూచుట కసహ్యముగ నుండును; అయిన, నాపురుగు పరమహితము జేయునని తెలిసికొని, జనులు దానినిఁ బ్రాణమువలెఁ గాపాడుచుందురు కదా!

చౌపాయ్ 94

"త్రికరణశుద్ధిగ శ్రీరామునిచరణకమలములను సేవించుటయే, మనుజులకు ముఖ్యమగు ప్రయోజనము; ఏశరీరముతో రఘురాముని

భజించెదరో, ఆశరీరమే చక్కనిది; అదియే పవిత్రమయినది; బ్రహ్మదేవుని పెద్దకొడుకయినను, రామునియందు విముఖుఁ డయినయెడల, వానినిఁ బండితులుగాని కవులుగాని మెచ్చుకొనరు; ఈశరీరమును ధరించియుండినపుడే, ఓ గరుడస్వామీ! రామునియందు నాకు భక్తి కలిగెను; అందుచేత, నాకీశరీరమునం దభిమానము మెండు; కనుక, నే నీశరీరమును విడిచిపెట్టఁ జాలను; నేను గోరినపుడు నాకు మృత్యువు వచ్చును; శరీరము లేకపోయినయెడల, భజనఁజేయుటకష్టమని (దుర్లభమని) వేదప్రమాణము కలదు; ప్రథమమునను మాయ నన్ననేక త్రిప్పులు త్రిప్పెను; రామునియందు విముఖుఁడనై యుంటిని; కనుక, నాకు స్వప్నమందైనను సుఖము లేకపోయెను. అనేకజన్మములనెత్తి, నే ననేకకర్మముల నాచరించితిని; యోగములు, జపములు, తపములు, దానములు, యజ్ఞములు మొదలగునవి చేసియుంటిని; నా పూర్వజన్మకర్మలన్నియు నాకు జ్ఞాపకము కలదు; ఓ గరుడజీ! లోకములో నేను నివసించియుండని గర్భముకలదా? అన్నియోనులయందు నేను పుట్టియుంటిని; ఓ స్వామీ! నే ననేకకర్మల నాచరించి, చూచియుంటిని; కాని, ప్రస్తుతము నాకుఁగలసౌఖ్యమును నే నెన్నఁడు పొందియుండలేదు. నా పూర్వజన్మకర్మలన్నియు నాస్మరణలో నుండును; ఎందుచేత ననిన, శివునికటాక్షమువలన, నాబుద్ధిని మాయ కప్పలేదు.

దోహా 139, 140

"ఓ గరుడా! నాపూర్వజన్మకథఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము; దానిని వినినందున, నీకు శ్రీరామునియందు భక్తికలుగును; భక్తివలన, దుఃఖములు పోవును. ఓ స్వామీ! పూర్వకల్పములో నొకసమయమున పాపఘోరాయిష్టమగు కలియుగము వచ్చెను. అప్పుడు, స్త్రీపురుషు లధర్మమార్గమున సంచరించిరి; వేదములకు విరుద్ధముగ వారు నడచిరి.

చౌపాయ్ 95

"నే నాకలియుగములో నయోధ్యాపురములో నొకశూద్రుని గర్భమునందు జన్మించితిని; త్రికరణశుద్ధిగ, శివుని నే నారాధించుచుంటిని; మనోవాక్కర్మలచే నే నితరదేవతలను దూషించితిని; నాకు

దురభిమాన ముండెను. ధనగర్వముచే మదించియుంటిని ; పరమవాచా
లుఁడను ; నాబుద్ధి తీక్ష్ణముగ నుండెను ; నాకప్పుడు విశేషముగ దాంభి
కము కలదు ; అయినను నేను రఘురాముని రాజధానిలో నివసించి
యుంటిని ; కాని, నాకు శ్రీరాముని మహిమ లేశమపి తెలియదు. వేద
పురాణేతిహాసములలోఁ జెప్పియుండిన ప్రకారము, ప్రస్తుతము నే
నయోధ్యానగరముయొక్క ప్రభావమును లెస్సగఁ దెలిసికొంటిని ;
పూర్వజన్మములో నెవ రానగరములోఁ బుట్టియుండిరో, వారికే నేఁడు
రామునియందు భక్తికలుగును. అయోధ్యానగరముయొక్క ప్రభావ
మును మనుజుఁడు తెలిసికొనినయెడల, వానిహృదయములో శ్రీరామ
మూర్తి ధనుర్బాణములను ధరించి నివసించియుండును ; ఓ గరుడజీ!
ఆకలియుగము మహాకష్టకాలము ; స్త్రీపురుషులు మహాపాపిష్ఠులు ;
పాపాత్ములు ; పాపకర్మపరాయణులు ;

దోహా 141, 142

"ఆమహాకలి సకలధర్మములను కబళించెను ; సద్గ్రంథములను
మూలఁబెట్టెను ; దాంభికులు వారిబుద్ధికిఁ దోఁచినవిధమున, ననేకమార్గ
ములను కల్పించిరి ; ఆ క్రొత్తమార్గము వెంబడి మనుజులు నడచి, వేద
ములను పరిత్యజించిరి. అందఱును మోహమునకు వశులయిరి ; సత్క
ర్మలను లోభము వంచనముఁ జేసెను; ఓ జ్ఞానసాగరుఁడా! ఓ గరుడజీ!
సావధానముగ వినుము ; తగుమాత్రము కలియుగధర్మములఁ జెప్పు
చున్నాను.

చౌపాయ్ 96

"కలియుగమునందు వర్ణాశ్రమధర్మములు నశించెను ; స్త్రీపురు
షులు వేదములతో విరోధించిరి ; బ్రాహ్మణులు వేదవంచకులు ; క్షత్రి
యులు ప్రజావంచకులు ; వేదశాస్త్రములమర్యాదలను అజ్ఞులనెవరు
మన్నింపరు. ఎవనిబుద్ధికిఁ దోఁచినమార్గమున వాఁడు నడచెను; పెద్దగొం
తుకఁగలవాఁడు పండితుఁడు ; మిథ్యావాదముఁ జేయువాఁడును, దాం
భికుఁడును, వేషధారియు—ఇట్టివాఁడే సజ్జనుఁడని చాటుచుండిరి.
పరులధనము నపహరించువాఁడు చతురుఁడు ; పరులుచూచి మెచ్చు
కొనుటకుఁ గర్మములనాచరించు దాంభికుఁడే, సదాచారుఁడు ; అస

త్యముఁ జెప్పువాఁడే సరసుఁడు, సర్వజ్ఞుఁడు; ప్రాగరుఁబోతువాఁడే, రసికుఁడు; దురాచారసంపన్నుఁడును, వేదమార్గములకుఁ బ్రతిమార్గములఁ జెప్పువాఁడే, జ్ఞాని; వాఁడే, విరాగి; జటలనుధరించి, నఖములను పెంచినవాఁడే, తపస్వి.

దోహా 143

"కుచ్చితవేషమును భయంకరభూషణములను ధరించి, భక్ష్యాభక్ష్యములను భుజించి, భ్రష్టుఁడయినవాఁడే, సిద్ధుఁడనియు యోగియనియుఁ దలంచి, వానిని జనులు పూజించిరి.

సోరఠా 14

"పరుల కపచారముఁజేయువాఁడే, గౌరవనీయుఁడు; వాఁడే, మాననీయుఁడు; మనోవాక్కర్మములచే నెవఁడు ప్రగల్భములం బలుకునో, వాఁడే వక్త.

చౌపాయ్ 97

"పురుషులు స్త్రీలకు వశ్యులు; ఓ గరుడా! నటునిచేతిలోని మర్కటమువలె, స్త్రీలచేతిలో మనుజులు నాట్యముఁ జేయుదురు. బ్రాహ్మణులకు శూద్రు లుపదేశించెదరు; శూద్రులు యజ్ఞోపవీతముల ధరించి, కుదానములను గ్రహించెదరు. అరిషడ్వర్గమునకు జనులు వశ్యులయిరి; గురువులను, దేవతలను, సజ్జనులను, బ్రాహ్మణులను వారు ద్వేషించుదురు. సుగుణసంపన్నుఁడగు చక్కనిభర్తను విడిచి, స్త్రీ పరపురుషునిఁ బొందును. సువాసినులు భూషణములను విసర్జించెదరు; పూర్వసువాసినులు భూషణములను సదా ధరించియుందురు; గురుశిష్యులకు నోరు-చెవులు లేవు; గురువునకు నోరులేదు; శిష్యునకు చెవులులేవు; గురువు లోభమునకు వశ్యుఁడై, శిష్యుని దుర్గుణములను కనిపెట్టఁడు; శిష్యుఁడు ధనమునిచ్చినందున, గురూపదేశములను మన్నింపఁడు. శిష్యునివద్దఁ గట్నముఁబుచ్చుకొని, వానిసందేహములను దుఃఖములను విడగొట్టని గురువు ఘోరనరకముఁ బొందును; శిష్యుని ముఖముఁజూచి, గురువు తియ్యని మాటలాడును; వానిపరోక్షమున, వానిందిట్టును; కట్నమునిచ్చిన శిష్యుని స్తుతించును; లేనియెడల, వానిని దూషించును. తల్లిదండ్రులు కుమారులఁబిలిచి, పొట్టఁ బోషించుకొనుటకుఁ దగినమార్గములనే వారికి బోధించెదరు.

దోహా 144

"ఏమాత్రము బ్రహ్మజ్ఞానములేని స్త్రీపురుషులు సదా బ్రహ్మజ్ఞానమును గుఱించియే ప్రసంగించుచుందురు. వారికి బ్రహ్మశబ్దము మాత్రము తెలిసియుండును ; కాని, వారికి దానిసాధనములు తెలిసియుండవు ; ఒకచిల్లిగవ్వకు లోభించి, వారు బ్రహ్మహత్యలను గురుహత్యలఁ జేయుదురు. కలియుగమున బ్రహ్మజ్ఞానుల విధమిట్లుండును. *'అరే! మీరు మాకంటె బ్రహ్మజ్ఞులా ? మీరు బ్రాహ్మణులా ? బ్రహ్మమునుఁ దెలిసికొనిన వారే బ్రాహ్మణులు; కర్మలవలన వర్ణములు వచ్చెను; కాని, జన్మవలనఁగాదు.' అని శూద్రులు బ్రాహ్మణులను ధిక్కరించి

---

* ఒకనగరములో నామకార్థ మనేకబ్రహ్మజ్ఞానులు నివసించియుండిరి. ఒకసమయమున నొకవైద్యుఁ డానగరమునకు వచ్చెను. అతఁడొక గృహస్థునిగృహమునకు వచ్చి, "అయ్యా ! నేనొక వైద్యుఁడను ; నేను రోగములను చక్కఁజేయఁగలను ; సమయము వచ్చినప్పుడు, నన్ను గటాక్షింపుఁడు" అని యజమానితోఁ జెప్పెను. ఆ యజమాని వైద్యునిఁజూచి "అయ్యా ! సర్వం బ్రహ్మమయం జగత్ ; అని చెప్పియున్నది. రోగములు, ఔషధములు, సర్వము బ్రహ్మము" అని పలికెను. వైద్యుఁడు నిరాశజేసికొని, నగరములోఁ దిరుగుచుండెను. అట్లు కొంతకాలముగతించెను ; అంతట నా నగరములోని రాజునకు సంకటమువచ్చెను ; ఎందఱువైద్యులువచ్చి మందులనిచ్చినను, రాజునకు సుముఖముకలుగలేదు. అప్పు డీక్రొత్తవైద్యుఁడు మందులనిచ్చి, రాజునకు స్వాస్థ్యముఁదీసికొనివచ్చెను ; కాని, రాజుశరీరము నీరసించియుండెను. అతఁడు వైద్యునిఁజూచి "అయ్యా ! నా నీరసముబోవుటకుఁ దగినమందు దయచేయుఁడు" అని యడిగెను. "ఓ రాజా! ఒక బ్రహ్మజ్ఞానియొక్కశరీరమునుండి తైలముఁదీసి, దానితో మందుఁ జేయవలెను ; ఆమందు మీకు బలమునిచ్చును ; కాని, బ్రహ్మజ్ఞాని దొరకుటయెట్లు ?" అని వైద్యుఁడుచెప్పి విచారించెను. "అయ్యా! మానగరములో నందఱు బ్రహ్మజ్ఞానులే ; మీరు విచారింపవలదు" అని రాజుచెప్పి, యొక సేవకునిఁబిలిచి, "ఓయీ ! నీవు నగరములోనికిఁబోయి యొక బ్రహ్మజ్ఞానినిఁ దీసికొని రమ్ము" అని వాని నాజ్ఞాపించెను. ఆసేవకుఁ డంగడివీధికిఁబోయి "ఓయీ ! విక్రేతా ! నీవు బ్రహ్మజ్ఞానివేనా ?" అని యడిగెను. "అవును" అని "దుకాణదారుఁడు" చెప్పెను. "మంచిది ; రాజుగారి యాజ్ఞప్రకారము నగరులోనికి రమ్ము." అని సేవకుఁడు చెప్పెను. "ఎందులకు ?" అని వాఁ డడిగెను. "ఒకబ్రహ్మజ్ఞానిశరీరమునుండి తైలము కావలయును" అని సేవ

చూచి, వారితో వాదించెదరు; క్షత్రియులవలె, వైశ్య శూద్రులు వర్మలమని చెప్పుకొనుచుందురు; వారు చేయుచుండెడి కర్మలు మాత్రము మ్లేచ్ఛకర్మలు.

చౌపాయ్ 98

"పరస్త్రీభోగులు, కపటవర్తనులు, మోహ, ద్రోహ, వైర, మమతాంధకారులును, వీరే, అద్వైతవేత్తలు; వీరే, జ్ఞానులు; కలియుగములో నిట్టి యలౌకికవ్యాపారములను కన్నులారఁ జూచియుంటిని. వారు స్వయము భ్రష్టులగుటయేగాక, వేదోక్తప్రకారము జపతపములఁ జేయువారిని సహితము భ్రష్టులఁజేయుటకుఁ బ్రయత్నించెదరు; అట్టివారు నరకములో నొక్కొక్కకల్పము నివసించెదరు. వారు స్వప్రయోజన సిద్ధికొఱకు, వేదములో మిథ్యాదోషములఁ జూపించి, కాష్ఠవాదముఁ జేయుచుండిరి; తైలికులు, కుమ్మరులు, చండాలులు, కిరాతులు, కోలులు, కలవారులు (కల్లుఁదీయువారు) ఈ మొదలగు నీచ వర్ణములవారు, భార్యావియోగముచేతను ధనము లేకపోవుటచేతను, శిరస్సును ముండనముఁ జేయించుకొని, సన్యాసివేషమును ధరించెదరు; అట్టిసన్యాసులను బ్రాహ్మణులు తెలిసికొనలేక, పూజించెదరు; ఆ సన్యాసు లిహపరలోకములకు దూరస్థులు కాఁగలరు. ఇఁకను బ్రాహ్మణులు నిరక్షరకుక్షులు; లోభులు; కాములు; ఆచారరహితులు;

---

డుఁడు పలికెను. "ఓయీ! పరిహాసమునకుఁ జెప్పియుంటిని; కాని, నిజముగ నేను బ్రహ్మజ్ఞానినిగాను; నీపుణ్యముండును; నన్ను విడిచిపెట్టుము" అని వాఁడు బ్రతిమాలుకొనెను. ఈవృత్తాంతము నగరమంతట వ్యాపించెను. ఇంతకుముందు బ్రహ్మజ్ఞానులమని ప్రగల్భములఁ బలుకుచుండిన వారందఱు బ్రహ్మజ్ఞానులము కామనిచెప్పి పారిపోయిరి. ప్రథమమున వైద్యునితోఁ బ్రసంగించిన గృహస్థుసహితము బ్రహ్మజ్ఞానిని కానని చెప్పి, వైద్యునిఁ బ్రతిమాలుకొనెను. నామకార్థమేగాని, నిజముగ బ్రహ్మజ్ఞానులు నగరములో లేరని రాజు గ్రహించి, వైద్యునిఁజూచి "అయ్యా! బ్రహ్మజ్ఞానులు లేదుకదా! ఎట్లు మందు మీరు చేయఁగలరు?" అని యడిగెను. "ఓ రాజా! ఒక ప్రక్రియప్రకారము, బ్రహ్మజ్ఞానులతైలముతో నామందుఁ జేయవలయును; అది సంప్రాప్తము కానపుడు, మఱియొక ప్రక్రియప్రకారము మందుఁజేయఁగలను" అని వైద్యుఁడు సమాధానముఁ జెప్పెను.

మూర్ఖులు; వృషలులు (శూద్రస్త్రీసంభోగులు). జపములు, తపములు, వ్రతములు, దానములు, మొదలగునవి శూద్రులాచరించెదరు; ఉన్నతాసనాసీనులై, వారు పురాణములఁ బఠించెదరు; వారివారి బుద్ధికిఁ దోఁచినవిధమున మనుజులు సంచరించెదరు; ఆహా! ఓ గరుడా! వారి యధర్మప్రవర్తనలకంతము లేదు; వానిని వర్ణింపఁజాలను; లోకమునకు దుర్దశసంభవించును.

దోహా 146, 147

"కలియుగములో వర్ణసంకరమగును; ఎవనిమగ్గమునకు వాఁడే సేనాపతి; లోకమర్యాదలు నశించును; లోకము పాపముతో నిండును; పాపభయము వారికి లేదు; భయము, రోగము, శోకము, వియోగము మొదలగు పాపఫలముల ననుభవించెదరు; వేదసమ్మతమగు నారాయణుని భక్తిమార్గములో వైరాగ్యమును వివేకమును గలవు; అయినను, మోహమునకు వశ్యులై, వారు నూతనమార్గములను గల్పించి, వానివెంబడి గమనించుటచేత, ననేకదుఃఖముల ననుభవించెదరు.

ఛాంద్ 22, 23, 24

"ఓ గరుడా! గృహముగాని ధనముగాని లేనివాఁడే సన్యాసి కదా! వైరాగ్యసంపూర్ణుఁడే సన్యాసికదా! అట్టి సన్యాసులకా కలియుగములో దివ్యభవనములుండును; వారి గృహమునిండ ధనరాసులుండును; వారు విషయాసక్తులై యుండెదరు; తపశ్శాలులు ధనము నార్జించెదరు; గృహస్థులు నిర్ధనికులు; ఓ తాతా! కలియుగ కౌతుకముఁజెప్ప శక్యముకాదు; వారు కులస్త్రీలను గృహములనుండి వెడలఁగొట్టి, నీచకులస్త్రీలను గృహములలో నుంచెదరు; వారు కులాచారములను విడిచిపెట్టెదరు; ఎంతవఱకుఁ గుమారుఁడు తనభార్యముఖముఁజూడకయుండునో, వాఁడంతవఱకు జననీజనకులమాటప్రకారము సంచరించును; ఎంతటనుండి వాఁడు శ్వశురగృహసుఖము ననుభవించునో, వాఁడంతటనుండి స్వకుటుంబీకులను శత్రువులని తలంచును. పాపపరాయణులై, రాజులు, ధర్మమార్గములను విడిచి, ప్రజల ననేకవిధములదండించి, బాధించెదరు; మలీనుఁడగు ధనికుఁడే, కులీనుఁడు; నిర్ధనికుఁడగు కులీనుఁడే, మలీనుఁడు; జపతపములను, బూజలను

బ్రాహ్మణులు విడిచిపెట్టఁగలరు; ఒక యజ్ఞోపవీతమునుమాత్రమే వారు ధరించెదరు; దిగంబరియగు పాపాత్ముఁడే, తపస్వి; వేదపురాణముల సంగతిఁ దెలిసికొననివాఁడే, హరిదాసుఁడు; సజ్జనుఁడు. కవీశ్వరుల మాటను మన్నింపరు; వారినిసహిత మాదరింపరు; అందఱును గుణదూషకులు; యథార్థవాదులు లోకవిరోధులు; మాటిమాటికిఁ గఱువులు సంభవించును; తినుటకన్నములేక మనుజులు గతించెదరు.

దోహా 148, 149

"ఓ గరుడా! కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, దంభము, పాషండము—వీనితో లోకము పూరించియుండును. జపములు, తపములు, వ్రతములు, దానములు, యజ్ఞములు, ధర్మములు—ఈమొదలగువానిని మనుజులు తామసులై యాచరించెదరు. (పరుల కపకారముఁ జేయుటకును, బరులను హింసించుటకుఁ జేయునట్టికపటకర్మకు తామసకర్మ యని పేరు). మారణహోమములఁ జేసి, యుచ్చాటనమంత్రములను వారు జపింతురు; కాలమునకు మేఘుఁడు వర్షింపఁడు; భూమిలో నాటినవిత్తులు మొలకెత్తవు.

ఛాంద్ 25, 26

"ఓగరుత్మంతా! అబలలు కచభారులు; క్షుత్పీడితులు. దరిద్రులు దుఃఖభాగులు; స్వార్థపరులు; దురభిమానులు. మూర్ఖులు సుఖవంతులు; ధర్మహీనులు. వారికి న్యాయము లేదు; వారికుటిలబుద్ధి కాఠిన్యమును వహించును; లేశమైనఁ గోమలత్వము వారికి లేదు. మనుజులు రోగపీడితులు; సుఖములుగాని భోగములుగాని వారికి లేవు. కారణములేకయే వారు దురభిమానులై, పరులతోఁ గలహించెదరు. అల్పతరాయువులు; వారిజీవితమంతయు పదునయిదు సంవత్సరములు; అయినను, నహంకారముమాత్రము వారిని విడిచిపెట్టదు; అందుచేత, వారు కల్పాంతముపఱకు జీవించియుండెదమని తలఁచి, ప్రయత్నించెదరు. కలియుగమునందు సాంఘికధర్మములు చెడిపోవును; అనుజులుగాని తనుజులుగాని పెద్దలయాజ్ఞలను మన్నింపరు; సంతోషము,

విచారణ, శీలత్వము—ఇవియన్నియు నశించును; వర్ణములు సంకరమగును; వర్ణాశ్రమధర్మములు నశించును; వైరము, కాఠిన్యము, కపటము, చంచలత్వము—ఈ మొదలగునవి పూర్ణించియుండును; మిత్రభావము నామావశిష్టము; వారిని వియోగదుఃఖము నులుపులుపెట్టుచుండును; ఇంద్రియనిగ్రహముగాని, దానముగాని, దయగాని, వ్యాపారముఁ జేయువారికి యుండవు; జడత్వమును, లౌకికము సర్వత్ర వ్యాపించును.

దోహా 150, 151

"ఓ నాగాంతకుఁడా! కలికాలము పాప - దుర్గుణభూయిష్ఠమగును; అయిన, నొకగొప్పవిశేషము కలదు; ప్రయాసము లేకయే, మోక్షము జెందవచ్చును. కృత, త్రేతా, ద్వాపరయుగములలో, యజ్ఞము, యోగము, పూజ—వీనిమూలమున మనుజులకు గతియుండెను; కాని, కలియుగములోమాత్రము, హరినామమును స్మరించిన మాత్రమున, మనుజులకు ముక్తి కలదు.

చౌపాయి 99

"ఓ గరుడా! కృతయుగములో నందఱు జ్ఞానులు; విజ్ఞానులు; యోగులు; హరిని ధ్యానించి, సద్గతికిఁ బోయిరి. త్రేతాయుగములో ననేకవిధముల యజ్ఞాదిక్రతువుల నాచరించి, మనుజులు వానిఫలమును హరికి సమర్పించి, సంసారసాగరమును దాఁటిరి. ద్వాపరయుగములో రఘునాథునిచరణములఁ బూజించి, మనుజులు భవసాగరముయొక్క యొడ్డుఁజేరిరి. కలియుగములో హరినామమును స్మరించినను, హరిగుణములను గానముఁజేసినను, సంసారసాగరముయొక్క లోఁతును కనుఁగొందురు. కలియుగములో యోగములు, యజ్ఞములు, జ్ఞానము—ఈ మొదలగువానిప్రయోజనము లేదు; కేవలము రామునిగుణములను గానముఁ జేయుటయే యాధారము; సర్వధర్మములను బరిత్యజించి, రాముని శరణుచొచ్చి, యతనిని భజించుటయే ముఖ్యము; భక్తిశ్రద్ధలతో రామునిగుణములను గానముఁ జేయుటయే వారికిఁ బ్రధానము. ఈ ప్రకారము జేసినయెడల, సంసారబంధనములను విడఁగొట్టుకొనుటకు సందేహము లేదు; కలియుగములో రామనామప్రతాపమే ప్రకట

మగును; ఆనామముయొక్క ప్రభావమువలన, మనస్సు నిర్మలమగును; పుణ్యము కలుగును; పాపము నశించును; ఇదియే కలియుగములోని విశేషము; ఇంతకంటె విశేషమేమికలదు?

'శ్లో. కృతే యద్ధ్యాయతో విష్ణుం, త్రేతాయాం యజతో మఖైః
ద్వాపరే పరిచర్యాయాం, కలౌ తత్ హరికీర్తనాత్.' భాగ.

దోహా 152, 153

"ఓ గరుత్మంతుఁడా! కలియుగముతో సమానమగుయుగము మఱియొకటి లేదు; ఎవరు నిశ్చయముగ రాముని విశ్వసించి, యతని గుణములను గానముఁ జేయుదురో, వారు ప్రయాసములేకయే సంసారము నిస్సారమని తెలిసికొని, దానిని దాఁటఁగలరు; శ్రీరాముని నామమువలననే, సర్వసిద్ధులఁ బొందవచ్చును. (శ్లో. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ.' భగ - గీ - 18 - అధ్యా - ప్రమాణము.) ఓ తాతా! ధర్మమునకు నాలుగుపాదములు; సత్యము, శౌచము, తపము, దానము—ఈనాలుగును నాలుగుపాదములు; వీనిలో నొకటియే, కలియుగములోఁ బ్రధానము; భగవంతునికటాక్షము వలన, నెవనిశక్తికొలఁది వాఁడు దానముఁ జేయవలెను. దానమువలన, సకలకల్యాణములు సమకూడును. (శ్లో. 'తపఃపరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే, ద్వాపరే యజ్ఞమేవాహు ర్దానమేకం కలౌయుగే')

చౌపాయ్ 100

"ఓ వైనతేయా! శ్రీరామునిమాయాప్రభావమువలన, నాయా యుగముల కనుగుణ్యముగ మనుజులు ధర్మముల నాచరించెదరు; శుద్ధము, సత్యము, మిత్రభావము, విశేషఅనుభవజ్ఞానము, మనస్సంతుష్టియు—ఈగుణము లేసమయమునఁ బ్రకటమగునో, నప్పుడు కృతయుగము వచ్చెనని తెలిసికొనుము; కొంచెము రాజసముతోఁగూడిన సత్త్వగుణమును మనస్సంతుష్టి యుండినపుడు త్రేతాయుగధర్మములు ప్రవర్తించెనని తెలిసికొనుము. సత్త్వగుణము తగ్గి, రజోగుణ మధికమై, దానితోఁ దామసగుణము కొంచెము కలసి, మనస్సునకు హర్ష

శోకములు రెండు నుండినపుడు, ద్వాపరయుగము ప్రవేశించెనని గ్రహింపుము. రాజసము కొంచెము, తామసము సంపూర్ణముగను, అంతఃశత్రువులు నల్వురును మనస్సును బాధించునపుడును, గలియుగ ధర్మములు ప్రవర్తించెనని తెలిసికొనుము. పండితులు యుగధర్మములను లెస్సగ మనస్సులో విచారించి, పూర్వయుగధర్మముల నాచరింపక, కేవలము రామనామమునే జపించెదరు; వారే రామునిచరిత్రను జెప్పుచుందురు; వినుచుందురు; అధర్మమును విడిచి, వారు ధర్మము నాచరించెదరు. కలియుగములో, రామునిచరణములయందుఁ బవిత్రమగు ప్రీతిఁ గలవానికి, నధర్మమనుమాట యుండదు. ఓ గరుత్మంతా! నాటకునికపటనాట్యములు వానిసేవకులయందు వ్యాపించునా? అటులనే, కలియుగకపటవ్యాపారములు హరిదాసులయందుఁ బ్రవర్తింపవు.

దోహా 154, 155

"హరియొక్క మాయచే సృజింపఁబడిన గుణదోషములు, హరిభజనలేక పోఁజాలవు; అందుచేత, సకలకామములను విడిచి, రాముని భజించుటయే శ్రేష్ఠము. ఓ తార్క్ష్యా! ఆ కలియుగములోఁ గొన్ని సంవత్సరములు నే నయోధ్యానగరములో నివసించియుంటిని; అంతట నానగరములో క్షామము వచ్చెను; అందుచేత, నేను దుఃఖించి, ఆ నగరమును విడిచి, పరదేశమునకు వెళ్లియుంటిని."

## సప్తమవిశ్రామము.

చౌపాయీ 101

"ఓ గరుడజీ! అప్పుడు నేను కటికదరిద్రుఁడను; అతిదీనుఁడను; మలినవస్త్రములను ధరించి, దుఃఖించుచు, నుజ్జయినీనగరములోఁ బ్రవేశించితిని; కొన్ని దినములు గతించినతరువాత, నేను గొంతధనము నార్జించితిని; అంతటనుండి, పూర్వమువలె శివుని యారాధించుచుంటిని. ఆనగరములో నొక వైదికబ్రాహ్మణుఁడు శివునిఁ బూజించుచుండెను;

అతనికి మఱియొక ప్రయోజనములేదు; అతఁ డత్యంతసాధువు; పరమార్థచింతఁ గలిగియుండెను; శివుని యారాధించుచుండినను, విష్ణువుని నిందింపఁడు; (అజ్ఞానులగు వైష్ణవులు శివుని, శైవులు విష్ణుని నిందించెదరు.) కపటముతో నే నతనిని సేవించితిని; ఆబ్రాహ్మణుఁడు పరమ దయాళువు; నీతిమార్గప్రవర్తకుఁడు; దేవునివంటి యాబ్రాహ్మణుఁడు నావినయవిధేయతలఁ జూచి, నన్ను తనపుత్రునివలె భావించి ప్రేమించెను. ఆబ్రాహ్మణుఁడు శివపంచాక్షరీమంత్రమును నా కుపదేశించెను; అంతియకాదు; అనేకవిషయములను బోధించెను; నేను శివాలయములోఁ గూర్చుండి శివమంత్రమును జపించుచుంటిని; కాని, నాహృదయములో దాంభికమును పాషండము నధికమయ్యెను.

దోహా 156

"ప్రథమమున నేను దుష్టుఁడను; పాపబుద్ధిఁ గలవాఁడను; నాజాతి నీచమయినది; అందులో, మోహములోఁ బడియుంటిని; కనుక, హరిదాసులగు బ్రాహ్మణులఁ జూచి, నేను మండిపడుచుంటిని; ఎంతవఱకు నేను విష్ణువునకు ద్రోహముఁ దలఁచితినో అంతవఱకు నాబుద్ధి కలుషమయ్యెను.

సోరఠా 15

"నాగురువు నాయాచరణవిధానములను నిత్యముఁ జూచి, విచారించి, యనేకవిధముల బోధించి, నన్ను మందలించెను. అందుచేత, నతనిపై నాకుఁ గ్రోధము పుట్టెను. నీతియుక్తమగు మాటలవలన, పాషండులబుద్ధి తిరుగునా?

చౌపాయీ 102

"ఒకదినమున నాగురువు నన్నుఁ బిలిచి, యనేకనీతులను నాకు బోధించెను; పిమ్మట, నతఁడు నన్నుఁజూచి, 'ఓ పుత్రా! శివుని సేవించుటవలన నేమిఫలము కలుగును? శ్రీరాముని చరణకమలములయందు నిశ్చలభక్తి కలుగుటయే, దానిఫలము. ఓ శిష్యా! బ్రహ్మమహేశ్వరులే రాముని సేవించెదరుకదా! ఇఁకను పామరులగు మనుజులమాట చెప్పనేల? ఓరినిర్భాగ్యుఁడా! ఓరిమూర్ఖుఁడా! ఎవనిచరణములను బ్రహ్మమహేశ్వరులు సేవించెదరో, నీ వటువంటివానికి ద్రోహముఁ

దలంచితివికదా! నీకేమి శ్రేయస్సు కలుగును?' అని పలికి నన్ను మందలించెను. ఓ గరుడజీ! శివుఁడు నారాయణుని సేవకుఁడని నాగురువు చెప్పినమాటను విని, నామనస్సు మండిపడెను. నేను క్షుద్రుఁడను; ఎంతవిద్యను నేర్చుకొనిన నేమి ప్రయోజనము? పాలుఁబోసి పామును బెంచినట్లయ్యెను. నేను దురభిమానిని; నాస్వభావము కుటిలము; నీచకులములోఁ బుట్టియుంటిని; దౌర్భాగ్యుఁడను; దివారాత్రములు గురువునకు ద్రోహముఁ జేయవలయునని తలంచుచుంటిని. నాగురువు మాత్రము పరమదయాళువు కనుక నాయందు లేశమైన యతనికిఁ గ్రోధము లేదు; యథాప్రకార మతఁడు మాటిమాటికి నాకు బుద్ధిఁ జెప్పుచుండెను. ఎవనివలన నభివృద్ధిలోనికి వచ్చునో, వానినే నాశముఁ జేయుటకు నీచపురుషుఁడు ప్రయత్నించును. ఇందుకు దృష్టాంతము వినుము; అగ్నిలోనుండి ధూమము పుట్టును; ఆధూమమే మేఘమగును; నిప్పు నామేఘము చల్లార్చునుకదా! మార్గములోఁ బడియుండినధూళిని జనులు నిరాదరించెదరు; నిత్యము వారిచరణప్రహారములను సహించును; ఆధూళి పవనప్రేరితమై, ప్రథమమున మీఁదికి యెగిరి, యంతరిక్షమును మలినముఁ జేయును; తదుపరి, రాజుకిరీటము నిండఁ బడి, దానిని మలినముఁ జేయును. అనంతరము రాజునేత్రములలోఁ బడి, యతనిని దుఃఖపెట్టును. ఓ గరుడా! పండితులీసంగతిఁ దెలిసికొని నీచుల సాంగత్యమును విడిచెదరు. దుష్టులతో సహవాసముగాని విరోధముగాని చేయఁగూడదని పండితులును గవులును జెప్పుచున్నారు. ఇంతకంటె మంచిమాట యేది? వారిని నిర్లక్ష్యముగ జూచుటయే మంచిది; వారితో విరోధముగాని స్నేహముగాని కూడదు; అశుచియగు శునకమును దగ్గఱఁ బెట్టుకొందుమా! అటులనే, దుర్మార్గునిఁ జేరఁదీయరాదు. నే నొకదుష్టుఁడను; నామనస్సు కపటము; నాస్వభావము కుటిలము; నాగురువు చెప్పుచుండిన హితోపదేశములు నాచెవిఁ బట్టలేదు; నాహృదయమున నాఁటుకొనలేదు.

దోహా 157, 158

"ఓ గరుడా! ఒకదినమున నేను శివాలయములోఁ గూర్చుండి, శివమంత్రమును జపించుచుంటిని; ఆసమయమున నాగురువు శివాల

యములోనికి వచ్చెను; నేను లేచి, యతనికి నమస్కరింపలేదు; 'ఈసమయమున నేను శివాలయములోఁ గూర్చుండి, శివమంత్రమును జపించుచుంటిని, కనుక, నే నతనికి నమస్కరింపఁ బనిలేదు' అని నేను తలంచితిని. నాగురువు పరమదయాళువు కనుక నేను చేసిన యమర్యాద నతఁడు పాటింపలేదు; అతనికి నాయందు లేశమైన క్రోధములేదు; అయినను, గురువునకు నమస్కరింపక పోవుటవలన నాకుఁ బాపము వచ్చెను; నా దౌర్జన్యమును శివుఁడు సహింపలేదు. 'ఓ దౌర్భాగ్యుఁడా! నీచుఁడా! మూర్ఖుఁడా! నీగురువు సజ్జనుఁడు; అతనికిఁ గ్రోధము లేదు; అతనిచిత్తము కృపాయత్తము; అతఁడు సంపూర్ణజ్ఞాని; జ్ఞానులకు మానావమానములు సమానము. ఓరీదుష్టుఁడా! అయినను, నిన్ను నే శపించెద; నీతిమార్గముఁ దప్పిన నీవంటినీచుని నేను జూడలేను. నేను నిన్ను దండింపనియెడల, నేను శ్రుతిమార్గమును తప్పినవాఁడను గాఁగలను; గురువునకు లేచి నమస్కరింపనివాఁడును, గురువుయం దీర్ష్యకలవాఁడును, రౌరవనరకములో నూరుకల్పములు పడియుండవలెనని వేదము చెప్పుచున్నది; అంతియకాదు; సర్పాదినీచయోనులయందుఁ బుట్టి, పదివేలసంవత్సరములు కష్టము ననుభవించును; ఇదియంతయు నీవు తప్పక యనుభవించెదవు. ఓరీ పాపాత్ముఁడా! అజగరమువలెఁ గూర్చుండి, గురువుంజూచి, నీవు లేచితివి కావు; కనుక, నీవు సర్పమై పుట్టుము; చెట్టుతొఱ్ఱలో నివసింపుము; నీబుద్ధి చెడిపోవునుగాక! నీవు మహానీచగతిఁ బొందుము' అని మందిరములో నంతరిక్షమునుండి శివునివాక్యము వినఁబడెను.

దోహా 159, 160

"ఈ ఘోరమగు శివునిశాపమును గురువు విని హాహాకారముఁ జేసెను; గడగడ వడఁకుచుండిన నన్ను నా గురువుచూచి, కడుదుఃఖించెను. నాగురువు శివునకు దండప్రణామముఁ జేసి, చేతుల జోడించుకొని నిలువఁబడి, వినయవిధేయత లొలుకుచుండ, మృదుమధురవాక్యములతో నిట్లు శివునిఁ బ్రార్థించెను; ఆప్రార్థనయే రుద్రాష్టకమని ప్రసిద్ధికెక్కెను.

ఛాందు 27

రుద్రాష్టకము.

'శ్లో. నమా మీశ మీశాన నిర్వాణరూపం
విభుం వ్యాపకం బ్రహ్మవేదస్వరూపం,
అజం నిర్గుణం నిర్వికల్పం నిరీహం
చిదాకాశ మాకాశవాసం భజేహం. ౧

ఓ ఈశాన ఈశా! ఓ ముక్తిరూపా! నీవు సర్వసమర్థుఁడవు, సర్వ వ్యాపకుఁడవు, బ్రహ్మవు, వేదస్వరూపుఁడవు, స్వయము ప్రకటన మయినవాఁడవు, గుణములు లేనివాఁడవు, వికల్పము లేనివాఁడవు, చేష్టారహితుఁడవు, చిన్మయుఁడవు (చైతన్యస్వరూపుఁడవు), ఆకాశము వలె సర్వవ్యాపకుఁడవు.

శ్లో. నిరాకార మోంకారమూలం తురీయం
గిరాజ్ఞాన గోతీత మీశం గిరీశం,
కరాళం మహాకాలకాలం కృపాలుం
గుణాగారసంసారసారం నతోహం. ౨

ఆకారరహితుఁడవు, ఓంకారమునకు నీవే మూలము, తురీయ అవస్థలో నుండువాఁడవు (మూఁడవస్థలకుఁ బరుఁడవు), వచనములకును, జ్ఞానమునకును, నింద్రియములకుఁ బరుఁడవు, ఈశ్వరుఁడవు, కైలాస రాయుఁడవు, కఠినమగు మహాకాలమునకు నీవు కాలుఁడవు, కృపాళుఁడవు;

శ్లో. తుషారాద్రి సంకాశ గౌరం గభీరం
మనోభూతకోటి ప్రభాసీ శరీరం,
స్ఫురన్మౌలి కల్లోలినీ చారు గంగా
లసద్భాల బాలేందు కంఠే భుజంగా. ౩

హిమాలయపర్వతముతో సమానమగు గంభీరమయిన గౌరవర్ణ శరీరము కలవాఁడవు; నీశరీరము కోటి కామదేవులవలెఁ బ్రకాశించును; నీమస్తకముపై నాడుచుండిన గంగ కలదు; నీలలాటమునం దర్ధచంద్ర

బింబము శోభించును; సర్వభూషణములు నీకంఠమునకుఁ గలవు; ఇట్లు నీ యలౌకికచమత్కారము ప్రకటమగుచున్నది.

శ్లో. చలత్కుండలం శుభ్రనేత్రం విశాలం
ప్రసన్నాననం నీలకంఠం దయాళుం,
మృగాధీశ చర్మాంబరం ముండమాలం
ప్రియం శంకరం సర్వనాథం భజామి. ४

నీ చెవులకువ్రేలుచుండిన కుండలములు కలవు; నీ నేత్రములు విశాలమయినవి; నీ ముఖము సదా ప్రసన్నము; నీకంఠము నీలము; దయానిధివి; నీవు సింహచర్మమును ధరించెదవు; నీమెడలోఁ గపాల మాలిక వ్రేలుచుండును; అది నీకుఁ బ్రియము; సర్వమునకు నాథుఁ డవు; కల్యాణకారకుఁడవు కనుక శంకరుఁడవు; ఓ స్వామీ! అట్టి నిన్ను భజించెదను.

శ్లో. ప్రచండం ప్రకృష్టం ప్రగల్భం పరేశం
అఖండం అజం భానుకోటిప్రకాశం,
త్రిధాశూలనిర్మూలనం శూలపాణిం
భజేహం భవానీపతిం భావగమ్యం. ౫

అతితీక్ష్ణముఁ గలవాఁడవు, అతియుత్తముఁడవు, అతిప్రగల్భుఁ డవు, పరేశుఁడవు, అఖండుఁడవు, అజుఁడవు, కోటిసూర్యులకాంతిఁ గలవాఁడవు, మూఁడుశూలములను నాశనముఁ జేయువాఁడవు, త్రిశూలమును ధరించినవాఁడవు, భావించినమాత్రమున, భక్తులకుఁ బ్రాప్తించెదవు; నీకు, ఓ స్వామీ! దండప్రణామముఁ జేయుచున్నాను.

శ్లో. కలాతీత కల్యాణ కల్పాంతకారీ
సదా సజ్జనానంద దాతా పురారీ,
చిదానంద సందోహ మోహాపహారీ
ప్రసీద ప్రసీద ప్రభో మన్మథారీ. ౬

కాలమున కతీతుఁడవు, కల్యాణరూపుఁడవు, ప్రళయముఁ జేయువాఁడవు, సదా సజ్జనుల కానందముఁ గలుగఁజేయువాఁడవు, త్రిపురములను సంహరించితివి, చిదానందసందోహమూర్తివి, మో

హాము నపహారించెదవు, మన్మథుని జయించితివి; ఓ స్వామీ! కటా క్షించి, నన్ను రక్షింపుము.

శ్లో. న యావ త్సతీనాథ పాదారవిందం
భజంతీహ లోకే పరేవా నరాణాం,
న తావత్సుఖం శాంతి సంతాపనాశం
ప్రసీద ప్రభో సర్వభూతాదివాసం. ౭

ఓ ఉమానాథా! ఎంతవఱకు జీవులు నీ పాదారవిందములను సేవింపరో, వా రంతవఱకు నిహపరలోకములో సుఖమునుగాని శాంత మునుగాని పొందరు; వారిసంతాపము నశింపదు; ఓ స్వామీ! సర్వ భూతములు నీయందే నివసించియుండును; ప్రసాదింపుము.

శ్లో. న జానామి యోగం జపం నైవ పూజాం
నతోఽహం సదా సర్వదా శంభుతుభ్యం,
జరా జన్మ దుఃఖౌఘతా తప్యమానం
ప్రభో పాహి శాపా న్నమా మీశ శంభో. ౮

యోగమును జపమును తపమును నే నెఱుంగను; హే శంభో! కేవలము నేను నీకు నమస్కారముఁ జేయుచున్నాను; సదా నీకు నమ స్కారము; వృద్ధాప్యముచేతను, జననమరణదుఃఖములచే దుఃఖించు చున్నవాఁడను; నేను నీ శరణుఁజొచ్చెద; ఓ నాథా! ఈనాశిష్యుని శాపమునుండి తప్పింపుము; మాటిమాటికి నమస్కరించుచున్నాను.'

శ్లో. రుద్రాష్టక మిదం ప్రోక్తం విప్రేణ హరతుష్టయే,
యే పఠంతి నరా భక్త్యా తేషాం శంభుః ప్రసీదతి.

ఈ రుద్రాష్టకమును బ్రాహ్మణుఁడు చెప్పి, సాంబశివునకు సమర్పిం చెను; దీనిని భక్తిశ్రద్ధలతోఁ జదివినవారిని శివుఁడు ప్రసాదించును.

దో॥ 161, 162, 163, 164

"శ్రీసదాశివుఁడు బ్రాహ్మణుని విజ్ఞాపనమును విని, సంతుష్టాంత రంగుఁడై, ప్రసన్నుఁడై, 'ఓ విప్రుఁడా! నీమీఁద నాకు దయవచ్చెను; వరము నడుగుము.' అని మందిరములో నంతరిక్షమునుండి పలికెను. అంతట బ్రాహ్మణుఁడు చేతుల జోడించుకొని, 'ఓ నాథా! నీకు నా

మీఁద దయవచ్చినయెడల, నీవు దీనులను రక్షించువాఁడవు కనుక, నీచరణములయందు నాకు నిశ్చలభక్తి యుండునట్లు ప్రసాదింపుము; ఓ స్వామీ! నాప్రార్థన మఱియొకటి కలదు; ఈ నాశిష్యుఁడు మూర్ఖుఁడు; నీమాయకు వశ్యుఁడు; కనుక, మాయకు లోఁబడి, వాఁడు తిరుగుచుండును; హే కృపాసింధో! ఓ భగవంతుఁడా! ఈ నాశిష్యునియందుఁ గ్రోధమును విడిచిపెట్టుము. ఓ శంకరా! ఓ కల్యాణకర్తా! ఓ దీనదయాపరమూర్తీ! ఈ నాశిష్యుని రక్షింపుము; వానిని శాపము నుండి యుద్ధరింపుము; ఓ స్వామీ! ఇంతలోనే వాఁడు నీశాపానుగ్రహముఁ బొందుఁగాక! నీశాపవిముక్తి యగుఁగాక!

## చౌపాయ్ 104

" 'ఓ శంకరుఁడా! ఓ కల్యాణకర్తా! ఇట్లు నీవు ప్రసాదింపుము; వానికి మంగళమగుఁగాక!' అని ప్రార్థించెను. నాగురువుయొక్క పరోపకారబుద్ధికి శివుఁడు మెచ్చుకొని, 'తథాస్తు' అని పలికి 'ఓ బ్రాహ్మణుఁడా! ఈ నీశిష్యుఁడు దారుణమగు పాపముఁ జేసినను, నేను క్రోధించి వానిని శపించినను, నీసాత్త్వికస్వభావముఁ జూచి, నేను మరల వానిం గటాక్షించితిని; క్షమాశీలురును, పరోపకారులు నగు బ్రాహ్మణులు నాకును రఘునాథునకును సమానముగ ప్రియులు; ఓ బ్రాహ్మణుఁడా! నాశాపముమాత్ర మసత్యము కాదు; వాఁడు తప్పక సహస్రజన్మముల జన్మింపవలెను; ఏజన్మములో నయినను, వానికి పూర్వజ్ఞాన ముండును; దీనికి నామాటే ప్రమాణము. జననమరణములవలనఁ గలిగెడిదుఃఖము లేశమపి వానికి యుండదు; ఓరీ శూద్రుఁడా! నీవు రామునినగరములో జన్మించితివి; పిమ్మట నీవు నన్ను సేవించుచుంటివి; ఆ నగరముయొక్క ప్రభావమువలనను, నాయనుగ్రహముచేతను, రామునియందు నిశ్చలభక్తి నీహృదయములోఁ బుట్టును; ఓయీ! ఈ నామాటను వినుము; నామాట సత్యము; అన్నిమాటల సారాంశము; బ్రాహ్మణులను సేవించుటవలన, హరిని సంతోషింపఁ జేయువ్రతము సిద్ధించును. ఇఁక ముందుకు బ్రాహ్మణులను నిరాదరింపకుము; వారు స్వతంత్రులనియు ఈశ్వరునితో సమానులనియు తెలిసికొనుము. ఇంద్రునివజ్రము, నాత్రిశూలము, యమునిదండము, విష్ణునిచక్రము—ఇవి యొకానొక

ష్పుడు మనుజులఁ జంపవచ్చును లేకపోవచ్చును; కాని, బ్రాహ్మణుని క్రోధాగ్ని వారిని భస్మముఁజేయును. ఈ జ్ఞానమును సదా నీలక్ష్యములో నిడుకొనుము; దుర్లభమగునది యొకటి నీకు లోకములో నుండదు. మఱియొకవిధమున నిన్నాశీర్వచించెదను; నీస్వచ్ఛందవిహారములకు నిరోధకముండదు.' అని శివుఁడు చెప్పి, నన్నుఁ బ్రసాదించెను.

దోహా 165, 166, 167, 168

"ప్రేమరసపూరితమగు శివునివచనములను నాగురువు విని సంతోషించి, 'తథాస్తు' అని పలికెను. అనంతర మతఁ డనేకవిధముల నన్ను బోధించి, శివునిచరణారవిందములను హృదయమునందు ధ్యానించుచు, స్వగృహమునకు వెళ్లెను. కొంత కాలమునకు నేను మృతినొంది, యా వెంటనే వింధ్యాచలపర్వతముమీఁద నొక సర్పమునై పుట్టియుంటిని; ఓ గరుడజీ! కొంచెము కాలములోనే, నే నాశరీరమును శ్రమ లేకయే విడిచిపెట్టితిని. నే నేశరీరమును ధరించినను, దానిని ననాయాసముగ విడిచిపెట్టఁగలను; శరీరమును ధరించినపుడును లేశమపి నాకు శ్రమయుండదు. ఏవిధమున మనుజులు జీర్ణవస్త్రములను విడిచి, నూతన వస్త్రములను ధరించెదరో, శరీరధారణయు విసర్జనయు నట్లేయని తెలిసికొనుము. శివుఁడు వేదములమర్యాదను నిలిపెను; నాకు లేశమపి క్లేశము లేకపోయెను; ఈ ప్రకార మనేకశరీరములను నేను ధరించితిని; కాని, ఓ గరుడుఁడా! నా పూర్వజ్ఞానము పోలేదు; అది సంపూర్ణముగ నుండెను.

చౌపాయ్ 105

"నేను సర్పాదులయందుఁ బుట్టి శరీరములను ధరించియుండినను, రఘునాథునియందలి భక్తిమాత్రము సదా నే ననుసరించియుంటిని. నాగురువుయొక్క సుశీలమును సాత్త్వికస్వభావమును సదా నాజ్ఞప్తిలో నుండినందున, నే నందులకుమాత్రము విచారించుచుంటిని. తుదకు, నేను చర్మదేహమును ధరించి, యొక్కబ్రాహ్మణునిగర్భమున జన్మించితిని; ఆ మానవశరీరము దేవతలకు సహితము దుర్లభము; అట్లు వేదములు చెప్పుచున్నవి. బాలురతోఁగూడి యాటపాటలలో వినోదించుచుండినను, రఘునాథునిచర్యలనే చేయుచుంటిని. అంతకం

తను వయస్సు వచ్చెను; అప్పుడు నాతండ్రి నాకు విద్యాభ్యాసముఁ జేయించెను; శ్రవణనిధిధ్యాసనము లేవియు నాకు బోధపడలేదు; అన్ని వాసనలు నామనస్సును విడిచిపెట్టెను; నామనస్సు రామునిచరణములయందే లీనమై యుండెను.

(శ్లో. పూజా కోటిసమం స్తోత్రం స్తోత్రకోటిసమం జపః,
జపకోటిసమం ధ్యానం ధ్యానకోటిసమో లయః.)

"ఓ గరుడుఁడా! ఏ మందభాగ్యుఁడు భక్తియనునట్టి కామధేనువును విడిచి, గాడిదను బట్టుకొనును? నేను భక్తిలో మగ్నమైయుంటిని. కనుక నాతండ్రిమాటలు నాకు బోధపడలేదు. నాతండ్రికి సహితము విసుగుపుట్టెను. కొంతకాలమునకు నాతల్లిదండ్రులు కాలునకు వశ్యులయిరి; జనులను రక్షించు భగవంతుని భజించుటకు నేను వనమునకు గమనించితిని; ఆయాస్థలములలోనుండిన మునీశ్వరుల యాశ్రమములకు వెళ్లి, వారికి నేను నమస్కరించితిని. రఘునాథునికథఁ జెప్పుమని వారిని నే నడిగియుండినందున, వారు నాకు రామకథఁ జెప్పుచుండిరి; నే నిట్లు రామకథనువినుచుఁ గాలముఁ గడపి, యొకస్థలమునుండి మఱియొకస్థలమునకు గమనించుచుంటిని; ఇదియంతయు శివునిప్రసాదమువలన జరగెను. ఈ మూలమున నా యీషణత్రయము నశించెను; నాహృదయము నిర్మలమయ్యెను; నామనస్సులో నొకకోరికమాత్ర మధికమయ్యెను. 'నే నెప్పుడు రామునిచరణారవిందములఁ జూడఁగలను? నాజన్మ మెప్పుడు సఫలమగును' అని నేను సదా చింతించితిని. నే నీవిషయమును మునులతోఁ బ్రసంగించినపుడు, వారు భగవంతుఁడంతటను కలఁడని వారు చెప్పుచుండిరి; కాని వారు భగవంతునివిషయమై చెప్పిన నిర్గుణమతము నాకు మనస్కరింపలేదు. సగుణబ్రహ్మము మాత్రమే నామనస్సునకు నచ్చియుండెను.

దోహా 169, 170, 171, 172

"నాగురువుపవచనములను స్మరించుటచేత, నామనస్సు శ్రీరామునిచరణారవిందములయందు లీనమై యుండెను; రామునిగుణములనే గానముఁజేయుచు నేను సంచరించితిని; అంతకంతకు రామునియందు 'నూతనానురాగము నాకుఁ బుట్టెను. సుమేరుపర్వతశిఖరము

మీఁద నొకవటవృక్షచ్ఛాయలో సుఖాసీనుఁడై లోమశమహర్షి యుం డెను; ఒక్కొక్క ప్రళయ మయినతరువాత, నతనిశరీరమునుండి యొక్కొక్కరోమము పడును. నే నతనిం జూచి, నమస్కరించి, దీన వచనములతోఁ బ్రసంగించితిని. ఓ గరుడజీ! వినయవిధేయతలతో నేను మృదుమధురముగ చెప్పినమాటల నాకృపాలుఁడగు ముని విని సంతో షించి, 'ఓ బ్రాహ్మణుఁడా! నీరాకకు నిమిత్తమేమి?' అని యడిగెను. 'ఓ కృపాసాగరుఁడా! నీవు సర్వజ్ఞుఁడవు; చతురుఁడవు; భగవంతుఁ డవు; కటాక్షించి, సగుణబ్రహ్మము నారాధించువిధముఁ దెలుపుము' అని నేను బ్రార్థించితిని.

చౌపాయ్ 106

"ఓ గరుడజీ! ఆమునిరాజు నన్నాదరించి, అతిశీఘ్రములో రామునిగుణములను నాకు వినిపించెను. ఆ లోమశమహర్షి బ్రహ్మ జ్ఞానసంపన్నుఁడు; జ్ఞానోపదేశమునకు నే నర్హుఁడనని తెలిసికొని, జ్ఞాన మును నా కుపదేశించెను. 'బ్రహ్మ అజుఁడు; అగుణుఁడు; అద్వై తుఁడు; సకల హృదయాంతరాళములలోఁ బ్రకాశించును; ఇచ్ఛా, కాల, రూపరహితుఁడు; అఖండము; అనుపమానుఁడు; అనుభవ ముచేఁ దెలిసికొనఁదగినవాఁడు; మనోవాచామగోచరుఁడు; పాపరహి తుఁడు; నాశములేనివాఁడు; అవినాశి; నిర్వికారుఁడు (జననము, వృద్ధి, వివర్ణము, క్షీణము, వృద్ధాప్యము, మరణము—ఆఱువికారములు లేని వాఁడు నిర్వికారుఁడు); ఆద్యంతములు లేనివాఁడు; ఆనందస్వరూ పుఁడు; ఆ బ్రహ్మమునకును నీకును భేదములేదు; నీరునకును నీటికెర టమునకును భేదమేమియు లేదుకదా! బ్రహ్మమును జీవుఁడు నొక టియే (అయమాత్మా బ్రహ్మ); సగుణనిర్గుణములు రెండు నొక్కటియే.' ఈప్రకార మనేకవిధముల నతఁడు నిర్గుణబ్రహ్మజ్ఞానము నుపదేశించెను; కాని, నిర్గుణబ్రహ్మమతము నామనస్సునకు నచ్చలేదు. మరల, నే నతనికి నమస్కరించి, 'ఓ మునిరాజా! కటాక్షించి, సగుణబ్రహ్మమతమును నా కుపదేశింపుము; రామునిభక్తి యనునట్టిజలములో, నామనస్సనునట్టి మీనము సదా మునిఁగియుండును; ఓ చతురుఁడా! దానినే నాకు బోధింపుము; కటాక్షించి, సగుణోపాసనఁ దెలుపుము; ఏవిధమున

నేను రామునిఁ జూడఁగలను? కన్నులార శ్రీరాముని దర్శించినతరు వాత, నీవుచెప్పిన నిర్గుణోపాసన నవలంబించెద' అని ప్రార్థించితిని. ఓ గరుడజీ! హరియొక్క శ్రేష్ఠగుణముల నతఁడు చెప్పెను; కాని, యతఁడు సగుణోపాసనమును ఖండించి, నిర్గుణోపాసనము నే నిరూపించెను. అతఁడు చెప్పిన నిర్గుణమతమును ఖండించి, నే నెంతవఱకును సగుణమత మునే, చెప్పుచుంటిని. మునిరాజు చెప్పిన ప్రతిమాటకును నేను ప్రత్యు త్తరము నిచ్చుచుంటిని; అంతట, శ్రీలోమశమహర్షికి నామీఁదఁ గ్రోధమువచ్చినట్లు నాకుఁ దోఁచెను; ఓ గరుడజీ! నే నాబ్రహ్మజ్ఞాన సంపన్నునిఁ దిరస్కరించినందున, నతనిమనస్సులోఁ గోపము పుట్టెను; బలవంతముగ తఱచుటవలనఁ జందనములోనుండి సహిత మగ్ని పుట్టునుకదా!

**దోహా 173, 174**

"అంతకంత కతనికిఁ దామసము వచ్చినందున, నతఁడు నిర్గుణ బ్రహ్మమును గుఱించియే వాదించెను; నేను స్థిరముగఁ గూర్చుండి, యనేకప్రకారముల నే నావిషయమును నాలో నేను విచారించితిని. ఓ గరుడా! మునికిఁ గోపమువచ్చెను; 'ద్వైతబుద్ధి లేకపోయినయెడలఁ గోపమెందుకుఁ బుట్టును? అజ్ఞానము లేనియెడల, ద్వైతబుద్ధి యెందు లకుఁ బుట్టును? జీవుఁడు ఈశ్వరునియంశ; సజాతీయుఁడు-అయినప్పటి కిని, జీవుఁడు మాయలోఁబడి, దుర్బలుఁడై, పరిచ్ఛిన్నుఁడయ్యెను. ఇట్టి జీవుఁడు ఈశ్వరునితో నెట్లు సమానుఁడగును? లోమశమహర్షి జ్ఞాని; అయిన నెందు కతనికిఁ గోపమువచ్చెను? అతనిజీవుఁడు ఈశ్వరునితో నెట్లు సమానుఁడగును?

**చౌపాయ్ 107**

"'సకలజీవులకు హితముఁజేయువానికి దుఃఖము లెట్లుకలుగును? చింతామణిని సంగ్రహించినవాఁడు దరిద్రుఁడగునా? ఈశ్వరునితో జీవుఁడు సమానమగునపుడు, ఈశ్వరునిగుణము లే జీవునియందుఁ గనఁ బడవలెనుకదా! అప్పుడు క్రోధ మేమగును? కామాతురుఁడు నిష్క ళంకముగ నుండఁగలఁడా? పరద్రోహి నిశ్శంకగ నుండఁగలఁడా? ఉండ లేఁడుకదా! బ్రాహ్మణద్వేషియొక్క వంశము నిలిచియుండునా? స్వభోగ

ములఁ గోరినవాఁడు శుభాశుభకర్మఫలముల నేల ననుభవింపఁడు? దుష్టులసాంగత్యముఁ జేయువానికి సాత్త్వికబుద్ధి యెట్లుకలుగును? పరస్త్రీభోగునకు సద్గతి యెట్లుప్రాప్తించును? రాజనీతిని గుర్తెఱుంగని యెడల, నెట్లు రాజ్యము నిలువఁబడును! నారాయణునిచరిత్రములను గానముఁజేసినయెడల, నెట్లు పాపములు నివసించును? పరమార్థచింతఁ గలవాఁడు సంసారములో నెట్లుపడును? పరులను నిందించువానికి సుఖము లెట్లుకలుగును? పుణ్యము లేనియెడల సత్కీర్తి యెట్లులభించును! పాపము లేనియెడల, నపకీర్తి యెట్లువచ్చును? పరమేశ్వరుని యందలి భక్తికంటె మఱియొకలాభ మేదికలదు? ఆభక్తియొక్క ప్రభావమునే వేదపురాణములు చాటుచుండును. ఓ గరుడజీ! మనుజుఁడై పుట్టి, హరిభజనను విడిచిపెట్టుటకంటె నీచమగునష్టము మఱియొకటి లోకములోఁ గలదా? తామసముకంటె నధికమగుపాప మేదికలదు? భూతదయకంటె నధికమగు ధర్మమేది?' అని యీప్రకార మనేకవిధముల నాలో నేను చింతించి, జీవుఁడుమాత్ర మీశ్వరుఁడు కాఁడని స్థిరపఱచుకొని,మునియుపదేశముల నిరాకరించితిని.మాటిమాటికి నేను సగుణబ్రహ్మమునే నిరూపించితిని; అంతట నతనికిఁ గోపము వచ్చెను. 'ఓయీ! మూర్ఖుఁడా! మహోత్కృష్టమగు బ్రహ్మజ్ఞానమును నీకు నే నుపదేశించినను, నీవు దానిని మన్నింపవు; అంతటితోఁ జాలింపక, నన్నెదిరించి, మాటకుమాట నీవు ప్రత్యుత్తరము నిచ్చుచుంటివి; నామాటలు సత్యమయినను, నీవు వానిని విశ్వసింపవు; ఈవెంటనే నీవు కాకివై సంచరించెదవుగాక! ఓయీ మూర్ఖుఁడా! నీమనస్సులో నింతదురభిమానము ముండెనుకనుక, నతిచండాలకాకివి యగుము' అని యతఁడు నన్ను శపించెను. ఆశాపము నాకుఁ దగిలినను, నామనస్సునకు భయముగాని దైన్యము గాని కలుగలేదు.

**దోహా 175, 176**

"ఓ గరుడజీ! ఆవెంటనే నాకు కాకిరూపము వచ్చెను; నే నామునీశ్వరుని చరణకమలములకు నమస్కరించి, శ్రీరాముని స్మరించుచు నెగిరిపోయి తిరుగుచుంటిని." ఓ పార్వతీ! శ్రీరాముని చరణములయం దనురాగముఁ గలిగి, కామక్రోధాదులను విడిచిపెట్టినవానికి

లోకమంతటను భగవంతుఁడు కనఁబడును. ఇఁక నట్టివాఁ డెవనితోఁ గలహించును?

చౌపాయ్ 108

"ఓ గరుడజీ! ఆమునీశ్వరునిలో దోషములేదు; అతనియంతరంగమును రఘునాథుఁడే యట్లుప్రేరేపించెను. ఆ కృపాసాగరుఁడగు రఘురాముఁడాముఁనియొక్క బుద్ధిని భ్రమింపఁజేసి, నాభక్తినిఁ బరీక్షించెను. మనోవాక్కర్మలచే నేనతనిదాసుఁడనని తెలిసికొని, రఘురాముఁడామునికిఁ దిరిగి బుద్ధినిచ్చెను. నా స్వాభావికగుణమును, నాకు రామునిచరణములయందు గల దృఢవిశ్వాసమును లోమశమహర్షి గ్రహించి, యాశ్చర్యపడి, విశేషము పశ్చాత్తాపముఁ బడి, నన్నాదరించి తనవద్దకుఁ బిలిచెను. అనేకప్రకారముల బోధించి, నన్నతఁడు సంతోషపెట్టెను. అతఁడు నాకు షడక్షరరామ మంత్రము నుపదేశించెను. ఆ కృపానిధానుఁడగు మునిరాజు బాలరాముని ధ్యానించువిధానమును నాకుఁ జెప్పెను. సకలసుఖముల నిచ్చునట్టి బాలరాముని సుందరరూపము నామనస్సునకు నచ్చెను. ఆసంగతి నీకు నేను ప్రథమమునఁ జెప్పియుంటిని. నన్నతఁడు కొంతకాలము తనవద్ద నుంచుకొని, 'రామచరిత్రమానసమును' సంపూర్ణముగ వర్ణించి నాకుఁ జెప్పెను. అత్యాదరణతో నతఁడు సప్తకాండములచరిత్రను నాకు వినిపించి, తదుపరి మృదుమధురవాక్యములతో నిట్లు ప్రసంగించెను. 'ఓ కాకమా! ఓ నాయనా! ఈ చక్కని రామచరిత్రమానసముయొక్క రహస్యమును నేను శివుని ప్రసాదమువలనఁ దెలిసికొంటిని; నీవు రాముని నిజభక్తుఁడవని గ్రహించి, సంపూర్ణముగ నీకారహస్యమంతయుఁ జెప్పియుంటిని; నేను చెప్పినసంగతిని లెస్సగ గ్రహింపుము; ఓ తాతా! ఎవనిహృదయము రామభక్తిశూన్యమైయుండునో, వానికిమాత్ర మీరహస్యముఁ జెప్పకుము' అని నాకు బోధించెను. నేనతనిపాదములకు నమస్కరించి, నిలువఁబడియుంటిని. ఆకృపానిధియగు లోమశుఁడు తన చేతులను నాశిరముపై నుంచి, నన్ను దీవించి, యిట్లు పలికెను; 'ఓ కాకమా! నాకటాక్షమువలన, నీవు రామునియందు నిశ్చలభక్తియుండుఁగాక.

దోహా 177, 178

"'నీవు సదా రామునకుఁ బ్రియుఁడుగ నుండెదవుగాక! నీవు సకలగుణధాముఁడ వగుగాక! అభిమానరహితుఁడ వగుగాక! స్వేచ్ఛారూపముఁ గలవాఁడ వగుము; స్వచ్ఛందమరణము కలుగుగాక! జ్ఞానవైరాగ్యములతోఁ గూడియుండెదవు; ఏయాశ్రమములో నీవు నివసించి భగవంతుని స్మరించెదవో, ఆయాశ్రమమునకు యోజనమువఱకు మాయ వ్యాపింపదు.

చౌపాయీ 109

"'కాలము, కర్మము, గుణదోషములు, స్వభావము మొదలగు వానివలనఁ గలుగుదుఃఖములు నీయందుఁ బ్రసరింపవు; రహస్యములును బ్రకటములయిన శ్రీరామునిచరిత్రము సంపూర్ణముగను, పురాణేతిహాసములును, వానిలోనిభేదములును, నీమొదలగునవి శ్రమలేకయే నీకుఁ దెలియుగాక! దినదినమునకుఁ గ్రొత్తక్రొత్తభక్తి నీకు రామునిచరణములయందుఁ బుట్టుగాక! నీమనోభీష్టములన్నియు నీశ్వరుని ప్రసాదమువలన నీకు దుర్లభముగావు!' అని యాముని నన్నుదీవించెను; ఓ గరుడజీ! ఓ బుద్ధిమంతుఁడా! లోమశుని యాశీర్వాదమును విని, 'ఓ మునీశ్వరా! నీవచనములు సఫలమగుఁగాక! మనోవాక్కర్మములచే నితఁడు నాభక్తుఁడు; ఇతనిమీఁద నాకుఁ బరిపూర్ణకటాక్షము కలదు.' అని యశరీరవాణి పలికెను. ఆమాటలను వినినందున, నామనస్సు సంతోషముచే నుప్పొంగెను; భగవంతునియందుగల ప్రేమలో నే మునిఁగియుంటిని; నాసందేహములన్నియు పీడెను. మాటిమాటికి వినయవిధేయతలతో మునిచరణములకు నమస్కరించి, వారి యాజ్ఞఁ గైకొని, నాఁటనుండి నే నీయాశ్రమములో నివసించియుంటిని; స్వామికృపవలన దుర్లభమగువరములఁ బొందితిని. ఓ గరుడా! ఇచ్చట నేను నివసించియుండ, నిరువదియేడు కల్పములు గతించెను. ఇచ్చట నేను సదా శ్రీరామునిగుణములను గానముఁ జేయుచుంటిని. తెలివిగలహంసలు మొదలగుపక్షులు వచ్చి, నాహరికీర్తనలను వినుచుందురు. ఏయేకాలములలో భక్తుల నుద్ధరించుటకు భగవంతుఁ డయోధ్యానగరములో నవతరించెనో, నేనాసమయములలో నయోధ్యానగర

ములోనే నివసించుచుంటిని; ఆసమయములలో నేను బాలరాముని చిత్రవిచిత్రనడకలఁ జూచి వినోదించుచుంటిని; మరల రాముని బాలరూపమును నాహృదయములో నిడుకొని, నే నీయాశ్రమమునకు వచ్చి నివసించుచుండుట కలదు. యావత్కథను నీకు వినిపించితిని; కాకిశరీరము నాకు లభించినందుకుఁ గారణముకూడ నీకు జెప్పియుంటిని; ఓ తాతా! నీయన్ని ప్రశ్నలకు సమాధానమయ్యెను. రామభక్తియొక్కమహిమకు భారము లేదు; ఈసంగతిఁ దెలిసికొనుము.

దోహా 179, 180

"ఇందుచేత, నా కీశరీరమునం దభిమానము లేదు; ఈశరీరముతో నాకు రామునిచరణకమలములయందు భక్తి కలిగెను; ఈశరీరముతోనే శ్రీరామప్రభువుని దర్శించితిని; నాసందేహములు విడిపోయెను. భక్తితోఁగూడిన సగుణోపాసనను నే నవలంబించినందున, నాకీ ఘోరమగుశాపమును మునీశ్వరుఁ డిచ్చెను; చూచితివా! తుదకు నే నెట్టిదుర్లభమగు వరములఁ బొందితినో; ఇదియంతయు భజనయొక్కప్రతాపమే; భజనయే సారముగలది."

# అష్టమవిశ్రామము.

చౌపాయ్ 110

"ఎవరు తెలిసితెలిసి భక్తిమార్గమును విడిచి, జ్ఞానముకొఱకు శ్రమఁబడుచుండెదరో, వారే జడులు; వారే మూర్ఖులు; ఓమూర్ఖులారా! ఇంటిలోనుండిన కామధేనువును విడిచి, మూర్ఖులే పాలచెట్టు నాశ్రయించెదరు; నారాయణునియందలి భక్తివిడిచి, తదితరోపాయములవలన సుఖముఁ బొందఁగోరిరవారు, నావను లేకయే మహాసముద్రమును దాఁటఁగోరిన నీచులు; వారివంటిమూర్ఖులు లేరు." ఈప్రకారము కాకభుశుండి చెప్పిన మహోపన్యాసమును గరుత్మం

తుఁడు విని సంతోషముచే సుప్పొంగి, కాకభుశుండితో నిట్లు పలికెను. "ఓ మహాప్రభో! మీ ప్రసాదమువలన నామోహమును, శోకమును, సందేహమును, భ్రమయు నశించెను. మీకృపవలనఁ బవిత్రమగు రామ గుణకీర్తనలను శ్రవణానందముగ వినినందున, నామనస్సునకు శాంతము కలిగెను. ఓ నాథా! మిమ్ముల నొకసంగతి యడుగుచున్నాను; కటాక్షించి, నాకు బోధింపుఁడు. పొందుట కెంతదుర్లభమయినను, జ్ఞానము వంటి యోగ్యమయినది మఱియొకటి లేదని వేదపురాణములును సజ్జనులును చెప్పుచున్నారు; లోమశమహర్షియు మీకు సంపూర్ణజ్ఞానమును బోధించిచెప్పెను; ఐనను, భక్తినిదప్ప, మఱియొకదాని నాదరింపఁగూడదని మీరు చెప్పినారు. ఓ స్వామీ! ఓ కృపానిధానుఁడా! భక్తిజ్ఞానములకుఁ గల యంతరమును బోధించి చెప్పుఁడు." అని గరుత్మంతుఁడు ప్రార్థించెను; గరుడునిసందేహముఁ దెలిసికొని, యతనిని ఆదరించి, కాకభుశుండి యతనితో నిట్లు ప్రసంగించెను. "ఓ గరుడజీ! భక్తిజ్ఞానములకేమియు భేదములేదు; ఆ రెండును సంసారదుఃఖములను హరించును. లోమశమహర్షి చెప్పిన ప్రసంగములోఁగూడ నా రెండింటికిని యంతరము కనఁబడదు; ఆసంగతియే చెప్పుచున్నాను; సావధానముగ వినుము. ఓ తాతా! జ్ఞానము, విజ్ఞానము, వైరాగ్యము, యోగము-వీరు పురుషులు; ప్రతాపము కలవారు; అన్నివిధముల వారు ప్రబలులు; స్త్రీలు స్వాభావికముగ నబలలు అని సుప్రసిద్ధము.

సోరఠా 16

"ఓ గరుత్మంతా! అట్టిజ్ఞానియు మునియుఁ జంద్రముఖులను మృగనయనలను జూచినతరువాత, వారిమనస్సు వికలమగును. మాయ లోకములో స్త్రీరూపమున నవతరించెను.

చౌపాయ్ 111

"ఓ తాతా! నే నిప్పుడు పక్షపాతబుద్ధితోఁ జెప్పుటలేదు; వేద, పురాణ, సజ్జనసమ్మతమును, యథార్థముఁ జెప్పుచున్నాను. ఓ నాగాంతకుఁడా! మాయ, స్త్రీరూపమయినను, స్త్రీ కాదు; ఈచక్కని నీతిమాటఁ దెలిసికొనుము. (ఈసంగతి జానకివిషయములోఁ బ్రవర్తింపదు; జానకి ఆదిశక్తి; కోట్లకొలఁది సాధారణస్త్రీ లామెతో సమానులు కారు.)

ఓ గరుడా! మాయయు, భక్తియు—ఇరువురు స్త్రీలు; ఈసంగతి లోకవిదితము. ఈ రిరువురిలో భక్తిమీఁద రఘురాముని కధికదయ కలదు; మాయ వేశ్యాంగనవంటిది; ఏవిధమున నాజ్ఞప్రకారము వేశ్యాంగన నటించునో, మాయకూడ నటులనే భగవంతుని యాజ్ఞాప్రకారము నటించును. భక్తింజూచిన, రామునకు దయ మెండు; ఇందుచేత భక్తింజూచి, మాయ భయపడును; రామభక్తికి నుపాధి లేదు; ఉపమానము లేదు; బాధ లేదు; ఎవనిహృదయమునం దామె నివసించునో, వానింజూచి మాయ కొంచెము భయపడి, వానిముందట దనప్రభావముఁ బ్రకటింపలేదు. ఈసంగతిఁ దెలిసికొనియే, జ్ఞానులును, విజ్ఞానులును, సంపూర్ణగుణసంపన్నులును భక్తిఁగావలయునని పరమేశ్వరునిఁ బ్రార్థించెదరు. 'ఓ స్వామీ! మాకు భక్తిఁ బ్రసాదింపు'మని కోరుచుండెదరు.

దోహా 182, 183

"ఈ రాముని రహస్యము నెవరు శీఘ్రముగఁ దెలిసికొనలేరు; రఘునాథునికటాక్షముఁ గలవారే ఈరహస్యమును గ్రహింపఁగలరు; వారికి స్వప్నమందయినను మోహభయ ముండదు. ఓ చతురుఁడా! ఇంకను భక్తిజ్ఞానములకుఁ గలభేదముఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము; దానిని వినినందున, నఖండశాశ్వతభక్తి రామునిచరణములయందుఁ గలుగును.

చౌపాయీ 112

"ఓ తాతా! అనిర్వాచ్యమగు విషయమును వినుము; అది యనిర్వాచ్యమయినను, భావముచే నూహింపవచ్చును; ఈశరీరములో నుండిన జీవునకు నాశము లేదు; జీవుఁ డీశ్వరాంశసంభూతుఁడు; చేతనముఁ గలవాఁడు; పాపరహితుఁడు; స్వాభావికసుఖముఁ గలవాఁడు. ("శ్లో మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" అని భగ. గీతా. ప్రమాణము.) ఆజీవుఁడు మాయకు వశ్యుఁడై, దానివలలోఁ జిక్కెను; శుకవానరములవలె, స్వయంకృతబంధనములలోఁ దగులుకొనెను. (చిన్నమూతిగల పెద్దబుడ్డిలో వానరము తనహస్తముఁ బెట్టి, పిడికిలి

నిండపదార్థమును సంగ్రహించి, హస్తమును బయటకుఁ దీసికొనలేదు; పిడికిలి విప్పినయెడల, నది తనహస్తముఁ దీసికొనఁగలుగును. ఈసంగతిఁ దెలిసికొనలేక, జాడీచెంబు తనహస్తముఁ బట్టుకొనెనని యది తలంచి, గిజగిజలాడును; చిలుక, ఒకకఱ్ఱకుఁ ద్రాడుగట్టి, దానిని భూమిలో మీఁదమీఁదఁ బాతియుంచెదరు; ఆకఱ్ఱకొసకొక రొయిలునుంచెదరు; ఆరొయిలనిమిత్తము చిలుకవచ్చి కఱ్ఱమీఁద వ్రాలును; అది వ్రాలినంతనే, ఆకఱ్ఱ గిరగిరమని తిరుగును; ఎగిరిపోవుటకు శక్తియుండియును, చిలుక యెగిరిపోక, దా నాకఱ్ఱ కంటుకొనిపోయి యుంటినని తలఁచి భ్రమించును). తెలివిగలజీవుఁడు మాయవేసినముడిలోఁ దగులుకొనియుండును. ఆముడి అబద్ధమే; అయినను ముడిని విప్పుట కష్టము. ఇటులనే, జీవుఁడు మాయలోఁబడి సంసారమునకు వశ్యుఁడయ్యెను; ఆముడిని విప్పుకొనలేక, సుఖముఁ బొందఁడు. దానిని విప్పుకొనుటకు మార్గములనేకములు వేదపురాణములలోఁ జెప్పఁబడియుండెను; అంతకంతకాముడి బిగించుకొని పోవుచున్నది; కాని, సావధానముగ దానిని సాధించి విడఁదీయుటలేదు; ఆజీవుని ప్రయత్నములవలన నది విశేషము బిగియుచున్నది. జీవునిహృదయములో మోహాంధకారము ప్రవేశించెను; అందుచేత నాముడిని జీవుఁడు చూడలేక, దానిని విడఁదీయలేఁడు. ఒకానొకప్పుడు పరమేశ్వరుని కటాక్షమువలన, నాముడి వీడును; లేనియెడల, లేదు; ఇఁక నాముడిని విడఁదీయుట యెట్లు; దానిని విడఁదీయుట కుపాయముఁ జెప్పుచున్నాను. సాత్త్వికశ్రద్ధయే యొకగోవు; భగవంతునికృపవలన నాగోవు వచ్చి హృదయములో నివసించును; జపములు, తపములు, సంయమములు, నియమములు, వేదోక్తశిష్టాచారములు, ధర్మములు, శుభకర్మలు—ఈ మొదలగునవియే పచ్చికనేలలు; వీనిమీఁద నాగోవు వచ్చి మేయుచుండును; ప్రేమ యనునది దాని దూడ; ఈదూడమూలమున దానిపొదుగునిండ పాలు చేరియుండును; నివృత్తిమార్గ మనునట్టిత్రాటిచే నాగోవు కట్టఁబడియుండును; విశ్వాస మనునట్టి పాత్రలోనికి దానిపాలఁ దీయవలెను; నిర్మలాంతఃకరణమే యాగోవుపాలఁ దీయును; దానిం గాపాడును. పరమధర్మమనునట్టి పాలందీసి, నిష్కామమనునట్టి యగ్నిహోత్రముమీఁదఁ గాఁగఁబెట్ట

వలెను. ఆ వేఁడిపాలను క్షమ యనునట్టి వాయువుచే సంతోషము చల్లార్చును. సమదృష్టి యనునట్టి తోడుచల్లచే నా పాలు తోడుకొనును. ఈ ప్రకార మాచరింపవలయును. ప్రసన్నత యనునామె యొకవిచారణయే యొకపాత్ర; ఇంద్రియనిగ్రహమే యొకకవ్వము; సత్యమును, ప్రియవచనములును, ఆకవ్వమునకుఁ ద్రాళ్లు; ఈతోడుకొనిన పెరుగును పాత్రలోనుంచి, కవ్వముతో నామె త్రాళ్లనుద్రిప్పి మథించును; ఇట్లు మథించినందున, వైరాగ్యమనునట్టి నవనీతము పుట్టును.

దోహా 184, 185, 186

"శుభాశుభకర్మములనునట్టి కట్టెపుడకలకు యోగాగ్నిఁ దగిలించి, కాల్చవలెను; బుద్ధియనునట్టి గృహిణివచ్చి, యావెన్నను గాచి పెట్టును. మమత్వమనునట్టి మట్టమంతయు నందులోఁ దగులపడును. ఆ ఘృతమును బుద్ధి చల్లార్చును. ఉజ్జ్వలమగు బుద్ధియే విజ్ఞానము; చిత్తము దీపపుప్రమిద; ఈవిజ్ఞాన మాఘృతమును ప్రమిదనిండ నింపును. సమత్వమనునట్టి దీపపుసెమ్మెమీఁద నాప్రమిద నామెయుంచును. మూఁడుగుణములును మూఁడవస్థలును-ఇవియే ప్రత్తిపోకలు; ఈ ప్రత్తినుండి దారమును పేఁడవలయును; తురీయావస్థయే దారము; ఈదారముతో విజ్ఞానము వత్తిఁజేయును.

సోరఠా 17

"ఆవత్తికి విజ్ఞానమే దీపము వెలిగించును; కామాదులనునట్టి శలభము లాదీపముమీఁదఁ బడి, తగులబడును.

చౌపాయ్ 113

"'సోహం' అనునట్టి యఖండజ్ఞానమే, యాదీపముయొక్క జ్వాల; ఆత్మానుభవసుఖమే దానిప్రకాశము; ఆదీపముకాంతివలన సంసారమునకు మూలమగు భేదబుద్ధి నశించును; దానివలన, నపారమగు అవిద్యయొక్క ప్రబలమగుపరివారము (మోహము మొదలగునవి) పాఱిపోవును. అప్పుడు బుద్ధి ఆదీపమువద్దఁ గూర్చుండి, మాయయొక్కముడిని విప్పును. ఆముడి వీడినయెడల, జీవుఁడు కృతార్థుఁడగును; ఓ గరుడజీ! ఆముడినివిప్పుటకు బుద్ధి ప్రయత్నించుటఁజూచి, అనేకవిధముల మాయ విఘ్నముఁజేయును. దీనికిఁ గారణమును సావధానముగ వినుము. ఓ గరుడా! ఆసమయమున మాయ లేచి, ధన

రాజ్యాదులను, యోగబలాదులను వెంటఁబెట్టుకొని, బుద్ధిని భ్రమింపఁ జేయును; బలవంతముగనైనను, జమత్కారముచేతనైనను, నేదోయొక విధమున నాదీపమును మాయ తనబట్టకొంగుతో నార్పివేయును. అప్పుడు బుద్ధిగాని కొంచెము జాగరూకతతో నుండినయెడల, నామాయ యొక్క వికారములను లక్ష్యముచేయదు. ఒకవేళ, జీవుఁడు బుద్ధియొక్క సహాయముచే మాయను జయించినను, తదుపరి దేవతలు వచ్చి, యాజీవుని భ్రమింపఁజేయఁగలరు. ఆదేవతలు వచ్చి, 'ఓ జీవుఁడా! రా రమ్ము; మాలోకములలో దివ్యభోగముల ననుభవింపుము' అని ఆశఁ జూపించెదరు. ప్రతియింద్రియమునకును బ్రతిరోమకూపమువద్దను నొక్కొక్క దేవత కూర్చుండియుండును; విషయములగాలి కొంచెము (ఏమాత్రము) ప్రసరించినను, వారు కవాటములను విడఁదీయుదురు. ఆవిషయవాయువు హృదయగృహములోఁ బ్రవేశించి, విజ్ఞానదీపమును ఘనముఁ జేయును; ఇంక నామాయ ముడివిడదు; అంతట నంధకారము వ్యాపించును. ఆ విషయవాయువులవలన బుద్ధి వికలమగును. ఇంద్రియములుగాని దేవతలుగాని విజ్ఞానదీపమును సహింపరు; ఎంతవఱకును వారు విషయభోగముల ననుభవించుట కాశించెదరు. ఈవిధమున విషయవాయువులవలన బుద్ధి వికలమయినపుడు, విజ్ఞానదీపమును వెలిగించువా రెవరు?

దోహా 187, 188

"ఓ గరుడా! ఇఁక నాజీవుఁడు జననమరణాదిదుఃఖములఁ బొందును. పరమాత్మునిమాయ దుస్తరము; ఆమాయఁ దరించుట దుర్లభము; దానియంతముఁ జూచుట మహాకష్టము; ఓ నాథా! జ్ఞానమార్గమును వర్ణించుటకును, గ్రహించుటకును, సాధించుటకును, ఘుణాక్షరన్యాయమువలెఁ గష్టము; ఒకవేళ నన్నికష్టములం దాఁటివచ్చినను, మార్గములో ననేకకష్టములు బుద్ధిని నిరోధించును.

చౌపాయ్ 114

"ఓ గరుడజీ! జ్ఞానమార్గ మసిధారా వ్రతమువంటిది; ఏమాత్రము తప్పినను, వినాశము నిశ్చయము; ఉద్ధారణ మఱిలేదు; ఈ మార్గమున విఘ్నములు ("క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గమ

పథ_స్తత్క_వయో వదంతి" శ్రుతివచనము.) లేక జీవుఁడు తుదవఱకు వెళ్లినయెడల, నతఁడు ముక్తిఁ బొందును. ఓ గరుడజీ! భక్తిజ్ఞానముల కుఁగల మఱియొక భేదముఁ జెప్పుచున్నాను; నీవు చతురుఁడవు; దానిని సావధానముగ వినుము; దానివలన, రాముని చరణములయం దఖండ నిశ్చలభక్తి కలుగును. ముక్తిమార్గ మతిదుర్లభమని వేదపురాణేతిహాస ములును సజ్జనులును జెప్పుచున్నారు. రాముని భక్తితోఁ గొలిచిన యెడల నివియన్నియు వానియంతట నవి లభించును. కోటిప్రయత్న ములఁ జేసినను, పృథ్వి లేక జల మెట్లుండును? రామభక్తి లేక, కైవల్య సుఖము ననుభవించుట యెట్లు? రామభక్తులకే ముక్తిసుఖము లభిం చును. ఈసంగతిని చతురులు లెస్సగ విచారించి, ముక్తిఁ గోరక, భక్తి కావలయునని భగవంతునిఁ బ్రార్థించెదరు. ఏశ్రమ లేకయే భక్తిమార్గము నవలంబించినవారికి మోహాదులు నశించును. శరీరముఁ బుష్టిచేయుటకు కదా భోజనము; ఆపదార్థములను జఠరాగ్ని కదా పచనముఁ జేయును; అటులనే, రామభక్తివలన నట్టిసుఖము లభించును; ఈభక్తిమార్గము ("క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్‌దృష్టే పరావరే") సులభము; సహజము; సుఖదాయకము. ఏమూర్ఖుఁడు భక్తిమార్గమును విడిచి పెట్టును?

దోహా 189, 190

"ఓ గరుత్మంతా! శ్రీరాముఁడే యజమాని; నేనే సేవకుఁడను; ఈప్రకారము తలఁచి, రాముని సేవింపవలయును. ఈసంగతి తెలియ నంతవఱకు, సంసారమును జీవుఁడు తరించుట కష్టము. ఈసిద్ధాంత మును విచారించి, శ్రీరామునిచరణకమలములను భక్తితో భజింపుము; ఓ గరుడజీ! చేతనములకు జడత్వమును, జడములకు చేతనమునిచ్చు టకు రఘురాముఁడు సమర్థుఁడు సుమీ! అతనిని భజించువారే ధన్యులు; చూడుము; చైతన్యముగలనీకు జడ్డుతనము వచ్చెను; జడ్డుతనముగల నాకు, భక్తివలన, చైతన్యము కలిగెను.

చౌపాయ్ 115

"ఓ గరుడజీ! జ్ఞానమార్గమును నీకు బోధించితిని; ఇఁకను భక్తి యనెడి మణియొక్కప్రభావముఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము; కోరినకోరికలను సఫలముఁజేయుటలో, భక్తి చింతామణి

వంటిది; ఆమణి జీవులహృదయాంతరాళములలో నివసించును. దివా రాత్రము లామణి ప్రకాశించుచుండును; ఆమణిదీపమునకు ఘృతము గాని వర్తిగాని యవసరము లేదు. ఆమణిఁ గలవానివద్దకు మోహమను దరిద్రము రానేరదు. విషయవాయువు లాదీపమును ఘనముఁజేయలేవు. ఎవనిహృదయములో నీమణిదీపము ప్రకాశించుచుండునో, మోహాంధ కార మచ్చటఁ బ్రవేశింపలేదు. కామాదులనునట్టి శలభము లాదీపము వద్దకు రాఁజాలవు; ఈభక్తి మణిప్రభావమువలన, విష మమృత మగును; శత్రువులు మిత్రులగుదురు; ఈమణి లేనియెడల, సుఖము కలుగదు; ఓ గరుత్మంతుఁడా! లోమశమహర్షి యొక్క శాపము, నా కమృతమయ్యెను గదా! మొదట నన్నతఁడు శత్రువుగ భావించి, తుదకు మిత్రునిగఁ దలఁచి, నాకు వరముల నిచ్చెను. ఈమణిమూల మున మనస్సంకటములన్నియు శాంతించును. ఈ మనస్సంకటముల వలన, జీవుఁడు సంసారదుఃఖములపాలఁ బడెను. రామభక్తిమణిని హృదయమునందు ధరించినవానికి స్వప్నమందయినను లేశమపి దుఃఖ ములు కలుగవు లోకములోఁ జతురశిరోమణియగువాఁడు భక్తి మణినే లక్ష్యములోనుంచుకొని, దానిం బొందుటకుఁ దగినప్రయత్న ములఁ జేయును. ఈమణి జగత్ప్రసిద్ధమయినను, రాముని కటాక్షము లేక లభింపదు. ఈమణిని సంగ్రహించుట కనేకోపాయములు కలవు; కామక్రోధాదుల బెదరింపులకు భయపడి, నిర్భాగ్యుఁడు దానివద్దకు రాఁజాలఁడు. వేదపురాణములే యొకపుణ్యపర్వతము; రామకథలను నట్టి మణిగను లాపర్వతముమీఁదఁ గలవు; సజ్జను లామణిగనులఁ గనిపెట్టెదరు; చక్కనిబుద్ధియే వానిం ద్రవ్వుటకు గునపము. సజ్జనులు జ్ఞానవైరాగ్యములనునట్టి రెండునేత్రములచే వానిం జూచెదరు. జీవులు ప్రేమతో నాగనులను మణినిమిత్తము త్రవ్వి, సకలసుఖముల నిచ్చునట్టిమణిని సంగ్రహించెదరు; ఆమణియే సకలసుఖముల కొకగని వంటిది. ఓ నాథా! నా మనస్సులోనినమ్మకముఁ జెప్పుచున్నాను; <u>రామునికంటె రామునిదాసుఁడే గొప్పవాఁడు</u>; ఇందులకు దృష్టాంతము కలదు; సముద్రములో జలముకలదు; సముద్రుఁడు కదలఁడు; మేఘము లాజలముఁ బీల్చి, సమస్తప్రదేశములలో వర్షించును; ఆనీటి

వలన, మంచిగంధపువృక్షము పెఱుగును ; దానిసుగంధమును వాయువు దశదిశలకు వ్యాపింపఁజేయును. రాముఁడు మహాసముద్రుఁడు ; సజ్జనులే మేఘములు; వీ రాజలమును నాలుగుదేశములలో వర్షించెదరు ; శ్రీరాముఁడే చందనవృక్షము ; సజ్జనులే వాయువు ; ఆవృక్షముయొక్క సుగంధమును వారు నలువైపుల వ్యాపింపఁజేయుదురు. హరిభక్తిఁ గావలయునని జనులు కోరుచుందురు ; సత్సాంగత్యము లేనియెడల, నాభక్తి లభింపదు. ఈసంగతిఁ దెలిసికొని, చతురులు సత్సాంగత్యముఁ జేయుదురు. వారికే రామునియందు భక్తి లభించును.

దోహా 191, 192

"ఓ గరుత్మంతుఁడా! వేదస్వరూపుఁ డగుబ్రహ్మమే క్షీరసముద్రము ; సజ్జనులు దేవతలు ; జ్ఞానమే మందరపర్వతము ; ఆక్షీరసముద్రమును మథించుటవలన, రామకథలనునట్టి యమృతము పుట్టెను ; రామభక్తియే, ఆయమృతముయొక్క మాధుర్యము. సజ్జనులు, దేవతలు ; వైరాగ్యము, డాలు ; జ్ఞానము, చంద్రాయుధము ; కామాదుల జయించి, హరిభక్తియనునట్టిజయమును వారు పొందిరి. ఈవిషయమును లెస్సగ విచారింపుము ; హరిభక్తివలన, సకలసాధనములు సిద్ధించును."

# నవమవిశ్రామము.

చౌపాయ్ 116

కాకభుశుండి ప్రసంగించినయుపన్యాసమును గరుత్మంతుఁడు విని, పరమానందభరితుఁడై, మరల వినయవిధేయతలతో నిట్లు పలికెను :—

"ఓ మహాత్మా ! మీకు నాయందు దయయుండినయెడల, నన్ను మీదాసునిగ భావించి, నా యీ యేడుప్రశ్నలకుఁ బ్రత్యుత్తరముల నిచ్చి నన్నుఁ బ్రసాదింపుఁడు ; ఓ స్వామీ ! ఓ నిర్మలబుద్ధిగలవాఁడా !

ప్రథమమున: అన్నిశరీరములలో నేశరీరముఁబొందుట దుర్లభము? రెండు: లోకములో నేది పరమసుఖము; పరమదుఃఖము? లెస్సగ విచారించి, వీనిగుఱించి సంక్షేపముగఁ జెప్పుఁడు. ఇఁక నాల్గవప్రశ్న: సజ్జనదుర్జనులమర్మము మీఁకు బాగుగఁ దెలియును; కనుక, నాకు వారి మర్మముఁ జెప్పుఁడు; వారిస్వభావలక్షణములను వర్ణింపుఁడు. తదుపరి, వేదములోఁ జెప్పఁబడినప్రకార మేది యధికమగుపుణ్యము? ఏది యధికమగుపాపము? పిమ్మట మనోరోగములను సంపూర్ణముగ వర్ణింపుఁడు; మీరు సర్వజ్ఞులు; మీఁకు నాయందుఁ బరిపూర్ణకటాక్షము కలదు." అని గరుత్మంతుఁడు ప్రార్థించెను. అనంతర మీవిధమున, కాకభుశుండి ప్రసంగించెను. "ఓ వైనతేయా! నీప్రశ్నలకుఁ బ్రత్యుత్తరములఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము. వానివానిభేదములను బోధించి చెప్పుచున్నాను; వినుము. ఓ తాతా! మానవశరీరముతో సమానమగునది మఱియొకటి లేదు; చరాచరజంతువు లాశరీరమునే కోరుచున్నవి. ఆశరీరమే నరకమునకును, స్వర్గమునకును, నపవర్గమునకును సోపానము; ఆ శరీరముమూలమున, భక్తిజ్ఞానవైరాగ్యములు లభించును. ("ధర్మార్థ కామమోక్షాణాం శరీరం సాధనం స్మృతం" అని ప్రమాణము.) ఇంతచక్కనిశరీరమును ధరించినమనుజుఁడు విషయాసక్తుఁ డయినయెడల, వానివంటిపరమమందమతి మఱియొకఁడు లేఁడు. ఈవిషయములలోఁ బడినమనుజుఁడు, చేతిలోఁబెట్టిన చింతామణిని దిగఁద్రోచి, గాజుపెంకుల కభిలషించును కదా! లోకములో దరిద్రుని వంటిదుఃఖి లేఁడు; దారిద్ర్యముకంటె దుఃఖము లేదు; సత్సాంగత్యము వలనఁ గలిగినసుఖముకంటె సుఖము లేదు. త్రికరణశుద్ధిగఁ బరోపకారముఁ జేయుటయే సజ్జనులస్వభావము. (పరోపకారాయ సతాం విభూతయః") ఎన్నికష్టములనయిన పడి, సజ్జనులు పరుల కుపకారముఁ జేయుదురు; ఏప్రకారముననయిన దుర్జనులు పరులకపకారముఁ జేయుదురు. సజ్జనులు సత్పురుషులు, దయామయులు; భోజపత్ర వృక్షము వంటివారు; పరులకు హితముఁజేయుట కనేకకష్టములను వారు పొందుదురు. దుర్జనులు గోఁగునారవలె, నితరులబంధనమునిమిత్త ముపయోగపడుదురు; ఆగోఁగునుండి నార దీయుటవలన నది చనిపోవును; అయి

నను, దానినార పరులను బంధించును; అటులనే, దుర్జనులు చనిపోయి నను, వారు చేసిన దుష్కార్యములవలనఁ బరులకుఁ గీడుమూడును. ప్రయోజనములేకయే, వారు పరుల కపకారముఁ జేయుదురు; ఒకరిం గఱచుట వలన, సర్పమున కేమిప్రయోజనము కలదు? వానిప్రాణము పోవును గదా! ఎలుక వస్త్రములం జింపివేయును; దాని కేమి లాభముకలుగును? దుష్టులు పరులసంపదకు ముప్పుఁదెచ్చి, తాము నశించెదరు; వడగండ్లు వరిపంటను నాశముఁజేసి, పిమ్మట నీరగునుగదా! లోకమునకు దుఃఖముఁ గలుగఁజేయుటకే దుర్జనులు జన్మించెదరు; ధూమకేతువు పుట్టిన యెడల, లోకమునకు దుర్భిక్షము కలుగును. సత్పురుషులజన్మము లోకమునకు సుఖమునిచ్చును; సూర్యచంద్రులవలె, వారు సర్వజనాహ్లాదకారకులు; 'అహింసాపరమో ధర్మః' అని ధర్మశాస్త్రప్రమాణము కలదు; భూతదయకంటె నుత్కృష్టధర్మము లేదు; పరులను నిందించుటకంటె నధికమగుపాపము లేదు. పరబ్రహ్మస్వరూపుఁడగుగురువును నిందించువాఁడు, బెకబెకలాడు కప్పకడుపులోఁ బుట్టును. వెయ్యి జన్మములవఱకును వాఁడు కప్పగర్భమునఁ బుట్టుచుండును. బ్రాహ్మణులనునిందించి వాఁడనేకవేలసంవత్సరములు నరకదుఃఖములఁ బొంది, యనంతరము కాకిశరీరమునుధరించి తిరుగును. దురభిమానముచే, వేదములను దేవతలనునిందించినవాఁడు రౌరవనరకములోఁ బడియుండును. సత్పురుషులను నిందించినవాఁడు గ్రుడ్లగూబయై పుట్టును; వానికి మోహరాత్రియే ప్రియముకాని, జ్ఞానరూపమగుసూర్యుఁడు ప్రియుఁడు కాఁడు. విచక్షణలేక జనులనుదూషించువాఁడు గబ్బిలమై పుట్టును. ఓ తాత గరుడా! ఇఁకను మనోరోగములను వినుము; వానిమూలము ననే జనులకు దుఃఖములు కలుగును. మోహమే సకలదుఃఖములకు మూలమునుమీ! దానివలన, ననేకబాధ లుత్పన్నమగుచున్నవి. కామమే వాతము; లోభమే కఫము; క్రోధమే పైత్యము; ఈ పైత్యమే మనుజులహృదయమును సదా దహించుచుండును. వాతపిత్తశ్లేష్మము లీమూఁడు నుద్రేకించినయెడల, సన్నిపాతమువచ్చును; మహాదుఃఖము సంభవించును కదా! కామక్రోధలోభములు మూఁడును విజృంభించినయెడల, నప్పుడు మనుజుఁడు పడినపాట్లఁ

జెప్ప శక్యమగునా? ఎంతో ప్రయాసముఁ బడినగాని, విషయభోగములు సంప్రాప్తము కావు; ఆభోగములే శూలలు; పేరుపేరున నీశూలలను వర్ణింప నెవరిశక్యము? మమకారమే దద్రువరోగము; ఈర్ష్యయే గజ్జి; కుటిలస్వభావమే కుష్ఠువు; అహంకారమే జలోదరము; ఈరోగ మతిదుఃఖము నిచ్చును; దంభము, కపటము, మదము, మానము - ఇవియన్నియు వాతరోగములు. తృష్ణయే యుదరము; ఈషణత్రయమే యుష్ణము; మత్సరమును, నవివేకమును - ఈ రెండు ద్వంద్వసంకటము; వాతపిత్తములు, లేక వాతశ్లేష్మములు, లేక పిత్తశ్లేష్మములు.

దోహా 193, 194

"ఒక్కరోగమే మనుజునిఁజంపుటకుఁ జాలును; రోగము లన్నియుఁ గూడినయెడల, నసాధ్యము కదా! ఈరోగములన్నియు సదా జీవుని బాధించుచుండును; ఏజీవుఁడు భగవంతునిస్మరించున్నో, వానికే సుఖముకలుగును. జపము, దానము, యజ్ఞము, జ్ఞానము, శిష్టాచారము— ఈ మొదలగునవియే యౌషధములు; వీనివలన నా రోగములు పోవు; ఆరోగములకుఁ దగినమందులు కావు.

చౌపాయ్ 117

"ఓ గరుడజీ! ఈ ప్రకారము లోకములోనిజీవులు రోగపీడితులు; శోకము, హర్షము, భయము, వియోగము, ప్రీతి— ఈ మొదలగునవి యాజీవుని వెంటనంటియుండును. ఈమనోరోగములను గొంచెముమాత్రమే నేను చెప్పినాను. ఈరోగములచే జనులందఱు పీడింపఁబడుచున్నారు; కాని, తగుమాత్రము జనులు వానిం గొంచెముకొంచము తెలిసికొని, వానిం బోల్చుఁగలరు; జనసామాన్యముగ నీరోగము లెవరికిం బట్టుపడవు. ఆరోగములం దెలిసికొనినయెడల, నిఁక లోకములోఁ బాపాత్ములేయుండరు; ఒకవేళఁ దెలిసికొనినను, పాపాత్ముల రోగములు నిశ్శేషము కావు; జనులదుఃఖములు నశింపవు; ఆ రోగములకు విషయభోగములే యపథ్యము; అపథ్యమువలన నా రోగములు ప్రబలమగును; మునులెల్లపు డౌషధములను సేవించెదరు; ఆరోగములచే మునులే బాధపడుచుండినపుడు, బాపురే!

మనుజమాత్రులమాటఁ జెప్పనేల! ఈరోగములపుట్టను రాముని కృపయే బాగుగఁజేయును; సద్గురువే మంచివైద్యుఁడు; వేదవచనముల యందు విశ్వాసము—గురువృవచనములను మన్నించుట—విషయ భోగములయం దాసక్తిలేకయుండుట—ఇదియే పథ్యము; రాముని యందలిభక్తియే సంజీవిమూలిక; సాధనచతుష్టయమే దానికి నను పానము; ఈప్రకార మామూలికను సేవించినయెడల, రోగము లన్నియు నిర్మూలించును. ఈమందును సేవింపనియెడల, ననేకకోటిప్రయత్నములఁ జేసినను, రోగములు నిర్మూలింపవు; ఎప్పుడు మనోసంకటములు నశించునో, వైరాగ్యమప్పుడువచ్చి శరీరమునకు బలమునిచ్చును; బుద్ధియనునట్టిక్షుద్బాధ దినదిన మధికమగును; విషయాశ లంతకంతకుఁ దగ్గును; వానివలనఁ గలిగినసీరసము నీరసించును. ఎప్పుడు మనుజుఁడు నిరోగియై జ్ఞానస్నానముఁజేయునో, వానిహృదయములో నప్పుడే రామభక్తి పుట్టును. బ్రహ్మమహేశ్వరులు, శుకయోగియు, సనకాదులును, నారదాదిమునులును—ఈ మొదలగువారిమత మేమనిన, ఓ గరుడజీ! రఘురాముని చరణకమలములయందు స్వాభావికభక్తి నుంచుటయే శ్రేష్ఠము; శ్రీరాముని యందు భక్తిలేనియెడల, సుఖములు కలుగవని, వేదపురాణేతిహాసములు చాటుచుండును. ఒకవేళ, తాఁబేలువీఁపుమీఁద వెంట్రుకలు పుట్టవచ్చును; వంధ్యాపుత్రుఁ డొకనినిఁ జంపవచ్చును; నిరాధారముగ, ఆకాశమునఁ బుష్పములు పుష్పింపవచ్చును; కాని, పరమేశ్వరునకుఁ బ్రతికూలముగనుండిన జీవునకుమాత్రము సుఖము కలుగదు. ఎండమావులయందు నీటిఁద్రాగవచ్చును; కుందేలుశిరముపై శృంగములు పుట్టవచ్చును; అంధకారము సూర్యుని నశింపఁజేయవచ్చును. ఇట్టివిపరీతములు సంభవింపవచ్చును; కాని, రామునకు విముఖుఁడగు జీవునకుమాత్రము సుఖముకలుగదు. హిమరాసులమీఁద నగ్నిపుట్టినఁ బుట్టవచ్చును; కాని రామునియం దాసక్తిలేనివానికి మాత్రము సుఖము లేశమైన గలుగదని నమ్ముము.

## దోహా 195, 196

"ఒకవేళ జలమును తఱచుటవలన, వెన్న పుట్టవచ్చును; ఇసుకలో నుండి తైలముఁ దీయవచ్చును; కాని, పరమేశ్వరుని భజించుటవలనఁ

దప్ప, సంసారసాగరమును దాటుట కష్టము. ఓ తాతా! ఈసిద్ధాంతము నిశ్చయము సుమీ! ఇది సర్వశాస్త్రముల సారముసుమీ! ఈ సిద్ధాంతము నిరాక్షేపణ; రఘునాథునిప్రభావ మెట్టిదో చూడుము; ఒకక్షణములో మశకము బ్రహ్మయగును; బ్రహ్మ మశకమగునుసుమీ! ఆహా! శ్రీరామునిప్రతాప మెంతపనిఁ జేయును! ఈసంగతిఁ దెలిసికొని, సందేహములను విడిచి, చతురులు శ్రీరామచంద్రుని నిరంతరము భజించెదరు.

శ్లో. వినిశ్చితం వదామి తే నాన్యథా వచాంసి మే,
హరిం నరా భజంతి యేఽతిదుస్తరం తరంతి తే.  ౧

“ఓ గరుడా! ఈసిద్ధాంతము నిరాక్షేపణమని చెప్పుచున్నాను; సత్యమునే చెప్పుచున్నాను; అసత్యముఁ జెప్పను. ఏమనుజులు రాముని భక్తితో సేవించెదరో, వారే భవసాగరముయొక్క తుద ముట్టఁగలరు.

చౌపాయ్ 118

“ఓ గరుడస్వామీ! నిరుపమానమగు శ్రీరామునిచరిత్రమును విరళముగను సంక్షేపముగను నాబుద్ధికిఁ దోఁచినవిధమున వర్ణించి నీకుఁ జెప్పియుంటిని. ఓ నాథా! సర్వకామములను బరిత్యజించి, శ్రీరామునే భజింపుమని వేదములు సిద్ధాంతీకరించెను. నావంటి మూర్ఖాగ్రేసరునిసహితము కటాక్షించి కాపాడిన శ్రీరామచంద్రునివంటి ప్రభువును విడిచిపెట్టి, మఱియే ప్రభువును సేవించెదవో చెప్పుమా? ఓ గరుడా! నీవు సాక్షాత్ విజ్ఞానస్వరూపుఁడవు; నీకు మోహము లేదు; నీకు నాయందు విశేషము దయకలదు; కనుక, నన్నతిపవిత్రమగు రామచరిత్రముఁ జెప్పుమని నీవు ప్రసంగించితివి. శ్రీశుకులు, సనకాదులు, శ్రీమహాదేవుఁడు—ఈ మొదలగుమహాత్ములమనస్సులలో శ్రీరామచరిత్రము సదా వెలుగుచుండును. సంసారములో సత్సాంగత్యము దుర్లభము; ఒకదినములో నొకఘడియలో నొకనిమిషము సత్సాంగత్యము లభించినయెడల, నాజీవుఁడు పరమపదముఁబొందుట కధికారి యగును. ఓ గరుడా! నీలో నీ వాలోచించుకొని తెలిసికొనుము; నేను పక్షులలో నీచుఁడను; అన్నివిధముల నపవిత్రమయినవాఁడను; అయినను,

ప్రభువు నన్ను బ్రసిద్ధునిఁ జేసెను; నాజన్మము పవిత్రమయ్యెను; ప్రభువుని భజించుటకు నా కధికారము కలిగెను కదా!

దోహా 197, 198

"అన్ని ప్రకారముల నేను హీనుఁడను; అయినను, ఓ గరుడజీ! నీ సమాగమమువలన, నిప్పుడు నేను ధన్యుఁడనై, కృతార్థుఁడ నయితిని. తననిజదాసునిగ నన్నుఁ దెలిసికొని, శ్రీరామచంద్రులు నీసత్సాంగత్యమును నాకుఁ గలుగఁజేసెను. ఓ నాథా! ఈ రామకథను నాబుద్ధికిఁ దోఁచినవిధమునఁ జెప్పియుంటిని; నేను దానిలో రహస్యము లేమియు దాఁచియుండలేదు. శ్రీరామునిచరిత్రము మహాసముద్రము; దానిలోఁతుఁ గనిపెట్టుటకు సామర్థ్య మెవనికిఁగలదు?"

చౌపాయీ 119

ఇట్లనేకవిధముల శ్రీరామునిగుణములను స్మరించి, వానిం గీర్తించినకొలఁది, కాకభుశుండియొక్క మనస్సు సంతోషముచే నుప్పొంగుచుండెను. "శ్రీరామునిమహిమేమని చెప్పఁగలను? 'న-ఇతి, న-ఇతి' అని చెప్పి, వేదము లామహాత్మునినామమును గానముఁజేయుచుండును. ఆ నాథునిప్రతాపమును, బలమును, మహిమయు అపరిమితము; శ్రీరామునిచరణకమలములను బ్రహ్మమహేశ్వరులు సదా పూజింతురు. అతనికి నాయందుఁ బరిపూర్ణకటాక్షము కలదు; చూచితివా! ఓ గరుడా! దీనిఁబట్టి శ్రీరామునిమన స్సెంతకోమలమో తెలిసికొనుము. అతనిస్వభావమువంటిస్వభావమును నే నెచ్చటఁ జూడలేదు; యొకరివలన నింతవఱకు వినియుండలేదు. శ్రీరామునితో సమానుఁడగువానిని యెట్లు చెప్పఁగలను? సాధకులును, ('న తస్య ప్రతిమా అస్తి యస్య నామ మహద్యశః' అని వేదప్రమాణము కలదు.) సిద్ధులును, ముక్తులును, ఉదాసీనులును, కవీశ్వరులును, పండితులును, విరాగులును, సన్యాసులును, యోగీశ్వరులును, తపశ్శాలురును, ధర్మాత్ములును, విజ్ఞానులును - ఈమొదలగువారు నాప్రభువు శ్రీరామచంద్రుని సేవించినగాని, సంసారసాగరమును దాఁటలేరు; ముమ్మాటికి నేను నాప్రభువునకు నమస్కరించెదను. నావంటిపాపాత్ముఁడు శ్రీరామచంద్రుని శరణుఁ జొచ్చి, ప్రభువిట్టివాఁడని తెలిసికొని, నిర్ధూతకల్మషుఁ డయ్యెను; ఆ

పవిత్రుఁడు, ఆ శాశ్వతుఁడగు శ్రీరామస్వామికి దండప్రణామంబులఁ జేయువాఁడ.

దోహా 199, 200

"శ్రీరామనామము సంసారరోగములఁ దొలఁగించుట కౌషధముపంటిది; అనేకవిధములగు భయములు శూలలువలన గలుగుదుఃఖములను హరించును; ఆ కృపాసాగరుఁడు నిన్నును నన్నును గటాక్షించుఁగాక." అని యీప్రకారము కాకభుశుండి చెప్పిన సర్వోత్కృష్టమగు ప్రసంగమును గరుత్మంతుఁడు విని పరమానందభరితుఁ డయ్యెను; అతనిసందేహములన్నియు నశించెను. అతఁడు మృదుమధురవాక్యములతో నిట్లు చెప్పెను. "ఓ కాకభుశుండీ! ఓ నాథా! మీ వచనముల వలన నేను గృతకృత్యుఁడ నయితిని; భక్తిరసపూరితమగు మీ శ్రీరాముని ప్రసంగమును వినినందున, నామనస్సు పరమానందభరిత మయ్యెను. శ్రీరామునిచరణములయందు నాకు నూతనభక్తి పుట్టుచున్నది. మాయ వలనఁ బుట్టినదుఃఖములన్నియు నశించెను; నామనస్సు నిర్మలమయ్యెను.

చౌపాయ్ 120

"ఓ నాథా! నేను గృతకృత్యుఁడ నయితిని; నాసందేహములన్నియు హరించెను. రామునియందు భక్తి నాకుఁ గలిగెను. మీరే యనునట్టినావను బురస్కరించుకొని, నామోహసాగరమును అనాయాసముగ దాఁటినాను. మీరు నా కనేకప్రకారముల సుఖమునిచ్చియుంటిరి. నేను మీ కేమి ప్రత్యుపకారముఁ జేయఁగలను? మీరు సంపూర్ణకాములు; రామునికటాక్షము మీయందుఁగలదు; మీవంటియదృష్టవంతుఁడు లేఁడు; సత్పురుషులు, మహాత్ములు, వృక్షములు, నదులు, పర్వతములు, భూమి—వీరందఱు నన్నియుఁ బరోపకారార్థమే సృజింపఁబడెను. సత్పురుషులహృదయము నవనీతమువంటిది, అని కవీశ్వరులు చెప్పుచున్నారు; కాని, వారు బాగుగఁ జెప్పలేదు; నిప్పుసెగ తగిలినంతమాత్రమున, దానియంతటది కఱుగును; పరులదుఃఖములఁ జూచి సత్పురుషులహృదయము నీరగును. నాజన్మమును నాజీవితమును సఫలమయ్యెను. మీకటాక్షమువలన, నాసందేహములు వీడెను నేను సదా మీదాసుఁడనని భావింపుఁడు." అని యిట్లు గరుత్మంతుఁడు బహువారములు కాకభుశుండిని స్తుతించెను.

దోహా 201, 202

ఈప్రకారము గరుత్మంతుఁడు కాకభుశుండిని స్తుతించి, యతని చరణములకు నమస్కరించి, యారణధీరుని, నా సుఖసాగరుని, నా జగదోద్ధారకుని, నా తారణతరణుని, నా సంకటహరుని, శ్రీనివాసునిధామమునకు—వైకుంఠమునకుఁ బయనమయ్యెను. ఓ పార్వతీ! మహాత్ముల సాంగత్యముతో సమానమగులాభము మఱియొకటి లేదుసుమీ! సత్సాంగత్యము లేనియెడల, శ్రీరామునికటాక్షము కలుగదని వేదపురాణములు చెప్పుచుండును కదా!

చౌపాయ్ 121

"ఓ పార్వతీ! ఈ రామకథయనునట్టి పరమపవిత్రమగు నితిహాసమును సాంతముగ నీకు వినిపించితిని; ఈరామకథను భక్తిశ్రద్ధలతో వినినవారికి సంసారబంధనములు వీడిపోవును. ఆశ్రీరాముఁడు కల్పవృక్షమువంటివాఁడు; కృపాసాగరుఁడు; దీనదయాపరమూర్తి; అతనిని నమ్మి, సేవించినవారికి, భక్తి నిచ్చును; అతనికటాక్షమువలన, నతనిసేవకుల కతనిచరణములయం దత్యంతభక్తి కలుగును. ఈరామకథను సావధానముగ వినినయెడల, మనోవాక్కర్మములచేఁ జేసినపాపములన్నియు నశించును. తీర్థయాత్రలు, యోగము, జ్ఞానము, విజ్ఞానము, వైరాగ్యము, అనేకశుభకర్మలు, వ్రతములు, దానములు, యజ్ఞాదిక్రతువులు, సంయమము, నియమము, భూతదయ, బ్రాహ్మణగురుసేవయు, విద్య, వినయము, వేదకర్మలు—ఈ మొదలగువానికి, ఓ పార్వతీ! యొకటియే ఫలము; శ్రీరామునిచరణభక్తియే వానిఫలము. వేదములోఁ జెప్పఁబడియుండినప్రకార మెవనికోయొకనికి శ్రీరాముని యందు భక్తి లభించును; అదియైనను, శ్రీరాముని కటాక్షమువలననే, వానికి సంప్రాప్తమగును.

దోహా 203

"ఓ పార్వతీ! ఈరామకథను వినినందున, మునీశ్వరులకు సహితము దుర్లభమగునట్టి శ్రీరామునియందు భక్తి, మనుజులకు శ్రమ లేకయే లభించును.

చౌపాయ్ 122

"ఓ పార్వతీ! ఏ మనుజునిమనస్సు సదా శ్రీరామునిచరణముల యందు రమించుచుండునో, వాఁడే సర్వజ్ఞుఁడు; వాఁడే గుణజ్ఞుఁడు; వాఁడే జ్ఞాని; వాఁడే లోకపూజ్యుఁడు; వాఁడే పండితుఁడు; వాఁడే దాత; వాఁడే ధర్మపరాయణుఁడు; వాఁడే కులరక్షకుఁడు; వాఁడే నీతినిపుణుఁడు; వాఁడే పరమప్రవీణుఁడు; వాఁడే వేదాధ్యయనసంపన్నుఁడు; వాఁడే సహజపాండిత్యకవీశ్వరుఁడు; వాఁడే ధీరుఁడు; నిష్కాపట్యముతో రాముని సేవించువాఁడే కృతకృత్యుఁడు; ధన్యుఁడు. పతివ్రతధర్మములను నడిపించుస్త్రీ ధన్యురాలు; గంగానది ప్రవహించుచుండినదేశమే ధన్యము; రాజ్యధర్మముల ప్రకారము పరిపాలించురాజే ధన్యుఁడు; యజనయాజనాధ్యయనాధ్యాపక, దాన ప్రతిగ్రహ— ఈషట్కర్మల ప్రకారము నడచుకొనుచుండిన బ్రాహ్మణుఁడే ధన్యుఁడు; దానముక్రింద వినియోగింపఁబడినధనమే సార్థకము; ధర్మమార్గమునఁ బ్రవర్తించుబుద్ధి సార్థకము; సత్సాంగత్యములో గతించినకాలమే సార్థకము; బ్రాహ్మణులచరణములను సేవించువానిజన్మమే సార్థకము.

దోహా 204

"ఓ పార్వతీ! శ్రీరామచంద్రమహారాజు నుపాసించువాఁడు పుట్టినకులమే, సార్థకమయినది; ఆవంశమే, లోకపూజ్యమయినది; ఆ వంశమే పవిత్రమయినది; ఆ యుపాసకుఁడే సుశీలుఁడు.

చౌపాయ్ 123

"ఓ పార్వతీ! ప్రథమమున నేనీ రామకథను గుప్తముగ నుంచి యుంటిని; కాని, నీ నిశ్చలభక్తిం జూచి, సంపూర్ణముగ నా రామకథను నాబుద్ధికిఁదోఁచినవిధమున వర్ణించి చెప్పియుంటిని. మూర్ఖునకును, శ్రీరాముని లీలావతారచరిత్రమును సావధానముగ వినుటకు శ్రద్ధలేనివాని

కిని, గామాతురునకును, పరమలుబ్ధునకును, క్రోధపరాయణునకును ఈ రామకథను జెప్పఁగూడదు. చరాచరబ్రహ్మాండమునకు నాయకుఁడైనను, రఘురాముని సేవింపనియెడల, వాఁడీరామకథనువినుట కర్హుఁడు కాఁడు. ఇంద్రుఁడు చంద్రునివంటి రాజయినను, బ్రాహ్మణద్వేషియయిన యెడల, వానికి రామకథనువినుట కధికారము లేదు. సత్సాంగత్యము నభిలషించువారికే, రామకథనువినుట కర్హతకలదు. గురుచరణారవింద ములను సేవించువారును, బ్రాహ్మణసేవకులును, నీతిమార్గప్రచారణు లును—— వీరే రామకథనువినుట కధికారులు. ఎవరు శ్రీరామునివిశేష ముగ ప్రేమింతురో వారే యీరామచరిత్రమును విని, పరమానం దముఁ బొందఁగలరు; వారికే పరమసుఖము కలుగును.

దోహా 205

"శ్రీరామునిచరణములయందు నిశ్చలభక్తిం గోరినవాఁడును, నిర్వాణపదముఁ గోరినవాఁడును, భక్తిశ్రద్ధలతో నీ రామకథామృత మును శ్రోత్రేంద్రియములమూలమునఁ బానముఁ జేయవలెను.

చౌపాయ్ 124

"ఓ పార్వతీ! నే వర్ణించిచెప్పిన రామకథవలనఁ గలియుగపాప ములు నశించును; మనస్సు నిర్మలమగును. జననమరణములకు శ్రీరామ కథ సంజీవనౌషధమువంటిదని వేదాధ్యయనసంపన్నులు చెప్పి, రాముని గుణములను గానముఁ జేయుచున్నారు. ఈచరిత్రలోని సప్తకాండలు సప్తసోపానములు; ఈసోపానముల నెక్కి వెళ్లినవారికి, రామభక్తి లభించును; వారిమీఁద రామునకుఁ గటాక్షము వచ్చును; వారే యీసోపానములమీఁదఁ బాదములఁ బెట్టఁగలరు; ఈ రామకథను నిష్కపటముగఁజదివిన వారిమనోభీష్టములు సిద్ధించును. శ్రీరామునికథ నామోదించినశ్రోతయు, వక్తయుఁ, బ్రశంసకర్తయు, గోష్పాదమునువలె, సంసారసాగరమును దాఁటఁగలరు." అని శ్రీశివమహారాజు ప్రసంగిం

చెను. శ్రవణానందముగ నతనివచనములను విని, పార్వతి సంతోషముచే నుప్పొంగి, తననాథునితో నిట్లు ప్రస్తావించెను:— "ఓ నాథా! మీకృపవలన, నాసందేహములన్నియు నశించెను. శ్రీరాముని చరణములయందు నామనస్సులో నవీనప్రేమ పుట్టుచున్నది.

దోహా 206

"ఓ విశ్వేశ్వరా! మీకృపవలన, నేను గృతకృత్యురాల నయితిని; రామునియందు భక్తికలిగెను; నా దుఃఖములన్నియు శాంతించెను." ఉమామహేశ్వరులసంవాద మింతటితో సమాప్తము.

చౌపాయ్ 125

"ఓ భరద్వాజా! ఈ పార్వతీపరమేశ్వరులసంవాదము వినినందువలన సుఖముకలుగును; విషాదములు శాంతించును; సంసారభయములు పాఱిపోవును; సందేహములు దూరస్థములగును; సత్పురుషుల కానందముకలుగును; ఆసంవాదము మహాత్ములకుఁ బ్రియము. లోకములోని రామోపాసకుల కీసంవాదముకంటెఁ బ్రియమగునది మఱియొకటి లేదు. నాబుద్ధికిఁ దోఁచినవిధమున నే నీరామచరిత్రమును వర్ణించితిని" అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పి విరమించెను. పిమ్మట భరద్వాజుఁ డతనినిఁ బూజించెను. అనంతరము యాజ్ఞవల్క్యుఁడు భరద్వాజుని సెలవుఁగైకొని, నిష్క్రమించెను.

"తులసీదాసుగా రీవిధమునఁ బ్రసంగించిరి; "ఓ జనులారా! ఈ మహాకలికాలములో మఱియొకసాధనము లేదు; యజ్ఞములు, జపములు, తపములు, వ్రతములు, యోగము, పూజలు— ఈ మొదలగువానిం జెప్పనేల? సదా, రామునిస్మరింపుఁడు; రామునిగుణములనే గానముఁ జేయుఁడు; రామునిగుణములనే వినుఁడు; శ్రీరాముఁడు పాపాత్ములఁ బవిత్రులఁ జేయునని వేదములును, నష్టాదశపురాణములును, మహాత్ములును చెప్పుచున్నారు; అందుచేత, నిష్కపటముగ శ్రీరాముని

సేవించుటయే కర్తవ్యము; శ్రీరాముని భక్తిశ్రద్ధలతోఁ గొలిచినవాఁ డెవఁడు ముక్తికిఁబోలేదు ?

ఛాంద్ 28, 29, 30

"శ్రీరామునిఁ గొలిచినవారందఱును ముక్తికిఁ బోయిరి; ఓ మూఢమనసా! నీ మూర్ఖత్వమును విడిచిపెట్టుము; పతితులను పావనము చేయఁదగిన శ్రీరాముని యేలభజింపవు? వేశ్యయగుపింగళియు, నజామిళుఁడు, జటాయువును, గజేంద్రుఁడును - వీరు రామనామమువలనఁ దరించిరి; ఇంక ననేకులు, యవనులు, వ్యాధులును, నాభీరులును, గిరాతులును, శ్వపచులును, జండాలురు మొదలగువారు రామనామోచ్చారణవలనఁ దరించిరి; అట్టి రామచంద్రునకు దండప్రణామముఁ జేయుచున్నాను. శ్రీరామమూర్తిచరిత్రమును వినినను, జెప్పినను, గానముఁ జేసినను, స్త్రీపురుషులు కలిమలములను మనోమలములనుండి విమోచనులయి, శ్రమలేకయే, పునరావృత్తిలేని శ్రీరామధామమునకు నిష్క్రమింతురు. ఈసంహితలోని యయిదుగాని యారునొకటిగాని చౌపాయీలను గంఠోపాఠముఁ జేసినయెడల, నవిద్యవలన సంప్రాప్తమగు పంచవికారములు రఘురాముని మహిమవలన నశించును. ఈ గ్రంథమునందు శ్రీతులసీదాసుగారు 5100 చౌపాయీలను రచించిరి. వానిలో నయిదుచౌపాయీలు పంచదేవతారాధనను చెప్పును. ఎట్లనిన :— శంకరోపాసనగుఱించి,

"ఇచ్ఛిత ఫల బిను శివ అవరాధే,
లహాఇ న కోటి యోగ్య జప సాధే.
జేహి పర కృపా న కరై పురారీ,
సో న పావముని భక్తి హమారీ.

శక్త్యుపాసన :—

భవ భవ విభవ పరాభవ కారిణీ,
విశ్వవిమోహని స్వవశ విహారిణి.

నహి తవ ఆది మధ్య అవసానా,
మహిమా అమిత వేద నహి జానా.
జగ సంభవ పాలన లయ కరణీ,
నిజ ఇచ్ఛా లీలా వపు ధరణీ.

పంచదేవతోపాసన :—

కరి మజ్జన పూజహి నర నారీ,
గణపతి గౌరి పురారి తమారీ.
రమారమణ పద వంది బహోరీ,
వినవహి అంచల అంజలి జోరీ.

ఇత్యాదివాక్యములవలన నీ రామాయణము సర్వజనసమ్మతమయి యుండును.)

శ్రీరాముఁడే చక్కనివాఁడు; శ్రీరమారమణుఁడే సర్వముఁ దెలిసినవాఁడు; ఆ దాశరథియే కృపానిధానుఁడు; ఆ సీతాపతియే దీన దయాపరమూర్తి; ఆ కౌసల్యానందవర్ధనుఁడే కామములులేనివాఁడు; ఆ రామభద్రుఁడే భక్తులకుఁ బ్రియముచేయును; ఆ పరంధాముఁడే భక్తులకు ముక్తినిచ్చును; అతనితో సమానుఁడు మఱియొకఁడు లేఁడు; అతని లవలేశమగుకృపచేతనే, నావంటి మందమతియగుతులసి పరమ విశ్రామముఁ బొందెనుకదా! అతనిదయవలన, సకలశాస్త్రములు నాకు బోధపడెను. శ్రీరామునివంటి కృపాళుఁడగుప్రభువు మఱియొకఁడు లేఁడు.

**దోహా 207, 208**

ఓ శ్రీరఘునాథా! సంసారబంధనములను విడఁదీయుటకుఁ దగిన వీరుఁడవు నీవే; దీనులదైన్యముఁ బోఁగొట్టువాఁడవు నీవే; దుఃఖము లును, శోకమును, మోహమును—వీనిచేఁ బీడితులగువారు, నీమూల మున శాంతిం బొందఁగలరు. నీవంటివాఁడవు నీవే. కామాతురుఁడు

ప్రియసఖుని, లుబ్ధుఁడు ధనమును ప్రేమించువిధమున, నాకు శ్రీరాముని యందుఁ బ్రేమయుండుఁ గాక.

శ్లో. పాపినామహ మేకాగ్ర్యో దయాళూనాం త్వమగ్రణీః,
దయనీయో మదన్యోఽస్తి తవ కోఽత్ర జగత్త్రయే.

ఉత్తరకాండము సంపూర్ణము.



శ్రీ మ ద్గో స్వా మి

# తులసీదాసకృతరామాయణము

# ల వ కు శ కాం డ ము.

ప్ర థ మ వి శ్రా మ ము.

శ్లో. జయతి రఘువంశతిలకః కౌసల్యాహృదయనందనో రామః,
దశవదననిధనకారీ దాశరథిః పుండరీకాక్షః. 1

నమామీశ ఘనజ్ఞాన రఘువంశదాసం
సదానందదాతా సువిద్యాప్రకాశమ్,
విశదశ్శైలనీలం కృపాళుం నివాసం
చరణాంబుజం సేవితం పాపనాశం. 2

గతంమోహమారాది శూలం విశాలం
హరంతాపసంతాప భవశోకజాలమ్,
నమోకాకపాదం సుబుద్ధిం సుశీలం
సదాభక్తవాత్సల్య వాసాద్రినీలమ్. 3

ప్రసన్నాననం నీలవదనం సుశ్యామం
నమో పాహి శరణం సురామాభిరామమ్,
భాష్యోఉమానాథ యశనాథనామం
దేఖ్యోకృపాసింధు కోరామధామమ్. 4

చౌపాయ్ 1

"ఓ సకలకల్యాణగుణాకరుడా! ఓ కాకరాజా! మీ స్వేచ్ఛానుసారము మీ రీరూపమును ధరించితిరి; అవధపురిలో విహరించుటకు మీకభిలాష మెందు; ఓ దయానిధీ! నా పూర్వజన్మవాసనయు, నా

తాపత్రయమును శాంతించి, నశించెను. మీరుపదేశించిన జ్ఞానము వలన, నా యజ్ఞానమంతయు వీడిపోయెను. సకలభూభారమును హరించుటకు, భగవంతుఁడు నరరూపమును ధరించి, లీలావతారచర్యలఁ జూపించెను; అట్టి శ్రీరాముని యవతారకథలను సాంతముగ వినినందున, నామోహము మాయమయ్యెను. ఆ విశ్వనివాసుఁడు, ఆ లోకారాధ్యుఁడు, ఆ దైత్యాంతకుఁడు, ఆ విశ్వవంద్యుఁడు, భక్తులనిమిత్తమనేకరూపములను ధరించి, చిత్రవిచిత్రచర్యలఁ జేయునని తెలిసికొంటిని. ఓ నిశ్చలజ్ఞానసంపన్నుఁడా! మీరు దయానిధులు; ఆ మనోవాచామగోచరుఁడగు పరబ్రహ్మమంత్రము మీ విశాలరూపమును ధరించి, యవతరించినట్లు తోఁచును; నేను మీశరణుఁజొచ్చితిని; నన్నుఁ గటాక్షించి, రక్షింపుఁడు; నా యదృష్టమువలన, మీదర్శనము నాకు లభించెను; మీకటాక్షమువలన, నాకు యోగమును, నాయింద్రియరోగములును నశించెను.

దోహా 2

"ఓ నాథా! గంగానదివలె, నాహృదయము నిర్మలమయ్యెను; జన్మజన్మములకు మీ చరణారవిందములనుమాత్రము విడువఁజాలను.

చౌపాయ్ 2

"ఓ నాథా! శ్రీమచ్చరాచరజగన్నాథునిగుణములను వినినందున, నామనోరథములు సిద్ధించెను. ఓ వాయసకులతిలకమా! మీకృప వలన, లోకారాధ్యునిగుణములు నామనస్సునకు బాగుగఁ బట్టెను. ఇతఃపూర్వము నామనస్సులో వెత్తియుండెను; కాని, యిప్పుడావెలితి పూర్ణమయ్యెను; నామనస్సు సంపూర్ణముగ సంతోషముతోఁ నిండెను; అనేకనదులజలములు సముద్రములోఁ బడుచుండినను సముద్రునకు వెలితిలేదు; పుష్టిలేదు. అవధపురిలోనుండిన చరాచరజంతుజాలముతోఁ గూడి, శ్రీరామచంద్రులు వైకుంఠధామమునకు విజయముఁ జేసిరి; అయోధ్యాపురవాసులు గృహములను విడిచి, శరీరములతో నెట్లు వైకుంఠమునకు వెళ్లిరి? ఓ స్వామీ! ఈ పరమసందేహము నన్ను బాధించుచున్నది. ఓ మునిరాజా! బాలుని సంజల్పములను తండ్రి విని సంతసించువిధమున, నా సంజల్పములను మన్నించి, నన్ను మీ పుత్రు

నిగ భావించి, నా సందేహామువీడునట్లు బోధింపుము; ఓ కృపానిధీ! ఈవిషయమును నాకు బోధించి, రామాశ్వమేధచరిత్రమును సాంత ముగ వివరింపుము." అని యీప్రకారము గరుత్మంతుఁడు పలికెను.

దోహా 3

ఈప్రకారము గరుత్మంతుఁడు పలుకుచుండ, నతనిశరీరము పులక రించెను; అతనికంఠము గద్గదమయ్యెను. పరమాత్మునివిషయమై యతఁడు చేసినప్రశ్నను కాకభుశుండి విని, ప్రసన్నుఁడై, గరుడునితో నిట్లు పలికెను.

చౌపాయ్ 3

"ఓ గరుడా! శ్రీరామునికటాక్షమువలన, నీమనస్సులోనుండిన మోహాదులు నశించెను; నీవు ధన్యుఁడవు; నీకు నాయందు విశేషము దయకలదు. మృదుమధురమగు నీ సరసపుపలుకులు నామనస్సున కాహ్లా దము నిచ్చుచుండును. నిష్కపటముగ రామునిచరిత్రమును వినుటకు నీకుఁగల యభిలాషవలన, నామనస్సునకుఁ దృప్తికలిగెను; నీ యభి లాషవలన, నమంగళములన్నియు నశించును. పరమరహస్యమగు శ్రీరాముని నిరుపమానచర్యలను సావధానముగ వినుము; అవధపతియగు శ్రీరాముని లీలామానుషచర్యలపారములు. ఆ యనంతుఁడు, ఆ యద్వి తీయుఁడు, ఆ శాశ్వతుఁడు, ఆ జననమరణములులేని ప్రభువు, సాధా రణమనుజునివలె, సంపూర్ణపాపములతోనిండిన సంసారబంధనములకుఁ జిక్కువడి, పదునొకండువేలసంవత్సరము లయోధ్యానగరములో నివ సించి, రాజ్యముఁ బరిపాలించి, మాయామానుషచర్యల నడపించెను. లోకోపకారార్థము రామునిచరిత్రము నింతవఱకు విస్తరించి చెప్పి యుంటిని.

దోహా 4

"ప్రథమమున నారదునిద్వారా బ్రహ్మదేవుఁడుపంపించిన వర్త మానమునుమాత్రము రాముఁడు హృదయములో దాఁచుకొని, అతి జాగరూకతతో సంచరించుచుండెను; శ్రీసీతారాముల లావణ్యసంపదఁ జూచి, కోటిమన్మథులుసహితము సిగ్గుపడుచుండిరి.

### చౌపాయ్ 4

"ఒకసమయమున, మంత్రులతోను, పురజనులతోను, తమ్ములతోc గూడి, యతియుత్సాహముతో గురువుగృహమునకు వెళ్లెను; అప్పుడు సూర్యుcడు మకరరాశిలోc బ్రవేశించు మహాపర్వసమయము; శ్రీరాముcడు మొదలగువారందఱు గురుచరణారవిందములకు నమస్కరించిరి. శ్రీకాశీనగరము ధర్మక్షేత్రమనుసంగతి లోకప్రసిద్ధము; అచ్చట నుండి వారు, వారివారి వాహనములనెక్కి, కాశీనగరమునకు వెడలిరి; చతురంగబలములతోc గూడి శ్రీరామమూర్తి శ్రీకాశీపట్టణమునకుc బ్రయాణ మయ్యెను. మార్గములో నచ్చటచ్చట విశ్రమించి, తుదకు వారు కాశీనగరమునకు వచ్చిరి; ఆ పుణ్యక్షేత్రమును వారు చూచి, దానికి నమస్కరించిరి; పిమ్మట, వారు గంగాదేవికిc బ్రణమిల్లిరి; ఆనగరమును, నాత్రిలోకపావని యగుగంగను చూచినమాత్రమున, రాముని మనస్సున కాహ్లాదము కలిగెను. ఆ కృపాసింధు, ఆ సుఖరాశి, ఆ శ్రీరాముcడు, కాశీనగరములోనుండిన బ్రాహ్మణులను, దండులను, యతులను, సన్యాసులను, పలువిధముల యథోచితముగ సత్కరించి, యాదరించెను; అపరిమితముగ నతcడు షోడశమహాదానముల నిచ్చెను; అతcడు ధర్మముక్రింద వినియోగించిన ద్రవ్యముc జూచి, కుబేరుcడును ఇంద్రుcడును సిగ్గుపడిరి.

### దోహా 5

"ఈప్రకారము దేవతల నర్చించియు, బ్రాహ్మణుల సత్కరించియు, మునులను సన్మానించియు, యతులకు భిక్షc జేయుచు, కొంతకాలము శ్రీరాముcడు శ్రీకాశీనగరములో నివసించియుండెను; ఆపురవాసులు సంతసించిరి. తదుపరి, యతcడు స్వరాజధానికిc బ్రయాణమయ్యెను.

### చౌపాయ్

"అయోధ్యానగరములో నిత్యోత్సవములును, నూతనవినోదములును జరగుచుండెను; అనుదినము శ్రీరాముcడు దానములక్రింద ధనమును వినియోగించెను. ఓ గరుడా! ఈమహాకలియుగదుఃఖములు మనుజులను బాధింపలేదు; దుర్భాషలనుమాట లేదు; ఒకరినొకరు నిందించుకొనుట లేదు. ప్రతిగృహములో ననుదినము వేదపారాయణయుc, బురాణశ్రవణమును జరగుచుండెను; ఎవరికులధర్మముల ననుసరించి,

వారు సంచరించిరి; కాని, యితరకులధర్మముల నాచరించుట లేదు. శ్రీరామునకు జనులయం దనురాగము దినదినము వృద్ధిబొందెను; అందుచేత, నతనియందు వారికి ననురాగము బలిసెను. 'అహా! నేను రాజ్యముం జేయుచుండఁ, బదునొకండు వేలసంవత్సరములు గతించెను; అశ్వమేధయాగముం జేయవలెను; బ్రహ్మావచనముల నసత్యముం జేయఁ గాఁడదు; మేము మావైకుంఠధామమునకుం బోవలెను' అని శ్రీరాముఁడు తనలోఁదాను జింతించెను; ఒకదినమున, నతఁడు ప్రాతఃకాలమున లేచి, స్నానసంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించి, గురువుగారి మందిరమునకు వెళ్లి, వారికి నమస్కరించి, అశ్వమేధయాగమును గుఱించి, వారితోఁ బ్రస్తావించెను. అశ్వమేధయాగచరిత్రమును జదివినవారు సంసారసాగరమును దాఁటఁగలరు.

దోహా 6

"ఆ కృపాసాగరుఁడు, ఆ భక్తవత్సలుఁడు, ఆ జ్ఞానస్వరూపుఁడు, ఆ సంసారదుఃఖముల నివారించు శ్రీరాముఁ డనేకచిత్రవిచిత్రచర్యలఁ జేయుచుండెను.

చౌపాయ్

"పురాణములలో నారదుఁడు గానము జేసినవిధమున, శ్రీరాముని చర్యలఁ జెప్పుచున్నాను; సావధానముగ వినుము; అతని ప్రభుత్వములో, లోకమంతయు నిర్మలమయ్యెను; వాల్మీకమహాముని శ్రీరామకథను విపులముగ వర్ణించియుండెను. నావంటిబుద్ధిహీనుఁడు రామకథను సాంతముగ నెట్లు వర్ణింపఁగలఁడు? కొంగలమధ్యను హంస శోభించునా! శ్రీరాముని ప్రభుత్వములో, నెచ్చటను బాపమనుమాట వినఁబడలేదు; పాపముఁ జేయువారు లోపించిరి; సరసులగుపురుషులు వేదముల నభ్యసించి, పురాణములఁ జదువుచుండిరి. లోకకంటకములను నివారించు శ్రీరామునికాలములో, భక్తిశ్రద్ధలతో భర్తలకు స్త్రీలు శుశ్రూషఁ జేయుటఁ జూచి, దేవతాస్త్రీలు సిగ్గుపడిరి. తల్లిదండ్రుల యాజ్ఞలను, గురువులవచనములను, బాలకులు మన్నించుచుండిరి. వారు జపములఁ జేయుచు, తపస్సుల నాచరించుచు, దానముల నిచ్చుచు, దినములు గడపిరి. జనులందఱు సుఖముగ జీవించియుండిరి; అందఱు

దేవేంద్రభోగముల ననుభవించిరి; కుబేరునితోసమానముగ వారికి ధనధాన్యములు సమృద్ధిగ నుండెను. శరత్కాలచంద్రబింబముఁ జూచి, చకోరములు సంతసించువిధమున, నంతఃపురస్త్రీలు శ్రీరాముని: జూచి, యానందించిరి.

ఛాంద్ గీతము 1, 2, 3,

"అటులనే శ్రీరాముని ముఖచంద్రునిఁ జూచి, తల్లులుముువ్వురు పరమానందముఁ బొందిరి; శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముఁ గన్నులారఁ జూచినందున, భరత లక్ష్మణ శత్రుఘ్నులమనస్సుల కాహ్లాదము కలిగెను. ఇతఃపూర్వము, వానరసైన్యములతోఁ గూడి, యుద్ధమునకు రాముఁడు వెళ్లెను; కాని, ప్రస్తుతము చతురంగబలములు వెంటనడువ, నతఁడు తమ్ములతోఁ గూడి, వేఁటకు వెళ్లెను. ఆప్రకారము చతురంగబలములు నడుచుచుండ, వారు వాహనారూఢులై, నగరముఁ గలయఁజూచిరి; దినమంతయు శ్రమపడినందున, వారు సాయంసంధ్యా సమయమునకు వేఁటనుండి మఱలి, గృహములకు వచ్చుచుండిరి; మార్గములో హేమసారంగములఁ జూచి, వారు వాహనములనుండి దిగి, వానింజూచుటకు వెళ్లిరి; ఆ సారంగములవెనుకఁ బరుగెత్తినపుడు, శ్రీరామునిపాదములకుఁ బుష్పములముండ్లు గ్రుచ్చుకొనెను; అప్పుడతఁడు ముఖముఁ ద్రిప్పుకొని, తనలోఁదాను నవ్వుచుండెను; అతని దేహమెంత సుకుమారము? ఆనాఁడు యుద్ధములో నతఁడు, రావణుఁడు ప్రయోగించిన మహాశక్తినిసహితము భరించెను గదా! అప్పుడతని దేహమెంత కఠినము? భక్తుల నుద్ధరించుటకు, నిద్రాహారములు లేక, శ్రీరాముఁడు పదునాలుగుసంవత్సరములు వనవాసముఁ జేసెనుకదా! అట్టిప్రభువు నేఁడు షడ్రసోపేతముగ పక్వాన్నమును భుజించెను; ఘృతమును, మధురపదార్థము లుండినగాని, యతఁడు భుజింపఁడు; అతఁడు తమ్ములతోఁ గూడి, క్రీడావినోదములలోఁ గాలముఁ గడపెను. భక్తులను రక్షించుటకే, లక్ష్మణమూర్తి యుద్ధములో మేఘనాదుని సంహరించెను.

దోహా 7

శ్రీరామునిప్రభుత్వములో, లోకమంతయు సంపూర్ణకళలతో నిండియుండెను; పాపమనుమాట లేదు; మునీశ్వరులు నిర్భయముగ

వనములలో సంచరించిరి; వారు మహాభక్తిశ్రద్ధలలో, రాముని సేవించిరి; రాజునకును బ్రజలకు నన్యోన్యానురాగము బలిసెను.

చౌపాయ్

"భూమియంతయు శోభస్కరముగనుండెను; వనములుసహితము కలకలలాడెను; పక్షులును మృగములును, స్వాభావికవిరోధములను విడిచి, పరస్పరమైత్రితో మెలంగెను; శ్రీరామ రాజ్యములో, వైరమను మాట లేదు; ఒకరియెడల నొకరికి వైరము లేదు; అందఱు పరమ సఖ్యముగ నుండిరి; ప్రతిగృహమును సంపదలతోఁ దులదూగెను; శ్రీవారిప్రభావమును వర్ణింప శక్యముకాదు. సరస్వతియు, బ్రహ్మ మహేశులును, కోటానఁగోట్లు శేషువులును, లోకములోనుండిన పండితులును, గవీశ్వరులును—రామరాజ్యముయొక్క పరిపూర్ణకళలను సాంతముగ వర్ణించుటకు సమర్థులు కారు. ఒకపర్వతముపొడుగున కాటుకగుండఁ దీసికొనివచ్చి, సముద్రమంతపాత్రలో 'సిరా' చేయుము; కల్పవృక్షమే యొకకలము; సప్తద్వీపముల పొడుగువెడల్పుగల కాగితముపై, సరస్వతియు, విష్ణుమూర్తియు, శివుఁడును, పదివందల కల్పములవఱకు రాముని ప్రభావమును, చర్యలను, గుణములను వ్రాయుచుండినను, దుదముట్టవ్రాయుటకు సమర్థులు కారు.

సోరఠా 1

"ఓ గరుడా! శ్రీరామునిచరిత్ర మపారము; దానిని సాంతముగఁజూపుట కష్టము; మున్ముందు రాముఁడు చేసినచర్యలను వినుము.

చౌపాయ్

"ఒకదినమున హాజారములో శ్రీరాముఁడు, తమ్ములతోఁ గూడి, సింహాసనము నధిష్ఠించియుండెను; ఆసమయమున, నొకబ్రాహ్మణుఁడు దుఃఖించుచు, రాజసభకు వచ్చెను; అనేకనిష్ఠురవాక్యముల నతఁడు పలికి, మొఱవెట్టెను. 'అయ్యో! లోకములో సూర్యవంశపురాజుల కీర్తిప్రతిష్ఠలు నేఁటిదినముతో నంతరించెను; శిబి, రఘు, దిలీప, సగర మహారాజుల ప్రతాపమును, వారి కీర్తిప్రతిష్ఠల నెవ రెఱుంగరు? వారి కాలములో నిట్టివిపరీతములు జరగియుండెనా? ఎన్నఁడైన, తండ్రి బ్రతికి

యుండఁ, గుమారుఁడు చనిపోవుట కలదా! ఈనాఁటి కీవిపరీతములఁ జూచితిమి!' అని యాబ్రాహ్మణుఁడు విలపించెను. అతనిదుఃఖమునకుఁ గారణమును సర్వాంతర్యామియగు శ్రీరాముఁడు గ్రహించెను. మాయామానుషరూపమునుధరించిన శ్రీరామమూర్తి బ్రాహ్మణునివచనములను విని, కొంత విచారించెను; ఏకారణముచేత నతనికుమారుఁడు మృతినొందెనో, దానిం దెలిసికొనుట కతఁడు చింతించెను. అప్పుడు శ్రీరామచిత్తముఁ గనిపెట్టి, 'ఓ నాథా! వింధ్యపర్వతసమీపమున నొకశూద్రుఁడు తపముఁ జేయుచున్నాఁడు; అందుచేత నతనికుమారుఁడు చనిపోయెను' అని అశరీరవాణి పలికెను.

ఛాంద్ గీతము 1, 2

"బ్రాహ్మణచిన్నవాని మరణమునకుఁ గారణముఁ దెలిసికొని, శ్రీరాముఁడు శీఘ్రము రథముపైఁ గూర్చుండి, వింధ్యపర్వతమునకుఁ బ్రయాణమయ్యెను. ఆ చక్కనిపర్వతముఁ జూచినందున, నతనిమనస్సున కాహ్లాదనము కలిగెను. ఆ శూద్రునియాశ్రమము మనోహరముగ నుండెను; తోఁటలును, బాలవాటికలును, సరోవరములును, వేదికలును—శ్రీరాముఁడు చూచెను. తుమ్మెదలు ఝంకారముఁ జేయుచుండెను. శుక పిక కోకిల పారావతంబులు కిలకిల మనుచుండెను; నెమిళ్లు కూయుచుండెను. వయోవృద్ధులగు కోలులును కిరాతులును సాదరముగ నాశ్రమమునకు వచ్చి పోవుచుండిరి. శ్రీరాముఁడు కోపించి, యొకబాణముతో వానిశిరస్సుఁ ద్రుంచెను. వాఁడు తనభక్తుఁడని తెలిసికొని, శ్రీరాముఁడు వానికిఁ దనలోకము నిచ్చెను; అచ్చట నతఁడు తీర్థవిధులను యథావిధిగ జరిగించెను.

దోహా 8

"అంతట నా బ్రాహ్మణబాలుఁడు సజీవుఁడై లేచెను. ఆపదోద్ధారకుఁడు, ఆ భక్తవత్సలుఁడు, శ్రీరాముఁడు స్వరాజధానికి వచ్చెను.

చౌపాయ్

" 'ఓ దీనరక్షకా! రక్షింపుము; రక్షింపుము; ఓ కృపాసాగరుఁడా! నే నేమియపరాధముఁ జేయలేదు; నిష్కారణము నన్నొక బ్రాహ్మణుఁడు కొట్టెను'' అనియొకకుక్కవచ్చి సింహద్వారములో నొక

నాఁడు మొఱబెట్టెను. శ్రీరాముఁడు దానిమాటలను విని, సేవకునితో బ్రాహ్మణునకు వర్తమానముఁ బంపెను. అంతట నాబ్రాహ్మణుఁడు వచ్చెను. నిష్కారణము శునకముఁ గొట్టినందులకు సమాధానముఁ జెప్పుమని శ్రీరాముఁడు బ్రాహ్మణుని నడిగెను. 'ఓ నాథా! కోపము లేదు; ఆలోచన లేదు; వ్యర్థముగ నేను కుక్కను గొట్టియుంటిని' అని బ్రాహ్మణుఁడు చెప్పెను. అప్పుడు శ్రీరాముఁడు సభికులం జూచి, 'ఆర్యులారా! ఈ బ్రాహ్మణునకుఁ దగినదండనను విధింపుఁడు' అని పలికెను. 'ఓ రాజాధిరాజా! బ్రాహ్మణుఁడు దండనకుఁ బాత్రుఁడు కాఁడు; మీచిత్తానుసారము ప్రసాదింపుఁడు' అని సభికులు ప్రత్యుత్తరము నిచ్చిరి; అప్పుడు శ్రీరామమూర్తి శునకముఁ జూచి, 'ఓ శునకమా! నీవు చెప్పినప్రకారము బ్రాహ్మణుని దండించెదను.' అని యడిగెను.

దోహా 9

"'ఓ స్వామీ! ఈబ్రాహ్మణుని మఠాధిపతిగఁ జేయుము; అతఁడు సుఖించును; స్వేచ్ఛానుసారముగఁ బ్రవర్తించును.' అని కుక్క చెప్పెను. బ్రాహ్మణునకు శీఘ్రము శ్రీరాముఁడు పట్టువస్త్రములఁ గట్టి, చెవులకు మకరకుండలములఁ దగిలించి, ఏనుగుపైఁ గూర్చుండఁబెట్టెను.

చౌపాయీ

"శ్రీరామమూర్తి బ్రాహ్మణుని యథావిధిగ సత్కరించి, పూజించి, 'ఢంకా, నౌపత్' వాద్యములు మ్రోఁగుచుండ, మఠమునకుఁ బంపెను. 'చూచితిరా! కుక్కనుగొట్టినందులకు బ్రాహ్మణున కెట్టిశిక్ష విధింపఁబడెనో చూడుఁడు! ఆ కృపాసాగరుఁడు వానిని మహారాజపదవికిఁ దీసికొని వచ్చెను; ఏమిచిత్రము' అని స్త్రీపురుషులు వారిలోవారు గుసగుసలాడిరి; వానికిఁ దగినశిక్ష విధింపఁబడెనని శునకము సంతోషించుచుండెను. ఆశునకము సంతోషించుట వారు చూచి, రామునివద్దకు వచ్చి, 'ఓ నాథా! ఈవిధమున బ్రాహ్మణుని మీరు దండించినందుకుఁ గారణముతెలియదు' అని యడిగిరి. ఆ శిక్షనుగుఱించి కుక్కనడుగుమని శ్రీరామమూర్తి వారితోఁ జెప్పెను; అప్పుడు వారు శునకమును బిలిచి, దానిని యడిగిరి. 'ఓ రాజాధిరాజా! పూర్వజన్మములో నే నొకబ్రాహ్మణుఁడను; శ్రీకాశీనగరములో

నివసించియుంటిని; శ్రీవిశ్వేశ్వరుని సదా త్రికరణశుద్ధిగ నారాధించుచుంటిని; హేమంతఋతువులో నొకనాఁడు హోమముఁ జేయుచుండ, నాగోళ్లకు ఘృత మంటుకొనెను.

దోహా 10

"'నేను గృహమునకు వచ్చి, కించిదుష్ణాన్నమును భుజించితిని; అప్పుడు నాగోళ్లలోఁ జేరుకొనిననెయ్యి కఱిగి, అన్నములోఁ గలిసెను; ఆయన్నమును నేను సేవించితిని. ఆ పాపముచేత, ననేక పాపయోనులయందు జన్మించితిని; ఇప్పటికిని నాకుఁ బాపవిమోచనము కాలేదు.' అని యీప్రకారము కుక్క సమాధానముఁ జెప్పి, రాజసభకు నమస్కరించి, దుఃఖించుచు, దానిమార్గమున వెళ్లెను. అంతట జపమునకు సమయమయ్యెను; అంతఃపురములోనికి వెళ్లి, శ్రీరాముఁడు శివునిఁబూజించెను; పిమ్మట నతఁడు తమ్ములతోఁగూడి భుజించి, కొంచెముకాలము విశ్రమించెను; మంత్రులు మొదలగువారు వారివారి గృహములకు నిష్క్రమించిరి. సాయంసమయమునకు నాలుగుఘడియల ప్రొద్దు వ్యవధియుండ, శ్రీరాముఁడు తమ్ములతోఁగూడి సభకువచ్చెను; కొంతవఱకు వారు పురాణకాలక్షేపముఁ జేసిరి; అంతట సంధ్యాసమయమయ్యెను; బ్రాహ్మణులకు శ్రీరామచంద్రుఁడు షోడశమహాదానముల నిచ్చెను; వారు సాయంసంధ్యావందనమును వార్చిరి. శ్రీరాముని సెలవుఁ గైకొని, ప్రధానులు మొదలగు వారు స్వగృహములకు నిష్క్రమించిరి. దేశములోను నగరములోను చారులు గూఢముగ సంచరించి, ప్రతిదినము సాయంసమయమునకు నగరునకు వచ్చి, యావద్వృత్తాంతమును ప్రభువునకు విన్నవించుట యాచారము కలదు. ఆయాచారులు చెప్పినవృత్తాంతములను రామమూర్తి వినుచుండెను; వారిలో నొకఁడొకదినమున రాజువద్దకు వచ్చి, నమస్కరించి, జోహారువనుచు నిలువఁబడియుండెనుగాని, యేసమాచారముఁ జెప్పక, మౌనమును ధరించియుండెను.

ఛాంద్ 1

"వానిని శ్రీరాముఁడు తర్కించినను, వాఁడు పలుకక యూరకుండెను; అంతట వాఁడు ధైర్యమునవలంబించి రామునితో నిట్లు చెప్పెను. 'ఓ మహారాజా! ఓ రాజాధిరాజా! నామాట మన్నింపుము;

నన్ను క్షమింపుము. ఒకచాకలివాఁడును, వానిభార్యయుఁ గలహించిరి. 'ఓసీ! నేను రాముఁడనుకాను; ఇంతకాలము నీవు పరులగృహములో నివసించియుంటివి; కనుక, నాగృహమునుండి లేచిపొమ్ము' అని వాఁడు భార్యను బొమ్మనెను." ఆమాట బాణమువలె రామునిహృదయమునకుఁ దగిలెను. ఆరాత్రి నిద్రలోఁగూడ నావిషయమే రామునకు స్వప్నమువచ్చెను. అతఁడు మేల్కాంచి దుఃఖించెను.

దోహా 11

"నేను రాజ్యముఁజేయుచుండ నొకయుగము గతించెను; ఇంక నొకవెయ్యిసంవత్సరములు రాజ్యముఁ జేయవలెను" అని యాకృపాసాగరుఁడు చింతించెను.

చౌపాయ్

"ఆహా! నేను జానకిని విడిచిపెట్టవలెను; వేదమార్గములను నిలుపఁబెట్టవలెను." అని యతఁడు నిశ్చయించెను. అతఁడు జానకి వద్దకు వచ్చి, సంతోషముతో నామెతో ముచ్చటించెను. ఆ కృపాసముద్రుఁడు చిఱునవ్వు నవ్వి, "ఓ సుందరీ! ఇంతవఱకు నీవు నన్నొక వరము నడుగలేదు; అయినను, నీకొకవరము నిచ్చెద; నీ పవిత్రధామమునకుఁ బొమ్ము" అని చెప్పెను. ఆతక్షణమే జానకి శ్రీవారిచరణములకు నమస్కరించి, ఆకాశమార్గమున వైకుంఠమునకుఁ బోయెను; ఆ వృత్తాంతము చరాచరజంతుజాలమునకుఁ దెలియదు. మాయసీత మాత్రము శ్రీరామునివద్ద నిలిచియుండెను; ఆ మాయసీతం జూచి, "ఓ సీతా! వరమునడుగుము" అని రాముఁడు పలికెను. "ఓ నాథా! నాకు మునియాశ్రమములలో విహరింపవలెనని కోరికకలదు" అని యామె చెప్పెను; మునికన్యలకును మునిపత్నులకుఁ దగినవస్త్రాద్యలంకారములనామె మాటఁగట్టెను. "తథాస్తు; రేపుప్రాతఃకాలమున నీవు ప్రయాణమగుము" అని రాముఁడు చెప్పెను.

దోహా 12

ఆ జగత్పతి, ఆ శ్రీనివాసుఁడు, ప్రాతఃకాలమున మేల్కాంచెను; యాచకజనులు మొదలగువారు శ్రీరామగుణములను గానముఁ జేయుచుండిరి. శ్రీవారిముఖకమలము వికసించియుండెను.

చౌపాయ్

శ్రీలక్ష్మణభరతశత్రుఘ్నులు శ్రీరామునివద్దకు వచ్చి, వారిచరణములకు నమస్కరించిరి; అన్నదమ్ములతో నతఁడు మాటాడక యూరకుండెను. శ్రీరామునిముఖము వెలవెలఁ బోవుచుండెను; అతని శరీరనవకము చెడిపోయెను; అతని ప్రతియవయవము శంకను ద్యోతింపఁచెను. అతనివ్యాకులమునకుఁ గారణముఁ దెలియక, వారుముగ్గురు గడగడ వడఁకిరి; అతనిమనోవ్యాపారము వారికి నగోచరము. శ్రీరాముఁడు విచారించి, నిట్టూర్పులను విడిచి, తమ్ములతో నిట్లు ప్రసంగించెను. "ఓ తమ్ములారా! నామాటను మన్నించి, జానకిని వనములోవిడిచిపెట్టి రండు. ఆమాటను వినినంతలో వారు నిశ్చేష్టులయిరి; వారిశరీరములు మండెను; వారిహృదయములు దహించుకొనిపోయెను. ఓ గరుడా! ఈమాట నతఁడు హాస్యమునకుఁ జెప్పెనో, లేక నిజముగఁ జెప్పెనో, వారికి సందేహము కలిగెను.

దోహా 13

ఆ ముగ్గురుతమ్ములు వ్యాకులముఁ బొందిరి; వారిముఖముల నుండి మాట వెడలలేదు. శత్రుఘ్నుఁడు వెక్కివెక్కియేడ్చుచు, హస్తములను జోడించుకొని, రామునితో నిట్లు విన్నవించెను.

చౌపాయ్

"శ్రీవారివచనములు మాహృదయములను ఛేదించెను. జానకి లోకమాత; ఈసంగతి జనులకుఁ దెలియును. మీరు లోకతండ్రులు; సకలజీవులహృదయములలో నివసించియుందురు; సచ్చిదానందపురుషులు. ఏకారణముచేత జానకిని విడిచిపెట్టుచున్నారు? త్రికరణశుద్ధిగ నామె మీ నిత్యానపాయిని గదా! ఓ రాక్షసాంతకా! ఓ కమలలోచనుఁడా! మీరు సర్వజ్ఞులు; ఆమె ప్రస్తుతము గర్భమును ధరించెను." అని శత్రుఘ్నుఁడు విన్నవించెను. "ఓ తమ్ములారా! మీరు నామాటనుల్లంఘించినయెడల, నాప్రాణము లీ నాశరీరములో నిలిచియుండవు. పరమేశ్వరునికృప బలవంతము. మీకు మంగళమగుఁ గాక! ఓ తమ్ములారా! నా మాటప్రకారము, ప్రాతఃకాలమున జానకిని వనములకుఁ దీసికొనిపొండు." అని శ్రీరాముఁడు కన్నీరుఁగార్చి, పలికెను.

### సోరఠా 2

కర్ణకఠోరమగు శ్రీరామునివచనములను విని, భరతుఁడు చేతుల జోడించుకొని, శ్రీవారితో నిట్లు ప్రస్తావించెను. "ఓ నాథా! నేను బుద్ధిహీనుఁడను. నావిన్నపము నాలకింపుము.

### చౌపాయ్

"ఓ నాథా! మనసూర్యవంశమునకు లోకములోఁ బేరుప్రతిష్ఠలు కలవు; తండ్రి: దశరథమహారాజు; తల్లి కౌసల్య; మీరు స్వయము త్రిలోకాధిపతులు; మీపేరుప్రతిష్ఠలు లోకప్రసిద్ధము; మీ కీర్తిని వేదములును శేషుఁడును గానముఁ జేయుచుండును. మీ సత్తువంతయు లోకమునకు విదితమయ్యెను. వేదములును శేషుఁడును మీ శక్తిని సంపూర్ణముగ వర్ణింపలేరు. జానకి సకలశోభాన్వితురాలు; అమంగళములను నశింపఁజేయును; సకలశుభమంగళముల నిచ్చును. ఆమె మహాపతివ్రత; ఆమెఛాయను గ్రహించినమాత్రమున, నితర స్త్రీలు సద్గతిం బొందఁగలరు; వారు సంసారకూపములోఁ బడరు. అట్టి జానకి మిమ్ములనువిడిచి, వనములలో విహరింపఁగలుగునా? ఒకక్షణము మిమ్ములనువిడిచి జీవించియుండఁగలదా? ఓ కృపాలుఁడా! నీరులేకుండ మత్స్యములు జీవింపఁగలవా? మేఘములు వర్షింపనియెడల, వ్యవసాయము జరుగునా! సకలగుణసంపన్నురాలు, ఆ జ్ఞానస్వరూపి, ఆజానకి మిమ్ములను విడిచి, క్షణమాత్రము జీవించుట దుర్లభము." ఈ ప్రకారము భరతుఁడు చెప్పినమాటలను విని, శ్రీరాముఁడు తమ్మునితో నిట్లు ప్రసంగించెను. "ఓయీ భరతుఁడా! నీవు సీతియుక్తమగు మాటలఁ బలికియుంటివి.

### దోహా 14

"రాజు, రాజనీతిప్రకారము, ధనమును ధర్మమును రక్షింపవలెను. ప్రజలఁ బాలించుటలో, వారిని క్షోభపెట్టకూడదు; అత్యనురాగముతో వారిని రక్షింపవలెను."

### చౌపాయ్

దూతచెప్పినమాటల నతఁడు తమ్ములకు వ్యక్తపఱచెను. "ఓ తమ్ములారా! మనవంశమునకు గొప్పకళంకము వచ్చెను. మనవంశములో

ననేకరాజులు గతించిరి. ఒకరికంటెనొకరు సుప్రసిద్ధులు; వారికీర్తిప్రతిష్ఠలు లోకవిదితము. రఘువు, దిలీపుఁడు, స్వాయంభువు, భగీరథుఁడు మొదలగురాజులను వేదము సహితము ప్రశంసించును. మనజనకులు దశరథమహారాజును భూలోకములో నెఱుఁగనివారు లేరు; వారు ప్రాణములనయినను విడిచిపెట్టిరిగాని, యాడినమాటను తప్పలేదు. మన వంశమునకు మచ్చలేదు; ఒకవేళ మచ్చవచ్చినపుడు ప్రాణములను విడిచిపెట్టకయుండినవాఁడు నీచుఁడని తెలిసికొనుఁడు;" "ఓ నాథా! ఓ సర్వజ్ఞుఁడా! జానకికి లేశమపి కళంకము లేదు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సహిత మామెను ప్రశంసించిరి. సువర్ణమువలె, శుద్ధిఁబొంది, అగ్నిహోత్రములోనుండి జానకి వెడలివచ్చెను. జానకికి మచ్చగలదని, దేవతలుగాని, నరులుగాని, మునులుగాని, స్వప్నమందైనను జెప్పలేరు.

దోహా 15

"ఈవృత్తాంతమును నమ్మక, జానకి పాపాత్మురాలని తలంచువారు, రౌరవాదినరకములలోఁ గోట్లకొలఁది కల్పాంతములవఱకు బాధల ననుభవించెదరు."

చౌపాయ్

శ్రీరామునిరౌద్రరూపమును కోపారుణనేత్రాంతములను లక్ష్మణుఁడు చూచి, భయపడి, భరతుని వెనుకకు దూరెను. "ఓ లక్ష్మణా! విచారమును మూర్ఖత్వమును విడిచిపెట్టుము. లోకులుపలికిన మంచి చెడుగులను గ్రహింపుము. నాయాజ్ఞ నుల్లంఘించి, ప్రత్యుత్తరము నిచ్చినయెడల, నాజన్మాంతము నీవు విచారింపవలసి యుండును. జానకిని రథముపైఁ గూర్చుండఁబెట్టుకొని, గంగానదీతీరమున విడిచిపెట్టి రమ్ము. ఓ తమ్ముఁడా! సాంద్రారణ్యములో, నిర్జనప్రదేశములో నామెను విడిచి రమ్ము," శ్రీవారియాజ్ఞను లక్ష్మణుఁడు విని నిరాశఁజేసికొని, మృత్యువునకు సిద్ధపడి ప్రయాణమయ్యెను. భోజనపదార్థములను వస్త్రములు మొదలగువానిని రథముపై నిడి, జానకినిఁ గూర్చుండఁబెట్టి, లక్ష్మణుఁడు వెడలెను; శ్రీరామునిధర్మపత్ని అత్యుత్సాహముతోఁ బ్రయాణ మయ్యెను.

దోహా 16

లక్ష్మణమూర్తిముఖము చిన్నబోయియుండుటఁ జూచి, ఆ చిన్నారిపొన్నారిమనస్సు వ్యాకుల మయ్యెను; ఆమెకు దుఃఖము లోలోన నుప్పొంగెను; కాని, ఆమెముఖమునుండి యొకమాటయయినను వెడలలేదు. మణిని నష్టపడినసర్పమువలె, నామె విచారించెను.

చౌపాయ్

వారు గంగాతీరమునకు వచ్చిరి; ఆకాఅడవిఁ జూచి, వారు భయపడిరి. లక్ష్మణుఁడు భయపడుటఁ జూచి, సీత వెలవెలఁబోయి, యతనితో నిట్లు ప్రసంగించెను. "ఓ నానాథుని ముద్దులతమ్ముఁడా! ఇచ్చట మునియాశ్రమములు కనఁబడవు; ఎచ్చటికి నన్నుఁ దీసికొనిపోయెదవు; ఈవనములో నానావిధక్రూరజంతువులు, ఏనుఁగులు, సింహములు, మృగములు, వ్యాఘ్రములు, వానరములు, సర్పములు మొదలగునవి విచ్చలవిడిగ సంచరించుచున్నవి కదా! ఈప్రదేశములో మునిసంచారమయినను గనఁబడదు; ఓ లక్ష్మణా! నాబొందినుండి ప్రాణములు వెడలుచున్నవి." ఈప్రకారము సీత విలపించెను. లక్ష్మణునిమనస్సు జాలిఁబడెను. "ఓ త్రిమూర్తులారా! ఎంతపనిఁ జేసితిరి." ఈప్రకారమతఁడు చింతించి రథముపై మూర్ఛిల్లి, భూమిమీఁద విఱుచుకొని పడెను. అంతలో నతనికిఁ దెలివివచ్చెను. అతఁడు సీతఁజూచి, ధైర్యమునవలంబించి, "దాహముచే నాప్రాణములు వెడలుచున్నవి." అని యేడ్చెను.

దోహా 17

అతనిమనోసంకటము నామెచూచి విలపించెను. "లక్ష్మణుఁడు శరీరమునువిడిచిపెట్టుటకు సిద్ధపడెను; ఇఁక నాప్రాణములుండిన లాభమేమి?" అని యామె చింతించెను.

చౌపాయ్

లక్ష్మణుని కృతనిశ్చయముఁ దెలిసికొని, "ఓ లక్ష్మణుఁడా! జానకిని విడిచిపెట్టి, నీవు నగరమునకుఁ బొమ్ము; సౌభాగ్యవతియగు శ్రీజానకి జీవించును" అని ఆకాశవాణి పలికెను. ఆమాటలను వినినందున, నతనికి ధైర్యమువచ్చెను; అతఁడు చేతుల జోడించుకొని, ఆమెకు మూఁడుప్రదక్షిణములఁ జేసెను. ఆమెచరణములకు నమస్కరించి,

దుఃఖపడి, యతఁడు రథమును మరలించి, నగరమునకు వెడలెను. ఆకాశవాణిమాటలను జానకి విని మూర్ఛిల్లెను. అంతలో నామెకుఁ దెలివి వచ్చెను; ఆమె నలువైపులఁ గలయఁజూచెను. రథముగాని, గుఱ్ఱములుగాని, లక్ష్మణుఁడుగాని, యామెకుఁ గనఁబడలేదు; "ఆహా! దైవమా! పుట్టినదిమొదలు నాప్రాణములు దుఃఖములపాలఁ బడెను; అందుచేత, నింతదుఃఖమువచ్చినను, నాప్రాణములు నాబొందిని విడిచిపెట్టవు." ఈప్రకార మనేకవిధముల నామె విలపించెను. ఆసమయమున వాల్మీకి మహాముని వనములోఁ దిరుగుచుండి, దైవికముగ నాప్రదేశమునకు వచ్చెను. ఆమె వాల్మీకిమహామునిని గుఱుతుపట్టి, స్వవృత్తాంతము నతనితోఁ జెప్పెను.

దోహా 18

"ఓ మునిరాజా! నేను జనకచక్రవర్తికుమార్తెను; శ్రీరామచంద్రులభార్యను. ఈసంగతి లోకప్రసిద్ధము. వారు నన్ను విడనాడుటకుఁ గారణము తెలియదు. విధికృతముఁ దప్పించుకొనుటకు శక్యమా.

చౌపాయ్

"ఓ మునిరాజా! లక్ష్మణదేవర నన్నుఁ దీసికొనివచ్చి విడిచిపెట్టెను; ఇందుకుఁ గారణము నాతోడఁ జెప్పలేదు." ఈప్రకారము సీత చెప్పినవృత్తాంతమును వాల్మీకిమహాముని విని, యామె నోదార్చెను. "ఓ కుమారీ! నీతండ్రి, మిథిలాధిపతియగు జనకుఁడు నా ప్రియశిష్యుఁడు; నాయం దతనికి భక్తివిశ్వాసములు కలవు. ఓ సుకుమారీ! నీవేమి చింతపడకుము. అంత్యమున నీకు శుభము కలుగును; పునః నీకు రామునిసంయోగము లభించును." ఈప్రకార మతఁడు జానకిని తన కూఁతురుగ భావించి, పర్ణశాలకుఁ దీసికొనివచ్చెను. ఆమె స్నానమాడి, శుచియయ్యెను. అనేకవిధముల నామెకతఁడు ధైర్యముఁ గల్గించెను. సీత గంగానదిలో జలకమాడెను. అతఁడు సమర్పించినకందమూలఫలముల నామె భుజించెను. శ్రీరామమూర్తిని ధ్యానముఁజేయుచు నామె సుఖముగ నుండెను. ఓ గరుడా! భోజనానంతర మతఁడనేకచిత్రవిచిత్రకథలఁ జెప్పి, యామెకు వినోదముఁ గలిగించెను. తదితర మునీశ్వరులుసహితము సంతోషించిరి. అనేకవిధముల లక్ష్మణుఁడు మనస్సును సమాధానముఁ జేసికొని, ధైర్యము నవలంబించి, నగరమునకు వచ్చెను.

ఛాంద్ 1, 2, 3

శ్రీజానకిని నరణ్యములో విడిచి, లక్ష్మణుఁడు నగరునకు వచ్చి, విచారించుచు స్వగృహములోఁ బ్రవేశించెను. అనేకవిధముల, ముప్వు రుతల్లులు విలపించిరి. జానకికి గొప్పయాపద వచ్చెనని వారు విచారించిరి. లక్ష్మణుఁడు వారిని యోదార్చెను. మణిని నష్టపడినసర్పమువలె, వారు వ్యాకులపడిరి. రాజకుటుంబములో నెచ్చటఁ జూచినను, రోదనమే వినఁబడెను. అవధపురజనులు, స్త్రీపురుష లాబాలవృద్ధులు విలపించిరి. వారివిలాపముల నెట్లు చెప్పఁగలను? ఎచ్చటివా రచ్చట దుఃఖించుచు, నోటివెంబడిమాటలేక, చతికిలఁ బడిరి. నగరమంతటను హాహాకారము పుట్టెను. ఆకోలాహలమును శ్రీరాముఁడు విని, లక్ష్మణునితోఁ గూడి, మందిరములోఁ బ్రవేశించెను. అతఁడు తల్లుల నోదార్చి, వారికి జ్ఞానము నుపదేశించెను. వారి యజ్ఞానకవాటములఁ బడఁగొట్టెను; వారిహృదయములు నిర్మలమయ్యెను. "ఓ స్వామీ! నీ నిజమునెఱుంగక సంసారములోఁ బడియుంటిమి. నీవు మాపుత్త్రుఁడవని తలంచితిమి. మమ్ములఁ గటాక్షింపుము; నీయందు భక్తిఁ బ్రసాదింపుము. యోగీశ్వరులు మొదలగువారు నీభక్తికొఱ కనేకవిధములఁ బ్రయత్నించెదరు; ఆ నిశ్చలభక్తినొసంగుము." ఈప్రకారము తల్లులు ప్రార్థించిరి; వారుకోరినవరము నిచ్చెను. వారి ముప్వురియంతఃకరణలు పరిశుద్ధమయ్యెను; వారు యోగాగ్నినిఁ బ్రజ్వలించిరి.

దోహా 19

ఆ ముప్వురుతల్లులు యోగాగ్నిచే శరీరములను దహించి, పరమపదమునకు వెళ్లిరి. ఆ నల్వురన్నదమ్ములు వారిమరణమునకు దుఃఖించిరి.

చౌపాయ్

వేదోక్తప్రకారము వారికిఁదగిన యుత్తరక్రియలను వారు నిర్వర్తించిరి. తల్లులపేరఁ జెప్పి, షోడశమహాదానముల నిచ్చిరి. గోవులును, వస్త్రములును, సువర్ణమును, మణులును, నాగమణులును, జీనాంబరములును, రథములును, ఏనుఁగులును, గుఱ్ఱములును, భూములును—ఈమొదలగువానిని నపారముగ ముప్వురుతల్లుల పేరుచెప్పి, కుమారులు బ్రాహ్మణుల కిచ్చిరి. ఆబ్రాహ్మణులు తృప్తిఁబొందిరి; మరల దానములను గ్రహించుటకు యాచకుల కిష్టములేకపోయెను. దరి

ద్రులు కుబేరులయిరి. వేదాధ్యయనసంపన్నులు వేదపన్నములఁ జదివి, యన్నదమ్ములను దీవించిరి. "ఆచంద్రార్కము దశరథరాజకుమారులు జీవింతురు గాక," అని ఆయాచకులు స్వగృహములకు నిష్క్రమించిరి. అనంతరము శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులు సుఖముగ జీవించియుం డిరి. ఈప్రకారము శ్రీరాముఁడు శూద్రతపస్విని శిక్షించెను; బ్రాహ్మణ కుమారుని బ్రతికించెను; స్వర్గస్థులయిన ముప్వురుతల్లుల కుత్తరక్రి యల నొనరించెను.

దోహా 20

"అశ్వమేధయాగము నొకటిఁ జేయవలయునని కోరికకలదు. దానివలన సకలపాపములు నశించును." అని శ్రీరాముఁడు తలంచెను. అంగదాదులకు వర్తమానముఁ బంపి, వారితో నతఁడు సుఖముగ నుండెను.

చౌపాయ్

ఒకదినమున నతఁడు తమ్ములతోను మంత్రులతోఁ గూడి గురువు గారిగృహమునకు వచ్చెను. గురువుచరణములకు వారు దండప్రణా మముఁ జేసిరి. గురువు వారిని యాదరించెను. మృదువచనములతో గురువు వారియోగక్షేమము నడిగెను. "ఓ స్వామీ! గురువుల చర ణారవిందములను సేవించుటవలన మాకు నిత్యము క్షేమము." అని శ్రీరామమూర్తి పలికి, గురువుచరణములకు నమస్కరించెను; అతనిని గురువు దీవించెను. పురాణకథలను, నూతనయితిహాసములను గురువు చెప్పుటకారంభించెను; శ్రీరాముఁడు మొదలగువా రాకథలను సావ ధానముగ విని, సంతసించిరి. అన్నదమ్ములునల్వురును ప్రసన్నులై, గురు వును జూచుచుండిరి. ఆ సచ్చిదానందమూర్తి, ఆ సూర్యకులచంద్రుఁడు, ఆ శ్రీరామచంద్రుఁడు చేతులనుజోడించుకొని, గురువుతో నిట్లు ప్రసం గించెను:—"ఓ నాథా! మీ చరణారవిందముల ప్రసాదమునలన, యావద్రాజ్యములో సాప్రభుత్వము న్యాయముగను సత్యముగను నడచుచున్నది.

దోహా 21

"ఓ కరుణాసాగరుఁడా! నామనోరథ మొకటికలదు; మీరు దానిని పూర్తిఁజేయవలెను.

**చౌపాయీ**

"ఓ నాథా! మీకృపవలన ననేకయజ్ఞములను జపముల నొనరించితిని. ప్రస్తుత మవధపురజను లశ్వమేధయాగముఁ జూడఁగోరుచుండిరి. మీకు భయపడి, భరతుఁడావిషయమును మీతోఁజెప్పుటకు శంకించును; సమయముఁ జూచి, నేను స్వయము చెప్పఁదలంచితిని. మీయాజ్ఞను శిరసావహించి, యాప్రకారము సంచరించెదము." ఈ ప్రకారము శ్రీరాముఁడు వినయవిధేయతలతో విన్నవించినవాక్యములను గురువు విని, సంతోషించెను. "ఓ రామా! ఎందులకు నీవంటివాఁడు నీతియుక్తముగఁ బ్రసంగింపఁడు? భగవంతునికృపవలన, నీయభిలాష సిద్ధించును. ఓ భరతుఁడా! లే లెమ్ము; అందులకుఁ దగిన సంభారముల నాయత్తముఁ జేయుము." ఇటుల వసిష్ఠుఁడు పలికినపలుకులవలన, నన్నదమ్ములును మంత్రులు మొదలగువారును సంతోషించిరి. వా రనేకవిధముల గురువును స్తుతించి, వారిచరణములకు నమస్కరించిరి; బ్రాహ్మణు లనేకులు భరతునివెంట నడచిరి.

**దోహా 22**

సుమంత్రుఁడు పురజనులను సేవకులను బిలిచి, నగరమును, రాజమార్గములను, అంగడివీథులను, స్వగృహములను సింగారింపుఁడని యాజ్ఞాపించెను; అచ్చటచ్చట మండపములను నిర్మింపుఁడనియు జెప్పెను.

**చౌపాయీ**

మంత్రియాజ్ఞాప్రకారము వారు వారివారిపనుల నతిశీఘ్రముగ నెఱవేర్చిరి; ఆశుభవర్తమానము రాణులు విని సంతసించిరి. ఆసేవకు లనేకమండపములను నిర్మించిరి. ఆనగరము కలకలమనుచుండెను; దాని శోభంజూచి, బ్రహ్మసహితము నిశ్చేష్టుఁ డయ్యెను. పురజనులు వారికిఁ దగినసంభారములను సిద్ధపఱచిరి; చతురంగబలములు మోహరించి యుండెను. అంతరిక్షమున దేవదుందుభులు మ్రోఁగెను. మరల మంత్రులును సేవకులును శ్రీరామునిసమీపించి, "జయ, జయ" శబ్దములఁ జేసి, శ్రీరామునకు నమస్కరించిరి. వారియాజ్ఞప్రకారము, మునీశ్వరులకు వర్తమానముఁ బంపిరి. "ఓ నాథా! మీయాజ్ఞను శిరసావహించె

దను" అని శ్రీరాముఁడు గురువునకు విన్నవించెను. శ్రీవారిచిత్తమును గ్రహించి, "ఓ రామా! శ్రీజనకచక్రవర్తికి వర్తమానముఁ బంపుము; వారు నీయజ్ఞమునకు సకుటుంబసపరివారముగ దయచేయఁగలరు." అని మృదుమధురముగ వసిష్ఠుఁడు పలికెను.

దోహా 23

"ఓ రామా! షట్కర్మనిరతులగు బ్రాహ్మణులకును, మునీశ్వరులకును, మహర్షులకును, అష్టదిక్పాలకులకును, శుభలేఖలను వ్రాయుము."

చౌపాయ్

శ్రీరాముఁడు గురువుతోఁ గూడి, అయోధ్యానగరమునకు వచ్చి, దానిసింగారముఁ జూచి, సంతోషించి, ప్రసన్నుఁడయ్యెను. అంతలో సేవకులు దేశదేశములకుఁ బోయి, ఆయాదేశాధిపతులకు శ్రీవారి శుభలేఖల నందఁజేసిరి; ఒకసేవకుఁడు మిథిలాపురమునకు వెళ్లెను. జాంబవంతుఁడు, అంగదుఁడు, సుగ్రీవుఁడు, విభీషణుఁడు, నలుఁడు, నీలుఁడు, ద్వివిదుఁడు ఈ మొదలగువానరులు, వానరపుంగవులును, ఇంద్రాదిదిక్పతులును విజయముఁ జేసిరి. విమానారూఢులై, దేవతాస్త్రీలు మధురముగ గానముఁ జేయుచు వచ్చిరి; వారిగానమును విని, పరభృతములు సిగ్గుపడెను. ఆయావనములనుండి వెడలి, మునీశ్వరబృందములు, గుంపులుగుంపులుగ నగరమునకు వచ్చెను. శ్రీవారు, చూడ వచ్చిన యతిథులను యథాన్యాయముగ సత్కరించి, యాదరించి, వారికిఁదగినబసల నిచ్చెను. బ్రహ్మ విష్ణుమహేశ్వరులును, సూర్యచంద్రులును, నవగ్రహములును, బ్రహ్మఋషులగు సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులును, విజయముఁ జేసిరి; స్వేచ్ఛావిహారులగు (7) వేలఋషులతోఁ గూడి, విశ్వామిత్రుఁడు వచ్చెను. శ్రీరాముఁడు వారిని నాదరించి, సత్కరించిరి.

దోహా 24

పారాశరులు, భృగువు, ఆంగీరసుఁడు, వ్యాసుఁడు, నారదుఁడు, అగస్త్యుఁడు—ఈ మొదలగుమహర్షులును, దేవలుఁడును, పులస్త్యుఁడును వచ్చిరి.

చౌపాయ్

దేదీప్యమానముగ వెలుగుచుండిన యజ్ఞశాలను వారు చూచి, ప్రసన్నులయిరి. మిథిలాపురమునకుఁ బోయియుండిన సేవకుని, ఆనగర వాసులు చూచి, సంతోషించిరి. అయోధ్యాధిపతియగు శ్రీరామచంద్రుని సేవకుఁడు వచ్చియుండెనని, ద్వారపాలకుఁడు శ్రీజనకచక్రవర్తితో విన్నవించెను. ఆవర్తమానమును జనకుఁడు విని, దిగ్గున లేచి కూర్చుండెను; అతనిశరీరము పులకరించెను; అతని నేత్రముల వెంబడి నానంద బాష్పములు కారెను. ఆసమయమున నతఁడు పొందినసంతోషమును శేషుఁడును సరస్వతియు వర్ణింపఁజాలరు. అతనియవయవములు శిథిలమయ్యెను. పట్టలేనిసంతోషముతో నతఁడు ద్వారమునద్దకు వచ్చెను; శ్రీవారిసేవకునిఁ జూచి, యతఁడు పరమానందభరితుఁడయ్యెను. "శ్రీవారు తమ్ములతోఁగూడ, క్షేమమా?" అని చక్రవర్తి యడిగెను. "ఓ నాథా! ఈలేఖవలన, సర్వము మీకు విశదమగును" అని వాఁడు నమస్కరించి, చెప్పెను. ఆలేఖను చక్రవర్తి గుండెలకును నేత్రముల కద్దుకొనెను; అతనికంఠము గద్గదమయ్యెను. అతఁడు మాటఁజెప్పలేకపోయెను.

దోహా 25

ఆసమయమున జనకచక్రవర్తియవస్థ నెవరు చెప్పఁగలరు? అప్పుడు రాజనగరులో జయజయశబ్దములు పుట్టెను. రాజబంధువులందరు ప్రసన్నులయిరి.

చౌపాయ్

ఆశుభలేఖను జనకచక్రవర్తి పలుమారులు చదివెను; అతని మనస్సు సంతోషముచే నుప్పొంగెను. అతఁడు సేవకునిఁ బిలిచి, "ఓయీ! ఈశుభవర్తమానమును నగరములోను, బురములలోను, గ్రామములలోను చాటింపుము. దశవిధవాద్యములను మ్రోయించుము" అని యాజ్ఞాపించెను. అతఁడు మంత్రినిఁ బిలిచి, యతనికి శుభలేఖ నిచ్చెను. అతఁడు దానినిఁ గైకొని, నేత్రములకద్దుకొని, వినయపూర్వకముగ దానినిఁ జదివి, సంతోషించెను. అతఁడు శ్రీరామచంద్రుని స్మరించి, పరమానందభరితుఁడయ్యెను. అంతలో నీశుభవర్తమానము నగరమంతట వ్యాపించెను; ప్రతిగృహస్థుఁడును మంగళకల

శములను నిలువఁబెట్టెను; వా రానందభరితులై, సంచరించిరి. రా జనేకదానముల నిచ్చెను. ఆ జనకపట్టణము సకలసంపదలతోఁ దులఁ దూఁగుచుండెను. దేవతలందఱు జనకచక్రవర్తినిఁ జూడవచ్చిరి. "ఓ రాజా! అయోధ్యానగరమునకు శీఘ్రము నీవు వెడలుము" అని వారు చెప్పిరి.

దోహా 26

దేవతలు వారివారివిమానముల నెక్కి, యయోధ్యానగరమునకు వెడలిరి; వారు చేతులను జోడించుకొని, యనేకవిధముల జనకుని స్తుతించిరి. ఆ భూపాలమౌళి యెంతధన్యుఁడు!

ఛాంద్ 1, 2, 3, 4, 5

"పద సుమిర కరుణాకంద శ్రీరఘుచంద్ర దశరథ నాయకం,
సియ సహిత అనుజ వసిష్ఠ పద రతి వసో మమ ఉర లాయకం.
అంభోజ నయన విశాల లాల కృపాల దశరథ నందనం,
శతకోటిమార ఉదార శోభా అతుల బల మహి మండనం.

"ఆ లక్ష్మణభరతశత్రుఘ్నసమేత శ్రీరామచంద్రుఁడు, ఆ దశరథ కుమారుఁడు, ఆ కరుణాసముద్రుఁడు, ఆ దివ్యమంగళవిగ్రహుఁడు, ఆ కమలలోచనుఁడు, కోటిమన్మథుల చక్కఁదనమును తిరస్కరించువాఁడు, ఆ మహాబలవంతుఁడు, ఆ లోకశిఖామణి—వసిష్ఠునితోఁ గూడి, ఓ దేవతలారా! యతఁడు నాహృదయమున సదా నివసించుఁగాక!" అని జనకుఁడు ప్రార్థించెను.

"సజ తూణ కటి కర శర శరాసన కపట మృగ మద గంజనం,
వైదేహి అనుజ సమేత కృపానికేత జన మన రంజనం.
మను హృదయ వాస నివాస కరు కరుణాయతన కరుణామయం,
మహిమా న కోఉ జన జాన సున హరియాన జ్ఞాన విశాలయం.

ఓ గరుడా! నీవు మహాజ్ఞానివి; భగవంతునిమాయ నెవరు గ్రహింపఁగలరు? జనకచక్రవర్తి భగవంతు నీప్రకారము ధ్యానించెను.

"ఆ కృపాసముద్రుఁడు, ఆ శరశరాసనధరుఁడు, అక్షయతూణీరములు గలవాఁడు, ఆ సీతాలక్ష్మణభరతశత్రుఘ్నసమేత శ్రీరామమూర్తి, మద మోహములను కపటమృగములను సంహరించువాఁడు, భక్తులకానందము నిచ్చువాఁడు, ఆ కరుణాలయుఁడు, ఆ కరుణామయుఁడు, సదా నాహృదయములో నివసించుఁగాక."

"సో హేతు కర వృషకేతు ప్రభు ఖర దూషణాది నికందనం,
నర అధమ పామర కామవశ మతి భజత నహి రఘునందనం.
తవ లలిత లీలా వసహి జేహి ఉర సగుణ ప్రభు ధరణీధరం,
కహి సక న శారద శేష నారద జాని కిమి జన వాపురం

"ఓ ధరణీధరుఁడా! ఓ స్వామీ! నీవు శ్రీసాంబశివునకు హితకారివి; ఖరదూషణాదిరాక్షసులను సంహరించితివి. ఓ నాథా! కామాదులకు వశ్యుఁడైనయధముఁడు నిన్ను భజింపఁడు; కాని, తదితరులెవరు నిన్ను భజింపరు? ఓ ధరణీధరుఁడా! నీ సగుణలీలావతారముల నెవఁడు స్మరింపఁడు? ఓ నాథా! నారదుఁడును, ఆదిశేషుఁడును, శారదయు నీ మహిమను వర్ణింపఁజాలరు; నేను పరమమూర్ఖుఁడను; నా కేమిసామర్థ్యము కలదు."

శ్రీతులసీదాసుగారు తదితరుల శరణుఁబొందక, శ్రీరాముని సదాధ్యానించి, త్రికరణశుద్ధిగ నతనిని నమ్మి, సుఖముఁ బొందెను. ఈ ప్రకారము జనకచక్రవర్తి శ్రీరాముని స్తుతించి, శ్రీరామయోగక్షేమమును వారిసేవకునివలనఁ దెలిసికొని, పరమానందభరితుఁ డయ్యెను. అతనిమనోరథము లీడేరినందు కతఁడు భగవంతుని స్తుతించెను; బ్రాహ్మణులకు ధనధాన్యముల నిచ్చి, వారిని నతఁడు సత్కరించెను. ఏనుఁగులను, గుఱ్ఱములను, ధనధాన్యములను, చీనిచీనాంబరముల ననేకముల నిచ్చి, బ్రాహ్మణుల నతఁడు పూజించెను. అతఁడు చేసినమహాదానములకు లెక్కలేదు. ఈప్రకారము దానములఁ గైకొని, వారు సంతోషించిరి; వారు 'జయజయ' శబ్దములఁ జేసిరి; జనకునిమనస్సు సంతోషముచే నుప్పొంగెను.

దోహా 27

జనకచక్రవర్తి శ్రీవారిసేవకుని నాదరించి, సత్కరించెను. ఆ చక్రవర్తి చతుర్విధపురుషార్థములఁ బొందెను; అతియుత్సాహముతో నతఁడు (గురువు) శతానందునిగృహమునకు వెడలెను.

చౌపాయ్

ఈ శుభవర్తమానము నతఁడు గురువునకు విన్నవించెను; అతఁడు పరమానందభరితుఁ డయ్యెను; "ఓ రాజా! అయోధ్యానగరమునకు శీఘ్రము వెళ్లి, యజ్ఞముఁ జూడుము. నీ చతురంగబలములతోఁ గూడి వెడలుము." గురునాజ్ఞఁ గైకొని, యతఁడు స్వగృహమునకు వచ్చెను. అతఁడు సేవకులఁ బిలిచి, "ఓయీ! చతురంగబలములను సన్నాహముఁ జేయుము." అని యాజ్ఞాపించి, యంతఃపురములోనికి వెళ్లెను. అతఁడు శుభలేఖఁ జదివి, అంతఃపురస్త్రీలకు వినిపించెను. వారు సంతోషించి, బ్రాహ్మణులకు దానముల నిచ్చిరి; యాచకులకు ధనధాన్యముల నిచ్చిరి; వారు శ్రీవారిసేవకునిఁ బిలిచి, శ్రీవారియోగక్షేమముల నడిగిరి; ఆ సేవకుఁడు చెప్పిన సమాచారమును విని, వారు సంతసించిరి.

ఛాంద్ గీతికా

జనకచక్రవర్తి తమయోగక్షేమమును శ్రీరామునకు శుభలేఖను వ్రాసిపంపెను; మిథిలానగరమంతటను మంగళధ్వనులు మ్రోఁగెను. నగరమును రాజనగరును రక్షించుటకు యోధుల నతఁడు నియోగించి, చతురంగబలములతో వెడలెను. పదివేల రథికులును,ఆఱువందలయేనుఁగులును, అనేకవేలఁ దాతులును రౌతులును, చక్రవర్తివెంట నడచెను. ఆగుఱ్ఱములపై రత్నస్థగితమగు 'జీనులు' గట్టిరి. ఆహా! ఆ సమాజము వారియొయ్యారము నెటుల వర్ణింపగలను? చతురులగు మహాయోధులు నడచిరి. ఒకపల్లకిలో గురువు శతానందుఁడును, మఱియొకపల్లకిలో జనకచక్రవర్తియుఁ గూర్చుండి వెడలిరి. ఈప్రకారము జనకచక్రవర్తి దండుతో వెడలినపుడు, భూమి కంపించెను. ఆ మహాయోధులు, అతిరథమహారథశ్రేష్ఠుల నెవరు లెక్కపెట్టఁగలరు? ఆదికూర్మముతో నాదిశేషువు క్రుంగెను.

దోహా 28, 29

ఈ ప్రకారము చక్రవర్తి మునులతోను చతురంగబలములతోఁ గూడి, ప్రయాణమును సాగించి, రెండవదినము సాయంత్రము మూడు గంటల కయోధ్యానగరమును సమీపించెను. శ్రీవారు చక్రవర్తి యాగమనమును విని, వారికి నెదురుగ వెళ్లిరి. వారు పరస్పరానురాగ ముతోఁ గలసిరి. విశాలస్థలములో నొకపటకుటీరమును వారినిమిత్తము నిర్మించిరి.

చౌపాయి

సరయూనదీతీరమున నొకవిశాల మగుప్రదేశములో, శ్రీరామాజ్ఞప్రకారము జనకచక్రవర్తికి విడిది నిచ్చిరి. ఇతరదేశాధీశులను సత్కరించుటకు ముగ్గురుతమ్ములను నియోగించి, శ్రీవారు జనకుని వద్దకు వచ్చిరి. శ్రీరాముఁడు చక్రవర్తికి నమస్కరించి, యతనివద్దఁ గూర్చుండిరి. అతఁడు పరమానందభరితుఁ డయ్యెను; అతనికంఠము గద్గదస్వరము పడెను; అతఁడు శ్రీవారిశిరమును ముద్దుఁబెట్టుకొని, మృదుమధురవచనములతోఁ బ్రసంగించెను; అతనిమనస్సు సంతోష ముచే నుప్పొంగెను. శ్రీరాముఁడు తగినవిధమున జనకుని సత్కరించి, వారిపరిచర్యలకు సేవకులను నియోగించెను; తదుపరి, మంత్రిని భరతునిఁ బిలిచి, చక్రవర్తిని సేవించుటకు భరతుని నియోగించిరి. ఓ గరుడా! భరతుఁడు యుత్సాహముతో నతనిని సేవించెను; జనకుఁడును సంతోషించెను. అనంతరము, శ్రీరాముఁడు గురువునకు నమస్కరించిరి; గురువు శ్రీరాముని దీవించి, వారికిఁ దగినవరముల నిచ్చెను; తదుపరి దేవతలకును, బ్రాహ్మణులకు నమస్కరించిరి; వారును దీవించిరి. ఇట్లు వారందఱు సుఖముగనుండిరి.

దోహా 30

పదివేలశిష్యులతోఁ గూడి, వసిష్ఠుఁడు శ్రీరామునివద్దకు వచ్చెను. "ఓ రామచంద్రా! నామాట వినుము.

చౌపాయి

"వేదపురాణములును, సకలధర్మశాస్త్రములును ఘోషించుచున్నవి; మహాపురుషులుసహితము చెప్పుచున్నారు. ధర్మపత్నివినాగా,

యజ్ఞముఁ జేసినను, సిద్ధిలేదు. కనుక, జానకిని రప్పింపుము ; ఆమె యజ్ఞమున కావశ్యకము." ఈప్రకారము మునిరాజు చెప్పినమాటలను శ్రీరాముఁడు విని, యాశ్చర్యపడి, సత్యాసత్యములఁ జెప్పక, మౌనముసుధరించి, యూరకుండెను. "ఓ మునిరాజా! ఓ స్వామీ! నాప్రతిజ్ఞకు భంగముకలుగకుండ, నాకులమున కప్రతిష్ఠరాకుండ, మీ రీకార్యమును నిర్వహింపవలయును. (రెండవవివాహముఁ జేసికొననని శ్రీరాముని ప్రతిజ్ఞ ; జానకిని రప్పించుటవలన, నప్రతిష్ఠవచ్చును.)" ఈప్రకారము శ్రీరాముఁడు విన్నవించెను. అప్పుడు వసిష్ఠుఁడు నారదాదిమునులఁ జూచి, వారి సమ్మతిప్రకారము, "ఓ అనాదిపురుషుఁడా! రత్నస్థగితమగు బంగారుసీతను నిర్మింపుము. ఆ సువర్ణప్రతిమను భూషణములతో సింగారింపుము ; ఆ ప్రతిమరూపముఁ జూచి, కామదేవుఁడు సిగ్గుపడవలెను ; దానింజూచి, స్త్రీపురుషులు నిజమగుసీతయని భ్రమింపవలెను ; ఆబొమ్మను జానకి చూచి, యాశ్చర్యపడవలెను." అని పలికెను.

దోహా 31

ఆ యజ్ఞవైభవము నెటుల వర్ణించిచెప్పఁగలను ! ఆ కృపాసముద్రుఁడు, ఆ లోకారాధ్యుఁడు, ఆ బ్రహ్మాండనాయకుఁ డనేకచిత్రవిచిత్రచర్యలను నడిపించెను.

చౌపాయ్

సువర్ణసింహాసనముపై వ్యాఘ్రాజినమును వేసికొని, శ్రీరాముఁడు దానిపైఁ గూర్చుండెను. ఆ బంగారుసీతతోఁ గూడి శ్రీరామప్రభువును దేవతలు చూచి, ప్రసన్నులయిరి. వారు శ్రీసీతారాములకు నమస్కరించిరి. త్రికాలజ్ఞానసంపన్నుఁడగు వసిష్ఠుఁడు జనబాహుళ్యముఁ జూచి, సేవకులఁ బిలిచి, "ఓయీ! సేవకులారా! మీ రీజనులను యథావిధిగ సత్కరింపుఁడు ; వారు కోరినపదార్థములను వారికిచ్చి, వారిని సన్మానింపుఁడు." అని యాజ్ఞాపించెను. గురువాజ్ఞప్రకారము వారు శ్రీరాముని సమ్మతిఁ గైకొని, కోట్లకొలఁదిగృహముల నవలీలలో నిర్మించిరి ; వారినిపుణతను బ్రహ్మ చూచి, యాశ్చర్యపడెను. కల్పవృక్షమును కామధేనువువలె, నాగృహ

ములు సకలకోరికలతో నిండెను. ఆ గృహములశోభను శారదయు శేషుఁడును వర్ణింపఁజాలరు. నగరమును, గృహములును, రాజవీథులును, అంగడివీథులును, సందులుగొందులును, సర్వము సుగంధముతో నిండెను. పరమచతురులును, వివేకులును, మహాబలవంతు లగుదిక్పా లురు పరమార్థచింతచే నచ్చటికి వచ్చియుండిరి.

ఛాంద్ 1

వారివారి మర్యాదలప్రకారము సభికుల నుచితాసనములపై భరతుఁడు కూర్చుండఁబెట్టెను. వారివారిభాగ్యమును నదృష్టము వారికి వారే కొనియాడుకొని, కుబేరుని సంపదనుసహితము గర్హించిరి. బ్రహ్మదేవుఁడుసృజించిన సకలభూతములును, సురాసురులును, నరనాగు లును, ఖగమృగములును, రాముని యజ్ఞముఁ జూడవచ్చిరి; వారిని యథాన్యాయముగ శ్రీరాముఁడు సత్కరించెను. ప్రతివారిని పేరుపేరు వరుసన శ్రీరాముఁడు కుశలప్రశ్నఁ జేసి, యాదరించి, సత్కరించెను.

దోహా 32

ఐదువేల మహాయోధులును, ఐదువేల వేదాధ్యయనసంపన్ను లును యజ్ఞమును రక్షించుచుండిరి.

చౌపాయ్

మాఘశుద్ధవిదియనాఁడు శ్రీరాముఁడు యజ్ఞముఁ జేయ నారంభిం చెను. ఆదినమున నతఁడు యజ్ఞదీక్షలోఁ బ్రవేశించెను. "ఓ రాజా! యజ్ఞపశువుఁ దెప్పింపుము. వేదములోఁ జెప్పఁబడినలక్షణములు దానికిఁ గలవో లేవో చూడవలయును." అని వసిష్ఠుఁడు పలికెను.

("శ్లో. గంగాజలసమానేన వర్ణేన వపుషః శుభః,
కర్ణే శ్యామో ముఖే రక్తః పీతః పుచ్ఛే సులక్షితః.
మనోవేగః సర్వగతి రుచ్చైఃశ్రవసమప్రభః,
వాజిమేధే హయః ప్రోక్తో శుభలక్షణలక్షితః.)

గురువుగారి యాజ్ఞఁబొంది లక్ష్మణుఁడు సంతోషించి, వారి చరణ కమలములకు మాటిమాటికి నమస్కరించెను. అత్యుత్సాహముతో నశ్వశాల కతఁడు వెళ్లి, యజ్ఞపశువును సింగారించెను; దానివీఁపునకు రత్నస్థగితమగు జీనుఁగట్టెను; నల్లని చెవులును, శ్వేతవర్ణముగల

గుఱ్ఱముఁ జూచి, సూర్యుని గుఱ్ఱముసహితము సిగ్గుపడెను ; ఆగుఱ్ఱమును మన్మథుఁడు స్వయము సింగారించినట్లు కనఁబడును; దానిశోభను వర్ణించుటకు శక్యము కాదు. సాక్షాత్తు సూర్యనారాయణమూర్తి దాని రూపమును ధరించివచ్చిన ట్లాయశ్వము ప్రకాశించెను. నీలమాణిక్యములతోఁగూడిన నెమలిపింఛమును, దానిశిరస్సునకుఁ గట్టిరి. అంతరిక్షమున నక్షత్రములువలె, నాపింఛము తళుకుతళుకు మనుచుండెను. చతురులగు సేవకులు దానివెంట నడచిరి. మెఱుపువలెఁ బ్రకాశించుచుండిన పట్టుత్రాడును దానిమెడకుఁ దగిలించిరి.

దోహా 33

ఏడువేలమహాయోధులును రణధీరులును శూరులు నశ్వములపై నెక్కి, లక్ష్మణునితోఁ గూడి శ్రీరాముని వద్దకు వచ్చిరి.

చౌపాయ్

దిగ్విజయమునిమిత్తము, విశ్వామిత్రుఁడు చెప్పినప్రకారము, శ్రీరాముఁడు దానిని బూజించెను; అతఁడు షోడశమహాదానముల నిచ్చెను. అతఁ డాగుఱ్ఱమున కభిషేకముఁ జేసి, సువర్ణపట్టమును వ్రాసెను.

"ఏక వీర కోశలపుర మాహి
అరి దల దలన సురేశ సకాహీ,
జేహి జలహోయ గహే సోబాజీ
దండ దేహు వన జాహు కి భాజీ.

"అయోధ్యానగరములో నొకవీరుఁడు కలఁడు ; అతఁడు శత్రుసంహారకుఁడు ; అతనిం జూచి, దేవేంద్రుఁడు భయపడును ; ఈగుఱ్ఱమతనియజ్ఞపశువు ; బలవంతులు దానిని పట్టుకొనుఁడు ; లేక, ఆవీరునకు మీరు పన్నుఁ జెల్లింపుఁడు ; కాదేని, వనములకుఁ బొండు." ఈప్రకారము శ్రీరాముఁడు పట్టమును వ్రాసి, దానిముఖమునకుఁ గట్టెను. ఇనవంశోత్తముఁడగు శ్రీరామునివద్దకు భార్గవాదిమహర్షులు వచ్చిరి. లవణాసురునివృత్తాంతమును వారు చెప్పిరి; మహామును లాసమాచారమును విని దుఃఖించిరి; వారిమాటలకు శ్రీరామునినేత్రములనుండి నీరు కారెను; ఆతక్షణ మతఁడు తూణీరములఁ దెప్పించెను.

దోహా 34

అందులో నమోఘమగుతీక్ష్ణబాణము నొకదానిని దీసి, శ్రీరాముఁడు శత్రుఘ్నున కిచ్చెను. "ఓయీ తమ్ముఁడా! నా మంత్రముఁ జదివి, నీ వీబాణమును వానిపైఁ బ్రయోగింపుము. సకలదేశాధిపతులను జయించి, రమ్ము" అని శ్రీరాముఁ డతనితోఁ జెప్పెను.

చౌపాయ్

పిమ్మట శ్రీరాముఁడు విభీషణునిఁ బిలిచెను; అతఁడు శ్రీవారి చరణకమలములకు నమస్కరించెను. "ఓ విభీషణా! లవణాసురుని వృత్తాంతమును నిశ్శేషముగఁ జెప్పుము." అని శ్రీరాముఁ డడిగెను. అతఁడు చేతులజోడించుకొని, యీప్రకారము ప్రసంగించెను. "ఓ నాథా! సత్యముఁ జెప్పుచున్నాను. మీచిత్తము. మాకొక సవతి చెల్లెలు కలదు; దానిపేరు కుంభీనస. రావణుఁడు దానిని మధుదానవున కిచ్చి, వివాహముఁ జేసెను. వాఁడు దానినిఁ బరిగ్రహించెను. కాలాంతరమున, దానిగర్భమున లవణాసురుఁడు పుట్టెను; వాఁడు శివునుద్దేశించి, ఘోరమగుతపము నాచరించెను. ఓ నాథా! శివుఁడు వాని తపమునకు మెచ్చి, వానికొకత్రిశూలము నిచ్చెను. 'ఓయీ లవణాసురా! ఈత్రిశూలమును ధరించినవానిని యుద్ధములో నోడించుట దుర్లభము.' అని శివుఁడు దానిప్రభావమును వానితోఁ జెప్పెను.

దోహా 35

"ఓ నాథా! వాఁడు దానిబలమువలన, సురాసురులను, నరనాగులను లక్ష్యముఁజేయక, విచ్చలవిడిగ సంచరించును. వాఁడు సకలజీవులను వెంటదరుముచుండును; వానిచే జయింపఁబడనిజీవులు లోకములోఁ గనఁబడరు."

చౌపాయ్

ఈప్రకారము విభీషణుఁడు చెప్పినవృత్తాంతమును శ్రీరాముఁడు విని, నవ్వెను; అతఁడు శత్రుఘ్నుని నాదరించి, తనదివ్యాంశనతనిలోఁ బ్రవేశపెట్టెను. శ్రీరామునియాజ్ఞాప్రకార మేకముహూర్తమున, మూఁడువేలరణభేరులు ధణధణమని మ్రోఁగెను; ఆశబ్దమును విని, భూమి కంపించెను; గజతురంగంబులు ధ్వనిఁజేసెను. సూర్యునిరథ

మును తిరస్కరించి, (10)వేల అతిరథమహారథశ్రేష్ఠులు దానివెంట నడచిరి. వారు శంఖములఁ బూరించిరి; అంతరిక్షమున నాసమయమున దేవదుందుభులు మ్రోఁగెను. నగరమునకు బహిరంగస్థలములో యావత్సైన్యమును నిలిచెను. అత్యుత్సాహముతో శత్రుఘ్నుఁడు నతని కుమారుఁడును దండయాత్రకు వెడలిరి. పండ్రెండుదినములవఱకు వారు ప్రయాణమును సాగించి, యమునానదీతీరమునకు వచ్చిరి. ప్రతిదినమతఁడు బ్రాహ్మణులకు దానముల నిచ్చుచుండెను. అహోరాత్రములతఁడు శ్రీరాముని చరణకమలములను మానసికముగఁ బూజించుచుండెను.

దోహా 36

అతఁడు యమునానదీజలములలో స్నానముఁజేసి, శివునిఁ బూజించి, శ్రీరాముని ధ్యానించి, మరలఁ బ్రయాణమును సాగించెను.

చౌపాయ్

ఈప్రకారము చతురంగబలము నడచెను; అతిరథమహారథులు వీరాలాపములాడుచు, నత్యుత్సాహముతో వెడలిరి. వారు సాహసించి, లవణాసురునిపట్టణమును ముట్టడించిరి; రణదుందుభులు మ్రోఁగెను. వానిశబ్దమును లవణాసురుఁడు విని, కోపముచే మండిపడెను. వానివద్ద నరువదివేలరాక్షసయోధులు కలరు; వారిని వాఁడు యుద్ధమునకుఁ దీసికొనివచ్చెను. ఆ రాక్షసవీరులు వీరాలాపములాడుచు, గర్జించుచు, భుజముల నప్పళించుకొనుచు, చాఁడి వెడలిరి; ఆ రాక్షసకటకముఁ జూచి, లవణాసురుఁడు ప్రసన్నుఁడై యుప్పొంగెను. "ఓయీ వీరులారా! శత్రుసైన్యమును ఖండింపుఁడు; ఆ రాజుఁబట్టుకొని, బంధింపుఁడు; నాకు జయముకలుగునట్లు పోరాడుఁడు" అని లవణాసురుఁడు వారిని యుత్సహించెను. ఆ రాక్షససైన్యము యుద్ధమునకు నడచెను. కాటుకపర్వతమునుసహితము వారు కాటుకఁ జేసిరి. 'సంహరింపుఁడు' అనుశబ్దము వినఁబడెను; మహాయోధులు సింహనాదములఁ జేసిరి; ఇరుకటకములలోను రణభేరులు మ్రోఁగెను. ఎవరిప్రభువులకు వారు జయముఁ గోరి, యోధులజోడీలు ద్వంద్వయుద్ధముఁ జేయ నారంభించెను.

ఛాంద్ 1, 2

ఈప్రకార మా రెండుసైన్యంబులు దారొ్కని, యొక్కమ్మడిని విజృంభించి, రౌతురౌతును, బదాతిపదాతిని, యోధుయోధును, తమక ముతోఁ దారొ్కని, యొకరినొకరు ధిక్కరించుచు, వీరాలాపము లాడుచు, నాత్మస్తవముఁ జేసికొనుచు, బాణ, శక్తి, తోమర, పరశు మొదలగు వివిధశస్త్రంబుల నొకరిపై నొకరు ప్రయోగించుకొనిరి. శిర స్సులును, హస్తములును, పాదములును ముక్కలుముక్కలుగఁ దెగి నేలఁబడెను; వానిని భూమిమీఁదఁబడకుండ గృధ్రములు వానినిఁ బట్టుకొని, యంతరిక్షమున కెగసెను. మహావీరులు శస్త్రప్రహారం బులచే నేలఁబడి, దిగ్గున లేచి, మరలఁ బోరాడుచుండిరి; అనేక మాయలఁ గల్పించి, వారు శత్రువుల నెదురొ్కనిరి. శత్రుఘ్నుని కుమారుఁ డనేకరాక్షసయోధులఁ జంపెను. దేవత లంతరిక్షమున నిలిచి, యుద్ధముఁ జూచుచుండిరి. వారు పుష్పములను వర్షించి, జయ జయశబ్దములఁ బలికి, యా రణకౌతుకముఁ జూచుచుండిరి. ఆయోధు లొకరినొకరు సంహరించుకొనిరి.

దోహా 37

"ఆహా! నాసైన్యము పికాపికలయ్యెను." అని లవణాసురుఁడు చింతించి, కేతు, మాతంగులను కుమారులతోఁగలిసి, యుద్ధమునకు వెడలెను. కలవరపడుచుండిన సైన్యమును వాఁడు మోహరించెను.

చౌపాయ్

శత్రుఘ్నునికుమారుఁడు సుబాహువు మతంగునిఁ దారొ్క నెను; ఇరువురు కాలపురుషులువలె, ఘోరముగ పోరాడిరి. అతని రెండవకుమారుఁడు యూపకేతువు, కేతువను వానితో యుద్ధముఁ జేసెను; జయాపజయములను లక్ష్యముఁజేయక, ప్రాణములమీఁద నాశ విడిచిపెట్టి, ఆ రెండుద్వంద్వములు యుద్ధముఁ జేసెను. ఆ బలవం తులయుద్ధమును లవణాసురశత్రుఘ్నులు పరమానందముతోఁ జూచు చుండిరి. ఉభయసైన్యంబుల మహావీరులు మరల నెదురొ్కని, యొకరిపై నొకరు శస్త్రాస్త్రంబులఁ బ్రయోగించుకొనిరి. ఆ ఘోరసంగ్రామముఁ జూచి, దేతలుసహితము భయపడిరి. "ఓ గురూ! వీరిలోనెవరికి

జయముకలుగును" అని వారు బృహస్పతినడిగిరి. "ఓ యింద్రుఁడా! నీవు మనస్సులో శంకింపకుము; ఒకక్షణమాత్రము రాముని ప్రతాపము నీ హృదయములో ధ్యానింపుము." ఈలోపున, యూపకేతువు కోపించి, మహాస్త్రముఁ బ్రయోగించి, కేతువును సంహరించెను; సుబాహువు మతంగునియమపురమునకుఁ బంపెను. ఈప్రకారము లవణాసురుని కుమారులిరువురు వీరస్వర్గముఁ బొందిరి.

ఛాంద్ గీతికా 1, 2, 3

ఈప్రకారము శత్రుఘ్నునికుమారుల బాణములు రెండును లవణాసురుని కుమారులఁ జంపి, మరల వాని యంబులపొదులలోఁ బ్రవేశించెను. ఆ సూర్యకులతిలకము లిరువురును రణభూమిమీఁద విచ్చలవిడిగ సంచరించిరి. కుమారులమరణముఁ జూచి, లవణాసురుఁడు దుఃఖించి, నేలఁబడి మూర్ఛిల్లెను. వాఁడు తెలివిఁదెచ్చుకొని, త్రిశూలమును ధరించి, శత్రుఘ్నున కెదురుగ నిలువఁబడెను; ఆయిరువురు మహాబలులు; వారిసైన్యములు వారివెనుక నిలువఁబడెను. శిరస్సులును, పాదములును, బాహువులును, గగనమున కెగురుచుండెను. యోగినులును ప్రసన్నలయి, రక్తములో స్నానముఁ జేసి, పునుకలమాలను గ్రుచ్చుచుండిరి. కాళియు భవానియు నానందముతో గీతములఁ బాడిరి. మహావీరులు శంఖములఁ బూరించిరి; రణదుందుభులు మ్రోఁగెను. అతియుత్సాహముతో వీరులు యుద్ధమునకు వెడలిరి. పిశాచములు సంతోషించి, నాట్యమాడెను; పునుకలమాలను శివుని కొఱకుఁ గ్రుచ్చిరి. శాకినులు పునుకలలో రక్తముఁ బోసికొని, గుడగుడమని త్రాగుచుండిరి; డాకినులు మేదోమాంసములను భుజించి, యంతరిక్షమున విహరించిరి.

దోహా 38

అనేకరాక్షసయోధులను శత్రుసూదనుఁడు యుద్ధములో సంహరించెను; వారిమరణముఁ జూచి, లవణాసురుఁడు దుఃఖించి, క్షణమాత్రములో నంతర్ధాన మయ్యెను.

చౌపాయ్

వాఁడు మాయఁబన్ని, క్షణములో ననేకదేవతలను సృష్టించెను; ఆ మాయదేవతలు నానావిధశస్త్రాస్త్రంబుల ధరించి, యుద్ధమునకు వె

లిరి. బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, సనకాదులును, మునులును మొదలగువారు, శస్త్రాస్త్రంబులను, బాణతోమరశక్తిపరశుగదాదండంబులను ధరించి, పోరాటమునకు నడచిరి. "కట్టుఁడు, కొట్టుఁడు" అని పలుకుచు దేవతలు యుద్ధము నారంభించిరి. వారు నిజముగ దేవతలని తలంచి, శత్రుఘ్నునిసైనికులు జోహారువనుచు నిలువఁబడిరి; కాని, యుద్ధముఁ జేయుటలేదు. రాక్షసులబల మధికమయ్యెను. శత్రుఘ్నునివీరులకుఁ గరచరణము లాడలేదు. అతనిసైన్యము చీకాకుఁబడుటఁ జూచి, నారదుఁడు శత్రుసూదనునివద్దకు వచ్చెను. "ఓ శత్రుఘ్నుఁడా! వీరు దేవతలు కారు; ఇదియంతయు రాక్షసమాయ" అని మునిచెప్పినమాటల నతఁడు విని, శివుని స్మరించి, రాముఁడు మంత్రించియిచ్చినబాణమును సంధించెను. సూర్యోదయమువలన నంధకారము విడిపోవువిధమున, రాక్షసునిమాయ విడిపోయెను.

దోహా 39

శత్రుఘ్నుఁడు మంత్రముఁ బఠించి, బాణముఁ బ్రయోగించెను; దాని ప్రభావమువలన, ననేకబాణములు పుట్టెను. ప్రచండవాయువు విజృంభించి, మేఘబృందములఁ దోలఁగించువిధమున, నాబాణములు రాక్షసమాయను హరించెను.

చౌపాయ్

ఆ మాయాదేవతలు నశించిరి; కాలాంతకునివలె, సుబాహువు యుద్ధమునకు వెడలెను. "ఓరీ దుష్టుఁడా! నీ శూలమునుధరించి, యుద్ధమునకు రమ్ము" అని పలికి, యతఁడు వానిమీఁద నొకగదను బ్రయోగించెను. ఆగదాప్రహారమును సహింపలేక, వాఁడు గిరగిర దిరిగి నేలఁబడి,మూర్ఛిల్లెను. ఓ గరుడా! రాక్షసాధిపతి నేలఁబడుటఁ జూచి, రాక్షసులు క్రోధోద్దీపితులై, యుద్ధమునకు వెడలిరి. లవణాసురుఁడు మూర్ఛఁబడియుండుటఁ జూచి, కైటభుఁడనురాక్షసవీరుఁడు మూఁడువేల రాక్షసవీరులతోఁ గూడి, సుబాహువున కెదురుగ నిలిచెను. వాఁడు ప్రయోగించినబాణములను సుబాహువు చంద్రాయుధముతోఁ దునుమాడెను. అంతట లవణాసురుఁడు తెలివిఁదెచ్చుకొని, శూలముఁ బట్టుకొని, యూపకేతువుమీఁదికి వచ్చెను,

సోరఠా 3

ఆశూలమును వాఁడు సుబాహువుమీఁదఁ బ్రయోగించెను. ఆశూలము తగిలినందున, నతఁడు 'రామ, రామ' యనుచు మూర్ఛిల్లెను.

చౌపాయ్

సోదరునిదురవస్థఁ జూచి, యూపకేతువు క్రోధించి, నిరోధించి నను నిలువక, కైటభునిమీఁద నేకముహూర్తమున మూఁడుకోట్లబాణములఁ బ్రయోగించెను; అందుచేత వానికరచరణము లాడలేదు. ఈప్రకారము వానిని భంగపఱచి, యూపకేతువు సోదరునివద్దకు వచ్చెను. ఆబాణము తగిలినందున, సుబాహువునకు శరీరముపై స్మారకము తప్పియుండెను; పశువువలె, నతఁడు నేలఁబడెను. సోదరునిశరీరమునుండి బాణమును తీసి, యూపకేతువు 'రామనామము' అను మహౌషధము నతని కిచ్చెను. ఆ రామనామప్రభావమువలన, నతనికి స్వాస్థ్యమువచ్చెను; అతఁడు దిగ్గున లేచి, పక్కున నవ్వి, ధనుర్బాణములను ధరించి, యుద్ధమునకు నడచెను. అనేకరాక్షసయోధులపై నతఁడు శస్త్రాస్త్రములఁ బ్రయోగించి, వారిని సంహరించెను. కైటభుఁడు మూర్ఛిల్లెను; లవణాసురుఁడు వానిరథమును మఱలించెను.

దోహా 40

ఆమూర్ఛఁబొందిన కైటభుని గృహమునకుఁ బంపి, మహావీరుఁడగు లవణాసురుఁడు యుద్ధమునకు వచ్చెను.

చౌపాయ్

అంతలోఁ గైటభుఁడు తెలివిఁదెచ్చుకొని, సోదరుని వెంటఁదీసికొని, యుద్ధమునకు వెడలెను. ఓ గరుడా! ఆ దేవశత్రువులఁ జూచి, కాలుఁడుసహితము భయపడును. వారియెదుట నతనిబలముసహితము క్షీణించును. కాలాంతకులువలెఁ గైటభుఁడును జామ్యకుఁడును యుద్ధమునకు వచ్చిరి; వారు యుద్ధమునుండి లేశమైనఁ బరాఙ్ముఖులు కారు. వారు వచ్చి, లవణాసురునకు నమస్కరించిరి. "ఓ నాథా! ఈదినమున యుద్ధములో మాకోరికలు సఫలమగును." అని వా రిరువురు పలికి, శత్రుఘ్నునికుమారులఁ జూచి, "ఓయీ! మీరు బాలకులు; కనుక, మిమ్ములను విడిచిపెట్టితిమి; అనేకమహావీరులను మేము యుద్ధ

ములో సంహరించితిమి; మీవంటిబాలకులను సంహరించుటవలనఁ బ్రయోజనము లేదు. మీరు మానాథునకు శత్రువులు; మా ప్రభువు పంపించినందున, మీతో యుద్ధముఁ జేసి, మిమ్ములను సంహరించెదము. మామాట నిశ్చయము. మీసైన్యములను యమునానదిలోఁ గలిపి, మీతండ్రిని వధించెదము." అని పలికిరి.

ఛాంద్ గీతికా 1

"ఓయీ! మీసైన్యములను యమునలోఁ గలిపెదము; మీ శత్రుఘ్నుని వధించెదము. మిమ్ములఁ జూర్ణముచేసి, మానాథుని ఋణముఁ దీర్చెదము; మీసైన్యముల నాయత్తముఁ జేయుఁడు. మా మాటలను బాగుగవిచారించి, మీరు యుద్ధముఁజేయుఁడు." ఈ ప్రకారము వారు వీరాలాపము లాడి, సింహనాదములఁ జేయుచుఁ, బోరాటమునకు నడచిరి. సుబాహువును, యూపకేతువును, ధనుస్సులను ధరించి, యుద్ధము నారంభించిరి. ఇట్లుభయసైన్యంబులు ఢీమని దార్కొని, ద్వంద్వయుద్ధముఁ జేసిరి. పాదములును, బాహువులును, శిరస్సులును దెగి నేలఁబడుచుండెను. యోగినులును యోగినీబాలికా బాలకులును రక్తముఁ బానముఁ జేయుచుండిరి. గృధ్రములును, గాకులును, నక్కలును, శవములఁబీకి తినుచుండెను; వానిసంతోషము జెప్పుటకు శక్యముకాదు. అనేకవిధముల నవి మేదోమాంసములను భక్షించి, నృత్యముఁజేయ నారంభించెను.

దోహా 41

ఉభయసైన్యంబులయోధులు క్రోధించి, విజృంభించిరి. పిఱికిపందలు పరుగెత్తిరి; కత్తులు, కుఠారములు, ఈటెలు, మెళమెళమనెను. బలవంతులు పూరించి, పోరాడిరి.

చౌపాయ్

భయముచేతఁ బరుగెత్తిపోవుచుండినయోధులఁ జూచి, "ఓ యోధులారా! నిలుఁడు, నిలుఁడు; మీవీరత్వముఁ జూపుఁడు; భయమునువిడిచి, పోరాడుఁడు" అని శూరులు వారిని నిలువఁబెట్టిరి. మరల వీరులందఱు మోహరించి, యుద్ధముఁజేయ నారంభించిరి; ఆ ఘోర

యుద్ధముఁ జెప్పుటకు శక్యముకాదు. వర్షకాలములో మేఘములువలె, వారు బాణవర్షముఁ గురిపించిరి. గుఱ్ఱములడెక్కలవలన, ధూళియెగిరి యంతరిక్షముఁ గప్పెను. రాత్రిపడినట్లు, నలువైపులఁ జీకట్లు ప్రసరించెను. సంధ్యాసమయమువచ్చెనని రాక్షసయోధులు తలంచి, యుద్ధముఁ జాలించిరి; రాకుమారు లిరువురును శత్రుఘ్నునివద్దకు వచ్చిరి. ఆకుమారులు మహాబలవంతులని తెలిసికొని, తండ్రి ఇంద్రునివలె, సంతోషించెను. సాయంసమయ మయ్యెను; రాక్షసవీరులు స్వగృహములకుఁ బోయిరి; మరుచటిదినము ప్రాతఃకాలమున యుద్ధము నారంభించుటకు నిశ్చయించిరి.

దోహా 42

అంతఁ బ్రాతఃకాలమయ్యెను; సూర్యుఁ డుదయించెను; రణభేరులు మ్రోఁగెను; వీరులు శంఖములఁ బూరించిరి; చతురంగబలములు యుద్ధమునకు నడచెను. లవణాసురుఁడు వీరావేశముతో వచ్చెను.

చౌపాయ్

వాఁడు శివునిస్మరించి, త్రిశూలమును ధరించి, కాలాంతకునివలె, శత్రువులపైఁ బడెను. ఒకక్షణములో వాఁడు మహాయోధులను సంహరించెను. శత్రుఘ్నుఁడు వానిపరాక్రమమును సహింపక, వానిమీఁదికి వెడలెను. వాఁడు త్రిశూలమును శత్రుఘ్నునిమీఁదఁ బ్రయోగించెను; అందుచేత నతఁడు మూర్ఛిల్లెను. వాఁడు మరలఁ గోపించి, ఖడ్గమును విసరెను; వానియాటోపముఁ జూచి, సుబాహువు కోపించి, వాని నెదుర్కొని, గదాదండమును విసరి, వానిరథమును, నశ్వములను, సారథిని, చూర్ణముఁ జేసెను. నవ్వుచు ననేక వీరుల నతఁడు సంహరించి, యొకబాణమును లవణాసురునిమీఁదఁ బ్రయోగించెను; అందుచేత వాఁడు మూర్ఛిల్లెను. మరల వాఁడు తెలివిఁదెచ్చుకొని, ధనుర్బాణములను ధరించి, వెడలెను. అంత, శత్రుఘ్నుఁడు మూర్ఛనుండిలేచి, దేవతలు వ్యాకులముఁబడుటఁ జూచి, రామచంద్రుఁ డిచ్చినబాణమును బ్రయోగించుటకు సిద్ధపడెను.

దోహా 43

శ్రీరామునిచరణకమలముల నతఁడు స్మరించి, రామబాణమును సంధించి, ప్రయోగించెను. వాఁడు వ్యాకులముపడి, నేలఁబడి ప్రాణములను విడిచిపెట్టెను.

చౌపాయ్

అంతరిక్షమున విమానములపై నుండినదేవతలు వానిమరణమునకు సంతోషించి, పుష్పములను వర్షించిరి; దుందుభులను మ్రోఁగించిరి. "ఓ నాథా! ఈనాఁటికి మాదుఃఖములు చల్లారెను." అని దేవతలు స్తుతించి, జయజయధ్వనులఁ జేసి, శత్రుఘ్నుని దీవించిరి. వానిమరణమునకు జామకుఁడును కైటభుఁడును దుఃఖించి, క్రోధతామ్రాక్షులై గర్జించుచు, నొకపర్వతముఁబట్టుకొని వెడలిరి. ఒకబాణమును సుబాహువు ప్రయోగించి, యాపర్వతముఁ జూర్ణముచేసెను; అర్ధచంద్రాకారబాణములను రెండుప్రయోగించి, యతఁడు వానిబాహువులను ఛేదించెను. అప్పుడు జామకుఁడు నోరుదెఱచుకొని, సుబాహువు మీఁదికి వచ్చెను; అతఁడు వానిశిరస్సుఁ దుంచెను. వాఁడు మహాశబ్దముఁ జేయుచు నేలఁబడి, ప్రాణములను విడిచిపెట్టెను.

దోహా 44

యూపకేతువు కైటభుని సంహరించెను. దేవతలు పుష్పములను వర్షించిరి; దేవదుందుభులు మ్రోఁగెను; బ్రహ్మాదిదేవతలు సంతసించిరి.

చౌపాయ్

దేవతలు జయజయశబ్దములఁ జేసి, తండ్రి కుమా[illegible]రు[illegible] స్తుతించిరి. మునిగణంబులు వేదంబులఁ బఠించి, వారిని దీ[illegible], వందిజనంబులు స్తోత్రపాఠములఁ జదివిరి. తండ్రికుమారుల[illegible]ములఁ జేసిరి; అప్పుడు దేవేంద్రుఁడు శత్రుఘ్నునివద్దకు వచ్చి, [illegible]లను జోడించుకొని, ప్రేమరసము లోలుకుచుండ, నిట్లు స్తుతించెను:—"ఓ నాథా! మిమ్ములను స్తుతించుటకు నాజిహ్వ తగదు. మీవలన, నేనును నదితిసం

తతివారును సనాథుల మయితిమి." శత్రుఘ్నుఁడు దేవేంద్రాదులఁ జూచి, రథముడిగ్గి, వారికి నమస్కరించెను. "ఓ దేవతలారా! మీకటాక్షము వలన శత్రువులను సంహరించితిని; శ్రీవారి ప్రతాపమువలన జయము కలిగెను." ఈ ప్రకారము శత్రుఘ్నుఁడు పలికినపలుకులను దేవేంద్రుఁడు విని సంతసించి, యతనిని స్తుతించి, దీవించెను.

దోహా 45

అనంతరము దేవేంద్రాదులు బృహస్పతిని ముందునిడుకొని, యజ్ఞవాటికకు వచ్చి, శ్రీరామునిసమీపించి, శత్రుఘ్నునిసమాచారము నతనికి విన్నవించి, శ్రీరాముని స్తుతించిరి.

చౌపాయ్

ఇచ్చట శత్రుఘ్నుఁడు రెండునగరములను స్థాపించి, యిరువురు ఁమారులకుఁ బట్టముఁగట్టెను. ఒకనగరముపేరు మధుర (Muttra) ఆపట్టణము లోకములోఁ బ్రసిద్ధికెక్కెను; రెండవనగరము 'విదిత'నుగుఱించి వేదములోఁ జెప్పఁబడెను. సుబాహువను కుమారుఁడు ధర్మాత్ముఁడు; బలవంతుఁడు; కనుక, నతనికి మధురానగరరాజ్యము వచ్చెను. బలవంతుఁడగు కేతువునకు 'విదిత'నగరరాజ్యము వచ్చెను. ఆనగరము యమునానదికిఁ బశ్చిమతీరమున నుండెను. యూపకేతువు రాజ్యముఁ బొంది, సంతోషించెను. శత్రుఘ్నుఁడు కుమారులిరువురకుఁ దగినవిధమున రాజనీతుల నుపదేశించెను; ఆనగరముల నప్పగించి, వారిని దీవించెను. పిమ్మట శత్రుఘ్నుఁడు దిగ్విజయమునిమిత్తము వెడలెను. 'దీర్ఘాయుష్యమస్తు' అని వారిని దీవించెను. రణదుందుభులు మ్రోఁగెను; అశ్వమునుదీసికొని, యతఁడు చతురంగబలములతో దక్షిణదిశకు వెడలెను. కుమారులును, మంత్రులును, జతురంగసైన్యములును యమునానదిని దాఁటి

దోహా 46

యమునానదికి నమస్కరించి, చతురంగసైన్యములతో వెడలి, యుత్సాహముతో వారు వెడలిరి; వారింజూచి, దేవతలు సంతసించి, పుష్పములను వర్షించిరి.

### చౌపాయ్

ఈప్రకారము వారు నలుదిశలఁ గ్రుమ్మరి, వాల్మీకి మహాముని నివసించు యాశ్రమవనముఁ బొడఁగాంచిరి. ఆయాశ్రమములో జానకి పుత్రులిరువురు, సూర్యునివంటి ప్రచండపరాక్రమవంతులు కలరు. ఆపుత్రులు గుఱ్ఱముఁ జూచి, దాని లలాటముననుండిన పత్రముఁజదివి, దానిని బంధించిరి. తరకసమును నడుమునకుఁ గట్టుకొని, ధనుర్బాణములను ధరించి, వారు యుద్ధమునకు సిద్ధముగనుండిరి. ఆగుఱ్ఱమును సంరక్షించుచుండిన సహస్రవీరులు కుమారులవద్దకు వచ్చిరి. వృక్షమునకు బంధింపఁబడినగుఱ్ఱముఁ జూచి, వారాకుమారులు బాలకులని తెలిసికొని, శాంతించిరి. "ఓ కుమారులారా! మీతల్లిదండ్రులు ధన్యులు; మీరాగుఱ్ఱమును విడిచి, మీగృహములకుఁ బొండు" "ఓయీ వీరులారా! యుద్ధమునకు వచ్చి, భిక్షమునడుగుట యుచితమా? అట్లు యాచించుటవలన, క్షత్రియకులమునకు మచ్చవచ్చును కదా.

### ఛాంద్ 13, 14

"ఓయీ శూరులారా! క్షత్రియకులమునకు మచ్చఁదీసికొని వచ్చుట యుచితము కాదు. మీవంటిబలహీనులను గుఱ్ఱమును రక్షించుటకుఁ బంపినవారెంతప్రవీణులో కదా? మీకు బలములేనియెడల, మీగృహములకుఁ బొండు." ఈప్రకారము కుశలవులుపలికిన కర్ణకఠోరమగు పలుకులను యోధులు విని, వారు బాలులని తెలిసినను, వారిని నెదుర్కొనిరి. లవుఁడు ధనుస్సునుసంధించి, ఆడుచుఁబాడుచు, బాణపరంపరలఁ బ్రయోగించి, యావీరులశరీరములఁ జిల్లులుపొడిచెను. ఆశూరులు నేలఁబడి, మూర్ఛిల్లిలేచి, శత్రుఘ్నునివద్దకు వెళ్లి, "ఓ మహారాజా! ఇరువురుకుమారులు, మునిబాలకులు, మనగుఱ్ఱమును బంధించి, మనయోధుల ననేకులను సంహరించిరి." అని మొఱఁబెట్టుకొనిరి. ఆమాటలకు శత్రుఘ్నుఁడు కోపించి, చతురంగబలములను మోహరించి, కుశలవులపైకి నడచెను. అతిరథశ్రేష్ఠులగుకుమారుల నతఁడు చూచి, సిగ్గుపడెను. "ఈయిరువురు బాలురుకదా! వీరితో నెట్లు యుద్ధముఁ జేయఁగలను" అని యతఁడు చింతించెను.

సోరఠా 4

"ఓ మునిబాలమరాళములారా! మీరు గుఱ్ఱమునువిడిచి, గృహమునకుఁ బొండు; మీరు పూజనీయులు; కనుక, మిమ్ములఁ బూజించుటవలన, నాజన్మము సఫలమగును." అని శత్రుఘ్నుఁడు వారికి బోధించెను.

చౌపాయ్

"ఓ రాజా! మీ పేరేమి? మీ నగరమేమి? ఈసైన్యములతో నేల మీరు వనములో సంచరించుచుంటిరి? ఏకారణముచేత మీరీగుఱ్ఱమును విడిచిపెట్టితిరి? ఎందుచేత దానిలలాటమునకుఁ బట్టముఁ గట్టితిరి? ఓ రాజా! మీకు బలపౌరుషములు లేనియెడల, మీ రీపట్టముఁ దీసి, గుఱ్ఱమును విడిచి, గృహమునకుఁ బొండు." ఈప్రకారము కుశలవులుపలికిన కఠోరవాక్యములకు శత్రుఘ్నుఁడు తలవంచుకొనెను. శస్త్రాస్త్రములఁ గట్టుమని వీరుల కాజ్ఞాపించి, యతఁడు ముసిముసినవ్వుల నవ్వెను. "ఆహా! ఎంతబలవంతుఁ డీరాజు! చప్పట్లకు సింహము భయపడునా!" అని కుశలవులు పక్కున నవ్వి, గురువగు వాల్మీకినిస్మరించి, ధనుర్బాణములను సంధించిరి. కుశలవులు శరపరంపరల నతనిరథముపై వర్షించి, యతనిశరీరమునిండఁ జిల్లులుబొడిచిరి. అతనియోధులు నేలఁ బడి, సొమ్మసిల్లి, మూర్ఛిల్లిరి. గృధ్రములు మొదలగుపక్షులు మాంసమును భక్షించుచుండెను.

దోహా 47

ఆకుమారు లొక్కొక్కవీరునిఁ బిలిచి, వానిని సంహరించిరి; పిఱికిపందలు పరుగెత్తి, శ్రీరామునివద్దకు వెళ్లిరి.

చౌపాయ్

యావద్వృత్తాంతమును వారు శ్రీరామునకు విన్నవించి, ఆ బాలకుల గుణాతిశయములను వర్ణించి చెప్పిరి. యుద్ధముఁ జేయువారు మునికుమారులని రాముఁడు విని, వ్యాకులముఁ బడి, అంతలో ధైర్యమునవలంబించి, యిట్లనియెను:—"ఓ తమ్ములారా! వీరులారా! మీరు లక్ష్మణునితో యుద్ధమునకు వెడలుఁడు. బలాత్కారముగ

వారిని బంధించి, తీసికొనిరండు; వారు మునికుమారులు కనుక, నేవిధమున వారినిఁ జంపఁగూడదు; వారు వధార్హులు కారు." ఈ ప్రకారము శ్రీరామునియాజ్ఞఁ గైకొని, లక్ష్మణుఁడు చతురంగబలములతో దండెత్తెను; అతఁ డాయుద్ధభూమికి వచ్చెను. మూర్ఛఁబడియుండిన యోధుల నతఁడు చూచి, విస్మయపడి, మునికుమారులతో నిట్లనియె: "ఓ బాలకులారా! మీప్రాణములను రక్షించుకొని, గృహమునకుఁ బొండు. సూర్యవంశపు రాజులు దేవబ్రాహ్మణులను రక్షించెదరు; మీరు బ్రాహ్మణకుమారులు; మీతోఁ బోరాడుట మాకు శ్రేయస్సు కాదు. మీరు నా కన్నులయెదుటనుండి వెడలిపొండు; మిమ్ములఁజూచిన, నా శరీరము క్రోధముచే మండుచుండును."

దోహా 48

ఇట్లు లక్ష్మణుఁడు చెప్పినమాటలను కుశలవులు విని, పక్కున నవ్విరి. "ఓ రణధీరుఁడా! నీతమ్మునిదురవస్థఁ జూచి, నీగృహమునకు వెడలిపొమ్ము." అని వారు పలికిరి.

చౌపాయ్

ఆమాటలను లక్ష్మణుఁడు విని, మూర్ఛిల్లియుండిన తమ్మునిఁ జూచి, ధనుస్సును సంధించెను. ఆ మునికుమారులతోఁ బోరాడుట సూర్యకులాచారమునకు విరుద్ధమని యతఁడు విచారించి, సంకోచించెను. "ఓ బాలకులారా! మీకు బుద్ధిలేదు. మీరు కేవలము బాలకులు; మీతోఁ బోరాడుటవలన, లాభము లేదు; కనుక, మీకుఁ దోడుపడువారినిఁ దీసికొనిరండు." ఇట్లు లక్ష్మణుఁడు చెప్పుచుండినను, నతనిమాటలను లక్ష్యముఁజేయక, కుశుఁడు తీవ్రబాణముఁ బ్రయోగించెను; ఆబాణమునకు భూమి కంపించెను; శేషమూర్తి వ్యాకులపడెను. ఆబాణ మంతరిక్షమును వ్యాపించెను; సూర్యబింబము మఱుగుపడెను. కుశలవులప్రతాపమును సహింపలేక, లక్ష్మణుఁడు కోపించి, వారిని నెదుర్కొనెను; అతఁడు రథమును నిలువఁబెట్టి, నిశ్చింతగ యుద్ధముఁజేయ నారంభించెను. కుశలవు లతనిబాణములను ఖండించిరి! అన్నదమ్ములిరువురు నతిచమత్కారముగ యుద్ధముఁ జేయు

చుండిరి; అప్పుడు లక్ష్మణుఁ డొకగదను మహావేగముతోఁ బ్రయోగిం చెను; ఆగద తగిలినందున, కుశుఁడు వ్యాకులపడెను.

దోహా 49

అందు చేత, నతఁడు మూర్ఛిల్లెను. లవుఁడు కోపించి, వచ్చుచుం డిన లక్ష్మణునివక్షస్థలముపై నొకబాణముఁ బ్రయోగించెను. ఆబాణము తగిలినను, లక్ష్మణుఁడు బలవంతుఁడు కనుక, నేలమీఁదఁ బడలేదు.

చౌపాయ్

అనంతరము, లవలక్ష్మణులు మల్లయుద్ధముఁ జేసిరి; వారు పట్టును విడువక, సమానముగఁ బోరాడిరి. అనేకమాయోపాయములచే నొకరి నొకరు గ్రుద్దుకొనిరి; పూర్ణబలముఁ జూపించి, వారు పోరాడిరి. పిమ్మట, లవుఁడు లక్ష్మణునిఁ బిడుగువంటి గ్రుద్దుగ్రుద్దెను; లక్ష్మణుఁ డం దులకు వ్యాకులపడి, లవునిగుద్దును మెచ్చుకొనెను. లక్ష్మణుఁడు శ్రీరా మునిస్మరించి, కుశునిపై నొకబాణమును విడిచెను; ఆ బాణముతగిలి, కుశుఁడు మూర్ఛపడెను. ఆకుశుఁడు వాల్మీకిని సీతను స్మరించి, మూర్ఛ నుండి లేచి, యుద్ధమునకు వెడలెను. అతఁడు ధనుర్బాణములను ధరించి, ముందుకు వచ్చి, లక్ష్మణునిఁ జూచి, మండిపడెను. అతఁ డొక తీవ్రబాణమును సంధించి, లక్ష్మణునిపైఁ బ్రయోగించెను; మేఘనాదు నిపైఁ బ్రయోగించిన బాణములను లక్ష్మణుఁడు ప్రయోగించినను వానిని కుశలవులు తునుమాడిరి. ఆబాణములు విఱిగి, నేలఁబడెను.

దోహా 50

ఆ కుశలవులప్రతాపముఁ జూచి, లక్ష్మణుఁడు చింతాక్రాంతుఁడై, "ఆహా! ఈయుపద్రవము సీతావియోగమువలన సంభవించెను. నాశరీ రమును విడిచిపెట్టినగాని, నాకీదుఃఖము పోదు" అని దుఃఖించెను.

చౌపాయ్

ఈసమయమున, వాల్మీకిమహాముని యుపదేశించినబ్రహ్మాస్త్ర మును కుశుఁడు సంధించెను. మూఁడులోకములును గడగడవడఁకెను. ఆబ్రహ్మాస్త్రమును లోకులు గౌరవించెదరు; బ్రహ్మవిష్ణుమహేశ్వరులు సహితము దానిని మన్నించెదరు. లక్ష్మణునిహృదయమునకుఁ దగులు

నట్లు, కుశుఁడాబాణమును సంధించి, విడిచిపెట్టెను. ఆబాణము తగిలినందున, నతఁడు మూర్ఛపడి, తెలివిఁదప్పి, నేలఁబడెను. సైనికులు కాందిశీకులై, అయోధ్యానగరముఁజేరిరి. ఒకదూత శ్రీరామునిసమీపించి, లక్ష్మణుఁడు మూర్ఛపడుట మొదలగువృత్తాంతమును విన్నవించెను. "ఓ నాథా! ఆబాలకులు చతురంగబలములను సంహరించినవిధమును నేను కన్నులారఁ జూచి యుంటిని. ఆబాలకులు మూఁడుమూర్తుల మిమ్ములఁ బోలియుందురు. వారు బాలురేగాని, వారిపరాక్రమమును వర్ణించుటకు శక్యముకాదు. వారు కాకపక్షధరులు; ముద్దులు మూటఁగట్టుచుండిరి; వారిబల మపారము."

దోహా 51

భరతుఁడు చింతాక్రాంతుఁడై, చేతులను జోడించుకొని, "ఓ నాథా! సీతను విడిచిపెట్టినందులకు, మనకు భగవంతుఁడు తగినఫలము నిచ్చెను." అని విన్నవించెను. అప్పుడు శ్రీరాముఁడు తమ్మునితో నిట్లు పలికెను.

చౌపాయ్

"ఓ తమ్ముఁడా! ఏమి? నీకు యుద్ధముఁజేయుటకు భయమా? మంచిది; నేను స్వయముగ యుద్ధమునకుఁ బోఁగలను; నారథమును సిద్ధముఁ జేయుము. ఇంతటితో యజ్ఞముఁ జాలింపుఁడు. నేనువెళ్లి, యాబాలకులఁ జూచి, వారిపూర్వోత్తరములఁ గనుఁగొనివచ్చెదను. ఆ బాలకులవలన, నా కింతదుఃఖము కలిగెను." ఇట్లు శ్రీపతి పలికినములుకులవంటిమాటలకు భరతుఁడు సిగ్గుపడి, యూరకుండెను. శ్రీరాముఁడు తమ్మునినాదరించి, బోధించెను. "ఓ తమ్ముఁడా! నా పూర్వపుమిత్రులకును సఖులకును వర్తమానముఁ బంపుము; హనుమంతుఁడు, అంగదుఁడు, జాంబవంతుఁడు, సుగ్రీవుఁడు, విభీషణుఁడు, ద్వివిదుఁడు, మయందుఁడు, నలుఁడు, నీలుఁడు-ఈ మొదలగు మహావీరులను వెంటఁదీసికొని, యుద్ధమునకు వెడలి, యా యన్నదమ్ములనిరువురఁ దీసికొనిరమ్ము." ఆ శేషశాయివచనముల నతఁడు శిరసావహించి, యతనిచరణములకు నమస్కరించి, మహాయోధులతోఁ గూడి, రౌద్రాకారుఁడై, వెడలెను. అతఁడు యుద్ధభూమికి వచ్చి, మహావీరులకు భయముఁ బుట్టించు రక్తనదిఁ జూచి, యాశ్చర్యపడెను.

దోహా 52

ఆసమయమున, నా కుశలవులు, మహావీరులు, రణస్థలమునకు వచ్చిరి; వా రిరువురఁ జూచి, వానరయోధులు భయపడిరి. అప్పుడు హనుమంతుఁడు వారితో నిట్లు ప్రసంగించెను.

చౌపాయ్

"ఓ బాలకులారా! మీవంటిబలవంతులగు కుమారులఁ గనిన తల్లిదండ్రులు ధన్యులు; మీరు మీగృహములకుఁ బొండు." ఈ మాటలకు కుశలవులు మండిపడి, యతనితో నిట్లనిరి. "ఓయీ వానరుఁడా! నీకు శక్తిలేనియెడల, గృహమునకుఁ బొమ్ము; యుద్ధముఁ జేయుటకు నీవు భయపడినయెడల, నిన్ను లేశమైన శ్రమపెట్టము" వారి మాటలకు భరతునకుఁ బౌరుషమువచ్చెను. "ఓ వీరులారా! శస్త్రాస్త్రములఁ బ్రయోగింపుఁడు." అని భరతుఁ డాజ్ఞాపించెను. అతనియాజ్ఞ ప్రకారము, వానరభల్లూకములు మహావృక్షములను బర్వతములఁ బట్టుకొని, కిలకిలమనుచు, వానిని కుశలవులమీఁద రువ్విరి; లవుఁ డొకబాణముఁ బ్రయోగించి, వానిని జూర్ణముఁజేసెను. దుష్టునిమనోరథములు విఫలమగువిధమున, వానరులవృక్షాదులు నిష్ఫలమయ్యెను. లవుఁడు కోపించి, బాణపరంపరలను వర్షించి, యోధులను సంహరించెను.

ఛాంద్ ఛాంద్‌గీతికా

చతురంగబలములు విఱిగిపడెను; రక్తనదీప్రవాహములో, వారు కొట్టుకొనిపోవుచుండిరి. లవుఁడు ధనుస్సునుసంధించి, బాణములను వర్షించెను; మహావీరులకుఁ గరచరణము లాడలేదు. గజములును, అశ్వములును, నిలువఁబడియుండి, సొమ్మసిల్లెను; రణస్థలముమీఁద రక్తనది ప్రవహించెను. మహావీరులకు గాయములు తగిలినందున, నేలఁబడిరి. వెనుకకు విఱుచుకొనిపడినవీరులు, చేతులనూతగొని, మెల్లమెల్లగ లేచిరి; మఱికొందఱు నేలఁబడి, ప్రాణములను విడిచిరి; తదితరులు నిట్టూర్పులను విడిచి, పడియుండిరి. ధైర్యమునవలంబించి, కొందఱు వీరులు ముందునకు నడచిరి; తెక్కలువిఱిగి, నేలఁబడిన పర్వతములవలె, వానరభల్లూకవీరులు పడిరి. ఆవీరనది భయంకరముగఁ బ్రవహించెను. ఆనదీతీరమున భూతప్రేతపిశాచగణంబులు నాట్యమాడెను;

గృధ్రములు మొదలగునవి మాంసమును భక్షించుచుండెను; వాని సంతోషమునకు మితములేదు; వివాహోత్సవమునందువలె, భూత ప్రేత పిశాచ ఢాకినీ శాకినీ గణంబులు నదిలో స్నానముఁ జేసి, మాంసమును భక్షించి, రక్తముఁ ద్రాగి, నృత్యమాడెను. కాళికాశకులును, శివునిప్రేతగణంబులును మృతకళేబరములతో వినోదము లాడుచుండిరి. శవముల పేగులఁ బట్టుకొని, పక్షులు మీఁదికి నెగురుచుండెను. అవి రక్తపానముఁ జేసి, యాడుకొనెను. సంగ్రామచతురులగు శివునిప్రేతగణంబులు గజములచర్మముల నొలిచి, వానిమాంసముఁ దినుచుండిరి; బేతాళగణంబులు వాని తొండములను భక్షించిరి; కొన్నిగణంబులు వానింబట్టుకొని, నృత్యముఁ జేసిరి. మఱికొందఱు 'హరహర'యనుచు, వానివేఁడిరక్తమును బానముఁ జేసిరి. ఆకుశలవుల నెంతస్తోత్రముఁజేసినను, దనివిదీరదు; అంతనేర్పుగ వారు రణస్థలమున విహరించిరి. చతురంగబలములును, వానరభల్లూకయోధులును విఱిగిపడిరి. అనేకవిధముల వారు 'ఛీ'మని యోధులఁ బిలిచిరి; వీరచిత్తములు చంచలమై, వ్యాకులముపడెను. ఒకరినొకరు పిలుచుకొని, పరుగెత్తిరి.

దోహా 53

ఈప్రకారము కుశలవులు ఘోరయుద్ధముఁ జేసి, వానరులను జయించిరి. భగవంతుఁడు విపరీతముగనుండెనని తలఁచి, దుఃఖించి, భరతుఁడు యుద్ధమునకు నడచెను.

చౌపాయ్

వ్యాకులపడి, చింతాక్రాంతులై, పడియుండిన వానరభల్లూకవీరుల నతఁడుచూచి, దుఃఖించెను; అంగదుఁడు, సుగ్రీవుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు—ఈ నల్వురనుబిలిచి, వారితో నిట్లు పలికెను. "ఓ వీరులారా! మీరును విభీషణుఁడును వెళ్లి, యాబాలకులఁ బట్టి తీసికొనిరండు." వానరభల్లూకయోధులు మోహరించి, యుద్ధమునకు వెడలిరి; వారికి, ఓ పార్వతీ! శ్రీవారిమహిమ తెలియదు. అప్పుడు కుశుఁడు వాలికుమారునితో నిట్లు ప్రసంగించెను:—"ఓ అంగదా! నీప్రతాపము లోకవిదితము. నీవు నీతండ్రినిజంపించి, నీతల్లిని మఱియొకనికి నప్పగించితివి. నీవు నీసిగ్గునకుఁ దిలోదకముల నిచ్చి,

యేముఖముతో యుద్ధమునకు వచ్చితివి ? నేఁడు నీవు దానిఫలము నను భవించి, నీకళంకమును బోఁగొట్టుకొనుము." ఈమాటలవలన నంగదు నకుఁ గోపమువచ్చెను; అతఁ డొకపర్వతముఁ బట్టుకొని, కుశుని నెదు ర్కొనెను.

దోహా 54

కుశుఁ డొకబాణముఁ బ్రయోగించి, దానిని జూర్ణముఁజేసెను. అందువలన, నంగదునికి శృంగభంగమయ్యెను; అతఁ డాసమాచార మును భరతునితో విన్నవించెను.

చౌపాయ్

కుశుఁడు మఱియొకబాణముఁ బ్రయోగించెను; దానివలన నీలుఁడును అంగదుఁడు నంతరిక్షమున కెగిరిపోయిరి. వారు మాటి మాటికి నంతరిక్షమునుండి భూమిమీఁదికిని, భూమిమీఁదనుండి యంత రిక్షమునకు నెగిరిపోవుచుండిరి. వాయువువలన మేఘబృందములు పరు గెత్తువిధమున, వారు కొట్టఁబడిరి; వారిదురవస్థఁజెప్పుటకు శక్యము కాదు. తుదకు వారు భరతుని శరణుఁజొచ్చిరి. "ఓ స్వామీ ! మేము గర్వముపడియుంటిమి; మీమహిమను గుర్తెఱుంగము. నేఁడు మా గర్వము పరిహారమయ్యెను. అయిదుబాణముల నతఁడు ప్రయోగించి, మమ్ముల ననేకవిధముల బాధపెట్టెను. మేము దీనులమని గ్రహించి, యతఁడు మమ్ములను విడిచిపెట్టెను." ఈప్రకారము నీలుఁడును అంగ దుఁడును శ్రీరామునితో విన్నవించి, తిరిగి భరతునివద్దకు వచ్చిరి. అతనిదురవస్థను వారు చూచి, మైమఱచిరి; వారినేత్రములకుఁ జీకట్లు గ్రమ్మెను; వారికి దశదిక్కులు కనఁబడలేదు. ఆసమయమున, సుగ్రీవుఁ డును, జాంబవంతుఁడును, హనుమంతుఁడును, వృక్షములను శైలములఁ బట్టుకొని, యుద్ధమునకు వెడలిరి.

దోహా 55

ఆవానరులఁ జూచి, కుశుఁడు నవ్వి, తమ్మునితో నిట్లు చెప్పెను. "ఓయీ తమ్ముఁడా! ఈ వానరులనువిడిచి, భరతుని నెదుర్కొనుము. అతనిని జయింపవలెను."

**చౌపాయి**

శ్రీరామునికుమారులు భరతశత్రుఘ్నులతోఁ బోరాడిరి; వారి యుద్ధమును శేషుఁడును శారదయు వర్ణింపఁజాలరు. ఓ పార్వతీ! ఆ చరిత్రమును వినుము. ఆకుమారులు మహాయోధులఁ జంపి, సింహనాదముఁ జేసిరి; ఆయిరువుర పరాక్రమముఁ జూచి, వానరభల్లూకములు వెఱగుపడిరి. కుశుఁడు ప్రయోగించినబాణమువలన, సుగ్రీవాది వానరులు మూర్ఛపడిరి. సమ్మోహనాస్త్రమువలన, సకలసైన్యముల వారును మూర్ఛపడిరి. ఆ వానరులగాయములను జెప్ప శక్యము కాదు. వారిదుర్దశఁ జూచి, భరతుఁడు కోపించి, లవుని వక్షస్థలముమీఁద నొకబాణముఁ బ్రయోగించెను; అందుచేత, లవుఁడు మూర్ఛపడెను. అప్పుడు కుశుఁడు రౌద్రాకారుఁడై, శూలములవంటి నూరుబాణములను భరతునిపైఁ బ్రయోగించెను. అతఁడు భరతుని నలువైపుల బాణములతోఁ గప్పెను.

**దోహా 56**

ఆబాణములు తగిలినందున, భరతుఁడు మూర్ఛిల్లి, నేలఁబడెను. అంతలో లవుఁడు మూర్ఛనుండి దిగ్గునలేచెను; ఆకుమారులు తల్లిని, గురువును స్మరించి, రణస్థలమున నిలువఁబడిరి.

**చౌపాయి**

నల్వురుదూతలు భరతునకును సైన్యమునకును సంభవించినదురవస్థఁ జూచిరి; ఆ వీరనదీప్రవాహములో గజాశ్వములు కొట్టుకొనిపోవుచుండెను. ఆదూతలు భయపడిరి. మీనమకరములవలె, నారక్త నదిలో గజాశ్వములు మొదలగునవి కొట్టుకొనిపోవుచుండెను. వారు దానినిఁ జూడలేక, ముఖముఁ ద్రిప్పుకొనిరి. ఆ నదీతరంగములలో ననేకవీరులు పోవుచుండిరి. గాయములుపడి, బాధపడుచుండెన వీరులు, ఆ నదీతీరమున మూల్గుచుండిరి. అయోధ్యానగరమునకు వెళ్ళి, యావద్వృత్తాంతమును శ్రీరామునకు వారు విన్నవించిరి. యజ్ఞమును పురోహితునియాధీనముఁ జేసి, శ్రీరాముఁడు చింతాక్రాంతుఁడై, చతురంగ బలములను సిద్ధపఱచి, రౌద్రాకారుఁడై వెడలెను. అతఁడు రణరంగము

నకు వచ్చి, కుమారుల నిరువురఁజూచి, బాణములను ప్రయోగింపక, వారిని రప్పించెను.

దోహా 57

వారు దగ్గఱకువచ్చినతరువాత, వారితో నిట్లు శ్రీరాముఁడు ప్రసంగించెను. "ఓ బాలకులారా! మీ తల్లిదండ్రులెవరు? ఎచ్చట మీరు నివసించెదరు? మీ దేశముపేరేమి? మీ రనేకవీరులను యుద్ధములో సంహరించితిరి."

చౌపాయ్

"ఓ రాజా! ఈమాటలవలనఁ బ్రయోజనమేమి? ధనుర్బాణములను సంధించి, యుద్ధముఁ జేయుము. నీవు స్వర్గలోకమునకు వెళ్లుటకుఁ దగిన ప్రశ్నలవలెఁ దోఁచును. రణస్థలములో నధికప్రసంగముఁ జేసినందున, వీరులపిఱికితనము వెల్లడియగును. దుఃఖమును విడిచి, యుద్ధముఁ జేయుము." అని కుశలవులు చెప్పినవాక్యములను శ్రీరాముఁడు విని, "ఓయీ కుమారులారా! మీరు బాలకులు; మీశరీరము లతికోమలములు; మీనామములును వంశమునుఁ దెలిసికొనినఁగాని, మీతోఁ బోరాడుట యుచితము కాదు. అనామధేయులతో నేను బోరాడను" అని పలికెను. "ఓ రాజా! జనకచక్రవర్తికూఁతురు జానకి, మా తల్లి; వాల్మీకిమహాముని మా సంరక్షకుఁడు. మాతండ్రి పేరును మావంశమును మాకుఁ దెలియదు. మేము కుశలవులము. మేము వనవాసులము" అని వా రిరువురు చెప్పిరి. వారు తనకుమారులని శ్రీరాముఁడు తెలిసికొని, వారిమీఁద బాణములను బ్రయోగించుట యుచితము కాదని తలఁచి, యూరకుండెను. "ఓయీ కుమారులారా! వెనుకనుండి నాసైన్యము వచ్చును; దానితో మీరు యుద్ధముఁజేయుఁడు." అని శ్రీరాముఁడు పలికి, యంగదుఁడు, జాంబవంతుఁడు మొదలగువారిని మూర్ఛనుండి లేపించి, వారినిఁ బిలిచెను.

ఛాంద్

ఆ శత్రుసూదనుఁడు, ఆ సకలదుఃఖనివారణకర్త, ఆశ్రీరాముఁడు వానరయోధులఁ బిలిచి, నవ్వి, వారితో నిట్లు ప్రస్తావించెను.

"ఓ వీరులారా! శత్రుసైన్యములను మర్దించుటకుశక్తిగల భరతలక్ష్మణ శత్రుఘ్నులు మూర్ఛపడిరి. నాతమ్ములు మహావీరులను సంహారించిరి; ఆహా! అట్టి నాతమ్ములు నేఁడు మునికుమారులవలన జయింపఁబడి, నేలఁగూలిరి. మీరు శత్రువులను మర్దింపఁదగినవారు; కనుక, మీ కీర్తిప్రతిష్ఠలను నిలువఁబెట్టుకొని, యుద్ధముఁ జేయుఁడు. ధైర్యమునవ లంబించి, పోరాడుఁడు." ఈప్రకారము వానరులు శ్రీరామునిచేనుత్స హింపఁబడి, మహావృక్షములను పర్వతములఁ బట్టుకొని, 'హాహా' అని శబ్దములఁజేయుచు, యుద్ధమునకు వెడలిరి.

దోహా 52

వెనుకనుండి లవుఁడు ధనుర్బాణములను ధరించి, విభీషణున కెదురుగ నిలిచి, యతనికిఁ గోపమువచ్చునట్లు తృణీకరించెను.

చౌపాయి

"ఓరీ మూర్ఖుఁడా! విభీషణా! ఓరీ! యుద్ధములో నీ యన్నను జంపించి, సిగ్గులేక శత్రువుతోఁ గలిసి, నీ పిఱికితనముఁ జూపించుటకు వచ్చితివా? తండ్రితోసమానుఁడు నీ పెద్దన్న; అతనిభార్యను నీ వప హరించి, బలాత్కారముగ నీగృహములో నుంచుకొంటివి. ఓరీ పాపా త్ముఁడా! రావణుఁడు బ్రతికియుండినపుడు మండోదరిని నీవు తల్లీ అని పిలుచుచుంటివి. ఆమెకు నీవు ద్రోహముఁ జేసియుంటివి; ఆహా! ఏమి నీధర్మము? ఎంతధన్యుఁడవు? సముద్రములోఁబడి నీవు చచ్చినమేలు. ఓరీ యధముఁడా! పాపీ! నీగొంతుకఁ గోసికొని చనిపొమ్ము; సము ద్రములోఁ బడుము. సిగ్గులేక, యుద్ధములో నెదురుగనిలిచి, ప్రగల్భ ములఁ బలుకుచుంటివి. ఓరీ సిగ్గుమాలినశిఖండీ! శీఘ్రము నాయెదుట నుండి లేచిపొమ్ము. లేనియెడల, నీకు మృత్యువు సన్నిహితమయ్యెనని తెలిసికొనుము." ఇంతకఠోరము లగువచనములను విభీషణుఁడు విని, కోపించి, లవునిమీఁదికి నొకగదఁ బ్రయోగించెను. అతఁడు దానిని ముక్కలుముక్కలుగ ఖండించెను. మరల వీరులశల్యములను భేదింపఁ దగిన యేడుబాణముల నతఁడు లంకేశునిపైఁ బ్రయోగించెను. విభీష ణుఁడు నేలఁబడి పొరలి లేచి, పిడుగువంటిత్రిశూలముతో లవునిఁ గొట్టెను.

దోహా 59

ఆత్రిశూలమును కుశలవులు ఖండించిరి. వారు బాణములఁ బ్రయోగించినందున, విభీషణునకుఁ గరచరణము లాడలేదు; అతఁడు వ్యాకులపడుటఁ జూచి, హనుమదాదివానరులు దుఃఖించిరి.

చౌపాయ్

హనుమదాదివానరులు తరుశైలపాషాణములను వారిమీఁదికి విసరిరి; కుశలవులు వానిని ముక్కలుముక్కలుగఁ ద్రుంచిరి. ఎవరికిఁ దగినవిధమున వారికిఁ గుశలవులు శాస్తిఁజేసిరి. వెనుకను నిలువఁబడి యుండిన శ్రీరాముని మహాయోధులు ముందునకు నడచివచ్చి, ధీమని కుశలవుల నెదుర్కొనిరి. అంగదాదివానరులు, మరల తరుశైలపాషాణములతోఁ దాఁకిరి. ఆసోదరులు వానిని వ్రక్కలుచేసి, ఖడ్గయుద్ధము నారంభించిరి. గజమునకు దోమకాటు లక్ష్యమా? అటులనే, వానరుల ఖడ్గప్రహారములను, గుశలవులు లక్ష్యముఁజేయక, హనుమదాదివానరులఁ గొట్టిరి; వానరులు మూర్ఛపడిరి; వారిదురవస్థం జూచి, విచారించి, జాంబవంతుఁడు సుగ్రీవునితో నిట్లనియె. "ఓ కపిరాజా! ఈశరీరముతో ననేకమహాయోధులను యుద్ధములో సంహరించియుంటిని; మఱికొందఱను జయించియుంటిని.

దోహా 60

"ఈబాలకులు త్రిలోకవీరులు; వీరిని జయించువారు లేరు; యుద్ధమునకు వెడలుఁడు; అపజయముఁ బొంది, జీవించియుండుటకంటె రణస్థలములోఁ బ్రాణములను విడిచిపెట్టుట యుత్తమము."

చౌపాయ్

ఈప్రకారము వారుకూడఁ బల్కుకొని, యుద్ధమునకు వెడలిరి. వానరభల్లూకములు దండువెడలివచ్చుటఁ జూచి, కుశలవులు వారిని యెదుర్కొనిరి. లవుఁ డొకబాణముతో సుగ్రీవునిఁ గొట్టెను; ఆకపిరాజు బాణముచేఁ గొట్టఁబడి, యేడుయోజనములదూర మెగిరిపోయెను. జాంబవంతుఁడు క్రోధించి, వారిమీఁదికిఁ బరుగెత్తెను; కుశుఁడును భల్లూకరాజును మల్లయుద్ధముఁ జేసిరి. ఆభల్లూకము నతఁడు నేలఁబడఁ

ద్రోసి, వానికరచరణములను బంధించెను; పిమ్మట వారు హనుమంతుని గట్టిరి. వారినిఁ దీసికొనివచ్చి, అశ్వమునెదుటఁ గుశలవులు కూర్చుండిరి. లవుఁడు గుఱ్ఱమువద్ద నిలువఁబడి, దానిని గాపాడుచుండెను. కుశుఁడుమాత్రము రామునిమీఁదికి వెడలెను. అతఁడు చూచునప్పటికి, రాముఁడు రథముపై సీల్గి పడియుండెను; కుశుఁడు లజ్జపడి, మరలి వచ్చెను. అశ్వములపైని, రథికులపైనుండిన యలంకారములఁ దీసికొని, కుశలవులు హనుమంతుని వెంటఁబెట్టుకొని, గృహమునకు వెడలిరి.

ఛాంద్

చక్కనివస్త్రములను భూషణములను, వానరభల్లూకములను వెంటఁదీసికొని, గుఱ్ఱముతోఁ గూడి, కుశలవులు జానకిని సమీపించి, ఆమెకు నమస్కరించి, వాని నామెకుఁ గట్నముగ సమర్పించిరి. ఆవానరులను భూషణములను జానకిచూచి, భయపడెను. ఆసమయమున వాల్మీకిమహాముని చింతాక్రాంతుఁడై వచ్చెను. అతఁడు జానకి కీవృత్తాంతమును విన్నవించెను. అతఁడు హనుమంతజాంబవంతులబంధనములను విప్పి, "ఓ బాలకులారా! ఎంతపనిఁ జేసితిరి! రామలక్ష్మణభరతశత్రుఘ్నులఁ బడఁద్రోసివచ్చితిరి కదా!" అని విచారించెను; "అయ్యో కుమారులారా! మీవలన వంశమునకు మచ్చవచ్చెను కదా! ఆహా! భగవంతుఁడు నాకు వైధవ్యముఁ దెచ్చిపెట్టెను. మీరు విచారింపక, శీఘ్రము చందనాగరుకర్పూరకుంకుమాదులను సిద్ధముఁజేసిన, నేను నానాథునితో సహగమనముఁ జేసి, సిద్ధిపొందెదను." అని సీత మొఱబెట్టెను. వాల్మీకిమహాముని జానకిని నోదార్చి, యామెకు ధైర్యముఁ జెప్పెను. అతఁడు కుశలవులఁ దీసికొని, రణస్థలముఁ జూచి, యాశ్చర్యపడెను. శ్రీరామునిరథమును గుఱ్ఱములను గుర్తుపట్టి, యతనిచరణములకు వాల్మీకి నమస్కరించెను. ఆతురతతో శ్రీరాముఁడు దిగ్గునలేచి, కూర్చుండెను; కుశలవు లతనియెదుట నిలువఁబడియుండిరి.

### సోరఠా 5

ఆ ప్రణతార్తిహరుఁడు వాల్మీకిమహాముని వచనములను విని తెలివిఁదెచ్చుకొని, నేత్రములను విప్పెను; అతనిని మునిరాజు కౌఁగి లించుకొనెను.

### చౌపాయ్

వాల్మీకిమహాముని శ్రీరాముని సందర్శించి, "ఓ నాథా! నా జన్మము సఫలమయ్యెను. నేనెంత ధన్యుఁడను?" అని విన్నవించి, లక్ష్మణుఁడు సీతను వనములో విడిచిపెట్టినవృత్తాంతమును, కుశలవులజననమును శ్రీరామునకుఁ జెప్పెను. "ఓ నాథా! కుశలవులు నీకుమారులు; బ్రహ్మమహేశాదిదేవతలును, పంచభూతములు సాక్షి—వీరు నీకుమారులు; నిస్సందేహము." ఈమాటలను విని శ్రీరాముఁడు కుమారులఁ గౌఁగిలించుకొనెను. దేవతలు మృతవానరులపై నమృతవర్షముఁ గురిపించిరి; వారు జీవించి, దిగ్గునలేచిరి. లక్ష్మణభరతశత్రుఘ్నులు సహితము మూర్ఛనుండి మేల్కొనిరి. లక్ష్మణుఁడు జానకివద్దకు వెళ్లెను. రాముఁడు లక్ష్మణునిఁ బిలిచి, "ఓ తమ్ముఁడా! నామాట వినుము. నీవు జానకినిసమీపించి, శపథముగుఱించి యామెయుద్దేశముఁ గనుఁగొనుము." అని చెప్పెను. అతఁడు జానకినిసమీపించి, ఆమెచరణములకు నమస్కరించెను; కుశలవుల ముద్దాడెను. శ్రీరామునియిచ్ఛానుసారము జానకి శపథముఁ జేయుటకుసిద్ధపడి, లక్ష్మణునితోఁ గూడి, శ్రీరామసభకు వచ్చెను. ఆమె సభ్యులఁ జూచి, సత్యముగ నిట్లు ప్రమాణముఁ జేసెను. "ఓ దేవతలారా! ఓ పంచభూతములారా! ఓ సభికులారా! మనోవాక్కాయకర్మములచే శ్రీరామునిఁదప్ప, మఱియొకపురుషుని స్వప్నమందయినను నేను ధ్యానించియుండలేదు. ఓ తల్లీ! భూదేవీ! నన్ను నీలోఁ గలుపుకొనుము." అని జానకి ప్రార్థించెను. అతక్షణము పటపటమని భూదేవి బద్దలయ్యెను. ఆబిలములోనుండి యొకదివ్యసింహాసనము వెడలెను; ఆసింహాసనమును సర్పములు ధరించియుండెను. దానిపై భూదేవి మూర్తిభవించి కూర్చుండెను.

ఆమె చేతులఁజాచి, జానకినెత్తుకొని, దీవించెను. "ఓ జానకీ! చాలు, చాలు; పుట్టినదిమొదలు నేటివఱకు నీవు దుఃఖపడనిదినము లేదు; ఎల్లప్పుడు నీవు కన్నీరుఁ గార్చుచుంటివి. రా రమ్ము; నాయింటికి వచ్చి, సుఖముగ నుండుము." ఈప్రకారము భూదేవి పలికెను.

దోహా 61

అంతలో నొకసింహాసనము లోపలినుండి వచ్చెను; జానకి దానిపైఁ గూర్చుండెను; ఒకనిమిషములో వారిరువురు తిరోహితు లయిరి. ఆమెఖ్యాతి మూఁడులోకములలో వ్యాపించెను.

చౌపాయ్

ఈసమాచారమును లక్ష్మణాదితమ్ములు కన్నులారఁ జూచుచుం డిరి; వారు కన్నీరుగార్చిరి. శ్రీరాముఁడు విచారించి, "జానకి నా మనోవ్యాపారమునునుసరించి వెడలెను; ఆమె నామనస్సుగ్రహించి, సంచరించెను. ఇఁక మేము మా వైకుంఠధామమునకు వెడలవల యును" అని చింతించి, రౌద్రాకారుఁడై భూదేవినిఁ జూచి, "ఓ దేవీ! నాజానకినిఁ దీసికొనివచ్చి, యప్పగింపుము. లేనియెడల నిన్ను ముక్కలు ముక్కలుగ ఖండించెదను" అని పలికెను. అప్పుడు బ్రహ్మదేవుఁడు వచ్చి, "ఓ నాథా! ఇది యిట్లు జరగపలసియుండెను; మీరు శాంతిం పుఁడు; మీధామమునకు మీరువెడలుటకు సమయమయ్యెను." అని బోధించెను. ఇట్లు సీతావియోగమునకు దుఃఖించుచు, శ్రీరాముఁడు తమ్ములతోను కుమారులతోఁ గూడి రాజధానికి వచ్చి, యజ్ఞము సమాప్తముఁ జేసెను. దేవతలు నియమించినప్రకార మతఁడు కార్య ములను నిర్వహించెను. అతఁడుచేసిన షోడశమహాదానముల నెవరు వర్ణించిచెప్పఁగలరు? అనేకప్రకారముల మునిగణంబులను సత్కరించి యాదరించి, వారికి షడ్రసోపేతముగ భోజనముఁ బెట్టి, పిదప వారి గృహములకు వీడ్కొలిపెను. శ్రీరాముఁడు జనకచక్రవర్తిని సత్క రించి, పూజించెను; అతఁడు శ్రీరామునిసెలవుఁ గైకొని, మిథిలానగర

మునకు వెడలెను. శ్రీరాముఁడు గురువుల చరణములఁ గడిగి, వారిపాద తీర్థముఁ బుచ్చుకొనెను. గురువులు సెలవుబుచ్చుకొని, వెడలిరి. పిమ్మట బ్రాహ్మణులు శ్రీరామునివర్తమానముప్రకార మతనిసన్నిధానమునకు వచ్చిరి.

దోహా 62

ఆబ్రాహ్మణులను శ్రీరాముఁడు సత్కరించి, పూజించి, యొక్కొక్కబ్రాహ్మణున కొక్కొక్కలక్షగోవుల నిచ్చెను.

చౌపాయ్

ఈప్రకారము యజ్ఞముఁ జూడవచ్చినవారు స్వగృహములకు సంతోషించుచు నిష్క్రమించిరి. శ్రీవారు సుఖముగ నుండిరి. పురజనులు, స్త్రీపురుషులు శ్రీరామునిసందర్శించి, నిత్యము పురాణములను వినుచు, సుఖముగనుండిరి. అయోధ్యానగరములో నివసించియుండిన చరాచరజంతువులు, కపటమును విడిచి, శ్రీరాముని సేవించి, దేవతల కంటె నధికసుఖములఁ బొంది, పరమానందమగ్నులయి యుండిరి. ఈ ప్రకారము కొంతకాలము గడచెను. అప్పుడు శ్రీరాముఁడు స్వధామమునకు వెడలుటకు సమయమయ్యెనని తెలిసికొనెను. ఇట్లు శ్రీరాముఁడు పదునొకండువేలసంవత్సరములు రాజ్యముఁ బరిపాలించెను. అతఁడు స్వధామమునకు వెడలుటకుఁ గోరుచుండెను. "ఓ యమధర్మరాజా! నీవు భూలోకమునకుఁ బోయి, కాలముగతించెనని శ్రీవారితో విన్నవింపుము." అని బ్రహ్మ చెప్పినప్రకారము, యమధర్మరాజు వెడలెను.

దోహా 63

యముఁడు మునివేషమును ధరించి, నగరమునకు వచ్చెను. అతఁడు దేదీప్యమానముగ వెలుగుచుండెను. ఆముని పదుచుతనములో నుండెను; అతనినడుమునకు కృష్ణాజినము కట్టఁబడియుండెను.

చౌపాయ్

ఆసమయమున లక్ష్మణుఁడు ద్వారపాలకుఁడు. "ఓయీ! నేను శ్రీరామదర్శనార్థము వచ్చితిని అని వారికి విన్నవింపుము." అని

యతఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. లక్ష్మణుఁడు లోనికివెళ్లి, మునియాగమనమును శ్రీరామునకు విన్నవించెను; ఆతక్షణ మతఁడు వెడలి, ద్వారమువద్దకు వచ్చెను. అతఁడు మునీశ్వరునిచరణములకు నమస్కరించెను. అతఁడు మునీశ్వరుని లోనికిఁ దీసికొనివెళ్లి, యాదరించి సత్కరించి, యర్ఘ్యపాద్యాదులనిచ్చి పూజించి, యిట్లు విన్నవించెను; "ఓ నాథా! నాజన్మము సఫలమయ్యెను; మీయాజ్ఞను శిరసావహించెదను." అప్పుడు మునివేషధారి రామునితో నిట్లు పలికెను. "ఓ కృపానిధీ! ఓ ఇనకులతిలకమా! ఓ రామా! నామాటను సావధానముగ వినుఁడు. మనయుభయుల సంభాషణసమయమున నీప్రదేశమున మూఁడవవాఁడు నిలిచియుండఁగూడదు. అట్లు నిలిచినవానికి మరణమే శాస్తి. మనసంభాషణను వినినవానిని శపించెదను. బ్రహ్మమహేశ్వరులయినను, శపించెదను." "ఓతమ్ముఁడా లక్ష్మణా! నీవు సింహద్వారమువద్ద నిలిచియుండుము. నాదర్శనార్థము వచ్చినవారికి సమయముకాదని చెప్పుము. నాసెలవులేక, యెవరినైన నీవు లోనికి విడిచిపెట్టినయెడల, నేనుస్వయముగ నిన్ను సంహరించెదను; నామాట సత్యము; అసత్యము కాదు" అని శ్రీరాముఁ డాజ్ఞాపించెను.

దోహా 64

ఒకనిర్జనస్థలములో నామునివేషధారి మృదుమధురముగ రామునితో నిట్లు విన్నవించెను. "ఓ నాథా! నన్ను రక్షింపుము. మీ వైకుంఠధామమునకు విజయముఁ జేయుఁడు" అని చెప్పి, సెలవుఁగైకొని, వెడలెను.

చౌపాయ్

విధికృతము నెవ రడ్డగింపఁగలరు? ఆసమయమున దుర్వాసమహాముని ప్రత్యక్షమయ్యెను. కొంతదూరమున నతనిఁ జూచి, లక్ష్మణుఁడతనికి నెదురుగ నడచివెళ్లి, నమస్కరించి, క్షమాపణఁ జెప్పుకొనెను. "ఓయీ లక్ష్మణా! నేను శ్రీరామదర్శనార్థము వచ్చియుంటిని; నాయాగమనము వారికి విన్నవింపుము; ఈసమయమున నీవు ప్రత్యుత్తరము నిచ్చినయెడల నిన్ను నీవంశమును, నీనగరమును, భస్మముఁజేయుదు"

అని దుర్వాసమహాముని చెప్పెను. ఆహా! విధికృతముఁ దప్పించుకొ నుట దుష్కరము; మునీశ్వరునివచనములను లక్ష్మణుడు విని, మరణము నిశ్చయించుకొని, శ్రీరామునిసన్నిధానమునకు వచ్చెను; అతఁడు రెండుచేతులను జోడించుకొని, "ఓ నాథా! దుర్వాసమహాముని మీదర్శనార్థము వచ్చెను" అని విన్నవించెను. "ఓ తమ్ముఁడా! ఏల యిట్లు తొందరపడి ప్రవేశించితివి? కాలకర్మములు దుస్తరములు" అని విచారించెను. ఓగరుడా! తరువాతివృత్తాంతమును వినుము.

దోహా 65

"ఓ తమ్ముఁడా! దుర్వాసుని శీఘ్రము తీసికొనిరమ్ము. అతనినాదరించి, సత్కరించి, ప్రవేశపెట్టుము" అని రాముఁడు చెప్పెను.

చౌపాయ్

ఇట్లు ప్రవేశించిన దుర్వాసమహామునిని శ్రీరాముఁడాదరించి, యుచితాసనముపైఁ గూర్చుండఁబెట్టి, యర్ఘ్యపాద్యముల నిచ్చి పూజించెను. "ఓ మునిరాజా! నేను మీ సేవకుఁడను. మీయాజ్ఞలను శిరసావహించెదను. మీచిత్తానుసారము వర్తించెదను" అని రాముఁడు విన్నవించెను. "ఓ నాథా! అనేకదినములనుండి వ్రతదీక్షలోనుండి నేను భుజించియుండలేదు; ఈదినమున వ్రతము సమాప్తమయ్యెను. రాజదర్శనముఁజేసి భుజించెదను; ఆఁకలి విశేషముగ బాధించుచున్నది. కనుక, నాకు శీఘ్రము భోజనముఁ బెట్టుము." అతనియాజ్ఞాప్రకారము శ్రీవారు షడ్రసోపేతముగ మునీశ్వరునకు భోజనముఁ బెట్టించి, చేతులను జోడించుకొని, వినయవిధేయతలతో వారియెదుట నిలువఁబడియుండెను. మునిరాజు సెలవుఁగైకొని, నిష్క్రమించెను. లక్ష్మణునింజూచి శ్రీరాముఁడు చింతాక్రాంతుఁడై దుఃఖించెను. ఇతఃపూర్వము వారిట్టిదుఃఖము ననుభవించియుండలేదు. వారు శోకార్ణవములో మునిఁగియుండుటఁ దెలిసికొని, భరతుఁడు మొదలగువారును పురజనులును శ్రీవారినిఁ జూడవచ్చిరి. శ్రీవారిచరణములకు నమస్కరించి, భరతశత్రుఘ్నులు జోహారువనుచు నిలిచియుండిరి. వారు భయపడి, గడగడవడఁకుచుండిరి. శ్రీవారి కమలలోచనములనుండి నీరు వఱదలై కారుచుం

డెను. వారు భరతునిఁ జూచి, "ఓ తమ్ముఁడా! మనగురువులను శీఘ్రముతీసికొని రమ్ము" అని యాజ్ఞాపించెను. భరతుఁడు కన్నీరుఁగార్చుచు వెళ్లి, యీవృత్తాంతమును గురువులకు విన్నవించెను. ఆతక్షణము గురువు విమానారూఢుఁడై నగరునకు వచ్చి, సభలోఁ బ్రవేశించెను. శ్రీవారు మొదలగువారు దిగ్గునలేచి, గురుచరణారవిందములకు నమస్కరించిరి. శ్రీవారు తమప్రతిజ్ఞను, లక్ష్మణునిప్రవర్తనయు మొదలగువృత్తాంతమును నిశ్శేషముగ విన్నవించిరి. ఇఁక లక్ష్మణుఁడు శరీరమును విడిచిపెట్టునని వసిష్ఠుఁడు గ్రహించి, "సజ్జనులముఖముఁ జూడకయుండుటయే వారికి శిరచ్ఛేదము" అని సమాధానముఁ జెప్పెను. ఈమాటప్రకారము రాముని దర్శనమ జేయకయుండిన జీవనము నిష్ఫలమని లక్ష్మణుఁడు గ్రహించి, శ్రీ మునిచరణారవిందములకు నమస్కరించి, సరయూనదిలోఁ బ్రవేశించి, జలము నాచమనముఁ జేసెను. అతఁడు కటిపర్యంతము జలములలో నిలువఁబడి, పవనములను బంధించి, క్రమముగ వానిఁ సహస్రారమునకుఁ దీసికొని, రాముని ధ్యానించుచుఁ బ్రాణములను విడిచిపెట్టెను. ఆజీవుఁడు కపాలమును భేదించుకొని పోయె. శ్రీరామునిచతుర్థాంశము లక్ష్మణుఁడు; శేషావతారుఁడు; అతఁడు వైకుంఠములోఁ బ్రవేశించెను. శ్రీలక్ష్మణస్వామినిర్యాణమును శ్రీమ భరత శత్రుఘ్నులు విని, శోకార్ణవములో మునిఁగిరి. వారికి తోపము లేకపోయెను.

చౌపాయి

అయ్యో! నే నేమాటఁ జెప్పితిని; నాతమ్ముఁడు నన్ను విడిచిపెట్టెను. నాతమ్మునిఁ జూడఁ బోవుటకుఁ గినప్రయత్నముఁ జేయుదు. ఓభరతుఁడా! ఈనగరమును నీవు పరిలింపుము" అని శ్రీవారు చెప్పిరి. ఆమాటలకు భరతుఁడు వ్యాకులపడి, నేలమీఁదఁ బడెను. "ఓ నాథా! నన్ను విడనాడుట న్యాయమా నేనుమాత్రము లక్ష్మణుని విడిచి, జీవములతో నుండఁగలనా?" అని భరతుఁడు విన్నవి "ఓయీ తమ్ములారా! మీరు ప్రయాణమునకు సిద్ధముగ న అని చెప్పి, శ్రీమ కుమారులఁ బిలిచి, వా రాజధర

శించెను; వారికి రాజ్యపట్టముఁ గట్టెను; భరతునికుమారుఁడు తక్షునకు దక్షిణరాజ్యము నిచ్చెను. భరతుని రెండవకుమారుఁడు పుష్కరునకు 'పుష్కర' నగరరాజ్యము నిచ్చెను. ప్రథమమున రాక్షసులను సంహరించి, నగరములను వారు స్థాపించిరి. ఆనగరములను శ్రీవారు భరతునికుమారుల కిచ్చిరి. లక్ష్మణునికుమారులు మహాబలవంతులు; శూరులు; చిత్రకేతువు, చిత్రాంగదుఁడు; వారు రణధీరులు.

దోహా 68

పశ్చిమరాజ్యమున రాక్షసులను సంహరించి, నగరములను వారు స్థాపించియుండిరి; వేర్వేఱుపేర్లుగల రెండునగరముల రాజ్యములను శ్రీరాముఁడు లక్ష్మణునికుమారుల కిచ్చెను.

చౌపాయ్

పిమ్మట నయోధ్యానగరమును కుశునకిచ్చి, శ్రీరాముఁ డతనికి రాజధర్మముల నుపదేశించెను. "ఓ పుత్రా! నీతమ్ముల నాదరింపుము. రాజధర్మముల ననుసరించి, ప్రవర్తింపుము." అని శ్రీవారు బోధించిరి. కొంచెముదూరములోనుండిన యుత్తరఖండభూములు సకలసంపదలకు నిధానము. అచ్చట 'లవపురము'(Lahore)ను రాజధానిగఁ జేసి, దానిని శ్రీవారు లవునకిచ్చిరి. ఆనగరము లోకప్రసిద్ధము. అష్టసహస్రముల రథములు, పంచాశత్సహస్రముల గుఱ్ఱములు, దశ సహస్రము మదగజములు, వేలకొలఁదిపదాతులును—ఈమొదలగుచతురంగబలముల నొక్కొక్కనికి శ్రీరాముఁడు విభజించెను. ఆ చతురంగబలములఁ జూచి, దిక్పాలురుసహితము సిగ్గుపడిరి. శ్రీవారు కోట్లకొలఁది వెండిబంగారములను నవరత్నములను గుమారుల కిచ్చిరి; వారిసంపదముందు,కుబేరునిసంపద చిన్నబోవును.

దోహా 69

ఈప్రకారము శ్రీవారు కుమారులను సంతోషపెట్టి, బ్రాహ్మణులను యాచకులను బుద్ధిమంతులను బిలిపించిరి.

### చౌపాయ్

గోవులు, వస్త్రములు, భూములు, ధనము, గృహములు— ఈ మొదలగువానిని శ్రీరాముఁడు వారికిఁ జాలినంత యిచ్చెను. అయోధ్యానగరములోనుండిన యాచకులు శ్రీరామునితో నిట్లు విన్నవించిరి. "ఓ నాథా! ఓ జగదీశ్వరా! మీరు శాశ్వతపురుషులు, నాశరహితులు, మీకు జననమరణములు లేవు; మావిన్నపములను మన్నింపుఁడు. ఆజన్మాంతము మేము మీచరణారవిందముల నాశ్రయించి, జీవించితిమి. అంత్యకాలమునకు మాకు నిర్భాగ్యదశ వచ్చెను. మేము మీదాసులమని గ్రహించి, మమ్ములను మీలోకమునకుఁ దీసి కొనిపొండు; మేము సనాథుల మగుదుము." ఈ ప్రకారము ఆ జనులవిన్నపములను శ్రీవారు విని "మంచిది" అని వారితోఁ జెప్పి వారియనురాగమునకు సంతసించిరి. కిష్కింధారాజ్యము నంగదున కిచ్చి, సమయముఁ జూచి, సుగ్రీవుఁడు శ్రీరామసన్నిధానమునకు వచ్చెను. జాంబవంతుఁడు, విభీషణుఁడు, నలుఁడు, నీలుఁడు, అంగదుఁడు— ఈ మొదలగు దేవతాంశసంభూతులగు కోట్లకొలఁది వానరు లాసమయమునకు శ్రీరాముని వద్దకు వచ్చిరి.

### సోరఠా 6

"ఓ విభీషణా! ఒకకల్పము నీవు లంకారాజ్యముఁ బరిపాలింపుము. నావచనము సత్యమని తెలిసికొనుము. అంతమున నీకు దేవలోకము సంభవించును" అని శ్రీరాముఁడు చెప్పెను.

### చౌపాయ్

"ఓ జాంబవంతుఁడా! ద్వాపరయుగాంతమువఱకు నీవు భూలోకములో నుండుము; అప్పుడు నేను కృష్ణావతారుఁడనై, నీతోఁ బోరాడఁగలను. నీవు నన్ను గుర్తుపట్టఁగలవు" అని శ్రీరాముఁడు పలికి, తదితరులకు ధైర్యముఁ జెప్పి స్వయము సరయూనదీతీరమునకు వచ్చిరి. శ్రీరామునికి దక్షిణవైపున భరతుఁడును వామమున శత్రుఘ్నుఁడును, వారివెనుక మంత్రులు మొదలగు పురజనులును క్రమముగ నడచిరి. ఆసమయమున గాయత్రి, వేదములును, అష్టదిక్పాలురును బ్రాహ్మణరూపము ధరించి, శ్రీవారితో నడచిరి. చరాచరజంతుజాల

పీతాంబరములను ధరించి, యుత్సాహముతో నడచిరి. ఆసమయము నకు దేవతలుసహితము రూపములను ధరించివచ్చిరి. ఓ గరుడజీ! తదుపరివృత్తాంతమును వినుము. సమయముం జూచి, శ్రీవారు హనుమంతునితో నిట్లు పలికిరి.

దోహా 70.

"ఓయీ పుత్రా! ఆచంద్రార్కము నీవు చిరంజీవివై యుండుము. నిన్ను సేవించిన మనుజులదుఃఖములం బోంగొట్టుము."

చౌపాయ్

అప్పుడు [illegible]ర రాజు బ్రహ్మవద్దకు వెళ్లి "ఓ తండ్రీ! శ్రీరాముండు మహాయాత్రనిమిత్త[illegible] సరయూనదీతీరమునకు వచ్చెను." అని చెప్పెను. ఆతక్షణము బ్రహ్మమహే[illegible]రులును, సనకాదిమునులును, సత్యలోక నివాసులును, విమానారూఢు[illegible], యంతరిక్షమున నిలిచిరి. వారిరంగు రంగుల విమానములకాంతుల[illegible] నంతరిక్షమంతయుం ధళధళయని ప్రకాశించెను. దానిని వర్ణించుటకు [illegible]ముకాదు. బ్రహ్మాదిదేవతలు జయజయశబ్దములం జేయుచుండిరి. మిడు[illegible]దండువలె, దేవతావిమానము లంతరిక్షమునం గనంబడెను. ఆసమయము[illegible] నగరజనులు సరయూనదీజలములను స్పృశించినమాత్రమున, వార[illegible] విష్ణుసారూప్యము వచ్చెను. వారు విమానారూఢులై వైకుంఠమునకు [illegible]మనించిరి. వారి యైశ్వర్యమును దేవేంద్రాదులు చూ[illegible], యాశ్చర్యపడి[illegible] సరయూనదీ తీరమున వేదధ్వనులు వినంబడెను; అంతరిక్షమునుండి ఫు[illegible]వర్షము పడెను.

ఛాం[illegible]గీతికా

వేదమంత్రములం బఠిం[illegible] భరతుండు శ్రీ[illegible]లో [illegible]లీనమ య్యెను; శత్రుఘ్నుండు జలము[illegible] స్పృశించి, పద్మములం బ్రకాశించుచు, శ్రీపతిలో లీనమయ్యె[illegible] వానరయోధులు వారివారి దేవతాంశలలోం గలసిరి. సుగ్రీవుండు [illegible]ర్యునిలో లీనమయ్యెను. [illegible]కారము వారు పరలోకముం బొందిన[illegible]వాత, శ్రీవారు జలము[illegible] దిగిరి. అప్పుడు శ్రీనాథుండు బ్ర[illegible]దిదేవతలతో నిట్లు పలికెను. దేవత

లారా! ఒకమాసమువఱకును మీరీ నదీతీరమున నివసించియుండుఁడు. ఈమాసములో నానగరమునకు వచ్చి, ప్రాణములను విడిచిపెట్టినజీవులకు నాసారూప్యము నిచ్చి, వారిని దివ్యవిమానములపైఁ గూర్చుండఁ బెట్టి, నా సాకేతలోకమునకు బంపుఁడు. ఈనాపుణ్యభూమికి వచ్చినవారును, ఈపవిత్రమగు సరయూనదీజలములలో నొకనిమిషము స్నానముఁ జేసినవారును, నావైకుంఠధామమునకు రాఁగలరు; వారికి యంత్యకాలమున నాసారూప్యము వచ్చును. ఆజన్మాంతము నా నగరములో నివసించిన స్త్రీపురుషులను నాలోకమునకుఁ బంపుఁడు. నా మాటలను మన్నింపుఁడు." ఈమాటలను శ్రీరాముఁడ చెప్పి, మేఘములో మెఱుపువలె, నంతర్ధానమయ్యెను. "ఓజగన్నాథా! జయ, జయ" అని బ్రహ్మాదిదేవతలు ధ్వనులఁ జేసిరి; వారా జగత్పతికి నమస్కరించిరి. అయోధ్యానగరములోనుండిన చరాచరజంతుజాలములు శ్రీవారి యిచ్ఛానుసారము వైకుంఠమునకు గమించిరి.

/1, 72

ఈప్రకారము శ్రీరామచరిత్రమును శివుఁడు పార్వతికిబోధించి, "ఓ పార్వతీ! సత్సంగముతో సమానమగులాభము మఱియొకటి లోకములో లేదు. నారాయణుని కృపయుండినగాని, సత్సంగత్వము లభింపదని వేదపురాణేతిహాసములు చెప్పుచుండును." అని చెప్పెను. ఇట్లు కాకభుశుండిచెప్పిన శ్రీరామచరిత్రమును గరుత్మంతుఁడు విని, పరమానందమగ్నుఁడై, ఆనందబాష్పములఁ గార్చెను. అతనిశరీరము పులకించెను. ఆకాకభుశుండి శ్రీవారిపరమభక్తుఁడని వైనతేయుఁడు గ్రహించి, యతనిచరణములకు [illegible] నమస్కరించెను.

చౌ॥

ఓ పార్వతీ! నేనుచెప్పిన పరిపవిత్రమగు నితిహాసమును విని నరులకు ఐహికలదుఃఖములు నశించును. ఆ దీనదయాపరమూర్తి ఆకరుణాసముద్రునియందు భక్తికలుగును. సావధానముగ నీచరిత్రమును వినినవారల్, మనోవాక్కాయకర్మముల్చేఁ జేసినపాపములు భస్మమగును. కలతీర్థాటనములు, యోగవైరాగ్య సాధనములు, దానములు,

వ్రతములు, జపములు, తపములు, వ్రతము, యజ్ఞాదిక్రతువులు, సంయమనియమదమములు, భూతదయ, దేవగురుబ్రాహ్మణసేవయు, విద్యావినయములు, జ్ఞానము — ఈ మొదలగువానివలన, ఓ పార్వతీ! నారాయణునియందు భక్తి పుట్టును. వేదమునందుఁ జెప్పఁబడిన రామభక్తి రామునికృపవలన లభించును.

దోహా 73, 74

ఈ రామకథను విశ్వసించి, నిరంతరము పఠించినయెడల, మునులకు దుర్లభమగు రామభక్తిని, నిరాయాసముగఁ బొందఁగలరు. గరుత్మంతుఁడు వైకుంఠమునకు వెళ్లెను.

మంగళహారతి.

"ఆరతి శ్రీ రామాయణజీకీ,
కీరతి కలిత లలిత సియపీకీ.
గావత బ్రహ్మాదిక ముని నారద,
వాల్మీకి విజ్ఞాన విశారద.
శుక సనకాది శేష అరు శారద
వరణి పవనసుత కీరతి నీకీ.

శ్రీమద్రామాయణమునకు హారతి; రామాయణ మెట్టిది శ్రీసీతాపతియగు శ్రీరామచంద్రునికీర్తి దీనిలో వర్ణింపఁబడెను; బ్రహ్మయు, నారదుఁడును, విజ్ఞానులును, బుద్ధిమంతులును, వాల్మీకియు, శ్రీశుకులును, సనకాదులును, శేషుఁడును, సరస్వతియు — శ్రీరాముని కీర్తిని వర్ణించిచెప్పిరి; దీనియందు మహావీరునికీర్తి వర్ణింపఁబడెను. శుకులును, సనకాదులును, శేషుఁడును సరస్వతియు — ఈ శ్రీరామచరిత్రమును గానముఁ జేయుదురు.

"సంతత గావత శంభు భవానీ,
అౌ ఘుట సంభవ ముని విజ్ఞానీ.

